# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువ కాలపరిమితికి చందాపద్ధతి లేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనుకూలమైనది. ఏర్పాటుచేయబడిన రేట్లు ఎట్లనగా: ఒకసారికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడిన కాలమునకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవరకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసినచో జవాబు ఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాతి చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. సూచనచూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథాగతిని పోషింప చందాదారులనుప్రార్థించెదము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగనుండ ఇచ్చగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతిసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

1936 ఫిబ్రవరి 29 వ తేదీన

విడుదలచేయబడింది ! | విడుదలచేయబడింది !

చూడండి !! | బెజవాడ సరస్వతీ టాకీస్ వారి తెలుగుటాకీ | ఆనందించండి !!

# ద్రౌపదీవస్త్రాపహరణము

క్రింది స్థలములలో విడుదలచేయబడింది.

బెజవాడ: దుర్గాకళామందిరం

గుంటూరు: ఫిలిప్సుటాకీస్ (రత్నహాలు)

నెల్లూరు: వినాయకసినిమా

విశాఖపట్నం: పూర్ణాథియేటరు

కాకినాడ: మెజస్టిక్ సినిమా

సికిందరాబాద్: ఇంపీరియల్ టాకీస్ (నాగన్న దేవిడి)



మార్చి నెలలో క్రింది స్థలములలో విడుదలచేయబడును.

బెంగుళూరు: సాగర్ టాకీస్ మైసూరు: అపెరాటాకీస్ ఏలూరు: రామకృష్ణాటాకీస్

మరియు మద్రాసు, ఒంగోలు, తెనాలి, గుడివాడ, రాజమహేంద్రవరములలో

ఈ అమూల్యావకాశమును ఆంధ్రులు సకుటుంబ బంధుపరివారముగా సుపయోగించుకొని, ఆనందింపుడు.

***For Booking Apply to:***—**SARASWATI TALKIES, LTD., Bezwada.**

# విషయసూచిక



**త్రివర్ణచిత్రము**

నాట్యవిలాసము

తయారైనది! విడుదల తేదీకై నిరీక్షింపుడు !!

శ్రీలక్ష్మి ఫిలిమ్సువారి బ్రహ్మాండమగు టాకీ

# ద్రౌపదీ మానసంరక్షణము

ప్రపంచవిఖ్యాతిగాంచిన రాగిణీదేవి గోపీనాథుల భరతనాట్యసహితముగా వచ్చుచున్నది.



టి. రాఘవాచారి, బళ్లారి, మాధవపెద్ది, దైతా గోపాల, పారుపల్లి సుబ్బరావు, బందా కనకలింగేశ్వరరావు B.A., B.L., మిస్. లీలాబాయి, మిస్. కమలాబాయి, మిస్. శ్రీహరి మొదలగు నటనశిరోమణులు పాల్గొనుచున్నారు.

మార్చి నెలయందు యావదాంధ్రభూమియందును విడుదల చేయబడుచున్నది.

*For Booking apply to:* **MESSRS LAKSHMI FILMS LTD.,**
3/7 TATAMUTHIAPPAN ST., G. T. MADRAS.

## ఈస్టిండియా కొత్త ఫిల్ములు

సి. పుల్లయ్యగారి

'కుశలవ'ను మించిన చాయాచిత్రం!

# సతీ అనసూయ

నటీనటులు ఎవరు తెలుసునా!

ఆంధ్ర తారామండలాన్ని అలంకరించనున్నవారు

అందరూ పిల్లలు 13 ఏండ్ల లోపువారు

# ధ్రువ విజయము

నటీ నటులను ఏరడంలో ఈసారి

అద్భుతశక్తిగల ఎవరిని ప్రదర్శిస్తున్నారో

సి. పుల్లయ్యగారు ఎదురు చూడండి!

---

## మినర్వాటాకీస్ డేవిడ్‌సన్ స్ట్రీటు

(బ్రాడ్వేయందు ప్రథమప్రదర్శనమునకై ఎదురుచూడుడు)

---

## హిందీటాకీలు:

విద్రోహి

రాజపుత్ర వధ, కొట్లాటలు, కుస్తీలు,
ప్రేమ, విరహం, కుట్రలు
చిత్ర విచిత్రచర్యలు



స్వప్నస్వయంవరం

భవాని చిత్రమును, పాశ్చాత్య వ్యామోహం,
భారత నారీమణుల ఆదర్శం, ప్రతిబింబితాలు
ఈ చిత్తరువులో హాస్యం ప్రధానరసం.

---

రానున్న చిత్తరువులు :

1. హంతకుడు, 2. ఖైబరులోయ, 1936 భార్య

---

సింప్లెక్సు మెషీనులు, ఆర్. సి. ఏ. సెట్టులు, 6 నెలలు వాడబడిన మెషీనులు
చౌకధరలకు అమ్మకానికి వున్నవి.

---

పైవాటి కన్నింటికి: టెలి: చామ్రియగా.

## చమేరియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు,

20. వేపేరి హైరోడ్డు, మద్రాసు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రిగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సౌత్ కోఆపరేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ,
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్. [లిమిటెడ్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. సూకరాజుగారు, ఆంధ్ర న్యూస్‌ఏజెన్‌సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల సూర్యనారాయణరావుగారు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు
కాకినాడ: సున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్‌బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
అనకదలవలస: సి. వి. నరసింగరావుగారు
మచిలీపట్టం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్ పేట.
కర్నూలు: టి. బాలనాగయ్యశెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.



# స్వవిషయము

ఉ॥ అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలఁ బె
ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడిఁబుచ్చినయమ్మ దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ములనుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధియిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వసంపదల్.

(భాగవతము)

గృహలక్ష్మికి యెనిమిదవ సంవత్సరము నిండి తొమ్మిదవయేఁడు ప్రారంభమగుచున్నదని వ్రాయుటకు సంతసించుచున్నారము. కాల దేశ పాత్రముల పరిస్థితు లెటులున్నను ఈ పత్రి కెట్టి యాటంకములు లేక యెనిమిది వత్సరము లత్యంతోత్సాహముతో నాంధ్రుల కరకమలము లలంకరించుటలో విశేష మేమియు లేదు. ఏలన పరమేశ్వరుని కృపాగసమే గాక, ఈ బాలికను బెంచి పెద్ద జేయుటకు జనకుఁ డనవరతము జూపు ముద్దు మురిపెములే గాక ఆంధ్రలోకమం దెంతమందియో సోదర సోదరీమణులు తమ రచనలచేతను చిత్రములచేతను గృహలక్ష్మి నెప్పటికపుడు సమయానుకూలముగా నలంకరించుటయు గాక, తమ గృహములకు దయతో నాహ్వానించుచు, నితరులచే నాహ్వానింపజేయకున్న యీ బాలిక యెట్టి ఆయాసమును లేక అల్లారుముద్దుగ నెదుగ జాలదు. ఇవ్విధముగ నీమె యభివృద్ధి కాధారభూతులైనవారి కందరికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

# గృహలక్ష్మి

ఇట్లుండియు నీ సమయమున గృహలక్ష్మిని సోదరసోదరీలోకము ఆదరించు విషయమును గురించి కొంచము కొఱంతగ జెప్పవలసి వచ్చినందులకు మాకుఁ గష్టముగ నున్నది. రెండున్నరకోటికి పైగానుండు ఆంధ్రులందు గృహలక్ష్మికి రెండు వేలమంది చందాదారులు మాత్రమే యున్నారని వినిన నెవరికైనను విచిత్రము గలుగక మానదు. తత్కారణములు విచారణీయములే. గృహలక్ష్మియం దేదో కొఱంత యున్నదందమా, ఈవిధముగ సంవత్సరముల కొలది సర్వాంగసుందరియై ఆంధ్రుల హస్తము లలంకరించి సజీవయై యభివృద్ధి బొందుచుండుటచే దానిని నమ్మజాలము. అభివృద్ధి లేదందమా, సమయానుకూలముగ వివిధవిధములగు రచనలను చిత్రములను ప్రకటించి మించుటయేగాక, సోదరీమణులను తద్రచనావిషయమున ప్రోత్సహించి గౌరవించుటయు జరుగుచున్నది. ఇంకను పైపెచ్చుగ నాంధ్రనారీలోకమునకు వారియభివృద్ధికిఁ గావలసిన మార్గముల వెదకుటయందును, వాని నితరులకు దెలుపుటకు ప్రకటించుటయందును బద్ధకంకణయై, పని చేయుచునేయున్నది. అంతియగాక "మాకొఱకై బయలుదేరి మాకుఁగావలసినవానినన్నిటిని ప్రకటింపుచు మా వృద్ధికి కారకురాలు" అని ఆంధ్రనారీలోకము జెప్పుకొనవలసినది ఒక్క గృహలక్ష్మిని మాత్రమే !

ఇక గృహలక్ష్మికి నాదరణ లేనందులకు విరివిగా బైలుదేరుచున్న ఇతర సోదరిపత్రికలు కారణమందమా, అదియునుఁ గాజాలదనియే మా తలంపు. ఏలయన పత్రికలు విరివిగా బైలుదేరుట ప్రజలయందు విద్యాభిరుచిని, సాంఘికాభివృద్ధిని నాగరికతాభివృద్ధిని సూచించును. అంతియగాని యింతకుముందున్న పత్రికలపై విసుగుఁ జనించిగాదు. అట్లు ప్రాఁతవానిపై విసుగు జనించి క్రొత్తవానిపై ప్రేమ గల్గుచున్నచో ప్రాఁత నిదివఱకే మాయమై యుండుసుగదా !

ఆర్థికమాంద్యము కారణమని కొందఱనవచ్చునుగాని దానియందుగూడ మాకు తగినంత నమ్మకము లేదు. ఆర్థికమాంద్యము లేదనుకొన్న రోజులందు గృహలక్ష్మి కెట్టి యాదరణ యుండెనో నేఁడుగూడ నంతియు; కొంచముగ హెచ్చుగూడ. అందుచే నిదియే కారణముగ నుండజాలదు. కాని మాకు దెలిసిన కారణ మొకటి. ఆంధ్రులయం దొక్క విచిత్రమైన గుణము గలదని చెప్పుటకు చింతించుచున్నారము. ఎంత విద్యావంతులుగాని ధనవంతులుగాని పత్రికల చూడవలయునను నిచ్చయుండును నేమోగాని యర్థికరూపమున పత్రికల నాదరింపవలయున నెడి యభిలాష—అందు ముఖ్యముగ తమ మాతృభాషయందు వెలువడు పత్రికల ఆదరించి యుద్ధరింపవలయున నెడి కోర్కె చాలతక్కువ. ఇది ధనవంతులకు బీదవారికిగూడ సామాన్యమే. ప్రపంచ వార్తలను, తమ దేశవార్తలను దెలిసి

కొనుట, తమరచనలచే వానియందు వివిధ విషయములను చర్చించుట సంఘాభివృద్ధికి దోహదము గల్గించుటని అందరికి దెలియునేమోగాని, యట్టి యమూల్య పత్రికలకు తమకుఁ దోచినంత యార్థికసాహాయ్యము జేయవలయుననువారు తక్కువ యని యొప్పుకొనకతీరదు. మొన్న మొన్ననే బైలుదేరిన "ఆనందవికటన్" అను తమిళ వారపత్రికకు సుమారు పదివేలకు పైగా చందాదారులుండి వారిసంఖ్య దినదినాభివృద్ధి గాంచుచుండుటయు, ప్రతికూలివాఁడు సైతము దానినిగొని చదివి యానందించుట జూడనగును. కాని మన ఏ తెలుఁగు పత్రిక కంతమంది చందాదారులు గలరు? తుదకు యేకాకిగా వెలువడుచున్న దినపత్రికలకైన నంతమంది చందాదారులున్నారా యనునది సందేహామే. కావున మనయందు పత్రికాదరణ ఎక్కువ గావలయును. అపుడే పత్రికలన్నియు సర్వాంగ సుందరములై వెలువడి సంఘమునకు గొప్ప మేలుజేయ గలవు. ముఖ్యముగ గృహాలక్ష్మి నాదరించుట ఆంధ్రనారీమణుల విధియైయున్నదని మనవి చేయుచున్నాము.

నిజమే! ప్రజోపకరములగు పత్రికలకు ఆదరణ యుండవలసినదే; గృహాలక్ష్మి యేమి జేసినది; ఏమిచేయనున్న దనవచ్చును. ఎనిమిది వత్సరములుగా గృహాలక్ష్మి ఎట్టి యాశయములతో నేమిజేసినదో ఏమి చేయుచున్నదో పాఠకలోకమే నిర్ణయింప గలదు. దాని నిచట పేర్కొనుట ఆత్మస్తుతియని మాతలంపు. ఐన చేయనున్న దేమియనియన్న దాని కొకమాట దెలుప గలము. గృహాలక్ష్మికి తొమ్మిదవయేఁడారంభమైనది గదా! ఆ వయస్సునకు తగినరీతి యేయేవిషయములందు శ్రద్ధ వహింపనగునో భావిభారత గృహాలక్ష్మికవశ్యమైన విషయము లెవ్వియో వానియందెల్ల సాధ్యమైనంతవఱకు బనిచేయగలదు. ప్రపంచపరిజ్ఞానము, లలితకళా ప్రసక్తిని గుఱించి మునుపటికంటె శ్రద్ధవహించును. ఇంతకు మా సోదరీమణు లీవయస్సున తమ చిరుతసోదరి నెట్లు సర్వాంగసుందరిగా నొనర్ప నిష్టపడుదురో తదనుగుణము గనే గృహాలక్ష్మిగూడ బైలుదేరుచుండ గలదు.

అందుచే ఆంధ్ర సోదరీసోదరులను మేమొక్క ప్రార్థన గావింపవలసియున్నది. మునుపటివలె వారు తమరచనలతో గృహాలక్ష్మి నలంకరించుటకును, తమగృహాములకు తమసోదరిని యాహ్వానించి యాదరించుటకు తోడుగా నింకను యెక్కువ శ్రద్ధ వహించి, ప్రతియింట గృహాలక్ష్మికి యాదర మిప్పించుటకును, యితరులను రచనలకు ప్రోత్సహించి గృహాలక్ష్మికి బహుమతి చేయుటకును వారిని హృదయపూర్వకముగా ప్రార్థించుచున్నాము. ఆంధ్రనారీమణు లేమిటియందును నితరులకు దీసిపోరన్న పేరుమాత్రముచేతనే తృప్తిబొంది యుండక మిన్న లనిపించుకొన ప్రయత్నింతురుగాక. పరమేశ్వరు డందరి కోరికలను సఫలతజేయుగాక.

# గృహలక్ష్మీ ప్రశంస

శ్రీమతి మ. వసుమతిగారు

ఉ. తొమ్మిదియేండ్ల బాలికవు త్రోవను జూపుచునుంటి పెద్దలౌ
కొమ్మల కెల్ల; నే పొగడగూడదు నెచ్చెలిగ; గాని నీ మనో
జ్ఞమ్మగు రూపమున్ సుగుణ సంపదయుం గని హృద్యసుందరా
కమ్మనివాసనల్ గలయ గ్రమ్మిక మానసు సొక్కజేయుచున్.

సీ. "గృహలక్ష్మి యేతెంచెనీవేళ వేళకు తిండి యోగంబు లేదేమొ మాకు!"
"గృహలక్ష్మి లేకున్న నింటిలో నొకపూట దొరకునే తిండి మీ రెటుల గడిపెదరొ?"
"ఎటుల వచ్చెనో కాని యీ పేరుదీనికి వెడలగొట్టుటకైన వీలులేదు"
"సోపయోగమె లేకయున్నచో నింతకు సాగనంపరె నరుల్ స్వార్థపరులు?"

గీ. అనుచు నర్మసల్లాపకారణమ వగుచు
నెల నెలకువచ్చి యానంద నిధిని దెచ్చి
సోదరీమతల్లుల కెల్ల చూఱవిత్తు
నిన్ను విడువంగ, నోచెలి! నేర్తురెల్ల?

చ. నెల నెలవచ్చి మాగృహము నిండొనరింపుము వ్యాసహారముల్
గళమున నొప్ప, సుందర వికస్వరపద్యలతాంతమాలికా
వళి స్ఫురదీపశోభలు నలువైపులనిండ కథావిభూషలన్
లలనలు వేడ్కజూడ గృహలక్ష్మి! మనోహర సుందరాకృతిన్.

క. "గృహలక్ష్మి" సేవనమును
మహాలక్ష్మి పూజనంబు మగువల కెప్పుడున్
విహితంబగు నానందము
మహితశ్రేయసము మానక నొసంగున్.

# స్వయంకృతాపరాధమా!

సైనికోద్యోగమునన్న మాతండ్రికి నేనొక్కఁడనే కుమారుఁడను. నా జన్మకాలమున మాతండ్రి యొక దళాధిపతిమాత్రమే. తొమ్మిది సంవత్సరముల ప్రాయమందే తల్లి గతించినది. తదుపరి మాతండ్రితోఁగూడి వేరువేరు పట్టణములందు వసించుచుంటిని. మాకు బంధువు లెవ్వరులేరు. మాతండ్రి ద్వితీయ వివాహమాడలేదు. నేను కొంచెము పెదిగియున్నందున నొక సేవకుని సాయమున సంసారము సాగించుకొనుచుంటిమి.

మాతండ్రిగారి ఉద్యోగముతోపాటు జీతముగూడ అభివృద్ధిజెందినందున నే పెరిగిన పరిస్థితులు ఆదర్శప్రాయముగ నుండెను. కోరికలు సఫలతజెందకుండుట గాని, పనికిమాలిన పరిసరములను గాని, దారిద్ర్యమును గాని నే నెఱుఁగను. అట్లని నేను భాగ్యముతో తులతూగుచు దుర్వ్యయము గావించలేదు. నియమిత సౌఖ్యవాతావరణములో పెరిగియు నొకవిధమగు శిక్షణనన్ను చెడకుండ రక్షింపుచుండెను. దయార్ద్రహృదయుఁడగు తండ్రికితోడు విద్యాభ్యాసము దేశసంచారమును గూడ చిరుత తనమునుండి నాకబ్బిన భాగ్యము గల్గినది.

నా బాల్యకాలమున జెప్పఁదగినవి విషయమేమియు లేదు. ఆరోగ్యభాగ్యముగల్గి గౌరవనీయమైన పథమందు నడుచునట్టి యొక సాధారణ యువకుఁడనై నలుగురి కంటికానందముగ నుంటిని గాని సాంఘిక విషయములందు పరిచయము తక్కువ. ఏలన మా జీవితము సైనికజీవితమై కట్టుదిట్టములకులోనై యుండినది.

పదియేడవ సంవత్సరమున గనుల నిర్మాణ శాస్త్ర విద్యచదువ నారంభించితిని. కొలదికాలములోనే మాతండ్రి అనారోగ్యముచే గతించినను, నావిద్యావిధాన పరిసమాప్తికివలయు ధనముమాత్రము కావలసినంత యుంచిపోయెను. ఆతనిస్మృతిచే నేనొంటిరినైతిని. నాకు కొంతమంది దూరబంధువులుండినను వారి పేరులను తప్ప వారినిగూర్చి యెక్కుడుగ నెఱుఁగను. మాతండ్రి మరణము నాకు తీరని నష్టము గల్గించినను, ఇట్టి సమయమున యితర యువకులుండునట్లు నేను నిరాశాభావపూరితుఁడుఁ గాలేదు. సైనికశిక్షణ, నాకు మార్పులందు తగురీతివర్తించి ఉన్నదానితో సంతసముగ నుండునట్టి యభ్యాసము గల్గించినది.

అప్పుడు నా జీవితమున విశేషము లేమియుఁజరుగలేదు. నేను ఆటలందు చేరియుండినను ప్రఖ్యాతిజెందలేదు. బ్రహ్మచారియై ఉత్సాహపూరితుఁడగు యువకుఁడేయే విషయములందు పాల్గొనునో నేనుగూడ నట్లే వర్తించితిని. కాని నావిద్యావిషయమందు మాత్రము పేరు పొందగల్గితిని. నా బాల్య జీవితమున కట్టుదిట్టములకు లోనై యుండినందున నేను తప్పదుత్రోవల బోవలేదు అట్లు నడచుకొంటిని గదాయని గర్వముగూడలేదు.

నా యిరువదియొకటవ సంవత్సరమున పట్టమును పొంది కొన్నిమాసముల తరువాత బీహారునందలి రాగి గనులందు మొదటి యుద్యోగమును స్వీకరించితిని. నిజమగు యుత్సాహముతో స్వయముగ సంపాదించు బాధ్యత నారంభించితిని. అది కష్టమని యెంచియు నాకు జయశీలుఁడనుఁ గాననుభయము తోచలేదు. నాకు దివ్యమగుబలమును ఉత్తమమగు విద్యయు మాతండ్రి నిల్పిపోయిన కొన్నివేల రూపాయలునుఁ గలవు; నేను దుర్వ్యయుని గాను.

ముఖ్యపరిశీలనోద్యోగినై యుండుటచే అచటనా యుద్యోగము. నేను గనిగర్భమునుఁ బ్రవేశించి మాదిరుల సేరుకొని పని జరుగుచుండగా పరీక్షింపవలసి యుండెను.

# స్వయంకృతాపరాధమూ!

నేను మొదటిదిన ముదయమున కార్యాలయము నందు బోనునుఁజూడ నేగినపు తతఁడు నావంకసంశ యాశ్చర్యములు పురిగొన నవలోకింప, నతడేమి యోచించుచున్నాడని యచ్చెరువందితిని.

"చిత్తరంజన్! నీ వయస్సెంత?"

నేను ప్రత్యుత్తరమివ్వ నాతఁడు బల్లపైగ్రుడ్డి ముఖము చిట్లించెను. "సరి. నీవిక్కడ జేరావు. నీకొక పరీక్ష పెడతా"అని, ఉన్నట్లుండి లేచి "నీవు బయి స్తే వృద్ధికొస్తావు. యువకుల కిది పెద్దఉద్యోగమే" అని ముగించెను. కార్యాలయమునుండి పరిశోధనగది కాతని వెంటనడచితిని. అచట యథాప్రకారముగ, పరిశీలింప వలసిన వస్తువులు ద్రావకములు కుప్పలుకుప్పలుగ బడియుండెను. కిటికీకెదురుగా ఒక ద్రావకమును జూచుచు ఒకపురుషుఁడు నిలువఁబడియుండెను. మా చప్పుడువిని మావంకదిరిగెను. ఆతని కిరువదినాల్గు లేక ఐదుసంవత్సరముల వయస్సుండును. దీనదృష్టి, పాలి పోయిముఖము సన్ననిశరీరముపై వదులుగ వ్రేలాడు చున్నదుస్తులు గమనించితిని. ఆతఁడు నన్నొకవిధముగ జూచుచుండెను.

"బెనర్జీ, ఈతఁడు చిత్తరంజన్. చటర్జీస్థానమునకు వచ్చినాడు" అని బోను నావంకదిరిగి "బెనర్జి నీ సహోద్యోగిగానుండి నీకుఁ జూపవలసిన విషయము లను నాకంటె త్వరగాఁ జూపగలఁడు" అనెను.

మాకు ప్రత్యేకవసతు లొసఁగబడెను. కాని యేకాంతవాసము కష్టముగనుండెను. బెనర్జీవైఖరి నాకు విచిత్రముగఁదోచెను. నేనే సంభాషణ కారంభించితిని. కాని ఆతని మాటలందుగాని చదువునందుగాని మరే విషయమందుగాని యిష్టమున్నట్లెదోచలేదు. పాల్గొ నకపోయినను ప్రతిమానవునకొక విషయమం దిష్టముం డుట సహజమేగాని యాతని విషయము నదియసత్య మయ్యెను. నేను జెప్పునపుడువినుచు నాపైపొక విధముగఁ జూచుచుండెను. అందలి యర్థము నాకు దుర్భేద్యముగనుండెను.

ఆతని నేం[illegible] [illegible]దేను. ఆమె సౌందర్యము — ఆమె [illegible] మనో హరమైన చేరదేసికనులు, నాటి[illegible] [illegible] నిష్కల్మ[illegible]ము చింత[illegible]గూడి ప్రతి[illegible] [illegible] న[illegible]ండెను. నేను దాని[illegible] [illegible] విచి [illegible]మునొందితిని. ఆ[illegible] [illegible]నిగురించి [illegible] చెప్పలేదు, నే నడుగలేదు.

నేను త్వర[illegible] నా[illegible] [illegible] పోవుచుంటిని. అ[illegible] [illegible] [illegible] [illegible]లుఁ[illegible]గా నిశ్చయించుకొంటిని. నా[illegible] [illegible] నిపుణత్వము నా[illegible]ద్యోగమునకు చాల [illegible] వచ్చెను. బెనర్జీ[illegible] [illegible] [illegible] సని కొనసాగించుచుండెను గాని నానాఁటి [illegible]ఁడు చిక్కిపోవుచుండుట స్పష్టముగాఁ గానవచ్చుచుండెను. ఒకమారాతనితో అతని స్థితినిగురించి మాట్లాడి "యింత కంటె సులభమైన ఉద్యోగి[illegible] చూచుకొన రాదా" అంటిని. దాని కాతఁడు "[illegible] బాగుగనేయున్నా"నని బదులాడెను, గాని యాతని ముఖముమాత్రమది యసత్యమని చాటుచుండెను. ఏదో కారణమువలన నాతఁడా యుద్యోగము [illegible]న్నా డని తలంచితిని. దీనితరువాత ఆవిషయమై ప్రస్తావన లేమియులేక మా కార్యములందు నిమగ్నులమైతిమి.

ఒకసంవత్సరము గడచిపోయెను. ఒకమా రిరువురు చేరి, మరియొకమారు వేరువేరుగా పనిచేయుచుంటిమి. నాజీవితమును నాశనముచేసిన సంఘటనను చదువరు లకు దెలుపుటకుముందు గనుల యంతర్భాగమునందలి విషయము కొంతవివరింతును. గనిముఖద్వారమునుండి పెక్కుసొరంగములు పోవుచుండును. అవియే రాక పోకలకు దారులు. సొరంగము అంతమునగల గోడకు ముఖమందురు. ఆముఖము క్రిందిభాగమున 'వింజ'న బడు బొరియలుండును. అవి క్రిందిసొరంగములతో కలుపుటకై నిర్మింపఁబడియుండును.

ఒక మధ్యాహ్నము భోజనానంతరము నేనును బెనర్జీయును కొన్నిమాదిరుల నేరుకొనివచ్చుటకై

తొమ్మిదివందల అడుగులక్రిందనున్న సొరంగమునుబట్టి పోతిమి. మే మా సొరంగముఖమును జేరినపు డచట పండ్రెండడుగులలోతున 'వింజి'ని జేయుటకై పాటుబడుచున్న కొంతమందిని జూచితిమి. వారు దానిలో డైనమెట్లను పెట్టుటకు రంధ్రముల త్రవ్వుచుండిరి. వారు వానికి అగ్నిముట్టించుట కింకను కొన్ని నిముషములు వ్యవధియుండుటచే నేనును బెనర్జియును మా పనులకు వెళ్లిపోయితిమి. ఒక కురుచనిచ్చెన దిగి యాతఁడు 'వింజి'యందు మావిరుల నేరుచుండెను. నే నా 'వింజి'మీఁదగల పలకనుదాటి నూరడుగులదూరమునగల ముఖమువద్దకువెళ్లి నాపనిని జూచుకొనుచుంటిని.

నా పనియందు నేను నిమ్నడనైయుంటిని. ఆ 'వింజి'యందు పనిచేయుచున్నవారు డైనమైట్లకు నిప్పుబెట్టితిమని యఱచుచు నన్ను త్వరగరమ్మని బిలుచుచు పైకి నిచ్చెనసాయమున గబగబ నెక్కుచున్నంతవఱకు నాకు గమనమేలేదు. వారి అఱపులువిని చకితుఁడనైతిని. తత్క్షణమేఁ జేయవలసినకార్యము నాకుదెలియును. వెంటనే పరుగిడి పలకనుదాటుకొని, నిచ్చెనమూలమున పైనున్నసొరంగము జేరుకొని ప్రేలుడువలన ఎగిరివచ్చు రాళ్లనుండి ప్రాణములను గాపాడుకొనుటయే. అచటి పనివారంద రాతురతతో పైకివెళ్లి యినుపటి నిచ్చెనను పైకిలాగుకొనిరి. ఇంకను కొన్నినిముషములవఱకపాయము గలుగదని నాకు దెలిసియున్నందున, అప్రేలుడులో విడిచిరానిష్టములేని కొన్నిమాదిరులను ఏరుకొనుట ముగించిచూడగా అవతలికొనయందు బెనర్జి త్వరితగతి నిచ్చెనయెక్కుచుండెను. నే నాసొరంగము వెంట పరుగిడ ప్రారంభించి పలకమీఁదకు వచ్చితిని. వారు పనిజేయుగొయ్యి ఆ పలకక్రింద నేగలదు. అవసరములో పలకమీఁదనుండి కాలుజారి ప్రేలుడుపదార్థములతో పూర్తిగనింపబడిన గొయ్యిలోబడిపోతిని.

కాని నేను చాలయెత్తునుండి క్రిందబడలేదు. అది పండ్రెండడుగులుమాత్ర ముండును. అందుచే దెబ్బ తగులకపోయినను మరుక్షణములో గలుగనున్న అపాయమును నే మరువలేదు. అచటి డైనమట్లసంఖ్యయు, అవి పెట్టబడియున్న స్థళమును నాకు దెలిసియున్నప్పటికిని అవి ప్రేలుటకుముందే అగ్నినార్పు టసాధ్యమైయుండెను. లేచినిలువఁబడి గోడనెక్కుటకు ప్రయత్నించితిని. గోళ్లు గోడలోపలికి గ్రుచ్చుకొన్నను అచటి మట్టిగాని రాళ్లుగాని నాచేతులకు పట్టునివ్వలేదు. ఆగొయ్యి పైభాగమునగల పలకను జ్ఞప్తికిదెచ్చుకొని నాకాళ్లయందున్న బలమంతయు నుపయోగించి పలకను పట్టుకొనుటకై యెగిరితిని. కాని అది నా కందదయ్యెను. ఆ మృత్యుగహ్వరమునుండి తప్పించుకొనుటకు మార్గమును తలంచుటకుగూడ వ్యవధిలేక మరల మరల నెగుర నారంభించితిని. ఏక్షణమునందైనను ప్రేలుడు గలుగవచ్చును.

పైనయొక అఱపువింటిని. భయాశ్చర్యములు బెనగొన పైకిజూచితిని. బెనర్జి పైనుండి నిచ్చెనను క్రిందకు దింపుచుండెను. అది నేలనుతాకియు తాకకముందే అతివేగమున గబగబ పైకెక్కుచుంటిని. బెనర్జి నిచ్చెన కదలకుండ గట్టిగ పట్టుకొనియుండెను. అచట మా కిరువురకు నిముషములు—కాదు కొన్ని క్షణములు మాత్రము వ్యవధియుండెను. అతడు దేవునిదయవలన నిచ్చెనను గట్టిగ బట్టియుంచెనుగాని లేకున్న నాయాతురతవలన తప్పక నేను పట్టువీడియుండును, లేక నిచ్చెన క్రిందకు పడియుండును.

నేను పైభాగము జేరి పరుగిడజొచ్చితిని. మేమిరువురు మాసొరంగమున బరుగిడుచుంటిమి. ఏలన పైకిపోవుటకు కాలముచాలదు, కాని ఆప్రేలుడు చోటునుండి వేయు ప్రతిఅడుగు కూడ మా క్షేమమును బలపరచుచుండెను. ఎగరోజుకొనుచు, స్వేదబిందువులు జలజల రాలుచుండ సొరంగ మవ్వలి కొననున్న నిచ్చెనను జేరుకొంటిమి. ప్రేలుడు — అపుడే — భయంకరముగ ప్రేలుడు వినవచ్చెను. ఆశబ్దము నాశరీరమందలి ప్రతియణువును భయముచే నింపివైచి నను చైతన్యవిహీ

డుని జేసియైవ, నేను పరమాణువులుగా బేధింపబడు చుంటినని తలంచితిని.

శబ్దము పొగ అణగినతరువాత పనివారలు పై సారంగమునుండి క్రిందకు రానారంభించిరి. చైతన్య విహీనులై యింకను నచటనే నిలువబడియున్న మమ్ము నమ్మరాని హోయినిసూచించుదృష్టులతోఁ జూడసాగిరి. నాచెంపను గీచుకొనిపోయిన గాయముతప్ప మాయిరువురి కెట్టిగాయములుఁగాలేదు. నాప్రాణ మాతఁడు రక్షించెననుటలో కించిత్తైనను సందియములేదు. నేను దానినిగూర్చి మాటాడనశక్తుఁడై యాతనిచేతిని కృతజ్ఞతాసూచకముగ నొక్కితిని.

తరువాత నారాత్రి మా నివాసములందు మేమున్నపుడు, ఎట్టి ధన్యవాదము లాతని యౌదార్యకృషికి చాలకున్నను, నేనతనికి ధన్యవాదములర్పింప ప్రయత్నించితిని. అతఁడు నిర్మొగమోటముగా, అగౌరవముగా కసరివైచెను. నాకృతజ్ఞత అతని కయిష్టము గల్గించెనేమో?

"నీవట్లు నన్ను వదలించుకొనజాలవు. బెనర్జీ! నీవు నాప్రాణరక్షకునివి. నా ప్రాణసంరక్షణకొరకు నీప్రాణముల నొడ్డితివి. నీ వచటికి వచ్చినపుడు నాకు జీవించుటకు ముప్పదిక్షణములకాలమే యుండెను. అబ్బ! నాతలంపులు నీ వూహింపజాలవు! నాజీవిత సర్వస్వమునకేగాక నేనికమీద ఆర్జించిన దానికిగూడ నీవే కర్తవు. నాశరీరమున ప్రాణమున్నంతవఱకు నా జీవితము నీయధీనమే. దేవుఁడు నీకు నాకృతజ్ఞత జూపింప నొకతరుణము —" అని ముగింపకుండ నాతఁ డడ్డమై, "చిత్తరంజన్ తరుణమిపుడురాలేదు. నీచిత్తవృత్తి నెఱుఁగుదును. దానినింక విడిచెదము." అనెను.

ఈ సంఘటనానంతరముగూడ మే మిరువురము ప్రియమిత్రులుగా నుండజాలమైతిమనుటకు విచిత్రము గొలుపకమానదు. నాశక్తికొలఁది యాతని మదికెక్కునట్లు, ఆతని సంతోషపెట్టుటకు ప్రయత్నించితిని గాని, యాతఁడు యథాప్రకారముగా యేకాంతవాసియై, చెనకరాకయుండెను. తుదకు ప్రాణము విసుగెత్తి యాతనిచర్యకు వెరగందుచు విరమించితిని.

కొంతకాలమునకు తరువాత నాతఁడు సెలవుపై కొన్నినెలలకాలము కలకత్తానగరమునకు వెళ్లెను. నే నాతనికి కృతజ్ఞుఁడుగానుండియు, వెళ్లునపుడు చింతాధీనుఁడైయుండు నాతఁడు లేకుండుటొక సంబరముగా నెంచితిని. తిరిగివచ్చినపు డాతఁడు పూర్తిగా మారునని దలంచితిని. నిజమే ఆతఁడు మారియుండెను— కాని ఆమార్పు 'క్రమముగా రాజుగారిగుఱ్ఱము గాడిదయి'నట్లుండెను. కాని మార్పిదని నే జూపింపజాలనైతిని; ఆమార్పు మనోనయనములకుదప్ప నాలిక దృష్టికి గానరాదు.

ఆతనిప్రవర్తన నాకెంతమాత్రము సరిపడదయ్యెను. ఒక్కొకమారా ఉద్యోగమునువీడి యితరచోటికిపో ప్రయత్నించితిని గాని నాకదివఱకే వేతనాభివృద్ధిగల్గి యుండుటయు, బోసుగారు నన్నమితాదరముతోఁ జూచుచు పెక్కుపనులను నాకు వశపరచుచుండుటయు, నభివృద్ధిసూచకమని నా యభిప్రాయమును మార్చుకొంటిని.

ఒకదిన ముదయమున గనులజూపు కొందరు ప్రముఖులు వచ్చెదరని తెలియుటచే, బోసుగారు నేనును బెనర్జీయు నున్న పరిశోధనాలయమున కవసరముతో వచ్చి, తాను వచ్చువారికి గనులజూప నేగుదుననియు, ఈలోపల పనివారి కివ్వవలసినజీతము వచ్చుననియు, గుమస్తా లేకుండుటచే నేనే డబ్బును భద్రపఱుపవలెననియుఁజెప్పి ఇనుపపెట్టెను దెఱచుటకు మాఱు మొకచీటిపై వ్రాసియిచ్చి వెళ్ళెను. దానిని నేను జేబునందుంచుకొంటిని.

మధ్యాహ్నమైనందున బెనర్జీ భోజనమునకు వెళ్లెను. అంతలోపలనే డబ్బువచ్చెను. దానిని భద్రముగా

# స్వయంకృతాపరాధమా!

ఇనుపపెట్టెనందు దాచితిని. తదుపరి పరిశోధనాలయమునకు, ఆఫీసుమూయకనే వచ్చితిని. గదితెరచియే యున్న నే గనిపెట్టుకొనియుండగలనని నాయూహ. ఆదినము నాపల్లొకటి విపరీతముగ నొప్పిగల్గించుటచే నాపనియం దేకాగ్రతయుండకపోయినను చేయవలసిన పని బోలెడంతయుండెను.

బెనర్జి తిరిగివచ్చినపు డతనితో నేను భోజనమునకు వెళ్ల నిష్టములేదనియు పల్లునొప్పి విపరీతముగా నున్నదనియు జెప్పితిని.

"అట్లయిన పట్టణములోని దంతవైద్యునివద్ద కెందులకు వెళ్లరాదు? సాయంకాలమునకు ముందే నీవు తిరిగిరావచ్చును. నాపని నేనిదివఱకే ముగించియుండుటచే నీపనిముగించుట కించుక సాయపడగలను" అని బెనర్జి సూచించెను.

అది మంచిసలహా. అవసరకార్యములకు బనికివచ్చుటకొక మోటా రచటనుండెను; పైగా బోసుగారు నన్ను ఆఫీసునం దుండమనికూడ చెప్పియుండలేదు. జీతములిచ్చు ధనముదీసికొని ఇనుపెట్టెలో భద్రపరుపమనిమాత్రమే యాతనియాజ్ఞ. దానితరువాతనే భోజనమునకు బోనగును. ఇంతలో గనులజూడ నేగినవారు ఒకగంటకు దిరిగివత్తురు.

"సరియే. బోసుగారు వచ్చిరేని ధనము ఇనుపపెట్టెయందు భద్రముగనున్నదని చెప్పుము" అని యాతని సలహా కంగీకరించుచు బెనర్జితోనంటిని.

నేను పట్టణమున బోవుమార్గము నర్ధభాగముగడచిన తరువాతనే, నా కోటు పరిశోధనాలయమునందే యున్నదనియు, ఇనుపపెట్టె తాళపుచెవులు తెరుచు మార్గముగూడ నందే వీడివచ్చితిననియు జ్ఞాపకమునకు వచ్చెను. వెనుదిరిగివచ్చితిని. బెనర్జి తనపనియందు నిమగ్నుఁడైయుండి నేను కోటునదీసికొనుట గమనింపలేదు.

నేను తిరిగివచ్చుటకు చీకటయ్యెను. దంతవైద్యుఁడు నాకు మొదట నేదో చికిత్సజేసి పూర్తిగా చికిత్స నందుటకు మరుదిన ముదయమున దిరిగిరమ్మనెను.

ఆరాత్రి పల్లునొప్పి తిరిగి యారంభమయ్యెను. కొంతకాలము పరపుపైననే దొర్లుచుంటిని. కాని బెనర్జిని నిద్రాభంగము గావింప నిష్టపడనైతిని. నొప్పి యంతకంతకు భరింపరానిదయ్యెను. లేచి దీపము వెల్గించి ఆప్రదేశమును గలయజూచితిని.

బెనర్జి తనపడకమీద లేడు. నాకాశ్చర్యముగలైను. వెలుతురులో నాగడియారమునుజూడ రెండుగంటలైయుండెను. తలుపును దెరచి బైటికిజూచితిని. వెన్నెల కొద్దిగనుండినను ఏమియు గోచరముగాలేదు. త్వరగా దుస్తులనుధరించితిని. అతఁడంతరాత్రిలో నొకఁడే బైటికిబోవుట అస్వస్థతవలననో లేక పిచ్చిచేతనో యూహింపజాలకపోయితిని. ఎట్లయిన నాతని గన్గొని సాయపడ దలంచితిని.

చెప్పులు దొడుగుకొనుచుండ కాలివద్ద యేదో కాగితపుముక్క గనుపింప దానినిదీసితిని. అది బెనర్జికి వైద్యుఁడిచ్చిన బిల్లు; దానిపై నేవో బెనర్జి వేసిన అంకెలుండెను. అప్రయత్నముగ దానిని జేబులోవైచుకొంటిని, చెప్పు లింకను పూర్తిగ తొడగలేదు. ద్వారము దెరచుకొని బెనర్జిలోన ప్రవేశించి నన్నుఁగని నిర్ఘాంతపడి, "పిచ్చిపట్టినదని తలంచితి వేమో! నిద్ర రాకుండుటచే గాలిలో దిరిగివచ్చితిని." అని గద్గద కంఠముతో మాటాడెను.

నా తెలివితక్కువకు చింతించుచు దుస్తులుదీసి పడకజేరితిని. కాని బెనర్జి వృత్తాంత మభేద్యముగ నుండెను. అతఁ డసాధ్యుడని ఎంచితిని.

మరుదిన ముదయమున కంపెనీ కారులో దంతవైద్యునివద్దకు బయలుదేరితిని. ఐదు మైళ్లు వెళ్లినతరువాత నైరునందు గాలిపోయెను. దానిని మార్చుకొని వేగముగా నడుపుకొనుచుపోవుచుండ మా యజమాని

బోసుగారి కారు అత్యంతవేగముగ నాకారు కడ్డ మయ్యెను. అందులోనివారు నన్నాగమని యాజ్ఞా పించిరి.

నిర్దాక్షిణ్యముగ బోసుగారి గుమస్తా కారునుండి నన్ను క్రిందకు దిగమని నా కారంతయు పరీక్షించెను. పరీక్షానంతర మాతఁడు నన్ను తనతోఁగూడ రమ్మ నెను. ఎందుకో వచింపక బోసుగారి యాజ్ఞయని మాత్రము జెప్పెను. నాకు గలిగిన యాందోళన వర్ణనా తీతము. తిరిగి వచ్చితిని.

ఆఫీసుగదియందు బోసుగారు కూర్చొనియుండిరి. మూల నొక కుర్చీయందు భయముచేనొదిగి బెనర్జీ కూలబడియుండెను. బోసుగారు స్వస్థముగా, జీతము లిచ్చుటకై భద్రపరుపఁబడిన ధనమపహరింపబడినదని నాకెఱిఁగించిరి. సారాంశమిది. ముందునాఁటి భోజనా నంతరము బోసుగారు ఆఫీసునకువచ్చి బెనర్జీని ధన మెచ్చటనని యడిగి ఇనుపపెట్టెయందుండిన సంచిని చూచెను. అది అతనివాడుక గాకున్నను ఆరోజుననే జీతములపట్టీ తయారుజేయుటకు పెట్టెదీసి చూడ ఆ సంచియందు ధనములేదుగాని మట్టితో మిశ్రమమైన లోహపు ముక్కలుమాత్ర ముండెను. ఆతఁడే పదునొకండువత్సరములుగా ధనమును దాచు చుండెను, గాని యెప్పుడట్టి విపరీతముగల్గ లేదు. ఇనుప పెట్టెను బలవంతముగా దెరచినగుర్తులు లేవు. పెట్టెను దెరచుమార్గము నాకుమాత్రము దెలియును. బెనర్జీ దానిని యేదోవిధమున దొంగలించియుండినదప్ప పెట్టె తెరచుసమాచార మతనికి దెలియదు.

ధనమును దీయుటకు మా కిరువురకే సాధ్యమగును. మరుదినముదయమున ధనముజూచుకొందురని మాకు దెలియును. అదియునుఁగాక నేను వేగముగా మోటారు నందు పట్టణమునకుపోవుచు త్రోవలో పట్టుబడితిని. బెనర్జీ గనివిడిచి కాలిత్రోవను బోవుచుండ తీసికొని రాబడెను. ఈదొంగతనము మాయిరువురలో నొక్కరే జేసియుండవలెను.

బోసు కను లగ్నికణములు రాల, "ఇందులో డబ్బు దొంగలించిన దెవరు? చెప్పండి. చెప్పకపోయారా! పోలీసువారువచ్చేవఱకు నిర్బంధములో నుంచుతాను" అని గర్జించెను.

భయకంపితుండనై నానిర్దోషత్వమాతనికి విన్నవించి తిని. నేనాసనమునువీసి పెట్టెలో తెలిసినతప్ప తరు వాత చూడలేదు. బెనర్జీగూడ తాను నిర్దోషినని నెను. దీని నెవరునమ్మరు. బోసు కోపముచే మమ్ము గదికి త్రోయించి తాళము వేసి కాపుంచెను. మాయుండే మా వస్తువులన్నియు వెదకబడినవి.

బోసు వెళ్లిపోవుట గంటిని. ఒకచోట గూలబడి యచేతనుఁడనై యుంటిని. బెనర్జీమాత్రము గదియందు పచారు జేయుచుండెను. నేనది గమనించలేదు. అ ప్రయత్నముగా జేబునందున్న యొక కాగితమునుదీసి ఊరకనుదువ జొచ్చితిని. దీర్ఘచింతయందుండుటవలనను నాకది వాడుక. ఉన్నట్టుండి ఆ కాగితమువంక చూచి తిని. అదరిపడితిని. హృదయవేగము ద్విగుణించెను. ఆకాగితముపై బెనర్జీ యక్షరములుండెను. అవి ఇనుప పెట్టెను దెరచుటకు లెక్కించిన అంకెలు. త్రిప్పి చూచితిని. అది బెనర్జీకి వైద్యుఁడిచ్చిన బిల్లు!

ఒకక్షణములో సంతయు నా భావవీధిని మెఱసి పోయెను. నేను మధ్యాహ్నము ఆఫీసువిడిచిన కొదు నిముషలలోనే పెట్టెను దెరచుకొఱకును వ్రాసియుంచు కొన్నాడు. నేను వెళ్లిన తరువాత దాని నుపయోగించి నాడు. అర్ధరాత్రమున నాతని చర్య నిస్సంశయముగ ఆధనమును దాచిపెట్టుటకే!

మానసము కొంచెము విశ్రాంతి బొందెను. తన బిల్లుపై పెట్టెతెరచుటకు గావలసిన అంకెలుండుట దుర్లభము; అట్లుగాని నాతఁడు వ్రాసియుంచుకొన నధికారము లేదు. కావున ఆతని దురుద్దేశ్యము బయలు పడుచున్నది. దీనిచే నా నిర్దోషత్వమును నేను రుజువు పఱచుకొనఁగలను. కాగితమును జేబులో నుంచు

కోసుచు నాముఖమందు దోచు ఆనందభావము నణచ ప్రయత్నించితిని.

“ఇదో ఇటుచూడు, చిత్తరంజన్! నీవు నన్ను జిక్కించుకొన్నావని నాకు దెలియును”అన్నాడు బెనర్జీ ఉన్నట్టుండి. అతఁడు పచారుచేయుట నిలిపి భయమును వీడి నావంక విచిత్రముగాఁ జూచుచు నాముందు నిలువఁబడియుండెను.

నేను గొంతు సవరించుకొని “మంచిది. నీవేమి జేయదలచితివి”అని యంటిని.

“అదే నేనుగూడ నిన్నడుగ దలంచితిని”అని బెనర్జీ మెల్లగాననెను.

నేను చకితుఁడనై, “నాకందు జోక్యమేమియు లేదు గాని నన్నుగూడ వారనుమానించి యుండుటచే నేను నా నిర్దోషత్వమును ఋజువుపఱచుకొనక తప్పదని నీకు దెలియదా”అని యంటిని.

“నాకేమియు దెలియదు.”అనెను గాని అతని పెదవులు తడబడెను.

“ఏమీ” యని తీవ్రముగ గద్దించితిని.

చాలసేపటివఱకు కాతఁడు నిరుత్తరుఁడై తుద కతి ప్రయత్నముతో, “రెండుమాసముల క్రిందట నీప్రాణముల గాపాడితిని. ఆసమయమున చాల కృతజ్ఞుఁడవనుచేగాక, నీవు నీ జీవితమే నాయధీనమంటివి. బహుశా నీ వొకవేళ సమయానుసారముగ మాట్లాడితివేమో—”అని నావంక తీక్ష్ణదృష్టితో జూచుచు “నేనా జీవితమున ఒక సంవత్సరకాలను మాత్రము కోరుచున్నాను. నీ వియ్యకపోయిన నే దూషింపను; కాని కృతజ్ఞుఁడవైనచో ఒక సంవత్సరము ప్రతిఫలముగా నాకిచ్చు టొకగొప్పగాదు.”అనెను

“ఏమీ? ఒక సంవత్సరమా?” అతనికి పిచ్చేమైన బట్టినదా?

[కృతజ్ఞత జూపింప సిద్ధపడి చిత్తరంజన్ జీవితమెట్లు నాశనము జేసికొనియెనో, ఎంత ఘోర యాతన ననుభవించెనో, బెనర్జీని సంతోషపెట్టుటకై యొక స్త్రీమూర్తి ఎంతటి త్యాగమొనరించెనో రాబోవు సంచికయందు జదువుఁడు.] చ.రా.

---

## మేఘుఁడు

సుంద శర్మగారు

తపనాంశువేడికి తండ్రి తల్లడమొంద జననమొందిన కష్టజన్ముఁడితఁడు
పవలురాతిరి తీరుబడిలేక దిరుగాడు చపలచిత్తుని కనుచరుఁడితండు
జన్మభూమినివీడి జనకునివిడనాడి నింగిపైదిరిగెడి నీటుకాఁడు
ముల్లోకములనెల్ల మోహింపజేసెడి మెఱుపులసానికి మిత్రుఁడితఁడు

కప్పకూతల మెచ్చెడి ఘనుఁడితండు
కేకికుల్కులకితఁడు కేకిసలు వేయు
తుమ్మెదలయాటకితఁడు సంతోసమొందు
ముత్యములచిప్ప మూయించి మురియువాఁడు.

# పురుషుడైన స్త్రీ

## శస్త్రచికిత్సతో మిస్ కౌబ్‌కోవా మిస్టర్ కౌబెక్ అయింది!

"నే నింక ఆడుదానిని కాను—పురుషుడను. నా గౌనులు, ఫ్రాకులు అన్నింటిని నా చెల్లెలికి యిచ్చివేశాను. నేను ప్రస్తుతము నిండుయౌవనములో నున్న యువకుడను" అంటున్న దీ స్త్రీ.



జెండా కౌబ్‌కోవా ప్రపంచ ప్రసిద్ధి గడించిన జకోస్లోవెకియా నివాసిని. ఈమె వయసు 21 వత్సరములు. వైద్యులు అతి సూక్ష్మమైన శస్త్రచికిత్స చేయగా కౌబ్‌కోవా యువతి యువకుడైనది. దానితో నిన్న మొన్నటి వరకు మిస్ కౌబ్‌కోవాగా వుండినది యిప్పుడు మిస్టర్ కౌబెక్‌గా మారిపోయింది.

ఇప్పుడు ఆమె—కాదు అతడు నిండు యౌవనుడు. ఆమె నేడు చక్కని సూట్లు ధరిస్తూవుంది. ఇదివరలో స్త్రీగావుండి యే కార్యాలయములో యేపని చేస్తూవుండేదో అదేకార్యాలయములో అదేపని యిప్పుడు కూడా చేస్తూవుంది.

ఆమె భుజములు విశాలమైనవి. ఆమె నడుము సన్నము. సూటు ధరించిన ఆమె ఆకారము ఆకర్షనంతమై వుంది. ఇదివరకు బాబ్ వలెనుండిన ఆమె తల చక్కని క్రాప్‌గా మారింది. ఆమె నేడు వెళ్లినచోట్లలో చాల గౌరవింప బడుతూవుంది. అంతా ఆమె చుట్టును మూగువారే

### కౌబ్‌కోవానాటి ఖ్యాతి

ఇదివరలో కౌబ్‌కోవా స్త్రీగా వున్నప్పుడు అగ్నిశిఖలాగు పరుగు పెట్టడానికి పేరుబడింది. 80 మొగాలు 800 మీటర్ల పరుగు పెట్టవలసిన పోటీపందెములలో ప్రపంచములో ఆమెతో సమానముగా పరుగెత్తగల స్త్రీ మరియొకతె ఉండేదికాదు. 1934 లో లండనులో యీమె తొలుత దేశదేశాలనుండి వచ్చిన స్త్రీల నందరిని పరుగులెత్తుటలో ఓడించినది.

ఇంక జకోస్లోవెకియాలో ఆమె పేరు యీ పరుగులెత్తడములో చెప్ప నవసరమే లేదు.

ఇంతలో ఆమె స్త్రీత్వము పోయినది.

నాడు యువతి. నేడు యువకుడు. యువకుడై—కోబెక్ అయినతరువాత ఆమె ఖ్యాతి గడించుకోవలసివుంది.

స్త్రీ పురుషుడు అవడానికిగల కష్టాలు

స్త్రీ పురుషుడుగా చెలామణీ కావడంఅంత యెక్కువ కష్టమైన విషయము కాదను కొన్నది కోబ్‌కోవా మొట్టమొదట, కాని క్రమేణా ఆమెకు అంతా అనుభవమైంది.

మగవారి దుస్తులు కొనవలసి వచ్చింది, సూట్లు చాలచౌక అనుకొనేది మొదట కొబ్‌కోవా. తీరా కొనడానికి వెళ్లేసరికి అవి బ్రహ్మాండమైనంత ధర.

తరువాత స్త్రీ పురుషుడుగా మారినందుకు ప్రభుత్వపు చట్టాలలో కొంతమార్పు జరుగవలసివచ్చింది. ఆమె జన్మదిన సంబంధమైన సర్టిఫికెట్ మొట్టమొదట మార్పు చేయాలి. ఇందుకు ఒక లాయరు సహాయం. కొబ్‌కోవా ఆ లాయరునకు తాను పురుషుడుగా మారుసని రుజువుచేసే డాక్టరు సర్టిఫికెట్ యిచ్చింది.

ఈమార్పు జరిగేముందు ఆమె స్త్రీగా గడపిన జీవితము అంతమైనట్లుగా చావు సర్టిఫికెట్ జారీ చేయవలసివచ్చింది. అది జరిగిన తరువాత జననసంబంధమైన సర్టిఫికెట్ ఆమెకు అధికారులు యిచ్చారు. ఈవిధముగా కొబ్‌కోవా తన యిరువదియొకటవయేట పురుషుడుగా ప్రపంచములో చలామణికా ప్రారంభించింది.

వైద్యులు కొబ్‌కోవాకు చేసిన శస్త్ర చికిత్స చాల సూక్ష్మమైనది. ఇంకా మరి యొక చిన్నశస్త్రము చేయాలి. దానితో కొబ్‌కోవాలో పరిపూర్ణమైన మార్పు కలిగిం దన్నమాట.

మొదటి మార్పు

"మొట్టమొదట ఆమెలో మార్పు యే విధముగా కలిగిందో కొబ్‌కోవా యిలాగు చెప్పింది. మొట్టమొదట క్రిందటి వసంతకాలములో నాలో ఒక వింతమార్పు కలిగింది. ఆమార్పు—ఆ ఉద్రేకము నా భావములను మార్చివేసింది. దానితో వెంటనే నేను వ్యాయామముచేసే యితర స్త్రీలతో—స్త్రీలకోసము ప్రత్యేకముగా యేర్పడిన వ్యాయామశాలలో తరిబియతు సందడము మానివేశాను.. ...నేను స్త్రీనై యుండి క్రీడారంగములో యెంతటి ఖ్యాతి సంపాదించానో అంతటి ఖ్యాతియు పురుషుడనై కూడా గడింపగలనన్న దృఢవిశ్వాసము నాకు వుంది. నాకు సరియైన వయసు వచ్చింది. అందువల్ల నేను ప్రస్తుతము మిలిటరీ తరిబియతు పొందగలనని నమ్ముతున్నాను.

నన్ను ఇటీవల అనేకమంది వివాహ సంబంధమైన విషయము లడిగారు. నేను వివాహమునుగురించి యెప్పుడైనా తల పెట్టానో లేదో తెలిసికొనవలెనని వారికి యెక్కువ అభిలాష. ఈప్రశ్న నిజంగా కొంచం సున్నితమైనదే. అదీగాక యిప్పుడప్పుడే ఆ ప్రశ్నకు సమాధాన మీయవలసిన అవసరంలేదు. యెందుకంటే నా వయసు ప్రస్తుతం చాలా తక్కువ. కాని ఒక విషయము మాత్రము నిజం—ముందు ముందు నేను వివాహము చేసికొంటాను.

(ప్రజాబంధు)

# స్వాగత పద్యములు

(శ్రీయుత సర్ వేంకటసుబ్బరాయ [illegible]గారి అభినందనార్థము. [illegible]

తెలుగువిద్యార్థులు చదివిన ప్రశంసాపద్యములు.)

శా॥ శ్రీపద్మాననగూఢి సంతత సువిద్యానందు, [illegible] ।
జ్ఞానాపారీణత నుల్లసిల్లు త్రిజగత్కల్యాణ[illegible] ।
డా పీతాంబరుఁ జెల్లువేళను సత్యోద్యోగంబు శ్రేయోభిలం ।
షాపాంగంబులఁ బ్రోచుగాక మిమ్ము 'సర్' (Sir) [illegible]॥

సీ॥ చదువుసంధ్యలులేని చానలమేలుకై
విద్యాలయంబు గల్పించినారు ।
అజ్ఞానమునబడి యల్లాడువారికి
సుజ్ఞానమును త్రోవఁజూపినారు ।
పరులకు నుపకారపద్ధతి సమకూర్చి
ప్రజలమన్ననలను బడసినారు ।
తులలేని పెద్దయుద్యోగంబుల నొసంగి
అనదలకష్టంబు లడఁచినారు ।

తే॥ గీ॥ పావనంబైన నూతనవత్సరమున ।
సార్వభౌమ ప్రసాదిత 'సర్' బిరుదము ।
సర్వజన సంస్తుతంబుగ సంగ్రహించి ।
మాకు నానందమునుగూర్చి మసలినారు ।
దంపతుల మిమ్ము రక్షించు దైవమెపుడు ॥

# 'రాత్రిరాత్రే పగలుపగలే'

కూచిమంచి శ్రీరామమూర్తిగారు

తెల్లవారింది. సూర్యోదయమయింది. ఏడుగంటలు ప్రొద్దెక్కింది. ఇంకా లేవడు మోహనరావు. పాపం! అతనిగృహలక్ష్మి యిందిర నాలుగుగంటలకే లేచింది. పొయ్యి అంటించింది. బొగ్గులకుంపటి మీదపడేసింది కాఫీనీళ్లు. నీళ్లు మరిగిపోతున్నాయి. యింకా లేవడు మోహనరావు. కాఫీపొడుము నీళ్లలో వేసింది. ఆ నీళ్లప్పుడే చల్లారిపోతున్నాయి. యింకా లేవడు. ఏలాగయితేనేం యిందిర తటపటాయిస్తూ మంచందగ్గిరకు వెళ్లింది. గజగజవణికిపోతూంది. లేపితే ఏమంటాడో లేపకపోతే యేమంటాడో! చల్లారిపోయిన కాఫీ పనికిరాదు సరేకదా! కప్పులు వీధిలోకి ఎగురుతాయి. లేపితే త్రిడతాపనిభయం. ఇంతలో మోహనుడు ప్రక్కనుదొర్లటం సంభవించింది. ఇందిరహస్తములు మోహనునిపైని అప్రయత్నంగా వ్రాలాయి. విసుక్కుంటూ లేచి కాలకృత్యాలుతీర్చుకొని,

'ఏయ్ కాఫీ' అన్నాడు.

'చల్లారింది'

'ఎందుచేత'

'ఆలస్యం అవడంచేత'

'మళ్లీపెట్టాలి.'

'ఇదేపనా'

'ఇంకేంపని'

'బడి వేళకు భోజనం కావాలా'

'కావాలి'

'ఏలాగవుతుంది'

'చేస్తేను'

'భగవంతుడు నాలుగు కాళ్లు అయిదు చేతులూ ప్రసాదించలేదు.'

'లేకపోతే నేనెందుకు.'

'ఎందుకో మీకే తెలుసు' (చిరునవ్వు)

'వెధకబుర్లు చెప్పక త్వరగాచేయ్'

'ఇప్పుడెంతయింది.'

'ఎనిమిదేగా'

'బడి ఎన్నిఘంటలక్కు'

'రోజూచెప్పాలా'

'అయినా ఒకమారు చెప్పదురూందయుంది.'

'పదింటికి.'

సరే కాఫీతాగండిఅంది. చిరునవ్వు మొలకలెత్తుతోంది యిందిరసుందరాననంమీద. చిరుమొలకల కర్థము తెలియక విసవిసలాడుతున్నాడు మోహనరావు. కోపం ఎక్కువగావచ్చింది. ఎందుకువచ్చిందో అతనికే తెలియదు. పని కావచ్చింది. మోహనుడు 'ఇందిరా! యీవాళ్ల తిండిపెట్టదలచుకోలేదూ!' అన్నాడు భీకరంగా. కాని ప్రేమాప్రవాహం చిన్నిపుంసయిపోతున్నాడు. ఆసంగతి యిందిరకు తెలుసు. ఇంకా మొగము చిరునవ్వులతో నిండుతోంది. మోహనునికి కోపం నిముషనిముషానికి ఎక్కువౌతోంది. ఇంతట్లో పనికూడాఅయింది. మోహనరావు ఒకటిరెండు చేస్తూ స్నానంచేసి భోజనానికివచ్చేడు.

'ఆలోపస్సైపోతున్నాను కదా!' అని ప్రభావం చూపించడానికి ప్రారంభించేడు. కూర విసిరేయడం చారు పారబోయడం యిలాంటి క్రూరకృత్యాలు జరిగించాడు. తనచాకిరీకి రాణింపులేదని యిందిర విచారిస్తోంది. కోమలమయినమనస్సు క్రుంగిపోతోంది. చివరికి చిటిచిటికి గాలివానయింది. కోపంతో సరిగా భోంచేయక బళ్లోకివళ్లేడు. ఆలస్యంఅవడంచేత లేటుమార్కు Latemark చేసేడు. ఏదోబళ్లో చెప్పేడుగాని అతనికి పాలుపోటంలేదు. అకారణవైరం. మాటల స్ఫురింపువైరంగాని మనస్సులోవైరంకాదు.

ఒంటిగంటయింది. మోహనుడు యింటికివచ్చి తలుపు కొట్టేడు. కాని ఏమనుకున్నాడోగాని గిర్రునతిరిగి హోటలుకువెళ్లి కాఫీని సేవించి, పాఠశాలకు బయలుదేరేడు.

పాపం యిందిర విచారిస్తోంది. ఆలోచనలు పుట్టుకొస్తున్నాయి. "నేనుమాత్రం మనిషినిగానూ?

నే నేనున్నానని యింతకోపం? ఆయనకే యింత కోపంవుంటే నాకుమాత్రంవుండదూ? ఆయన అర్ధాంగినికానూ? యింటికివచ్చి తలుపుకొట్టి కాఫీతాగకుండావెళ్లేరు? పోనీ? వెళ్లనీ? ఈపూటనరారు. రేపూరారూ? అదీచూస్తాను.' అనుకుంది. అమాయకురాలు. అంత నవీననాగరికత ఎరుగదు. పల్లెటూరిబిడ్డ, పట్నవాసం కాపురంచేస్తోంది.

నాలుగయింది. బడివదలిపెట్టగానె గోదావరివైపు షికారువెళ్లేడు. చల్లనిపిల్లగాలు లాతనిమనస్సుని నిర్మలంగాచేసాయి. మనస్సులో భార్యపైనికోపం. కోపంతో ప్రేమా ఎక్కువౌతోంది. కాని నటించడం మానితే లోకువౌతానేమోయని భయం. ఇంటికి వచ్చేడు.

ఇందిర ఆయనభోజనానికివస్తారా, రారా, అని ఎదురుచూస్తోంది. గడియారంవైపు చూచింది. రెండు ముళ్లూ ఎనిమిదిమీదున్నాయి. 'పిలుస్తాను. ఏమంటారోచూస్తాను' అనుకుంది. ఆతడున్నగదినిప్రవేశించి మెల్లగా మృదుమధురస్వరంలో "ఎవరికుండవు తప్పులు. మనుష్యులకు ఉండకపోతే మానులకుంటాయా? ఎనిమిదౌతోంది. భోజనానికి దయచేస్తే బాగుంటుంది."

'నాకింకా అక్కర్లేదు.'

'కోపంచేతా? ఎందుకీకోపం?

'సరదాకి! వెళ్లు'

'భోజనంమాట'

'ఆకలివేస్తే తినచ్చు'

'ఎవరు'

'ఆకలివేసినవారు.'

'మీకులేదా?'

'నాకు లే దాకలి'

'నాకుమాత్రం వేస్తుందేమిటి?'

'వెళ్లమంటే తెలియడంలేదూ? నేనురాను. నీవు భోజనం పెట్టక్కరలేదు.'

'ఎందుచేత?'

'నీగుణాల్నిబట్టి'

'మంచిగుణాలున్న అమ్మాయినే పెండ్లిచేసుకోలేకపోయారు.' అంటూ విసవిసనడిచి వెళ్లిపోయింది.

వంటింట్లోకివెళ్లి తనకు కావలసిందేదో భుజించి పడకటిల్లుచేరింది. నేలమీద చాపవేసుకు పడుకొంది విచారిస్తూ. ఇంతలో మోహనుడు హార్మోనియంలో శ్రుతిచేసి, కూనిరాగాలతో, భావగీతాలతో దోమతెరమంచం మీద ప్రవేశించేడు. కాని నిద్దురపట్టదు. సిగరెట్టు వెలిగించేడు పూర్తిగాపీల్చి పారేశేడు. ఇంకా నిద్దురపట్టదు.

ఆరుబయట వెన్నెల్లోతిరిగివస్తే నిద్దురపడుతుందేమోఅని పెరటిలోనికి వెళ్లేడు. అది పున్నమరాత్రి. పండువెన్నెల పుచ్చపువ్వల్లా కాస్తోంది. చంద్రుని వంకచూచేడు. 'యిలాంటి చల్లనిరాత్రి ప్రణయ కలహాలతో వ్యర్థపుచ్చుతున్నావా' యని వెక్కిరిస్తూన్నట్టు కనిపించాడు. ఇంతట్లో 'నోరులేనిపక్షులమయిన మావిధంగానైనా అన్యోన్యంగావుండకూడదూ?' అని బుద్ధిచెప్పుతోన్నట్టు రెండుపిట్ట లొకచెట్టుపైనుండి చటున ఎగిరిపోయాయి. మోహను డేమనుకున్నాడో గాని వెంటనేవచ్చి పరుపుమీదచేరేడు.

ఇందిర విచారిస్తోంది, పూర్వపు ముచ్చట్లన్నీ జ్ఞాపకానికితెచ్చుకుంటూ. వేడికన్నీళ్లు నునుచెక్కులనుండి వక్షస్థలాన్నిచేరి, కట్టుకున్న పొత్తూరుచలువ ఖద్దరు చీరెను పట్టురవికెను తడిపేస్తున్నాయి. పాపం! ఆ సోదరీమణి అవస్థ వర్ణించడంకంటె అట్లాంటి భర్తలతో కాపురంచేస్తూన్న మహిళామణులకే విడిచిపెట్టితిని.

ఇందిరనోటినుండి అప్రయత్నంగా "లతలను, లలితలకు తగినఆశ్రయము లభింపకున్న శోభించుట చుస్తరముగదా?" అనేమాటలు గంభీరభావంతో వెలువడ్డాయి. మోహను డేమనుకున్నాడోగాని చటాలున మంచం దిగి యిందిర కరకమలములను పట్టుకొని "ఇందిరా! నిన్నీరోజున చాలాబాధపెట్టితిని, నగహంకారంచేత. నన్నునుగ్రహించి నా తప్పులు మరిచిపో. గృహలక్ష్మి క్షమించు" అన్నాడు సరసవచోగుంభనతో.

ఇద్దరూ పాన్పుపైచేరారు? ఇద్దరి మనస్సులూ నిర్మలంగా పవిత్రంగ ఉన్నాయి. మోహనునిచేతు లాతనిగృహలక్ష్మి ముంగురులు సవరించుటకు సిద్ధపడ్డాయి. పెదవులుపెదవులకై వెదుకొంటున్నాయి. తక్కినది మనకెందుకు.

# శారదా సుందరీదేవి

ఆచంట లక్ష్మీనరశింహాంగారు

శౌర్య పరాక్రమములచే, సాహసస్థైర్యములచే దేశములను జయించినవారిని లోకులు మహావీరులని పూజించుచు, వారినికాంచిన వీరమాతల చారిత్రవివరములను వర్ణించుచున్నారు. కాని శాశ్వతములైన మతవిశ్వాసములను వెలయించి, జనుల నజ్ఞానాంధకారమునుండి వెడలించుటకు తోడ్పడినవారును, పైవారి కంటె నెన్నియో రెట్లు అధికులునునగు బుద్ధభగవానుడు, ఏసునాధుడు, శంకరుడు, చైతన్యుడు, శ్రీరామ కృష్ణపరమహంస, వివేకానందస్వాములవంటి మతకర్తలను ప్రసవించిన నారీమతల్లుల యుదంతములను ప్రస్తావించుటలేదు. ఇందులకై కృషిసల్పుట యెంతయు నవసరము. ఇట, పాశ్చాత్య వ్యామోహము దేశమునలుగడల నావరించి, మతమును, జాతీయ జీవనమును, విధ్వంసముచేయు కాలమున నవతరించి బ్రహ్మసమాజమతమును స్థాపించిన కేశవచంద్రసేనుని మాతృదేవి చారిత్రము నుల్లేఖించుచున్నాను.

ఈయమ 1819 సంవత్సరమున, వంగదేశమున, హుగ్లీజిల్లాయందు, త్రివేణియను గ్రామమున జన్మించెను. ఈమె జనకుడగు గౌరీహరదాసు శైవమతస్థుడు. ఉత్తముడగు వైద్యుడనియు, కరుణాళువనియు పేరుగాంచెను. శారదాసుందరీదేవి బాల్యమున హెచ్చుగా చదువునేర్చియుండలేదు. కొలదిగా వ్రాయను, చదువనుమాత్రమే యభ్యసించెను. కాని మతవిషయికములగు పెక్కుగేయములను, గ్రంథములను యీమె కంఠత వల్లించుచుండెడిది.

ఈమె మనుమరాలి భర్తయగు క్షేత్రగిరిగారు ప్రచురించిన యీమె స్వీయచరిత్రమునుబట్టి, యీమె రూపసియనియు, బాల్యమునుండియు, కల్లకపట మెరుంగని నిర్మలాంతఃకరణ యనియు తెలియుచున్నది.

ఏక గ్రామస్థులును, శ్రీమంతులును నగు దివాన్‌రాధా కమలసేనుగారు యీమెను తమ కుమారుడు పెయరీ మోహానునకు ధర్మపత్నిగా జేసికొనిరి. అప్పటి కీమె వయస్సు 9 సంవత్సరములు మాత్రమే. ఈమె 10 వ ఏటనే అత్తవారిల్లు ప్రవేశించెను.

హిందూ సాంప్రదాయ సిద్ధమైన యవిభక్తకుటుంబమున బెరిగి, గృహమునకు సర్వాధికారిణియగు నత్తగారియొక్కయు, నాడుబిడ్డలయొక్కయు, యింకను యింటగల వృద్ధవితంతువులయొక్కయు, నడుమున నీమె యౌవనముగడపెను. తాత్కాలికముగ నీ శిక్షణము కష్టభాజనమే యయ్యు,

నీమె కత్యంత సహనమును, గరిపి భావి జీవితమునకు సహకారియయ్యెను.

ఈమె మామగారగు రాధా కమలసేనుత్తమ శ్రీ వైష్ణవుడు. భోగభాగ్యసంపన్నుడైనను, గృహమునందు కేవల విరాగియై సంచరించుచుండెను. పరమ సుశీలయు, వినయవతియునగు, శారదా సుందరీదేవి నీయన మిగుల గారవించుచు, నామెకు భక్తి ప్రపత్తులను గరపి, గురుడై, ఐహిక భోగములకంటె, నాత్మోద్ధరణమునకు పరమాత్మని శరణొందుమని యుద్బోధింపుచుండెను. యీయన 1844 సంవత్సరమున స్వర్గస్థుడయ్యెను.

ఈయన ఐహిక భోగములకు విస్తారము నోచుకొనలేరు. ఈమెకు ముప్పదవ వత్సరమున భర్త మరణించెను. అప్పటికీమెకు మూవురు కుమార్తెలును, ముగ్గురు కుమారులును కలరు. బ్రహ్మసమాజ స్థాపనాచార్యుడగు కేశవచంద్రు డీమె రెండవ కుమారుడు.

వితంతువుగానుండి యీమె సహనముతో పెక్కుకష్టముల ననుభవించుచున్నను, దినదినాభివృద్ధి నందుచున్న సంతానమునుగాంచి యూరట నొందుచుండెను. కేశవచంద్రుడు బాల్యము నుండియు మిక్కిలి మేధాశాలియై, కళాశాలయందు తోడివిద్యార్థులకన్న మిన్నయై, భావిజీవిత వికాసచిహ్నముల నగుపరచుటను గాంచి యీయమ ఆనందమును వెలిబుచ్చుచు, పరాత్పరునకు ధన్యవాదముల నర్పించుచుండెను. కేశవచంద్రుడు విద్యార్జనముతోబాటు, శీలము నలవరచుకొనుచుండెను.

ఈయన వైష్ణవసాంప్రదాయము ప్రకారము, చక్రాంతితముల నొనర్చుకొనుటకు తల్లియెదుట నయిష్టమును వెలిబుచ్చెను. ఆ మతవిధి జరుగుదినమున యిల్లు వెడలిపోయెను. ఈ యుదంతమును గురించి శారదా సుందరీదేవి, తన స్వీయచరిత్రము నందిట్లు వ్రాసియుండెను. "మతవిధి జరుగు దినము సమీపించెను. నా బిడ్డడగు, కేశవచంద్రునితోబాటు నా బావబిడ్డలగు జోగేంద్రుడు, మోహినీంద్రులకును, చక్రాంకితము లొనర్ప నిశ్చయింపబడెను. విశేష ప్రయత్నము లొనర్చబడెను. గురుదేవుడు మాయిల్లుచేరెను. పుణ్యదినము తెలవారెను. కాని కేశవు డెచటను కాన్పించలేదు. అతడు మిత్రుడగు దేవేంద్రనాథుని శరణు జొచ్చెను. వాడు క్రైస్తవమతమును స్వీకరించబోయి యుండునని, నాటిదినమంతయు నేను ఆహారపానీయములు ముట్టలేదు. రాత్రి ప్రొద్దుపోయిన పిమ్మట నాకుమారుడు యిల్లుచేరి, నా స్థితిని చూచి నిశ్చేష్టుడయ్యెను. అతడు నెమ్మదిగా నన్ను సమీపించి నా చేతియందొక పుస్తకమును, ఒక కాగితమునుంచి వెడలిపోయెను. చదివి చూడగా నా కాగితమునం దిట్లుండెను.

"కస్త్వం వా ? కుత ఆయాత?
కోమే తాత ? కామే పుత్ర ?
మాయామయమఖిలం హిత్వా"

(నీ వెవరు ? ఎందుకువచ్చితివి ? తండ్రి ఎవరు ? పుత్రుడెవరు ? ఇదంతయు మాయ యని యెరుగుము.)

ఈ శ్లోకమును చదువగానే నాభావములు మారెను. నేను వెంటనే లేచి గురుదేవునియొద్దకు పోయి ఆ శ్లోకమును చూచితిని. ఆయనదానిని చదివి "అమ్మా? యిదియే నీకుమారుని మతమగుచో నతడు త్వరలో మహా ప్రబుద్ధుడు కాగలడు. వేలకొలది మంది యాతని నాశ్రయించగలరు. నీకు విచారమక్కరలే"దని పలికెను. ఈ మాటలను విన్నపిదప నాకు ఆశ్వాసము కలిగెను."

ఈమె హిందూవిధుల ప్రకారము సంతతవ్రత పరాయణయు, విరాగియునయ్యు సంకుచిత స్వభావకాదు. ఆమెభావములు విశాలములై, తనకుమారుని విశ్వాసములను ప్రోత్సహించదగినవై యుండెను. తనకుమారుడు బ్రహ్మసమాజమును వరించినపుడె తనస్థితి నామె యిటుల వర్ణించెను. "వాని మతాంతరమప్పుడు నేను పడినబాధ లిన్ని యన్ని కాదు. అనుదినమును దూషణపరంపరలుమీాద పడుచుండెను. నా బావగారగు హరి మోహనబాబు, నాకుమారుని, విపరీత స్వతంత్ర భావములకు వానిని దండింపనైతి నని, నన్ను దినదినమును తూలనాడుచుండెను. కన్నీళ్లధారలు కురిపించుచుండెను. అప్పుడు నాకు, మావాడు నిజముగా తప్పు చేయుచున్నాడేమో ననిపించెడిది. కాని యిప్పుడు నాభ్రమ తొలగినది."

మరొకసారి యీామె తనమనోధైర్యమును వెల్లడించెను. కేశవచంద్రుడు, తన బంధువులెల్లరకును, అయిష్టమని ఎరిగియు, తన జ్యేష్ఠపుత్రుని జాతకర్మను బ్రహ్మసమాజ విధులప్రకారము స్వగృహమున జరుప తీర్మానించెను. 1863 సంవత్సరము జనవరి 11 వ తేదీని యీా పుణ్యకర్మ జరిగెను. వాద్యములు మహాధ్వనితో ప్రారంభము కాగానే, కేశవచంద్రుని బంధువులు, యిదివరకువలె, ఆయనను యిలువెడలగొట్ట శక్తిలేక, ఆదృశ్యమును చూచి భరించలేక, స్త్రీలు, బిడ్డలు, నవుకర్లు వస్తువాహనములతో యిల్లువదలిపెట్టి పోయిరి. ఈ సమయమున ఒక్క కేశవచంద్రుని మాతృదేవి మాత్రమే యాతని బాయకుండెను. గృహయజమానిపై నాధారపడిన వితంతువయ్యు, నీమె నైతికముగా తనకుమారుడు న్యాయపక్షమున నున్నాడని దృఢముగా విశ్వసించుటచేతనే, ప్రపంచమంతయు విడచినను, తానుమాత్రము కుమారుని విడువలేదు.

శాంతి, సామరస్యములే యీామెమతమై యుండెను. ఈమె మూఢాచారముల నెన్నడును ఆమోదించలేదు. పరులదుఃఖమును బాధలనుచూచి కరుణామయియగు నీమెహృదయము ద్రవించెడిది. ఎంత దుర్బలగానున్నప్పుడైనను, యీామెవ్యాధిగ్రస్తుల కుపచారముచేసెడిది. ధనాఢ్యగాకున్నను, యీామె పేదలకు శక్తికొలది తోడ్పడుచుండెను. తారయను పరిచారిక కీమె విస్తా

రము తోడ్పడి, యామెను తనతో తీర్థ యాత్రలకు తీసికొనిపోవుచుండెను. వితర్క మెరుగని యామె దాతృత్వమును పూర్వాచార పరాయణులును, బ్రహ్మసామాజికులును కూడ సమముగానే యాశించుచుండిరి.

కుటుంబవిభాగములం దీమెకు భర్త వీలునామా ప్రకారం రావలసిన రు. 15000 ల రొక్కమును రాబట్టుకొనుటకు, బావగారి మీద దావా వేయవలసినదిగా మిత్రులీమెకు సలహాయీయగా, నీమె తిరస్కరించెను. ఇందునుగురించి తన స్వీయచరిత్రమునం దీమె యిటుల వ్రాసియుండెను. "కోర్టు వ్యవహారము లెట్టివో నే నెరుగను. నేను దావాచేయ నిరాకరించుటచేతనే, నాపాలు భాగమును గోల్పోయితిని. ధనము పూజనీయులైన నా బావగారిని జైలునకుపంపి, హింసించి, సాధించదగినంత వాంఛనీయము కాదని నిశ్చయించితిని." ఇట్టి నిశ్చయము భర్తను గోల్పోయిన యువతికి కలుగుటెంత కష్టమో మనము సులభముగా నూహించవచ్చును. కుటుంబ పరిస్థితులు తారుమారైనప్పుడు సైతమీమె తననిశ్చయమునకు విచారము చూపలేదు.

ఈయమ తన దీర్ఘజీవితమును, హిందూ వితంతువుల భాగధేయమగు నిరంతర సేవాపరాయణతతో గడపెను. సుఖములు పైబడినప్పుడేమి యుబ్బి తబ్బిబ్బు కాలేదు. బాధలు, వియోగములు, దుఃఖపరంపరలు అలముకొన్నప్పుడు క్రుంగిపోలేదు. ఈమె జీవితకాలముననే, యామె సంతానమునందరును, పెక్కుండ్రు మనుమలును మరణించిరి. దైవేచ్ఛయందు పూర్ణవిశ్వాసమునుంచిన, యీ ధీరస్వాంత వ్యర్థముగా వాపోవలేదు.

వృద్ధురాలై, పరలోక గమనోన్ముఖురాయెయున్న సమయము నీమె తనయనుభవముల నిట్లు వ్రాసెను. "సువిశాలమైన, నాకుటుంబమున, సుఖదుఃఖములు అవినాభావములైన, నిత్యసంఘటనలైనవి. భగవానుడు నాకు కేవల సుఖముగాని, కేవలదుఃఖముగాని ఎన్నడును కలిగించలేదు. ఎల్లప్పుడును అవి రెండునుకలిసియే వచ్చుచుండెను. అందువలన, నేను యీ ద్వందమునుండి విడిపించుకొని, యావలి తీరమును చేరితిని. నా కుటుంబమున నొకశాఖవారు నిలువ నీడయు, తిన తిండియులేక బాధపడుటయు, రెండవ పక్షమువారు మహారాజభోగములతో తులతూగుటయు, కాంచినను, నేను హర్ష, దైన్యవివశురాలను కాలేదు.

ఈరెండును కరుణామయుడైన, విశ్వరక్షకుడు అర్పాములని చేయుచున్న వుత్సవములే యని గుర్తెరిగి, ఒకకంటితో సుఖమును, మరొకకంటితో దుఃఖమును భరించి, ఆత్రముతో పరమపిత సాన్నిధ్యమున కెదురు చూచుచున్నాను."

మాతృదేవి యుద్బోధము, కేశవచంద్రుని యాద్యంతములందును తాండవించుచుండెను. ఆమె యాధర్మమును మానసమునం దుంచుకొనియే, యీయన

పాశ్చాత్యదేశములందు పెక్కుచోట్ల హిందూ గృహశాన్నత్యమును గురించియు, హిందూ మాతలయొక్కయు గృహిణుల యొక్కయు నాధిక్యమును గురించియు నుపన్యసించియుండెను. ఈయమ ప్రోద్బలమున నే తన నూతనమతమున, నుత్తమ హిందూ సంస్కారములకు తావొసంగెను. ఈయమ పాదతలమున గూర్చుండియే, యీ ప్రవక్త తన "నవసంహితను" రచించియుండెను. ఈయనచే సృష్టింపబడి, హిందూ విజ్ఞానాధి రాశియై, ప్రాశ్చ పాశ్చాత్య జాతులనేక మొనర్చగలిగిన బ్రహ్మసమాజమున కీమె మాతృతయని చెప్ప నొప్పును.

ఈయమ సుదీర్ఘ జీవితమున మనకు విచిత్రసంఘటన లేమియు గోచరించవు. కాని జీవిత మంతటిలోను ఒకటి రెండు యుత్తమకార్యముల నొనర్చి ఘనత కెక్కిన వారికంటె, జీవితమంతయు సాధనరూపముగా గడపినవారు హెచ్చుధన్యులేని, క్రియా పూర్వకమగు సద్బోధమున జీవిత మును గడపిన, యీయమ జీవితము పరమ ధన్యమని చెప్పవచ్చును.

ఈయమయందలి ప్రియవాదిత్వము, సహనము, శాంతము, ధార్మికత, ప్రపంచము నెడ విరాగము, అకుంఠితమైన ఈశ్వరవిశ్వా సము కేశవచంద్రునందు మూర్తీభవించి యుండెను. ఇంకను విశేషించిన యీయన శక్తులు దైవదత్తములే యైనను, శీలనిర్మా ణము పూర్తిగా యీయమదేయని యొప్పు కొనక తప్పదు. యీవిషయము నాయనయే యొప్పుకొనియుండెను.

కేశవచంద్రుడు అవసానకాలమున, మిగుల యాతన ననుభవించుచుండ, నీయమ హృదయము వ్రేలునట్లు విలపించి "నాయనా? నీ యాతనకు నా ఘోర పాపమే కారణము. దౌర్భాగ్యురాలనగు నా కడుపున జన్మించుటవల్లనే, పవిత్రా త్ముడవయ్యు నీ విట్లు బాధపడుచున్నా"వని యాక్రోశింప, మరణావస్థయందున్న కుమా రుడు "అయ్యో! ప్రియజననీ? అటులన కుము? నీవంటి యుత్తమశీలయగు మాతృ దేవి యెవనికి లభించగలదు? నేను నీగుణ పుంజములనే గదా, భగవదనుగ్రహమున రాణింపజేసినది? నేను యీ ప్రపంచమున నాదని చెప్పుకొనునదంతయు నీదే? ముమ్మాటికి నీదే"యని జవాబిచ్చెను.

అంతిమకాలమున బల్కిన యీ సత్యవ చస్కుసివాక్కులకంటె, నీయమ జీవితము సార్థక్యమయ్యెనని యుద్ఘోషించుటకు వేరు సాక్ష్యమేమి వలయును? ఈయమ ఋషి తుల్యజీవితమునే, ఆయన గ్రహించెనని యిందునుబట్టియే గ్రహించవచ్చును.

ఈమె తన ఎనుబది ఎనిమిదవయేట, (1907 సంవత్సరము) పరమపదము నొందెను. ఈమె యస్తమించి చిరకాలము గడచినను, యీమె జీవితము భారతసంత తికి ఆదర్శమై వెలయుచున్నది. ఇట్టి యున్నతాశయ ప్రేరితలై, క్రియారూపిణు లైన, వీరమాతలు, పెక్కురు జన్మించి నప్పుడే, దేశము స్వాతంత్ర్య విరాజితము కాగలదు.

# శిశుశిక్షణము

బుర్రా వెంకటనాంచారయ్యగారు ఎం. ఏ.

## పసిబిడ్డ అనుకరణము

ఇతరుల భావములనుగాని పనులనుగాని బోలు భావముల మనలో రేకెత్తించుట కార్యముల నాచరించుటయు ననుకరణమగును. తనకు మూలపురుషుండగు శాఖామృగమువలెనే మానవుడును అపారమగు ననుకరణశక్తిని బడసియుండెననుట అత్యుక్తికానేరదు. వేషభాషలయందు, ఊహాపోహలయందు జుట్టు బొట్టులయందును మానవుడు తెలిసియో తెలియకనో పరిసరముల ననుసరించుచునేయున్నాడు. మానవునియు జంతుజాలముయొక్కయు నభివృద్ధి ముక్కాలుమువ్వీసము అనుకరణముపై నాధారపడియున్నది. పసిబిడ్డ ప్రప్రథమమున పెద్దల ననుకరించుటవలననే వృద్ధిదాయకమగు జీవనము నెరపగలుచున్నది. అనుకరణాభిలాష సాధారణముగా నాలుగునెలలదైన తర్వాతనే శిశువునావరించును. శిశువు సాధారణముగా తన తల్లితండ్రులవలననే యెక్కువగా ననుకరించును గనుక "అబ్బాయి; ఇది చేయుమది చేయకుమని" ఆనబెట్టుట నిరుపయోగము. బిడ్డలు సదభ్యాసముల నలవరచుకొనవలయునని పెనగులాడు పితరులుగూడ సభ్యాసముల పుంజితులై యుండుటకు సర్వథా యత్నించుట కడుంగడు శ్రేయస్కరమని సుస్పష్టమగుచున్నది.

కడుపులో మాడునపుడు బిడ్డనోటిలో నేదియో తినుబండారమును పెట్టుకొనుట యనుకరణము కానేరదు. కాని తనకు బుభుక్షలేనపుడును తనకు రుచింపనిపదార్థములును, ఇతరులు తినగాంజూచి తానును మెక్కుటకు యత్నించుట తప్పక యనుకరణమగును. తాను క్రొత్తగావినిన ధ్వనిని మరల మరల జేయ యత్నించుటయు ననుకరణమేయగును. జంతువులన్ని కృత్యముల ననుకరింపంజాలవు. కోకిల సహజమధురమగు మాతృగానమునే యనుకరింపగలుగునుగాని తదితరరవముల ననుకరించెడిశక్తి దానియందు శూన్యము. కాని బిడ్డడు తిర్యగాదులవలెనేగాక పరిసరముల నతికౌశల్యముతో ననుకరింపంగలుగును. అట్టి శక్తియే అత్యధికుడు వృద్ధికాముడగుటకు [illegible] చున్నది.

అనుకరణము బుడుతనియందు ప్రాధాన్యము వహించుచున్నది. ఇది బిడ్డనికి మొదటి ఆరునెలలలోనే పరిచితమగును. ఆవలించుట నవ్వుట మొదలగు కార్యములనే ప్రత్యనుకరణమందుము. ఇతరులా కార్యములొనర్చుట పరిశీలించి వానిని బిడ్డ అనుకరించును గనుక దీనికి ప్రత్యనుకరణమని నామకరణము జేసితిమి. అయత్నకృతానుకరణమును మొదటి నాలుగు సంవత్సరములలోనే బిడ్డడారంభించును. బిడ్డ తన పరిసరములను పరిశీలించుజ్ఞానము నిపుడు బడయును. అట్టి అనుకరణమును నిర్హేతుకముగనే శిశువారంభించుచున్నాడు. అట్లొనర్చుటలో వాని కెట్టి యుద్దేశ్యమును లేదని స్పష్టముగా చెప్పవచ్చును. శిశువిపుడు కోడికూత పిల్లిమోత మొదలగు ధ్వనుల ననుకరించుట యందత్యుత్సాహము జూపును. నాటకీయానుకరణము నిపుడు మొదలిడును. దీనికి పైదానితో సంబంధము లేకపోలేదు. కాని యీ ఘట్టమున శిశువు తన భావపరంపరను బహుధా వ్యక్తపరచ నిచ్ఛగించును. తాను వినినట్టియు చనివినట్టియు బిడ్డలగాని మానవులగాని తాను సాధారణముగా ననుకరింపం జూచును. స్వేచ్ఛానుకరమునే అప్రేరితానుకరణమని పిలువవచ్చును. ఇట్టియెడ బాలుడన్యవస్తుప్రేరితుండైగాక లోలోన పొడసూపెడి తన కోర్కెలను కొనసాగించుటకై అనుకరించుటయే యిదియగును. ఇట్టితరి తాను

కొంతవఱకు భాషనుగూడ నలవరచుకొనును. తనకు వచ్చిన బుడిబుడినుడులతో తనవాంఛలను వ్యక్తపరచును. ఇది శిశువృద్ధికి ముఖ్యావసరము. తనలో తాను నవ్వుకొనుట మొదలగు కృత్యముల యత్నకృతానుకరణజనితములగును. కాని తానితరులనవ్వించుట స్వేచ్ఛానుకరణమగును. ఆదర్శానుకరణమును గూడ బిడ్డడు వ్యర్థముగా నొనరించుటలేదు. ఇట్టి కృత్యము నాచరించుటకుముందు శిశువు, కొన్ని యాదర్శములనుగలిగి తత్సాధనకై పెనుగులాడుచు నట్టి యాదర్శములసాధించిన వారలవలెనే మెలఁగుటయే ఆదర్శసాధనానుకరణమగును. అయినప్పటికిని అనుకరణవైధర్మ్య మిదమిత్థమని చెప్పుటకు వీలుపడదు. దీనియంగము లొండొంటితో సంపృక్తములగుటవలన నట్టి విభజనమొనరించుట దుస్సాధ్యమగుచున్నది.

## ప్రత్యనుకరణము

ఏణ్ణర్థము పైబడువఱకును బిడ్డలు ప్రత్యనుకరణమును మాత్రమే యొనరింపగలుగుచుండిరి. పోనుపోను యిది తదితరభాగములతో మిశ్రితమైనను, మానవుని బొత్తిగా వీడిపోవుటలేదు. వానియందడగియే యుండును. బిడ్డలు దర్పణమువలెనే సర్వమును తమయందు ప్రతిబింబింపఁజేసెడి శక్తిగలవారనుట సువిదితమేగదా! నీవు వారల విషయమెట్లు మెలఁగెదవో నీయెడల వారు నటులనే మెలఁగెదరు. మానవుని వ్యక్తిత్వము, మనోభావములును, వానిమోము, కంఠధ్వని, వాని కృత్యములయందు సహితము పొడగట్టుచునే యుండును. దానిని బిడ్డడుగూడ పొడగట్టుశక్తిగలిగియేయున్నాడు. ఉదయముననే యుపాధ్యాయుఁడు నిప్పులకుంపటివలె మోము పెట్టుకొనినచో బుడుతలును అట్టులనే చిఱ్ఱుబుస్సనుచుందురు. అతఁడు వారియెడ నాదరణ జూపినచో వారున్నూ అతని నాదరింతురు.

## అయత్నకృతానుకరణము

ఇట్టిది సాధారణముగా సంవత్సరముపైబడిన బిడ్డలతో నంకురించును. ఇదియును మెండటిదియు సర్వదాసంపృక్తములే. ఇది సాధారణముగా కరచరణాద్యవయవ విక్షేపమువలనను ధ్వన్యనుకరణమువలనను గలుగుచున్నది. ఇట్టి అనుకరణము నిర్హేతుకమైనదని మనకిదివఱకే తెలియును. పసిబిడ్డలు సామాన్యముగా తమకు పరిచితములగు తిర్యగాదుల ననుకరింతురట. అందులకే కాబోలు, 1,2 సంవత్సరముల పిల్లవాఁడు "అంబా"అనుచు తానావు బుజ్జాయినని చెప్పి తల్లిదండ్రుల సంతోషపరవశులను జేయుట. బిడ్డలు తాము వినిన ధ్వనులను చూచిన సైగలను, ఈరీతిననుకరింతురు.

## నాటకీయానుకరణము.

పైదానివలననే నాటకీయానుకరణమును బిడ్డడు, కమ్మచ్చులోనుండి బంగారుతీగెను కలాదుఁడులాగినటుల లాగును. ఇదే బిడ్డని అభివృద్ధియొక్క వైధర్మ్యమును తెలుపుచున్నది. ఇట్టియెడ నర్భకుఁడు తానువినిన కథలయొక్కగాని చూచినవస్తు ప్రపంచముయొక్కగాని ప్రేరణవలన తాను కొంతవఱకు మనఃకల్పనము మొదలిడుచున్నాడు. తనయిల్లు తగులపడునటుల భావించి యేడ్వసాగును. తనయాటవస్తువుల నెవ్వరో దొంగిలించినటుల తలంచి నిర్విణ్ణుఁడగును. అదియేగాక ఆంధ్రభాగవతమున బాలకృష్ణుఁడు 'గోపాలకుఁడనేను గోవులుంపీ'రని యుపన్యసించినటుల తాను కంచరవర్తకుఁడని, వైద్యుఁడని, ఉన్నతోద్యోగియని పెద్దవారితో చెప్పుకొనుచుండును. ఒకప్పుడు కొందరు పిల్లలు కుంకుమమ్మెడివారి చర్యనంతయు జాగరూకతతో పరిశీలించి వారివలెనే రాతి మొరుము తెచ్చి పొట్లములుకట్టి అమ్ముటకు మొదలిడిరి. బిడ్డలు పరిసరములందే యే విషయముల నేత్రపర్వమగునటులగాంతురో వానినన్నిటిని తా మనుకరింపఁజూతురు. కనుకనే పితరులు సామాన్యకుటుంబమునకు చెందినవారలయ్యు తా మున్నతోద్యోగులకు తరుచుగా నిజగృహములందాతిథ్యమొసంగి వారలు పదేపదే తమయిండ్లకువచ్చునటుల జూచినచో వారిసంపర్కమువలన బిడ్డలట్టి యుద్యోగులననుకరింప మొదలిడుదురు. అట్టి అనుకరణ వాంఛయే వారిని కీడకుండునటుల జూచినచో

వారలున్నూ పెరిగి పెద్దవారైనతర్వాత నున్నతోద్యోగముల బడయగలుగుదురు. పాఠశాలలయం దుపాధ్యాయులును బాలురభావములు ప్రదిక్తములగునటుల జూచి యుక్తాయుక్తముల నెఱింగి వారినిట్టి యనుకరణము నభ్యసింపఁజేసినచో తప్పక బాగుపడెదరు. నటనానురక్తి బిడ్డనికి మూఁడవయేట నేగలిగి జీవితకాలమంతయు వానిని వీడుటలేదు. నాలుగు మొదలు ఏడుసంవత్సరములు వచ్చెడివఱకును బిడ్డనియందిది యుచ్చస్థితిని గాంచును. ఈకాలముననే బిడ్డ సాధారణముగా తనతో నొకసంగిడిగాఁడో కొందఱు స్నేహితులో భాషించునటుల భావించి తన నటనాకౌశలమునంతయు జూపఁ మొదలిడును. ఇట్టి అభ్యాసమే యేకపుత్రులకును గలుగుచున్నదని కృష్ణాపత్రికముఖమున నిదివఱకే వివరించియుంటిని.

## స్వేచ్ఛానుకరణము.

ఇది శిశువునందు రెండవసంవత్సరముననో మూఁడవసంవత్సరముననో తలయెత్తుచున్నది. దీనిని పసిగందు యాదృచ్ఛికముగాగాక ఒకనిర్దిష్టోద్దేశ్యమును నెరవేర్చుటకే యొనరించును. నా కిదికావలెనని యడుగుటకు శిశువు మాటలాడవలెనుగదా! అట్టివాక్కులర్థవంతములుగానిచో తత్ప్రయోగము నిరర్థకమగునని యాతఁడెఱుంగును. ఈస్థితియందు — పెద్దలేవస్తువు నెటులనుచ్చరింతురో అటులనే యాతఁడు నుచ్చరింపయత్నించును. అట్టి యత్నమును జేయుటకై పరిసరముల నాతఁ డతిసమర్థతో ననుకరింపవలయును గదా! పెద్దవారొకకృత్యము నెటు లాచరించుచున్నారో శ్రద్ధతో పరిశీలించి అనగా ప్రత్యక్షనేత్రచరిత మొనర్చుకొనియే బిడ్డసమర్థతో నద్దాని ననుకరింపఁగలఁడు. స్వేచ్ఛానుకరణము శిశుబోధ కెంతయో తోడ్పడును. అందులకే మాతాపితరులు తామొక పనిని ముందు చేసిచూపినచో శిశువతి నిపుణతతో వారల ననుకరించుటయేగాక తత్కార్యాచరణమునం దెంతయో విజయమును గాంచుచున్నాఁడు. దీనినిబట్టి మన శ్రీరంగనీతులన్నియు నిష్ప్రయోజకములగునని సువ్యక్తమగుచున్నదిగదా! ఈరీతిగా కార్యాచరణమునం దాతని కభిరుచి గలిగించినచో తత్కార్యము సరిగా చేయలేదను నెపమున వానిని మనము శిక్షింపనవసరముండదు.

## ఆదర్శసాధనానుకరణము.

ఇది పైయంగముల వికృతియేనని చెప్పవచ్చును. సాధారణముగా 3 మొదలు 4 వత్సరములు రాగానే బిడ్డ లిట్టిచిహ్నముల నగపరతురు. ఒకప్పుడొకబిడ్డఁడు తానే నాయనమ్మకథలోనో వినిన యొకరాకుమారుని పిల్లవానిచర్య కచ్చెరువంది నాటనుండి తాను మేధావివలెనే మెలఁగఁజొచ్చెను. అయత్నకృతానుకరణము, బిడ్డని యాతఁడు జూచెడిదంతయు యుక్తాయుక్తవిచారణలేకయే అనుకరింపఁజేయును. కాని ఆదర్శసాధనానుకరణము మాత్రము తాను స్వేచ్ఛాదృష్టితో పరిశీలించి "శ్రేష్ఠ"అని ఆదరించి మెచ్చుకొనిన కొంతమందివ్యక్తులను మాత్రమే అనుకరింపఁజేయును. ఈ అనుకరణము బిడ్డనికి 13 వత్సరములు వచ్చువఱకును ఉన్నదున్నట్లుజూచుటవలన వానికి మహత్తరమగు క్రమశిక్షగా పరిణమించుచున్నది. కాని బిడ్డనికి వ్యక్తతరాగానే తానుజూచి మెచ్చుకొనినప్రతివ్యక్తిని అనుకరింపక, తానట్టిలోకోత్తరుఁడగు మానవుని జీవితమునుండి కొన్ని యాదర్శప్రాయములగు ఘట్టములనుమాత్రము మనమునందుంచుకొని వాని సాహాయ్యమున తనజీవితమున జీవితమునకు మార్గదర్శకములగు కొన్ని నిబంధనలను నిర్మించుకొని సాధ్యమైనంతవఱకు వాని నాచరణయందు బెట్టుచుండును— సత్యాన్వేషణపరులగు తల్లిదండ్రులు దీనియావశ్యకతను తెలిసికొని తమబిడ్డలను భావిజీవితనిర్మాణమునందు దక్షులనుగా నొనరింతురని నా ఆశయము.

# మంచిమార్గం

ద్విభాష్యం. వెంకటరమణయ్యగారు

[విద్యావంతులైన యువతులు చాకచక్యముతో గ్రామవాసులగు స్త్రీలమధ్య విద్యావ్యాప్తి జేయుటకు ఈ వ్యాసమున ఒక చక్కనిమార్గము సూచింపబడినది.]

అవూరు పల్లెటూ రవడంచేతనో అంత వరకు ఏ పట్నవాసపుపిల్లల్నీ ఆ వూరువా రెవరు చేసికోకపోవడంచేతనో సుశీల అవూరు రాగానే చూసినవారంతా చోద్యపడ్డారన డంలో ఆశ్చర్యమేమీలేదు. తప్పనిసరిగా తనకొడుకు రామేశంపట్టుమీద సుశీలని చేశాడుగాని నిజంలో చైనులుగార్కికూడా ఇష్టంలేదు.

సుశీలవచ్చినదిలగాయితు ఇళ్లల్లో ఎన్ని గుసగుసలు బయల్దేరాయో ఎవరుచెప్పగలరు. రామేశంమాత్రం సుశీలమీద ఏవిధమైన అనుమానంలేకుండా సంచరించడమేగాకుండా తన కా పట్నవాసపుపిల్ల లభించినందులకు మనసాసంతోషిస్తున్నాడు. వచ్చినకొత్తలో సుశీల ఆవూళ్లో ముత్తైదువలతో మాట్లాడు తోంటే అసహ్యంగా చూచేవారుగాని క్రమేపీ ఆ వినయము, పౌశీల్యము, సుగుణ సంపత్తి, పరోపకారపారీణత చూసి ఆదరిం చేవారు. కొన్నాళ్ళకు సుశీల కనిపెట్టిందే మంటే పల్లెటూళ్లో ప్రజలు పోసుపోలుకబు ర్లతో కాలక్షేపంచేస్తారనే విషయమొక్కటి. ఏమంటే ఎన్నిమాట్లు వాళ్లుచెప్పుకున్నా ఎవర్ని గురించో పనికిమాలినమాటలు. వా ళ్లింట్లోవీళ్లు వీళ్లింట్లోవాళ్లు నేరాలుఎంచుకో వడం, అత్తాకోడళ్ళ గొడవలు, మొగుడూ పెళ్లాల గొడవలు తప్పితే మరేమీచెప్పుకో వడం ఎప్పుడూ సుశీల వినలేదు. ఇలాంటి ముసలివాళ్ళని వదలి తనయీడువాళ్ళతో సహవాసం చేద్దామూఅంటే గవ్వలు, గచ్చ కాయలు ఆడుతూ కాలక్షేపంచెయ్యడంతప్ప పుస్తకంమొహం చూసినవాళ్లెవళ్లూ ఆవిడకు కనబడలేదు. ఎలాగేనా అవూరువాళ్ళను బాగుచెయ్యాలని గట్టిగాఆలోచించిది. పురా ణాలంటే గట్టి నమ్మకముంటుందిఅనేవిషయం గ్రహించింది. ప్రస్తావనవిషయంలో అప్పు డప్పుడు చదువుకోమనీ, దేశసేవచెయ్యమనీ హెచ్చరించేది. ఈమాట లెలాతెలిశాయో పెద్దాళ్లకందరకు తెలిసిపోయాయి వెంటనే చదువున్నఆడది ఈవూళ్లో ఉండకూడదు. అన్నివిధాల మేము కట్టుదిట్టముచేస్తూంటే యీరామేశం ఇన్నాళ్ళకి ముప్పుతెచ్చాడు అని అంతాఅతన్ని దూచబట్టుకున్నారు. కాని అతనొక్క చిరునవ్వునవ్వి ఊరకున్నాడు. అతనిలో ఏమీ చలనంగలగలేదు.

ఏదోఒక పర్వదినంవచ్చింది. మగాళ్లంతా గోదావరి స్నానానికని వెళ్లిపోయారు. ఆడ వాళ్లంతా ఇళ్లవద్దనే స్నానాలుచేసి ఉపవా సాలుచేస్తూ వంట, పెంటలేకపోవడంచేత

ఒకచోటజేరి లోకాభిరామాయణ కాలక్షేపంచేస్తూండగా సుశీలప్రవేశించి "ఈ వేళ కూడా ఈ గొడవలెందుకండి? పుణ్యమా? పురుషార్థమా? ఏపురాణమో చదువుకో కూడదా? అంది. ఆమాట అందరికీ నచ్చింది. 'చదివేవారలేరో' అని చల్లగా అన్నారెవరో. నాకు చేతనైనట్టు నేను చదువుతా వింటారాఅంటూ భాగవతము పట్టుకువచ్చి మంచిరక్తిగాఉండే రామానావతారము ప్రారంభించి పూర్తిచేసేసరికి ఆడమళయాళము ఆశ్చర్యపోయి ఆయ్యో చదువుకుంటే నయమగ్రా అన్నారు. ఆవేళనుండి సుశీలకు కొంచెం అగ్రస్థానంవచ్చింది. ఇలాటివి వృద్ధికావడానికి క్లబ్బుంటేమంచిదని సుశీల ఓమాటు ఎవరితోనో అంది. వెంటనే మరొక ఆవిడలేచి "ఏమన్రో చదువువద్దు సంధ్యవద్దు. ఇలాటి యంత్రాల్లో మనలని పడగొట్టి పట్నవాసం మాయచేద్దామని చూస్తోంది లేకపోతే అదేదో పెట్టుమాటుందేమిటి? అక్కడ అడ్డమైనమగాళ్ళతోను తిరుగుతారట, మంచిచెడ్డలులేవట, ఏవేవో ఆటలాడతారట, పేకాటలాడతారట, డబ్బెట్టి మీటింగులు చేస్తారుట. నారాయణ అనుకోకూడదు గాని మొగాడితో కాపురంచెయ్యొద్దంటారుట. ఇదెక్కడి గోలోకాసి" అని ప్రారంభించింది. సుశీల చిన్ననవ్వునవ్వి' ఎవరు చెప్పారండి పిన్నిగారూ! మీకు అన్నీ ఉట్టెవి. క్లబ్బు పెట్టినంతమాత్రాన కానివాళ్ళైపోతారా? వీళ్ళంతా చదువుకుంటానంటున్నారు గదా! పనీపాటలేకుండా ఉండే సైముల్లో నేర్చుకుంటే తప్పేమీలేదు. చూడండి కొన్నాళ్లుపోయాకమీరేమంటారో. చెప్పాడు మాటలు చెడ్డవి" అని ఆవిణ్ణి శాంతింపజేసి పార్వతమ్మగారింటిమందువాకాళీగా ఉంటుంది గనుక పన్నెండున్నరకంతా అచ్చట చేరుకోవడానికి రెండుగంటలకు వెళ్ళిపోడానికి ఆవేళనుంచే యేర్పాటుచేసికున్నారు. చదువురానితనఈడుపిల్లలకు చిన్నపిల్లలకు అక్షరాలు ప్రారంభించి చెపుతూండేది. ఒకరోజు పురాణము మరొకరోజు ముసలిముత్తైదువలచేత అనేక రకాల పురాణగాధలకు సంబంధించిన పాటలు పాడించేది. మంచి అభివృద్ధిలోనికి వస్తూందికాని తనకోరిక ఇంకానెరవేరడం లేదు. ఒకరోజున తానో చిన్నలెక్చరిచ్చి దేశాన్నిగురించి పూర్వమునకు ఇప్పటికీఉండే తేడాలుచెప్పి ప్రభుత్వాన్నిగురించి మాట్లాడి ప్రస్తుతపరిస్థితు లెలాతెలుస్తాయో చెపుతూ టూకీగా తనచేతులోనున్న పేపరులోని అంశాలు చదివేసరికి అంతా ఆసంగపొంది రోజూ అలాటిది తెమ్మన్నారు. ఆనాళ్ళు వెనకవేసుకున్న బాపతో, అడిగి తెచ్చుకున్న బాపతో చందాలు వసూలుచేసి, ఆంధ్ర పత్రికవగైరాలు తెప్పించడం మంచిదని సలహాఇచ్చింది కాని మొదట్లో ఎవరూ వప్పుకోలేదు.

కొన్నాళ్లకు ఆవూళ్లో ఎవరెవరే యే పత్రికలు తెప్పించుతున్నారో అవన్నీ ఓ మాటుచూసి ఇచ్చేసే పద్ధతిని అచ్చటికి తెచ్చి చదివి వినిపించి తిరిగి వాళ్ల ఆడాళ్ల

ద్వారానే పంపేస్తూండేది. సుశీలయందు మంచి అభిమానం అప్పటితో ఆవూళ్లో ఆడాళ్లకు మగాళ్లకూకూడా ఏర్పడింది. పతివ్రతల కథలు, పతిభక్తినిగూర్చిన అంశాలు ముచ్చటించడంవల్లనో ఏమో స్త్రీలక్లబ్బుయందుండే చెడు అభిప్రాయం అంతామార్చుకున్నారు. ఇలా సమావేశాలు జరుగుతూన్నా ఆడాళ్లవల్ల మొగాళ్లకు ఏవిధమైన లోపము, సపర్యలలోగాని, సంచారంలోగాని కలగకపోవడం బహుజనాదరణీయంగా ఉంది. కాని సుశీల ఎప్పుడు పరపురుషులకంటబడలేదు. కొన్నిరోజులు గడచినవెంటనే సుశీలవారు తెప్పించుకునే పత్రికలు సంఘంద్వారా తెప్పించితే డబ్బు తగ్గుతుందని వాళ్లందర్నీ ఒప్పించి తక్కువచందాకు ఆయాపత్రికలు తెప్పించింది. ఇప్పటికి అక్షరజ్ఞానమేకాకుండా పత్రికలుచదివేజ్ఞానం చాలామందికి అలవడింది. సుశీలకు కొంతతృప్తి కలిగింది.

మరోమాటు ప్రస్తావనలో గాంధినిగూర్చి మాట్లాడగానే మొహాలు చిట్లించుకున్నారు ఆడాళ్లు. కాని క్రమంగా ఆ దురభిప్రాయాన్ని తొలగించి కట్టుబట్టలనుగూర్చి మాట్లాడుతూ తీరికగాఉండేటప్పుడు చేసికోగల పనుల్ని చెప్పి తాను తననేర్పరితనము చూపించడానికో రోజు ఏర్పరచి రాట్నముమీద నూలుతీసింది. తానుతీసిన నూలంతా ప్రదర్శించింది. ఆమె మేధాశక్తికి నైపుణ్యానికి అంతా సంతోషించారు. మరోవారంనాటికల్లా ఇంటింటా రాట్నాలు వెలిశాయి. ఒక్కనిముషం ఏయింట్లోను వృథాపోవడం లేదు. ఈ సంగతులన్నీ రామేశం తెలుసుకుని గ్రామపునరోద్ధరణం ఇలా ఆడాళ్లవల్లే జరగాలిగాని నెత్తినోరు కొట్టుకు ఉపన్యాసాలు దంచినా లాభంలేదు. పల్లెల్లోను ఈవిధంగా స్త్రీలక్లబ్బు లుండాలనీ అనుకుంటూ తనసంతోషాన్ని వెలిబుచ్చుతూ గాఢమైన ముద్దు సుశీలకు బహుమతి చేశాడు. సుశీల ఇంతవృద్ధిలోనికి తీసికొని వచ్చిన క్లబ్బునకు కొన్నాళ్లనుంచి హాజరు కావడంలేదు. పుట్టింటివారు కావిడిచ్చి తీసుకుని వెళ్లారుట. మళ్లీ పిల్లాడితో హాజరవొచ్చు. అప్పుడుజరిగే అభివృద్ధిమళ్లీ మాటు.

ఋణదాత:—పోయినసంవత్సరంనుంచీ పక్షాన కొకమారు బిల్లు పంపిస్తూంటే? ఇంకా డబ్బు యివ్వకుండా—

ఋణస్థుడు:—నిజమే! మీరు బిల్లులు పంపించేది మానేసి వానికయ్యే తపాలచార్జి నా అప్పుకు జమవ్రాసుకుంటూవుంటే?

# త్యాగము

జి. జోగంరావుగారు

తన వెనకతలుపు వేసుకుంటూ ప్రసాదరావు గది విడచి వెళ్ళిపోయాడు. కుర్చీవదలి అతడు కిటికీదరి నించున్నాడు. చల్లని చంద్రకిరణములు గదిలో పడుతున్నాయి. అందంగా పెరిగిన సపోటాచెట్టు కొమ్మలు వొకటిరెండు కిటికీ క్రిందపార్శ్వమును రాపిడిచేస్తున్నాయి. భవనముముందు పందిరమీద విరియబూసిన మాలతీలత తావుల వెదజల్లుతూంది.

కాని అతడు అక్కడ నించున్నదివేరె. ఆభవనం అవతలకేసి వాకట్లో వో మంచముమీద కమల పడుక్కునుంది. కమల నాతడిదివరకు అనేకసార్లు చూచుచున్నాడు. ఆ మేడమీదనే లీలతో తీవ్రముగా వాదిస్తున్నపుడు ఆమె సౌందర్యమును చూచేడు. లీల హాస్యమునకు ఆమె అమాయిక హృదయము వుప్పొంగ 'పకపక' విరగబడి నవ్వినపుడు ఆమె చక్కదనమును పరికించేడు. తన నికృష్ట జీవితమును స్నేహితురాలితో ముచ్చటించుచు చెక్కిళ్ళవెంబడి నీరుగార్చిన అప్పటి ఆమె దీనవదనమును చూచేడు. నేడు వెన్నెట్లో నిశ్చింతగా ప్రపంచమును మరచి నిద్రించుచున్న ఆమెను నిదానిస్తూన్నాడు. తదేకంగా చూస్తున్నాడు. అదేపనిగా చూస్తున్నాడు. కాని అతనికి తనివితీరలేదు. సన్నంగా పొడుగా తెల్లగా... నిజానికి కమల అందమైన అమ్మాయి. త్రాచుపాములాంటి పొడుగాటిజడ, పెదిమలమీద చిరస్థాయిగ ముద్రింపబడిన చిన్ననవ్వు, ఆమె అవయవసౌష్ఠవము, చూపుల సౌజన్యము, పలుకుల మాధుర్యము—వీటికి పట్టుబడినాడతఁడు. 'నీవు చాలా అందంగావుంటావు' అని రోజుకు పదిసార్లేనా చెపుతూంటాడతఁడు. ఆమెవిని ఆలోచనాపూర్వకంగా వూరుకుంటుంది. ఆమె యేమనుకుందో అతనికి యెల్లా తెలుస్తుంది?

నాటిపుదయమే కమల వొంటరిగా మేడమీదికి రావటం. అప్పటివారి సంభాషణ అతడు మరవలా. అతని 'డయిరీ' నాడు చేసుకున్న పుణ్యమని.

"నీవు యెంతో అందంగావున్నావు"

"............"

"నేనలా చెపుతూన్నపుడు నీవు నన్నెందుకు అభినందించవు?"

"మీరు నన్ను యెగతాళిచేస్తున్నారు."

"ఎందుకు నువ్వల్లా అనుకున్నావు?"

"నేను నిజంగా అంత అందంగా లేను."

"ఎవరిఅందం వారు చెప్పుకుంటారేమిటి లేకపోతే."

"మీ మాటలయందు నిజమున్నదని మీరు నమ్మకంగా చెప్పగలరా?"

"నా అంతరాత్మ ప్రబోధించినది. నేనన్నాను. అది నిజము కాక అసత్యమెలాగవుతుంది?"

ఆమెమనసులోని సంక్షోభము నాతడుగుర్తించేడు.

"మీరు నా అందంవిషయమై యేమీ అనవద్దు."

ఆమెవెళ్ళిపోబోయింది.

అతడామెచేతిని పట్టుకున్నాడు.

"నీవు అందంగావున్నావు. అందంగావున్నావన్నాను. నీవు కురూపివైతే అందంగా లేవని చెప్పేవుందును."

"అలా చెపుతారా?"

"తప్పకుండా."

"నా అందమువిషయమై మీకెందుకు?"

"కమలా! నీకింకా తెలవలా, నిన్ను నేను ప్రేమిస్తున్నాను."

ఆమె శూన్యంగా చూస్తూంది తోటకేసి.

"నన్ను వదిలేండి."

అతడు వదిలేడు.

ఆమె మెల్లగా మెట్లుదిగిపోయింది.

అట్టి కమల తనకెదురుగావుందిపుడు. అతనికి నిద్ర రాలేదు. ఆ విశాలనేత్రములు రెండు ఆ ప్రేమమూర్తి కేసి నిదానిస్తున్నాయి.

ఊళ్లో గడియారం పదకొండు కొట్టినది. గదిలో మేజామీదున్న వాచీకేసి అతడు చూచేడు. ద్వారము చెంత లీలావతి నించునుంది. అతడు చలించేడు.

"కాంతం! ఇంకా నిద్రరాలేదా?"

"లీలా! నీవింత రాత్రివరకు మేలుకున్నావేమి?"

"నాన్నగారు 'ట్రెయిను'కు వెళుతున్నారు. అందు చేత మెలకువ వచ్చింది."

"ఇంతవరకు ఆయనతో మాట్లాడుతున్నా. అందు చేత మేలుకొనివున్నాను."

లీల ఆమె వెనక తలుపువేసుకుంటూ గదివదలి వెళ్లి పోయింది.

## ౨

లీలావతి గదివిడిచి వెళ్లిపోయినతర్వాత లక్ష్మీ కాంతం పరుపుమీద పడుకున్నాడు.

ఆమె తనతో యింకా యేమోమో మాట్లాడుతుం దనుకున్నాడు లక్ష్మీకాంతం. కాని లీల వెంటనే వెళ్లిపోయింది. ఆమె తన నడతను అనుమానించిందేమో అనుకున్నాడు. లీలతో సంభాషణఅంటే అతనికి యెంతో సరదా. లీలావతి అతనికి మేనమామకూతురు. ఆమెకు పదిహేనుయేళ్లు వచ్చేయి. కాని ప్రసాద రావు ఆమెకింకా వివాహము చెయ్యలేదు. లీల ఫోర్తుఫారమ్ చదువుతూంది. ఆక్లాసులోనే కమల ఆమెకు సహాధ్యాయిని. లీలాకమలలు వొక యం.ఏ. ని 'ట్యూటరు'గా పేసుకున్నారు. అతడే లక్ష్మీకాంతం మొదట్లో లీల నాతడు వరించేడు. ఆమెను వివాహము చేసుకొనుటకు తాతడు నిశ్చయించాడు. కాని అతనికి కమలతో పరిచయమయింది. ఆమె బ్రతుకు తెలివును తెలుసుకొంటూన్న కొలదీ అతని కామెపై జాలి కలిగింది. ఆమె అతని హృదయము నాకర్షించింది. లక్ష్మీకాంతం చలించేడు. కమలని తన యెదుట పడ వద్దని లీలతో అనేకసార్లు చెప్పేడు. కాని లీలావతి అట్టి ప్రయత్నంచెయ్యలా. కాంతం యేమి చెయ్య గలడు. ప్రకృతి స్వభావ సిద్ధమగు మానవ దౌర్బల్య మునకు లొంగిపోయాడు. కమలను ప్రేమిస్తున్నానని నాటి పుదయమే ఆమెకు తెలియజెప్పేడు. లీల నాతడు బహిష్కరించగలడా?

ఇట్టి విషమస్థితిలో అతనికి ఆలోచనచెప్పేవాళ్లు కూడా యెవరూలేరు. జ్ఞానమువచ్చిన దగ్గరనుంచీ అతడు మేనమామదగ్గరనే వున్నాడు. కన్నకుమారుని వలె తన్నువారుచూచి విద్య చెప్పించారు. అట్టివారికి ద్రోహం తలపెట్టడమెలా? లక్ష్మీనరసమ్మ లీలని తనకిచ్చి వివాహం చెయ్యటానికి నిశ్చయించుకుందని అతనికి తెల్సు. ఆవిషయం గురించే ప్రసాదరావతనితో యింతవరకు ముచ్చటించినది. లక్ష్మీ నరసమ్మ కాంతంతో లీలపెళ్లి విషయమై మాట్లాడమని భర్తను ప్రోత్సాహించిం దానాడు. కాంతం కంటె మంచి వరుడు తమ అమ్మాయికి దొరకడని ఆదంపతుల తలంపు. కాంతం ప్రసాదరావుకి యేంచెప్పగలడు. అతని హృదయ సంక్షోభమును యెవరు గుర్తించ గలరు. లక్ష్మీకాంతం నిశ్చయంగా లీలావతిని ప్రేమించాడు. కాని కమల అతని దృష్టిపథంలో బడింది. అతడు ఆలోచించాడు. కాని ఆలోచన తెగలేదు. 'లీల అభిప్రాయమును కనుక్కోండి' అని చక్కా తప్పించుకున్నాడు ఆనాటికి.

## ౩

కమల లక్ష్మీకాంతాన్ని వరించిదని లీలావతికి తెలుసు. లీలకూడ కాంతాన్ని ప్రేమించింది. కాని

ఆమె సరళహృదయ. కాంతం కమలని ప్రేమించాలని ఆమె ప్రయత్నం. మొదట్లో ఆవిషయం కాంతానికి తెలియజేయాలనే ఆమె వుబలాటపడ్డాది. తన ప్రేమ నిరసించినందుకు అతడు పరిహసిస్తాడేమో అని ఆమెభయం. రానురాను లక్ష్మీకాంతం కమలను ప్రేమిస్తూన్నట్లు ఆమె గ్రహించింది. కమలకూడ నిన్ను ప్రేమిస్తున్నాదని అతనితో చెప్పాలని ఆమె అనుకుంది. మేరినానుండి వచ్చినతర్వాత నాటిరాత్రి ఆమె అట్టిప్రయత్నంలో వున్నపుడే ప్రసాదరావు కాంతం గదిలోకివెళ్లటం ఆమెచూచింది. వారిసంభాషణ ఆమెవిన్నాది. తండ్రి తనవివాహవిషయమై తనతో ముచ్చటిస్తాడనుకుంది. వూరినుంచి తిరిగివచ్చి వారంఅయింది. కాని ప్రసాదరావా ప్రశంస యేమీ తేలేదు. పోనీ తనేవెళ్లి నా కీవివాహ మిష్టములేదని చెప్పడానికి జంకిపోయింది. ఇంత కీ కాంతాన్ని ఆమె గాఢంగా ప్రేమించింది. లక్ష్మీకాంతం తన్ను వివాహమాడుట కిష్టపడితే ఆమెకుమాత్ర మెందు కయిష్టం.

అట్టి ఆలోచన్లతో ఆమె రాత్రి చాలవరకు మేలుకుంది. ఆమెకుగదిలో నిద్రపట్టలేదు. తలుపుతీసుకొని పైకివచ్చింది. ఆ వెన్నెలరేయిలో భవనమంతా ప్రశాంతంగావుంది ఆమెమెట్లదగ్గరకొచ్చింది. కాంతం గోడనానుకొని నించున్నాడు.

"నిద్రపట్టలేదా ?"

"లేదు."

"బుల్ బుల్ తీసుకురానా"

"వద్దు."

వారిద్దరూ మాట్లాడలేదు.

పదినిముసాలయింది.

"నీవు ప్రేమిస్తున్నావుకదూ ?"

"ఎవర్ని ?"

"నన్ను."

"అవును."

"కమలనో ?"

అతడు వూరుకున్నాడు.

"నీ వామెను ప్రేమిస్తున్నావు యీమధ్యనే. ఆమె నిన్ను చాలకాలమునుండి ప్రేమిస్తూంది."

"నిజమా ?"

"అవును."

"నీ కెలా తెలిసింది ?"

"ఆమెయేచెప్పింది."

"నే నామెను ప్రేమించలేను."

అతనిదైన్యం — ఆమెహృదయం చలించింది.

"ఏమి ?"

"లీల నాప్రణయదేవత."

"ఆమెయే కమలని ప్రేమించమని నిన్ను కోరింది."

అతడు ఆమెకేసిచూచేడు.

"నీవు కలగంటున్నావా ?"

"లేదు."

"అయిన నీవుచెప్పునది నిజమా ?"

"అవును."

"మామ మనవివాహమునకై ప్రయత్నించుచున్నాడు."

"అది మనవివాహమునకై కాదు."

"లీలా ! ఇది నీత్యాగమా !!

ఆ వెన్నెట్లో ఆమెమూర్తి తేజోవంతమైవుంది. ఆమె మారుపలుకలేదు.

## ౪

కమల అతణ్ణి ప్రేమిస్తున్నాదని లక్ష్మీకాంతంతో ఆనాటిరాత్రి చెప్పినదిమొదలు లీలావతికి మరోరకం ఆతృతపట్టుకున్నాది. ప్రసాదరావు తన వివాహవిషయమై యేమంటాడోఅని ఆమెభయం. అతణ్ణి వప్పించినట్టైతే యింట్లో తనకు ప్రతికూలురుందరని ఆమెకుతెల్సు. అయితే లక్ష్మీకాంతానికి ఆమెనిచ్చి వివాహంచేదామని అతడు వుబలాటపడుతూన్నపుడు

'అదికాదు' అని చెప్పటానికి ఆమె సాహసించలేక పోయింది. తన్నిట్టి క్లిష్టపరిస్థితుల్లో పెట్టిన కమలపై గాని, కాంతంపైగాని ఆమెకు క్రోధంలేదు. వారి కలయికకై ఆమె ప్రయత్నం. అందుకే ఆమెకు ఆతృత.

* * *

తెల్లవారితే లీలావతివివాహం. కమలకుటీరము బాగా అలంకరింపబడ్డాది. తల్లితోకూడ కమల ఆనాడే తన స్నేహితురాలికడకు వెళ్లిపోవచ్చింది. ప్రసాదరావు వివాహమునకంతయు సిద్ధముచేసికొని మేడమీద వసారాలో 'news paper' చదువు తున్నాడు. వెనుకనుంచే లీల అతని శిరోజముల నిమిరినది.

"ఏవమ్మా యిల్లావచ్చేవు ?"

"ఏవీంలేదు."

ప్రక్కనున్న సోఫాలో ఆమెకూర్చుంది.

"నాన్నగారూ ! లీల కిపుడే వివాహమువలదు."

"ఏమి ?"

"కమల కాంతమునువరించింది."

"అయితే ?"

"అతడామెకు ప్రేమభిక్షపెట్టేడు."

ప్రసాదరావు నిశ్చలంగా వూరుకున్నాడు.

"నాన్నగారూ ! కాంతం మీమాట జవదాటడు. కాని కమల నాతడు వివాహముచేసుకోటం నా యిష్టం. కమల కష్టజీవిని. నాకు పెండ్లికాదని మీకు భయమా ? నాజీవితమును పాడుచేసుకుంటున్నా నను కోకండి. ఒకవేళ పాడుచేసుకొన్న కమలసుఖిస్తుంది. నా కంతేచాలును."

బొటనవ్రేలితో నేల రాస్తూ లీలావతి వూరుకుంది. అంతకంటె ఆమె యేమిచేస్తుంది. ప్రసాదరావు తీవ్రంగా ఆలోచించాడు. కాంతంవంటి భర్త లీలకి మళ్లాదొరకడని ఆత డనుకున్నాడు. కాని కమల నాతడు కన్నకూతురు మల్లేమాస్తూన్నాడు.

'లీలా ! కాంతం కమలని వరించాడని నీకుతెలుసా ?'

"తెలుసును. అతడామెను స్వీకరించుట కెట్టి ఆటంకము చెప్పడు."

"లీలా ! రేపు కమలకేవివాహము."

తండ్రి నుదుటినిముద్దాడి లీల అప్పుడే లోనికి పరిగెత్తింది కాంతంతో చెప్పటానికి. మొట్టమొదట ఆమెకుకనబడింది కమల.

"ఏ మాతొందఱ ?"

"కాంతం యెక్కడున్నాడో తెలుసా ?"

"వారిగదిలో."

"నీవుకూడరా నావెనక."

గదితలుపుత్రోసి యిద్దరూ లోనప్రవేశించేసరికి కాంతం ఆ కిటికీదగ్గరనించుని వున్నాడు.

"కమలకి పెళ్లి."

"వరుడు ?"

అతడు వెనుదిరిగి ప్రశ్నించేడు.

"లక్ష్మీకాంతం."

"హాస్యమా ?"

"కాదు. నాన్నగారి వాగ్దానము."

అతడు నమ్మలేదు.

కమల అంతకన్నా నమ్మలేదు.

కాని లీల యెందుకు అసత్యంచెప్తుంది. వారి చూపులు యేకమయేయి. అదిచూచి లీలావతి సంతుష్టి జెందింది. అచటనుండి ఆవలికిపోయింది.

"నీవు యెంత అందంగావున్నావు." ఆమెబుగ్గలు యెర్రబారినై. అతడు ముగ్ధుడయ్యేడు ఆమెనుచూచి.

# ద్రౌపది వైదుష్యము

శ్రీమతి వెన్న అనంతరామమ్మగారు

ద్యూతపరాయణుఁడగు ధర్మరాజు సుయోధన ప్రేరితుఁడై శకునితో జూదమునకుఁగడంగి సర్వస్వము నోటువడి చివరకుఁ దమ్ములును తానునుగూడ దాసులై యికఁ బణ మొడ్డుటకు ధనములేమి బిక్క మొగముతో దిక్కులు సూచుచుండ నతనింగాంచి శకుని "ఇప్డేల నిన్నొడ్డి తధిప నీకు నొండు ధనముగలదు మఱచితెట్లు కమలాక్షి పాంచాలకన్య నీకు ధనముగాదె" అన్నాడు. ఇంకేమి ధర్మజున కామాటలమృత పూరములైనవి. పెన్నిధిగన్న పేద చందమున నుప్పొంగి "అలయక వెండియుం గడఁగి యక్షరతుండయి ద్రౌపదిన్, మహోత్పలదళచారునేత్రం గులభామఁ బణంబుగఁజేసి యొడ్డి సౌబల ఖలుచేత నోటువడి పాండుసుతుం డుడిగెన్." ఇంతటితో ధర్మపుత్రునాశ లడుగంటినవి. సుయోధనునివాంఛ నెఱవేరినది. మానధనుఁడగు సుయోధనుఁడు మయసభలోఁ దన్నుగాంచి నవ్విన యా సతీలలామముపై పగదీర్చికొనుట కదను చిక్కెఁగదాయని యుబ్బి "నరవుల్లఁగలసి తనయిలు బరువడిఁ దుడువంగ గృష్ణఁబనుచు వగన్" ఆమెను దోడ్తేర బ్రాతిగామి నంపినాఁడు "అవనినాథుచేత నాజ్ఞాపితుండయి సూతనందనుండు ప్రాతిగామి పాండవాగ్రమహిషి పాలికిఁజని భక్తివినతుఁడగుచు" సమాచారమంతయుఁ బూసగ్రుచ్చినట్లు వచించినాడు. అయ్యదివినిన వెంటనే యామె చకితయై నిశ్చేష్టయై "ఏయుగంబునందు నెట్టి దుష్కృతవుండు భార్యనొడ్డియోటువడిన భర్తగలడె" అని చింతించి యెట్టకేలకు దిట్ట తనమూని "మున్ను నన్నోటువడి మఱి తన్నునోటువడియనో తన్ను మున్నోటువడి విభుండు గన్న నన్నోటువడియెనో" నీకుఁ దెలిసినఁ జెప్పుము లేకున్న నక్కితవు నడిగి తెలిసికొని రమ్మని నిరాఘాటముగాఁ జెప్పినది. వెంటనే యతఁడుపోయి ధర్మజునకా ప్రశ్నల విన్పింప దానితో నతనికి దలముక్కలై యదత్త ప్రతివచనుండైనాఁడు. సభ్యులెల్లరును వేటమొగములతో నొకరినొకరు చూచుటయే కాని దానికి నుత్తరం బీయ నొక్కఁడును సాహసింపలేదు. "సందేహమైన యర్థమునిందఱి సన్నిధిని యడిగి యిందఱెఱుంగన్ సుందరి పాంచాలేంద్రసుతం దోడ్కొనిరమ్ము" అని సుయోధనుఁడు మరలఁ బ్రాతిగామినంపినాఁడు. ఇక నామెసభకు వచ్చిన మీఁదటఁ బ్రశ్నములకు,జవాబులకుఁ దావెక్కడ? అంతయు హడావడి. ఆకల్లోలములోనే వికర్ణుఁడు కొంతధర్మోపన్యాసము గావించెను. కాని యయ్యది ద్రౌపదీప్రశ్నమునగల యభిప్రాయము నాకుఁదోచినంతవఱకునే నిందు పొందుపరచుచున్నాను. సహృదయులగు

విదుషీమణులెల్లరు నిందలి లోపముల సవరింపఁబ్రార్థితులు.

అసలు ద్రౌపది ప్రశ్నలు

1 మున్ను తా నోడి పిదప నన్నోడెనా?

2 మున్ను నన్నోడి పిదప తా నోడెనా?

అని గదా! ధర్మజుఁడు మున్ను తానోడి యితరులకు దాసుఁడైనవానికి నవిభక్తమగు నాస్తిపై హక్కులేదు; గాన దాసుడగు ధర్మజునకుఁ బాండవుల కేవురకు సమాన స్వామ్యముగల నన్నుఁబణముగా నిడుటకు హక్కులేదు. అట్లు చేయుట ధర్మవిరుద్ధము. సామాన్యముగ హిందూకుటుంబములలో స్వతంత్రుఁడగు యజమానియే యవిభక్తమగు హక్కును అన్యాక్రాంతము సేయుటకు చట్టమంగీకరింపదు గదా? అట్టిచోఁ దాను దాసుఁడైన హక్కునే గోల్పోవలసిన ధర్మజునకిట్టి యధికారమెట్లుండును? ఒకవేళఁ దమ్ములెల్ల రంగీకరించి యట్టి హక్కునొసగి నారను కొన్నను నాతండ్రియగు ద్రుపద భూపాలునకు సైతము నాపై కొంత హక్కుగలదు గదా? అదెట్లన లోకమున నే దేని వస్తువును దానము సేయ నెంచిన దాత యద్దాని యాచకునకు ధారాదత్తము సేయు నపుడు 'తుభ్యం సంప్రదతే న మమ' అనగా ఈ వస్తువును నీకిచ్చుచున్నాను. ఇక దీనిపై నాకధికారములేదు, అని చెప్పును కాని కన్యాదాతయన్ననో ''తుభ్యంసం ప్రదతే'' అని మాత్రము చెప్పును; గాని ''న మమ'' అని చెప్పడు. కావునఁ గన్యాజనకునకు వివాహమైన మీదటఁగూడఁ గుమార్తెపై కొంత యధికారముగలదనియే కదా దీనివలనఁ దేలుచున్నది. అందుచే నాతండ్రి యనుమతిలేక నన్నొరులకు దాసినిచేయుట ధర్మేతరము. అట్లుచేసిన ''ధర్మతనూజుండు 'ధర్మువుదప్పిన ధరణీతలంబెల్లఁ దల్లడిల్లు,' అనుమాట బూటకముగాక మానదు. అట్లుగాక తాను స్వతంత్రుఁడై యుండఁగ నన్నోడినను మాతండ్రియు నద్దాని సంగీకరించినను నయ్యది ధర్మవిరుద్ధమేయగును. ఏలనన వివాహకాలమున నగ్ని హోత్రుఁడు సాక్షిగా 'అర్థేచ, ధర్మేచ, కామేచ నాతిచరామి' అని ప్రమాణముచేసిన తాను స్వతంత్రుఁడైయుండి నన్నన్యునకు దాసిని జేయుట విరుద్ధముగాదా! స్వవచన వ్యాఘాతముగాదా? ప్రమాణోల్లంఘనముగాదా? పూర్వము హరిశ్చంద్రాదిమహానుభావు లట్లొనరించిరిగదా? యనినచో నామహామహులు సత్యరక్షణకై భార్యచేఁ బ్రేరితులై ప్రార్థితులై నిర్బంధితులై యట్లు చేసిరి గాని నాభర్తవలె జూదమున సిటనున్న సామానులతోఁబాటు భార్యను పణముగ నిడలేదు. కావున నియ్యది ధర్మదూరము. అని యామె గభీరాశయము. ఆహా! ఎంతటివైదుష్యము. ఇట్టి విదుషీమణులఁగాంచిన భారతమాత ధన్య, విశేషించి పాంచాలమాత ధన్యతర, అట్టి సతీను తల్లుల కాలవాలమగు భారతనారీలోకము ధన్యతమము.

# అనుమాన పిశాచము

శ్రీమతి వి. రాజలక్ష్మిగారు

శ్రీహరిశాస్త్రి నివాసం పట్టణంలోనే. ఆయన భార్య శేషమ్మ. వారికి పిల్లలు ముగ్గురే. తొలిసంతానం సరస్వతి. ఆపిల్లకి శారదాబిల్లు ముందరే చేసేరు పెళ్లి. ఇప్పుడు సరస్వతికి రజస్వలాలయే యీడు. రంగడుకి ఎనిమిదేండ్లుంటాయి. ఐదవక్లాసు చదూతున్నాడు. గౌరి ఐదేళ్లది. శాస్త్రిగారి కుద్యోగమేమీలేదు కాని తిండానికి లోటులేకుండా తాతతండ్రులు లార్జించేరు భూములు. శాస్త్రిగారికి 'నా'యనేవారెవరూలేరు.

యదుభూషణరావుగారు శాస్త్రిగారింటి పొరుగునేయున్న కోమటిగుమస్తా. మంచి ధనవంతుడు. ఆయన భార్య కమల. ఆవిడకో పాతికేండ్లుంటాయి. ఆయనకీ ముప్పదిఏడు దరిదాపు. పిల్లలుమాత్రం లేరు. ఆ యిద్దరే ఉనివసించేవారాయింట్లో.

ఈ రెండు కుటుంబములతోటే ఉంది మన కథంతా.

౧

(శాస్త్రిగారు వీధి యరుగుమీద—రంగడు, గౌరీ అప్పుడే పడుకుంటారు — రాత్రి — శేషమ్మగారు, సరస్వతి వంటఇంట్లో.)

"ఏఁవండీ, భోజనానికి లేస్తారా?"

"............"

"ఏఁవండీ?—ఉఁన్నారా?"

"............"

"ఏఁవండీ?"

"అరుస్తావేఁవిటి గాడిదలాగ? మతిలేదూ?"

"పలకలేదని కొంచెం గట్టిగా పిల్చేను."

"పిలవడం సొంపేనా అది? అయితే సరే."

"..............."

"..............."

"కాళ్లు కడుక్కుందికి నీళ్లు తెచ్చీదా?"

"తేవాలనుంటే తెచ్చేయుందువు. ఎందుకు తేవాలి?... నేనే పోతాను నూతికి."

*　　*　　*

"ఏఁవిటే! అన్నఁ విలాగుంది? జగన్నాథ ప్రసాదంలాగ! అనబగాయ ఉడకేలేదు. ఏడిసినట్టే ఉంది. ఎలా ముద్దమింగడం?"

"అదేఁవోమరి, పప్పుకూర బాగుందంటూ తిన్నారు పిల్లలు. ఏఁవే సరస్వతీ?"

"అయితే అ సాక్ష్యఁవేఁవిటి. పోనీ నేనే అబద్ధమాడేను."

"అదికాదండీ;"

"మరేఁవిటి? నాకు సరదా కాబోలు వుట్టినే అలా అనడం?"

"..............."

"కూర అయింతేనా అయింది? అంతకాయ కొన్నాను!"

"మరెంతవుతుంది? కమల అడుగుతే కొంచెంకూర ఇచ్చేను."

"అది! అలాచెప్పు. ఆయనకేదీ మంచికూరలేదు కాబోలు."

"ఏమ్మాటలండీ, ఎవరేనా వింటే నవ్వుతారు! కమలనోరు విడుచుగు అడిగిందనీ, నిన్న మొన్న అదే మనకికూర ఇచ్చిందనీ కాని లేకపోతే నాకేఁవిటి? పోనీండి, ఇహ—"

"అయితే ఇప్పుడెవళ్లేఁవిటన్నారు. నోరుముయ్, ఉన్నమాటంటే ఉదాశనంలావు."

"ఇవి ఉన్నమాటలా? రామ! రామ!!"

"చిన్నపిసరుకి ఎందుకింత రాద్ధాంతం చెయ్యడం?" అంది సరస్వతి మెల్లిగా.

"అవున్రా చిన్నవాళ్ల దగ్గర్నుంచీ పెద్దవాళ్ల దాకా బుద్ధిచెప్పే వాళ్ళేను!" అన్నాడు శాస్త్రి.

౨

(అప్పుడే సూర్యోదయం అయింది.—సరస్వతి, తమ్మునికి, చెల్లెలకు చద్దిఅన్నము పెడుతూంది—శేషమ్మ కాఫీ పొయ్యివద్ద—శాస్త్రి ఇంట్లో పచారీ చేస్తూను—)

"ఏఁవే అంతతెల్లవారకుండా లేచేవెందుకూ ఇవాళ?"

"మరి అంట్లూ చెంబులూ అవీ కాపడానికేనుకుని వీధిగుమ్మం కడిగి ముగ్గుపెట్టుగుని, ముఖం కడుక్కుని కాఫీపెట్టేస్సరికప్పుడే ఇంతసేపైందికదా లేవకపోతే ఎలాగ?"

"ఓహోహో! ఈపన్లు చెయ్యడానికంత తెల్లవారకుండా లేవాలీ?"

"బాగుంది! ఆడవాళ్లందరూ అలాగే లేస్తారు."

"నేను, తెల్లవారి లేచేను, అప్పటి కెవళ్లూ లేవలేదు!"

"వచ్చి మీతో లేచేనని చెప్తారేఁవిటి ప్రతీవాళ్లూ" అంది సరస్వతి.

"అబ్బ! ఏంతెలివి? నాతో చెప్తారన్నానా?"—

"ఎందుకీ సాధింపు? అమ్మ చేసిన తప్పేఁవిటి?"

"తప్పని ఎవళ్లన్నారు? నీసాధింపేఁవిటి మధ్యని?" ఎలాగైతేనేం పెద్దదాని వయ్యేవు!"

"పెద్దవాళ్లవక ఉండిపోతారూ?" అంది సరస్వతి మెల్లిగా.

"ఆ గొణుగులెందుకు? పొరుషంజాస్తి."

* * *

"ఛీ! ఎందుకొచ్చినజన్మ? రామ! రామ!! ప్రతీదానికీ కాల్చుగుతినెయ్యడమేనా? ఒకనాడు సరదాగా ఉందాంఅంటే వీల్లేదు. ఎప్పుడూ అను మానఁవేనా?.........సరస్వతి లేకపోవడంచూచి కొట్టడంకూడాను; అదుంటే కొంత జంకుతారు.... ఇంతకంటె చస్తేమేలు...జన్మానికోసారేనా ఇల్లు కదలరు, సరేగదా నన్ను కదలనీయరు!......... పోనీ ఏఁవీవద్దు ఇంతతింటూ పడిఉందాంఅంటే అలా ఉణ్ణివ్వరు........"

* * *

"వెంకయ్యగారింటికి అటుగుల్లంపుకి రమ్మన్నారు వాళ్లు."

"అయితే? నాతో చెప్పడఁవెందుకు?"

"వెళ్లాను."

"ఇంతాలిస్యఁవెందుకుచేసేవు? అన్నంతినగానే వెళిపోలేకపోయే?"

"పోనిండి మరోగంట పోయాకే వెళ్లాను."

"పోనియ్యడఁవేఁవిటి? ఇప్పుడే వెళ్లు."

"..............."

"ఇదుగో చెప్తున్నావిను. ఇప్పుడు వెళ్లకపోతే పనికిరాదు. మాటంటే అంతపంతఁవేఁవిటి? నాకేం బోధపడదు!"

"పంతఁవేఁవిటి? మీరలా చెప్తే అలాగే చేస్తుంది", అన్నాది సరస్వతి కొంచెంరోసంతో.

"ఏఁవిటీ? నీ ఇదేఁవిటి నాకేం తెలిసింది కాదు? నువ్వు మాటాడకు."

(శేషమ్మగారికి శాస్త్రిగారిచేత నాలుగు తగులును. సరస్వతి అడ్డువెళ్లి తానుగూడ కొంచెమనుభవించును.)

* * *

"అల్లుడుకి రమ్మని వ్రాసేరా?"

"భోజనంచేస్తూన్నప్పుడి దేంఘోష? అల్లుడో, అల్లుడో అని ఏడుస్తావేఁవిటి?"



పశ్చిమగోదావరిజిల్లా ఆంధ్రమహిళాసభ

ఇందు ఏలూరు ప్రిన్సిపల్ సబార్డినేటు జడ్జి జయిరుద్దీన్ సాహేబుగారి సతీమణి మొదలగు ప్రముఖురాండ్రిందుగలరు.

"ఇదేం పైఘోషకాదే ఇంటిఘోషే!" అన్నాది సరస్వతి నవ్వుతూ.

"వెయ్యిసార్లు చెప్పేను. నువ్వు మధ్యని మాటాడకు !"

"దాంతో ఏఁవిటి ?—ఉత్తరం వ్రాసేరా ?"

"అల్లుడు ఎప్పుడు వస్తాడని బెంగపెట్టుగు పోతు న్నావు కాబోలు నువ్వు. నావద్ద డబ్బులేదు నే వ్రాయలేదు."

"..............."

"..............."

"ఏఁవిటిప్పుడింతఖర్చూను. నలుగురుతో ఇంత తింటాడు అల్లుడుకూడా అంతేకాదూ ?"

"అవును ఆతిండే నే పెట్టలేను. నీకు కాఁవులుస్తే నువ్వు వ్రాసితెచ్చుకో అల్లుణ్ణి."

"ఏమ్మాటలూ ? ఎవరేనా వింటే—"

"నోరుముయ్—వెధవలు తిండేనా తిన్నగా తిన నివ్వరు."

## 3

(మధ్యాహ్నసమయమున భోజనముల వేళ—శాస్త్రిగారు పీటమీద భోజనమునకై అధిష్టించి—రంగ, గౌరి, అన్నముతింటూ — శేషమ్మగారు వడ్డిస్తూ—సరస్వతి కూర్చుని—ఉంటారు.)

"ఇంత ఆలస్యంగా వంటయిందేఁవిటే ఇవ్వాళ?"

"కమల వాకటుంగి, వాళ్లవంటకూడా వండవల సొచ్చింది."

"వాళ్లవంటంటే సంభరపడుతూ చేస్తావు.—"

"మనవంటమాత్రం చెయ్యలేదూ ?" అన్నాది సరస్వతి.

"చేస్తున్నాది ఏదో విధిలేక."

"..............."

"అన్నం అవీ వాళ్లఇంట్లో పడిస్సేవే ?"

"ఊఁ."

"గుమస్తాగారేఁవిటి చేస్తున్నారు? ఆయన పాపం వడ్డించుకోగలరూ ?"

"ఇలాంటి మాట్లని నాకళ్లంట నీళ్లు కార్పించ కండీ ! నేనేఁ వాయనగదిలోకెళ్లి చూసేనా ఏంచేస్తు న్నారో తెలీడానికి? అన్నం ఇంట్లోపడిస్సి కమలతో చెప్పి వచ్చిస్సేనుగాని, సరస్వతికూడా కూరపట్టుగు వచ్చిందినాతో, దాన్నడగండి నేనేఁవిచేసేనో అక్కడ."

"అదిమాత్రం నీకూతురేనా మరేంపైదా?"

"నాన్నగారూ ! ఇలాంటిమాట్లని ఆడవాళ్లకి విచారం కలుగజేస్తే ఇంటికి నాశనఁవండీ—"

"మెల్లిగానా ఆమాట !"

"వెధవల్లల్లా శాపాలుపెట్టకర్రా. మీ మొఖా లీడ్చ !—"

*   *   *

"ఒరే రంగా ఏఁవిట్రా చాకలిపద్దు ఇలా వేసేవు? వెధవా ! ఏడిసినట్టేయుంది !"

"ఏఁవండీ?"

"ఏఁవేఁవిటి ?— చింకిగౌరి తెల్లకబ్బా; ఎర్ర అక్కయ్య పర్కిణి; దుక్కనానగారి దుప్పటి—నీ నెత్తి ఏఁవిటిలా వ్రాసేవు ? — వెధవా ! మాట్లాడవేం !"

"కాదండీ, అక్కయ్య ఎర్రపరికిణీ, గౌరిచింకి తెల్లకబ్బా, నానగారి దుక్కదుప్పటి అన్నమాట!"

"వెధవా, పోతరం లావవుతున్నానేఁవిటి ? — ఆ మంచంపట్టుగు వేళ్లాడతావేఁవిటిలారా!"......

(శాస్త్రి రంగణ్ణి కాళ్లతో మడుతూ కొట్టుచుండును.)

"నాయనో ! నాయనో ! — అమ్మా ! — అమ్మా ! — అక్కా ! — చచ్చిపోయేనర్రోయ్ — దేఁవుడా !"

"అబ్బ ! — నానగారూ ! మతిలేదండీ ? చంపే స్తారా ఏఁవిటి ? అబ్బ — చూడలేకుండాఉన్నాఁ వండీ — మీకు ఎలా చేతులొస్తున్నాయో కొట్టడానికి ? — అమ్మా ! అమ్మా !" (అంటూ సరస్వతి కన్నీరుతో, ఏడుస్తూఉన్న గోరిని దగ్గరగాతీసుకొని తల్లినిపిల్చును.)

"వెధవా ! మెల్లిగాకొట్టినా చంపిస్సినట్టు గరుస్తా వేఁవిటిరా ? ఏంవేషాలు నేర్చుగున్నావురా ! నోరు ముయ్."

"అమ్మా ! అమ్మా ! — ఏడవలేన్రా ! — అమ్మా — కొ ... డ ... తారు."

"ఏఁవండీ ? — నామీద కోపఁవుంటే నన్ను కొట్టండిగాని పిల్లాణ్ణి చంపకండి. వాడేంచేసేడు ? — ఇదుగో —"

"వెధవల్లా ! గుంటవెధవని వెనకేసుగొస్తారూ ? ఏడవండి. నాకేంగావాలి? వాడినికూడా చెడపండి."

* * *

"ఏఁవండీ అన్నానికిలెండి."

"ఊఁ."

"పెట్టేస్తాను ?"

"ఊఁ."

................

"అన్నంకావాలా ?"

"వద్దు."

"పచ్చడి ?"

"కొంచెం."

"చాలా ?"

"ఊఁ."

"వంట్లో బాగులేదూ ?"

............

"ఏఁవండీ ?"

"చాలాబాగుంది."

"ఆ కోపఁవేఁవిటి ! ఆ మాటాడక పోవడఁవేఁవిటండీ నాన్నగారూ ?" అన్నాది సరస్వతి.

"మాటాడితే తిడుతున్నాడు అనడం, పోనీ సాకెందుకు అని ఊరుకుంటే కోపంఅనడం ! ఎఁవిటి మీ సాధింపు ? నాకేం బోధపడ్డంలేదు."

(ఉదయం. — శాస్త్రి మూలుగుతూ ఒకమంచం వేసుకొని దానిమీద పండుకొనును.)

"అన్నా ! — ఏంబాధ ? — హా ! దేఁవుడా ! అన్నన్న,"

"వంట్లో బాగులేకపోతే, నే పక్క వేసీనండీ ? మీరు వేసుకోకపోతే ఏం ?"

......................

"ఉష్ణం జాస్తీగా వచ్చిందేఁవిటండీ ?"

"అబ్బ ! ఏంతలనొప్పి? రామ ! రామ !"

సరస్వతి మీ వద్దఉంటుంది, నేను స్నానానికెళ్తాను ?"

"ఊఁ."

"మధ్యాహ్నం అంటు పడతారా ?"

"నాకు కాఫీచెయ్యాలనప్పిడే బెంగపట్టుగుందేఁవిటి ? అబ్బబ్బ ! — బాధ ! — నేనిప్పుడు మధ్యాహ్నం అన్నంతింటానని వాండుర్రాయలేను. — రామ! రామ ! —"

"కాళ్లుపట్టీదా ?"

"వద్దు. తమరు స్నానానికెళ్లొచ్చు — తలనొప్పి రా దేఁవుడా ! ఏంబాధోయి తండ్రీ ! — రక్షించు నాయినా !"

* * *

"అమ్మా ; ఇదుగో, వెయ్యిసార్లు నడుంనొప్పని, కాళ్లుపట్టిస్సేయని, కఫంచేయిస్సిందని ఆయన మూలగడం మనం చూస్తూనేయున్నాంకదా ? మరి ఇప్పుడు నువ్వెందు కలా బెంగపడతావు ? — మరేం భయంలేదూరుకుండూ."

"కాదే ఈసారి కొంచెంజ్వరం జాస్తీగావచ్చిందే; నువ్వు వెళ్లి ఆయనవద్దకూర్చుందూ. నేనంటే ఆయనకి బొత్తిగాకోపం."

"మరెపళ్లంటే ఆయనకి కోపంలేదు ?"

"సరే వెళుదూ వేగిరం."

* * *

(మధ్యాహ్నం — శాస్త్రి మంచంమీద మూలుగుతూ — శేషమ్మ కాళ్లుపడుతూ — సరస్వతి ఆ ప్రాంతాన్నే కూర్చొని — రంగడు గారి ఇంట్లోలేరు.)

(ఇంతలో యదుభూషణరావు ప్రవేశించును.)

"ఏమండోయి ! శాస్త్రిగారూ ! ఉష్ణం ఎలాగుంది ?"

"ఏమీలేదండి. కొంచెం వేవచ్చినది."

"అంతలా మూలుగుతున్నారు ? — పోనీ మీ హోమ్‌డాక్టర్ని తెప్పించుకోగూడదూ ?"

"ఏమవుటో చూడాలింకా !"

"సరే. ఐతే మళ్లీవస్తాను సాయంత్రం ?"

"చిత్తం." (యదుభూషణరావు వెళ్లును.)

* * *

"అన్నా ! — ఏంబాధ ! — ఏమే పరాయి మొగాడువచ్చి మాటాడుతూవుంటే కదలకుండా కూచుంటావేం ? మతిలేదూ ? — ఎంబాధోయి దేవుడా ! —"

"ఆయ నంతమూరన్నుంచే మాటాడుతూంటే. కాళ్లుపడుతూన్నదాన్ని నేనెందుకు లేచిపోవడం ? అని కాని; లేకపోతే నాకుమాత్రం అంతసిగ్గు లజ్జ లేదూ ?"

"సరే, మరి నన్నుచంపకు. అబ్బ — కాళ్లుపీకు !"

"ఇవాళపొద్దున్న కమలవచ్చి మీకెలాఉందో అడిగినప్పుడు ఆవిడ నీ మంచందగ్గిరా రాలేదూ ? దాని కాయన ఏమిటన్నాడు ? అంతమాత్రాన్ని ఆవిడని లంజ కిందకట్టేడమేనా ?" అన్నాది సరస్వతి.

"ఐతే నువ్వూ మీ అమ్మాకూడావెళ్లి ఆయనతో కులాసాగా మాటాడండి ! — రామ ! రామ ! — ఇంత వేపుగుతిసేస్తే ఎలాగ? — ఏంబాధా! నాయనా దేవుడా ! —"

* * *

(రాత్రి 7 గం॥లు వేళ — శాస్త్రి మూలుగుతూ మంచంమీద. మిగతవారందరూ మంచంవద్ద —)

"అన్నా ! — దారుణబాధ ! — దేవుడా ! రక్షించుతండ్రీ ! —"

డాక్టర్ని పిల్పించేదా రంగణ్ణిపంపించి ?"

"నీకు కావులిస్తే పిలిపించు.—అబ్బబ్బ !—హా! దాహం ! —"

"రంగా వేగం పిల్చుకురా డాక్టర్ని, ఆయనతో ఏమిటి."

(రంగడువెళ్లి డాక్టర్ని పిల్చుకొనివచ్చును.)

"ఏమండీ శాస్త్రిగారూ ! ఏమిటండీ చికాకు ?"

"పెళ్లాం, పిల్లలూ. మరేమిటి ? అబ్బా ! రామ! రామ !—"

డాక్టరుగారొచ్చేరు. చికాకేమిటో చెప్పండి. మందిస్తారు."

"నువ్వు ఇంట్లోకివెళ్లొచ్చు. నాకూ తెలుసును; నువ్వు చెప్పనక్కరలేదు. —"

(శేషమ్మ ఇంట్లోకివెళ్లును.)

(డాక్టరు దేహమంతయు పరీక్షించిచూచును.)

"మీఅబ్బాయిని రేపుదయంపంపండి మందిస్తాను. ఇప్పటికీపిల్సు పుచ్చుకోండి."

చిత్తం." (డాక్టరువెళ్లును.)

"అబ్బా ! బాధ ! బాధ ! — ఏంబాధ —"

* * *

(నడిరేయి — నట్టింట శేషమ్మగారి శవము —

ఇల్లంతా నిశ్శబ్దము — పిల్లలందరూ నిద్రలో — శాస్త్రిగారుమాత్రము శవమువద్ద — శేషమ్మగారి ముఖం దివ్యతేజస్సుతో వెలుగుతూంది. —)

"ఎంతపనిచేసింది ! — అబ్బా ! బాధ హెచ్చుతున్నాది. హృదయం పగిలిపోతున్నాది. ఉరిపెట్టుగుంది ! ఓయిదేవుడా ! తల్చుగుంటే గుండె పగిలిపోతున్నాది. — నాబాధలు పడలేకే కాబోలు ఇంతపనిచేసింది ! — అయ్యో ! ఎంతపాపాత్మున్ణి. ఇంక నన్ని లోకంలో బ్రతకనిస్తారు, బ్రతకలేను ! జీవితం దుర్భరమనిపిస్తున్నాది ! — హా ! దేవుడా చివరకెంతపనిచేసేవు ! — తండ్రీ నీలీలలు ఎవరెరుగగలరు? అబ్బా ! — పరమపవిత్రురాలైన నాభార్యని చేరుకుంటాను. రక్షించుతండ్రీ ! దేవుడా ! — మాసరస్వతిని కాచు నాయనా ! సర్వేశ్వరుడా! ఆపద్బాంధవుడా, తండ్రీ ! — మా చావులవల్ల మాపిల్లలకు కష్టములు రానియ్యకు తండ్రీ ! మా చావులనుగూర్చి ఇదిగో వ్రాసి ఇక్కడ ఉంచేస్తాను. — తండ్రీ ! నే బ్రతకలేను. ఇదుగో ఈ నల్లమందు, నూనె, హా; కాదు, కాదు నాభార్య అనుసరించినమార్గాన్నే నేనూ అనుసరిస్తాను; ఈ త్రాటితోనే ఉరిపోసుకుంటాను. నాయనా దేవుడా ! రక్షించు నన్ను క్షమించు."

*　　*　　*

అనుమాన పిశాచముచే
మనుజులు పీడింపబడి తనుసతుల కన్నుం
గానకిటుల బాధించిన
మనభారతదేశ మెట్లు భాగ్యముగనునో !

# మాతృవందనము

శేషాద్రి రమణకవులు

తల్లి! తావక పాదసందర్శనంబు, దొరుకని దినంబులే నాకు దుర్దినములు
జనని! తావక కరుణారసంబునాకు, గలుగని ప్రసన్న రాత్రియే కాళరాత్రి
నీ పవిత్ర దృగంచల లిస్సృతంబు, కరుణారసమున నాకబ్బెఁ గవిపదంబు
నీ వినిర్మలశోణిత నివహముననె, మానితంబైన పురుషజన్మము లభించెఁ

గలితభావాభిరామమహా కావ్యరచన, అతులితంబైన యాంధ్ర భాషానురక్తి
చిత్తతరణంబు వాఙ్మయ సేవనంబు, ఇన్నియేటికి నాయందు నున్నశక్తి
తల్లి! నీసత్కృపాప్రాప్త ధనమునుమ్మ, శూన్యజీవితమున మనఃక్షోభపొడమి
ఘోరతరరోగబాధచే గుండెజెదరి, వితత సేవకవృత్తిచే మతికలంగి

ప్రకృతి దుఃఖాత్మకముగఁ గన్పడెడివేళ, తల్లి తావక చరణ సందర్శనమున
మంచువలెఁ జిత్తసంక్షోభ మాటుమణుగు, మహిత శీలల సోదరీ మణులమధ్య
ప్రేమతోడుత ననునీవు పెంచుకతన, పర సతులయందు సోదరీ భావమేను
నినువుగానున్నయప్పుడే నేర్చుకొంటి, జీవకారుణ్యమును బితృసేవనంబు

మాతృదేశానురక్తియు మాతృభక్తి, దేవుఁ డిచ్చినయంతలోఁ దృప్తిపడుట
మాతృభావనతో నన్యమానినులను, దలఁచుచుండుట నీ కృపా ఫలమెసుమ్మ
ఈ మహాదీనురాలి కీవేలపొడమి, ఘోరదారిద్ర్యబాధ చేకొంటివయ్య
ఏమహా భాగ్యవతి కేని యీవుపొడమ, తప్పునుగదయ్య యీ మనస్తాపమంచు

నన్ను నాపన్ను నోదార్చు చున్నయపుడు, పిడుగు లోకకోటి తలపయిఁ బడినయట్లు
అలమటించితి నాహృదయంబునందు, నీదుగర్భంబునం బుట్టి నిరుపమాన
సుకవితారసభాగ్యంబుఁ జూరగొంటి, తావక స్తన్య ధారయే దైవవశత
శాంతజీవనమందు నుత్సాహమొసఁగె, ఈకుటుంబదరిద్రతా హేతువుగనె

చేకురె స్వధర్మవిహితమౌ జీవితంబు, నీ పవిత్రోదరమున జనించుకతన
కలిగె ననుకూలమైన నిష్కామకలన, చాలదే నాకు నిట్టి శాశ్వతసుఖంబు

# గృహలక్ష్మి

కలదె యిది యన్యమాతల గర్భమందు ? కష్టసుఖములు జీవికిఁ గర్మఫలము
లివ్వి చవిజూడమానుట లెవనితరము! సర్వసౌభాగ్య భరితయౌ జననియొసఁగు
భాగ్యసంపద లెందాఁకఁ బ్రాప్తమగును ? ఉత్తమచరిత్రయౌ మాత కొక్కమాఱు
వందనమొనర్ప జన్మసాఫల్యమగును, ఇట్టి కరుణామృతస్వాంత నిట్టిమాత
నిట్టి యుత్తమశీలను నేనుమదిని, తల్లియని భక్తితో మ్రొక్కదానికంటెఁ
గల్గునే యన్యభాగ్యమీ కష్టమతికి, శుష్కదేహంబుతో నుండి చూపులందుఁ
బుత్రవాత్సల్య రసమది పొంగిపొరల, మామకాదృష్టచింతన మానసమున
బ్రదికియుంటివి నాపుణ్య భాగ్యమునను, కనులముందుఁ జరించునా కల్పవల్లి
కామితఫలంబు లొనగూర్చు కామదోగ్ధ్రి, చింతఁబోకార్చి తనువు సంజీవకరణి
నా వ్రతఫలంబు నాతల్లి నా యుపాస్య, దైవతము నీవె నీకు వందనము తల్లి
దినదినము నొక్కమాఱు నీదివ్యమూర్తి, గడియకొకమాఱు నీపాదకంజయుగళి
అరగడియ కొక్కమాఱు దయార్ద్రదృష్టి, నెలమి సేవింపఁ జేకూరునేని నాకు
నన్నుఁబోలిన సుకృతి వేఱున్నె యింక, ఆంధ్రవాఙ్మయమందు నమ్మాయటన్న
మధురపదమునకీడైన మాటలేదు, సర్వకష్టాస్పదంబైన జగమునందుఁ
దల్లికీడైన పరదైవతంబులేదు, భాషయును దేశమాతయుఁ బ్రకృతిదేవి
తల్లికి సమానమగు దైవతములుగాదు, కనులమూసిన దెఱచినఁ గాంచుచున్న
మాతృమూర్తియె నాముందు మసలుచుండు, సుకృతమననాదె, యన్నింట సుకృతినేను.

## కావలెను

మునుపటివలెనే "గృహలక్ష్మి"కి పెక్కు సోదరీమణులనుండి రచనలు వచ్చుచున్నందులకు మా కృతజ్ఞతా వందనములు. ఇంకను కథలు, పద్యములు, పాటలు, స్త్రీలకు సంబంధించిన వివిధ విషయములుగల వ్యాసములు గావలెను. వ్యాసములు విడివిడి కాగితమున కొకే ప్రక్కన వ్రాసిపంప వేడికోలు.

సంపాదకులు.

# సంసారచక్రము – గో సంరక్షణ

"అభినవ సహదేవ" డాక్టరు ఏజళ్ల శ్రీరాములుచౌదరిగారు

ఏనాడు మన భారతదేశము గో సంరక్షణమునందుపేక్షచేసెనో ఆనాటినుండియే మనదేశము అధోగతిపాలైనది. ఈ గో సంరక్షణము భారత నారీమణులకు పరమ ధర్మముగా స్థిరపడియున్నది. కృషియే జీవనోపాదిగా గల దేశములలో గోవును పూజ్యభావముతో పరికింతురేగాని వానిని సంరక్షించుటకై తగిన శ్రద్ధవహించుటలేదు. దేశములో పశుసంతానము అభివృద్ధి కావలెనన్న, ప్రజలు ఆరోగ్యవంతులై సర్వసుఖములు అనుభవించవలెనన్న, గృహాంగణాలు తమకుటుంబములను పోషింపవలెనన్న, మన దేశము సర్వసౌభాగ్యములతో తులతూగవలెనన్న గోసంరక్షణకై స్త్రీ పురుషాదులు పూనుకొనవలెను.

గోమయము మిక్కిలి పరిశుద్ధమనియు, క్రిమిసంహారమనియు, మనపూర్వుల కత్యధికమగు నమ్మకము గలదు. గృహాంగణములను శుభ్రపరచుటకు గోమిళితమగు ఉదకమునే యిప్పటికిని గ్రామములందు పలువురు వాడుచుందురు. సాలగ్రామము తులసీవనము అగ్నిగోవు పూర్వాచారపరాయణులకు పరమపూజనీయములు. ఉదయమున నిదురలేవగనే గోవును చూసినపిదప గోప్రదక్షిణ యొనరించుట ప్రబలమగు సదాచారముగా నున్నది. పుణ్యస్త్రీలు గోవు మహాలక్ష్మియని పసుపు కుంకుమలతో, పుష్పదామాదులతో నలంకరించి నిత్యమును ముఖ్యదినములందు నారాధించెదరు. భక్తులు భక్తిపూరితులై స్వయముగా లేతపచ్చికలగ్రహించి శ్రద్ధతో గోవులకును, గోవత్సములకును చేతులార మేపుదురు. అందువలన సాక్షాద్భగవదవతారమనియు, పురాణ పురుషుడనియు, గోసంరక్షకుండనియు, గోవర్ధనోద్ధరుండనియు, గౌతాచార్యుడనియు పరమభక్తితో మనచే నారాధింపబడుచున్న శ్రీకృష్ణ భగవానునియొద్ద తొమ్మిదిలక్షల గోవులుండెను. వారికథలయందు గోపాల పరావృతుడు గోపాల బాలుడుఅనునవి శ్రీకృష్ణున కన్వర్థనామములైనవి. ఆకతమునగూడు గోవులు పరమ పూజనీయములైనవి.

సంసారచక్రమును గిఱ్ఱునత్రిప్పు గృహిణి హిందూగృహమునకు జీవగఱ్ఱు, గో రక్షణము, హిందూగృహమున స్త్రీలవశముననే యున్నది. స్త్రీలు పురుషులకంటె దయతో పోషించుచుందురు. హిందూవనిత గోవును ప్రత్యేకముగా పాలకై పెంచుటలేదు. గో. రక్షణము పుణ్యప్రదమని తలంచుచున్నది. స్త్రీలనేకులు గోవులను పదిసార్లు పవిత్రదేవతలవలె పూజించెదరు. డిక్కులునిండునట్లు మేత మేపుదురు. ఎక్కడనో గాని ఆవులలో పొడచునవి యుండవు. "గోవు మాలచ్చికి కోటిదణ్ణాలు" అనునట్లుగ గోవులు హిందూగృహమున పిల్లలవలె మనోహరముగా తిరుగుచుండును. కక్కురితికి పడి లేగకు లేకుండ పాలను పిండరు. ఆవు ముదిసిన కటికివానికి అమ్మరు. అనేకులు యింటబుట్టిన ఆవులు యింటనే మరణించవలెనని కోరుచుందురు. అచ్చుపోసి విడచిపెట్టిన ఆబోతుల విషయములో హిందువులకుగల భక్తి సర్వలోకవిదితమేగదా ? పల్లెటూళ్లయందలి స్త్రీలు సగకాలము పశుసంరక్షణార్థమై వినియోగించుదురు. తెల్లవారుజామునలేచి పోయి గడ్డిదొకి దులిపి తట్టలనిండ దెచ్చెదరు. అటుతరువాత కడుగు, ప్రత్తివిత్తులు జొన్నలు, ఉలవలు మున్నగునవి విసరి పడితిలో కలిపి యుంచెదరు. తరువాత సాయంకాలము మరల గడ్డికి

పోయి కొన్ని మున్నగునవి మూటకట్టి తెచ్చుదురు. ఈమధ్యకాలమున పాలుతీయుట, పెరుగుతీసి మజ్జిగ చేయుట మొదలగు పనులతో కాలము వెళ్లబుచ్చుచుందురు.

## పాడిపశువులు—తదితరపశువులు

పాటుపడు పశువులకంటె పాడిపశువులు సుకుమారమైన జంతువులు. పాడిపశువు లితరపశువులకంటె సాధువులైనవి. పాటుపడు పశువులకు ఎటువంటి ఆహారము పెట్టినను తినును. పాడిపశువులు రుచికరమైనవి, బలముగలవిగానుండు దాణాదినుసులు గడ్డిజాతులు తినును. పాడిపశువులకు కోపము, తామసము చాలతక్కువ, యజమానునియందుగాని, యజమానురాలియందుగాని ఒకవిధమైన ప్రేమగలిగియుండును. పాడిపశువులు లేనిగృహము గృహముకాదనియే చెప్పవచ్చును. అవిలేనిచో గృహము కళకళలాడుచుండదని మహాత్ములు చెప్పుదురు. పాడిపశువులు తిను ఆహారమునుబట్టి వాని శరీరకాంతి వృద్ధియగుచుండును. ఇంకను చాల ఆరోగ్యకరముగా, సంతోషముగ నుండును. శరీరారోగ్యముగల పశువుపాలు మనకు ముఖ్యాహారమని శాస్త్రజ్ఞులొప్పుకొనియున్నారు.

## పాడిపశువులను కడుగుట

ఈపశువులను పరిశుభ్రమైన స్థితియందుంచుటగత్యము. ఆవులకంటె గేదెలు మిగుల మడ్డిజంతువులుగాన చాలజాగ్రత్తగా వీనిని కాపాడుచుండవలయును. గేదెలకు బురదయనిన మిగుల ప్రీతి. కాకశరీరముగల పశువు లెప్పుడును నీటిలోనె యుండవలెనని కోరిక కలిగి యుండును. కొన్ని గేదెలు శరీరమునిండ మట్టి నింపుకొని యింటికివచ్చును. యజమానులలో కొందరు వానిని శుభ్రముగా నీటితో కడుగక యట్లే యుంచుదురు. అట్లుంచుటవలన పశువునంటుకొని యున్న బురద యెండి బెరడకట్టును. తరువాత పశువు శరీరము బిగదీయును. అందువలన పాలుకూడా తగ్గి యేదైన వ్యాధికూడ కలుగవచ్చును. కాబట్టి పాడిగేదెల నెప్పుడును నియమించిన వేళకు శుభ్రముగా నీటితో కడిగిన యెడల వానిశరీరము లారోగ్యకరములుగా నుండును. పొలమునుండి గేదెలు రాగానే, జాగ్రత్తగా పరీక్షించి వానికి తగిన సదుపాయములు చేయవలెను. పశువుల కంటుకొనిన బురదలో ఒకవిధమైన రోగమును కలిగించు సూక్ష్మజీవులుండవచ్చును. లేదా యీ బురద దుర్వాసనగా నుండవచ్చును. కాబట్టి వెంటనే నీటితో కడుగవలెను ముఖ్యముగా పశువుల తోకలకంటుకొను బురదను పొదుగులోనుండు బురదను శుభ్రముగా కడుగవలెను. లేనిచో తోకను సిమిరి, పొదుగువాపు మున్నగు వ్యాధులు కలుగవచ్చును. వేసవికాలములో మధ్యాహ్నము 11 లేక 12 గంటలకును సాయంకాలము 4 లేక 5 గంటలకును తప్పకుండ చన్నీటితో పాడిగేదల శరీరములు కడిగినయెడల వానికి హాయిగానుండి చక్కగా నెమరు వేయుచు చెవులాడించుచుండును. ఆవును గేదెలకువలె స్నానము చేయించరాదు. ఆవు గేదవలె మడ్డిజంతువుకాదు. కనుక యేవారమునకో, యేపక్షమునకో స్నానము చేయించుట మంచిది. గేదెలు చెరువులలోను కాలువలలోను స్నానముచేసి యింటికి వచ్చునపుడు జలగలు శరీరమునుబట్టి వ్రేలాడుచుండును. అప్పుడు వాటిని నెమ్మదిగా తీసివేయవలెను. అవి శరీరమునుండి రానియెడల ఉప్పునీరుపోసి తీయవలెను.

## పాడిపశువుల కుడితితొట్లు

పాడిపశువుల కుపయోగించు కుడితితొట్లు ప్రత్యేకముగానుండవలెను. మట్టితో జేసినతొట్లుగాని, రాతితో చేసినతొట్లుగాని పల్లెటూళ్లలోనున్న రైతు లెక్కువగా వాడుదురు. ఇటువంటితొట్లు గట్టివిగను, గరకు లేకుండగను, విశాలముగను మూతి వెడల్పుగను నుండుటమంచిది. తొట్టిమూతి విశాలముగానుండి

పెద్దదిగా నుండినయెడల పశువు త్రాగుటకును కుడితి అడుగుభాగమునకు మూతియుంచి త్రాగుటకును, ఇంకను కుడితి అడుగుభాగమున నిలువయున్న తవుడు మున్నగు నవి నోటితో తీసుకొని తినుటకును వాటముగా నుండును. లేనిచో పశువునకు చిరాకుకలిగి యీ తొట్టిని బ్రద్దలుకొట్టును. ప్రతిదినము తొట్టిని శుభ్రముగా కడుగుచుండవలెను. లేనిచో దుర్వాసనపుట్టి పశువులకు పలువిధములగు రోగములు పుట్టును. ఒక్కొక్క పశువునకుగాని రెండు పశువులకుగాని ఒక తొట్టియుండుట మంచిది. ఈతొట్టినికూడా ప్రతి దినము పరిశుభ్రముగా కడుగుచుండవలెను. జబ్బుగల పశువులకుమాత్ర మీతొట్లలో కుడితి పెట్టరాదు. పల్లెటూళ్లలోనుండు రైతులలో చాలమంది ఆ తొట్లలలో మిగిలినఅన్నము, మజ్జిగ, వార్చిన గంజి మున్నగు నవి పోయుదురు. అందువలన కుక్కలు కాకులు వచ్చి మూతులుపెట్టి తినును. ఇట్టివి తినుటవలన విషజీవులాకుడితిలో జేరును. తరువాత పశువులు ఈ కుడితిని త్రాగి పలువిధ సంకటములపాలగును. కాబట్టి ఆతొట్లపైభాగమునకు తగినట్టి మూత వేయించియుంచుట మంచిది.

## పాడిపశువుల విశ్రాంతి

వర్షాకాలములో 10, 15 దినములాకేమాదిరిగా ధారగా వర్షములు కురిసినపుడు పాడిపశువులను దొడ్లలో నుంచుదురు. మాగాణిభూములు రైతులు మెట్టరైతులకంటె పశువుల విషయమై చాలయిక్కట్లు పడుచుందురు. మాగాణిరైతులు వర్షములు కురిసినప్పుడు తదితర చోటులకు తోలుటకు స్థలములేక ఆ కొట్టములలోనే యుంచుదురు. వర్షములకు దొడ్డియంతయు తడిసి చెత్త, మలమూత్రములు వగైరాలు కుళ్లి దుర్వాసనవేయును. అందుచేత ఆవాసన సహించలేక పశువులు దొడ్డినుంచి బయటకు వెళ్లుటకు ప్రయత్నించును. కాబట్టి వర్షముకురిసినపుడు మీగ్రామ విశాలస్థలములోనికి మీ పశువులను తోలుకొని వెళ్లి అక్కడ కొంచెముసేపుంచి అటునిటు తిరుగనిచ్చుట మంచిది. లేక పొలములలోనున్న మెరకనేలలకు తోలినను తోలవచ్చును, కొన్నిప్రాంతములయందు పశువుల నెల్లప్పుడు యిట్టిభూములయందే వానికి తగిన కొట్టముల నేర్పరచి అక్కడనే యుంచుదురు. ఈపద్ధతి చాలామంచిదేగాని అప్పుడప్పుడు యిండ్లకు కూడా నలవాటు చేయవలెను. వర్షములు లేనపుడును, తదితర సమయములందును పశువులను కట్టు కొయ్యలకు కట్టివేయక విశ్రాంతిగా ఆ దొడ్లలో తిరగనిచ్చుచుండవలెను. లేనిచో అవి బయటకుపోవుటకు ప్రయత్నించుచుండును.

## పాలుతీయుమనిషి

సాధారణముగా ధనికులయిండ్లలో తప్ప తదితర చోటుల పశువులయజమానులుగాని వారి స్త్రీలుగాని పాలు పితుకరు. ప్రతిరైతు సోమరితనముంచక తనంతట తానే తమపశువులను పాలుపితుకుట చాల మంచిది. ధనికులలోగూడ చాలమంది తదితర వ్యవసాయపుపనులు చేయకపోయినను పాలు పితుకుట మాత్రము విధిగా జేయుదురు. పాడిలేనియింటియొక్క స్థితిగతులు మీకే తెలియును. కాబట్టి పాడిగల ప్రతి రైతు, తప్పక పాడిపశువులను పోషించి పాలుపితుకగలందులకు ప్రార్థించుచున్నాను. పాలుపితుకుమనిషి మురికిగానుండు వస్త్రములను ధరించి చేతులను శుభ్రముగా కడుగుకొని పాలుపిండవలెను. పాలుపితుకు మనిషికి కురుచ చొక్కాయును, మోకాళ్లవరకు సరిపోవు కట్టుపంచెయును, ఇష్టమున్న తలపాగయును వుండుట మంచిది. పొడుగుచొక్కాయును, లాపైన కట్టుపంచెయు, నుండుటవలన పశువు యెప్పుడైన తన్నినయెడల ఆమనిషికి ప్రమాదము కలుగవచ్చును. అనారోగ్యకరమగు మనిషి అనగా క్షయ మొదలగు అంటువ్యాధులు గల మనిషి పాలుపితుకరాదు.

## పాలెప్పుడు తీయవలెను.

సామాన్యముగా పాడిపశువులలో ననేకరకము

లుండును. కొన్ని సునాయాసముగా నిచ్చును. మరి కొన్నటికి చిరుతిండి అనగా ఉలవలు, తవుడు, చిట్టు. జనుపకాడ మున్నగునవి పెట్టిపాలు తీయుటయు గలదు, కొన్ని పశువులు తమ దూడలకు పాలుతక్కువగునను యుద్దేశముతో సగమువరకు పాలుఇచ్చి తరువాత ఎగచేపుకొనును. మరికొన్ని తన్నును. తరువాత ఆపాలు దూడకు ఇచ్చును. కాబట్టి పశువుయొక్క గుణమును కనిపెట్టి పాలు పితుకవలెను. ప్రతిదినము ఉదయము 6 గంటలకును, సాయంకాలము 6½ లేక 7½ గంటల లోపుగను పాలు తీయుట మంచిది. కొన్ని పశువులు ఎల్లవేళల నిచ్చును. కాని రెండుపూటలుమాత్రమే పాలుపిండుట మంచిది. పశువు జబ్బుగా నున్నదో లేదో పరీక్షించి పాలుతీయవలెను. పశుశాల శుభ్రముగా బాగుచేసినతరువాత పాలుతీయుట శ్రేయస్కరము. దుమ్ము ఎంతమాత్రము పాలలో పడరాదు. పాలుపిండిన తరువాత పాలబిందెను ఎవరికిని చూపించరాదు. దృష్టిదోషము కలుగును.

పుట్టిన మూడునెలలవరకు దూడకు సగముపాలు వదలిపెట్టవలెను. సగభాగము యజమానుడు తీసికొనవలెను. 4 వ నెలలో మూడుభాగములు యజమాని తీసుకొని ఒకవంతు దూడకు వదలిపెట్టవలెను. అటు తరువాత దూడయొక్క బలమునుబట్టి పితుకవలెనని బ్రహ్మపురాణములో హారీతమహాముని చెప్పెను.

## పాలుపితుకు పాత్రలు

మనదేశములోని రైతులు చాలభాగము పాలను పోయుపాత్రలు మట్టికుండలనే వాడుచున్నారు. ఇవి చాల శ్రేష్ఠమైనవి. పాలుపిండుటకు మాత్రము తప్పక కళాయివేసిన లోహపుపాత్రలను మాత్రమే యుపయోగించవలెను. కళాయిలేనిపాత్ర లుపయోగించు టంత మంచిపద్ధతికాదు. రాగిపాత్రలు కళాయిచేసిననే గాని పోయుటకు పనికిరావు. ఇనుపపాత్రలలో పాలుపోసిన చిలుమెక్కి చెడిపోవును, మీగడ నల్లబడును. తగరపు పాత్రలలోనిపాలు నీలిరంగుగానుండును. చీనాపింగాణీ పాత్రలలోపోసిన పాలు త్వరగా చల్లారవు గాన తోడుపెట్టుటకు పనికిరావు. కంచు కొయ్యపాత్రలు పోయుటకు మంచివి.

పాలుపితికెడుపాత్రలు మిగుల పరిశుద్ధముగాను, ధగధగ మెరయుచున్నట్లుండవలెను. లేకున్న పాలు చెడిపోవును. శుచియనునది ముఖ్యముగాచూడని రైతుయొక్క వ్యాపారము వృద్ధిపొందజాలదు. ఇంతియేగాక అచ్చటి పదార్థములను తినెడుప్రజల దేహారోగ్యమునకు హానిగలుగును. స్త్రీలలో చాలమంది దేహమును వంచక పాలనుపితుకుపాత్రలను బహుమడ్డిగానుంచుదురు. వీనిని ప్రతిదినము శుభ్రముచేయనియెడల దుర్వాసనకొట్టును. ఒకవిధమైన మడ్డిపాత్రయొక్క అడుగు భాగమున పేరుకొని వాసనవేయును. ఆపాత్రలోనే పాలుపిండినయెడల నసహ్యముగానుండును.

కాబట్టి పాల నెల్లపుడు పరిశుభ్రమైనపాత్రలో నుంచి మూతపెట్టియుంచవలెను గాని దుర్వాసన యున్నచోట పెట్టరాదు. పాలుపితుకునపుడు వేడినీటితో పాత్రను శుభ్రముచేసి వాడవలెను. పాలనుపితుకు పాత్రలు మూతులు వెడల్పుగానుండుటమంచిది.

## పాలనుకాచుపాత్రలు

స్త్రీలలో చాలభాగము మట్టికుండలనే పాలను కాచుపాత్రలనుగా నుపయోగించుచున్నారు. ఇవియే చాల ప్రశస్తమైనవని నాయభిప్రాయము. ఈకుండలు పరిశుభ్రముగను, నునుపుగను, మందముగను అంత పెద్దవికాకుండ నుండవలెను. ఒకసారి పాలువేసి శుభ్రముగాకడిగి ఉపయోగించవలెను. ఇంకను పాలను కాచుపాత్ర శుభ్రముగా కడుగకపోయినయెడల పరిశుద్ధముగాని యితర యేవస్తువుయొక్క సంపర్కము తగిలినను పాలు విరిగిపోవును. ఈపాలపాత్ర నేమాత్రము మురికియున్నను, లేక మజ్జిగ ఏమాత్రము పాత్రల కంటుకొనియున్నను, వానియందు పాలుపితికినను,

పోసినను వెంటనే విరిగిపోవును. ఒకపాత్రలో పాలను కదలకుండ కొంచెమునేపుంచినయెడల పైన మీగడ కట్టును. దీనిని సులభముగా తీయవచ్చును. ఈమీగడ మిగుల సూక్ష్మజీవులతో కూడుకొనియుండును. పాలపై నుండి తీసి చిలికినప్పుడు ఈ రేణువులన్నియు కూడు కొని ముద్దయగును. (దానినే వెన్నయందురు.) పాలను కాచుపాత్రలపైని మూతవేయకుండా కాచుటమంచిది. ఇటువంటిపాత్రలు దుమ్ముగలస్థలములందు నుంచరాదు. తడిసిన పిడకలతోగాని కట్టెలతోగాని దాలివేసి పాలు కాగనీయరాదు. అట్లు కాగనిచ్చినచో పాలు పొగ చూరిపోవును.

ముఖ్యవిషయములు

స్త్రీలు పాడిపశువులకు తవుడుచిట్టు ఎక్కువగా పెట్టరాదు. తగినంతగా పెట్టవలెను. అట్లుపెట్టినయెడల నేత్రరోగములు వాతరోగములు కలుగును. ఖలియు నట్లుగా మేపినయెడల ఎల్లప్పుడు ఎదయగుచుండును. కట్టునిలువదు. పాలు తగ్గిపోవును గాన ఎక్కువగా మేపరాదు. ప్రత్తివిత్తులుపెట్టి నడుమ తగినంత ఉప్పు కలిపి పెట్టవలెను. లేనిచో వాతరోగములు కలుగును. వెన్న ఎక్కువగా వచ్చునను యుద్దేశ్యముతో తవుడు పెట్టుటతగదు. అట్లుపెట్టినచో, కీళ్ళవాతము దొమ్మ మొదలగు రోగములు సంభవించును. నాచేరచింప బడిన అనుభవ పశువైద్య చింతామణియను గ్రంథము చూచినయెడల పైవిషయములన్నియు విపులముగా వ్రాయబడినవి. చదువరులు తప్పక తెప్పించి చూచెదరుగాక.

ఒకరు :—ఒకస్త్రీకి తనకుమారుని పురుషపుంగవునిగా జేయడానికి యిరవైయేళ్లు పడుతుంది.

ఇంకొకరు :—ఔను. వాన్నే తెలివితక్కువ దద్దమ్మగా తయారుచేయడానికి యింకొక స్త్రీకి యిరవై నిముషాలు పడుతుంది.

---

ఒకదినము ఒకపత్రికలో, ఒకడు

"బజారులో నాసంచిని పోగొట్టుకొన్నాను. దానిని తీసినవానిని గుర్తించాను. అతడు నాకు దానిని తక్షణమేవచ్చి యిచ్చిపోవలయును."

అని వ్రాస్తే, ఆ పత్రికలో మరుదినము,

"సంచినిదీశాను. గుర్తింపబడ్డాను. పోగొట్టుకొన్నవారు నావద్దకువచ్చి సంచిని ఎప్పుడైనా తీసికొనిపోవచ్చును" అని ప్రకటింపబడ్డది.


చల్లని పండువెన్నెట్లో
జీవామృతము ను
సేవించి హాయినిపొందుడు.


ఆయుర్వేదాశ్రమము
మద్రాసు.
బాలభాస్కర
యకృత్,ప్లీహోదర
వ్యాధులకు
వరప్రసాదము.
S. BRAHMA.

# గ్రామ పరిశ్రమలు

మొదలి వెంకటరామయ్యగారు

ఆంధ్రదేశమునందు కొన్ని విచిత్రపరిశ్రమ లభివృద్ధిజెందుచున్నవి. ఇవి పూర్వము లేవుగాని, ప్రస్తుతము, మనయాంధ్ర సోదరీమణులు వీనిని నూతనముగా కనుగొనుచున్నారు. వీనిలో "కాగితములతో గృహోపకరణములజేయుట" యొకటి. ఇది నెల్లూరుజిల్లాయందు విశేషవ్యాప్తిగలిగి యున్నది. దీనిని నేను స్వయముగాజూచి గ్రహించితిని. ఈ యుపకరణములు చాల దృఢముగను, విచిత్రముగనున్నవి. ఈపరిశ్రమను ఇతర ప్రాంతములకు పత్రికా మూలమున దెలియజేయ దలంచితిని.

చిత్తుకాగితము లుపయోగ రహితములని మనవారు విశేషముగా పారవేయుదురు. కాని ఈచిత్తుకాగితముల మూలముననే యొక పరిశ్రమను వృద్ధిజేయవచ్చును. ఈ పరిశ్రమ మొదట గ్రామములయందుండి, మిక్కిలి యనాగరికమని తోచినను, దీనిని వృద్ధినందించినచో, కాలక్రమముగ నిదియే యొక నాగరికవృత్తిగా పరిణమింపగలదు. ప్రస్తుతము మన పురుషులు, తుక్కుకాగితముల యుపయోగమును గ్రహింపలేకయున్నారముగాని, మన సోదరీమణులు నూతనోత్సాహముతో క్రొత్తక్రొత్త పరిశ్రమల నభివృద్ధి నందించుచున్నందుల కెంతయు శ్లాఘనీయులు. ఈ కాగితములతో చిన్నబుట్టలను, గిన్నెలను, తట్టలను, ఇట్టివనేక పరికరముల స్వల్పపరిశ్రమతో, తయారుజేయనగును.

చాల తుక్కుకాగితముల నొకచో చేర్చవలయును. అవన్నియు జేర్చినతరువాత నొక పెద్ద గిన్నెలో నీరుబోసి, యాకాగితములనన్నిటి నా నీటియందుంచవలయును. అట్లు నీటియందుంచిన కాగితములను, మూడు నాలుగుదినములు బాగుగా నానునట్లుంచవలయును. అవి నానినతరువాత, ఒకసేరు వరకును మెంతులదెచ్చి, మరియొక గిన్నెయందుంచి, తగిన నీరునుబోసి, వానినొక రోజువరకును బాగుగా నాననీయవలయును. నానినతరువాత మెంతులు తమ పూర్వపరిమాణమునకు రెండంతలుగా నగును. నాల్గవరోజు నానిన యాకాగితములదీసి,రోటియందుంచి బాగుగా రుబ్బవలయును. రుబ్బగారుబ్బగా నా కాగితములు గుజ్జగును. తరువాత దానిని బయటికిదీసి, మరల కొంచెము కొంచెముగా మెంతులతో రుబ్బవలయును. ఇట్లు షుమారు పావుగంట రుబ్బినయెడల మొత్తము జిగటగా గుజ్జవలెనగును. తరువాత మిగిలిన దానినంతయు క్రమముగా గుజ్జగునంతవరకును, రుబ్బవలయును. తరువాత నాగుజ్జును (Pulp) ఒక గిన్నెలోనికి త్రోడవలయును.

పిమ్మట మనమొక బుట్టను, తయారు చేయవలయుననిన, ఆబుట్టను దెచ్చి దాని పై భాగమున, నిండుగా సన్నటి బట్టయొకటి కట్టి, యాబుట్ట మూతివద్ద ముడివేయవలయును. తరువాత నాగుడ్డనిండుగాను, దట్టముగాను, ఇదివరకు తయారుజేసియుంచిన కాగితముల గుజ్జునువేయుచు రావలయును. తరువాత నదంతయు పూర్తికాగానే, బట్టతో గూడ బుట్ట నొకచో కదలకయుండు నట్లుంచవలయును. అట్లు రెండుమూడురోజులుంచగానే యాకాగితము గుజ్జంతయునారి, యాబుట్ట యాకారముతో గట్టిపడును. తరువాత నాబుట్టనుదెచ్చి, దానిపై బట్టనువిప్పి, లోపలనుండు బుట్టను బయటికి దీయవలయును. తరువాత నెమ్మదిగా, ఆరినకాగితముల బుట్టకంటుకొనియున్న సన్న వస్త్రమును విడదీయగా, దృఢమైన కాగితముల బుట్ట మిగిలియుండును. తరువాత నాబుట్టకు మన మిచ్చవచ్చిన రంగువేసికొనవచ్చును. పై విధముగనే పళ్లెములను, గిన్నెలను, తట్టలను తయారుజేయవచ్చును.

ఇట్టి పరిశ్రమలు, మనయాంధ్రదేశమునందభివృద్ధి జెందవలయును. సోదరీమణులందరును, ప్రయత్నించి ఈచిన్న పరిశ్రమనున్నతస్థితికి దేగోరెదను. ఇదియే కొంతవరకును "గ్రామపరిశ్రమ పునరుద్ధరణము" నకు, పునాదియగునని యూహించుట కవకాశములుగూడ గన్పించుచున్నవి.

# "జ్ఞానము"

ఆచంట సత్యవతమ్మగారు

జ్ఞానమనెడి దొక దివ్యచక్షుఃవంటిది. అట్టిశక్తి మనుజన్మలకు తప్ప, తక్కిన అండజ, ఉద్భిజ్జ, స్వేదజ, జరాయుజంబులలో మృగావళులకును లేదు. "ఆహారనిద్రాభయమైదునాని" అని వాటికి తినుట నిద్రించుట, భయపడుట, సంసార వ్యవహారములు మాత్రమే తెలుసును కాని, తామెవరో, తమ్ముల పుట్టించిన వారెవరో, దీనిచే జన్మకారణునిఁ దెలుసుకొనవచ్చునో యెట్టి క్రియచే బహుళదుఃఖకరమగు జన్మనుతరింపఁ జేసికొనవచ్చునో యట్టి జ్ఞాన సాధనము మాత్ర మగమ్యము.

దన్ను దాఁదెలిసికొనుటదే జ్ఞానలక్షణము. అట్టిలక్షణ మనేకజన్మార్జిత పూర్వపుణ్య విశేషంబున మానవుడై పుట్టిన జన్మలకైనను, సుకృతకర్మవశుఁ డైన నరునకేలభించును కాని, విషయేచ్ఛల వశుఁడైన, మనుజాధముని పొందనేరదు.

విషయము లొక పెద్దవలవంటివి. ఆశయనెడి మోహపదార్థమం దుంచబడిన "ఎర" వంటిది. ఆశామెర కాసించి, మనుజమృగావళులందు మైమరచి వలలో జిక్కికొని విముక్తినొందలేకుందురు. బుద్ధియనెడు ఎలుకలరేడు బోధయనే తనవాడిదంతములచే మాయావలను కొరుకుటే (అనగా మనస్సు బుద్ధిబోధనువిని, అరిషడ్వర్గముల నణచి, ఈషణత్రయముల వదలి, గుణరహి తుఁడై, జ్ఞానసాధనంబెరిగి, ఆత్మతత్వము తెలిసికొని, ఆశాగుణరహితుఁడై, జ్ఞాన భక్తి వైరాగ్యయుక్తుడై మనుటయే) మానవజన్మతరించు నుపాయము. జ్ఞానముచే భక్తి యుదయించును. భక్తిచే భవహరమగును.

జ్ఞానమునకే తెలివని, ఎఱుకని నామాంతరములు. దానిచే, జీవాత్మ పరమాత్మల, అద్వైతమెరిగి సాయుజ్యముక్తినొందుటచే జన్మతరించును. ఈదారినెరుగని నరజన్మ వృథాపతనహేతువై, జడమై, భవసాధనమగుచున్నది. సౌధోపరి నెక్కి సురక్షితులమైయుండక, క్రిందకురికిన గతియెట్టిదో, జ్ఞానదీపికా సహాయమున్నను, జన్మాంధకారమును వదలింపఁజేసికొన కుండు టట్టిది. భక్తి నౌకా సహాయమున సంసారార్ణవమును తరింపకుండుటట్టిది. అజ్ఞానాటవిని జ్ఞానఖడ్గముచే భేదించి దారినెరుగుటయే నరజన్మవలని ఫలితము. ఆశామెరను నిరసించి, అహంకార మమకారములవదలి, పూర్వపుణ్యావశమున లభించిన మనుష్యజన్మ వృథాగానీయక, జ్ఞానసాధావలంబికులై తరించుదురుఁగాక.

ఓం తత్ సత్

# అస్పృశ్యతానివారణ మనవసరమా?

శ్రీమతి డి. ఎన్. రాజేశ్వరమ్మగారు

వర్తమానయుగమున భారతీయుల భావాతిశయాదర్శములు వివిధవర్ణాశ్రమధర్మసభలలో ప్రళయఝంఝానిల తీవ్రసంక్షుభితధరాధరంబులపగిది నిలుకడ జెందకున్నవి. వర్ణభేదములు స్వరాజ్యసాధనమునకు ప్రథమ సోపానమగు పరస్పర సుహృద్భావమును పారదోలి కేవలము స్వప్రయోజనపరాయణతను పెంపొందింపజేయుచున్నవి. పవిత్రమగు హిందూమతము, తన్మూలమున హీనదశకు గురియైనది. ఈ హీనదశకు ఉత్తరవాదులెవరు? వితండవాదములచే, మతాదర్శములను, అర్థభేదము నొనర్చియు యుత్పాతలగు మనభారతజాతీయులే. వీరిలో స్వప్రయోజనార్థమై అసత్యములైనను భగవదోపదేశమని, ప్రసాదించి చెప్పెడి ప్రాజ్ఞులుకూడ కొందరుగలరు. పూర్వమతాచార్యుల పేరిట స్వకల్పితసూత్రములను ప్రమాణములుగ బోధింపజాలు మహనీయులు మఱి కొందరు. ఇట్లు నేటివరకు ధర్మాధర్మ విచక్షణలేక సాగుచున్న కల్పితమత సాంప్రదాయములను విద్యావిశిష్టులవిని సైరించిరి. కాని కాలమెల్లపుడొకరీతి నుండునా? విజ్ఞానము ప్రబలిన నిమీలితనేత్రుడైయున్న నాటిభారతీయుడు నేడు కనులు తెరచినాడు. తన పూర్వదుస్థితిని తెలిసికొని, నిలువున నీరైనాడు. స్వాతంత్ర్యాలోచనమునై సాధారపద్ధతి పరాధీనతకు శత్రువైనాడు. కావుననే నవీనయుగము పూర్తిగ పూర్వముకన్న నాల్గ మారిపోయినది. అట్టి పరివర్తన మాశ్చర్యము కాదు. కేవలము క్రమము సహజము. హిందూమత ము పవిత్రతను [illegible]మించుట మహమ్మదీయుల దండయాత్రలు మొదటికారణము. మత గ్రంథములు దేశభాషలలో ముద్రింపబడకుండుటయు తన్మూలమున నవి విపరీతార్థములచే గ్రహింపబడుటయు రెండవకారణము.

మతము క్షీణదశకు వచ్చుకొలది విపరీతములగు జాతిభేదములు జనించుచున్నవి. దయాదాక్షిణ్యరాహిత్యమగు స్వప్రయోజన పరాయణత ప్రబలినది. నీతిమార్గ మడుగంటినది. సాత్త్వికభావమస్మరణీయమై పోయినది. విపరీతాచారములు విరివిగ నభివృద్ధి నొందుటచే మానవసంఘమున కత్యంతోపయుక్తములగు పూర్వపుటాచార సాంప్రదాయము స్వప్నప్రాయములైనవి. వర్ణభేదమున కివియె కారణములు. కాక హిందూశృతి, స్మృతిపురాణేతిహాసములలో నెందుజూచినను "బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు," అను చాతుర్వర్ణము మాత్రమే గన్పట్టుచున్నది. శ్రీకృష్ణభగవానుడు గీతలలో "చాతుర్వర్ణ్యం మయాసృష్టంగుణకర్మవిభాగశః" అని చెప్పుటచే నీ నాల్గువర్ణములవారు, పుట్టుకవలన కాక, గుణకర్మలచే సృష్టింపబడినారని తెలియుచున్నది. కాన పంచమవర్ణము, కేవలము భారతానంతర సృష్టియని స్పష్టమగుచున్నది.

పంచములనబడు నిమ్నజాతివారు సఖ్యమునకర్హులా? లేక అనర్హులా? అని ప్రపంచించుటకు పురాణయుగములోని ఉదాహరణములు పెక్కులు. మాలకూతునకు జన్మించిన పరాశరుడు బ్రహ్మరుషియనంబరగెను. అతనికి జన్మించిన వేదవ్యాసుడు మతమునకు ప్రామాణికమగు వేదసంచయమునకు విభాగకర్తయయ్యెను. చండాలకన్యను జేకొనిన వశిష్ఠుడు పరమపావనుడయ్యెను. ఇట్లే పురాణయుగమున నెందరో,

# అస్పృశ్యతానివారణ మనవసరమా ?

పంచములతోడి బాంధవ్యమును గల్పించిరి. ఈమధ్యనే కదా శంకరస్వాములవారు మిల్లరుకన్యను శుద్ధి సంస్కారణ మొనర్చి మతమున జేర్చినది. కేవల మొక పరదేశీయ యువతిని హిందూమతమున నైక్య మొనరించుటకంటె స్వదేశీయులను స్వమతస్థులును నగు పంచములను స్పృశించినంతనే తప్పేమియు గానరాదు. కులకాంతలను విడనాడిన జారశిఖామణులు సదాచార సంపన్నులైనచో కాషాయాంబరములధరించి, కేలనొక జపమాలబూనినంతనే దుర్మార్గుడును సన్మార్గుడగుచో హేయదృష్టిచే దిలకింపబడు పంచముడు నిరపరాధియగు భారతీయుని స్పృశ్యమాత్రమున కేలయనర్హుడో తెలియకున్నది. మతముపేరిడి వేనవేలు అపరాధముల నొనర్చుచున్నాము. మతమను నెపమిడి ముక్కుపచ్చలారని బాలికలకు వివాహములొనర్చి వారి వైధవ్య ప్రాప్తిని కన్నులారగని సంతసించుచున్నాము; మత విరుద్ధమని పునర్వివాహము లొనర్చిన వారిని వెలివేసినాము. తుదకు మతముపేరిడి కోట్లకొలది జనుల విజ్ఞాన వికాసముల నధఃపాతాళములకు ద్రొక్కినాము. పంచముడును మనవలెనే తల్లిగర్భమున జనించి, అన్నిహక్కులను, అనుభవించుటకు తగిన భారతీయుడు కాని అన్యదేశీయుడు కాడు. కేవల మొకయన్యదేశీయుడగు వానికి, వంగివంగి 'జోహారు' చేయుటకు వెనుదీయని మానవధర్మము, అవసరమైనచో వాని కరస్పర్శచే గౌరవింపజాలు మానవ శీలము యేకదేశజనితుడగు మరియొకసోదరు నంటరాదని నిషేధించుట కెట్లొప్పుకొనుచున్నదో మిగుల శోచనీయము, సర్వేశ్వరుడగు దేవదేవుని కన్నిప్రాణులు తుల్యములు, అతడందరిని సమాదరదృష్టిచే దిలకించు పక్షపాతములేని తండ్రి. అట్టి తండ్రిని సేవింపనీక పంచముడు దేవాలయమున ప్రవేశింప తరుముచున్నాము. అయ్యో ! న్యాయాన్యాయ విమర్శకదృష్టియు, ధర్మాధర్మ విచక్షణశక్తియు, మనకేది ? భారతజాతికి ప్రధానమగు సత్యగుణ మెచ్చటికేగె ? ఆహా ! హిందూసంఘము మతము పేరిడి యెన్ని దుష్కృత్యము లొనర్చుటకు సాహశించినది. అధర్మవర్తనులును, అవినీతివర్తనులును నగు వారు మనలో నెందరులేరు. వారందరు మిక్కిలి గౌరవోన్నత పదవులనందుటలేదా ? కాని పాప మెంతనీతిపరులైనను, సద్వర్తనులైనను యోగ్యులైనను, జన్మచే నిమ్నజాతికి జెందినంతమాత్రముననే, హిందూ సంఘమున కెట్టి స్థానమైనను వారికి లేకుండజేయుట నిజముగ దేశారిష్టక సూచకమనదగును. మనము వారిని నీచదృష్టిని గిలకించుటవలననే వారిలో చాలమంది క్రయిస్తవులగుచున్నారు. క్రయిస్తవుల నాశ్రయించుచున్నారు. తుదకు వారి పరాధీనత భారతీయ జాతీయతను బలహీనమొనర్చ మనకు తీరని లోటు కలుగుచున్నది.

కావున భారతదేశాభివృద్ధికి చదపురుగై, సంఘము యొక్క పతితస్థితిని దిలకింప సిద్ధమగుచున్న అస్పృశ్యతా పిశాచమును సంహరించినగాని, దేశానర్థకమునకు విఘాతము గలుగదని నమ్ముట మేలు.

సోదర సోదరీమణులారా ? మహాత్ముడడుగో ? సత్యాగ్రహ దీక్షబూని రాజకీయరంగమున రాణించినాడు. దేశదాస్యాంధకారము పటాపంచలుజేయ స్వతంత్ర్యభాను డుదయగిరినెక్కి ప్రకాశింపనున్నాడు. స్వతంత్ర్యోదయమునకు పూర్వమే ఉషఃకాలమున పక్షులు కలకలరవములచే వీనులవిందొనర్చువిధమున క్రొంగొత్త సంస్కారములొనర్చి జాతీయగీతములను బాడుడు. జాతీయతను నెలకొల్పు పాటుపడుడు. ఐకమత్యమును, అనురాగమాత్రముచే సహృద్భావమును పెంపొందించుజేయుడు, ఇట్టిసందిగ్ధ సమస్యలలోన అస్పృశ్యతా నివారణ మనవసరమని యెవరనగలరు ?

# కైకమ్మా!

శ్రీమతి యన్. అలివేణిగారు

౧

కైకమ్మా! భవదీయవృత్తమును సాకల్యమ్ముగాజూడకే
లోకుల్ కాకులు తిట్టిపోసెదరు నీ లోకోపకృత్యంబు చిం
తాకంతైన గణింపలేరు నిజము న్గన్గొన్న దోషాచరా
నీకంబుల్ తెగి లోకముల్ మనుటకున్ బీజంబు నీవేకదా!

౨

కాంతుడు కాళ్లబడ్డ కనికారము సుంతవహింపలేవు బల్
పంతముపట్టి రాము వనవాసమొనర్పగ బంపబట్టియే
అంతమునొందినారు నరహంతకులైన సమస్తరాక్షసుల్
సుంత దయార్ద్రచింతవగుచో కథ సర్వముమారియుండదే!

౩

మును దేవాసురయుద్ధభూమి బతి సమ్మూర్ఛావశుండైన నె
మ్మన మందించుక భీతిచెందక రిపుల్ మార్కొన్న కంపింపకే
ఘననిర్ముక్తతటిల్లతాయన శతాంగం బొక్కలి ప్తన్ రణా
వనిదాటించి సుధీరతాగరిమ నీ ప్రాణేశురక్షించితో!

౪

ప్రాణముగాచినట్టి సుకృతాత్ములకేది యిడంగరాదు? నీ
ప్రాణవిభుండు నీకిడె వరద్వయ; మక్కఱగల్గినప్పుడ
వ్వానిని గోరుకొంటి వాడబాటుప్రకారము, ధర్మమేయగున్
దానవతండు తక్కుట యధర్మము సుమ్మన కన్నిచెప్పినన్.

## ఆ ప్త వా క్యం!

౫

రాము డిలంజనించుట పరాక్రమగర్వితు రావణాసురున్
సోమపదార్చనారతు విశుద్ధతపోధనపీడనవ్రతున్
భూమిభరంబుదీర్ప వధమున్ బొనరించుటకంట; యాపనిన్
రాముడు నీము డీవు విపినంబులకంపక చేయగల్గునే!

౬

మగడు వశంవదుండయిన మానినిదిట్టుట లోకధర్మమై
నెగడిన దంతెకాని తననేర్పుమెయిం బతిప్రేమ నూఱిగొ
న్న గరిత ధన్యురాలు, గణనార్హసుమీ! మువురాంధ్రలోన నీ
మగనికి నీవెనచ్చితి, సమర్థవు కేకయరాజనందనా!

౭

ఆయతబాహు విక్రమబలాఢ్యుడు సత్వగుణప్రధానుడున్
శ్రీయుతమూర్తి రామనృపసింహునిగూర్చిన పుట్టపుట్టు రా
మాయణగాథ కంతకు సమర్థపుబీజము నీదుపాత్రయే
వేయినమస్కృతుల్ గొనుమ ప్రేమపురస్సరముల్ మదంబరో!

---

## ఆ ప్త వా క్యం!

ఎఱుకలపూడి గోపాలకృష్ణారావుగారు

"సహధర్మచారిణి" సఖియయగాని, "సహధర్మచారిణి" గాదుసఖియ
భర్తలోనర్ధంబు భార్యయున్నదిగాని భర్తయేపూర్తికి కర్తగాదు
సారసాక్షినిజూడ సాధ్వియేయగుఁగాని కవులాడునట్టుల కఠినగాదు
ఉవి దార్యమతము తా నుద్ధరించునెగాని పురుషులట్టుల నన్యములకుబోదు

అగ్నిసాక్షిగఁబెండ్లాడి నట్టియతివ
తమ్ము సంతృప్తిఁబఱచు మాత్రమ్మెగాదు
పాతివ్రత్యప్రభావాన ప్రాణమొడ్డు
నుభయలోకాల నలరించు నుత్తమగుణ!

# అది నీ ఘనత;
# నీ గౌరవము;



ఒక యింటికి యజమానురాలుగానుండి తన కృత్యముల విజయవంతముగ నొనరించుట యరుదై యున్నది. పురుషులవలన పొగడ్తకెక్కనివియు, తుదకు మెప్పునుగూడ పొందనివియునగు నసంఖ్యాకములగు పనులందరుజేయుచుందురు. కాని స్త్రీలు ఘనతయు గౌరవమును బొందుటకు జేయవలసిన విధులు కొన్నిగలవు. అది అందరెఱింగినదే. వీనిలో ప్రతిదినము తేనీరుజేయుటకూడ నొకటి. ఈ కార్యమున స్త్రీలకు సర్వాధికారముగలదు. దీనిని గ్రహించిన యిల్లాండ్రెపుడును, తమ హస్తములనుండి తమ పురుషులు, దయాగసమనదగిన యీ భారతదేశపు తేనీటిని గైకొనుచున్నారను మాటమాత్రము మరువజాలరు.

## తేనీరును తయారుజేయుట.

మరగబెట్టిన మంచినీటితో నొకపాత్రను (మంటిదైన మంచిది) గడిగి, శ్రేష్ఠమగు భారతీయ తేయాకును, మనిషికొక చమ్చావంతున, పైగా పాత్రకొక చమ్చాచేర్చి వేయుము. మంచిమరిగిననీటిని పాత్రయందలి తేయాకుపైబోసి ఐదునిముషము లుండనిచ్చి పాలు చక్కెరను గలిపి సేవించుము.



**భారతీయ తేనీరొక్కటే కుటుంబ పానీయము.** I K-33



# శిశుపోషణ

ఆహారము.

తల్లిపాలే ప్రశస్తమనీ ఫలానికారణాల వల్ల ననీ వివరించ నక్కర్లేదు. గమనిక లేమైనా వున్నవి అవే.

ఏడ్చినపుడల్లా పాలివ్వరాదు. ఇంక రాత్రైతే ఓ ఎనిమిది గంటలకాలం ఇవ్వరాదు. తొమ్మిది పది మొదలు తెల్లవారి అయిదు ఆరయ్యేవరకు. ఈవ్యవధికాలంలో ఏడిస్తే పక్కమార్చి అంతగా నిలవకపోతే కొంచెం వేడిగా కాచిననీళ్లు ఇవ్వవచ్చు.

మొదటి ఆరువారాలూ పాలు మూడు గంటల కొకమారు ఇవ్వవలె. ఇలా అని నిర్ధారణ చేసుకోడం అవసరం. పాలివ్వడానికి అవసరముండదుకాని, బిడ్డను లేపవచ్చు. వాడుకబడితే బిడ్డ సరిగ్గా సమయానికి మేల్కొంటుంది.

కానివేళల్లో ఏడిస్తే నీళ్లివ్వవచ్చు. పాలెంతమాత్రం ఇవ్వరాదు.

గుక్కతిప్పుకుంటూ, ఓ పదిహే నిర్వై నిమిషాలు, మెల్లగా, రెండువైపులా, బిడ్డ పాలుత్రాగేటట్లు గమనించవలె.

బిడ్డ కక్కడం పాలలో దోషంవల్లకాదు. తొందరగాత్రాగడంవల్ల. ఇలా త్రాగకుండా తల్లి జాగ్రతపడవలె.

బిడ్డలేడ్వడం తరచు ఆకలైతేనేకాదు. కడుపు నిండుండికూడా ఏడ్వటంకద్దు. విచక్షణ అందువల్ల అవసరం. ఏడ్చినప్పుడల్లా పాలివ్వరాదు. ఆలా ఇవ్వవలెనను కోడం ఓ దురభిప్రాయం. జీర్ణకోశానికి విశ్రాంతి ముఖ్యం. పెద్దవాళ్లకే వేళకాని సమయాల్లో ఆహారం జబ్బైతే, లేతవయసు బిడ్డల విషయంలో చెప్పవలెనా. జబ్బు ప్రమాదాలకు మూలమునూ.

స్నానము-ఆహారము. బిడ్డలకు పాలివ్వవలసింది స్నానం అయింతర్వాతనే. ముందు కాదు.

తొమ్మిదినెలలయితే పాలు నిలుపుదల చేయవచ్చు. ఓ అయిదారువారాలు క్రమంగా పూర్తిగా నిలపడానికి తీసుకొనవచ్చు.

పాలైనా, అమ్మబడే రకరకాల ఆహారాలైనా జాగ్రతగా శుభ్రంగా వాడవలె. పాలైతే బాగాకాచి, ఇతరమైతే చెప్పిన ప్రకారం చేసి వాడవలె.

12 నెలలవరకు ఆవుపాలు మంచి ఆహారం. గంజి మొదలైనవి ఏడాదిఅయితేనే. ఏడాది ఆరునెలలయితే అన్నం పెట్టవచ్చు. అంతకుముందుగా పెట్టటం అంత ఆరోగ్యంకాదు.

కమలా, ద్రాక్ష, తదితర పండ్లరసాలు బిడ్డలకు బాగా వాడవచ్చు. పిప్పి వేరుచేసి ఉపయోగించవలె. తల్లిపాలులేని బిడ్డలకు దీనివాడుక మరీ ఉపయోగం.

పాలబుడ్డి వాడుక అనారోగ్యం. వీటివల్ల అపాయాలు వివరించాలంటే చాలా. ఓ శుభ్రమైన పింగాణీగిన్నె చాలు ఆహారం తయారు చేయడానికి.

కానివేళల్లో ఇష్టపడకుంటే బిడ్డకు ఆహారం ఇవ్వవద్దు. మరి తగని ఆహారాలూ వాడుక చెయ్యవద్దు.

కొన్నిమాసాలు వారానికోసారైనా బిడ్డను తూచడం, ఏకారణంగానైనా హెచ్చు కాకుంటే వైద్యుని కనుగొనటం ముఖ్యం.

యస్. శేషగిరిరావు.

---

# స్వర్గమేల?

మునగపాటి చినహనుమయ్యగారు

విజ్ఞాన విద్యా వివేకశోభితగుణ, వర్ధిత సౌశీల్యవర్తనంబు,
సహజ గాంభీర్య హాస్యామోదమాధురీ, స్వారస్య కవిత వాగ్వైభవంబు,
కరుణా ప్రపూర్ణ సంకల్పాను సంధాన, కమనీయ సత్కార్య కారకంబు,
బహువిధాలంకార ప్రాజ్ఞతాధిక్య సం, ప్రాప్తలాలిత్య విరాజితంబు,

తాపదుఃఖరోగ దారిద్ర్య భయ మృత్యు
సమయశాంతి ధైర్య సాధకంబు
అగు సతీమతల్లి — అర్ధాంగియగునేని
స్వర్గమేల? పురుషసత్తమునకు.

# బాలవిజ్ఞానశాఖ

## బడిపిల్లవాడు, ద్రాక్షపండ్లు

శ్రీమతి కమలావతికన్య

అప్పుడే దేవాలయమునుండి తిరిగిపోవుచున్న యొకబాలుడు తనపాఠశాలావరణ ముగుండా వెళ్లవలసివచ్చెను. అచ్చట చక్కగా పండి గోడమీదికి వ్రేలాడుచున్న ద్రాక్షపండ్ల గుత్తులపై యాకుఱ్ఱని దృష్టి బడెను. ఇంతకుమునుపే దేవాలయమున గురువుగారు యెవరిదో వివాహప్రకటన జేసియుండిరి. ఆ సంగతి మదికిరాగా, తన్నెవ్వరు జూచుచుండలేదని యెంచి, ఒక గుత్తిని త్రెంచుకొని నోటి సమీపమునకు దాని గొనివచ్చి యచ్చటనే యాపి యిటులనెను. 'ఈ ద్రాక్షగుత్తియొక్కయు నా నోటియొక్కయు వివాహప్రకటన చేయుచున్నాను. వీరిరువురును పరిశుద్ధ వివాహ రీతిగా జతగూడరాదనుటకు యే న్యాయహేతువునైనను మీలోయెవరైనను తెలిసికొనియున్నయెడల, యిప్పుడే దానిని వెల్లడిచేయవలెను; లేనియెడల మఱెన్నటికినిగూడ మౌనముగా నుండవలెను. వెంటనే యా ద్రాక్షలును యా నోరును జతగా గూర్చబడెను.

దురదృష్టవశమున యీ సంగతంతయు ఆ బాలుని యుపాధ్యాయుడు చాటుననుండి కనిపెట్టెను. మరియు వానిమాటలు వినబడజాలనంత దూరమున యుండనందున వాడు పలికిన ప్రతియక్షరమును స్పష్టముగా వినగలిగెను. అయినను, యప్పటి కూరకుండి, మరునాడు తక్కినవాని సహపాఠకులందరి ముందు వానిని నిలువజేసి, తాను చేత నొక కఱ్ఱనుబూని, దండధారివలె గస్పట్టుచు యా బాలుని దండించుటకు పూర్వ మిట్లనియె. 'నేను యీ దుడ్డుకఱ్ఱయొక్కయు యీకుఱ్ఱని వీపుయొక్కయు వివాహప్రకటన జేయుచున్నాను. ఎవరైనను ఆటంకపఱుచ దలచుకొనినయెడల యిప్పుడే సహేతుకముగా వెల్లడిచేయవలెను. లేనియెడ యికనెన్నటికిని మాటాడరాదు."

బాలుడు వెంటనే సర్వము గ్రహించగలిగెను. అయినను చెదరని చిత్తముతో గట్టిగా 'నేనీ ప్రకటన నిషేధించుచున్నా' నని యఱచెను.

గురువు—ఇందుకు కారణమేమి కనుపఱచగలవు ?

బాలుడు:—ఉభయపక్షముల వారు సమ్మతించకపోవుటయే కారణము.

గు:—"ఆలాగా !" యని, పిల్లవాని బుద్ధిచతురతకు లోలోన సంతసించుచు, "అటులయిన యీ వివాహమును త్రోసిపుచ్చవలసినదే." (అనువాదము)

## పెళ్ళాలసరదా

సి. వి. రమణగారు

ఎనిమిదవ హెన్రీ యెందుకు యేడుమందిని పెళ్లాడాడని ఒక టీచరు ప్రశ్నిస్తే పరీక్షలో కొంతమంది కుర్రాళ్లీలా వ్రాశారు.

గణపతి:—హెన్రీ పూర్వరాజుల రాణులకథలను వినడానికి చాలా యిష్టపడేవాడు. అందుచేత ఏడుమందిని పెళ్లాడాడు.

వాసు:—ఒక జ్యోతిష్యుడు హెన్రీతో చాలా మందిని పెళ్లాడితే స్వర్గాని తప్పకుండా వెళతావని జెప్పాడు. కాబట్టే అతడేడుమందిని పెళ్లాడాడు.

గోపీనాథ్:—హెన్రీకి పేకాటంటే చాలసరదా కాబట్టి యేడుమందిని పెళ్లాడాడు.

రాముడు:—హెన్రీ తన పెద్దఅంతఃపురంలో ఒంటరిగా ఉండటానికి భయపడి యేడుమందిని పెళ్లాడాడు.

రంగడు:—హెన్రీకి యిరుగుపొరుగువారి దెబ్బలాటలు పెళ్లాంచెప్తుంటే వినాలని చాలసరదా. అందుకే పెళ్లాడాడు ఏడుమందిని.

శంకరుడు:—హెన్రీ వార్తాపత్రికల్లోపడే పెళ్లి యినాములకు చింతిస్తూఉండేవాడు. కాబట్టి యేడుమందిని పెళ్లాడాడు.

కృష్ణుడు:—హెన్రీ రకరకాల పిండివంటలు తినాలంటుండేవాడు. ఏడుమంది వంటకై వరించాడు.

నారాయణుడు:—ఒకదినము హెన్రీ తనమంత్రులతో ఇలా అన్నాడు. "నారాజ్యములో ప్రతివారు ఏదో గొప్పపని చేస్తూ ప్రసిద్ధికెక్కుతున్నారు. నేనేమిచేయగూడదు?" మంత్రిఅన్నాడు. "చాలమందిని పెళ్లాడుటకు ప్రారంభించండి. మీపేరు ప్రపంచంలో ప్రసిద్ధికెక్కుతుంది." అందుకే యేడుమందిని వివాహమాడాడు. (బొంబే క్రానికల్)

---

## పిత్రాణము

పాకల చంద్రకాంతామణిగారు

అవి చీకటిరాత్రులు. నాడు ఘోరాంధకారము. భోరున వానకురియుచుండెను. ఉరుము లతి భయంకరముగ గర్జించుచుండెను. అట్టి సమయమున మూర్ఛాగతుడగు తమ జనకునొక యుత్తమాశ్వముపై నిడి అశ్వారూఢులగు మువ్వురు రాజపుత్రులు ఆ నిబిడకాళరాత్రియందా ఘోరారణ్యమున పరువులెత్తుచుండిరి. వెనుకగిట్టలచప్పుడు. శత్రుసైన్యములు తమ్ము వెంటాడుచున్న విషయ మా మువ్వురుతరుణులు గ్రహించి భీతినొందసాగిరి. నిమిషనిమిషమునకు శత్రుసైన్యములు దగ్గరపడ జొచ్చెను. పెద్దవారిరువురి నోటనుండి హాహాకారము లుప్పతిల్లెను. కడగొట్టువాడగు జయసింగు మాత్రము వారిని భయపడవలదని పలుకుచు తన తేజిని మరింత త్వరపరుపసాగెను.

ఆయశ్వములు వాయువేగ మనోవేగములను మించి బర్విడసాగెను. కాని లాభము లేకపోయెను. నిమిషములో శత్రుసైన్యములు వీరిని ముట్టడించెను. పెద్దవారిరువురును శత్రుసైన్యముల గాంచినతోడనే భ్రాంతచిత్తులై స్వప్రాణరక్షణార్థములకై తమ్ముని శత్రుమధ్యమునవిడచి స్వార్థపరులై పలాయనులైరి.

జయసింగు మీదపడిన ఈ యాపదను గురించి ఇంచుకంతయు చలింపక ధైర్యముతో అశ్వావతరణము గావించి తన తండ్రి శరీరమును పదిలముగ నొకచెట్టుక్రిందనుంచి యే యాపదయు తండ్రికి గలుగకుండ తండ్రి శరీరమును కౌగిలించుకొని పరుండెను.

శత్రుసైన్యము లక్కోటికివచ్చి జయసింగాదులగానక యాశ్చర్యపడుచు నందందు వెదకుచుండిరి. వాన ఇంకను భోరున గురియుచుండెను. గాలి యతిభయంకరముగ వీవసాగెను. శత్రుసేనలింకను జయసింగు పితనుగూర్చి వెదుకజొచ్చిరి. ఇంతలో నొక మెరపుమెరసెను. ఆకాంతిలో వారికి చెట్టు మొదట నొక మనుష్యాకృతి గన్పించెను. వెంటనే పదునైదురశ్వు లొక్కసారి పై కెగసి ఆ యాకృతిశిరము ఖండించివైచెను. ఆమస్తకముగైకొని శత్రుసేన లొక్కపరుగున నగరాభిముఖులైరి.

నబాబు దర్బారు తీర్చియుండెను. విద్యుత్కాంతిచే నాదర్బారు వేయిరెట్లు రామణీయకముగ వెలుగొందజొచ్చెను. దర్బారంతయు నిశ్శబ్దత వహించియుండెను. అందరి జూపుకులు సింహాద్వారముపై నుండెను. అందరు వెడలిన సేనరాకకై నిరీక్షించుచుండిరి.

ఇంతలో పరుగుపరుగున నాసేన దర్బారు ప్రవేశించి చిన్నమస్తకము శూలాగ్రమున గ్రుచ్చి నబాబునకుజూపిరి. అందరినోట హాహాకారము లుప్పతిల్లెను. జరిగినప్రమాదమును సైనికులు గుర్తించి భీతిచే గడగడ వడకసాగిరి. కారణము, అది జయసింగు మస్తకమే. పితృప్రాణమునెరవేర్ప నాబాలుడు చేసిన సాహసము క్షణములో నగరమంతయు నల్లుకొనెను. సైనికులు జయసింగుజనకుడనుకొని యాకాళరాత్రియందు జనకుని గాపాడ తనదేహ మడ్డుపెట్టిన జయసింగు శిరమునే ఖండించివైచిరి.

---

ఆపరేషన్ అంటే అమితంగాభయపడే ఒకరోగి ఆపరేషన్ అయినతరువాత వార్డులోనికివస్తూ "దేవుడా! రక్షించావు. ఆ కాస్తా అయిపోయింది" అన్నాడు.

ఇంతలో ప్రక్కపరుపుమీద ఉన్నరోగి అందుకొని "అంతనమ్మకం పెట్టుకోవద్దు. నాకు ఆపరేషన్ చేసినపుడు డాక్టరుగారు స్పాంజిలోపల మరచినానంటూ రెండవమారు దానికోసరమై తిరిగి ఆపరేట్ చేసారు." అన్నాడు.

ఆప్రక్కనే యింకొకరోగి "నిజమే. నాలోపల డాక్టరుగారి సామానేదో ఉండిపోయిదంటూ మరీ నన్నింకొకమారు ఆపరేషన్ జేసారు." అన్నాడు మెల్లగా.

అప్పుడే మొదటిరోగికి ఆపరేషన్ చేసిన సర్జనుగారు లోపలికివచ్చి "నాటోపీ యిచ్చట ఎవరైనా జూశారా" అని ప్రశ్నించారు.

పాపము ఆ మొదటిరోగి మూర్ఛపోయాడు ఆమాటవింటూనే.

# రమణులదే రాజ్యము

వ. రా.

పైపదముల గన్నంతటనే కొందరికి మళయాళదేశము జ్ఞాపకము రావచ్చును. మరికొందరు స్త్రీలు ముందు సర్వహక్కులను తమ చేతులలోనికి దీసికొని పురుషులపై రాజ్యము జేయుటను గురించియేయోయని వింతనొందుదురు. కాని భయపడవలసిన పనిలేదు; వింతపడవలసిన విషయముగాదు; నూతనమైన న్యూస్ గూడా కాదు. సర్వాధికారుల మనుకొని పురుషులెంత యధికారము 'చలాయించి'నను, వారికి సంఘమునం దెక్కువ హక్కులు లేకుండ జేసినను రమణులు మాత్రము రాజ్యము లేలుచునేయుందురు. ఆరాజ్యము గృహమని యందఱెఱిగినదే. ఆరాజ్యమునకు సర్వాధికారి—నిజస్థితిలో రమణియే గదా! ప్రాచ్య పాశ్చాత్యదేశములందు గృహిణికి గృహరాజ్యాధికార నిర్వహణమునకు గావలసిన హక్కులందు హెచ్చుతగ్గులున్నవి. ఈహక్కులు సంపూర్ణముగ గల్గియుండువారు బర్మావనితలు. వారి విపులమగు గృహజీవితమునుగూర్చి **The Illustrated Weekly of India** యందు ఎల్. జె. యన్. గారిట్లు వ్రాయుచున్నారు.

ప్రాచ్యఖండములందే దేశమునను—తుదకు ప్రపంచములో నెచటను—స్త్రీలు గృహాధికారమందు బర్మావనితలవలె నిర్వివాదమగు నధికారమునుగల్గి 'చలాయింప' జాలరు. అచ్చెరువొనరించు వ్యవహారిక శక్తి అభ్యాససిద్ధమగు జ్ఞానములతో బర్మాస్త్రీ పూర్వాచారములు వారికిలు తోస కొసంగిన స్థానమునకు చక్కగ తగియున్నది. ఆస్థానము నామె సౌఖ్యముతో మనోహరభావములతో శాంతితో నింపుచున్నందుననే ఆమె యధికారమునకు లొంగియుండువారు మారుమాటాడక, సణగక గొణగక సంతోషముగనుందురు.

వివాహమన బర్మీయులకు యింటిని నెలకొల్పుటని యర్థము. ఈ కార్యము ముగిసెనేని భార్య గృహరాజ్యమును పాలింప నారంభించును. భర్త సంతోషముగా భార్య 'స్వదేశ విదేశ' వ్యవహారములు నిర్వహించుచుండ అంగీకార సూచకముగా తల నాడించుచుండును.

సాధారణముగ బర్మాదేశీయుడు సోమరియని వాడుకగాని, పూర్తిగా శ్రద్ధ వహింపకుండనుండడు. గభాలున నొక కార్యము గావించి విజయమునందుచే మరొక్కదానిని గమనించును. తనభర్త అన్ని కార్యములను తన యాలోచనాసాహాయ్యము లేకుండగనే నిర్వహించు సామర్థ్యముగలదని యాతని కామె యందతి తమైన నమ్మకముండుటచే నామె సత్యాగత దయతో నాదరించును.

బర్మాగ్రామనివాసుని భార్య తన వరిపంట నంతటిని రంగూను వర్తకప్రతినిధి కమ్ముటయేగాక చక్కని బేరముం జేయం

గలదు. భర్త యెప్పుడును భార్యకు దెలియ కనేగాని, భార్య యిష్టమునకు వ్యతిరేక ముగాగాని యేవ్యవహారమును నారంభింపడు; అట్టి వ్యవహారములందు చాల మంచి ఫలితములు తప్పక గలుగును.

ఇల్లాలు గృహమునకు సర్వాధికారిణియై యుండు నన్నంతమాత్రమున బర్మాయందు భర్తలందఱును భార్యదాసులని యను కొనుట తప్పు. అయిల్లాలు భర్తకు లోబడని యసాధ్యురాలు గాదు; ఎదురు దిరుగు గయ్యాళిగాదు. వేదవిధులు మానవ చట్టములుగూడ కొన్ని కార్యముల నిర్వ హించుటకే గావింపబడియున్నవని యామె తలంచును. వానిలో తన భర్తయెడఁ దాను గావింపవలసిన విధుల నుల్లంఘించిన మోక్షము త్వరలో లభింపదని యామె యాశయము.

వీరి మనుధర్మశాస్త్రము వివాహవిధు లను పెక్కువిధములుగ విభజించును. దాని ప్రకారము భార్య ఏడువిధములు: తల్లితో, సోదరితో, మిత్రునితో, యజమానితో, శత్రువుతో, చోరునితో, బానిసతో సమానమైనది. వీనిలో మిత్రునితో సమాన మైన భార్యయే మిగులఁ గొనియాడబడు నది. ఆమెనుగురించి వారిశాస్త్రమున నివ్విధముస గలదు.

"భర్త కోరికల దీర్చుచు, సతనిని మిగుల దయతో నాదరించుచు, యథో చితముగా ప్రేమతో మాట్లాడుచు, తా నతని ఆచారవ్యవహారములందును, ఇతరు లతో సంబంధ బాంధవ్యము లందును విడువకెపుడును సాయపడి నాతనికొఱకై మిత్రునివలె పాటుపడుచు, భర్తను గాంచి నపుడు సంతోషముగ గన్పడి, ఆనంద ముతో నాతనితో భాషించుచు, నాతని పాదములు గడిగి యొత్తుచు, ఆహారపానీ యములను సకాలములో చక్కగా నమర్చి యుంచుచు, విశ్రమింపతగిన ప్రదేశమున పడకనమర్చుచు, నాతని సౌఖ్యమున కెల్ల పుడు పాటుపడుచుండు భార్యయే ఉత్తము రాలు."

ఆదర్శమైన భార్యకీ విధులని వివర ముగ నిర్ణయింపబడిన యీ కార్యజాలమం తయు బర్మాస్త్రీ వివాహానంతరము తప్పక ఆచరించును. వారి 'దమ్మకట' ప్రకారము భర్తయందు దోషములను గని భార్య యతని దూషించుట తప్పు, కాని వారి 'దమ్మదట్' నీతిప్రకారము భార్య దూషిం చినంత మాత్రమున భర్త ఆమెను విడచుట న్యాయదూరము.

గృహాధికారనిర్వహనము బూనుటకు చాలకాలమునకు ముందే బర్మాగృహిణి తన వివాహానంతరము తప్పని సరిగా నిర్వ హింపవలసిన తన స్థానమునకు దగినరీతి శిక్షణపొందును. 'నడ్వెక్‌మింగల' మనబడు చెవులనుకుట్టి పోగులనువేయు ముఖ్యమగు తంతు జరిగిననాటినుండియే యీ శిక్షణ యారంభమగును, ఆంగ్ల సంప్రదాయమగు 'డెబు' (Debut) వలె దీనికి సంఘమునందు ప్రాముఖ్యముగలదు.

ఇయ్యది సాధారణముగా బాలికకు పదమూడవయేడు వచ్చినప్పుడు జరుగును. బాలిక జాతకము వ్రాసిన పురోహితునిచే ముహూర్తము నిర్ణయింపబడి వాడుకగా చెవులుకుట్టు వానికి దెలుపఁబడును. తరువాత చెవిని బంగరుసూదితో కుట్టుదురు. దానిని క్రమక్రమముగా పెద్దదిజేసి 'కమ్మలు' పెట్టుకొనుటకు తగినదిగా జేయుదురు. ఈ కార్యము జరిగిన తరువాత భార్యగా, పరిపాలకురాలిగా తన జీవితముగ గడుప బాలిక శిక్షణ యారంభించును.

అరణ్యములమధ్యనున్న గ్రామమునందలి బర్మాబాలిక పెరిగి పెద్దదైయె యీ తంతు లేమియు లేకనే గృహిణియగును. కాని పెద్ద గ్రామములందును, పట్టణములందును, వ్యవహార దక్షణతకు గావలసిన బుద్ధి తీక్షణతను పెంపొందించుటకు విద్య చాల వఱకు సాయపడుచుండును. ఈ విధానము ఆబాలికకు పై తంతుజరిగిన తరువాత స్వగ్రామముననే బజారునందైన సంతయందైన నొకయంగడిపై నొకసంవత్సరకాలము అధికారము వహింప నియమించుటచే పూర్తియగును.

దీనియందు గడించిన యనుభవము సహజస్వభావమగు కార్యనిర్వహణశక్తి నభివృద్ధి నొందించుటయేగాక బౌద్ధమఠముల యందు వ్రాయుటకును చదువుటకును మాత్రము నేర్చుకొను తన సోదరులకంటె బర్మాబాలికకు మనుష్యస్వభావ పరిశీలనానుభవ మెక్కువ గల్గించును. బాల్యకాలమున సంపాదించిన యీ ప్రయోజనము జీవితమునందంతటా నామె నుపకరించును. గావున నామె సాధారణముగా గృహమును పరిపాలించుచుండును. వ్యవసాయములన్నిటి యందామె సలహా చెప్పుచు పాల్గొనుచుండును.

గృహముపై తాను 'స్వాతంత్ర్యము' అధికారమును గురించి యాధునిక స్త్రీ చెప్పునట్లు గర్వపడదు; తాను సేవకురాలనని మాత్రమే తలంచును; ఆమె సమ్మతించినను, సమ్మతింపకున్నను చెప్పుట సరిగా నామె శక్తి సామర్థ్యము కొలది చేయవలెను సంఘమామెకు విధించిన నియమములను యామె పాటించుచుండును. ఆమె కష్టకాలమున కావలసినవి బాధ్యతగూడ స్వీకరించుచుండును.

ఆమె యింటి ఆదాయ వ్యయములను చక్కగ గుర్తెఱిఁగి సరిగానే ఖర్చుచేయ వలసియుండును. తన భర్తయు పిల్లలు తృప్తిపొందు మార్గమును, వారు సౌఖ్యమనుభవించు రీతియు, ఆమె చూడవలసి యుండును. ఎచటనైనను నష్టము గను పించెనా బాగుపరుచుటకై ఆమె యత్నించుచుండి యామె తప్పించుకొనరాదు.

కావున ఇంటి స్వాతంత్ర్యమును, అధికారము ననుభవించుచుండియు బర్మాగృహిణి, 'విధి'దినమున— మానవజన్మ ఏదైనను— మరుజన్మమున తాను పురుషుడై పుట్ట ప్రార్థించు టాశ్చర్యముగొల్పును.

మన పొరుగువారైయుండి మన దేశమున నొక భాగముగ పరిగణింపబడుచుండు బర్మా సోదరీమణులనుండి మన సోదరీమణులెన్ని విషయములు నేర్చుకొనవలసియున్నవో యెఱుంగుదురుగాక.

# పుష్పచయము

## స్త్రీలు పురుషులకంటె మిన్నలా?

జంతు దేశ ధర్మశాస్త్రజ్ఞులును, మానసికశాస్త్రజ్ఞులును స్త్రీలు సున్నితహృదయులు, శీఘ్రకోపులను కవుల అభిప్రాయములతో నేకీభవింతురు. పురుషులకంటె స్త్రీలు త్వరగా నేడ్వగలరు. చాలమంది పురుషులకు ఏడ్పొక కష్టముగాని స్త్రీలలో పెక్కుమంది మంచియేడ్పునే శ్రమనివారణగా నెంతురు. కాని వారెంతటి దుఃఖములనైన అద్భుతముగ భరింపగల సహనమును నేర్చుకొనియున్నారు. వారు శరీరబాధలను చాలయోర్మితో భరింతురు. చాలమంది బాధలను భరించుటలో పురుషులకంటె స్త్రీలే మిన్నలనిగూడ జెప్పుదురు. వైద్యులు దీని నొప్పుకొనరు. కాని, అలసటచే దుఃఖించు స్త్రీ ధైర్యముతో దంతవైద్యుని యొద్దకు బోగలదు.

అలసటజెందియుండు స్త్రీ చురచురలాడుచు సంతోషపెట్టుటకు సాధ్యురాలు గాకుండును. పురుషులు స్త్రీలకంటె త్వరగా వలసిపోవుటయేగాక, పూర్తిగా వలసిన యథాస్థితికి వచ్చుటకు చాలకాలము పట్టును. స్త్రీలట్లుగాదు. స్త్రీలకు నిరోధశక్తియే జీవము. దీనివలన నామె పెక్కురోగములను రాకుండ నిరోధించుచు, త్వరగా తేరుకొనుచుండును. స్త్రీ లెంతత్వరగా నలసిపోవుదురో, అంతత్వరగా తేరుకొని పూర్వస్థితిని బొందుట యాశ్చర్యకరమగు సంగతి.

పురుషులకన్నను స్త్రీ సుకుమారముగా గన్పించుటకు చాల కారణములున్నవి. వారి శరీరనిర్మాణమే సుకుమారముగా విచిత్రముగానుండును. చిరుగాలికిగూడ చెడిపోవునను సందియముదోచు సున్నితముగా మేళవించిన వీణతో స్త్రీ సమానయని జెప్పవచ్చును. పురుషుని జీవితమున్ననో అడ్డములేని మైదానమువంటిది. స్త్రీ జీవితమంతయు మిట్టపల్లములే! ఆమె ఉన్నతోన్నత శిఖరముమీద నున్నపుడు, శారీరకముగా, మానసికముగా నెట్టి యాయాసములేనినాడు సాక్షాత్తు దేవతయే. ఆస్థానమునుండి క్రమక్రమముగా భూమికి దిగుచున్న కొలదీ ఆటంకపెట్టుట కశక్యురాలై, దుర్బలయై, కోపితయై, తానెక్కువగా ప్రేమించువారితోడనే కయ్యమునకు దిగుచుండును.

చక్కగా స్త్రీల నిర్మాణమాది వివిధవిషయముల గ్రహించినవారికి దప్ప స్త్రీస్వభావ మెఱుంగుట రాజకీయవేత్తలకు, మతాచార్యులకు, సంఘసంస్కర్తలకు దుస్సాధ్యము. సాధారణముగా స్త్రీల ప్రేమించువానికి వారి స్వభావము కొంత దెలిసియుండవచ్చును గాని, పదిలో తొమ్మండుగురు తమవలెనే ఊహింపవలెనని, భావింపవలెనని ప్రవర్తింపవలయునని ఆశింతురు. దీనికంటె యితర అద్భుతములు జరుగవలయునని గోరుటగూడ సులభమే. కాని స్త్రీ లాపాదమస్తకముగూడ స్త్రీలే! వారు శరీరప్రకృతిలో, పనిలో, పాటలో, ఊహాలో, ఉద్రేకములలో, ఆలోచనలలో, ఆదర్శములలో పురుషులతో నేకీభవింపరు. కొన్ని విషయములలో స్త్రీ ప్రకృతికివశయైయున్నను, ఇతరులందు పురుషునికంటె మిన్నయే!

ప్రకృతివలన స్త్రీలకు గలుగు మార్పులు మాత్రమేగాక, మరికొన్ని కృత్రిమశక్తులుగూడ నామెకు తోడ్పడుచున్నవి. స్త్రీలలో చాలమంది యింటిపనులలో నిమగ్నులైయుందురు. వాని ఫలిత మెట్టిదో చాలమంది పురుషులకు దెలియదు. ఇల్లు చక్కజేసికొనుట, పిల్లలను కనిపెంచుట, వంటచేయుట, అసంఖ్యాకములైన యితర విధులను నిర్వర్తించుట చాల సులభమని యనుకొందురుగాని, ఇయ్యవి చాల కష్టమైనవేగాక వీని నిర్వహింప ఆలోచన, శక్తి, ఓర్పు మిక్కుటముగా గావలసియుండును. వంటజేయుటే యొక కళ; అదియు సామాన్యముగాదు. లక్షల కొలది స్త్రీలకు దారిద్ర్యముచే గృహకృత్యములు సంకటములుగా జేయబడినవి.

ఇక స్త్రీపురుషుల వేరువేరుగా దీసుకొన్న పురుషులు వివిధములై వినోదములైన పనులను సమయానుసారము జేయుచుందురు. స్త్రీలకు, ముఖ్యముగ పనులందు నిమగ్నలగువారికి, వినోదములుండవు గాని విసుగు బుట్టును. వారారోగ్యముగనుండవలసిన వారికికూడ కొన్ని వినోదము లుండకతప్పదు.

స్త్రీలకు పురుషులకంటె కోప మెక్కువయని అనుటకష్టము గాని, వారి నందులకు నిందింపకూడదు, కనికరింపవలసినదే! ప్రకృతి స్త్రీలకు కొంత యశస్సుతోపాటు శిక్షగూడ విధించినది. ఆమె దేనికిగాని త్వరగా లోబడునని పురుషుడు నేరారోపణముచేయుట నిరుపయోగము. ఏలన, యీ గుణమే ఆమెకు సౌందర్యము, బలము, నైతికభావము గలిగించును. కొన్నివేళలం దామె కోపము చూపినను, సౌఖ్యము, ప్రేమ, సానుభూతి యిచ్చుటయం దామె యందెవేసినచేయి. (వాల్టర్ ఎమ్. గాలికర్)

విచిత్రవివాహములు: అబిసీనియనుల వింతవాడుకలు: వీనినిగూర్చి మాడర్క్లైమ్సు యిట్లు వ్రాయుచున్నది:—

వివాహము ఎతియోపియాయందు సాధారణవిషయము. నీ యిష్టమువచ్చినపుడు వివాహమాడి బుద్ధి పుట్టినపుడు విడువవచ్చును. ఎట్టి ఆటంకములుండవు. విడాకులు బుచ్చుకొనుటకు వ్యభిచార మనవసరము; ఎంతమాత్రము కష్టములేకనే దానిని పొందవచ్చును.

మనుష్యుని అవగుణములన్నియు గమనించియే ఎతియోపియను వివాహనిబంధనలు గావింపబడినవి. వా రన్ని వివాహములు సమ్మతింతురు. ఇష్టము వచ్చినపుడు విడిపోవుట కంగీకరించు సివిలు వివాహము గలదు. పరిశోధకవివాహములు మొదలగు పెక్కువిధములగు పెండ్లిండ్లు గలవు. ఒక స్త్రీ యితరుల బెండ్లాడకనే వారితో కొంతకాలము నివసించి నిబంధనలేకనే సంతానము బడయవచ్చును.

కాని ముఖ్యమైన వివాహములు నాల్గుమాత్రమే. మొదటిది చర్చిలందు జరుగు వివాహము. పురోహితుల సకల విధులతో నిర్వహింపబడును. వీరికి విడాకులహక్కు లేదు. సుఖమో దుఃఖమో వారితో తమ జీవితమంతయు గడుపవలసినదే. సతీపతులలో నెవరు మరణించినను మరల వివాహమాడరాదు. దీనిని కొంతమందియే ఆచరింతురు. రెండవది చట్టబద్ధమైన వివాహము (Civil Marriage) ఒకవిందులో వివాహనిశ్చయము ప్రకటింపబడును. నాటినుండి వరుడు వధువును కాపాడువారి నొకరిని పూచిగా చూపవలెను. మాట తప్పినయెడల వరుడు వధువు స్థితి బాగుపడువరకు లేక ఆమెకు గల్గిన నష్టము దీరువఱకు దినమున కొక డాలరు చొప్పున యిచ్చుచుండవలెను. సతీపతుల ఆస్తి కిరువురు అధికారులైయుండి, విడాకులు పుచ్చు

కొన్ని సమానముగా భాగించుకొందురు. విడాకుల సమయమున సంతతియున్న పెద్దవారిని తండ్రి దీసికొనును, చిన్నవారిని తల్లి శ్రద్ధవహింపవలసియుండును.

మూడవది కొన్ని నియమములపై కొంతకాలమునకు మాత్రము. ఈవిషయమున వరుఁడే వధువును గాపాడుటకును, తాను తప్పుత్రోవల బోకుండుటకును పూచీగా యితరుల జూపింపవలెను. ఇట్టి వివాహములందు సతీపతులు తమ యిష్టమువచ్చినపుడు విడిపోవచ్చును. నాలవది సంతానముకొఱకై నియమింపబడిన వివాహము. ఎవరైన వివాహమునం దిచ్ఛలేక సంతానముమాత్రము కోరుచో, వా రిరువురు గలసికొందురు; సంతానముతో వారి సంబంధము రద్దగును. వరుఁడు వివాహసమయమున వధువునకు పెక్కు బహుమతులిచ్చును. వానిలో సర్వసాధారణమైనది కొంతభూమి. దానిలో మాసమునకు మంగలివాని ఖర్చుకు సరిపోవు ఆదాయము వచ్చును. ఎతియోపియనులు వెండ్రుకలయందు అతి శ్రద్ధవహింతురు. వా రాహారము లేకుండనైనను దురు గాని మాసమాసము క్రాపు చేయించుకొనకుండనుండజాలరు.

## ఆడుతోబుట్టువులులేని మగవాళ్లు

నా మిత్రులగు పురుషులు చాలమంది వివాహజీవితమున సంతృప్తి బొందకయుండుటకు కారణములు దెలియవలెనని గావించిన యన్వేషణచే అసంతృప్తిపరులగు పురుషులందరు ఆడుతోబుట్టువులు లేనివారే యని గనుకొంటిని.

స్త్రీ సంతానములేని యింటియందుండు బాలుఁడు మనస్సున సర్వవిషయములు చక్కగ నాటుకొను చిన్నవయస్సున స్త్రీలనుగూర్చిన యథార్థజ్ఞానమును స్వానుభవముచే నెఱుంగకపోవును. అతఁడు పెద్దవాఁడైన పిదప స్త్రీ లతని కాకర్షణీయులే గాని, వారిని ప్రేమింప నారంభించినపుడు వారి స్వభావములను దెలియక చాల తంటాలుపడును.

మనకంటె పెద్దదైన సోదరియుండునేని, మన వివాహజీవితమున ఆనందదుఃఖముల కామెయే కారకురాలై యుండును.

చిన్నవయస్సున నిరంతరము తన సోదరిసహవాసమున బాలుఁడు స్త్రీపురుషుల స్వభావవిరుద్ధజీవితముల దెలిసికొనును. ఈ స్వభావవైరుద్ధ్యము సోదరీసోదరులకుమధ్య ప్రేమ కడ్డము రానివ్వదు. వివాహితుల మధ్యగూడ యిట్టి విరుద్ధస్వభావములవలననే అసంతృప్తి ప్రబలును.

పెక్కుమంది బాలికలు, తమ తలిదండ్రులు తమ సోదరులకంటె తమ్ము భిన్నముగ నాదరించుట గ్రహింతురు. పెక్కువిషయములు బాలురకు న్యాయమనియు, బాలికలకు గూడదనియు వచింతురుగదా! అందుచే తాను బాలికనని తలంపుగల్గి తనకంటె ఎక్కువ హక్కులుగల బాలునిపై తిరస్కృతభావము యింటియందే బాలికకు వృద్ధియగును.

స్త్రీలై ఎందుకు జన్మించితిమని యావజ్జీవము దుఃఖించు స్త్రీలుగూడ గలరు. ఈచింతయే వారి బాల్యకాలమున చలమునకు చోటిచ్చును.

సోదరిలేని పురుషుడింకొక స్త్రీని ప్రేమించునపుడే యామె స్వభావమును గుర్తింప నారంభించును. ఈ కార్యము నాతఁడు చిత్రవిచిత్రాభిప్రాయములతో ప్రారంభించును.

సోదరులతో కలసి మెలసి యుండనందున యువతులు ప్రకటించు మంచి నడవడికయే నిజమనియు స్థిరమనియు దలంచుచున్నారు. కాని, స్త్రీలెంత తాలిమిలేనివారో, ఎంత ముంగోపులో, ఎంత విచిత్రమైనవారో, ఎంత నిగూఢమైనవారో, అంతటి మృదువుగా, సానుభూతితో తాల్మితో, స్వార్థపరత్వముతో వర్తింపగలరని యువనికి దెలియదు.

తనసోదరి నెక్కువగా ప్రేమించు సోదరుడు, తన సోదరివంటి గుణములుగల స్త్రీనే సహజముగా కోరవచ్చును. కాని వివాహవిషయములందు సోదరినిబట్టి సతిని కోరుకొనుటయందు శ్రద్ధవహింపవలసియుండును.
(జాన్యుయరి మార్టిమర్. టైమ్స్ ఆఫ్ ఇండియా)

## తులసిన జూచిన దోమలు దగ్గఱజేరవు

హిందూ గృహమున తులసి యుండుటాచారమైనను యిటీవల దానిని కొంతమంది మూఢాచారమనుట వాడుకైనది. తులసివలన ఎంత ఉపయోగమో డాక్టరు టి.సి. బానుచౌదరిగారు మెడికల్ డైజెస్టునందు వ్రాసిన విషయములవలన గ్రహింపవచ్చును.

వేరునుండి ఆకులవఱకు తులసి మొక్క చాల ఉపయోగపడును. ఇది దోమలను దగ్గఱజేరనీయకుండుటకత్యంతోపకారి. తులసిని రసముదీసి శరీరమునకు బూసికొన్న దోమలుదగ్గఱజేరవు. దీనికి నిదర్శనముగ జార్జి బర్డువుడ్ యిట్లు వ్రాయుచున్నారు. "బొంబాయినగరమున అల్బర్టువస్తు ప్రదర్శనశాలయు, విక్టోరియా గార్డన్స్ నిర్మాణసమయమున, అచట పనిజేయుచున్న వారందరు దోమలచే చాల బాధపడుచుండిరి. దాని మూలమున మలేరియా వ్యాపించెను. ఒక హిందువు సలహాపై ఆ ఉద్యానవనము చుట్టుతులసి మొక్కలు నాటబడియెను. ఆనాటినుండి జ్వరము తగ్గెను; దోమలు మాయమయ్యెను. అంతకుముందాస్థలము బొంబాయి నగరమునందెల్ల మలేరియా జ్వరమునకునికిపట్టయి యుండియుండెను. తులసి ఆయుర్వేదమునందు మలేరియా జ్వరమునకు ఔషధముగా సూచింపబడినది. దానిని 'ఇంపీరియల్ మలేరియల్ కాన్ఫరెన్స్' సరియైనదని ఒప్పుకొన్నది.

తులసిమొక్క నింకను పెక్కురోగముల కుపయోగింపవచ్చును. నిమ్మరసముతో నూరిన తులసి ఆకులను తామర, గజ్జి మొదలగు చర్మవ్యాధుల కుపయోగించిన మంచిఫలితము నిచ్చును. ఇది చర్మమును మృదువుజేసి, ముఖమందలి నల్లనిమచ్చలను పోగొట్టి సౌందర్యము నభివృద్ధిజేయును. చెవి నొప్పికి తులసి యాకురసము ఉత్తమమైన ఔషధము. ఇది పాము కాటునకు తేలు కాటునకుగూడ ఉపయోగింతురు. పాము కరచిన వెంటనే కొన్ని తులసియాకులను దినవలయును. వెన్నతో గలిపిన పిండి కరచినచోటబెట్టి రంగుమారిన వెంటనే మార్చుచుండిన విషమంతయు బైటికివచ్చును.

## భారతీయ యువకులు తప్పక పెళ్లాడాలి

కొలదికాలము క్రింద తమ తండ్రిని వివాహపు వ్యయమునుండి రక్షించుటకై నలువురుపుత్రికలాత్మహత్యకు పూనుకొన్న విషయమై చర్చించుచు అమృతబజారు పత్రికిట్లు వ్రాయుచున్నది.

వివాహోచితలైన నలువురుకన్యలు ఆత్మహత్యకుబూని ముగ్గురు మరణించుట, మరియొకరు చాల అపాయకరమగు స్థితియందుండుట ప్రజలు ముఖ్యముగ గమనింపదగిన విషయము. ప్రకృతము దేశము రాజకీయ



కీ. శే. సత్తి పద్మావతిగారు

సంగీతమునందును, ఆంధ్రసాహిత్యమునను మంచి పాండిత్యము,
నిరంతర పత్రికాపఠనమునం దాసక్తిగల్గిన యిల్లాలు.



బొంబాయి చిత్రకళా సంఘప్రదర్శనమునందు శ్రీయుత [illegible] గారి

“ఎఱుకల నీటుకత్తె” అనుచిత్రము.

విషయములతో నిండియుండుటచే సాంఘికవిషయములయెడ గావలసిన శ్రద్ధవహించుటలేదు. పైసమాచారము మనసంఘమెంత హీనస్థితియందున్నదియు, దానిని చక్కజేయుటకు మనమెంత శీఘ్రముగ బూనుకొనవలసినదియు వ్యక్తపఱచుచున్నది.

ఈమున్నితహృదయులైన కన్యలు, తమ తలిదండ్రులు బీదవారైనందున తగినవరులను గన్గొనజాలక పోవుటచే, యెదిగిన కన్యలకు వివాహముజేయక యింటనుంచుకొనువారికి సంఘమువల్ల తప్పక గల్గు అవమానము బాధ గల్గింప నిష్టములేక తమ జీవితముల త్యజించిరి. వరశుల్కమే యిందులకు కారణమని తలంచుటలో చాలవఱకు సత్యమున్నది. గాని వేరుకారణములుగూడ గలవు. ఈవరశుల్కము లిదివఱకు లేని వారి మధ్యగూడ క్రమముగ వ్యాపించుచున్నది. అంతశ్శాఖ వివాహములు లేకుండుటయు, సంఘమునందలి బాలికలందరు బాలుర అభివృద్ధితో సమానులుగ నుండకపోవుటయు దీని యావశ్యకతను పెంచుచున్నది.

యువకులమధ్య వివాహమాడుటకు యిచ్ఛలేకుండుట నానాటికి పెరుగుచున్నది. దీనికిఆర్థికస్థితి, సుఖజీవనమునం దిచ్ఛ కారణములగుచున్నవి. బ్యాంకిలో పైకము, కారు, మొదలగునవి తప్పని సరిగా జీవింపగోరువారు తమస్వల్ప సంపాదనతో భార్యాబిడ్డల గూడి జీవితముగడప నిష్టపడుదురా? యువకులందరు బ్రహ్మచారులైనచో, వివాహముల కెదిగిన కన్యలగతేమి! దురదృష్టవతులగు కన్యల ఆత్మత్యాగమును గూర్చి యించుక శ్రద్ధతో యోచించినచో యివ్విషయముయొక్క ప్రాముఖ్యతయు, యీ సమస్యాపరిష్కార సాధనమును బైలుపడకపోవు.

## ముసోలిని—అపుడు—ఇపుడు

ఇటలీప్రభుత్వ సైన్యములు ట్రిపోలిమీద 1911–వ సంవత్సరము దండెత్తినవి. 1935 సందు ముసోలిని ఎతియోపియాపై దండెత్తు టెంతన్యాయమో అదిగూడ అంతియ. ఆయుద్ధమును పెక్కుమంది ఇటలీప్రముఖులు ప్రతిఘటించిరి. ఆకాలమున ఇటలీకార్మికుల కుపన్యసించిన మాటలను The New Republic మరల నిట్లు ప్రకటించుచున్నది.

"మానినులారా! మాతలారా! ఇది మీవిధి. రైలుకడ్డముగపడుకొని మీపుత్రులను ప్రభుత్వాశయ బలిపీఠములకు పోనివ్వకుండ అడ్డగింపుడు."

"మనదేశమున గావలసినంత దురవస్థలేదా! బానిసత్వములేదా! విద్యావిహీనులు మన దేశమున జాలకున్నారా? గృహములందును బజారులందును తిండికిలేక మలమల మాడువారు మనమధ్య తక్కువా? ఇట్టిచో మనమె ట్రిపోలీతరులకు నాగరికత నేర్పగలము? ధనికవాదప్రభుత్వము మిమ్ముల గమనించుటలేదని యెఱుంగరా?"

"మనలో వేలకొలది కార్మికులను మనల అలవరతము పీల్చిపిప్పిచేసి యధికారము చేయుచున్న ప్రభుత్వముకొఱకై బలిచేయవలయునని తలంచుచున్నారు. ఇది వారి దేశభక్తి."

ఈమాటలు సంఘోపకారియగు బెనిటో జారెజ్ ముసోలిని యనువారు జెప్పినవే! దీనిని అతని మిత్రుడొకడు వ్రాసియుంచి యిటీవల చికాగోనందలి 'Peoples' Press నందు ప్రకటించెను. 1911 వ

సంవత్సరమున జెప్పియున్న మాటలను మఱచియున్న ముసోలినిగారిని దీనిని మరియొకమారు జూడగోరుచున్నాము అని మాంచెస్టర్ రెవ్యూ పత్రిక వ్రాయుచున్నది. ఇపుడు ముసోలినీగారు అబిసీనియాపై యుద్ధము జేయుటీసూత్రములపైననా అని సందియము.

## పద్యకవిత్వమున రోగములను కుదుర్చు శక్తిగలదు:—

పద్యకవిత్వములో రోగములను కుదుర్చునట్టిశక్తి చాలవిశేషముగ నున్నదను విషయ మనాదికాలము నుండియు, ప్రజలకు బాగుగా దెలిసియేయున్నది. ఆ కవిత్వమును చదువుటవలన మిక్కుటముగ కిష్టపడుచుండువారికిగూడ ఆనందముగలుగును. ఆపదలో నున్నవారియందుగూడ అద్భుతమైనమార్పు గలుగును. ఆకాశమార్గమున నెగురుచు భరతపక్షి పాడుపాటవలన దోషములుగూడ అణగిపోవురీతి ప్రాచీనకవులు వ్రాసిన పద్యములను చదివిన ప్రజలకష్టము లణగిపోవును.

విటుమెను, గొయిత, టెనిసన్ విక్టరుహ్యూగో, ఠాకూర్ గారువంటి మహాకవులు వ్రాసిన గ్రంథముల యందలి కవిత ఆనందపారవశ్యతను గల్గించి యన్నిబాధలను పోగొట్టగలదు. చాల నిరుత్సాహముగా, దుఃఖముగానున్నపుడును, ఆరోగ్యముగలుగుచున్న సమయమునను, యిటువంటికవిత్వము మహోపకారముజేయును. అపుడు గల్గు ఆనందమును వర్ణించుటకువీలులేదు. జీవితమును పొగడుచు, వ్రాసిన కవిత్వము పాటయైనను పద్యమైనను, గద్యమైనను, లేక శిలావిగ్రహమైనను, నృత్యమైనను, దానివలన అద్భుతశక్తిగలుగును.

ప్రాచీనకవులు వ్రాసిన ఆనందపూరితమైన కవిత్వమును చదువుటవలనను, చూచుటవలనను, వినుట వలనను శరీరమానసికవ్యాధులన్నియు మాయమగును. జీవశక్తులకు గల నిరోధములన్నియు, తొలగును. అపుడు శరీరమానసికారోగ్యము గలుగును. (కలకత్తా మునిసిపల్ గెజెట్.)

## పెళ్లిజరిగిన మూన్నాళ్లకే కుక్కకొఱకై విడాకులు

వివాహము జరిగిన మూడవరోజున యిరువురు దంపతు లొక కుక్కకొరకై విడాకులు పుచ్చుకొనిరి. ఈ వ్యవహారము వార్సానగర సమీపమున కోర్టునకు వచ్చినపుడు వధువగు మేరియా న్యాయాధిపతితో జెప్పిన సంగతులబట్టి దెలిసినది.

ఏడ్చుచు ఆమె యిట్లు జెప్పెను; "నేను నా నాథుని ప్రేమించితిని. ఇపుడును ప్రేమించుచునే యున్నాను. నేను మా నూతనగృహమునకు వెళ్లినపు డచట ఒక పెద్దనల్లకుక్క ఉండెను. నేను కుక్కలన్న యిష్టపడను. అందులో ఆకుక్క భయంకరమైనది. నాభర్త నాయం దీర్ష్యాళువై తా నింటలేనపు డితరుల నింటికి రానివ్వకుండుటకు కుక్కను తరిబియతు చేసియుండెను. నా భర్తనుండి విడాకులు పుచ్చుకొనవలయునని నా కిష్టములేదు గాని ఆ కుక్కతో జీవించుట నాకు గష్టముగనున్నది. దానిని వదలుటకు నాభర్త యిష్టపడుటలేదు."

అంతట న్యాయాధిపతి భర్తవైపు దిరిగి, "నీ భార్యయెడ నీవట్లు వర్తింపజాలవు. కుక్కను వదలుకొనుము" అని మందలింప, భర్త "నేను ప్రకృత మున్నట్లేయుందును. ఆమె కిష్టమున్న నుండనిండు, లేకున్న పోనిం"డనెను. అంతట న్యాయాధిపతి ఆమెకు విడాకులుపొందుట కనుజ్ఞనిచ్చెను. పరమపవిత్రమై ప్రేమపూరితయగు యర్ధాంగి పాశ్చాత్త్యులకనులందు చతుష్పాదజంతువునకు సమానముగాదు గాబోలు.

# పుష్పచయము

## మార్గరేట్ సాంగరు సతి—భారతనారీమణుల సౌందర్యము

"ప్రపంచమునగల జాతులన్నిటియందును భారతనారీమణు లత్యంతసుందరులు. వారి స్థితిగతు లెట్టివైనను ముఖములందుమాత్ర మొకవిధమగు మనోహారత్వము, అందము ఉండితీరును. పూరిగుడిసెలందు నివసించు బీదవారియందు సైతము అసమానమగు సౌందర్యమును గనుగొంటిని."

భారతీయవనితల కిట్టి గొప్పపొగడ్తను ప్రసాదించినవారు మార్గరేట్ సాంగర్ సతిగారు. బొంబాయినందు తన భారతదేశపర్యటనమునుగూర్చి ప్రశ్నించుచు తనతో మాట్లాడిన నొకపత్రికావిలేఖరితో నీవిధమున జెప్పిరి. సంతాననిరోధన సాధనముల నుపయోగింపకనే, వాని విషయము కొంచముగూడ నెఱుంగకనే స్త్రీలు సౌందర్యవతులుగా, సొగసుకత్తెలుగా, మనోహరముగా నుండగలరని తెలిసికొనుటకు చాల తృప్తికరముగనున్నదని మాడరన్ రెవ్యూ వ్రాయుచున్నది.

## ఎతియోపియాలో తక్లీయే సౌభాగ్యమునకు మూలము

అడిస్ అబాబా (ఎతియోపియా ముఖ్యపట్టణము) యందే గృహమునకైన వెళ్లుము. ప్రతియింట రాట్నము జూడగలవు ఇంతవరకును ఎతియోపియా తనకు గావలసిన వస్త్రములు నన్నిటిని తయారుజేసికొనుచుండెడిది. ప్రతివారు ఖద్దరుధరించెడివారు. జపానునుండి తక్కువధర గుడ్డలు దిగుమతియగుటకు ప్రారంభించిన నాటినుంటి నేత పరిశ్రమ నశించినది. కాని వారికి నేటికిని 'చెమ్మా' యనబడు తన దేశమున నేయబడు అంగవస్త్రముపై మక్కువ మిక్కుటము. దీనికి గావలసిన దారమునంతయు తక్లీలపై స్త్రీలు తయారుచేయుదురు. (అడ్వాన్సు)

## మానవుల ప్రార్థనల దేవతలు విందురా?:—

అమెరికాయం దొక శ్వేతజాతీయు డొక యెఱ్ఱయిండియను రాచపుత్రికను వివాహమాడి, వారివంశపరంపరగా వచ్చుచున్న యొక రహస్యసమాచారమును సంగ్రహించెను. దానివలన నాతఁడు గొప్ప బొగ్గుగనులను కనుగొనెను. తరువాత ఆ రాచకన్యను నిర్దయుఁడై విడనాడెను.

కొలది కాలములోననే బొగ్గుగనుల పరిశ్రమ అభివృద్ధిజెందెను. అచట నుండుండిన యెఱ్ఱయిండియనుల కుగ్రామము భాగ్యవంతమగు నొక పెద్దపట్టణమయ్యెను. దానినుండి బొగ్గుగొనిపోవుటకు రెండు రైలుమార్గములు వేయబడెను.

విడువబడిన రాజకుమారి మాత, శ్వేతజాతివారి క్రూరత్వమునకు భరింపజాలక, సమీపమునగల నొక పర్వతమున నెక్కి 'మానిటో'ను ప్రార్థించి ఆ గనులప్రాంతములనుండు శ్వేతజాతినంతయు నిర్మూలింపగోరెను. అప్పటినుండియే అచట కష్టము లారంభమయ్యెను.

1902 వ సంవత్సరమున గనులందు గొప్ప ప్రేలుడుగల్గి, 140 మంది చనిపోయిరి. 1908 సంవత్సరమున గొప్పఅగ్ని ఆ పట్టణమును గాల్చివేసెను. మూడుసంవత్సరములకు తరువాత పనివారు సమ్మెకట్టుటచే పరిశ్రమ నాపవలసివచ్చెను.

1918 సం|| ఇన్‌ఫ్లుయంజాజ్వర మాప్రాంతమున మృత్యుదేవతయై విజృంభించెను. పిదప నైదువత్సరములకు కెనడాబ్యాంకు దివాలా దీయుటచే గనులపనివా రందు వేసిన తమధనమును బోగొట్టుకొనిరి. ఎప్పుడును తగగదని యనుకొన్న బొగ్గుగను లిపుడు ముగియవచ్చినవని శాస్త్రజ్ఞులు గనుగొన్నారు. కాన నిపు డింకొకమార్గము గన్గొన్నగాని ఆ కంపెని నడచునటులలేదు. ఆ గనులందు ఆ పట్టణమునగలవారిలో నూటికి 85 మంది పని జేయుచున్నారు.

బ్రిటిషు కొలంబియాయందు ఫెర్నియాయం దీ గనిగలదు. మానవుల దుర్నయముల వారింప దేవతలు తోడ్పడుదురా? కుమరిత ఘోరదుఃఖమును జూడజాలని మాతృహృదయాగ్ని ఫలిత మింతజేయునా? అను సందేహములు మాత్రము మనకు గల్గుచునేయుండును.

# ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు

## స్త్రీల సత్యాగ్రహ చరిత్ర

సాధ్వీమతల్లులు, వీరనారీశిరోమణుల దివ్యచరిత్రలు వేద, పురాణేతిహాసచరిత్రములలోనే గాక ప్రత్యేకముగకూడ, పలువిధముల కీర్తింపబడుచు, భారతదివ్య తారాపథంలో, "ధృవ", తారవలె ప్రకాశిస్తున్నవి. దేశాలయొక్కగాని, సంఘాలయొక్కగాని చరిత్రలు ప్రత్యేకము ప్రతిష్ఠింపబడడంలో ఒకవిధమైన ఆకర్షణ, ఉత్తేజము, ప్రోత్సాహము నున్నదనుట నిస్సంశయము. అది ఆ యా దేశ, సంఘ, వ్యక్తుల ఉన్నతాదర్శ సేవాత్యాగముల ననుసరించే యుంటుందనుకొనండి. ఆ ఉద్దేశ్యంతోనే మహామహుల దివ్యచరిత్రలు ప్రత్యేకముగకూడా నిర్మింపబడినవి. పల్నాడు, బొబ్బిలి వీరగాథలు, పలువిధాల కీర్తింపబడుచున్నా, ఆ మాంచాల, మల్లమాదేవుల ధీరకథనములు ప్రత్యేకంగా ప్రదర్శింపబడడంలో, గర్భభూతమైన యొక యమోఘదివ్యశక్తి ప్రజ్వరిల్లుతున్నది. ఈ ఉత్తమాదర్శముతో స్త్రీల, కాంగ్రెసు సత్యాగ్రహచరిత్రలను ప్రత్యేకముగా రచించడం, దేశాభిమానానికి, శ్రేయానికి, మిక్కిలి ప్రోత్సాహకరమని, భావిక ర్తవ్యసాధనాని కత్యంత సహాయకారియని భావించి చరిత్రవ్రాయ సమకట్టినాము. రాష్ట్ర, జిల్లావారిగా రచింపబడు కాంగ్రెసుచరిత్రలో, స్త్రీలచరిత్రలు వివరింపబడినా, అది బహుళమైనచరిత్రను సేకరింపవలసినదవడంచేత, స్త్రీలచరిత్ర, సమగ్రంగా ప్రతిష్ఠించడానికి అవకాశంచాలదు. వివిధ దేశాలవారు ఆయానాటి స్త్రీఉద్యమాన్ని, చరిత్రలను ప్రకటిస్తూనే యున్నారు. రామాయణంలో ఆనాటి భారతధర్మస్వరూపము ప్రదర్శితమైనట్లే, సీతాదేవిలో భారతాదర్శ స్త్రీస్వరూపము మూర్తీభవించి యుంటున్నది. కీర్తిశేషురాలైన శ్రీ భండారు అచ్చమాంబగారు ఈ మహోద్దేశ్యంతోనే, "అబలా సచ్చరిత్రరత్నమాలను" రచించి, చారిత్రకస్త్రీలను శాశ్వితంగా దృక్పథంలో నిల్పినారు. స్వాతంత్ర్యకాంక్ష, ఆత్మోత్తేజనముల కంకురంవైచిన ఆసాధ్వీమణి ఆశయాలు సార్థకములగుచున్నవి. కాన దేశస్వాతంత్ర్యంకోసం మహోన్నత సేవాత్యాగములొనర్చిన ఆంధ్రస్త్రీల సత్యాగ్రహచరిత్ర సమగ్రంగా రచింపడం అత్యావసరమని పూనుకొన్నాము. కేవలము సత్యాగ్రహచరిత్రయే గాదు. ఎవరికి నేమీ ప్రబోధములేనిరోజుల్లో 1920 సం॥నుండి, నడుములుగట్టి, కార్యరంగానికుఱికి అత్యంత సేవాత్యాగము లొనర్చిన స్త్రీల ఆనాటి కాంగ్రెసుచరిత్రమునుండి ఉదాహృతం. అదియే దీనికి పునాది. గాన ఈ 15 సం॥ల చరిత్రము రచింపబడును. జైళ్ళకు వెళ్ళినవారేగాక పికెటింగు, స్వదేశిప్రచారం మొదలైన అన్నివిధాల కాంగ్రెసు సేవజేసినవారి విషయాలు చేర్చబడతవి ఫోటోలతోసహా. కావున అత్యావసరమైన ఈ సదుద్యమానికి సోదరీమణులందరు సర్వదా చేయూతనిచ్చి తోడ్పడగలందులకు ప్రార్థించుచున్నాము. స్వయంగావ్రాసిన చరిత్రలే పూర్తిగనుండును గాన ఆత్మోత్కర్ష యగునేమో, యని శంకించక రాష్ట్రమునందలి సోదరీమణులంతా, టూకీగా (విషయముమాత్రమే ప్రాధాన్యముగ) తమతమచరిత్రలను, మిత్రులచరిత్రలను వ్రాసి పంపించ ప్రార్థించుచున్నాము. విద్యార్థినులీ విషయములో తమతమ మిత్రులచరిత్రలు, ఛాయాపటములను సేకరించి పంపడానికి శ్రద్ధవహించవలెను. ఆ యా జిల్లాసంఘాలవారుకూడ ఇందుకుతోడ్పడ గోరుతాము. కాంగ్రెసు సత్యాగ్రహచరిత్ర సంపూర్ణముగా నేనాడో తీర్మానించినవి. జిల్లాసంఘాలు, రాష్ట్రసంఘము కొన్నిజిల్లాల వారు ఆదిస్వర్ణోత్సవసమయానికి ప్రచురించ సూచించారు. కాని ఒక్కజిల్లాచరిత్ర సమగ్రంగా నుదాహరింపబడలేదు. అట్లా అస్తవ్యస్తంకాకుండా సంపూర్ణచరిత్ర, శాశ్వితంగా నిర్మింపబడుటకు సర్వవిధాల తోడ్పడ ప్రార్థన. చరిత్రలు, ఉత్తరప్రత్యుత్తరాలు పంపువారు శ్రీ పొణకా కనకమ్మ, ఆచారివీధి, నెల్లూరు, అనిగాని, శ్రీ ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, నర్సాపురం, పశ్చిమగోదావరిజిల్లా అనిగాని వ్రాయగోరెదము. పెద్దలు, సోదరులు, యువకులు, మా యీ ఉద్యమాన్ని ఆశీర్వదించి అభిమానించి ప్రోత్సహించవలెనని ప్రార్థించుచున్నాము.

ఇట్లు

పొణకా కనకమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ

# గ్రంథపరిచయము

**హిందూదేశ చరిత్ర**

మొదటి, రెండవ భాగములు. గ్రంథకర్త నాయని సుబ్బారావు, బి.ఏ.,బి.యిడి., నరసారావుపేట, మునిసిపల్ పాఠశాలయందు చరిత్రోపాధ్యాయులు. వెల రు. 2.

మాధ్యమిక, ఉన్నతపాఠశాలలందు హిందూదేశ చరిత్ర తప్పక నేర్పబడవలయునని విద్యాశాఖవారేకగ్రీవముగా నంగీకరించినను ఆ విషయమున బాలురెక్కువ శ్రద్ధపుచ్చుకొనునట్లు గనబడదు. కారణమేమన హిందూదేశచరిత్రములు బాలుర మనస్సునకు వచ్చినటుల విషయములను పొందుపరచి తేటతెల్లముగ వ్రాయబడకపోవుటచేతనే. ఇక ఈ పుస్తకమన్ననో అట్టి కొఱతను కొంతవరకు తీర్చుటయేగాక, నేటివఱకు చరిత్రయందు పరిశోధింపబడిన విషయములతోగూడ మృదుమధురశైలిలో వ్రాయబడినది. గ్రంథకర్తగారుపాధ్యాయులై చక్కని యనుభవము గడించి బాలురకీ చరిత్ర బోధించు విషయమునగల కష్టముల గుర్తించి యీ పుస్తకమును రచించినారనుటలో సందియములేదు. అంతియగాక విద్యాశాఖవారు 1929 సంవత్సరమునందు ఉన్నతపాఠశాలలం దుపయోగించు చరిత్రవిషయమై ప్రకటించిన స్కీముప్రకారము వ్రాయబడినది. అంత్యమున నేటి ప్రభుత్వవిధానమును బాలురు సులభముగా గ్రహించు రీతి శాసనసభలు, సంస్కరణములాదిగాగల విషయములు చేర్పబడినవి. ఈ పుస్తకమును టెక్స్టు బుక్ కమిటీవా రంగీకరించుటలో ఆశ్చర్యమేమియులేదు. ప్రతులు "ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెని, తెనాలి" కి వ్రాసిన బడయుగలరు.

**హిందూదేశము : క్రైస్తవ ప్రభుత్వనిర్మాణ తత్త్వము**

210 పేజీలు. వెల 8 అణాలు. దీనిని మొదట మేజరు బి. డి. బాసు, ఐ.ఎమ్.ఎస్.వారు ఆంగ్లమున మాడరన్ రెవ్యూయందు వ్యాసరూపమున ప్రకటించిరి. దానిని తరువాత 'Consolidation of the Christian Power in India' అను పేర నొక గ్రంథరూపమున ప్రకటించిరి. దీనిని మహీధర జగన్మోహనరావుగారు తెనుగున అనువదించి విశ్వసాహిత్యమాల రెండవ గ్రంథముగా ప్రకటించిరి. ఇందు బ్రిటిషు ప్రభుత్వమువారు ఆదినుండియు హిందూదేశమును లోబరచుకొనుట కవలంబించిన పద్ధతులును, దేశము నాక్రమించిన తరువాత దానిని సురక్షితముగా పాలించుటకు కావలసిన విధానములను రాజనీతిని, హిందుమహమ్మదీయ మతాచారులపట్ల వారి కెట్టిఅభిప్రాయము లుండినదియు, ఆర్థికవిషయమై దేశమందు యెట్టి శ్రద్ధవహించినదియు, విద్యావిధానముపట్లవారి యాశయములును వివరింపబడినవి. ఆయా సమయములందు తద్విషయములపై బ్రిటిషు ప్రముఖుల అభిప్రాయము లందందు దెలుపబడినవి. అందరికిని అర్థమగునట్లు సరళమగు వ్యావహారికభాషయందు వ్రాయబడినది.

**లియో టాల్స్టాయి**

116 పేజీలు. విశ్వసాహిత్యమాలా మొదటి గ్రంథము. గ్రంథకర్త రామమోహన్ గారు. టాల్స్టాయిని గురించి తెలియనివారు నాగరికప్రపంచమున వేమూలయందుగాని యుండరన అతిశయోక్తిగాదు.

ఈతఁడు రాజభోగము లనుభవించు జమీందారుగ నింటిబిడ్డయయ్యె, లెక్కకు మిక్కుటముగ ధనము నార్జించియు ప్రతిపైసాగూడ జనోపకారణమునకై వినియోగించెను. దాతృత్వమువలననే ఇంతటి మహనీయుడయ్యె నాయన్న, యాతని కవితాప్రతిభ యంత కంటెను మిన్నయైనది. రచనలు ఇతర కవులవంటివే యందమా ప్రత్యక్షరము ప్రజోపయోగమునకై యుద్దేశించినవి. కవియై, కళారాధకుడై, త్యాగియై తన దీర్ఘజీవితమునంతయు ప్రజల బన్నముల వారింప జీవింప యత్నించిన యీ మహనీయుని చరిత్ర యిందు చక్కగా వ్యవహారిక భాషయందు వ్రాయబడినది. ప్రతిభారతీయుడును జదువదగినది.

**పుట్టుమచ్చల శాస్త్రము** 84 పుటలు. నేదునూరి గంగాధరంగారిచే వ్రాయబడి కొండపల్లి వీరవెంకయ్యవారిచే ప్రకటింపబడినది. వెల తెలియదు. ఇందు పెక్కు పుస్తకములనుండి ఇదివరకు ఎచటను ప్రకటింపబడని పుట్టుమచ్చల విషయములేగాక, సుడులలక్షణములు, సాముద్రికము, మొదలగు విషయము లెన్నియో వ్రాయబడినవి. అచటచట శ్లోకములు పద్యములుగూడ జేర్పబడినవి. ఈ శాస్త్రము లందు నమ్మకమున్నవారి కీ పుస్తకము బాగుగా నుపకరించును.

**మేలుకొలుపులు** ఇదియును నేదునూరి గంగాధరంగారిచే వ్రాయబడి గుండు జగన్నాథం సన్స్ వారిచే ప్రకటింపబడినది. వివిధ దేవతల మేలుకొలుపులు, పాటలు పద్యములు గలవు.

**ఉదార పాండవము** 134 పుటలు. వెల 0-12-0 ఉభయభాషాప్రవీణ శ్రీమతి రాపూరు సుబ్బమ్మగారిచే రచింపబడినది. ఇందు భారతమునందలి కథ యంతయు క్లుప్తముగ గలదు. పాండవుల ఉదారము, కౌరవుల దుర్మార్గము బైలుపడు పట్టులందు మాత్రము చాల రమ్యముగ వ్రాయబడినది. ఎంత దుర్మార్గము తమ కొనరించిన ఎట్టి పరిస్థితులందును పాండవులు ధర్మబద్ధులై అపకారికి ఉపకారము చేయుటయు, కృతఘ్నులై కౌరవులు ఉపకారికి నపకారము చేయుటయు చక్కగ ప్రదర్శింపబడినది. శైలి ధారాశుద్ధిగల్గి సరళముగనున్నది. పాఠశాలలందలి బాలబాలికల కత్యంతోపకరముగ నుండునని నమ్ముచున్నాము. ప్రతులు వేపల శ్రీరామచంద్ర కీర్తిగారు, ఖాజపేట రాజమండ్రివారికి వ్రాసిన బడయవచ్చును.

**విజయకుమారి** శ్రీ కర్లపాలెం కృష్ణారావుగారి సంపాదకత్వమున "సాహిత్యలత" 6వ కుసుమముగా వెలువడినది. 80 పేజీలు. వెల చందాదారులకు 8 అణాలు. ఇతరులకు 12 అణాలు. గ్రంథకర్త్రి శ్రీమతి యర్రంరెడ్డి చెంచు క్రిష్ణమ్మగారు. ఇందలి కథ బాగుగనేయున్నది. శైలి సులభము. మున్ముందీ గ్రంథకర్త్రి అభివృద్ధికి రాగలదని విశ్వసింతుము.

**కావ్యమాల** ఇదియు సాహిత్యలతా గ్రంథమాల 7వ కుసుమముగా వెలువడినది. 100 పేజీలు. గ్రంథకర్త కారుమంచి కొండలరావుగారు, బి.ఎ.,బి.యిడి. ఈ కావ్యమాలయందు 'బిక్కని' 'ప్రేమబలి' 'మునిమాపు' అను మూడు పువ్వులు గలవు. ప్రతిపుష్పము తన మనోహరరూపముచేతను, సుగంధముచేతను ప్రతివారిని ఆకర్షించుననుటలో సందియము లేదు. ఉత్సాహపూరితుఁడగు నీకవి తన రచనలందా యాపట్టులగల పాత్రలచే నావేశపూరితుఁడై బల్కించుచుండును. ఇది సరళమై ధారాశుద్ధిగల్గి, ఉత్తమాశయములచే రంజిల్లుచు, చదువుట కాహ్లాదకరముగ నుండును. ఈకవి కల మిట్టి కావ్యకుసుములచే నింకను ఆంధ్రమాత నలంకరించుగాత!

**The Philosophy of the Village Movement**

ఇది యాంగ్లభాషయందు శ్రీయుత జే. సి. కుమారప్ప గారిచే వ్రాయబడినది. జగ మెఱిగిన బ్రాహ్మణుడగుట వీరినిగురించి యెవరికిని తెలియకయుండదు. శ్రీయుత బాబు రాజేంద్రప్రసాద్ గారు "అఖిలభారత గ్రామపారిశ్రామిక సంఘమునకు నిర్మాణకర్తయు, కార్యదర్శియునైయుండుట చేతనే గాక, ఈ గ్రామపునరుద్ధరణ సమస్యను లేవదీసినవారగు మహాత్మాగాంధిగారి తత్వమును చక్కగ నర్థము జేసికొన్నవారగుటచే వీరి గ్రామపునరుద్ధరణ విషయమై వ్రాయుట చాల తగియున్నది" అని ఈ గ్రంథమున ఉపోద్ఘాతమునందు రచించినదానితో అందరు నేకీభవింపకతప్పదు. ఇందు వివిధ సమయములందు గ్రంథకర్తగారిచే ఉపన్యాసము లివ్వబడినట్టియు, పత్రికలందు ప్రకటించినట్టియు వ్యాసములు ఉపన్యాసములు కూర్చబడినవి. ఈ గ్రంథమును జదివినవారు పూర్వము మన గ్రామము లెంత యార్థిక స్వాతంత్ర్యము గల్గియుండినదియు ప్రకృతము వానికి గావలసిన సదుపాయములును జేయవలసిన పద్ధతులును, ప్రజలసహకార ఆవశ్యకతయు చక్కగ బోధపడగలవు. ప్రకృతపు అ. భా. గ్రా. పు. సంఘపు ఆశయములు గూడ చక్కగ వివరింపబడియున్నవి. గ్రామాభివృద్ధిగోరు ప్రతివారును జదువదగినది. వెల 0-8-0. 84 పుటలు. ప్రతులు The Andhra College of Commerce, Rajahmundry వారివద్ద దొరకును.

# పత్రికాపరిచయము

ఆంధ్రప్రజ:—

ఫిబ్రవరి పదియవ తేదియందు ఆంధ్రలోకము రెండవ దినపత్రిక గాంచు భాగ్యము బడయ గల్గినది. ఇదే "ఆంధ్రప్రజ." ఇదివఱకు "తమిళనాడు" అను తమిళపత్రికను వెలువరించుచున్న శ్రీయుత పి. వరదరాజులునాయుడుగారి సంపాదకత్వమున వెలువడుచున్నది. ఆంధ్రపత్రికసైజున, 8 పేజీలలో అన్ని విషయములు ఆకర్షనీయముగా వెలువడినది. సర్వసాధారణముగా ప్రతిదినము ప్రకటించు వివిధములైన వార్తలేగాక 'అధునికుని లేఖలు,' కీ. శే. సకలత్వాలాగారి జీవితము' మొదలగు వ్యాసములు గమనింపదగినవి. ఆంధ్రపత్రిక సహకారముగోరుచు ప్రకటింపబడిన యీపత్రిక అన్నివిధముల దానిబోలియున్నది. దానివలెనే ప్రజాదరణ బడయగలదని నమ్మెదము.

ఈ పత్రికయొక్క యాశయము లివి: "నిష్కళంకమగు జాతీయవాదముకొఱకును రాచకీయస్వాతంత్ర్యము, సాంఘికన్యాయములకొఱకును భారతీయుల అదుపుఆజ్ఞలకు లోబడు పరిపాలనావిధానము నెలకొల్పుటకును, సాంఘికమతభేదములను తొలగించి యెల్లరకు స్వతంత్రసమత్వముల ప్రసాదించుటకును, ఆర్థికస్వాతంత్ర్య సంపాదనకును, కార్మిక, కర్షకుల కష్టముల నివారించుటకును, రైతు పురోభివృద్ధి కాటంకదాయకమగు ఋణముల పరిష్కారమునకును, భూమిపై పన్నుతొలగించి వ్యవసాయఆదాయముపై పన్నువిధించుటకును, ఉరిశిక్ష తీసివేయుటకును, గనులను, రైళ్లను, పెద్దపరిశ్రమలను జాతీయప్రభుత్వాధీనముచేసి అభివృద్ధిపరచుటకును, దేశక్షేమమునకనుకూలమగు కరెన్సీవిధానమును అమలులో ఉంచుటకును "ఆంధ్రప్రజ" నిరంతరకృషిచేయును.

# గృహలక్ష్మి

భారతదేశ భావిభాగ్యోదయము భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణముపై ఆధారపడియుండనీ, రాష్ట్ర విభజన భాషాప్రయుక్తముగ జరుగవలెనని స్పష్టపరచుచు, ఆంధ్రరాష్ట్రమును వెంటనే నెలకొల్పుటకు "ఆంధ్రప్రజ" ఆందోళనము గావించును."

ఆంధ్రప్రజ ప్రతి అరణామాత్రము — ఆంధ్రలోకముచే నిది ఆదరణబొందునని నమ్ముచున్నాము.

రాష్ట్రేతరాంధ్రసంజీవని:—

ఖర్గపురమునుండి శ్రీయుత గుమ్మలూరి లక్ష్మీనృశింహశర్మగారి సంపాదకత్వమున వెలువడు ఈసచిత్ర మాసపత్రిక ప్రధమసంచికను అందుకొనుట కానందించుచున్నాము. గృహలక్ష్మిసైజున 48 పుటలు. వెల 2 అణాలు. సాలుచందా 1 రూ. మాత్రము.

స్వరాష్ట్రమును వీడి జీవనాధారముకొరకు దేశమున వివిధ భాగములందును పరదేశ భాగములందును వసించియున్న ఆంధ్రుల మాతృభాషాభివృద్ధికొరకును, స్వరాష్ట్రమునందుండువారితో నెపుడు సంబంధ బాంధవ్యములు గల్గియుండజేసి యాంధ్రత్వమును క్షీణము గాకుండనుంచుట ఈ పత్రికయొక్క ఆశయము.

భారతదేశమున వివిధభాగములనుండి ఈ పత్రికాస్థాపన నభినందించుచు వచ్చిన ప్రశంసలు ఆశీర్వాదములే యీపత్రికయొక్క అవశ్యకతను జాటుచున్నవి. ఆరంభముననుండు మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి సందేశమెంతయు గమనింపదగినది. వాయువేగుల వేంకటసుబ్బారావుగారి "బొంబాయి రాష్ట్రాంధ్రులు" జదివిన బొంబాయిమండలమున నుండుఆంధ్రులును ఆంధ్రమహాసభ జేయవలసినకార్యములును ద్యోతకమగును. వీనికితోడు ఉమర్ ఆలీషా, బులుసు వేంకటరమణయ్య మొదలగు ప్రముఖులవ్యాసములు చక్కగనున్నవి. వైద్యవిద్య, కర్మయోగరహస్యము, వ్యవసాయలాభమార్గములు, ప్రహసనములు మొదలగు వివిధవిషయములకు సంబంధించిన వ్యాసములుగలవు. ఈపత్రిక దినదినాభివృద్ధిగాంచి రాష్ట్రేతరాంధ్రుల కుపయోగపడునని ఎంచెదము.

---

మనుమరాలు విపరీతమైన గుడ్డలు వేసుకొను పద్ధతిజూచి అవ్వ చీవాట్లు పెడుతూ, "నిన్నీ వేషంలోచూస్తే మీయమ్మ నిన్నేమంటుందో అని భయంగాఉంది" అన్నది.

నవీనయువతి నవ్వుతూ, "నాకుగూడా అదే సందేహమే! ఎందుకంటే యీ గుడ్డలు మా అమ్మవే!" అన్నది మెల్లగా.




**శ్రీయుత ఠాకూరుగారు: విద్యావిధానము**

మన భారతదేశమున విద్యావిధానము యొక్క మేలుకీళ్లను గుఱించి యెవరికిని చెప్పవలసిన యవసరముండదు. అది మన మందరికి ననుభవైకవేద్యమే. దానిని సంస్కరించినదప్ప మనకు వేరు శరణ్యములేదు. కలకత్తానగరమున విద్యావాసరోత్సవ సందర్భమున మనదేశ విద్యావిధానమును గూర్చి యుపన్యసించుచు రవీంద్రకవీంద్రులు “భారతదేశమున నిర్బంధ విద్యావిధానమమలునందుంచి, మాతృభాషయే పాఠశాలలందును కళాశాలలందును ముఖ్యభాషగా ప్రవేశపెట్టనిచో భారతమాతకిక మోక్షము లేదు” అని వచించిరి.

ప్రకృతము పాశ్చాత్య ప్రపంచమంతయు నింత యభివృద్ధికి వచ్చుటకు ముఖ్యమగు కారణము విద్యగాదని యెవరును వచింపజాలరు. జన సామాన్యమునందుండు అజ్ఞానము విద్యమూలమున మాయము జేసి, సాంఘికాభివృద్ధిని గల్గించి దేశాభ్యుదయమునకు దోహదము గావించిరి. కాని భారతదేశమందీ యజ్ఞానమైకమత్యమునకు యెదురుచుక్కయై, విద్యాధికులతోడను, ధనాధికులతోడను సామాన్యజనసముదాయమునకు సంబంధములేకుండజేసి భారతమాతకు పక్షవాతరోగమువలె బాధకరమై యున్నది. ఈ జనసముదాయమునకు విద్య నేర్ప ప్రయత్నింపకుండు నీ విధాననిరుపయోగతను వర్ణింపనసాధ్యమై, “ఏ సంఘము తనయందొక భాగమునకు మాత్రమే జ్ఞానదీప్తిని గల్గించి యెక్కువభాగమును నిరంతర మజ్ఞానాంధకారమున ద్రోసియుంచునో యది నశింపక తప్ప”దని కవీంద్రుఁడు వాకొనెను. “ఏ నాగరిత సంఘమైనను ఆత్మహత్యాసూచకమై, క్రూరమై, లోభమైన విద్యావిధానమును గర్హింపక తీరదు. ఈ దైన్యమునకు లొంగిన భారతమాత విధికి నాకవమానము గల్గుచున్నది.” ఈపల్కులు సత్యేతరములనుటకు వీలులేదు.

ఇట్టి విద్యావిధానముచే తృప్తిబొందక దేశమునందంతయు విద్యావ్యాప్తికి పాటుబడుటకు ధనము తగినంత లేకున్నదనుట సాంప్రదాయమై పోయినది. ఆర్థికముగా నెన్నియోరెట్లు వెనుకనుండిన రష్యా జపాను వంటిదేశములు పట్టుదలతో విద్యావ్యాప్తికి నిరంతరము కృషిసల్పి, సంఘాభివృద్ధియొనరించి, పరిశ్రమాభివృద్ధికి కారణములై తమ దేశమును భాగ్యవంతముం జేసినవి. నాటి నుండియు భాగ్యవంతమన దగిన భారతదేశ

మందే విద్యావిధానమునకు దగినంత ధనము లేకుండబోయెనా ?

ఇక పాఠశాలలందును కళాశాలలందును నేర్పబడు విషయములు మాతృభాషయందు నేర్పబడక పోవుటచే విద్యావిధానమెంత సుబోధకమో తెలియుచునేయున్నది. పర భాషను ఓ న మాలు మొదలుకొని ప్రారంభించి పదేండ్లు జదివి పట్టభద్రుండైనను ఆ భాష లో నిర్దుష్టముగా జదువనుగాని వ్రాయనుగాని వచ్చుటలేదుగదా ! పుట్టుక తోడనే వచ్చు భాషయందే పదేండ్లు పాటుబడినను గూడ నిదే స్థితియందుందురనిన యెవరైన నమ్మగలరా? "శిశువులకు మాతృస్తన్యమెంత యావశ్యకమో, విద్యార్థికి మాతృభాష యంత యావశ్యకమని" కవీంద్రులన్న దానితో ప్రతివారు నేకీభవింపగలరు.

ఈ విద్యావిధానములో గూడ పెక్కు లోపములుండుట అందఱికి దెలిసిన విషయమే. ఎవరెవరి కెట్టివిద్య గావలయునో గుర్తెఱుంగుట ఉత్తమము. తరువాత నిర్బంధవిద్యయు, మాతృభాష ప్రాముఖ్యతయు పాటింపవలసియుండును. ప్రభుత్వము వారీయావశ్యకతలనెఱింగి ప్రజాసముదాయమునకు మేలొనర్తురని విశ్వసించుచున్నాము.

కొరడాదెబ్బల శాసనము

బెంగాలునందు వివాహితలను అవివాహితలనుగూడ నపహరించుకొనుపోవు నేరములు నానాటికి పెరుగుచుండుటచే ప్రభుత్వమువారు అట్టి దురంతములు గావించు వారియెడ కఠినచర్యల దీసికొనవలసిన అవసరమేర్పడెను. అదియే కారణముగా బెంగాలు శాసనసభయందు, ఇట్టినేరమును గావించు దుండగీండ్రకు కొరడాదెబ్బలశిక్ష విధింపవలయుననెడి శాసనము ప్రవేశపెట్టబడెను. మహమ్మదీయులే యీ దుండగముల నెక్కువ జేయుచున్నారను యుద్దేశ్యముతో హిందువు లందరా బిల్లును బలపరచిరి. కాని మహమ్మదీయులపట్ల హిందువులు యీర్ష్యవహించి యిట్టిశాసనము చేయుచున్నారని శ్రీయుత షర్వాదిప్రముఖులు వాదించిరి. కాని సభయందు హిందువు లధిక సంఖ్యాకులగుటచే పైబిల్లు శాసనము గావింపబడెను.

సాధారణ శిక్షణల నెంతమాత్రము గమనింపక నిట్టి దుండగము లాచరించు వారి నీశాసనమొకవిధముగా భయపెట్టి దురంతముల తగ్గించునేమోగాని, పూర్తిగా నిట్టినేరము లీశాసనముతో నాగిపోవునా యను సందియము గలుగకమానదు. అదియునుగాక, నాగరికత యభివృద్ధిజెంది, యేవిధమగు హింసగాని అనాగరితయని యనిపించు నీకాలములోగూడ నిట్టి కఠిన శాసనములు సమంజసము లౌనా ? ఇట్టి దురంతములను బాపుట కింతకంటె శాస్త్రీయమైన త్రోవలులేవా ? సక్రమపద్ధతిని నేరస్థులను బాగుచేయువిధానముల నవలంబించిన జనాంగీకారములై యభివృద్ధి సూచకములగునని యెంచెదము.

# సంపాదకీయములు

## అస్పృశ్యతా నివారణము

### ఆంధ్రరాష్ట్రీయ సభ

హిందూజాతియం దంటరానితన మను నదెంత అసభ్యమైనదో సహృదయులకు వేరుగాజెప్ప బనియుండదు. దానినా మూలాగ్రముగ నిర్మూలింప పాటుబడు మహాత్ములు గొందరు; స్థిరముగా నుండుటకై ప్రాణముల బలియివ్వ సిద్ధముగనుండు మహాశయులు గొందరు. రెండవ తెగకు జేరక యీపని "మాయింటి ఆడువారికి సరిపోదు, లేకున్న ప్రపంచము తల్లక్రిందుల జేయుదు" మనువారు కొందరున్నారు. వారు కాకినాడయందు గూడిన ఆంధ్రరాష్ట్రీయ అస్పృశ్యతా నివారణసభయందు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి యాధిపత్యమునజరిగినసభయందుకట్టమంచి రామలింగారెడ్డిగారీవిషయమై చెప్పినమాటలను కొంచము గమనింపగోరెదము. "మాకుటుంబములో స్త్రీలునైతెము ఈ అంటరానితనమును పాటింపరు. సంఘసంస్కరణము నం దనురక్తులైన పురుషులుగూడ చాల మంది తమస్త్రీలు దీని నంగీకరింపరనుసాకున తమయిండ్లలో హరిజనులను సమానముగ జూచుటకు జంకుచున్నారు. అది వట్టి దురభిప్రాయము. భర్తతోడిదే స్వర్గమని యన్ని విషయములందు, భర్తయనుమతిని వేదము వలె నంగీకరించుసతిపై తమకు ధైర్యము చాలక యిట్టి యపనింద వేయుట అక్రమము గాన ఎల్లరు సోదరులైన హరిజనులను తమ సోదరులుగ భావింపవలెనని గోరుచున్నాను."

పురుషులు సంస్కారప్రియులు; స్త్రీలు సనాతనాచారపరులు; సులభముగా వారు సంస్కారములయం దిష్టము గనబరుపరని కొంతమందివాదము. కాని హరిజనులదుస్థితి వారికి నచ్చజెప్పి వారియందు సానుభూతిని బుట్టించుచో వారే ముందడుగువేసి పురుషులకంటె శ్రద్ధతో హరిజనసోదరుల నుద్ధరింపగలరనితలంచెదము. అంతియగాని మగవారు తమఅయిష్టమునో, సోమరితనమునో, చాందసమునో ఆడువారిమరుగున దాచుటెందులకు?

ఈసభయందు దేలిన సారాంశములన్నిటిలో హరిజనులకు దేవాలయప్రవేశమునకంటె ఆర్థికముగా బాగుబడువిషయమును ముఖ్యమైనదనునది గమనింపదగినది. అన్నమోకానుచంద్రా యని యరచు నా హరిజనుడు దేవునికై దేవాలయమునకై దెబ్బలాడునా? మొదట కుక్షి నింపుకొన్న గదా గుడిమాట దలంచును. కావున సోదరసోదరీమణులెల్లరు తమకు తోచిన రీతి వారి నుద్ధరించుటకు వెనుదీయరని నమ్మెదము.

## కలకత్తా అంతర్జాతీయ మహిళాసమావేశం

బరోడా మహారాణిగారి యధ్యక్షత క్రింద కలకత్తానగరమున అంతర్జాతీయ మహిళాసమావేశము జరిగినది. మహారాణిగారు తమసంస్థానమున నెట్టి యున్నతాభిప్రాయముల గల్గియుండి ప్రసిద్ధి కెక్కిరో, యీ యధ్యక్షతపదవియందుగూడ నట్టి ముఖ్యమైన యాశయముల వెల్లడించిరి.

ఈ యాశయము లొక్క భారతరమణికే గాక ప్రపంచమున మరేజాతి స్త్రీకైనను ఆదర్శప్రాయములే!

వారి మొదటియాదర్శము, భారతీయ స్త్రీలేగాక ప్రపంచమందలి స్త్రీలందరును ప్రపంచపౌరత్వమును బొందవలయు ననుటయే. దీనికి పునాదివిద్య. విద్యావ్యాప్తి గల్గిననేగాని స్త్రీలు--జాతిగూడ—ముందునకు రాజాలరు. విద్యావ్యాప్తికి నిర్బంధ విధానమువలనగాని యుపయోగ ముండదు. "మనకు ప్రకృతము నేర్పబడువిద్య నిష్ప్రయోజనము; హానికరముగూడ. విజ్ఞానాభివృద్ధి విషయమున నేమాత్రము జాగ్రత్త లేదు. ఇయ్యది చక్కగా నభివృద్ధియగుటకు కవకాశ మింటియందేగలదు. కాని యక్కడనే యది గన్పించుటలేదు" అన్న రాణిగారిపల్కులు యథార్థములు. ఇండ్ల యందు విద్యాభివృద్ధిజేయు బాధ్యత యితరులందరికంటె స్త్రీలయందెక్కువగా నున్నది. జాతీయ వ్యవహారములందు తమ ధర్మములకు తోడ్పడునట్టిదియును, ఆత్మ ధర్మమును పెరవారిధర్మమును గుర్తెఱుంగునట్టిదియును, సంఘమున మర్యాదగ ప్రవర్తించి దానిని వృద్ధికి దెచ్చునట్టిదియును అగు విద్యయే నేర్పుటకు ప్రతిపుత్రికను రాణిగారు తయారుజేయమనుట శ్లాఘనీయము.

నూతన రాజ్యాంగనవిధానమున స్త్రీలకు గల హక్కులనుగూర్చి ముచ్చటించుచు, మునుపటికంటె రాజ్యాంగములందు యిపు డెక్కువ హక్కు లొసంబడినవనియు నట్టిహక్కులు విశ్వజనీనమగువఱకు నుపయోగముండదనియు, ప్రకృతముగల నియోజకాధికారముచేతనే దానిని విస్తరింప పాటుపడవలెననియు నుడివిరి. తదుపరి స్త్రీలకు ఆస్తి సంక్రమణస్వత్వము అవసరమనియు, వారికి విడాకులచట్టము గావలె నన్న వారసత్వపు హక్కుముం దేర్పడవలె నని వారు గావించిన సూచనయుక్తముగ నున్నది. స్త్రీల కాస్తియందు హక్కు గలిగినపుడే స్త్రీపురుషులు సహకారము గల్గియుందురు. సహకారము సానుభూతియు గల్గినచో విడాకు లక్కరకురావు.

ఈ ముఖ్యాంశములతరువాత నీసమావేశమందు గణింపదగినవిషయము స్త్రీలు-పత్రికారచయితవృత్తి యనునది. పత్రికారచయితవృత్తియందు పాశ్చాత్యదేశములందే యెచటనో యొకరుందురన్న విద్యావ్యాప్తిలేని మనదేశమందా విషయమై వేరుగా నుడువవలయునా? ఈసందర్భమున శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారు, ఈదేశపత్రికలకు గావలసినంత స్వాతంత్ర్యములేదన్నవిషయమును గాదనజాలముగాని ఉన్నంతవఱకు మన భారతనారీమణులు తమ రచనలతో ముందుకు వచ్చుచున్నారా?

ఈవిషయమై ఆంధ్రసోదరీమణుల కొక్కమాట మనవి జేయవలసియున్నది. ఆంధ్రులలో విద్యావంతులైనస్త్రీలు పెక్కుమందియున్నారు గదా? కాని యెంతమంది పత్రికలకు తదేకదీక్షతో వ్రాయుచున్నారు? కొంతమందితప్ప తక్కినవారందఱు పత్రికా

రచన ప్రస్తావనయే యెత్తికొనుటలేదు. ఆంధ్రనారీలోకపక్షమున వెలువడు యేక పత్రికయగు గృహలక్ష్మిమైన ప్రతివిద్యావతియగు నాంధ్రసోదరియు వ్రాయకూడదా? ఇప్పుడైన విద్యావంతులగు సోదరీమణులు శ్రద్ధవహించి పత్రికారచనకు బూనుదురుగాక యని గోరుచున్నాము.

ఆంధ్రరాష్ట్ర మహిళాసభ: కాకినాడ

ఈసభ కాకినాడయందు శ్రీమతి కామేశ్వరమ్మగారి యధ్యక్షతక్రింద సమావేశమైనది. కామేశ్వరమ్మగారు ప్రకృతము భారతదేశమునకు సంబంధించిన నూతనసంస్కరణములనుగూర్చియు సాంఘికసంస్కరణములనుగురించియు తన ఖండితయభిప్రాయములను వెల్లడించుట యభినందింప దగినది.

ఏబదివత్సరములుగా అఖిలభారతమహాసభ పాటుపడుచుండియు వర్ణభేదములింకను ఐకమత్యమున కాటంకములు గల్గించుచుండుట చింత్యనీయము. ఇట్టి యాటంకములను సాధ్యమైనంతత్వరగా తొలగించవలయును. దీనికి జాతీయసభ తగిన కట్టుదిట్టములు గావింపవలెనని కామేశ్వరమ్మగారు జెప్పినది యుక్తముగనే యున్నది.

ఎన్నికలలో స్త్రీల నభ్యర్థులుగా పెట్టని విషయమై కామేశ్వరమ్మగారికి దోచిన తలంపులు మెచ్చతగినవే. ఏలన, ఇంత విశాలభారతదేశమున, నింతమంది విద్యానిధులగు సోదరీమణులమధ్య, ఇంతమంది దేశభక్తులగు నారీమణులనడుమ భారతశాసనసభ కనుపుటకు తగినవారు గనబడక పోయిరో, మదరాసు శాసనసభకు శ్రీమతి రుక్మిణమ్మగారిని హెచ్చుమెజారిటితో పంపుటతోడనే శాసనసభలందు స్త్రీల ప్రాతినిధ్యము ముగిసినదో తెలియకున్నది. ఈవిషయమై జాతీయసభ తగుశ్రద్ధవహింపక తప్పదు. ఈ సమావేశమందలి తీర్మానములు కార్యరూపమును దాల్చుగాక!

శ్రీ ఆంధ్రమహిళా గానసభ, రాజమండ్రి.

ఈసభ యంత ప్రసిద్ధమైనదిగాదు; ప్రసిద్ధి జెందినదని వ్రాయబూనుకొనలేదు, గాని, శ్రీమతులు నాళము సుశీలమ్మ బొల్లాప్రగడ వెంకటచలమమ్మ గారివంటి సాధారణ గృహిణులు సంగీతమునందు అసాధారణ శ్రద్ధగొని సభల, పాఠశాలలస్థాపించి, యితరుల ప్రోత్సాహములేకున్నను, స్వంతపైకముతో, స్వంతగృహములందు కొనసాగించుచున్న యీ యుద్యమము చాల ప్రశంసనీయము. సంగీతమునకై ఆంధ్రు లెంత ప్రాకులాడినను అరవలకన్న వెనుకబడి యుండుట శోచనీయము. ఆంధ్రసోదరీమణులు పైజెప్పినట్టి పాఠశాలలను సభలను తామే ప్రారంభించి, సంగీతము నభివృద్ధిలోనికి దేగలరు. ఇతరుల ప్రోత్సాహముగూడ అవసరమే. కాని తామై ముందడుగు వేయనిది యితరులెట్లు ప్రోత్సహింపగలరు? ఇట్టి యుద్యమమును ప్రారంభించినందులకు శ్రీమతులు నాళము సుశీలమ్మ, బొల్లాప్రగడ వెంకటచలమమ్మగారి నభినందించుచు వారి యాశయములు తప్పక ఫలించునని గోరుచున్నాము.

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# పఠానుల బలపరాక్రమము



కాశ్మీరపుకళ మీకు కావలయును

మానవులందరును బలిష్ఠముగను దార్ఢ్యముగను జన్మింపరు. కాని శరీరమునుపట్టి పీడించే నిస్సత్తువను నిర్మూలించి నిగనిగలాడు దేహముతో నిండు ఉత్సాహముతో అవయవముల పుష్టితో హాయిగ నుండుటవసరము. అది మానవుని జన్మహక్కు. అందులకై ప్రతి ప్రాణియు ప్రయత్నింపవలయును.

**దీనికి సాధనము అమృత**

# అమృత

రక్తశుద్ధి ద్రావకము

రక్తహీనత; మలబద్ధము; అజీర్ణము; కీళ్ళనొప్పులు; సోమరితనము; మేహవ్రణములు; సుఖసంకటములు; నిస్సత్తువ; కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని, ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో ఆరోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 3 0 0

6 ఔ. రు. 1 10 0

# కేసరికుటీరం

ఎగ్మూరు :: మద్రాసు




# అర్క

## సర్వజ్వరనివారిణి

జ్వరము — మానవుల శక్తిని, జీవనమును పీల్చివేయును. కనుక జ్వరము మిమ్ము ఆవహించినదనగనే దానిని పారద్రోలవలయును. అట్లుచేయుచో మిమ్మాపిశాచి జీర్ణించి పిప్పిచేయదు. జ్వరము వచ్చినదనగనే అర్కను ప్రయోగించుడు. ఆహార, విహారబులు భేద దోషంబుల వలన అన్నాశయమునందు క్రిమికూటముచేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములు, కడుపులో ప్లీహమును జ్వరగడ్డను, అర్క కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

**6 ఔ. రు. 2 8 0 — 3 ఔ. రు. 1 8 0 — 1 ఔ. అ. 8.**



సుభగంకరణములు

## కుంతలకాంతి మల్లిక

సువాసన తలనూనె. స్త్రీ పురుషులు తలదువ్వుకొనుటకు ఇది మంచి సువాసన తైలము. దీనిలో పరదేశపు అత్తరులను కలుపక స్వదేశ పుష్పములతో తయారైన అత్తరులతోనే తయారుచేయబడినది. పరదేశపు అత్తర్లు బొగ్గుతారులోనుంచి తీయుదురు. స్వదేశపు అత్తరులు హిందూదేశపు మల్లె, జాజి, గేదంగి, మాలతీ, మాధవీ మొదలగు పుష్పములలోనుంచి తయారుచేయుదురు.

బుడ్డి 1–కి 1-0-0

## కేసరి పోమేడ్

దీనిని తలదువ్వుకొనుటకు ముందు కేశములకు కొద్దిగ రాచుకొనిన వెంట్రుకలు రేగక మిసమిసలాడుచుండును. ఇందు పేరుగాంచిన అత్తరులు చేరియున్నవి.

బుడ్డి 1-కి 3 అణాలు.

# కేసరిగారి ఇతర ఔషధములు

జయద్రావకము: విజయవటి

కలరామందులు వెల రు. 1 0 0

శ్రీఫలాదిపానకము

నీళ్లవిరేచనములకు 3 ఔ. వెల రు. 1 0 0

చరకామృతము

మహామ్మారిమందు 3 ఔ. వెల రు. 0 12 0

లోహారిష్టము

పాండువుకు 12 ఔ. వెల రు. 3 0 0

శారిబ

పురాణసెగరోగములకు, శ్వేతప్రదరములకు
12 ఔ. వెల రు. 3 0 0

మదనకామేశ్వరీ

శయ్యాసుఖమునకు వెల రు. 2 0 0

ఆదిత్యలవణము

అజీర్ణములకు వెల రు. 1 4 0

రతివల్లభరసాయనము

పుష్టినికలిగించుటకు 40 బిళ్లలు వెల రు. 2 0 0

భృంగామలకతైలము

మెదడు చల్లబడుటకు 6 ఔ. రు. 1 0 0

లాక్షాతైలము

అభ్యంజనతైలము 6 ఔ. వెల రు. 2 0 0

కుమార్యితైలము-లేపము

మూలవ్యాధిమందులు తైలం వెల 2 0 0
లేపం వెల 1 0 0

మేహకులాంతకతైలము

సవాయిజాడ్యములకు విరేచనౌషధము.
6 ఔ. వెల రు. 3 0 0

మారుతీతైలము

సెగరోగములకు వెల రు. 1 0 0

వ్రణశోధని

వ్రణశోధనమునకు డబ్బీ వెల రు. 0 8 0

మార్తాండలేపము

చర్మరోగములకు వెల రు. 0 8 0

సోమరాజాదిలేపము

బొల్లికి బుడ్డి వెల రు 2 0 0

మధుమేహవటి

అతిమూత్రవ్యాధికి 40 బిళ్లలు రు. 3 0 0

కఫకేసరివటి

దగ్గు, పడిశములకు 24 బిళ్లలు రు. 0 12 0

కుసుమవటి

సుఖభేదమందు 24 మాత్రలు వెల రు. 12 0

క్షారతైలము

కర్ణరోగనివారిణి వెల రు. 0 8 0

సిద్ధామృతచూర్ణము

కేసరి కాఫీపొడి వెల రు. 0 8 0

విషనిధ్వంసిని

తేలుమందు వెల రు. 0 8 0

బిల్వాదిలేహ్యము

పాండు, విషదోషములకు బుడ్డి 1 0 0

చ్యవనప్రాశ

కఫజాడ్యములకు వెల రు. 1 0 0

JULY 1936 REGD. No. M-2357 VOL. 9 No 5

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు
డాక్టరు. కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

సంపుటము ౯ జూలై 1936 సంచిక ౫

ఆంధ్రప్రెస్ - ఎగ్మూరు - మద్రాసు

వేల్ పిక్చర్స్‌వారి మూడవమాస్టర్ టాకీ

# శశిరేఖా పరిణయము

డైరక్టరు
పి. వి. దాసు గారు



దివ్యసంగీతము -- పులక
లాదవించు అభినయము
రిచ్చవడజేయు శిల్పము
వన్నెలుమీరిన తయారు
ఫోటోగ్రఫీ వింతలు
కమ్మనికథ

ఈ చిత్రము సన్నై
నిరీక్షింపుడు

మిస్. శ్రీరంజని — సుభద్ర

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరంరావుగారు. మదరాసు: అకుండి వెంకటశాస్త్రిగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని
జెమ్‌షెడ్‌పూర్: టి.సి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ, [లిమిటెడ్.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. సూర్యరాజుగారు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్‌వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్‌గారు
కాకినాడ: నున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్‌బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్చుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్‌కుమార్ ఫార్మసీ.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
మచిలీపట్టణం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్‌పేట.
కర్నూలు: టి. బాలనాగయ్యశెట్టిగారు, బాలసరస్వతి బుక్‌డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.
నెల్లూరు: పంచాగ్నుల వెంకటనరసింహంగారు
కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతోవ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేర లేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎస్ప్లనేడు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.



# పాశ్చాత్యనాగరికత — స్త్రీలు

ధనాశ, మనుష్యపీడనము, మారణయంత్రనిర్మాణము — ఇవియే నవీన నాగరికతయందుగల ముఖ్యగుణములని యందరంగీకరింతురేని పాశ్చాత్యదేశములు—యూరపుఖండమున—నాగరికతచే నొప్పుచు దానిని క్షణక్షణమున నభివృద్ధిచేయుచున్నవని చెప్పుటలో నిసుమంతేనియు సందియముండదు. బాహ్యాడంబరత హింస వీని కాలవాలమైన నీ దేశములను ఆదర్శములుగా నెంచుకొనుచుండుటయు జరుగుచున్నది. ఆదర్శముగా గైకొను వారిదేశములందు జూపు యుత్తమగుణములలో స్త్రీలకు సంఘమునందత్యున్నత స్థానముగల దనువిషయము గమనింపదగినది.

పాశ్చాత్యసంఘమునందు స్త్రీలకున్నత స్థానము లేదని యెవరును వచింపసాహసింపరు. కాని అదెట్టి స్థానము? వారచట యెట్టిగౌరవమును బొందుచున్నారను విషయమును సూక్ష్మదృష్టితో పరిశీలింతుమేని పలువిధములై యాశ్చర్యకరములగు విషయములందు గనబడును. నాగరిక దేశములని విఱ్ఱవీగుచున్న దేశములందే స్త్రీలనుగూర్చి పరస్పర విరుద్ధాభిప్రాయములును, విచిత్ర సిద్ధాంతములును, విపరీతచట్టములును గలవు. ఈ నాగరికదేశముల నేతల యభిప్రాయములే యీ విషయమును స్పష్టపరచును. 'స్త్రీ మహాశక్తినిలయ'; 'వంటయింటగల ప్రతిస్త్రీయు ప్రభుత్వమునుపరిపాలించువిధాన

మెఱుంగవలయు'ననెడి రష్యా నియంతయభి ప్రాయమునకును; 'స్త్రీ సంతానమును బడసెడి యంత్రము మాత్రమే. రాజ్యాంగవిషయము లందామెకు ప్రసక్తియనావశ్యక'మను జర్మని నియంత ఆశయమునకును; 'దేశాభివృద్ధికి దేశరక్షణకు తగిన పుత్రులప్రసాదించుటే వనితలపనిగాని రాజకీయములందు వారి కేమిపని'యనుచుండు నిటలీ నియంతతలంపు లకును భేదముగన్పడదా? వీరి యాశయముల ననుసరించియే ఆయాదేశములందు స్త్రీల యొక్కస్థితి యాధారపడియుండును.

స్త్రీ మహాశక్తిస్వరూపిణియని యన్న మహాశయుని పరిపాలనమునగల రష్యాదేశ మందన్ని విధముల స్త్రీ మూర్తి అత్యున్నత స్థానమాక్రమించి యున్నదని ప్రపంచమంత యు నెఱింగిన విషయమే! ఈ దేశమున స్త్రీ పురుషులని ప్రకృతిభేధము చూపినదేమో కాని ప్రభుత్వముగాని, సంఘముగాని, మతము గాని యట్టి భేధము నేవిధముగనైన చూప లేదు. విద్యావిషయమున, మతమునందు, (మతమనునది యాదేశమున నింకను కూర్చ నియున్న) సంఘపుటేర్పాట్లయందు, ప్రభుత్వ పరిపాలనయందు స్త్రీపురుషుల హక్కులకు భేదములేదు. పైగా స్త్రీలు అన్నిశాఖలందు పరిశ్రమజేయుచు పురుషులకంటె చాల యభి వృద్ధికి వచ్చుచున్నారు. వారు తమ జీవిత ములో నీ త్రోవద్రొక్కవచ్చు నీ దారిపోరా దను నియమ మెచటనులేదు. వారిష్టమున్న యొంటరిగ నుండవచ్చును; వివాహమాడ వచ్చును; విడిపోవచ్చును; పిల్లలగనవచ్చును; కనకుండ నుండవచ్చును. తుదకు వివాహము లేకయే పిల్లలగన నిష్టముండునేని కనవచ్చు ను. ఎట్టి నిర్బంధముగాని ఎవరిబాధగానిలేదు. పైగా ప్రభుత్వమే స్త్రీలు గర్భముధరించియు న్నపుడు సర్వసౌకర్యముల నేర్పరచి సంతా నముగలిగిన తరువాత కావలసిన సదుపాయ ముల నొనగూర్తురు. ఆసంతానము విషయ మై ప్రశ్న యెచటను జనియింపదు; కూడద నుట కితరులకు హక్కుగూడ లేదు.

స్త్రీలు క్రమక్రమముగా ప్రతిశాఖయం దును తమసంఖ్య నభివృద్ధిజేసికొనుచున్నారు. పరిశ్రమలందు వారు 1935 వ సంవత్సర ముని నూటికి 42మందియుండిరి. పారిశ్రామిక పాఠశాలలోని విద్యార్థులందు నూటికి 36 మంది స్త్రీలే. జనసముదాయములో నూటికి 80.3 మందికి వోటింగు హక్కుగలదు. ప్రభు త్వమునందు పదిలక్షల స్త్రీలకుపైన యుద్యో గములు చేయుచున్నారు. వారిలో నాల్గు లక్షలమంది ప్రభుత్వోద్యోగముల కెన్నుకొన బడినవారు. నాల్గులక్షలమంది స్థానికప్రభుత్వ ములం దుద్యోగులు. లక్షాపంద్రెండువేలు పురుషులతోబాటు న్యాయస్థానములందు న్యాయమూర్తులు. లక్షకుపైగా కోఆపరే టివుబోర్డుల నిర్వహించుచున్నారు. అంతియ గాక వీరు పనిచేయని ప్రభుత్వశాఖలేదు. సైన్యమునందుగూడ చేరి వీరనారులై విజృం భించుచున్నారు. శాస్త్రపరిశోధనలజేసి సెబా సనిపించుకొనుచున్నారు. వీ రిన్నివిధముల దేశాభ్యుదయమునకు తోడ్పడుచుండుట

వలననే నా దేశమును ప్రపంచమున నందరు అనుకరింప ప్రయత్నించుచున్నారు. కాని యిచ్చటగూడ స్త్రీల వ్యాపారములన్నియు నితరదేశీయులాదర్శప్రాయముగ నంగీకరింతురని వచింప సాధ్యముగాదు.

ఇఁక రష్యాతో నెనవచ్చు జర్మని మొదలగు దేశములందు మహిళాగౌరవ మెట్లుండునో విచారింతము. ఆదినుండియు ఫ్రాన్సు స్త్రీలకు సంఘమునం దొకవిధముగ గౌరవమిచ్చినను వారి స్వాతంత్ర్యమునకై యెట్టి మార్పులను గావించుటలేదు. వారికి రాజకీయములందు ఎక్కువ ప్రవేశములేదు. ఇంగ్లండు, రష్యా దేశమునకు తరువాత, యూరపునం దెల్ల గణింపదగినది. రష్యా వలె గాక పోయినను స్త్రీ స్వాతంత్ర్యము బ్రిటనునందు గలదు. వారు స్త్రీమూర్తిని తగిన యాదరముతో గౌరవించుటయేగాక పురుషునితో సమానమగు హక్కు లిచ్చియున్నారు. తక్కిన యితర దేశములన్నిటియందును స్త్రీల విషయమై యెక్కువ గమనింపదగిన విశేషము లట్టె గానరావు.

నాగరికదేశములని విఱ్ఱవీగుచున్న దేశములలో జర్మని యొక్కటి. ఈ దేశమున హిట్లరుఅధికారానంతరము స్త్రీపాట్లుపరమాత్మని కెఱుక. పురుషునిది సర్వాధికారము. స్త్రీల యధికారము కుండలవద్ద మాత్రమే. మహాసంగ్రామానంతరము జర్మను స్త్రీలు వోటింగు, శాసనసభా ప్రవేశాధికారములను బడసిరి. కాని నాజీ యధికారము ప్రబలినంతనే స్త్రీ స్వాతంత్ర్యము మడుగంటెను. వారికి ప్రభుత్వమునందు స్థానమే లేకుండబోయెను. అంతియగాక హిట్లరు ప్రాముఖ్యత వహించినంతనే నిరుద్యోగసమస్యను నిర్మూలింపదలంచి యుద్యోగములందున్న స్త్రీలనందరిని యిండ్లకు బంపెను. 35 సం॥ పైబడిన స్త్రీ ఉద్యోగము చేయరాదు. ముందే వివాహము చేసికొనియున్నగూడ నంతియ. వేయేల! వారిని తలిదండ్రులు పోషింపజాలియుండురేని వా రుద్యోగములు చేయరాదు!! ప్రభుత్వ పరిపాలనమునందున్న సంస్థలందు వంటకత్తెలను దీసివేసి వారికిబదులుగా నాస్థానముల పురుషుల నియమించిరి! ఇంతకంటె అన్యాయ మేమిగలదు?

జర్మనియందు స్త్రీలు పురుషులతోబాటు విద్యావిషయమున సర్వసౌకర్యములు గలిగియుండిరి గాని హిట్లరు తాకుడుచే నవి పటాపంచలయ్యెను. ఏ కళాశాలలలోనైన చదువుటకు ప్రవేశ మందరికిలేదు. వానిలో ఉద్యోగులు మరికొందరు. ఉపాధ్యాయినులుగా స్త్రీలు పురుషులక్రిందనే పని చేయవలయును. సైన్య సంబంధమగు పనులకు స్త్రీలే పనికిరారు!

నిరుద్యోగసమస్య నివారణార్థము హిట్లరు కేంద్రరక్షణాలయముల (Concentration Camps) స్థాపించెను. వీనియందు జరుగు ఘోరములు ప్రపంచమున నెచ్చోటను జరుగవు. ఇంతకుముం దితర యుద్యోగములందున్న స్త్రీలను బలవంతముగా నాచోట్లకు బంపి యందు వారిచే

గోడ్లు వేయించు టాది కఠినకార్యముల జేయించుచున్నారు. వారచట బానిసల కన్న నికృష్టముగ జూడబడుదురు. వివాహితలనుగూడ నచటి కనుపుదురు. వారికి సంతానముండెనేని యా శిశువులను బలవంతముగ వేరుపరచి శిశురక్షణాలయముల కంపెదరు!! 17నుండి 21 సంవత్సరముల వయస్సుగల యువతుల కిట్టి నిర్బంధ పరిశ్రమ గలదు. మారణయంత్రముల తయారుచేయుటకు కుసుమకోమలులగు యువతులు గంటలకొలది ఘోరవాతావరణములో బనిజేయుటకు నియమింపబడినారు.

ఈ కేంద్రరక్షణాలయములందు లక్షకు పైగా స్త్రీ పురుషులు నిర్బంధింపబడియున్నారు. వారిలో 60 సంవత్సరములకు పైబడిన వృద్ధులగు స్త్రీలుగూడ గలరట! వారిపై కొన్ని సమయములందు నేరములు మోపి అచటనే హతమార్చుటయు గలదు.

ఇటలీయందువలెనే జర్మనియందు వివాహము సంతానాభివృద్ధికిమాత్రమే. ఈ విషయమున నాజీలు చాల శ్రద్ధ దీసికొనుచున్నారు. వివాహమాడగోరువారికి ప్రభుత్వమువారు ధన మప్పుగా నిచ్చుచున్నారు. సంతాన మధికముగానున్నవారికి పెక్కువిధముల బహుమతులు ముట్టజెప్పుచున్నారు. సంతానహీనులకు విడాకులు గలవు. సంతాన మెక్కువగలవారికి విడాకు లొప్పుకొనబడవు.

నాజీలకు యూదులకు సంబంధబాంధవ్యము లుండగూడదు. యూదులతో గలసి తిరుగు యువతులను, వారి తల్లులనుగూడ నూరంతయు నూరేగించి యవమానము జేసి గాని విడువరు. ఇంక యూదులసంగతి చెప్ప నవసరమేలేదు.

జర్మని స్త్రీలయెడ కొంచమైన శ్రద్ధ గైకొనుచున్నచో దేశమునకు భావికాలమునకు గావలసిన సైన్యము తయారు జేసికొనుటకే! ఈవిషయములో ఇటలీ జర్మనీని మించినది. అందము చిందినట్లు నాగరికత నష్టమైనట్లు, భూతదయ, సానుభూతి గలిగి ప్రపంచమునగల 'అనాగరికు'లనెల్ల చక్కజేయుదునని ప్రపంచమంతయు నదిఘోరమనుచున్నను వినక బాంబులతో భయంకరవాయువులతో అబిసీనియా దేశమున దిక్కులేనివారిని మారణహోమము జేసిన ముసోలినీ మహాశయ నాగరికోత్తమ చక్రవర్తి పరిపాలించు నా నిటలీదేశమున స్త్రీలస్థితి మరింత హృదయవిదారణముగ నున్నది.

ప్రపంచసంగ్రామానంతరము యూరపుఖండమున స్త్రీస్వాతంత్ర్యము విజృంభించినదనుచుందురు. అది కొన్ని దేశములందు సత్యమైనను ఇటలీయం దబద్ధమైనది. ఫేసిజము పుట్టుకతో స్త్రీలకు నిగళబంధనము బిగిసినది. అందుచే వారిప్రకృతపుస్థితి కొన్ని శతాబ్దములకు ముందున్నదానికంటె మెఱుగుగాదు. పాశ్చాత్యదేశములను—ఇంగ్లాండు, రష్యా—జూచిన యేవిదేశీయుడైనను ఇటలిజూచుటకు వెళ్లిన నచట ప్రభుత్వకార్యాలయములందును వ్యాపారస్థలములందును స్త్రీ

లగపడకుండుటనుజూచి యచ్చెరువందును. మాస్కో, లండనునగరములం దీదృశ్యములు సర్వసాధారణములు. నేటి ఇటలీదేశము పురుషనిర్మితము; పురుషుని అధికారమెక్కువ. స్త్రీకి ప్రభుత్వహక్కన్న మాటయేలేదు. ఆమె యే బాధ్యతగల యుద్యోగమును స్వీకరింపరాదు. భార్యగా, మాతగాతప్ప నామెకు ప్రత్యేకవ్యక్తిస్వాతంత్ర్య జీవితము లేదు. దేశాభివృద్ధి సూచకములగు వ్యవహారములందు పాల్గొనుటకుగాని, తనదృష్టి విశాలమొనర్చుటకుగాని, ఇతరనాగరిక దేశస్త్రీలు జన్మహక్కుగా నిరంతరము భావించుచుతరుణములు స్వాతంత్ర్యము వారికి సున్న. ఇటలీ దేశపుస్త్రీ కిల్లేశరణ్యము. ఆమె పురుషునికి దాసిగనుండుట గృహకృత్యముల నిర్వహించుకొనుట, సైన్యమున కుపకరించు కుమరుల గనుట, పురుషసంతతి నభివృద్ధిజేయు సుతల గనుట—వీనికంటె చేయవలసిన వేమియు లేవు!

ఇటలీయందు స్త్రీలకు, నిరుపయోజనమగు కొన్నిఫేసిస్టు స్త్రీసంఘములకు తప్ప, వోటింగు అధికారములేదు. వారి కీ యధికారమునిచ్చుటకు నాగరికమహాశయుడగు ముసోలినీ దృఢముగ నిరాకరించెను! ఇట్టి వారే మొన్నజరిగిన ఎతియోపియాయుద్ధము న్యాయమైనదని దేశమున ప్రచారముచేసి ప్రభుత్వమునకు తోడ్పడుటకు నియమింపబడిరి!! శతాబ్దములనుండియు ఇటలీ విశ్వవిద్యాలయములు స్త్రీలకు చోటిచ్చుచుండెడివి; యిపుడు స్త్రీలు 11 సం॥ముల పైబడు బాలురకు బోధింప ననర్హులని చట్టమున్నందున విద్యాశాఖనుండి చాలమంది యుద్యోగములు మానుకొనవలసి వచ్చినది. ఇక యుద్యోగముజేయ దలంచుకొన్నవారెల్ల ఫేసిస్టుపార్టీకి జెందియుండకతప్పదు.

పరిశ్రమాలయములలో బనిజేయుస్త్రీలకు పురుషునితో సమానముగ జీతమువివ్వరు. అచ్చటపరిస్థితులు వారికి దుర్భరముగనున్నను చక్కజేయుమార్గములు గనబడుటలేదు. ఇతి రోద్యోగములందు గూడ స్త్రీలు కొంతమంది యున్నారు గాని బాధ్యత వహింపదగిన యే యుద్యోగమును వారి కివ్వబడదు. ఇటలీ దేశమందు స్త్రీలకు విద్యాసౌకర్యముకలదన్న నది వారిని గృహనిర్వాహకుల జేయుటకే! దానికితగిన విషయములనుదప్ప వేరు వానిని వారికి బోధింపరు.

నాగరికత కునికిపట్టగు నితరదేశములందెల్ల వివాహవిషయములందు స్త్రీసమానహక్కుగల్గియుండగా, నిటలీయందు స్త్రీ పురుషునికంటె తక్కువయే. భర్తభార్యను గాయము తగులకుండ చావ మోదవచ్చును. భర్తజేయు దురంతదుర్మార్గములకు భరింపజాలక భార్య యిలువీడుచో పోలీసులు ఆమెనుపట్టి తీసికొనివచ్చి యొకసంవత్సరము వఱకు శిక్షవిధింతురు! కాని నిష్కారణముగా భార్యను భర్త త్యజించినచో నది చట్టము లెక్కలోనికి గైకొనదు. వాని కేలాటి చిక్కులేదు. కాని వివాహ మేవిధముగాగాని రద్దుచేయుటకు ప్రభుత్వ మంగీకరించుటరుదు.

అటులయ్యు నిటలీయందు స్త్రీ మాతృమూర్తిగాకొంచెము గౌరవము బడయుచున్నది. సంతానోత్పత్తియే ముఖ్యసాధనముగా నెంచి ముసోలినీ సంతానవతులగు స్త్రీలను బహుమతులచే గౌరవించుచున్నాడు. సంతాన నిరోధము నిషేధింపబడినది. పాపమీ విధముగ మాతలకు కించిద్గౌరవము జూపి వారి పుత్రరత్నములను దురాశేంధనముగా యుద్ధదేవతకు బలియొనర్పనున్నాడను విషయము వారెఱుగరా?

ఇంగ్లాండునందు వివాహవయస్సు యువతులకు 21వ సం॥లుండవలయునని యాందోళన జరుగుచుండగా, ఫ్రాన్సునందు వివాహోచితవయస్సు యువతీయువకులకు 15, 18 సం॥ను, జర్మనియందు, 16, 18 సం॥ను, ఐయుండగా ముసోలినీదృష్టిలో నిది 14, 16 సం॥మాత్రమే యైనది. ఈవిషయములందెన్నో విధముల వెనుకబడియున్న దనుచున్న భారతదేశములోనే వివాహోచిత యువతీయువకుల వయస్సు 14,18 సంవత్సరములే! ఇటలీ నాగరికత యిదియేనా? సంతానోత్పత్తి కెన్ని సాధనములు దోహదములుగావలయునో యవన్నియు ముసోలినీ గమనించుచున్నాడు. శిశుసంరక్షణవిషయమై అనన్య సామాన్యముగు శ్రద్ధగైకొనబడుచున్నది. దీనికిగావలసిన ద్రవ్యము? బ్రహ్మచారులవద్దనుండియు, నితరులవద్దనుండియు నన్యాయముగ లాగుచున్నారు. బ్రహ్మచారుల కుద్యోగాదులుగూడ దూరమే.

భావివీరుల మాతగా నిటలీస్త్రీ గౌరవింపబడుచున్న దంతియగాని అంతకుపైన ఆమె గవ్వజేయదు. పురుషుడు నిరంకుశాధికారి. ముసోలినీ దృష్టిలో స్త్రీ సుందరముగనుండి పురుషునికంటె కానందమిచ్చునట్టిదై యుండవలయును. అంతకంటె వేరేమియు లేదు. స్త్రీస్వాతంత్ర్యము ఫేసిజము — ఒకదాని కొకటి వ్యతిరేకము.

ఇట్టి యుద్దేశములతో దేశాభివృద్ధికి మూలమంత్రమగు స్త్రీమూర్తి నీవిధముగ గౌరవించు ముసోలినీ మహాశయు డేముఖముతో నాగరికతనేర్పుదునని చంకలెగురవైచి యబిసీనియాను కబళించెనో, దానికి తమ స్థానమును, గౌరవమును తెలిసికొనక స్త్రీలోకమునకంతయు కళంకముగల్గునటుల నిటలీస్త్రీ లామహాత్మునికి సాయపడిరో యూహింప సాధ్యముగాకున్నది. ఇపుడైన మించినదిలేదు. పాశ్చాత్యదేశము లందలి స్త్రీలు తమ సాంఘికావస్థ యితరదేశీయుల కాదర్శప్రాయమని యొకవంక యనుకొనుచు, నొకవంక తమ్మణగద్రొక్కి తలలపై నాట్యమాడుచున్న నియంతల దురంతదుర్మార్గములకు భరించియుండక తగురీతి ప్రవర్తించి, దురభిమాన, దురాశ, దుర్మార్గములకై దేశముల శక్తిసామర్థ్యములను ధారవోసి భయంకర సంగ్రామములకై ప్రాకులాడుచుండువారి యాశయముల మానవకళ్యాణమార్గాన్వేషణకై మరల్ప ప్రయత్నపడుదురని నమ్ముచున్నాము. తలంచిన స్త్రీమహాశక్తికది దుస్సాధ్యము గానేరదు.

# తారాబేన్ కన్య

[ఈమె యొక శ్రీమంతురాలగు నాంగ్లేయకన్య. భారతదేశమును సేవించు సంకల్పముతో నీమె యిచటికివచ్చి, 2 సంవత్సరములుపైగా సేవయొనర్చి, యిటీవల నాకస్మికముగా మరణించెననువార్తను సోదరీమణు లెల్లరును వినియుందురు. ఈ యమను గురించి శ్రీ గాంధీమహాత్ములవారు హరిజనపత్రికయం దిటుల వ్రాయుచున్నారు ఆ.ల.న.]

"బొంబాయి నగరమున కాంగ్రెసు జరుగుచుండగా మేరీఛెస్లీ కన్య యీ దేశమునకు వచ్చెను. తోడనే యామె కాంగ్రెసు శిబిరమునందు నా కుటీరమును వెదకికొనివచ్చి, నన్నుకలసికొని, తాను మీరాబేన్‌నకు పరిచితురాలననియు, ఆమెతోడనే కలసి యిచటికి రానుద్దేశించితిననియు, కాని కొన్ని యిబ్బందులవలన 1, 2, వారములు ముందు వచ్చితిననియు, భారతవర్షగ్రామములను సేవించుట తన యాశయమనియు నా కెరింగించెను. ఆమె మాటలయందు నాకంతటి నిశ్చయము కాన్పించకపోవుటచే, కొన్నిమాసము లీ దేశమున సంచారముచేసి వెడలిపోవునని భావించితిని. కాని నా యీ యుద్దేశము పొరబాటని త్వరలోనే కనుగొంటిని.

మధ్యరాష్ట్రములందు ఖేడీయను గ్రామమున స్థావర మేర్పరచుకొని, పనిచేయుచున్న శ్రీమతి మేరీ బార్‌కన్యయుదంత మీమె తెలిసికొని, త్వరలోనే యామెను కలసికొనెను. మరికొన్నిదినములకు వారిరువురునుకలసి, వార్ధాకువచ్చి, మాతో కొంతకాలముండిరి. ఛెస్లీకన్య కార్యదీక్ష నాకు విస్మయము కలిగించెను. ఆమె మేరీబార్‌కన్యతో కలసి హైందవనారీమణివలె దుస్తులు ధరించి, తనపేరు తారాబేనని మార్చుకొనెను. ఖేడీగ్రామమున నామె స్వయముగా భూమినిత్రవ్వి, మట్టితట్టలను మోయుటయు, ఆహారమును ఆరోగ్యమునకు భంగము కలిగించునంతటి మితముగా తగ్గించుటయు గాంచి, బార్ కన్య భయభ్రాంతయయ్యెను. కనడానుండి తనకు సమృద్ధిగావచ్చు ద్రవ్యమునుండి యామె నెలకు రు. 10లు మాత్రము స్వంతవ్యయమునకు మిగుల్చుకొని, మిగతమొత్తమును, అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘమునకో, గ్రామోద్ధరణకు పాటుపడు ఏ ప్రచారకులకో యిచ్చివేయుచుండెను. ఆమె దాతృత్వమునకు మితిమేర యుండెడిదికాదు. నే నామెను మిగుల జాగరూకతతో పరిశీలించుచుంటిని. మానవుని యుత్తమస్వభావమునం దామెకు విశ్వాసమమెండు. ఆమె యుత్తమచరితయగు క్రైస్తవురాలగుటచే, పరుల తప్పిదములను సులభముగా మన్నించెడిది. ఆమె క్వేకరుకుటుంబమునకు చెందినను, సంకుచితస్వభావ కాదు. నామమాత్రపు మతాంతరీకరణ మామె హర్షించెడిది కాదు.

ఈయమ లండను ఆర్థికశాలయందు పట్టభద్రయై, యొక సహోధ్యాయినితోకలసి, ఆనగరమునందే పెక్కువత్సరము లొకపాఠశాలను నిర్వహించిన యుపాధ్యాయురాలు. ఇచటికిరాగానే, హిందీ నేర్వవలసిన యావశ్యకతనుగుర్తించి, వరుసగా ప్రతిదినమును అభ్యసింప నారంభించెను. హిందీ మాటాడుట కూడ వాడుక చేసికొనుటకుగాను, యీమె వార్ధా మహిళాశ్రమమందు కొన్నిమాసములు నివసించెను. అచటనుండియే, యొకరిరువురు సహచరులతోగలసి,

వేసవియందు బదరీకేదారయాత్రకు ప్రయాణమయ్యెను. ఇంతటి ప్రయాసకరమగు యాత్రకు పూనవలదని నేను హెచ్చరించినను, యామె స్థిరసంకల్పము మారలేదు. కొలదిరోజులక్రిందటనే యామె బయలుదేరియుండెను. ఇంతలోనే యాకస్మికముగ మే 15వ తేదిని కాన్లాలునుండి "తారాబేన్ మరణించె" నను తంతి పిడుగువలె నందుకొంటిని. ఈయుత్తమ చరితకు భారతగ్రామములందుగల ప్రేమ యపారము. ఉత్తమ భారతపుత్రులవలెనే యామె, మన మాతృదేశకల్యాణమును వాంఛించెడిది. మానవులలో కొందరల్పులనియు, మరికొందరధికులనియు గల వాదము నీమె తీవ్రముగా ప్రతిఘటించెడిది. పేదవారగు స్త్రీలతోను, వారిబిడ్డలతోను మిగుల చనువుతో మెలగుచుండెను. పరులకు అత్యంతసహనముతో సేవయొనర్చెడిది గాని, తనకొరకెవ్వరిని కష్టపడనిచ్చెడిది కాదు. కుడిచేతితో నొనర్చెడి సత్కార్యములను ఎడమచేతి కెరుకపడనీయక, ఆత్మపారవశ్యముతో కృషియొనర్చిన విశుద్ధసేవాపరాయణ. ఈయమ ప్రవిమలాత్మ శాంతినొందుగాక !"

మహాదేవదేశాయి గారిట్లు వ్రాయుచున్నారు. "మహాత్ముడు పైవ్యాసము వ్రాసినప్పుడు తెలియరాని యీమె యాకస్మిక మరణకారణము లిప్పుడు బయలువడినవి. గాంధిజీవ్రాసినప్రకార మామెకు వేసవియంతయు సిమ్లాకొండలయందు గడుపదగిన ద్రవ్యవసతియున్నను, ఆమె యందుల కిష్టపడదయ్యెను. అందులకుబదు లామె బదరీకేదారమునకు పోనెంచి, వార్ధామహిళాశ్రమమందలి నలుపురు కన్యలతో బయలుదేరెను. దారియం దామెకు జలుబుచేసెను. తోడనే, వెంబడినున్న సోదరీమణు లామెను వార్ధాకు మరలవలసినదిగా వేడినను, ఆమె యంగీకరించలేదు. వ్యాధితో బాధపడుచు, దుర్బలయైనను, ఆమె యితరులసహాయమునొల్లక, తన సామానుమోయుచు నడచుచుండెను. కాని యిట్టుల చాలకాల మామె ప్రకృతిని ధిక్కరించజాలకపోయెను. విపరీతమైన విషజ్వరము (బహుశ న్యుమోనియా కావచ్చును) ఆవహించి, యామె కదలనశక్తురాలయ్యెను. ఆస్థితిలోమాత్రమే యామె సమీపమునగల హాస్పిటలునకు కొనిపోబడుట కంగీకరించెను. కాని యచటికి పోవుదారిలోనే, ప్రాణవాయువు లెగిరిపోవుచు న్నట్లామెగ్రహించి, తాను వీలునామా వ్రాయదలచుచుంటినని చెంగటనున్న సోదరి కెరింగించెను. ఆమె వెంబడి ప్రయాణముచేయుచు, నామెకు వలయు నుపచారముల నొనర్చుచున్న సోదరి మహాదేవికి హిందీతప్ప వేరుభాషరాదు. అదృష్టవశమున ఘెస్లీకన్య గడచిన యారుమాసములలోను, ఆభాషను కొంత నేర్చియుండుటచే మహాదేవిచేత "నాపేరనున్న యాస్తియంతయు, కనడాబ్యాంకు లలోనున్న రొఖముతోసహా, సర్వమును బాపూకు చెందవలె"నని వ్రాయించి, దిగువను హిందీలోనే సంతకమొనర్చి, మరికొలది నిముషములలోనే మహాదేవియొడియందు శిరమిడి యసువులను విడచెను. తనకంటె హెచ్చుగా మాతృభూమిని ప్రేమించిన యుత్తమురాలనియు తనకు మాతృసమానయనియు తారాబేనును ప్రేమించిన మహాదేవి, యామె కళేబరమును సమీపమునగల కాంగ్రెసు గురుకులమునకు చేర్చి, యచట మిత్రులసహాయముతో, వేదోక్తవిధుల ననుసరించి దహనసంస్కార మొనర్చెను.

ఈవిధముగా నీమహోత్తమురాలు అస్తమించెను. కాని యింతటితో నీమెసేవ యంతరించెనని నేను నమ్మజాలను. ప్రేమపూరితమును, స్వార్థరహితమును నగు నీయమ యుదాహరణము సోదరీమణులను సేవాపరాయణులగుట కెల్లప్పుడును పురిగొల్పుచునే యుండగలదు."

# భారతనారి ఆదర్శము

స్వామి వివేకానందగారు

'హే భారతీయా! నీ నారీజాతి ఆదర్శము సీతా, సావిత్రి, దమయంతులను మాట మరువకుము. నీ ఉపాస్యదైవము సర్వత్యాగియును, ఉమానాథుడును అగు శంకరుడను విషయమును విస్మరింపకుము. నీవివాహము, ధనము, నీజీవితము, ఇంద్రియ సుఖములకొఱకుగాదు, స్వార్థసుఖములకొఱకుగాదు. నీవు నీజన్మముహూర్తమున నే మాతకై బలిగా సమర్పింపబడితివి. నీసంఘము విరాడ్రూపినియగు మహామాయయొక్క ఛాయమాత్రమే!'

భారతీయనారియొక్క విభిన్నఆదర్శములలో మాతయొక్క ఆదర్శమే శ్రేష్ఠమైనది — భార్యయొక్క స్థానముకంటె నది అధికతరము. భార్యాపుత్రులు లొకప్పుడు పురుషుని త్యజించిన త్యజింపవచ్చును గాని తల్లి అట్లొనర్పజాలదు. అట్టిసమయములలో గూడ మాతృప్రేమ అట్లేయుండును, మరొకింత వృద్ధినందును. మాతృప్రేమయందు ఆటుపోటులులేవు, ఇచ్చిపుచ్చుకొనుటలు లేవు, జరామరణములు లేవు. ఒకతల్లికిమాత్రమే ఇట్టిప్రేమయుండుట సంభవించును — భార్య, పుత్రపుత్రికలకుకాదు.

మాతృపదవి జగత్తులోనున్న పదవులన్నిటిలో శ్రేష్ఠమైనది. ఏలయన, ఈ పదనియందే అన్నిటికంటె స్వార్థత్యాగముఁ జూపవలసిన తరుణము, స్వార్థశూన్యకార్యముల నొనర్చవలసిన అదను, ఇతరుల దిద్దు అవకాశములభించును. ఈశ్వర ప్రేమయొక్కటియే మాతృప్రేమకంటె అధికమైనది; తక్కినవన్ని తక్కువవి. మాతయొక్క కర్తవ్యము, మొమ్మొదట పిల్లలగురించి చింతించుట, తరువాత తన్ను గురించి. అట్లొనర్పక తల్లిదండ్రులు సామాన్యవిషయములగు ఆహారపానీయములలో గూడ ప్రప్రథమున తమ్ముగురించి తలతురేని, తామే మంచివస్తువులగొని పిల్లలగతి ఏమైనది చూడరేని, తల్లిదండ్రులు పిల్లలనడుమ పక్షులువాటి సంతానమువంటి సంబంధము నిలబడును. తరుణియందు భగవానుని మాతృభావ ప్రతిమూర్తినిఁ జూడఁగలిన పురుషుడు ధన్యుడు. పురుషునియందుభగవానుని పితృభావ ప్రతిమూర్తినిఁ జూడఁగల్గిన తరుణియే ధన్యురాలు. మాతాపితలయందు భగవత్ప్రకాశముం గాంచగలిగిన సంతానమే ధన్యము.

శాక్తేయులు జగత్తునందంతటను వ్యాపించియున్న శక్తిని మాతృభావనతో పూజింతురు — కారణమేమన, అమ్మయను పేరుకంటె తియ్యనిదగు పేరు మరొకటిలేదు.

భారతదేశమున తల్లియే తరుణియొక్క శీలమున కాదర్శము.

పితృభావనకంటె ముందుగా మాతృభావమే భారతదేశమున వికాసము నందినది. అంబానామమును పేర్కొనినంతటనే సర్వశక్తిభావము, ఐశ్వర్యభావము, రేకెత్తును. శిశువు తనతల్లిని మహాశక్తిమంతురాలుగా తలపోయును. మన ఐహికజననియందు ప్రకాశమునందుచున్న జగన్మాతయొక్క శక్తికణము నుపాసించిన మహత్త్వము నందవచ్చును.

ప్రకృతిరమణిని తల్లియని భావింపుము. ప్రతిపురుషుఁడు తనభార్యకంటె ఇతరులగు స్త్రీలను తల్లిగానో, తోడపుట్టువుగానో, చెలియలుగానో జూడనగును. ముఖ్యముగా మతబోధకుడనగోరువాఁడీ మాతృభావనను అవలంభించి, తదుచితముగ వర్తింపనగును.

శక్తివినా జగుత్తు ఉద్ధరింపఁబడజాలదు. మనదేశము తక్కినదేశములకంటె అధమమైనదెందులకు? శక్తిహీనమైనదెందులకు? - ఆచ్చటశక్తి అవమానింపబడినది. అమెరికాలో, యూరప్‌న, ఏమిగాంచితిని? శక్తిపూజ, శక్తిపూజ. వారెరుంగకయే పూజనొనర్చుచున్నారు — కామముతో. విశుద్ధభావముతో, స్వాభావముతో, మాతృభావనతో పూజనొనర్చువారికి మంచికలుగదా?

మనము పాశ్చాత్యదేశముల నారీపూజనుగుఱించి విందుము. అది సాధారణముగా తరుణియొక్క యౌవన, సౌందర్యముల పూజ. కాని శ్రీరామకృష్ణుని నారీపూజ యనగా, ప్రతియువతియు ఆనందమయియగు జగన్మాత — ఆమెపూజ. నేను స్వయముగా జూచియుంటిని. ఆయన సంఘము ముట్టవెరచు పతితస్త్రీలయెదుట చేతులుజోడించికొని నిలబడి, తుదకు రోదించుచు వారి పదతలమునంబడి సగము మైమరచి 'అమ్మా! నీ వీరూపమున దారియందు నిలబడియున్నావు, మఱొకరూపమున విశ్వమైనావు' అని వాపోవును. ఎవని నుండి పశుభావములన్నియు తొలఁగిపోయినవో, ఎవఁడు ప్రతియువతిని భక్తితో గాంచుచున్నాఁడో, ఎవనిముందట వనితావదనములన్నియు అన్యాదకృతిని దాల్చినవో, కేవల మా జగన్మాతయొక్క ప్రతిబింబమందు ప్రతిఫలించుచున్నదో, ఆజీవిత మెంతధన్యమో ఆలోచించిచూడుము. ఇదియే మన కవసరమైనది. రమణియందున్న ఈశ్వరత్వమును మోసగింపగల మనుచున్నారా? అట్లెన్నఁడును జరుగలేదు, జరుగదు. తెలిసియో, తెలియకయో అదెల్లప్పుడును ఆత్మప్రకాశము నొనర్ప యత్నించుచునేయున్నది. అది తప్పకుండ, మోసమును, కపటమును పట్టుకొనియేతీరును. అది దొసగులేకుండ సత్యతేజమును, ఆధ్యాత్మికాలోకమును, పవిత్రతా శక్తి ని ఉపలబ్ధీకరించుకొనియేతీరును. అసలగు ధర్మము నార్జింపగోరినచో నిట్టి పవిత్రత పృథ్వీతలమున యెల్లయెడల నావశ్యకము.

పవిత్రతాసతీత్వములు జయింపజాలని పశుభావమున్నదా? తనపతికంటె ఇతరు

లగువారిని సంతానబుద్ధితో పరికించి, వారిని తల్లిగోలెనరయు మహాపతివ్రతామ తల్లి సమ్ముఖమున పవిత్రవాయువుల పీల్చ లేని నరపశువుండడు.

బ్రహ్మచర్యమే స్త్రీపురుషుల ప్రధాన ధర్మము. నమ్రయు, ప్రేమికయు అగుసతి సత్పథమునఁ బెట్టజాలని పురుషుడుదార కడు —— అతడెంత అధముడైనకానీ. జగత్తింతవరకు, అంత అధఃపాతాళమునకుఁ బోలేదు. నేను ప్రపంచమునంతటను నృశంసులగు భర్తలనుగుఱించియు, పురుషుని అపవిత్రతను గుఱించియు చాలగ వినియుంటిని. కాని నాఅభిప్రాయము: అట్టిస్త్రీలసంఖ్యయు పురుషులసంఖ్యకు తీసికట్టదు.

నాకొక తరుణిసంగతి గుర్తునకువచ్చుచున్నది. అపెభర్త త్రాగుబోతు. ఆయువతి నాకడకువచ్చి తనభర్తయొక్క దోషము నుద్ఘాటించుచుండెడిది. నావిశ్వాసము —— పెక్కుమంది తమభార్యల దోషముననే త్రాగుబోతులగుదురని.ముఖస్తుతినొనర్చుట నాపనికాదు, సత్యమును వెల్లడించవలెను. ఏయువతులు మనస్సునుండి సహ్యాగుణము సంపూర్ణముగా రూపుమాసిపోయినదో, ఎవరు స్త్రీస్వాతంత్ర్యవిషయమున భ్రాంతియుతాభిప్రాయములదాల్చి పతుల తమ పిడికిలిలో నుంచుకొందుమని పల్కుచుందురో, పురుషులు సాహసించి వారికి రుచింపనిపల్కులఁ బల్కినచో గంద్రగోళము నొనర్తురో, అట్టిస్త్రీలు సంఘమునకు మిక్కుటమగు అశుభమును గూర్చుచున్నారు;—— వీరి గయ్యాళితనమువలన ప్రపంచమునందలి సగపాలుజను లింకను ఏల ఆత్మహత్యనొనర్చుకొనకుండనున్నారో, ఆశ్చర్యవిషయము.

(అనువాదకుడు పూర్ణానంద)

# ఆంధ్రరాష్ట్రము

శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవిగారు

తే॥గీ॥ రాష్ట్రరాష్ట్రాంతరంబుల రామలెల్ల, తిండితిప్పలులేక నేతెంచుచుండ
అతిథు లభ్యాగతులటంచు నాదరించి, పాడిపంటలనొసగెమా పంటవలతి.

౨

అన్నిటనుమిన్నయైనట్టి యాంధ్రభూమి; రాష్ట్రమగుచునువరలక రంగుదక్కి
ఏడ్చుచున్నదిఘోరున ఏమినందు? అరసినడుములుగట్టుడో యాంధ్రులార!

౩

గొప్పపదవుల నెంతొ జేగొన్నవార !ఆంధ్రమాతనుమరువంగ అదనుగాదు
ధనముపాడియుపంటయు మనకుగలఁదు, రాష్ట్రమొక్కటియేలేదు రాణదక్కి.

# "చట్టసభల్లో మెజారిటీ మీదేగా"

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఉదయం తొమ్మిదిగంటలవేళ రాజేశ్వరి యింట్లో ఏదోపని చేసుకుంటూ ఉన్నది. కచ్చేరిసావట్లో పడకకుర్చీలో కూర్చుండి టపా చూచుకుంటూ ఉన్న రాఘవరావు 'రాజేశ్వరీ' అని పిల్చాడు. "ఓయి" అంటూ రాజేశ్వరి సావట్లోకివచ్చి 'యెందుకు పిల్చారు' అన్నది. ప్రయాణం వచ్చింది. పెట్టెలు సర్దూ అన్నాడు రాఘవరావు.

"ఎక్కడికి" అన్నది రాజేశ్వరి.

గుంటూరు కన్నాడు రాఘవరావు.

"ఏమి మా మఱదలు పెద్దమనిషైందా? మా మామయ్య ఉత్తరంవ్రాశాడా?" అని అడిగింది రాజేశ్వరి వడివడిగా.

"మీ మఱదలూ పెద్దమనిషి కాలేదు. మీ తమ్ముడూ పెద్దమనిషి కాలేదు. గుంటూరులో మహిళాసభలు. కొందఱు పెద్దమనుష్యుల భార్యలు నిన్ను రమ్మని ఆహ్వానం పంపించారు."

"పెద్దమనుష్యుల భార్యలేమిటి? వారికి వూరూ పేరూ లేనట్టు."

"ఉన్నదో లేదో నాకేమి తెలుసు. దానిలో ఉన్న విషయం చెప్పాను."

"అయితే వారి పేర్లు అందులో లేవా?"

"ఉంటే చదువనా?"

"పేరులేని ఆహ్వానపత్రిక లుంటాయా?"

"ఉన్నవో లేవో నీవే చూడు. రాఘవరావు సతీ" అని ఆహ్వానపత్రిక రాజేశ్వరి చేతికిచ్చాడు రాఘవరావు. రాజేశ్వరి పత్రిక చేతికి తీసుకొని చదువుకొని, "వారందఱు ఉన్నతోద్యోగుల భార్యలు కనుక ఘనంగా ఫలానివారి సతి అని వ్రాసుకున్నారు. అందులో తప్పేమున్నది. ఇప్పుడందఱూ అట్లాగే వ్రాసుకుంటున్నారు గదా?" అన్నది చిఱునవ్వు నవ్వుతూ.

"ఓహో! యిందులో తప్పేమిటో నీకు కన్పడ లేదా? అయితే బ్రతికిపోయినాము. ఇంకా కొన్నాళ్లు మేము నిర్భయంగా ఉండవచ్చు."

"ఒకప్పుడు మాత్రం మీకు నిర్భయం గాకేమి గాని, అసలు మీకు కన్పడిన తప్పేమిటో చెప్ప రాదా?"

"కందకులేని దురద చేమకేమి? నా కెందుకు నేను చెప్పను."

"మాకు తెలివిలేక తెలుసుకోలేదు. తెలిసినవారు మీ రెందుకు చెప్పరాదూ?"

"మీకు వ్యక్తిస్వాతంత్ర్యం కావాలె గాదూ?"

"ఆc."

"పురుషులతో సమానహక్కులు కోరుతున్నారు గాదా?"

"అవశ్యం."

"ఇది వట్టి వాగాడంబరం అనుకుంటాను. మన సార మీ కట్టి కోరిక లేదు."

"ఉన్నది. మా తొమ్మిదేండ్ల మహిళాసభా తీర్మానాలూ ఒక్కమాటు తిరుగవేసి చూడండి మా స్వాతంత్ర్యాభిలాష నానాటికి యెంత తీవ్రమైపోతు న్నదో మీకే తెలుస్తుంది."

"అది వట్టి వాక్తీవ్రత. పద తీవ్రత. అంతే మనోగతాభిప్రాయంమాత్రం గాదు."

"అట్లా అనుకోటం పొరబాటు. స్వాతంత్ర్యం కోసం మా మహిళాలోకం యెంత ఆవేదనపడుతున్న దీ మా మనస్సులు చొచ్చి చూస్తే తెలుస్తుంది."

"అంతశ్రమ అక్కర్లేదు. మీ ఆహ్వానపత్రికలు చూస్తేనే విశదమౌతున్నది."

"ఏమి విశదమౌతున్నది."

"మీ రింకా మగవారి అండనే ఆధిక్యత పడయ గోరుతున్నారని."

"ఎందువల్ల?"

"తమ కొక ప్రత్యేక నామధేయముండగా దానిని మాని ఫలానిఆయన పెండ్లాన్ని అని వ్రాసుకున్నందు వల్ల."

"ఓహో! మంచి సారాంశమే తేల్చారే. భర్త పేరు వ్రాసుకొన్నందువల్లనే మా ఆశయాలకు భంగం వస్తుందా? దొరసానులందరూ యిట్లాగే వ్రాసు కుంటారు గదా. వారి హక్కుల కేమి భంగం వచ్చింది? వారు పురుషులతో సమానహక్కు లను భవించడంలేదా?"

"అనుభవిస్తున్నారుగాని వీరికైనా యీ స్వరూప నాశనం బాగుండలేదు. ఒక దొరసాని ఒక్కొక్క మొగుడిని పెండ్లాడి వాడితో సఖ్యతచెడితే విడా కులు పుచ్చుకొని మఱొకడిని కట్టుకుంటూ ఉంటుంది. ఒక్కొక్క మొగుడిని కట్టుకున్నప్పుడల్లా వాడి పేరే దీని పేరు. దీని కెన్నిటిలో సమానహక్కు లున్నా పేరులోమాత్రం సమానహక్కులేదు. మీకు దేనిలోనూ హక్కు లేకపోగా హక్కున్న ఈ పేరులో దొరసానులను అనుకరించి అదిగూడా పోగొట్టుకున్నారు. మన దేశంలో అనాదినుంచీ జనకసంబంధమైన పేరుకేగాని భర్తృసంబంధమైన పేరు లుంచు ఆచారములేదు. వైదేహి, వైదర్భి, పాంచాలి, శైబ్య, జానకి, ద్రౌపది, ఈ పేరులన్నీ వీనినే సూచిస్తూఉన్నవి. ఈ పేరులు స్త్రీల దేశ మును, వారి వంశమును, వారి తండ్రులను వెల్ల డిస్తూ చిన్నవిగా ముద్దుగా నున్నవి. ఇక ఇప్పటి పేరులో శారదారమణారావు, పార్వతీనారాయణ మూర్తి, సత్యవతీ సీతాపతి, లేకపోతే మిసెస్ శర్మ, మిసెస్ శాస్త్రి, మిసెస నాయుడు. వీటికి తెలుగు తర్జుమా పిళ్లైసతి, గుప్తసతి, చౌదరీసతి. ఇవి మఱీ అధ్వాన్నంగా ఉన్నాయి. ఇందులో అయ్య పేరూ లేదు. అమ్మ పేరూ లేదు. ఈవిధంగా ఉన్న గోడు గూడా ఊడగొట్టుకుంటూ వ్యక్తిస్వాతంత్ర్యమనీ, సమానహక్కులనీ ఏవేవో పెద్దపెద్ద పేర్లు చెప్పుతుంటె నవ్వు వస్తుంది. రాజేశ్వరీ! మీ ఆడవాళ్లంతా ఈ పేరులు చూచి దీనిలో యేదో గొప్ప ఉన్నదని మురుసుకుంటున్నారు గాని మా మగవాళ్లమైతే భార్య యెంత విద్యావంతురాలైనా కానీ, యెంత ఆస్తిపరురాలైనా కానీ, యెంత సంపాదనపరురా లైనా కానీ, ఫలానిఆమె మొగుడూ అంటె హత్య చేసుకుంటాము గాని, ఆమోదిస్తామా! అంతటిమాటా యెందుకు. నన్నెవరైనా రాజేశ్వరీ పతీ! అని పిల వనీ. పిలిచినవాడిని చెంపలు వాయించుతానో లేదో?" అన్నాడు రాఘవరావు.

రాజేశ్వరి పకపకా నవ్వి "మే మంత అఘాయి త్యం చేయలేము సుమండీ" అన్నది.

"దాస్యప్రవాతావరణంలో పుట్టి పెరిగిన జీవులు మీరు మీకు వ్యక్తిగౌరవం ఏమి తెలుస్తుం"దన్నాడు రాఘవరావు. "అవును తరతరాలనుంచీ స్త్రీ ఆధిక్యత నంగీకరించని జాతికి చెందిన మహనీయులు మీరు ఫలాని ఆమె పెనిమిటి అంటే సహిస్తారా మఱి?"

"సహించడం మాకు......"

"ఇంతకు ప్రయాణం మాటేమిటి?"

"అయితే మహిళాసభకు వెళ్తావా ఏమిటి?"

"వెళ్తాను ఎన్నాళ్లనుంచో చూడాలెనని ఉన్నది. క్రిందటిమాటూ వెళ్లవలెనంటే పడ్డదికాదు. ఈ మాటైనా వెళ్లిచూచివస్తాను. ఎక్కడో దూరపు

జిల్లాల్లో జరుగుతుంటే చూచేదిలేనేలేదు. మన జిల్లాలో జరిగేదైనా చూచివస్తాను."

"ఐతే ప్రయాణంగట్టు."

"ఎప్పుడు?"

"ఇవ్వాళే మూడుగంటల బండికి."

"మూడుగంటల బండికా? గుంటూరు వెళ్ళేటప్పటికి బాగా చీకటిపడదూ?"

"అయ్యో! చీకటిపడితే రైలు దిగలేనిదానవేనా సమానహక్కులు కోరుతున్నావు మాతోబాటు?"

"యుగయుగాలనుంచి మమ్మల్ని వంటయిండ్లలో నిర్బంధించి మాశక్తియుక్తులన్నీ అడగగొట్టి ఇప్పుడు ఒంటరిగాపోలేదంటే ఏమిచేస్తాము? చిన్నప్పటినుంచీ ధైర్యసాహసాలకు అలవర్చిఉంటేగదా ఎవరికైనా ధైర్యస్థైర్యాలుండేది?"

"అయినా భయంలేదు. శ్రీమతులను యెదుర్కోడానికి కొందరో స్త్రీలు రైలువద్ద వేచిఉంటారు. వారు సురక్షితంగా నిన్ను బసకు చేరుస్తారు. కనుక ఒంటరిగా వెళ్లినా భయంలేదు."

"నేను ప్రతినిధుల బసకుపోను. మామయ్యగారి యింటికి పోతాను. పిల్లలకు పాలునీళ్లు ఆ బసల్లో ఎక్కడ అమురుతాయి?"

"అట్లయితే మీమామయ్యకు ఇప్పుడే వైరుచేస్తాను. ఆయన రైలువద్దకు మనిషిని పంపుతారు."

"పోనీ మీరుగూడా రాగూడదా ఎట్లాగో శని ఆదివారాలు కచ్చేరి ఉండదుగదా."

"మా మగవాళ్ల హక్కులన్నీ ఊడగొట్టేటువంటి సభకు నీవు డెలిగేటుగా పోవడమూ నీకు నేను తోడు రావడమూనా?"

"మీ మగవారిమీద తీర్మానాలెవరు చేస్తున్నారు? మాకీ యీ సౌకర్యాలు కావాలెనని కోరుకుంటాము అంతే. అవి మీమీద తీర్మానాలెట్లా అవుతాయి?"

"మీరుకోరిన సౌకర్యాలన్నీ మీ కిచ్చేటట్లయితే మా కసౌకర్యమేగాదా?"

"స్వార్థపరత్వానికి మగవారు పెట్టింది పేరు."

"పరార్థములను భంగపుచ్చేవాళ్లం మాత్రం కాము."

"ఇంతకూ గుంటూరు కస్తారా? రారా?"

"దయచేసి రాను"

"అయితే మామయ్యకు టెలిగ్రామివ్వండి. స్టేషను వద్దకు ఎవరైనా పంపుతాడు" అని రాజేశ్వరి లోపలికి వెళ్లింది.

"అయితే వెంటనే టెలిగ్రామిస్తే మంచి"దని రాఘవరావు పడకకుర్చీలోనుంచి చివాలునలేచి గదిలోకి వెళ్లి బీరువాలో మనీపర్సుతీసి జేబులో పెట్టుకొని ఉత్తరీయం బుజానవేసుకొని బజారుకు బయలుదేరాడు. ఇంతలో రాజేశ్వరి వంటయింట్లోనుంచి వచ్చి "టెలిగ్రాము యివ్వడానికి వెళ్లుతున్నారా?" అన్నది.

"అవును."

"అక్కడనుంచి బజారుకుగూడా వెళ్లివస్తారా?"

"వెళ్లిరమ్మంటె వెళ్లివస్తాను. ఏమి కావాలేమిటి?"

"సభలో పిల్లలు యేడిస్తే చేతిలో బెట్టడానికి ఒక బిస్కట్ల పొట్లాము తేండి. యింకా మా మామయ్యగారి పిల్లల కివ్వడానికి రెండుపొన్ల పెప్పరమెంట్లు."

"సరే తీసుకొస్తాను."

"అయ్యో! వినిపించుకోకుండా వెళ్లుతారేం?"

"ఇంకా యేమిటి?"

"సన్నపూవుల వాయెల్ ఎనిమిదిగజాలు తలలో గుచ్చుకొనే......"

"అబ్బబ్బా మీ ఆడవాళ్ల ప్రయాణమూ అంటె భయమేస్తుంది."

"చిన్నసూదిదగ్గిరనుంచీ మీ చేతిమీదుగా రావాలె

గనుక మేము యెంత అవసరమైన వస్తువుకోరినా అబ్బబ్బా అంటారు. అదే మీకు కావాలసొస్తే మాట్లాడకుండా తెచ్చుకుంటారు. మొన్న మీరు బొంబాయి వెళ్లటానికి యెన్నినూట్లు ఖర్చుపెట్టించారు. ఎన్నిబూట్లుకొన్నారు! మాటవరసకైనా అబ్బా యింతైందని అనుకున్నారా? మీకేమి చేతులారా సంపాదించుకుంటారు గనుక మనసారా ఖర్చుపెట్టుకుంటారు." "మీరుగూడా సంపాదించుకోరాదా? మాపని తేలికవడుతుంది."

"అదేఉంటే మాస్త్రీల పరాధీనత ముక్కాలు మువ్వీసం తగ్గేపోవును."

"ఔరా! మీ మనస్సులో ఎన్నిభావాలు పుట్టుతున్నాయి."

"ఎన్ని పుడ్తేనేమి? నీళ్ళల్లోపుట్టిన బుడగలు నీళ్ళలో కలియవలసిందేగాని వానికి ప్రత్యేకతేమున్నది?"

"నిజంగా యిది మహిళాయుగం" అంటూ రాఘవరావు చిఱునవ్వు నవ్వుతూ లోపలికివచ్చి డబ్బు తీసుకొని బజారుకు వెళ్లాడు. రాజేశ్వరి ప్రయాణపు సర్దుబాటులో నిమగ్నురాలైంది.

## 2

సరిగా రెండుగంటలకు గుఱ్ఱపుబండివచ్చి వాకిట్లో నిలిచింది. రాజేశ్వరి సామానంతా సర్దుకొని బిడ్డలకు తలలుదువ్వి నీళ్లుపోసి మంచిదుస్తులు వేసి తానుగూడా చక్కగా ముస్తాబై గదులకన్నిటికీ తాళాలు పెట్టుతున్నది. రాఘవరావు వరండాలోపచారుచేస్తూ బండిని చూడగానే సామానుబండిలో పెట్టరా అని నౌకరుతో జెప్పి లోపలికివచ్చి "యింటరు తీసుకోమంటావా?" అన్నాడు రాజేశ్వరితో. "యింటరులో స్త్రీలకు ప్రత్యేకపుపెట్టె ఉంటుందా" అన్నది రాజేశ్వరి. "బహుశా యీబండిలో ఉండదనుకుంటా"నన్నాడు రాఘవరావు. "అయితే మూడవక్లాసే తీసుకోండి హాయిగా మాటామంతీ ఆడుకుంటూ కూర్చోవచ్చు"న్నది రాజేశ్వరి.

"ఇంటరులో మాత్రం మాట్లాడుకోగూడదా?"

"ఎవరితో?"

"ఉన్నవాళ్లతోనే."

"ఎవరో మగవాళ్లుంటే వాళ్లతో నాకేమి మాటలు? అట్లాంటిది మీరు వెంటఉంటే ఏబండిలోనైనా కూర్చోవచ్చును."

"సరి నీవు యెక్కడికి బోయినా బాడీగార్డుగా నేను వెంటనుండాలె కాబోలు."

"అయినా యిప్పుడెందుకు? మూడోక్లాసు టికెట్ తీసుకుంటే ఆడవాళ్లపెట్టె తప్పకుండా ఉంటుంది కనుక అందులోనే కూర్చుంటాను."

నౌకరూబండివాడూ సామాన్లు బండిలో పెట్టారు. రాజేశ్వరీ పిల్లలు బండిలోయెక్కారు. రాఘవరావు సైకిల్ మీద యెక్కి ముందుగా స్టేషనుకువెళ్లి టికెట్లు తీసుకున్నాడు.

ఇంతలో రాజేశ్వరి పిల్లలు యెక్కిన జట్కాబండి వచ్చింది. లైసెన్సుకూలీని సామానులోపలికి తీసుకపొమ్మనిచెప్పి జట్కావాడికి బండిబాడుగ యిచ్చి భార్యనుబిడ్డలను ప్లాటుఫారంవద్దకు తీసుకొనివెళ్లాడు రాఘవరావు. "పిల్లల నెట్లా పట్టుకుంటావో కిటికీల వద్దకు పోతారు, తలుపులు వేయబోతారు, తలక్రిందికి వంచుతారు. జాగ్రత్తసుమా" అని రాఘవరావంటూ ఉంటే "యిల్లు జాగ్రత్త సుమండీ నౌకర్లమీద యిల్లు వదిలిపెట్టి పోతున్నాను. సుబ్బమ్మ కొంచెం చెయివాడి మనిషిగూడాను" అని రాజేశ్వరి చెప్పుతూ ఉన్నది. మాట్లాడుతూ ఉండగానే కూతలు పెట్టుకుంటూ రైలుప్లాటుఫారంమీదికి వచ్చింది. స్త్రీల పెట్టెలో భార్యనూ బిడ్డలనూ యెక్కించి "యిక నేను ఉంటా" నన్నట్టుగా భార్యవంక చూచాడు రాఘవ

రావు. "అయ్యో వెళ్లుతున్నారా? ఈబండిలో యెవరూ ఎరిగిన వాళ్లుఉన్నట్టులేదు. పిల్లలతో ఎట్లా వెళ్లుతానో" అన్నట్టుగా బిక్కమొగంతో పెనిమిటివంక చూచింది రాజేశ్వరి. ఆమె పిరికిచూపులు చూచి "నేనుగూడా ప్రయాణమై రాకపోతి"నని జాలితో అనుకున్నాడు రాఘవరావు మనస్సులో. కాని రైలు కదిలి పొయ్యేటప్పుడు ప్రయాణపు ఆలోచనలు చేసి ప్రయోజన మేమున్నది? గమనోన్ముఖమైన పొగబండి ఒక్కకూతకూసి ఒకరినొకరు విడవలేకున్న సతీపతులను నిర్దాక్షిణ్యంగా విడదీసి నడకసాగించింది.

బండి దృష్టిపథంనుండి తొలిగేదాకా చూస్తూ నిలబడి చల్లంగా యింటికొచ్చాడు రాఘవరావు.

కచ్చేరినుండి యింటికి వచ్చింది మొదలు భార్యతో కూడా తిరుగుతూ ముచ్చట్లుచెపుతూ పరిహాసాలు చేస్తూ పొద్దులు పుచ్చడం రాఘవరావుకు అలవాటు. అందువల్ల భార్యా బిడ్డలు లేని యిల్లు చూస్తే అతని వల్లమాలిన విచారంకలిగింది. ఒక్క నిముషమైనా యింట్లో నిలవడానికి బుద్ధి పుట్టలేదు. వేళ గాకపోయినా బ్యాటు తీసుకొని క్లబ్బుకు వెళ్లాడు. రాత్రి యెనిమిది గంటలదాకా అక్కడే ఉండి మఱునాటి కాలక్షేపం నిమిత్తం మిత్రులను పేకాడుకొందాము రండని పిలిచి యింటికి చక్కా వచ్చాడు.

## 3

సోమవారం సాయంత్రం అయిదుగంటల బండి దిగి రాజేశ్వరి యింటికి వచ్చేటప్పటికి రాఘవరావు యింకా యింటికి రాకపోవడంచేత పిల్లలు తండ్రి కోసం యెదురు చూస్తున్నారు. పనివాళ్లంతా అమ్మగారొచ్చారని ప్రేమపురస్సరంగా పలకరిస్తున్నారు. సుబ్బమ్మ వచ్చి రాత్రికి వంట యేమిచేయమంటారని అడుగుతున్నది.

"మా తమ్ముడికి రోజూ రాత్రిపూట కందిపచ్చడి ఉండి తీరాలె. పంతులుగారికి కూర తప్పని సరిగదా. పిల్లలకు పప్పుపులుసు యిష్టం. అప్పడం వడియం ఏవో చూడు. మధ్యాహ్నం చేసిన పులుసు పచ్చళ్లు ఉన్నవా? ముందు పిల్లలకు వేడినీళ్లు కాచి యివ్వు. పాలు గలిపి పోయాలె" అని యజమానురాలి ఠీవితో సుబ్బమ్మకు వంట పురమాయిస్తున్నది రాజేశ్వరి. ఇంతలో రాఘవరావు యింటికి వచ్చాడు. నాన్న వచ్చాడు, నాన్న వచ్చాడు అంటూ పిల్లలు గంతులు వేస్తూ తండ్రికి యెదురుబోయినారు. రాఘవరావు చిన్నవాడిని యెత్తుకొని పెద్దపిల్లను వ్రేలు పట్టుకొని నడిపిస్తూ లోపలికి వచ్చాడు. నాన్నా! యీ బండికే వచ్చాము అని కుఱ్ఱవాడంటే, మామయ్యగూడా వచ్చాడు నాన్నా! అన్నది లీల. "ఎవరు శ్రీనివాసులా?" అన్నాడు రాఘవరావు రాజేశ్వరి వంక చూచి.

"అవు"నన్నది రాజేశ్వరి. "ఏడీ శ్రీనివాసులు అప్పుడే యెక్కడికి పోయినా"డని రాఘవరావంటూ ఉండగానే కాళ్లూ చేతులూ కడుక్కువద్దామని దొడ్లోకి వెళ్లిన శ్రీనివాసులు తువ్వాలుతో ముఖమూ చేతులూ తుడ్చుకుంటూ సావట్లోకి వచ్చాడు. రాఘవరావతన్నిచూచి "ఏమిరోయి శ్రీనివాసులూ ఆజ్ఞలేని అనర్సు బియ్యేకు అనాలోచితంగా పిల్లనిచ్చినందుకుగాను అపరాధంక్రింద నన్నుగూడా పోషించండని అత్తవారి యింట్లోనే ఉంటున్నావా ఏమి?" అన్నాడు.

"లేదు బావా!" అన్నాడు శ్రీనివాసులు చిఱునవ్వుతో.

"సరె, సరె క్షణంలో యెంత అల్లిక వేశారు? మహిళాసభ లేపనంగా నేను వెళ్లినవాడే వాడూ వచ్చాడుట. అంతట్లో వాడు అత్తవారింట్లో ఏండ్లూ పూండ్లూ ఉన్నట్టు మాట్లాడుతున్నా లేమ"న్నది రాజేశ్వరి.

"ఓహో! ఏమిటి చెప్పవూ. మహిళాసభకు డెలిగేటుగా వచ్చాడా. ఆ సంగతి నాకేమి తెల్సు చెప్పవేం మరీ" అన్నాడు రాఘవరావు నవ్వుతూ.

"ఆడవాళ్ల సభకు వాడెందుకు డెలిగేటుగా వస్తాడు" అన్నది రాజేశ్వరి అభిమానంతో.

"బావ కథకుడు గాదూ. అట్లా అల్లుకుపోతూ ఉంటాడులే" అన్నాడు శ్రీనివాసులు.

"కథలమాట యెత్తబోకు. మీ అక్కయ్యకిప్పుడు కొండంత కోపం వస్తుం" దన్నాడు రాఘవరావు.

"వస్తే నీకేమి భయమా?" అన్నాడు శ్రీనివాసులు.

"మీ అక్కయ్య తమ మహిళాసమాజంలో స్వయంగా అగ్రాసన మధిష్ఠించి మూడు తీర్మానాలు చేసినప్పటినుంచీ నాకు భయమేమిటి కాస్తాకూస్తా గాదు. వల్లమాలిన భయంపట్టుకున్నది. మళ్లీ మళ్లీ ఎటువంటి రిజల్యూషన్సు చేయిస్తుందో అని. ఇవి ఆడవాళ్లకు భయపడాలిసిన రోజులురా! నీకు తెలుసునో తెలియదో" అన్నాడు రాఘవరావు.

"అబ్బో యేమి భయపడుతున్నారో పడుతున్నారు. నిజంగా ఈరోజుల్లో ఆడవాళ్లనుగురించి మీ మగవాళ్లు వ్రాస్తూఉన్న వ్రాతలవంటి వ్రాతలు యేనాడూ యే మగవాళ్లూ వ్రాసిఉండలేదు. ఏ కథ చూచినా, ఏ వ్యాసంచూచినా, ఏ పాటచూచినా, ఏ పద్యంచూచినా స్త్రీలనుగూర్చిన నిందలూ, అధిక్షేపణలూ, అనుచితపువర్ణనలూ" అన్నది రాజేశ్వరి.

"అదిగో ఆరంభమైంది తామసోపన్యాసం" అన్నాడు రాఘవరావు నవ్వుతూ.

"అవును. ఇప్పటి అసభ్యపువ్రాతలు తలుచుకుంటే నాకు తామసమే వస్తుంది నిజంగా. స్త్రీని భోగ్యవస్తువని రసికులూ, పురుషునికి చెందిన వస్తువాహనములవంటి జడపదార్థమని అధికారదృష్టిగలవారూ, హేయపదార్థమని వేదాంతులూ, ఎవరికి తోచినట్లు వారు వారివారి చిత్తవృత్తులనుబట్టి వ్రాస్తూఉంటారు. ఈ వర్ణనలుచూస్తే గ్రుడ్డివాళ్లు యేనుగును వర్ణించిన కథగా ఉంటుంది. నలుగురు గ్రుడ్డివాళ్లు ఏనుగు ఎట్లా ఉంటుందో తెలుసుకోబోయి ఒకడు కాలుపట్టి చూచి ఏనుగు స్తంభంలా గుంటుందన్నాడుట. ఇంకొకడు చెవిపట్టుకుచూచి యేనుగు చేటలాగుంటుం దన్నాడుట. ఇంకొకడు తొండంపట్టుక చూచి ఎబ్బే! స్తంభమంతలా వెక్కడిది గొట్టంలాగుంటుందని అన్నాడుట. అట్లాగే స్త్రీనిగూడా వర్ణిస్తుంటారు తమకు తెలిసినంతవరకూ. అంతేగాని అగాధమైన నారీహృదయం పూర్తిగా తెలుసుకున్నవా రెవరూలేరు. భగవంతుడు పురుషులను యేదినును పదార్థంతో చేశాడో స్త్రీనిగూడా అదేపదార్థంతో చేశాడు. కనుక స్త్రీ పురుషుడితో సమానమైన స్వరూప స్వభావలక్షణాలుగల మానవప్రాణిగాని మగవారి కలవుపోకడలకు ఆస్పదమైన శుద్ధజడపదార్థం గాదు" అన్నది రాజేశ్వరి తీవ్రంగా.

"అబ్బో! అబ్బో! ఇదిగో శ్రీనివాసులూ! యీ పురుషులతో సమానమైన మానవప్రాణి మొన్న గుంటూరు ఒంటరిగాపోలేక తప్పించుకు తెలిగిందిగోయి. యిప్పుడీ బింకపుమాటలు చూచావా" అన్నాడు రాఘవరావు నిరగబడి నవ్వుతూ.

"ఎల్లప్పుడు ఇనుపపంజరంలో పెట్టి బంధించిన పక్షికి దాని ఎగిరే శక్తి కుంటుపడిపోయి ఉండదా? అయినా ఆ తప్పుమాత్రం ఎవరిది?" అన్నది రాజేశ్వరి. రాఘవరావు దానికి సమాధానం చెప్పకుండా "ఓహో! ఇక్కడ ఉన్న కొద్దీ మనమీద తప్పు లెక్కలైపోతున్నాయి గాని షికారుపోదాము వస్తావుటోయ్ శ్రీనివాసులూ!" అన్నాడు బావమరిదితో. నవ్వుతూ వస్తానన్నాడు శ్రీనివాసులు. బావమరిదు

లిద్దరూ షికారువెళ్లారు. రాజేశ్వరి ప్రయాణపు సామానులు సర్దిపెంటున్నది.

## ౪

రాత్రి యెనిమిది గంటలైంది. రైలు ప్రయాణంలో హైరానుపడి ఉండటంచేత పెద్దపిల్ల లిద్దరూ అన్నంపెట్టగానే నిద్రపోయినారు. పసిపిల్లగూడా పాలుత్రాగి అలిసిపోయినట్టు పడుకున్నది. ఇంట్లో నిశ్శబ్దం రాజ్యం చేస్తున్నది. రాజేశ్వరి విశ్రాంతిగా కూర్చుండి మహిళాసభావృత్తాంతాలు నెమరువేసుకుంటున్నది. సుబ్బమ్మ వంటపని అయినందువల్ల పంతులువారి రాక యెదురుచూస్తూ తలుపు నానుకొని కూర్చుండి సన్నసన్న కునుకులు దీస్తున్నది. ఇంతలో రాఘవరావూ శ్రీనివాసరావు యింటికి వచ్చారు. వచ్చే రావడంతోటే వంటైందా అన్నాడు రాఘవరావు. అయినదన్నది రాజేశ్వరి. "అయితే భోజనంచేద్దాము. ఎందుకు ఆలస్యం" అన్నాడు రాఘవరావు.

రాజేశ్వరినిగూడా తమతో భోజనానికి కూర్చోమన్నాడు. తర్వాత భోజనం చేస్తానంటే రాఘవరావు ఒప్పుకోలేదు. అందఱు భోజనానికి కూర్చున్నారు. భోజనాలవుతున్నాయి. "ఏమిరా శ్రీనివాసులూ ఉద్యోగంమాట యేమీ ఆలోచిస్తున్నట్టులేదేం" అన్నాడు రాఘవరావు.

"ఆలోచించకేమి అయినా ఎక్కడున్నాయి ఉద్యోగాలు?"

"మీ మామగారేమీ ట్రైచేయడంలేదా? ఆయనకు జిల్లాబోర్డు ప్రెసిడెంటుతో వారితో స్నేహితం కాబోలునే."

"స్నేహపుసిఫారసులకు ఉద్యోగాలిచ్చే రోజులు పోయి చాలారోజు లైంది."

"అట్లాగైతే మామగారి యింట్లోనే యిల్లిటం ఉండు, ఇప్పుడు కళాశాలాపట్టభద్రులు చాలామంది నిరుద్యోగ సమస్యను యిట్లాగే పరిష్కారం చేస్తున్నారు. కాఫీ ఫలహారం భోజనం వగైరాలు వేళకు భయభక్తులతో అమురుతాయి భార్యగూడా ఉంటుంది. దివాకులుచేస్తూ దర్జాగా ఉండవచ్చు."

"అత్తవారియింట్లో చాలారోజులుంటే అల్లుడి గౌరవం అడగనక్కరలేదు. వారపుబ్రాహ్మడికన్నా కనాకష్టమైపోతాడు."

"ఆ అట్లా యెందుకు జరుగుతుంది? అదేమంటే నా భార్యను నాకు పంపించండి ఎక్కడికో యేవూరో యేదేశమో తీసుకపోతానని గడబిడచేస్తే సరి చచ్చి ఊరుకుంటారు."

"వాళ్ళయింట్లో మనం పీటలుపెట్టుకొని కూర్చోడమెందుకు? వాళ్ళగౌరవించారనుకోడ మెందుకు? ఎప్పుడో మర్యాదగా వాళ్లు పిలిచినప్పుడే వెళ్లితే గౌరవంగా ఉంటుందిగా."

"ఒరే నీవిట్లా దేవయ్యొరగా ఉన్నావంటే ఎవడూ ఉద్యోగమీయడు. సరిగదా అత్తమామలూ ఘనంగా చూడరు. పెళ్లాంగూడా చెప్పినమాట వినదు. ఆఖరికి యేఫిలింస్టూడియోలోనూ యాక్టుచేయడానికీ ఏ గ్రామోఫోనులోనూ రికార్డివ్వడానికీగూడా పనికి రాకుండాపోతావు తెలుసునా?"

రాఘవరావూ శ్రీనివాసులూ కుర్చీలమీదకూర్చు తాంబూలం వేసుకుంటున్నారు. ఉయ్యాల్లో పసిపిల్ల కదులుతూఉంటే రాజేశ్వరి మెల్లగాపోయి బిడ్డను చిచ్చిగొట్టి ఊపుతూఉన్నది.

"రాజేశ్వరీ ఇంతకూ గుంటూరుపోయి రావడం తప్ప మీ మహిళాసభ యెట్లా జరిగిందో డైవోర్సు తీర్మానం యేమిచేశారో యేమీచెప్పవేం" అన్నాడు రాఘవరావు. రాజేశ్వరిబిడ్డ బాగా నిద్రపోయినట్టు చూచి సావట్లోకివచ్చి "ఇంకా యేమి డైవోర్సు మహిళాసభలో రూపులేకుండా పోయిందన్నది."

"ఏమీ డైవోర్సు తీర్మానం మహిళాసభలో ఎవరూ పెట్టనే లేదా?"

"పెట్టలేదు"

"పోనీ బ్రతికిపోయినాము. మన దాంపత్యానికి మరోసంవత్సరంవఱకూ స్థిరత్వమేర్పడింది."

"డైవోర్సుప్యాసైతేమాత్ర మనదాంపత్యానికేమి నష్టం?"

"నష్టమంటె నష్టమే. నీ సావాసకత్తె లెవరైనా పెనిమిటితో డైవోర్సు పుచ్చుకుంటూ ఉంటే అది నీకుగూడా ముచ్చటైతేనే నేమిచేయను? ఈ ముగ్గురు పిల్లలూ నేను."

"చెల్లమ్మగారి పెనిమిటి చెప్పినట్లే చెప్పుతున్నా రే."

"ఏమి చెప్పాడుట?"

" 'ఒసే నీవు చూడబోతే ఆరుగురు బిడ్డల తల్లివి, ఆ మహిళాసభలో డైవోర్సు ప్యాసుచేస్తున్నారు. దానిప్రకారం మన మిద్దరం మన వివాహం బందం త్రెంచుకొని విడిపోవాలె. అప్పుడు నిన్నూ పిల్లలనూ యెవరు మాస్తారు. ఇంతెసుంది పిల్లలు గలదాని నిన్నెవడు కట్టుకుంటాడు? నిష్కారణంగా అన్యాయమైపోతావు. అటువంటిది ఆ మహిళాసభ. ఆ సభకు పోవాక దానికి చందా యివ్వవాక' అని చెప్పాడుట. అంతటితో ఆమె నూసిలిపోయి వదినె గారు నేను మహిళాసభకు గాసండి. మానా రిట్లా చెప్పారన్నది. ఏమన్నాసరే, మీ మగవారికి డైవోర్సంటె సింహస్వప్నంగాగా ఉన్నది లెండి. అందువల్ల యెన్ని అభూతకల్పనలైనా చేసి ఆడవాళ్లను హడలేస్తున్నారు."

"నా కాభయం మేమీలేదు. నీవు నిక్షేపంలాగా విడాకులుపొంది మరో........."

"అబ్బా! ఏమి మాటలండి! నాకేమి తప్పు ఒప్పు తెలియదు. ఏది చెప్పునంటే అదే."

"అబ్బో! విడాకులంటే యింత తప్పు పట్టుకుంటున్నావు గాని సమానహక్కులూ, స్వాతంత్ర్యము యిత్యాదులంటే ఉప్పొంగిపోతావే."

"దానికేమి. అవి మానవసమాజమునందు హక్కులు. అవి ప్రతిస్త్రీకి ఉండితీరాలె. అయితే విడాకులకు బదులు మగవారిమీద ఒకటి ప్యాసుచేశాము లెండి."

"ఏమిటది."

"భార్య జీవించియుండగా యే మగవాడూ మళ్లీ పెళ్లి చేసుకోరాదని."

"లక్ష్య చేసుకోండి మాకేం."

"అవును. మీకేమీ? చట్టసభల్లో మెజారిటీ మీదేగా?"

ఒకరు చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం (Oriental Manuscript Library, Madras) వెళ్లి అచటనున్న ఉద్యోగితో,

"ఏమండీ, 'కృషీవలుడు' అను అచ్చు పుస్తకాన్ని ఒకమారిస్తారా?"

ఉద్యోగి "ఇది 'లిఖితపుస్తక భాండాగారం' అని తెలీదూ?"

అడిగి నాతడు వినయంతో "చిత్తం. వ్రాతప్రతే యిలా దయచేయించండి."



శ్రీమతి కె. ఎ. ముత్తులక్ష్మి అమ్మాళ్. కొడుమూడు నివాసిని. హరికథకురాలు. కోయంబుత్తూరు డిస్ట్రిక్టుబోర్డునకు పోటీలేకుండా ఎన్నుకొనబడినది.

# భాగ్యజీవి

(జటావల్లభుల వెంకటరత్నమ్మగారు)

ఉ. కలకలనవ్వు మోమున వి ♦ కాసముగన్పడ, చిన్నిగజ్జెలన్
గలగల నాదముప్పతిల ♦ కాలొకప్రక్కముడించి ప్రాకి, నా
యలజడి విన్నతోనె మధు ♦ రాననమెత్తుచు చేయిసాచు నీ
గులుకుచు జేరదీయుటయె ♦ కోటిఫలంబులసార; మర్భకా!

ఉ. అల్లదె "దాయిదాయి" యని ♦ యాటలపాటల బుద్ధిజొన్పుచున్
"తల్లిదియిద్ది, మామదిది, ♦ తండ్రిది, ముద్దను మ్రింగు" మంచు నీ
మెల్లని మాటలన్ మఱిపి ♦ మేనునజేరిచి బువ్వబెట్టుటే
చల్లని జీవితంబునకు ♦ సార్థకమౌపనిగాదె? బాలకా!

ఉ. పూచినతమ్మిబోల్ మొగము ♦ పున్నమచందురు ధిక్కరింప, చే
సాచినతోనె పైకెగసి ♦ చయ్యనబాహుల నాశ్రయించి, దో
బూచులఁజూడ్కి మీదనిడి ♦ ముద్దుగలేబెదవుల్ గదల్పనా
నీ చిరునవ్వువెన్నెలలు ♦ నెమ్మదిఁజల్లగ జేయునర్భకా!

ఉ. "విద్దెమువిద్దె" మంచుకడు ♦ వేడుకతో నినునిల్ప, చేయి నా
యొద్దకుసాచి, చిర్నగవు ♦ లూరెడుమోమును మీదికెత్తి మేల్
సుద్దుల నత్తతాతయును ♦ చోద్యము కన్నులకింపుగూర్చు నీ
ముద్దులతీవి జూచుటయె ♦ మోదములందున మోదమర్భకా!

ఉ. అంగముధూళిధూసరిత ♦ మౌతఱి ముట్టగరాకుమంచు, చే
రంగనివారణన్ సలుప ♦ లౌల్యతలేచి, మఱింతవేగము
ప్పొంగగతోనె మీదబడి ♦ పూర్ణముగా మలినంబొనర్చు ని
న్నుంగని కోపమందుటయె ♦ నోచిననోముఫలంబు, బాలకా!

చ. కలిగిన భావముముట్టిపడ గాంచుచు నేవియొ ముద్దుపల్కులన్
బలుకగ, భావముందెలియ ♦ బల్మఱుపృచ్ఛనొనర్ప, నేడ్పుచున్
దెలియగరానివర్ణముల ♦ దీనతబల్కెడు నిన్నుజూచి లో
పల విసుగొందు జీవితమె ♦ భాగ్యములందు నభాగ్య మర్భకా!

# బిడ్డలు — కలలు

బుర్రా వెంకటనాంచారయ్యగారు ఎం.ఏ.

కొన్ని మాసముల క్రిందట "స్వప్నలోక" మను శీర్షిక క్రింద ఆంధ్రపత్రికయందు శిశు స్వప్నములగూర్చి కొంతవఱకు వివరించితిని. అనాగరిక జాతులు మనయాత్మ స్థూలదేహమును వీడునపుడు అనుభవించెడి కష్టసుఖములే స్వప్నములని నుడువుచున్నవి. నాగరికులు కలగనువాఁడు తన భవిష్యత్తునుగాని తాను కలలోఁగాంచిన మరియొకని యదృష్టమునుగాని స్వప్నములోఁజూడ గలడని స్పష్టపరచుచున్నారు. కాని సైకోయనలిస్టులలో నొకఁడగు ఫ్రాయిఁడుగారు స్వప్నములొక నిర్దిష్టార్థమును సూచించుచున్నవనియును, ఇట్టికల లెవ్వనియందంకురించునోవాని వ్యక్తిత్వమును నడతను బహిర్గతమొనర్చుటయందు, అవి తోడ్పడుననియును నుడివిరి. అందువలన శిశు స్వప్నముల తెలిసికొనినచో వానిభావముల పెద్దవారమగు మనము తెలిసికొని యట్టివారిని సన్మార్గమున పట్టింపవచ్చును.

వయోప్రాదుర్భావసమయమున బిడ్డలు గనుపరచు వింతచేష్టలు:—ఉలిపితనము మొదలగు లోపములు చిన్నతనమున తగినంత క్రమ శిక్షణము లేనందున బిడ్డల నావరించును. చెట్టైవంగనిది మ్రానైవంగునా? అట్టి లోటుపాట్లు బిడ్డలకబ్బకుండ చేయుటకు తల్లితండ్రులు యథాశక్తి పాటుపడుట యుచితమే. బిడ్డనియట్టి దుష్పథంబున బెట్టు విషయములెవ్వియో వాని స్వప్నవృత్తాంతమును తెలిసికొనినచో మనము గుర్తెఱుంగగలము. కాని వారినుండి యట్టి ప్రవృత్తిని రాబట్టుటకు మనమునల్లమేకను తేవలసినదే. సాధారణముగా పిల్లలు మనము గేలిచేయుదుమనిగాని ఏమయిన ననుకొందుమనికాని వారి స్వప్నవృత్తాంతముల మనకు చెప్పుటకు వెనుకాడుదురు. అదియునుగాక కొందఱు బిడ్డలు వారికి స్వప్నలోకమునందు గలిగిన యనుభవముల మనకు విప్పి చెప్పలేరు.

అయినను వారి ముఖలక్షణములఁబట్టియే మనము వారికెట్టి స్వప్నములువచ్చెనో కొంతవఱకు తెలిసికొననోపుదుము. బిడ్డలు స్వప్నానుభవములకును లోకానుభవముల కునుగల భేదమును గుర్తింపఁజాలరు, కనుక యుదయమున లేవగనే గతరాత్రి దుస్స్వప్నములువచ్చిన బిక్కమొగముపెట్టి యేడ్చుటయేగాక దినమంతయు తేటగా యుండదు. కాని యుత్సాహజనకములగు స్వప్నముల గాంచినచో వారలు తేజముగలిగియుందురు.

బిడ్డలు 12 సంవత్సరముల లోపలను 13 వ యేడు దాటిన తర్వాతను సర్వసాధారణముగా కలలు గనుచునే యుందురుగాని పదమూడవయేట స్వప్నములు వారికంతగా

రావు. పదిసంవత్సరములకు లోపల బిడ్డలకు చలనహేతు స్వప్నములు (Kinesthetic) అంతగారావు. కాని 10 మొదలు 17 సంవత్సరములవఱకు నిట్టి స్వప్నములు మితముగా వచ్చును. పుష్టుగాతిను బిడ్డలకివి యెక్కువగా వచ్చును. సామాన్యకుటుంబములకు జెందిన వారికి నివి యరుదుగా వచ్చును. 5 మొదలు 7 సంవత్సరములవఱకును బిడ్డలు తమ గృహవిషయములకు సంబంధించిన కలలుగందురు

అయిదు సంవత్సరముల బిడ్డ స్వప్నలోకమున తానే ప్రధానస్థానము నలంకరించును. ఈ యీడుబిడ్డలు సంబంధ బాంధవ్యముల నంతగా గుర్తింపజాలరు. కాని 7 సంవత్సరములు రాగానే చుట్టముల సహితము కలలయందు గుర్తింపగలరు. ధనవంతుల శిశువులకంటె ధనహీనుల బుడుతలే యాటవస్తువులను గూర్చిన కలలుగందురు. సాహసము ధైర్యమునకు సంబంధించిన కలలీ యీడువారలకంతగారావు. కొన్నివేళలయందిట్టి బిడ్డలు తమపాఠశాలనుగూర్చి 8 మొదలు 14 వత్సరములవఱకును కలలు గందురు. పసిబిడ్డలు తిర్యగాదులకు సంబంధించిన స్వప్నముల గాంతురు. మగబిడ్డలు సాహసకృత్యము లొనర్చినటుల తరుచు కలలు గంతురు. వారు దొంగలు, దోపిడిగాండ్రు మొదలయినవారిని నిద్రయందు గాంచి యెక్కువగా క్షోభమును జెందుదురు. కాని యాడుబిడ్డలు వింతగొలుపు పురుషులను వింతగొలుపు స్త్రీలను స్వప్నమునందుగాంచి కలత జెందుదురు. ముసలమ్మలు, జంతువులును సాధారణముగా బాలికలను స్వప్నములందు బాధ పెట్టెదరు. పది సంవత్సరముల వయస్సు పైబడగానే బిడ్డలు కలవరింతలు మొదలుపెట్టెదరు. అందును బాలికలే యెక్కువగా కలవరింతురు. శృంగారాది విషయములగూర్చిన స్వప్నముల బాలికలే యెక్కువగా గాంతురట. కాని 13వ యేడు రాగానే వీరికి నసూయా ప్రధానములగు స్వప్నములు వచ్చును.

పదునాల్గు వర్షములు రాగానే బాలురకు క్షోభహేతువులగు స్వప్నములు రావుగాని బాలికలమాత్ర మివి వీడుటలేదు. ఈ యీడునకు వారికి పాఠశాలకు సంబంధించిన స్వప్నములు మెండుగావచ్చును. మగపిల్లలు తాము మరణించినటుల స్వప్నముల మిక్కుటముగా గందురు. వారికి యక్షులనుగూర్చిన స్వప్నములు రావు. శిశువులు స్వప్నములందు తమ్మే తాము జూతురు; కాని కొన్ని యేండ్లు పైబడిన పిమ్మట తల్లిని తదితరబంధువులను తమ స్నేహితులను క్రమక్రమముగా గాంతురు. 10 మొదలు 16 యేండ్లు వచ్చువఱకు నిట్టి స్వప్నములు వారి కెక్కువగా వచ్చును. బాలురు సాధారణముగా బాలికలనే స్వప్నములందు జూతురు. బాలికలు నట్లే బాలుర దర్శింతురు. భయహేతువులగు స్వప్నము లీయీడున బాలబాలికలకు నమానమే.

కల లెట్లు వచ్చును :— ప్రథమముననే దేనియొక యింద్రియప్రేరణ నూతనముగా మనకుఁ గలిగిన యనుభవముల స్మృతిపథమునకుఁ దెచ్చును. ఈ స్మృతి మనయందంతర్గతము కోర్కెలతో మిళితము జెందును. ఇట్టి కోర్కెలకుగాని కోర్కెకుగాని సంబంధించిన నిజస్థితి మారిపోవుటయేగాక మన స్మృతికూడ కొంతవఱకు తారుమారు జెందియట్టి మన కోర్కెల సులభముగా వ్యక్తపరచునటుల సాహాయ్యంపడును. సాధారణముగా యిది పెద్దవారు స్వప్నముల గాంచు పద్ధతి. బిడ్డలుకూడ యీ పద్ధతిననుసరించియే స్వప్నముల గాంతురు గాని వారి స్వప్నములు సామాన్యస్వభావము గలవి. అవి సాధారణేచ్ఛలనే యావిష్కరించును. పెద్దవారి స్వప్నముల వారి పరిస్థితు నన్నింటిని మనము తెలిసికొనుటకవకాశ మెక్కువగాయున్నది గనుక, సులభముగా విప్పి చెప్పవచ్చును. మొరటువారియు బిడ్డలయొక్కయు స్వప్నములు సాంకేతికములు గాక వారి నిజేచ్ఛనే బయల్పరచును.

శిశు స్వప్నముల నవగతము చేసికొను టెట్లో యించుక విచారింతము. ప్రథమమున వారి స్వప్నములయం దావిష్కృతమగు విషయముల వారి వ్యక్తిత్వము నడత స్థితిగతులతో పోల్చి చూచుకొనవలయును. ఇట్టుల లెక్కకు మీరువారి స్థితిగతులను వారి స్వప్నవిషయములను అవగతము చేసికొని అంతర్గతాంశములగూడ శ్రద్ధతో విచారించి తెలిసికొనిన పిమ్మట యట్టి స్వప్నముల విప్పిచెప్పవలెను.

శిశుస్వప్నములు వారి స్వభావమును తెలిసికొనుటయందు మన కెంతో తోడ్పడుచున్నవి గాన మన మిట్టివిషయములవగతము చేసికొని కష్టసుఖముల నిష్పక్షపాతబుద్ధితో విచారించి వారిని సన్మార్గమును పట్టింపవలయును.

---

"బాబూ! మా అబ్బాయి రంగయ్య తనువద్దనేనా ఉద్యోగంచేసేది?"

"అవును. ఏంకావాలి?"

"నేను రంగయ్య మేనత్తను. అతన్ని కొంచం అవసరంగా చూడాలి"

"పాపము మీరాలస్యంగా వచ్చారండి. మీశవ దహ నంచేయడానికి అతడు మధ్యాహ్నమే వెళ్లాడు."

# తుదిమెట్టు

శ్రీమతి సు. అన్నపూర్ణాదేవిగారు

అతని పేరే సూరయ్య. అతనికొక్కడే కొడుకు. ఈ కొడుకుపేరు రామన్న. రామన్న నాలుగో ఏట తల్లి స్వర్గస్థురాలైంది. భార్యపోయిన సూరయ్యపాట్లు ఎవరికి తెలుస్తాయి — ఆదుఃఖం ఆబాధలూ తల్లిపోయినపిల్లలని పెంచేవాళ్లకే తెలుస్తాయి. ఇంట్లో దిక్కెవ్వరూ లేరు. ఇదివరకు ఇల్లంతా మేసిన బంధువు లిప్పుడు పిలుస్తే పలకడంలేదు. ఏంచేస్తాడు? స్వయంగా వండుకొని తంటాలుపడుతున్నాడు. పిల్లాడిని క్రిందదింపకుండా ఎత్తుకుతిప్పుతున్నాడు. దాసీపిల్ల నొకదాన్ని జీతానికిఉంచి పిల్లాడికి చాకిరీ చేయిస్తున్నాడు.

అబ్బాయికి అయిదోఏడు వచ్చింది. అక్షరాభ్యాసం చేశారు. సూరయ్య కొడుక్కి చదువుచెప్పడం మొదలుపెట్టాడు. వాడికి ఆటలమీద ధోరణి ఇంకా వదల్లేదు. చదువుపేరు చెప్తే భయమేసేది. తిండి తినగానే మాయమైపోయేవాడు. తోడిపిల్లలతో కూడి తోటల్లోను దొడ్లలోనూ తిరగడం మొదలుపెట్టేడు. కొడుకు పాడైపోతున్నాడని సూరయ్య రామన్నని బడిలో ప్రవేశపెట్టాడు. తండ్రి తర్ఫీదుచేతనైతేనేమి పంతులు భయంచేతనైతేనేమి క్లాసులు ప్యాసయినాడు; ఫారాలు దాటుతోన్నాడు.

ఇంతలో ఇర్విన్ దొరగారు శారదాచట్టం పేసుచేశారు. దేశమంతా కలకలం బయల్దేరింది. ఈచట్టం అమల్ లోనికి రాకుండా మేలుకుందామని వయసు వావి, చదువుసంధ్య, అప్పుఆస్తి, అందంచందం ఆలోచించకుండా ఊరూర వేలకొలది పెళ్లిళ్లు బాజాలులేనివి కొన్ని, బ్రాహ్మలులేనివికొన్ని, కట్నాలు ఎగరేసినవి కొన్ని, మంత్రాలులేనివి, మంగళసూత్రాలులేనివి గబగబ అయిపోవడానికి అందుకున్నాయి. ఆసందట్లో సూరయ్యకొడుకు రామన్నక్కూడా ఒకకుఱ్ఱదాన్ని తగిలించారు.

సూరయ్యకు చాలా ఆనందంగానేఉంది. తల్లిలేని పిల్లాడికి తలవనితలంపుగా పిలిచి పిల్లనిచ్చారని సంతోషించాడు. కోడలువస్తుందని ఉప్పొంగాడు. ఇక కొడుకుని బి.యె బి.యల్ ప్యాసుచేయించాలని దీక్ష పట్టేడు. కొడుకును మెల్లమెల్లగా మంచిమాట్లాడి అహోరాత్రములు చదివించడానికి మొదలుపెట్టేడు. ఐతే నేమిలాభం — అబ్బాయిలో సారమేది — తండ్రి తంటాలుపడుతోన్నకొలది కథ అడ్డంతిరుగుతోంది. రామన్న, పెళ్లిఅయిపోయింది కదా ఇక చదువెందుకనుకున్నాడో, ఈఉద్యోగాభావ దినాల్లో దీని ఉపయోగమేమిటి అనుకున్నాడో లేక బహుళ విద్యావ్యాసంగంవలన మెదడు చిట్టెంకట్టుకుపోయిందో తెలియదుకాని మొత్తంమీద అబ్బాయికి చదువు విషతుల్యం అయిపోయింది.

సూరయ్యచేతనైన ప్రయత్నాలన్నీచేసి కుఱ్ఱాడిని దారిలోకి తేవడానికి తంటాలుపడుతున్నాడు. అయితే అబ్బాయి బడిపేరుచెప్పి వెళ్లి రైలుస్టేషనులో మకాంవేస్తున్నాడు. ప్రయివేటు పంతులు పేరుపెట్టుకొనివెళ్లి పేకాలుసజ్జులో ప్రవేశించాడు. పెట్టె బేడ తడిమిపట్టుకువెళ్లిన డబ్బుతో బీడీలు సిగరెట్లు కొంటున్నాడు. కాఫీక్లబ్బుల్లో కాతాలు రాసూన్నాడు. రౌడీసెట్టులకు టీపార్టీలు చేస్తున్నాడు. ఇతని ప్రభావం ఊళ్లో పెళపెళలాడుతోంది.

సూరయ్య ఏమిచేస్తాడు? అతనికి మతిపోయింది. కొడుకు, చెప్పినమాట వినడంలేదు — చదువుకి తిలదకం వదలేశాడు. పైగా పెట్టెతాళాలుకూడా తిప్పడ మొదలుపెట్టాడు. సూరయ్య మొదట నీతిబోధచే

ఋజుమార్గానికి లాక్కొద్దాంఅని చూశాడు. అది అంతకంటె పనిచెయ్యలేదు. తరవాత బూతులపంచాంగం విడేశాడు. అది అంతకంటె పనిచెయ్యలేదు. ఇదికాదురా పని అని వందప్రయోగం ప్రారంభించాడు. ఆదెబ్బతో రామన్న రోడ్డందుకున్నాడు. తండ్రి బడికివెళ్లాడని అనుకుంటూన్నాడు. అబ్బాయి కాసీప్రయాణం కట్టాడు.

సాయంకాలమయింది. రామన్నజాడ కనపడలేదు. సూరయ్య సందులుగొందులు చూశాడు, గుళ్లుగోపురాలు వెతికాడు, నూతులుగోతులు పరికించాడు. రామన్న కనపడడు. అందరిని అడగడంఅయింది. ఇక చేసేపనేముంది? బ్రతికిఉన్నాడా అనేసందేహం పుట్టింది. పశ్చాత్తాపం బయల్దేరింది. సూరయ్య చేసిన పని తప్పనుకున్నాడు. చెంపలువాయించుకున్నాడు. దేముళ్లందరికి మొక్కున్నాడు. కాని ఈసందేహం ఎవరుతీరుస్తారు? గుండెలు దడదడకొట్టుకుంటూన్నాయి. ఒంటమ్మట చెమటప్రవాహం కిందకారుతోంది. సూరయ్యమతిపోయి వీథిఅరుగుమీద చతికిలపడ్డాడు.

కొంతమంది అతనిని చూడ్డానికివచ్చారు. వారు 'ఎక్కడికైనా టెలిగ్రాంలు కొట్టావయ్యా' అని సూరయ్యకు చెప్పేరు. అప్పుడు ఆతనికి కొంచెం స్మృతివచ్చింది. పెట్టెతీసి గుప్పెడురూపాయిలు పట్టుకువెళ్లి పోస్టుమేస్టరుగారి చేతిలోపోశాడు. తనకున్న బంధువులందరికి టెలిగ్రాములు కొట్టించాడు. తిండి తిప్పలు లేకుండా ఆఫీసుగుమ్మంలో పడుకొని రామస్మరణ చేస్తూన్నాడు. రెండుఝాములైంది. గణగణ చప్పుడొకటి వినబడింది. పోస్టుమాస్టరు. 'రాజపురంలోఉన్నాడు' అని వార్తచెప్పాడు. సూరయ్య తక్షణం గుడ్డములుపుకొని బయలుదేరి రాత్రి రైలుమీద ఆఊరువెళ్లి తనముద్దులకొడుకుని వెంటబెట్టుకొని స్వగ్రామంచేరుకున్నాడు. సూరయ్య తనకొడుకును బాగుచేసుకోడానికి ప్రయత్నించడం ఎండమావుల్లో నీళ్లకోసం వెతకడంలాంటిదే అని నిస్పృహచేసుకున్నాడు.

## ౨

పడకటింటిలో గుసగుసలు బయలుదేరేయి. ఆగుసగుసలు క్రమక్రమంగా బెకబెకలయాయి. ఆగదిలో గవ్వలచప్పుడు వినబడుతోంది. గచ్చకాయల గలగల వినబడుతోంది. పేకకలుపుడు వినబడుతోంది. నాటకపుపాటలు వినబడుతూన్నాయి. నాగమ్మపాటలు వినబడుతున్నాయి. రామన్నలచ్చమ్మ ఏకమై అంటుకుపోయినట్టైపోయారు. ఒకరోజు ఒకనిమిషంకింద ఎగిరిపోతోంది. సూరయ్య, కోడలువచ్చిందికదా ఇక కొడుకు బాగుపడతాడేమో అని అనుకున్నాడు. కాని వెనకటికంటె ఇప్పుడేమీ మెరుగనిపించలేదు. అప్పుడు రామన్న ఇంటిపట్టునఉండక కనపడేవాడుకాడు. ఇప్పుడు పడకగది విడిచిపెట్టక కనపడడంలేదు. అప్పుడు తండ్రికికనపడ్డ కొత్తవిశేషాలు —. పలకరిస్తే పలకడు. కనబడితే కళ్లెట్టచేస్తాడు. బ్రతిమాలితే బుస్సుమంటూన్నాడు. సూరయ్య ఆశలన్నీ అడుగంటిపోయాయి; చిత్తభ్రాంతికలిగింది; సన్యాసంపుచ్చుకుందామా, దేశాంతరంపోదామా అని ఆలోచిస్తూన్నాడు. కాని మనస్సులో ఒకఉద్దేశ్యం పీక్కుతింటోంది. దానిఫలితంకూడా చూద్దాంఅని అని ఓపికపట్టాడు.

సూరయ్య సమయంకోసం చూస్తూన్నాడు. ఒకనాడు రామన్న లచ్చమ్మకి పువ్వులుతెద్దాంఅని ఊళ్లోకివెళ్లేడు. సూరయ్యకి మంచిసమయం దొరికింది; కోడలిని పిలిచాడు. మంచిమాటలుచెప్పి సావకాశంగా కూచోపెట్టి ఏదోమంత్రం ఉపదేశంచేశాడు.

లచ్చమ్మ చదువుకున్న తెలివితేటలుకలపిల్ల. చెప్పినంతమాత్రమున మాటలో సారముగ్రహించే బుద్ధిమంతురాలు. సింహపుపిల్లకూడా పెద్దఏనుగు కుంభస్థలాన్నే తినాలని ప్రయత్నంచేస్తుందిట. స్వభావజన్యములైన సద్గుణములు కలవాళ్లు చిన్నవాళ్లైనను గొప్పపనులు చేయడానికి సాహసిస్తారు.

రామన్న:—(వచ్చి) ఇవిగో పువ్వులు. నీకు కావలసినవన్నివచ్చాయి. దండలు గుచ్చు. నీకుకొన్ని నాకుకొన్ని. కానీ —

లచ్చమ్మ:—(పువ్వులన్నీ ఒక పళ్లెంలో పోసి వాటిల్లో కొన్ని వాకట్లోకి గిరవాటేస్తోంది.)

రామన్న:—అదేమిటే? పువ్వుల్ని పారేస్తున్నావు?

లచ్చమ్మ:—ఇవెందుకండీ నిర్గంధకుసుమాలూ! వీటిని తాకితే మన తెలివితేటలుకూడా పోతాయి.

రామన్న:—(కొంచెం వెలవెలపోయేడు) అయితే నీఅభిప్రాయం ఏమిటి? మనం చదువువచ్చినవాళ్లం అనేనా నీఊహ —

లచ్చమ్మ:—ఎందుకూ కొందనివాళ్లమనే.

రామన్న:—అటయితే ఆ సువాసనగల పువ్వుల్ని మనం తాకితే వాటికి నష్టంవస్తుందేమో వాటిని వీధులోపారెయ్యి.

లచ్చమ్మ:—వాటికి నష్టంవచ్చినా అవి భరిస్తాయి. అవి పరోపకారబుద్ధితో పుట్టాయి. పరోపకారులు కష్టనష్టములకు ఓర్చుకుంటారు. వాకట్లో పువ్వులు మనంటివి. ఇవి పండితులవంటివి. పండితులస్నేహం వలన కలిగేలాభం వీటివూలాన్నికూడా మనకు కలుగుతుంది. అవి మనదగ్గిరఉన్నంతసేపూ విద్వాంసులు విద్యవలన ఎంతగౌరిమను పొందుతూన్నారో మేము కూడా మా సువాసనవలన అంతగౌరవమునుపొంది ప్రతివారి శిరసుమీదికీ ఎక్కుతూన్నాం అని చెపుతూంటాయి. మేము సువాసనను సంపాదించినట్లు మీరు విద్యను సంపాదించి గౌరవాన్ని పొందండోయి అని కేక వేస్తూంటాయి.

రామ:—అబ్బో! ఉపన్యాసాలు మాగట్టిగా కురిపించేస్తూన్నావు. ఇంకా మాటలు కట్టిపెట్టి రెండుపేకాటలేదాంరా —

ఇంతలో సాయం సమయమయింది. భార్యాభర్తలిరువురు పడక్కివెళ్లేరు. ఇద్దరిమనస్సులు ఆలోచనలలో మునిగిపోయినాయి. ఒకరితోఒకరు మాట డుకోడంలేదు. కన్నులు మూతలుపడ్డంలేదు. తెల్లవారింది. మళ్లీరామన్న గవ్వలాటకు గళ్లుగీస్తూన్నాడు. లచ్చమ్మ గజేంద్రమోక్షం తీసింది 'గజప్రాణావనోత్సాహియై' అని పద్యంచదివి ముగించింది. దీని కర్థం చెప్పమని భర్త గెడ్డంపట్టుకుని బ్రతిమాలింది. పాపం ఇతనికా పద్యంలో ఒకమాటకీ అర్థం తెలియదు. పైకీ — కిందకీ — కొంతసేపుచూశాడు. 'సరే అర్థం ఆనక చెపుతాను కాని రెండాటలు వేద్దాంరా' అన్నాడు.

'ఆటమాట దేముడెరుగును. మీ కీపద్యానికర్థం వచ్చునా రాదా చెప్పండి బ్రతిమాలుకుంటాను' అని లచ్చమ్మ దీనంగా ప్రార్థించింది.

రామన్న జవాబు చెప్పడానికి కొంతసేపు తటపటాయించాడు. గత్యంతరంలేదు. తన అజ్ఞానాన్ని ఒప్పుకోనక, తప్పిందిగాదు. 'పద్యంలో ఒక్కమాట కూడా నాకర్థంరాదు. ఇదినిజం. ముమ్మాటికినిజం' అన్నాడు. లచ్చమ్మముఖం ఇంకా ముడుచుకుపోయింది.

లచ్చ:—(కళ్లమ్మట నీళ్లు కారుస్తూ నిలుచుంటుంది.)

రామ:—(నిశ్చేష్టుడై ఏమనడానికి తోచక) ఏడిశావు. నీ అభిప్రాయం ఏమిటి.

లచ్చ:—(కళ్లు తుడుచుకుని) నీ అభిప్రాయం ఏమిటన్నారు కనుక చెపుతాను వినండి. నే చెపితే ఏమి లాభం—నే చెప్పినట్లు చేస్తానని చేతిలో చెయ్యి వేస్తారా.

రామ:—నీ చేతులో చెయ్యి పెళ్లినాడే వేశాను మళ్లీ ఎందుకు.

లచ్చ:—అలాగైతే నన్ను చంపుకు తిన్నట్లే.

రామ:—అలాగే నువ్వు చెప్పినట్లు తప్పకుండా వింటాను. వినకేమి చేస్తాను. నామాట నువ్వు వినక

పోతే వచ్చేనష్టం నాకుమాత్రం తెలియదా ఏమిటి. చెప్పు చెప్పు. ఏరాకడ కొస్తావో చూస్తాను.

లచ్చు:—రాకడకేముంది. మన ఉభయుల శ్రేయస్సుకోసమే చెప్తున్నాను. భగవంతుడు నాయందుంటే నా ప్రబోధము మీకు నచ్చుతుంది. లేకపోతే నా ఖర్మం అని నోరుమూసుకొని ఊరుకుంటాను. నేను మన సంసారస్థితిగతులను విన్నాను. మనం ఒక పేదకుటుంబంలోవాళ్ళమని బోధపడింది. చిరాయువులై మామగారు బ్రతికియున్నంతకాలము మనము రెండు మెతుకులు తినగలుగుదుమేమో కాని ఆయన అనంతరమందు మనము ప్రాయోపవేశము చేయవలసిందే. ఒకవేళ మనకి సంతానం కలుగుతుందనుకోండి. అప్పుడు మనకే తిండిలేకపోతే వాళ్లగతి ఏమిటి. ఇంతమంది కట్టకట్టుకొని గోదావరిలో దిగవలసిందే. ముందుగతి చూస్తేనా గుండె నీరై పోతుంది. నన్ను రక్షించి నామాట వినాలి. మీ రెలాగో కష్టపడి కొన్ని పనికొచ్చే పరీక్షలు ప్యాసవాలి. మనపట్టుకు తిండివచ్చే ఉపాయమైనా చూసుకోవాలి. అంతవరకు నాకు నిద్దరపట్టదు. ఏం చెపుతారు.

రామ:—(నిర్ఘాంతపోయి రాతివిగ్రహము లాగ రెప్ప వాల్చకుండా చూస్తూ కూచున్నాడు.)

లచ్చు:—అదేమిటి అలా చూస్తారు. వీనిలో కష్టం ఏముంది. గొప్ప బుద్ధిమంతులైనవాళ్లు ఒక రోజులో చదవగలిగితే మీరు రెండు రోజులు పడుతుందనుకోండి. దానివలన నష్టం ఏమిటి. ఇవిగో బంగారపుగాజులు (అని చేతులవి తీసేసింది) మీ నాన్నగారిని డబ్బు అడగడం ఇష్టంలేకపోతే ఇవి అమ్మేసి పుస్తకాలు కొనిపట్రండి. (అని అతని చేతిలో పెట్టింది.) ప్రయివేటుమేష్టరు కావలస్తే నా గొలుసమ్మెయ్యండి. మీరు దీపంవెలిగించి బల్లదగ్గర కుర్చీవేసి ప్రతిరోజూ శిద్ధంచెయ్యడం పూచీనాది. మీతోగూడా అహోరాత్రాలు నేనుకూడా తెనుగు చదువుతూంటాను. ఇక మీ కేమిలోటు బయలుదేరండి. పుస్తకాలు తీసుకురండి (అని భర్తను లేవదీసింది.)

రామన్నకు తిరగా స్కూల్లో చదవటానికి సిగ్గేసిందో చదవలేననుకున్నాడో తెలియదు కాని బజారుకు వెళ్లి శిల్పాదికగ్రంథాల్లో కొన్ని కొనుక్కొచ్చాడు. లచ్చమ్మ మనుచరిత్ర కొనుక్కుంది. ఇద్దరూ రాత్రింబగళ్లు ఒకరినొకరు విడవకుండా చదవడం మొదలుపెట్టారు. రెండు సంవత్సరాల్లో రామన్న రెండు త్తమపరీక్షలు ప్యాసయినాడు. లచ్చమ్మ కాలంలో మూడు తెలుగుకావ్యాలు ముగించింది. మరొక సంవత్సరానికి రామన్న ఉద్యోగం సంపాదించాడు. ఉత్తమకాంతల కార్యాలు సఫలాలు కాకపోతాయా.

సూరయ్యకోడలి కుపదేశంచేసిన మంత్రం పట్టిచ్చింది. సూరయ్య సన్యాసం సంగతి కట్టిపెట్టాడు. అత్యంతానుకూల దాంపత్యముతోను సంతానైశ్వర్య సంపదలతోను తులతూగుతూన్న కొడుకుని కోడలిని చూసుకొని సూరయ్య పరమానందంతో కాలక్షేపం చేస్తూన్నాడు.

బాగుచేసినా పెళ్లామే, పాడుజేసినా పెళ్లామే.

‘ఏకా భార్యా సుందరీవా దరీవా’

# సాహిత్యము—దాని మహత్త్వము

శ్రీమతి కస్తూరి రామలక్ష్మీదేవిగారు

సర్వవ్యాపక ఈశ్వరస్వరూపమును తెలుసుకొనగలిగినది జ్ఞానవస్తువు. భగవంతుడ గోచరుడగు నప్పటికీ జ్ఞానసులభుడనియే యెఱుంగవచ్చును. అట్టి జ్ఞానరాశియందొక భాగము సాహిత్యము. సాహిత్యమున కర్థము జ్ఞానము, జ్ఞానమున కర్థము సాహిత్యము అని చెప్పవచ్చును.

భావప్రకటనకు ముఖ్యమైనది భాష. సాహిత్యములేని భాషవికాసము నొందఁజాలదు. ఎంతటి రూపవతియైనను గుణహీనయగు స్త్రీ సంఘములో నిరాదరురాలై యెట్లు వ్యాకులపడుచుండునో ఆవిధముగానే సాహిత్యములేని భాష యితరభాషలముందు అనాదరణకు పాలగుచుండును. భాషయొక్క శ్రీ సంపన్నతయు, జీవకళయు, దానియొక్క వికాసమునూ సాహిత్యమునందే ఆధారపడి యున్నవి. ధార్మికోద్దేశ్యములు, సాంఘిక సదుపదేశములు, ఐతిహాసికదృశ్యములు రాజకీయ సమస్యలు ఆధ్యాత్మిక అనుష్టానములు భాషాసాహిత్యమునందు ప్రతిబింబితములై యున్నవి. జాతియొక్క శక్త్యాశక్తులు సజీవ నిర్జీవత్వములు, సభ్యతాసభ్యత్వములు ఆయాభాషలయొక్క సాహిత్యమునందు నిర్ణయింపబడుచున్నవి. సాహిత్యములేని భాష, మరియు ఆభాషకు చెందిన జాతియు, అసభ్యతజాతియని చెప్పబడుచున్నది. జాత్యవస్థ లెట్లుండునో సాహిత్యావస్థలు కూడ నట్లేయుండును. జాతియొక్క క్షమతా ప్రతిబింబము చూడవలెననిన సాహిత్యదర్పణమున జూడగలము. అట్టి అద్దమున కెదుట నిలువబడినయెడల సామాజిక వ్యక్తిత్వము పూర్వమునం దెట్లుండెనో ప్రస్తుతకాలమునం దెట్లు మార్పుచెందెనో తెలియగలదు.

శరీరమునకు ముఖ్యముఁగా కావలసినది భోజనపదార్థముకదా. అదిలేనిచో శరీరము అచిరకాలములోనే నాశోన్ముఖమగునని యెల్లరెఱింగిన విషయమే. ఆవిధముగానే సాహిత్యరసాస్వాదనములేని మస్తిష్కము క్రియారహితమై నిష్ప్రయోజనమై తుదకు నిర్జీవమగుచున్నది. కాని యింకొక విశేషము తెలుసుకొన తగియున్నది. అభోజ్యపదార్థము వలన శరీరము రోగగ్రస్థమై చెడిపోవుచున్నది. తదనుసారముగా వికృతభావనలు మస్తిష్కమునకు హానికరములగుచున్నవి. వ్యక్తియొక్క అధఃపతనమునకు అజ్ఞానముకంటె వేరొకవస్తువేదియు లేదు. జాతిని జీవకళాభివృద్ధికిగాను, సభ్యతాసంపన్నముగాను చేయదలచినయెడల ఉత్సాహపూర్వకముగా ప్రాచీనకాలమునందువలె సాహిత్యమహాదేవిని సంసేవించుటయె ప్రథమకర్తవ్యమని ముఖ్యాభిప్రాయము.

ఇతరదేశజాతులను చూచినయెడల సాహిత్యమే అచ్చట సాంఘిక రాజకీయ

ఆర్థిక సమస్యలయందు గొప్పగొప్ప మార్పులను కలుగచేసి మహోన్నతమైనటువంటి అలజడులను గలుగజేసి అచ్చటచ్చటి దురాచారములను నామూలాగ్రముగ త్రుంచివైచి తన జాతిని సంరక్షించుకొన గలిగినట్లు తెలియుచున్నది. ఇంతయేల? సాహిత్యమునందొక గొప్ప మహాశక్తి దాగియున్నది. అట్టి దానిని యేయుద్ధసామగ్రులయందును చూడజాలము. ఇతర దేశములయందు సాహిత్యమే ఆత్మ స్వాతంత్ర్యబీజమును సుదృఢముగ నాటియున్నది. తన ముద్దుబిడ్డలను వ్యక్తిగత స్వతంత్రభావములలో పెంచి పెద్దవారినిచేసి పతనోన్ముఖమునుంచి పునరుద్ధరించినది సాహిత్యజననియే !

మృత్యువాతంబడినవారలను పునర్జీవితులుగా చేయుటకు సాహిత్యము సంజీవి వంటిది. పరాధీనమునంబడి పరాక్రమశూన్యమై ప్రభావరహితమై పతనోన్ముఖమైన జాతిని లేవనెత్తినది సాహిత్యమేకదా? అజ్ఞానాంధకారమునంబడి సాహిత్యమహాదేవిని సేవించి పూజించనిజాతి అసహాయియై తుదకు తన వ్యక్తిత్వమునే పోగొట్టుకొనుచున్నది.

మహత్తరకార్యములను కొనసాగింపకలిగెడివాడు మానవుడే! ఆతనికి పరమేశ్వరుడు అన్ని శక్తులను ప్రసాదించియున్నాడు. సర్వశక్తియుతుడగుటప్పటికీ కార్యసాధనకు గడంగకుండుటయందొక ప్రకృతి స్వభావము గలదు. అదియే జీవకళాభ్యుదయమునకు విఘ్నము గలిగించుచున్నదని తెలుసుకొనవచ్చును. మహోదాశయములయందు సఫలమనోభీష్టులగుటయే మానవోద్దేశ్యము. కాని అది ఈశ్వరాధీనము కదా ?

జాతికి జీవకళను ప్రసాదించెడిది సాహిత్యము. మహత్తరకార్యములను కొనసాగించు యత్నములలో అదియొక ప్రథమసోపానముగా కాన్పించుచున్నది. ఉట్టి కెగురనిదే స్వర్గమున కెగురుట కష్టముగదా? సర్వశక్తియుతమగు సాహిత్యమును సేవించి పూజించి ప్రేమించనిదే మానవుడు యింకేమి చేయగలడు ? ఆర్థిక సాంఘిక రాజకీయ సమస్యలయందు తీర్ణులగుటకు సాహిత్యసంపాదకులను మార్గదర్శకులుగా యెంచుకొనవలయును. వారలకన్నియు సులభసాధ్యములు. సాహిత్యవిశారదులు విశ్వవిజితులగుటకు సందియము లేదు.

జ్ఞానమునందొక భాగమైనటువంటి సాహిత్యము ఆధునిక ప్రపంచమునందు అందును చాలభాగము స్త్రీలలో మిక్కిలి కొరతగా కాన్పించుచున్నది. జ్ఞానమనునది తెలియక చేయునదేమియు లేక, కడుయిడుములంబడుచు, నిస్సహాయలై తిరుగు సోదరీమణులెందరో గలరు. అట్టి తనయనుంగు బిడ్డలవ్యక్తిగత స్వతంత్రబీజములను సుదృఢముగ నాటిపెంచి పోషించి వారలను పతనోన్ముఖమునుంచి పునరుద్ధరింపగలిగెడిసాహిత్యమహాజననికి వందనసహస్రము లర్పింపదగును.

# కేసరిగారి ఇతర ఔషధములు

జయప్రదావకము: విజయవటి

కలరామందులు వెల రు. 1 0 0

శ్రీఫలాదిపానకము

నీళ్లవిరేచనములకు 3 ఔ వెల రు. 1 0 0

చరకామృతము

మహామ్మారిమందు 3 ఔ వెల రు. 0 12 0

లోహారిష్టము

పాండువుకు 12 ఔ వెల రు. 3 0 0

శారిబ

పురాణసెగరోగములకు, శ్వేతప్రదరములకు

12 ఔ. వెల రు. 3 0 0

మదనకామేశ్వరి

శయ్యాసుఖమునకు వెల రు. 3 0 0

ఆదిత్యలవణము

అజీర్ణములకు వెల రు. 1 4 0

రతివల్లభరసాయనము

పుష్టినికలిగించుటకు 40 బిళ్లలు వెల రు. 2 0 0

భృంగామలకతైలము

మెదడు చల్లబడుటకు 6 ఔ. రు. 1 0 0

లాక్షాతైలము

అభ్యంజనతైలము 6 ఔ. వెల రు. 2 0 0

కుమారితైలము—లేపము

మూలవ్యాధిమందులు తైలం వెల 2 0 0

లేపం వెల 1 0 0

మేహకులాంతకతైలము

సవాయిజాడ్యములకు విరేచనౌషధము.

6 ఔ. వెల రు. 3 0 0

మారుతీతైలము

సెగరోగములకు వెల రు. 1 0 0

వ్రణశోధన

వ్రణశోధనమునకు వెల రు. 0 8 0

మార్తాండలేపము

చర్మరోగములకు వెల రు. 0 8 0

సోమరాజాదిలేపము

బొల్లికి బుడ్డి వెల రు 2 0 0

మధుమేహవటి

అతిమూత్రవ్యాధికి 40 బిళ్లలు రు. 3 0 0

కఫకేతువటి

దగ్గు, పడిశములకు 24 బిళ్లలు రు. 0 12 0

కుముదవటి

సుఖభేదిమందు 24 మాత్రలు వెల రు. 0 12 0

క్షారతైలము

కర్ణరోగనివారిణి వెల రు. 0 8 0

సిద్ధామృతచూర్ణము

కేసరి కాఫీపొడి వెల రు. 0 8 0

విషవిధ్వంసిని

తేలుమందు వెల రు. 0 8 0

బిల్వాదిలేహ్యము

పాండు, విషదోషములకు బుడ్డి 1 0 0

చ్యవనప్రాశ

కఫజాడ్యములకు వెల రు. 1 0 0

# విద్వాన్ కవితిలక కవితావిశారద
# కాంచనపల్లి కనకాంబగారు

ఒ. వెంకటరంగయ్యగారు

కనకమ్మ యనినను కనకాంబయన్నను కించిద్వర్ణ భేదమేగాని, యర్థభేదము లేదు. మొదటిది వికల్ప సాధ్యము, రెండవది సావర్ణ్య విధిప్రాప్తము. ఎట్లు జూచిన ప్రకృతి "కనక" మే. జీవయాత్రాపీఠికయందలి యుత్పలమాలికా మధ్యమున నిజనామాక్షర ముకుళము "కనకమ్మ"గనే తీరినది. మఱియు నా యుద్గ్రంథో ల్లాస తార్తీయమునందలి నన్నూటరైదవ కందమునను నిదియె చిత్రితమైయున్నది. ర.గశతకపు 77-105 పద్యములును, 1917 నందలి ప్రకటితమైన అమృతవల్లి యు, 1925 వ నాటి గౌతమబుద్ధచరిత్రమును 1932 లోని శ్రీమద్రామాయణ కథాసంగ్రహమును యన్వయ న్యాయమున కనకమ్మనే రూఢిజేయుచున్నవి. కన కాంబాపక్షమున (1929) అభిజ్ఞానశాకుంతలము కలదు. మహా ప్రౌఢకవిత్వసంపదచే చెన్నలరారు జీవయాత్రా హంసవిజయము లుభయపార్శ్వముల కనుకూలించుచున్నవి. వస్త్వైక్యము సిద్ధమగుచుండ నామరూపవికారము గణింపఁదగినదికాదు. ఈమెకు "రంగమ్మ" యను నింటివాడుక పేరున్నట్లు తెలియు చున్నది.

ఇంటిపేరు కంచనపల్లియా, కాంచనపల్లియా? అమృతవల్ల్యాదులఁ గొన్నిట "కంచనపల్లి" కాన నగును. శాకుంతలా జీవయాత్రాదులు కాంచనపల్లి నభిమానించినవి. కంచన (కంచన్న) యనునొక పుణ్య పురుషునివలన కంచనపల్లి యేర్పడియుండును. అమ్మన బ్రోలు, సిద్ధనకొండూరు, రామనపాశెము ఇత్యాది గణములలోనిది. కంచి, కాళహస్తి, కాశిలోనగు పుణ్య క్షేత్రములు స్త్రీపురుష నామములుగ గ్రహింపఁ బడుచున్నవి.

ఇక కాంచనపల్లియె సిద్ధముగావలయునెడల బంగారు గలయూరని యన్వయముగ నుండఁగలదు. పొన్నూరు, వజ్రకరూరు లోనగు గ్రామనామములు గలవు గదా? కాంచన మిచట బంగారమగునెడల నింతకాలముదనుక నుండనిచ్చి యుండురాయను సందేహము నొందమునెడ కాంచనమొక వృక్షనామ ముగగూడ యున్నది. తుమ్మలపల్లి, మామిడిపూడి, చింతతోపు లోనగున విట్టిగ్రామనామముల కుదాహర ణము లగుచున్నది. కంచనపల్లియో కాంచనపల్లియో ఇది గోల్కొండ సీమయం దున్నటుల దెలియు చున్నది.

ఈ యింటిపేరటివారు తెలుఁగు బ్రాహ్మణ తెగ లలో శ్రీ రామానుజీయ పక్షమవలంబించిన తెన్కలై (తెంగలి) సంప్రదాయమునకు చేరిన వారుగ నున్నారు. వ్యావహారికమున నీతెగవారిని గోల్కొండ వ్యాపారు లనుచున్నారు. నిజాంరాజ్యమున వీరికి వైష్ణవులనియె వాడుకపేరు. వ్యాపారశబ్దమున కిచట వాణిజ్యపరముగ నర్థముకాదు. నియోగులన సెట్లు ఉద్యోగధర్మమున నుండువారని వాడుకయో నటులే వ్యాపారశబ్దమునకును నిచట వ్యాప్తి సిద్ధమగుచున్నది. యదార్థమున నీతెగవారందరు కూటస్థప్రసక్తముగ నియోగశాఖలోనివారనియె తెలియుచున్నది. హరి హరాభేదమున నియోగు లచ్యుతులుగ నున్నారు. భేదబుద్ధిచేతను వైష్ణవపారమ్య గ్రహణముచేతను

గోల్కొండవారైరి. అయిన నిప్పటికిని వీరిలో వినాయకచతుర్థి, వరలక్ష్మీవ్రతములు, లోనగు ప్రాచీన సంప్రదాయాచరణములు ప్రథమస్థితిని సూచింపుచున్నవి. వైష్ణవము బుచ్చుకొనినందున వీరికి తిరుమంత్రోపదేశము తప్తచక్రాంకణము శ్రీ వైష్ణవగురువులు చేసినను వీరిండ్ల హవ్యకవ్యాదుల యాజకులు ప్రాయికముగ స్మార్తబ్రాహ్మణులుగనే యున్నారు. కనకమ్మగారి విద్యాతత్త్వపరిజ్ఞానాతిశయమువలన నీమె జీవయాత్రాహంసవిజయాది యుద్గ్రంథముల నభేద్యప్రతిపత్తినే యాలంబనము జేసికొనినది. ఉత్తర సర్కారులలో గోల్కొండవ్యాపారులను తెలగాణ్యపు నియోగులనియు, యారువేలవారిని వెలనాటి నియోగులనియు చెప్పుట కలదు.

గోల్కొండవారు ప్రాయికముగ సంపన్నులు. మొగలాయి ప్రభుత్వమున వీరు ఫౌజుదారిలోనగు గొప్పగొప్ప యధికారపదవుల నలంకరించియుండిరి. ఆరువేలవారిలో నున్నటుల గంగాధరులు దర్వీకరులు వీరిలో కనుపడరు. ప్రాతకాలపువారిలో అగ్నిష్టోమాది క్రతువులజేసినవారుండిరి. వావిలికొలను రత్నోజి దీక్షితులనువారు సోమయాగమును జేసిరి. వీరు శ్రీమద్రామాయణమునకు వ్యాఖ్యానము వ్రాసినట్లు ప్రతీతికలదు గాని ఆగ్రంథము లభింపలేదు. ఈతెగవారు శ్రాద్ధాదుల శ్రీవైష్ణవుల నిమంత్రించు ఆచారమొకటి యిబ్బందిగానుండి ఇప్పుడిపుడు వీరు బంధుయాజనము ననుష్ఠించుచున్నారు. ఆరువేలవారి కింకను యీ సంస్కరణాభిమానము సార్వత్రికముగ సిద్ధింపలేదు.

ప్రాచీనాంధ్రకవులలో గోల్కొండవారు ముఖ్యముగ నున్నారు. గడచినశతమున మనువసుచరిత్రాదుల కెనయగు సుమనోమనోభిరంజనమను మహాప్రబంధమును రచించిన ఓగిరాల జగన్నాథం పంతులవారును 1860 ప్రాంతమున లీలావతీగణితము గద్యపద్యాత్మకముగ తెలుగుజేసిన తడకమళ్ల వెంకటకృష్ణారావు పంతులవారును ప్రసిద్ధులైయుండిరి. అధునాతన విద్వత్కవిప్రపంచమున పరమవైష్ణవులు భక్తవరేణ్యులు అనుష్ఠానపరులు విరాగులు శ్రీ కుమారాభ్యుదయ కౌసల్యాపరిణయ శ్రీ మదాంధ్రరామాయణాద్యుత్తమపద్యకావ్యములను శ్రీ కృష్ణలీలామృతాది పండిత పామరోపయుక్తవచనకావ్యములను రచించి లోకోపకారముచేసి నానుడానుడునా దపోవృత్తి భాసిల్లు ఆంధ్రవాల్మీకి ఇత్యాది బిరుదాంకితులును కొంతకాలము మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజియందాంధ్రాచార్యులుగను, కొంతకాలము గవర్నమెంటువారి యాంధ్రభాషాప్రధానపరివర్తకులుగను నుండిన మ-రా-రా-శ్రీ బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బరావు పంతులుగారును యీవ్యాపవస్తు విద్యాకవితిలక కాంచనపల్లి కనకాంబగారును విలసిల్లుచున్నారు.

కనకాంబగారి జనకకుటుంబ స్థావరము పల్నాడు సీమలోని దుర్గిగ్రామము. దేశకాలవ్యవహారస్థితుల ననుసరించి యీకుటుంబము గుంటూరుచేరి యచట క్రొత్తపేటలో నిలవుగొనినది. యీమె తండ్రిగారు కంచనపల్లి రంగరావు పంతులవారు. తల్లిగారు రంగమ్మగారు. వీరు హారీతులు. ఈదంపతుల కుదయించిన పుత్రికాత్రయమున కనకాంబగారవరజలు. విజయసంవత్సర శ్రావణమాసమున శ్రీ కృష్ణాష్టమీ భానువాసర నిశీథసమయమున శ్రీ కృష్ణావతారస్మరణ సమకాలీనముగ నీయమ జననమొందినది. (3-9-93) ఈమె తొమ్మిదినెలల బిడ్డగనుండగ తండ్రిగారు పరమపదము జెందిరి. పదునొకండేండ్లగువరకు యీమెయు తల్లిగారును గుంటూరునందే యుండిరి. అంతదనుక నీమె ఆయూర వీరింటిచేరువన నొకబడిలో చదువుకొనుచుండినది. చిన్నతనమునుండియు చదువునం దత్యంత ప్రీత్యుత్సాహముల చూపుచుండినది. తోటిగణములలో గణ్యత జెందుచుండినది.

ఇంటనే దేశాభిమాని పత్రికాలయ ముండినందున యీమె యా పత్రికాలయమునకు బోయి యచటి

## విద్వాన్ కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు

వార్తాపత్రికలను యితర గ్రంథములను చదువుకొనుచుండినది. జన్మవిశేషమునకీ యానుషంగికసంపదచే కూడి యీమెకు నానాట చదువునందాసక్తియు నభిమానమును పెంపొందినవి. భావివైదుష్యప్రాగల్భ్యమునకిది యంకురమనదగును. అనేక పుస్తకములును పత్రికలును చదువుచుండినందున నీమెకు మంచివాచకమేర్పడుటయేగాక చిరుతవయస్సునుండియు వచోధారయు కలిగినది. పదునొకొండవ యేటనే నీమె యుద్వాహసంస్కారసంకేతమును బొందింపబడినది. ఆవల మూడుమాసముల లోపల పురుషార్థసిద్ధికకాలాంతరాయము సంభవించి యీమెకా బాల్యబ్రహ్మచర్యము ప్రాప్తవ్యార్థమయినది. శైశవాభ్యస్తవైరాగ్యమునను పుట్టినింటనే యుంటచేతను యీమెయందకుత్సమైజనకాన్వవాయమే ప్రకటితమైనిలిచినది. పరతత్త్వైక్యానుసంధాన సందేశదిదృక్షమై తదేకదీక్షితురాలై జీవయాత్రను తత్పరముగ నడపుచు ప్రాణధారణ జేయుచున్నది. నెల్లూరిలో కాపురముండిన యీమె పెదతల్లి భర్త మంగు రామానుజరావు పండితులును, యీమె బావగారు పంగనామాల వెంకటరంగారావు గారును 1906 ప్రాంతముల నీమెను నీమె తల్లిగారిని నెల్లూరికి తోడుకొనివచ్చి ఈమె కాంధ్రసంస్కృతముల నభ్యసింపజేసిరి. వెంకటరామానుజనామోచ్చారణలో నీమె భావివైదుష్యప్రాభవమంతయు నిమిడియున్నదన్న నతిశయోక్తి కాదు. వారీమెను నెల్లూరిలో గవర్నమెంటు బాలికాపాఠశాలలో షష్ఠఫారములో చేర్పించిరి. ఆ బడిచదు వొకప్రక్కనుండ యీ పండితులవారీమెయందు అంకురించియుండు ప్రజ్ఞాప్రతిభల గనుగొని యింటికడ చిన్నయసూరీయ బాలవ్యాకరణము అమరకోశము ఆంధ్రనామసంగ్రహము అప్పకవీయములోనగు వాని పాఠముల జెప్పుచు తెలుగువారు పెద్దపుస్తకము అని పూజించు ఆంధ్రమహాభారతము చదివించుచు నివికాక సంస్కృత కావ్యపాఠముల జెప్పుచు విద్యాధికురాలిని జేసిన కీర్తి వడసిరి. ఈ పెదదండ్రిగారితో నీమె పద్యముల సంభాషించుచుండినది. పండితులవారి ధన్యతయపారము గదా! గురువును మించిన శిష్యురాలినిజేసిరి. 1909వ సంవత్సరములో నరసాపూరు ప్రోగ్రెసివు యూనియనువారి స్త్రీల పోటీపరీక్షలకు బోయి ప్రథమ బహుమానమును బంగారు పతకములను బొందినది. ఈ పరీక్షలో ప్రత్యుత్తరముల పద్యములలో వ్రాసినట్లు పరీక్షకులు 1910 సంవత్సరపు హిందూసుందరి పత్రికలో వ్రాసిరి. వైదుష్య ప్రపంచమున స్త్రీ పురుషు లందరిలో ప్రథమురాలుగ నిలచినందున యీయమ బొందిన విజ్ఞానచంద్రికవారి ఆరు పతకములను 216 రూపాయల బహుమానమును కనులారజూచి కడుంగడు సంతసించి శ్రీరామానుజరావుగారు సచ్ఛిష్యప్రదత్త విద్యాఫలమున కానందించి యావల కొలదికాలమునకు "యద్గత్వానినివర్తంతే తద్ధామ" జేరిరి.

నెల్లూరి పాఠశాలలో నీమె చదువుకొనినంతకాలము సర్కారువారీమెకు విద్యార్థినీ వేతనము నెల రు. 12లు చొప్పున నిచ్చుచువచ్చిరి. ఈ కాలమునందీమె ఆంధ్ర, సావిత్రీ, హిందూసుందరీ పత్రికలకు పద్యములను వ్యాసములను బంపుచుండెడిది. అచటి చదువంతయు బూర్తియైన పిదప నా పాఠశాలయందె ఈమె యుపాధ్యాయిగ గైకొనబడి అందు కొంతకాలముండి 1913 నందు చెన్నపట్టణమందలి దొరతనమువారి బ్రాహ్మణవితంతు శరణాలయము జేరి యచట ఇంగ్లీషు చదువుకొనినది. తిరువల్లిక్కేణిలో దొరతనమువారి యున్నత పాఠశాలయందు (Lady Willingdon High School) స్కూలుఫైనలు పరీక్షకుపోయి దానియందు ప్రథమస్థానమునంది బహుమతులను స్వర్ణపతకములను బొందినది. ఇంటర్మీడియేటు పరీక్షవరకు చదివినది. ఈమె వైద్యవిద్య నభ్యసింప ఢిల్లీకి బోవలయునని సంకల్పించుకొనినది. సంసారపు సన్నివేశము లనుకూలింపమి

యీ ప్రయత్నము సఫలము కాజాలకపోయినది. అటుపై 1919వ సంవత్సరమున తా నిదివరకు జదివిన లేడీవిల్లింగ్డన్ హైస్కూలులో స్కూలుఫైనల్ క్లాసునకు ఉపాధ్యాయిత వహించి శ్లాఘ్యముగా నిర్వహించినది. ఈ స్థానమునసుండగ నీమె ఆన్ని ఫర్డ యూనివర్శిటీవారికిని మెక్మిల్లన్ కంపెనీవారికిని చరిత్ర భూగోళము మొదలగు కొన్ని కొన్ని పాఠ్య గ్రంథములు తెలుగుజేసి యిచ్చినది. 1926లో విద్వాన్ పరీక్షకుబోయి ఫస్టుక్లాసులో సర్వోత్తమురాలుగ నుత్తీర్ణురాలయినది. ఈమె యే పరీక్షకు పోయినను ప్రథమస్థానము ప్రథమబహుమానములు బడయుచుండినది. పరీక్షాప్రశ్నలకు ప్రత్యుత్తరములను 1909 సంవత్సరమునుండియు పద్యరూపముగా వ్రాయుచుండినది. ఇట్లు ప్రతిభావనీసాంది విశేషములతో బాల్యమునసుండి చెన్నలరారినది. 1928వ సంవత్సరమునసుండియు మద్రాసులో మేరీరాణీ కాలేజీలో ఆంధ్రాచార్యకతీర్థమున ప్రవేశించి స్త్రైణ విద్యాభ్యున్నతులకు తోడ్పడుచున్నది. హైస్కూలునందుగాని కాలేజియందుగాని యీమెదగ్గర చదివిన వారందరు ఉత్తీర్ణులగుటయే గాని తప్పియెఱుగరు.

ఈమెకు చిన్నతనమునసుండియు రచనయం దొక విధమగు నకృత్రిమ సహజప్రావీణ్యము కలిగియుండినది. ఇంటిలోనివారితో ముచ్చటలు చేయునపుడును అప్రయత్నముగ పద్యములతో సంభాషణ జరపుచుండెడిది. నేస్తకత్తియలతో జరపు నుత్తరప్రత్యుత్తరములు ఛందోబద్ధములుగ నుండెడివి. ఏతాదృశ నైజసంస్కారసంపత్తి విద్యాసంయోగపరిష్కృతమై శ్లాఘ్యకృతమై ఈవిదుషీమణి కవితిలకముగ తేరి యాంధ్రదేశ మహాభాగధేయముగ వెలసినది.

ఈమె మద్రాసులో యుపాధ్యాయిత నందినది మొదలు తెలుగు పరీక్షలకు పరీక్షకురాలుగ సంభావింపబడి ఆంధ్రపాఠ్యనిర్ణాయకసమితి (Board of Studies)యందు ప్రధానసభ్యురాలుగ నుండుటయే గాక మద్రాసు విశ్వసహావిద్యాపీఠమున తెలుగు చదువునకు సంబంధించిన సమస్త ప్రచారవిచారములందు నున్నతసభ్యత్వము నందినది. వైదుష్యప్రపంచమున నిట్టి మహాగౌరవస్థానముల నింతదనుక మన కోస్తాలో యే స్త్రీయును బడసినదిలేదు.

చిఱుతతొక్కుపలుకులజాలు నాతిచిరమున శాస్త్రబద్ధమైన వన్నెమీఱిన కవిత్వప్రవాహముగ పరిణమించినది. పండ్రెండవయేట (1905) నెల్లూరులో వెలసియుండు శ్రీ తల్పగిరి రంగనాయకస్వామివారిపై రంగశతకమును రచించినది. పదియు నాల్గుపూర్తియగులోపల నరసాపురమున బెట్టబడిన స్త్రీల విద్యావిషయికమగు పోటీపరీక్షయందు స్త్రీ పురుషులలో నగ్రపదమునంది సువర్ణపతకాని బహుమానముల బడసినది. పదునాఱేండ్లకు విజ్ఞానచంద్రికామండలివా రేర్పరచిన పోటీపరీక్షలో ప్రథమస్థానము నంది స్వర్ణపతకములను ఇన్నూటపదియారులను పారితోషికము బొందినది.

పాఠశాలలలో పాఠ్యములుగ నుపయోగపడదగు గ్రంథములుగాక ఈమె రచించిన వచనకావ్యములు మూడగపడుచున్నవి. (1) నెల్లూరనుండు "సుబోధినీ' ప్రకాశకుల ప్రార్థ ననుమోదించి 1917నం దీమె అమృతవల్లి యను నవలను వ్రాసినది. కీర్తిశేషులు పండిత నటేశశాస్త్రిగారు అరవమున వ్రాసిన "దిక్కట్ర ఇరుకోళంద్రైగళ్" అను నవల కిది యాంధ్రానువాదముగ నున్నది. విషవల్లి యన నశ్లీలముగనుండునని దీనికి అమృతవల్లి యను పేరు పెట్టబడినదే కాని యదార్థమున నిది విషవల్లిప్రయోగకల్పనమైన సపతితల్లియొక్క ఈర్ష్యానూయల కాలవాలమైయున్నది. దీనిచే "రాధ" యను పేర నీవల ముద్రించినటుల తెలియుచున్నది. సపత్నీ మాతృద్రోహభాజనలగు నిద్ద రక్కచెల్లెండ్ర నీరాథ పెద్దది. (2) గౌతమబుద్ధ చరిత్రము (3) పాండవోదంతము. కడదానియందు భారతకథయంతయు కొలదిగ



జా ల రి



శ్రీమతి అద్దేపల్లి రమణాబాయిగారు

(విశాఖపట్నం)

ఈ ఆర్యవైశ్యబాలిక వయస్సు 13 ఏండ్లు. అంగ్లము 7 వ క్లాసు వరకూ చదువుకొన్నది. ఆంధ్రమున మంచి ప్రవేశముగలదు. అభిమానవిద్య సంగీతము. హార్మోని, ఫిడేలు మున్నగువాయిద్యముల నేర్పరి.

జెప్పబడియున్నది. ఈ వచనకావ్యములు మూడును బాలురకును బాలికలకును సుగమమగు శైలియందు వ్రాయబడి పాఠ్యగ్రంథములుగ నిర్ణయింపబడ నర్హములైయున్నవి.

పద్యకావ్యముల తొలిపలుకు పూర్వోదాహృత రంగశతకము. ఇదంతయు కందములనున్నది. అప్పటి శైలియు నిప్పటిశైలివలె పటిష్ఠమై యున్నది. శతక మంతయు "రంగా" యను నంకితము గలిగియున్నది.

రావే యభయం బీవే
పావన సింహపురివాస పాపవినాశా
నీవీక్షణములఁ బఱపుము
నీవే నా కేమగడయు నిజముగరంగా.

ఈశతకమునుగూడ నెల్లూరు "సుబోధిని"-సంపాదకులె ప్రకాశింప జేసియున్నారు.

ఈమెజేసిన శ్రీ కాశ్యాది మహాయాత్రావృత్త మంతయు 1912 ప్రాంతముల పద్యరూపమున రచింపబడినది. ఇది రెండవపద్యకావ్యము. ఇది సీసమాలికా రూపమున నున్నది. దీని పేరు కాశీయాత్రాచరిత్ర.

1919 నుండి 1925 లోపల నీమెజెప్పిన యుద్గ్రంథము జీవయాత్ర. ఇది 1925 లో వెలువడినది. జీవుడు బ్రహ్మైక్య సాక్షాత్కారముఁ బొందుదనుక పృథగ్వస్తువుగ పరిగణింప బడదగునేని అట్టిజీవుని యైహికాధ్యాత్మిక యాత్రావర్తనమిందు చిత్రింపబడియున్నది. ఈజీవుడె ఈకావ్యమున నిరంజనపదవాచ్యుడై గోచరింపుచున్నాడు. గ్రంథస్థవిషయము లనేకములును అమోఘములును అయియున్నది. వానినెల్ల నిట లెక్కింపబూనుటకన్న నా గొప్ప కబ్బమునుచదివి బోధజేసికొని స్వాత్మానందముబొంద నాంధ్రమహాజనము నెంతయు సప్రశ్రయముగ బ్రార్థించుటయె నిట నిప్పటికి జాల గలదనిమనవి.

గ్రంథరచనా కాల క్రమ మననేక్షితమగునేని "హంసవిజయము" జీవయాత్రానుయాయి యగుచున్నది. ఇది గడచిన భావకాన్తికమునినుండి (1934 నవంబరు) మాసానుగతముగ యున చైత్రమువరకు (1935 యేప్రెలు) ఆంగ్లోజ్జీవకేయసు భారతియందు ప్రథమమున ప్రకాశింపబడినది. ఇదియొక యాధ్యాత్మిక మహానాటకము. జీవహంసకును పృక్కృతి లక్ష్యస్థానమైయున్నది. ఈరెండును పాత్రనామరూపస్థళ విషయాదులచే నొండొంటి పూరణములుగ నున్నవి. ఈరెంటనుభావములు కొన్ని గూఢములుగను సరూప దేశైక బోధ్యములుగను ఉన్నవి. ఇంగ్లీషునలో పిలిగ్రిమ్సు ప్రోగ్రెసు (Pilgrim's Progress) సంస్కృతమున ప్రబోధచంద్రోదయ సంకల్ప సూర్యోదయములును ఈరెండుగ్రంథముల పూర్ణభావ ప్రయోజనముల దెలుపజాలవు. ఎద్దియోయొక నిమిత్తమున నీరెండు కావ్యముల బరామర్శింపబడని లోకోక్తులు సామెతలు లోకనీతులు ఉపనిషద్వాక్యములు మహావాక్యములు అనేకములు మిగిలి యుండజాలవు. ఈమె యుదాహరించిన కొన్ని యుల్లేఖల కాకరము లెందున్నవియో విచారింప వలసియున్నది. ఎచటనైన యుండగలవను విస్రంభముమాత్రము గలదు. ఈరెండు గ్రంథరాజములందీమె యుపయోగించిన యుపమలుకొన్ని అనన్యస్పృష్టములయియున్నవి. స్థాలీపులాకమున కొన్నియుదాహరణములు :—

జీవయాత్ర—జీవాధికారము ప. ౧౧౬

సతిసుతు లిరువుర కెందుఁ
స్మృతిలేనిసమయమునగద క్షేమప్రసవం
బతుల ధ్యానంబున నా
గతిసంస్మృతి లేకుండునాత్మ కాంచు
విముక్తిన్.

ప. ౧౨౬

దుర్జయమగు దృశ్యమును వి
సర్జింపఁ బోధజేసె సారథిగాదా

నర్జునునకు శ్రీకృష్ణుడు
మార్జాలము కాష్ఠమట్లు మఱచినభంగిక

ఈ మార్జార కాష్ఠన్యాయము గురూపదిష్టానుభవ సిద్ధవిషయముగ నున్నది. దీని వివరించిచెల్పుటకు ఈ కవయిత్రియే దక్షురాలు.

ప. ౧౪౩ ఇందు మరచీల (Screw Nail) ఉపమానముగ గొనబడినది.

పైపైన ద్రిప్పుచుండుట
యేపని మరమే కదియెట్లే పోనీ
యీాపగిది మంత్రపఠనం
బేపని జీవాత్మ నీకు నేమేగానీ.

ఇండ్లుకట్టువారు కమానుల (arches) దీర్చుటకు ముందు మూసలుకట్టుకొని పూర్తిఅయినపిదప ఆమూసల దీసివేయుదురు. ఈ అనుభవభావము తృతీయోల్లాసమున వెంకటాచలయాత్ర ౧౬౩ వ పద్యమున నుపయోగింపబడియున్నది.

మధ్యరాల నర్థమండలాకృతిగోడ
గట్టిపిదపవాని నెట్టునట్లు
బాలువాతగుణము వాసిజేయగ నుల్లి
గడ్డనమలి నోరుc గడుగునట్లు.

ఇట్టివన్నియు ఆధునికపరిజ్ఞానమున బుట్టినవిగ నుండగలవు. ఈమె అత్యంతమగు లోకపరిజ్ఞానముగలదగుటచే లోకయాత్రయందు మనుజులకు ప్రతిదినమును అనుభవములో దగులుచుండు అనేకవిషయముల గ్రంథస్థము చేసినది. ఐహికాముష్మిక ప్రసంగములేమి, భౌతికాధ్యాత్మిక విషయములేమి, ప్రాచీనాచార సంవిధానముల ప్రాచీన ఐదానంతననాగరకోపజ్ఞతలేమి ఈ రెండుగ్రంథముల మధ్య నెచ్చటనైన యణగియుండును. స్త్రీపురుష సంబంధవిషయమున నీమెసిద్ధాంత మద్భుతంబుగా నున్నది. పురుషునికి స్త్రీ యర్ధాంగలక్ష్మియైనటుల స్త్రీకిని పురుషుడు యర్ధాంగముగ గణింపబడుచున్నాడు. ఈ ద్వంద్వయోగము లేక పూర్ణమదః పూర్ణమిద మ్మిత్యాతి శ్రుత్యర్థము కదు రటలేదు. జీవయాత్ర ౧-376.

పురుషార్థము స్త్రీయన స
త్పురుషార్థముగాక వట్టితుంటరికొఱకా
పురుషార్థంబే యిచ్చినc
బురుషార్థం బగుటనిజము.........

ఇందలి "పురుషార్థ" "పురుషార్ధ" పదములపై నెంతయైన వ్యాఖ్యానము జేయదగును.

జీవయాత్ర ౧-౩౭౦

ఏకాంత బోధమొసగెడు
నాకాంతయ ముక్తికాంత యాస్థానంబే
నాకము—

యీా పద్యమునందలి జాత్యమగు ధ్వనియో సుకుమారమగు శ్లేషయోగనిభావమతిమనోహరముగా నున్నది. స్త్రీనిగురించిన యిట్టి ప్రశంసావాక్యములన్నియు కథానాయకుడగు జీవుని (నిరంజనుని) పెండ్లి జేసికొమ్మని యొప్పించుఘట్టమున నున్నవి. ఇట్టి స్తావవాక్యములకన్నిటికిని నాతడు పూర్వపక్షములు ప్రకటింపగలడు.

జీవయాత్ర—౧-౩౭౭

పురుషార్థము జనియించిరి
ధర గామినులన్నమాట తథ్యంబనగక
హరియింతురు మానసమో
వరమారుత వంచకంబో.........

ఇంకొకపూర్వపక్షము (౧-౩౯౦)

చదువcజదువc జదువ సంసారమూలేదు
వంటలేదు కడుపు పంటలేదు
మంటమగనిజూడ మహిళాసభలనుంట
.........................

పూర్వోదాహృతమగు పురుషార్థభావమునకు ౧-౩౭౦ యందు వింతయగు వ్యాఖ్యగలదు: —

అంగనకును హంసంబున
కుంగమనంబొకఁడు తెలిసికొన దగుభేదం
బంగన పురుషోత్తముఁ గొ
ల్చుంగతి హంసమెపుడు నడచుఁగా విధి
వెంటన్.

పురుషార్థ సంపాదనసాధనమగు స్త్రీ భర్తృరూపియగు శ్రీపురుషోత్తమునె గొల్చునని భావము. వివాహప్రయోగమునందును వరుని శ్రీ లక్ష్మీనారాయణస్వరూపియనియె వరణము జరుగుతున్నది.

ఇట్లు పూర్వపక్షసిద్ధాంతములు జరిగి తుదకా నిరంజనుడు పెండ్లిజేసికొనెను. ఇక నా స్త్రీపురుషుల శృంగార విహార సంపదలతత్త్వము హంసవిజయమున మూడవయంకమున నిటుల మహానిపుణముగ సమర్థింపబడియున్నది.

రాజశేఖరు వచనము—"ఆత్మ మనస్సంయోగంబు యోగంబు నాబడు. పంచేంద్రియంబులకు విషయంబులైన శబ్దస్పర్శరూపరస గంధంబులనియెడు నీయయిదర్థంబుల నత్యుత్తమభంగిధరించు సుందరీమణితోడి సహయోగంబు భోగంబు నాబడు. భోగంబున మానసికానందమును కలుగును.

ఆదినారాయణు పాదాబ్జమందు సం
భవమొందు నమృతంపు బావిమోవి
బ్రహ్మసారంబైన ప్రణవాక్షరంబను
బ్రౌణంబుగాదాల్చు ఘ్రాణపుటము
స్ఫటికాకృతినివెల్గు పరమపూరుషునిల్పు
నిర్మల తేజంబు నేత్రయుగము
పతిరూపమునుదాల్చి సుతురూపమున దేల్చి
విపరీతచర్య మెప్పించు మేను
యోగమూర్తియునతుల సంభోగమూర్తి
దానకీర్తియుసానంద ధర్మవృత్తి
గలిగి వెలిగెడుదివ్య విగ్రహమునాత్మ
భక్తి భజియించుభాగ్యంబు భాగ్యమందు.

ఈమె స్త్రీలయెడ నైరాశ్యము బొందినదిగాదు. సర్వథా వారి యభ్యుదయములనె ఈరెండు మహాకావ్యముల నుద్ఘోషించినది.

జీవయాత్ర —౧-౪౪౦.

పరలోకము గొనియాడక
పరమాత్మునిగురుని భక్తవరులన్ దఁ
కరమర్థించిన జాలుఁ (రుణీ
పరమార్థముకొఱకుఁ బాట్లుపడగానేలా?

తత్త్వశాస్త్రముల నుదాహరింపబడియుండు న్యాయములు, ఉపాయములు అనేకములీ రెండుగ్రంథముల నుపయోగింపబడియున్నవి. మార్జారకిశోర మర్కటకిశోరములు మాత్ర మెట్లో ఈవిహారమున దగులలేదు. జాబాలోపనిషత్తులోని పిపీలికామార్గ విహంగమార్గములకీ గ్రంథముల ప్రసక్తిగలిగియున్నది. జీవయాత్ర (౨—౨౭౭. హంసవిజయంబున అంక. ౪. ప్రథమరంగము)

విశిష్టాద్వైత మతానుసారమగు శేషశేషిన్యాయముదాహృతమైయున్నది (జీవయాత్ర ౨-౬౩౯.)

భాగవతవాత్సల్యాతిశయము నుద్ఘోషింపుచు మత్స్యకూర్మ విహంగవిధానములు (1) జీవయాత్ర ౧—౨౭౦ యం దుపన్యసింపబడియున్నవి. ఈయంశము శ్రీ వేదాంతదేశికుల దయాశతకమునుండి యుల్లేఖింపబడినదని దెలుపుటకై కాబోలు శ్లేషానుప్రాణితమగు గీతమున వారి దివ్యనామాక్షరములు పొందింపబడియున్నవి: —

(1) ఈ మత్స్యకూర్మ విహంగప్రశంస శ్రీవిద్యారణ్యకృత జీవన్ముక్తి ప్రకాశికయందును గలదు.

కానుకలనుభక్తిఁ గైకొని దేశిక
స్వామిపాదములను బ్రాలనతనిఁ
గుక్కుటమును మత్స్యకూర్మంబులను
బోలె
నంటె చూచెఁదలచె నాత్మవిభుఁడు.

ఈ రెండుగ్రంథములందును, తత్రాపి జీవయాత్ర యందు విశేషముగను తత్త్వరహస్యములును ఉపాసనారహస్యములును, పెక్కులు సూచింపబడియున్నవి. ఆమె వ్రాసినవిషయములలో గ్రంథపరిచితములును స్వానుభవములునునగు వానికంటె ప్రత్యక్షగురూపదేశసిద్ధములును మెండుగగలవు. జీవయాత్రయందు మూడుమారులు (౧-౧౨౬, ౧-౭౩౩, ౩-౨౩౯) ఈక్రిందిపద్యమును పొందుపరచియున్నది—

దుర్జయమగు దృశ్యమును వి
సర్జింపఁగ బోధఁజేసె సారథిగాఁదా
నర్జునునకు శ్రీకృష్ణుఁడు
మార్జాలము కాష్ఠమట్ల మఱచినభంగి.

ఈ కవయిత్రిమతమున నీమార్జాలకాష్ఠన్యాయము ఐకాగ్ర్యసిద్ధికొక సాధన ప్రక్రియగ నున్నది.

ఇంగిలీషుల మిస్టిసిజం (Mysticism) పారెబిల్ (Parable) అను రీతులుగల రచనలు ఈ రెండుగ్రంథములగలవు.

కుక్కదిన్నవాడు గురులింగజంగంబు
పందిదిన్నవాడు పరమయోగి

యను వేమనపద్యమీ రెండువిధములకు నుదాహరణముగ నున్నది. మిస్టిసిజం అనగా గూఢార్థము, అంతరార్థము, పారెబిల్ అన్యాపదేశమువంటి రూపకప్రక్రియగలది.

జీవయాత్ర ౩-౪౧౬ న నీక్రింది పద్యమున్నది.

చెట్టుక్రిందపక్షి జీవుండు పైనున్న
పక్షి నాత్మఁజూడఁ బైకినెగురఁ
దద్వ్యమాత్మయొకఁడు తాను నీడయటంచుఁ
చెల్పు జీవయాత్ర కల్పనగము.

ఈపద్యమునందు మిస్టిసిజమున్ను పారెబిల్లు ప్రకృతియును గలవు. దీనిమర్మ తాత్పర్యబోధమునకై జీవయాత్రాముఖపటమున నొక చిత్తరువు గలదు. ఈ పద్యమునందలి బహిరంతరభావములన్ని బాగ చిత్రితములై యున్నవి.

జీవయాత్ర ౩-౨౩౬.

యిల్లడై కిచ్చితివి నీ
యిల్లాలా పరుగులిడును హితమతి నీవీ
యిల్లాలి యింటియయ్యను
నెల్లప్పుడు గొల్వశాంతి హెచ్చును విప్రా.

దీని భావమేమి ?

ఈ కవయిత్రి మతాభినివేశ మెట్టిదని నిర్ణయించుటకీ రెండుగ్రంథములును కొంతవరకు సాయము కాగలవు. జన్మయు పరిసరములును విష్ణు పారమ్యప్రవణములయినను పాషండప్రాయమగు వీరవైష్ణవమీమెయం దగపడదు. వీరశైవము దురూహ్యము. పంచాయతన విధాన మీమె కొప్పినదని తోచుచున్నది. శివ, రామ, కృష్ణాదుల నామరూపములచే స్మరించినను వీరిలో నన్యోన్యపారమ్య విచారప్రచారములు ఈమె కేమాత్ర మభిమతములును సమ్మతములును గావు. అంతియగాక వారియం దభేదమును అనుభవించినది.

రాముండని కృష్ణుండని
నీమహిమలు తెలియలేము నీనామమును [లఁగ

గామింతురు వేర్వేరుగ
రామా శివరామకృష్ణ రామా రామా

జీవయాత్ర ౨-౫౭౦.

మీకిరువురకున్ భేదము
లేకుండట దెలుప నిట్టిలీలలు చేయన్
మీ కేతగు శివరామా.........

౨-౫౭౪

జీవయాత్ర 3-౫౭౧-౫౭౨ లందు శ్రీశారదాం బాస్తుతిగలదు.

తత్త్వసిద్ధాంతమున నీమె శాంకరాద్వైత పక్షపాతియని జెప్పనగును.

జీవయాత్ర ౧-౧౫౦ యందీమె యొక రామదాసును ప్రశంసించియున్నది. ఈతడు తానిషా రామదాసో శివాజి ఛత్రపతి రామదాసో నిర్ణయింపవలనులేకున్నది.

పతిభక్తి నీమె యొక్కవగ ప్రస్తుతించియున్నది.—

'శారద:—నీవుమాత్రము నీభర్తయొక్క మనస్సు గనిపెట్టి సుఖపడును.

సుమిత్ర:—మీకటాక్షంబున నావిధుండును నా కనుకూలుండే (హంసవిజయము 5—2)'

ఈ సాధకురాలు అన్నిటను ప్రాతలనేయభిమానింపక సంస్కరణములకును అవకాశము కలిగించినది. జీవయాత్ర (౧—౫౬3) యందు నిరంజనుడు (జీవుడు) అతని నర్మమిత్రుడును భావిప్రధాన సచివుడుననగు అన్నంభట్టును జరిగించు సంభాషణలో నిరంజనవాక్య మిటులున్నది:—

అచిరకాలంబునను రాజునౌదు నింత
లోన నీవును లోకంబులోని వింత
లరసి వచ్చితివా మనమిరువురమును
సంస్కరింపగవచ్చును సంఘమెల్ల ॥

అట్లని క్రొత్తలనన్నిటి నీమె యామోదింపలేదు. జీవయాత్ర ౨—౨౧౦.

తలగొరుగుట జలజాక్షుల
విడిపించుట భాష్యశాంతివిధియనిషేధం
బులు లేమియు బుధదూషణ
ములు చిత్రముముక్తబంధములు కలి
నౌరా!

ఈ పద్యభావము పూర్తిగ నామెగారివలన దెలియవలసినదె. "తలగొరుగుట" క్రాపుచేయుటయా (Cropping hair) లేక "జలజాక్షుల" అను విశేష్య పదమునకు సింహావలోకనముగ "తలగొరుగుట" తోను "విడిపించుట"తోను అన్వయము చేయదగునా. వైధవ్యవిషయమున స్త్రీలకు మౌండ్యమొక మహా క్రూరసంస్కారమని భావము కలిగియుండును.

ఈ పద్యమునందలి "ముక్తబంధములు" ముక్తపదగ్రస్తాదులు బంధకవిత్వములు లోనగుకవిత్వవిషయకములా లేక స్త్రీపురుషు లొకరినొకరు విడనాడి దిరుగ కలియుటయా. ఇందతిమాత్ర ప్రసంగమున్న వశ్యవచస్కురాలగు నీకవితల్లజ క్షమించుగాక. ల డ ప్రాసమిందొక ఛందోవిశేషముగగూడ గన్పడుచున్నది.

(మారుమనువులయొక్కయు విడాకులయొక్కయు ప్రచారమీమె గ్రంథముల నగపడదు. ఈ విపథ ప్రసంగమవిచారిత రమణీయముగ నుత్సర్జింపనగును.)

నౌకాయాత్ర, విదేశ ఖండాంతరగమనములు, విమానయానము ఇత్యాదులీమె కనభిమతములుగావు. ఇందులకు సాక్ష్యము కావలసియున్న హంసవిజయమునందలి యన్నంభట్టును లలితాకుమారియు జాలియుందురు.

ఇక స్త్రీలు విద్యాధికురాండ్రగు విషయమున యీ కవయిత్రినిజతాత్పర్యముటు.డ హంసవిజయమున ఎం. ఏ. (M.A.) పరీక్షోత్తీర్ణురాలగు మిస్. లలితా కుమారి యొకతెయున్నది. ఆమె సంభాషణ మీ నాటకమున నింగిలీషుననే వెలసియున్నది. వైదుష్య

మూలసూత్రము మాత్రము ఆర్యవిద్యాభిమానమును వేదశాస్త్రప్రామాణ్యమును చులకన జేయలేదు. దేవ గురుభక్తి ప్రపత్తులు ప్రతిపద్యయందును ప్రతిధ్వనించుచున్నవి. ఈమె పరాకాష్ఠయాత్మసాక్షాత్కార మేయగు ఆత్మసాక్షాత్కారమునను, స్వస్వరూపావస్థానోపలబ్ధియు, అంతశ్చక్షుర్దృష్టియు, అనుసస్కానుభూతియు నీమెకు కదుంగడు ఉత్సాహప్రదములుగ గన్పడుచున్నవి.

ఇట్లు మహోదారగంభీరపథముల విహరించునీ మహాయోగినీ కవయిత్రియదనున దండిగను సూటిగను నాటునట్లు పరిహాసకమును జేయగలదు. జీవయాత్ర ౧-౪౦౯ యందు మగవారిచదువు నిట్లు యెగతాళి బట్టించి కించిత్పరితాపమును గూడ జూపినది.

చదివినాడుగాని సంశయమాపోదు
చదువఁజదువఁ దెలివిసన్నగిల్లె
బిదపఁజూడ వీడు మొదటినిబోలుగా
గుణముకుదుర దేమి కొట్టుకొందు.

ఆమె పుణ్యాన నీ చతుష్పాత్తు నింతటితో వదలినది. లేనియెడల 'చదువుకంటె మేలు చాకితనము' యని పంచపాదింజేసి ఈయాటవెలదిచే నాడించియుండును.

ఇదిజాలక హంసవిజయమున నింకొకచో (3-3) 'నల్లచీరఁ గట్టువారెల్ల నాపెండ్లాలె యనుకొనెనఁట నీవంటివాఁడొకడు' అని డామాడోలిగానిచే నిరంజను నెక్కసక్కెములాడింపజేసినది.

ఈకాలపు శిశువిద్యాపద్ధతులందలి వస్తుపాఠముల (Object Lessons) గూర్చి యెక్కింతన్మయపూర్వకమగు చర్య హంసవిజయమున (౨-౪) గలదు.

'బూడిదెగుమ్మడికాయ పొట్టలోనడ్డముగ గరికెఁ గ్రుచ్చిన 'ఈ' యగును.'

'చెవులబూరెలమూఁకుడు చెవులలో గరికె దూర్చిన 'ఆ' యగును.'

'ఒకపీపా, రెండుచేటలు, నొకగోకలి, నాలుగు కొయ్యరోళ్లు ఒకచీపురికట్ట, పెట్టి యేనుగుపాఠమును జెప్పవలెను.'

ఇంతట నిలువక 'ఇంకనిట్టి పనేకనుకలవు'అని తాలాతోలి డామాడోలిగాని నోటబలికించినది.

పండితంమన్యుల,హంసవిజయ మొక్కెడ(I. 1) చురగతాకనాడినది. 'ఇట్టివారు బెజ్జము - రంధ్రము నను రెండుశబ్దముల జేర్చి బెంద్రమందురు. కుటుంబమును సంసారమును జేర్చి కుటుంబరమందురు.

ఈ కవయిత్రిజేయగల భాషావినోదముల కింకొకయుదాహరణము జూపసనగును. హంసవిజయమున (౫-3) నిరంజనుడును యాతనిదేవియు తరిగొండ వెంగమాంబగారి యోగమహిమంగూర్చి ముచ్చటించుకొనుచుండగ డామాడోలిగాడువిని స్వగతమున 'నేనన్ని దేశములు చూచివచ్చితిని. అందరు బాగుగఁ దెనుగుమీఱినారు' అనుకొనును. అంతట 'తెనుగుమీఱినారు' అన్నమాట అతనికి విచిత్రముగదోచి 'పరిశోధకు లీ తెనుగుమీఱి శబ్దమునకు వ్యుత్పత్తి నేమని నిర్ణయించిరో' యని భ్రాంతుడగును.

హంసవిజయమునందలి యేనవయంకపు రెండవ రంగమున 'జాతిభేదవిమర్శ (Caste Distinction) దీర్ఘముగను నిపుణముగను జేయబడియున్నది.

"చక్కెరయొకటియె చిలుకగా, పందుగ, తేలుగా, వేలువేలు నామరూపములతో నున్నటులొక్క బ్రహ్మంబె పెక్కురూపముల నీవిశ్వమునఁ గానవచ్చును."

* * * *

"ద్వితీయాద్వై భయం భవతి. రెండవవానివలన భయభేదములు కలుగును. అద్వైతానుభూతినిఁ బ్రతిపాదించు మంత్రముయొక్క సంతతమననమే భేద

భయపరిత్రాణ మొనర్చును" అని శారద తీర్మా నించినది.

లలితాకుమారి M.A. గారికిని జాతిగతభేద మేమా త్రమును సరిపడదు. ఉదాహృతాంకమునందే ఈక్రింది సంభాషణ గలదు.

'లలిత—My God! What shall I do to solve the problem of difference.

సుమిత్ర—తల్లీ ఈ భేదదృష్టిపోయి సమరస మేర్పడుటకు నే నేమిచేయుదును?

శారద—You die. With you the difference dies.

సుమిత్ర—నేను చచ్చినయెడల నాతో భేదము నశించునందురా.

లలిత—How can I die?

సుమిత్ర—నే నెట్లు చావగలను? (స్వగతము) నే నడుగఁబోవుమాట నీమెయు నడిగినది. దీని కేమి సమాధానముండును.

శారద—If you cannot die we are here to kill you; rather the Ego in you.*'

జీవయాత్రా హంసవిజయములందు పలుమారు గోచరించు మహావ్యక్తి "శారద" ఈ కవయిత్రి ప్రతిబింబముగనుండునా యను శంక కవకాశము గలదు. అద్యైసందర్భములనుబట్టి పాఠకులు ఈసందేహ నివారణ మొనర్చికొనగలరు. కృష్ణభూషణముగారను వ్యవహారనామమున వెలసి "శ్రీ అమృతానంద నాథులు" అని దీక్షానామధేయమున ప్రసిద్ధులయిన మహామూర్తు లీమె కాధ్యాత్మికగురువులు. వీరు ఆంధ్రులు. వీరు తిరుపతిలో నెలకొల్పిన త్రిలింగ మహావిద్యాపీఠమున నీయమ యొక సాధకురాలని తెలియుచున్నది. ఈ రెండు గ్రంథముల దరచుగ చెల్పబడియుండు తత్త్వవిషయములును సంప్రదాయ ములును అనుభవములును ఈ మహాగురుముఖ నిష్యం దామృత బిందువులగనున్నవి. జీవయాత్ర వీరి పవిత్ర స్మరణతో ప్రారంభమగుచున్నది.

జీవయాత్ర మూడుల్లాసములుగ విభక్తమై యున్నది. ప్రాయికముగ గ్రంథమంతయు కందపద్య మయమైయున్నది. ఈ కందచవి తొలికావ్యమగు రంగశతకముననే జూపబడినది.

"అందములగు కందంబుల

బొందుగ మీపాదములను బూజించెద"నని శ్రీ రంగనాయకస్వామిని వేడియున్నది. అటులని యితర వృత్తాదుల వర్జించినదిగాదు. తిక్కయజ్వవలె నీమె పద్యరచనయందు సవ్యసాచి యనదగును. ఇదంతయు గాక 1878 పద్యములచే నలరుచుండు ఈ జీవయాత్ర నిర్వచనమైయున్నది.

హంసవిజయమున కీమెయే గ్రంథాంతగద్యమున "మహావిద్యానాటకము" అని సార్థకనామకరణము జేసియున్నది. ఈ రెండు గ్రంథముల దగులుచుండు నిరంజనుడే (జీవుడే) శ్రీ పరమహంస మహాగురు కటాక్షమున "యోగసిద్ధబలంబున గామరూపుడై హంసగవచ్చి" మరల నిరంజనుడైనటుల చెల్పబడి యున్నది. అందుచే నీ నాటకమునకు "హంసవిజ యము" అను పేరుపెట్టి ఈమె ఆధ్యాత్మికాది భౌతికముల సమన్వయము జేసినది.

హంసవిజయమునందలి స్త్రీపురుషు లందరు సద్గురు కటాక్షమును శారదాప్రసాదమును బొంది ముక్త లయిరి. ఒక్క డామాడోలికా స్త్రీమాత్రము నిత్య నారకిగా నిలిచియున్నటులున్నది. ఈతడు పండితు

* టీక: నీవు—నేను, నీది—నాది అను భేదము నశింపవలయునని ఈ సంభాషణయందలి 'నేను' You 'నీవు' ఇత్యాదిపదముల తాత్పర్యము. ఈ భావమే జీవయాత్ర ౧-౭౯౪లో స్పుటముగ మూర్తిమంతమై యున్నది. "నేనున్నది నున్న నీవు నేనని కన్నట."

డును జ్ఞానియు కావచ్చును-గాని ఈ దోషాన్వేషణము వీడిపోయి గుణపరామర్శ కడవరకును నలవడినట్లగపడదు. నాటకమధ్యమున ప్రవేశించిన రామరెడ్డియు కృతార్థుడై కడతేరినట్లున్నది.

నెల్లూరి నీమె నిజజన్మస్థానముగ నభిమానించినది. జీవయాత్రయందును హంసవిజయమునందును ఈ మండలములోని మహాపవిత్ర శైవక్షేత్రమగు సోమశిలను తత్పరిసరముల ప్రవహించు పినాకినీ మహానదిని పలుమారు స్మరించినది.

1925 సంవత్సర మధ్యభాగమున చెన్నపురియందు జీవయాత్ర వెలువడినది. అపుడచట కవిపండిత మహాసభ యొకటి జరిగి ఈమెకు గొప్ప సన్మానమును జీవయాత్రనుగూర్చి గొప్ప ప్రశంసయు జరిగినవి. ఆ మహాసభాముఖముననే నీమెకు "కవితిలక" బిరుద మొసంగబడిన ఆ మహాసభాసందర్భమున మహాపండితు లొకరు పరమాశ్చర్యభరితులయి "నిస్సారసరస్వతి" యని నీమెను ప్రస్తుతించిరి. ఆ పండితులు హంసవిజయమును జూచియుండిన "నిస్సారమహావిద్యా" యని యుద్ఘోషించియుందురు.

తొలుత భారతిలో 1934—35 సంవత్సరములలో ప్రకాశమై హంసవిజయము ఈవల దేశోద్ధారక నాగేశ్వరరావుగారి ఆంధ్రపత్రికాముద్రాయంత్రమున గ్రంథరూపమున ముద్రితమై ఆంధ్రగీర్వాణోర్దూద్యనేక భాషాపారంగతులును విద్వత్కవీశ్వరులును ప్రౌఢకావ్యనాటకకర్తలును జయపురసంస్థానాధీశ్వరులునునగు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజాగారి యభినందనపురస్సరముగ భాసించుచున్నది.

ఈ రెండు గ్రంథములకును ఈ కవయిత్రియే వ్యాఖ్యానము వ్రాసిన బాగుండును. కొన్ని తత్త్వరహస్యములు సంకేతములు గురూపదేశములపై నాధారపడియుండు స్వానుభవవిషయములు ఇతరుల కూహాతీతములుగ నుండగలవు. జీవయాత్రయొక్క నిగూఢస్థితి నుద్దేశించి కవయిత్రియే గ్రంథాంశముల గూర్చి యొక పీఠిక వ్రాసియున్నది. అదిలేకున్న ఈ ప్రబోధారణ్యమున దిక్కుతెలియక పాఠకులు చిక్కుపడుదురు. ఈ గ్రంథముల యాఖ్యాయికాభాగ మతిస్వల్పము పాఠకుడు తలస్పర్శిగ విషయము తెలిసికొనుట సులభము కాదు. కావున వ్యాఖ్యానము లపేక్షితములగుచున్నవి.

ఈమె తెలుగున నెట్లో సంస్కృతమునను నటులే యనాయాసముగ నానావిధశ్లోకముల గీతముల వ్రాయగలదు. జీవయాత్రయందును హంసవిజయమునందును నివియెన్నియైనగలవు. ఈమె "ఉభయభాషాకవితాభూషాలంకృత" యైనటుల గద్యవలనను దెలియుచున్నది. కవితాచమత్కృతి దీపింప నొక్కొకమారు ఒక్కతెలుగు ప్రత్యయమైన లేకుండ పూర్ణముగ సంస్కృత తిజంత సుబంతములనే వ్రాసి ఒక కందముగనో యొక వృత్తముగనో ప్రస్తరించుచున్నది. ఉదాహరణము :—

క॥ లోకానపి సకలాన
స్తోకానందాన్ కురుష్వసుజానా
స్వీకృతభక్తాన్ యుక్తాన్ [నస్మాన్
శ్రీకర శాంతించ దేహి శివకైవల్యం॥

సంస్కృత ఛందస్సున దీని నార్యావృత్తముగ గణింతురు కాబోలు.

జీవయాత్రా హంసవిజయములకు సజాతీయమై అయిదు వేలపద్యముల నలంకృతమగు 'శైలి' యను గ్రంథము నీమె రచించినటుల దెలియుచున్నది. అది యింకను ప్రకటింపబడినటుల లేదు. పేరునుబట్టి యూహించిననిదియు నైతికాధ్యాత్మికవిషయముల నలరియుండుననియు తోచుచున్నది. ఇందెవ్వియో గొప్ప శీలములు బోధింపబడియుండును. లేక భాషాశైలి యనియా ? లేక శిలాసంబంధమా ?

1927 సంవత్సరమున నీమె పద్యముక్తావళిని రచించినది. అభిజ్ఞానశాకుంతలము 1928 నందు తెలిగింపబడినది. శాకుంతలమును మేఘసందేశమును తెలిగించుట ఇప్పటి తెలుగుకవులకొక స్పర్థావహమైన ట్లున్నది. మేఘసందేశము ఈమె భావప్రపంచమున నున్న యుండదగును. శాకుంతలము మనోహరముగ నున్నది. ఇదివర కనేకములున్నను, ఈ యాంధ్రీకరణమును శాకుంతలాపూర్ణబోధమునకు కావలసియె యున్నది:—

శుశ్రూషస్వగురూన్ కురుప్రియసఖీ
వృత్తం సపత్నీ జనే
భర్తుర్వి ప్రకృతాపిరోషణ తయామాస్మ
ప్రతీపంగమః
భూయిష్టం భవదక్షిణాపరిజనే భాగ్యే
ష్వనుత్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో
వామాః కులస్యాధయః॥

ఈమెగారి తెలుగు—

గురుశ్రూషయొనర్పుమా సవతులన్
గొమ్మా సఖీవృత్తితో
వరుడే భంగమొనర్చనే నలుకమార్వ
ల్కన్నదే మానుమా
పరివారంబు గడుంగృపంగనుము సంప
ద్గర్వమున్వీడు తా
ల్తురు రామల్ గృహిణీపదంబిటు పెరల్
చూడన్ గులాధుల్ గదా॥

అంకము 6 :— మూలము—

ఉచ్ఛేత్తుం ప్రభవతి యన్న సప్తసప్తి
స్తన్నైశంతిమిర మపాకరోతిచంద్రః

కనకమ్మగారి తెలుగు:—

రాత్రిహారిహరింపని తిమిరంబు రాజు
సంహరించుట యల్లది సహజమకద॥

ఇందు కాళిదాసున కొదగని 'రాజు' మనోహరమగు శ్లేషచే పాదాంతేవాసిస్సై ప్రకృతికిశోభను గలిగించినాడు.

అంకము 7 :—

వల్మీకాగ్రనిమగ్నమూర్తిరు రసా
సందష్టసర్పత్వచా
కంఠే జీర్ణలతా ప్రతానవలయో
నాత్యర్థసంపీడితః
అంసవ్యాపి శకుంతనీడనిచితం
బిభ్రజ్జటామండలం
యత్రస్థాణురివాచలో మునిరసా
వభ్యర్కబింబంస్థితః॥

తెలుగు:—

తనువందర్థముపుట్ట జూడగనహిత్వ
గ్వ్యాప్తమై వక్షమున్
దనరన్ జీర్ణలతా ప్రతానవలయాత్యం
తార్తుడై కుత్తుకన్
వనశాకుంత కులాయపూరిత జటాభా
రంబు మూపంటగా
నిను లక్షించుచు స్థాణువట్లచలుడై
యొందుండునమ్మౌనితాన్॥

ఇందు 'నిను లక్షించుచు' ననుటలో నీమె పదవిభాగభేదముచే సొంపగుశ్లేష నూహింపజేయుచున్నది:

(1) మూపు—అంటన్—కాన్—ఇను (సూర్యుని) లక్షించుచు

(2) మూపు—అంటన్—కాన్—నిను (శకుంతలను పరిత్యజించిన దుష్యంతుడవగు నిన్ను) ఈ పదవిభాగ

ద్వయము సమంజసమగునేని ఈ తెలుగుపద్యము కాళిదాసోక్తి మెరుగు బెట్టుచున్నది.

1931 లో నీమె 'రామాయణకథాసంగ్రహము' జెప్పినది. ఇదియే వాల్మీకమున ప్రథమసర్గ. దీనినే బాలరామాయణమనుటయుగలదు. ఇదంతయు కంద ఘనమైయున్నది. ఒక్కట నీమెపేరును మోసులెత్తి యున్నది.

ఈ చిన్నకావ్యమునందును గూఢ వాక్యములు కొన్నిగలవు:—

నీకథ నీకున్నీనై
నాకై పల్కితివి రామనారాయణయ
స్తోకానందంబగు నీ
రాకడపోకడలఁ దెలుపురా పరమేశా॥

ఇందలి శైలి యిటులుండును:—

అనఘుఁడు రాముఁడుసీతా
వనితందగగూఁడి మఱలఁబడసెను రా
జ్యంబును జగము బ్రహ్మాష్టంబ
య్యెను ముదముగా దుష్టిపుష్టి నెంతయు
గనియెగా॥

పూర్వోదాహృతగ్రంథములును అయిదువేలపద్యముల 'శైలి'యు గాక స్వగురూపదేశముల నేర్చి గూర్చి 'అమృతానంద బోధామృతసారము' 'ఆనంద సార'మనియు రెండుగ్రంథములు రచించియున్నది. అవియు నచ్చువడలేదు. ఇవన్నియుగాక భారతి, గృహలక్ష్మి, త్రిలింగ, ఆంధ్రహేరాల్డు, హిందూసుందరి, సుబోధినీ పత్రికలను అనేకవ్యాసములను పద్యావళులను వ్రాసియున్నది. ఇట్టి చిల్లరరచనలు సంగ్రహింపబడి గ్రంథరూపము వెలువడనున్నవి.

నెల్లూరులో బ్రచురింపబడుఁ సుబోధినిలో (1935) అంబాస్తవము (ఆరుపద్యములు) కన్యాకుమారిప్రభావము (17 పద్యములు.) జీవప్రబోధము (పంద్రెండుపద్యాలు) ప్రకటించియున్నది. అంబాస్తవమున స్వీయచరిత్రము సూక్ష్మముగాగలదు. ఈమె భాషయు, రచనయు నిర్దుష్టములుగానున్నవి. రేఫార్థానుస్వారదృతాంతనియముల జక్కగ బాటించినది. ఈమె కవిత్వమున తప్పు గానరాదు, పదలాలిత్య సారస్యములుగలవు.

నిత్యవృత్తిలో నీమె మహానైష్ఠికురాలు. ఉపాసకురాలు. పంచాయతన పూజాపరాయణురాలు. తీర్థయాత్రాదికముల బూర్తిచేసికొనినది. గురుదేవభక్తిగలది. తిరుపతిలో త్రిలింగపీఠమును ప్రతిష్ఠించినది. ప్రతిదినమును గృహదేవతార్చనలో స్మార్తపంచాయతనపూజావిధానమున సప్తసహస్రావర్తి పూజజరిగించుచున్నది. చెన్నపట్టణమందలి గోపాలపురములో కవితిలకకుటీరమును, నిర్మించికొని స్వస్వద్వితీయరాలై అధీతిబోధాచరణ ప్రచారణదీక్షా ప్రసక్తురాలయి యథాసంభవముగ నిరాడంబరముగ జీవయాత్రానుసంధానముచేయుచున్నది.

అంతరంగమున నాధ్యాత్మిక తత్త్వజ్ఞురాలయ్యును బాహ్యమున గవర్నమెంటుకాలేజీలో ఉపాధ్యాయియయ్యును సదాస్వజాత్యభివృద్ధినే ముందిడుకొని లోకసేవజేయుచున్నది. 1913 మే నెలలో కాకినాడలోజరిగిన మహిళాసభకీమె యధ్యక్షత్వము వహించి ఆపదవిని శ్లాఘ్యముగనిర్వహించినది. అప్పటి కీమె పదునైదేండ్లు వయస్సుననుండినది. ఆసభయందీమె యనర్గళముగ నుపన్యసించి సభ నాశీర్వదించి ఆశువుగ ప్రౌఢములగు పద్యముల జెప్పినది. సభవారందరు ఆశ్చర్యమగ్నులైరి. 1917 లో నెల్లూరులోజరిగిన మహిళాసభ కీమె ఆహ్వానసంఘాధ్యక్షురాలుగ నుండినది. ఆసందర్భమున నీమెయిచ్చిన సన్మానోపన్యాసము అమూల్యముగనున్నది. దీని తిరుగ ముద్రింపించుట స్త్రీజనమునకు మహోపకారముగానుండును. గడచిన డిసంబరునెల తే 8 దిని నెల్లూరియందుజరిగిన

పుల్లజయంతి ప్రయుక్తమగు మహాసభకధ్యక్షురాలుగ వరింపబడి సభను చక్కగా నిర్వహించి సభలో సన్మానమునొందిన శ్రీమతి చిల్కపాటి సీతాంబగారికి స్వర్ణకంకణము తొడుగుసందర్భమున ఆశువుగా నీక్రింది పద్యము జెప్పినది.—

గీ॥ పలుకుఁదొయ్యలి ముంజేతి చిలుకపాటి
సీతమాంబకు లక్ష్మియిచ్చె వలయంబు
కరము మాటాడుటరుదు కంకణము
నిడునె
యత్త కోడలిదానిపై నాదరమున.

ఈ యాశుపద్యమున విచిత్రార్థస్ఫురణగలదు.

పలుకుఁదొయ్యలి=సరస్వతి దేవియొక్క

ముంజేతి చిలుకపాటి=ముంజేతి నలంకరించియుండు చిలుకవంటి

సీతమాంబకు = చిలుకపాటియను యింటిపేరుగల సీతమాంబకు

లక్ష్మి=(1) లక్ష్మి దేవి—(2) గృహలక్ష్మి పత్త్రిక

యిచ్చెవలయంబు=కంకణము నిచ్చినది.

కరము మాటాడుటరుదు = నేర్పిన మాటలనైన చిలుక యూరక మాటలాడుచుండునుగాని ప్రకృతపు బహుమానపాత్రమగు చిలుకపాటి సీతమాంబ విశేషముగ మాటలాడదు. మాటలాడుటకంటె పద్యముల వ్రాయుటయందు సమర్థురాలు అని భావము.

కంకణమునిడునె యత్త=అట్టికోడలికి అనగా పరస్పరము మాటలు లేని కోడలికి అత్త కంకణమును పెట్టునా! లక్ష్మిసరస్వతుల కత్తకోడలి వావిప్రసిద్ధము—అని ఆశ్చర్యము. అత్తతో మాటాడనికోడలి యందును అత్తగారికి దయయుండు టాశ్చర్యము. ఇందలి కంకణ శబ్దమున శ్లేష నూహింపఁదియుండును. కంకణము= (1) వలయము (2) కం×కణము: నీటిబొట్టు.

అత్తతో మాటలాడ నిచ్చగింపనికోడలికి అత్త నీటిచుక్కనైన యిచ్చునాయని ధ్వనిగనుండును.

అయితే ఇచట ప్రత్యక్షముగ నిచ్చియున్నదే యన్న నది కోడలిపై దయ చేతగాదు. కోడలిదానిపై నాదరమున=కోడలిదియగు చిలుకపైనగల ఆదరము చేత యిచ్చినని. అనగా చిలుకపాటి సీతాంబగారిపై తనకు గల ఆదరాతిశయమున నీ బహుమతి చేసినది యని భావముగనుండును. ఆశువుగజెప్పిన నీపద్యమున నింత మనోహరమగు భావము నిమిడ్చినది.

ఏపదవినున్నను ఏపనిబూనినను ఏరచనజేసినను ఈ మహిళాశిరోమణికి ముఖ్యగమ్యము స్త్రీజనాభ్యుదయ ముగనే గనుపడుచున్నది. 'బాలను గవితాచతురత జాల'నని జంకుతో వ్రాసిన రంగశతకము మొదలు జీవయాత్రా హంసవిజయాంతము యీ ఆశయమే స్వర్ణాక్షరముల భాసించుచున్నది.

జీవయాత్రలో సర్వతోభద్రవిజయము అను ప్రకరణమున (౭–౧౦౧) యందు నిరంజనుడు తనయర్ధాంగలక్ష్మింగూర్చి బలికిన సూక్తము పరమప్రమాణ మగుచున్నది:—

కాంచిననిన్నె కాంచవలెఁ; గారుణికత్వ
మంజూపి మేలుగాఁ
బెంచిన నీవబెంచవలె; భీతిజనింపఁగ
శత్రుకోటులన్
ద్రుంచిన నీవద్రుంచవలెఁ; దోషముఁ
బాపిఁ మనంబుజ్ఞానమున్
నించిన నీవనించవలె; నిశ్చలభక్తి ఘటింపగావలెన్
సంచితమెల్లఁ ద్రుంచనలె శాంతియు
ముక్తియు నీవయీవలెన్॥

కలకత్తాలో ప్రకటింపబడుచుండు (Heritage of India (భారతపైతృకము) అను గ్రంథప్రణాళికలో దాదాపు పదేండ్లక్రింద Poems by Women (భారత

స్త్రీ కవనములు) అను నొకగ్రంథము వెలువడినది. వేదకాలము మొదలు యిప్పటికివరకు వైదికసంస్కృతములో పాలీలో, లౌక్యసంస్కృతమున, అరవమున కన్నడమున, మళయాళమున, మహారాష్ట్రమున, బెంగాలి, హింది, గుజరాతి, కాశ్మీరి, ఉర్దూ, పార్శి, ఇంగ్లీషు లోనగు భాషలలోన కవనముజేసిన స్త్రీలపేళ్లున్నవి. తెలుగున కొక్కరిత పేరును లేదు. తరువాత ఒకటిరెండేండ్లకు ఆప్రణాళిక నేతలే పండిపెద్దిచెంచయ్య యం.ఏ., యం.ఎల్., రాజామంత్రి ప్రగ్గడ భుజంగరావుపంతులు బి.ఏ. గార్లచే ఆంధ్రవాఙ్మయముపై నొకగ్రంథము వ్రాయించిరి. తెలుగుస్త్రీకవులు పదిమందినిమాత్రమె వారు పేర్కొనిరి.

(1) కుప్పమ్మ — భారతరచనయందు నన్నయభట్టునకు దోడైన నారాయణభట్టు కూతురట. ఈమె గ్రంథములెవ్వియు లభింపలేదు.

(2) రంగనాథరామాయణ కవిద్వయమున నొకడగు కోనబుద్ధరాజుకూతురు. ఈమెపేరు తెలియలేదు. గ్రంథములును తెలియలేదు. అయ్యలరాజు రామభద్రుని సకలకథాసారసంగ్రహమున నీమె పద్యములు కొన్నిగలవట.

(3) మొల్ల — రామాయణకర్త్రి.

(4) కృష్ణదేవరాయలకుమారిత మోహనాంగి — ఈమె చెప్పినట్లు ప్రతీతిగల మరీచి పరిణయము లభింపలేదు.

(5) ముద్దుపళని — రాధికాసాంత్వన కవయిత్రి.

(6) సుభద్రమ్మగారు. (18 వ శతాబ్దము) కేశవ శతకము — కొన్నిదండకములు.

(7) తరిగొండ వెంగమ్మగారు — వెంకటాచల మహాత్మ్యము — రాజయోగసారము.

(8) బండిపాపమ్మ (19 వ శతాబ్దము) మీనాక్షి శతకము.

(9) రత్నాంబ (డిటో) వెంకటరమణశతకము.

(10) శ్రీరాణి చెల్లాయమ్మగారు — పార్థసారథి శతకము.

ఈ వాఙ్మయచరిత్రము ప్రకటింపబడినప్పటికె గుండు అచ్చమాంబ బండారు అచ్చమాంబ లోనగువారు తెలుగుదేశమున ప్రసిద్ధ కవయిత్రులుండిరి. వీరిపేళ్ల గ్రంథమున లేవు. ఇది యటుండగ — అప్పటికి ప్రస్తుత కనకమ్మగారి 'జీవయాత్ర' ప్రకటితమై కవిపండిత సన్మానమును బొందినది. ఆమె పేరుగాని ఈగ్రంథము పేరుగాని ఆచరిత్రయందు దగులలేదు. ఆంధ్రాభిమాన మిటులున్నది. ఆంధ్రయూనివర్సిటి వారునీ పరిశోధన బూనినటులలేదు.

మన కనకమ్మగారికి కవనశక్తి లిఖితపఠితప్రాయముగనున్నది. (శైశవాభ్యస్తము). ఇంగ్లీషువారు పోపును (Pope) గురించి "He lisped in numbers" అనగ నాతని బాలభాషణమె గణబద్ధమైయుండినదందురు. ఈమెయు నట్టిదిగనున్నది. ఈమె కవిత్వధోరణి ఇంగ్లీషున బ్రౌనింగు, క్రిస్టినా రోసెట్టిగార్ల కవిత్వమువలె గూఢము అంతఃకరణ ప్రవృత్తముగనున్నది. దేశసేవకురాలు సరోజినీదేవియు ఇంగ్లీషున మనోహరమగు కవిత్వముజేసిన ప్రసిద్ధురాలు. కనకమ్మగారి కవిత్వమును అటులే కమ్మగనుండును. ఈమెకిప్పుడు నలువదిమూడేండ్లు. ఇప్పటికి పదేండ్లుముందుగనే ఈమె సంస్కృతాంధ్రములయందును ఇంగ్లీషునందును గొప్పపాండిత్యము సంపాదించి పండితవృత్తినంది స్వజాతి స్వదేశాభిమానములవెలయుచుండుట ఆంధ్రస్త్రీణమున కెంతయు యుత్కర్షావహముగనుండగలదు.

చదువనగా శ్రీహృదయము
చదువుటవేరొండుగాదు చదువిల దానిక్
ముదితల కృపలేకుండిన
విదితంబగునెట్లు బ్రహ్మవేత్తలకైనన్॥

(జీవయాత్ర ౧-౩౬-౪)

ప్రథమపాదమునందలి 'శ్రీ' స్థానమున 'స్త్రీ' యున్న బాగుండదా?

# అపజయము

శ్రీమతి రాణి చాకుంట సరస్వతీబాయిగారు

౧

పద్మ నా బాల్య స్నేహితురాలు. చిన్న తనమందే తలిదండ్రులు గతించారు. సోదరుని పోషణలో ఉండి విద్యనేరుస్తోంది. మేమిద్దరం చిన్నప్పటినుండీ ఒకేక్లాసులో చదువుతుండేవాళ్లం. మాయిల్లూ వారిల్లూ సమీపంలోనే ఉన్నవి. మేమిద్దరం ప్రియ స్నేహితులంకూడాను.

పద్మ చాల చురుకైనపిల్ల. ఎప్పుడూ యింట్లో చదివినట్లు కనపడేదికాదు. కాని క్లాసులోనమాత్రం ఫస్టుమార్కు దాని సొమ్మే. పద్మతో ఆడుకునే వాళ్లెవరూలేరు వారింట్లో. మాయింట్లో నాతోనూ మా అన్నయ్య భాస్కరావుతోనూ ఆడుకుంటుండేది. మహాకొంటెపిల్ల. ఎప్పుడూ చిన్నచిన్న కొట్లాటలు కావాలి. నాతో అట్టే కొట్లాడేదికాదు కాని మా అన్నయ్యతో కలహాలు. ఆయన చదువుకుంటుంటే పుస్తకాలు చిందరవందర చేయడం. లాక్కెళ్లడం. ఆయన పద్మ వెంబడి పరుగెత్తడం. పట్టుకొని పుస్తకాలు లాక్కోగానే పద్మకు తుద్రునకోపం వచ్చేది. తిర్గి నేను బ్రతిమిలాడడం. అప్పుడపు డన్నయ్యగూడా క్షమాపణ కోరుకునేవాడు. హాసన్ముఖియైన పద్మ కొపం చూడలేకపోయేవా డన్నయ్య. మహా అభిమానంకూడా అన్నయ్యకు పద్మంటే. వీద్దరి కలహాలు, క్షమాపణలుచూచి వినోదించేదాన్ని నేను.

పద్మ స్నేహంవల్లనే మాబాల్యం మహానందంగా గడించింది. మాఅన్నయ్య యింగ్లండు వెళ్లాడు బ్యారిస్టరీకి. అప్పటినుండీ పద్మా నేనూ దినమంతా కలిసే ఉండేవాళ్లం ఎప్పుడో రాత్రివేళలతప్ప. దోషరహితమై బాల్యదశ ఎలాంటివారికైన ఆనందమయమే ననుకుంటాను. ఆనిశ్చింత, ఆనిర్మలహృదయావస్థ ఆయాటలు, ఆపాటలు జ్ఞప్తికివస్తే యీ నా గార్హస్థ్య సుఖాతిశయాలనుకూడా మరచిపోతాను. ఆభావముల్లో మునిగిపోయి నిర్మలానందం అనుభవిస్తాను.

పద్మకు పదునాలుగేండ్లొచ్చినయి. నాకో పదిహేనుంటయేమో. మేమిద్దరం స్కూల్ ఫైనల్ చదువుతున్నాం. వయస్సొచ్చిన కొలదీ పద్మకు పురుషులపైని ద్వేషమెక్కువౌతోంది. ఎప్పుడూ నాతో పురుషులదుండగముల గూర్చియే మాట్లాడుతుండేది. నేను విసుక్కునేదాన్ని. ఇక తనభావసంచయాన్ని సహాధ్యాయినులకు వెలిబుచ్చడం మొదలెట్టింది సమయం దొర్కినప్పుడల్లా. పద్మ తెలివైందను నభిమానంవల్ల మనస్సులో ఉన్న ఎవరూ ఎదురు మాట్లాడేవారుకారు. ఆపని కెప్పుడన్నా నేనే సాహసించేదాన్ని. స్త్రీ పురుషులొండొరు లొకరికొరకై యొకరు సృష్టింపబడ్డారని వీరియనురాగపూ

రిత జీవితమే సృష్టిస్థితికి హేతుభూతమని నాయభిప్రాయం. యీమాటలు పద్మ కే మాత్రం గిట్టవు.

పద్మమాటల్లో సత్యంలేకపోలేదు. గాని పురుషుల సన్మార్గులగా చేయడానికి పద్మ యవలంబింపవలెననే మార్గం బాగలేదు. అది దుస్తరంకూడా! యిక పురుషుని సరియైన మార్గంలో నడిపించేది స్త్రీయే. స్త్రీ యందొక దివ్యమైనశక్తి నిగూఢమైఉంది. పురుషుని లోబరచుకోగలదు. తన చేతిబొమ్మనుచేసి యాడించగలదు. కాని యిలాంటి దివ్యతరశక్తిని కొందరు యువతులు దుర్వినియోగపరుస్తారు. పురుషుని పెక్కువిధముల చీకాకుపెడతారు. వారి దాంపత్యం నరకస్వరూప మౌతుందప్పుడు. యిక కొందరు తరుణులు దాన్ని కనుగొనలేరు. పురుషునికి పూర్తిగా లోబడతారు. అతన్నే మార్గమందును నిరోధించరు. అలా చేయడం పతివ్రతాత్వమునకు భంగకరమనుకుంటారు. కాబట్టి యీరెండు మార్గాలు బాగలేవు. భగవంతుడు ప్రసాదించిన దివ్యశక్తిని స్త్రీలు సద్వినియోగపరచాలి.

౨

పద్మ స్కూల్ ఫైనల్లో మొదటిదిగా ఉత్తీర్ణురాలైంది. నేనో రెండవదానిగా ప్యాసయ్యాను. ఆ యెండకాలం సెలవుల్లోనే నావివాహమనుకుంటున్నారు. మా వాండ్లు పురాతనపద్ధతి కాకుండా వధూవరులొండొరులం తామేవరించుకునే ఏర్పాటు చేశారు మానాన్న. వరుడు యల్.యల్.బి. ప్యాసై వరంగల్లో ప్రాక్టీసు మొదలెట్టాడు. గొప్ప కుటుంబంవారే. యిరువైఅయిదువత్సరాలవయస్సు, చామనచాయ. ఎలాగైతేనేం మేమిర్వురం చూచుకున్నాం. ప్రేమబద్ధులైన దంపతుల సౌఖ్యానికంత ముండదు. వారి నేలాంటి యిక్కట్టులైనను దారిద్ర్యమైనను బాధించనేరదు. నిర్మలమై దేవతాస్వరూపమైన ప్రేమే వారికి సర్వస్వము. మానవ నిర్మితములైన భర్మ్యహర్మ్యాదులలోపము పాటించరు. ప్రకృతిస్వరూపములైన తరుచ్ఛాయలయందైన నిశ్చింతతో కాలముబుత్తురు. ప్రాపంచిక గంద్రగోళాలనుండి విముక్తులై దివ్యానందమును పొందగలరు. ఆహా! ప్రేమయందెంతటి మాహాత్మ్యమున్నది? దానివలన ఎట్టి మహత్తరశక్తినైనను బంధింపవచ్చును. సర్వశక్తి సమన్వితుడైన సర్వేశ్వరుని గూడ ప్రేమచే బంధితునిచేయవచ్చును. అట్టి పవిత్రప్రేమ నాప్రభువు నాకొసంగినాడు.

నావివాహప్రయత్నములుచూచి పద్మకు విచారం కలిగింది. నేనేదో గొప్ప విపత్తులో పడిపోతున్నానని. ఒకనాటిరాత్రి వేసవి కాలపు వెన్నెలలో పడుకున్నాం! కాని యిర్వురమూ దాని సౌఖ్యమనుభవించడం లేదు. పద్మ చిన్నబోయిన ముఖంతో అంటోంది.

"అక్కా నీవు విద్యావతివి. తెల్సినదానవు. పురుషుల దౌర్జన్యాలను చూస్తున్నావు. వింటున్నావు. చదువుతున్నావు. నీకీ పిచ్చి యెందుకు పుట్టింది చెప్పు. మీనాన్నగాని మీఅమ్మగాని నిన్ను నిర్బంధపెట్టు

న్నారా? నీయింద్రియోద్బోధితమా? చూడు లలితా ! వెనుక నీవతనికి వంటకత్తెవో దాసివో అయికాలంబుచ్చాలి. నిన్నుమహా నీచముగా జూచుచుండును. సోదరీ! నీవవ లంబింపబోవు మార్గము మిక్కిలి కంటక పూరితము. పురుషులేలొంగి స్త్రీలకు దాసులమై యుందుమని, యిదివరకొనర్చిన వాటికి క్షమాపణ వేడుకొనినప్పుడు మనము ధన్యు రాండ్రము. అప్పుడు దయాస్వభావలం గనుక వారి ప్రార్థన అంగీకరిద్దాం. లేకుంటే జీవితాంతంవరకూ బ్రహ్మాచర్యంగాఉందాం. లలితా నా మాటవిను. నీమంచి గోరియే చెప్తున్నాను."

నేను:—పద్మా! ఎందుకు నీ కీపిచ్చి భావాలు? అన్యోన్యానురాగముగల దంప తులకలాంటి యిక్కట్టులు వచ్చునని తలంపను. బాల్యవివాహాలవల్ల దంపతు లొండొరులయెడ ప్రేమ గలిగియుండనందువలన అలాంటి అనర్థాలు వస్తున్నయి. నావిషయ మలాకాదు.

పద్మ:—పురుషుల ప్రేమ చంచలము. వారి యనురాగమును నమ్మడానికి వీలులేదు.

నేను :—భావికాలవిషయాలు చెప్ప గలమా? అలాసంభవిస్తే అది వారివారి ప్రారబ్ధమనుకోవాలి. ప్రేమాన్వితు లొండొరు లెంతోకాలము వియోగము పొందుచున్నారు. దానికి మన మేంచేస్తాము.

పద్మ:—చాలూరుకో. యీముసలమ్మ వేదాంతాలన్నీ ఎక్కడ నేర్చుకున్నావు? నీ బోటి దుర్బలహృదయులే మన వ్యక్తిగౌరవానికి భంగం గలుగచేస్తున్నారు.

నేను:—ఓహో! అలాగేం. తొందరెందుకు? నీవెంతటి నిగ్రహంగా ఉంటావో నేనూ చూస్తాను. ఇప్పుడు విద్యాభ్యాసంలో మునిగియుండబట్టి నీకేం తెలియడంలేదు. ప్రకృతివిరుద్ధమైన పనిచేయడం చాల దుర్లభం.

పద్మ:—నీలాంటివారున్నారుగా సృష్టించడానికి పురుషపిశాచాలను చాలు.

నేను:—నేనేకాదు ముందు నీవుగూడ మా మార్గమే—

పద్మ:—(మాటకడ్డంవచ్చి) అలా ఎన్నటికి జర్గనేరదు. నన్ను నీవలె దుర్బలహృదయ యని భావించొద్దు.

నేను:—పోనీ పద్మా! ఒకవేళ మీ అన్నయ్యే నిన్ను వివాహానికి నిర్బంధిస్తాడనుకో! ఇంతగా పోషించి విద్య నేర్పించిన అన్నయ్య మాట నిరాకరిస్తావా?

పద్మ:—ఆయన నా యిష్టానికి వ్యతిరేకం చెప్పడు. ఒకవేళచెప్తేమాత్రం ఆయన మాట కోసం నాజీవితాశయాన్ని మార్చుకుంటానా? ఎన్నటి కట్లుచేయును.

నేను:—సరె చూద్దాంగాని నిద్రోస్తుంది. యివాళకు పడుకో రేపు మాట్లాడుతా మేమన్నాఉంటే.

పద్మా:—సోదరీ నా కోరిక నెరవేరుస్తావా? చెప్పు. నీ వివాహం మానేసావా?

నేను:—నేనుమాత్రం నా జీవితాశయా న్నెలా మార్చుకుంటాను?

పద్మ "పోనీ నీయిష్టం చెప్పినమాట వినకుంటే నీయవస్థనీదే" అని నోరుమూసు కుంది.

పద్మ త్వరగానే నిద్రపోయింది. నాకు మాత్రం నిద్రపట్టలేదు. నాహృదయం డోలా యనంగాఉంది. ఏమార్గం అవలంబించాలని ఎంతో ఆలోచించి ఆలోచించి తుదకు నా మార్గమే త్రొక్కదామని నిశ్చయించాను. కష్టములువచ్చినచో వాటియనంతరం సహజంగా రాబోయేసుఖం మహానందంగా ఉంటుంది.

### 3

నా వివాహమైన ఒక సంవత్సరంవరకూ నేనెక్కువ మా పుట్టింటనే ఉన్నాను. ఇది నాయిష్టంగాదు. మాఅమ్మగారి నిర్బంధం. నావివాహంలో మాఅన్నయ్యలేని లోపం మాత్రం నన్ను బాధించింది. పద్మగూడ ఎక్కువగా రాలేదు తనకిష్టంలేని పనిగాబట్టి. నావివాహమైనతరువాత పద్మ ఎక్కువగా నావద్దికిరావడం మానేసింది. వస్తేఎక్కువ సేపు కూర్చోదు. మాస్నేహబంధంమాత్రం తెగలేదన్నడూను.

మా అత్తవారింటికి వచ్చాను. పద్మ మాటలు తరచు వింటూండడంచేత నా మనస్సులో కొంతవరకు భయమేర్పడింది పురుషుల నమ్మతగినది కాదేమోనని. కాని నా ప్రభువు నా భయసంశయాదుల కెన్న డూ ఎడమీయడంలేదు.

నా యీ కొలదికాల సతీత్వమందే పురుషులు పద్మ వర్ణించునంతటి దుర్మా ర్గులు కారనీ, వారిని ప్రేమతో స్వాధీన మొనర్చుకొని వారి నానందింపజేసి తా నానందిచుట స్త్రీయొక్క ముఖ్యకర్తవ్య మనీ గ్రహించాను. స్త్రీ జన్మసార్థకం కావడానికి పత్నీత్వమే అవసరమని తెల్సు కున్నాను. విద్యాయుతులగు దంపతు లన్యోన్యానురాగముతోనుండి వారి వారి విధ్యుక్త ధర్మముల నెరవేర్చుకొనుచుండిన వారి నే కష్టము లంటవు. వారి కిహము పరములు సులభసాధ్యములు. ఇలాంటి వెన్నో గొప్పగొప్ప యాదర్శములు స్వాను భవంగా తెల్సుకున్నాను. దివ్యమోహనశక్తి భగవంతుడు స్త్రీల కిచ్చాడు. దానిని ధర్మ మార్గంలో వినియోగపర్చడం స్త్రీయొక్క ముఖ్యధర్మము.

పద్మ ఇంటర్మీడియటు ప్యాసైంది. బి.ఏ. జూనియర్ చదువుతోంది. నేను పుట్టింటి కొచ్చాను. పద్మ నన్ను కౌగిలించు కొని చిన్నపిల్లలా ఏడుస్తోంది. ఎందు కేడు స్తుందో గ్రహించలేకపోయాను. గదిలోకి తీసుకెళ్లాను. దాని ఏడ్పునకు కారణ మడి గాను.

పద్మ:—ఇన్నాళ్లు నిన్ను విడచియున్నం దులకు ఎన్నడెరుగని యీ నీచదాస్య మున ఎలాకాలం బుచ్చుతున్నావోనని విచారిస్తున్నాను. పరీక్షలకై చదువు తూండడంవల్ల నీ కుత్తరాలు వ్రాయలేక పోయాను. లలితా! ఎవరైన తమ కష్టా



డా. సుశీల ఎన్. పరంజిపె

(కీ. శే. ఎన్ జి. పరంజిపెగారి కుమార్తె)

ఇంగ్లాండునందు ఎల్.ఆర్.సి.పి., ఎం.ఆర్.సి.ఎస్.

పట్టముల బడసి భారతదేశమునకు తిరిగివచ్చిరి.

లను తమ నెచ్చెలులతో చెప్పుకుంటే వారి పరితాపము కొంత శాంతిస్తుందనుకుంటాను. చెప్పు. నీ కేమేం కష్టాలు సంభవిస్తున్నవో?

నాకు నవ్వొచ్చింది. పద్మయే పిచ్చి పిచ్చియూహాలకు లోనౌచున్నదనే విచారం నన్ను బాధిస్తుంటే, నేనే యేమో కష్టాలుపడుతున్నానని తా ననుకుంటోంది. "పద్మా! విచారించకు. నా కేమాత్రం కష్టంలేదు" అన్నాను. పద్మ "పురుష దాస్యం" అంది.

నేను:—పిచ్చిదానా! స్త్రీగాని పురుషుడుగానీ బ్రహ్మచర్యంగా ఉండి జీవితానందం పొందజాలరు. పురుషుల ద్వేషించి, వారితో సంబంధంలేకుండా ఉండి స్త్రీగౌరవము సంపాదిస్తానన్నమాట దుర్లభమైంది. ఒక పురుషుని నీకు తగినవాని వరింపుము. అతనిని ధర్మమార్గమున నడిపింపుము. నీవు సీతవై యతని రామునిగా జేయుము. అపుడే నీజాతి, నీ కుటుంబము, నీవు, నీ భర్త ధన్యులగుదురు.

పద్మ ముఖం ఎఱ్ఱబారింది. విచారం కోపం ఆమె నావరించినై. నామీద ఉండే ప్రేమ, చాల దినములకు చూచినందున గౌరవం, ఆమె నింతతడవు నోరు మూయించినయి గాని, ఆమాటలే మరోనోట విన లేదు. విని సమీపించలేదుకూడాను. అక్కడికి తీవ్రంగా అంటోంది, "ఓయ్! అమాయికా! ఇదంతా నీభర్త నేర్పాడా నీకు! స్వార్థపరుడు! పురుషుల హృదయాలు కనుక్కోవడం దుర్లభం. ఇప్పుడు నీ యౌవనముందలి హృదయానందకరమగు వెన్నెల రాత్రులలో నీ భావికాల యంధకారమయమైన జీవితాన్ని ఊహించలేకున్నావు. మనకంత దూరదృష్టేఉంటే ఇన్ని అగచాట్లెందుకు ? నల్గురుపిల్లల తల్లివైనప్పుడుగాని నీ భర్త కెంతప్రేముంటుందో నీకు తెలుస్తుంది. ముందుంది ముసళ్లపండుగ. ఎందుకెగురుతావుండు."

నేను:—పద్మా! మనమే కొంచెం తెలివిగా ప్రవర్తిస్తే అలాంటి దెన్నడు జరుగనేరదు. జర్గినా చింతయుండదు. కుర్రాళ్లతోనే మన కానందం గల్గుతుంది.

పద్మ:—"ఇపు డానందం. తర్వాత దుఃఖం. దుర్భరమైన దుఃఖం. మరువకు, మరువకు" అని అంటూ లేచి ఉండమంటుండగా వెళ్లిపోయింది. దీనిపిచ్చి ఎన్నడు మానునో యని యాలోచిస్తూ నేనూలేచి మా అమ్మవద్దకి వెళ్లాను.

[పద్మ క్రమంగా తన ఆశయాలన్నీ విడువడం, లలిత వృద్ధేశాలకు‌ఃజయంగలగడం, పద్మ పెళ్లి, అపజయం పొందడం వచ్చేసంచికలో చదవండి.]

# నిద్ర; కవిత

శ్రీమతి బుద్ధిరాజు చెల్లాయమ్మగారు

గుబురుగుబురులుగా గూడుకొన్న పొదల
చిగురుటాకులలోన విచిత్రగతుల
బూచియున్నట్టి మల్లికాపుష్పతతుల
తావులెడనెడనొలికిన తావులందు
మధురమకరందరసపాన మత్తమధుప
తతులఝుంకారగాన మోహితసమీర
మృదుతరాంగుళీధూత తంత్రీస్వనముల
శిలలుగరగిపో నదులైన తలములందు
చూతపల్లవమాధురీ శోభజిక్కి
యొడలిపై నెల్ల పుష్పాళ్లుగడలుకొనగ
గానవాహినుల్ జగమెల్లగప్పివైవ
కోకిలలువిహరించెడు కోనలందు
తుహినకిరణుడు చంచలదూర్మికాంచ
లముల చలువచేతులను లాలనయొనర్చి
వికచకైరవనవదళ వృంతజనిత
వాతసౌఖ్యములను చొక్కు వనములందు
విసువునలసటలేక నల్దెసలద్రిప్పి
తలపులకువన్నెవెట్టు చిత్రములగూర్చి
శిథిలహృదయను నను ముగ్ధజేసివైతు
వీయకారణవాత్సల్య మేలనీకు ?
ఊహాకందనియెత్తున ద్యోపథాన
చెప్పరానట్టివేగాన చెదరిపోవు
గాలికెరటాలమించు ఖగమ్మురీతి
నభ్రతలగాములౌ విమానములలోన
చపలుతోటలోమబ్బు పూబొదలనడుమ
రాజితానంతకోటి తారకలతోడ
రాజువాహ్యాళివెడలి సరాగకేళి
దేలువిమలాంబుయుత సరస్తీరమందు
స్వర్గగంగానదీ హేమసైకతముల
చలువలగుసీటితూపరల్ చెలువమెరయ
కలయజిమ్మెడు మందసుగంధవాహ
కంఠనిర్గతస్వాగత గానమందు
కాంతితొరగినపూవులు కానబడని
పండుటాకులునేలపై బడనియట్టి
జరయుమరణములేనట్టి జనులుగలుగు
మనుజులెన్నడు గననినందనములందు
ముగ్ధసజ్ఞానతిమిర విమోహితాత్మ
నైన నన్ను నీతోడవిహార సరణిద్రిప్పి
యెన్నడెరుగనిసౌఖ్య నిర్జితను జేతు
వీయకారణవాత్సల్య మేలనీకు?
పూవుపూవునబొదలెడు తావులందు
చిగురుచిగురున నొలికెడు చెలువమందు
యెన్నఁనులేని తలపని యెరుగరాని
దివ్యసౌందర్యమున నాదుదృష్టినిలిపి
పలుకుతేనియలొలుక రాచిలుకలందు
మధువునానుచుబాడెడు మధుపమందు
కలుషమేమియొ యెకయింతగానరాని
నిర్భరానందసంరంభ నిరతిజూపి
పగలువెంబడిరాత్రియు, వగలవెనుక
సుఖములును, వర్షమడగిన సూర్యకాంతి
వరుసగాగల్గునట్టు లేర్పరచియున్న
ప్రకృతిలోగల సత్యసారమును దెల్పి
దేశకాలనిమిత్త బంధితములైన
పుడమిపొలిమేరలను దాటిపోయి,యంత
నన్ను నంతప్రకృతి కధినాథజేతు
వీయకారణవాత్సల్య మేలనీకు?

# వివాహ చరిత్ర

"రాచ"

## ౧

### పుట్టుక

వివాహమన నెఱుగని వా రుండుటరిది. సమానవయస్సుగల యువతీయువకులు జీవితమందలి కష్టసుఖముల సమానముగా పంచికొని సంతానము బడసి, యొకచో జేరియుండ సంఘ మంగీకరించు 'ఫర్మానా' వివాహము. సత్సంతాన మందలి మూలసూత్రము; సృష్టిసూత్రపరిపాలన విధాన మాదర్శము. ఇట్టి పవిత్రవిషయమునకు ప్రకృత ప్రపంచముననుు భారతదేశముననుు ఎట్టి యర్థమున్నదో తెలియనిది గాదు. తండ్రి తనయుని వివాహము తలపెట్టిన నది పవిత్రోద్దేశ్యముతో గాదు; లోకాచారము ననుసరించి కుమారుని కే బాలికనో తగలకట్టవలయుననియే; లేక కూడుగుడ్డల సంపాదింప దారిజూపని విద్యకొఱకై వెచ్చించిన ధనము గడించుట కే! తల్లి తనయ వివాహము తలపెట్టిన, పెద్దదైన లోకులేమందురో; చుట్టుప్రక్కగల అమ్మలక్కలేమి వాగుదురోయను భయము చేతనే! తాము తలపెట్టకపోయినను తలిదండ్రుల బలవంతముచేత వివాహమాడుటకు సిద్ధపడిన బాలబాలికల కదేమైనది తెలియక యొప్పుకొనుట, నూతనవస్త్రాభరణాదులధరించుట, తియ్యని తినుబండారముల విరివిగా దినుటయందలి యానందము వలననే! కాటికికాళ్లు చాచుకొని పండుముదుసలియయ్యు వివాహమునకై సకల ప్రయత్నములు చేయుట తాను గతించువఱకు దగ్గరుండి దాసివలె పనిచేయుట కొకస్త్రీని సంపాదించు నాశవలననే! సంసార సౌఖ్యములకు దూరుడయ్యు సంతానభాగ్యమును బడసియు కొందరు పురుషులు వివాహమాడ నువ్విళ్లూరుట బిడ్డలపెంచుటకు దాదియు, వంట జేయుటకు వంటకత్తెయు గావలయుననెడి కోర్కెచేతనే! పరస్పర ప్రేమచే బంధితులై పవిత్రోద్దేశ్యములతో వివాహమాడుటకు ప్రయత్నించువారు చాల తక్కువ. సంఘములో నింతటి ప్రాముఖ్యమివ్వబడిన యీ వివాహపు పుట్టుపూర్వోత్తరములు చదువరుల కాదరణ పుట్టించకపోవు.

వివాహమునకు ప్రధానోద్దేశ్యము సత్సంతానమను విషయము నిర్వివాదాంశము. అది ప్రకృతిసిద్ధమై యంతటను గనబడుచున్నది. వివాహమను తంతులేకున్నను సృష్టియందుగల ప్రాణులు నీ యుద్దేశ్యముతోడనే సంతానమును బడయుచున్నవి. పశుపక్ష్యాదులలో నీ సంతానము బడయు పద్ధతు లొకటిగనుండవు. కొన్ని కొంత కాలము మాత్రము గలసియుండి సంతానో

త్పత్తిగాకనే వేరై పోవుచుండును. మరి కొన్ని సంతానోత్పత్తియగువఱకుండి తరువాత వానిని పెద్దవగువఱకు పోషించు భారముతలపై నిడుకొని తరుఘాత వేరగును. మరికొన్ని సంతానమునుబడసి జీవితకాలమంతయు నొకచోగలసియుండి మందలు మందలుగా నుండును.

ఆదిమానవులలో వివాహమునకు సంతానోత్పత్తియే ముఖ్యముగా పరిగణించుచున్నట్లు పెక్కునిదర్శనములు గలవు. ఆదిమానవుల దగ్గరవారని యెంచబడుచు నాగరిక ప్రపంచమునకు దూరముగ వివిధ ప్రాంతములతోనున్న అనాగరిక జాతుల యెడల నీ విషయము గాననగును. ఫ్యూజియనులు, తూర్పు గ్రీన్‌లాండు దేశస్థులును స్త్రీకి సంతానముగలిగిన గాని వివాహము పూర్తియైనదని తలంపరు. పెరుగియర్ చాకోయందలి లెంగ్వ ఇండియనులు మొదట వివాహమాడి యొకచో నివసింతురు. నియమితకాలములో సంతానము గలిగినతప్ప వారా వివాహమునకు బద్ధులుకారు. కొన్ని కెనడాజాతులలో పురుషుడు తండ్రియింటనున్న భార్యతో అపుడపుడు వసించుచుండును కాని శిశువు జన్మించిన పిదపనే భార్యభర్తతో గూడ నివసింపవెళ్లును. అట్కా-అలేట్ జాతిలో పురుషుడు తనభార్యకు సంతానము గల్గినంత వఱకు ఆమెనుకొన్న పైకమివ్వడు.

బోర్నియోసముద్రతీరవాసులు వివాహమునకు ముందు వధూవరులు నిశ్చయమైన తరువాత నొకచో వసింపనిత్తురు. గర్భధారణ చిహ్నములు గనబడిననే వారిరువురకు వివాహమగును. కొన్ని ఆస్ట్రేలియా దేశపు జాతులలో నొకడొకయువతితో సంతానము గలుగువఱకు వసించిన నామెను భార్యనుగా నుంచుకొన నిత్తురు. నీలగిరులందలి బడగలను వారిలో స్త్రీకి ఐదవమాసము వచ్చినగాని వివాహము స్థిరపడదు. మధ్యఆఫ్రికాయందలి ఫార్ జాతిలో భర్త మామగారింటనే సంతానోత్పత్తియగువఱకు భార్యతోగూడ వసించును. అంతవఱకు భార్యాభర్తలకగు ఖర్చు మామగారే భరింపవలయును. ఆకాలములో అల్లునకు ప్రతిరాత్రి మూడుమారులు భోజనము పెట్టనలయునట! పురాతన కుకి జాతులందొక యువకుడెవరిని వివాహమాడ గోరునో ఆమె తండ్రియింట మూడుసంవత్సరములు పనిచేయుచుండును. ఈ కాలములో నాతడామెతో వసింపవచ్చును. ఆమెకు గర్భధారణ చిహ్నములు గల్గిన నతనికి వివాహమాడుటకు హక్కుండును.

వీనిని బట్టిచూడ ఇతరవిషయములకంటె సంతానోద్దేశమే వివాహమునకు ప్రధానమని స్పష్టమగును. ఇట్లు సంతానముబడయ వివాహమాడు పురుషులకు కొంతశక్తి సామర్థ్యము'ు జీవనోపాయసాధనములు అవసరము. మనదేశమున స్త్రీపురుషులుగా పుట్టినచో మరి వివాహమాడకుండుటకు వీలే లేదు. వారు బీదలైన, కురూపులైన, రోగులైన,అశక్తులైన,మరేమైనసరియే పెండ్లియా

డితీరవలసినదే.అందులో స్త్రీలైనచెప్పవలసిన పనియేలేదు. వారు వివాహమాడకుండనున్న చో ప్రళయమువచ్చును; ప్రపంచముతలపైన బడును; హిందూమతము గంగకలయును; ఆచార మడుగంటును; ఈ వివాహము పైననే ఆధారపడియుండుపితరులు నాశన మగుదురు. అట్లుగాక స్త్రీలకువిద్య,వయసు, రూపము, బ్రతుకుదెరువు, ఇష్టానిష్టములు ఇవియేమియు చూడక వారికెవరినో అంట గట్టి వివాహమైన కొలది కాలములోనే వా రెవరికిచెప్పక స్వర్గలోకమునకు విమా నాలపై ప్రయాణములు సలిపి యేపాప మెఱుగని వారిని యావజ్జీవఘోరనరక బాధల పాలుజేసిపోగా ప్రపంచము నిలు చును; హిందూమతము జీర్ణముగాదు; ఆచా రము మెఱుగెక్కును; పితరులు తరింతురు; పెద్దలు సంతసింతురు; సంఘము సెబా సనును.

దానికేమిగాని పూర్వులలో మాత్రము వివాహమాడు నాతడు ముఖ్యముగా యువ కుడై, బలవంతుడై తనభార్యను రక్షించుసా ధనోపాయము లెఱింగియుండవలయుననెడి నియముండెడిది. ఉత్తరఅమెరికాఖండమంద లి ఇండియనులు సంసారమును పోషించుశక్తి గలుగుటకుమున్నే వివాహమును తల పెట్టుటవమానముగా నెంతురు. పూర్వ కాలమున మానవులకు వేటయే ముఖ్య జీవనోపాధిగానున్నందున వేటాడుటకు రాని వాడు వివాహమున కనర్హుడుగా పరిగ ణింపబడుచుండెను. బ్రిటిషుగయానా యందు మాకూసిన్ అనబడువారిలో వివా హమాడ దలంచుకొన్నవాడు ఓర్పుధైర్యస్థైర్యాదిగుణములు గలవాడని నిరూపించుకొ నుటకు శరీరమందు పరీక్షార్థమితరులు జేయు పలుగాయములను భరింపవలయును. అంతి యగాక అతడు కొంత అడవిని చక్కజేసి కుటుంబమునకు గావలసిన మాంసాదులను వేటాడి తీసికొని రావలయును. ఇటువంటి పరీక్షలు పలుతెగలలో పలువిధముగగలవు. అలాస్కాయందలి కోయిఠకాఅను జాతి వారు తమలో నెవడైన యొక జింకను చంపకముందే వివాహమాడినచో నాతనికి సంతానము గలుగదని నమ్ముదురు. యొక గిరులను తెగలో వరుడు కాగోరువాడు, కాబోవు మామ అడవియందు కొట్టవేసి వచ్చిన యొకపెద్దమ్రానును నింటికి లాగుకొని వచ్చి యొకగుడారముక్రిందబడురీతివేయవల యును. అపుడే అతడు వివాహమున కర్హుడు. ఈజిప్టునందు కొంతమంది ఆరబ్బు లలో వరుడగువాని బంధువులందరు చబు కులతో ధైర్యమును బరీక్షింప చావ మోదుదురు. వానికి వివాహము నిజముగ గావలసియున్నచో నాతడద్దానిని సంతోష ముతో భరింపవలయును. ఇటువంటి విచిత్ర వాడుక లెన్నేనిగలవు. నవీన యువకులవి యనాగరకముగ దలంపవచ్చునుగాని వారు వివాహమాడుటకు పరీక్షలలో గడతేరుట కన్న నూరకుండుట మేలనియే తలంతురు. కారణమేమి? వివాహమున కన్నివిధముల తగినవారు చాలతక్కువగా నుండుటే!

ఈ వివాహపద్ధతి ఆదినుండియే యిప్పటి యభిప్రాయములతో జరుగుచున్నదని తలంపరాదు. సంతానోత్పత్తితో ప్రకృతియందు స్త్రీపురుషప్రాణు లొకయెడ జేరి వసించును. సంతానోత్పత్తియయిన తరువాత ప్రకృతియందు యావజ్జీవ మన్నిప్రాణులుగలసి యుండునని తలంపజనదు. గర్భధారణగల్గిన వెంటనే కొన్ని జంతువులు విడిపోవును. మరి కొన్ని వానినిపెంచి పెద్దజేయుటకు పూనుకొనును. మరికొన్ని యావజ్జీవమువఱకు వానితో గలసియుండును. గొరిల్లా మొదలగు కోతిజాతు లీతెగకు జెందినవి. ఆగుణములో పరమావధి జెందినవాడే మానవుడు.

మానవుడు స్త్రీ గర్భముధరించి నప్పటినుండియు, ప్రకృతియందు జంతువులవలె, నామెను సంరక్షింప బూనుకొని యామెయండనుండును. సంతానముగల్గిన తరువాత భార్యను, సంతానమును రక్షించుభారమంతయు నాతడే వహించును. కాని యీకాలమందు ఒకవిధమగు వాడుకగాని అనురాగముగాని యాతని తనభార్యా పుత్రులనుండి వేరుచేయక నుండెడిదని భావించుటకంటె వివాహమను నియమము ఏర్పడిన పిదపనే పురుషుడు భార్యాబిడ్డలతో స్థిరముగనుండుటజరిగినదని యెంచుట మంచిది. ఈయేర్పాటు సంఘము గావించుటకు స్త్రీపురుషులొకచో నివసించువాడుక మాత్రమే యాధారముగాదు. వారికిగల్గిన సంతానము నెడ తలిదండ్రులకు సహజప్రేమ జనించును. కాని మానవుడపుడంత నాగరికతజెంది యుండకపోవుటచే భార్యాబిడ్డల తప్పని సరిగా పోషించుబాధ్యత గుర్తెఱిగియుండక పోవచ్చును. అపు డాస్త్రీయు నామె సంతానమితరుల నాశ్రయింతురేని మొదటియాతని కున్నట్టి యాదరణ — వాడుకను సంబంధమునుబట్టి — యిష్టము వారియెడ గలుగక పోవచ్చును. అందుచే నొకపరి యొకచో వసించి సంతానమును బడసినమీాదట వారందరు విడిపోకుండుటకును, వారిమధ్య సంఘసహవాసముచే మొలకలెత్తుచున్న యనురాగమును వృద్ధిపొందించుటకును, కొన్ని నియమములనెఱిగి వర్తించుటకును, అప్పటివారిలో కొంచెము జ్ఞానము గలవారు వివాహమను పద్ధతి నేర్పఱచిరి. దానికి లోనైనవారు మాత్ర మొకచో నివసింపవలయుననియు, వారు తదుపరి వీడిపోరాదనియు నిర్ణయించిరి. దీనికి సంఘము తనయంగీకారమును జూపెను. అది నానాటికి దేశకాలపాత్రలబట్టి మారుచు వివిధ కట్టుబాట్లకులోనై తుదకు విపరీతముగా పరిణమించినది. తరువాత బైలుదేరిన బాహ్యాడంబరాచారము లందున్న యాశయములనే మఱుగుపరచినవి.

# వర ప్రసాదము

నాడు మాత భవాని చత్రపతి శ్రీ శివాజికి ధర్మరక్షణార్థము పవిత్రఖడ్గమును ప్రసాదించినది. ఆ దేవీ సమర్పిత ఖడ్గమే అతనికి బలము, తేజస్సు, ధైర్యము. భారతీయులందరికి ఆ బలము, ఆ ధైర్యము, ఆ స్థైర్యము, ఆ తేజస్సు నుండవలెను.

బలమును వృద్ధిపరచుటకు, ధైర్యస్థైర్యములను పెంపొందింపజేయుటకు, కండరములను పెంచుటకు, తేజస్సు నినుమడింపజేయుటకు, జీవామృతమును సేవింపవలెను.




నరముల బలమునకు, దేహపుష్టికి, తేజస్సునకు

## జీవామృతము

ఆయుర్వేదాశ్రమము, :: పోస్టుబాక్సు 287, మదరాసు.

# భారతస్త్రీకి సంపూర్ణస్వేచ్ఛ

[పై శీర్షికతో గతసంచికయందు కొంతమంది సోదరీమణుల వ్యాసములను ప్రకటించితిమి. వారి యభిప్రాయము లీ సమస్యపై కొంచముచ్చుతప్పకుండ నొకరీతి యుండుటజేసి యితర సోదరీమణులుకూడ తమ యభిప్రాయముల దెల్పిన ప్రకటింతుమని మరల కోరితిమి. దానిపై మాకుచేరిన వ్యాసములందు కొన్నింటిని మాత్ర మిచట క్లుప్తపరచి ప్రకటించుచున్నాము. ఈ విషయముపై సోదరీమణుల యభిప్రాయముల ప్రకటించు టీ సంచికతో విరమించుచున్నాము. గత సంచికయందు గావించిన ప్రకటన ననుసరించి తమ యభిప్రాయములను ప్రకటనార్థమై వ్యాసరూపమున మాకు పంపుకొన్నవారికి కృతజ్ఞులము. సంపాదకుడు.]

ఈ సమస్యపై ఇప్పటికే చాలామంది సోదరీమణులు సలహాల నిచ్చియున్నారు. కాని పరిశీలించి చూడగా ఇంచుమించుగా అందరి ఉద్దేశములును ఒకేవిధముగా కనుబడుచున్నవి. ఇందరు సోదరీమణులకు వ్యతిరేకముగా నే నీయభిప్రాయము నివ్వవలసి వచ్చినందుకు చింతించుచున్నాను.

క్రిందటనెల ప్రచురింపబడిన వ్యాసములన్నిటి ముఖ్యాంశము స్త్రీలు పాశ్చాత్యవిద్యలు, వేషాచారములు నేర్చుకొనక గృహనిర్వహణము బాగానేర్చుకొని పతివ్రతలుగాఉండి, అనగా భర్తను సర్వవిధముల పూజించుచూ, పిల్లలే తమ జీవితసర్వస్వమనుకొని, వారి రక్షణమే తమ విధ్యుక్తధర్మమనుకొని, బాహ్యవ్యవహారాలతో ఎక్కువ సంబంధం లేకుండా, సుమతీ సావిత్రుల కథలు చదువుకుంటూ కూచుంటే సర్వస్వతంత్రురాలు అవుతుంది అని తేలుతున్నది. ఇందులో ఆశ్చర్యకరమైన విషయమేమనగా హైందవస్త్రీకి గృహనిర్వహణమునందుగాని శిశురక్షణమునందుగాని పాతివ్రత్యవిధానమునందుగాని ఇప్పుడు ఏమీ అస్వాతంత్ర్యము లేదు. ఇంతేగాక సేవా విధానమే జీవిత లక్ష్యముగా పెట్టుకొనే ఏజాతికిగూడ అడ్డంకులు ఉండవు. నిజముగా భారతస్త్రీకి కావలసినది ఇంతమాత్రమే అయినయడల ఆమె ఇప్పటి జీవితముతో తృప్తిజెంది నిర్విచారముగా "స్త్రీభక్తివిజయము" చదువుకుంటూ పిల్లల్ని ఆడించుకుంటూ కూర్చోవచ్చును. అందుకు ఇప్పుడున్న స్మృతులు, చట్టములు, సాంఘిక పరిస్థితులు అన్నీ అనుకూలముగానే ఉన్నవి. ఈ స్వేచ్ఛతో తృప్తిజెందినయడల నిర్విచారముగా శతాబ్దముల పర్యంతము ఇట్లే పతివ్రతలుగా ఉండవచ్చును.

అట్లుగాక భారతస్త్రీ తానుప్రాణముగల చీపురుకట్టను (A living broom) కాననియు పురుషులలో వలె, అనుకూలము గల్గినయడల పురుషులు చేయగల గొప్పపనులన్నియు చేయగలననియు, తనజాతి యందు బుట్టిన తనవంటి భారతస్త్రీలే కొందరు ప్రపంచవిఖ్యాత కార్యములాచరించియున్నారనియు, తెలుసుకొని నాగరిక ప్రపంచమునందలి వివిధప్రాంతముల స్త్రీలెట్టి సంపూర్ణస్వేచ్ఛను ననుభవించుచున్నారో అట్టి స్వతంత్రమే తనకుగూడా ఎప్పుడు, ఎట్లా, వచ్చునా? అని విచారించినయడల అప్పుడు ఈక్రింది సంస్కరణములు ముందుగా జరుగవలసి ఉండును.

స్త్రీకి ఇప్పుడుఉన్న మోస్తరుగాక, ఏవిధమైన ప్రత్యేక నిబంధనలు లేక, సర్వవిధముల పురుషులతో సమానమైన వారసత్వపు శాసనము రావలెను.

# భారతస్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ

(2) ఇప్పటివలె స్త్రీ ఈ యీప్రత్యేకవిద్యలను మాత్రమే నేర్వవలెననే నిబంధనలేక ఆమె అభిరుచిని అవకాశమును, అవసరమునుబట్టి ఏప్రత్యేక విద్యనైనా నేర్చుకొనగలిగియుండవలెను.

(3) స్త్రీల వివాహవయోనిర్ణయము, మనుస్మృతి ననుసరించి 8–10 సంవత్సరములుగాని శారదా శాసనము ననుసరించి 14 సంవత్సరములుగాని గాక రజస్వలా నిబంధనలేక, వారి వీలుననుసరించి శరీరస్థితినిబట్టి ఎవరికి వారి ఇష్టప్రకారము ఉండవలెను. (?)

ప్రస్తుతము అవసరమైన పెద్దసమస్య లివ్వి. ఇవి సమకూడినయెడల మిగిలిన చిన్నచిన్న సంస్కరణ ములను స్త్రీలు స్వయముగానే చేసుకొనగలరు. ఇన్నిటికన్న ముఖ్యమగు విషయమేమనగా స్త్రీలు తాముగూడ పురుషులతో సమానులమనియు, ఈప్రపంచ చిత్రము ననుభవించుటకు అనుకున్న సర్వాధికారము లును తమకుగూడ గలవనియు, స్వార్థపరులైన పురాణకారుల సంకుచితాభిప్రాయములవలన తమకు లోపించిన సక్రమాధికారములను తిరిగీ సంపాదింపవలెననియూ, తలంచి వానిని బొందుటకు ప్రయత్నముచేయవలెను.

అంతేగాని ఇలా పాతివ్రత్యంతో పిల్లలగన్నణ ఇంటి సవరణచేసుకుంటూ కూర్చోవడమే సంపూర్ణ స్వేచ్ఛ అనుకునేయెడల ఇకభారతస్త్రీలకు క్రొత్తగా కావలసిన సంస్కరణము లేమీలేవు. మరియు ప్రపంచమంతా క్రొత్తక్రొత్తమార్పులతో దినాదినాభివృద్ధిచెంది ముందుకు నడుస్తూఉండగా మనభారతస్త్రీలు వెనుకకునడచి అనసూయా అరుంధతీలవలె తయారుకావలెననుకుంటున్నారు. అంత ప్రేమగల ఆపురాణ పతివ్రతల చరిత్ర లలో ఉత్ప్రేక్షతీసివేయగా విశ్వాసకరమైన నిజచరిత్ర ఎంత మిగులుతుందో ఒక్కరిచరిత్రనైనా ఇంతవరకు ఎవ్వరూగూడ పరిశోధనచేయలేదు. ఇంతేగాక ఈధర్మములుచెప్పి వెనుకకు ఈడ్చేస్త్రీ లెవరైనా ఇప్పుడు మన పురుషులనుగూడ వశిష్టకుకకౌశికులనుగా తయారుచేస్తారా! లేనియెడల పురుషులు పెద్దపెద్ద చదువులు చదువుకొని ప్రపంచవిజ్ఞానం సంపాదించి పరిపూర్ణమైన పాశ్చాత్యదుస్తులతో క్లబ్బు విహారాలకు కాస్మాపాలి టన్ డిన్నర్లకు హాజరవుతూ అంతర్జాతీయసమస్యలను ఆదుర్దాతో పరిశీలించే రోజుల్లో మనస్త్రీలు అనసూయా అరుంధతీ లాగా ఐహోయి శుశ్రూషచెయ్యడానికి తప్ప ఇంకెందుకు పనికిరానిస్థితిలో ఉన్నయెడల ఆపురుష మహాశయులు ఇంటికిరావడమంటే అసహ్యపడి క్లబ్బుల్లో తమకు కనబడే స్వాతంత్ర్య మూర్తులైన ఏక్రైస్తవ కాంతా కరస్పర్శలనానికో కలవరించి పోతారు. చివరకీ పతివ్రతామణులు భర్తలకేగాక సపత్నులకుగూడ సేవచేయవలసిన స్థితికివచ్చి మరింత శీఘ్రంగా ముక్తిబొందుతారు.

కనుక స్త్రీ సంపూర్ణస్వేచ్ఛ సమానమైన గౌరవము బడయవలెనంటే వెనుక నేను సూచించినట్లు ఉన్నత స్థితికి వచ్చుటకు ప్రయత్నింపవలెను గాని సేవావిధానంలోనే సంపూర్ణస్వేచ్ఛగలదని తలంపగూడదు.

యల్లాప్రగడ సీతాకుమారి—(హైదరాబాదు,)

భారతస్త్రీకి ప్రపంచస్త్రీలందరిలో తలమానికమని కీర్తివచ్చియున్నది. ఏల? ఆమె పతిసేవా వ్రతగమన: అందువలననే మనలో పాశ్చాత్యదేశములందువలె విడాకుల అగచాట్లులేవు. భారతస్త్రీలలో విద్యతక్కువ. ఇపుడిపుడు విద్యావతులగుస్త్రీలు బయలుదేరుట ముదావహము. కాని వారికివిద్య వచ్చినంత మాత్రమున పతులకు లొంగియుండరన్న భావముగూడ పట్టుపడుచున్నది. తుదకది ఎంతవరకు ప్రబలినదన చదువుకొన్నభార్యను పెండ్లాడితే సంసారయాత్రకు నిరుపయోగమని నమ్ముటవరకు వచ్చినది. ఇపుడు నిరుద్యోగసమస్య పురుషులలోననే ప్రబలముగనున్నయది. అట్టియెడ స్త్రీలుగూడ వారితో పోటీపడి యుద్యోగములదూరి సంసారికజీవనమున చక్కగ శ్రాద్ధానకపోయినచో భారతజాతియే అధోగతిపాలగుట

తిథ్యము. కావున ఏనాడు మనము లలితకళలను అనగా విద్య, కవిత్వము, చిత్రలేఖనము, సంగీతము, చమ్కీ పని మొదలగునవి చేపట్టి గృహకృత్యముల కడ్డులేని తీరికసమయములయందు సాగించుచు పురుషులమనసుల రంజింపచేయుదుమో అప్పుడు సంపూర్ణస్వేచ్ఛనుబొంది భారతీయులకేగాక ప్రపంచనారీరత్నములకెల్ల మార్గదర్శినులై భారతదేశమును తేజోవంతముగ చేయజాలుదుము.

పులవర్తి కమలావతీదేవి—(రాజమండ్రి.)

ఇప్పుడు భారతభూమియం దెచ్చోటవిన్నను యొకవంక "స్త్రీస్వాతంత్ర్యము, పురుషులతో సమానమైన హక్కులుండవలె"ననియు వేరొకచో "స్త్రీవిద్య"యనియు, మరొకప్రక్క "సాంఘికవివాహము"లనియు, యింకొకచోట "విడాకులచట్ట"మనియు, వేరొకయెడ "స్త్రీలు దేశసేవచేయ సమకట్టవలె"ననియు కేకలు ప్రబలముగా వినబడుచున్నవి. కాని యీ కేకలను పలుకురాయివలె నూరుసారులు వినవచ్చుచున్నదే గాని స్త్రీలోకమున కావంతయు మేలు గలుగకున్నది. కారణమేమన నిజపరిస్థితులను గమనించక ఇతరిని జూచి నక్క వాతపెట్టుకొన్నట్లు విదేశస్థుల ననుకరింపగడంగుటయే. కన్యగానున్నప్పుడు తలిదండ్రుల ప్రేమ లభింపకయు, యౌవనమున భర్తృప్రేమ లభింపకయు, వార్ధక్యమున పుత్రప్రేమ లభింపకయు యెందరు స్త్రీలు కష్టపడుచున్నారో విచారింపబూనుకున్న మూడువంతు లట్టివారేయున్నారు. పైకెంత గంభీరులైయున్నను మూడువంతులమంది యట్టివారే. లోనిక్రుళ్లుతీయక పైమెరుగు లెల్లిపెట్టిన నేమిలాభము. బాల్యమందు తల్లిదండ్రుల ప్రేమగల్గిన కన్య స్వాతంత్ర్యము గల్గియుండును. (?) ఆమె వివాహితగాకున్న యామె స్వేచ్ఛాప్రవాహమున కడ్డేలేదు. కాని యట్లుండుట సౌఖ్యప్రదము కానేరదు. అడ్డుపెట్టువారులేనపుడు స్వతంత్రమనుభవించుట గొప్పగాదు. భర్త యాధీనమున (?) స్వతంత్రగ్గాయుండుటయే యెక్కువ. భర్తప్రేమ చూరగొన్న సతీతిలకమే నిజమైనస్వేచ్ఛ యనుభవించును. ఎన్నికష్టములున్నను, యెన్ని చిక్కులున్నను పతిప్రేమ లభించిన సతి నాథుని హృదయసింహాసనాధిష్టానదేవియై స్వాతంత్ర్యప్రభల నల్దిక్కుల వెదజల్లుచు ప్రణయ రాజ్య మేలగలదు. అదిలేకున్న యీమె యెట్టి కోటీశ్వరుని తనయయైనను, యెంత యితరులు తినను గౌరవించుచున్నను స్వతంత్ర్యసౌఖ్య మనుభవింపజాలదు. ఏదో బాల్యమున పైపేరుకు చదువుపాటి విద్యనేర్పి వరశుల్కాది నియమముల మీరలేక యెవరికో యొకనికిచ్చి వివాహముజేయుచుండుట పరిపాటైపోయినది. ఇందెవరి కిష్టములేకున్నను యీసంసారము కష్టసముద్రమగుచున్నది. కనుక యిట్టి మన వివాహవిధులు మొదట చక్కబడవలెను. వధూవరు లొండొరుల ప్రేమించి వివాహమాడిన యిట్టికష్టము లెక్కువయుండవు. జీవితమునకంతయు స్వర్గప్రాయమగు నాతరుణమే యిట్టి వికల్పములవల్ల నరకప్రాయమగుచున్నది. ప్రేమ గల్గకున్న నామన స్సామెకివ్వనను భర్త నే స్త్రీయైన నెట్లు వశపరచుకొనగలదు? పోనిమ్ము. భర్తతో నేమి నా యిష్టము నాదని భర్తసంబంధము విడనాడిన సంపూర్ణమైనసౌఖ్య మే స్త్రీయైన ననుభవింపగలదేమో సోదరీమణు లాలోచించిచూడుడు. అప్పుడామెకు త్రిభువనాధిపత్యమైనను సౌఖ్యప్రదము కానేరదు. భర్తను వశపరచుకొను యువతి పతిచేత నెట్టి ఘనకార్యమైనను చేయించగలదు. ఇందు కెన్నియో చారిత్రక నిదర్శనములున్నవి గదా? అట్టి స్త్రీ విద్యావతియేని పురుషునిద్వారా యెంత దేశసేవయో చేయించగలదు. కనుక బాల్యమందు తమ పుత్రికలను విద్యావతులను(అనగా కేవల మాంగ్లవిద్యయని కాదు. యాంధ్రమైనను తగినవిద్యనేర్పించుట) జేసి యాకన్య కనుకూలవరుని గూర్చుటయే స్త్రీకి మన భారతీయులిచ్చు స్వాతంత్ర్యము. విదేశవిద్యావ్యామోహితముగాని సద్విద్యాపద్ధతులను నెలకొల్పి వరశుల్కాది దురాచారములను పారద్రోలి వివాహపద్ధతులను నెలకొల్పినయెడల మన భారతరమణీమణు లెంతమంది దేశోద్ధారకులనో తయారుచేయ



# శ్రీమతి ఫిలోమెనా తంబుచెట్టి

"భారతీయ ఫిడేలు రాణి" యని పాశ్చాత్యులచే ప్రశంసింపబడిన శ్రీమతి ఫిలోమెనా తంబుచెట్టియొక్క జీవిత చరిత్ర నిట వ్రాయుటకు బూనుటలేదు; లేక నీమె గడించిన కళావిమర్శనము చేయ మా యుద్దేశ్యముగాదు. ఏలన భావిజీవిత మీామె యసమానప్రతిభను జాటవలసి యున్నది. భారతనారీమణియయ్యు పాశ్చాత్య గానకళయందు ఫిడేలు మీాదెన లేని నైపుణ్యమును బ్రదర్శించి మించిన నీమె కళాసామర్థ్యమందు భారతీయుల దృష్టి గౌరవాదరములతో బాదుకొనున నెడి యాశయమే యీవ్రాత కాధారము.

వ్యక్తుల జీవితములందువలెనే జాతీయ జీవితమునందును ఎగుడు దిగుడులు, కష్ట సుఖములు, నూతనోజ్జీవనము గలుగుచుం డును. ఆంగ్లేయులు భారతదేశమునందు బ్రవేశించిన దినములలో మెకాలే యన్నట్లు "మహామహిమోన్నతులైన భారతీయులు బానిసత్వమున మూఢనమ్మకములందు బడి" మూల్గుచుండెడవారు. కాని కాల మొకరీతిగనుండదు. త్వరలోనే నూతనో జ్జీవనము ప్రారంభించినది. భారతీయుల ప్రతిభను పాశ్చాత్యులు క్రమక్రముముగా గుర్తింపదొడంగిరి. విదేశీయులు తమ సారస్వతము, కళలపట్ల జూపుచువచ్చిన గౌరవాదరములే భారతీయులును సంపూ ర్ణముగ మేలుకొల్పినవి. అంత రవీంద్రుం డుదయించి ప్రపంచసారస్వతమున ప్రచండ భానుండై ప్రభలీనజొచ్చెను. శ్రీ ఠాగూరు

దత్తు సరోజినీనాయుఁడు మొదలగువారి రచనలు ప్రాచీప్రతీచీ ఖండముల గౌరవింప బడఁజొచ్చెను. ఠాకూరు వంశము చిత్రకళ నభివృద్ధిబొందించి యెల్లరిచే 'సెబాస్' అని పించుకొనెను. సి. వి. రామను, రాధా కృష్ణ మహాశయులు విజ్ఞానతత్త్వశాస్త్రము లందు భారతీయుల ప్రతిభను జూపెట్టి దివ్య దీప్తిని వెలింగిరి. ఉదయశంకరుఁడు, మనో హారమై అపురూపమైన భరతనాట్యమును పునరుద్ధరించి భారతీయకళ లిట్టివాయని ప్రపంచమును వెరగందజేసెను. చాలని దానికి శ్రీమతి ఫిలోమెనాకన్య పాశ్చాత్య పద్ధతిని జంత్రగాత్రమున రాల్గరగంఁజేసి ప్రాచ్యులపాశ్చాత్యుల నౌరా యనజేసెను. ఇతరులవలె నీమెయు కళలను భారతీయ పద్ధతులతో నేందుల కారాధింపక మానె నని ప్రశ్న రావచ్చును. దానికి కారణములు లేకుండఁబోలేదు. విమలమై యున్నతమై యున్న కళకు ప్రాచియని ప్రతీచియని భేదములేదు. పద్ధతులు, పరిభాషలు వేరు గావచ్చును. కాని సారము, తత్త్వమంతయు నొక్కటియే. ప్రకృత ప్రపంచమున నే కళ గాని విరివిగా వ్యాప్తిఁ బొందవలసి యున్నచో పాశ్చాత్యపద్ధతియే దాని కెక్కు డుగా తోడ్పడుచున్నది. అంతియగాక, పాశ్చాత్యపద్ధతుల నవలంభించి వారి గుట్టు మట్టుల నెఱింగి ప్రాచీప్రతీచీ కళా సమ్మే శన మొనరింపఁదగును. ఈవిషయమై ఫిలోమెనా కన్యగారే చెప్పిన సంగతులను గమనింపఁదగినవి. "పాశ్చాత్యులమైనను భారతీయులమైనను గానకళ సర్వజనాంగీ కారమై ప్రత్యేక ఆకర్షణ గల్గియుండును. ఐరోపాయందు భారతీయ గానకళను ప్రశం సించువారు పెక్కుమంది యుండురీతినే, పాశ్చాత్యగానమును మెచ్చుకొనువారు భారతదేశమందు విరివిగ గలరు. భార తీయులయు పాశ్చాత్యులయు గానకళల సమ్మేళనమును ప్రపంచమంతయు నాకర్షిం చును."

భారతదేశమున చక్కని పరిపాలనము నకు పేరుగాంచినది మైసూరు రాష్ట్రము. ఈ రాష్ట్రపరిపాలకులు జనాంగీకారముగ పరిపాలించుటయగాక కళారాధకులై వే విధముల కళాపోషకులైయున్నారు. ఈ యాస్థానమున ప్రస్తుతము హుజూరు కార్య దర్శిగానుండి మహారాజుగారి యాదర ణయు, ప్రజల ప్రేమను చూరగొన్న శ్రీ రాజసభాభూషణ తంబుచెట్టి ఓ.బి.ఇ. గారికి కడపటి కుమార్తెగా అక్టోబరు 10వ తేది 1914 వ సంవత్సరమున ఫిలోమెనా కన్య జన్మించెను. తంబుచెట్టిగారి వంశము మైసూరు రాష్ట్రమున సుప్రసిద్ధమైనది. రాజసభాభూషణుగారి తండ్రిగారగు టి. ఆర్. ఎ. తంబుచెట్టిగారు మైసూరు ప్రధాన న్యాయాధిపతిమై తదుపరి దివానుగారై యెల్లరి మెప్పుగడించిరి. రాజసభాభూషణు గారుగూడ తండ్రిగారికిఁ దీసిపోవని కుమా రులు. వారి వంశము చాలకాలము క్రిందనే క్యాథలిక్ క్రైస్తవమతమును చేపట్టినది. వారి వంశీయులవలెనే రాజసభాభూషణు

గారుకూడ చాల మతాభిమాని. ఆ యభిమానముచేతనే సెంటు ఫిలోమెనా అను క్రైస్తవయోగిని పేరు కుమార్తెకుం బెట్టిరి. ఫిలోమెనాగారి తల్లియు నుత్తమగుణభూషితయై తనయ యభివృద్ధికి మిక్కుటముగ పాటుబడినది.

తలిదండ్రులకు ప్రథమమున తనయ భావిజీవితమునుగూర్చిన యాలోచన లెవ్వియు లేకున్నను, ఆమె చిరుతప్రాయముననే సంగీతమునం దభిరుచిజూపుటం గని యారేండ్లప్రాయమున మైసూరునందు గుడ్ షెప్పర్డు కాన్వెంటున, సిస్టర్ మారిన్ పరిపాలనక్రింద నుంచిరి. ఈమె యతిత్వరితముగనే చురుకుదనముతో తలిదండ్రులు, ఉపాధ్యాయులు వెరగంద సంగీత మభ్యసింపజొచ్చెను. ఏడేండ్ల ప్రాయముననే జ్యూనియర్ ట్రినిటీకాలేజీ పరీక్షకు వెళ్లి, పరీక్షకులచే **'Born Violonist'** అనిపించుకొనెను. దీని యనంతర మామె కలకత్తా గానకళాశాలయందు ప్రొఫెసర్ సాండ్రి గారివద్ద చదువుటకు వెళ్లెను. తలిదండ్రులనుగాని, యింటినిగాని వదలివెళ్లజాలని చిరుతప్రాయమయ్యును దూరదేశములందు అల్పకాలముననే పరిస్థితుల నలవాటు జేసికొని యచటి విద్యార్థులలో మిన్నయై గురువుల మెప్పు బొందుచు వచ్చెను. ఆ వయస్సునందే సాధారణముగా ప్రవీణులకే కష్టతరమనిపించు ఎఫ్. సి.టి.ఎల్. పరీక్షకు వెళ్లెను. ఏడేండ్లప్రాయమున తనకు పరీక్షకుండైన డా. మిస్ట్రాస్కీ గారే యిపుడుగూడ పరీక్షకులైరి. వీ రొక్కపరిగూడ పరీక్షకులు గాకుండుట గాకయని విద్యార్థులు మ్రొక్కుకొనునట్టి మహనీయులు వారు. అట్టివారే ఫిలోమెనా కీ కష్టమగు పరీక్షయందు నూటికి 98 మార్కుల నిచ్చి, తా నామె ప్రతిభకు పూర్తి మార్కుల నివ్వవలయుననెడి కోర్కె నతికష్టముతో నణచుకొంటినని నుడివిరట!

ఇంతటితో నీవిద్యను వీడనీమె సమ్మతింపదయ్యెను. ఈమె కప్పుడు పదునారేండ్ల ప్రాయము. ఈమెను ప్రాణ సమానముగ చూచుకొనుచున్న తలిదండ్రు లీమెను వీడక తప్పినదిగాదు. ఈమె పాశ్చాత్యఖండముల కేగి యావిద్యపారము చూడవలయునని పట్టుబట్టెను. అందుచే ప్రపంచమునందంతయు ప్రసిద్ధిచెందిన ప్యారిస్ కన్సర్వేటోర్ పాఠశాలయందీమె జదువ నిష్టపడి యచటి కేగెను. ఆ పాఠశాలయందు జేరుటకు అభ్యర్థులు పెక్కు దేశములనుండి 150 మంది చనుదెంచిరి. వారిలో పదిమంది మాత్రము మాపాఠశాలయందు ప్రవేశింప నర్హత సంపాదించిరి. ఫిలోమెనా వారిలో నొకరు. అచటనున్న భారతీయులు ఈమెఒకరే! అచట నున్న వారందరికంటెను చిరుతవయస్కురాలును ఈమెయే !!

ప్యారిసునగర జీవితమీామె దృష్టిని విశాల మొనరించెను. కళామహత్త్వ మెఱుంగుట కది మిగుల తోడ్పడెను. అచట గల కళానిలయములైన సంస్థలనేగాక లలిత

కళలకు—ముఖ్యముగ చిత్రకళకు—ఆదినుండి యుపేర్గాంచిన ఇటలీదేశమును ఈమెచుట్టి చూచివచ్చెను. అంతియగాక తాను జమన్వ పాఠములతోడనే కాలము గడుపక పాశ్చాత్య సంగీతకళా ప్రపంచమున సూర్యచంద్రులవలె దివ్యదీప్తితోఁ దేజరిల్లు మహనీయుల రచనలనన్నియు జదివి వాని నభ్యసించుచు వచ్చెను. ఆపాఠశాలయందు విద్య పరిపూర్తిగావించినపిదప నేఁడు ప్రఖ్యాతుఁడైన రొమేనియాదేశపు వైలనిస్టుఅగు ఎనెస్కో వద్ద కొంతకాలము విద్య నభ్యసించెను. అతఁడీమెనుఁగని జంత్రగాత్రమున నీమె యచిరకాలములో నత్యున్నతస్థాన మాక్రమించునని చెప్పుచుండెడువాఁడు. ఆపలుకు లిప్పటికే సత్యమైనవి.

1934 వ సంవత్సరము ఏప్రెలు 20 వ తేది లండనునగరమున కొమ్ములు తిరిగిన సంగీతశాస్త్ర పారంగతుల ముందు ట్రినిటి కాలేజి కన్‌సర్ట్‌హాలునందు ఫిలోమెనా ప్రథమ సంగీతసభ గావించెను. ఆనాఁడీమె తన యసమానప్రతిభఁజూపి యచటివారిని యాశ్చర్యమగ్నులఁ గావించెను. ఆనాటి పత్రికలన్నియు నీమెను పొగడ్తలతో నింపివైచెను.

దీని యనంతరమీమె తల్లిగారితోఁగూడ సార్వభౌమదంపతులకు పరిచయము గావింపబడి వారిచే గొప్పఆదరము జూపబడెను. ఆ సమయమున భారతజాతీయ వేషముననే వెళ్లి యామె యచటగల వారిచే మిగుల శ్లాఘింపఁబడెను.

1935 ఏప్రెలు నెల 11 వ తేది ఫిలోమెనా జీవితమందొక గురుతరదినము. సంగీతప్రావీణ్యతను ప్రకటింప సమయమేతెంచినది. అది గత సార్వభౌముల రజతోత్సవసమయము. ప్రపంచమునందన్ని మూలలనుండి హేమాహేమీ లందరచట ప్రత్యక్షమైయుండిరి. పూర్వమిండియా ప్రతినిధిగనుండిన లార్డ్ రీడింగుగారి యాధిపత్యమున ఫిలోమెనా గానకళా ప్రదర్శనము గావించునని పత్రికలందెల్ల ప్రకటనలు గావింపఁబడెను. ఆ సుప్రసిద్ధసభికుల యెదుట ఫిలోమెనా తన యద్భుత సంగీత ప్రజ్ఞను ప్రదర్శించెను. నాఁడచట ప్రదర్శనము గావించిన సంగీతపారంగతులందరికంటె ఫిలోమెనా మిన్నయని యేకగ్రీవముగ ప్రశంసింపఁబడెను. ఆవిషయమును పత్రికలెల్ల యతిముదముతో ప్రకటించినవి. ఒకపత్రిక యీమె "భారతఫిడేలు రాణి"యని బిరుదిచ్చెను.

ఈవిధముగ నీమె యసదృశసామాన్య గౌరమునుబొంది 1935 వ సం॥ సెప్టంబరు 5 వ తేది భారతదేశమునకుఁ దిరిగివచ్చెను. ఈమెవలన తమ సంస్థానమునకు గల్గిన గౌరవమునకై మైసూరుప్రభుత్వము చాల సంతసించి యఖండ గౌరవముతో బొంబాయి నగరమున నీమెకు స్వాగతమిచ్చెను. దీనియనంతరము మైసూరు మహారాజుగారును, వారి యాస్థానప్రముఖులును 1935, అక్టోబరు 10 వ తేది చేసిన సభయందు, మైసూరు జగన్మోహినీ రాజభవ

సమున మనోహరముగా, ఫిలోమెనా తన విద్యను జూపి తనప్రభువును యాస్థానమును నానాందవార్ధి నోలలాడించెను.

ఇంతటి చిరువయస్సునందే యింత సంగీత ప్రావీణ్యమునుబడసి, ఆ విద్యాపారము జూడనిన్ని దేశములు సంచారము గావించి దిగ్దంతులవంటి పాశ్చాత్య పండిత ప్రకాండుల ప్రశంసలకు పాత్రురాలై భారత మాత యశచ్చంద్రికల దిగంతములకు వెదజల్లిన, చల్లుచున్న, ఈ ఫిలోమెనా తంబు చెట్టికి పరమేశ్వరు డెప్పుడు తోడునీడయై యామె కళనింకను వెలుగొంద జేయుగాక.

ఈ ఫిలోమెనా తంబుచెట్టిగా రాంధ్రులనియు, వారికిగల్గిన యనన్యసామాన్య గౌరవమునకును, వారి ప్రావీణ్యమునకును ఆంధ్రు లెంతయు గర్వింపదగినదనియు, మాపాఠకలోకము గుర్తెరుగునని తలంచుచున్నారము.

---

## సంశయాలు

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు
(బొంబాయి)

చిగురుటాకుల తెరవెన్క జేరిమిగుల, సందమగుచిన్ని రెక్కల నన్నివిప్పి
పలవవ్వుచునున్నదో ఎఱుగరాదు, తేటిపాటకు దలయూచు తెల్లజాజి.
ఏవిరోధమొ దెలియ నే నెంతదాన, కలువదోయ్యలి సూర్యుని గాంచినంత
వదనమెత్తదు, నమ్రమై వ్రాలు చంద్రు, డగుపడిన యంత ముసిముసినగ వదేల?
తలిరుటాకుల నైన గదల్పలేని, మలయపవనున కేమిటి బలమొగాని
విరహులనుజేరి మితిమీరి వేగజేయు, వాని కెవ డిచ్చెరీశక్తి?...............
కనన దేమి విచిత్రమోగాని దెలియజాల, నొకమూల వారాకసమున నుండ
నీయనంత ప్రపంచంబు వెలుగజేయు, శక్తి నెవరిచ్చి రా సూర్యచంద్రులకును?
ఏమిటో పోండి! నాకేల ఈయవస్థ, విశ్వమందంత చిత్రాలు వేలువేలు
చిత్రగర్భితమైన ఈసృష్టినంత, నెవరు గావించిరో జూడ నెవరికెఱుక?

# ఆంతరంగిక ఆరోగ్యము

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎమ్.ఏ., బి.ఎల్.

శరీరసౌఖ్యమునకు శారీరకారోగ్యము అవసరమగునట్లు మానససౌఖ్యమునకు మానసికారోగ్యము అక్కఱయైనది.

శరీరమునకును చిత్తమునకును గల సంబంధము అవిచ్ఛిన్నమైనది. శరీరమానసికారోగ్యములు పరస్పర సశ్లేషసంబద్ధమైనవి! శరీరదార్ఢ్యము మానససౌష్టవమును పెంపొందించును, మానసదార్ఢ్యము శరీరసౌష్టవమును వృద్ధిపఱచును! అసంఖ్యాజన్మలందు, ఆత్మయలవఱచుకొనిన అద్భుతశక్తిని తనగర్భాలయమున నిడికొనిన పవిత్రమందిరము శరీరము. కృష్ణభగవానుని ఉద్దేశములకు సవ్యసాచినిమిత్తమాత్రమైనట్లు ఆత్మయొక్క మహత్తరోద్దేశసిద్ధికై నిమిత్తమైనది మానవదేహము. కురుక్షేత్రమే లేకున్న కిరీటికృష్ణులే లేరు. పార్థ పార్థసారథుల జన్మోద్దేశములు పూర్ణమగుటకు కురుక్షేత్ర మనివార్యమైనట్లు ఆత్మోద్దేశములు సిద్ధించుటకు శరీరము ప్రధానమైనది!

శరీరారోగ్య మలవడుటకుఁ దోడుపడు నియమములున్నట్లే మానసికారోగ్యమును చేకూర్చు నిబంధనములుగలవు. వివిధావయవక్రియాపరిశోధనము శరీరారోగ్యమునకు ముఖ్యమైనట్లు మానసికారోగ్యమునకు మానసపరిశీలన మవసరము.

మానసము త్రిగుణాత్మకమైనది. శారీరకమగు నెగులుగల్పించు దురాచారము లున్నట్లు మానసికోన్నతిని ప్రతిఘటించు ప్రతికూలశక్తులు గలవు. రజోతమములు సత్త్వగుణమునకు జోహారొనరించునాఁడే మానసికోన్నతి సాధ్యమగును.

ఇచ్ఛాబలము యోచనభావనాశక్తులు చిత్తమునకు గలవు. ఈమూఁడు సమముగా నభివృద్ధినొందిననాఁడే స్వాంతము వృద్ధినందును. ఇవి పరస్పర విరుద్ధములైననాఁడు, మానవజన్మమున ఘోరారిష్టములు ప్రజ్వరిల్లును. కేవల మిచ్ఛాశక్తియందు వృద్ధినొందునాతఁడు ప్రపంచమునంతను తనచేతులందు గిరగిరఁద్రిప్పజాలును. భూగోళమును కందువలీల నెగురగొట్టగలఁడు. కాని ఈతఁడందు విజయము సామరికమైనది, తన యుద్దేశసిద్ధికై ఈతఁడు ఘోరక్రియ లాచరించుటకు సంశయింపఁడు! రక్తపంకిలమగు నీతని చేతులందుఁజిక్కి పృథ్వి మలీమసమగును! సీజరు అలగ్జాండరు మున్నగు మహావీరుల జీవనము లిందులకు తార్కాణములు. మానసశక్తిని విశేషముగ వృద్ధినొందించునాతఁడు అద్భుత మేధాసంపన్నుఁడగును కాని యితఁడు తఱచుగ స్వార్థమునకు దాసుఁడగును. దీర్ఘయోచనయం

దీతఁడు మునింగియుండునుగాని నడుముగట్టి యీతఁడు ముంగలకు లంఘింపజాలఁడు! ఇచ్ఛాశక్తియందు గొరవడి భావశక్తియం దద్భుతకుశలుఁడగు నాతఁడు దారుణజీవన ప్రవిదారుణమున గూలిపోవునని హేమ్లెటు చరిత్రము దెల్పుచున్నది! మానస శక్తినలవఱుచుగొనక హృదయసముద్భూత స్నిగ్ధభావవిభూతినందినవాఁడు పవిత్రచారిత్రుఁడగును, కాని యోచనేచ్ఛాశక్తులు వీని యందు గుంటువడియుండుటచే అనుక్షణ మీతఁడు అరిష్టకుండమున బ్రుగ్గిపోవలెను. ఈ యద్భుతసత్త్వమును షేక్స్పియరు మహాకవి ఒథెల్లోలియరుల జీవనములందు ప్రమాణ మొనరించెను!

ఈ మూఁడుశక్తులను సమయముగా పెంపొందించిననాఁడే మానవుఁడు మహాపురుషులందు తలమానికమగును. ఈ శక్తులొకనాఁటితో ఒక జన్మమున చేకురఁజాలవు. ఈశక్తి సంపాదనమున క్రమాభివృద్ధి నొందుటకై వివిధపరిక్షాతరుణములను జన్మలమూలమున జగదీశుఁడు మానవుల కొసఁగుచున్నాడు. ఆత్మాభ్యున్నతికి జేయూఁత యొసఁగు నిట్టి మానసశక్తి నలవరచికొనవలయుననియే కర్మసిద్ధాంతము తెలుపుచున్నది. చరమాదర్శమునకు మనుజునిదోకొనిపోవు సోపానములు పుట్టువులు. ఒకమెట్టు రెండవదానికి పునాదియగునట్లు ఒకజన్మము మరుపుట్టువునకు మూలబంధమగును! పుట్టువుమెట్లులు దాటిననాఁడే పరమాత్మాదర్శమును మానవుఁడు జేరుకొనును! మహాత్ముఁడు మనుజులందు మాళిగ్రమై తుదిమెట్టుపై నిలుచును! వీనికిని, జగదీశునకును, భేదమొక పుట్టువు యొక్క మెట్టుమాత్రమేయగుచు నీతని శక్తి యత్యద్భుతమైనది! మనుజుఁడు త్రిగుణాత్మకమగు మానసశక్తినంది పుట్టువుమెట్టులను జాలనట్టివేచి, నిజతేజమును గుర్తించి "సోహం"అను ప్రజ్ఞనందిననాఁడే శంకరాచార్యుఁడు కాఁజాలును. ఈ యాంతరంగికాభివృద్ధిని ప్రతిఘటించు పగతురారుర్వురని ప్రతివారెఱుంగుదురు. వారులను జంపివేయుటకంటె జయించుటయందు ఘనతగలదు. కంఠీరవమును దునియలొనరించుటకంటె ఛాగశిశువట్లు చేయుటంచు ఆధిక్యతకలదు. దేవదత్తుఁడను దుర్మతి పురికొల్పిన ఉన్మాద వేదండమును మూషికమట్లు లొనరింపక వధించియుండినచో సిద్ధార్థుఁడు శూరాగ్రేసరుఁ డనిపించుకొనునేమోగాని లోకోత్తర పురుషుఁడై భగవత్సముఁడై భగవంతుఁడే యనిపించుకొనిన సౌఖ్యమునిఁ గాఁజాలకపోవును! అంతశ్శత్రువులను జంపివేయుటకంటె వానిని లోబఱచుకొనుటందు ఘనతగలదు. ఇట్టిశక్తి నందిననాఁడే మనుజుఁడు జితేంద్రియుఁడై భవనిశ్రేణియందలి తుదిమెట్టుపై నిలిచి త్రివిధమానసశక్తికి ఆదర్శములగు సత్త్వశుభసౌందర్యములు దివ్యమహిమందు దొలుకాడింప త్రిగుణబోధక త్రిమూర్తి తేజమునుబడసి దిగంతములకు మిఱుమిట్లు గొలిపి జగదీశు జేరుకొనును! ఇట్టి యద్భుత

సామర్థ్యమునందిననాఁడే మానవుఁడు సంపూర్ణాంతరంగిక సౌష్టవమునందెనని తలపవలెను.

"నిజోద్దేశసిద్ధికై నిరాకారుఁడైన భగవంతుఁడు పృథ్వీశరీరముదాలుచు"నని ఉపనిషత్తులు దెల్పుచున్నవి. అట్లే మానసప్రవృత్తులను విజృంభించుటకు మానవునకు శరీరమవసరము! ఇంద్రియమార్గములనుండి మానసము క్రొత్తతలపులను నూతనానుభవములను బడయును; జ్ఞానసముపార్జనమునకు ఇంద్రియములు ముఖ్యము. వీనిని మాపొనరించుట భౌతిక ప్రపంచమందలి యద్భుత సత్యములను బహిష్కారమొనరించుటగును. దృష్టిదోషరహితుఁడైన మానవునకెట్టి దృశ్యమైన స్పష్టమైయుండు తెఱఁగున ఇంద్రియాపాంగ గర్భిత మానసికదృష్టిదోషరహితమైనప్పుడే భౌతిక ప్రపంచమందు నిగూఢమైయున్న యద్భుతములు మనుజునకు ద్యోతకమగును. మానసికారోగ్యమును, ఆంతరంగికోన్నతినందిన నాఁడేచిత్తమిట్టి తేజోగర్భిత దృష్టినందును!

భౌతికముగను అధ్యాత్మికముగను మనుజునకు దోడ్పడు మానసికారోగ్య మలవఱచుకొను టెట్లు? శరీరారోగ్యమును బోధించు నిబంధనలు ఆరోగ్యప్రకాశికలందు జూపట్టినట్టులు మానసికారోగ్యము నుద్బోధించు నియమములు మతగ్రంథములందు గలవు. వివిధమతములయ్యు ఈ మతములో క్కీయాదర్శ శిఖరమునకు మనుజుని దోకొను శైలమార్గములు—ఒకే ఉదధిజేరు ఝురీమతల్లులు! ఆత్మసంవరణ స్వార్థత్యాగకర్తవ్యపాలన సత్యనిష్టపరార్థజీవన, ధర్మసంబద్ధ కామార్థముక్తి సాధనాదిమహద్గుణములు, మానసికారోగ్యమును ఆత్మోన్నతినలవఱచును. ఏమతపంథమునైన మానసికారోగ్యమునందిననాఁడే జీవాత్మ పరమాత్మ నందజాలునని మానసికారోగ్యశాస్త్రమగు తత్త్వశాస్త్రము తెలుపుచున్నది. ఈశాస్త్ర నిబంధములను హృదయంగమమొనరించుకొని వానిని నిజజీవనశ్యందనము నఁపు హుమాయులు గావించునాఁడే మానవుఁడు నిజకర్తవ్యమును నిజధర్మమును నిర్వహించుకొని నిజజన్మసార్థకమును గావించుకొనును. ఇట్లొనరించుకొనినపుడే అతఁడు జగదీశు జేరును. మానవునిబడసి సృష్టికర్త సృష్టియుద్దేశసిద్ధినంది అనంతానందమున నోలలాడును!

# అఘోర కామినీ దేవి

ఆచంట లక్ష్మీనరసింహాంగారు

హిందూసంఘమున జన్మించి ప్రాచీన సాంప్రదాయముల నడుమ బెరిగిన ముగ్ధలగు భారతమహిళలు సహితము ప్రాపంచిక పరిస్థితులతో నించుక బరిచయము కలిగించుకొన్నయెడల వా రెంతటి త్యాగమొనరించగలుగునదియు, తన జీవితమున బుజువుపరచినది దేవీమూర్తి అఘోరకామినీదేవి జీవితము.

ఈమె జన్మస్థానము వంగదేశమునందలి శ్రీపురమను గ్రామము. ఈమె జనకుడగు విపినచంద్ర బాసుగారు గౌరవకుటుంబమునకు చెందిన కాయస్థ కుల్లజుడు. 1856 సం॥రం మే నెలయందు ఈమెజన్మించెను. ప్రశాంతమగు శ్రీపుర గ్రామమున నీయమ తల్లిదండ్రులచే నల్లారు ముద్దుగా పెంపబడి బాల్యమున సత్సాంప్రదాయసిద్ధములగు విద్యాబుద్ధు లభ్యసించెను.

ఈమెను 10వ యేటనే ఏకగ్రామవాసియు, పట్టభద్రుడునునగు ప్రకాశచంద్రబా బను పదునెనిమిదేండ్ల యువకునకిచ్చి వివాహము గావించిరి. ప్రకాశచంద్రుడు తన యర్ధాంగి మనోవికాసమునకును, విజ్ఞానాభివృద్ధికిని చేయూత నొసగుచుండెను. పవిత్రాత్ములగు నీ దంపతులు డిండోరుల సాహచర్యమున నభివృద్ధిగాంచి లోకకల్యాణమునకు తోడ్పడిరి.

పాశ్చాత్యవ్యామోహము ఆర్యవిజ్ఞానము నావరించి విద్యార్థికులను పెడద్రోవలను బట్టించుచున్న రోజులవి. నిర్మలశీలుడును, జ్ఞానపిపాసియునగు ప్రకాశచంద్రుడు విద్యార్థిదశయందే (1871) బ్రాహ్మమత మవలంబించెను. అప్పటికి పదునైదు వత్సరముల బాలికయగు నఘోరకామిని కళాశాలనుండి అప్పుడప్పుడు యింటికి కరుదెంచు భర్తవలన నీ నూతనమతసిద్ధాంతములను గ్రహించుచుండెను.

ప్రకాశచంద్రుడు ఉద్యోగముకొరకు పలు బాములుపడి చివరకు 1875 వత్సరమున మోతీహారీ పట్టణమునకు క్షామనివారణోద్యోగిగా నియమింపబడెను. అప్పటికి వీరి స్వల్పయాదాయముతో యిరువురు కుమార్తెలను, యిరువురు బంధువులను, యింటివద్దనున్న తల్లిని పోషించవలసివచ్చినను, నూతనముగ గృహభారము వహించిన దేవి యసంతృప్తి యెరుగదు. మిగుల చాకచక్యముతో కుటుంబమును గడపుచుండెను. ఈకాలముననే యీమె ప్రశాంతముగా చదువును, ధ్యానమును వృద్ధినొందించుకొని, భవిష్యజ్జీవితమునకు మెరుగుదెచ్చిన యుత్తమగుణము లన్నిటికిని పునాదు లేర్పరచుకొనెను. కుటుంబసౌఖ్యము కొరకు పాటుపడుటలో సౌఖ్యమును తగ్గించు ప్రయత్నముల నిక్కాలముననే యీమె ప్రారంభించి యిచటనే యీమె యాత్మవిజయమును సంపాదించెను. ఇచటనుండగానే యీమె అఘోరనాథగుప్త యను బ్రహ్మర్షిపుంగవునివలన బ్రాహ్మదీక్షను గ్రహించెను.

మరికొంతకాలమునకు ప్రకాశబాబు బంకింపురమునకు మార్చబడెను. ఈ పట్టణము అఘోరకామినిదేవి కార్యక్రమమునకు రంగస్థలముగ బరిణమించుటచే మిగుల ధన్యమయ్యెనని చెప్పవచ్చును. ఇచటికి జేరసరికే దేవి యాత్మపరిపుష్టినొంది, వికసితమై, మానవసేవ యొనరింప నువ్విళులూరుచుండెను. పరుల యున్నతికొరకు పాటుపడని వ్యక్తి జీవితము వ్యర్థమని యీమె గమనించి ధీరయై సంచరించుచుండెను. తన చుట్టుప్రక్కలవారి యక్కరలను తెలిసికొనుచు వారి యిక్కట్టులను దీర్చుటకుగాను, తన కోర్కెలను, అక్కరలను తగ్గించుకొన నారంభించెను. విలువ

గల తన యాభరణములన్నిటిని నూడ్చిపెట్టి, క్షామ బాధితుల సహాయార్థము వినియోగించెను. తనకు బాల్యమునుండియు ప్రేమపాత్రములైన సరిగ పట్టు దువ్వలువలను వర్జించి, సామాన్యులగు బీదరీగృహిణులు ధరించు ముతుకఖద్దరు వస్త్రధారిణి యయ్యెను. పెద్దయుద్యోగులతో సంప్రదించవలసినప్పుడు సైతము తన దీక్షావస్త్రములను, యీయమ వీడియెరుగదు. సౌందర్యపిపాస తనవిధులకు అడ్డుతగులకుండుటకు గాను, యీ నారీరత్నము తనకురులను కత్తిరించుకొనెను. సతులకు అమూల్యాలంకారములగు కురులను కత్తిరించుకొను టెంతటికష్ట కార్యమో సోదరీ మణులు సులభముగా నూహించుకొనవచ్చును. మరియు నీ శిక్షణము నంతటికిని మకుటాయమానమగు నట్లు, యీసమయముననే, యీసాధ్వి తన దాంపత్య జీవితమున, భౌతికభోగముల కెడము లేకుండునట్లు బ్రహ్మచర్య ఘోరప్రమాణ మొనర్చెను. దీక్షామహిత యగు భారతీయగరిత రొనరించ నసాధ్యమగు త్యాగ ముతేదని యీమె తనశపథమువలన లోకమునకు చాటెను. నడివయసునగల దంపతులిరువురును, దైవ సాక్షికముగా నీ సత్యమును పాలించిరి.

1883 వ సంవత్సరమున వీరి రెండవకుమార్తె తీవ్ర వ్యాధిపీడితయై, బ్రతుకదని నిరాశచేసికొనబడెను. ఒకనాటిరాత్రి, యాబాలిక మిక్కిలి వేదననొందుచు, అవసానకాల ప్రయాణోన్ముఖ యైనట్లుకన్పడెను. మాతృదేవి యట్టిసమయమున సైతము, ధైర్యమును గోల్పోవక, ధీరయై, బిడ్డ తలక్రింది తలగడను నిమురుచుండెను. బాలికపడు చరమావస్థనుగని పురుషుడగు ప్రకాశచంద్రుడు సైతము ధైర్యము నుగ్గబట్టజాలక పసిబాలునివలె యేడువజొచ్చెను. వెంటనే అఘోర కామిని యాయనను సమీపించి "ప్రియతమా! పిరికివారివలె మనము వాపోవుటకిది యదనుకాదు. రండు! మన ప్రియపుత్రియెడల, మన కర్తవ్యమును నేరవేర్తము" అని ప్రబోధించి, భార్యాభర్తలిరువురును, ఆబిడ్డ శయ్యాప్రక్కన మోకరించి, భగవానుని ప్రార్థించిరి. పవిత్రాత్ములగు నీదంపతులప్రార్థనను ఈశ్వరుడు ఆలించెనోయన, ఆబాలిక త్వరలో స్వస్థురాలయ్యెను. ఇంతటి కష్టకాలమున నంతటి ప్రశాంతమును వెలిబుచ్చుట కామె యెంతటినిగ్రహము నలవరచుకొనెనో మన మూహించవలసినదే.

ఆనందకుమారచక్రవర్తియను వీరియింటి పొరుగునగల క్రైస్తవ లొకరు మరణింప, యీమె వారి కుటుంబము నాశ్వాసపరచి, ఆయనబిడ్డల విద్యాభివృద్ధికి క్రియాపూర్వముగకూడ దోడ్పడెను. ఈమె సాహాయ్యమును దాతృత్వమును పొందుటకు స్త్రీ పురుష భేదముగాని, మతముగాని ఏరికిని అడ్డువచ్చెడిది గాదు.

నేటికి అరువది వత్సరములనాడు, పురుషులందే విద్య తక్కువగా నున్నసమయమున ఎండమొగమెరుగక, పరదాచాటునజిక్కి, మూఢవిశ్వాసనిలయులై, మగ్గుచున్న బీదరీరమణులందు విద్యావ్యాపనమునకు యత్నించు టెంతటికష్టమో నేడు మనము సరిగా గ్రహించుట సాధ్యముకాదు. అందులకవసరమగు పాఠశాలా భవనములుగాని, యుపాధ్యాయులుగాని (స్త్రీ యుపాధ్యాయినులు లేనేలేరు) నిర్వహణమునకవసరమగు ద్రవ్యముగాని లేవు. ప్రజలసానుభూతి కూడ మృగ్యము. ఒకవేళ ఇన్నిటిని సంపాదించినను, విద్య కావలెననియభిలషించు బాలికలులేరు. తాను స్వయముగా బోధించ నిశ్చయించినను, యీమె యందుల కవసరమగు విద్యాబోధనా పద్ధతి యెరుగదు. తలపోసినకొలది, తాను పూనినకార్యముయొక్క దుస్సాధ్యత యీమెను కలవరపెట్టసాగెను. కాని యింతమాత్రమున నామె తనసంకల్పమును విడువలేదు.

తాను స్వయముగానే యికార్యమును పూనదలచి, లక్నోయందలి మహిళా విద్యాబోధనా పాఠ

శాలయందు శిక్షణము నేర్చుకొన ఇంట రెండవస్త్రీ దక్షతలేని పెద్దకుటుంబమును వదలిపెట్టి వెళ్లెను.

కళాశాల సూపరింటెండెంటుగు మిస్. ఐ. తోబరన్, వుదారహృదయ యగుటచే, యీమె యాశయమును గాంచి, మిగుల నానందించి దేవికి ప్రేమపూర్వకమగు స్వాగతమిచ్చెను. దేవియొక్క స్థైర్యమును, ఓర్పును, విశేషించిన ఈశ్వరవిశ్వాసమును, యీమె నాకర్షించి కఠినములగు కొన్నినియమముల నామెయెడ సడలించ దలచినను, దేవి యంగీకరించలేదు. అఘోరకామిని, విద్యార్థినిగా నున్నకాలమున వసతిగృహమునందలి నియమములను నిష్కర్షగా పాటించుచు, విద్యార్జనమునకు పదునాలుగుగంటలును, భగవధ్యానమునకు 4 గంటలును, నిద్రాభోజనములకు 6 గంటలను వినియోగించుచుండెను.

ఈసమయమున నీమె స్థైర్యమునకొక పరీక్షాసమయము వచ్చెను. ఇంటివద్దనుండి, పెద్దకుమారుడు సుబోధ్ తీవ్రవ్యాధిపీడితు డయ్యెనను పిడుగువంటి వార్తవచ్చెను. తోడనేయీమె తనగదిచేరి, భగవధ్యానవిలీనయై, తనబిడ్డను రక్షింపుమని యీశ్వరుని వేడుకొనెను. మాతృప్రేమసైతము, యీమెను తనవిధినుండి చలింపజేయలేదు. ఆందోళితములైన కొన్నిరోజుల యనంతరము, భగవానుని కృపవలన, తనముద్దుబిడ్డడు స్వస్థుడయ్యెనని దెలిసి, యీమె పరాత్పరునికి కృతజ్ఞతా ప్రణామము లర్పించెను.

అపూర్వనిశ్చయ మొనర్చి, ఆదర్శసిద్ధికొరకు 35 వత్సరములప్రాయమున 5 గురు బిడ్డలను, కుటుంబమును విడిచి, బాలికల శిక్షణకొరకు యోగ్యతలనంది వచ్చినదేవిని, బంకింపుర పౌరులు గుంపులుగట్టి తూర్యనాదములతో నెదుర్కొని, యత్యుత్సాహముతో నూరంతయు నూరేగించి, తమకృతజ్ఞతను తెలిపిరి.

అప్పటికి పట్టణమునగల బాలికాపాఠశాల యధమస్థితియందుండెను. అందు డజనుమంది బాలికలు మాత్రమే యుండిరి. ఆపాఠశాలతరఫున గురుప్రసాద గుప్తగారు దేవినిసమీపించి పాఠశాలనిర్వహణము వహింపుమని ప్రార్థించెను. ఇందుల కంగీకరించుట యన నెన్నియో బాధ్యతలు వహించవలసియుండెను.

ఈమె యాధిపత్యమున పాఠశాల దినదినాభివృద్ధి గాంచెను. పాఠశాల కామెయేసర్వస్వమై యుండెను.

బాలికలకు పాఠశాలయందు కరపు శిక్షణతో తృప్తిపడక, అఘోరకామిని యిండ్లకుబోయి, బాలికల యారోగ్యమును గురించియు, విద్యనుగురించియు వారి తల్లులతో చర్చించుచుండెను.

వసతిగృహమునందలి బాలికల దినచర్య ముచ్చటగా నుండెను. వారు ఉదయమునలేవగానే, ఎవరిమాటలతోవారు సులభముగా ప్రార్థనజేయుచుండిరి. కొంచెము పెద్దవారగుబాలికలు, తమకంటె చిన్నవారగు ఒకరు లేక యిరువురు బాలికలపై యాజమాన్యము వహించి, తమ యనుభవములను, దినచర్యవ్రాయుచుండిరి. అచట వారు ముఖ్యముగా స్వయంసహాయము, పరులకుతోడ్పడుట, పవిత్రజీవితమును గడుపుట, నేర్చుకొనుచుండిరి. అఘోరకామినియు, నామె కుమార్తె లిరువురును, వారికి పాఠములు కరపుచుండిరి. వసతిగృహమున నివసించుబాలికలకు, భోజనమునకు పెచ్చుఖర్చే యగుచుండినను, బాలికకు నెలకు రు. 7 లు మాత్రమే వసూలు చేయుచుండిరి. ప్రకాశచంద్రబాబు, తన సతీమణి ప్రారంభించిన యుద్యమములకెల్ల నండయైయుండి, అవసరమైన ద్రవ్యసహాయ మొనర్చుచుండెను.

త్యాగమూర్తులగు దంపతులిరువురును తమ స్వగృహమునే, పాఠశాల వసతిగృహముగ నిచ్చివేయుటచే, బంకింపుర బాలికా పాఠశాల యచిరకాలముననే పేరు ప్రతిష్ఠలసంపాదించి, రాష్ట్రీయువతీ శిక్షణాలయము లన్నిటిలోను మిన్నయయ్యెను. పాఠ్యా

కవియాపనరగు బోల్పర్ గారు యీ సంస్థనుదర్శించి యిటుల వ్రాసియుండెను. "ఇచట సర్వమును చక్కగా జరుగుచున్నదని తెలుప సంతసించుచున్నాను. ఇట్టిసంస్థలను దేశమున వితంతువులును, బ్రహ్మచారిణులగు కన్యలును నిర్వహించు టెరుగుదును. కాని ప్రకాశబాబు సతివంటి, కుటుంబవతి, యిట్టి కఠిన కార్యమును చేబట్టి, యింత చక్కగా నిర్వహించుచుండుట, నాకు అక్కజము కలిగించుచున్నది" పై విమర్శనఫలితముగా ప్రభుత్వమువారీ పాఠశాలను గుర్తించి హెచ్చుమొత్తము విరాళమొసంగి, యీమె భారమును కొంత తగ్గించిరి.

నేడీపాఠశాల హైస్కూలుక్రింద మారి, సాలునకు వందలకొలది యువతీమణులను ప్రవేశదీక్షయందుత్తీర్ణులనుగావించుచు అఘోరకామినీదేవి ప్రచండకార్య దీక్షకు అమోఘతార్కాణమై యున్నది.

ఇంతటి భారవహమైన కార్యమామె నిర్వహించుచున్నప్పుడు సైతము, ఆర్తులకుతోడ్పడు తన సత్కార్యాచరణమును మానలేదు. వసుధయే కుటుంబమని భావించిన యీమహనీయురాలికి, పరుల కుపకారమొనరించు ప్రకృతి ప్రారంభమున నభ్యాసముగాను, క్రమముగా స్వభావముగాను, చివరకు తృష్ణగాను పరిణతినొంది, పరుల కుపకారమొనర్పని దినము దుర్దినమని భావించుచు, కాల వ్యత్యాసముగాని, స్వసౌఖ్యముగాని గణించక, శ్రీమంతులనిగాని, నిరుపేదయనిగాని విచక్షణలేకుండ, యార్తులకుపచరించ సన్నద్ధయగుచుండెను. ఒక్కొకప్పుడు తాను తలపోసిన కార్యమున, భర్తయనుమతినందుటకు సైతము వ్యవధి లేనంతటి యావేగముతో ముందునకు సాగెడిది.

స్వకుటుంబ విశ్వకుటుంబములకొరకు విరామ మెరుగక యొనరించిన తీవ్రకృషి ఫలితముగా నామెకు హృదయవ్యాధి యంకురించెను.

పదునైదుదినములీ సాధ్వి వ్యాధిపీడితయై 1896 వ సంవత్సరం జూను 16వ తేదిని, స్వర్గస్థురాలయ్యెను. నలువదివత్సరముల యల్పప్రాయమున నీయుత్తమ చరిత దేహయాత్రనుచాలింప సంతాపకరము. కాని విధిచెయ్దములు అనివార్యములు గదా? మానవ సహజమగు భౌతికకాయము నశించినను నీయమ దివ్యమును, అనశ్వరమును నగు కీర్తికాయమున శాశ్వతముగా ప్రకాశించుచుండగలదు.

త్యాగమూర్తియగు నీ భారతముద్దుకుమారి చరితము ఆంధ్రమహిళామణులను, నిరంతరసత్కార్యాచరణమునకు పురికొల్పుగాక!

నేడు కలకత్తానగరమున వైద్యశిఖామణియు, రాజకీయనాయకుడును నగు బిధున చంద్రరాయిగారీయమ రెండవపుత్రుడు.

# సంయుక్త నిర్వేదము

శ్రీమతి పరుచూరి భువనేశ్వరీదేవి
,, పరుచూరి అన్నపూర్ణాదేవి

అధర్మయుద్ధంబున తురుష్కులు పృథ్వీరాజును పరిభవించి జీవగ్రాహ మొనరించిరి. వీరనారి సంయుక్త ఆ పిడుగుమాటకు బెగడొందక మగటిమిచిక్కబట్టి పగఱ బలువిధముల సంగరమున వగలపా లొనరించుచుండెను. గాని తండోపతండంబులుగ నేలయీనిన యట్లు సేనలు వచ్చుచుండుటంజేసి పోరును తుదిముట్టజేయజాలకుండెను. ఇరుదెగలు రవి గ్రుంగుతోడుత సమరంబు పరిసమాప్తి గావించిరి. రాజపుత్రయోధులు ఆహారంబుల గైకొని పరిశ్రమాపనోదనార్థము శిల్పశయ్యల పరుండిరి. సంయుక్త ఏకాకినియై ఒకపట కుటీరమున పచారుచేయుచు అస్పష్టస్వరమున నిట్లు పలవించుచుండెను.

సైన్యము సన్నగిల్లె; రణసాధనసంపద వట్టిపోయె; రా
జన్యకుమారరత్నము వశంవదుడాయె; నశించెదుర్గముల్;
దైన్యముహెచ్చె; శాత్రవుల దాడికలంచుచు నుండె; డస్సితిన్
అన్యముగోచరింపదు మహాత్మ! లలాటము నేమివ్రాసితో.
కరణీయంబు స్ఫురింపదాయె నకటా! ఖడ్గంబుకీల్గొల్పి భీ
కరశౌర్యాగ్ని శిఖాచ్ఛటాతతి తురుష్కవ్రాత మగ్గించుటో
కరముల్ మోడ్చి మహాప్రభో తమరు సంగ్రామంబు చాలించి మా
కరముల్ గైకొని ముక్తుజేయ నృపు సంకల్పింప సంధించుటో.
ప్రాణము లెక్కగాగొనుట పౌరుషరేఖకు గొప్పమచ్చగా
జాణలుపల్కుచుంటవిని సంధికి సిద్ధముగాగ పాడియే
మేనస్రవింపరక్తము సమీకమునన్ పరిపంథి సంధికిన్
బూనుకొనంగనెంచి భయమ్మున్ వెలిబుచ్చితి పీవడెందమా!
ప్రాణనాధుని శత్రువులు పరిభవించి, దిట్టతనమున నేడు బంధించియుండ
చివికి సంయుక్తసంధికి సిద్ధపడుట, స్వప్నమందైన తలపగా వలదువలదు.
సమరరంగమున కరికి శాత్రవులను, లేడిపిల్లలవలె కబళించితైతు.
చేవదరిగినవెంటనే జీవములను, వీరబలివేదికకు సమర్పించితైతు.
ఇంతియేకాని ప్రాణాలనిచ్ఛగించి, పిరికిపందనై శత్రులశరణుగోరి

రాజపుత్రవీరులకు కళంకరేఖ, ముట్టజెప్పగాబోను యీబొందితోడ.
ఎదురుపడనది మాతండ్రి యెట్టులేను, యుద్ధమున బలివెట్ట సంసిద్ధనగుదు
మానహీనుని భారతమాతృద్రోహి, దండ్రిగారంచు భావింపధర్మమగునె.
కటకటా ! తల్లి ! కడుకడగండ్లజెందు, చుంటివేమి దౌర్భాగ్యము చుట్టుకొనెనొ?
అకట! శౌర్యాగ్నిశిఖలు చల్లారెనేమి! ధీరదుందుభిధ్వనులు శాంతించెనేమి!
ఒకనాడు యుద్ధవేదికమీద సల్పెను తాండవనృత్యంబు ధైర్యలక్ష్మి
ఒకనాడు శత్రుమస్తకరక్తవాహిని జలకమాడెను పటుశౌర్యశక్తి
ఒకనాడు శత్రుకటకభూమి స్వేచ్ఛతో వ్యాహ్యాళిగావించె పౌరుషరమ
ఒకనాడు పగఱ పునుకలను ముత్యాల పేరుగా దాల్చెను విజయకాంత
ఒక్కనాడు క్షాత్రవతతి నుక్కడింప కాల్వలుగపారినట్టి రక్తంపుటేరు
నింకపారుచుండెనెకాని యింకలేదు సాటిగలదెందునీ మహోజ్జ్వలచరితకు.
కోటగోడలనుండి కుప్పించిదుమికి ద్విట్తతి మొదలెట్ట చెండాడినారు
కొండగుహలడాగి గండుమీరి రిపుల హరిణాలమాడ్కి వేటాడినారు
కోటబ్రద్దలుచేయు కుంభికుంభంబుల నొక్కపెట్టున చావమోదినారు
కోటకాల్చు ఫిరంగిగుండుల చేబట్టి వెన్నముద్దలవలె విసరినారు
మడమదాకించితే జీలమలపుకొనుచు, దస్యుసేనలమీదుగా దాటినారు
భారతీయయోధుల పటుపౌరుషంబు కెదురుగలదె ముల్లోకాల నెంచిచూడ.
కదనమున బరాజయమును గననినీకు, రాణిసంయుక్తవలన సంప్రాప్తమయ్యె
అనెడునుడిగలకాలంబునవని నిలుచు, నేటినుండి ప్రజలయొక్క నోటినుండి
బయలువెడలి పాపము పరిపక్వమంద, మేనిలో కొనయూపిరి ప్రాణముండు
వరకు శత్రుబలంబుల దరుముచుండు, ఇంచుకేనియు నసువులాసింప నిజము.
తల్లి! శపథంబు నీదుపాదములసాక్షి, హృదయమేలకో మిక్కిలి బెదరుచుండె
ఎడమభుజము పల్సార్లు కంపించుచుండె, శిరసు దేనికో గిర్రున దిరుగుచుండె
కాయమంతయు తెలియకే కదలుచుండె, చూడగానివి యపజయ సూచకములు.
చిత్తమా! నీవు చివ్వకు సిద్ధమగుము, కాయమా! సంగరమునకు కదలిపొమ్ము
ఇటుల నిర్వేదమొందిన యేమిహితము, దైవమేమివ్రాసిన దానిదాటరాదు.
తూర్పుతెల్లవారినటుల దోచుచుండె, సంగరమునకు కదలంగ సమయమయ్యె
సేననెల్లయుద్ధమునకు సిద్ధపఱచి, ధీరవచనంబులను ప్రబోధింపవలయు.

# "బిందుమాధవమ్"

నందివాడ వెంకట చలపతిరావుగారు

శంకరం సరస్వతీ గ్రంథనిలయమువారి టూరింగు యేజెంటుగా నుండెను. నలువదిసంవత్సరముల ప్రాయమైనను, నాతడు పెద్దలలో బెద్ద చిన్నలలో చిన్నగా మెలగుట కలవడినవాడు. నూతనులైనా యొకపరి సంభాషించితే, నాతనివంక నాకర్షించి, యాతనితోడ సాంఘికమభిలషింపజేయు, చతురసంభాషణ మాతనిసొమ్ము. మాసహోదరునిచే వ్రాయబడి, సరస్వతీ గ్రంథనిలయమువారి కీయబడిన, యొకానొక నవలవిషయమై కనుగొంటకు బ్రప్రథమమున నాతని గలుసుకొంటిని. తత్సమయమాది పరిచయబాహుళ్యతయు గలిగింది. ప్రస్తుత మాత డేజెన్సీ గొన్నికారణములచే విరమించి కాకినాడలో స్థిరవాస మేర్పరచుకొన్నాడు.

ప్రతిదినమును, సుబుసుపోకకై నేను వారింటి వెళుతూ జతురంగమును, చీట్లపేకయు, నాడుచుండుట క్రమముగా నలవాటైంది.

శంకరంగారును, నేనుమాత్రమే, ఆ దినమున జతురంగమున బ్రొద్దుపుచ్చుచుంటిమి. అన్యమనస్కుడై యాట నాతడు చాల పాడుగ నాడుచుంట గని నేనిలా అన్నా,

"మీ రేదో నన్యాలోచనధీనులై, ఆట చాల యోటమిగా—"

"నా మనస్సేలనో యీరోజున చాల నాందోళనగానుంది కళా" (నా పేరు కళానిధి)

"ఆట జాలించివేతామా ?"

"ఆటమాటటుంచు. మన చతురంగపెత్తులలోగల బుద్ధివిశేష మారయవలసిన పరీక్షాసమయం వచ్చింది."

"విశేషములా ?"

"పరహితచింత ఉంటే నన్నీ విశేషములే !"

"మనసహాయ మిప్పు డెవరికి కావాలె? పరహితచింతయుండుటయే జీవితపరమావధి. నాచేనైన దేమైననున్నచో జెప్పండి. విధిగా చేస్తాను."

"సంగతి సందర్భము చూచి, అగునో కాదో తెలుసుకొనవచ్చునని నీతో మాట్లాడుట."

"అయితే సరి చెప్పండి."

"మనసంఘం చాలా నిర్వీర్యమై, రానురా నధఃపతితమగుచున్నది కళా ! శారదాబిల్లువచ్చి పీకనుత్తరించివేస్తుందేమో అని చేసిన అవకతవక పెళ్ళిళ్లు తలచుకొంటే శిరోవేదన. అవేం పెళ్ళిళ్లు ! అతి బాల్యవివాహాలటుండనీ. వివాహతత్త్వం తెలిసిన తలిదండ్రు లెందరున్నారంటావు ? నూటికొక రుండిరని గణించుటకంటె, లేరని చెప్పటే మంచిది. వధూవరుల కన్యోన్యప్రేమయే సూత్రధారణ చేస్తుంది. అట్టి ప్రేమానుబంధమే లేని సూత్రధారణచే నా మరణాంతము వా రిద్దరు అయిష్టతాభూయిష్టమగు జీవితము నీగుకొనవలసిందే కదా ? అలాటి సందర్భాల్లో హోమ, మంత్ర, నియామకంగా గట్టిన మంగళసూత్రము—సూత్ర మెన్నడూ కాదు. గళమున పురిత్రాడు మాత్రమే !! వారన్యోన్య ప్రేమపాశబద్ధులో, కారో అను యోచన లా తలిదండ్రుల కక్కరలేదు కళా ! చూడూ ! ఎంతో భూవసతియున్నది, ఒక్కడే కొడుకు. యిలాటివే పాటిస్తారే గాని, ముసలిబడుగు—"

"ముసలిబడుగైతే మరీమంచిదికదండీ ! అల్లుడు గుటుక్కుమంటే అమ్మాయి కాస్తివస్తుందిగా ? ఇంగిత మెరుగని చవటలంతా పెళ్లిపెద్దలైతే, యెన్నో

అనర్థాలు మూడుననుటకేమి సందేహంలేదు. పెళ్లి పెద్దలమని బయలుదేరి, వధూవరుల పాలియముళ్లగు చున్నారు."

"పెళ్లిగా అంటావేం ఆమాట ? విగతభర్తృక యగుకూతుచే నింటనూడిగంచేయించుకొంటూ, దానిస కన్న నెంతో నైచ్యముగ బరిగణించుతూ, అదిఅంతా నాపె పురాకృతమని ఘోషించు వారలజూచిన నా కొడలు మండుతుంది. పురాకృత మెట్లాంటిది చెప్పు కళా ? కాటికి కాళ్లుజాచుకొనివుండే యే యరువ దేండ్ల ముదుసలికోబట్టి అంటగట్టి ఆతడు గతించిన ఆమ్మాయిపురాకృతమటోయి? పీళ్లయొక్క ప్రాపంచిక జ్ఞానశూన్య ఫలంకాని ! ఎందరు యువతీయువకులు – అన్యోన్యప్రేమానుబంధంలేకుండా, మనోవ్యాధితో మరణిస్తారో – యవ్వనరక్తప్రవాహోజ్వలతగల నీవు కొంచెం ఆలోచించిచూడు !! తలచుకొంటే గుండె ద్రయ్యలైపోదా ? హృదయలేకుండా పురాకృతమని ఘోషిస్తారు. మానవయత్నము అపసవ్యమార్గగామి అయితే పురాకృతమేమిటి ? దిబ్బ !"

"నిజమేనండి శంకరం గారూ ! మనంచేసినకార్యం మంచిదే అని, ఆత్మప్రబోధమున చేసినపుడు, అది వక్రిస్తే పురాకృతమనిన కొంతనయమే. ఎందరు సంఘభీతిచే ఆత్మహత్య (స్వేచ్ఛానిర్మూలనము) నొనర్చుకొంటున్నారో ? చూచిచూచి, కుత్తుక కత్తరిస్తూ పురాకృతమనిన నది మిగుల శోచనీయం."

"ఇప్పుడీ ద్రావిడ ప్రాణాయామం యెందు కంటే—"అని అర్ధోక్తిలో అత డసందర్భముగా "బిందూ !" అని పిలచేడు. నేను తెల్లబోయి అతని కేసి చూచాను.

బిందూ వచ్చింది. పదిరెండేండ్ల వయస్సు. చామన చాయ. కళ్లల్లో ఓవిధమైన నవీనమగు కళ ఉట్టి పడుతూవుంటుంది. ఆమెను జూచుటలో ముందుగా చూచేవాళ్లను ఆ సోగకండ్లే ఆకర్షిస్తాయంటే అతిశయోక్తికాదు. కమ్మని కంఠస్వరం. త్రాచుపాముల్లే జడ. కపోలములపై ఎప్పుడు చిరునగవు తాండవమాడు చుండును. మొత్తంపై నందమైన అమ్మాయే.

"ఎందుకండీ ?"

"చూడమ్మా ! బిందూ ! నా కీరోజున చాలా నజ్జుగానుంది. కాస్త నా సోలెడు బియ్యంకూడా అత్తిశ కేసిపెడుదూ !"

"అల్లానే"

"కాసిని మజ్జిగనీళ్లు దొరుకుతాయమ్మా ?"

"ఆఁ ! కూరకూడా తెచ్చిస్తాలెండి" అంటూ వెళ్లిపోయింది.

ఆనడకలో గూడా ఓవిధమైన మురిపెము.

* * *

"చూసేవుకదా కళా ! యేమంటావు ?"

"అమ్మాయి బాగానేవుంది. కథానాయకా ? సంగతేమిటి ?"

"పదిహేనువందల రూపాయీలకు విక్రయింప బడుతూవుంది."

"ఆఁ ! యెవరికి ? యేమిటి ?" అని తొందరగా ప్రశ్నించేను.

"ఎవరో ఒక అనామధేయుడు !"

"ఎవరో ఒక అనామధేయుడా ? చూస్తూ రత్నం లాంటి పిల్లను అఘాతంలో దింపేస్తున్నారా ?"

"అఘాతంలో బడద్రోయు టేమిటోయి వెర్రి, మొండికత్తితో పీక నుత్తరించుట కాలోచిస్తుంటే ? ఆ యమ యాతన—"

"యమ యాతనా ?"

"అంతకన్న ఎక్కువే. అది తలచుకొంటే హృదయంకరగి నీరైపోదా ? ఆ మరణాంత దుఃఖభూయిష్ట మగు జీవితయాత్ర ఎలా నిర్వహించగలదు ?"

"కడుపారగనిన తల్లియే యిలా—"

"కన్నతల్లి కాదు. లేదు."

"ఆవిడనమ్మా అంటూ, ఆవిడకొడుకు, నరసింహాన్ని అన్నయ్యా అంటుందే."

"ఏదో దూరపుబాంధవ్యం. అనాథ."

"అందుచేతనే యిట్టి కార్యానికి వెనుదీయలేదు."

"నీవింకా సత్యకాలపు మాట్లాడుతావు. కళా! ఆవిడ తల్లియైనా, ఆ బాలికను విక్రయించేతీరును, వాళ్ల అవస్థల్లాఉంది. వాళ్ల దారిద్ర్యాంధకారం భేదించేమార్గం యిదే. నరసింహానికి యిరవైరూపాయిలు జీతంగల మాష్టరీఉద్యోగం. ఇతరోపాధిలేదు. కాకినాడలో కాపురం. ఎల్లా కాలంగడుస్తుంది?"

"అందుకని ఆపిల్లను చంపివేస్తారా?" అని నా రక్తనాళము లావేశముతో బ్రద్దలైపోతుంటే అడిగేను.

"హృదయం వుండే నీ వల్లా అంటున్నావే కాని, హృదయశూన్యయగు ఆ వృద్ధజంబుకాని కేమి విచారం!"

"ఏమైననూ దీనికవాంతరం కల్పించాలి. మానవ యత్న మెంతవరకుబోవునో అంతవు ప్రయత్నించి, మంచివాని కాబాలిక నంటగట్ట—"

"అదుగో! వరుడుగా వాళ్లనుకుంటూన్న ఆ వరుడు (ముసలి) వచ్చునట్లుంది? అవును. ఏదో మాట్లాడుతున్నాడు. విను! విను! బేరం కుదర నట్లుంది?"

"బేరం? బేరం? వీళ్లశ్రాద్ధం!"

"ఉస్, యేమిటావ్రేకం కళా! విననోయి మొదట."

* * *

"ఆమ్మాయిని విడిచివుండడం అంటే ఎల్లానో ఉంది. తగు మనుష్యులు తమంతట తామేవచ్చి అడిగినప్పుడు బెట్టుచేయకూడదని యివ్వాలని. కాని — కాని —"

"అయ్యో! కాదామరి? ఎంతమాట! మీరింత దూరంచెప్పాలీ? నేనుమాత్రం యెరుగనా? మీకు మల్లే నేనూ ప్రేమిస్తాలెండి." యిరవైవేల రూపాయీలఆస్తి ఆమె అదుపాజ్ఞల్లో వుంటుంది."

"మరా మూడువందలమాట?"

"ఏ మూడువందలు?"

"పదిహేనువందలకు కొరదా?"

"అదా! మీయిష్టం. అలాగున అంగీకారమేనా?"

"మా అబ్బాయితో ఆలోచించిచెప్తా. రెండు రోజులుపోయాకవస్తే. ఏదో ఒకటి నిశ్చయం చేసుకొందాం."

"అలాగే. కొంచెం మంచినీళ్లిస్తారా?

"బిందూ!"

బిందూ పలుకలేదు.

బిందూ మంచినీళ్లిచ్చెనో లేదో తెలియదు. ఆ వరుడు మళ్లీ దర్శనంచేస్తానంటూ వెళ్లేడు. యింతలో— "ఏమే పెళ్లంటే యేడుస్తావేం? నిక్షేపంలాంటి సమంధం, ఇరవైవేలు! ఒకటా? రెండా? ఆతఆస్తి నీదే— ఇంకాయేమో అంటూంది గాని, నామనస్సు పరిపరి విధాల భ్రమిస్తూవుండుటచే నా చెవులోబడలేదు. శంకరంగారు దీర్ఘాలోచనాసూచకమగు నిట్టూర్పువదలారు.

ఇంతలో — "శంకరంగారూ!" అంటూ మా వద్దకు నరసింహం వచ్చేడు.

"నరసింహం! విశేషం యేమిటి? అత నెవరు? పన్నెండువందలు — కొరదా మూడువందలూ — యేమిటోయికథ?"

"అత నెవరో నాకూ తెలియదు. అత నేమో పన్నెండువందలరూపాయీలకు మాబిందూ నడిగేట్ట! మాఅమ్మ 15 వంద లిమ్మన్నదట. నాల్గయిదురోజుల్లో మళ్లీవస్తాట్ట. మా బిందూ చెల్లావిక్రయం యిదేవిశేషం."

"ఆమరణాంత సుఖదుఃఖ మిశ్రితమగు జీవిత యాత్రనేర్పచు విషయమిదిగాని, కూరగాయలటోయి! బేరానికి?"

"నేనదే మాఅమ్మతో వాదించేను. అమ్మకం మా టటుంచండి. అనుకూలమగు వరుడా కాడు. నలుబది యేండ్లవయస్సు. మాచెల్లా యేం సుఖపడుతుందని యీ పెళ్లి?"

"ఆ అమ్మాయి సౌఖ్యం మీరభిలషిస్తే, అస లీ పెళ్లికే ఒప్పుకోరు. ధనం ముఖ్యం. యేమంటావు నరసింహం?"

"దాన్ని మాసోదరికంటె యెక్కువగా చూస్తున్న నాకు దాన్ని వదలడంఅంటే ఎంతో కష్టంగానుంది."

"అదేంమాటగాని, నరసింహం, యీప్రేమ నాకు తెలుసును. నీవు నిజంగా ప్రేమంటూవుంటే యీ సంబంధం తప్పించి, మరోటి చెయ్యాలి."

"దొరికితే తప్పకచేస్తా."

"ఏమిటి గనుక దొరుకుటకు? మనం ప్రయత్నిం చాలి."

"దైవసాక్షిగా"—అంటూ నరసింహం కళ్లల్లో నీళ్లెట్టుకున్నాడు.

"నీది చాలా జాలిగుండెరా నరసింహం! కళ్లంట నీళ్లుకార్చకమ్మా! నిన్ను కార్యమునకై ప్రోత్సహిం చుట కన్నానుగాని, నీవు మాచెల్లాయిపై ప్రేమలేదని కా"దని సానునయంగా శంకరరకగారన్నారు. ఇం తలో —

"నరిసిం అన్నయ్యా! భోజనానికిరావూ! కాళ్లా యికూనేసిం"దని బిందూపిలిచింది. నరసింహం వెళ్లాక, మేంకొంతసేపు మాట్లాడుకున్నాం. తదుపరి యింటికి వచ్చాను.

* * *

నేనొక సమంధంగురించి నరిసింహంతో చెప్పేను. అంగీకరించినాడు. మాగురువుగారి తమ్ముడు మాధవం. యిరువదియేండ్ల వయస్సు. F. A. పరీక్షుడై— ఆ వెంటనే దైవికంగా విజయనగరం కలెక్టరు కచేరీలో నొకఉద్యోగము లభిస్తే అందు ప్రవేశించాడు. ముప్పదిఅయిదు రూపాయీలు జీతం. ఉద్యోగం స్థిరీకృతం (confirm) అయింది. చామనచాయగా నుం టాడు. మేము ముగ్వురము అన్యోన్యమాలోచించి తుద కదియే స్థిరీకరించాము.

* * *

"బిందూ! నీకాపెళ్ళి యిష్టంలేదుగా?" అని శంకరంగా రన్నారు.

"ముసలిబడుగు నెవ్వరు కోరుకొంటారు?"

"యిష్టంలేదని వేరేచెప్పాలీ అంటావుకదూ? బిందూ!" అన్నాను నేను.

"నిజమేనా? బిందూ!"

"యింకా యెందుకండీ తరచి తరచి అడగటం?"

"ఆమె దీనవదనంచూస్తే నాకు చాలా జాలేస్తోం", దన్నాను.

"హృదయశూన్యయగు మాచిన్నకక్కికిజాలేమిటి? సాధుమృగమగు గోవును, ఖరపరఖండఖండములుచేసే కసాయివానికి కృపాలేశమైన నుంటుందనడం, ఎండ మావుల్లో నీరుందన్నట్టే" అంది బిందూసరస్వతి.

"బిందూ! బాగా చదువుకున్నట్లున్నావు?"

"ఏదో ఆంధ్రభాషాప్రపంచమున కాస్తజ్ఞానం అల వరుచుకున్నదంతే" నని శంకరంగా రన్నారు.

"జాతీయోద్ధరణ మన్నిట ముఖ్యంగా గమనించ వలసిందే"

"యీగోడ పెందుకోయి కళా! యీ ఫొటో చూడమ్మా," అని మాగ్రూప్‌ఫొటో బిందూసరస్వతి కిచ్చాడాయన.

బిందూసరస్వతిచూచి, సాభిప్రాయంగా తల యూచి బాబూ! యీ ఘాతుక మృగమధ్యంనుండి బయటపడితే చాలు! శ్రేబాయుడే! నిరుపేద ఐనా నేను భిక్షుకినై యాతనితో ప్రొద్దుపుచ్చుతాను. నాకదే అనిర్వచనీయమగు ఆనందము! ఫలితశూన్య మగు నీయూడిగముకన్న నదియే వేయిరెట్లు మేలు!!"

"అబ్బో! బిందూచెల్లాయి చాలా ఉదారాశయాల్తో కూడుకున్నదే" అన్నా నేను.

"ఏం చెయ్యమన్నావు అన్నయ్యా! కళా! నువ్వే ఆలోచించు, భిక్షుకత్వమంత నీరసఅంటావా? హైందవభూమిలో ఎన్నికోట్లమానవులు తినగూడును గట్టబట్టాలేక గుండుచుండిలో యించుకైన విచారింతురా? ఎవరో నీవంటి పరహితచింతకులు అట్టి భైక్షుకాళిదలచి రెండు వేడికన్నీటిబిందువులు కార్చె దరు"అని ప్రత్యక్షరంలోనూ, కృతజ్ఞతారసం ఉట్టి పడుతుండగా బిందూసరస్వతి అన్నది. ఆమె అమాయికత్వానికి నాకు చాలా జాలేసింది. అప్పుడే నాకళ్ల ల్లోకి నీళ్ళొచ్చాయి.

"బిందూ సరస్వతివివాహం నిశ్చయమైంది. నరసింహం తల్లికి నూటపదార్లిచ్చుటకు మాధవం అంగీకరించేడు. ఆవిడ ఎల్లా ఒప్పుకొన్నదో అన్న ఆశ్చర్యం అక్కరలేదు. శంకరంగారు ప్రోత్సహించుటచే, తన కొడుకు నిర్బంధించుటచే ఒప్పుకొనక తీరిందికాదు. యింతకును దైవానుకూల్యత. నరసింహం నాకు ధన్యవాదము లర్పించకుండా నుండలేకపోయాడు. నన్ను గాఢంగా కౌగలించుకొని, కళ్లల్లోనీళ్లు గిరుక్కున తిరుగుతుంటే, "అన్నా కళా!" అని మరి మాట్లాళ్లేక పోయేడు.

*　　*　　*

బిందూసరస్వతి అత్తారింటనే పెళ్లి, నేను, మా నరసింహం, శంకరంగారుమాత్రమే ఆడపెళ్లివారం. తలుపుదగ్గిర పేర్లుచెప్పే సందడిలో నున్నారంతా. "విన పళ్లే గట్టిగాచెప్పు" "ఆఖరికి వినబడనీయవేం" అని బిందూ సరస్వతిని ఆట్లాడిస్తున్నారు. మగపెళ్లివారి తరపు సువాసినులు.

"నూటపదార్లు. మాధవం—"అని సునుసిగ్గు దొంతరలచే పలుకజాలక నూరకొంది బిందూసర్వతి కళ్ల ల్లోనీళ్లు తిరుగుతుంటే నాకేసి జాలిగాచూస్తూ.

"మాధవి, తనూ వచ్చేం, తలుపుతియ్యండనే కదండీ! మాచెల్లా యెన్నిసార్లుచెప్పినా?" అని నేను శంకరంగారితో నన్నారు గంభీరగా.

మాధవం నామాట్లకు దొంగలేనంగా నవ్వేడు. అనువాసినులు అమ్మలక్కలంతా నవ్వుతుంటున్న సందడిలో— తలుపుదగ్గిర పేర్లుచెప్పకనే, బిందుమాధవులు లోనికిపెళ్లిపోయారు.

# ఆశీర్వాదము

## శ్రీమతి కా. స్వారాజ్యలక్ష్మి

శా. ఆశీర్వాదము లందుకొమ్మ గుణవి
ద్యాబుద్ధులం బ్రౌఢవై
యా శీతాచలసేతు మధ్యగత వి
శ్వాంధ్రాంగనాహ స్త స
ద్భూషారత్నమవై నిరంతరమనో
మోదంబు సంధించుచున్
మా సద్మంబును జేర రమ్మతుల స
న్మానంబులం బొందుచున్.

సీ. కేసరితల్లజు గృహమునజన్మించి
ప్రేమతో దాదులు పెంపబెరిగి
తప్పటడుగులతో తల్లిని గరగించి
చిల్కపల్కులతోడ చెన్నుమీఱి
గాయకవరులతో గానంబునేరిచి
వెలయు పండితులలో విద్యనేర్చి
ఆంధ్రబాలికలకు నాటలునేరిపి
కాంతావళికి మంచి కథలుజెప్పి

గీ. నీవు లేనిగృహంబు కళావిహీనమే, యనకయుండ ప్రతినెల యేగుదెంచి
గురుతరానందమున్ మాకు గూర్చునిన్ను జదువగల్గుట భాగ్యవశంబుగాదె.

చం. అనయము నీకు సత్కృపని
తోధిక వృద్ధిఁజెలంగి పత్రికా
మణులకు మేలుబంతివయి,
మాన్యత గాంచుము, నీవు లేని యాం
ధ్రనిలయ మెందులేదనగ
రాజిలు మో "గృహలక్ష్మి!" నిత్య స
ద్గుణగణభాసివై అమల
కోమల వాక్సుమ వాసితంబవై.

వచ్చెను. సీత కొడుకు పదేండ్లవాఁడు, ఆటలయందపేక్షచేత చేరువనుండు నొక బాలికచెంత కేగియుండెను. తమ బండి వచ్చెడి సమయమగుటవలన ఆటల మరఁగిన కుమారునిఁదోడి తెచ్చుటకై, తన పిల్లవానియొద్దకు సీతవెళ్లి, దాపున పండు కొనియున్న యొక స్త్రీ ముఖమును తేరిపారి చూచెను. ఒక నిముసములోనె యీ స్త్రీ లొకరి నొక రానవాలుపట్టి, కౌఁగలించు కొని సంతోషమునఁదేలిరి. సీత కిపుడుగాన వచ్చినది యామె బాల్య సఖియగు శారదయె! వారపుడు తమబాల్య దినములు జ్ఞప్తికిఁదెచ్చుకొని, ఆనందపరవశలయిరి. కొలఁదినిమేషములలోనె వారు వేర్వేరు రెయిలుబండిలో గూర్చుండిరి. కాని, సీతా శారదలు ఒకరినుండి యొకరు వీడ్కోలు గైకొనుటకు ముందుగా దైవానుగ్రహము నఁదమపిల్ల లీ యిరువురును పెరిఁగి పెద్దవా రయిన ఇద్దఱికిని బెండ్లిచేసి తాము ధన్యుల మయ్యెదమని నిశ్చయించుకొనిరి! హిందూ స్త్రీల కత్యంత సంతోషదాయకమగునవి తమ పిల్లలపెండ్లి ముచ్చటలేగదా!

భరతదేశమున నతిబాల్య వివాహముల నరికట్టుట కుద్దేశింపఁబడిన "శారదాశాస నమె" అతిబాల్య వివాహములు ప్రథమ మున నొక్కుమ్మడిగ జరుగుటకు మొదటి కారణమయ్యెను! ఐనను, ధీరమతులు, విద్యావంతులును, పామరజనులుపెట్టు బాధలు లెక్కసేయక, తమపిల్లలకు వయస్సువచ్చిన పిమ్మటనే పెండ్లితలపెట్టుదు మని దృఢ నిశ్చయులయియుండిరి. ఇట్టి వారిలో ముఖ్యులు సీతయు నామె పతి యును. వీరు తమ పుత్రున కున్నతవిద్య చెప్పించు ప్రయత్నమునఁనేయుండి వివాహ మునంగతి యాలోచింపరైరి. దీనికిఁ దోడుగ వీరి కుమారుఁడు ప్రభాకరము చదువునందే శ్రద్ధవహించి, తాను విద్యా పరిపూర్తియగువఱకును వివాహముచేసి కొనననని చెప్పివేసెను. ఇపుడాతఁడు పదునెని మిదివత్సరములుదాటి పెద్దపరీక్షలిచ్చి యున్నను తాను ఉద్యోగ స్వీకారము చేయువఱకును పరిణయముగాననియు ఆ పిమ్మట తనపని ఖాయమగువఱకు వివాహ ముచేసికొనననియును తన పెండ్లికి వాయి దాలు వేయుచుండుట తలిదండ్రులకుఁ గొంత గుండె దుడుకు గలిగించినను కొలఁదికాల ముననె యతఁడు వివాహమునకు సుముఖుఁ డగునని యువ్విళులూరుచు సీతయు భర్తయు నాని మనస్తత్వమునుగని పెట్టు చుండిరి.

ప్రాజ్ఞతవచ్చిన పుత్రునిమీఁద ననగత్య ముగఁ దమ యధికారము చెల్లింపఁబూనక ఆతనిదండ్రులు పెండ్లిమాటలతోఁదమ తన యుని విసిగింపక అతఁడు ఋజుమార్గమున నడచునట్లు మాత్రము చూచుచుండిరి. ఒకనాఁడు ప్రభాకరము తనతల్లి సీతతో ముచ్చటించుచు తాను జూచివచ్చిన సభ లోని కార్యక్రమమును వర్ణించి విద్యావతి యగు నొకబాలిక యచట మధురగానము చేసెనని చెప్పెను. ఇంకొకపరి యాతఁ

డచటి యువతీవిద్యాలయ వార్షికసమయమునఁ బ్రదర్శింపఁబడిన నాటకమునుగురించి జననితోఁ మాటాడుచు వెనుకటి విద్యావతి యీమాఱు గావించిన ప్రసంగము మిగుల హృద్యముగ నుండెనని చెప్పెను. సంభాషణా సందర్భమున నిట్లు సీత తన తనయుని కాబాలయందు మక్కువ గలుగుచున్నదని గ్రహించి యామె వృత్తాంతము మెల్లఁగఁగని పెట్టుచుండెను. కాని, యా బాల యచట విద్యాపరిపూర్తిచేసి తన దలిదండ్రులుండు చోటికి వేగమె వెడలి పోవుటచేత సీత కామె వర్తమానము పూర్తిగఁ దెలియదయ్యెను.

ఇంక కుమారునికి జిన్ననాఁడే పెండ్లి చేయకుండుటకై సీతపడిన కష్టముకంటె కొమార్తె కతిబాల్య వివాహము తప్పించు విషయమై శారదపడిన శ్రమయధికమైనది. శారద తన బాల్యసఖియగు సీతను మరచి పోలేదు. సీత పుత్రుఁడును విద్యావంతుఁడునునగు ప్రభాకరునకుఁదగిన యిల్లాలినిగఁ దనకొమార్తెను సంసిద్ధపఱచుటకై కమలకు దూరప్రదేశమందలి యువతీ విద్యాలయములో శారదయున్నత విద్య చెప్పించెను. సీత కొడుకు విద్యా పరిపూర్తిచేసెనని కొంతకాలము క్రిందటనే తెలిసినను అతఁడు వివాహమునకు విముఖుఁడని శారద వినెను. దీనికిఁదోడుగా అతఁడిపుడు ఉద్యోగస్థుఁడై దూరదేశమేగెనని వార్తకూడ వచ్చెను. కాని యెంతమంది నడిగినను ప్రభాకరుఁడుండుచోటు సీతకుఁదెలియకుండెను. ఐనను తన కొమార్తె వివాహకు విఘ్నము గలుగకుండునట్లుగ యుక్తవయస్సువచ్చిన వెనుకనే పుత్రికయభీష్టమునను సరించి యామెకుఁ బరిణయము గావింప శారదయుద్యమించెను.

ఇచట సీత తన కుమారుని మనస్సునకు నచ్చిన కమల యునికిపట్టి తెలిసికొనవలెనని చేసిన కృషి యెట్టకేలకు ఫలించెను. కమలనుజూచి వచ్చిన బంధువులు తెలిపిన వార్తలు సీతను ప్రభాకరుని ఆశ్చర్యమున ముంచివైచెను. చిన్నవాఁడు కన్నెచిన బాలయు తాను విద్యనేర్చు పురముననె నివసించియుండు ప్రభాకరుని గొన్ని పౌర సభలలోఁజూచి ఆతని శీలమును గురించి జనులకుఁగల సదభిప్రాయమెఱిఁగినది గావున ఆ యువకునే ప్రేమించియుండెనఁట! శుభము వెంట శుభము చేకూరుచుండును. వధూవరుల తల్లులు సీతా శారదలు, చిరకాలమునుండి తమ వియ్యమున కెదురుచూచుకొనుచుండుటచేత కమలా ప్రభాకరుల పాణిగ్రహణమహోత్సవము శీఘ్రమె జరిగి అందఱికినిసంతోషదాయకమయ్యెను.

పిల్లల పరస్పరప్రేమమూలమున పెద్దల చిరకాలపుఁగోర్కె లిట్లు సులభముగ సఫలీకృతమయ్యెను. ప్రేయసీప్రియులకు ప్రేమబంధమును గల్పించి పెంచి పరిణయముగఁ బరిణమింపఁజేసిన విధిప్రేరణ తమ సత్సంకల్పమునకు విచిత్రముగఁదోడ్పడెనని యిప్పటికిని సీతా శారద లాశ్చర్యమునఁ జెప్పుకొనుచున్నారు !

# "గుడ్డిగానడుస్తే గోతులో పడ్డమే"

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

నవనాగరిక యుగమగు నీ యిరువదవశతాబ్దములో కూడా మనదేశము సగముకన్నే తెరచుట వింత కదా? శోచనీయంకూడను. అన్ని దేశపరిస్థితులు అవలోకించుచుగూడ కొన్నివిషయాల్లో వివేకహీనంగా గ్రుడ్డిగా నడవడమేనా? దీనికి కొన్ని కని వినిన సంగతులు తెలుపుచున్నాను వింటే.

ఏవూళ్లోనో యొకబైరాగి యింటింటికివెళ్లి ఒక్కనోటుయిస్తే (అంటే ప్రాంసరీనోటుకాదు. రూపాయిలనోటు) వేలకువేలు నోట్లుచేసి యిస్తానంటే, లోకులునమ్మి వేలకువేలు గుప్పేసి, అవి తీసుకుని వాడుడాయిస్తే నోరు నెత్తి కొట్టుకొని యేడ్చి యూరకున్నారట.

ఇంకోచోట ఒక ఘోషాయివెళ్లి ఒకశక్తి మీ యూరుప్రవేశించి తెల్లారేసరిక్కి మీపశువులను చంపేస్తుంది. నేను దివ్యదృష్టిని పరికించిచెప్పాను. ఏదో కొంతసొమ్మిస్తే, శక్తిని పారదోలేపూజ చేస్తానంటే, కొందరు నమ్మి డబ్బిచ్చినారట. కొన్నియూళ్లల్లో నమ్మక పోపొమ్మంటే, రాత్రికిరాత్రి రెండుమూడు వీధుల పశువులకింత విషమిచ్చి చంపేసినాడట. మరునాడు వారివారిపశువులు చచ్చియుండడముచూచి, సన్యాసినినమ్మక యింత తెచ్చుకున్నామని విచారించి వానినివెదకి తీసుకువద్దామని వెతకబోయినారట. ఇంతలో పశువులకు మందుపెట్టుటచూచి, సన్యాసిని మెత్తగా తన్నుచున్నారట. వెదకబోయినవారీ దృశ్యముచూచి వారితోకలసి తన్ని, వాడిచేతనే విరుగుడుపెట్టించి పశువులను బ్రతికించుకున్నారని వదంతి విన్నాము.

మావూళ్లో ఓఅమ్మాయి, పిల్లలకోసము తపించి, చూచినగాతికి పుట్టకుమ్రొక్కి, నోములు, తీర్థయాత్రలు, ఉపవాసములు, అశ్వత్థప్రదక్షిణములు ఎన్నో చేసి ఫలంలేక, వారి వీరివలన యేవూళ్లోనో యొక సన్యాసి కలడనియు, వాడే కోరికకోరితే నది తీర్చే అపర బ్రహ్మవతారమని విని, పతిసహితంగా ఆ సన్యాసివద్దకేగి ఫలదక్షణాలచే తృప్తిగావించి, తన సంతానకోరిక దెల్పగా ఘోషాయిచిట్కాఅంటారే, అలా ఒకచిట్కా మందిచ్చి యిద్దరిని సేవించమన్నాడట. అది తిన్నతక్షణంనుండి, మగవాడు మంచమెక్కి నెలతిరగకుండా చచ్చిపోయినాడు. తదాదిగా భార్యకు పిచ్చెక్కి తిరుగుచున్నది. సంతానములేదు చట్టుబండలులేదు—కాని చావుకాక బ్రతుకు కాకుండా వితంతువై తన్నుతానే యెరక్కయున్న దా అమ్మాయి. విన్నారా?

కొంతకాలంక్రింద జరిగిందిది. రాజమండ్రి ఇన్నీసుపేట పడవలరేవుదరి నొక కోమటిముసలిదొక చిన్న చిల్లరదుకాణము పెట్టుకొని, జీవించుచు ఏదో కొన్నివందలరూపాయలు జేసికొంది. చేతికి బంగారు మురుగులు చేయించుకొంది. దానికి తోడొకముసలిది కాపలా. ఈ ఆడంగులసంగతి గ్రహించాడొక మోసగాడు. రాత్రి 10 గంటలప్పుడొక పూజారివలె ఇన్ని పువ్వులు దేముడు నివేదనమని పళ్ళో, కొబ్బరిచెక్క లో పట్టుకొచ్చి యీముసలాళ్లకిచ్చకాలు (అంటే ఏవో పురాణకథలు) అవి చెప్పి నమ్మకంకలిగించుకొని ప్రసాదములు పెట్టుచుండి ధనుర్మాససేవల యొక్క ప్రసాదమని పులిహోర, వడలు, చక్రపొంగలి, దధ్యోజనం, కమలాఫలములు వగైరాలిచ్చియిచ్చి

యొకనాడింత సగ్గుబియ్యపు పరమాన్నమూ యిద్దరి ముసలాళ్లకిపెట్టినాడట. వాడుకప్రకారమది వాళ్లు త్రాగారు. వెంటనే మత్తెక్కి పడినారు. అసలు దుకాణపుది స్మృతిలేకుండానే యుండుటచే దాని చేతిమురుగులు తీసికొని పెట్టెలోని సొమ్ము తీసుకొని పరారైనాడు. రెండవదానికి తినగానే డోకులువెళ్లినవి. అందుచే అంతమత్తుగాలేక యివన్ని కలలో కన్నట్లు చూస్తూందిటకాని, నోరులేదు కదలలేదు. తెల్లవారేసరికి, దుకాణపుది పిచ్చెత్తినదానిలా తయారైంది. కళ్లుచూపేకాని నోటిమాటలేదు. చేతులు కాళ్లు పీకికొనుట, లేవబోవుట యీలాయుంటే చుట్టుప్రక్కలవాళ్లందరు పోగై హాస్పత్రికి తీసికొనిపోయి వాడెట్టినమందుకు విరుగుళ్లుచేయిస్తే నెమ్మదించి జరిగినవన్నీ చెప్పినది. పోలీసులకు రిపోర్టుయిచ్చినారు. కేసు జరిగింది. ఆరకపు పూజారి తెనాలిలో పట్టుపడ్డాడని వినికిడైంది. యీలాగేయుంటాయి గుడ్డి నమ్మకాలు.

ఇట్టిమోసములు పెద్దపెద్దపట్నాల్లో మరీయెక్కువ. ఎవరిని నమ్మేరోజులు కావివి. ప్రజల గౌరవపాత్రులగు యోగీశ్వరులవేషాలతోయున్న ప్రతివ్యక్తిని గ్రుడ్డిగా అసలే నమ్మకూడదు. యింటియజమాని యొక్క స్వహస్తలిఖిత రూపకములేనిదే స్త్రీలు, నౌకర్లను, చాకర్లను, జోగులను యెవరిని నమ్మకూడదు. ఆఖరికి యెరిగియున్నవారినైనా నమ్మకూడదు.

మాబంధువులో యొకరింటికి భిక్షచేయుమని ఒక స్వాములవారొచ్చారట. ఆస్వామికి ఒక కాలు విపరీతపు బోదకాలు పైగా వర్షాకాలమగుట యింత బురదకాళ్లకంటుకొనెను. కాళ్లు స్వాములవారికి భిక్షసేయువారు పాదపూజసేయు సందర్భమున కడగాలని నియమమున్నదిలెండి. అందుచే ఆబురదకాళ్లతోవచ్చి పీటమీదకూర్చుని పాదపూజ చేయమన్నాడట. ఆయింటి యజమానురాలా కాళ్లుకడుక్కొని రండందిట. ఆ మాటకా స్వామిజీకి కోపమువచ్చి, భక్తులకసహ్యమేల? నాకాళ్లేలాయుంటే ఏమి అవే కడినపాదతీర్థము తీసుకోవలసిందేకాని, అడ్డుచెప్పిన చోట నేను భోజనముచేయనని చివాలున లేచిపోయినాడట. భోజనసదుపాయముల కొఱకైన సాపాటు స్వాములుకాని సర్వసంగ పరిత్యాగులా యిప్పటి సన్యాసులు?

మరియొకవింత. ముఖ్యంగా వినండి, ఆమధ్య దిగంబరస్వామి మాపూరొచ్చి నడిగోదావరిలోయున్న యిసుకతిప్పమీద బసచేసాడు. పదిమందిశిష్యులు, పంచాగ్ని మధ్యనివాసము, పుట్టెడువిభూతి పూత, నల్లమేఘచ్ఛాయనుమించు రంగుకలిగి, ఉక్కుగుండును దిగత్రొక్కు శరీరము, మౌనవ్రతం. రాత్రింపగళ్లు సమాధేకాని కన్నుచూపులేకుండుట ఆయనదేభాషోకాని, యేదేశభాషా రాదేమో మాటే లేకపోవడం. నీరైనా స్వీకరించినట్లు కనబడకపోవడం. విరాగిఅంటే యీయనేఅన్నట్లున్నాడు. స్వామంటే స్వామికాదురా? పిల్లలులేనివాళ్లకు పిల్లలు, రోగాలున్నవి పోగొట్టడం, కళ్లులేనివాళ్లకు కళ్లు యీలా ఒక్కచిటిక విభూతితో సకలరోగ నిర్మూలం చేయుచున్నాడని స్త్రీపురుషాదులదేపోత వేలంవెర్రిగా. ఒక్కఫలమైన ముట్టనియోగిని పళ్లుదక్షిణలతో ముంచెత్తారు. సాష్టాంగదండములతో యిసుకంతా పల్లమైపోయింది. వైతరణినది దాటితేనే కాని, జీవులు యమలోకం చేరరన్నట్లుగా కొంత గోదావరినది దాటితేనే కాని జనులా యతీశ్వరుని సన్నిధిచేరరు. దీనితో పడవవాళ్లు, బళ్లవాళ్లులాగ్గా లోకులసొమ్ము మిగిలింది స్వామికి సమర్పణ. ఈ సమర్పణఫలములగుట్ట అసలే నీరైనా ముట్టనిసంయము యేమితింటాడు? శిష్యులున్నారుకాదు కంపెనీ యేజెంట్లవలె. వారుతిని వచ్చినవారికి ప్రసాదముల క్రింద యిచ్చి ధ్యానానందస్వామివంటి విభూతింతతీసి, కోర్కెదారులకొసగి పంపించుచుండిరి. వెళ్లి నమ్మలక్కలు, అయ్యలు ఎంతమహానుభావుడు కాకపోతే, నిరాహారుడైయుండి గుండులాగే యున్నాడంటే,

కబుర్లు ఆనోటనోట వింతలే. ముసలిచ్యవనుని అశ్వినీకుమార్లు యువకునిచేసినరీతిగా నీతని దలచుచుండిరి. అందరినోటమ్మట, టకారములేకాని, స్వానుభవను లెవరూ గన్పించరు.

ఇంతలో చనిపోయిన తునిరాణిగారా యోగిని తమ,యూరు రమ్మని కబురంపినదట. అందుకై రైలులోపోవుచుండగా పోలీసులు అనేకచోట్ల ఖూనీలు చేసి, మారువేషమున తప్పించుకొని తిరుగుచున్న హంతకునిగానెరిగి బంధించిరని ఇంగువవాసనలా వార్తలు బయలుదేరాయి. ప్రజలను మోసబుచ్చగలడు కాని, భగవంతుని పసిపట్టుటలో పంచానన సమానులగు పోలీసులను గికురించగలడా? ఉల్లిపువ్వు ఉల్లిపువ్వే. మల్లిపువ్వు వాసనొచ్చునా? రోగాలుకుదిర్చినా కుదర్చకపోయినా డబ్బురోగం కొంతవఱకు కుదిర్చాడు హంతకయోగి. ఇన్నివిన్నా కళ్లుతెరవరే ప్రజలు.

ఇదయాక మాయూరే ఇంకో స్వాములా రు వచ్చారు భగవద్గీతాసార ముపన్యసించుటకు. చాలా బాగా చెబుతున్నాడని, ఒక్కకానియైనా పుచ్చుకోడని, పల్లె మసలేలేదని వదంతులతో జను లదే పోత. పదిహేడురోజులు పదిహేడధ్యాయాలు చెప్పాడు. ఇంతవఱకొక్క గవ్వయినా రాలేదు కంఠశోషే కాని. అడుగుటకా నామర్దా. ప్రజాభిప్రాయం తారుమారై గౌరవం తగ్గుతుంది. అడక్కపోతే అమ్మైనా పెట్టదు. ఈలాంటి చిక్కుల్లో పడ్డాడు మహానుభావుడు. ఈ పదిహేడురోజుల నుంచి విడవకుండా సేవించుచున్న యొకాయనకు తన దీనత చెప్పుకొన్నాడో ఏమో పద్దెనిమిదోరోజులచివర కాలమం దందుకున్నాడు శిష్యుడు డబ్బుప్రస్తావన. "స్వామియొకమఠం గోదావరితీరమున స్థాపించదలచుకొన్నాడు. ఆయన తలంపన్యథాచేయుట మనకు చాలా అగౌరవం గాన" అనేసరిక్కి ఎమ్టిహాండు (వట్టిచేతుల)తో వచ్చినజనుల్లెల్లరు చల్లచల్లగాజారేరు. ఆవేళే క్రొత్తగా చూడాలనివెళ్లిన మేమున్నూ వారి ననుసరించాము. ధనముష్టుడు కాని, నిష్కామయోగి వడో తెలియకుండా యున్నది. మోక్షసన్యాస యోగ దినము గనుక స్వామికి శుద్ధమోక్షమై, తెల్లవారుగట్ల వెడలిపోయినాడు.

బందరులో సామర్థ్య యొక వేదాంతివచ్చి స్త్రీపురుషాదులకా వేదాంతవిద్య యుపదేసిస్తానన్నాడట. గుడ్డినమ్మకాల్లో, స్త్రీ లగ్రగణ్యలగుటచే యొకటే వెఱ్రిపోతగా పోవగాపోవగా, కొన్నిరోజులకొక యవ్వనవితంతువు కుపదేశమెసంగున నేవో యవాచ్యములు పల్కెడట. అది యూరంతాప్రాకి ఆవేదాంతిని తన్నదలపెట్టారట యూరిపెద్దలు. అదితెలిసి, పలాయనసూత్ర మవలంబించాడా వెఱ్రివేదాంతి. మాయదారి ప్రపంచాన్ని కళ్లు బాగాతెరచి విమర్శనగా నడవాలికాని గుడ్డిగానడుస్తే గోతులోపడ్డమే. ఇక్కడికి కిదిసరి.

మహో వింత. మరీవింత. వెనుకటికో సన్యాసి, ఆరవేసికొన్న గోచిగుడ్డ ఎలుకలు కొఱుకుచున్నవని, వాటిని చంపుటకో పిల్లిని, పిల్లినిపెంచుటకై పాలు కావలసి ఆవును, ఆవు సంరక్షణకొక నౌకరును, ఇన్నిటిని కనిపెట్టుటకొక స్త్రీని పెండ్లాడి తుదకొక సంసార మేర్పరచుకొన్నాడట. అలా ఈమధ్య అంటే సుమారెనిమిది నెలలనుంచి మాయూరే (అన్ని వేళంవెఱ్రులకు అగ్రపీఠం లెండి) వచ్చి, మఠాలలోను, గుళ్లలోను, అధ్యాత్మరామాయణ మతి సారస్యంగా అంతరార్థ బాహ్యార్థము లాకాశమంటే నేర్పున చెబుతున్నాడు. మాట మైసూరుపక్కీ ఏసమాసైనా మారచనగా, విపులంగా చెబుతున్నాడులెండి. వినేవాళ్లలో మూడువంతులు స్త్రీలే. వారిలో మూడు వంతులు వితంతువులే. వితంతువులకే యతిస్వతంత్రము కాదా? తత్వబోధ తరుణుల తలనపాల మంటుచున్నది. సన్యాసిగా ఆశాకోపము లాకాశమంటుచున్నవి. డబ్బులేని డిప్రెషన్ రోజుల్లో ఎన్నిటికిని డబ్బుతేగలరు. అందులో పురుషుల కాఫీటిఫెన్లకు,

సినీమా నాటకాలకు, సూటుబూట్లకు, షోకులకు పోగా మిగిలితేను. వారనుగ్రహించి యిస్తేనుగద మగని వక్షస్థలంవీడనిలక్ష్మి స్త్రీ పాలబడుట. అందులో వితంతుల శేకొడుకో, ఏమరదో, ఏ అన్నతమ్ములో, మరదలో, కోడలోయియ్యాలి దయదల్చి. ఇందరిచేతులమీదనుంచి రావడం, స్వామికివ్వడం అరుదగుచుండుటచే, నాస్వామికి ధర్మోపన్యాసకర్త శోషకు కడుసలిగి, పల్లెచుంచాడు. అదీ నిండుటలేదు. ముఖాముఖిగా అడిగాడు. అన్నికోరికలువిడిచిన సర్వసంగ పరిత్యాగియైన యతీశ్వరునకీ తుచ్ఛధనముతో పనేమని యెవరో అన్నారట. అంటే ఆయన అపరదూర్వాసుడై, "రైలువాళ్లు సన్యాసికే ఎక్కించుకుంటారా? అద్దియియ్యక పట్నంలో యిల్లెవరిస్తారు. పదార్థములులేనిదే పాకమెట్లు భుజించను. కడుపు నిండనిదే గాథలెట్లు మీకు చెప్పను. గనుక, రోజు తలకొక అర్ధణా కాని, మొత్తము నెలదాకా యియ్యలేకపోతే నెలకొకరూపాయిగా మొత్తపరచిగాని తేవలె"నని అట్లా తెచ్చేవారు చేతులెత్తమని, అన్నాడని వదంతిపుట్టింది. పైగా విభూతి పెట్టుకోకుండా వితంతువులు రావలదనిశాసిస్తే, ఇంత విభూతిలేకుంటే సిగ్గేస్తుంది స్వామీ అందిట ఓముసలావిడ. ఆలాగా మంగలాడివద్ద క్షౌరమునకు తలవంచి కూర్చొనుటకు సిగ్గులేదా అన్నాడట తక్షణం. ఇంకోఆవిడ పళ్లెము పట్టి స్వామికి చందా వసూలుచేసి రోజూయిస్తూంటే డబ్బులు తీసుకున్నావని దొంగతన మారోపించగా ఆవిడ మళ్ళీవెళ్లలేదని స్వయంగాతెల్పింది. ఇన్నిరకాలుగా చెప్పుకుంటూనే వెడుతున్నారమ్మలు. ఏమర్రా అంటే, అసలు చెప్పే యతికున్న లేకపోయినా, దేహాభిమానం ఎందుకు ఇన్నివింటూ అన్నారు కొందరక్కలు, పురాణవైరాగ్యముగా.

భిక్షలకు పిలవలేదని యొకకోపము. పిలిచిరిబో గాటీలు బాగులేవనియో, గంధము తీయలేదనియో, దక్షిణ చాలదనియో, వంట రుచిలేదనియో, 'పిండివంట తనకిష్టమైనవి కాదనియో కోపముతో అలుగుతాడని వదంతులు. పాపం పుణ్యం భగవంతునికెఱుక. ఏమయినా, కోపంమాత్రం తగదు. సన్యాసికిన్ని చింతలెందుకు? ఆహారవిహారములికింత హడలెందుకు? డబ్బుకై యింత కాంక్షెందుకు? ఆత్మసంయమునకు సత్రం భోజన, మఠానిద్ర యుండాలి. ఆరోజు కేది ప్రాప్తో, అది తినాలికాని ఆకాశహర్మ్యాలెందుకు? లోకహితార్థమై తన జ్ఞాన మన్యదాపోనీయక, విని యోగించు పుణ్యాత్ములకీ యుపాధినిలుచుటకే పండో భక్షించి జ్ఞానదేహాభివృద్ధితోజీవించి జ్ఞానయోగసాధనములచే దేహాభిమానంవీడి దుర్దృశ్యము లేకముగా చరించి ధన్యులై లోకమును తరింపజేయుటరైయుంటయే, సన్యాసుల లక్షణంకాని చవట సన్యాసిరా యనిపించుకొనుట యతికులంబుకొక లోపమని మనవి.

మనుజులపరికించి మరీ మసలాలని మామగువలకు మనవి. నామాటల కలుగవలదనియు, నిజమాడిన నిష్ఠూరము వలదనియు పురవాసులకు మనవి. అంధత్వమున కథఃపతనమే యని హెచ్చరిక. మామన విని మంచిగా గ్రహించిన మహనీయుల కనేకవినతులని మనవి. ఉన్నసంగతేకాని దూషణకాదని మరిమరి మనవి.

# పహారీజాతులందు విచిత్రాచారములు

"రాచ్ఛ"

భారతదేశము గడు విశాలమైనది. ఇందు పెక్కుజాతులు చిరకాలమునుండియు వాస మేర్పఱచుకొని యున్నవి. ప్రపంచమంతయు నూతన నాగరికతా ప్రవాహమున దేలి పోవుచున్నను జగత్తున కట్టి పరిణామమేమి యు జరుగనివిధముననే యీజాతులు పురా తనమునుండి వచ్చుచున్న తమయాచార ముల నెప్పటివలె జరుపుకొనుచు కాలము గడపుచున్నవి. మానవునిశక్తి కిసుమంతయు లోబడని పర్వతరాజమగు హిమాలయ పర్వతప్రాంతమున నిట్టిజాతులు గలవు. వాని లో భోటియాజాతి యొకటి. ఈజాతినిగురిం చిన విచిత్రాచారములగూర్చి ఇ. వీక్లీలో, కె. ఎ. అబాసుగారిట్లు వ్రాయుచున్నారు.

ప్రస్తుతముగల జాతుల సంఘ వ్యవస్థల మార్పవలయుననుచు రచించిన పెక్కుమంది ప్రముఖుల పుస్తకములం దొకటైన నీజాతి యం దెవరును జదివియుండరని నిశ్చయ ముగ జెప్పవచ్చును. ఈవింతైన అనాగ రిక జాతి హిమాలయపర్వత ఉత్తరసాను భూములందు జనాకీర్ణమగు పట్టణములకు దూరముగా వసించుచున్నది. వారి విచిత్రా చారములు ముఖ్యముగ వారివివాహపద్ధ తులు ఇతరజాతులనుండి భేదించుటయగాక, అటువంటి యనాగరిక జాతులమధ్య ఆశ్చర్య కరములగు పెక్కువిషయము లుండుటవలన, వారినిగూర్చి తెలుసుకొనుటకు మోదావహ ముగ నుండును.

వీరియందు మూడువిధములగు వివాహ ములు గలవు. వీనిలో సనాతనమైనది 'అంకాల్' అనబడునది. దీనిప్రకారము వధువు యింటియందే మంగళసూత్రము గట్టు తంతు జరుపబడును. రెండవది 'సెరాల్'. దీనినిబట్టి ఎట్టి తంతుగాని ఏర్పా టుగాని లేకుండగనే యువకుడొకయువతిని తనతో తీసికొనిపోవును. ఇది జరిగినతరువాత 'అంకాల్' గావచ్చును. ఒకవేళ అది జరుగ కున్నను, వారు భార్యాభర్తలని సంఘ మంగీకరించును.

మూడవది Companionate Marriage అనబడు సమాజవివాహము. ప్రతిభోటియా గ్రామమందును 'రంగ్ భంగ్' అనబడు గృహమొకటి యుండును. ఇదివఱకు వానిని సంఘసమావేశముల కుపయోగించెడువారు. ఇపుడాచోటికి ప్రతిభోటియాకన్యయు నొంట రిగ వెళ్లవచ్చును. అచటికి యువకులుగూడ వచ్చెదరు. అందుచేరిన యిరువురు యువతీ యువకులు తాము వివాహమాడుట కొప్పు కొన్నదానిని వెల్లడింతురు.

తదుపరి వారిరువురు సంగీతపరీక్షకు లో నగుదురు. వధువు గెలిచెనేని వరుని తన

యింటికి గొనిపోయి వివాహమాడును. ఆమెక్కోడిన వరుని వెంట నతని యింటికి వెళ్లును.

ఇట్టి సంస్థలేగాక భోటియాజాతి సంఘ జీవితమున నింకొక ముఖ్యవిషయముగలదు. వారిస్త్రీలకు సంఘమున చాల ఉత్తమస్థాన మిత్తురు గాన వారితరులపై యధికారము చెలాయింతురు. వివాహమునకు స్త్రీలే మొదట ప్రారంభింతురు. గృహజీవన మందుగూడ వారెక్కువ ప్రాముఖ్యతగల్గి యుందురు. భర్త యింకొకభార్యను వివాహమాడెనేని, మొదటభార్య కాతనికి విడాకులిచ్చు నధికారము గలదు; కాని భార్య సమ్మతిలేక భర్త ఆమెకు విడాకు లెట్టిపరిస్థితులందును ఇవ్వజాలడు.

ఈపహారీలందు ఖాసియాలనబడు నింకొకజాతిగలదు. వీరు ముఖ్యముగా కుమాంా ప్రాంతముల నుందురు. వారు తాము హిందువులమని చెప్పుకొనుచున్నను, వారి సాంఘికాచారనియమములు హిందూవిధులకు వ్యతిరేకముగనుండి, యనాగరికజాతికి జెందియున్నవి. హిందూసంఘమున స్త్రీ గౌరవముతో జూడబడుచుండ, నీఖాసియాల యందు చరాస్తివస్తువుకంటె యెక్కుడుగ పరిగణింపబడదు.

ఈజాతియందును భోటియా జాతియందును స్త్రీలకుగల స్థానము చాల భిన్నముగ నున్నది. భోటియాలందు స్త్రీ తన కిష్టము వచ్చినవారిని మువ్విధములగు వివాహపద్ధతులలో నేవిధముగనైన పెండ్లియాడనగును. కాని ఖాసియాలందు భార్యల నితరవస్తువుల వలె కొనుటయు అమ్ముటయు జరుగుచుండును. వారిలో వివాహపు హక్కులకెట్టి పవిత్రభావమునులేదు. భర్తకు ఇతరఆస్తిపై యెట్టి హక్కుగలదో భార్యపైగూడ నంతియు. ఆమె కెట్టిస్వాతంత్ర్యము నుండదు.

వారు భార్యలను ఆస్తితోజేరు యితర వస్తువులవలె తలంచుటవలన సాధారణముగా వారిని అమ్ముచు కొనుచుందురు. ఈ వాడుక వారిజాతియందుండు స్త్రీపురుష జనసంఖ్యనుబట్టి కలిగినది. వారియందు నూరుమంది పురుషులకు డెబ్బదిమంది స్త్రీలు మాత్రము గలరు. ఈవాడుక వారు నాగరిక ప్రపంచసంబంధమువలన క్రమక్రమముగా మానుచున్నారు. త్వరలో పూర్తిగా మాయుననిగూడ తలప వీలగుచున్నది. వీరిలో విగతభర్తృకయైన స్త్రీని భర్తతమ్ము డితరఆస్తితోపాటు గ్రహించును. దీనికెట్టి తంతుగూడ జరుగవలసినదిలేదు.

కుమాను పర్వతప్రాంతములందే వసించు తారను, బుక్సాస్ అను జాతులందింకను విచిత్రమగు వాడుకగలదు. వారపాయకర మగు బురదప్రదేశములందు వసించుచున్నను ఏ బాధలేకుండ శతాబ్దములనుండి వర్ధిల్లుట మిగుల అక్కజమునుగలిగించును. హిందూదేశమునం దంతటికిని వారిగృహములు చాల పరిశుభ్రముగనుండును. వాని నారోగ్య విధుల ననుసరించి గాలివెలుతురు ధారాళముగవచ్చునటుల గట్టుదురు. ఆప్రదేశమంత

యు మలేరియా కునికిపట్టైనను వారికెపుడా జ్వరముగూడ రాదన్న వారారోగ్య పద్ధతుల యొక నెట్టిశ్రద్ధ దీసుకొందురో దెలియగలదు.

వారి పరిశుభ్రగృహములనుగని వారు గొప్ప నాగరిక జాతియని దలంచుట పొరపాటు. ఏలన వారు మూఢనమ్మకము గలవారై యుండుటయగాక యితరజాతులందువలె వివాహమునెడ విచిత్ర సిద్ధాంతములతో గూడియుందురు.

ఖాసియాలందు భార్య ఆస్తివస్తువులలో నొక్కటిగా పరిగణింపబడగా పైజాతులందు భర్త కొంచ మెచ్చుతక్కువగా అంటరానివానివలె నెంచబడుచుండును. ఆతని చౌక (హిందువులిండ్లలోని భోజనశాల) లోనికి రానివ్వక భోజనము యింటిబైటవేతురు!

[రాబోవుమాసమునుండి వివాహము, దాని పుట్టుపూర్వోత్తరములు, వివిధజాతుల మధ్య వివాహాచారము లాదిగా చోద్యమైన విషయములతో వ్యాసములు వరుసగ ప్రకటింపబడును.]

# శిశునిర్వేదము

ఎన్నిపర్యాయములు యుద్భవించి మరణ
మందియున్నానొ, సిగ్గొకింతైనలేదు
శాశ్వతానందమయ సుఖాస్పదమటంచు
జననమందితి పాడువిశ్వంబునందు.
పూర్వభవఋణవాప్తికై బుట్టినట్టి
ఋణినటంచు నెఱింగియో దనదుదేహ
పాటవసువర్ణకాంతులు బాయుననియొ
నన్ను బోషింపదాయెగా కన్నతల్లి!
దోషగాఢాంధకార బంధురసమేత
గర్భకుహరంబు వెల్వడ, గలిజలంబు
జల్లుదాదిగఁ దాదియే తల్లి కన్న
తల్లియెవ్వరో యెఱుగ మదుల్లమందు.
మాతృప్రేమానురాగ సంభావితమతి
'అమ్మ'యని బిట్టుబిల్వగా నామె ఎవరొ
వచ్చి నానోటిలో "యిన్ని" పాలుబోయ
వెగటుబుట్టించెనవ్వి; నా ప్రేవులెల్ల
సుళ్లుదిరిగెడుత్తుద్బాధ సొరలియుండి.

గుంటుపల్లి వేంకటేశ్వరరావుగారు

ప్రేమదళుకొత్తనెందరో విసువుకొనక
జేయుచుందు రహరహంబు సేచనములు,
తనదు కరుణార్ద్రదృష్టిని దనిపి యించు
కైనఁజేఁదీయదేలనకా గన్నతల్లి.
ఎట్టిరక్తంబునం దుద్భవించినానో;
అన్యరుధిరజనితరుచి స్తన్యమెపుడు
నాయుదరమందు మెలమెల్ల నాట్యమాడు,
గాని జీర్ణింపకవిగడ్డ కట్టియుండు!
తూగుటుయ్యాలయందున దూదిపరుపు
పైబరుండి హాయిగ జోలపాటవినఁగ
మందహాసంబు మోముపై చిందులాడ;
నన్నుగనరాదదేలకో కన్నతల్లి.
మూర్ఖమూనిబెంగనుగొని బొగులుచుండ
నన్ననుసరించునేలకో కన్నతండ్రి;
తనదురక్తాశ్రుసిక్త హస్తములనెత్తఁ
వడిగనాకండ్లవెంట బాష్పములుగుఱియు.

—స్వరచితమైన "కన్నతల్లి" నుండి.

# భారత స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ

[గతమాసపు సంచికయందు శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు "భారతీస్త్రీ సంపూర్ణస్వేచ్ఛ నెప్పుడు బడయగలదు" అను సమస్యపై తమ యభిప్రాయమును వెల్లడించిరి. దానిని ప్రకటింపుచు మే మితర సోదరీమణు లీ సమస్యపై తమ యభిప్రాయముల వెల్లడింపదలంచుచో ఈమాసము సంచికయందు చోటిత్తుమని వ్రాసితిమి. దానిచే పెక్కుమంది సోదరీమణు లావిధముగా తమ యభిప్రాయములను క్లుప్తముగను దీర్ఘముగను వెల్లడించుచు వ్యాసముల వ్రాసిపంపిరి. ఆ వ్యాసములన్నియు నున్నవున్నట్లే ప్రకటింప చోటు జాలమి క్లుప్తపరచి ప్రకటించితిమి. మరికొన్ని మానివేసితిమి. దీనికి రచయితలు మన్నింతురుగాకయని కోరుచున్నాము. ఈ సమస్యపై యక్కరగొని త్వరగా తమ వ్యాసముల బంపినందులకా యారచయిత్రుల నభినందించుచున్నాము.

సం. గృ. ల.]

౧

మొదట సంపూర్ణస్వాతంత్ర్యమును గ్రహించుట కర్హమగు యోగ్యత యున్నదాయని ప్రతి భారతస్త్రీ స్వయం విమర్శకు బూనుకొనవలెను. పురుషద్వేషులును, స్వవిమర్శదూరులును, యుద్రేకపూరితులునునగు కొందరు యువతు లొక్కచోజేరి "భారతస్త్రీ సంపూర్ణస్వాతంత్ర్యమును బడయగోరుచున్నది. తన్మూలమున పురుషునిపైగల పరంపరానుగతపగ నామె సాధింప గోరుచున్నది. భారతమహిళామణులెల్లరును తదాశయపూర్తికై సర్వరీతుల తోడ్పడుట విహిత"మని యేమేమో చాటుటయే తడవుగ గృహమునువీడి సతిరూపమున పతికి జేయవలసిన శుశ్రూషను మఱచి, మాతరూపమున నిజబిడ్డలయెడ తనకుగల సమస్తబాధ్యతలను త్యజించి, గృహవేల్పులగు పెద్దల నంతకుపూర్వమే తిరస్కరించి 'దేశసేవ' యని 'మానవసేవ' యని సమాజములకు, సభారంగములకు ఉపన్యాసపీఠికలకు పరువులెత్తుచున్నారు. ఇంతకూ స్త్రీ స్వాతంత్ర్య సంపాదన దేశోద్ధరణార్థమే యని యెల్లరి దృఢవిశ్వాసము. ఆహా! కార్యోత్సాహము వారి నంధప్రాయులుగా జేసియుండనోపు. గాకున్న, నిజస్థానముల విడనాడి కర్తవ్యతావిమూఢమనస్కలై సదుద్దేశయుతలగు భారతస్త్రీలు దేశానర్థమున కొడిగట్టగలరా?

మాతృదేశ దాస్యవిముక్తికి తోడ్పడవలెనన్న, శృంఖలావిముక్త గావలెనన్న భారత స్త్రీ నిలువవలసిన తావెద్ది? ఉపన్యాసపీఠముపైనా లేక స్వగృహాంతర్భాగమున నిజశిశువు పర్యంకముచెంతనా? కన్నబిడ్డ నొరులశిక్షణమున కప్పజెప్పి యొరులశిక్షణాభారము తాను వహించునా? ఇది పాడియగునా? పూర్వపు భారతస్త్రీలు తమకు ప్రసాదింపబడిన సంతానమున కెట్టి యుత్తమోత్తమశిక్ష నొసగుచుండినది యెఱుగరా? అవును; ఎట్లెఱుంగగలరు! విదేశ విద్యావిమోహితులైన నేటి యువతీయువకులు ధర్మబద్ధములును ఆదర్శకప్రాయములునగు మనవారి యుజ్జ్వలచారిత్రములను పఠించుటయే దుస్సాధ్యమైనది. పఠించినను వాని విశ్వసించుట దుర్లభమైనది. ఇట్టితరి వాని ననుసరింపబూనుట గలుగునా?

# భారతస్త్రీకి సంపూర్ణస్వేచ్ఛ

నేటి విద్యాపద్ధతులలో సయితము శిశువునకు ప్రథమోపాధ్యాయిని మాతయనియు, ప్రథమపాఠశాల గృహమనియు యుద్బోధించుటలేదా? అయితే, ఆవిధులను పాలించున దెవ్వరు? నేటిమాత తనబిడ్డ లాలన పాలనలను సహింపజాలకున్నది. దేశపాలనాకార్యక్రమమున పాల్గొనజూచుచున్న యీ సుకుమారాంగి శిశుపాలనాభారమున కశక్తియగుచున్నది. పురుషునితో సమబలమును ప్రదర్శించుచున్న యీ సబల నిజశిశు స్తన్యపాననిరాకరణముచే తనదేహబలమును గాపాడ ప్రయత్నించుచున్నది.

పోనిమ్మ! మాతగా తన ధర్మముల నిర్వహింపలేకున్న నేమి! తత్పూర్వము సతీధర్మముల చక్కగా పాలించెనని తృప్తిజెందదలచినచో అక్కడ నదియు శూన్యము. విద్యావిహీనయై యుండుటయే భారతస్త్రీ దాస్యమునకు ప్రబలకారణమని మొఱపెట్టగా యిప్పుడిప్పుడు స్త్రీవిద్య యతిశయించినది. విద్యాపారీణులగు స్త్రీలసంఖ్య నానాటికి మించుచునేయున్నది. అయితే, తత్ఫలమువైపు దృష్టిసారించినయెడ గాన్పించు దృశ్యమేమి? విద్యచే యజ్ఞానమను యవనిక తొలగిపోగా భూతలము స్వర్గతలముగా మారుచున్నదా? సహజసౌందర్యము, విద్యాలంకారకారణమున ద్విగుణీకృతము కాగా, జన్మదాతలగు మాతాపితరుల మానసములను గాని ఆపిదప అగ్నిసాక్షిగా పెండ్లాడిన భర్త మనఃకమలమునుగాని రంజింపజేయుచున్నదా భారతీయ యువతీమణి! ఇందులకు వారి యంతరాత్మలే తగుసమాధాన మిచ్చుగాక.

విద్యాఫలమే స్వాతంత్ర్యమనియు, స్వాతంత్ర్యమన ధిక్కారమనియు నేటి నాగరికతాప్రపంచవిహారిణులగు స్త్రీల నిశ్చితాభిప్రాయము. విద్యావతియగు స్త్రీ దేశహితసంపాదన కొక యమూల్యయంత్రము కాగలదని యూహించిన మహామహుల యాశయములన్నియు వమ్మగుచున్నవి. వారి మనోవాంఛలను సిద్ధింపజేయుచున్న విదుషీమణులును లేకపోలేదు; అయితే వారి సంఖ్య యతిస్వల్పము. దేశహితార్థము సంపూర్ణస్వాతంత్ర్యమును సంపాదింప గోరుచుంటిమను భ్రమకులోనై సభారంగములకు పరుగులు పెట్టుచున్న వారు! నిజముగా వారి హృదయమున యా కాంక్షగలదేని సంపూర్ణస్వాతంత్ర్యమును బడయగోరుదురేని వారి గృహమే వారి కార్యస్థానము. వారి సంతతియే దేశసేవాదక్షులనుగా వారు సిద్ధపఱుచవలసిన పౌరజనము. వారి భర్తల హృదయమే వారి స్వాతంత్ర్యసింహాసనములు. వాని నధిష్ఠింపగలిగినయెడల వారు ధన్యలు. అప్పుడే రాజ్యము లేలగల్గిన సాటి రమణులవలె వారు వారి గృహరాజ్యములను సంపాదింపగలరు.

స్త్రీమూలమున ప్రతియొక్క కుటుంబమును యుత్తమసంస్కరణ మొందగడగినచో దేశ మత్యల్ప కాలమున పూర్వప్రఖ్యాతి జెందుననుటకు సందియమేమున్నది! అట్టి సంస్కరణాభారము వహించుట బాహ్యకార్యనిమగ్నుడగు పురుషున కసాధ్యమగు పనియైయుండ స్త్రీ సయితము తెల్లవారుటతోడనే ధనార్జనార్థము యే పాఠశాలకో, కచ్చేరికో, న్యాయశాలకో తయారైన ఇంటిపనుల చక్కబెట్టువారెవ్వరు! తమ నాశ్రయించి జీవించవలసిన మిగత మూడాశ్రమముల వారి మాటయేమి? ఇట్టి సతీపతులగృహములు నిశ్చలానందమున కునికిపట్టైయుండుటకు మారు నిరంతరవిచారచిహ్నములను వెదజల్లుచు బాహ్యాడంబరమునకు తప్ప తదితర విషయములందు శోభావిహీనములై బరగుచున్నవి.

శ్రీమతి డి. కమలావతిగారు, హైదరాబాదు.

౨

స్వాతంత్ర్యము! స్వాతంత్ర్యము! నారీస్వాతంత్ర్యము! నలుప్రక్కల నీమాటలే ప్రతిధ్వనించుచున్నవి. వైపరీత్యగతుల 2, 3 దినములు మాత్రమే చదివినబాలిక నోటకూడ నీమాటలే!

# గృహలక్ష్మి

స్త్రీలు! పురుషులు! భూమ్యాకాశముల కెంత భేదమో వారలకు నంతియే కాని, పూవువాసికిని, చంద్రచంద్రికలకును ఎంతయు భేదమో నొండొంటితో నెంతయావశ్యకమో అట్లే వీరలభేద్యులు. ఒండొరుల సహాయ మత్యావశ్యకము. స్త్రీ దేవీమయమూర్తి; ప్రేమ స్వరూపిణి; అగాధహృదయ; స్థిరమతి; అత్యున్నత మేధాశక్తి సంపన్న. పైకామె ఎంతమృదులయో ఎంత మధురాన్వితయో ఎంత శాంత సహనశీలయో, అంతరంగమున నామె యంతగంభీరమయి అంత దుర్నిరీక్ష్య. అగ్రాహ్యమగు స్త్రీ స్వభావము నర్థము చేసికొనుట చాల కష్టతమము. కుసుమ కోమలయగు స్త్రీకిని దృఢకఠినమూర్తియగు పురుషునకును శారీరకముగనేగాక మానసికముగనుగూడ నెంతో తారతమ్యముగలదు. సాధారణముగ నిప్పటి విద్యార్థినుల స్వాతంత్రేచ్ఛ, పురుషుల అధీనులుగాకుండుట, ఇచ్చవచ్చినట్లు నిస్సంకోచముగ తిరుగుట, (సాధ్యమైనంత వరకు పురుషుల ననుకరించి) వేషభాషల నేర్చుట, రమణీహృదయ రత్నమగు గాంభీర్యమును జీవితము యొక్క పవిత్రతను బారవైచి వెలికితనముతో జీవయాత్రగడపుట, పెద్దల మన్నించుటకుబదులు వారలయెడ ననాదరణచూపుట మొదలగు గుణరత్నములు. ఇది స్వాతంత్ర్యమా? లేక స్వార్థపరత్వమా? మనోవికాసము లేనివారలకు వినయ విధేయతలకు సహనశాంత రాహిత్యములును అలవడినవి. స్త్రీజన ప్రయోజనకారియగు విద్యనభ్యసించిన సరియగు బుద్ధివికాసము కలిగి ఈ దుర్దశ పట్టకుండెడిది.

ప్రకృతి సిద్ధమగు సంసారేచ్ఛ ప్రతినారీజీవిత హృదయాంతరాళమున తళుకుతళుకుమని మెరయుచుండును. స్వగృహమునకు సర్వాధికారిణియై తా నుండవలెననుకోరిక ఏరమణీమణికుండదు? నిజ విద్యాలాభముచే స్వగృహమును స్వర్గతుల్యముగ నొనర్చి భావిసంతతిని తమ యమూల్య శిక్షాదానముచే ఆదర్శ స్త్రీపురుషులుగ నొనర్చు మహత్తరకార్యమందు సర్వస్వాతంత్ర్యముగల స్త్రీ స్వాతంత్ర్యవిహీనయని ఎట్లు పేర్కొనబడగలదు?

ఈ యాధునిక స్వాతంత్ర్యకామినులగు స్త్రీలలో వేరొక తెగవారున్నారు. వీరల్పసంఖ్యాకులు, సంసారిక జీవనమున కిచ్చగింపనివారు, మానవజాతికై యాత్మసమర్పణము గావించు రమణీరత్నములు. లోకకల్యాణమునకై దేశసేవయందు న్యాయస్థానమందు రాజకీయ కార్యములందును, సర్వత్ర పురుషస్థానముల నిల్పి ఇన్నినాళ్లనుండి యణగద్రొక్కబడియున్న స్త్రీ మేధాశక్తిని, కన్నులు మిరుమిట్లు గొలుపునటుల దేదీప్యమానముగ చేసి జయశ్రీల నందుకొను స్త్రీరత్నములు కొందరు గలరు. సాధారణ స్త్రీలకు నిజమగు బుద్ధివికాసము కలుగచేయువిధానము—విద్యాశిక్షణమిచ్చుట మిక్కిలి యావశ్యకము. అప్పుడే వారలు శిక్షితలగుదురు. ఈ యాధునిక విద్యావిధానము వట్టి ఆడంబరరూపమే గాన, దీనిని పూర్తిగా మార్పుచేయవలెను. నేటి విద్యాఫలితముగా మన భారతనారి యా పురాతన యున్నతస్థానమునుండి జారి నేడధఃపతనమైనది. ఈమార్పు చేసిననేకాని నేటి హైందవనారి నాటి రమణీరత్నమై రాజిల్లనేరదు. అఖిలభారత మహిళాసభవారును, అంతర్జాతీయ నారీ సమితివారును, ఈ ప్రస్తుత విద్యావిధానము స్త్రీజనోపకారి కాదనియే తీర్మానించిరి. త్వరలో మార్పులు గావించి నిర్బంధ విద్య నియమించిననేగాని మనభారతమహిళ యున్నతస్థితికి రానేరదు.

శ్రీమతి మంజులదేవిగారు షిలాంగ్—ఆసాము.

3

భారతనారీమణి ఎప్పుడు తన ధర్మమును నెరవేర్చునో, అప్పుడే సంపూర్ణస్వేచ్ఛ బడయగలదు.

## భారతస్త్రీకి సంపూర్ణస్వేచ్ఛ

భారతస్త్రీలు ఆంగ్లేయభాష నేర్వవచ్చును. అందలి మంచి విషయములను గ్రహింపవచ్చును. యోగ్యత యున్న ఉద్యోగములు చేయవచ్చును. కాని పూర్వము భారతమహిళలకుండెడు ఆర్యధర్మములు మాత్రము మరువకూడదు. భారతదేశమునందు పుట్టిన ప్రతిస్త్రీయును తమతమ మతములయందు ఏయేధర్మములు చెప్పబడెనో ఆయాధర్మముల ప్రకారము నడుచుకొనుట మంచిది. ఎవరైన తప్పుచేసినయెడల అమ్మా నీకు యిది ధర్మముకాదని చెప్పవలెను. ధర్మమాచరింపని స్త్రీలు ఏవిద్య చదివినను నిష్ఫలమే. పూర్వము స్త్రీవిద్యావిజయ దుందుభి డాక్టరు ఆనందబాయిజోశియను బ్రాహ్మణస్త్రీ భర్తయనుజ్ఞవడసి అమెరికాలో విద్య నభ్యసింపుచు తన స్నేహితురాండ్రకును యితర పాశ్చాత్యస్త్రీలకును ఆర్యధర్మములు బోధించుచు మహారాష్ట్రస్త్రీలవలె జడలువేసి చీరెలు కట్టింపుచుండెను.

తాను న్యూజరసీపట్టణమున కేగుటకుముందు తన స్నేహితురాండ్ర కందఱకును మహారాష్ట్రపద్ధతి ననుసరించి విందుచేసెను. భర్త గోపాలరావు తనభార్య నడవడి కనుగొనదలచి యామెకు దెలుపకయే యకస్మాత్తుగా నచటికిబోయెను. భారతభూమికి కీర్తిదెచ్చిన యామె సత్ప్రవర్తనఁగనిన పిదప గోపాలరావు తానామెను గూర్చి శంకించినందుకు పశ్చాత్తాపపడెను. ఇట్టి రత్నము లనేకములుగలవు. కాని యీ రత్నములను సానబెట్టి ప్రకాశింపజేయుటకు గోపాలరావువంటి వారు లేనందున నారత్నములును రాళ్లవలె గనుపించుచున్నవి. ఆంగ్లభాషాకోవిదులైన కొందరు విదుషీమణులు, ఆంధ్రమును మరచి అనాచారములకులోనై ఋషివాక్యములను మంటగలపి కులధర్మములకు స్వస్తిచెప్పి అటు సంఘసంస్కర్తలకును ఇటు సనాతనులకును దూరులై త్రిశంకస్వర్గమువలె నూగులాడుచున్నారు. వీరి ఉపన్యాసములు ఏసంఘమును తృప్తిపరచవు. భారతస్త్రీలకు ముఖ్యధర్మము కేవలమన్నిటియందును పాశ్చాత్యుల ననుకరించుటగాదు.

ఆంగ్లభాషావ్యామోహమునకు లోబడి కులధర్మమును కూలద్రోసి, మానప్రాణములను ధారవోసిన స్త్రీలెందరోగలరు. భారతస్త్రీలకు స్వేచ్ఛకావలయునన్న ధర్మమును బట్టియు వారియోగ్యతనుబట్టియు వచ్చును.

శ్రీమతి అయ్యాదేవర బాలా త్రిపురసుందరమ్మగారు, నందిగామ.

### ౪

స్వాతంత్ర్య మనునది ఒక వస్తువుకాదు. దానిఆకారము మనకు తెలియదు. కాన ఒకరు 'ఇందతీసుకో' అని అనరు. అది మనము తెచ్చుకొనవలెను. మనకు మనలను పరిపాలించుకొనగలిగెడి శక్తి ఎప్పుడు కలుగునో అప్పుడే స్వాతంత్ర్యము బడయుదుము. ఇప్పుడు హైందవస్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యము లేదన్నమాట నిజమే. ప్రస్తుతము విద్యావతులమని స్కూల్ ఫైనలు, అయిదవఫారము మొదలగు క్లాసులు చదివి, అమితమగు ఆనందము పొందువారు నా ఉద్దేశప్రకారము విద్యావతులు కారు. స్కూల్ ఫైనలు చదువు గుమాస్తాపనికి చాలు. హైందవస్త్రీకి తగినవిద్య లేకుండుటయే స్వాతంత్ర్యము లేనందుకు ప్రబల కారణముగ నమ్ముచున్నాను.

పరభాష నేర్చుకొనుట పాతకముగాదు. తెలుగులోను ఉద్గ్రంథములు కలవు. ఇతర భాషలలోను కలవు. షేక్స్పియరును సరిగా చదివి అర్థముచేసుకొన్న మనకు ఈ ప్రపంచమున సంతోషముగ జీవయాత్ర గడపుటకు వలసినంత తెలివివచ్చును. కాన భాషనుగూర్చి ఆలోచింప నక్కరలేదు.

స్వాతంత్ర్యము కావలెనని చెప్పు స్త్రీలలో చాలమంది సీత ద్రౌపది మొదలగువారి పేరుల జూపెదరు. భారతరామాయణములు చదివినయెడల సీతాద్రౌపదులకు పూర్ణస్వాతంత్ర్యము కలదని తెలియ కలదు. కాని మన మాలోచించుకొనవలసిన దొక్కవిషయమే. సీతా ద్రౌపతులంత తెలివిగలవారమా?

# తప్పు ఒకరిది శిక్ష ఒకరికి

శ్రీమతి వల్లూరి శారదగారు

౧

మధుసూధనరావుగారికి శ్యామల పెద్ద కూతురు. శ్యామల చాల తెలివైనబాలిక. గుణవంతురాలు. పాఠశాలలో విద్యార్థినులతో ఎంతోస్నేహంగా వుంటుంది. కపటమూ ఈర్ష్య యెరుగదు. అమాయకపు బాలికయని తల్లీ, తండ్రీగూడ తక్కిన పిల్లలకంటే ఎంతో ప్రేమతో చూస్తూవుండే వారు. శ్యామల అంత చాయగలది కాక పోయినను చక్కనికళ్లు, కోలముఖంకలిగి, ఒంకుల ఒంకులజుట్టు, నాజూకుగా వుంటుంది. శ్యామలకు విద్యయన్న ఎంతో ప్రేమ. అందుచేత ఆమెను తండ్రి హైస్కూల్లో చేర్పించాడు.

ఆహైస్కూలుపిల్లలు ఎంతో అల్లరిచేసినా ఎంత దుర్మార్గాలు చేసినా, శ్యామల ఊరకుండేది. మేష్టరు అడిగినప్రశ్నకు సరీగా ఆన్సర్ చెప్పినదని పైగా పిల్లలంతా మనస్సులో కుళ్లుకుంటూ ఎగతాళి చేసేవారు. కాని తనచదువేమో తానేమో చూచుకొని శ్యామల ఏమియు మాట్లాడక తన దోవన తాను వచ్చేది. ఇందువల్ల మొదట, హేళనచేసినప్పటికీ తరువాత విద్యార్థినిలూ, ఉపాధ్యాయులూ గూడా ఆమె అంటే గౌరవముగా చూచేవారు.

శ్యామలకు మిత్రులులేరనే చెప్పవచ్చు. చాలా మితభాషి అయినందుచేత ఎవరూ అట్టే ఆమెతో స్నేహం కలిగించుకునేవారు కారు. కాని యేలాగో మేరీ అనే ఆమెతరగతి విద్యార్థికి ఆమెకు ఒకవిధమైన స్నేహం అలవడ్డది. ఒకరినొకరెంతో ప్రేమించుకొనేవారు, వారిద్దరికీ ప్రేమవున్నా గుణాలొకటిగాదు. శ్యామలకు చదువులో ఎంత శ్రద్ధో మేరీకంత అశ్రద్ధ. శ్యామలమాత్రం స్నేహితురాలికి పాఠాల్లో చాలా సహాయం చేసేది.

౨

రాత్రి 11 గంటలు అయింది. శ్యామల తల్లి, పిల్లలు, అంతా నిద్రపోతున్నారు. తండ్రిమాత్రం మేల్కొని యేదో వ్రాస్తున్నారు. శ్యామల పరీక్షలు దగ్గరకు వస్తున్నవని మూడురోజులబట్టీ పగలు అన్నం రాత్రి నిద్రలేకుండా చదువుతూ ఉన్నది. లైటుముందరకూర్చొని తెల్లవారితే పరీక్షలని తెల్లవార్లు చదవాలసిందే నను కుంటూ చదువులో నిమగ్నంఅయింది. ఇంతలోకే తలుపు కొట్టినశబ్దం ఉన్నట్టుండి వినిపించింది. శ్యామలకేమీ తోచిందిగాదు. భయసంభ్రమాలు పెనగొన్నాయి. లేచి తలుపు తిన్నంగా తియ్యంగానే మేరీ పరిగెత్తుకొని లోపలకొచ్చింది. ఆశ్చర్యంతో నోట మాటరాకుండా నిలుచుంది శ్యామల. మేరీ చిరునవ్వుతో శ్యామలవైపుచూస్తూ పయిటచాటున ఏమిటో దాచిపెట్టుకొని యిలా అన్నది.

"శ్యామలా! శ్యామలా! నీకు ఒకమంచి ప్రైజు తెచ్చాను."

"ఏమిటింత రాత్రివేళ ఆదుర్దాగా పరుగెత్తుకొంటూవచ్చి ప్రైజంటున్నావు. ఏమిటో సమాచారంచెప్పు త్వరగా" అంది శ్యామల ఆత్రంతో.

"ఆశ్చర్యం దేనికి. ప్రైజంటూవుంటే. నాకేమిస్తావు నీకిది తెచ్చినందుకు" అంటూ శ్యామలముఖానికేసి చూసింది మేరీ.

"అదేమిటో చూపించు. తరువాత ఇయ్యాలిసింది యిస్తాను" అని విసుగుకుంటూ ప్రశ్నించింది శ్యామల. ఇదిగో అంటూ పయిట చాటునవున్న కాగితం బయిటికితీసి "శ్యామలా, మన మింతకష్టపడి తెల్లవార్లు నిద్దరలేకుండా చదవటం అనవసరం. ప్రశ్న పేపరు తెలిసింది. ఈప్రశ్నలను గనుక పుస్తకంచూచి జవాబులు వ్రాసుకున్నామా అంటే మనం చులాకుగా ప్యాసుగావచ్చు. నీమీద ప్రేమచేత తెచ్చాను." అనిచెప్పి చేతికివ్వచ్చింది ప్రశ్న పేపరు. అదిచూచి శ్యామలకు ఏదో భయముగల అసహ్యమైన వస్తువును చూచినట్టు వళ్లుజలదరించింది.

ప్రశ్న పేపర్లు—వానినినమ్ముకొని విద్యార్థులు పడేబాధలు చాలావిని కాపీ చేయడానికిగ్గాని దాన్నేనమ్ముకొని పాఠాలు చదువకుండా వుండేందులకుగాని శ్యామల మొదటినుండీ చాలా భయపడేది. అందు చేత, మేరీతో.

"ఆపాడుకాగితం నాచేతి కివ్వనక్కఱ లేదు! అయినా ఆపేపరుచూచి వ్రాస్తే ఏమి లాభం. మనమంతట మనం చదివివ్రాస్తే లాభంగానీ, ఆపాడుపేపరు చూచివ్రాస్తే అన్యాయము కనుక నేను చూడను." అని గంభీరంగా చెప్పి తాను చదువుకొనడాని కారంభంచేసింది. మేరీకి ఇదంతా వింటూ చూస్తూవుంటే చాలా కోపం వచ్చింది. "నేను ఎంతోప్రేమతో దీనికోసం ఎంతోప్రయత్నించి నీకోసమనితెచ్చి నీకిస్తే నీవేమో ధర్మపన్నాలు చెపుతున్నావే. నేనొక్కదాన్నే ప్యాసవుతే కష్టంగావుంటుందని నీకుగూడ చూపిద్దామని తెచ్చాను. ఇది తీసుకో. నామాటవిను." అని బలవంతాన శ్యామలచేతిలో పెట్టింది. శ్యామల "ఇది నేను చూడ"నంటూ ఆవేశంతో చింపేసింది. మేరీకి పట్టరానంత కోపంవచ్చింది. "నీకోసమని ఇంతప్రేమతో తెస్తే నీవు నాయెదుటనే చింపినందుకు తగినశిక్ష అనుభవించి, చివరకు పశ్చాత్తాపపడతావులే." అనిచెప్పి చరచరా వెళ్లిపోయింది శాంతంగా చదువుకొంటూవున్న శ్యామలహృదయంలో చంచలనం పుట్టించి.

## 3

తెల్లవారింది, శ్యామల మరిరెండుమార్లు పుస్తకాలన్నీ తిరుగేసి అవసరంగా భోంచేసి పరీక్షకువెళ్లింది. గుండెదడతో మొదటిప్రశ్నాపత్రం జదివింది. అన్నీ తనకు తెలిసినే అవటంవల్ల చక్కగా ఆన్సర్ జేసింది. ఆసంతోషంతో మిగతా అన్నీ పేపర్లుగూడా ప్రతిదినం బాగావ్రాసింది. పరీక్షవుతానని గట్టి

నమ్మకం గలిగింది. శ్యామల తల్లిదండ్రులు గూడా చాలాసంతోషించారు. తప్పకుండా పరీక్షప్యాసవుతుంది గదా అనేనమ్మకంతో ఎఫ్. ఏ. కు చెన్నపట్నం పంపడానికి ఆలోచిస్తున్నాడు తండ్రిగారు. వేసవి సెలవుల్లో కులాసా వుండడానికని పినతల్లిగారి వూరికి ప్రయాణంపెడుతూంది శ్యామల. కాని నిద్రాహారాలు లేకుండా పరీక్షలకు చదివినందు చేత శ్యామలకు బడలికచేసి జ్వరం తగిలింది.

సుమారు ఒక వారంరోజులుఅయింది. ఒకనాడు వుదయం 8గంటలప్పుడు శ్యామల గదిలో పడుకొని చదువుకొనుచున్నది. ఇంతలోనే ఆమె తండ్రి మధుసూధనరావుగారు వాకిట్లోనుంచి శ్యామలా, శ్యామలా, అని కేక బెట్టుకుంటూ పేపరు చేతిలో పట్టుకొని గదిలోకివచ్చి "మీ పరీక్షపేపర్లు ఔటు అయినాయట. ఇంక 15రోజులకు మళ్లీ పరీక్షపెట్టారట. ఈ పేపరులోవేశారు." అని చెప్పేరు. ఆమాటవినేటప్పటికి అదివరకల్ల ప్యాసవుతానని మిక్కిలి ఉల్లాసంతోఉన్న శ్యామల ఒక్కసారితో కుప్పున కూలిపోయింది.

"చచ్చి చెడి సంవత్సరం చదివి పరీక్షకు వెళ్లి వ్రాసివచ్చిందొకరు. సంవత్సరంపొడవునా పుస్తకం ఎత్తకుండా యెట్లో ప్రశ్నాపత్రాలు సేకరించుకొని పరీక్షకువెళ్లింది యింకొకరు. కాని వారివల్లనే అందరికి కష్టం నష్టం జరుగబోతూఉంది. అలాచెపితే నమ్మేవాళ్లెవరు. ఇతరవాళ్లను మన్నించేవారెవరు. ఇంతకు ఈ మాయదారిప్రపంచంలో ఎవరో దుర్మార్గులుచేసినదానికి ఇంకొకరు అనుభవించవలసివచ్చేది తప్పదు." అని అనుకొన్నది. "మళ్ళీ పరీక్షలో నేను ప్యాసుగానండీనాన్నగారు."అని తండ్రిగారితోఅన్నది. నీరసంగా వున్నది. చదవలేదు. అయినా చదువకతప్పదు. మళ్లీ చదవటం ప్రారంభించింది. పరీక్ష రోజులు దగ్గరకువచ్చినై. శ్యామలకు వళ్లు ఇంకా బాగా నెమ్మదికాలేదు. పరీక్షరోజు వచ్చినది. శ్యామలకు మొదటవున్న వుత్సాహము లేదు. శక్తిలేదు. పైగా భయం. పరీక్షకువెళ్లింది. పరీక్షపేపర్లు వ్రాసింది.

ముందటి వుత్సాహంతో చదువలేదు. వ్రాయలేదు. పైగా ప్రశాంతహృదయంలో భయంజొరబడి మరీ కష్టం గలిగించింది. పరీక్షపేపరు బైటబడ్డాయని కోపంతో తిరిగి యిచ్చినపేపర్లు చాల కష్టంగా యిచ్చారు. అందుచేత శ్యామలకు ప్యాసవుతానని నమ్మకం ఎంతమాత్రమూలేదు. ఇంతకూ ఆమె యితరులుజేసిన తప్పుకు బలిగావలిసిందే గదూ?

# మనోరమ

## సింహావలోకనము

మ. భవదీయప్రజ చుట్టియుండఁ నడుమన్ భాసిల్లు నీరూప మా
హవ మధ్యానఁదళుక్కుమంచుదన కుద్యద్ధైర్యముంజూప సం
స్తవనీయంబుగఁ దక్షణంబ యసిచేతంబూని కల్పాంతభై
రవభీమంబుగ శత్రులందునుము సంరంభంబయూహించెదన్.

డి. కళావతీదేవి.

ఆధునిక భావప్రతిబింబితముగ స్త్రీల కావశ్యకమై, చర్చనీయమైన మహోదంతములఁగూర్చియు, వృద్ధిమార్గములఁ గూర్చియు, నున్నతాశయములఁగూర్చియు బ్రసంగించు నుద్దేశముతో మే మయిదుగుర మొక సంఘముగ నేర్పడితిమని పాఠకులకుఁ దెలిసియే యున్నది. అట్టి యుద్దేశముతో మాలో గవయిత్రియగు కళావతి చేసిన యాలోచనమునుబట్టి ఆంగ్లమున టెన్నిసన్ అను నుత్తమ కవీంద్రునిచే రచింపఁబడియున్న 'రాజకుమారి'యను కథను ఆంధ్రభాషయందుఁ బేరెన్నికఁగన్న పూర్వకవు లవలంబించిన విశ్రుతమార్గమునుబట్టి యథోచితముగ మార్చి మా మా యభిరుచులనుబట్టి చెప్పుచుంటిమని పాఠకలోకమునకు సంపూర్ణముగ నవబోధమైనదనియే భావించుచున్నాను.

కేవల మొకవ్యక్తిచేఁగాక మాయందఱి వలనను మేమవలంబించిన విధానమునుబట్టి ఒక 'సమిష్టితత్వము'న తలకొకభాగముగ మాయైదుగురిచేతను చెప్పఁబడుచున్న ఈ 'రాజకుమారి'యం దిప్పుడు పూర్వభాగముగ భావింపఁదగిన మొదటి నాలుగాశ్వాసములును ముగిసినవనియు నిఁక కథయందలి యుత్తరార్ధమును 'మనోరమ'యను పేరుగల నేను ప్రారంభింపవలసి యున్నదనియు పాఠకులకుఁ దెలుపుకొనుచున్నాను.

మూలగ్రంథ మాంగ్లమునఁ బద్యకావ్యముగ మూడువేల మూఁడువందల పంక్తులలో విరచింపఁబడినది. అందింకను పదునాలుగువందల పంక్తులను నేనును ప్రియంవదయు గళావతియుఁ జెప్పవలసి యున్నదని చదువరులకు విన్నవించుకొనుచున్నాను.

కథలఁ జెప్పుటయం దాంధ్రమున నూతనముగ మాచేఁ బ్రవేశపెట్టబడిన ఈరచనావిధానమున మే మాంధ్రమహిళాలోకమున కేమైన యూడిగయొనర్పఁ గలిగితిమో లేదో కాలమే నిర్ణయింపఁగలదు. ఉదాత్తరసాన్వితమైన మహాకావ్యములు యోగ్యతనుగూర్చి

మనము తర్కించుకొనునప్పుడు వానిని సమగ్రముగ మననమొనర్చి చెప్పవలయును గాని కణుపుకణుపునకును విఱుగఁగొట్టబడి నెలకొకమాఱు పత్రికలలోని కెక్కింపఁబడుచున్న ఆయా భాగములమాత్రముచూచి తత్వనిర్ణయ మొనర్పఁదగదు.

కాని ఇప్పుడీ కథయందలి పూర్వభాగము సమాప్తమగుటయుఁ బరిశిష్టమగు నుత్తరకథయందుఁ గ్రొత్తఘోరణు లుదయించుటయు మూలగ్రంథమున కవియే స్పష్టముగఁ జెప్పుకొనియుండుటచేత మేమీ కథాప్రవాహమును సాగించుటకు ముందింతవఱకెట్లు కొట్టుకొని రాగలిగితిమో కొంతయైన పాఠకలోకమునకుఁ దెలియఁజేయ వలసియున్నదని భావించుచు నేనావిషయమును గూర్చి ముచ్చటింపఁదగునని మాసమాజమునఁ బ్రథానోపన్యాసకురాలగు ప్రియంవదను గోరుకొంటిని.

ఆమె యిట్లు పలికెను.

ఉపజ్ఞామహితులగు మహాకవు లన్నిభాషలయందును స్త్రీ విషయికమగు రచనలచేతనే శాశ్వతమగు కీర్తికాస్పదులగుచు వచ్చిరి. అట్టి కవులందఱును తమకావ్యములలోని ఘనతకు సారమంతయు కాంతావిషయికమగు ఘట్టములయందున్నదని సంపూర్ణముగ గుర్తించుచునే గ్రంథరచనమొనర్చుట జరుగుచున్నది. ప్రపంచమున నన్నిజాతులయందును, అన్నిభాషలయందును ప్రతిభావంతులగు నుత్తమకవులు స్త్రీల యుత్తమ చరిత్రముల నజస్రసహస్రముఖముల ఘోషించుచుఁ దమ జీవితములఁ దుదముట్టించుకొనుచున్నారు. ఎవ్వరెంత గఱువతనమున, నెంత యత్యద్భుతముగ రచింప నేర్పరులయినను ఆంగ్లమున టెన్నిసన్ కృతమగు 'రాజకుమారి' యందువలె స్త్రీ విషయికమగు మహాశయములఁ జిత్రించి చూపినవారు లేరు. 'నభూతో నభవిష్యతి' యని చెప్పఁదగిన యుత్తమప్రజ్ఞ నాతఁడీ గ్రంథమునఁ జూపియుండెనని విజ్ఞులంగీకరింపవలసి యున్నది.

Our echoes roll from soul to soul,
And grow for ever and for ever.

మన హృదయాంతరాళముల మనకుదయించుభావములు ప్రతిధ్వానతత్వమున నొకయాత్మనుండి వేఱొక యాత్మకుఁ దొరలిపోవుచు నిరంతరమును జగద్వ్యాప్తముగఁ బరిభ్రమించుచుండునని ఆమహాకవియే చెప్పియున్నాఁడు.

మ. మనయాత్మధ్వను లొండొకంటి పరిరం
భంబొందు మార్మ్రోయుచున్
నినదభ్రహ్మము రోదసిన్ బ్రబలుచున్
నిండారు చందాన బూ
చిన భావంబుల సౌరభంబుత్రిజగ
త్క్షేమంకరంబౌచు భా
విని భూతంబున వర్తమానమునఁ బృ
థ్విన్ బెంచు నామోదమున్.

అని మిగుల కుంటుకొనిపోవుచున్న భాషయం దసంతృప్తికరముగ మన మా మహాకవి భావము నాంధ్రీకరించుకొంటిమి.

1847 వ సంవత్సరమున టెన్నిసన్ తన గ్రంథ మాంగ్లభాషయందుఁ బ్రకటించెను. అనఁగ నీతఁడా గ్రంథమునురచించిన ఎనుబది ఎనిమిదేండ్లకు మనమా గ్రంథ మాంధ్ర భాషకుఁ బరివర్తింప నూహించితిమన్న మాట. తొంబదియేండ్లక్రితమాంగ్లభూమియం దుదయించిన స్త్రీ విషయికమగు రమణీయరవ మిప్పు డాంధ్రదేశమునఁ బ్రతిధ్వనించుచున్నది. అట్టి యుద్యమమున మన మైదుగురమొక సాంఘికతత్వమున—అది నిమిత్తమాత్రమనుఁడు, కారణ జన్మమనుడు—ఏమైనను కలసి రచించుటయుఁ బరస్పర సహాయమును గ్రంథార్థముల విస్పష్టమొనర్చుకొనుటయు, నిట్లు సభాముఖమున జర్చించుకొనుటయు నాకు ముదావహముగా నున్నది.

ఆధునికయుగమున నాంగ్లసారస్వతము నందుదాత్తరసాన్వితమైన కావ్యనాటకములొనర్చిన మహాకవులలో టెన్నిసన్ మిగుల నగ్రస్థానమునఁ బ్రకాశించునట్టివాఁడు. అతఁ డాంగ్లదేశమున 1809 వ సంవత్సరమున నుదయించి 1892 వ సంవత్సరమునం గీర్తిశేషుఁడయ్యెను. అతఁడు తన నలుబదిరెండవయేట విక్టోరియా మహారాణివలన నాంగ్లకవితాసామ్రాజ్యమునఁ బట్టాభిషిక్తుఁడయిఁ (అనగ పొయెట్ లారియేట్ గా నియమింపఁబడి) నలుబది రెండేండ్లవఱకా యున్నతపదవియందు సారస్వతప్రియుల కానందవర్ధనముగనుండి నట్టివాఁడు.

వర్తమానయుగమున నాంగ్లభాషవలె భూగోళమంతటను ప్రచారమందున్న భాష మఱియొకటిలేదు. అట్టి యాంగ్లభాషయందు వర్తమానకవుల కావ్యములలో టెన్నిసన్ కృతగ్రంథములకున్న ప్రచారము తదితర కవికృత గ్రంథములకు లేదని విమర్శకు లేకగ్రీవముగా నంగీకరించుచున్నారు. అనఁగ నాధునికుల కావ్యములలో టెన్నిసన్ రచనలకున్న వశీకరణశక్తి మఱియే కవులగ్రంథములకును లేదని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. *

ఇఁక నామహాకవి రచనలయందు మన మాంధ్రమునకుఁ బరివర్తన మొనర్చుచున్న 'రాజకుమారి'యొక్క యోగ్యతనుగూర్చి, ఇంచుక యోచింతము. స్త్రీల హక్కులను గూర్చి, సతీత్వధర్మములనుగూర్చి, విద్యావివాహ స్వేచ్ఛాజీవనాధికారములఁగూర్చి ముఖ్యముగ సృష్ట్యాదినుండి స్త్రీల కనుష్ఠేయమగుచున్న పత్నీత్వ జీవితమునందు మంచిచెడ్డలను గూర్చి చర్చించుటకాతఁ డీగ్రంథమును దయారుచేసెను. ఆంగ్ల సంఘమున స్త్రీల కున్నత పరివర్తనావకాశము లేర్పడుట కీ గ్రంథము చాలవఱకు సహాయకారి యయ్యెనని మనము చెప్ప

* "Of all Modern English poets Tennyson has most readers".— Professors, Rowe and Webb, Presidency College, Calcutta.

కొనవచ్చును. స్త్రీ పురుషు లుండువఱకు నీగ్రంథమునఁ జర్చింపఁబడిన విషయములు హృదయంగమములును సంతతపరితోష శీలములును, కౌతుకవర్ధనములునయి యుండి పోవును.*

నేఁడొక్క భారతవర్షమునందే కాక సర్వఖండములందును స్త్రీల కున్నతపరివర్తనావకాశము లేర్పడియున్నవి. స్త్రీ సంఘాభ్యుదయాభిలాషులను మనుజోత్తములు నాగరికప్రపంచమునం దంతటను స్త్రీల యున్నతికై తమజీవితముల ధారపోయుట వలననే నేఁడు స్త్రీసంఘమున నింత సంచలనము—ఇంతశక్తి—ఇంతజీవము — ఇంత సంక్షోభము — ఇంత ధాటి సర్వదేశముల సర్వతోముఖముగ వ్యాపించి యున్నవి.

సంతత పరివర్తనశీలములై స్త్రీ సంఘమును కలంచుచున్న ప్రస్తుతోద్యమములఁ గూర్చి ఈ మహాకావ్యమునఁ జర్చింపఁబడిన విధముగ నేకవియుఁ జేసియుండలేదని నే నూహించుచున్నాను.

గ్రంథమును తొలుత 1847 వ సంవత్సరమునఁ బ్రకటించినతరువాత 1848, 1850, 1851, 1853 వ సంవత్సరములందాకవి యీ గ్రంథ మక్కడక్కడ సవరించుకొనుచు గ్రొత్తగ్రొత్తవన్నియుఁ దొడుగుచు ప్రచురించుకొనెను. అనఁగ మొదట నీగ్రంథ మైదుకూర్పులవఱకు సవరింపఁబడుచు వచ్చినదన్నమాట. అందువలన నిప్పుడు లభ్యమానమగుచున్న ప్రిన్సెస్నుబట్టి కవి 'ప్రౌఢనిర్భర వయఃపరిపాకము'ను బొంది యున్నకాలమునందే నిరంతరాయమగు తన ప్రజ్ఞాధిక్య మిందు గాన్పింపఁజేసెననియు, తన కవితాశిల్పమున కిందు మిక్కుటముగా మెఱుఁగులు పెట్టుకొనుచు వచ్చెననియు, చిరకాలమా గ్రంథవిషయములఁ దర్కించుకొనుచు చదువరులకు హృదయంగమమగు రూపమున వెల్లడింపఁ బరిశ్రమించెననియు విమర్శకు లూహించుచున్నారు. *

ఇట్టిమహాత్వమునఁ బ్రకాశించు నీగ్రంథమును కవి 'మెడ్లే'—అనఁగ కలగూరగంపయగు నొకరీతి మిశ్రకథయని కంఠోక్తిగఁ జెప్పుకొనుచున్నాఁడు. గ్రంథస్థవిషయములను, కావ్యనిర్మాణ తత్వమును మనము చక్కగ నవబోధమొనర్చు కొన్న

* The Princess deals with a question of lasting interest to society, and one which has of late years risen into more conspicuous importance, the changing position and proper sphere of woman.

—Professors Rowe and Webb,
Presidency College, Calcutta.

* The Princess, therefore, as we now possess it, is the outcome of careful and sustained effort on the poet's part, the offspring of his mature powers, polished and refined through several editions, and may thus be fairly regarded as a work upon which its author has bestowed the utmost of his critical afterthought as well as creative power.

—Professor P. M. Wallace.

యెడల నీగ్రంథము తప్పక 'మిశ్రకథ'యే యని మన మంగీకరింతుము.

1847 వ సంవత్సరమున నీగ్రంథము ప్రచురించునప్పటికి ఆంగ్లస్త్రీ సంఘమున నేటివలె నుత్తమపరివర్తనావకాశము లేర్పడి యుండలేదు. అయినను అట్టి యవకాశములకై స్త్రీలు ప్రచండమగు నాందోళన మొనర్ప నారంభించిరి. సంఘమున నార్థికముగ రాజకీయముగ వారు మిగుల వెనుకఁబడియుండిరి. అట్టి స్వతంత్రత కవకాశములు లేకపోవుటయే కాదు, ఇరువది ముప్పది యేండ్లక్రితముండిన భారతీయస్త్రీలవలెనే సామాన్య విద్యాపరిగ్రహణమునకుఁగూడ బాహ్యలయి కేవల గృహోపకరణ యోగ్యమగు వస్తువులవలె భావింపఁబడుచువచ్చిరి. ఇంగ్లాండుదేశమునందే ప్రజలభావము లిట్లుండునపుడు తదితరదేశముల స్త్రీల కెట్టిపరిస్థితులుండినవో చెప్ప నక్కఱయే లేదు. ఇప్పుడు పురుషులతో సరిసమానముగ సర్వతంత్రస్వతంత్రము లేర్పడియున్న రష్యాదేశమునందు మొన్నమొన్నటివఱకు స్త్రీయనఁగ **a living broom or shovel**— ప్రాణములతోడి చీపురుగట్టయనియు, చెత్తలనెత్తు పాఱయనియుఁ జెప్పఁబడుచు వచ్చినది.

ఇట్లనుటవలన స్త్రీలు తమకు పురుషులతో సరిసమానమైన హక్కులు రావలెని కోరకుండ నుండిపోయిరని భావింపవలదు. సర్వకార్యకలాపములయందును, సమస్త వ్యవహారనిర్వహణమునందును పురుషులెట్టివారనుచున్నారో స్త్రీలుకూడ నట్టివారు కాఁగల యవకాశపరంపర లుండవలెననియు, సాంఘికముగ, రాజకీయముగ, నార్థికముగ సకలజీవిత వ్యాపారములయందును పురుషులకువలెనే స్త్రీలకును హక్కు లుండవలెననియు టెన్నిసన్ 'రాజకుమారి'ని రచించిన కాలమునందే స్త్రీలోకమున మహానాయికలుదయించి ఆంగ్లదేశమునఁ దీవ్రమగు నాందోళనములఁజేయ నారంభించిరి. అనఁగ శతశతాబ్దములనుండి యంధకారమునఁ బడియున్న పాశ్చాత్య నారీసంఘమున కజ్ఞానతిమిర విధ్వంసమగుట కాకాలముషఃకాలమువలె నుండినదన్నమాట. అప్పుడా యపూర్వప్రకాశమునఁ దన్మయులై కొందఱు పాశ్చాత్య కాంతలిష్టమువచ్చినట్లు—తమ భావములకుఁ దట్టినట్లు—తమనోటికి దొరకినట్లు—ప్రపంచ మదరిపడునట్లు ఉన్మత్తప్రలాపముల సహిత మపలపించుచుఁ గర్ణకఠోరముగఁగూడ సాహసించిరి. సర్వతంత్రస్వతంత్రవాదినులగు నీ వీరాంగనలు ముష్కరత్వమున దుండగులగు పురుషులను సహిత మతిక్రమించి జగత్తంతయు ఆశ్చవడునట్లు స్త్రీలయధికారములకై మిగులఁబట్టుదలతో బోరాడ నారంభించిరి. అట్టి స్వతంత్రవాదినుల కాంగ్లభాషయందు 'సఫ్రజెట్స్' అని పేరు. అట్టిస్వతంత్రవాదినుల యాందోళనమునకు ఫలితముగ నిటీవలెనే యాంగ్లదేశమున స్త్రీలకు రాజకీయరంగమున నెన్నికలలో వోటుచేయు నధికారములు వచ్చినవి.

అట్టి స్వతంత్రవాదినుల యాందోళన మమెరికాఖండమునందు మిగుల విపరీతముగ విజృంభించి పోయెను. వారియందు 'అమేలియా జెంక్సు బ్లూమర్' అను నామె మిగుల విఖ్యాతిపొందిన మహానాయిక. సర్వజీవిత వ్యాపారములయందును స్త్రీలకు పురుషుల తోడి సమత్వముండవలెనన్న పురుషులెట్టి దుస్తులను ధరింతురో స్త్రీలుగూడ నట్టి దుస్తులనే ధరింపవలెననియు—వస్త్రధారణ మున స్త్రీల కట్టి యధికారమును నిరాటంకముగ నొసంగవలయుననియు—అట్లంగీకరింప నంతవఱకు స్త్రీలకు పురుషులతో సరి సమానమైన గౌరవము లభింపదనియు ఆ నాయకురాలి వాదము. అట్టి మహాందోళన మామె టెన్నిసన్ తన 'రాజకుమారి'ని వ్రాయుటకు కొంచెము ముందుగఁజేసి పాశ్చాత్యసంఘమున మిగుల సంచలనమును గల్గించుటకుఁ గారణభూత యయ్యెను.

స్త్రీలు పురుషులవలె 'లాంగులను'తొడుగుకొన్న యెడల వారికి జీవితవ్యాపారములలో పురుషులతో సరిసమానమగు గౌరవమును అధికారమును లభించునట! ఎంత వింత! — అట్లయినయెడల 'లాంగుల'ను ధరించు తురుష్కయువతులకును, మనదేశమందలి పాంచాలయువతులకును, చీనావారి యోఁడువాండ్రకును పాశ్చాత్యకాంతలను మించిన స్వతంత్రమును, అధికారమును లభించియున్నవన్న యెడల నెవ్వరైన విశ్వసింతురా?

టెన్నిసన్ 'రాజకుమారి'ని వ్రాయుకాలమున స్త్రీలకు సర్వతంత్ర స్వాతంత్ర్యము లుండవలెనను వాదములు మిగుల ప్రబలి యుండినవి. అట్టివాదములందలి యున్నత భావములఁ గవితారూపమున శాశ్వతముగ నిలిపియుంచుటకే ఆతఁడే 'రాజకుమారి' యను కావ్యమును రచించెను.

ఇఁక మన మింతవఱ కాంధ్రభాషయందుఁ బరివర్తించిన కావ్యభాగమును సింహావలోకనముగఁ గొంతభావమునకుఁ దెచ్చికొందము. టెన్నిసన్‌యొక్క కథానిర్మాణమునకుఁ బునాదియని చెప్పదగిన యనుక్రమణిక మనకంతగఁ బనికి రాకపోవుటవలన మనము పూర్తిగ వదలివైచితిమి. అందు 'రాజకుమారి' యందలి కథావస్తువునకుఁ బీజమీక్రిందివిధమున నున్నది.

ఆంగ్లేయు లేడుగురు కళాశాలనుండి చదువుల ముగించుకొనివచ్చి నప్పుడందొక మిత్రునియింట సమావేశమయి వారు పరస్పరమును చేసికొన్న ప్రసంగముల నొకఁడాత్మకథగఁ జెప్పుకొనెను.

'వాల్టర్'అనువాఁడు తన యాఱుగురు స్నేహితులతో కాలేజినుండి ఇంటికివచ్చినపుడు తన సోదరియగు 'లిలియా'యను నామెతో నేవో ముచ్చటించుచుండగ శత్రు దుర్నిరీక్ష్యముగ యుద్ధమొనర్చిన యొక వీరాంగననుగూర్చి యొకఁడు వినుపించుట తటస్థించెను. అప్పుడు వాల్టరు తన చెల్లెలినిఁ

దట్టుచు 'ఏదీ, ఇట్టి యామె నేఁడొక్కతె యైన ఉన్నదా ?' అని ప్రశ్నించెను.

అందులకు లిలియా తీవ్రముగ 'లేక పోవుటయేమి వేలకొలదిగ నట్టివారున్నారు. అయిననేమి ?—ఆచారోపహతలయి వ్యర్థముగనుండి పోవుచున్నారు. దానికంతకును కారణము తదనురూపమగు శిక్షణమగుట వలన నట్టి శిక్షణమునకు బాహ్యలయి నిరుపయోగముగనుండిపోవుట తటస్థించుచున్నది. మీరు, పురుషు లిట్లొనరించిరి. ఇందులకు మీపై నాకెంత యమర్షముగనైననున్నది. నేనే గొప్పదాననై యున్న యెడల!—నేనొక గొప్ప కవయిత్రినై మమ్ముల శిశుప్రాయులగాఁ జేసియుంచు మీకు సిగ్గుకలుగునట్లు చేసియుందును. ఆహా !—నేనొక రాజకుమారినై యున్న యెడల పురుషులగాలి తగులకుండ — పురుషులకువలెనే గొప్ప కళాశాల నొకటిగట్టి పురుషులకే యేవిద్యల నేర్చుకొనుట కవకాశమున్నదో ఆయా విద్యలన్నియు స్త్రీల వశమగునట్లు చేసియుండెడిదానను. విద్యాపరిగ్రహణమున మీకంటె మేము రెండురెట్లు సూక్ష్మబుద్ధి గలవారము.' అని వచించెను.

అందులకు వాల్టరు మిత్రుఁడొకఁడు మందహాసముతో—"మన యిప్పటి విద్యాలయములనుండు మగవాండ్రందఱు ఆఁడువాండ్రయిపోవుటయే తటస్థించినయెడల నప్పటి దృశ్యమెంత సొంపుగనైన నుండుననుటకు సందేహముండదు. ఇప్పటి యధ్యాపకులు, విద్యాధికారులు, విద్యార్థులు సర్వ మాఁడుమళయాళమునుగ మారి పోయిన యెడల నెంత రమణీయముగ నైననుండును. అయినను, వారు మిగులఁ బ్రాఁతగిలి త్రుప్పు పట్టియుండు మన పురుషవిద్యార్థులవలెగాక చిత్రవర్ణపుఁ జిలుకలవలె రంగురంగుల దుస్తులధరించిన యోగ్యముగ నుండునను కొందును. అయినను మహామధురమగు నాకారములఁ బ్రకాశించునట్టి పట్టభద్రురాండ్రయందెందఱిట్టి లిలియాలున్నను— వారెంత దట్టముగఁ దమ గూండ్ల నిర్మించుకొన్నను వాని నేదొ యొక యువకుఁడా నవాలు పట్టకుండనుండడు"అని పలికెను.

అందులకామె తీవ్రముగ "అదంతయు మీపేలవపుఁ బ్రకృతి కనురూపమైనధోరణి. అయినను మాకింక కన్నుదెఱచి చూచు పురుషాకృతుల నుండువస్తువులకు మరణమే శిక్షగఁ జేసివేయుదును." అని ప్రత్యుత్తర మిచ్చెను.

ప్రసంగవశమునఁ దనకుదయించిన మహామర్షమున కామె యంతలోనే సిగ్గుపడి తన యాగ్రహమునకు తానే నవ్వుకొనెను.

అప్పుడు వాల్టరు తనచెల్లెలిని ప్రేమైక సూచకముగ 'చిన్నరాకాసి'యని 'కృతజ్ఞతలేనిపిల్లి'యని ఇట్టి ముద్దుపేరుల నొకయిరువదింటి నేకరువుపెట్టి—"కళాశాలయందుఁ జదువుకొన్నంతకాలము తమ కాఁడువారి సహవాసము లేకపోవుటవలన బ్రదుకు మిక్కిలి దుర్భరముగఁదోచుచు వచ్చిన దనియు—అక్కడ నుండునపుడెల్ల స్త్రీల

సహవాసమునుగూర్చియే తలపోసికొనుచు నుంటిమనియు—ఎన్ని వ్యాయామఖేలనముల నెట్లు కాలమును గడపుకొన్నను తమ యింటియొద్ద సురభిళమగు పుష్పములవలె నామోదవర్ధనమగు బాలికల సాంగత్యము కొఱతపడుటచేత తమ కన్నియు నసహ్యముగఁ దోచినవనియు"—కొంత ప్రేమగఁ గొంత యెకసక్కెయముగఁ జెప్పఁజొచ్చెను.

"నిజము, మాసహవాసములేని కొఱత మీకు తప్పకఁ గానవచ్చినది. నాకెంపుటుంగరమొక యొడ్డనముగ నేనిది సత్యమని యొప్పుకొందును:" అని తన కెంపుటుంగరమున్నవ్రేలితో నామె యదలించుచుఁ బ్రత్యుత్తరమిచ్చెను.

పంజరముననున్న చిలుక ప్రేమైక సూచకమగు కటాక్షమునుబఱపి తన కాహారమందించు నిల్లాలివ్రేలిని జాగ్రత్తగఁబట్టికొని అపాయమెదవకుండ గారాబముగఁ గఱచునట్లు వాల్టరు ఆయుంగరమున్న వ్రేలందుకొని కఱువఁబోయెను.

లిలియా మహామధురముగనఱచి తన చేతి నీవలకు లాగుకొనెను.

అప్పుడు వాల్టరు "నేనన్నదాని నీక నెన్నఁడును సంశయింపవుకద!—రా! విను. నీ సహవాసమును కొఱతగఁ భావించితిమనుట కిదే నిదర్శనము. క్రిస్టమస్ దినములలో మిగుల చదువువారివలెనే మాబసయొద్ద పాఠములఁ జెప్పుటకు అధ్యాపకు నొకనిని నియమించుకొంటిమి. ఆపండుగరోజులలో గణితములును కొరకురాని కొయ్యలయి పోవుటవలన నది పనిగాదని ఒకళ్ళీడ్చుకొని పోవు నా హేమంతమున నెక్కడెక్కడఁ దిరుగుచున్నను ఇంటియొద్ద సుఖోచితక్రీడల నుండు మిమ్ములఁ దలంచుకొనుచు కాలక్షేప మొనర్పఁజొచ్చితిమి. అందువలన నాహారవిహారముల నీవు మాకు సంతత స్మరణీయవుగ నుండిపోతివి. అంతేకాదు. మే మేఁపుగురమును ఏడ్వురు లిలియాలవలె క్రిస్టమస్ దినములలో నీవు నీతోడి బాలికలతో నెట్టెట్టి యాటలాడుదువో ఆయా యాటలనే యాడి వినోదించితిమి. ఆసందర్భమున నొక నోటినుండి ఇంకొకనోటికి వచ్చునట్లు నీవితరబాలికలతో చెప్పుకొను విధముగ మేము కథలసహిత మల్లిచెప్పుకొంటిమి." అని పలికెను.

ఆమె కట్టి యాటలనిన మిగులనిష్టము. తదితర ఖేలనములకంటె బాలికలందఱొకచోటచేరి తములో తామేదో యల్లికొని యొకరితరువాత నొకరుగఁ గథలసాగించి పరిసమాప్తమొనర్చి యానందించుటామెకు మిగుల ప్రియమైయుండెను. సంగీతాది వినోదములకంటె అట్టివానియం దాసక్తిమెండు. బాలికలైనయెడల—"నే నేమనుకొన్నానో చెప్పుకో!"అని కాని, మఱి యేవిషయములఁ గూర్చియైనఁ గ్లిష్టముగ 'ఎప్పుడు?' 'ఎక్కడ?' 'ఎందుకు'? అని యీవిధముగ నడిగికొని నవ్వుకొనుటయు, పరస్పరము తమ మనస్సులనుండు భావములఁ దెలిపికొని యానందించుటయు బాలికాలోకమున

నెక్కడనైన నున్నదే. కాని పురుషులు బాలికాజన యోగ్యమైన ఇట్టివినోదముల తమలో డామేమి చెప్పుకొందురు ?—అట్టి సంశయమున నామె తదనురూపముగఁ బలుకుచుండగ నామెయన్న—"అదుగో ! అతఁడు కథను ప్రారంభించును. తరువాత నొక్కొక్కఁడే వంతునుబట్టి కథ చెప్పి వేయును. తుదకాకథ మాయేడు ముఖములఁబుట్టి పరిసమాప్తమగును. — ఎట్టి కథ ?—ఎట్టి ఫక్కి?" అని నీవడుగుదువు. కేవలమట్టి హేమంతమున నుబుసుపోవుటకే మేమట్టి యేడుదలల రాకాసికథలఁ జెప్పుకొంటిమి." అని పలికెను.

"ఈవసంతమున సహితముబుసుపోవుట కారీతి వినోదకథాకలాపమును గానిండు." అని లిలియా తనయన్న నడిగెను.

అప్పుడు వారి మేనత్తయొకతె "ఈవసంతమునమాత్ర మెందులకుఁ గారాదు ? మన దేశకాల పాత్రానురూపమైన వీరకథను సందర్భోచితముగ నెందులకుఁ జెప్పరాదు?" అని యాయువకుల నుద్బోధించెను.

కేవల వినోదార్థ మారంభింపవలయు నన్న కథ వీరపురుషోచితమగు నితివృత్తముగ నుండవలయునను మేనయత్తమాటకు వారికి నవ్వువచ్చెను.

ఆమె యమర్షమున వారి నుపలక్షించుచు "మీయిష్టమువచ్చినట్లు చెప్పుకొనుఁడు. ధీరోదాత్తమైన వీరగాథగ—లేక మీకథను మీరే నాయకోత్తములైన యాత్మకథగ— కాక మీకు చిత్తమువచ్చినరీతి నెట్టి చిత్ర కథగనైన సరే.—ఏదో యొకటి ప్రారంభింపుఁడు." అని పలికెను.

అప్పుడు వాల్టరు ఈకథనంతయుఁ బాటకలోకమునకుఁ దెలియజేయుచున్న కథకుని వంకఁదిరిగి—

"విలంబ మెందులకు?—మా లిలియానే కథానాయకురాలిగఁ దీసికొని ఆమె నాఅడుగుల పొడుఁగైన రాజకుమారిగఁ జేసివేయుము. లోకాతీతమైన ఘనతయుఁ, వీర కాంతనురూపమైన ప్రజ్ఞయుఁ, బురుషులకు దిగ్భ్రమ నొదవించు నిర్దాక్షిణ్యతత్వమును ఆమెయం దుదయింపఁజేసి ఆమెను వరింపనీవ కథానాయకుఁడవై రాజకుమారుడవగుము." అని హెచ్చరించెను.

అంత నాకథకుఁడు—"అట్లయిన రాజకుమారుఁడునగు నన్ననుసరించి మీ రీ యుద్యమము నిర్వహించుకొనుఁడు. మన రాజకుమారి వీరకాంతయే యగును. అయిన దేశకాలపాత్రములఁబట్టి స్త్రీల కళాశాలయు, స్త్రీసామ్యములును,పూర్వగాథలును,మహోద్యమములును— అన్నిటిని కలిపిన మిశ్ర కథగాఁ జేసివేయుదము. 'వింటర్స్ టేల్'ను వ్రాసిన షేక్స్పియరే మనకై దీనిని రచించి యుండిన బాగుండియుండును కాని—అయిననేమాయె ? మనబుద్ధుల కెట్లుతోచిన నట్లు చెప్పివేయుదము.—నడుమనడుమ మనకూపిరి యాడుట కిచ్చుట స్త్రీ లేవైనఁగేయములఁ బాడుచుండిన మేలు."—అని 'రాజకుమారి'యను నీ కావ్యకథ నుపక్రమించెను.

కథ పలువురచేఁ జెప్పఁబడుచున్నదను సూచనయే కావ్యమనితర సాధారణమైన మిశ్రకథ యనిపించుకొనుటకుఁ జాలియున్నది. కథ ముగియునప్పటికి కాని కథకుల కెవ్వరికి కథ యెట్టిరూపమునఁ బరిసమాప్తమగునో, ఎంత విపరీతముగా నభివృద్ధియగునో, ఎట్టి పరస్పరాసంబద్ధములఁ బరిణతి బొందునో యూహించుట కవకాశములేదు. మఱియుఁ బరస్పరవిరుద్ధములగు దేశ కాలపాత్రముల కథకు లిష్టమువచ్చినట్లు తమ కథాభాగముల నభివర్ణించుకొనుట కవకాశముండును గావున నిట్టి యసందర్భపుఁబుట్టి ములకలతోనున్న కావ్యమునుకవి కంఠోక్తిగ 'మెడ్ లే' అనఁగ 'మిశ్రకథ' యని పలికికొనుచున్నాడు.

మూలకావ్య మహత్త్వమును లెస్సగఁ దెలిసికొనవలెనన్న నందలి యనుక్రమణిక లోనికథ నిట్లు కల్పించుటయందు కవి యాశయమును మనము గుర్తింపవలసియున్నది. మూలకథ కేవల కల్పితమని—వట్టి యసంభవమని దాని వైఖరివలన మనకెంత గోచరించుచున్నను, అది యిట్టి కావ్యశిల్పమున నొకదోషముగఁ బరిగణింపఁబడదు.*

గ్రంథమున విపరీతముగఁ గొనిరాఁబడిన సంఘటనములే దాని కనన్యసామాన్యమగు ఘనతయుఁ దేజమును కల్గించుచున్నవి. కావ్యమహత్త్వమును దెలిసికొనుటకు కవి గ్రంథముఖమున నెత్తికొనిన సందర్భములఁ దొలుత మనమంగీకరించి తదనంతర మా కావ్యవిషయ విచారమొనర్పవలయును గాని ఆదియందే కథ యసంభవమగుటవలన కావ్య ప్రయోజనము గూడ శూన్యమని మూల చ్ఛేద మొనర్పఁదగదు. పదితలలవాఁ డొక కాంత నీడ్చుకొనిపోయి దాని సతీత్వమునకు భంగముసేయకుండ నుంచివేయుట అసంభవ మగునని రామాయణ మాదరణీయము గాదనవచ్చునా? అగ్నిగుండములందు, ఘృతకుండములందు, ద్రోణములందు, దేవదానవులయంశములచే, మంత్రశక్తులచే నరులుద్భవింపరని భారతమొక కావ్యముగ నంగీకరించుట కాటంకముండునా?

అదేవిధముగ మన 'రాజకుమారి'వంటి యామది భూతభవిష్యద్వర్తమానములనుండుట కవకాశములేదని గ్రంథమును హీనముగఁ బరిగణింపఁదగదు. గ్రంథముఖమునఁ జర్చితమై యభివర్ణితమైన మహదాశయముల గూర్చి పాఠకులహృదయములకు నిరంతర కృతముగ నందుఁ బొడగట్టు సాంఘిక సన్నివేశములఁగూర్చి మనమూహించి కావ్య గౌరవమును నిర్ణయింపవలెను.

---

* In estimating a poem the conditions assumed by the poet must be taken for granted; and we have only to inquire whether, there being assumed, the poem possesses unity, congruity, and a definite and worthy object.

We should apply to 'The Princess' the same rules as to other similar works of imagination or of fancy. —Professor P. M. Wallace.

అట్టి కథానిర్మాణమున కందలి 'యను క్రమణిక' పునాదివంటిది. గ్రంథమున భావి కథానురూపమైన సూచనముల నందలి యనుక్రమణికయందుఁ దీసికొనిరాబడని సందర్భమొకటియు కథావస్తువున లేదని విమర్శకు లనుచున్నారు.*

ఈ మహాకావ్యమందలి ప్రధానకథను మన మైదుగురమును మన యభిరుచులఁబట్టి భారతీయ సాంప్రదాయానుగుణ్యముగ మార్చి భాషాంతరీకృత మొనర్చుచుంటిమి. అందిప్పుడు పూర్వభాగమున నాలుగాశ్వాసములు సమాప్తమైనవి. ఇఁకఁ బ్రారంభింపనున్న పంచమాశ్వాసముతో నుత్తరకథ యందుఁ గ్రొత్తధోరణు లుదయించుచున్నవి గావున మనమీ కథాప్రవాహ మిక సాగనిచ్చుటకుముందు యింతవఱకెట్లు కొట్టుకొని పోఁగలిగితిమో సింహావలోకనముగ జెప్పదగునని మనోరమ నన్నుఁ గోరుటచేత నేఁడీ కావ్యసందర్భమునుగూర్చి తర్కించుట కింతగ నవకాశమేర్పడినది.

ఇఁక మనచే నాంధ్రమునకుఁ దేఁబడిన కథ యేరూపముననున్నదో క్లుప్తముగఁ జూచికొందము.

౧

రమణీయముగ శృంగారించుకొనుట యనినఁ దనకు వెన్నతోడి విద్యగ బెరిగియుండిన రాజకుమారుఁ డొకడుండెను. ఆతఁ డెనిమిదేండ్లవయసున నున్నప్పుడు కమలాకరవర్మ యను రాజేంద్రుని పుత్రికయగు నిందిరను ఖడ్గమునుబంపి కళ్యాణార్థమై ప్రధానమును గావించియుండిరి. తరువాత నతఁడారూఢ యౌవనుఁడై బాలికను స్వయముగఁ బరిణయమాడుకాలము చేరువకువచ్చినప్పుడు, ఆమెకు పరిణయమాడనుద్దేశ మెంతమాత్రము లేకపోవుటయేగాక నవనవోన్మేష శాలినియై, స్వేచ్ఛానుసారముగ నుండగోరి యున్నదని రాయబార మొకటివచ్చెను. అందులకా రాజకుమారునితండ్రియగు విజయరామ రాజేంద్రు డాగ్రహించి తన సైన్యములఁ దోడ్కొనిపోయి 'కోడలి' నింటికి దెచ్చికొందునని నిశ్చయించెను. కాని యారాజకుమారునికంత ప్రతికూలయగు వధూమణిపై దండోపాయమునుఁ బ్రయోగించుటకు మనస్సంగీకరింపక పోవుటచేత నర్థరాత్రమునఁ దనతండ్రికిఁ దెలియకుండ, కృష్ణవర్మయు, పార్థసారథియనను మిత్రులతో కమలాకరవర్మ రాజ్యమును చేరుకొనెను.

అచ్చట నారాజకుమారి తన యంతఃపురమునందలి బంధువుల నందఱనువదలి జ్ఞానోపార్జనమే మనుజజీవితమునకుఁ బరమలక్ష్యమై యుండవలెనని స్త్రీజాతి నుద్బోధించుటకై మహిళా విద్యాలయమొకటి స్థాపించుకొని అందుఁ దన స్త్రీజనముతో నుండి పోయినదని తెలియవచ్చెను. ప్రధాన

* It may be remarked that there is scarcely anything in the story which is not prophetically glanced at in the Prologue.

—Hallam Tennyson.

కాలమున నుభయవంశములవా గొనర్చు కొనిన సమయమునకుఁ దాను బద్ధుఁడనని భావించుచు కమలాకరవర్మ తనపుత్రిక పేర లేఖలవ్రాసి రాజకుమారున కొసంగెను. వానినిగైకొని రాజకుమారుఁడు తన యిర్వురు స్నేహితులతోడను రాజకుమారిచే ననుశాసితమగుచున్న స్వేచ్ఛాసీమలకు బయనమైపోయెను. ఆసీమలకుఁ బరిసరముననున్న పురపాలకుఁ డాతనిని గౌరవించి మగవాఁడనువాఁ డెవ్వడాభూములపై నడుగుపెట్టకుండ నారాజకుమారి శాసనములఁ గావించుకొనియున్నదనియు, బోతుటీగయైనఁ దన భూములఁ బ్రవేశింపకుండ 'నభూతో నభవిష్యతియని చెప్పఁదగినవైఖరి' నత్యుగ్ర శాసనముల నచ్చటి స్త్రీమండల మనుశాసించుచున్నదనియుఁ దెలియఁజేసెను. అందువలన రాజకుమారుఁ డామె నెట్లైన సందర్శింపఁగోరి తనస్నేహితులతోఁగూడ స్త్రీరూపమునుధరించి యామహిళామహా విద్యాలయమున తాము విద్యోపార్జన మొనర్చ వచ్చినట్లతిసాహసమున నందుఁ బ్రవేశించెను.

ఇది ప్రథమభాగము.

౨

ఆ యువతీ రూపధారిణులగు మువ్వురను నిక్కంపు స్త్రీలుగాఁదలచి రాజకుమారి పరిజనులామెకడకుఁ దోడ్కొనిపోయిరి. అప్పుడామెతోడి సంభాషణమున నామె యెట్టి తత్త్వమునఁ బురుషజాతిపైఁ గత్తికట్టియున్నదో, ఎట్టి మన స్తత్త్వమున నా మహిళావిద్యాలయ మచ్చట బ్రతిష్ఠించుకొనెనో తెలిసికొనెను. స్త్రీల యున్నతియే మనోరథముగ, ఉత్తమాదర్శముగ, పరమావధిగ, నైహిక లోకజీవితవ్రతముగ నామె తలంచుచుండెనని అతనికి సంపూర్ణముగఁ బోధపడెను. విద్యోపార్జనార్థమైవచ్చిన విద్యార్థినులవలె వారచ్చటి శాసనములకుఁ గట్టుబడియుండుచ నట్లొడంబడుచు, బత్రములపై తమ యామోదములిచ్చి నా డావిద్యాలయమున మహోపన్యాసమొసంగు శకుంతలాదేవి యుపన్యాస భవనమునకు వెడలిపోయిరి. ఆమె పార్థసారథి కగ్రసోదరి. ఆమెయక్క మరణించుట చేత నామెబిడ్డయగు నహల్య కామె తల్లియయి పెంచుచుండెను. నాఁ డొసంగిన మహోపన్యాసమున నామె సృష్ట్యాదినుండియు పురుషుఁ డన్నిదేశముల స్త్రీలకెట్లక్రమమొనర్చుచుండెనో వెల్లడించుచు నవకాశము కలిగినపుడెల్ల ప్రపంచచరిత్రమునఁ జెప్పను చేయను నేర్పరలయిన మహానాయికలాఘజాతియం దుదయించుచు వచ్చిరనియు, నిందిరాదేవిచేఁ బ్రతిష్ఠింపఁబడిన ఆ మహోద్యమమహాత్త్వమునఁ బురుషు లెంతటివారనుసులగుచున్నారో స్త్రీలుకూడ నట్టివారగుట కవకాశము లేర్పడియున్నవనియు, తమ్ముఁ బురుషులు త్రొక్కి యడఁచియుంచుట కవకాశములేదనియు, తమభావి భాగ్యోదయమునకది యుషఃకాలమనియు, నాచార శృంఖలానిబద్ధమై బానిసత్వముననున్న స్త్రీజాతిని తమరాజకుమారి స్వేచ్ఛాపరతంత్రమగునట్లుచేసి తమకట్టి యవకాశములఁ గల్పించినదనియుగంభీరరవమున నామె వారితో





కీ. శే. జమీందారిణి మోతే సుబ్బలక్ష్మీదేవి (చిట్టెమ్మ) గారు. మోతే కృష్ణరావు గారి (జమీందారు, ఏలూరు) సతీతిలకము. ఎల్లరిచే మెప్పుబొంది 21 వ ఏట పరమపదించిన ఉత్తమ సాధ్వి.



నేదో ప్రసంగమును జేయఁబోవుచు నాకస్మికముగ హారియందున్న తన తమ్ముఁడగు పార్థసారథిని గుర్తించెను. తోడనే వారందఱు మాఱువేషముల వచ్చిరని యామెకు విశదమైపోయెను. 'పురుషులు లోనికి రారాదనియు, వచ్చిన మరణశిక్ష'—యనియు వారావిద్యాలయద్వారమున నుగ్రముగఁ జెక్కించుకొనియున్నను వారంత ధైర్యముగ నందు బ్రవేశించుట కామె కొంతతడవ క్రోధవివశయై తన నాయకురాలగు నిందిరాదేవియొద్దకుఁబోయి వారి మోసమును వెల్లడింతునని పట్టుఁబట్టెను. ఏకదేశ సంజనితులగు తమ్ముఁగాపాడవలసినదనియు, వా రొనరించుకొన్న శాసమునుబట్టి తమ్ముఁజంపినయెడల రెండు రాజ్యములవారికిని ఘోరముగ యుద్ధములైపోవుననియు, అట్టి యుద్ధవాతావరణమున వారి మహిళామహావిద్యాలయము కూలిపోకుండనుండదనియు రాజకుమారుఁ డామెను బ్రార్థించెను. చాల తడవామె యందులకు నిరాకరించుచుఁ దమ కార్యఖడ్గముల భారమును వహించుచున్న తమ రాజకుమారియే అందునుగూర్చి నిర్ధారించుకొనుననియు తమ మహోద్యమమునకు—తమ సద్ యత్నఫలావాప్తికి—అవసరమైనయెడల తన బిడ్డయగు నహల్యను సహితము బలిదానమొసంగ సంశయింపననియు అట్టి సందర్భమున మానవజాతియందలి ఒక యర్థభాగమగు నాఁడుజాతి యున్నతి సంశయాస్పదముగ నున్నప్పుడు తానొకసోదరుని, ఒక రాజకుమారుని ప్రాణములఁదీయుటకు సంశయింపననియుఁ జెప్పఁజొచ్చెను. అయినను ఆమెయం దాత్మధర్మమనురాగముతో నొరపికొని బాధకల్గించుటచేత నామె తనబింకమును విడచి వా రొకటిరెండు రోజులలో విద్యాలయమువిడచి పోయినయెడల వారి యుదంతమితరుల కెఱిఁగింపకుండనుండుట కొప్పుకొనెను. వారట్లనుకొనుచుండగ నావిద్యాలయమున మహాధ్యాపికయగు భానుమతీదేవిపుత్రిక మాలతి యచ్చటకువచ్చుట తటస్థించెను. ఆమె వారాడుకొను మాటల విని యున్నను ధీరోదాత్తులగు నామువ్వురను గాపాడుట కొప్పుకొనెను. తరువాత వారా మహిళావిద్యాలయమున స్త్రీలేమేమి బోధించుచుండిరో బాలిక లేయే విషయముల నేర్చుకొనుచుండిరో గ్రహించుచుఁ బ్రొద్దుగడపిరి. వారు నేర్చుకొనుచున్నవన్నియు బురుషస్పష్టములై ప్రాతఁగిలియున్న విద్యలేయనియు, అం దేమియుఁ గ్రొత్తచదువులును నవీనమార్గములును లేవనియు, ఆఁడుదెప్పుడేమియు గ్రొత్తదానిని కనిపెట్టలేదనియు గృష్ణవర్మ తనస్నేహితులతో పలుకఁజొచ్చెను. మఱియు నకాముఁడగు ప్రవరునియందు లబ్ధానురాగయై ప్రలాపించు వరూథినివలె పురుషజాతిపై కినుకవహించియున్న శకుంతలపై నాతఁ డనురక్తివహించుచు నావిద్యాలయమునందలి కాంతల హృదయములన్నియుఁ బీడుపడియున్నవనియు వేయిగృహముల రాణులయి బిడ్డలఁగనుచు మాతృదేవతలయి పురుషుల కుత్సాహమిచ్చి యుండవలసిన బాలికలు గ్రహచారవశమున వం

ఖ్యాత్వమునఁ బ్రకాశించు చుండిరనియు, శృంగారరసమున కవకాశముండని బ్రదుకు స్త్రీజన్మ మెట్లగుననియు, విషయసాయకుని యాగడములకు వజ్రకీలితమైయున్న వారి హృదయములఁ జూడదనకు గుండె నీరగుచున్నదనియు కామోన్మాదమున నుపన్యసింపఁ జొచ్చెను. తరువాత భోజనసమయమున భుజించునప్పుడుకూడ విద్యాలయమందలి కన్యలు ఏవో శాస్త్రములఁగూర్చి పూర్వపక్ష సిద్ధాంతములొనర్చుచు సందడిచేసి తమయందలి జ్ఞానతృష్ణను వెల్లడించిరి. తరువాత నచ్చట యుద్యానవనమున నొకచో గొందఱు బాలికలు తమజీవితముల వసంతకాల మంతరించిపోవుచున్నదనియు, సంసారసౌఖ్యములకు వెలియైనబ్రదుకు నిరర్థకమనియు, 'అనాశ్వాసితదుఃఖితే మనసిసర్వమసహ్య'మనియు, గృహములఁ జక్కబెట్టుకొను సామర్థ్య ము విదలకు సమస్తవిద్యాపరాయణతవలన నెట్టి ప్రయోజనమును లేదనియు, మఱియు విద్యాధురీణురాండ్రగు యువతులనుజూడ పురుషుల కొకవిధమైన ద్వేషమనియు నీ విధముగ తమలోఁదాము చెప్పుకొనుచుండుటకు వారాశ్చర్యపడిరి. తరువాత నావిద్యాలయమున జగద్ధితమునకై యిందిరాదేవి చేయు సత్ప్రియత్నములకు సంపూర్ణ ఫలావాప్తి కలుగునట్లు స్త్రీలైక్యకంఠముగ దేవునిఁ బ్రార్థించుచు మనోజ్ఞముగఁ బాడుకొనిరి.

ఇది ద్వితీయభాగము.

3

మఱునాటి యుదయమున మాలతి రాజకుమారునియొద్దకువచ్చి తనతల్లి వారు పురుషులని కనిపెట్టినదనియు గావుననిఁక విలంబమొనర్పకుండ వెంటనే విద్యాలయమును విడచి పాఱిపొండనియు హెచ్చరించెను. తామింకను విద్యాలయమున నుండునట్లామెను వశమొనరించుకొని వత్తునని కృష్ణశర్మ వెడలిపోయెను. శకుంతలకును భానుమతికిని విద్యాలయమునఁ బొసఁగకుండనున్నదనియు, పరపదార్థాపహరణప్రవీణులగు గ్రంథకారులవలె శకుంతల తన పదాభిప్రాయతస్కరణ మొనర్చుచుండునని భానుమతి యనుచుండునని మాలతి చెప్పినదానిసిబట్టి రాజకుమారుఁడు గ్రహింపగల్గెను. ఆమె వెడలిపోయిన తరువాత పార్థసారథి మాలతిని రాజకుమారుఁడిందిరను మెచ్చుకొనుచుండగఁ గృష్ణశర్మ వచ్చి తాను భానుమతికి సర్వమెఱిఁగింపవలసి వచ్చినదనియు* తమరాజ్యమున నామెకుఁ గొంతరాజ్యమిచ్చి అందామెను సర్వసుందరీలోకమునకు బ్రభ్విగా, నియంతనుగాఁబట్టాభిషేకమొనర్చ నాశఁజూపితిననియు, ఆమె యందులకు కారాత్రి ప్రత్యుత్తరమిత్తునని సెలవిచ్చినదనియు, తానతికష్టమున నామెయంతవఱకు నోరుమూసికొనునట్లు చేసికొని రాఁగలిగితిననియు విన్నవించెను.

నాఁటిసాయంకాలమున పర్వతారోహణమొనర్ప రాజమారితో స్వారి వెడలిరి. మార్గ

---

* తమ రాజకుమారున కామె తోడ్పడిన కొఱకు

మధ్యమున రాజకుమారునిగూర్చిన ప్రసంగ మువచ్చెను. రాజకుమారి తనయుద్యమున సుస్థిరయై యుండిపోవుటయే జరుగునెడల నతఁడు హతాశుఁడై, విచ్ఛిన్న చేతస్కుఁడై దారుణముగఁ జచ్చిపోవునని స్త్రీవేషధారణ మొనర్చియున్న ఆ రాజకుమారుఁడు తన్నుఁ దాఁజెప్పుకొనెను. అందుల కామె యొకరి యాజ్ఞానుబద్ధముగ తనజీవితస్వాతంత్ర్యమును బోఁగొట్టుకొనుటకుఁ దాను వట్టిపసికూనను గాననియు, అన్యకన్యాసాధారణమైన బుద్ధితో తన యిష్టానిష్టములఁ బాటింపకుండ అన్యులొనర్చుకొనునట్టి ప్రాచీనసమయము లకుఁ దాను బద్ధురాలుకావలసిన యావశ్యకత లేదనియు, తాను తనజాతి నుద్ధరించుటకై జీవితమును సహితము ధారవోయ బద్ధకంకణయై యుంటిననియుఁ బ్రత్యుత్తర మిచ్చెను. తరువాత వారు పెక్కువిషయములఁగూర్చి ప్రసంగించుకొనుచుఁ జీకటి పడుచుండఁగ, బర్వతావరోహణ మొనర్చిరి.

ఇది మూడవభాగము.

## ४

ఆ రాత్రివేళ వారా కొండక్రింద నిర్మించుకొన్న గుడారమున నాసీనలయియుండఁగ నా రాజకుమారి తనకేదైన గీతములఁ బాడవలెనని కోరఁగ వాసంతియను నామె స్త్రీల ప్రాక్తనజీవితములఁ దలంపునకుఁ దెచ్చుచు 'అశ్రులశ్రులు—వ్యర్థాశ్రు!'లని తమహృదయములఁబుట్టు విషణ్ణత్వముగ్గడించుకొనుచు కొన్నిగీతములఁబాడెను. ఆరాజకుమారి మహామర్షమున నామె సదల్చుచునట్టి భావతరంగములన్నియు నిర్వ్యాపారత్వమునఁ దినికూర్చుండి సంస్కారశూన్యలై యుండుట వలన నుదయించినవనియు, స్త్రీజాతికిఁజెల్లిన పూర్వసంఘటనములన్నియు నిర్విశేషముగ నశించినవనియే తా మూహించి మఱల నచ్చట తమకగుచున్న పునఃసృష్టియందుఁ దమకలవడియున్న ప్రతిభయు, ప్రజ్ఞయు, నసాధారణతేజమును పూర్ణముగ నుపయోగమునకుఁ దెచ్చికొనవలెననియు నుద్బోధించెను. ఆమె రాజకుమారునివంకఁ దిరిగి వారిదేశపు గీతమేదైన బాడవలయునని కోరగ నా రాజకుమారుఁడు తాను తనదేశముననుండగ తనమనోహరిణిపై తనకుగల ప్రేమను వెల్లడించుచు రచించిన గీతములఁ గొన్నిబాడెను. అట్టి శృంగారాత్మకమైన రచనల నసహ్యించుకొనుచు రాజకుమారి మనకవుల శృంగారరసాపస్మారమును గూర్చి దీర్ఘముగ నుపన్యసించెను. పూర్వకవుల శృంగారరసము నిశ్చలమును, పవిత్రమునగు ప్రేమతత్త్వము నుగ్గడింపక, కేవలదైహిక సంజనితమును, జంతుసాధారణమునగు కామోద్రేకము నభివర్ణించుననియు, అట్టి మిథ్యాప్రణయములను మనవారెంతవిదల్చుకొనిన స్త్రీజాతి కంత శ్రేయస్కరమనియు, శితువాసన్నమైన గిరిగహ్వరములఁ డాగియుండు మిడుతలవలె తమ యంతరాళములఁ బుట్టు కామోద్వేగములఁ నడంచికొని జితేంద్రియత్వమునఁ బ్రకాశింపవలెననియు నామె తనస్త్రీల నుద్బోధించెను.

ఆమె యింకను రాజకుమారునితో వారి దేశమందలి స్త్రీలవైఖరులు దెలియునట్టి గీతమొకటి పాడవలయునని చెప్పగ కృష్ణవర్మ మద్యపానమున నుదయించిన తాత్కాలికోన్మాదమున 'గైరమ్మ'ను గూర్చియు 'వెంకమ్మ'ను గూర్చియు నాఁడువాంధ్ర కర్ణములకు వినసొంపుగాని గేయముల నుత్సాహమునఁ బాడఁజొచ్చెను. తన కొడలు మండుకొనిపోవుచుండగ 'ఊరకుండ వయ్యా!' యని యరచుచు రాజకుమారుఁ డాతని నొక్కటికొట్టెను. అప్పు డామహిళా సంఘమున నామూవురును పురుషులని వెల్లడియగుటచేత నెంత సంక్షోభమైన నుదయించెను. మధుకోశమున కేమైన తగిలియెడల నలుదిక్కులకును పాఱిపోవు మధుమక్షికములవలె నప్పు డాబాలికాసంఘమంతయు గుడారమునుండి నానాముఖముల చెదరిపోయెను. కొంతసేపటి కా రాజకుమారి యావలనున్న వంతెనపై నుండి స్వారియొనర్చుచున్న గుఱ్ఱముతోఁగూడ ప్రమాదవశమున నచ్చటి యేటినీటియందుఁ బడిపోవుటవలన నా స్త్రీ సంఘమున హాహాకారము లుదయించెను. చైతన్యవిహీనయై ప్రవాహమునఁ గొట్టికొని పోవు తన ప్రియురాలి నాయేటి నీటినుండి ఈవలకుఁ దెచ్చి పరిజనుల కందిచ్చియు నా రాజకుమారుఁడు తనపురుషత్వము బట్టించుకొనుటచేత వారితోడఁ బోవఁజాలకపోయెను. అయినను అతఁడు పాదచారియై తిరుగ నా విద్యాలయోద్యానమునఁ బ్రవేశించి అందు నడయాడుచుండగ పార్థసారథి యచ్చటికి వచ్చి రాజకుమారి యేమేమిచేయుచున్నదో సర్వమెఱిఁగించెను. అతఁడు చెప్పిన వానిని బట్టి రాజకుమారి మాలతి నెంత ప్రశ్నించినను ఆమె కొయ్యవలె నేమియు మాట్లాడకుండ నుండిపోయెననియు శకుంతల కన్యాసంఘము నుండి పలాయితమైపోవుటవలన తాత్కాలికముగఁ బుట్టినకోపమున రాజకుమారి యామె బిడ్డయగు నహల్య నా మహిళా విద్యాలయద్వారమున కావలఁ బాఱవేయ నియోగించినదనియు తెలిసికొనెను. కృష్ణవర్మ శకుంతల నెచ్చటికో లేవదీసికొనిపోయి యుండుననియు, అతఁ డామె నేమిచేసినను చేయవచ్చుననియు పార్థసారథి యనుచుండగ; కృష్ణవర్మ యంతరంగమున మిగుల మంచివాడనియు, హాస్యరసికలోలుఁడైనంతమాత్రమున నవనీతివర్తనుఁడని చెప్పరాదనియు రాజకుమారుఁ డతని నగ్గింపఁదొడంగెను. అంతలో నా విద్యాలయాధికారి ఇలిరువురు వారి నాక్రమించి పట్టుకొని రాజకుమారి సమక్షమునకుఁ దోడ్కొని పోయిరి.

వారు పోవునప్పటికి రాజకుమారి యెదుట భానుమతి వారు పురుషులని యెఱిఁగియుండియుఁ బట్టి యొప్పగింపని నేరమునకై గొప్ప యాత్మరక్షణోపన్యాస మొకటి గావించుచుండెను. అదంతయు సాంతముగ విని రాజకుమారి విద్యాలయ మును స్థాపించునప్పు డామెయొనర్చిన శపథములకుఁ భిన్నముగాఁ బ్రవర్తించినందునను, బుద్ధిపూర్వకముగ సమయభంగ

మొనర్చినందునను ఆమెను వెడల నడచుచుంటినని స్పష్టముగఁ దెలియఁజెప్పెను.

అంతలో వార్తాహరురాలొకతె వచ్చి రెండుయుత్తరముల నారాజకుమారి కందిచ్చెను. అందొకదానియం దామెతండ్రి తానా రాజకుమారు నామెవద్ద కంపునప్పు డత్యుగ్రముగ నామె యొనర్చుకొన్న శాసనములఁ దెలిసియుండనందున వానినిగూర్చి తెలిసినంతటనే ఆమె యక్రమ మొనర్పకుండ నివారించు తహతహతో తొందరగవచ్చి యర్ధరాత్రిసమయమున రాజకుమారుని తండ్రియగు విజయరామ రాజేంద్రునిచేతులలోఁ బడిపోయిననియు, అతఁ డామె యావరణమంతయు ముట్టడించి తనపుత్రుని కపాయమురాకుండ తన్నుఁబట్టి యుంచుకొనెననియు వ్రాసియుండెను. రెండవదానియందు రాజకుమారుని తండ్రి తనపుత్రుఁ డామెయొద్దకు వచ్చియుండెను గావున నాతని కెట్టి యవజ్ఞయొనర్చినను ఆమెను ఆమెవారిని నేలకుఁ గోలకుఁ దెచ్చి యామె యాగడముల నామమాత్రావశేషముగా జేసివేయుదుననియు, ఆ యుభయవంశములును చేసికొనియున్న ప్రాక్తనసమయమునకు బద్ధురాలయి ఆమె తనకుమారునిఁ బరిగ్రహించి తీరవలెననియు వ్రాసియుండెను. అప్పుడు రాజకుమారుఁడు కేవల స్వేచ్ఛాపతియై యున్న యామె రహస్యముల నెట్లైనఁ బరిశోధించు నపాత్రపుఁబుద్ధితోఁ చానచ్చుటకు రాలేదనియు తమ కిరుపురకును పాలితవ్యమగు రాజ సమయమున కొకభంగము వాటిల్లకుండ వలయునను మహాందోళనముతో పురుషులకు దుర్గమముగ నామెచే ననుశాసింపఁబడుచున్న యాసీమలఁ బ్రవేశించితిననియు, తాను స్త్రీజాతియన్నఁ దుచ్ఛముగఁ దలపోయునట్టిప్రకృతిని బుట్టినవాఁడ గాననియు, ప్రపంచమున స్త్రీలెంత మహోన్నతస్థితికి వచ్చుట కవకాశముండునో అంత మహోన్నతస్థితికి వచ్చుట కొడఁబడినయెడల మానవలోక మింకను తేజస్వంతమయి, సౌఖ్యారంభ సంయుతమయి, సకల కళ్యాణానుగుణావహమై యుండునని భావించువాఁడనియు, బాల్యకాలమునుండియుఁ దనకు లోకమిందిరామయమై యుండెడిదనియు, గావునఁ దానారూఢయౌవనుఁడై ఆమెను స్వయముగ సందర్శింప నరుగుదెంచితిననియు, అందుల కామె తండ్రి వ్రాసియిచ్చిన యనుజ్ఞాపత్రములే సాక్ష్యమనియు చెప్పెను. అంతలో మహాసైన్యములతోఁ బురుషులా విద్యాలయమును ముట్టడించిరని విద్యార్థినులయందు గొప్ప కలకల ముదయించెను. ఆరాజకుమారి వారిపై మండిపడి వారికి గట్టిగా చీవాట్లు పెట్టి తమయాపద గడవబెట్టి దమపగల సాధించి తమకు శుభ మొడగూర్చువారున్నారనియు, వారువచ్చి తమకై యుద్ధమొనర్తురనియు, లేనియెడల తమ జన్మస్వాతంత్ర్యముల సంరక్షించుకొని తమ యోగ్యతను జగద్విదితముగ నుంచివేయుటకు తానే స్వయముగ కవచియై, ఖడ్గ

పాణియై సకల మానవలోక శిరఃకంపన యోగ్యముగ రణరంగమున నురుకఁగల ననియు, నిఁక తన సమక్షమున నింత యల్లరికిఁ గారణభూతలైన 'మహానాయికల'ను మఱునాఁడు శిక్షింతుననియుఁజెప్పి వారం దఱ నావలకుఁ గొట్టివైచెను.

తరువాత నామె రాజకుమారునియొద్దకువచ్చి ఆతఁడు మిగుల నుత్తమప్రకృతిని సంచరించెననియు, మహారాజకుమార యోగ్యమైన ప్రవర్తనయందుఁ బ్రవర్తించె ననియు, అందులకు తన కృతజ్ఞతను తెలుపుకొను చుంటిననియు బలికి, తనప్రాణముల గాపాడినందులకుఁ దన మనస్సంగీకరింప కున్నను వానికన్నిటికి ధన్యవాదములఁ జెప్పుకొనెను. అయిన నంత మోసమునఁ దమ యావరణమునఁ బ్రవేశించి, తమ పరిచారికల మూర్ఖాత్ములఁజేసి అన్ని యసత్యములాడి, అన్నివిధముల తన్నును తనవాండ్రను పలుదెఱఁగుల భంగముల పాలుచేసి యున్న యాతనిని పరిణయమాడుట హాస్యాస్పదమనియు, అతని కెన్నటికిని వశీకృతురాలై యతనితోడిదేయోకముగ బానిసయయి ఆజన్మాంతముండ నూహించుట కంటె యాగడ మింకొకటిలేదనియు, ప్రపంచముననుండు బంగారమంతయు నతనికి కిరీటమై పోయినను, భూమియందుండు మానవుల నాలుకలన్నియు అతనినే యేలికగఁ నంగీకరించినను తానందుల కొడంబడుదానఁ గాననియు స్పష్టముగఁజెప్పి తన పరిజనులచేత వారినావలకు గెంటించివేసెను.

ఇది నాల్గవభాగము.

మన మాంధ్రమునకుఁ బరివర్తించిన కావ్యకథ యీవిధముగ నున్నది. ఆంధ్ర భాషకు శిరోభూషణములగు నుత్తమగ్రంథములన్నియుఁ బరభాషలయందలి కావ్యము లాధారముగ వ్రాయఁబడినవని భాషాభిమానులందఱకు దెలిసియేయున్నది. పూర్వకవులందఱు గీర్వాణకల్పవృక్షచ్ఛాయను గూర్చుండి తమ భాషాంతరీకరణములందు స్వతంత్ర రచనల నెడనెడఁ జొప్పించుచుఁ దమ ప్రతిభావిశేషముల వెల్లడించిరి. శ్రీనాథుఁడు దననైషధమునఁ జెప్పికొనినట్లు వారాయాకావ్యములఁ నశేషమనీషి హృదయంగమంబుగా శబ్దంబు ననుసరించియు, భావంబుపలక్షించియు, రసంబుఁ బోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారమున గావ్యకల్పనమొనర్పఁ బరిశ్రమించిరి. అట్టి మహాకవులుసహితము కొన్ని సందర్భములఁ బండితప్రకాండులకుఁ దృప్తికరముగా వ్రాయఁ జాలకపోయిరి.

మనమీగ్రంథ మాంగ్లభాషయందున్న వైఖరిని 'మక్కికి మక్కిగఁ' జేయుచుండ లేదనియు, మనబుద్ధులకుఁ దోచినట్లు మార్చివేయుచుంటిమనియు స్పష్టముగఁ జెప్పుకొనుచునేయున్నాము. అయినఁ బాశ్చాత్య వ్యామోహములఁ బరిభ్రమించుచు నాంగ్ల ధోరణులు మనములఁబట్టియుండు నాంధ్ర

మహాశయులీ కావ్యమున సర్వమును మూలానుసారముగఁ బరివర్తించిన బాగుండియుండునని తలంపవచ్చును. వ్యావహారిక భాషాభిమానులగు మహామహులు శైలిక్లిష్టముగ నున్నదనియు, సర్వజన సుబోధ్యముగ లేదనియు, వ్యవహారధోరణిని ప్రవాహరూపమున నోట నెట్లుండునో భాష నట్లుండని గ్రంథములమొగముఁ [redacted] కుండఁ, జెవిని జేర్పకుండఁ జేతబట్టకుండఁ ద్రోసివేయవచ్చును. శైలియందు ప్రాక్తన పద్ధతులఁబోవు గ్రాంథికవాదులు భాష యింకను గాఢపాకమున లేదని యాక్షేపింప వచ్చును. అట్టిసందర్భమున సర్వజనులకుఁ దృప్తికరముగ నెవ్వరును రచింపజాలరు కావున—

ఉ. అంచితులైన వారలిది
యారసి యీరసమున్ గ్రహించి లా
లించినఁజాలు కొందఱవి
లే వివిలే వని నిందసేయు వా
రంచు రచింపమానుదుమె!
అందఱినిం దనియింప మమ్ము ని
ర్మించిన బ్రహ్మకైనఁ దర
మే! యిది పెద్దలెఱుంగ కుందురే.

అని వర్తమానమున నాంధ్రకవితాగురులగు దిరుపతివేంకటేశ్వరుల వైఖరి నవలంబింపవలసి వచ్చుచున్నది.

మూలకావ్య మాంగ్లమున రచింపఁబడి తొంబదియేండ్లగుచున్నది. అట్టిగ్రంథమున నాధునికభావము లెట్లుండునని కొందఱాక్షేపింపవచ్చును. అందును రాజకీయవిషయముల టెన్నిసన్ తనకాలమున మిగుల వెనుకఁబడి యుండినవాఁడు. అట్లయ్యును నాతఁడీయొక్క గ్రంథమునందే భావిసూచనముల కనురూపమైనభావములఁ బ్రకటించెనని విమర్శకు లేకగ్రీవముగ నంగీకరించుచున్నారు.

In one [redacted]lone did Tenny- [redacted] suggestive ideas, and [redacted] when dealing with the Woman's Movement. In the Princess he was for the first and last time really in advance of his age. There is a healthy progressive note in this poem, and reactionary as it may seem to modern minds, it seems to me on the whole a just and sympathetic presentment in poetic form of the problem connected with woman's place in society.

The line "Woman is not undeveloped man but diverse", goes to the root of the Sex question, and might well be pondered over by certain extremists to day. The Emancipation of women has passed through many phases since Tennyson's day; yet can we better Tennyson's general estimate:

> "The Woman's cause is Man's
> They rise and sink together."
>
> — Arthur Compton—Rickett.

అనఁగ స్త్రీ స్వాతంత్ర్యోద్యమమున టెన్నిసన్ కాలమునుండి యెన్నియెన్ని పరివర్తనము లేర్పడినను టెన్నిసన్ తన గ్రంథమునందుఁ బ్రకటించిన యుత్తమభావముల

మించి మనమేమియు వెల్లడింపఁజాలమని యర్థమగును కాదా ?

గ్రంథమహత్త్వమునుగూర్చి మనభావములకుఁ దెచ్చుకొనుట కింతకంటె యధికముగఁ జెప్పవలసిన దేమియు లేదు కావున నిఁక చెప్పవలసియున్న యుత్తరభాగమును ప్రారంభింపవలసినదని 'మనోరమ'ను గోరుకొనుచున్నాను.

నే నిట్లంటిని.

కావ్యమున ద్వితీయాశ్వాసారంభమునుండియు కవి కథకులకు విశ్రాంతియొదవుటకై మూలకథయందలి స్త్రీలు గీతములఁ బాడినట్లు పాటలఁజెప్పుచు వచ్చినాడు. అట్టిపాటలకుఁ బ్రతిగమనకావ్య మూలకించుచు నిచ్చటఁ జేరియుండు స్త్రీలఁ బాడవలయునని మేము తొలుతఁ గోరుకొంటిమి. కాని వారాయా సందర్భముల బాడుచున్న పాటలు మన కావ్యప్రకృతికి భిన్నమై యుండుటవలన మూలకావ్యమునందలి పాటలనే కళావతిచేత నామెకుఁ దోచినట్లు రచింపఁజేసి నేను పత్రికల కిచ్చుచున్నాను. ఇప్పుడీ యుత్తరభాగమునకుఁ దొలుతనున్న గీతమును సాభిప్రాయసూచకముగ 'లిలియా' పాడినట్లున్నది. దానిభావను నీయుత్తరకథకు శిరోభూషణముగ నొక్కపద్యమునందు రచింపవలసినదని నేను కోరగ కళావతి ఈ 'సింహావలోకనము'న నారంభమునఁగూర్చ నొకపద్యమును రచించెను. దానిభావ మసంపూర్ణమును, అస్పష్టము నగుటవలన యర్థమింకను విపులముగఁ జెప్పవలసినదని యడుగఁగ దానికింకను తొలుతఁ గూర్పవలసినదని వేఱొకపద్య మల్లియిచ్చెను. కావున రెండవపద్యమును ముందును మొదటిపద్యమును తరువాతనుగూర్చి మీరీ పద్యభావములఁ జూచికొనఁదగునని మిమ్ము గోరుకొనుచున్నాను. రెంటియందును గొ[illegible]వముల చర్విత చర్వణము.

మ. భవదీయంబగు కంఠనిస్వనమె శుం
భత్కేళిమైఁ బోవు నా
హవభేరీ ధ్వనులందు దియ్యముగఁ ద
న్నానందితుం జేయ సం
శ్రవణీయంబగు నీదు వైఖరుల స
ర్వాంగీణ రోమాంచుఁడై
భవదామోదముఖంబు వైద్యుతగతిన్
భావించు నప్పట్టునన్.

మ. భవదీయప్రజచుట్టియుండ నడుమన్
భాసిల్లు నీరూప మా
హవ మధ్యానఁ దెళుక్కు మంచు దనకు
ద్యద్ధైర్యముం జూప, సం
స్తవనీయంబుగఁ దక్షణంబ యసి చే
తంబూని కల్పాంత భై
రవ భీమంబుగ శత్రులం దునుము సం
రంభంబ యూహించెదన్.

స్త్రీలఁగూర్చి కొంత యవహేళనముగ నింతవఱకుఁ గథ సాగియున్నది గావున నిఁక నైన స్త్రీల యుత్తమతత్త్వమును ప్రదర్శింపఁదగుననియు, వీరైన స్త్రీ స్వాతంత్ర్య రక్షణార్థమైన యుద్ధోదంతమునుగూడ కథ

యందుఁ బ్రవేశపెట్ట దగుననియు నరకము వచ్చునట్లు 'లిలియా' యిట్టి గీతములపాడె నని యున్నది. ఆలుబిడ్డలఁ గాపాడుటకై ప్రాణములనైన యోసింపక మహావీరులు యుద్ధరంగముల నుఱుకుచుందురు. సంఘమునఁ బురుషులకున్నతిగాని, పతనముగాని స్త్రీలతోడిదే యగుటవలన స్త్రీల యాశయములగూర్చి యొకసక్కియములాడు వైఖరులనుండు కథలకు స్త్రీల కోర్చుట్లుండ గలదు? కావున నీకనైన నట్టిఘోరణిని గట్టిపెట్టి కథనుదాత్త తత్త్వమున సాగింప వలయునని లిలియా గోరికొనుచున్నది. తదనుగుణ్యముగ నీక కథయుఁ జెప్పఁబడు చున్నదని గమనింతురుగాక.

నా గ్రహావేశమున వణకిపోవుదానివలె గాలికి సంచలించుచున్న రాజగుడారమునకుఁ మమ్ముఁ దోడ్కొనిపోయెను.

లోనఁ దీక్షణమగు దీపముల కాంతి యందుఁ దొలుతనాకనులు చీకట్లుపడెను. నన్నుఁజూచి యచ్చటఁ జేరియున్న వీరు లొండరులతో వెటకారములఁ జెప్పుకొను నట్లొక క్షణ మేమోగుజగుజలు పోయిరి. అంతలో నెంతఁ ద్రొక్కియుంచినను అణగి యుండని దానివలె వారియందలి యుపహాస్యతత్త్వ మొక్కసారిగ చిక్కన నీవలకు వచ్చుటచేత నచ్చటి మహావీరులు, మహారాజులు, పరిజనులు నోడల్లిఁగకుండ కడుపులు చెక్కలగునట్లు నవ్వఁదొడఁగిరి. మాయాఁడువేసములు మాకు బ్రాతవడి పోయెను గాని వారికట్టి జగన్మోహనరూపములఁజూచుట కదియేక్రొత్త. ఆపైన వారు పౌరుషహితులును, ప్రతాపశాలురునగుట వలన నాఁడువేసమున నధఃపతితుఁడనగు రాజకుమారుని నన్నుజూచి పొట్టలఁబట్టుకొని వికారముగ నకిలింపఁదొడఁగిరి.

## రా జ కు మా రి

ఆవల మేము రెండడుగులు వేయునంతలో నచ్చట నిలచియుండిన యొకవిగ్రహమునుండి, 'నిలువుఁడు. ఎవ్వరది?' అను కంఠస్వర మొకటి మాశ్రవణములఁబడెను. 'సంస్థానమునకుఁ జెందినవార మిర్వుర'మని నేననుచుండగ నారక్షకభటుఁడు మమ్మాన వాలుపట్టి 'రండు. దయచేయుఁడు. మీ నిమిత్తమే యాలోచనసభయందున్నారు. వారిరువు రీవలకే వచ్చిరి. మహారాజును మేల్కొంచి సేనాధిపతులతో నున్నారు.' అనిపలికి కవచధారియు ఖడ్గపాణియునగు నాసైనికుఁ డొక్కసారిగ నక్కడనుదయించిన మహానగరమువలె నున్న మావారి శిబిరమునందు గుడ్డతోఁ జేయఁబడిన యిండ్ల గుంపులనడుమ సింహధ్వజములతో

అంత విపరీతమగు నవ్వువలని యానంద భాష్పములతోఁ బ్రక్కలెగరోజుకొనుచు మాతండ్రి కమలాకరవర్మనుజూచి "రాజా, నీవిఁక విడుదల పొందితివి. మాతనయునకు 'హామీ'గా నిన్ను నిలిపి యుంచితిని. అయిన నీ వేషముతో నిదివాఁడో లేక యేదైన గొట్టుగాయు నెట్టి యువతియో నాకుఁదెలి యకుండ నున్నది. మాపాకశాలల నెంగిళుల నెత్తు బోనకత్తెలైన నింతకన్న పరిశుభ్ర

ముగ నుండురుకద !" అని తిరుగ నవ్వఁ దొడంగెను.

ఆ మహిళావిద్యాలయోద్యానమునం దలి శూరాంగనల హస్తములకుఁ దొరక కుండఁ బారిపోవునపు డచ్చట క్రిందఁబడుట చేత నా యాఁడువేసపు చీర బాడయి డాగు లుపడి యుండెను. మఱియు నాపాదశిరః పర్యంతమును నేను రాజకుమారుఁడననుట కయోగ్యమైన వైఖరినుండి పోతిని.

అప్పుడా వీరులలో నొకఁడు తననోటికి చేయి అడ్డముగఁబెట్టి ప్రక్కనున్న వేఱొక వీరునితో రహస్యముగ "చూచితివా! సోకుఁడు దగిలిన వానివలె నెట్లున్నాడో!" అని నన్నుఁజూచి పరిహాసమాడుచుండగ మాతండ్రి యుగ్రముగ నతని నవలో కించుచు "మీ సోకుడులను మిమ్మును సైతానుఁడెత్తుకొని పోవలె"నని యాతని శపియించి నాతో "ఇట్టి యపాత్రవైఖరి నుండకుండ కత్తులఁబట్టి యుద్ధమొనర్పఁగల మగవాఁడవగు"మని నన్నదలించుచు 'పొమ్ము కృష్ణవర్మనాకు సర్వమెఱిగించెను.' అని పలికెను.

శాసనాతిక్రమణ మొనర్చు బడిపిల్లలు గురువుల బెత్తపుఁదెబ్బలకును వాటితోడి చీవాట్లకును తలలువాంచి యావలకుఁ బాఱి పోవునట్లు నేనచ్చటనుండి యావలఁబడి రాజలాంఛనముల మెఱయు నెప్పటివేష మును ధరించి అప్పటి కుదయించియున్న సూర్యప్రకాశమున ధగధగలాడుచు కృష్ణ వర్మను కలసికొంటిని. ఆ సమావేశము తొలుత మాకిరువురకును కొంత సిగ్గుకలిగిం చెను కాని రాత్రి యాతఁడు పాడినపాట కును—నేనప్పుడు కొట్టినదెబ్బకును పరస్పర ము వెల్లడించుకొనిన తరువాత నాతఁడు తన కథనిట్లు చెప్పెను.—అట్లు మాపురుష త్వమును పట్టించుకొనుట కాతఁడు మిగుల విస్మయపడి యావలకు పఱుగిడెను. అంధ కారబంధురమగు నానిశా సమయమున నాతఁడు దారి తెలియకుండ నడయాడు చుండగ నొకచోట దుఃఖవివశయయి పరిదే వనమొనర్చు శకుంతలను కలసికొనెను. "కాని యంతలోనే మీతండ్రి సైనికుల హస్తములలోఁ బడిపోయితిమి.—అయిన నా శకుంతలమాత్ర మొక్కమాటయైన పలుకదు మారాడదు ఆగుడారమున నున్నది" అని నన్నును పార్థసారథిని అక్కడ కుఁ దోడ్కొనిపోయెను.

అక్కడ ప్రోవులు బెట్టఁబడియున్న ఆ యుధపరంపరలనడుమ ఏదేనియున్నత స్థాన మునుండి బలాత్కారముగఁ బడగొట్టఁబడిన శిలావిగ్రహమువలె శకుంతల నేలపైఁబరుం డియుండెను. అనుకంపనీయమగు ఆమె యా కృతినిఁజూచి నేను బిచ్చవడిపోతిని.

సైన్యముల వెనువెంటఁ గ్రుమ్మరుచుండు సేవక స్త్రీలజాతికి చేరియుండువృద్ధాంగన యొకత ఆమె పార్శ్వమునఁ గూర్చుండి తదేకధ్యానమున నామెను జూచుచుండెను.

పార్థసారథి సోదరి నుపలక్షించుచు "అక్కా! యేల వాపోయెదవు?—తల యెత్తి మమ్మొక్కసారి చూడుము. మే మిందఱమును నీకు ఋణపడియున్నాము. అయినను నీవుచేసిన దానియం దయుక్త మేమున్నది? ఏకోదర సంజనితుఁడనగు నన్ను నీ రాజకుమారుని స్వహస్తములతో మరణ శిక్షకుఁగురి చేయలేవుకద! గహనమగు పరిస్థితులయందు చేయదగిన దానినిచేయుట కంటె హృదయసౌఖ్య మింకొకటియుండదు. కావున నీవు ధీరచిత్తవై ఉపశాంతివహిం చుటలెస్స." అని పలికెను.

అదేవిధమున నేనును—"అమ్మా! నీ వూరడిల్లవలెను. ఏ వ్యక్తిముందు నాకీ సర్వధరామండలమును కొఱగావని భావిం తునో అట్టి యామెను నేను సహితము పోగొట్టుకొంటినికానా?" అని పలికితిని.

ఆమె నామాటలవిని కదలి రుద్ధ కంఠ మున మెల్లగ నేడ్చుచు లేచి కూర్చుండెను.

"ఆహా! నాబ్రతు కెందులకు? కాల్ప నా? ఆమెను—నాజీవిత సర్వస్వమైన నా మిత్రురాలిని—చూచుచుండగఁ బోఁగొట్టు కొంటిని. హతబుద్ధినై, మందభాగ్యనై ఆమెయెడ ద్రోహమొనర్చి—ఆమెకు, నాకు, సర్వమాని నీలోకమునకు దూరమై పోతిని. ఇంత తుచ్ఛస్థితికిఁ బాలయి నేనెట్లు జీవింపగలను? — నాయొద్ద మీరొనర్చిన శపథముల కనురూపముగ నెందులకుఁ బ్రవర్తించినారుకారు? అట్లయిన నాకింత మునిఁగియుండక పోవునే!—ఎంతపాడు!— ఎంతతుచ్ఛము! ఇంత పాపాత్మురాలను నా కుపశాంతియెట్లు?" అని వాపోవ దొడంగెను.

ఆమె మాటలకు కృష్ణశర్మ తన పశ్చా త్తాపమును వెల్లడించుచు — "అయిననో యుత్తమాంగన! నీకై, నీ పసికూనకైన నీ వుపశమిల్లి జీవింపవలయునని ప్రార్థించు చున్నాను. వృథావాపోయిన నేమి ప్రయో జనము?" అని పలికెను.

ఆమె యంచులకుఁ గొంచెము బిగ్గరగ నిట్లనుచు విహ్వాలింపఁ దొడంగెను.

"ఆహా! నా అహల్యా!—పుష్పమువంటి నాముద్దుబిడ్డను బోగొట్టుకొంటిని—ఇఁక నీ జన్మమున నాబిడ్డమొగముఁ జూడను గావలయు. కఠినాత్మయగు నాయిందిర నాబిడ్డ నిఁక నాకు దక్కనిచ్చునా?—చూచు చుండగ నెంత యాపదకుఁ బాలయిపోతిని! ఇఁక నాబిడ్డ యేమయిన నెవ్వరి కేమికావలె? చూచువారు లేక, ఆదరించువారులేక నిష్కారణముగ, నిష్కరుణముననది చచ్చి పోవును గద! లేదా, నిరాదరణమున రోగ పీడితయైపోవును గావలయు! ప్రతిదానికి ప్రతియల్ప నేరమునకు 'ఈపిల్ల దానిపిల్ల' యని కోసిపెట్టుచుందురు! ప్రతిదానికై తల్లిని దలంచి వారు దానిని బాధించుచుందురు. ఆహా! కుసుమకోమలమగు నాముద్దుబిడ్డ! నాయహల్యబ్రదికియే యుండినయెడలవారు చెప్పుడు దానినిబట్టి నేనిట్టి పాపాత్మురాల

నని నాయందెట్టి ఆకటికి జెందమును వహించునో! నేను దాని కెక్కడి తల్లిని! దురాత్మురాలనై దాని నచ్చట నెందుకు వదలి వచ్చితిని? అదిలేక పాడిల్లువలెనున్న యీ ప్రపంచముననే నేమిచేయుదును? నలువురలోఁ దలవంపగునని, పరిహాసాస్పదురాలగుననదునని భయపడి వారప్పుడొనర్చిన గోలకు బీతిల్లుటచేత నాకింత దుర్గతి పట్టినది. ఇఁక నే నేమైననగుదును కాని నేను వారి గుమ్మము యొద్దకుఁబోయి నాబిడ్డ నిచ్చి వేయవలసినదని రేయిబవలేడ్చుచుఁ గూర్చుండిపోవుదును. 'నా అహల్య! నా అహల్య'అని వారిచెవులకు వెక్కసముగ నేడ్చుచుఁ గూర్చుందును. నాబిడ్డను నా కప్పగించువఱకు నట్లొనర్చి తీరుదును. తుదకు ప్రాణమువిసిగి నాబిడ్డను నాకిచ్చివేయుదురు. దాని నెత్తుకొని నాహృదయ దుఃఖము నివారించుకొనవలయుఁగాని అంతవఱకు నాకూరటయుండదు. ఆహా! నా అహల్యను నాకుఁదిరిగి యొప్పగించు వానికి నేనెంత కృతజ్ఞురాలనై యుందును!"

"ఊఁఅడిల్లుము తప్పక నీవామెను పడయగలవు."అని కృష్ణవర్మ పలికెను. ఆమె మాఱుమాటాడక తన యెప్పటిస్థితియందు భూతలమున నొరగిపోయెను. పరహస్తగతమగునప్పుడు కొన్ని యల్పకీటకము లొనర్చునట్లు మరణమభినయించు దానివలె నామె నిశ్చలతత్వమున నుండిపోయెను.

## సోదరీమణుల కొకమనవి

రాబోవు అక్టోబరు మాసారంభమున యథాప్రకారము గృహలక్ష్మి దసరా సంచిక వెలువడును. దానిలో స్త్రీలచే మాత్రము రచియింపబడు వివిధవిషయములకు సంబంధించిన చక్కని పద్య గద్య వ్యాసములు ప్రకటింపబడును. దీని కాంధ్ర విద్వత్సోదరీమణుల సాహాయ్య మత్యంతావశ్యకము. కావున సోదరీమణులెల్ల తమ పద్య గద్య వ్యాసములను సాధ్యమైనంత త్వరగా బంపి దసరా గృహలక్ష్మి సర్వాంగసుందరిగా వెలువడునట్లు తోడ్పడుదురని మనవి.

సం. గృ. ల.

తినడానికి తియ్యగా తేలిగ్గా చల్లగా వుండే ద్రవాహారం.

పండ్లు — పుచ్చపండ్లు, తాటిముంజలు.

చల్లగా — త్రాగటానికి
- నారింజపండ్ల షర్బతు
- తరవాణి
- పసగడుగు Rice Washings
- తరుబూజానీళ్లు
- తేనె—నీళ్లు
- కొబ్బరికాయనీళ్లు
- పానకము
- తాటిముంజలనీరు
- ఆవుచల్ల

చల్లమీదినీళ్లు కమ్మగావుంటాయి. వీటి ఉపయోగము ఆరోగ్యమూనూ.

అయితే

కృత్రిమంగా చల్లదనం వచ్చేటట్లు చేసి వాడబడే

Iced(ఐస్డ్) బాదంకీర్
- మంగోలా
- బనానా
- పైన్ ఆపిల్
- ఆరంజ్

మొదలైనవన్నీ వెంటనే కాకున్నా కొన్నాళ్లకు శ్వాససంబంధమైన జబ్బుల్ని తెచ్చిపెట్టవి. ఇది గమనించవాల్సిన విషయం.

ఈ ఆహారపానీయాలకు తోడు నిద్రకు ఒక ధారాగృహముంటే (Remaining in a house containing artificial springs or jets of water) శరీరం హాయనిపిస్తుంది.

వాగ్భటుని యీ ధారాగృహవర్ణన వాసయోగ్యస్థానము

"ఆకాశమునంటునట్టి గొప్ప వృక్షములచే సూర్యరశ్మి నడ్డగించుచు మల్లికాతీగెలతో చుట్టబడిన ద్రాక్షగుత్తులచే ప్రకాశించుచుండు వనములో పందిలిని నిర్మించి దానిచుట్టు సువాసనగల పన్నీరుచే తడుపబడిన వస్త్రములను జుట్టి, మామిడిపండ్లు, మామిడిచిగుళ్లు, మామిడి పూలగుత్తులు వీని నధోముఖముగ వ్రేలాడుచుండునటుల గట్టి దానిలో నతిమృదువైన అరటిచిగుళ్లు, చెంగలువ, తామరతూండ్లు, తామరపువ్వులు, నల్లకలువలు యీ మొదలగు వానిచే నిర్మించబడిన శయనమునందు గ్రీష్మకాలమున మధ్యాహ్నములో సూర్యకిరణ తాపమును సహించలేని మనుజుడు నిద్రించవలయును. లేక పుష్పములు చిగుళ్లు కట్టబడి విచిత్రమైన వస్త్రాభరణాదులచే నలంకరించబడిన హస్తములు... ముఖము వీనిమూలముగ సుగంధమైన జలము వెలిపడుచుండు స్త్రీరూపమైన ప్రాను మొదలగువానిచే జేయబడిన బొమ్మనునిచియుండు ధారాగృహమునందు గాని నిద్రించవలయును. రాత్రులయందు చంద్రకిరణములచే వ్యాప్తమైన మేడమీద వసించవలయును."

శ్రమాన్ని పోగొట్టే ఉపాయాలా

"స్వస్థచిత్తుడు చందనముచే తడుపబడిన శరీరముగలవాడు పుష్పమాలికలను ధరించినవాడు ... అతిసూక్ష్మమైన వస్త్రమును ధరించినవాడునైన పురుషునికి జనించిన శ్రమము జల

ముచే తడుపబడిన విసనకఱ్ఱలు, తాటివిసనకఱ్ఱలు, మృదువుగ గాలిరాతగిన నెమలియీకెలు మొదలగువానిచే చేయబడిన విసనకఱ్ఱలు, జలకణములను వర్షించునట్టి మందవాతము, పచ్చకర్పూరము, మల్లికామాలలు, ముక్తాహారము, హరిచందనము, ముచ్చటగ మాటలాడు శిశువులు, గోరింక, చిలుకలు ... మొదలగువాని సేవనచే నివర్తించును.”

ఇది మనకు సాధ్య మెంతవరకు ?

ఎండల్లో ఆహారపానీయాల మాటటుంచి అదనపు వేడివల్ల కలిగే గెడ్డలబాధా, ఏమరియుంటే కలిగే తేళ్లబాధా వీటి నివర్తికి సూక్ష్మ సాధనాలు తెలుసుకొనుండటం మంచిది.

### గెడ్డలు

పసుపు, వేపాకు, గన్నేరాకు వీటిలో దేనైనా నూరికట్టే గెడ్డలు హరిస్తవి.

చంద్రకాంతఆకులు, దాసానిచెట్టుఆకులు, తమలపాకులు వీటిలో వేటికైనా ఆముదము చరిమి వెచ్చజేసి గెడ్డలకువేసినా అవి హరిస్తవి.

బియ్యపు పిండికాని యెర్రమన్నుకాని నీళ్లతో వుడికించికట్టే ఉపయోగమే.

మంచి గంధంలో రసకర్పూరం గాని హారతికర్పూరంగాని కలిపి, బాలింతజోలు పట్టు, కచ్చికఆముదముకలిపి పట్టిస్తే గెడ్డలు అణిగిపోతవి.

చందనతైలపువాడుక, చందనబొమ్మలు అరగతీసి లేపనముచేయుట, కాపడము, శీతలోపచారాలు వీటినిగురించి వివరించనక్కర్లేదు తెలిసిన వాడుకలు కాబట్టి.

### తేళ్లబాధకు

ఏంచేసేదానికీముందు కుట్టినచోటుకు పైగా గుడ్డపేలికగాని తాడుగాని బిగించి కట్టి, చన్నీళ్లల్లో స్నానంచెయ్యడం మంచిది. ఆపైన ఏదో ఒక లేపంవెయ్యొచ్చు.

### ప్రక్రియలు

పెద్దవుల్లిపాయ రెండు ముక్కలుగకోసి దానిమీద సున్నపుపొడిచల్లి రుద్దితే మంట తక్షణం నిమ్మళిస్తుంది.

పసుపుముద్ద కాల్చి పొగపట్టే విషము హరిస్తుంది.

నేలవేముపైనరుద్దీ సేవిస్తేనూ విషం నివర్తిస్తుంది.

గచ్చపప్పు గంధం అంటించి నిప్పుతో కాస్తేనూ విషం హరిస్తుంది.

నవాసారం సున్నం కలిపి వాసనచూచినా, కుట్టినచోట అంటించినా, కుప్పింటాకు నూరి పట్టించినా, ఉత్తరేణిఆకులు నూరి పట్టించినా విషం నిస్సందేహంగా విరుగుతుంది.

దుష్టపువేరు గంధం, వస గంధం, కుంకుడుకాయ గంధం, గోరోజన గంధం ఉపయోగమే.

ఇక అందరికీ ఇంట్లోచల్లగా
కూర్చోడానికి వీలుంటుందా?

ఎండల్లో వానల్లోతిరిగి కష్టపడి బ్రతుకు తెరువు చూచుకోవాల్సినవారున్నారుగా. వీరికి ఎండవడ తాకడంవల్ల ఎండదెబ్బ కల్గటంకద్దు. దీనికి తగు చికిత్సచేయకపోతే కొన్ని సమయాల్లో ప్రాణహానికూడా.

జ్వరం, తెలివుండకపోవడం, నోరెండటం, తలనొప్పి, పోటు, దిమ్ము, మైకం, మూర్ఛ, వాంతులు......ఇవి లక్షణాలు.

ఇలావడతాకితే బాగాగాలివచ్చే ఓ విశాలమైన గదిలోకి తీసుకెళ్లి పరుండబెట్టి, చుట్టూమూగక, చల్లటిగుడ్డ నొసటిమీదుంచి, బాగా విసురుతూ తెలివుంటే ఇంత చల్లటి నారింజపండ్లషరబతో పానకమో ఇచ్చి అప్పటికీ ఒకవిధంగా తేరుకోకుంటే డాక్టరుకు కబురంపడం మంచిది.

పిల్లలవిషయంలో

అతి జాగ్రత అవసరం. ఎండదెబ్బ (Sunstroke) వేడిమి దెబ్బ (Heatstroke) రెండూ ముప్పుతెచ్చి పెట్టేవే.

ప్రయాణం ఎంతమాత్రమూ ఉచితం కాదు యీకాలంలో.

పిల్లలగదుల్లో తలుపులకు కిటికీలకు వట్టివేరుచాపలుకట్టి నీళ్లుచల్లుతూ పండ్లరసము, రెండుమూడుమార్లు నీళ్లు త్రాగిస్తుంటే చాలా అనుకూలం.

ఉక్కిరి బిక్కిరి చేసేదుస్తులు టోపీలు వాడటంప్రమాదం.

—ఎస్. శేషగిరిరావు.

# పుష్పచయము

## లిండక్‌బర్గు శిశువు కేసు

నాగరికత, పదార్థ విజ్ఞానశాస్త్రము ఎంత వేగముగా పాశ్చాత్య ప్రపంచమున—ముఖ్యముగా నమెరికా ఖండమున—పరువులిడుచున్నవో యంతకంటెను ద్విగుణీకృతమగు వేగముతో ఘోరనేరములచట ప్రబలుచున్నవి. ధనరాసులమధ్య పొరలాడుచున్న ధనికులు ప్రాణముల నరచేతిలో బెట్టుకొని నివసింపవలసి వచ్చుచున్నది. కఠిన శిక్షలువేయుచు ప్రభుత్వము వేయిగనులతో గనిపెట్టియున్నను నేరస్థులు మితిమీరి ప్రజల శాంతజీవితములను హటాత్తుగా పటాపంచలు జేయుచున్నారనుటకు ప్రపంచమంతయు గగ్గోలుపుట్టించిన యీ లిండన్‌బర్గు శిశువుహత్యా కేసు నిదర్శనముగానున్నది. దానివివరములు క్లుప్తముగ క్రింద వ్రాయబడినవి.

1932 వ సం|| మార్చి 1 వ తేది ఉదయము హోప్‌వెల్, న్యూజెర్సీ (అమెరికా) సమీపమందొక భవనమున నొకదాది తనపాలనమునందున్న 21 నెలల బాలుని మేల్కొలుపుటకు వెళ్లెను. అచట బాలుడు లేడు గాని, పదివేలపౌనుల నడుగుచు వ్రాసినచీటి యొకటిమాత్ర మందుండెను.

ఆమె అరపులు, గోల ఇంటిలోనివారందరిని అచటికి తెచ్చెను. త్వరలో శిశువు చోరులచేతులలో బడినట్లు తెలిసిపోయెను. ఆయింటికి మైలుదూరములోపలనేయున్న పోలీసుల కావర్తమానము వెంటనే తెలియజేయబడెను. తరువాత ఉదయమున భాగములుగా నున్న నిచ్చెనతోగూడిన మోటారొకటి సమీపము వెళ్లుచున్నట్లు ఒకరు తెల్పిరి. చోరులు మోటారుమీద పోయిరి. ఈవార్త పోలీసులందరికి తెలుపబడెను. వారిని వెదకుటకు మితిలేనిధనముగూడ వెచ్చమయ్యెను.

దినములు గడచుచుండెను. పదివేలపౌనుల ధనమిమ్మని పలుమారు వంకరవ్రాతతోడి చీట్లు వచ్చుచునే యుండెను. దొంగమాత్రము పట్టుబడలేదు.

మార్చి 8 వ తేది డా. జాప్సి కాండక్ అను నొక యుపాధ్యాయుడు దొంగలకును లిండక్‌బర్గువారికిని మధ్యవర్తిగా నుందునని జెప్పగా నందరు దానికి సమ్మతించిరి.

పరిశోధనలు సాగుచునేయుండెను. ఆయింటికి దక్షిణపువైపున నిచ్చెనభాగములు గనపడెను. అంతకంటె మరేమియు పత్తా దొరకలేదు. లిండక్‌బర్గు నిద్రాహారములమాని చింతతో నుండెను.

డాక్టరు కాండల్‌గా రొకదినము శ్మశానవాటికయం దొకనిని గన్గొనెను. వాడు దొంగలించినపుడు బిడ్డకున్నదుస్తులను గుర్తుగా నిచ్చెను. కొన్నిదినములతరువాత బిడ్డను వెనుకకిచ్చుటకై కోరబడిన 10 వేల పౌనులకు ఆడాక్టరు సెక్యూరిటీపత్రమును ఆతనికా శ్మశానవాటికయందే యిచ్చెను.

కాని శిశువునుమాత్రము తిరిగి చోరు లివ్వలేదు.

దినములు వారములు గడచిపోవుచుండెను. పరిశోధనలు సాగుచునేయుండెను. శిశువు దొరకలేదు



"అదో అమ్మ వస్తూంది!"



"వ్వూ, ఊః! అమ్మేదీ!"

మే 12 వ తేది దొంగలింపబడిన భవనమున కైదుమైళ్ళదూరమున శిశువు తలలో నొక తుపాకి గుండుతో చచ్చిపడియుండుట కనుగొనబడెను. ఈఘోరమునకు ప్రపంచమంతయు నుడికిపోయెను.

ప్రశ్నపరంపరలు బైలుదేరెను. అందరిని అనుమానింపసాగిరి. కడకా యింటనున్న వైలెట్ షార్ప్ అను సేవకురాలగు యింగ్లీషు యువతి ననుమానముపై నిర్బంధించిరి. కాని — ఆమె ఆత్మహత్యచేసికొనెను!

కాలము జరిగిపోయెను. మే 1 వ తేది 1933 వ సం|| కాండన్ చోరునకిచ్చిన సెక్యూరిటీలు న్యూయార్కుబ్యాంకులో జె. జె. పాల్క్నర్ అను పేరుతో నున్నట్లు పోలీసులకు తెలియవచ్చెను. ఈలోపల చీట్లపైనగల వ్రాతలబట్టి నేరస్థుడిట్టి యాకారము గల్గియుండునని సిద్ధాంతములు జేసిరి. తుదకు సెక్యూరిటీ పైక మున్నచోటు కనిగొనిరి. అది బ్రూనో రిచ్చర్డు హాప్టుమాన్ వద్ద దొరికెను. వారు వ్రాతలబట్టి నిర్ణయించిన ఆకారమున కాతడు సరిగా సరిపోయెను. వెంటనే ఆతని అరెస్టుచేసిరి. దొంగ దొరికెను. పరిశోధనలు ముగిసెను. దొంగను వెతకుటకైనకర్చు 80,000 పౌనులు !

విచారణ ఆరంభమయ్యెను. హాప్టుమాన్ శాంతముతో నుండుచువచ్చెను. విచారణ 1935 వ సం ఫిబ్రవరి 13 వ తేదివఱకు జరిగెను. ఆతడు దోషియని నిర్ణయించిరి. విచారణకు 32,000 పౌనులు కర్చయ్యెను !

ఇది ఇంతటితో ముగియలేదు. దోషి అపీలు గావింపనెంచెను కాని ఆతనివద్ద పైకములేనందున ప్రభుత్వమువారే ఆ కర్చులను భరించిరి. ఆ అపీలు అంగీకరింపబడనందున సుప్రీముకోర్టుకు తిరిగి అపీలు గావించిరి. దీనికి 16,000 పౌనులు కర్చు !

దానివలనగూడ ఫలిత మగపడలేదు. 1936 జనవరి 17వ తేది యాతని మరణశిక్ష జరుగవలసి యుండెను. కాని అట్లు జరుగలేదు. అది మార్చి 31వ తేదిని మరల వాయిదా. అపుడుగూడ తప్పిపోయెను. కారణము? పాల్ వేండల్ అనునతడు తానే ఆనేరము గావించియుంటినని పోలీసులకు జెప్పెను. దానికి విచారణ జరుగవలసియుండెను. దాని కాలస్యము జరుగును. ప్రభుత్వమువారి కాలస్యము గిట్టదయ్యెను. కావున హాప్టుమాన్‌కు విద్యుచ్ఛక్తిని పారించి మరణశిక్ష కొనసాగించిరి. హాప్టుమాన్ కడపటివరకు తాను నిర్దోషినని చెప్పుచునేయుండెను!!

## పట్టిన దయ్యాన్ని తరుమగొట్టితే ప్రాణాలదీసుకొని పరుగెత్తింది

ఇప్పటికి రేపటికికూడ దయ్యములు మనుష్యులను పట్టి పీడించే ఉద్యోగములను వదలుకొన్నట్లులేదు. అయ్యవి పురుషులను, బాలురను, వృద్ధులను అట్టే తరచుగా బాధింపవు, యవ్వనములోనుండే స్త్రీలనే మిక్కుటముగా బట్టి బంధించుట సాధారణమైనది. ఈ దయ్యముల విషయము భూతవైద్యులకంటె, వైద్యులకంటె బాధపడే వారికే యెక్కువగా తెలుసునని అనుకొనవచ్చును. సాధారణముగా స్త్రీలకు హిస్టీరియా యను వ్యాధివచ్చి వారు దానివలన విపరీతచేష్టలుచేయుచు బాధపడుచుండునపుడు వారికి దయ్యముబట్టినది అనుకొనుట వాడుకయైనది. ఈ పిచ్చినమ్మకములకు లోనై చాలమంది యపాయముల బొందుచున్నారు. ఇది విద్యాగంధములేని గ్రామస్థులలో

నెక్కున. ఈ దయ్యముపట్టుటయు, దానికి యజ్ఞానులై యొనర్చెడి చికిత్సవలన గల్గు లాభము నిటీవల వేలూరుసమీపమున జరిగిన వృత్తాంతమునుబట్టి సోదరీమణులు దెలిసి కొందురని నమ్ముచున్నాము.

అన్నమ్మాళ్, హనుమంతన్ అను భార్యాభర్త లిరువురు మదరాసు సమీపమునగల పల్లవరము గ్రామస్థులు. వారు బంధువులున్న కరై గ్రామమునకు వచ్చి వసించుచుండిరి. అన్నమ్మకు దయ్యము పట్టినట్టి గుర్తులు గన్పించుచుండెను. ఫిబ్రవరి 14వ తేది సాయంకాల మామెను దయ్యము గట్టిగపట్టుకొని విడువకుండునట్లుండెను. వారున్న యింటి ఇల్లాలు మరియమ్మ విభూతి ఇత్యాదులతో దయ్యమును తరుమ గొట్ట ప్రయత్నించి విఫలయయ్యెను. అంతటా దయ్యము పెద్ద రాతినెత్తుకొని బజారువెంట నడువగా నామె వెంట మరియమ్మ బెత్తముచేసికొని దానిని భయపెట్టుచు వెంటరాసాగెను. గుంపుజేరినవారంద రామెకు సాయ పడుచుండిరి. ఇంతలో విభూతిధరించి పూజారివా రచట ప్రత్యక్షమై దయ్యమునకు (అన్నమ్మకు) రెండు ఉడుకులెంపకాయల నిచ్చిరి. దానితో దయ్యము రాయితోగూడ క్రిందబడెనుగాని వెడల నిరా కరించెను.

పూజారి మరియమ్మ చేతిలోని బెత్తమును దీసికొని అన్నమ్మను చావమోదెను. కాని దయ్యము పోవుట కంగీకరించలేదు! వెంటనే పూజారి బెత్తము బారద్రోచి ఒక చెట్టుకొమ్మను దీసికొని మరల దేహ శుద్ధిగావించెను! అయితే దయ్యము—దానికి లెక్కలేదు కాబోలు—పోలేదు.

పూజారికి కోప మెక్కువయ్యెను. వెంటనే ఆవూరి గ్రామదేవతగుడికి పరుగెత్తి అందున్న కత్తిని దీసికొనివచ్చి క్రిందపడియున్న అన్నమ్మను కొట్టుట కారంభించెను. గాయములపై గాయములయ్యెను. రక్తము చిమ్ముచుండెను. ఆమె గుడ్డలు భూమియు తడిసిపోవుచుండెను. అయితేమాత్రము—దయ్యము ససేమిరా యనుచుండెను. ఎంత మొండిదయ్యము!

అంత టామెకు చుట్టు ఎండుగడ్డిపరచి అగ్ని ముట్టించిరి. దానితో ఆమె చీరగూడ అంటుకొనెను. ఇంతవఱకు ప్రేక్షకులలో నొక్కరైన ఈ ఘోరమును నిలుపమనిగాని, "నీకు పుణ్యముంటుందిలెండి దయ్యము గారూ పొండి" అని ఆ దయ్యమునుగాని అనరైరి. కాని యిపుడా ఘోరమును సహింపజాలక ఒకడు అగ్ని నార్పివేసెను.

తరువాత వీరి కష్టము ఫలించెను. దయ్యము వెడలిపోయెను. పాపము—దానితో అన్నమ్మ ప్రాణములుగూడపోయెను!! పూజారివా రింత కష్టపడి దయ్యమును పంపి, దానితోగూడ అన్నమ్మ ప్రాణము లను తోడుగా పంపినందుల కాతనిపై హత్యానేరము మోపిరి! అన్నమ్మ శరీరముపై 16 కత్తిగాయము లుండెను!!

హానిజేయు సంకల్పము తనకు లేదనియు, దయ్యమును వెడలగొట్టుటకే వారి యిష్టప్రకారము ఆవేశముతో అట్లు గావించితిననియు పూజారిగారు వాదించిరి.

నిజమేననియు అంతటి మహాత్కార్యము జేసినందులకు మరణశిక్షగాక యావజ్జీవద్వీపాంతరవాస శిక్ష మాత్రమె వేయుచున్నామనియు న్యాయాధిపులు సెలవిచ్చిరి.

## 65 సం॥ వరుడు—16 సం॥ వధువు

ఎంత యవినీతికరమైనను, ఎంత ప్రకృతికి విరుద్ధమైనను, ఎంత ఘాతకమైనను, విజ్ఞాను లది ఎంత నికృష్టమైనదని, దుర్మార్గమని చెప్పినను కించిత్స్వార్థమునకై పశుప్రాయులై మానవు లితరులకు యావజ్జీవనరకము గల్గించు పనులను జేయ బూనుచునే యుందురు. మానవత్వము, దయాదాక్షిణ్యాది గుణములు—మరేమైన—వారిని అట్టి దుర్మార్గములనుండి వెనుకకు లాగజాలవు. ఈక్రింది యుదంతము దీనికి తార్కాణమైయున్నది. ఇట్టి పట్టుల నిట్టి మానవులపట్ల సంఘము చాల కఠినత వహించి నిష్కారణముగ ప్రవర్తించిననేగాని ఫలితము గలుగనేరదు; అమాయకులై ఏపాప మెఱుగనివారలకు నరకయాతనలు నిలువవు; సంఘము మంచిస్థితికి రాజాలదు.

ధన్‌బాదు సమీపగ్రామమున నొక బ్రాహ్మణుడు గలడు. అతనికి 16 సం. వయస్సుగల కుమార్తె గలదు. బరద్వాన్ సమీపగ్రామస్థు డొకడు 40 సం. ప్రాయమువాడనియు, ద్వితీయ వివాహమున కనియు మధ్యవర్తులు కన్యనడుగ నతడు తనకుమార్తె నాతనికిచ్చుట కంగీకరించెను. ముహూర్తము నిర్ణయింపబడెను. ఆనాటిరాత్రి వరుడు తన పరివారముతోగూడి యాడంబరముతో చనుదెంచెను. ముహూర్తసమయమున పెళ్లి పీటలమీదికి వచ్చిన వరుని జూడగా నతడు 40 సం.వాడు కాడు గాని 65 సం. తక్కువగాక తలంతయు తెల్లగనరసి, పండ్లజాడేమియు లేక పండుముసలిగా గనపడెను. వెంటనే వధువుపక్షమువారందరా వివాహము జరుగరాదని యడ్డగించిరి. వధువుగూడ "మా తాతలాగనుండుట కర్హుడైన యాతనికిచ్చిన ఆత్మహత్య గావించుకొందు"నని చెప్పెను. దీనికి తగిన సమాధానము జెప్పక వరునిపక్షమువా రందరు తిన్నగ జారిపోయిరి. కాని తాతగారుమాత్రము వివాహమగునంతవఱ కాచోటు గదలనని భీష్మించుకొని కూర్చొనిరి. తుద కా వధువున కచటనే ఆతాత కనులయెదుటనే వివాహమయ్యెను గాని ఆ తాతకుగాదు.

వివాహమునకు గావలసిన పరికరములన్నియు సమకూర్చబడి, జరుగవలసిన విధులన్నియు జరిగి యుండినందున ఆ కన్యకవివాహ మారాత్రియే నిలువక జరుగవలసియుండెను. అటనుండు కొందరు ముందంజవేసి ఆవూరునందు బ్రాహ్మణులం దెవరైన వరుడు దొరకునేమోయని వెదుకజొచ్చిరి. వారామెను వివాహమాడమని పెక్కుమంది యువకుల బ్రతిమాలిరిగాని యెవరును సాహసింపలేదు.

తుదకు వారు పగలంతయు పరీక్షలకు జదివి యలసి బాటప్రక్కనే చాపపై బరుండియున్న యొక విద్యార్థిని గన్గొనిరి. ఆత డా మరునాటి యుదయమున పరీక్షకు వెళ్లవలసియుండెను. వా రతనిలేపి తమ్ము వెంబడించుమనిరి. అతడు దిగ్భ్రమజెంది తా నేమిజేయుచున్నదిగూడ దలంప నశక్తుడై వారిని వెంబడించెను. ఈలోపల ఆవిద్యార్థి తండ్రినిగూడ గన్గొని కుమారుని వివాహమున కనుమతి యివ్వవలసినదని బ్రతిమాలగా నతికష్టముపై నాత డందుల కంగీకరించెను. తుదకు వివాహము తెల్లవారుజామున గావింపబడెను. ఈ సమాచార మింతలో చుట్టుప్రక్కలవారందరికి దెలియుటవలన నచట జేరిరి. వీరందరు నూతన వధూవరులను ఊరంతయు నూరేగించిరి. అంతవఱకుగూడ ఆతాత అచటనే కూర్చొని యీతంతు ఆమూలాగ్రముగా చూచుచునేయుండెను. కాని తరువాత జరిగిన వివాహపువిందులో నాతడు పాల్గొనెనో లేదో తెలియదు.

# గ్రంథపరిచయము

**పల్లెపట్టు**

"పల్లెయే సర్వప్రపంచము, పంటపొలమే కామధేనువు, పత్నియే తన యిహపరమ్ముల భాగ్యదేవతగా" నెంచు భారతమాత ముద్దుబిడ్డడగు రైతును క్రమక్రమముగా నేఁడందరు కన్నెత్తి చూచుచున్నారు. రాజనీతిజ్ఞులగు నాయకులు, సంఘసంస్కారులగు నేతలు రైతువైపు తమ దృష్టుల పారించుచుండగా "రవిగాంచనిచో కవిగాంచు" నన్న కవికుమారుడు రైతుజీవితము తనకైతకు వస్తువుగా దీసికొనకుండజాలడు. కర్షకకుమారుని జీవితము కవికుమారుల కిటీవలనే పొడగట్టినది. అట్టి కవికుమారులలో నీ పుస్తకమును రచించిన చిరుమామిళ్ల విజయపార్థసారథిగా రొకరు. 'కల్మషంబును గాలదన్నిన కర్షకుల ప్రేమంపుజీవన'మును గేయములందు కనులపండువుగ, మనోహరముగా వర్ణించినారు. ఇందుగల సీతారాములజీవిత మాదర్శప్రాయమై యతిరమ్యముగ చిత్రింపబడినది. వారు "చీకు చింతాలేని ప్రాణులు, చెలిమికలుములు గలుగు జీవులు." భారతజాతీయప్రతిమలు.

కాని నేటిరైతున కింత యదృష్టములేదు. కవిగారు వ్రాసినట్లు "నిర్భరం బతిదుర్భరంబౌ, గర్భదారిద్ర్యమ్ముపాలై, కూటిపేదై—గుడ్డపేదై, నేటి రైతుండెక." దీని నందరు గుర్తించి వారి శ్రేయోభివృద్ధికై పాటుపడిన గాని ఫలముండదు.

ఇందు ప్రకృతి రామణీయకమును వర్ణించుపట్టున పాత్రలను చిత్రించుచోట గ్రంథకర్త చాల నైపుణ్యమును జూపెనన చెల్లును. ఈ చిన్నిపొత్తము కర్షక జీవితమును జూపు మనోహరచిత్రము. 60 పేజీలు. ముద్రణాదులు చక్కగనున్నవి. వెల తెలియదు. పలయువారు చిరుమామిళ్ల విజయపార్థసారథిగారు, ముప్పాళ్ల, నందిగామ, కృష్ణాజిల్లా అని వ్రాయగలరు.

**నిజాము రాష్ట్ర పరిపాలనము**

భారతదేశసంస్థానము లన్నిటి యందును మిన్నయై భాగ్యనగరమని పేరొందిన హైదరాబాదు రాష్ట్రపరిపాలనా విధులు క్లుప్తముగ నిందు వ్రాయబడినవి. ఆ రాష్ట్రీయులకేగాక ఆరాష్ట్రమును గురించి యెఱుంగగోరు నితరులకుగూడ నిది నుపయోగముగా నుండగలదు. ఈ రాష్ట్రమునగల సంస్థానములు, వాని పరిపాలనము, నైజాము పూర్వచరిత్ర, రాష్ట్రవిభజనము, శాసనసభ, పరిపాలనమందుగల పలుశాఖలు వీనిని గురించిన వివరములు వ్రాయబడినవి. రాష్ట్రీయభాగములను, ముఖ్యపట్టణములను జూపు దేశపటముగూడ చేర్చబడినది. ఉర్దూపదము లితరులు సులభముగ గ్రహించు రీతి వానికి తెలుగు ఇంగ్లీషు సరియైన పదములును, వ్రాయబడినవి. దీనిని సురవరము ప్రతాపరెడ్డి, బి.ఎ.,బి.ఎల్. గారు రచించిరి. గోల్కొండ ఆఫీసులో దొరుకును. గోల్కొండ చందాదారులకు 4 అణాలు. ఇతరులకు 6 అణాలు.

**వయోజనవిద్య**

ఈ కరపత్రమును ఆంధ్రపాఠకలోకమునకు చిరపరిచితులైన శనివారపు సుబ్బారావుగారు రచించిరి. ఇందు వయోజనులకు గ్రంథాలయములు సులభముగ విద్యనేర్పు పద్ధతులు వివరింపబడినవి. ప్రభుత్వమువారు చదువువచ్చిన ప్రతివారికి వోటు నిచ్చుటకు హక్కు నిచ్చియున్నారు. కావున ప్రభుత్వమువారితో సంబంధముండుటకు చదువు ముఖ్యసాధనముగనున్నది. దానిని వయోజనులకు గ్రంథాలయములే వ్యాప్తిజేయ చాల సాయపడును. ఈ కరపత్రమును వేటపాలెము సరస్వతీ నికేతనమువారు ప్రకటించిరి.

**శ్రీహరినాథావతారము**

పై గ్రంథమును శ్రీ కుసుమహరనాథతత్త్వ ప్రచారిణీ సభ, రాజమండ్రివారు ప్రకటించిరి. వెల 0-5-0.

కలికాలమున పరమాత్ముని యవతారమనియు, అయనను గొల్చినవారికి మోక్ష మతిసులభమనియు శ్రీ హరనాథునిగూర్చి చాలమంది నమ్ముచున్నారు. కాని కొంతమందిమాత్రము ఆయన పరమాత్ముని యవతారముగాదనియు, నందరివలె సామాన్య మానవుడనియు, ఆతని భక్తులాయనుగూర్చి చెప్పు విషయము లుత్ప్రేక్షలనియు వాదించుచున్నారు. ఈ వాదప్రతివాదములతో నిట ప్రసక్తిలేదు. ఈ పుస్తకమునందు హరనాథబాబు గారియొక్కయు వారి సతీతిలకమగు కుసుమకుమారదేవిగారియొక్కయు పుట్టుపూర్వోత్తరము లాదిగాగలుగు విషయములు గలవు. వీరు భగవత్స్వరూపులని కావలసిన నిదర్శనములును, పెక్కుమంది అభిప్రాయములును ఇందు చేర్చబడినవి.

---

# పత్రికాపరిచయము

## గోష్ఠి

“శ్రీమదాంధ్ర విద్యాపీఠగోష్ఠివారి యాజమాన్యమున బ్రకటితమగు సచిత్రవైజ్ఞానిక మాసపత్రిక. ఇందు ధర్మార్థమోక్షములకు సంబంధించిన సకలవిషయములును సరసముగను సమగ్రముగను చర్చింపబడును. ఆంధ్రరత్న గోపాలకృష్ణ లీలలన్నియు నిందు ప్రదర్శింపబడును.” గోష్ఠి మహోదాశయములు గమనింపదగినవై యున్నవి. ఇందుగల పద్యగద్యవ్యాసము లుద్రేకపూరితములై విశ్వమానవ సౌభ్రాత్రత మాశించునవై యున్నవి. అల్పకాలములోనే ఈగోష్ఠి ఆంధ్రుల గౌరవాదరణములబడసి యభివృద్ధియగుగాకయని యెంచుచున్నాము. సాలుచందా 1-8-0 రు. స్త్రీలకు, విద్యార్థులకు మాత్రము రు. 1-0-0. వలయువారు, మేనేజరు, గోష్ఠి, బెజవాడ అని వ్రాయగలరు.

## గోల్కొండ పదునొకండవ సంవత్సరాది సంచిక

పదునొకండవ సంవత్సరాదిసంచిక నందుకొనుటకు సంతసించుచున్నాము. నైజామురాష్ట్రమున గల ప్రముఖులగు ఆంధ్రుల చిత్రపటములచేతను, ‘ప్రజాహితసమస్యలు, పశురక్షణము, స్త్రీసమస్య, సాంఘికసమస్యలు, కథలు, వాఙ్మయము, చరిత్ర,’ మొదలగు 23 వ్యాసములచేతను నలరారుచున్నది. ఈ వ్యాసములన్నియు, ఆయా శాఖలందలి ప్రముఖులచేత వ్రాయబడినవి. వీనిలో నిరువురి స్త్రీలవ్యాసములు గూడనుండుటయగాక, తంజావూరు రాజాస్థాన కవయిత్రులనుగురించి పరిశ్రమచేసి వ్రాసిన వ్యాసముగూడ గలదు. వీరు స్త్రీల కట్టిగౌరవము గల్గించినందులకు శ్లాఘనీయులైయున్నారు.




## భారతస్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ

పైశీర్షికతో నీ సంచికయందు స్థలాంతరమున నలువురి సోదరీమణుల యభిప్రాయములు ప్రకటింపబడినవి. ఈ నలువురకుకూడ యీసమస్యపై కొంచె మెచ్చుతక్కువగ నొకేదృష్టియున్నట్లు గన్పడుచున్నది. పాఠకులందరీ యభిప్రాయములతో పూర్తిగా నేకీభవింతురో లేదో చెప్పఁజాలము. చాలమందికి భేదాభిప్రాయము లుండవచ్చును. లేక ఇంకను ఈ సమస్యపై వ్రాయవలసిన విషయములున్నవని వారు దలంపవచ్చును. కావున సోదరీమణులెల్ల నీ శీర్షికనుచదివి తమ యభిప్రాయములనుగూడ మాకు జూను 15 వ తేదిలోపల వ్రాసిపంపినచో ప్రకటింపగలము. వ్యాసము లెంతక్లుప్తముగ నున్న నంతమంచిది.

## స్త్రీలు—వోటింగుహక్కు

ప్రభుత్వములన్నిటియందును పరిపాలనా విధానమందు ప్రజల సంబంధ మెక్కువగా నుండు విధానముగల ప్రభుత్వమే తృప్తికరముగనుండి చిరస్థాయిగ నుండునని అందరికిని దెలిసినవిషయమే. ఆరంభమునందు ప్రభుత్వ మెట్లేర్పడినను కడపట ప్రజలకు పరిపాలనావిధానమం దెక్కువ ప్రాతినిధ్యమీయవలసినదే. ప్రజలు ప్రభుత్వమునందు ప్రాముఖ్యముగల్గి యుండవలయునన్న వోటింగు హక్కు తప్పక గల్గియుండవలయును. దానిని చక్కగ నుపయోగించు మార్గముగూడ నెఱింగియుండవలయును. ఈ వోటింగు హక్కు పెక్కుదేశములందు వయసువచ్చిన ప్రతిస్త్రీపురుషులకును గలదు. అందువలననే వారు తమ ప్రభుత్వములందు పాల్గొని దేశాభివృద్ధికి తోడ్పడి సర్వసౌఖ్యములతో తులతూగుచున్నారు.

ప్రజాప్రాతినిధ్యము తక్కువగాగల దేశములలో భారతదేశమొకటి. ప్రతివారికి వోటింగుకావలయునని అందరు కోరుచున్నారే గాని అంతటియదృష్టము భారతీయుల కింకను పట్టలేదు. కాని ప్రభుత్వమువారు కొంతమందికైన వోటింగుహక్కు గల్గించు నభిప్రాయముతో నియమించిన నిబంధనలలో విద్యయొకటి. అనగా విద్యావంతు లందరికిని వోటింగు హక్కుగలదు.

భారతీయులందు విద్యావంతులైన పురుషులే చాల తక్కువయయియుండగా స్త్రీల మాట చెప్పనేల? అదియునుగాక కొలదిగ విద్యావంతులైన స్త్రీలలోగూడ రెండు తెగలు గలరు. వారిలో నొకరు తమకు

స్వాతంత్ర్య మిసుమంతైన లేదనియు పురుషులు స్వార్థపరులై వారిస్వాతంత్ర్యము నణగద్రొక్కినారనుచు తీవ్రముగ నుపన్యాస ధోరణులందుబడి కార్యసాధనోపాయముల కొలదిగ నెఱింగినవారు. మిగిలి వారు వీరికి కేవలము వ్యతిరేకము. రావణుఁడు రాజ్యమేలితేనేమి, రాముఁడు పరిపాలించితేనేమి అని తామున్నయిల్లే సర్వప్రపంచముగా నెంచి సంసారబాధలందుబడి ప్రపంచము సమాచారమే యెఱుఁగనివారు. మధ్యరకమువారు చాలాతక్కువ. రెండవరకమునకు చెందిన వారిలో విద్యావంతులు పెక్కుమంది యున్నను వారు తాము వోటరుల జాబితాలందు రిజిష్టరు చేయించుకొని వోటింగు హక్కును చక్కగ గుర్తెఱిఁగి తగిన సమయములం దుచితరీతి నుపయోగించుట సాధ్యముగాకుండుటనేమో. అందరికిని వోటింగు హక్కు లేక పోయెనని లేనిదానికి వగచుటకంటె ఉన్నదానినే ఉచితముగ నుపయోగించి కార్యసిద్ధిబడయుట మేలు. కావున విద్యావంతులైన సోదరీమణు లీయవకాశము బోగొట్టుకొనక వోటరుల జాబితాలందు చేర్పించుకొనవలయును. అట్లుచేరుటకు మే నెలాంతమువఱకే వ్యవధియున్నను ఇంకను దానిని పొడిగించు సూచనలుగలవు. ప్రభుత్వమువారుగూడ నట్లు గావింతురనియే యెంచుచున్నాము. విద్యావంతులై యుండియు వోటరులుగా రిజిష్టరు చేయించుకొనుటకు వసతులులేని సోదరీమణులకు విద్యావంతులైనవారలు తగుసాయము జేయవలయును.

కాకినాడ విద్యార్థినీసమాజ

వార్షికోత్సవములు

కాకినాడయందు పై సమాజము యొక్కయు దాని యాధిపత్యమున నిర్వహింపఁబడుచున్న మహిళావిద్యాలయము, 'హిందూసుందరి' యొక్కయు వార్షికోత్సవములు జరిగినవి. శ్రీమతి కవితిలక కంచనపల్లి కనకమ్మగా రధ్యక్షతవహించిరి. ఆంధ్రదేశమున స్త్రీలయాజమాన్యమున నసే పాఠశాలయు, పుస్తకభాండాగారమును, పత్రికయు, నిర్వహింపబడుచుండుటలో నిదియ ప్రథమమనియు, సరియగు నాదరణములేకున్నను, కష్టనష్టముల గమనింపక శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారతి శ్రద్ధతో పై వానినన్నిటిని నిర్వహించుచు మహిళాలోకమున కెంతయు సేవజేయుచున్నారనియు ఆంధ్రులందఱెఱిఁగినదే. దానికి తగిన ప్రోత్సాహము ఆర్థికసాహాయ్యము ఆంధ్రులింకను హెచ్చించినచో నీ సంస్థను,తన్మూలమున తమ్మును,ఉద్ధరించుకొన్న వారగుదురని యెంచుచున్నాము.

ఈ వార్షికోత్సవసందర్భమున వెలువడిన 'హిందూసుందరి' ఏప్రెలు, మే సంచికనందుకొనుటకు సంతసించుచున్నాము. ఇందు అధ్యక్షురాలి గంభీరోపన్యాసము, సమాజనివేదికతోగూడ చక్కని పద్యగద్యవ్యాసములుగలవు. తల్లిగారివలెనే శ్రీమతి మహాలక్ష్మీ సుందరమ్మగారీసమాజమునెడ, పత్రికయెడ నెక్కువశ్రద్ధ బుచ్చుకొనుచుండుట శ్లాఘనీయము. ఈ సమాజము దినదినాభివృద్ధిబొందు గాకయని కోరుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# బలమునకు
# కాడ్ లివరాయిల్
# మంచిది
# దానికంటె స్కాట్సు ఎమల్షన్
# 3 రెట్లు ఉత్తమము



రోగాదులచే బలహీనమైన శరీరమునకు ముఖ్యముగా బలమిచ్చు ఏ ఆహార పదార్థమునకంటె కాడ్ లివరాయిల్ లో ఉత్తమగుణములున్నవని యిటీవల పరిశోధనల వలన తెలియుచున్నది. దీనియందు ఎ. డి. జీవధాతువు లధికముగ నున్నందున బలమిచ్చుట దీనికి సహజగుణము.

కాని దీనిని ఉన్నదున్నట్లుగా రోగములచే బలహీనులైనవారు, జీర్ణశక్తిలేనివారు సేవింపజాలరు.

అందుచేతనే స్కాట్సు ఎమల్షను ప్రాముఖ్యత. ఇది కాడ్ లివరాయిల్ నుండి, రుచిగా, సులభముగా జీర్ణమగునట్లు, దాని ఉత్తమగుణములు చెడకుండ అద్వితీయముగ తయారుచేయబడినది. దీనికితోడు స్కాట్సుఎమల్షన్ లైమ్, సోడాలోని, హైపో ఫాస్ఫైట్సుగల్గి సాధారణకాడ్ లివరాయిల్ కంటె మూడురెట్లుత్తమముగా నున్నది.

## రోగము రాకుండ కాపాడును.

స్కాట్సుఎమల్షన్ శరీరమును యథాస్థితికిదెచ్చుటకు బలము శక్తి గల్గించుటతోడనే ఆగదు. నూతనరోగములను రానివ్వకుండ సదా ఆటంకపఱచును. కావుననే బలహీనముగ నున్నపుడును, రోగాదులభయమున్నపుడును సేవించుట. కాదర్శప్రాయమైనది. రక్తాభివృద్ధి, నరములశక్తి, శరీరమునకు బలము గల్గించుటకు వైద్యులు 60 సంవత్సరములుగా స్కాట్సుఎమల్షనును సిఫార్సు చేయుచున్నారు.

**స్కాట్సు ఎమల్షన్**

కాడ్లివరాయిల్ కంటె 3 రెట్లు మంచిది.

కండరములను ఎముకలను వృద్ధిజేయును.

నరములకుబలమిచ్చును.

రక్తాభివృద్ధి గల్గించును.

రోగాదుల రానీయక ఆపును.



# SCOTT'S Emulsion

స్కాట్సు ఎమల్షను మండీవర్తకులు: శుద్ధమైన కాడ్ లివరాయిల్ నుండి

ఇంపీరియల్ కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్.

కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, లంబో, కాన్పూరు, పాట్నా, అహమ్మదాబాదు, కొచ్చిను, కాలికట్టు, ఖపట్టణము, కరాచి, అమృతసరము.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు. మదరాసు: అకుండి వెంకటశాస్త్రిగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని
జెమ్ షెడ్ పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, [లిమిటెడ్
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. సూకరాజుగారు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు
కాకినాడ: నున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్ బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
మచిలీపట్ణం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్ పేట.
కర్నూలు: టి. బాలనాగయ్యశెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.
నెల్లూరు: పంచాగ్నుల వెంకటనరసింహంగారు
శాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు వరఖాస్తు పంపుకొనుడు.

# విషయసూచిక

# తలవెంట్రుకలను నిడుపుగా, మృదువుగా సుందరముగా నుంచుకొనుటకీ సులభపద్ధతి నవలంబింపుము.

విడువక స్వస్తిక శీకాయ సబ్బు వాడుచున్నచో నీవుకూడ దీర్ఘములై సుందరములైన కురులుండగలవు. ఈసబ్బు తలవెంట్రుకల శుభ్రపరచుటలో నద్వితీయమైనది; కొప్పు దీర్ఘముగ పెరుగజేయును; నైగనిగ్యము కూర్చును; చుండు మాన్పును. కుంతలాభివృద్ధికి పేరుగాంచిన శీకాయ మొదలగు దినుసులతో శీకాయ సబ్బు తయారుచేయబడినది.

ఇది ఒక బిళ్లగాగాని, మూడు బిళ్లలుగల పెట్టెలుగాగాని దొరుకును. ఒక్కటి యుపయోగించిననే దాని సుగుణము మీకు తెలియగలదు. దీనికి మంచివాసన గలదు. స్నానాదుల కాదర్శప్రాయముగనుండును







## ది స్వస్తిక్ ఆయిల్ మిల్స్ లిమిటెడ్

వడాలా బొంబాయి

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్థ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ కొరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 20 0 0 అరపుటకు రు. 12 8 0 కాలుపుటకు రు. 8 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్థసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసినచే జబాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరని వారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లుతెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు,మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రముపంపకూడదు.



వరలక్ష్మి పూజ

వ్రతముల్ దేనికి ? పూజ లెందులకు ? స్వా
ర్థత్యాగముఁ లేనిచో,

బ్రతుకే హీనముగాదె యంచుమదిలో
బాటించి యెల్లప్పుడుఁ

పతికో పట్టికో బంధుజాలమునకో
భద్రంబు గాంక్షించి వే

వ్రతముల్ సేసెడు పుణ్యమూర్తికి నమో
వాకంబు లర్పింపరే.



# వర్ణాంతరవివాహ సక్రమత్వనిర్ణయ శాసనము

" చాతుర్వర్ణ్యమయాసృష్టం గుణకర్మ విభాగశః
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః."

( భగవద్గీత )

భారతశాసనసభయందు డాక్టరు భగవాన్దాసుగారు వర్ణాంతరవివాహ సక్రమత్వ శాసనమును ప్రతిపాదించిరి. దీని నిదివఱకే శ్రీయుత వి.జె. పటేలుగారు 1918 వ సంవత్సరమున ప్రతిపాదించియుండిరి కాని యది నిరుపయోగమై యంతరించెను. దానిని యున్నదున్నట్లుగానే భగవాన్దాసుగా రిపుడు ప్రవేశపెట్టిరి. ఈ చిత్తుచట్టము 1935 వ సంవత్సరము సెప్టంబరుమాసమున ప్రవేశ పెట్టబడినను 1936 వ సంవత్సరము జూలై 15వ తేదివఱకు ప్రజాభిప్రాయ మెఱుంగగోరి నిల్పియుంచునటుల నపుడు తీర్మానింపబడెను. ఆకాలము ముగిసినది. ఇపు డిది శాసనమగునో మునుపటివలె యంతరించునో చూడవలసియున్నది.

ఈచట్టముయొక్క ప్రధానోద్దేశ్యమియ్యది. వధూవరు లిరువురు భిన్నవర్ణములకు సంబంధించినవారైనను వారి వివాహము సక్రమమైనదని — హిందూధర్మ శాస్త్రము లు లంగీకరింపకపోయినను — పేర్కొనబడవలయును. ఆ వివాహానంతరము ఆస్తియందు హక్కు యథాప్రకారముగ నుండవల

యును. ఇష్టములేనిచో అంతర్వర్ణవివాహములు నిర్బంధములని ఈశాసనము బోధింపదు.

అంతర్వర్ణ వివాహాముల కాటంకము లిపుడు కూడ లేవని కొంతమంది యనవచ్చును. సదుపాయము లున్నసంగతి సత్యమేయైనను, వివాహమాడువారు మతమునైన లేకున్న ఆస్తినైన విడువవలసి వచ్చుచున్నది. ఈచట్ట మట్టియాటంకముల నుండి తప్పించును. దీని యావశ్యకతను గూర్చి డా. భగవాన్దాసుగారు యభిప్రాయము లివి:—

ఆది మానవులలో వర్ణాశ్రమధర్మములు లేవు. నాగరికత పెంపొందిన పిదపనే సంఘమందు గలవ్యక్తులు పరస్పరసాహాయ్యముచే సంఘోద్ధరణకుఁ బూనుకొనుటకై వర్ణాశ్రమధర్మము లేర్పరుపఁబడినవి. ఇవియు మానవ ప్రకృతియొక్క సహజ మనస్తత్వ సూత్రముల ననుసరించియు, ఆహారవిహారాది వ్యాపారసూత్రములఁబట్టియు, ఆర్థికసూత్రములఁబరికించియు, మానవజాత్యభ్యుదయ సూత్రము నెడ శ్రద్ధవహించియు, విద్యాబోధనావిధానమును దిలకించియు నాచరణ లోనికి దీసికొని రాఁబడినవి. ఈ వర్ణాశ్రమధర్మముల నెలకొల్పుటలో నపారమైన ప్రకృతి, ధర్మ, లోకజ్ఞానము లిమిడియున్నవి. బ్రాహ్మణుఁడన బ్రహ్మమును — వేదమును — అభ్యసించువాఁడని యర్థము. ఆతఁడు శాస్త్రపఠన శాస్త్రబోధనలవలననే జీవితముఁ గడుపవలసియుండును. ఇది యాతని వృత్తి. క్షత్రియుఁడనఁగా "క్షతత్రాణ" వృత్తినే యవలంబించువాఁడు. అనఁగా నపాయమునుండి రక్షించువాఁడు. సంఘమునకు కవచమువలెనుండి కాపాడుచే వృత్తిగాఁగలవాఁడు. "వైశః" — ఆస్తి సొత్తులను సేకరించువాడు వైశ్యుఁడు. పాఁడిపంటలచే పరిశ్రమలచే దేశాభ్యుదయమునకుఁ దోడ్పడువాఁడు. ఇఁక శూద్రుఁడన్ననో సేవకావృత్తి నవలంబించి మనువాఁడు. "ఆశుద్రావంతి" శీఘ్రముగా పరుగిడి ప్రతీహారులవలె పనిచేయు సేవకుల వంటివాఁడు. ఇతర చిల్లరివర్ణములకును, వర్ణములందలి భేదములకు నిట్లే సార్థకనామము లుంచబడినవి.

ఇట్టి వర్ణములన్నియుఁ గాలక్రమమున వృత్తులందు గలుగు విభేదములచే శాఖోపశాఖలైనవి. వాని నావిధముగ ఆదిలో పేరులుబెట్టి వేరుచేయుటలో సంఘమును విడఁదీయు నుద్దేశము లేదు. పోటీలులేక వారివారి వృత్తియందు వారభివృద్ధిజెంది పరస్పరసాహాయ్యముచే దేశాభ్యుదయమునకు మూలమగుదురను యుద్దేశ్యముచేతనే. మానవుఁడే వృత్తి యవలంబించువారి మధ్య జన్మించునో దాని ననుసరించియే యాతని చిత్తవృత్తి, స్వభావను యుండుటకలదు. అట్టివాఁడా జాతివారినే వివాహమైనచో వీరివృత్తి వంశానుగతమై వృద్ధిబొందవచ్చును కాని మానవునికి జన్మముతోఁగూడ వచ్చిన స్వభావమే జీవితమంతయు నుండుటరుదు. పరిసరప్రభావము, సంస్కారావకాశములు వృత్తిని మార్చవచ్చును. ఇట్లు మారినచో

వృత్తినిబట్టి నిర్ణయింపఁబడిన కులముకూడ మారిపోవునుగదా! ఇపుడు తమ కులవృత్తి ననుసరించువారు హిందూమతమున చాల తక్కువ.

అదియునుఁగాక భారతదేశమున పట్టణములు పెరిగినతరువాత నందుండువారు కులవృత్తుల మాని పరిసరములను, అవసరములను, అవకాశములను బట్టి యిష్టము వచ్చిన వృత్తులఁ బ్రవేశించుచున్నారు. వారు పుట్టుకతో నొక కులమువారు; వృత్తిచే నింకొక కులమువారు. ఇట్టిచో కులస్థాపనయందు యంతరార్థ మెఱింగినవా రిపుడు వర్ణాంతరవివాహముల కడ్డుచెప్పనేల?

నేఁడు హిందూమతమున సుమారు మూఁడువేల కులములున్న ట్లంచనా వేయఁబడినది. ఈ మూఁడువేల కులములవారు మూఁడువేల వేర్వేరువృత్తుల నవలంబించుట లేదు. ఒకటేవృత్తిని పెక్కుమంది యవలంబించుట మాత్రము గాననగును. వర్ణోత్పత్తి యందుఁగల ప్రధానోద్దేశ మీ విధముగ దూరముగాఁగ నీకులమువారలు తమ కుల మర్యాదలను స్వాతంత్ర్యమును చలాయించుచు స్వార్థపరత్వముతో ప్రాకులాడుదురేగాని తాము తదితర కులములయెడఁ బ్రవర్తింపవలసిన బాధ్యతలను గమనింపరు. పైగా కులములందు న్యూనతాధిక్యతలు ప్రబలి సంఘమును చీలఁదీసి ఐకమత్యమునకు తీరని యంతరాయములై యున్నవి. ఐన నీ అంతర్వర్ణములనన్నిటి నిర్మూలనము చేయవలయునను యభిప్రాయమీ బిల్లు ప్రవేశపెట్టువారికి లేదు; ఆబిల్లుగూడ దాని కుపకరింపదు.

ఈ వర్ణవ్యవస్థ నేర్పరుచుటలోఁగల నంతరార్థ మెఱిఁగి యీ కులనియమముల నతి కఠినముగాఁ గాపింపకపోయినచో నే సంఘమైనను స్థిరముగాఁ జిరకాలము వృద్ధిఁబొందుచుండగలదు. ఈ కులభేదములు – జన్మముచే నిర్ణయింపఁబడునవి – లేకున్నను వృత్తినిబట్టి చేయఁబడిన విభజనలు లేక జాతులున్నట్టి దేశములిపుడును గలవు. అవి యతిత్వరితగతితో యభివృద్ధిఁబొందుటకు వారియందు–జాతిభేదములున్నను–సంబంధ బాంధవ్యములందు కఠిననియమములు లేమియు, జాతులలో న్యూనతాధిక్యతలు గాన రామియు కారణములు.

వ్యాపారాదులఁ జేయవలసిన వైశ్యుఁడు రాజకీయరంగములందు ప్రవేశించి నేతయై దేశాభ్యుదయమున పాటుబడుట కాతని కులవృత్తి యంగీకరించునా? కృషియే ముఖ్యముగా నెంచు రైతుసోదరుఁడు ప్రభుత్వాధికారము వహించి దేశము పరిపాలింప నాతని కుల మొప్పుకొనునా? దీనికి హిందూధర్మశాస్త్రము లొప్పుకొనునా? దీని నిట్లాక్షేపించుటే హాస్యాస్పదముగ లేదా? కుల మంగీకరించక పోనిండు. ధర్మశాస్త్రములు వెలివేయనిండు. వారు తమ చిత్తవృత్తి ననుసరించి కులమర్యాదను లెక్కింపక యిష్టమైన వృత్తి నవలంబించినందుననే మానవాభ్యుదయమునకు తోడ్పడు మహాత్ములైరి.

వారు వృత్తిచే నిపుడింకొక కులమునకు సంబంధించినవారైరి గదా! జన్మముచే భిన్నకులములకు సంబంధించియుండి, జీవితమం దొకే వృత్తి ననుసరించు వారిరువురు వివాహమాడ దలంచుచో కులమర్యాదలు, మతము, ధర్మశాస్త్రములు అదికూడదని యనుటెందులకు? కులమర్యాదల నతిక్రమించి యిష్టము వచ్చిన వృత్తులందు ప్రవేశించువారిని ధర్మశాస్త్రములు, సంఘము, మతము వలదనజాలక యూరకుండి — వివాహవిషయములందు మాత్రమంత పట్టింపు జూపుటెందులకు?

వర్ణభేదములను, కులవృత్తులను నిర్ణయించినవన్న మన ధర్మశాస్త్రములు వర్ణాంతర వివాహముల కంగీకరించుట లేదా? బ్రాహ్మణులు తమకంటె తక్కువ వర్ణములవారని తలంపఁబడిన క్షత్రియ, వైశ్య, శూద్రుల వివాహ మాడవచ్చుననియు, తక్కువవారుకూడ క్రమము ననుసరించి యట్లు గావింపవచ్చుననియు ధర్మశాస్త్రము లంగీకరించుచు, నది యంద రవలంబింతురేమోయను భయముచే నట్లు గావించిన వారధోగతులగుదురని వచించినవి. నాఁడుగూడ వారు మానవమానసప్రవృత్తుల నెఱిగియే యిట్టి యనుకూలము గల్పించిరి.

వర్ణాశ్రమధర్మముల సుస్థిరముగ నెలకొల్పినను అవి కాల దేశ పాత్రలఁబట్టి మారక యెల్లకాల మొకేరీతి యుండవలయునని పెద్దల యుద్దేశమైనట్లు గానరాదు. భారతము శాంతిపర్వము చూడుడు: "ధర్మములు, ఆచారములు దేశ కాల పాత్రానుసారముగ మారుచుండవలెను. సర్వత్ర శ్రేయోదాయకమైన యాచార ధర్మము లెవ్వియు నుండవు. కావున నొక సంప్రదాయమువలనఁ గలిగెడు మేలు కంటె కీడెక్కువగానున్న ఆ సంప్రదాయము మారి మరొక సంప్రదాయము రావలెను. ఇదికూడ కొంతకాలమైన పిదప మార్పు చెందవలసియుండును. కాబట్టి సర్వకాల సర్వావస్థలందు నొకే రీతిగా వర్తింపఁగల ఆచారధర్మము లుండఁజాలవు." కావున లోకాచార వ్యవహార నియమములైన శాసనములు సజీవముగ నుండుటకుకూడ నిదియే మూలసూత్రము. సందర్భశుద్ధి, ధర్మసమన్వయము, దేశకాల పాత్రానుగుణ్యము ప్రధానలక్ష్యములుగా మన మూహించు ధర్మశాస్త్రకారులచే నూహింపఁబడెను. ధర్మములనునవి యుగ లక్షణము ననుసరించి మారుచుండునని మనువుకూడ చెప్పియున్నాడు.

నేఁడు మన సంఘమున నెంతవఱకు సవర్ణవివాహములు జరుగుచున్నవి? సమాన చిత్తప్రవృత్తి గలవారే, సమాన కర్మలయం దభిమానముఁగలవారే సవర్ణులనదగియుందురు గదా! అట్టి సమాన ప్రవృత్తికలవారి వివాహమే దంపతులకును సంఘమునకును శ్రేయస్సును గూర్చునని పెద్దలు నిర్ణయించిరి. కాని నేఁడు జరుగు వివాహములందు చిత్తప్రవృత్తికి గాని మరే ద్దానికిగాని ప్రవేశములేదు. పై పెచ్చుగ

వారు భిన్నవృత్తులందున్నను వృత్తి ననుస రించి నియమింపబడిన కులములను మార్చు కొనక జన్మించిన కులముల పేరుతోడే వ్యవ హరింపఁబడుదురు. అట్టివారు వివాహమాడి నచో నది సవర్ణవివాహ మెట్లగును?

భగవద్గీతయందలి శ్లోకార్థ మొకపరి గమనింపుఁడు. "జన్మతః ఏర్పడునది స్వభా వము; స్వభావము ననుసరించి గుణ మేర్ప డును; గుణము ననుసరించి వృత్తికర్మ యేర్ప డును; కర్మ ననుసరించి చాతుర్వర్ణము లేర్పడుచున్నవి." పై సిద్ధాంతమునకు కేవ లము వ్యతిరేకమై, విరుద్ధమై, మన సంఘ మందలి వ్యవహారములు నడచుచున్నంత మాత్రముననే సమాన చిత్తప్రవృత్తియం దేకీభవించి, జన్మించిన కులములు వేరైన యువతీయువకుల వివాహము సవర్ణము గాకపోవుచున్నదా?

హిందూమతమున వర్ణములలో శాఖలు, అంతశ్శాఖలు వెఱ్ఱిగాఁ బెరిగిపోవుచున్నవి. ఏడుగురు కనూజీ బ్రాహ్మణు లొకచోఁ జేరిన వారికి తొమ్మిది యును, పదుముగ్గురు గుజరాతీ బ్రాహ్మ లొక చోఁ జేరిన వారికి ముప్పదిమూఁడును, వంట పొయ్యిలుగావలసి యుండునని చెప్పఁబడు చున్నది. దీనివలన వర్ణవ్యవస్థ ఎంత సంస్కా రమును గోరుచున్నదో సహృదయు లెఱుం గకపోరు. ఈ విభజనలవలన న్యూనాధి క్యతాభిప్రాయము లెక్కువై పరస్పరవైష మ్యములు హెచ్చి సంఘము క్షీణదశ జెం దుట కవకాశముగలదు. ఒక్కొకమారు స్వశాఖయందు వరులు దొరకపోవుటయు, దానిమూలమున వరశుల్కపిశాచ మావిర్భ వించుటయు, సంతతి కుటుంబము లభోగతికి బాల్పడుటయు ననుభవజ్ఞులకు విదితము. ఈ పరిస్థితులలో తమ వివాహముల విషయమై కష్టపడుచున్న తలిదండ్రుల స్థితినిగాంచి భరింపజాలక వివాహోచితలైన కన్య లాత్మహత్యలకు బాల్పడుటయు నూతనము గాదు. వర్ణాంతర శాఖాంతర వివాహములు సక్రమమైనవని శాసనమున్నచో నిట్టి యన ర్థములకు చోటు దొరకకపోవుటయగాక యువతీ యువకులమధ్య వర్ణభేదము లెఱుఁ గక యభివృద్ధిపొందు ప్రేమకు దోహదము గల్గి సంఘము వృద్ధిబొందును.

పై భగవాన్దాసుగారి యభిప్రాయము లన్నియు, నిష్పక్షపాతదృష్టితోఁ బరికించి, ప్రపంచానుభవము దాని కనుసంధించి చూచినచో నవియన్నియు ససంగతములని యెవ్వరు ననఁజాలరు. కాని యీ విషయ ములు కనులారఁగనికూడ "అవన్నియు సరే! వర్ణాంతరవివాహములు మాత్రము హిందూ మతమున కూడవు" అని యందరనుచుం దురు. ఇదంతయు ప్రపంచ మేమనునోయను భీతిచేతనే. ప్రాఁతపద్ధతినివీడి నూతనత్రోవఁ ద్రొక్కుటకు డే సంఘమైనను, చిరకాలపు వాడుకచే నొసలుముడివైచి కన్ను బుస్స నకమానదు. కాని అందలి లాభమును గుర్తెఱిఁగినపు డామోదమును జూపును. ఇట్టి సంస్కరణములు తమ కభ్యుదయ సూచకములని భారతీయులెల్ల నేడు గుర్తిం తురేని అంతర్వర్ణవివాహ సక్రమత్వశాస నము గావించుకొని వృద్ధిబొందుదురుగాక!

# వివాహ చరిత్ర

"రాచ"

## ౨

### ప్రధానోద్దేశముల మార్పు

వివాహారంభమునుగురించి వ్రాయుచు దానికి ప్రధానోద్దేశము సంతానాపేక్షయని తెల్పితిని. మానవులయందు వివాహ మారంభమగుట కిదియేకాక యితరోద్దేశములు కూడ గలవు. చరిత్రాంశములతో పరిశీలించి చూచిన నీయుద్దేశము లొక్కొకపుడు ప్రధానముగను ఒక్కొక్కపుడు అప్రధానముగను నున్నట్లు తెలియగలదు. ఆదియుగమునుండియు నేటివఱకు సంఘపరిస్థితులను గమనించిన వివాహపద్ధతి ప్రారంభమగుటకు స్త్రీపురుషుల పరస్పరసాహాయ్యము లేక స్త్రీవలన పురుషునకుగల్గు ఆదాయము, సంతానము, ప్రేమ కారణములై యున్నట్లు గనపడుచున్నది. నేడు ప్రపంచపరిస్థితులుమారి నాగరికత వ్యాపించి పూర్వాచారములుమారి యున్నవన్నను పై యుద్దేశ్యములు పలుదేశములలో స్థిరముగ నాటుకొనియుండుట జూడనగును. సాధారణముగా పాశ్చాత్యదేశములలో కేవలము ప్రేమయే వివాహమునకు పునాదియగుచున్నది. ప్రేమించిన స్త్రీపురుషు లితరవిషయము లంతగా గమనింపక వివాహ మాడుచున్నారు. ఈ ప్రేమయందు పవిత్రత తక్కువయగుటచే నీ వివాహములట్టె సంతోషప్రదములై సౌఖ్యదాయకములై చాలకాలము నిలువకయున్నవి. ఈ పాశ్చాత్యదేశములోనే జర్మనీ ఇటలీమున్నగు దేశములందువివాహములు సంతానోద్దేశ్యమే ప్రధానముగాగొని నిర్వహింపబడుచున్నవి. ఇతర దేశములందు — ముఖ్యముగ మన భరతఖండమున — రైతులు పారిశ్రామికులాదిగాగలవారు వివాహమాడుట స్త్రీ తమ జీవయాత్రయందు, సంపాద్యమందు, కృషియందు నిరంతరము తోడ్పడునని యే. ఇవ్విధముగా నాదిలో ప్రధానకారణములని యెన్నబడిన విషయములు నేటి ప్రపంచమున గలవు — నేటి ప్రపంచము ప్రాచీనసంఘము యొక్క పరిణామమే గావున మానవ నైజగుణములన్నియు ప్రపంచమునుండి మాయము గాజాలవు. ఒక్కొక్క యుగమున యొక్కొక్కచోట పై యుద్దేశములు ప్రాధాన్యత వహించియుండెనని తెలియవచ్చుచున్నది.

నీతి, నియమము, ధర్మము, పాపభీతి, మొదలగునవి తెలియని యాదియుగములో పురుషుడు భౌతికబలముచే లోబరుచుకొన్న వానినెల్ల తనయాస్తి వస్తువులుగా గణించుకొనువాడు. నాడాతడు స్త్రీల స్వేచ్ఛాప్రవర్తనయెడ నీర్ష్యగాని వారిపై ప్రేమగాని జూపుటతో పట్టుదల గల్గియుండకపోయినను ఒకపరి తనకులోబడి తన యాస్తియైన స్త్రీ తన యిచ్చవచ్చినరీతి మెలగవలయునని యెక్కువపట్టుదలతో గమనించువాడు. స్త్రీ నాతడు తన బానిసయని భావించునేగాని జీవితమున కష్టసుఖముల తనతో వంచుకొను

భాగ స్వామియని తలంపడు. దీని కుదాహరణముగా, చిప్పవాస్ జాతులు స్త్రీలు పనిజేయుటకై సృష్టింపబడిరనియు స్త్రీలొకరే యిరువురు పురుషులు చేసినంతపనిని చేయగలరనియు దలంచుట నేటికి గాననగును. వారి గుడారములు స్త్రీలే నిర్మింతురు; దుస్తులను తయారుజేయుదురు; వారి సాయములేక ప్రయాణములు సాగవు; కావలసిన కార్యములన్నియు వారే జేయుదురు; పురుషుల కెక్కువ ఖర్చును గల్గింపరు.

ఇట్టి యభిప్రాయములతో నిండియుండిన పురుషమూర్తి నెదుర్కొన్న స్త్రీ యబలయై యుండుటచే సులభముగ లోబడియుండును. ఒకపరి తనకులోబడిన స్త్రీమూర్తి యితరుల యధికారమునకు లొంగియుండుటకు పురుషుడంగీకరింపనందుననే నాడు ప్రతిపురుషుడును నొక్కొక్కస్త్రీని తమయాస్తిగా స్వీకరింపుచు వచ్చెను. ఈ విధముగా స్త్రీ పురుషునికి భార్యయగుటకుమున్ను దాసియైనది. ఇట్టిదానిని లొకరికంటె యెక్కువమంది యావశ్యకమని పురుషుడెంచుచో, నిదేరీతి పెక్కుమంది స్త్రీలను వివాహము—ఇది సక్రమమైన వివాహమగుచో—చేసికొనువాడు. ఇపుడు మధ్యఆఫ్రికాఖండమందలి కొన్నిజాతులు పురుషు లెంతమంది స్త్రీలను వివాహమాడిన నంతమంచిదని తలంతురు. ఏలన వారు పురుషులను భరింతురు! కావలసిన వానినెల్ల సమకూర్చి వారిని సుఖపెట్టుదురు. 'డ్యూయెల్లా' జాతి భార్యయుండుట మూలధనమనియు, వారినుండి సంతానమును బడయుట వడ్డీ సంపాదించుటయనియు దలంచును. తనభార్య నాతడు తనకున్న వస్తువులలో నొక్కటిగ పరిగణించును గనుక నిష్టమున్న నింట నుండనిచ్చును; లేకున్న వెడల నంపును; లేక యితర వస్తువులతో మనుష్యులతో మార్చుకొనును — ఇట్టి విపరీతపద్ధతు లాదియుగమున విశేషము. వాని నింకొకవ్యాసమున వ్రాయుదును. ఆతడామె నేమిగావించినను తనలాభము, ఆదాయము చెడకుండ మాత్రము జూచుకొనుచుండును.

వివాహితలైన స్త్రీలకే నిర్బంధము లెక్కువగాని యవివాహితులైన కన్యలకట్టి నిర్బంధము లేనందున వారు స్వేచ్ఛావిహారులై యుండిరి. వీరిని పురుషులు, వస్తువులకు బదులుగా గాని, కొనిగాని, వివాహమాడుటకు మున్నామె గృహమున కొంతకాలము కృషిచేసిగాని, బడయుచుండిరి. సాధ్యమైనచో బలవంతముగ వారిని లోబరచుకొనుట సాధారణమైయుండెను. ఏవిధముగ వారు స్త్రీలనుబడసినను వారిచే సేవజేయించుకొనుటకే యనువిషయము స్ఫుటముగ తెలియుచున్నది.

వివాహమాడినవారికి సంతానప్రాప్తి గలిగెనేని వారిని పెద్దజేయు బాధ్యత స్త్రీపైననే యుండెడిది. నేటికిగూడ నంతియే. సంతానము పెరిగి పెద్దయైన కన్య లమ్ముడు వస్తువులుగను, కుమరులు కృషిచేయుట కుపయోగపడుచున్నందున సంతానమువలన లాభమును గ్రహించి పురుషుడు సంతానమునెడ నెక్కువశ్రద్ధ జూపదొడంగెను.

ఈయుగము మారినది. సంఘస్థితులు మారజొచ్చినవి. స్థిరనివాసము లేర్పడినవి. స్త్రీలు కృషి చేయుస్థలమును పురుషులు మెల్లగా నాక్రమించుకొనజొచ్చిరి — అనగా బానిసలుగా పురుషులు తయారైరి. ఇపుడు పురుషునకు తనవారు గావలసివచ్చినది. అనగా తన సంతానావశ్యకత హెచ్చినది. స్త్రీ గృహకృత్యముల నిర్వహించుటకును, సంతానము బడయుటకు ముఖ్యసాధనమని దలంపబడినది. ఈవిధముగ సంతానోద్దేశ్యము బలపడినది. ఈ యుగముకూడ మారినది. నవీనయుగ మారంభించినది. ఈ యుగములో పెక్కు దేశములందు — ఉన్నతస్థితి జెందిన ప్రతి సంఘమందును — ఆదాయమును గాని, సంతానమునుగాని వివాహమూడువారు ఆరంభములో గణింపరు. పరస్పర ప్రేమ సౌఖ్యములే నిపుడు వివాహమునకు ప్రధానోద్దేశములైనవి.

వివాహోద్దేశ్యములు, మూడు విధములుగా — ఆదాయము, సంతానము, ప్రేమ — మూడు యుగములకును సంబంధించినవిగా దలంపవచ్చును. వాని స్థానము లీ క్రింది విధమున జూపవచ్చును.

| మొదటియుగము | రెండవయుగము | మూడవయుగము |
|---|---|---|
| 1. ఆదాయము | 1. సంతానము | 1. ప్రేమ |
| 2. సంతానము | 2 ఆదాయము | 2. సంతానము |
| 3. ప్రేమ | 3. ప్రేమ | 3. ఆదాయము |

ఇందలి అంకెలు ప్రధానోద్దేశ్యముల ప్రాముఖ్యతను వరుసగా దెలుపును. ఈ విభజనను బట్టి చూచినచో నాదియుగమున వరుసగా వివాహమునకు ప్రధానోద్దేశ్యములైన ఆదాయము, సంతానము, ప్రేమ రెండవయుగమునమారి, సంతానము ప్రథమస్థాన మాక్రమించెననియు, మూడవయుగముగా ప్రకృత ప్రపంచమున ప్రేమ ప్రథమస్థాన మాక్రమించినట్లును దెలియగలదు.

ఆదినుండి యిప్పటివఱకుగల కాలము సౌకర్యార్థమై మూడుయుగములుగా భాగింపబడినది గాని, ఇంతవఱకు ఈ యుగమని గాని తరువాత నింకొక యుగమనిగాని విభజించుటకు సాధ్యము గాదు. ఒక యుగములోని యుద్దేశ్యము లెపుడు మారనారంభించెనో మఱియుగములోని యుద్దేశము లెపుడు ప్రారంభింపబడియెనో వ్రాయుటకు దుర్ఘటము. కాని యుద్దేశముల స్థానమునుబట్టి మాత్రమె మనము యుగములుగా కాలమును విభాగింపవచ్చును.

ఒక హెచ్చరిక. ఈ విషయములన్నియు వివాహమాదియుగమునుండియు పొందిన మార్పులను జూపుటకును, వివిధ సంఘములందలి విచిత్ర వాడుకలను వాని పరిణామమును మాత్రము పాఠకులకు తెలుపు నుద్దేశ్యముతో వ్రాయబడినవే గాని పూర్వము నుండి పురుషుడు స్త్రీ నిష్టమువచ్చినట్లుపయోగించెనని చూపుటకు గాదు. చదువరులీ యుదాహరణములగొని స్త్రీలపై యాధిపత్యమును—యుక్తాయుక్తమును వీడి, మానవత్వమును బోనాడి — జేయుటకును గాదు.

# ఆదర్శ ప్రపంచము

శ్రీమతి వెలిదండ చూడికుడుతమ్మగారు

అది జ్యేష్ఠమాసము మండువేసంగి. సూర్యభగవానుడు తన ప్రచండతేజోమహిమనంతా, కడుపుకోసరం వీధులవెంబడి తిరిగే కాటకజనానికి చూపిస్తున్నాడు. సంపన్నులైన మహనీయులంతా, తమతమ సౌధరాజాల్లో పైన యెలక్ట్రిక్ ఫానులు విసురుతూ ఉంటే, ఆపసోపాలుపడుతూ నిద్రపోబోతున్నారు. తెల్లవారుఝామున మూడుగంటలకేలేచి అకానో, జేడో, పెట్టి ఏఆకుకూరో, ఏనీళ్ల పెరుగో కొనుక్కొని దానివల్లవచ్చే లాభంతో ఆపూట బ్రతుకుదామనుకొని, కొన్నిమైళ్లదూరంలో ఉన్న పట్నాల్లోకివచ్చి ఇంట్లోనుండి వీధిలోకి అడుగుపెడితే తమ అడుగు కందిపోతుందనుకునే ధనవంతురాండ్ర పంచలంబడి దిమ్మతిరిగి, వారిచ్చే ఏరాళ్లనూకలో, ఏపిచ్చిసోలెడు గింజలో గంపలోపోసికొని, పైనుండి మాడ్చే ఎండ వేడికి, లోపట్నుంచి కాల్చేఆకలివేడికి తాళుకోలేక గబాగబా పరుగెడుతున్నారు పల్లెటూరిజనం తమతమ పల్లెలికింకా. అంతకంటె నిర్భాగ్యులైన కొంతమంది, ఆమాత్రం అమ్ముడుబోనందున ఇంకా ఆ ఎండలో, "పెరుగో, కూరో" అని సత్తువచచ్చిన కంఠస్వరంతో వీధులెంబడి కేకలేస్తున్నారు. బిచ్చగాళ్లు లెక్కలేకుండానే ఎక్కడచూచిన ప్రతిగుమ్మాలెంబడి వ్రేలాడుతూనే ఉన్నారు. ప్రేమానందరావు ఇంకా భోజనంలేకుండానే ఏదో ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాడు. లోపట్నుంచి అతనితల్లి భోజనానికి లెమ్మని రెండుమూడుసారులువచ్చి పిల్చిందిగాని పరధ్యాన్నంగా ఉండటంచూచి తిరిగి లోనికి వెళ్లిపోయింది. అతడు తనచేతిలో దాదాభాయిగారు వ్రాసిన "హిందూదేశదారిద్ర్యము" అను పుస్తకాన్ని పుచ్చుకొని పేజీలు తిరుగవేస్తున్నాడు. ఒక్కొక్కసారి వీధిలో దిక్కుమొక్కులేని గర్భదరిద్రులు ఎండలో పడేపాట్లను గమనించిచూస్తున్నాడు. కాని బేరంకోసం గంటలకొద్దీ కటకటలాడించే గృహిణుల పామరత్వానికి మనస్సులోనే క్రుంగిపోతూ, తాను వెళ్లి స్వయంగా "అమ్మా చేతిని అణాపబ్బాలుపెట్టుకొని దానిమీద ఏమైనా ఒక సోలెడుగింజలు ధారకం దొరుకుతుందేమో అనేఆశతో ఎంతోదూరంనుండి మీసమ్మాలకాడికివచ్చే కటికదరిద్రుల్ని ఇంత వేధించడం ఏంధర్మం ఏంన్యాయం అమ్మా" అని అడుగుదామన్నంత ఉద్యుతుడైపోతూ తిరిగి తమాయించుకుంటున్నాడు. అతనిదృష్టి పుస్తకంమీద ఉందో, లేక ప్రొద్దుట్నుంచి ఆగాపులో అల్లాడే జనంమీద ఉందో మనం నిర్ణయించలేము.

ఒక్కొక్కసారి ప్రకృతిస్వభావాన్నిగురించి యోచించుకుంటూ "ఓ ఈశ్వరా! నీవు కరుణాస్వరూపుడవు. నీకరుణాదృష్టి ఈదీనులమీద ఎందుకు పడటంలేదు?

"ఇటువంటి అన్యాయ అంతరములను కొంతవరకైనా పోగొట్టడానికి నీపవిత్రమైన న్యాయశక్తిని నాకీయుము. పరమపవిత్రమైనటువంటిన్నీ మహాదుర్లభమైనటువంటిన్నీ మానవజన్మ ఎత్తికూడా ధర్మసాధనానికి సాధనభూతమైన తమ శరీరాన్ని పోషించుకొనే అవకాశంలేని ఈకటికదరిద్ర సోదరులకు, కొంచమైనా సహాయముచేయగలశక్తి, దీక్ష నాకిమ్ము" అని కంటివెంట నీరుకారుస్తూ ప్రార్థనా నిమగ్నుడైనాడు. ఇంతట్లో తనగుమ్మానికి కొంచంప్రక్క

కుంటూ జేబులోంచి రెండురూపాయలు తీసి చేతిలో పెట్టి, "అమ్మా! బండిచేయించుకొని మరీ ఇంటికెళ్లు. ఇదిగో ఈ ఎనిమిదణాలు తీసికో బండిఅద్దెకు" అని చెప్పిపోతుండగా అక్కడే కూలిచేస్తూఉన్న పదేళ్ల కుఱ్ఱవాడొకడు తనదృష్టిని ఆకర్షించాడు. వాడినిచూచి

"ఆడుకోని, పాడుకోని, చదువుకోని ఖుషాసాగా ఉండవలసిన ఇంత చిన్న వయస్సులో తన కడుపునైనా పూర్తిగానింపలేని, ఈకూలిడబ్బులకు ఈఎండలో వానలో ఆవిధంగా కష్టపడి జీవింపవలసి వచ్చిందిగదా. ఇటువంటి పరిస్థితుల్లో పెరిగినవాళ్లే భవిష్యద్భారత పౌరులుగాఉండి దేశసౌభాగ్యాన్ని రక్షించవలసినవాళ్లు" అని అనుకుంటూ ఎండలో మాడిపోయినమొగంతో గుంటలుకట్టినకళ్లతో పని చేస్తూఉన్న ఆఅబ్బాయిదగ్గిరగా వెళ్లి,

"అబ్బాయీ! మీ అమ్మ నాన్న ఎక్కడున్నారు?"

"మానాయన నిరుటి వేసంగిలో ఇక్కడే పనిచేస్తూ వడొట్టి సనిపోయినాడండీ. మాఅమ్మకు కాళ్లుసేతులు పట్లు, వగరుపు ఆయాసమండీ. కూర్చుంటే లెగలేదు. నాకు పదిసంవత్సరా లుంటాయండీ. మా కులం కాపుకులం."

"అయితే మీ కెవరు గంజికాచిపోయడానికి దిక్కెవరు? గంజి ఎలాగొస్తుంది?"

"మాయమ్మ ఆలాగే నాలిగిళ్లకువెళ్లి బిచ్చమెత్తుకొ వత్తుందండి. నాచెల్లెలు ఎనిమిదేళ్లది గంజికాచిపోస్తుందండీ. అదే మాకాదరువండీ"

వినయునివైపుతిరిగి "వినయా! ఈ కుఱ్ఱవాడి కథ ఎంత దీనంగాఉందో విన్నావా? మానవజీవిత పరిణామానికి పునాదువంటిదైన ఈ బాల్యావస్థ ఈవిధంగా వికాసానికి అవకాశంలేకుండా ఎండి రాలిపోతున్నది. పరమేశ్వరుడు శాంతిసౌఖ్యాలని ఎప్పుడు ఇస్తాడో?"

## 3

"వినయా! మనం మొదలుపెట్టిన పని కొంతవరకు జయప్రదంగా జరుగుతూఉన్న ట్లేనుమా. ఇన్నాళ్లు ఈవికల్పాంగులంతా ఏమూలుండేవాళ్లో, ఎన్నెన్ని కష్టాలుపడుతుఉండేవాళ్లో కదా పాపము. వాళ్లందరికి తగిన సదుపాయాలుచేస్తూ, ఆరోగ్యనియమాలను గూర్చి చెప్పతున్నావుకదా? ఆదిక్కుమాలిన వాళ్లం దరికూచీ నీవేనుమా."

"నీవు చూడకుండా, నీవు లేకుండానే చూచే దెంతమాత్రం. మొన్న మనంకొని రిజష్టరీచేయించిన భూమి చాలా సారవంతమైనదని దానిని సాగుబడి చేస్తూఉన్న రైతుబిడ్డలు చెబుతున్నారు."

ఇలాగు వీళ్లు మాటాడుతూఉంటే వీధిలోనుంచి కొంతమంది పేదజనంవచ్చి కాళ్లమీదబడి,

"బాబూ! ఇల్లువాకిళ్లు కాలిపోయి కూడసుట్టం మొక్కదైవంలేకుండాఉన్న దిక్కుమాలినవాళ్లమండీ. అందరికీ తమరు ఆశ్రయమిచ్చి రచ్చిత్తున్నారు. మేమందరం మీకాళ్లబడ్డాం. ఏంచెయ్యమంటే అది చేత్తాం. దుక్కెడుగంజికి ఆదరువుచూపిస్తే అదే పదివేలు మాకు."

"అయ్యో! మీకెవ్వరూ సహాయం రాలేదా?"

"ఏంసహాయం ఎక్కడిసహాయం బాబూ. తాగడానికే గుక్కెడు నీళ్లులేక సచ్చిపోతున్నాము. మా అయిదారువందల గడపకీ మాగ్రాంపొలిమేరలో ఉన్న నుయ్యి ఒక్కటే మాఅందరికీ నీటికాధారం. ఇక మేము సేసేదేటుందిబాబు. గుడిసెలన్నీ అగ్గిదేవుడు మింగుస్తూఉంటే, గుడ్లప్పచెప్పేసి మిటకిరిస్తూ పిల్లల్తో పాపల్తో బయలుకొచ్చాం. మాగోల కాకిగోలండి."

"మీరందరూ ఇంతవరకూ ఏమేమిపనులు చేసుకుంటూ జీవిస్తున్నారు."



కీ॥ శే॥ సముయమంత్రుల వందేమాతరముగారు.

గృహలక్ష్మీ పాఠకుల కీమెరచనలు పరిచితములే.

ఉన్నతవిద్య లభ్యసింపకున్నను పత్రికాపఠనము

నందును, వానికి వ్యాసములు వ్రాయుటయందును

చాల యభిరుచి గల యిల్లాలు.



జపానుదేశీయులు చేతిపనులందును చిత్రకళలందును సుప్రసిద్ధులు. వారు గొడుగులను వెదురు కాగితము పట్టు వీనితో నతిసుందరముగ చేయుదురు. వివిధరంగులతో గొడుగుల తయారుచేయుచుండు టిందు గాననగును.

"ఇవని ఏంచెప్పంబాబూ. పోయినాళ్లు పట్నా లెంబడిపోయి ఒకపావల్డబ్బులు తెచ్చుకొని ఆ రోజు కారోజు కాలక్షేపం చేసుకోవడం. లేనివాళ్లు, కొండలెంట వెళ్లి, ఏసింతకూరో, ఏకర్వేపాకో, ఏ ఆకూరో ఇంతకోసి పట్నాలెంబడి వెళ్లి అమ్ముకొని ఆవచ్చినదాంతో జీవిత్తున్నామండీ. ఆ ఆకులైనా దసుంకట్టిందే కోసుకోనియ్యరుబాబూ అక్కడున్న బాబులు."

"మీరందరూ ఇక్కడుండవచ్చును. మీకందరికి కొన్నికొన్ని పనులు నేర్పుతాం. ఆపనులుచేస్తూ మేం చెప్పినట్టుగా మాత్రం ఉండాలి. ఇప్పటిమట్టుకు నూలుతీయడం,బట్టలు నేయడం,సులభమైనమార్గాలతో వ్యవసాయంచెయ్యడం, తోటలుపెంచడం, బియ్యం దంచడం, ఈ మొదలైనవన్నీ ఇక్కడ మేము చేయిస్తూ ఉన్నపనులు. మీ అనవసరపు అలవాట్లన్నీ క్రమంగా వదలెయ్యాలి. త్రాగుడు, నిషావస్తువులు వేసుకోవడం పూర్తిగా వదిలెయ్యాలి. ఆరోగ్యవిషయాల్లోకూడా, మేచెప్పిన సలహాలను మీ రనుసరించాలి. ఇటువంటి వన్నీ మీ మంచికోసరం నియమింపబడ్డ నియమాలని మీకందరికీ క్రమంగా వాటంతటవే బోధపడతాయి."

"సిత్తంబాబూ! మమ్మల్ని కాపాడ్డానికి మీ రిన్నిచమలు పడుతూఉంటే తమరిమాటని కాదనడం ఉంటుందా. నిప్పులోదూకమన్నా దూకుతాం, బాబూ."

ఒక ముసలివానివైపుచూస్తూ "ఏం లేలే! మా గ్రామంలో ఉండేవాడవు ఎందుకిక్కడికి ఈలాగు వచ్చావు? ఆక్కడ నీఇళ్లు వాకిళ్లు ఏమిచేశావు"

"అంతా తెలిసిన ప్రభువులు తమరు. నన్నిలాగున అడిగితే నే నేంచెప్పను. తనువంటి బుడతలందరూ మా గ్రామాల్ని వదలివేసి ఈలాగువచ్చేస్తే మమ్మల్ని పోషించేనాథు లింకెవరు? ఆ వున్నవాళ్లైనా మా గుడ్డలు కట్టుకుని మా కాకూలి డబ్బులు ఇచ్చే బుడతలుకారు. ఇక మాకు కడుపుగడిచే దేలాగండి. ఉన్న పొలని వదల్లేక ఇల్లువాకిళ్లు అమ్ముడుపోయేవరకు అప్పుసప్పులు చేసుకుంటూ, అలాగేఉన్నాము. ఇక ముందు దారిలేక పెళ్లాంబిడ్డల్తో కూడా తెగబడి ఒక ఏడాదిబట్టి ఈఊళ్లో కూల్చేసుకుంటూ, ఒచ్చినాడు ఇంతగంజితాగుతూ లేన్నాడు పడుకుంటూ రోజులు వెళ్లబుచ్చుకుంటున్నాం. వీళ్లందరూ ఇలా వస్తూఉంటే నేనుగూడా వచ్చాను. వచ్చినందుకు తమదర్శనమే అయింది."

"అయ్యో! చాలావిచారము. పల్లెటూళ్లు పట్నవాస సౌకర్యాలతో నిండనంతకాలము(అనగా మనిషి జీవితానికిఅవసరమైనంతమట్టుకు) ఈకష్టములు తప్పవు. కోర్టు పనులొచ్చినా, ఆసుపత్రిసౌకర్యాలు కావలసివచ్చినా, చివరకు సామాన్యవిద్య కావలసివచ్చినా పట్నాల్లోకివస్తేనేగాని వేరేలేదు. అంతకంతకూ చివరకు నీటికికూడా వాచిపోవలసినంత దురవస్థవచ్చినది పల్లెటూళ్లలో. అందువల్ల ఈ అల్లరులు పడలేక అందరూ పట్నాల్లోనే నివసించవలసిన అవసరం ఏర్పడ్డది. నన్ను నిందిస్తే ఏమిప్రయోజనం. ఒకసారి మాఇంటికి నీకొడుకును తీసికొనిరా."

"ఏంరాను. లేమితో డొమ్ములాటలాగు ఇక్కడికి వచ్చినప్పట్నిండీ, సహవాసాలు వాడికి జాస్తిఅయినాయి. తల్లితండ్రులం ఆయిన మామీద మనుపు చూపించే గౌరవము లేదు సరిగదా, ఒకొక్కనాడు కొట్టడానికికూడా వస్తాడు. వాడు తెచ్చుకొన్న కూలి డబ్బులు, వాడితాగడానికి, వాడి సినీమాలకి, వాడి పేకాట్లకి ఖర్చుపెట్టేసుకుని మమ్మల్ని ఇంకా ఇమ్మని వేధిస్తున్నాడు. ఇంట్లోపెళ్లాం, మేము, బ్రతికున్నామోలేదోకూడా వాడి కక్కర్లేదు. బాబూ! నా దుఃఖం ఎవరితో చెప్పుకోను."

"రామయ్యా ఇలా మారిపోతాడని కల్లోకూడా నేననుకోలేదుసుమా. నీకడ సారం కొడుకు ఏమైనా నేర్చుకుంటున్నాడా? వాడిపేరు పైడిగాదూ?"

“అవును బాబూ! వాడిపేరు పైడిగాడే. నేనేం చదువు చెప్పించగలను బాబూ జ్ఞానంవచ్చేటంత చదువుచెప్పించడానికైకా దగ్గరడబ్బులేదు. ఏదో కష్టపడి ఇంతచెప్పించినా వాడి కెందుకూపనికిరాదు. ఈకూలినాలిపనులా చేయడు. గుమాస్తా గిరులాదొరకవు. నేను పెద్దవాణ్ణై చాలా ప్రపంచానుభవం పొందాను. మీ రెంత చదువున్నవారైనా ఒక్కమాట నాది వినండి. మన బాగోగులు మన మంచిచెడ్డలు అన్నీవిచారించి తీర్పవలసిన బాధ్యతగల ప్రభువుల చిత్తం మారాలి. మారేటట్టుచేయాలి. ఒక్కసంగతి. దేశంయావత్తూ ఎన్నిగ్రామాలున్నాయో, ఎంతెంత భూమి ఏఏవిధంగా సాగుబడి అవుతున్నాదో, ఎంతెంతశిస్తు వసూలవుతున్నాదో, ఎంతెంతవసూలు కావలసియున్నదో, ఈ మొదలైన వైనాలన్నీ తెలుసుకుంటూఉన్న అధికారులు, ఏఏగ్రామాల్లో నీటి సదుపాయం పొలాలకు, మనుష్యులకు పశువులకు ఏమాత్రం సదుపాయంలో ఉందో, గ్రామస్థులకు వారిబిడ్డలకు విద్య ఏమాత్రం అందుబట్లో ఉందో, వారి నికరాదాయం, వారిఖర్చులు, వారిజీవితవిధానం ఏమాత్రం సరీగా ఉందో ఈ మొదలైన వైనాలన్నీ కనుకోవలసిన బాధ్యత ఆ అధికారులదేకదా. ఇంతకూ విధీవిధానం అంతే పేదవాళ్లనే చుట్టిచుట్టి కొడుతూఉన్నది.”

“అకాటికి ఈవిచారం అంతా ఎందుకు. రేపటినుండి నీవు నీపిల్లలుకూడా ఇక్కడికేవచ్చి పనిపాటలు చేస్తూబతకండి. మీరందరూ ఇకవెళ్లండి.”

వినయభూషణుని చూచి “వినయా! వీళ్లందర్నీ చూచావా ఎంతదీనంగా కనబడుతున్నారో. ఈ కార్మికసమస్య పెద్దసమస్యగా నన్ను వేధిస్తున్నాది. రేపు తెరవబోయే అస్సెంబ్లీలో నే నొకతీర్మానం కార్మికసంఘం తరపున ఉపాదించాలని అనుకుంటున్నాను. ఇప్పుడు సాధారణంగా కూలీలందరూ ప్రొద్దున్న ఏడుగంటలనుండి పన్నెండుగంటలవరకూ అనగా తొమ్మిదిగంటలకాలం పూర్తిగా పనిచేస్తున్నారు. ఇది చాల అన్యాయం. అక్రమం. వారి దేహారోగ్యానికి భంగంలేకుండా ఎంతసేపు చేయవచ్చునని వైద్యులు చెబుతారో అంతకాలమే ఆపనివాళ్ల వలన పనిని పుచ్చుకోవాలి. ఇంకో అన్యాయంకూడా యోచించాలి. పనిని పుచ్చుకునేవాళ్లు తమరికిష్టం లేకుంటే ఆపనివాళ్లని అప్పటికప్పుడు తప్పించిస్తున్నారు. ఆ కూలివాడికి ఆపూట కూలినష్టం అవుతూ ఉంది. కాబట్టి పని మొదలుపెట్టకమునుపే ఇన్నాళ్లు ఈపనిపట్టునని అంచనావేసుకోవాలి. ఇన్నాళ్లు నెల జీతం మాదిరిగానే వాళ్లకు జీతాలు ఇచ్చి పని పుచ్చుకొనితీరాలి. న్యాయంగా అందరూ అనుభవించే సెలవులు ఈకూలీలక్కూడా అనుభవంలో ఉండాలి. ఏమి మాటాడకుండా అలాచూస్తున్నావు. ఇటువంటి తీర్మానంఒకటి ఉండాలంటావా? లేదంటావా?”

“తప్పకుండా ఉండాలనే నాఉద్దేశం. పౌరుల బాగోగులకు బాధ్యతవహింపవలసిన ప్రభుత్వమువారు తమంతటతామే ఇటువంటి ఆక్టులను ప్యాసుచేసిఉండాలి. ఇప్పటికైనా ఇటువంటివాటికి సహాయామోదాలు కనబరిస్తేనే ప్రజాశాంతి ఏర్పడుతుంది. అయినట్టు మరచిపోయినాను. సాయంకాలం అయిపోతున్నాది. కలెక్టరు దేవిడ్డుగారిని కలుసుకోవాలనుకున్నాంగదూ?”

(ఇంకావుంది.)

# భారతనారి—ప్రేమ

స్వామి వివేకానందగారు

ప్రేమ కర్తవ్యచక్రమును స్నేహోక్తమొన రించిన నది మసృణగతి చాలితమగును. కానిచో, ఘర్షణ తప్పనిసరి—స్త్రీ పురుషు లొండొరులపట్ల తమ కర్తవ్యముల నెట్లు నిర్వహించుకొనగలరు? మనము మన జీవితములో ప్రతిదినము సంఘర్షణను కనుగొనుచుండుట లేదా? ప్రేమసిక్తమైనచో కర్తవ్యము మధురమగును. ప్రేమ స్వాతంత్ర్యముననే ప్రకాశమునందును. కాని ఇంద్రియదాసుడు, క్రోధదాసుడు, ఈర్ష్యాదాసుడు, క్షుద్రక్షుద్ర సంసారికఘటనలకు దాసుఁడును అగుటయే స్వాతంత్ర్యమా? మన జీవితమున సంఘటిల్లు చిన్న చిన్న కర్కశఘటనల సహించియుండుటే స్వాతంత్ర్యముయొక్క అభివ్యక్తి. స్త్రీలు సహజముగా నుత్తేజితులగుదురు. ఈసునుదాల్తురు. తాల్చి భర్తలపై చులకనగా దోషముల నారోపింతురు. వారు తమ్ము స్వతంత్రలుగా చెప్పుకొందురు. అట్లే తలతురు. కాని వారిద్దానివలననే తమ్ము ప్రతిపదమున బంధించుకొనుచున్నారని ఎఱుంగరు. ఎల్లప్పుడును తమ భార్యలపై దోషారోపణఁజేయు పురుషుల సంబంధమై ఇదే మాట చెల్లును.

మనుష్యుడొకానొక విషయమును ఎప్పుడు తీవ్రముగా వాంఛించుచున్నాడో అప్పుడా అతడు తన స్వాతంత్ర్యమును పోగొట్టుకొనుచున్నాడు. అతడు దాసుడై పోతున్నాడు. ఒకానొకరమణి మరొక పురుషునివైపు ఆకృష్ట అయినంతనే వానిదాసి అయిపోవుచున్నది. పురుషుడుగూడ ఇట్లే కాని,దాసత్వమునువహించు అవసరమేమియు లేదు.

స్వార్థరహితమైన దానినే ప్రేమయని వక్కాణింపనగును. ప్రతిరమణియు తాను ప్రేమనిధినని వచించును. కాని స్వల్పసమయములోనే ఆపె ప్రేమించుశక్తి తనకు లేదని గ్రహించును. ఈ ప్రపంచమంతయు ప్రేమను గుఱించిన కబుర్లతో నిండియున్నది. కాని ప్రేమించుట చాల కష్టము. ప్రేమయెచ్చట? ప్రేమయున్నదని గుర్తించుటెట్లు? మొదటి లక్షణము ప్రేమయందు ఇచ్చిపుచ్చుకొనుటలు లేవు. ఒకవ్యక్తి మఱొకనిని దేనినైన పొందగోఱి ప్రేమించుచున్నచో అది ప్రేమ గాదనియు, వర్తకమనియు గ్రహింపనగును. ఇచ్చిపుచ్చుకొనుటలున్నచోట ప్రేమకు తావులేదు. ప్రేమ ఎల్లవేళల ఇచ్చుచునే యుండును. ప్రేమదాత, గ్రహీతకాదు.

ప్రేమయొక్క ద్వితీయలక్షణము భయరహితత్వము. భయపెట్టి ప్రేమించునట్లొనర్పగలమా? ప్రేమయున్నచోట భయమునకు తావులేదు. ఒక న్యాయమూర్తి మాట చూతము—ఆయనపని ముగించి ఇంటికి వచ్చినప్పుడాతని భార్య అతనిని ఏదృష్టితో గాంచును? తన భర్తయని, తన ప్రేమనిధియని.

## భారత స్త్రీ — ప్రేమ

ప్రేమయొక్క తృతీయలక్షణము గీనికంటె మహత్తరమైనది. ప్రేమ మహాదాదర్శము. మనుష్యులు పైన చెప్పిన సోపానద్వయమును దాటి వ్యాపారము, భయముల వదలిపెట్టినప్పుడు ఈప్రేమయే మన మహదాదర్శమై వెలుంగుచున్నదని గ్రహింపగలము.

ప్రేమికునకు మఱి రెండవవస్తువుండదు. ప్రేమించునదె అన్నిటికంటె గొప్పదగు ఆదర్శము. మన ప్రేమవస్తువు సర్వోచ్చ ఆదర్శము కానంతవఱకు అసలైనప్రేమయే జనింపదు. ప్రేమ ఒకానొకప్పుడు నీచవస్తువులపై ప్రసరింపవచ్చును; కాని ఆవస్తువే ప్రేమికుని మహాదాదర్శము. ఒకడు తన ఆదర్శమును ఒకానొక కుత్సితజనునియందు కనుంగొనవచ్చును. మఱొకడు మంచివానియందే గ్రహింపవచ్చును. కాని, సర్వత్ర ప్రేమించునది ఆదర్శమునే.

కురూపియగు యువకుని సౌందర్యవతియగు యువతి ప్రేమించుచుండుటయు, సౌందర్యవిహీనుడగు పురుషుని అందగత్తెయగుపడతి వలచుచుండుటయు మనము కనుగొనుచున్నాము. వారెందువల్ల ఆకర్షింపబడుచున్నారు. ఇతరులకు ఆయా స్త్రీపురుషులు రూపవిహీనులుగా కన్పట్టవచ్చును, కాని ప్రేమికున కట్లగపడదు. ప్రేమికుని నయనములకు ఆ ప్రేమాస్పద వస్తువుకంటె అన్యసౌందర్యవస్తు వగుపించదు. ఇదేమి? ఇదెట్లు? రూపహీనుడగు యువకుని ప్రేమించుయువతి తన హృన్మధ్యముననున్న సౌందర్యాదర్శమును తాను ప్రేమించు యువకునిపై ప్రక్షేపించుచున్నది. ఆమె ఆ కురూపియగు యువకుని ప్రేమించుటలేదు. పూజించుటలేదు. ఆమె తనదర్శమునే పూజించుచున్నది.

పతికొఱకే పతినెవరును ప్రేమించుచుండుటలేదు, పతియందున్న ఆత్మకొఱకే పతిని ప్రేమించుచున్నారు; భార్యకొఱకుగాను భార్యనెవరును ప్రేమించుచుండుటలేదు, భార్యయందున్న ఆత్మకొఱకు భార్యను ప్రేమించుచున్నారు. ఆయావస్తువుల ఆయావస్తువులకొఱకును ప్రేమించుటలేదు, ఆత్మకొఱకే ప్రేమించుచున్నారు. మన మనుదినము నిందించు స్వార్థపరత్వముగూడ ప్రేమయొక్క అవాంతరరూపమే. అతినీచమగు స్వార్థపరత్వమందుగూడ ఈ 'స్వ' 'అహం' భావములు క్రమముగా విస్తరిల్లుచుండును. ఈ ఒక 'అహం'భావమే వివాహమైన రెండగును. పిల్లలుపుట్టిన మఱిరెండగును. ఇట్లే ఈఅహంకారము విస్తరిల్లుచుండును. తుదకు జగత్తంతయు ఆత్మ అయిపోవును. ఇదియు క్రమముగా వ్యాపిల్లి విశ్వజనీనప్రేమ— అనంతప్రేమగా పరిణమించును. ఈప్రేమయే ఈశ్వరుడు.

మహాశక్తి మనవెనుకనుండి ప్రేమింప ప్రేరేపించుచున్నది. ఆప్రేమవస్తువు నెచ్చట వెదుకవలయునో మన మెఱుంగము. కాని ఈప్రేమయే మనల నావస్తువును వెదుక ముందున కడుగిడున ట్లొనర్చుచున్నది.

జగత్తునందు ఆకర్షణశక్తి ఒక్కటిమాత్రమే యున్నదని శాస్త్రము ప్రవచించు

చున్నది. అయ్యది ఈశ్వరుడు. పతిజీవని యగు యువతి తనభర్తయందీ శక్తియున్నదని యెఱుగదు. అదియే ఆమెను భర్తవైపున కీడ్చుచున్నది.

మనుష్యుడు తన ప్రేమవస్తువు ఐహికము కానప్పుడే యదార్థముగా ప్రేమింప గలుగుచున్నాడు. ప్రేమవస్తువు భూఖండముకాదు. ఈశ్వరుడు. అప్పుడా మనుజుడు యదార్థ ప్రేమికుడగుచున్నాడు. భార్యాభర్తలిర్వురు తాము బ్రహ్మస్వరూపులమని గ్రహింప గలిగినప్పుడే ఒండొరులనధికముగా ప్రేమించుకొన గల్గుచున్నారు. అతడే భార్యాభర్తల యందు వెలుంగుచున్నాడు. నీవు భార్య యుండనీ తంటాలేదు. వదలి లేచిపోవలె ననుదాని కర్థములేదు. కాని, నీభార్యయందు నీవీశ్వరదర్శన మొనరింపవలెను.

భార్యాభర్తలు పరస్పరమే ప్రేమను ఒసంగికొని ప్రేమించుకొనుచుందురో ఆప్రేమను ఈశ్వరున కర్పించవలెను.

ఈశ్వరప్రాప్తికై సాయపడు భార్యయే సతి. సతీత్వము జాతియొక్క జీవనశక్తి. సతీత్వనాశనమే జాతియొక్క మృత్యుచిహ్నమని చరిత్రయందు కనుగొని యుండలేదా?

(అనువాదకుడు—పూర్ణానంద.)

# నివేదనము

నందివాడ వెంకటచలపతిరావుగారు

గీ॥ "ఎట్టికఠోర వ్రతదీక్షలేనిసరియె
పూనిచరియింతుగాని నాభుజబలమ్ము
స్వార్థమునకమ్ముకొననొల్ల నరులకెపుడు
జన్మజన్మాంతరముల నిశ్చయముసుమ్ము॥

గీ॥ "ప్రాణవాయుసంచారము మేనియందుఁ
గలుగునంతకు—చేతిలో గత్తియుండు
నంతకును తేరిచూడగా నలవియగునె
రాచబిడ్డను నాహవరంగమందు?

గీ॥ "అట్టి సుక్షాత్రజన్మంబునంది, చేతఁ
బట్టి యరిశిరఃఖండన పటిమఁగ్రాలు
కత్తి, జంపుటో జచ్చుటో గాంచదన్య
మెరుగనట్టి నన్నిట్లు శోధింతువేల?

గీ॥ "ఘనస్వతంత్రాభిలాషమై గ్రాలునాదు
హృదయరక్తాభిషేకమే నీవుగోర
నిండునిబ్బరమునసేతు నిశ్చయముగ
యిట్టిదుష్కరశోధన లేటికమ్మ?

గీ॥ "ఎడతెగనికష్టముల సదాపడుచునుంట
యేనునైరాశ్యమును జెంది బానిసగను
బోదునని యెంచితేమొ? యెప్పుడునుకల్ల
నాకు స్వాతంత్ర్యతృష్ణ ప్రాణాధికమ్ము.

గీ॥ "నీ శుభాశీర్బలంబున నెగ్గెదేని
ధన్యుఁడనె—దైవమన్య ధాతలఁ జెనేని
పోటుబంటులకుచితమౌ పోల్కి మాతృ
దేశముక్తికై గర్త్యవశేషుఁడయ్యె
నను చిరస్థాయియౌ యశంబందువాఁడ.

గీ॥ "పావనంబగు నీ పాదపద్మములను
కదనవిజయేందిరంగొని కదలులోగ
యేను స్పృశియింపఁజాలనయినావు తదను
కూలసాధన సంపత్తిఁ గూర్పవమ్మ
స్వర్గమునుమించునట్టియో జన్మభూమి."

# గ్రంథాలయములు

యార్లగడ్డ శ్రీ కృష్ణపాదుగారు

ఒకనాడు సర్వప్రపంచమునకు జ్ఞానభిక్ష బెట్టిన భారతదేశము—పశ్చిమదేశము లన్నియు గాఢాంధకారములో మునిగియున్నపుడు జ్ఞానజ్యోతిని ప్రకాశింపజేసిన భారతదేశము—అనాగరికులై గొడ్డుమాంసము దినుచున్న జాతికిసహితము జ్ఞానోదయము గలుగజేసిన భారతదేశము—ఋషీశ్వరులకును, త్యాగులకును, వీరులకును ఆవాసమైన భారతదేశము—పతివ్రతాతిలకములకును, వీరనారీమణులకును పుట్టినిల్లని కీర్తిగడించిన భారతదేశము—యేమైనది? తారుమారైనది. తలక్రిందులైనది. బానిసత్వమనుభవించుచున్నది. దీనికి విమోచనయెట్లు? మార్గమెద్ది? గమ్యస్థానమెక్కడ? అని విచారించుచో రెండే మార్గములు. పాఠశాలలు — గ్రంథాలయములు. జాతీయభావములు, స్వదేశభక్తి హృత్కమలమున జీర్ణించిపోయిన ఉపాధ్యాయబృందము పాఠశాలలకు సంప్రాప్తము గావలెను. శాంతస్వభావము, వినయనమ్రతలు, విద్యాసంపన్నత, దాస్యవిమోచనకు మార్గాన్వేషులగు యువకరత్నములు గ్రంథాలయములకు గావలెను. ఏనాడు యిట్టియోగ్యులట్టిస్థానముల నాక్రమించెదరో యాప్రదేశమున స్వాతంత్ర్యవాయువులు వీచుచుండును. పాఠశాలలు, పౌరాణికపు గురుకులాశ్రమముల విద్యావిధానమును స్మరణకు దెచ్చునట్లుగా నుండవలెనను నొక్కమాటతో యీవిషయమును విరమించుచున్నాను. రెండవది గ్రంథాలయములు వాటి యుపయోగములు మనము ముఖ్యముగా గమనింపవలెను.

మనపూర్వులు అజ్ఞానులకు భక్తిని పురికొల్పుటకై యెన్నియో శివ, విష్ణాలయములనిర్మించి, నిత్యనైవేద్య, దీపారాధనలకునై, మడిమాన్యములు (దేవాదాయములు) సమర్పించి శాశ్వతధర్మముల నెలకొల్పి కీర్తికాములైరి. అట్టి పుణ్యమూర్తుల సంతతివారమగు మనము కొరతవడిన, విద్యాదేవతయగు శారదాంబకు భవనములునిర్మించి ఆలయసంరక్షణకు గాను కానుకలుసమర్పించి యందు నుత్సాహపూరితులగు భాండాగారాధిపతులను నియమింపవలెను. ఈ భాండాగారాధిపతులు విద్యావంతులుగను, శాంతచిత్తులుగను, సుగుణవంతులుగను, జనాకర్షణపరులుగను యుండవలెను. ఇట్టి సుగుణములు గలిగియుండిన గ్రంథాలయములు, సర్వజనాదరణీయములై, దినదినవర్ధమానములై తేజరిల్లగలవు. యీ గ్రంథాలయములను వృద్ధిబఱుపవలెనన్న, నాగరికాగ్రేసరులగు యమెరికాదేశస్థులవలె, మనగ్రంథాలయములు జనులనాకర్షించునవిగా జేయవలెను. సర్వస్వాతంత్ర్యంబులలవడుటకు, విజ్ఞానధనంబునొందుటకు, ప్రకృతి ఆధ్యాత్మికము దెలిసికొనుటకును, సూక్ష్మములో మోక్షమనునట్లు యీగ్రంథాలయములె సాక్షిభూతములగును. ఇట్టి సర్వోత్కృష్ట గుణాతిశయములను బట్టియె మనపౌరాణికులు దేవాలయములకుతోడు పెక్కుచోట్ల నీగ్రంథాలయములను స్థాపించియుండిరి. ఒక్కదేవాలయమున నాముష్మికసాధనంబు దెలుపునుగాని, గ్రంథాలయమున విజ్ఞానసంపత్తితోగూడుకొని ఐహికాముష్మిక సుఖసాధనము గలుగజేయును. నాగరికతవ్యాపించిన ప్రతిదేశమందును, గ్రంథాలయములు మిక్కిలి యభివృద్ధిజెందినవి. యూరఫ్‌ఖండము అత్యున్నతస్థితి నందినదన్న గ్రంథాలయములె చాలవరకు కారణమని దలంపవలెను. పూర్వమువలెనే మనదేశ మభివృద్ధి బొందవలెనన్న, మన పూర్వుల హృదయసీమలందు దేవళము లెంత గౌరవనీయములుగ నెలకొల్పబడినవో మన హృదయసీమలందీ గ్రంథాలయములంత గౌరవముగా నెలకొల్పవల

యును. మనపూర్వులచే వ్రాయబడిన దేశచరిత్రలు గాని, మతగ్రంథములు గాని, పరహస్తగతంబగుట చేతనేమి, క్రిమిభక్ష్యంబుననేమి, అగ్నిదగ్ధంబుననేమి, యంతరించగా నున్నవాటినైన తాళపత్రాది గ్రంథంబులుగూడ సేకరించి, రక్షించి, భాండాగారముననింపి మాతృభాషాపోషకులై యభివృద్ధిగాంచువారు ధన్యులు. యీగ్రంథాలయాభివృద్ధియే మన కామ్యార్థము లొసగుసాధనము సౌఖ్యప్రదము. ఇంగ్లండు జర్మనీ మున్నగుదేశంబులందు, గ్రంథాలయములేని గ్రామముసహితము లేదనియే జెప్పవచ్చును. నెలకు వందలకొలది గ్రంథములు సంపాదించి గ్రంథాలయములనింపి కుతూహలులగుచున్నారు. ఆదేశమందు ధనికులెంతయు ధనసహాయము చేయుచుందురు. గ్రంథాలయోద్యమమునకు జనకతుల్యులని సువర్ణాక్షరములతో బేర్కొనబడుచున్న ఒక "అంద్రూకార్నిజి" యను ధనికుడెన్నియో గ్రంథాలయములు నిల్పి ప్రోత్సాహపరచెను. అట్టి మహనీయు లీదేశమున కొరతపడుట మన దురదృష్టమని తలచవలెను. గ్రంథాలయములసంఖ్యగూడ మన దేశంబున స్వల్పముగ గోచరించుచున్నవి. ఒక్క బరోడారాజ్యములోమాత్రము శారదాదేవి రాజుయొక్క యాదరణ బొందగలిగినది. ఆరాజ్యములో ప్రతియొక్కపాఠశాలలో గ్రంథాలయమున్నట్లు తెలియుచున్నది. పాఠశాలకు సంబంధములేని యితర గ్రంథాలయముల నెన్నియో రాజాగారు పోషించుచున్నారు. అటనున్న కేంద్రగ్రంథాలయములనుండి జిల్లా తాలూకా గ్రామగ్రంథాలయముల కెంతయు సహాయసంపత్తిగలదు. మ్యాజిక్ లాంతర్లవల్లనేమి, చిత్రలేఖనవవల్లనేమి, యాగ్రంథాలయములు ప్రజల నాకర్షించుచుండును. స్త్రీశాఖ, బాలశాఖయను విభజనలుగూడ ప్రతిగ్రంథాలయమందు బొడగట్టుచుండును. ఇట్టి సత్సంకల్పముతో గ్రంథాలయోద్యమమునకు దోడ్పడుచున్న బరోడా మహారాజగు శ్రీ "శాయాజీగయక్వార్" మహాశయు లెంతయు ధన్యులు. మరపురాని సచ్చరిత్రలో శ్రీవారినామము సువర్ణాక్షరములతో విలసిల్లుచుండును. బరోడా రాజ్యమును తిలకించియె శ్రీ తిరువాన్కూరు మహారాజాగారుగూడ తమరాజ్యమందు గ్రంథాలయోద్యమము విస్తరింపజేయుటకు ప్రయత్నించుచున్నారు. ప్రతిరాష్ట్రమునందును గ్రంథాలయోద్యమమునకు తమ జీవితసర్వస్వమునుగూడ ధారవోసిన మహామహులు కొందఱుండబట్టియె శారదాదేవి సజీవముతో నుండగలిగినది. 1910-11 లో మన యాంధ్రరాష్ట్రమున, గ్రంథాలయోద్యమము ప్రారంభింపబడి, దినదినప్రవర్ధమానము బొందినదంటే దానికి చిరస్మరణీయులగు యిద్దరువ్యక్తులు గలరు. ఒకరు కీర్తిశేషులైన సూరి వెంకటనృసింహశాస్త్రిగారు; రెండవవారు నాటినుండి నేటివరకుగూడ యెడతెరిపిలేని గ్రంథాలయ సేవజేయుచున్న శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు. ఆంధ్రరాష్ట్రమున గ్రంథాలయోద్యమము చిరస్మరణీయము బొందవలెనన్న మనమెల్లర ముపేక్షాపరులమై యూరకొనక ప్రతిమానవుడు, స్వకుటుంబాభివృద్ధి, స్వశరీరారోగ్యము నెట్లుగోరుచు బాటుపడునో, గ్రంథాలయోద్యమమునకుగూడ నట్లు పాటుబడుట, తనపరమావధియని దలచవలెను. దేశారాధన ప్రతివ్యక్తికి యమూల్యాభరణము. దేశోద్ధరణకు కృషిచేయవలెనన్న, దేశసేవచే జీవయాత్రనడుపుచు పాశ్చాత్యదేశముల తోబాటు మనదేశమును పోటీకి నిలుపి, పురాతన మహౌన్నత్య నిత్యసామ్రాజ్య సౌభాగ్యములు తిరిగి ప్రసాదించి, తద్దేశవాసుల యార్థికవృత్తులు సంపాదించి వారి సౌభాగ్యములు పాలు బంచుకొనవలెనన్న, మన దేశము తొల్లింటియౌన్నత్యము, సిరిసంపదలు సత్కళాభివృద్ధిబొంది, మన భావికాలాభివృద్ధికి, మూలకారణములగు విద్యార్థులగు యువకులకు నీతిమార్గములు ప్రసాదించవలెనన్న, మన బాలబాలి

కల విద్యావ్యాసంగములు అభివృద్ధి, దేశబాంధవుల భావోదయముల ప్రకాశింపజేయుట, దేశము యొక్క ప్రాభవప్రతిష్ఠలను, కీర్తిగౌరవములును గాపాడుట, మానవహక్కులను, స్వాతంత్ర్యములకును శాశ్వతమైన పునాదులు వేయుట, జ్ఞానులయు, త్యాగులయు, వీరులయు సచ్చరిత్రలు మరపురానట్లు చేయుట, ఇయ్యవి చేయవలెనన్న గ్రంథాలయములె సాక్షీభూతములని గ్రహింపవలెను. వేలకొలది గ్రంథాలయములు స్థాపింపజేసి యందున్న జ్ఞానామృతమును ప్రజలు గ్రోలునట్లు చేయవలసినబాధ్యత, గ్రంథాలయసేవకులయందున్నదనుమాట మరువగూడదు. భారతదేశీయ మహాజనసభాధ్యక్షులగు పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు అలహాబాదులో ఆనంద భవనమందొక పెద్దగ్రంథాలయమును స్థాపింపకల్పించి యుండుటలో గ్రంథాలయోద్యమమందు శ్రీవారికెట్టి యాదరణాభిమానములు గలవో గ్రహింపుడు. ఆంధ్ర సోదరులీ సుస్సమయమును, జారవిడువక తగుసహాయ సంపత్తులతో గ్రంథాలయోద్యమమున కెంతయు తోడ్పడెదరుగాక యనియు, భగవానుడీ సత్సంకల్ప మచిర కాలములో నెరవేర్చుగాక యనియు ప్రార్థింపబడియెడిని.

---

# మాల

మద్దూరి అన్నపూర్ణయ్యగారు

దేవళంబు మాల దివ్యంబుగాగట్టు
　　అందుగొల్వహక్కు నందలేదు;
పావిత్రవ్వు మాల పగలెల్లపనిచేసి
　　దానినీరువాడు త్రాగలేదు;
మేడగట్టిమిగుల మేలొనరించును
　　మాలదానియందు మసలలేదు;
రోడ్డువేయుమాల రుధిరంబుజిమ్మును
　　అందునడువహక్కు పొందలేడు
చేనుదున్నుమాల చెమటనుగార్చుచు
　　గంజియైనలేక గింజుకొనును;
పాతశాలమాల పరమభక్తినిగట్టు
　　అందుచదువలేడు డెందవలర;
వస్త్రయంత్రమెల్ల వానిచేసాగును
　　భార్యకైనబట్ట బడయలేడు;
కర్మనెల్లనీవు కాతుకమొప్పార
　　పంచినామభువిని పాళ్లుచేసి (?)
సుఖమదెల్లనీది దుఃఖముమాలది
　　బుద్ధియన్ననీదె బుద్ధియార!
ఫలమదెల్లనీది పనియెల్లవానిది
　　శక్తియున్నమాల భుక్తిగనడు
అన్నియున్న పెద్దఅన్నయ్య వేసుమ్ము
　　ఆర్యుననుచుదెల్పు నధముడీవు.
మాలవానికిలను మైలనుమాత్రమే
　　అనుభవింపగల్గు హక్కుగలదు
పేదవానికుర్వి వేదనయొక్కటే
　　యావదాస్తియగునె నార్యపుత్ర!
ఆర్యధర్మమన్న నర్థంబునిదియెనా
　　చాలుచాలునీదు స్వార్థబుద్ధి!
వేదమతముయొక్క విధియిట్టిదైనచో
　　వందనంబుబాబు వద్దుమాకు.

# అపజయము

శ్రీమతి రాణీ చాకుంట సరస్వతీబాయిగారు

గత సంచిక తరువాయి

[లలిత భాస్కరరావు సోదరి. పద్మ వీరికి స్నేహితురాలు. లలితకు సహపాఠి. మాతాపితలు లేనిది. లలితా భాస్కరులతో కూడి ఆడుకొంటూ వుండేది. భాస్కరరావు బార్ అట్ లా చదవడానికి ఇంగ్లండు వెళ్లేడు. లలితా పద్మలు మెట్రికులేషను పరీక్ష ముగించారు. లలితకు వివాహనిర్ణయమైంది. చిన్నప్పటినుండీ మగవాళ్లంటే గిట్టని పద్మ కది రుచించిందిగాదు. మగవారి దౌర్జన్యాలు ఏకరువుపెడుతూ లలితను పెళ్లి మానేయమంది. కాని లలిత ఆశయాలు వేరు. పెళ్లి చేసుకొంది. పద్మకు కోపం వచ్చింది. ఆడువారి అబలత్వాన్ని నిందించింది. ఆ ఆశయాల తోనే బి. ఎ. ప్యాసయింది. స్త్రీలు పెళ్లాడి బాధ లెందు కనుభవించాలి అనే ధోరణిలోనే ఎపుడూ వుండేది. తరువాత కథ చదువండి.]

## ౪

"లలితా! బి.ఏ. ప్యాసయాను. నీవలెనే తిన్నతిన్నగా మిత్రురాండ్రందరు నన్ను వదలి పోయినారు. అనగా వివాహాలు చేసుకోని అత్తవారిండ్లకు వెళ్లారు. నామాట లొక్కరికైన చెవుల కెక్కలేదుగదా అన్న విచారం. మన జాతిలో ఇంత దుర్బల ముండడం వల్లనే పురుషస్వాములు మన నిలా బాధిస్తున్నారు.

ఇక నాస్థితి. మాట్లాడ్డానికి కెవరూ లేరు. దినమంతా గ్రంథాలు, వార్తాపత్రికలు చదువుతుంటాను. చదువుతూ చదువుతూ విసిగినప్పుడు మాత్రం ఎవరైన మాట్లాడ్డానికి, సాయంత్రం షికారుకు వెళ్లడానికి ఉంటే బాగుంటుం దనిపిస్తుంది. మా పదినెకు యింటిపనులవల్ల తీరికేలేదు పాపం. ఏంచేయాలో తోచదు. రాత్రిళ్లు గూడా ఏదో ఆవేదనగా ఉంటుంది. త్వరగా నిద్రపట్టదు. పట్టినాకలత నిద్ర.

మన మిత్రులలో ఒకళ్లైన ఉత్తరం వ్రాయరు. వాళ్లు ప్రస్తుతం తమ యానందంలో నన్ను మరచుంటారు. ముందు ముం దెన్నటికైనా జ్ఞాపకానికి వస్తాను. వారి యీ ఆనందం అస్థిరమైందనే నాకింకా నమ్మకం. కాబట్టి నామాట లెన్నటికైనా నిజం గాకుండాపోవు.

"సోదరీ! నీవైన మరచిపోవనుకుంటాను నన్ను. వారంరోజుల కొకసారైన ఉత్తరం వ్రాయుచుండుము. నే నెల్లప్పుడూ మీ శ్రేయమే కోరుచుందును. కాబట్టి శంకించక నీ కష్టసుఖములను తెల్పుచుండుము. ముందేమి రానున్నా యిప్పుడు మాత్రం సుఖిస్తూనే ఉన్నారు. అదే పదివేలు.

ఇట్లు

పద్మ."

ఈ ఉత్తరంవల్ల నాకు కొంత విచారం గల్గినప్పటికీ, పద్మహృదయ మొక కోరి

కతో బాధపడుచున్నది. ఆబాధ నివారించు మందు, దాని అన్న నిర్బంధము వల్లనైనా పుచ్చుకొనక తప్పదు.

పద్మ ఉత్తరానికి ప్రత్యుత్తర మిచ్చాను. దానిబాధ నుపశమింపజేయునది, జీవితానంద మొసంగునది, వివాహమేనని దాని నిర్వహణార్థము తగినవరుని తానే చూచుకొనుట మంచిదనిగూడా వ్రాశాను.

నే నీ ఉత్తరం వ్రాసిన కొలదికాలానికే మా పద్మను చూడడం తటస్థించింది. మా అన్నయ్య బ్యారిస్టరీ పరీక్షలో ఉత్తీర్ణుడై యింటికి వస్తున్నాడు. మా దంపతుల కాహ్వానం వచ్చింది. ఇద్దరం వెళ్లాం మా పుట్టింటికి.

పద్మ బొత్తుగా మారిపోయింది. ముఖం పాలిపోయింది. ఇపుడా ఉత్సాహం, ఆ చిరునవ్వు, ఆకాంతి పద్మముఖంలో కనబడడంలేదు. దాని ముఖం ఎండి నవ్యత నొందడానికి సుధావర్షము కోరుతున్నట్లుంది. ఎప్పుడేదో ఆలోచిస్తూనే ఉంటుంది. ఎవరితోగూడ ఎక్కువ మాట్లాడదు. దాని మనస్సులో ఏదో బాధపడుతూ న్నట్లనిపించింది నాకు. ఆ బాధకు కారణం దానికిగల రెండు వ్యతిరేకాభిప్రాయములే. వివాహం చేసుకోవడమా? చేసుకోకపోవడమా? మాటపట్టుదలగల పద్మ త్వరగా తన పరాజయాన్ని ఒప్పుకోవడంలేదు. తనకు గలిగిన కోరిక నణచివేయడానికే విశ్వప్రయత్నం చేస్తోంది.

పద్మను చూడడానికి వెళ్లాను. కుశల ప్రశ్నలైనయి. దాని యీస్థితికి కారణ మడిగాను. చెప్పలేదు. రాత్రిళ్లు ఎక్కువగా చదవడంవల్ల యిలాంటి మార్పు గల్గిందన్నది. కాని నన్ను చూడ్డంతోటే అవమానం గల్గింది దానికి. దాన్ని కప్పిపుచ్చే ప్రయత్నం చేసింది. లేని నవ్వు తెచ్చిపెట్టుకుంది. దాని యవస్థచూచి నాకు జాలిగల్గింది. మా అన్నయ్య "రేపు వస్తున్నాడు, నీ బాల్యస్నేహితుడు స్టేషనుకు వస్తావా" అని అడిగాను. "సమ్మకంలేదు. రేపు చూద్దాంలే" అన్నది. నేను లేచి ఇంటికి వెళ్లాను.

※

మా ఇల్లంతా మహానందంలో మునిగి తేలుతోంది. మా అన్నయ్య బొంబాయి నుండి టెలిగ్రా మిచ్చాడు. నిర్దేశింపబడిన వేళకు మా నాన్న, నేను, మావారు స్టేషను చేరుకున్నాం. అన్నయ్య నెదుర్కోవడానికి పద్మను రమ్మని మళ్లీ కబురు చేశాను. శరీరం స్వస్థతగాలేదని రానంది. ఇలాంటి సంతోషాల్లో అందరికన్న ముందు దూకే పద్మ ఇప్పుడు అందరికంటే వెనుకబడ్డది. తా నేదో గొప్ప అపరాధం చేస్తున్నట్లు భయపడుతుంది మాతో సంచరించడానికి.

రైలు రాగానే రెండవ తరగతి బండి వద్దకి వెళ్లాం. మా అన్నయ్యదిగాడు. మా మనుష్యులు ఆయన సామాన్లు తీస్తున్నారు. ఎంతోకాలానికి చూచాడు స్వజనాన్ని అన్నయ్య. మాకందరి కొకేసారి

ఆనందబాష్పాలురాలినై. అందరితో కల్సి ఇటూ అటూ చూస్తున్నాడు. "మన పద్మ రాలేదేం? పాపం భర్తతో కాపురం చేస్తుంటే రావడాని కెలాకీరుతుంది" అన్నాడు నిరాశతో. "ఆమె శరీరంలో అస్వస్థతగా ఉందిట. అందువల్ల రాలే దన్నయ్యా!" అన్నాను నేను. మేమంతా ఇల్లు చేరుకున్నాం సంతోషంగా.

మరుసటిరోజు పద్మవద్దకి వెళ్లాను అన్నయ్య రమ్మన్నాడని చెప్పడానికి. నేను వెళ్లేవరకు పద్మ తనలో తా నేదో ఆలోచించుకొని ముసిముసి నవ్వులు నవ్వుతుంటోంది. దాని యీస్థితి నన్నూ సంతోష పెట్టింది. కాని దీనికి కారణం? నన్నుత్సాహంతోటీ ఎదురుకొని కూర్చోమంది. అన్నయ్యను గురించి కుశలప్రశ్న లడిగింది. ఆయన్ను గురించి క్లుప్తంగా కొన్ని విషయాలు చెప్పి, తన్ను చూడ్డానికి రమ్మన్నాడని చెప్పాను.

పద్మ:—సరే! ఇన్ని సంగతులు చెప్పావు గాని మీ అన్నయ్య ఒక లేడీని మెడకు గట్టుకొచ్చాడా? మన బ్యారిస్టర్ గార్ల కది మొదటి క్వాలిఫికేషన్.

నేను:—చెప్ప మరిచాను. తెచ్చుకున్నాడు. అహాహా! ఆమె అందం చెప్పడానికి నా తరంకాదు. ఆమెను చూపడానికే ఇప్పుడు రమ్మనడం.

ఈమాట విన్నంతోనే ఒకనిట్టూర్పువిడిచింది పద్మ. "మన భారతీయయువకులు తమశీలాన్ని పాడుచేసుకుంటున్నారు గదా" అంది విచారంగా. పద్మ నాకు సరిగ్గా సీతలాగుండే దనిపించింది. వారి దాంపత్యం అనన్యసామాన్యంగా ఉంటుంది. [illegible] ఎలాఉందో.

"పద్మా? లేవేం! వెళదాం! పాపం అన్నయ్య నిరీక్షిస్తుంటాడు" అన్నాను.

పద్మ:—నన్నాక్షేపి నిర్బంధపెట్టకోకు. తొందరేంవచ్చింది. చూద్దాంలే. అయినా యౌవనమందున్న పురుషులను చూడాలన్నా, మాట్లాడాలన్నా భయమేస్తుంది. కాబట్టి ఇప్పటికి "క్షమించ ప్రార్థించితి"నని చెప్పుమీఅన్నతో. ఇన్నాళ్ళైనా పద్మ జ్ఞాపకంఉన్నందులకు నాకృతజ్ఞతావందనము నీవే వారి కందచేయి.

"యీదొంగవేషాలన్నీ కట్టిపెట్టు, నీవు రాకతప్పదు"అని పద్మనుచేయిబట్టిలాగాను. లేచి "సరేపద" అని బయల్దేరింది.

దారిలో "సరేగాని లలితా! నిజంగా భాస్కర్రావుగా రొక ఆంగ్లస్త్రీని వివాహం చేసుకున్నాడా? మీనాన్న ఆమెనింటి కెలా రానిచ్చాడు. మీఅమ్మ గోలపెట్టడం లేదూ?" అంది.

నాకు నవ్వొచ్చింది "తొందరపడతావేం? అన్నీ తెలుస్తాయిగా!" అన్నాను నవ్వుతూనే.

మాయిల్లు ప్రవేశించాం. మాఅన్నయ్య మా యల్.యల్.బి. గారూ ఏదో మాట్లాడుతూకూర్చున్నారు. అక్కడికే వెళ్లాం. "అన్నయ్యా! పాపం పద్మ మీఇంగ్లీషులేడీ

గార్ని చూడాలనొచ్చింది. చూపింపరేం'' అన్నాను నవ్వుతో. వాళ్ళిద్దరూ నవ్వారు. పద్మకు కోపంవచ్చింది. పరాజయం లభించింది పాపం!

భా:—పద్మం! కూర్చో. నీవింతదనుక వివాహం చేసుకోకుండాఉండి బి.ఏ. చదివావంటే చాలసంతోషించాను. ముఖమంతా పాలిపోయింది. జబ్బేమన్నా చేసిందా? లేక ఎక్కువగా చదవడంవల్ల ఇలా మారిపోయినావా?

పద్మ:—జబ్బేంలేదు. చదవడంవల్లనే ఇలా అయిందనుకుంటాను.

నేను:—అదీకాదన్నయ్యా! మీ పురుషుల నందరినీ ఒక మహాసముద్రంలోముంచి, తాను మహారాజ్ఞిగా, తనప్రజలంతా స్త్రీలుగా, యీ ప్రపంచా న్నేలుకోవడానికి మార్గాలాలోచిస్తోంది. ఆ ఆలోచనల్లోనే నిద్రాహారాలుగూడ మానేసిందేమో?

భా:—ఇప్పుడుగూడ నీవు మాఅందరికీ మహారాణివే. మేము నీఆజ్ఞలకు బద్ధులమే. దాని కింతప్రయాసం ఎందుకు పద్మా!

పద్మ:—లలితా! వేళాకోళంచేయడానికా నన్నిక్కడికి రమ్మన్నావు?

నేను:—నిజంచెప్తే నీకింతకోపం ఎందుకు?

భా:—పద్మా! పోనీ ఆసంగతి డ్రాప్ చేద్దాం! గాని చిన్నప్పటికళాకాంతులు లేవేం నీముఖంలో? అదిగాక నాముందు సిగ్గుగూడ పడుతున్నావు. కారణం?

పద్మ:—సిగ్గెందుకు? అయినా బాల్యావస్థే ఎల్లకాలంఉంటుందా?

భా:—ఏండ్లు వచ్చినయి. అంతేగాని నాకు నిన్నుచూస్తే మళ్లీ ఒకపరియాయం నీతో ఆడుకోవా లనిపిస్తుంది.

నేను:—అబ్బో! చాలా పెద్దకోరికే కోరావు అన్నయ్యా!

భా:—ఇందులో తప్పేముంది. చనువున్నవాళ్లల్లోగూడ పూర్వపుభావా లుండవనుకుంటాను.

నేను:—అలాకాదు. పద్మాదేవిగార్కి అసలు పురుషులంటేనే గిట్టదంటే నీతో ఎలా ఆడుకుంటుంది. నీవు పురుషుడవు కావా?

పద్మ:—తిర్గి నీఉపన్యాసం మొదలెట్టావు లలితా! నిన్ను మాట్లాడించిందెవరు?

"మీరే మాట్లాడుకోండి నేను వెడతాను" అని లేచి లోపలికివెళ్లాను. మా యల్.యల్.బి.గా రిదివరకే స్నానానికి వెళ్లారు.

వాళ్ళిద్దరూ సుమారొకగంటసేపు మాట్లాడుకొన్నారు. ఇంగ్లాండువిషయాలు కొన్ని మాఅన్నయ్యచెప్తూంటే లోపలఉండి విన్నాను.

౬

నేనూ అన్నయ్యా, పద్మ షికారుకు వెడుతుండేవాళ్లం సాయంత్రం. పద్మముఖంలో జీవం కనబడుతుంది. ఇది భాస్కరసందర్శన

మహాత్మ్యమేమో ననుకున్నాను. అది ప్రకృతి సిద్ధమేగా!

పద్మ ఇంట్లోనే ఆగిపోయినాను నిర్బంధం వల్ల సాయంత్రం షికారునుండివస్తూ. లోపలికి వెళ్లగానే పరధ్యానంగా అన్నట్లుగా అన్నాను. "పాపం! పద్మం శీతకరకిరణ ప్రసాదమున కృషించి ముకుళించి యిప్పుడిపుడే భాస్కరోదయమున ముసిముసి నవ్వులు నవ్వుతోంది."

"ఏం లలితా! నీకేం మతిపోయిందా? రాత్రిపూట భాస్కరోదయమేమిటి? పద్మం వికసించడమేమిటి" అని నవ్వింది పద్మ.

నేనూ:—నవ్వుతూ "ప్రియసందర్శనం పద్మాని కెంతసంతోషం కలిగించింది. ప్రకృతిలో భగవంతుడొక ప్రత్యేకవ్యక్తికి, మరొక ప్రత్యేకవ్యక్తితో ప్రేమబంధమేర్పచి యుంచాడుగదా" అన్నాను.

"ఎప్పుడూ నీకు ప్రేమ, ప్రియులముచ్చటలే. బ్రహ్మచారిణి ముందలాంటిమాటలు ముందెన్నడూ మాట్లాడుబోకు" అన్నది చిరునవ్వుతో.

నేను:—అలాగేం! తమరుకూడ గృహిణులైతే ఇంతకన్న ఎక్కువేకావాలి. తొందరెందుకు. కొద్దిలోనేఉంది.

పద్మ:—అయితే! నేను వివాహం చేసుకుంటాననే నీయభిప్రాయం? ఎన్నటికీ చేసుకోను.

ఆమాటల్లో పూర్వపు పట్టుదల కనబడ లేదు.

పద్మ:—అదంతా ఏమోగాని, పురుషులతో ఆపవిత్రదాంపత్యసంబంధంకంటే స్నేహభావంతో నిర్మలంగా సంచరిస్తే బాగని పిస్తుంది.

నేను:—అవు నలాగే తోస్తుందిపుడు. ముందు —

పద్మ:—ముందు? ముందేమైతుంది?

నేను:—ఏమైతుందో నేను చెప్పను, గాని నిన్న మీ అన్నయ్య మాఇంటికివచ్చి మానాన్నతో ఏమో మాట్లాడుతున్నారు.

పద్మ:—(ఆత్రంతో) ఏమిమాట్లాడారు? నీకేమైనా తెలుస్తే చెప్పు!

"నాకేం తెలుసు. మీఅన్నయ్యనే అడగ గూడదూ!" అని లేచాను వెళ్లడానికి. పద్మ యింకా కూర్చోమన్నది కాని రాత్రైనందున వేళైందని బయల్దేరేను.

"వదినా! తిర్గిరేపు దర్శనం చేసుకుంటారు" అని అంటూ పరుగెత్తాను. పద్మ లోనికి వెళ్లిపోయిం దనుకుంటాను.

మాయింట్లో అందరం భోజనాలు చేస్తున్నాం. పద్మసోదరుడు మాట్లాడినవిషయం చెప్పారునాన్న. భాస్కరావుకు పద్మతో వివాహంచేయాలని ఉందన్నాడు. మానాన్న వరదక్షిణపక్షమువాడు కాడు. లేకుంటే అన్నయ్య ఇంగ్లాండువెళ్లిన ఖర్చులైన సంపాదించేవాడే. భాస్కరునడిగి చెప్తానన్నాట్ట. అన్నయ్య తలవంచుకొని లోలోననవ్వుకుంటున్నాడు.

"ఏం! భాస్కర్! పద్మతో వివాహం నీకిష్టమేనా?" అన్నాడు నాన్న.

భాస్క:—నాన్నా! ఆ పిల్ల అసలే వివాహం చేసుకోకుండా జీవితం సాంతం బ్రహ్మచర్యంగా గడుప దలచిందటగా?

మాఅమ్మ నవ్వుతూ "ఏమోనండీ మహా గడుసుపిల్ల. చదువుకున్నాళ్ల కిదోరోగం" అంది.

మేమంతా నవ్వాం. "కోడలిమీద హుకుమ్ చలాయించడానికి వీల్లేదనా? ఆక్షే పిస్తున్నావు" అన్నాడు నాన్న.

నేను:—అసలు పద్మ మీకు కోడలు కావడ మెలా? వివాహం చేసుకోదుట నాన్నా!

నాన్న:—అదంతా వాండ్ల అన్నయ్య ఏర్పాటు చేసుకోండే నాతో ఎలా మాట్లా డుతాడు.

నేను:—పద్మకిష్టమైతే అన్నయ్యనొప్పిం చేపూచీ నాది.

భోజనాలు పూర్తిఅయినవి లేచాం.

అంతా నిశ్చయమైంది. ముహూర్తంగూడ పెట్టుకున్నారు. పద్మ, వాళ్ల అన్న వదినె ఒకేతీరుగా నిర్బంధపెట్టడంవల్ల ఎలాగో ఒప్పుకుందిట! అయినా లోకులంతా దంప తులుగా భావించినా తానుమాత్రం అలా ఉండదట. ముడిపడ్డాక ఏలాఉన్న సరే నను కున్నాను.

బంధువులంతా వచ్చారు. ఎంతోమంది మిత్రులువచ్చిరి. వివాహం మహావైభవంగా జర్గింది. తగుమూకలులేవు. బ్రాహ్మణ సంతర్పణలులేవు ఒక్కదినముతప్ప. తక్కిన నాల్గుదినములు బీదలకు పెట్టించాం. చూచిన వారు, విన్నవారుగూడ ఆనందించారు వీరి దాంపత్యానికి. వధువు 18 సంవత్సరముల కన్య బి. ఏ. ప్యాసైంది. వరుడు బ్యారిస్టర్ 25 సంవత్సరముల బ్రహ్మచారి. ఇద్దరు బాల్యమిత్రులు. ఒకరినొకరు వరించుకు న్నారు. ఈ మధ్యకాలంలో బాల్యవివాహ ములు ప్రబలి మనసంఘాన్ని పాడుచేసినయి గాని పూర్వం ఆర్యుల్లో యిలాంటి వివా హాలే జర్గుతుండేవట.

వివాహం పూర్తిఅయింది. ఆరవనాడు సాయంత్రం మాఅన్నయ్యా, పద్మా, తోట లో తిర్గుతున్నారు. చిన్నగా నేను వారిని వెంబడించాను కానరాకుండా, నాచేతుల్లో క్యామరాఉంది. వారొకచోట కూర్చు న్నారు. పద్మభుజంమీద అన్నయ్య చేయి వుంది. పద్మ తనతల అన్నయ్య భుజం మీదపెట్టి అవనతముఖం చూస్తోంది. ఇదే సమయమని స్నాప్‌కొట్టాను. నా కోరిక నెరవేరింది.

మర్నాటివరకు ఫోటో తయారైంది నా కోరికప్రకారం. దానిక్రింద "అపజయము" అని వ్రాశాను.

ఈపటం తీసుకోని అన్నయ్య గది ముం దుకు వెళ్లాను. లోపల నూతన దంపతు లున్నారు. 'నేను లోనికి రావచ్చునా?'



బొంబాయి, విక్టోరియా గార్డెనునందు హంసలుండు కొలను దృశ్యము.

అన్నాను. ''సంతోషంగా'' అన్నా డన్నయ్య. లోనికి వెళ్లాను. ''అన్నయ్యా! నీ కోఫోటో చూపిస్తాను. మహాచిత్రమైంది, గాని పదినెల్లోమాత్రం దానిసంగతి చెప్పకు'' అన్నాను పద్మవైపు చూస్తూ. పద్మ ముఖం వాల్చుకుంది తనకుగూడా చూపలేదన్న కోపంతో. అన్నయ్య ఫోటో చూచి ఒక్కపెట్టున నవ్వాడు, పద్మవైపు చూస్తూ.

పద్మ:—ఏమిటా సంతోషం, పట్టలేకుండా ఉన్నారు?

"వదినా! నీ కెందుకు కోపం! పోనీ, నీవుకూడ చూడు'' అంటూ చూపించాను చిత్రాన్ని. కోపంవచ్చింది, తన పరాజయాన్ని చిత్రించానని. 'అబ్బా! ఏం దొంగవేషాలు!' అన్నది.

నేను:—వదినా! యీదంపతులు ప్రపంచంలోకల్లా అద్వితీయులు, కాబట్టి యిలాంటి చిత్రాన్ని ఏదైన పత్రికకు పంపిస్తాను మీ పేర్లుగూడ పైనవ్రాసి. అనుజ్ఞ యిస్తావా?

"ఏమో? ఏమన్నా చేసుకో! నా కెందుకు? నాఅనుజ్ఞ తీసుకొనే ఈపని చేశావా? ఇప్పుడుమాత్రం నాఅనుజ్ఞ ఏల?'' అంటూ కోపంతో బైటకువెళ్లింది ఆ పటం గుంజుకొని.

## గమనింపు

రాబోవు అక్టోబరు మాసారంభమున యథాప్రకారము గృహలక్ష్మి దసరా సంచిక వెలువడును. దానిలో స్త్రీలచే మాత్రము రచియింపబడు వివిధవిషయములకు సంబంధించిన చక్కని పద్య గద్య వ్యాసములు ప్రకటింపబడును. దీనికాంధ్ర విద్వత్సోదరీమణుల సాహాయ్య మత్యంతావశ్యకము. కావున సోదరీమణులెల్ల తమ పద్య గద్య వ్యాసములను సాధ్యమైనంత త్వరగా బంపి దసరా గృహలక్ష్మి సర్వాంగ సుందరిగా వెలువడునట్లు తోడ్పడుదురని మనవి. రచయితలు తమ ఛాయాచిత్రములనుగూడ పంప ప్రార్థన.

సంపాదకుడు.

# కుసుమ

"శ్రీ ప్రేమచంద్ జీ"

ఆధునిక హిందీకథాలేఖకుల్లో ప్రేమచంద్ జీ సర్వశ్రేష్టుడు. ఆయన వ్రాసే కథలు భావపూర్తితోనూ, మనోవిజ్ఞానంతోనూ కూడివుంటై. ఆయన 'సేవా సదనం, ప్రేమాశ్రమం, రంగభూమి' మొదలైన నవలలుకూడ చాలావ్రాశాడు. ఆ నవలలు రవిబాబు, శరత్ బాబు వ్రాసే నవలలకు తీసిపోవు. ఆయన వ్రాసిన కథలు చదువుతూవుంటే రష్యాదేశపు టాల్‌స్టాయి జ్ఞాపకం వస్తూవుంటాడు. అందువల్లే ప్రేమచంద్ జీ 'నవలాచక్రవర్తి' అను బిరుదాన్ని గ్రహించగలిగాడు. 'హంస' మాసపత్రికకు సంపాదకుడు.

ఆయన వ్రాసిన కథలు భారతీయభాషలలోనేకాక విదేశీయభాషలలోగూడ అనువాదం అవుతూవున్నై. మన భాషలోకూడ ఆ ప్రతిభాశాలి వ్రాసిన కథలు, నవలలు అనువాదంచేస్తే చాలా బాగుంటుంది. కొన్ని గ్రంథాలు మన భాషలో కూడ అనువాదం అయినట్లు తెలుస్తూంది. అవి అంత ప్రసిద్ధిలోనికి వచ్చినట్లు తోచడంలేదు. ప్రస్తుతం ఆంధ్రదేశంలో హిందీ చదువుకున్నవారి సంఖ్య జాస్తీగానేవుంది. కాని రత్నపరీక్షకులం కాలేకపోయాం మనం. మాతృభాషాభండారాన్ని రత్నాలతో నింపడానికే వివిధభాషలను నేర్చుకో ప్రయత్నించాలి మన ఆంధ్ర సోదరసోదరీమణులు [అనువాదకుడు.]

సంవత్సరంనాటిమాట. నేనొకరోజు షికారువెళ్లుతుండగా నవీనుడు కనుపించాడు. అతను చిన్ననాటి నుండి నాస్నేహితుడు. అతని వాసస్థలం ఆగ్రాపట్టణం. మంచికవికూడాను. నేను అతనికవిసమాజానికి చాలా పర్యాయాలు వెళ్లాను. ఇటువంటి కవితోపాసకుణ్ణి నే నెప్పుడూ చూడలేదు. వృత్తివకాలతు కాని యెప్పుడూ కావ్యచింతనలోనే మునిగిఉంటాడు. అతనికి వాదనాశక్తి బాగాఉండడంవల్ల తరచుగా కేసులువస్తూనే వుంటై. కోర్టువెలుపల కోర్టువిషయంగాని, కేసులవిషయంగాని అతనికి నిషేధం. కోర్టులోవుండే ఆ అయిదారుగంటలేవకీలు. మిగతాసమయమంతా ఆపాదమస్తకం కవి. ఎప్పుడుచూచినా కవిబృందం అతన్ని అంటగట్టుకునేవుంటుంది. అతనిపదాలు బాణంమోస్తరుగా తిన్నగా హృదయంలో నాటుకుపోతై. అతని స్వర మాధుర్యం దానికి ముఖ్యకారణం. అతను లక్నో వచ్చే ముందునాకు తెలియజేస్తూవుండేవాడు. ఈదినం అతన్ని లక్నోలో చూడగానే ఆశ్చర్యంగలిగి "నీవెప్పుడు వచ్చావు? కుశలమా? నీవువచ్చేముందు నాకు తెలియజేయలేదేమి?" అని అడిగాను నవీనుణ్ణి.

"నేనొకవిపత్తులో చిక్కుకొనివున్నా. నీకు తెలియజేయడానికి సమయంలేకపోయింది. నీ గృహాన్ని నాగృహంగానే తలుస్తా. వేరే ప్రయత్నాలు చేయడ మనవసరం. ఇప్పుడు నిన్ను కష్టపెట్టడానికి వచ్చా. షికారువెళ్ళడం మానేయి ఇంటికివెళ్లిన తర్వాతనా విపత్కథంతా చెపుతా" అని నవీనుడు జవాబిచ్చాడు.

నేను భయంతో "నన్ను చింతానిమగ్నుణ్ణి చేశావు. నీ కేమిటి విపత్కాలమేమిటి! నాకేమీ తోచడంలేదు" అని అన్నా.

"ఇంటికి పద. మనస్సు కుదుటపడినతర్వాత చెప్తుతా."

"పిల్లలంతా కుశలమా?"

"ఆ. అటువంటి దేమీ కాదు."

"రెస్టారెంటులో ఫలహారం తీసుకుందువు గాని రా."

"ఇప్పుడు కాదు."

మేమిద్దరం యింటికి బయలుదేరి వెళ్లాం. ఇంటికి వచ్చినతర్వాత పాదాలకు నీళ్లు, త్రాగడానికి మర్బతు యిచ్చా. కొంతసేపయిన తర్వాత తన విపత్కాలమంతా చెప్ప ప్రారంభించాడు నవీనుడు.

"కుసుమ వివాహానికి నీవూ వచ్చావు. అంతకు ముందే కుసుమను అనేకపర్యాయాలు చూశావు. సరళస్వభావులైన యువకుల్ని ఆకర్షించే గుణాలు ఆమెలో వున్నవనుకుంటా. దాన్ని నీవు వొప్పుకుంటావా?"

"నీకంటె కుసుమనే యెక్కువ ప్రశంసించుతా. అట్లాంటి స్వభావంగల పిల్లని యెక్కడా చూడలేదు నేను" అని జవాబిచ్చా.

నవీనుడు కరుణాస్వరంతో ఈవిధంగా అన్నాడు. "ఆకుసుమనేత్రాలనుండి యీదినం కన్నీళ్లు కాల్వలై ప్రవహిస్తున్నై. తనభర్త చూపించే నిర్దయే దీనికి కారణం. పునస్సంధానమై వొకసంవత్సరం కావస్తూవుంది. ఈమధ్యలో మూడు పర్యాయాలు అత్తగారింటికి పోయింది కుసుమ. కాని వొకపర్యాయమైనా ఆమె భర్త ఆమెను పలకరించలేదు. ఆమెముఖం చూస్తేనే అసహ్యించుకుంటాడు. అతన్ని పిలవనంపి వారిద్దరికీ సఖ్యతకూర్చ ప్రయత్నించా. రాకపోగా వుత్తరాలకైనా జవాబు యివ్వలేదు అతను. అతను తనభార్యను ప్రేమించకపోవడానికి కారణమేమిటో నాకు తెలియదు. రెండో వివాహం చేసుకోబోతున్నాడని తెలుస్తూవుంది. నీవు సుస్తుపస్తూతేనంతమార్పు జెందింది కుసుమ. రాత్రింబవళ్ళు యేడ్వడంతప్ప రెండో పనిలేదు. నాదుఃఖం నీకే తెలియాలి. కోర్కెలన్నీ మట్టిపాలైనా. కొడుకులు లేకపోయినా, కుసుమను చూచుకునే ధన్యతనందానను కున్నా. లోటులేకుండా విద్య చెప్పించా. బి. ఎ. చదువుకోకపోయినా బాగా చదువుకున్న స్త్రీకి వివాదాల్లోగాని జ్ఞానంలోగాని తీసిపోదు. నీవు కుసుమ వ్రాసిన వ్యాసాలు చాలా చూశావు. ఆనాగరి వ్యాసాలు యే రోగ్యమంగి స్త్రీలో ప్రాముఖ్యము తెలుస్తా. నా వాదంలో ఆమెను యెవరూ జయించలేరు. గృహకృత్యాల్లో బహు నేర్పరి. కాని తనభర్త దృష్టిలో పాదధూళికైనా సరిపోదు. నిజమైనా అతన్ని అనరానిమాట అని వుండాలి. లేకపోతే నీతో వుదాసీనంగా యెందుకు వుంటాడని అనేకపర్యాయాలు కుసుమను ప్రశ్నించా. 'నాతో మాట్లాడేటంతగ యెప్పుడు' అని జవాబిచ్చేది కుసుమ. ప్రథమదినమే వారిద్దరికీ పరస్పర విరోధం గలిగిందని తలుస్తా. కుసుమను ఆమెభర్త యేమైనా అడిగి వుంటాడు. సిగ్గుచే జవాబు యివ్వకపోతే యింకా కొన్ని మాటలు అడిగివుండవచ్చు. కిర్తైనా యెత్తివుండక పోవచ్చు కుసుమ. కుసుమకు సిగ్గుపుట్టుకతోనే వచ్చిన సంగతి నీకూ తెలును. ఆమెభర్త వుదాసీనంగా వుండడానికి కారణం యిదేననుకుంటా. కుసుమవంటి బాలికతో యెవ్వరున్నైనా వుదాసీనంగా వుంటాడని నేను కలలోనైనా అనుకోలేదు. యిదంతా నాదురదృష్టం. కుసుమ భర్తకు చాలావుత్తరాలు వ్రాసింది. కాని ఆనిర్దయుడు వొక్కవుత్తరానికైనా జవాబు యిచ్చిన పాపానపోలా. వుత్తరాలన్నీ తిప్పేశాడు. ఆపాషాణహృదయాన్ని కరిగించే వుపాయం నాకేమీ తోచడంలేదు. నేనా వానికి వుత్తరం వ్రాయలేకుండా వున్నా. నీవే కుసుమని రక్షించాలి. లేకుంటే ఆప్రాణం కాస్తా యెప్పుడో యెగిరిపోతుంది. చెప్పకుండా ఘా.

రెండు ప్రాణాలుకూడ కుసుమను అనుసరిస్తై. ఆవ్యథ మేము చూడలేకుండావున్నాం.”

నవీనుని నేత్రాలు అశ్రుపూరితములైనై. నాకూడా దుఃఖంకలిగింది. అతన్ని వోదారుస్తూ “నీ విన్ని దినాల నుండి దుఃఖమనుభవిస్తూకూడ నాకు తెలియజేయలేదేమి? నే నీలోజే కుసుమదాబాడు వెళ్తా. అతన్నిలాక్కొచ్చి కుసుమపాదాలమీద పడవేస్తా” అన్నా.

“నీవతనితో చెప్పేదేమి?”

“అవి నన్నడగవద్దు. వశీకరణమంత్రాలనన్నిటినీ పరీక్షిస్తా.”

“నీవు సఫలుడవుకాలేవు. అతనిలో మంచి వానికి వుండవలసిన గుణాలేమీలేవు. నీవు అక్కడినుండి వానిభక్తుడవై తిరిగి వస్తావు. అతను యెప్పుడూ నీ యెదుట చేతులు జోడించుకు నిలబడ్తాడు. నీకలోర శక్తా శాంతమూలుంది. నీవు చేయగల సాధనవొకటె. నీకలంలో మంత్రంవుంది. దానిద్వారా చాలామంది యువకుల్ని మంచిదారికి రప్పించావు. హృదయంలో నిద్రించే మానవత్వాన్ని మేల్కొల్పేవంతునీది. కుసుమ వ్రాసినట్లుగా వొకకరుణాజనకమైన వుత్తరంవ్రాసి కుసుమభర్త హృదయాన్ని కలవరపర్చు. దానితో మంచి దారికి వస్తాడు అతను. నేను జీవితపర్యంతం నీకు కృతజ్ఞుణ్ణిగావుంటా.”

నవీనుడు వొకకవేగా. ఆపనికి కవిత్వపు ప్రాధాన్య ముండాలి. అతనికంటె నేను బాగా వ్రాయలేక పోయినా అతన్ని నిరాశజెందించడం నా కిష్టంలేదు. అందువల్ల యీవిధంగా అన్నా—“వుత్తరం వ్రాసి శక్తికొలది అతనిబుద్ధిని మార్చ ప్రయత్నిస్తా. కాని అనుచితంగాని పక్షాన కుసుమ తనభర్తకు వ్రాసిన వుత్తరాల్ని నాకు వొకపర్యాయం చూపించు. అతనా వుత్తరాల్ని తిరగగొట్టాడుగాన చింపిపారవేయకుండా వుంటే కుసుమవద్ద తప్పకవుంటై. ఆవుత్తరాల్లో వ్రాయక మిగిలినసంగతులేమైనావుంటే నేనువ్రాస్తా.”

“నీవు చూడగోరతావనే వుద్దేశ్యంతోనే ఆవుత్తరాలను నాతో తీసుకవచ్చా. ఇదిగో కట్టిని చదువు. నీవు చదువగూడని సంగతులేమీవుండవు” అని నవీనుడు వుత్తరాలకట్ట వొకదాన్ని జేబులోంచితీసి నాముందుంచాడు.

ఆవుత్తరాలు సుగంధంతోగూడిన పచ్చని గులాబి కాగితంమీద సుందర అక్షరాలతో వ్రాయబడివున్నై. వాటిని చదువ ప్రారంభించానేను.

మొదటివుత్తరం

నా స్వామీ,

నేను యిక్కడకువచ్చి వారంరోజులైంది. కాని రెప్పపాటుకాలమైనా కండ్లుమూసి యెరుగ. ప్రక్కలు మార్చడంలోనే గడచిపోతున్నై రాత్రులు. ఏమితప్పిదం చేసినందులకు యీశిక్ష అనుభవిస్తున్నానని మాటి మాటికి ఆలోచించుకుంటున్నా. మీరు నన్ను కొప్పడి తిట్టండి బుద్ధిపుడితే చెవుకూడ పట్టుకోండి. ఈశిక్షల నన్నిటినీ సహర్షంగా అనుభవిస్తా. కాని యీనిష్ఠురత్వాన్ని సహించలేకుండావున్నా. నేను మీగృహంలో వారంరోజులున్నా. నాహృదయంలోని కోరికెలు ఆ భగవంతునికే తెలియాలి. మీతో మాట్లాడతలంచా. నా అపరాధాలను క్షమించ వేడుకుందామనుకున్నా. కాని మీరు నానీడనుచూచే చాలాదూరం తొలగేత్తే వారు. అందువల్ల నాకు సమయందొరకలేదు. రెండు ఝాముల వేళ మీయింట్లో వారందరూ నిద్రించే వారు. ఆసమయాన నేను మీగదిలోనికివచ్చి శిరస్సు వంచుకుని కొన్నిగంటలవరకు నిలబడివుండేదాన్ని. మీరు వొకపర్యాయమైనా కన్నెత్తిచూచేవారు కారు. ఇవి మీ రెరిగినవిషయమే. అప్పటి నామనో దుఃఖం బహుశమీకు అర్థంకాదు. దాన్ని అర్థం చేసుకునేవారు నాబోటి అభాగినులే. నాస్నేహితురాండ్ర వల్ల ప్రథమరాత్రి మిలనపు కథలువిని నేను సుఖాల స్వర్గాన్ని కల్పించుకున్నా. దాన్ని నష్టపరిచారు మీరు నిర్దయతో.

మీపై నాకే అధికారంలేదా? నేరస్థుణ్ణి శిక్షించడానికి కోర్టుకూడ యేదోవొక అభియోగాన్ని కల్పిస్తుంది. సాక్ష్యాన్ని అడుగుతుంది. నేరస్థుడు చెప్పేదంతా వింటుంది. కాని నన్నేమి అడగలేదు మీరు. నాతప్పు నాకుతెలిస్తే ముందుజాగ్రత్తగా తొలిగేదాన్ని. పాదాల మీదపడి క్షమాదానమడిగేదాన్ని. మీరు క్రోధంగా వుండడానికికారణం నాకేమి తెలియదని వొట్టువేసుకుని చెపుతున్నాను. మీరు మీభార్యలో చూడదలంచిన గుణాలు నాలో లేకపోవచ్చు. నాకు యింగ్లీషురాదు. ఇంగ్లీషు ఆచారవ్యవహారాలు నాకు తెలియవు. ఇంగ్లీషు ఆటలుకూడ నాకు ఆడనుచేతగాదు. ఇంకా యెన్నో లోపాలు నాలోవుండవచ్చు. మీకుతగిన భార్యను కానని నేను వొప్పుకుంటున్నా. మీకు నాకంటె రూపవతి, గుణవతి, తెలివిగలభార్య దొరికి వుండవలసింది. కాని స్వామీ, శిక్ష అపరాధాలకు గాని లోపాలకుగాదు. మీరు చెప్పినవిధంగా నడుస్తా. మీరు నన్ను ప్రేమించండి. ఆతర్వాత నేను నాలోపాలను యెంతత్వరగా పూర్తిచేసుకో గలిగేది మీకే తెలుస్తుంది. మీప్రేమకటాక్షం నారూపాన్ని ప్రదీప్తంగాను, నాబుద్ధిని తీవ్రంగాను, నా అదృష్టాన్ని బలవంతురాలనుగాను చేసివేస్తుంది. దానితో పూర్తిగా మారిపోతాను నేను.

స్వామీ మీరు కోపించే దెవర్నో ఆలోచించుకున్నారా? మీపాదాల మీదపడి క్షమాదానమడిగే వొక అబలను. జన్మజన్మాంతరాలకు మీదాసి మీ కోపాన్ని సహించగలదా? నాహృదయం చాలా దుర్బలమైంది. నన్ను యేడ్పించితే మీకు పశ్చాత్తాపం కంటె వేరేలాభంకలుగదు. ఆక్రోధాగ్నికణమొకటే నన్నుభస్మంచేసివేస్తుంది. నామరణమే మీరుకోరేపక్షాన మరణించడానికి తయారు నేను. కేవలం మీఆజ్ఞచాలు దీనికి. నామరణంవల్ల మీకుచిత్తశాంతికలిగితే సహర్షంగానన్ను మీపాదాలమీద సమర్పించుకుంటా. నాలో వంద దుర్గుణాలున్నప్పటికీ వొక సుగుణంకూడావుంది. మీకు నేను చేయగలిగేసేవ రెండో స్త్రీ చేయలేదని చెప్పగలను. మీరు విద్వాంసులు, వుదారవంతులు, మనోవైజ్ఞానికులు. మీయెదుట నిలబడి దయాభిక్ష అడుగుతూవుంది మీదాసి. దాన్ని మీద్వారంనుండి తన్ని వెళ్లగొడతారా?

మీ అపరాధిని,

కుసుమ.

ఆవుత్తరంచదవగానే నాశరీరం గగుర్పొడిచింది. ఏస్త్రీఅయినా యింతగా హద్దుమీరి తనభర్తను పొగడడం నాకు అసహ్యమనిపించింది. పురుషుడు తన భార్యతో వుదాసీనంగావుంటే స్త్రీమాత్రం అతన్ని యెందుకు నిర్లక్ష్యభావంతో చూడగూడదు? వివాహం స్త్రీని తనదాసిగా చేసిందని తలుస్తాడు దుష్టుడు. ఆ అబలను యెన్నిఅత్యాచారాలపాలుజేసినా అతని చేతిని యెవరూ పట్టుకోజాలరు. ఏమి అనుకూడ అనలేరు పురుషుడు నాలుగైదు వివాహాలుకూడ చేసుకోవచ్చు. తాను సంబంధంవదిలిన భార్యనుకూడ కఠోరంగ శాసించవచ్చు. స్త్రీకుల మర్యాదయొక్క బంధనాల్లో కట్టుబడివుందని, యేదుస్తూచావడంకంటె వేరేవుపాయంలేదని పురుషునికితెలుసు. పదిమాటలకు వొకమాటైనా స్త్రీయెదురు చెప్పగలదనే భయంవుంటే అతనికి దుర్మార్గంచేయడానికి సాహసంవుండదు. పాపం స్త్రీయెంత వివశురాలు. నేనే కుసుమనైతే ఆనిర్దయకు పదిరెట్లు నిర్దయచూపించేవాణ్ణి. కష్టాలపాలుచేసేవాణ్ణి. సమాజం నవ్వుతుందనేభయం నాకుండేదిగాదు. అబలలమీదజరిగే అత్యాచారాలుచూచి కూడ యేమి అనలేని సమాజం యేడ్చినా, నవ్వినా నాకు లెఖ్ఖగావుండేది గాదు. ఓ అభాగ్యయువకులారా! మిమ్మగట్ట త్రాళ్లు మీరే తెచ్చుకుంటున్నారని మీకు తెలియడంలేదు. పురుషుడు ప్రణయభండారంతో భార్యా తల్లిదండ్రులను, సోదరిసోదరులను, స్నేహితురాండ్రను సంతోషపెట్టవలసిన దినాలివి. ఆ సమర్థత

లేనివాడు స్త్రీ క్షుభితహృదయాన్ని యెట్లాసంతోష పెట్టగలడు? కావలసిన పరిణామం అయితీరుతుంది. అబలకృశించిక్షీణించి మరణిస్తుంది. భర్తస్నేహాన్ని పొంది తన జన్మసఫలత చెందిందని తలుస్తుంది స్త్రీ. ఆ ప్రేమను ఆధారంచేసుకుని తానుపొందే కష్టాలనన్నిటినీ సంతోషంతో అనుభవిస్తూవుంటుంది. పురుషుని హృదయంలో ప్రేమవసంతరుతువు ప్రవేశించినపుడు స్త్రీలోక్రొత్తక్రొత్త ఆశాపల్లవాలు బయలుదేరే సమయం ఈసమయం. ఈరుతువులో ఆవృక్షాన్ని గొడ్డలితో నరికే నిర్దయుడెవడుంటాడు? నేను రెండోవుత్తరం చదవప్రారంభించా.

## సు

### రెండోవుత్తరం

నాజీవనధనమా,

నేను రెండువారాలవరకు మీజవాబుకు ప్రతీక్షించి యీదినం మరల మిమ్మ కష్టపెట్టదలంచా. నేనావుత్తరం వ్రాసేసమయాన మీరు నాకు తప్పక జవాబు యిస్తారని నాహృదయం సాక్ష్యమిచ్చింది. ఆశకువిరుద్ధంగా ఆశపెట్టుకునివున్నా. అవకాశం లేకగాని అస్వస్థులుగావుండిగాని నావుత్తరానికి జవాబు వ్రాసియుండరని తలుస్తున్నా. భగవంతుని దయవల్ల మీరు అస్వస్థులు గాకుందురుగాక. ఎవర్ని అడగడం? ఈవిచారంతోనే నా హృదయంకంపించి పోతూవుంది. మీరు ప్రసన్నులుగా ఆరోగ్యవంతులుగా వుండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నా. మీరు నావుత్తరానికి జవాబు వ్రాయకపోయినాసరే. యేడ్చి వూరుకుంటూ. మీరే నా దైవస్వరూపులు. మీకు కష్టంగలిగినపుడు నాకు వుత్తరంవ్రాయండి. యెవరినైనాతీసుకుని మీవద్దకువస్తా. మర్యాదనీతులకు లోబడివుండడం నాకు కష్టంగావుంది. ఆస్థితిలో గూడ నాసేవను మీరు కోరనట్లైతే నాజీవితంలోని అమూల్యవస్తువును మీరు లాక్కుంటున్నారనితలుస్తా. తినడానికి యింత గంజో, అంబలో, కట్టుకోవడానికి యేమొద్దుగుడ్డో యిస్తేచాలని తలుస్తున్నా. ఇంకా వేరేయిష్టమని కష్టపెట్టను. భూలోకవిపత్తులలోగూడ మీతోవుండే సంతోషంగా కాలంగడుపుతా. నాకు ఆభూషణాలకోరికగాని, మేడల్లోనివశించే కోరికగాని, ధనోపార్జన కోరికగాని, స్వర్గసుఖాలకుపోయే కోరికగాని లేదు. నాజీవనోద్దేశ్యం మీసేవ చేయడమే. ఇదేనానిధ్యేయం.

నాకీప్రపంచంలో దేవతలు, గురువులు, శాసకులు యెవరూ లేరు. నా దేవతలు, నా గురువులు, నా రాజులు మీరే. మీరు మీపాదాలనుండి నన్నుత్రోసి వేయవద్దు. నేను సేనాపుష్పాల్ని. కర్తవ్యనైవేద్యాన్ని నాపమిటలో భద్రపరచుకుని మీ సేవజేయడానికి వచ్చా. నా యీనైవేద్యాన్ని, పుష్పాల్ని మీపాదాల మీద వుంచనివ్వండి. పూజచేయడం వుపాసకునిపని. దేవత ఆపూజను స్వీకరించినా, స్వీకరించకపోయినా ఆలసించడం అతని ధర్మంకాదు.

నాశిరోముకుటమా, నాయిప్పటిదశ మీకు తెలియదు. తెలిస్తే యింతనిర్దయగా ప్రవర్తించరు. మీరు పురుషులు. మీహృదయంలో దయ, సానుభూతి, వుదారతలున్నై. మీరు నావంటితుచ్ఛవస్తువును క్రోధంగా చూస్తారని నేనునమ్మను. నేను దయాపాత్రురాలను. మీరు సూర్యులు; నేను అణువును, మీరు అగ్ని; నేను తృణాన్ని, మీరు రాజులు; నేను భిక్షకురాల్ని. క్రోధం సమానులమీద చూపించాలి. నేను మీక్రోధాఘాతాన్ని యేవిధంగా సహించడం? మీసేవకు నేను అర్హురాలనుగాదని తలంచితే మీరు నాకు విషపుగిన్నెను యివ్వండి. అమృతంగా భావించి నేత్రాలకద్దుకుని త్రాగివేస్తా. నామరణంవల్ల మీరు నిశ్చింతులైనారనే సంతోషం చాలునాకు. నేను మీదాన్ని. ఎల్లప్పుడూ మీదాన్నిగా వుంటా. ఈ జీవితంలోనేగాదు. అనంతంవరకు. ఇదే నాకోరిక.

అభాగిని,

కుసుమ.

ఈవుత్తరం చదవగానే నాకు కసుమమీద కోపం వచ్చింది. ఆగాడిదెమీద అసహ్యమేసింది. నీవు స్త్రీవి కనుక ప్రస్తుత ఆచారప్రకారం పురుషునికి నీమీద అన్నివిధాల అధికారంవుంది. కాని నమ్రతకు కూడ హద్దువుండాలి. స్త్రీకి అభిమానం, కఠినత కొంచెం వుండాలి. పురుషుడు స్త్రీని వొత్తిడిచేస్తే స్త్రీకూడా అతన్ని లెక్కచేయకూడదు. మనం స్త్రీలకు ధర్మత్యాగాలపాఠంచెప్పి వారి ఆత్మసమ్మానాన్ని, ఆత్మవిశ్వాసాన్ని అంతమొనరించాం. పురుషుడు స్త్రీని ఆశ్రయించుకుని వుండనపుడు స్త్రీ మాత్రం యెందుకు ఆశ్రయించుకునివుండాలి ? భగవంతుడు పురుషునికియిచ్చిన చేతులు స్త్రీకి యివ్వలేదా ? పురుషులు తెలివిగలవారైతే స్త్రీలు అబోధులా ? పురుషులకు కండ్లు నెత్తిమీదికి రావడానికి కారణం ఈనమ్రతే. పురుషుడుకోపించితే స్త్రీకి ప్రళయం సంభవించిందనే తలంచాలి. కుసుమగాదు దయాపాత్రురాలు. కుసుమవంటి భార్యారత్నాన్ని గౌరవించని ఆమెభర్తయే దయాపాత్రుడు. అతను యెవ్వతెతోనైనా కాలంగడుపుతూ వుండవచ్చునని నాకు సందేహం.

సరే, మూడోవుత్తరం తెరిచాను.

మూడవవుత్తరం

ప్రియతమా,

నాజీవితం నిరుద్దేశ్యమని తోస్తూవుంది. చూచేవాడు, వేరుకునేవాడు లేనప్పుడు పుష్పంవికసించి లాభం? వాడి భూమిమీదపడి కాళ్లతో త్రొక్కబడడానికేనా ? నేను మీగృహంలో నెలరోజులుండి రెండోపర్యాయంవచ్చా. మామగారే నన్నిక్కడకు పంపించారు. ఇన్నిదినాలకు వొకపర్యాయమైనా మీరు నాకు దర్శనం యివ్వలేదు. ప్రతిదినం మీరు గృహంలోనికి కనీసం యిరవైపర్యాయాలైనావచ్చి మీవారితో నవ్వుతూ మాట్లాడుతూ వుండేవారు. కాని మీరు నావద్దకు రాగూడదని వొట్టువేసుకున్నారు. అనేకపర్యాయాలు పిలవనంపాను. అనేకపర్యాయాలు సిగ్గువదలి మీగదిలోకి వచ్చాను. కాని నావైపు కన్నెత్తికూడా చూడలేదు. ఇంత హృదయహీనులువుంటారని తలంచనైనా తలంచలేదు. నేను ప్రేమించడానికి, నమ్మడానికి, సేవ జేయడానికి యోగ్యురాలను కాకపోవచ్చు. కానిదయకు యోగ్యురాలనుగానా ? నేనాదినం యెంత ప్రయాసపడి మీకొరకు గులాబ్ జామాన్లు తయారుచేశాను ? మీరు వాటిని చేత్తో ముట్టనైనాముట్టలేదు. మీరు నాయందు అంతవిరక్తులైనపుడు నేనుజీవించి ప్రయోజనమేమిటో నాకే తెలియడంలేదు. అపరాధం చెప్పకుండా శిక్షిస్తున్నారు. ఇది మీఅన్యాయంగాదూ ? ఇదేమినీతి ? నేను మాసంలో పదిరోజులే మీయింట్లో భోంచేశాను. ఆసంగతి మీకుకూడజ్ఞాపకమె. నేను నడవలేనంత బలహీనురాలనై పోయాను. నేత్రాల్లో జ్యోతిలేదు. సరే, మీయిష్టంవచ్చినట్లు కష్టపెట్టి యేడ్పించండి. ఒకదినం యీఅనీతికి అంతంవుంటుంది. ఇప్పుడు అన్నిఆశలూ మృత్యువుమీదనే నిర్భరమై వున్నై. నామరణవార్తవినికూడ సంతోషంతో గంతువేస్తారని, కన్నీటిబిందువు వొకటైనా రాల్చరని నేను అనుకుంటున్నా. ఇది మీదోషంగాదు. నాదౌర్భాగ్యం. క్రిందటిజన్మలో యేదో పాపంచేసివుంటా. మీమోస్తరుగా నేను మిమ్ము ప్రేమించకుండా వుండేశక్తి నాలోలేదు. వృక్షంమాదిరి లత నిలబడివుంటుందా ? వృక్షానికి యేమీ ఆధారం అవసరంలేదు. ఆశక్తిలతకు యెక్కడినుండి వస్తుంది ? అది వృక్షాన్ని పెనవేసుకొనుటకుకే పుట్టించబడినది. దాన్ని వృక్షంనుండి వేరుచేస్తే యెండిపోతుంది. వర్తులాకారమైన నాజీవితానికి కేంద్రం మీరు. నేను హారాన్ని. దానిదారం మీరు. ఆ హారపు ప్రత్యేకపుష్పం ఆదారాన్ని ఆధారంచేసుకుని వుంది. ఆ దారంలేనిది హారపు పుష్పాలు విడిపోయి ధూళిలో మిళితమౌతై.

నాకు 'శన్నో' అనే స్నేహితురాలు వుండేది. ఈ సంవత్సరం ఆమెకు వివాహమైంది. ఆమె భర్త అత్త గారింటికి వచ్చినపుడు శన్నో పాదాలు భూమిమీద నిలవవు. ప్రతిదినం అనేకపర్యాయాలు శృంగారాన్ని మాకు చెప్తావుంటుంది. ముఖకమలం వికసించివుంటుంది. తనఉల్లాసాన్ని ఆపుకోలేదు. మాబోటి అభాగినుల మీద ఆవుల్లాసాన్ని వెదజల్లుతూవుంటుంది. నన్ను శన్నోవచ్చి కౌగలించుకున్నప్పుడు నేను హర్షాశ్రు దాలవర్షంలోతడిచి ముద్దైపోతూవుంటాను. ఆదంపతు లిద్దరు అనురాగంలో మగ్నులై వుంటారు. ఆ అఖండ ప్రేమక్షణానికి ప్రపంచంలోని యేవస్తువు సాటి? ప్రేమ యెల్లకాలం వొకేమాదిరి వుండదని నాకు తెలుసు. జీవనచింతలు, దురాశలు వారినికూడ తమ వశంచేసుకుంటాయి. కాని యీమధురస్మృతులు దాచు కున్న ధనంరీతి అంతంవరకు వారికి సహాయంచేస్తూనే వుంటాయి. తనభర్త స్వగృహానికి వెళ్లినపుడు శన్నో వెక్కి వెక్కి యేడుస్తూవుంటుంది. ఆసమయాన నా హృదయం గద్గదమై పోతూవుంటుంది. భర్తదగ్గర నుండి వుత్తరంరాగానే ఆమెకు గొప్పనిధి దొరికినట్లు వుంటుంది. శన్నో యేడ్పులోనూ, విఫలతల్లోనూ వొక స్వాదంవుంది. వొక రసంవుంది. వ్యగ్రతతోనూ విహ్వలతతోనూ కూడివున్నై శన్నో నేత్రాశ్రువులు. నిరాశతోనూ, దుఃఖంతోనూ కూడివున్నై నా అశ్రువులు. ఆమె వ్యాకులతలో ప్రతీక్షావుల్లాసాలున్నై. నావ్యాకులతలో దీనతా నిరాశలున్నై. ఆమె దూషణలో అధికారమమతలున్నై. నాదూషణలో భగ్నతకుదనాలున్నై.

ఉత్తరం పెద్దదౌతుంది. కాని నామనస్సులోని భారం తగ్గడంలేదు. భయంకరమైన యెండలు కాస్తున్నై. తండ్రిగారు నన్ను 'మసూరి' తీసుకువెళ్లే ప్రయత్నంలో వున్నారు. నాదుర్బలతవల్ల ఆయనగారికి క్షయ అని సందేహంగావుంది. నాకు మసూరేకాదు స్వర్గంకూడ నరకంలో సమానమని తెలియదు తండ్రి గారికి.

అభాగిని,

కుసుమ.

నా స్వప్నవృత్తం

నాపాషాణదేవతా,

నిన్న మసూరినుండి తిరిగివచ్చాను. ఆరోగ్యాన్ని చేకూర్చే మంచిస్థలమని అందరూ అంటారు. కావచ్చు. నేనొకదినంకూడ నాగది వదలిపోలేదు. భగ్నహృదయులకు ప్రపంచమంతా శూన్యం. నేను రాత్రి వొక మంచిస్వప్నంచూశాను. చెప్పిప్రయోజనం? మృత్యువంటే యిప్పటికికూడా భయంవేస్తూవుంది. ఆశా బంధనాలు నాజీవితాన్ని బంధించివేసినై. జీవితో ద్యానద్వారంవద్దకుపోయి దానిలో షికారు చేయకుండా తిరిగిపోవడం ఎంతదుఃఖదాయకం? ఆవుద్యానవనంలో యెంత సౌరభంవుంది. యెంత ఆనందంవుంది. నాకాద్వారమే మూయబడివుంటుంది. ఆవుద్యానవనంలో విహరించి ఆనందం పొందవలెనని అనేక కోరికలతోనూ, అనేకప్రయత్నాలతోనూ బయలుదేరా. కాని నేను ఆవుద్యానవనసమీపానికి చేరగానే ద్వారం మూయబడినది.

నేను మరణించినతర్వాత నాశవంమీద రెండు కన్నీళ్లబిందువులైనా వదుల్తారా? ఈమాత్రం వుదారత చూపించలేరూ? మరణించేవారి అపరాధాల్ని అందరూ క్షమిస్తారు. మీరుకూడా నన్నుక్షమించండి. వచ్చి నాశవాన్ని స్నానంచేయించి నాముఖాన కుంకుమబొట్టుపెట్టండి. నాచేతులకు గాజులుతొడిగి గంగాజలం నోట్లోపోయండి. నాలుగైదుఅడుగులు నా శవాన్ని మోయండి. దానితో నాఆత్మ సంతుష్టిజెంది మిమ్ము ఆశీర్వదిస్తుంది. భగవంతునిదర్బారులో మీయశాన్ని గానంచేస్తానని వాగ్దానం చేస్తున్నా. ఇదికూడా

అలభ్యమేనా? ఆ శిష్టాచారంతో బాధ్యతలన్నిటి నుండీ విముక్తులవౌతారు. ఈమాత్రంచేస్తారని నాకు విశ్వాసంవుంటే యెంతసంతోషంగా మరణిస్తాను? ఎంతసంతోషంగా మృత్యువునకు స్వాగతమిస్తాను? కాని మీకు అన్యాయం చేయను. నామరణవార్తవినగానే మీరువచ్చి నాశోకమృత్యువునకు వొకక్షణం దుఃఖిస్తారని నేను యెరుగుదును. నేనా శుభావసరాన్ని నా జీవితంలో చూడగలుగుతానా?

సరే, నేనొకప్రశ్న అడుగవచ్చా? కోప్పడవలదు. నాస్థానం యింకొకసౌభాగ్యవతి ఆక్రమించుకుందా? అట్లాజరిగివుంటే ధన్యవాదాలు. కొంచెం ఆమె చిత్రాన్ని నాకుపంపాలి. నేనాచిత్రాన్ని పూజించి పాదాలమీద శిరస్సుంచుతా. నేను సంతోషపెట్ట లేనిదేవతవల్ల వరప్రసాదంపొందిన ఆసౌభాగ్యవతి పాదాలకడిగి ఆనీటిని పానంచేస్తా. ఆమెతో మీరు సుఖంగావుండవలెనని నాహృదయేచ్ఛ. అపరోక్షంగా గాకపోయినా, పరోక్షరూపంగానైనా ఆ దేవికి యేకొద్ది సేవచేయుగలిగినా మీకు వుపయోగించానని అనుకుంటా. ఆమె శుభనామం, గ్రామం తెలియపర్చండి. ఆమెవద్దకువెళ్లి "దేవీ, నాభర్తకు నీవుప్రేమికవు. కాబట్టి నేను నీకుదాసిని. నీపాదాలవద్ద శరణమివ్వు. నేను పుష్పాలతో నీశయ్యను అలంకరిస్తా. నీపాపటి ముత్యాలతో నింపుతా."అని ప్రార్థిస్తా. ఇదేనాజీవనసాధనమౌతుంది. నాకు యీర్ష్యకలుగుతుందనిమాత్రం తలచవలదు. ఎవరైనా నావస్తువును లాక్కున్నప్పుడే నాకు యీర్ష్య కలుగుతుంది. ఆ వస్తువు నాదని తలంచేభాగ్యం లేనప్పుడు దానికొరకు యెందుకుయీర్ష్య?

ఇంకా చాలా వ్రాయవలసివుంది. కాని డాక్టరు గారు వచ్చారు. ఆయన నా హృదయపరితాపాన్ని క్షయ అనుకుంటున్నాడు పాపం.

దుఃఖంతో పీడింపబడుతున్న
కుసుమ.

నాకు ధైర్యాన్ని చేకూర్చినవి ఆ రెండు వుత్తరాలు. నేను ఆవేశహీనుణ్ణి. భావుకత నాలో లేనే లేదు. కాని యీ వుత్తరాలు నన్ను వ్యాకులపరిచినై. వొకచోట నిజంగానే నేత్రాలు అశ్రుపూరితములైనై. తల్లిదండ్రులు తమ ప్రాణాల్ని సహితం యివ్వడానికి సిద్ధంగావున్న బాలికవివాహం జరిగిన తర్వాత యీవిధంగా విపద్గ్రస్థురాలవడం యెంత వేదనతో గూడిన విషయం. ఇటువంటి వైవాహిక దుర్ఘటనలు చాలా తక్కువగా జరుగుతవనడంలో సందేహంలేదు. స్త్రీ పురుషుల అధికారం సమానం కానిది నిత్యము యిటువంటి అఘాతాలు జరుగుతూనే వుంటై. దుర్బలులను శిక్షించడం మానవస్వభావం. కరిచేకుక్కను చూచి దూరంగా పారిపోతారు. కరవనికుక్కమీద వినోదంకొరకు రాళ్లు రువ్వుతారు పిల్లలు. నీ నౌకర్లు వొకేశ్రేణివారైతే పోట్లాడుకోరు. కానివారిలో వొకర్ని వుద్యోగిగాను, రెండవవానిని అతని అధీనంలోని నౌకరుగానుచేసి చూడు. వుద్యోగి నౌకరుమీద దర్జా చలాయిస్తాడు. సుఖమయదాంపత్యపు పునాది అధికారసమానమ్మీదే ఆధారపడివుంటుంది. ఈ వైషమ్యంలో ప్రేమవుంటుందని తలంచను నేను. యజమాని పశువుమీద చూపించే ప్రేమనే మన మీ దినం పురుషుల్లో చెప్పుకునే ప్రేమ. పశువు తల వంచుకుని పని చేసినంత కాలం యజమాని గడ్డికుడితి పెడతాడు. శరీరాన్ని శుభ్రపరచి ఆ భూషణాల్నికూడ అలంకరిస్తాడు. పశువు తనపనిలో మందంగావుండి మెడవంచినప్పుడు యజమాని కొరడాదెబ్బ దాని వీపుమీద పడుతుంది. దీన్నిప్రేమ అనరు.

అయిదోవుత్తరం విప్పా.

## అయిదవ వుత్తరం

నే ననుకున్నప్రకారం వెనుకటి వుత్తరానికికూడ మీరు జవాబు వ్రాయలేదు. నన్ను వదిలిపెట్ట సంక

క్షించుకున్నారని దీనితో తేలిపోయింది. పురుషునికి స్త్రీ కాలిచెప్పుతో సమానం. స్త్రీకి పురుషుడు దేవతుల్యుడు. దేవతకంటేకూడా గొప్పవాడు. వివేకం వుదయించినప్పటినుండీ పతిని కల్పించుకుంటూనే వుంటుంది స్త్రీ. నేను చేసింది అదే. నేను బొమ్మలాటలాడుకునే సమయాన మీరు బొమ్మరూపంతో నా మనోదేశంలో ప్రవేశించారు. మీ పాదాలను పత్తాను. హారాలతో, పుష్పాలతో, నైవేద్యంతో మిమ్మ సత్కరించా. కొన్ని దినాలతర్వాత కథలు వినడంలోను, చదవడంలోను, నాకు యెక్కువరుచి వుండేది. అప్పుడు మీరు కథానాయకరూపంతో మా యింటికి వచ్చేవారు. నేను నా హృదయంలో స్థానమిచ్చి మీకు బాల్యకాలంనుండీ మీరు యేదోకవిధంగా నా హృదయంలో దూరివున్నారు. ఆభావనలు నా అంతఃస్థల పునాదివరకు పోయినై. నా అస్తిత్వపు వొక్కొక్క అణువు ఆ భావనలచేత గుచ్చబడివుంది. వాటిని హృదయంనుండి తీసివేయడం సహజం కాదు. వాటితో నా జీవనపరమాణువులుకూడ విడిపోతై. అదే మీ కోరికైతే ఆవిధంగానే జరగడం మంచిది. నేను మీ సేవలో యేదైనా చేయడానికి సిద్ధం. మీ సేవలో నేను నాశనంగావడమే నా జీవనోద్దేశ్యం. నేను లజ్జాసంకోచాలను పరిత్యజించా. ఆత్మసమ్మానాన్ని పాదాలతో త్రొక్కివేశా. కాని మీరు నన్ను స్వీకరించ దలంచలేదు. వివశురాలను. మీదోష మేమీలేదు. మీరింత కఠోరులు గావడానికి కారణం నే నేదైనా తప్పు చేసివుండాలి. మీరు దాన్ని నాలుకమీదకు తెచ్చుకోవడంకూడ వుచితం గాదు. నేను ఆ నిష్ఠురాన్ని శిక్ష యేవిధమైనశిక్షైనా సహించడానికి తయారుగావున్నా. మీచేతితో విషపుగిన్నెను తీసుకుని త్రాగడంలోకూడ విలంబంవుండదు. కాని విచిత్రం విధిగతి. స్త్రీ పురుషునిదాసియనే సత్యాన్ని వొప్పుకునేదాన్ని కాదు మొదట. పురుషునికి స్త్రీ సహచారిణిగాదు, అర్ధాంగిగాదు [illegible]. కాని యిప్పుడు తెలుసుకొన్నా. కొన్నినాళ్ళక్రిందటనే వొకపుస్తకం చదివాను. దానిలో పూర్వం స్త్రీ పురుషులకు పశువులవలె సంపత్తి అయివుంది. పురుషునికి స్త్రీని అమ్మడానికిగాని, తాకట్టుపెట్టడానికి గాని చంపడానికి కాని అధికారంవుండేది. [illegible] సశస్త్రులైవచ్చి కన్యను యెత్తుకుపోయినా అదే వివాహపుఆచారమైవుండేది. కన్యతోగూడ ధనధాన్యం, పశువులనుకూడ తీసుకపోయేవారు. కన్యను తమయింటికి తీసుకవెళ్ళి కాళ్ళకు బేడీలుతగిలించి యింటిలో వుంచేవారు. స్త్రీ తన ఆత్మసమ్మానాన్ని కాపాడుకొనడం కొరకు పురుషుడు దేవతయని వుపదేశం [illegible]వుండేవారు. అనేకవేలసంవత్సరాలు గడిచినా పురుషుని భావాల్లో పరివర్తనేమీకాలేదు. పురాతన ఆచారాలన్నీ వికృతంగాగాని, సంస్కరణరూపంగాగాని యీనాటికివున్నై. ఆలేఖకుడు స్త్రీసమాజదశను యెంత సుందరంగా నిరూపించినది ఈదినం నాకర్థమైంది.

మిమ్మ నావుత్తరాలను నాకు తిప్పిపంపవలసిందని నేను సవినయంగా ప్రార్థిస్తున్నా. అంతిమప్రార్థనకూడయిదే. మీరిచ్చిన వస్త్రాభరణాలు నాకు వుపయోగపడవు. వాటిని నావద్ద వుంచుకోవడానికికూడ అధికారంలేదు. మీయిష్టంవచ్చినప్పుడు తెప్పించుకోవచ్చు. వాటిని నేను వొకపెట్టెలోపెట్టి వేరుగా వుంచా. వాటివివరంకూడ దానిలోనేవుంచె. తీసుకోండి. ఈరోజునుండి నానోటిలోగాని, నాకలంతో గాని యేవిధమైన మొరలువినరు. నేను మీకు విశ్వాసఘాతం చేస్తున్నానని పొరపాటునైనా తలంచకండి. నేను యీయింటిలోనే కృశించికృశించి మరణించినా, మీమీద నాకు యేమాత్రం ద్వేషంవుండదు. భర్తలోనిశ్రద్ధయే నేను పోషింపబడిన జలవాయువు యొక్క మూలతత్వం. ఈర్ష్యాద్వేషాలుకూడ ఆమూలతత్వాన్ని నాహృదయంనుండి తీసివేయలేవు. మీరు యెక్కడవుండినా కుశలంగావుండమని భగవంతునికి

విన్నవించుకుంటున్నా. తనకోరకు, తన మాతాపితరుల కొరకు, తన భర్తకొరకు నారీజీవనం అర్ధమని ఈ జీవితంలో అన్నిటికంటె గొప్పఅనుభవం నాకుకలిగింది. మాతాపితల గృహంలోగాని, భర్త గృహంలోగాని స్త్రీకి గౌరవంలేదు. మాయిల్లు శోకాగారమైంది. అమ్మయేడుస్తూవుంది, నాయన యేడుస్తూవున్నాడు. కుటుంబంలోనివారంతా యేడుస్తూవున్నారు. నా పుట్టుకవల్ల జనానికి యెంతో మనోవేదన కలుగుతూ వుంది. ఒకవేళ వారు యీబాలిక స్త్రీజాతిలో పుట్టకపోతే చాలబాగుండేది అని తలంచుకుంటూ వుండవచ్చు. కాని ప్రపంచమంతా వొకవైపుఅయినా మిమ్మ్ము జయించలేదు. మీరు నాప్రభువులు. మీ తీర్పు నిశ్చలమైంది. దానికి అపీలుగాని, ఫిర్యాదుగాని లేదు. మంచిది, యీదినంతో యీకాండసమాప్తి. ఇక నేను నా దళిత భగ్నహృదయంవున్నాం. మీసేవ చేయలేకపోతినని దుఃఖిస్తున్నా.

అభాగిని,

కుసుమ.

## ౫

మూకవేదనదశలో నేనెంతసేపు కూర్చున్నది నాకే తెలియదు. ఇంతలో నవీనుడు "నీవీ వృత్తరాలను చదివి యేమి నిశ్చయించుకున్నావు?" అనిఅన్నాడు.

నేను శోకంతోగూడిన హృదయంతో ఈవిధంగా అన్నా—"ఈవృత్తరాలే ఆనరపిశాచపుహృదయాన్ని వశం చేసుకోలేనప్పుడు నావృత్తరాలు యేమిపనిచేస్తై? ఇంతకంటె కరుణావేదనలు నావల్లగాదు. ఈవృత్తరాలను స్పర్శించని మార్మికభావంలేదు. ఆసైతానువద్దకు వెళ్లి ముఖాముఖిగా నాలుగుమాటలు మాట్లాడి అసలు సంగతి తెలుసుకోవడమే నాఅంతిమవుపాయం. అతను సంతోషప్రదమైన జవాబుయివ్వకపోతే నారక్తం అతనిరక్తం యేకం కావలసిందే. నాకు వురిశిక్షగాని, అతనికి జన్మాంతరఖైదుగాని తప్పదు. కుసుమ ధైర్య సాహసాలు కొనియాడదగినై. నీవు ఆమెనువోదార్చ్చతూవుండు. నేనీరాత్రే మురాదాబాదువెళ్లి యెల్లుండికి సంగతులన్నీ తెలియజేస్తా. అతను చరిత్రహీనుడుగా కనుపించుతున్నాడు."

నానోటికి వచ్చినదంతావాగా. ఆతర్వాత మేమిద్దరంభోంచేసి స్టేషనుకువెళ్లాం. నవీనుడు ఆగ్రాకు వెళ్లాడు. నేను మురాదాబాదుకు బయలుదేరా. క్రోధావేశంలో నేనేదైన చెడుపని చేస్తానేమోనని భయపడినాడు నవీనుడు. నేను నచ్చచెప్పినమీదట అతనికి చిత్తశాంతి కలిగింది.

నేను ప్రాతఃకాలం మురాదాబాదుచేరి పరీక్షించడం మొదలుపెట్టాను. ఆయువకునివిషయంలోవున్న నాసందేహం తప్పని తేలింది. బజారులోగాని, కాలేజీలోగాని, వాని యిష్టమిత్రులలోగాని అందరూ అతని ప్రశంసకులే. పొద్దుగూకబోతుంది. సంధ్యాసమయానికి అతనియిల్లుచేరుకున్నా. నిష్కపటభావంతోవచ్చి నాపాదాలమీద వొరిగాడు అతను. అది నేను మరవలేను. అటువంటి వాక్చతురుణ్ణి, సుశీలుణ్ణి నేను చూడలేదు. కుశలక్షేమాలనుగురించి నాలుగైదుమాటలు అడిగినతర్వాత యీవిధంగాఅన్నా—"నీతో నేను కలవడం సంతోషమైనవిషయం కాని యేమిఅపరాధం చేసిందని కుసుమను కఠోరంగా దండించుతున్నావు? ఆమె నీకు కొన్నివృత్తరాలువ్రాసింది. నీవు వాటికి జవాబైనా యివ్వలేదు. రెండుమూడుపర్యాయాలు యిక్కడకువచ్చినా, ఆమెతో నీవు మాట్లాడనుకూడ మాట్లాడలేదు. ఆనిర్దోషురాలైన బాలికతో యీవిధంగా ప్రవర్తించడం అన్యాయంకాదూ?"

యువకుడు లజ్జితభావంతో చెప్పాడు—"మీరు యీప్రశ్న యెత్తకుండావుంటే బాగుండేది. దీనికి జవాబుయివ్వడం నాకు చాలాకష్టం. నాతప్పుగాదని తెలియజేయడానికి విధిలేక చెప్పవలసివస్తుంది. మీరు నన్ను అత్యంతలోభినని, స్వార్థపరుడనని తలంచవచ్చు. కాని యదార్థంలో ఈవివాహంవల్ల

నాకు ప్రాణంకంటె ప్రియమైనకోరికవొకటి పూర్తి కాలేదు. వివాహంచేసుకుని నాకాళ్లకు బేడీలువేసు కోతలంచలేదు. నన్ను నవీనుడు బలవంతపెట్టడంవల్లను నాకు అన్నివిధాల సహాయంచేస్తానని ఆశావాక్యాలు చెప్పడంవల్లను నేను వొప్పుకున్నా. వివాహం జరిగిన తర్వాత నావిషయమై ఆలోచించనేలేదు. నన్నెప్పుడు చదువుకోవడానికి విదేశం పంపగలిగేవిషయాన్నిగురించి వొకవుత్తరమైనా వ్రాయలా. నేను వివాహానికిపూర్వమే ఆయనకు నాకోరిక వెల్లడించా. కాని నన్ను నిరాశుణ్ణిచేయడమే ఆయన వుచితమని తలంచాడు. నాఆశలన్నీ మట్టిపాలుగావడానికి కారణం ఆయనచూపించిన అకృపయే యల్.యల్.బి. ప్యాసై కాళ్లుకొట్టుకుంటూ కోర్టుకుపోవడంకంటె వేరే యింకేమిలేదు.”

నేను అతనితో “అయితే నీవు నవీనుణ్ణి కోరేదేమిటి? ఇచ్చిపుచ్చుకోళ్లవిషయంలో ఆయనేమి తక్కువచేయలా. బహుశా విదేశంపంపే ఖర్చు ఆయన భరించలేక పోవచ్చు”అని అన్నా.

అతను తలవంచుకుని యీవిధంగా అన్నాడు— “అయితే ఆయన వివాహానికిపూర్వమే చెప్పవలసింది. నేను వివాహం యెందుకు చేసుకునేవాణ్ణి? ఆయన పెట్టిన ఖర్చులవల్ల నాకేమిలాభంకలిగింది? రెండు వైపులా పదిపన్నెండువేల రూపాయలు బూడిదెపాలైవుంటై. వాటితోపాటు నా అభిలాషలుకూడ బూడిదెపాలైనై. నాయనగారికి కొన్నివేలరుణమైంది. ఆయన నన్ను విదేశం పంపేస్థితిలోలేరు. నవీనుడు తలచుకుంటే నన్ను విదేశంపంపలేడూ? ఆయనకు పదిపన్నెండువేలరూపాయలు వొక లెక్కలోనివి గావు.”

నేను నిశ్చేష్టుడనైనాను. నానోటినుండి అనాయాసంగా యీమాటలు బైటికివచ్చినై—“ఛీ యీ పాడు ప్రపంచం! యీపాడు హిందూసమాజం! వొక అబలజీవితాన్ని సంకటపెట్టి, ఆమెతండ్రిని అత్యాచారాలతో వొత్తిడిచేసి తాను వున్నతోద్యోగము పొందగోరే స్వార్థమానులెందరున్నారు. ఉద్యోగార్జనకొరకు విదేశంపోవడం తప్పుగాదు. భగవంతుడు శక్తియిచ్చివుంటే వెళ్లు. కాని భార్యను త్యజించి, మామపైన ఆభారాన్ని వేయడం లజ్జతోకూడినపని. నీవు నీ పురుషార్థంతో వెళ్లినప్పుడే కొనియాడబడతావు. వొకర్ని కష్టపెట్టిగాని, నీ ఆత్మసమ్మానాన్ని అమ్ముకునిగాని వెళ్లడం వొక వెళ్లడంగాదు.” ఈపాపుని దృష్టిలో కుసుమకు మూల్యంలేదు. ఆమె కేవలం ఆతని స్వార్థసిద్ధికేర్పడిన సాధనమాత్రమే! ఇటువంటి నీచునితో తర్కించడంకూడ వ్యర్థం. మామాట్లు అతని చేతిలో చిక్కివుంది. అతనిపాదాలమీద శిరస్సు వొంచడంకంటె యింకో వుపాయంలేదు.

రెండోబండిలో ఆగ్రాచారి వృత్తాంతమంతా నవీనుకిచెప్పాను. బాధ్యతంతా అతనిశిరస్సుమీద పడుతుందని అతనికేమి తెలుసుపాపం? ఆర్థికపరిస్థితుల వల్ల వకాలతుబాగా సాగకపోయినప్పటికీ, పది పన్నెండువేలరూపాయలు సులభంగా యివ్వలేనప్పటికీ, ఆయువకుడు నవీనునితో ఆవిషయం ప్రస్తావించివుంటే అవశ్యం యేదో వొకవుపాయం చేసివుండేవాడు. అతనికి కుసుమకంటె యింకెవ్వరున్నారు? అతనికి యీమాట జ్ఞాపకమేలేదు. అందువల్లనే ఈ సమాచారం చెప్పగానే యీవిధంగా అన్నాడు.

“ఆపెద్దమనిషి యీకొద్దివిషయాన్ని యింత రాద్ధాంతంచేశాడు. ఇష్టంవచ్చినప్పుడు యిష్టంవచ్చిన చోటికివెళ్లి చదువుకోవచ్చునని ఈదినమే ఆతనికి వుత్తరంవ్రాయి. దానిఖర్చంతా నేనే పెట్టుకుంటా. సంవత్సరంపాటు కుసుమను యేడ్పించి యేడ్పించి చంపాడు అనిర్దయుడు.”

ఇంటిలో దీనివిషయం చర్చించుకున్నారు. సంకటవిముక్తికొరకు అనుష్ఠానం చేయబోయేవిధంగా వొక వెయ్యిరూపాయలచెక్కు కుసుమభర్తపేర పంపబడబోతూవుంది.

"అమ్మా! రూపాయలు పంపనవసరంలేదని నాన్నగారితో చెప్పు," అని కనుబొమ్మలుముడిచి కుసుమ తనతల్లితో చెప్పింది.

తల్లి విస్మయంతో బాలికవైపుచూచింది. "యేమి రూపాయలు? ఆరూపాయలా? పంపితేయేమి? అంతావానిదే. విదేశానికిపోయి చదువుకోవాలని ఆపిల్లవానికివుంది. మేము పోయేసమయాన కట్టుకుపోతామా?"

"ఒక్కపైసాఅయినా పంపించవద్దని తండ్రిగారితో చెప్పు."

"పంపితే తప్పేముంది?"

"మనిషిని పట్టుకుపోయి అతని యింటివారిని ముక్తిధనంఅడిగి బాగా డబ్బులాగే దారిదొంగమోస్తరువాడు అతను."

తల్లి తిరస్కారనేత్రాలతోచూచింది—"ఏమిమాటలవి? ఇన్నిదినాలతర్వాత దారికొచ్చినదేవతను మళ్ళీ అలిగించుతావు."

కుసుమ విదలిస్తూచెప్పింది—"అటువంటి దేవత అలగడమే మంచిది. ఆస్వార్థపరునితో నేను నిర్వాహించలేను. అతనికి రూపాయలుపంపితే విషంత్రాగి మరణిస్తా. ఇది పరిహాసంగాదు. నేను అటువంటిమనిషి ముఖంగూడ చూడగోరను. తండ్రిగారితోచెప్పు. నీవు భయమైతే నేనేచెపుతా. నేను స్వతంత్రంగావుండ నిశ్చయించుకున్నా."

కుమార్తె ముఖమండలం రక్తవర్ణ మవడం తల్లి చూచింది. ఈప్రశ్నతర్వాత తల్లి చెప్పనూలేక పోయింది, విననూలేకపోయింది.

రెండోదినం సంగతంతా నవీనుడు నాతోచెప్పాడు. నేను ఆత్మ విస్మృతదశలో పరుగెత్తుకుంటూపోయి కుసుమను కౌగలించుకున్నాను. నేను స్త్రీలలో యీఆత్మాభిమానాన్ని చూడగోరుతున్నా. నామనస్సులోవున్నదాన్ని చేసిచూపించింది కుసుమ. దాన్ని చెప్పడానికి నాకు సాహసంలేదు.

కుసుమ తనభర్తకు వుత్తరంవ్రాసిగాని, అతని మాట యెత్తిగాని సంవత్సరమైంది. నవీనుడు అల్లుని బతిమిలాడి తీసుకువస్తానని చెప్పాడు. కాని కుసుమ అతనిపేరుకూడ వినదలచుకోలేదు. ఆమెలోని స్వావలంబవుదృఢతకు నాకు ఆశ్చర్యమాతూవుంటుంది.

నిరాశ ఆవేదనలతో కూడివుండే కుసుమ తేజోహీనముఖం, స్వాభిమాన స్వాతంత్ర్య తేజస్సులతో భాసిల్లుతూవుంది.

వ్యాసకర్తలకు:—ప్రకటింపబడని వ్యాసములు తపాలబిళ్లలు పంపిననేగాని తిరిగి పంపబడవు. ప్రకటింపబడునట్లయిన ఆ సంగతి వెంటనే తెలియజేయబడును. సంపాదకుడు.

# ప్రణయాపరాధి

శ్రీమతి అబ్బిశెట్టి కనకరత్నాయమ్మగారు

ఆతఁడొక గౌరవకుటుంబ జాతివాఁడు
ముదిమిచేఁ గేలుకంపించి పోవుఁగాని
తనదు లేయీక కుంచియ తాకుచోటు
జీవకళ లుట్టిపడు చిత్ర శిల్పమగును.

లేతతనగోటి కొనయూఁతఁ బూతపూసె
సార్వభౌమ కిరీట మంజరులుగూడ
పిలిచిముద్దిచ్చెఁ దనకళా ప్రియవధూటి
కలసిక్రీడించె శిల్ప శృంగారవాటి.

అన్నమనువారి మొగమతఁ డరయలేదు
వచ్చినది బీదసాదల పంటయయ్యెఁ
గ్రిందుమీఁదగు మీఁదును గ్రిందునగును
బక్కచిక్కిన నిరుపేద పాపమిపుడు.

మూఁడుమాసంబులకుఁ గ్రింద ముద్దుబిడ్డ
డడవిగాచిన వెన్నలై యవనికొఱిగె
ముసలితడుములు దినియెట్లొ గడుపుచున్న
కడుపుమంటకు నిదితోడు పడినదకట.

పరువు నూనూగుమీసాల ప్రాయమపుడు
ఇంటినిండను శిష్యులే యెపుడుగనినఁ
గాలుకదుపంగ లేని యీకాలమందుఁ
జేతికఱ్ఱనునందిచ్చు శిష్యుఁడేడి ?

వయసుచెల్లిన తనభార్య జ్వరముపడియెఁ
దనయ యత్తవారింటికిఁ దరలిపోయెఁ
బాపమా ముదివగ్గు బాష్పములరాల్చి
వైద్యునింటికి మెలమెల్లఁ బయనమయ్యె.

"వందనశతంబు దయసేయ వలయుమీరు
వచ్చుచున్నాఁడ మీకు నాహ్వానమీయ
నాఁడుఁబోయిన తీర్థమే యడ్డుపడెను
బుట్టిన దినంబునేడు మా మోహనునకు"

అంచుఁ బలికిన ప్రాంత విద్యార్థిమాట
వీధికుమ్మము చెంతఁగా వెడలివచ్చెఁ
బాప మెన్నెన్నొ విధముల బ్రతిమలాడె
ప్రాణములుదీసె శిష్యుఁడు పట్టువిడక.

ఇల్లు సగనొత్తుకొని శిష్యు నింటికరిగెఁ
బెద్దయుత్సవమగుచుండెఁ బెండ్లిలాగుఁ
వచ్చువారును బోయెడి వారునగుచు
నెచటఁజూచిన జనము క్రిక్కిరిసియుండె.

జరిపెవిధ్యుక్తధర్మముల్ శాస్త్రిగారు
పొసఁగె మాధ్యాహ్నకాలిక భోజనములు
వంటకంబులతో నాల్గు గంటలపుడు
పరిచయులుదప్ప మిగిలిన వారుసనిరి.

శాంతియుతమైన తనచిత్రశాలలోని
కండఱునుజేరి యాసీను లైనయపుడు
గురువుగారికి శిల్పోప కరణములను
జూపెశిష్యుండు వేర్వేరఁ జోద్యపడగ.

మోహనుని జంకనిడుకొని మురువుతోడ
నచటికరుదెంచె శిష్యుని యనుఁగుజాయ
బాలకుని కంఠమందు రత్నాలమాల
వ్రేలుచుండెను చెలిమాలు వెల్లివిరియ.

అదియొకానొక పన్నిదంబందు తనకుఁ
బ్రాప్తమైనట్టి బహుమతియంచు శిష్యుఁ
డందికొని దానిగురువుల హస్తమునిడి
మెప్పుకోసము చూపెను ద్రిప్పిత్రిప్పి.

అచటనున్నట్టి పరిచయు లబ్రమంది
గురువులకరంబులో మాల నరయఁగోరి
పుచ్చుకొన్నారు వరుసగా మెచ్చుకొనుచు
నొక్కరొక్కరె యేదియో యూహతోడ.



కీ॥ శే॥ కలగర కాంచనమాల. కలగర హరబ్రహ్మముగారి సహధర్మచారిణి. సంగీతసాహిత్యములందు పిన్న వయసునందే ప్రవీణత సంపాదించినది.



మిస్. ఎస్. కె. ముగసేత్

కాలికట్ సుప్రసిద్ధ వ్యాపారి ముగసెత్ కుమార్తె. మంగళూరు కళాశాలలో మద్రాసురాజధాని యందు ఇంగ్లీషున ప్రథమురాలుగా పరీక్షురై ఇంగ్లండువెళ్లి ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమున మూడేండ్లుఇంగ్లీషున ప్రత్యేకపరిశ్రమజేసి తనప్రతిభకు మెప్పువడసి తిరిగి భారతదేశమునకు వచ్చిరి.

సంజకెంజాయ లట్లన జాలువారి
హేమరసమున మింటిమొలాముఁ జేసెఁ
క్షేత్రశాలాస్థు లంతలేచిరి యొకింత
ప్రొద్దుపోయెను నిండ్లకుఁ బోవలెనని.

చంటిబిడ్డయు నేడ్వఁగా సాగెనపుడు
'ఈయుమా, మాల పిల్లవాఁ డేడ్పుమాను'
నంచుశిష్యుఁడు భార్యతోఁ బలికె—కాని
యెచటఁజూచిన మాల కన్పింపదాయె.

చకితులై రెల్లరును మహాశ్చర్యపడుచు
నొకరిపై నొక్కరనుమాన మొందుచుండి
రత్నమాల యెచ్చోటను రాలిపడెనొ!
యెవరుదొంగలొ! దేవుఁడే యెఱుఁగుఁగాక.

అందఱు పరీక్షసేయుమం చనిరిగాని
ఎట్టకేలకు నట్టులే యేర్పడెను
గురువుగారొక్కరేయింకఁ గొదువపడిరి
వారిజేబులె పైకుబ్బి వారియుండె.

"ఓభవానీప్రసాద! నేనొప్పుకొనను
నను బరీక్షింప నీవు నందఱకుఁబోలి
చేయవలసిన విధినన్ను న్యాయసభకు
నీడ్చి దండింపఁదగినఁ జేయింపుమోయి!"

అనిరి గురువులు విద్యాధరామరేంద్రు
లటఁబరీక్షకు నొప్పుకో కలుకసెంది
యొదిగియు భవాని భక్తితో నూరకుండె
నచటివారలు గురువులే యనిరి దొంగ.

ఎల్లవారలు తమతమ యిండ్లకేగి
రంత మరునాటి యుదయంబునందు లేచి
మోహానునితల్లి పొత్తిళ్లు పుణుకుచుండెఁ
దళతళత్తని మెరసె రత్నాలమాల.

భర్తకునుజూపి పొరపాటు పడితిరనెను
సరళకుంగేల రత్నాలసరముగాంచి
నిలువునీరయ్యెనట భవానీప్రసాదు
అనపరాధుని దొంగంచు నందఱనిరి.

వారములు పక్షములు నెలల్ వత్సరములు
గడచిపోయెను నొకపుణ్యకాలమందు
గోష్పదీతీరజలములఁ గ్రుంకులాడి
నిలిచి తిరిగిచూచెను భవానీప్రసాదు.

బవిరిగడ్డంబు కాషాయవస్త్రములును
కపిలజడలును బూదిరేకలు వెలుంగ
గోష్పదీతీరజలములఁ గ్రుంకులాడ
నరుగుదెంచెను గురువు ప్రత్యక్షమయ్యె.

కంపలంబడ్డ కాకిగాఁగలఁగిపోయి
శిష్యుఁడురుగతి గురువులఁ జేరిమ్రొక్కి—
వినతులు నతుక మహాభయ వినయమునను
చేసి సాష్టాంగపడెఁ గంటిచెలమలూర.

"స్వామి! మన్నింపవలెనను బ్రేమతోడ
దొరకె రత్నాలమాల మాచిఱుతబిడ్డ
పొత్తిగుడ్డలలోన—మీచిత్తమెంత
అలవటించెనొగద నాడు హా! మహాత్మ!

వెదకివేసాఁరితిని మీదు సదనమందు
గ్రామమందున మీజాడ గానరాదు
ఎచటికేగితిరో! యేమొ! యెఱుకలేక
శోకబాష్పాలు రాల్చులుఁజూచుచుంటి."

తనదుశిష్యుని బైకెత్తి విద్యాధరుండు
శిరముమూర్కొని కూర్చుండఁజేసిపలికెఁ
"తండ్రి! యానాటినామాట తీండ్రమగుచు
నినుఁగలఁచెనటంచుఁ గన్నీరుదుడిచి.

గాని ఒక్కొక్క సాధనామార్గమునందుగాని అనురాగము గలవారు సమాజములుగ గూడి తమభావముల పెంపొందించుకొను చున్నారు. మరియు కార్మికులు సంఘము లుగా నేర్పడి యజమానులతో డీకొని తమ క్షేమముకొఱకై ప్రయత్నించుచున్నారు. కర్షకులు సమితులుగాగూడి భూస్వాము లతో పోరాడుచున్నారు. భిన్నభిన్న రాజ కీయాభిప్రాయములు గలవారు తమ అభి ప్రాయానుగుణముగ దేశాభివృద్ధికై పాటు పడుచున్నారు. సంస్కర్తలును, సనాతను లును, సంఘములస్థాపించుకొని ఒండొరుల బలాబలముల చూచుకొనుచున్నారు. నిరు ద్యోగులు సహితము సంఘములనేర్పరచి తమ సమస్యాపరిష్కారమునకై యొత్తిడి జేయుచున్నారు. స్త్రీలు సమాజముల నెల కొల్పి తమ అభ్యుదయమునకై పాటుపడు చున్నారు. సోదరీమణులారా! ఈపురము నందలి నారీలోకములో నణగియున్నశక్తిని విజృంభింపజేయు సదుద్దేశముతో నీమండలిని స్థాపించి యింతకాలమునుండి నడపుకొని వచ్చుచున్న నిర్వాహకులను నేను మనసార అభినందించుచున్నాను.

నాడు—నేడు.

పూర్వము పురుషులు, స్త్రీలను ఆట వస్తువులనుగా భావించుచుండెడివారు. అందు వలననే ఇంగ్లాండు దేశస్థుడగు టెన్నిసను మహాకవీశ్వరుడు "Man is the Hunter Woman is his game," అని వ్రాసియు న్నాడు. పురుషుడు వేటకాడు; స్త్రీ వేటాడ బడు జంతువు అని అర్థము. సంఘములో స్త్రీకి వ్యక్తిత్వముగాని స్వాతంత్ర్యముగాని నాడు లేదయ్యెను. తమ రక్షణములో నుండవలసినవారినిగా నెంచి పురుషులు స్త్రీ లకు ఏహక్కులను లేకుండ జేసివైచిరి. అవలంబించిన శిక్షావిధానమునుబట్టి తమ హక్కులను తామే గుర్తింపలేని స్థితికి క్రమేణ స్త్రీలను పురుషులు తీసికొనివచ్చిరి. "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" "స్త్రీబుద్ధిః ప్రళయంకరీ" "నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతా" యను వాక్యములె ఎట్టిస్థానము స్త్రీలు మన దేశమున మున్ను ఆక్రమించియుండిరో బాగుగ వ్యక్తీకరించు చున్నవి. ఇప్పుడిప్పుడు హైందవనారీ లోకము ప్రపంచపరిస్థితులు తిలకించి కన్ను తెరచినది. పాశ్చాత్యదేశములలో సహి తము, నాగరికతకు పేరుపొందినట్టి ఇంగ్లాండు దేశములోగూడ నిన్న మొన్నటిదనుక స్త్రీ లకు తగిన స్వాతంత్ర్యము లేదయ్యెను. వోటింగు హక్కును సహితము, స్త్రీలు ఎంత ఆందోళనయోచేసి ఎన్ని ఇడుమలో పడిన పిమ్మటనే సంపాదించుకొన గలిగిరి. సంతకముజేయు సామర్థ్యము కలిగిన మాత్రముననే ఆ హక్కు శ్రమపడకయే మనకు లభింపనున్నను ఆఫీసునకువెళ్లి ఎవరు వ్రాసి ఇత్తురని మనలో ఎందరమో ఉపేక్ష చేయు చున్నాము. వోటింగుహక్కు చాలా విలువ గలది. దేశపరిపాలనావిషయములో మనకు కూడ కొంత ప్రాధాన్యతయు, మన అభిప్రా యములకు కొంతవిలువయు తదనుగుణ

ముగ పనులు జరుగుటయు కలదని దానిని బట్టి స్పష్టము కాగలదు. అట్టి అమూల్య మైన అవకాశము మనము పోగొట్టుకొనదగి నది కాదు. ఆస్తులద్వారా ఫ్రేంచైజు ఉన్న పుడు వోటర్లు బహుతక్కువగానుండిరి. ఇప్పుడు ఈ విద్యాయోగ్యతవలన మరికొం దరు ఓటర్లగుట తటస్థించునని అధికారు లూహించిరి. కాని అదియు కల్లయే యగు నేమోయని నాభీతి. దేశనాయకులు ఆందో ళనమొనర్చి గడవును పదేపదే మార్పించుచు వచ్చినారు. ఏమిచేసినను ఓటర్లు విరివిగా జేరుటలేదు. మనలో ఉపేక్షాభావము హెచ్చు. హక్కులున్నను వాని నుపయో గించుకొనవలెనన్న ఉత్సాహము తక్కువ. కాని యిందు కెవరిని అనవలసిన పనిలేదు. మన సాంఘికస్థితి ప్రకృతమున నిట్లులున్నది.

## స్త్రీ సమాజముల ఆవశ్యకత

మన భరతఖండము ఇతర దేశముల కంటె విద్యలో చాల వెనుకబడియున్నది. జర్మనీ, డెన్మార్కు దేశములలో స్త్రీపురుషు లలో నూటికి నూరుమంది విద్యావంతులు. జపానులో, పురుషులలో నూటికి 98 మం దియు స్త్రీలలో 100 కి 96 గురును చదువు వచ్చిన వారై యున్నారు. ఇంగ్లాండులో పురుషులలో 100 కి 94 మందియు, స్త్రీలలో 100 కి 91 మందియు, అమెరికాలో 100 కి 96 మంది పురుషులును, 94 మంది స్త్రీలును విద్యాసంపన్నులై యున్నారు. ఇతరదేశముల స్థితి యిటులుండ మనదేశస్థితి ఎట్లున్నదో గమనింపుడు. మనదేశమున పురుషులలో 100 కి 7 గురును స్త్రీలలో 100 కి 1.25 మందియును విద్యనేర్చినవారై యున్నారు. పాశ్చాత్యదేశములలో ఒక్కొక్క మనుజునికి సగటున 9 మొదలు 17 రూపాయలవరకు ప్రాథమికవిద్య నిమిత్తమై వెలవగుచుండ మనదేశంలో మనుష్యునికి రెండు అణాలు మాత్రమే వ్యయము గావింపబడుచున్నది. దీనినిబట్టి విద్యావిషయమున ప్రభుత్వము వారెంత యుపేక్షాభావము వహించి యున్నారనుట సువిదితము. ఇక ప్రజలు స్వతంత్రించినపుడు విద్యాసంస్థలన్నియో, దేశ దారిద్రమువలన నీరసస్థితికి పాల్పడుచున్నవి. ఇట్టి సందర్భములో సాధ్యమైనంతవరకు మనమే స్వయంకృషివలననే జ్ఞానసముపార్జన మునకు గడంగవలెను. అట్టి ప్రయోజనము ఈమండలివంటి సంస్థలసాహాయ్యముననే శీఘ్రముగ సాధ్యము కాగలదని నా అభిప్రాయము.

## స్త్రీ విద్య

విద్యలేనిది స్త్రీలు మానసికముగ గాని శారీరకముగ గాని నైతికముగగాని, ఆధ్యా త్మికముగగాని అభ్యుదయము గాంచజాలరు. దైవకృపవలన స్త్రీలకు విద్య ఆవశ్యకమా, కాదాయని చర్చించు దినములంతరించినవి. స్త్రీలకెట్టి విద్యావిధానముండవలెను ఎంత వరకు వారికిపురుషులతో బాటుగా సామాన్య విద్య అవసరము అనునవి ప్రకృతము స్త్రీ విద్యాభిమానుల నాందోళనపరచు విషయ ములు. ఈమాట యెట్లున్నను విద్యయన కేవలము చదువుట వ్రాయుటతో పూర్తి

యగు నామమాత్ర విద్యకాదని మనము తెలిసికొనవలెను. జ్ఞానవికాసమే నిజమగు విద్య. మన హిందూసంఘములో బాలికలు చిన్నవయస్సుననే గృహస్థాశ్రమస్వీకరణము చేయవలసిన వారగుటచే వారికి తగిన జ్ఞాన సముపార్జనమున కవకాశము తగ్గిపోయినది. తరువాత జ్ఞానమును పడయవలెననెడు అభిలాషకలిగినను అందుకు తగిన అవకాశ ములులేవు. ప్రపంచవిషయములను గ్రహించ వలెనను కోరికగలవారు సహితము తగిన సౌకర్యములు లేకపోవుటచే కూపస్థమండూ కములవలె నుండవలసిన వారగుచున్నారు. విద్యావంతుడగు భర్తకు సర్వవిధముల సాయపడవలసిన సహధర్మచారిణి, దేశకల్యా ణమునకు తోడ్పడుబిడ్డలను సిద్ధముచేయవల సినమాత విద్యాశూన్యగానుండు టెంతయు విచారకరముగదా!

## వార్తాపత్రికలు

జ్ఞానప్రచారమునకు స్త్రీ సమాజములు అవలంబింపదగు సాధనములలో వార్తాపత్రి కలు అగ్రగణ్యములని వక్కాణింపవచ్చును. జ్ఞానాభిలాషకలవారు ఇచ్చటికివచ్చి నానా విధ వార్తాపత్రికలను చదువుకొనవచ్చును. విద్యాగంధమెఱుంగని సోదరీమణులకు విద్య నేర్చినవారు వానిని చదివిచెప్పనగును. వార్తా పత్రికాపఠనమువలన ప్రపంచములో ఎట్టెట్టి పరిణామములు కలుగుచున్నవో గ్రహించు టకు వీలగును. అంతియేగాక మనదేశములో గూడ ఇతర ప్రాంతీయులు ఎట్లు అభివృద్ధి మార్గముల నన్వేషించుచున్నారో యెఱుంగ నగును. మరియు స్త్రీఉద్యమము లెచ్చటెచ్చట ఏవిధముగా కొనసాగింపబడుచున్నవో కనుగొని ఆయాపద్ధతులలో మనకు యోగ్య ములగు వానిని పరిగ్రహింపవచ్చును. పత్రిక లలో ప్రచురింపబడు ఏకథలైనను చదువు కొని మనసు నుల్లాసముగను ఉత్సాహవంత ముగను ఉంచుకొనవచ్చును. గృహమున నుండియే యిట్టి జ్ఞానమును సంపాదించుకొన రాదాయని యెవ్వరైన ప్రశ్నింపవచ్చును. కాని తెలియనివిషయముల తెలిసినవారికడ నుండి గ్రహించుటకును, లౌకిక రాజకీయ మత సాంఘికవిషయములపై చర్చలు గావించు కొనుచు సత్యాసత్యముల నారయుటకును సమాజము లుపకరింపగలవు.

## గ్రంథభాండాగారములు

గ్రంథభాండాగారము, నారీమణులలో జ్ఞానమును పెంపొందజేయగల రెండవసాధ నము. ప్రచురింపబడు సమస్తగ్రంథములును ఎల్లవారును తెప్పించుకొనజాలరు. అందువలన సద్గ్రంథములన్నియు సమకూర్పబడియుండు గ్రంథాలయములు ప్రతిపురమునందును నుం డుటముఖ్యము. గ్రంథాలయోద్యమమునకై 'Andrew Carnegie' అను కోటీశ్వరుడు 10 కోట్లరూపాయలను వెచ్చించియున్నాడు. విదేశములలో గ్రంథాలయోద్యమము బహు వ్యాప్తియందున్నది. ప్రతిగ్రామమందును, పురుషులకు స్త్రీలకు ప్రత్యేకగ్రంథాలయ ములుకలవు. మనదేశములో గ్రంథాలయో ద్యమవ్యాప్తికై విద్యాభిమానులు ఆందోళన మొనర్చుచున్నారు. మొత్తమున ఆంధ్రమున

750 గ్రంథాలయములున్నవి. గ్రంథాలయ మహాసభ లచ్చటచ్చట ఏటేట జరుగుచున్నవి. గ్రంథాలయముల మూలముననే దేశములలో విజ్ఞానము విశాలవ్యాప్తి గాంచుచున్నది. మనదేశములో ఈగ్రంథాలయోద్యమమునందు ముందంజవైచినది బరోడా రాష్ట్రము. ఏపురమునందైనను ఏగ్రామము నందైనను గ్రంథాలయము స్థాపింపబడిన యెడల దానికగువ్యయములో 2 పాళ్లు ప్రభుత్వమువారు భరింతురు. ఒకపాలే స్థాపించిన వారు భరించవలసినది. అచ్చట జిల్లాపట్టణ గ్రంథాలయములు, 800 గ్రామగ్రంథాలయములు, 200 పఠనమందిరములున్నవి. ప్రతి పాఠశాలయందు ప్రభుత్వమువారు ఒకపుస్తక భాండాగారము నుంచుచున్నారు. ప్రజలు నూటికి 60మంది వీనినుపయోగించుచున్నారు. సంచారగ్రంథాలయములు సహితము అందు స్థాపింపబడినవి. ఇట్టి విద్యావ్యాప్తికి జేయూత నొసంగుచున్న గైక్వారు మహారాజుగారు స్తుత్యార్హులు. వందనీయులు. తదితరసంస్థానాధిపతులును భారత ప్రభుత్వమువారును ఈవిషయములో వారి ననుగమించు టత్యావశ్యకము.

### ఉపన్యాసములు

జ్ఞానవ్యాపనమునకు, సాయపడు సాధనములలో విద్యాధికులొసంగు ఉపన్యాసములు గూడ పేర్కొనదగియున్నవి. అభిమానము వహించి కొందరు కొన్నివిషయములలో ప్రత్యేకముగ కృషిచేయుచుందురు. అట్టివారిచ్చు నుపన్యాసములెంతయు జ్ఞానదాయకములు కాగలవు. అందుచే మండలులు విద్వాంసుల రావించి వారికి ప్రీతికరములగు వానినిసూచ్చి ప్రసంగములనిప్పించి నారీలోకములో జ్ఞానమును వ్యాపింపజేయదగును. మహాపురుషులయొక్కగాని, పతివ్రతామతల్లుల యొక్క జీవనచరిత్రములు మనజీవితములను దిద్దుకొనుటకు మిక్కిలి ఉపకరింపగలవు. పూజ్యులగువారి వర్ధంతులను జయంతులను జరుపుచో వారిపుణ్యచరిత్రములను పెద్దల మూలమున వినుటవలన చాలమేలు కలుగగలదు. సరిగా నర్థము చేసికొనగల్గినచో పురాణములుగూడ మన కుపకారము చేయగలవు.

మానవాభిసేవవృద్ధి కేవలము శ్రవణము వలననే సాధ్యముకాదు. జ్ఞానార్జనముతో పాటు మానవసేవచేయుటగూడ యావశ్యకము. దరిద్రులు, వికలాంగులు, అంటరానివారు, మనసేవ నపేక్షించుచున్నారు. అట్టివారికి మండలివారు తమకు చేతనైన సేవ చేయుటకు పూనుకొనతగును.

జ్ఞానమును వ్యాపింప జేయుటయే గాక మండలులు గృహాలంకరణమునకు తోడ్పడు లలిత విద్యలనుగూడ ప్రోత్సాహపరుపవచ్చును. అల్లికపనులు (Crochet work) కుట్టుపనులు (Embroidery work) పేము పని, Fret work మొదలగు విద్యలను వారమునకొక్కతూరి చెప్పుచువచ్చినచో స్త్రీలకెంతయు నుపయోగకరముగ నుండగలదని నాతలంపు. ఒక్కొక్కరి కొక్కొక్కవిద్యయం దభిరుచియుండును. ఎవరి కేవిద్యయం

దభిరుచికలదో నేర్పుకలదో వారు అద్దానిని ఇతరులకు నేర్పవచ్చును. విశ్రాంతిసమయములలో ఉపయోగకరముగ నుండునట్టి ఉల్లాసపుపనులవి. ఒకరు మరియొకరిగృహములకు వెళ్లుటయన కష్టము. రెండుమూడు పనులు నేర్చుకొనవలెనన్న ఇర్వురు ముప్వురి గృహముల కేగవలసియుండును. అది సాధ్యమగు విషయముకాదు. నలుగు రొకచో గూడి ఏపనియైనను సాధించుట సుకరము. ఒంటరిగా చేయుటలో సంతోషములేదు. ఈ మండలివంటి సంస్థలలో అట్టిపనులు సుసాధ్యములు. అంతియేగాక మండలులలో చేరుట వలన ధనికులు దరిద్రులు పండితులు పామరులు, అనుతారతమ్యములు నశించును. ఒండొరులలో ప్రేమ సౌహార్ద్రములు పెంపొందును.

## ఉపసంహారము

మనదేశము నేడొక నూతనయుగమున ప్రవేశించుచున్నది. స్త్రీలకు కష్టదినములు గడచి మంచిదినములు వచ్చుచున్నవి. ఇన్నాళ్లనుండి తదభివృద్ధికి ప్రతిబంధకములుగా నుండిన సంకెళ్లు ఒక్కటొక్కటిగా తెగిపోవుచున్నవి. శ్రీహరవిలాస శారదాగారి దయవలన బాల్యవివాహనిరోధకచట్టము అమలులోనికి వచ్చినది. ఈనాడుగాకపోయినను క్రమక్రమముగానైన బాల్యవివాహములు నశింపకమానవు. దానితోపాటు స్త్రీలకు విద్యాభ్యాసమున కెక్కుడు వీలుకలుగగలదు. అంతియేగాక శారదావివాహశాసనమువలన వివాహవిషయమున తమ అభిప్రాయమును వెల్లడించుటకు బాలికలకు కొంత అవకాశముగూడ లభించినది. ఇది క్రమముగా స్త్రీల వివాహస్వాతంత్ర్యమునకు మార్గదర్శకము కాగలదు. త్వరలో అంతర్వర్ణవివాహసమస్య శాసనసభలో ఆలోచనకు రానున్నది. అంతియేగాక స్త్రీలవారసత్వమునకు సంబంధించిన చట్టమునుగూడ శాసనసభవారు ఆలోచింపనున్నారు. ఈ సమస్తవిషయములును మనము శ్రద్ధతో విచారించి అభిప్రాయముల నియ్యవలసినవై యున్నవి. ఈపనిని స్త్రీసమాజములు చేయవలసియున్నది. నేను పేర్కొన్న నానావిషయములలో మండలి కొంతకొంత పనిచేయుచున్నందులకు నేను సంతోషించుచున్నాను. పురస్త్రీల అభివృద్ధికి తోడ్పడుచు త్వరలో స్థిరముగు భవనమును పడసి, మండలి చిరకాలము వర్ధిల్లుగాకయని కోరుచున్నాను.

# అంగరాణ్మణీ

శ్రీమతి కుడితిపూడి బుచ్చమాంబగారు

దేవానీకమదెల్ల దన్ను గొలువన్ దేవేంద్రుడంచున్ మహా
భావానన్ వెలుగొందు దైత్యహరుడే పాదాబ్జముల్ పట్టి యో
దేవా! భిక్షయటంచు వాకొనగ జేతేతంద్రి నీదేసుమీ
ద్యావాపృథ్వుల బేర్కొనందగు మహాత్యాగంబు సూతాత్మజా. ౧

భానుతనూజ! నీవపుడు భవ్యభవత్కరవాలధారచే
మానుగ వర్మకుండల సమస్తము జీల్చెడివేళ లోకముల్
పూనిక నెట్టులేడ్చెనొకో పూతచరిత్రుడవౌ త్వదీయ గా
థానలకీలతాలయి హృదబ్జములాగక యంగరాణ్మణీ. ౨

రవిజా! పోయినపోవునంచు దనువున్ రక్షింపకే యిచ్చితౌ
నవురా తత్ప్రిభవాతిరేకమున నే దాన ప్రపూర్వంబునౌ
భవపుణ్యాత్మక కర్ణనాముడవహో! భాగ్యైక తేజోనిధీ
భువనంబందున ధార్మికాగ్రగణనాపూర్వుండ వీవేసుమీ. ౩

కౌ శి కా !

సూతసుతుండు నీవడుగ సూర్యునివిన్నప మూలకింపకే
శాతకరాసిచే దనదు శౌర్యముగన్పడ గుండలంబుల
న్నాతత భక్తితోడుతను నార్యుడవంచని కోయుచుండగన్
ప్రీతిని పారద్రోలి యెట్టు ప్రేతమవైతివి పాకశాసనా. ౪

రాజ్యంబన్న త్రివిష్టపంబు ధరణిన్ గాపాడువారల్ సురల్
పూజ్యుండౌ గురుడో బృహస్పతి ప్రతాపోపాదులన్నన్ గురుల్
ప్రాజ్యంబౌ క్రియయన్న వ్రేల్ముడువ గన్పట్టంగ లేదెందు ల
న్నాజ్యంబందగనే నొకండ వనలేదా సిగ్గు నాకాధిపా. ౫



# శిశుపోషణ

**స్నానమూ**

మొదణ్ణుంచీ ప్రతిదినమూ నీళ్లు పోయడమవసరం. వరుసస్నానాలనీ తేటగాలేడనీ దినస్నానం మానడం ఏమాత్రం ఆరోగ్యం కాదు. నీళ్లు మరీ వేడిగావుండకూడదు. వెచ్చగావుంటే చాలు. కొన్నాళ్లయిం తర్వాత నులివెచ్చగావుంటే సరి ఉపయోగించొచ్చు. నీళ్లు వేడిగా వుండకుంటే జలుబు చేస్తుందనుకోడమూ వేడినీళ్లు వాడ్తే పిల్లలు బాగా నిద్రపోతారనుకోడమూ వట్టివెర్రి. వేడినీళ్ల వల్ల వచ్చేనిద్ర అలసటవల్ల. సహజంగా వచ్చేదికాదు.

నీళ్లు పోయడానికి ముందు యీనీళ్లు పోయవచ్చా కూడదా అని తెలుసుకోవలె. మోచేయి భరించే వేడైతే జడియనక్కర్లేదు.

నీళ్లుపోసింతర్వాత మెత్తటి వెచ్చని చిన్న గుడ్డల్ని తీసుకొని తుడవకుండా వంట్లో తడి పోవునట్లు అద్దడం మంచిది.

కండ్లు నోరు చెవులు ముక్కు వీటి పరిశుభ్రత అవశ్యం గమనించవలె. పరిశుభ్రమైన ఒక్కొక్క పేలికతోనైనా ప్రత్తితోనైనా ఒక్కొక్క అవయవాన్ని శుభ్రపరచవచ్చు. అన్నిటికీ ఒకటేవాడటం ప్రశస్తం కాదు.

స్నానం ప్రొద్దునే. రాత్రిళ్లు వెచ్చని నీళ్లతో ముఖాన్ని చేతుల్ని Sponge చేయడం చాలు. Sponge చేసినప్పుడూ నీళ్లు పోసినప్పుడూ దుస్తులు మారిస్తే చాలు. అంటే దినానికి రెండుసార్లు మార్చవలనన్న మాట.

కడపటిమాట — ఆహారం. వెనుకనేకాని ముందివ్వడం కూడదు.

ముద్దుపెట్టుకోడం మంచిది కాదని — వద్దని ఏలా చెప్పడం? అందులో కన్నతల్లికీ తండ్రికీన్నీ. ఇతరులకు చెప్పొచ్చు మరీ మొగమాటమైతే తప్ప.

**ముద్దూ ముచ్చటలూ**

అందులో ముద్దు అసలు నోటిమీద పెట్టుకో కూడదు. క్షయ అయితే ఏం, మరి ఇతర చెడ్డజబ్బులైతే ఏం ఇందు వల్ల కల్గడంకద్దు కనుక. మరికొందరు ఎత్తుకో కుండా — తాకకుండా చూడవలె. అమ్మ వారు పోసినవారూ — స్నానమైనా సరే — ఓ పది పదిహేను దినాలవరకూ, వంటిన చర్మరోగ మేదైనావున్న వారూ.

ఇక గాలి బిడ్డలకు ఎంతవుంటే అంత మంచిది. గాలి, వెలుతురు బాగావుండే గదుల్లోనే వాళ్లను పగలు కాని రాత్రిళ్లు కాని పడుకోపెట్టవలె. ఎండ తగలకుండా ఓగంటో రెండుగంటలో ప్రొద్దునా సాయంత్రమూ వూరికైనా త్రోపుడుబండివుంటే దాన్లోనైనా కొంచెం త్రిప్పడం పిల్లల కారోగ్యం. దీంట్లో వుద్దేశంకూడా గాలి_వెలుతురూ బాగా తగలవలెననే.

—ఎస్. శేషగిరిరావు.

# క్షమార్పణ

శ్రీమతి అవసా సుగుణమణిగారు

"రామూ !"

"బాబూ !"

"అమ్మగారు నిన్న సముద్రతీరమున నేమిచేసి యుండిరి?"

"బాబూ !..."

"నీవు ఆమె నచ్చటకు ఎప్పుడు తీసుకొనివెళ్లి యుంటివి? మరల నామె ఎప్పుడు తిరిగివచ్చెను?"

"ఏమి బాబూ? మామూలుప్రకారముగనే..."

"సరి...ఇదివరలోకన్న ఆమె యిప్పుడు కారును విశేషముగా వాడుచుండుట నీవు గమనించలేదా?"

"లేదు బాబూ"

"మరియిదివరలోకన్న పెట్రోలుఖర్చు విశేషముగా గానవచ్చుటకు కారణమేమి?"

"....."

"ఇటీవల ఆమె నూతనస్థలములకు పోవుచున్నదా"

"లేదు బాబూ"

రాము విశ్వాసపాత్రుడైన సేవకుడు. తానెరిగిన విషయములను వెల్లడించిన యజమానురాలు కష్టములపాలవునని ఆమెను కాపాడుటకై సంసిద్ధుడై రానున్న విపత్తునకు తలయొగ్గి బొంక సాహసించెను. కాని తన యజమానుని శల్య పరీక్ష ముందాతని తాత్కాలికపు మనోధైర్య మెంతసేపో నిలువలేకపోయెను.

"రామూ! నీవబద్ధమాడుచున్నావు. నీపై నాకధిక విశ్వాస ముండెడిది. కాని నీవును యితర సేవకులవలె తేలితివి........ నీ కొనర్చిన మేలునకిది ప్రతిఫలము కాబోలు."

రాముడు మారుమాటాడలేదు. తొట్రుపడు పాదములతో రెండడుగులు వెనుకకువైచి భయకంపిత హస్తములను పెనవైచుకొని తన యజమానునిమోము మీద సాహించలేక తలవాల్చి న్యాయస్థానమునదోషి పగిది నిలుచుండెను. ఆతడు దయార్ద్రహృదయుడగు తన యజమానుని వాత్సల్యమునకు విశేషముగ ఋణపడియున్నమాట నిజమే. ఇటీవల తన యజమానుని భార్య నడవడికలో నూతనాంశములు గాన్పించుటయు యదార్థమే. ఆమె నూతనవ్యక్తులతో సంప్రదించుచుండుట, దుర్మార్గుడగు పరపురుషునితో సైకత స్థలముల వాహ్యాళికై వెడలుట మున్నగున వాతడెరుంగుట సత్యమే. పాపమాతడనేకసారులు యజమానుని కెరుకపరుప సాహసించనూలేదు, సబబని తలంచనూ లేదు.

"మంచిది రామూ నీవిక వెళ్లవచ్చు... చూడూ... మన యిరువురిమధ్య జరిగిన యీ సంభాషణ యితరు లెఱుగరాదు. దీనిని నీవు మరచిపోవలయునుసుమా నామాట జవదాటవని నమ్ముచున్నాను."

పొంగి పొరలివచ్చు క్రోధము నణచుకొనుచున్న తన యజమానుని ప్రజ్వలితమోము నొక్కసారి అరమోడ్పు కనుంగవతో తలయెత్తిచూచి ఆతని మాటలకు వల్లెయనునట్లు ప్రత్యుత్తరముగ తలనాడించి, స్త్రీ సంరక్షణార్థమై అవిశ్వాసముగ ప్రవర్తించినందులకు పశ్చాత్తాపముగ నాలుకను కరచుకొనుచు సంకోచముతో రాముడు గదినివీడెను.

*　　*　　*　　*

శ్రీనివాసరావు పేరెన్నికగన్న జీవితభీమా సంస్థ కార్యదర్శి. మాసమునకు మూడువందలరూప్యముల వేతనమును బడయుచున్నాడు. సాలుసకు పదివేల ప్రతిఫల మొసంగు పిత్రార్జితమగు భూవసతికూడగలదు. ఆతనిభార్య విశాలాక్షి దయాదాక్షిణ్యాది గుణములలోను రూపసంపదలలోను అన్నివిధముల భర్త కనుకూలమైన సతి. ఏ సందర్భములోనైన దాంపత్యమును కొనియాడవలసివచ్చినచో లోకులు విశాలాక్షిశ్రీనివాసులను తార్కాణముగ చెప్పుకొనుచుండుటకద్దు. కాని ఆదంపతుల కొక మనోవ్యాకులత గలదు. అది సంతానములేమి. విశాల కాపురమునకువచ్చి ఎనిమిదేండ్లు గడచినను నేటివరకు ఆమెకు సంతానముగలుగ లేదు. ఆ కాంక్షలో ఆమె త్రొక్కని పుణ్యభూములం

మ్రొక్కనిదైవతములు మునగనినదులు చేయనివ్రతములు లేవు. కాని అదృష్టము అందరిహస్తగతము కదా!

పై నుదహరించిన సంభాషణ జరుగుటకొక పక్షము పూర్వము శ్రీనివాసుడు తలనొప్పిగనుండుటచే నియతి కాలముకన్న ముందుగనే కచేరినుండి గృహమున కేతెంచెను. కాఫీ తయారుచేయుటయం దారితేరిన తన ప్రేయసిచే తయారుచేయబడిన వేడికాఫీ మృదుమధురమగు తన కుసుమకోమలిపదలాలిత్యము తనబాధ నివృత్తి చేయునని యాతని విశ్వాసము. కాని యాతని కాశాభంగమగునట్లు విశాలశయనమందిరమునగాని చావడిలోగాని కాన్పింపలేదు. వెదకుచు వంటయింటికి పోవుసరికి ఆమె తనయడుగుల సవ్వడినైన గుర్తింపలేనంతటి యేకాగ్రచిత్తముతో నేదియో దీర్ఘాలోచన చేయుచుండుట కనుగొనెను. విశాల కొంతవరకొక జాబును పఠియించి దీర్ఘనిట్టూర్పువిడచి లేఖాదహన సంస్కారణమునకు గడంగెను. ద్వారముదరి నిలుచుండి యీదృశ్యము నవలోకించుచున్న శ్రీనివాసునకు దేహము గగుర్పొడిచినది. తనకనులు తాననమ్ముటకు సందేహము గలిగెను. మారుమాటాడక వెనుదిరిగి శయనమందిరమునజొచ్చి శయ్యపైబరుండి యోచనా నిమగ్నుడయ్యెను. తా నెరుంగని రహస్యపులేఖ తన భార్యకెవరు వ్రాసియుందురు? అంత పదిలముగ లేఖను వంటయింటిలో చదువవలసిన నిగూఢ రహస్యమేమైయుండును? ఉత్తరమును చదివిన వెంటనే కాల్చివేయవలసిన అగత్యమేమి? ఇవి పాప మాతని పట్టి బాధించుచున్న విషమసమస్యలు. అతని అనుమానమునకు సహేతుకమగు కారణములేకపోలేదు. స్త్రీకి తన ప్రవర్తనపై కళంకమునారోపించు విషయములు లేకున్న ఉత్తరమును కాల్చు నవసరమేమి? విశాల దోషియని నిరూపించుటకీ నిదర్శనము చాలదా? పాశ్చాత్య నవనాగరికతావ్యామోహముచే కొందరు కన్యలు తమ శీలమును పాడొనర్చుకొనుచున్నట్లు వినియున్న తాను తనభార్య సహితము అవివాహితగానున్నప్పుడట్టేల చేసియుండలేదని తలంచవలయును? విశాలసోదరి కుముద్వతి విశ్వవిద్యాలయములో హూణవిద్య నభ్యసించుచున్న కాలముననే ఆమెనుగూర్చి కథల వినియున్నాడు. కుమ్మరావములో ఇత్తడిముంతలున్నట్లు కుముద్వతికి తోబుట్టువగు తనభార్య సద్వర్తనమును ఎట్లు విశ్వసింపగలడు? డోలాయమానుడగు నాతనిని పట్టిపీడించుచున్న అభేద్యసంశయములకిది ఆటపట్టు. గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు శీర్షబాధచే పీడింపబడుచున్న శ్రీనివాసునకు మనోవేదన సైదోడైనది. ఇంక చెప్పవలసినదేమున్నది? అనుమానపిశాచమునకు తావు లభింపకయేపోవలె. లేకున్న వ్రేళ్లునాటి శాఖోపశాఖలై విస్తరించుట కెంతకాలము పట్టును?

విశాల వంటయింటనుండి శయనమందిరమునకు విచ్చేసి దీర్ఘాలోచనా నిమగ్నుడైన భర్తను కనుగొని నివ్వెరపడి 'నేడేమి యింతవేగముగా ఆఫీసునుండి వచ్చా'రని చిరునగవుమోమున చిందులాడ ప్రశ్నించెను.

"ఆ..."అని తూష్ణీభావముతో నాతడు మోము నావలకు త్రిప్పివైచుకొనెను.

"మీ శరీరములో బాగులేదా?"అని ఆతురతతో విశాల మరల ప్రశ్నించెను.

"లేదు...ఆ...ఔను"అని శ్రీనివాసుడు పరధ్యానముగా జవాబిచ్చెను.

విశాల దిగులువడి తన కోమలహస్తమును భర్త నుదుటిపైనుంచి ఉష్ణస్థితిని గమకించుటకై యత్నించెను. కాని చేయితాకిన వెంటనే అతడు త్రుళ్లిపడి వెనుకకు వ్రాలెను.

"మీకు చలిగాఉందా?"

"అవును—ఆ—లేదు"

"త్వరగ పండుకొనండి. నేను డాక్టరును కబురంపిస్తాను."

"అక్కరలేదు నావంట్లో బాగానేఉంది. తల మాత్రము కొంచెము నొప్పిగాఉంది."

"తలనొప్పటండీ! అట్లనినా కిదివరకేల చెప్పలేదు? ఉండండి కొంచెం కాఫీ తయారుచేసి తెస్తాను. గత రెండుసంవత్సరాలనుండి శలవన్నమాటెరుగక కష్టపడి పనిచేయటంవల్ల ఆరోగ్యంచెడింది. కొన్నాళ్లపాటు శలవు పెట్టకూడదటండీ. ఏ ఊరైనావెళ్లి విశ్రాంతి తీసుకోవచ్చు. స్థలమార్పు ఆరోగ్యాభివృద్ధికి తోడ్పడు తుంది కూడను" అంటూ ప్రత్యుత్తరమునకాశించక కాఫీ తయారుచేయుటకై వెడలిపోయింది విశాల.

"క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్ ... యదార్థమే... లేకున్న ఈమె కీఊరు విడువవలసిన తలంపేల?...ఒహో... తెలసినది. ఊరు విడువవలసిన ప్రతిబంధకమే గలిగినది. లేకున్నన న్నేల శలవుపెట్టుమని నిర్బంధించును?" అనుచు శ్రీనివాసరావు నిట్టూర్పువిడచి యోచనానిమగ్నుడయ్యెను. అతని కనులయెదుట చిత్రాంగి సారంగధరులు, తిష్యరక్షకుణాలులు, తారాశశాంకులపాత్రములు ప్రదర్శింపబడుచున్నట్లు కానవయ్యెను. స్త్రీవలననశించిన కౌరవులు రావణకుంభకర్ణాదుల చరిత్రలు జ్ఞప్తికివచ్చినవి. తాకంఠస్థ మొనర్చిన స్త్రీనిందాగర్భితశ్లోకములుకొన్ని ఒకదానివెన్క నొకటి స్ఫురించినవి. ఇరువదినిముషముల తరువాత విశాలతెచ్చిన కాఫీ ఆతని జిహ్వకు విషమువలె పరిణమించినది. ఆమె యొనర్చిన శుశ్రూష బాధానివారణకుమారు బాధోత్పత్తికి మూలకారణమైనది.

"డ్రైవరును పిలవనంపు. నేనువెళ్లి డాక్టరును చూచివస్తా"నని కొంతవడికి మౌనమునువీడి శ్రీనివాసుడు విశాలతోననెను.

"మీరు వెళ్లేదానికన్న డాక్టరునేరమ్మని కబురంపిస్తే బాగుండదండీ"

"అట్లాకాదు నేనేవెళ్లి బీచిరోడ్డునకూడా కొంచెం తిరిగివస్తాను."

"అవునండి పరిశుభ్రమైనగాలి పీల్చవచ్చు. దుస్తులను మార్చుకోండి. నేనువెళ్లి డ్రైవరుకు కబురంపిస్తాను."

శ్రీనివాసు డా యుద్రిక్తపరుపబడిన చలనశకటమారోహించి డాక్టరు గృహమువంకకైన పోంగి చూడక సముద్రతీరమునకుపోయి యేకాంతమగుచోట గూర్చుండి ఒకదానిపై నొకటిగ యరుదెంచుతరంగముల తిలకించుచుండెను.

లోకములో మన చిత్తవృత్తులలో నిముడ్చుకొనలేని వస్తువులు కొన్నిగలవు. అట్టివానితో సంపర్కము కలుగచేసుకొనవలెనన వాటి యుద్దేశముల ననుసరించి నడువవలయును. లేదా, తొలుతనే స్వస్తి చెప్పవలయును. ప్రస్తుతము శ్రీనివాసుని కలంచుచున్న దీ సమస్యాపరిష్కారమే. అతడు విశాల ప్రవర్తన సహించి ఆమెతో కాపురముచేయుటయా? లేక త్యజించి యొంటరిగపోవుటయా?

*　　*　　*　　*

వారము దినములు గడచినవి. శ్రీనివాసునకు దినమొక యుగముగ తోచుచున్నది. విశాల యొనర్చు ప్రతికృత్యము ఆతని అనుమానమునకు దోహదమొసంగుచున్నది. నాటిరాత్రి పండ్రెండు గంటలైనను శ్రీనివాసుడు వాలుకుర్చీలో కూర్చొని ఊహాతరంగముల మునిగి తేలుచున్నాడు. అతని హృదయములో తనలోనున్న అగ్నివల్లనే తగులబడిపోయిన బూడిదమాత్రము గలదు. ఆతని ముఖముపై అంతరంగిక హృదయవేదనయొక్క ఛాయ ప్రతిబింబించుచుండెను. ఆ గదిలోనున్న గడియారము దాని విహితకృత్యమును నెరవేర్చుకొనుటకై కొట్టిన పండ్రెండుగంటల నాతడెరుంగనే యెరుగడు. అప్రయత్నముగ నాతని నోటినుండి "నా సర్వస్వమని నమ్మిన విశాలద్రోహము చేయుటయా?......పరీక్షించెదగాక" అను మాటలు బయలువెడలెను. మరుక్షణమున విశాల శయనించియున్న గదిలోనికి నిశ్శబ్దముగబోయి మంచముప్రక్కను నిలుచుండెను.

విశాలగాఢనిద్రలో నుండెను. ఆకులచాటునుండి రెండు మూడు చంద్రకిరణములు గవాక్షముద్వారా ఆమె మోముపై ప్రసరించి సహజలావణ్యమగు ముఖమునకు దేదీప్య మొనగూర్చెను. పిల్లతెమ్మెరలు ఆమె ముంగురుల నటునిటు కదల్చి మోమున కొక వింత సోయగము కలుగజేయుచుండెను.

నిశ్శబ్దముగ రెండు నిముసములు గడచినవి. తలవని తలంపుగ విశాలగాఢనిద్రలో "నే తప్పక చేసెదను. నీ వేమిచేయుమనిన నది యొనర్చెదను. కాని, యీవిషయము నా నాథు డెఱుంగరా"దని కలువరించెను.

ఇంక నేమున్నది. నిప్పుబిగించిన కోతి అగ్నిత్రొక్కినట్లు శ్రీనివాసు డున్మత్తుడై గదినివీడి పరుగిడెను.

*          *          *          *

సంధ్యాసమయము. శ్రీనివాసుడు వాహ్యాళికైనను వెడలక కచేరిసావడిలో కూర్చొని అంతవరకు తా నన్వేషించిన విషయముల క్రమముగా తలంచుకొనుచు వాపోవుచుండెను. అంతలో తన వ్రాతబల్లపైనున్న టెలిఫోనుగంట కొట్టినది. శబ్దగ్రాహమును చెవియొద్ద నిడుకొని సంభాషణ కుపక్రమించెను.

"..................."

"నేనే శ్రీనివాసరావును."

"..................."

"తాతాలాల్ కంపెనీ వర్తకులా, భగవాన్దాసులా? వందనములు. క్షేమమా?"

"..................."

"జౌనాను. ఈమధ్య పని తొందరవలన రాలేక పోయితిని. వర్తకముగా బాగుగా సాగుచున్నదా?"

"..................."

"మావంటివారే నగలను కొనుటకుమారు అమ్మ జూపినయెడల వర్తకము బాగుగా కొనసాగునను చున్నారా?"

"......"

శ్రీనివాసునకు ఏమి ప్రత్యుత్తర మొసంగుటకును తోచలేదు. అతడు నగలను విక్రయింప వాంఛించ లేదే. ఎట్టకేలకు తన అసమర్థత వెలిబుచ్చుచు "మీ రేమనుచున్నారో నాకు బోధపడలే"దని పలికెను.

"..................."

"నాభార్య అమ్మివేయుమని మీ చేతికిచ్చిన వజ్రపుగొలుసు విషయమా. రాత్రిలోగా అమ్మివేయుమని చెప్పారా?"

"..................."

"బేరం కుదిరిందా. 2750 రూపాయలకా?

"..... ............"

"భగవాన్దాసుగారూ! మీకు జ్ఞాపక మున్నదా? ఆగొలుసు నా మామగారు మీ కంపెనీలోనే నాలుగు వేలకు కొన్నారు."

"..................."

"వజ్రములలో మాత్రము కొన్నప్పు డున్నధర అమ్మినప్పు డుండదా? సరే. నా భార్య ఉద్దేశము కనుగొని రేపు ఉదయం తెలియపరుస్తాను. శలవు."

టెలిఫోనును మరల యథాస్థానమునసుంచి శ్రీనివాసుడు యోచనానిమగ్నుడయ్యెను. తన యనుమతి లేనిదే విశాలకంఠహారమును విక్రయింప యత్నించుటలో భావమేమి? తన్నువిడచి యొవనితోనైన...? మహాభాగ్యము! ఈ రెండువేలరూకలతో నెంత కాలము జీవయాత్ర సాగించగలదు?

*          *          *          *

ఆ నిశీథకరాళభీకరరాత్రిలో పదునొకండు గంటలప్పుడే కొట్టినది. యథాప్రకారముగ శ్రీనివాసుడన్వేషణార్థమై శయ్యాగారమున ప్రవేశించి, విశాల యింకను నిదురపోక మంచముపై పరుండి రోదన మొనర్చుచుండుట గాంచెను. తన ప్రణయసామ్రాజ్యమున నీ యనుమానబీజ మంకురింపకపోయవచో తన సతి యొక్కొక్క కన్నీటిబొట్టు తన హృదయమును



విభ్రమము.



మిస్. శాంతా కాళిదాస్ గాంధి.
బొంబాయి విశ్వవిద్యాలయమున సైన్సు
దీసికొని ఇంటర్ పరీక్షయం దుత్తీర్ణయై,
ఇంగ్లండునం దున్నతవిద్య బడయుటకై వెల్లిరి.



శారితా విభాకర్—ఎల్.సి.పి.ఎస్.,
ప్రసూతి వైద్యమునం దున్నతవిద్యకై
ఇంగ్లండు వెల్లిరి.



శ్రీమతి సోఫియా వాడియా

దివ్యజ్ఞాన సంఘమునందు కవితావ్యాస నవలా
రచయితల సంఘమునందు సుప్రసిద్ధురాలు.
అర్జెంటైనాలో పైసంఘసమావేశమునకు
భారత ప్రతినిధిగా వెళ్లిరి.

శయ్యాప్రక్కలు చేసియుండెడిదే. కాని నేడో, అది వజ్రతుల్యమై అభేద్యమైనది. తనసతి శయనించి యున్న మంచముపైనను కూర్చుండుట కిచ్ఛగించక ఆ చెంతనున్న కుర్చీసమీపమునకు లాగుకొని కూర్చుండి "ఎందుకీ యే"డ్పని తప్పనిసరిగ శ్రీనివాసుడు ప్రశ్నించెను.

"తమతో ఒక అపరాధమును చెప్పి క్షమార్పణ కోరుకొనవలసియున్న"దని విశాల కనులు తుడుచు కొనుచు లేచికూర్చుండెను. ఆమె నయనద్వయమున కరుణా, అవ్యక్తమైన యేదో వ్యథ పొడకట్టుచున్నది.

"అపరాధములు క్షమింప వీలైనవి, వీలుకానివి అని రెండు విధము"లని సగర్వముగ శ్రీనివాసుడు ప్రత్యుత్తరమిచ్చెను.

"నేడేమి మీ మాటలధోరణిమారిట్లున్నది? జరిగిన దేదియో విననిదే......"

"ఉపోద్ఘాతము చాలించి సంగతేమిటో తేలనీ" అని అర్ధోక్తిలోనే విసుగుదలతో శ్రీనివాసు డనెను.

"నా సోదరి కుముద్వతికి వివాహము నిశ్చయమైన సంగతి మీరు వినియేయుందురు. ఆమె చదువు కొనుచున్న సమయమున తన సహపాఠియగు మోహనరావునకు సదుద్దేశముతో బాల్యచాపల్యమున కొన్ని ఉత్తరములు వ్రాసినదట."

"ఏమి ఉత్తరములు ?"

"ఏమో నాకు తెలియదు. కాని మోహనరావు మాత్రము దురభిప్రాయపడి నాసోదరి వివాహము సంగతి నెరింగి ఆ ఉత్తరములు బహిర్పరచినచో నా చెల్లెలి వివాహమున కంతరాయము గలుగుననియు, ఆ ఉత్తరము లాతనిదరినుండి పరిగ్రహించుటకు కుముద్విని నాతనికిచ్చి వివాహమైన నొనర్పవలయుననియు లేదేని తాకోరిన ద్రవ్యమైన నీయవలయుననియు నా చెల్లెలిని బెదరించుచు ఉత్తరము వ్రాసెనట. ఆమె నాకీ యంశమును ఉత్తరముద్వారా తెలియబరుచుచు ఎట్లైన సరే నీ క్లిష్టపరిస్థితులనుండి కాపాడుమని కోరినది. నే నిర్దయురాలనై మిమ్ములనుంచుట భావ్యము కాదని కాల్చివేసితిని. నాటినుండియు నాసోదరి సంరక్షణార్థమై శారీరిక ప్రయత్నము కొనసాగించితిని. ప్రారంభమున్న నాకదే ధ్యానమగుటచే ఒక్కొక్కప్పుడు ఈవిషయములనే కలగాంచితినని చెప్పుట హాస్యాస్పదముగనే యుండును. మోహనరావుతో ఈవిషయమై రెండు మూడుసార్లు సముద్రతీరమున ప్రస్తావించి రెండువేల రూపాయి లాతని కొసంగుటకును ఉత్తరములను పరిగ్రహించుటకును యేర్పాటు చేసితిని. నా దగ్గర అంతసొమ్ము లేకపోవుటచే నా రత్నహారమును తాతాలాల్ కంపెనీవారికి విక్రయింపనొసంగితిని. నా చెల్లెలిపైనున్న అభిమానము కొలది యిన్నివిషయములు తమ కెరుకపరచక కృతఘ్నురాలనై సాహసించి యొనర్చి నందులకు నన్ను క్షమించరూ ?" అనుచు విశాల మరల రోదన మారంభించెను.

శ్రీనివాసుని సంశయమేఘావృతము పటాపంచలైనది. అతని హృదయకుహరమున ప్రజ్వరిలుచున్న రోషానలముపై కుంభవృష్టి కురిసినది. అప్రయత్నముగ నాతని నయనములనుండి యశ్రువులు రాలినవి. క్షణమున కుర్చీనుండిలేచి మంచముపై కూర్చొని విశాలను తన యంకమునకు చేరదీసి "క్షమార్పణ కోరుకొనవలసినది నీవు కాదు. నే"నని యోదార్చెను. ఆ దంపతు లిరువురును పూసగ్రుచ్చినట్లు జరిగిన విషయములనెల్ల వక్కాణించుకొని మధ్య మధ్య తా మనుమానించిన విషయముల నన్వయించుకొని ఆనందాబ్ధిలో నోలలాడిరి.

శ్రీనివాసుడు కంఠహారమును విక్రయింపకయే మోహనరావునకు రెండువేల రూకల నొసగి, రహస్యరేఖలను గ్రహించి, భార్యకొసగి యిరువురును కుముద్వతి వివాహమునకు పయనమయిరి.

గ్యారంటి! 2 సం॥ల గ్యారంటి!!




టి. సి. ఎన్.
గోల్డెన్
మెటల్
చెయినులు










T.C. NAGALINGAPPA & Co.
280 Walltax Road, P.T., MADRAS.

కాంతిలోనూ, వన్నెలోనూ అసలు బంగారు నగల కేమాత్రం తీసిపోవు.

| | | | | |
|---|---|---|---|---|
| పెద్దసైజు 1 పేటది | 1-కి రూ. | 7 | 0 | 0 |
| ,, 2 పేటలది | 1-కి రూ. | 14 | 0 | 0 |
| ,, 3 పేటలది | 1-కి రూ. | 21 | 0 | 0 |
| ,, 4 పేటలది | 1-కి రూ. | 28 | 0 | 0 |
| బేబిసైజు (చిన్నది) 1 పేటది | 1-కి రూ. | 5 | 0 | 0 |
| ,, ,, 2 పేటలది | 1-కి రూ. | 10 | 0 | 0 |
| వి.పి. ఖర్చు 1 పేట మొదలు 4 పేటలవఱకు | 1-కి రూ. | 0 | 6 | 0 |

అక్కఱలేనిచో వారము రోజులలో త్రిప్పిపంపిన అంగీకరింపబడును.

మా ఏజంట్లు:—పటేలుస్టోర్సు, మ్యునిసిపల్ హైస్కూలురోడ్డు, బెజవాడ.

మా చక్కని బొమ్మల కేట్లాగు ఉచితము.

టి. సి. నాగలింగప్ప అండు కో.,

280, వాల్టాక్సు రోడ్డు, మదరాసు.

# తెలుగుటాకీలు అభివృద్ధి పొందాలంటే?

హిందీలోను బెంగాలీలోను టాకీలు అద్భుతంగా అభివృద్ధిపొందుతూ వుండడం, వీని కేవిధానా తీసిపోని ఆంధ్రంలో మాత్రం అవి శైశవస్థితిలోనే వుండడం ఎవరికైనా ఆశ్చర్యం కలిగించకపోదు. అంటే దక్షిణదేశంలో నుతికెక్కిన చిత్రాల్ని మనవారూ తీశారు. తీస్తున్నారు. అయితేమాత్రం? ఇతర భాషల్లోలాగ అభివృద్ధికి రావాలంటే ఇంతమాత్రం చాలదు. అందుచేత క్రింది విషయాల్నికూడా ఆలోచిస్తే బాగుంటుందేమో.

నటీనటులు కేవలం డబ్బుకోసమే ప్రాకులాడుతూ, ఫిల్ములలో నటించడం అంతా రాగాలు ఈడ్చడంతోటే వుందనుకుంటే చాలదు. వారికి సినీమాలంటే యేమిటో, ఆ కళ ఎట్లా ఆరాధించాలో ఆ కళ తెలిసినవారి ఆజ్ఞల ఏలా మన్నించాలో తెలిసి వుండాలి. వీనికి తోడుగా ప్రపంచ జ్ఞానం, విద్యకూడా అవసరం. అపుడే వారూ, కళాకూడా అభివృద్ధికి రావడానికి అవకాశాలుంటాయి.

డైరెక్టర్లు డబ్బు తక్కువ అవుతుందని దారినిపోయే యెవణ్ణో పట్టుకొనివచ్చి తర్ఫీతుచేసి పనికొస్తాడనుకుంటే వుపయోగంలేదు. అటుగాకుండా బాగా తెలుసు మాకని గర్వించే నటకావతంసులను చేరదీసి వారు తమయిష్టప్రకారం మెలగడానికి బదులుగా వారియిష్టప్రకారమే తాము నడుచుకొంటూవుంటేకూడ అభాసమే. ఫిల్ముతీసేవాళ్ని, చూచేవాళ్ని భయపెట్టేలాగు సింహగర్జనాలు చేస్తూ తైతెక్కలాడే వాళ్ళవల్లకూడా ఇంతే వ్యప యోగం. ఒకవేళ ప్రేక్షకులు – రసౌచిత్యం ఎఱుగక – దీనికి సంతోషిస్తే సంతోషించవచ్చు. డబ్బుకూడా రావచ్చు. కాని ఫిల్ములలో మాత్రం అభివృద్ధికి దారివుండదు. డైరెక్టర్లు సరియైన నటీనటకబృందాన్నే యేర్పరుచుకోవాలి. ఫిల్ముపరిశ్రమనుగురించి చాలా అనుభవంకూడా సంపాదించివుండాలి. ఏక్టర్ల వల్లనైతేయేమి, యితరమార్గాల వల్లనైతే యేమి వీరికి కష్టాలు రావచ్చు. కష్టాలొచ్చాయని తీసేఫిల్ములు పాడుగా తియ్యడానికంటే వూరకుండడమే ఉత్తమం.

ముప్పాతికాముప్వీసం తెలుగుఫిల్ములు– అన్నిఫిల్ములగతి అంతే – పాడుగావడానికి ప్రేక్షకుల అభిరుచులే కారణం. వారికి ప్రకృతికి ప్రతిరూపం అయిన చిత్రాలట్టే రుచింపవు. ఎవరైనాసరే – సమయాసందర్భాలు విడిచి – పాడాలి. ఏ నటుడైనా సరే శివమెత్తినట్లు దుమకాలి; హుంకరించాలి; గర్జించాలి. లేకుంటే వారికి నచ్చదు. అందుచేత వీరికిష్టమువచ్చినట్లెల్లా డైరెక్టర్లు, ఆభాసంగా చిత్రాల్ని తయారుచేస్తారు. లేకపోతే కర్చుపెట్టిన డబ్బంతా పాడుచేసుకొంటామేమో అని భయం.

ఫిల్ములు తీయడానికి ఎంతసేపూ పురాణకథలే రాణించవు. ఫిల్ములు జనుల అభిరుచులబట్టి వారి నానందింపజేసే వుద్దేశం...

## తెలుగుటాకీలు అభివృద్ధి పొందాలంటే?

త్రోసే తయారుచేయబడుతవి అనుకొన్నావారిని ఫిల్ములమూలంగా బాగుపడ చేయ డానికన్నా డైరెక్టర్లు శ్రద్ధతీసికోవాలి. ఎంత చాకచక్యంచూపినా, ఎంతప్రవీణత



శ్రీరంజని — 'లవకుశ', 'కృష్ణలీల', 'శశిరేఖ', 'సతీతులసి' వీనియందు ప్రధాన పాత్రను ధరించి ప్రఖ్యాతిబడసినది. శ్రీ పుల్లయ్యగారి నిర్వహణమున లవకుశయందు ప్రదర్శించిన నేర్పు ఈమె ఇతర చిత్రములందు జూపజాలక పోయినది.

ప్రదర్శించినా నిరంతరము కుప్పిగంతులువేసే హనుమంతరాయుని, చిత్రవిచిత్రాలుగా

వెన్నదొంగలించే గోపాలకృష్ణయ్యని, తత్కాలానికి ప్రేక్షకులుచూచి కిచకిచలతో ఆనందింతురేమోగాని దానివల్ల వారేమీ నేర్చుకోరు; బాగుపడరు. అంతకంటె ముఖ్యమైన వుద్దేశాలు సంఘటనలు వుండే విషయాల్ని ఫిల్ములుదీస్తే సంఘం బాగు



దాసరి కోటిరత్నం — 'సక్కూబాయి', 'అనసూయ', 'లంకాదహనం' అను చిత్రములందు నటించినది. సక్కూబాయి భూమికను చాలనేర్పుతో నిర్వహించినది.

పడుతుంది. ఇప్పుడు ముఖ్యంగా మనదేశానికి సంఘం అభివృద్ధిఅయ్యే - దేశాభ్యుదయానికిని — ఫిల్ములవసరం. వీనిలోనే జనాభిరుచులను, వారి కానందంగలిగే

విషయాలను, వారు నేర్చుకోవలసిన వాటిని కూడా అనుసంధానం చేయొచ్చు. ఇపుడిపుడే ఒక సాంఘిక చిత్రం బైలుదేరింది. ఇటువంటి సాంఘికచిత్రాలు - చాలా బైలుదేరవలసి వున్నవి. భారతీయులకు రాజకీయచిత్రాలు చాలా ఆకర్షనీయం అని కొంతమంది అంటారుగాని అవి పూర్తిగా సాధ్యమయ్యే అవకాశాలు మనకులేవు ప్రభుత్వం ఒప్పుకోదుకాబట్టి. కాని యితరవిధాల సంఘం బాగుపడే చిత్రాలు ప్రయత్నిస్తే సఫలం కలుగుతుంది.

ఈలా వ్రాయడంలో, ఆంధ్రదేశంలో కళారాధకులుగాని, నిపుణులైన నటీనటకులుగాని, నిర్వాహనశక్తి అనుభవంగల డైరెక్టర్లుగాని లేరనే అభిప్రాయం లేదు. ప్రసిద్ధులు వున్నారు. వీరంతా యేకీభవిస్తే కళారాధనతోపాటు సంఘాభివృద్ధి కలుగుతుంది. ఇపుడు ఫిల్ములు తయారు చేస్తూ వుండేవారు తయారుచేయ సంకల్పం వున్నవారు కూడా యీ విషయాలు గమనిస్తారని అనుకుంటున్నా.

ఇంకోమాట. స్టుడియోల్లో నీతినియమాల గురించి వినబడే హృదయదారణ విషయాల్ని ఫిల్ము పరిశ్రమకు సంబంధించిన వారంతా చక్కచేస్తారని ఆశయం. లేకపోతే అది ఫిల్ము పరిశ్రమకే కాకుండా, సంఘానికే తీరని కళంకం అవుతుంది.

(ఎ డ్రీమర్)

## త్వరలో ప్రదర్శింపబడబోవు తెలుగుచిత్రములు

మోహినీ రుక్మాంగద మదరాసునందు నేషనల్ మూవీటోన్ కంపెని లిమిటెడ్ వారిచే తయారుచేయబడుచున్నది. రామతిలకం, గగ్గయ్య మొదలగు వారిందు నటించుచున్నారు. ఇది ప్రాచీనసంప్రదాయముల ననుసరించి తీయబడుచున్నట్లు తెలియుచున్నది.

### వీరఅభిమన్య

బొంబాయి సాగర మువీటోన్ స్టుడియోలో తీయబడుచున్నది. పులిపాటి వెంకటేశ్వర్లు, నాగభూషణరావు, కమలాబాయి, యిందులో పాత్రల నిర్వహించుచున్నారు.

### ప్రేమవిజయము

ఇండియన్ సినీటోన్ వారి సాంఘిక చిత్రము. ఇదియే తెలుగున మొదటి సాంఘిక చిత్రమన వచ్చును. ఇందు నటించిన పాత్రధారులందరిదివరకే సుప్రసిద్ధులనిపించుకొనకున్నను చక్కగ నటించినట్లు తెలియుచున్నది.

### శశిరేఖాపరిణయము

స్వర్గీయులైన, సుప్రసిద్ధ డైరెక్టరు పి. వి దాసుగారిచే వేల్సుపిక్చర్సు నందు ప్రారంభింపబడినది. త్వరలోనే విడుదలగానున్నది. దీనిలో రాజేశ్వరరావు, శ్రీరంజని మొదలగు పెక్కుమంది పేరొందిన నటకులు పాల్గొనుచున్నారు.

### సతీతులసి

ఆంధ్రదేశములోని సుప్రసిద్ధ నటీనటులందరిందు పాల్గొనుచున్నారు. కథ కవికోకిల రామిరెడ్డిగారిది. బి. ఎస్. రాజయ్యగారిందులోని సంగీతమును బాల్గొనుచున్నారు. దీనిని నెల్లూరు శ్రీరామాఫిలిమ్సువారు తయారుచేయుచున్నారు.

ఇంకను, గుంటూరు ఈస్టిండియాపిక్చర్సువారి రుక్మిణీకళ్యాణము, మోహినీరుక్మాంగదయును, స్టార్ కంబైన్సు లిమిటెడ్ వారి సారంగధరయును, దేవదత్తా ఫిలిమ్సువారి సతీసులోచనయు త్వరలో విడుదలయగునని తెలియుచున్నది.

# మగని చెవిలో

"అనసూయ"

(రెండో పెళ్ళినిగురించి)

"అరదమునెక్కి- కేతనపటాంచల
చంచలమైన తాల్మితో
తురగజవంబు మిక్కగడవద్రోసి
కడంగెడు తత్తరంబుతో
తిరుగెడు బండికండ్లపగిదిన్
భ్రమియించుమనంబుతోడ..."

ఏమిటండీ ఆ పద్యము! కృష్ణుడు సత్యభామ యింటికి వెళ్లుచున్నప్పుడు అతని మనస్సును గురించి వర్ణించి చెప్పినదా! నిజంగా అటువంటి మనుష్యులూ, అటువంటి మనస్సులూ ఉంటాయా? ఆ కృష్ణుడికి యేమిపట్టిందండీ అంత భయపడి సత్యభామ యింటికి వెళ్లకపోతే! మిమ్మల్ని సలహా అడిగితే క్లబ్బుకువెళ్లి పొమ్మని చెప్పియుందురు గదా! కృష్ణునికి ఆపాటి బుద్ధి పుట్టలేదు. అందుచేత వెళ్లేడు, ఆ యిల్లాలిచేత తాపులు తిన్నాడు!

మన కృష్ణారావు నాటి కృష్ణునివంటివాడే!

అమగో! ఎవరైనా కొంచెము భార్యయెడల ప్రేమగాఉంటే వాడికి ఏమీ చేతకాదనీ, ఆడారివాడనీ, వాడికి పెళ్లాంవద్ద భయమనీ, అంటారు! మీకు లేకపోవడం సరేకదా, ఒకరివద్దనున్న సుగుణమైనా చూచి మెచ్చుకోలే రెందుచేత చెపుమా! పెళ్లాలు సావిత్రిలాగు ఉండాలి, సీతలాగు ఉండాలి అని మీరు చెప్పుచుండడం బాగుందీ! మేముమాత్రం మగవాళ్లు కృష్ణుని మోస్తరుగా రాముని మోస్తరుగా ఉండాలని కోరడం బాగులేదూ? అయినా మన దేశంలో ఆడవాళ్లని అన్యాయంగా అధఃపాతాళానికి అణిచేసేరు; దాని ఫలితము ఇక కొద్దిరోజులలోనే రాకమానదు లెండి! ఇప్పటికే పాశ్చాత్య సంపర్కం నించి మీ అధికారపు కట్టడములు కాలడం ప్రారంభించేయి! పూర్తిగా దగ్ధమైపోయేంతవరకూ మీరింకా మీ పాతస్వర్గంలోనే ఉన్నట్లు భావించుకుంటూ ఉండండి! మిమ్మల్ని యింట్లో కూర్చోపెట్టి పిల్లలను చూడండి అని చెప్పి మేము క్లబ్బులకు వెళ్లే రోజులు రాకపోవు లెండి! అప్పుడు తెలిపిస్తాము మీయొక్క కుటిలత్వమంతా! అప్పుడు మీచేత తినిపిస్తాము మీరు మాకు పెట్టిన కష్టములయొక్క ఫలములన్నీ! తెల్లవారిలేచిన దగ్గరనుంచీ నానా చాకిరీచేసి పిల్లలతో నానా బాధలూపడి మీఅమ్మా మీఅప్పా తిట్టిన తిట్లన్నీ తిని యేదో కొంచెం పెంద లాడే పనులు తెరపిచేసుకొని కూచుంటే, మీరు ఎక్కడో ఖాతాఖానీకివెళ్లి రాత్రి పదిగంటలవరకూ రాక కాలక్షేపము చేసివేయడమూ, నేను అలాగు పిట్టలాగు మీకోసము కనిపెట్టుకొని కూర్చోవడమూ, తరువాత పిల్లలు ఒక నిద్రతీసి మళ్లీ నా పీకలమీదికి సవారీ అయిపోవడమూ—ఇలాగు నేను ఇన్నిబాధలు పడుతూఉంటే మీకు చీమకుట్టినట్లైనా ఉందీ? చాకలిమూటలు మోయడానికి గాడిదెలాగు మేము ఇవన్నీ అనుభవించడానికే పుట్టేమని కాబోలు మీ తాత్పర్యము! చిన్నప్పుడు పెళ్లిలో మెడమీద పూజా పెడితే యేమిటో హాస్యాని కనుకొన్నాను గాని యింత నిజముగా యెద్దుపూజాలాగు ఉంటుందని అనుకోలేదు. జయపురం ఘాటీలమీద బరువు లాగు

కోనిపోయే యెద్దులలాగు మేము యీ సంసారాన్ని మోసితీసికెళ్లడానికి దేవుడు మాకు రాసేదు కాబోలు! పోనీ, ఎంతబరువైనా మోయవచ్చును. ఎన్నిపాట్లైనా పడవచ్చును. 'నా' అన్నవాళ్లుంటేను! కాని అలాంటి వారేరీ? చూచి సంతోషించేవారు లేరే! చేసినపనీ, పడినకష్టమూ, అంతా అడివిగాచిన వెన్నెల అయి పోతూఉంటే, చింకిజేబులో ధనం పోసినట్లు కారి పోతూవుంటే, మరి ఏక్కారా, సంతోషమూ, ఉత్సాహమూ ఉంటాయి చెప్పండి! మీరైనా ఒక మాటు కొకమాటు కష్టసుఖాలు ముచ్చటిస్తూ ఉంటే, ఇంత మనోవ్యథ, ఇంత దుఃఖము నా కుండదుగదా! కాని అందుకు మీకు ఆసక్తిలేదు. తీరుబాటులేదు. క్లబ్బుకు ధారపోసే అయిదు గంటలలో రెండు గంటలు తగ్గిస్తే ఏం తుపానులు పెట్టేస్తాయా, రైళ్లు కొట్టేస్తాయా, భూకంపాలు పుట్టిపోతాయా! లేక మీ స్నేహితులకు మతులుపోతాయా, మీకు వెర్రెత్తి పోతుందా? ఆ రెండుగంటలసేపూ యింట్లో కూర్చొని పిల్లలిని చూస్తూ నాకు చేయూతగాఉంటే నాప్రాణం ఎంత సంతోషిస్తుంది! అలాంటిబుద్ధి మీకు పుట్టితే! నావంటి మంచివాళ్లు ఉన్నంతకాలం ఇలాగు కళ్లు కానకతిరుగుతారు, తరువాత మీపాట్లు కుక్కలుపడవు! నావిలువ మీకు యిప్పుడు తెలియదు! ఎలాగూ నాకు మూడు నాలుగేళ్లలో మార్కం ఉందని జ్యోతిష్కుడు చెప్పేడుట గదూ! అప్పుడు మీరు తిరిగీ పెళ్లాడాలి—మీకు నాయొక్క మంచి చెడ్డలు అప్పుడు బోధపడాలి! మళ్లీ పెళ్లాం వస్తేనేగాని తొలిపెళ్లాం గుణాలు బోధపడవు. దాని ధాటికు ఆగలేక క్లబ్బు యెటువంటిదో నెలకు ఒక మారైనా చూడక, నిత్యమూ పిల్లల యేడుపులు చెవులలో ఓంకారశబ్దములాగు వినబడుతూఉంటే, మీరు ఆ రెండోపెళ్లాంవద్ద భయభక్తులుగల్గి భృత్యులగా సంచరిస్తూ ఉన్నప్పుడు నాకు చూడాలని మహా కోరికగా ఉంది! వీలైతే దెయ్యమునైనాఅయి ఈ యింటిలో ప్రవేశించి చూడకపోను లెండి! అప్పుడు ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా "పోయిన అనసూయ మంచిది; దానిని నిష్కారణం బాధపెట్టేను; ఇప్పుడు ఈ జాంబవతివచ్చి నా ప్రాణాలు పుచ్చుకుంటూ ఉన్నది; క్లబ్బుకా వాచిపోయినాను, వంట పొగంతా నా కళ్లలోనూ ముక్కులోనే ఉంటూ ఉన్నది; తోటి స్త్రీడర్లందరూ వారి యిష్టంవచ్చినట్లు కథలల్లి నాగురించి కూస్తూఉన్నారు! ఏమైనా దీన్ని ఎదిరించి అన్నానంటే నిజమైన జాంబవతిలాగే ఐరికేసి రవ్వపెట్టి నా పరువంతా బయటపెట్టేస్తుందేమో అని భయమువేస్తూఉంది!" అని ప్రతి నిమిషమూ మీరు గింజుకుంటూఉంటే, మీ జాంబవతి మీపైని ముఖము చిట్లిస్తూఉంటే చూచి, "ఏమండీ! నేను అన్నది నిజమైందా?" అని అడగాలని ఉంది.

అందుచేత ఏదో నేను బ్రతికిఉంటే యీ రెన్నాళ్లూ నన్ను సుఖపెట్టండి, మీరు సుఖపడండి! 'నా' అన్నవాళ్లు లేక తహతహ లాడిపోవుచున్నాను! మీ దర్శనము హైదరాబాదు నవాబుగారి దర్శనము లాగు అపురూపమైపోయి, మీ అమ్మగారూ మీ అప్పగారూ నన్ను మాలదాన్ని చూసినట్లు చూస్తూ ఉండి కాల్చుకొని తింటూఉంటే, ఎందుకండీ యీ పాడుబ్రతుకు! మీ పిల్లలిని మీరే పెంచుకోండురు గాని, లేకపోతే మీ రెండోపెళ్లామూ మీ అమ్మా అప్పా పెంచుతారు! నా కెందుకు ఈ చిత్తశోభ? ఈ మూడు నాలుగేళ్లూ ఎలాగో కళ్లు మూసుకుంటే నాకు మార్కము రానేవస్తుంది, మీ కోరిక తీరనే తీరుతుంది! నాబాధ అంతమవనే అవుతుంది!........

నా మార్కంఅంటే ఎందుకండీ అంత సంతోషం మీకు? ముఖం వికసించిపోయింది తామరపద్మం లాగు! సంబరం దాచుకోలేకుండా ఉన్నారు! అలాగే కానివ్వండి! యీ సంతోషమంతా రెండోపెళ్లాము వచ్చిన తరువాత చూద్దాము! నాన్నకు పెళ్లి అవుతుందని సందడేగాని సవతితల్లి వస్తుందని జ్ఞానములేనట్లు

జాంబవతిమాట మరచిపోకండి! జాంబవతి మీ యింటిలో కాలు పెట్టినతరువాత మీయింటివద్ద లోపలా పైనాకూడా అలికిరిగానే ఉంటుంది లెండి! యింటిలోపల ఆమే మీపైని రణగుణధ్వనిచేస్తుంది! అప్పుడు ఎన్ని చిత్రాలు,ఎన్ని తమాషాలైనా జరుగుతూ ఉంటాయి లెండి! రెండోపెళ్లి అనుభవం ముందున్నది లెండి! రెండూ పెళ్లిచేసుకోరూ?ఎరిగీ మరిచీ మరిపెళ్లాడరూ? దానికేమి! ఈ కబుర్లు అందరూ మామూలుగాచెప్పేవే! ఎదురుగుండా మనిషంత మనిషి పెళ్లాం దెయ్యంలాగు నిలబడితే నేను తిరిగీ పెళ్లిచేసుకుంటానని అనడానికి ఏమగడైనా జంకుతాడు. కేవలం భయమని కాదు గాని ముఖం మెప్పక! నేను గతించిన పదమూడో రోజున మీరు పెళ్లి సెటలుచేసుకొని పల్లకీ యెక్కక పోరు! పెళ్లాడకపోతే శక్తిలోపం అనుకుంటారేమోనని జిజ్ఞాస! నా మొదటిపెళ్లాం వొట్టువేయించుకుందనో లేకపోతే మాఅమ్మ నూతిలోపడతానంటూ ఉన్నదనో, పిల్లలకు సంరక్షణలేదనో, ఏదో ఒక నెపం సంకల్పించుకొని పెద్దబ్బాయి చేయూతపుచ్చుకొని ఎలాగో బాజాలతో పల్లకీ యెక్కిపోతారు! చూపుకి వద్దూపొడుగూ ఉన్నారు! పేరుకి ప్లీడరు! మరేమిటి కావాలి! ఇక లోపలసంగతా? అది పెళ్లికూతురే తరువాత తెలుసుకొని తగినట్లాను వేసుకుంటుంది! ఆ తరువాత మీ ప్రాయశ్చిత్తం మీకు అవుతుంది! అప్పుడు నేను జ్ఞాపకం రాకపోనులెండి! ఆతరువాత సంగతి నా కెందుకు. నేను బ్రతిమాలుకొన్నట్లు నాకు దేవుడిచ్చిన యీ మూడు నాలుగేళ్లూ మాత్రము వృథాపోనివ్వకండి! ప్లీడరు పని పాపానికితోడు పెళ్లాం ఉసురుపోసుకొన్న పాపంకూడా మెడగట్టుకోకండి! ఏదో ముఖం మెప్పకైనా, పెదవులకు బెల్లం రాసుకొని అయినా, నాతో పూర్వమువలె—అనగా—మీరు చదువుకొంటూఉన్న రోజులలోవలె అభిమానముగా రెండు తీపిమాటలు మాట్లాడండి! క్లబ్బు రెండుగంటలు తగ్గించండి! ఇది ఇల్లూ, ఇది పెళ్లామూ అని ఒంటిమీద కొంచెం చైతన్యం ఉంచుకోండి! దానివల్ల మీభాగ్యమేమీ తరిగిపోదు! మీ గౌరవానికేమీ లోపమురాదు! మీకు సరివారిలో తలవంపులు రావు! నన్ను చులకనచేసి క్షోభపెట్టినంతమాత్రముచేత మీకు రావుబహద్దరు, దివానుబహద్దరు, కితాబులు వచ్చి పడిపోవు, మీరు పెద్ద చక్రవర్తులైపోరు! కాబట్టి అగ్నిసాక్షిగా పెళ్లాడిన మోహమూ, ఇన్నాళ్లూ కలసిమెలసిఉన్న స్నేహమూ, ఇవి తలచియైనా నాయందు కొంచెం గౌరవం వుంచండి! అంతే నేను కోరేది!

---

ఒక పత్రికావిలేఖరి. "ఫలానా ఘరానామనిషి ప్రియభర్తను, కూర్మిసంతానాన్ని, దగ్గరిచుట్టాల్ను విడచిపెట్టి ఫలానాదినం స్వర్గస్థురాలైందని వ్రాయుటకు చాలా చింతిస్తున్నాము"

ఈవిలేఖరిగారు చింతించేది దేనికో!

# కాడ్లివరాయిల్లో వుండే బలమునిచ్చే సహజగుణం స్కాట్సు ఎమల్షన్లో 3 రెట్లు అధికంగావుంది




జబ్బువల్ల నీశరీరంలోవుండే బలమూ సత్తువా నశించిపోయినపుడు, తిరిగి బలంచేకూర్చేందుకు డాక్టర్లు, ఎ. డి. జీవధాతువులతో మంచిశక్తినిచ్చే కాడ్‌లివరాయిల్లాంటి వుత్తమమైన బలవర్ధకంకంటె, వేరే ఏమీ చూపించలేరు.

కాని కాడ్‌లివరాయిల్ వున్నదున్నట్టే, బలహీనంగా వుండేస్థితిలో చక్కగా జీర్ణించుకొనడం కష్టం. చాలామంది యీస్థితిలో సేవింపనేలేరు. అందుచేతనే స్కాట్సు ఎమల్షను ముఖ్యముగా ఉపయోగమైంది. ప్రత్యేక పద్ధతితో తయారుచేయబడింది కాబట్టి, స్కాట్సు ఎమల్షను కాడ్‌లివరాయిల్లోవుండే శక్తినంతా కలిగివుంటుంది; రుచికరంగా వుంటుంది. ప్రతివారూ జీర్ణించుకోవచ్చు. ఇదేకాకుండా, లైమ్, సోడాలందుండే బలమిచ్చే, హైపోఫాస్ఫైట్సు వున్నందువల్ల సాధారణ కాడ్‌లివరాయిల్‌కంటె మూడు రెట్లధికంగా గుణం ఇస్తుందని కనిపెట్టబడింది.

అడ్డుకొనే శక్తికూడా వృద్ధిజేస్తుంది.

స్కాట్సు ఎమల్షన్ జబ్బుపడ్డపుడు పోయినబలం, ఆరోగ్యం చేకూర్చేదే కాకుండా బలహీనం గల్గినపుడూ చుట్టుప్రక్కల్లో రోగాలు వున్నపుడూ పుచ్చుకోవడానికి ఉపయోగపడుతుంది. రోగాలని రానివ్వకుండా పోరాడేశక్తి అమితంగా శరీరానికి కలగజేస్తుంది. రక్తం వృద్ధిచేయడానికి, నరములకు బలం చేకూర్చడానికి, అన్నివిధాలా శరీరానికి శక్తి కలిగించడానికి, స్కాట్సుఎమల్షన్ డాక్టర్లచే అరవైయేళ్లుగా సిఫార్సు చేయబడుతూవుంది.

# SCOTT'S Emulsion

స్కాట్సుఎమల్షను మండీవర్తకులు: శుద్ధమైన కాడ్‌లివరాయిల్ నుండి
ఇంపీరియల్ కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్.
కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా
అహమ్మదాబాదు, కొచ్చిను, క్యాలికట్టు, విశాఖపట్టణము, కరాచి, అమృతసరము.




## జపానులో పరిచారికలు

ఇంటిలో దాసి అంటే అది మనకంటె తక్కువది. ఎటువంటి నీచమైనపనులైన చేయించవచ్చును, యిష్టమువచ్చినట్లు అధికారము చలాయించవచ్చును; అది సాధారణముగా ప్రతిగృహిణియు గృహస్థుడు తలచుట మనలో అలవాటే. ప్రతియితర దేశములలోకూడ పరిచారికలున్నారు. వారి యాదరణ వేరు వేరుగా నుండును. వీరి యాదరణవిషయమై జపానువారినుండి నేర్చుకొనవలసిన దెంతేనియు గలదు.

జపానులో పరిచారిక, పాశ్చాత్య గృహములలో బీదరాలైన బంధువువలె నుండును. అక్కడామె వేతనముపై పనిజేయుదాదిగాక పనినేర్చుకొనునదిగానుండును. అందుచేతనే ఆమెకిచ్చు జీతము చాలతక్కువ. బాలికలు పాఠశాలలను వీడినవెంటనే, అనగా పదునారేండ్లప్రాయమున, వివాహమాడుటకు ముందు గృహకృత్య నిర్వహణమును గురించి తెలుసుకొనదలంచి పరిచారికవృత్తి యవలంబింతురు.

పరిచారికను యిల్లాలు గర్వముతోచూడక ఆమెపని నేర్చుకొనుచున్న బాలికయను యభిప్రాయములతో నుండును. సంవత్సరమునకు రెండుమారు లొకవారమువంతున ఆమెకు తన కుటుంబము జూచుటకు శలవుకూడ యివ్వబడును. ఆ సమయములో ఆమెకు దుస్తులు బహుమతిగా నివ్వబడును. వీని విలువ ఆమె పనిజేయు వానిస్థితిని బట్టియుండును. ఇంట బనిజేయుచున్నంతకాలము యజమానురాలే ఆమె రక్షణమువహించి శ్రద్ధగా కాపాడును. యజమాను రాలెంత దయ, అక్కర, నమ్మకము జూపునో అంతకంటె ఎక్కువగనే పరిచారికకూడ ఆకుటుంబమునెడ శ్రద్ధగలిగియుండును. గృహనిర్వహణమునందు వారు చాల విశ్వాసనీయులు. జపానునందు పరిచారికలెపుడును దొంగిలింపరు.

దినమంతయు నామెకు విశేషముగా విసువు గలిగించు పనియుండదు. పెందలకడలేచి యింటిని శుభ్రపరచును వంటను సిద్ధముచేయును. ఆహారము ముగిసినతరువాత పాత్రల శుద్ధిచేయును. తదనంతరము యజమాని బూట్సులతుడిచి, పిల్లలనుబడికి పిలుచుకొనిపోవును. యజమానురాలి వెంబడి వస్తువులకొనుటకు బజారువెళ్లును. మధ్యాహ్నము సాధారణముగా నామె గుడ్డలుకుట్టును. సాయంత్రము మరలవంట-తరువాత పాత్రలు శుభ్రపరచడము, పడకలువేయడముతో నామె పనులు ముగియును. కాని సాయంత్రమామె విచ్చలవిడిగ తిరుగుటకు వీలులేదు. దినమంతయు నామెకీ పనులన్నియునున్నను సరియగు నాదరణముండుటవలన నామెకేమియు కష్టముగ గనిపింపదు.

వారు యజమానుల గృహముల వీడునపుడు పరిచారికలవలెవీడక ధనవంతురాండ్రగు కన్యలవలె విలువగలదుస్తులధరించి వెడలుదురు. దీనివలన వారికెంత యాదరణముండునో తెలియగలదు. వీరినిజూచి మన సోదరీమణులుగూడ తమయింట పనిచేయు పరిచారికలను తోబుట్టువులవలె యాదరించుచు, వారి నభివృద్ధి దెచ్చుటయేగాక యాత్మోన్నతినందుదురని తలంచుచున్నాము.

## పాశ్చాత్యుల మూఢనమ్మకములు

ఇటీవల నొకడు శకునముగాలేదని తానుతప్పక వెళ్లవలసినకోర్టుపనికి వెళ్లలేదట. అతనికాకోర్టు పౌ. 2-13-0 జుల్మానావిధించబడినది. వాడు కోర్టునకు రానికారణము తెలిసికొని జుల్మానావిధించిన జడ్జిగారుకూడ వాని నమ్మకములతో నేకీభవించెనట. ఎందుకన ఆ జడ్జిగారుకూడ యింటినుండి బైలుదేరి తిరిగి యేకారణముచేతనైనా వెనుదిరిగితే కొంతసేపు కూర్చునకుండా ప్రయాణముసాగించరట!

గుఱ్ఱపులాడము అదృష్టము గలిగించునని పాశ్చాత్యులకు చాలమందికి నమ్మకము. అందుచేత వారాకలాడమును ద్వారమునకు వ్రేలాడగట్టెదరట. అందరికివలెనే తనకు అదృష్టము గలుగవలయునని యొకడొకలాడము ద్వారమునకు వ్రేలాడగట్టెను. ఆమరుదినమాతడు ద్వారమును దాటుచుండగా లాడము తెగి వానితలపైబడి పెద్ద గాయము గల్గించెనట! అదృష్టమీవిధముగ తనతలపైబడునని పాపమాతడు తలంపలేదు కాబోలు!

## శరీరమందమితమైన విద్యుచ్ఛక్తిగల మనిషి

కొంటుజనాన్ బెరెజాయి 63 సంవత్సరముల వృద్ధుడైనప్పటికిని నలువదియేండ్ల వానివలెనుండును. తనయందున్న యద్భుతశక్తినిగురించి యిటీవలనే తెలిసికొన్నాడు. "ఒక సంవత్సరముక్రిందనే నాశరీరములో అమితమైన విద్యుచ్ఛక్తిగలదని తెలిసికొంటిని. నే నొక గుడ్డను పైకెత్తుకొన్నపుడందుండి బుస్సను శబ్దము మిణుగురులు గలుగుట సంభవించెను. నా మిత్రుల కిది తెలిసినది. ఒక డాక్టరు సలహాపై సుప్రసిద్ధ డాక్టర్లకీ సంగతి తెలిపితిని. వారు నన్ను పరీక్షించి యిట్టివిషయ మింతకుమున్ను కనివిని యెఱుగమనిరి. తరువాత వారు నాలోనున్న విద్యుచ్ఛక్తి కొన్నివందలవోల్టు శక్తి గలిగియుండునని చెప్పిరి. వారు విద్యుచ్ఛక్తి పరిమితిని కొలుచు యంత్రములు తెచ్చిరిగాని అవి పనిచేయలేదు. సాయంత్రమగునప్పటికి నాయందుగల శక్తి బలహీనమగును. కాని రాత్రియందు యథాప్రకారముగనేయుండును. రాత్రి పడకమీద పండుకొన్నపుడు నా శరీరమిచ్చు వెలుతురునందే నేను చదువుకొనగలను. బల్బులనుగూడ చేతతాకి వెలిగింపగలను" అని యాతడు వచించుచున్నాడు.

"...నాథులన్ నేరములన్ సేయ, పేరలుకం జెందిన కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే?"

భర్తప్రవర్తన బాగులేదని తనకు విడాకు లిప్పింపమనికోరుచు మిసర్స్ ఐవ్స్ అను నామె కోర్టులో దావాచేయగా, భార్యప్రవర్తన సరిగాలేదని భర్తకూడ దావాచేసెను. కేసు విచారణ సందర్భమున ఈ క్రిందివిషయములు బైటబడినవి.

ఐవ్స్ వివాహమాడినతరువాత నాల్గుసంవత్సరములకాలము భార్యాభర్తలమధ్య యెట్టికలతలులేకుండ సంతోషముగ సంసారము చేయుచుండిరి. అపుడామె భర్తకు ఎలెయిన్ కాలింగ్ అను కన్యతో పరిచయమయ్యెను. వారిరువు రెపుడు నాట్యములకు బోవుచుండుట గని ఐవ్స్ భర్తను మందలించెను. కాని భర్తగాని ఆ కన్యగాని ఆమెమాటల సరకుచేయలేదు. ఇట్లుండ భర్త ఒకదినము కాలింగుకు 50 షిల్లింగుల విలువగల గ్లావ్స్ (చేతులకు తొడుగుకొనునవి) యిచ్చిన ట్లామెకు తెలియవచ్చెను. అపుడామె కాలింగును కలసికొని గ్లావ్స్ తిరిగి తీసికొని యికపై తన భర్తతో కలసి తిరుగుట చూచెనేని దండింతునని తీవ్రముగ మందలించి వచ్చెను.

త్వరలోనే ఆకన్య తన భర్తతో దిరుగుచుండుట ఐవ్స్ కనిపెట్టి, ఆమెను వీధిలో కలసికొని కుక్క గొలుసుతో దేహశుద్ధి గావించి, అచటనుండి భర్త పనిచేయుచున్న ఆఫీసునకువెళ్లి అచట నిలువచేయబడిన యొక కుండడుఘాయను భర్త తలపై గ్రుమ్మరించెను. ఇంత జరిగియు ఈ సమాచారము ఆ కన్యగాని భర్త గాని ఎవరికి తెలియనీయ లేదు. ఈ వృత్తాంతమంతయు విని ఐవ్స్ ప్రవర్తన ననుమానించుటకు మార్గములు లేవనియు, ఆమె భర్త ప్రవర్తన చెడినట్లు తా నెంచుచున్నాననియు చెప్పుచు న్యాయాధిపతి ఐవ్స్‌కు విడాకుల నిప్పించెను.

## శాపాలికి శక్తివుందా?

మధ్య ఆఫ్రికాలో నొక నీగ్రో మాంత్రికుడు చెట్టువిఱిగి మీదబడి మరణించెను. వాడు మరణావస్థలో నున్నపుడాతడుపయోగించుచున్న కడియములపై కన్నువైచిన యొక శ్వేతజాతీయుని గని ఏమో గొణుగుకొనుచు చనిపోయెను. తరువాత పాశ్చాత్యుడు మాంత్రికుని కడియముల తన స్వాధీనమొనరించుకొనెను. ఆతడొక గనులవ్యాపారి. కొలదికాలమునకే ఆతని గనులందు పనిచేయువారి కొక వాతరోగము సంభవించి వ్యాపారము చెడిపోయెను. ఆతడంతట వివాహమాడదలంచి స్వదేశమునకు బయలుదేరెను. అచటతని కపారమైన ధననష్టము, నూతనముగా పెండ్లియాడిన యామె కారుమాసములు చిత్రములగు పెక్కురోగములు గల్గెను. తరువాత అతనికే జబ్బువచ్చెను. తేరుకొన్న కొంతకాలమున కాతడు కడియములదీసి వాని విషయ మొక మిత్రునితో చెప్పెను. ఆదినమే మోటారుకారుచే త్రొక్కబడి కాలియెముక విరుగగొట్టుకొనెను. ఇది గత జూలైలో జరిగినది. మిగిలియున్న ధనముకూడ వేరొకరీతిగా నష్టమువచ్చెను. ఆతని కుమారుడొకదినము ఆ కడియముల తాకిన కొంతసేపటికే మోటరుక్రిందబడి తీవ్రగాయములకు లోనయ్యెను. ఆ కడియము లతనివద్ద నిప్పటికిని గలవు. ఆతని కింకేమి గానున్నదో?

మూడేండ్లక్రింద నొక పురాతనవస్తువుల సేకరించు వ్యాపారముగల నొక సుప్రసిద్ధురాలు ఈజిప్టునుండి మృతిజెందిన యొకమనిషి చేతిని సంపాదింపగలిగెను. శాస్త్రజ్ఞు లది 7000 ఏండ్లక్రిందటిదనియు, ఈజిప్టును పరిపాలించిన యొక రాకుమారి హస్తమనియు చెప్పిరి. దీనిని సేకరించిన యామె భర్త అట్టివస్తువుల నింట నుంచుకొనగూడదని మొఱలిడినను ఆమె వినదయ్యెను. అంతటాతన కపాయకరమగు నొక రోగమువచ్చి దానినుండి తీరుకొనజాలక నాతడు గడచిన ఆగస్టుమాసమున గతించెను. ఆంతటా యిల్లాలా చేతిని పురాతన ఈజిప్టుపద్ధతుల ననుసరించి దహనముచేసెనట!

ఇంగ్లండులో నిట్టిశాప మొకటిగలదు. నూరేండ్లక్రిందట ప్రకృతము లార్డ్సు ఆవ్ వాటర్‌ఫోర్డ్ (Lords of Waterford) అనువారి వంశీయు లొకడు స్వారిచేయుచు నొకబాలుని క్రింద బడగొట్టెను. కాని యాతడు న్యాయస్థానమున నిర్దోషియని విడుదలపొందెను. ఆసమయమున ఆబాలుని తల్లి వితంతువు. అతనికి "మీ వంశములో నొకరైనను సహజమగు మృతి బొందకుందురుగాక" యని శపించెనట. కొన్నివారములకే నాతడు స్వారిలో గుఱ్ఱముమీదనుండి క్రిందబడి మరణించెను. తరువాత వచ్చిన వాటర్‌ఫోర్డులార్డ్సులో నొకరు నీటమునిగి మరణించిరి; ఇంకొకరు గుఱ్ఱముమీదనుండి క్రిందపడి కుంటినగుదునను భయముతో ఆత్మహత్య జేసికొనెను; ఇంకొకరు త్రొక్కుడుచే మరణించిరి.

తమప్రభావము జూపిన శాపములలో నివి కొన్నిమాత్రము. శాస్త్రజ్ఞులు వీని కేమందురో? ఇది పట్టి కాకతాళీన్యాయమా?

# గ్రంథ పరిచయము

**కావ్యాళి** — శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిగారు రచించిరి. ఇందు పతిభక్తి, శ్రీరంగనాథస్తుతి, వేణుగోపాల శతకము అను మూడు భాగములు గలవు. ఈ మూటియందును వీరి భావములు పవిత్రములై, మనోజ్ఞములైయున్నవి. శైలి మధురమైనది. ఈమె రచన మొత్తముపై పూర్వకవయిత్రుల దలపించుచున్నది. ఈ కవయిత్రి యిట్టి సద్రచనలు ఆంధ్రమునకు దింకను రచియించి వన్నె దెత్తురని నమ్ముచున్నాము. ఇది యువకవి సమితి ద్వితీయ ప్రచురము. చక్కని అచ్చు; నాలుగణాల తపాలబిళ్లల పంపిన యువకవి సమితి, కలవపాముల, కృష్ణాజిల్లానుండి బడయగలరు.

**యువతీ ఆరోగ్యవిధులు** — శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారు రచించిరి. ఇందు స్త్రీలకుపయుక్తములైన పెక్కు విషయములు గలవు. పరిశుభ్రత, ప్రథమచికిత్స, గృహసేవావిధానము, గర్భధారణకాలమున గమనింపవలసిన విధులు, ప్రసవదశ, అంటురోగములు, వానియెడ దీసికొనవలసిన శ్రద్ధ, రోగకాలములందు పథ్యపానాదులు మొదలగు విషయములను స్త్రీలకు సులభముగా నర్థమగురీతి వ్రాయబడినవి. ప్రతి గృహిణియు నీ విషయములను దెలిసికొనవలసిన యావశ్యకత మెండుగగలదు. ఆంధ్రభాషయం దిట్టి విషయము లపురూపములు. ఆ కొరతను పోగొట్టి స్త్రీలోకమున కత్యంతోపయోగముగ రచించిన టి. వరలక్ష్మమ్మగారు శ్లాఘనీయులు. ఈ పుస్తకము వెల ఒక రూపాయ. గ్రంథకర్త్రిగారివద్ద 1223, రామకోటె, హైదరాబాదు (దక్కన్) దొరకును.

**వివాహతత్త్వము** — శ్రీయుతి బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు రచించిరి. వివాహవయోనిర్ణయమును శాసించుచు శారదాబిల్లు అములునకు వచ్చినప్పటినుండి సనాతనధర్మపరుల కది సహింపగూడనిదైనది. కాని వివాహవయోనిర్ణయమున కే శాస్త్రములు ప్రమాణములని వా రుదహరింతురో వానియందే శారదాబిల్లు నందుండు వయస్సే — కొంచ మించుగ — తగినదని వ్రాయబడియున్నదని వారికి తెలియకపోదు. కావున వివాహధర్మము సువ్యక్తముచేయుట పండితుల ధర్మమైయున్నది. "శ్రీ మల్లయ్యశాస్త్రిగారు వారి గ్రంథమునందు వివాహతత్త్వమును శాస్త్రప్రమాణములతోను, లౌకిక పారమార్థికదృష్టితోను, హేతువాదముతోను చేసిన విమర్శనము సనాతనులకును, సంస్కారులకును పఠన పరిశీలనార్హమైనదిగనున్నది" అని ఈ గ్రంథమునకు పరిచయవాక్యములలో శ్రీ కా. నాగేశ్వరరావుగారు రచియించినది నిజమైయున్నది. ఈ గ్రంథమును పెక్కుశాస్త్రముల పరిశోధించి, పెక్కు ఉదాహరణములతో శాస్త్రిగారు రచించిరి. ఇది ఆంధ్రపత్రికా కార్యాలయమువారిచే ప్రచురితము.

**దేశీయ పరిశ్రమము** — పారిశ్రామిక ద్వితీయ పుస్తకముగా వెలువడినది. శ్రీ పెండెం వేంకట్రాములుగారు రచించిరి. ప్రకృతము భారతదేశ భాగ్యోదయము దేశీయపరిశ్రమలపై నాధారపడియున్న పూర్వము మన దేశమం దన్ని పరిశ్రమ లుండియున్నను కాలప్రవాహమున బడి లీనమైనవి. ఈ గ్రంథమున పూర్వకాలమున మన దేశమందలి పరిశ్రమలన్నియు నిదర్శనపూర్వకముగా పేర్కొనబడినవి. ఇపుడు ముఖ్యమైన పరిశ్రమలున్న స్థలములు వాని ప్రాముఖ్యతగూడ వివరింపబడినది.

ఇటువంటి సంగతుల దెలిసికొనుటవలన లాభముగల దని తలంతుము. వెల రు. 1-4-0. గ్రంథకర్తగారి వద్ద, పేరాల, చీరాలపోస్టు, దొరుకును.

**తొట్టివైద్యము** ఈ గ్రంథ మిదివఱకే ఆంధ్రుల కరకమలము లలంకరించియున్నది. ఇపుడు గ్రంథకర్తగారైన డాక్టరు పుచ్చా వెంకట్రామయ్యగారు ద్వితీయ ముద్రణమునందలి పెక్కువిషయముల విపులము జేసియు, పెక్కు పటములను వాని వివరములను జేర్చియు మూడవ ముద్రణమునకు దెచ్చిరి. కూనేమహాశయుడు సుప్రసిద్ధుడైన జర్మని వైద్యుడు. అతడు జలచికిత్సలచేతనే సర్వరోగములను తప్పక నివారణచేయు మార్గములను కనుగొని ప్రపంచమునకు మహోపకార మొనరించెను. వీరీ చికిత్సలపై పెక్కు గ్రంథముల రచించిరి. అవి ప్రపంచమందలి ముఖ్యమైన భాష లన్నింటిలోనికి అనువదింపబడినవి.

సులభములై, ప్రకృతిసిద్ధములై సర్వరోగములను సందేహములేకుండ నివారించు నీ కూనేమహాశయుని పద్ధతుల నాంధ్రుల యందు వాటులోనికి దెచ్చుటకు మిగుల పాటుబడి యీ గ్రంథమును వెలువరించిన గ్రంథకర్తకు ఆంధ్రలోకము కృతజ్ఞత జూపదగియున్నది. ఈ గ్రంథము 370 పేజీలు గల్గి, పెక్కు పటములతో నొప్పుచున్నది. క్యాలికో బైండు. వెల రు. 3. బెజవాడ ప్రకృతి కార్యాలయమున దొరుకును.

**గోప్రభావము** తెనాలి వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ శాస్త్రిగారిచే రచింపబడినది. ఏలూరు గోసంరక్షణ సమితి త్రైవార్షిక కార్యబహుమానములలో ప్రథమగణ్యముగా రు. 116 బడసినది. ఇందు గోవు ప్రభావము పద్యములందు వ్రాయబడినది. గోరక్షణ సమితివారి యాశయములు శ్లాఘనీయములు.

**గోవు** ఇయ్యది పైసమితి త్రైవార్షిక కావ్య బహుమానములలో ద్వితీయగణ్యము. బొడ్డు బాపిరాజుగారు దీనిని రచించిరి. ఇదికూడ గోప్రభావమును దెలుపు పద్యగ్రంథము.

**రామమోహన విజయము** ద్రోణము రాజు రామమూర్తిగారిచే పద్య గద్య గేయములందు రచింపబడి శ్రీ కోకా వెంకటసుబ్బారావుగారి కంకిత మివ్వబడినది. సంఘమునందు చెలరేగుచున్న దురాచారప్రవాహము నాపి బ్రహ్మమత ప్రతిష్ఠ చేసిన యద్వితీయ మేధావంతుడగు రాజారామమోహనుని చరిత్ర యిందు రమ్యముగ వర్ణింపబడినది. వెల 0-6-0. పిఠాపురమున సాధనకుటీరమున దొరుకును.

**మహాత్ముని ఆంధ్రదేశ సంచారము** ఇందు ఆంధ్రదేశమందలి మహాత్ముని ఖద్దరు యాత్ర, సత్యాగ్రహ యాత్ర, హరిజన యాత్రలందలి వివిధ ప్రదేశములందు జరిగిన ఉపన్యాసాది వివరములు వరుసగా నివ్వబడినవి. మహాత్ముల సందేశములు, వారి anecdotes, హృదయాహ్లాదముగ నున్నవి. ఆంధ్రులెల్లరు దీనిని పఠించిన మహాత్ముని హృదయమును మరువకుందురు. గ్రంథారంభమున మహాత్ముని జీవితచరిత్ర క్లుప్తముగ వ్రాయబడినది. ఇది యాంధ్రగ్రంథమాలచే ప్రకటితము. హరిజన సేవాసంఘము, ఆంధ్రాబ్రాంచ్, ఏలూరునందుకూడ ప్రతులు దొరుకును.

**తాతా చరిత్రము** ఆంధ్ర పాఠకలోకమునకు నూతనవిషయముల దెలుపుచు జగత్కథలాది గ్రంథముల రచించినవారిలో నొకరు శ్రీ కొమండూరు శఠకోపాచార్యులు రచించిరి. ఆంధ్ర

మున ఆర్థికపారిశ్రామిక సమస్యల పరిష్కరించి వ్యాపారమును పెంపొందించువారి చరిత్రలుకూడ ఆవశ్యకములే. పార్శీకులమున జనియించి, వ్యాపార రహస్యములు నెఱిగి, విదేశపద్ధతుల నవలంబించి, కోట్లకొలది ధనము గడించి, భారతదేశమున పెక్కు పరిశ్రమల నెలకొల్పుటకును, విద్యను పెంపొందించుటకు నమితముగ పాటుబడిన జంషెడ్జి నస్సర్వాంజి తాతా జీవితచరిత్ర మీ గ్రంథమున సులభశైలిలో వ్రాయబడినది. వెల పది అణాలు. కాకినాడలో గ్రంథకర్తగారివద్ద దొరుకును.

తరంగిణి (ఖండకావ్య సంపుటి) గ్రంథకర్త కందుకూరి రామభద్రరావుగారు, ఇన్నీసుపేట, రాజమండ్రి. వెల 0-4-0.

ఈ తరంగిణికి ప్రవేశికను భావకవిత్వ విశారదులగు కస్తూరి శివశంకరశాస్త్రిగారు వ్రాసిరి. ఇందు 'గోదావరీనది' భక్తిపూరితము. 'గంగమ్మ', 'జన్మభూమి', 'ఆంధ్రభూమి', 'పాటభ్రమ', 'విశ్వశోకము', కోర్కి, సాయాహ్నవర్షము, పూజ, మాలతి, సానుభూతి, జీవితయాత్ర, 'విరహిణి' 'నా భాగ్యము' మొదలగు శీర్షికలతో గేయపణితిని వృత్తములలోను గీతములలోను విరచింపఁబడినవి. వీనిని చదువఁజదువ నింపుజనించుచున్నది. ఆంధ్ర యువకలోకమును ప్రబోధింపఁజాలియున్నవి. వలయువారు గ్రంథకర్తపేర వ్రాయవచ్చును.

(ఆ. వే.)

కోపదారి మొగుఁడు ఐదంకముల సాంఘిక నాటకము. శ్రీ ఊటుకూరు కామేశ్వరరావుగారు రచించిరి. ఇందలి కథయిది. శంకరశాస్త్రి అను నాతడు మున్కోపి. ఏదో వంకలబెట్టి భార్యను పలుమారు చావమోదుచు ననాదరణ చేయును. ఆమె గతించిన పిదప నాతనికి పశ్చాత్తాపము గలిగి ముప్పదియేళ్ల వితంతువును వివాహ మాడును. ఇందు సంభాషణలు చక్కగ నిర్వహింపబడినవి. సనాతనాచార వాతావరణమందలి యిల్లాండ్ర యభిప్రాయములు యథార్థముగ వ్యక్తపరుపబడినవి. కాని కథానాయకుని వితంతు వివాహానంతర జీవితమునుగూడ చేర్చియుండిన బాగుండెడిదేమో? గ్రంథమంతయు వ్యావహారికభాషలో హృదయరంజకముగ నున్నది.

# పత్రికా పరిచయము

## 'కమ్మమహారాజా' పత్రిక

గొట్టిపాటి సుబ్బరాయ చౌదరిగారి సంపాదకత్వమున అనంతపురమునుండి ప్రతిమాసము వెలువడు కమ్మకుల ప్రదీపిక. 1/8 క్రౌనుసైజు 64 పేజీలు మొదటి నాల్గుసంచికలు మా కార్యాలయము జేరినవి. ఇందు చాలవఱకు కమ్మకుల సంబంధమైనవియు, కమ్మకుల ప్రదీపకులయొక్క చరిత్రలును గలవు. వీనితోగూడ వ్యవసాయమునకు, ఆయుర్వేదమునకు, తదితరవిషయములకు సంబంధించిన చక్కని పద్య గద్య వ్యాసములు గూడనున్నవి. త్వరలో నాంధ్రపాఠకలోకముచే నాదరింపబడు గాకయని కోరుచున్నాము. దీనికి సంవత్సరము చందా నాల్గు రూపాయలు.

---

గమనిక:—విమర్శనార్థమై పంపు పుస్తకములను పంపువారు రెండుప్రతులు పంపినగాని విమర్శింపబడవు. సంపాదకుడు.



# సంపాదకీయములు

## గుంటూరు స్త్రీలసభ—ఏకపత్నీ వివాహము

జూలై రెండవతేది గుంటూరు లేడీ రిక్రియేషన్ క్లబ్బునందు పురస్త్రీలు సమావేశమై పురుషులలో నేడు బహుపత్నీ వివాహములు ప్రబలుచున్నవనియు, స్త్రీలకు దానివలన మిగుల నన్యాయము జరుగుచున్నవనియు ఖండించిరి. తదనంతరము "అగ్నిసాక్షిగ వివాహమాడిన తమ ధర్మపత్నులను, బిడ్డలను నిష్కారణముగ వదలి, ద్వితీయ వివాహములాడి వారి నగౌరవపరచుచు, పెను యిక్కట్టులపాలు చేయు దురాచారము పురుషులలో నిరాఘాటముగా వ్యాపించుచున్నందునను, ఇట్టి వివాహములు నీతికిని, శాస్త్రమునకును, లోకనాగరికదృష్టికిని వ్యతిరేకమయి భారతజాతికి ప్రపంచదృష్టిలో నపకీర్తి దెచ్చుచున్నందునను, భారతప్రభుత్వమువారును, రాష్ట్రీయప్రభుత్వమువారును, స్వదేశ సంస్థానములవారును వెంటనే ఏకపత్నీ వివాహ (Monogamy) చట్టములు నిర్మించి, ద్వితీయపత్నీ వివాహమును (Bigamy) నిషేధింపవలయును" అని యేకగ్రీవముగా తీర్మానించిరి. అదియునుగాక దీనికి సహకారిగానుండుటకై "ఇట్టి వివాహములకు సంబంధించినవారల నాగరికులెల్ల బహిష్కరింపవలయును" అనికూడ తీర్మానించిరి.

కేవలము స్వార్థపరులై నిష్కారణముగ, సంతానమునైన గమనింపక, సాధ్వియగు భార్యను వీడి తన కత్తికెదురులేక స్వేచ్ఛావిహారుడై యుండు పురుషుని చేష్టలకు మనస్సు పరితపింప, ననాథలగు నా సాధ్వీమణుల కష్టములు హృదయమును నీరుగావింప నావేశమునొంది కొందరు నారీమణు లిట్టి శాసనములున్న మంచిదని దలంచుట విచిత్రముగాదు. వీటిచే నిట్టి దురంతములు తగ్గిపోవుటయు గలుగవచ్చును.

ప్రకృతిలో స్త్రీలకంటె పురుషుల కవకాశము లెక్కువగలవనియు, పురుషుల నెదుర్కొనుట భారతస్త్రీ ధర్మముగాదనియు, శతాబ్దములనుండియు దాస్యవాతావరణమున బెరిగిన స్త్రీలు చెప్పుటతో నేకీభవించుటవలన నుపయోగములేదు. వారిని ప్రకృతముగల స్థానమున యుంచుటకై, శాస్త్రమునందున్నదనియు, స్మృతులందున్నదనియు నిదర్శనముల జూపుచు, తమ యధికారము స్థిరముగా నిల్పుటకై సర్వదా ప్రయత్నించు పురుషసత్తముల యాశయముల కంజలిఘటించుట కూడ నంతియ. పెరిగి పెద్దయైన తరువాత తన జన్మమున కాధారభూతురాలైన మాతృ

మూర్తియగు స్త్రీకి సంఘమునందు సరియగు స్థానము పురుషుడివ్వవలయుననియే యెల్లఱు కోరదగినది.

అయినను ఏకేపత్నీ వివాహము నెడ సదభిప్రాయములేని వారిట్లువాదింతురు. సంతానముకూడ గలిగిన ప్రథమకళత్రమును నిష్కారణముగ వీడి ద్వితీయ వివాహమాడు పురుషులు ప్రబలుచున్నారనుటకు వీలులేదు. కాలక్రమముగా సంఘములో భార్యయుండ ద్వితీయ వివాహము మిగుల గర్హింపబడుచున్నది. శతాబ్దముల నుండియు సంఘము మంచిదని దలంచెడి యాచారములే మాసిపోవుచుండ సంఘము హేయమని గర్హించు నీవాడుక వృద్ధిపొందుటకు మార్గములుండవు. అదియునుగాక, ఏ ద్విపాదపశువో గాక మానవమాత్రుడైన పురుషుడెవడును, తగిన కారణమున్నదప్ప, భార్యను వీడడు. అట్లు వాడు వీడినచో వాని శిక్షించుటకు ప్రభుత్వచట్టములుండనేయున్నవి. అదియునుగాక పురుషుడు పెక్కుఅను వివాహమాడుట శాస్త్రసమ్మతము స్త్రీస్వాతంత్ర్య మెక్కువగనున్న పాశ్చాత్య ప్రపంచమునగూడ నిట్టి చట్టముల గానము.

ఒకవేళ నీ చట్టపు నిర్మాణమునకై ప్రయత్నించినను చేయునదెవరు? వీరిలో స్త్రీ లెంతమంది గలరు? తన గట్టత్రాళ్లు తామె దెచ్చుకొన్న పురుషులిట్టి చట్టములు గావింతురనుటకు వీలున్నదా? ఒకవేళ ఉదారాభిమానులట్లు గావించినను శారదాచట్టమువలె గావించి పేలవముగా నిరుపయోగమగురీతి జేసివైతురు. అందుచేత ఈ శాసనమువలన పరిస్థితులు బాగుపడునని నమ్మకములేదు.

సాంఘికవిషయములందన్నిటను ముందంజవేసి శాసనముల నిర్మించు పాశ్చాత్యస్త్రీలకేల నీ శాసనావశ్యకత దోపలేదు.? వివాహములయందును, విడాకులయందును, సమష్టిబాధ్యతలయందన్నిటను స్త్రీ పురుషులకు పాశ్చాత్యప్రపంచమున దారతమ్యములేదు. ఏహక్కుల సంపాదించుటవలన తమ సంఘము సర్వతో ముఖముగ నభివృద్ధి జెందునో వారెరుగుదురు. బాధ్యతా సంపాదన నిర్ణయము నొనర్చు బుద్ధి వికాసమును, బుద్ధివికాసమునకు దోహదమగు విజ్ఞాన సంపదయు విజ్ఞానసంపద్దాయియగు విద్యయు వారికిగలదు. కాననే వారికీ శాసననిర్మాణావశ్యకత దోపలేదు.

భారతస్త్రీలకన్ననో తమహక్కుల సంపాదించుటకు దగిన విజ్ఞానమును తుదకు తమ హక్కులెట్టివో యెరుగుటకు దగినబుద్ధి వికాసమును గావలయును. మనసంఘము గూడ దరతరములుగ స్త్రీలపై నన్నివిషయముల ననాదరము జూపుచున్నది. కాన మనసంఘమున స్త్రీలకెట్టి హక్కు ఆవశ్యకమో దానిని పొందు మార్గమేదియో, దానికై మనము ప్రయత్నింపవలయును. సంఘము ప్రవృద్ధమై ప్రకాశించవలయునన్న, మనస్త్రీలు విజ్ఞానఖనులై వెలయవలయు

నన్న, స్త్రీలు సమానమగు హక్కులకై పోరాడుటమేలు. సమానమగు హక్కులు గలిగినప్పుడేకపత్నీ వివాహబహుపత్నీ వివాహసమస్యలు నిలువవు.

విషయనిర్ణయ సభ—స్త్రీల ప్రాతినిధ్యము

జాతీయసభాశయముల నెరవేర్చుటకై నాఁడును నేఁడును స్త్రీ పురుష భేదములు లేక యందరు కృషిచేయుచునే యున్నారు. కావున విషయనిర్ణయసభ యందుకూడ నట్టి భేదములకు చోటుండవలసినది గాదు. ప్రకృతముగల వర్కింగు కమిటీయందు స్త్రీల సమస్యలలో కాంగ్రెసు కనబరచుచున్న ఉదాసీనభావమును ఖండించుచు గుజరాత్ కాంగ్రెసువాదులు పలువురు జాతీయసభాధ్యక్షులైన జవహరిలాల్ వద్దకు వెళ్లి విజ్ఞాపనము సమర్పించిరి. దానికి ప్రత్యుత్తరముగా వారు సాధ్యముండియు వర్కింగుకమిటీలో స్త్రీలను జేర్ప లేదనియు, నట్లు చేర్పకుండుట వారికే లాభమనియు, స్త్రీ లిపుడు నితరుల కృషిపై నాధారపడి యున్నారనియు, రాజకీయ సాంఘిక విషయములందు స్త్రీలకు పురుషసాహాయ్యమావశ్యకమనియు తెలుపు నొక ప్రకటన గావించిరి. ఈ ప్రకటనయందలి విషయములు చిత్రము గొలుపుచున్నవి.

కాంగ్రెసువారికి స్త్రీ పురుష భేదమును జూప నిష్టములేకున్నచో వర్కింగు కమిటీకై సభ్యుల నెన్నుకొను నవసరమున స్త్రీల కవకాశము గల్గించియేయుందురు. స్త్రీలందు జయశీలురు గాకపోయియుందురేని యిపుడీ వాదనకే చోటుండదు. వారి కట్టి యవకాశమును గల్గింపక, సాధ్యమయ్యు నొక సభ్యురాలినిగూడ నియమింపక కాంగ్రెసు కట్టి భేదములేదని ప్రకటించినంతమాత్రమున నది నమ్మకము గల్గింపదు.

వారి కట్టి యవకాశమున్నను గల్గింపకుండుటే మంచిదని జవహరిలాల్ గారన్న దేనితో నేకీభవింపజాలము. అవకాశములున్నపుడు వారిని వెనుక నెట్టుచున్న స్త్రీ లభివృద్ధిబొందుటకు మార్గమగునా? ఈ ప్రకటనయందలి విషయముల కాశ్చర్యమునెంది ప్రత్యుత్తరమిచ్చిన శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారీ విషయమై వ్రాయుచు, "ఇది విచిత్రమైన హేతువాదము; ఇంకను విచిత్రమైన మానవతత్వజ్ఞానము వృద్ధురాలు, గాడిద, యొకేజాతి చేరినవి. దీని నెంత మర్దించిన నంతమేలను సామెత నాకిపుడు జ్ఞాపకమునకు వచ్చుచున్నది" అని వ్రాసిరి.

స్త్రీలు తమ కార్యములందు పురుషుల పైననే యాధారపడి యున్నారనియు, స్వయంకృషి జేయరనియు జవహరిలాల్ గారనుచున్నారు. స్త్రీలు స్వయంకృషిచేయక పురుషులపై నాధారపడి వారి వరములకై యెదురుచూచుట లేదు. కాంగ్రెసువారి తీర్మానములు, కార్యములు స్త్రీ పురుషులకు సమానముగా వర్తించును గావున వారి కార్యక్రమములో సమానత్వమును గోరుచున్నారు. పురుషులతో కలసి మెలసి స్త్రీ పురుష బేధములేక దేశముకొరకై పాటుబడుటకే యెంచియున్నారు. అట్టియెడ

వారిని వర్కింగు కమిటీనుండి బహిష్క రించు తీర్మానమును దెచ్చి జాతీయసభా కార్యక్రమమునందే చోటు లేకుండజేసి వైచునేమో? ఇకనైన కాంగ్రెసు నాయకులిది గమనించి కాంగ్రెసునందు స్త్రీ పురుష న్యూనతాధిక్యతలు లేకుండచేయుదురని తలంచుచున్నాము.

## శ్రీ సార్వభౌముల కపాయము తప్పుట

జూలై పదునాఱవ తేది ఉదయము జరిగిన సంఘటనయందు శ్రీ అష్టమయెడ్వర్డు గారికి అపాయము దప్పినందులకై మిగుల యానందించుచున్నాము. రాజుగారు నాడు జరిగిన యుత్సవమునుండి మరలి హైడు పార్కునందు మరలి వచ్చుచుండగా, బాట కిరుప్రక్కల నిలువఁబడి యుత్సవమును దిలకించుచున్న వారిమధ్యలోనుండి యొక స్కాట్లండు దేశీయుడు పిస్తోలును రాజుపై విసరివైచెను. అది రాజుగారి గుఱ్ఱమునకు దగిలి క్రిందబడెను. ఇంతలో రక్షకభటులు ప్రేక్షకుల సాయమున వానిని బంధించిరి. సార్వభౌము లూరకతిరిగిచూచి శాంతముగ వెడలిపోయి నాటి కార్యక్రమమును యథాప్రకారముగనే జరిపిరి.

బంధింపఁబడిన తరువాత అపరాధి రాజున కెట్టియపాయముగల్గింప తన యుద్దేశ్యముగాదనియు, యొక విషయమునకై యసమ్మతి ప్రకటింప నట్లు గావించితిననియు జెప్పెను. పట్టువడిన తరువాత వానియభిప్రాయ మెట్లున్నను వాని కారంభమున అపాయము గల్గింపవలయునను యాశయ ముండక మానదు. తన యసమ్మతి దెలుపవలయునేని అంతకంటె యుత్తమ మార్గములు గలవు. పాశ్చాత్యదేశములందు, కక్షలు, పక్షములెక్కువై, ఒకరియాశయము లింకొకరికి గిట్టకున్న వ్యక్తులమీాదబడి వారి నంతమొందించుట సాధారణమైనది. అభిప్రాయ బేధములు సరిచేసికొనుటకును, అన్యాయముల చక్కజేసికొనుటకును, ఇట్టివి నాగరికమార్గములుగావు. నాగరిక దేశీయులమని జెప్పికొనువారి నిట్టి సంఘటనలకు చోటిచ్చుట గర్హనీయము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.



## సౌందర్యము రెండు చర్మముల నంటియున్నది.

చర్మముక్రింద తైలగ్రంథు లెండిపోయి క్రింది చర్మమును క్రుంగజేసినపుడు గీతలు, ముడుతలు ప్రారంభించును పైచర్మము నశించి కళాహీనము బైలుదేరును. ఈ రెండు చర్మములకును వేరువేరు చికిత్స లవసరము.

### గీతలను ముడుతలను రాకుండజేయుట

రాత్రులందు 'పాండ్స్ కోల్డుక్రీము' పూయుము. ఇది క్రింది చర్మమునకు దిగి తైలగ్రంథులను నింపి, అచటి కండరముల బలపరచును. ఇది రోమకూపముల శుద్ధిజేయుటవలన నల్లనిమచ్చలు మాయును.

### గరకుచర్మమును బాగుచేయుట

మీ పైచర్మమునకు 'పాండ్స్ వానిషింగ్ క్రీము' గావలయును. దీనిని ముఖమునకు మెడకు చేతులకు పూసికొని, రాత్రియంతయు నుండనిచ్చిన, ఉదయమున చర్మము మృదువుగా నూతనముగా మనోహరముగానుండును.

ఉచితము : దీనిని నేడే పంపి పాండ్స్ రెండు క్రీములట్యూబులను పాండ్స్ ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ షేడు) నేచురల్.........రోజ్ క్రీమ్.......బ్రునెట్......

డాడ్జి అండ్ సెయ్‌మర్ లిమిటెడ్,
3, వికెట్ రోడ్డు, బొంబాయి.

పేరు..........................................
చిరునామా.........................No. GL. 4.

# సులోచనములు

దృష్టిరక్షణకును
సౌందర్యమునకును
సుప్రసిద్ధమైన చోటు



26 సంవత్సరములుగా పేరొందిన మహారాజులు, న్యాయాధిపతులు, డాక్టర్లు, జమీందార్లు వీర్లచే కొనియాడబడిన నమ్మకమైన స్థలము.

**RADHA BROS.,**
OPHTHALMIC OPTICIANS,
174, BROADWAY, MADRAS.

# తులసి, బిల్వ, వేప

ఇవి తులసి, బిల్వ, వేప అను జాతీయమూలికలను గూర్చి శాస్త్రవిషయక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథరాజములు. ఈమూలికల ఓషధిగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణవివరము సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథములు. క్రౌను సైజున మంచి ఫెదర్‌వైటు కాగితముమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ప్రథమ ద్వితీయ తృతీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథకర్త : కే. యన్. కేసరి   ప్రతి 1-కి 0–8–0

గృహలక్ష్మి కార్యాలయము
పోస్టుబాక్సు నెం. 752,   ఎగ్మూరు, మద్రాసు.

అనుకరణములను చూచి మోసపోకుడు

# అమృతాంజనము




అన్ని నొప్పులకు సిద్ధామృతము

అమృతాంజనం డిపో

బొంబాయి — మదరాసు — కలకత్తా

---

# గృహలక్ష్మి

ఒక్కొక్క వత్సరపు పన్నెండు సంచికలు కలిపి బైండుచేసిన సంపుటములు. కాలికో బైండు. దిట్టమైనఅట్ట. గ్రంథభాండాగారములకు అలంకారములు. ఒక్కొక్క సంపుటము కొద్ది కాపీలు మాత్రమే ఉన్నవి కావున త్వరపడి ఆర్డరు చేయవలెను. ఆలసించిన దొరకనేరవు. తిరిగి అచ్చుపడనేరవు.

వెల సంపుటము ఒక్కటికి రు. 6—0—0 మాత్రము

రైల్వేపార్సెలుగా తెప్పించుకొనుట మంచిది.

గృహలక్ష్మి కార్యాలయము,

పోస్టుబాక్సు నెం. 752, ఎగ్మూరు, మద్రాసు.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

సంపుటము ౯ సెప్టెంబరు 1936 సంచిక ౭

# "ఈ పిల్లవాడు చాల ఉత్సాహముగా వుండెడివాడు ఇపుడు ఎందుకు చీకాకుపడుచున్నాడు?"

ఇతని బలహీనతకు, చికాకుతనమునకు వైద్యులీ సులభచికిత్సను చెప్పుచున్నారు.



మనస్థిమితము, ఉత్సాహము బిడ్డయొక్క ఆరోగ్యస్థితినిబట్టి యుండునని అందరికి తెలియును. బిడ్డ చికాకుగను, నిరుత్సాహముగను, అనారోగ్యముగ నున్నచో అతని దేహమునకు కొన్ని ముఖ్యమగు పదార్థములు లోటున్నవని తెలుసుకొనవలెను! సరియైన ఆహారము బలమును వృద్ధిచేయుచు బాధను తొలగించును. సుమారు అరువది సంవత్సరములకంటె ఎక్కువకాలమునుండి వైద్యు లంగీకరించిన "స్కాట్సు ఎమల్సను"కంటె దీనికి మరొక చికిత్సలేదు. ఇది కాడ్డు లివరు ఆయిలుతో మాత్రమేగాక, ఎ, డి వైటమినులతోను, శరీరమును, ఎముకలను, బలపరచు కాల్సియము, ఫాస్ఫరసు లవణములతోను పూర్తిగ నిండి యున్నది. ఇది రుచిగనుండును. సులభముగ జీర్ణమగును. కాడ్డు లివరు ఆయిలు కంటె మూడురెట్లెక్కువ గుణమునిచ్చును

పట్టి కాడ్డు లివరు ఆయిలువలెను, డి వైటమినుల నిచ్చు తదితరౌషధములవలెగాక అన్నియు ఉన్న ఔషధము. ఆహారమునకు వేరుగ కాల్సియము మున్నగునవిగల పదార్థము లేవియును అక్కరలేదు. అన్నియు దీనిలో నున్నవి. ఎటువంటి బలహీనతయైనను దీనిని సేవించిన తగ్గును. ఇది మిక్కిలి ప్రఖ్యాతిగాంచిన దివ్యౌషధము. ఇది అంటువ్యాధులు రాకుండ కాపాడును. దగ్గు, జలుబు, జ్వరము మున్నగునవి దీనిని సేవించు బిడ్డలను చేరవు.

# SCOTT'S Emulsion

శుద్ధమైన కాడ్‌లివరాయిల్ నుండి

తల్లి దండ్రులకు ముఖ్యము

స్కాట్సు ఎమల్షను ఎముకలవృద్ధికి—వెన్న పాలకన్న 80 రెట్లు, గ్రుడ్లసొనకన్న 2 రెట్లు బలము. దేహము పెంచుటకు—వెన్నకు 8 రెట్లు, బనానాకు 100 రెట్లు గుణము.



స్కాట్సు ఎమల్షను మండీవర్తకులు :

ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్,

కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కానూపురు, పాట్నా, అహమ్మదాబాదు, కొచ్చిను, క్యాలికట్టు, విశాఖపట్టణము, కరాచి, అమృతసరము.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రిగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎస్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. నూజవీడు: వి. ధనంజయ అండ్ కంపెని
జెమ్ షెడ్ పూర్: వి. కొండలరావుగారు అకౌంట్సు ఆఫీసు
బరంపురం: ఎస్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్ కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. నూకరాజుగారు, ఆంధ్ర న్యూస్ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: శి. శ్రీహరిరావుగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూస్ఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్ గారు
కాకినాడ: నున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్ బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్చుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
మచిలీపట్టణం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్ పేట.
కర్నూలు: టి. బాలనాగయ్యశెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.
నెల్లూరు: పంచాగ్నుల వెంకటనరసింహంగారు.
కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్ల ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

# విషయసూచిక

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్థ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతి లేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 20 0 0 అరపుటకు రు. 12 8 0 కాలుపుటకు రు. 8 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్థసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువరైయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలుఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తులపేర ఎంతమాత్రముపంపకూడదు.

"సంజసూర్యుని అరుణకాంతులు జగముపై ప్రసరింపగా,

వడిగ నిండ్లకు పొలముపడతులు అడుగ్గువేయుచుసాగిరి"



# సమాన హక్కులు

నేటి భారతదేశమును కలవరపరచుచున్న సమస్యలలో స్త్రీహక్కులనిర్ణయమొక్కటి. స్త్రీ, స్వాతంత్ర్యము కావలెనని పోరాడుచున్నది. నేడు హక్కులకోసము — సమాన హక్కులకోసము కూడ పోరాడ సమకట్టియున్నది. పురుషుడు ఏరీతిని ఆత్మగౌరవమును నిలువబెట్టుకొన ప్రయత్నించుచున్నాడో, అదే రీతిని, స్త్రీ కూడ తన ఆత్మగౌరవమును, స్వాతంత్ర్యమును, హక్కులను సంపాదించుకొని కాపాడుకొన దలచియున్నది. సృష్టియందు — ప్రకృతియందు పురుషునకెంత ప్రాముఖ్యత, బాధ్యత ఉన్నదో స్త్రీకికూడ అంతటి ప్రాముఖ్యతయు బాధ్యతయుకలదు. కాని మానవుడు ప్రకృతిలో ఒకభాగమేయైనను సహజమైన ప్రకృతి ధర్మమును అనుసరింపక పురుషుడు స్త్రీకన్న యెక్కువయనియు స్త్రీ పురుషునకు బానిసవలె వర్తింపవలెననియు — కొన్ని అర్థములేని నియమములను యేర్పాటుచేసికొని, ధర్మముపేర అధర్మమును చెలామణి చేయజొచ్చినాడు. క్రమముగ నీ యధర్మనియమములు సమాజముమీద బలాత్కరింపబడిన కారణమున అవియే ఆచారములుగను మానవధర్మములుగను నేటికిని మిగిలియున్నవి. పురుషనిర్మితములైన ఆ నియమములవలన స్త్రీల యొక్క యదార్థస్వాతంత్ర్యము, అడుగంటిపోయినది. దానికై నేడు స్త్రీలు ప్రయత్నించుకొనడములో ధర్మవిరుద్ధమేమియునులేదు.

కాని నేడీ సమాన హక్కులకొరకు సాగింపబడుచున్న పోరాటము యెట్టిపద్ధతుల మీద నడపింపవలయునో ముందుగ నిర్ణయింపబడవలయును. ఇందులకు దీర్ఘ

యోచనము గావించి ఒక కార్యక్రమమును నిర్ణయించవలసియున్నది. అనంతరము ఆ కార్యక్రమమును ఆచరణలో బెట్టుటకు విధానముల సరయవలయును. ఈ పద్ధతి ననుసరించి వ్యవహరించుచో స్త్రీలు తమ ఆశయములను నెరవేర్చుకొనగలరు.

నేడు భారతమహిళలు యీ హక్కుల కోసము పోరాడుచున్నారు. కాని దీనికొక దారిగాని తెన్నుగాని లేకున్నది. ఆ కారణము చేతనే దీనికొక స్వరూపముగాని ఆకారము గాని యేర్పడుట లేదు.

ఈ ఆందోళనమును సాగించుచున్న భారతమహిళలుచేయుచున్న ప్రచారములోని తీవ్రతవలన—ఉద్రేకమువలన సులభముగ కాగల కార్యములు కూడ అతి కష్టమగు చున్నవి. భారతమహిళామండలి అభ్యుదయ మునకు ప్రస్తుతము అనుసరింపబడుచున్న విధానము కేవలము అనుకరణమేగాని భారతదేశమున కనుకూలమైనది యెంత మాత్రమును కాకయున్నది. మానవనైజము అన్నిప్రాంతములలోనను ఒక్కటియెయ్యైనను ప్రాచ్యప్రతీచీవాసుల ఆచారములు, విధాన ములు, సభ్యత — యివియన్నియు ఒకేవొక ధోరణిని అనుసరించియుండక, ఆయా ప్రాంత ములకు — ఆయా సీతోష్ణ స్థితిగతులకు అను కూలమై వేరువేరుగ ఉండుచున్నవి. దాన ప్రాచ్యఖండవాసులమగు మనము కన్ను మూసికొని ప్రతీచీ స్త్రీల పద్ధతులను అనుస రించడమువలన యెట్టిలాభమును ఉండకపో వుటయెగాక అనవసరముగ కొన్నిచిక్కులు, వ్యతిరేక పరిస్థితులు యేర్పడుచుండగలవు. స్త్రీల హక్కులకోసము పోరాడు మా సోదరీ మణులు తొలుదొలుత యీ యంశమును గమనింతురుగాక.

భారతమహిళామండలికి కావలసిన హక్కు లెట్టివి? — యిది ప్రథమమున మనము యోచింపవలసిన విషయము. హిందూసమాజములో గృహము నకు సంబంధించినంతవరకును స్త్రీ యెక్కువ స్వాతంత్ర్యమును చెలాయించును. కాని యీ స్వాతంత్ర్య మనుదానికి నేటి పరిస్థితులలో అర్థములేక పోవుచున్నది. అంతియగాక స్త్రీ కేవలము గృహవ్యవహారములలో నిమగ్నమై యితర విషయములలో యెట్టి హక్కు బాధ్యతలనుగాని లేకుండఉండుటచే ఆమె హృదయమునఒకవిధమైన "తక్కువదనము" ఆవాసమేర్పరచుకొనుచున్నది. ఇదే పరిస్థితు లలో పురుషు లుండినను పర్యవసానమిదియే కాగలదు.

దీనికి విరుగుడు నరయవలసియున్నది. స్త్రీకి గృహమందుగల హక్కులలోని గొప్ప తనమును గమనించుటకు — అనుభవించుటకు ఆమెకు ఆర్థికముగ కొన్ని హక్కు లుండవలెను. తండ్రిఆస్తిలో పురుషునకు హక్కుఉండినట్లే స్త్రీకికూడ కొంత ఆర్థికహక్కు కల్పింపబడు టతో ప్రస్తుతపు మహిళామండలియొక్క ప్రాముఖ్యత నేటికి పదింతలు యెక్కువ కాగలదు. స్త్రీ ఆర్థికముగ పురుషునకు తీసిపోని సమయముననే ఆమెకు నిజముగ స్వేచ్ఛయను నది యుండగలదు. నా డామె గృహమందు

స్వేచ్ఛతో — బాధ్యతతో కేవలము బానిస వలె గాక తాను ను ఒక భాగస్వామినిగా వ్యవహరించగలదు.

స్త్రీకి ఆస్తి యెందుకు? ఆమెకు కావలసినది తల దాచుకొనుటకు యింత పంచ, కట్టుకొనుటకు గుడ్డ, తినుటకు అన్నము, రక్షణకు భర్త చాలునను భావమును చాలమంది పురుషులు వెలిబుచ్చుచుందురు. మనమే యీ ఆర్థికవ్యవహారములతో అవస్థలపడుచున్నాము. యింక నీ స్త్రీలకుకూడ యీ రూపాయలు అణాలు పైసలతో తాపత్రయపడవలసిన అవసరమెందుకు? హాయిగ యేదో యింత తిని పడి యుండరాదా? అని మరికొంద రనియెదరు. స్త్రీలను యింకను బానిసలుగ ఉంచుటయే యీ అభిప్రాయములను వెలిబుచ్చుట లోనగల ప్రముఖోద్దేశమని తలంప వీలులేదు. కాని, యీ వాదమువలన మహిళామండలి కేమాత్రపు విలువయు ఒనగూడదు. నేడు స్త్రీ యెంతటి 'గృహిణి'యై యజమానురాలై యుండినను ఆమె స్వతంత్రించి యే కార్యము గాని చేయలేదు. తరతరముల నుండి వచ్చుచున్న అధికారకారణమున పురుషుడు తన పెద్దరికమును చూచుచు చూచుచు వదలుకొనలేడు. అందువలన శ్రీ దేశముఖుగారి బిల్లులోని అంశముల ననుసరించి స్త్రీకిగూడ వారసత్వపుహక్కులు యేర్పడునెడల స్త్రీయొక్క అంతస్తు యెక్కువ కాగలదు. మరియొక విషయము: స్త్రీకి ఆర్థికహక్కులులేని సమయమున భర్తను కోలుపోయిన అభాగిని, యెవ్వరి పంచనో బానిసవలె పడియుండవలసి వచ్చుచున్నది. ఒకే ఒకమారుగ ఆమె అంతస్తు మారిపోవడమనిన దానిని భరించుట కడుంగడు దుర్భరము. నిన్న రాణియై సర్వసౌఖ్యముల ననుభవించిన యామె నేడు దాసియై యింట ఊడిగముచేయుట యనునది ధనికప్రపంచమునకు సహజమేయైనను స్త్రీజీవితము మరింత హేయమైపోవుట సమాజాభివృద్ధికి యెంత మాత్రమును శ్రేయముకాదు. అందువలన యెట్టి పరిస్థితులందైనను స్త్రీకూడ ఆత్మగౌరవముగలిగి స్వతంత్రముగ జీవింపగల శక్తి గలిగియుండుటకు మార్గములు యేర్పరచుట, ఆమె సమాజమున కొక భారముగ లేకుండ జేయుటకు తగిన యేర్పాటులు జరుగుట యనునది ఒక ధర్మము. భారతమహిళా మండలి యభివృద్ధికిని భారతదేశాభివృద్ధికిని యీ యేర్పా టెంతయు అవసరమని మా యభిప్రాయము.

స్త్రీల ఆర్థికహక్కు లీ విధముగ గమనింపబడిన అనంతరము స్త్రీకి సమాజమందు కలుగవలసిన హక్కుల గురించి యోచింతము.

భారతమహిళ నే డెన్నియో అన్యాయము గు నియమములచే బంధింపబడియున్నదనుట నిర్వివాదాంశము. పురుషుడు ఆమె హక్కుల నన్నింటిని అపహరించినాడు. ఇది యెవ్వరును కాదనజాలరు. ఏదో కాలమున శాసనము ఆచారమునై యున్న అంశము నేడు కాలము ననుసరించి—అవసరముల

బట్టి సంస్కరించవలసియుండును. అట్టి సంస్కారమునకు పురుషు డంత సుముఖుడు కాకుండుటయు — అందునను ముఖ్యముగ మతాధికారిఅనుకూలుడు కాకయుండుటయు శోచనీయము. ఒకప్రక్క శారదాచట్టము అమలునందున్నప్పటికిని మతాధికారి బాల్య వివాహములనే ప్రోత్సహించుచున్నాడు. బాలవితంతువివాహములను అతడు ప్రతి ఘటించుచునేయున్నాడు. ఈ ధోరణి ఆధునిక దినములలో యెంతమాత్రమును అనుసరణీయము కాదు. కాని సమాజ మును యినుపబోనులోనబడినట్లు మానవుడు ఉక్కిరిబిక్కిరియై ఆ యిరుకునందే తన్నుక లాడుకొనుచున్నాడు గాని బయటకు రాజాలకున్నాడు. ఆ కారణమున స్త్రీని పూర్వజన్మ కర్మఫల మనుభవింపక తప్పునా అను నెపమున అవస్థల పాలు జేయుచున్నాడు. నేడు స్త్రీల కిట్టి నిర్బంధములు ఉండరాదు. భారతదేశమున 1931 నాటికి 15 మొదలు 40 యేండ్లలోపు వితంతువులు 59,81,096 మంది యున్నారు. ఇంతమందియు పరుల పంచల ఊడిగము చేయుచు జీవితవాంఛలు సఫలత గాంచక సమాజమున కొక భారమై దుఃఖభాజనముగు జీవితములను గడపుచున్నారు. ఇంత భారమును — లాభము లేని యీ బరువుమ్రోతను మ్రోయు సమాజము యేరీతిని అభివృద్ధినందగలదు ? భారత మహిళకు వివాహాదికార్యములందు కొంత హక్కు — స్వాతంత్రత ఉండవలయును. ఆమెకు బాల్యమందే వివాహము చేయరాదు. ఇష్టముండిన వితంతువులకు తిరిగి వివాహమాడుటకు అవకాశ మీయవలెను. ఆమెను అష్టకష్టముల పాలుజేసి, బహిష్కరించి సమాజము కల్మషహృదయముతో వర్తింపరాదు.

ఇంకను స్త్రీలకు సమాజములో సమాన గౌరవము అధికారములు కలుగుటకుగాను మార్గములైనవి విద్యాదివిషయము లెన్నియోగలవు. వాటిని గురించి యిది వరకు పలుమారులు ముచ్చటించియుంటిమి గాన ఆ భాగములను పేర్కొనుటతో మాత్రము విడచుచున్నారము.

స్త్రీకి హక్కులను—సమానహక్కులను కల్పించుటవలన గృహవ్యవహారములు ప్రస్తుతమునకు వలె సవ్యముగ సాగవని కొందరనుమానింప వచ్చును. అట్టి అపకతవక లేమియు జరుగవని నిర్భయముగ తెలుపగలము. స్త్రీ తనకు సంప్రాప్తమైన యీ నూతనాధికారమును దుర్వినియోగము చేయదు. అందువలన పురుషుడు స్త్రీలు వాంఛించు సక్రమమగు హక్కులను సంతసమున నీయవచ్చును.

ఈ సమానహక్కులకై ప్రయత్నించు మా సోదరీమణుల కీ సమయమున ఒకచిన్న సలహా నీయవలసియున్నది. మనము భారత సంప్రదాయ విరుద్ధమైన పద్ధతులను అనుసరింపవలసిన అవసరము యెంతమాత్రమును లేదు. మనము స్వతంత్రపథముల ననుసరించి మన హక్కులకొరకు పోరాడుదము. అదియే మనకు శ్రేయము.

# ఉన్మత్తతాండవము

అమెరికా స్త్రీ మేయో భారతదేశము గురించి యిష్టమువచ్చినన్ని అసత్యములను వ్రాసి ఆ గ్రంథమునకు "భారతమాత" (మదర్ ఇండియా) అను నామము నిడినది. ఆ గ్రంథములో భారతమహిళల గురించి ఆ అమెరికా స్త్రీ చాల నీచముగ — అలుసుగ వ్రాసియున్నది. ఫిలిప్పైను వాసుల గురించి కల్లిబొల్లి గ్రంథములు వ్రాసిన కాథరీన్ మేయో ఇండియా గురించికూడ అదే విధమున అసత్యములను వ్రాసినదనిన అందులో వింతయేమియు లేదు. కూటికొరకు గల కోటివిద్యలలోను తిట్టుబోతు కవిత్వము నల్లుట ఒక విద్యయని మేయో తలచి ఆ విధానము ననుసరించి ఆ మహాయిల్లాలు ధన మార్జించుకొనుచున్నది. కాని ఆపద్ధతిని అనుసరించి బ్రతుకవలసిన అవసరము లేని ఒక భారతీయుడు, హిందూమహానాయకుడైన భాయిపరమానందు కూడ మేయో తల్లికి ముదియన్నవలె వ్యవహరించుటయనిన వింతయె.

భాయిపరమానందుగారు శాసనసభ్యులు. హిందూమతము అధోగతిపాలగుచున్నది, దాని నుద్ధరించుటకు నేను కంకణము కట్టియున్నానని దేశమంతటను బ్రిమ్మరుచుండెడి యీ పరమానందుగారు—గడచిన శాసనోల్లంఘనోద్యమమందు పాల్గొనిన స్త్రీలందరును కుమార్గముల చరించువారలే యని పంజాబు "హిందూ" పత్రికయందు ప్రకటించియున్నారు. ఈ మహనీయుడు యింతటితో ఆగక బహిరంగసభలలో ప్రజలు ఆ విషభావములకు సంతాపము వెలిబుచ్చవలెనని యెంత కోరినను వినక ఒకే మొండిపట్టు బట్టి "నే నన్నది యదార్థము. నేను సంతాపమును వెలిబుచ్చను" అని ప్రజాభిప్రాయమును తిరస్కరించెను. తన సోదరీమణులను అన్యాయముగ తూలనాడిన యిటువంటి వ్యక్తులు ప్రజాప్రతినిధులు యెట్లులయ్యెదరు? ప్రజల అభిప్రాయములను శాసనసభలలో యదార్థముగ నెట్లు వెలిబలుకగలరు?

గత శాసనోల్లంఘనోద్యమ సమయమున యెండ కన్నెరుగని భారతమహిళలు, సత్యాగ్రహము చేయుచుండగ, పోలీసుచర్యలను వోపికతో సహించుచుండగ ఆదృశ్యములను చూచిన పాశ్చాత్యులే భారతనారీలలామలను వేనోళ్ల శ్లాఘించుచుండ యీ పరమానందుగారు ఆ మహిళల సీలము మంచిది కాదు, ఉద్యమమందు పాల్గొనిన యే కొద్దిమందియో దక్క మిగిలినవా రందరును సిగ్గుమాలిన జీవితము గడపువారలే యని ప్రకటించుట సాహసము. త్యాగశీలరగు భారత మహిళలను యీరీతి అవమానపరుప సాహసించుట రాబోవు యెన్నికలను దృష్టియం దుంచుకొని ఉన్మత్తతాండవమును గావించుటగాక వేరేమి?

భారతదేశము యిట్టి సంకుచితహృదయములకు సరియైనపాఠము కరుపవలసిన బాధ్యత యెంతయేనియు కలదు. ఉన్నత భావములుగాని ఉన్నతాశయములుగాని లేక త్యాగముయొక్క మాహాత్మ్యమును గురుతింపలేనివ్యక్తులను ప్రజాసంస్థలకు పంపుటకన్న తెలివితక్కువపని మరియొక్కటి యుండదు. పంజాబుహిందువులు పరమానందునకు సరియైన గుణపాఠమును నేర్పెదరు గాక.

# ఇతర దేశాలలో

హాలెండు స్త్రీల రాజకీయాధికారము — బెల్జియములో సామ్యవాద భావములు — విజృంభించుచున్న హాలెండు మహిళోద్యమము — స్విట్జర్లెండులో స్త్రీ పోలీసులు.

హాలెండులో స్త్రీలు పురుషులతో సరి సమానముగ రాజకీయాధికారమును అనుభవిస్తున్నారు. కాని ఆర్థికవిషయాలలోను న్యాయశాస్త్రమందునను స్త్రీలకు సమాన హక్కులు లేవని ఆ దేశపుస్త్రీలు ఆందోళన సలుపుచున్నారు. పురుషులలో ప్రజా స్వామ్యతత్వము యెలాగు వృద్ధిపొందుతూ వుందో అదేవిధముగ స్త్రీలలో కూడ ఆతత్వము వృద్ధిపొందడానికి అవకాశములు కల్పించవలెనని కోరుతున్నారు. స్త్రీలు వివాహమాడుట అవసరమని నిర్బంధించడను ఆధునికావసరములకు ఒక ఆటంకముగా వున్నది గనుక యిష్టమున్నవారు అవివాహితలుగ వుండుటకు అవకాశము వుండాలంటూ కొన్ని మహిళాసంఘములు ప్రచారము చేస్తున్నవి.

ఈదేశములో స్త్రీలు యేవో కొన్ని శాఖలలోనే ఉద్యోగము చేయవచ్చు. ఆశాఖలలోకూడా "రిట్రెంచ్‌మెంటు" ప్రస్తావన వచ్చినపుడు ముందుగ స్త్రీలనే పనులనుండి తొలగిస్తున్నారు.

ఈదేశములో మహిళోద్యమము అతి శీఘ్రముగ వ్యాప్తినందుతూ వుంది.

* *
*

బెల్జియముస్త్రీలలో సామ్యవాద భావములు యెక్కువప్రచార మవుతూవున్నవి. ఇటలీ అబిసీనియా యుద్ధము జరుగుతూ వున్నసమయమున ఇటలీ ముష్కరతను నిరసిస్తూ బెల్జియముస్త్రీలు ఒక ప్రతికూలసభను యేర్పాటుచేశారు. దేశములోని మహిళా సంఘము లన్నింటినుంచీ ఆసభకు ప్రతినిధులు వచ్చారు. స్త్రీలు తమ అసమ్మతిని తెలియజేసే బ్రహ్మాండమైన ఊరేగింపును సాగించారు. దేశములోని కొందరు స్త్రీలు మాత్రము మతకట్టుబాటులకు లోనై యీ ఉద్యమములో పాల్గొనలేదు. పైగా కొంచము వ్యతిరేకప్రచారము సాగించారు. అటువంటి పరిస్థితులలో సామ్యవాదభావములుగల స్త్రీలు యుద్ధతత్వమును సైనికతత్వమును నిరసించేటందుకు మరి యొక సమావేశమును యేర్పాటుచేశారు. ఇతియోపియా యుద్ధసమయమున వైద్య సహాయమునకుగాను స్త్రీలు నగరవీధులలో డబ్బునుదండి అబిసీనియాకు పంపారు.

ఉద్యోగములలోవుండి వివాహము చేసి కొన్నస్త్రీలను పనులనుండి తొలగించడానికి

ప్రభుత్వము పూనుకొన్నది. ఇది అన్యాయమని మహిళాసంఘములు తీర్మానించినవి. ఇటువంటి అన్యాయము జరిగిన స్త్రీల పక్షము వహించి పోరాడుటకుగాను ఒక కమిటీ యేర్పాటు చేయబడింది.

ఇంతవరకూ బెల్జియమ్ స్త్రీలకు వోటింగు హక్కు లేదు. కాని స్త్రీలకు వోటింగు అధికారము వుండాలన్న ఉద్యమము ప్రజామోదమును పొందుతూవుంది.

* *
*

పోలెండులో మహిళోద్యమము కొంతకాలముపాటు లేకుండినది కాని యిటీవలనే పోలెండు స్త్రీలు తిరిగి ఆందోళన, ప్రచారము ప్రారంభించారు. కాని పాపము యీ దేశములోని కేంద్రమహిళాసంఘమునకు డబ్బులేని కారణమున అంత చురుకుగా పనిచేయుటకు వీలులేకుండా వుంది. దేశములో ప్రవేశపెట్టబడిన నూతన రాజ్యాంగవిధానమును బహిష్కరించుటలో స్త్రీలు యెక్కువశ్రద్ధ వహించారు. నూతన రాజ్యాంగవిధానమును బహిష్కరించవలెనన్న ఆందోళన విజయవంతముగ సాగుటకు స్త్రీల ప్రచారమే ముఖ్యమైనది.

* *
*

ఏవిధమైన ప్రచారమైనప్పటికీ స్త్రీలు చక్కగా చేయగలరని ముసోలినీ గ్రహించాడు. సైనికతత్వమును ప్రజలలో వ్యాప్తి చేయడానికిగాను యీ నియంత, ఇటలీలో స్త్రీలను నియమించాడు. గత ఐరోపా మహాసంగ్రామములో భర్తలను గోల్పోయిన స్త్రీలను వృద్ధమాతలను దేశభక్తి పేరిట ప్రాణములను తృణప్రాయముగ భావించడములోని ఉత్కృష్టతను బోధచేయడానికి నియమించాడు. ఈ స్త్రీలప్రచారమువల్లనే అబిసీనియా యుద్ధసమయమున గ్రామములనుండి వ్యవసాయదారులైన యువకులెందరో యుద్ధభూమికి ఉరికారు.

* *
*

పోలీసుశాఖలో స్త్రీలు పనికిరారన్న వాదమును స్విట్జర్లెండు ప్రభుత్వము నిన్నమొన్నటివరకు సాగిస్తూవుండేది. కాని నేడు స్విట్జర్లెండులోని కొన్ని ముఖ్యనగరములలో స్త్రీలను పోలీసుశాఖలో జేర్చుకొన్నారు. స్త్రీలు పిల్లలయొక్క వ్యవహారములమీద నీ పోలీసుస్త్రీలు అధికారము చెలాయిస్తారు. ముఖ్యముగ వ్యభిచారజీవనము గడపే స్త్రీలను సరియైన మార్గములకు త్రిప్పడానికి స్త్రీపోలీసులె సాధనమని ఊహింపబడుచున్నది.

# ఆదర్శ ప్రపంచము

శ్రీమతి వెలిదండ చూడికుడుతమ్మగారు

(గతసంచిక తరువాయి)

కలెక్టరు డేవిడ్డు మొత్తంమీద మంచిహృదయం గలవాడు. సర్వమానవ సౌభ్రాతృత్వమును, పుస్తకాలయందు చదవడమే కాకుండా, ఆచరణలో పెట్టాలనేటటువంటి ఉద్దేశంగలవాడు. జీసను, దీనులకోసరం చూపించేజాలిని, త్యాగమును తరుచూ మననముచేసే స్వభావం గలవాడు. ఈదేశంలో వెయ్యింటికి 999 మంది గర్భదరిద్రులు గా ఉన్నారని తనకు సాధ్యమైనంతమట్టుకు ఆ దరిద్రులకు ఉపకారంచేసి ఈదేశపు ఉప్పు తినినందుకు ఈదేశజులఋణం తీర్చుకుని వారి కృతజ్ఞతను, పొందవలెననెడి ఉదారాశయం గలవాడు. ఆదివారం ప్రత్యేకంగా తన దర్బారు రూములో తహాసీలుదారు రామచంద్రరావుతో ఆక్రిందటిరోజునే వచ్చిన ప్రేమానందరావు పిటీషన్ కాగితాన్ని చూస్తూ

"ఏమండీ రామచంద్రరావుగారూ! ఈ ప్రేమానందరా వెవరో మీకు తెలుసునా?"

ఇంతంట్లో ఒక జవానువచ్చి చేతిలో ఒక కాగితము పెట్టి నిలబడ్డాడు. కలెక్టరు తనలో నవ్వుకుంటూ "అయ్యా! మీరు స్వయంగావెళ్లి అతన్ని తీసుకు రండి". తహాసీలుదారు వెంటనేవెళ్లి ఇద్దరు కొత్త మనుష్యులతో లోపలికి తిరిగివచ్చాడు. పరస్పరము అభివందనాలయిన తరువాత కలెక్టరుగారు "మీ పిటీషన్ చూశానండి. మీరు పేదవాళ్ళకు అవసరమైన సహాయముచేస్తూ ఉన్నందుకు నాకు చాలసంతోషము. నాకుతోచిన సహాయం నేను చేయడానికి సిద్ధంగానే వున్నాను. కాని మీరు ఆసంస్థతరఫున కొన్నటువంటి గ్రామవిషయంలో పన్నులు తగ్గించటంమాత్రము నాకు సాధ్యమని ఇప్పట్లో తోచదు."

"తమరు ఆలాగు సెలవిస్తే ప్రజలు ఇక చేసేదేమిటి? ఇటువంటిపనులు ప్రభుత్వమువారే స్వయంగా చేసి ప్రజల్లో శాంతిసౌఖ్యాలను నెలకొల్పిన ప్రజాప్రభుత్వముల మధ్యఉన్న అంతరములన్నీపోయి, నిజమైన సౌఖ్యము, నిజమైనకీర్తి తప్పకుండా ఉభయులకు కలిగేది."

"ఈమధ్యనే ప్రభుత్వమువారు గ్రామస్థుల సహాయంకోసరం కొంతసొమ్మును శాంక్షన్ చేసారు. దానిలో కొంత ఈసంస్థకు వీలుపడితే ఇయ్యడానికి ప్రయత్నంచేస్తాను."

"అయితే భూమిపన్ను విషయంలోకూడా న్యాయంగా ప్రభుత్వమువారు విధించవలసిన పన్ను కాకుండా అందులో సగమే పేదలసహాయం కోసరం ఏర్పడ్డ ఈగ్రామమునకు విధించవలసిందని నామనవి."

"ఈకరువుకాలంలో ప్రభుత్వమువారు దీనికి ఒప్పుకుంటారని తోచదు. అయినా నాశక్తి లోపం లేకుండా ప్రయత్నంచేస్తాను."

"తమరిదయ. భగవత్సంకల్పము. నాప్రయత్నంనే చేస్తానుగాని ప్రభువైన మీవంటివారి సహాయసంపత్తులులేనిదే ఏపనీ మేము ప్రజలమైన పూర్తిగాచేయలేము. ఒకవేళ చేయదలచినా పునాదిలేనిగోడలాగ శాశ్వతంగా ఎప్పటికీ ఉండదని నానమ్మకము. ఈ కాగితం కొంచం చిత్తగించండి."

"కాగితముమీద అక్కర్లేదు. మీరు పేదలకోసరం కలెక్షను చేసే ఫండుకు ఈచెక్కును తీసికొని ఉపయోగించండి. నాకు తోచింది అప్పుడప్పుడూ ఇలాగే చేస్తూఉంటాను."

"చిత్తం. చాలాసంతోషం. మీరీమాత్రం అవకాశం మాకిచ్చినందుకు మా మనస్ఫూర్తివందనాలు. ఇక సెలవు. మీ విలువైనకాలాన్ని అనవసరంగా వృథా పుచ్చను" అని అంటూ అవతలికి వెళ్లి –

"వినయా! ఇతడు స్వభావముగా మంచి ఉన్నతో ద్దేశములుగల వాడైనట్లేతోచుచున్నది. ఒక్కసారి వెయ్యిరూపాయల చెక్కు ఇవ్వడమేకాకుండా ఇంకా తనకుతోచిన సహాయము చేస్తాననికూడా అన్నాడు. మన అశోకనిలయం ప్రవేశోత్సవానికి ఈయననే అధ్యక్షునిగా ఉంచవలెనని నాఉద్దేశము. ఇట్టి అంతఃకరణశుద్ధి, ఇట్టి నిగర్వత మనము సాధారణంగా ఎవరిలోకూడా చూడలేము."

"ఇప్పటికి మనఫండు కింతవరకు వసూలైనది మనం పేపర్లలోకి తెలుపవలసియున్నదని నిన్న నేకదా అన్నావు. రేపు అన్నీచూచుకొని పంపుదాము." ఈలాగు స్నేహితులిద్దరూ మాటాడుకుంటూ తాము కట్టినూఉన్న అశోకనిలయంలోకి ప్రవేశించారు. అప్పటికప్పుడే పేదజనం అందరూ స్నానపానాలు పూర్తిచేసుకొని రామమోహనరావు చెప్పిపోయిన విషయాలను చెప్పుకుంటూ అప్పుడేవస్తూ ఉన్న చిరువెన్నెట్లో కూర్చున్నారు. పదిపన్నెండేండ్ల పిల్లలు వేరే ఇంకొకచోట తాము నేర్చుకున్న నీతిపద్యాలను చదువుతూ గంతువేస్తున్నారు. ప్రేమానందరావు తనకోసరం ఎదురుచూస్తూఉన్న లేడీడాక్టరును చూచి

"ఏమిలాగు వొచ్చారు. మీరు చాలా అభిమానంగా కన్నబిడ్డల్లాగ ఈ నిరుపేదలను తగినట్లుగా చూస్తున్నందుకు చాలా సంతోషం. మీరు, ఆసర్జనుగారు, ఆ ఆయుర్వేదఆచార్యులుగారు పరస్పరము సలహాలను చేసుకుంటూ ఆంగ్ల, ఆయుర్వేదవైద్య రహస్యాలను గూర్చి పత్రికాముఖంగా విమర్శనాపూర్వకంగా తరుచూ ప్రజలకు తెలుపుచుండాలనికూడా నా కోరిక."

"మీరు ప్రతిఫలంలేకుండా మానవసేవే జీవిత పరమావధిగా పెట్టుకొని ఇంతకష్టపడి జీవితం ధార పోస్తూఉంటే జీతాలు పుచ్చుకుంటూ మీరిచ్చిన బసల్లోనేఉంటూ మీరు చెప్పినపని చేయడంలో అతిశయమేముంది. వారి కారోగ్యనియమాలను గురించి ఇంకా తగినట్లుగా బోధపడలేదు."

"పాపము వారికప్పుడే ఏలాగుబోధపడతాయి. మేము మానవులమే అని తెలుసుకునేటట్లుగా ముందు, వారికితగిన మానసికోద్బోధనచేస్తే వాటంతటవే అన్నీసులభంగా వాళ్ళకు బోధపడతాయి. ఇంతవరకూ మీరుచేస్తూఉన్న పనికి చాలా సంతోషము. ఆ పేదల కందరికీకూడ సంతాననిరోధవిషయం చక్కగా బోధ పరుస్తూ దాని ఆవశ్యకతవారికి నచ్చచెప్పాలి."

"ఆలాగే నాకు సాధ్యమైనంతవరకు మీరు చేస్తూ ఉన్న ఈపనికి సహాయం పూర్తిగా చేయాలని నా త్రికరణశుద్ధియైన కోరిక. ఇక నే సెలవుతీసుకుంటా."

"ఎవరండీ బాబూ! ఇక్కడ ప్రేమానందరావనే అబ్బాయి ఎక్కడున్నాడు?"

"నేనేనండి. ఇలా దయచేయండి. ఏంసెలవు."

"నాయనా! మీతండ్రినాటినుంచి నాకు మీ కుటుంబం బాగాతెలుసు. నీతండ్రిపోయినా ఇంత చిన్నవయస్సులోనే ఇంతచదువు చదువుకొని ప్రపంచం అంతాతిరిగి జ్ఞానాన్ని సంపాదించావు. దానికి తగినట్లుగా స్వార్థాన్నిపూర్తిగా చంపేసుకొని నీ స్వంతఆస్తినంతా వెచ్చించి ఈ సంస్థతరపున ఒక గ్రామాన్ని కొనేశావు. నిర్బాధనంకోసం, పడరాని పాట్లుపడుతూ పెద్దలందరినీచూచి వారిచేత 'ఓహో' అనిపించుకుంటూ డబ్బును పోగుచేస్తున్నావు. దీనుల్ని ఉద్ధరించడానికి కంకణంకట్టుకున్నావు. కిరీటం గల రాజుకున్నంతబాధ్యతను కిరీటంలేకుండా నీవు వహించి కీర్తిపొందుతున్నావు. పంచాయతీసభలను ఏర్పాటుచేసి, గ్రామస్థులు బయటికి పోనక్కర్లేకుండా చేసావు. పాఠశాలలను, బోధకులను ఏర్పాటుచేసి

ఇంకా గవర్నమెంటువ్రాసి ఇంకానహాయం పొందుటకు ప్రయత్నంచేస్తున్నావు.”

“ఏమిటండీ తాతగారూ! ఈపురాణమంతాను. భగవంతుని ఇచ్ఛాదీనులమైన మనం, మనంచేసేదేమిటి? ఇంతకూపర్యవసానమేమిటో తేల్చారుకాదు.”

“అందుకే నేనింతదూరంవచ్చాను. ఇంతదూరం చెప్పాను. నువ్వుఇప్పుడు చేస్తూఉన్నపని, జరుపుతూ ఉన్నమార్గం చాలాబాగుంది. గాని నువ్వేర్పరిచిన సంతాననిరోధం (బర్తుకంట్రోలు) పద్ధతిమాత్రం ఏమీ బాగులేదు. ఇప్పటికే ప్రపంచంలో అరాచకంజాస్తి అయిపోతున్నది. ఆదర్శాలు మారిపోయినాయి. స్వాతంత్ర్యానికిబదులు స్వేచ్ఛాచారం పెరిగిపోతున్నది. ఇక ఇదికూడా అమల్లోకి వచ్చిందంటే ప్రపంచంలో నీతి సౌశీల్యము అన్నది పూర్తిగా నశించిపోతుంది.”

“దీనికనేనా అంత గాబరాపడుతున్నారు. ఈ పద్ధతివల్ల ప్రత్యేకంగా అవినీతికెక్కడ అవకాశం ఉండదని నాఉద్దేశం. అది ఏలాగంటే బ్రహ్మచర్యం అవలంబిస్తూ జీవితాన్ని పరోపకారంకోసం వినియోగించుకోడానికి ఉద్దేశించుకున్నవాళ్లకి ఈపద్ధతులతో సంబంధమే అవసరంలేదు. ఎటొచ్చీ వివాహం చేసుకొని సంసారయాత్ర జరుపుకుంటూ, సంసారభారం వల్లగాని, దేహారోగ్యలోపంవల్లగాని అవస్థలు పడే వాళ్లకు ఇది అవసరం అంటారా, కాదంటారా?”

“అవునుగాని ఆబాధ ఉన్నవాళ్లు దూరదూరంగా ఉండి కాలంగడుపుకోవాలి.”

“తాతగారూ! మీకూ 60 ఏళ్లుదాటాయి. ప్రపంచలో కష్టాలు సుఖాలుపడుతూ చాలాఅనుభవం సంపాదించారు. సంసారంలోఉంటూ, పరస్పర అన్యోన్యతవధర్మంగా అలవాటుపడి అన్నిహక్కులూ కలిగిఉన్న భార్య దగ్గిరఉండగా, ప్రాపంచిక వాసనలలో, ప్రాపంచిక సుఖాలలో ఎల్లప్పుడూ ఉంటూఉన్నవాళ్లకు మనసుకట్టుకొని ఎల్లప్పుడూ ఉండటం సంభవమా? వస్తువలగా కొన్నాళ్లు సంభవమైనా ఎప్పుడో ఒకప్పుడు ఎవరోవకరు తప్ప అందరూ వ్యామోహములో పడకమానరు. బాగా యోచించండి. దీనివలన ఇంకొక మేలుకూడా ఉంటుంది. ధనహీనులందరూ సంసారభారానికి భయపడి అవివాహితులుగానే ఉండి ఆత్మోన్నతిలేనంటువంటి అక్రమమైన అలవాటుకు లోబడిపోయి ఆత్మవంచకులై దేహారోగ్యమును చెడగొట్టుకుంటూ జీవచ్ఛవాకారంగా తయారవుతున్నారు. దీనివలన అటువంటి దానికి అవసరంలేదుగదా?”

“అయితే మానవసృష్టి అంతా నశించవలసిందనేనా నీఉద్దేశము. భగవంతుని ఇచ్ఛకు అడ్డుతగిలి, మనం ఎంతమాత్రం శ్రేయస్సును పొందలేమని నా తాత్పర్యము.”

“తాతగారూ! ఒక్కసంగతిఅడుగుతా చెప్పండి. వారికే ఒకపూట గ్రుక్కెడుగంజికి, జానెడుగుడ్డకు గతిలేక అల్లాడుతూఉంటే వారిబిడ్డలు ఏవిధంగా ఈప్రపంచంలో జీవిస్తారో, వారివల్ల ఆతల్లిదండ్రుల హృదయాలు ఎంత క్షోభపడిపోయి అటమటించుతాయో కొంచం యోచించండి. దేహవికాసం, మనోవికాసం కూడాలేని ఆబిడ్డలే దేశముయొక్క భవిష్యత్పౌరులుగా ఉండవలసిన వారుగదా. అదిగాకుండా ఎవరైనా నెత్తిమీద గంపెడు బరువుండి అవస్థపడడానికి ప్రయత్నిస్తామా, లేకపోతే మీనమేషాలని లెక్కపెడుతూ ఆమనిషిని ఆ అవస్థకు వదలిపెట్టామా? కాబట్టి ఇప్పటి పరిస్థితులనుబట్టి తప్పకుండా ఉండి తీరవలసిందే. దీనివలన నిజముగా మానవసృష్టి నాశనమైపోయేకాలంవస్తే, అప్పటికి మనకంటే బుద్ధిమంతులు, మహానుభావులు ఉండకపోరు. కాలమే అవసరాన్నిబట్టి మనుష్యులకు నూతనఉద్దేశాలను పుట్టించుననే ప్రకృతిసూత్రాన్ని మనం మరువకూడదు.

సర్వవ్యాపియైన భగవంతుడు ఏవిషయమైనా ప్రపంచానికి నూతనంగా వెలిబుచ్చ సంకల్పించినప్పుడు, దానిని ఏవ్యక్తిద్వారానైన వెలిబుచ్చునుగాని రూపము లేని ఈశ్వరుడు స్వయంగా మనకువచ్చిచెప్పుట అసంభవమనికూడా మనం మరువకూడదు.”

“బాగానేఉంది. భగవంతుడు కర్మానుగతులనుగా జీవులను సృష్టించి ప్రపంచక్రమమును జరుపుతూఉంటే దానికిది వ్యతిరేకంగదా.”

“నేనొక్క ప్రశ్నను మిమ్మల్ని అడుగుతా. మీ కోడలికి సంతానభాగ్యం లేకపోతే మొన్న మొన్ననే వైద్యంఅనీ, ఆసుపత్రిఅనీ, ఆపరేషన్‌లనీ ఎందుకు తాపత్రయపడ్డారు. కర్మ ఏలాగుంటే ఆలాగుంటుందని వదలిపెట్టక ఏరోగంవచ్చినా ఏరొచ్చువచ్చినా మానవప్రయత్నం అన్నది చేస్తున్నామూలేదా? మనం అన్నిప్రయత్నాలు చేసాక అది ఫలించకపోతే ఈశ్వర సంకల్పం వ్యతిరేకంగా ఉందనికదా మనం వదలిపెట్టాం. లేకపోతే మానవప్రయత్నానికి ఎక్కడైనా అవకాశం ఉంటుందా పూర్తిగా ఈకర్మసిద్ధాంతాన్ని పట్టుకుంటే?”

“అయితే ఎవరికి తోచిన వారు దీనిని అనుసరింపవచ్చునన్నమాట?”

“ఇదిగో ఇందులోనేఉంది పొరబాటంతా. ఇప్పటి మోస్తరుగా బజారులో కూరగాయలవలె అయిన వాళ్లకీ, కానివాళ్లకీ ఈపద్ధతు లందుబాటులో ఉండకూడదు. పౌరుల బాగోగులకు బాధ్యులైన జిల్లాఅధికారుల స్వాధీనంలోఉండాలి—ఎవరికీసమస్య అవసరమో, ఎవరికి అనవసరమో అని నిర్ణయం చేసే అధికారం, అవసరమని కోరినవారిని మాత్రం, వారు నిజంగా భార్యాభర్తలో కాదో, వారు దారిద్ర్యము చేతగాని, ఆరోగ్యలోపంచేతగాని నిజంగా బాధపడుతున్నారో లేదో బాగా పరీక్షచేసి చక్కని సాక్ష్యం తీసికొని మరీ దీనికి అనుజ్ఞఇవ్వాలి. ఇట్టి కేసులకు ప్రత్యేకంగా ఆసుపత్రులలో స్థానంఉండాలి. జనుల కందరికీ ఇట్టి ఉపాయం ఉన్నదనిమాత్రం తెలిసేటట్టు చూడాలి. ఏది ఏలాగైనా దీని అధికారంమాత్రం అధికారుల చేతులలో పూర్తిగాఉండాలి. ఇలాగైతే సంఘంలో అవినీతిప్రవర్తనకు దోహదంగా ఈసంతాన నిరోధము ఏమీ కారణముగదని స్పష్టముగా బుజువౌతుంది. తాతగారూ! కోపమా నామాటలకి.”

“నాయనా! నీవుచెప్పిన సంగతులనుబట్టి కొంతవరకు ఇది అవసరమనే తోస్తుంది. ఇది అటుంచి నాసలహా ఒకటి యోచించు. నీవు ఎసెంబ్లి మెంబరువు గదా. నీవు పేదలకొరకు, నిరుద్యోగులకొరకూ ఎన్ని శ్రమలుపడినా తాత్కాలికపు ఉపశాంతేగాని శాశ్వత సహాయముగాఉండటం అసంభవం. మొట్టమొదట రైతుస్థితి బాగుపడీ వ్యవసాయంతో ప్రతివాళ్లు జీవించవచ్చుననే ఆశ అందరికి కలిగించాలి. దీనితో అందరికీ ఈఉద్యోగకాంక్ష చాలావరకు తగ్గి గ్రామ జీవితంవైపు దృష్టి మళ్లుతుంది. నీ శక్తిసామర్థ్యం, అన్నీ కేంద్రీకరించి ఈసంస్కారం జరపటానికి ప్రజల్లో, ప్రభుత్వములో కదలిక కలిగించితే నీవు నిజంగా సఫలీకృతుడవు అవుతావు. నేను పెద్దవాడ్ని. నా అనుభవంమీద నేను చెప్పాను.”

“ఈసంగతి అందరూ అంటూఉన్నదే. నాఉద్దేశముకూడా ఆలాగేఉంది. భగవదుద్దేశం ఏలాగుందో?”

# అయ్యవారిని చేయబోతే కోతయింది

'కరుణకుమార'

వెంకటనారాయణ శింగరాయకొండ లేబరుస్కూలు టీచరు. నాలుగోఫారం పరీక్ష తప్పిపోయినందున హయ్యరుగ్రేడు ట్రైనింగు ప్యాసయి, వారినీ వీరినీ ఆశ్రయించి అంతా మూడునెలలకిందటి లేబరు డిపార్టుమెంటు స్కూలులో నెల కిరవై రూపాయల టీచరువుద్యోగం సంపాదించుకొని ఛార్జి తీసుకొన్నాడు.

ఛార్జి తీసుకొన్న మూడో నెలలోనే జిల్లా లేబరు ఆఫీసరుగారు ఏప్రియల్ నెల అయిదవ తేదిన ఉదయం ఎనిమిదిగంటలకు బడికి తణిఖీ నిమిత్తం వస్తున్నామని అడ్వాన్సుగా వెంకటనారాయణకు నోటీసుకార్డు పంపారు.

నోటీసుప్రకారం ఆఫీసరుగారు సరిగా ఆరోజున బడివద్దకు రావడమూ, వారు వచ్చేవరకు స్కూలుతలుపు తాళంవేసివుండి, వెంకటనారాయణగాని పిల్లలుకాని హాజరులో లేకపోవడమూ జరిగింది. ఇదిచూచి ఆఫీసరు ఉగ్రుడయి పరవళ్లుతొక్కుతూ ట్రావెలర్సు బంగాళాలోని తన మకాముకు చక్కాపోయినాడు.

పగలు పన్నెండుగంటలు కావచ్చింది. ఎండ మిటమిట లాడుతోంది. లేబరు ఆఫీసరుగా రప్పుడే భోజనంచేసుకొని పడకకుర్చీలో వంకుకొని సిగరెట్టు కాలుస్తున్నారు. వారి జవానుకూడా అప్పుడే భోజనానికి పోయినాడు. బంగాళాకాంపౌండులోని గుడిసెలో కాపురంవున్న యానాదివాడొకడు వరండాలో కూర్చుని పంకా లాగుతున్నాడు.

వచ్చినపని కాకుండా, ఆరోజు డయరీ అంతా వృథాఅయిపోయిందే అని విచారిస్తూ నోటీసు ముందుగా పంపినప్పటికీ వెంకటనారాయణ చూపించిన అవిధేయతకు అతను ఎదుటిపడితే ఎగిరిమింగేయా లన్నంత ఆగ్రహంతో పెద్ద నిట్టూర్పులువిడుస్తూ, నోటిలో పెట్టి ముట్టించిన సిగరెట్టును రెండుమూడు పీల్పులతోనే ఆఖరుచేస్తూ, ఇట్లా ఒకదాని వెంట మరొకటిచొప్పున ఇప్పటికి ఒకటీ — రెండూ — మూడూ — నాలుగుసిగరెట్లు తగలేశారు లేబరు ఆఫీసరుగారు. వారు అయిదో దాన్ని బయటికి తీయబోతూవుండగా ఒక అరడజను బత్తాయిపండ్లూ, అరడజను కమలాపండ్లూ వగైరాలతోవున్న ఒక వేపతట్ట చేత్తోపట్టుకొని, ఎదుటబడితే ఏమిచేస్తారో దొరగారన్న దిగులుతో అడుగులో అడుగు వేసుకొంటూ, వరాండా మెట్లెక్కి పిల్లిలా నక్కుతూ నక్కుతూ అప్పుడే వచ్చాడు వెంకటనారాయణ. భయపడుతూ భయపడుతూ దొరగారు కుర్చీలో పరుండివున్న గదివాకిలివద్దకు వెళ్లి, తట్టలో పళ్లుతీసి బల్లమీద పెట్టి 'రక్షించండి బాబూ! ఈ దఫాకు క్షమించండి' అంటూ మరుక్షణంలో దొరగారి పాదాలమీద వ్రాలా డతడు.

వెంకటనారాయణ అంటినకాలు ఛర్రున విదలించివేసి "ఛీ! బయటికి పో. ఇడియట్! నిన్ను డిస్మిస్ చేస్తాను చూచుకో. బుద్ధుందా లేదా నీకు?" అని తోకతొక్కిన తాచు లాగ కుర్చీలో పండుకొన్న లేబరు ఆఫీసరు గారు లేచి ఒక్క ఉరుమురిమాడు.

"క్షమించండయ్యా! పొరపాటు జరిగిందండి. బుద్ధిపూర్వకంగా చేసినతప్పు కాదండి. ఇట్లా ఇంతపని జరుగుతుందని నేను కలలోను కూడా అనుకొనివుంటే దొరగారు తమరికింత ఆగ్రహంరాకుండానే చేసుకొనేవాణ్ని. ఇప్పుడయినా నాకథ యావత్తూ శాంతంగా వింటే దొరగారు నామీద ఇంత ఆగ్రహపడరని మనవి చేసుకొంటున్నానండి" అని వెంకటనారాయణ నడుంవంచి రెండుచేతులూ జోడించి గజగజలాడుతూ విన్నవించుకొన్నాడు.

"ఏంకథ? ఆ కథేమిటో — ఆ యేడుపేమిటో ఏంజరిగిందో చెప్పు— అదీ వింటాం" అని కొంచెం తమాయించి వెంకటనారాయణ ఏంచెప్పుకొంటాడో శాంతంగా విందామని దొరగారు తిరిగి పడకకుర్చీలో వెనక్కి జేర్లబడి, ఆరో సిగరెట్టు ముట్టించి రెడ్డీకంవేసికొని ఓరకంటిచూపుతో వెంకటనారాయణను చూస్తూ కూర్చున్నారు.

అంతట వెంకటనారాయణ కొంతధైర్యం తెచ్చుకొని గుండె దిటవుపరుచుకొని గొంతు సవరించుకొని తన చరిత్ర నీ క్రిందివిధంగా ఆరంభించాడు.

"తమ రీదినం అయిదవతేదీని తణిఖీకి వస్తామని పంపిన నోటీసుకార్డు నాకు మొన్న మూడవతేది ఉదయం పదిగంటల కందిందండి. తమ అనుగ్రహంవల్ల నాకీ శింగరాయకొండ గ్రామంలో నౌకరీ దొరకడమూ, నేను ఛార్జి తీసుకొన్న మూడునెలలకే తమరు నా స్కూలు తణిఖీకి వస్తామని నోటీసు పంపడమూ తలచుకొనేవరకు నాకు ఆనందం కలిగింది. నేను నౌకరీలో చేరినపిదప ఇదే తమరు మొదటిసారి తణిఖీకి రావడం కాబట్టి ఈసారి తమరిని హృదయపూర్వకంగా ఆహ్వానించి గౌరవించి తమరి నానందపరిచి తమరి వల్ల మంచి సర్టిఫికెట్టు పొందుదామని కోరిక పుట్టింది. నా స్కూలురావడంతోనే తమరి మెడలో ఒక గులాబీపూలమాలవేసి, పండ్లూ వగైరాలు సమర్పించి తమరిని పూజిద్దామనుకొన్నాను. నిన్న నాలుగోతేదీ అంతా గడువుందికదా, నెల్లూరికిపోయి మంచి మాలా పళ్లూ తీసుకువద్దామని ఆరురూపాయలు చేతబుచ్చుకొని మొన్నరాత్రి ప్యాసెంజరులో నెల్లూరు వెళ్లానండి.

"తెల్లవారుజామున అయిదుగంటలకు నెల్లూరుచేరింది ప్యాసెంజరు. రైలుదిగి ఉదయాన్నే పెద్దబజారులో పువ్వులమ్మే సాహేబుల అంగడికిపోయి మంచిరకం ఒకమాలకు రూపాయన్నరకు బజానాయిచ్చి, సాయంత్రం ఆరుగంటలకు మాల తయారవుతుందని సాహేబు చెప్పినందువల్ల అతనితో సాయంత్రం వస్తానని చెప్పి వెళ్లిపోయాను. బజారులో రూపాయన్నరకు గజనిమ్మపండ్లూ, ఆపిలూ,

కమలాలూ తీసుకొని ఇంకా యితరపనులు చూచుకొని మధ్యాహ్నం పూటకూటింట భోజనంచేసుకొని సాయంత్రం ఆరుగంటలకు మళ్లీ బజారుకు వెళ్లానండి. పూలమాల తయారుగావుంది. దాన్ని తీసుకొని ఒక బుట్టలో నలిగిపోకుండా భద్రపరిచి, రాత్రి ఏడు, ఏడున్నరగంటలకు మళ్లీ పూటకూటింటికి వెళ్లి భోజనంచేశాను. పూటకూటాయనకు డబ్బు లిచ్చివేసినపిదప నా మనీపర్సులో మిగిలినపైకం లెక్కచూచుకోగా నేను తీసుకువెళ్లిన ఆరురూపాయలలోనూ రూపాయ రెండణాలు మిగిలినవి. 'సరే, నెల్లూరినుంచి శింగరాయకొండకు సరిగా రూపాయేకదా రైలుఛార్జి — ఇంకో రెండణాలు అదనంగానే వున్న'వనుకొని పైకితీసినరూపాయి మళ్లీ పర్సులోపెట్టేసమయంలో దానికి అంచున చిన్ననొక్కున్నట్టు కనిపించింది. అరే, చంద్రబింబంలాంటి ఈ జార్జిమార్కు కొత్తరూపాయికి కళంకంలా ఈ పాడునొక్కు ఎట్లా వచ్చిందాఅని అనుమానిస్తూ దాన్ని కింద గచ్చుమీదవేసికొట్టి మోగించాను. ఖంగుమని మోగింది. మళ్లీ రెండోసారి కొట్టాను. పూటకూటిల్లంతా మారుమోగింది. అనుమానమెందుకు ఈ రూపాయికనుకొని దాన్ని పర్సులోవేసి పండ్లు నాసూటు కేసులోపెట్టి దానికి తాళంవేశాను. రాత్రి తొమ్మిది తొమ్మిదిన్నర కావచ్చింది. శింగరాయకొండకువెళ్లే ప్యాసెంజరు తెల్లవారుజామున నాలుగుగంటలకు చేరుతుంది నెల్లూరు. పూటకూటింట పడకవేస్తే మెళుకువ వస్తుందో రాదో, — అర్ధరాత్రి ప్రయాణం, వున్న యీ వొక్కరైలూ దాటిపోతే వచ్చినపనంతా వ్యర్థమయిపోవడమే కాకుండా దొరగారికి ఆగ్రహం గనుక వస్తే మనుబతుకంతా తలకిందైపోతుంది, వెళ్లి రైలుస్టేషనులోనే పడుకొంటే మంచిదని సూట్ కేసు ఒకచేత్తోనూ, పువ్వులమాలబుట్ట మరోచేత్తోనూ పట్టుకొని వెన్నెట్లో స్టేషనుకు బయలుదేరాను.

"కాని దారిపొడుక్కీ నాకు రూపాయిమీద అనుమానం బాధిస్తూనేవుంది.'' రూపాయి మోతచూస్తే బాగానేవుంది కాని ఆ టిక్కట్టిచ్చేవాడి కంటికి నొక్కుకనిపిస్తుందేమో. మోత బాగామోగిన నొక్కున్న రూపాయలు రైలువాళ్లు తీసుకొంటారో లేదో. ఆ టిక్కట్టిచ్చేవాడు రూపాయి మోగించి టిక్కెట్టు నాచేతిలోపెడితే సరే; ఒకవేళ అట్లాజరక్కపోతే ఏమిగతి? మనకీ పట్నంలో తెలిసినవారెవ్వరూ లేరే! అందులోనూ అర్ధరాత్రిసమయం — అయినా రూపాయి పడకపోవడమే ఖాయమా? — పోనీ, ఎవరికయినా దీన్నిచూపించి నొక్కున్నదని చెప్పకుండా వాళ్లను "అయ్యా! ఈరూపాయికేం లోపమండీ'' అని అడిగితే, వాళ్లు దీనికేమయినా వంకపెట్టగలరా? — కాని ఈ ఆలోచనకూడా బాగాలేదు. మనరూపాయిలోపం మనమే ఎందుకు బయలుపెట్టుకోవడం? ఎవరితోనూ ఈ రూపాయి ప్రస్తావనే చేయకూడదు. మాట్లాడక స్టేషనుకువెళ్లి హాయిగా తెల్లవారుజామువరకూ పండుకొని టిక్కె-

టిచ్చేసమయంలోపోయి ఏమీ యెరగనట్లు బల్లమీదపడేస్తే ఖంగుమని రూపాయిమోగి పూరుకొంటుంది; సరేరాఅని టిక్కెట్టు ఇవ్వనే యిస్తారు. అదీగాక, రాత్రివేళ, ఆ నిద్రకళ్లకి వాళ్లకీ రూపాయినొక్క అసలు కనిపిస్తుంది గనుకనా? రాత్రిపూట ఈ ఉద్యోగంచేసే రైలుద్యోగస్థులందరూ - రైలునడిపే ఏడ్రైవరోతప్ప – గార్డూ, అండరుగార్డూ, స్టేషను మాస్టరూ, టిక్కెట్టిచ్చేవాడూ, వసూలుచేసే వాడూ – యావన్మందీ అసలు సగం నిద్రలోనే ఉద్యోగం చేస్తూవుంటారు. అటువంటిది టిక్కెట్లమ్మేవాడికి నారూపాయి నొక్క కనిపిస్తుందా? చేస్తుందా? మోగించాడంటే చక్కగామోగే నారూపాయి కేమిటి రాత్రి వేళ సగంనిద్రకళ్ల టిక్కెట్టిచ్చేవాడు పేరు పెట్టడ మేమిటి?—ఛా! ఛా! ఎందుకొచ్చిన అనుమానం ఇది. మరేమీ ఫరవాలేదు రూపాయికి వచ్చిన భయ మేమీలేదు" అని యేవేవో ఆలోచనలు చేస్తున్నాను. ఈ ఆలోచనలోనే స్టేషను చేరాను.

"నేను స్టేషనులో అడుగుపెట్టేవరకు మిషనరీ క్లాకుటవరు టంగు టంగుమని పది గంటలు కొట్టింది. "బలే. బలే శకునం. గంటకొట్టింది. ఇక ఫరవాలే" దనుకొని లోపల హాలులోకి వెళ్లాను. హాలుకు నడుంగా పైన పలకలద్దాల లాంతరు వేలాడుతోంది. దానిలోని దీపం తప్ప యితర పెద్దదీపా లేమీ హాలులో లేవు. మూడో తరగతి ప్యాసెంజర్లు కొంత మంది బెంచీలమీదా, కొంతమంది కిందా పండుకొని నిద్రపోతున్నారు. కొందరు కూర్చునే కునికిపాట్లు పడుతున్నారు. ఒక మూల ఒక ముసలాయన దగ్గుతున్నాడు; వేరొకమూల ఒక చంటిపిల్ల లేచి యేడుస్తోంది. ఒకపక్క కొంతమంది చుట్టలు కాల్చుకొంటూ లోకాభిరామాయణం మాట్లాడుకొంటున్నారు. బయట రోడ్డు పక్క జట్కాలూ, ఎద్దుబళ్లూ వున్నవి. పదిన్నర గంట కావచ్చింది. నాకూ నిద్ర వచ్చీ రానట్టుగావుంది. ఇంకో అరగంటకు మద్రాసునుండి మెయిలువచ్చి వెళ్లిపోయింది. దానితో హాలులోని సమ్మర్దం కొంత అణిగి అక్కడక్కడ కొద్దిపాటి ఖాళీ అయింది. "తెల్లవారుజామునకదా నా రైలు వచ్చేది. ఈలోపల కాస్త కూర్కుపోదా" మను కొని తలకింద సూటుకేసు పెట్టుకొని పక్కన పువ్వులబుట్ట పెట్టుకొని కాళ్లు చాచుకొని రెండావులింత లావులించి రంగా! రంగా అంటూ మేను వాల్చాను.

"కళ్లు మూసుకొన్నాను కాని నిద్రపట్ట లేదు. పైకి నిశ్శబ్దంగానూ, శాంతంగానూ వున్నట్టున్నానే కాని లోపల గుండెలు దడ దడ రైలింజనులా కొట్టుకొంటున్నవి. ఏమీ భయం లేదని నాలో నేను ఎన్నిసార్లు ధైర్యం చెప్పుకొన్నా గుండె నిబ్బరం కలగ లేదు." ఒకవేళ రూపాయి పడకపోతే యెట్లా? రైలువాళ్లకు మనతో మొగ మాటం గనుకనా? ఈ రైలు దాటిపోతే గతేమిటి?"—ఇవే ఆలోచనలు. ఎంత అణుచుకొందామన్నా ఉత్సాహం — ఈ ఆలో

చన లణగటంలేదు. నిద్రపట్టలేదు. లేచి కూర్చున్నాను. హాలంతా పరికించి చూచాను. రాత్రి పన్నెండు, ఒంటిగంట అయిపోతోంది. అంతా నిశ్శబ్దంగావుంది. "ఈ హాలులో ఇంతమంది ప్రయాణీకుల లోనూ ఎవరికైనా నాకులాగ ఇంత ఆందోళన వుంటుందా? హాయిగా నిద్రపోతారా వుంటే?—మనకయితే మాత్రం ఎందు కాందోళన? గడియారం టంగు టంగుమని గంటలు కొట్టింది. మనకు జయమే" అని మనస్సుకు దిటవుచెప్పుకొని మళ్లా కళ్లు మూశాను. కాని ఉఁహూఁ. మనస్సుకు శాంతి కలుగలేదు. 'తీరా రూపాయి మారకపోతే రేపు దొరగారి తణిఖీ యేమి కావాలె? స్కూలేమి కావాలె? నే నేమి కావాలె—ఇదేమిరా భగవంతుడా! ఇట్లాంటి చిక్కులలో పెట్టా' వనుకొంటూ ఆ వేదనతో లేచికూచుని కొంతసేపు అటూ ఇటూ పచార్లుచేశాను. తిరిగి మళ్లా వచ్చి నా మామూలుచోట పండుకొన్నాను.

"క్లాకు టవరు రెండు గంటలు కొట్టింది. మూడు కొట్టింది. ఆఖరుకు నాలుగుకూడా అయింది. గుండెలు మహావేగంతో కొట్టు కొంటున్నవి. అప్పుడు నాది అదొక విపరీతమయిన స్థితి. టిక్కెట్లు తీసుకొనే టైమయిందన్నట్లు స్టేషన్ ప్లాటుఫారంమీద గంట గణగణ వాయించాడు పోర్టరు. హాలులో నిద్రపోతూవున్న వాళ్లందరూ నిద్ర లేచారు. ఒక్క నిముషకాలంలో టిక్కెట్లమ్మే కిటికీవద్ద పెద్దగుంపు చేరింది; జనం త్రొక్కులాడుకొంటున్నారు. స్థలం లేదు. ఒకరినొకరు తోసుకొంటున్నారు. పెద్ద రభసంగావుంది. టిక్కెట్టు తీసుకొనేటందుకిదేరా సమయమని నేనూలేచి పర్సులో రూపాయి పైకితీసేవరకు ఒక ముసలి తురకసాహెబు డెబ్బయి ఏండ్లవాడు నా కడ్డంగా వచ్చి "మహారాజ్! ముసలివాణ్ణి. కళ్లు కనుపించవు. ఆ జనంలోకిపోయి టిక్కెట్టు తెచ్చుకోలేను. నాకు శింగరాయకొండ కో టిక్కెట్టు తెచ్చిపెట్టు మహారాజ్! నీకు సలాంచేస్తా"నన్నాడు. "శింగరాయకొండకా? టిక్కెట్టా? — సరే తెస్తాను. పైకం తే" అన్నాను నేను.

సాహేబు తన వణకుచేతో సంచిలో నుంచి రూపాయతీసి నా చేతిలో పెట్టాడు. "బలే. ఇట్లావుండాలి అదృష్టమంటేను. ఈ తొందరలో రెండు రూపాయలూ ఒకేసారి టిక్కెట్లిచ్చే ఆయన చేతిలో పడేస్తే ఆయనకు నా రూపాయి నొక్కు అసలే కనిపించదు. ఒక్కరూపాయి విడిగాఇస్తే పరిశీలించడానికవకాశంగాని రెండు రూపాయలూ జోడించియిస్తే ఇక భయమేమిటి? బతికానురా భగవంతుడా!" అనుకొంటూ టిక్కెట్ల కిటికీదగ్గరికి వెళ్లానండి. జనసమ్మర్దం ఇంకా తగ్గలేదు.

"శింగరాయకొండకు రెండు టిక్కె" ట్లంటూ నాచేతిని బలవంతంగా ఇతరుల చేతుల పక్కనుంచి కిటికీగంతలోకి పోనిచ్చి రెండు రూపాయలూ బల్లమీద పెట్టాను.

వాటిని టిక్కెట్లిచ్చే ఆయన మోగించాడో లేదో—నాకు తెలియదు. నా చెవి కేమీ మోత వినపడలేదు. "ఇదేరా పరీక్షసమయం. అటో ఇటో తేలిపోతుం దిప్పుడే" అనుకొంటూవుండగా "ఈ రూపాయ పడ" దంటూ ఆ రెంటినీ తిరిగి నాచేతిలో పెట్టాడాయన.

"నొక్కు కనిపించింది కాబోలు! ఇక నేదిరా దిక్కు?" అనుకొంటూ గుంపులో నుంచి తోసుకు బయలుపడ్డాను. నా కేమీ పాటిపోలేదు. దిక్కూ దెసా తోచలేదు. వొళ్లంతా తేళ్లూ జెర్రెలూ పాకినట్లయింది. ప్రపంచమంతా తిరిగిపోతున్న ట్టనిపించింది. ఏమి చేయను? ఎక్కడికి వెళ్లను? ఎవరి నాశ్రయించను? ఎవరి నెరుగుదు నక్కడ? ఏమి బుద్ధి? అని యేమీతోచక తన్నుకులాడుతుంటే నా సూటు కేసువద్దతనమూట పెట్టుకు కూచున్న సాహేబువచ్చి "అయ్యా! టిక్కెట్టేదండి" అన్నాడు. "లేదూ. టిక్కెట్టు తేలేదు. నా రూపాయ మారదని రెండు రూపాయలూ ఇచ్చేశాను. ఇదిగో నీ రూపాయ. నీ టిక్కెట్టు నీవే తెచ్చుకో. నే తేలే" నంటూ లాంతరుదీపం వెలుతురులో రెండు రూపాయలూ నిదానంగా చూచి నా నొక్కురూపాయి నేను జాగ్రత్త పెట్టుకొని అతని ఎడ్వర్డు రూపాయ అతనికి కిచ్చివేశాను. ఏమి చేయడానికీ తోచక కాలు కాలిన పిల్లలా ఇటూ అటూ తిరుగుతూవుండగా అంతలోనే సాహేబు నాదగ్గరికి తిరిగివచ్చి "అయ్యో! ఇదేమిటి మహారాజ్! నా రూపాయ మారదని వాపసుచేశాడు ఆ టిక్కెట్టు పంతులు. మా దొడ్డపని చేశావు. నా మంచిరూపాయ నువ్వు తీసుకోని నీ పడనిరూపాయ నా కిస్తావు. నా రూపాయి నాకియ్యి" అని గదిమాడు.

"నే నేమయినా పొరపాటుపడ్డానా" అని మళ్లీ దీపం వెలుతురులో నా రూపాయిను పరిశీలించి చూచాను. అది నా రూపాయే — జార్జి చక్రవర్తి బొమ్మా అంచున నొక్కూను. సందేహమేమిటి?— సాహేబు కిచ్చినది సాహేబు రూపాయే. పొరబడలేదనుకొని "నీరూపాయే నీకిచ్చాను సాహెబూ! నా పడనిరూపాయి నీ కివ్వలే" దన్నాను. "లేదు మహారాజ్! చీకట్లో పొరపాటు పడ్డారు మీరు. నారూపాయి మంచిరూపాయి సామీ! నాది నాకిచ్చేయం డన్నాడు. ఏం చెప్పనతనికి? "లేదు సాహెబూ! నారూపాయి నాకు గుర్తే. దానికి చివర నొక్కుం"దన్నాను. "లేదయ్యా నా రూపాయి తీసుకొని నీపడనిరూపాయి నా కిస్తావుటయ్యా? బలే దొడ్డవాడివే. ఇచ్చెయ్యి నా రూపాయి" అని గోల ప్రారంభించాడు. ఈ గోల కక్కడ హాలులోనివారు దగ్గరికివచ్చి మమ్మల్ని చుట్టుకోవడం మొదలుపెట్టారు. "ఎట్లాగ ఈసాహెబును నమ్మించడం? అతనికి కళ్లు కనిపించవు. అతని రూపాయి తీసుకొన్నప్పుడు మంచిదే అనే వుద్దేశంతో మోగించకుండా తీసుకొన్నాను. మొదట మోగించినా తీరిపోయేది. ఇప్పుడేమనుకుంటే ఏమిలాభం?" అనుకుంటూ

వుండగా చుట్టూ మూగినవారు తలోక మాటా అనడం మొదలుపెట్టారు. సాహేబు తొందర ఎక్కువయింది రూపాయి ఇచ్చెయ్యమని. "ఆఖరుకు నా నొక్కురూపాయే మంచిదనీ, సాహెబురూపాయే చెడ్డదనీ నిశ్చయమయింది. అయితేమట్టుకు లాభమేమిటి? సాహెబు నెట్లా నమ్మించడం?— అతనికి టిక్కెట్టు తీసుకువస్తానని మెరక్కపోయి ఒప్పుకొన్నాను. మొట్టమొదట లేనిపోని అనుమానాలకు పోయిచెడ్డాను." అనుకొంటూవుండగా సాహెబు "ముసలాణ్ని కళ్లు కనపడవు గనుక మోసం చేస్తావుటయ్యా? ఇచ్చెయ్యి నారూపాయి. రైలు వస్తోంది. వెళ్ళాలంటూ మరింత గంద్రగోళం చేశాడు. ఏమి చెయ్యనిక. ఇక నివ్వక విధి లేదు—ఇదేమిరవ్వరా" అని నారూపాయి వాడిచేతిలోపెట్టి వాడిరూపాయి నేను తీసుకొన్నాను. నా నొక్కు రూపాయితో టిక్కెట్టు కొనుక్కొని టింగురంగా అని చక్కాపోయినాడు సాహెబు.

"ఆఖరుకు బలే తమాషాజరిగిందోయి వెంకటనారాయణా! కథలాగేవుంది. తరువాతేంజరిగిందేమిటి"అన్నారు నవ్వుతూ లేబరు ఆఫీసరుగారు.

"ఇకనేముంది స్వామీ! నేనక్కడదిగడిపోవడం — దొరగారు తమరిరాకా — స్కూలుతణిఖీ తలచుకొనేటప్పటికి వాళ్లు కంపరమెత్తిపోయింది. ఏమిచేయడానికీ దిక్కుతోచలేదు. రైలువచ్చేస్తున్నది. మతిపోయింది. మళ్లా కిటికీదగ్గరికి వెళ్లాను. టిక్కెట్టు పంతుల్ని శతవిధాల బతిమాలుకొన్నాను. ఎంతబతిమాలుకొన్నా ప్రయోజనం లేకపోయింది. నాదగ్గర రూపాయ చెల్లదంటే చెల్లదని తీసుకోనన్నాడు. "సాహెబు సైంధవుడిలా అడ్డుతగిలి వాడిరూపాయ నాకంటగట్టి పోయినాడే" అని దుఃఖంవచ్చింది. "ఇకనేమిచేయనురా భగవంతుడా"అనుకొంటూ వుండగా ప్లాటుఫారంమీద కొచ్చేసింది రైలు. ఇక ఆలోచిస్తే కార్యంలేదనుకొని నాదగ్గర అదనంగావున్న రెండణాలతోనూ ప్లాటుఫారంటిక్కెట్టుకొని ఒక్కపరుగున ప్లాటుఫారంమీదికివచ్చి పడ్డాను. రైలుదాటిపోతుందేమో అన్నఖంగారులో నాకెదురుగా వున్న పెట్టితలుపుతెరచి లోపలికెళ్లికూచునేవరకు—శ్రీరామచూస్తునుగదా—అది ఇంటరుక్లాసయింది. అసలే టిక్కెట్టులేదు; అందులోనూ ఇంటరుతరగతి ప్రయాణం! ఇదేమిరా ఎట్లావచ్చిందనుకొంటూ, పువ్వులదండ జ్ఞాపకానికివచ్చి చూచుకోగా ఆబుట్టలేదు. తొందరలో స్టేషనులో మరచిపోయివచ్చానని తెలిసిందప్పుడు. దానికోసం విచారిస్తూ వుండగా రైలు పెన్నవంతెనమీదికి రావడమూ, ఇంతలోనే — అదివరకాబండిలో ఎప్పుడెక్కాడో టిక్కెట్టుకలెక్టరొకడు టిక్కెట్లడగుతూవుండడమూ జరిగింది. "వస్తే అన్నిచిక్కులూ వక్కమాటువస్తవి—ఇదేమి ఖర్మంరా భగవంతుడా"అని హడిలిపోతున్న సమయంలో టిక్కెట్టుకలెక్టరు నాదగ్గరికి వచ్చి టిక్కెట్టడిగాడు. నాదగ్గరటిక్కెట్టేదీ? లేదని నాసంగతంతా చెప్పబోతూవుంటే



అనంతపురం శ్రీ భారతమహిళాశారదాసమాజము.

18 వ. వార్షికోత్సవము.

అధ్యక్షురాలు: శ్రీమతి మానవేదన్ రాజానతి



యల్లాప్రగడ సీతాకుమారి
గృహలక్ష్మియం దప్పుడప్పు డీమె వ్యాసములు
వ్రాయుచుండును.

వినక దొంగతనంగా ప్రయాణం చేస్తున్నానని నాకు మద్రాసునుంచి ఇంటరుక్లాసుకు డబ్బిఛార్జికట్టి నాపేరువ్రాసుకొని నెల్లూరు తర్వాతిస్టేషను పడుగుపాడులో దింపివేసి స్టేషనుమాస్టరు కొప్పగించి తనదారిని తాను చక్కాపోయాడు.

ఏమని చెప్పుకోను దొరగారూ! నా అవస్థ—తెల్లవారేవరకూ పడుగుపాడులో వుండి తెల్లవారినతర్వాత ఆస్టేషనుమాస్టరు కాళ్లుపట్టుకొని ప్రార్థించి, ఆయన దయ దలచడంవల్ల శింగరాయకొండకు టిక్కెట్టు తీసుకొని అయనదగ్గర తీసుకొన్న చేబదులుతో—ఈ పన్నెండుగంటల ప్యాసింజరులో వచ్చిపడ్డానండి.

ఈలోగానే దొరగారు తమరు స్కూలుకు రావడమూ, నేను లేనన్నకారణంచేత కోపంచేసి ఇక్కడికి వచ్చేయడమూ జరగిందండి—పోయిన పూలమాల పోనే పోయింది స్వామీ! ఈపళ్లయినా తీసుకొని నన్ను కటాక్షించకపోతే—''

అని దీనంగా గద్గదస్వరంతో చెప్పుకొంటూ నిలబడివున్న వెంకటనారాయణ వైఖరి చూచేవరకు లేబరుఆఫీసరుహృదయం కరిగింది, జాలిపడ్డా డతనిస్థితికి; "సరే నీకు భయంలేదు. నేను రేపటిదినం స్కూలు తణిఖీకి వస్తా"నని చెప్పి అతన్ని వోదార్చడమేకాకుండా అతనికి రైలువాళ్లు కట్టిన డబ్బిఛార్జి ఏడురూపాయలన్నరా తానే యిచ్చేసి వెంకటనారాయణ నింటికి పంపేశాడు.

# తేయాకు కథ

ఎన్నో "కొత్తవస్తువులు" అప్పుడప్పుడు బయలు దేరుతునేవుంటవి. అయితే అవి యిదివరకు బొత్తిగా లేవని చెప్పడానికి వీలులేదు. ఆవిధంగానే తేయాకు గూడ యిండియాలో పూర్వం యుగయుగాలనుంచి తెలిసేవుంది.

ఇప్పుడు మనం యీ "చా"ను ఎంతో కులాసాగా నాగరకంగా, వాడుతూవున్నాం. అది "కులాసా కలిగించే తేనీరు"అని నిస్సందేహంగా చెప్పవచ్చు. కాని పూర్వకాలంలోగూడ మనం యిప్పుడు వాడుతున్న మాదిరిగానే తేయాకు వాడబడుతూవున్నట్లు రికార్డుల పూర్వకంగా దృష్టాంతాలేమిన్నీ లేవు. ఏదో శాఖాహారంక్రింద "మియాంగ్ లెట్"అనీ, లేక తేయాకు ఊరగాయఅని వాడుతుండేవాళ్లు. తరువాత అది తేయాకు వెన్నవంటి ఒకవిధమైన చారు రసంగా ప్రఖ్యాతిపొందింది. దీనికి ప్రాముఖ్యం కలిగిన తరువాత గూడ యీ స్వదేశపానీయం ప్రజాదరణ బొందటానికి ఎంతో కాలంపట్టింది.

ఇండియానేలలో నాటడానికి పనికివచ్చే తేయాకు మొక్క ఒక్క చీనాదేశంలోనే దొరుకుతుందని పూర్వకాలపు బ్రిటిషువ్యాపారస్థులు,డచ్ వణిక్కులు, పోర్చుగీసు వర్తకులు నమ్ముతూవచ్చారు. కొంచెం ద్రావిడ ప్రాణాయామమైనప్పటికి, నిజంగా విచారిస్తే వాళ్ల యీ డొంకతిరుగుడు నమ్మకానికైనా మనం యెంతో కృతజ్ఞులమైవుండాలి. ఎందుకంటే, ఆ సాహస విక్రమార్కుల ప్రయత్నాలూ, పవిత్రమైన యీ తేయాకుమొక్కను తీసికొనిపోవడానికి సాధనభూతాలయిన వాళ్ల రంగురంగుల పడవలూ, లేకుండా వుంటే, మనకు యింతగా సేదదీర్చి ఉత్సాహం కలిగించే యీ దివ్యమైన పానీయం, కెమెలియా వృక్షకోటిలో జేరిన యేదోఒక జాతిచెట్టునకు సంబంధించినదిగా పరిగణింపబడేదేకాని, అనుభవయోగ్యానికి వచ్చేదికాదు. "టీ గురించిన సర్వస్వం" అనే పుస్తకాన్నివ్రాస్తూ యీ మధ్య విలియం హెచ్. యూకర్సు అనేదొరగారు తెలిపిందేమంటే:—

"1780 సంవత్సరంలో ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీవారి తాలూకు దళాధిపతులు కాంటన్ పట్నం నుంచి చీనాదేశపు తేయాకుగింజలను కొన్ని కలకత్తాకు తీసికొనివచ్చారు. వీటిలో కొన్నింటిని అప్పటి గవర్నరు జనరలు వారన్ హేస్టింగ్సు, భూటాన్‌లో వున్న జార్జిబాయిల్ అనే దొరగారికి పంపాడు. తక్కినవాటిని బంగాళా సైనిక పటాలానికి అధిపతిగా వున్న లెఫ్టెనెంట్ కర్నల్ రాబర్టు కిడ్ గారు కలకత్తావద్ద శిబ్‌పూరులోవున్న తన బొటానికల్ తోటలో నాటాడు. వాటిని యెట్లా పెంచవలెనో, వాటివిషయమై యేవిధముగా శ్రద్ధ తీసికొనవలెనో మొదలయిన సంగతులు సరిగా తెలియకపోయినప్పటికి అవి బాగానే మొలిచి వృద్ధిపొందినవి. అప్పుడు కుంఫిణీవారు యేలుతున్న మన హిందూదేశంలో పైరుఅయి పెరిగిన తేయాకుమొక్కలలో అవే మొట్టమొదటివి."

అయితే, యీ తేయాకుమొక్క హిందూదేశంలో పుట్టిందా కాదా అనే రాద్ధాంత సిద్ధాంతాలతో కాలం గడపకుండా, చీనాదేశపు మొక్కలనే యిక్కడ పైరుచేయు సాధనాలగురించి యెక్కువగా శ్రద్ధతీసికొన్నట్లు కనపడుతుంది. 1788 లో సర్ జోసఫ్ బ్యాంక్సు అనే దొరగారు ఉండేవాడు. ఆయన గొప్ప ప్రకృతిశాస్త్రజ్ఞుడు. భారతదేశంలో కొత్తకొత్తపైర్లను పండించడానికి ఆయన అనేక మార్గాలను సూచించాడు. వాటిలో తేయాకు మొక్కను శిఫారసు చేసింది బీహారు, రంగపూర్

గత నూరు సంవత్సరాల్లో, ఇండియా తేయాకు ప్రపంచానికంతా తెలిసిపోయింది. అది యిప్పుడు యితర ప్రపంచానికి హిందూదేశపు రాయబారిగా వుండి ప్రాక్పశ్చిమదేశాలమధ్య సన్నిహిత స్నేహ బాంధవ్యాలను పెంపొందించడానికితోడ్పడుతున్నదని చెప్పడానికి యేమి సందేహంలేదు. ఇంటియన్ టీ పరిశ్రమకు షుమారు నూరుకోట్ల రూపాయలు ఖర్చు యినవి. ఇంచుమించుగా 800,000 యెకరాల విస్తీర్ణం గల 5000 తేయాకుతోటలలో యిప్పుడు తేయాకు పైరవుతున్నది. సుమారు 10,00,000 మంది ప్రజలు యిండియన్ టీ పరిశ్రమలో పనిచేస్తున్నారు.

సమస్తదేశాలవారికి ఉత్తమమైన యిండియన్ టీని త్రాగే అవకాశం లబ్బింది. అయితే మన యింటి పెరటిచెట్టు మనమందుకు పనికిరాదనే సామెతగా యితర ప్రపంచమంతా, యిండియా టీని యెంతో మక్కువపడి మానకుండా త్రాగుతూవుంటే, ఇక్కడ మన భారతదేశంలో మన భారతీయులు దివ్యమైన మన స్వంతపానీయంలోవుండే ఉత్తమగుణాలను గుర్తించడంలో యింకా పెండ్లినడకలు నడుస్తూ మీనమేషాలను లెక్కపెడుతుండడం ఆశ్చర్యంగా వుంది.

ఇండియన్ టీయొక్క నిజమయిన విలువను మనం గుర్తించేటట్లు చేయటానికి యీ "తేయాకు ఉద్యమము" బయలుదేరింది. కాబట్టి మీ ధర్మాన్ని మీరు నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాము. తేయాకు విషయంలో యెక్కువ శ్రద్ధ పుచ్చుకొని పనిచేయండి. "ఇండియనులకు యిండియన్ టీ" అని చెప్పడమే కాకుండ "ఏ సమయమైనా టీ త్రాగే సమయమే" అన్న సంగతిని జ్ఞాపకముంచుకోండి.

కూచ్ బీహార్ జల్లాలకు. 1823 వరకు ఇండియా తేయాకును కనుకొన్నట్లు మనకు నమ్మతగే రికార్డులు యేమీ లేవు. ఆ సంవత్సరంలో రాబర్టు బ్రూస్ అనే ఆయన అప్పుడు బ్రిటిష్ యిండియా తూర్పు సరిహద్దులకు అవతలవుండే బర్మా, అస్సాం ప్రాంతాల్లోకి వ్యాపారపు దండయాత్రలను సాగించాడు.

అదిగో! అప్పుడు దొంగ బైటపడ్డాడు. శివసాగర్ దగ్గరవున్న కొండలవైపు యీ దేశీయ తేయాకుపొదలు విచ్చలవిడిగా పెరుగుతున్న సంగతి ఆయన కంటపడ్డది. ఆయనకు అవి బంగారపుగనులలాగ తోచినవి. వాటిని వదలిపెట్టడానికి బుద్ధిపుట్టక ఆ తేయాకుమొక్కలు, తేయాకుగింజలు తనకు సప్లయి చేస్తూ వుండేటట్లుగా అక్కడవున్న సింగపూరు నాయకుడితో ఖరారు చేసుకున్నాడు.

అప్పటినుంచి దానికి వైభవం యెత్తుకుంది. కలకత్తాలోవున్న వర్తకసంఘానికి దాని పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలిసికొనడానికి కొంతకాలంపట్టినా, తరువాత తరువాత, ఇండియా దేశపు తేయాకు వాళ్ల దృష్టిని బాగా ఆకర్షించింది.

ఇప్పుడు యింతవ్యాప్తికి వచ్చిన "తేయాకు సంఘాన్ని" సుమారు ఒకశతాబ్దం క్రిందట లార్డు విలియం బెంటిక్ అనే దొరగారు స్థాపించి తేయాకు పరిశ్రమాభివృద్ధికి కారణభూతుడైనాడు. ఈ సంఘం వాళ్లుచేసిన కృషి ఫలితంగా, తేయాకుపైరు అస్సాంలో పెరిగిందన్న సంగతి ఖండితంగా నిర్ధారణ అయింది. లార్డు విలియం బెంటిక్ దొరగారు యీ సంఘాన్ని స్థాపింపకపోయినట్లయితే, ఇండియా తేయాకును గురించి యింతశ్రద్ధ తీసికొనేవాళ్లు లేక, అది పురిటిలోనే సందుకొట్టిపోయేది.

# భారతనారి ఆదర్శము

స్వామి వివేకానందగారు

జాతీయజీవనమును బ్రహ్మచర్యాదర్శమును ప్రతిష్ఠింప బూనుకొనినచో ప్రప్రథమమున వివాహమును పవిత్రవంతముగాను, విచ్ఛేదరహితముగాను ఒనర్చవలెను. దీని సాయముననే మాతృపూజాసాధనము నొనర్చవలెను. రోమన్ క్యాథలిక్కులు, హిందువులు వివాహముయొక్క పవిత్రతను రక్షించి, దానిని తెంపకుండినవారగుట చేతనే శక్తిశాలురగు స్త్రీపురుషుల సృజింపగలిగిరి. అరబ్బుల దృష్ట్యావివాహ మొక బలవదధికారము. ఇష్టమువచ్చినప్పుడు దానికి తిలాంజలి నొసగవచ్చును. కాన బ్రహ్మచర్యాదర్శమును వారియందు కనుగొనజాలము. బౌద్ధమతము వివాహస్ఫురణ నందని జాతుల చేతబడుటచే ఆదేశీయుల యందింకను సన్యాసప్రహసనము జరుగుచునేయున్నది. శక్తిశాలురగు కుమారబ్రహ్మచారి, బ్రహ్మచారిణు లుద్భవింపవలెనన్న జనసాధారణముయొక్క వైవాహిక జీవనమును పవిత్రతమ మొనరించుట ఆవశ్యకము.

వివాహవిషయమున భారతీయ పాశ్చాత్య ఆదర్శములు భిన్నములు. పాశ్చాత్యుల వివాహమన్న శాసనబంధము. భారతీయ దృష్టా వివాహమన్న భార్యాభర్తల కిర్వురకు ఎడతెగని అనంత సంబంధమును ఘటిల్లజేయు వ్యవస్థ. వారికిష్టముండనీ, ఉండకపోనీ రాబోవు జన్మలలో వారొండొరుల భార్యాభర్తలుగ పొందుదురు. వారొండొరులు వారివారికర్మల సగపాలు ననుభవింతురు. వారిలో నేయొకరైన వెనుకబడినచో, వెనుకబడినవారు సహధర్మిణి లేక సహధర్మి శబ్దవాచ్యులగు నంతవఱకు ముందుననడిగినవారు వేచియుండవలసినదే.

భార్యయన హిందువులకు సహధర్మిణి. హైందవు డనేక ధర్మకార్యముల నొనర్చవలసియున్నాడు. భార్యలేనిదే అవిసాగవు. పురోహితుడు వారిర్వుర బంధించును. ఆస్థితిలోనే వారు దేవాలయములను, పుణ్యక్షేత్రములను దర్శింతురు.

భారతీయ రమణులెట్లుండవలెను? సీత వారి ఆదర్శము. భారతీయుల చరిత్రలో నున్న యువతుల ఆదర్శములన్నియు సీత చరిత్రలో కేంద్రీకరింపబడినవి. సీతాదేవి ఆర్యావర్తమున వేలకొలది యేండ్లనుండి వనితలందరివలన పూజింపబడుచున్నది. మహామహిమమయియగు సీత శుద్ధతకంటె శుద్ధురాలు. సహిష్ణుతయొక్క పరమాదర్శము. ఇట్టి సీత ఎప్పటికిని పూజలనందుచునే యుండగలదు. తిలమాత్రమైన చీకాకుపడక అట్టి దుఃఖమయజీవనమును

గడపినట్టి సీత, ఆ ఆదర్శస్వభావురాలు, ఆసాధ్వి, మనుష్యలోకమున కంతటికిని, ఒక్కమనుష్యలోకమునకే యననేల—దేవ లోకమునకుగూడ ఆదర్శనీయురాలు. సీత ఆచంద్రతారార్కము మన జాతీయదేవతయై నెగడగలదు. ఆపె వృత్తాంతము మన కందఱికిని దెలిసినదే కాన దానిని వివరించుట అనావశ్యకము. మన పురాణము లన్నియు వినష్టములై పోవచ్చును, మన వాదమేలు ప్తమైపోవచ్చును,మన సంస్కృత భాష కాలస్రోతమునబడి అంతర్హితమై పోవచ్చును కాని భారతదేశమున గ్రామ్యభాషను మాట్లాడు నల్గురైదుగురు హైందవులున్నను సీతయొక్క చరిత్ర నిల్చియేయుండును. సీతయొక్క చరిత్ర మనకు అస్థిమజ్జాగతమైనది. ప్రతి హిందూనారియొక్క రక్తమున సీత ప్రవేశించియున్నది. మనము సీతయొక్క బిడ్డలము. ప్రస్తుతము నారీగణమును ఆధునిక భావములతో తయారు చేయుటకుగాను ఒనర్పబడు యత్నములన్నియు,—వాటి మధ్య సీతయొక్క ఆదర్శము లేనియెడల—నిష్ఫలములగును. భారతీయ యువతీమణులెల్లరు సీత నాదర్శముగా గైకొని ఆపెఅడుగుల జాడ ననుసరించుచు తమ ఔన్నత్యము కొరకు పాటుబడవలెను. ఇదొక్కటే వారి ఉన్నతికగు మార్గము.

భారతదేశమున బాలబాలికలు సీతాదేవిని పూజింతురు. ముఖ్యముగా బ్రతి బాలికయు ఒనర్చితీరును. భారతీయ రమణుల తీవ్రవాంఛ—సీతవలె కావలెనని, ఆయమయొక్క విశుద్ధస్వభావమును, పతి పాతివ్రత్యమును అన్నిటిని సహింపగల ఓరిమిని బడయవలెనని. ఈ విషయముల నాలోచించునప్పుడు భారతీయ, పాశ్చాత్య ఆదర్శముల తారతమ్యమును తేలికగనే గ్రహింపగలరు. భారతీయునకు సీత సహిష్ణుతయొక్క పరమాదర్శము. పాశ్చాత్య దేశము లనునుకదా—'కర్మ నొనర్పుము, ఒనర్చి నీశక్తి చూపింపుము' భారతమనును కదా—'కష్టదుఃఖములను సహించి నీ శక్తిని ప్రదర్శింపుము.' మనుష్యు డెంతగ అధికసంపదల పొందగలడో పాశ్చాత్యులు చూపినారు; మనుష్యు డెంతగ అల్పపరిమాణ విషయములతో జీవితమును గడపగలడో భారతీయులు చూపినారు. ఈ రెండు ఆదర్శములు ఒకేభావముయొక్క చరమసీమ. సీతాదేవి భారతీయభావముల ప్రతినిధి స్వరూపము, రూపుదాల్చిన భారతమాత. సీత యను నాపె వాస్తవముగనుండెనా, సీతాదేవి కథ చారిత్రకమా అను విషయముల గుఱించి కాదు మేము చర్చించునది. కాని, సీతాదేవి ఉపాఖ్యానమున ప్రదర్శింపబడిన ఆదర్శ మింకను భారతదేశమున నిల్చియేయున్నదని మే మెరుంగుదుము. సీతాదేవి ఆదర్శము భారతదేశము నంతటిని ఆచ్ఛన్న మొనరించినది. ఇది జాతీయజీవనమున జాతియొక్క నరనరమున ప్రతిరక్తబిందువున ప్రవేశించినట్లు మరే పౌరాణిక ఉపాఖ్యానము ప్రవేశించలేదు. సీతనామము శుభమును, విశుద్ధమును

పుణ్యమును అగు దానియొక్క పరిచయ వాచకము. మన మేరీతిగ నారీజాతిని గౌర వించునది, ఆదరించునది సీతాశబ్దమున నభి హితమైయున్నది. ఆశీర్వదించినప్పుడు 'సీతా మ్మవారివలె కమ్ము' అందుము. భారతీయ నారులు తమ్ము సహిష్ణుతామూర్తియు, పతిపరాయణయు, విశుద్ధస్వభావురాలును, రామభార్యయునగు సీతయొక్క సంతాన ముగా భావింతురు. ఆయమ అన్నికష్ట ముల సహించినది గాని రాముని పల్లెత్తు మాటైన అనలేదు. ఈ దుఃఖకష్టముల సహించుట కర్తవ్యముగా భావించిన దా బిడ్డ; చలింపక, శాంతముగ అన్నిటిని సహించినది. ఆమె వనవాస మెంత ఘోర మైనదో, విచారశూన్యమైనదో ఆలోచిం పుడు—కాని, ఆమె హృదయమున విసుగు ప్రవేశింపలేదు. ఇట్టి తితిక్షయే భారత దేశముయొక్క విశేషము. బుద్ధభగవానుడు పల్కియున్నాడు: —'దెబ్బకు దెబ్బ నిచ్చిన దానివలన నగున దేమియులేదు. కేవలము జగత్తున మరొక పాపము హెచ్చుటతప్ప.' ఈ విశేషభావము సీత యొక్క ప్రకృతిలోనేయున్నది. అన్యాయ ప్రతీకారచింత ఆమెయెదలో ప్రవేశింపలేదు.

భారతదేశమున ప్రతిబాలికకు సావిత్రి వలె పతివ్రతయగునట్లు ఉపదేశ మీయ బడును. ఆమె ప్రేమ ముందు మృత్యువు జయింపబడెను. ఆమె తన ప్రేమబలమున యమునినుండి తన భర్తను పొందగలిగెను.

* * *

హిందూమతము మానవునికొఱకు నిర్దే శించు ఏకమాత్ర కర్తవ్యము—ఒక్కటే— అనిత్యతయందు నిత్యవస్తు సాక్షాత్కార ప్రయత్నము; కాని, దీనిని సాధించుటకు గాను ఒకేమార్గమును సూచింప సాహసిం పదు. వివాహము, బ్రహ్మచర్యము, మంచి చెడుగు, విద్యమూర్ఖత్వము,—ఏ విషయ మైన కానీ, చరమ లక్ష్యమునకు గొనిపోవ సాయపడును. మహాభారతమందలి ఆతరుణయోగి కథ—క్రోధానలమున పక్షుల భస్మమొనరించి, పతివ్రత, ధర్మ వ్యాధులకడ నుపదేశమంది సాధననొనర్చి తత్వజ్ఞానము నందినవాని కథ—గుర్తునకు దెచ్చుకొనుడు.

* * *

ఈదేశమున పురుషుడు స్త్రీలయెడ నిట్టి భేదబుద్ధి నెందులకు వహించినాడో తెలిసి కొనజాలము. మఱి, వేదాంతశాస్త్రము వచించుచున్నది కదా, ఒకా చిత్ వస్తువు సర్వభూతముల వెలయుచున్నదని. మీరు స్త్రీనిందనే ఒనర్చుచున్నారు. కాని, వారి మంచికై ఏమొనర్చితిరో చెప్పుడు. స్మృతు లను వ్రాసి, నియమముల బద్ధమొనర్చి పురుషులు స్త్రీలను సంతానోత్పాదనా యంత్రములుగా మార్చివైచినారు. మహామాయ (జగన్మాత)యొక్క ప్రత్యక్ష విగ్రహములగు వీరిని పైకి తీసుకొనిరానిచో మీకితర మార్గమున్నదా? ఏ శాస్త్రమం దైన యువతులు భక్తిజ్ఞానముల కధికారి

ణులు కాజాలరని వ్రాయబడియున్నదా? బ్రాహ్మణులు తదితరజాతులవారు వేదపాఠార్హులని వచించినప్పుడే భారతదేశమునకు పతనము సంభవించెను; అప్పుడే స్త్రీల వేదాధికారమునుగూడ లాగికొనిరి. వేదకాలమున, ఉపనిషత్తుల కాలమున, మైత్రేయి, గార్గి, ప్రభృతులగు స్త్రీలు బ్రహ్మవిచారమున పురుషులతో సమానముగ నిలబడ గలిగియుండిరి. వేలకొలది వేదజ్ఞులున్న సభలోలేచి, గార్గి యాజ్ఞవల్క్యుని బ్రహ్మవిచారమున కాహ్వానించినది. ఒకప్పుడు వీరికీ ఆధ్యాత్మిక జ్ఞానాధికారమున్న ఇప్పుడుమటుకెందులకుండ గూడదు? ఒకప్పుడు జరిగినది మరొకప్పుడు జరుగవచ్చును. ఇయ్యది చరిత్రప్రసిద్ధము.

పరబ్రహ్మతత్త్వమున లింగభేదములేదు. మనస్సు బహిర్ముఖమై యున్నప్పుడు లింగభేదము కన్పట్టును. మనస్సంతర్ముఖమైన లింగభేదము తొలగిపోవును. తుదకు సమరస బ్రహ్మతత్త్వమున మనస్సు మునిగినప్పుడీ పుంస్త్రీ భేదజ్ఞానము సంపూర్ణముగా నంతర్హితమై పోవును. మేము శ్రీరామకృష్ణుని యందీవిషయమును ప్రత్యక్షముగా గాంచితిమి. అందువలననే, బయటికి భేదమున్నప్పటికి స్వరూపత, ఎట్టిభేదమును లేదని వచించుచున్నాను. పురుషుడు బ్రహ్మజ్ఞుడవ గలిగినచో స్త్రీమటు కెందులకు కాజాలదు? సర్వావభాసాత్మకమగు ఆత్మతత్త్వమును ప్రత్యక్షమొనర్చుకొన గలిగినప్పుడీ లింగభేదము అంతర్హితమైపోవును. శ్రీరామకృష్ణునికి స్త్రీయన్నమాత్రమునసే మాతృబుద్ధి సజాతిదైనగానీ ఎట్టిదైనగానీ.

* * *

పురుషునికవసరమైనట్లే, యువతులకుఁ గూడ బ్రహ్మచర్య మత్యంతావశ్యకము. పూర్ణయోగి కావలెనన్న లింగాభిమానమును త్యజింపవలెను. ఆత్మకు లింగభేదము లేదు, అగుచో నయ్యది తన్నుదా లింగాభిమానమునువహించి కలుషత మొనర్చుకొనుటా? స్త్రీపుంభేదము ఆత్మయందారోపింపబడిన భ్రమమాత్రమే—శరీరవిషయమునగూడ నియ్యది సత్యము.

(అనువాదకుడు: శ్రీ పూర్ణానంద)

# శాంతి

"శ్రీ ప్రేమచంద్ జీ"

నేను అత్తవారింటికివచ్చాను. అప్పట్లో నేను చాలా తెలివితక్కువగా ఉండేదాన్ని. బట్టలు ధరించడం ఎలాగో ఒకరితో మాట్లాడటం ఎలాగోకూడ బొత్తిగా నాకు తెలిసేదికాదు. తలఎత్తి ఎవరితోనూ మాట్లాడలేక పోతూవుండేదాన్ని. కండ్లు వాటంతటఅవే వాలిపోతూఉండేవి. ఎవరిదగ్గరకైనా వెళ్లాలంటే సిగ్గుగాఉండేది. స్త్రీలఎదుటకైనా సరే ముసుగులేనిదే వెళ్లడానికి సందేహంగ ఉండేది. నేను కొద్దిగా హిందీ చదువుకున్నాను. కాని నవలలు నాటకాలు అంటే నాకు ఇష్టంవుండేది కాదు. అవకాశం దొరకినప్పుడల్లా రామాయణం చదువుతూఉండేదాన్ని. రామాయణం అంటే నాకు చాలాఇష్టం. దాన్ని మనుష్యులు వ్రాశారనుకోను. దేవతలువ్రాశారని నా నమ్మకం. నేను ఇంట్లో ఏదోఒక పనిచేస్తూఉంటాను. ఏమీ పనిలేకపోతే రాట్నం ఒడుకుతూఉంటాను.

మా అత్తగారంటే నాకు చాలభయం. ఒకరోజున పప్పులో ఉప్పు ఎక్కువయింది. మా మామగారు భోంచేస్తూ ఉప్పు కొంచంఅంచనాగావెయ్యమన్నారు. ఇంతకంటె వారు ఏమీ అనలేదు. ఆమాట వినగానే నాహృదయం కంపించిపోయింది. ఆ మాటకంటే నన్ను వేధించే దింకొకటి లేదనుకున్నాను. కాని నా తెలివితక్కువతనం మా బాబుజీకిఅనగా నాభర్తకు ఇష్టం ఉండేదికాదు. వారు వకీలుపని చేస్తూఉండేవారు. మంచిమంచి డిగ్రీలుకూడ పొందారు. వారు నన్ను ప్రేమిస్తూఉండేవారు. కాని ఆప్రేమలో దయ ఎక్కువకనిపిస్తూఉండేది. స్త్రీల ఆచారాలు వారివిద్యా సంబంధమైన విషయాల్లో వారు చాలా ఉదారులు. ఆకారణంచేత నా పద్ధతులుచూచి వారు చాల విచారిస్తూవుండేవారు. నాతో మాట్లాడుతూవుంటే వారికి ఏమీ ఆనందంగాఉండేదికాదు. నిద్రవస్తే ఏదైన ఇంగ్లీషుపుస్తకం చదువుతుంటే ఏం చదువుతున్నారు అని నేను అడిగినప్పుడు నావంక దయతో చూస్తూ "ఏమిచెప్పను? నీకు ఏమితెలుస్తుంది" అంటూ ఉండేవారు. నా అసమర్ధతకు సిగ్గుపడేదాన్ని. "ఇలాంటి విద్వాంసునకు నేను తగను" అనుకునేదాన్ని. కాని బాబుజీ నన్ను ఎప్పుడు నిరాదరణగా చూడలేదు.

ఒకరోజున సాయంత్రం రామాయణం చదువుతూ వున్నాను. దానిలో భరతుడు రాముని వెదుక్కుంటూ బయలుదేరాడు. అతని కరుణాక్రందన ఘట్టం చదువుతూవుంటే నా హృదయం దుఃఖంతో నిండిపోయి కళ్లనుండి నీళ్లు ప్రవహిస్తున్నాయి. దుఃఖంపొంగి వస్తూంది. ఇంతలో బాబూజీ గదిలోపలికి వచ్చారు. నేను వెంటనే పుస్తకం మూసివేశాను. వారిఎదుట నా తెలివితెక్కువతనాన్నికప్పిపుచ్చాలనిప్రయత్నించాను. కాని వారు పుస్తకాన్ని చూచారు. రామాయణమా అన్నారు. నేను అపరాధినివలె తలవంచుకొని ఆవునన్నాను. పుస్తకము చాల మంచిభావములతో నిండియున్నది కాని మానవస్వభావము ఆ గ్రంథంలో అంతబాగా చూపించలేదు. ఇంగ్లీషు లేఖకులు ఫ్రెంచి లేఖకులు అలా చూపిస్తారు. నీకు ఈసంగతులు తెలియవన్నారు. ప్రస్తుతం ఇంగ్లండులో స్వాభావికత ఉంటుంది. వారుకాలానుసారంగా కథలు వ్రాస్తారు. వాటిని చదువుతూవుంటే చాలఆశ్చర్యం కలుగుతుంది. మనకవులు అడుగడుగునకు ధర్మములు నీతులును భోధిస్తూవుంటారు. అందుచేత అప్పుడప్పుడు వారి భావములందు అస్వాభావికత వస్తూవుంటుంది.

ఈ లోటే రామాయణములో కూడా వున్నది. బాబూజీమాటల్లో అర్థం నాకేమి తెలియలేదు. నాకు రామాయణం చాలా బాగుంటుంది. ఇంగ్లీషుపుస్త

కాలు నాకు యెలా తెలుస్తాయి అన్నాను. "ఏమీ కష్టంలేదు. ప్రతిరోజూ ఒకగంట చదివినట్లయితే కావలసినంత యోగ్యత సంపాదించుకోవచ్చు. నీవు నామాటే వినవు. ఎంతచెప్పినా నాదగ్గర నీకు సిగ్గే పోదు, ఎంత చెప్పినా ప్రయోజనంలేదు. కొంచెం శుభ్రంగాఉండు. పరమాత్ముడు మనకు సౌందర్యాన్ని ఇచ్చాడు. దానిని మనం శృంగారించుకొని వృద్ధి పొందించుకోవాలి. కాని నీదృష్టిలో వాటికి నీవు యోగ్యత యివ్వడంలేదు. కురూపియైన భర్తవద్ద ఎలాఉంటేనేమి అనుకుంటావు. నీవు నాకు బలాత్కారంగా వైరాగ్యం నేర్పాలనుకుంటున్నావు. నేను రాత్రింబగళ్లు కష్టపడి సంపాదిస్తున్నాను. నా కోరిక ఏమిటంటే ఆద్రవ్యాన్ని నీవు చక్కగా విని యోగించాలి. కాని నీ తెలివితక్కువతనం పురాతనపు అభిప్రాయాలు నాకష్టాన్నంతాను వ్యర్థం చేస్తున్నాయి. స్త్రీలు కేవలం వంటచేయడానికి, పతిపూజ చేయటానికి, ఏకాదశీవ్రతాలు చేయటానికి కాదు. వారి జీవితాభిప్రాయాలు చాలగొప్పవి. వారు పురుషుల సామాజికవిషయములందు, మానసికవిషయములందు సమానరూపంగా భాగాలను తీసుకొనడానికి అధికారిణులు. వారికి పురుషులవలె స్వతంత్రంగా ఉండటానికికూడా అధికారంఉంది. నాకు నీ అమాయకత్వం చూస్తే చాలకష్టంగాఉంది. స్త్రీ పురుషుని అర్థాంగి. కాని నీవు నన్ను మానసికంగాగాని సామాజికంగాని ఏవిధంగాకూడ సంతోషపెట్టలేకుండా వున్నావు. నా ఆచారాలు విచారాలు ధర్మాలు వేరు. నీ ఆచారాలు నీధర్మాలు వేరు. జీవితంలో ఏపనిలోను నాకు నీవల్ల యేవిధంగాకూడ సహాయం లేదు ఏమైన ఆలోచిస్తున్నావా? నా జీవితం ఏవిధంగా నాశనం అవుతుందో అన్నారు.

బాబూజీ చెప్పినమాటలు యథార్థము. నేను వారిమెడలో ఒక ఇనుపగొలుసులాగా ఉన్నాను. ఆరోజునుండి నేను వారుచెప్పినప్రకారము నడచుకోటానికి ప్రతిజ్ఞచేసుకున్నాను.

౨

మంచిమంచిబట్టలు కట్టుకోవడమన్నా నగలు సింగారించుకొనడమన్నా నాకు యిష్టంలేదని ఎలా చెప్పగలను. ప్రపంచంలో ప్రతిస్త్రీకి ఈకోరిక ఉంటుంది. బాలికనిదగ్గరనుండి వృద్ధులవరకూగల ప్రతివ్యక్తికి సింగారించుకోవడమంటే సరదాగా వుంటుంది. అందులో నేను యువతిని. మాకన్నవారింట్లో చేతిమీదవడకిన మోటుబట్టలు వేసుకోడం అలవాటు. మాఅమ్మ నాయనమ్మ స్వయంగా రాట్నంవడకి నూలుతీస్తారు. సాలెవానిచేత బట్టలు నేయిస్తారు. అందుచేత బయట బట్ట చాల తక్కువగా కొంటాము. నేను ఎప్పుడైనా సన్నచీర కట్టుకున్నా, శృంగారించుకున్నా, పెద్దఇంటిబిడ్డలకు తగదని వెంటనే మాఅమ్మ కోప్పడుతూవుండేది. ఎప్పుడైనా అద్దంలో ముఖంచూచుకున్నాకూడా ఆమెకు చాలా కోపంగా ఉండేది. కాని బాబుజీ పట్టుదలవలన నా సందేహాలన్నీ పోతున్నాయి. నాఅత్తగారు ఆడుబిడ్డలు నాముస్తాబునుచూచి మండిపడుతూవుండేవారు. కాని ఇప్పుడు నాకు వారంటే లెక్కలేదు. బాబూజీ ప్రేమకు పాత్రముకావడమే — ఆయనను సుఖపెట్టడమే నాఉద్దేశము. ఇప్పుడు ఆయన అభిప్రాయాలకు నాఅభిప్రాయాలకు సామ్యం కుదురుతూవున్నది. ఇప్పుడాయన చాల ప్రసన్నులుగాఉంటున్నారు. నాకోసం ఫేషన్ చీరెలు, అందమగుజాకెట్లు, మెరుస్తూ ఉండే స్లిప్పర్సు తెస్తూవున్నారు. కాని ఈవస్తువులను ధరించి ఎవరియెదుటకు పోయేదాన్నికాను. ఈవస్త్రములు కేవలం ఆయనఎదుటే ధరిస్తూ ఉండేదాన్ని. నన్నుచూస్తే మావారికి చాల సంతోషంగాఉండేది. స్త్రీ తనభర్తను ప్రసన్నునిచేయుటకు ఏమిచేయదు? ఇప్పుడు నాకు యింటిపనులు చేయుటఅంటే ఆస తగ్గింది. కాలముఅంతా సింగారించుకొనడముతోను, పుస్తకాలు చదువుటతోను గడచిపోతూంది. నాకు పుస్తకాలంటే ప్రేమ ఎక్కువయింది.

నేటివరకు నా అత్తమామలను గౌరవించుతూ వుండేదాన్ని. బూట్లు, గౌను వేసుకొని వారిఎదుటకు వెళ్ళడానికి నాకు సాహసం ఉండేదిగాదు. నాభర్త వందలకొలది రూపాయలు సంపాదిస్తూవుంటే నేను యింట్లో దాసిలాగా ఎందుకుండాలని అనుకొన్నాను. నాకోరికప్రకారం చెయ్యాలనుకున్న పని చేస్తాను లేకపోతే లేదు. నాకు ఆజ్ఞాపించేవారు ఎవరు? నాకు ఆత్మాభిమానం వృద్ధిఅయింది. అత్తగారు ఇంట్లో నాకు ఏదయిన పనిచేయమని చెప్పినట్లయితే మహా విసుక్కుంటూ ఉండేదాన్ని. ఒకరోజునఉదయం ఫలహారం తయారుచేయమన్నారు. నేను వినీవిననట్లుగా వెళ్లిపోయాను. ఆమె కొంచెము సేపటివరకు నాకోసం యెదురుచూచింది. నేను గదిలోనుండి రాకపోయేటప్పటికి ఆమెకు కోపంవచ్చింది. ఆమెది సహజంగా కోపస్వభావం. కొంచెముమాటనుకూడ పెద్దదిచేసి అల్లరిచేస్తుంది. ఆమె కేవలం నన్ను దాసీలాగా చూచేది. తనకుమార్తెలను చాలా ఆదరంగా చూచేది. ఆమె రుసరుసలాడుతూ గదితలుపు దగ్గరకు వచ్చి ఫలహారం తయారుచేశావా అని అడిగింది. ఇప్పుడు అవకాశంలేదని జవాబు చెప్పాను.

"పనిచెయ్యకుండా కూర్చునుటే నీపనా? ఏమిటా గర్వం. నా భర్త సంపాదిస్తూంటే నేను పని ఎందుకు చెయ్యాలనుకుంటున్నావా? నీభర్త లక్షలు సంపాదించినాసరే ఇంట్లో అధికారం నాదే. వాడు నాలుగుపైసాలు సంపాదించటం ప్రారంభించాడు. నీవు రాణిగారులాగు తయ్యారవ్వాలనుకుంటున్నావు. కాని వానిని పెంచి పెద్దవానిని చేసినప్పుడు నీవు రాలేదు. నేనే వానికి విద్యాబుద్ధులుచెప్పించి యోగ్యుణ్ణిచేశాను. ఏమివేషాలు. నిన్న దిగావోలేదో అప్పుడే నెత్తిమీద కూర్చోవాలనా ఆలోచన?" అని విదలించింది. నేను ఏడవటం మొదలుపెట్టాను. నోటినుంచి ఒక్కమాటైనా రాలేదు. బాబూజీ ఆసమయంలో మేడమీదగదిలో కూర్చొని చదువుకుంటున్నారు. ఈపోట్లాటఅంతా వారు విన్నారు. వారికి చాల కష్టంకలిగింది. రాత్రి గదిలోకిరాగానే "అమ్మ కోపం ఆ దురుసుతనమూ చూచావా, ఈలాంటి స్త్రీలవలననే స్త్రీలకు తమ జీవితములు పర్వతాల్లాగా తోస్తూవున్నాయి. హృదయములో ఎంత వేదన కలుగుచున్నదో తెలుసుకొనుట కష్టం జీవితమే బరువైపోతూంది. ఎలాగంటే నీరు, ప్రకాశము, వాయువు లేనిచెట్లు ఎలా ఎండిపోతాయో అలాగే మనుష్యుల ఆత్మోన్నతికూడ ఆగిపోతూవున్నది. ఆమెకుమారుణ్ణి అవటంచేత ఆమెఎదుట యేమీ మాట్లాడలేను. నామీదకూడ ఆమెకు చాల అధికారంఉంది. కాబట్టి ఆమెకు విరుద్ధంగా మాట్లాడటం చాలసిగ్గు. అమ్మ స్వభావం మార్పుచెందదు. ఆమె తిట్టినట్లుపడటమూ లేక రెండవదారి చూచుకోవటమూ. చెప్పు నీ యభిప్రాయం." అన్నారాయన.

నేను జగుస్తూ మీయిష్టంయెలాగో అలాగే చేస్తాను అన్నాను. నేను ఇక నుండి చదువను. వ్రాయను. అత్తగారి ఇష్టప్రకారమే చేస్తాను. చదివి చేసేది ఏముంది అన్నాను.

"నీవు చదువుమానడం నాకు ఇష్టంలేదు. నిన్ను నాగరికత గలదానినిగా, విద్యావతిగా చేయడం నాకు యిష్టం. ఇవే అమ్మకు చాలకష్టం కలుగజేస్తూవున్నాయి. కాబట్టి వేరేవూళ్ళో ఉందాం. వకీలు పనికూడా ఇక్కడ దొరకటం లేదు" అన్నారు. నేను వారికి ఏమీ విరుద్ధముగా చెప్పలేదు. కాని వంటరిగా వుండాలని భయపడ్డాను. అయినా అక్కడ స్వతంత్రంగా వుండవచ్చునుగదా అని సంతోషించాను.

## 3

ఆరోజునుండి అత్తగారు నాతో మాట్లాడటం మానేశారు. ఇరుగుపొరుగువారిఎదుట, ఆడుబిడ్డల యెదుట, నన్ను పరిహాసంచేస్తూవుండేవారు. ఆమెమీద ఉన్నగౌరవం తగ్గింది. నేను మా ఆయనమీద ఏదో మోహనమంత్రం ప్రయోగించానట. అది నాదోషం.

భాద్రపద మాసము. జన్మాష్టమి వచ్చింది. ఇంట్లోవారంతా పూజచేసుకున్నారు. నేనుకూడ యథావిధిగా పూజచేశాను. ఠాకూర్ జీ జననం రాత్రి పన్నెండు గంటలకు అయిందట. మేమంతా కూర్చొని పాడుకుంటున్నాం. బాబూజీకి యివన్నీ గిట్టవు. వారు పండుగరోజున రంగుదగ్గరకుకూడా రారు. పాడటం, వాయించటం సంగతి చెప్పనే అక్కర్లేదు. రాత్రి ఒంటిగంటకు వారి గదిలోకి వెళ్లాను. వారు నాకు నచ్చజెప్పటం మొదలెట్టారు. "ఈవిధంగా శరీరాన్ని కష్టపెడితే లాభం ఏమిటి? కృష్ణుడు మహా పురుషుడే. కాబట్టి పూజచేయుట మనకు కర్తవ్యము. కాని ఈ తాళాలు, మేళాలువల్ల లాభం యేమిటి? యిదియంతా మోసం. వట్టి బాహ్యాడంబరం" అన్నారు.

బాబుజీ స్వయంగా ఈ మార్గాన్నే అనుసరిస్తూ ఉండేవారు. వారు భగవద్గీతను చాల ప్రశంసిస్తారు. కాని ఎప్పుడూ చదువరు. హిందూధర్మాలంటే వారికి చాల ఇష్టం కాని సమయానుకూలంగా ప్రవర్తించరు. భారతదేశం చెడిపోడానికి వేదాంతమే ముఖ్యకారణం అని అంటూ ఉండేవారు. ప్రపంచంలో ఉండే ప్రతిపదార్థాన్ని తుచ్ఛంగా చూస్తూంటే మనం అనుభవించేది ఏమిటి? ఎల్లప్పుడు నోరు మూసుకొని కూర్చుంటే మన నిర్వాహం ఎలా జరుగుతుంది?

ఆసమయంలో వాటికి సమాధానం ఇచ్చే శక్తి నాదగ్గర ఎక్కడున్నది? వారు యూరోపియనుల నాగరికతప్రకారం మాట్లాడుతున్నా రనుకున్నాను.

## ૪

కొన్ని దినములు జరిగిన తరువాత మేము అలహాబాదు వెళ్లాము. రెండంతస్తులమేడ అద్దెకు తీసుకున్నాము. ఆమేడ బాగా అలంకరించివుంది. మాకు ఐదుగురు నౌకర్లు—ఇద్దరు స్త్రీలు, ఇద్దరు పురుషులు. ఒకడు వంటవాడు. నాకు ఇంటిపనులతో ఎట్టి సంబంధములేదు. నవలలు చదువుకుంటూ కూర్చునే దాన్ని. భోజనం బల్లమీదికే వస్తూవుండేది. బాబుజీ చాల ఇష్టంగా భోంచేస్తూవుంటున్నారు. మొదట నాకు సిగ్గు కలిగింది. కాని నెమ్మది నెమ్మదిగా నేను కూడా బల్లమీదనే భోజనంచేయటం మొదలు పెట్టాను. మాకు ఒక అందమైన బండికూడావుంది. ఇప్పుడు మేము పది అడుగులుకూడా నడవటంలేదు. ఎక్కడికైనా వెళ్లాలిఅంటే బండి హాజర్. మావారు ఇదే ఫేషన్ అనేవారు.

మావారి రాబడి ఇప్పుడు చాల తక్కువయింది. అప్పుడప్పుడు వారు చింతగా వుండటం చూస్తూ వున్నాను. ఆదాయం తగ్గినప్పుడు వ్యయం తగ్గించుకుందామని, చిన్నిఇంట్లో ఉందామని, ఇద్దరు నౌకర్లు చాలని చెప్పాను. కాని బాబుజీ నవ్వుతూ చెపుతూ ఉండేవారు: "నేను నా దారిద్ర్యాన్ని స్వయంగా ఎందుకు డప్పువేసుకోవాలి. దరిద్రతను చాటాలి, మనము బీదవారమని మరచిపో. మళ్లీ లక్ష్మి స్వయంగా మనవద్దకు పరుగెత్తుకొని వస్తుంది. ఎక్కువగా ఖర్చుచేయుట ద్రవ్యోపార్జనకు మొదటిమెట్టు. ఇందువలన మనలో గుప్తముగావున్న శక్తులు వికసిస్తాయి" అని అన్నారు.

మాకు ఖర్చు దినదినము వృద్ధిఅవుతూవుంది. మేము వారమునకు మూడుసార్లు సినిమా చూస్తూవున్నాము. వారానికి ఒక్కసారి తప్పకుండా మిత్రులకు విందు చేస్తూవున్నాము. జీవితంలో ఇలాంటి సుఖాలు అనుభవించటమే లక్ష్యంగా పెట్టుకున్నాము. ఈశ్వరుడు మనకు మంచి వస్తువులు అనుభవించటానికి ఇచ్చాడు. వానిని అనుభవించుటే ఈశ్వరుని ఆరాధించటం. ఒక క్రిస్టియన్ లేడీ చదువు చెప్పటకు సంగీతం నేర్పటకు వస్తూవుండేది. ఇంట్లో ఒక పియానోకూడ హాజరయింది. ఈ ఆనందంలోపడి రామాయణం మరి భక్తమాల చదవటం మర్చిపోయాను. ఆపుస్తకాలంటే నాకు విసుగు, ద్వేషం. దేవతలమీద విశ్వాసం తగ్గిపోయింది.

నెమ్మదిగా నెమ్మదిగా పెద్దవారితో స్నేహము చేయటం మొదలుపెట్టాను. ఇది ఒక క్రొత్తసొసైటీ. వీరి ప్రవర్తనలు, ఆహారవిహారాలు నాకు చాల క్రొత్తగా కనిపించాయి. నెమళ్లలో కాకివలె నేను ఈ సొసైటీలో కనిపిస్తున్నాను. ఈలేడీలు సినిమాలను గురించి, అప్పుడప్పుడు పత్రికలను గురించి, మంచి మంచి లేఖకులను గురించి మాట్లాడుతూవుండేవారు. వాళ్లయొక్క చాతుర్యం, బుద్ధితీవ్రత చూస్తే నాకు చాల ఆశ్చర్యంగా ఉండేది. వారు ముసుగులేకుండగనే బయటకు వచ్చేవారు. వారి సాహసానికి నేను చకితురాలనయ్యేదాన్ని. వారు నన్నుగూడ తమవెంట తీసుకొని వెళ్లుటకు ప్రయత్నించారు. కాని నేను సిగ్గుచేతనే వెళ్లేదాన్ని కాను. నేను వారి ముఖములలో ఎప్పుడు విచారం చూడలేదు. మిస్టర్ దాసు నకు చాల జబ్బుగాఉంది; కాని మిసెస్ దాసు మొగముమీద చింతారేఖ కనిపించలేదు. మిస్టర్ బాగ్‌డీ క్షయరోగముతో హాస్పిటలులో ఉన్నాడు. కాని మిసెస్ బాగ్‌డీ నిత్యము టెన్నిసు ఆడుటకు వస్తూవుంది. ఈ లేడీల ప్రవర్తనలలో ఒక ఆకర్షణశక్తి ఉంది. అది నన్ను ఈడ్చుకొనిపోతూవుంది. వారు ఇంగ్లీషులో మాట్లాడుతూవుంటే కేవలం దేవతలే అనుకుంటూవుండేదాన్ని. నేను ఈలోటును పూర్తి చేయటానికి ప్రయత్నం చేస్తూవుండేదాన్ని.

బాబూజీ మొదటనుండి చాలా ఆదరంగా చూచారు. నన్ను ఎల్లప్పుడు డియర్, డార్లింగ్ మొదలగు నామములతో పిలుస్తూ ఉండేవారు. నాకు ఆమాటలయందు డాంబికం కనిపిస్తూవుండేది. ఆ మాటలు హృదయమునుండి గాక నాలుకచివరనుండి వస్తున్నాయని తలచేదాన్ని. చాల ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఆయనగారిమీద మొదట నాకున్న ప్రేమ యిప్పుడు లేదు. ఇప్పుడు వారికి తలనొప్పివస్తే నా హృదయానికి ఏమీ బాధకలగటంలేదు. నాకు ఆత్మగౌరవం హెచ్చసాగింది. ఇప్పుడు నేను దినమంతా సింగారించుకోటంలోనే గడుపుతున్నాను. ఇదే ప్రపంచంలో ముఖ్యకర్తవ్య మనుకున్నాను. నా సౌందర్యాన్ని చూచుకొంటే నాకు గర్వం ఎక్కువయింది. నేను యితరులకోసం గాక నాకోసం బ్రతకాలి అనుకున్నాను. త్యాగం, సేవ మొదలగు భావాలు నా హృదయంనుండి లుప్తమయ్యాయి.

నేను ఇప్పుడుకూడ పరదాలోపలనే వుంటున్నాను. కాని ఇతరులు నా సౌందర్యాన్ని పొగడుతూ వుంటే వినాలని నా హృదయం చాలా తహతహ పడుతూంది. ఒకరోజున మిస్టర్ దాసు చాలమంది సభ్యులు, బాబూజీ అంతాకలసి కూర్చున్నారు. నాకూ, వారికీ మధ్య ఒక పరదా అడ్డు. మావారికి నన్ను ఆ సభ్యులకు చూపించాలని వుండేది. కాని సిగ్గుపడతానని ఊరుకునేవారు. తమ మిత్రులు నన్ను చూడగలందులకు ఒక పని మిషగా పెట్టుకొని మాటి మాటికి నన్ను పరదాదగ్గరకు పిలుస్తూ ఉండేవారు. కొన్ని దినాలకు నా పరదా అదృశ్యమయింది. అలహాబాదు వచ్చి రెండు సంవత్సరాలు గడిచింది. పరదాలేకుండగనే మావారితో షికారుకు వెళుతున్నాను. షైరు అయినతరువాత టెన్నిస్ వచ్చింది. మొదట టెన్నిస్, క్లబ్బు. ఆవీ తమాషాల్లాగా కనిపించాయి. వీరు వ్యాయామముకోసం కాదు. ఆడంబరంకోసం ఆడుతున్నారని తలచాను. వారు చేసే ప్రతిపనిలోనూ, వంగటంలోనూ, పరుగెత్తటంలోను, గంతువేయటంలోను ఒక కృత్రిమత కనిపిస్తూవుంది. క్లబ్బులో ఇంతకంటేకూడా విచిత్రాలు వున్నాయి. సంభాషణలో సారములేని ఇంగ్లీషుముక్కలు ఉపయోగించటం వచ్చీరాని నవ్వులు నవ్వటం. పురుషులను శూన్యదృష్టితో చూడటం—పెద్ద గంద్రగోళంగా వుంది. కాని క్రమేపీ నాకుకూడ ఆ అనుకరణే నచ్చింది. ఈ ప్రదర్శనాల్లో చాలా శక్తివుందని తెలుసుకున్నాను. నేను ప్రతిదినం క్లబ్బుమెంబర్లు నన్నుచూచి ఆశ్చర్యపడేలాగా అలంకరించుకొనే

వాన్ని. జనులు నా సౌందర్యాన్ని ప్రశంస చేస్తూ ఉంటే నా ఆనందానికి హద్దు ఉండేదికాదు. కాని నా ప్రవర్తనను ఆంతరికంగా చూచుకుంటే నాకు చాలా భయంకలిగేది. ఏమైపోతానో అనుకునేదాన్ని. క్లబ్బుకు వెళ్లటం మానేద్దామా అనుకున్నాను. కాని సమయానికి తయారై వెళ్లేదాన్ని. నేను నా వశములో లేను. నా హృదయం దుర్బలం అయిపోయింది.

## ౫

రెండుసంవత్సరాలు గడిచాయి. బాబు ప్రవర్తనలో ఒక విచిత్రమైన మార్పుకలిగింది. వారు ఎప్పుడు విచారంగాఉన్నట్టు కనిపిస్తున్నారు. నాతో చాల తక్కువగా మాట్లాతూ ఉండేవారు. ఏదో గొప్ప చింత వారికి కలిగిందని తెలుసుకున్నాను. ముఖము ఎప్పుడూ వాడివుండేది. ప్రతి చిన్నవిషయానికి నాకల్లను కోపపడుతూ వుండేవారు. బయటకు వెళ్లడం మానేశారు.

ఒకమాసానికిపూర్వం వందపనులుఉన్నా సరే క్లబ్బునకు తప్పకుండా వెళ్లేవారు. ఇప్పుడు తనగదిలో కూర్చొని పత్రికలు, పుస్తకాలు చదువుకోడం మొదలెట్టారు. వారు ఎందుకిలా మారినారో నా కర్థంకాలేదు.

ఒకరోజున వారికి తీవ్రంగా జ్వరంవచ్చింది. కాని నాకు వారివద్ద కూర్చోబుద్ధిగాలేదు. నామనస్సంతా నవలలమీద ఉంది. వారిదగ్గరకు వెళుతున్నాను. మళ్లా వెంటనే తిరిగివస్తున్నా. టెన్నిస్‌కువెళ్లేసమయం అవుతూంది. వెళ్ళనా, వద్దా అని పెద్ద ఆందోళన పడ్డాను. చాలసేపటివరకు నామనసులో సంగ్రామం జరిగింది. ఇక్కడ కూర్చుంటే మనస్సునకు సంతోషం లేదు. ఇక్కడ పూరికే కూర్చోవడం అనవసరమని విలువగల బట్టలు వేసుకొని రాకెట్ తీసుకొని క్లబ్బుకు వెళ్లాను. అక్కడ మిసెస్ దానుతోను, మిసెస్ బాగ్‌డీతోను బాబుస్థితిచెప్పి నిశ్శబ్దంగా కూర్చున్నాను. అంతా కోర్టులోనికివెళ్ళటం మొదలెట్టారు. మిస్టరు దాను వచ్చి నన్ను రమ్మన్నాడు. నేనుకూడ కోర్టునకువెళ్లి ఆడటం మొదలుపెట్టాను.

నేటికి మూడుసంవత్సరాలకు పూర్వం బాబుజీకి జ్వరంవస్తే రాత్రంతా వారికి విసరుతూ ఉండేదాన్ని. హృదయవ్యాకులంగా వుండేది. ఆజ్వరం నాకన్నా వచ్చిందిగాదే అనుకునేదాన్ని. కాని యిప్పుడు హృదయంలో స్నేహభావం అంతరించింది. ఇప్పుడు ఆడంబరం, ప్రేమ ఎక్కువయింది. నేను ఎప్పటిలాగ రాత్రి తొమ్మిదిగంటలకు ఇంటికివచ్చాను. బాబూజీ కొంచెం కులాసాగాఉన్నట్టు కన్పించారు. వారు నన్ను కేవలం అనాదరకంగా చూచారు. నేను పండుకున్నాను. నాహృదయం స్వార్థపరత్వాన్ని ధిక్కరించింది.

నేను ఇప్పుడు ఇంగ్లీషునావల్సు బాగా చదివి అర్థం చేసుకుంటున్నాను. నాసంభాషణ ఇప్పుడు చాల తెలివితేటలతో కూడుకొనిఉంది. నాకు నామిత్రులతో తప్ప యితరులతో మాట్లాడటానికి సంకోచంగా ఉంది. తక్కువ అంతస్తువారితో మాట్లాడటం పెద్ద తప్పుగా ఉంది. హిందూస్త్రీలనుచూస్తే నాకు చాల అసహ్యంగా ఉండేది. వారిలో శిష్టాచారంలేదని నా అభిప్రాయం.

బాబుజీకి జ్వరం తగ్గలేదు. నేను క్లబ్బుకు వెళ్లడం మానేశి మూడురోజులయింది. మిసెస్ దాను రోగివద్ద నర్సునుంచి రావలసినదని చెప్పింది. నేను ఒప్పుకున్నాను. రోగి సేవనుండి విడుదలకాగానే నాకు చాల సంతోషం కలిగింది.

ఒకరోజున రెండుజాములవేళ కుర్చీలో పండుకొని ఇంగ్లీషుపుస్తకం చదువుతున్నాను. హఠాత్తుగా నాకొక ఆలోచన కలిగింది. మావారిజబ్బు అసాధ్యం అయితే అని ఆలోచించుకున్నాను. కాని నాకు ఏమి

దుఃఖం రాలేదు. కల్పనామయమగు శోకాన్ని తలచుకొంటూంటే ఒకవిధమైన ఆనందం కలిగింది. మిసెస్ దాసు, మిసెస్ నాయుడూ మొదలయిన వారంతా నన్ను చూట్టానికి వస్తారు. నేను వారిని చూడగానే విచారంగా సోదరీమణులారా, అబ్బ! ఎంతకష్టం వచ్చింది! అయ్యో నాజీవితం చీకటిరాత్రి లాగాను, స్మశానంలోని దీపంలాగా అయింది. ఆమహా పురుషుని ఆత్మకు శాంతి కలుగుగాక అని అందామని ఆలోచించుకున్నాను.

నేను ఈవిధంగా నా మనస్సులో శోకపూరితమైన ఉపన్యాసాన్ని రచించాను. శవాన్ని శ్మశానానికి తీసికెళ్లే సమయాన్ని స్త్రీలు కట్టుకునే బట్టలవరకు ఆలోచించాను. మమ్మలను గురించి పట్టణమంతా చర్చలు జరుగుతాయి. కంటోన్మెంటువారందరు నాకు వారి ఆత్మశాంతికై పత్రాలు పంపిస్తారు. అప్పుడు నేను వారి ఉత్తరాలను పత్రికలకు పంపిస్తా. వారికి తిరిగి జవాబు వ్రాయజాలననీ నా హృదయం అంతా ముక్కలయిపోయిందని యేడ్చుటకు తప్ప మరి సమయంలేదని వారి ఆత్మకు సద్గతి కలుగుటకు వారి నందరిని ప్రార్థనచేయమని ప్రకటిస్తా.

నేను ఈఆలోచనలలో మునిగివున్నాను. ఇంతలో నర్సు వచ్చి మిమ్మలను బాబుగారు పిలుస్తున్నారని చెప్పింది. క్లబ్బుకు వెళ్లేసమయం అయింది. విధిలేక వారిదగ్గరకు వెళ్లాను. మావారికి జ్వరం నెల రోజులనుండి అలాగే ఉంది. చాల బలహీనంగా ఉన్నారు. వారు నావైపునకు వినయంగా చూచారు. కండ్లలో కన్నీరు నిండిఉంది. నాకు వారిమీద దయ వచ్చింది. కూర్చున్నాను ధైర్యంచెపుతూ. ఏమి చెయ్యను మరియొక డాక్టరిని పిలువనా అని అడిగాను. ఆయన దృష్టిని క్రిందకువంచి నాకు ఇక్కడ వుంటే జ్వరం తగ్గదు. నన్ను అమ్మదగ్గరకు పంపించు అన్నారు.

ఇక్కడకన్న అక్కడ మీకు చికిత్స ఎక్కువ జరుగునన్నా, మీ యభిప్రాయం అన్నాను.

అమ్మను చూడాలని మనసు చాల తొందరపడుతూంది. మందులేకుండానే నేను అక్కడ ఆరోగ్యవంతుణ్ణి అవుతానన్నారు. ఇది కేవలం మీ వూహ అన్నాను.

బహుశా అలాగే కావచ్చు కాని నా కోరిక చెల్లించు. నేను ఈరోగమువలన కాదు ఈజీవనము వలననే దుఃఖితుడనైపోయాను అన్నారు.

నేను ఆశ్చర్యంగా వారి వైపు చూచాను. అవును ఈ జీవితంవలననే నాకు చాల కష్టం కలిగింది. ఎక్కడ స్వచ్ఛమైన అలలు ఉన్నాయని, నిర్మలమైన జలం ఉన్నదని ఆశపడ్డానో అక్కడ మరుభూమి ఉంది. నేను డాంబికజీవితాలను చూచి మోహితుడనైపోయాను ఈ నాలుగు సంవత్సరాలనుంచి ఈ ఉపవనంలో బాగా తిరిగాను. మొదటనుండి చివరవరకు అశాంతినే పొందాను. ఇక్కడ హృదయానికి శాంతిలేదు. ఆత్మకు శాంతిలేదు. ఇది ఒక ఉన్మత్తమైన శాంతియుత స్వార్థపూర్ణవిలాసజీవితం. ఇచ్చట నీతి, ధర్మము, సహానుభూతి మచ్చునకైనా కన్పించవు. నన్ను రక్షించు. ఏమి ఉపాయం లేనట్లయితే అమ్మకు ఉత్తరం వ్రాసి రప్పించు. ఆమె తప్పకుండా వస్తుంది. తన దురదృష్టపు పుత్రుని దుఃఖం ఆమె చూడలేదు. ఆమె మమతాపూర్ణమగు దృష్టి స్నేహపూర్వకమగు శుశ్రూష నాకు వందమందులకన్న ఎక్కువ పని జేస్తాయి. ఆమె చూడడానికి నా మనసు చాల ఆతురతపడుతూంది. ఆమె హృదయంలో సత్యము, స్నేహము, ప్రేమ ఉంటాయి. ఆమె ఒడిలో చచ్చిపోతే నాకు శాంతి కలుగుతుంది అన్నారు.

జ్వరంచేత వారు అలా వాగుతున్నారనుకున్నాను. నర్సుని టెంపరేచరు చూడు డాక్టరుదగ్గరకు వెళ్లాలి అన్నాను. నర్సు థర్మామీటరు తీసుకొని బాబు



శ్రీమతి పరిణయము

న - నటించిన శ్రీమతి అన్నాదొరై.

గౌరవమైన కుటుంబమునకుచెందిన యువతి.



మట్టితో తయారుచేయబడిన బాడ్జర్ — పెద్దవిగ్రహము.
3000 — కిలోగ్రాములు దీనిబరువు. చేయుటకు నూరు దినములుపైగా పట్టెను.
జపానున సారాదుకాణములకు సత్రములకు ఇది గుర్తు.

దగ్గరకు వెళ్లింది. వారు ఆమె చేతినుండి థర్మామీటరును లాగి నేలమీద బ్రద్దలుకొట్టారు. అది ముక్కలై పోయింది. నావంక హేళనగాచూస్తూ క్లబ్బుకెళ్ల డానికి బట్టలు ధరించుకొని డాక్టరుదగ్గరకు వెళతావా? అటుఇటు తిరగడానికి వెళతానని చెప్పరాదూ అని అన్నారు.

నాకు చాలభయం కలిగింది. దుఃఖం కలిగింది. బాబు కళ్లు మూసుకున్నారు. శ్వాస చాలవేగంగా కొట్టుకుంటూంది. ఎవరినైనా డాక్టరుదగ్గరకు పంపుదామని ద్వారందగ్గరకు వెళ్లాను. ఈ అదలింపులు విని నేను స్వయంగా ఎలా వెళ్లను?

ఇంతలో బాబులేచి కూర్చున్నారు. వినయభావంతో నాతోచెప్పడం మొదలెట్టారు. "సుశీలా, నేను నీతో ఒకవిషయం రెండువారాలనుండి చెప్పాలనుకుంటున్నాను. కాని సాహసం కలుగలేదు. నేను చెప్పాలని నిశ్చయించుకొన్నాను. నేను ఇప్పుడుతిరిగి నాఇంటికివెళ్లి మొదటవలె జీవితం గడుపగోరుతున్నాను. నాకు ఈ జీవనంఅంటే అసహ్యతకలిగింది. ఇదే నా రోగమునకు ముఖ్యకారణము. నాకు శారీరకంగా ఏమీ జబ్బులేదు. మానసికమైన కష్టమే. నేను మళ్లా నీవు మొదటవలె లజ్జగాఉండటం, తలవంచినడవటం, రామాయణాం చదవటం, పతిభక్తి యందు పూర్ణశ్రద్ధ మొదలగు పూర్వపుదృశ్యాలను చూడగోరుతున్నాను. నా కోరికప్రకారం ఆచరిస్తావని నా విశ్వాసం. ఆ సాదాజీవితంలో వాస్తవముగు సుఖంఉంది. చెప్పు. స్వీకారమేనా? నీవు ఎల్లప్పుడును నాఆజ్ఞానువర్తివై ఉన్నావు. ఇప్పుడుకూడ అలాగే నడుచుకో. అలా నడుచుకోకపోతే పరిణామం ఎంత భయంకరంగా ఉంటుందో అని అన్నారు.

నేను వెంటనే జవాబు ఇవ్వలేకపోయాను. ఆలోచించడం మొదలెట్టాను. స్వతంత్రజీవనంలో యెంత సుఖంఉంది. ఇంతకాలం స్వతంత్రంగా ఉండి మళ్లా బోనులోనికివెళ్లనా? మళ్ల దాసీలాగా అవడమా? ఎందుకు పీరు నాకు స్వాతంత్ర అనే పాఠం నేర్పాలి? దేవతాపూజలు చేస్తూంటే, రామాయణం చదువుతూవుంటే, ఉపవాసాలు చేస్తూంటే, వాటినిగురించి ఎందుకు ఆక్షేపించాలి? ఇప్పుడు అవన్నీ మరిచిపోయాను. వాటిని కేవలం మిధ్యఅని తలచాను. ఆ యంధకారకూపంలోనే పడవేయాలని వారు ఆలోచిస్తున్నారు. నేను వారి ఇష్టప్రకారమే నడుస్తున్నాను. నా అపరాధాలేమో నాకు తెలియలేదు. ఆఖరుకు తమకు ఇక్కడ ఏమి కష్టమని అడిగాను.

బాబుజీ మళ్లాలేచి కూర్చున్నారు. నావైపుకు క్రోధంగాచూచి ఈ ప్రశ్న నన్ను అడుగుటకంటె నీ హృదయాన్ని అడిగితే బాగుంటుంది అన్నారు. ఇప్పటికి మూడుసంవత్సరాలకు పూర్వం నన్ను నీవు ఎలా చూచావో, ఏభావనతో నన్ను భావించుకొనే దానవో ఇప్పుడు అలా నన్ను భావిస్తున్నావా? నేను నీకంటె సుశిక్షితుడనై, బుద్ధిమంతుడనై, ప్రపంచమంటే ఏమిటో తెలుసుకొన్నవాడనైనప్పటికి మొదట నన్ను ఏదృష్టితో చూచేదానవో, ఇప్పుడదంతా మారిపోయింది. ఎన్నిఉన్నా, ఎన్ని లేకపోయినా మొదట నన్ను నీవెంతో గౌరవించే దానివి. ఇప్పుడు నన్ను ఏమాత్రం గౌరవించటంలేదు. ఈ నూతనభావాలు నీకు నాయందుండే గౌరవాన్ని పాడుచేయలేదని ఎలా చెప్పగలను? ప్రత్యక్షప్రమాణరూపంలో, ఏ ఆచారాలు, ఏపద్ధతులు, ఏనాగరికతలు, నీకు కలిగి దాని ద్వారా నేను సంతోషపడాలనుకున్నానో అవన్ని ఇప్పుడు నీహృదయంలో సంపూర్ణంగా నాటుకొని వేరేపరిణామం పొందాయి. నీవు బాహ్యసంబధమైన శృంగారాల్లోను విలాసాల్లోను పడిపోయి, నుడిగుండంలోపడ్డ నావలాగాఉన్నావు. కాని ఆసంగతి ఏమీ నీకు తెలియదు. ఇప్పుడు నాకు పూర్తిగా అనుభవంలోనికి వచ్చినవిషయం ఏమిటంటే ఈ

నాగరికత ఈ స్వేచ్ఛాచారం అనేభూతం స్త్రీల కోమల హృదయాలను తొందరగా వశంచేసు కొంటుంది. ఇదివరకు అంటే మూడుసంవత్సరాలకు పూర్వం ఈలాంటిజబ్బు స్థితిలోఉన్న నన్నువంటరిగా వదలిపెట్టి పొరుగిండ్లకు పోవాలని కోరేదానవా? నేను రోగినై మంచముమీదపడిఉంటే ఇరుగమ్మల ఇళ్లలోకూర్చొని సంగీతం పాడేదానవా? సామాన్యంగా స్త్రీల హృదయం ఒకరకపు ఆధిక్యభావాన్ని ప్రేమిస్తూఉంటుంది. కాని ఈ నూతనాధిక్యతకంటే నా కాప్రాచీనాధిక్యతే చాలాగొప్పగా కనిపిస్తుంది, ఆ ఆధిక్యతకు ఫలం, ఆత్మిక, శారీరక అభ్యుదయం, హృదయపుపవిత్రత కాని ఈ ఆధిక్యతకు ఫలంపొగరు బోతుతనం, మాటమాటకు దెబ్బలాడటం నిర్లజ్జా భావం, బాహ్యాడంబరం, స్వేచ్ఛాచారం. నీవు ఇప్పటి లాగా అప్పుడుగూడా మిస్టర్ దాసుతో, ఎగతాళీ మాటలాడుతూ, నవ్వుతూ, తిరుగుతూ, ఉంటే నేను నిన్నుచంపనన్నాచంపేవాడిని, లేకపోతే విషమైనా తిని చచ్చిపోయేవాణ్ణి కాని, ఈ నూతనాధిక్యతకు ప్రధానలక్షణం సిగ్గులేకపోవుటయే. కాని నేను అన్నీ చూస్తున్నాను. అన్నీ సహిస్తున్నాను. ఈరోగంవచ్చి నా కీమాత్రం భావపరివర్తనాన్ని కలిగించింది. నీవు ఇప్పుడు ఇక్కడ కూర్చున్నాగూడా నామనస్సు సంతోషం పొందదు. ఎందువల్లనంటే నీహృదయం ఇక్కడలేదు. అది నాకుతెలుసు. నేను ఈ ఇంద్ర జాలంలోనుంచి విడివడిపోదామని చూస్తున్నాను. ఈ ఇంద్రజాలపునాగరికతలో ధనానికి గౌరవం ఇంద్రియ లిప్స నాగరికత భ్రష్టభావనలు ఉన్నయి. ఏమిచెప్పు, నేను చెప్పినవిషయం నీకు స్వీకారమేనా?

నా హృదయంమీద వజ్రంపడ్డట్టయింది. బాబుగారి అభిప్రాయం పూర్ణంగా నాకు తెలిసిపోయింది. ఇంకా నాహృదయంలో పూర్వపుసిగ్గు దాక్కొనే వున్నది. ఈబాధ సహించలేకపోయాను. తిరిగి ఆసిగ్గు మళ్లా నాహృదయంలో లేచొచ్చింది. అంతరాత్మ తప్ప కుండా వారి ఈసలహాను అంగీకరించమనిచెప్పింది. ఇప్పుడు నాస్థితి మొదటఉన్నట్టుగా లేదు. అప్పట్లో వారు నాకు ఇష్టదైవంగా వుండేవారు. వారు ఆజ్ఞా పించారు అంటే తప్పకుండా వారిఆజ్ఞను నిర్వర్తించే దాన్ని. కాని, ఇప్పుడు నాదృష్టిలోకి ఇంకో సాధారణమనుష్యు డొచ్చాడు. మిస్టర్ దాసుఫోటో నాదృష్టిలో కన్పిస్తూఉన్నది. ఆదుర్మార్గుడు చెప్పిన మాటలు హృదయంలో ఎలాటిమార్పును కలిగించి నాయి? అది హృదయంలోనికి రావటంతోనే సిగ్గువల్ల కళ్లురెండూ క్రిందకు దిగిపోయినాయి. బాబూజీగారి ఆంతరికమైన వ్యధ వారిముఖంనుండే కన్పిస్తూఉన్నది. స్వార్థము, విలాసలిప్స, నా హృదయంలోనుంచి దూరమైపోయినాయి. వాటికి బదులు ఈశబ్దాలు హృదయచిత్రానికి ఎదుట నల్లని సిరాతో వ్రాయబడి కన్పించసాగినాయి. నీవు ఫేషను లోనూ వస్త్రాభూషణాదులలోనూ, గొప్పఉన్నతిని పొందవు. నీకు ఇప్పుడు నీహక్కులను తెలుసుకొనే శక్తి వచ్చింది. తెలుసుకొన్నావు కూడాను. నీలో జీవితసుఖాన్ని అనుభవించుకొనే యోగ్యత ఎక్కు వయింది. నీవు ఇప్పుడు అమిత గర్విష్టివి. దృఢమైన హృదయంగల దానవు. శిక్షాసంపన్ను రాలవుగూడా అయినావు. కాని నీ ఆత్మబలం నశిం చింది. అందువల్ల నీవు నీ కర్తవ్యాన్ని మరచి పోయినావు.

నేను రెండుచేతులు జోడించుకొని బాబు కాళ్ల మీద పడ్డాను. నోటినుండి ఒకమాటకూడ రాలేదు. అశ్రువులు ప్రవహిస్తున్నాయి. ఇప్పుడు తిరిగి మళ్లా మాయింటికివచ్చాను. అత్తగారు నన్ను చాల గౌరవిస్తున్నారు. బాబు చాల సంతోషంగా ఉంటున్నారు. వారు ఇప్పుడు ప్రతిదినం సంధ్యా వందనం చేస్తున్నారు. మిసెస్ దాసుదగ్గరనుండి అప్పుడప్పుడు ఉత్తరాలువస్తున్నాయి. అవి అలహా బాదుసొసైటీలో క్రొత్తక్రొత్తవార్తలతో నిండి

ఉంటున్నాయి. మిస్టర్ దాసునుగురించి ఏవో కలుషితమైన మాటలు పుట్టాయి. ఈ ఉత్తరాలకు జవాబు వ్రాస్తూఉన్నాను. ఈ ఉత్తరాలు రాకుండాఉంటే బాగుంటుందని నాకోరిక. ఎందుకంటే జరిగినరోజులను జ్ఞాపకంచేస్తున్నాయి. వాటిని మరచిపోవాలని నా కోరిక.

బాబు చాల పుస్తకాలు అగ్నిదేవునికి అర్పితం చేశారు. వారు ఇప్పుడు ఇంగ్లీషు పుస్తకాలు చాల తక్కువగా చదువుతున్నారు. నేను రామాయణం, భారతం చదువుతున్నాను. ఇదివరకంటె ఇప్పుడు చాలా ఆనందాన్ని అనుభవిస్తున్నాను. రాట్నం పూర్వంకన్న యిప్పుడు బాగా ఒడుకుతున్నాను. ఎందుకంటే ఈమధ్యరాట్నం ఎక్కువ ప్రచారంలోనికి వచ్చిందికనుక.

[అనువాదకురాలు: శశిరేఖాదేవి]

# చేతి వ్రేళ్ల చిన్నికుటుంబము!

రాయసం వెంకటశివుడుగారు

చిన్ననాఁడు నేస్తులు నేనును ఆడని యాటలు, చెప్పుకొననికథలును లేనేలేవు. వాక్కులేనిపశువులు, చలనములేనిచెట్లును మాక్రీడలలోఁ బాల్గొనుచుండునట్లు భ్రమింపుచుండువారము! అపుడె ధార్వాడనాటక సమాజ మాంధ్రదేశమునఁ బ్రదర్శించిన నాటకములు చూచియుండిన మా పెద్దయన్న సెలవుల కింటికి వచ్చినపుడు, మా క్రీడావినోదములు పెచ్చుపెరుగుచుండెడివి.

ఒకనాఁ డాటలనడుమ సలపు తీర్చుకొనుచు, చేతులుచాచి మా పెద్దచింతచెట్టు క్రింద మేము కూర్చుంటిమి. వరుసగనుండు మాచేతులవ్రేళ్లు సంజకెంజాయలో మెరసిపోవుచుండెను. వానిలో నిడుదలు కురుచలు, లావులు సన్నములు, రకరకములుండెను. కొందఱిగోళ్లు తెల్లగను, కొన్ని గోరింటాకు రంగుతో నెఱ్ఱగను మెరయుచుండెను. అంతట మాలో నొక బాలకుఁడు, "చూచారా! మనవలెనే మనచేతివేళ్లుకూడా ఎపుడైనా పండుగలకు ఆటలాడు కొంటవేమో సుమీ!" యని పలికెను. ఆతని యూహకు నవ్వుకొంటిమి.

ఇంతకంటెను అద్భుతము గొలిపినవి యిపుడు మాయన్నపలికిన పలుకులు: "పిల్లలారా! మీచేతులిపుడు పరిశోధించుకోండి. ఒక్కొకచేతివేళ్లు ఒక చిన్నకుటుంబమే సుమండీ! ఇంతేకాదు—ఆవేళ్లచేత నేను మాట్లాడిస్తా కూడాను—చూచుకోండి!" చేతిలో ముణిగియున్న వ్రేళ్లు లేచి మాట్లాడునాయని పిల్లలము పుల్కుపుల్కునఁ జూచుచుంటిమి!

మాయన్న యపు డిట్లనెను:—"పిల్లలారా! ఇపుడు మనము 'వేళ్లాట' ఆడుకొందాము. వేళ్ళన్నీ ఒక కుటుంబమన్నాను. కుటుంబములో తలిదండ్రులు, కుమార్లు కూతుళ్లును ఉంటారని మీకు తెలుసును. మీలో యెవరేవేలు వేషమువేస్తారో బాగా ఆలోచించుకోండి!" ఈమాటలు వినఁగనే, మాలో గొప్పయలజడి గలిగెను. అందఱును తలాయొకవేషమును వేయుట కాలోచించుకొంటిమి. మాయన్న యంతట నెలుగెత్తి యిట్లనెను:—"కుటుంబానికి తల్లిముఖ్యం—ఆతల్లివేలు వేషం మీలో యెవరువేస్తారో చెప్పండి!"

ఈపాత్రను ధరించుటకు మాలో నిద్దఱము పూనుకొంటిమి,—నేను, సుందరియును. "ఏదీ, మీరేవేలును తల్లివేలని పట్టినారో చూపించండి!" అని యన్న యడుగఁగా, బొటనవ్రేలు నేనును, నడిమివ్రేలు సుందరియును, జూపితిమి. అంత మాకీ సంవాదము జరిగెను.

అన్న:—"బొటనవేలూ! నీవు తల్లివేలు ఏలాగైనావో చెప్పు?"

బొటనవేలు:—"వేళ్లన్నిటిలోను లావుగాను, బలముగాను ఉన్నాను గనుక!"

అన్న:—"మధ్యవేలూ! నీవు అమ్మ వెట్లయినావు?"

నడిమివ్రేలు:-"అన్నిటిలోను పొడుగుగాను, మధ్యగానుఉన్నాను-నేనే తల్లివేలును."

అంతట మాపిల్లవాండ్రలో కలవరము బయలుదేరెను. కొందఱు నాపక్షమున నుండిరి. కొందఱు సుందరియె తల్లివ్రేలుగా నుండఁదగినదని తలంచిరి.

సద్దు నివారించి మధ్యవర్తియైన మా యన్న యిట్లు పలికెను. "వేషంవేసినది మగవాడైనా ఆడదైనా వకటె! మనకు కావలసినది అసలు పాత్రే. ఇది తేలడం కష్టమైతే యింకొకప్రశ్న వేస్తాను. తండ్రివేలు వేషము వేసేవా రెవరో చెప్పండి?"

బాగుగ నాలోచించుకొనిన నేనులేచి, "నేనే తండ్రివేలును!" అని చెప్పివేసితిని. అందఱును నవ్విరి.

అన్న:—"అబ్బాయీ! నీవు తల్లివి తండ్రివికూడా యేలా గవుతావు? నీవు తండ్రి వెట్లో చెప్పు!"

నేను:—"అన్ని వేళ్ళలోను ధృడముగాను, ముఖ్యముగాను ఉన్న బొటనవేలును గనుక నేనే తండ్రిని—మధ్యవేలు అందరిలోను పొడుగైనను, అంత శక్తిలేనిది గనుక, అది తల్లివేలె."

ఈనిర్ధారణమున కందఱు సులభముగ సమ్మతించిరి. అపుడు తరువాతి ప్రశ్నమువచ్చెను.

అన్న:—"చూపుడువేలు వేషం యెవరిదోయి?"

నాచెలికాండ్రలో రంగయ్య మిగుల బలిష్ఠుఁడు, సాహసుఁడును. అతఁ డిపుడు వచ్చి ముందునిలిచెను.

అన్న:—"ఏమోయి తర్జనీ! నీవృత్తాంతము చెప్పు—నీవు మగపిల్లవాడవా, ఆడపిల్లవా? కారణాలేమిటి?"

తర్జని:—"నేను మగపిల్లవాడను. అన్ని వేళ్లను, తుదకు తండ్రివేలినికూడా, ధిక్కరించే శక్తి నాకున్నది." ఇదియు నందఱు నొప్పుకొనిరి.

అన్న:—"ఇపుడు నాలుగవవేలు కథ మనము విందాము."

అపుడు రమణయ్య ముందుకురాఁగా, "నీ వెవరవు?" అని మధ్యవర్తి ప్రశ్నించెను.

నాలుగవవేలు:—"నేను అనామికమను ఆడుపిల్లను - అక్కయ్యను!" అని పలికినపుడందఱును ప్రక్కలు పగులునట్టుగ నవ్విరి. ఆమాటలలోని సత్యముమాత్ర మెవరును గాని, శంకింపలేదు.

ఓపికలేని మాకడఁగొట్టు చెల్లెలు, చిట్టి యంతట ముందుకువచ్చి, "నేను చిటికినివేలిని! చిన్నక్కయ్యను!" అనుదాని ముద్దుమాటల కెల్లరును నవ్వి, ముద్దులలో దానిని ముంచివైచిరి!

తర్జని తన ప్రతాప మింకను బ్రదర్శింపఁగోరి, మరల ముందుకువచ్చి, "నేను తల్లి పక్కవారి కందరికీ అండగా వుండడమేకాక, తండ్రికి సదా సాయపడుచుంటేనే గాని, ఆతడేమీచేయలేడు!" అని విఱ్ఱవీగెను!

ఒక విధమగు గర్వము చిట్టికిఁగూడ లేకపోలేదు—ఇపుడామె ముందడుగిడి, "ఇంటిపనంతా పెద్దవాళ్లు చేసుకుని, చిన్నపిల్లనని నన్ను ఆట్లాడుకోనిస్తారు—నన్నెవరూ కొట్టరులే!" అని తన చిన్నవేలాడించుచు నట్టె పరుగెత్తెను.

# మేలుకొలుపు

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

మేలుకొనుమో భారతీయుడ
మేలుకొనుమో దేశభక్తుడ
మేలుకొని నీ తల్లిదేశపు
ముక్తి గనవయ్యా.

అల్లదిగో నవ్యప్రత్యూషమ్ము
గాఢాంధకారము బాపగా
నా దివ్యపురుషుని వాణియే
నవజ్యోతి గనవయ్యా.

జ్యోతివెల్గున జూడుమా
నవభారతీయ దైవసృష్టిని
సర్వులును సమమనెడి భావము
స్వాంతమందుననూ.

అంటరాదు ముట్టరాదను
తుంటరత్వము మాని బుద్ధిని
గాంధిప్రభుని సుబోధలందున
గణ్యతను నుంచి.

ఆ మహాత్ముని త్రోవ నడచిన
ఈ మహావిశ్వంబు గెల్తువు
మోహమంతయు బాసిపోవును
ముక్తియును పొందలున్.

గాంధియే మనతండ్రి ప్రభువును
గాంధియే మనగురుడు నాత్మయు
గాంధియే నవభారతంబున
ఘనప్రవక్త గదా!

మే మీావలకు వచ్చి వేసితిమి.

అంతట కమలాకరవర్మకుమారుఁడగు విజయసింహుఁడు మహాసైన్యములతో నచ్చట కరుగుదెంచెననువార్త మా స్కంధావారమును కలంపఁజొచ్చెను. తన తండ్రి యట్లు మా తండ్రిగారిచేత నొంటరిగాఁ జిక్కిపోవుట తెలిసినంతటనే యతఁడు వాయువేగ మనోవేగములతో యుద్ధసన్నద్ధుఁడయి కయ్యమునకుఁగాలుద్రవ్వుచుఁ గూర్చున్న మా సైన్యముల కట్టెదుటఁ దమ యాశ్వికసైన్యములఁ బట్టించుకొనివచ్చెను. నేను నా స్నేహితులతో మావారి యాలోచనసభకు వచ్చి అందు మా తండ్రియు నామె తండ్రియు కార్యతంత్రనిమగ్నులయి తర్కవితర్కము లొనర్చుకొనుచుండఁ గనుగొంటిని.

మా తండ్రిగా రిట్లనుచుండిరి. "మన మొనర్చుకొన్న ఆ యొడంబడికయున్న దే - అది నిరాటంకముగఁ జరిగిపోవలెను. తామిది ముఖ్యముగ గమనింపవలయు.—ఈ పిల్లను మీా రన్నివిధముల భ్రష్టురాలినిగఁ జేసివైచితిరి. మీా మెత్తదనమే యామె నింతకుఁ దీసికొనివచ్చినది. ఇప్పు డామె మిమ్మును మగవాండ్రను ఒక్కవిధముగ నపహాసించుచున్నది. తన్ను దాను వంచించుకొనుటయేఁగాక తన స్త్రీజాతికి—నాకు, వానికి, ఈ యశేష మానవలోకమునకు అవజ్ఞ యొనర్చుచున్నది. బాలిక యొకతె యీావిధముగ సృష్టిని ధిక్కరించుచు — లోకమును వంచించుచు — ప్రకృతి నాజ్ఞాపించుచుఁ జండశాసనము లొనర్పఁదగినది కాదు. సమయబద్ధయయి ఆమె పరిణయమాడుట కొప్పుకొనవలెను. లేనియెడల నసిఘాతభయంకరమును, అగ్నితాడనభీభత్సమును అగు నిష్ఠురదండోపాయ మొకటి యుండనేయున్నది. ఆమె యనుమతింపని యెడల నిఁక యుద్ధమైపోవలసినదే."

కమలాకరవర్మ నావంకఁదిరిగి "నీ వేమందువు? లోకసామాన్యభంగుల బోవ నిచ్చగింపని మా కుమార్తెను లోకాతీతమగు వైఖరిని సందర్శించి వచ్చితివి. ఇప్పటికిని ఆమెయందు నీకుఁ బ్రేమయున్నదని వినుచున్నాను. కావున నీవిషయమై మన సెట్లున్నదో స్పష్టముగఁ జెప్పివేయుము. నీవును యుద్ధము కావలయు నందువా?"

నే నిట్లంటిని.—"యుద్ధమునకు నే నిచ్చగింపను. — మహారాజా, ఇప్పు డంతగ యుద్ధమొనర్పవలసిన యావశ్యకత యేమి యున్నది? ఎట్టి ఫలితమునకై యుద్ధమొనర్తుమో అట్టి మహాఫలము యుద్ధమున మన కందకుండబోవునని స్పష్టముగఁ దెలిసియున్నపుడు అట్టి వృథాయాసమునకు సంసిద్ధులమగుటకంటె వెంగలితన మింకొకటి యుండదు. ఇప్పు డీ చేయరాని యుద్ధ

మొనర్చి నేనేమి సాధించినవాఁడనగుదును? పరమపవిత్రములగు మందిరములఁ బాడొనర్చి, గృహములకుఁ జిచ్చువెట్టి, గ్రామములఁగాల్చి, సస్యశ్యామల రమ్యమగు వసుంధరను వీనుఁగు పెంటలుగాఁజేసి మే మీ దేశ మెంత వశమొనర్చుకొన్నను తుద కామె నావశమగుట కవకాశములేదు. మహా పవిత్రములగు సంసార ద్రుమ కుసుమముల ద్రుంపివేసి, సంసార నిలయముల దగ్ధమొనర్చునప్పుడు వానిపై స్తంభాకారముల నెగయు యుద్ధధూమమునుండి నే నామెకంటి కిప్పటి కంటె మూఁడింత లధికముగా రక్కసుఁడనై కానవత్తును. తనకుఁ బంధకరులగు వారి నిప్పుడామె రిత్తతూష్ణీంభావమున నిగ్రహింపవచ్చునుగాని యుద్ధమున బట్టువడిపోయినయెడల నట్టి దౌర్జన్యమున విజయవంతులగువారినిఁ దనకును, యీసర్వమానినీ లోకమునకును బరమశత్రువులుగా ద్వేషించుచు నుండిపోవును. కావున నీకార్యము మృదుత్వమున నగునట్లు ముష్కరత్వమునఁ జక్కబఱచుకొనుట కవకాశములేదు. ఆమె ప్రేమయే నా కైహికమనోరథముగ భావించుచున్నాను. అది యుద్ధమున సిద్ధింపదని స్పష్టముగఁ దెలిసికొనియున్నాను. ఈ రాజ్యమునందలి దుర్గములఁదుత్తునుకలుగఁ బాడుచేసి మీ మహానగరముల నెంత గైవస మొనర్చుకొన్నను ఆమె ప్రణయ దుర్గమునుమాత్రము పట్టుకొనుట యసంభవమైపోవును. శిలల రువ్వు మా మహా మారణయంత్రములచే, మృత్యు వక్త్రసంకాశములైన మా శతఘ్నులచే మీ నగరములనెంత చూర్ణీభూత మొనర్చినను, మీ నగరవాసులను మేమెంత నేలకును గోలకును దీసికొనివచ్చినను ఆమెనుమాత్రము స్వాధీన మొనర్చుకొనజాలను. బలవంతముగ నామెను బట్టుకొనినంతమాత్రమున నామె ప్రణయలక్ష్మి నావశమైపోవదు. ఆమె కడకంటికటాక్షమైహికమనోరథముగ భావించుచున్నాను. ఇప్పు డామెను యుద్ధమున బరాజయమొందించి, బందీకృతను జేసి, సంకెలలఁగట్టి నా యెదుట కీడ్పించుకొన్నను నా యంతర్వాంఛితము సిద్ధింపదు. ఆమె విషణ్ణచిత్తమునఁ దనకైన భంగపాటులఁ ద్రిప్పికొనుచు తన్నంత పరాభవ మొందించిన యవజ్ఞాగ్రంథమునందలి పుటలఁ దిరుగ వేయుచు వానినడుమ గీటకసదృశుఁడనై ప్రాకుచుండు నన్ను తత్పత్రప్రహారమున విగతజీవునిగఁ జేసివేయును. అట్టి సందర్భమున నేను నా నైహికజీవిత ఫలావాప్తికి దూరగుఁడనై పరమపదించి పోవుదునన్నమాట. అంతకంటె మానవులపాలిటి యమదూతయగు యుద్ధదేవత సృష్ట్యాదియం దెప్పుడో హతమయి మంచుగడ్డలలో పేరుకొనిపోయియుండు 'మేమత్' లనఁబడు బృహద్రూపములనుండు నుగ్రసత్వములవలె నామమాత్రావశిష్టముగ నొక్కమాఱు నశించిపోవు నెడల భద్రమగునని భావించుచున్నాను.

మానవజాతికి యుద్ధములను మించిన మహాపదవింకొకటిలేదు. సృష్ట్యాదినుండి

మానవులకు యుద్ధనీతియందలి యనర్థము తెలుకకు వచ్చుచున్నను దానినే క్షత్రధర్మముగ సమస్త కార్యసాధన తంత్రముగ నూహించుచుండుట నాకు మహాశ్చర్యముగ నుండిపోవుచున్నది.

ఆ. బ్రహ్మచేత భూమి పతుల కీధర్మంబు
కల్పితంబు ; రాజ్య కాంక్షఁజేసి
తోడి చూలునయునఁ దోఁడబుట్టిన వాఁడు
చంపుచుండుఁ గ్రూర చరితుఁడగుచు.

క. భూమికి ధనధాన్యములకు
భామలకును మానములకుఁ బ్రాభవ ములకుం
గా మించి మీఁదుగానక
శ్రీమదమున మానధనులు చెనకుదు రౌరులన్.

అని మనవారు క్షత్రధర్మమున నగుచున్న దుండగముల గుర్తించుచు నేయున్నారు. అయినను యుద్ధమున మొదటఁగ త్తిదూయువారుకూడ నవసానమున నదంతయుఁ బ్రాప్తకాలంబయివచ్చిన భూప్రజాక్షయం బనియోఁ, బాపభారమునఁ గ్రుంగిపోవు చున్న భూమి నుద్ధరించుటకై తాము నిమిత్తమాత్రులమగుచుంటిమనియో లేక దాము ధర్మ సంస్థాపకులమై లోకక్షయ కర్తలమగుచుంటిమనియో భావించుచుం డుదురేమొ నేనెఱుంగను.

ఉ. భూమికిఁగాఁగ ప్రాణముల
పోకఁదలంపక రౌద్రఘోరసం
గ్రామము సేయుచుండుదురు
రాజులుదొల్లియు నెంత దీఁపొకో భూమి?

అని రాజుల యుద్ధపిపాసనుగూర్చి విస్మయ పడుచుఁబలికినయుభయ కవి మిత్రుఁడగు తిక్కన సోమయాజి యుద్ధోద్యమమందలి యనౌచిత్య మజాతశత్రునిచే నిట్లూహింపఁ జేసియున్నాఁడు.

ఉ. అక్కట లాతులైన పగ
తైనను జంపనకోర నేల? యొం
డొక్క తెఱంగు లేదె అది
యొప్పదె బంధుసుహృజ్జనంబులా
దిక్కననున్న వారు గణు
తింపక సంపదకై విధించి దూ
ఱెక్కట దోసమందుటను
నీ దురవస్థలకోర్వవచ్చునే ?

క. జయమగు నోడుదుమను ని
శ్చయ మొక్కఁడు లేదువినుము
సమరమునఁబరా
జయము మరణంబుకంటె హృ
దయస్ఫుటభేదనము సేయుఁ
ధర్మ్యంబనఘా

కావున యుద్ధనీతివలన కార్యసాధన మవశ్యమునై తీరునని యెట్లు చెప్పవచ్చును? యుద్ధ వ్యవసాయముల నెల్లప్పుడు ముందంజవేయు మహావీరుఁడయ్యును 'అడిబిరపుతులువ' యని పలువురచేఁ చెప్పఁబడుచు వచ్చిన కర్ణునిగూర్చి యుద్ధాచార్యుఁడగు కృపుడిట్లనుచున్నాఁడు.

గీ. కయ్యమునకఁ యెపుడుఁ గాలుద్రవ్వుదు,
కార్య
గతికిఁబోవ్వనీతి యుతులు సమర
మథమసాధనముగ నాడుదు రిర్థసం
సిద్ధిఁబొందు తెఱఁగు సేయునెడల.

అందును సమస్తపురుషార్థములకు ముఖ్యోప కరణమనియు మూలమనియుఁ జెప్పఁబడు నర్థాంగీ సంపాదనమున యుద్ధమధమాధమ సాధనముగ భావింపఁదగినది. కుసుమ కోమములగు స్త్రీలను క్రూరకర్మాస్పద మగు యుద్ధనీతి కగ్గముసేయుట కంటె ముష్కరత్వ మింకొకటిలేదు. కావున మహారాజపుంగవులగు మిమ్ములనిరువురను యుద్ధాలోచనములనుండి విరమింపవలయు నని వినయముగఁ బ్రార్థించుచున్నాను. యుద్ధముల జయము దైవాధీనము.

ఆ. కలహమగుడు లక్ష్మిఁ గావించుఁ,
ప్రాణహా
నియును జేయునింత నిక్కవంబు,
పలువురొకనికోడి పాఱుట, బల్లిదు
లనదచేతఁజెడుటయును ఘటించు.

మన యుభయవంశములకును జిరకాలాను గతమైన బాంధవ్యమున్నది. అట్టి మా వ్యాపారమును సామతంత్రోపాయ జక్కబఱచుకొనఁదగినది కాని స్వజన వినాశకారియైన యుద్ధోపాయమున నెఱవేర్చుకొనఁదగినదికాదు. యుద్ధ మనఁగనది యీదేశమునందలి ప్రజలును ఆదేశమునందలి ప్రజలును దలపడుటవలన నగును గాని మహారాజకంఠీరవులగు మీ రిరువురును మల్లయుద్ధమునందువలె దైహిక ముగ బలాబలముల నిర్ణయించుకొనుటవలన కాదుకద! కావున నుపశమించుట లెస్స యని ధర్మరాజును మోడ్పుగేలుతోఁ బ్రార్థించుసంజయునివలె.

చ. అఖిల జనక్షయంబయి జ
యాపజయంబులు రెండునుండుదినీ
సుఖములుగాని యీపనికి
జొత్తురెయుత్తములట్లుఁగాక యా
నిఖిల సుఖంబులేమిటికి
నీవని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ
జంపితయేని దయాపయోనిధీ.

అని మా తండ్రిగారికిఁ దెలుపుకొను చున్నాను.

మాతండ్రిగారందులకు సమ్మతింపక రూక్షముగ నిట్లుపలికిరి.

"క్షత్రధర్మమున కార్యసాధనమ కర్తవ్య మని యెంతదీర్ఘముగ నుపన్యసించితివి!— ఇసీ! నీవాఁడు వాంద్ర నే మెఱుఁగుదువు?— ఈ విధముగ నీవు నోటికివచ్చినట్లాడునపుడు మనవాంద్రుచెప్పు వెంగలికథయు విశ్వాస యోగ్యమని భావింతునుకద! నీవెఱుఁగవు

కావున నిపుడైన తెలిసికొనుము—మగవాఁడు వేఁటకాఁడు. ఆఁడుది యతనికేళీ మృగము. బంగారులేడిని బట్టఁబోయిన శ్రీరామునివలె ధగధగలాడు నాఁడువారి మేనికాంతులకు మన మాకర్షితులమయి వారినిఁబట్టికొన నుద్యమింతుము. అట్లు వారిని వేఁటాఁడుటయే వారికి మహానంద ప్రదము. అందులకు వారు మనల గాఢముగఁ బ్రేమింతురు. మనము వారి నెంత యణఁగఁద్రొక్కి స్వారియొనర్తుమో వారు మనకంతగ వశంవదలయి సౌఖ్యమిచ్చుచు నుండిపోవుదురు. అట్టి వాండ్ర వెనుకవేసికొని నీవేమేమో యుపన్యసించుచున్నావు. ఇసీ! యెంతసిగ్గు! వారి ప్రకృతుల నెంత మృదుత్వమున్న వారంత కఠినతత్వములఁ బ్రేమింతురు. వారి యంత రాళముల నెంత కోమలత్వమున్న వారంత కర్కశప్రకృతుల సహవాస మభిలషింతురు. రౌద్ర ఘోరసంగ్రామముల వారెంత భీత చిత్తలగుదురో అట్టి సంగ్రామములొనర్చు మహావీరుల వారంతగ నభిలషింతురు. ఎట్టి విక్రమకార్యముల నొనర్చు సాహసము వారియందుఁబూజ్యమో వారట్టి పరాక్రమ శీలురవంక కాకర్షిత లగుచుందురు. హింసాకరమగు ఘాతుకములతో ఘోరమయ్యును అభిరామమగు నాహవముల మృత్యుధిక్కారమొనర్చు విక్రమకేళి యొనర్చు మహావీరులు, తూర్యాదిరవములతో జైత్రయాత్ర యొనర్చుచు యుద్ధఘోషములఁగల గుండువడు కాంతాజనములనడుమ కుతికి రక్తసిక్తమగు కైదండలఁ దమ వధూమణుల వలచి వలపించుచుఁ బాణిగ్రహణము లొనర్చుకొనుచుందురు. ఇదేవిధముగ నేను సీతల్లిని బరిణయమాడితిని. సాధుశీల యయ్యు నామె వీరపత్ని—వీరజనని పెండ్లాడిన మహాగుణభూషణయగు నట్టి యువతిని బెండ్లాడవలెను. కాని, యీ కొఱకంచున్నదే!—కొఱుకరాని యిట్టి కొయ్యతో సాధుమార్గములా? మృదుత్వమా? కృష్ణవర్మ మాటల కను రూపముగ నామెచేతలుండునెడల—అగ్ని వృష్టి గుఱియుచు నాకాశమున నెగుఱు శరభసాళ్వములను పండ్లకావున కుపయోగించు చిన్నవలలచే బట్టుకొన నూహించుటయు, శార్దూలాది యుగ్రసత్వముల సాలెపుర్వులగూండ్ల బంధింప నూహించుటయు వివేకతరముగ భావింపవచ్చును.

మ. కరిరాజున్ బిసతంతు సంతతులచే
గట్టన్ విజృంభించు వా
డురువజ్రంబు శిరీష పుష్పములచే
నూహించు భేదింపఁదీ
పరచింపన్ లవణాబ్ధికిన్ మధుకణ
ప్రాప్తిన్ బ్రవర్తించు ని
ద్ధరణిం మూర్ఖులఁ దెల్పు నెవ్వఁడు సుధా
ధారానుకారోక్తులన్.

అనిచెప్పిన కవి వెఱ్ఱివాఁడా?"

నే నిట్లుపలికితిని—"నిశ్చయమే. కాని అసాధారణమగు నుద్దండతత్వముల, వివేకమునఁ జక్కఁజేయవలయును. యోధా

గ్రేసరులఁజూడ యువిద లాకర్షితులగుదురని మీ రనుచున్నారు. మీ రనునట్లు మహా యోధలక్షణము లామెయం దేమైనఁగొఱత వడి యున్నగదా ఆమె పరుల ప్రతాపతత్వ ములకు వశంవద యగును? ఎన్నితుపాను లుదయించినను మహాద్రివలె స్త్రీహితమహా రంభమగు తన యుద్యమమునఁ జలింపకుండ నిలువగల చిత్తస్థైర్య మామెయం దున్నది. అట్టి నిష్కంపధైర్యమున నిన్న నడికిరేయి యందామె నిలువఁబడి (కృపాణమును చేతఁ బట్టి ప్రతిజ్ఞయొనర్చు మహావీరులవలె) తనపై విఱచుకొనిపడుచున్న పురుషలోకము నధఃకరించుచు మాట్లాడినది. మహాయో ధులుకూడ దలపడుటకు సాహసింపఁజాలని మహోగ్రమారణతంత్రములందైనను ప్రాణ సమర్పణ మొనర్చుటకు వెనుదీయని యమేయతత్వ మామెయందున్నది. "స్త్రీ జనస్వాతంత్ర్యఫలావాప్తికి ప్రహ్లాదకుమా రునివలె నేనెట్టి మరణబాధలనైన ననుగ్రహ ములుగ భావింపగలను. ఒక్కసారి స్వార్థ రహితమగు నాత్మార్పణమున సూక్ష్మముగ ఫలసిద్ధియగుట కవకాశము లున్నయెడల నట్లు పంచత్వమొందుటయే నాకుఁ బరమ ధర్మము. అశేషకాంతాస్వాతంత్ర్య మొక్క కాంతాప్రాణ సమర్పణమున సిద్ధింపఁగలిగిన యెడల నెట్టి మహోగ్ర మారణ తంత్ర మైనను వెనుదీయకుండ సిద్ధపడఁగలను." అని యుత్సాహపూరితముగ నామె చెప్పు కొనియున్నది. అట్టి యప్రమేయతత్వమున కేవల పురుష సాధారణమని మీరూహించు చున్న సాహసము పూజ్యమైయుండునా? మఱియు నిన్నటి నిశీథసమయమునఁ బురుష సైన్యములు తమ్ము ముట్టడించియున్నవని తెలిసినప్పుడు తనకొదవిన మహామర్షమున తమ జన్మస్వాతంత్ర్యముల సంరక్షించుకొని తమయోగ్యతను జగద్విదితముగ నుంచి వేయుటకు తానే కవచియై, ఖడ్గపాణియై రణరంగమున నుఱుక సంసిద్ధముగ నుంటి ననియు, నందొకవేళఁ జచ్చినను స్త్రీ లోకాభ్యుదయమునకై పంచత్వమొందితి నను కీర్తి శాశ్వతముగ నుండిపోవుననియు ధీరస్వాంతయై తన బాలికల హెచ్చరించినది.

"వీరకాంతానురూపమైన యిట్టిధైర్యము స్త్రీప్రకృతి కవమానాస్పదమని తాము భావింపవలదు. ఆపదలందు ధైర్యగుణమును బ్రదర్శించు నభిమానవతులను లోక మా చంద తారకముగ గీర్తించుచు నుండఁదగినది కాని సిగ్గుబిడియములు లేకుండఁ బ్రతి ఘటించుచున్నదని దూషింపఁదగినది కాదు.

"ఇఁక మీరు స్త్రీలగూర్చి యొక్కటే తుదుపుగ నొక్కటే ప్రకృతియని భావించు చున్నారు. పురుషులయం దెట్టియెట్టి భిన్న ప్రకృతులున్నవో స్త్రీలయందును అట్టి భిన్న భిన్నప్రకృతు లున్నవిగాని స్త్రీజాతియంతయు నైసర్గికముగఁ గోమలమనియు విభీతచేతస్క మనియు, పౌరుషాశ్రయమనియు భావింపఁ దగినది కాదు. పుష్పములలో కమలమున కును గలువకును యెంతయంతరముండునో కాంతలలో ఒకకాంతకును వేఱొకకాంత

కును అంతయంతరముండును గాని యిరు వురును ఒక్కవిధముగ నుండురని భావింప వలదు. ఒకతె వీరవినోదముఁ గ్రీడించు మహావీరునిఁ గామింపవచ్చును. వేఱొకతె విద్యావినోదముల నానందించు పండితుని ప్రేమింపవచ్చును. మఱొకతె వేదాంతగోష్ఠి నుండు పరమసాత్వికునిఁ బ్రేమింపవచ్చును. ఇంకొకతె విపరీత ప్రకృతినుండు నధమాధమునే వరింపవచ్చును. హృదయ ప్రమోదకరమగు వెన్నెల శుభ్రవస్తువుల పైనను అశుభ్ర పదార్థములపైనను ఒక్క విధముగనేఁ బ్రకాశించునట్లు, సర్వలోక సంపత్కరమగు స్త్రీ హృదయానురాగము ఉత్తములను హీనులనుగూడ నుత్సాహవంతులుగాఁ జేయుచున్నది.

"వారట్టి యుత్సాహకారిణులగుట వలన నింకను యోగ్యముగ విద్యావివేక సంపన్నలగుటకుఁ జక్కని యవకాశము లున్నయెడల ప్రపంచ మింకను తేజస్వంతమయి సకల కల్యాణ గుణావహమై యుండిపోవును. కావున స్త్రీహిత మహారంభమగు నట్టి యుద్యమమును తనతలకుఁ గట్టికొని ప్రతిస్త్రీ యందును ఆమె తన ప్రతిబింబమునే చూచుచు వారిబ్రదుకే దనబ్రదుకుగా, వారికష్టమే తనకష్టముగా, వారి శ్రేయమే తనశ్రేయముగా, వారి యౌన్నత్యమే తన యౌన్నత్యముగా మనోవాక్కాయ కర్మముల ననుభవమునకుఁ దెచ్చుకొనుచున్నది. అట్లుండుటయె ఆమె బుద్ధికి సమంజసముగ నున్నది. అనితర సాధారణమైన దుస్తరమార్గమునఁ బ్రకాశించుచు నామె తన ప్రతిభావిశేషమును, ప్రజ్ఞాధిక్యమును గాన్పింపఁ జేయుచున్నది. కావున నన్ని కఠిననియమము లుంచుకొని తదనురూపముగ నింతవఱకుఁ బ్రవర్తించి యున్నది. ఇఁక మాయమ్మ యందురా ?— ఆమె భూమిపై నవతరించిన యనుకంప దేవత — మూర్తీభవించిన సుగుణరాశి. అప్రమేయ గుణ పూజ్యయగు మాతల్లికిని తదితర కాంతలకును పోలిక లేనేలేదు. భిన్న విద్యుద్ధర్మ యుక్తములగు పదార్థము లాకర్షింపఁబడునట్లు భిన్నభిన్న తత్వయుక్తులగు స్త్రీపురుషు లాకర్షితులయి తమ యైహిక జీవితములకు సంపూర్ణత్వమును, సంతుష్టియు, శాంతియుఁ గలుగఁజేసికొన వలసి యున్నది. లోకమున కాదర్శకరముగ బ్రతుకనెంచువా రిట్లూహింపవలసియున్నను విపరీత చేతస్కులగు మనుష్యు లట్లొనరింపఁ జాలక హృదయవ్యథలఁ బాలయి పోవుచున్నారు. స్త్రీలయెడల జూపింపవలసిన గౌరవమున నొక యర్ధభాగమైన వారికిచ్చి మనుష్యుఁడీ లోకమున నెంతవాఁడగుచున్నాడో అందొక యర్థభాగమునకైన స్త్రీలు వచ్చు నవకాశము లున్నయెడల నిప్పుడిందిర తమకు 'జన్మహక్కు'గ ఘోషించుచున్న వివాదమును జేయుట కావశ్యకత లేకుండియే యుండును—ఇఁకఁ బ్రకృతాంశము: ఏమియొనర్చినను యుద్ధము మాత్రము వలదు. యుద్ధమైన నేనంతయుఁ గోల్పోవుదును."

కమలాకరవర్మ యిట్లు పలికెను,—

"అవును. నీవు యుక్తియుక్తముగ మాట్లాడితివి.—మహోత్సాహ జనకమగు యౌవనమునఁ బ్రేమించుట యనఁగ నెట్లుం డునో నాకుఁ జక్కఁగ జ్ఞాపకమున్నది. కాని నీవలెనే నప్పుడిన్ని పాట్లు పడియుండను. సుఖ మయమైన ప్రణయజీవితము సులభముగ నాకు వశమైపోయెను.—నీవచ్చముగ నిందిర వలెనే చర్చయొనర్చితివి. దేనినిగూర్చియైన పలికిన, చర్చించిన నామెయే చేయవలెను. కాని నీసంభాషణమామె చర్చలకంటె సమంజసమును సమ్మానార్హమునై యున్నది."

అని మాతండ్రిగారితో నిట్లు పలికెను—"తమ పుత్రునియం దసాధారణ గౌరవార్హమైన ఘనతయున్నది. వీర పురుషోచితమగు నితనివాక్యములు నాకు మోదావహముగ నున్నవి. అతఁడు మా ఇందిరను పెండ్లాడు టయే నాకభిమతము — ఇంక నింతనఱకు మీరొనర్చిన యోగడమునకు, అనఁగ నా స్వేచ్ఛను నిరోధించి నన్నీవిధముగ నిలిపి యుంచినందులకు తమకుమారునకుఁ గీడు వాటిల్ల కుండవలయునను పితృప్రేమ దీని కంతకును మూలము కావునను నాకు మీ రర్హ గౌరవమును జూపితిచియుండిరి కావునను మీ కుమారునిఁజూచి మీరొనర్చిన యవజ్ఞ క్షంతవ్యమని భావించుచున్నాను. మీ కుమారునికై నే నేమొనర్చినను యుక్తమే. ఇఁక మాయనుజ్ఞలేకుండ మారాజ్యముపై దండెత్తివచ్చి, మీరిన్ని సైన్యములఁదెచ్చి యిచ్చట పీఠమువేసి నందులకు—నర్తం చరులవలె నడికిరేయి నిట్టి యోగడమున మాదేశ మాక్రమించుకొన్నను, మాప్రజల ధనధాన్య గేహములకుఁ జిచ్చువెట్టక, మా కర్షకుల హింసింపక, మాస్త్రీల బాధింపక, మాగ్రామస్థుల యాహారపదార్థము లపహ రింపక కేవల యోగ్యాచరణులై యుండిరి. గావున నేను చెప్పునదేమన—

"మాకుమారుఁ డజయుఁడు మాసైన్యాధీశులతో నావల నున్నాడు గావున నేనిప్పుడు తమకుమారునిఁ దోడ్కొని యజ యునితో మాట్లాడ ననుమతింపవలయునని మిమ్ము గోరికొనుచున్నాను. అతనిని నిరపాయముగఁ బంపివేయుదునని తమ యెదుటఁ బ్రమాణపూర్వకముగ వచించు చున్నాను. నామాటకన్న నజయునిమాట యన్న నిందిర కధికగౌరవము గావున నేదో యొకరీతి నీవ్యవహారమును మనము చక్కఁ బఱచుకొనుట కవకాశముండును. ఇదమిద్ధ మని యిప్పుడేమియుఁ జెప్పఁజాలను. కాని యేదో యొకవిధము గోచరింపకుండ నుండదు. మిత్రత్వముననే కార్యసాధన మొనర్చుకొందము.— (అని నామిత్రుల వంకఁదిరిగి)—నాకీవఱ కతిథులై యుండిన మీరు, మీకు సమ్మతమైన మీరును మాతోవచ్చిన సంతసింతును. మనము పరస్పర మొక్కభావమున నొక్క వ్యూహ మట్లునిలువఁబడినయెడల బ్రతికూలతత్త్వము లంతగ మనలఁ బ్రతిఘటింపఁజాలవు." అని యారాజు గమనోన్ముఖుఁడయి మాతండ్రి

గారికిఁ బ్రణామ మొనరించుటయు, వారు మనస్సున నిష్టములేకున్నను మెట్టకేలకు మా ప్రేమ కనుమతించువారివలె 'ఊఁ' యనిరి.

అంతట మేము నల్వురమ శ్వారూఢులమయి వారి యాశ్వికసైన్యములు నిలిచియున్న తావునకుఁ బయలుదేరితిమి. మార్గమున కిరుగెలంకులనున్న మహోన్నత వృక్షములపై పక్షు లవ్యక్త మధురమగు నవంగశాస్త్రములఁ జదువుచుండఁగ బుష్పనికుంజములనుండి యుత్సాహవర్ధనమగు మలయమారుతము నామానసమునఁ గోరిక లీరికలెత్తఁ జేయుచుండెను. నామనోహారిణి నన్వేషించు తహతహతో నేనా యోఁడు వారి విద్యాలయమున నేమేమి యొనర్చితినో, నాప్రణయకథ కెట్టిమెట్టి భంగపాటు లొనవచుచవచ్చినవో ఆ మహారాజునకుఁ దెలుపుకొంటిని. తనకుమార్తెపై నాకుఁ గల యుత్తమభావమున కాతఁడు నన్నభినందించుచు నా ప్రణయకథకింక భంగపాటొదవకుండ సహాయ మొనర్తునని వాగ్దాన మొసంగెను.

కాని వారి యశ్వసైన్యముఁ గలసికొనునప్పుడు మాయం దట్టి శృంగారభావముల కవకాశము లేకపోయెను. తమరాజు రాకఁజూచి యాసైన్యములందలి శూర యోధులు స్వాగతపూర్వకముగ జయజయధ్వానము లొనర్చిరి. భేరీమృదంగ పణవాది నినాదములతో, మంగళోపకరణ శోభితమగు పుణ్యాహనాదములతో, పరమాశీర్వాదములతో, మాగధగీతములతో, వందిజనస్తోత్రములతో వారిసైన్యములందు పరమాభీలసుందర సమ్మర్ద మగుచుండగ ముప్వు రాశ్వికనాయకులుముందునకువచ్చి తమరాజునకు స్వాగత సూచకముగఁ బ్రణామ మాచరించిరి.

మొదట వారెవ్వరో యనుకొంటిని కాని వారాతని పుత్రులగు నజయసింహుఁడును, అతని యనుజన్ములగు రామకృష్ణులు నని క్షణములో నాకుఁ దెలిసిపోయెను. నాజీవితమున నట్టి విశాలోరస్కులు, అమితబలులు పంచానన సమభీషణమూర్తులు నగు యువకులఁ జూచియుండను. ఆకవలవారినడుమ నజయుఁ డున్నతుఁడయి రూపురేఖలయందును, సామాన్య వైఖరియందును నా మనోహారిణిని దలంపునకుఁ దెచ్చుచున్నట్లుండెను. వారి తనుత్రాణములును, శిరస్త్రాణములును సూర్యప్రకాశమునఁ ధగధగ మెఱసిపోవుచుండెను. ఆ యుద్ధఘోషములమహత్వ మేమని చెప్పవచ్చును!—అంతవఱకు యుద్ధమువలదని ఘోషపెట్టియున్న నాయందు సహిత మదియొక విధమైన వీరావేశమును కలిగించెను. ఉగ్రమగు కండకావరమున ప్రతిజంతువునందును బుట్టుచుండు నుహామదము నన్ను సహితము యుద్ధోన్ముఖునిగఁ జేయుచున్నట్లుండెను.

అంత నామహారాజు తన ముప్వురు పుత్రులకును సర్వవిషయములును విశదముగఁ జెప్పివేసెను. ఆవిద్యాలయమునను,

మమ్మును, మావాతిశిబిరమును అతఁడు త్రేలఁ జూపించుచు మాకథను, తనకథను వారికి వినిపించుచుండఁగ మాయాఁడు వేసములకు, మేముఁ పడిన భంగపాటులకు వారి యందణప శక్యముగాని యపహాస్యతత్వ ముదయించుచుండెను. ఎట్టకేలకు మహాకాయుఁడును, మహావీరుఁడును అగు నా యజయసింహుఁ డిట్లు పలికెను.

"మా రాజ్యముపై దాడెత్తివచ్చిరి. దానితో నూరకుండక యతనిని సహితము మీకు 'ఖైదీ'గా నుంచుకొనిరి. ఎంత యాగడము! అయినను మా తండ్రికి యుద్ధ మసమ్మతము. ఎంతయాగడము! నాకు యుద్ధము కావలయునా, లేదాయన్న—అయిన మీ రా మహారాజునకుఁ జేసిన వాగ్దత్తమున్నది. ఇఁక మా సోదరి. ఆమెయం దొక సత్య వి నిశ్చయ బుద్ధి యున్నది. అయిన నామె యాశయములు కొంత వియత్పథమున నున్నతముఁగ, మహోన్నతముగఁ బోవుననుట వాస్తవము. అయినను తగిన యవకాశమును, తదనురూపమగు కాలమును సమకూడిన యెడల, తమ యుద్యమ మెట్టి ఫలితమునకు వచ్చునో జూడవలయును గాని వృథగ తమ్మును తమయుద్యమమును నిందింపవలదనుచున్నది. అట్టి యవకాశము తనకుఁ గలుగునట్లు ఆమె నాచేతఁ బ్రమాణము చేయించుకొనియున్నది. నేనుమాత్ర మా విషయముల నేమంత యెఱుఁగుదును?—ఆమెనుమాత్ర మొక ప్రకృతిమానవభామినిగా దలంపరాదు. తమకైన దురన్యాయముల నామె యేకరువుబెట్టినప్పుడు ఆమెజెప్పిన దంతయు యుక్తమేయని నే నూహించితిని. నిశ్చయముగ నామె యాశయ విహంగములు దుస్తరమార్గముల విహరింప నభిలషించును. అయిన నేమాయె?—భూతభవిష్యద్వర్తమానముల స్త్రీ జాతి యందామెను మించిన యలంకార ముండదు. ఆమెయందనితర సాధారణమగు ప్రజ్ఞయున్నది. నిరుపమానమగు ప్రతిభావిశేషమున్నది. తదనురూపముగనే నామె నభినందించెడువాఁడను. కావున నామె యుద్యమ మిది యుక్తమయుక్తమని నిర్ణయించుటది నాకేమి పని? ఆమె కెవ్వరన్న నభిమానమో వారియం దత్యంత మధురముగ నుండఁగలదు. కావున నో రాజకుమార! సమంజసమగును కాక పోవును. నేనామె పక్షమున నుండువాఁడను. అట్లుండునని ఆమె నా చేత శపథము చేయించుకొనియున్నది. మహాదేవి ఆలయమున స్వచ్ఛమగు దీపికాప్రకాశమున నా కృపాణమునుబట్టి—ఆదిశంకరుల నుద్దండ వివాదమున జయించిన విదుషీమణియాఁట! —ఆమె పేరేదియో నేను మఱచిపోయితిని—ఆమెపై యొట్టువేయించుకొని నే నామె పక్షమున నిలచునట్లు వాగ్దానమును పొందియున్నది. కావుననిఁక ఫలితమేమనఁగ—ఆమె నిన్ను పెండ్లాడదు కావున నీవింక విరమించుటయే యుక్తము. లేనియెడల మాతండ్రి యొప్పుకొనకున్నను సంగ్రామ రంగముననే దానిని నిర్ణయింతము."

మా ప్రాచీనసమయ మంత సూక్ష్మముగ వదలుకొనుటకు నా మన స్సంగీకరింపకపోవుటచేతను, బుద్ధిహీనమైన యుద్ధమునఁ బరస్పర వైషమ్యము లింకను వృద్ధి చేసికొనుట నా కభిమతము కాకపోవుట చేతను నే నాతనికిఁ దక్షణము ప్రత్యుత్తర మొసంగఁజాలకపోతిని. అంతలో నాకవల వారిలో నొకఁడు మమ్ము రెచ్చగొట్టుటకో యన తన మీసపు వెండ్రుకలపై వునఁ జేయి వేసికొనుచు సగ మాత్మగతముగ మాట్లాడుకొనువానివలె "ఆఁడు మగరూపములు! కావుననే తమ యాఁడుగుఁడియల కనురూపముగ నాఁడువేసముల వేసికొనిరి" అని యుపాలంభింపఁజొచ్చెను.

ఆ యుపాలంభన మసిఘాతమువలె మాకు దగులుటచేతఁ దక్షణము కృష్ణవర్మ యందికొని యేదో ముష్కరముగ జవాబు చెప్పుచుండగ, నే నూరకుండఁజాలక కృష్ణవర్మ నొక చేతఁ బట్టుకొని "ఏదీ, చూతము! ఎవ్వ రెంత పౌరుషవంతులో దెలిసిపోవును. ముప్వురకు ముప్వుర ముంటిమి కావునఁ దక్షణమే కలియఁబడి కొట్టుకొందమా?" అని యమర్షమునఁ బంతములు పలుకు బాలురవలె కొంచెము దీవ్రముగఁ బ్రత్యుత్తర మొసంగవలసినవాఁడనైతిని.

అంతట నా మూఁడవయాతఁ డిట్లు పలికెను. "ముప్వురకును ముప్వురనుట యేల? అంతకు హెచ్చుగఁ గొట్టికొనఁగూడదా? ఒడల్లింత గా దాఁచుకొనవలెనా?— అందును భువనమాన్యగుణోత్తరయగు మన యక్క— గౌరవప్రతిష్ఠాపనమునకై ముప్వురము మాత్రమేనా గత్తులఁ దూయవలసినది? మన సేనాంగములలోఁ బ్రతినాయకుఁడును తమ రాజేంద్రునికై న యవజ్ఞ గిడగిపైచుకొని శాశ్వతమగు కీర్తి నుపార్జింపవలయునని తహతహ లాడుచున్నాఁడే! కావున నింకను హెచ్చుగఁ బోరాడినఁగాని యిం దేమి పసయున్నది? అధమపక్షమునఁ బక్షమున కొక యేబది యోధులైనఁ దలపడి అందెవ్వరు జయింతురో వారే గెలిచినట్లును రెండవవా రోడిపోయినట్లును యేల నిర్ధారింపరాదు?"

అందులకు నే నిట్లంటిని. "ఆహా! అట్లే చేయవచ్చును. కేవలము గాలికిఁబోవు నీ కీర్తికై మనమందఱమును ప్రాణములతో చెలగాట మాడికొనవచ్చును. మన చేతల నభిరామముగ నింద్రధనుఃకళికవలెఁ బ్రకాశింపజేయు నీ 'కీర్తి'కి మన మెంత ఘోరముగనైనఁ జచ్చుట కొప్పుకొనవచ్చును. క్షత్రియులు సుభోచితశయ్యలఁ జచ్చుటకంటె వివృత స్వర్గద్వారమని మనవారు గీర్తించు యుద్ధమున నీ బ్రదుకులఁ జూద మాడి వేయుదము. అయిన నంతమాత్రమున నేమగును? మే మోడిపోవుదుము. సరే. కాని మే మొకవేళ జయించినను తుదకు విఫలమనోరథులము కావలసినదే కాదా? మేము జయించినంతమాత్రమున నామె సమయబద్ధురాలు కాఁజాలదు కద!"

అందులకు కజయుఁడు "అట్లుకాదు. అట్టి యుద్ధఫలితమున కనురూపముగ నామె

కట్టునడియుండఁదగునని ఆమెకు నచ్చజెప్పు భారము నాది. లేఖాముఖమునఁ దగిన కారణముల జెప్పి ఆమె యందులకు బద్ధురాలయియుండునట్లు చేయుదును. దానిపై నామె భావ మెట్లుండినది యే స్వయముగ మీ కందఁజేయుదును" అని పలికెను.

"కాని, అబ్బాయిలు! వినండి!" అని యా వృద్ధరాజేంద్రుఁ డెన్నివిధముల నివారింపఁజూచినను, నీటియం దీద నుద్యమించు బాతుపిల్లలను వలదని వారించు పెంపుడు తల్లి యదకోడిపెట్టవలె నాతఁ డెంత చెప్పినను సంగ్రామప్రియులగు నా రాజకుమారులు వినుపించుకొనకపోవుటచేత నతఁడు హతాశుఁడై మిన్నకుండవలసినవాడయెను.

ఆ తరువాత మే మంతగ భాషింపవలసిన యావశ్యకత లేకపోవుటచేత నా మిత్రులతోఁ గలిసి మా తండ్రిగారి శిబిరమునకు వచ్చివేసితిమి. ఈలోన మా తండ్రిగారు కొంత కథగా నిచ్చిరని తెలిసికొంటిని. ఆ విద్యాలయద్వారమునకు మూఁడుసార్లు వారొక రాయబారిని బంపి యిందిర సమయభంగ మొనర్పకుండ నుండునో లేదో తెలియఁగోరిరట. ఆ రాయబారి మూఁడు మాఱ్లచ్చటకుఁ బోయియుండెను. మొదటి పర్యాయ మతఁ డచ్చట నెన్ని తూర్యధ్వను లొనర్చినను ఎవ్వ రగుపించలేదు. అతఁడు తలుపులవద్ద నెంత తట్టినను ఎన్ని విధముల నఱచినను ఎవ్వరును రాలేదు. వినిపించుకొనలేదు. రెండవసారి లోననుండి భయంకరమగు నొక కంఠధ్వనితో నొక స్త్రీ యతని నచ్చటనుండి పొమ్మని యదల్చివైచెనఁట. మూడవసారి బలవిక్రమ సపన్నలను, విశాలోరస్కులును, వ్యాయామ విద్యాప్రవీణులును అగు నాయెనమండ్రు హారికలును ఒక్కుమ్మడిగ ద్వారమును దెఱచి ఆ రాయబారిపైఁ బడి, యతని కేశముల నిష్కరుణముగఁ బీకి, బ్రక్కయెముకలఁ బొడిచి, మొగమున గొట్టి యతనిని బ్రాణావశిష్టునిగ నొనర్చిరఁట. వా రట్లాతనిపై నట్టి యత్యాచార మొనర్చుచుండగ నా రాజకుమారి తన విద్యాలయ సౌధమున నిష్కంపధైర్యముతో నిలుచుండి సర్వముపలక్షించుచుండెనఁట.

కొండలపై జలవాయుభూతము లొండొంటితోఁ బెనఁగులాడుచుండగ మహారయమునఁ బొంగిపోవు రెండు ప్రచండ వాహినులనడుమ నిశ్చల తత్త్వమున నొక గట్టుపై ఠీవిగ నుండిపోవు మహావృక్షమువలె నామె వైఖరియున్నది.

కాని నా వధూమణిపై సంగ్రామ మొనర్పఁబాస యిచ్చితినని మాతండ్రిగారికిఁ దెల్పినప్పుడు ఆయన మహోత్సాహమునఁ జేతులఁబఱచుచు యోధకుమారులతోఁ దానును యుద్ధమొనర్చు నవకాశము కలిగినదని బలుకఁజొచ్చిరి కాని, వృద్ధులు, జ్ఞానవృద్ధులునగు వారిమంత్రీశ్వరు లట్టిపద్ధతి యుద్ధనీతికిని రాజనీతికిని గూడ విరుద్ధమని హేతుకల్పన మొనర్చుటచేత నాగ్రహముతో, ననిష్టతతో నట్టి పూనిక

నుండి విరమింపవలసిన వారయిరి. మా మహాయోధవర్గమున ననేకులుత్సాహమునఁ గృపాణములువట్టి నాకై నాసమయమునకై ప్రాణముల పోకఁదలంపక సంగ్రామమొనర్తుమని ప్రతిజ్ఞయొనర్చిరి.

అంతలో నారాజకుమారి యుద్యానవనమున కీవలపార్శ్వమున మాయాహావవినోదమునకు రంగమును తయారుచేయఁ జొచ్చిరి. ద్వారమునకుఁ జేరియున్న యిత్తడి తలుపులపై 'టామైరిస్'అను మహారాణిపై 'కైరస్'అను పరిషయన్ చక్రవర్తి విజిగీషార్థము దాడి వెడలినప్పుడామె యేమి యొనర్చినదో చిత్రముగఁ దొలువఁబడి యుండెను.*ఆయుదయమంతయు వారచ్చటి యుద్ధరంగమును సదునుచేయుటతోఁ గడిచి పోయెను. నడుమనడుమ రాయబారు లిచ్చటి కిని యచ్చటికినిఁబోవుచు సందేశములను, ధిక్కారములను జేరవేయుచు వచ్చిరి.

తుదకజయసింహుఁడు నాకు వాగ్దత్త మొనర్చిన ఆరాజకుమారి ప్రత్యుత్తరము వచ్చెను. ఉప్పొంగివచ్చు మహోపన్యాసము వలె సుందరమగు నక్షరములలో లిఖింపఁబడియున్న ఆలేఖనందికొని యీ విధముగఁ జదువుకొంటిని.

"అన్నా, అజయా! స్త్రీల కెల్లదేశముల నిరంతరముగ నగుచున్న యవజ్ఞలనుగూర్చి యూహించునప్పుడు నాహృదయ మెట్లు దహించుకొనిపోవుచుండునో నీకు దెలియనిది కాదు. స్త్రీల కీనుపచెప్పులదొడగి పరాభవించు చైనావారి దుర్మార్గమునుగూర్చి, పరిణయకాలమున పురుషుఁడు భార్యను చావమోదుట కొఱనికి కన్యచేత నందియ్యఁబడు రష్యావారి 'కొఱడాదాన' మహోత్సవమునందలి యాగడమునుగూర్చి, బ్రదికియుండఁగఁ జెప్పరాని దుష్ప్రభుత్వములఁ జేసి ఆయువుమూడిన 'పీనుఁగల'య్యుండియు బ్రదికియున్న తమస్త్రీలను తమదేహములతో గాల్పించుకొను హిందువుల దౌర్జన్యమును గూర్చి, ఆఁడు శిశువు లుదయించినంతటనే వారికిఁక తగినవరులులభింపరను భవిష్యద్దుర్దశలకైన ననుకంపమున నోటఱుంగని నెత్తురు కందువులను గంగానదియందలి మొసళ్లనోళ్ల కందించు రసపుత్రమాతల దురంతమును గూర్చి చదువునప్పుడు, ఊహించునప్పుడు,

* 'టామైరిస్'అను రాణియొక్క దేశమును తనస్వాధీన మొనర్చుకొనవలెనని 'కైరస్'అను పరిషయన్ చక్రవర్తి మహాసైన్యములఁ దోడ్కొనిపోయెనఁట. ఆమె సామమార్గమున నెంతచెప్పినను 'కైరస్' వినకపోవుటచేత ఆమె యాతనితో యుద్ధమున హోరాహోరిగాఁబోరి తుదకాతనిని సంపూర్ణముగ పరాజయము నొందించుటయేగాక అతఁడాయుద్ధమునఁ బ్రాణములసహితము బోగొట్టుకొను మహాపదకుఁగూడ బాలుచేసెనట. అట్లు ఖండితుఁడైయున్న యామహారాజు మస్తకమును ఆమె యొక రక్తపుఁదిత్తిలోని కెక్కించి యతని 'రక్తదాహమును' పరిపూర్ణముగఁ దీర్చికొమ్మని యుపాలంబించెనట. తమపై దాడెత్తివచ్చు పురుషులకు భయావహముగ నట్టి చిత్రమాయాఁడువారి విద్యాలయద్వారపు తలుపులపైనున్నదని భావము. ఈక 'హెరొడోటస్'అను ప్రాచీనగ్రీకుచరిత్రకారుఁ డభివర్ణించియున్నాఁడు.

చర్చ యొనర్చునప్పుడు నా కపరిమితమైన యమర్షముదయింపకుండ నుండునా?

"అంతేకాదు. నాగరికతా మహావ్యాప్తి నొందియున్న యీకాలమునందుగూడ నిట్టి యాగడముల కనురూపమైన దుశ్చత్వము సమస్త వ్యవహారములయందును బురుషుల యందుండి పోవుచున్నది. స్త్రీలకు స్వాతంత్ర్యార్హత లేదనియు, స్త్రీలను కేవల గృహోపకరణ యోగ్యముగఁ జూచుకొనవచ్చుననియు శాస్త్రసిద్ధాంతములు మనుజ జాతికిఁ దలవంపుగ నిప్పటికిని బ్రపంచమును బీడించుచున్నవి. అన్ని దేశములందును, అన్ని జాతులందును ఇట్టి శాసనములు బొమ్మజెముడువలె వ్యాపించిపోయియున్నవి. పూర్వ పశ్చిమ మధ్యస్థమగు సమస్తదేశములందును స్త్రీల నణచియుంచుటయే పౌరుష లక్షణముగ భావింపఁబడుచున్నది. పౌర సత్వాధికారములపై, స్వపరిపాలనాధికారములకై లక్షలకొలది ప్రజ లాందోళన మొనర్తురుకాని ఒక్కరును స్త్రీ స్వాతంత్ర్యోద్యమమున బద్ధకంకణులైనవారు లేరు.

"అందువలన నేనీ యశేష పురుషలోకమునకును పరాఙ్ముఖనై నాజాతి నున్నతికిఁ దెచ్చుటయే జీవితవ్రతముగ భావించుచు నుండిపోవలసివచ్చినది. పురుషులయాగడ మెంతమాత్రమును చేరఁజాలని దుర్గమస్థాన మొకటి నేనిచ్చట నిర్మించి దాని యభ్యున్నతికై కొన్ని యుగ్రశాసనముల సాహాయ్యము కాపుగఁ జేసికొంటిని. వాని మహాత్మ్యమున మేము జిరకాలము ఘాతుక మృగముల బారిఁబడకుండ దప్పించుకొంటిమి.

"స్త్రీల కభివృద్ధి కవకాశములేని గొప్ప యెడారివంటి యీ విశాల ప్రపంచమున స్త్రీలకుఁగనులపండువుగ నేనిట్టి ఫలవంతమగు ప్రదేశమును దయారుచేసితిని. అందెల్ల దేశముల నింతవఱకు చెప్పనుఁజేయను జేతనయిన యాఁడువాండ్రెప్పుడెప్పుడేమేమి యొనర్చిరో దెలిసికొన వీలుండునట్టి వస్తువులను, పుస్తకములను, విగ్రహములను ప్రతిష్ఠింపించుకొంటిని

"ఇట్లు మాచదువులలోఁబడి మేముండగా, మాకన్యలవలె వేసములు వేసికొని ముష్కరులగు ముగ్గురు పురుషులాగడమున మా విద్యాలయమునఁ జొరఁబడి మాశాంతికి భంగమును కలుగఁజేసిరి. వారిదుండగ మేమనవచ్చును? —— పసికూననై యున్నప్పుడయియుండిన సమయభంగమని యొకసాకు గల్పించుకొని ప్రేమయని, వివాహమని—— యిట్లు వలవని ప్రేలరిమాటల నాకు మహామర్షమునకుఁ గారణభూతులైరి. కన్నులఁ దెఱువని శైశవప్రాయమున, నాయిష్టానిష్టములతో నిమిత్తములేకుండ జరిగియున్న యాప్రాచీనసమయమునకు నేనేల బద్ధురాల నగుదును? అట్టి యాగడమున నాసమక్షమునకు వచ్చినంతమాత్రమున నా జీవితవ్రతమునకు నేనేల భంగమును కలుగఁజేసికొనవలెను?

"మహాఘాతుకమగు సింగముల నేను మచ్చిక యొనర్చితిని. ఇంతటి ఘాతకులగు

పురుషులను నేను మచ్చిక చేసికొనఁజాలక పోవుదునా?

"ఇప్పుడు వీండ్ర కెవ్వరు బుద్ధిచెప్పఁదగినది?—మీరా? నేనా? బుద్ధి పూర్వకముగ నాకింత యవజ్ఞయొనర్చిన వీండ్రనిప్పుడు తప్పక శిక్షింపవలెను. ఉగ్మలీజనహిత ప్రారంభమగు నీ యుద్యమమునఁ బావనతయు, ఘనతయుఁ, బరిశుద్ధతయు లేదా?

"ఇప్పుడు నేను మాజాతిగౌరవమును, సత్యమును గాపాడుకొనవలసియున్నది. ఇట్టి సందిగ్ధసమయమున జగన్నిర్మాణకారణమగు నాదిశక్తి మనకు జయమీయకుండ నుండదు.

"కావున నజయుఁడ! నీవు సంగ్రామమున నజయ్యుఁడవై మమ్ముఁగాపాడగలవు. నీ పరాక్రమమున నాకు విశ్వాసమున్నది. మఱియుఁ బరమపావనయగు నెట్టి తల్లి గర్భమున నీ వుదయించియుంటివో జప్తియందుంచుకొని జగమునకు మాతృస్థానమని చెప్పఁబడుచున్న మా స్త్రీ జాతి నుద్ధరింపుము.

ఒకవేళ నీవోడినయెడల నేనోడితినని యొప్పుకొని తదనురూపమగు సమయమునకు బద్ధురాలనయ్యెదను. కాని నీవోడిపోవువాఁడవుకావు. అయినను నీవాతని ప్రాణములమాత్రము తీసికొనవలదు. తన ప్రాణములనైన సరకుచేయక నాప్రాణముల నీతఁడు కాపాడియుండెను కావునను, అతని తల్లి యింకను జీవించియేయున్నది కావునను నీవాతనిని చంపఁదగదు. కాని యుద్ధమునఁ జక్కఁగ పోరాడుము. చేతికొలఁది, శక్తికొలఁది యుద్ధ మొనరింపుము. నాప్రియ సహోదరులు! స్త్రీహితకాముకులగు దేవతలు మీకు తోడయ్యెదరు గాక!

ఉ. కీర్తనపాత్ర చిత్రమతి
కిల్బిషపావన శీలమున్ జగ
న్నర్తన మూలసూత్రమును
నవ్యవిభూతికి నాలవాలమున్
కీర్తికి మూలకందమును
కేవలదైవమయైనశక్తి సం
పూర్త మనోరథంబులును
భూరిజయంబును మీకునిచ్చుతన్.

ఉగ్మలీజనహిత ప్రారంభమగు మా యుద్యమమున మాతోఁజేర్పఁదగిన పురుషులు మీరొక్కరే. మమ్ము మా చదువుల నుండకుండ నడుమవచ్చిన యీ కందిరీగల నావలకుఁగొట్టివైచిన తరువాత భావికాలమున మిమ్మొక్కరినే మేము మా చరిత్రముల కెక్కించుకొని కీర్తించుచుందుము. మీరు యుద్ధ మొనర్చు కవచములఁ బరమపావనముగ మా విద్యాలయమునఁబెట్టికొని, మీ విగ్రహముల సహితము మాకుఁగన్నుల పండువుగఁ బ్రతిష్ఠించుకొందుము. అట్టి భావికాలమున స్త్రీలు తప్పక ముందంజవేసి తమ యోగ్యతను తాము గుర్తింప సమర్థురాండ్రయ్యెదరు. ఇంతవఱకు మగవానితోడిదియుఁ, బిల్లలతోడిదియు లోకముగఁ

దలపోయు స్త్రీలప్పుడు సరియైనస్వేచ్ఛా సౌఖ్యమునుబొంది విజ్ఞానమే ఐహికలోక పరమార్థముగఁ దలంపగల్గుదురు. నేఁడు ప్రపంచమును తమవశముగఁ జేసికొనుచున్న పాశ్చాత్యజాతులయందలి పురుషసింహములవలె తాము ను పరాక్రమశాలినులయి ఉత్తర దక్షిణ ధ్రువ మధ్యస్థమగు నీభూగోళము స్వాతంత్ర్యోదయమునఁ బ్రకాశించునట్లు చూడఁగలరు.

మీ సోదరి

ఇందిరా దేవి."

అనియున్న లేఖకుఁదిగువ మఱియు నీ 'హెచ్చరిక' నాకగుపించెను.

"మీాశిబిరమున నీతో యుద్ధమున కుపక్రమించువారిలో నెవ్వరును ద్రోహులుండకుండ మొదటఁ జూచికొనుము. మా శాసనధిక్కారమైనది మొదలు మావిద్యాలయ మొక విద్రోహపుఁబుట్టగఁ గానవచ్చుచున్నది. ఈఁతిబాధలవలె నీపురుషులు మాపై విఱుచుకొనివచ్చిరి.—ఇట్లు పురుషులచేఁ జుట్టఁబడియున్న స్థితియందీ విద్యాలయమున నుండుటకంటె మాబాలికలు వారివారి యిండ్లయందుండిన బాగుండియుండునేమొ!—ఇట్టి సందిగ్ధసమయమున నయోగ్యురాలగు నొకతల్లి యిచ్చట వదలిపోయియున్న యొక పసికూన నాకు హృదయ సౌఖ్యావహమై కొంతయాశ్వాసమిచ్చుచున్నది. ఇఁక నెప్పటికి తల్లి నావెన్నెయును. దాని మానసవికాసమునఁ దల్లియని చెప్పఁదగు నామెనే యామె తల్లిగఁ గౌరవింపఁగలదు. నేటి ప్రాతఃకాలమున నొక గంటసేపు దానిని నాయొడియందుఁ గూర్చుండఁ బెట్టికొంటిని. అప్పు డా యనాథబాలిక హస్తములు మృదులముగ నాహృదయమును దడవి యీప్రపంచముపై నా కుదయించిన యాగ్రహవికారమును మటుమాయమగునట్లు చేసివైచెను.— మనకు సంపూర్ణ మనోరథ సిద్ధియగుఁగాక!"

మాతండ్రిగారా లేఖనుజూచి యిట్లనిరి.

"తెలిసియుఁ దెలియనిపట్టుదల! అయిన నేమాయె?—మహావిప్లవములఁ జక్రవర్తుల కర్థాంగియయి మహాయోధుల నుదయింపఁ జేయఁగల యుత్తమశక్తి ఆమెయందున్నది. బుద్ధిని దగ్ధపటలమొనర్చి కనులకు విభ్రాంతి నొదవించు మోహమటుంచి కొంచెమూహింపుము. బలహీనుఁడును, హీనప్రకృతియునగు నీకమలాకరవర్మ ఆదియందామె కంత స్వతంత్రమిచ్చి ఆమెనింతగఁ బాడుచేసినాఁడు. పురుషుఁడు బలహీనుఁడైనయెడల ఆఁడుది బలవంతురాలయి సృష్టిని దల్లక్రిందుగఁ జేసివేయును. భూమియొక్కయుపరిభాగ మెప్పుడెంత స్థిరముగ నుండిపోవునో సృష్టియందీ ధర్మ మంత స్థిరముగ నుండిపోవునని భావింపఁదగును.— పొలముదున్నువాఁడు పురుషుఁడు, వంటయింట వంటజేయున దాఁడుది. కత్తిఁ బట్టవలసినది మగవాఁడు, గరిటద్రిప్పవలసిన దాఁడుది. కలముఁబట్టి వ్రాయవలసినవాఁడు

పురుషుఁడు-సూదిబట్టి కుట్టవలసినదాఁడుది. మెదడుపయోగమునకుఁ దెచ్చుకొనవలసిన వాఁడు మగవాఁడు, హృదయ ముపయోగ మునకుఁ దెచ్చుకొనవలసిన దాఁడుది. ఆజ్ఞా పింపవలసినది పురుషుఁడు, ఆ జ్ఞ వ్రు రా లాఁడుది. లేనియెడల నంతయు నవకతవక! ఇంటిపెత్తన మాఁడుదానికి వదలివైచిన యెడల మగవాఁడాత్మగేహమునందే నరక బాధ లనుభవించును. ఇఁకఁబ్రపంచతంత్రము లన్నియు నాఁడువారి వశమై పోయినయెడల సృష్టితంత్రములుగూడ భ్రష్టములయి ప్రళయ మాసన్నమైనదని భావింపవచ్చును.

"కాని నీ విప్పు డామెను సంపూర్ణ ముగ వశమొనర్చుకొనుట కవకాశ మున్నది. పెండ్లియయి నీ వామె నదుపాజ్ఞ లలో నుంచఁగలిగినయెడల, నింటబిడ్డను కుంపటిపాలుచేసి వీధులలో తమ జన్మ స్వాతంత్ర్యములను కూరగాయ లఱచిన ట్లఱువఁబోవు నవివేకపు స్త్రీలవలెగాక వీర కాంతయు, వీరమాతయు ననిపించుకొనుట కవకాశముండును. అంద తామె సౌందర్య వతియనియే చెప్పెదరు. అట్లయిన నానంద కరమే — ఇట్లామెనుగూర్చి పరుసముగ మాట్లాడినందుల కామెయన్న నాకుఁ గిట్ట దని భావింపకుము. ఆమెను యుక్తమైన త్రోవకుఁ దెచ్చు భారము నీయందున్నది. అంతేకాక ఒకమాఱు పెండ్లయిన కాంతల యం దెంతటి మానసికపరివర్తనములైన సూక్ష్మముగ జరిగిపోవును. అట్టి పరివర్తన ములు వారికి సహితము కష్టముగనుండవు. ఇద్దఱు కవలపిల్ల లుదయించినయెడల నామె యవివేక మొక్కతుడుపుగ వదలిపోవును. స్త్రీల వివేకము పిల్లలఁ గనుటయందును వారిని పెంచుటయందును కలదు. దానిని మించిన ప్రజ్ఞయుఁ, బ్రతిభయు స్త్రీల కనా వశ్యకము."

అని మా తండ్రిగారు వారి తత్త్వమున కనురూపముగ మాట్లాడిరి. నేను వారిని వీడ్కొని నా మనోహారిణి వ్రాసిన యంశ ముల—ముఖ్యముగ 'నీ వాతని ప్రాణముల మాత్రము తీసికొనవలదు'—అను వాక్య మును పలుమాఱు భావమునకుఁ దెచ్చు కొనుచు నూహింపఁదొడఁగితిని. మఱియు నేను మా పురోపవనమునందుండగ నాకు వినుపించిన "ఆమె నన్వేషింపుచుఁ బొమ్ము. తప్పక నీకు విజయము చేకూరగలదు" అను నశరీరవాణి వాక్యములు నాకు స్ఫుర ణకు వచ్చెను.

మా తండ్రిగా రాడిన మాటలను దలంచి,తుదకు నా ప్రణయ గాథకుఁగానున్న పర్యవసానమును గూర్చి యూహింప నారంభించితిని. అప్పుడు మా వంశమును పీడవలె బట్టికొనియున్న ఆ బౌద్ధభిక్షుకుని శాపము సహితము నాకు జ్ఞాపకమునకు వచ్చెను. మాయందుఁ గేవల మోసపుఁ జాయల కెదుఱుగఁ బోట్లాడు మహావీరుఁ డొక డుదయించి భ్రాంతిమూలకముగు నీ మాయాలోకమునఁ బడిపోవునని గదా యతఁడాడియుండెను? — అని తలంప నారంభించితిని.

అంతటఁ దళుక్కున మా వంశమును బీడవలెఁ బట్టుకొనియున్న ప్రాక్తనశాపము నన్నా వహించినది గావలయు. ఆరాజులు, వారి స్కంధావారములు, ఆ మహిళా విద్యాలయము—అంతెయుఁ గపటనాటకములనియు, నైంద్రజాలికదృశ్యములవలె మోసపుఁజాయలనియు భావింపఁజొచ్చితిని. ప్రాచీనయుద్ధరంగములలో నెన్నఁడో చచ్చిన మహావీరులతో పోరాడఁ దలంచుచుంటినినియు, నా జీవితము సహిత మొక కపటస్వప్నమనియు విభ్రాంతాత్ముఁడనై పరిభ్రమింపఁజొచ్చితిని. కాని అట్టి చిత్తవృత్తి నా మనసున నెంత యాకస్మికముగఁ బొడమినదో అంత యాకస్మికముగనే పరిసమాప్తమైపోయెను.

నే నెప్పటివాఁడనయి చూచునప్పటికి మా పోరాటమునకు సర్వమును సంసిద్ధముగనుండెను. శాస్త్రోపదిష్ట ప్రమాణోచిత వృత్తాయతంబును, నపాకృతవృక్షవల్మీకంబును, సమీకృతనిమ్నోన్నత ప్రదేశంబును, దూరీకృతపాషాణశల్య శకలంబును, విరచిత బహువిధ ప్రేక్షాగార మంచకవలయంబును అగు రంగభూమియందు మంగళతూర్యఘోషముల వ్యాహతముగఁ జెలరేగుచుండగ నాపక్షమొక యేబది యాశ్వికవీరులును, అజయుని పక్షమొక యేబది యాశ్వికవీరులును నిలిచి యుద్ధమునకు సిద్ధమైరి. ఉభయ సైన్యములవారును ప్రేక్షాకాగారములఁ దమ తమ నియమిత స్థానములఁ గూర్చుండిమా యుద్ధవినోదమును విలకించుచుండగ మే మత్యుగ్రముగఁ దలపడి పోరాడఁ జొచ్చితిమి. తాళ్లవర్షము వలె గుఱ్ఱపు డెక్కలు నేలపై తటతటలాడుచుండగ మే మీటెలతోఁ గ్రుచ్చుచుఁ, గత్తులతోఁ బొడుచుచుఁ బ్రతియోధుల డీకొంటిమి.

కేవల వీరరసమయాత్మకులగు యోధవీరులతోఁ గలసి కవచములఁ జించుచు, నెత్తురులురివించుచుఁ, గండలు చెక్కుచు, నెమ్ముల విఱచుచుఁ బోరాడునప్పుడుకూడ నా కది యొక కలవలెనే దోపఁజొచ్చెను. జాగ్రతవస్థయందుఁగూడ నా యుద్ధావినోదమంతయుఁ గలయందగుచున్న విధముగ నుండెను. ఆభీలవేగమున మాపై కుఱుకుచున్న ప్రతివీరుల గుఱ్ఱములు వెనుకకాళ్లపై లేచి నిలుచుండగ దారుణసంఘర్షణమునఁ దనుత్రాణముల నగ్నులుదయించి దీర్ఘమగు నీటెలు దుత్తునికలై నేల కొఱిగిపోవుచుండెను.

ఎంతటి శూలారోపణములైనను, ఎంతటి కృపాణఘాతములైనను కొంద ఱాశ్వికులు కొండలవలె నకంపితులైయుండగ, కొందఱు తూలిపడియు ద్విగుణీకృత ధైర్యమున నురవడించుచుండగ, కొంద ఱధఃపతితులయ్యు తమ గుఱ్ఱములపై కెగసి పరాక్రమించుచుండగ, కొందఱు కూలిపోవు గుఱ్ఱములక్రింద మాయమగుచు బొబ్బరించుచు వచ్చిరి.

అజయసింహుని కిరుపార్శ్వముల మహాబాహువులతో మెఱయు నాకవలివా రెచ్చటఁజూచినఁ దామయై కఠినప్రహారము లోకవర్షముగఁ గురిపింపఁజొచ్చిరి. రౌద్రరస

మహోత్సాగ్రముగ నాశ్వికులు నేలకును గోలకును వచ్చి చిందఱవందఱ యగుచుం డగ యాయోధుల నాయాజయుఁ డొక్కఁడ చెగటాఱఁ జేయుచున్న ట్లగుచుండెను. శూలములు, కత్తులు, కఠారులు, డాళ్లు—సర్వ మా మహావీరుని ధాటికి నిలువఁ జాలక దుత్తుమురై పోవుచుండెను. అతని యెదురెదుర నిలువఁజాలక మా యోధులు కూలిపోవురూపముగ, నొఱగురూపముగ, నేలకొఱగు రూపముగఁ, దన్నికొనెడి రూపముగఁ గానవచ్చుచుండిరి. 'చేతఁ గండ్రగొడ్డలినిబట్టి నిష్కారుణముగ శత్రువులఁ జావఁగొట్టు భార్గవరామునివలె ఘోరాసితో నంత భీభత్సముగ యుద్ధమొనర్చు నీతఁ డతిహీనసత్త్వుఁడగు నా కమలాకరవర్మకు ఉదయించినవాఁడా?— అట్లయిన మన యొడళ్లఁ దండ్రులకంటె తల్లుల భాగమే నత్యధికముగనుండవలయు'నని నే నూహించుకొనున ట్లాతఁ డత్యుగ్రసంగర మొనర్చుచుండెను.

కలవోలె, చిత్రమువోలె కానవచ్చునతనినుండి నే నా విద్యాలయము వంక నుపలక్షించితిని.

ఆ మహాసౌధోపరిభాగమున నచ్చటి విగ్రహముల నడుమ విగ్రహములవలె నిలచియున్న తన స్త్రీలనడుమ నా రాజకుమారి శకుంతల శిశువు నొక్కచేత నెత్తికొని తేజస్వంతమగు దేవతవలె మా యుద్ధమును తిలకించుచుండెను.

పూర్వకాలమున మహావీరు లాహవ మొనర్చునప్పుడు దేవత లాకాశమున విమానములపై నుపలక్షించుచు శౌర్యాలంకారులగు యోధులపైఁ బూలవర్షములఁ గురిపించువారఁట. కాని యీమె—ఆకటికఱ డెందమున శిలవలె జూచుచు నా పరాజయమును, నా పతనమునుఁ గోరికొనుచు వానికై యనునిమేష మెదురుచూచుచున్నదే! ఈమె నా కెట్టిదేవత! 'ఆ! మైనఁ గొంతమే ల్నారాయణ!' యనుకొనుచు నేను నా చూడ్కుల మఱలించి తుములముగ యుద్ధమగుచున్న తావునకు వ్రాలి ఆ కవలవారియం దొకని నేలకుఁ గొట్టివైచితిని. తదుత్తరక్షణమునఁ గృష్ణవర్మ రెండవవానిని సహిత మధఃపతితునిగా నొనర్చివైచెను. నా స్వప్నముల కనురూపముగ నా భావిభాగ్యోదయ ముండదు కావలయు. నా మనోహారిణియగు నింతియే నా యుద్ధమును జూచుచు నేను క్రిందయి పోవలయునని వేయిదేవుళ్ల మొక్కుచుండగ నాకు జయ మెట్లువచ్చును? కావున నామె కన్నులకుఁ జల్లగ నే నీక యుద్ధమునఁ గూలిపోవలసినదే!—అని యూహించుకొనుచు 'అయినను నా యావచ్ఛక్తియు వినియోగించి చేయఁగలిగిన దెంతయుఁ జేసివేయుద'మని యనుకొనుచుండగ దీర్ఘబాహుఁడు, నమేయసత్త్వుఁడునగు నా యజయసింహుఁడు తన గుఱ్ఱమును నావంకకు ద్రిప్పి పోరాడఁ జొచ్చెను.

ఇండ్లపై, చెట్లపై, జంతువులపై భయంకరముగఁ బ్రేలి, భూమిని భూప్రజల నొక్కుమాఱుగ వణకించివేయు పిడుగుల పిండువలె నయ్యేకవీరుఁడు కఠినప్రహారముల విడువకుండ మాపై వర్షింపఁజొచ్చెను. ఏదియు నతని ధాటిని ప్రతిఘటింపఁజాలక పోయెను. తన దక్షిణనేత్ర మట్లు నన్నరసి ప్రేమించు నా మిత్రుఁడగు పార్థసారధి యొక్కఁడే మా యిరువుర కడ్డముగవచ్చి యతనిని నివారింపఁజూచెను కాని ఆ అజయసింహుఁడు, నోరికండ నాచికొనిన ప్రోఁగుబెబ్బులివలె హుంకరించుచు నొక్క బలవత్ప్రహారమున నతని బుడమిపైఁ బడఁగొట్టెను. దానినిజూచి కృష్ణవర్మ యాతని నాక్రమించి తన చేతుల తీఁట వోవ నతనిని ప్రహరించుచుఁ బరాక్రమింపఁ జొచ్చెను. మా పక్షపు యోధులలోఁ గృష్ణవర్మను మించిన పరాక్రమశాలి లేఁడు. అయిన నాతఁడు సహితము తనకంటె పరక్రమాశాలియగు నజయసింహుని ధాటి కాగఁజాలక నేలకుఁ గూలిపోవలసివచ్చెను. అంతట నేను నా యశ్వమును రెచ్చగొట్టి యజయసింహునిపైఁబడి యుద్ధమొనర్పఁ జొచ్చితిని. గుఱ్ఱము లొండొంటి మెఱసి కొనుచుండగ మేము మా చేతుల కొలది, కృపాణముల కొలది, యావేశముల కొలది పెనఁగులాడితిమి. భూకంపము లుదయించు నప్పుడు మహాసౌధములు వ్రయ్యలగుట వలనఁ గురియు శిలావర్షమువలె మహోగ్రప్రహారములు నా శిరస్త్రాణమునఁబడి పోఁదొడంగెను. నా యావచ్ఛక్తితోఁ జేతియందలి కృపాణము రెండగున ట్లాతనినిఁ బ్రచండముగఁ గొట్టియు నతనియం దొక త్రుప్పుడును రాల్పఁజాలకపోతిని. అంతటితో నా యందలి కలయు, సత్యమును, చైతన్యమును నాయం దుండకుండ పలాయనమైపోయెను. జాగ్రత్స్థితియం దంధకార మలముకొనుచుండగ నేను నేల కొఱగిపోతిని.

ఇది మనోరమ యను వచనకావ్యమున
రాజకుమారి యను కథయందు
మనోరమ యను నామెచేఁ
జెప్పఁబడిన పంచమ
భాగము

---

## విన్నపము

### గృహలక్ష్మి దసరాసంచిక

అక్టోబరు మాసారంభమున గృహలక్ష్మి దసరా సంచిక వెలువడును. దానిలో స్త్రీలచే రచియింపబడు వివిధవిషయములకు సంబంధించిన చక్కని పద్య గద్య వ్యాసములు ప్రకటింపబడును. దీని కాంధ్ర విద్యత్సోదరీమణుల సాహాయ్య మత్యంతావశ్యకము. కావున సోదరీమణులెల్ల తమ పద్య గద్య వ్యాసములను త్వరగా బంపి దసరా గృహలక్ష్మి సర్వాంగ సుందరిగా వెలువడునటు తోడ్పడుదురని మనవి.

సంపాదకుడు.



# శి శు పో ష ణ

**పండ్లు**

బిడ్డలకు ఏడెనిమిది నెలలకంతా పండ్లు వస్తవి. కొందరికి యేమీ తొందరవుండదు అప్పట్లో. కొందరికి జ్వరం రావడము, విరేచనాలవడము, పుండ్లు లేవడము—యిలాంటి బాధలు. ఇలా అవస్థపడుతున్నపుడు చికిత్స అనవసరమని అనుకోరాదు. బిడ్డలు చికిత్స లేకుంటే చిక్కి ఎముకల్రపోగు లైపోతారు. ఔషధమూ సరియైన ఆహారమూ వ్రణ శోధనా వుండవలె. అంతా సరిగ్గా జరిగిపోతున్నా Cod Liver Oil చేపనూనె—కమలాఫలరసము—వీటి వాడుక, మంచిగాలి ఉండటము అవసరము. చల్లనినీళ్లు కొంచెము కొంచె మివ్వడమూ, చిగుళ్లు నొప్పిగా వుంటే మృదువుగా రాయడమూ ఉపశాంతికి మార్గాలు.

**ఏడ్పు**

పిల్లలు అప్పుడప్పుడు ఏడ్వటం మంచిదే, కాని, మూల్గడం మంచిదికాదు. ఏడ్వకుంటే ఆరోగ్యంగా లేరన్న మాట. ఏడ్వవలెనని అట్టె ఏడ్పించ కూడదు.

అట్టె ఏడుస్తుంటే అలక్ష్యం చెయ్యరాదు. కారణం తెలుసుకొని తగినట్లు సముదాయించాలి. ఆకలేవుండొచ్చు, దాహమయివుండొచ్చు లేకున్న ఏదైనా నొప్పో.

**బరువు**

పిల్లల్ని వారాని కొకసారి తూచడం వారి బరువు తెలుసుకోడం అవశ్యం. ప్రతివారమూ బరువు ఏ కొంచెమో గొప్పో ఎక్కువ అవుతూవుండాలి. అలా కాకుంటే వెంటనే డాక్టరుకు చూపించి సరియైన మందూ మాకూ యివ్వాలి. భారములో యెదుగని బిడ్డలు సాధారణంగా చిక్కి, ఒళ్లు ముడతలుపడి, సరిగా పాలుత్రాగక ఎప్పుడూ నిద్రపోతూ వుంటారు.

సాధారణంగా యేయే నెలలో ఎంతెంత వుండవలసిందీ యీ క్రింది పట్టీనిచూస్తే తెలుస్తుంది.

| నెల | బరువు |
|---|---|
| 1 | 8 పౌన్లు |
| 2 | 9½ |
| 3 | 11 |
| 4 | 12½ |
| 5 | 14 |
| 6 | 15½ |
| 7 | 16¾ |
| 8 | 18 |
| 9 | 19 |
| 10 | 20 |
| 11 | 21 |
| 12 | 22 |

దీన్ని గుర్తుపెట్టుకొని మరీ హెచ్చు తక్కువలుంటే తగుశ్రద్ధ తీసుకోవాలి.

టీకాలు వేయడమా మానడమా— దీని మంచిచెడ్డల్ని గురించి టీకాలు భేధాభిప్రాయాలున్నాయి. టీకాలు వేసేటట్లయితే మూడో నెల అయిదోనెల లోపల వేయడం మంచిది. బిడ్డలు బోర్లపడుతుంటే చేతులు నొప్పి పుట్టవి కనుక బోర్లపడటానికి ముందే టీకాలు వేయించాలి.

—ఎస్. శేషగిరిరావు



# పుష్పచయము

## స్త్రీ విక్రయము:—

వృద్ధులు వివాహముకొరకు పసిబాలికలను కొనుట అనునది అందరును యెరుగుదురు. ఆపద్ధతి ఒక ఆచారమైపోయినది. కాని శారదాశాసనము వచ్చిన తరువాత కొంతవరకు యీ బాలికావిక్రయము పోయినదనవచ్చును. నేడు నగరములలో వ్యభిచారగృహములను సాగించువారికొరకు కన్యలను స్త్రీలను మాయజేసి తీసికొనివెళ్లి విక్రయించుటగలదు. ఈ దుర్వ్యాపారమును సాగించువారికి భయము కలుగులాగున బెంగుళూరు సెషన్సుజడ్జి టి. శింగారవేలుగారు శిక్షవిధించియుండుట కొనియాడదగియున్నది. ఆ కేసు వివరములు :

> "మల్లేశ్వరము రంగనాథపురములో ఫిర్యాది వెంకట్రాయ మైనరు భార్య మల్లమ్మతో నివసించుచుండెను. చింతామణినివాసి మల్లమ్మ బంధువు హనుమంత, నంజమ్మతో సహా చుట్టముచూపుగా తన యింటికి వచ్చెను. కొన్నినాళ్ల తరువాత వారిద్దరును మల్లమ్మతో మాయమయిరి. వెంకటరాయ యీవిషయమును పోలీసుల కెరిగించెను. పోలీసులు విచారణ సాగించిరి. నగరమును శోధించి చివరకు నగరత్ పేటలోని ఒక వ్యభిచారిణిగృహములోనున్న మల్లమ్మను తీసికొనివచ్చిరి. ఆ బాలికను యిరువది రూపాయలకు ఆ వ్యభిచారిణికి అమ్మివేసినట్లు తేలినది. న్యాయమూర్తిహనుమంతకును నంజమ్మకును ఐదేసియేండ్ల కఠినశిక్ష విధించెను."

*     *     *     *

## స్త్రీలు — సైనికోద్యోగములు:—

యూరపుఖండమందలి దేశములలో సామ్రాజ్యతృష్ణ యెక్కువ యగుచున్నది. ప్రతి ప్రభుత్వమును మారణయంత్రములను విపరీతముగ పెంచివేసికొనుచున్నది. ఒక ప్రభుత్వమును జూచి మరియొక ప్రభుత్వము సైనికబలమును యెక్కువ జేయుచున్నది. పురుషుల నందరను సైన్యములలో జేర్చుటతో తృప్తిపొందని ప్రభుత్వములు స్త్రీలను కూడా యీ పటాలములలో జేర్చుచున్నారు. ప్రస్తుతము స్పెయినుదేశములో సాగుచున్న అంతఃకలహములలో స్పెయినుదేశపు స్త్రీలు ప్రభుత్వపక్షము వహించి ఆయుధములను పట్టుకొని పోరాటమును సాగించుచున్నారు. జపాను రష్యా దేశములు స్త్రీలకు విపరీతముగ సైనికశిక్షణము నిచ్చుచున్నట్లు ఒక ఫ్రెంచిపత్రికవలన తెలియుచున్నది:—

> "రష్యాలోని స్త్రీలకు సైనికశిక్షణము అవసరమని సోవియట్ ప్రభుత్వము నిర్బంధింపనున్నది. ప్రస్తుతము రష్యాలో 30,00,000ల స్త్రీలకు సైనికశిక్షణము నిచ్చుటకు యేర్పాటులు చేయబడు



శ్రీమతి కే. తియడోర్

గౌరవ మాజిస్ట్రేటు

చున్నవి. ఈ ముప్పదిలక్షలమంది స్త్రీలకును తరిబియదునిచ్చి కోటిమంది సైనికలుగల రష్యా సైనిక దళమును పూర్తిచేయ సమకట్టినది. వెయ్యిమంది స్త్రీలు ఒక్కొక్క పటాలముగ యేర్పరచి ఆధునిక మారణయంత్రముల నుపయోగించు విధానములను నేర్పదలచినది. ముఖ్యముగ మరఫిరంగుల ప్రయోగ మును స్త్రీలకు రష్యాప్రభుత్వము నేర్పుచున్నది.

సైన్యములోనే గాక వాయునౌకాదళములోకూడ స్త్రీలు పాల్గొనవలెనన్నది రష్యా ప్రభుత్వముయొక్క అభిప్రాయము. ఏరోప్లేనులలో చాల ఉన్నతస్థానమునకు యెగిరి అక్కడనుండి "పారాచూట్" సహాయమున క్రిందికి దిగగల ప్రవీణతగల స్త్రీలు 50,000 మంది ఆదేశమందున్నారు. స్మోలెంక్ వాయునౌకాశ్రయమందలి ఒకదళమునకు 29 యేండ్ల యువతి పాక్‌చజీవా అధికారిణిగా నియమింప బడినది.

ఇంతేగాక రష్యాలోని రాజకీయపోలీసుశాఖలో స్త్రీలను యెక్కువగా నియమించుచున్నారు.

టర్కీలోకూడ స్త్రీలకు సైనికశిక్షణ నిచ్చుచున్నారు. కెమాల్ ప్రభుత్వము యీవిషయమున అత్యంతశ్రద్ధ వహించి ప్రచారమొనరించుచున్నది. కెమాల్‌యొక్క పుత్రికయే టర్కీలో ప్రప్రథమమున సైనికురాలైనది:—

కెమాల్ అటాటర్క్‌యొక్క దత్తపుత్రిక సాబహా గూక్‌చెక్ హనూమ్, టర్కీకి ప్రథమ సైనికురాలైనది. ఆమె ఎస్కీచిహార్ లోని వాయునౌకా పాఠశాలలో విద్యార్థినిగా జేరినది. విద్య పూర్తియైన మీదట హనూమ్ టర్కీప్రభుత్వ వాయునౌకాదళమందలి ప్రథమోద్యోగినిగా నియమింపబడును.

దేశరక్షణము, స్త్రీలుఅనే సమస్యగురించి టర్కీసైనిక శాఖామంత్రి మాటాలాడుచు "మనదేశము మీద కిపు డెవ్వరును దండెత్తిరారు. ఐనను ముందు జాగ్రత్తకొరకుగాను దేశములోని స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరును సైనికశిక్షణముపొంది యుండుటెంతయు మంచిది."

* * * *

## స్త్రీలను తినే స్త్రీలు:—

ఆఫ్రికాలో దేవతల ప్రీతికొరకు నరులను విరోధులను బలియిచ్చే పద్ధతి యిది వరలో ఉండెడిది ; ఆ యాచారము క్రమముగ అంతరించుచున్నది. కాని దక్షిణ సముద్రములలో, 'మాలికులా' దీవులలో మానవులను తినే మానవులు చాలమంది కలరని టి హెచ్. హారిసన్‌గారు వ్రాయుచున్నారు. ఈయన దక్షిణ సముద్రములోన గల పలు దీవులకు వెళ్లి ఆ ప్రాంతీయుల జీవనవిధానములను తెలిసికొని లండను నగరము చేరిరి. వారీక్రింది విషయములను ఒక ఉపన్యాససందర్భమున తెలియబలికిరి:

"అది యేలనోగాని మాలికులాదీవులకు చాల తక్కువమంది ప్రయాణముచేయుదురు. నే నాదీవులలో ఒక్క వత్సరముపాటు జీవించితిని. ఈ ద్వీపమందు ప్రముఖములయిన ఐదు వేర్వేరు తెగలుకలవు. వీటిలో నంబాస్ తెగ ప్రముఖమైనది. ఈ నంబాస్ తెగవారు నా యెరుకను ఐదుమందిని

విజయచిహ్నముగ యెత్తుకొనివచ్చి కాల్చి భుజించిరి. సాధారణముగ యీ నరమాంస భక్షణమందు స్త్రీలు పాల్గొనరాదు. ఇదియొక నియమము. కాని నంబాలలో తక్కువ తెగలవారు ప్రక్క గ్రామములతో పోరాడినపుడు మాత్రము చిన్న బాలికలను కోసి పంచి యిడు సమయమున తిననిచ్చెదరు. నరులను అనాగరకజాతులు యీవిధముగ బలియిత్తురని సినిమాలలో చూపబడు దృశ్యములు కేవలము ఊహా మాత్రములే. ఈ నరమాంస భోజనము విజయచిహ్నముగ యేర్పాటు చేయబడును. రాత్రి సమయముల డప్పులు మ్రోగును. ఈ పురుషులు రాత్రియంతయు యుద్ధనృత్యము చేయుదురు. తెల్లవారుసరికి స్త్రీలు యెండుకట్టెలను సిద్ధము చేసియుంతురు. అనంతరము పెద్దప్రొయ్యిని వెలిగింతురు. కనకనకాలిన ఆ ప్రొయ్యిలో శవములనుంతురు. అనంతరము అట సమావేశమైన వారందరును ఆ మాంసమును కొంచముకొంచముగ విభజించుకొనియెదరు.”

* * * *

"మా అమ్మ వంటజేస్తే:—"

భార్య స్వయముగ వంటచేసి వడ్డించిన సమయములందు వంట యెలాగు ఉన్నదని భార్యఅడిగిన యప్పుడు భర్త, "వంట రుచిగనే ఉన్నది, కాని మా అమ్మ వంట చేస్తే యింతతినేవాడు అంతతింటాడు, అలా వండేది" అనడము మామూలు. కాని యిది యథార్థముకాదు. ఆ లోపమంతయు వయసులోనే ఉన్నదని షికాగో నార్తువెస్టర్న్ యూనివర్సిటీ ప్రొఫెసర్ లెస్లీ. వి. ఆర్కీగారు చెప్పుచున్నారు:—

"మగవారు యీ విధముగ రుచినిగురించి అనుటకు కారణమేమని తెలిసికొనుటకు నాలుకమీది 60,000 వేల చిన్న చిన్న రుచిని తెలియజేయ మొగ్గలు" (Taste buds) ను లెక్కించితిని. పరిశీలించితిని. సాధారణముగ సహజమైన ఆరోగ్యముగల బాలునికి నాలుకమీద రుచిని తెలియజేయు 328 "మొగ్గలు" ఉండును. ఈ మొగ్గలకును మెదడునకును సంబంధము చేర్పరచు కొన్ని నాళము లున్నవి. అందువల్ల రుచి దాని అనుభవము ఆ సమయమున యెక్కువగఉండును.

ఇరువదియేండ్ల అనంతరము యీ రుచిని తెలిపే మొగ్గలు క్రమముగా అంతరింప నారంభించును. వృద్ధుని నాలుకమీద యీ మొగ్గలు నూటికన్న యెక్కువయుండవు. రుచిని తెలియజేయు యీ మొగ్గలు అంత తక్కువయున్న కారణముననే—పిల్లలు అసహ్యపడేమందులను యెట్టిబాధయు లేకుండనే వృద్ధులు స్వీకరింపగలిగెదరు."

* * * *

నైతికలక్ష్యము దిగజారినది:—

నేడు స్వేచ్ఛ అనుపేరిట నైతికలక్ష్యము దిగజారినదన్న భావమును కొంతమంది మేధావంతులు వెలిబుచ్చుచున్నారు. ఇతర దేశములలో నైతికజీవనము యేవిధమున ఉండినను మన దేశములో మాత్రము ప్రాచ్యప్రతీచీ పద్ధతులసంఘర్షణ మాత్రము యెక్కువగఉన్నది. భారతీయులు యేమార్గము మంచిది యేమార్గము చెడ్డది అనే

సందిగ్ధావస్థలో జిక్కియున్నారు. ఈ సమయమున మేధావంతుల అభిప్రాయములను గమనించుట అవసరము. లండన్ విశ్వవిద్యాలయపు చరిత్రపండితులు ఎఫ్. జె. సి. హెర్న్‌షాగారు నైతికపతనము గురించి ఒక అంతర్జాతీయసమావేశములో యీ అభిప్రాయమును వెలిబుచ్చియున్నారు.

"ఈ రోజులలో నైతికనియమములను చాలవరకు త్రోసిరాజనునట్లు వ్యవహరించువారు యెక్కువై యున్నారు. ప్రతివ్యక్తియు స్వయముగ యోచనజేయగలుగుట సంతోషకారణమే యైనను, యెవరి యిష్టమువచ్చినటులుగ వారు సంచరించుచో యింక ప్రజలవర్తనమునకు హద్దుపద్దు లుండవు. అప్పుడు సమాజజీవనము దుర్భరమగును.

యుద్ధానంతరము స్వేచ్ఛాజీవనముపేర హద్దుమీరిన కాముకజీవనము ప్రబల నారంభించినది. ఇందువలన నైతికపతన మేర్పడుటయేగాక యెన్నియోజీవనములు అధోగతి పాలగుచున్నవి. సమాజము యొక్క నైతికవేదిక సడలుటయనిన శాంతి వాతావరణము చాలవరకు దూరమైపోయిన దనుకోవలసి యుండును."

* * * *

## స్త్రీలు — స్వదేశీ:—

స్త్రీలు స్వదేశీ ఉద్యమమును అర్థముచేసికొని ఆచరణలో బెట్టునెడల భారత దేశీయ పరిశ్రమల కెంతో ప్రోత్సాహ మొనగూడెడిది. భారతదేశములోననే వింత వింత చీరలు, వస్త్రములు తయారగుచున్న యీ దినములలోకూడ భారతమహిళలు యింకను విదేశవస్త్రములయెడ వ్యామోహమును విడువజాలకుండుట శోచనీయము. ఢక్కాలో శ్రీమతి సుహాసినీదేవి మహిళా మహాసభలో యిచ్చిన సలహా గమనార్హమై యున్నది.

"హిందూజాతి నేటివరకును ఒక ఆకారముతో ఉండగలుగుటకు హిందూమహిళల పట్టుదలయే కారణము. స్త్రీలకే నిజముగ పట్టుదల లేకయుండినయెడల యీ మతేను యీ జాతి యేనాడో అంతరించి నామరూపములు లేకుండ పోయెడిది. ఇదే పట్టుదలను నేడు నా సోదరీమణులు స్వదేశీ ఉద్యమముపట్ల వహించునెడల భారతీయుల పరిశ్రమలు తలయెత్తి యుండగలిగెడిది. నా సోదరీమణులు మనదేశములో పండిన పంటను ఆరగించవలెను. మనదేశములో తయారైన చీరలను ధరించవలెను. మనదేశములలోని పరిశ్రమల నన్నింటిని ఉత్సాహముతో ఆదరించవలెను. అప్పుడు భారతదేశము భారతీయులు స్వయసహాయులై యితర దేశీయులతో సరిసమాన గౌరవముల నందుచు హాయిగ జీవింపగలరు. భారతసోదరీమణులు స్వదేశీప్రమాణమును గైకొందురుగాక."

# ఆ యధికారము
# ఆ గౌరవము మీదే





గృహపత్నిగానుండుట సామాన్యంబుకాదు. ఎవ్వరును గమనించని నూరువిషయములుగలవు. వాటిలో కొన్నిటిపై స్త్రీలకే యధికారము. "టీ" తయారుజేయుపని వారికి ముఖ్యము. తెలిసిన స్త్రీలీ దయాస్వరూపమైన "టీ"ని తమ పురుషుల కిచ్చుట మరువరు. నిర్దోషమైన యీ యారోగ్యపానమే సంసారానందము గల్గచేయుచున్నది.



"టీ" జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒకస్పూన్ "టీ" యొక్కొకరికిన్ని మొత్తముగా నొకస్పూన్ యధికముగాను పాత్రములో వేసి బాగుగా మరుగుచున్న నీటినిపోయవలెను. 5 నిమిషములుతాళి కప్పులలో పోసి, పాలు, చక్కెర చేర్చవలెను.

## సంసారమునకు తగుపానము — ఇండియా "టీ"

I K-33 RS.


గృహలక్ష్మి
స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక
సంపాదకుడు
డాక్టరు. కే. యన్. కేసరి
GRIHALAKSHMI
సంపుటము ౯ అక్టోబరు 1936 సంచిక ౭

# సారంగధర

స్టారు కంబైన్స్‌వారి అద్వితీయమైన ద్వితీయ తెలుగుటాకీ

సుప్రసిద్ధ తారాగణమంతయు పాల్గొన్న చిత్రము



చిత్రాంగి సారంగధరుని పటమును చిత్రించుట

| | | |
|---|---|---|
| అద్దంకి, కనకలింగేశ్వరరావు | మారుతి | బాలామణి |
| పులిపాటి | నగరాజరావు | తిలకం |
| ఆకుల | శ్రీరంజని | శకుంతల |
| కె. ఆర్. రావు | శాంతకుమారి | మోహన |

బొంబాయిస్టుడియోలందు ప్రతిభాశాలులగు శాస్త్రజ్ఞుల నిర్వాహణమున తయారుచేయబడుచున్నది.

**స్టార్ కంబైన్స్ లిమిటెడ్, 161, మౌంట్‌రోడ్, మదరాసు.**

# విషయసూచిక



* ఈ వ్యాసమునకు సంబంధించిన బ్లాకులు 'ప్రజామిత్ర' వారిచే నివ్వబడినవి.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రిగారు.

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.

హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.

తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని

జెమ్షెడ్ పూర్: వి. కొండల్రావుగారు, అకౌంట్సు ఆఫీసు

బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.

గుంటూరు: వెల్కం అండు కంపెని.

సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు

పిఠాపురం: ఎం. నూకరాజుగారు, ఆంధ్ర న్యూస్ఏజెన్సీ.

రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.

ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.

తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూస్ఏజంటు.

బెజవాడ: ఆంధ్రా ఇన్డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.

ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.

రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.

చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.

నరసాపురం: వై. సత్యనారాయణగారు.

నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు

కాకినాడ: నున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్ బాయ్ అండు కో.

భీమవరం: వంగల అచ్చుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.

గుడివాడ: శ్రీ శివరామ అండు కో.

తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.

అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)

పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.

మచిలీపట్నం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్క్యూల్ పేట.

కర్నూలు: టి. బాలనాగయ్య శెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.

అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.

నెల్లూరు: పంచాగ్నుల వెంకటనరసింహంగారు.

కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

శా. శ్రీయుఁ భారతియుఁ సరస్వతియు స్వశ్రీలేశ సంజాత లా
క్ష్మీయుక్తుల్ హరిరుద్రనీరజ భవాద్యాదిత్యసంఘమ్ము లే
మాయాలీలను నే జగజ్జనని కై మాత్రాస్వరూపాఢ్య, కే
ష్యేయప్రాభవ కట్టి శక్తి నతిభక్తిన్ గొల్తు దుష్టాప్తికిన్.

దేవీభాగవతము.

# మా య

ఏకస్యానేక మూర్తిత్వం
యుగపత్ పరమాత్మనః
సచ్చిదానంద రూపస్య
సిద్ధ్యేన్ మాయాం వృతే కథమ్.

మాయయను పదమునకు 'మోసము' 'తంత్రము' 'టక్కరితనము' అను నర్థములే గాక, 'ప్రకృతి' 'అజ్ఞానము' 'భ్రమ' యని నిర్వచనము చేయబడుచున్నను నివి యన్ని యునొకే మూలసూత్రముపై నాధారపడి యున్నవి. వేదములందును నుపనిషత్తు లందును దృష్టికి గోచరించునదియును, నశాశ్వతమైనదియును,ప్రకృతియని మాయ యని పేర్కొనబడినది. మాయయందంత ర్భూతమయ్యు కానరాక యుండునదే 'ఆత్మ' యనియు, 'పురుష'మనియు జెప్పఁబడు చున్నది. 'పురుషుఁడు', 'మాయ' వీని వలననే సృష్టియయ్యెననియు, నా సృష్టి యందు దృష్టికి గోచరించునది యంతయుఁ గూడ మాయయేయనియు అద్వైతవేదాంత మతము. ఈయుద్దేశమునే యెల్లరకుఁ జిరపరి చితమగు "బ్రహ్మసత్యం జగన్మిథ్యా"యను వాక్యమునందు వెల్లడింపఁబడినది. మాయ కును ఆత్మకును అవినాభావసంబంధ మైనను వేదకాలమునుండియు, ఆత్మ "సర్వం హి అయం ఆత్మా" యనియే చెప్పఁబడుచున్నది. ఈమాయనుగూర్చియు నాత్మనుగూర్చియు వ్రాతలే హిందూ వేదాంతమునందలి ప్రధానవిషయములు.

ఆత్మ శాశ్వతమైనదనియు, సచ్చిదా నంద స్వరూపమైనదనియు, ఆయాత్మయే మాయావశమై జీవత్వమంది తన్నుమఱచి చీకాకు పడుచున్నదనియు నెఱిగి యా

మాయనువిడనాడి స్వరూపమునుజెందుటే మోక్షమనియు నద్వైతము వచించుచున్నది. మాయయనుదానినే 'ప్రకృతి'యని వచించుచు విశిష్టాద్వైత వేదాంతులు వేరుమార్గమును సూచించుచున్నారు. ప్రకృతియే సకలసృష్టికియాధారమనియు, నది యీశ్వరుని యాధీనమనియు నందుచే కేవలము ప్రకృతినివిడనాడక, యామె నాశ్రయించి యీశ్వర సాక్షాత్కారము బొందదగుననియు వీరియాశయము. ఈ ప్రకృతినే శాక్తేయులు శక్తియనియు, సృష్టికాధారభూతమనియు, తక్కిన దేవతా రూపములన్నియు నామె యాకారములే యనియు వచింతురు. మాయఆత్మను గాననీక జీవులను పెడమార్గమున బెట్టుచున్నందున మాయనుండి తొలగియుండవలయుననియే యందరి తలంపు.

ప్రకృతి పైనజెప్పినరీతి సృష్టి కాధారభూతురాలు—అనగా జగన్మాత యన్నమాట. ప్రకృతి స్త్రీ పరమాత్ముడు పురుషుడునైయున్నను ప్రకృతిలేకనాతడేమియు చేయజాలడన్నచో నీ యాదిశక్తియొక్క, ప్రకృతిమాతయొక్క—అందుచే స్త్రీయొక్క ప్రాముఖ్యత గననగును. ఈ ప్రకృతి సత్వ రజస్తమో గుణయుతయగుటచే లక్ష్మీసరస్వతీ దుర్గయని త్రిమూర్త్యాత్మకమయ్యె. ఈ ముప్వురు ప్రకృతియందలి సంపద, బుద్ధి, బలముల కాధారభూతులు.

శిశుజీవితమునకు తల్లి యెంత యావశ్య[illegible] ప్రకృతియందలి జీవి కాదిశక్తి దయయంత యావశ్యకము. కావుననే వేలకొలది నామములచే వెలయు నాదిశక్తిని పూజించుట. ఈపూజ ముఖ్యముగ నవరాత్రములందు జరుగుచున్నది. ఈ పూజావిధానమునం దైహికచింత—లాభము—కన్న పారమార్థికవిషయ మెక్కువగ గాననగుచున్నది. దీనినెఱిగినవారు సృష్టిరహస్యము నవగాహమొనర్చుకొని యాత్మోపలబ్ధి బొందుదురు. ఎఱుగనివా రిహలోకలాభములు బొందగలరు.

సాధారణముగ మానవులు ప్రకృతినుండి-మాయనుండి—తొలగి ఆత్మనుపొంద శక్తులుగారు. కావున వారికి నుత్తమ మార్గమెయ్యదన ప్రకృతి నాశ్రయించి,—తండ్రిని బొంద తల్లి నాశ్రయించు శిశువువలె—పూజించి యామె కృపబొంది యంతర్లీనమైయున్న యాత్మ సాక్షాత్కారముబొందుట. ఇది యిందలిరహస్యము. మరియు నీదేవి నర్చించుటలో మనము స్త్రీకిగల యుత్తమ స్థానమును గుర్తించి గౌరవించుచున్నాము. ఆ దేవీస్వరూపులగు ముప్వురను—లక్ష్మి, సరస్వతి, దుర్గల—పూజించి జీవులకు ముఖ్యమైన సంపద, బుద్ధి, బలము నుపాసించుచున్నాము.

ఇక పూజావిధానమువలనగలుగు నితరలాభములగురించి 'గృహలక్ష్మి' పెక్కుమారు లిదివఱకే యుగ్గడించినది. పారమార్థిక ప్రాపంచికసౌఖ్యము లొనగూర్చు నీదేవపూజ గావించి యెల్ల రాత్మాభిరుచుల నీడేర్చుకొందురుగాక.

# పాశ్చాత్యప్రపంచములో నాగరికతాప్రవాహ మడ్డుతిరిగినదా?

ప్రపంచచరిత్రను పరికించితిమేని నాగరికత యొక దేశమునుండి యింకొక దేశమునకు తిన్నగ వ్యాపించినట్లు దెలియగలదు. నాటి నాగరికతయందు మానవకళ్యాణకాంక్ష స్వార్థత్యాగము నుండియుండెనేమొ కాని నేటి నాగరికతయందు మానవమారణమార్గములు స్వార్థపరత్వ మధికముగగలవు. నేటి నాగరికతాప్రవాహమునకు వేగ మెక్కువైనది. ఇప్పటికి సంవత్సరముక్రింద 'అనాగరిక'మగు అబిసీనియాదేశమును రక్షింప 'నాగరికతాప్రవాహము' బైలుదేరి మారణయంత్రములతో—భయంకర బాంబులతో, మాడ్చిచంపు వాయువులతో—నా దేశమంతయు ప్రాకి దేశమును శ్మశానముగ మార్చినది. నేటి స్పెయినుదేశపు పరిస్థితులను పరిశీలించినచో అబిసీనియాదేశమునకు ఇటలీనుండి బైలుదేరిన నాగరికతాప్రవాహము అబిసీనియా కొండలకుదాకి పడమటికి దిరిగి ఎడారిమూలమున మొరాకో దేశమువఱకు వెళ్లి అటనుండి యుత్తరమునకు దిరిగి స్పెయినుదేశము ప్రవేశించినదాయను సందియము గలుగుచున్నది. ఏలన ఇటలీదేశీయులు ముసోలినీ యాజ్ఞలపై అబిసీనియాకు చనుదెంచి యెట్టి నాగరికతను నేర్పిరో మొరాకో దేశీయులు జెనరలుఫ్రాంకో యాధిపత్యమున స్పెయినుదేశమునకు జనుదెంచి యట్టినాగరికతనే వ్యాపింపజేయుచున్నారు—ఇంకను యెక్కువకూడ. పై రెండింటి కొకేకారణము గాదు. కాని అబిసీనియాకు నాగరికత నేర్పుమిష మీద సామ్రాజ్యకాంక్షియై ముసోలినీ గతవత్సరమన్ని ఘోరములు జేసెను. నేడెట్టి మిషలేకున్నను ప్రజాప్రభుత్వము నంతరింపజేసి నిరంకుశ సామ్రాజ్యతత్వమును నెలకొల్ప ఫ్రాంకో ప్రభృతు లిట్టిఘోరములు జేయుచున్నారు. భేద మింతియ.

కాల్వోసోటిలో అను ఫాసిస్టునాయకుని హత్యతో స్పెయినులో కొంపలంటుకున్నవి. జూలై 17-వ తేది మొరాకోదేశమున—స్పెయినుదేశమునకు ఉత్తర ఆఫ్రికాఖండమునగల వలసరాజ్యము—ఫ్రాంకోయను నాయకుని క్రింద విప్లవమారంభమై క్రమక్రమముగ స్పెయిను నందంతటను ప్రాకి నేడు ఘోరరూపము దాల్చినది. దేశమంతయు పీనుగుపెంటలతో నిండి శ్మశానమైనది. వేలకొలది నిరపరాధులగు పురుషులు స్త్రీలు, శిశువులు భయంకరముగ చంపబడుచున్నారు. వందలకొలది సంవత్సరములుగా నత్యంతరమణీయముగా నభివృద్ధిబొందుచువచ్చిన బార్సిలోనియావంటి పెక్కునగరములు నేలమట్టము గావింపబడి పీనుగుపెంటలతో నిండియున్నవి. సస్యశ్యామలమైన భూములు పాడుచేయబడుచున్నవి. వేయేల! ఇంకను కొంతకాలమీరీతి యుద్ధము సాగుచున్నచో స్పెయినుదేశము నివాసయోగ్యముగ నుండదన్న నది యతిశయోక్తిగానేరదు. ఇంతటితోనైన అంతఃకలహము లంతరించుసూచనలు గన్పడుటలేదు. కాని దీనిమూలమున ప్రపంచసంగ్రామము మరియొండు బయలుదేరునేమోయను భయముమాత్రము ప్రపంచము నావరించినది. దీనికి కారణము లరయుటకుముందు స్పెయిను నైసర్గికపరిస్థితులు, ప్రజలు, దేశచరిత్ర, ప్రకృతవిప్లవము మొదలగువానినిగూర్చి కొంత దెలిసికొందము.

### నైసర్గిక పరిస్థితులు:—

స్పెయినుదేశము ఆఫ్రికాఖండమునకు ఉత్తరమునను, ఫ్రాన్సునకు పడమటను, ఇంగ్లండునకు దక్షిణమునను గల ద్వీపకల్పము—యూరపుఖండమునకు పడమటకొనయందున్న దేశము. తూర్పుదిక్కునతప్ప మిగత

భాగమంతయు సముద్రతీరముగానున్నందున నీదేశము కొంతకాలము సాగరరాణియై వెలసినది. దేశమునందు చాలభాగము కొండలమయము. వీనియందు ప్రకృతి రామణీయకమగు పెక్కుచోటులుగలవు. శీతోష్ణస్థితి విపరీతమగు మార్పులకు లోనైయుండును. ఈదేశమున నున్న చాలనదు లెండకాలమున నెండిపోవుచుండును. ద్వీపములుగాక స్పెయిను సుమారు 1,90,050 చదరపు మైళ్ల విస్తీర్ణముండును. ప్రజలయొక్క ముఖ్యవృత్తి వ్యవసాయమైనను దేశమునం దర్ధభాగము వ్యవసాయమున కుపయోగపడదు. గోధుమ, బార్లీ, జొన్న ముఖ్యమగుపంటలు ద్రాక్షకూడ విరివిగా పండింపబడి ద్రాక్షసారాయి పరిశ్రమ కుపయోగపడుచున్నది. ఖనిజసంపదకూడ యెక్కువగ లేదు. అందుచేత పరిశ్రమలంత లాభకరములుగ లేవు ఎగుమతులకంటె దిగుమతులే ఎక్కువగనున్నవి. రాకపోకల కెక్కుడుసౌకర్యములు నవీన నాగరికప్రపంచపు ఏర్పాట్లును విరివిగ గలవు. దీనికి ముఖ్యపట్టణము మాడ్రిడ్ నగరము.

ప్రజలు:—

స్పెయినుదేశమందు రెండుకోట్ల జనసంఖ్యగలదని యంచనావేయబడినది. రోమను కాథలిక్ మతమునకే దేశమునం దెక్కువప్రచారము. స్పెయినుదేశీయులు మిక్కిలి ధైర్యసాహసములు పట్టుదలగలవారు. వారితరదేశీయులవలె శాంతముగ తమపనులందు నిమగ్నులైయుండరు. రాజ్యాంగములం దెపుడును పాల్గొనగోరుచుందురు. మతగురువులు మతమును బోధించుటకు బదులు రాజకీయములగూర్చి చెప్పుచుందురు. స్పెయినునందు పలుమారు ప్రభుత్వములు మారుటకును, విప్లవములు జరుగుటకు నదియేకారణము. ఈదేశపు రాజకీయ పరిస్థితులెపుడు నిట్లుండుటకై దేశీయు లొకగాథ జెప్పుదురు. ఒకానొక స్పెయినురాజు దేవుని ఇతర చలిదేశము లందువలెగాక ఎక్కువ సూర్యకాంతిని, సుందరులగు స్త్రీలను, నాగరికులగు ప్రజలను, పైగా మంచిప్రభుత్వము నిమ్మని ప్రార్థించెనట. మొదటి మూడింటినిచ్చి దేవుడు కడపటిదాని విషయమై "ఈ దేశమునగల నితరసౌకర్యములకుతోడుగ నదికూడ యున్నచో దేవతలందరు నిచటనే నివాసము లేర్పరచుకొని స్వర్గమును ఖాళీచేయుదు"రనెనట. దేవతలుగాదు ఇతర ఐరోపాదేశీయులుగూడ నిందు స్థిరముగా వసింప గాంక్షించునట్టి మహత్త్వ మీదేశమున లేకున్నను చక్కనిప్రభుత్వముమాత్ర మరుదైయున్న మాట సత్యమే.

స్పెయినుదేశీయులు ధైర్యసాహసములకుతోడు దయాదాక్షిణ్యాది గుణగణములుగల్గి నితరుల నొప్పింప నిచ్ఛగలవారు గారనుటకీ క్రిందియుదంత మొకనిదర్శనము. ఒకడు కడుబీదవాడై జీవించుటకు వేరుమార్గముగానక దోపిడితో బ్రదుకనిశ్చయించి, పొలమునుండి ధాన్యాదుల గొనివచ్చు నొకబండిని త్రోవలో నడ్డగించి బండివానివద్దనున్న ధనమునిమ్మని భయపెట్టగా నాతడు తనవద్దనున్న ముప్పదిడాలర్ల నతనికిచ్చెను. అంతటా దోపిడిదొంగ "నేనిట్లాచరించుట కెంతయో చింతించుచున్నాను గాని నా కుటుంబ దీనస్థితిదలంచికొన్న గుండె నీరగుచున్నది. ఐన నాకొక్క డాలరుమాత్ర మిపుడుచాలును. మిగిలిన ధనమంతయు నీవే యుంచుకొనుము" అని తిరిగి బండివానికి యిరువదితొమ్మిదిడాలర్ల నిచ్చివేసెను. బండివా డందుల కాతని శ్లాఘించుచు "మహాశయా! తమ కుటుంబమునకు ధాన్యాదులేమైన గావలసియున్న దీసికొను"డని యివ్వబోయెను. అంతటా 'దొంగ' "ప్రకృతము కొంచమువద్దు, చిక్కుడుగాయలిచ్చిన చో కుటుంబమునకు చాలును. కాని వానికి నేను పైకమిచ్చి కొనవలసియున్నది. దానికై యీడాలరు కూడ పుచ్చుకొని యావస్తువులనిమ్ము" అని డాలరాతనికిచ్చి వస్తువుల దీసికొనెను. బండివాడాతని శీలమున కచ్చెరువంది తనపైకములో నైదుడాలర్లు బహుమతిగా స్వీకరింపుమని వేడుకొన్న నాత



కాల్వోసోటేలో

ఫాసిస్టు. ఇతనిహత్యయే స్పెయిను
విప్లవమునకు బహిరంగకారణము.



జనరల్ ఫ్రాంకో

విప్లవకారుల నాయకుడు. సామ్యవాదమును
స్పెయిను హృదయమునుండి సమూలముగ
నాశనము చేయవలయు ననుచున్నాడు.



బార్సిలోనా

స్పెయినునందు సుందరమగు నగరములలో నొకటి. విప్లవములో
నాశనముచేయబడినది. ఇందు జరిగిన ఘోరములు వర్ణనాతీతములు.



స్పెయిను వీరవనిత

స్పెయిను ప్రజాప్రభుత్వమును రక్షించుటకై వందలకొలది వీరవనితలు కత్తిగట్టి విప్లవకారులతో పోరుచున్నారు.




దంగీకరింపక పోవుటచే నతని నెన్నిరీతులనో ప్రతిమాలి ఐదు డాలర్లతనికిచ్చి తనదారిని వెళ్లెనట.

ఆదేశపుస్త్రీలు చాల సుందరులని ప్రతీతి. వారు పెక్కురంగులతో కూడిన దుస్తుల ధరింతురు. వారికి పురుషులకన్న నింట యధికార మెక్కువ. గృహాధికారమున పురుషునిది రెండవస్థానము. ఇది మూరుల యధికార కాలమున కొంచము మార్పు బొందినది కాని పూర్తిగా నంతరింపలేదు.

చరిత్ర:—

ఆదిలో స్పెయిను దేశము రోము సామ్రాజ్యమున నొకదేశముగా నుండెడిది. ఈ సామ్రాజ్యాధికారమంతరించిన తరువాత నీదేశము రెండు వందల సంవత్సరములు 'విసిగాతు'లను వారి పరిపాలన క్రింద నుండెను. వీరి యనంతరము మూరులు తమ రాజ్యము స్థాపించిరి. వీరి



అజానా — కాబల్లేరో

ప్రజాపక్ష నాయకులు

రాజ్యము స్పెయినునందంతయు వ్యాపించలేదు. కాని చాలకాలము స్థిరముగనుండెను. ఉత్తరభాగమునగల చిన్నచిన్న రాజ్యములన్నియు ఫర్డినాండ్ ఇస్‌బెల్లావారికాలమున 1479 సం దొక్కటయ్యెను. వీరి కాలముననే స్పెయిను నూతనప్రపంచమున వలస రాజ్యములస్థాపించి సాగరరాణియని పేరుబొందెను.

పదునారవశతాబ్దమున అమెరికాఖండము నుండి ధనరాసులచే నింపబడి స్పెయిను యూరపునందగ్రస్థానము వహించియుండెను. పోర్చుగల్ కూడ 1580 వ సంవత్సరమున స్పెయినుకు చేర్చబడినందున వలసరాజ్యముల సరివి హెచ్చెయ్యెను. కాని కాలక్రమమున ప్రాబల్యము తగ్గిపోజొచ్చెను. రాజులు బలహీనులై యితర రాజ్యములకు లొంగిపోయిరి. 18వ శతాబ్దారంభమున బోర్బనువంశము స్పెయినుపై నధికారమువహించి కొంచము ప్రాముఖ్యత జెందుచు వచ్చెను గాని నెపోలియను కాలమున శక్తిహీనరై నాతనికి లొంగిపోయెను. ఆకాలముననే వలసరాజ్యములు కూడ స్వాతంత్ర్యము వహించుచు వచ్చెను.



జూవాన్ మార్చి
విప్లవకారులికి ధనసహాయం
చేస్తున్న కోటీశ్వరుడు.

నెపోలియను యనంతరము మరల బోర్బను రాజులధికారము వహించిరి కాని దేశమభివృద్ధికి రాలేదు. రాజ్యముకొరకై యంతఃకలహములు మిక్కుటమై రాజ్యము బాగుపడుటకుమారు క్షీణించుచు వచ్చెను.

రాజ్యాధికారమునకై ఫర్డినాండు మరణానంతరము 1833 సం॥మునను, 1868 సం॥మునను అంతఃకలహములు జరిగి 1874 సంవత్సరమున ఏడవ ఫర్డినాండు కుమార్తె రెండవ ఇస్‌బెల్లా కుమారుడగు 12వ ఆల్ఫెన్జో రాజయ్యెను. ఆతడు 1885 నవంబరు 25వ తేది గతించెను. అతనిని మరణానంతర మూరు మాసములకు 1886 సంవత్సరము మేనెల 17వ తేది 13వ ఆల్ఫెన్జో రాజు జన్మించెను. అతని తల్లియే 1902 వఱకు అతనికి రీజెంటుగా దేశమును పరిపాలించెను. ఆల్ఫెన్జో రాజ్యమునకు వచ్చిన తరువాతకూడ దేశమున—బార్సిలోనా, కేటలోనియా రాజ్యభాగములందు—అశాంతి ప్రబలి తుదకు 1923వ సంవత్సరమున నియంతపరిపాలనము ప్రారంభమయ్యెను. 1930 సంవత్సరమున రాజా పూర్వాధికారమును చేపట్ట ప్రయత్నించి విఫలుడై, ప్రజాపరిపాలనోద్దేశముల నెదుర్కొనజాలక 1931 ఏప్రెలునందు కుటుంబసహితుడై దేశమును వీడెను. ఆతడిపుడు విదేశములందు వసించుచున్నాడు. అంతట స్పెయిన్ ప్రజాప్రభుత్వమయ్యెను. కాని, అప్పటినుండియు తిరుగుబాటులు, అల్లరులు నిలువలేదు.

విప్లవము:—

జూలై 17వ తేది ప్రారంభించిన ఈ విప్లవము హటాత్తుగా సంభవించినది గాదు. 1931 వ సంవత్సరమునుండి లోలోపల రాజుకొనుచునేయున్నది. పదమూడవ ఆల్ఫెన్జో రాజు దేశమును వీడిన తరువాత రాజకీయవేత్తలుగాని ప్రజానాయకులు ప్రజానిరంకుశ ప్రభుత్వమును స్థాపించిన పిదప నూతన సంస్కారములతో నూతన స్పెయిను దేశమును సృష్టిజేయ నుద్దేశించిరి. కాని చేతకానివారగుటచేతను, ఈసంస్కారము లెంతమాత్ర మిష్టములేని పక్షము లెక్కువగుటచేతను విజయము గాంచలేకపోయిరి.

వీరిలో సంస్కారముల గావించి సామ్యవాద పద్ధతిని నడువవలయుననువారు, కార్మికులు, కర్షకులు మొదలగు ప్రజాసముదాయము. దీనికంతయు వ్యతిరేకముగ వర్తించి సంస్కారములను సంస్కర్తలనుకూడ ధ్వంసము జేయ సమకట్టినవారు రాజానుచరులు, భూస్వాములు, జమీందారులు, ధనవంతులు మొదలగువారు. వీరికి ఫాసిస్టు సిద్ధాంతములు తీపి. మొదటి పక్షములన్నియు జేరినదానికి ఎడమపక్షమనియు, వ్యతిరేకముగ పనిజేయువారందరికి కుడిపక్షమనియు వ్యవహరించుచున్నారు. ఫిబ్రవరిమాసము ప్రభుత్వపు ఎన్నికలందు జయము లభించిన దీ యెడమపక్షమువారికే.

ఈవిధముగా దేశము బాగుచేయుటకుమారు యిరుపక్షములవా రొకరినొకరు రద్దగించుటచేతను విప్లవములు బైలుదేరడముచేతను రాజ్యము నాటికంటె చెడిపోయినది. కాని ప్రజలమధ్య సామ్యవాద సిద్ధాంతములు వ్యాప్తి బొందుచువచ్చినవి. ఈ సమయమున ప్రజాపక్షమునకు జయము గల్గినందున ఫాసిస్టుపార్టీ—కుడిపక్షము—సహింపలేకపోయినది. ఏవిధముగానైన ప్రజాపక్షమును ప్రబలముగ ప్రతిఘటింప బూనుకొన్నది. ఈ సమయముననే సామ్యవాదులు కొందరు సైన్యమును తీసివేయుట కొక బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టిరి. దానితో సైన్యము భయపడి ప్రతికూలవాదులతో జేరి జూలై 25వ తేది విప్లవ మారంభముచేయ నిశ్చయించుకొనినది. సీనార్ ఫారావులో అను రక్షకభటాధికారిని ఫాసిస్టులు చంపినారన్న కోపముచేత రక్షకభటులు ఫాసిస్టు నాయకుడైన కాల్వోసోటీలోను హత్యగావించిరి. దీనితో విప్లవము ప్రారంభమైనది. ప్రభుత్వమువారికి కుట్రదారుల ప్రయత్నములు దెలిసియు నుపేక్షించినందుననే విప్లవము తీవ్రరూపము దాల్చినది. మొరాకోనుండి ఫ్రాంకో నాయకత్వమున విప్లవసైన్యము స్పెయిను ప్రవేసించినది. అచట విప్లవకారులతో గలసి ఫ్రాంకో ప్రభుత్వము నెదిరించెను. కర్షకులు, కార్మికులు ప్రజాప్రభుత్వమును గాపాడ కత్తిగట్టి పోరాడుచున్నారు. ఎండకన్నెరుగని స్త్రీలు కూడ పాలుమరువని కసిగందుల వీడి యుద్ధభూమి కురుకుచున్నారు. కాని ఎంతజేసినను ప్రభుత్వ మింతవఱకు విప్లవము నణచలేదు సరిగదా తుది కోడిపోవునేమో యనిపించుచున్నది.

విప్లవము : విదేశసంబంధము :—

విప్లవకారులు నానాటికి బలవంతులగుచున్నారు. వారికి స్వబలముకంటె వెనుకబల మెక్కువ. ప్రభుత్వపక్షము ధనవంతులు విప్లవకారులకు సహాయపడరని పొరపడినారుగాని వారివలననే విప్లవకారుల కెక్కువ బలము దొరికినది. కోటీశ్వరుడైన జావాక్ మార్చి యను పొగాకు వర్తకు డమితముగ విప్లవకారులకు ధనసహాయము జేయుచున్నాడు. ఎందుకన ప్రజానాయకులగూర్చి యతడెప్పుడును "కాబల్లెరో చచ్చిపోలేదూ, అజానా ఇంకా బ్రదికి వున్నాడా?" అని నిరంతర మనుకొనువాడు. అతనికి ప్రభుత్వపక్షమన్న ఎంతమాత్రము గిట్టదు. ఇట్లు ధనవంతుల సాయము మాత్రముగాక-స్పెయినునం దంతఃకలహము లారంభమైన వెంటనే వానియం దెవరును జోక్యము బుచ్చుకొనకూడదని యైరోపాయందలి ముఖ్యదేశములెల్ల యొడంబడిక గావించుకొన్నను-రహస్యముగ జర్మనీ, ఇటలీ, పోర్చుగల్ దేశములు విప్లవకారులకు యంత్రసామగ్రిపంపి కావలసినసాయము చేయుచున్నవి. ఫ్రాన్సుస్పెయిను ప్రభుత్వపక్షమె యైననను గెలువవలయుననిచూచుచున్నది. ఇంగ్లండు అంతకలహముల నేవిధముననైన అంతరింప జేయవలయునని ప్రయత్నించుచున్నది. దీనికంతయు కారణములు గలవు.

ఒకానొక దేశమున చెలరేగిన విప్లవమం దన్ని దేశములు అక్కరతో గాచియుండు రహస్యము ప్రకృత యైరోపాఖండమందలి స్థితి దెలిసినగాని బోధపడదు. ఇపు డా ఖండమును—ఇతర ప్రపంచమును

కూడ—నుజ్జాత లూగించుచున్న శక్తులు కమ్యూనిజము, ఫేసిజము. ఇవి యొకదానికొకటి ప్రబల శత్రువులు. సామ్యావాద సిద్ధాంతములతో సామ్రాజ్యమును స్థాపించి, ప్రపంచమంతయు వానినివ్యాపింప దలంపుగలది రష్యా. సామ్యవాదమును తుద ముట్టించి ఫేసిజ సిద్ధాంతములనే వ్యాపింప దలంపుగలవి ఇటలీ జర్మనీలు. అందుచే రష్యాయన్న వీనికి గిట్టదు. ప్రజాపక్షమునకు జెందిన ఫ్రాన్సు పరిస్థితుల గమనించి రష్యాతో నేకమగుట కిష్టపడుచున్నది. కోమటిలాగు ఏప్రక్క లాభమున్న వారితో జేరదలంచిన దేశములు గూడ గలవు. స్పెయినునందు ఫేసిస్టు పార్టీవారగు విప్లవకారులు జయశీలురగుచో ఇటలీ జర్మనీలకు మంచి బలముగలుగును. తరువాత వారి కత్తికి యూరపునం దెదురుండదు. ఈ సిద్ధాంతములు గిట్టని ఫ్రాన్సు కపుడపాయము వాటిల్లకతప్పదు గాన యుద్ధమారంభమైనపుడే స్పెయినుతో నెట్టి జోక్యము పుచ్చుకొనగూడదని అన్ని దేశములనుకూర్చి యొడంబడిక చేసికొనెను గాని అది నిరుపయోగమైనది. అందుచే ఫ్రాన్సు పాడలిపోవుచున్నది.

ఈవిధముగ స్పెయినుదేశపు విప్లవము విదేశములతో నెక్కుడు సంబంధముగలదై త్వరలో ముగియు నటుల గన్పింపక నింకొక ప్రపంచసంగ్రామమును దెచ్చి పెట్టునటులున్నది. నానాజాతిసమితి అబిసీనియాను ఇటలీసామ్రాజ్యకాంక్షకు బలియిచ్చినపాపము దగిలి కీర్తిశేషురాలై యుండనిచో నీ పరిస్థితులం దేమైన జేసియుండెడి దేమో (స్పెయిను అనాగరిక దేశముకాదు కాబట్టి.) ఇపుడుకూడ శాంతికై ప్రబలమగు యేర్పాటులు జరుగుచున్నవి కాని అంతకంటె భయంకరముగ యుద్ధము సాగిపోవుచున్నది. ఇంకొక విచిత్రమేమన నితర దేశములన్నియు నతిత్వరగా మారణయంత్రములను యుద్ధసామగ్రులను నిర్మించుకొనుటలో నిమగ్నులై యున్నవి.

మానవుని యత్యంతాశ్చర్యనిమగ్ను నిజేయు నేటి నాగరికత విజ్ఞానము నమితముగ చేకూర్చియుండియు ప్రపంచము మానవకళ్యాణమార్గమునుబట్టి పోవక మానవమారణమునకై నిరంతరము పాటుబడుచున్నది. ఎదురుదిరిగిన నీ నాగరికతాప్రవాహమును నాపి తగు విధమున నుపయోగించు శక్తి ప్రపంచమున నిపుడు లేదు. కాన నిది నడ్డులేక ప్రవహించి ప్రళయము దెచ్చిపెట్టుననుటలో సందియము లేదు. (చ. రా.)

---

## ప్రబోధము

ఆంధ్రదేశము నీదు దేశము
ఆంధ్రప్రజలే నీకుటుంబము
ఆంధ్రభాషయె నీదుజీవము
ఆలకించవోయీ !

భారతీయుల పూర్వభాగ్యము
భారతీయుల శౌర్యరక్తము
భారతీయుల మేటిబిరుదులు
భగ్నమయ్యాయి !

రాజసింహ ప్రతాపసింహులు
రాజు పృధ్వీరాజుగాగల
రాజులెల్ల స్వతంత్రమునకై
నాజిగూలిరిగా !

దేశభాగ్యము కొల్లబోవగ
దేశమాత కృశించుచున్నది
ఆశపడదా నీసహాయము
లేశమునకైనన్.

తెల్గుదేశపు మేటిశౌర్యము
తెల్గుదేశపు స్వేచ్ఛభావము
తెల్గురక్తము నీదుయెదలో
మెలగుతుందోయీ !

లేవవోయీ ! చేతగాదను
భావమునబడి నిద్రబోవక
సేవజేయుము నీదుయనుజుల
భావిభాగ్యముకై.

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మీగారు



# శారద లేఖలు



సౌభాగ్యవతికి కల్పలతకు:

నెచ్చెలీ! "స్త్రీస్వాతంత్ర్యము కూడదు" అను వ్యాసమును చదివినపిమ్మట "యిది స్త్రీలచే వ్రాయబడినదై యుండునా", అని నేనుగూడ నీవలెనే శంకించితిని. కాని ఆ వ్యాసము చివరను రచయితలనామములు స్పష్టముగా వ్రాయబడియున్నప్పుడు మన మట్లు సంశయించుట అవివేకముగదా! కావున ఆవ్యాసము స్త్రీలచే వ్రాయబడుట సత్యమే. కాని ఆసోదరీమణులు మాత్రము స్త్రీల కష్టనిష్ఠురములను లేశమైనను చవిచూచి యెఱుగని మహాభాగ్యశాలినులై యుందురని మాత్రము నాకు దోచుచున్నది. మన యాంధ్ర నారీరత్నములలో నిట్టి యదృష్టవతులైన నారీమణు లిరువురైన నుండినందులకు మన మెంతయు సంతసింపవలసి యున్నది. ఈ సోదరీమణులు వర్ణాంతర వివాహములు, స్త్రీవారసత్వపుహక్కులు, దేశసేవ, ఉన్నతవిద్య, వోటింగుహక్కులు, మున్నగు విషయములు పురస్కరించుకొని ప్రస్తుతము వీని విషయమై దేశమున జరుగుచున్న ప్రయత్నములను చూచి యివి యన్నియు స్త్రీలకు సమకూడినటులే, సమకూడిన స్త్రీలకు స్వాతంత్ర్యము వచ్చినటులే మహానరక మనుకొని దీర్ఘ వ్యాసము వ్రాసినారు. ఈ అలజడికంతయు కారణము వర్ణాంతర వివాహములను గుఱించియు, స్త్రీపురుష సమానహక్కులను గుఱించియు భారతశాసనసభలో ప్రతిపాదింపబడనున్న భగవాన్‌దాసుగారియొక్కయు దేశముఖుగారియొక్కయు బిల్లులే.

వర్ణాంతరవివాహము లెంతమాత్రము పనికిరావనియు నిట్టి వివాహములు చేసికొనినవారు సుఖపడలేదనియు, ఇవి పురుషులకు జెల్లునేమో కాని అబలలమగు మన కెన్నడును తలంచరానివనియు వీరి వాదన. వర్ణాంతర వివాహములు పనికి రాదనిన అనవచ్చును. వీనికి కారణములు పెక్కులున్నవి. కాని యిట్టి పెండ్లిచేసికొనిన వారు సుఖపడలేదనుట నాకొకకారణముగా కాన్పించుటలేదు. ఏలనన కులగోత్రములు చక్కగా పరిశీలింపబడి చేయబడిన దంపతులలోగూడ సుఖపడని వారెందరో యున్నారు. మఱియు వర్ణాంతరవివాహము పురుషులకు జెల్లునేమో కాని స్త్రీలకు జెల్లదనుట యేమో నాకర్థమగుటలేదు. పురుషులకు జెల్లినను పురుషులు పురుషులనే వివాహమాడరు గదా! వర్ణాంతరవివాహమున కర్హతగల యొక పురుషు డట్టి అర్హతలేని యొక స్త్రీని వివాహమాడియే యతని చెల్లుబడిని చూపవలయును. అట్టిచో నిట్టి వివాహములు పురుషులకు తగును

స్త్రీలకు తగదు అనిన నెట్లు పొసగును? ఈ వర్ణాంతర వివాహము లుచితముగాదనుటకు పశుపక్ష్యాదులలో నిట్టివి జాతిసంబంధములు లేవని పీ రుదాహరణ చూపిరి కాని పశుపక్ష్యాదులలో బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది విభేదములుండినగదా యివి కులముల ప్రకారము సంబంధములు కలిగియున్నవని చెప్పుటకు? ఆవిధముగా చూచినచో మానవులు మానవులనే వివాహమాడుచున్నారు గాన వర్ణాంతరవివాములుగూడ సజాతిసంబంధములే యని వర్ణాంతర వివాహవాదులు సమర్థింపవచ్చును గదా! కాన వర్ణాంతర వివాహములవలన భార్యాభర్తలలో నైకమత్యము చెడెడి పరిస్థితులనేకములు కలవు. వాని నుదాహరించి యిట్టి వివాహము లుచితముగాదనిన వారి వాదన కొంతవఱకు సమంజసముగా నుండెడిది.

ఇక పిత్రార్జితపు ఆస్తిలో కొమార్తెలకు గూడ కొమారులతోబాటు సమాన వాటా లేర్పడువిషయమై వీరు తీవ్రమగు నసమ్మతిని దెలుపుచున్నారు. ఇందువలన స్త్రీలకు పుట్టిళ్లుబుగ్గిపోవునని వీరి యభిప్రాయము. వీరి దృష్టిలో తండ్రి ఆస్తిలో భాగములు పంచుకొనిపోవు కొమార్తెల్లరు పుట్టినిండ్లను ధ్వంసముచేసిపోవువారనియు వచ్చెడికోడండ్రెల్ల రెట్టియాస్తిని తీసికొనిరాని దరిద్రులాండ్రనియు తేలుచున్నది. ఒక యింటి కొమార్తె లొకయింటి కోడండ్రుగను నొకయింటికోడండ్రొక యింటి కొమార్తెలై యుండుట విధియై యున్నప్పుడు శాసనమువచ్చినచో పిత్రార్జితపు ఆస్తి హక్కులందఱికి వచ్చునుగాని కొందఱి నెట్లు విడిచిపెట్టును? ఇంటికి వచ్చెడి కోడండ్రును యింటినుండి వెడలెడి కొమార్తెలును ప్రతియింటను సామాన్యముగా నుండియే యుందురుగదా. కొమార్తెలకు భాగార్హత కలుగుటచే అన్నదమ్ముల భాగములు చిన్నవగునని వీరు జాలిపడుచున్నారు. కాని తండ్రి సంపాదించిన యావదాస్తిని పుష్కలముగా పంచుకొని ఆతండ్రి కడుపుననే బుట్టినప్పటికి స్త్రీయన్న కారణమున ఆమె పేదరాలైనను, బిడ్డలుగలదైనను, ఆర్జనాపరుడగు భర్తగలది కాకపోయినను, విగతభర్తృకయైనను, నామెకు వీసమెత్తుసొమ్మును ముట్టజెప్పక నిర్భాగ్యమోటముగ ప్రవర్తించు సోదరులనుగూర్చి వీరు యోచించుటలేదు. అందువలన స్త్రీలకు గలుగుచున్న కష్టనష్టములనుగూర్చి వీరికి జాలియేలేదు? "మనంపాదంబెట్టిన వేళ మంచిదై మన భర్తలు అదృష్టవంతులై సంపాదించవలెను. ఆవిధముగా మనము స్వార్జితపు ఆస్తిని సంపాదించుకొనవలెనని కోరుకొనుట మంచిది" అని వీరు స్త్రీలకు సలహాయిచ్చుచున్నారు. ఈకోరిక ప్రతిస్త్రీకి యుండనేయున్నది. కాని సఫలమగుటలోనే యున్నది వ్యత్యాసము. మఱియు అందఱు స్త్రీలకు పాదంబెట్టినవేళ మంచిదేయగుచో అందఱు స్త్రీలకు స్వార్జితపుఆస్తిని సంపాదింపగల భర్తయుండుచో యేస్త్రీల కసలు

భాగార్హ్వతయేవలదు. కాని లోకములోని స్త్రీలందఱు సంపాదనగల భర్తలుగల వారేనా? అందఱు భర్తలుగల పుణ్యవతు లేనా? కాదుగదా అట్టి సందర్భములలో స్త్రీలకట్టి ఆర్థిక సౌకర్యము లేర్పడినచో వారి స్థితి దుఃఖభాజనముకాకుండును గదా.

నిజ మాలోచించినచో మన హిందూ స్త్రీల బానిసత్వమునకు మత సాంఘిక కట్టుబాటు లేవియు ముఖ్య కారణములు కావు. ఆర్థికోపపత్తి లేకపోవుటయే ముఖ్య కారణము. ఈ దుస్థితి యుగయుగములుగ స్త్రీనిపట్టి పీడించుచున్నది. లోకములో డబ్బుతో నక్కఱలేని మానవులుందురా? పసిబిడ్డకుగూడ పైసతో పనియే యున్నది. అందులో సమస్త క్రయవిక్రయ వ్యవహారములు ద్రవ్యములతోనే జరుగవలసిన యీ దినములలో ద్రవ్యముతో ప్రతిమనిషికిని అవసరమే. కాని స్త్రీ దీనికెడగా చేయబడినది. ఇది సామాన్యమైన శిక్షయా? స్త్రీకి మాత్రము డబ్బుతో నక్కఱయుండదా? స్త్రీగూడ మానవమాత్రురాలేగదా. ఒక కాయనో పువ్వునో కొనవలయునని, చీరెనో రవికనో కొనుక్కొనవలయునని, బిడ్డల కేమైనకొని పెట్టవలెనని, దానమో ధర్మమో చేయవలెనని, పెద్దతనము వచ్చినచో తీర్థమో సార్థమో పోవలయునని యేదేని మానవసహజమైన అభిలాష స్త్రీలను ప్రేరేపింపవచ్చును గదా. సొంతమగు ధనము లేకున్న నివి చేకూరుటెట్లు? భర్తలుగాని పుత్రులుగాని స్త్రీల యవసరము గుర్తెఱిగి ధనము నిత్తురా? తనవద్దనున్న ధనమువలె యితరుల యనుగ్రహాముపై వచ్చెడి సొమ్ము వినియోగపడునా? మా యింటిపొరుగున నొకరున్నారు. ఆ యిల్లాలికి దాదాపు యేబదైదేండ్లున్నవనుకొందును. ఏ నలుబదేండ్లనుండియో కాపురము చేయుచున్నది. కొడుకులు, కూతుండ్రు, మనుమలు, మనుమరాండ్రు, దుర్యోధన సంపత్తి. కాని ఆ యింటియామె వారెల్లరకు ఊడిగము చేయుటకుతప్ప మరియెందుకు కొఱగాదు. ఆమె పెనిమిటి డెబ్బదవపడిలో వృద్ధుడు. మొలలో బల్లెమంత తాళపు చెవిగట్టుకొని యామె కొక పైసయైన చేతబెట్టక కాల్చుక తినును. తుట్టతుదకు వడ్లదంపిన చిట్టుపొట్టు నూకనుచ్చు గూడ స్వయముగా నమ్మి బొడ్డున పెట్టుకొనును. వాకిలియూడ్చు పనిమనిషి రెండు పూటల అన్నము పెట్టించుకొని నెల కాగానే రెండు రూపాయలు ఠకీమని చేతిలో వేయించుకొనిపోవును కాని సహధర్మిణియైన యీ ఆ జన్మదాసీకి కానీకి గతిలేదు. అంతవఱకెందుకు. నవనాగరకులైన మా సమాజసభ్యురాండ్రలో కొంతమంది నెల కొక పావలా బేడ యివ్వజాలక రాజీనామా పెట్టగా "యేమి మీరు డబ్బులేనివారుకూడా కాదే యీ రాజీనామా లేమి"టనగా "మా మగవారీయనప్పుడు మేమేమి చేయమండీ" అని సిగ్గుతో చెప్పలేక చెప్పిరి. ఈవిధముగా రాగి డబ్బుకు గతిలేక స్త్రీ లెందరో అల్లాడు

చుండ మన సోదరీమణులు మన స్త్రీలకు ఆస్తి అధికారములు వలదనుచు సొంత సంపాదనా సామర్థ్యము, వారసత్వాధికారములు మున్నగు సర్వసౌకర్యములు గలిగియున్న పురుషులయెడనే అభిమానము వహించుట, కలిగినమ్మ కలిగినమ్మకే పెట్టిన దను సామ్యముగానున్నది. మన దేశములో స్త్రీలు సొంతముగా ధనార్జనచేయు పద్ధతి లేదు. అనేక కారణములచేత వారి కట్టి యవకాశముగూడ తక్కువ. ఇట్టి పరిస్థితులలో ఇటు పిత్రార్జితపు ఆస్తినుండియో అటు భర్త్రార్జిత ఆస్తినుండియో కొంత సొమ్ము సమకూడెడి అవకాశమునేర్పడుట స్త్రీ సంఘమునకు శ్రేయస్కరమే గాని అపాయకరము గాదు.

నేను కొమార్తెలుగల తండ్రులు అల్లుండ్రకిచ్చెడి కట్నమైనను కొమార్తెల వివాహము గొంతుమీది కత్తివంటి బలవంతపు ప్రాణాంతకపు విషయమగుటచేత విధిలేక యిచ్చుచున్నారేగాని బుద్ధిపూర్వకముగను ప్రేమాతిశయముచేతను నేమాత్రముగాదు. ఈ కట్నములు లేకనే కొమార్తెలకు మంచి వరులు లభించు నవకాశమున్నచో నొక్క తండ్రియైనను వేయి రూపాయలు కాదు గదా వందరూపాయలైనను నీయఁడు. ఆ కట్నములవల్లనైనను కొమార్తెకు లాభించు నదేమియులేదు. తండ్రి యిచ్చుచున్నాడు. పెనిమిటి తీసికొనిపోవుచున్నాడు. వధువున కిందువల్ల ఫలిత మేమియులేదు సరి గదా ఆ కట్నములోనే కొంచెమైన తగ్గినచో బాధింపబడుటకు మాత్రము యీపిల్ల గురియగుచున్నది.

ఈ సందర్భమున మొన్న మొన్న జరిగిన విషయ మొకటి జ్ఞాపకము వచ్చుచున్నది. కట్నము లాంఛనములు అత్తలాడు బిడ్డల నడుతులు వగైరాలన్నిటికి కలిసి మొత్తము పదునారు వందలకు బేరమట! వివాహ సమయమున కన్యాదాతవల్ల వానిలోనే నూరు రూప్యములో కొఱవైనవట. పుట్టకనో గిట్టకనో ఆ నూరురూపాయలు పిల్ల అత్తవారింటికి వెళ్లువఱకు తీర్చబడనేలేదు. ఇక పిల్ల అత్తింట అడుగుపెట్టినది మొదలు అత్త లాడుబిడ్డలు, పెనిమిటి, అందఱు ఏకమై ఆ తండ్రి యీయవలసిన డబ్బు కొఱకై పిల్ల నొకటే సాధింపు, వేధింపు, ఆమె తల్లి, దండ్రుల నొకటే తిట్టిపోయుట. ఈ నిరంతరవేదనను ఆబాల యెట్లు భరింపగలదు? రెండేండ్లు కాపురము చేసినది. ఈ అత్తింటి బాధలకు లోలోన దిగులుపడి క్రుంగి కృశించి రోగమున పడినది. తలిదండ్రులకీ సమాచారము తెలిసి కొమార్తెను పంపమని యడిగిరట. లోగడ బాకీ వడ్డీ అసలు ఫాయిదాలతో చెల్లించిన గాని నీ కొమార్తెను పంపమనిరట. కడుపు తీపిచే నల్లాడుచున్న ఆ గృహస్థుడు మిగిలిన యే పొలపుచెక్క నమ్మి తెచ్చినాడో! వారు కోరినన్ని రూపాయలు తెచ్చిపోసి అస్తిపంజరమువలెనున్న కొమార్తెను యింటికి తీసికొనిపోయినాడట. అంతే. రెండేండ్లు



ఇక వర్షంబాధ ఉండదు.

వర్షములో స్వేచ్ఛగా తిరుగుటకు క్రొత్తగా చేయబడిన దుస్తులు.



రై సీత

అష్టకష్టములుపడి యింటికి వచ్చిన బిడ్డను ఆ తల్లిదండ్రులు తోడబుట్టినవారు అందఱు కన్నులతో చూచుకొనినారో లేదో, తీసి కొని వెళ్లిన మూడవనాడే ఆమె విగతజీవ యైనదట. ఇక వైద్యసేవ కవకాశమెక్కడ? కట్నములవలన నెందరో యువతు లిట్లు బలవన్మరణమునకుపాలై నశించుచున్నారు గాని కట్నపు సొమ్మును భార్యా భర్త లిరువు రేకమై యిమ్మి సొమ్ము చేసికొను టెక్కడను కన్పించదు.

ఉన్నతవిద్య నభ్యసించుట, ఉద్యోగ ములు సేయుట, ఉపన్యాసము లిచ్చుట హైందవస్త్రీల కనర్హమైన పనియనియు, పూర్వపు స్త్రీ లిట్లు చేసియుండలేదనియు వీరు చెప్పుచున్నారు. కాని వేదకాలము నుండియు స్త్రీలు విద్యావతులైయున్నట్లు దృష్టాంతము లెన్నియో గలవు. ద్రౌపది యెంత విద్యావతియైనది భారతములో నామె గాథకు సంబంధించిన ప్రతి యక్కర మును చెప్పుచునేయున్నది. కౌరవసభలో తాను పరాభవింపబడిన సందర్భమున ద్రౌపది వేసిన ప్రశ్నలు వేయి యుపన్యాస ముల పెట్టు గాదా? విదుర భీష్మాది ధర్మజ్ఞు లెల్ల రామెను ప్రశ్నించిరి గాదా? విరాట సభలో నామె యెట్టి యుపన్యాసము చేసెనో రాయబార సందర్భము కృష్ణున కెట్టి సందేశ మొసగెనో, పాండవుల నెట్లు యుద్ధమునకు బురికొల్పెనో, భారతము చదివినవా రెల్లరకు తెలియుచున్నది గదా. రావణ యుద్ధమునకు భారతయుద్ధమునకు స్త్రీలే కారణభూతులై యుండ పూర్వపు స్త్రీ లిట్టి వెఱుగరనుట యెట్లు?

కేవలము లౌకికములందేగాక పారమా ర్థికములందును స్త్రీలు ప్రజ్ఞాఢ్యలై యుండి రనుటకు జనకమహారాజు సభలో స్త్రీలు గావించిన బ్రహ్మవాదము తార్కాణ గదా. ఈవిధముగ ప్రాచీననారీమణులు యుగయుగ ములకుపూర్వమే లౌకిక పారమార్థికాది సమస్త విద్యలయందు కుశలలై యున్నారు. ఈసందర్భమున వీరు ప్లాటుఫారము పై కెక్కి యుపన్యసించుస్త్రీలను వర్ణించిన తీరత్యంత జుగుప్సాకరముగ నున్నది. ప్రాచీనహైందవ నారీధర్మమును స్త్రీలు తు చా తప్పకుండ అనుష్ఠించవలెనని నొక్కివక్కాణించుచున్న యీ సోదరీమణులిట్టి నిర్లజ్జాకరమగు వర్ణన నెటులవ్రాసిరో! ఇది ఆర్యమహిళాధర్మ మగునా?

మన హిందూకుటుంబములలో ప్రతివిష యమునందు పురుషుడే అధికారిగను స్త్రీలు వారి ఆజ్ఞాశిక్షలోనై వర్తించు సహధర్మ చారిణులుగను నుండుట అనాదినుండి యిప్పటివఱకు జరుగుచున్న పద్ధతి. కావున ప్రతిస్త్రీయు పెనిమిటి యిష్టప్రకారము వర్తించుటయు, వారికి యిష్టమగు పదార్థ ములను, వారి కచ్చేరివేళకే తయారొనర్చు టయు వారు భుజించినతరువాతనే భుజించు టయు స్థిరమైన నాచారముగా నున్నది. ధనికులుగాని పేదలుగాని అగ్రవర్ణులు గాని హీనవర్ణులుగాని సమస్త హిందూ కుటుంబములలోను నిదియే పరిపాటి. ఇందు

లకు వ్యతిరేకముగా నూటికికోటికి యొకస్త్రీ ప్రవర్తించినదో నామె లోకదూషితయగు చున్నది. నిజమట్లుండ, స్త్రీయే సుఖజీవి యనియు, సర్వస్వతంత్ర సమస్త సుఖోప భోగముల ననుభవించుచున్నదనియు, పురుషుడు వేళకు సరియైనభోజనమైన లేక ఏ కాటో మాడో తినిపోయి నౌకరీచేసి అధికారులచే సర్వదా వారికి బానిసీడై నానామాటలు పడి డబ్బుగడించి భార్యకు సమర్పించు కష్ట జీవియనియు వీరు వ్రాసినారు. పురుషుడు సర్వస్వతంత్రుడు. నౌకరీ చేయుచున్నను అతడు అధికారికి బానిసగాడు. డబ్బు సంపాదించి పెట్టుచున్నను అతడు భార్యకు బానిస గాడు. ఏలనన తనకు సమ్మతిలేనప్పు డాతడీ యిరువురితోను సంబంధము వదులుకొని స్వేచ్ఛగా వర్తింపగలడు. స్త్రీ యిట్టి స్వతంత్ర జీవియగునా ? స్త్రీలు ధరించుచీరెలు రవికలు సొమ్ములు మున్నగునవియైనను పురుషుడు తమయిష్టప్రకారము తెచ్చియిచ్చినవే గదా ! అతడు తెచ్చియీయనపుడు స్త్రీ యేమియు చేయజాలదుగదా. పాపమీ సోదరీమణులిరువురు మగవానికేమున్నది నగలా గుడ్డలా అని జాలిపడుచున్నారు. కాని భార్యలకు నగలు చీరెలు తెచ్చువారు వీరేగదా. తమకుగూడ కావలసినచో మరి రెండు హెచ్చుగా తెచ్చుకొనిన కాదనువా రెవరు ?

స్త్రీయొక్క సర్వసౌఖ్యములు పురుషుని యిచ్ఛాధీనమైయున్నవి కాని స్త్రీ యిచ్ఛాధీనములు లేవు. “స్నేహితులయిళ్లకని, బంధువులగృహాలకని, భజనసమాజాలకని, సినీమాలకని, మీటింగులకని, పేరంటాలకని కొంపలు తాళాలుబిగించి యిచ్చవచ్చినట్లు సంచరించుచున్నా”రని స్త్రీలనుగూర్చి వీరు మరొకఆరోపణ గావించినారు. కాని యిది విశ్వసింపదగిన మాటగాదు. ఎవరో ఒక రిద్దఱు బయటికిపోగల నవకాశముగలవారు, తమభర్తల కిష్టమైనవారు ఎచ్చటికైన వెళ్లు చున్నను, అది స్త్రీమండలి కంతకుచుట్టి పెట్టవలసిన స్వాతంత్ర్యముగాదు.

గృహిణియగుస్త్రీకి భర్తకు సమ్మతమైనను యిలువెడలరాని పరిసితులనేకములు గలవు. గృహకృత్యములేమి, గర్భధారణ శిశుపోషణాది పరిస్థితులేమి, బంధుమిత్ర అతిథి అభ్యాగతీత్యాది గృహాగతుల సన్మాన సందర్భములేమి, రోగగ్రస్తురాలైన వారి ఉపచర్యాదికములేమి, పండుగపబ్బములేమి, పనిపాటలవారి చేపనులు చేయించుటేమి, ఇన్నియు స్త్రీమీదనే నిర్భరపడి యున్నవిగదా. ఈపరిస్థితులలో నేయిల్లాలికి యూరుపట్టుకొని తిరుగుటకు వీలగును ? మగడు సమ్మతించినను నామె కింటిలోని కాలు వీధిలోపెట్టుటకు వీలున్నదా ? ఎవరి నిర్బంధము వలదు గృహిణి నావరించిన కార్యకలాపమేచాలును ఆమెను యింటిలో కట్టిపెట్టుటకు. ఇన్నియు చక్కబెట్టుకొని యే పేరంటమునకై పోవుదమనిన పోనీ యని పురుషులెందరు ! ఒక విద్యాధికుడున్నాడు. వివాహమైన నాల్గునెలలకే తల్లిచాటుబిడ్డను, రజస్వలకానిదానిని తన

భర్తృత్వాధికార బలిమిని తీసికొనిపోయి యింట బంధించినాడు. ఆగృహము పాతాళ గర్భమే. ఆ పాతాళలోకములో ఆమె గృహ కృత్యములు నిర్వహించుచు ఒంటరిగా మసలుచుండవలెను. దాదాపు పదేండ్లయి నది. ఆమెను తనయింటికి తీసికొనివచ్చి మరల పుట్టినింటిమొగము చూపలేదు. అత డెటకేని పోవుచున్న ఆ లోపలింటికి తాళము. ఆమె ఆయింటిలో బందీ. అతడు నిర్వ్యాపారిగాడు. నిర్ధనుడుగాడు. మంచి గడనగలవాడు. మేడలు మిద్దెలు, కారు, గ్రామోఫోను, పెట్రోమాక్సులైట్లు—ఒక టేమి సమస్తనాగరిక సుఖపరికరములకా గృహము నిలయము. కాని వాని యనుభవ మంతయు నాతనికొక్కనికే, ఆసహధర్మిణి కందులో పాలులేదు.

మొన్నమొన్ననే మాబంధువులలో నొకరి కొమార్తె చనిపోయినదని చూడబోతిని. ఏమిచెప్పుదు నా క్షోభ! పాపము తల్లి తోబుట్టువులు, అమ్మ పినతల్లి యెందరో బంధు జనమున్నారు. వారిలో నొక్కరైన నామె వియోగమున కేడ్చినవారు లేరు. అందఱు అమెపడిన పాట్లనుతలంచి యేడ్చువారే. బిడ్డనుచూచి యేడేండ్లయినదని యేడ్చువారు కొందఱు, మూడేండ్లయినదని యేడ్చువారు కొందఱు, ఒకటేగోల. గ్రామాంతరమున నున్నవారిమాట సరియే ఆమె కాపురమున్న యింటికి నిరుగుపొరుగులనున్న వారే ఆమెను చూచి యెఱుగరట. ఆమె చనిపోయిన వెనుక వీధిలోబెట్టి నీళ్లుపోయుచుండ ఈ యంటిలో స్త్రీయుండెనా? అని యెల్ల రాశ్చర్య మగ్నులైరట. ఈవిధముగా ననేక మంది స్త్రీ లిప్పటికిని భర్తృనిర్బంధమునకు లోనై క్రుంగి కృశించి విగతజీవులగుచుండ స్త్రీ జన్మయే యత్కృష్టమైనదనియు పురుష జన్మయే పాపిష్టిదనియు పురుషులకున్న కష్ట ములు స్త్రీలకు లేనేలేవనియు వీరెట్లు వ్రాయగలిగిరో నాకు దోచుటలేదు.

స్త్రీల వోటింగుహక్కునుగుఱించిగూడ వీరు ప్రస్తావించినారు. ఈవోటింగధికారము స్త్రీలకెంతమాత్ర ముండకూడదనియు నిది భార్యా భర్తలమధ్య వైమనస్యములకు కారణమగుననియు "పెనిమిటి బిడ్డలు వల్ల గాదంటూఉంటే యేసాహెబుగారికో సీటు యివ్వడానికి స్త్రీ వెళ్లుననియు" వీరు వ్రాసి నారు. ఎంతమాట! మనదేశమున మాంటు ఫర్డు సంస్కరణములు వచ్చినదిమొదలు స్త్రీలు వోటింగధికారమును వినియోగించు చునే యున్నారు. స్త్రీవోటరులలో చాల మంది తమయింటికి పెద్దగానున్న పురుషుని యనుమతిప్రకారము వోటుల నిచ్చుచున్నా రని వినుచున్నాము. కాని సాహెబులకిచ్చి వచ్చుచున్నారనుమాట వినియుండలేదు. అట్టిచో స్త్రీ వోటరులనెల్ల నొక్కుమ్మడి కట్టగట్టి యిట్టిదుర్గాతికిచేర్చుట సోదరీమణు లెట్లు సాహసించిరో తెల్లము కాకున్నది.

ఆరంభమునుండి ఈవ్యాసము స్త్రీలచే వ్రాయబడినదేయైనను యెల్లెడల పురుషుల యెడ కారుణ్యమును స్త్రీలయెడ కాఠిన్య మును జూపబడుచు వ్రాయబడియున్నను,

కట్టకడపట స్త్రీ సహజమైన మార్దవమును, జాత్యభిమానమును చూపకుండ నుండలేక పోయినారు. వితంతువివాహములును స్త్రీల మనోవృత్తి హక్కులును అత్యవసరములని వ్రాయుటయే గాక హిందూసంఘమున నెప్పుడునులేని భర్తృపరిత్యక్తల వివాహములుగూడ నావశ్యకములనిగూడ వ్రాసినారు. మఱియు ప్రస్తుతకాలమున వార్తాపత్రికలలో ప్రచురితములగుచున్న చిత్తరువులను తప్పక నిరసింపవలెనని వ్రాసినారు. ఇందులకే సోదరీరత్నములనెంతయు నభినందించుచున్నాను.

కల్పలతా! ప్రస్తుతకాలమున భారతనారీమణుల గణ్యత కొఱవడిపోవుచున్నదను గాఢతర సంతాపముచే నీసోదరీమణు లిట్టి దీర్ఘవ్యాసమును వ్రాసియుందురు. ఎట్టిపరిస్థితులలోను అట్టి గణ్యతను నిలుపుకొనవలసినబాధ్యత ప్రతిహిందూస్త్రీపై నున్నదని నేనును నొక్కివక్కాణింతును. కాని వీరి విమర్శనావైఖరి ఒక్కొక్కచో స్త్రీలు వట్టి పనికిమాలినవారను నపోహ కెడమిచ్చునటులుండుటచే సత్యము వెల్లడించుటకై యింతగా వ్రాసితిని.

స్త్రీలు కోరుటచేనేమి ప్రభుత్వమొసగుటచేనేమి, స్త్రీలకు క్రొత్తక్రొత్త అధికారములు చేకూరుచున్నమాట వాస్తవమే. వానికి అలజడిజెంది నిరాకరించుటలో వివేకములేదు. వానిని వశపఱచుకొని యుక్తవిధమున స్త్రీల మర్యాదకెట్టి భంగములేకుండ వినియోగించుటలోనే గౌరవము గలదు. ఈసందర్భమున సెప్టెంబరునెల గృహలక్ష్మి సంపాదకీయవ్యాసమున చెప్పినటుల అనుకరణములేక ఆవశ్యకములగు వానికే స్త్రీలు ప్రయత్నించిన ప్రాచీనగౌరవము నిలుపుకొందురు.

భావపురి — మిత్రురాలు,

1—10—36 — శారద.





# చర్మము శుభ్రపరచుటే గాదు
# మెఱుగు కూడ కలిగించును.

నాగరిక గృహములందు మైసూరు శాండిల్ వుడ్ సబ్బులేనిదే స్నానము చేయుట జరుగదు. సువాసనతో గూడిన ఈ సబ్బునురుగు ఆరోగ్యము పెంపొందించు శుభ్రతను గల్గించుటేగాక, ఒడలి వన్నెకు మెఱుగు దెచ్చును.




నేటినుండి మైసూరు శాండిల్ వుడ్ సబ్బు నుపయోగించుటకు నిర్ణయించుకొనుము.

అన్ని చోట్ల దొరకును.

## గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరి
బెంగుళూరు.

# మానవపరిణామము

శ్రీమతి తాడి నాగమ్మగారు

ఈ మహావిశ్వములోనున్న సకల చరాచరములందును మానవుని విజ్ఞానపరిణామము బహు చిత్రాతిచిత్రవిచిత్ర విషమ సంఘట్టనల పూరితమైయున్నది. మానవునికి కలుగని సంశయముగాని తీరిన ఆశగాని లేదు. వానికి తట్టని ఆలోచనలుగాని పుట్టని కోర్కెలుగాని లేవు. ఆదియుగములందు అతఁడు ఆరాధించని దేవతగాని పూజ చేయని ప్రకృతిగాని లేదు. ఆధునిక యుగములందు అతడు నమ్మతగిన దేవుఁడుగాని నాశముచేయని ప్రకృతిగాని లేదు. పూర్వకాలపు మానవుఁ డన్నిటిని నమ్మినాఁడు. నవీనకాలపు మనుష్యుఁడు దేనిని నమ్మఁడు. వారికి వినినదంతయు సత్యము, కనినదంతయు పవిత్రము. వీరికి వినినదంతయు కల్ల, కనినదంతయు కృత్రిమము. అప్పటి మానవుని ముఖ్యాశయము ముక్తి. ఇప్పటి మానవుని నిత్యాశయము భుక్తి. ముక్తిని దృష్టియందుంచుకొనియే యాతఁడు సమస్తమును చేయుచుండువాఁడు. భుక్తిని దృష్టియందుంచుకొనియే యీతఁడు సర్వమును చేయుచున్నాఁడు. ముక్తికొరకై యాతఁడు శక్తినంతయును ధారవోసినాఁడు. భుక్తికొరకై యీతఁడు యుక్తినంతయు నేకరువు బెట్టుచున్నాఁడు. ముక్తిని సంపాదించుకొనుటకై అనాఁటిమానవులు తీర్థయాత్రలు చేసినారు. భుక్తిని సంపాదించుకొనుటకై ఈనాఁటి మానవులు దండయాత్రలు సాగించుచున్నారు. ఆదియుగములందు యువాన్ చ్వాంగ్ మొదలగు చైనాదేశీయులు ఘోరాటవీపరివృతమగు పర్వతములనుదాటి హిందూదేశమునకు వచ్చుట ముక్తికొరకు. ఆధునికయుగములందు ఆంగ్లేయులు మొదలగువారు భయంకర తుపానులకు నిలయమగు మహాసముద్రములను దాటి వచ్చుట భుక్తికొరకు. ఆ కాలమందు అశోకమహాచక్రవర్తి తనవారినిసింహళ దీవులకు పంపుటకు కారణము ముక్తిమార్గము వ్యాపింపజేయుటకు. ఈ కాలమందు ఎలిజబెత్తుమహారాణి తనవారిని తూర్పుఇండియా దీవులకు పంపుటకు కారణము భుక్తిని ప్రోగుచేసికొనుటకు, ఆనాఁడు రాజ్యము పేరున మతము వ్యాప్తము కాబడినది. ఈనాఁడు మతముపేరున రాజ్యము విస్తృతము చేయబడుచున్నది. అప్పటివారికి ఆముష్మికపు చింతలుమెండు. ఇప్పటివారికి ఐహికవాంఛలు నిండు.

కేవలము ఆముష్మికమునకై ఐహిక మును వారు గోల్పోయిరి. కేవలము ఐహికమునకై ఆముష్మికమును వీరు గోల్పోవుచున్నారు. వారికి రాజు దైవ స్వరూపుఁడు. వీరికి దానవస్వరూపుడు. వారికి ప్రభుత్వ నీతినియమములపై ఎక్కువ ప్రీతి. వీరికి ఎక్కువ భీతి. రాజశాసనములు వారిని సక్రమమార్గమున నడిపించినవి. వీరిని విప్లవ మార్గములు త్రొక్కించినవి. వినయము ఆనాఁడు పేరుదెచ్చినది. విప్లవము ఈనాఁడు కీర్తిని దెచ్చుచున్నది. విన్నప ముల మూలముననే ఆ కాలపు ప్రజలు తమకోర్కెలు నెరవేర్చుకొనగలిగిరి. విప్లవ ముల మూలముననే ఈ కాలపుమనుష్యులు తమఆశయముల నెరవేర్చుకొనుచున్నారు.

విన్నపములకు రోజులవి. విప్లవములకు దినములివి. అప్పటిజీవితము నవరసభరితమై నది. ఇప్పటిజీవితము అష్టకష్టమయమైనది. శక్తిపైనాధారపడి జయముపొందుట ఆనాఁటిధర్మము. యుక్తిపై నాధారపడి విజయముగొనుట ఈనాటిమర్మము. పూర్వ కాలపు మతములు మస్కారమయములు. నవీనకాలపుసత్రములు తస్కరమయములు. విషయమెంత దురవగ్రాహ్యమైన అప్పటి వారికి భక్తి అంత ఎక్కువ. ఇప్పటివారికి విరక్తి అంతఎక్కువ.

కులధర్మములు వారికిముఖ్యము. పార్టీ ధర్మములు వీరికిముఖ్యము. కులధర్మము నుల్లంఘించినవారికి ఆ కాలమందు ప్రత్యక్ష ముగశిక్షించి పరోక్షమున బుద్ధిగరపిరి. పార్టీ ధర్మముల నుల్లంఘించినవారిని ఈకాలమందు పరోక్షమున దిట్టుచు ప్రత్యక్షముగ పొగడు చున్నారు. మతములనుండి ఆనాడుశాసన ములు వెలువడినవి. మందిరములనుండి ఈనాడు శాసనములు వెలువడుచున్నవి. పుట్టు ప్రతిశాసనము తమయొక్క ప్రతిభాభి వృద్ధికేయని అప్పటివారి తలంపు. చేయు ప్రతిశాసనము తమయొక్క స్వేచ్ఛ నరి కట్టుటకేయని ఇప్పటివారి కసరింపు. తమ పూర్వులు తమకంటె గొప్పవారని ఆ కాలపుమనుష్యులు నిరతమునమ్మిరి. తమ పూర్వులు తమకంటె ఛాందసులని ఈ కాలపువారు సతతము సణుగుచుందురు. సనాతనమైన ప్రతివిషయముపై వారికి ఆసక్తిమెండు. నవీనమైన విషయములన్ని టిపై వీరికి వ్యామోహామునిండు. నూతన ముకు వారు ఏవగించుకొనిరి. సనాతన మునకు వీరు స్వస్తిజెప్పిరి. పశ్చిమదేశస్థులు వారికి మ్లేచ్ఛులు. వీరికి ఆదర్శప్రాయములు. విదేశ ఆచారవ్యవహారములను వారు ఏవగించుకొనిరి. వీరు ఆలింగనము చేసి కొనిరి. భోగముల నాశించి త్యాగములను చేసిన కార్యశూరులు వారు. త్యాగములు చేయుమని భోగముల నార్జించిన వాక్శూరులు వీరు. అన్నివిధముల వారు అతీతులు. పలువిధముల వీరు పతితులు.

అప్పటి స్త్రీధర్మము వేరు. ఇప్పటి స్త్రీ ధర్మము వేరు. ఆమె అబల. ఈమె సబల. సతతము సహధర్మ మాచరించుట ఆమె వృత్తి. నిరతము పోటీపడుట ఈమె ప్రవృత్తి.

ఆమె ముగ్ధ. ఈమె ప్రౌఢ. ఆనాటి ముగ్ధలకు పసుపు రాసుకొనుటయందు ప్రీతి. ఈనాటి ప్రౌఢలకు పౌడరు రాసుకొనుటయందు ప్రీతి. పెండ్లి ముందు ప్రేమించుట తరువాత ఆనాటి వారికి ధర్మము. ప్రేమ ముందు పెండ్లియాడుట తరువాత ఈనాటివారికి ధర్మము. రాణివాసము ఆ కాలపు స్త్రీలకు కష్టముగా కాన్పించలేదు. స్వేచ్ఛావిలాసము ఈ కాలపు స్త్రీలకు నింద్యముగా కాన్పించుటలేదు. అబలయగుటచే అన్ని విషయములందు పతిపై నాధారపడవలసి వచ్చినది ఆనాటి కాంత. సబలయగుటచే ఏ విషయమునందును భర్తపై నాధారపడుటలేదు ఈనాటి సుదతి. రావణుని నిజరూపమును చూడగనే భయవిహ్వలయై మూర్ఛనొందినది ఆ కాలపు సీత. రావణ స్వరూపమును చూచుటతోడనే బట్ట బిగియగట్టి చేతులు సవరించి నీవా నేనా యని కలయబడుటకు వెనుదీయదు ఈ కాలపు సీత. భర్తతో అరణ్యమునకు పోయినది అప్పటి దమయంతి. పతితో క్లబ్బులకు పోవుచున్నది ఇప్పటి దమయంతి. ధవునికి సతతము ధర్మోపదేశము చేయుట ఆ కాలపు చంద్రమతి ధర్మము. ప్రియునికి నిరతము "టీ"గాచి యిచ్చుట ఈ కాలపు చంద్రమతి కర్మము.

అత్త ఆనాడు పెత్తనము వహించినది. కోడలు ఈనాడు ప్రభుత్వము చేయుచున్నది. ఆనాటి అత్త కోడలకు రాక్షసియై గాన్పించినది. ఈనాటి కోడలు అత్తకు కొరవి దయ్యమై గాన్పించుచున్నది. ఆ కాలమందు అత్త తన కోడలిచే దాసీతనము చేయించుకొన్నది. ఈ కాలమందు కోడలు తన అత్తచే ఊడిగము చేయించుకొనుచున్నది. ఆనాటి కుటుంబసామ్రాజ్యమునందు అత్తయొక్క నిరంకుశత్వమునకు కొదువలేదు. ఈనాటి కుటుంబసామ్రాజ్యమునందు కోడలి విప్లవమునకు అంతులేదు. అత్త శెలవిచ్చిననే తప్ప కోడలు కొడుకుతో మాట్లాడుటకు వీలులేని రోజులవి. కోడలు దయతలచిననే తప్ప కొడుకు తల్లితో మాట్లాడుటకు వీలులేని దినములివి.

అత్తచే ఆనాటి కోడలు చీపురుదెబ్బలు తిన్నది. కోడలిచే ఈనాటి యత్త మొట్టికాయలు తినుచున్నది. అత్తల గూడుపుఠాణీలు ఆ కాలమునందు మహా ఎక్కువగా నుండెడివి. కోడండ్ర కాన్ఫరెన్సులు ఈ కాలమున మరీ మిక్కుటముగనున్నవి. అత్తల రోజులవి. కోడండ్ర దినములివి. అప్పటి కోడండ్రకు అత్త ఒక గృహదేవత. ఇప్పటి కోడండ్రకు అత్త ఒక గ్రహదేవత.

అప్పటి బిడ్డ ప్రకృతి వేరు. ఇప్పటి బిడ్డల యావేశములు వేరు. పవిత్రపు మాతృస్తన్యమును త్రాగి పెరిగిన ఆనాటి బిడ్డలకు మాతృభక్తి యెక్కువ. కృత్రిమపు డబ్బాపాలు త్రాగి పెరిగిన ఈనాటి బిడ్డల కది శూన్యము. సంతానవతియగు సతిని ఆనాటి పతి సత్కరించినాడు. బర్త్ కంట్రోలు నాచరించు భార్యను ఈనాటి భర్త బహూకరించుచున్నాడు.

అప్పటి సంస్థానాధీశుల ఆలోచనలు వేరు. ఇప్పటి జమీందారుల యావేశములు వేరు. అప్పటి రాజాధిరాజులు కవులను పోషించెడివారు. ఇప్పటి సంస్థానాధీశులు కుక్కలను పోషించుచున్నారు. వారి కొలువులు పండితమయములు. వీరి కొలువులు శునకమయములు. వందిమాగధుల పొగడ్తలపై వారికి ప్రీతి మెండు. వార్తాపత్రికల దూషణల గురించి వీరికి భీతినిండు. అప్పటి సంస్థానాధీశులకు పరదేశముల పద్ధతులపై పరమ అసహ్యము కలిగెడిది. ఇప్పటి సంస్థానాధీశులకు విదేశ వ్యామోహములపై వింత వెఱ్ఱి కలుగుచున్నది.

అప్పటి రాజులు స్వదేశమును విడిచి యెరుగరు. ఇప్పటిరాజులు స్వదేశమునందు నివసించి యెరుగరు. ఆనాటి రాముడు అయోధ్యను విడిచిపోవుటకై దుఃఖించెను. ఈనాటి రాముడు ఇంగ్లాండును విడిచి వచ్చుటకై చింతించును. పులివేటయందు అప్పటిరాజులకు ప్రీతి మెండు. ఫుట్‌బాల్ ఆటయందు ఇప్పటి రాజులకు ప్రీతిమెండు. నిత్యము ఒకరితోనొకరు పోరాడుటచే పాడైనారిప్పటి సంస్థానాధీశులు. సతతము ఒకరిపైనొకరు వ్యాజ్యములు వేయుటచే పాడగుచున్నారు ఇప్పటి జమీందారులు. కోడిపందెములవలన ఆనాటి రాజులు చెడిరి. గుఱ్ఱపు పందెములవలన యీనాటి సంస్థానాధీశులు చెడుచున్నారు. స్వప్రజలను చక్కగ పాలించుచు పర ప్రభుత్వములను ప్రతిఘటించెడు వారు పూర్వపు రాజులు. స్వప్రజలను నిరంకుశముగ చండశాసనులై పాలించుచు పర ప్రభుత్వములకు జోహారు లొనర్చుచున్నారు ప్రస్తుతపు సంస్థానాధీశులు.



గ్యారంటి !!    5 సం॥ల    గ్యారంటి !!

# గ్యారంటి

కాంతిలోనూ, వన్నెలోనూ అసలుబంగారు నగల కే మాత్రం తీసిపోవు.

## టి. సి. యన్. గోల్డన్ మెటల్ వడ్యాణములు




| | | |
|---|---|---|
| నెం 1. పెద్దసైజు సాదాగజ్జెలు లేనిది | 1-కి రూ. | 12-0-0 |
| ,, చిన్నసైజు ,, | 1-కి రూ. | 8-0-0 |
| ,, 2. పెద్దసైజు సాదాగజ్జెలు కట్టినది | 1-కి రూ. | 20-0-0 |
| ,, చిన్నసైజు ,, | 1-కి రూ. | 15-0-0 |
| ,, 3. పెద్దసైజు 1 తట్టు వంకీగజ్జెలుకట్టినది | 1-కి రూ. | 20-0-0 |
| ,, చిన్నసైజు ,, | 1-కి రూ. | 15-0-0 |
| ,, 4. పెద్దసైజు 2 తట్టు వంకీగజ్జెలుకట్టినది | 1-కి రూ. | 20-0-0 |
| ,, చిన్నసైజు ,, | 1-కి రూ. | 15-0-0 |
| ,, 5. పెద్దసైజు జాలరు వడ్యాణము | 1-కి రూ. | 35-0-0 |
| ,, చిన్నసైజు ,, | 1-కి రూ. | 25-0-0 |

వి. పి. ఖర్చులు 1-కి రూ. 1-4-0

అక్కరలేనిచో వారములోజులలో త్రిప్పిపంపిన అంగీకరింపబడును.

మా చక్కని బొమ్మల కేటలాగు ఉచితము.

## టి. సి. నాగలింగప్ప అండు కో,

నెం. 280. వాల్ టాక్సు రోడ్డు, పి.టి., మదరాసు.

మాఏజంట్లు:—పటేలుస్టోర్సు, మునిసిపల్ హైస్కూలురోడ్డు, బెజవాడ.

మహమ్మద్ బసిరుద్దీనుసాహెబ్, మెటల్ జ్యూయలరిషాప్, మెయిన్ రోడ్, నిడదవోలు (ప.గో.జిల్లా.)

జయభారతి వస్త్రాలయము, మెయిన్ రోడ్డు, ఏలూరు.



# ప్రాక్టికల్ సరసం

## గిల్లి ఖజ్జా

శ్రీమతి డి. శారదామణీదేవిగారు

“పోలీసువాళ్లతో వ్యాపారంఅంటే యేమనుకుంటున్నావో, అగ్గితో ఆటలాడుకోడంకాదూ ?— పొటాసు, గంధకం, గన్ పౌడరు యిల్లాంటివన్నీ యింట్లోవుంచుకొని యింట్లోనే తూటాలు కాలుస్తూ కూచుంటే యేమౌతుందో మామీద తిరగబాట్లుచేసినా, మాతో యుద్ధాలుచేసినా అల్లాగే నామరూపాలు లేకుండా హతమైపోతావు. అందులోనూ మరి యే పోలీసు ఆఫీసరువద్దనైనా నీ ఆటలు సాగుతాయేమో కాని యీ లక్ష్మోజీరావుదగ్గర సాగవు. నేను నాయిడు బిడ్డని. తరతరాలనుంచి మావంశంలో మిలిటరీ రక్తం ప్రవహిస్తూవచ్చింది. నా దగ్గిరవూరికే తెగసాగేవంటే యీ భూమ్మీదుండగానే యమయాతన పడిపోతావు. నా తమాషా యేమనుకున్నావో కాని యీ వైపు ఛత్రపురం లగాయతు ఆవైపు చిత్తూరుదాకా నా పేరంటే సింహస్వప్నం. నిన్ను హతమార్చియ్యాలని తోస్తే నిల్చున్న పాట్ని పేల్చేసి పరలోకానికి పంపించేస్తాను. నేనల్లాచేస్తే యీ లోకంలో వైస్రాయైనా నిన్ను కాపాడలేడు. యిప్పుడు పట్టుబడిపోయావు కాబట్టి అల్లాచెయ్యను. నీతోటివాళ్లంతా ఎల్లా దొరికిపోతారో, ఎక్కడున్నారో యిప్పుడైనా బుద్ధిగా చెప్పేసెయ్యి. వినాశకాలం వచ్చి నువ్వు నాతో పొగరుగా మాట్లాడుతున్నావు. యిప్పుడిల్లాగాడిద నెందుకెక్కించానో బాగా ఆలోచించుకో. మీవాళ్లకి నువ్వెంత దొరవైనా నాదగ్గిర నా జోగుకింద అప్పుడప్పుడు నలిగి చచ్చిపోయే పురుగుకన్నా క్షుద్రుడవన్నమాట నీకు తెలియకుండాపుంది.”

అప్పుడే పట్టుబడి బోనులో కెక్కించునప్పుడు భయోత్పాతకరముగ హుమ్మని కళ్లనుండి నిప్పులు కురిపించు పెద్దపులివలె పెడరెక్కలు కట్టియున్న గంటందొర బుస్సుమని క్రోధతామ్రాక్షుండై తానెక్కింపబడ్డ గాడిదమీదనే ఒక యెగురెగిరినాఁడు కాని అతని కిరుప్రక్కలనున్న పోలీసుజవానులు అతని చెరియొక బాహువుపట్టికొని గాడిదమీదనుండి పడిపోకుండా తిన్నగానుండునట్లు అదిమియుంచివేసిరి. గంటందొర తనలో పొంగివచ్చుచున్న క్రోధము, ద్వేషము, అసహ్యత తెలియజేయునట్లు తుబుక్కున ఉమిసి యిట్లుపలికెను.

“దప్పల లచుమయ్య! యెదవ ప్రతాపాలా నువ్వూ! నీ యేపాలికి నే బెదరిపోయ్యేవోణ్ణనుకుంటున్నావు! యిన్నాళ్లు యినుపెట్టగ్గధర్మతండ్రుల్లా మమ్మల్ని రచ్చించుకొచ్చారు. నువ్వెప్పుడొచ్చినావో ఆ యేళనుంచి కొంపల కగ్గెట్టేస్తున్నావు. ఆ ధర్మతండ్రి పెద్దకలకటేరు లేపూ ఆ ప్రెబువు కిందటిదర్బార్లో నన్నూ మా జాతోళ్లనీ గనంగా మెచ్చుకున్నాడు. అప్పుడు నువ్వేకోస్తాలో వున్నావు? నీ మూలాన్ని యిన్నాళ్లకీ కొండల్లో పితూరీలు మళ్లీపుట్టినై. మా కినాశకాలం వచ్చిందంటున్నావు. మాక్కాదు ఆ యినాశకాలం నీకొచ్చింది. ముందు మావోణ్ణి నువ్వు పేల్చేసినావు. ఉత్తినేజాతోళ్లని సంపేత్తూంటే యెవళ్లూరుకుంటారంటా! అప్పుడు నిన్ను మీవోళ్లని నేను మెత్తగ శితగ్గొట్టించేసినాను. దానిమీద మా గూడేనికంతా అగ్గెట్టించేసినావు. మనసుల్చచ్చి, యిల్లుకాలి, వోకిళ్లు

కాలి మేం పితూరీలు సెయ్యఁవేంటి? మా వొక్క గూడెం తోటయింపీ మా జాతోళ్లు ఒందలు యేలు మాతో శేరతీర్తారు. ఈ యెవ్వారంలో మీ కంపిణీవోళ్లు నాయంగా ధర్మంగాపోతే మే వెఁప్పటిలాగా అణిగుండి మీ పాదాలకి దణ్ణాలెడతా వేఁమో గాని యిల్లా యుద్ధాలుసేస్తే మేఁవూ చేస్తాం. అసలీ కొండలన్నీ మాయి. ఈ బూఁవిపుట్టినప్పటినుంచి యేరాజూ యేనావాబు యీాట్ని హరించెయ్యలేదు. మీ తెల్లోళ్లకేటిమీాద ప్రబుత్వాలు కావాలంటే మా యిష్టంలేందీ యెప్పుడూ సెల్లదు. రెండురోజులైంది. నువ్వాడుతూన్న బాగోతవంతా జిల్లాకలకటరుకి — ఆయన మాకు గవుర్నరు కాదూ — యిన్నపంచేశాను. ఆ డెల్లాగా మంచోడే. ఈయాళో రేపో నీకు ఆడ్డరొచ్చేస్తుంది. ఒచ్చేదాకా మమ్మల్ని నువ్వు గాడిదలెక్కించి కుక్కలెక్కించి నీ సేతనైన ఆట లాడతావు. ఆడు! యెంతకాలం ఆడ్తావో!”

“ఆరినిన్ను తగలెయ్య. నీ కెంతపోతరంవచ్చింది. ఈ కొండల్లో గవర్నరన్నా వైస్రాయిఅన్నా యెవ రనుకొంటున్నావు? నేనుగానూ? కిందటేడు వైస్రాయి విశాఖపట్నం వచ్చినప్పుడు నన్నుగొప్పగా గౌరవించి ఒకఘంటసేపు మాట్లాడేడు. యింకనేను మెడ్రాసువెళ్లేనంటే గవర్నరుతో మాట్లాడకుండా రానేరాను.”

అని తనప్రక్కనున్న సబ్‌యిన్‌స్పెక్టరుతో

“ఈ కొండవెధవల కేంతెలుస్తుంది చెప్పు? నాకూ సర్. రెడ్డినాయిడుగారికి వున్నస్నేహం? వీడో జంగ్లీభూతం! అయినా ‘జాతివాళ్లందరూ తిరగబాటుచేస్తాం యేంచేస్తా’రంటాడు? వీడికి యింగ్లీషువాళ్లు, వాళ్లరాజరికం, వాళ్లప్రెస్టిజి యేం బోధపడుతుంది? రెడ్డినాయిడుగారిప్పుడు గవర్నరే కాబట్టి యింకా వీళ్లేమన్నా గడబిడలుచేశారంటే— ఈ మన్యాల్లో చెప్పనేఅక్కరలేదు — ఈ జిల్లా అంతటా మార్షల్‌లా పెట్టించేస్తాను. వెధవలు నామరూపాల్లేకుండా నశించిపోతారు.”

“యేదోగొప్పగా డప్పులోయించేస్తున్నావు కాని అయినీవోళ్లకిమాత్రం తెలవాయేంటి? అయినా నీ కిందివోళ్లు యినసపెట్టర్లంటేనే నీకు రవ్వంత కనికారము లేదు. ఈ కొండళ్లోళ్ల మీా దేటుంటుందంటాను! ఈ కొండల్లోపుట్టే సర్పాలైనా మేం సెప్పినట్లింటాయి. కాని నువ్వు పాసాణంలాంటోడవు! నిన్న ఆ బాపన యినసపెట్టర్నంట — మావోళ్లు నలుగురికి తలోరూపాయిచ్చి ఆయ్యని కొండల్లోకి మోయించేసి అదో బాగోతం ఆడినావంటగాదూ? యిల్లాంటు నుర్లన్నీ తగిలి ఎప్పుడో నావంటోడి సేతుల్లో గోరంగా సచ్చిపోతావు.”

“వీ డొకజంతువు. వీ ణ్ణిల్లావుంచెయ్యండి” అని యొక సబ్‌యిన్‌స్పెక్టరన్నాడు.

“అవునండీ వీడొట్టి కుక్కగాడిద కొడుకు. వీడు మొరగడం మొదలుపెడితే సామాన్యంగా వదల డండీ” అని యింకొక సబ్‌యిన్‌స్పెక్ట రన్నాడు.

“అవుతే బేపన యిన్‌స్పెక్టరింటున్నాడేమండీ? యేమైందేమిటి?” అని మఱియొక యిన్‌స్పెక్టరు లక్ష్మోజీరావునాయుఁడు గారిని ప్రశ్నించెను.

“అదొక ప్రాక్టికల్ జోక్!—అంటే వినోదం నిమిత్తంచేసిన పరిహాసమండీ. అతనికున్న భోజనపరా క్రమం యెవరికుంది చెప్పండి? వాడు మనవాళ్లందరి లోనూ వట్టి కవర్డు (పిఱికిపంద). అది రూఢిగా తెలుసుకుందామని వాడు నిద్రపోతూండగా పితూరీ దార్లు పట్టుకున్నట్లు నిన్న నుదయం చిన్ననాటకం ఆడించాను కాని వినియోగంలేకపోయింది. వాడు నేను మోసంచేస్తున్నట్లు గ్రహించి తానేమో మహా ప్రతాప శాలినన్నట్లు—తన్నుమించిన అ సహాయ శూరుడింకోడు లేనట్లు అభినయిస్తాడు. వాడొట్టి

యిన్సబార్డినేట్ గూస్ (అవిధేయుడైనమూర్ఖుడు) కాదు చెప్పండి?

"మంచిపనేచేశారు. కాని శత్రువుల చేతుల్లోపడి పోయామని భావించే స్థితివస్తే ఎంత అసహాయశూరు డైనా బెదిరిపోకుండా వుండడనుకుంటాను. పాపం అటువంటి ఆర్డియల్‌లోకూడా చలపతిరావు చాలా ధైర్యంగానే వుండిపోయాట్ట. అవుతే మేమంతా పిరికి వాళ్లమేమో అని మీారందరిమీాద యీాపద్ధతు లవలం బిస్తే మేం మళ్లీ పరస్పరం ముఖాలు—చూసుకో గలఁవా చెప్పండి?" అని యింకొక సబ్‌యిన్‌స్పెక్ట రన్నాఁడు.

"కాదయ్యా! మీా అందరిమీాద అల్లా యెందు కౌతుంది? ఆ చెవలమ్మ కదేం తోచింకో కాని తన బెమ్మ లే దేహబలంలోను, బుద్ధిబలంలోను మొన గాళ్ళని నాతో వాదించడం మొదలెట్టాడు. ఒక మాటు బాగా బుద్ధిచెప్పాలని అల్లా పరాభవం చేశాను. 'బుద్ధిః కర్మానుసారిణీ' అన్నట్లు వాడి బుద్ధి అల్లావుండి నేనంటే యిన్‌సబార్డినేట్‌గా వుం టాడు."

## డప్పుల లక్ష్మోజీరావునాయుడు

అధికారమదమువలన వచ్చిన దురహంకారము దూర్గర్వమునుకలసి సర్కిల్ ఇన్‌స్పెక్టరు లక్ష్మోజీరావు నాయుఁడుగారి యవతారమేర్పడినదని చెప్పవచ్చును. ఆ మనస్కూల్ ఫైనలు పరీక్షనిమిత్తమై మూఁడవసారి దండయాత్రకు సిద్ధమగుచుండగా నీశ్వరకృపవలన నైరోపాఖండమున లోకోత్పాతకరమైన మహాయుద్ధ మారంభమగుటయు అందునిమిత్తమై యిండియను సైన్యములను గవర్నమెంటువారు పంప నూహించు టయు సంభవించెను. తనయాలివంక ప్రపితామహుఁ డొకఁడు సెకందరాబాదున సైన్యమందొక జమాదారు పనిని చేసియుండుటవలన లక్ష్మోజీరావు తన వంశము వారు తరతరములనుండియు సిద్ధహస్తులగు రణశూరులని తన భావమున బుట్టిన కల్పనలఁగొన్నిటి నవ్యాహార ముగఁజేసి, వాని మహత్వమునసెట్లో సైన్యమునఁ జేర్చుకొనఁబడెను. అతఁడా యుద్ధమున నెచ్చటకు బోయెనో, యేయే వీరవినోదముల పాలుగొనెనో, ఎంతపౌరుష ప్రకటన మొనర్చెనో యెవ్వరేమియు నెఱుఁగరు కాని యుద్ధము పరిసమాప్తమైనప్పుడు గొప్పగొప్ప సైన్యాధిపతులితనివంటి పరాక్రమశాలి నెన్నఁడును జూచియుండమని కొనియాడుచు వ్రాసి యిచ్చిన కొన్ని యోగ్యతాపత్రములఁ దెచ్చుకొని వాని మూలమున పోలీసుడిపార్టుమెంటునందు ఉన్నతోద్యో గములఁజేయు మహాదశకు బాత్రమయ్యెను.

ఇప్పుడు బి.యే.లు ఫ్యాసయి, ఎం.ఏ.లు ప్యాసయి 'ఎం.ఏ. పిహెచ్‌డి' లనిపించుకొని ఉద్యోగము లు దొరుకక నౌఖరీలు పుట్టక దరిద్రదేవతతో పోట్లాడుచు 'అన్నమోరామచంద్రా'యని యల్లలనాడు నిరుద్యోగి మహాశయులకు ఈ నాయిఁడుగారి చరిత్ర కన్నెఱ్ఱగి నుండకపోదు. 'ప్రపంచములో యుద్ధములైన పుట్ట కుండనున్నవి. పుట్టినను అవి బ్రిటిష్‌సామ్రాజ్యాని కందుబాటులో లేకుండనున్నవి. ఏదో మఱల గొప్ప యుద్ధములగువఱకు మన ఆర్థికదుస్థితి యీాలాగుననే యుండు'నని తలపోయువారిప్పు డీ దేశమున లక్షలును కోట్లును బయలుదేరుచున్నారు. అట్టి తలపోతలకీ నాయిఁడుగారివంటి ఆదర్శజీవితము లే హేతుభూతము లగుచున్నవని చెప్పవచ్చును.

నాయిఁడుగారి జీవిత ముచ్ఛ్రితికి వచ్చుటకు ఆయన దైహిక శౌర్యముకంటె ఆయన వాక్‌శౌర్యమే ఎక్కువగ సహాయకారియయ్యెనని చెప్పవచ్చును. పోలీసుశాఖయందు తానొక్కఁడనే పిఱికికండలేని పౌరుషశాలినని యాతఁడు నిర్భయముగఁ జెప్పుకొను చుండును. తదితరులందఱును భోజనప్రియులు. తా నొక్కఁడే వీరవినోదముల నానందించు ప్రతాపశాలి. ఇది గవర్నమెంటునకుకూడ పూర్తిగ తెలియును.—

అయినను తాను బి.యే. వఱకు జదివియుండలేదు కావున తానింకను చిన్నయుద్యోగమున నుండి పోవుట తటస్థించినది కాని లేనియెడల తానీవఱకే ఏ యిన్స్పెక్టరు జనరలో, లేక పోలీసుకమీషనరో, అధమ మొక సూపరింటెండెంటో కాకుండియుండునా? అని యాతఁడెల్లప్పుడును తన క్రింది యుద్యోగస్థుల యొద్ద ప్రతాపములు కొట్టుచుండును.

మదరాసునగరముననుండి గవర్నమెంటు శాఖల బరిపాలించు మంత్రులు, డైరెక్టర్లు, గవర్నమెంటు మెంబర్లు, జస్టిస్‌పార్టీనాయకులు — వీరందఱికి తానాంతరంగిక మిత్రుఁడనని యతఁడు చెప్పుకొనుచుండును. అందులకు కొంత యాధారము లేకపోలేదు. జస్టిస్‌పార్టీయం దొకమహానాయకుఁడును, ఒకప్పుడు మంత్రిశిఖామణియునగు నొక నాయుఁడుగారి కుమారుఁ డొకఁ డాయన భార్యకు వదినగారి చెల్లెలికాడబిడ్డ భర్త యగుటవలన నాతఁడు తఱచుగ వారి యింటికి సంబంధములు గల్పించుకొనుచుపోవుట తటస్థించిన మాట మాత్రము వాస్తవము.

అతివాదులన్నను మఱి యెట్టిజాతీయ వాదులన్నను అతనికి వర్ణనాతీతమగు నసహ్యము. ఒకప్పుడాతడుండు తావున కాంగ్రెసుసభయొకటి జరుగుచుండగ వక్తల యుపన్యాసము లెవ్వరికిని వినిపింపకుండ కొందఱు బండవాండ్రచేత విడువకుండ డప్పులగొట్టించి కాంగ్రెసువారి కార్యకలాపములకు తాత్కాలికముగ కొంత విఘాతము సేయుటవలన నాతఁడప్పటినుండియు డప్పుల లక్ష్మీజీరావునాయుఁడని ప్రఖ్యాతివహించెను.

ఆసంగతి నటుండనిచ్చి నాయుఁడుగారివలన నీకొండ వాండ్రలో పితూరీ యెట్లువచ్చినదో తెలుపవలసియున్నది. నాయుఁడుగారు గొప్పజాతి కుక్క నొక దానిని మద్రాసునుంచి తెప్పించి అది తాను పక్షులను వేటాడునప్పుడు నేలపైఁబడుచున్న పక్షులను నోటితో కఱచికొనివచ్చి తన చెంతఁ బోవులు పెట్టించు నేర్పరి తనమలపడునట్లు తరిఫీదు చేయుచుండగా, ఆకాశమున నొక పక్షికని యుద్దేశింపబడిన తుపాకిగుం డొక దానిని ఏదో వృక్షమున కాయలుగోయుచున్న యొక కోయవాఁడు తన పొట్టనుబెట్టుకొని ఏపాపమెఱుఁగకున్నను సంహరింపఁబడి పోవుచున్న పక్షివధను ప్రయత్నముగ నివారించుట సంభవించెను. అప్పుడక్కడనున్న కోయగూడెమునకు నాయకుఁడగు గంటందొరయనువాఁడు కోపోద్దీపితుఁడై కొందఱు కోయవాండ్రను దీసికొనివచ్చి తమ మనుష్యునావిధముగ హత్యయొనర్చినందులకు తమకు సరియైన సమాధానమును, నష్టపరిహారమును ఈయవలసినదని నాయుఁడుగారి నల్లరిపెట్టెను. అందులకాతఁడు ముష్కరత్వమున నదల్చివేయుటయే కాక బిరుసుతనముగఁ బ్రత్యుత్తరమీయుటచేత కోయవాండ్రతనితోనున్న యిద్దరు పోలీసుభటులను చావఁగొట్టి నాయుఁడుగారి పైఁబడి యాతనిని తమగూడెములోనికి దోడ్కొనిపోయి తమకు నష్టపరిహారమగువఱకును వానినొక ఖైదీగానుంచి వేయుదుమని వెల్లడించిరి. అంతలో నాయుఁడుగారి పటాలమునకీవార్త తెలియుటవలన వారా కోయగూడెముపైఁబడి శిశువులు, స్త్రీలు, వృద్ధులని లేశమైనవివక్షలలేకుండ నందఱను కఱ్ఱలతో గొట్టి వారి గుడిసెలకగ్గిపెట్టి గూడెమంతయు పరశురామ ప్రీతియగునట్లొనరించిరి. అప్పుడుదయించిన మహాసంక్షోభమున నాయుఁడుగారు తన పరివారమును గలసికొని నిరాయుధులగు కోయవాండ్రకు హడలుపుట్టించి వారన్ని దెసలకును పాఱిపోవునట్లు చేసివైచెను.

ఈ విధముగ 'పితూరీ' పుట్టి అందుమూలముగ తనకు యేజన్సీచరిత్రమున శాశ్వతమైనకీర్తి గలుగుటకు అవకాశమేర్పడినందులకు నాయుఁడుగారి కొక సామ్రాజ్యము లభించినట్లు అపరిమితమైన యానందముదయించెను. కోయవాండ్లు పోలీసువాళ్లపై తిరుగఁబడి చెలరేగిపోవుచున్నట్లు వెంటనే పెద్దపెద్ద పటాలములను పంపవలసిన యవసరమేర్పడినట్లు ఆయన



విదేశములందుగల సెంట్ జాన్ అంబులెన్సు దళాధికారియగు సర్. ఎర్నెస్ట్ బర్డన్ గారు, బొంబాయియందు మహమ్మదీయ స్త్రీదళవిభాగమును పరీక్షించుట.



తిరువేంద్రము సముద్రతీరమందలి పిల్లలు.

యధికారులందఱకు తెలియఁజేసెను. ఇప్పటికొక వారమై పైవాండ్రవద్దనుంచి తనకు అర్థబలము అంగబలము ఎడతెగకుండ వచ్చుచుండుటచే నాయిఁడుగారు మఱింతయుత్సాహముగ కోయవాండ్రను వేటాడి పట్టుకొనుట కారంభించెను.

ఆనాటియుదయమున నాయిఁడుగారు తనపటాలమును తీసికొని కొండలలో దాఁగియున్న కోయవాండ్ర బట్టికొను తహతహతో కొన్నికొండల నెక్కుచుండఁగ దూరమున నొక్కకొండయడుగున విద్రోహుల యాకారములు కానవచ్చుటచేత వారు తమ బలగమునంతను దీసికొని ఆకొండను ముట్టడించిరి. మొదట నందెవ్వరును కానరాలేదు కాని బాగుగా పరీక్షింపగా తీగలల్లుకొనుటవలన నేమియు లేనట్లున్న గుహయొక్క ముఖద్వారమొక్కటి బయలుపడుటవలన దానియందెవ్వరైన నక్కియుందురని అచ్చటితీగలను పెల్లగించుచుండఁగ నిరువురు కోయవాండ్రందుండి యీవల కాకస్మికముగవచ్చి కొండపైనున్న తుప్పలనుబట్టి కొండనెక్కి క్రోతులవలె లంఘించుచు చూచుచుండఁగ నదృశ్యులైపోయిరి. ఆగుహయందింకను కోయలుందురని నాయిఁడుగారూహించిరి కాని గుహాంతరాళమంధకారబంధురముగ నుండుటచేతను లోనప్రవేశించుట కెవ్వరికిని సాహసమంతగ లేకపోవుటచేతను నాయిఁడుగారాగుహాముఖమును ఎండు కట్టెలతోను చెత్తతోను నింపి గుహయందెవరైననున్న బ్రదికియుండుట యసంభవముగ గుహయంతయు పొగతో నిండిపోవునట్లూదరబెట్టిరి. పొగబెట్టుటవలన కన్నమునుండ లేక యీవలఁబడు నెలుకవలె నప్పుడు గంటందొర చీదరించుచు నీవలఁబడగ పోలీసువాండ్రాతనినిబట్టుకొనిరి. విద్రోహులనాయకు డింతయవలీలగఁ బట్టుబడిపోయినతరువాత నాయిఁడుగారతనిని పలువిధముల బాధలుపెట్టి యింకను సర్కారుపై కుట్రలబన్నుచున్న కోయవాండ్రబట్టి యొప్పగింపవలసినదని నిర్బంధించెను. గంటందొర యందులకు సమ్మతింపక పోవుటయేకాక తన్ను మిక్కుటముగ దూషించుటచేత నాయిఁడుగారక్కడ గానవచ్చిన యొక గార్ధభముపై నెక్కించి వాని నొకవిధముగ నవమానించి శిక్షయొనర్చితిమని సంతసించిరి.

తదనంతరము వారిరువురకును జరిగిన సంభాషణ మీకథారంభమునఁ దెలుపుకొనియే యుంటిమి.

## 'వాడిగ్రహచారమే బాగుంది'

పెడకేలు గట్టి గర్ధభారూఢ మొనర్పఁబడియున్న ఖైదీనితీసికొని వారొకయేటియొడ్డునకు వచ్చిరి.

"సగంమంది ముందుదోనెక్కి అవతల గట్టుకు పోండి. తరువాత మా మూఁడు గుఱ్ఱాలు, ఇన్‌స్పెక్టర్లు, ఖైదీ, నేను దాటివస్తాము. ఆపైన మిగిలిన వాళ్ళొస్తారు. ఈగాడిదనిక్కడ వదిలేద్దాం." అని నాయిఁడుగారు సెలవిచ్చిరి.

"ఒరేగంటం, నీకీదశ వొదిలిపోయింది. గ్రహచారంబాగున్నవాణ్ణి దేవుఁడుకూడా చెరపలేఁడు." అన్నాఁడొక సబ్‌యిన్‌స్పెక్టరు.

"మీగ్రహచారాలన్నీ అప్పుడే బాగుపడ్డాయయ్యా అప్పుడే సంతోషించిపోతున్నావు!" అన్నాఁడు గంటం దొర కొంచెంభీకరంగా.

"అట్టే కరవబోకు" అన్నాఁడు ఇన్‌స్పెక్టరు.

"నువ్వేదో కూస్తేనే నేను మొరిగేనయ్యా యిన్‌స్పెట్టరు."

పరివారమున నొకయర్ధభాగమావలకు చేరుకొన్న వెనుక ఖైదీ, యిన్‌స్పెక్టర్లు మూఁడుగుఱ్ఱాలు దోనె మీదికెక్కింపబడినవి.

"గుఱ్ఱాల్ని వేఱేదాటిస్తే మంచిదేమో!" అన్నాఁడొక యిన్‌స్పెక్టరు.

"మనంవచ్చేటప్పుడీ గుఱ్ఱాలు మరి నలుగురం యెక్కివచ్చాం కామయ్యా, మరేం భయంలేదు." అన్నాఁడు మఱొకయిన్‌స్పెక్టరు. దోనె యేటినడుమకు వచ్చుచుండగ దానిమీద నొకపెద్ద కోలాహలముద యించెను. అదియెట్లుపుట్టెనో తరువాత యిన్‌స్పెక్టర్లు కూడ సరిగ చెప్పుకొనలేకపోయిరి.

గంటందొరకు చేతులు కట్టివేయఁబడియుండెను కాని కాళ్లకెట్టి నిర్బంధమును లేకుండ కొంపోవఁబడు చుండెను. ఆకస్మికముగ నేదో యావహించిన వాని వలె గంటందొర చెంగున నుఱికి రెండుగుఱ్ఱముల నడుమకుఁబోయి వాని డొక్కలదరిపోవునట్లు తలతో క్రుమ్మ నారంభించెను. గంటందొర దోనె మీదనుండి నీటిలోని కేదో విచిత్రప్రక్రియవలన దుముకబోవు చున్నాఁడని భావించి నాయిఁడుగారు తమ చేతులలో నున్న చబుకుతో వాఁడున్నవైపునకు సాగదీసి యొక్కటికొట్టిరి. ఆదెబ్బ గంటందొరకు తగులక నడుమనున్న గుఱ్ఱములకు తగులుటచేత నవి గంటం దొరకుమ్ములకు నాయిఁడుగారి చబుకుదెబ్బలకు మిగుల కంగారుపడి సకిలించుచు మూఁడవగుఱ్ఱముపైబడి పోయెను. పర్వతసానమున మూఁడుగుఱ్ఱములును బెదరి ఒక్కవైపునకు విఱచుకొని పడుటచేత అవినిల్చియున్న తావున దోనెకు భారమధికమయి చూచుచుండగ నది తిరుగఁబడుటయేగాక తనపైనెక్కియున్న జనులను, జంతువులను ఒక్కయూపున నీటఁద్రోసి వేయుచు దానును నీటమునిగి యదృశ్యమయ్యెను.

"అయ్యో అయ్యో! చచ్చాం చచ్చాం." అని హాహాకారములు చేయుచు యిన్‌స్పెక్టర్లాక్రోశించు చుండగా గంటందొర 'ఈ గండం తప్పిందంటే నాయిఁడు గెహచారం బాగుందన్నమాటే!" అని నీటి లోనికి వాఁడంతట వాఁడే దుమికియుండెనని తరువాత యిన్‌స్పెక్టర్లనుకొనిరి.

తేమదళమున కంతకును మొనగాండ్రగు యిన్‌స్పె [illegible]డీయు నీవిధముగ నీటిలో మాయమగు చుండుట కన్నులుపెట్టుకొని చూచుచు చెరియొకగట్టున నిలుచుండియున్న పోలీసువాండ్రు తమ టోపీలను గట్టుపైనుంచి యీఁతనేర్చినవారందఱు నార్తరక్షణ పరాయణులై జలగండమునట్లు చిక్కువడియున్న జనులను జంతువులను ఉద్ధరింప నారంభించిరి.

"ఏడీ గంటందొర? — అయ్యో నాయిఁడుగారు పాపం! —మనం మనగుఱ్ఱాలు అంతా వున్నాంకాని ఆయన? —" అని నీటినుండి యుద్ధరింపఁబడిన ముగ్గురు సబ్‌యిన్‌స్పెక్టర్లును తమలోదాము బలికికొనుచుండగ పోలీసువాండ్రన్నిదిక్కులనున్న జలోపరిభాగముపై చూడ్కులఁ బ్రసరింపఁజేయుచు పరిశోధన మారంభించిరి.

"నాయిఁడుగారి కీతరాదోయ్! అది మునిగి పోయించోటు. అంటే అక్కడే దొరుకుతారు." — అని వ్రేలితో చూపించుచు నొక సబ్‌యిన్‌స్పెక్టరు జనమును హెచ్చరించిరి.

"అదుగో! — ఆ దూరాన్ని యేట్లో చూడండి! అదేదో దుంగలాకొట్టుకుపోతూన్నట్లుంది. బహుశః గంటందొర కాదుకద!"

"యేడికాదు! దుంగాలేదు దూలంలేదు" అని పోలీసువాండ్రీవిధముగ ననుకొనుచుండగ దూరముగ గొట్టుకొనిపోవుచున్న ఆ దుంగ నీటినుండి గంటఁదొర రూపమున గట్టుపై కెక్కి పలాయితమైపోవుట కాన వచ్చెను.

'ఢాం! ఢాం!' అని చెవులు పగిలిపోవునట్లావైపునకు పోలీసువాండ్రాతనిపై తుపాకుల గాల్చిరి కాని వాఁడక్కడనున్న చెట్లగుంపులలోబడి మఱల కానరాకుండ మాయమైపోయెను.

"పట్టుకో! పట్టుకో! అని యఱచుచు పోలీసు వాండ్రావైపునకు పరువులెత్తిరి.

"వీడిచర్య చాలా చిత్రంగావుందండీ. దూరాన్ని గట్టెక్కేవఱకు నీటి పైభాగంలో ఎక్కడాకనిపించ

లేదు. సబ్ మెరైన్ లాగ జలాంతర్గతంగా అంతదూరం సంకెళ్లతో యీదుకుపోవడంవుందే ఇది నేనెక్కడా చూళ్లేదు. నే నిక్కడ ప్రత్యక్షంగా కళ్లతో చూసి వున్నా యిల్లాజరిగిందని యెవరితోనైనా చెప్తే' అబ్బే పట్టి కల్పనాకథ.' అని కొట్టేస్తారు." అని ఒక యిన్‌స్పెక్టరు తోడివాండ్రతో చెప్పుకొన్నాఁడు.

## గంటందొర దుండగము.

చింతాక్రాంతచిత్తముతో సబ్‌యిన్‌స్పెక్టరు చలపతిరావు పంతులుగారు 'స్టౌ' పై తేనీరు తయారుచేసికొనుచుండిరి. తామున్నది మన్యమగుటచేతను పిల్లలు పసివాండ్రగుటచేతను వారు 'పితూరీ' అంకురించిన వెంటనే భార్యను పిల్లలను పుట్టినింటికి పంపివేయుటవలన తామే మూడుపొద్దులును చేయి గాల్చుకొనవలసిన దురవస్థకుఁ బాలుపడిరి.

అయినను వారిప్పు డందునుగూర్చి యేమియు చింతించుటలేదు కాని నిన్నటియుదయమున పైయధికారి లక్ష్మోజీరావు నాయిడుగారు తమపై జరిగించిన యత్యాచారమును గూర్చియే పరిపరివిధముల నాలోచించుచుండిరి.

"వీడమ్మ కడుపుమాడ! ఎంత తంత్రంపన్నేడు! గాడిదకొడుకు! తనుచేసినట్టే తనకూచేస్తే తనేమౌతాడు! మోడిగాడిదకొడుకు!" — అని కొంతసేపటికి తమ కసిదీరునట్లు కొంచెం బిగ్గరగా పలికికొనిరి.

"అలా సెయ్యండిబాబు! — సేత్తే సచ్చి వూరుకుంటాడు!" అని యెవ్వరో కిటికీకావల తమమాటకు ప్రత్యుత్తరమిచ్చిరి.

"ఏంరా గంటం! నువ్వు పట్టుబడ్డట్టు టెలిగ్రామ్ వచ్చింది. పారిపోయొచ్చేశా వేమిటి?" అన్నాఁడు చలపతిరా వక్కజపడుచు.

"సిత్తం, బాబు! — నాను మీకు సూచ్చ్మంగా సిక్కిపోలానా బాబూ! మీ నాయిడు గోర్ని యేట్లో బుటకేయించి సంపేశినాను. నాను గజీతగోణ్ణి కాబట్టి సేతులకి యెనకయేపుకట్టేసి గుంకెళ్లేసేసినా మీవోళ్లెవ్వరికి సిక్కకుండానే తిన్నంగా మావాళ్లతో యిక్కడకొచ్చేసి మీ టేశన్ కాడ ఓ సిన్న నాటకం ఆడేసి ఓ సలాంపెట్టేసి పోదామని యిలాగొచ్చేను. సలాం బాబయ్యా! ధర్మప్రెబువులు, కనికారం వుంచండి!" —అని చెప్పుచు పరుగెత్తడం మొదలుపెట్టెను.

ప్రక్కనున్న తలుపుఁదెఱచి వానిని వెన్నాడి పట్టుకొందమను నుద్దేశ్యముతో వా రది తెఱువబోయిరి కాని దానికావల గొళ్లెము పెట్టబడియుండెను. వారు పరుగెత్తి వీధితలుపు తెఱువబోయిరికాని అదియు నావల బంధింపఁబడియుండెను.

"ఓహోయ్! వీధేపోయేవాళ్లు! తలుపు తెఱువండి. ఇదుగో! ఇల్లాగ! పట్టుకోపట్టుకో" అని వా రాతలుపును గుంజి యెంత చప్పుడైన చేసిరికాని ఆ మిట్టమధ్యాన్నమప్పు డెవ్వరు నా యింటిచేరువకు వచ్చుచున్నట్లుగుపించలేదు. ఆయన వంటయింటిలోనికి పరుగెత్తి అక్కడితలుపుగూడ నదేవిధముగ గుంజి యల్లరిచేసిరి. ఇఁక లాభములేదని భావించి యింటనున్న పెద్దగునపమునుదెచ్చి దానితో వంటయింటితలుపుల బగులగొట్టి యీవలకువచ్చిరి. ఆయిల్లు గ్రామమునకు కొంచెమావల రాజమార్గమున కొకప్రక్కనుండెను. మండు వేసవియగుటవలన నాబాట నిర్మానుష్యమైయుండెను. ఆ యింటివెనుకనున్న దొడ్డికావల కొంతదూరమున నొక కొండలవరుసయుండెను. తనకట్లాకస్మికముగ కానవచ్చిన గంటందొర యెట్లు పరుగెత్తియుండునని యాలోచించుచుండగ తమయింట దొంగే పళ్ళెమొకటి క్రిందబడినట్లు చప్పుడయ్యెను.

అదేమైయుండునని యింటిలోనికి పరుగెత్తి చూడగ తాము వంటయింట చేసిన తలుపుకన్నము

నుండీ కుక్క యొకటి గృహమున ప్రవేశించి పెరుగు గిన్నెపైనున్న పళ్లెం మీవలకుద్రోసి కతుకుచుండుట కాశ్చర్యపడి దాని నావలకు గొట్టివేసి మిగుల తిక్తముగనుండిపోయిన తేనీటి నెట్లో గొంతుకలో పోసికొని వంటయింటి నేదో యొకవిధముగ మూసి స్టేషను వద్దకు పరుగిడిపోయిరి.

చూచుటతోడనే తమ స్టేషను విడచివచ్చిన యల్పకాలములోను అచ్చట నెంతటి దుండగమైన జరిగిపోయెనని తెలుసుకొనిరి. స్టేషను లోపలిభాగమునసున్న యొక స్తంభమువద్ద నెవ్వడో యొక వ్యక్తి దీనదశకు వచ్చి స్తంభమునకు గట్టబడియు స్వేచ్ఛాసంపాదనమునకై విదల్చుకొనుచుండెను. గడ్డమునుబట్టి యాతఁడు రహీమ్‌ఖానని యూహింపవలసి వచ్చెను కాని యాతని మొగమంతయు సున్నముతో తెల్లగ వెల్లవేయబడియుండుటచేత మిగుల నపహాస పాత్రమై, వికృతమై, భయంకరమైయుండెను. వాఁడు గట్టిగ కేకలువేయుటకైన వీలులేకుండునట్లు దుండగులు నోట గుడ్డలు క్రుక్కియుండిరి.

"ఏం? రహీమ్! యిల్లాగైపోయినావూ? కోయిలొచ్చారా ఏమి? మరేం దోచుకుపోలేదు కదా?" అని నోటనున్న గుడ్డల నీవలకుఁ దీయుచు సబ్ యిన్‌స్పెక్టరు వాని కట్లును విప్పదొడంగెను.

"సర్కార్! నా బొందిలో ప్రాణాలుండగా బలే హామానం జరిగేపోయింది. ఆ గంటం దొరని నిలువునా పట్టుకొని తేగకాల్చినట్లు కాల్చి కొరికీ వెయ్యాలన్నంత పగాపుట్టింది. లేకాపోతే యీ కల్లూ మాడుకుపోతున్నాయి. మొగమూ పొక్కలెక్కింది. పట్టి ఆడు దానిపనీ సేసినాడ్ మహరాజ్! నే నొక్కణ్ణీవుండే ఈమాదూ యెండా తాళలేకా థోడా అంఖీ (కళ్లు) మూసి బల్లమీద సోగయా. గంటం దొరవున్నాడే ఆడునాయిడు గారి సేతుల్లో సిక్కిపోయాడు గాదా యీపితూరీ సచ్చిపోయిందీ అని దిల్‌మే బలే హుషార్‌తో వుండి పోయాన్ సర్కార్! అహా సైతాన్ ఎల్లా పారిపోయ్ వచ్చాడో నాకూ బుర్రమీదా దుడ్డూ పుచ్చుకొనీ ఒక్కటీ యేసి యేక్‌దమ్ ఐదుమందీ వచ్చీ కాళ్లూ సేతుల్ పట్టుకొని ఈ స్తంభానికీ కట్టియేసి నార్ మహరాజ్. మకాన్‌కే ఊపర్ కట్టీవున్నా జండా లేగయా. పైనవున్నా బందూక్ సబ్ లేగయా. (తుపాకులన్నీ పట్టుకుపోయారు) తమరూ యెవరూ లేందీ కారణం ఇంతా హామానం నాకూ జరిగేపోయిఁదీ. నాయిడుగారూ యేట్లో మర్గయా అంటాడు గంటం. ఆయన సావలేకుండా తిరిగీ వస్తే నేనూ ఆయన సేతుల్లో మర్జాయగా. (చచ్చిపోతాను) మహరాజ్! అల్లాకీ ముఖంసూసీ సచ్చీ హోల్ మనవీచేశా! అంఖీ తెరిసివున్నప్పుడూ వస్తే నా బహాదురీ (శౌర్యం) సూపీ ఆళ్లందర్నీ పట్టీ సర్కార్‌కీ దాఖల్ సేసీవుండేవాణ్ణి."

"నీ బహాదురీ నా బహదురీ ఎవడిక్కావలి? నాయుడుగారింకా బతికుంటే నీ కన్నముందు నేనే మర్జాయ్‌గా. ఏదో కారు వచ్చినట్లుంది. వాకట్లో హారన్ వినిపిస్తోంది. ఎవరో! నువ్వుపోయి ముఖం కడుక్కురా."

## కేశవరెడ్డిగారి రాక

అంతలో డిప్యూటీ సూపరింటెండెంటు కేశవరెడ్డిగారు కారుదిగి లోనికివచ్చిరి.

"హల్లో! గురూజీ, చలపతిరావ్! యేమి టిల్లావున్నావు! ఈవాల కాలేమిటి? యివ్వాళ యెంపైర్ డే కదా మొఖాలు వేలవేసి యిల్లావున్నారేం? ఈ సాహేబు మొగాన్ని వెల్ల యెవరేశారు? గంటం దొరని పట్టుకున్నామనీ, యిక్కడికి తెస్తామనీ నాయుడుగారు టెలిగ్రామిచ్చారు కదా యిక్కడ లేరేం?" అని ప్రశ్నలపై ప్రశ్నల వేయఁజొచ్చిరి.

"అబ్బే! గంటం దొరని పట్టుకున్నావా డెల్లాగో పారిపోయాడండీ వా డొట్టి మారీచుడిలా వున్నాడు. ఏం తంత్రంచేశాడో యేమోగాని నాయిడుగార్ని యేట్లో ముంచేశాట్ట! ఈలోగా యిక్కడ మా పీకల మీదకికూడా వచ్చేటంత పనిచేశాడు. చెప్పుకోడానికి జిహ్వా ఆడకుండావుంది. బ్రతికుండికూడా జీవచ్ఛవంలా వుండవలసినంత పరాభవం జరిగిపోయింది. కోయలొచ్చి ఈ స్టేషన్ దోచుకు పారిపోయారు. ఇటువంటి పరాభవాలన్నీ పొంది బ్రతికుండడం కంటె పొడుచుకు చచ్చిపోతే బాగుండేటట్లు తోస్తుంది. మన మిద్దరం బాల్యస్నేహితులమన్న సంగతి తమరు మర్చిపోలేదనుకుంటాను. ఇల్లాంటి సందర్భంలో నాకు సుపీరియర్ ఆఫీసర్లు మీరే వచ్చారు కాబట్టి యీ నాయిడుగారి ప్రభుత్వంకింద మే మెంత యమయాతన పడిపోతున్నామో మీకు కొంచెం విదశం చేసుకోవాలనివుంది."

వా రట్లనుచుండగ కోయవాండ్రను వేటాడుటకై పోయిన పోలీసుపటాలమంతయు స్టేషన్‌లోనికి వచ్చి డిప్యూటీ సూపరింటెండెంటును చూచి అభివాద మొనర్చెను.

## నాయుఁడుగారి ప్రతాపములు

"ఈ పోలీసుశాఖలోవున్న సుపీరియ రాఫీసర్లందరికీ నా ఫిట్‌నెస్ (యోగ్యత) నా ఇంపెర్టర్బబిలిటీ (నిశ్చలమైన ధైర్యం) పూర్తిగా తెలుసు. ఈ గంటం దొరవంటి రాస్కెల్ బెంగాలులోవున్న ఏ రివల్యూషనరీలలోనూగూడా వుండడంటే నమ్మండి. ఇంత పితూరీలో నేను గనుక పోలీసుశాఖకున్న ప్రెస్టిజ్ నిలవబెట్టగలిగాను. కాని మఱొకడైతే యీపాటికి వాళ్ల చేతుల్లోపడి హతమైపోయేవాడు. ఇంతపనీ నే నొక్కణ్ణే చేశాను. నా క్రిందివాళ్లంతా వట్టి చెవలమ్మలు. ఎంతసేపూ భోజన పరాక్రమమే కనిపిస్తుంది కాని డ్యూటీలోవుండగా ఏ పిసరు కరేజ్ అన్న మాటలేదు. నా కన్న ముందొచ్చి తమరే చిత్తగించారు కదూ? ఒక్కరోజు స్టేషన్ వదలి వెళ్లేనో లేదో, యిందులోవున్న తుపాకులు జండాలు యావత్తూ పితూరీదార్లు కప్పగించేశారు. ఇంత పరాభవం జరిగింతర్వాత చలపతిరావు పంతులుగారు రాజీనామా దాఖలు చేసుకుంటే నేనూ ఆయనాకూడా బ్రతికిపోతాం. బి.యే.లు ప్యాసవగానే అయిపోయిందండీ! ఇల్లాటివాళ్లు ఈ డిపార్టుమెంటు పట్టుకు దేవుల్లాడక ఎక్కడైనా పెసరట్లేసుకు అమ్ముకున్నా, లేక అరవయ్యర్లలాగ కాఫీ హోటేళ్లు పెట్టుకున్నా కొంత లోకోపకారంగా బ్రతకవచ్చు" అని యేటిలో మునిగిపోయియు ప్రాణములతో బ్రతికివచ్చిన లక్ష్మీజీరావు నాయుఁడుగారు డిప్యూటీ సూపరింటెండెంటుగారివద్ద నొక్కఁడును కూర్చుండి పెద్ద యుపన్యాస మిచ్చుచుండెను.

కొంతసేపటికి చలపతి రావుగారు రహీమ్‌ఖాన్‌తో నచ్చుటకువచ్చి "మా యింటివెనకనున్న కొండలవరుసలో నల్లవాగు దగ్గిరున్న మఱ్ఱికింద గంటందొర ఎత్తుకుపోయిన జండా టెలిస్కోప్‌లో (దూరదర్శిని) బాగా కనిపించింది. చీకటి పడిపోవడంవల్ల టార్చిలైట్లు పట్టికెళ్లి పరిశోధించాలని తోచి యిల్లా వచ్చాము. పితూరీదార్లు కనబడితే ముందు మీతో చెప్పవలసినదని ఆర్డరిచ్చారు కనుక యిప్పుడేం చెయ్యవలసిందో సెలవియ్యండి" అని పలికెను.

నాయుఁడుగారు పకపక నవ్వుచు, "చూడండి! ఇందుచేతనే పంతుల్ని మించిన అసహాయశూరుఁడీ పోలీస్‌ఫోర్స్‌లో లేడంటున్నాము. అయితే పంతులుగారూ! ఈ రాత్రివేళ నిద్ర చెరుపుకొని మీ రా కొండలవెంట వెళ్లిబోకండి. వెడితే డేంజర్లో (అపాయం) పడిపోతారు. అసలీ పితూరీ లేవదీసింది నేనే కాబట్టి నేనే స్వయంగా చూసుకుంటాను. ఒకసారి చచ్చిపోతే యింకేమైనావుందా? బతికి బాగుంటే

బలుసాకైనా తినచ్చునంటారు. జేమ్మలు మీకు తెలియదా యేం?"

"అవును. మహాప్రభో! ఈ భూమ్మీద ఋణాను బంధం మనిషి పూర్తిగా వదలిపోయేవఱకు మనకి చచ్చేబుద్ధి యెల్లా పుడుతుంది చెప్పండి? అందు లోనూ మేము పప్పుజేమ్మలమని తమరు శెలవిస్తూనే వున్నారు. ఇంతకీ ఉద్యోగాలూడిపోతూన్న మాకు కరేజ్ రమ్మంటే యెల్లా వస్తుంది? అయినా ఉగ్యోగంలో వున్నంతకాలం పైయధికార్లు మీ రెన్ని చెప్పు దెబ్బలు కొట్టినా వోర్పుగా భరించడమే డ్యూటీ కాబట్టి తమ రుపదేశిస్తూన్న 'బ్రదికియుండిన సుఖములు బడయవచ్చు' అనే మాత్రం పునశ్చరణ చేసుకుంటూ మొండిబ్రతుకు బ్రతుకుతూవుండిపోతాను. అన్నంతో ఋణంవుండేవఱకు నిష్కారణంగా చచ్చిపోడాని కెవ్వడూ ఒప్పుకోడు" అని రుసరుసలాడుచు జవాబు చెప్పి ఆవలకు వెడలిపోయెను.

"చూడండి! తమాషాగా మాట్లాడితే ఈయన ప్రతినిత్యం యిదేవిధంగా మీదపడి కరుస్తూవుంటాడు. ఈ పౌరుషమంతా నావద్ద నిస్తరివద్ద చూపించే బదులు ఆగంటం దొరమీద రవంత చూపించకూడదు చెప్పండి? అబ్బే యీయన చేతగానితనమంతా ఇన్‌సబార్డినేషన్‌గా ముదిరిపోతోంది. మొదట యీయనకీ డిపార్టుమెంటులో ఉద్యోగమిచ్చినవాడి తెలివికి సంతోషించాలి. నా తమాషా చూద్దురుగాని యీ పోలీసుఫోర్సులో నేనైనావుండాలి లేకపోతే ఆయనైనావుండాలి. ఇందునిమిత్తం నేను గట్టిగా వ్రాసి అవసరం అయితే మెడ్రాస్ వెళ్లి గట్టిపట్టు పట్టాలని వుంది."

## ఆపదలో పడిపోయిరి,

రాత్రి 8 గంటలగుచుండగ నాయుఁడుగారు స్టేషన్ నుండి దోచుకోఁబడిన జెండాను తా మెక్కుడును పోయి పట్టుకొని తమ యసహాయశూరత్వమును లోకమునకు వెల్లడింపవలయునను సంకల్పముతో బయలుదేరిరి. ఆ యంధకారమున భయంకరముగ గానవచ్చు ఆ కొండలనడుమ దయ్యములగుంపులవలె నున్న చెట్లసందులనుండి పోవుచుండగ నాతఁడెన్నఁడు నెఱుఁగని భీరుత్వ మాతనిహృదయమున నాకస్మికముగ నెట్లంకురించినదో కాని యాతఁడీవిధముగ దలపోయఁ జొచ్చెను.

"ఈ మన్యంనిండా సెద్దపులులు చెలరేగిపోతూ వుంటాయని తెలిసికూడా తెలివితక్కువగ ఒక్కణ్ణే వచ్చేశాను. ఆ చెలపతిగాడిదతో నేను లేనిపోని వివాదం తెచ్చుకున్నాను. నేనుపోయి జెండాతెస్తా నంటే—'వల్లకాదు నేనేతెస్తా'నన్నాను. ఛా! అల్లా అనవలసిందికాదు. ఇప్పుడీరాత్రివేళ యేపులైనా మీదబడితే ఏంగతి? అని ముందుగానే పీకనొక్కేసి చంపి పొట్టనెట్టుకుంటాయంటారు. ఈవేళ పొద్దున లేవగానే కంటికి పిల్లికనిపించింది. ఈ రోజల్లా నాకు గండాలే జరిగిపోతున్నాయి. లేకపోతే యెప్పుడూ అనుకోని గంటందొరని పట్టుకొనికూడా నాకే జల గండం రావాలా?—పోనీ, అప్పుడెల్లాగో ప్రాణాలు కాపాడుకుంటే మళ్లీ యీరాత్రివేళ ఒక్కణ్ణీ బయలు దేరి జెండా పట్టుకోవాలన్న దురహంకారం మనసులో పట్టుకోవాలా?—ఒకవేళ ఆగంటందొరకే కనక నే నీవిధంగా తిరుగుతున్నానని తెలుస్తే యింకేమైనా వుందా? వాడికి నామీద యెంతపగైనావుంది.— అవును. నేనుమాత్రం వాడిమీద పగపట్టడంలేదా యేమిటి? — వాడిచేతుల్లోపడితే వెంటనే బుర్ర కోసేస్తానని వాణ్ణి గాడిదనెక్కించినప్పుడు భీకరంగా చెప్పేడు. మన ఆనర్ సంగతి జెండాసంగతి దేవుఁ డెరుగునుకాని వెంటనే తిరిగి వెళ్లిపోతే బాగుంటుంది. ఈ మన్యంలో పెద్దపితూరీపుట్టిందనీ, దాన్ని నేను అణిచేశాననీ శాశ్వతమైన కీర్తివుండాలని యీ కోయాళ్లతో గిల్లి ఖజ్జా తెచ్చుకున్నాను.—అయితే

అయిందికాని వెంటనేవెళ్లి ఇక్కడ కోయలు మితి మీరివున్నారని లేనిపోనివన్నీ రాసినట్లు కల్పించి యావన్మందినీ తీసుకొచ్చి యీ జెండాపట్టుకుంటే బాగుంటుంది. ఎంత చీకటి గావుంది.”

అప్పు డాకస్మికముగ నలుగురు కోయవాండ్రతని పైబడి పట్టుకొనిరి. నాయుడుగారి చేతులోనున్న పిస్తోలునుంచి వరుసగ మూడుగుండ్లు ‘ఢాం, ఢాం, ఢాం’ అని మ్రోగిపోయినవికాని ఒక్కటియు కోయలకు తగిలినట్లులేదు.

“గాడిదకొడుకు! లాగియ్! రాక్షసి గాడిద కొడుకు!”

“గిజగిజ మంటున్నాడు——పెట్టుబుర్రమీద దుడ్డు కర్రతో ఒక్కపెట్టు.”

“సచ్చిపోతాడ్రా!”

“పీకోక్క సెయ్యడానికే కాదుట్రా! పట్టుకు పోతున్నాం? తీసుకురాంగానే మనదొర యీడిపీకోక్క సెత్తానన్నాడు కాదుట్రా!”

నాయిఁడుగారుమిగుల సమయస్ఫూర్తికలవారగుట చేతనున్న పిస్తోలప్పగించుచు

“అరే గంటం! నామాటవిను”అని సాంత్వనముగఁ బలికిరి.

“మాదొరిక్కడలేడయ్యా! అయితే యేటంటా వేంటి?”

“అవుతే మీరిప్పుడెందరున్నారో చెప్పండి.”

“ఇక్కడ నలుగురు ఆమడుపులో యాభైమంది.”

“నన్నువాళ్ళదగ్గిరికి తీసుకుపోకండి. నేనుగవర్న మెంటుకిరాసి మీనలుగురికి వేయేసిరూపాయలు, యీ యేజన్సీలో గొప్పగొప్ప పదవులు, భూములు యిప్పిస్తాను.”

“నువ్విత్తావుకాని యీలోపల మా జాతోళ్లంతో మాప్రాణాలు వుచ్చేనుకుంటారయ్యా!—అయి నా మా కొంపల కగ్గెట్టేసినోడవు నువ్విచ్చేదేటంతా?”

“తల్లితోడు ఏ ప్రమాణం చెయ్యమంటే ఆ ప్రమాణం చేస్తాను. నానోటినుండి మాటొస్తే యెప్పుడూతిరిగిపోను. ఆకాశం విరిగిపడ్డా, సూర్యుడు నేలమీదకొచ్చినా, భూఁవి తిరగబడ్డా సరే!”

“నీలాటోళ్లు పుట్టబట్టే యీపాపఁవంతా మొయ్య లేక బూఁవితిరగబడి పోతోంది. కట్టెయ్యరా! కళ్లు కట్టెయ్! మనం యెక్కడుంటామో దారి సూడ్డఁ వెందుకు?”

## ఒక కపటనాటకము

“గంటందొర యీడి కొంప కగ్గెట్టెయ్యాలని రెండుదబ్బాల సీవనూనె తీసికెళ్లేడ్రా. నాయుడు సిక్కిపోతే యెంటనే పీకోక్క సెయ్యమన్నాడు.”

కన్నులుకట్టి, రెక్కలుకట్టియున్న నాయిఁడుగారు వణకిపోవుచు “కోయీలూ! చూడండి నన్ను నిష్కారణం చంపెయ్యకండి మీకు పుణ్యంవుంటుంది. నేనింతవఱకు పోలీసునౌఖరీలో సంపాదించుకొన్న 15 వేల రూపాయలు మీకప్పగించేస్తాను. అవి మీ చేతుల్లోపడేవరకూ నన్నొదిలిపెట్టకండా యిల్లాగే కట్టేసివుంచుకోండి; నన్ను మాత్రం బతకనియ్యండి; అల్లా చేస్తే నేను గవర్నమెంటుకిరాసి యీ పితూరీకంతా నేనేకారణమని ప్రకటన చేయిస్తాను. మీగూడెం కాల్చేసినందుకు, మీ మనిషిని చంపేసినందుకు ఆ నష్టం పూర్తిగా గవర్నమెంటు పెట్టుకునే యేర్పాట్లు చేయిస్తాను. మీకింతకంటె యేంకావాలి చెప్పండి? నాగ్రహచారం యిల్లాకాలిపోయింది కాని నా గొప్ప తనం మీకేఁవీ తెలియకుండావుంది. గవర్నరుతో కూడా నాకు గొప్ప స్నేహంవుంది. నన్నీవిధంగా చంపేశారంటే మీలో ఒక్కపురుగైనా లేకుండా సర్కారు మీతో గొప్పయుద్ధాలుచేస్తారు. బాగా ఆలోచించుకోండి.”

"యుద్ధంవెళ్ళాగా అయిపోతూనేవుంది. మీ యిన్‌స్పెక్టర్లు, నీపైయ్యో డెవడో ఒచ్చేడంట. ఆడూ మా శేతుల్లో సిక్కిపోయే తంత్రంయేదైనా వుంటే సెప్పు. అల్లాసేత్తానంటే అందాకానిన్ను సంపకుండా వుంటాం."

"వాళ్లు యెట్లా గొరుకుతారో నే నెట్లా చెప్పను?"

"ఆళ్లు మా సేతుల్లో పడిపోవాలని నువ్వు నమ్మకంగా తంత్రంపన్నితే కాకుండా ఉంటుందా సెప్పు? ఏదో కల్పనొకటి సెయ్యి. మేం యాదైమందివుండి ఆ శైక్కడికొత్తే అక్కడ పట్టుకోడానికి కాసుకుంటాం."

"అయితే ఆలోచిస్తానండు కాని కళ్ళిల్లా కట్టిస్తే బుద్ధి కేంపీతట్టదు. కళ్లైనా విప్పండి."

"అయితే ఆళ్లంతా మా శేతుల్లో పడ్డాని కొప్పుకుంటావా?"

"ఆహా! వాళ్లంతా మీకు పట్టుబడేటట్లు చేస్తాను. నన్ను మాత్రం చంపకండి."

"ఒరేయ్, ఆళ్ల వోళ్లకే యింత దోహం సెయ్యడాని కొప్పుకొనేవోడు యీ డెన్ని గోరాలకైనా జంకడ్డా బాబు!—తియ్యికత్తి! ఆపణంగా పీకోసెయ్."

నాయుడుగారు చీక్కరించుకొనుచు "అయ్యో! అయ్యో! నే నెట్లా చచ్చిపోవాలో అదైనా కళ్లతో కాస్త చూడనియ్యండి! బాబులు కారూ!" అని బ్రతిమాల దొడంగిరి.

"ఊం. అయితే సూడు!" అని ఒక కోయవాడాయన కళ్లకు గట్టిన బట్ట తొలగించెను.

ఆకస్మికముగ భగవద్దర్శనమైనయెడల సామాన్య మానవుల కెంత కంపము, నాశ్చర్యమును కలుగునో అప్పుడు తన కన్నుల యెదుట బడిన దృశ్యమును గాంచినప్పుడు నాయుడుగారికికూడ నట్టి వర్ణనాతీతములగు భావములొక్కపెట్టున పుట్టినవని చెప్పవచ్చును. ఎదుట డిప్యూటీ సూపరింటెండెంటు కేశవరెడ్డిగారును చలపతి రావుగారును కూర్చుండి కొందఱు కోయవాండ్రచేత నీ నాటకమంతయు నాడి తన్ను వట్టిగాడిదనుగా జేసివైచిరని యాతండా యుత్తరక్షణముననే తెలిసికొనెను. చలపతిరావు పిఱికిపంద యని నిరూపించుటకు నాయుడుగారిట్టి నాటకమే యాడి విఫలమనోరథులైయుండుటచేత వారు తోక ద్రొక్కిన త్రాచువలె బుసగొట్ట నారంభించిరి.

"హల్లో! నాయుడూ! నీ కరేజ్ యింతసేపు స్వయంగా చూసి సంతోషిస్తున్నాను. అయితే నన్నూ, అంద రిన్‌స్పెక్టర్లనీ పట్టి కోయాళ్ల కప్పగించేస్తానంటావు! కొన్నాళ్లు సెలవుపెట్టి మద్రాసెళ్లి నీ పెర్సనల్ ఫ్రెండ్ రెడ్డినాయుడుగారు గవర్నరీలో వుండగానే అక్కడో వెలుగు వెలిగి రాకూడదూ?" అని కేశవరెడ్డిగారనిరి.

"ఇప్పు డెందరు గవర్నర్లనీ చూడకుండా అవుతుంది? సింహం నోట్లో తలదూర్చి దాని జుట్టుపీకేసినట్లు మీ రీవిధంగా నేనో బఫూన్ అన్నట్లే కామెడీ ఆడించారు కాని యిది సంపూర్ణంగా ట్రేజడీ అయిపోయేటట్లు చేస్తాను. నా తమాషా! లక్ష్మోజీ రావుతో సరసం అంటే యేమనుకుంటున్నారో!"

"అవుతే కొంప తీశావన్నమాట. చావుకి సిద్ధమైనప్పుడింకోరాక దోస్తావు? అంతేకాదు? నీలాంటి అసహాయశూరుడింకో డీ పోలీస్‌ఫోర్సులో పుట్ట లేదంటావు. నువ్వెంత ప్రతాపశాలివైనా నీ ప్రతాపాలన్నీ వట్టి నిరపరాధుల మీ దెందుకు చూపాలో చెప్పు? అఖరికి క్షుద్రమైన పురుగుకూడా కాలితో తొక్కుతూంటే తిరగబడి పీకి వదలిపెడుతుంది కదా! మనిషైనవాఁ డూరుకుంటాడా చెప్పు?—ఈ చలపతి రావున్నాడే యీయనా నేను కలిసి చదువుకున్నాం.



చిరుతహృదయములో నింత చిచ్చుగలదె?



గుంటూరు శ్రీ మహాలక్ష్మీ పఠనమందిరము

నాల్గవ వార్షికోత్సవసందర్భమున తీయబడిన ఛాయాపటము. ఆధ్యక్షురాలగు శ్రీమతి మధ్వాచార్యుల నరసమ్మగారు, సభ్యురాండ్ర నాటకమందు పాల్గొన్న బాలికలుగలరు.



శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు
బొంబాయి. దూరదేశములందున్న
యాంధ్రాభిమాన పూరితురాలు.
వీరి వ్యాసములచే గృహలక్ష్మి
యలంకరించుకొనుచుండుట
పాఠకులకు విదితమే.

చదువుకునే రోజుల్లో యీయన శాన్స్క్రిట్‌లో నాకు పాఠాలు చెప్పుతూండేవారు. చదవయిం తర్వాత నా కెక్కువ ప్రాపకంవుండడంవల్ల నే నీ వుద్యోగం చేస్తున్నాను. ఈయన నాకన్న తక్కువ చదువు చదువుకోకపోయినా సబ్‌యిన్‌స్పెక్టరే అయ్యాడు. ఈయన్ని పట్టుకుని నిన్న నుదయం నువ్వాలాంటి నాటకం ఎందుకాడేవో చెప్పు?"

"వినోదంగా—ఒక 'ప్రాక్టికల్ జోక్' అని వూహించి అల్లా చేశాను. అంతమాత్రంచేత మీ రీ జిల్లాలో నా కప్రతిష్ఠవొచ్చేటట్టు నా కిందవాళ్ల దగ్గిర యిల్లా చెయ్యొచ్చా చెప్పండి?"

"పోలీసునౌకరీలోవున్నందువల్ల రోజుకి యిరవై నాలుగుగంటలు థియరిటికల్‌గా నేను డ్యూటీలో వుండాలి. అయినా నేనుకూడా అప్పుడప్పుడు ప్రయివేట్ సిటిజన్‌గా మారిపోవలసిన అవసరం వస్తూ వుంటుంది. ప్రయివేట్ సిటిజన్‌గావున్న సమయాల్లో నేను పోలీసాఫీసరునన్న సంగతి పూర్తిగా మరిచి పోవలసివుంది. కాబట్టి యిల్లాంటి సందర్భాల్లో నేను ప్రయివేట్ సిటిజన్‌గావుండి నువ్వుచేసిన ప్రాక్టికల్ జోకే చలపతిరావు నీమీద చెయ్యడాని కనుజ్ఞ యిచ్చాను."

"మీరు డ్యూటీలో లేకపోవచ్చుకాని నే నున్నానే!"

"గంటందొర కలెక్టరుకి యీావత్తుసంగతులూ పిటీషన్ పెట్టాట్ట. దానిమీద కోయవాణ్ణి చంపినందుకు వెంటనే నిన్ను డ్యూటీలోంచి సస్‌పెండ్ చేసి ఎరెస్టు చెయ్యవలసిందనీ, పితూరీదార్లమీద ఏవిధమైన చర్యాతీసుకోవద్దనీ టెలిగ్రాముమీద ఆర్డర్లొచ్చాయి. కాబట్టి యిప్పుడైనా కథ అడ్డంగా తిరిగిపోయిందని తెలుసుకో. కలెక్టరు, సూపరింటెండెంటు రేపిక్కడ కొచ్చి యిన్‌వెస్టిగేషన్ (విచారణ)చేస్తారు. వాళ్ల గూడెం కాల్చేసినందుకు గంటందొర నీకొంపలో కిరసనాయిలుపోసి అంటించెయ్యాలని చూస్తూండగా చలపతిరావు, రహీమ్‌ఖాను వెళ్లి అరెస్టుచేశారు. కాబట్టి యిప్పుడు నువ్వెక్కువ పరాక్రమశాలివో వీళ్లెక్కువ పరాక్రమశాలురో తెలిసిపోయింది. 'చెరపకురా చెడిపోతావు.' అన్నారు మనపెద్దలు."

"ఇదంతా కథగావుంది."

"ఆహా! యిదంతా నీ చమత్కారంవల్ల యేర్పడ్డ కథ. ఏపాపం యెరగని కోయల్ని గిల్లిఖజ్జా తెచ్చావు. ఇక్కడ ప్రజలంతా తిరుగుబాటుచేశారనీ, వెంటనే మార్షల్‌లా పెట్టాలనీ యెంత 'హంగామా' యైనా చేశావు.

ఘటంభింద్యాత్పటంఛిద్యాత్కుర్యాద్వాగార్దభస్వరం
యేనకేనా వ్యుపాయేన ప్రసిద్ధ పురుషోభవేత్.

అని చదువుకున్నరోజుల్లో ఒక సంస్కృతశ్లోకం నేర్చుకున్నాను. ఎల్లాగైనా పేరురావాలని ప్రయాసపడే అధికార్లంతా నీ చరిత్రం కొంతైనా తెలుసుకొని బుద్ధిగావుంటే బాగుంటుంది.—కాని చలపతిరావ్! నువ్వు బలేవాడవయ్యా! యీ కోయల్ని యెల్లా తరిఫీదుచేశావోకాని మంచి నేర్పరితనం చూపించారు. నాయుడుగారి అంతరంగపరివర్తనం కళ్లకికట్టినట్లు చూపించారు. నాయుడుగారికి లొంగిపోయుంటే కొన్నివేలు వీళ్లకి దొరికిపోననుకుంటాను. ఆయన కా యోగ్యతా లేదు. వీళ్లకా ప్రాప్తిలేదు. వీళ్లకందరికీ బహుమతులిప్పిద్దాం. అందులో యిది యెంపైర్‌డే కూడాను. యెల్లాంటివాడికైనా ప్రాణాలమీద తీపివుంటుందో కండ్లారాచూశాను."

# అమృత బిన్దు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

మనసు శుద్ధ మశుద్ధమ్ము ననఁగ బరఁగు,
గామసంకల్పచిత్తమ్ము కలుషమనియు
గామవర్జితచిత్తమ్ము కలుషరహిత,
మంచుఁ దెలియుము ఋషులవాక్యమ్ము
[సుమ్ము.

మనసె బంధమోక్షమ్ముల కునికిపట్టు,
విషయసంసక్తచిత్తమ్ము వెలయు బంధ
మగుచు విషయ రాహిత్యమాయాత్మ
[మగును,
మోక్షమునకు నెపుఁడుబుధామోదమెసఁగ.

నిర్విషయహృదయమున కపూర్వమోక్ష,
మెందులకుఁ జెప్పఁబడియెనో యందువలన
నెపుఁడు మోక్షార్థి విషయరాహిత్యముగను,
మనసు నరికట్టవలయు సమంచితముగ.

విషయరాహిత్యమైహృది వెలయుమనసు,
సతము నాత్మస్వరూపమ్ము సరవిఁబొంది
వరలుచున్నదో యదియెపో పరమపద మ,
టంచు పలికిరార్యులు పరమాత్మనియతి.

హృదయసంకల్పజాలమ్ము ప్రిదిలి నాశ,
నమునునొందు నందాకమనమ్ము నెపుఁడు
నధికతరముగ బంధింప నదియ ఎఱుక,
ధ్యానమదియసూ న్యాయ విస్తరములేల?
అదియుచింతింపఁదగనిది, అదియతలఁప,
దగినదియుఁగాదు చింతింపఁదగినయట్టి

దియునుఁగ దు చింతింపఁగా దిటము. ఇట్టి,
పక్షరాహిత్యజ్ఞానియే బ్రహ్మమగును.

స్వరముతో యోగమును జేర్పవలయు నాద,
రహితముగ బ్రహ్మమున్ ఎంచ రమ్యమగును
స్వరరహితభావనమ్మున బ్రహ్మమరయఁ,
గలను కలదంచు నెఱుకతోఁ గనుముసతము.

బ్రహ్మనిష్కళంకమును, నిరంజనమ్ము,
నిర్వికల్పమునై సదా నెగడియుండు
అదియె 'నేన' ని యెఱుక చేనరయువాఁడు,
బ్రహ్మమేయగు సత్యమ్ముపట్టిచూడ.
నిర్వికల్పమనంత మనిందితమ్ము,
నప్రమేయ మకారణ మాధ్య మాఢ్య
మాపరబ్రహ్మమంచును సరయునతఁడు,
బంధములనుండి తొలఁగును బంధురముగ.

లేవువృద్ధిక్షయమ్ములు, లేదుజన్మ,
లేదుసాధకుడు, ముముక్షులేడ? లేదు
ముక్తుడిదియెపో నిజమైన మూలతత్వ,
మంచుపలికిరి తొలుతనే ఆర్యజనము.

జాగ్రదాదియవస్థలన్ జనము మనన,
మరసి చేయఁదగ్గది పరమాత్మమొకఁడె
ఆ యవస్థాత్రయమ్మును నధిగమించు,
జనున కేనాటికిం బునర్జన్మలేదు.

భూతముల కెల్లనాత్మయై పొదలువాఁడు,
భూతభూతాలవెలసెపో పొందుగాను

# అమృతబిన్దు

చంద్రుడొక్కఁడు; జలములసరవి నొకటి,
గాను, బహువిధమ్ములగాను గాంచునట్లు.

ఘటమునందున్న మిన్నులు ఘటమ్ముఁదీయ,
రాదు ఘటముమాత్రమె కొనిపోదు మటులె
జీవుఁ డాకాశ తుల్యుఁడు స్థిరుఁడటంచు,
నిశ్చలజ్ఞానతత్వాన నెఱుఁగవలయు.

వివిధరూపాలు కలదిగా వెలయుఘటము,
తెఱఁగు దేహమ్ము. అటులయ్యుఁ దిరిగితిరిగి
తాను నశించు టెఱుఁగదు తథ్యమెఱుఁగు,
నాత్మ మొక్కటిమాత్ర మత్యంతనియతి.

శబ్ద మాయాప్రపంచ సంసక్త జీవు,
డంధకారమ్ము విడనాడి అమలకాంతిఁ
గనుటలేదు. తన్మాయాంధకార మెడుగ,
నేకమా స్థితినొకఁడుగా నెఱిఁగిచూచు.

బ్రహ్మ — శబ్దాక్షరమ్మై పరిఢవిల్లు,
అది సమాప్తిగా శేషించు నదియ అక్ష
రమ్ము ఆ యక్షరమ్మును నిమ్ముగాఁగ,
ఆత్మశాంత్యర్థి ధ్యానించు ననవరతము.

తెలిసికోతగ్గ విద్యలు కలవురెండు,
అదియు; — శబ్ద, పరబ్రహ్మ లీయవనియందు
శబ్దబ్రహ్మముఁ దెలిసిన శస్త్రగుణుఁడు,
ఆ పరబ్రహ్మమునుఁ బొందు నద్భుతముగ.

తవిలి మేధావి వేదశాస్త్రాలఁ జదివి,
జ్ఞానవిజ్ఞాన దక్షుఁడై గ్రాలు పిదపఁ
బొట్టుఁబోఁద్రోచి ధాన్యంబుఁ బొందువాని,
వలెను నవ్వాని వర్జింపవలయు సుమ్ము.

రంగు రంగుల వెలయు గోరాజి కాని,
వానిపాల రంగొక్కటై వరలునట్లు
జ్ఞాన మాపాలరీతిగాఁ గానుపించు,
లింగముల వెల్లనావుల లీలఁదోచు.

పాలలోనేయి గూఢమై పరగుభాతి,
భూతభూతాన జ్ఞానమ్ము పొదవియుండె
స్వాంతమన్థానమున సదాసరవిఁ దరచ,
నది బయల్పడు నుచ్ఛనీచాదులేల ?

జ్ఞాననేత్రుండు ; కట్టెతోఁగట్టెరాచి,
యగ్ని వెలయించు నట్టు లత్యంతనియతి
మనసుమథియించి అమలబ్రహ్మమ్ము నేనె,
యంచుఁ దెలిసికోవలయు ముఖ్యమ్ముగాఁగ.

అఖిలభూతాలకాధారుఁ డఖిలభూత
వాసుఁ డఖిలభూతత్రాత వాసుదేవుఁ
డతఁడె నేనంచు, వెండియు నతఁడె నేనె
యనుచు నుపనిషత్సూక్తి నరయవలయు.

"ఇత్యుపనిషత్"

# ప్రత్యక్ష ప్రమాణం

**శ్రీమతి రాజేశ్వరిగారు**

కృష్ణయ్య ఆవూరి బడిపంతులు. అతడే హెడ్డు మాస్టరు, అతడే అసిస్టెంటు, అతడే సర్వమున్నూ. ఆ గ్రామానికి వారంరోజులకోసారి పోస్టు రన్నరు కటాక్షం కలిగితే వచ్చే యే వుత్తరమైనా చదివి అర్థం చెప్పగల పండితు డతడొక్కడే. గ్రామభుక్తగారు సైతం గంటన్నరసంధ్య వార్చగలరే కాని సంతకం మాత్రం ఎడమచేతి బొటనవ్రేలిదే. కృష్ణయ్యకి నెలకి ఆరురూపాయిలు కరువుల్లాగ బడిపంతులుజీతం అందుతుంది. అదిమినహాగా అతనికున్న రాబడి నిండుసున్న. గ్రామస్థులందరూ కలిసి ఒక ఊపాంతపు మెట్టు అతనికి యిచ్చి మిద్దెటిల్లు నిర్మించి యిచ్చేరతనికి. ఇంటికొకతూముడుచొప్పున సంవత్సర గ్రాసం; అటుపైని కూరగాయలూ, మజ్జిగ, మొదలైనవి కృష్ణయ్యకు నిత్యవార్షికాలు — జీతంలోంచి కొంటే ఉప్పూ కిరసనాయిలూ కొంటాడు.

కృష్ణయ్యకు మరేవ్యాపకం లేనప్పుడే బడి తెరుస్తాడు. అధికమాసంలాగ స్కూళ్ల ఇన్‌స్పెక్టరు రాక ముందుగానే తెలుస్తుంది గనుక ఆ రెండు రోజులూమాత్రం పొలాలంటపోయిన పిల్లలనీ, కనీసం ముప్పైయేళ్లలోపువాళ్ల నందర్నీ, తీసుకొచ్చి బడి తీరుస్తాడు. తక్కినరోజుల్లో కృష్ణయ్యకు బాతాఖానీ తప్ప వేరుపనిలేదు.

సంక్రాంతికి సెలగంట పెట్టేరు. ఎప్పుడూ తెరవని బడికి బాహాటంగా పండుగసెలవులిచ్చి కృష్ణయ్య వీధరుగుమీద కూచున్నాడు. సాయంకాలమైంది. ఎదురుగావున్న కోనేటిమీదనుంచి గాలి తెరతెరలుగా వస్తూంది. పుంతలోనున్న బురదలో జలక్రీడలాడించి పోతులనూ గేదెలనూ తోలుకొస్తూన్న కాపుకుఱ్ఱల అర్థంలేనిపాట అంతరిక్షాని కంటుతూంది. కృష్ణయ్యకు మాటలాడడానికి మనిషెవడూ దొరక్క, చిన్న గావంచా వీపుచుట్టుగా మొణుకులకు ముడివేసి తిరపతి డోలీలో కూర్చున్నట్టు వూగుతున్నాడు. వూరింటి పంచ దొరటోపీలాగ అతని కుదురుమాత్రం కప్పివుంది.

ఎదురుగా చెరుకుతోటల్లో సూర్యుడు గ్రుంకుతూ వుండగా, కోనేటిమెట్లమీద నెవడో బాటసారి, తడిసినపాదాలు దులుపుతూ పైకెక్కివస్తున్నాడు. కృష్ణయ్యకు కాలక్షేపానికి గ్రంథం కనిపించినట్లైంది.

"ఎవరయ్యా...వోయ్... ఇలారండి. యేవూరుమీదీ?"

"అయ్యా, మా వూరాండి? మాది ముందూరు."

"అబ్బో, యెవరయ్యోయ్ నువ్వు, పెద్దవేదాంతిలా గున్నావే!"

కృష్ణయ్యవద్దనున్న గొప్పప్రజ్ఞ అది. ఎంత అపరిచితుడైనా సరే, మూడుముక్కల్లో 'అండీ'లోంచి 'అబ్బి'లోకి దింపేస్తాడు.

"ఎప్పుడూ మీది ముందూరే అయితే, నువ్వెల్లప్పుడూ పొరుగూరులోనే వుంటావన్నమాట; యేమంటావు, నే చెప్పింది?...అబ్బో, నన్ను మాటల్లో బోల్తా కొట్టించీపాటి వా డెవడున్నాడు?"

"స్వామీ, మీతో వాదించేపాటి వాడనా? యతానాస్తి పితానాస్తి అన్నలాంటి అసాధులం మాకు వూరేమిటి పేరేమిటి, స్వామీ?"

"అబ్బో, నువ్వు కొంచెం ఢోక్కాశుద్ధి పొందిన వాడిలాగున్నావు ... ఉత్తరరామాయణానికి అర్థం చెప్తున్నానిప్పుడు, కావలిస్తే యీ రాత్రివిని వెళ్లు."

"అయ్యా, ఉత్తరరామాయణం వింటాగాని అది ఊర్ధ్వలోకానికే ఉపయోగం - సాపాటేదో అదే సద్యఃఫలం. ఆకలిగొన్నవాడికి అనుష్టుప్శ్లోకాలతో పొట్టనిండునా స్వామీ ?"

"ఆరె, నీ..., నువ్వొక్కడో ఉద్దండపిండంలా గున్నావే. పానుగంటి జంఘాలశాస్త్రిధోరణి కొంచెం నీలో కనిపిస్తూంది... నాకేం అభ్యంతరం లేదుకాని, వండివడ్డించేది మా ఆవిడ ; ఆ విడను కనుక్కోని-"

"బాబూ, మీ పిల్లలతోపాటు మరోవిస్తర్లో-"

"ఆగు ఆగు. అక్కడే పొరపాటు పడుతున్నావు- మా ఆవిడవుందే - (సావిట్లో తొంగిచూచి) అక్కడ ఆ ప్రసంగం యెత్తకూడదు...నువ్వెరగవు కాబోలు, నేను కేవలం ఆనందస్వరూపం ; ఆవిడమాత్రం, అటుచూడు, ఆ - నందస్వరూపం......కానీ, శ్లేష కవిత్వాని కున్నరుచీ యేడుకూరల పులుసుకి లేదు సుమా !"

శేషమ్మ ఘోషాచేగాక కేవలం విస్తీర్ణంచేత వీధి గుమ్మం దాటలేక తొంగిచూచి కృష్ణయ్యను రాత్రి వంట నిమిత్తం సలహాచేసింది. పరులయెదుట తన ప్రతిభను భంగపర్చనందుకు శేషమ్మను మనసులోనే మెచ్చుకుంటూ, కృష్ణయ్య అతిథివచ్చిన విషయం తెలిపి అప్పడాలుకూడా కాల్చమని వెనకాలే కేక వేసేడు.

"ఏమయ్యా, కోనేటిమెట్లమీదికిపోయి అందాకా కూర్చుందామా ?"

"అలాగే కానీండి, స్వామీ."

"చూడూ, అన్ని ఋతువుల్లోనూకూడా, గాలి బొరడంవుందే, అది వొంటికి మహామంచిది. నీడనుంటే చెట్టుసైతం బతకదు."

"అన్నిగాలులూ అనుభవించిన, అనుభవిస్తూన్న నాతో దాని బాగోగులు సేవించమని చెప్పాలా ?"

ఆ కోనేరు చాలా విశాలమైంది. నాలుగుగట్లనుండి కుచ్చెళ్లుపోసినట్లు రాతిమెట్లు నీటిలోదాకా దిగి, ఆ జలకన్యకు మరింత శోభతెస్తున్నాయి. నాల్గు దిక్కులనుండీ కమ్ముకుని వస్తూన్న చీకట్లలో, వారిద్దరూ ఆ మెట్లపైని చతికిలబడ్డారు. కృష్ణయ్యకి నేడు బ్రహ్మానందంగావుంది. కీ యిస్తే పరుగెత్తే బండిలాగ, అతనికి బాటసారి లభించడాన్ని నాలుక విజృంభిస్తూంది.

"స్వామీ, ఆవలిగట్టునవున్న శిథిలాలు యేదైనా ఆలయమా ?"

"యేం చల్లనివేళ కదిపేవయ్యా ఆ విషయం. నే వ్రాసిన దదొక్కటేకథ ; ఆ తర్వాత మరి వ్రాద్దామంటే మా ఆవిడ పడనిచ్చిందికాదు. చూడూ, మనం బాగా ఆలోచిస్తే, యీ ప్రపంచంలో కవి అన్నవాడికి పెళ్లికాకూడదు ; పెళ్లికానిఅయుందో, వాడు కవిత్వమేనా వొదులుకోవాలి పెళ్లాన్నేనా వొదులుకోవాలి......రెండింటికీ మాత్రం పొసగదు."

"బాబూ, మీరు రెంటినీ విడిచినట్టు తోచదు ; ఆ ఆలయం విషయంమాత్రం చెప్పకుండా విడిచేరు."

"అదే అదే. ప్రస్తావన వొచ్చిందిగనుక చెపుతున్నాను. ఆ ఆలయంవుందే అది దేవాలయంకాదు. ఒక పెద్దసంసారి తాలూకు యిల్లు."

"శ్రీహరీ ! పశుపత్ని సుతాలయాలు నాలుగింటిలోను చిరస్థాయి కావలిసిన కొంపదే జీర్ణించిపోయినపుడు కడమవాటి విషయమేమై యుంటుందో !"

"వింటే, నీకే తెలుస్తుంది. అదిఒక అద్భుతమైన కథకింద పెంచి వ్రాసేను నేను. మొదట అనిర్గళంగా ప్రబంధకవిత్వం చెప్పిచెప్పి, చెలామణీ కాకపోడాన్ని, కడుపుకోసం యీ వూరుచేరేను యిరవైయేళ్లక్రిందట. అప్పుడీ అయ్యలరాజువారి లోగిలి, ఓ, భూలోక

వైకుంఠంలాగుండేది. రామచంద్రయ్యగారంటే వయసున పాతికేళ్లవాడైనా, చేతి కెముకలేనివాడని సుప్రసిద్ధిపొందేడు. ఇక్కడ బడిపంతులు పని నాకు చేయించింది ఆ దాతే... మనం మంచికిమంచీ చెప్పుకోవాలి — చెడ్డవుంటే మనం చెప్పకుండానే లోకం వెయ్యినోళ్ల చాటిపోస్తుంది. లోకము మాయగ మూకుడున్నదే, అన్నాడు కవి... కానీ, శ్రవణానందంతోటి ప్రబంధాలరోజులు వెళిపోయేయిసుమా ! యేదీ ఆ పద్యం:—

'ముంగాల సింగార......' "

"నా సంగతి విడిచి అప్పుడే అడ్డుదారి తొక్కేరు స్వామీ !"

"అడ్డుదారేమిటి, కవికి అన్నీ దారులే. నిరంకుశాః కవయః అన్నాడు... అయితే ఆ రామచంద్రయ్య గారికి చంద్రుడిలో మచ్చలాగ ఒక దుర్గుణంవుండేది."

"యేమదీ ?"

"భార్యమాట జవదాటకపోవడం."

"రామరామ! యెంత దుర్గుణం చెప్పేరుబాబూ!"

"కాదూ? దుర్గుణమని మెల్లిగా అంటూవేమిటి ? దుర్వ్యసనమని చెప్పక ?... నే చెప్తాను వినూ ! సంసారసూత్రంలో ఒక్కటే రహస్యం. ఆడదాన్ని అప్పడాలపిండిని యెంత మర్దిస్తే అంతరుచి. యీ సూత్రం ఒక్క మా ఆవిడపట్ల అన్వయించిందికాదు. యెంచేతనో యెరుగుదువా; 'అతివలజూచి పీరబల లంచు వచించు మహాకవీంద్రులుద్ధత విపరీతవాదు'లని మా ఆవిడని చూసి చెప్పివుండాలి."

"సరే, తర్వాత?"

"చంద్ర భాగాదేవి—అంటే రామచంద్రయ్యగారి భార్య—చాలా ఉత్తమురాలే అయితేనేం, పెనిమిటి వల్ల యే స్వల్పవిషయంలోనూ తిరస్కారం సహించలేకపోయేది."

"అంతటి అనుకూల దాంపత్యానికి నేరారోపణ మీవంటి కవీశ్వరులు చెయ్యాలి కాని—"

"నేరం వుందోలేదో నీకే తెలుస్తుంది, తుదముట్టా విను. పదిపన్నెండేళ్లు కాపురంచేసిన తర్వాత, రామచంద్రయ్యగారికి సంతానంలేమికి ఓదార్పురీతిగా, ఆయన సోదరుడును భార్యయు అకస్మాత్తుగా మరణించి తమ యేకైక పుత్రికను, మూడేండ్లకూనను, దిగవిడచిరి. ఆపిల్లను రామచంద్రయ్య చంక బెట్టుకుని గుమ్మములో కాలుబెట్టిననాడే లక్ష్మీవారి గుమ్మము వెలుపల కడుగుపెట్టినది. చంద్రభాగకు—కరుణతప్ప అన్య మెరుగని ఆ యిల్లాలికి—ఎక్కడనుండి ఊరిందో ఆ పసికూనమీద అవ్యాజద్వేషం అంకురించింది."

"నిజం? నేను నమ్మలేకున్నాను "

"అయితే నువ్వు రెండోవాడివి. మొదటివాడామె భర్త. లోకమంతా గుసగుసలాడుకుంటూన్న ఆమె కుత్సితం, రామచంద్రయ్య యెన్నడూ గ్రహించలేదు; అవసానకాలానికైనా తెలిసివుంటుందని—"

"అతడెన్నాళ్లయింది, గతించి?"

"రెండేళ్లవుతుంది. అతని మృతికిసైతం కారణమతని భార్యయే. అతనికేదో శూలనొప్పి బాధ అప్పుడప్పుడు వుండేదట. అది చంపే జబ్బుకాదు. అయితేనేం, ఆపరేషనుకోసమని చెన్నపట్నం పంపించింది భార్య. అతడు బహుదూర దృష్టికలవాడు గనక తమ పెంపుడుపిల్లకు పెళ్లిచేసి—యీ అవతల వీధిలో భుక్తగారి అబ్బాయికే—ఆ యేడేండ్లపిల్లనూ అత్తింటనే దిగవిడిచి, భార్యను పుట్టింటికి పంపి, తను రాయపేట ఆస్పత్రిలో చేరేడు......వారంరోజుల నాడు అతడు చనిపోయేడని తెలిసిందిగామూ."

బాటసారికి కడపటిముక్క వినిపించినట్టులేదు. అతడు గజగజవణకుతూ పైనున్న బట్టతో చెవులు సైతం కప్పుగుని "అబ్బా, యీవూళ్లో యెంతచలి!"

అన్నాడు. కృష్ణయ్యమాత్రం తనధోరణి విడిచేలాగు లేడు. చుట్టుప్రక్కల నంతటా నిశ్శబ్దమే ఆశ్రతి చేసుకొని రెండుమూడు కీచురాళ్లు గీఁమని గుక్క తిప్పకుండా రొద చేస్తున్నాయి.

"ఆ ఘోరవార్త వినగానే పాపం చంద్రభాగ తన కుపశమనముగా తన పెంపుడు పిల్లను చేర దీయ బోయినది కాని అన్నీయెరిగిన ఆపిల్ల అత్తవారు మళ్లీ యీమెకు చూపుతారా?"

"బాబూ నాకు తెలీక అడుగుతున్నాను. ఆపిల్ల కేమైనా అపచర్య పినతల్లివల్ల కలిగిందని వెల్లడి అయినదా?"

"అయ్యో, పిచ్చివాడా! దాని కెందుకుంటుం దోయ్ యీ పిల్లమీద అభిమానం?"

"ఉండకూడదా?"

"అదేంమాట? అవకాశమేదీ? ... ఇంతకూ లోక మంతా మొదటే నిశ్చయించేసేరు, యీపిల్లంటే చంద్ర భాగకు కిట్టదని."

"లోకమంటే, యీ వూరివారనేనా"?

"చాలదూ? ... మరి నాలుగు నెలలనాడు చంద్ర భాగ, మరి కాలుజారిందో, లేక కోరిచేసిందో, యీ కోనేట్లోనే—"

"శ్రీహరీ,—అబ్బబ్బా — నేను భరించలేను బాబూ నే భరించలేను; యీచలి— ఈ యీదురుగాలి ఈ ఆకలి, యీదాహము!"

కృష్ణయ్యకి కరచరణాలాడలేదు. దోసిలితో కోనేటినీళ్లు తెచ్చి నాలుగుసార్లు బాటసారి మొహం మీదజల్లి నోట్లోపోసేడు.

"అయితే,— చెప్పండి స్వామీ, యీనీట్లోనే యీకోనేట్లోనే—?"

"సరిసరి! నువ్వెక్కడో ఉత్తపిరికి పందలా గున్నావు. అసలు సంగతి యింకా చెప్పేలేదూ!"

"యేది?"

"నాకథ—అంటే అందుమీదనే నల్లినకథ. ఆస్పత్రిలో అతనుపోయేడని టెలిగ్రాంవచ్చిందా? ఆమర్నాడులేదు మూడోనాడేంట, రాయపేట ఆస్పత్రితాలుకూ మృతకళేబరశాలలోంచి ఒక కళేబరం యెవరో యెత్తుకుపోయేరని ఆంధ్రపత్రికలో పడ్డాది—

అప్పుడు నాకేమిటితోచిందీ, కళేబరం పోవడం అన్నది, రామచంద్రయ్యబతికి తప్పించుకు పారిపోయే డనే కల్పన కవకాశమిస్తూంది కదా అని చెప్పి కథంతా యిప్పుడు చెప్పినట్టే వ్రాస్తూ, రామచంద్రయ్య మళ్లీ యిక్కడికి వచ్చినట్టూ, వూరంతా ఆశ్చర్య పడ్డట్టూ, పోయిన భార్యకై అతడు విచారిస్తూ, పెంపుడుకుమార్తె పేర యావదాస్తి వ్రాసియిచ్చి తాను కాశీ పోయినట్టూ కథపెంచి వ్రాసేను.... యెందుకూ, అది పత్రికకి దేనికీ పంపలేకపోయేననే విచారం?"

"ఎందుచేత?"

"మా ఆవిడ ఆకాగితాలు నిప్పుచెయ్యడంకింద వుపయోగించేసింది. నేను కోప్పడబోతే యేంలాభం?"

"పోనిండి బాబూ, కథలో నాయికకు జలగండం భగవంతుడే యిచ్చేడు. నాయకుడికి అగ్నిసంస్కారం మీకృతంగా జరిగేయోగ్యత వుండెను!"

అప్పడే రాత్రి పదిగంటల సమీపమై వుంటుంది. గ్రామంఅంతా అప్పడే నిశ్చల సమాధిలో మగ్నం అవుతూంది. దూరంగా యెక్కడో బండికి కందెన పెడుతూన్న కిరకిరశబ్దం ఆచీకటి తెరల్లోంచి, యేదో పరలోకజీవుల యాతనవలె, అతి కర్కశంగా విన వస్తూంది.

కృష్ణయ్యకు ఆనిశాప్రళయ స్వరూపంద్యోతకం కాగానే, యింటివద్దనున్న కాళీస్వరూపంయేమి గర్జా రావంచేస్తూందో అని తలచి ఉలిక్కిపడి "యీ పాటికి వెడదామా?" అన్నాడు.

బాటసారి అట్లేఅని "స్వామీ, మీరు నడవండి, మీ వెనకనే అయిదునిమిషాల్లో వస్తున్నా"నంటూ ఒక మెట్లువెంబడి తిన్నగా వెళ్లసాగెను. కాలకృత్యములకనియెంచి, కృష్ణయ్యముందుగా యింటిదారి పట్టేడు.

కృష్ణయ్య యింటి గుమ్మమెక్కి తలుపుతట్టడం ఆరంభించేడు. ఇంతకూలేదు, అంతకూలేదు, శేషమ్మ అలికిడి. నిద్రిస్తూందో అతను ధన్యుడే. అలిగిటక్కు పెట్టిందో తలుపుతీయడంతోటే ఒక ఫెళఫెళార్భటితో ఉల్కాపాతం అతడిమీద పడడం నిశ్చయం... తలుపేరాత్రి తెరిచేలాగ తోచలేదు. సరే, పురాణం కానిచ్చి భుక్తగారి అరుగుమీదే పడుక్కుందామని కృష్ణయ్య అక్కడికి పోయేడు. అక్కడ జనమంతా యితడికోసం యెదురుచూస్తూ, చేరబడడానికి సుఖమైన స్థలం లభించినవాళ్లు ఆవులిస్తూ, వితంతుబృందం ఊరి కోడళ్ల నెలలు లెక్కకట్టక వాదించుకుంటూ, యిట్లా పురాణంకోసం సిద్ధంగాఉన్నారు. కృష్ణయ్య కిర్రు చెప్పులధ్వనిబట్టి అక్కడ యేమరుగుననో కూర్చున్న శేషమ్మ, తాళపుగుత్తి శబ్దభేదిలాగ అతనిముఖము మీదకై గురిచూచి విసిరి, "ఓలాంతరు తీసుకువెళ్లి స్వయంగా తామూ చుట్టం వడ్డించుకు మింగుతారు, నేలేవలేను" అంటూ అనుజ్ఞాపత్రం జారీచేసింది.

కృష్ణయ్య బ్రతుకుజీవుడా అనుకుని లాంతరుచేత పుచ్చుకు నింటికి వచ్చేడు...ఇంటి అరుగుమీద బాటసారిలేడు. ఇంకా రాలేదేం చెప్మా కోనేటినించీ? అనుకుంటూ దారి యెరగడేమో చీకట్లోనని దీపం పట్టుకుని కోనేటికెళ్లేడు కృష్ణయ్య. అక్కడసైతం లేడు—దూరంగా అవతలిగట్టుని నీటిచేరువ మెట్టు మీద యేదో తెల్లగా కనిపిస్తూంది. మెట్లంటచుట్టు తిరిగి కృష్ణయ్య అక్కడకువచ్చేడు. అక్కడాలేడు బాటసారి; యేవో బట్టలున్నాయి! ఆప్రక్కనే, కుంకుమాపసుపూ విరజిమ్మివున్నాయి!...

కృష్ణయ్యకి వొళ్లు జలదరించింది అయినా అతని లోని కవితామార్దవమంతా కరడుబారిపోయి వుండడాన్ని ధైర్యంతెచ్చుకొని ఆ బట్టలు విడదీశేడు ఒక చింకిలాల్చీ జేబునుండి రెండు కాగితంముక్కలు పడ్డాయి.

దీపంవెలుగున చూస్తే ఒకదానిమీద యిట్లుంది:—

"చంద్రభాగ అమాయిక — యీ పాడులోకం, దుష్టత్వం నమ్మినట్టు సజ్జనత్వంనమ్మదు. ప్రేమలేదని అనుకునే తావున, ప్రేమకనిపించినా గ్రుడ్డిలోకం చూడదు, అంగీకరింపదు."

రెండవకాగితం కృష్ణయ్యకే ఒకవుత్తరం:—

"స్వామీ, మీకథలో చేసినకల్పన బహుస్వాభావికమని నేనే మీకు రుజువు. ఇందులోవుంచిన నెం 113 రు టిక్కట్టు, రాయపేట ఆస్పత్రివారు నా మెడకుకట్టినది, పరలోకయాత్రకోసం. కాని మీ కథరీతిగా, నేను నా పెంపుడుబిడ్డ యెదుటపడితే, లోకం నన్ను సజీవునిగా నమ్మదు, మీ రొక్కరు నమ్ముదురేమోకాని. ఆనాడు, పోయిన కళేబరము నేనే అనిగాని, విధివశమున పునర్జీవితుడనై వచ్చుట సత్యేతరము కాదనిగాని లోకమును నమ్మించుట యెట్లు? నాకున్నది ఒకటేమార్గము,—నాఅర్ధాంగి చంద్రభాగ పెట్టినమార్గం!

ఈరాత్రి, తమ దోసిలితో పోసిన యీ నాజలము నా కమృతమైనది. దానిలోనే యున్నది నా సర్వస్వము, నేనును.

—రామచంద్ర."

# మగని చెవిలో

"అనసూయ"

(పోరుగామెను గురించి)

ఏమండీ! మన యువతల పోరుగు వెల్నాటం ఓవర్సీరూ అతని పెళ్లాం ఎందుకండీ అలాగు దెబ్బలాడుకుంటారు? అతడి పెళ్లాం చర్యలు చూస్తే నన్ను నిజంగా శాంతమూర్తినిగా మీరు అనకతప్పదు! నువ్వంటే నువ్వని దెబ్బలాడుతుందండీ! మొగుడు మన్నాపన ఏమీలేదు; తిట్టుకు తిట్టు తిడుతుంది, మాటకు మాట అంటుంది. ఇంకా చుట్టుప్రక్కల యిళ్లున్నవి గాని లేకపోతే కొడుతుందేమోకూడాను! అక్కడికీ అతడు సముదాయిస్తునే ఉంటాడు! కాని అది ఊరుకోదండి! ఏదో చేసేడనో చెయ్యలేదనో యెత్తుకుంటుందండీ ధోరణి! అది పట్టుకొని జణాయించి జణాయించి చూశారూ! తుపానులో గాలీ వానా లెంపలు వాయించినట్లు అడా పెడా కొడతాయి—అలాగు అతడిమీద కురిపించేసరికి అతడు కొంతసేపు సమాధానాలు చెప్పి చెప్పి ఆఖరుకి చాలలేక నెత్తి మొత్తుకున్నా వదలదండీ! ప్రతీరోజూ వాళ్లిద్దరికీ యేదో దానికి యుద్ధమే గదా! చూడగా చూడగా వాళ్లది మార్జాల దాంపత్యములాగు కనబడుతుంది నాకు!

'మనది మాత్రమో!'

చాలు! సంతోషమైంది! కడుపు నిండిపోయింది! ఇన్నాళ్లూ చేసిన చాకిరీ, తిన్న తిట్లూ, పడ్డశ్రమా, ఓర్చిన ఓర్పూ, అన్నీ ఒక్కమాటతో తుడిచేసేరు! మీకు నా మీద యిట్టి అభిప్రాయం ఉన్నదని నేను ఎన్నడూ అనుకోలేదు! మీకు మనస్సులో ఇంత కపటము కల్మషము ఉన్నదని నాకు తెలియలేదు!

"నలువశిరంబు ముట్టినను నల్లనివానిని నమ్మవచ్చునే" అన్నమాట యీనాడు సార్థకమైంది! ఆహా! ఆడవాళ్లు ఎంత వేగంగా నమ్మివేస్తారు! ఎంత వేగముగా వలలో పడిపోతారు! పూర్వంనుండీ ఇలాగు దగాచేసుకొనే వచ్చారు ఆడవాళ్లని మగవాళ్లు! ఆడినన్ని మాటలూ ఆడీడం. పెట్టినన్ని చీవాట్లు పెట్టీటం, ఆఖరుకి ఏముఖం తుడుపుమాట అనడమో, లేక ఏతూలు రవికెలగుడ్డ కొనడమో చేసేసరికి అమాయకపు ఆడది అదంతా నిజమైన అభిమానమే అనుకొని తిట్లు చీవాట్లు అన్నీ మరచిపోతుంది! నూరు చెప్పుదెబ్బలైనా ఒక్కబూరె ముక్కతో సాటి కావని అనుకొంటుంది! ఇలాగు నిత్యమూ మగవాళ్లు కొంపలు తీస్తునే ఉంటారు!

కష్టాలు వాళ్లవే, కపటములు వాళ్లవే; దొంగతనం వారిదే; అబద్ధాలు వారివే, అన్యాయాలు వారివే, కాఠిన్యం వారిదే, క్రౌర్యం వారిదే; మోసం వారిదే, మూర్ఖం వారిదే; ఇలాగు అవలక్షణము లన్నీ పెట్టుకొని ఆడవాళ్లని మాయచేత లోబరచుకున్నట్టే పూర్వము "మాయా శీలుడు, చంచలాత్ము లనుకంపాశూన్యు లాక్షేత్రకా! న్యాయత్తుల్ సమయాను కూల హృదయవ్యాపార గోపాయనో| పాయజ్ఞుల్ మగవారలు" అని అన్నారు.

ఇన్ని బాధలు కష్టములు ఓర్మితో పడుతూ ఉన్న నన్నే మీరు యింత చుల కనగా అనేసేరు గదా, యింక లోకంలో ఎక్కడ న్యాయం ఉంది చెప్పండి! తక్కిన అంద రాడవాళ్లలాగు బట్టలు కొని యిమ్మని బలవంతం చేయలేదు! సరుకులు పెట్టమని చంపుకొని తినలేదు! పిల్లలతో విసికిపోలేదు! మీ అమ్మనీ అప్పనీ యెది రించలేదు! మా పుట్టింటికి తరుచు పారి పోలేదు! మిమ్మల్ని కాఫీక్లబ్బు గాని క్లబ్బు గాని ఆటపాటలు గాని ఖర్చు పెచ్చాలు గాని మానవలసినదని బలాత్కరించలేదు! 'పందంటే పంది, నందంటే నంది' అని మీరు చెప్పినదానికీ చేసినదానికీ అన్నిటికీ అలాగే అని తల ఊచిపడిఉంటే ఇదా నాకు మీరు అఖరికి యిచ్చిన కితాబు! మార్జాలమునా నేను? నిజమే! మీరు పిల్లి అయినప్పుడు మీ పెళ్లామును అయిన నేను పిల్లిని గాక మరేమవుతాను? మీకు పిల్లి గుణములు గాక పులి గుణములు ఒక టైనా ఉందీ? ఇంట్లో ఆడవాళ్లు కేకవేసు కుంటూ ఉంటే తోకముడుచుకొని పారి పోతారు గాని వాళ్లని ఆపలేరు గదా! ఎల కలవంటి అనాథుబంట్రోతు గుంటలమీదికి పిడుగు అయిపోతారు గాని ఆడదైనా డాబుచేసి కేకలేస్తే దాడుతీయడమే కదూ మీ శక్తి? మేష్టరుని మీరు ఆక్షేపిస్తారు గాని నిజంగా మేష్టర్లయందు పిల్లలికి భయమూ భక్తీకూడా ఉండవచ్చును. ఈ వూరి హెడ్డుమేష్టరుని చూడండీ! అతడంటే అందరికీ యెంత గౌరవమో! మీయందో? ఎవడికీ యేమీ ఉండదు, హేళన తృణీ కారము తప్ప! మీరు పిల్లి కాబట్టీ మీ పెళ్లామును నేనుకూడా జింహ్వా చచ్చిన పిల్లిలాగు ఉండబట్టే మనకి యీ యింట్లో యింత నీచకముగా చూడడమూ అమ ర్యాదా చేయడమూ జరుగుచున్నాయి! అసలు ప్లీడరంటేనే పిల్లి! దానిలో మీరు మరీ చేతకాని పిల్లి! అటువంటి పిల్లికి పెళ్లాము—మరీ నీచపుపిల్లి—మన దాంపత్యము మార్జాలదాంపత్యము కాక మరేమిటి అవుతుంది?

'ప్లీడరంటే పిల్లివంటివాడా? వాడికి యెంత స్వేచ్ఛ, యెంత గౌరవము?'

చెప్పేదేమిటి ప్లీడర్ల స్వేచ్ఛాగౌరవ మున్నూ?......లంచాలు కుదర్చడము కూడా చేయడానికి జంకని మీ ప్లీడర్లకు గౌరవము స్వేచ్ఛ చెప్పేదేమిటి?

ఎవరు కుదురుస్తున్నారా? ఏం నంగనాచులండీ! ఎరగనట్లు నటిస్తారు? మన ఊళ్లో ఒక పెద్దప్లీడరు సానివాడేనా? మరొక పెద్దప్లీడరు చిన్నవాడుగా ఉన్నప్పుడు చేసిన పని యిదేనట! దానివల్లే ముందరికి వచ్చేడుట! ఇప్పుడిప్పుడు మీ గుంట ప్లీడర్లుకూడా కొందరు ఇట్టివి మొదలుపెట్టేరుట! యిప్పుడు డబ్బు సువాసనలో ఆ నీచపుకంపు కనపడదో, లేకపోతే కక్కోకజీబాధలాగు ఆ కాస్తసేపూ ఆ బాధపడక తీరదనోవారిని అందరూ గౌరవిస్తారు! అట్టి గౌరవాలకి లెక్కేమిటి? ఇకను అధికార్లకి పళ్లూ ఫలాలూ పంపించేవాళ్లు, వాళ్ల యింట కాస్త కష్టంవస్తే తమ యింట్లో శవం పోయినట్లు యేడ్చేవాళ్లు, యిళ్లకు వెళ్లి ఆశ్రయించేవాళ్లు, మానాన్ని వప్పచెప్పేవాళ్లు, వాళ్ల సంగతి చెప్ప నక్కర్లేదు గదా! గంతలో పడేసిన యెంగిలాకుల మీద కుక్కలకు స్వేచ్ఛలేదూ? అట్టిదే మీ ప్లీడరీ స్వేచ్ఛ! అంచేత మీరు ప్లీడరు పిల్లి; నేను మీ పెళ్లాం పిల్లిని; మనది మార్జాల దాంపత్యము కాక సీతారాముల దాంపత్య మెట్లవుతుంది?

ఆహా! అంత చులకనగా అనేసేరు గాని నేను ఆ వెల్నాటి ఓవర్సీరు పెళ్లాంలాగు, నీళ్లుతోడి తెమ్మన్నానా? పొయ్యిలోనికి కర్రలు కొట్టమన్నానా? కుంపటిలో నిప్పు చెయ్యమన్నానా? వంటంతసేపూ పిల్లలని ఆడించమన్నానా? మీ యెంతట మిమ్మలినే వడ్డించుకోమన్నానా? పిల్లలిని యెత్తుకుంటావా, యెంగిళ్లెత్తుకుంటావా అని అడిగి ఆఖరికి రెండూ చేయించేనా? చేతిలో రూపాయి అయినా లేకుండా లాగేసి మంగలి ఖర్చులకికూడా పెళ్లామును అడగవలసిన యోగ్యత పట్టించేనా? పడకగది ఉపన్యాసమందిరముగాను తక్కినవి కవాతు మెరకలుగాను చేసివేసేనా? వేసవికాలములో విసనికర్ర అతని చేతిలో అంటుకుపోయినట్లు ఉండిపోవడమే గదూ! పిల్లలకు విసరడమని మిష—అమ్మగారికే సేవ! ఇటువంటి పనులు ఒకటీ లేదు గదా, ఒకటీ మీచేత చేయించలేదు గదా, ఎందుకలాగు అనేసేరు? మీకు యేమైనా విశ్వాసమూ ప్రేమా న్యాయమూ ఉన్నాయీ? ఉంటే ఎందుకలాగు అంటారు?

హాస్యానికి అన్నారా? ఇదా హాస్యము? ఈ మోస్తరుగానే గదూ మీ మగవాళ్లు పూర్వంనుండీ చేస్తూఉన్న దగాచర్యలు! అన్నంతమాటా అనీడం—హాస్యమునకని వెనుకనుండి సర్దుబాటు చేయడం—ఏమి సబబుగానున్నది? హాస్యమంటే యెంత నాజూకుగా ఉండాలి! ఎంత సంతోషము పుట్టాలి! వేసవికాలములో ఐసుక్రీము తింటే చల్లదనము ఒంటికి వ్యాపించినట్లు హాస్యమువలన ఆనందం పుట్టి వ్యాపించాలి! అంతేగాని కర్రవిరిచి పొయ్యిలో బెట్టినట్లు ఏదో ఒక పోటుకుమాటు పొడుచుకొని చచ్చేటట్లు అనీడమూ, ఆతరువాత గిజగిజగించుకొని కొట్టుకుంటూ ఉంటే హాస్యానికన్నానని తేలిపోవడమున్నా? ఈమాటు యిటువంటి హాస్యాలు కట్టిపెట్టండి! లేదా, లేకపోతే ఆరాత్రి నిద్రకు సెలవుపెట్టండి.

# పండుగ కట్నము

మహాలక్ష్మి పుట్టుకకు ప్రసాదరావుగారి గృహస్థితి బాగానేవుండేది. అప్పట్లో వారింట్లో లక్ష్మి తాండవిస్తూ వుండేది. అమూలంగానే లేకలేక పుట్టిన యీ ఆడపిల్ల మహాలక్ష్మి అయింది. ఆమెముందు యింకొక మగపిల్లడు వున్నా ఆ కారణంగానే తాత తండ్రులమధ్య దాసీ జనంమధ్య అల్లారుముద్దుగా పెరిగింది లక్ష్మి. తెల్లని శరీరము, విశాలమైనకనులు, తీర్చినకనుబొమలు, చక్కని నోరు ఆమె పేరును సార్థకంచేసాయి. లక్ష్మి నాల్గవ యేటనే బడికి బయలుదేరింది. తాతగారి అభిమానము చేత తండ్రిఆదరణచేత చిన్నతనంలోనే ఫిడేలు నేర్చుకుంది. కాని లక్ష్మికి జ్ఞానము పూర్తిగావచ్చేకాలానికి ప్రసాదరావు కుటుంబస్థితి బాగులేదు. లక్ష్మి వెనక నొక మొగపిల్లడు ఆడపిల్ల పుట్టారు. తాతల నాటి ఆస్తులు తన అనుభవంలోకి రాకుండానే తండ్రి పాడుచేశాడు. కుటుంబం గడవడం యెలాఅన్నది సమస్యే అయినా జ్ఞానమువచ్చిన పిల్లాపిల్లాడ్ని, పరమ సాధ్వీఅయిన యిల్లాల్నిచూచుకొని ప్రసాదరావు సంతుష్టిజెందీవాడు. మహాలక్ష్మికి పదమూడవయేటికే విద్యాగంధము బాగుగా అలవడింది. తండ్రికి మన స్తిమితములేని గడియల్లోచక్కగాపాడి అతణ్ణిసంతోష స్వాంతుని చేసేది. ఆరోజుల్లో అట్టికూతురుకన్న వేరేమి కావాలి? అన్ని సుగుణములు కలిగిన లక్ష్మికి గర్వములేకపోవడం అతనికి ఆశ్చర్యం వేసేది. లక్ష్మి సున్నితహృదయ. అది నిష్కళంకము. ఆమె మనసును విప్పి చదివితే 'ప్రేమ'అన్న అక్షరములు కనబడతాయి. అట్టి లక్ష్మి కష్టములనుభవించడం అతనికి యిష్టములేదు. అతడు వెదకివెదకి వొకవరుణ్ణి తెచ్చేడు. లక్ష్మి మనస్ఫూర్తిగా వొప్పుకున్నమీదట తను సాగినంతవరకు వైభవంగా వివాహముచేశాడు. తన అల్లుడు గౌరవమయిన కుటుంబములో పుట్టేడు. సుగుణవంతుడు. విద్యాధికుడు. రామారావు లక్ష్మిని భరించేవాడయ్యేడని అతడు నిజంగా గర్వించేడు.

అని పూజా సెలవులు. రామారావుని రమ్మని మామగారు మదరాసు వుత్తరము వ్రాసేరు. తనభర్త నాడు వస్తారుగదా అని లక్ష్మి వుత్సాహంగావుంది. రామారావే కారణంచేతనో మెయిలుకురాలేదు. ఆమెకు ఆతృత హెచ్చింది. 'అక్కా బావయెప్పుడువస్తాడే' అన్న చెల్లెలి ప్రశ్నకు విసుక్కుంటూ గదిలో కూర్చుంది. కాలం యెంత అయిందో ఆమెకు తెలీదు. ఏమి తోచక 'ఫిడేలు'తీసి వాయిస్తూంది 'ననుపాలింపగనడచి వచ్చితివో'అని. రామారావు లోపల ప్రవేశించాడు. అతడు ప్యాసింజరులో వచ్చేడు. వాలీ స్టాండుమీద పడేస్తూ 'నడచిరాలేదు. బండిమీద'అంటూ వాలు కుర్చీలో కూర్చున్నాడు. లక్ష్మి వెనుదిరిగిచూచింది. సిగ్గు సంతోషము వొకటి తర్వాత వొకటి ఆమెను ఆవహించాయి. ఆమె తిరిగీ అదేపాడుతూంది.

'నమ్మకం లేదు?'

ఆమె లేచింది. మేజానానుకొని నించుంది.

'మెయిల్లోవస్తానన్నారు?'

'బెజవాడలో దిగాను.'

'ఇప్పుడు రారనుకున్నాను.'

'పొరపాటు!'

'ఆడవాళ్లంటే మీకంతలోకువా?'

'ఎవరులోకువో తెలుస్తూనేవుంది. శలవు లివ్వగానే పరుగెత్తుకొచ్చాను.'

'బండి మీదన్నారు?'

'గెలిచావే'



రాబోవు ఒలింపిక్ పందెములకు
టోకియోనగరము రంగమగుట దెలిసి ఆ నగరబాలిక లుత్సవము సేయుట.



బొంబాయి మహిళ సేవామండలి యాధిపత్యమున నూతనముగా ప్రారంభింపబడిన
కుట్టుపని తరగతియందలి యుపాధ్యాయినులు విద్యార్థినులు.



మిస్. ఇందిర ఖేడ్కర్ ఎం. ఎ., బి. టి.,

మొరాదాబాద్ మహిళా కళాశాల ప్రిన్సిపాలు.

ఉన్నతవిద్యబడయుటకై ఇంగ్లండునకు వెళ్లిరి.

'జయము యెప్పుడూ మాదే.'

'బావా! గ్లాసుమంచి నీళ్లు కావాలేవిఁటి కాఫీ యిప్పుడే అయిపోయింది' అని కమల పరామర్శచేసింది. రామారావుకి కమలని చూస్తే యెంతో అభిమానము. కమల దొరలపిల్లలావుంటుంది. ఆమె రోజు పట్టే పంతములు చూచి ఆ అమాయకురాలికి వాళ్లకుటుంబ స్థితి తెలీదుకదా అనుకునేవాడు.

'బావా! మెడ్రాసునుంచి నాకేమిటి తెచ్చావు?'

'సిల్కుఫ్రాకులు' కుట్టించితెచ్చాను. సూటుకేసు తీసి మీదనే వున్నాయి తీసుకో.'

కమల అక్కచేత తీయించింది.

'బాగున్నాయే అక్కా! బావమంచివాడే, అవునా?' లక్ష్మి సగర్వంగా వూరుకుంది.

'బావా! అక్కకేమీ తేలేదు?'

'తెచ్చేను.'

'ఏమిటి? ఎక్కడుంది?' అని ఆతృతగా ప్రశ్నించింది కమల.

'ఇదిగో' అని తన్ను చూపెట్టి నవ్వేడు రామారావు.

'పో బావా? యెప్పుడు హాస్యాలేనూ' అని కమల ఫ్రాకులుపట్టుకొని దారితీసింది.

లక్ష్మిమీద రామారావుకి యెంతో ప్రేమ. స్త్రీ పురుషులు సాధారణంగా చెప్పుకొనే ప్రేమకాదతనిది. అతడామెను భౌతికంగాకంటె నైతికంగానే హెచ్చు ప్రేమించాడు. లక్ష్మిని తను ఆరాధించవలసిన దేవతకి మల్లే భావించేవాడు. మెడ్రాసులో అతడిప్పుడు ఎం.యే. చదువుతున్నాడు. తన విద్యాపరిశ్రమ ఆమె సాహిత్యజ్ఞానంలో యెంత అనిపించేది.

'లక్ష్మి.'

ఆమె రామారావుని పరికించింది.

'నీవు నాప్రేమరాజ్యానికి రాణివి.'

ఈపాటికి చాలించండి.'

'యిలారా.'

ఆమె అతనిదగ్గరకు చేరింది.

'నీవు నాజీవితనౌకకు చుక్కానివి.'

'కానని యెవరన్నారు.'

అతడామెను వడిలోకిలాగేడు. ఆమెబుగ్గలు యెర్రబారినై.

నాడువిజయదశమి. రామారావు అభ్యంగనము అయినతర్వాత కాఫీ ఫలహారములు పుచ్చుకొని వరండాలో కుర్చీలో కూర్చున్నాడు. ప్రసాదరావంతవరకు అతనితో యేవోవో సంభాషించి వెళ్లిపోయాడు. కమలతో వొకటిరెండు మాటలాడి యింటిఅల్లుడు గదిలో పడుక్కున్నాడు 'షేక్స్పియరు'డ్రామాచదువుతూ. మధ్యాహ్నము భోజనముల దగ్గర సాయంత్రము ధవళేశ్వరము వెళతానని ప్రసాదరావన్నాడు.

'నేను మెయిలులో వెళుతున్నా'నని రామారావు చెప్పేడు. ప్రసాదరావు ఆలోచనా పూర్వకంగా 'సరే' అని వూరుకున్నాడు. భోజనముఅయిన తర్వాత గదిలోకిపోయి పడుక్కున్నాడు రామారావు. గంట పోయిన తర్వాత లక్ష్మిగదిలో ప్రవేశించింది.

'నిద్రేనాయేవిఁటి?'

'.........'

'నామీదకోపము వచ్చినట్టుంది.'

రామారావు కొంచెం వత్తిగిల్లేడు.

లక్ష్మి మంచంమీద కూర్చుంది.

'ఎందుకు?'

'ఏమిటి?'

'నామీదకోపం.'

'నీమీద యెందుకు!'

'పోనీ మీతోటి వచ్చేస్తాను.'

'ఎక్కడికి?'

'మెడ్రాసు.'

'వద్దు.'

'బెజవాడలో దిగిపోతాను.'

'మీ అమ్మ కింకా నీరసంగా వుందన్నావు.'

'అవును.'

'ఇక్కడేవుండు.'

'మరియెందుకు మొగం అలా ముడిచారివాళ.'

'ఏమీలేదు.'

నిజానికి రామారావు వుదయంనుంచీ అలా గేవున్నాడు. పండుగకి పిలిచి మామగారు తనకి తగినకట్నము యివ్వలేదని అతని అలక. స్వభావానికి రామారావు మంచివాడే. కాని అట్టి లోకలాంఛనమే అతని సుస్వభావాన్ని అరికట్టి లక్ష్మిపై యీర్ష్య కలిగించపోయింది. లోకజ్ఞానమెఱిగిన లక్ష్మి భర్త హృదయక్లేశము గ్రహించలేకపోలేదు. అందుకనే మాటల్లో పెట్టి ఆలోచన మరలింపబోయింది. రామారావు చదువుకున్నవాడు. తనగృహస్థితి తెలిసి విద్యాహీనునివలె, మూర్ఖునిలా ప్రవర్తించడం ఆమె సహించలేకపోయింది. పెద్దచదువులు చదివినందుకు లంచములు కావాలి? అవి ప్రాపంచిక విషయపరిశీలనములేని చదువునకా! లోకానుభవములేని చదువు నేర్చుకున్నందులకా? అని ఆమెప్రశ్న. లక్ష్మి తెలివితక్కువదికాదు. హృద్భావము గ్రహించగలయువతి. రామారావుకి పాఠము నేర్పాలని ఆమె నిశ్చయించుకుంది.

'రేపు ప్యాసింజరులో వెళ్లండి.'

'మీవాళ్లు యిచ్చేకట్నాలు మిగిలిపోతాయనా?' అన్నాడు రామారావు.

రామారావుపై మహలక్ష్మికి కోపమురాలేదు. తనస్థితికి ఆమె యినుమంతయినా చలించలేదు. ఆమె యవ్వన హృదయంలో ధైర్యలక్ష్మి 'బాపుటా' యెత్తింది. రామారావామెముఖంలోకి చూచేడు. ఆమె నిశ్చలత్వానికి ఆశ్చర్యపోయాడు.

కాలమానాన్నిబట్టి మరోగంట గడచిపోయింది. కాఫీ త్రాగి రామారావు పూర్లోవెళ్లాడు. లక్ష్మి మనసును నొప్పించానేమో అని అతనికి భయంవేసింది. కాని లోకరివాజుప్రకారము తనకు జరగవలసిన గౌరవము యెందుకు జరగకపోవాలి అని అతనిప్రశ్న. అది శాసనమా అని ప్రశ్నించుకుంటే తీరిపోను. అందుకు యెవర్ని నిందించడం. సంఘాన్నా? తన అత్తవారినా? తనలక్ష్మినా? తన్నా?......... మెయిలుప్రయాణానికి అరుగంటలకే భోజనంఅయింది. గదిలోకివెళ్లి లోపల మేజామీద తమలపాకుల చిలకలలో వొక్కొక్కటే నములుతూ సూటుకేసు తెరచేడు. మీదనేవుంది తెల్లనికాగితము. తీసి ఆతృతగా చదివేడు.

"సంగీతసాహిత్యాల్లో బాలనై, ప్రేమరాజ్యాలలో యువతినై, ప్రాపంచికానుభవంలో ప్రౌఢనై, మీ జీవితనౌకకు చుక్కానినైన నేను మీకు కట్నం. ఇది కట్నంక్రింద భావించరుకాబోలు. కాకపోయినా యిది ఆనాడే మీకు వచ్చినదనుకున్నారేమో? లేదు. నేడు నేను హృదయపూర్వకంగా నన్ను అర్పించుకుంటున్నాను. ఇది మీకు పండుగకట్నము......... లక్ష్మి.. ..."

రామారావుకి దుఃఖమే వచ్చింది. గదిద్వారము వైపుచూచేడు. లక్ష్మి నించునివుంది. అతడుసంజ్ఞతోనే రమ్మని పిలిచేడు.

'నీ వెవరు?'

'మీ లక్ష్మిని.'

అతడామెను దగ్గరకు చేర్చుకున్నాడు.

'ఇల్లాంటి పండుగకట్నం యెవరేనా పుచ్చుకున్నారా?'

ఆమె తనశిరము నాతనిగుండెపై ఆని సాభిప్రాయంగా అతని ముఖంలోకిచూచింది.

జి. వెంకటరమణమ్మ.

# "పాంచాలి పల్కులు"

పాండుభూధవతనూభవులు పాండవులు
పదమూడువర్షముల్ బన్నంబులొంది
సమయంబునోర్పుతో సలిపిన్యాయముగ
తమతండ్రిపాల్గొన దరణీశుకడకు
శ్రీకృష్ణుబంపిన జేకూరుశుభము
లనిరాయబారిగా నంబుజనేత్రు
ప్రార్థింపసమ్మతి వాసుదేవుండు
హస్తినాపురమున కరిగెడువేళ
పాండవుల్ దమయభిప్రాయముల్దెలిపి
వీడ్కోల్పదలచినవేళ నసహ్య
దుఃఖవశమ్మున ద్రుపదతనూజ
పలికె నిబ్భంగి నవ్వనజాక్షుతోడ
మధుసూదనా! నాదుమనవినాలింపు
మవినీతులైన కౌరవులచేమనము
పడినబన్నములెల్ల పాండునందనులు
మరచిరిగద! కృష్ణ! మదిలోననేడు
అయిదూళ్లనొసగిన నంతెచాలనుచు
కోరివేడినమాత్ర గుమతిరారాజు
సమ్మతినొసగునే స్మయమూను గాక
యొకవేళనట్టిది యొనగూడెనేని
సరివారునవ్వరే సరసిజనయన!
అంతలంతలుజేసి అడవులకంపి
వంతలపాల్జేసి ప్రాభవంబంది
సంతసించెడువారు సంధివాక్యముల
కీకొందురేయెందు; కృష్ణ! మురారి
తెలియనివారు భీతిల్లినవారు
సిగ్గుమాలినవారు చేతురీసంధి
యని పరిహాసంబు నవనిపైనెల్ల
వారలుసేయరే? గౌరవంబేడ
రాజ్యభాగములేక పూజ్యతలేక
యాచించియైదూళ్ల నందబోనేల?
మీసంధిపద్ధతిమేలు వారలకే!
పరిభవాల్సైరింప బ్రాహ్మణోత్తములె?
కీడొనర్చినవారిగూడ రక్షింప
కూర్చుబందుగులాట కూల్చగలేరొ?
క్షత్రియధర్మంబు సమసెనేమనకు
ఓటయొకింత సుయోధనుదుష్ట
చిత్తంబులోలేదు శ్రితజనపక్ష
సామవాక్యములతో సంధికైవేడ
దురభిమానముబూను దురితవర్తనుడు
కౌరవసభలోన కయ్యంబెపొసగు
నట్టిరీతులుగల్గు నప్పుడైనవీర
లనిజేతురో లేక యడవికేగెదరో
కనుగొనుమిప్పుడే కంసారి! శౌరి!
వరముననగ్నిలో ప్రభవంబునంది
ప్రథితమౌభారత వంశంబుజొచ్చి
బహుపరాక్రమశాలి పాండుభూమీశు
కోడల స్వఖ్యాతి గూడవహించి
ప్రథితవీరులు వీరి భార్యనైమించి
నీతిపరాక్రమ పూతులౌసుతుల
గాంచి సోదరులెల్ల గౌరవింపంగ
పరమప్రశస్తిని బడసితి కృష్ణ!
నీవు సుభద్రకంటెను నన్నుగౌర
వంబునజూతు వవ్యయమైనప్రేమ

# గృహలక్ష్మి

అట్టిసన్నుతకాంత యంచనిదైన
యుడుగక దుశ్శాసనుడు జంకులేక
నేకవస్త్ర యటన్న నేవయులేక
కురుపితామహగురుల్గూడ జూడంగ
కురురాజసభ నాదు కురులూడబట్టి
యీడ్చిపరాభవ మెంతేఁజేయ
యాదృశ్యమునుగాంచి యాసలుదక్కి
చిత్రాకృతింబొంది చేష్టలుదక్కి
యున్న నక్కురురాజు యుద్ధతిమాన్ప
హేకృష్ణ! హేకృష్ణ! హేకృష్ణ! రావె
యంచునిన్నార్తనై యతిభక్తి వేడ
బ్రోవవే దయతోడ గోవిందనీవు
కోడలు నాకన న్గ్రూరితదాసి
గాజేసిన మహాత్ముకడ సేవసలుప
వీరలుజనినచో వీరలతోడ
గూడనేజని వారి కూడిగాల్సేతో
కోటరికముసేతొ గోవింద చెపుమ !
అనుచుకన్నులనశ్రు కణములుజార
దుఃఖంబుక్రోధంబు తొందరజేయ,
వేవేగ దనజేత వెంద్రుకల్ బట్టి
వెన్నుని ముందరబెట్టి యిట్లనియె
దుశ్శాసనుని వ్రేళ్లతోజిక్కిసగము
తెగిపోయె నింకను మిగిలినవీని
గౌరవసభలోన గావించుసంధి
వేళ నీ మదిలోన విస్మరింపకుము
ఈవేణిచేపట్టి యీడ్చిన చెనటి
కరముమున్ముందుగా దురమునదనువు
వ్రయ్యలై చెదరి రూపఱియున్న వేళ
పలుబాము లడవిలోబడిన ధర్మజుడు
నేనుచూడకయున్న యీక్రోధవహ్ని
యారిపోనేర్చునే యార్తశరణ్య !
మదిలోనవేదన మానిపోనగునె ?
కన్నీటికాల్వలింకగ శక్యమానె ?
ఆర్తనై యున్న నాఅడలుదీర్పంగ
జాలనివో భీము సత్త్వమదేల ?
గాండీవివిక్రమ గర్వంబదేల ?
గాల్పనే యికనేల ఖలజనధ్వంస !
పదమూడువర్షముల్ భరియింపలేని
పరిభవక్రోధ మాసురమైనతాల్మి
నొడిలోనమండెడు బెడిదంపుటగ్గి
గట్టుకొన్న తెఱంగుగా నిల్పియుంటి
జగములెల్లనుబ్రోచు జగదీశ్వరుడవు
అఖిలలోకంబుల కాదిగర్భుడవు
నగుసోదరునినిన్ను నత్యంతబాహు
బలవిక్రమాఢ్యులై బరగెడుపతుల
గలిగినన్గ్రోధాగ్ని బాలియనేరదుగ !
యీదుఃఖవార్ధిలో నీదెడునన్ను
దరిజేర్ప నేరీతి దారిజూపెదవో
మీకార్యసాధన మీమంచితనము
మీబాంధవప్రేమ మీసంధిఫలము
చెడకుండమీపని చేసికోకృష్ణ !

దేశిరాజు భారతీదేవి

గ్యారంటి ! 2 సంll గ్యారంటి !!

# టి. సి. ఎన్. గోల్డన్ మెటల్ జ్యూయలరి

## మార్టువారి వివిధ రకముల గాజులు






ఈ గాజులు అచ్చంగా బంగారు గాజులలాగే కాంతితోనూ, వన్నెలోనూ మెరిసి పోతున్నాయి. నలుపు కావడము లేదు.

పెద్దసైజు గజులు 2 యించిలు మొదలు పైబడినది. జత 1-కి రూ. 3-0-0

మధ్యమసైజు $1\frac{3}{4}$ ఇంచి మొదలు 2 ఇంచిలకు లోగా వుండునది. జత 1-కి రూ. 2-8-0

బేబీసైజు $1\frac{3}{4}$ ఇంచికిలోబడినది. జత 1-కి రూ. 2-0-0

వి. పి. ఖర్చులు జత మొదలు 6 జతలువరకు రూ. 0-6-0




గాజులకు ఆర్డరు చేయువారు వుపయోగించెడు వారి గాజుల చుట్టుకొలతను ఇంకితో మార్కు చేసి పంపండి.

2 అణాల ఖరీదుగల మా చక్కని బొమ్మలకేట్లాగు ఉచితము.

వలయువారు:— **టి. సి. నాగలింగప్ప అండు కంపెని,**

280 వాల్ టాక్సు రోడ్డు, పార్కుటవున్ పోస్టు, మదరాసు.

ఏజంట్లు:—పటేలుస్టోర్సు, మ్యునిసిపల్ హైస్కూల్ రోడ్డు, బెజవాడ.

మహమ్మద్ బసిరుద్దీనుసాహెబ్, మెటల్ జ్యూయలరిషాప్, మెయిన్ రోడ్, నిడదవోలు (ప.గో.జిల్లా.)

జయభారతి వస్త్రాలయము, మెయిన్ రోడ్, ఏలూరు.

# * * పిల్లలకు — పిట్టకథలు * *

## చిన్న పిల్లల పాటలు

తెప్పమీద తెప్ప
నీళ్ళమీదకప్ప
భోగందానికొప్పు
ఎడమకాలిచెప్పు !

* * *

తేరాయెక్కంతేరా
పప్పుబెల్లంతేరా
గోడదాటిరారా
నీకులేదుపోరా !

* * *

శ్రీమతి యల్. సుబ్బలక్ష్మిగారు

పిల్లల్లారారండర్రో
పిడికెడుబియ్యం తెండర్రో
ఆడుకోపోదామురండర్రో
అట్టుముక్కలు తెండర్రో !

* * *

బండి అమ్మాబండి
పదహారుకుచ్చులబండి
సూర్యదేవుడుపెళ్ళి
చూచివద్దామురండి
ఆకులుపోకలు తెండి
అడిగివద్దామురండి.

## యుక్తి

సభయంతయు గిటకిటలాడుచుండెను. భూలోక దేవేంద్రసభయన నా సభ యొప్పారుచుండెను. జనులెల్లరు క్రొత్త మంత్రిపదవి యేరికిలభించునో జూడ నతి కుతూహలులై యుండిరి.

"సభాసదులారా! రాత్రి యొకానొకడు నా గుండియలపై దన్ని, నా మొగముపై నుమిసి, మదీయశిరోజములబట్టి లాగెను. అట్టివాని కర్హమగుశిక్ష యెట్టిదియో వచింప గలవారీ నూతనమంత్రిపదవిని, అస్మదీయ ప్రియభగినిని గ్రహింపనర్హులు." ఇది రాజు ప్రశ్న.

సభయంతయు సూదిపడినను వినబడు నంతటి నిశ్శబ్దతగలిగియుండెను. ఏరును నోరెత్త సాహసింపరైరి.

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

"మహారాజా! పవిత్రవంతమగు భవదీయ గుండియలపై దన్ను సాహసించిన యా దురాత్ముని కాళ్లను, దేవతాస్వరూపమగు తమమోముపై నుమిసిన యా క్రూరాత్ముని నాలుకను, భవదీయ పుణ్యశిరోజములలాగ సంకల్పించిన యా దుష్టుని కరములను బ్రతికియుండగనే ఖండించుటయే యర్హమగు శిక్షయని మదభిప్రాయము." ఇది రాజశ్యాలికుడగు జయసింహుని యుత్తరము.

# స్మృతిపథము

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

సీ॥ తన మహోదగ్రప్రతాపారుణచ్ఛటల్ ఖండాంతరముల కీరెండగాయ
తన దిగంతక్రాంతఘనయశశ్చంద్రిక లెల్లలోకములకు వెల్లవేయ
తన మహాపాండిత్యధారణాగరిమంబు కవిచంద్రములకు కల్పకంబుగాగ
తనచేతి శితమహోదగ్రఖడ్గప్రభల్ ప్రతిపక్షులకు గుండెబరువుగాగ.

గీ॥ వెలయు శ్రీకృష్ణరాయభూవిభుడునేలి, నట్టి సువిశాలసామ్రాజ్యమంతెగూడి
బేరుకైనను లేక గభీరమైన, గాలగర్భంబులోపల గలసిపోయె.

సీ॥ కవితాపితామహు కవనంబులోపలి యల్లికచవిజూచు నట్టివాడు
ముక్కుతిమ్మనకవి ముద్దుబల్కుల కెల్ల డెందమానంబు నొందునాడు
తనబహిఃప్రాణమై దనరుచిన్నమదేవి నతిగూర్మితోడ బెండ్లాడునాడు
ఘనముష్కర తురుష్కకాండంబులంజీల్చి గొమరొప్పజయముజేకొన్ననాడు.

గీ॥ నలరగల్యాణలక్ష్మికి నిలయమైన, నీదు సువిశాల సామ్రాజ్యమీదినమ్ము
నామమాత్రావశిష్టమై నాటుననుచు, దలచియుందువె శ్రీకృష్ణధారుణీంద్ర?

చం. ఘనతరశిల్పకార్యముల గౌరవమందిన బెద్దశిల్పు లే
పున శిలలెల్లజేర్చి బహుపోకడలందున నల్పశిల్పక
ల్పనల రచించినట్టి బహుబాగగు రాచనగళ్లునేడు నీ
ధనములు గాలగర్భమున దాగునటంచు దలచియుంటివా?

చం. సరగున జాతిగుండియలుసైతము నీరయిబారకున్నెరా
పరి గళలేక సర్వమును బాడయినిల్చిన నీదుదివ్యసుం
దరతర హర్మ్యరాజములదప్పక గన్గొన బాడుదైవమీ
కరణినొనర్చెనేయనుచు గంటికి నీరిడకుందురే జనుల్.

ఉ. ముక్కున వ్రేలుసేర్చి యరమోడ్పు గనుంగవతోడ తోడివా
రక్కజమంద వైభవమహాంబుధినూయెల లూగియుద్ధతిన్
దక్కిన రాష్ట్రరాజముల దానొకమిన్నయనంగ బేరుపెం
పెక్కిన నీదురాజ్యరమ యింపుదొఱంగిన జూచుటెట్లొకో.

గీ॥ అటుల విచ్ఛిన్న వైభవమందుదూగి, నేడు బేరుసైతములేక నిల్చియున్న
నీదుసామ్రాజ్యరమ జూచునేని గర్భ, శత్రువునకైన గన్నీరు జాఱకున్నె?

# ప్రకృతి విలాసము

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

ప్రదేశము—కైలాసము

ప్రవేశము—శివుడు దాక్షాయణి.

శివుడు:—దాక్షాయణీ! దీర్ఘదర్శిత్వ మనునది స్త్రీజాతికి పూర్వానుసారము సుమా. ఎంతటి ఆత్మబంధువులైనను మత వైషమ్యము లుంచుకొని తామే శ్రేష్ఠుల మని ఇతర దైవములను ఇతరులను ద్వేషించువార లెన్నటికిని మాన్యులుగారు. అట్టివారిం దరియుటయు హానికరము.

దాక్షాయణి:—దేవా! కాలవైపరీత్యముచే వైషమ్యభావ మూనిన మజ్జనకు నింతటితో త్రోసిపుచ్చందగునా? మా అయ్య మూర్ఖుడేయగును. ఐనను తొల్లి విరించిచే ప్రాజాపత్యపదవినంది స్రష్టయయ్యె. ఇపు డొకానొక నెపమున మిమ్ము ద్వేషించి మీ వైముఖ్యమునకుం గురియయ్యెనేని యధఃపతితుడగునుగదా. అట్టితరి విశుద్ధ ప్రకృతులగు సతీమతల్లు లీ విధికల్లోలములం గలుగనీక ప్రపంచమునకు ప్రశాంతి గలుగ జేయవలయునని నా మనవి.

శివుడు:—దాక్షాయణీ!(తెరలో ప్రకృతి విలయమొందును. భస్మమగును.) ఉప శ్రుతి విలయమును సూచించుచున్నది. ఎవ రక్కడ?

నందీశ్వరుడు:—(ప్రవేశించి) దేవా! దక్షానుచరులు మనకుయజ్ఞభాగ మీయమని నిందించుచు బోవుచుండిరి. శివాభావమగు నా యజ్ఞము దగ్ధమగు గాక అని మేమును శపియించితిమి.

శివుడు:—ఆతడు దక్షుడే యైనను అసూయాపిశాచగ్రస్తుడగుటచే నన్నిట అదక్షుడేయగును. ఇంతలో శాపమేల. ఇపుడా దక్షాధ్వరముంజూడ మీయమ్మ పయనమగుచున్నది.

నంది:—(తత్తరముతో) అయ్యో! ఆయ్యో! అమ్మా!

దా:—అత్యాహితమేమి?

శి:—అపాయమని.

దా:—ప్రాణేశా! అట్లనకుడు. కన్న బిడ్డలయెడకన్నవారి మనస్సులు వెన్నవలె నుండును. అభ్యంతరములు సెప్పక సెలవిండు.

శి:—దాక్షాయణీ! పోదగని తావులకుం బోయిన రాదగని యాపదలు రాకమానవు.



మదరాసు విశ్వవిద్యాలయమున ఈసంవత్సరము పట్టములబొందిన స్త్రీ పట్టభద్రలు.



పులవర్తి సరస్వతీకుమారి

ఆంధ్రపాఠకలోకమునకు చిరపరిచితురాలగు

శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవి గారి తనయ.



స్థానాపతి రుక్మిణమ్మగారు.
"గృహలక్ష్మి" పాఠకులకు చిరపరిచితురాలు.



స్విస్ సోదరీమణులచే
బందరులో నిర్వహింపబడుచుండు
ప్రసూతివైద్యాలయము. స్విస్ సోదరి అనాథ
శిశువుల నాదరించుట.



'స్వారి'

మనస్సు కీడునే శంకించుచున్నది. భవితవ్య మెటులున్నదో? నందీ! మీ యమ్మను దక్ష పురంబున విడచిరమ్మా. దేవీ! పయనిం పుము.

దా:—దేవా! చిత్తము. నే బోయెద.

న:—(స్వగతము. దేవి పోయివచ్చెద ననుటకుమారు పోయెదననుచున్నది. ఆశీర్వ చనములందును ప్రయాణములందును అశ్లీల ధ్వనులుండరాదు. కాగలది కాకమానదు) అమ్మా! ఇట్టిటు. (నిష్క్రమింతురు.)

*     *     *

రంగము—దక్షాధ్వరవాటిక

దక్షుడు, దాక్షాయణి, దేవతలు నుందురు.

దక్షుడు:—కుమారీ? పిలువని పేరంట మునకు వచ్చియు ఆ కొండవీటిజంగము దేవర యేమో మహాదేవుడని స్తోత్రము జేసెదవు పొమ్మావలకు.

దా:—తండ్రీ! ఆ కొండవీటిజంగము దేవరను నిండుభక్తి నారాధించిన కుబేరా దులు నిత్యశ్రీయుతులై యణిమాద్యష్ట విభూతులంది చరితార్థులైరి. మూఢులై నిందించినవా రధఃపతితులైరి.

ద:—ఇల్లు వాకిలిలేక వల్లకాట గాపుర ముండి బిడియము విడచి బిచ్చమెత్తుకొనుచు కొండలలో దిరుగుచుండెడువాని నిండుభక్తి నారాధించి చరితార్థులగుదురట అట్టి బ్రహ్మఘ్నుని కన్నియనిచ్చి వేదురునై చెడిపోతిని.

దా:—దుర్జనులయెడ తామసీ యగు నా రుద్రునియెడ నవినీతుడైన మూఢుడు తామసిగాకయుండునే. మహా దేవునికి నిండోలగంబున నవినయముంజూపిన యాచతుర్ముఖుని గతి నీవే స్మరించుచుంటివి గదా? అన్యోన్యాభేదస్వభావమున శుద్ధసత్వ స్వరూపుడై సత్యసంకల్పుడగు పుండరీ కాక్షుడు సకలలోకపూజ్యుండగుట దలం పుము. దేవతానింద నారకకారణంబగు.

ద:—జోగి పునుక నిడుకొని భిక్షాన్న మును గ్రసించు నావిరూపాక్షుని సాహ చర్యముచే నీకును మతిపోయినది. అబలవు ఒకమూలనుండక భక్తిమార్గము లుప దేశింపవచ్చితివా చాలు జాలు.

దా:—అబలనని నిరసింతువా? నేను బోధించునది ధర్మేతరమని నిందించు చుంటివా? సమస్త స్థావరజంగమ భూతా త్మకంబగు నీ యనంతప్రపంచంబునకు ఈ యబల మూలప్రకృతియని యెరుంగవా. అఖిల విద్యాధినేతయగు వాణి యెవ్వరు? సకల సంపదధిష్ఠాన దేవతయగు లక్ష్మి ఎవ్వరు? బుద్ధియు బలమును సంపదయు లేనిచో సృష్టిస్థితిలయముల కాధారమగున దెద్ది? నీ వెవ్వరు? ఎచ్చటనుంటివి? ఎట్టి యుత్సాహశక్తిచే జన్మమునేయ నెంచి ఈ పుణ్యసభాస్థలి నాసీనుడవై యుంటివి. అం తయు ప్రకృతి శక్తివలననే కదా. అట్టి ప్రకృతి శివాధీనమని యెరుంగుము. లేకున్న సర్వశూన్యము.

ద:—ఓసీ ! వెలరీ! ఈసభ విడచి పోయె దవా మెడబట్టి గెంటవలయునా?

దా:—(మండిపడి) దురాత్మా! నీ కడు పున బుట్టి దాక్షాయణీ సంజ్ఞచే నాయభవుని మోల చరించుట తగదు. నీమొగము జూడ రాదు. శివనిందామహాపాతకివి. ప్రపంచమునకు మూలప్రకృతియగు స్త్రీకి అవజ్ఞనొనర్చితివి. ఈ పాపఫల మిపుడే కట్టికుడుపును. శివాభావముగా నొనర్చిన నీక్రతువై నను సుఖాంతముగానేరదు. ధ్వంసమగును. మరణమాపాదించును. మహాదేవునానతి జవదాటి నీ కడుపద్రొక్కి నీ మొగము చూచిన పాపమున నపవిత్రమగు ఈదేహ మిక నిలువ రాదు. భస్మము గావలయును. ఈ ప్రకృతి వికృతినొంది మరల నూతనశోభ నందుగాక. (ఆకసమువంక జూచి) దేవా! మహానుభావా! ప్రకృతి భస్మమగుచున్నది. (దాక్షాయణి భస్మమగును. సభ్యులు హాహాకారము లొనర్తురు.)

దేవతలు:—భయముతో ఆహా! అదేమి! ప్రళయకాల భైరవునివలె నేదియో యొక మహాభూతము విజృంభించి ఈ వంకకు బరువెత్తి వచ్చుచున్నది.

నారదుడు:— దాక్షాయణి భస్మమగుటకుం గనలిన రుద్ర కోపాగ్నిమూర్తిందాల్చి దక్షాధ్వర ధ్వంస మొనర్ప వచ్చుచున్నది. (వీరభద్రుడు ప్రవేశించి రౌద్రముతో శివాభావభగు యజ్ఞము ధ్వంసము చేయును. వేల్పులను తన్నును. వేల్పులు పరుగువారుదురు.)

వీర:—ఓరీ సూర్యా! ఆదిశక్తిని పరాభవించుచుండ చూచి నవ్వితివటరా. (దంతము లూడదన్నును.)

సూర్యుడు:—రుద్రానుచరా! అపరాధిని. మన్నింపుము. (మరుగుపడును.)

వీర:—దక్షా! నీ విక లేవు. (తల నెగురగొట్టి) దిక్పాలులారా! యాగావసానమైనది. యాజినై దక్షుని శిరంబిదిగో పూర్ణాహుతిగావించుచున్నాడ. (దాని నగ్నియందు వ్రేల్చును)

బ్రహ్మ:—(వడకుచు) నారాయణా రమ్ము. యజ్ఞ వరదుండవు గమ్ము. (విష్ణువు ప్రవేశించును బ్రహ్మాదులు నమస్కరించి) దేవా ఇది యిటులైనది.

విష్ణు:—ఇది శివనిందా పాపఫలము. అవశ్యమనుభావ్యము.

గీ॥ ఆతడు మహామహుండు లోకైకవంద్యు
డభవుడాద్యుండు శంకరుం డాదిదేవు
డట్టి శివనిందనమొనర్చి యాచరించు
క్రతువు సెడకున్నె విఘ్నము గాంచకుండ.

మరియు నీ దక్షు డవివేకియై,

గీ॥ జగములకు మూలమా పరాశక్తినీత
డాత్మవిజ్ఞానశూన్యుడై యవమతిగనె
నట్టిపాపంబునకు ఫలమందె నిపుడె
యెవరి కర్మంబు వారల నేచకున్నె.

బ్రహ్మ:—దేవా! అజ్ఞానదోషమో దుష్కాలమై పరీత్యమో ఈ దక్షుడు శివుని

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
సంపాదించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

డాక్టరు. కె. యన్. కేసరి

# GRIHALAKSHMI

సంపుటము ౯ నవంబరు 1936 సంచిక ౯

# కృష్ణునిగురించి మావారు దిగులుగా యుండెడిది.















## హార్లిక్సు ఎక్కువబలము నిచ్చును

ఎదుగుచున్న బిడ్డలకు ఆటలయందేగాక పెరుగుటకుగూడ వారిబలము విశేషముగా వ్యయమగుచున్నది. ఈ పోయినబలమును తిరిగి పూర్తిచేయనియెడల, వారికి మిగిలియున్న సత్తువ తగ్గి, చికాకు పొడమి, శిథిలత జెందుదురు. హార్లిక్సునందు బిడ్డలకు కావలసిన పుష్టికరమైన పదార్థము లున్నవి. దానిని బిడ్డలకు ప్రతిరోజు ఉదయము 9 గంటలకుగాని, రాత్రి పరుండునపుడుగాని ఇచ్చిన మంచి బలవంతులగుదురు. దానిరుచి బిడ్డలకు మిక్కిలి ప్రీతిగానుండును. వెంటనే అది సత్తువను, దేహపుష్టిని చేకూర్చును.

**హార్లిక్సు శిథిలతనుండి కాపాడును**



# వీనితో చాలా కష్టం

## ఇతరపిల్లలలాగ ఇతడు సంతోషంగా ఎందు కుండగూడదు ?



డాక్టర్లు చీకాకుగా నిరుత్సాహంగా వుండేపిల్లలకు ఈచికిత్సలః
సిఫారసుచేస్తారు. చిఱచిఱలాడడం, చీకాకు ఇటువంటి గుణాలన్నీ, ఆవ
రములో పుష్టికరములైన వస్తువులు లేనందున కలిగే బలహీనానికి చిహ్నాలః
డాక్టర్లు గుర్తించారు. ఈలోపము సరిపోయి తిరిగి బలము చేకూడితే
సంతోషం ఉత్సాహం కలుగతవి.

అటువంటిసమయాల్లో స్కాట్సుఎమల్షన్ కంటె ఉత్తమమైనం
లేదు. ఎ.డి. వైటమినులతో గూడుకొని పుష్టికరమగు కాడ్లివరాయిల్ సహ
జంగా బలము కలిగించేది. దీనికితోడుగా స్కాట్సుఎమల్షన్ కాల్సియ
భాస్వరము లవణములతో చేరినందున పెరిగేశరీరాల్ని ఎముకల్ని అభివృ
చేసి పోయినబలాన్ని తిరిగియిస్తుంది. సేః
చుటకు ఇంపుగా జీర్ణించుటకు సులభం
వుండి స్కాట్సుఎమల్షన్ కాడ్లివరాయిః
కంటె మూడురెట్లు ఎక్కువబలమిస్తుంః

తలిదండ్రులకు

స్కాట్సుఎమల్షన్ ఎముకలపెంచుటలో పాలు,
వెన్నకంటె 80 రెట్లు మంచిది. గ్రుడ్లకం
టె రెండింతలు మంచిది. శరీరాన్ని పెం
చుటలో, వెన్నకంటె ౭రెట్లు మంచిది.
బనానాలకంటె 100 రెట్లు మంచిది.



### సంపూర్ణమైన చికిత్స

కాడ్లివరాయిల్ శరీరానికి గావలః
పదార్థాలు ఏవేవిఇస్తుందో, వాటినన్నిః
స్కాట్సుఎమల్షన్ యిస్తుంది. దీనిఫలిః
సంపూర్ణంగా పొందాలని కాడ్లివరాయి
వాడునపుడువలె డివైటమిను నిచ్చువ
వులుగాని, కాల్సియంగాని వేరుగా సేః
ంలసిన అవసరము వుండదు. రోగములవల్ల బలహీనత యేర్పడినపుడు పిల్లలకు పెద్దలకుకూడా బలము చేకూర్చుకోడాని కింతకం
త్తమమార్గం లేదు. స్కాట్సుఎమల్షన్ దగ్గు, జలుబు, ఇన్ఫ్లుయింజా మొదలైన అంటురోగాల్ని రాకుండా ఆపుతుంది. ఇది డాక్ట
ః అరవైయేండ్లుగా సిఫారస్ చేయబడుతూవుంది.

# SCOTT'S Emulsion

శుద్ధమైన కాడ్లివరాయిల్ నుండి

స్కాట్సు ఎమల్షను మండీవర్తకులు: ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్,
కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా,
అహమ్మదాబాదు, కొచ్చిను, కలికట్, విశాఖపట్టణము, కరాచి, అమృతసరము.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రిగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు. (పెద్దచావిడి దగ్గర)
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని
జెమ్ షెడ్ పూర్: వి. కొండల్రావుగారు, అకౌంట్సు ఆఫీసు.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్ కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. నూకరాజుగారు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూస్ ఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు.
కాకినాడ: నున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్ బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
మచిలీపట్టణం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్ పేట.
కర్నూలు: టి. బాలనాగయ్య శెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.
నెల్లూరు: పంచాగ్నుల వెంకటనరసింహంగారు.
కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకోనుడు.

# విషయసూచిక



త్రివర్ణ చిత్రము

నల దమయంతులు

# కాంగ్రెసు అఖండవిజయము

## మువ్వురు స్త్రీలు గెలుపొందుట

మదరాసు పురపాలక ఎన్నికలకు కాంగ్రెసువారు మూడుస్థానములకు శ్రీమతులు రుక్మిణిలక్ష్మీపతి, అమ్ము స్వామినాథన్, శ్రీమతి విశాలాక్షమ్మగారలను నిల్పిరి. వీరందరు ఎక్కువ పలుకుబడిగల తమ ప్రత్యర్థులనోడించి జయించిరి. వీరికి జయముగూర్చిన వోటర్లను — ముఖ్యముగ స్త్రీ వోటర్లను—ప్రశంసించుచున్నాము.

ఈ ఎన్నికల పట్టీయందు 7000 మంది స్త్రీవోటరులు గలరు. వీరిలో చాలమంది కాంగ్రెసువారికే వోట్లనిచ్చుట శ్లాఘాపాత్రము. వీరు ఓట్లనిచ్చుటయందు జూపిన ఉత్సాహమమితము. నడువలేని ముదుసలులు విద్యావిహీనులైన స్త్రీలు పెక్కురు అక్కరతో అరుదెంచి తమ హక్కులను సద్వినియోగము జేసిరి.




ఎక్కువ పలుకుబడిగలిగిన జస్టిసునాయకుడగు సుందరరావునాయుడుగారిని ఎన్నికలందుఓడించి శ్రీమతి రుక్మిణిలక్ష్మీపతిగారు జయమందిరి.

వీరికింతటి యుత్సాహము బుట్టించుటకు కాంగ్రెసు తరఫున గావించిన ఎన్నికల ప్రచారణలో చాలమంది స్త్రీలు పాల్గొనిరి. తమ సోదరీమణుల కుత్సాహముతో బాటు వారి విధాయకముల గుర్తింపజేసిరి. జాతిమత భేదములు లేక కాంగ్రెసు విజయములకు తోడ్పడిన అందరికిని మా అభినందనములు.

ఈ ఎన్నికలు మదరాసు కార్పొరేషను చరిత్రయందు నూతన శకము ప్రారంభించినవి. కాంగ్రెసు పలుకుబడి, ప్రభావమెట్టిదో బైటబడినది. ఇపుడైన ఇతర పక్షములన్నియు నొక్కటై భేదాభిప్రాయములవీడి అన్ని పక్షములకును — ప్రజాబాహుళ్యమున కత్యావశ్యములైన పురపాలక విషయములందు చెన్నపురి నభివృద్ధికి తెచ్చుటకు ప్రయత్నింతును గాక.

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్థ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతి లేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువమేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందియవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 20 0 0 అరపుటకు రు. 12 8 0 కాలుపుటకు రు. 8 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్థసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు

వ........పోవసమకట్టి యక్కోమలి మేలుకొనకుండ మెల్లన దాని వస్త్రంబునం దర్ధంబు సించి తనకుం బరిధానంబు సేసికొని వెలువడి కొండొకనేలపోయి దమయంతియందు ఘనంబైన తననెయ్యంబను తీగం ద్రెంపనేరక క్రమ్మఱ నచ్చోటికి వచ్చి,

చ. కలి దమయంతిఁ బాపసమకట్టు సతిం బతి వాయనోపఁ డా
లలనను దీర్ఘసౌహృదబలంబున నట్టులు రెంటఁ జేసి య
న్నలుఁడు విశృంఖలహారజ్జల బెనంగి గతాగతకారియైన య
య్యులయునుబోలె నూఁటాడక యెంతయుఁ బ్రొద్దు పనిచ్చె తాత్మ్యఁడై.

( భారతము)





# బొంబాయి మతకలహములు

ప్రపంచములో ప్రఖ్యాతమతముల స్థాపించిన ప్రవక్తలందరును పరమతసహనము పరమోత్కృష్టముగ పరిగణించి తమ యను చరులకు బోధించిరి. కాని కాలక్రమమున ప్రజలు వారిమతము లనుసరించుచు ముఖ్య సిద్ధాంతములను మాత్రము మరుగుచేయుచు తమ యిష్టమువచ్చినటుల వ్యాఖ్యానముల గావించుకొని మతము పేరట నానా యనాచారములను యకృత్యములను జేయు చువచ్చిరి. కావుననే ప్రపంచ మీనా డింత యలజడి కాలవాలమై జీవితము దుర్భరమగుచున్నది.

నేడు బొంబాయినగరమున మరల మత కలహములు బైలు దేరినవి. బొంబాయి యందు బైకుల్లాయను స్థలమున నొక మారుతీదేవాలయమును, ఒక మసీదును ప్రక్క-ప్రక్కననే గలవు. మారుతీ దేవాల యము ముందు సభామండపము కట్టుటకు హిందువు లుద్దేశించి పురపాలకుల యను మతిగొని కార్యమున కుపక్రమింపగా మహమ్మదీయ సోదరులు దాని కాటంకము గల్గించిరి. దానితో కలహము లారంభమై పట్టణమంతయు ప్రాకినవి. హిందూ మహ మ్మదీయులు గుంపులుగజేరి వివిధాయుధ ముల ధరించి యొకరినొకరు నిష్కారణ ముగ గాయపరుచుకొనుచు వారి కలహము లం దేమాత్రము సంబంధములేని నిరపరాధు లను హింసించుచున్నారు. పెక్కు దుకా ణములను దోపిడిచేయుచున్నారు. ప్రభు త్వమువారు మారణయంత్రములతో భయ పెట్టినను యీదుండగము లాగుటలేదు.

బహుశా యీ పోరాటమునందు పాల్గొనువారందరు మతముపేరట—స్వమత సంరక్షణ కొరకు — పోరాడుచున్నామను భ్రమకు లోనై యుండవచ్చును. అన్ని మతములందును ముఖ్యసిద్ధాంత మొక్కటియె. పద్ధతులు వేరైన గావచ్చును. ప్రతి మత మపరమతములయందు సహనత జూపవలయునని ఘోషించుచున్నది. ఇవన్నియు నట్లుండనిచ్చినను, సభామంటపమును నిర్మించుకొనుటలో నిర్మింపకుండుటలో నే మతమునకు, నష్టముగాని కళంకముగాని గలుగదుగదా? ప్రతిమతము మానవాభివృద్ధికై స్థాపింపబడియుండ ఆమతముపేరట చేయు పనులు మాత్రము మానవాభివృద్ధి కాటంకములై యుండునట్లేల జేయవలెను?

ఇట్టి మతకలహములు హిందూదేశమునకు మహమ్మదీయులు వచ్చిననాటినుండి సాంప్రదాయములై యుండలేదు. నాడు జరిగిన యుద్ధములు కేవలము రాజ్యకాంక్షచేతనేగాని మతముపేరిటనే యని జెప్పజాలము. ఒకమారు మహమ్మదీయులను హిందువులుగాని, హిందువులను మహమ్మదీయులుగాని యుద్ధరంగమున జయించి వారి దేశమును స్వాధీనపరచికొన్నచో నంతటితో కలహము లంతరించెడివి. అంతియగాని తరువాత దేవాలయములకని మసీదులకని పోరాటము లెపుడు ఇంత భీభత్సముగనుండినట్లు గానరావు. మహమ్మదీయ ప్రాబల్యమునకు వెరచి హిందువులూరకుండిరని యనుటకూడ సమంజసముగ లేదు. హిందూదేశమున రాజ్యాధికారము వహించిన మహమ్మదీయ ప్రభువులందరు మతకాంక్షచే దేవాలయములను హిందువులను హింసించినవారని చెప్పుటకు నిదర్శనములు లేవు. ఒకవేళ ఆరంభమున నట్లున్నను కాలక్రమమున సహనముతో నుండినట్లే గనబడుచున్నది. దీనికి నిదర్శనముగా పెక్కు పట్టణములలో దేవాలయములును మసీదులును ప్రక్కప్రక్కననే గలవు. హిందూదేశమునం దంతయు ప్రసిద్ధిజెందిన కాశీనగరమునందు ప్రసిద్ధమైన దేవాలయమును మసీదును ఒకదానినొకటి యానుకొనియే యున్నవి. దక్షిణదేశమున కొంతకాల మెల్లరికి సింహస్వప్నమై, పాశ్చాత్యులచే క్రూరత్వమున కాలవాలమైనవాడను యర్థముతో "వ్యాఘ్రము"మని పిలువబడుచుండిన టిప్పుసుల్తాను నివసించుచుండిన బెంగుళూరునందును, శ్రీరంగపట్టణమునందును ఆతని రాజభవనమున కతిసమీపముననే దేవాలయములును మసీదులుగలవు గదా! ఈనాటివలె వారికి మతసహనము లేకున్నా డివి యెట్లు సమకూరియుండెడివో తెలియకున్నది.

ఇన్ని శతాబ్దములనుండి ప్రబలుచు వచ్చిన హిందూ మహమ్మదీయమతములు రెండును బొంబాయినగరమున నేడొక మారుతీమంటప నిర్మాణముపై నాధారపడుటతి శోచనీయము. ఆమండపనిర్మాణము మతాచారముల కాటంకమని మహమ్మదీయులును, నిర్మింపకుండుట హిందూమతా

చారమున లోపమని హిందువులు నెంచుట సిగ్గుపాటు. ఇట్టి స్వల్పవిషయములపై నాధారపడి కలహముల గల్పించునవి మతములా? దీనికై పోరాటమారంభించిన మొదరోజులలో 58 మందిని బలిజేసి సుమారు 500 మందిని వైద్యాలయముల కనుపుటయా? తుదకు ప్రభుత్వమువారిచే ప్రక్కలు విరిగినతరువాత తమయజ్ఞానము నెఱుగుటయా?

ఇపు డింత తీవ్రముగ మతముపేరట పోరాడుచున్న హిందూ మహమ్మదీయ సోదరులలో తమతమ మతములనుగూర్చి తెలిసికొన్నవారును, ఇప్పటి పోరాటమం దెంత న్యాయముగలదో యెఱిగినవారును ఉండరన్నవింతగాదు. కాని కేవలము పోరాటము కోసర మందు పాల్గొనువారే యెక్కువ. వీరందరు దుండగీడుల మూకలకు జేరినవారే! తెలిసినపెద్దలు వచించిన రీతి సహనముతో మెలంగక పోరి యిరు పక్షములకు నష్టము గల్గించి వీరందరు ప్రభుత్వమువారిచే శాస్తినిబొందిన తరువాతనే సహనము వహింతురు. ఇకనైన భారతీయు లట్టి భ్రమలకులోనై లేనిపోనివాటికి మతముపేరట పోరాడుచు అధఃపతితులగుటకంటె ఉత్తమమతమగు ఐకమత్యము చెడకుండ ప్రవర్తించుచు యుక్తాయుక్త వివేకముగలిగి ప్రవర్తింతురని యాశింతుము.

హిందూదేశచరిత్రలో ప్రకృత ప్రభుత్వ పరిపాలనను మించిన రాజ్యపాలన మింతవఱకు గానరాదని పాశ్చాత్య మహాశయులచే గొనియాడబడుచున్న నీ పరిపాలనయందు నిటువంటికలహము లెక్కువ యగుచుండుట భారతీయుల దురదృష్టము. హిందూమహమ్మదీయులందరు ఆత్మబుద్ధి సుఖమనుమాట మరువక పరబుద్ధి వినాశకరమని గుర్తించు టుత్తమము. ప్రభుత్వమీ కలహబీజములను తుదముట్ట నిర్మూలించి ప్రజల కామోదము గల్గింతురని కోరుచున్నాము.

భావిభారతదేశము నిట్టి యనర్థములు జరుగకుండ భారతీయ సోదరీమణులందరు, భావిభారత పౌరులుగాబోవు తమ సంతానమునకు మతసహనము ఉగ్గుపాలతో బోయుదురుగాక.



# ** పాశ్చాత్య ప్రపంచము **

పాశ్చాత్య ప్రపంచమునకు యూరపుఖండమే కేంద్రస్థానమై యున్నది. మానవాభివృద్ధికిని మానవ వినాశమునకును మూలమైన సిద్ధాంతములు, విప్లవములు, యుద్ధములు యూరపుఖండమునందే ప్రభవించి ప్రపంచమునంతయు వ్యాపించుచున్నవి. నేడు యూరపుఖండమంతయు నల్లకల్లోలముగ నున్నది. రాజకీయ,సాంఘిక ఆర్థికస్థితులన్నియు వివిధమార్పులకు లోనగుచున్నవి. ప్రపంచమునకు ప్రళయమును దెచ్చిపెట్టు యుద్ధవాసనలు వచ్చుచున్నవి.

సాధారణ విప్లవరూపమున బైలుదేరిన స్పెయినుదేశపు వ్యవహారములు ప్రచండ యుద్ధములుగా పరిణమించి దేశమునంతయు ధ్వంసము చేయుచున్నవి. ప్రభుత్వ మెంత ప్రయత్నించినను విప్లవకారుల నణచలేక పోవుచున్నారు. ప్రజలందరు ప్రభుత్వపక్షమున పోరాడుచున్నారు. వీరిలో పెక్కుమంది స్త్రీలు. స్త్రీసైన్యము నానాటికి వృద్ధియై పురుషులకంటె ధైర్యసాహసములందు యుద్ధనిపుణతయం దధికులగుచున్నారని వార్తలు దెలుపుచున్నవి. కాని దైవము వారిపాలలేదు. క్రమక్రమముగా విప్లవసేనలు రాజధానియగు మాడ్రిడ్ నగరమును సమీపించుచున్నవి. అదికూడ కొలదికాలములో వారిచేజిక్కవచ్చును.

స్థిరపడియుండు ప్రభుత్వము నింతకాలము విప్లవకారు లెదిరించి విజయులగుచుండుటలో రహస్యము లేకపోలేదు. స్పెయినుదేశపు వ్యవహారములలో జోక్యము పుచ్చుకొనగూడదని యొడంబడిక చేసికొన్న దేశములే—జర్మనీ, ఇటలీ పోర్చుగల్—విప్లవకారులకు కావలసినంత సాహాయ్యము చేయుచున్నవి. ఈ దేశములన్న గిట్టనిదగు రష్యా వారు చేయుచున్న మోసమును గుర్తించి మండిపడినది. జర్మని ఇటలీ దేశములు ఒడంబడికను భగ్నము జేయుచున్నవనియు, వెంటనే అది మానుకొనకున్న ఇతరదేశము లిట్లు మానుకొనుటకు మందలింపకున్న స్పెయిను ప్రభుత్వమునకు సాయము చేయుదునని ప్రకటించెను. ఒడంబడిక భంగము చేయుచున్న దేశములు తాము చేయుచున్నవానికి సిగ్గుపడుటకు మారు యథాప్రకారముగా వర్తించుచున్నవి. ఇటలీ రష్యా ప్రకటనవిని తాను విప్లవకారులకు సాయపడెదనని యన్నది. లోలోపల వారివారి యిష్టానుసారము ప్రవర్తించుచున్నను పైపైన అన్ని దేశముల ప్రతినిధులు సమావేశములు జరుపుచు ఒకరి నొకరు నిందించుకొనుచున్నారు. ఈపరిస్థితులలో యే కించిత్కారణమో ప్రపంచ

యుద్ధమును తెచ్చిపెట్టుచో నాశ్చర్య ముండదు.

* * *

యూరపునందలి యలజడికే ప్రపంచము జడియుచుండ ప్రాచ్యభాగమునగూడ యుద్ధమేఘము లావరించుచున్నవి. తూర్పుదేశములలో దురాశ యెక్కువై ఇతరదేశముల కబళించ జపాను నిరంతరము ప్రయత్నించుచున్నది. యూరపునందు జర్మని యిటలీ ఆశయములెట్టివో ఆసియాయందు జపానుఆశయము లట్టివి. కొలది కాలముక్రిందటనుండి జపానువారి నిరంకుశ చర్యల నోర్చుకొనజాలక చైనీయులు కొందరు కొన్ని సంఘములుగా నేర్పడి జపానువారి కెదురుగా ప్రచారము చేయుచున్నారు. వీరిలో కొంతమంది జపాను నావికులను మట్టుపెట్టిరి. దానిపై జపాను అమితాగ్రహమంది సైన్య మాయత్తముచేసి చైనా ప్రభుత్వమువారిని తగనికోరికలు కోరినది. చైనా జపానుకు ఘోరయుద్ధ మారంభమగునని ప్రపంచమంతయు దలంచినది. కాని దైవానుగ్రహమున అది తప్పిపోయినది. ఈసమాచారము పూర్తిగా అణగిపోవకముందే ఇంకొకభయంకరవార్త వ్యాపించినది. రష్యాదేశపు సరిహద్దులందు జపాను రష్యాసైనికులకు సంఘర్షణ ఆరంభమైనదనియు రెండుదేశముల సేనలు సరిహద్దులందాయత్తమై యున్నవనియు వార్తలు వచ్చినవి. జపాను రష్యాలు దలపడుచో ప్రపంచయుద్ధము రాకమానదు. రష్యా యన్న గిట్టని జర్మని ఇటలీలు జపానుకు సాయముచేయవచ్చును. రష్యాకు మిత్రములై జర్మని యిటలీల యభివృద్ధికోర్వని ఫ్రాన్సు ఇంగ్లండు దేశములు రష్యాకు సాయపడవచ్చును. ఈ వార్తలుగూడ అంతరించినవి. ప్రపంచవాసుల భయముదొలగినది. కాని యెపుడో కొంపలంటుకొనునను సందియముమాత్ర మేరిని బాయకున్నది.

* * *

డిక్టేటర్లు_నియంతలు_నానాటికెక్కువయగుటయగాక తమ త్రోవల నిరంకుశముగా జేసికొనుచున్నారు. రష్యానియంత స్టాలిన్ మహాశయుడు తన నిరంకుశత్వమును తుదముట్టింపజేయ సంకల్పించిన 16 మంది కుట్రదారులను సోవియట్‌నందలి సుప్రసిద్ధ పురుషుల నందరిని తుదముట్టించెనను వార్త ప్రపంచమునంతయు నిశ్చేష్టపడజేసెను. కాని నేడు వారందరు రష్యాయందలి సుప్రసిద్ధ కర్మాగారములందు పనిజేయుచున్నారని తెలియుచున్నది.

ఆస్ట్రియాదేశాధ్యక్షుడగు షూష్నిగ్ తన ప్రతిద్వంద్వియు, సామ్రాజ్యవాదులనాయకుడును అగు రాకుమారుని అతని యనుచరులను యధికారమునుండి తొలగించి నిరంకుశత్వమును స్థిరపరచుకొన్నాడు. ఇతడింక మీదట యే యితర నియంతలతోజేరి గగ్గోలుజేయునో తెలియకయున్నది.

* * *

ప్రపంచమహాయుద్ధమునకు కారణమైన ఆస్ట్రియా దేశపు రాకుమారునిహత్య జరిగిన నాడు ఏ రాజకీయ యార్థిక శాస్త్రజ్ఞునికైన ఆహత్యవలనగలుగు యుద్ధమునందు 80 లక్షలమంది మృతులయ్యెదరని 3,000 కోట్ల పౌనుల ధనము వ్యయమగుననియు నెవరైన చెప్పియుండిన వారునమ్మక "అట్టియుద్ధము జరుగదు, అంతధనము ప్రపంచములోలేదు; అంతమంది మరణమునకు ప్రపంచము సహింపదు"అనియుండెడివారు. కాని అది జరిగితీరినదిగదా?

ఇప్పటికి 18 సంవత్సరముల క్రిందకూడ ప్రపంచమును నిట్టి వాతావరణమే ఆవరించి యుండెను గాని యెవరును పూర్తిగా దాని నెదుర్కొన తయారై యుండలేదు. అందుచే యుద్ధము నాల్గుసంవత్సరములు జరగడము అమితముగా ధనము జనులు నష్టముగావడము జరిగినది. కాని నేడట్లుగాదు. ప్రతిదేశము విరివిగా యుద్ధసామగ్రి తయారుజేసికొను టయగాక "సంగ్రామక్రీడలు" ఆడుచున్నది. ప్రపంచమున నిప్పటికి పలు దేశములీ యాటలకై సుమారు 100 కోట్ల పౌనులు ఖర్చుచేసినవి. దీనిలో యుద్ధసామగ్రికి సైన్యమునకు దాని నిర్మాణమునకు అగు ఖర్చులు చేర్పబడలేదు. బ్రిటిషు ప్రభుత్వము 30 కోట్ల పౌనులును, జర్మని 80 కోట్ల పౌనులును, రష్యా 100 కోట్ల పౌనులును, అమెరికా 45 కోట్ల పౌనులును, ఫ్రాన్సు 35 కోట్ల పౌనులును (అవసరమగు యుద్ధ ఖర్చులకు 70 కోట్లను లుగాక) వ్యయము చేయదలంచినవి. ఇవి కొన్ని యుదాహరణములమాత్రమె. ఈ వ్యయము సంవత్సర సంవత్సర మెక్కువగు చున్నది. అంతియగాక అమెరికా 2,000 మైళ్ల దూరములో సముద్రముమీద సంగ్రామక్రీడలాడుచు (నావికాబలముతో) 2 కోట్ల పౌనులు ఖర్చుపెట్టినది. వారు ముగించినతరువాత జపానువారు ప్రారంభించి 150 లక్షల పౌనుల ఖర్చుతో ముగించిరి. ఇంకను ఎన్నో దేశము లెన్నో విధముల నిట్టి క్రీడలాడుచున్నవి. ఇదంతయు నెందులకు? మానవసౌభాగ్యమునకా? వినాశమునకా?

15 అం. షెల్ కాల్చుటకు 800 పౌనులును, ఒక టార్పెడో కాల్చుటకు 1,200 పౌనులును ఖర్చు అగుచున్న భావికాలపు యుద్ధమునందు వ్యయమగు ధనము, జీవ కోట్లు సులభముగ దలంపనగును.

ఈ ధనములో, పరిశ్రమలో, అక్కరలో శతాంశమైనను కర్చుపెట్టి మానవాభివృద్ధికి పాటుపడిన నేడు ప్రజలందుగల దుర్భరజీవితము దొలగి యెంతేని సుఖముగలుగును. కాని దాని తలంచువారీ ప్రపంచమున నెందైనగలరా?

# అబ్దుల్లాగాంధికి మాతృదేవి కస్తూరిబాయిగారి హితబోధ

ఇటీవల మదరాసులో ఒకనాడు అర్ధరాత్రివేళ రాజవీధిలో నీవు తప్పత్రాగి తందనాలాడుచుండగా పోలీసువారు అరెస్టుచేసిరనియు మరునాడు మేజస్ట్రేటు కోర్టుకు తీసుకొనివెళ్లిరనియు మేజస్ట్రేటు ఒకరూపాయి మాత్రమే జుల్మానా వేసెననియును నేను వింటిని. నీకు మేజస్ట్రేటు ఇంతతక్కువ శిక్ష వేయుటవలన నతడు చాల దయగలవాడనియే నేను తలచుచున్నాను. నీ తండ్రిపట్లగల గౌరవమువలననే మేజస్ట్రేటుగూడ నీకింత తక్కువ శిక్షను విధించెను. మదరాసులో చాల విఖ్యాతుడగు నొక ప్రముఖునియింట నీ వతిథిగానుండి అటనుండి వెడలిపోయి యీరీతిగా అపఖ్యాతికి పాత్రుడైతివని వింటిని. దీనివలన నీకు బసయిచ్చిన ప్రముఖునకు చాల అసంతృప్తి కలిగియుండును. ఈ వార్త వినినప్పటినుండియును నాకధికమగు మనోవ్యథ కలిగినది. ఆరాత్రి నీ ప్రవర్తన మిక్కిలి నింద్యము. అనేక సంవత్సరములనుండి నేను హితోపదేశము చేయుచున్నను నీప్రవర్తనరోజు రోజుకు మరింత నింద్యమేయగుచున్నది.

నీవు నా కడుపునబుట్టియు శత్రువుని వలెనే మెలగుచున్నావు. నీ దుష్ప్రవర్తనమున నాకు జీవితమే దుర్భరమగుచున్నది. వార్ధక్యములో నీ తలిదండ్రులమగు మాకు నీవు చాల మనస్తాపములను కలిగించుచున్నావు గాన నీవు మిక్కిలి పాపకార్యమును చేయుచున్నావు. నీవు సిగ్గుబిడియములను పూర్తిగా వదలివేసితివి.

నిన్నుగూర్చి వార్తాపత్రికలలో మరల నెట్టి దుర్వార్తలు వెలువడునో యని ప్రతిదినమును నిద్రలేవగనే మనసు కంపించి పోవుచుండును. నీ వెచటనున్నావో ఎచట నిద్రించుచున్నావో, ఏమివస్తువులను తినుచున్నావో, తినరాని వస్తువులనుగూడ తినుచున్నావేమో అని నేను చాల పరితపించుచుందును. నీవు నాకు పెద్దకుమారుడవు. నీ కిపుడు 50 యేళ్లున్నవి. నిన్ను చూడవలెనను కోరిక నాకు తరుచుగా కలుగుచుండును గాని నీ వెక్కడనున్నావో నాకు తెలియదు. నీవద్దకు వచ్చినచో నన్నుగూడ నవమానపరచెదవేమో అను భయముగూడ నాకు కలుగుచుండును.

దక్షిణదేశమున సభలలో మాటలాడుచు నీ తండ్రిని నిందించితి వనియును నీతండ్రిని ఎగతాళి చేయుచు మాటలాడితివనియును నేను వింటిని. నీతండ్రి నిన్నుగూర్చి యెవరితోను యేమియును పలుకడు. కాని నీ దుర్వర్తనమువలన నీతండ్రిగుండెలు పగులుచుండునని నేను తలచెదను. నీవు తరుచుగా మాకు దుఃఖమును కలిగించుచుండుట నరక హేతు వేయగును. కన్నతండ్రిని సభలోనిందించి పరిహసించుట నీకెంత మాత్రమును ఉచితముకాదు. ఇందువలన ప్రజలకు నీపైగల నిరసనభావము మరింత అధికమగునే గాని జగద్విఖ్యాతుడగు నీ తండ్రికీర్తి కెట్టి కళంకమును కలుగదు. నీతండ్రి నిన్ను మనసార ప్రేమించుచునే యున్నాడు. ప్రజలందరును నీతివర్తనులుగా నుండుడని నీతండ్రి నిరంతరమును బోధించుచుండును. నీతివర్తనము నీ జనకునకు ముఖ్యతేనుము.

"నాదగ్గరనే యుండుము. నీకు అన్నవస్త్రములనిచ్చి పోషించెదను. నీకు ఆరోగ్యమును కలిగించెదను" అని నీతండ్రి చాల సారులు నీకు బోధించెను గాని నీవు వినలేదు. నీవు వట్టి కృతఘ్నుడవు. నీతండ్రికి ప్రజలందరునుగూడ ఆప్తబంధువులే. అతడు నీవిషయమున నింకేమియును చేయజాలడు.

నీ ప్రారబ్ధ మిటులున్నదని విచారించుచు మిన్నకుండును. అతని కనేకబాధ్యత లున్నవి. భగవదనుగ్రహమున నీతండ్రికపారమగు మనోదార్ఢ్యము కలదు.

భగవంతుని సంకల్పమున ప్రపంచమున నెరవేర్చుటకు దయామయుడు సర్వేశ్వరుడు నీ తండ్రికి దీర్ఘాయురారోగ్యాదుల నొసగుగాక. నేను ఆడుదాననగుటచే నాకట్టి మనోనిబ్బరము లేదు. అందువలన నీదుస్స్థితికి నేను నిరంతరమును కుమిలిపోవుచున్నాను. నీవు నా కెక్కడను శాంతిలేకుండ చేసితివి.

నీదుష్ప్రవర్తననుగూర్చి ప్రతిదినమును నీతండ్రికి వుత్తరములు వచ్చుచునేయుండును. నీ ప్రవర్తనవలన

కలుగుచున్న దుర్భరావమానమువలన నేను మిత్రుల యిళ్లకుగూడ వెళ్లుట మానివేసితిని. నీతండ్రి నీకృతఘ్నతను ఎల్లప్రుడును క్షమించుచునేయుండునుగాని భగవంతుడటుల క్షమించడు.

నీవు మహమ్మదీయ మతమున నెందులకు కలసితివో నాకు తెలియదు. అది నాకనవసరము. ప్రతిచోటున హిందువులందరును మహమ్మదీయమతములో కలియవలెనని నీవు సభలలోను సంభాషణలలోను బోధించుచుందువని నేను వింటిని. మతమునుగురించి నీ కేమైన తెలియునా? నీ విట్లు తలకుమీరిన పనుల నేల చేసెదవు?

ప్రస్తుతస్థితిలో యుక్తాయుక్తముల విచారము చేయగలశక్తి నీ కెటుల కలుగును? గాంధిమహాత్ముని కుమారుడవని ప్రజ లిప్పటికిని నిన్ను గౌరవించుచున్నారు. ఆకారణమున అమాయకులగువారు నీ దురోచ్ఛనలను విని చెడిపోవుటగూడ తటస్థించునేమోయని నేను భయపడుచున్నాను. మతమును గూర్చి బోధించుటకు నీవు అర్హుడవు కావు.

నీకు ఎవరు ధనమిత్తురో వారికి నీవు బానిసగానుందువు. ధనమిచ్చువారిని నీవు ప్రేమించెదవు. ఆ ధనమును దుర్వినియోగముచేసి సారాయి త్రాగి సభలలో నుపన్యసించెదవు.

నీవు నీ ఆత్మనుగూడ ధ్వంసము చేయుచున్నావు. కొంతకాల మగుసరికి యిపుడు నిన్నాదరించుచున్న మహమ్మదీయులుగూడ నిను దరి జేరనీయరు.

ఇపుడైనను నీప్రవర్తనను మార్చుకొనుము. నీవు మహమ్మదీయుడవగుట నాకెంతమాత్రమును యిష్టము లేదు. గాని నీవు చేసిన ప్రకటనలో నీవు తెలిపినట్లు యిటుపైని నీవు మద్యపానము వ్యభిచారము మున్నగు దుర్వర్తనలను వదలివేసెదవని తలచి నేను లోలోపల చాల సంతసించితిని. అట్టి సంతసమునకు గూడ నేను నోచుకొనలేదు. మతముమారినను నీకు మతిమారలేదు. నీవు మహమ్మదీయుడ వైనపిమ్మట నీ ప్రవర్తన మరింత ఆధ్వాన్నమైనదని బొంబాయినుండి చాలమంది వ్రాసిరి.

నీ దుర్వర్తనమున నీ కుమారుడును నీకుమార్తెలును అల్లుండ్రును మిక్కిలి విచారించుచున్నారు.

నా కుమారుని మహమ్మదీయ మతములో కలుపుటకును అతనిని దక్షిణదేశమున త్రిప్పుటకును కారకులగు మహమ్మదీయసోదరులారా! మీప్రవర్తన నాకు అగ్రాహ్యముగా నున్నది. మహమ్మదీయులలో ధీమంతులగువారును మాకు చిరమిత్రులగువారును యీ చర్యనంతనుపూర్తిగా గర్హించుచునేయున్నారు.

సుగుణ ఖనియగు డాక్టరు అన్సారీగారు జీవించియున్నచో మీకును నా కుమారునకునుగూడ నదుపదేశమును చేసియుందురు. అట్టిప్రముఖులు మీకు సదుపదేశమును చేసెదరనియే నేను నమ్మెదను.

ఇస్లాంమతములో కలియుటవలన నాకుమారుని వర్తనము బాగుపడకపోవుటయే గాక మరింత పాడగుచున్నదనిగూడ తెలియుచున్నది. మీరతనిని మందలించి సన్మార్గమునకు మరలించవలెను. నాకుమారునకెవరో కొందరు మౌల్వీ అను బిరుదము నిచ్చిరనిగూడ వింటిని. త్రాగుబోతులకు మౌల్వీ అను బిరుదముల నిచ్చుటకు మహమ్మదీయమత మంగీకరించునా?

మదరాసులో నాకొడుకు త్రాగి అల్లరి చేసిన పిమ్మటగూడ మహమ్మదీయులు కొందరు రైలుస్టేషనులో వీడ్కోలుపును సలిపిరని వింటిని.

ఈరీతిగా మీరు వీనిని రెచ్చగొట్టుటవలన మీకేమి లాభము కలుగగలదు? అతనిపైని మీకు మనఃపూర్వకమగు సోదరప్రేమ యున్నయెడల మీరెటుల చేయురు. మీరు చేయుచున్న పనివలన అతని కెట్టిమేలును కలుగుట లేదు. మమ్ముల నవమానపరుచుటయే మీవుద్దేశమైనచో నేను చెప్పవలసిన దేమియులేదు. మీ యిష్టము వచ్చినటుల చేయుడు. కాని కన్నతల్లియొక్క మనఃక్షోభ మీలో ఉత్తములగువారు మనసులలో పరివర్తనముల కలిగింపకమానదు. మీరు నాకుమారునివిషయమున చేయుచున్న పనివలన భగవంతునికి సంతృప్తి కలుగదనిమాత్రము నేను చెప్పగలను.

# స్త్రీ పురుష సమానత్వమావశ్యకమా ఎందేని యనర్థదాయకమా?

[1935-వ సంవత్సరము దసరాసంచికయందు పై విషయముపై ఉత్తమవ్యాసము వ్రాసినవారికి బహుమతి యివ్వబడునని ప్రకటించితిమి. కొంతమంది సోదరీమణులు పోటీవ్యాసములబంపిరి. వానిలో ప్రథమ ద్వితీయ బహుమతులందిన వ్యాసములిచ్చోట ప్రకటింపబడినవి.]

ఏదేశమైన మహోన్నతదశయందున్నదన్న దానికి కారణభూతులు స్త్రీలే. ఏదేశమైన హైన్యస్థితియందున్నదన్న దానికి కారణభూతులు స్త్రీలే. స్త్రీ ఏ యవస్థయందుండునో దేశముకూడా అదియే అవస్థయందుండును. స్త్రీ గౌరవమే దేశగౌరవము. నారీకల్యాణ సౌభాగ్యమే దేశకల్యాణ సౌభాగ్యము. మహిళాభివృద్ధియే దేశాభివృద్ధి. సగముప్రజ లధోగతియందున్న యే దేశమును వృద్ధికిరాదని వేరుగా వచింపబనిలేదు. దేశమున సగము ప్రజలు స్త్రీలే కదా. కనుక స్త్రీలు వెనుకపడుట దేశము వెనుకపడుటయే. స్త్రీ పురుషులు సమాన స్థితియందున్నప్పుడే స్వరాజ్యమున కర్హత. జపాన్, టర్కీ, రష్యా దేశములు స్వతంత్ర దేశములగుట స్త్రీ పురుష సమానత్వమా దేశములయందుండుటచేతనే. స్వార్థపరత్వముతో పురుషులు తమతో సమాన సంఖ్యగల స్త్రీల నిర్బంధించి త్రొక్కజేయుచున్నంతవరకు దేశమునకు ముక్తిలేదు.

మనదేశమునకు స్వరాజ్యము కావలెనన్న స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చుట మొదటి మెట్టు. వనితలకొక వ్యక్తిత్వమేర్పడవలెను. స్త్రీ పురుషుని సొత్తు కాదు, ఆమె యొక ప్రత్యేకవ్యక్తియన్న భావమేర్పడవలెను.

పూర్వము పురుషులు స్త్రీలను అమితముగ గౌరవించెడివారు. స్త్రీలు సుకుమారులనియు, వారు సుఖపడుటయే దేవుని ఆశయమనియు, కష్టపడి వారిని సుఖింపజేయుటే తమ యాశయమని పురుషులు రత్నముల పెట్టెలో దాచునట్లు స్త్రీలను గృహములందుంచి తాము కష్టపడియార్జించినది తమయింటి స్త్రీల చేతికిచ్చి, వారు సమకూర్చిన ఆహారపదార్థములతో భుజించి ఇంట సర్వస్వాతంత్రతయు గృహరాజ్ఞీత్వము స్త్రీలకొసగి వారి మన్ననలచే తృప్తులై గృహముల స్వర్గతుల్యములుగ నొనరించుకొని సుఖించుచుండిరి. ధన సంపాదన పురుషునివంతుగను, ఆధనమును వినియోగపరచుట స్త్రీవంతుగను, మన దేశమున ఆచారమైయుండెను. కాలక్రమమున ఒకప్పుడు రాణీత్వమొనరించిన స్త్రీ పురుషుని సొత్తై అతనిబానిసై పోయినది.

ఇపుడు మనదేశస్త్రీల పరిస్థితులు పరిశీలించిన యవి చాల శోచనీయమగు స్థితియందున్నవి. స్త్రీలు చాలా హైన్యస్థితియం

మన్నారు. ఈ హైన్యమునకు కారణము పురుష దౌర్జన్యము సంఘదౌర్జన్యము.

పురుషసంఘము నారీసంఘమునకు ద్వేషియై ఒక న్యూనతయేర్పరచి, బంధించి బలవంతముగ పాలించుచున్నది.

పురుషుడు స్వార్థపరుడై స్త్రీని గృహకోణమున నిర్బంధించి వంటయింటి పనుకట్టెంటి బానిసగజేసి తన విలాసవస్తువుగ నుపయోగపరుచుకొనుచున్నాడు. పురుషుడెన్ని వివాహములనాడినను భార్యల నెందరినో విడనాడినను ఎంత అవినీతికరమగు పనులు చేసినను సంఘమొప్పుకొనును. శాస్త్ర మంగీకరించును. ఒకస్త్రీ తననీతి వర్తనమునుండి జారిన సంఘమామెను వెలివేసి నిరాధారురాలినిగాజేసి నానాయవమానములతో బీభత్సపరచును. మగవాడు లేనిది స్త్రీ చెడదుకదా! కాని సంఘ మా పురుషమహాశయుని ఏమియు చేయదు. చేయజాలదు. చేయ ప్రయత్నించదు. సరికదా మీదు మిక్కిలి అతని కొక కాంప్లిమెంట్-మొగమహారాజు! "ఎన్ని పూవులన్ వ్రాలదు తేటి."

ఎంత అన్యాయము! మగవాడై పుట్టితే చాలును—యాడుదానిపై నధికారము చేయుటకు, పడతుల బాధించుటకు, కండువాలవలె కాంతలమార్చుటకు, వేయి వివాహములాడుటకు పురుషుని కధికారము గలదు. కాని భర్త అయోగ్యుడై త్రాగుపోతై తన్ను కొట్టితిట్టి బాధించుచున్న యతనినుండి వేరుపడుటకు స్త్రీ కధికారము లేదు.

'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' యని శాస్త్రము. ఈ వజ్రాయుధము చేతనే పురుషులు స్త్రీల నిన్ని రోజులు నిర్బంధించిరి.

తమవిద్య, తమసుఖము, తమ శ్రేయస్సే యెంచుకొనుచు స్వార్థపరులై స్త్రీలకేందును యోగ్యతలేదని స్పష్టముగ జెప్పుటయేకాక శాసనములు శాస్త్రములు కల్పించి స్త్రీల నిన్నిరోజులు యణచిపెట్టియుండిరి. వీటికి కారణము శాస్త్రకారులు, పురుషులు. పురుషుడే సంఘము.

స్త్రీలకీ న్యూనతెందుకు? స్త్రీజాతి కూడా మానవజాతికి చెందినదేకదా? స్త్రీలు జడపదార్థములుకారే. వారును మానవ మాత్రులేకదా! దైవము పురుషులతో బాటు స్త్రీలకు కరచరణాద్యవయవములును, శరీర పాటవమును బుద్ధి జ్ఞానశక్తులును, యుక్తాయుక్త వివేచనాబుద్ధియు నొసంగి ఇరువురిని సమముగనే సృష్టించియున్నాడు. సమమే కాదు, స్త్రీలకు కొంతాధిక్యతకూడా యున్నది. బుద్ధియందు స్త్రీలు పురుషుల కన్న నాల్గురెట్లెక్కువయని మనువే—'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి'యన్న మహానుభావుడే చెప్పియున్నాడు. పురుషులకెట్టిబుద్ధియున్నదో ఎట్టి భావోన్మీలనశక్తులుకలవో యట్టి శక్తులే స్త్రీలకుండ వారికి మాత్రము స్వాతంత్ర్య మక్కరలేదనుటేటిన్యాయము?

బుద్ధి చాతుర్యమున పురుషుల కెందును వెనుదీయని స్త్రీల పురుషులు ద్రొక్కి వేయుట స్వార్థపరత్వమేకదా! స్త్రీలకీ నిర్బంధము నిస్సహాయత న్యూనతయేర్పరచినది పురుషుని స్వార్థమేకదా! అవకాశములు లభింపక స్త్రీప్రతిభ మాటుపడినది కాని స్త్రీలెందును పురుషులకు తీసిపోరు.

శాస్త్రముల ప్రకారము స్త్రీకూడ సొత్తే కాని, స్త్రీకి వ్యక్తిత్వమే లేదు. స్త్రీకి వ్యక్తిత్వ మేర్పడవలెను. స్త్రీకి వ్యక్తిత్వమేర్పడుటకు పురుషునితో సమానముగ స్వాతంత్ర్యము గలుగుటకు స్త్రీకి పురుషునితో సమానముగ విద్య, హక్కు, శాసనసభలయందు సభ్యత్వము మొదలగునవి కావలయును. ఇన్ని రోజులు సహజశక్తు లుపయోగపడక పోవుటకు కారణము వారి కవకాశములు లభింపకనే.

స్త్రీలు సర్వస్వాతంత్ర్యములు పురుషులవలె సమాన గౌరవములతో పరిగణింపబడుటకు కేవలము గృహజీవనమే కాక, తమ భీరుత్వము వదలి భయపిశాచమునకు లొంగక బహిరవాతావరణమున కురకవలెను.

స్త్రీ స్వాతంత్ర్యమునకు స్త్రీలే పని చేయవలయును. స్త్రీల పరిస్థితులు స్త్రీలే చక్కపెట్టుకొనవలయును. మనకు కావలసినవేవో మనమే సంపాదించుకొనవలయును. ఆడువారి కష్టసుఖములాడువారే ఎరిగియున్నారు గనుక సంఘమును యథాయోగ్యముగ సంస్కరించుట స్త్రీల పనియై యున్నది. పురుషులు స్త్రీలకు సహాయము చేయుదురనుట కల్ల. ఇన్ని దినములు మనపై స్వారిచేసినవారు ఇపుడు మనకు స్వాతంత్ర్యమివ్వ నిచ్ఛగింతురా? వారి చెప్పుచేతలకు లొంగక స్త్రీలు సమానత్వము బడయుదురేమో యని భయపడు పురుషులు, మనకు సహాయముచేసి మనము కోరినట్లు స్వాతంత్ర్యమొసగి తమ్ము గట్టత్రాళ్లు తామే పెచ్చుకొందురా? మనము కోరినంతనే వారు స్వాతంత్ర్యమివ్వ సిద్ధపడువారేని ఈసరికి స్త్రీలకే కాదు, దేశమునకుకూడా స్వాతంత్ర్యము వచ్చియుండెడిది. ఊరకకూర్చొని సమానత్వము సమానత్వమన్న యది రాదు. పురుషు లివ్వరు. కనుక స్త్రీలే క్రొత్త స్వేచ్ఛాధికారములు సంపాదింపవలయును. శాసనములు మన మెట్లు పుట్టింతుము? శాసనసభలలో స్త్రీలకు ప్రవేశములు గలిగించవలెను. ఆ ప్రవేశము లొకరిద్దరికి గలిగిన చాలదు. పురుషులతో సమముగను, లేకున్న పురుషులకన్న ఎక్కువ సంఖ్య స్త్రీలున్ననే చట్టములు స్త్రీల కనుకూలముగ ఉపపాదింపబడి గెలువబడును. స్త్రీ జనాభివృద్ధికి పాటుబడు మహనీయులు కొందరు శాసనసభలలో స్త్రీలకు క్రొత్తి హక్కులకై క్రొత్త చట్టము లుపపాదించుచున్నను, స్త్రీ ద్వేషులే ఎక్కువ సంఖ్య గల సభ్యులగుటచే వోటమియే కాని గెలుపు లేనేలేదు. స్త్రీ ప్రతినిధు లెక్కువయైన క్రొత్త హక్కులకు కొదువలేదు.

చట్టములు రాగనే లాభములేదు. వాటిని ఆచరణలో పెట్టవలయును. ఆచరింప పూనుకొన్న చట్టములు లేకున్నను యంత బాధలేదు. ఆచరణయందు స్త్రీలు ముందడుగు వేయవలయును. స్త్రీ పూనుకొన్న అసాధ్యములు సాధ్యములగును. పూనుకొనకున్న సాధ్యములే యసాధ్యములై పోవును. కనుక సంఘమును యథాయోగ్యముగ సంస్కరించుట స్త్రీలవిధియైయున్నది.

ఒకరిపై ఆధారపడకుండుటకు ధనము కావలయును. ధనము కావలయునన్న ఆస్తిహక్కు పురుషులతో సమముగ స్త్రీలకుకూడా కావలయును. ఆ స్తిహక్కు కోటిహక్కులతో సమానము. డబ్బు లేకున్న సమానత్వము, స్వతంత్రము రాదు. భేదాభిప్రాయములు వచ్చిన విడనాడి వేరుండుటకు శక్తిలేకున్న స్వాతంత్ర్యమునకు చోటెక్కడ? స్వాతంత్ర్యత కావలయునన్న, ప్రత్యేకముగ ధనము, ఆర్జనయుండవలెను. కావలయునన్న మన దేశపు కూలివాండ్రను చూడుడు. పురుషులతోబాటు స్త్రీలు కూలిపని చేయుచున్నారు. ఆ స్త్రీలకు స్వేచ్ఛకూడ మన శ్రీమంతుల యాడువారికన్న ఎక్కువే.

ఇప్పటి ధర్మశాస్త్రప్రకారము స్త్రీలకు జీవనాధారము వివాహమే. తలిదండ్రుల ఆస్తి స్త్రీ కేమాత్రము ముట్టకపోవుటచే భర్తయే జీవనాధారమైయున్నాడు. తలిదండ్రులు తనయులకు విద్య చెప్పించుచున్నారు కాని, తనయలకు నేర్పు టరుదు. స్త్రీలు ధనార్జనము చేయవలయునన్న, నీరు మోసియో, వంట చేసియో కాని వేరువిధముగ ఆర్జింప వీలులేకున్నది. కనుక తలిదండ్రులు పుత్త్రునితోబాటు ఆస్తి యిచ్చిన ఆ మూలధనము విద్య నేర్చుకొనుటకు స్వతంత్రజీవితము గడుపుట కవకాశముండును.

ప్రస్తుతము హిందూమహమ్మదీయ ధర్మశాస్త్రముల ప్రకారము స్త్రీలకు సిద్ధించు హక్కులు స్వల్పాతిస్వల్పములు. పురుషుని దయాధర్మభిక్షములు.

తల్లి గర్భమున తనయులవలె తనయలు కూడా నవమాసము లూరినవారే. తల్లి రక్తమును తనయులును, తనయలును సమముగ పంచుకొనినవారేయైనను తండ్రి ఆస్తి పంపకములలో మాత్రము యావదాస్తియు తనయులదే. తనయలకు పూచిక పుల్లయైన రాదు. ఆడుబిడ్డ పుట్టింట పుచ్చిన వక్క కొనుటకైన నోచుకొనలేదు. అత్తింటి ఆస్తి కధికారముకూడ లేదు. స్త్రీ చనిపోయిన ఆమె ఒడలిపై ఆభరణములు పురుషునికి చెందును. అట్లే పురుషుని ఆస్తి స్త్రీకి చెందదు. పిత్రార్జితమైన అతని అన్నదమ్ములకు లేకున్న జ్ఞాతులకు స్వార్జితమైన అతని యిచ్ఛప్రకార మత డెవరికొసగిన వారికి చెందును కాని ధర్మపత్నికి చెందవలయునన్న నిర్బంధములేదు. స్త్రీ పుత్రవతియైన కొంతమేలు. పిత్రార్జితములో బావమరదులొక పాలిత్తురు. లేకున్న స్త్రీ నిరాధారురాలై అధోగతిం చెందును.



మిస్. ప్రేమకాంతక్

ఫెయిజీపూరున౯దు రానున్న దేశీయమహాసభ

సమావేశమున స్త్రీసేవాదళాధికారిణి.







మిసర్సు. విజయలక్ష్మి పండిట్. శ్రీయుత

జవహరిలాల్ నెహ్రూగారి సోదరి.



గోవిందరాజ దేవాలయగోపురము — తిరుపతి

అత్తింటి అగచాట్లే స్త్రీలకు కాని ఆర్థిక వ్యవహారముప ట్లధికారము స్త్రీలకు లేదు. కనుక స్త్రీలకు పురుషులతో సమముగ ఆస్తిహక్కుత్యావశ్యకము.

స్త్రీలకు విద్య కావలయును. విద్య లేనిది ఎవరు ఏపనియు చేయజాలరు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యల నెన్నో ఎదుర్కొనుపట్ల స్త్రీలకు సమాన బాధ్యత కావలయును. పురుషులతో వాదించుటకు వారి వృత్తులన్నియు మనము చేయుటకు పురుషులు నేర్చెడు విద్యా విధానములు మనము నేర్చుకొనవలయును. అంతియేకాదు. సర్వవిధముల స్త్రీ పురుషులు సమానులని యన్నిపనులకు, గౌరవ ములకు స్త్రీలర్హులని ఎంచి అవసరమగుచో యన్ని సంస్థలయందును, కళాశాల కచేరీల యందు స్త్రీల ప్రవేశముల కవకాశములు గల్పించు టావశ్యకము. కొన్ని పరీక్షలకు —Indian Civil Service, Engineering. Agriculture మొదలగు పరీక్షలకు_స్త్రీల కిపు డధికారము లేదు. ఆ ఆటంకము తొలగి ఆ శాఖలందుకూడా స్త్రీ లున్నతిపడయ వలయును.

మన దేశమున బ్రహ్మచర్యము, స్త్రీ పురుషు లిరువురికిని, మునుపుండెడిది. ఇపుడుపురుషు డా జన్మాంతము బ్రహ్మ చారై వుండవచ్చును కాని స్త్రీలుండుట కధికారముపోయినది. మరల కన్యాత్వాధి కారము సంపాదింపవలయును. కొందరు వివాహమిచ్చగింపరు. అట్టివారికి నిర్బంధమే కదా వివాహము ? కనుక స్త్రీలకాజన్మాంత కన్యాధికార మావశ్యకము.

పురుషుడు భార్యచనిపోయిన పునర్వివాహ మాడును. అట్లే స్త్రీలుకూడా పునర్వివాహ మం దధికారముపొందు టావశ్యకము. పునర్వి వాహమువలన జనాభివృద్ధియేకాని వేరువిధ మగు నష్టమేమియునుండదు. వితంతువులెల్లరు వివాహమాడ నిచ్ఛగింపరనునది విదితమే. కాని వివాహాధికారము లేకుండుట వివాహ మాడ నిచ్ఛగించువారికి నిర్బంధమేకాదా ?

స్త్రీలకు వివాహవిచ్ఛేదనాధికారము కూడ యావశ్యకమే. ఈ యధికారము పొందిన స్త్రీల వినీతిపరురాండ్రై దినమున కొకభర్తను జెట్టబట్టి విషయవాంఛలందే మునిగిపోవుదురని దురభిప్రాయము పలువు రిని భాధించుచున్నట్లున్నది. భారతదేశమున భార్యాభర్తృత్వసంబంధము విషయవాంఛ లతోనే కూడియుండలేదు. ఆ సంబంధము తాకగనే వూడు త్రుళ్లినపండుకాదు. అట్లను కొన్నను అంత అంటియంటకయున్న దాంపత్యముకన్న విచ్ఛేదమే మేలుకాదా ?

స్త్రీ లీయధికారమును దుర్వినియోగము చేయరు. ఈ యధికారము నుపయోగించువా రరుదు. కోటికొక్కరుండినను యదియు న్యాయసమ్మతముగనే యుండును కాని దుర్వి నియోగమై యుండదు. భార్యలపేరట ఇన్స్యూర్ చేయగనే భర్తలను భార్యలు దుర్మరణములపాలు చేయుచున్నారా ? లేదు కదా! అట్టిదే ఈ విడాకులచట్టముకూడ. తెలిసియు తెలియక ముందాలోచనలేక పసి

బిక్షలు, అమాయికలు, ఈ అధికారమును దుర్వినియోగము చేయుదురనియు, దాని వలన పలుబాముల పాలౌదురనియు ఈ యధికారము వలదనకూడదు. నీటదిగిన అపాయమని ఈతనేర్చుకొనక యుందురా? ఈ అధికారోపయోగము కొద్దియైనను ఇది యావశ్యకమే. దీనికేల భయపడవలయును? భర్తయెడ నంమందు బద్ధానురాగురాలై యున్న భార్య యతనినేల త్యజించును? విడాకులచట్టము న్యాయశాస్త్రమందున్న నేమాయెను? దానిని ఆచరణలోకి రాకుండ భర్తలేల పని చేయకూడదు? పై జెప్పినవన్నియు నిర్బంధనివారణ కావ్యావశ్యములే.

ఈ అధికారములన్నియు పొందిన స్త్రీకి స్వాతంత్ర్యసమానత్వములు లభించును. స్త్రీలు నిర్బంధములేక వారివా రభిరుచుల బట్టి నడచుకొందురు. ఏవిధమైన నిర్బంధము స్త్రీలకుండదు. అవివాహితులై ఉద్యోగములు చేయువారు ఉద్యోగములందు ప్రవేశింతురు. గృహిణీత్వ మాశించువారు, గృహలక్ష్ములై విలసిల్లుదురు.

కనుక సర్వసమానత్వమవినీతికరము కానే కాదు. అరమరలులేక యన్నివృత్తులు స్త్రీపురుషులుచేయ దేశోద్ధారణమే కాని దోషముగాదు.

సమానత్వము స్త్రీల నిర్బంధమును నిస్సహాయతను తొలగించి దేశకల్యాణమునకు తోడ్పడి స్వరాజ్యమిప్పించును. కనుక సమానత్వ మావశ్యకమేకాని, ఎందును యనర్థదాయకముకాదు.

సమానాధికారములు చట్టములద్వారా పొందగనే లాభములేదనియు, వాటిని యాచరణలో పెట్టవలయుననియు పైననే పేర్కొంటిని. ఆచరణయే ముఖ్యము. ఆచరించుటయన పాతస్మృతులయందుండు ఆచారములమీద,యనగా దాస్యభావముల మీద తిరుగబడవలయును. పురుషులు చాల కాలముక్రిందటినుండియే తిరుగబడుచున్నారు. వనితలు తిరుగుబాటుచేయని కారణమున పురుషుల సంకల్పము లీడేరకున్నవి.

సమానత్వము సిద్ధింపగనే స్త్రీలు ప్రకృతిసిద్ధముగ లభించు గృహధర్మములు విడనాడరు. విద్యావంతులు, ధనవారసులైనంతనే తమ స్వేచ్ఛను దుర్వినియోగము చేసి గృహిణీధర్మముల విసర్జించుట సరికాదు. ఇపుడు కొందరు చదువుకొన్నవారు, గృహధర్మములనొనర్చిన తమ పరువుకు భంగమని, బిడ్డలకును, భర్తసపర్యలకు నాకర్లనుంచి, ధనవ్యయమేకాక, స్వర్గతుల్యముగ నొనరింపవలసిన గృహములను నరకముగ మార్చుచున్నారు. కావుననే స్త్రీ స్వాతంత్ర్యమునెడ దురూహాలు బైలుదేరినవి.

జాతీయవృత్తులు స్త్రీపురుషులు సమానముగ చేయ గృహిణీత్వమునకే కొఱంతయు రాదు.

—మైదవోలు పద్మావతి.

# స్త్రీపురుష సమానత్వమావశ్యకమా ఎందేని యనర్థదాయకమా ?

౧

"చదువ నేర్తురు పూరుషుల్ బలెనె శాస్త్రంబుల్ పఠింపించుచో
నదమన్నేర్తురు శత్రుసేనల ధనుర్వ్యాపారముల్ నేర్పుచో
నుదితోత్సాహముతోడ నేలగలరీయుర్విన్ బ్రతిష్టించుచో
ముదితల్ నేరఁగరానివిద్యగలదే ముద్దార నేర్పించినన్."

భారతదేశమునందు పురుషులకే స్వాతంత్రతలేదు. ఒక్కప్పు డున్నస్వాతంత్ర్యము గోల్పోయిన భారతజాతి దానిని మరల పొందుటకు నేడు ప్రయత్నించుచున్నది. ఈ ప్రయత్నములో స్త్రీలనుగూడ చేరనిచ్చినచో పురుషులకు దమప్రయత్నములో రెట్టింపుసహాయము కలుగగలదు గదా! ఆసహాయము మనఃస్ఫూర్తిగ స్త్రీలుచేయవలయునన్న వారి మనస్సునకు సదసద్వివేచనా జ్ఞానముపూర్తిగా నుండుటకవకాశము లుండవలెను. 'ఈపని చేయదగినది' అను హేతువాదశక్తి స్త్రీలకునుగలదు. అది సరిగా యుపయోగించుకొనుటకు అవకాశములు గల్పింపవలయును. అనగా తన యాలోచనయే తనకార్య నిర్వహణమునకు మూలమగునట్లు మనకవకాశము లుండవలయును.

సమానత్వమనగానేమి? స్త్రీ పురుషులలో లింగభేదముచేత నొకపని మగవారికి మంచిదయి మనకు చెడ్డదికాగూడదు. అది యిట్టిది. బంగాళాదుంపలకూర మగవారికి బలముచేసి మనకు బలముచేయకపోదు. శరీరతత్వములోను, బుద్ధిలోను, స్త్రీపురుషులు సమానులు. అయితే పురుషులలో నున్నంతమంది బలిష్ఠదేహులు, శాస్త్రాది పరిజ్ఞానముగలవారు మనలోలేరని సందేహము తోచవచ్చును. ఆ పరిజ్ఞానము కలుగుట కవకాశములులేవు. మనము కల్పించుకోలేము. మానవులకు తమ యాలోచన నితరులతో చెప్పుటకు అందఱు కలిసి పనిచేయుటకు చేసినపనికి దగిన ప్రతిఫలముపొంది తమకు తోచినట్లా ప్రతిఫలము ననుభవించుటకును సహజమైన కోరిక యున్నది. ఇవి న్యాయమైనకోరికలు. ఇవి స్త్రీపురుషులకు సమానము. ఇట్లు సంఘ మొప్పుకొనుటయే సమానత్వము. మానవ శరీరము, హృదయము, స్త్రీపురుషుల కొక్కటియేగదా. కాబట్టి పురుషులకున్న కోరికలు స్త్రీలకును యుండుట ప్రకృతి విరుద్ధముకాదు.

ఇంక నీసమానత్వ మేయేవిషయముల యందుండవలయునను ప్రశ్న చర్చింపవలసియున్నది. కాని అంతకుముందు సమానత్వముపనికి రాదనువారి యూహలు కొన్ని చర్చించినమేలు.

సమానత్వము పనికిరాదనువారెవరు? సాధారణముగాపురుషులు. భారతదేశములో పురుషులకే స్వాతంత్ర్యములేదు. స్వాతంత్ర్యమనగా నేను పైనవ్రాసిన కోరికలను నెఱవేర్చుకొనుటకు తగిన ప్రభుత్వసహాయము

లేవు. స్త్రీలించుమించుగా "బానిసలు." వారు మనలను బోబఅచు కొనుటకు ప్రయత్నింతురు. కాఁబట్టి మనము బానిస లకు బానిసలము గావలయునని కొందఱి యుద్దేశ్యము. ఇట్లని పురుషులంద రెల్లప్పుడు పట్టివారనియు నాయభిప్రాయముగాదు. ఉదారహృదయులు లేకపోలేదు. వారికి వందనములు. పురుషులలో కొంతమంది యెల్లప్పుడును, అందఱును కొన్ని సమయ ములలోను "స్త్రీకి హృదయమున్నది. వారికిని రాగద్వేషములుగల" వనుమాట మఱతురు. అట్టిచో వారిని సన్మార్గమున బెట్టుటకు తగిన సామర్థ్యముండిసలహా చెప్పగలుగుటకు స్త్రీకి సమానహోదా యవసరము.

ఏల పనికిరాదందురు? ఇందులకు గొన్ని కారణములువారు చెప్పునవి విమర్శింతము. అది స్వభావమని కొందఱివాదము. పూర్వ మునుండియు నట్లేయున్నదని వారిమతము. కాని వైదికవాఙ్మయములో స్త్రీపురుషులకు సమానహక్కులున్నటుల కానబడుచున్నది. సంసారమునకు స్త్రీపురుషులు రథమున కుభయచక్రములవంటివారు. వీనిలో యొక చక్రమున కెంతబాధ్యతయో రెండవచక్ర మునకు నంతయే బాధ్యత. స్వభావమేమియో బోధపడుపమన్నచో పురుషులు మొదటి నుండియు నట్లేయున్నదని చెప్పుదురు. అనగా మొదటినుండియు పురుషులిట్లే చెప్పుచున్నారని యర్థము. అది వారికి స్వభావముగాఁ గనఁబడినది. పురుషులదృష్టి కట్లుతోచినది. పురుషులదృష్టికి వారి స్వాతం త్ర్యము నరికట్టునదేదియు స్వభావముగా దోచలేదు. రాజకీయపారతంత్ర్యమువారికి స్వభావముగాఁదోఁచినదా? నిర్వ్యాపారత స్వభావముగా దోఁచినదా? వాక్స్వాతంత్ర్య విహీనత స్వభావముగా దోఁచినదా? లేదు. స్త్రీలకు సమానత్వము లేకపోవుట స్వభావ ముగాఁ దోఁచుటలేదు. ఒప్పుకొందురా? మనస్సునకు తోఁచుటయే ముఖ్యముగాదా?

"స్త్రీలు తమ యబలత నొప్పుకొను చున్నారు. స్వభావముగా స్త్రీ యజమా న్యముకోరదు. పురుషులు తమకంటె నధికు లుగా తమకు యజమానులుగా నుండుట వారికి సమ్మత" మందురు. ఎవరొప్పుకొని నారు? "స్త్రీ యబలకా" దని వెనుక గృహలక్ష్మిలో మన సోదరీమణులు వ్రాసిన వాక్యములు స్మరింపబడుగాక! యాజ మాన్యముకోరిక పోవచ్చును. కాని బాని సత్వము మనము కోరుచుండుటలేదు. సమానత్వము కోరుచున్నాము.

సమానత్వముకోరనివారు పురుషులు. పురుషులకు కోపమువచ్చుననియు, వానిపై నుండు గౌరవముచేతను కొందఱు స్త్రీలును యూరకుందురు. అట్లయిన న్యూనతనేల భరించుచున్నారని ప్రశ్న రాగలదు. భరించు చున్నామనగా రోగము సరదాచేతగాదు. తన్నివారణోపాయములేక. అజ్ఞానముచే రోగమే స్వభావము కాబోలనుకొనుటచేత.

వేఱొకవాదమున్నది. స్త్రీస్వాతంత్ర్య మున్నచో స్త్రీలు కుటుంబకార్యములను లెక్కపెట్టుటకును సంతానము వృద్ధిచేసి

ప్రజాభి వృద్ధిచేయుటకు సమ్మతింపరని కొందఱు పురుషులవాదము. పురుషునకు లొంగియుండుటచేతనే సంసారములును, ప్రజాభివృద్ధియును జరుగుచున్నవా? స్త్రీకి మాత్రము కుటుంబ సత్సంతానముల యపేక్షలేదా ? సంతానాపేక్ష స్త్రీకిని పురుషునివలె సహజము. ఇంకను యెక్కువ కూడను అందువలన సమానత్వముచే నీ ఘనకార్యములు నిలిచిపోవని మనవి. ఒక వేళ స్త్రీకి యిష్టములేదని వాదముకొఱకు సమ్మతించినచో అంతలోకమును గుఱించి యామెకు శ్రద్ధయే లేనిచో పురుషులకు మాత్రమేల యంతశ్రద్ధ !

సమానతయున్నదని చరిత్ర దెలుపు చున్నది. విద్యలో సమానతయున్నట్లు భవ భూతి యుత్తరరామ చరిత్రయందు ఆత్రేయి పురుషవటువులతో విద్యాభ్యాసము చేసిన దనివ్రాయుటచే దెలియుచున్నది. కామందకి యనుయోగిని పురుషులతో శాస్త్రచర్చ చేసినట్లు మాలతీమాధవీయము తెల్పు చున్నది. ఋగ్వేదములో కొందఱు మంత్ర ద్రష్టలు స్త్రీలు. వాగాంభృణియను నొక బ్రహ్మవిదుషి జ్ఞానబోధచేసినది. యజురా థర్వణ వేదములనాటికి స్త్రీలు 'శాస్త్ర' చర్చలు సలిపెడివారు. యాజ్ఞవల్క్యునిసతి మైత్రేయియే యిందులకు తార్కాణము.

సమానత్వము కావలయుననుటలో అధి కత కోరుచుండుటలేదని స్పష్టము. మానవ సహజమగు ఆశలు మగవానికున్నట్లు మనకును యుండవచ్చునని వాదము.

రాజకీయవిషయములో సమానత్వమును గూర్చి చర్చింతము. రాజకీయవిషయము లనగా మనకుగావలసి ప్రభుత్వము నెన్ను కొనుట ప్రజాప్రభుత్వములో పురుషునితో సమానస్థానములు తీసికొనుట దేశసేవ చేయుటయునుగదా.

ప్రభుత్వమునకు పురుషుల పైవలెనే స్త్రీలపైనను హక్కుగలదు. ప్రభుత్వశాసన ములు స్త్రీలపైగూడ సమానముగా వర్తిం చును. అట్టి ప్రభుత్వము పురుషులచే నెన్ను కొనబడినచో స్త్రీల హక్కులనుగూర్చి ఆ పురుషులకు ఆదుర్దాయుండవలసినపనిలేదు. ప్రస్తుతమున్నదిగదా యందురేమో అది శాసనబద్ధముగానప్పుడు యెల్లకాల మట్లే యుండుననుటకు నమ్మకమేమున్నది ? స్త్రీలకు సమానత్వము లేకుండ జేయవలయుననియే వారికి యెన్నికహక్కును లేకుండజేయుట యగుచున్నది. ఎన్నికహక్కు ఆత్మహక్కు లను సంరక్షించుకొనుట కుపయోగింపఁ బడును. ఎన్నికలు తెలియక తమహక్కును దుర్వినియోగము జేయుదురేమో ? పురు షులు చేయుచున్నచో యేమగుచున్నది. తగినశిక్షణ విద్యయిడినచో మనమును పురుషులవలెనే యెన్నుకొనగలుగుదుము. భోజనము మితము, నియమము, లేకుండ పెట్టినచో అనారోగ్యమని యసలుమాను దుమా?

రాజకీయ శాసనసభలలో పురుషుల తోపాటు స్థానములున్నచో ప్రతిః శాసన సమయములోను దానివలన స్త్రీలకు (ఆ

శాసనఫలితము ననుభవించువారిలో సగము ప్రజలము) కలుగు కష్టనష్టములు చర్చింపఁ బడవచ్చును. శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు మద్రాసు శాసనసభలోనున్నారు. ఆవిడ యందలి చర్చలలో పాల్గొనుటలో సమర్థత చూపుటలేదా? ఇది ప్రస్తుతవిషయము. చరిత్రాత్మకముగా గావలయునన్నచో దాహరణములు పెక్కులున్నవి. విక్టోరియా, ఎలిజబెత్తు, రాణీ దుర్గావతి మొదలగువారు పరిపాలకులు. నూర్జహాను మొదలగు సలహాదారులు గలరు గదా. వీరవనితలు, వీరమాతలు పెక్కురున్నారు.

దేశసేవలో స్త్రీలము సమానత్వము కోరుచున్నాము. రాజేంద్రప్రసాదుగారు కాంగ్రెసునకు స్త్రీలు చేసిన సేవ నుగ్గడించి యున్నారు. శ్రీమతి సరోజినీ నాయుఁడు, దుర్గాబాయమ్మ తెలుగుజిల్లాలలో ననేకులగు స్త్రీలు భీమవరం తాలూకాలోని క్షత్రియవనితలు యీమధ్య మహాత్ముని యుప్పు సత్యాగ్రహము విషయములో చేసిన సేవ సమానత్వమును కాదనగలరా? కావలెనన్న యెందఱినో చూపగలము.

రాజకీయ వ్యవహారములలో న్యాయముకొఱకు నిర్దాక్షిణ్యము, నిష్పక్షపాతత్వము కావలయుననియు, మనము సాధారణముగా జాలిగుండె గలవారమగుటచే ముఖ్యవిషయములలో దయచే, పక్షపాతత్వముచే వ్యవహారములను పాడుచేయుదుమనియు కొందఱి యభిప్రాయము. రాజకీయవ్యవహార మట్టిదనుటకు సందియము లేదు. అచ్చట దయయుండుట దోషము. న్యాయమునకు హృదయములేదు. అయినను యిచ్చటగూడ స్త్రీలు వ్యవహారములు పాడుచేయరనుటకు యుద్ధమునకు పురిగొల్పిన ద్రౌపదియు, ఖడ్గ తిక్కన భార్యయును, తానే యుద్ధమున శత్రులను జెండాడిన ఝాన్సీయును సాక్షులు.

ఆర్థిక సమానత్వమును బరిశీలింతము. వ్యక్తులకు నిర్బంధములు లేక సంఘము యనుమతించిన పనులలో బనిచేయుచు, దానివలన సంపాదన చేసికొనుట కవకాశములుండుట; తనపూర్వులు సంపాదించిన దానిని తాననుభవించుట కవకాశము కల్పించుట; తనధనమును తాను వినియోగము చేసికొనుటకు స్వేచ్ఛయుండుట ననునవి యార్థికముగా నవసరములు. ఇవి స్త్రీపురుషులకు సమానములు.

తన పోషణమునకు దాను సంపాదించుకొనుట మగవానికున్న హక్కు. ఇది స్త్రీలకు లేదని యాతఁడన్నచో నది యామెను శాశ్వతముగాఁ దనపైనను, సంఘముపైనను యాధారపడి యుండునట్లు చేయుటకై యున్నది. ఉద్యోగము మగవానికి పాపముకాదు. తప్పుకాదు. స్త్రీకిమాత్ర మది యేల వలదనుచున్నారు? నిరుద్యోగసమస్యా భయమేమో? స్త్రీల పోటీ లేనప్పుడుమాత్రము పూర్తిగా నుద్యోగము లున్నవా? నిరుద్యోగము స్త్రీలుద్యోగము చేయుటవలన వచ్చినదికాదు.

పురుషులకును, స్త్రీలకునుగూడ నిరుద్యోగ మునకు కారణములు వేఱేయున్నవి.

మహాయుద్ధ సమయములో యుద్ధము చేయు దేశములన్నిటిలో పురుషులు యుద్ధములోనికి బోగా గుమాస్తాపనులు, రేడియో ఆపరేటరు పనులు, మందు సామానుపనులు, పోస్టాఫీసు, మొదలగు ఆఫీసుపనులు స్త్రీ లతిసమర్థతతో నిర్వ హించుకో గలిగినట్లు తెలియుచున్నది.

ప్లీడరుపనిలో యిప్పుడిప్పుడు స్త్రీలు హిందూదేశములో పనిచేయుచున్నారు. వైద్యవృత్తిలో నెంతమందియో సమర్థులు స్త్రీలు గలరని యందఱెఱిగిన విషయమే. ఉపాధ్యాయ వృత్తిమాట చెప్పనక్కఱ లేదు. ఈ యన్నిపనులలోను స్త్రీల సమ ర్థత ప్రశంసింప దగియున్నది. ఇందు సమా నతకు వ్యతిరేకములగు వాదములకు సహా యపడు లోపము లేవియు లేవుగదా! లోపములున్నచోఁ దగిన శిక్షణలేక యన వచ్చును. పురుషులుమాత్ర మన్నిటిలో నందరును సమర్థులా ?

తనపూర్వులు సంపాదించినది తాను (పురుషుఁడు) యనుభవించుచున్నాడు. మగవారు నిర్మించిన శాసనములగుటచే స్త్రీలకు వారసత్వము లేకుండజేసి మనలను లోబఱచుకొని యుంచుకో దలచినారు. "మీాకు శ్రమలేకుండ మగవారు కష్టపడి, మిమ్ము సుఖపెట్టుచున్నారు గదా" యని పల్కుదురు. కాఁదీకిని శ్రమలేదు. శ్రమలేక పోవుటలో చాల సుఖములేదు. కావలసినది ఆత్మగౌరవము స్వేచ్ఛ. ఆత్మగౌరవము ఆత్మ విశ్వాసమువలన గలుగును. ఆత్మవిశ్వాస మున కాత్మద్రవ్యముముఖ్యము. అదితండ్రిసొ మ్మున కొరసురాలిని చేయుటలో నున్నది.

సమానత్వము సమానస్థితిగతులవలన వచ్చును. పోష్యవర్గములోనిదిగ వాయను నీచభావముతో మనజాతిని పురుషులు చూడకుండుటకు మనకు ధనార్జనకును, ఔర సత్వమునకును హక్కులుండవలెను. పర స్పరగౌరవము, ఆదరముగల కాపురములు వర్ధిల్లును. స్నేహితులకున్న సంబంధమిట్టిది. భార్యలో స్నేహితులలక్షణములు మగవాని కిని, భర్తలో చెలికత్తియలగుణములు యాఁడుదానికిని యానందదాయకములు గదా! అనగా 'సమానఫాయి'లో సంతో షము గలదనిభావము.

ఒకవిషయము చెప్పవలసియున్నది. స్త్రీ లందఱకును సంపాదించుటకు శక్తిగలదా? అను ప్రశ్నవచ్చును. పురుషులందరు సంపా దింప గలుగుచున్నారా? అన్నప్రశ్న పెంకె తనముగా నుండును. సంపాదించుకొొన గలుగువారిని సంపాదించుకొొననిండు చాలును. స్త్రీజాతిపై పురుషులకు గౌర వము కలుగుట కార్థికసమత్వ మవసరము.

ఇక సంఘములో స్త్రీపురుషుల సమా నత్వమునుగూర్చి చర్చింతును. తొలుత వివాహవిషయము. పిదప సంఘ, కుటుంబ, కార్యములలో స్త్రీపురుషుల సంబంధము, పిదప రెయిండొరులనుగూర్చిన ప్రవర్తనము వీనిలో ముఖ్యములు.

సంసారము సుఖప్రదముగ జరుగుటకు పరస్పరానుమతు లవసరము. తన కిష్టము వచ్చిన స్త్రీని వివాహము చేసికొనుటకు పురుషున కధికారమున్నది. స్త్రీ తరఫున యిష్టము తెలుపువారు తలిదండ్రులు. తల్లిదండ్రులు కుమరితలక్షేమముచూడరని యనలేము. కాని, బీదతనమువలన, యజ్ఞానము వలన, అమ్ముకొనుటయో, సరిపడనివాని కిచ్చుటయో జరుగుచుండుటలేదని యెట్లనగలము? వివాహవిషయములలో స్త్రీల యభిప్రాయము కావలయునన్నచో బాల్యవివాహములు తప్పవలయును. స్త్రీయే తప్పుడుగా భర్తనెన్నుకొన్నచో యేమిచేయుదురని యడుగకుడు. తానే తెచ్చుకొన్న కష్టము, అపథ్యము చేసి తెచ్చుకొన్న రోగమువంటిది. ఇతరులపై కోపమునొందుటకు వీలులేదు. తన యభిరుచులకు, తనకోరికలకు వీలయినసంబంధమునకు స్త్రీమాత్రము ప్రయత్నము చేయదా? స్వయంవరములన్నియు విఫలదాయకములు కానేరవు.

సంసారములో సమానహక్కులుండుట వలన స్త్రీపురుషు లుభయులకును సౌఖ్యమున్నది. మనము సమానత్వము కోరుట యెందులకు? 'నా'దను బాధ్యత యుండుట వలన సంఘుకార్యములు చక్కగ నగుటకు వీలున్నది. సంసారములో సమానత్వము వలన మనకు మానసికసౌఖ్యము కలుగును. ఒకటిమాత్రమున్నది. వయసుచే పెద్దవాడగుభర్త యనుభవములోగూడ పెద్దవాడయి యుండును. భర్త సామాన్యముగా యాలోచనా భాగమునునడిపి, క్రియా భాగమును భార్యకొసంగును. ఇందువలన మన సమానత్వమునకు లోపము వచ్చినదని నేనన్నను. ఆలోచనవిని యవసరమైనచో యవలంబించి, యక్కరలేనిచో నక్కఅలేదని దాని యపకృతమును మనకు బోధించి సమానతగుర్తించిన చాలును. సంసారరథమును రెండుచక్రములపై నాథా రపుననిట్లు చేయుమని కోరుదును.

కడపట విద్య, శిల్పము, గానము, కవిత్వము మొదలగువానిలో సమానములగు నవకాశములు నేర్చుటకు గలుగవలెను. వీనిలో చాలవఱకు వివాదాంశములు కాకుండుటచే చర్చింపఁ బనిలేదు.

ఒక్కవిషయముమాత్రము చెప్పవలసి యున్నది. లలితకళలలో ననవరతాభ్యాస మవసరము. మానినచో నవి పాడైపోయి ప్రాతఁ బడిపోవును. సృష్టియేర్పాటులవలన స్త్రీ గర్భధారణాదికములందు పై లలితకళ లభ్యసించుటకు వీలులేదుగదా. ఉద్యోగము వేరే యుదరపోషణార్థమైనవృత్తి చేసికొను స్త్రీలకు సిద్ధహస్తత యుండకపోవచ్చును. అయినను, గొప్ప పాటకురాండ్రు లెక్కలేనంతమంది యున్నారు. సత్యవాణి, బుచ్చి కృష్ణ మొదలగు చిత్రలేఖనా నిపుణులున్నారు. ఇది గొప్పకాదా?

స్త్రీపురుష సమానత్వ మెందు ననర్థదాయకముగాదని, ఆ యా విషయములు చర్చించునప్పుడు చూపినాను. కోరునది

సమానత గాని యధికత గాదు. పురుషులతో మాకు బాధ్యత కావలయుననుచున్నాము. ఇందువలన బిడ్డలు, పోషణ, మొదలగు సృష్టిచే నియమింపఁబడిన విధులును, కుటుంబసంరక్షణ, గృహనిర్వాహణ మొదలగు వ్యవహార సౌకర్యముకొఱకు సంఘము నియమించినపనులను మనము వలదన్నామని యుద్దేశ్యముకాదు. అవి యన్నియు ముఖ్యముగా మనమే నిర్వర్తింతుము. మనకు సాంఘికముగా, ఆర్థికముగా, రాజకీయముగా సమానత్వము కావలయుననుచున్నాము.

ఇట్టి సమానత్వ మనర్థకారికాదు. సరికదా దానివలన నీక్రిందిలాభము లున్నవి. పురుషులలో నిప్పుడొక గుణమున్నది. తమవలననే స్త్రీజాతి బ్రదుకగలుగు చున్నదని వారి యభిప్రాయము. దానివలన మనకు పోయినది లేదుగాని, ధైర్యముచే స్త్రీజాతిని హీనముగాఁ జూచుచున్నారు. ఇది మనకు మంచిదికాదు. సంఘమునకు మంచిదికాదు. రెండవది దేశములోనున్న భౌతిక, మానసికశక్తులు వృద్ధియై లోకోపకారకములగుట స్త్రీలకు సమానతనీయక ప్రజలలో సగభాగము వ్యక్తులశక్తులను వ్యర్థము చేయుచున్నారు. సమానత్వమునంది మనము గూడ దేశసేవకు రాం డ్రగుట శ్రేయోదాయకము.

స్త్రీపురుష సమానత్వమన్నిట నావశ్యకమనియు, దానివలన లోకకల్యాణము గలుగుననియు, అందులకై మన జాతియంతయు బ్రయత్నించుట ముఖ్యమైన విషయమనియు నెఱుంగుట సమంజసము.

# చదువుచెప్పింపతల్లిరో! శ్రద్ధగొనుము

గురుతరవ్యవహార గుట్టు మట్టులనైన స్వయముగా నరసెడి శక్తిలేక
ప్రాణనాథుడువ్రాయు ప్రణయలేఖలనైన తనకుదాజదివెడి యనువులేక
అత్తవారెన్నెన్ని యగచాట్లుబెట్టిన తలిదండ్రులకుదెల్పు దారిలేక
చాకలిదెచ్చిన చలువగుడ్డలనైన పద్దువేయగ జాలు పటిమలేక

చదువురానట్టి యువిద దా మదిమిదనుక
పడయరానట్టి బాధల పడెడుగాన
బాల్యమువనుండి కూతుం డ్రబడికిబంపి
చదువుచెప్పింపతల్లిరో! శ్రద్ధగొనుము.

కనుపర్తి వరలక్ష్మమ్మగారు

# రక్షాసూత్ర బంధనము

శ్రీమతి తటవర్తి సత్యవతీదేవిగారు

సాయంకాల సమయము. దినమందు రవి తన తీవ్రాతపముచే ప్రపంచమును దపింపజేసి పశ్చిమాంగనాసక్తుడై యరుగుచుండెను. చిత్తూరు రాజోద్యానవనమం దిరువురు స్త్రీలు సంభాషించుచుండిరి. అందొక్కతె ప్రౌఢ. ఒకతె ప్రౌఢావస్థకు జేరుచుండెను. ఆ పడంతుక లిద్దరి మోములందును విచారము అధీరత్వము ప్రకటమగుచుండెను. మొదటిస్త్రీ వ్యగ్రతా పూర్ణస్వరముతో పలికెను.

"సోదరీ! మన కందర కిప్పు డుపాయమేమి ఆలోచించితివి?

"కొంచెముగూడ స్థిరీకరింపజాలను. భగవానుఁడగు ఏకలింగస్వామి యుద్దేశ్య మెట్లున్నదో."

ఈసారి బహదూర్ షా ఉదయపురమును పూర్తిగా మట్టిలో కనిపివేయవలెనని నిశ్చయించినట్లును అట్లే ప్రతిజ్ఞచేసియున్నట్లును వినవచ్చినది."

"సర్దారులందరు విక్రమజిత్తుయెడ నసంతుష్టులై యుండుటవలన వారందరు విక్రమజిత్తునకు సాయము చేయుదురనిన సందేహాస్పదముగా దోచుచున్నది. వారందరు విక్రమజిత్ యెడ నింత క్రోధులైయుండుటకుగల హేతువెద్దియో నాకు తోచకున్నది. అటులున్నను అందరుకూడ మేము పప్పాబాయి రాజ్యమందు వాసము చేయుచున్నామని యనుచున్నారు."

"సర్దారులందరు విక్రమజిత్తునకు సాయముచేసినను చేయకున్నను చిత్తూరును రక్షించుటలో వెనుతిరుగరు. మరి విక్రమజిత్తు రాజ్యము అత్యాచారిణియగు పప్పాబాయి రాజ్యమైపోయెనా?"

"ఎవరెరుగుదురు? వారంద రిట్లే పలుకుచున్నారు. ఏ సమయములో పప్పాబాయి ఏమి చేసియున్నదో కాని యామెతో విక్రముని సరిపోల్చుచున్నారు. కాని సేనాపతులు విక్రమునిపై జేయు క్రోధముజూడ చిత్తూరును రక్షించుటకుకూడ వారు రారనియు పూనుకొనరనియు తోచుచున్నది."

"సోదరీ! నీవు వట్టి అమాయకురాలవు గదా! మేవాడ్ దేశవాసులకు చిత్తూ రెంత గౌరవవస్తువో నీ వెరుగనట్లు తోచుచున్నది. చిత్తూరు వారికి ప్రాణములకంటె ప్రియమైనది. చిత్తూరు రాణాయందు వారికి సంపూర్ణమగు అయిష్టత గలిగియున్నప్పటికి మనస్ఫూర్తిగ వారు చిత్తూరును పూజచేయుదురు."

"ఇట్లున్ననుగూడ గుజరాత్ పాదుషాతో నెదుర్కొన సమర్థుడగువాడు చిత్తూరులో నెవడు గలడు?"

"సోదరీ! ఇట్లు నీ వేల పలుకుచున్నవు? ఈ మేవాడు దేశము ప్రస్తుతము స్మశానమువలెనున్నను సమయము వచ్చినచో ఈ భస్మరాశియందునుండి అగ్ని ప్రజ్వలించును.

"సోదరీ! ఇట్లు కాగలదేమో కాని నాకుమాత్రము నమ్మకము లేకుండుటచే నే నేదియు స్థిరము చేయజాలకుంటిని."

"నీ వింత భయపడిపోయితివా ఛీ! సోదరీ! ఈలాగున పలికి నా మనస్సుకు బాధ కలిగింపకుము. రాజపుత్రస్త్రీలు మరణమన్న భయపడుదురా?"

"అట్లైన నీ వింత ఆలోచించెద వెందుకు? ఏకలింగభగవానుని యుద్దేశ్య మెట్లో అట్లే కాగలదు."

"నేను నాకొఱకు విచారించుచుంటి ననుకొంటివా? విక్రముని విషయమై, ఉదయుని విషయమై ఆలోచించుకొన నాకు చాల భయము కలుగుచున్నది."

"అవును. నీ ఆలోచన బాగున్నది. కుమారు లిద్దరి విషయమై బెంగగా ఉన్నది. అయినను రాజ పుత్ర డింభకులుగూడ తమ విషయములో తామాలో చింపకొనకుండ ఉండజాలరు. వారు బాల్యావస్థ నుండియు సాముగరిడీలయందు నేర్పరులేగదా."

"అది సరియే. కాని ఒక్కసారిగ ఏకలిప్తలో బప్పారావుల వంశమును నీవు లుప్తము చేయదలంచు చుంటివా?"

"నీ వన్నది సత్యము. ఈ సంగతి నాకు ధ్యానమే లేదు. మనమందఱ మెట్టి చిక్కులలో తగుల్కొన్నను సరే బప్పారావుల వంశము నిర్మూలము కాకుండ మనము జాగ్రత్త పెట్టవలయును.

"చిత్తూరుకోట రక్షితము కానిదే ఈ బాలకు లెట్లు అపాయరహితులగుదురు? విక్రముడు వీరుడే కాని అతడు గుజరాత్ సుల్తాను సైన్యముల నెట్లెదు ర్కొనగల్గును?".

"ఈమాట సరియే కాని అందుల కెట్టి యుపాయ మాలోచించిన మన కార్యము నెరవేరును?"

"సోదరీ! ఒక ఉపాయము చేసిన మన కార్యము నెరవేఱజాలదా?

"ఎట్టి ఉపాయము?"

"హుమాయూను బాదుషాను చిత్తూరును రక్షింపవలసినదిగా ప్రార్థించినచో మన పని సఫలము కాదా?"

ఈ సంగతి విని రెండవస్త్రీ బిగ్గరగ నవ్వెను. మరల మొదటిస్త్రీ పలికెను. "సోదరీ! ఒక్క సారియే నవ్వులో నెగురగొట్టితివేమి ?"

"నీమాట వినిన యెవరికి నవ్వురాదు? ఎవని తండ్రి స్వర్గవాసియగు చిత్తూరు రాణాకు ప్రతి ద్వంద్వియో అట్టివానిని చిత్తూరునకు వచ్చిన ఆపత్తు తొలగించి కాపాడవలసినదిగా ప్రార్థించుట వెఱ్ఱి తనము గాదా?"

"సోదరీ! నామాట యొక్కసారిగ అట్లు కొట్టివేయకుము. బాబరు స్వకీయులకు రాణావారికి శత్రువులైనను రాజపుత్రుల శౌర్యపరాక్రమములను ప్రశంసించుటలో తృప్తికనువాడు. హుమాయూను బాదుషాకూడ మనల ప్రశంసించుచు ఉండవచ్చును."

"ముసల్మానుల ప్రశంసపై నీవు విశ్వాస ముంచు చుంటివా ?"

"మొగలులు అట్టి ముసల్మానులు కారని నేను విని యుంటిని. వారికి హిందువులయెడ సద్భావము గలదు ?"

"నీవీ ఆశ్చర్యకరమైనసంగతి యెచ్చటవింటివి ?"

"కాదు. ఇదిఅంతయు సత్యము. మొగలులు చాల శాంతప్రకృతి గలవారు. హిందువులతో సఖ్యము చేయుటకై వారెప్పుడును తలచుచుందురు. చిత్తూరు రాణి అనురోధమును అతడెన్నడు తిరస్కరింప జాలడు."

"నీవెట్లు అనురోధము చేయుదువు ?"

"నేను బాదుషావద్దకు రక్షాసూత్రము పంపె దను. ఏపవిత్ర రక్షాసూత్ర బంధనముచే రాజపుత్ర స్త్రీలు రాజపుత్రుల సోదరులని పిలుతురో అట్టి బంధ నముతోడనే మొగల్ పాదుషాను స్నేహమునకై ప్రార్థించెదను."

"ఏది యెట్లున్నను నీ సాహసము అత్యద్భుతము. కాని మొగలులొక రాజపుత్రస్త్రీయొక్క రక్షాసూత్ర బంధనము స్వీకరింతురా ?"

"తప్పక స్వీకరించెదరని నాకు నమ్మకముగలదు. హుమాయూన్ బాదుషాయొక్క ప్రకృతిబట్టిచూచిన అతడు చిత్తూరురాణిని ధర్మసోదరిగ తలంచుటకు వెను దీయడని నా విశ్వాసము."

"నీకు దీనిపై విశ్వాసమే ఉన్నచో మరి ఆలస్య మేల? సూత్రము శీఘ్రముగనే బాదుషావద్దకు బంపుము."

"కాని మొదట పాదుషావద్దకు మనిషినిబంపి అతని యుద్దేశ్య మెరుంగవలయునని నాతలంపు. అనంతరమున వీలుగా ఉన్నప్పుడు రక్షాసూత్రము గూడ బంపవచ్చును. ఎందుకన ఒకవేళ అతడు దానిని త్రిప్పివైచుచో అపరిమితమగు అవమానము పొందవలసివచ్చును."

ఇద్దరుస్త్రీలును మేవాడ్ రాణాయగు సంగ్రామ సింహుని భార్యలు. మొదటియామె పేరు కర్ణవతి. రెండవయామె పేరు జవాహిర్ బాయి. రాణాసంగ్రామసింహు డప్పుడు జీవించియుండలేదు. ఇద్దరురాణుల కిద్దరు పుత్రులుగలరు. ఒకని పేరు విక్రమజిత్, రెండవ వాని పేరు ఉదయసింహుడు. మాలవ్యా బాదుషాలతో మేవాడ్‌నకు ఎప్పుడు శత్రుత్వమువిడువక వచ్చుచుండెను. సమయము దొరికినప్పుడు ఒకరు రెండవవారిపై పగదీర్చుకొన తలంచుచుండిరి. సరిగ రాణా బ్రతికియున్నంతకాలము వారికి వీలుచిక్కినది కాదు. మరణించినపిదప విక్రమజిత్తు సింహాసన మధిరోహించెను. కాని యీతడు కొలదిరోజులలోనే అందర కప్రియుడై పోయెను. గుజరాత్ పాదుషా బహాదుర్‌షా మేవాడ్ పరిస్థితులన్నియు తెలిసికొని చిత్తూరుపై ఆక్రమణ చేయదలంచి వలయు సన్నాహము లాచరించుచుండెను. మేవాడ్ వాసులకుగూడ అతనియుద్యమము తెలిసెను. కాన వారందరు అత్యంత శంకితులైరి. ముఖ్యముగ రాణి కర్ణవతి తనకుమారుడగు ఉదయసింహుని విషయములో బెంగగొని యుండెను.

రాణీకర్ణవతి తాను నిశ్చయించినట్లుగ పురోహితునిపిలిచి తనఅభిప్రాయము వెల్లడించెను. పురోహితుడు బాదుషావద్దకు లేఖగొంపోవ స్వీకరించెను. యథాసమయములో రక్షాసూత్రముగూడ పాదుషావద్దకు బంపబడుననికూడ తెలిపెను. పురోహితుడు శుభముహూర్తమున అగ్రానగరమునుగూర్చి ప్రయాణమయ్యెను.

## 2

బాదుషాహుయగు హుమాయూన్ నివాసము అగ్రానగరము. ఈసమయమున శత్రువులవలన నతనికి గూడ మిక్కిలి శ్రమగా ఉండెను. ఆఫ్గనిస్థానమందొక విద్రోహదళము, బంగాళా, బీహార్ దేశములలో శేర్‌షాహుయున్ను యుద్ధమున కెదురుచూచుచుండిరి. రాణీకర్ణావతి పురోహితుడుద్వారా లేఖ పంపునప్పటికి హుమాయూన్ బంగాళాదేశము వైపునకు దండెత్తిపోవుటకు సిద్ధుడైయుండెను. బాదుషా సభలో కూర్చునియుండెను. ఇంతలో ద్వారపాలుడు పాదుషాకు పురోహితుని రాక యెరింగించెను. చిత్తూరు రాణియొక్క కులపురోహితు డేసియో అవశ్యకకార్యముపై తనవద్దకు వచ్చియుండెనని గ్రహించి హుమాయూన్ వెంటనే యాతనిని లోనికి రప్పించి సంగతేమని అడుగగా పురుహితుడు రాణీకర్ణావతియొసగినలేఖ అతనికి అందిచ్చెను.

పాదుషా లేఖపఠించెను. అనంతరమున పురోహితుడు—"ఇదికాక ఆజ్ఞయొసగుచో నేను కొంత వక్కాణించెదను" అనెను.

"మంచిది. సుల్తాను బహాదుర్‌షాహ చిత్తూరుపైకి దాడివెడలి వచ్చుటకు బయలు దేరి యుండెనా?"

"బయలుదేరుట కుద్యుక్తుడై యుండెను. శీఘ్రములోనే బయలుదేరునని వినియుంటిని."

"నేను నాశక్తికొలంది రాణి ప్రార్థనముచెల్లింప ప్రయత్నించెదను."

"పాదుషావారి మాటలచే నేను సంతుష్టుడనైతిని. చిత్తూరు రక్షింపబడుననియు, రాణా సంగ్రామసింహుని వంశము లుప్తము కాజాలదనియు నాకు నమ్మకము కలిగినది."

"సంగరాణాయొక్క అద్భుతవీరత్వముపై నే నత్యంతము ముగ్ధుడను. అందుచే యథాశక్తి నేను వారి వంశమును కాపాడుటకు ప్రయత్నము చేసెదను. రాణితో మీరు నాయీ యుద్దేశ్యమును తెలుపుడు."

"బాదుషాహ ఆజ్ఞ శిరోధార్యము."

"సమయము వచ్చినప్పుడు రక్షాసూత్ర మంపెద నని రాణి తనలేఖలో తెలిపియుండెను. రక్షాసూత్ర బంధనమన్న నేమో తెల్పియజేయుడు."

"మా రాజపుత్రస్త్రీలలో నొక రివాజుగలదు. ఏ స్త్రీయైనను ఒకరితో ధర్మసోదరునిగా సంబంధము స్థాపనముచేయ నుద్దేశించియున్నప్పుడు రక్షాసూత్ర మను నొకత్రాడు చేతికి కట్టింపుదురు. ముఖ్యముగ వారేదైన విపత్తులో చిక్కుకొనియున్నప్పుడు పంపుదురు."

"రక్షాసూత్రబంధనముద్వారా సోదరసోదరీసంబంధము స్థాపితమగునా?"

"అవును ఎవనియొద్దకు రక్షాసూత్రమంపబడునో అతడు ప్రాణములనొసగియైనను ఆమెకు సహాయ్యము చేయును.

"మొగలుపాదుషాకూడ యిందుకు వెనుదీయడు. నేనాదరపూర్వకముగ యామెపంపు రక్షాసూత్రము గ్రహించెదనని మీరాణితోజెప్పుము. నేను బంగాళాదేశము పైపునకు జనదలచితిని కాని యామె అనురోధము తీర్చుటకై ఇప్పుడే యావత్తుసేనతో చిత్తూరు పైపునకు బయలుదేరి వచ్చుచున్నాను."

"పాదుషావారి ఆజ్ఞ శిరోధార్యము" అనిపలికి పురోహితుడు సెలవుగొని చిత్తూరునకు ప్రయాణమయ్యెను.

## 3

బహాదూర్ షాహ ప్రతిహింసాగ్ని హృదయమును దహింప చిత్తూరును భస్మీపటలముగావింప పెద్దసేనా సమేతుడై చనుదెంచుచుండెను. అతని అశ్వికదళము కాల్బలమునకు అంతులేకుండెను. ఇదియుగాక ఫిరంగులు పేల్చు సైనికులుగూడ అనేకతుపాకులతో అరుదెంచుచుండిరి. లాబ్రీఖాన్ అనువాడు తుపాకి వీరులకు నాయకుడు.

రాణావిక్రమజిత్తు అప్పుడు బూందీ రాజ్యాంతర్గతమగు "వైచ"మను పట్టణమున ఉండెను. బహాదూర్ షాహసేన మొదట అచ్చటనే కనిపించెను. విక్రమజిత్తుకూడ వెనుకడుగు వేయువాడు కాడు. అతడు తన గుప్పెడు సేనను గైకొని ఆ అసంఖ్యసేనతో దలపడెను. అతని అధీనమందుగల సర్దారు లాతనిని రక్షించుటకన్న చిత్తూరును గాపాడుటయేముఖ్యమని ముందునకేగిరి. బహాదూర్ షాహయొక్క ప్రబలపరాక్రమ సైన్యమెదుట విక్రముడు నిలువజాలక పోయెను. నేడు చిత్తూరునకు సర్వనాశము సిద్ధమయ్యెను. కోటగోడకు రంధ్రమువేసి మహమ్మదీయులు లోన ప్రవేసించిరి.

దుర్గారావు, సత్తా, దద్దా మొదలగువారు రంధ్రపథమందు జీవములు త్యజించిరని విని జవాహిర్ బాయి కొలదిసేపటిలో అస్త్రశస్త్రములు కవచము మొదలగునవి దాల్చి యచ్చటకు వచ్చెను.

రాజమాతనుగాంచి సర్దారులు సైనికులు ద్విగుణీకృతోత్సాహముతో బోరదొడంగిరి. కాని ఫిరంగి గుండు తగులుటచే నా వీరనారీరత్నముకూడ నేలకొరగెను. వీరనారియగు ఆమె చిత్తూరురక్షణము కొరకై నవ్వుచునవ్వుచు ప్రాణములర్పించెను. అనంతరమున మిగిలిన రాజపుత్రులు ప్రాణములొడ్డి యుద్ధము చేయసాగిరి.

జవాహిర్ బాయి మరణవార్త రాణీకర్ణవతికి తెలిసినతోడనే యామె శోకసంతాపములచే అస్థిరయయ్యెను. అంతమున ఆమె పురోహితుని మరియొకసారి పిలిపించి ఇక నాలసింపకుమని రత్నస్థగితమగు సువర్ణకంకణము రక్షాసూత్రరూపముగ నాతనికి అందిచ్చెను. దానిని పురోహితుడుగైకొని పాదుషా దర్శనార్థమై వెడలిపోయెను.

హుమాయూన్ బాదుషా ఆగ్రానుండి బయలుదేరి అపారమగు సేనావాహినితో చిత్తూరువైపునకు

రాజొచ్చెను. బహాదూర్ షా సుల్తాను చిత్తూరుకోటను వశపరచుకొనియెనని మేవాడ్ పొలిమేరవరకు వచ్చిన మీదట యావైపునకుపోవుటకు మొదలయొసంగెను. అంతయు అతివేగమున చిత్తూరువైపునకు జని త్వరలో కోటసమీపమునకుపోయి నిలిచెను.

మొగలుసేన చిత్తూరుపొలిమేరకడ విశ్రమించియుండ నచ్చటకే పురోహితుడు చనెను. పాదుషాయగు హుమాయూన్ అతని తనదర్బారులోనికి పిలిపించి సంగతేమని అడిగెను.

పురోహితుడు యథోచితరీతి నాతనికి ప్రణమిల్లి పలికెను. "సమ్రాట్! చిత్తూరు సర్వనాశమగుటకు సంసిద్ధమై యున్నది."

"సుల్తాను కోటలో ప్రవేశించియుండెనాయేమి?"

"ఈపాటికి ప్రవేశించియుండును."

"అతడు కోటలో ప్రవేశించుట మీరు చూచియుండలేదనుకొందును."

"మహారాజా! లేదు ఊరకే కోటలో ప్రవేశించుట యాతనికి తేలికయా? అయినను అతనిరాక కడ్డుతగులువార లిప్పు డెవరున్నారు? అందఱు చిత్తూరుకొఱకై బలియై పోయిరి."

"రాణా జీవించియుండలేదా?"

"ఏకలింగస్వామికృపచే నాతడుజీవించియుండెను. కాని ఎచ్చటఉండెనో యెవ్వరు ఎరుగరు."

"అయిన ఇంతవరకు చిత్తూరును ఎవరుకాపాడిరి?"

"రాజపుత్ర సర్దారులును, రాజమాతయగు జవాహిర్ బాయియును. కాని వీరులందరు స్వర్గమలంకరించిరి. రాజమాతయు పోరుచు మరణించెను."

"రాణీకర్ణవతియు ఉదయసింహుడు క్షేమముగా ఉన్నారా?"

"నేను వారు బ్రదికియుండగా చూచివచ్చితిని. రాణి పూర్వాకథనమురీతిగ రక్షాసూత్రము పంపించియున్నది."

ఇట్లు పలికి పురోహితుడు స్వర్ణవలయమును దీసి బాదుషాకు కొసగెను.

పాదుషా చేతికి దానిని తొడిగికొనగా పురోహితుడు శీఘ్రముగా చిత్తూరునకు దయచేయవలయునని కోరెను. అట్లే అని పాదుషా తన సైనికులతో చిత్తూరు వైపునకు జనెను. రాణీకర్ణవతిని రక్షించుటకొరకై యాతని హృదయము ఆతురపడుచుండెను. అతడు ఆ రక్షాసూత్రబంధనమును కర్తవ్యబంధనముగా దలంచి మిక్కిలి కంగారుతో ప్రయాణము చేయసాగెను.

రాజమాత మరణించిన పిమ్మట సుల్తాను సేనయొక్క వేగమును రాజపుత్రులు సహింపజాలక పోయిరి.

రాణీకర్ణవతి యంతయు వినెను. సర్దారులందరు యామెవద్దకు జని, "జననీ! దుర్గము రక్షింపబడినది కాదు. ఇక రాజపుత్రస్త్రీల కర్తవ్యము పాలనము చేయుదురుగాక" అని పలికిరి.

"మీరందరు చితులు అలంకరించుచుండుడు. అంతలో నేనును తయారగుదును. హా! రక్షాసూత్రమా! నిన్నింత ఆలస్యముగా ఏలపంపితిని? పాదుషాచేరనే లేదు గదా."

"రక్షాసూత్రమే పంపినచో ఆలస్య మేల చేసితిరి?"

"ఏకలింగస్వామి యిష్టప్రకారము జరిగెను. ఆ స్వామి మన బలిదానము వాంఛించియుండెను. నేను కూడ వారి చరణసాన్నిధ్యముజేర నరుగుచుంటిని. మంచిది. కాని ఉదయసింహుని విషయమై యెట్టి ఉపాయ మాలోచించితిరి?"

"వారికొరకు మీరు విచారింపకుడు. బూందీవీరశ్రేష్ఠుడగు శూరతానురావువారి భారము తనపై నుంచికొనెను."

“అయిన నేను నిశ్చింతనై ప్రాణముల దొరగెదను. మీరందఱు సహగమన వ్రతమునకు పరికరములు గూర్చుడు. నేను సిద్ధము చేసికొందును.”

రాజపుత్రులందరు చితి అలంకరింప దొడంగిరి. కొలదిసేపటిలోనే కలపదెచ్చి ఒక పెద్ద చితి పేర్చిరి. నేడు ఈ మండుచున్న చితిలో రాజపుత్రస్త్రీలు, మాతలు, సోదరీగణము, భార్యలు ఆత్మవిసర్జనము చేయుదురని యుద్ధములో చావగా మిగిలిన రాజపుత్రులనుకొనజొచ్చిరి.

చితి ప్రజ్వలితమై అందుండి మంట బయలుదేరుచుండగా రాజపుత్ర స్త్రీలందరు అలంకరించుకొని అక్కడకు చేరిరి. రాణీకర్ణవతివద్దకు పదమూడువేల రాజపుత్ర లలనలు ప్రోగయిరి. ఇంతలో సుల్తాను కోటను స్వాధీనము చేసికొని యీవైపునకే పరుగెత్తుకొని వచ్చుచుండెనని తెలియగా అందరు భగవానుడగు ఏకలింగస్వామి నామము స్మరించుచు ఆ చితిలో బడిరి. చూచుచుండగా అగ్నిశిఖ ప్రజ్వలించెను. పదమూడువేల రాజపుత్రస్త్రీలు భస్మరూపముగ మారిపోయిరి!

౪

చిత్తూరు జయించి బహాదర్‌షాహ సంతోష సముద్రమున యీదులాడ జొచ్చెను. ఇంతలోనే హుమాయూన్‌పాదుషా చిత్తూరు చేరెనని వార్త వచ్చెను. చక్రవర్తి లేఖగొని దూత కోటలో ప్రవేశించెను. హుమాయూన్ చక్రవర్తి బహదూర్ షాహను కోటవిడిచి వెడలిపోవలసినదిగా వ్రాసెను. ఆరీతిగనే సుల్తాను కోటనువదలి తన దేశమునకు ప్రయాణమయ్యెను. హుమాయూన్ పాదుషాహ కోటలో ప్రవేశించి రాణీకర్ణవతి పదమూడువేల రాజపుత్రస్త్రీలతో ఆత్మబలిదానము చేసిన కథవిని స్తంభితుడైపోయెను. ఆతని నోటినుండి “హా! సోదరీ! రక్షాసూత్రము కొంచెముముందుగా ఎందుకు పంపకపోయితివి ?” అను వాక్యములు వెడలెను.

---

## విజయదశమి!

శ్రీమతి చర్ల నగరాజకుమారిగారు

రాజమహారాజ రాజాధిరాజులైన
కృష్ణరాయాది మహనీయు లేలునపుడు
పూజ్యవై భారతీయ సంపూజ్యవగుచు
నెంతలెం తేసి గౌరవమ్మొనసినావొ!

నేడు దుర్భరదారిద్ర్య పీడితాత్ము
లయిన భారతీయప్రజలు ప్రాంజలి గయి
సేయుటేగాక స్వాగతం బీయలేరు
కొన్కలీయంగలేని బికారులగుట.

పూర్వమహనీయు లెన్నియో మోదమునను
కొన్కలిచ్చి స్వాగతముల గారవించి
రనుచు వీరియెడల బిట్టుకినియకమ్మ!
తినుటకేలేని యీభారతీయులే మె
సంగి సత్కరింపగలరు జగతినిన్ను.

* * *

నాటిగౌరవమ్మందు శతాంశమైన
గాంచలేవన కల్లగా దించుకైన
విపుల విఖ్యాత సుచరిత్ర విజయదశమి!

# మాతృభూమి

శ్రీమతి సరోజనీ దేవిగారు

విశ్వవిఖ్యాత ప్రతాపసంపన్నులగు, ఆంధ్రచక్రవర్తుల విజయభేరి దిక్తటముల మారుమ్రోగిన వేంగీరాజ్యలలామ నీ జన్మభూమి! యభిమాన కుమారి!!

వీరకుమారకుమారీరత్నముల పవిత్రరుధిరబిందు క్షాళితమై రెడ్డిభూధవ శౌర్యధైర్యసాహసగుణముల వైభవోపేతమై అనన్యసామాన్యప్రతాపఖని నాయకురాలి భుజాటోపమున విలసితమై యలరారిన పల్నాడు రాజ్యేందిర నీమాతృభూమి ముద్దులబిడ్డ!

రాణీ రుద్రమాదేవి కాకతీయప్రతాప కేసరి విజయగర్జనలచే మార్మ్రోగిన ఓరుగల్లు, కమ్మప్రభువరేణ్యుడగు శ్రీ వేంకటాద్రీశునియతులశౌర్య విభవాత్మకమైన అమరావతీనగరము, నీభారతభూమికి ప్రేమపాత్రములు!

కార్యసాధనాచతురులగు యోధాగ్రగణ్యుల జన్మభూమి మహారాష్ట్రము, విప్లవనాయకులగు వీరసింహముల కన్న వంగదేశము, జగజ్జెట్టులని పేరొందిన సుపుత్రులనిలయమగు పంజాబు భారతమాతయశశ్చంద్రికలు!

నేడో పారతంత్ర్యమునబడి సర్వవిధముల నధఃపతితమైనది నీ మాతృభూమి!

సోదరా!

ఇరువదిరెండుకోట్ల హిందువులు అన్యోన్యకలహముల మరచి యుక్తకంఠముల సంతోషగేయముల నాలాపనజేయు నీ దసరా పర్వదినమున నీ పూర్వ మహర్షుల దివ్యచరిత్రల సంస్మరించి నీజన్మభూమి నన్నివిధముల నున్నతస్థానము నలంకరింపజేయు రచనాప్రణాళికను నీ హృదయమున సంసిద్ధపరుప శపథమొనర్పుము.

అదియే నీభారతభూమికి
నీ వొనర్పుపూజ
పర్వదినమునాడు చేయవలసిన
విధి

# టెలివిజన్ లేక దివ్యదృష్టి

గోపరాజు శివశంకరరావుగారు, ఎం.ఎస్.సి.

చైనాదేశమున 'ఒక ఛాయ పదివేల వాక్కులకు సమానము' అను సామెత కలదు. ఇందెంతో భావమున్నది. టెలివిజన్ అనగా దూరదేశములోని మనుష్యులను, మనోహరమైన దృశ్యములను కండ్లకు కట్టినట్లు చూచుటకు వీలగుట. శాస్త్రజ్ఞుల పరిశ్రమలవలన కనుగొనబడి తయారుచేయబడినను, ప్రజలు తక్కువవెలతో దానిని వినియోగపరచునంత వీలులోనికి రాలేదు. ఈ బాల్యావస్థలోనే జర్మనీలో కొన్ని స్టూడియోలును, బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగు కంపెనీవారు అలగ్జాండ్రియాప్యాలసు లండనులోను, డాన్‌లీకంపెనీవారి వేలసులోను స్టూడియోలను ఏర్పరచి దృశ్యములను దూరదేశములకు పంపుచున్నారు. జర్మనీలో ఛాయలను గ్రహించుయంత్రములను, టెలివిసర్ (Televisor) లను అమ్ముచున్నారు. ఒకేపెట్టెలో రేడియోసంగీతం వినుటకును, టెలివిజనువలన ఛాయలను గ్రహించుటకును ఏర్పరుప బడియున్నది. మీటరు త్రిప్పుటతోడనే వివిధప్రదేశముల దృశ్యములు కనబడును. టెలివిజన్‌కు 'బెయిరుడు' (Baird) అను ఇంగ్లీషు మహాశయుడు కారకుడు. 1925 వ సంవత్సరము ఏప్రెల్‌లో ఈయన మొదట నిరూపణము చేసినను, 1935 వ సంవత్సరము మార్చి నెల వరకు బ్రిటిష్‌వారు స్టూడియోలను స్థాపించ లేదు.

పురాణాది గ్రంథములలో పూర్వకాలమున పురుషులు దూరదేశపు వాక్‌దృశ్యవాసనస్పర్శలను వారి మహత్తు లేక దివ్యదృష్టిమూలమున గ్రహించెడివారని చూచి అతిశయోక్తులుగా భావించెడివారము. ఇప్పుడు శాస్త్రజ్ఞానమువలన అతిశయోక్తులు నిజము లగుచున్నవి. టెలివిజన్ కొన్ని యిరోపీయదేశములలో వాడుకలో నున్నది. మన దేశములోనికికూడ శీఘ్రకాలములో వాడుకలోనికి రాగలదు. కొలది కాలములో శాస్త్రజ్ఞులు వాసనలను, స్పర్శలను గ్రహించుట కనిపెట్టుదురని నాదృఢనమ్మకము.

బుద్ధిబలమువలన శాస్త్రజ్ఞులు కనిపెట్టిన అమోఘమైన యంత్రములన్నియు మన ఇంద్రియములవలె పనిచేయునట్లు ఏర్పరుప బడినవి. చెవిలాగుననే పనిచేయు యంత్రమును తయారుచేయుటకు ప్రయత్నించి జయమొందిరి. దానినే 'టెలిఫోను' లేక

'మైక్రోఫోను' అందురు. తరువాత ఇమి టేషన్ (artificial) కన్నును తయారు చేసిరి. దీనినే 'ఫోటో ఎలెక్ట్రిక్ సెల్' (Photo electric cell) అని అందురు. చెవి కన్ను పనిచేయుటకు జీవము ఎట్లు అవసరమో అట్లే పై రెండుయంత్రములు పనిచేయుటకు 'ఎలెక్ట్రిక్ కరెంటు' అవసరము.

టెలివిజనే గాక దూరదేశము నుండి ఫోటోలను పంపుట (Telephotography), పై దేశములలో జరుగు మాట్లాడు సినిమాలను చూచుట (Tele-talkies), ఛాయలను ప్లేట్లపై రికార్డుచేయుట (Phono-vision), చీకటిలో విదేశపుదృశ్యములను చూచుట (Noctovision), టెలివిజన్‌ను రంగులతో చూచుటకూడ కనిపెట్టిరి.

తరువాత టెలివిజన్‌లోని ముఖ్యాంశములను చర్చింతము. ఒక అనుక్షణము మాత్రము దృశ్యము చూచినప్పుడు కన్ను సెకండులో ఎనిమిదవ భాగమువరకు ఆ దృశ్యమునే చూచుచున్నట్లు కనబడును. దీనినే దృష్టినిలకడ (Persistence of vision) అని అందురు. కంటియొక్క స్వభావ గుణముచేతనే మనము సినిమాలను, టెలివిజను చూచుచున్నాము. వెలుతురు వస్తువులమీదపడి కనుపాపమీదకు వచ్చుట వలననే మనము దేనినైనను చూచుటకు కారణమై యున్నది. టెలివిజనుకు వెలుతురు విభజనముఖ్యము. నిపోకౌగారు కనిపెట్టిన ఒకేసైజు ఒకేవేగమున తిరుగు విభజనచక్రములను ఛాయలను పంపుచోటను గ్రహించు చోటను ఉపయోగించవలెను. పంపుచోటనుండే ఫోటో ఎలెక్ట్రిక్ సెల్ మీదపడు ఛాయ దూరదేశమున గ్రహించు యంత్రములోనుండే 'నియాన్‌లాంపు'అలికిడి మూలమున కనబడును.

టెలివిజన్ హంతకులు, దొంగలు, వీరి ఫోటోలను, వేలిముద్రలను వివిధదేశభాగములకు పంపి పోలీసు పరిశోధనలకు తోడ్పడుచున్నది. ఎక్సరే (Xray) ఫోటోలను దూరదేశములోని నిపుణవైద్యులకు పంపి వారి అమూల్య సలహాలను కొన్ని నిముషములలోనేపొంది, అనేక జీవరక్షణములు చేయవచ్చును. 'నాక్టోవిజన్'వలన సైన్యము, రాత్రివేళ విరోధులకు తెలియకుండగనే ఫోటోలనుతీసి గుట్టుమట్లను తెలిసికొనవచ్చును.

కలలు నిజములుగా మారుచున్నవి. ఉద్దేశ్యములు ఎంత ఆశ్చర్యకరమైనను, మొదటలో హాస్యాస్పదమైనను, యోచనాపరుల మనమున నశింపక, వేళ్లు పారి, పెంపొంది, నిజరూపమునుదాల్చి సర్వజనులకు సహాయమై రంజింపచేయును.

# మ నో ర మ

గీ. రణముఖంబునఁ జచ్చిన ♦ ప్రాణవిభుని
కాయమింటికి దెచ్చి ర ♦ క్కాంతఁదలచి—
రోదనము సేయ దించుక ♦ ఖేదపడదు
మూర్ఛ మునుగదు విహ్వల ♦ మూర్తిగాదు.

గీ. ఆమె పరిచారికలు చూచి ♦ యడలఁదొడఁగి
రామె శోకింపకూరక ♦ యట్లుయున్న
హృదయ దుఃఖాన ప్రాణంబు ♦ లెగయునంచు
విగతచేతనయౌనంచు ♦ వేగపడుచు.

గీ. జీవితేశ్వరు మెచ్చిర ♦ చ్చెలువ యెదుట
ప్రణయయోగ్యుఁడుధీరుఁ డ ♦ పారగుణుఁడు
స్నేహ శాత్రవపాత్రుఁడ ♦ జేయుఁడనుచు
నైన నోరెత్తియేడ్వ ద ♦ య్యబల వినియు.

గీ. అంతనొక బాల మెలమెల్ల ♦ నచటనుండి
యోధవరు మోముపై వేసి ♦ యున్న వలువ
తొలగదీసెను దుఃఖంబు ♦ కలుగుకొఱకు
నైన నోరెత్తియేడ్వ ద ♦ య్యబల కనియు.

గీ. తొంబదేండ్లున్న ముదుసలి ♦ తొయ్యలొకతె
వాని పసిబిడ్డనుంచెన ♦ ప్పడతి యొడిని
తొలకరినిబోలె కన్నీరు ♦ తూలిపడియె
'నీవునై బిడ్డ! బ్రదికితి ♦ నీ'కటంచు.

రా జ కు మా రి

## ౬

కలవలె చిత్రమువలె జరిగియుండిన నాటి సంఘటనములు ఆనాఁడే పరిసమాప్తమై యుండకపోయినను మఱల నాకింతవఱకుఁ బొడసూపి యుండలేదు. జాగ్రతకును సుషుప్తికిని మధ్యస్థమగు ననిర్వర్ణ్య స్థితియందు నే నుండిపోయితిని. చూచుచుఁ జూడజాలక, వినుచు వినఁజాలక అనుకంప నీయమగు దుర్దశయందు పడియుండినను అప్పుడయిన సమస్తవిషయములను నేను పలుమా ఱితరులవలన వినియుండుటచేత వానిని నేను స్వయముగ జూచినట్లే చెప్పు కొందును.

నేనట్లు భూతలమునఁ గూలిపోయినప్పుడు నేనును నాపక్షమును పరమవిషాదకరమగు నపజయమునకుఁ బాలుపడి దేనికై యుద్ధ మొనర్చితిమో దానినంత నొక్కత్రుటిలో గోల్పోవవలసిన మహాపదకుఁ బాత్రమయి తిమి.

'రాజకుమారుఁడు హతుఁడయ్యె'నని ప్రేక్షకులందఱు నప్పుడు మహానాదముగఁ జెప్పుకొనఁదొడంగిరి.

నాతండ్రిగా రామహానాద మాలించు టయేతడవుగ రంగభూమిపై నేను పడి యుండిన తావునకుఁ బరుగెత్తివచ్చిరి. వారు పరమదుఃఖావేశమున నాయొద్దఁ జతికిలఁబడి నాతలత్రాణమునుదీసి సంతాపితాంతః కరణులయి తల్లడిల్లుచుండగ వారివెనుక తన యహల్యను దలంచి దుఃఖించుచు శకుంతలాదేవియు నేను పడియున్న తావునకు కరుదెంచెను. కాని ఆయిందిర అహల్యా కుమారినెత్తుకొని ఆ విద్యాలయసాధాగ్ర

మున తన బాలికాసంఘముతో నిలువఁబడి తనకైన మహావిజయమునకుఁ బొంగిపోవుచు సర్వ మంగళలక్ష్మించుచు నేయుండెను.

నృపముమహాసద్ధ్వానములతో దేవతలు తన్ను స్తోత్రముచేయుచుండగా తూలపోని పరాక్రమమునఁ గీర్తితప్సుర్రయై సింహనాదాట్టహాసములతో లోకకంటకుల నీఱుచేసి తన భావిచరిత్ర ముగ్గడించుకొనుచు మహోపన్యాసమిచ్చిన చండికాదేవివలె * ఆమె యావేశపూరితయయి యీక్రింది గీతములఁ బాడెనఁట.

గీ. పడిరి మనశత్రువులందఱు ♦ పడిరిపడిరి,
భ్రష్టమతులౌచు దుష్టులై ♦ భంగపడిరి.
అంధకారాన వారెద్ది ♦ యపహసించి
హీనతరమంచు చిన్నదం ♦ చెంచినారో

గీ. అట్టివి త్తనమిప్డు స ♦ ర్వాంధ్రజగతి
విస్మయావహమానట్లు ♦ వి స్తరిల్లి
వేలకొలదిగ శాఖల ♦ వేసి వేసి
సూర్యదేవుని రశ్మిచే ♦ శోభగాంచి

గీ. కొలది యిడరానిఘనతచే ♦ కూర్చికొనియె,
పడిరిమన శత్రువులందఱు ♦ పడిరిపడిరి
భ్రష్టులై, దుష్టమతులయి ♦ నష్టపడిరి,
పలుదెఱంగుల భంగాల ♦ పాలబడిరి.

గీ. స్త్రీలకన్నీళ్లఁదడిసెనీ ♦ చివురు లగ్ని
అశ్రుమయములు పత్రంబు ♦ లన్నిదిశల
నట్టిసందర్భముండియు ♦ నందుబోడమె
పురుషదుర్గాగ్రహ్యమైనట్టి ♦ పుణ్యరవము.

గీ. ఖండితము సేయవచ్చిర ♦ కాండముగను-
ప్రాణములు దీయరాని అం ♦ పానఁబెట్ట
హతమతులవచ్చినాయుధ ♦ హస్తులగుచు
వచ్చి తమదెబ్బచే దామె ♦ చచ్చిరిపుడు.

గీ. పడిరిమన శత్రులందఱున్ ♦ బడిరిపడిరి
భ్రష్టులై, దుష్టులై, నష్ట ♦ భాగ్యులైరి-
పెండ్లికినివచ్చున ట్లతి ♦ బిరుసుతలల
చేత గొడ్డళ్ల ధరియించి ♦ చెప్పుకొనిరి:-

గీ. "చూడగంటిమి దీనినీ ♦ సొబగుతోడ
బనవిప్పుడ పడఁగొట్టి ♦ దీనితోడ
సల్పుకొందము గేహోప ♦ సాధనముల-
బల్లచెక్కలు, కుర్చీలు, ♦ మంచములును.

గీ. పురుషలోకైక సౌఖ్యాను ♦ భోగ్యమైన
బండ్లు, పడవలు, నోడలు, ♦ వంతెనలుగ
చేసికొందము కొమ్మల ♦ చెఱపివైచి
పంచికొందము గృహయోగ్య ♦ వస్తువు"లని.

గీ. పడిరిమన శత్రులందఱున్ ♦ బడిరి పడిరి
పలుదెఱంగుల భ్రష్టులై ♦ భంగపడిరి,
కొట్టవచ్చియు విఫలులై ♦ కూలిపడిరి
చెఱుపవచ్చియుఁ దమ్ముదాఁ ♦ జెఱచుకొనిరి.

గీ. ఉక్కు కంబంబురీతిన ♦ త్యుగ్రబలము
పుట్టినప్పుడ పుట్టెనీ ♦ భూజమందు
చెఱుపఁగలవారె! శత్రులీ ♦ సీమఁ జొచ్చి
భంగపడెదరుగాక దు ♦ ర్వారులయ్యు.

గీ. హస్తములయందె గొడ్డళ్లు ♦ ధ్వస్తమయ్యె
వారిపైజేతి యెమ్మలీ ♦ వలను విఱిగె-
చెడిరిమన శత్రులందఱుం ♦ జెడిరి చెడిరి
చెఱుప నుంకించి రూపఱి ♦ చెడిరి చెడిరి.

గీ. ఇట్టి గ్రీష్మంబుఁ జూచిన ♦ వృక్షమింక
శీతలచ్ఛాయ నిడుగాక ♦ చేవఁగలిగి
హృదయ సంతోషఫలముల ♦ నిచ్చుగాక
ఇంపుగల్గించుగాక స ♦ త్త్వైకమహిమ.

* శుంభనిశుంభాసురుల వధించిన దేవికథ మారనకృతమగు మార్కండేయ పురాణముననున్నది.
— మార్కం. పు. ఆ. ౬.

గీ. భూనభోంతరమంటున ♦ పూర్వశోభఁ
దీప్తమౌగాక భద్రసం ♦ ప్రాప్తిదనరి
ఆదిజంబగు రాతిపు ♦ నాదులవియ
జగతిఁజలియింపఁజేయుత ♦ శాశ్వతముగ.

"సఖీమణులారా! పరమపవిత్రమై మన మనుశాసించుకొనియున్న చండశాసనము లన్నియుఁ దుచ్ఛముగ ధిక్కరింపఁబడినవి. ఐనను మనకై ప్రాణములపోఁకదలంపకుండ యుద్ధరంగమున కరికి నేలపైవ్రాలి పడి యున్న మనసహోదర రత్నములయెడ మనమిప్పు డుదారవర్తనలమై యుండదగును. మన భావిభాగ్యోదయమైన యుత్తమదివస మిది. రాఁబోవుకాలమున మనకై యింత మహాత్యాగమొనర్చిన సోదరవీరుల నుగ్గ డించుచు స్త్రీలు కల్యాణోత్సవములఁజేసి వారి పవిత్రగ్రహము లారాధించుటయు నొక పుణ్యవిశేషముగ నొకరీతి మహత్త్వ సంపాదనముగఁ దలంచుచు నుండిపోవుదము.

"కావున మనమీవఱకు చేసికొనియున్న నియమముల స్వయముగ భంగమొనర్చు చుంటిమని భావింపక మనకై పోరాడిన వీర యోధులకు స్వస్థతఁగలుగునట్లు స్వయముగ సేవ యొనర్పవలసియున్నది కావున మన మచ్చటికివెళ్లి వారి కీ విద్యాలయమున స్వాగతమిచ్చి వారికి హృదయసౌఖ్యావహ మగునట్లు ప్రవర్తింపవలసియున్నది.

"మన స్వాతంత్ర్య భాగ్యోదయమైనది కావున మనమిట్టియల్ప కాలోపయోగ్య మైన నియమములఁ బాటింపవలసిన యావ శ్యకతలేదు. ఆ రంగభూమికినడచి మనకై అంత యుత్తమప్రకృతిని పోరాడిన మహా యోధుల నిచ్చటకుఁ దెచ్చికొందము. క్షత గాత్రులకు పురుషులొనర్చు సేవకంటె స్త్రీ లొనర్చు సేవవలన శీఘ్రముగా స్వాస్థ్యము చేకూరఁగలదు."

అని యామె ఆయహల్యను తనచేతుల నెత్తుకొనియే నూర్వురు బాలికలను వెంటఁ బెట్టుకొని సాధావతరణమొనర్చి ఆ మహా ద్వారమును తెరపించి మేముందఱమును పడి యున్న రంగభూమివంకకు నడచివచ్చెను. వారివెనుక కొంతదూరమున వారిచర్యల నుపలక్షించుచు భానుమతియు మేమున్న తావున కరుదెంచెను.

చెదరిపోవు లేళ్లవలె ఆ బాలికాగణ మచ్చటిసైన్యము నడుమనున్న రంగస్థలము నకువచ్చి ముందు తమసోదరులు పడియున్న తావునకు నడచివెళ్లిరి. అప్పు డా రాజ కుమారి ఒకచేత నహల్యనెత్తికొని పొంగి పొరలివచ్చు సహోదరప్రేమమునఁ గ్రింద బడియున్న వారిపైవంగి ఆదరపూర్వకముగ వారిని స్త్రీలోక రక్షకులనియు, సత్యపరా క్రమములనియు, సౌఖ్యమయాత్మకులనియు వారినిట్టి చావులేనిపేళ్ల స్తోత్రముచేసి "మీ రీకటికనేల నిచ్చటి గుడారములలోఁబడి యుండ నేటికి? యెవ్వరికై యుద్ధమొనర్చిరో అట్టి మాస్వహస్తముల స్వస్థులయ్యెదరుగాక. మావిద్యాలయమునకు రండు" అని పలికెను.

అప్పు డామె కుదయించిన హృదయ మార్దవముననో మఱి యొందువలననో గాని ఆరాజకుమారి నాప్రక్కకు నడచి

వచ్చెను. నాచెంతనున్న రాజసింహ నామెను సప్రేమముగఁజూచుచు మహామర్షమున లేచి నిలుచఁబడెను. ఆమెచర్య కేమనుటకును నో రాడక మహారాజ్ఞిగా రట్లుండగ నామెకొయ్య వలె నిశ్చైతన్య ప్రకృతినిబడియున్న నన్ను జూచి నిట్టూర్పువిడిచెను. తమయాత్మజుని గాయములఁదగిలియున్న వారి దుస్తులఁజూచి నప్పుడామెకు సహితము కొంతయనుకంపను పుట్టియుండవలెను. ఆమె హృదయమున నేదో బాధకలిగినదానివలె పెదవులు వణకి పోవుచుండగ వివర్ణవదనయయి యిట్లు పలికెనట;—

"ఇతఁడు నాప్రాణములఁ గాపాడెను. అయినను నా సోదరునిచేత వధింపఁబడి పోయెను. దైవఘటన మిట్లున్నది!"

అందులకు నాతండ్రిగా రామెదుండగము నుగ్గడించుటకో యనునట్లు నాహృదయము నకుఁ జేరువగ నే నెల్లప్పుడును ధరించు చుండు ఆమెపట మీవలకుఁ దీసిరఁట.

అప్పు డా రాజకుమారి భావమున నపూర్వమగు చిత్రపరివర్తనమొకటి జరిగి పోయెను. ఆమె జీవితచరిత్రమున భానుమతి తోడి సహవాసము కుదురుటకుపూర్వము తనతల్లిబ్రదికియుండగ నాపటమును దయారు చేసి నావద్దకుఁ బంపియుండిరి. తనతల్లి చిన్ననాఁ డంతయాదరముగఁ బంపియున్న ఆపటమును నేనంత యమూల్యముగ నుంచి కొనుటామెకు మహాశ్చర్యముగఁ దోచెఁ గావలయు.

మేనఁ బ్రాణములు లేనివానివలె భూమిపైఁబడియున్న నన్నుఁజూచినపు డామె కెట్టి భావపరంపర లుదయించినవో నేను వర్ణింపఁజాలను. ఆమెమాత్ర మాసమయ మున తనమూర్ఖపుఁ జేతలకుఁ గొంతవిషణ్ణ చిత్తయగుట ధృవము. అట్టి పశ్చాత్తాప మామె హృదయమునఁ బొడముట కదియే ప్రథమము.

తుదకంతయు నంత విపరీతముగ పరి సమాప్తియగుటకు ఆమె ఖేదపడి వజ్రకఠిన మగు నామె హృదయమున కుసుమకోమల మగు తత్వమొక టుదయించెను. అనుకంప నీయమగు నా యవస్థకు అయఃపాషాణ నిష్ఠురమగు నామెహృదయ మొక్కమా ఱుగ ద్రవీభూతమయ్యెను.

ఆమెవంగి తనచేతనున్న శిశువునచ్చట నేలపైఁ గూర్చుండబెట్టి తన కోమలహస్త ముతో నా కణతలను దడవి యిట్లు పలికెను.

"అయ్యా, యితఁడు బ్రదికియే యున్నాడు. ఇచ్చటి మాభవనమున నితనికి మా సహోదరులవలెనే ఔషధాదుల నిచ్చి శుశ్రూషయొనర్ప ననుజ్ఞ యిండు. ఈవఱకే నే నితనికి ఋణపడియున్నాను. తా మనుజ్ఞ నిచ్చినయెడల మే మితనిని పునర్జీవితుఁడుగఁ జేసి మా కృతజ్ఞతను వెల్లడించుకొందుము."

నే నావఱకే ప్రాణములఁ బాసియుంటి నని భావించియున్న నా తండ్రిగా రా మాటల విని తమ హృదయమున మఱలఁ గొంత యాశ పొడచూపుచుండగ నా

గాత్రమును గాయములను పరీక్షింప నారం భించిరి.

సంశయాస్పదమైయున్న నా ప్రాణ ములపై నిట్టూర్పుల విడుచుచు జన్మ శత్రువు లిరువు రా విధము న నుండగ శకుంతలాదేవి నాకు చేరువగ నడచివచ్చెను. అప్పు డామె శిశువగు నహల్య తన తల్లి నానవాలుపట్టి మహానందమునఁ జప్పట్లు గొట్టుచు నర్థశూన్యముగఁ బకబక నవ్వుచు, ఎగిరిపడుచు తన తల్లివైపునకుఁ జేతులు సాచి ఆమె యొడిలోని కెగురఁబోయెను.

అట్టి దృశ్య మా రాజకుమారికి మనః కంటముగనుండి ఆ బిడ్డను బట్టికొని "నాది— నాది—నీది కాదు, నీది కాదు. ఇయ్యి, పిల్ల నిచ్చివెయ్యి" అని ఆమె తల్లి నదల్చి వేసి ఆ బిడ్డను తాను లాగుకొనెను. నో రెఱుఁగని యా శిశువు తన తల్లిని చేరఁ జాలక అతికరుణముగ నేడువఁజొచ్చెను.

శకుంతల ఆచ్చెపడి విషణ్ణత్వ మాకా రము దాల్చినదానివలె నిలువఁబడిపోయెను. అప్పు డచ్చటఁ జేరియున్న మనుజులంద ఱును అనుకంపనీయమగు ఆ తల్లి యవ స్థకుఁ బరితాపఁబడుచు నుండిపోయిరి.

నిద్రలేమిచే, దుఃఖముచే నెఱ్ఱనయి యున్న కన్నులతో, అశ్రుసిక్తమయిన కపోలములతో, విడివడిగాలి కెగిరిపోవు కచసమూహములతో నిట్టూర్పులు నిగు డ్చుచు ఆ శకుంతల నోగాడక నిలువఁబడి పోయెను. లోనినుండి పొరలివచ్చు దుఃఖ మాపికొనఁజాలక ఆ శకుంతల యప్పు డను కంపనీయముగ వాపోవఁదొడంగెను.

ఆమె యా క్రందనమును విని ఆ రాజ కుమారి నన్నును, ఆ శకుంతలను, ఆ బిడ్డను గూడ రూక్షముగ నవలోకించుచుండగ సర్వమును జూచుచు నాచెంతనే పరుండి యున్న కృష్ణవర్మ ప్రయాసమున ఒక చేతిపై లేచి కూర్చుండి యేమో పలుక బోయెను. రాజకుమారి యతఁ డానాటి యపాత్రపు గేయమును చూపిన దుర్జాతు నిగ నానవాలుపట్టి చూపులలోనే యతని పై నగ్నివర్షమును గురిపించుచు ధిక్కార సూచకముగ నిలువఁబడెను. అయినను అతఁడు చలింపక ఆమె నుద్దేశించి యిట్లు పలికెను.

"అమ్మా! నీ వెంత రూపవంతురాలవో అంత బలవంతురాలవు. అంత భయంకరు రాలవు. ఆఁడుసింగమవయ్యు నీ శిరోజ ములయందే ఏ మగసింగముల జూలునకును లేని ఠీవి నలంకరించుకొనఁగలదానవు. సత్యమే కాని ప్రకృతియు ప్రేమయు నను నీ వస్తువులున్నవే అవి నీ భీషణప్రకృతి కన్నను బలవత్తరములును భయంకరములు నని తెలిసికొనుము. దైవఘటనవలన నీవు నీ కాలిచే మా కంఠములఁ ద్రొక్కివేయఁ గలుగుచున్నావు. మేము పరాజితులమై భ్రష్టులమైపోతిమి. సర్వతంత్ర స్వతంత్రవగు నీవు విజయవతివై మాకుఁ బ్రాణాంతకు రాలవైతివి. ఇంకను నీ కేమి కావలెను?— ఆమె కామె బిడ్డ నిచ్చివేసి స్వకీయబుద్ధి

చేత నీవు కల్పించుకొన్నదియు, నిర్మానుష్యమగునదియునగు నీ స్వేచ్ఛాప్రపంచము నకుఁ బట్టభద్రురాలవగుదువు. నీ కడుపు చలువవలన మా రాజకుమారుఁడు వధింపఁబడియేపోయెను. బ్రదుకఁగలిగినను నీ యుష్కృత్యమున జీవచ్ఛవముగనే యుండిపోవును. ఇఁక నీ వేమైనను నీ జోలి మా కక్కఱ లేదు. నీవు సర్వప్రపంచము నందునుగల స్త్రీల హృదయముల వశీకృతి మొనర్చుకొనుచు నుండిపొమ్ము. కాని నేఁ డిల్లలుకగనే పండుగయైపోవునా? ఎప్పటికైన మనుజజాతిపై నీ వొనర్చుచున్న అత్యాచారములకు శాస్తి జరుగకుండనుండదని తెలిసికొనుము. పగటి వెనుక రాత్రియు, రాత్రి వెనుక పగలును లోకాంతమువఱకు తిరిగి తిరిగి వచ్చుచుఁ బోవుచునుండవలసినవే కాదా? దుర్మార్గుల కీవిధి యేర్పడినప్పుడే కదా ధర్మసంస్థాపనమున కవతారమూర్తుల రాకల కవకాశ మేర్పడుచుండును? న్యాయపద్ధతుల కే మాత్రమైన వీలుండుటచేతనే ఆపదలఁబడియుండు మానవులు బ్రతుకఁ గలుగుచున్నారు కాని లేనియెడల మీవంటి విపరీత వ్యక్తులవలన లోక మీవఱకే నశించియుండవలసినది.

“కావున మీ మహాశయముల కెప్పుడో మహావసానమేర్పడి అందు నీవును, నీ విద్యాలయమును నామమాత్రావశేషముగ నశించిపోఁగలరు. భావికాలమున మీ కెట్టి ప్రళయములున్న నా కేమిగాని ముందు నీ వాబిడ్డ నామె కిచ్చివేయుము. ఎంతటిదానవైనను, నీ వెన్ని యెన్ని సాధింపఁ గలిగినను చేతులలో నీ గర్భవాసమున నిట్టి శిశువులఁ గనఁజాలవు కద! అట్టి నీవు ఆమె పుత్రికపై నింతయాస జేయు టెందులకు?

“నేను స్త్రీనని చెప్ప రక్తనాళ మొక్కటి నీ దేహమునను న్నయెడల, నిన్ను కన్నతల్లియన్న నీ కభిమాన ముండిన యెడల, నిన్ను పెంచి గారాబముచేసిన హస్తమున నీకుఁ బ్రేమయున్నయెడల, నీ లోన డెందము ఆతిచేయఁబడకున్నయెడల నామె పిల్ల నామె కిచ్చివేయుదువు.

“ఎవ్వతెను నీ ప్రాణసఖియని మొన్న మొన్నటివఱకు సంభావించియుంటివో ఆమె చేతులకు స్వయముగ నీ వా బిడ్డ నొప్పగింపఁజాలవు కాఁబోలు! నీయందు లేని హృదయమార్దవ మామెయందుండి ఆమె తన యన్నను తన రాజకుమారుని మరణశిక్ష కొప్పగింపఁజాలకపోయినది. అది నీ దృష్టియందు దుద్భవింపరాని మహాపరాధము. నీ వామె కీయజాలనియెడల నేనే బిడ్డను తీసికొని ఆమె కిచ్చివేయుదును. ఇమ్ము. నా చేతికిమ్ము. నే నామె కిచ్చివేయుదును.” అని యాతఁడనుచుండగ మొదట నామె యతనిని రూక్షముగఁజూచి క్రమముగ ఆ బిడ్డముఖముపై దృష్టిపఱపి అతని మాటల వినుచు నూరకుండెను. ఆమె దానినెత్తికొని యీవిధముగ పలుకఁదొడంగెను.

“మనోహరమగు మొగ్గ! వికసించియు వికసింపక సురభిళమైన ప్రసూనమవు! అంధ

కారమయమైన మహాపదయందు ప్రాణ మిత్రులందఱు గర్భవిరోధులుగ మాఱి పోయినప్పుడు నీవు హృదయంగమమగు జ్యోతివై ఆమోదమొసంగితివి. నాకు దుర్లభమగు దాంపత్యవిభూతికి నిక్షేపముగ నుదయించిన పుణ్యస్వరూపవు. నీతోడి పొత్తింక వదలిపోయినది. పూర్వ ముండినట్లే ఈపురుషులు కఠినముగ నుండిపోవుచున్నారు. మనమింక వియోగము నందవలసియున్నది కాని ఒకప్పుడు నీవలననే నామనోరథములకు సంపూర్ణ ఫలావాప్తి కలుగునని భావించుచు వచ్చితిని. నీకు వ్యవహారనిర్వాహకత్వ మలవడునట్లుసేయ సంకల్పించితిని. ఈనాటి ప్రాతఃకాలమున నిన్ను పాన్పునఁబెట్టికొని పరుండినప్పుడు కుసుమకోమలములగు నీ చిన్నిచేతుల నా హృదయదుఃఖముల మటు మాయమగునట్లు చేసివేయఁగల్గితివి.— కాని యిఁకముందైన నీతల్లి నా కెంత దొంగయై, విద్వేషిణియై, మహావిద్రోహిణి యైపోయినదో అంతయెక్కుడుగ నీకు విశ్వాసయోగ్యయై యుండిపోవుగాక! ఒక వేళ మహాకఠినమగు దుష్ప్రభుత్వమునకు నీవు పాలుగావలసివచ్చినయెడల నది స్వేచ్ఛాజీవితమునందలి సౌఖ్యమువలెనే నీకుఁ జూపట్టుగాక!”

అని ఆ రాజకుమారి యా కసిగందును ముద్దుపెట్టి దాని కృష్ణవర్మ చేతుల కందిచ్చుచు నిట్లు పలికెను.

“సర్వేశ్వరుఁడు నీ పాలనుండుగాక! సర్వదా నీకు భద్రమాగాక! అయ్యా, తీసికొనుఁడు.”

అని యినుపతొడుగులనున్న కృష్ణవర్మ చేతులయం దాపసిబిడ్డనుంచుటయే తడవుగ శకుంతల ఆనందబాష్పములఁ దేలిపోవు కన్నులతో బిడ్డనందుకొని దాని నాపాదశిరః పర్యంతమును ముద్దులుపెట్టిపెట్టి దానితో తన వక్షస్థలమును గప్పికొని తరువాత కొంత శాంతచిత్తయయి ఆ రాజకుమారి దెస వినమ్రపూర్వకముగఁ జూచుచు నిట్లు పలికెను.

“మన మిర్వురమును పరమసఖ్యమున నుండినట్టివారము. ఇప్పుడు శాశ్వతముగ నేను నా దేశమునకు వెడలిపోవుదును. మఱల నెప్పటికిని నిన్ను సందర్శింపఁజాలను. సర్వోచ్చమగు నీ మహోద్దేశములకు నేను తగినట్టి దానను కాను. అందులకు తగినదాని నొకతె నన్వేషించుకొనుము. నిన్నిఁక చూడఁజాలను కావున కృపార్ద్రచిత్తవై ఎప్పటివలె ఒక్క మంచిమాటఁ జెప్పుము. నా యపరాధ మిప్పటికిని నీవలన క్షంతవ్యమైనదని తలంచి కృతజ్ఞురాలనై శాంతముగ మా దేశమునకు వెడలిపోవుదును.”

కాని ఆ యిందిరనోట నొక్కమాట యైన రాలేదు. ఆమె యాపసిబిడ్డను తెప్ప వాల్పకఁ జూచుచున్నట్లు కొయ్యవలె నుండి పోయెను. ఆమెవైఖరి కామె యన్నయగు నజయసింహుఁడు మిక్కిలి సంతాపపడుచు నిట్లు పలుక నారంభించెను.

"ఇందిరా! యేమిది?—నీవు పురుషుల నిందించితివే! నీవు స్త్రీనయ్యు నింకొక స్త్రీయన్న నెంత కఠినత్వ మవలంబించుచుంటివో భావింపఁజాలవా? మీరు మీరే యక్రమ మొనర్చుకొనుచున్నారు. నేను నీకై యుద్ధ మొనర్చినట్టివాఁడను. నాయందు దయ యుంచియైన నీవాకింత మృదుత్వమును వహింపవచ్చును. నీయుద్ధమును నేనును నావాండ్రును చేసియుండిరని నీకేమైన నున్నదా? ఆమెతో మాట్లాడి సంభావింపుము.—చూడు! ఆమె యెంత కరుణముగ నేడ్చుచున్నదో! నేడైన యుద్ధముల ముమ్మాఱు చేయమన్నను చేయఁగలను కాని అట్టి కన్నీళ్లఁజూచుచు నుండఁజాలను."

కాని ఆయిందిరనోట నొక్కమాటయైన రాలేదు. అదంతయుఁజూచి మొగము జేవురించుచుండగ — యెన్నఁడు నెఱుగని యాగ్రహపరవశత్వమునఁ గమలాకరవర్మ కూఁతుతో నిట్లు పలికెను.

"మనరక్తమున నినుమున్నదందురు. నేనేమో యనుకొంటిని కాని యిప్పుడు తప్పక యున్నదని యొప్పుకొందును. అయఃపాషాణ నిష్ఠురమైన యిట్టితత్వము నీయం దెట్లుదయించినదో నాకాశ్చర్యముగనున్నది. నీకిట్టివైఖరి నన్నుబట్టి వచ్చియుండదు. చచ్చి స్వర్గస్థురాలై యున్న నీతల్లినిబట్టియు నీకుద యించియుండదు. అట్టి నవనీతమునం దిట్టి ఱాయి పుట్టుటయే వింత! కీర్తిశేషురాలగుటకు ముందామె "మనయిందిర మిగుల పట్టుదలగల బాలిక. అయినను ఆమె నను శాసించుచు లెస్సగ శిక్షింపఁగలవారి నామె చెంద నిరంతర ముండునట్లు చూచుచుండుము." అని చెప్పియుండెను. నేనట్టి వ్యక్తికై యన్వేషించితిని.—అందఱు భానుమతీదేవి అట్టివ్యక్తియని నేకగ్రీవముగఁ జెప్పిరి. నిన్నామె కొప్పగించితిని. ఆమె గొప్ప యుపకారమే చేసినది. ఏమి?—ఒక్కమాటయైన పలుకఁజాలవా? నీతండ్రి నగు నేను బ్రతిమాలుకొనుచున్నను నీవు జిహ్వ యాడింపకుండ నుంచుకొందువా? ఱాయైపోయిన అహల్యవలె యెట్లు బొమ్మవలె నూరకొనుచున్నావు! నిన్ను బట్టికొన్న పిచ్చితనమునకు యిరుదెఱంగుల మహాయోధులును బలియై మహాపదకు వచ్చియుండిరే! ఈశ్వరకటాక్షమున నంతఁ జావుదెబ్బ లెవ్వరికిని తగిలియుండవని భావించుచున్నాను. గ్రీష్మకాలములయందుఁ జల్లదనమునకై రాజధానినివదలి చచ్చి స్వర్గముననున్న మీయమ్మతో వచ్చి ఆవిలాససౌధమున నివశించుచుండెడివాఁడను. అప్పుడు మమ్మీవిధముగ నేడ్పించుటకు నీవింకను పుట్టియుండలేదు. నాకీ యైహిక జీవితమునఁ బ్రియతమమును, మహానందప్రదమైయుండిన పూర్వవాసన స్ఫురణకుఁ దెచ్చునట్టిదియు నగు నామహాసౌధమును నీకు సర్వతంత్ర స్వతంత్రములతో నిచ్చివేసితిని. అదంతయుఁ గడకిందులకా? ఇట్టి నీకు దయాదాక్షిణ్యము లున్నవా?—ఆమెతో మాట్లాడుము. ఇట్టి నిరర్థకమగు బింకమున నేమి సాధింపఁగలవు? ఈమె యెవతె?

నీతోడి ప్రథమసందర్శనమునందే "నాకు సమానవయస్క సమానతత్వ యుక్తురాలును అగు సఖీమణి యిన్నాళ్లకు దొరకినది" అని నీవు పరమోత్సాహమునఁ జెప్పుకొన్న ఆశకుంతలయే యగును కాదా? నీయాలోచనలలో, చేతలలో సహభాగినియయి, సహచారిణియయి యిర్వురు సతీపతులకంటె నధికతరమైన యనురాగముతో నీతో సర్వదా ప్రవర్తించియుండిన ఆశకుంతలయే కాదా? మహానిశీథసమయమున మన సౌధాగ్రముల నిలువఁబడి గ్రహగతుల గూర్చి, నక్షత్రతత్వములగూర్చి, తోకచుక్కలఁగూర్చి, సప్తర్షి మండల భ్రమణములఁగూర్చి యేవేవో కొలుకరాని క్రొత్త క్రొత్తశబ్దములఁ జెప్పుకొనుచు నీనీడవలె సంచరించియుండిన నీ ప్రాణసఖియే కాదా? ఇప్పుడామెతో ఒక్కమాట—ఆదరపూర్వకమగు నొక్కమాట యనఁజాలవా? ఎంత పాషాణమైపోతివి!—మొద్దువలె మొలుదువలె నిల్చుందువు కాని ఒక్కమాట నోట రానీయఁజాలవు! ఆమెయునియు నేననియుఁ జెప్పుకొనుట యెందులకు?—ఈ సర్వవసుంధరయందును నీకొక్కవ్యక్తిపై నిక్కమగు ప్రేమయున్నదని పల్కికొనఁగలవా? ఎంత యన్నను నూరకొందువు కాని ఒక్కమాట పలుకలేవు! నీకు హృదయమెక్కడిది! మొదటపుట్టియున్నను పుర్వులు దినివేసిన గింజవలె నీవిపరీతభావములను క్రిములచేత మన్నయి రూపఱి యుండవలెను."

అని ఆమహారాజు తన కలవాటులేని ధోరణిని తనుజాతతో నిష్ఠురముగ నెంత యదల్చినను ఆమె నోరెత్తి మాట్లాడదయ్యెను. విషమమై, విపరీతమై, పరస్పర విరుద్ధమైనభావముల సంఘట్టనమున ఆమె వివశయైనదానివలె తలవాల్చి నిలుచుండెను. నిశ్చలతత్వమున నుండు తేటనీట మేఘ సంఛన్నమగు చంద్రబింబమువలె నామె మోమున సంశయావహమైన చిరునగవొకటి 'అస్తినాస్తి'యను భావమున నంకురించెను.

అంతట నాతండ్రిగారు నాగాయములపై జేర్చియున్న తమదృష్టుల నామెవంకకుఁద్రిప్పి మనసుఁ బట్టికొనఁజాలక తీవ్రముగ నిట్లనిరి.

"ఆహా! యెంతటి యాఁడుదానవు! నీమాటలకు మోసపోయి యాక్రిందటిక్షణమువఱకుగూడ నీవందఱాఁడువాండ్రవంటి దానవనియే భ్రాంతిపడి క్షతగాత్రుఁడగు నా తనయుని నీకొప్పగింప సమ్మతించితిని. వానికిసహిత మట్లొనరించుట యంగీకారమగునని భావించి సమ్మతించితిని.—కాని నీపిచ్చతనమున నీసహచారిణియైన నీనేస్తగత్తెను క్షమింపక నీవున్నవైఖరి చూడగా, నీవిపరీతతత్వమున మఱల నేమైన తుపానులు పుట్టినయెడల మందనిపేరుపెట్టి నీవే విషమో వానికికలిపి వానిని సూక్ష్మముగఁ జంపివేయుదువు. నీవెంతటి సాహసమునకైన సిద్ధపడఁ గల్గుదువు."

అని పరిజనులవంకఁ దిరిగి—

"ఇట్టి సన్నివేశమున క్షతగాత్రులగు పురుషులకు పురుషులచేయియే క్షేమకరము. కుమారు నెత్తికొనిరండు."

అని వారులేచి నిలువఁబడిరి. ఆరాజు చేసిన తుచ్ఛారోపణమున కేవో తీవ్రముగ నామె ప్రత్యుత్తరమిచ్చునని చూపులు శ్రద్ధాళువులై యామె నుపలక్షించుచుండగ నారాజకుమారి భావాంబరమునఁ గ్రమ్ము కొనియున్న మేఘములలోనుండి ఒక్కసారిగ వేడిమియు, వెల్గుఁగజాపు నొడతోడి కన్నీళ్ల జడివానయొకటి బుట్టికొనివచ్చి విషణ్ణచిత్తయగు నాశకుంతల నొక్కసారిగ ముంచివేసెను.

"శకుంతలా! రమ్ము. కడకేగి నీఅయి పోవు నన్నుఁ గౌగిలించుకొనుము. ఒక్క గంటయైన నిశ్చలచిత్తమున నుండఁజాలని నన్నుఁ బునస్సఖ్యానురూపముగ సంభా వింపుము. శూన్యతత్వమున నున్నదని వీరెల్ల రాక్షేపించుచున్న నాహృదయమును దాఁకి అది శూన్యమో, శుష్కమో, కఠినమో లేక పాషాణమో నీవే నిర్ణయించుకొనుము. పెద్దవాండ్రు కూకలువేయగఁ బసిపిల్ల లొకర్నొకరు మనమిప్పుడు పరస్పరాలింగన మొనర్చి బద్ధసఖ్యమున నుండిపోవుదము. ఇప్పుడు పసిబిడ్డఁ కంటె హెచ్చుగ నాయం దేమి ఘనత యున్నది?—కావున నేను సహితము క్షంతవ్యురాలనే! పురుషులతో నెట్టిసంబంధములును లేని కన్యలతో నేను వ్యవహరించి యుండదగినది. నీవు నాకంత ద్రోహమొనర్చినను బ్రియతరురాలవే. ప్రియమైన విద్రోహినివి. అయినను నీయందు నాకింతప్రణయము! ఏల?—ఏల? గతించినదానినిగూర్చి నేనిప్పు డెందులకు జర్చింపవలెను?—కావున నీమహారాజుల సమక్షమున భూతమును విస్మరించి నీవెంతటి యవిశ్వసనీయవైనను నిన్ను సంపూర్ణముగ క్షమించి యెప్పటిస్నేహమున గౌరవించెద నని ప్రతిజ్ఞ చేయుచున్నాను."

అని యారాజకుమారి శకుంతలాదేవికిఁ గై దండ యొసంగి మాతండ్రిగారినిజూచి యిట్లనెను.

"మహారాజా! మీయాతనయునకు శుశ్రూష యొనర్ప నాకనుజ్ఞనిండు. నేనాతనికి ఋణ పడియున్నాను. నేనాతనికెంత కృతజ్ఞతఁ జూపింపఁదగునో సంపూర్ణముగ హృదయ మునకు వచ్చియున్నది. కావున తమ్మిట్లు సాహసించి యడుగుచున్నాను. నన్నిఁక నాక్షేపింపకుఁడు. మీరు, మీపరివారమును స్వేచ్ఛగ లోనికి వచ్చుచుఁ బోవుచు నుండ వచ్చును. అనుకూలతరమైన కాలము వచ్చువఱకు మాబాలికల నందఱను వారి వారియిండ్లకు బంపించివేయుదును. ఇప్పుడు వారి నిచ్చటనుంచి చేయునదేమియులేదు. ఇప్పుడు తామేమందురు?—అన్నా!— నాయన!— మీరిరువురే మహారాజునకు నచ్చఁజెప్పుఁడు. నన్నిప్పుడింతగ నావహించి యున్న నాసహజానురాగమును, దయయు మీమీహృదయముల కొకింత తగులఁజేసి నాకోరికను మన్నింపుడు. నాజీవితనిశ్చయ మునుండి యిట్లు కూలిపడిపోవునప్పుడు స్త్రీజాతికి ప్రకృతిసిద్ధములైన దుర్బలత్వ మును, నిస్సహాయతయు, కంపమును, దయయు నొక్కసారిగ నన్ను విహ్వాలించి వేయుచున్నవి."

అని పలుకునప్పు డామెమోమునఁ బాష్ప జల మగ్గలమై క్రమ్ముకొనెను. సాతంత్రి గారు బదులాడలేదు. అప్పుడు కృష్ణవర్మ శకుంతలతో—

"నీసోదరుడు—పార్థసారధి—అతనికై మీనాయకురాల నడిగికొనుము. అతఁడును గాయపడి భూతలమునఁ బడియున్నవాఁడు. రాజకుమారునితో నతఁడుసహితము స్వస్థతకు వచ్చునట్లు చూచుకొందువుగాని" అని పలికెను.

ఆరాజకుమారి విషమసూచకముగ మంద హాసముచేయుచు "అట్లే కానిమ్ము. మా నియమము లీవలకే చెడిపోయినవి. అతఁడు కూడ లోనికి రావచ్చును" అనిపలికెను.

అంతట 'కన్నీళ్ళ'ఁగూర్చి విషాదగీత ముల బాడిన వాసంతియు తన మేనత్తకొడు కొకఁడా యోధులలో గాయపడియున్నవా డనియు, వానికి తానుపచారమొనర్తుననియు అందులకు సహితము సమ్మతింపవలసిన దనియుఁ దన నాయకురాలిని ప్రార్థించెను. రాజకుమారి యిట్లనెను.

"అట్లే కానిమ్ము. దైవఘటనమున నిట్టి ప్రవాహమునఁ బడిపోతిని. ఒక్కగంటయైన కాలూని నిలువఁజాలక పోవుచున్నాను. మన నియమబంధనముల నవలీలగఁ ద్రెంపి వేయుచున్నాము. అయిన నగుఁగాక. అట్లే కానిమ్ము."

భానుమతి యట్లుపలికెను.

"అట్లే కానిమ్ము? అమ్మవారు తా మిట్లనుట నాకాశ్చర్యజనకముగ నున్నది. కాని యీనియమములఁ దాము చేయలేదు. కావున తాము వానిని ధారాళముగఁ ద్రుణీక రించివేయుదురు. వానిని చేసినదానను నేను. నేను పెండ్లాడి భార్యనై మసలియున్న దానను. కావున బురుషులన్న నెట్టివారో సంపూర్ణముగఁ దెలిసియున్నదానను. పురుషు లనుబోలు వంచకులుండరు. స్త్రీతనయాత్మ గౌరవమును నిప్పచ్చరమొనర్చుకొని పురు షునకు లొంగిపోవుటకంటె తుచ్ఛత్వ మింకొ కటిలేదు. ఇప్పుడీపురుషులు తమ్ముఁ బెండ్లా డుటకై వచ్చిరి. పరిణయమున బద్ధకంక ణులై వచ్చిరి. అట్టివాండ్రకు మీరవలీలగ వశమైపోవుట నా కాశ్చర్యజనకముగ నున్నది."

అని యామెతత్వమున కనురూపముగ మాట్లాడెను. భూకంపము లుదయించు నపు డున్నతసౌధములనుండి యుత్పాత సూచకముగ బ్రయోగింపఁబడు ఘంటానాద మువలె నల్పముగఁ గంపించిపోవు రకమున నారాజకుమారి విషణ్ణచిత్తయై నిట్లు త్రోసివైచెను.

"మన విద్యాలయమునందలి సర్వద్వార ములును తెఱచివేయుఁడు! కేవలమొక్కడే కాదు. శత్రుండైనను, మిత్రుండైనను లోనికి రానిచ్చగించు పురుషుఁ డెవ్వఁడైనసరే వానిని లోనికిఁ దోడ్కొనిరండు. మనలఁ బట్టికొన్న యీతుపానంతరించువఱకు మన బాలికలకు సెలవు లిచ్చివేయుదును. వా రంతవఱకుఁ దమయిండ్లకడ కొంత విశ్రాంతి గైకొందురు గాక!"

అని యా భానుమతినిజూచి__

"సముద్రమధ్యమునఁ గొండలపై నుండు దీపస్థంభముల నెట్టి తరంగము లొరసికొని వచ్చినను ఆదీపస్థంభములా మహాద్రిపై నిలిచియుండి పోవునట్టివేకాదా? __ మాచవి గాని యిట్టిమాటలగట్టిపెట్టి నీకనురూపమైన జనులఁ గలసికొని వారితో నుండిపొమ్ము. వీలైనయెడల మమ్మిప్పుడు కడచుటకైన సిద్ధపడియుందువు కాని__నీబ్రదుకున కాశ్వా సాంతమై పోయినది. నీవు నన్నింకను బ్రేలిం పక నీయిచ్చవచ్చినచోటికి వెడలిపోవచ్చు ను" అని పలికెను.

ఆమె మారోర్మము వెట్టుకొనునప్పు డామె యందలి యనాదరమును మహామర్షమును ఆ రాజకుమారిముఖమును కెంపుగఁ జేసి వైచెను. అప్పు డామె సహోదరుఁడగు నజయసింహుఁడును, ఆమె. తండ్రియగు కమలాకరవర్మయు ననునయవచనములాడి పరీక్షితమై సంక్షోభించిపోవు నామెహృదయ మున కూరట కలుగునట్లు చేసిరి. ఆమె యనిన సర్వదా నిరసనబుద్ధితో నుండు.మా తండ్రిగారుసహిత మామెతో సాంత్వన ములుపలికి ఆమె హృదయమున కుపశాంతి కల్గుట కాయాసపడిరి.

తదనంతరము వారు క్షతగాత్రులమై యున్న మమ్ము నెత్తుకొని ఆమహిళా మహా విద్యాలయమునకు దో డ్కొ ని పోయిరి. కన్యాక్రాంతమగు నామహావరణపు ద్వారములన్ని బురుషస్వరూపములు లోనికిఁ జొరబడుటకు నివ్వెఱపడి ఆముఖద్వారోపరి నున్న కన్యకాపరమేశ్వరి హాహాకార మొనర్పఁ జేయుచున్నట్లిచ్చటి తలుపులు కర్ణకఠోరముగఁ 'గీచు'మనుచుండగ నిశ్చై తన్యతత్వముననున్న మమ్ము లోని కెత్తి కొనిపోయిరి.

విశాలమగు నచ్చటిప్రాంగణమున క్షత గాత్రులను పాన్పులపై పరుండబెట్టునప్పు డచ్చటి స్త్రీవిగ్రహములన్నియు నపూర్వ మగునట్టి సంఘటనమునకు జెచ్చవడి చూచు నట్లుండిపోయెను. బాలికలు కొందఱు ఇంది రాదేవి సింహాసనమునకుఁ జేరువగ నామెను పరివేష్టించి సంఘంబులై వచ్చుచుఁ బోవుచు నున్న యోధుల దిలకించుచు నుండిపోయిరి. ఆసింగపుబిల్లలు సహితము కవచధారులగు క్రొత్తక్రొత్త విగ్రహముల యాగమనమునకు భీతిల్లుచున్నట్లు తమ యజమానురాలి పాద ములవద్ద నక్కి సర్వ ముపలక్షించుచు నుండి పోయినవి.

తండోప తండములుగవచ్చు నామహా యోధు లా విద్యాలయసౌందర్యమునకు విస్మయపడుచుండగ నా విద్యాలయపు బాలిక లన్నిదిశల నివ్వెఱపాటుతో వారిని దిలకించుచు నుండిపోయిరి.

అట్లానాటి దివసమవసానమునకు వచ్చు చుండగ నచ్చటి శ్రద్ధా, క్షమా, దయాది రూపములఁ బ్రతిష్ఠింపఁబడిన శిలావిగ్ర హములు నాటి సంఘటనములకుఁ దమ మూర్తులఁ జేవురింపఁజేసికొనుచున్నట్లు చిత్ర చిత్రమగు కాంతిపుంజములఁ బ్రసరింపఁ దొడంగెను.





ఉత్తరహిందూస్థానమున కుర్మీక్షత్రియులలో
14 వ ఏట మెట్రికులేషన్‌లో ప్రథమ
తరగతియందుత్తీర్ణురాలైన బాలిక.
ఢిల్లీలోని ఇంద్రప్రస్త
ఉన్నతపాఠశాలలో చదివినది.





మిస్. వి. థాకూర్‌దాస్ ఎం. ఏ.,
పంజాబు విశ్వవిద్యాలయమున గణిత
శాస్త్రమునందు ఉత్తీర్ణయైన ప్రథమ స్త్రీ.
ఉన్నతవిద్యబడయుటకై ఇంగ్లండు వెళ్లిరి.



కాళీఘట్ట దేవాలయము – కలకత్తా

అప్పుడా యిందిరాదేవి నాఁడు సల్పఁదగిన కార్యక్రమమునుగూర్చి తనబాలికల హెచ్చరించెను. అప్పు డామె యాజ్ఞానుసారముగ నూ. యోధవరు లచ్చటి సోపానపంక్తి మీఁదుగ నన్ను సౌధోపరిభాగమున నిశ్శబ్దముగ నిగూఢముగనున్న గదిలోనికిఁ దోడ్కొనిపోయి అచ్చట నొక మృదులపర్యంకమునఁ బవళింపఁజేసిరి. నన్నేకాక నా మిత్రులు కృష్ణవర్మను, పార్థసారథిని, ఆకవల వారినికూడ వారా సౌధోపరిభాగమున వేఱ్వేఱు గదులలోఁ బరుండబెట్టిరి.

తరువాత నానాటి సాయంకాలమంతయుఁ గన్యాజనమును వారివారియిండ్లకు దీసికొనిపోవు గుఱ్ఱపు బండ్లయొక్కయు, వృషభ వాహనముల యొక్కయు రొద వలన నెంతటిసమర్ధమైన నామహా విద్యాలయమున నుదయించెను.

కాని యీ బాలికలలో వివేకవతులనియు, చాతుర్యవతులనియు బరిగణింపఁబడిన కొందఱు కన్యలా రాజకుమారితో నామెకు సహాయముగ నుండిపోయిరి.

ఆవిద్యాలయ కుడ్యములకుఁ జేరువ విడిసియున్న సైన్యములనాయకులు యథేచ్ఛముగ లోనికి వచ్చుచుఁబోవుచు క్షతగాత్రులకుఁ గట్టబడు కట్లనుగూర్చియు, జరుపఁబడుచున్న చికిత్సాదులఁ గూర్చియు దెలిసికొనుచు పరులకుఁ దెలియఁజేయుచునుండిరి.

ఈ విధముగనంతయు మాఱిపోయెను.

ఇది మనోరమయను వచనకావ్యమునఁ
రాజకుమారి యను కథయందుఁ
బ్రియంవద యను నామెచేఁ
జెప్పఁబడిన షష్ఠమభాగము.



# పాశ్చాత్య గృహిణులు

ప్రపంచమున ప్రతి నాగరికయజాతియందును, భాగ్యవంతుల తరగతికి చెందినవారి వాడుకలు మర్యాదలు, అన్నియు నొకటిగనే యుండి జాతీయ సిద్ధముగనుండు విషయములను గమనించువారికి యెక్కువ నవకాశమీయను. పురుషులు లండను ఫాషనులను, స్త్రీలు పరాసు ఫాషనులను అనుకరించెదరు. వారు ఆటలందును పాటలందును వాఙ్మయమునందును ఆసక్తి కలుగజేసికొనెదరు. రుచికరములగు భోజనములను చేయుచు జీవితమున మంచి సౌఖ్యమును యనుభవించెదరు. వీరు సామాన్యముగ నందఱును నొకటే విధమున జీవితమును గడుపుచుందురు.

ఫ్రాన్సు, అమెరికా, యింగ్లాండు మొదలగు దేశములందును మరెక్కడైనను, జనులు ఎట్లు నివసించుచున్నారో కనుగొనవలయునన్న మధ్యతరగతి, బీద తరగతి వారితో వసింపవలెను. భాగ్యవంతులే గాక మధ్యతరగతి జనులు ఫ్రాన్సున చాల సుకుమారముగ నివసించెదరు. ఇంగ్లీషు, జర్మనీ దుకాణదారుడు తిను భోజనముకన్నను, చిన్నచిన్న అమెరికనుపట్టపు హోటేళ్లయందు యిడు భోజనము కన్నను, ఫ్రెంచి కార్మికుడు మంచిరకము భోజనము పుష్టిగను మంచి యాకలితోను భుజించును. ఇంగ్లీషుకార్మికుడు మధ్యాహ్నసమయమున తిను పదార్థములను ఫ్రెంచికార్మికుడు తినడు సరిగదా, వాటిపై పు కన్నెత్తియైనను చూడడు. ఇంగ్లీషుకార్మికుడు రోడ్డుమధ్యకాని, గోడకు చేరిగిలబడిగాని, రొట్టె, పూరగాయలులేక కొంచెము మాంసమును, ఎండలో మూతలేక సీసపుగొట్టాలలో మరుగుచుండు సారాయిని త్రాగును.

పరాసుభార్య:—

తెలివితేటలలో ఆవిడభర్తకు పైచేయి. గృహార్థిక విషయములందు ఆవిడ కనుబరచుతెలివి, యింటిని శుభ్రమైన పద్ధతులందు నేర్పు సూక్ష్మగ్రాహ్యత, నాగరికత, వంటచేయుటయందు నిపుణత, దేశీయ పద్ధతులయందు యనుసరణ వీటి యన్నింటిచేతను కొద్దిపాటి ధనము గణించు భర్తను సంసారమును, యితర దేశీయభాగ్యవంతులు చూచి యీర్ష్యపడువిధమున భర్తను సంతోషింపచేయును.

వేసుకొనుటకు అనువగు రెండేదుస్తులువున్నను వాటిని చాకచక్యముతో మార్చి యెన్నోవిధములగు దుస్తులు కలిగియున్నట్లు చూచువారలను భ్రమింపచేయును. పలుఫాషనుల తెలుపుచు ధరించువుడుపులచే, అవి వేసికొనుతీరుచే పరాసుస్త్రీ పురుషులను ఆకర్షించుచున్నది. ఆవిడను ఒకబురదచోటిని దాటునపుడు తన గౌనును అతి సుకుమారముగ పట్టుకొని నడుచుటయందు యేస్త్రీయును సాటిరాదు. ఆవిడ ఎప్పుడు అటుయిటు మసలుచు, చూచువారలకు తనయందు ఆసక్తి నశించిపోవకుండ చేసికొనగలదు. ఆవిడ ఎల్లప్పుడు శుభ్రముగనుండును. తల చక్కగ దువ్వుకొని చేతులకు గ్లవులు బాగుగతొడిగికొని మంచి మేజోళ్లను కాలిజోళ్లను వేసి ఎప్పుడు ఆకర్షణీయముగ నుండును. పురుషుల ఎదుట కనుబర్చు మర్యాద, మాట్లాడుభాష వీటివలన నిజముగ ఆవిడ గౌరవ కుటుంబమునకు చెందిన స్త్రీయని దలంపజేయును.

పరాసుభార్య మర్యాదలకు పోయి వారిని వీరిని అనవసరముగపిలచి టీగాని విందులుగాని చేయదు. ఆవిడ పియానో వాయించదు. దీనివలన భర్త

చెవులకు శ్రమకలుగదు. తన దుస్తులను తనే కుట్టుకొని దర్జీకూలి తగ్గించును. రుచికరములును, ఆరోగ్యవంతములగు పదార్థములను తానే వండి వంటవాని ఖర్చుతగ్గించును. పరాసు స్త్రీయొక్క భాగ్యము, అనవసరపు ఖర్చులేకుండ సంసారముచేయుటయందే యిమిడియున్నది. పరాసు దేశీయుడు సంవత్సరమునకు నూరుపౌన్లు ఆదాయముతో సంవత్సరమునకు అయిదు వందలపౌన్లు రాబడికల ఆంగ్లేయుని జీవితముతోటి సరితూగగలడు.

పరాసు స్త్రీ ప్రతిరోజున ప్రొద్దుననే పొందికైన తన డ్రెసింగు గదినుంచి చక్కగ ముస్తాబై బయటికి వచ్చును. ఆవిడ తనయింటికి పెద్దపెద్దహాలులు లేక పోయినను యిష్టపడును కాని డ్రెసింగు గదిలేనిదే వుండలేదు. ఆవిడ ప్రతిరోజు చక్కగ అలంకరించుకొని భర్తమనసును కంటినికూడ రంజింపచేయును. ఒకరిని చూచిన నొకరికి కలుగు విసుగుదలే, పెక్కు సంసారవిచ్ఛేదనములకు మూలకారణమని ఆవిడకు బాగుగ తెలుసును. అందుచేతనే ఎక్కువ శ్రద్ధకలిగి యుండును.

ఆవిడ తాను గొప్పతరగతి స్త్రీనని కూడ భ్రమింపచేయును. భార్యాభర్తల మధ్య వేర్వేరు గదులుండవలెనను పట్టుదల కలిగియుండును. అనవసరముగ ఒకరిఎదుట నొకరుకూర్చుండి విసుగు కలిగించుకొనరు. ఎవరికి అవసరముకలిగిన, వారు అవతలివారి గదితలుపు మెల్లగకొట్టి పిలతురు. కొందరు భార్యాభర్తలమధ్య యిటువంటి మర్యాదయేమని హేళన చేయవచ్చును. కాని యిటువంటి చిన్నవిషయములే సంసారమును సుఖవంతముగ చేయునది.

ఆంగ్లేయ గృహిణి:—

ఆంగ్లేయులు ప్రత్యేక పద్ధతులచేత వివాహమాడుచున్నారు. ప్రతి విషయములందును వారు త్వరపడక ఎట్లు వ్యవహరించెదరో అట్లేభార్యలనుకూడ ఏరుకొనుచున్నారు. వారు మొదటి చూపులతో బెదరిపోరు. ఇదే ఆంగ్లేయులయందుగల గొప్పతనము. ఇట్లు నిదానముగ యోచించి పెండ్లిచేసికొనుటచేతనే సంసారములకు గట్టిపునాది ఏర్పడుచున్నది.

ఆంగ్లేయుడు తన భార్యయందు అందమును కోరడు. పెండ్లియాడిన తర్వాత స్థిమితముగనుండగోరును. డబ్బుగల భార్యనైనను అన్నివిధముల సుఖముగ సంసారముచేయు గుణములు లేనియెడల వదలివేయును. అందమైన ముఖముకన్నను, చిరునగవుగల ముఖమే అతనిని ఎక్కువ ఆకర్షించును. ఎల్లప్పుడు వుల్లాసముగనుండు స్త్రీలనే కోరును కాని బొమ్మవలె అలంకరించుకొను స్త్రీని కోరడు.

ఆంగ్లేయుల హనీమూను (honey-moon) ఒకనెలరోజులు పట్టును. అతను తన యింటియందు స్థాపితమగునపుడు భార్యను, అదుపు ఆజ్ఞలలో వుంచుటకు మొదలుపెట్టును. ఆవిడకు చేతినిండ పని కల్పించును. యింటిపనులను చూచుట యింటిని శుభ్రముగనుంచుట, పిల్లలను కనిపెంచుట మొదలగు విషయములతో ఆవిడకు పని కలిగించును. స్నేహభావమును, ఆత్మసమర్పణము అనునవి ఆంగ్లేయ కుటుంబములలో గాఢముగ బాదుకొనివున్నవి. వీరి కుటుంబములు ప్రణయపూరితముగను చలాకీగాను నుండవు. ఆంగ్లేయ మధ్యతరగతి జనులయందు జీవితము సామాన్యముగానుండును.

సాధారణముగ యీ తరగతి భార్యాభర్తల మధ్య రహస్యములు లేవు. దాపరికములు లేవు. ఫ్రెంచివారివలె వారికి వేర్వేరు డ్రెసింగు గదులు వుండవు. వారికి వాటి అవుసరము యంతగా తెలియదు. ఇటువంటి చిన్నవిషయములచేతనే పరాసు స్త్రీలవలె వీరు చలాకీగానుండరు. ప్రేమవిషయములో ఆంగ్లేయులు కొంచెము స్వార్థపరులు. చిన్న చిన్న విషయములచేతనే సంసారము సుఖవంతముగనుండు ననునది వారు మరచిపోవుదురు.

# పాశ్చాత్య గృహిణులు

పరాసుకన్య వివాహమాడుటచేత తన స్వాతంత్ర్యమును పొందుచున్నది. ఆంగ్లేయకన్య సాధారణముగ తన స్వాతంత్ర్యమును పోగొట్టుకొనుచున్నది. అమెరికను కన్య వివాహమాడుటచేత తన స్వాతంత్ర్యమును కాపాడుకొనుచున్నది. పరాసునందు భార్య భర్తకు సఖురాలుగను, అంతరంగికురాలుగను, సాధారణముగ యజమానురాలుగను వుండును. ఇంగ్లండునందు భార్య గృహయజమాని మాత్రమే. దీనివలన ఆవిడ హోదాయందు జీతము బత్తెములేని పనిమనిషికన్నను ఎక్కువగనుండును.

ఇంగ్లాండునందు భార్య గృహమునందు మాత్రమే సమభాగిని. పరాసునందు ఆవిడ వ్యవహారములందును కూడ సమభాగురాలే. ఆవిడ స్వాధీనమునందే భర్త యొక్క గ్రంథములు, రొక్కముకూడ నుండును. ఇంతకంటెను అతనికి నమ్మకమైన చోటుండబోదు.
ఇంగ్లండునందు భర్త భార్యకు నెలకు సరిపడు యింటికర్చుకు, ఆవిడ దుస్తులకు, స్వంత ఖర్చుకు డబ్బు యిచ్చును. భర్త ఎట్లు వ్యవహారము చేయుచున్నది కాని, లాభనష్టములను గురించి కాని, అతని యితర విషయములగురించి కాని భార్యకు తెలియదు.

అన్ని విషయములు బాగుగనుండి సంసారయాత్ర సుఖముగ నడచుచుండిన ఆంగ్లేయస్త్రీ భార్యలలో అగ్రస్థానము వహించును. ఆవిడ తన సందేశమును బాగుగ నెఱుగును. తన భర్తకు యింటియొద్ద సౌఖ్యమును, ప్రశాంతతను, ఉత్సాహమును కలుగజేసి, వ్యవహారములలో యితర విషయములలో అతనికి కలుగు మనఃక్లేశమును పోగొట్టుచున్నది. భర్తకు మనశ్శాంతిని పొందుటకు యింటి నొక వరప్రసాదమని ఎంచునటుల చేయును. ఇదియే ఆవిడ సందేశము.

"జాన్ బుల్ (యింగ్లీషుపురుషులు) సహచరులు, అందముగను, ఆరోగ్యముగను నుందురు. బహుశ కొద్ది ధైర్యముగలవారుగ కూడ నుందురేమో? పతివ్రతలగు భార్యలను కొంచెముఎక్కువగ మర్యాదచేయవచ్చును. శ్రేష్టమైన తల్లులయందు బహుశ కొంచెము గమనింపు తక్కువుండవచ్చును. కాని అన్నిటికంటెను స్త్రీలకు సంసారములందుండు చిన్నవిషయములందు కలగమనింపు అను ప్రజ్ఞావిశేషముచేత పూరిగుడిసెనైనను సుఖప్రదముగ చేసి ఒక పెద్దభవనమునకు యీడు తేగలరు."

నాకు ఇంగ్లీషు కుటుంబముల కట్టుబొట్లు, పద్ధతులు చూచుటచేత ఆంగ్లరాష్ట్రముయొక్క గొప్పతనమునకును అభివృద్ధికిని ఈ చిన్నకుటుంబముతే సింహపీఠమని గట్టినమ్మకము కలుగుచున్నది.

అమెరికను గృహిణి:—

భర్త ఎట్లుదిద్దిన భార్య యట్లుండునని సామెత. ఒక రాష్ట్రములోని స్త్రీలు వారి పురుషులు ఎట్లు దిద్దుదురో అట్లుందురు. ఆధునిక ఆదర్శక స్త్రీలను తయారుచేసిన అమెరికను పురుషులు యెంతయు ప్రశంసనీయులు. వీరి రాజ్యము ప్రజాప్రభుత్వము కాదు రాజ్యాధిపత్యము కాదు, స్త్రీ ప్రభుత్వము. స్త్రీలకోసమే యీ ప్రభుత్వము. అమెరికను ప్రభుత్వము వెనుకనుండు నొక రహస్యమైన శక్తి స్త్రీలు.

ప్రపంచస్త్రీ లందరికన్నను మనోహరమైనవారు అమెరికను స్త్రీలు. వీరిని తక్కిన స్త్రీలతో పోల్చుదము. ఆంగ్లేయస్త్రీ అందముగ చక్కని శిలా ప్రతిమవలెనుండును. పరాసుస్త్రీ శృంగారము, మృదుత్వము మూర్తీభవించినటులుండును. కాని, ఆవిడ అందముకన్నను ముఖవర్చసుకన్నను, తన మర్యాదచేతను, మాటలచేతను పురుషులను ఎక్కువ ఆకర్షించుచున్నది. రోమనుస్త్రీ మంచి అవయవ సౌష్టవము కలిగియుండును. కాని అమెరికనుస్త్రీ తక్కినవారి గుణములు, ఆకారములు అన్నింటితో కూడిన కలగూరగంప. అమెరికనుస్త్రీ పరాసుస్త్రీ వలె చలాకీగాను, ఆంగ్లేయస్త్రీవలె విగ్రహపుష్టిని

కలిగియుండును. దీనికితోడు తన ప్రత్యేకమైన సహజ గుణములను కలిగియుండును. ఆవిడ నడుచుకొను తీరు నందు నటనలేక స్వాభావికముగనుండుటచేత తన ప్రత్యేకతను చాటుచున్నది. అమెరికను స్త్రీలు సాధారణముగ అందములేనివారైయుందురు కాని, దాని లోపము కప్పిపుచ్చుటకు కొన్ని మంచి గుణములు కలిగియుందురు.

చిన్నతనమునుండి అమెరికను బాలిక స్వతంత్రముగ పెరుగుటచేతను బాలురతో కలిసిమెలిసి జంకులేక తిరుగుటచేతను, పెద్దదైన పిమ్మటకూడ పురుషులతో జంకులేక స్వాభావికముగ తిరుగుచుండును. దీనివలన ఆవిడకు తన పురుషులపైనకల శక్తిని బాగుగ తెలియును. ఆవిడ తన బుద్ధిసూక్ష్మతచేతను, విద్యచేతను జీవితమున మానసికము సుఖముల నందుచున్నది. మరియు తన సూక్ష్మగ్రాహ్యముచేతను దేశీయపద్ధతియందు దానవరణచే జీవితములోని ఎటువంటి మార్పునకైనను సిద్ధపడి ఐక్యముకాగలదు.

ఎంత అందమైనదైనను, విద్యాధికురాలైనను యీ ఒక స్త్రీయొద్దనే పురుషుడు స్థిమితమును పొందుచున్నాడు. ఈ స్త్రీ తన స్త్రీలక్షణములు పోగొట్టుకొనకుండ ఆకర్షణీయమైన సఖునివలె మెలగుచున్నది.

ప్రపంచములో స్త్రీలందరికన్నను పురుషుల మన్ననలను ఎక్కువ బడయునది అమెరికను స్త్రీ. పరాసు దేశీయుడు వారి స్త్రీలకు దాసుడు అయినను అతను అన్ని విషయములందును, కష్టసుఖములందును తమ స్త్రీలు సమభాగులుగ నుండవలెనని ఆశించును. ఆంగ్లేయుడు గృహమునందు మాత్రము తమ స్త్రీలు సమభాగులుగనుండవలెనని యిష్టపడును. కాని అమెరికను భర్త పైవారికంటెను ఎక్కువ శ్రమపడి ఆత్మ సమర్పణము చేసికొనును. ప్రాద్దున ఆరుగంటల మొదలు సాయంకాలము ఆరు గంటలవరకు శ్రమపడి చెమటలూడ్చి పనిచేయును. ఆ చెమటబిందువులే తమ స్త్రీల ఒంటిమీద రవలై ప్రకాశించుచుండును. అమెరికను భర్త సుఖములందు మాత్రమే భార్యను ఆహ్వానించును. కష్టములందు ఆవిడను కష్టపెట్టడు. కోడికూత మొదలు శ్రమయంతయు అతనిదిమాత్రమే.

ఇట్టి వారిపురుషులు కాయకష్టపడినను, వారి స్త్రీలు తమ భర్తలయందు సానుభూతిని చూపరు. మీదు మిక్కిలి తమ దురదృష్టమును నిందించుకొనుచుందురు. ఎల్లప్పుడు వారి గొప్పతనమే. అమెరికను స్త్రీలు సదా తమ శక్తిని ఎక్కువచేసుకొనవలెనను కోరికనే కలిగియుందురు. ఇంగ్లండునందు వెనుక నే నొక నుపన్యాసము యిచ్చితిని. ఉపన్యాసానంతరము ఒక అమెరికను స్త్రీ నాతో మాట్లాడవలెనని వచ్చినది. ఆవిడతనతో తనతల్లిని నొకపురుషుని వెంట తెచ్చినది. ఆపురుషుడు వీరి వెనుకనే, దూరముగ నిలువబడెను. వారు మాట్లాడి తిరుగవెళ్లునపుడు తల్లి కూతురు ముందు వెళ్లిరి. వారు వెళ్లినతర్వాత పురుషుడు మెల్లగ ముందునకువచ్చి నేను "తండ్రిని" అని చెప్పి వెళ్లిపోయెను. అతను వెనుకనుంచివచ్చిన ఎంతోగణ్యతలేనట్లు కనబడెను. దీనివలన అమెరికను స్త్రీలకు పురుషులన్న నొకవైపు నిర్లక్ష్యముకూడ నుండెనేమోఅని తలచుటకువీలగుచున్నది. దీనికంతయు వారి విద్యావిధానమే మూలమని తలపవలసియున్నది.

పూర్వము యింగ్లండునందును పరాసునందును, బాలికలకు కూడికలు, తీసివేతలు, సంగీతము,కొంచెము చదువను వ్రాయను రాగానే చదువు సమాప్తినందును. ఆవిడ పెళ్లికి సిద్ధపడును. వారిని మీఆదర్శమేమని ప్రశ్నించిన మంచితల్లులు, భార్యలాటేయని యందురు. అట్లేవారి బాలురుకూడ మంచి తండ్రులౌట భర్తలౌటే తమ ఆదర్శమని చెప్పుదురు. కాని అమెరికానందు బాలబాలికలుకలిసి చదువుకొందురు. ఒకేబల్లమీద బాలుడు బాలిక బాలుడు ఇట్లే కూర్చుందురు. వారి విద్యాశాఖవారి ప్రణాళికవలన

## పాశ్చాత్య గృహిణులు

బాలురకన్నను బాలికలే ఎక్కువ తెలివిని కనుబర్చు నట్లు తెలియుచున్నది. ఇట్లు ప్రక్కప్రక్కన కూర్చొని చదువుట చేత బాలురకు బాలికలను చూచిన నొక విధమగు గౌరవము, బాలికలు బాలురనుచూచిన నొక విధమగు నిరసన. ఇదే పెద్దవారైన స్త్రీలకు పురుషులను చూచిన చులకన పురుషులకు స్త్రీలనుచూచిన గౌరవభావములకు కారణములగుచున్నది.

కావున యితర పాశ్చాత్యదేశములలో బాలబాలికలుకలసి విద్య నభ్యసింపవలెనను వారు కొంచెము దూరాలోచనజేసి యిటువంటి విద్యావిధానమును అమలుజరిపిన బాగుండును.

ఎంత అందమున్నను, దేహసౌష్టవమున్నను, విద్యయున్నను, స్త్రీకి సహజగుణమును, అలంకారమును అగు ఆత్మసమర్పణ అనురాగము స్వార్థత్యాగము యివిలేనిదే స్త్రీత్వము రాణించదు.

అమెరికను స్త్రీలు స్వార్థపరులగుటకు వారి పురుషులేకారకులు. పురుషులు దిద్దినట్లే వారి స్త్రీలుందురనుట సత్యదూరముకాదు. అమెరికను పురుషులు ధనార్జనమే ముఖ్యాధారమనియు వారికితీరిక సమయము లందు క్లబ్బులే సుఖపడుచోట్లనియు తలచుచు తమ స్త్రీలను గమనించనియెడల ఆస్త్రీలు వారిజీవితమును ఎట్లు సుఖవంతముగ గడపుటో యోచించుకొనెదరు. అందువలననే వారిదేశమందు లెక్కలేనన్ని స్త్రీ క్లబ్బులు. ఆవిడకు భర్తయనగ విపరీతార్థములేని సఖుడు. తనభర్తను పేరుపెట్టిపిలచును.

అమెరికను పురుషులు భర్తలందరికన్నను ఎక్కువ భార్యలయందు అనురాగముకలవారు. వారు వారి భార్యలకు దాసులుకారు. వారి యిష్టమువచ్చినటుల చరించుచు కాలయాపనము చేయుదురు. భర్తలు పిల్లలు కుక్కలవలె పెంపుడు మృగములు. కాని వాటికంటెను వుపయోగములో ఎక్కువ. ఎందుచేతనన వారు కాయకష్టపడి వారిస్త్రీలను సుఖింపచేయుచున్నారు.

అనువాదకురాలు; శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

## మనవి

పెక్కుమంది రచయిత్రులు గ్రాంధిక వ్యావహారిక భాషలరెంటిని గలిపి వ్రాయుచున్నారు. వ్యాసమందలి భాష వ్యావహారికమో గ్రాంధికమో అయియుండవలయునుగాని రెండుగలసి యుండ కూడదు.

పద్యవ్యాసములకంటె గద్యవ్యాసములె యెక్కువగా పంపకోరిక. తమ వ్యాసములు ప్రకటింపబడునని మావద్దనుండి సందేశమందిన వెంటనే రచయితలు తమతమ ఛాయాచిత్రముల బంపవేడికోలు.

కలిగియుండును. దీనికితోడు తన ప్రత్యేకమైన సహజ గుణములను కలిగియుండును. ఆవిడ నడుచుకొను తీరు నందు నటనలేక స్వాభావికముగనుండుటచేత తన ప్రత్యేకతను చాటుచున్నది. అమెరికను స్త్రీలు సాధారణముగ అందములేనివారైయుందురు కాని, దాని లోపము కప్పిపుచ్చుటకు కొన్ని మంచి గుణములు కలిగియుందురు.

చిన్నతనమునుండి అమెరికను బాలిక స్వతంత్రముగ పెరుగుటచేతను బాలురతో కలసిమెలసి జంకులేక తిరుగుటచేతను, పెద్దదైన పిమ్మటకూడ పురుషులతో జంకులేక స్వాభావికముగ తిరుగుచుండును. దీనివలన ఆవిడకు తన పురుషులపైనకల శక్తిని బాగుగ తెలియును. ఆవిడ తన బుద్ధిసూక్ష్మతచేతను, విద్యచేతను జీవితమున మానసికమగు సుఖముల నందుచున్నది. మరియు తన సూక్ష్మగ్రాహ్యముచేతను దేశీయపద్ధతియం దావరణచే జీవితములోని ఎటువంటి మార్పునకైనను సిద్ధపడి ఐక్యము కాగలదు.

ఎంత అందమైనదైనను, విద్యాధికురాలైనను యీ ఒక స్త్రీయొద్దనే పురుషుడు స్థిమితమును పొందుచున్నాడు. ఈ స్త్రీ తన స్త్రీలక్షణములు పోగొట్టుకొనకుండ ఆకర్షణీయమైన సఖునివలె మెలగుచున్నది.

ప్రపంచములో స్త్రీలందరికన్నను పురుషుల మన్ననలను ఎక్కువ బడయునది అమెరికను స్త్రీ. పరాసుదేశీయుడు వారి స్త్రీలకు దాసుడు అయినను అతను అన్ని విషయములందును, కష్టసుఖములందును తమ స్త్రీలు సమభాగులుగ నుండవలెనని ఆశించును. ఆంగ్లేయుడు గృహమునందు మాత్రము తమ స్త్రీలు సమభాగులుగనుండవలెనని యిష్టపడును. కాని అమెరికను భర్త పైవారికంటెను ఎక్కువ శ్రమపడి ఆత్మ సమర్పణము చేసికొనును. ప్రొద్దున ఆరుగంటల మొదలు సాయంకాలము ఆరు గంటలవరకు శ్రమపడి చెమటలోడ్చి పనిచేయును. ఆ చెమటబిందువులే తమ స్త్రీల ఒంటిమీద రవలై ప్రకాశించుచుండును. అమెరికను భర్త సుఖములందు మాత్రమే భార్యను ఆహ్వానించును. కష్టములందు ఆవిడను కష్టపెట్టడు. కోడికూత మొదలు శ్రమయంతయు అతనిదిమాత్రమే.

ఇట్టి వారిపురుషులు కాయకష్టపడినను, వారి స్త్రీలు తమ భర్తలయందు సానుభూతిని చూపరు. మీదు మిక్కిలి తమ దురదృష్టమును నిందించుకొనుచుందురు. ఎల్లప్పుడు వారి గొప్పతనమే. అమెరికను స్త్రీలు సదా తమ శక్తిని ఎక్కువచేసుకొనవలెనను కోరికనే కలిగియుందురు. ఇంగ్లండునందు వెనుక నే నొక నుపన్యాసము యిచ్చితిని. ఉపన్యాసానంతరము ఒక అమెరికను స్త్రీ నాతో మాట్లాడవలెనని వచ్చినది. ఆవిడతనతో తనతల్లిని నొకపురుషుని వెంట తెచ్చినది. ఆపురుషుడు వీరి వెనుకనే, దూరముగ నిలువబడెను. వారు మాట్లాడి తిరుగవెళ్లునపుడు తల్లి కూతురు ముందువెళ్లిరి. వారు వెళ్లినతర్వాత పురుషుడు మెల్లగ ముందునకువచ్చి నేను "తండ్రిని" అని చెప్పి వెళ్లిపోయెను. అతను వెనుకనుంచివచ్చిన ఎంతోగణ్యతలేనట్లు కనబడెను. దీనివలన అమెరికను స్త్రీలకు పురుషులన్న నొకవైపు నిర్లక్ష్యముకూడ నుండెనేమోఅని తలచుటకువీలగుచున్నది. దీనికంతయు వారి విద్యావిధానమే మూలమని తలపవలసియున్నది.

పూర్వము యింగ్లండునందును పరాసునందును, బాలికలకు కూడికలు, తీసివేతలు, సంగీతము, కొంచెము చదువను వ్రాయను రాగానే చదువు సమాప్తి నందును. ఆవిడ పెళ్లికి సిద్ధపడును. వారిని మీఆదర్శమేమని ప్రశ్నించిన మంచితల్లులు, భార్యలౌటేయని యందురు. అట్లేవారి బాలురుకూడ మంచి తండ్రులౌట భర్తలౌటే తమ ఆదర్శమని చెప్పుదురు. కాని అమెరికానందు బాలబాలికలుకలిసి చదువుకొందురు. ఒకేబల్లమీద బాలుడు బాలిక బాలుడు ఇట్లే కూర్చుందురు. వారి విద్యాశాఖవారి ప్రణాళికవలన

# తల్లి బన్నము దీర్ప దయఁజూడు తనయ

పనిబాటలకు స్వస్తివాక్యంబు జెప్పి
సుతునికి నిదురరా జోకొట్టి పిదప
పతిపాదములనొత్తి బడలికదీర
మెల్లన శయ్యపై మెయి వ్రాల్చునంత
కనుఁగవ బాష్పాంబు కణములుదొరుగ
కేశపాశంబెల్ల క్రింద జీరాడ
జీర్ణాంబరం బొండు చీరగాగట్టి
ఘన త్రిశూలంబొక కరమునబట్టి
దైన్య మాకారంబు దాల్చుచందమున
యొకవ్యక్తి లోనికి యొయ్యనవచ్చి
నిలుచుండి ననుఁగాంచి నిట్టూర్పు నించె.

* * *

నేను:—

భయసంభ్రమాశ్చర్య భరితనై లేచి
కరములు ముకుళించి కళవళపడుచు
ధన్యనైతిని తల్లి దర్శనంబబ్బె
పరమపావనమైన భారతమాత
యీరీతి వేంచేయ నేమి కార్యంబు
దయయుంచి సెలవిమ్ము ధన్యనయ్యెదను.

* * *

భారతమాత:—

కన్నతల్లి నటంచు గణియింపఁబోరు
నీరీతి నందరు నిద్రించు వారె!
తనయు లందరుజేరి తల్లి దైన్యంబు
పోగొట్టి భాగ్యంబు పురుణింతు రనుచు
పెద్దకాలము వేచి విసిగితి గాని
స్వార్థపరత్వంబు స్వాభిమానంబు
నిలువెల్ల నిండంగ నీల్గుచున్నారు
అమితదురాచార మైనను సైచి
తనయులు కొరగాక దద్దమ్మలైన,
తనయులైనను తల్లి దరిఁ జేర్పరాదె?

* * *

నేను:—

తల్లిరో! ధీరులై తనయులున్నారు
అఘటనా ఘటన సమర్థులు వారు
ఇలుదప్ప వేరొండు ఎఱుఁగము మేము,
అదిగాక యబలల మాడువారలము
తమ బన్నముల్ దీర్ప దక్షతగలదె?

* * *

భారతమాత:—

అబల స్త్రీయని పల్కు టలవాటుగాని
సబలయో అబలయో సాక్ష్యముల్లేవె?
తనయుల మాటల తడవగ నేల?
తల్లికై కొందరు తమజీవితముల
తృణముగానర్పించి ధీరులై వెలసి
దివికేగ మిగిలిన ధీనిధులుతమ
తోడి వారలు జేయు దుష్కర్మములను
భరియింపఁజాలక పలుకకున్నారు
అసహాయులై కొంద రలసియున్నారు
పదవులు గాంక్షించి ప్రాకులాడుచును
రే బవల్ కొందరు ప్రేలుచున్నారు
సంఘముల్ సరిదిద్దు చదువులు మాని
అంతఃకలహముల నభివృద్ధిజేయు
వెఱ్ఱి వేవిధములై విక్రమించినది
వారితో బనియేమి వనజాక్షి నీకు
నేఁ జెప్పునదిజేయ నేర్చితివేని
సంఘంబు దేశంబు సౌఖ్యమొందెడిని.

* * *

నేను:—

సంసారమున నుండి సాధ్యమౌనేని
చేయవలసినదెల్లఁ జేసెద వాని
సెలవిమ్ము మాతరో సిరిసాహసింతు.

*  *  *

భారతమాత:—

బహుమతుల్ నాకపై బడివేలుఁగలవు
వానిలో నత్యంత వగఁగూర్చు నట్టి
అంటరాని తనంబు 'హాళలించు' నన్ను
ఒకతల్లి కడుపులో నొకచోటఁ బుట్టి
ఒకజాతిగా సృష్టి యొనరింప బడియు
యొక దేశమందుండి యొకరి నొక్కరిని
అంటరాదనుమాట అవివేకముగద!
కట్టుపుట్టము లేక కడుపు మాడంగ
కడుకష్టములఁబడి కందగ జేసి
కడజాతి వారని కఠినులై మీరు
వారిపై నిర్దయ వహియించినారు
కఠినకార్యంబౌట కడముట్ట దీని
దేశీయ నేతలు దీర్పలేరైరి
ఇట్టిదైనను నీవ యీడేర్పగలవు
అంటరాదనిమెదు హరిజను డౌసి
వారి కష్టము నీదు వగపుగా నెంచి
ప్రేమ మీరఁగ చెంత బిలిచి వారలకు
అన్నమో నీరమో ఆదరణంబో
సమయంబు గురుతించి సాయంబుజేసి
హెచ్చు తగ్గనుభేద మింతయు లేక
చల్లని మాటల సఖ్యత నెరపి
ఆరోగ్యవిధియు విద్యావిధానంబు
మద్యమాంసాదుల మానుట యాది
గాగల వన్నియుఁ గరుణతోఁ దనదు
తనయుల మేల్గోరు తల్లిచందమున
మంచి మార్గముజూపి మన్నించు మమ్మ.
ఉచితపద్ధతి వారి నుద్ధరింపంగ
సంసారమదినీకు సాయమై యుండు;
ప్రేమయాదరణముల్ విరివిగా జేర్చి
కరుణ రసంబుతో గలిపి యివ్వంగ
అస్పృశ్యతా రోగ మడుగంటిపోవు;
తపములు 'లెక్చర్లు' తగినచట్టములు
ఉపవాసములు నిట్టు లుపయోగపడవు
కావున నీరీతి గావింపు మికను
అధమ వర్ణులమంచు నణగియున్నట్టి
వేవేలు నీజాతి వృద్ధిబొందెడును
నేటినుండియె దీని నెరపెదవేని
నీను సంతానంబు నేర్చు నియ్యదియు
వారికాలంబున వర్ణభేదంబు
మాయమై దేశంబు మహిమవేగాంచు
యెఱుఁగుము నాకోర్కె నియ్యదె సుమ్మ.

*  *  *

నేను:—

తల్లి మీ యానతిఁ దలదాల్చి యుండి
నేటి నుండియు వారి నేఁజేరఁదీసి
అధికాదరంబున నాదరించెదను.

*  *  *

భారతమాత:—

ఇలు కర్మభూమిగా నెంచితివేని
గృహలక్ష్మివై మొదల్ గృహముద్ధరించి
సంఘంబు దేశంబు సంతరించెదవు
మరువకు మీమాట మదిలోననెపుడు!

(చ. రా.)

#  జయభేరి 

[పశ్చిమచాళుక్యచక్రవర్తియగు ఆఱవవిక్రమాదిత్యుఁడు క్రీ.శ. 1126 లో గతించ అతని కుమారుడు భూలోకమల్లుడు రాజయ్యెను. ఈమధ్యకాలమున కాకతిప్రోలరాజు ఆంధ్రరాజ్యము నెలకొల్పదలంచి పశ్చిమచాళుక్యసామంతరాజుల కొందరిని లోగొని విజయభేరి మ్రోగించి దండయాత్రకు బయలుదేరుట ఈనాటకకథయందలి యితివృత్తము. చరిత్రశోధనమున నిర్ణయులైన సమకాలికపురుషులే చాలవర కీ నాటకమునందు పాత్రములుగ జేర్పబడిరి. పశ్చిమచాళుక్య రాజ్యసంబంధులగు వీరులును కాకతీయ ప్రోలరాజు పక్షపువీరులును, బరస్పర జిగీషతో గావించిన సంగరముల దెలుపు వేయి స్తంభాల గుడిశాసనము మొదలగునవి ప్రకృతికథాకల్పనమున కాధారములు. కొండు భట్లు రామభద్రచయనులు రాజపురోహితుడు కథాకల్పన సౌష్ఠవమునకు సాయముగ గైకొన్న కల్పితపురుషులు. తక్కినవారందఱు చరిత్రలోకమున సుప్రసిద్ధులు. ఆఱవ విక్రమాదిత్యుని యంత్యావస్థతో కథాకల్పన మారంభింపబడి ప్రోలరాజు దండయాత్ర వెడలుటతో, యువరాజకుమారుని రాజ్యపట్టాభిషేకముతో ముగింపఁబడినది. కథాకాలము శా. శ. 1048 పరాభవ సం. భాద్రపద బ. దశమినుండి ఆశ్వయుజ శు. దశమివరకు నడచినట్లు భావింపబడినది.]

నాటకమునందువచ్చు పాత్రలు

| | | | |
|---|---|---|---|
| 1 | ప్రోలరాజు | — | అనుమకొండరాజు |
| 2 | ముప్పమదేవి | — | ప్రోలరాజుభార్య |
| 3 | గంగాధరమంత్రి | — | ప్రోలరాజు అంతఃపురపరిపాలకమంత్రి |
| 4 | బేతనమంత్రి | — | ప్రోలరాజుప్రధాని |
| 5 | అచింతేంద్రుడు | — | రాజగురువు |
| 6 | కుమారరుద్రుడు | — | యువరాజు |
| 7 | కామచమూపతి | — | కాకతీయసేనాధ్యక్షుఁడు |
| 8 | సామంతబొల్లయ | — | ప్రోలరాజునకు సామంతుఁడు |
| 9 | కొండుభట్లు | — | అచింతేంద్రవరుని |
| 10 | రామభద్రచయనులు | — | శిష్యులు— |
| 11 | దేవణభట్టు | — | గూఢచారి |
| 12 | భూలోకమల్లుడు | — | పశ్చిమచాళుక్యచక్రవర్తి |
| 13 | మందెనగుండరాజు | — | పశ్చిమచాళుక్యచక్రవర్తుల |
| 14 | జగద్దేవమహారాజు | — | సామంతరాజులు |

రాజపురోహితుడు తదితరులును వత్తురు.

మొదటియంకము—మొదటిరంగము

స్థలము—అనుమకొండకోట.

కాలము—మొదటిదినము సాయంకాలము.

(కోటలోని రాజభవనముపైపు పోవుచు కాకతి ప్రోలరాజును అతని అంతఃపురపాలక మంత్రియగు గంగాధరమంత్రియు ప్రవేశించుచున్నారు.)

ప్రోలరాజు:—గంగాధరా! మన మంత్రిసత్తముడైన బేతనధార్మికబుద్ధి యెంతయు గొనియాడదగి యున్నది. అతని స్వామిభక్తికితోడు వినయసౌశీల్యాదిసుగుణపుంజములనుజూచి మేమెంతయో హర్షితుల మగుచుందుము.

గంగాధరమంత్రి:—బేతనమంత్రిభార్య ప్రతిష్ఠించిన కడలాలయబసది (పద్మాక్షీదేవాలయము)నుండి ఇప్పుడే వేంచేయుచున్న దేవరవెంటనున్న నాకు బేతనమంత్రి సుగుణాతిశయము స్వానుభవసిద్ధమే యయ్యెను. అదిగాక దేవరకు ఆశ్రితులయెడగల గౌరవాదరములు ప్రత్యక్షముగా గనుగొన గలుగుచున్నాడను.

ప్రోలరాజు:—బేతనమంత్రియు అతని భార్యమైలమదేవియు మన యనుమకొండకోటయందు దేవతాప్రతిష్ఠ యొనర్చిరి. కాకతి రాజన్యపుంగవుల బాహుబల పరిరక్షణమునకుతోడు దైవబలంబుకూడ సహాయపడి అనుమకొండదుర్గమునకు భద్రము చేకూర్పవలెనని యాపుణ్యదంపతుల యభీష్టమైయుండవొప్పు.

గంగాధరమంత్రి:—దేవరి యంతఃకరణప్రవృత్తి సత్యమును నిరూపింపకుండ నెట్లుండగలదు.

ప్రోలరాజు:—దేవతాసందర్శనానంతరము ఒకదివ్యసందేశము మాకన్నిదిక్కులనుండి వినవచ్చుచున్నట్లు స్ఫురించుచున్నది.

గంగాధరమంత్రి:—ఆశ్చర్యము! ఆశ్చర్యము!!

ప్రోలరాజు:—అదేమైయుండునో?

గంగాధరమంత్రి:—ఆ! గోచరించినది! గోచరించినది. దేవరదిగ్విజయయాత్రకు దోహదమొనరించు సువార్తయొకటి పంపించిన గూఢచారునివలన విననున్నారమేమో! సందేహమేల? ఆదివ్యసందేశము తప్పక దేవరదిగ్విజయ యాత్రవిషయమైయుండును.

ప్రోలరాజు:—బ్రాహ్మణవాక్య మమోఘమని పెద్ద లందురుగదా!

గంగాధరమంత్రి:—మన మిదిగో రాజభవన సమీపమునకు వచ్చిచేరితిమి.

ప్రోలరాజు:—సూర్యాస్తమయ సమయమైనది కావున తత్కాలోచిత కృత్యంబులు నెరవేర్ప మే మంతర్భవనమునకు వెడలెదము. మీరును మీనైమిత్తిక కార్యములొనర్ప వెడలగలరు.

గంగాధరమంత్రి:—చిత్తము!

ప్రోలరాజు:—గంగాధరమంత్రీ! రాత్రి పురాణశ్రవణకాలంబున దేవతామందిర ప్రాంగణమున మమ్ము గలిసికొనుడు. (నిష్క్రమించును.)

(గంగాధరమంత్రియు వెడలిపోవును.)

మొదటియంకము—రెండవరంగము

స్థలము-అచింత్యేంద్రవరుని ఆశ్రమము;

కాలము-రెండవదినము ఉదయము నాలుగుగడియల ప్రొద్దెక్కినతరువాత.

(కొండుభట్లు రామభద్రచయనులు అను నిద్దరు శిష్యులు ప్రవేశింతురు.)

కొండుభట్లు:—ఓరీ చయనులూ! యీ వేళ యింకా మనగురువుగారు ఆశ్రమానికి చేరకపోవుట కు యేమికారణమైవుంటుంది?

చయనులు:—ఇంకేముంటుంది? మహారాజుగారి దర్శనానికి వెళ్లివుంటే ఆలస్యమైవుంటుంది.

కొండుభట్లు:—మందబుద్ధిరానీది! నీవేమో మహా పూహా గాడ వనుకున్నాను.

నేను వ్రాయలేనూ......?



ఇదో...తీసుకో...రడీ!




## దిగంబరుల సంఖ్యలో ఇంగ్లండు జర్మనీని మించుతుంది.

నాగరికత వ్యాపించుకొలది విచిత్రసిద్ధాంతములుకూడ విరివిగ వ్యాపించుచున్నవి. సృష్టిలోనిమానవు డాదిలో దిగంబరుడుగనుండి క్రమక్రమమున పరిణామమును బొందుచు నేటి స్థితికివచ్చియున్నాడు. కాని నేడు మరల మొదటిస్థితికి బోవుటే నాగరికతయొక్క పరమావధియని కొందరు దలంచుచు, దాని కనుగుణముగా దిగంబరులై పట్టణవాస మునువీడి ప్రకృతినే యెక్కువగ నాధారముగజేసికొని జీవింపదలంచుచున్నారు.

దుస్తులను ధరించుట ప్రకృతివిరుద్ధమని ఇతరదేశములలో అనేక దిగంబరసంఘము లేర్పడుచున్నవి. ఇంగ్లాండులో 60 దిగంబర సంఘములున్నవి. జర్మనీలో 1930 సంవత్సరమునాటికి ఫాదరులాండు అడవులలో 20 లక్షల దిగంబరులు కులాసాగా జీవనము గడుపుచుండిరట. హిట్లరు వచ్చినతర్వాత దిగంబరులసంఖ్య తగ్గినది. కాని ఇప్పటికిని జర్మనీలో రహస్యముగ దిగంబరసంఘముల నేకములున్నవి.

సౌతుక్రిమియాలో యట్లా అనుపట్టణములచుట్టును మిక్కిలి ఎత్తైనపెద్దగోడ కట్టిరి. దానిలో దిగంబరుల ఇండ్లు చాలగలవు. ఆపట్టణములో ప్రవేశించువారు దిగంబరులైయుండవలెను. జబ్బుగానున్నవారు ఆ పట్టణమునకు వచ్చినయెడల ఆరోగ్యవంతులగుదురని వారి నమ్మకము. సముద్రతీరమున స్త్రీపురుషులు ప్రతిదినము ఆతప స్నానముచేయుదురు. స్నానముచేయుటకు ప్రతివారును డాక్టరు ఉత్తరవు తీసికొనవలెను. వారి ఆరోగ్యమును కాపాడుటకు డాక్టర్లు ప్రతిదినము పరీక్షచేయుచుందురు.

*　　*　　*　　*

## రాక్షసు లీ కాలములోగూడ గలరు.

ఉన్నతపాఠశాలలందును, కళాశాలలందు విద్యనభ్యసించు విద్యార్థినుల యభివృద్ధి యందు ఈర్ష్యగొని వారి విద్యను జెడగొట్టుటకు విద్యార్థులేగాక యితరపెద్దలును పలు చోటుల ప్రయత్నించుచున్నట్లు దెలియుచున్నది. స్త్రీవిద్యకును, వారి యభివృద్ధికిని భారతదేశమంతయు ప్రయత్నించుచుండ దుండగీండ్రు కొందరు ఈర్ష్యాళువులై నీచకృత్యము లకు దొడంగుట చింత్యనీయము. తమకు వారి యభివృద్ధి చదువు ఇష్టములేకున్న అందులో పాల్గొనక నూరకుండనగును గాని వారి విద్యాభివృద్ధికి విఘాతము గల్గించుట విద్యార్థి నుల నవమానించుట బెదరించుటాది పనులాచరించుట రాక్షసకృత్యములగును గాని మానవకృత్యములు గావు. ఇట్టి వారిని కనుగొని ప్రజలును ప్రభుత్వమువారును కూడ తగినరీతి దండించుట భావ్యమైయున్నది. పైదుండగీండ్ర నీచకృత్యములకు సహింపక బలియైన యొక అభాగిని సమాచారము బొంబాయి క్రానికల్‌నందు ప్రకటింపబడినది.

## గృహలక్ష్మి

కోలబాలోయన్న పాన్ వెలు హైస్కూలులో చదవుచున్న స్త్రీలను కొందరు విద్యార్థులు రహస్యముగ పెద్దవారి సహాయమున అనేకవిధములైనబాధలు పెట్టుచుండిరి. ఆస్కూలులో చదువుస్త్రీలలో మిస్. మాలతీ అనునామెనుగూర్చి చాలరహస్యపు జాబులామె తండ్రికివ్రాసి ఆమెకుచదువు మాన్పించమనియు లేనియెడల రహస్యముగా తీయబడిన ఆమె ప్రతిమలు బయలుపర్చెదమనియు బెదరించుచుండిరి. ఈవిషయములో పెద్ద వారుకూడ రహస్యముగా పనిచేయుచున్నట్లు తెలియుచుండెను. కొంతకాలమైనతర్వాత ఆమెతండ్రి ఈ విషయమై పోలీసు సూపరింటెండెంటుకు రిపోర్టుచేయుటకు నిశ్చయించుకొనెను. కాని ఆమె తనకువచ్చిన అపవాదమునకు సిగ్గుపడి క్రిందటినెల 20 వ తేదీని ఉదయమునలేచి నగలన్నియుతీసి దగ్గరనున్న బావిలోపడి మరణించెను.

*　　　*　　　*　　　*

### ముగ్గురిని పెండ్లాడినా తప్పులేదు

కొన్ని పశ్చిమదేశములలో నొక భార్యయుండగా నింకొక స్త్రీని వివాహమాడుట చట్టవిరుద్ధముగా పరిగణింప బడుచున్నది. కాని యిటీవల ఫ్రాన్సులో నొకడు ముగ్గురిని వివాహమాడియు, చట్టసమ్మత మనిపించుకొనినాడు. ఆవిచిత్ర ఉదంతమిది.

ఒకనాడు పారిసు నగరవీధులలో నొక పురుషుడు మోటారుక్రిందబడి తీవ్రగాయములకు లోనయ్యెను. అతడపాయస్థితియందుండి తనవృత్తాంతము జెప్పజాలనందున అతడెవరో కనుగొనుటకు రేడియోమూలమున నతనిసమాచారము పట్టణమంతయు ప్రకటించుచు గుర్తించువారు హాస్పిటలుకు రావచ్చునని యెఱుంగజేసిరి. ఒకగంటలోనే 60 మంది స్త్రీలాపురుషుని గుర్తించుటకు గుమిగూడిరి. వారిలో ముగ్గురు ఆతడు తమ భర్తయని పోల్చుకొనిరి. వారు పరస్పరము తెలియని వేఱువేఱుస్త్రీలు.

అచటి అధికారులు వారల సంగతివిని నవ్వదొడంగిరి. వారది నమ్మలేదు. అంతట కొంతకాలమున కాపురుషునికి స్మారకమువచ్చి ఆ ముగ్గురుస్త్రీలును తనభార్యలేయని యంగీకరించెను. అసలు వృత్తాంతమిది. వేరువేరుపేరులతో నాతడు పారిసునగరముననే ఆ ముగ్గురిని వివాహమాడియుండెను. ఆముగ్గురికి నాతడు ప్రత్యేకగృహములు కొనియిచ్చెను. అందులో ఆదర్శప్రాయుడగు గృహస్థునివలె వసించుచుండెను. సంవత్సరమున నాల్గుమాసము లొక్కొక్కరితో సంతోషముగ నివసించుచుండెను. మిగిలినకాలమంతయు, వ్యాపారకార్యములపై ప్రయాణము చేయుచున్నట్లు వారికి నమ్మజెప్పుచువచ్చెను. వారిముగ్గురివద్ద నాతడు మూడుపేరులతో వ్యవహరింపబడుచుండెను. కాని నిజముగునామధేయము వేరు. ఆతడట్లున్నందుకు ప్రభుత్వ మాతని శిక్షింప ప్రయత్నించెను గాని వీలులేకపోయెను. ఆతడు వేరువేరుపేరులతో వివాహమాడి యున్నాడు. అదియునుగాక అతనిభార్య లెవరును అతనిపై యెట్టి కంప్లెయింటును జేయడములేదు. ఆతడా రీతిగా 20 సంవత్సరములనుండి జీవయాత్ర సాగించుచున్నాడు. ఈవృత్తాంత మెఱిగినతరువాత చాలమంది ఆతడు మూడుసంసారముల నిర్వహించి ఆమూలమున ప్రభుత్వాదాయ మెక్కువ జేయుచున్నాడని యతని యెడల నెక్కువ సానుభూతి జూపుచున్నారు.

*　　　*　　　*　　　*

## యార్కుషైరు స్త్రీల ఆచారములు

యార్కుషైరులో (ఇంగ్లండు) స్టాతీసుఅను గ్రామములో పెళ్లివాండ్ర వివాహములు చాల వింతగా నుండును. పెండ్లిరోజున వధువును ముస్తాబు చేయుటకు నీలివస్త్రములుధరించి గ్రామములోని కన్యలందరును వత్తురు. వధువును ఒకతొట్టెలో స్నానముచేయించి పరికిణీలను రవికెలను తొడిగెదరు. తర్వాత ఒక్కొక్కటి పౌను బరువుగల తొమ్మిదిసీసపురాళ్లు ఆమెరవికెచుట్టును వ్రేలాడదీసెదరు. పుట్టినబిడ్డయొక్క బరువు తొమ్మిదిపౌనులుండును గాన ఆ నూతనదంపతులకు ముందుపుట్టబోవుబిడ్డలు తొమ్మిదిపౌను లుండునట్లు దీవించుట కావిధమున చేసెదరట. పిమ్మట పెండ్లికొమార్తె వ్రేలాడుచున్న సీసపురాళ్లతో వంగకుండ వీధులలో నడువవలెను. గ్రామములోని కన్యలందరు వెండినాణెముల నామెపైకి విసరెదరు. ఈవిధముగ గ్రామమంతయు తిరిగినతర్వాత వధువు ఒక నల్లటోపీ వరునకిచ్చి తాను నమ్మకమైనభార్యగా నుండెదనని వాగ్దానముచేయుచు అతనికుడిచేయి ముద్దుపెట్టుకొనును. అతడాటోపీని ఆమెకు తొడుగును. ఈ టోపీమహోత్సవముతో వారి వివాహము పూర్తిఅగును. క్రొత్తపెండ్లికుమార్తెలను చూచి చంద్రుడు అసూయతజెంది చేపలను వలలనుండి తప్పించుకొనుమార్గ ముపదేశించునని వారినమ్మకము. అందుచేతనే యార్కుషైరుమారుస్త్రీలు నల్లటోపీలు లేనిదే రాత్రులందు బయటకు రారట.

*   *   *   *

## మూడుసార్లు పాముకాటు భరించిన బాలిక

మెహర్పూరుకు 5 మైళ్లదూరములో బేటూయి అనే గ్రామముంది. ఒకరోజున ఒకబాలిక త్రోవను పోవుచుండగా ఆ అమ్మాయి యెడమకాలిమీద ఒకత్రాచుపాము గరచింది. వెంటనే ఆపిల్లను యొక పాముమంత్రగానియొద్దకు తీసుకెళ్లారు. ఆతడామెకు విషమపయికెక్కకుండా రక్షించాడు.

కాని పాముమాత్రం ఆపిల్లను మళ్ళీతిరిగి కసిదీరకఱవాలన్నట్టుగా కాచుకొని కూర్చుంది. తరువాత కొన్నిరోజుల కా పిల్లవాళ్లయింటియొద్దనుండి పొరుగింటికి వెళ్లుతూంది. ఎక్కడకాచుకొని కూర్చుందో ఆ పామే తిరిగి ఆమెను కాటువేసింది. యీ దఫాకూడా ఆ అమ్మాయి కేవిధమయిన మోసము జరుగలేదు.

ఆపామేరెండుసార్లు కరచేసరికి తల్లితండ్రులకు భయమెక్కువయింది. ఆపామును చంపించాలని చాలా ప్రయత్నాలు జేశారు. ఆపాము జాడతెలియలేదు. పాము సామాన్యమయిందికాదు. రెండుసార్లాపిల్లను రక్షించినందుకా మంత్రగానిని చాలా మెచ్చుకున్నారు. ఇఖనుండయినా ఆ అమ్మాయిని చాలాజాగ్రతగా కాపాడాలని ఆమె యెక్కడికిపోయినా కాపలాకాస్తుండేవారు.

మర్నాటి మధ్యాహ్నము ఆబాలిక పొలమునకు వెళ్ళాలని బయలుదేరింది ఆమెతోపాటు కొంతమంది స్త్రీలు బయలుదేరారు. త్రోవకు ప్రక్కనేయున్న యొకపొదలోనుండి ఆపామే బుసబుసమంటూ పరుగెత్తుకొచ్చి వాళ్లందరిమధ్యలోనున్న ఆఅమ్మాయిని కాటువేసి వెళ్ళిపోయి కన్నములో జొరబడింది. వెంటనున్న స్త్రీలు పాముకరచినచోట త్రాడుతో కట్టుగట్టి ఊళ్లోకితీసికెళ్లి మంత్రిగాని కొప్పగించారు. ఈసారి గూడా బాలిక కేవిధమయిన అపాయం గలుగలేదు.

*   *   *   *

## భార్యల్ని అమ్మే వ్యాపారం

ఫ్రాంసులో బయలుదేరిన క్రొత్తవ్యాపారమిది. కొంచెం అందంగావుందంటే చాలు ఆపిల్లను యెలాగో మోసగించి తీసికెళ్లి అమ్మెస్తారీ వ్యాపారీలు. ఫ్రాంసులో యీవ్యాపారస్తులు బాలికలపట్ల భూతాలయ్యారు.

యిన్నాళ్లనుంచి గుట్టుగానే జరుగుతూవచ్చింది వ్యాపారం. కాని మొన్నమధ్య 16 యేండ్ల యౌవనవతివల్ల బయటపడింది. యీమె యొక అరబ్బీకి అమ్మబడింది. అతడీమెను పోతుటీగలోపలకు దూరలేనంతటి కట్టుదిట్టాలతో బంధించాడు. పదియేనుదినాలయ్యాక యెలాగో తప్పించుకొని పారిపోయి పోలీసులకు తెలియపర్చింది. దానితో పారిస్ నగరమంతా వెల్లడిఅయింది. పోలీసులు దర్యాప్తుచేసివెతికారు. అంజెలోజంబార్డి పాలొకతాలా అనేవారిద్దరు పట్టుబడ్డారు. యీమాదిరిగా అమ్మకమునకు సిద్ధముగనున్న యువతులు చాలమంది రక్షింపబడ్డారు. వాళ్లందరు పనిపాటలకోసం పట్టణానికొచ్చి యీమాయలోపడ్డారట. అరెస్టుచేయబడిన వారిద్దరు ఒక్కొక్క యువతిని 10 షి మొదలు 4 పౌనుల ధరతో విక్రయిస్తున్నారట భార్యలు కావాలన్న వారికి.

*  *  *  *

## ప్రాణముపోయినా ప్రతిభపోదు

ఎవరైన ప్రతిభాశాలి చనిపోయినచో అతని తెలివియును ఆలోచనాశక్తియును అతనితోనే నశించును. కాని ప్రస్తుత శాస్త్రజ్ఞులు క్రొత్తశక్తిని కనిపెట్టుచున్నారు. ఒక గొప్పవాడు చనిపోవుసమయమున అతని తలతీసి వేరుగనుంచినయెడల అది క్రొత్తవిషయములనుగూర్చి ఆలోచించుచేయుండునని అభిప్రాయపడుచున్నారు. కొన్నిచోట్ల సర్కారువారు శాస్త్రవేత్తలకు తలలనిచ్చి ఈ క్రొత్తవిషయము కనిపెట్టు విషయములో సహాయపడుచుండిరి. కాలము గడిచిన కొలది రాజకీయపరిస్థితులందును, మరితర విషయములందును మార్పుగల్గుచుండును గాన ఆతలలు, వాటి ఆలోచనలు వ్యర్థమని కొందరు నమ్ముచున్నారు. చనిపోయిన వారినే బ్రతికించుటకు ప్రయత్నించుచున్న శాస్త్రవేత్తలు తలలకు ఆలోచనశక్తి వచ్చునట్లు చేయుదురనుట కెంతయు సందేహములేదు.

*  *  *  *

## క్రొత్తరకపు దూరదర్శిని

కేపుటౌనులోనున్న రాయలు అబ్జర్వేటరీలో క్రొత్తరకపు దూరదర్శిని తయారుచేసిరి. దీనివల్ల నక్షత్రముల విస్తీర్ణమును, వాటి బరువునుకూడ తెలుసుకొనవచ్చును. సూర్యునికంటె పెద్దనక్షత్రముల విస్తీర్ణమును, బరువునుకూడ దీనివలన సులభముగా కనుగొనవచ్చును.

*  *  *  *

## పిచ్చివైద్యము

మతిచెడినవారికి జ్ఞానదంతములను పెరికివైచినచో సరియైన స్థితికి వచ్చుచుండిరని బ్రిటిషు లూనసీ బోర్డు ఆఫ్ కన్ట్రోలువారు తెలుపుచున్నారు. ఈ వైద్యమువల్ల అనేకమందికి జబ్బు కుదురుచున్నది. గొంతులోనుండు గవదకాయలను తీయుటవల్లకూడ చాలమందికి కుదురుచున్నది.



## స్వస్తిక్ కుంతల ద్రవ్యములు

క్రమముగా స్వస్తిక కుంతల ద్రవ్యము లుపయోగించిన మనోహరమగు నిడుపైన వెండ్రుకల బొందగలవు. అవి భారతదేశమంతయు ప్రసిద్ధి జెందినవి. వానిలో మట్టితైలములు చేరలేదని గ్యారంటీ నివ్వబడినది.







### కుంతలాభివృద్ధికి

వెంట్రుకలు విరివిగా పెరుగుటకును, బట్టతల కాకుండుటకును, చుండు మొదలగు వానిని పోగొట్టి శిరమునకు చల్లదనము గల్గించుటకును చాల నుపయోగకరము. చక్కని పువ్వుల సెంటు గలుపబడినది.

### ప్రశస్తమైన స్వస్తిక వెండ్రుకల తైలము

శ్రేష్ఠమైన కొబ్బరికాయ, తిల తైలములచే తయారు చేయబడినది హానికరమగు మట్టి తైలములందు చేర్పబడలేదు. రెండు విధములుగా దొరుకును. (కొలదిగా సెంటు చేర్చినది. ఎక్కువగా జేర్చినది.) స్వస్తిక ప్రశస్తతైలము క్రింది 5 వివిధ సువాసనలతో దొరుకును:—రోజా, మల్లె, శ్రీగంధము, కస్తూరి, స్వీట్ పి.



### సువాసనగల ఆముదము

వెంట్రుకలకు మిగుల బలవర్ధకము. వెంట్రుకలను రాలకుండ తెల్లబడకుండ చేయును. చర్మమును శుభ్రపరచి చల్లదనము గల్గించును. మంచి సువాసన చేర్పబడినది. ఉత్తమమైనది.







### షికకాయ్ సబ్బు

వెంట్రుకల యభివృద్ధికి, శిరస్నానమునకు, చుండు పోగొట్టి మెఱుగు గల్గించుటకు సాటిలేనిది. శిరమునకు చల్లదనము గల్గించును.

డిస్ట్రిబ్యూటర్సు ప్రతి జిల్లాయందు గలరు.

## ది స్వస్తిక్ ఆయిల్ మిల్స్ లిమిటెడ్, బొంబాయి.




## భారతమాత దేవాలయము

నూటయేబదేండ్ల క్రితము జరిగిన ఫ్రెంచివిప్లవ సమయమునందు మానవస్వాతంత్ర్య సంపాదనమునకై హోరాహోరిగాఁ బోరాడిన ఫ్రెంచివారు అన్య దైవములఁగొల్వమని చెప్పుచు తమ యంతరాళము లందలి పరమాదర్శములే మూర్తీభవించిన దైవము వలె గానవచ్చుటకై స్వతంత్రదేవత కొక మహాలయ మును నిర్మించిరి. అదేవిధమున స్వరాజ్యసంపాదనము నకై తహతహలాడుచున్న భారతీయులు భారతమాత దేవాలయమొకటి ప్రతిష్ఠింప నిశ్చయించిరనుట దేశ భక్తులకు ముదావహముగ నుండకపోదు. పరమపవిత్ర మగు భాగీరథీతీరమున మోక్షలక్ష్మీకిల్లైన వారణాసీ నగరమున భారతమాత దేవాలయమును ప్రతిష్ఠింప నిర్ణయించిరి. మానవోత్తముఁడగు మహాత్మాగాంధీ గారు అక్టోబరు 25 వ తేదీయందు ప్రారంభోత్సవ మును జరిపింతురని తంతివార్తలు వచ్చుచున్నవి.

రెండు వేల రూప్యముల విలువగల చలువరాళ్లలో భారతవర్షమందలి మహానదులతో, అరణ్యములతో, పర్వతశ్రేణులతో భరతమాత యాకారము విగ్రహ ముగఁ జేయింపబడినది. ఈప్రతిమ వెడల్పు 30 అడు గులును పొడుగు 31 అడుగులును అని చెప్పఁబడుచు న్నది. ప్రారంభోత్సవమునకుముందు చతుర్వేదములును నాలుగుసారులు పఠించి సపాదలక్షయగు గాయత్రిని జపించి ఆలయప్రతిష్ఠాపనము శాస్త్రోక్తముగ జరుప బడుచున్నది. సంకల్ప మీవఱకే మహాత్మాగాంధీగారి నామమున జరుపబడినది. పూర్ణాహుతియు మహాత్మా గాంధీగారు స్వయముగ నాచరింతురట. "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపిగరీయసి" "జననియు జన్మభూమి యును స్వర్గముకంటెను మాననీయముల్" అను మహా వాక్యమును స్ఫురణమునందుంచుకొని పుణ్యసంపాద నార్థమై కాశీయాత్రలకు బోవు యాత్రాపరులందఱు నీ మాతృదేవత నారాధించి తమ పూర్వులు నోచి యుండని పుణ్యఫలములకుఁ బాత్రులయ్యెదరని విశ్వ శించుచున్నాము.

## వంగ మహిళా కర్మి సమ్మేళనము

అక్టోబరు 11, 12వ తేదీలలో కలకత్తా నగరము నందలి ఆల్బర్ట్ హాలునందు సమావేశమైన నిఖిల వంగ కర్మచారిణుల మహాసభను స్వయముగ జూడ గంటిని. ఆధునిక విజ్ఞానసంపత్తియందు వంగయువతు లను మించిన విదుషీమణులీ భరతవర్షమున మఱి లేరని చెప్పవచ్చును. సాంఘిక, విద్యా, రాజకీయ రంగములలో ప్రజ్ఞాధురీణలైనవారు వివిధ ప్రదేశ ములనుండి వచ్చి రెండు వందల ప్రతినిధురాండ్రు సభ నలంకరించిరి. దక్షిణ భారతవర్షమునకు నే నొక్కతెనే ప్రేక్షకురాలనైపోయి యుంటినని భావించుచున్నాను. తదితర ప్రాంతీయులగు సంఘ సేవికలు సహితము ప్రేక్షకురాండ్రై వచ్చి వంగ మహిళాప్రచారిణుల నిర్వాహకత్వమును సాక్షి విభూతలైరి. నోడియాజిల్లా నివాసినియగు శ్రీయుత నిర్మలనలినీ ఘోషుగారు సభాధిపత్యమును వహిం చెను. వందేమాతర గానమైనవెనుక కార్యదర్శిని శ్రీయుత లావణ్యలతాచందా యనునామె భారత

దేశమునందలి వివిధప్రాంతములనుండి సభ జయప్రదముగ జరుగ నభిలషించుచు వచ్చియున్న లేఖలను తంతివార్తలను పఠించిరి. అందు శ్రీయుత మహాదేవ దేశాయిగారు మహాత్మునకు బదులుగ నిట్లు వ్రాసిరి. "తమ సమ్మేళనము సాఫల్యమగు గాకయని మహాత్ము డభిలషించుచున్నాడు." శ్రీమతి సరోజినీనాయుడు గారీ క్రిందివిధముగ తంతివార్త నంపిరి. "వంగ నారీగణము లక్ష్మియొక్క, సరస్వతియొక్క, శక్తియొక్క స్వరూపముల నొందుదురుగాక!" జవహర్ లాల్ నెహ్రూగారి మాతృదేవతయగు స్వరూప్ రాణీ నెహ్రూగా రిట్లు వ్రాసిరి. "తమ సమ్మేళన సాఫల్యమునకై నేను నాయొక్క శుభాభిలాషములను ఆశీర్వాదములను తెలియజేసికొనుచున్నాను. వంగదేశ మహిళాగణము తమ సాహసికత్వమును, దృఢతరమైన కార్యవినిశ్చయతత్వమును వెల్లడించుచు తమ కర్తవ్యపాలన మొనర్చుకొనుగాకయని ఈశ్వరుని ప్రార్థించుచున్నాను."

ఇట్టిలేఖల బఠించుటయైనవెనుక ఆహ్వానసంఘాధ్యక్షురాలగు శ్రీయుత మోహినీదేవిగారు బంగాలీ నాయికలను కలకత్తా కాహ్వానించుచు తమ యుపన్యాసమును పఠించిరి. భారతవర్షమును ప్రతిఘటించుచున్న రాజనైతిక, అర్థనైతిక, సామాజిక సమస్యలను గూర్చి తర్కించుచు ఆమె తన యుపన్యాసమును ముగించినవెనుక సభాధ్యక్షురాలగు శ్రీమతి నిర్మల నలినీఘోష్‌గారు తమ యధ్యక్షోపన్యాసమును చదివిరి. ఆధునిక భారతీయసంఘమునఁ గ్రొత్తగ నుదయించిన పరిస్థితుల కనురూపముగ వంగనారీమణులు ప్రవర్తింప వలసియున్నదని యామె వచించెను. ప్రపంచరూపమును మార్చివేయుచున్న స్వతంత్రతాదర్శములకును, సామ్యవాదసిద్ధాంతములకును అనురూపమైన పద్ధతులను భారతీయమహిళ లాచరణములోనికి దేవలసియున్నదని యామె వక్కాణించెను. వంగదేశమున నెట్టి విచారణములు లేకుండ నిర్బంధమున నుంచి వేయుచున్న సర్కారువారి చండశాసనవిధానముల నామె తీవ్రముగ నిరసించెను. తదుపరి అస్పృశ్యతానిర్మూలనమునుగూర్చియు, గృహపరిశ్రమలగూర్చియు, సర్వాందోళనములయందును మహిళాప్రచారిణుల యావశ్యకతనుగూర్చియు ఆమె వీర్షముగ జర్చించెను. ఆమె యుపన్యాసమైన వెనుకఁ బలుతీర్మానములను ఘటించుచు విదుషీమణు లుపన్యసించిరి.

మఱునాటి మధ్యాహ్నమున విశ్వకవీంద్రుడగు డాక్టర్ రవీంద్రనాథ ఠాగూరుగారు మహిళా ప్రచారిణుల హెచ్చరించుచు నుపన్యసించిరి. సృష్ట్యారంభమున ధారుణి యొక రూపమునకు వచ్చుటకు ముందు విశ్వప్రకృతియందు యూహాతీతమైన కల్లోలము లుదయించియుండెననియు అదేవిధముగనే ఆందోళనమైన నొక రూపమునకు వచ్చునప్పుడు కల్లోలములు ప్రకృతిసిద్ధముగ జరుగుచుండుననియు నది సృష్టియందలి పరమధర్మమనియు వారు తొలుత జెప్పిరి. పురుషులు సర్వవిషయముల తమ కర్ధభాగినులను ముందునకు గానీయకుండ నిలిపియుంచినదానికి బ్రతిఫలముగ మానవలోక మపరిమితమైన దుర్గతికి బాత్రమగుచు వచ్చినదని వారు వచించిరి. ఆధునిక నాగరికతామహావ్యాప్తియందు పురుషుడు కుటుంబ జీవనమునకు బ్రతిబంధకరుడై సంచరించుచు వచ్చినాడనియు, అట్టి కుటుంబజీవనములు భగ్నముకాకుండ స్త్రీ యెల్లవేళలయందుఁ దన శక్తిని కుటుంబ సంరక్షణమునకును ఏతన్మూలముగ మానవలోక కళ్యాణమునకును పరిశ్రమించినదనియు వారు చెప్పిరి. అయినను ప్రపంచచరిత్రమున స్త్రీ లెంతపని జేసి యుండిన బాగుండియుండునో వా రంతపనియు జేయ లేకపోవుచు వచ్చిరి. కారణము—పురుషుడు స్త్రీని మూర్ఖాత్మనుగాఁజేసి యింటియొద్దనే నిల్పియుంచి వేయుట. అందునకు ఫలితముగ మానవుని విజ్ఞానమున కెంతటి చేటైన వాటిల్లినదని చెప్పవచ్చును. స్త్రీలు

పశుప్రాయులగుచు మూఢవిశ్వాసములకును మూర్ఖాచారములకును పుట్టినిల్లుగ నుండిపోవుచు తమతో పురుషులనుకూడ నజ్ఞానపంకమునఁ బడిపోవునట్లు చేసివేసిరి. కాని ఆధునికకాలమున స్త్రీల విజ్ఞానోదయముతో నొక క్రొత్తశక మదయించినది. పూర్వ పశ్చిమ మధ్యస్థమగు సమస్త దేశములలోను స్త్రీలు మహామహిమాన్వితలయి పురుషులతో సరి సమానముగ సంఘసేవ జేయగలుగుచున్నారు. భారతీయ మహిళలయందు సహిత మట్టి సంచలన ముదయించుట కవీంద్రునకుఁ బరమానందకరముగనున్నది.

తరువాత మహిళాప్రచారిణులు చాల తీర్మానములఁ జేసిరి. వంగదేశమున నిఖిల వంగమహిళా సంఘ మనుపేర నొకసభను స్థాపించి దానికి వంగదేశమునఁ బ్రతిగ్రామమున శాఖలను బ్రతిష్ఠించి పని చేయవలయునని తీర్మానింపబడెను.

ఇట్టి మహిళాసమ్మేళన మాంధ్రభూమియందు సహితము జరుగవలసియున్నదని నేను భావించు చున్నాను.

—దివాకర్ల శారదామణీదేవి.

* * *

## బాపట్ల స్త్రీ హితైషిణీమండలి లలితకళాప్రదర్శనము

ఈ వత్సరము దసరా సందర్భమున యీ మండలి యందు లలితకళాప్రదర్శనము యేర్పాటు చేయబడి ఈ ప్రదర్శనముయొక్క ప్రారంభోత్సవము యీనెల 17-10-36 తేదీ శనివారము సాయంత్రము నాల్గు గంటలకు యీ పురమునందలి లోకల్ ఫండు ఆసుపత్రి లేడీ డాక్టరుగారగు శ్రీమతి ఎన్. అన్నపూర్ణమ్మ ఎల్.యమ్.పి. గారిచే జరుపబడినది.

ప్రదర్శనమునకు మండలి సభ్యురాండ్రును వారి బాలికలును, యువతీవిద్యాలయ ఉపాధ్యాయినులును, విద్యార్థినులును, తమచే ప్రదర్శనము నిమిత్తమై స్వయముగా ఉలు, ధారము, జరీ, పూసలు, రిబ్బనులు, కాగితములు మున్నగువానిచే తయారుచేయబడి టేబుల్ క్లాతులు, దిండుగుడ్డలు, మేజోళ్లు, టోపీలు, మెడపట్టీలు, బుట్టలు, పళ్లెములు, పూవులచెట్లు, సంచులు, పెట్టెలు, జాకీలు వగైరా ఆటసామానులును, తలనూనెలు, పండ్లపొడులు, తిలకములు, సబ్బులు, కుంకుమలు, చాపలు, నారబుట్టలు వగైరా గృహపరిశ్రమలును, చిత్రపటములు, కొయ్యపనులు మున్నగునవియు అనేకము పంపి ప్రదర్శనము నాకర్షవంతముగా చేసియున్నారు. స్త్రీలు పురుషులు బాలురు బాలికలు చాలమంది వచ్చి చూచి ఆనందించిరి. స్త్రీలకును బాలికలకును లలితకళలయందును గృహపరిశ్రమల యందును ప్రోత్సాహము కల్గించుటకై ఈ ప్రదర్శన మేర్పాటుచేయబడినది.

—క. వరలక్ష్మమ్మ,
కార్యదర్శిని.

# మీ యిండ్లు మీరు జేయునట్లే



కొన్ని యిండ్లు మంగళకరముగాను, కొన్ని వేరుగానునుండుటకు కాపురముజేయు స్త్రీలే కారణము. తమ పతుల గౌరవించుటకుగాను తగినవారి నింటికి పిలుపించు టెంతయవశ్యమని తెలివిగల స్త్రీ లెరుగుదురు. దానికి సరియైన కాలము "టీ" పుచ్చుకొనే సమయమే. శాంతినొసంగు ఇండియా "టీ" మాటలలో చమత్కార సామర్థ్యముల ప్రేరేపించును. మంచి స్నేహితులు చేరెదరు. అటువంటి "టీపార్టీ" వాడుక యారంభించుము—దానికి శ్రేష్టమైన ఇండియా "టీ" వుపయోగించుము.



"టీ" జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూన్ "టీ" యొక్కొకరి కిన్ని, మొత్తముగా నొకస్పూన్ యధికముగాను పాతములో వేసి, బాగుగా మరుగుచున్న నీటిని పోయవలెను. 5 నిముషములు తాళి, కప్పులలో పోసి, పాలు, చక్కెర చేర్చవలెను.

## పారమార్థికమైన పానము—ఇండియా "టీ"

I K-28 RS.

# గ్రంథ పరిచయము

**కులలక్ష్మి**

ఈ గ్రంథమునకు శ్రీయుత సురేంద్రనాధ రాయి గారి గ్రంథము మాతృక. వంగ భాషనుండి హిందీ కనువదింపబడిన దానినుండి బత్తలపల్లె నరసింగరావు, కదిరి శ్రీనివాసాచార్యులు గారలు ఆంధ్రీకరించిరి. గృహిణి యెఱుంగవలసిన ధర్మము లన్నిటినిగూర్చి వివరముగ నిందు వ్రాయబడియున్నది. ఇందలి విషయములు నూతనములుగాక పోయినను నేటి భారతనారీమణులు వానిని మరియొకమారు జ్ఞాపకము జేసికొనుట మంచిది. యీ గ్రంథమందలి యభిప్రాయములు పూర్వపక్షిని వ్రాయబడియుంట ఆధునికు లంగీకరింపజాలరు. సర్వవిషయములందును ముందంజవేయుచున్న నీ కాలములో పూర్తిగా వెనుకకు మరలుట సాధ్యముగాదు; ఉత్తమపద్ధతిగూడ కానేరదు. 150 పేజీలు. వెల 0-12-0. వలయువారు, కందర్ప శామాచార్యు, సుబోధయ డిపో, కదిరి, అనంతపురము జిల్లా అని వ్రాయగలరు.

**భారతీ నక్షత్రమాలిక 'నిర్మల'**

శ్రీమతి నేమాని భారతీ రత్నాకరాంబ (హైదరాబాదు, ఉన్నత పాఠశాల విద్యార్థిని) చే రచింపబడినవి. 'భారతీ నక్షత్రమాల' శారదాస్తుతి. 'నిర్మల' ఆంగ్లమున షేక్సుపియరు మహాకవి రచించిన 'As you like it' అను నాటకమందలి కథకు స్వేచ్ఛానువాదము. చిరుతప్రాయపు కవిత్వమైనందున రచన రసవంతముగలేదు. కాలక్రమమున సత్కావ్య రచన యలవడుననీ నమ్ముచున్నాము.

**జీవితసమస్య**

ఇందు ప్రపంచఘోష—మానవ విప్లవము, స్త్రీ కన్నీరు, శైలూస్టేషనులోని గడబిడలు అను మూడు వ్యాసములును, ఇంకెక్కడి జయము, ఒకముద్దు, సందిగ్ధము అను మూడు కథలును గలవు 'ప్రపంచఘోష' నేటి ప్రపంచ పరిస్థితుల వివరించుచున్నది. 'స్త్రీ కన్నీరు'న పూర్వకవులకు స్త్రీస్వభావము చిత్రించుటలోని యన్యాయము జూపబడినది. 'శైలుస్టేషను నందలి గడబిడలు' గ్రంథకర్త్రి యన్న గారు రచించిరట. 'ఒకముద్దు' భారతనారి సాహసమును త్యాగమును నీతిని, 'ఇంకెక్కడి విజయము' జమీందారుల మితిమీరిన వెచ్చములను, 'సందిగ్ధము' జీవితమందలి విషమసమస్యలను వ్యక్తము చేయుచున్నవి. రచన చదువుట కింపుగనుండి గురు గంభీర విషయములగూర్చి యాలోచింప దారిజూపును. గ్రంథకర్త్రి తాడి నాగమ్మగారు, మోరిపాలము, ఆదుర్రుపోస్టు, రాజోలుతాలూకా, తూ. గో. జిల్లా. వెల 8 అణాలు.

**ఆంగ్లచరిత్ర (ట్యూడరు యుగము)**

ఆంధ్ర భాషయందు విద్యార్థుల కుపయోగపడునట్టివి దప్ప, కేవలము చరిత్రాత్మక దృష్టితో రచింపబడిన ఆంగ్లచరిత్రలు గానరావు. గ్రంథకర్తగారీ లోపమును దీర్ప రచించితిమని జెప్పుకొన్నారు. గ్రంథమును జదివిన పాఠకులు దాని యథార్థమును దెలిసికొనగలరు. చరిత్రాంశముల నట్టె విరివిగా త్రవ్వక కావలసినవానిని నేర్పరచి చదువరుల కాసక్తిగలుగు రీతి మంచి శైలిలో నీ గ్రంథము రచింపబడినది. ఆంగ్లమునందే చరిత్రల చదువు నలవాటుబడిన వారికిగూడ ననుకూలముగా నుండునటుల గ్రంథాంతమున ముఖ్యమగు ఆంగ్లపదములు వానికి పుస్తకమున నుపయోగించినఆంధ్రపదముల పట్టిక నుండినచో బాగుండెడిది. గ్రంథకర్త వేలూరి సత్యనారాయణగారు, బి.ఎ.,బి.ఎల్., భీమవరము. వెల 1-0-0.

## గృహలక్ష్మి

**శారదా విజయము** — ఇది యొక చరిత్రాత్మక నవల. 14వ శతాబ్దమందును 15వ శతాబ్దారంభమునను, విజయనగర రాజులకును బహమనీ సుల్తానులకును జరిగిన పోరాటములును, నాటి యాంధ్రుల స్థితియు నిందలి చరిత్రాంశములు. వీనితో మిళితమై శారదాసింహాద్రులయొక్కయు, జానకీ హరిహరులయొక్కయు ప్రణయకథలు కల్పింపబడినవి. రచయిత తమిళ వాతావరణమున బెరిగియు ఆంధ్ర భాషాపాండిత్య మీగ్రంథమున చక్కగ వెలువరించినది. స్త్రీపాత్రలపోషణ చక్కగ నేయున్నను, ఇతర చరిత్రాత్మక నవలందునవలెనే వారు మగవేషములు వేసి నానాయవస్థలబడి నవలారచనయందలి traditional విచిత్రముల జూపెట్టక తప్పించుకోలేదు. చరిత్రాంశములు కనుసరింపబడినవి. ఇందు మహమ్మదీయులకు మారుగా నుపయోగింపబడిన 'మొఘలు' శబ్దార్థము విచారింపదగినది. శైలి సరళముగనున్నది. కథ నీతిబోధకముగ నున్నది. టెక్స్టుబుక్ వారిచే నామోదింపబడినది. ఉన్నతపాఠశాలల కుపయుక్తముగనున్నది. గ్రంథకర్త్రి శ్రీమతి దేవమణి సత్యనాథన్ గారు. వెల వెల 0-14-0. రాఘావిలాస్, 39-ఎ, హారింగ్టన్ రోడ్, చట్ పట్, మదరాసు.

---

# పత్రికా పరిచయము

**The School Magazine Government Secondary and Training School for women, Anantapur.**

పై పాఠశాల ఆంధ్రోపాధ్యాయులైన శ్రీయుత సీరిపి ఆంజనేయులుగారి సంపాదకత్వమున వెలువడిన వార్షికసంచిక ఆంగ్లాంధ్రములందు పద్యగద్యములచే నలరారుచున్నది. ఇందలి వ్యాసములన్నియు పాఠశాలయందలి విద్యార్థినులవే యగుట ముదావహము. చిన్నతరగతులు మొదలుకొని పెద్దతరగతుల విద్యార్థినుల వివిధవ్యాసము లిందు గలవు. విద్యార్థినుల వ్యాసరచనయందు సంపాదకు లెక్కువ శ్రద్ధవహించినట్లు గనబడుచున్నది. విద్యార్థినుల వ్యాసములతోబాటు వారి ఛాయాపటముల ప్రకటించుట వారి వ్యాసరచన కెక్కుడు ప్రోత్సాహకరము. ఈసంచికయం దితర ఛాయాచిత్రములు పెక్కుగలవు. అవన్నియు విద్యార్థినుల కితర కళలందుగల అమితాసక్తికి యుదాహరణములై యున్నవి. ఇతరపాఠశాల లీవిధముగా పత్రికల వెలువరించి విద్యార్థినుల విద్యాభివృద్ధికి తోడ్పడుట మంచిది.

**సుగుణానందబోధిని**

శ్రీయుత జి. ఆర్. సుబ్రహ్మణ్యంగారి సంపాదకత్వమున వెలువడుచున్న మాసపత్రిక. ఈ పత్రికయొక్క ఆశయము ఇదమిత్థమని నిర్ణయింప వీలులేకున్నది. పత్రికపేరునుబట్టి వ్యాసములనుగాని, ప్రకటించు వ్యాసముల యుద్దేశముల ననుసరించి పత్రికపేరునుగాని మార్చిన మంచిదేమో ? స్థిరమైన యొక యాశయముతో, (పాలసీతో) పత్రిక నడచిన యుత్తమమని యెంచుచున్నాము.

ఇపుడు వెలువడు పత్రికలు విద్యార్థుల కుపయుక్తములగు విషయములయెడ ప్రత్యేక శ్రద్ధవహించుటగానము. ఈ పత్రికాసంపాదకులు సూచించినట్లు విషయమునెడ యెక్కువ శ్రద్ధవహించిన విద్యార్థిగణమున కెక్కుడుపకరించునని నమ్మెదము.

చందాగాని, విడిప్రతి వెలగాని తెలియదు. వెలువడుచోటు కాశీగార్డెన్సు, కుమరప్ప మొదలి వీధి, నుంగంబాకం, మదరాసు.



# సంపాదకీయములు

## జవహరిలాల్ గారి పర్యటనము

దేశీయసభాధ్యక్షుడగు శ్రీయుత జవహరిలాల్ నెహ్రూగారు మదరాసు రాజధానియందు అక్టోబరు మాసారంభమునుండియు పర్యటనముసల్పి, దేశీయసభయందలి ప్రజాబాహుళ్యమునకు గల విశ్వాసమును ద్విగుణీకరించిరి. వారు మదరాసు నగరమున కాలు బెట్టినదిమొదలు, పర్యటనము చేసినప్రతిచోటను ప్రతిసమయమునను ప్రజలు వేలు, లక్షలుగాజేరి ఆహ్వానించి తమ విధి నెరవేర్చుటయేగాక దేశీయవిముక్తికై కృషిసల్పుచున్న కాంగ్రెసు బలము నధికముగజేసిరి.

నెహ్రూగారి పర్యటనమువలన ప్రజల నాందోళనపరచుచున్న పెక్కు సమస్యలు పరిష్కారమై కాంగ్రెసునందు ప్రజలనమ్మకము దృఢపడినది. కాంగ్రెసువారు స్వరాజ్యమునకై కృషిసల్పుట ముఖ్యముగ బీదవారైన కార్మికులకును రైతులవిముక్తి గల్గించుటకేయని నెహ్రూగారు నొక్కిచెప్పిరి. దానికి ఉత్తమమార్గమైన సోషలిజమే యనుసరింపదగినదని వచించిరి. ప్రజలందరు కాంగ్రెసన్న ఉత్సాహము గౌరముజూపుట సంతోషదాయకమైనదే గాని, కాంగ్రెసు ప్రణాలికప్రకారము ప్రతివారును కార్యశూరులై విజృంభింపవలయునని వారు వచించినదానితో నేకీభవించెదము.

కాంగ్రెసువారు పదవులు కాంక్షించు విషయమై నెహ్రూగారు తమ యసమ్మతిని వెలిబుచ్చుచు, ఒకవేళ పదవుల చేకొన్నను నూతన రాజ్యాంగ ప్రణాలిక నెదుర్కొనుటకే యని సూచించిరి. కాని కొంతమంది మహానుభావులు అసలు ఉద్దేశమును మరచి పదవుల సంపాదనమే యెక్కుడుగనెంచి ప్రాకులాడుచున్నారు. వారి వ్యామోహము పూర్తిగ వదలినగాని కాంగ్రెసు ఆశయములు కొనసాగవు.

ఈపర్యటనమున అక్టోబరు 6 వ తేది మదరాసు కాంగ్రెసు భవనమునందుకూడిన మహిళాసభయందుపన్యసించుచు నెహ్రూగారు వారికర్తవ్యమును బోధించిరి. స్త్రీలు వెనుకబడియున్నచో ఆదేశమే వెనుకబడియున్నదని వారు వచించినదానితో నెల్లరేకీభవించెదరు. కావుననే వారికి రాజకీయములందుగూడ తగిన ప్రాతినిధ్య ముండవలయునని స్త్రీలు కోరుచున్నారు. వారు కూడ యిందుల కంగీకారము జూపిరి. సంతసమె. అంతటితో యీసమాచారమును వీడక వారికి ప్రాతినిధ్యము తప్పక గలుగునటుల జూడవలసినది అధ్యక్షునివిధియని

హెచ్చరించుచున్నాము. రాజకీయ స్వాతంత్ర్యమునకై స్త్రీలు కృషి సలుపుచునే యున్నారు. స్త్రీమహాగారసనట్లు వారు వారి విషయములకై ప్రత్యేకముగ కృషిసలుపుచు ముఖ్యమైనవిషయమును మరచుటలేదు. మరువజాలరు. కాని వారికి తగిన ప్రాతినిధ్యములేదని యెఱిగి రేని దానికొరకై వారు ప్రత్యేకముగ కృషి చేయకతప్పదు.

* *

*

హిందూస్త్రీ వారసత్వపుహక్కు బిల్లు సవరణ

హిందూసంఘమునందలి స్త్రీల కింతవఱకు తృప్తికరముగలేని వారసత్వమును గలిగించుటకై దేశముఖుగారొక బిల్లును శాసనసభయందు ప్రవేశపెట్టిరి. ప్రభుత్వమువా రింతవఱకు వానియెడ తమ యభిప్రాయమును వెల్లడింపలేదు. కాని వారసత్వము భార్యలకు వితంతువులకు మాత్రము వర్తించురీతి బిల్లును సవరించుచో ప్రభుత్వమువారు దీని నొక సెలెక్టు కమిటీ కొప్పగింతురని దెలిసి యారీతిగనే సవరించుటకు బూనుకొన్నారు. ఇది సమంజసముగనున్నదని యొప్పకొన జాలము. వారసత్వపుహక్కు గావలయునన్న, భార్యగనో, లేక వితంతువుగనో యుండక తీరదన్నమాట. అట్లు గానివారికి వారసత్వమన్నది యుండగూడదు గాబోలు. ఈవిధానము వివాహమునెడ కన్యకుండు స్వాతంత్ర్యమును సమూలముగ దీసివైచుచున్నది. ఇదివఱకే వివాహవిషయములందు కన్యకేమాత్రము స్వాతంత్ర్యములేమి దెలిసియేయున్నది. దీనికితోడు వివాహమాడిన గాని వారసత్వహక్కుండదన్న ఆమె తప్పనిసరిగా తన యిష్టమున్నను లేకున్నను యితరుల యిష్టప్రకారము నడచుకొనవలసి యుండును. ఇట్టి సవరణలతో బిల్లు ప్రతిపాదింపబడకుండ భారతీయ సోదరీమణులందరు ఆందోళన జరిపెదరుగాక! ఇతర బిల్లులవలె నిరుపయోగములై శాసనమైన నాటినుండియే దానియందలి లోపములు కితరులు గురి గాకుండునట్లు సోదరీమణులు శ్రద్ధవహింతురు గాక.

* *

*

ప్రాథమికపాఠశాలలు — ఉపాధ్యాయినులు

మదరాసు ప్రభుత్వము వారిటీవల బాలికా పాఠశాలలందు స్త్రీలనే నియమించుట కనుకూలమగు నుత్తరువుగావించి యున్నారు. బాలికాపాఠశాలలందు ప్రకృతముపాధ్యాయులుగానున్న పురుషులను బాలుర పాఠశాలలకు ఖాళీయైనపుడెల్ల బంపి ఆస్థానమునందు స్త్రీలను నియమింపవలయు ననియు, ఈవిధముగ బాలికాపాఠశాలలందు స్త్రీలు నిండువఱకు నూతనముగ పురుషుల నియమింపగూడదనియు, బాలుర పాఠశాలలందుగూడ ఒకటి రెండవతరగతులకు స్త్రీలనే సాధ్యమైనంతవఱకు నియమింపవలయుననియు, పురుషులచే నడుపబడు ప్రయివేటు స్కూళ్లకంటె స్త్రీలచే

నడుపబడువాని కెక్కువ గ్రాంటు నివ్వ వలయుననియు, సీయుత్తరవులను స్థానిక ప్రభుత్వమువారు ఆచరణలో పెట్టవలయు ననియు ప్రభుత్వమువారు ప్రకటించి యున్నారు.

విద్యాశిక్షణబొంది ఉపాధ్యాయవృత్తికి సిద్ధముగానున్న స్త్రీలు పెక్కుమంది యుండి యు బాలికాపాఠశాలలందు పురుషులనే కొన్ని మండలములందు నియమించుచుండుట జరుగుచున్నది. ఇకనైన యీ వాడుక అంత రించునని సంతసించెదము. బాలుర పాఠ శాలలందలి ఒకటిరెండు తరగతులకుగూడ ఉపాధ్యాయినులనే నియమింప ప్రభుత్వము వారు చేసినసూచన మెచ్చదగినది. కాని అటువంటిబాలురను బాలికాపాఠశాలలందే జదువననుమతి ఇచ్చు టింకను బాగుండును. ప్రాథమికవిద్య బాలబాలికలకు గరపుట యందు సహజముగ నోర్పు,వారి మనోగత విషయముల నెఱుంగుటయందలి నిపుణత స్త్రీలకే గలదు. ఈవిధానము విద్యా వ్యాప్తి కెక్కుడుగ నుపకరింపగలదు.

* *

*

చదివితే సంసార మక్కరలేదా?

నేటివిద్యావిధానము పురుషులు తమ జీవ యాత్ర సాగించుటకే ఇసుమంతైన సాయ ము జేయదు. ఇక స్త్రీలకు గావలసినప్రత్యేక విద్యావిధానమునుగూర్చి చెప్పవలసిన పనియే లేదు. కాని యీ విద్యావిధానము వలననే మోక్షముగలదని యనుకొను సోదరీమణులు విద్యతోగూడ నూతనభావ ములు నేర్చుకొందురు. ఆభావములు విద్య కంటె యనర్థదాయకములు. విద్యావతి యైన స్త్రీ వివాహమాడరాదు. ఒకవేళ వివాహమాడిన గృహకృత్యములు శిశు పోషణాదికార్యములు జేయకూడదు. ఇటు వంటి యభిప్రాయములతో విద్యావతి యగు సోదరి తన భావిజీవితములో నెక్కు డుగ కష్టపడును. ఈవిషయమై సిమ్లా యందు ఇర్విన్ ప్రభ్వీపాఠశాల బాలికలకు బహుమతులు పంచుచు లిన్లిత్గో సతీమణి జేసినయుపదేశము లెల్లరు గమనింపదగినవి.

'మీరు చక్కనివిద్య నేర్చుకొనుచున్నా ముగదాయని ఇంటి పనిపాటలుజేయుట పరువుతక్కువయని దలంచుట పాడిగాదు. విద్య యెక్కువగ నేర్చుకొలది బాలిక లే యింటిపనినైన జేయుట తమగొప్పకు లోప మని భావించుచున్నందులకు తలిదండ్రులు విసుగుకొనుచుండిరని వింటిని. ఈయభిప్రా యము యుక్తమని దలంపను. ఇంట పని పాటలు జేసి శుభ్రముగా, అందముగా, ఇంపుగా గృహము నుంచుకొనుటకంటె కావలసినదేమి? రుచికరములగు వంటలు జేయ శక్తిగలిగియుండు టెంతటి గొప్పవిష యము?'

పాశ్చాత్య విద్యావిధానమువలన విప రీతభావములకు లోనగువారందరు, ఆవిద్య పూర్తిగా నభ్యసించిన పాశ్చాత్య నారీమణులకే అట్టి యభిప్రాయము లెంత


గృహలక్ష్మి
స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక
సంపాదకుడు
డాక్టరు. కే. యన్. కేసరి
GRIHALAKSHMI
సంపుటము ౯ డిశంబరు 1936 సంచిక ౧౦



# అబ్బా! యీ బాధ!

అదే, స్త్రీని కృంగదీసి, నేల పాల్జేయు
జీవితముమొడల విరక్తి కలుగజేయు — సుఖ
ప్రదమగు సంతానము లేకుండ జేయు

## ముట్టుకుట్టు!

ఈ గర్భాశయ రోగమును పారద్రోలిననేగాని స్త్రీకి సుఖముండదు. స్త్రీకి బాధారహితమగు సుఖమయ జీవనమును ప్రసాదింపగల ప్రముఖరసాయనము "లోధ్ర". నేడే లోధ్ర సేవనమును ప్రారంభించండి.

# లోధ్ర

సంతానసంజీవి — ఆరోగ్యప్రదాయిని

## కేసరికుటీరం

ఎగ్మూరు : : మదరాసు

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రిగారు.

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.

హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు. (పెద్దచావిడి దగ్గర)

తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని

జెమ్షెడ్పూర్: వి. కొండల్రావుగారు, అకౌంట్సు ఆఫీసు.

బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.

గుంటూరు: వెల్కం అండు కంపెని.

సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.

పిఠాపురం: ఎం. నూకరాజుగారు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.

రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.

ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.

తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూస్ ఏజంటు.

బెజవాడ: ఆంధ్రా ఇన్డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.

ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.

రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసు ఏజెంటు, 244 ఫేర్ వీధి.

చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.

నరసాపురం: వై. సత్యనారాయణగారు.

నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్ గారు.

కాకినాడ: నున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్ బాయ్ అండు కో.

భీమవరం: ఎంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.

గుడివాడ: శ్రీ శివరామ అండు కో.

తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.

అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)

మచిలీపట్నం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్ పేట.

కర్నూలు: టి. బాలనాగయ్య శెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.

అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.

నెల్లూరు: పంచాగ్నుల వెంకటనరసింహంగారు.

కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

**ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు**

గ్యారంటి ! 2 సం॥ల గ్యారంటి !!

# గ్యారంటి

కాంతిలోనూ,
వన్నెలోనూ
అసలు
బంగారునగలకే మాత్రం
తీసిపోవు

## టి. సి. యన్.
## గోల్డన్
## మెటల్






ఇమిటేషన్ పారిస్
ముత్యాలహారము

ఈ ముత్యాలహారము మంచి ముత్యాల హారమువలెనే యుండును. ఇది మెటల్ బంగరపుతీగెతో చుట్టబడి ఎప్పటికిని నలుపు కాకుండ మిక్కిలి మనోహరముగా నుండును.

క్రయము హారము 1-కి రూ. 2 0 0

వి. పి. ఖర్చులు హారము 1
మొదలు 6 వరకు రూ. 0 6 0

పగడములు మొదలైనవి చుట్టుటకు
తీగె తులం 1-కి రూ. 2 0 0




శంఖ మాల

క్రయము 1-కి రూ. 6 0 0
వి.పి. ఖర్చులు రూ. 0 6 0

అక్కరలేనిచో వారమురోజులలో త్రిప్పి పంపిన అంగీకరింపబడును.

మా చక్కని బొమ్మల కేటలాగు ఉచితము.

వలయువారు:— **టి. సి. నాగలింగప్ప అండు కంపెని,**

280 వాల్ టాక్సు రోడ్డు, పార్కుటవున్ పోస్టు, మదరాసు.

ఏజంట్లు:—పటేలుస్టోర్సు, మ్యునిసిపల్ హైస్కూల్ రోడ్డు, బెజవాడ.
జయభారతి వస్త్రాలయము, మెయిన్ రోడ్, ఏలూరు.



ఉద్యానవనమున విహరించుచున్న శశిరేఖ

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరి మితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచ బడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 20 0 0 అరపుటకు రు. 12 8 0 కాలుపుటకు రు. 8 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింప వలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలము లకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువరైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండ వలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతోవ్రాయవల యును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తర ములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసము లను అందుకొనుచు ఈవలకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జబాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరు వాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరని వారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటునుచేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలు పనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథా రీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందా దారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారు లుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుట గాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంప గలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తర ములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.













# ఎప్పుడూ అలసివుంటే జయంపొందలేవు

నరముల బలహీనతవలన నిరంతరమూ బలహీనత కలుగుతూవుంటే నీవు బాగా పని చేయలేవు. ఆ బలహీనత కర్చయినశక్తిని తిరిగి పూర్తిచేయునిద్రాల్లోవుంది. ఉదయం నిద్రలేచినపుడు బలహీనంగావుంటే, ఆదినమంతా పనిచేయడానికి శక్తిలేకపోతే పడకకుపోవునపుడు ఒకకప్పు హార్లిక్సు పుచ్చుకో. అది నరముల బలహీనత లేకుండచేసి నిద్రపోవుకాలంలో కర్చయినశక్తిని త్వరగా కలిగిస్తుంది.

**హార్లిక్సు** శిథిలతనుండి కాపాడును

# విషయసూచిక



త్రివర్ణచిత్రము

సంగీతావిర్భావము

# స్త్రీపురుష సమానత్వమావశ్యకమా?

## ఎందేని అనర్థదాయకమా?

స్త్రీలు పురుషులతో నన్నిటియందును సమానత్వము గావలయునని యాందోళన చేయుచున్న నీ దినములలో, స్త్రీపురుష సమానత్వ మెంతవఱకావశ్యకము; అట్టి సమానత్వమం దనర్థ మేమైనగలదా యను విషయము పాఠకుల కుపయుక్తముగ నుండు నను తలంపుతో పైసమస్యపై నుత్తమ వ్యాసమును రచించిన రచయిత్రికి బంగారు పతకము బహుమతిగా నిత్తుమని 1935 సం. దసరాసంచికయందు ప్రకటించితిమి. తదనంతరము మా కందిన పోటీవ్యాసములలో నుత్తమమగు శ్రీమతులు మైదవోలు పద్మావతీదేవి వేమల మీనాక్షీ దేవిగారల వ్యాసముల గతసంచికయందు ప్రకటించియుంటిమి.

ఈ సోదరీమణు లిరువురు తమవ్యాసము లందు,జీవితవ్యాపారము లన్నింటిలోను స్త్రీపురుషసమానత్వ మత్యంతావశ్యకమనియు ఎందైనను అనర్థముగాదనియు ఘంటాపథముగ చాటియున్నారు. ఈ విషయము సర్వత్ర యంగీకరించుట కొన్ని యాటంకములుగలవని ఎంచవలసియున్నది. కొన్నింటియందు అనర్థదాయకమను విషయమును వారువివరముగ చర్చింప వదలినందున యిందువ్రాయ దలపెట్టితిమి.

స్త్రీపురుషసమానత్వమును ప్రబోధము జేయువారందరు పురుషుల కేయే హక్కు లున్నవో అవన్నియు స్త్రీలకుకూడ నుండ వలయుననియు, పురుషు లేమేమికార్యముల నొనర్తురో ఆ కార్యములు చేయుటకు స్త్రీల కెట్టియాటంకములుండగూడదనియు రాయి గుద్ది చెప్పుచున్నారు. ఇది సాధ్యమయి వారనుకున్నంత సౌఖ్యప్రదమగునా యన్న దే ఆలోచనీయము.

ఈసమస్యయెడ చాలకాలమునుండియు స్త్రీపురుషుల కొకవిధమగు దుర్భ్రమ యుండుట వాడుకైనది. దానిని దూరముగ బారద్రోలినగాని యీ సమస్య పై వ్రాత లర్థముగావు.

స్త్రీలకు పూర్వకాలమున నెక్కువ గౌరవముండినది. కాని యది క్రమక్రమముగ కాలదేశపాత్రముల ననుసరించియో, లేక తనయధికార ప్రాబల్యము చలాయింప దలంచియో, లేక కేవలము స్వార్థపరత్వము వలననో పురుషుడు స్త్రీని ప్రకృతపుస్థితికి దెచ్చియుండవచ్చును. కాని నేడు దానికి పరితాపమంది హృదయపూర్వకముగ స్త్రీల స్థితి నుద్ధరింప పాటుబడు పురుషులుగలరు. ఎంతపాటుబడినను పడుచున్నను వారి యాధిపత్యమునగాని చక్కబడని స్త్రీలును లేక పోలేదు. దీనిని గమనింపక స్త్రీస్వాతంత్ర్య ముపై పురుషు లెంతవ్రాసినను, ఏమిచేసి నను, న్యాయాన్యాయములను, సత్యాసత్య ముల నరయక పురుషుల కెపుడును స్త్రీలకు స్వాతంత్ర్యము నిచ్చుటకు భయ మున్నదనుకొను విచిత్రాభిప్రాయముగల్గి కొందరుస్త్రీలు వారివ్రాతలను ఖండించు టయేముఖ్యమని తలంచుచున్నారు. ఇక పురుషులన్ననో, తమ దైన్యస్థితి నెఱిగి తాము బాగుపడినగాని దేశము బాగుపడదనియెంచి యభివృద్ధికి వచ్చుమార్గ మేది యన్వేషించి నను, అది పురుషుల కెంతమాత్ర మనర్థదా యకము గాకున్నను, స్త్రీలకు స్వాతంత్ర్య మున్న తమజీవయాత్రకు కష్టముగలుగునని విచక్షణలేక వారి కార్యజాలమునంతయు ఖండించుదుర్భ్రమచే, పక్షపాతముచే బాధ పడుచున్నారు. ఇరువురును పక్షపాతములను వీడి న్యాయదృష్టితో సాంఘికాభివృద్ధికి త్రోవల గమనించి తదనుగుణముగ వర్తించుటుత్తమము. ఇపు డిటవ్రాయబోవు విషయముల సోదరసోదరీమణులెల్ల నిష్పక్ష పాత దృష్టితోడనే తిలకింతురని మనవి.

స్త్రీస్వాతంత్ర్యమును, హక్కులనుగూర్చి వ్రాయునపుడుగాని, మాటలాడునపుడుగాని ఒకరిద్దరివ్యక్తిగతాభిప్రాయములను,వ్యక్తుల కష్టములను మనసునందుంచుకొనక జనబాహుళ్యమున కన్నివిధముల ననుకూలించు పద్ధతులకై ప్రయత్నింపవలయునేగాని, పరిస్థితు లనుబట్టియు పరిసరములనుబట్టియు సహజోద్యోగములవీడి వేరువిధముగజీవయాత్రగడప వలసివచ్చిన వారి నాదర్శముగాగొని దానినే జనసామాన్యమునకు వర్తింపదలంచి పని జేయుట ముదావహము గాజాలదు. ఏలయన యెక్కుడభివృద్ధిగోరువారు జనసామాన్యమే గాని యొకరిద్దరు వ్యక్తులుగారుగదా!

## స్త్రీపురుష సమానత్వమావశ్యకమా ? ఎంచేసి అనర్థదాయకమా ?

పరమాత్ముడు తనసృష్టియందు స్త్రీ పురుషులను భేదదృష్టితో - అనగా ఒకరు హెచ్చని నింకొకరు తక్కువయనికాని, ఒకరధికారి, యింకొకరు బానిసయనిగాని, ఒకరికి స్వాతంత్ర్యముగల దింకొకరికిలేదని కాని - సృష్టింపలేదు. ప్రపంచములో చేయ వలసిన కార్యజాలము ననుసరించియు, గడపవలసిన జీవితము ననుసరించియు, విభేదముగలిగించెను. స్త్రీసృష్టికి మూలమే కాక, సృష్టిసాగుటకు కూడ సాధనము. కావుననే వారు మాతృత్వమువహించి శిశుపోషణాదిభారములు తప్పనిసరిగవహింప వలసియుండును. దాని కనుగుణముగనే వారి శరీరనిర్మాణము, వారి ప్రకృతియు సృష్టింపబడినది. పురుషులన్నో స్త్రీలు పైజెప్పిన స్థితియందున్నపుడు వారి రక్షణార్థమై పాటుబడుటకు వలయు ప్రకృతి గలవారైయున్నారు. ఇది నైజముగ నేర్పడినదగుటచే స్త్రీపురుష సమాన హక్కుల చర్చించునపుడు దీనిని సదాదృష్టి యందుంచుకొనవలసియుండును.

నేటిభారతస్త్రీలస్థితి యెంతయు నభివృద్ధిని కాంక్షించుచున్నది. మతముపేరట సంఘము పేరట వారి యాయురారోగ్యసౌభాగ్యముల కాటంకముగలిగించు పద్ధతులన్నియు మాన్పి, తమ జీవితోద్యోగములు వేరైనను, సౌకర్యము లుండవలయునని ప్రయత్నము జేయుట మంచిదే. దీనికి సంబంధించిన, రాజకీయ, మత, ఆర్థిక వివిధ విషయములనుగూర్చి సోదరీమణు లిదివఱకే ముచ్చటించియున్నారు. వాని మరల నిచట చర్చించుట చర్వితచర్వణమగును.

కాని స్త్రీలు పురుషులవలెనే జీవిత వ్యాపారము లన్నింటియందును పాల్గొన వలయునని పోరాడుటలో లాభములేదు. మచ్చునకు కొన్నిటిని పరికింతము. నేటి విద్యావిధానము పురుషులకే యుపయోగ పడుటలేదు. పైగా వారిధనమును శక్తిని పీల్చి పిప్పిచేసి యుద్యోగముల కుపయోగ పడక వారి జీవితము నధోగతికి తెచ్చుచున్నది. అట్టివిద్యయే స్త్రీలకు మరింత చెరుగుచేయుననుటలో సందియ ముండదు. అట్లని స్త్రీలకు విద్య అనవసర మనియనుటలేదు. వారికి కావలసిన విద్య వేరు. ఎవరికి కావలసినవిద్య వారునేర్చి కొన్న యుపయోగముండునుకాని పురుషులు నేర్చుకొన్నదే స్త్రీలును నేర్చుకొనవలయు నన్న యుపయోగమేమి ?

శరీరకష్టములకోర్చి, కావలసిన యుద్యోగములన్నియు చేయుటకు పురుషులకు సహజముగ బలమున్నది. ప్రకృతివారి కెట్టి యాటంకములు గలిగింపదు. దానికై పురుషులట్టివిద్య నభ్యసింపదగును. స్త్రీ లెల్లరా యుద్యోగములకై చదువవలయు నన్న తమ సహజోద్యోగములను వీడు చున్నారన్నమాట. వీడిన నేమనవచ్చును. స్త్రీపురుషు లిరువురు సంపాదింపగల రన వచ్చును. ఏమన్నను సహజోద్యోగములు మానుట లాభదాయకముగాదు. పైగా అనర్థములు గలుగుట తప్పదు.

ఒక యుదాహరణము. పురుషులింత మంది విద్యావంతులుండగా, ఎన్నియో నేర్చినవారుండగా స్త్రీలనే నర్సులనుగా నియమించుటెందులకు? వారు రోగుల కుపచారము చేయుటలో నమితమైన ఓర్పు, దయ, సానుభూతిగల్గి వర్తింతురనియేగదా? పురుషులెట్లు ప్రయత్నించినను చేయగలుగుదురా? చేయజాలుదుమని తమ్ము నర్సింగు కోర్సున చేర్చుకొమ్మని తమకందులో సమానత్వముండవలయునని పురుషులు పోరాడుచో నది అపహాస్యమును, తెలివి తక్కువయు నగునుగదా?

ఇదియేగాదు. శిశుపోషణాది కార్యములు పురుషులెంత నేర్పరులైనను నేర్వగలుగుదురా? గృహనిర్వహణమున, పాకకళలో, లలితకళాభ్యాసమున పురుషులు స్త్రీలకు వెనుకేగదా? ఎంత మహిమాన్వితుడైనను శిశువును పెంప దాదిని నియమింతురుగాని పురుషుని నియమింతురా? కారణమేమి? వారికట్టి గుణములు ప్రకృతి సిద్ధముగావు. లేనివి తెచ్చిపెట్టుకున్న రాణింపవని అందరెఱిగినదే! కావుననే పురుషులతో నన్నిటియందును సమానతగల్గి వారి యుద్యోగములన్నియు చేయవలయునను టెంత శ్రేయోదాయకమో ఆలోచింపుడు.

స్త్రీ లుద్యోగములు చేయుట కింకొక యాటంకముకూడ గలదు. వారికి శక్తి, జ్ఞానము, ఓర్పుయున్నప్పటికిని ప్రకృతి గల్పించిన శరీరనిర్మాణాది విషయములబట్టి వారు ప్రతిమాసము కొంతకాలము తప్పక విశ్రాంతి బొందవలసిన వారగుచున్నారు. ఆకాలమున నారోగ్యము ననుసరించి మన పూర్వులు పెక్కు నియమముల గావించిరి. ఆ నియమముల నుల్లంఘించిన ననారోగ్యము గల్గి బాధపడుదురనుట వింతగాదు. నేను వానిని గమనింపని వారిస్థితిని మనము కనులార గాంచుచునేయున్నాము. ఉద్యోగముల-మన ఇట్టి నియమములను పాటింప వీలుండదు. పైపెచ్చుగ గర్భవతులుగానున్నప్పుడు, తదనంతరము కొంతకాలమువఱకు వారలకు విరామము తప్పక కావలసియుండును. ఇట్టిచో ఉద్యోగములు నిరాటంకముగ సాగవని వేరుగ వచింపబనిలేదు.

ఇది సర్వసాధారణముగ నందరికిని వర్తించు విషయము. అంతియగాని యెవరుగాని, యెట్టిపరిస్థితులందుగాని, ఎంతలాభదాయకమైననుగాని ఏ స్త్రీయైనను ఏ యుద్యోగమును చేయక మడిగిట్టుకొని కూర్చుండవలసినదని మా యుద్దేశ్యము గాదు. తప్పని సరియగుచో అనర్థముగాక శ్రేయోదాయకమగుచో చేయవచ్చును. వైద్యవిద్యయందు ప్రాథమిక పాఠశాలో పాధ్యాయినులుగా వారు కృషిమొనర్చిన పురుషులకంటె కూడ యెక్కువ అనుకూలింపగలరు. అంతియగాక గృహనిర్వహణమాది విషయములను స్త్రీలకు బోధింపవలసినపుడు వారెక్కుడుగ నుపకరింపగలరు. ఇటులనే అందరికిని అన్ని యుద్యోగములు లాభదాయకములై వారికి మేలొనగూర్చుననుమాట అతిసాహసము.

పాశ్చాత్యదేశములలో స్త్రీ పురుష భేదములేక సమానతగల్గియున్నారనియు, సమానముగ నన్నియుద్యోగములందును పాల్గొనుచున్నారనియు మనముకూడనట్లుండవలయుననియు కొంతమంది వచించుట గలదు. విద్యావంతులైన మన సోదరీమణులకంటె పాశ్చాత్యసోదరీమణులే యెక్కుడుగ గృహనిర్వహణభారము వహించుచున్నారనియు, ఇతరోద్యోగములకంటె ప్రకృతిబద్ధమగు యుద్యోగమునే యెక్కుడుగ కాంక్షించుచుందురనియు వారెఱుగవలయును. ఇంతకు వారిని పూర్తిగా మన మనుకరింపజాలము.

---

## చుక్క బొట్టు

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

తెల్వి, సౌందర్యమిచట కేంద్రీకరించె, చూపరుల దృష్టులిచ్చోట సుడివడిపోవు ;
నాగమాంగళ్యములకు శ్రీరామరక్ష, సొగసుగా బాలతీర్చిన చుక్కబొట్టు !

* * *

పసరుబాల్యమునాడు పాలబుగ్గలమీద అమ్మదిద్దియట్టి యగరుబొట్టు
పరికిణీల్గట్టెడి ప్రాయంబునందున చెలులు మోమునఁబెట్టు చిట్టిబొట్టు,
పరిణయంబావేళ ప్రౌఢబాలలుకూడి వేడుకతోదీర్చు పెండ్లిబొట్టు,
పతిఁగూడి సంసారభారంబు బూనుచో కొనగోటవాటించు కుంకుమంబు,
కాంత ! నీభాగ్యరేఖ సాక్షాత్కరణము, తరుణి ! సౌందర్యవిభవ సాధనవిధమ్ము
బాల ! నీపతిఁ దూరదేశాలనుండి, గతగృహోన్ముఖుజేయు నక్షత్రమహహా !

* * *

శారదాచంద్రవిశాల పాలంబుపై మురిపెంబుపట్టిచ్చు పుట్టుమచ్చ
సంఫుల్లదరవింద స్వచ్ఛాననంబున రక్తిజూపెడి పుష్పరజముబొట్టు
పూవుకన్నెల పాలబుగ్గరేకులపైన సుళ్లుతిర్గెడు తేటిచుక్కబొట్టు
సరసీప్రశాంత సంపన్నముఖంబుపై మిట్టియెగసెడి మీలుచిట్టిబొట్లు
ప్రకృతిసౌందర్యలక్ష్మికి పసయబొట్టు, సహజసౌందర్యవతులయ్యు సాధ్వులకును
వింతసొబగునుగూర్చి పావిత్ర్యమొసగు, కుంకు మా గురు కస్తూరిగోరుచుక్క !

* * *

పాలపొంగగు దుష్టులభావములను, చల్లచుక్కయి విరుచు నీసాధ్విబొట్టు !
తనమనోహరు ధర్మపథమ్మునందు, త్రోవచూపించు రేబవల్ ధృవము ధృవము !

# పాశ్చాత్య ప్రపంచము

## తిరిగి రూజువెల్టు

అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగినవి. ఇదివఱకు రెండు సార్లు పనిచేసి అఖండవిజయముతో రూజువెల్టు గారు ప్రతిద్వంద్విని జయించి అధ్యక్షులైరి. అమెరికా ప్రజలందరు రూజువెల్టు నందెట్టి నమ్మకమును గల్గియుండుటలో విచిత్రమేమి యులేదు. సంయుక్తరాష్ట్రములాతని పరిపాలనాఫలితముల నిదివఱకే యామోదించి నవి. ఇంకను ఆతడు ఎన్నికలకుముందు తనను మరల అధ్యక్షునిగా యెన్నుకొన్నచో దేశమును సుభిక్షము గావించి ప్రకృతము ప్రజాబాహుళ్యమునకు కార్మికులకు గలుగు కష్టముల దొలగింపుమనియు నిరంతరము యుద్ధములకై ప్రయత్నించుచున్న యూరపు ఖండదేశములతో నేకీభవింపక శాంతికై పాటుపడుదుననియు వాగ్దానము గావించి యుండెను. ఆవిధముగనే శాంతి కీమహావ్యక్తి పాటుబడి యితరదేశములకు పాఠమునేర్పి తన వాగ్దానము నెరవేర్పవలసియున్నది. ఈ యమెరికా ఎన్నికలు భారతీయులకు మంచి పాఠము నేర్పుచున్నవి.ఎవరు ప్రజాబాహుళ్య మునకై సర్వవిధముల పాటుబడుదురని తలంతురో వారియెడ భేదాభిప్రాయముల వీడి వారిని నేతలుగా నంగీకరించి దేశాభ్యు దయమునకు దోడ్పడవలయును. భారత దేశమునందు కాంగ్రెసునెడ ప్రజలందరట్టి నమ్మకమునే గల్గియున్నారు. కాని యింకను దేశమునందున్న భేదాభిప్రాయముల నిర్మూ లింప ప్రయత్నించుట అవసరము.

*

* *

## స్త్రీలకుకూడ నిర్బంధసైనికశిక్షా ?

నేటి నియంతలు చేయుచేష్టలు చూచి నచో వారు మానవుల సమూలనాశనము నకు తలపెట్టినటుల సందేహముగల్గక మానదు. ముసోలిని హిట్లరులు యువకులకు కూడ నిర్బంధసైనికశిక్ష యొసంగుటయగాక బాలురకుకూడ విద్యతోబాటు సైనికశిక్ష కరపుటయందు నిమగ్నులైయున్నారు. రష్యాసైన్యమునందు స్త్రీలెందరో జేరి యున్నను, చేరుచున్నను వారి కెట్టి నిర్బంధ ములేదు. పరిస్థితులబట్టి స్త్రీలు స్పెయిను సైన్యమునందు జేరుచున్నారుగాని అధికా రులు వారిని తప్పక చేరవలయునని యాజ్ఞా పించుటలేదు. కాని శాంతయుతముగనున్న టర్కీలో కెమాల్‌పాషాగారు స్త్రీలకు నిర్బంధసైనికశిక్ష నమలుపరచుట కాలో చించుచున్నట్లు దెలియుచున్నది. ఇది శృతి మించుటయగును. అనగా వారు పోరాడ లేరని గాదు. సమయమువచ్చినచో వారు స్వదేశసంరక్షణ కెంతమాత్రము వెనుదీయ రనుట నిజమేయైనను వారిని నిర్బంధసైనిక శిక్షకులోజేయుట యుచితముగాదు. అంత

జాతీయ మహిళాసభవారు దీనికి తమ యసమ్మతిని దెలుపుచు యాందోళన సాగించుట యుచితము.

*

* *

హిట్లరు బాంబు

హిట్లరు జర్మని దేశమునకు నియంతృత్వము వహించినప్పటినుండి మహాయుద్ధమునకు ముందు తనదేశమున్న స్థితికి దీసికొనిరావల యునని భగీరథప్రయత్నములు చేయుచునే యున్నాడు. యుద్ధానంతరము గావింబడిన వార్సెల్సుసంధి షరతుల నుల్లంఘించుట కారంభించినాడు. లోకార్నో ఒడంబడికను ధిక్కరించినాడు. లోలోపల తన్నెవరైన యెదిరింతురేమోయని రాత్రింబవళ్లు యుద్ధ సామగ్రిని తయారుచేసికొనుచున్నాడు.

వార్సెల్సుసంధి షరతులలో జర్మను నదులను అన్నిదేశములు వ్యాపార సౌకర్యముల కుపయోగించుకొనవచ్చునను నది యొకటి. హిట్లరు తమతో మిత్రత్వమున నున్న దేశములుతప్ప తదితరులు జర్మను నదులపై వ్యాపారములు సాగించుటకు వీలులేదని ప్రకటించెను. దీనివలన యింత వఱకు ఆనదులపై వ్యాపారములు సాగించు చున్న దేశముల కిబ్బంది కలుగకమానదు. అంతటితో కొంప లంటుకొనునేమో ?

ఎప్పటికైనను అట్లు గాకమానదని హిట్లరు ఎఱిగియే సామ్యవాద మడుగంట జేయు నుద్దేశ్యముతో రహస్యముగ జపాను దేశముతో మొన్ననే సంధిచేసికొనెను. ఈ సంధిప్రకారము రెండు దేశములు తమలో నెవరిమీదనైన యితర దేశములు యుద్ధమునకు గడంగుచో పరస్పరసాయము చేసికొనుట కిచ్ఛగించినవి. రష్యాదేశమన్న జర్మని జపానులకు గిట్టదు. ఒంటరిగ రష్యాతో దలపడి బ్రతికివచ్చుట కల్లయని ఈ రెండు దేశములకు బాగుగ తెలియును. అందుచేత నివి యీయెత్తు యెత్తినవి. నేటిపరిస్థితులను బట్టి చూచినచో జర్మని మరియొక ప్రపంచ యుద్ధమును కూడ దెచ్చిపెట్టునేమోయని సందియము గలుగుచున్నది.

*

* *

అశాంతి కడ్డములేదా ?

ప్రపంచములో ప్రతిచోటను అశాంతి అల్లరులు ప్రబలుచునే యున్నవి. మొన్న మొన్నటివఱకు పాలస్తైనునం దల్లరులుజరిగి యూదుల కపరిమితముగ నష్టముగలిగినది. ఇది యంతరించినదో లేదో దీనిప్రక్క దేశ మగు సిరియాయందు అల్లరు లారంభమైనవి.

లెబనాన్ అను ప్రజాప్రభుత్వరాష్ట్రము సిరియాప్రభుత్వమునకు చేరినది. అది యింత వఱకు ఫ్రాన్సుమేండేటరి పరిపాలనముక్రింద నుండినది. కొంతకాలముక్రింద లెబనాన్ ఫ్రాన్సుచేరి సంధిచేసికొన్నవి. దానిప్రకారము ఫ్రాన్సు లెబనాన్‌ను కొంతకాలములో స్వాతంత్ర్యనిచ్చుట కంగీకరించినది. దీనికా రాష్ట్రవాసులగు క్రైస్తవులందరు సంతసించి పండుగచేసికొనుచుండగా సిరియా సమ్మతి లేకనే లెబనాన్ ఫ్రాన్సుతో సంధిగావించుట

తగదని మహమ్మదీయులందరు సమ్మెకట్టి క్రైస్తవుల బాధించుటకు పూనుకొన్నారు. వారి దుకాణములు కొల్లగొట్టడము, ఇండ్లకు చిచ్చుపెట్టడము జరుగుచున్నది. ప్రభుత్వమువారీ అల్లరులనడచుటకు సైనికశాసనము అమలుజరుపుటకు యోచించుచున్నారు.

ఈ అల్లరుల దురదృష్టము భారతదేశమునుకూడ వీడలేదు. పోయిన మాసమారంభించిన బొంబాయిఅల్లరులు మొదట అణగిపోయిన సూచన లగుపడినను మరల తలయెత్తి వచింపరాని దురంతరములు కెడమిచ్చుచున్నవి. కోట్లకొలదిజనులు కడుపునిండ తినుట కన్నములేక అవస్థపడుచుండగా తిన్నదిఅరుగక మతములని మట్టిగడ్డలని పోరాడుకొనుచున్న వీరి విజ్ఞానము నేమనవలయునో తెలియకున్నది.

* * *

స్పెయినుకు అంత్యదశ సమీపించినదా ?

స్పెయినుదేశపు ముఖ్య పట్టణ మగు మాడ్రిడ్‌నగరము విద్రోహులచేతిలో పడినట్లే యెంచబడుచున్నది. ఇపుడు యుద్ధము చేయు యిరుపక్షములవారు యుద్ధానంతర మేమి యనుభవింపదలంచియున్నారో కాని పట్టణములను, పల్లెలను, ప్రజలను, పాడిపంటలను భస్మము చేయుచున్నారు. మాడ్రిడ్‌కు కూడ ఆగతే బట్టినది. ఇంకా పూర్తిగా రాజధానినగరము లోబడకమున్నే, ప్రజాప్రభుత్వమువారు ఓడకముందే విద్రోహుల నాయకుడగు ఫ్రాంకోను జర్మను యిటలీదేశములు స్పెయినుదేశమునకు నిజమగు అధికారి యని గుర్తించుట ప్రపంచమునకు వింతగల్గించుటలేదు. ఈప్రకారముచేయుదురని ముందే అందరెఱుగుదురు. ఇపుడు వారు విద్రోహులకు బహిరంగముగా యుద్ధసామగ్రుల బంపుదురని తలంపబడుచున్నది. వీరిసాయముచే విద్రోహులు స్పెయినునందు తమ అధికారము నెలకొల్పుదురేని ఇటలీజర్మనీల యెత్తులుకొనసాగి నాజీ సిద్ధాంతములు మూడు ప్రక్కల చుట్టుకొని ఫ్రాన్సును ముప్పుతిప్పలబెట్టును. ఆదినుండి యిట్లగునని భయపడుచున్న ఫ్రాన్సు స్వరక్షణకొఱకై మరికొన్ని యెత్తుల నెత్తగిలదు. తరువాత ?

# గృహలక్ష్మి కంకణ మహోత్సవాహ్వానము

## (1936)

శ్రీమతి విద్వత్కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారి పేరు నెఱుఁగని యాంధ్రభాషాపరిచయులుగాని, గృహలక్ష్మిపాఠకులుగాని, యుండరు. వీరు రాధ, (అమృతవల్లి) గౌతమబుద్ధచరిత్రము, పాండవోదంతము, కాశీయాత్రాచరిత్ర, హంసవిజయము, అభిజ్ఞానశాకుంతలము, ఆనందసారము మొదలుగాగల ఉద్గ్రంథములేగాక, యాంధ్రదేశమున వెలువడు ప్రసిద్ధపత్రిక లన్నింటిలోను పద్యగద్యవ్యాసముల రచియించి యాంధ్రలోకమున వినుతికెక్కిరి. ఇట్టివారిని సత్కరించుట యాంధ్రుల విధియని యెంచి నెల్లూరు పురమున ప్రోగ్రెసివ్ యూనియన్ వారి మొల్లజయంతి యుత్సవ సందర్భమున డిశంబరు 27 వ తేది ఆదివారము జరుగు సభలో నీమెకు గృహలక్ష్మి కంకణము అర్పింప నిశ్చయించితిని. ఆ సమయముననే 1935 వ సంవత్సరము దసరాసంచిక గృహలక్ష్మి యందు ప్రకటింపబడిన "స్త్రీపురుష సమానత్వమావశ్యమా? ఎందేని యనర్థదాయకమా?" అను పోటీవ్యాసముపై ఉత్తమ వ్యాసముల రచించిన శ్రీమతులు మైదవోలు పద్మావతీదేవిగారికిని వేదుల మీనాక్షీదేవిగారికిని బంగారు పతకములుకూడ యివ్వబడును. కావున వా రిరువురును ఆ సమయమున కరుదెంతురని కోరుచున్నాను. ఈ కంకణమును, బహుమతులును గృహలక్ష్మి పాఠకులతరఫున సమర్పింపబడును గాన ఎల్లరువిచ్చేయ ప్రార్థితులు.

ఇట్లు

కె. యన్. కేసరి

'గృహలక్ష్మి' సంపాదకుడు

# సోయాబీను

చదువుల రామచంద్రయ్యగారు

మానవశరీర మొక విచిత్రయంత్రము. దాని నిర్మాణమునకును, తదనంతరము నిరంతర పరిశ్రమచే నందు కర్చయిపోవు శక్తిని పునరుద్ధరించుటకును ఆహార పదార్థముల మూలమున కావలసిన వస్తువులన్నియు మానవుడు సమకూర్చుకొనవలసియున్నది. ఈవస్తువులన్నియు నేదేని యొకేపదార్థమునుండి దొరుకవు. పెక్కు పదార్థములను మిళితముజేసినగాని సరియగు వస్తువులు లభింపవు. దీని నెఱుగక శరీరాభివృద్ధికి గావలసిన పదార్థములు లేని కొన్ని యాహారములనే తినుచుండుటవలన ఆరోగ్యముచెడి, శక్తి నశించి, అల్పాయువగును.

మన యాహారపదార్థములం దిట్టి లోపములే గలవు. మన యాయుర్దాయ ముండవలసిన దానిలో సగమై ప్రపంచమందలి దేశములలో కడపటి స్థాన మాక్రమించుచున్నది. వేయిమందికి 84 గురు నిరంతరము రోగములచే బాధపడుచున్నారు. నానాటికి జాతియొక్క ఆరోగ్యము దానివలన వారి శక్తియు క్షీణించిపోవుచున్నది. పరిశ్రమలన్నియు బలహీనములై దేశదౌర్భాగ్యమునకు తోడగుచున్నవి.

శరీరాభివృద్ధికి గావలసిన పెక్కుపదార్థములు పాలయందు గలవు. కాని యితరదేశములవలె మన దేశీయులు పాలు సర్వసాధారణముగా నుపయోగింపరు. దీనికి అజ్ఞాన మెక్కువ తోడగుచున్నవి. భారతీయులలో శక్తిహీనమైన ఆహారమును ఎక్కువగా తినువారు మదరాసు మండలమువారై యున్నారు.

భారతీయుల ఆహారమందలి లోపములు పెక్కు గలవు. వానిలో కొన్నింటిని జూపెదను.

ముఖ్యమైన ఆహారము మండల మండలమునకును మారుచుండును. ఈ పదార్థములందు మాంసకృత్తులు, క్రొవ్వుపదార్థములు తక్కువ.

శరీరమునకు ముఖ్యముగా గావలసిన ఎ. బి. డి. వైటమినులందులో లేవు. కాల్సియమ్, ఫాస్ఫరస్, ఇనుము మొదలగు పదార్థములు తక్కువ.

చాలమంది ఎ. సి. వైటమినులుగల ఫలముల నుపయోగింపరు.

పాలు, పాలతో సంబంధించిన ఆహారమును చాల మంది వాడరు.

మాంసాహారులు తాము తిను జంతువు లారోగ్యములా కాదాయని గమనింపరు. వారైన మంచి మాంసము, చేపలు, గ్రుడ్లు ప్రతిదినము తినలేరు.

ధాన్యముమీద పొట్టు, అన్నము ఉడికించిన నీరు నుపయోగింపరు. దానియందే ముఖ్యమైన పదార్థములుండును.

బలపదార్థములైన పాలు, వెన్న, నేయి, నూనెలం దితరపదార్థముల గలిపి పాడుచేయుదురు.

ఇవన్నియు గమనించినచో భారతీయుల ఆహారమునకు పాలు, తత్సంబంధమైన పదార్థములు, ఫలములు (అటంకములేనియెడల మాంసము, చేపలు, గ్రుడ్లు) చేర్చవలసియున్నదని తెలియుచున్నది. కాని యిది దుర్భరదారిద్ర్యమునబడి క్రుంగుచున్నవారందరికిని

---

సోయాబీనులనుగూర్చిన వివరములు గృహలక్ష్మి కార్యాలయమునకు వ్రాసిన బడయగలరు.

సాధ్యమగునదిగాదు. అందుచే అందరి అందుబాటులో నుండి సులభముగ చౌకగ దొరకునదియై, వారి ఆహారమునందు ప్రకృతముగల లోపములనెల్ల పూర్తి చేసెడి వస్తువు గావలసియున్నది. అదియే సోయాబీన్.

## చరిత్ర : పుట్టుపూర్వోత్తరములు:—

సుమారు రెండువేలేండ్లకుమున్ను రచింపబడిన 'కౌఆంగియా' అను చైనీయుల నిఘంటువునందు ఇది 'టాటియన్' అనియు, పురాతనగ్రంథములలో 'షూ' లేక 'సా' అనియు పేర్కొనబడినది. బహుశా 'సోయా', 'సోయ్', 'సోజా' అను పదము 'షూ' నుండియే వచ్చియుండును.

సోయా ప్రాగ్దేశమునందే ప్రభవించినది. చైనా, కొరియా, మంచూరియా దేశములు దీనికి మాతృభూములు. చైనాయందిది వేలకొలది సంవత్సరముల నుండి బలమైన ఆహారపదార్థముగా నెంచబడుచున్నది. సుమారు 6000 సం||ముల క్రింద చైనాదేశమును పరిపాలించిన పెన్‌నుంగ్ దీని నా దినములలో నుత్తమాహారముగా 'బెన్‌జాల్ గాంగ్'నందు వర్ణించెను. తరువాత చైనాగ్రంథములందు నిదేవిధముగ సోయాబీన్ వర్ణింపబడినది. జపాను పురాతన గ్రంథములందుగూడ యిట్టివర్ణనలే గలవు. కాన ఇదెంత పురాతనమైనదో తెలియగలదు.

వర్ణనలేగాక చైనీయులు దీనిని 7000 సం, క్రింద నుండి పండించుచున్నట్లు తెలియుచున్నది. ఈదేశములందు దీనికి సుమారు 70 పేరులు గలవు వీనిలో 1400 రకములుగలవు (పశ్చిమదేశపు రకములతో గలిసి యివి యిప్పటికి 1500 రకములగునని తెలియుచున్నది.) చైనీయులకందరి కిది ముఖ్యమైన ఆహారము. వేయి సంవత్సరముల క్రింద చైనాభాషలో స్త్రీ దీనియుపయోగమును తెలుపుచు రచించిన పద్యములు గలవట.

ఇంతటి యమూల్యాహారపదార్థము 17వ శతాబ్దమువఱకు పాశ్చాత్యులకు తెలియకయుండెను. క్రమక్రమముగ వారు దీని విలువను తెలిసికొని రెండు శతాబ్దములలోపలనే దానితో ఆహారపదార్థముల తయారుచేయుటేగాక, యితర విషయములకుకూడ నుపయోగించి లాభము పొందుచున్నారు.

ఇది భారతదేశమున కంత క్రొత్తదిగాదు. దీనిని ఆఫ్ఘనిస్థానమునుండి బర్మావరకు పండించుచుండినట్లు తెలియవచ్చుచున్నది. కాని దీని వ్యవసాయమునందు భారతీయు లంతటి శ్రద్ధవహింపలేదు. నేడమిత శ్రద్ధ వహించున ట్లగపడుచున్నది. కాలక్రమమున నది భారతీయులకు ముఖ్యమైన పంటయై బీదలపాలిటి పారిజాతమై యొప్పునని యాశింతును.

## సోయాబీనుతో చేసికొనదగు పదార్థములు

### సోయాపాలు.—

సోయాపాలునకు 7 భాగములు నీళ్లు 1 భాగము సోయాబీనుల పిండియు కలుపవలయును. నీరు బాగుగా మరిగినతరువాత పిండి కొంచెము కొంచెముగా వేయుచు గరిటెతో కలుపుచుండవలయును. దానిని 15 నిమిషములు బాగుగా నుడకనివ్వవలెను. కొంతసేపు క్రిందమంటతీసి పొయ్యిమీదనే కొంతకాలము పెట్టి యుంచవలయును. తరువాత ఆనీటిని గుడ్డలో వడియగట్టుకొనవలయును.

### సోయాపెరుగు:—

పైవిధముగ పాలను తయారుచేసికొన్న తరువాత సాధారణ పాలకువలెనే మజ్జిగనో, మరేపులుసు పదార్థమునో కొంచము గలిపి పేర బెట్టుకొనవగును. ఇది సాధారణపాల పెరుగుకంటె గట్టిగనుండును. రుచికూడ బాగుండును.

(సశేషము)

# గృహిణీత్వానికి జీతాలా?

'ఒక సోదరి'

ఇల్లాలు ఇంటిపనులు చేయడానికి భర్తలు జీతాలివ్వాలంటే విన్నవాళ్లకు నవ్వొస్తుంది కామోసు. పైగా పురుషులంతా "గృహ నిర్వహానానికి మేము జీతాలు ఇవ్వవలసివస్తే, బైటదిరిగి, కష్టకష్టాలుపడి సంపాదించి, యింట్లోవున్నవాళ్లను పోషించేటందుకు మాకు గృహిణే యివ్వాలె" అంటారేమో! ప్రస్తుతం విషయం అదికాదు. నేడు చాల మంది సోదరీమణులు విద్యావతులై ఉద్యోగాలు చేయాలని ప్రయత్నం చేస్తూవుండడం తరుచుగా జరుగుతూందిగదా! కొంతమంది వివాహాలకుముందు వుద్యోగాలు చేసినా పెళ్లిళ్లయిన తరువాత మానుకోవలసి వస్తుంది పెళ్లయినతరువాతకూడా వుద్యోగాలుచేయాలంటే వారి జీవితం సుఖంగా జరగదు. అటువంటివారంతా యీలాంటి విషయాల్లో యేమిచేయాలో వివరిస్తూ పి. ఎన్. మోహిలిగారు బొంబె క్రానికల్లో యీలా వ్రాస్తున్నారు.

కొంతమంది సంపాదించి స్వతంత్రంగా జీవితం గడపడానికంటూ, మరికొంతమంది కళాదృష్టితోనంటూ వున్నతవిద్య అభ్యసిస్తున్న సోదరీమణులు దినదినాభివృద్ధి కాంచుచుండడం ముదావహమైందే. కారణమేమైనా నారిసంఖ్య చాలా పెరిగిపోతూంది; వారు పురుషులతో సమానంగా డిగ్రీలు సంపాదించి తక్కువజీతాలకు వుద్యోగాలు చేయడానికి పూనుకొంటున్నారు. కాబట్టి మనకు నూతనంగా 'స్త్రీలు వుద్యోగాలు చేయవచ్చా?' అనే సమస్య బైలుదేరింది.

గాజుభరిణల్లోపెట్టి వుంచాలనే సనాతనులలో ఆటంకముందేమోగాని నవీనాచారాలకు వాడుకపడినవారిలో వివాహం గాని వారు వుద్యోగంచేయడానికి అభ్యంతరం వుండదు. ఒకవిధంగాచూస్తే వుద్యోగం చేస్తూ సంపాదిస్తూవున్న స్త్రీ తనజీవితంలో పెళ్లిఅయినతరువాత ఎక్కువగా సుఖపడుతుంది. కాబట్టి నవీనులదృష్టిలో—ఆస్త్రీ పెళ్లిఅయినతరువాత వుద్యోగం మానుకోని గృహనిర్వహణం చేయదలంచుకొన్నా— వివాహానికిపూర్వం వుద్యోగంచేయడం లాభదాయకమైందే.

కాని పెళ్లయినతరువాత—

పెళ్లితోకూడా సాధారణంగా పరిస్థితులు పూర్తిగా వేరవుతవి. వివాహితఅయిన స్త్రీ తనవిషయమే గాకుండా తనభర్తవిషయం కూడా బాధ్యత వహింపవలసివస్తుంది. కాబట్టి యిచట పరస్పర విరుద్ధవిషయాలు రెంటు సమన్వయం చేయవలసివుంది. వివాహితఅయినస్త్రీ వుద్యోగంచేయవచ్చా అనేది ఒక ప్రబలసమస్యగా ఏర్పడుతుంది. ఈసమస్య పరిష్కారంపైననే భార్యాభర్తల సౌఖ్యం ఆధారపడివుంది. ఈసమస్యపైన విద్యావంతులైన నవీనదంపతులు ఎక్కువగా కలహిస్తారు; ఫలితాలు దుర్భరంగా పరిణమిస్తవి.

ఈవిషయంలో పురుషునిదృష్టి చాలా స్పష్టంగావుంటుంది ; దానికి వేరే చర్చ అనవసరం. అతడు తాను పెళ్లాడినస్త్రీ తన సౌకర్యాలు గమనించాలని కోరుతుంటాడు. అంతేకాకుండా ఇంటిని చక్కగా శుభ్రంగా వుంచాలనీ తనకు నచ్చినట్లుగా వండాలనీ, పిల్లల శ్రద్ధగా చూచుకోవాలనీ అనుకుంటాడు. చదివినా, చదువకపోయినా ఒకస్త్రీ తన్ను భర్తగా అంగీకరిస్తే, తాను కోరుదానికంతా ఆమె అంగీకరించే పెళ్లాడుతుందని అతను అనుకుంటాడు. లేకపోతే ఆమె తన్నెందుకు పెళ్లాడుతుంది ? ఇది సాధారణంగా పురుషుని స్వార్థదృష్టి.

అయితే విద్యావంతురాలైన స్త్రీదృష్టి కొంచం భేదిస్తుంది. విద్యావతులలో చాలామంది ప్రేమసహవాసానికి పెళ్లాడుతారుగాని గృహనిర్వహానానికి పిల్లల కనడానికి కాదు. అంతేకాకుండా నేటి విద్యావతులకు ఒకవిధమైన ఆత్మగౌరవం, ఆర్థికంగా స్వతంత్రజీవితం గడపాలనే భావం వుంది. అది కొంతకాలంనుంచే బైలుదేరింది. ఆర్థికస్వాతంత్ర్యం లేకపోయిన తరువాత ఇంట్లో మరేవిధమైన స్వాతంత్ర్యం కూడా వుండదని దీల్లో అంతరార్థమై వుండవొచ్చు. కాబట్టే విద్యావతి తాను తన ఉద్యోగం నిలుపుకొని గృహనిర్వహణం పూర్తిగా యితర సేవకులపైన పెట్టడానికి చూస్తూవుంటుంది.

ఇక్కడే పురుషు డభ్యంతరపెట్టడం. ఆతని స్వానుభవమైన అభిప్రాయ మేమిటంటే జీతానికి పనిచేసే నూరుమంది సేవకులైనా ప్రేమపూరితఅయిన తనభార్య తన గృహాన్ని సౌఖ్యప్రదంగా జేసినట్టు చేయలేరనే. డబ్బుతో దయ్యాన్నికూడా ఆడించవచ్చుకాని ప్రేమనుకాని ప్రేమపూరితమైన సేవనుకాని ఎంతధనమైనా సంపాదింపలేదు; సకలసౌఖ్యాలు కలగడానికి అత్యావశ్యకమైన సంతోషగృహవాతావరణము కల్పించడానికికూడా అది యుపయోగించదు; అని అతని తలంపు. ఇది యథార్థమైందే అని అందరూ అంగీకరించవలసిందే. ఇల్లాలు గృహాధికారము వహింపని కొన్ని యిళ్లను **చూడండి; ఆగృహాము** నిర్జీవంగా కనపడుతూ సంతోషానికి దూరంగావుంటుంది. కాని నేటి దైనికజీవితములో పెక్కుసమస్యల నిరంతరము ఎదుర్కొను పురుషుడు సంతోషప్రదమై శాంతియుతమై ప్రేమపూరితమైన గృహజీవితాన్నే కోరుతుంటాడు. ఇది కొంతమంది విద్యావతులన్నట్లు పురుషులదురాశా, లేక తగని కోరిక అవుతుందా ?

గృహజీవితములోనికి పిల్లలు రాగానే యీసమస్య మరింత విషమిస్తుంది. అది పురుషునివాదనకు బలాన్ని పెంచుతుంది. పెద్దవారైన పురుషులకే గృహం కావలిసివస్తే పిల్లలకు దాని ఆవశ్యకత మరింత హెచ్చుకదూ? పురుషునికి దైనికజీవితంలోని కష్టాలను వుపశమింపజేయడానికి భార్యయొక్క శ్రద్ధ, ప్రేమ కావాలంటే పిల్లలకు దినమంతా తల్లియొక్క ప్రేమ, ఆదరణ కావలసివుంటుంది. కాబట్టి యీ

సమస్యకు తృప్తికరమైన పరిష్కారం కనపడ లేదని అనవలసిందేనా?

ముందే శ్రద్ధపుచ్చుకోవడం ఉత్తమమైందే. పెళ్లికిముందు విద్యావంతులు వివాహమంటే ఏమిటో అందులో ఎవరెవరేమేమి భాధ్యతల నిర్వహించవలెనో స్పష్టంగా మోమాటంలేకుండా చర్చించుకొనడం వుత్తమం. వారు దాని కంగీకరించక పోయినా పెళ్లాడే కోరికుంటే దానికి తగినట్టు తగిన యేర్పాట్లు చేసికొనడం మంచిది. ఆసమయంలో వారు ఒకరికొకరు కొంచం సానుభూతి చూపించేస్థితిలో వుంటారు. అలా కాకుండా వారి ఆశయాలు అభిప్రాయాలు, విపరీతంగా భేదిస్తే వారు పెళ్లాడకముందే ఆసమాచారం స్పష్టంగా తెలిసికొనేది మంచిది; చేసికొన్నతరువాత తెలిసికొనే దానికంటె.

ఒకవేళ పెళ్లయినతరువాత భార్యాభర్తలు భేదపడితే? భార్య అపుడుకూడా తనవుద్యోగం నిలుపుకొని సంపాదించదలచుకొంటే? భర్త ఆమెను గృహనిర్వహణం తప్పక వహించాలని పట్టుబడితే? వారప్పుడేమిచేయాలి?

దీనికి రెండుమార్గాలువున్నవి. అవి బాగా పనిచేస్తవికూడా. మొదటిదేమిటంటే, భార్య బైటపోకుండా యింట్లోనో, గృహాలంకరణానికో పనికొచ్చే ఒక పరిశ్రమను ఆరంభించడం. విద్యావతి యీవిషయాల్లో తన బుద్ధిని వినియోగిస్తే చేయవలసినవి ఎన్నోవున్నవి.

రెండోది. ఇది విద్యావతులకు తగిందీ తృప్తికరమైందీకూడా. ఏమిటంటే గృహనిర్వహణాన్ని ఒక వుద్యోగంగా ఎంచుకోని భర్తను దానికి తగినట్టు డబ్బు యివ్వమనడం. ఇది అందరికీ హాస్యంగా తోస్తుందేమోకాని ఇందులో విపరీతం ఏమీ లేదు. పురుషుడు తనభార్య సత్యంగా గృహనిర్వహణములో ఎక్కువసేవ చేస్తుందని గుర్తిస్తే ఆమెకు ప్రతిఫలమివ్వడానికి వెనుతీయకూడదని అనుకుంటా. ఎందుకంటే పురుషుడు విద్యావతిగావుండే తనభార్య తనవుద్యోగం మానుకొని గృహనిర్వహణం చేయాలంటే ఆమెకు కలిగే ఆర్థికనష్టం కనపడకుండా చేయడానికి కొంత యేదైన యివ్వవలసిన ఆవశ్యకతవుంది. అందుచేత ఆమెకు తృప్తికరంగా కొంతడబ్బు యివ్వాలి. ఇది మీరు ఒక జేబునుండి మరొక జేబులోనికి మార్చునట్లే కనపడుతుంది. కాని మానసికంగా దీనివల్ల చాల మేలు కలుగుతుంది. ఈకాలములో చదువుకున్న స్త్రీ స్వాతంత్ర్యంఅంటే ఎక్కువగా గణిస్తుంది కాబట్టి పైస్థితిలో ఆమె తన స్వాతంత్ర్యం నిల్పుకున్నానని తృప్తిపడుతుంది. ఈవిధంగా 'పెళ్లయిన స్త్రీ వుద్యోగంచేయవచ్చా' అనే సమస్య దంపతుల కిద్దరికీ తృప్తికరంగా పరిష్కారం అవుతుంది.

# గృహపరిశ్రమలచే ధనము గడించుటెట్లు?

పరిశ్రమలవలన నేడితరదేశము లెంతటి యభివృద్ధికి వచ్చినవో వచ్చుచున్నవో వేరుగా వచింప బనిలేదు. భారతదేశమందు పరిశ్రమలు చాలతక్కువ; ఉన్నను అవి విదేశవస్తువులతో చేయునట్టివై యున్నవి. స్వదేశవస్తువులనే యుపయోగించి పరిశ్రమల కొనసాగించుట భారతదేశభావిభాగ్యమునకు దారితీయుట యగును. కాని దీనికి పెట్టుబడియు, నిర్మాణకౌశలము, పారిశ్రామిక విద్య, పైగా ప్రభుత్వమువారి యాదరణ చాల యావశ్యకములు.

ఇవి లేకనే కొన్ని పరిశ్రమలు జరుగుటకు వీలులేకపోలేదు. వానిలో గృహపరిశ్రమలు ముఖ్యములని యెంచనగును. మనము నిరంతర ముపయోగించు చిన్నచిన్న వస్తువులను కూడ విదేశములనుండి కొనుచున్నాము గదా! వాని విరామకాలమున సులభముగా గృహిణులే తయారుచేసికొన్నచో వారికి కొంత కర్చుతగ్గి వృథాగాబోవు కాలము గూడ సద్వినియోగముచేసినట్లగును. ఇతర దేశములందు గృహిణులు కష్టములైన పెక్కుపరిశ్రమల యింటియుందే యారంభించి ధనము గడించుచున్నారు. నేడు మన భారతీయాంగనలకుకూడ నట్టి పరిశ్రమలు మేలుగూర్చునను నాశయముతో యీ ప్రకటన జేయుచున్నాము.

పై సమస్యపై ఉత్తమవ్యాసముల రచించిన సోదరీమణులకు ప్రథమ ద్వితీయ తృతీయ బహుమతులుగా రు 5, రు 3, రు 2. నివ్వబడును. సంపాదకుల తీర్మానమే అంత్యముగా పరిగణింపబడును. ఆ పరిశ్రమ యీక్రింది నిబంధనల ననుసరించి యుండవలయును.

1. గృహిణులు ఇలువీడకనే స్వయం సహాయముతో చేసికొనుటకు తగియుండ వలయును.

2. ఆ పరిశ్రమయందు విదేశవస్తువుల నుపయోగింపక అన్నివస్తువులును స్వదేశీయములై సులభముగా లభించునవియైయుండ వలయును.

3. ఈ పరిశ్రమయందరి అందుబాటులో ప్రాక్టికల్‌గానుండవలయును.

4. ఈ పరిశ్రమవలన తయారగువస్తువులు అందరికిని అత్యావశ్యకమైనవిగనుండి త్వరగా కర్చుగావలయును.

ఈవిషయములన్నియు గమనించి సోదరీమణులు త్వరలో తమకు దెలిసిన పరిశ్రమలను గురించి వ్రాయుదురుగాక.

---

# కావలెను

ఏబదిరూపాయల జీతముగల గౌరవనీయమైన యుద్యోగముననున్న పట్టభద్రుడగు 25 సం. (బలిజ) యువకునికి 16, 18 సంవత్సరములకు పైబడని కన్య కావలయును. వరకట్నాదు లనవసరము. కన్య రూపవతియు, విద్యావతియు సంగీతము చిత్రకళ మొదలైన లలితకళలందు ప్రవేశము కలదియునై యుండవలయును. ఈ కులములోని యితర బేధముల పాటింపబనిలేదు. పైవిషయముల తృప్తిపరచు బాలవితంతువులైనను సరియే. ఉత్తరప్రత్యుత్తరములు రహస్యముగా నుంచబడును. వివరములు క్రిందివారికి వ్రాయుడు.

## 2

గౌరవనీయమైన కుటుంబమున నొక వంటచేయు బ్రాహ్మణస్త్రీ కావలయును. పాకకళలో నేర్పరిగ నుండవలయును. పరిశుభ్రతముఖ్యము. దుబారాఖర్చు పిచ్చిమడి లేకుండ యుండవలయును. మాసమునకు రు 15 మొదలు రు 20 వరకు యోగ్యతను బట్టి జీతము యివ్వబడును. గృహలక్ష్మి పాఠకుల కిట్టివారు దెలిసియుండిన వారిచేత దరఖాస్తులు పెట్టించవలయును.

## 3

శిశువులను పెంచి పెద్దచేయు నవీనపద్ధతులను దెలిసిన యొక ఆంధ్రస్త్రీ కావలయును. ఆమెకు వసతిగృహము, కట్టుబట్టలు వుచితము. మాసమునకు రు 20 లు వేతనము యివ్వబడును.

వివరములకు:

సంపాదకుడు, 'గృహలక్ష్మి'

పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు.

---

గమనింపు:—

వధూవరులు కావలయునని ప్రకటన లింకమీదట ప్రతిమాసమును ప్రకటింపబడుచుండును. వలయువారలు ఇట్టిప్రకటనలను 15 తేదికిముందే మా కార్యాలయమునకు పంపుకొనవలయును. ఉత్తరప్రత్యుత్తరములు రహస్యముగనుంచి వారివారి కందింపజేయుదుము. ప్రకటనలకు ఒకకాలము ఒక అంగుళమునకు ఒకరూపాయప్రకారము చార్జిచేయబడును. సంపాదకుడు.

## 'ఆ......!'

రాజ వేంకటపద్మనాభ రావుగారు

### 1-వ రంగము

(అగ్రహారము. బ్రాహ్మణుయిల్లు. సోమశాస్త్రిర్లు ఓపక్క అరుగుమీదకూర్చుని ఎండాకు చినుయి స్తళ్లకు బాదమాకులతో మాసిక లేస్తుంటాడు. వయస్సు 55 సం. తక్కువ వుండవు. మాసినగడ్డాము వీభూది రేఖలతో అయిక్యమైపోతుంది. చామనచాయగ, బక్కపల్చగ వుంటాడు. రొండో అరుగుమీద చిరిచాప వేసివుంటుంది: దానిమీద శంకరశాస్త్రి, సోమశాస్త్రికొడుకు — కూర్చుని వో యింగ్లీషు పుస్తకాన్ని చూస్తుంటాడు. గుంటూరుకాలేజీ బి.ఎ. విద్యార్థి. వయస్సు 24 సం. మించకుండా వుంటుంది. సన్నగ, ఎర్రగ — అందంగా వుంటాడు. నవనాగరికత అతనిలో కనిపిస్తుంటుంది. సమయం — ఉదయము.)

శంకరశాస్త్రి:—నాన్నగారూ! చెల్లి ఏడుస్తూంది, ఆ తాతను చేసుకోనని.

సోమశాస్త్రిర్లు:—దానిముఖం. దానికేమి తెలుసు చెప్పూ. ఆయనకేంరా! దబ్బపండులాంటిమనిషి!

శంక:—అయినా మనకుమటుకు తెలీటంలా నాన్నగారూ! చెల్లికీ, ఆయనకు యీడాజోడా! ఆయనకు అరవైసంవత్సరాలుంటాయి; చెల్లికి పన్నిండోసంవత్సరం దాటుతూవుంది.

సోమ:—అరవైసంవత్సరా లుంటే మటుకు? నలభైసంవత్సరాల మనిషిలావుంటాడు. ఆయనకున్న వోపిక నీకుందీ? తెల్లవారుఝామున లేచి స్నానం చేసి — చల్లో! — పీటమీదకూర్చుని పారాయణ చేయటం మొదలుపెట్టాడంటే పదిగంటలదాకా లేవడు. తిండో! తద్దినంబ్రాహ్మడికన్నా యింకా కొంచెం ఎక్కువతింటాడు. ఎంతహూరాయింపు! శంక:—(కోపంగా) నాన్నగారూ! మన ముసలిగేదె నాల్గుమానికల చిట్టుతిందూపెట్టితే? ఎలా అన్నా, ముసలివాళ్లు ముసలివాళ్లే! ఎంతతిన్నా, ఎంతచేసినా ఏండ్లుతగ్గి పళ్లావయిసాళ్లుకారుగా! చెల్లి ఆయనకు కూతురన్నా నమ్మరు. మనుమరాలుఅంటే ఏమన్ననమ్ముతారేమో!

సోమ:—దానికేమిరా! కామశాస్త్రిర్లు నాలుగో పెండ్లి చిన్నపిల్లనేగా చేసుకుంది! ఈయనకంటే పెద్దవాడేగా! ఆ అమ్మాయి పెద్దదికాలేదా? సంసారం చేయటంలేదా? అప్పుడే యిద్దరుపిల్లలు!

శంక:—చదువుకున్న శాస్త్రిల్లు ఆయన. మంత్రాలకే పిల్లలను కంటున్నాడేమో! నాన్నగారూ! మొన్న మీకు ఎవ్వరో దానమిచ్చేరే ఓఆవుపెయ్యను, దానిని అమ్మేరుకదూ? ఎంతకు?

సోమ:—ముందు ముప్పైచెప్పాను. ఎవ్వరూ మొగ్గిరాలా. చివరకు పాతిక్కిచ్చా.

శంక:—నాన్నగారూ! ఆ ఆవుపెయ్యకు చెల్లికి భేదం ఏమిటి? దానిని పాతిక్కుఅమ్మితే, చెల్లిని నాలుగువేల కమ్ముతున్నారు.

సోమ:—(తెల్లముఖంవేసి) అదేమిటి? చెల్లిని అమ్ముతామురా! యేదో సంబంధం మంచిదని యిస్తున్నాముగాని; మనం ఆయనకు దగ్గరబంధువులం అవుతున్నాము. ఏదోబహుమానంగా యిస్తానన్నాడు ఆ పెద్దమనిషి. మనం వద్దంటే బాగుంటుందీ? ఇదిగో చూడూ, యిక యిబ్బందివుండదు. ఈ సంవత్సరం బి. ఎ. అయిపోతే వచ్చేసవత్సరం దానిపైచదువుదుగాని, అయితే అది గుంటూరులోవుండదా?

శంక:—'అంగట్లో అన్నీవున్నాయి; అల్లుడు నోట్లోశని' అన్నట్లు వుంది. ఈ సంవత్సరం యినుప పెట్టెతాళం పోయిందాఏమిటి? డబ్బుకోసం నే నెంతయిబ్బందిపడ్డానో మీకేంతెలుసు! ఇప్పుడు పంపారు, యిక అప్పుడుపంపుతారు! దానికేమిగాని, హాయిగా మేనరికం యిచ్చుకోకూడదూ? కృష్ణ శాస్త్రి వచ్చేసంవత్సరం బి.ఎ. చదువుతాడు. పిల్ల వాడు అందంగా వుంటాడాయెను. తెలివిగలవాడు; బుద్ధిమంతుడు. పిల్లా, పిల్లవాడికీ, యిద్దరికీ యిష్టమే!

సోమ:—ఇష్టానికి, అయిష్టానికికాదు. అసలు పిల్లవాడి కేమి ఆస్తుందో చెప్పు. అవున్న కొంచెం ఆస్తీ చదువుకిందే ఆఖరవుతుంది. ఉద్యోగాలా, పాడా, తరువాత అడుక్కోతింటమేనా? అదీచేత కాదు యీ పాడుఇంగ్లీషుమూలాన. ఆయనకుమాడు, ఎంతఆస్తీ! ఎంతఆస్తీ! పైనసంపాదనఎంత! యిప్పటికీ బయలుదేరాడుఅంటే పూటకు రెండురూపాయలు, మూడుమానికలబియ్యం మూటకట్టందీ యింటిగుమ్మం తొక్కడు. ఓ పెద్దపెంకుటిళ్ళవంతి, పాడి, పంట, చేతినిండాడబ్బు — ఆయనకేమిరా, లక్ష్మీపుత్రుడు! అమ్మాయి ఎంతసుఖపడొచ్చు!

శంక:—స్త్రీకి నిజమైనసౌఖ్యం తగినభర్తవల్ల వస్తోంది, కాని డబ్బువల్లరాదు. చూడండి నాన్న గారూ! ఈవూళ్లో పంతులు ప్రకాశరావు నెలకు యిరవైసంపాదిస్తేనేమి? భార్యాభర్తలు — యీడూ జోడు — చిలుకాగోరంకలులాగ ఎలా హాయిగా వుంటున్నారో? అది సౌఖ్యమంటె.

సోమ:—అబ్బాయి! నువ్వు చిన్నవాడివి. అను భవంతక్కువ. డబ్బువుంటే కొండమీదికోతి దిగి వస్తోంది. అసలు ఫలానివారిభార్యఅన్నా గొప్పే! ముందుమాటయిచ్చే, ఆ పెద్దమనిషికి. ఇపుడుకాదంటే బాగుండదు. సాయంకాలం పిల్లనుచూచుకోటానికి మన యింటికొస్తారు చూడు. వారినిజాగ్రత్తగా బాగా మర్యాదచేయాలి. నువ్వు ఆయనను ఎక్కిరించి పోట్లాటపెట్టుకునేవుసుమా! బాగుండదు.

శంక:—(కోపంగా) నే నేమిచెప్పినా మీకు నచ్చదు. మీయిష్టంవచ్చినట్లు చేయండి.

సోమ:—అలాఅన్నావు బాగుంది. ఏదో పెద్ద వాడిని నే నున్నాగా నాకే వొదిలిపెట్టు అదంతా.

(తెరపడుతుంది)

## 2-వ రంగము

(సాయంకాలము. సోమశాస్త్రిగ్లు ఇల్లంతా అలికి ముగ్గులేసివుంటుంది. ద్వారానికి మామిడిఆకు తోరణంకట్టి వుంటుంది. ద్వారం కిందిభాగానికి పసుపు, కుంకం పెట్టివుంటుంది. ఓ అరుగుమీద చిరి చాప, రెండోఅరుగుమీద తాటిఆకులచాప పరిచి వుంటాయి. శంకరశాస్త్రి తాటిఆకు చాపమీద కూర్చునివుంటాడు. సోమశాస్త్రిగ్లు, యిటూఅటూ పచార్లుచేస్తుంటాడు.)

సోమశాస్త్రిలు:— (ఆలోచనగా) సుబ్బావ ధానిగారు యింకారాలేదేమిటి చెపుమా.!

శంకరశాస్త్రిలు:—(విచారహృదయంతో ఆకా శంవంక చూస్తొంటాడు.)

సోమ:—అబ్బాయీ! ఇపుడెన్నిగంట లవుతుంది?

శంక:—అవుతుంది నాలుగుగంటలు.

సోమ:—వొస్తూవుంటారు అనుకుంటూ (వీధివేపు చూచి) ఆ! వారేలాగున్నారు వస్తున్నారు. (మళ్లా నిదానించిచూచి) వారే! సుబ్బావధాని, పిచ్చెయ్య శాస్త్రిగ్లుగార్లు.

(ప్రవేశం సుబ్బావధాని, పిచ్చెయశాస్త్రిగ్లు. సుబ్బావధాని క్రాబోయేపెండ్లికొడుకు. శరీరం పచ్చగావుంటుంది. ఇస్త్రీచేయని చాకలింటిగుడ్డలాగా ముఖంనిండామడతలు, మీసాలులేవుగాని ఫ్రెంచి కటింగులాగ నశ్యం ముక్కుదగ్గర. చెవులకు బంగారు కుండలాలు మామిడిపండ్లులాగ వ్రేల్లాడుతుంటాయి,

మాడుమీదిజుట్టు మాయమైవుంటుంది. తలకుచుట్టూ పంచపాళీలాగ తెలుపు, నలుపుమిలితమైన జుట్టు కనిపిస్తుంది. తెల్లని జరీధోవతికట్టుకోని, ఓజరీ ఉత్తరీయం మెడకుచుట్టుకొని వుంటాడు. కాఫీరంగు కొల్లాయి గుడ్డ భుజంమీద వేల్లాడుతుంటుంది. నడుందగ్గర ఓ పెద్దకురుపులాగ పొడుంబుర్ర వుంటుంది. కండ్లకు సులోచనాలువుంటాయి. చేతిలో వెండిపన్నుకర్ర. అరవైసంవత్సరాలకు తక్కువలేని మనిషిలాగా వుంటాడు. (పిచ్చెయ్యశాస్త్రిర్లు పెండ్లిళ్లకుదిర్చే బ్రాహ్మణుడు. సాక్షాత్తు తద్దినాల బ్రాహ్మణుడు లాగ వుంటాడు.)

సుబ్బావధాని:—నమస్కారాలండి, మామగారు!

సోమ:—చిత్తం! చిత్తం! దయచేయండి పెద్దలు. ఇవిగోనీళ్లు కాళ్లుకడుక్కోండి. (ఇద్దరికి చెంబులతో నీళ్లుయిస్తాడు.) కాళ్లు తుడుచుకోండి. (కొల్లాయిగుడ్డయిస్తాడు.) అలా చాపమీద దయ చేయండి.

(సుబ్బావధాని, పిచ్చెయ్యశాస్త్రిర్లు చాపను అలంకరిస్తారు.)

సోమ:—తమరు మడికట్టుకోని దాహంపుచ్చుకుంటారా ?

సుబ్బా:—అబ్బే! అవుసరంలేదు. వారేనా అండి మీ అబ్బాయి గుంటూరులోచదువుత.

సోమ:—చిత్తం.

సుబ్బా:—మిమ్మలను ఎప్పుడూచూడలా.

శంక:—సాధారణంగా నే నిక్కడవుండను; ఎప్పుడన్నా శెలవులకువస్తాంటా.

పిచ్చె:—అయ్యా! తమరు మమ్మలను తొందరగాపంపాలి. పొద్దుపోతూంది. నాల్గుమైళ్లుపైగా పోవాలి.

సోమ:—అలాగే. అమ్మాయిని తీసుకొరమ్మంటారా ?

పిచ్చె:—చిత్తం!

(సోమశాస్తుర్లు ఇంటిలోనికిపోయి 12 సంవత్సరముల అమ్మాయిని తీసుకొచ్చి సుమ్మందగ్గిర నుంచోపెడతాడు. ఆ అమ్మాయి తలవొంచుకోని వుంటుంది. ఎర్రగా, సన్నగా, నాజూకుగా వుంటుంది. చాల అందంగా వుంటుంది అనేచేప్పాలి. పరికిణీ, గౌను తొడుక్కొని, చాల బంగారునగలుపెట్టుకొని వుంటుంది.)

పిచ్చె:—అమ్మాయీ! నీ పేరేమిటమ్మా ?

అమ్మాయి:—శకుంతల.

పిచ్చె:—ఓ, దివ్యమైననామం!

సుబ్బా:—ఎందుకండీ, కండ్లవెంబడి నీళ్లుకారుతున్నాయి, కండ్లకుజబ్బా ?

సోమ:—అబ్బే! లేదండీ. ఉదయం తలంటిపోసుకుంది, నురుగు కంట్లోపడ్డది.

శంక:—కండ్లకుకాదు జబ్బు; హృదయానికి.

సోమ:—(కుమారునివేపుకండ్లువుంచిచూస్తాడు.) అదీకాక, పాపము! తల్లిపోయిసంవత్సరమేగా అయింది. ఉదయాన్నించి తల్లినితలుచుకోని ఏడుస్తుంది. పెండ్లిసమయంలో ఆవిడెలేకపోవటం, ఎంతో లోపంగావుంది.

సుబ్బా:—అయ్యో! కాదుమరి.

సోమ:—ఆవిడ బతికున్నప్పుడు అంటూవుండేది, మీలాటి గొప్పసంబంధాని కియ్యాలని. పాపం! చూచిసంతోషించే యోగ్యతే లేకపోయింది.

శంకర:—ఇలాటి గొప్పసంబంధము దొరుకుతుందో, దొరకతో అని సగము యీదిగులుతోనే చచ్చిపోయింది.

సోమ:—(కొంచెం తెల్లముఖంవేస్తూ) అదికూడ నిజమేనండి.

సుబ్బా:—అవును, అనుకున్న వన్నీ జరుగుతాయా మరి ?

సోమ:—చిత్తం. అలాగే.

సుబ్బా:—ఏమన్నా చదువుకుందా అండి?

సోమ:—భారతం, భాగవతం గడగడ చదివేస్తుందండి. కొంచెం యింగ్లీషుకూడ నేర్చుకుంది అన్నయ్యదగ్గిర.

శంకర:—మీకు కొంచెం చూపుతగ్గినట్టువుంది; ఇబ్బందేమి లేదులెండి. మా అమ్మాయి మీకు కావలసిన పారాయణగ్రంథాలన్నీ చదివి వినిపిస్తుంది.

సుబ్బా:—చూపుకేమండి? ఈ కళ్ళజోడు వూరికే......ఏదో......

పిచ్చె:—అందానికి పెట్టుకున్నారు; చూపుకేమండీ, నిక్షేపంలావుంది.

సుబ్బా:—అయినా, చదవవలసిన అవుసరమే లేదు. అన్నీ నాకు కంఠతావొచ్చు.

సోమ:—చిత్తం. పెద్దలు తమకేవిరావు?

పిచ్చె:—సోమశాస్త్రిర్లుగారూ! అమ్మాయి వొంటిమీదవున్న సొమ్మంతా, అమ్మాయితోనే వొస్తుందా అండి?

సోమ:—(తెల్లముఖం వేస్తాడు)

శంకర:—అబ్బే! అవి ఎలావస్తాయిఅండి? ఊరికే చూపించాము, మా అమ్మాయికి, చాల సొమ్ములు మొయ్యగల శక్తివుందని. రేపు మీరు కొంచెంచేయిస్తే మొయ్యలేదని.

సుబ్బా:—సొమ్ముకేమిలెండి, నాదగ్గర మూడువేల ఏడువందల పదహారు రూపాయల కిమ్మత్తుగల సొమ్మువుంది.

సోమ:—(తేటముఖంతో) తమదగ్గరసొమ్ముకేమి కొరతండి? అపరకుబేరులు!

పిచ్చె:—పిల్లకేమన్నా లోపంచేస్తారా? అమ్మాయిగారు ఎక్కడికిపోవాలన్నా నడవకుండా ఓ ఓంటెద్దుబండి కొంటానన్నారు.

సోమ:—ఓంటెద్దుబండీ కొంటారు, రెండెడ్లబండీ కొంటారు. వారు తలుచుకుంటే ఏమిచేయలేరు?

శంకర:—ఏమి సామర్థ్యం! దున్నలబండీ కొంటారు, వారికేం మహారాజులు!

సుబ్బా:—(కొంచెం కోపంగా) దున్నలబండీ?

సోమ:—అంటే, అమ్మాయీ, మీరు హాయిగా ఒంటెద్దుబండిఎక్కి పార్వతీపరమేశ్వరులులాగ తిరుగుతుంటే, వ్యవసాయానికి దున్నలబండి.

సుబ్బా:—పొలాలన్నీ మక్తాకు యిచ్చాను.

సోమ:—చిత్తం. అదే హాయిలెండి

పిచ్చె:—సంబంధము స్థిరపడ్డట్టేగా? తాంబూలాలు పుచ్చుకోండి.

సోమ:—ఇప్పుడేమి? మునుపే స్థిరపడ్డది.

(సోమశాస్తుర్లు, సుబ్బావధాని తాంబూలాలు పుచ్చుకుంటారు).

పిచ్చె:—ముహూర్తం ఎప్పుడు స్థిరపరిచారు?

సోమ:—ఉదయాన్న రామావధానిగారిదగ్గరకు వెళ్లి ముహూర్తంపెట్టించాను. ఎల్లుండి రాత్రి ఒంటిగంటకు చాలదివ్యంగావుంది అన్నాడు.

సుబ్బా:—'శుభస్య శీఘ్రం' అన్నారు. ఎంత తొందరగాఅవుతే అంతమంచిది.

సోమ:—చిత్తం అన్నీ బాగానేవున్నాయి—కాని ఒకటే కొంచెం భయంగావుంది. ఈవూరిలో శారదాబిల్లు హడావుడిగావుంది.

సుబ్బా:—దానికేమి? మావూరిలో చేద్దాం. అచ్చట నన్నేమి చేయలేరు లెండి.

పిచ్చె:—ఆవూరిలో సుబ్బావధానిగారంటే ఎంత పలుకుబడీ! ఎంత గౌరవము! ఎంత శారదాబిల్లు అయినా ఆవూరిలో వారినేమి చేయలేదు.

సోమ:—అంచేతే, అక్కడేచేస్తే ఏయిబ్బందీ వుండదు. అందులో రాత్రి ఒంటిగంటకుకదా ముహూర్తం, ఎవ్వరికే తెలియకుండానే చేయవచ్చు.



మచిలీపట్టణమున లేడీస్ రిక్రియేషను క్లబ్బువారు లేడీ ఎర్స్కిన్ సతికి విందొనర్చిన సందర్భమున సమావేశమైన మహిళామణులు



కుత్తాలం జలపాతము—ఒక దృశ్యము.

పిచ్చే:—పెండ్లిఅయినదాకా ఎవ్వరికి తెలియ కూడదు. తరువాత ఏదన్నా వస్తే నైజాములో చేశా మని చెప్పొచ్చు.

సుబ్బా:—అదీ నిజమే. మామగారూ! ఇదిగో వెయ్యిరూపాయలు. లెక్కించుకోండి. (నోట్లబొత్తి యిస్తాడు).

సోమ:—(సంతోషంతో) చిత్తం! చిత్తం! తమరు లెఖ్ఖలేస్తే మళ్లీ దానికి తిరుగా (నోట్లను లెఖ్ఖలేస్తాడు) సరిగావున్నాయి. మీదగ్గిర పొరపాటు వొస్తుందా?

సుబ్బా:—ఎల్లుండి సాయంకాలం కొంచెం మసగపడ్డతర్వాత మీరందరు వచ్చేయండి. అన్నీ సిద్ధంచేసివుంచుతా.

సోమ:—చిత్తం. అలాగే.

సుబ్బా:—ఇక శెలవిస్తారూ?

సోమ:—చిత్తం.

(అందరులేస్తారు).

పిచ్చే:—సోమశాస్త్రిర్లుగారూ! ఏదో బీద వాడిని. నన్ను మరిచిపోకండి.

సోమ:—అయ్యో! ఎంతమాట! ఇదంతా మీ చలవే!

(సుబ్బావధాని, పిచ్చెయ్యశాస్త్రిర్లు వెళ్లి పోతారు).

శంకర:—నాన్నగారూ! రాత్రి బండికి నేను గుంటూరు వెళ్లాలి. నాపరిక్ష ఏమయిందో కనుక్కోరావాలి.

సోమ:—(నోట్ల బొత్తిని సంతోషంగా కొల్లా గుడ్డను ముడేస్తూ) అలాగే నాయన! వెళ్లిరా.

(తెర పడుతుంది).

## 3.వ రంగము

(రాత్రి 12 గంటలవుతుంది. ఊరంతా నిద్ర పోతుంటుంది. సుబ్బావధాని ఇంట్లో కొంచెము హడావుడిగా వుంటుంది. తలుపులన్నీ బిగించి వుంటాయి. హాల్లో సోమశాస్త్రిర్లు పీటమీద కూర్చుని వుంటాడు, బొడ్లో రవికగుడ్డపెట్టుకోని. సుబ్బావధాని పెండ్లికొడుకై పీటమీద కూర్చొనివుంటాడు. పిచ్చెయ్యశాస్త్రి మంత్రాలు చెప్పుతుంటాడు. ఇంకా యిద్దరు బ్రాహ్మణులు పెళ్లిపెద్దలులాగ ముందు కూర్చొనివుంటారు. శంకరశాస్త్రి గోడకు ఆనుకోని నుంచునివుంటాడు. అతని ముఖంలో కోపం, విచారం కనిపిస్తువుంటవి. పక్కగదిలో శకుంతల పెండ్లి కూతురై కూర్చొని దుఃఖము పొరలి, పొరలి వస్తాంటే పమిటచెంగుతో కన్నులు తుడుచు కుంటూవుంటుంది. సుబ్బావధాని పక్కన రూపా యలమూట వుంటుంది).

సోమ:—శాస్త్రిర్లుగారూ! మెల్లగా చదవాలి మంత్రాలు. ఈకార్యం ఎవ్వరికీ తెలియకుండా అయి పోవాలి.

పిచ్చే:—చిత్తం.

(మంత్రాలు మెల్లగా చదువుతుంటాడు. అంతలో కారు ఆగినమోత వినిపిస్తుంది. వెంటనే బయటినుండి తలుపుమీద గుద్దులు-"తలుపు, తలుపు." అని కేకలు వినిపిస్తాయి).

(లోపల అందరు గాబరాపడతారు. శంకర శాస్త్రి తలుపుతీస్తాడు).

సోమ:—(పిరికితనంగా) ఆ! ఆ! వొద్దు. (ఓ సర్కిల్ యిన్‌స్పెక్టరు, సబ్‌యిన్‌స్పెక్టరు, కానిస్టేబిలు, త్రిమూర్తులులాగ ప్రత్యక్షమవుతారు ఆయుధాలతో. సర్కిల్‌యిన్‌స్పెక్టరు లావుగా, ఎర్రగా, బుర్రమీసాలతో వుంటాడు. సబ్‌యిన్‌స్పెక్టరు వోమాదిరి సన్నగా, ఎర్రగావుంటాడు. మీసాలు, కళ్లజోడు వుంటాయి. కానిస్టేబిలు లావుగా, కొంచెం నల్లగావుంటాడు.)

సర్కిల్‌యిన్‌స్పెక్టరు:—(అధికారంతో) ఎవరదండీ యీపెండ్లి?

సుబ్బా:—(వొణుకుతు) పెండ్లిలేదు.........పెండ్లికి వెళ్లదామని.........తయారు.

సర్కిల్:—ఎక్కడికి ?

సుబ్బా:—నైజాము.

సర్కిల్: —ఏయ్! అబద్ధమాడుతున్నావ్! కబడ్దార్! నిన్నేమిచేస్తానో చూడు. ఇపుడు పెండ్లి యిక్కడ చేసుకుంటూ లేదంటావా ?

సోమ:—(వొణుకుతూ) అయ్యా!......పెండ్లి......కూతురులేదు.........పెండ్లి ఎలా.........యిక్కడ.

సర్కిల్:—(కోపంతో) పెండ్లికూతురులేదూ ? కాన్‌స్టేబిల్ ! ఇల్లంతా వెతుకు. పెండ్లి కూతురుందేమో.

(కాన్‌స్టేబిల్ యిల్లు వెతుకడాని కెళుతాడు).

సుబ్బా:—అయ్యా ! క్షమించాలి......ఏదో తప్పు.........

(కాన్‌స్టేబిల్ గదిలోనుంచి పెండ్లికూతుర్ని తీసుకొస్తాడు).

సర్కిల్:—(కన్నులు ఉఱుముతు) పెండ్లి కూతురు లేదూ (కోటుజేబులోనుండి చిన్నపుస్తకం పెన్సలు తీస్తాడు). మీ పేరు ?

సుబ్బా:—అయ్యా! అయ్యా! క్షమించాలి.

సర్కిల్:—(అధికారంతో) ముందు పేరుచెప్పు.

సుబ్బా:—సుబ్బావధాని.

సర్కిల్:—పెండ్లికుమారు లన్నమాట. సరే. మీ పేరు ?

సోమ:—సోమశాస్త్రిర్లు.

సర్కిల్:—పెండ్లికూతురు తండ్రికదూ ?

సోమ:—చిత్తం.

సర్కిల్:—మీ పేరు ?

శంకర:—శంకరశాస్త్రి.

సర్కిల్:—పెండ్లికూతురికి ఏమవుతారు ?

శంకర:—అన్న.

సర్కిల్:—అమ్మాయీ ! నీపేరు ?

శకుం:—శకుంతల.

సర్కిల్:—మీ పేరు ?

పిచ్చి:—పిచ్చెయ్యశాస్త్రిర్లు.

సర్కిల్:—సరే! పురోహితులన్నమాట. మీ పేరు?

1 వ బ్రాహ్మణుడు:—వెంటయ్యశాస్త్రి.

సర్కి:—నీకేం సంబంధము యిక్కడ ?

1 వ బ్రా:—సంభావన కొచ్చేము, మేమిద్దరం.

సర్కిల్:—మీ పేరు ?

2 వ బ్రాహ్మణుడు:—విరోచనశాస్త్రి.

సర్కిల్:—(వొచ్చేనవ్వు అపుకుంటూ) విరోచన శాస్త్రి ! అదేమి పేరయ్యా ?

2 వ బ్రా:—పిల్లలు బతక్కపోతుంటే మావాళ్లు యిలా పిలుస్తున్నారు.

సర్కిల్:—మీతప్పులకు శిక్ష తెలుసా ? శారదా బిల్లు అతిక్రమించినందుకు పెండ్లికొడుక్కి రెండువేల రూపాయలు జులమానా, ఆరునెల్లు ఖయిదు, పెండ్లి కూతురుతండ్రికి వెయ్యిరూపాయలు జులమానా, నాల్గునెలలు ఖయిదు. పెండ్లికూతురుకు పెండ్లి చేయించే బ్రాహ్మడికి మూడునెల్లు ఖయిదు.

(సోమశాస్త్రిర్లుకి, సుబ్బావధానికి, పిచ్చెయ్య శాస్త్రికి వొణుకుడు జాస్తి అవుతుంది. దిక్కు మొఖము వేస్తారు.)

సోమ:—అయ్యా ! చెంపలేసుకుంటూ. బుద్ధి తక్కువైంది.

సర్కిల్:—మీరు పిల్ల నమ్ముతున్నారుట. ఈ నేరమునకు మీకు రెండువేలు జులమానా, రెండు ఏండ్లు ఖయిదు. పెండ్లికొడుకు కొంటున్నాడు కాబట్టి వెయ్యిరూపాయలు జులమానా, ఆరునెల్లు ఖయిదు.

సుబ్బా:—అయ్యా! మీరు దేముళ్లు దయ తలచాలి.

సర్కిల్:—(పై మాటలు వినుపించుకోకుండా) తాతాబిల్లుప్రకారం పెండ్లికొడిక్కి 4 సం. కఠినశిక్ష.

సుబ్బా:—(ఆశ్చర్యంతో) తాతాబిల్లుఏమిటి?

సర్కిల్:—ఈబిల్లు మొన్ననేవొచ్చింది అమలులోకి. తాతలు, అంటే మీబోటివృద్ధులు చిన్నపిల్లలను పెండ్లి చేసుకోకూడదు; చేసుకొంటే 4 సం. కఠినశిక్ష.

సోమ:—అయ్యా! మేమెప్పుడూ వినలేదే!

సర్కిల్:—విన్న శారదాబిల్లు అతిక్రమించారు. ఇక అది వినలేదు. రేపు కోర్టులో బోనుఎక్కితే అన్నీ వింటారు.

సుబ్బా:—(వొణుక్కుంటూ వొచ్చి సర్కిల్ యిన్స్పెక్టరు రెండుచేతులూపట్టుకొని) అయ్యా! క్షమించాలి. బతిమాలుతున్నా. ఇవి చేతులుకావు. కాళ్లు.

సర్కిల్:—(చేతులు విదలించి) కాన్స్టేబిల్ ఈయన్ని అవతలకు లాగు.

సోమ:—మేము ఏమిచెప్పినా వొప్పుకోవటంలా అబ్బాయీ! నువ్వన్నా యింగ్లీషులో మాట్లాడరా చదువుకున్నవాళ్లు మీఅందరు ఒకటి.

సర్కిల్:—నేనుమాట్లాడేది తెనుగే! మీరు తెనుగులో చెప్పతే నాకు అర్థం అవుతుంది.

శంకర:—(సుబ్బావధాన్ని పక్కకు తీసుకోపోయి మెల్లగా) అవధానులుగారూ! పోలీసువారికి మాటలుచెప్పడే లాభంలేదు. ఆరూపాయలమాట వారిచేతిలోపెట్టి క్షమించమని కోరండి. కొంచెం అయినా పని అవుతుంది.

సుబ్బా:—సరే! (ఊడిపోతున్న బిళ్లగోచీని చిక్కిరిబిక్కిరిగా దోపుకోని, రూపాయలమూట సర్కిల్ యిన్స్పెక్టరు చేతిలోపెట్టి) అయ్యా! ఇన్స్పెక్టరుగారూ! ఈ మూడువేల రూపాయలను గ్రహించి నన్ను ఎలాగో అలా ఒడ్డుచేర్చండి. పరువు మర్యాద పోగొట్టుకొని ఖైదిలోపడి మాలకూడు తినలేను.

సర్కిల్:—అబ్బె! అబ్బె! ఇదేమిటి అయ్యా! నేనెప్పుడూ తీసుకోను యిలాంటిది.

సుబ్బా:—అయ్యా! మీరు అలాఅంటే లాభం లేదు. దయతలచాలి. అసలు యీపాడుపెండ్లి ఒద్దు అంటూవుంటే యీ పిచ్చెయ్యశాస్త్రి చేశాడు యిదంతా. లేకపోతే నాబ్రతుక్కితోడు పెండ్లేమిటి కాటికి కాళ్లు జాచుకున్న నాకు?

సర్కిల్:—మరి ఎందుకు చేసుకున్నావ్?

సుబ్బా:—ఎదో పిల్లనిస్తానంటే చేసుకుందామని బుద్ధిపుట్టింది, పెండ్లాం అనేదివుంటే మంచిది కదా అని; వంటఅన్నా చేసిపెట్టుతుంది.

సర్కిల్:—(కోపంగా) చూడు, శాస్త్రిర్లూ! ఇన్నేళ్లువొచ్చాయి, బుద్ధిలేదూ? ఆ చిన్నపిల్లను నాశనంచేస్తానికి నీమనసు ఎలావొప్పింది?

సుబ్బా:—బుద్ధివొచ్చింది (చెంపలేసుకుంటాడు) ఈజన్మలో యిలాంటిపని ఎప్పుడూ చెయ్యను.

సర్కిల్:—సోమశాస్త్రిర్లుగారూ! మీవిషయం ఏమిటి?

సోమ:—అయ్యా! క్షమించాలి. నేనూయిస్తాను డబ్బు...యింటిదగ్గర వుంది.

సర్కిల్:—అసలు చేసిందిఅంతా నువ్వు. నీమీద యిపుడు రొండుకేసులున్నాయి. పిల్లను అమ్మటం, ఒకటి, శారదాబిల్లును అతిక్రమించటం రొండు.

సోమ:—(బిక్కముఖంవేసి చేతులు నలుపుకుంటూ) అయ్యా! నన్నుకూడ క్షమించాలి. బుద్ధివొచ్చింది. మీరేమిచెయ్యమని శెలవిస్తే అది చేయడానికి సిద్ధంగా వున్నా.

సర్కిల్:—అలావుతే ఒకటిచెయ్యండి—(సబ్ యిన్‌స్పెక్టర్ని చూపుతూ) వీరు పోలీసు సబ్ యిన్‌స్పెక్టరుగారు. వైదికులే. ఈముహూర్తానికే మీ అమ్మాయిని యీయనకిచ్చి పెండ్లిచేయండి. కేసు అంతా రద్దుచేయిస్తాను.

సోమ:—(తెల్లముఖంవేసి) చి... త్రం!

సర్కిల్:—అందరికీ యిష్టమవుతేనే చేద్దాం సుమా! ఏమండీ శంకరశాస్త్రిగారూ! మీకిష్టమేనా?

శంకర:—మిక్కిలి యిష్టం.

సర్కిల్:—శకుంతలా! నీకో?

శకు:—ఆ!

సర్కిల్:—సబ్ యిన్‌స్పెక్టరుగారూ! మీకు?

సబ్ యిన్:—బహుయిష్టం.

సర్కిల్:—ఏమండీ సుబ్బావధానులుగారూ! మీఉద్దేశ్యమేమి?

సుబ్బా:—(చేతులు నలుపుకుంటూ) అయ్యా! అయ్యా! తమరిమాటకడ్డా?

సర్కిల్:—సోమశాస్త్రిగ్లుగారూ! అందరికీ యిష్టమే. ఇక కార్యం జరపండి.

సోమ:—చిత్రం.

(సోమశాస్త్రుర్లు కొత్తబట్టలు సబ్ యిన్‌స్పెక్టరికి యిస్తాడు. సబ్ యిన్‌స్పెక్టరు డ్రస్సుయిప్పి ధోవతి కట్టుకొని ఓ ఉత్తరీయం కప్పుకొని, ఓ ఉత్తరీయం తలగుడ్డ చుట్టుకుంటాడు. పిచ్చయ్యశాస్త్రి అతనిని పెండ్లికొడుకుచేసి పీటమీద కూర్చొపెడతాడు. సర్కిల్ యిన్‌స్పెక్టరు, కానిస్టేబిలుకూడ డ్రస్సులు విప్పుకొని మామూలుబట్టలు ధరించి పెండ్లిపెద్దలులాగ కూర్చుంటారు ముందు. పిచ్చయ్యశాస్త్రి మంత్రాలు మొదలుపెడతాడు. తెల్లవారేటప్పటికి పెండ్లిఅంతా అయిపోతుంది. ఊళ్లోజనం చాలమంది వొచ్చి చూస్తుంటారు.)

సర్కిల్:—సబ్ యిన్‌స్పెక్టరుగరూ! (నవ్వుతూ కన్ను ఎగరవేస్తాడు. అప్పుడు సబ్ యిన్‌స్పెక్టరు నవ్వుతూ మీసాలు లాగేసుకొని, తలపాగా, కళ్లజోడు తీసేస్తాడు.)

సోమ:—(తెల్లముఖంవేసి ఆశ్చర్యంతో) ఆ! మాకృష్ణశాస్త్రి!

(సర్కిల్ యిన్‌స్పెక్టరు * శంకరశాస్త్రి ఒకరినొకరు చూచుకొని నవ్వుకుంటారు. శకుంతలా కృష్ణశాస్త్రీ దొంగచూపులు చూచుకొని నవ్వుకుంటారు. మిగతావాళ్లంతా తెల్లపోయి చూస్తారు.)

(తెర వాలుతుంది)

---

* సర్కిల్ ఇన్‌స్పెక్టరు, శంకరశాస్త్రి ఒకబళ్లో చదువుకున్నవారు.

# హరిశ్చంద్రలోని యాధ్యాత్మికము—

—శ్రీమతి యీరుగుల రాధాకామేశ్వరమ్మగారు

సత్యహరిశ్చంద్రీయ నాటకరచయిత బలిజేపల్లి లక్ష్మీకాంతకవివర్యులు. ఈ నాటకమాంధ్రనాటకములలో సుప్రసిద్ధము. దీనిని పలువురు నటశేఖరులు పలువిధములుగ స్వీయనటనాకౌశలముచే ప్రదర్శించుచుండిరి. ప్రదర్శనములను చూచుటవలనను, దానిని పలుమారు పఠించుటవలనను, విమర్శనాగ్రేసరుల రచనాకౌశలమును బట్టియు, దానియందు కొంత యాధ్యాత్మికౌన్నత్య మున్నదని తోచుచున్నయది.

కథాసందర్భమునుబట్టిచూడ సత్యహరిశ్చంద్రుఁడు దినకరకులసంజాతుఁడగు సుక్షత్రియుఁడనియు, ఉదాత్తగుణసమలంకృత రాజశేఖరుఁడనియు సత్యశీలుఁడనియు తెల్లము.

ఇంద్రసభయందు సత్యవ్రతప్రశంసావసరమున తత్పురోహితుఁడగు వసిష్ఠమహర్షి హరిశ్చంద్రుడనియే నొక్కివక్కాణించెను. కాగా పూర్వమునుండియు నెలకొనిన విరోధమును దీర్చుకొనుటకు విశ్వామిత్రుఁడు వసిష్ఠునివాదము నంతను పూర్వపక్షముగావింప, పరస్పరము శపథములగావించిరి.

పిమ్మట నక్షత్రక, మతంగకన్య, కార్చిచ్చు మొదలగు ననేక మాయోపాయములచే హరిశ్చంద్రునియొక్క సత్యవ్రతమునకు భంగము రాజొచ్చెను. కాని సత్యాగ్రహియగుటచే నాలుబిడ్డల నమ్మి, రాజ్యభ్రష్టుడై, కాటికాపరియై తుదకు సర్వసంపదలను ఉమామహేశ్వరానుగ్రహముచేపొంద కలిగెనని సామాన్యముగ నాటకవస్తువు తెల్లమగుచున్నది.

ఇట్టియెడ కొందరిమతమున సత్యవ్రతము నెగ్గించుకొను పెంకితనములో "ఏకాతపత్రం జగతఃప్రభుత్వం నవంవయః కాంతమిదం వపుశ్చ — అల్పస్య హేతో ర్బహుహాతు మిచ్ఛన్ విచారమూఢఃప్రతిభాసిమేత్వమ్" అన్నట్లు లౌకికమర్యాదల సమర్థించుకొనుటకేయనియూహ. సామ్రాజ్యమును దారాపుత్రాదులను వదలుట వెఱ్ఱితనమనియు మరియొక యూహ. కథాంతమున త్రిమూర్తులువచ్చి మానవవ్యవహారముల పరిష్కరించుట నాటకకవుల బుద్ధిమాంద్యమనియు మరియొకమతాంతరము.

విచారింప కథలోని యవస్థలను, భంగపాటులను దశావిపర్యయములను లౌకికార్థమున మన్నింపనిచో చరమావస్థయందు లభించిన త్రిమూర్తిసందర్శనము మోక్షప్రాప్తికి నిదానమని తెల్లము. విష్ణుమూర్తి

వైరాగ్యప్రదాత; అట్లే పరమపితయగు పశుపతి అష్టైశ్వర్యప్రదాత; పరమేష్ఠి సాత్వికమైన బ్రహ్మానందప్రదాత.

త్రిమూర్తులలో నేయొకరో ప్రత్యక్షమైనచో నేదో యొకేరకపు సంపద వాటిల్లి యుండెడిది. అట్లుకాక త్రిమూర్తిసందర్శన మేకకాలమున కలుగుటవలన సచ్చిదానంద స్వరూపము సాక్షాత్కరింపబడెను. దీనివలన గుణత్రయసంకల్ప మొదవి కైవల్యప్రాప్తి కలిగె ననవచ్చును. (త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున, నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమఆత్మవాన్) అని కృష్ణభగవానుడు చెప్పినట్లు ఇట్టి మానసిక శిక్షయే కైవల్యప్రాప్తికి హేతువు.

హరిశ్చంద్రునకు కథాంతమున కల్గినది రాజ్యప్రాప్తియు దారాపుత్రసంయోగమును కాదు. అతికఠినములగు సత్యాగ్రహపరీక్షా పరంపరల కాలవాలమగు హరిశ్చంద్రునకు సుఖపరంపరలయందు నిరీహయే కాని సక్తి యున్న దనుట హేయము. ఉన్నను, "నళినీదళమంభసా" అన్నట్లే యుండనగును. కావుననే షేక్స్పియర్ మహాకవి నిత్యసుఖ మీ జీవితమున లేదనియే కాబోలు నాటకమున కథానాయకులను, ఇట్టి సందర్భములయెడ విషాదాంత మొనర్చెను. ఇదికాక పాశ్చాత్యనాటకములు సామాన్యముగ విషాదాంతముగనే నిర్మింపబడుట మఱియొక నిదానము. భారతీయ నాటకములలో నాయకులు కష్టపరంపరల ననుభవించి తురీయాశ్రమ పద్ధతుల నాశ్రయింతురు. కావున హరిశ్చంద్రునకు లభించినది బ్రహ్మానందోపలబ్ధి (మోక్షము).

ఇట్టి యానందోపలబ్ధిని భారతీయులు తపస్సువలన సాధించిన ట్లగుపడుచున్నది— తపస్సనగా మంత్రపునశ్చరణము కాదు; శిష్టవేషధారణము కాదు; "సత్యం తపశ్శాంతం తపః ఋతం తపశ్శమ స్తపః దానం తపోదమ స్తపః" అను సూక్తి ననుష్ఠించి హరిశ్చంద్రచక్రవర్తి యాదర్శభూతుండాయెను. ధనదారపుత్రాత్మక మగు నీషణ త్రయమును పరిత్యజించి త్యాగముయొక్క స్వస్వరూపమును వెల్లడి చేసెను. మానవుల కర్మబద్ధుల గావించు నీషణత్రయమును జయించుటచే సుఖదుఃఖసమీకరణముచే నియతకర్మానుష్ఠానముచే హరిశ్చంద్రుని సత్యతపస్సు మోక్షదాయకమైనదే కాని "నే నబద్ధమాడను" అను ప్రతిజ్ఞతో ప్రాకులాడు మొండిపట్టుదల కానేరదు. అట్లైనచో సత్యవ్రతముకూడ రాజసంకల్పములలో నొకటియగును.

హరిశ్చంద్రనాటకపు పరమావధి రాజసంకల్పమైన సత్యసంరక్షణముకాదనియు, నిర్గుణమైన మోక్షోపలబ్ధియనియు, రాజ్యదానము దారాపుత్రవిక్రయము మున్నగు నవస్థలు కాలవశమున నేర్పడ్డ యిక్కట్టులు కావనియు, ఈషణత్రయమును జయించు యోగసాధనములనియు చెప్పుట న్యాయసమ్మతము.

శిబి, రంతిదేవ, బలి, కర్ణాదులు దాన తపస్సుచే మోక్షమునుసాధించినట్లు సత్య హరిశ్చంద్రుఁడుసత్యతపస్సుచే సంసారవారిధి తరించి త్రిమూర్త్యాత్మకమగు నిర్గుణబ్రహ్మ సాక్షాత్కారము పొందెననియు చెప్ప నగును. ఇట్లే ఇరువదవ శతాబ్దియందై మనకుసమకాలికుఁడగు మహాత్మాగాంధీజీ యొక్క పవిత్రజీవితాదర్శములు కూడ హరిశ్చంద్రుని సత్యయోగమునే చాలవరకు సరిపోలునని చెప్పనగునేమో. కావుననే దేశముకొరకు సత్యాగ్రహమును ప్రతిష్ఠించెను. ఈతఁడు ఈషణత్రయముకూడ నట్లే జయించినమహాధీరుఁడు సర్వస్వ మర్పించిన మహాయోగి; విమలచేతస్కుఁడు; రాజకీయాధ్యాత్మికసమన్వ యజ్ఞానధురంధరుఁడు. ధన్యుఁడు, ధన్యతముఁడు.

---

## జిజాబాయి సందేశము

గోనెల నరసింగరావుగారు ఎం. ఏ.

సంకెలలన్ దగుల్కొని విషాదభరమ్మున గ్రుంగిపోవుచున్
బంకిలసంకులంబయిన భారతధారుణిలోన బూర్వ ధ
ర్మాంకురముల్ పునర్భవమునంది విరాజిలునట్లుజేయఁగా
గంకణ మీవుదాల్చుము జగమ్మున నీ శివనామమొప్పఁగన్.

ఎదిరిబలంబు నీ బలము నేర్పడ నేర్పుఁగనిశ్చయించి, యె
య్యదనున కెద్ది ప్రస్తుతము యయ్యదిపాటుయొనర్చి, శత్రుసం
పద బహిరంగలీలఁగొన వాటముగానియెడన్ మరాటిపీ
రదళముఁగూర్చి డీకొని దురంబొనరింపుము కొండకోనలన్.

చింబోతుల్బలె శత్రుసేనలు శివాజీ! నిన్ను డీకొన్న, వా
జం బింకంబును, సింగపుంగొదమవాసిం జూపువేళాయె;వి
శ్వం,బోహో! యన సర్వశత్రునిచయవ్యాపారనోద్యోగివై
యంబాదత్తకృపాణపాణివయి లెమ్మా నీకుఁగళ్యాణమౌ.

అల హరిశ్చంద్రు దీవ్యత్సత్యసంధత ప్రాచ్యజాతీయతత్త్వముగఁబొదల
రామచంద్రు నసిధారావ్రతప్రౌఢిమ నిత్యనూతనముగా నివ్వటిల్లఁ

# గృహలక్ష్మి

కృష్ణదేవుని మహోత్కృష్టగీతామృతా భంగురాభంగసంపద చెలంగ
రాణాప్రతాపు దుర్వార శౌర్యస్థైర్య విభవ మింకొక మాఱువిస్ఫురింపఁ
బరులు నీమాతృభూమి కుపద్రవములు, సలుపకుండఁగ విశ్వమ్ముసన్నుతింప
నంచితాదర్శ పురుషుండ వగుచునెగడి, ఛత్రపతి వీవెయన్న యశంబుగొనుము.

నీతో ప్రాణముప్రాణమై మెలఁగుచున్ నీకై స్వసౌఖ్యంబు సం
ప్రీతిన్ గాన్కయొసంగి, నిన్నధిపునిన్, మిత్రోత్తమున్, భారత
స్వాతంత్ర్యప్రతిపాదనోజ్జ్వలితదీక్షాదక్షు సుక్షత్రియున్
బూతస్వాంతతఁగొల్చు శూరతతినే పోషింపు మశ్రాంతమున్.

భారతజాతిజీవితము బ్రాహ్మణులందున, గోవులందు వి
స్ఫారతనొందుచున్నది; కృపాపరతంత్రతఁగావుమయ్య! దో
స్సారముబీరమున్ నెఱపి; సజ్జనసౌఖ్యకరుండవౌచు, నీ
కీరితివెన్నెలన్ జగమొగిన్ దులకింపఁగ నిన్ నుతింపఁగన్.

వాఁడిమిసూపకయ్య పగవారలపైదలు లెన్నఁడేని నీ
దాడులకగ్గమైన; భరతక్షితిధర్మము నెంచి, తల్లులున్
దోడులుగాఁదలంచి, పరితోషమువారలకున్ ఘటించి మా
యాఁడుఁదనంపుఁబెంపు నుఱుమాడక ప్రోదియొనర్పుమా సుతా!

రోదసిప్రవస్నె ననాథుల, రోదన నిర్హ్రాదపటలరూక్షత; నెట్లీ
వాదుకొని కస్తివాపెదొ, భూదయితుల కిద్ది ధర్మముఖ్యముసుమ్మా.

అమ్మలనెల్లగన్నజగదంబ, భవాని శివాజిపేర ని
త్యమ్ముఁజెలంగుచున్న భవదాత్మకు నిస్తులసౌఖ్యమున్, ప్రభు
త్వము, వివేకభాగ్యముఁ, గృపార్ద్రమనీషయు, ధర్మకాంక్ష, వే
ఱమ్ములప్రోవు హర్షసముదగ్రతనీకు ననుగ్రహించుతన్!

# మగనిచెవిలో (సంసారం గురించి)

'అనసూయ'

చూశేరా ! లోకంలో యేమీ లేందే యెలాగు పుట్టిస్తారో ! మొనిరుడు శివరావు అను బ్యాంకు సూపరునైజరు పోయేడుగదూ ! అతడియిల్లు మనకు చేరువ మూరెడు మేర. అతనిభార్య రమణమ్మ రోజూ నాదగ్గరకు వస్తూఉండేది. రోజూ నేనూ దానిదగ్గరకు వెళుతూ ఉండేదానిని; అలాగు మాయిద్దరికీ స్నేహం కలిసిపోయింది. పాపము ! దానిమొగుడికి వారం రోజులుమాత్రం జబ్బుచేసి పక్షి యెగిరిపోయినట్లు ఎగిరిపోయేడు. వాళ్లిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు చిలుకా గోరింకాల్లాగు ! చూస్తే ముచ్చట వేసేది. ఎప్పుడూ నవ్వుతాలేగాని విచారమన్నమాట వాళ్లవద్ద కనపడేది కాదు. హఠాత్తుగా పిడుగుపడ్డట్లు అతనికి మరణము సంభవించినది. రమణమ్మగోల భూమీ ఆకాశమూ పట్టలేదుగదా ! తరువాత అది పుట్టింటికి వెళ్లిపోయింది. అచ్చట అది తోటలలోనూ దొడ్లలోనూ షోకుగా షికారువెళుతూ ఉన్నదనీ, చీర రవికె కట్టుకొని సోపులూ పౌడర్లూ రాసుకొని ముస్తాబుగా తిరుగుతూ ఉంటుందనీ, విధవావివాహం చేసుకోడానికి ప్రయత్నం చేస్తూ ఉన్నదనీ ఈమోస్తరుగా యిచ్చట బుకార్లు బుట్టించేరు ! పుట్టించినవాళ్లు ఏపాపాన్ని పోతారోగాని అదంతా అబద్ధమేసుమండీ ! ఇవి కిట్టక పనిలేని ఆడవాళ్లు కల్పించిన బుకార్లుగాని మరేమీ కావు. మొన్నువచ్చి ఇచ్చట వాళ్లఅత్తగారింట నాలుగు రోజులు ఉన్నది. అప్పుడు దానిని చూచినానుగదా! నిత్యమూ కంటికీనేలకూ ఏకధారగా ఏడవడముతప్ప దానికి మరొక పనేలేదు ! తనభర్తను తల్చుకోని నిమిషంలేదు ! ఇంటిలోని ప్రతివస్తువును చూడడం, అతనిని జ్ఞాపకం తెచ్చుకోవడం, వాళ్ల పూర్వపు రోజులు స్మరించడం, కళ్లంట నీరుకార్చడం, యీమోస్తరుగా ఎప్పుడుచూచినా భర్తనుగురించే తలచుకొంటూ అన్యచింతలేని దాన్నిగురించి ఈఊరి అమ్మలక్కలు ముఖ్యంగా మీవాళ్లు, పుట్టించిన బుకార్లు వింటే ఎవరికైనా కోపంవస్తుందా రాదా ?

అందులోకీ మీవాళ్లు ఉన్నారే, ఒక బుకారు పుట్టించడానికి అయితేనేమి, పుట్టినది నాల్గుమూలలా అల్లుకోనేటట్లు వ్యాపింపచేయడానికి అయితేనేమి మహానేర్పరులు కదూ ! టెలిఫోనూ వైర్లెస్సూకూడా వారికి తీసిపోతాయి ! అయితే నేరమునకుమాత్రం ఎప్పుడూ దొరకరు ! ఎవళ్లయినా ఏమైనా అని పోతారని తామే ముందుజట్టీకి దారితీసి నేరం ఎదుటివారిమీదనే మోపేస్తారు. మొన్నను మనపొరుగు కృష్ణారావు పెళ్లాంమీద ఏమిటి వేసేరో తెలుసునా? అది పట్టపగలే మగనిచేత కాళ్లు పట్టించుకుంటుందనీ, విసిరించుకుంటుందని బుకార్లు వేసేరు ! అంతేకాకుండా దాన్ని చూసినప్పుడల్లా వీళ్లు ఏదోమిషమీద 'మొగుడిచేత కాళ్లు పట్టించుకొనేవాళ్లు' అని మాటల సందర్భములో చీటికిమాటికి దొర్లిస్తూ ఉండడము ఒకళ్లనుచూచి ఒకళ్లు నవ్వుకుంటూ ఉండడమూ, యీమోస్తరుగా చేస్తున్నారు. చూసిచూసి కృష్ణారావుపెళ్లాం నాతో యేమన్నదో తెలుసునా ? "యమలోకం అన్నది ఉన్నదో లేదో అని అనుమానం అవుసరములేదు; వీళ్లిద్దరూ చనిపోయిన తర్వాత వెళ్లేదే యమలోకం" అని అన్నాది. "ఈలాంటి అత్తగారితోనూ ఆడబొట్టెతోనూ యెలాగు వేగుచున్నావే" అని నాగురించి ఆశ్చర్యపడ్డది. అది మీఅమ్మా అప్పా సంగతే చూసిందిగాని మీసంగతికూడా చూడలేదు. మీముగ్గురిసంగతీ నిదానంగా కనిపెట్టిచూస్తే, నేను పడుతూఉన్న బాధలూ, నామనస్సులోని ఖేదమూ, నేను చూపుతున్న ఓర్మీ ఇవన్నీ కొంచెం గమనిస్తే, ఇది నిజంగా సీతాసావిత్రీ అలాంటి అమానుషమైన ఓర్మీ, శక్తి గలదిగాని మామూలుది కాదని ఎవరికైనా తోచకమానదు !

'నామీదకూడా ఏమిటా విసుర్లు?'

అననా? అనక మానేస్తానా? మీగురించి కొంచెం ఆగి ఆలోచించుకోండి! అప్పుడు నేనన్నవి నిజమో కావో బోధపడుతుంది! మీరు ఊరునిండా అప్పులు చేసేస్తున్నారట! నాకు తెలియకపోలేదు! మొన్నను కాఫీహోటేలువాడు రెండుమూడుమార్లు వచ్చేడు; వాడిని మీఅమ్మగారు ఎందుకువచ్చేవని అడిగేరుగాని వాడు మీపరువు నిలబెట్టేడు; ఏదో కేసుపనిఉన్నదని చెప్పి వెళ్లిపోయినాడు. ఇంటి అద్దెబాకీ దీనితో నాలుగునెలలది యివ్వాలిగదా! పనిఉన్న లేక పోయినా ప్రతీప్లీడరుతోపాటు ఇద్దరు గుమాస్తాలు; వాళ్లకు నెలాతిరిగి వచ్చేసరికి ఫ్లేటుమీద పెట్టినట్లు జీతాలు యిచ్చుకోక తప్పదుగదా! ఇక బంట్రోతు కాపవాళ్లు, నూనెవాళ్లు, నేతివాళ్లు, పాలవాళ్లు వాళ్ల సంగతి చెప్పఅక్కర్లేదు. ఇలాగు యిన్నిఖర్చులు అవుతూనే ఉంటాయి! నేనుమాత్రం అల్లా పాత చీరెలు మూడింటితోనూ యేడాదినుండీ కాలక్షేపము చేస్తున్నానుగాని కొత్తది కొనడానికి మీకు ఎప్పటి కప్పుడే ఏదో ఒకకొంప మునిగిపోయినంత ఆటంకం, ఇబ్బంది. ఇలాగు అప్పులుఅయిపోతూ, ఖర్చుకు ఎత్తా ముతీగా ఉన్నా మీకు చీమకుట్టినట్లేనా ఉండకుండా, మీరు నావలుపట్టుకొని యిలాగు కాలక్షేపము చేసి వేయడమో—లేకపోతే పేకాటలో, బాతాఖానీలో, ఏమొక్కకనో, పువ్వుకనో, ఏగుమ్మిడిపళ్లకో, పనస పళ్లకో, ఏబాలుకనో, టీపార్టీకనో, ఏనాటకో, పాటకో, ఏవూరికో, ఎవరిదగ్గిరకో, చెప్పకుండా చెయ్యకుండా పారిపోవడమో—గాని మీకు మీవృత్తిమీద పిసరంతైనా లక్ష్యమువున్నట్లు కనబడదుగదా! ధనతృష్ణ ఉండి దానికి తగినఓపిక లేకపోతే కార్యమేమిటి? చూడండీ మనయింటియెదుట అల్లా మచ్చులప్లీడరు! రైలువచ్చిమాటుమణిగేదాకా పెట్రోలులైటువెలిగించి అలాగు పురుగులకోసం బల్లిలాగు కాచి కూర్చుంటాడు! వీధిలో పాక్షిలాంటివాడు ఎవడైనా వెళుతూఉంటే వాడిని పలకరించక మానడుగదా! పట్నాయుడుని చూస్తే బంధువును చూసినట్లే సంతోషం! ఎక్కడ రూపాయిలు చప్పుడైనా యింట్లోంచి పైకివెళ్లిపోవచ్చి నిలబడి తదేకదీక్షతో చూస్తాడు! పార్టీలతో అతి నెమ్మదిగా అతి ఆప్యాయంగా మాట్లాడతాడు! మొన్నను మీగుమాస్తాని అడుగుకురా! ఎవళ్లో గోచీలుకట్టుకొన్న కూరాకులపార్టీలు మనయింటికి వచ్చేరు; మీరులేరనివిని వెళ్లిపోయినారు. వాళ్లని యీ మచ్చులప్లీడరుగారి గుమాస్తా రమ్మని తీసుకెళితే ఆప్లీడరుగారు వాళ్లని గుమ్మంలోనే యెదుర్కొని తీసికెళ్లి కుర్చీలమీద కూర్చోపెట్టేడండీ! సర్కసులో కోతులు కుర్చీలమీద కూచుంటే ఎలాగుంటాయో వాళ్లు కుర్చీలమీద కూర్చొని అలాగేఉన్నారు! అలాగుచేస్తే ఏమైనా డబ్బొయేగాణీ దొరుకుతుంది కాని మీలాగు విస్సాటమూ నిర్లక్ష్యమూ ఉంటే ఈవృత్తిలో ఏమిటిలాభము? పోనీయండి! నేను మొదటినుండీ మీకు చెవిలో యిల్లుకట్టుకొని శత పోరేనా లేదా చెప్పండి! ఏదో మేష్టరుపనికిగాని మరేదైనా పనికిగాని చదివియ్యండి! నెలకు నూరైనా రాకపోవు! దానితో ఎలాగో కాలక్షేపము చేసి వేయవచ్చును. ఈప్లీడరుపనిలాగు వొడుదొడుకులు ఉండవు, నిత్యదరిద్రం ఉండదు, కడుపులో చల్ల కదలకుండా జీతం ముట్టిపోతూ ఉంటుంది, గౌరవంగా కాలక్షేపానికి లోటుండదు, అని నేనంటే, "మాష్టరునీ మంగలాడినీ చూసేవాడెవడు? ఎక్కడి కేనా వెళుతూవున్నప్పుడు ఎదురుగుండావస్తే తిట్లు తినడంతప్ప వాళ్లకు గౌరవమేమిటి? నాపీకపోయినా ప్లీడరీకి చదవక మాన"నన్నారు! చదివేసేరు! ఏమిటి లాభం! ఇలాగు ఎలకలలాగు మాడిపోతున్నాము! ఇలాగు మరికొన్నిరోజులుంటే మనము వీధి యెక్కవలసినదే! మీఅమ్మగారిడబ్బూ, అప్పగారిడబ్బూ పాము పడగెత్తికాస్తూఉన్న ధనంలాంటివే! ఆఆశ కలలోనుకూడా లేదుగదా! మీవృత్తిలో రాబడికి

నీతీ నిలకడా లేదు. డబ్బు లావుగా ఉన్నట్లే ఉంటుంది. ఏమండీ! ఇదంతా మనదేనా అంటే, ఎప్పుడూ స్టాంపులసొమ్మో, పార్టీలసొమ్మో, నకళ్లసొమ్మో అనే చెప్తూ ఉంటారు. డబ్బు ఉండికూడా దరిద్రం సముద్రం అంతా ఉండి దాహానికి ఒకచుక్క కూడా లేనట్లుంది. ఏమైనా రాబడి వస్తుందో రాదో తెలియదు. ఎంతవస్తుందో తెలియదు ఎప్పుడు వస్తుందో తెలియదు. ఈరోజున నాలుగురాళ్లు వచ్చేయని మిన్నందుకుంటే రేపు కాణీఅయినా కళ్లపడదేమోనని కూపములో క్రుంగిపోవడమేగదా! ఎందుకీ ఎగుడు దిగుడుల బ్రతుకు? నిలకడగా ఎంతో కొంతవస్తే చచ్చీచెడీ దానిలో నేయిమిడి సంసారం పోషించుకో వచ్చును. దీనికో! దీనికి అలాగు కాదుగదా! అనవసరమైన వేషభాషలు, డాబుదర్పాలు, పైనిపటారం, లోపల లొటారం! ఏదిలేకపోయినా వేగనట్లుంటుంది. ఇవన్నీ ఎలాగో సర్దుకోనేసరికి కాళ్లు పీకిపోతాయి. ఆఖరికి పెళ్లానికి గుడ్డముక్క కొనడానికి గాని పిల్లలికి బడిపుస్తకాలు కొనడానికిగాని ఇబ్బంది పడకుండా రోజులు వెళ్లకుండా వున్నవి. పట్టాస్టాంపుకి బదులువాడితే మరి ప్రాక్టీసు యేమిటి? చూడండీ! ఆ సబురిజిస్ట్రారులని వస్తారు! అంతచచ్చువాళ్లు మరి ఉండరుగదా! వాళ్లకి ఎంత చేతకానివాడికైనా జీతం కాక రోజుకి పది, పదిహేను రూపాయలు సునాయాసంగా దొరుకుతాయట! వాడికి దస్తాలా బంట్రోతు, పెట్టే, బేడా, వేషం, దర్జా అన్నీ ఉంటాయి! కాని ఖర్చు స్వల్పం! ఏవీధికొసనో ఒకమారుమూల యింట్లో ఒకభాగం పుచ్చుకొని రాతికింద కప్పలాగు కాలక్షేపం చేసివేస్తాడు! ఆఖరికి పింఛనీకూడా వస్తుంది! కాలుమీద కాలేసుకొని తినవచ్చును! మీకు అలాగు కాదే! ఆఖరిదాకా అయ్యన్నపంతులులాగు కాళ్లీడ్చుకుంటూ వెళ్లవలసినదేగాని మానేస్తే మానీడమేగాని కాణీఅయినా కళ్లపడదుగదా! కాలాడితే గాని కడవాడని బ్రతుకు! అంచేత సర్వేశ్వరుడు సమనుపంపించేవరకూ సాగుతూ ఉండవలసినదే మీ వృత్తిలో! మురారి మూగించడమేగాని తనంతటతాను మానివేయడం ఉండదుగదా! ఇటువంటి మీవృత్తి. మీ రుణాలూ, మీస్థితిగతులూ, అటుపైని యింట్లో నిత్యకలహములూ ఇవన్నీ అనుభవిస్తూ ఇంకా రానున్నవి తలచుకుంటే నాగుండె చెరువైపోతూ ఉంటుంది! ఏదిఎట్లున్నా మీకు కొంచెమైనా శ్రద్ధ లేకపోవడం బాగుంది కాదులెండి! పిల్లలూ, పెళ్లామూ, సంసారమూ వీటియొక్క బాధ్యత మనస్సుకు పట్టించుకోక 'అంటకు ముట్టకు' అన్నట్లు ఎన్నాళ్లేమిటి ఇలాగు తిరుగుతారు? ఎన్నాళ్లేమిటి ఇంకా ఈ పేకాటా గోట్టికాయలాటా ఆడేస్తారు! బుర్ర పండిపోవడం మొదలుపెట్టిందికదా మనస్సెప్పుడేమిటి పక్వం అవుతుంది? ఇంకా ఈచిల్లరఆటలూ చిన్నతనమూ కట్టిపెట్టకుండా ఉంటే, ఎప్పుడేమిటి దీక్షగా డబ్బుఆర్జించి నిలవచేస్తారు! పిల్లలకు చదువులు వున్నాయి, సంధ్యలు ఉన్నాయి, పెళ్లిళ్లు ఉన్నాయి పేరంటకాలు ఉన్నాయి! "పూటభత్యం, ఫుల్లవెలుగూ" అన్నట్లు మీరు కాపురంచేస్తే ఇవన్నీ యెలాగు జరుగుతాయి! పోనీ అందుకడిగా డబ్బున్న మామగారేనా ఉంటే వారియింట్లో సకుటుంబంగా కాలక్షేపంచేసేసి దొరికిన నాలుగురాళ్లు మిగిల్చి వడ్డీకి వేసుకుందా మనుకుందుకి అట్టిఅదృష్టము మనమొగాలకి లేదుగదా! మరయేమిటి సాధనం? దొరికిన ఆయిదారురాళ్లూ జేబులోనే ఉంటాయిగాని పెట్టెలో పెట్టడానికైనా మీకు శ్రద్ధా తీరుబాటూ ఉన్నట్లు కనిపించదు! జేబులోనుంచే అవి కాటు అయిపోవడమో ఖర్చుఅయిపోవడమో జరుగుతుందికాని పెట్టే, తాళమూ ఈఘోషే మీకు అక్కర్లేదుకదా! దీనికి తోడు మీకు ఊరినిండా అప్పులు! ఇలాగు మీరు సంసారంచేస్తూఉంటే నామనస్సును అనునిత్యమూ ఆందోళన కొరుక్కుతింటూ ఉంటుందంటే ఆశ్చర్యమేమిటి? అవును కాని, మీకు వారంవారం వచ్చే పచ్చటి అట్టపుస్తకాలు యిప్పుడు రాలేదేం? కంపెనీ వాడికి బాకీపెట్టేసేరా? బాగుంది! వేలులాగైనా బాకీలులాగైనా మరి బాధలేదన్నట్లుంది మీసంగతి! ఇవన్నీ యెలాగు తీరుస్తారేమిటి? ప్రొద్దున్నలేచి చెప్తారా? ఆహా! మీకు ఎలాగు నిద్రపడుతుందండీ! నాకు కళ్లుమూస్తే అప్పులవాళ్లందరూ యిల్లు చుట్టివేసినట్లనిపిస్తుందికదా! దీనినుండి ఎప్పుడేమిటి విముక్తి?

# గృహలక్ష్మీ తారావళి

రామసుబ్బారాయ వేంకటనారాయణ సోదరకవులు

(స్నేహలతా కవితాసంఘము)

ఉ. సారములేని సంసరణసాగరమే గతియంచు నెంచి నీ
వూరక కాలమంతయు నహో గడుపన్ దలపెట్టఁబోకు, వి
స్తారకభాసుధారసనిదానమునౌ 'గృహలక్ష్మి' పత్రికన్
నేరుపుతోఁ బఠింపు మవనిన్ శుభమయ్యెడు నీకు సోదరీ!

గీ. ఆంధ్రమాతగర్భమ్మున నవతరించు, భాగ్య మొనగూడె మనకు నో పడతులార!
ఆంధ్రభాషాభివృద్ధికై యత్నమూని, యాంధ్ర పత్రిక వెవ్వేళ నరయఁ దగును.

గీ. అతివ! 'గృహలక్ష్మి' పత్రికయన్న స్త్రీల,పాలిఁట గనియంచు వచింపవలయునొక్కొ!
స్త్రీల విద్యాభివృద్ధికై తీర్చఁబడిన, పత్రికను పోషణము సేయవలయు నమ్మ.

గీ. పంపుచుండుము దానికి వ్యాసములను, ముద్దులొల్కెడి జిలిబిలి పద్దెములను
నింతకనుమించు కార్యం బదేదికలదు, ఎల్లవేళల నానంద మొసఁగుచుండు.

గీ. ఇంటఁబనిపాట లన్ని ముగించినంత, గద్యమైనను లేకున్న పద్యమైన
నేదియైనను గృహలక్ష్మి కీయఁదగదె? వ్యర్థముగఁ గాలమును గడుపంగఁ దగునె?

గీ. పేరుమోసిన గృహలక్ష్మి వెలయుకతనఁ, బడయుచుంటిమి కాదె లాభంబు మనము
స్త్రీలకై కంకణంబు ముంజేతఁదాల్చు, నట్టిగృహలక్ష్మి ఋణమెట్లు నెట్టఁగలము?

ఉ. జ్ఞానము గల్గినందులకుఁ గాలము వ్యర్థము సేయఁబోక, యే
దైనవిశేషముల్ వెలయునట్టులఁ దీర్చి వ్యాసరాజముల్
బూనిరచింపుచుండి కడుమోదముతో నభిమానముంచి, య
ద్దానికిఁ బంపుచుండుటలు ధర్మము కాంతలకున్ సఖీమణీ!

ఉ. తొమ్మిదియేండ్లనుండి కడుఁ దోరపుశక్తిని వెల్లడించి, వ్యా
సమ్ములసేకరించి సరసంబగుపద్ధతు లెల్లఁ జూపి, సౌ
ఖ్యమ్ము శుభమ్ము సద్యశము గాంచఁగ స్త్రీలకు పారిజాతమై
యిమ్ముగ దిక్తటంబుల నహీనపుఁ గాంతులఁ జిల్కు లేదొకో!

# గృహలక్ష్మి

ఉ. నీ కొరులేలచెప్పవలె నీకనుదమ్ముల విప్పిచూచినన్
ప్రాకటధర్మ భావములరన్ గృహలక్ష్మిని గానుపింపవో
శ్రీకరమైన వ్యాసములు స్త్రీరచితంబులునై వెలుంగుచున్
నీకిది యన్నిరీతులను నీతికి ఖ్యాతికి మేలుఁ గూర్చెడిన్.

గీ. స్త్రీల కొఱకునై బయలుదేరినది గాన, నిద్ది స్త్రీజనంబులె నిర్వహించు టొప్పు
నొక్క మాసపత్రికకుఁ జేయూతనీయ, కున్న నగుబాటు కాదొకో? యువిదలార!

గీ. ఎట్టి శుభముహూర్తమునందు నిద్ది, 'కేసరి' దయచే లోకమునఁ బ్రచురింపఁబడెనో
నాఁటనుండియుఁ జూడ నీనాఁటవఱకు, భాగ్య సౌభాగ్యములతోడ వరలుచుండె.

గీ. పత్రికను నెలకొల్పుటే భారమగును, నాపయినఁ గవయిత్రుల నాదరించి
మంచి బహుమానములను సమర్పణంబు, సేయుటేలాటి భారమో? చెప్పనేల?

గీ. ఇన్నిరీతుల స్వార్థంబునెంచకుండ, స్త్రీలవిద్యాభివృద్ధికై జీవితము ను
భారవోసెడు 'కేసరి'గారి పుణ్యమింతయని చెప్పశక్యంబె? యెరికైన.

గీ. ఇట్టి డాక్టరు కేసరి కెల్లవేళఁ, జిరతరానంద భాగ్యంబు జెందునట్లు
మీరలెల్లరు పత్రికాభారమంత, నిర్వహించుటే ధర్మమో నెలఁతలార!

ఉ. ఆవలనిట్టి కేసరి కనంతశుభంబులు గల్గునట్లు, ల
క్ష్మీ విభవాయురున్నతులు సేకురునట్లు నిరంతరంబు మో
దావహమైనజీవితము నందెడునట్లు రమాధినాధునిన్
భావనసేసినిచ్చలును బ్రార్థనసేయుట ధర్మమయ్యెడిన్.

ఉ. భారత దేశమందుఁగల భామినులందరు నొక్కటై మహో
దారగుణాతిరేక బలతత్పరులై 'గృహలక్ష్మి' పత్రికా
భారము నిర్వహించునెడ భారతదేశము వైభవంబునం
దారయమించకుండునె సమస్తజగంబులలోన నెచ్చెలీ.

ఉ. కావున నేఁటినుండియు జగంబుననెల్లెడఁ గీర్తిఁగాంచి సు
శ్రీవిభవంబులన్ దొడిగి చెన్నలరారెడు రీతి 'లక్ష్మి'కిన్
జేవఁగలట్టిపద్యములు శీఘ్రమె పంపుమ వ్యాసరాజముల్
భావము పల్లవించునటులన్ లిఖియింపుచు మాసమాసమున్.

# గృహలక్ష్మీ తారావళి

గీ. గృహమునకుశోభఁ దెచ్చెడు గృహిణియంత, కంటె వేయిరెట్లధిక సౌఖ్యంబునిచ్చి,
యిందునందున సత్కీర్తి నెసఁగఁజేయు, నిట్టి 'గృహలక్ష్మి' లేనట్టి గృహమదేల?

గీ. వ్యాసరాజములను వ్రాసిపంపకున్న, నెట్లొ పత్రికనైనఁ గన్నెత్తిచూడు
మన్నయం దరయఁగలవుసుమ్మ తెలివి, గూర్చెడునపూర్వవాక్యముల్ కొన్ని సఖియ!

గీ. కవనమునువ్రాయు శక్తినిఁ గాంచకున్న, పత్రికనయినఁ జూచునభ్యాసమున్నఁ
గాంచు టాశ్చర్యమౌనె? లోకజ్ఞతయును, దాన నచిరకాలమ్మున జ్ఞానమబ్బు.

ఉ. తొమ్మిదియేండ్లనుండి తనతోడమెలంగిన కాంతలందరున్
గమ్మనికైత లల్లుచు జగమ్మునఁ గీర్తినిఁ గాంచరొక్కొ? నీ
వెమ్మెయినైన వారిపథమెంతయుఁబట్టిన లాభమబ్బు, సౌ
ఖ్యమ్మొనఁగూడు నీకుఁ గలకాలము నీ 'గృహలక్ష్మి' బట్టినన్.

గీ. ఆడువాండ్రకుఁ జదువేల యనుచు వ్యర్థ, మనుచు నిరసింపఁబోకుఁడో యన్నలార!
యెంత విద్యాధనంబున్న నంతకెక్కు, డైవరలుగాదె జన్మ ధన్యతనుగాంచి.

గీ. ఎందఱో పేరుగల కవయిత్రులున్న, వారు వారలందఱుమంచి వ్యాసములను
వ్రాసిపంపుచుండినఁదక్క వారుకూడ, వారివలనఁ బ్రోత్సాహమ్ము బడయరొక్కొ?

ఉ. మంచిసతీత్వతత్త్వము సమంచితకీర్తియు భూరిసౌఖ్యముల్
గాంచఁదలంచియున్న 'గృహలక్ష్మి'ని వీడక సర్వకాలమం
దంచితమైనసేవలను నాదరమొప్పఁగఁజేసి ధాత్రిలో
మించఁగదమ్మ సత్కృతులు మేలుగఁజేసి కృతార్థురాలవై.

మ. పదివర్షంబులు రాకమున్నె యిల భాస్వత్కీర్తి నార్జించుచున్
విదితంబైన పరోపకారములు దాపెక్కుల్ సతీకోటికిన్
ముదమారన్ బొనరించిమించెఁ గదసంపూర్ణాయురారోగ్య సం
పదలన్ మా 'గృహలక్ష్మి' పత్రికకు దైవంబిచ్చి రక్షించుతన్.

---

# జయభేరి

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

(వెనుకటి సంచిక తరువాయి)

రెండవయంకము—మొదటిరంగము

స్థలము-కల్యాణపట్టణము నందొక రాజభవనమున రాజసభామందిరము.

కాలము-ఉదయము నాలుగుగడియలు ప్రొద్దెక్కినసమయము. ఆరవ దినము.

[పశ్చిమచాళుక్యచక్రవర్తియగు భూలోకమల్లుడు (మూడవసోమేశ్వరుడు) సింహాసనాసీనుడైయుండును. మంథెనగుండరాజు త్రిభువనమల్ల జగద్దేవమహారాజును చెరియొకప్రక్కన ఉచితాసనములపై గూర్చుండి యుందురు. మంత్రియొకడు చక్రవర్తికిసమీపమున నిలబడియుండును.]

భూలోకమల్లుడు:—మంత్రివర్యా! స్వతంత్రుడు గాజూచుచున్న ఆ కాకతిప్రోలరాజు హంతకుని శిక్షించి పశ్చిమచాళుక్యసామ్రాజ్యపీఠమునకు బలి యొసగుసమర్థుడు మాసామంతులలో నొక్కడైనలేడా?

మంథెనగుండరాజు:—(లేచి) సామ్రాజ్యాధిపతీ! ఈ మీపాదసేవకుడు దేవరయాజ్ఞయగుట తడవుగా ఆ రాజ్యమదాంధుడగు కాకతిప్రోలుని నొక్కక్షణములో దేవరపాదాక్రాంతునిజేయ నాతురతపడు చున్నవాడు. (అని కూర్చుండును.)

మంత్రి:—జగద్దేవా! చక్రవర్తిగారిమాటలు వింటివిగదా! ఆ ప్రశ్నమునకు తగు సదుత్తరమిమ్ము.

జగద్దేవుడు:—ఇదిగో నా ప్రతిజ్ఞ వినుడు. చతుస్సముద్ర వేలాపరివృతమైన పశ్చిమచాళుక్యసామ్రాజ్య చక్రవర్తుల పాదసేవకులమైన మేము ఒక్కప్రోలుని గాదుగదా సమస్త సామంతమండలేశ్వరబృందమును గూడ మన చక్రవర్తియడుగులకు మడుగులొత్తునట్లు చేయగలవారము.

మంథెనగుండరాజు:—మా కాజ్ఞయిండు. నేనును, ఈ జగద్దేవమహారాజును తత్క్షణమేపోయి పశ్చిమ చాళుక్యసామ్రాజ్యాంతర్గతంబున కంటకప్రాయుడైన ఆ కాకతిప్రోలుని బంధించి తెచ్చెదము.

భూలోకమల్లుడు:—సామంతమండలేశ్వరులారా! మీ రనుకొనినట్లు కాకతిప్రోలు డంతసులభసాధ్యుడు కాడు.

మంత్రి:—ఏనాడు స్వర్గీయవిక్రమాత్యచక్రవర్తులు దీర్ఘవ్యాధిగ్రస్థులయి మంచముపట్టెనో ఆనాటినుండి కాకతిప్రోలుడు తగుబలమును ధనమును సమకూర్చుకొని స్వాతంత్ర్యపతాకము ననుమకొండదుర్గముపై ధరింపజేయ యత్నించుచున్నట్లు వేగులవాండ్రు తెచ్చు వార్తలవలన తెలియుచునేయున్నది.

మంథెనగుండరాజు:—అతనికాబుద్ధి పొడమినట్లు కుమారతైలపదేవుడును, గోవిందదండేశుడును అతని వలన బడిన భంగపాటు చెప్పకయే చెప్పుచున్నది.

భూలోకమల్లుడు:—మీరాజభక్తికి మే మెంతయు సంతసించుచున్నారము. పశ్చిమచాళుక్యసామ్రాజ్యమునకు రానున్నవిపత్తుల నరికట్టుబాధ్యత మీపైగలదు. త్వరగాపొండు. రాజద్రోహుల జెండాడుడు.

గుండరాజు / జగద్దేవరాజు:—చిత్తము దేవా! దేవరయాజ్ఞ శిరసావహించుచున్నాము.

(అని నిష్క్రమింతురు.)

భూలోకమల్లుడు:—మంత్రిసత్తమా! నేటి కీసభ చాలించి అంతఃపురమునకు నేగుచున్నారము, అనుమ



దేవాలయమునకు.

కొండవిషయ మెప్పటికప్పుడు మాకు తెలుపుచుండుము. (అని సింహాసనమునుండిలేచి వెడలిపోవును. మంత్రియు నిష్క్రమించును.)

## రెండవఅంకము—రెండవరంగము

స్థలము—అనుమకొండకోటలోని రాజసభాభవనము

కాలము—ఉదయము నాలుగడియల ప్రొద్దెక్కిన తరువాత తొమ్మిదవదినము.

[ప్రోలరాజు సింహాసనాసీనుఁడై కొలువుదీర్చి యుండును. చేతనమంత్రి చేతనొక లేఖపట్టుకొని వినయముతో నిలుచుండియుండును. రేచర్ల కామచమూపతి మొలను కరవాలము వ్రేలాడుచుండ మరొక యుచితాసనముపై కూర్చుండియుండును.]

ప్రోలరాజు:—మంత్రివర్యా! మంథెనగుండరాజు వ్రాసిన లేఖయందలి ముఖ్యాంశములు వినిపింపుము.

చేతనమంత్రి:—దేవా చదువుచున్నాడ. "ఇదివరలో మీ రొనర్చిన యపరాధములకు క్షమాపణ చెప్పుకొని పశ్చిమచాళుక్య చక్రవర్తియగు సోమేశ్వర సామ్రాజ్యాధిపుని పాదములపైబడవలెను. అట్లు—" (అర్ధోక్తిలో).

ప్రోలరాజు:—ఆ నరాధముడు మదాంధుడై తనకును మాకునుగల తారతమ్యము గ్రహింపజాలక మిడిసిపడి అట్టిలేఖను వ్రాయ సాహసించుచున్నాడుగా?—తరువాత చదువుము.

చేతనమంత్రి:—"అట్లు కానిపక్షమున మేము తక్షణమే మీపై దండెత్తివచ్చి మిమ్ము ప్రాణములతో బట్టుకొనిపోయి ఆపశ్చిమచాళుక్య చక్రవర్తి పాదములకడ జేర్చివైచెదము. (అర్ధోక్తిలో)

ప్రోలరాజు:—ఆ! తెలిసినది. ఆమదాంధుని దుష్ట లేఖయందలి సారాంశము. గర్వోన్మత్తుడై వ్రాసిన గుండరాజాధముని లేఖను నింక మాకడ చదివి వినిపింపకుము. (కామచమూపతితో) కామచమూపతీ! కాకతీయరాజన్యుని బాహుబలదర్పము చవిచూడ నవకాశముగల్గించుకొన్న మంథెనగుండదండాధిపునికి ప్రతీకారముచేయ మామనంబు తత్తరపడుచున్నది. నీవును నీ అభిప్రాయము తెలుపవలెనని కుతూహలమై యున్నాము. ఏమనియెదవు?

కామచమూపతి:—దేవా! దేవర బుద్ధిసంపదను మించి మముబోంట్ల అల్పబోధము అన్యథా యేమి విన్నవించుకొనగలదు?

చేతనమంత్రి:—స్వ పర తారతమ్య భేదము గుర్తింపక మత్తిల్లి ప్రవర్తిల్లెడు గుండరాజునకు మన యీ కామచమూపతి దగిన ప్రాయశ్చిత్తవిధిని నిర్ణయింపదగినవాడు.

ప్రోలరాజు:—అందుకు సందేహమేమి?

కామచమూపతి:—(లేచి) కాకతీయాంధ్రక్షాత్ర తేజమును దిరోభూతమొనరింపజూచెడి యా గుండ భూపాలజలదమును మదీయబాహుబలవజ్రాయుధమున కరజేయ దేవరయానతికై వేచియున్నాడ (అని కూర్చుండును).

చేతనమంత్రి:—కాకతీయరాజ్యలక్ష్మీ పరిరక్షణ పరాయణచిత్తుడగు నీ కామసేనాని గుండరాజాధముని శిరఃఖండనమొనరించి వానిరొమ్మున కాకతిరాజముద్రితాంకమగు వరాహాంకము గుద్ది స్వామి ఋణంబు దీర్చికొన సమర్థుండు.

ప్రోలరాజు:—మంత్రిసత్తమా! లెస్సగావచించితివి. మాకును నట్లే దోచుచున్నది.

కామచమూపతి:—దేవర యనుగ్రహమునకు బాత్రుడనైతిని.

మంత్రి:—మహారాజుగారికి దెలియని రాజనీతి యుండదు. అయినను మంథెనగుండభూపుడువ్రాసిన యీ యుత్తరము మిషగాగైకొని కామచమూపతి

అతని రాజధానీనగరంబు ముట్టడించిన మనకు మేలయ్యెడు నని నాయల్పబుద్ధికి దోచుచున్నయది.

ప్రోలరాజు:—ఆ శత్రుకీటకమును సమూలముగా నాశనముజేయ మేము స్వయముగా నతనిపైదండెత్తి వెడల సంకల్పించి యున్నవారము. అయినను నీ విష యమున కామచమూపతి యభిప్రాయంబుకూడ దెలిసి కొన దలచినారము.

కామచమూపతి:—మహారాజులుంగారి సేనాధ్య క్షత క్రింద నున్న కాకతీయాంధ్ర సేనార్ణవమును దిల కించుటటుండ కన్నెత్తిచూచుటకైన నే శత్రురాజు సాహసించును? కావున నవశ్యము మహారాజులుంగారు దండునడుపింపదగు సన్నాహంబుగావింప మాకు గర్త వ్యమైయున్నది. (ద్వారపాలకుడు ప్రవేశించును.)

ద్వారపాలకుడు:—యేలినోరికి జయం. చత్రు లెవరో మనపట్టణంమీదికి దండెత్తివస్తున్నారని యేలినోరికి విన్నవించుకోడానికి ఒక వీరభటుడు ద్వారందగ్గరకనిపెట్టుకొనివున్నాడు. దేవర సెలవై తే-

(అందరు ఆశ్చర్యముతో దిలకింతురు.)

ప్రోలరాజు:—ద్వారపాలకా! వేగిరముపోయి అతనిలోనికిం బ్రవేశపెట్టుము. శీఘ్రముగాపొమ్ము.

ద్వారపాలకుడు:—సిత్తము దేవరా! [అనివెడలి మరల నాసైనికుని వెంటబెట్టుకొనివచ్చి] ఇదిగో యేలినవారిక్కడఉన్నారు. ఇటుఇటు (అని వెడలి పోవును).

సైనికుడు:—దేవా! యేలినోరికి జయం. మన పట్టణానికి యేడెనిమిది మైళ్ళ దూరంలోవున్న మడి కొండమీదుగా మహాప్రభో! శత్రురాజొకడు దం డెత్తి వస్తూన్నాడని తెలిసికొని దేవర కావార్త మనవిచేసుకోవడమునకు వస్తి మహారాజా!

ప్రోలరాజు:—కామచమూపతీ! మన సైన్యమును కోటవెలుపల నన్నిమూలల దండువిడిసియుండ నేర్పా టుగావించి శత్రువెవ్వడో తెలిసికొని మాకా వార్త వెంటనే దెలుపుము.

కామచమూపతి:—చిత్తముదేవా! అట్లే గావిం చెద. (అని నిష్క్రమించును).

ప్రోలరాజు:—మంత్రిసత్తమా! మనకోటలో నుండు సేనానాయకుని నియమితప్రదేశముల దండు నిలిపికొని భద్రముగా కోటద్వారముల గాపాడు చుండుమని తెలియజేయుము.

చేతనమంత్రి:—చిత్తము దేవా! అట్లే యొనర్చెద. (అని నిష్క్రమించును.)

ప్రోలరాజు:—ఎవడురా అక్కడ? అంతఃపుర మునకు దారిలీయుము. (అని నిష్క్రమించును).

## రెండవయంకము—మూడవరంగము.

స్థలము:—హిడింబాశ్రమప్రాంతమున
ఒక మెట్టుగుట్ట.

కాలము:—పగలు రెండుజాముల వేళ,
తొమ్మిదవ దినము.

[అచ్చుటిపర్వతముపై పశ్చిమచాళుక్య సామంత మండలేశ్వరుడగు త్రిభువనమల్ల జగద్దేవమహారాజు ఒక సేనానాయకునకు ఆగుట్టకు దూర్పుభాగమున కాకతీయసైన్యముతో దనసైన్యము దలపడుచున్న విధమును జూపుచుండును.]

జగద్దేవమహారాజు:—(సేనానాయకునితో) మన వీరభటులు ఉదయమునుండియు కాకతీయసైన్యమును అనుమకొండ కోటగోడల సమీపమునకు నెట్టుకొని పోవుచునే యుండిరి. కాని రెడ్డి సేనానాయకు డెవడో కాకతీయసైనికులకు దోడ్పడినాడు. అతడు మనసైన్యమును వెనుకకు మరలింపజేసినందున ఈ హిడిం బాశ్రమ పరిసరములు ఉభయసైన్యములకు రణ రంగమై యెట్లు ఘోరసంకులసమరము సాగుచున్నదో చూచితివా!

సేనానాయకుఁడు:—చూచుచునే యున్నాడ మహారాజా! అదిగో మన గజసైన్యము ముందుకు నెట్టుకొనివచ్చి అశ్వసైనికుల నెట్లు హతమార్చుచు శత్రుసేనాసుల జీకాకుపరచుచున్నదో!

జగద్దేవమహారాజు:—ఇ ది గో సైనికుఁడొకడు పరుగెత్తికొని మనవైపే వచ్చుచున్నాడు.

(సైనికుడు ప్రవేశించును.)

సైనికుడు:—దేవరా! జగద్దేవమహారాజా! కాకతిప్రోలరాజు స్వయంగా సైన్యాన్ని నడిపించుకొంటూ మనల్ని పారదోలాలని కోటనుంచి వెలుపలికి వచ్చి తమసైన్యాన్ని కలుసికొని మనపైకి వస్తూన్నాడని మనదండుదొర మీతో చెప్పిరమ్మన్నాడు.

జగద్దేవమహారాజు:—ఏమీ! కాకతిప్రోలరాజే స్వయముగా తనసైన్యమును నడిపించుకొని వచ్చుచున్నాడుగా!

సేనానాయకుడు:—మనముకూడ మన వీరభటులకుందగినట్లు నుత్సాహపరచుచు ఆకాకతి ప్రోలరాజును ప్రాణములతో బట్టుకొని పశ్చిమ చాళుక్య చక్రవర్తికడ మనము చేసినప్రతిజ్ఞ నెరవేర్చుకొనెదము. త్వరపడుడు!

[అని కొండక్రిందికిబోవును. సేనానాయకుడును వెంటబోవును.]

(తెరలో) "వీరభటులారా! పారిపోవుచున్న కాకతీయాంధ్ర సైన్యమధ్యమున మదపుటేనుంగునెక్కి తనసైన్యముతోగూడ ప్రయాణమై అనుమకొండకోట జొరబారనుంకించుచున్న ఆకాకతిప్రోలరాజును బంధింపుడు. అతనిజుట్టుకొనుడు. కొట్టుడు." అను కేకలు సైనికులకోలాహలము వినబడును.

(తెర లేచును.)

(ఒక భయంకరమైన యుద్ధభూమి కానవచ్చును. అచ్చట గుఱ్ఱములయొక్కయు యేనుగులయొక్కయు శవములు మనుష్యులతలలు మొండెములు కనబడును. కాకతిప్రోలరాజు వేషంబుననున్న ఒకని బంధించి ఇద్దరు జగద్దేవమహారాజు సైనికభటులు ప్రవేశింతురు]

ఒకడు:—ప్రోలరాజా! విడిపించుకోవాలని యత్నిస్తావా, నిన్నీకత్తికి బలిస్తాను.

రెండవవాడు:—ఓరాజా! నీవు ప్రాణాలపై ఆశ వుంచుకుంటే జాగ్రత్తగావూరుకుండి జగద్దేవమహారాజులకడకుపట్టుకొనిపోయేటప్పుడు పెనగులాడకుడు.

మాయప్రోలరాజు:—ఓ పిరికిపందలారా! యేనుగు మీదనుంచి జారిపడినప్పుడు ఒకసారిగా నన్ను బట్టుకొని కట్టివేయడంకూడా వొక పౌరుషమా! విడువండి! విడువండి! లేకపోతే నా రెండుకాళ్లతో మీ ఇద్దర్నీ పొట్టలు చెక్కలయ్యేటట్టు తన్ని పారవేస్తాను. [అని తన్ను విడిపించుకొన పెనగులాడును].

మొదటివాడు: —(గట్టిగాపట్టుకొని)అదిగో! మా జగద్దేవమహారాజులు గారిటే వస్తున్నారు తిన్నగా నడు. [జగద్దేవమహారాజు సేనానాయకునితో ప్రవేశించును].

జగద్దేవమహారాజు:—(దూరమునుండి) మనయుద్ధభటులలో నొక్కరైన ఆకాకతిప్రోలరాజును బంధించి తేలేకపోయెనుగా!

సేనానాయకుడు:—అదిగో మన వీరభటులిద్దరు ప్రోలరాజునే గాబోలు బంధించి తెచ్చినారు.

ఒకభటుడు:—(బంధితుని ముందునకుద్రోచి) జగద్దేవమహారాజా! ఇదిగో కాకతిప్రోలరాజును బంధించి పట్టపేనుగుమీదనుండగా కట్టి తెచ్చేము. యేలినోరి కోరిక చెల్లించాలని మాలో అనేకమంది ఇతని వాడికత్తికి బలైపోయేరు.

జగద్దేవ:—(సిగ్గుచే దలవాల్చుకొనియున్న బంధితుని నిదానించిచూచి సేనానాయకునితో) ఈ బంధితుడు కాకతిప్రోలరాజు కాడేమోయని సంశయము పొడముచున్నది.

సేనానాయకుడు:—నాకును నట్లే దోచుచున్నది.

ఇద్దరు భటులు:—కాదు మహారాజా — కాదు.

ఒకభటుడు:—నీ పేరేమని ఇతన్నడుగుతే 'ప్రోలరాజని నా దుస్తులు చూచైనా కనుగొనలేరా?' అన్నాడు. అదీగాక మహాప్రభో! ఒకక్షణంలో అంతమంది ఇతనిచేతిలో సచ్చిపోయినారంటే ఇతడు తప్పక ప్రోలరాజయేవుంటాడు.

జగద్దేవమహారాజు:—(తల వంచుకొనియున్నా బంధితుని మొగమెత్తి పట్టుకొనిచూచి) ఓ మూర్ఖశిరోమణులారా! ఇతనినా కాకతిప్రోలరాజని పట్టుకొనివచ్చితిరి. (బంధితునితో) ఓరీ! నీవేనా కాకతిప్రోలరాజవు?

బంధితుడు:—(నిరసనభావముతో) మీ వంటి పిరికిపందలకా! కాకతిప్రోలమహారాజులుంగారు దొరికేది! పట్టపేనుంగుమీదినుంచి జారిపడ్డ ఆమహారాజుపైకి ఒక్కసారిగా మీసైనికులంతా వచ్చిపడ్తే, ఆ మహారాజుగారి సైనికులూ మీసైనికులూ దొమ్ములాడ్తూవుంటే ప్రోలరాజుగారి నెత్తోతప్పించి వారిదుస్తులు వారిమాపటివాణ్నయిన నేను తొడుక్కొని కత్తి చేతబుచ్చుకొని కొడుతూవస్తూవుంటే నన్ను పట్టుకొని మీకడకు వచ్చేరు వీళ్లిద్దరూను.

భటులు:—ప్రోలరాజువని పేరుసెప్పిన నీవు ఆయన మాపటివాడవా! (అని ఆశ్చర్యపడి చూచుచుందురు.)

జగద్దేవమహారాజు:— సేనానాయకా! ఈ యిద్దరివీరభటులను ఈ బంధితునితోగూడ బంధించి తీసుకొనిపోయి వారినందరిని శిరఃఖండన మొనరింపుము. ఇంతలో అనుమకొండ కోటగోడలనెక్కి లోనికిం ప్రవేశింపజూచెడి మన వీరసైనికుని నాయంబునకు ప్రోత్సహపరుప మే మేగెదము. నీవును మమ్ము త్వరగా కలిసికొనుము (అని ముందునకు నడచిపోవును. సేనానాయకుడా యిద్దరిభటులను బంధితుని తనవెంట దీసికొనిపోవును.)

(ఇద్దరుభటులు:—రక్షింపుదొరా. మమ్ము రక్షింపు మీ బాంచలము. అని అరచుచున్నను వారిని సేనానాయకుడు నడపించుకొనిపోవును).

# ప్రేమ సమస్య

శ్రీమతి తాడి నాగమ్మగారు

'ఏమిటాలోచించుచున్నావు ఆల్బర్ట్'

'విశ్వమోహిని దర్శనమింకను కాలేదు గదా యని—'

'నేనంత అందగత్తెనా ఆల్బర్ట్?'

'నేనంత ఆలోచనలో మునిగియున్నానా మేరీ?'

'లేవు, నీవు నిజముగ ఆచలోనలో మునిగిలేవు.'

'ఉన్నావు నీవు నిజముగ విశ్వమోహిని వలె నున్నావు.'

'బోల్తాపడిపోయావుగదా ఆల్బర్ట్.'

'అబద్ధమాడినావుసుమా మేరీ?'

'ఏలాగు?'

'నే నేలాగు?'

'నేనందగత్తెనాఅంటే నే నాలోచనలో మునిగియుంటినా అంటివి. వెంటనే నీవాలోచించుట లేదనినేననగ నీవందగత్తెవుకావని నీ వనవలిసింది. అనలేకపోయావు పాపం! భయమేసిందికాబోలు !! బోల్తాపడ్డావు.'

'మొదట ఆలోచించుచుంటి వేమిటని ప్రశ్నించి తరువాత నీవేమి ఆలోచించుట లేదని స్వవచన విఘాతముచేసికొన్న నీవే అబద్ధమాడుచుంటివి. ఎవరుబోల్తాపడ్డారో?'

'మొదటమాట తప్పినవారే బోల్తా పడ్డట్టు.'

'పోనిమ్ము! నేనే పడిపోయానులే ఆల్బర్ట్ నీవు గెలిచావు కాబట్టి మహాఘనుడైన ఫ్రెడరిక్ అంతగొప్పవాడవులే. ఇపుడు సంతృప్తి కలిగిందా?'

'ఎందుకు నేనే బోల్తాపడ్డాను మేరీ గెలిచావు కాబట్టి మార్గరెట్ తెరిజా అంత గొప్పదానవులే. ఇప్పుడు కులాసాగా ఉందా?'

'నీవు నిజముగా ఒప్పుకుంటున్నావా అల్బర్ట్?'

'ముందు నీసంగతిచెప్పు మేరీ.'

'అబ్బా! పురుషులను నమ్మకూడదంటారు ఇదే కాబోలు.'

'స్త్రీలమాట నమ్మిట నీటిని మూట గట్టుటవంటి దంటారు నిజమేసుమా.'

'అటువంటి మాటలనకు. నేను సహించ లేను అల్బర్ట్'

'అటువంటి నిందలుమోపకు నేనోర్చు కొనలేను మేరీ.''

'తెలిసింది. పురుషులు వట్టికఠినాత్ములు.'

'గ్రహించాను. స్త్రీలు శుద్ధమోసకత్తెలు.'

'నన్నిట్లు బాధించబోకు అల్బర్ట్ నీకు నమస్కారములు పెడతాను'

'నన్నిట్లు వేధించబోకు మేరీ! నీకు ప్రణామములు.'

'స్త్రీలు మోసకత్తెలనుట నీకాధారమే ముంది?'

'పురుషులు నిరంకుశులనుటకు నీకేమి సాక్ష్యములున్నవి?'

'నాకు బోలెడుసాక్ష్యములున్నవి. చూడు—ఇంగ్లండురాజైన యెనిమిదవహెన్రీ యేమిచేశాడు. మాసిపోయిన చొక్కాలు మార్చుకొన్నట్లు ఎంతమందినో భార్యలను మార్చినాడు. ఇదంతా పురుషుడు నిరంకుశుడగుటవల్ల చేసినపనిగదా! రష్యన్‌చక్రవర్తులలో గొప్పవాడైన పీటరు తనమాటకెదురాడినకారణముచేత భార్యను బిడ్డలను ఖైదు చేయించుటకుకూడ వెనుదీయలేదు. బైబిలులో జ్ఞానియని పేరువడిన సోల్మన్ రాజుకూడ కనబడిన అందకత్తెనెల్ల పెండ్లాడినాడు. ఇక తూర్పుదేశములలో తురకరాజుకు భార్యలు మందలుమందలుగా నుందురట. ఇదంతయు పురుషుని నిరంకుశత్వమువల్లనేగద జరుగుచుండుట—ఉన్నమాటంటె నీకెంతకోప మొచ్చింది?'

'స్త్రీలు మోసగత్తెలనుటకు నాకెన్నో యాధారములు గలవు. ఆది పురుషుడైన ఆదామును అవ్వ మోసగించి మేలుకీళ్లు తెలిపెడుపండు తినిపించింది. దానివల్లనే గదా లోకమున కింతశ్రమ. హిబ్రూవీరుడైన సేమ్సన్ తనభార్యయైన డాలిలావలన మోసగింపబడి నాశనమైనాడు. ఇటాలియను వీరుడైన హెర్క్యులీస్‌కూడ తనభార్య యిచ్చిన వస్త్రమువలననె మరణించినాడు. రోమను వీరుడైన అంటోనియోకూడ ఈజిప్టురాణియైన క్లియోపాట్రావలన మరణించినాడు. ఇంతకు యిట్టి వీరులందరు నాశనమగుటకు స్త్రీలు మోసగత్తెలగుటవలననే గదా. మేరీ నిజముచెప్పితే నీకింతరోష మొచ్చింది.'

'ఇక నేను వినలేను అల్బర్ట్ చాలు ఒప్పుకొన్నాను; నిజముగ స్త్రీలు మోసకత్తెలే.'

'నేనును ఒప్పుకొన్నానుమేరీ. పురుషులు పూర్తిగ నిరంకుశులే.'

'ఇంతకు మనలో యెవరు గెలిచారు?'

'అదే సంశయము.'

'నీవే గెలిచావు ఆల్బర్ట్.'

'లేదు నీవే గెలిచావు మేరీ.'

'ఓడిపోయినందుకునీకు జుల్మానా యేమిటి?'

'బోల్తాపడ్డందు నీకు శిక్ష యేమిటి'

'నాకేమీవద్దు'

'నాకు కావాలి...'

'అబ్బ! పాపం చాల శ్రమపడ్డావు. నే వెళ్లి పోతున్నా.'

'ఓడిపోయిన స్త్రీకి వెళ్లడానికి స్వాతంత్ర్య మెక్కడిది ఆగు.'

'ఈలాగు బలవంతము మంచిదా ఆల్బర్ట్?'

'పురుషులు నిరంకుశులని నీవే ఒప్పుకొన్నావుగా?'

'కాబట్టి ఎనిమిదవ హెన్రీవలెనె నీవును చొక్కాలు చాల మార్చెదవన్నమాట.'

'ఆమాట మాత్రమనకు.'

'ఎందుచేత? పురుషులు నిరంకుశులేగా?'

'ఔగాక! నేను మాత్రమంతవరకు నిరంకుశుడను గాదు.'

'మరెంతవరకు?'

'నీ కిష్టములేకపోయిన నిన్ను నిత్యము ప్రేమించుచుండేటంతవరకు మాత్రమే?'

'నాకిష్టములేకపోవడమేటి ఆల్బర్ట్? ఆ మాట అనకు నేను వినలేను.'

'నన్ను నిరంకుశుడనకు మేరీ! నేను సహించలేను.'

'మనము రాజీపడదాం ఆల్బర్ట్'

'రాజీ షరతులేమిటి?'

'స్త్రీలు మోసగత్తెలని నీవెప్పుడు అనకూడదు.'

'పురుషులు నిరంకుశులని నీవెన్నడు చెప్ప గూడదు.'

'నేను ముమ్మాటికి ఒప్పుకున్నాను.'

'నేను త్రికరణశుద్ధిగ ఒప్పుకొంటిని.'

'వేళైంది నేను వెళతాను ఆల్బర్ట్.'

'వెళ్లవచ్చును—గాని—'

'సంశయమేమిటి?'

'మనరాజీ చెడిపోకుండ మూడుముద్రలు వేయాలి'

'ఏలాగు'

............

'తప్పతుందామరి'

'సెలవు'

'సెలవు'

* * *

అది సాయంసమయము; నాటితో జూన్ మాసాంతమగును.

జర్మనుసామ్రాజ్యమునుండి శాంతి సూర్యుడస్తమించుచున్నాడు. ఉదరపోషణార్థమై యుర్వియంతయు కలయవెదకబోయినపక్షులు తమతమ గూళ్లను చేరుచున్నవి. దినమంతయు కర్మాగారములందు కఠినముగ జీవితమును గడిపిన కార్మికులు కేరింతలుకొట్టుచు కేకలువేయుచు పాటలు పాడుచు ఇండ్లకు చేరుకొనుచున్నారు. ఆయుధకర్మాగారములు నిరంతరము పని చేయుచుండుటచే అందుండి తిరిగివచ్చు కార్మికులకు కొందరెదురేగుచున్నారు. నిర్బంధ సైనికవిద్య నేర్చుకొనుచున్న యువకులు

ఫ్రెడరిక్, బిస్మార్కు మొదలగు జర్మను సామ్రాజ్యసృష్టికర్తలను వేనోళ్ల పొగడుచు పోవుచున్నారు. బలముగలవానిదే రాజ్యము; బలవంతుడే బ్రతుకనర్హుడు; బలహీనులకీ పృథ్వీరంగముపై స్థానములేదని ట్రైట్‌స్కి గురిపించు ఉపన్యాసపరంపరలను వినిన శ్రోతలు యాతనిశక్తి సామర్థ్యములను హర్షించుచు పోవుచున్నారు. మానవమండలిని కవోష్ణరక్తస్రవంతులతో ముంచ యత్నించుచున్న బెర్లిన్‌నగర వింతదృశ్యములను గాంచుటకై రక్తవర్ణముగల పూర్ణచంద్రుడు ఉదయాద్రినుండి లేచుచున్నాడు.

అట్టిసమయమందు మేరీ తనమనోహరుడైన ఆల్బర్టు రాకకై ప్రతీక్షించుచున్నది. మేరీ కోటీశ్వరుడైన ఒకయూదునికుమార్తె. బెర్లిన్ నగరమునందున్న ఒక ఉన్నతపాఠశాలలో చదువుచున్నది. ఆమె కేవలము ముగ్ధయుగాదు, ప్రౌఢయుగాదు. చాల అందకత్తె. ఆల్బర్ట్ ఒకజర్మన్ సేనాని కుమారుడు. యుగయుగములనుండియు అతని వంశీయులు సైనికవృత్తివలననే జీవించుచున్నారు. అంత భాగ్యవంతులు కారు. వృత్తియేజీవనము. అతని కిరువురు అన్నలుగలరు. వారిపుడు నిర్బంధసైనికి విద్య నభ్యసించుచున్నారు. ఆల్బర్ట్ సరసుడు. ప్రతిభావంతుడు. మేరీకి సహాధ్యాయుడు. ఆమె అమాయికత్వము యీ నిష్కళంకమూర్తి నాకర్షించినది. ఈతని నిష్కళంకము ఆ యమాకురాలి నాకర్షించినది. ఇట్లు వారిరువురిప్రేమ దినదినప్రవర్ధమానమగుచున్నది. దినమున కొకసారియైన ఒకరినొకరు చూచుకొనకుండ నుండలేరు. ఇపుడు మేరీఆల్బర్ట్ రాకనునిరీక్షించుచున్నది. ఇంతలో ఆల్బర్ట్ వచ్చినాడు. ఆమె ముఖకమలము వికసించినది.

'ఆల్బర్ట్ ఏమి ఇంతయాలస్యం?'

'వచ్చి ఎంతసేపైనది ?'

'ఎంతసేపైతేనేం ? నా తొందరకొలది నేను వచ్చితినిగాని నీకేంలే ? '

'నీకంటె ముందుగనె నేను బయలుదేరాను. కాని మార్గమధ్యమందు కొంచెమాలస్యమైంది.'

'మార్గమధ్యమందు ఇంకా కొందరు మేరీలు నీకొర కున్నారుగాబోలు మరి నా కేంతెలుసును ? తెలిసుంటె నేనును ఆలస్యంగానే వచ్చివుందును.'

'నన్ను యేదోవిధంగా కష్టపెట్టడము నీకు సంతసమనుకుంటాను మేరీ ?'

'ముందుగవచ్చికూర్చున్న నాకుకష్టము గాని ఇపుడేవచ్చిన నీ కేమికష్టము ?'

'నీ కంతకష్టంగాఉంటే నన్నుశిక్షించి తప్పుమాత్రము క్షమించు మేరీ ?'

'శిక్షించుటకు నేనెంతటిదాన్ని ? క్షమించుటకు నే నెవ్వతెను ?'

'నా సర్వస్వము.'

'అట్లైతే శిక్ష......'

'సరే.'

'దారిలో ఆలస్య మెందు కైంది ఆల్బర్ట్?'

'అక్కడకూడా కొందరుమేరీ లున్నా రని నీవే ఒప్పుకొన్నావుగా.'

'లేదు. చెప్పుఆల్బర్ట్ దయచేసి ?'

'చెప్పితే నమ్మువారెవరు ?'

'నిన్ను నమ్మకపోతే మరెవరిని నమ్మ గలను ఆల్బర్ట్?'

'దేవుణ్ణిగాని దయ్యాన్నిగాని నమ్మవూ?'

'ఊహూ! నా సర్వస్వము నీవే.'

'అంటే దయ్యాన్నికూడా అని అర్థము కాదా ?'

'కాదు. నా దేవుడుమాత్రమే.'

'మేరీ! నిన్నటి వార్తాపత్రికలు చూచావా ?'

'చూచాను.'

'అందేమి గమనించావు.'

'ఒకపత్రికలో ఏదిప్రేమ, అనేకథను చదివాను.'

'అంతేనా ?'

'ఏవేవోచదివానుగాని జ్ఞప్తి లేవు.అవన్నీ యిపుడెందుకు ?'

'ఆస్ట్రియా సింహాసనమునకు వారసుడైన ఆర్చిడ్యూక్ ప్రాన్సిస్ ఫెర్డినాండ్ యువ రాజును బోస్నియసి రాజెవోనగరమందు చంపివేసిన సంగతి చదివావా ?'

'ఆ పత్రికలో 'యువరాజుహత్య' యని చూచానుగాని అంతగా గమనించలేదు.'

'దీనివలన ముందు ముందు చాల చిక్కులు కలుగనున్నవి మేరీ!'

'ఎవరికి? మనకా ?'

'మనకు కాదు యూరపురాజ్యములకు?'

'అదెలాగ ఆల్బర్ట్ ?'

'బోస్నియా రాజధానినగరమందు ఆ హత్య జరుగుటచే ఆస్ట్రియాప్రభుత్వము వారు తగిన సంజాయిషీ సెర్బియాప్రభుత్వమును కోర్తారు. వారట్లు యివ్వనియెడల ఆస్ట్రియాకు సెర్బియాకు యుద్ధముతప్పదు.'

'ఐతే జర్మనీ కేమినష్టము ?'

'సెర్బియావారందరు 'స్లావ్'అను తెగకు జెందినవారు. రష్యన్‌జాతివారుకూడ ఈ తెగకుజెందినవారే. అందుచేత ఆస్ట్రియాకు సెర్బియాకు యుద్ధమే పొసగినచో సెర్బియా పక్షముగ రష్యారణరంగమున కురుకుతుంది. అపుడు ట్రిపిల్‌అలయన్సు ననుసరించి ఆస్ట్రియాపక్షముగ జర్మనీ ఇటలీలు రణరంగమున కురుకుతవి. వెంటనే డ్యూయల్ అలయన్సు ననుసరించి ప్రాన్సు రష్యాపక్షముగ యుద్ధమునకు దిగును. ఇట్లు యూరపు ఖండమంత కల్లోలమునందు మునిగిపోతుంది.'

'ఈ యువరాజదంపతులహత్య ఇంతటి మహాయుద్ధమునకు కారణ మవుతుందా ?'

'కాదు. అసలు కారణములున్నవి. ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధమునందు జరిగిన పరాభవమును తీర్చికొనుటకు ఫ్రాన్సు నాటి నుండి తయారగుతూంది. బెర్లిన్ కాంగ్రెసులో బిస్మార్కు ఆధిపత్యమున ప్రాగ్దేశ సమస్యవిషయములో తనకుజరిగిన అన్యాయమును తీర్చుకొనుటకై రష్యా నాటి నుండి వేచివుంది.'

'ఇంతకు ఈ చిన్నికణ మింతటి మహా జ్వాలలకు కారణమగున్నమాట.'

'ఔనుమేరీ. కావచ్చును. త్వరలో భయంకరదినములు రానున్నవి.'

'నాకు భయమగుచున్నది ఆల్బర్ట్.'

'ఇట్టి యుద్ధము వచ్చుననియేగాబోలు మనదేశమునందు ప్రతియువకునికి నిర్బంధ సైనిక విద్యనేర్పరచిరి.'

'అందునీవు చేరబోకు ఆల్బర్ట్.'

'నే నింక ఆ వయస్సుకు రాలేదు. వయసువచ్చిన తరువాత నాకూ తప్పదు.'

'ఈ నిర్బంధసైనికవిద్యనేర్చిన యువకులందరు యేమిచేస్తారు ఆల్బర్ట్.'

'యుద్ధముపొసగిన వెంటనే వీరందరిని రణరంగమునకు పంపుతారు.'

'అందు నీవు చేరబోకు ఆల్బర్ట్'

'ఇపుడేమీ లేనపుడు అంతభయపడడ మెందుకు మేరీ?'

'ఏమో! నాకెందుకో భయమేస్తుంది.'

'యుద్ధమువస్తే అన్నానుగాని యుద్ధం వచ్చిందా యేమిటి.'

'ఏమో! నాకు దేహమువణకుతూంది.'

'ఊహలకే భయపడితే యెలాగ మేరీ?'

'జర్మను సామ్రాజ్యము శిథిలమగుచున్నట్లు నాకు తోస్తుంది నాకళ్లు తిరుగుచున్నవి, నన్నుపట్టుకో ఆల్బర్ట్.'

'............కంగారు తీరిందా మేరీ?'

'కంగారేకాదు; భయము కూడ పోయింది.'

'ధైర్యంకూడ వచ్చునేమో?'

'వచ్చేటట్టుగానేఉంది ఆల్బర్ట్'

'.....మరి ఇపుడు ధైర్యమొచ్చిందా మేరీ?'

'వచ్చిందిగాని వేళైంది వెళ్లుతాను.'

(సశేషము.)

# మాతృసుతా ప్రబోధము

శ్రీరమావల్లభు శ్రితపారిజాతుఁ
గారుణ్యసాగరుఁ గరుణాసముద్రు
మదిలోనఁ మ్రొక్కుచు మాయమ్మనీకు
ముదితలు వినఁనొప్పు మోదంబుగూర్చు
నీతులు గొన్నింటి నెఱిఁజెప్పనుంటి
నాతి వానినివిని నయముతో మెలఁగు
అమ్మ యేగెదవింక నత్తింటనుండ
నమ్మకుదూరమై యరిగెదవీవు
కన్నులఁ గన్నీరు గ్రమ్ముచునుండె
నెన్ని చెప్పిన విన దీ డెందమయ్యొ!
క్రన్న నదుఃఖంబు గడపదేమందుఁ
గన్న తల్లులకిది కానికష్టంబు
చిత్తచాంచల్యంబు చెందుటేకాని
యత్తింటి కోడల నై నేనురానె
అతివకుధర్మమా నత్తవారింట
బతిదాపునుండుట పరువుతో మనుట
పుట్టిల్లు పడతికిఁ బొరుగిల్లె సుమ్మ
చుట్టంబుతోడిదే చుమ్మ యీతల్లి
ఎఱుఁగనిగోలవు యేమఱియుందొ!
చిఱుతుకమాటచేఁ జెవియొగ్గి వినవొ!
తప్పుతల్లిది కూతు తామసియైన
నొప్పెఱుంగనిదైన నూర్మిళయైన
పతిసద్దైవంబుగా మతిలోనఁదలఁచు
సతికిసౌఖ్యంబులు సమకూరుఁ జగతి
ఇహభోగములకెల్ల నీతడేకాక
మహినెవ్వ రున్నారు మానినినీకు
ధవుడు సెప్పినమాట దాటకుమమ్మ
వివశాత్ముఁడై నను విజ్ఞానియైన
తప్పొప్పులెంచక దయితుకోర్కెలను
దప్పకచేయుమా తడయకవేగ
మందుఁడై యుండిన మగనితోఁ జెవికి
విందుగాఁ జురుకెక్కు విషయముల్ సెప్పు
అలుకమైనుండిన నాతనిజేరి
కలకతీర్చెడిగాథ కల్పించిచెప్పు
ధనహీనుఁడై మదిఁ దపియించుచున్న
గనినవస్తువులెల్లఁ గాంక్షించకమ్మ
వెసనంబులకుఁజిక్కి విసిగించుచున్న
వెసఁగూడదనిసాగి వేడుమోయమ్మ
పతినిగన్నట్టియా భామిని మామ
పతికంటెఘనులని భావింపుమమ్మ
కులగోత్రములవృద్ధి గోరెడివారు
కలిమిలేములమిమ్ముఁ గాచెడివారు
కొడుకుఁగోడలిఁజూచి కులికెడువారు
విడువనిప్రేమ దీవించెడువారు
నయభయంబులుచూపి నడిపించువారు
వయసుపోకిళ్లను వారించువారు
అత్తమామలెసుమా యతివరో! వారి
నెత్తిపైనిడుకొని నేరుపుమీర

# మాతృసుతా ప్రబోధము

కొలిచిసౌఖ్యంబులు గొనుము మాతల్లి !
కలితసౌభాగ్యంబు గనుమూపవల్లి !
తల్లినీయత్తయె తండ్రియే మామ
ఎల్లిదంబుగ జూతువేమొ యోలేమ
పొత్తుగావారితోఁ బోవకయున్న
నత్తంటిభోగంబు లన్నియునున్న
అత్తమాటలకెదు రాడకుమమ్మ
చిత్తంబుమామకుఁ జెదరించకమ్మ
మెలత ! అత్తకుముందు మేల్కొనుమమ్మ
కలపాచిపనులన్ని కావింపుమమ్మ
వెట్టిచేతలుచేసి వేధించకమ్మ
పట్టపగలునిద్రఁ పాడిగాదమ్మ
ఎఱుఁగఁజెప్పినవారి నెదిరించకమ్మ
చుఱచుఱచూపులు చూడకుమమ్మ
పనివేళ నాడకు పాడకుమమ్మ
తిని కాలమునువృథా తెంలించకమ్మ
ఇంటిగుట్టును వీధి కెక్కించకమ్మ
ఒంటరిగారచ్చ నుండకుమమ్మ
పకపకనవ్వుచుఁ బలుకకుమమ్మ
వెకిలిచాసలపొందు వేఁడకుమమ్మ
మందహాసంబుతో మాటాడుమమ్మ

అందంబుగావేష మమరించుకొమ్మ
ఇల్లుస్వర్గంబు గావింపుముకొమ్మ
పొల్లాడియపకీర్తి బొందకుమమ్మ
అంగనామర్యాద నలవర్చుకొమ్మ
దొంగిలించుటగొప్ప దోసమ్ముసుమ్మ
కలహంబునకుఁజోటు కలిగించకమ్మ
కులకాంతలనుబ్రీతిఁ గొలుపునుకొమ్మ
పెట్టుపోతలవేఱఁ బెట్టకుమమ్మ
చుట్టంబులనుబ్రోలిఁ జూడుముకొమ్మ
పగవారినేనియు బాధించకమ్మ
తగనినేపథ్యంబుఁ దాల్పకుమమ్మ
వచనప్రవీణతఁ బడయుముకొమ్మ
శుచిశుభ్రతలగూర్చి శోధింపుమమ్మ
ఆరోగ్యవిధి కెదురాడకుమమ్మ
నారీమణులుమెచ్చ నడయాడుమమ్మ
పుట్టింటిఖ్యాతిని బోషింపుమమ్మ
మెట్టినింటనుశ్రీల మెలఁగుముకొమ్మ
అనువుగానూఱేండ్లు నలరారుమమ్మ
మనుమలనెత్తుచు మనుముమాయమ్మ
విభవంబుగొనుమమ్మ విజయమాసమ్మ
శుభము నీకగుఁగొమ్మ సుఖమెనీకమ్మ.

సుసర్ల లక్ష్మీకాంతమ్మ.

# బా ల వి జ్ఞా న శా ఖ

**బంగారుతల్లికి : దీవనలు** 'బ్రహ్మశ్రీ'

బంగారు తల్లివమ్మా భామరో !
  రంగారు రాణివమ్మా
చెంగారు చేడెవమ్మా ఇంతిరో !
  తంగేటి తీగవమ్మా
చదువులకు ప్రోడవీవె చానరో !
  సంధ్యలా సారస్వతివీ
అల్లరీ చేయకమ్మా మీయమ్మ !
  ఆజ్ఞలను జవదాటకూ

రాజ్యంపు లచ్చివీవె రాణిరో !
  రాక్షసుల బరిమార్చుమీ
శ్రీకృష్ణు మదినిల్పుమీ ఓయమ్మ !
  ఆతడే యిలవేల్పుసూ
దుర్గమ్మ తల్లినీకు కొమ్మరో !
  కోటితో కోటగట్టుసూ
ఆయురైశ్వర్యములను ఆతల్లి !
  నీకిచ్చు ఘూన్నిలక్ష్మి.

చరకాపాటలు

బ్యాండు స్వరము

| | |
|---|---|
| గా మా పా ధ ని సా ధ ప | రై, రై, రైరయి మానుచు |
| మా ధ ప మ గ రి స గా గ్గా గ్గ | రాటము వడుకవె ఓతల్లి |
| గ ప మ గ రి స రీ ర్రీ ర్రి | వడకినవిను నాతల్లి |
| రి ప మ గ రి స | కడురయమున |
| గా మ ప ధా ప మ | వచ్చు స్వరాజ్యము |
| రీ గ మ పా మ గ | యిచ్చు సుఖంబును |
| సా రి గ మా గ రి సా సా స్స | మెచ్చు మహాత్ముడు రావమ్మా |
| సా నీ ధా సా | జాలా మేలే, |
| సా ని ధ ప | చాలూం లేవే |
| స్స ని ధ ప మ గ రి స॥ | సమయము మించును॥ రై॥ |

("తొలి నేజేసిన పూజాఫలము" వలె పాడవలెను.)

ఇదిగో రాటము నూలు వడుకవె
ఇది మనస్వ అ అ రాజ్యసాధనమే
సదనముననుు యీ కదురుతిరిగినా
ఉదరపోషణము ఊరకగల్గునె॥ ఇదిగో॥
మగవారపుడే మరిమరి వడకి
మగువరో మనకిటు మాటికి దెలుప
మొగమోటముపడి కదురునుమరచి
నగుబాటుజెందకె జగన్నాథనుత॥ ఇదిగో॥

కె. జగన్నాథరావు.

## గణపతి పూజ

శ్రీమతి వేదుల మీనాక్షీదేవిగారు

విఘ్నేశ్వరుడి పెళ్ళి కన్నీ విఘ్నాలే అన్నట్టు మా యింట్లో విఘ్నేశ్వరుడి చవితికి మా పిల్లవాడిచేత చేయించిన పూజకీ అన్నివిఘ్నాలే. ఇంతకీ యేదో పూజ అయిందనిపించాం. విఘ్నాలంటే సరిగ్గా విఘ్నాలు కావు. అయినా విఘ్నాలే అన్నమాట.

మావాడికిప్పుడు మూడోయేడు వచ్చిందికదా కాస్త పూజచేయించుదామని మా ఆవిడ చాలాకాలం నుంచీ అంటూంది. అంటే క్రిందటిసంవత్సరం చవితికి ప్రారంభించింది వొచ్చేసంవత్సరం వీడిచేత మనం పూజచేయించాలి సుమండీ అని.

అయితే వినాయకచవితి మగవారు పూజచేసేదినం కదా నువ్వుమాత్రం పూజచెయ్యవా అంటారేమో. నాకు నమ్మకంలేదు. నేను పూజచెయ్యను. ఒకళ్ళు పూజచేసినా కష్టంగావుంటుంది. ఆ మాటకొస్తే ఆ రోజున ఫలహారమేనా చెయ్యనివ్వను. మా కుర్రాడేడిస్తే హోటలికెడతాము. అంతకచ్చ నాకు. కుర్రాడు బయలుదేరాక వాడిమాటేగాని నామాటసాగదు. వాడూ తల్లీ యేకమవుతారు. ఓమాటు నేను వాడి తల్లిని పిచ్చివేషాలేస్తావేమిటని కేకలేశాను. విన్నాడు మావాడు. యేమిటే అమ్మవి పిచ్చియేచాలా? అమ్మ కదూ? తప్పుఅన్నాడు. రోషంవచ్చింది కాబోలు. ఇంతకీ చెప్పొచ్చేమాటేమిటంటే వాళ్ళమ్మ వాడిని 'వినాయకునికి పూజచేస్తావనరా నాన్నతో' నని వుసికొల్పింది. అంతే. నాప్రాణం నమలేశాడు 'సరే' ననేదాకా. 'ఎవరు అడగమన్నార్రా' అంటే 'నేనే నన్నాడా' వుద్దండుడు.

వీధిలోకివొస్తే అవేకొందాం. రానివి మానేద్దాం. దేముడుగాణ్ణి పూజచేసేందుకు కష్టపడి బజారుకి వెళ్లడంకూడా యెందుకని సాయంత్రం పాలవెల్లివస్తే కొన్నాను. మావాడు దాన్ని పాలపిల్లి అన్నాడు. మాయిల్లు గలవారు వీరిపాలవెల్లి రంగులకాగితాలతో అలంకారం చేశారు. మావాడు చూడడం, తన పాలవెల్లికికూడా అల్లా అంటించమనడం, నేను మావాళ్ల పిల్లాడిచేత కాగితాలు తెప్పించడం, చచ్చిచెడి రాత్రి తొమ్మిదింటిదాకా అంటించడం అయింది. మెడ్రాసునుండి పట్టుగుడ్డతెప్పించి చొక్కాకుట్టించాను వాడికోసం.

తెల్లవారింది. మా ఆవిడ తెల్లవారుఝామున నన్ను లేపి వేడివేడినీళ్లతో తలంటి నీళ్లోసింది. ఎప్పుడులేచి కాచిందో తెలియదు. అసలు నాకు నిద్దర యెక్కువ కావాలి. తెల్లగా తెల్లవారి సూర్యకిరణాలు మీద పడితేగాని లేచేరకంగాదు నాది. అల్లాంటి నేను మా ఆవిడ బలవంతంచేత లేచాను. పిల్లవాడికి పొయ్యకూడదూ అంటే నయమే $3\frac{1}{2}$ గంటలకి వాడికి నీళ్ళొయ్యనా. జబ్బుచేస్తుంది కుర్రకుంకకి అంది. ఇక నాకు స్నానం తప్పింది కాదు. దేవుడుగాణ్ణి తన్నెయ్యాలన్నంత కోపంవచ్చింది. రాదూ మరీ, వాడివల్లేగా యీతిప్పలన్నీను.

నాతలంటయింది. అయిదుగంటలకు మా అబ్బాయి అభ్యంగనంకూడా అయింది. అన్నట్టు చెప్పడం మరచిపోయాను. మాయిల్లు వీధిమీదికేవుంది. వీధరుగులున్నాయి. మమ్మల్నిద్దర్నీ అరుగుమీదకూర్చొని పత్రి, పళ్లుకొనమంది నాఅర్ధాంగి. సరేనని 9 గంటలదాకా కూర్చొని అన్నీకొన్నాము. స్నానాలవగానే ఆవిడ ధర్మమాని యింత కాఫీపోసి మరీపంపింది లెండి. అన్నివస్తువులూ కొనడంఅయాక యిట్టేలోపలికెళ్లేసరికి మాఆవిడ నన్ను పాలవెల్లి కట్టమంది. గబగబా వంటచేస్తోంది మాకుర్రాడుండలేడని. నేను విసుక్కుంటూ పాలవెల్లికట్టాను. విసుక్కుంటేమాత్రం తప్పుతుంది కనుకనా.

పూజాసామగ్రి యథాస్థానాన్నుంచబడింది. పెళ్ళికెడుతూ పెళ్లికొడుకుని మరచిపోయినట్లయింది

మాపని. మావాడు గబగబావచ్చి నాన్నోయ్ దేవుడు లేడన్నాడు; ఈపరమసత్యం వీడికెల్లాగ తెలిసిందా అనుకున్నాను. నాప్రాణం నిలువునా నీరయిపోయింది. వినాయకుడు వీధిలోకిరాలేదు. 'అయ్యో నీదేమణ్ణి దొంగలెత్తుకుపోనూ' అనుకొని బయలుదేరాను బజారికి, మావాడూ వెంటబడ్డాడు. వాడ్నెత్తుకొని నిమిషంలో బొమ్మకొనుక్కొచ్చాను. తోవపొడుగునా మావాడు "నాన్నా పేడ పట్టుకున్నావేమిటి? పారెయ్యమని గోలపెట్టాడు. 'పేడ కాదమ్మా దేముడు' అని వాడిని సమాధానపరిచేటప్పటికి నాతాతలు దిగివచ్చారు. సరే యింటికి వచ్చి గొడుగు బొమ్మనెత్తిని గుచ్చాను. మావాడికి పట్టులాగుతొడిగి చిన్నమడిగుడ్డకప్పి నేనూ మడి గట్టుకుని పీటమీద కూర్చున్నాం.

మాఆవిడ నైవేద్యంగూడా తెచ్చి అక్కడపెట్టింది. నేతిపూరీలు, పులిహోర చేసింది. చూశాడు మా ఆయుష్మంతుడు. "అమ్మ బాబోయ్" అని కేక వేశాడు. ఏంకొంపమునగలిగిందోనని యిట్టేచూద్దుంగదా మావాడు మూడుపూరీలుపట్టుకొని పారిపోయాడు; మా ఆవిడ అయ్యో! అదేమిట్రా అంది. మరేం మునిగిపోలేదు. దేవుడేమిటి సింగినాదం జీలకఱ్ఱ. పిల్లవాడేదేముడని! కేకలేశాను. ఫలహారంఅయాక పూజచెయ్యడానికి వచ్చి కూర్చున్నాడు. కేశవా, నారాయణా అని చెంబెడు నీళ్లు త్రాగేడు. పేరుకి వాడ్నికూర్చోపెట్టి నేనే పూజచేశాను. కూర్చున్నకాస్సేపు వాడు నాకన్నీ యేశి పెడతారుకదూ. బాన్నా నేనూ తింటాం అంటూనే వున్నాడు. తాంబూలం సమర్పయామి అన్నప్పుడు తాంబూలంలో కానీపెట్టాము. 'తమలపాకులు దేవుడికిత్తే యిచ్చావు. కాని, కానీ నాకియ్యి'మన్నాడు. పీచుమిఠాయి కొనుక్కుంటాడుట. ఎల్లాగో పూజయిందనిపించాము.

మధ్యాహ్నం భోజనంఅయాక కొత్తచొక్కా తొడుక్కుని మాఅందరికీ దణ్ణంపెట్టాడు. తరువాత కుర్చీలకీ, మంచాలకీ యివీ అవీ యేమిటి కంటికి కనబడ్డ ప్రతీవస్తువుకీ దణ్ణాలెట్టాడు.

ఇన్నివింతలతో ముగిసింది మాయింట్లో వినాయకచవితిపండగ.

"శక్తిత్రయం"



శ్రీ పార్వతి లక్ష్మి సుబ్బలక్ష్మలు

# శిశుశిక్షణ పోషణాలయములు

జటావల్లభుల పురుషోత్తముగారు ఎం.ఏ.

[ఇతరదేశములందుకంటె మనదేశమందు శిశుపోషణాలయముల అవశ్యకత అమితముగలదు. ఈ వ్యాసమును జదివినవారెల్ల దాని నెఱుగగలరు. ప్రత్యేకసంస్థలును ప్రభుత్వమువారును వాని ప్రాముఖ్యమును గుర్తించి ప్రకృతమున్న పాఠశాలలందైనను వేరుగనైనను నెలకొల్పి దేశాభ్యున్నతికి పాటుపడుదురని తలంచుచున్నాము. సం. గృ. ల.]

మనదేశములోవలెనే పాశ్చాత్యదేశములలోగూడ బాలబాలికలకు విద్యను ప్రారంభించుటకయిదవయేడు యుక్తకాలముగ భావింపబడుచున్నది. అంతకుపూర్వమునగూడ వారికి నేర్పవలసిన కొన్నియంశములును నలవాట్లును గలవు. కాని మనదేశములో నందువిషయమై యెంతమాత్రము శ్రద్ధ దీసికొనబడుటలేదు. పాశ్చాత్యదేశములలో నయిదేండ్లలోపుననున్న బాలురకు శిక్షణము గఱపుటకై ప్రత్యేకవసతులు గలవు. కేవలము మానసికశిక్షణమేకాక శారీరకపోషణముగూడ నందు గావింపబడును. బాలుర మానసికశారీరకాభివృద్ధికై తలిదండ్రులు యత్నించుచుండవలసినదేకాని యీవిషయమై వారు నిరంతరము శ్రద్ధ పూనుట యసంభవము. తండ్రి యేయుద్యోగములోనోయుండుటచే బయటకుబోవును. తల్లి గృహకృత్యములను నిర్వహించుటలో నిమగ్నురాలైయుండును. కాన పిల్లలను కనిపెట్టిచూచుచు తగిన శిక్షణపోషణముల నొసగుటకు ప్రత్యేకశాల లేర్పాటుచేయబడినవి. వానికి 'నర్సరీస్కూల్సు' అని పేరు. ఇందు 2 ఏండ్లు మొదలు 5 ఏండ్లు లోపుననున్న పిల్లలుమాత్రమే చేర్చుకొనబడుదురు.

ఇట్టి 'నర్సరీస్కూల్సు' ఇంగ్లండులో మొత్తము 70 మాత్రమే కలవు. అనగా నచట మిక్కిలి కొలది కుటుంబములు మాత్రమే యీపద్ధతివలన లాభమును పొందుచున్నవని యర్థము. ఈపద్ధతి 1918వ సంవత్సరమున ప్రారంభింపబడి ప్రభుత్వమువారిచే నంగీకరింపబడినది.

ఈపద్ధతిలోని ప్రధానాభిప్రాయ మేమనగా, ఆధునిక నాగరకదేశములలో ప్రతి మానవుడును తన యవసరములకును సౌకర్యములకును నితరులపై నాధారపడుచున్నాడు. పూర్వమున్ననో యెవనికి వాడు లేక యేకుటుంబమున కా కుటుంబము బట్టలను నేసికొనుచుండెను. పొలము దున్నుకొని పండించుకొనుచుండెను. నేడు నాగరిక దేశములలో చాల కుటుంబములవారు తాము చెల్లుబడిచేయు రొట్టెలు మున్నగు తినుబండ పదార్థములనుగూడ నింటిలో చేసికొనక బయటనుండి కొనితెచ్చుకొనుచున్నారు. అన్నిటికిని నిట్లు బాహ్యప్రపంచ

ముపై నాధారపడుచుండగా శిశుశిక్షణ. పోషణములవంటి ముఖ్యవిషయములలో బాహ్యప్రపంచమునుండి సహాయము గైకొనకుండుటలో నర్థములేదు. పిల్లలాడుకొనుటకు విశాలమైన బయలులుండవలెను. ప్రతి కుటుంబమును నట్టివాని నేర్పాటుచేయలేదు. ఏ యిరుకుకొంపలోనో కాపురమున్న కుటుంబములలోని పిల్లలు కదలుటకును మెదలుటకును దగినచోటు లేక యనారోగ్యముపాలగుదురు. గ్రామములోని పిల్లలందఱకును కలపి యొక విశాలస్థలము ప్రత్యేకింపబడుచో నందు వారు రెండు రెక్కలను విప్పి గగనవీధిని విహరించు విహంగమువలె నానందముతో క్రీడింతురు. శిశుశిక్షణ ఔషధాలయముల ప్రయోజనముల కిది యుదాహరణము.

నర్సరీస్కూలునకు పిల్లలను పంపిన తల్లు లింటియొద్ద నిశ్చింతగ పనిచేసికొనగలరు. అచటి పిల్లలకు ప్రమాదము తెచ్చు పరిస్థితు లేమియునుండవని వారికి తెలియును. పిల్లలాడుకొనుటకు వీలైనవస్తువులన్నియు సేకరించి యటనుంచబడును. శరీరమునకు బలమును నారోగ్యమును గల్గించి కండరములను పెంచు నాటలను నర్సరీస్కూలు నిర్వాహకులు పిల్లలచే నాడింతురు. అన్ని క్రీడాసౌకర్యములనే ధనికకుటుంబమునుగూడ తనపిల్లలకు గల్గింపలేదు. నర్సరీస్కూలువారు సమిష్టిపైన నీ సౌకర్యములను గల్గించుచున్నారు గాన మొత్తముపైన ఖర్చు తక్కువగనేయగును.

మనకుటుంబములలో తల్లులు పిల్లలతో పడు బాధ భగవంతునకెఱుక. పిల్లలను కొట్టుటయు, తిట్టుటయు, తమ్ముతాము మొత్తుకొనుటయు, తిట్టుకొనుటయు సామాన్యవిషయములు. నర్సరీస్కూళ్లకు పోయి సాయంకాలము తిరిగివచ్చిన పిల్లల తల్లులన్ననో పీరని జెందిసిపొందు నానందమునకు హద్దుండదు. పిల్లవాడు స్కూలులో తోటిపిల్లలతో పొందిన యనుభవమును తల్లికి చెప్పుచు మఱియు తా నచట చూచిన విశేషములను వర్ణించుటకుగూడ యత్నించును. మఱునాడు స్కూలునకు వెళ్లుట కుత్సహించుచుండును.

మనదేశములోవలెగాక ఇంగ్లండులో ప్రారంభపాఠశాలలో చేరినది మొదలు పిల్లవాని యారోగ్యమును పాఠశాలాధికారు లప్పుడప్పుడు పరీక్షించి తగుసలహాలను తలిదండ్రులకొసగుచుందురు. పూర్వము ఇంగ్లండులోకూడ ప్రారంభపాఠశాలలో చేరుటకు పూర్వవయస్సులో పిల్లల యారోగ్యమును గూర్చి శ్రద్ధతీసికొనుట లేకుండెను. 1918లో నర్సరీస్కూళ్లు ప్రారంభింపబడి నప్పటినుండియు నీలోటు తీరినది. రెండేండ్లకును నైదేండ్లకును నడుమనే పిల్లల బలమును గూర్చియు నారోగ్యమును గూర్చియు హెచ్చు శ్రద్ధవహింపవలెను. ఈకాలములో పిల్ల లెదుగునంత వేగముగా మఱేకాలములోను నెదుగరు. నర్సరీస్కూళ్లలో పిల్లలకీ క్రింది యారోగ్యసదుపాయములు గావింపబడును. కావలసినంత బయలుస్థలమును,

గాలియునుండును. తరుచుగా నారోగ్య పరీక్షచేయబడును. ఆరోగ్యశాస్త్రప్రకారము పిల్లల కెట్టియాహార మేవిధముగా తయారు చేయచేయవలెనో యట్టియాహార మావిధముగ తయారుచేయబడి మధ్యాహ్నసమయమున పిల్లలకు పెట్టబడును. పిల్లలకు నిద్ర వచ్చునపుడు చక్కనియేర్పాట్లతో పక్క లమర్పబడును. పరిశుభ్రముగానుండుట యెట్లో పిల్లలకు బోధింపబడును.

నర్సరీస్కూళ్లలో వ్రాయుటయు చదువుటయుగాని యెక్కములు మున్నగునవికాని బోధింపబడవు. అయిదేండ్లలోపున వీనిని బోధించుట పిల్లవాని కపకారముచేయుటయే యగును. ఈ చిన్నవయస్సులోకూడ నర్సరీస్కూళ్లలోని పిల్లలకు బుద్ధికిని శరీరమునకును నష్టమును గలుగజేయని విద్య బోధింపబడును. ఈ వయస్సులో పిల్లల కుతూహలము మెండుగనుండును. పంచేంద్రియములు మిక్కిలి యుత్సాహముతో పని చేయును. చూచినదానినెల్లనోటిలో పెట్టుకొనవలెననియు, కంటికి కనబడినదానినెల్ల తదేకదృష్టితో చూడవలెననియు, నెవరైన మాట్లాడుకొనుచో వినవలెననియు నెవరైన తమ్ము నెత్తుకొనవలెననియు తాము దేనినో యొకదానిని స్పృశించుచుండవలెననియు వారు హెచ్చుగ కోరుచుందురు. వారి యుత్సాహప్రకారము వారి నుండనిచ్చుచో వారికి గొప్పయనుభవము రాగలదు. అది యే చక్కని విద్యయని చెప్పవచ్చును. కాని యింటిలోని పెద్దవారికి పిల్ల లిట్లుత్సాహముతో కేళింతలు కొట్టుచునుండుట చీకాకుగానుండుటచేతను, దీనివలన నిజముగ పెద్దవారి పనులకు భంగము గల్గుచుండుటచేతను వీనిని సహింపక పిల్లలను నాల్గుబాదియొకమూల పడవైచుచుందురు. ఇందువలన పిల్లల శారీరక మానసికాభివృద్ధుల కాటంకమువచ్చును. నర్సరీస్కూళ్లలో నన్ననో పిల్లల యుత్సాహమునకు పూర్ణావకాశమీయబడుటయేకాక వారికి వినోదమును జ్ఞానమునుగూర్చు వస్తువు లెన్నియో వారియెదుట నుంచబడును. అందు కొన్ని వస్తువులు వారి యాహారశక్తిని పురికొల్పును; కొన్నివస్తువులు రంగులభేదములను తెలిసికొనుటకును రంగుల మంచి చెడ్డలనుగూర్చి యభిప్రాయముల నేర్పఱచుకొనుటకును తోడ్పడును; మఱికొన్నివస్తువులు—చిన్న చిన్నబ్యాండులు, హార్మోనియములు మున్నగునవి పిల్లలకు సంగీతములో నభిరుచిని గల్గించును. కొన్నికథలు చిత్రపటరూపమున వీరియెదుట నుంచబడును.

స్వయంసహాయముకూడ నర్సరీస్కూళ్లలో పిల్లలకు బోధింపబడును. ఏపిల్లవాని కోటు నాపిల్లవాడే విప్పుకొనవలెను. చేతులను కడుగుకొని తువ్వాలుతో తుడుచుకొనుట మున్నగు పనులనుగూడ పిల్లవాడు స్వతంత్రముగ చేసికొనును. తాను కూర్చొనవలసిన కుర్చీని ముందునకు లాగుకొనుటకుగూడ నెవ్వరును సహాయము చేయరు. ఈపనులను పిల్లలు స్వయముగ చేసికొనుటలో తమ కితరులు సహాయము

చేయకపోయినారే యను చింత యిసు మంతయునుండదు. మీదుమిక్కిలి తమ పనిని తాము స్వయముగ చేసికొనగల్గుచున్నందులకు వీరు సంతోషింతురు.

దీనినిబట్టి నర్సరీస్కూళ్లలోని విద్యార్థులకు వంటెత్తు తన మబ్బునని తలంపరాదు. కలసి పనిచేయవలసినచోట వారు మిక్కిలి స్నేహభావముతో కలసి పనిచేతురు. గదులను శుభ్రపఱచుట, మధ్యాహ్నభోజనము వడ్డించుకొనుట మున్నగుపనులలో వారు సమిష్టిగ వ్యవహరింతురు. ఒకరితోనొకరు పోరాడక కలసిమెలసియుందురు. క్రొత్తగ చేరిన పిల్లలను ప్రత్యేకప్రేమతో చూతురు. వారికి చాల సహాయము చేయుచుందురు.

శిశుశిక్షణపోషణములను నతి శ్రద్ధతోను పరిజ్ఞానముతోను చేయవలసినది ధర్మమను భావమే మన దేశీయులలో తక్కువ. పాశ్చాత్యులీ ధర్మమునే కళగను శాస్త్రముగను నభ్యసించుచున్నారు. జాతియొక్క భావి దశ యీ ధర్మనిర్వహణకౌశలముమీద చాలవఱకు నాధారపడియున్నదని వారి యభిప్రాయము. మన మన్నివిషయములలోను వెనుకబడియున్నట్లే యీవిషయమున గూడ వెనుకబడియున్నాము. పాశ్చాత్యుల నుండి యసంఖ్యాక దురభ్యాసములను మనము నేర్చుకొనుచున్నాము. వారిలోని మంచిమంచి సంస్థలనుగూడ మన మనుకరించినచో మనదేశ మెంత ముందునకు వచ్చునోకదా!

# శా ర ద లే ఖ లు

సౌ భా గ్య వ తి క ల్ప ల త కు

నెచ్చెలీ!

అఘటనా ఘటన సమర్థుడగు పరమేశ్వరుని లీలల నెఱుంగ నెవరితరము? అన్నియు సక్రమముగ నున్నప్పుడు అందరు దైవజ్ఞులె! అందరు శాస్త్రజ్ఞులె! అందరు ప్రతిభాశాలురె! కాని ప్రకృతిలో ఒక్క క్షణమాత్ర మే దేని మార్పుజరిగినచో నంతయు తారుమారు. అందఱి తెలివి వ్యర్థము. ప్రకృతి వైపరీత్యసంఘటనలకు సామాన్యమానవు డెంతనిస్సహాయుడో ప్రతిభాశాలియగు పురుషుడును నంత నిస్సహాయుడే. వారది కనిపెట్టిరి, ఇదికనిపెట్టిరి, పంచభూతములను పిడికిటబట్టిరి అని మనము ఆశ్చర్యచకితులమగునట్టి పాశ్చాత్యదేశపు వార్తలెన్నియో పత్రికలు ప్రకటించుచుండును. మనమును వారి బుద్ధికుశలతకు వారి యంత్రనిర్మాణ నైపుణ్యమునకును, వారిశాస్త్రపరిజ్ఞానమునకును ప్రశంసించుచు కైమోడ్పు లర్పించుచుందుము. కాని ఒక్క గాలియూపునకు ఒక్క సముద్రపు కెరటమునకు, ఒక్క భూమికంపమునకు, ఒక్క అగ్ని ప్రజ్వలనమునకు అంతయు బీభత్సము!

విజయదశమి పండుగ నెంతయో యుల్లాసముగ ముగించుకొంటిమి. దీపావళి కెదురు తెన్నులు చూచుచుంటిమి. వానలు సవ్యముగ కురిసెను. పైరులు చక్కగనుండెను. ధాతనామసంవత్సరములో తమ కేవియో కష్టములు కలుగనున్నవని ప్రజలుపడిన భయము నిర్హేతుకమని నవ్వుకొంటిమి. కాని ఇంతలో నాశ్వయుజ శుద్ధ త్రయోదశీ సౌమ్యవాసరమున (28-10-36) నింతటి ఝంఝూమారుతము వీచి యింతటి ప్రజాసంక్షోభ కారణమగునని యెవరు తెలిసికొనగలిగిరి? ఏ పంచాంగకారుడైన చెప్పగల్గెనా? ఏ వాతావరణ శాస్త్రజ్ఞుడైన సూచింపగల్గెనా? ఏ జ్యోతిష్కుడైన వివరింపగల్గెనా? లేదు. అందఱిని కనుమఱగించి అచింత్యాద్భుత శక్తిసంపన్నుడగు భగవంతుడు తన మహచ్ఛక్తిని ప్రకటించి యెల్లర నిరుత్తరులగావించినాడు. ఇప్పుడేమనుకొనవలయును? భగవంతుడొక్కడే సృష్టిస్థితిలయకారణకర్త. విశ్వమంతయు నతనిలోనిది. కావుననే మహాకవి పోతన.

"ఎవ్వనిచే జనించు జగ,
మెవ్వని లోపల నుండులీనమై
యెవ్వనియందు డిందు పర
మేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం

దెవ్వఁ డనాదిమధ్య లయుఁ
డెవ్వఁడు సర్వము దానయైన వాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు
నీశ్వరు నే శరణంబు వేడెదన్.

అని గానము చేసినాడు.

1925 సంవత్సరములో బెజవాడలో తుపాను గొట్టినప్పుడు నేనచటనుంటిని. అప్పుడును గృహములుచెడియు, ఫలవృక్షములు వగైరాలుకూలియు ప్రజలకు నష్టము కల్గెను. అప్పటి కదియే యత్యధికమనిపించెను. కాని, ఈవత్సరము మా బాపట్ల తాలూకాలో వాయుదేవుడు గావించిన ప్రళయతాండవము గాంచిన నది యేపాటి యనిపించినది. 27 తేదీ సాయంత్రము మూడుగంటలవేళ ఆకసము మేఘావృతమై చిటపటచినుకులతోను చల్లనిగాలితోను ముసురు పట్టినట్లులుండెను. వాతావరణము సుఖములేకుండుటచే దీపములు పెట్టక మునుపే ప్రజలు యెవరిండ్లకు వారు చేరుకొనిరి. చీకటి పడినతరువాత గాలి మరికొంత యధికముగా వీవసాగెను. కాని ప్రజలెవ్వరును లక్ష్యపెట్టకయే మాపటి భోజనములుచేసి పరుండిరి. కాని రాత్రి యగుకొలంది గాలియు వానయు నధికమై రాత్రియంతయు తీవ్రముగ వీచుచునేయుండెను. ఎటులనో ఉదయమైనది. నిద్రలేచి చూచుసరికి ప్రాతగిలిన దడులును పెళుసు వృక్షజాతులలోచేరిన బాదము, మునగ, బొప్పాయిచెట్లును అచ్చటచ్చట పడియుండుట కానవచ్చెను. అంతటితో గాలియుప శమించుననని యనుకొంటిమి. ఆవానగాడ్పులలోనే యుదయకాలపు గృహకృత్యములు నిర్వర్తించుకొంటిమి. కాని గాలి నిలుచు జాడ కానరాలేదు. సరిగదా మఱింత యధికమైనది. సరిగా జాముప్రొద్దెక్కునప్పటికి వాయు విజృంభణ మత్యధికమై యిక భూమిమీద నిలుచుదారి లేదనుపించినది. మొదటిదెబ్బకు తాటియాకుకొంప లెగిరిపోయినవి. రెండవయూపునకు మంగుళూరు పెంకులు లేచిపోయినవి. మూడవవిసరుకు జిన్నురేకు లూడిపోయినవి. కట్టకడపట నాటుపెంకులతో కప్పబడిన యిండ్లవంతు వచ్చినది. ఒక్క డాబాయిండ్లుమాత్రమే యాఘాటికి తట్టుకొని యసంఖ్యాక ప్రజలకాశ్రయమిచ్చి ప్రాణదానము గావించినవి. ఇక నేలగూలిన మహావృక్షములకును, నశించిన పశుపక్ష్యాదులకును, లెక్కయేలేదు.

పదిగంటలగుసరికి తుపాను యెంత భయంకరాకృతి దాల్చినదో చెప్పశక్యము గాదు. ఒకవంక తలుపులకు కిటికీలకు గడియ లెగిరిపోయి ఫెటీలుమని పగిలి ముక్కలై నేలపడుట, ఒకవంక దొడ్డిలోనున్న పెద్ద పెద్దమ్రాకులు పెళపెళార్భటులు సేయుచు పెళ్లగిలివచ్చి యిండ్లపై విఱుచుకపడుట, ఒకవంక యిండ్లమీాద పెంకులెగిరి ముక్కలు ముక్కలై నెత్తినిపడుట, వస్తువులన్నియు మట్టిగొట్టుకొనిపోవుట, ఆ కష్టము చెప్ప శక్యము గాదు అదేసమయమున మా దొడ్డిలోనున్న అరువదేండ్లనాటి పెద్దచింత చెట్టు పెళ్లున పెళ్లగిలివచ్చి మామేడమీాద

పడినది. ఆదెబ్బతో మాయిల్లు మేముగూడ మట్టమేయనుకొంటిమి కాని యెట్టెటో ఆదెబ్బను మాయిల్లు తట్టుకొనగల్గినది. ఇది కేవలము భగవదనుగ్రహమేనని చెప్ప వలయును.

ఈవిధముగా సాయంత్రము మూడు గంటలవఱకు నానాభీభత్సముచేసి గాలి యుపశమించినది. దానితోపాటువానయు తగ్గినది.

ఆతుపాను సమయములో నాపేద ప్రజ లెచ్చట తలదాచుకొనిరో యెట్టెట్టియవ స్థలు పడిరో తెలియదు. కొంచెము గాలి వాన తీవ్రతతగ్గగనే చలిలో వడవడవడకి పోవుచు తమకున్న నాల్గుపాతగుడ్డలు మూట గట్టి నెత్తినిబెట్టికొని చెంబుకంచముచేత బట్టుకొని ఉదయమునుండి యన్నములేక ఆకంటిచిచ్చుతో రోదనముసేసెడి బిడ్డల వెంట నిడుకొని ఆకటిమాట దేవుడెఱుగు తలదాచుకొనుటకు తావుదొరకిన చాలునని ప్రాణాతురులై నలువైపులనుండి గుంపులు గుంపులుగ నూరిలోనికి రాసాగిరి. రోగులు, వృద్ధులు, పచ్చిబాలెంతలు, పసినిసుంగులు నిండుచూలాండ్రు, వికలాంగులు అన్నాతు రులై ప్రాణాతురులై యురుకులుబెట్టుచు ఆవచ్చుతీరుచూడ హృదయవిదారకమై పోయినది. ధనికదరిద్రతా తారతమ్యము లేక నాటిపగలంతయు నించుమించుగా నెల్లరుపస్తు. రేయియైనను అవకాశమున్న వారు భుజించిరి. లేనివారు కడుపులో కాళ్లుపెట్టుకొని పరుండిరి. ఆపరుండుటైనను విశాలమగుతావుదొరకిన వారికి మాత్రమే లభించినది. కాని ఇండ్లులేక పరులపంచల నాశ్రయించిన వారెందరో ఆరాత్రి నిలువు కాళ్లపై నిలిచి జాగరణంబుచేసిరి.

ఎట్లెటో ఉదయమైనది. సూర్యభగవా నుడు తన సహస్రకిరణముల దశదిశల ప్రసరింపజేయుచు పొడుపుకొండపై పొడ సూపినాడు. ఆబాలభాస్కరుని గాంచగనే యెల్లరి ప్రాణములేచి వచ్చినట్లైనది. ఎల్లరు తమతమ గృహావరణముల బాగుచేసి కొనుటకు పూనుకొనిరి. ఎవరియింటిపని వారు చేసికొనుట తప్పనిసరి యగుటచే యానాడు కూలివాడనువాడు కాన్పించ లేదు. ఎల్లరకు స్వకాయకష్టముచే గృహా వరణముల చక్కబెట్టుకొనుట తప్పనిసరై పోయినది.

సాగర పరిసరమగుట ఉప్పెనభయమొకటి సర్వదా యీ ప్రాంతీయుల కలవరపెట్టును. అందును నిట్టి తుపానుసమయములలో నీభీతి ప్రజలకు మఱింతయధికము. ముప్పదవ తేదీ యుదయ మిట్టిభయమే బాపట్లపౌరుల నొక్కనిముసములో నాహాకారములు సేయు నట్లు చేసినది. ఆనాడు పూర్ణిమ. సముద్ర మున కానాడు ఆటుపోటులెక్కువ. కాన సముద్రఘుఘోష భయావహముగనుండును. ఆ సముద్రపుతీరపు పల్లెజనులలో ఉప్పెన వచ్చుచున్నదను ప్రవాద మెట్లుపుట్టినదో తెలియదు. ఆమాట చెవులబడినదే తడ వుగ ఎంతట నున్నవారంతట కొంపలువదలి పెట్టి బిడ్డలను చంకవేసికొని పురములోనికి

పారివచ్చిరి. వారినిచూడగనే పురములోని వారికిని భయముగలిగినది. ఇకనేమున్నది? వారును వీరును నేకమై వచ్చె, వచ్చెనను అరవులు, ఎక్కడికోపోదామని ఉరుకులు, ఏమైపోవుదుమో నని యేడుపులు, ఒక్కనిముసములో ఊరంతయు గందరగోళమై పోయినది. ఈవిధముగా కొంతసేపు కల్లోల పడినవెనుక యిదిఅంతయు వట్టి వదంతి యనియు, ఉప్పెనవచ్చుట లేదనియు, నాగరాజుకాలువ సముద్రపుపోటునకు పొంగి పొరలగ నదియే యుప్పెనయని ప్రజలు భయపడి పారివచ్చిరనియు తెలియవచ్చెను. ఉప్పెనభయముచే జను లిండ్లువదలి పారిపోవగా యిండ్లలోపడి దోచుకొనవచ్చు ననెడి యుద్దేశ్యముతో దుండగీండ్రు కొందఱీ ప్రవాదమును పుట్టించిరని మరికొందరు చెప్పిరి. గావలసిన యుప్పెనేమో ౨౮ తేదీ మధ్యాహ్నమే వచ్చెనట. రాగానే పల్లెజను లాహాకారు గాలిలోనే సముద్రున కెదురుపోయి పాలుపెరుగులు పారబోసి పసుపుకుంకుమలతో పూజచేసి కాని డబ్బులువేసి దణ్ణములుపెట్టిరట. అంతటితో సాగరుడు శాంతుడై వెనుకకు మరలెనట. సముద్రమునకు రెండుమూడుమైళ్లలోనున్న పల్లెలన్నియు నానాడే ఉప్పెన దెబ్బతినినవి. గొఱ్ఱెలుమేకలు మున్నగు సన్నజీవములు మందలకు మందలే మట్టితో పూడుకొని పోయినవి, పశుకళేబరములు కొన్ని యెత్తైన చెట్లకొమ్మలలో చిక్కుకొని వ్రేలాడుచుండుటచే సముద్రపు కెరటములంత యెత్తు వఱకు వచ్చియుండునని యూహింపబడుచున్నది. ఏమైననేమి గాలివానయు నుప్పెనయు నొకదానికొకటి తోడై యీ ప్రాంతీయులకు గావించిననష్టము అపారము.

౧౯౩౪ సంవత్సరములో గాలివాన మే నెలలోవచ్చెను. అది పైరు పంటలులేని వేసవికాలమగుటచేత కృషీవలుల కెట్టినష్టమును రాలేదు. నేటి పరిస్థితు లట్టివికావు. మెట్టపైరులు, మాగాణిపైరులుగూడ బాగుగా వెన్నువేసి ఒక్కనెలలో కోతకు సిద్ధముగానున్నవి. వేరుసెనగ సర్వసిద్ధమై మొక్కలుపెరికి యింటికిచేర్చుకొనవలసిన తరుణములోనున్నది. ఇట్టితరుణములో నిట్టి దారుణమైన తుపాను వీచుటచే పైరులన్నియు చెడిపోయినవి. ఈవిధముగా నీ వత్సరపుపంట పాడైపోవుటయేగాక తుపానులో ధాన్యపుకొట్లమీద పైకప్పు లెగిరిపోవుటచేత నిలువచేయబడిన నిరుటివత్సరపు ధాన్యముగూడ చాలచోట్ల పాడైపోయినది. రెండువత్సరములపంట నిట్లొక్కమారుగా కోలుపోయినతరువాత నిక జీవించుటెట్లో తెలియదు.

ఇక నేతపారిశ్రామిలకుగల్గిన నష్టము వర్ణనాతీతము. ఈ నేతపనివారెల్లరు సాధారణముగా చుట్టుగుడిసెలు కలవారేగాని గట్టియిండ్లు కలవారుకారు. ఆసుపోయుట, కండెలుచుట్టుట, పడుగుచేయుట మున్నగు వీరి పనులన్నియు చెట్లనీడలనేగాని గృహాములందుగాదు. తుపాను గాలిచే వీరికొంపలాపోయినవి; మగ్గములా విరిగినవి; తదితర

పనిముట్లూ భగ్నమైనవి. ముఖ్యముగా వీరికి నీడనిచ్చెడి చింత చెట్లూ నేలగూలిపోయినవి. నిలువనీడ లేకుండపోయినదను సామ్యము వీరియెడల సార్థకమైనది. జన్మప్రభృతి నేతయే కులవృత్తిగా గలవారగుట చేత వీరికితరపనులేమియు చేతగావు. పాపమీ పారిశ్రామికుల బ్రతుకులేమి కావలసియున్నవో తోచుటలేదు. ఒక్కపూట యన్నప్రదానముతో, ఒక్కొక్కవస్త్రదానముతో నివారింపబడవలసిన కష్టములుగావివి. శాశ్వతమగు జీవనోపాధి తెఱువులే చూపవలసియున్నది. ఈతాలూకాలో నీతుపానువలన నష్టపడనివారొక్కరైనలేరు. గొప్పయిండ్లుగలవారు గొప్పగను కొద్దియిండ్లుగలవారు కొద్దిగను నష్టపడిరి. ఎవరిస్థితికిదగిన నష్టము వారికి గల్గినది. ధాతనామసంవత్సరపుఫలితము ఎల్లరు భయపడినటులనే పరిణమించినది. ఈ దుర్భరస్థితినుండి ప్రజలెప్పటికి కోలుకొందురో, ఈ ఆపన్నుల రక్షించుటకై పరమేశ్వరుడేమిసంకల్పించియున్నాడో తెలియదు. అంతయు నీశ్వరాజ్ఞ.

కల్పలతా! అన్నియు చక్కగానున్నప్పుడు మానవులకుండెడి గర్వములకు లెక్కలేదు. ధనముచే, కులముచే, అధికారముచే న్యూనతాధిక్యతలు కల్పించుకొని త్రుళ్లిపడుదురు. కాని సార్వజనీనములగు నిట్టి మహావిపత్తులు సంభవించినప్పుడిట్టితారతమ్యముల కవకాశమే కన్పింపదు. 'అందఱమొకటే', 'అందఱమొకటే,' యనుభావమెల్లరిహృదయముల స్ఫురించును. మనుజులను గర్వోపహతులను జేయుటకే యిట్టి సంఘటనలు తటస్థించుచుండునేమో !

౧-౧౨-౩౬ మిత్రురాలు
భావపురి. శారద.



# పసిపాపలు - పోతపాలు

తల్లిపాలులేని బిడ్డలకు ఆవుపాలు తగునీళ్లు చక్కెర కలిపి వాడటం మంచిది. ఈపోతపాలు దినానికెన్ని ఎప్పుడెప్పుడు ఎన్నెన్నిమార్లు యివ్వవలసిందీ తెలిసికొని హెచ్చు తక్కువలు లేకుండా వాడుట అవసరం. ఏ యేనెలలో ఎలా ఇవ్వవచ్చో యీ క్రింది పట్టీనిచూచిన తెలుస్తుంది.

| నెల | ఎన్నిమార్లు | ఎప్పుడెప్పుడు | ఎంతెంత | దినానికెన్ని |
|---|---|---|---|---|
| నెల 2 లో | 6_7 మార్లు | $2\frac{1}{2}$_3 గంటల | 2_3 ఔన్సులు | 15-25 ఔన్సులు |
| ,, 3,4 ల్లో | 6 ,, | 3 కొకమారు | 3—$4\frac{1}{2}$ ,, | 25-30 ,, |
| ,, 5,6 ,, | 6 ,, | 3 ,, | $4\frac{1}{2}$-6 ,, | 30-35 ,, |
| ,, 7,8,9 ,, | 5_6 ,, | 3_4 ,, | 6_7 ,, | 35-40 ,, |

2 నెలలవరకు పాలకు నీళ్లు రెండింతలు, 6 నెలలవరకు సమము, 9 నెలలవరకు సగము నీళ్లు తగుచక్కెర కలుపవలెను. (చక్కెరహెచ్చైతే పుల్లటికంపుతో నురుగుగానీళ్ల విరేచనాలవుతవి) అయితే ఇదే అందరికీ ఒకేసూత్రంకాదు. యీపాలు కొందరికి అజీర్ణం చేస్తవి; మరికొందరికి పట్టినా పుష్టిచేయవు (బరువులో మార్పుండదు). ఇటువంటి సందర్భాలున్నవి గనుక గమనించి అజీర్ణమైతే నీళ్లనెక్కువచేసి పుష్టిచెయ్యకపోతే నీళ్లను తక్కువచేసి పాలను ఇవ్వవలెను. మరి పాలునీళ్లు చేర్చవలసిన భాగాలు మార్చేటప్పుడు (2-6 నెలలయినతర్వాత) ఒక్కసారిగా మార్చక పాలు కొంచెం కొంచెంగా హెచ్చించి నీళ్లను అదేప్రకారం తగ్గించడము మంచిది.

జీర్ణముసంగతి: ఈ పోతపాలుయిచ్చి జీర్ణమయితేనే మరి ఇవ్వవలెను. అలాగు కాకుండిన మళ్ళాఇచ్చిన ఆహారం జీర్ణంకాక మలంగా వుండలుండలుగా పోతుంది. ఇది గమనించి ఇవ్వవలసిన సమయాలు, అవసరముంటే పాలుయిచ్చే కాలపరిమితిలో కొంచము మార్పులు చేయడం మంచిది.

బిడ్డలు కొన్నినెలలయేటప్పటికి ఆటల్లో ఆకలిమరచి ఏడువరు. ఏడువలేదు గదా అని ఆహారమివ్వకుండావుంటారు కొందరు. ఇది సరికాదు. ఇందువల్ల ఆహారంచాలక రాత్రిళ్లు బిడ్డలు పోరుపెట్టారు. దానితో తలిదండ్రులకు జాగరంతప్పదు. ముందు శ్రద్ధతీసుకోవడం మంచిది.

— ఎస్. శేషగిరిరావు

# వింతలు విశేషాలు

## హిమాలయపర్వతములు 20 మైళ్లు జరిగినవి:—

హైమ్ అను భూగర్భశాస్త్రజ్ఞుడు హిందూదేశములో కొన్ని శాస్త్రపరిశోధనలగావించి హిమాలయములు క్రమముగా సమభూములవైపుకు జరుగుచున్నవనియు, ఇదివఱకే 20 మైళ్లు జరిగియున్నవనియు చెప్పెను. పర్వతములందున్న కొన్ని రాళ్ల ఫోటోలనుదీసి వాని పూర్వాపరస్థితినిబట్టి ఆతడిట్టి నిశ్చయమునకువచ్చెను.

## 27 రూపాయలపైన రెండులక్షలవడ్డి:—

ఫెరోజిపూర్‌నందు కిశోర్‌చంద్ అను షాహుకారు 1896 సం. ఒకరైతుకు భూమితనఖాపై 27 రూ. కంపౌండు వడ్డికిచ్చెను. అదియు రూపాయకు ఒకపంటకాలమునకు రెండణాలువడ్డి అనగా సంవత్సరమునకు 4 అణా లన్నమాట. ఈ సంవత్సరం రైతు తనభూమిని విడిపించుకొనుటకు రెవిన్యూఅసిస్టెంటుచెప్పిన ప్రకారం రూ. 60 సాహుకారుకు యివ్వబోగా ఆతడు తన వడ్డిప్రకారము లెక్కించి కోర్టులో రైతుపై 2,03,120 రూ. లకు దావాచేసెను.

## రెండేండ్లబాలునికి కావ్యములు కంఠస్థము:—

ఝాన్సి సమీపగ్రామమున పుట్టంధుడగు నొక రెండేండ్లబాలుడు గలడు. హిందీరామాయణ మహాభారతకావ్యములనుండి యేభాగమునుండియైనను పద్యములు చెప్పుమన్న సంకోచములేకుండ వల్లించును. అంతియగాక భగవద్గీతనుండి కష్టమైన శ్లోకములనుకూడ చక్కగవచించును. పెక్కుమంది ఆతనిదర్శనమునకు మూగుచున్నారు. ఆతడు శూరదాసు అవతారమని తలంచుచున్నారు.

## సైకిళ్లపై ముష్టి:—

శికింద్రాబాదులో కొంతమంది బ్రాహ్మణులు ద్వాదశిబియ్యాలకు, అమావాస్యబియ్యాలకు సైకిళ్లపై స్వారీచేయుచు భిక్షాటనము చేయుచున్నారు. ఇంకా కొలది దినములుదాటిన మోటార్లపైనికూడా బైలుదేరెదరేమోయని సందేహమగుచున్నది.

## ఒక స్త్రీకి ఒకకాన్పుకు ఆర్గురుబిడ్డలు పుట్టుట:—

సింధుదేశమున మయినీఅను గ్రామమున నిటీవల ఒక హరిజనస్త్రీ ప్రసవింపగా ఆర్గురుపిల్లలుపుట్టిరి. ఒక శిశువుమాత్రము మరణించెను. ౫ మంది ఆరోగ్యముగనున్నారు. చాలమందిప్రజలువచ్చి చూచుచున్నారు.

## తాతలఅవ్వల సంఘము:—

బర్మాలో తాతలఅవ్వల సంఘమనుపేరుతో రాజకీయసాంఘిక సంఘమేర్పరుపబడినది. స్త్రీలును పురుషులునుకూడ సభ్యులుగా చేరవచ్చును. ముసలివారైయుండవలయును. సభ్యులలో నెవరును కల్లు,సారాయి మున్నగువాటిని త్రాగకూడదు. చుట్టలను కాల్చకూడదు. తాంబూలము వేయకూడదు. తలకు క్రాపులు పెంచకూడదు. బర్మాకు స్వపరిపాలన మియ్యబడువరకును యీ సంఘసభ్యులెవరును శాసనసభ్యులుగా నుండకూడదు.

## కీరోమృతి కాలమున జరిగిన వింతలు:—

కీరోఅను సాముద్రికశాస్త్రవేత్త చనిపోయినపుడు వింత సంగతులు జరిగెను. గడియారము మూడు గంటలుకొట్టెను. పుష్పములులేకపోయినను ఇల్లుఅంతయు మంచివాసనతో నిండిపోయెను. ఎవరులేకపోయినను ఎక్కువమందిజనులు ఎక్కిదిగునట్లు మేడమెట్లమీద చప్పుడయ్యెను.

# నరములకు పట్టు

# కండరములకు బలము—



యివి రెండును మానవజీవనమును సౌఖ్యవంతముగ ఉపయుక్తముగ చేయగలవు. వీటిని ఆధునికదినములలో పెంపొందించుకొనుటకు జీవామృతమే సాధనము. జీవామృతము నరములకు పట్టును; కండరములకు బలమును సత్తువను ప్రసాదింపగలదు. జీవామృతసేవనము జీవితోత్సాహము నిచ్చును

నరములపటుత్వమునకు కండరముల బలమునకు

# జీవామృతము



తొట్టెలోని పాప యెప్పుడూ

## ఆడుకోవాలి, గాని

## యేడ్వకూడదు

బాలపాపల ఆరోగ్యము యకృత్ ప్లీహోదరములయొక్క స్థితి మీద ఆధారపడివుంటుంది. అది పెరుగకుండ ప్రకోపించకుండ ఉన్నంతవరకు పసిపాపలు యేడ్వకుండ ఆడుకొంటూవుంటారు. ఏనాడా అవయవములు యేదోఒక కారణమున పెరిగెనా ఆ పాపల జీవితము యీదురోమంటూ వుంటుంది. బాలపాపలను యీ ప్రాణములుతీసే బల్ల, గడ్డలనుండి రక్షించవలెనంటే అందుకు బాలభాస్కరయే సాధనము.

బాలభాస్కరసేవనమువలన యకృత్ ప్లీహోదరవ్యాధి పటాపంచలు కాగలదు

# బాలభాస్కర

ఆయుర్వేదాశ్రమం; గోవిందప్పనాయకవీధి, జి.టి. మదరాస్.



# పుష్ప చయము

## శాస్త్రపరిశోధనలన్నియు వినాశనమునకేనా ?

పాశ్చాత్యులు యుద్ధసమయములలో విషవాయువులను 1915 వ సంవత్సరమునుండి ఉపయోగించుచున్నారు. అప్పటినుండియు శాస్త్రజ్ఞులు అనేక పరిశోధనలజేసి యుద్ధసామగ్రి సులభమార్గముల తయారుజేయుచు పలువిధములగు మార్పులను గావించుచున్నారు. 1919 వ సంవత్సరములో క్రొత్తపద్ధతిని కనిపెట్టిరి. ఒకనిమిషములో చుట్టును అనేకమైళ్లవరకు ఆర్సెనిక్ విషవాయువు వ్యాపింపజేయు యంత్రములను తయారుచేసిరి. ఈవాయువు పీల్చగనే మత్తుగలుగజేసి యుద్ధమునకు నిరుపయోగముగ జేయును గాని అపాయమేమియు లేదు. ఈవిషయములో శాస్త్రజ్ఞులు కొంత కరుణచూపినట్లు స్పష్టమగుచున్నది. ఈమధ్యనే రాయల్ వార్విక్ షైరు రెజిమెంటువారు భయంకరమైన క్రొత్త ఎలెక్ట్రిక్ మెషిన్‌గన్ తయారుచేసిరి. అది ఒకనిమిషములో కొన్నిమైళ్లు చుట్టును. 1500 సార్లు కాల్చగలదు. కాని దానిని తయారుచేయుటకు చాలధనము వ్యయపరచవలసియున్నది.

బ్లాక్ మోరు అను నొక పరిశోధకుడు మరియొక క్రొత్తవాయువును కనిపెట్టెను. ఆవాయువు మనుష్యుని చెవిలోనికి ప్రవేశింపగనే వానికి ఏమియు వినపడదు. సరిగదా అవయవములన్నియును వాని స్వాధీనమునుండి తప్పిపోవును.

ఒక ఫ్రెంచి పరిశోధకుడు గంటకు 20,000 ఘనపు మీటర్ల విషవాయివు తయారుచేయగల యంత్రమును కనిపెట్టెను. ఇంకను పరిశోధకులు అనేకవిధములగు ఆయుధములను కనుగొనుచున్నారు. గాని వాటి అన్నిటికిని విరుగుడు తెలిసినగాని యుద్ధములలో ప్రయోగించరు. ఈ విషయములోకూడ శాస్త్రజ్ఞులు పలువిధముల ప్రయత్నించుచున్నారు.

రానురాను పరిశోధకులు విషప్రయోగముకంటె సులభమగు కిరణప్రయోగమును కనిపెట్టిరి. మాథ్యూసు అను శాస్త్రజ్ఞుడు ఒక ప్రదర్శనములో కిరణప్రయోగముచేత 60 గజములదూరములోనున్న ఎలుకలను, కుక్కలను, పిల్లులను చంపెను. ఆకిరణములు వాటి శరీరములోనికిపోయి వాటిరక్తమును నీరుగా మార్చునట.

డాక్టరు నికోలా తెస్లా అను శాస్త్రజ్ఞుడు కొన్నికిరణములను కట్టెను. ఆ కిరణప్రయోగమున 200 మైళ్లదూరముననున్న ప్రతిప్రాణియును నశించిపోవును. అట్టి కిరణప్రయోగముచే కోట్లకొలది జనులను నిమిషములో చంపవచ్చును.

*    *    *    *

## ఆత్మహత్యలలో గల రహస్యము బట్టబయలౌతుంది:—

కొంతమంది ఉన్నట్టుండి యెందు కాత్మహత్య చేసికొనుటకు ప్రయత్నించెదరు ?

ఈ సమస్యాపరిష్కారణమునకే ఇప్పుడు అమెరికాయందు కొంతమంది సుప్రసిద్ధ డాక్టర్లు పరిశోధనలు సలుపుచున్నారు. ఇకమీదట మానసచికిత్సావైద్యశాలలన్నిటిలో జరుగబోవు ఆత్మహత్యలు శ్రద్ధగా ప్రసిద్ధులగు మానసిక తత్త్వవేత్తలచే విచారింపబడును.

# గృహలక్ష్మి

వారిదివఱకే ప్రపంచమంతటిలో వివాహితులకంటె బ్రహ్మచారులే యెక్కువగ ఆత్మహత్యలకు లోనగునట్లు తెలిసికొన్నారు. కాని స్పెయినులోమాత్రము దానికి వ్యతిరేకముగా జరుగుచున్నది. అనాగరిక జాతులలోకంటె నాగరికతజెంది, విజ్ఞానులైన ప్రజలందే ఆత్మహత్య లెక్కువ జరుగుచున్నవి. నాగరికజాతులందును కష్టజీవితములను గడుపువారిలో నిది తక్కువ. అమెరికాయందు విశాలమైన స్థలములలో భవనముల నివసించువారియందుకంటె ఆత్మహత్యలు బీదలందును, అనారోగ్యమగు నిరుకుచోటులందు వసించువారియందును తక్కువయని కనుగొనబడినది.

ఈ యుద్దేశములు జూనుమాసమందే యెక్కువయగునట. అందు ముఖ్యముగా మంగళవారము ఉదయము 11 గంటలపుడు ఈ యభిప్రాయము లెక్కుడుగ నుండుననియు ఆసమయము విషగడియయనియు చెప్పుచున్నారు.

ఈ హత్యలకుపాల్పడు దురదృష్టవంతులు ఎత్తైన మేడలమీదనుండి క్రిందికురుకుటయు, మోటారునుండి విడువబడిన గాలిని పీల్చుటయు ఉపకరణములుగా నుపయోగించుకొనుచున్నారు. ఇదంతయు జూచినచో, నాగరికతాభివృద్ధియు, ధనమును మనోశాంతిని దూరముగావించి మనుజుని జీవితమును దుర్భరముచేసి వారినట్టి దుర్మరణములపాలు గావించుచున్నదనియు దేలుటలేదా ?

*　　*　　*　　*

ఇంగ్లీషువారిలో 119 మందికి ఒకడువంతున పిచ్చివాళ్లు:—

గత పదియేండ్లలోనూ నూటికి 30 చొప్పున అభివృద్ధిపొందింది పిచ్చితనం. ఈ లెక్కను చూస్తే క్రీ.శ. 2136 నాటికి అంతా పిచ్చివాళ్లు అయిపోతారు.

ప్రస్తుతం ప్రతివాళ్లూ అప్పుడప్పుడు మాత్రమే పిచ్చివాళ్లు అవుతుంటారు. కాలిబంతి ఆటగాణ్ణి చూచి నీవు ఘోరంగా నవ్వితే, పిచ్చివాళ్ల వైద్యాలయంలోవున్న ఏపిచ్చివానికన్నా ఎక్కువ పిచ్చివాడవుగా మారిపోతావు ఆక్షణం. ఆపిచ్చివాడికీ నీకూవున్న భేదం ఎక్కడంటే నీపిచ్చితనం సమయానికి సరిపోయినట్టుగా వుంటుంది. అంతే.

మనస్సు సక్రమంగా లేక బాధపడుతూన్నవాళ్లు 150,000 కన్న ఎక్కువ గావున్నారు. మనస్సులో లోపములుండి బాధపడుతూన్నవాళ్లు 90,000 మందివున్నారు. మనస్సు సక్రమంలో లేకపోవుట అనగా ఏదోయొక వ్యాధితో బాధపడుట. మనస్సులో లోపం అంటే మెదడులోలోపం అన్నమాట.

ఇంగ్లాండులోనూ, వేల్సులోనూ, మొత్తం 100 000 మందివరకూ చికిత్సపొందవలసినవారు గలరు. కాని పొందడంలేదు.

పురుషులకంటే స్త్రీలే ఎక్కువ పిచ్చివారు అవుతూవుంటారు. గతవత్సరంలో నలుగురు పురుషులు, ఐదుగురు స్త్రీలుచొప్పున పిచ్చివారుండేవారు.

కాని మధ్యతరగతివారిలో నలుగురుస్త్రీలు, ఐదుగురు పురుషులుచొప్పున పిచ్చివారుంటారు. దీనికి కారణం బాధ్యతఅంతా పురుషులమీదే వుండడం. ఉద్యోగం, పరిస్థితులు గ్రహించుకోలేనిభార్య, ఇవి పురుషులను సులభంగా పిచ్చివాళ్లని చేస్తాయి.

*　　*　　*　　*

అద్భుతమైన బ్రిటిషు విమానము 'కేనొపస్':—

"కేనొపస్" అను బ్రిటిషు విమానము ఆఫ్రికా, యూరపుల మధ్య ప్రయాణము సాగించుటకు సిద్ధముగా నున్నది. ఇంత పెద్ద విమానము, ఇంత వేగముగల విమానము ఇంతవరకు ఎచ్చటను, ఎవరును నిర్మించి యుండలేదు.

దీనిలో చక్కగా పచారీచేయుటకు తగినంత ప్రదేశముగలదు. సిగరెట్లు కాల్చుకొనుటకు, చదువుకొనుటకు వంటచేసికొనుటకు, ఇంకను వివిధ కార్యములకు ప్రత్యేక భాగములుండును.

పగటిపూట సరదాగాతిరుగుటకు ఇష్టములేనివారికి చక్కనిపడక కుర్చీలుండును. రాత్రులు ఆకుర్చీలన్నియు శయ్యలుగామారిపోవును. అమెరికాలోని దూరప్రయాణపు రైలుబండ్లలోవలె శయ్యలు ఒకదానిపై నొకటి అమరి సౌఖ్యముగానుండును.

ఈ విమానములో దగ్గరప్రయాణమునకు అయినచో 24 గురు ప్రయాణము చేయవచ్చును. దూరపు ప్రయాణమైనచో 16 గురకు అనుకూలముగ నుండును. తక్కినస్థలమును పడకలు ఆక్రమించుకొనును.

విమానములో రెండుభాగములు గలవు. క్రిందిభాగములో ప్రయాణీకులుందురు. తోకదగ్గరగదిలో మెయిలు (టపా) ఉండును.

పైభాగములో విమానోద్యోగులుందురు. ముక్కుదగ్గర బ్రిడ్జియుండును. దానిముందు అద్దముకిటికీ ఉండును. ఇక్కడనుండి యంత్రమును నడుపుదురు. ఆబ్రిడ్జికి వెనుకప్రక్క రేడియోగది ఉన్నది.

ఈగదికి వెనుకనే పర్సరు, షిప్పుక్లర్కులు ఉందురు. వీరు రాత్రులందు టపాను జాగ్రత్తగా చూచు చుందురు.

ఆఫీసుకు ప్రక్కనే ఉద్యోగులు నిద్రించుగదులున్నవి. వీరు మొత్తము 5గురు ఉందురు.

క్రింది భాగములో పొగత్రాగు స్థలమునకును, మొదటిగదికిని మధ్య విమానపుచట్రము ఉండును.

"కేనొపస్" ఒక ఏకచక్రవిమానము. చక్కగా అమర్చిన పరికరములతోనుండును. ముందుకు త్రోయు యంత్రములగతిని మార్చుచుండవచ్చును. గాలిని నిలువచేసికొను పెద్దపెట్టెలు గలవు. రెండుపక్షముల మీదను రెండేసివంతున, నాలుగు 740 హెచ్.పి శక్తిగల యంత్రములను అమర్చిరి. ఈ నాలుగు యంత్రములును మొత్తము గంటకు 200 మైళ్ల వేగమును కలిగించును. కాబినుమీద ఇవి జాగ్రత్తగా అమర్చుటవలన విమానము ఎగురుచున్నపుడు చప్పుడేమియు వినిపించదు.

* * * *

భార్యవస్తువులను బలాత్కారముగ తీసుకొనిఅమ్ముకొనుటకు భర్తకుఅధికారం ఉందా?

అధికారం ఉన్నా లేకపోయినా — బలాత్కారంగా తీసుకవెళ్లి అమ్ముకోటంమాత్రం నిత్యము జరుగుతునేఉన్నది. హక్కుఎవరిది అన్నవిషయమై ఇంతవరకూ నిర్ణయంకాలేదు. ధన్‌బాడ్ మేజస్ట్రీటుగారు ఈ సమస్యను ఇట్లే పరిష్కారంచేశారు. భార్యసొమ్ములపై భర్తకు అధికారంలేదు. అవిపూర్తిగా వారికే చెందియుండును. పదిసంవత్సరములక్రితము గాడాయ్, హేమబాలలకు వివాహంజరిగింది. ఇద్దరు కుమార్తెలు కలిగారు. ఇద్దరూ చనిపోయారు. భర్త గాడాయ్ భార్యను పుట్టింటికి పంపివేయటానికి ప్రబల ప్రయత్నములుచేశాడు. ఎన్నోవిధాల హింసించాడు. చివరకు ఎలాగైతేనేమి బయటకు తరిమివేశాడు.

పంపివేసేటప్పుడు ఆమెవంటిపైనన్న 900 రూపాయిలు ఖరీదుగల ఆభరణాలను వలిచివేసుకున్నాడు. ఈ సొమ్మును వివాహమపుడు తండ్రి ఆమెకు చదివించాడు. వస్తువులను ఊడబెరకటంలో ఆమె మామకూడా భర్తకు తోడ్పడినాడు.

రాజీగా పరిష్కారంచేసుకోటానికి తండ్రీ కూతురూ చాల ప్రయత్నంచేశారు. కాని లాభంలేక పోయింది. అప్పుడు కోర్టులో ఫిర్యాదుచేశారు. మేజస్ట్రేట్ యస్. దత్తాగారు విచారణలు జరిపి తరువాత కేసును తయారుచేసిరి.

తను రెండవపెండ్లిచేసుకోటం ఆమెకు ఇష్టంలేనందున హేమబాల ఇలా కేసుపెట్టిందని వాదసందర్భము మేజస్ట్రేటు సాక్ష్యమును బాగా పరిశీలించి ఈ క్రింది తీర్పును చెప్పిరి.

ఆ సొమ్ములను వివాహమప్పుడు ఇచ్చారు. అది స్త్రీధనం. హిందూధర్మశాస్త్రప్రకారం ఆసొమ్ముపై మరెవ్వరికినీ హక్కులేదు భర్తవదలివేసిన తరువాత ఆమెకు జీవనాధారము ఇంకేమియూ లేదు.

* * * *

3000 మైళ్లు ఇంట్లోనడక:—

ప్రతిరోజూ ఆపనిమీదా యీపనిమీదా ప్రతివాండ్లూ ఎంతదూరము నడుస్తారోనని పెద్దలు ఒక లెక్క తయారుచేసినారు. లండనులోనూ న్యూయార్కుపట్టణములోనూ యింట్లోస్త్రీ ఆపనికీ యీపనికీ సంవత్సరముకు మూడువేలమైళ్లు నడుస్తుందని అంచనావేసినారు. వాళ్లూ వీళ్లూ వచ్చినప్పుడు ఇంట్లోనుంచి తలుపుదగ్గిరకు రావడానికే రోజుకు ఒకమైలుచొప్పున నడవడము అవుతుంది.

ఇంకా మరీ ఆశ్చర్యము ఏమంటే బజారుకు కొనుక్కోడాని ఆడవాళ్లువెళ్లితే ఆషాపుదగ్గిరకూ యీషాపుదగ్గిరకూ నడవడానికి రోజుకు దామాషాను 8 మైళ్లు పడుతుంది.

మామూలుగా ఒకరైతు పొలముదున్నేటప్పుడు రోజుకు యిరవైఅయిదున్నరమైళ్లు నడుస్తాడట. గోల్ఫ్ఆటలో మామూలుగా 18 రంధ్రములదగ్గిరకు వెళ్లడానికి యెనిమిదిన్నరమైళ్లు పడుతుందట నాట్యము చేసేటప్పుడు నట్టువరాలు ఒకమైలుదూరం నడుస్తుందట.

ప్రతిరోజూ బీటుపోలీసు 14 మైళ్లు నడుస్తాడు. పోస్టుజవాన్ రోజుకు సామాన్యముగా యిరవైరెండు మైళ్లు నడుస్తాడు.

లండనునగరములో మనరాజుగారి బక్కింగ్‌హాము రాచనగరులో కాపలావారు రోజుకుయిరవైఆరు మైళ్లు నడుస్తారట.

* * * *

వంటపొయ్యి తగాదా:—

యుగోస్లావియా విలికేకిండా గ్రామంలో యిద్దరు స్త్రీలకు వంటపొయ్యివద్దతగాయిదా వచ్చినందున ఒకస్త్రీ రెండవ ఆమె కుటుంబానికి విషముపెట్టింది.

ఇద్దరుస్త్రీలు ఒకేయింట నివసిస్తూవున్నారు. ఆయింటికి ఒకటే వంటయిల్లు అందులో వొకటేపొయ్యి. ఆరెండుకుటుంబములవంటను ఆపొయ్యిమీదనే చేయాలి పొయ్యిని యెవరుముందు వినియోగించడము అనే విషయమువద్ద నిత్యమూ తగాయిదా వస్తూవుండేది.

ఆయిరువురిలో ఒకతెకు పానాకు చివరకు పట్టరానంతకోపమువచ్చింది. అందువల్ల రెండవస్త్రీ డెకాంకా వంటపూర్తిచేసి పులుసు అప్రక్కపెట్టి వెళ్లడము చూచి పానా అందులో ఎలుకవిషముతీసి కలిపివేసింది.

# తలవెంట్రుకలను నిడుపుగా, మృదువుగా సుందరముగా నుంచుకొనుటకీ సులపద్ధతి నవలంబింపుము.

విడువక స్వస్తిక శీకాయ సబ్బు వాడుచున్నచో నీకుకూడ దీర్ఘములై సుందరములైన కురులుండగలవు. ఈసబ్బు తలవెంట్రుకల శుభ్రపరచుటలో నద్వితీయమైనది; కొప్పు దీర్ఘముగ పెరుగజేయును; నైగనిగ్యము కూర్చును; చుండు మాన్పును. కుంతలాభివృద్ధికి పేరుగాంచిన శీకాయ మొదలగు దినుసులతో శీకాయ సబ్బు తయారుచేయబడినది.

ఇది ఒక బిళ్లగాగాని, మూడు బిళ్లలుగల పెట్టెలుగాగాని దొరుకును. ఒక్కటి యుపయోగించిననే దాని సుగుణము మీకు తెలియగలదు. దీనికి మంచివాసన గలదు. స్నానాదుల కాదర్శప్రాయముగనుండును.




## ది స్వస్తిక్ ఆయిల్ మిల్స్ లిమిటెడ్

వడాలా — బొంబాయి

డెశాంకా, భర్త, ఆమెపిల్లలు తరువాత ఆపులుసు పోసుకొని భోజనముచేశారు. ఆపులుసు తిన్న అంతా నురుగలు క్రక్కుకొంటూ నేలపడిపోయి అదొకలాగు యేడ్వమొదలు పెట్టారు.

యిరుగుపొరుగువా రాధ్వని వినివచ్చి వైద్యుని పిలిపించారు. వైద్యుడు విసాన్ని క్రక్కించాడు. ప్రయోగింపబడినది విషమని తేలినతరువాత పోలీసులు పానాను ఎరెస్టుచేశారు. అప్పటికికూడా ఆమెకసి తీర లేదు. డెశాంకా యింకముందు పొయ్యి వుపయోగించదు. అదివొక పాఠంగావుంటుంది అంది.

*　　　　*　　　　*　　　　*

## అత్తగారితో పేచీలులేకుండా వుండాలంటే?

కోడలు ఈ క్రిందివిధంగా నడచుకోలంటున్నా రొకరు.

ఆమె పూర్వపద్ధతులను ఆక్షేపించకూడదు.

ఆమె గృహనిర్వాహణపద్ధతులను సంస్కరింప పూనుకొనకూడదు.

ఆమె కుమారునితో మెలగేపద్ధతిని తప్పుపట్టకూడదు.

ఆమె చెప్పింది చేయడానికి గుఱ్ఱుమనకూడదు.

ఆమె నిజంగాగాని, లేక ఊహించుకొనిగాని బాధపడుతుంటే చిన్నపుచ్చకూడదు.

ఆమెకున్న వాడుకలను వెక్కిరించకూడదు.

ఆమె దగ్గర ఓర్పుఎప్పుడుగాని విడువకూడదు.

*　　　　*　　　　*　　　　*

## బర్మా గోవుల విచిత్ర వాడుకలు :—

రంగూన్‌లో ఇంతకుపూర్వము ఆవులు ఎప్పుడుకూడా ఇంత ఆశ్చర్యకరంగా ప్రవర్తించియుండలేదు. వాటి సాధారణపుమేత గడ్డి, త్రాగేది కుడితి. కాని ఇటీవల ఆవులుకూడా ఆహారపదార్థములలో పరిశోధనలు ప్రారంభించినట్లు కన్పడుతూఉంది.

గడ్డితినటం మానివేసి కాగితములను తింటున్నవి రంగూన్‌ఆవులు. ఇది చాలాకాలంక్రితమే ప్రారంభమైంది. పూర్తిగా గడ్డితినటం మానివేయకపోయినా కాగితాలమాత్రము తినటం సామాన్యమైపోయింది.

క్రిందటివారం మరింత ఆశ్చర్యకరమైన విషయంజరిగింది. భూమిగుండ్రంగా ఉన్నదని నిరూపించటానికి చిన్నతనంలో చెప్పే చీమకథ స్ఫురణకు వచ్చేటట్లు ప్రవర్తించినవి కొన్నిఆవులు. తామిచ్చినపాలను తిరిగి అవే త్రాగినవి. నిజంగా ఆశ్చర్యకరమైన విషయం!

*　　　　*　　　　*　　　　*

## దినమునకు మూడుసార్లు నిద్ర.

జర్మనీశాస్త్రజ్ఞులు నిద్రపోవు కాలపరిమితి బాగులేదనియు దానివలన కాలము వృథా అగుచున్నదనియు, అనారోగ్యమునకు కారణ మగుచున్నదనియు క్రొత్తమార్పు జేయదలంచిరి. దినమును మూడుభాగములుచేసి ప్రతిభాగములోను 2 గంటలచొప్పున నిద్రపోయి మిగిలినభాగములు ఇతరపనుల కుపయోగించిన యెడల నిద్ర గాఢముగ నుండుననియు ప్రజ లారోగ్యవంతు లగుదురనియు చెప్పుచున్నారు.

# గ్రంథ పరిచయము

**నెహ్రూ చరిత్రము**  భారతదేశమందు గాంధీమహాత్ముని తరువాత అంతటి నేతయై మహాత్ముని అహింసాసిద్ధాంతముల నన్నింటిని చక్కగ నవగాహమొనరించుకొని వానితో తన స్వతంత్రాభిప్రాయముల చేర్చి భారతదేశవిముక్తికి పాటుబడుచుండు మహావ్యక్తి జవహరిలాల్ నెహ్రూ. వీరిసాహసము, ధైర్యము, త్యాగాది ఉన్నతగుణములు భారతీయులెఱుగనివిగావు. అందుచే వీరిజీవితి మాదర్శప్రాయముగా ప్రతి భారతీయుడును జదువవలసియుండును. ఆ సదుపాయము ఆంధ్రలోకమునకుగల్పించి జవహరిలాల్ గారి జీవితచరిత్రము క్లుప్తముగరచించి దానియందే వారి తండ్రిగారిజీవితమును పొందుపరచినందులకు శ్రీయుత కొమండూరు శఠకోపాచార్యులగారి కాంధ్రులు కృతజ్ఞులైయున్నారు. ఈచరిత్ర మాబాలగోపాలము చదివి ఆదర్శప్రాయులైన దేశభక్తులగుదురుగాక. వెల 8 అ. ప్రతులు గ్రంథకర్తగారివద్ద కాకినాడలో దొరుకును.

**ఉద్యానకృషి**  ఇది వ్యవసాయ విషయములను గురించి తెలుపు చిన్నపుస్తకము. 4,5,6 పారముల విద్యార్థులకును, హయ్యరుగ్రేడు ట్రయినింగువిద్యార్థులకు మిక్కిలి ఉపయోగపడును. ప్రతివిషయములోను ముఖ్యాంశములను సులభముగా బోధపడునట్లు మన దేశపద్ధతుల ననుసరించి వ్రాయబడినది. ముఖ్యపదములకు ఇంగ్లీషు మాటలుకూడ గలవు. ప్రతివారును ఈపుస్తకము చదివి వారిఇండ్లనుచేరియున్న తోటలనుకూడ వృద్ధిచేసుకొనుట కుపకరించును. వెల 8 అణాలు. గ్రంథకర్త—పెయ్యేటి వెంకటేశ్వరరావు, హార్టికల్చరల్ ఇనస్పెక్టరు, మిషన్ హైస్కూలు, భీమవరం.

### పుస్తక స్వీకారము

**గోమాతృరక్షణము**
గ్రంథకర్త
కర్ణవీర నాగేశ్వరరావు,
సాహిత్యోద్యానము, చీరాల.

---

**రాఘవశతకము**
వేదనభట్ల వెంకన్నప్రణీతము.
పబ్లిషర్, Mrs. తాత కృష్ణమూర్తి, భద్రాచలం.

---

**పద్య హిందూదేశ చరిత్ర**
సి. ప్రశ్నోత్తరములు25 పద్యములు
గ్రంథకర్త
దేవరకొండ అమ్మన్న శాస్త్రి,
ఇన్నీసుపేట, రాజమండ్రి.
20 పేజీలు. వెల 0-1-0.

---

**శ్రీ వివేకానందస్వామివారి యతిగీతము**
గ్రంథకర్త
కూచి నరసింహముగారు, పిఠాపురము.
వెల 0-1-0.

# పత్రికాపరిచయము

## ప్రాక్పశ్చిమ వైద్య సమ్మేళన పత్రిక.

డాక్టరు ఎ. సుబ్బారావు L. M. P. గారి సంపాదకత్వమున ఎలమంచిలినుండి వెలువడు మాసపత్రిక. ఈసంచిక దసరాసంచికయైనను ఇందు పసిపిల్లలు—పాలు ఒక వ్యాసము మాత్రమున్నది. ఇందు మాతృస్తన్యముయొక్క ప్రాముఖ్యము, శిశువులకు పాలిచ్చువిషయములో గమనింపవలసిన విధులు, పోతపాలునందలి కీడు వివరముగా వ్రాయబడియున్నది. ఇది వైద్యులకును వైద్యేతరులగు స్త్రీ పురుష బాలబాలికలకును ఉపయోగపడునన్న సంపాదకులతో నేకీభవింపము గాని, తల్లులకిది యుపయుక్తమని తలంతుము. ఈసంచిక వెల మాత్రము 2 అ. సంవత్సరచందా రు 3.

## వైద్యప్రదీపిక (సంవత్సరాదిసంచిక)

గుంటూరునుండి శ్రీ ప్రొ.డి. రంగాచార్యులవారి యాధిపత్యమున వెలువడు వైద్యప్రదీపిక సంవత్సరాది సంచిక మాకందినది. ఇందు పెక్కువిషయములపై చక్కనివ్యాసములు గలవు. పూర్వకాలమున కవులకు కవిత్వముచేయుట కితరవిషయములులేక పోవుటచేతనో, లేక రచయితలందరు అన్నివిషయములను పద్యకావ్యములందే వ్రాయవలయునను వేలంవెర్రిక్రిందనో వైద్యవిషయములను పద్యకావ్యములలో రచించియుండచ్చును. కాని నేడైన ఆభ్రమనువీడి భిషగ్వరులు వైద్యవిషయములను సుబోధకమగు శైలియందు వచనములో వ్రాసిన మంచిదని దలంచెదము. ఇందు పెక్కుమంది భిషగ్వరుల చిత్రపటములును, వానివివరములను చేర్చుట ముదావహము.

## వీణ

తెల్లప్రోలునుండి శ్రీయుత పాటిబండ మాధవశర్మ గారి సంపాదకత్వమున వెలువడుమాసపత్రిక. పత్రికను సంబంధించిన వివరములు సంచికయందు లేవు. ఆవివరములు పూర్తిగా ప్రకటించిన చదువరుల కనుకూలముగ నుండుననుకొందుము.

ఈపత్రిక వ్యావహారికాంధ్రము నెక్కువగా యాదరించున ట్లగపడుచున్నది. వ్యాసములు వివిధ విషయములకు సంబంధించియున్నవి. ఆంధ్రపాఠకలోకమునకు చిరపరిచితులగు శివశంకరశాస్త్రి ప్రభృతుల రచనలు గలవు. క్రమక్రమమున వీణ హృదయానందకరముగ మంజులధ్వనిని ప్రయోగించు యని యాశింతుము. రాయల్ 1/8 సైజు. సాలు చందా రు 3—0—0 విడిప్రతి 0—4—0 అణాలు.

## మాతృభారతి

హైదరాబాదు(దక్కన్)బాలికోన్నతపాఠశాల ఆంధ్రవిద్యార్థినీగణముచే శ్రీ బిరుదు వెంకటశేషయ్య గారి సంపాదకత్వమున వెలువడుచున్నది. ఇందు చాలవఱకు విద్యార్థినులే వ్యాసముల రచించిరి. సారస్వతాభిలాష వీరివ్యాసములం దమితముగ గానవగును. ఈ విద్యార్థినులందరు మాతృభారతి సాక్షాత్కారము బొందుదురుగాక.

## Progress

భీమా, బ్యాంకులు, వ్యాపారము రైల్వేవిషయముల చర్చించు మాసపత్రిక. పైవిషయములు ఆంగ్ల, ఆంధ్ర, తమిళభాషలం దీ పత్రికలో ప్రచురింపబడును. సాలుచందా రు 3-0-0 విడిప్రతి 4 అణాలు. సంపాదకులు శ్రీయుత కె. ఎస్. సుబ్రమణ్యంగారు, 10, ముత్యాలుచెట్టివీధి, పరశువాకం, మదరాసు.



శ్రీమతి శకుంతలాదేవిగారు.

మీరట్ సార్ధన స్త్రీవిభాగమునకు స్వతంత్ర అభ్యర్థినిగా సంయుక్త పరగణాల శాసనసభకు నిలుచుచున్న మహిళామణి. ఈమె కన్యా గురుకులోన్నత పాఠశాల ప్రధమోపాధ్యాయిని.



మిస్. టి. కె. రాజమ్.

పుదుక్కోట రాణి బాలికోన్నత పాఠశాల ప్రధమోపాధ్యాయిని. పుదుక్కోట లెజిస్లేటివ్ కవున్సిల్ సభ్యురాలుగా నియమింపబడినది.



శ్రీమతి ఎం. కమలమ్మగారు,

బి. ఎస్. సి. (ఆనర్సు)

బెంగుళూరు సెంట్రలుకళాశాలయందు బి.ఎస్.సి. 'ఆనర్సు'నందు ప్రథమతరగతిలో ప్రథమురాలుగా యీ సంవత్సరము పరీక్షనైు బంగారు పతకమును బడసినది.



మిస్. ఎల్. భాగీరథీబాయి పిళ్లెగారు.

ఎల్. ఎల్. సి. సభ భారతీయశాఖకు
ప్రతినిధురాలుగా వెళ్లివచ్చిరి.



మిసర్స్. జె. బోలెండ్.

టెన్నిస్ ఆటయందు ప్రవీణులైన స్త్రీలలో
ప్రథమురాలు.



శ్రీమతి సేతూబాయిగారు బి. ఎ.

మైసూరు విశ్వవిద్యాలయమున ఈ సంవత్సరము బి. ఎ. యందు ప్రథమ శ్రేణిలో ను త్తీర్ణయై రెండు బంగారు పతకములను, నాలుగు వివిధ బహుమతులను బడసినది.




## పోటీవ్యాసములు — బహుమతులు

1935 వ సంవత్సర దసరాసంచికయందు "స్త్రీ పురుష సమానత్వమావశ్యకమా, ఎందేని యనర్థదాయకమా?" అను విషయముపై ఉత్తమ వ్యాసమును వ్రాసిన సోదరీమణికి బంగారుపతకము బహుమతిగ నివ్వబడునని ప్రకటించితిమి. తదుపరి మాకు చేరిన వ్యాసములలో నుత్తమములని యెంచిన శ్రీమతులు మైదవోలు పద్మావతి వేదులమీనాక్షిగారల వ్యాసములు గతసంచికలో ప్రకటించితిమి. మేము మొదట ఒకవ్యాసమునకే బహుమతి యివ్వదలంచుకొన్నను ప్రకటింపబడిన రెండును కొంచమెచ్చుతక్కువగ సమాన విలువగలిగియుండుట చేతను, ఇట్టి ప్రోత్సాహమికమీదట పెక్కుమందిని పోటీయందు పాల్గొనజేయ నక్కరగల్గించుననియు నుద్దేశ్యముతో ద్వితీయ వ్యాసమును రచించిన శ్రీమతి వేదుల మీనాక్షీదేవిగారికి కూడ నొక బంగారు పతకమునే యివ్వదలంచితిమి. ఈ బహుమతులు ఏటేటజరుగు గృహలక్ష్మీ కంకణ బహూకరణసమయమున నొసగబడును. ఇది డిశంబరుమాసము 27-వ తేది ఆదివారము నెల్లూరులో జరుగును.

ఈ సందర్భమున వ్యాసరచన విషయమై యొక సంగతి వ్రాయుట మంచిదని తలంతుము. ఆంధ్రనారీమణులలో చక్కని వ్యాసరచన చేయువారు లేరని చెప్ప సాహసింపజాలము. కాని వారికి ప్రోత్సాహమున్నను లేకున్ననుకూడ వ్యాసరచనకు బూనకున్నారని మాత్రము చెప్ప సాహసింపగలము. దానికిపై పోటీవ్యాసమొక నిదర్శనము. ఇట్టి సమయమునందు కూడ రచయిత్రులు వ్యాసముల బంపకుండుటచే పేరు ప్రతిష్టల యెడకూడ నంతశ్రద్ధలేని వారనుకొనవలెనా? పోనీ ప్రోత్సాహములు లేకపుడైన వ్రాయుచున్నారాయన్న నదియునులేదు. ఇట్లుండుట సోదరీమణులకొక గొప్పలోపమనుటకు క్షమింతురుగాక. ఇకమీదటనైన నట్టి కళంకమును తుదముట్ట నిర్మూలించి వ్యాసరచనకు దొడంగుదురని ప్రార్థించుచున్నాము.

* * *

## సాహిత్యము — మహాత్ముని యుద్బోధ

విద్యావిషయమున నితరదేశములకంటె

చాల వెనుకబడియున్న భారతదేశమందు సకల సాహిత్యములు సర్వతోముఖముగ నభివృద్ధిజెంది జనసామాన్యమున కుపకరించు నావశ్యకత ఎంతేనిగలదు. జనసామాన్యమున కుపకరింపవలయునన్న కేవలము పండితుల కర్థమగు గ్రాంథికశైలియందు గాక సులభభాషయందు వ్యావహారిక భాష యందు పండితులందరు గ్రంథముల వ్రాయ వలసియుండును. ఈ విషయమై మహాత్మా గాంధీగారు పద్రెండవ సాహిత్యమహాసభ కధ్యక్షతవహించినపు డిట్లు వచించిరి. "గ్రామములలో నివసించు నోరులేని అసంఖ్యాకులగు ప్రజలప్రతినిధినని నే దలంచు చున్నాను. గ్రామస్థులందరు సులభముగ నర్థముచేసికొనగల సులభశైలియందు గ్రంథముల వ్రాయవలయునని నేను పండితుల గోరుచున్నాను."

ఇందలి ప్రాముఖ్యమును గమనించియే ఆంధ్రదేశమున శ్రీయుత గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషాభిలాషను వృద్ధిగావించిరి. నేడు చాలమంది దాని నాదరించుచున్నారు. దానివలన జనసామాన్యము పెక్కు విషయముల సులభముగ నవగాహ మొనర్చుకొనుచున్నది. విద్యావంతులీ లాభమును గుర్తించి గ్రామస్థులకు గావలసిన సర్వవిషయముల నీ భాషయందు వారి కందింతురని కోరుచున్నాము.

ఈ సమయముననే మహాత్ములింకొక యమూల్యవిషయమును వ్యక్తము గావించిరి. "స్త్రీల విషయమై మీరు విపరీత వర్ణనలు చేయరాదు. స్త్రీ మీ జీవితములో మొదట మీ తల్లియనియు, తరువాత మీ సతీమణియనియు మీరు జ్ఞాపకముంచుకొని వ్రాయవలయును."

నేటి సాహిత్యములో స్త్రీలనుగూర్చి విపరీతపు వ్రాతలువ్రాయు వారందరికి యిది ప్రబోధముగ నుండగలదు. మహాత్ములనినది సర్వదా తన దృష్టియందిడుకొని వ్రాతకు గిడంగినచో నిపుడన్ని భాషలందును వెలువడు విచిత్రాభిప్రాయములు సన్నగిల్లుట కవకాశ ముగలదు.

* * *

## తిరువాన్కూరు హరిజనుల దేవాలయ ప్రవేశము

తిరువాన్కూరు మహారాజు తమ యిరువదైదవ జన్మదినమహోత్సవసందర్భమున చరిత్రయందు స్థిరముగ తన యశస్సు నిలచిపోవునట్టి మహాత్కార్య మాచరించి అఖిలభారతీయుల యొక్కయు విదేశీయుల యొక్కయు మెప్పు బొందినందులకు మిగుల యానందించుచు, వారి నభినందించుచున్నాము. అఖిలభారతదేశమందువలెనే తిరువాన్కూరునందుచాలకాలమునుండియు దేవాలయములలోనికి హరిజనుల పోనిచ్చు విషయమై చర్చ సాగుచునేయుండెను. నేటి మహారాజు యీసమస్యను విశాలహృదయముతో పరికించి మతముపేరట హరిజనులకు గలుగుచుండెడి యన్యాయములను దొలగింప నిశ్చయించి తన యాధిపత్యమునగల

దేశమందలి దేవాలయములలో అస్పృశ్యులని పరిగణింపబడుచు నింతవఱకు దేవాలయములలోనికి రానివ్వనట్టి హిందువులైన వారినందరిని అగ్రవర్ణులవలెనే దేవాలయముల ప్రవేశించుట కెట్టి యాటంకముండ కూడదని ప్రకటింపజేసెను. ఇట్టి ఘనకార్యములచేయ ప్రోత్సహించిన దివానుగారు సర్.సి.పి. రామస్వామిఅయ్యరుగారు భారతీయుల హృదీయవీధి చిరకాలము వెలుగగలరు. పరమాత్మ నర్చించుట కందరు తగినవారేననియు, మతము పేరట హరిజనుల కట్టి యవకాశము లేకుండజేయుట మతము యొక్క గొప్పలక్షణము గాదనియు చిరుతవయస్సుననే గమనించి భారతదేశమందలి ప్రసిద్ధ స్వదేశసంస్థానాధీశులందు మొదట వారై యిట్టి యాదర్శప్రాయమగు కార్యమాచరించినందులకు పరమాత్ముడు వారి కనేక జన్మదినమహోత్సవముల కవకాశమిచ్చి ప్రతిసమయమునందిట్టి యమూల్య కార్యముల జేయించుగాక. ఇతరసంస్థానాధీశులందరిది యాదర్శముగాగొని భారతదేశమునకు హిందూమతమునకు కళంకమైయున్న అస్పృశ్యతను సంపూర్ణముగ నిర్మూలించి దేశోద్ధారకులగుదురుగాక!

* * *

**ఆంధ్రదేశము—తుపాను**

అక్టోబరు యిరువదేడవతేది యారంభించి యాంధ్రదేశమును — ముఖ్యముగ గుంటూరుమండలమును — బీభత్సపరచిన తుపాను ప్రాబల్యమునుగూర్చి యెవరును వర్ణింపజాలరు. గాలిచే వానచే వరదలచే పాడిపంటలు నశించి పల్లెలుపట్టణములు కూడ ధ్వంసమయి నివాసయోగ్యములుగాక యున్నవనియు ప్రజలు పంచభూతముల ప్రతాపమునకుతోడు ఆకలిమంట బాధింప మలమలమాడుచున్నారనియు క్లుప్తముగ జెప్పనగునేమో కాని తుపాను బీభత్సమునకు గురియైన ప్రదేశములను చూచిన యిట్టి వ్రాతలందా ప్రదేశమందలి ఘోరములలో శతాంశమైనను ప్రదర్శింపబడలేదని యెఱుగగలరు.

నిలువనీడలేక తినుటకన్నములేక నల్లాడుచుండు వారలస్థితి నొకమారు మానసమందు దలంచి చేతనైనంతసాయమును ధనమూలముననైన, ధాన్యమూలముననైన మరేమూలముననైన వారికొనర్చి తోడ్పడురని సోదరసోదరీమణులనెల్ల ప్రార్థించుచున్నాము. ధనవంతులు తమకు తోచినంత సాయముచేయదలంచుట కింతకంటె యమూల్యావకాశములు గలుగవు. ప్రభుత్వమువారు ధనసహాయము చేయుటయందే గాక, పంటలు పాడైనభూములకు సిస్తులు వసూలుచేయుటలో పాడైన యిండ్లు గట్టుకొను సామాను ఉచితముగా నిప్పించుటలో యెక్కువగా బాధితులగు తోడ్పడురని తలంచుచున్నాము.

* * *

**గాంధీతనయుని మతముమార్పులు**

ప్రపంచమందు నేడందరిచే మహాత్మ డనిపించుకొను గాంధీగారి జేష్ఠపుత్రుడగు

హీరాలాలుగాంధివంటి వారినిబట్టియే 'పండితపుత్ర', 'సుపుత్రాకొంపబీకరా' వంటి సామెతలుబుట్టియుండును. మహాత్ముడు తన జ్యేష్ఠపుత్రుడు తనవంటివాడు గాక పోయెనని యెపుడు దుఃఖపడు గాని సాధారణ మానవునకంటె అధమముగా నిరంతరము ప్రవర్తించుచుండెనని వ్యసనపడును. పెద్దయైన అనుభవము గల్గునని యనుటకూడ హీరాలాలునెడ వమ్మయ్యెను. ఆతడు పలువ్యసనములకు దాసుడై తుదకు లోకోన్నతులగు మాతాపితలను గూడ నిందించుచు తన చర్యలకు దోహదము గలుగునని మహమ్మదీయ మతమునగలసి భారతదేశమంతయు దిరుగుచు ఆమతమే సర్వోత్కృష్టమైనదని చాటుచు, త్రాగి తందనాలు ద్రొక్కుచు కొంతకాలము గడపెను. నాడే మహాత్ముడు అట్టివారిని మహమ్మదీయమతమున — ఏ మతముననైన-చేర్చుకొనుట ఆమతమునకే కళంకమని చెప్పియుండెను. ఇటీవల ఆ హీరాలాలు దుర్మార్గములు మితిమీరగా కన్నతల్లి హృదయము కడుతపించి ఆతని చర్యల ఖండించుచు నొక బహిరంగలేఖను ప్రకటించెను. కస్తూరిబాయిగారి నిర్మల హృదయమున చెలరేగిన చిచ్చుయొక్క ప్రభావమో లేక తనయాట లింక మహమ్మదీయులమధ్య సాగవని హీరాలాలు హృదయమున బయలుదేరిన భయమో అతిని మరల హిందూమతము స్వీకరించునట్లు పురికొల్పినది. కాని అతడు మాత్రము తన పరివర్తనమునకు తనతల్లిగారి ప్రబోధమే కారణమని తెలిపినందులకు సంతసించుచున్నాము. ఏబదిసంవత్సరములకు పైబడియు, పెక్కు వ్యసనములకు లోబడియు నున్నకుమారుడు తల్లి ప్రబోధము వలన బాగుపడుననుచో మానవాభివృద్ధికి సోదరీమణు లెట్లా తోడ్పడి బిడ్డ దిద్ది తీర్చగలరో యెఱుగగలరు. హీరాలాలుగారి పరివర్తనమువలన హిందూమహమ్మదీయ మతముల కెంతమాత్రము గౌరవ గలుగునని యెంచము. ఈ మహాత్ముని తనయుడు తలిదండ్రుల జూచియైన యుత్తమమార్గమున చరించి వారి కానందమును గూర్చునని తలంచుచున్నాము.

22:—బొంబాయి కార్పొరేషను సభ్యురాలగు డాక్టరు మిసర్సు మలినీబాయి సుక్తాంకరుగారి అధ్యక్షతక్రింద బరోడాలో మహిళాసభ జరిగెను.

23:—అంతర్జాతీయ మహిళాసమావేశమునకు భారతీయప్రతినిధిగ హాజరగుటకై బ్రుసెల్సు నగరమునకు వెడలదలచిన కమలాదేవిచటోపాధ్యాయిగారికి ప్రభుత్వమువారు ప్యాసుపోర్టు నిరాకరించిరి.

26:—మ్యునిసిపల్ ఎలెక్షనులో శ్రీమతులు రుక్మిణమ్మ, అమ్ము స్వామినాధన్, విశాలాక్షమ్మ గార్లు కాంగ్రెసుపక్షమున విజయమొందిరి.

త్రివేంద్రములో గ్రామాభివృద్ధికేంద్రమును తిరువాన్కూరు రాజకుమారి కార్తీకతిరుణాలు ప్రారంభించెను. ఈకేంద్రము గ్రామస్త్రీల అభివృద్ధికొరకు నుద్దేశింపబడినది.

బాపట్లలో స్త్రీహితైషిణిమండలి లలితకళాప్రదర్శనము నేటితో ముగింపబడినది. శ్రీమతి ఎస్. అన్నపూర్ణమ్మగారు ప్రదర్శనప్రారంభోత్సవము జరిపిరి.

27:—శ్రీమతి లక్ష్మీభాస్కరరావుగారు బళ్లారిలో హరిజనులకుగాను విహారవనమును స్నానమందిరమును తెఱచిరి. గత ఆదివారం హాస్పేటలో శిశుసంరక్షణశాల తెఱచిరి.

28:—చీరాల, బాపట్ల ప్రాంతములందు పెద్దతుపాను వచ్చెను. చాలనష్టము గల్గెను.

బొంబాయిలో హిందూ మహమ్మదీయులు కొందరు కొట్లాడుటచే 70 మందిని ఎరస్టుచేసిరి.

డిశంబరు 6వ తేదీని 50వ భారతకాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక జరుగునని కాంగ్రెసు కార్యదర్శి ఆచార్య జె. బి. కృపాలినీగారు ప్రకటించిరి.

29:—పుదుపేటలో కాంగ్రెసుపక్షమున కార్పొరేషను ఎన్నికలందు విజయమొందిన ఆచంట రుక్మిణమ్మగారి గౌరవార్థమున పురజనులు పెద్దఊరేగింపు టుత్సవము జేసిరి.

మదనపల్లెలో శ్రీమతి రత్నాబాయిగారి అధ్యక్షతక్రింద చిత్తూరిజిల్లా మహిళాసభ జరిగెను.

30:—ఆల్డరుమెన్ ఎన్నికలలో కాంగ్రెసుపక్షమున పోటీలేకుండ స్త్రీల స్థానమునకు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు ఎన్నుకొనబడిరి.

అహమ్మదాబాదులో గాంధిమహాత్ముడు మ్యునిసిపల్ బాలికాపాఠశాల ప్రారంభోత్సవము జరుపుచు స్త్రీవిద్యాప్రాముఖ్యతనుగూర్చి ఉపన్యసించెను.

నైజాము నవాబుగారి కోడలు శ్రీమతి దర్‌షవర్ గారి అధ్యక్షతక్రింద హైదరాబాదు మహిళామండలి 10వ వార్షికోత్సవము టౌనుహాలులో జరిగెను.

31:—ఎర్నాకులంలో కొచ్చిన్ స్త్రీల వార్షికోత్సవము డాక్టరుగౌరీఅమ్మగారి అధ్యక్షతనుజరిగెను.

1:—రాజధాని ప్రధానమేజిస్ట్రేటు అబ్బాసాలీఖాన్ గారి అధ్యక్షతక్రింద ముస్లిముస్త్రీల విద్యావారముయొక్క ప్రారంభోత్సవము జరిగెను.

2:—శ్రీమతి హిజాబ్‌ఇంతియాజీగారు లాహోరు ఫ్లయింగుక్లబ్బులో వైమానికశిక్షణ నేర్చుకొన్న ప్రథమవైమానికురాలు. ఈమెకు లైసెన్సు ఇవ్వబడినది.

3:—పట్టాభిషేకము జరిగినతర్వాత తాను హిందూదేశమునకు వత్తునని ఎడ్వర్డు సార్వభౌముడు లండనులో పార్లమెంటు ప్రారంభోత్సవము జరుపుచు చెప్పెను.

4:—శ్రీమతి లిన్‌లిత్‌గో ప్రభ్విగారు గ్వాలియరులో ప్రసూతిఆసుపత్రి శంకుస్థాపనమహోత్సవము జరిపిరి.

హైదరాబాదు విమానాశ్రమము శంకుస్థాపనమహోత్సవము బీగంపేటలో రాజకుమార్తె శ్రీమతి దురేశ్వరుగారు జరిపిరి.

5:—గుంటూరు శ్రీసనాతనధర్మమండలియొక్క 31వ వార్షికోత్సవము జరిగెను.

8:—విరుధునగరు క్షత్రియ గర్ల్‌స్కూలులో తమిళనాడు మహిళాజనసభ జరిగెను.

9:—వై. డబ్లియు. సి. ఎ. ఆవరణములో అంతర్జాతీయకళావస్తుప్రదర్శనమునకు శ్రీమతి ముత్తా వెంకటసుబ్బరావు సతిగారు ప్రారంభోత్సవము జరిపిరి.

కరాచీలో సింధుశాఖ మహిళాసంఘమువారు సభచేసి దేశముఖుగారి బిల్లును అమలులోనికి పెట్టవలెనని తీర్మానించిరి.

10:—బొంబాయి హిందూమహమ్మదీయకలహములు తిరిగి జరుగుచున్నవి. ఇప్పటికి 71 మంది మరణించిరి. 600 మంది గాయపడిరి.

11:—కొచ్చిన్‌రాజాగారి భార్య శ్రీమతి వి. కె. లక్ష్మికుట్టి నెత్యారమ్మగారు త్రిచూరులో మహిళాసంఘపు నూతనభవనమును తెరచిరి.

14:—మహాత్ముని పెద్దకుమారుడు అబ్దుల్లాగాంధి తిరిగి హిందూమతమును స్వీకరించెను.

పెదపులివర్రు మహిళాసభ శ్రీమతి డాక్టరు కె. అచ్చమాంబగారి అధ్యక్షతక్రింద శ్రీ త్రిపురసుందరీ ఆలయములో జరిగెను.

15:—బొంబాయిలో తిరిగి అల్లరులు ఎక్కువయినవి. 400 మంది కొట్లాడిరి. 15 మందికి బలమైన గాయములు తగిలినవి.

16:—బెంగాలులో దేశముఖుగారి బిల్లుకు అనేకమంది అయిష్టతచూపుచున్నట్లు బెంగాలు గవర్నమెంటువారు తెలుపుచున్నారు.

బెంగుళూరు బైబుల్‌సొసైటీ మేనేజరు కుమార్తె శ్రీమతి కాంతమ్మగారు క్రిస్తవమతమును విడిచి హిందూమతమును స్వీకరించి దొరరాజుగారిని వివాహమాడిరి.

రామనాడులో కలెక్టరు గోపాలస్వామిగారి సతీమణి అధ్యక్షతక్రింద రామనాడు మహిళాసంఘముయొక్క ద్వితీయ వార్షికోత్సవము జరిగెను.

మిస్. ఇ. టి. చొక్కమ్మాళ్ గారిని మద్రాసు హైకోర్టు అడ్వకేటుగా చేర్చుకొనిరి. ఈమె గౌరవమేజస్ట్రేటుగను మద్రాసుజిల్లా విద్యాసంఘసభ్యురాలుగనునున్నారు.

20:—గుంటూరులో తుపానువలన నష్టపడినవారి సహాయార్థము శ్రీమతి అమృతకేరుగారు కలకత్తానుండి ఒక క్రొత్తచీరెలుబేలును దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారికి పంపెను.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## సముద్రమథనము



నాడు దేవదానవులకు అమరత్వము ఆరోగ్యము నిచ్చినది.

## అమృతము.

నేడు మనకు ఆరోగ్యము, నరములకు శక్తి, కండరములకు బలము తేజస్సు

నూత్న యౌవనము నిచ్చుచున్నది:

# జీవామృతము

ఆయుర్వేదాశ్రమము మదరాసు

# విషయసూచిక



త్రివర్ణ చిత్రము:

రాధాకృష్ణులు :

డిశంబరు 27 వ తేది ఆదివారము సాయంత్రము 4 గంటలకు వర్ధమాన సమాజమువారియాజమాన్యమున, శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి, ('హిందూ సుందరి' సంపాదకురాలు, కాకినాడ) యధ్యక్షతను, శ్రీమతి కవితిలక కంచనపల్లి కనకాంబగారికి గృహలక్ష్మీకంకణ బహూకరణమునకై నెల్లూరుపురమందిరమున సభ జరిగెను. ఆ సభకు నెల్లూరుపురమునగల సుప్రసిద్ధ స్త్రీపురుషులెల్లరు విచ్చేసిరి. శ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, మరి పెక్కుమంది వివిధ శాస్త్ర పారంగతులును సభ నలంకరించి యుండిరి. నియమితకాలమున ప్రార్థనానంతరము శ్రీయుత తూములూరి శివరామయ్యగారు శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారిని, శ్రీమతి కంచనపల్లి కనకాంబగారిని సభ కెఱుకపరచుచు వారి భాషాసేవను గొనియాడుచు, శేషమ్మగారి నధ్యక్షతవహింప సభాపక్షమున కోరిరి.

హర్ష తాళ ధ్వనులు చెలరేగుచుండ శ్రీమతి శేషమ్మగారధ్యక్షతపీఠ మలంకరించి యీరీతి యుపన్యసించిరి.

సోదర సోదరీమణులారా !

ఈసభలో నధ్యక్షతపదవి నలంకరించుటకు నా యధికారముకన్న నదృష్టము గొప్పది. సింహపురంబున పండిత కవి సమక్షమున, వర్ధమాన సంఘపక్షంబున, ఆయుర్వేదవైద్య కేసరియగు కేసరిగారు కవయిత్రీమతల్లియగు మొల్లజయంతినాడు కంకణప్రదానముచే బూజించు మహా

త్సవమునకు నే నధ్యక్షురాలనగుట కెంత పుణ్యముచేసితినో యని యనుకొనుచుంటిని. దేశమున నిండను విదుషీమణులుండ నుత్తమవిద్యావ్యాసంగ మింతయైనలేని నన్ను ప్రత్యేకమీ యధ్యక్షపదవికి నిర్ణయించుట కేమి కారణమా యనుకొంటిని. స్త్రీల పురోభివృద్ధికై ప్రచురింపఁబడు పత్రికకు అధిపతులువారు; నేనును పత్రికాధిపురాలను గానున నన్ను వారు నియమించియుందురు కాబోలు! స్వయముగ పాండిత్యము నాకు లేకున్నను, స్త్రీలు విద్యావతులగుటకు జేయు ప్రారంభముల వదలజాలక 35 యేండ్లుగ 'హిందూసుందరి' పత్రికను నడుపుచుంటిని. విద్యార్థినీ సమాజమను పేర ప్రచారము గావించుచుంటిని. ఈ రెండింటితో తృప్తిజెందక సమాజము యొక్క పేరు సార్థకముజేయనెంచి బాలికా పాఠశాలను స్థాపించి తగిన పండితులచే సంస్కృతాంధ్రములను హిందీ భాషను నేర్పించుచుంటిని.

ఇట్టి విద్యాగోష్ఠిలోనుండఁగా నీశ్వరానుగ్రహంబున గలిగిన యేకపుత్రికను విద్యావతిగానొనర్ప ప్రయత్నించుచున్నాను. ఇట్టిసంతత విద్యోపాసనమువలన గలిగిన పుణ్యమే నన్నీసభకు అధ్యక్షురాలినిగ జేసినది. రాజపౌరోహిత్య మెంతకష్టమో పత్రికాధిపత్యముకూడ నంతకష్టమే. అందు స్త్రీ పత్రికాధిపురాలుగనుండుకష్టము నే నెఱిగినంత ఇతరు లెఱుగరు. కాని శ్రీరామచంద్రుని గురుత్వము వహించుటకై వసిష్ఠుడు సూర్యవంశమును గనిపెట్టికొనియుండి నట్లు ఈనాడు మొల్లజయంతిలో విద్వాన్ కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకమ్మగారికి మహోత్సాహము జరిపించుసభ కధ్యక్షురాలుగా వచ్చుటకై గదా నేనీ పత్రికాధిపత్యమును విడిచిపెట్టక పట్టుక ప్రాకులాడుచున్నాను! నేటికి కృతార్థురాలనైతిని.

'హిందూసుందరి'కి మొదటిదినములలో నెల్లూరునుండి ముద్దులు మూటగట్టు పద్యములు, మనోహరమగు వ్యాసములు, తపాలుద్వారా వచ్చుచుండెడివి. 'హిందూసుందరి' చదువువారందఱు నాతోగూడ ఆ వ్యాసములు, పద్యములు చదివి గడుంగడు సంతసించి మా యువతీరత్నహారమునకు నాయకమణిగా నుండదగినవ్యక్తి యీ కవయిత్రియని కాకినాడలో విద్యార్థినీ సమాజములో జరిగిన మహిళాసభ కామె నధ్యక్షురాలుగా వరించి తపాలుద్వారా 1912 సంవత్సరములో ఆహ్వానము చేసితిమి. సభనాడు మేమందఱము పొగబండియొద్ద కధ్యక్షురాలి నెదుర్కొనబోగా మెఱుపుతీగ వలెనున్న యొక చిన్నదానిని పదియారేండ్ల ప్రాయము కలదానినిచూచి, యచ్చెరువందుచు నీమె యెవరైయుండునా యనుకొనుచుండ నామెతోడవచ్చినవా రీమెయే మీ యధ్యక్షురాలనిరి. అప్పటి మా యధ్యక్షురాలే యీ మహాకవయిత్రి కనకాంబగారు.

"నధర్మవృద్ధేషు వయస్సమీక్ష్యతే"

అని కాళిదాసమహాకవి చెప్పినట్లు అంత చిన్న వయస్సులో నీయమ్మమూర్తి మాకు

సేవ్యమైనది. ఆమె పలుకాజ్ఞయైనది. ఆ బాలామూర్తిలో పరమేశ్వరి తేజస్సు ఆ నాటికే చూచినవారందఱకు వ్యక్తమై యుండె. కారణజన్మయైన యీ విదుషీమణి దినదినప్రవర్ధమానయై తనయశస్సుచే దశదిశలావరించినది. ఆంధ్ర దేశమునందలి యువతీరత్నములందఱు పత్రికలు రాగానే "అవిగో కనకమ్మగారి పద్యము"లని యాసక్తిగ జూచుచుండిరి.

హిందూసుందరిలో, సావిత్రిలో, జనానాలో, అనసూయలో, దేశాభిమానిలో, దేశోపకారిలో, ఆంధ్రపత్రికలో, సంవత్సరాదిసంచికలో, భారతిలో, శారద, సుబోధిని, గృహలక్ష్మి పత్రికలలో నీయమ పద్యములు రత్నాకరములో రత్నములవలె ప్రకాశించునుగదా !

నేను పేర్కొన్న పత్రికలలోఁ గొన్ని యిపుడు లేవు. స్త్రీ విద్యాప్రచారము గావించు పత్రికలలో మా 'హిందూసుందరి' యొక్కటియె శ్రీ కనకాంబగారి చిన్ననాటి నుండి నేటివరకొక్కరీతిగా నిలచియున్నవి. తక్కినవి దేశకాలపరిస్థితులనుబట్టి యంతరించినవి. వానకాలపు వాగులు, వరదలు, శెలయేళ్లు, ఉప్పెనపొంగులు, అగ్నిపర్వతములు తత్కాలమునకు లోకమునకు విశేషాడంబరముతో ప్రచారమయ్యు కాలాంతరమున నామమాత్రావశేషముగా గొన్నియు నంతమాత్రమునకుఁ గాకుండఁ గొన్నియు నంతరించును. ఇట్లే పత్రికలు, ప్రవక్తలు, ప్రచారకులు, కవులు మొదలగువారొకకాలమున ప్రబలముగా విజృంభించి కాలాంతరమునణగిపోవుట గాంచుచుంటిమి.

వేయివత్తుల వెలుగుతో ప్రకాశించు విద్యుద్దీపము, తీగెలో శక్తి ప్రవాహ మాగిపోయినంత చల్లారి గాజుబుడ్డి మాత్రము మిగులును. అట్టులే యల్పప్రజ్ఞ లప్పటికప్పుడానుకూల్యమునుబట్టి యధికముగా వెలింగినను, అఖండజ్ఞాన తేజస్సున కధికరణమగు నాత్మానుసంధానము కలుగజేయు నుపాసనాబలము లేనికారణంబున నట్టివి కొలది కాలము వెలిగి మలగిపోవును. శ్రీ కనకాంబగారి తేజస్సట్లుగాక దినదినప్రవర్ధమానమై యీమె సంకల్పసామర్థ్యమునుబట్టియు, సద్గురూపాసననుబట్టియు, పట్టపగలింటి సూర్యకాంతితో సమానముగా వెలుగొందుచు, యువతీజనుల చక్షుస్తిమిరంబును బోగొట్టుచున్నది.

కనకాంబగారి కవిత్వము బుధజనానందకందమై, కందములతో నారంభమై తొలుదొల్త నీ నెల్లూరు శ్రీ రంగనాథచరణారవిందముల కర్పింపబడినది. ఇయ్యదియే రంగశతకమనబడు. రంగశతకానంతరము బాలబోధగా వ్రాసిన గౌతమబుద్ధ చరిత్ర, పాండవోదంతమును, కాశీయాత్ర తొలుత మా పత్రికలోనే ప్రకటింపబడినవి. రంగశతకమును, రాధయను నామాంతరముగల అమృతవల్లియు నెల్లూరు సుబోధిని ప్రకటించినదని వినుచున్నాను. రంగశతకము మొదలు ఆనందసారమువరకు ఈయమ కవిత్వమంతయు,

కం "పరదూషణ పరభూషణ
పరతన్ గవనంబు వ్యర్థపఱుపక పరమే
శ్వర చరణ స్మరణమునకె
గుతిచేసెన్ కనకమాంబ గురుకరుణాప్తిన్."

అను నెల్లూరు కవివర్యులగు దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి వర్ణనమునకు దగియున్నది.

బాల్యమునుండియు కనకాంబ గారుపాధ్యాయిగానుండి లేఖినీవిన్యాసమందే గాక బోధకతాశక్తియందును, విద్యార్థినులయు, విద్వాంసులయు మెప్పుగాంచిరనుట యెంతయు మోదావహముగదా! 16 వ యేట నెల్లూరు బాలికాపాఠశాలలో అంతకు మున్న రెండేండ్లనుండి నిర్వహించిన యుపాధ్యాయి పదవినివదలి చెన్నపట్టణ మున్నత విద్యకై పోవనున్న కవయిత్రి వీడ్కోలు సభలో బాలికాముఖంబున ప్రశంసించిన అభినవ తిక్కన దుర్భా సుబ్రహ్మణ్యశర్మ గారి వాక్కులు నేడును స్మరణీయములగుచున్నవి.

సీ. "తనబోధ మహిమనే తరుణి కష్టంపుఁ బా
ఠములను సులభసాధ్యముల జేసె
తనప్రవర్తనల నే తల్లిచెప్పకయే స
ద్గుణములు మాకుఁ జేకూరఁజేసె,
తనశేముషీ మహత్త్వమున నే జనయిత్రి
యాంధ్ర వాక్సాహిత్య మందగలిగె
తనతోడియమ్మలఁ దన యషంపవకు జి
త్తముల నేతన్వి సంతసిలఁజేసె

తే. గీ. అట్టి కనకాంబ యాత్మవిద్యాభివృద్ధి
కొఱకు మము వీడి యల చెన్నపురికిఁబోవు
నను నుదంతమ్ము స్వాంతమ్ములందుమాకు
చింతయును హర్షమును దారసిల్లజేసె.

"నాలుగేండ్లుగ మమ్ముఁగూడి య
నంతరీతుల మాకొగిన్
మేలొనర్చిన తల్లిస్నేకియ
మేము విస్మరియింపగా
జాలువారమికన్ బరీక్షలఁ
జాలదేరియు నీమె యీ
ప్రోలికే యరుదెంచి యిందునె
పొందుగాత మహోన్నతిన్."

అంతకుముందు రెండేండ్లు విద్యార్థిని రెండేండ్లుపాధ్యాయిగా నుంటచే పద్యమున నాలుగేండ్లని వర్ణింపబడినది.

కవివాక్కులు వినోదహేతువులగుటయే గాక విధివాక్యములుగా ఫలించుననుటకే సుబ్రహ్మణ్యశర్మగారివాక్కు లక్ష్యమగుచున్నది. ఆరు బంగారుపతకంబులు రెండు నూటపదారులు మహాసభలో నీ నెల్లూరు పురమందే యంతకుమున్న పుచ్చుకొని యుపాధ్యాయపదవినుండి విరమించి యున్నతవిద్యకుఁబోవు కవయిత్రి భావి భాగ్యోదయమును జూచినట్లుగా, నేటికి 24 సం॥ క్రిందట శర్మగారిట్లు వర్ణించుట యెంతవింత?

నెల్లూరునుండి చెన్నపురికరిగి యచట శ్రీ కనకాంబగారు ఆరుమాసములలో నాంగ్లేయభాషలో చక్కని ప్రవేశమొనర్చుకొని, ఇంటర్మీడియటువరకుచదివి, సంస్కృతాంధ్రముల నపారమగు పాండిత్యమును గడించి, యుద్గ్రంథములు వ్రాసి, యున్నత

పాఠశాలలో, గళాశాలలో, నుపాధ్యాయిగా, నుపన్యాసకురాలుగా, విశ్వవిద్యాలయమున బరీక్షకురాలుగ నుండి క్రిందటి సంవత్సరము మొల్లజయంతిసందర్భమున నీనగరమందే ఈ యగ్రాసనము నధిష్ఠించి మహాసభామధ్యమున బూజలొంది గుణగ్రహణపారీణులు సమరసమూర్తియగు తూములూరి శివరామయ్యగారియింట రు. 116 రూప్యములచేతను గుప్తముగా సత్కరింపబడియు, భాషాపోషకులగు మ.రా.రా. శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారి మహాకవి తిక్కనజయంతి కనువత్సరము చేయనెంచిన కవితాసన్మానము రు. 116 తానే ప్రథమము స్వీకరించి యువదాన్యవంశమున జన్మించిన మహారాజశ్రీ రేబాల పట్టాభిరామరెడ్డిగారిచే రు. 116 సన్మానమందియు, నీ సంవత్సరము మొల్లజయంతికి మహోజ్జ్వలంబగు' గృహలక్ష్మి కంకణమున' కర్హురాలై యిమ్మహాసభలోఁ బూజింపఁబడుచు

"ఈ ప్రోలికే యరుదెంచి యిందునె పొందుగాక మహోన్నతిన్'' అను కవి వాక్యమును సార్థకపఱచినారు.

ఈ మొల్లజయంతినాడు కనకమాంబ ననితర సాధారణముగ గౌరవించిన కే.యన్. కేసరిగారి యభిప్రాయము నెంతని కొనియాడుదును! ఆంధ్రస్త్రీలలో మూడు రత్నములు అమూల్యములు. మొదటిది మొల్ల. రెండవది తరికొండ వెంగమ్మ. మూడవది కనకాంబ. మూడు కాలములలో ముగ్గురుగా గానిపించినను యీ మూర్తిత్రయ మొక్కటియేయని నాకు దోచుచున్నది.

ఋణత్రయములో ఋషిఋణవిమోచనకై చేయు కర్మలలో నీ జయంతులు ముఖ్యమైనవి. ఈ జయంతులలో ఋషికల్పులగు మహాకవులను వారి గ్రంథములను వారొనర్చిన బోధములను స్మరించుకొని సంసారమార్గ సంచారముల దుమ్ముకొట్టుకొనిపోయిన మానసముల బరిశుద్ధము గావించుకొనుటయే ప్రధానకర్తవ్యముగా నున్నది.

స్త్రీ పురుషభేద మవయవములనుబట్టి వచ్చునని కాదు. జ్ఞానవిశేషము కానబడిన వ్యక్తులు పురుషులే కాని స్త్రీలుకారని వేదమునందుఁ జెప్పబడినదని పెద్దలందురు. అది నిక్కమే. ఉత్తమ కవితాశక్తి ధరించిన వారు ఋషులని కదా! "నానృషిః కురుతే కావ్యమ్మ''ని పెద్దలన్నారు. కాబట్టి స్త్రీ కవులకుఁగూడ ఋషిత్వము సిద్ధించుచున్నది. ఈమెభాష్యత్రయముయొక్కసారం తపస్సు యోగం మున్నగు అభ్యాసములచేతను ఆత్మానుసంధానంచేసినది. అదికాక కనకమాంబగారి కవిత్వము శిష్టసమ్మతమనుట కుదాహరణములు — దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు—

గీ॥ "అమృత సారంబుగాఁ గవిత్వము రచింప
శిష్టులౌననఁగ బవిత్ర జీవయాత్ర
సలుపనేర్చిన సతియోర్తు చాలదొక్క!
కామినీ లోకమునకెల్లఁ గాంతిగూర్ప"

వీరి గురువులు శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

"ఇట్టి దుర్భిక్షకాలమం దెపుడొ పూర్వ
ముపనిషత్తుల వినఁబడు నువిదల తల
మానికంబులఁబోలెడు మగువయోర్తు
పుట్టె మనభారతీయుల పుణ్యమనగ."

ఉపనిషత్తులలో వినబడు గార్గిమైత్రేయీ మొదలగు నారీరత్నములకు శిరోభూషణ మువంటిది కనకాంబగారని వేంకటశాస్త్రి గారు కంఠోక్తిగాఁ జాటినారు. అంతియే గాక "పుట్టె మనభారతీయుల పుణ్యమనగ" అను మహాకవి ప్రయోగమునకు సార్థక్యమే మైయుండును?

"పుట్టె మనతెల్గువారల పుణ్యమనగ" అనవలసియుండగా భారతీయ పదప్రయోజనము పదియేండ్లకు బైటపడినది.

కనకాంబగారి జీవయాత్రను వ్యాకరణ భాష్యవేత్తలగు శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ లంక లక్ష్మీనృసింహశాస్త్రిగారు సంస్కృతములోని కనువదించుచున్నారు.

అదిగాక జగద్విఖ్యాతులగు రాధాకృష్ణయ్యగారు సాహిత్య సామ్రాట్టగు విక్రమదేవవర్మ మహారాజుగారు మొదలగు మహామహులచే మిక్కిలి కొనియాడబడిన మన కనకమాంబగారి "హంసవిజయ నాటకము"ను ప్రాచ్యభాషాకోవిదులగు కూచి మంచి సుబ్బారావుగారు హిందీభాషలోని కనువదించి పూర్తిచేయుట నేనుస్వయముగా నెఱుంగుదును. ఈరెండు కారణములనుబట్టి కనకాంబగారి గ్రంథములు యావద్భారతవర్షవ్యాప్తికలిగి సకలజనులకుఁ దారకంబులు కాగలవని "మహాకవి" వేంకటశాస్త్రిగారట్లు చెప్పియుండిరికదా!

వీరి గురువులు కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు పంచమవేదము ననువదించిన విమర్శకతాశక్తితో నీకనకాంబ గారి జీవయాత్రం దిలకించి—

"గీతాశాస్త్రము వెనుక సీతారామాంజనేయము, దాని తరువాత భూతలమున ఖ్యాతిజెందగజాలినది జీవయాత్ర" యని ప్రశంసించిరి. అదిగాక భరతఖండమంతయు వ్యాపించ దగినదని వేంకటశాస్త్రిగారు చెప్పియుండగా వారి గురువులగు కవిసార్వభౌములు—

"సాధుసమ్మతముగ నిట్లు సర్వమాన
వోపయోగముగాఁ దత్త్వముత్తమార్థ
బోధకంబుగఁ గనకాంబ పొందుపఱచె
నెల్లరకు దీననానంద మెసగుగాత!"

భరతఖండమునందేకాక జీవయాత్రలోని బోధములు సకల మానవులకు నుపయోగింపఁదగిన తత్త్వము పరమార్థబోధకంబుగా శ్రీ కనకాంబగారి గ్రంథము లాంగ్లభాషలోని కనువదించుటకుఁ దగుపండితు లుద్యమించుచున్నారని సభవారికిఁ దెలుపుట కెంతయు సంతసించుచున్నాను.

సోదర సోదరీమణులారా!

సోదిగా చెప్పినమాట చెప్పి కనకాంబ గారిని నేను భూషించుచున్నానని మీరనుకొనరాదు.

కలికాలమున పెద్దలపేరుల స్మరించుకొని ప్రకృతకాలమునయున్న వారినే వశిష్ఠులుగా వామదేవులుగా తిక్కనలుగా వాల్మీకులుగా వ్యవహరించుకొనుచున్నాము. ఈ మొల్ల

జయంతినాడు బహూకరింప సమకట్టిన కేసరి గారిచే యీ మహాసభమధ్యంబున నెల కొల్పబడిన యీ కనకమాంబగారు సర్వ విధముల మొల్ల కేమాత్రము తీసిపోక కొన్నిపట్ల మొల్లనుగూడ నతిక్రమించు నేమో యనునట్లున్నారనుటలో నతిశయోక్తిలేదు.

పైవర్ణింపబడినఁ కవీశ్వరుల పొగడ్త లటుండ విమర్శకాగ్రేసరుండని ప్రసిద్ధివహించిన పండితులు వైదిక లౌకిక తంత్రవేత్తలు జగద్గురు శ్రీ శృంగేరీపీఠము నవలంబించిన తత్త్వవేత్తలునగు బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారిట్లు వ్రాయుచున్నారు.

"కం॥ ఆద్యుల పద్యము లట్లన
పద్యములై సుకవినికరవంద్యములై నీ
పద్యము లాస్వాద్యములై
హృద్యములై ముదముగూర్చె నెంతయునింతీ."

ఇదికాక కనకాంబగారి సమరసభావమును సర్వమతసహిష్ణుతనుగూర్చి శ్రీ కుప్పుస్వామయ్యగా రిట్లు వ్రాయుచున్నారు.

"కనకమ్మగారి మనమున శివ విష్ణు శక్తి ప్రభృతిదేవతామూర్తుల తారతమ్యభేద జ్ఞానము సుంతయేనియున్నట్లు గోచరింపదు. ఈమె గ్రంథములయందు కొన్ని పద్యములలో శివుని, కొన్నింటిలో శేషాద్రివిభుండగు వేంకటేశ్వరుని, కొన్నింటిలో రామచంద్రుని, కొన్నింటిలోఁబరదేవతనుస్తోత్రము గావించియునికియే దీనికి నిదర్శనము. ఇట్టి యుత్తమజ్ఞానముకుదురుట పండితుల కనేకుల కరిదిగానుండఁ గనకమ్మగారి కిది యచంచల రీతిని గుదురుట స్తవనీయము."

ఇన్ని హేతువులచే నిమ్మహాకవయిత్రి యీ సంవత్సరము మొల్లకంకణస్వీకరణమునకు నర్హురాలని వచించుట కుత్సాహపడుచున్నాను.

మొల్ల యెవ్వరును విచారణతోఁ గాలహరణము చేయదలచలేదు. అది విమర్శకులపని. నాకుఁజూడ మొల్లయొక తేజఃపుంజమువలె కానిపించుచున్నది. ఆకసమునుండి చంద్రబింబము భూలోకమునకుఁ దన చల్లని కాంతులు వెదజల్లునట్లు కృష్ణదేవరాయల కాలమునుండియో శ్రీనాథునికాలమునుండియో నేటివరకు తన కాంతులు వెలుఁగ జేయుచు నాంధ్రుల హృదయములకు బర్వమగుచు నేత్రముల వెలిగింపజేయుచు తన కవితామృతవృష్టిచే భవసంతప్తులగు జీవుల తాపము నార్పుచు విబుధులకు దుష్టిపుష్టుల నొసంగుచున్నది.

ఆంధ్రుల హృదయాకాశమునందీ మొల్ల చల్లగా సదా వెలుంగుచుండుగావుత!

ఈ మొల్లకవయిత్రి జయంతిని పురస్కరించుకొని స్త్రీలోకమునఁగల యుత్తమ విద్యావతుల నాహ్వానించి తెచ్చివారలకు గంకణప్రదానము చేయనెంచిన యీ కేసరిగారికిని ఇట్టి జయంతులు నిర్విఘ్నముగా భక్తి శ్రద్ధలతో నిర్వహించు నీ వర్ధమాన సంఘమువారికి నీశ్వరుడు సర్వదా విజయము ననుగ్రహించుగాక.

వర్ధంతులు జయప్రదముగా జరిపి కవిపూజ దేశమునకు నేర్పుచున్నది నెల్లూరు

మండలమని చెప్పవచ్చును. ఇక్కడ తిక్కన జయంతి ప్రారంభమైన యెన్నిదినములకో క్రిందటి సంవత్సర మొక పద్యములో దాయలు పినతండ్రి తద్దినము పెట్టునపుడు తనతండ్రి పేరుకూడా తర్పణములో రాదా యని తాను మానవుగదా! అట్లే తిక్కన జయంతి నెల్లూరువారు జరుపుచున్నారని రాజమహేంద్రమువారు నన్నయజయంతి నుపేక్షింపరాదని కనకమ్మగారు చెప్పి యున్నారు. కాక తాళీయముగా నీమె చెప్పిన కొలదివారములలోనే నన్నయ భట్టారకసమాజము రాజమహేంద్రవర ములో బయలుదేరుట సంతోషము. నన్నయభట్టారక సమాజము నన్నయజయం తులు ననువత్సర మభివృద్ధిగాంచుగాత!

మా చిన్నతనములో నరసాపురము పరీక్షలు విజ్ఞానచంద్రికవారి పరీక్షలు హిందూసుందరి సావిత్రి మొదలగు వార్తా పత్రికలు మాసపత్రికలు స్త్రీ విద్యావ్యాప కమునకు మిక్కిలి తోడ్పడినవి.

ఆ పరీక్షలలో నా పత్రికలో బ్రకా శించినదియే యీ కనకాంబగారి వ్యక్తి. ఇప్పు డా పరీక్షల ప్రాధాన్యము తగ్గిపోయి నది. కాని స్త్రీలు పాఠశాలలో సామాన్య విద్య ఉత్తమవిద్యకూడా నేర్చుకొనుట సర్వసాధారణమైనది. బి.ఏ. యం.ఏ. పరీ క్షలలో నుత్తీర్ణురాండ్రయి వెలయుచున్న నారీరత్నము లెందరో కలరు. జాతీయవిద్య జాతీయసంప్రదాయానుసారమైనది కాక పోవుటచే విద్యావిధానమున లోపము లెన్ని ప్రయోజనములేదు. జాతీయసంప్ర దాయముల కనుగుణమగు విద్య స్త్రీలకు నేర్పు నవకాశము లెపుడు కలుగునో కదా! నేను బ్రతికియుండగా పూర్ణముగా జాతీయ విద్యావిధాన మమలులోనికి వచ్చునని నాకు నమ్మకములేదు. ఉన్నతవిద్య నాశించువా రందఱు విదేశవిద్యావిధానము నవలంబించ వలసినవారేయైనారు. నా కుమార్తె మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో సంస్కృ తము యం.ఏ. పరీక్షకు చదువుచున్నది. కాబట్టి మార్చలేని విద్యావిధానమును తలుపక పెద్దముత్తైదువను నాకు తోచిన హితోపదేశమును విద్యార్థినులకు విద్యా వతులకు నొసంగుచున్నాను. దేశకాలపరి స్థితు లెన్నిమారినను స్వధర్మావలంబనము, గురుదేవపూజనము, పతివ్రత్యము, గృహిణీధర్మనిర్వహణము, మాతృత్వము నాంధ్రయువతు లెన్నటికి వీడకుండుట నా యభిప్రాయము. వింతపద్ధతులకు వేష భాషాభిరతికి లొంగిపోయి భారతనారీ మణులు ఆకారమునందు నంతరంగమందు, విరూపములు, వికారములు దాల్చుట విషాదకరము.

కాలవేగము నాప జాలముగాని కొందఱి లోనైన స్వధర్మరక్షణావేశము సఫలము కాకపోదు. అట్టి స్వదేశ వేషభాషాభిమా నము నారీమణులకు గల్పించు మాసపత్రి కలలో నొకదానిని (హిందూసుందరి) యథాశక్తి నిర్వహించుచున్నాను. సకల సౌకర్యములుకలిగి నేటికాలమునకు



గృహలక్ష్మీస్వర్ణకంకణ బహూకరణసమయమున దీయబడిన ఛాయాపటము.

'గృహలక్ష్మి' పత్రిక నిక్కముగ యువతీజనుల పాలిటి కల్పవల్లియైనదని చెప్పవచ్చును. ఆ లక్ష్మీకటాక్షమే నేటి సభ శోభకు కారణము కదా! 'గృహలక్ష్మి' వికాసమొసగు రంగవల్లులోయన వ్యాసములరచించి ప్రప్రథమమున మొల్లకంకణమందిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు దీర్ఘాయుష్మంతురాలై మనుగాత! ద్వితీయ వార్షికజయంతిలో నధ్యక్షపదవి నలంకరించిన శ్రీమతి కనకాంబ గారిచే "బలుకులొయ్యలి ముంజేతి చిలుక పాటి" యని వర్ణింపబడిన శ్రీమతి చిలకపాటి సీతాంబగారు ప్రబంధపుత్రులను నవలా పుత్రికలను ఇతోధికవృద్ధిగాగాంచి వృద్ధి పొందుదురుగాక!

నేడు మొల్లజయంతి గృహలక్ష్మి కంకణమును మొల్లముగ స్వీకరించిన శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు నూరు సంవత్సరములు వర్ధిల్లి తన యార్యధర్మముచే, బోధమహిమచే, సరసకావ్యములచే నీ యాంధ్ర దేశముననే గాక విశ్వమంతయు విఖ్యాతిచే వెలయుగాక!

ఈ నెల్లూరుపురమునందలి ద్వివిధభాషా భక్తి మత పోషక సంస్థలును, సదాస్వధర్మ రక్షకములై యలరారుగాక! ఇందలి పండితులు, కవులు, సాధువులు, సంపన్నగృహస్థులు సమరసభావముతో సదావృద్ధిపొంది యిట్టి మహాగోష్ఠులు గావించుచు దాము లోకమునకు మార్గదర్శకులై యలరారునట్లు భగవంతు డనుగ్రహించుగాక!

ఇప్పటికే కాలాతీతమైనను, వక్తవ్యాంశ మొక్కటి చెప్పకతప్పదు. ఆంధ్రదేశమున నదులలో గోదావరియు పినాకినియు మహానదులని నాకు దోచుచున్నది. ఏలన గోదావరీతీరమునను పినాకినీ తీరమునను ప్రౌఢయికముగ కవీంద్రులను చెలమలలో గావ్యామృతము సింగళసూరనార్యుడు చెప్పి నట్లు విశేషముగ నూరుట గాంచుచున్నాము. అందు ముఖ్యముగ నీ పినాకినిశబ్దము విన్న మాత్రమున పినాకినీనదియు, సోమశిలా క్షేత్రమును, సోమేశ్వరువిగ్రహమును, నందు పినాకినీ సైకతంబుల యోగినియగు శారద ధ్యాననిష్ఠలో నుండుటయు, నమ్మహనీయురాలు సత్యసారాదిగ్రంథముల లిఖించుచు జ్ఞానాంబమొదలగు భక్తురాండ్రకును, నన్నంభట్టు మొదలగు పరమభక్తులకును తత్త్వముపదేశించుట మొదలుగాగల కనకాంబా విరచిత హంసవిజయనాటక వృత్తాంతమంతయు మనస్సునకు గోచరమగుచున్నది. ఎవరీ శారదామణి? భావనాప్రపంచమున నున్న వ్యక్తియా! సంవత్సరముక్రిందట నాకు గన్నులురెండును గానరాక మనుష్యుల ముఖము లానవాలు తెలియక, యొక యక్షరమేని చదువలేని యంధత్వమున నుండియు, మా విద్యార్థినీ సమాజవార్షికోత్సవమునకు నీ కనకాంబగారి నధ్యక్షురాలుగ నాహ్వానించియున్నాము. గ్రుడ్డిదాననై బాలికలచే సభారంగమునకు దీసికొనిరాబడి యుపన్యసించుచున్న నన్నుజూచి పరమానుగ్రహముతో నీకనకాంబగారు "మీకు

కన్నులు తప్పక తిరిగి రాగలవు. నామాట నిక్కమ”ని వేయిమందిసభలో గంభోక్తిగ ఈశ్వరేచ్ఛను దాను జూచి వచ్చినట్లు చెప్పినారు. అప్పటికి హంసవిజయనాటకమును జదివించుకొని విని శారదారూపమును నాంతరంగికదృష్టితో జూచుచుంటిని. తరువాత కనకాంబగారి వాక్యముఫలించి యారుమాసములకే నాకు గన్నులు వచ్చినవి. నా నెచ్చెలి శ్రీమతి మాడభూషి చూడమ్మగారు శ్రీమతి కనకాంబగారి సహవాసముచే నంధులకుగూడ కన్నులువచ్చునని వ్రాసిరి. కన్ను దెరచి చూచువఱకు హంసవిజయములోని శారదాంబ ఇప్పుడు పినాకినీతీరంబునగాక పరమహంసపాలితమైన జయంతాశ్రమమున గాక శ్రీ అమృతానందనాథస్వామిచే ప్రతిష్ఠింపబడిన శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమున దపమొనరించుకొనుచున్నదనియు, మేరీరాణీ కళాశాలయందు నాంధ్రోపన్యాసకురాలుగ నున్నదనియు, సత్యసారాది గ్రంథములుగాక జీవయాత్ర అమృత, ఆనందసారాదిగ్రంథముల రచించినదనియు, జ్ఞానాంబా ప్రభృతులుగాక ఆశ్రయించిన ననుబోంట్లకు దారకము ననుగ్రహించి సుఖించుచున్నదనియు, నీసభలో నాచేత నీగృహలక్ష్మీకంకణ పారితోషికము నందుకొనుచున్నదనియు స్పష్టముగ దెలిసికొనగలిగి కన్నులు తిరిగివచ్చిన ఫలమునుగంటినని సంతసించుచు నేను జయంతికి హేతుభూతురాలగు మొల్ల కుపాస్యదైవమైన శ్రీ రామచంద్రమూర్తిని కనకాంబాకృత శ్లోకముచే స్తుతించి విరమించుచున్నాను.

సకల భువనదీపమ్ సాధు కల్యాణరూపమ్
దళిత విబుధపాపమ్ దానవానీకతాపమ్
సుచరిత పశుగోపమ్ స్వాత్మయ జ్ఞాయయాపమ్
విదళిత శివచాపమ్ విద్ధితమ్ రామభూపమ్.

* * *

అధ్యక్షోపన్యాసానంతరము శ్రీయుత కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు సభావేదిక నెక్కి స్త్రీవిద్యావశ్యకతను తాను చాలకాలమునకుముందే గుర్తించితిననియు, కాని నేటికాలపువారి యాశయములతో తాను పూర్తిగ నంగీకరింపననియు, నుడివి, తదుపరి మొల్లనుగూర్చి కొంతతడవు ముచ్చటించిరి. మొల్ల బహుశా వైశ్యకుటుంబమునకు జెంది యుండవచ్చుననిరి. ఈకాలమున స్త్రీవిద్యావ్యాప్తికై పెక్కురీతుల పాటుబడుచుండు శ్రీయుత కేసరిగారి యాశయముల నభినందించుచు క్రిందిపద్యముల జదివిరి.

డాక్టరు కె. యన్. కేసరి ప్రశంస

మ॥ వెలనాటిప్రభు శేఖరుండవు జగ
ద్విఖ్యాత విద్యావతీ
జలజాతాక్షులపాలి తండ్రివగుచున్
చర్చించి తద్విద్యలన్
వెలయింపన్ 'గృహలక్ష్మి' పత్రికను
వేవ్వేచ్చించుచున్ నిల్పెపెం
పలరంజేయుచునుంటె ధన్యుడవు
కే. యన్. కేసరీ భూసురా.

మ॥ ధరణిన్ నీసరివారు భూసురులలోఁ
దర్శింపగా నెవ్వరున్
పరికింపంబడ రుత్తమోత్తముఁడ
వన్ ప్రఖ్యాతియున్ భూతి నీ
ధరనీకేసరి, కేసరీ! వివిధవిద్వత్
కేసరీ ద్యోషధ
స్థితసంపాదిత కీర్తివైభవ! నినున్
దీవింపగా నొప్పదే!

మ॥ ప్రతివర్షంబును మొల్లపేర మహా
మున్ వర్తింపగాజేసి స
న్నుతరీతిన్ కవయిత్రులం దొకత
కున్ స్వర్ణాంచితంబై జగ
న్నుతమౌ కంకణమిచ్చుచుంటివని
నిన్నున్ జెప్పకోవింటె నా
మతినానందరసాబ్ధిదేలి యిపు
డీమాడ్కిన్ నుతింతుం జుమీ.

ఉ॥ నీగృహలక్ష్మియున్ మరియు
నీదగులక్ష్మియు నీదు బుద్ధియున్
వేగతులన్ సతీమణుల
విద్యవిరాజిలజేసి వారికిన్
భాగవతార్థబోధన మొ
నర్చుటకే యగుచుండెగాదె యే
రీగతి నుత్తమాశయము
హృద్గతి బూనగనుంద్రు కేసరీ.

ఉ॥ ఉత్తమవిద్య స్త్రీలు గొను
టొప్పు నటంచు దలంచియేను నా
చిత్తమునందు సంతతము
చింతయొనర్చుచు దానిఁ బత్రికన్
హత్తగజేయుచుండుదు ని
రంతరమందున నాదు కూతులన్
సత్తములైన బోధకుల
చక్కఁబఠింపగఁ జేసితింగదా.

మ॥ మును నాతాతకుఁదాత పత్నికవనం
బున్ నేర్చుటేగాదు, ప్రో
ఘనపాఠంబుగ వేదమున్ జదివిలో
కఖ్యాతినిం గాంచె ని
ట్లని నేఁజెప్పుట నాత్మగౌరవముగా
నధ్యాత్మ నూహింపగా
జనదే నిక్కము చెప్పితిన్ దెలియుమీ
సాధ్వార్య వంశాగ్రణీ.

మ॥ కవిలోకస్తుతకార్యముల్ సలుపుచున్
క్ష్మామండలంబందు స
ద్భవికంబున్ యశమున్ సుఖంబుపొదలన్
వర్తించు నీకెప్పుడున్
భువనేశుండు సమస్తసంపదలు సం
పూర్ణాయురారోగ్యముల్
తవురీతిం గలిగించి ప్రోచునెపుడున్
ధాత్రీసురగ్రామణీ.

* * *

అనంతరము అభినవతిక్కన బిరుదాంకితులగు శ్రీయుత దూర్భా సుబ్రమణ్యశర్మ గారును, శ్రీయుత దీపాల పిచ్చయ్యశాస్త్రి గారును శ్రీమతి కనకమ్మగారి యనర్గళ కవితాశక్తిని, అసమాన పాండిత్యమును అసదృశ ఆధ్యాత్మికజ్ఞానమును ప్రసంసింపుచు ముఁచ్చటించిరి.

శ్రీయుత దంటు శ్రీనివాసశర్మగారు చదివిన పద్యములు.

కం॥ మొల్లమగు జ్ఞానమునజగ
మొల్లక శ్రీరామకథరసోచితఫణితిన్
మొల్లలిఖించి తిరంబై
మొల్లమునంబడయరాని ముక్తింగొనియెన్.

కం॥ చిల్లరమాటలఁగాలముఁ
జెల్లింపక చిత్తమందు సీతారామున్
సల్లలితభక్తిఁగొల్చుట
మొల్లజయంతి సలుపుటకు ముఖ్యఫలంబే.

ఉ॥ పావనమైనశీలమునఁ
బ్రస్తుతి కెక్కి జగమ్మునందు వి
ద్యావతులైన కాంతలెట
నైనఁగనంగనసుంద్రుగాక స
ద్భావము, దేశికోత్తమన
పర్యయుఁ, గైతయు, బ్రహ్మవిద్యయుఁ
బ్రోవగుటొక్కడంగలిగెఁ
బోకనకాంబికయందనన్యమై.

గీ॥ సర్వవేదాంతసారంబు సంగ్రహించి
తనదుగ్రంథాలనించె నీధన్యచరిత
మొల్లపేరిటి బహుమానములనుగొనఁగ
నర్హులెవరన్న! మాకనకాంబకన్న.

కం॥ గురుకేసరి భజనంబున
పరతత్త్వమెఱింగినట్టి వరమతినీమేఁ
గురుపూజలఁదనియించుట
యురుగేసరి! దాననగుమహోన్నతి
నీకుఁ.

* * *

అంతట గృహలక్ష్మి పత్రికాపక్షమున శ్రీయుత చదువుల రామచంద్రయ్యగారు గృహలక్ష్మి యాశయముల గురించి యీవిధముగ నుపన్యసించిరి.

సోదర సోదరీమణులారా !

ఇంతకుముం దుపన్యసించిన మిత్రులందరు శ్రీమతి కంచనపల్లె కనకాంబగారిని గురించియు, గృహలక్ష్మి కంకణమును గురించియు పలుమారు ముచ్చటించిరి గదా ! ఈసమయమున గృహలక్ష్మి యాశయములను కంకణబహూకరణోద్దేశ్యమును దెలుపుట తగినదని తలంచుచున్నాను.

నేను స్వర్గతుల్యముగ నెంచబడుచుండు పాశ్చాత్య దేశములు అనాగరికస్థితియందుండి యందలి జనులు ద్విపాదపశువులవలె వర్తించుచున్న కాలములో సైతము భౌతికాధ్యాత్మిక సంపదల కాలవాలమై సకల విద్యలతో వెలయుచుండిన భారతదేశము నేడు విద్యావిషయమునందు వెనుకబడి నూతనోజ్జీవనమునకు విదేశప్రబోధమునకు బ్రాకులాడుచున్నది. విద్య దేశమునందు విరివిగ వ్యాపించిననేగాని దేశమునకు మోక్షములేదు. స్త్రీ సృష్టికి మానవాభ్యుదయమునకు మూలస్థానమగుటచే విద్యావతియగుచో నామె విజ్ఞానము వికసించి యది సంతానమునకు సంక్రమించి దేశదీప్తి కభివృద్ధిమార్గ మగపడును.

ఈ మూలసూత్రము ప్రతి దేశీయులును చక్కగ నెఱింగియున్నారు. కాని యే దౌర్భాగ్యమువలననో భారతదేశమున స్త్రీలకు విద్య యనావశ్యకమను నమ్మకము దృఢముగ నెలకొని భారతీయుల పతనమునకు దారిచూపినది. కాలదేశపాత్రములబట్టి యిప్పుడట్టి యభిప్రాయము కొంతవఱకు గర్హింపబడినను సమూలనాశనము గానందున స్త్రీ విద్యావ్యాప్తిచేయుట మన దేశమందు సులభము గాదు.

నేడెంత విరివిగా విద్యావ్యాప్తి కేర్పాట్లు జరుగుచున్నను, దాని కింకను దోహదము కల్గింపవలసిన యావశ్యకతగాని, సక్రమమైన విద్యావ్యాప్తియగుటకు జరుపవలసిన యాందోళనావశ్యకతగాని యెంతమాత్రము తగ్గుటలేదు. విద్యావిషయమటుండ స్త్రీపురుషులు జీవితమందు ప్రకృతిసిద్ధమైన భిన్నభిన్న ఉద్యోగములందు నిమగ్నులైనంతమాత్రమున వారిలో న్యూనతాధిక్యతలకు గాని స్వాతంత్ర్య దాసత్వములకుగాని చోటులేదనియు, స్త్రీలకుగూడ వ్యక్తిత్వ

ముండవలయుననియు, వారేమిటియందును పురుషు
లకు దీసిపోరనియు. చాటవలసిన యావశ్యకతకూడ
గలదు. వారభివృద్ధికివచ్చి యాయురారోగ్యాభ్యు
దయములందుటకు సక్రమమార్గముల చూపించుటయ
గాక, వారికి కావలసిన విద్యలం దభిరుచి బుట్టించి,
రచనావిధానమునందు చతురులనుగా జేయవలసి
యున్నది. ఈ కార్యసాఫల్యతకై తొమ్మిదిసంవత్సర
ముల క్రింద 'గృహలక్ష్మి' స్థాపింపబడినది. ఆంధ్రుల
యాదరణచే నది యింపుగ పెంపొందుచున్నది.
ఇపుడు తమిళసోదరీమణులకుకూడ నీ సౌకర్యములు
గలిగించుటకై 'గృహలక్ష్మి' తమిళభాషలో 1937 జనవరి
మాసారంభమునుండి మాసపత్రికగా వెలువడుచున్నది.

'గృహలక్ష్మి' కేవల మిట్టి ప్రోత్సాహముచేతనే
తృప్తిపొందుటలేదు. నిరంతరము నూతనమార్గము
లన్వేషించుచునేయుండును. ఉత్తమ వ్యాసముల
రచింపజేసి వారిని ప్రోత్సహించుటకై బంగారు పతక
ముల నిచ్చు టొకపద్ధతి. ఆంధ్రదేశమున ఉత్తమ
రచయిత్రులను లేక కవయిత్రులను గౌరవించి మొల్ల
జయన్త్యుత్సవ సందర్భమున 'గృహలక్ష్మి కంకణము'
దొడగుట మరియొకటి.

రచయిత్రులకు ఈ కంకణబహూకరణము ఆర్థిక
ముగ నెక్కుడుపకరింపకపోవచ్చును; కాని వారిని,
తదితరులను, ఉత్తమరచనలను పెంపొందింప ప్రోత్స
హించుననియే 'గృహలక్ష్మి' నమ్మకము. ఆ ఆశయమే
యెక్కుడుపకరించునని యెంతును. ఎంతటివారికి గాని
ప్రోత్సాహము మేలుచేయగలదనుట నిర్వివాదాం
శము. తమ శక్తిసామర్థ్యముల నితరులెఱిగి ప్రోత్స
హించినపుడే యది విజృంభించి యుత్తమకావ్యముల
జేయింపగలదు. అట్లైనచో పూర్వమున్న ఉత్తమ
శ్రేణికి చెందిన కవులనందరి నెవరు ప్రోత్సహించిరి ?
వా రుత్తమరచనల చేయలేదాయని ప్రశ్న రావచ్చును.
అది కొంతవఱకు నిజమైయుండవచ్చును. కాని
రచనాశక్తిని కవిత్వమును స్త్రీలయందు తగురీతి
ప్రోత్సహించియుండినచో నెంతమంది మొల్ల లెట్టి
యుద్గ్రంథముల రచించియుందురో ? ఎంతమంది
వెంగమాంబ లాంధ్రభాష నలరించియుందురో?
ఆంధ్రభాషామతల్లియొడిలో నెంతమంది రచయిత్రులు
బెరిగియుందురో యేరికెఱుక? ఇకనైన నట్టి ప్రోత్సాహ
మున్నచో విద్య విరివిగ వ్యాపించు నిక్కాలములో
నెంతమంది విదుషీమణులు తలలెత్తి యాంధ్రభాష
నలంకరించుటయగాక తమ జాతినికూడ నెంత యభి
వృద్ధికి దెత్తురో ఉత్ప్రేక్షింపవలసిన యావశ్యక
యెంతమాత్రము లేదు. ఈ కంకణబహూకరణమందలి
పరమోద్దేశ్య మియ్యదే.

ప్రకృతము కంకణము గ్రహించుచున్న
శ్రీమతి విద్వత్కవితిలక కవితావిశారద కంచనపల్లి
కనకాంబగారినిగూర్చి యిచట మరల చెప్పబూనుట
చర్వితచర్వణమగును. వారినిగూర్చిన విశేషము
లన్నియు నిదివఱకే మీకందరికి వినిపింపబడినవి. కాని
యొక్కటిమాత్రము మనవి చేయుచున్నాను. కంకంటి
పాపరాజుగారొకచో "కరముచే కంకణము, కంకణ
ముచే కరము కరమొప్పె" యని రచించిన విధమున
గృహలక్ష్మికంకణముచే—'గృహలక్ష్మి' నవవర్ష
ప్రాయయయ్యు పెద్దల పెద్దతనమును గ్రహించి తనకు
తోచిన లీల బహూకరించినందున—కనకమ్మగారి కర
మును, కవితామాధుర్యమువలన నాంధ్రజాతిని
చొక్కించు కనకమ్మగారి కరముచే గృహలక్ష్మి
కంకణమును వెలసినమాట మాత్రము సత్యము. ఈమె
నిట్టి రచనలచే యాంధ్రభాషాదేవి నలంకరించి యితర
నారీమణుల కాదర్శప్రాయ రచయిత్రిగానుండ పర
మాత్ముడు చిరపాలనుండుగాక.

* * *

ఉపన్యాసానంతరము చదువుల రామ
చంద్రయ్యగారు 1935, 1936 వ సంవత్సర
ములందు మొల్ల జయంత్యుత్సవ సందర్భ
మున నే గృహలక్ష్మి కంకణము లందుకొన్న

శ్రీమతులు కనుపర్తి వరలక్ష్మమ్మగారు అనారోగ్యముచే రాజాలక వ్రాసిపంపిన ఉత్తరమును, చిలకపాటి సీతాంబగారు మొల్లను గూర్చి వ్రాసిపంపిన వ్యాసమును క్రిందివిధముగ జదివిరి.

శ్రీయుత డాక్టరు కె. యన్. కేసరిగారికి కనుపర్తి వరలక్ష్మమ్మ నమస్కారములు.

అయ్యా,

తాము దయతో పంపిన మొల్లజయంతీఆహ్వానములు వందనములతో నందుకొంటిమి. విదుషీమణియు, కవయిత్రీ తిలకమును తత్వజ్ఞానసంపన్నయునగు శ్రీమతి కవితిలక కంచనపల్లి కనకమ్మగారికి గృహలక్ష్మి స్వర్ణకంకణ సత్కారము జరుగుచున్నందుల కెంతయు సంతసముగానున్నది. వర్తమానాంధ్ర విదుషీరత్నములలో నగ్రగణ్యయగు శ్రీమతి కనకాంబగారి సన్మాన కార్యక్రమముచే నీమేటి మొల్లజయంతి యత్యంత శోభాయమానమై దర్శనీయమైయుండగలదని భావించుచున్నను నాకింకను ఆరోగ్యముకలుగనందున ఈ మహోత్సవములో పాల్గొన జాలకుంటినని తెలుపుటకు విచారమగుచున్నది.

శ్రీమతి కనకాంబగార్కి నాయభినందనముల తెలుప బ్రార్థించుచున్నాను. శ్రీ మొల్లజయంతి జయప్రదముగా జరుగుగాకయని మనఃపూర్వకముగా వాంఛించుచున్నాను.

ఇట్లు విధేయురాలు

క. వరలక్ష్మమ్మ.

* * *

శ్రీమతి చిలకపాటి సీతాంబగారి వ్యాసము.

సోదర సోదరీమణులారా !

మొల్లయనం బ్రసిద్ధిగాంచిన యీ కవయిత్రి యే కాలముననుండినదో నిర్ణయించుటకెందరో పూర్వకవుల కవయిత్రుల చరిత్రలు పరిశీలించి యొకరొకరి యభిప్రాయముల పూర్వపక్ష సిద్ధాంతములొనర్చుకొనుచున్నారు. ఈమె కులగోత్రముల నిర్ణయించుటలోకూడ చాలమంది భిన్నాభిప్రాయములు గలిగియున్నారు. మలసిరంకెలువైచుచు మూరుకొను వృషభములభంగి పండిత మహత్తరులు తమ వాదప్రతివాదములచే నిర్ణయింపలేని యావిషయము మావంటివారి కసాధ్యము. ఇంతకు ఆమెకులమేదైనను గుణము, వైదుష్యము, శ్రీరామభక్తి, అనర్గళకవితాశక్తి మహత్తరములైనవి. అందుచే నామె సారస్వత లోకమునకెంతయు వందనీయ; విదుషీమండలమునకు తలమానికము; నెల్లూరు మండల భాగధేయమున నుద్భవించిన యమూల్యదివ్యరత్నము. ఈమె మొల్లయను ముద్దుపేర పిలువంబడుట కడుంగడు రమణీయము. పుష్పములు, లతలు, మొదలగు మంగళవస్తువుల పేర్లు బిడ్డలకు పెట్టుటగలదు. కమల, అరవింద, పద్మ, కుముద, చంపక ఈపేరులవలెనే మొల్లయను పేరు కూడ పరిపాటిగా నుండవచ్చును. కుందయను పేరు చిత్తూరు (చితోడ్) రాజపుత్రస్త్రీలలో నున్నట్లున్నది. కుందను తెలుగున మొల్లయందురు. ఆమె శ్రీకంఠ మొల్లేశ్వరుని వరప్రసాదమున జన్మించినదగుటచే నీమె తల్లిదండ్రులు శివభక్తులు కావున నీమెకు మల్లియను పేరిడియుందురని శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు వచించిరి. ఇదియు నుక్తికరముగ నున్నది. 'మొల్లయన శ్రీకంఠమల్లికేశ్వరుని పేరైనను ఈ కవయిత్రీమణికి ఒప్పియేయుండును. మల్లె, మొల్ల, రెండును ఉత్తమకుసుమములే; శిరోధార్యములే. మొల్ల కవయిత్రి నేపేరపేర్కొన్నను సంతోషదాయకమే. ఈ మొల్లమాంబ అపారప్రజ్ఞానిధియై జ్ఞానియై సకల లోకవిభుండగు శ్రీ రామచంద్రభుని దివ్యకథామృతంబుతోరంబుగగొని యొక్కొకపలుకుపలుకున కమృతంబులొలుకు తీరున ముద్దుపద్దియములల్లి, యాలరుం దేనియలకన్న మధురములగు చిలుకపలుకులవంటి

కేటలౌమాటల బొందుపరచి శ్రీరామాయణ మహా కావ్యమును రచించినమేటికవయిత్రి. ఇట్టి పూత చారిత్రయందుగల పూజ్యభావముచే నేటేట పూర్వ పూర్వకవుల జయంతులతోబాటు మొల్లజయింత్యుత్సవము జరుపుటకు దృఢనిశ్చయులై యుద్దిష్టకార్యమును మహోత్సాహముచే నెరవేర్చుచున్న నీనెల్లూరు వర్ధమాన సమాజమువారి కార్యదీక్ష కడుంగడుశ్లాఘ్యము. ఇట్టి మహత్కార్యమునందు పాల్గొని స్త్రీ జనాభ్యుదయమునకై విదుషీమతల్లులను సన్మానించును మహిళాప్రబోధ మొనర్చు శ్రీ గృహలక్ష్మి పత్రికాధిపతులగు డాక్టరు కె. ఎన్. కేసరిగారెంతయు వందనీయులు.

ఇక ప్రకృత మనుసరింపదగు. నేటి గృహలక్ష్మి కంకణమును బహుమతినందనున్న విద్వాన్ కవితిలక కవితావిశారద శ్రీమతి కంచనపల్లి కనకాంబగారిని గూర్చి ప్రసంసించుట ముఖ్యమని దలంతును.

అపరసరస్వతియో యనవొప్పు ఆర్యకనకాంబగారి దివ్యకవితామృతలహరిమనోహర రగంధనిస్వనములాంధ్ర సారస్వతకవి పండిత లోకము కనివిని యానందించి తజ్జనితానందమును కొనియాడిన మహాశయులెందరోకలరు. అట్లుండ నీ కనకమ్మగారి కనకమ్మ వంటి కవితానిక్షేపములందు ప్రత్యేకించి సువర్ణము వేరుపరుపంబూనుట నా సాహసమో యుత్సాహమో వివరింపలేకున్నదాన. ఈయమ్మ యెల్లప్రాయముననే సద్గురుకటాక్షమునుబడసి యనన్యదుర్లభమగు జ్ఞానభక్తి వైరాగ్యములంది ధన్యయగుట లోకవిదితము. వీరి కవితామృతము నవరస సంభరితము. ఏయే కథా వస్తువును యేయేరసముతో పూరింపవలయునో ఆ ఆనేర్పు మెకు వెన్నతో బెట్టినట్లున్నది. వీరి శాకుంతలమున కథానాయికుడగు దుష్యంతునిమృదుల హృదయ రాసిక్యమును శకుంతలపైగలిగిన ప్రియమునుగ్గడించు తెరివివరించి యాంధ్రవాణికి శృంగారతిలకము దిద్దినట్లున్నది. వీరి రామాయణకథాసారముతోరంబగు నమృతపారావార గంభీర భావపూరంబై పాఠక దయకేహృదారములందు విజ్ఞానసస్యంబుల మొలకలెత్తించి మించిన జ్ఞానఫలోదయ భాగధేయంబుం బ్రాపింపంజాలియున్నది. ఈయమగారి హంసవిజయమందలి కథాసంవిధాన మత్యంత జ్ఞానసంవేదితమై యలరారుచున్నది. సంఘదౌర్జన్యముల ధిక్కరించి విదుషియై విజ్ఞానియై శ్రీ వేంకటేశ్వర వరప్రసాదమున ననేకగ్రంథముల రచించియోగినియై విలసిల్లిన శ్రీ తరిగొండ వెంగమాంబ చరితము ఈ కనకమ్మగారి జ్ఞానవైదుష్యమును దిలకించినపుడుజ్ఞప్తికివచ్చుచున్నది. పరతత్త్వవిచారంబున నీమె ఆత్రేయిగార్గి మొదలగు వారి జాడల ననుకరించినది. వీరి గ్రంథములలోకెల్ల మేటియగు జీవయాత్ర బ్రహ్మసరస్వతీ ప్రణయ సంభాషణమును కథాహేతువుగ నిర్మించి అత్యంత రమణీయముగ కథాప్రవాహమును సాగించినది. ఒకచోట నీమె నిరపేక్ష స్వభావమును వ్యక్తపరచినది.

క. కోరెదరు మూఢులూరక
కోరికలన్నియును, ముక్తిగోరుదురు బుధుల్
కోరక నెద్దియు నూరక
ధీరులు నిన్గనెద రాత్మతృప్తికి శ్రీశా.

అని ఆత్మానందమునకై భగవధ్యాన మొనర్చుకొనుటయే శ్రేయము. అవ్వలంతయు భగవదధీనము. ఇదియే నిత్యానందము అని మరొకచో జీవుని (నిరంజనుని) వివాహోన్ముఖునింజేయు నెపమున స్త్రీల కర్తవ్యావశ్యంబులగు గుణము లిన్నియొప్పి యుండదగునని యట్టి వనితలే గృహిణీత్వమున కర్హలగుదురని వివరించినది.

క. మాటలనిపుణత కొంతయు
నీటగురూపమునుగొంత నీతినిబ్రీతిన్
బాటవమున నొకగొంతయు
జేటుందొలగింపగలవు చేడియలందున్.

'కార్యేషుదాసీ' అని చెప్పిన నీతిజ్ఞులవచనముల కీమె గృహిణీలక్షణానుశాసన పద్యరూపమున మెరుగిడినది.

మరి యొకచో,

క. జగమును శోధింపగ నీ
కగు నే? వగపేల చాలు నాత్మారామున్
దగు రీతి కూడి శాంతిని
విగతాగొడవైన సర్వవిధమున మేలౌ.

పరదోషనిరూపణా విచక్షణులగు పండితమ్మన్యులకీ పద్యరూపమున బుద్ధిగరపినది. ఈమె తానెంతటి జ్ఞానియైనను బాహ్యజీవనము గౌరవముగా నెగ్గించు తలంపున సంస్కృతాదివిద్యలతోబాటు రాజభాష యగు నాంగ్లమునుగూడ నతి నిపుణబుద్ధి నభ్యసించి రాజమాన్యయై యున్నతోద్యోగ పదవినందినది. నిండు కుండ తొణకదన్నట్లు పరదేశభాష నేర్చినను మన పూర్వులవేషభాషలు తదాచారములు విస్మరింపక గురుకులవాసము చేయుచున్నది. హాస్యగర్భితములగు ఛలోక్తులు కథాసందర్భమున పాఠకజనోపయోగ ముగా నచటనచట నునిచినది. బాణలిచెవిలో గరిట దూర్చిన'ఆ'యగునట. బూడిద గుమ్మడికాయపొట్టలో నడ్డముగ గరిటదూర్చిన 'ఈ'యగునట. బోధనా పద్ధతులందు గల చతురత కివి తార్కాణములు. తాము నవ్వుచు విద్యార్థులనవ్వించుచు వినోదగోష్ఠివలె విద్యా భ్యసనంబుచేయించు వీరి కౌశలమెంతయు కొనియాడ దగియున్నది. వీరు విద్యాధికులగుట రాజకీయోద్యోగ పదవినందె యని యంతమట్టున నేయుంచి స్వకులా చారము, స్వవిద్యయగు యాంధ్రముననే గ్రంథముల రచించుచు నాంధ్రసరస్వతి నుపాసించుచున్నది గదా! ఇట్టి వీరి మహోదారపవిత్రచరిత్రము తక్కిన భారతీయ మహిళాలోకమునకు మార్గదర్శియగుగాక!

క. కనకమ్మ పేరనలరెడి
గనకమ్మగ దోచునీకు కైతపఠింపన్
కనకమ్మవంటి మిమ్మును
కనకమ్మనవచ్చు ధరణికాంతలలోనన్.

క. కనకమ్మను గైసేయగ
కనకమ్మెదగునటంచు కడువేడ్కయిన్
గనకమ్మకు గృహలక్ష్మియొ
కనకమ్మకరంబున నలంకరణమగుచున్.

గీ. ఆంధ్రభారతీవీణాట కామ్మనలరు
భక్త్యగృహలక్ష్మినీకిడె పైడితొడవు
కరము శోభిలుగాక నీకరమునందుగ
శశియు ను నెన్నెలలే నెమ్మె చెలగినట్లు.

క. శ్రీయుతు కవితాశక్తియు,
బాయనివినయంబును గుణములపైగు భక్తిన్
మీయందనలంటగ్గ కొ
మ్మా! యివె కనకమ్మా నెమ్మి మాదగు వినతుల్.

* * *

డాక్టరు కె.ఎన్. కేసరిగారి యుపన్యాసము.

సోదరసోదరీమణులారా!

శ్రీమతి విద్వత్కవితిలక కవితావిశారద కాంచన పల్లి కనకమ్మగారి జన్మస్థానమీయూరే యగుట చేతను, ఈపురివాసు లామె కవితామాధుర్యము నిది వఱకే పెక్కుమారులు చవిగొని యున్నందువలనను నాకంటె మీరే యామెనుగూర్చి యెక్కువగ నెఱిగి యున్నారు. అందుచే నామెనుగూర్చి మీకు దెలియ నిదియు నేనధికముగ జెప్పదగినదియు నేమియు లేదు.

ఈ సింహపురి శతాబ్దములనుండియు కవితాకన్య కాటపట్టై, యసదృశకవుల కాకరమై వెలయుచు వచ్చినది. వీరిలో మనమిట కవులనుగూర్చి ముచ్చటింప దలంచుకొనలేదు. కాని యితర కవిసార్వభౌములతో బాటు కవితాసౌరభ్యముచే నానందింపజేసిన మొల్ల మాంబ జ్ఞాపకార్థమై యీ మెజయంతిని జరుపుచున్నా రము. మొల్ల చిరస్మరణీయురాలై యాచంద్రతారా ర్కముగ యాంధ్రులచే గౌరవనీయయగుట కామె రచించిన రసోచితంబగు రామాయణకావ్య మొక్క టియెగదా! మొల్లజన్మస్థానమందే ప్రభవించి, మొల్ల వలె నుత్తమకవితాసౌరభ్యమును నిరంతరమును వెద జల్లుచు, హంసవిజయము, జీవయాత్ర, ఆనందసార

మాదిగాగల పెక్కుయుద్గ్రంథముల రచించి ఈమె యాంధ్రలోకముచే నుతికెక్కెనని. ఇంకను పెక్కు నుత్తమగ్రంథనుల రచింపనున్నది. అట్టిచో నీమె యాంధ్రభాష మనునంతవఱకు స్థిరయశస్వినియై యుండు ననుటకెట్టి సందియముగాని లేదుగదా! మొల్ల నానా డెవరును గౌరవించినట్లు మనసు దెలియరాకున్నను కనకమ్మగారికి నేటితో యారంభమైన యిట్టిగౌరవము ఆచంద్రతారార్కముగ జరుగుచుండగలదని యాశించుచున్నాను.

ఈమె నిట్టి స్థిరగౌరవమున కెనజేయు కారణములు కవితామాధుర్యమును ప్రతిభయు పాండిత్యమును మాత్రమేగాదు ఇంకొక ప్రబలకారణముగూడ గలదు. సాధారణముగా నే సారస్వతచరిత్రయందైనను పండితులుగాని కవులుగాని తమజీవితకాలములో—గతించిన తరువాత గౌరవించువిషయముగాదు — పరస్పరము గౌరవించి యాదరణజూపుట చాలయరుదు. వారికి పరస్పరమీర్ష్యయే యెక్కువగనుండునన్న వింతగాదు. దీనితోగౌరవము గంగగలియగా పరస్పరదూషణలు-తుదకు వాచావాచిగాగాక బాహాబాహిగాకూడ కలహించుకొనుట సాధారణము. ఇట్టికవుల, పండితుల కలహములను చాలకాలమునుండియు కరతలామలకముగా గనుచు వానితో విసుగెత్తియున్న యీపురివానుల కట్టివానినిగూర్చి చెప్పవలసిన పనిలేదు. ఇది పురుషులకుమాత్రము వర్తించుమాట. స్త్రీలన్న వారి మాటయే దలపెట్టక నిరసనభావముతో జూచుచు వచ్చిరి. నేడా భావము చాలతగ్గిపోయియుండుట శ్లాఘనీయము.

కవులందరి పరస్పరగౌరవ సాంప్రదాయము లిట్లుండియు, కనకమ్మగారు కవులయ్యు పండితులయ్యు నీర్ష్యాదిభావముల చెంతజేరనీక, నాంధ్రభాషాకోవిదులను, కవిసార్వభౌములను స్వయముగా గౌరవించి యేటేట వారికి నూటపదార్లు బహుమతిగానిచ్చి నింతవఱకాంధ్రసారస్వతలోకమున లేని సాంప్రదాయమును నెలకొల్పి కీర్తివహించిరి.

కనకాంబగారు కవితాసంపన్నులుగాని ధనవంతులుగారు. కవిత్వమునకు దారిద్ర్యమునకు దగ్గరిసంబంధ మేయుగమునన్నైనను సాధారణముగా మారకయున్నది. అంతియగాక 'కవితల్ జెప్పిన పాదనేర్చిన వృథాకష్టంబె' యనునుడికివిలువ శ్రీనాథునికాలమం దెంతయుండెడిదో నేడుకూడ కొంచె మెచ్చుతక్కువగ నంతియ. అట్లుండియు కనకమ్మగారు పండితగౌరవమునకు పూనుకొన్నదన్న నతి శ్లాఘాపాత్రముగాక వేరొండేమిగాగలదు. వీరిట్టి గౌరవముల స్థిరముగానొనర్చ పరమాత్ముడు సకల సంపదలిచ్చుగాక.

ధనవంతు లెందరోచేయ నిష్టపడకున్నట్టి గౌరవములు పండితులకొనర్చు నీకనకాంబకు గృహలక్ష్మి కంకణ బహుకృతి నే జేయుట నా భాగ్యమనిదలంచి సంతసించుచున్నాను.

ఈమెయే పండిత బహుమతిక్రింద నూటపదార్లు ప్రతిసంవత్సరం మొసగుచుండుటచేత, ఈసంవత్సర మీమెకుమాత్రము గ్రహలక్ష్మికంకణపేర ఐదువందల రూపాయల మొత్తము నిచ్చుటకు నిశ్చయించి యున్నాను.

“సుకవితా యద్యస్తి రాజ్యేనకి” మ్మను నిట్టి కవయిత్రుల కియ్యదికూడ నొకగౌరవముగాని సాయముగాని కాజాలదనియే నాతలంపు, కాని విద్యావ్యాప్తియందిష్టముగల యైశ్వర్యవంతు లీవిధముగ స్త్రీలయభివృద్ధిని కాంక్షించి తగురీతి ప్రోత్సహించి గౌరవించుచువచ్చినచో నాకృషి యప్పటికి ఫలించి నేకృతార్థుడనైతినని భావింతును.

ఈ సమయమున నే జెప్పదలంచుకొన్న మరియొక విషయముగలదు. 1935 వ సంవత్సరము గృహలక్ష్మి దసరా సంచికయందు “స్త్రీపురుషసమానత్వ మావశ్యకమా ? ఎందేని యనర్థదాయకమా ?” అను సమస్యపై ఉత్తమవ్యాసమును రచించిన విదుషీమణికి బంగారుపతక మివ్వబడునని ప్రకటించియుంటిమి.

దానిపై నుత్తమవ్యాసము రచించిన శ్రీమతి మైద వోలు పద్మావతిదేవిగారు మొదటిబహుమతిని, శ్రీమతి వేదుల మీనాక్షీదేవిగారు ద్వితీయబహు మతిని ఇపు డిట అందుకొనగోరుచున్నాను."

అని డాక్టరు కె. యన్. కేసరిగారు రు. 500 ల రొక్కమును కనకమ్మగారికి బహూకరింప నధ్యక్షులచేతికివ్వగా వారు కనకమ్మగారి కర్పించిరి.

అధ్యక్షులవద్దనుండి శ్రీమతి మైదవోలు పద్మావతి దేవిగారు బంగరుపతకమును స్వీకరించిరి. శ్రీమతి వేదుల మీనాక్షీదేవిగారు తాము రాజాలక వ్రాసిన ఉత్తరము సభలో చదువబడెను. ఆమె బహుమతి పతక మామెకు పంపుట కంగీకరింపబడెను.

శ్రీమతి విద్యత్కవితిలక కవితావిశారద కంచనపల్లె కనకాంబగారు తనకు డాక్టరు కె. ఎన్. కేసరిగారు మొల్లజయంతియను మిషతో గౌరవింపబూనినందులకు కృతజ్ఞతనుతెల్లదింపుచు సభికుల కానందప్రాయములైన నీక్రిందిపద్యముల జదివిరి.

ఉ. పాటిమెఱింగి, సత్కవిత భంగులెఱింగి, చెలంగి నేఁడు నా
బోటికి, బోటికొక్కెడకుఁ బోవఁగ నేవము గల్గుదానికీ
నూటపదారు లైదిటి ఘనుం డితఁడిచ్చె నయాచితంబుగా
కోటవదాన్యకేసరికి క్షోణితలంబున సాటికల్గునే.

చ. వెదకినఁ గానరాఁడు పృథివీపతి యొక్కఁడు సత్కవీంద్రులన్
వెదకియొసంగ నూరయిన వెంటఁబడంగఁ బడంగ నెట్టులో
వదలుచుకోఁగడంగు నృపవర్యుఁ డొకం డెటనుండునో కదా
ముదితల సత్కవిత్వగుణముంగని పూజలొనర్ప సాధ్యమే.

ఉ. ఎల్లరు మోదమొందఁ గవయిత్రుల నేరిచి, కోరి తెచ్చి, యీ
మొల్లజయంతినాఁడు సభఁ బూజలుసల్పును, గంకణమ్మునున్
మొల్లమునిచ్చి నేఁడు బుధముఖ్యుఁడు కేసరి కన్నిసఁపదల్
గొల్లగవచ్చు దేవుఁ డనుకూలత నుండెడు నెల్లకాలమున్.

ఉ. పండితులున్ గవుల్ నృపులు ప్రాభవమున్గల పెద్దవారలు
ద్దండ కళాప్రపూర్ణులు సదస్యులుగాఁ గనుమీయ ధీరవే
దండములైన జంకుఁ, గలదా యిటువంటిపురంబు దానిలో
నుండెడు పుణ్యపూరుషు లొహోయనఁ బల్కుట నాకు సాధ్యమే.

శా. సాకేన్ జిన్నతనాన సత్సభలలో సన్మానము ల్సత్కృతుల్
నాకున్ సింహాపురంబు కూర్చి, యిది జన్మస్థానమే కాన, లో
నే కొంకున్గొనఁబోక నే నిచటనేమేఁ బల్కినన్ బెద్ద, లా
గాకంచున్ సయిరింత్రుపో, యని నమస్కారంబు లర్పించెదన్.

శా. ఏపుణ్యంబుననో మదీయకృతు లెంతేఁ బెద్దలౌ సత్కవుల్
గాపాడంగఁ గడంగుట న్విమల విఖ్యాతాఖ్యనై దుష్కలి
వ్యాపారం బిపుఁ డేపుమీఱ, నిజధర్మాసక్తులున్ జాఱ, సం
స్థాపింపందగు నార్యధర్మమని యాస్థన్ జాటి తిన్నాటికిన్.

ఉ. మొల్లజయంతి నాఁడు బుధముఖ్యులునున్, గవయిత్రులు, న్గవుల్,
పిల్లలు, పెద్దలొక్క యెడఁ బ్రీతిగఁ గూడిన గోష్ఠియందు, ను
త్ఫుల్ల సరోజలోచను, విభున్, రఘురాముని, సంస్మరించి యీ
కల్లజగంబును న్మఱచి కాంతుము స్వాంతమునందు శాంతినిన్.

ఉ. పండుగ పబ్బమంచు, మఱిపర్వమటంచు, జయంతియంచు, రా
ముండును గృష్ణుఁడంచుఁ బరము న్దలపోసి తరింతురంచు, నె
న్నండొ విధించి రట్లగుట నాదమునిల్పగ నేఁడు మొల్లకున్
బండుగవచ్చెఁ జక్కనిప్రబంధము వ్రాసినదామె చూడరే.

ఉ. కుమ్మరివారియింటను జకోరవిలోచన యుద్భవించి, లో
కమ్ముఁ దృణమ్ముగాఁదలఁచి, కంజదళాక్షుని సేవఁజేయు జ
న్మమ్ము పవిత్రమౌననుచు నమ్మి, మహాత్ముని రాముఁగూర్చి గ్రం
థమ్ములిఖించి, చల్లగను దాటెను మొల్ల భవాబ్ధివెల్లువన్.

ఉ. ఏమరుపాటు కల్గుగద యెంతటివారికి నెట్టులైన శ్రీ
రాముని సంస్మరింపఁగ దరమ్మె మనమ్మును నిగ్రహింప నో
భామినులార! నేఁడయిన బంధవిమోచను బద్మలోచనున్
నేమమువీఱఁ గొల్చి భవనీరధిపారముఁ జేరుటొప్పగున్.

ఉ. పూరుష పుంగవుల్లవులు పూర్వము నేఁడును గూడ భారతా
చారము, శీలము, న్దయయు, సత్యము, ధర్మము, నిల్పఁ బెట్టఁగా
భారతము, ల్పురాణములు వ్రాసిరి వాసిగ నిప్పు కొందఱా
దారికిఁ గంపగొట్టి పెడదారులు దీయుదు రౌరధీరులై.

ఉ. కల్లలు బొల్లులున్ బలికి కాదనియౌనని యెల్లకాలమున్
జిల్లరమాటలన్ గడప జీవులకెల్లను జెల్లునాయువుల్
డొల్లసమస్తమిందు నొకఁడున్ మనవెంటఁ గొనంగబోలదో
పల్లవపాణులార! భవభంజనుఁ గంజదళాక్షుఁ గొల్వఁడీ.

చ. చదివినవారలుండ రిలసాధ్వులలో, నొకవేళనుండినన్
జదువుట వ్రాయుచేయగును శాస్త్రపురాణము లంటవంతగా
జదివిన సంప్రదాయముగ సద్విషయమ్ముల బుద్ధిఁబోవ దే
చదువులనేర్వ వారలకు సత్కవితాకలనమ్ము కల్గునే.

ఉ. రెండును రెండుత్రోవలు ధరిత్రినిఁ బ్రాక్కప్రతీచివానిలో
నుండెడుసారము న్గురుని సూక్తినెఱింగి వచింతుఁ జింతలే
కండజయానలార! వినుఁ డందఱుఁబారముఁ జేర్చుఁబ్రాక్కు, వే
రండిక నొండుమార్గముల రాదు ప్రశాంతితరించి మించఁగన్.

శా. మీరాబాయి తరించె ముక్తి గృహిణీవై మించెంగదా కన్యయై
ధీరుండైన విదేహునిన్ సులభయుక్తి, దీక్షన్ భవంపుం దరిం
జేరెన్ వెంగమ తా వింతతువయినన్ నిశ్శ్రేయసం బందఁగా
దారు ల్పెక్కులు ధీరచిత్తలకు శ్రద్ధంబూనుచో ధారుణిన్.

ఉ. జాతి ప్రధానమా? గుణము సర్వజనస్తవనీయమాటచే
నాతియు రామచంద్రుని గుణమ్ములఁ బ్రస్తుతిజేసి లోకవి
ఖ్యాతినిఁ గాంచెమొల్ల, కనకమ్మను గమ్మదనమ్ము రీతిగాఁ
గైతయు భక్తియుంగలిసి గల్గఁజేయు నఖండమోదమున్.

ఉ॥ శూరులు నేఱులుంగలుగు చోటులనెన్నఁగనేల, వారిలో
సారమెఱుంగనేరని యసారులచర్చలతోడనేమి, సం
సారము దాటుదారులఁ బ్రచారముచేయు కవీశ్వరుల్‌గదా
ధీరులు, వారుచేయు నుపదేశమెఱింగి చరించుటొప్పగున్.

చ॥ ఇడుములకోర్చి, సంతతికినెంతయుఁగూర్చి, సుతుండుకూతురం
చెడ మొకయింతలేక భరియించి, సమంబుగఁబెంచు తల్లులీ
యెడరునఁ గావకున్నయెడ నేరికఁగాతురు భారతీయులన్
కడువిషమంపుకాలమిది కాలునిలీలఁగ్రసించు ధర్మముల్.

శా॥ ఆటల్ పాటలు, నవ్వుమాటలు నసభ్యంబైన పొత్తంబులున్,
బోటీలోట్లులు, వింతసొంపులును, దెంపుల్తంపులున్, విద్యలై
బోటుల్నేటికె హద్దులంగడచి, గుంపుల్గట్టిపోవంగ, నా
ర్భాటంబుంబొనరించుటల్ చదువులే పాశ్చాత్యదుర్వాసనల్.

మ॥ మగవారెట్టెటు సంచరించినను, ధర్మంబెప్డుఁ గాపాడఁగా
మగువల్ దీక్షవహించి యింతదనుకన్ మర్యాదలన్ నిల్పినా
రుగదా! పెంచుట స్త్రీలకున్నలుగు నేర్పున్ జూతుమే యెందు నీ
తెగువల్ నేటికి నిక్కలింగలిగి గోత్రిన్ జేసెబో నాతినిన్.

మ॥ పరభాష, ల్పరసంప్రదాయము, పరప్రారంభము ల్నేటికిన్
బరమంబైన పదంబునొందుట నభవ్యంబైన మార్గంబులన్
దరణుల్బోవఁగనైరి జీవిక కవస్థల్మారఁగా నారయన్
బరమార్థంబు స్వధర్మమున్నిమితము లాపద్ధర్మమెట్లుండినన్.

ఉ॥ రాజ్యము లేలినారు, రణరంగములన్ రిపుఁదోలినారు, సం
పూజ్యతనొందినారలు, ప్రబుద్ధులలో జయమొందినార హా!
భోజ్యమమర్చినారు, తపముంబొనరింపఁగ నేర్చినారు, సా
మ్రాజ్యపదంబె కాంతలకుఁ బ్రాజ్యమగున్నద భారతావనిన్.

ఉ॥ సత్యము, శౌచమున్, దయయు, శాంతియు, దాంతియు, దానధర్మముల్,
పత్యుపచారముల్, గురుసపర్యలు, మాధవపాదచింతనల్,
ప్రత్యయమాప్తులందు గృహభాండవిశుద్ధియు, శ్రద్ధభక్తియున్,
నిత్యముఁగల్గి పైఁజదువనేర్చినసాధ్వికి సాటిగల్గునే?

శా॥ కాంతాసమ్మితమౌను గావ్యమని తత్కాలమ్మునం జెంతయో
సంతోషంబునుగూర్పనేర్పగ సదాచారంబు వేదంబులన్
గాంతల్మీరుదురంచుఁ దెల్పుదు రలంకారజ్ఞులట్లౌటనో
కాంతారత్నములార! మీరు గురువుల్గావందగు న్ధర్మముల్.

ఉ॥ వేడుకకర్త్రియై మగనివింతగ సంతసపెట్టునట్టి య
య్యాడుది పల్కుపల్కు నిగమార్థముకన్నను మిన్నయౌ నికే
వ్వాఁడది దాఁటశక్తుఁడగువాఁడు, మనోహరియై మనోహరుం
గూడి స్వధర్మదీక్షఁ బరికొల్పెడు సాధ్వియుఁ గావ్యమొక్కఁడే.

గీ॥ గొప్పవంశంబుననుబుట్టి గొప్పబుద్ధి
గలుగుకవిహితుఁ గలవాని ఘనుని సాధు
వినయసుందరు, దీపింతు వెలయ విబుధ
సోము శేబాలపట్టాభిరామనాము.

చ॥ సిరియును విద్యయుంగలుగు సింహపురంబున వర్ధమానసం
ఘరచితగోష్ఠిలో బుధసకాశమునన్ నను బెద్దఁజేసి భూ
వరులునొనర్పలేని విభవంబున సత్కరణంబొనర్చు కే
సరి కిదు రంగఁ జెప్పుడు ప్రశస్త మహార్హ విశేషసంపదల్.

అంతట అధ్యక్షురాలు ఉపన్యాసకుల విషయములకు మెఱుగువెట్టుచు ఉపసంహారోపన్యాసము గావించిరి. శ్రీయుత తూములూరు శివరామయ్యగారు మొల్ల జయంతి జయప్రదముగా జరుగుటకు కారకులైనవారి నెల్లర నభినందించిరి. గంధఫల పుష్ప తాంబూలములను పంచుటతో సభ ముగిసెను.

---

# ప్రపంచ పరిస్థితులు

నానాటికి ప్రపంచమందు యుద్ధమేఘములు దట్టమగుచున్నవి. ప్రపంచశాంతి యనుమాట పంచబంగాళమైనది. ఏక్షణమునవో ప్రచండసంగ్రామము బయలుదేరి ఇదివఱ కెన్నడును కనివిని యెఱుగని వినాశనము గొనితెచ్చునని రాజనీతిజ్ఞులు రాయిగుద్ది చెప్పుచునేయున్నారు. ఇది నిజమే. ఇపుడు ప్రపంచమున రెండు శక్తులు బయలుదేరినవి. ఒకటి ఫేసిజము. యింకొకటి కమ్యూనిజము. ఇవి నానాటికి విజృంభించుచున్నవి. కాని ప్రజాసముదాయము నాకర్షించుచున్నది కమ్యూనిజమే. ఈ రెండును ఒకదానికొకటి పూర్తిగ వ్యతిరేకమగుటచే నివి రెండును ఏకరీతిగ నభివృద్ధిజెందజాలవు. అందుచే సంఘర్షన రాక తప్పదు. అది ప్రబలమై యేదో యొకటి యింకొకదాని నాశనముచేయువఱకు లేక అణగద్రొక్కువఱకు శాంతి యనునది యుండదు. ప్రాచీప్రతీచులందు ప్రబలమైన సమస్యయియ్యదే.

* * *

## ప్రాచి

పాశ్చాత్యప్రపంచమున స్పెయినువలె చైనా దేశమునందలి యంతఃకలహములు తీవ్రరూపము దాల్చునని యనుకొనుటకు కారణములుండినవి కాని ప్రాచ్యదేశభాగ్యమోయన నవి యంతటితో సంతరించినవి. సియాన్ఫునందు ప్రభుత్వమున కెదురుదిరిగిన సైన్యములు ప్రభుత్వమువారితో కొంతకాలము మాత్రమె పోరాడినవి. అంతఃకలహములచే నిరువురి బలము క్షీణించి దేశారిష్టకమై విదేశీయుల యొత్తిడికి లొంగిపోవుదుమని యిరుపక్షములవారును వెంటనే గుర్తించి సమాధానపడుట కంగీకరించిరి. విప్లవనాయకుడు చైనా యధ్యక్షుని విడచిపెట్టెను. దానిపై ప్రభుత్వమువారు విప్లవకారులపై యుద్ధముచేయుట నిల్పివేసిరి. అధ్యక్షుడగు చియాంగ్ షేక్ గారు తన పదవికి రాజానామానిచ్చినను ప్రభుత్వము ఒప్పుకొనదయ్యెను. విప్లవనాయకునికి పదిసంవత్సరముల శిక్షను మాత్రము విధించిరి. అదియు రద్దుగావింపబడినదని తెలియుచున్నది. ఈవిధముగ చైనాకలహము లంతరించి యాకలహముల పరిణామము నత్యాతురతతో గాచుకొనియుండిన జపాను రష్యాదేశముల యాశయములకు భగ్నకారణములైనవి. ఏవిధముగనైన జోక్యము గలిగించుకొని చైనాదేశమును కబళింపదలంచుకొన్న జపానుసంగతి

నెటింగియే చైనాదేశము అంతఃకలహముల కెడమీయక చక్కని రాజనీతిని గనబరచినది. జపాను ప్రాబల్యము నణంచవేచియుండు రష్యాకిదినానందాయకముగా నుండవచ్చును.

*   *   *

ప్రతీచి

నానాదేశములకు యుద్ధరంగమైయున్న స్పెయిను పరిస్థితులను బాగుచేయుటకు ఫ్రాంసు ఇంగ్లడుదేశములు ప్రయత్నించుచునేయుండియు పరిస్థితులతి తీవ్రరూపము దాల్చుచున్నవి.

పాలోన్ అను జర్మనునావ విప్లవకారులకు యుద్ధసామగ్రికొనిపోవుచున్నదని స్పెయిన్ ప్రభుత్వపునావలు దాని నడ్డగించి పరీక్షించుటకు నిల్పినవి. ఆసంగతి విన్నవెంటనే జర్మనియుద్ధనావలతివేగముతోవచ్చి దానిని విడిపించినవి. అదియునుగాక స్పెయినుప్రభుత్వము వారొక జర్మనుపౌరుని ఫాసిస్టుసభ్యుడని కాల్చిచంపిరి. దానిపై కారణములకై కాచుకొనియున్న జర్మని ప్రతీకారముజరుప నువ్విళ్లూరుచున్నది. స్పెయిను దేశపు నావలనునిల్పుచు, అని నిలువకున్న బాంబులను విసరుచున్నది. దీని కోర్వక స్పెయిన్ ప్రభుత్వ మెదురుదిరుగ నిశ్చయించినది.

ఇక విద్రోహులు ప్రతినావను పరీక్ష చేయుచు బ్రిటీషు ఫ్రెంచినావలపై బాంబులనువేయుచున్నారు. దీనికి ఇంగ్లండు ఫ్రాంసు దేశములుకూడ ప్రతీకారము చేయక మానవు. సభ్యతా ప్రపంచమీదురాగతమున కోర్వదు. ఇంగ్లండు విద్రోహులను వారుచేయుచున్న దురాగతముల విషయమై శ్రద్ధదీసుకొనుడని తీవ్రముగ హెచ్చరించుచున్నది.

పై విషయము లిట్లుండ స్పెయినునందు జరుగు యుద్ధమెంతమాత్ర మాగుటలేదు. ఇరుపక్షములవారికి సహాయము కావలనంత వచ్చుచునేయున్నది. ఇటలీనుండి 5000 మంది సైనికులు విద్రోహులకు సాయముచేయుటకు స్పెయినులో దిగినట్లు వార్తలు వచ్చుచున్నవి. ఈపరిస్థితు లేవిధముగ పరిణమించునోయని యూరపుఖండ మంతయు నుడికిపోవుచున్నది.



నెల్లూరు లేడీస్ క్లబ్ అధ్యక్షురాలైన మిసెస్. ఇ. వుడ్‌హౌస్ గారికి సభ్యులు వీడ్కోలొసంగుట.



ఫైజపూరు కాంగ్రెసుకొొఱకు శిక్షపొందిన స్త్రీవాలంటీర్లు.
మిస్. ప్రేమకాంతగారు మధ్యకూర్చొనియున్నారు.



ఫైజపూరు కాంగ్రెసుకు పూనాలో శిక్షపొందిన స్త్రీవాలంటీర్లు.

# ప్రేమ సమస్య

శ్రీమతి తాడి నాగమ్మగారు

(గతసంచిక తరువాయి)

౫

"మేరీ! నీవు తప్పక నీ తండ్రిమాట వినవలెను. వృద్ధుడైయున్న నీ తండ్రి కోర్కెను నెరవేర్పుము. చిన్ననాటనుండియు అతిగారాబముగ పెంచిన నీ జనకునియందు కనికరముంచుము. నీకై యాతడు కోట్లకొలది ధనమును సమకూర్చియున్నాడు. అవన్నియు నెవరి పాలుగాను? మనము వెంటనే జర్మనీ దేశమునుండి పారిపోవలెను. లేకున్న మన ప్రాణమాన ధనములు మనకు దక్కవుసుమా! నీ తండ్రి నిన్న మూడు దినములనుండియు సిద్ధము కమ్మనుచున్నను నీ వేలకో యుదాసీనత వహించి యుంటివి. కారణము తెలుపకూడదా?" అన్నది మేరీ తల్లి.

"అమ్మా! నేనును అదియే యాలోచించుచుంటిని. కాని అంత తొందరపడెదవేల? రెండు మూడు దినములలో మనము జర్మనీ రాజ్యమును విడచి పోగలము."

"మేరీ! నీకు లోకానుభవము చాలతక్కువ. దినదినమున కెందరో మన జాతివారు నాజీసంఘము యొక్క దుష్కృత్యములకు బలియగుచున్నారు. మొన్నటిదినమున రెండు యూదులకొంపలు తగులబెట్టబడినవి. నిన్నటిదినమున నలుగురి యూదుల శవములు చెరువునందు తేలుచున్నవి. ఇట్లు నిమిషనిమిషమునకు ఘోరవార్తలు మనకు వినిపించుచున్నపుడు మన మింకను యాలసింపనేల? తల్లీ! మామాట వినుము. వెంటనే ప్రయాణసన్నద్ధవగుము."

"అమ్మా! ఇన్నిదినము లున్నవారము ఇక మూడు దినములు గడపలేమా? అన్నిటికిని ఈశ్వరుడే కలడు. మనము నిర్దోషులమైనపుడు ఎందుకు అనుమానములకు లోను గావలెను?"

"మేరీ! ఒకవైపు చూచుచునే యేల కష్టముల పాలు కావలెను. రాత్రి యేమి జరిగినదో తెలియునా? నీ స్నేహితురాండ్రైన తెరిజా, మార్గరెటులను నాజీ యువకులు నానా అల్లరిచేసినారు. వారిస్థితి యిపుడు కడుప్రమాదముగనున్నది. ఇవన్నియు తిలకించినచో నాయొడలు కంపమెత్తుచున్నది. అమ్మా మేరీ! లెమ్ము! ఈ పాడుదేశమునుండి పారిపోవుదము. ఆలస్యము చేయవద్దు" అని మేరీ తల్లి చెప్పుచుండు నంతలో మేరీ తండ్రి కన్నీరుకార్చుచు చినిగిపోయిన వస్త్రములతో నచట ప్రత్యక్షమాయెను. అతని భయంకరస్థితిని జూచినవెంటనే తల్లి గడగడ వణకసాగెను. గొంతెత్తియేడ్చిన నెవరు లోనికివచ్చి యేమిచేయుదురో యని భయపడసాగెను. అంత నా వృద్ధుడు, "మన మాలసింపవలదు. వెంటనే లెండు. యూదులయొక్క దుకాణములన్నియు దోపిడిచేయబడుచున్నవి. పెద్దనాజీలదండు వచ్చి బజారుపై బడినది. నలుగురైదుగురు యూదులు హత్యచేయబడిరి. నే నెట్లో తప్పించుకొని బయటపడితిని. కాని మన దుకాణమునకు నిప్పంటించబడినది. ఇప్పటి కది పూర్తిగా దహనమైయుండును. మనము వెంటనే పారిపోవలెను. లేకున్న మన ప్రాణములు మనవిగావు. తల్లీ! మేరీ! ఎంతకాలమునుండియో చెప్పుచున్నను నీవు మామాటలు వినవైతివి. ఇప్పుడైనను నా ప్రార్థన యాలకించిలెమ్ము. అమ్మా! మా యీపాట్లన్నియు నీకొరకేగదా?" అని గద్గదకంఠముతో చెప్పుచు నామెను కౌగలించుకొని కుమిలి కుమిలి లోలోన దుఃఖింపసాగెను.

అంత తల్లి "మేరీ! ఒకనెలకైతమే నీవు మా మాటలు విని ప్రయాణమైనచో మన కీ కష్టములు

మూడియుండవుగదా! ఎంతకాలమునుండి బ్రతిమాలుచున్నను నీవు మామాటలు వినక నేటికి మమ్ముల నీ వార్థక్యదశయందు దిట్టస్థితికి దెచ్చితివి. అమ్మా! యిపుడైనను ముదుసలులమగు మాయందు దయయుంచి లెమ్ము. వెంటనే ప్రయాణసన్నద్ధవుకమ్ము. ఒక జర్మను యువకునియందు కలిగిన ప్రేమచే మమ్ముల నధోగతిపాలు కావింపకుము. ఇంతేకు నతడు నిన్ను పెండ్లాడుట పట్టిది. ఒకవేళ పెండ్లాడినను యీ నాజీ ప్రభుత్వమునందు మీరు సుఖించుట కలుగోని వార్త. మేరీ! యేల మాట్లాడవు. నీ యభిప్రాయమేమి?" అని కన్నీరు తుడుచుకొనుచు అనెను. అపుడు మేరీ, "తల్లీ! మీ కిన్నికష్టములను కల్గించిన నేను కడుపాపాత్మురాలను. నా హృదయము నపహరించిన ఆల్బర్ట్ వద్ద సెలవు గైకొనివచ్చెదను. దానికి మీ రనుమతించవలయును" అనెను. తల్లి కోపముతో "మేరీ! మనము దేవునియొక్క బిడ్డలము. అబ్రహాము యొక్క సంతానము. జర్మన్ యువకుని ప్రేమించుటచే నీవు మన జాతీయధర్మము నుల్లంఘించుచున్నావు. ఫలితము ఘోరముగనుండును సుమా!" "తల్లీ! నే నా ఫలితమునంతయు ననుభవింప సిద్ధముగా గానేయుంటిని. కాని నా యాల్బర్టునకే హానియు రాకుండుగాక!" యని చెప్పి వెంటనే ఆల్బర్ట్ను కలసికొనుటకు బయలుదేరిపోయెను.

౬

"నాయనా! ఆల్బర్ట్! నీ వామేరీవలన కష్టముల పాలగుదువు. ఇపుడైనను నామాటవిని యామె స్నేహము మానుము" అని ఆల్బర్ట్ తల్లి బ్రతిమాలసాగెను.

"అమ్మా! గత మహాసంగ్రామకాలమునాటి నుండియు నావిద్యకు మాత్రమేగాక మనకుటుంబఖర్చులన్నిటికిని కావలసినంత ధనము నొసంగుచువచ్చిన మేరీని నేను విడుచుట కృతఘ్నతకాదా?"

"హిట్లరుయొక్క నాజీపార్టీ నేడు యూదులను చీల్చి చెండాడుచున్నది. యూదులనుమాత్రమేగాక యూదులతో స్నేహముచేయుచున్న జర్మనులనుగూడా నాశనముచేయుచున్నారు. వారముదినముల క్రిందట మ్యూనిచ్ నగరమునందు యూదులతో స్నేహముచేయుచున్న ఇరువది జర్మన్ యువకులకు జన్మాంతరపు ఖైదు విధింపబడినది. హిబ్రూయువతులను పెండ్లిచేసికొనినారనెడి కారణముచే నలుగురు జర్మన్ యువకులు ఉద్యోగములు పోగొట్టుకొనుటయే గాక ఘోరమగు శిక్షలకు గురియైరి. గనుక నీ విపుడైనను మేరీస్నేహము విడిచిపెట్టవలెను."

"తల్లీ! మాతృదేవతవగు నీ యాజ్ఞలనిందు మన్నింపజాలను. ఇంతవరకు మనలను పోషించుచు నిష్కళంకప్రేమతో నాకొరకై జీవింపుచున్న మేరీని విడిచిపెట్టుట నాధర్మము గాదు."

"నాయనా నామాటవినుము. ఏనాడు నీ సోదరుల తండ్రియు మహాసంగ్రామమునందు మడిసిరో నాటినుండియూ నేటివరకూ నిన్నుజూచుకొని దుఃఖమును దిగమ్రింగుకొనియుంటిని. ఈవార్థక్యదశయందు నన్నిట్లు శ్రమలపాలుజేయుట ధర్మముగాదు."

"ఆమెను విడనాడి బ్రతికియున్నంతకాలమూ దుఃఖించుచుండుటకంటె ఆమెనుచేపట్టి సంతోషముతో మరణించుట మేలుగాదా?"

"మరి నిన్నే నమ్ముకొనియున్న నాగతియేమి?"

"అందుకనియే నిన్నెంతకాలమునుండియో బ్రతిమాలుచున్నాను. ఇపుడైనను నాప్రార్థన యంగీకరింపుము. మేరీ తల్లిదండ్రులతో బయలుదేరి నిన్ను కూడా తీసికొనిరమ్మనుచున్నది. అమెరికాదేశము పోయి యచట సుఖముగా జీవింపవచ్చును. వారికి కోట్లకొలది ధనముగలదు కదా?"

"నీమాటలు నాకేమియు బాగులేదు. తరతరములనుండియు నీవంశీయులీ జర్మన్ రాజ్యమునందు గొప్పగొప్ప సేనానులై రాజ్యచక్రములను ద్రిప్పిరి.

నేడు నీవొక పరాయిజాతిస్త్రీకి లోబడి బ్రతుకు జీవుడాయని ప్రాణములు దక్కించుకొన యత్నించు చున్నావు. అట్టిపిరికిపందల కట్టిపిరికివాడవు తగవు. నేను నామాతృదేశమును విడిచిరాను. నాగతి యేమైన నగుగాక! నన్ను నీచేతులతోనే యీ నామాతృదేశ మునందు పూడ్చి నీయిష్టమైనచోటికి బొమ్ము."

ఈమాటలు వినుటతోనే ఆల్బర్ట్‌నందున్న వీర రక్తమునందు వేడివాయువులు లేచినవి. చిత్రవిచిత్ర ములైన యాలోచనలు కలిగినవి. తాను నిజముగనే స్త్రీలోలుడై పోతినేమోయని భ్రమింపసాగెను. తన వంశీయులొనర్చిన వీరకృత్యములను జ్ఞప్తికిదెచ్చు కొనెను. తాను వారికి తగని వాడననిపించుకొనుట హేయమని తలంచెను. నాజీపార్టీయందు తాను నాయకత్వము వహించినచో హిట్లరుయొక్క కుడి భుజముగ నుండవచ్చునని యూహించెను. ఇట్లెన్నియో ఆలోచనాపరంపరలు యలలవలెలేచి యాడసాగినవి. ఇంతలో తల్లి తనపనిపై యరిగెను. కడసారి కర్తవ్య మును నిశ్చయించుకొనుటకై మేరీ ఆల్బర్ట్ వద్దకు వచ్చి నది. ఆలోచనానిమగ్నుడైయున్న ఆల్బర్ట్ ఆమెరాక నంతగా గమనించనేలేదు. అంతట మేరీ దీనముగా తనకుతగిన కర్తవ్యము నిర్ణయింపవలసినదని ఆల్బర్ట్‌ను ప్రార్థించెను. ఆల్బర్ట్‌యొక్క వీరరక్తమంతయు వెంటనే చల్లారినది. మరల మేరీయొక్క ప్రేమ స్ఫురణకు రాసాగినవి. తన సోదరులు తండ్రియు గతించిననాటినుండియు ఆమె తన నెంతసుఖపెట్టిన దియు యెట్లాదరించినదియు జ్ఞప్తికి దెచ్చుకొనసాగెను. అట్టి పవిత్రమూర్తియైన మేరీని విడచిపెట్టుటకంటె మహాపాతకము వేరొకటుండదని తలంచెను. ఇట్టి యాలోచనా సముద్రతరంగములందు యాతని మనసు తేలియాడసాగెను.

ఈలోపల మేరీ యాలోచనలు వేరుగా పరుగిడు చున్నవి. చిన్ననాటినుండియు తన నల్లారుముద్దుగ వేయికన్నులతో కాపాడుచు పెంచుచున్న తన తల్లి దండ్రులకు తనవలన యేల కష్టములు కలుగవలెను? ఇంతకు వారికి కలిగిన సంతానము తానొకర్తయే గదా? వారి యాశలన్నియు తనపైనుండగ వారికిన్ని కష్టములు తనవలన యేల కలుగవలెను? తాను వారు విడిచి పోయినయెడల సుఖముగనుందురుగదా? వారేల యట్లు చేయుటలేదు? తనపైనుండెడు ప్రేమవలననే గదా? దానికి ప్రతిఫలముగ తానేమి చేయుచున్నది? వారికి కష్టములొనగూర్చుచున్నది. తన సర్వస్వము ఆల్బర్ట్‌యని తలంచుచున్నది. ఇది ధర్మ సమ్మతమా? పైగా తనకొరకై ఆల్బర్టెన్ని కష్టములపాలు కావల యునో! తనను ప్రేమించినయువకునికి తనవలనే కష్టములు కలుగుచున్నవిగదా? కాబట్టి ఆల్బర్ట్‌ను విడిచి తన తల్లిదండ్రులతోపోయిన యిరువురికి సుఖ ముండునుగదా! తానేల యట్లుచేయకూడదు? అయ్యో! అట్లుగాదు. ఆల్బర్ట్ లేని మరియొక ప్రపంచము తన కేల? ఆల్బర్ట్ లేనపుడు తాను జీవించుటేల? జీవితమున కేది మధురమో యదిలేని జీవితముకంటె మరణమే మేలు. కనుక తాను ఆల్బర్ట్‌తో జీవించవలెను. లేదా మరణించవలెను. అట్లైనచో తన తల్లిదండ్రుల గతి యేమి? తానులేకుండ వారు జీవింపగలరా? ప్రేమ స్వరూపులైన తల్లిదండ్రులనట్లు విడనాడవచ్చునా? స్వార్థపరురాలై తన జీవితానందమునుకోరి తల్లిదండ్రుల జీవితానందమును భగ్నముచేయవచ్చునా? తానే తమ సర్వస్వమనియెంచి తనకై కష్టించి కోట్లకొలది ధన మును సంపాదించిన ముదుసలులైన మాతాపితరుల నావయస్సునందు దుఃఖపెట్టవచ్చునా? ఇపుడేది కర్తవ్యము? ఏది ధర్మము? తల్లిదండ్రులు తననెంతగా ప్రేమించుచున్నారో అంతగానె తానును వారిని ప్రేమించుచున్నది. ఆల్బర్టు తన నెంతగా ప్రేమించు చున్నాడో తానును యాతనంతగా ప్రేమించుచున్నది. ఇపుడెవరిని విసర్జించవలెను? అల్బర్టుకూడా తనతల్లిని మిక్కిలి ప్రేమించుచున్నాడు. వృద్ధురాలైన యామెను విడనాడితనతో ఆల్బర్టువచ్చుట మంచిదా? ఆమె మాతృదేశమైన జర్మనీని విడనాడదట. వీరు

జర్మనీదేశమునందు జీవింపజాలరు. ఇట్టి విషమ పరిస్థితులయందున్నారు. మేరీ ఆల్బర్టులు.

## ౭

అది నిశీథరాత్రి. ఆనాడమవాస్య. గాఢాంధకారము పృథ్వినంతయు క్రమ్ముకొనియున్నది. దట్టమైన మేఘములాకాశమంతయు నావరించినవి. ప్రచండమైనగాలి వీచుచున్నది. బ్రహ్మాండమదరునట్లు ఉరుములు ఉఱుముచున్నవి. మధ్యమధ్యకన్నులు మిఱుమిట్లుగొల్పు మెఱుములు కాన్పించుచున్నవి. క్రమక్రమముగా గాలియొక్క తీవ్రత హెచ్చుచున్నది. చెట్లకొమ్మలు విరుగసాగినవి. ఇండ్లకప్పులెగురమొదలిడినవి. రానురాను చెట్లు పెకలింపబడుచున్నవి. శకటములు తలక్రిందులగుచున్నవి. ఉఱుముల ఘోషమునకు మెఱుముల తళుకులకు భయంకరతుపానులకు పృథ్వియె జలదరించుచున్నది. రైలుస్టేషనునందున్న విద్యుద్దీపములు మినుకుమినుకు కాంతులతో కాన్పించుచున్నవి. అపుడు ఆల్బర్టు "మేరీ! ఇకనీతో నేనువచ్చుట మనకిరువురికికూడ అంతక్షేమముగాదు. రైలుస్టేషను సమీపించిన వెంటనే నన్నితరులు గుర్తింతురు. ఇక నీవు తల్లిదండ్రులతో కలిసిపొమ్ము. నాతల్లి నెట్లైనను సమ్మతపరిచి తోడ్కొని తరువాత వచ్చెదను" అనెను. మేరీనోట మాటరాలేదు. స్తభించిపోయినది. కడసారి తనప్రియుని మోముసరిగ చూచుకొనుటకైనను తాను నోచుకొనలేదు. కలిగినదుఃఖమును వెడల గ్రక్కుటకైనను వీలులేని పరిస్థితులవి. ఆభయంకర తుపానులో ముదుసలులగు తన తల్లిదండ్రులనెట్లు తోడ్కొనిపోగలనాయని యామె నిశ్పృహజెందెను. అట్టి విషమ సమయమందు వారిని రైలుస్టేషనువరకైనను సాగనంపలేకపోతినేయని ఆల్బర్టు చింతించెను. తన్నంతగా ఆదరించినవారి నాక్లిష్టపరిస్థితులలో విడనాడబోవు సరికి ఆల్బర్టునకు దుఃఖముపొంగి రాసాగెను. తరతరములనుండియు స్వస్థానముగ జేసికొనిన జర్మన్ రాజ్యమును తుదకు తమ కత్యంతహితులైన ఆల్బర్టును విడిచి పోవలసివచ్చెనేయని మేరీకి యామె తల్లిదండ్రులకు అశ్రుజలములు పొంగిరాసాగెను. గొంతెత్తి యేడ్చుటకు వీలులేనిసమయమది. అందరికన్నులనుండి దుఃఖబిందువులు రాలుచున్నవి. ఆ నిశీథరాత్రియందు వానినెవరు చూచెదరు? ఎవరికన్నీరు వారే తుడుచుకొనవలసిన దుస్థితివారికి కలిగినది. ఎవరేస్థితియందున్నది కూడ తెలిసికొనుటకు గాఢాంధకారము ప్రబలయాటంకము కల్పించినది. ఒకరి కౌగిలినుండి యొకరు వెలువడుసరికి పృథ్వియేకంపించుచున్నట్లు వారికి దోచినది. నోటిమాటలతోనె సెలవుచెప్పకొనిన యెవరు వినెదరోయని భయము. చూపులతో వీడ్కోలుపుచ్చుటకు వీలులేని నిశీథరాత్రి. తుదకెట్లో మేరీ తల్లిదండ్రులతో కలసి నాలుగడుగులు వేసినది. వెంటనే నిస్పృహజెంది నేల కొరిగినది. తిరిగిపోవుచున్న ఆల్బర్టును పిలుచుటకు ముదుసలులకు నోరురాలేదు. వారికి కలిగిన అపాయముకంటె ఎవరువినెదరోయనెడి భయమెక్కువగానుండెను. ఏపుత్రికయొక్క యోగక్షేమములనుకోరి తామట్టి ప్రయాణమును సంకల్పించుకొనిరో యాకుమార్తకే ప్రాణాపాయము కలుగు పరిస్థితులు కలిగినవి. ఇంతలో ప్రచండమైనపిడుగు పడుటచే వారికి సుమంతదూరమునున్న మహావృక్షము దగ్ధమైనది. వెంటనే బ్రహ్మాండముపగులునట్లు భయంకరముగ ఉరిమినది. తోడనే కుంభవృష్టి కురియసాగినది. వెనువెంటనే గాలియొక్క తీవ్రతయు హెచ్చసాగినది. పంచభూతము లొకదానితోనొకటి పందెము వేసికొనినట్లుగ పృథ్వినంతయుపునాదులతో కదిలించుచున్నవి. కుమార్తె కుపచారముచేయవలసిన తల్లిదండ్రులు వర్షముచేతడిసి చలికి గడగడవణకసాగిరి. కష్టమన నేమియో కలలోగూడ నెరుగని కోటీశ్వరులు మానవసంఘముచేతనేగాక ప్రకృతిచేతను బాధింపబడు కాలమరుదెంచును.

తిరిగిపోవుచున్న ఆల్బర్టుస్థితి యింతకంటెను ప్రమాదకరముగనున్నది. తన జీవితేశ్వరియగు మేరీని విడిచి

పోవుటలో ఆల్బర్టెంత బాధపడెనో యెవరికెఱుక ? పొరలివచ్చు యశ్రులపొం గణచుకొనుచు మేరీని దిగవిడిచివచ్చిన యా భయంకర-చీకటినే తిరిగితిరిగి చూచుచు పోవుచున్నాడు ఆల్బర్టు. ఇంతలో పిడుగు పడుట చూచినాడు. ఆ భయంకరఘోషమును విని నాడు. ఆ పిడుగువలన తనప్రియురాలు దగ్ధమైన దేమోయని సంశయించెను. చిత్రవిచిత్రభయాతి భయంకరములైన యాలోచనాతరంగములు మానస మును కల్లోలపరచ యాతడు స్తంభితుడై వెనుకకు వెర్రిచూపులు చూచుచుండెను. ఇంతలో రైయ్‌మనుచు వచ్చి యొక కారు యతనిపైబడినది. వెంటనే కారు లైట్లు వెలిగింపబడినవి. అది నాజీసంఘముయొక్క కారు. నాజీసంఘమునకై యది ప్రత్యేకముగ నిర్మింప బడినది. నడచునపుడు శబ్దముండదు. చీకటిరాత్రు లందు దీపములు వెలిగించి కార్లు నడుపవలెనను ప్రభుత్వ శాసనములు నాజీసంఘమునకు చెందవు. నాజీసంఘము యొక్క బలమునకై వారెట్లు నడచినను సరే. నరకమను నది యెచ్చటనో లేదు. యూదులకు జర్మనీదేశము నరకము. నీగ్రోలకు అమెరికాదేశము నరకము. భారతీయులకు దక్షిణాఫ్రికానరకము. మాలలకు హిందూదేశమే నరకము.

ఆల్బర్టును వెంటనే కారుపై చికిత్సాలయమునకు గొనిపోయిరి. గడ్డకట్టియున్న యాతని దుస్తులను తొలగించి మారుదుస్తులను తొడిగిరి. ఆల్బర్టున కింతను స్పృహరాలేదు. కాని యాత డాస్థితిలోనే "మేరీ! మేరీ!" యని కలవరించెను. నాజీదండు యా మాటలువిని వానియుదంతమును కనుగొన యత్నించిరి. ఎవరినడుగుదురు ? ఆల్బర్టుబట్టలను పరీక్షింపసాగిరి. అందొక లేఖయున్నది అందిట్లు వ్రాయబడియున్నది.

No. 12 Bismark street

"ప్రియమైన ఆల్బర్ట్ !

నీతో యాలోచించినట్లుగ నేను నాతల్లిదండ్రుల నాయత్తపరిచితిని. నేటిరాత్రి నెం. 5 రైలుస్టేషను 12 గంటలబండికి ప్రయాణము. మార్గమధ్యనందు 7 వ మైలురాయివద్ద మమ్ములను కడసారిగ కలుసు కొన ప్రార్థన. దీనితోపాటు రెండు మిలియనుల మార్కులు విలువగల నోట్లు పంపుచున్నాను. తిరిగి మమ్మును కలిసికొనువరకు వీనిని జాగ్రత్తగ వాడు కొందువుగాక ! నాజీపార్టీ నాశనమగుగాక !

ఇట్లు, – నీ మేరీ."

ఈలేఖ చూచుటతోడనే నాజీదండులో గుస గుసలు బయలుదేరినవి. మేరీ ఆల్బర్టులయొక్క ఆద్యం తములు కనుగొనుటకై వారు యత్నింపసాగిరి. లేఖ ప్రకారము ఆల్బర్టు వారిని 7 వ మైలురాయివద్ద కలిసికొనియుండవచ్చు. ఆసమీపముననే వారి కారు కూడ ఆల్బర్టుపైబడినది. కాబట్టి కారుపై వెళ్లినచో మేరీనొరకును. ఉత్తరమునందున్న ప్రకారం బిస్మార్కు వీథిలో పండ్రెండవ గృహమునకరిగి ఇంకను కొన్ని రహస్యములు బయలుపడవచ్చును. ఈయాలోచన కలిగిన వెంటనే నాజీలదండు రెండుచీలికలైనది. రైలుస్టేషను మార్గమునందు మేరీని పట్టుకొనుటకు కొందరు ఒకకారుపై బోయిరి. రెండవజట్టు మేరీ యింటిని శోధించుటకు పోయిరి.

(మేరీ ఆల్బర్టు లీ విషమపరిస్థితులనుండి వెలువడు దురా ? లేక నాజీసంఘమునకు బలియగుదురా ? ఇంతకంటెను ఘోరమైన పరిస్థితులయందు జర్మను దేశములో ఇంకెందరు యువకులు యువతులున్నారో ? ఈమొదలుగాగల విషయములన్నియు రాబోవు సంచికయందు చూడనగును.)

# భగ్నహృదయము

శ్రీమతి కె. యస్. భామామణిగారు

"అమ్మగారున్నారా?"

"ఉన్నారండి."

"అయితే రామనాథం వచ్చాడని చెప్పు."

"చిత్తం" అని నౌకరు లోనికి వెళ్లాడు.

అప్పుడే కాలేజీనుంచి వచ్చింది జానకి. కాలేజీదుస్తులను మార్చుకొని షికారుకు తయారుగఉంది.

"అమ్మా రామనాథంగారొచ్చారు."

"రమ్మను."

"చిత్తం" అని రెండు మూడు వాకిండ్లు దాటి నౌకరు బైటకివచ్చేసరికి రామనాథం మోటారుకారునుండి దిగి విలాసంగ యింటివైపుచూస్తూ నిల్చున్నాడు.

"బాబూ! దయచేయండి."

రామనాథం ప్రవేశించేటప్పటికి జానకి యెదురుగవచ్చి ఆహ్వానించింది.

"అంత అవసరముగ వచ్చారేం?"

"నేడు బీచిలో నుంచి రేడియో ప్రోగ్రాము అని. తొందరగపోవాలి."

"అయితే టీ పుచ్చుకొని వెళ్దాం రండి."

"అప్పుడే అయింది."

"మరొకసారి కానియ్యండి."

"సరే."

తొందరగ టీ పుచ్చుకొని జానకీరామనాథనులు కారులోకూర్చొని బీచికివెళ్లారు.

* * *

జానకి యింటర్మీడియేట్ సీనియర్ క్లాసున్నూ, రామనాథం బి. ఏ. సీనియర్ క్లాసున్నూ ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుతున్నారు. రామనాథం కాలేజీలో గొప్ప వక్తవటంచేతను, అచటి ఆంగ్లసారస్వత సంఘ కార్యదర్శి యావటంచేతను, నాట్యకళలో యభిరుచికలవాడవటముచేతను, తఱచుగ కాలేజీమ్యాగజైనుకు వ్యాసాలు వ్రాస్తూయుండడముచేతను, ఇవన్నిటిని మించినట్లు అతని అందం ఆకర్షణీయముగ ఉండడముచేతను జానకీ హృదయం అతని నాకర్షించింది. రామనాథంకూడ జానకీ సుగుణాలనిచూచి యేలాగైనా, ఆమెతో స్నేహితం సంపాదించాలనుకొన్నాడు. ప్రథమ ప్రయత్నంగా ఆంగ్లసారస్వతసంఘ ఉపన్యాసములో పాల్గొనమని ప్రార్థించాడు. జానకి అతనికోరికను ఒప్పుకుంది. అప్పటినుండి సాయంత్రము టెన్నిసుఆటల్లో తనకు ఉద్దిగ యేర్పాటుచేసుకొని ఆడుతూ వచ్చాడు కొన్నాళ్లు. కొన్నాళ్లకు స్నేహితం అనేది ప్రేమగ మారింది. రానురాను ప్రేమ మరింత పరిపక్వానికి వచ్చింది. ఒకరినొకరు పెండ్లిచేసుకొనేట్లు వాగ్దానాలు కూడ చేసుకొన్నారు. ఈసంగతి యేలాగైనా తమతండ్రులకు తెలియజేయాలనుకొన్నారు. జానకిప్రేమ రామనాథంతో లగ్నమైపోయింది. అతన్నితప్ప యితరులను పెండ్లాడనని నిర్ధారణచేసుకొంది.

# గృహలక్ష్మి

జానకికి పదునెనిమిదేండ్లు దాటినవి. చిన్నప్పుడే తల్లి చనిపోయింది. ఏకైక పుత్రిక అవడముచేత తండ్రి అతిగారాబముగా పెంచాడు. జానకితండ్రి కృష్ణమూర్తిగారు మద్రాసులోని ఇంపీరియల్ బ్యాంక్ మేనేజరు. తనభార్య చనిపోయినప్పటినుండియు కూతురిమీద ప్రేమచేత మరల రెండోవివాహము చేసుకోలేదు. ఇంటిలో తాను తన కూతురుమాత్రము కాపురము. కృష్ణమూర్తిగారి కొక చెల్లెలు కూడ కలదు. ఆమెపేరు కనకమ్మ. జానకికి వయసువచ్చేవరకు శ్రద్ధగ చూచుకొంటూ యుండేది. అన్న చెల్లెండ్రకు యేదో ఆస్తి విషయములో కొట్లాటలువచ్చి కనకమ్మగారు తన ఆస్తినంతా అనాథ శరణాలయానికి ఖర్చుపెట్టి బెంగుళూరు వెళ్లింది. కృష్ణమూర్తిగారికి ఒకటేకోరిక. తన కూతురికి మంచి సంబంధాన్ని తెచ్చి పెండ్లిచేసి, అల్లున్ని తన యింటిలోనే పెట్టుకొని తన ఆస్తినంతా కూతురిపేరట వ్రాసి పెట్టాలని. అంచేత చిన్నప్పటినుండి జానకిని బాగా చదివించాడు. జానకికోసర మెంత ద్రవ్యమైనా వ్యయంచేయడానికి తీర్మానించుకొన్నాడు. బ్యాంకి వ్యవహారాల్లో నిమగ్నుడవటముచేతను, తీరికలేకపోవడముచేతను రామనాథను తన యింటికి వచ్చిపోయే సంగతి, జానకీరామనాథనుల ప్రేమనుగురించి కృష్ణమూర్తిగారి కంతగ తెలిసిందికాదు.

ఆరోజు కృష్ణమూర్తిగారి బ్యాంకుకు శలవు. తీరుబాటుగ యింట్లోనేయున్నాడు. జానకి సమయము చూచుకొని ఆనాడు రామనాథమును తండ్రికి పరిచయం చేయాలని అనుకుంది. అందుకోసర మొక టీపార్టీ యేర్పాటుచేసింది. కృష్ణమూర్తిగారు తన గదిలో పడకకుర్చీలో కూర్చొని పత్రికను చూస్తూవున్నాడు. జానకిగదిలో ప్రవేశించి "నాన్నా, నేను టీపార్టీ యేర్పాటు చేశాను" అంది.

"ఎందుకు ?"

"ఈదినం మాకాలేజీస్నేహితుణ్ణి నీకు పరిచయంచేయాలని"

"ఎవరు ?"

"రామనాథం అను బి.ఏ.వి విద్యార్థి."

"ఎవరతను ?"

"బారిష్టర్ సర్వోత్తమరావుగారి కుమారుడు."

"ఆలాగా ! సరే ! బారిష్టరుగారు మన వాళ్లే, నాస్నేహితుండతను. అయితే అబ్బాయినిమాత్రం నేనెరుగను."

"3 ఘంటలకు రమ్మన్నాను."

"సర్వోత్తమరావుగారినికూడ ఆహ్వానం చేస్తే బాగుంటుంది."

"అతన్ని నేనెఱగనే."

"నేను పిలిపిస్తాను. ఈదినం శలవు తప్పకవస్తాడు."

"సరే ఆలాగేచేయండి."

జానకికి మరింత ఆనందమయింది. ఉభయపక్షముల తండ్రులు కలుస్తారని.

తొందరగ నౌకర్లకుచెప్పి పార్టీకి తయారుగ చేయించింది.

3 ఘంటలకు సరిగ కృష్ణమూర్తిగారి యింటిముందర మోటారుకారు ఆగింది. రామనాథం సర్వోత్తమరావుగారు కారులో నుండి దిగుతున్నప్పుడే మోటారుకారు శబ్దమును గుర్తించి జానకి కృష్ణమూర్తిగార్లు బైటికి వచ్చి వారివారి స్నేహితుల నాహ్వానం జేసారు. వెంటనే జానకి రామనాథాన్ని తండ్రికి పరిచయంచేసింది. రామనాథంకూడ అలాగే జానకిని తండ్రికి పరిచయం చేసాడు. పార్టీ చాలా ఆనందంగ 6 ఘంటలవరకు జరిగింది. జానకీరామనాథనులు శెలవుపుచ్చుకొని సినిమాకువెళ్లారు. కృష్ణమూర్తి సర్వోత్తమరావుగార్లు యింటి ముందర కాంపౌండులో పడకకుర్చీలలో కూర్చొని యేవో సంభాషణలకు పెట్టుకొన్నారు.

జానకి యేర్పాటుజేసిన టీపార్టీవలన ఒకరొకరికి సంబంధం మరింత సమీపానికి వచ్చింది. రామనాథాన్ని చూచేటప్పటికి కృష్ణమూర్తిగారికి జానకిని అతనికిచ్చి పెండ్లి చేయాలని కుతూహలంగ పుట్టింది. సర్వోత్తమ రావుగారికో యేదో వ్యాపారకార్యానికి దిగకుండా చక్కా సంబంధాలకు తీసుకొచ్చాడు సంభాషణాన్ని. ఈ సంభాషణలో ఒకరొకరు సంబంధాలతో కలిసికొన్నట్లు తేలింది.

"అయితే మాఅమ్మాయిని మీఅబ్బాయికి చేసుకోరాదా?" అన్నాడు కృష్ణమూర్తిగారు.

"దానికేమికాని, మావానికి యిప్పుడే పెండ్లిచేయాలని అనుకోలేదు. ఇంగ్లాండుకు పంపాలనిఉంది. ఐ.సి.యస్. ప్యాసయినాక పెండ్లి ప్రయత్నం చేయాలి."

"అలాగేచేద్దాం. ఇప్పుడుమాత్రం మా అమ్మాయికేమి మించిపోయింది, మాట అయితేచాలు తర్వాతనే కానిద్దాం. ఇది గాక మా అమ్మాయికి మీ అబ్బాయికి చాలా పరిచయంకూడఉంది. ఒకరినొకరు ప్రేమించుకొన్నారన్నమాట."

"సరే అలాగేచేద్దాం. ఇక టైమ్ అయింది శెలవు తీసుకొంటాను" అని సర్వోత్తమరావుగారు పైకిలేచాడు.

కృష్ణమూర్తిగారు పైకిలేచి సర్వోత్తమ రావుగారిచేతిలో చెయ్యిపెట్టి "అయితే యిదేమాట. చేతిలోచెయ్యికూడ వేస్తున్నాను" అన్నాడు.

* * *

కొన్నినెలలు గడిచాయి. రామనాథం బి.ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడయినాడు. జానకి కూడా యింటర్మీడీయేటు ప్యాసయింది. సర్వోత్తమరావుగారనుకొన్నట్లు కుమారుని లండనుకు పంపడానికి యేర్పాట్లుచేసాడు. జానకి రామనాథంకు వీడ్కోలువిందు యేర్పాటుచేసి తనమనోగతఅభిప్రాయాన్ని బలపరిచింది. రామనాథంకూడ జానకిని

తప్ప యితరులను పెండ్లాడనని వాగ్దానం చేసాడు. జానకిని వీడలేక అతిప్రయాసతో వెళ్లిపోయాడు లండనుకు.

రామనాథం లండనుచేరాడు. ఒకసంవత్సర కాలం యెడతెగక జాబులు విమాన టపా ద్వారా అతిశీఘ్రముగా వస్తూపోతూ వచ్చినవి. కాలక్రమమున పాశ్చాత్యనాగరికత చేతనో, లేక అచ్చటి పరిసరములవల్లనో, సాంఘికభేదాలచేతనో రెండో సంవత్సరములో జానకి వ్రాసిన లేఖలకు ప్రత్యుత్తరా లంతగవచ్చుట నిలిచిపోయింది. ఇంకొక ఆరుమాసాలకు పూర్తిగ లండనునుండి ప్రత్యుత్తరము వచ్చేదే నిలిచిపోయింది. జానకి వ్రాసివ్రాసి నిస్పృహజెందింది. ఒక్క జాబునకుగాని బదులురాలేదు. విఫలమనోరథ అయింది జానకి. సర్వోత్తమరావు కృష్ణమూర్తిగార్ల మైత్రికూడ మునుపటి మాదిరిగాక రానురాను సన్నగిల్లింది. సర్వోత్తమరావుగారు వేరే ఘరానా కుటుంబములో సంబంధము ఏర్పాటు చేసుకొన్నాడని పరోక్షంగ కృష్ణమూర్తిగారికి తెలిసింది. ఈ సమాచారము విన్నంతనే కృష్ణమూర్తిగారికి పట్టరానంత రోషము వచ్చింది. తానుకూడ వేరొక సంబంధాన్ని తెచ్చి యతని కన్నులెదుటనే కూతురికి వివాహంచేయాలని అనుకొన్నాడు.

అనుకొన్న మేరకు గొప్పవరదక్షిణ ఇచ్చుటకు ఒప్పుకొని పచ్చయ్యప్ప కళాశాల ప్రొఫెసర్‌గారి కొమారుడగు మోహనరావునకిచ్చి వివాహముచేయున ట్లేర్పాటు చేశాడు. ఈసంగతి జానకితో చెప్పాడు. సర్వోత్తమరావు మాటయిచ్చి తప్పినదానికి అతన్ని జానకి ముందు నిందించాడు. ఆ స్నేహసంబంధం యెప్పటికైనా కష్టమేయని చెప్పాడు. తన తండ్రి యేర్పాట్లకు జానకి కేమియుచేయుటకు తోచలేదు. రామనాథము లండనునుండి వచ్చినపిమ్మట ముఖాముఖిగ అతని మనోగతాన్ని అడిగి తెలుసుకొందామని అనుకొంది. అంత సాకు తండ్రి వివాహము ఆపుదలచేయ నన్నాడు. ఇక వారము పదిరోజులలో అయి తీరాలని కూర్చున్నాడు. తన ప్రయత్నాలను మాటను దక్కించుకోవడానికి జానకిని మాటమాటికి నిర్బంధపెట్టుతున్నాడు.

కృష్ణమూర్తి మరల జానకివద్దకు వచ్చి, "జానకీ! తండ్రిమాట త్రోసివేయడమేనా? లేక వివాహానికి ఒప్పుకొంటావా?" అని ఆఖరుమాటగ అడిగాడు.

జానకికి మాటాడుటకు తోచలేదు.

"సరే! నీవు ఒప్పుకొన్ననుసరే! లేకున్ననుసరే. వివాహానికి యేర్పాటుఅయింది. నామాట దక్కించుకోవాలి" అని చెప్పి కృష్ణమూర్తి వెళ్లాడు.

అప్పటినుండీ జానకికి దిక్కుతోచలేదు. వంటవాడొచ్చి భోజనానికి రమ్మని పిలిచాడు. వద్దనింది. తన గదిలోనికి వెళ్లి సోఫాపై కూలబడింది. చాల దుఃఖించింది. ధైర్యము చేసింది. తనవిలువగల దుస్తులన్ని తీసివేసి సామాన్యదుస్తులను వేసికొని బైలుదేరింది.

సెంట్రల్ చేరింది. అప్పుడే బెంగుళూరుమెయిల్ తయారుగవుంది. టిక్కెట్టు తీసుకొని స్త్రీలపెట్టెలో వెళ్లి కూర్చొనింది.

"బెంగుళూరిలో కదా! మా మేనత్త కనకమ్మగారున్నారని మానాన్న చెపుతూ ఉన్నది. బహుశ యిప్పుడు మల్లేశ్వరములో ఉండాలి. ఆమెవద్దకుబోయి శరణు వేసుకొంటాను" అని యేమేమో యోచనలు చేసుకొంటూవుంది. బెంగుళూరు చేరింది. మల్లేశ్వర మెన్నిమార్లు చూచినా మనస్థైర్యంలేక రెండు మూడు రస్తాలు మార్చి మేనత్తగారి ల్లు గుర్తించేటప్పటికి ఆమె ప్రాణాలు పైకెగసిపోనని. కనకమ్మ చాలావగచి అలాంటిసితి రావడానికి కారణమంతయు సావధానంగా సర్వమును వినింది. తమ్ముని కృత్యాన్ని నిందించింది.

జానకి యింటర్మీడియేటువరకు చదువుకొన్నదవటంచేత కనకమ్మగారికిగల పరిచయంతో, బెంగుళూరిలో వాణీవిలాస యిన్స్టిట్యూటులో జానకి కొక టీచరుపని యిప్పించింది. జానకికూడా చాలాశ్రద్ధగ పనిచేస్తూవుంది. విద్యార్థినుల ఆదరణ, టీచర్ల మెప్పు శీఘ్రకాలంలో సంపాదించింది. ఎప్పుడు తన విద్యావ్యాసంగాల్లోనే మునిగి తేలటంచేత జానకి తనవివాహ సంగతే పూర్తిగ మరచిపోయింది.

మద్రాసులో కృష్ణమూర్తిగారు ఆరోజు తెల్లవారలేచి జానకితో మాట్లాడడానికి మరల జానకిగదికి వెళ్లాడు. జానకి కనుపించలేదు. ఎక్కడెక్కడనో వెతకించాడు. పోలీసులో కంప్లెయింటుకూడా యిచ్చాడు. నెలరోజులైనను జానకిపోయిన పోకడ తెలిసిందికాదు. నిరాశచేసుకున్నాడు. తన మూర్ఖత్వాన్ని నిందించుకొన్నాడు. నిర్బంధంచేసినదానికి కూతుర్ని పోగొట్టుకొంటినని తన్నుతానే ఈసడించుకొన్నాడు. సముద్రములో పోయిదూకి ప్రాణములు పోగొట్టుకొందమని నిశ్చయము చేసుకొన్నాడు.

ఒకనాటిరాత్రి శరణాలయంలో తన గదిలో జానకిపడకపై పండుకొని "ఆంధ్ర పత్రిక" చదువుకొంటూవుంది. ఆకస్మాత్తుగా ఆమెకన్నులకు మాలాలంకృతులగు నొక దంపతుల ఛాయాచిత్రము కనిపించింది. ఛాయాచిత్రమును చూస్తూనే చిత్రము దిగువ వ్రాసిన సమాచారాన్ని అత్యాతురముతో చదివింది.

"వరుడు మదరాసునందు ప్రఖ్యాతిజెందిన హైకోర్టు న్యాయవాదియగు మ॥ రా॥ బారిష్టర్ యట్. సత్యోత్తమరావుగారి యేకైకపుత్రుడును, రామ్నాడుజిల్లా అట్టింగు కలెక్టరును అగు మ॥ రా॥ యస్. యస్. రామనాథం ఐ. సి. యస్. గారు.

కన్య మద్రాసు హైకోర్టుజడ్జీగారగు మ॥ రా॥ దివాన్‌బహదూర్ కె. యన్. రంగారావుగారి పుత్రికయగు శ్రీమతి సుశీలాదేవి బి.ఏ. గారు!"

జానకీచేతినుండి పత్రికనేలబడిపోయింది. స్మృతి దప్పిపోయింది.

తెల్లవారుసరికి కనకమ్మగారు "జానకీ! యింకా లేవలేదా. తెల్లవారింది" అని తలుపువద్దకువచ్చి తలుపుతట్టింది.

తలుపు వెంటనే వెనక్కు వెళ్లింది. లోపల నిశ్శబ్దము. పడకపైన యెవరూ లేరు. కనకమ్మగారు గాభరాపడి శరణాలయములో వెతకింది. ఎచ్చటను జానకి కనుపించలేదు. ఈ సమాచారము వెంటనే శరణాలయమంతా ప్రాకింది. జానకి యెచ్చటికి వెళ్లింది యేమయినది యెవరున్ను ఊహింపలేదు.

సాయింత్ర మవునప్పటికి ఆయూరి దినపత్రిక "తాయినాడు"లో ఈరీతిగ పెద్ద అక్షరాలతో ఒక ప్రకటన కనబడింది. శరణాలయమంతా గుంపుకూడి చదివారు.

### ఆత్మహత్య

"మల్లేశ్వరము చెరువులో ఒక శవము తేలుచుండెను. పోలీసువారు దానిని పైటికితీయించి పరీక్ష చేసిరి. ఆవ్యక్తి వాణీవిలాస ఇన్‌స్టిట్యూట్ నందు ఉపాధ్యాయినిగ యుండెననియు అనాథశరణాలయపు మేనేజరగు కనకమ్మగారి కోడలనియు తెలియుచున్నది."

# సోయాబీను

చదువుల రామచంద్రయ్యగారు

(గత సంచికతరువాయి)

[పై శీర్షికతో వెలువడుచున్న వ్యాసములు చదువరులందు సోయాబీను వివరముల నెఱుగవలయుననెడి కుతూహలము నభివృద్ధిజేయుట ముదావహము. పెక్కుమంది సోయా బీనులవిషయమై-ముఖ్యముగ నవి దొరుకుచోటు, వెల మొదలగు వివరములను-దెలుపుమని వ్రాయుచున్నారు. సాధ్యమైనన్ని వివరములు యీ శీర్షికక్రిందనే వ్రాయబడుచుండును. సోయాగింజలు, పిండి, కాఫీపొడి, బిస్కట్లు, రొట్టె మొదలగునవి "సోయాబీను సప్లై కంపెని, 15, అన్నాపిళ్లెవీధి, జి. టి. మదరాసు" నందు దొరుకును. వీరు చిల్లరగా రూపాయకు తొమ్మిదివీసెలువంతున గింజలు నమ్ముచున్నారు. ఒకేమారు ఎక్కువగా కొనువారికి తగ్గింపుధరలకిత్తురు. వలయువారలు వారికి వ్రాసి తెప్పించుకొనగలరు.

గుంటూరునందుగల క్షేత్రంలోకూడ (Guntur Agricultural Farm) సోయా గింజలు దొరుకుచున్నవి.

వీనిప్రాముఖ్యమునుగుర్తించిన రైతుసోదరులు వానిని పండించి వాని యుపయోగము వ్యాపింపజేయుట మంచిది.]

## మొలకసోయాబీను (Soya Bean Sprouts)

ఉలవలు మొదలగు కాయధాన్యములను మొలకలువచ్చువఱకు నీటితో నానబెట్టి కూరలకుపయోగించుట మనలో సాధారణమే. వడ్లనుకూడ మొలకలు వచ్చువఱకు నానబెట్టి చాలమంది తినుటగలదు. సోయాబీనులనుగూడ ఈవిధముగనే నానబెట్టి పెక్కువిధములుగా నాహారపదార్థములం దుపయోగించుచున్నారు. వీనినే యింగ్లీషులో Sprouts అందురు. మొలకసజ్జలని మనము వాడునటుల వీనిని మొలక సోయా అని వాడుకొనవచ్చును.

మొలకసోయాపద్ధతి ఇతర కాయధాన్యముల తయారుచేయుదానినుండి కొంచము భేదించుచున్నది. మట్టిపాత్రలో అడుగున నీరు ధారాళముగాపోవుటకు కొన్నిరంధ్రములు పెట్టి వానిపై కుండలోభాగమున నొక పల్చనిగుడ్డను వేయవలయును. వానిలో సోయా గింజలను కావలయునన్ని కడిగిపోసి దినమునకు నాలు గైదుమారులు వానిపై నీరు పోయుచుండవలయును. ఎండకాలమందు దీనికిచన్నీటిని, చలికాలమందు వేనీటిని యుపయోగించవలయును. గింజలు మొలకలెత్తుటకు ఎండకాలములో 3 నుండి 5 దినములును, చలికాలములో 10 నుండి 12 దినములును పట్టును. ఈకాల

ములో మొలకలు ఒకటినుండి రెండంగుళములపొడవు పెరుగును. మొలక పోయుటకు చైనాదేశీయులు వెదురుచాపలనే యుపయోగింతురు. వారు వీనిని అదే పనిగా పండించి దానివలన డబ్బుగడింతురు.

ఈమొలకలను పచ్చివిగనే చాలమంది తిందురు. మరికొందరు వేరువేరువిధములుగా తినుబండారములు తయారు చేసికొందురు; ఇతరపదార్థములతో గలుపుదురు. చలికాలమందు కొన్నిచోట్ల కావలసినన్ని కూరగాయలు దొరకనందున వానికి బదులుగానివి యుపయోగించెదరు. వీనియందు ఫలములందును, కూరగాయలందునుగల ఎ.సి.విటమిను లమితముగానుండును.

సోయాబీనులో నన్నిరకములు త్వరగా నుడుకవు. కాని సర్వసాధారణముగా వానిని నీటియందు నానబెట్టి తరువాత యుడికించుటే మంచిది. నానబెట్టుట గూడ గింజల యెండుదనమునుబట్టి యుండును. ఎట్లున్నను 20 మొదలలు 24 గంటలవఱకు నీటిలో నాననిచ్చి తరువాత యుడికించిన బాగుండును. అదియు నొకేసారి పెద్దమంటతో నుడికించుటకంటె మెల్లగా 2 గంటలకాల ముడికించుట శ్రేష్టము. ఏలయన పెద్దమంటతో త్వరగానుడికించుటకు ప్రయత్నించిన నవి గట్టిగా నైపోవుటయు గలదు. ఇంకొకవిధముగకూడ చేయనగును. 12 గంటలకాలము వాటిని నానబెట్టి తరువాత వేరునీటితో కొంచెము సోడాకలిపి మెల్లగా నుడికించిన రుచిగా నుండును.

ఇంతకుమునుపు వ్రాయబడిన పదార్థములందేగాక సోయాబీనులను మాంసాహార పదార్థములందు విరివిగ వాడవచ్చును. శరీరాభివృద్ధి కావశ్యకములగు పదార్థము లమితముగాగల మాంసము లందుకంటె సోయాబీనులం దెక్కుడు గుణమున్నందున సాత్వికాహారమును ప్రకృతిసిద్ధమైనవియునగు వానినే వాడుట శ్రేష్టము.

పారిశ్రామికాది యుపయోగములు.

మానవుని కాహారపదార్థముగా ఔషధముగా సోయాబీను ఎంతటి విలువగలదో ఇదివఱకే వ్రాయబడినది. సోయాబీను కొంచె మెచ్చుతక్కువగ ప్రతి పరిశ్రమకు తోడ్పడుచున్నదని చెప్పినచో అతిశయము గాదు. అందుచేత నిది విరివిగా పండింపబడు కొరియా, మంచూకో, చైనా మొదలగు ప్రాగ్దేశములనుండి విదేశముల కమితముగా యెగుమతి చేయబడుచున్నది. సోయానూనెయందు వెన్నకున్నట్టి గుణములుండుటచే చైనా జపాను దేశములందు వంటల కుపయోగింపబడుచున్నది. ఆలివునూనెకు బదులుగాకూడ నిది అమ్మకమగుచున్నది.

వ్యవసాయము

నందుకూడ దీని యుపయోగ మమితము. సులభముగా పండింపనగు సీపంటవిషయమటుండ దీనిని పశువులమేతగా నుపయోగించుచున్నారు. సోయాబీను మొక్కలను మేపిన పశువు లెక్కువబలముగలిగి యుండును. ఆవు లెక్కువగా పాలిచ్చును.

సోయా నూనెదీసిన పిండి ఆహారపదార్థములకేగాక పొలమున కెరువుగా, పశువులమేతగా నుపయోగింపవచ్చును.

సోయా తానువృద్ధియగుటకు కావలసిన నత్రజనిని భూమినుండి గాక గాలినుండి గ్రహించి దానిని వేరుల మూలమున భూమిని సారవంతము చేయును. సారవంతముగా లేని భూములందుగాని, నిరంతరవ్యవసాయముచే నిస్సారమైన భూములందుగాని సోయాపంట బెట్టినచో నది ముందుకంటె సారవంతమై మంచిఫలితము నిచ్చును.

(సశేషము)

# భార్యలకు జీతాలా !!

# ఇచ్చేవారు భర్తలా !!!

శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారు

[ పైరచయిత్రి తన వ్యాసమున అభిప్రాయపడినట్లు మొదట యీసమస్యను లేవదీయుటలోగాని అందులో సూచించిన విషయములలోగాని స్త్రీ హానిసత్వమును వృద్ధిచేయవలయుననెడి యుద్దేశ్యము వ్యాసకర్తకును వారి యభిప్రాయములను ప్రచురించిన యితరులకును లేదనియే తలంచుచున్నాము. అసలీసమస్యను యే ఉద్దేశ్యముతో లేవదీసిరో పాఠకులు సులభముగ స్పష్టముగ గ్రహించుటకు డిశంబరు గృహలక్ష్మి సంచికయందు ప్రకటింపబడిన "గృహిణీత్వానికి జీతాలా?" అను వ్యాసమందలి కొన్ని భాగములను క్రింద వివరించుచున్నాము.

'నేడు చాలమంది సోదరీమణులు విద్యావతులై ఉద్యోగాలు చేయాలని ప్రయత్నం చేస్తూవుండడం తరుచుగా జరుగుతూందిగదా! కొంతమంది వివాహాలకుముందు వుద్యోగాలు చేసినా పెళ్లిళ్లయిన తరువాత మానుకోవలసివస్తుంది. పెళ్లయినతరువాతకూడా వుద్యోగాలు చేయాలంటే వారి జీవితం సుఖంగా జరగదు. అటువంటివారంతా యీలాంటివిషయాల్లో యేమిచేయాలో వివరిస్తూ పి. ఎన్. మోహినిగారు బొంబె క్రానికల్లో యీలా వ్రాస్తున్నారు.'

'పురుషులతో సమానంగా డిగ్రీలుసంపాదించి తక్కువజీతాలకు వుద్యోగాలు చేయడానికి స్త్రీలు పూనుకొంటున్నారు. కాబట్టి మనకు నూతనంగా 'స్త్రీలు వుద్యోగాలు చేయవచ్చా?' అనే సమస్య బైలుదేరింది.'

'ఒకవిధంగాచూస్తే వుద్యోగంచేస్తూ సంపాదిస్తూవున్న స్త్రీ తనజీవితంలో పెళ్లి అయినతరువాత ఎక్కువగా సుఖపడుతుంది.'

'వివాహితఅయినస్త్రీ వుద్యోగంచేయవచ్చా అనేది ఒక ప్రబలసమస్యగా ఏర్పడుతుంది. ఈసమస్య పరిష్కారంపైననే భార్యాభర్తల సౌఖ్యం ఆధారపడివుంది. ఈసమస్యపైన విద్యావంతులైన నవీనదంపతులు ఎక్కువగా కలహిస్తారు; ఫలితాలు దుర్భరంగా పరిణమిస్తవి.'

'అంతేకాకుండా నేటివిద్యావతులకు ఒకవిధమైన ఆత్మగౌరవం, ఆర్థికంగా స్వతంత్రజీవితం గడపాలనే భావంవుంది. అది కొంతకాలంనుంచే బైలుదేరింది. ఆర్థికస్వాతంత్ర్యం లేకపోయిన తరువాత ఇంట్లో మరేవిధమైన స్వాతంత్ర్యంకూడా వుండదని దీన్లో అంతరార్థమై వుండవొచ్చు. కాబట్టే విద్యావతి తాను తన ఉద్యోగం నిలుపుకొని గృహనిర్వాహణం పూర్తిగా యితర సేవకులపైన పెట్టడానికి చూస్తూవుంటుంది.'

'పెళ్లికిముందు విద్యావంతులు వివాహమంటే ఏమిటో అందులో ఎవరెవరేమేమి భాధ్యతల నిర్వహించవలెనో స్పష్టంగా మాటామాటంలేకుండా చర్చించుకోనడం వుత్తమం.'

'వారి ఆశయాలు అభిప్రాయాలు, విపరీతంగా భేదిస్తే వారు పెళ్లాడకముందే ఆసమాచారం స్పష్టంగా తెలిసికోనేది మంచిది; చేసికొన్నతరువాత తెలిసికోనేదానికంటె.'

'ఒకవేళ పెళ్లయినతరువాత భార్యాభర్తలు భేదపడితే? భార్య అప్పుడుకూడా తనవుద్యోగం నిలుపుకొని సంపాదించదలచుకొంటే? భర్త ఆమెను గృహనిర్వహణం తప్పక వహించాలని పట్టుబడితే? వారప్పుడేమి చేయాలి ?'

దీనికి రెండు మార్గాలు ఉన్నవి......................రెండోది. గృహనిర్వహణాన్ని ఒక వుద్యోగంగా ఎంచుకొని భర్తను దానికి తగినట్టు డబ్బు యివ్వమనడం. ఇది అందరికి హాస్యంగా తోస్తుందేమో కాని ఇందులో విపరీతం ఏమీలేదు. పురుషుడు తన భార్య సత్యంగా గృహనిర్వహణములో ఎక్కువసేవ చేస్తుందని గుర్తిస్తే ఆమెకు ప్రతిఫలమివ్వడానికి వెనుతీయకూడదని అనుకుంటూ. ఎందుకంటే పురుషుడు విద్యావతిగావుండే తనభార్య తనవుద్యోగం మానుకొని గృహనిర్వహణం చేయాలంటే ఆమెకు కలిగే ఆర్థిక నష్టం కనపడకుండా చేయడానికి కొంత యేదైన యివ్వవలసిన ఆవశ్యకతవుంది. అందుచేత ఆమెకు తృప్తికరంగా కొంతడబ్బు యివ్వాలి. ఇది మీకు ఒక జేబునుండి మరొకజేబులోనికి మార్చినట్లే కనపడుతుంది. కాని మానసికంగా దీనివల్ల చాల మేలుకలుగుతుంది. ఈకాలములో చదువుకున్న స్త్రీ స్వాతంత్ర్యంఅంటే ఎక్కువగా గణిస్తుంది. కాబట్టి ఈస్థితిలో ఆమె తన స్వాతంత్ర్యం నిల్పుకున్నానని తృప్తిపడుతుంది. ఈ విధంగా 'పెళ్లయిన స్త్రీ వుద్యోగంచేయవచ్చా'అనే సమస్య దంపతుల కిద్దరికి తృప్తికరంగా పరిష్కారం అవుతుంది. సంపాదకుడు.]

ఏదోఒక క్రొత్తవిశేషంలేకుండా అంతా మామూలుగా జరిగిపోతూఉంటే బోలెడు డబ్బుపెట్టి తెప్పించుకునే పత్రికలు చదువడానికి పాఠకులకు విసుగ్గాఉంటుంది. అందుకని ఏ సోదరీ సోదరులో కష్టపడి ఏదో నూతనత్వాన్ని పుట్టిస్తుంటారు. అలా పుట్టించబడ్డదే ఈభార్యల జీతాలవాదం. అసలుముందుగా పి.ఎన్. మొహిలీగారు బొంబే క్రానికల్లో ఈవాదాన్ని లేవదీశారుట. దాన్ని ఆధారంగా చేసుకొని యుగవాణిలో "ఒకభర్త" ఈజీతాలపద్ధతిచాలా బాగుందని వ్రాశాడు. ఇంతలోకే గృహలక్ష్మిలో "ఒక సోదరి ?" దాన్నే అనుసరించుతూ ఈ జీతాలపద్ధతి అవశ్యాచరణీయం అంటూ వ్రాశారు. బాగానే ఉన్నది. ఈ వ్రాతల నాధారంచేసుకొని కొందరు అమాయిక సోదరీమణులు అయినసరే మాకు జీతాలుకావాలి నంటూ కూర్చోడం, ఆపళంగా ప్రశాంతంగా వెళ్లిపోయ్యే సంసారాలు కల్లోలాలలో మునిగిపోవటం ఆరంభించడం ఇకతరువాయి.

బాగా ఆలోచిస్తేనేగాని పైకి కనబడదు. కాని ఈవాదంలో పురుషులస్వార్థం ఎంతైనా ఇమిడిఉంది. ఏమంటే ఇప్పుడు మామూలు సంసారస్థులంతాకూడా ఏ జీతాల గొడవ లేకుండానే భార్యపోషణనంతా భరించవలసి ఉంది.

ఇకవేరే ఆర్థికసదుపాయాలుకూడ లేకపోవటంవల్ల స్త్రీలకయ్యే ఖర్చులన్నీకూడ భర్తలే భరించవలసిఉన్నది. ఇలాఉండగా ఇప్పుడిప్పుడు ఉన్నతవిద్యావంతురాండ్రయిన స్త్రీలు కొందరు స్వయంగా ఉద్యోగాలు



శ్రీమతి మున్నా కోటీశ్వరమ్మ గారు.
శ్రీరామకృష్ణ స్త్రీ భక్తసమాజ అధ్యక్షురాలు.



శ్రీరామకృష్ణ మందిరము, బెలగాము.
శ్రీమతి మున్నా కోటీశ్వరమ్మగారు శ్రీరామకృష్ణ
స్త్రీ భక్తసమాజమువారికి కట్టించి యిచ్చిరి.

చేసి ధనార్జనచేయటం మొదలుపెట్టారు. దీనివల్ల వచ్చిపడ్డది పురుషుల్లో అలజడి, అదుర్దా. ఏమంటే ఆర్థికంగా స్త్రీ తనపొట్ట తనరెక్కలమీద నిలుపుకోగలిగితే ఇప్పటి వలె పురుషుడికి ఇంతనీచంగా లోబడిఉండదు. మరొకటి, అదిగూడా ఇప్పుడే బయటపడ్డది. ఈ స్త్రీలుగూడ ఉద్యోగాల కెగబడితే ఇల్లు దిద్దేవారుండరట. ఎంతమంది నౌకరులను పెట్టుకున్న భార్యవలె పోషించరట. కనుక ఈమహాశయులు లేవతీసిన ఈవాదమేమనగా ఆస్త్రీలు అంతచదువూ చదువుకొని పైగా లలితకళలూ,గృహనిర్వహణమూనేర్చుకొని సర్వవిధాలా ఈభర్తను సంతోషపెట్టడానికే ఆవిద్యంతా వినియోగించేఎడల ఈభర్తగారు కొంతజీతం దయచేస్తారుట. ఇదీ వీరివాదం. ఇక ఇందులోఉన్న నష్టాలుచూద్దాం.

ముందుగా అసలుస్త్రీలు సంపాదింపవలసిన అవకాశం ఎందుకు వస్తుందనగా ఆమె ఉన్నతవిద్య నేర్చుకొని ఉండుటవల్లగాని, భర్తసంపాదన గృహవ్యయమునకు చాలనప్పుడుగాని, వితంతువో, పతిపరిత్యక్తో అయి జీవనాధారముకొరకు గాని, స్త్రీ ఉద్యోగము చేయవలసివస్తుంది. అలాంటి పరిస్థితులలో ఈవాదము పనికిరాదుగదా. ఇక తగినవిద్య లేక, భర్తసంపాదన గృహనిర్వహణమునకు చాలియున్నయడల, ఆ స్త్రీ ప్రత్యేకజీతమేమియూలేకనే గృహకృత్యములను నిర్వహించగలదు. ఇకజీతాలు ఏపరిస్థితులలో?

ఇంకొకవిషయమేమనగా సర్వవిద్యలను నేర్చుకొని ఉద్యోగనిర్వహణమునకు సామర్థ్యముగల స్త్రీలు వేరొకచోట ఉద్యోగము చేసిన ఆదాయము ఎక్కువకాగలదు. అట్లు కాక భార్యకు జీతమని పేరుమాత్రము పెట్టిన లాభమేమి?

ఇదివరకు భార్యకగు ఖర్చంతయు భర్తే భరించేవాడు. కాని ఈ జీతాలపద్ధతివల్ల ఇంటి ప్రతి చిన్నఖర్చు ఎవరి డబ్బులోనుంచి ఖర్చు చేయవలెననే సమస్యతో కూడుకొని గృహకల్లోలాలు ఎక్కువ అయిపోతవి.

అసలు ఇప్పుడు ఈ నిరుద్యోగపు రోజుల్లో తన పొట్టనింపుకొని భార్య పిల్లల కడుపునింపిన తరువాత భార్యకు జీతాలు గూడ ఇవ్వగలిగే ఉద్యోగస్థులెంతమంది ఉన్నారు?

ఈమోస్తరు చిన్న చిన్న సమస్య లటుంచి మరొక ప్రబలమైన సమస్యనుగురించి చెపుతాను. ఇప్పుడు సామాన్యంగా ఉద్యోగస్థులైనవారు తమ తెలివితేటలకు తగినజీతం దొరకనియడలకాని, జీతమునకుతగినంతకన్న ఎక్కువపని తీసుకునేయడలగాని, తన సామర్థ్యానికి తగిన గౌరవం పైఅధికారిచెయ్యక పోవటంవల్లగాని, ఏవిషయమైన అభిప్రాయ భేదాలో కలిగినప్పుడుగాని, ఆ ఉద్యోగాన్ని వదులుకొని మరో ఉద్యోగం చూచుకుంటాడు. నౌకరువాడూ అంతే. మరి భార్యవిషయం అలాకాదు కదూ. ఇచ్చే జీతం నచ్చినాసరే, నచ్చకపోయినాసరే, గౌరవంగా చూచినాసరే, హీనంగా

చూచినాసరే ఎవరో ఒకడు దాటిపోతేనే గాని ఆ దాంపత్యానికి విచ్ఛిత్తి లేదు కదూ. అలాటప్పుడు మరి జీతాలెందుకూ?

అసలు విషయం ఇదీ. పెండ్లి చేసుకున్న గృహనిర్వహణాంతప్ప రెండవవ్యాపకం ఏదయినా కించత్తు పెట్టుకున్నదా అంటే భర్తకు జరుగవలసిన సత్కారం ఆదరణ యథావిధిగా జరుగదు. ఆవిషయంగూడ పై వ్యాసకర్తలు స్పష్టీకరించారు. స్త్రీలు గృహానికి ఇంత ఆధారంఅని, వారు ఉద్యోగాలకు వెళ్లుతామని బయలుదేరేవరకూ, పురుషులకు తట్టలేదు. ప్రొఫెసర్ మార్టిను H. Martin, M.A.O.B.E. ఇలా చెప్పాడు. "It is said that we do not properly value a thing until we have lost it." బఱ్ఱె చస్తే పాడి బయటపడినట్లు.

ఇంతకూ సంసారాలు సౌఖ్యంగా గడవాలి అంటే భార్యాభర్తల్లో ముందుగా హృదయపరివర్తనం కలగాలి. ముఖ్యంగా భర్త ఈవిధమైన ఉద్దేశాలుకలిగి ఉండాలి.

"ఈమె నా భార్య. ఈ సంసారానికి నేనెంతఅవసరమో ఆమె అంత అవసరం. నేనెంత ధనం సంపాదించినప్పటికి దాన్ని సద్వినియోగంచేసి, నన్ను సుఖపెట్టి నాజన్మసార్థకం చేయడానికి భార్య ముఖ్యంగా అవసరం గనుక నేను ఏవిధంగాను ఆమె మనసుకు కష్టం కలిగించకుండా సర్వవిధాలా ఆమె ఇష్టాన్ని, సలహానిపాటిస్తూ ఆమె కష్టసుఖాలకు తోడుపడుతూ ఆమెను నా కష్టసుఖాల్లో భాగస్వామినిగా తీసుకుంటే మాసంసారం విశేషసౌఖ్యప్రదంగా గడచిపోతుంది."

ఈవిధంగా భార్యాభర్తలు న్యూనతాధిక్యతలు లేకుండా ఒకరియందొకరికి సమాన గౌరవంగలిగిఉండి భార్యలకు ఇప్పుడు సంఘంలోఉన్న నీచత్వంపోతే ఇక స్త్రీలకు జీతాలే అవసరంలేదు. కనుక ఈవిధంగా సమాన భాగస్వామినియైన గృహిణికి ఏదో కళ్ళనీళ్ళుతుడిచినట్లు కొంచెం జీతంయిచ్చి కలహాలు పెంచుకునేకంటే పురుషుడు తన రాబడి, ఇతర ఆర్థికసదుపాయాలు, చిక్కులు అన్నీ భార్యకు పరిచయముచేసి గృహసంబంధమైన వ్యవహారములన్నీ భార్యమీదనే పెట్టి ఆమెయుద్దేశముల ననుసరించి నడవటమే సర్వవిధముల శ్రేయస్కరము.

క్రొత్తగా భర్తలదగ్గిర జీతాలుపుచ్చుకొనడం అంటూ మొదలుపెట్టితే స్త్రీలకు సంసారంలోని బానిసత్వం ఇంకా స్థిరపడుతుంది కాని ఇప్పటికంటే ఏమాత్రమూ స్వేచ్ఛ దొరకదు.

---

గమనింపు: ఇతర పత్రికలకు ప్రకటనార్థమై పంపిన వ్యాసములనే 'గృహలక్ష్మి'కి పంపిన ప్రకటింపబడవని వ్యాసకర్తలకు మనవి.

సంపాదకుడు.

# తలవెంట్రుకలను నిడుపుగా, మృదువుగా సుందరముగా నుంచుకొనుటకీ సులభపద్ధతి నవలంబింపుము.

విడువక స్వస్తిక శీకాయసబ్బు వాడుచున్నచో నీకుకూడ దీర్ఘములై సుందరములైన కురులుండగలవు. ఈసబ్బు తలవెంట్రుకల శుభ్రపరచుటలో నద్వితీయమైనది; కొప్పు దీర్ఘముగ పెరుగజేయును; నైగనిగ్యము కూర్చును; చుండు మాన్పును. కుంతలాభివృద్ధికి పేరుగాంచినశీకాయ మొదలగు దినుసులతో శీకాయసబ్బు తయారుచేయబడినది.

ఇది ఒక బిళ్లగాగాని, మూడు బిళ్లలుగల పెట్టెలుగాగాని దొరుకును. ఒక్కటి యుపయోగించిననే దాని సుగుణము మీకు తెలియగలదు. దీనికి మంచివాసన గలదు. స్నానాదుల కాదర్శప్రాయముగనుండును.




దిస్వస్తిక్ ఆయిల్ మిల్స్ లిమిటెడ్,

వడాలా బొంబాయి

డిస్ట్రిబ్యూటర్లు: ది స్వస్తిక్ ఏజన్సీ, మద్రాసు – బెజవాడ స్టేషనరీ అండు ఫాన్సీమార్టు, బెజవాడ

# కవితిలక కనకాంబా ప్రశంస

మొల్లజయంతినాటి సభలో

అభినవతిక్కన దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారిచే చదువబడిన పద్యములు

మ॥ కవయిత్రీమణివంచు నిన్నుఁబొగడంగావత్తునో, లేక బ్ర
హ్మావిదశ్రీయుఁడు కృష్ణభూషణుని శిష్యంగా బ్రశంసింతునో
చవి బాల్యంబుననుండి సత్కవితకాసంగొన్న నీబుద్ధివై
భవమగ్గింతునొ, తోఁపలేదు కనకాంబా; సాధుపూజాప్రియా.

చ॥ అతిగహనంబులైన పరమార్థములన్ విశదంబుసేయుధీ
చతురత, శంకరార్యునకు సాటియనందగునొజ్జ, త్వత్పురా
కృతసుకృతైకపాకమున నెట్లొలభించె, మహేమివింత నీ
కృతులు తదీయబోధసుధినెల్లెడఁ జిల్కనవన్ యశస్వినీ.

మ॥ అతిలోకప్రతిభుండు, లోకనుతి గర్వాన్ రెండుఁదుల్యంబుగా
మతిభావించిన తత్త్వవేత్త, యుపమామార్గంబునన్ భక్తసం
తతిశంకల్ త్రుటిలోఁ దొలంపగలమేధాశాలి, మీయొజ్జ స
న్మతినేఁడున్ నను ముగ్ధుఁజేయుఁగనకాంబా; నెమ్మదిన్ బర్వినన్.

చ॥ పదిపదునైదునబ్దములపాటి యెలర్చిననెయ్యమున్ననే
యదుననైనఁ జెప్పకొనఁడయ్యె నిజోన్నతశాస్త్రదీక్ష; న
య్యదియిపుడెట్టులో విదితమయ్యెను దావకఁ'జీవయాత్ర' చే
సుదతిరొ! ధాత్రి నీ గురుయశోవిముఖత్వమెటేని గంటిమే.

చ॥ 'అమృతుని'పాదసారసములంటిన శిష్యవటంచు, దద్గురూ
త్తమునుపదేశసారసుధ ధాత్రికిఁబంచిన ధన్యవంచు; నె
య్యమునను 'మొల్లమూఁడవజయంతి' తటిన్ గృహలక్ష్మిపూజనీ
కమరుచువేళవ్రాసెనివి యాప్తుఁడొకండు గ్రహింపుధీమతీ.

# కవితిలక కనకాంబా ప్రసక్తి

మొల్లజయంతినాఁడు 27-12-36 సింహపురమందు సభలో

దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు చదివిన పద్యములు

క. కవిసార్వభౌములే నీ, కవితాకలనమ్ము హెచ్చుగామెచ్చిరనన్
ఎవరేలమెచ్చుకుందురు, కవితిలకమవైననిన్ను-కన్-గనకాంబా!

మ. 'కవితల్ చెప్పిన పాడ నేర్చిన వృథాకష్టంబె,' చిత్తంబు త
త్త్వవిచారంబొనరించుభాగ్యమె యలభ్యంబైనచో, బాపురే
కవనంబంతయుఁ తత్త్వచింతకె సమగ్రప్రజ్ఞ వెచ్చించు భా
గ్యవిశేషంబలరారెనీకుఁ గనకాంబా యెంతధన్యాత్మవో.

చ. గురుపదముల్ మదింగుదురుకొల్పి, మనంబునువంచి, యాసదగ్ర
చ్ఛురుఁదెగఁగోసి, యాత్మజనసంగము భంగమొనర్చి, సర్వమీ
శ్వరమయమన్న బుద్ధిఁగనఁజాలిన యోగినివైననిన్ను మా
కెఱుఁగఁదరంబె, మీమహిమలీరయెఱుంగుదు రేమిచెప్పుదున్.

చ. అమృతమయంబునీ హృదయ మార్తజనావన విద్యనీకు ని
క్కముసహజమ్ము ప్రాజ్ఞపదకంజసమర్చయనన్ నిసర్గమా
నమలగుణమ్ములెల్ల నొకఁడై నినుఁజేరఁగఁ బోలునమ్మయు
త్తమమగువర్తనంబున కుదాహృతి నీ చరితంబుసోదరీ.

సీ. కావ్యకల్పనఁ జేయఁగల కళాభిజ్ఞత అనువాదమొనరించునట్టినేర్పు
తత్త్వమ్ముగుఱుతింపఁదగిన విజ్ఞానమ్ము తెలిసినయంత బోధించుప్రజ్ఞ
జంకుబొంకునులేని స్వాతంత్ర్యసంపత్తి పండితవినుత సంపత్సమృద్ధి
సత్కారములు గొనఁజాలుసమర్థత సత్కారములు చేయజాలుశక్తి
నేటికవయిత్రులం దెన్న నీకెచెల్లె, నీవుగడియించినట్టి నిర్నిద్రకీర్తి
యరయస్త్రీలోకమునకు జయధ్వజంబు,క్రమసుగుణావలంబ శ్రీకనకమాంబ.

ఆ.వె. అర్హరీతినినిన్ను నర్చించిగృహలక్ష్మి, తద్జ్ఞకోటిపొగడ ధన్యయయ్యె
మహితమైనయట్టి గృహలక్ష్మిసత్కృతి, కాంచినీవు వన్నెఁగాంచితమ్మ.

# మగని చెవిలో

"అనసూయ"

(రాబడిగురించి)

ఏమిటండీ! పూర్వం అలాగు మేస్రీటుకచేరీలకు యీవూరూ ఆవూరూ తిరిగేవారు! ఇప్పుడు ఎక్కడికీ వెళ్లలేదు, కారణంయేమిటి? క్లబ్బువాళ్ళను వదలలేకనా? రేక పార్టీలు రాకనా? మునుపంత తరుచుగావచ్చి తీసికెళ్లేవాళ్లు ఇప్పుడెంచేతనేమిటి రావడం మానేశారు? మీరంటే వాళ్ళకి మొగం మొత్తేసిందా యేమిటి? డిప్రెషనురోజులా? డిప్రెషనురోజులైతే మీకేనా అందరికీనా? అందరికీ అయితే మనయింటి యెదుటిమచ్చలప్లీడరు ఎందుకలాగు అంతతరుచుగా తిరుగుతాడు? వాడిలాంటి వాళ్లు రావడమే యీఅనర్థానికి కారణమా? వాళ్లు చేసిన తప్పేమిటి? వాళ్లు మీలాగు పార్టీలను నిస్సారంగాచూచి తగిలేస్తే వాళ్లూ మీలాగేఉందురనా మీతాత్పర్యం? వాళ్లు పార్టీలను ఎలాగో చేరదీసి నాలుగురాళ్లు సంపాదిస్తున్నారా లేదా? ఒకడెవడో కోర్టుకు యెదురుగుండా పెద్దమేడకట్టేడుట! ఒకడు వేలకొద్దీ ఖర్చుపెట్టి యిద్దరాడపిల్లలకు పెళ్లిళ్లుచేసేడట! మరి వాళ్లెలాగు అవన్నీ చేస్తున్నారు?

డిక్రీ సొమ్ము తినేసి, పార్టీలసొమ్ము ఎగవేసి సొమ్ము తినేస్తే పార్టీలు వూరుకుంటారూ? మీరు వాళ్ళసొమ్ము యింట్లోకైనా తీసుకురాకుండా అక్కణ్నించి అక్కడే యిచ్చివేస్తూవుంటారే, తక్కిన వాళ్లు భయములేకుండా ఆసొమ్ము ఎలాగుతినేస్తారు? వాళ్ళని ఎవళ్లూ ఏమీ చెయ్యరూ? వాళ్లకు మాట రాదూ?

అవునుగాని మీప్లీడర్లు చాలామంది కార్లుకూడా కొన్నారుట! అంతడబ్బు వాళ్లకుదొరకుతూఉన్నదా యేమిటి?

"ఆ! అలాగే! కార్లుకొనటానికి చేసినఅప్పులు ఇంకా తీరలేదు; కొందరిమీద దావాలుకూడా పడ్డాయి! కొందరప్పుడే అమ్మేసుకున్నారు!"

ఇంతేనా! చేదపురుగుకి రెక్కలు వచ్చినంత సేపైనా లేదేమండీ యీకార్లసందడి! అందరికీ అంత దొరక్కుండాఉందండే? మరి అలాగైతే ఆ బొమ్మలాటదానిలాగు ఉంటాడు ఆప్లీడరు, అతడెందుకండీ హాయిగా తనవూళ్ళో తనకు వందో రెండువందలో దొరుకుతూఉంటే మానేసి యిక్కడికి పెద్దకుటుంబంతో వెళ్లిపోవచ్చేడు?

'వాడిప్రారబ్ధము!'

ఇక్కడేమైనా దొరుకుతూ ఉందా?

'ఆ! నెత్తికిచేతులు!'

మరైతే ఎవళ్లు తీసుకొనివచ్చేరండీ అతడిని ఈ ఊరు?

'వాడి శనిగ్రహము.'

ఎలాగు వాడు కాలక్షేపము చేస్తున్నాడండీ పిల్లలుగల వాడుగదా?

'రాతిలో కప్పలాగు.'

ఇంత దొరక్కుండా ఉన్నరోజులలో యేమి జార్రేసుకుందామని అల్లానత్తిప్లీడరు వచ్చేడండీ?

'ముష్టికి నత్తేమిటి?'

ప్లీడరు నత్తివాడున్నూ సానిది మాచకమ్మానూ అయితే మరి వృత్తి యెలాగు సాగుతుందండీ?

వేణుగోపాలశతకం ఎప్పుడు వ్రాసేరండీ?

'నాకేం తెలుసును?' మీకేం తెలియదూ? మిమ్మల్ని అడగడం నాదేతప్పు, బుద్ధిపొరపాటు! "యిది మంచిసమయమోయీ గోపాలా?" లేకపోతే

"ఎందుకీ తొందర సుందరాకార" అలాంటివి ఎవళ్లు వ్రాసేరో, ఎవళ్లు ఎప్పుడు ఏమో స్తరుగా ఎవరిమీద అభినయంపట్టి పాడేరో, ఆపాటలు కళావరురింగు బాగా పాడుకుంతో లేకపోతే స్టూడెంట్సు మేస్యు యలు బాగా వినికిడిచేస్తుందో, ఇవన్నీ మీకు గంత స్తంగనుక చెప్పగలరుగాని శతకాలసంగతీ, పురాణాల సంగతీ, మీరెప్పుడైనా చదివి తేగదూ మీకు తెలియ డానికి!

'ఎందుకేమిటి ఆ వేణుగోపాలశతకం ఘోష యిప్పుడు ?'

ఎందుకా? ఎందుకూలేదూ ఆవేణుగోపాల శతకంలో వార్ధక్యమున చిన్నవయసు పెండ్లామైన దారిద్ర్యమున బెక్కుతనయులైన అర్తుడౌభూపతికతి భాషిమంత్రైన కడుదీర్ఘ నత్తివకాలైన అనికొన్ని యీతిబాధలు చెప్పచూ ఇదికూడా ఒకగొప్ప యీతి బాధగా వర్ణించి చెప్పేడు. అంచేత అప్పుడుకూడా వకీళ్లుఉన్నారు కాబోలని అడిగేను? మీన త్తిప్లీడరు మాట్లాడితే కోర్టులో అందరికీ నవ్వుగాదండీ!

'నత్తిమేష్టరు కన్ననయమేకదూ! గుంటలువాడికి తాటికమ్మకట్టేస్తారు నాలుగునిమిషాలలో. కోర్టులో అలాగుకాదుకదూ, నవ్వువచ్చిన యెదుట ఏమీ అనరు!'

అయితే ఈ వీధిచివరఉన్న ఎండునరం వకీలుకి ఏమైనా దొరుకుతున్నాదండీ? వాడేమిటండీ రోజుకి రోజు మరీ నరవొరుగుఅయిపోతూవున్నాడు? తిండి తింటాడో తినడోగాని మాగాయడొక్కలాగు ఎండి పోతున్నాడు! వాడికి కోర్టులో వాదించడానికేనా శక్తిఉందా?

'జలగేజలగ వాడేవాడు!'

వాడు పిల్లలిని ఏమిగొత్తుకుంటాడండీ! వాడిని చూచి మీ ప్లీడర్లందరూ ముఖ్యంగా మీరు బుద్ధి తెచ్చుకోవాలి. వాడినిచూస్తే నాకు తలిశెట్టి రామా రావు ఒకమారు యింటిదగ్గిర అనేకవిధాలుగా పిల్లలను ఎత్తుకొని ఆడిస్తూ బాధలుపడుతూఉన్న ఒక గృహస్తు బొమ్మ వ్రాసేడు చూసేరూ, అది జ్ఞాపకంవస్తూ ఉంటుందండీ! మనయింటి యెదుటి ప్లీడరుమీదికి పులిమీద పుట్టలాగు మరెవడో ప్రథమశాఖవాడు ఒకడుకూడా వచ్చేడుట! వాడిని ముచ్చవకర్రైలు ఖర్చురూపాయి ఫీజుయిచ్చేస్తే ఏకేసైనా పట్టేస్తాడుట. మీ గుమాస్తా అంటూఉంటాడు! వక్కడైనా అంత అర్థాన్నంవుంటుందండీ? వేలకువేలు పోసుకొని కాయ క్లేశాలుపడి కష్టపడి చదువుకొన్నవాళ్లే ఇలాగు గతిలేక కాణీకి పరకకీ కూరకీ నారకీ కక్కుర్తిపడి కేసులు పట్టేస్తూఉంటే, ఇకను మీరందరూ యీ దుకాణాలు యెత్తేసి యెక్కడికోపోయి మరేదో జీవనాధారం చూసుకోవలసిందే! కాని యేమి పాడురోజులు వచ్చేయండి! అవతల పార్టీలా డబ్బు పెట్టుకోలేక యేడుపు, ఇవతల రయితులా శిస్తులు కట్టుకోలేమని యేడుపు, ఏమీ దొరకలేదు, ఖర్చుల కెలాగుఅని మీరు యేడుపు! ఆ దొరకవలసిన కాస్తా మీలాంటి వాళ్లదాకా రాకుండానే ఏ కపుడుకక్కుర్తిప్లీడరో తన్నేసుకుపోతూఉంటే మరెలాగు జీవనం వెళు తుంది? లాఠీలాగు కడుపుంటుంది ఆ ప్లీడరుకు ఎలా గుంటుందండీ ప్రాక్టీసు?

'వాడు మాయలకు మారీచుడు! నీటిలో నిప్పు పుట్టించి తానితో దీపం వెలిగించి తనదారి తను చూచుకోగలడు.'

అయితే ఇకముందు మన మాటేమిటి? దినాలు ఎలాగు వెళతాయి! అంతా అంధకారంగా ఉన్నట్లు తోస్తున్నాది!

'అంచేతే నీవు చెప్పినా మా అమ్మా వాళ్లనూ వదిలేసి పైకివెళ్లిపోవడానికి నాకు మనస్కరించలేదు.'

అదే మీకున్న దుర్గుణం! మీ పాపమేమి! అదే మన దేశంవాళ్లందరికీ ఉన్న దుర్గుణం! ఇంత పిస రైనా ధైర్యసాహసాలు లేవు! సర్వమూ డబ్బులో ఉన్నదనుకొంటారు! ఆ డబ్బుకోసం నానా లాచారీ

పడతారు! స్వతంత్రము, స్వేచ్ఛ వీటియందు అభిలాషే లేదు!

"త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతిమాం"

అని అన్నట్లు మనవాళ్లు ఎప్పుడూ బానిసలే! స్వర్గంలో చాకిరీకన్న నరకంలో రాజ్యమేలడమే గొప్ప అని పడమటివాళ్లనుకుంటారు! అందుకే వాళ్లు సూర్యుడు గ్రుంకని రాజ్యానికి రాజులైనారు! మన వాళ్లు యిలాగు అధోగతిపాలై బానిసలై గుమాస్తా పనిలోనో ప్లీడరు పనిలోనో సాలెపట్టులో ఈగల్లాగు చిక్కుకొని కొట్టుకొంటూ ఉన్నారు! వేరే స్వేచ్ఛగాఉండి గంజో కడుగోత్రాగి హాయిగా కాలక్షేపం చేయడానికి సాహసంలేదు సరే కదా, కోరికకూడా మీకు లేకపోవడం ఆశ్చర్యం! ఎంత కాలం మీ అమ్మగారి పొదుగులో దూరదామని ఉంది? దూరితేమాత్రం ఏమిటి లాభం?

మనవాళ్లు పూర్వం నాలుగుజాతులుగా భాగించేరు గాని ఇప్పుడంతా ఒకటేజాతి అయిపోయింది; కోమటిజాతి! కోమటిజాతి యెలాగా? మీలాంటి భయస్థులు, అమాయకులు, కొండమేకలు, ఉన్నజాతి కోమటిజాతి కాక మరేమిటి? శూరుడూ, భీరుడూ ఉభయులకూ కోర్టులున్నాయి గదూ! అంచేత అందరూ కోమట్లుగా తయారుఅయిపోయినారు, గిరీశంతో సాలలేక రామప్పంతులులాగు! పూర్వపు బ్రాహ్మణుల సత్వగుణమూలేదు. క్షత్రియుల రజోగుణమూలేదు; అందరియందూ పూర్ణముగా తమోగుణము వ్యాపించిపోయింది! ఈదేశంలో మనుష్యులకు గొప్పకార్యములు చేయడానికి ఉత్సాహమూ లేదు; ఉన్నా శక్తిసామర్థ్యాలు లేవు! ఎలాగో పొట్టగడిస్తే చాలునన్న స్థితిలోనికి వచ్చింది దేశం! అదీ నీచంగా కానీయండి, గొప్పగా కానీయండి, అది లెక్కలేదు! పొట్టగడవడమే ప్రధానం! పొట్టను దాటి మరి లోకంలేదు! కడుపే కైలాసమైపోయింది! పోనీ! అలాగని తృప్తిలేదు! పూర్వపువాళ్లలాగు నిరాడంబర జీవనంలేదు! డాబుకీ, దర్జాకూ, తృష్ణకూ లోటులేదు! కాని చేతకాక యీ పొట్టకూటిమెట్ట వేదాంతము! మరొకటి సాధ్యంకాక యీ కూపస్థ మండూకత్వము! మీ కాళ్లమీద మీరు నిలబడి మీ బ్రతుకు మిమ్మల్ని బ్రతుకమంటే మీకు యింత భయమైతే ఎలాగు! బురదగుంటఉంటే మరి పన్నీరుకొలను ఊసెందుకు మీకు? బానిసకూడు ఉంటే చాలును. స్వాతంత్ర్యపు పరమాన్నంవద్దు కదా మీకు? మిమ్మలిని అనవలసిన పనిలేదు, దేశాన్ని అనాలి! అట్టి దానికి ఇట్టిగతి పట్టిందిగదా అని! మనుష్యుల మనస్సుల నిండా మత్సరము, హృదయంనిండా భయము, ఒంటినిండా బద్ధకము, నరాలనిండా అశక్తి, జింహ్వా నిండా అబద్ధం, వాటితో కుళ్లిపోతూవున్నారు! మహాత్ములు దారి అప్పటప్పట చూపినా, అట్లు నడుచుకోడానికీ మనవారికి ఇంకా యోగ్యతపట్టలేదు! ఎన్నాళ్లు ఇంకా ఈ పాడుపరిస్థితులు ఉంటాయో? ఎన్నాళ్లు ఉండవలసిఉందో? కాలం కర్మం రెండూ కూడితేనేగాని విముక్తిఉండదు! ఏదో పెద్ద కొండవరద వచ్చినట్లు విప్లవము రావాలిగాని మామూలుమాటలచేత యీ స్థితిగతులు సవరణకావు! అది మనతరంలో లేదు! మనకళ్లతో చూడము! ముందెప్పుడు రాబోతుందో మనం చూడగలమేమిటి? ఏదియెట్లైనా మీరు అమ్మపొదుగువదిలి రాలేరు! కానీయండి! ఎన్నాళ్లుపడాలో అన్నాళ్లూ పడతారు! తరువాత దేవుడే ఉన్నాడు! ఇకచాలును, ఆ చెత్త పుస్తకం ముయ్యండి!



భూగర్భ దేవాలయము — బెంగుళూరు



బెంగుళూరు లాల్‌భాగ్‌నందలి అద్దముల మహాలు



శ్రీమతి పి. ఎన్. ఎస్. విశాలాక్షిఅమ్మాళ్
రామనాద్ డిస్ట్రిక్టుబోర్డు సభ్యురాలుగా
నెన్నుకొనబడిరి.



కీ. శే. బుద్ధిరాజు చెల్లాయమ్మ గారు.
ఈమె స్మారకచిహ్న పోటీపరీక్షలు
భీమవరము రవీంద్ర సారస్వత
సమాజమునందుజరుగనున్నవి.



'భోగిమంట'

# స్వేచ్ఛామూర్తి

కె. యస్. లక్ష్మణరావుగారు

స్త్రీలబలలు, అస్వతంత్రలు, వివేకశూన్యలని ప్రస్తాపించువారి వాదము ఖండింప, స్వేచ్ఛామూర్తియై, సమరావని నవక్రమపరాక్రమాన్వితయై యరివీరనికాయంబులం జీకాకుపరచిన విదుషీమణి దేవీజోన్ ప్రబల నిదర్శనము. ఈయమ జగద్విఖ్యాత వీరనారీమణులలో నగ్రగణ్య. పరాసుదేశ దుస్థితిం దొలగింప నవతరించిన సీమంతినీతిలకము. త్యాగక్షమాయుత సద్గుణావళీ విరాజిత స్వాతంత్ర్యదీక్షాపిపాసిని. జాగ్రత్స్వప్నసుషుప్తావస్థలందును స్వదేశరక్షణసాధనోపాయాన్వేషణ మొనర్చెడి రాజకీయధౌరేయ. దైవసందేశానుసారము స్వదేశరక్షణోద్యమవ్రత పరిపూర్తిగావించి, తుద కాంగ్లమాన్త్ర జాలమునకెఱయైన పరాసునారీకీరము.

## జోన్ ఆఫ్ ఆర్క్



“భవోహి లోకాభ్యుదయాయ తాదృశం”

“అబలయై పుట్టినది. అదియు నాయుధజీవులగు పురుషసఘముగల క్షత్రియజాతియందుగాదు. కఱ్ఱపట్టి గొఱ్ఱెలను కాచు వెఱ్ఱిగొల్లకులమున పుట్టినది. కఱ్ఱపట్టినది. గొఱ్ఱెలను కాచినది. ఇంతలో నీశ్వరసందే

శము వచ్చినది. కఱ్ఱబట్టిన చేతితోడనే కత్తి పట్టినది. వెఱ్ఱిగొఱ్ఱెలను కాచినబుద్ధి తోడనే వెంగలివిత్తులై యున్న తనజాతివారిని కాచినది. అబలయే సబలయైనది."

ఆకాలమున నాంగ్లేయులు చెలరేగి ఫ్రాంసుదేశమునందలి భాగములనొక్కొక్కటిగ కబళించుచుండిరి. క్రూరులగు నాంగ్ల సైనికులు దేశమంతటిని యల్లకల్లోలము గావించుచుండిరి. వారి యత్యాచారముల నరికట్టుట కేరికిని సాధ్యముకాకుండెను. ఇంచుమించుగ పరాసుదేశమంతయు నాంగ్లులపరిపాలన క్రిందికి రానుండెను. ఇట్టి విషమ పరిస్థితులయందు, స్వదేశము నుద్ధరించుటకో యన దేవీజోన్ జననమందెను.

ఒకనా డీమె దేశదుస్థితిఁదలఁచి చింతా భరమున "అనాథరక్షణ దీక్షావిచక్షణుండవగు నోప్రభూ! పతితదేశము నుద్ధరింప ముక్తిదాతనంపవా!"యని భగవానుని వేడికొనినది. అంత "జోన్! ననునమ్మి పదభ్రష్టుఁడగు డఫిన్ రాకుమారునకు సాయమొనర్చి పతితుల నుద్ధరింపుము. పవిత్ర చరిత్ర కాగల"వని దేవవాణి వినవైనది. జోన్ సంతసచిత్తయై శ్రద్ధతో కర్తవ్యాంశమున కాలిడినది. మానవదుర్లభమగు భగవత్కటాక్షమును వడసిన దేవీజో నెంతయు పూజనీయగదా!

జోను దేవసందేశము ప్రజల నుత్తేజితుల జేసినది. వారు జోనును దేవదూతగ సన్మానించి, సకల సమరాధిపత్యము నొసంగిరి. జోనుదేవియు నిర్భరాహ్లాదచిత్తయై, తత్పదవీ స్వీకార మొనర్చి, డఫిన్ప్రభునకు పట్టముగట్ట శపథముపూనినది.

తత్క్షణము, పదునారు వసంతంబుల మేనిజిగి సౌందర్యవిభ్రాజితమైయొప్ప, కేంగేల స్వాతంత్ర్యనిశితకరవాలము దరించి, శ్వేతాశ్వారోహియై, స్నిగ్ధహృదయమున సమరోన్ముఖియైనది. ఆహా! నిస్వార్థయై ప్రాణత్యాగంబునకు సయితము సిద్ధమై దేశదాశ్యశృంఖలములభేదింప, ధీరోదాత్తయై, యనిమొన పదన్యాస మొనర్చిన వీరలలనావతంసము జోన్ స్తవనీయకాకుండునా!

దేవీజోన్ ఆహవరంగమున కురికి, దుర్ధమనీయసాహసమున, ప్రత్యక్షభీభత్సస్వరూపిణియై కరమునఖడ్గలతిక తళతళమెరయ, శ్వేతాశ్వము నిచ్చవచ్చినయెడకు బోనిచ్చుచు, స్వసేనాళిను త్తేజమయవాక్కుల వీరావేశపూరితులంగావించుచు నంతమసదృశయై యరాతుల శలభంబులమాడ్కిఁ దునుమాడుచు పలుసమరంబుల విజయమునొందినది. సంగ్రామానంతరము మృతసేనాజనంబుల కొఱకు బాష్పములవిడిచెడిది. ఆపన్నశరణ్యయై, సమ్యగ్దృష్టిని, నిరువాగుల గాయితులకు చికిత్సగావించి శత్రుజనంబులచేగూడ వేనోళ్లఁ గీర్తింపబడెడిది. ఏమియీమె యఖండప్రజ్ఞాయుత వాత్సల్యస్వరూపము!

ముప్పాలు పరాసుదేశము జోనుకారణముగ దాస్యవిముక్తిహొందినది. డఫిన్ప్రభునకు జోను రీమ్సునగరమున జయప్రదముగ

పట్టముగట్టినది. అంతటితో దైవాజ్ఞపూర్తి యైనది కాని డక్రిన్ ప్రభు నాజ్ఞానువర్తిని యగు నామెకు తిరుగ సమరావనికురుకక తప్పినదికాదు. ఈ పరియాయము భగవ దానుమతి బొందకపోవుటచేఁ గావలయు, జోనునకు పరాజయము వాటిల్లినది. తుద కొక యుద్ధమున నామె, ద్రవ్యపిశాచవేష్టితు లగు కొందఱు దేశద్రోహులచే శత్రుహస్త గతయైనది. ధనలోభ మెంతటి నీచకృత్యమై నను జేయించునుగదా!

ఇట్లాంగ్లేయవశవర్తినియై యియ్యవార్య వీర్య యొకవత్సరము కఠినకారాగారవాస మనుభవించినది. పడరానిపాట్లు పొందినది. మనోమోహనకరంబగు నీమె సుకుమార శరీర మీ చెఱకారణముగ నెంతయు శోషి ల్లినది. ప్రకాశవంతములగు విశాలతరళనయ నంబులు తేజోవిహీనములైనవి. ఈసమయ మున కృతఘ్నుఁడగు డక్రిన్ కూడ యీామె విడుదలకై ప్రయత్నించలేదు. ఎంతటి కష్టము! జగజ్జేగీయమానయై చండాంశువగిది నుజ్వలప్రతాపోన్నతయై స్వదేశరక్షణము నకై పెనగులాడు జోనుదేవికా యీా కడ గండ్లు. అయ్యారే! ఇన్ని యాగబాట్లనొం దుచు నికనైనపూన్కి విడువకున్న దే!నిశ్చలత యననట్లుండవలయును. "సంపత్సుమహ తాం చిత్తం భవేదుత్పలకోమలమ్, ఆపత్సుచ మహాశైల శిలాసంఘాతకర్కశమ్మ"ను నార్యోక్తిని ధృఢపరచినదిగదా! అహాహా! యేమియీామె సహనశక్తి! ఓశిలామయ హృదయాంగ్ల మూర్తులారా! ప్రాచీనరాజ నీతి నుల్లఘించి, నీతిహైన్యమున, నింద్య దశల నామెను బంధించితిరి. మీా కామె స్థూలకాయమునేగాని హృదయమును కట్టి వేట్టుట యసాధ్యమనిమాత్రము మఱువకుడు.

నిర్జన కారాగారమునుండి విడుదలయై జోన్ విచారణమందిరమునకు గొంపోబడి నది. అచటి న్యాయవేత్తల న్యాయసిద్ధాంత ముల నేర్పరచి యెట్లో జోనునం దసత్య నిరూపణకై ప్రయత్నించిరి. ఎంత లోతుగ విచారించినను జోనుపట్ల వారి కావంత దోషమేనియు గన్పించినదికాదు. తుదకు విసివి యామెపై "సైతాన్‌చాలీ (దయ్యములపోతు)" అనియు "దేశానర్థ దాయిని"యనియు నభియోగముచేసి మరణ శిక్ష విధించిరి. జోనిసుమంతయు చలింప లేదు. వెనుకంజవేయలేదు. అదియేతుది పరీక్షాసమయమనుకొని యందు కృతార్థు రాలగుటకు నిరీక్షించుచుండెను.

నాడు జోనుకన్య మరణదండన నిర్ణీత దినము. కర్కశులగు నాంగ్లుల హర్షచిత్తుల జేయు పర్వదినము. స్వదేశస్వేచ్ఛామూర్తిని గోల్పోనున్న పరాసీయులకు పరాభవించు దినము. నాడు జోనునారీమణి యనుభవింప నున్న దుస్సహశిక్షావిధాన మవలోకింపనేరక సహస్రకిరణుడు మేఘావృతుడై కన్మరగెను. వధ్యస్థానమున నొకచితిపై స్వేచ్ఛామూర్తి యినుపగొలుసులతో నొక స్తంభమునకు బంధించబడినది. శిలామయహృదయులును, న్యాయాధిపులును, జోను మరణవిధానము

నేత్రపర్వముగ గాంచుటకు విచ్చేసి యథాస్థానంబుల నుపవిష్టులైరి. జోనిదియంతయు గాంచి చకితమై మృత్యువనివార్యమని తలచినది. పోవునది ప్రాణమేకదా యని నిస్సారతవహించినది. శరీరకష్టమంతయు నొకేసారి దీరునుకదాయని సంతసించినది.

న్యాయాధిపుడు కచను దేశద్రోహి నిలువంబడి, "జోన్ నీవు స్వధర్మత్యాగివౌట మరణదండన విధించుచున్నా"ననియెను. ఈ మన్మాత్రమేనియు చలింపక, మేఘగంభీర భాషణముల — "స్వర్గమర్త్యలోకములకు విధానకర్తవగు నోప్రభూ, నీ యాదేశానుసారమునే ననేకత్యాచారముల నెదిర్చితిని. ఇపు డీ హేయమగు తనువనలశిఖకాహుతిగానున్నది. అయిన నాత్మనిశ్చితకార్య మెంతకును విరమింపబడదు. ప్రభూ నాదుఃఖపూరిత దేశముపై పరాధీనతజూపకుమని ప్రార్థించుచున్నాను" యని యార్తనాదము గావించి నిశ్చలహృదయముతో నిలచినది.

ఘాతుకుడొక డా సమయమున చితికి నిప్పంటించెను. జోన్, స్వర్గప్రథమసోపానమున కాలిడినది. తుదకు కరపంకజద్వయమును మొగిడ్చి ప్రశాంతహృదయముతో నిమీలితలోచనయై, యావేగపూరితమగు డగ్గుకత్తితో "ఓ దయామయులారా మీారు నాచావును నేత్రపర్వముగ గాంచుడు. మీారెన్నటికిని నామృత్యువునకు కర్తలుగారు. అంతయు భగవదేచ్ఛయే. కాని నామరణానంతరము, మిత్రభావమున మీారందరు నా యాత్మకల్యాణమునకై సర్వేశ్వరుని ప్రార్థించుచుండుడనిమాత్రము కోరుచున్నాను. నాదయ నీ యదేశవాసుల బాధింపకుడని నా తుదికోరిక — శ-ల-వు." జోన్ యావేగపునుడు లందరిని కన్నీళ్లముంచినది. వారందరు హాహాకారముల సేయుచు కల్లోలవారాసిని మున్గిరి.

ముహూర్తమాత్ర మాత్రమున విశ్వధ్వంసియగు ననలశిఖలోపఘూర్ణితమిశ్రమై యరుణకాంతులనీనుచు ప్రచండవాతోద్ధూతమై మరింత ప్రజ్వరిలి, యసదృశపవిత్రాత్మ సాధువీరాంగన పుణ్యపూతశరీరము నొక్క త్రుటిలో భస్మీభూతము గావించినది.

స్వేచ్ఛామూర్తి యాత్మత్యాగమొనర్చినది. ఆమె యాత్మాదానఫలముగ పరాసుదేశమునకు దుర్దశదొలగి పరిపూర్ణస్వాతంత్ర్యమలవడినది. జనులందరు దేవీజోన్ స్మృతి పూజ యొనర్చినారు. దేవీజోన్ యశశ్శరీరయై వీరనారీజనమధ్యంబున వెలుగొందుచున్నది.

* * *

దేవిజోన్! ధన్యచరితమ్మా! నీదైవభక్తియు, స్వదేశానురక్తియు, పురుషోచితదృఢత్వమును, సంకల్పసాధనాతత్పరతయు, సుఖదుఃఖ సంపదాపద్హర్షవిషాదంబుల సహనశక్తియు కొనియాడ నేరితరము తల్లీ! దేవీ నీజన్మము తరించినది నీరాజభక్తి ఫలించినది నిన్నన్నమాత పావనమైనది. నినుబడయగల్గిన జాతి ధన్యతనొందినది. దేనికొరక కరివీరుల

వీర్యవహ్నిఁ దేజోవిహీన మొనరించితివో; ఎవతెకొరకు స్వార్థత్యాగినివై కర్కశబ్రహ్మచర్యముఁ జేపట్టితివో; ఏ మాతకొరకు బాల్యావస్థనే కఠినవ్రతమూని కర్మక్షేత్రమున దవతీర్ణవైతివో; ఏతల్లికొరకు శీఘ్రముగనే నవయౌవనము తొలుకాడుకాలముననే మహావ్రతోద్యాపనసల్పి దివికేగితివో; యట్టి నీదేశము, పరానుజనని పావనతనువైనది. నీయత్నము స్వేచ్ఛారూపము దాల్చినది. నీయభీష్టము సిద్ధించినది. పావనచరితా, నీశౌర్యయుత నిర్మలతేజోవికాసము భారతవీరవనితల కెల్లయు నాదర్శము. ఓ యలౌకికచరితా, జోనుమాతా, స్వామీ, జెహానెవ్, జహాన్, లాపుసేన్, జోన్ ఆఫ్ ఆర్కు, జియాండ్ ఆఫ్ ఆర్కను, దివ్యపర్యాయనామంబుల నాచంద్రతారార్కపర్యంతము నాదర్శప్రాయవై, చిరస్మరణీయవై విలసిల్లెదవుగాక!

---

# పోటీ పరీక్షలు

## (1) ఆహారశాస్త్రము—పోటీపరీక్ష నిబంధనలు

(1) జాతి వివక్షలేక స్త్రీపురుషు లెల్లరును ఈపరీక్షకు దరఖాస్తు పెట్టవచ్చును. (2) పరీక్షరుసుము రు. 0–4–0 మాత్రమే (3) దరఖాస్తులు 1937 సంవత్సరము జూలయి 1 తేదీలోఁగా ఆంధ్ర సరస్వతీ గ్రంథమాల వారికి చేరవలెను. (4) 1937 సంవత్సరము సెప్టెంబరు 25 తేదిలోఁగా ప్రశ్నపత్రములు దరఖాస్తుదారులకు పంపఁబడును. (5) దరఖాస్తుదారులు ఇంటికడనే ఈ ప్రశ్నలకు ఉత్తరములు వ్రాయవలెను. (6) ఆయుత్తరముల కాగితములు 1937 సం॥ రము నవంబరు నెల 7 తేదీలోఁగా రిజిస్టరు పోస్టులో ఈ క్రిందివారికి చేరవలెను (7) చేరినయుత్తరములన్నియు పరిశీలింపఁబడును. అందుగుణముల చేత ప్రథమస్థాన మలంకరించినవారికి ఒక బంగారుపతక మొసఁగఁబడును; రెండవ మూఁడవస్థానము నలంకరించిన వారికి వెండి పతకము లొసఁగఁబడును; నూటికి నలువదికి తక్కువగాని గుణములు వడసినవారికి సర్టిఫికెట్లు ఒసఁగఁబడును. ఈనిర్ణయములు ఆంధ్రసరస్వతీ గ్రంథమాల వారి అభిప్రాయమునననుసరించి యుండును. దరఖాస్తుదారులు అట్టితీర్మానమునకు బద్ధులైయుండవలెను. ఏపతకమువిషయములో నైన సమానగుణములు వచ్చునెడల అట్టి పతకమునకు బదులుగా దాని విలువ అట్టివారికి పంచిపెట్టఁబడును.

ఉత్తరములును, దరఖాస్తులును ఈ క్రిందివిలాసమునకు పంపఁబడవలెను:— వేమల్ల రాజగోపాలరావు ఆంధ్రసరస్వతీ గ్రంథమాలాధికారి, 124, వెల్లారివీధి, వేపేరి, చెన్నపురి.

## (2) శ్రీరవీంద్ర సారస్వత సమాజము, భీమవరం.

## శ్రీ చెల్లాయమ్మ స్మారక చిహ్న వ్యాసరచన పోటీపరీక్షలు. స్త్రీలకు మాత్రమే.

భీమవరం వాస్తవ్యులగు బుద్ధిరాజు రామబ్రహ్మంగారు కీర్తిశేషులైన తమ భార్య చెల్లాయమ్మగారి స్మారక చిహ్నముగ, వ్యాసరచన పోటీపరీక్షయందు ప్రథమురాలుగా నుత్తీర్ణయగు స్త్రీకి యొక బంగారు పతకము సమర్పింపనున్నారు. ఏతత్పరీక్ష శ్రీ రవీంద్ర సారస్వతసమాజ యాజమాన్యతను జరుపబడును. కావున పశ్చిమగోదావరి జిల్లా యందు గల మహిళామ తల్లులందరు, పరీక్షయందు పాల్గొందురని ఆశించుచున్నాను. "పతివ్రత లోక కళ్యాణమున కెట్లు తోడ్పడును" అను శీర్షిక క్రింద 5 పేజీలు (అరఠావు పేజీలు) మించకుండ సాధారణపు వ్రాతలను తెలుగున వ్యాసములు వ్రాసి, ఫిబ్రవరి 10 వ తేదీలోగా మాకార్యాలయమునకు చేరునట్లు పంపించ గోరెదను. కార్యదర్శి.

# అదే యొకకలా!



ఒక సౌందర్యమైన చిత్రప్రతిమను జూచిన, రసికుల కెంత మానసోల్లాసము గల్గుచున్నది. సంగీత కావ్యాలంకారాదులన్నియు నీలాగే. అయినను వీటిలో కొందఱికే సాహసము. సామాన్యవిషయములందున్ను యిటువంటి చాతుర్యములు గలవని యెప్పుడైన దలచియుందురా? ఒక కప్ "టీ" జేయుటయుయే యొక విద్య. ఇండియా "టీ" ఆయురారోగ్యానందంబుల గల్గుజేయునది.

## "టీ" జేయు క్రమము

శుద్ధమైన వేడినీరు, కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్ఫూన్ "టీ" యొక్కొక్కరికిన్ని, మొత్తముగా నొక స్ఫూన్ యధికముగాను పాత్రములో వేసి, బాగుగా మరుగుచున్న నీటిని పోయవలెను. 5 నిమిషములు తాళి, కప్పులలో పోసి, పాలు చక్కెర చేర్చవలెను.

## ఆరోగ్యపానము—ఇండియా 'టీ'

I.K-34

# పోటీ వ్యాసము

## గృహపరిశ్రమలచే ధనము గడించుటెట్లు ?

పై సమస్యపై ఉత్తమవ్యాసముల రచించిన సోదరీమణులకు ప్రథమ ద్వితీయ తృతీయ బహుమతులుగా రు 5, రు 3, రు 2. ఇవ్వబడును. సంపాదకుల తీర్మానమే అంత్యముగా పరిగణింపబడును. ఆ పరిశ్రమ యీ క్రింది నిబంధనల ననుసరించి యుండ వలయును.

1. గృహిణులు ఇలువీడకనే స్వయం సహాయముతో చేసికొనుటకు తగి యుండ వలయును.

2. ఆ పరిశ్రమయందు విదేశవస్తువుల నుపయోగింపక అన్నివస్తువులును స్వదేశీయములై సులభముగా లభించునవియై యుండ వలయును.

3. ఈ పరిశ్రమ అనుభవసిద్ధమై యందరి అందుబాటులో నుండవలయును.

4. ఈ పరిశ్రమవలన తయారగు వస్తువులు అందరికిని అత్యావశ్యకమైనవిగనుండి త్వరగా కర్చుగావలయును.

ఈ విషయములన్నియు గమనించి సోదరీమణులు త్వరలో తమకు దెలిసిన పరిశ్రమలనుగురించి వ్రాయుదురుగాక.

---

# కావలెను

ఏబదిరూపాయల జీతముగల గౌరవనీయమైన యుద్యోగముననున్న 25 సం. (బలిజ) పట్టభద్రునికి 16, 18 సంవత్సరములకు పైబడని కన్య కావలయును. వరకట్నాదు లనవసరము. కన్య రూపవతియు, విద్యావతియు సంగీతాది లలితకళలందు ప్రవేశము కలదియునై యుండవలయును. విద్యార్హపరీక్షయియున్న శ్రేష్ఠము. పైకులములోని యితరభేదముల పాటింపబనిలేదు. పై విషయముల తృప్తిపరచు బాలవితంతువులైనను సరియే. ఉత్తరప్రత్యుత్తరములు రహస్యము గానుంచబడును.

వివరములకు :-

సి. ఎన్. C/o 'గృహలక్ష్మి'.

# గమనింపు

వధూవరులు కావలయునని ప్రకటనలింకమీాదట ప్రతిమాసమును ప్రకటింపబడుచుండును. వలయువారలు ఇట్టి ప్రకటనలను 15 తేదికిముందే మా కార్యాయలమునకు పంపుకొనవలయును. ఉత్తరప్రత్యురములు రహస్యముగనుంచి వారివారి కందింపజేయుదుము. ప్రకటలకు ఒక కాలము ఒక అంగుళమునకు ఒక రూపాయ ప్రకారము చార్జి చేయబడును.

గృహలక్ష్మీకార్యాలయము

పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు.

# అంధకారంలో ప్రకాశం

శరచ్చంద్ర చటర్జీగారు

౧

అనేకదినాలనాటి విషయం. సత్యేంద్రనాథ చౌదరి వొక జమీందారుని పుత్రుడు. అతను బి యే. ప్యాసై యింటికి వచ్చినాడు. ఒకదినం అతని తల్లి అతనితో ఈవిధంగా అన్నది "ఆపిల్ల రెండో లక్ష్మి యే. నామాట విను, వొకపర్యాయం వెళ్లి నీ కండ్లతో ఆపిల్లను చూచిరా."

సత్యేంద్రుడు తలవూపుతూ అన్నాడు—నా కిప్పుడు పెండ్లి అవసరంలేదమ్మా, పెండ్లి చేసుకున్న తర్వాత పరీక్షను చదవటం చాలాకష్టం.

తల్లి అంది—పరీక్షను చదవడ మేమికష్టంవుండదు. ఆపిల్ల నాదగ్గరవుంటుంది, నీవు కలకత్తాలో చదువు కుంటావు. అందుచే నీవు చదువుకోవడానికి యేమి ఆటంకంవుంటుందో నాకు తెలియడంలేదు.

సత్యేంద్రుడు అన్నాడు—కాదమ్మా, నీవు చెప్పేది సరిగాలేదు. నాకు సమయంలేదు.

ఈవిధంగా చెప్పి సత్యేంద్రుడు బయటికి పోతూ వుండగా తల్లి అన్నది—వెళ్లకు, నిలుచో యింకో మాట చెప్పాలి! మరల కొంచెం ఆగిచెప్పింది—ఆ పిల్లవాకికి మాట యిచ్చివున్నా. నామాట నిలబెట్టు.

సత్యేంద్రుడు నిలబడి అసంతోషంగా అన్నాడు —నన్నడగకుండా వారికి మాట యెందుకిచ్చావు?

కుమారుని ఆమాటకు తల్లికి కొంచెం కష్టంగలిగి ఈ విధంగా అంది—సరే, నావల్ల తప్పు జరిగింది. కాని నీ తల్లిమాటను నిలబెట్టవలసిన భారం నీది. అది కాకుండా ఆ విధవరాలికూతురు చాలా దీనావస్థలో వుంది. నామాట విను, వొప్పుకో.

"యేసంగతీ యింకోపర్యాయం చెపుతా" అని సత్యేంద్రుడు బైటికి వెళ్లిపోయాడు. తల్లి చాలసేపటి వరకు కదలక మెదలక అక్కడనే నిలబడివుంది. సత్యేంద్రుడు తప్ప వేరే సంతానంలేదు ఆమెకు. ఏడెనిమిది సంవత్సరాలకు ముందు ఆమె భర్త చని పోయాడు. పాపం, అప్పటినుండీ తానే స్వయంగా గుమాస్తాల సహాయంతో నైతేనేం, కరణాల సహాయం తో నైతేనేం తన పెద్దజమీందారీని చూచుకుంటూ వుంది. కుమారుడు కలకత్తాలోవుండి వొక కాలేజీలో చదువుకుంటూవున్నాడు. అతనికి తన జమీందారీ సంగతే పట్టదు. అతను వకాలతు ప్యాసైవచ్చిన తర్వాత పెండ్లిచేసి, అప్పటినుండీ జమీందారీని వాళ్లి ద్దరకు వొప్పజెప్పి నిశ్చింతగావుందామని తల్లి ఆలో చించింది. వకాలతు ప్యాసుకానిది వివాహంచేసి చదువును ఆటంకపరచడం ఆమెకు యేమాత్రం యిష్టం లేదు కాని యింతలో యీమార్పు జరిగింది. భర్త చనిపోయినప్పటినుండీ ఈయింట్లో వొక శుభకార్యం గూడ జరిగివుండలేదు. ఆదినం తా నొకవ్రతంచేసి ఆ వూరివారినందరినీ తన యింటికి ఆహ్వానించింది. ఆ వ్రతానికి స్వర్గీయ అతులచంద్రముఖర్జీ భార్య పదకొండు సంవత్సరాల తన కుమార్తెతోగూడ వచ్చింది. ఆపిల్ల సత్యేంద్రుని తల్లికి చాలానచ్చింది. ఆబాలిక కేవలం అసమానసౌందర్యవతియే కాక, గుణవతియనికూడా తాను ఆబాలికతో మాట్లాడి నపుడు తెలుసుకుంది సత్యేంద్రుని తల్లి.

ఆసమయాన తల్లి తనలో తాను యిట్లా అను కుంది—ఒకపర్యాయం నే నా పిల్లను నా కుమారునికి చూపించాలి. ఆపిల్లను చూచినతర్వాత వివాహం చేసుకోకుండా వుండలేడు.

మరునాడు సత్యేంద్రుడు మధ్యాహ్నం మూడు గంటలకు భోజనంచేయడానికి తన తల్లిగదికి వచ్చి చకితుడై నిలువబడిపోయాడు. అతను భోంచేసే చోటుకు యెదురుగావున్న ఆసనమ్మీద వొక బాలిక రత్నాలతో అలంకరింపబడిన వైకుంఠలక్ష్మివలె కూర్చొనివుంది.

తల్లికూడ గదిలో ప్రవేశించి అంది — భోజనానికి కూర్చో.

సత్యేంద్రుని తంద్రావస్థ భగ్నమైంది. అతను కొంచెం గాబరాతో అన్నాడు–ఇక్కడ యెందుకు? యింకోచోట కూర్చుని భోంచేయకూడదు?

తల్లి చిరునవ్వు నవ్వుతూ అంది—నీవు నిజంగా వివాహం యిప్పుడు చేసుకోదలంచలేదుగా, యీ చిన్నపిల్లను చూచి సిగ్గుపడతావెందుకు?

“నేను యెవరికీ సిగ్గుపడను” అంటూ సత్యేంద్రుడు కొంచెం కళావిహీనుడై యెదురుగావున్న పీటమీద కూర్చున్నాడు. తల్లి అక్కడినుండి వెళ్లిపోయింది. సత్యేంద్రుడు రెండు నిమిషాలలోనే భోజనం సమాప్తిచేసి అచటినుండి వెళ్లిపోయాడు.

వెలుపలిప్రక్కవున్న తన గదిలోనికి వచ్చినాడు. ఈమధ్యలో అతని మిత్రులు కొంతమంది వచ్చి పాచికలు ఆడుతూవున్నారు. “నేను కూర్చోలేను. నాకు చాలా తలనొప్పిగావుంది”* అని చెప్పి వొకమూలకు వెళ్లాడు. దిండుమీద తలబెట్టి కండ్లు మూసుకుని పండుకున్నాడు. మిత్రులకు ఆశ్చర్యంవేసింది. ఆట ఆడేవారు తక్కువగావుండడంవల్ల పాచికలు మానేసి చదరంగం ఆడసాగారు. సాయంకాలంవరకూ ఆట జరుగుతూనేవుంది. కాని సత్యేంద్రుడు తన స్థానంనుండి వొకపర్యాయమైనా కదిలిన పాపాన పోలేదు. వోడుగెలుపు విషయంకూడ అడగలేదు. ఈదినం అవన్నీ తలనొప్పిగావున్నై అతనికి.

తన మిత్రులు వెళ్లిపోయినతర్వాత యింట్లోకి వెళ్లి తిన్నగా పడకగదివైపుకు పోతూవున్నాడు సత్యేంద్రుడు. అతను వెళ్లుతూవుండడం తల్లిచూచి అన్నది–యింతత్వరగా పండుకోబోతున్నావెందుకు?

సత్యేంద్రుడు చెప్పాడు—పండుకోబోవడంలేదు. చదువుకోవడానికి వెళ్లుతున్నా. ఎం.యే. ప్యాసు గావడం సామాన్యంగాదు. వృథాగా సమయం వెళ్లబుచ్చితే పని యేవిధంగా జరుగుతుంది?

ఆవిధంగా చెప్పి టక టక శబ్దంచేసుకుంటూ పైకివెళ్లినాడు.

ఒక అరగంట గడిచింది. కాని వొకపేజీకూడా చదవడం కాలేదు. టేబులుమీద యెదురుగా పుస్తకం తెరిచివుంది. పైకిచూస్తూ దూలాలు లెక్కపెడ్తూవున్నాడు. ఝుణ, ఝుణ అనేశబ్దం వొక్కపర్యాయంగా అతని ధ్యానాన్ని భంగం కావించింది. సత్యేంద్రుడు తిన్నగా కూర్చున్నాడు. ఇంతలో ఆ పాదమస్తకం ఆ భూషణాలను ధరించి ఆ లక్ష్మీస్వరూపురాలైన కన్య వస్తూవుండడం చూశాడు. ఆకన్య వచ్చి అతనివద్ద నిలువబడినది. సత్యేంద్రుడు తదేకధ్యానంతో చూడసాగాడు. బాలిక అత్యంత మృదుస్వరంతో అన్నది–అమ్మ మీసమ్మతి అడిగినది.

సత్యేంద్రుడు కొంతకాలం యేమీమాట్లాడక తర్వాత అన్నాడు—ఎవరితల్లి?

బాలిక చెప్పింది—మా అమ్మ.

* బెంగాలులో వివాహానికి పూర్వం పెండ్లికొడుకు తన స్నేహితులతో సహా పెండ్లికుమార్తెను చూచే ఆచారంవుంది. ఆసమయంలో అనేకవిధాలైన పరిహాసాలుచేస్తూ పెండ్లికుమార్తెను పరీక్షిస్తారు. అందువల్లనే మిత్రులంతా చేరారు. వారి అభిప్రాయాన్ని తెలుసుకుని సత్యేంద్రుడు తలనొప్పి అని వొంకపెట్టాడు. (అ. వా.)

సత్యేంద్రుడు జవాబు చెప్పలేకపోయాడు. తర్వాత కొంచెంసేపటికి చెప్పాడు—మా అమ్మను అడిగి తెలుసుకో. ఆమెయే సంగతి తెలియజేస్తుంది.

కన్య ఆగదినుండి వెళ్లుతూవుంది. సత్యేంద్రుడు అకస్మాత్తుగా అడిగాడు— నీ పేరేమిటి ?

'నాపేరు రాధారాణి' అని చెప్పి వెళ్లిపోయింది ఆబాలిక.

౨

ఆ రాధారాణి వైపునుండి దృష్టి మరల్చుకుని సత్యేంద్రుడు ఎం.యె. ప్యాసుగావడానికి కలకత్తా వెళ్లాడు. విశ్వవిద్యాలయపు పరీక్షలన్నీ ప్యాసు గానంతవరకు వివాహంమాట తలపెట్టగూడదను కున్నాడు. వీలైతే ఆతర్వాతకూడ గృహకల్లోలాలలోపడడంవల్ల మనుష్యుని ఆత్మగౌరవం నాశన మౌతుందని ఆతని తలంపు. మొదటినుండీ స్త్రీఅంటే వుదాసీనంగా వుంటూవుండేవాడు. కాని అకస్మాత్తుగా అతనిలో గొప్పమార్పు గలిగింది. దారినపోతూ వుండగా యేయువతి అయినా కనుపించితే చాలు బాగా ఆమెను చూడాలని అతని కనిపించేది. చూస్తూ చూస్తూవుండగానే సిగ్గుచే శరీరమంతా కంపించిపోయేది. వెంటనే యేవైపు ముఖమువుంటే ఆవైపుకు త్వరగా వెళ్లిపోయేవాడు.

సత్యేంద్రునికి యీతఅంటే మహాయిష్టం. అతను వుండే 'చోర్‌బాగాన్' యింటికి గంగానది సమీపంగానేవుంది. అందుచే అతను యెప్పుడూ జగన్నాధ ఘాటుకు స్నానంచేయడానికి వెళ్లుతుండేవాడు.

ఆనాడు పూర్ణిమ. ఆ ఘాటువద్ద కొద్దిగుంపు చేరింది. గంగానదివద్దకు వచ్చి సత్యేంద్రుడు వొక వుడియా బ్రాహ్మణునిదగ్గర పొడిగుడ్డలువుంచి నీళ్లలో దిగుతూవుండేవాడు. ఆబ్రాహ్మణుడు వున్నవైపుకు అతను వెళ్లుతూవుండగా కొంతమంది మనుష్యులు ఆతనిదారికి అడ్డంవచ్చారు. అందుచే కొద్దికాలం అక్కడ అతను నిలిచిపోవలసివచ్చింది. అక్కడ నలుగురైదుగురు మనుష్యులు వొకేవైపుకు చూస్తూ వుండడం చూచాడు అతను. వారి దృష్టిని అనుసరించి అతనుకూడా చూడగా విస్మయంతో స్తబ్ధుడైనాడు.

ఒకేపర్యాయం యింత అసమానసౌందర్యాన్ని యే స్త్రీ శరీరంలోకూడ నేను చూచియుండలేదని అనుకున్నాడు సత్యేంద్రుడు. ఆమె వయస్సు పదునెనిమిది, పందొమ్మిది సంవత్సరాలకంటె యెక్కువలేదు. వొకమామూలు నల్లంచు తెల్లచీరె కట్టుకునివుంది. శరీరమ్మీద వొకవస్తువుకూడలేదు. మోకాళ్లమీద కూర్చుని చిరపరిచితుడైన వొక పండాచేత చందనపు బొట్టు పెట్టించుకుంటూవుంది. ఆపండా తదేక ధ్యానంతో ఆ సుందరిముఖాన చందనం దిద్దుతూ వున్నాడు.

సత్యేంద్రుడు దగ్గిరకువెళ్లి నిలబడినాడు. పండా సత్యేంద్రునివద్దకూడా బాగుగా దక్షిణ దొరుకుతుందనే భావంతో ఆ రూపసికి బొట్టుపెట్టడం మాని సత్యేంద్రుని పొడివస్త్రాలను తీసుకోవడానికి చేయి చాచాడు.

వారిద్దరు వొకరినొకరు చూచుకున్నారు. సత్యేంద్రుడు త్వరగా తన గుడ్డలుపండా చేతికిచ్చి మెట్లు దిగుతూ నీళ్లలో ప్రవేశించాడు. కాని యీదినం అతను యీదలేదు. యేదోవొకవిధంగా స్నానంచేసి గుడ్డలు మార్చడానికి పైకివచ్చాడు. ఆ అసమాన రూపసి అంతకుముందే అక్కడినుండి వెళ్లిపోయింది.

ఆదినమంతా గంగను జపించడంలోనే గడిపాడు. మరుదినం ప్రాతఃకాలం కాకముందే గంగామతల్లి సత్యేంద్రుణ్ణి తనవైపునకు ఆకర్షించుకుంది. అతను వొంటికివున్న వొకధోవతిని తీసుకుని వెంటనే గంగానదికి బయలుదేరాడు.

ఆ అపరిచితరూపసి అప్పుడే స్నానంచేసి పైకి రావడం ఘాటుకుచేరి చూచాడు సత్యేంద్రుడు.

స్నానంచేసి తాను పండాదగ్గరకు వచ్చినపుడు ఆమె ఈదినంకూడ మొదటిరోజుమాదిరి పండాచేత బొట్టు పెట్టించుకుంటూవుంది. ఈదినంకూడ వొకరినొకరు చూచుకున్నారు. అతను త్వరగా గుడ్డలు మార్చుకుని అచటినుండి వెళ్లిపోయినాడు.

## 3

ఆస్త్రీ నిత్యం ప్రాతఃకాలాన స్నానంచేయడానికి వస్తూవుంటుందని తెలుసుకున్నాడు సత్యేంద్రుడు. ఇన్నిదినాలనుండి ఆమెను చూడకపోవడానికి కారణం తాను ఆలస్యంగా స్నానంచేయడానికి రావడమే నని అతను తలంచాడు.

గంగానదివొడ్డున వారంరోజులనుండీ వొకరినొకరు చూచుకుంటూనేవున్నారు. కాని యీరోజువరకు వారికి మాట్లాడుకునే అవసరం దొరకలేదు. కారణం నేత్రాలతో నేత్రాలు మాట్లాడుకునే సమయాన నోరు మూకీభావంతోవుండవలసి వస్తుంది గనుక. ఆ అపరిచితరూపసి యెటువంటిదైనా కావచ్చు. కాని ఆమె కండ్లతో మాట్లాడే విద్య నేర్చుకుందని, అది కాకుండా ఆవిద్యలో పారంగతురాలనీ అనుభవం చేసుకున్నాడు సత్యేంద్రుడు.

ఆదినం సత్యేంద్రుడు స్నానంచేసి కొంచెం అన్యమనస్కుడైపోతూవున్నాడు. ఇంతలో అతనికి వొక మాట వినిపించింది 'ఒకమాటండీ!' అతను తలయెత్తి చూచాడు. రైల్వేలైనుకు అప్రక్క ఆరమణి నిలబడి వుంది. ఆమె నడుముమీద యెడమవైపున నీటితో నిండివున్న వొకచెంబు, కుడిచేతిలో తడిచినచీర వున్నై. ఆమె తలవూపి పిలిచింది. సత్యేంద్రుడు యిటు అటుచూచి ఆమెవద్దకుపోయి నిల్చున్నాడు. ఆమె వుత్సుకనేత్రాలతో చూచి మృదుస్వరంతో అంది—'ఈదినం మా పనిమనిషి రాలేదు. కొంచెం దూరం దయవుంచి పంపించండి.' నిత్యం ఆమెతో కూడ వొకదాసీమనిషి వస్తూవుండేది. కాని యీదినం ఆమె వొంటరిగానే వచ్చింది. ఆమెను పంపించడం మంచిదికాదని తలంచాడు సత్యేంద్రుడు. 'నావల్ల కాదు' అని చెప్ప ప్రయత్నించాడు కాని చెప్పలేక పోయాడు. రమణి అతని మనోభావాన్ని గ్రహించి కొంచెం నవ్వింది. ఈవిధంగా నవ్వనేర్చినవారికి ఈ ప్రపంచంలో అప్రాప్యవస్తు వేదీవుండదు. సత్యేంద్రుడు వెంటనే 'పదండి' అంటూ ఆమె వెంట బయలు దేరినాడు. రెండు మూడు అడుగులు వెళ్లిన తర్వాత స్త్రీ మళ్లీచెప్పింది—పనిమనిషికి జబ్బుచేసి రాలేకపోయింది. నేను గంగాస్నానం చేయందివుండ లేను. మీకుకూడ యీ చెడుఅలవాటు వుందను కుంటా! సత్యేంద్రుడు మెల్లమెల్లగా అన్నాడు—అవునండీ! నిత్యం గంగాస్నానం చేయడానికి వస్తూనే వుంటా.

"మీరు వుండేదియెక్కడ ?"

"మాయిల్లు చోర్‌బాగాన్‌లోవుంది."

"మాయిల్లు జోడాసాంకూలోవుంది. మీరు నన్ను పథరియాఘాటుమూల తిరుగుడువరకు పంపించండి. మీరు పెద్దరోడ్డుమీదుగా వెళ్లవచ్చు."

"సరే."

చాలాసేపటికి వారికి యేవిధమైన సంభాషణ జరుగలేదు. చితపుర్ రోడ్డుదగ్గరకుచేరి ఆ స్త్రీ వెనుకకు తిరిగి నిలబడి మరల ఆవిధంగానేనవ్వి అంది—మా యిల్లు యిక్కడకు దగ్గరగానేవుంది. మీరు యిక వెళ్లండి. నమస్కారం.

సత్యేంద్రుడుకూడా నమస్కారంచేసి తలవంచుకుని వెళ్లిపోయాడు. ఆనాటి అతని మనస్సుయొక్క అవస్థనుగురించి వ్రాయడం అసంభవం. యౌవన కాలంలో పంచశరుని పుష్పబాణపు మొదటిదెబ్బ తిని సహించగలిగినవాడే ఆనాటి అతనిస్థితిని తెలుసుకో గలుగుతాడు. ఆ వున్మాదావస్థలోవున్న మనిషికి జల, స్థల, ఆకాశ, పాతాళాలు రంగురంగులుగా

కనుపిస్తూవుంటై. తన చైతన్యమంతా కోల్పోయి ప్రాణంలేని సూదంటురాయిముక్కరీతి కేవలం ఆ వొక్కవైపుకే వంగిపోవడానికి ప్రతిక్షణం తయారై వుంటాడు అతను.

మరుదినం ప్రాతఃకాలానలేచి చూచేసరికి చాలా పొద్దుయెక్కివుంది. అతనికి అత్యంతవ్యధకలిగింది. ఈ దినమంతా వ్యర్థంగాపోయిందని నిశ్చితరూపంగా తలంచాడు. నౌకరు యెదురుగా పోతూవుండడం చూచి కోపంతో అన్నాడు—వెధవ, యింతపొద్దు యెక్కినదాకా నన్ను లేపలేదు? పో, నీకు వొక రూపాయి జరిమానావేశా.

పాపం నౌకరుకు ప్రాణాలు పైనేపోయినై. వాడు యెక్కడివాడు అక్కడనే నిలబడిపోయాడు. సత్యేంద్రుడు రెండోగుడ్డ తీసుకోకుండానే కోపంతో యింటినుండి బయలుదేరినాడు.

వెలుపలికి రాగానే వొకబాడుగబండి మాట్లాడు కుని బండివానితో పథరియాఘాటుమీదుగా పోనివ్వ మనిచెప్పాడు. సత్యేంద్రుడు కన్నార్పకుండా రాస్తానేత్రాలు పరచినట్లు రెండువైపులామాస్తూ పోతున్నాడు. కాని గంగానదివొడ్డుకువచ్చి ఘాటు వైపుకు చూచినతర్వాత అతని దుఃఖమంతా అదృశ్య మైంది. దారిలోపడియున్న అమూల్యరత్నం దొరికి నట్లుగా భావించుకున్నాడు.

సత్యేంద్రుడు బండిలోనుండి దిగగానే ఆ రమణి చిరునవ్వునవ్వి చిరపరిచితురాలవలె అన్నది—ఈరోజు చాలా ఆలస్యంచేశారు? నేను మీకొరకు అరగంట నిలబడివున్నా, త్వరగా స్నానంచేయండి. ఈరోజు కూడ పనిమనిషిరాలేదు.

"ఒక నిమిషం ఆగండి." అంటూ సత్యేంద్రుడు నీళ్లలోకిదిగాడు. అతనియాత యెక్కడపోయిందో! యేదోఒకవిధంగా త్వరత్వరగా రెండుమునుగులుమునిగి వొడ్డుకుచేరి అన్నాడు—బండియెక్కడ?

రమణి అన్నది—నేను బాడుగ యిచ్చిపంపించా.

"మీరు బాడుగయిచ్చారా?"

"ఔను, యిచ్చానుపదండి" అంటూ ఆ భువన మోహిని వొకపర్యాయం నవ్వి ముందుకుసాగింది.

సత్యేంద్రుడు వొక్కపర్యాయంగా తనహృదయా న్నంతా అర్పించివేశాడు. లేనట్లైతే యెంత అమాయ కునికైనా వొకపర్యాయం 'అసలువిషయం యేమైవుం టుంది' అనే సందేహం తప్పకకలిగేది.

దారినపోతూపోతూనే ఆసుందరి అడిగింది—మీ యిల్లు యెక్కడనిచెప్పారు? చోర్ బాగాన్ లోనా?

సత్యేంద్రుడు అన్నాడు—ఔను.

"అక్కడ కేవలం దొంగలేవుంటారా?"

సత్యేంద్రుడు చకితుడై అడిగాడు—కారణం?

"మీరొక చోరాగ్రేసరచక్రవర్తులు అవడంచే."

ఈవిధంగాఅని మెడకొంచెం వంకరగాపెట్టి చూచి నవ్వుతూ మరల హంసగమనంతో నడువసాగింది. ఈ దినం నడుముమీదవున్న చెంబు కొంచెంపెద్దది. దానిలో వున్న గంగాజలం తపతపకొట్టుకుంటూ శబ్దంచేస్తూ వుంది. ఆశబ్దంద్వారా ఆనీరు "ఓఅంధయువకుడా, జాగ్రత్త! యిదంతామోసం" అని అన్నట్లుగావుంది. ఈవిధంగా ఆనీరు యెగురుతూ వ్యంగ్యం చేయ సాగింది.

మూలతిరుగుడువద్దకు వచ్చినతర్వాత సత్యేంద్రుడు సంకోచంతో అన్నాడు—బండిబాడుగ!

రమణి వెనుకకుతిరిగి నిలువబడి అస్ఫుటకోమల స్వరంతో చెప్పింది—ఒకవిధంగా అది మీరు యిచ్చి నట్లే!

సత్యేంద్రుడు దాన్ని తెలుసుకోలేక అడిగాడు— నేనిచ్చినట్లు యెట్లా?

"నావద్ద నా అనేది యేముంది నేనివ్వడానికి. నా అనేది యేమైనావుంటే అదంతా మొదటనే నీవు దొంగిలించివేశావు."

అట్లాచెప్పి ఆమె ముఖంతిప్పుకుంది. ఆమె వచ్చే నవ్వును ఆపుకుంటున్నదా అన్నట్లువుంది.

ఈ అభినయాన్ని సత్యేంద్రుడు చూడలేకపోయాడు. కాబట్టి ఈప్రచ్ఛన్నసంకేతం తీవ్రమైన మెరుపుతీగెవలె అతని సంశయజాలాన్ని తునాతునకలు చేసి హృదయాంతస్థలంవరకు ప్రకాశింపజేసింది. ఆ సమయానే, ఆ దారిలోనే, ఆ సుందరి అరుణపాదాల మీద పడదామనుకున్నాడు. కాని ఆతర్వాత వొక క్షణానికే అతను అత్యధికసిగ్గుచే నతమస్తకుడైనాడు. మరల శిరస్సుయెత్తి తన ప్రియురాలిముఖంవైపుకు చూడలేకపోయినాడు. యేమీ బదులుచెప్పక శిరస్సు వంచుకుని మెల్లమెల్లగా నడిచివెళ్లాడు.

ఆసుందరి చెప్పినప్రకారం పనిమనిషి 'ఫుట్ పాథ్' మీదనిలబడి దారిచూస్తూవుంది. ఆ పనిమనిషి ఆమె వద్దకువచ్చి అంది—పాపం, అయన్ని ఆవిధంగా ఆడించడం యెందుకు? రెండుడబ్బులురాలే వుపాయ మేదైనావుందా?

రమణి నవ్వుతూ అంది—అది నాకు తెలియదు. కాని ఆలాంటి తెలివితక్కువవాండ్లను ముక్కుకు తాడుబోసి యిష్టంవచ్చినట్లు ఆడించమంటే నాకు మహాసరదా.

దాసి కొద్దికాలంనవ్వి అంది—ఆ విధంగాకూడ మీరు చేయగలుగుతారు! అయనసంగతి మనకుతెలియదుకాని చూడడానికి వొక రాజకుమారుడులాగా కన్పించుతాడు. ఆ అసమానముఖాకృతికితోడు శరీరం చాయకూడ తోడయింది. మీయిద్దరికి యీడుజోడు బాగా సరిపోయింది. మీరు నిలబడి ఆయనతో మాట్లాడేసమయాన వొక గులాబీపుష్పాలజంట వికసించినమాదిరి కన్పిస్తూవుంటారు.

రమణి నవ్వుతూఅంది—సరే, పద అయన్నికాస్తా నీవు కాజేయకు.

దాసీ అమాత్రానికి వోడిపోయేది కాకపోవడంచే జవాబిచ్చింది — మీగొంతులో వూపిరివున్నంతవరకు ఆవస్తువును యింకొకరికి యివ్వలేరని గట్టిగా చెప్పగలుగుదును.

## ౪

అసంభవమైన విచిత్రాన్నిగూర్చి యెవరితో చెప్పవద్దన్నారు విద్వాంసులు. కారణం అజ్ఞానలు దానిని నమ్మకపోవడమే. ఆదినం యింటికివచ్చి 'టెనిసన్' పద్యాలుచదివాడు సత్యేంద్రుడు. 'డాన్ జువాన్' బెంగాలీలోనికి అనువాదంచేయడానికి కూర్చున్నాడు. తానుఅంత పెద్దవాడైనప్పటికీ 'పట్టపగలు, అదిగాక కలకత్తావంటి పట్టణపురాస్తామీదకు ఈఅద్భుతప్రేమ ప్రవాహం యేవిధంగా ప్రవహిస్తుంది. ఆప్రవాహపు అలలలోమునిగి యెంతవరకు అపాయంలేకుండా వెళ్లవచ్చు' అనే కించిత్తు సందేహమైనా అతనిమనస్సులో ప్రవేశించలేదు.

రెండుదినాల తర్వాత వాళ్లిద్దరూ స్నానంచేసి తిరిగివస్తున్నారు యింటికి. దారిలో ఆ అపరిచిత అకస్మాత్తుగా అన్నది—నిన్నటిరాత్రి నేను నాటకం చూడడానికివెళ్లా. పాపం సరళ దుఃఖంచూచి నా గుండె బద్దలైంది.

సత్యేంద్రుడు సరళానాటకం చూడకపోయినా స్వర్ణలతఅనేపుస్తకం అవశ్యంచదివాడు. అందుచే అతను మెల్లగాచెప్పాడు—ఔను, పాపం గొప్పకష్టం అనుభవించింది.

ఆమె పెద్దగానిట్టూర్చి అంది—ఉఫ్, ఆమె కష్టాన్ని వర్ణించడం అసంభవం. సరళ తనభర్తను అంత అమితంగా ప్రేమిస్తూవుంటే, ఆమె తోడుకోడలు ప్రేమించకపోవడానికి కారణం నీవు చెప్పగలుగుతావా?

సత్యేంద్రుడు సంక్షేపంగా జవాబిచ్చాడు—వారి వారి స్వభావం.

"నిజం, అసలుసంగతి అది. వివాహం అందరికీ అవుతుంది. కాని స్త్రీపురుషులు అందరూ వొకరి నొకరు సమానంగా ప్రేమించుకోగలుగుతారా? అది అసంభవం. ప్రేమఅంటే యేమిటో చచ్చేఅంతవరకు తెలియనిమనుష్యులు చాలామందివుంటారు. తెలుసుకునే శక్తికూడ వారిలోవుండదు. ఎదురుగా మంచిగీతాలు వేలకువేలు పాడినాగాని మనస్సువుంచి వినలేనివారు అనేకమందివుంటారు. యేవిషయంలోగూడ కోపం రాదు. చాలామందికి కోపగించనేలేరు. ప్రజలు వారిని పొగడుతారుగాని నేను వారిని నిందిస్తూవుంటా."

సత్యేంద్రుడు చిరునవ్వు నవ్వుతూ అడిగాడు— కారణం?

రమణి జవాబిచ్చింది—వారు వట్టి పనికిమాలిన వారు. పనికిమాలినతనంలో కొద్ది మంచిగుణం వుండ వచ్చు. కాని దోషం యెక్కువుగావుంటుంది. ఆ సరళబావ మోస్తరుగా. భార్యను యెన్ని అత్యాచారాలపాలుచేసినా ఆయనకు కోపంరాలేదు.

సత్యేంద్రు డేమీ మాట్లాడలేదు. ఆమె మరల చెప్ప నారంభించింది—అతని భార్య ప్రమద వొక పెనుభూతం! నేనేవుంటే ఆరాక్షసి గొంతు పిసికి పారవేసేదాన్ని.

సత్యేంద్రుడు నవ్వుతూ అన్నాడు—కాని నీవు యెట్లావుంటావు? ప్రమదఅనే పేరుగల నిజమైనస్త్రీ లేనేలేదు—అది కవీశ్వరుని కల్పనమాత్రం—

రమణి మధ్యలోనే అడ్డగించి అన్నది—అయితే కవి యిటువంటి కల్పన యెందుకు కల్పించాలి? మనుష్యులందరి అంతఃకరణలో భగవంతుడు వున్నాడని, ఆత్మవున్నదని చెపుతారు. కాని ప్రమదయొక్క అంతఃకరణలో భగవంతుడు వున్నట్లుగా ఆమె చరిత్రలో కన్పించదు. పెద్దకవీశ్వరుల పుస్తకాలు చదివినవారిని మంచి దారికిరప్పించి వొకరినొకరు ప్రేమించుకునేలాగు చేయాలి. ఆవిధంగాకాక ఆ పుస్తకం వొకరిమీద వొకరికి ద్వేషం వుత్పన్నమయ్యేలాగునచేసి జనుల అంతఃకరణములో భగవంతుని వాసస్థానంవుందనే నమ్మకాన్ని లేకుండా చేసింది.

సత్యేంద్రుడు విస్మితుడై ఆమె ముఖంవైపు చూస్తూ అన్నాడు—నీవు పుస్తకాలు బాగా చదివి నావనుకుంటా?

రమణి జవాబిచ్చింది—ఇంగ్లీషు రాదు, కాని బెంగాలీలో అచ్చయ్యే పుస్తకాలన్నీ చదువుతూ వుంటా. అప్పుడప్పుడు రాత్రి అంతా చదవడంలోనే గడచిపోతూవుంటుంది. ఇదే పెద్దరోడ్డు. పద, మా యింటిలోవున్న పుస్తకాలన్నీ చూపిస్తా.

సత్యేంద్రుడు వులిక్కిపడి అడిగాడు—మీ యింటి వద్దనా?

ఆమె అంది—ఔను. మాయింటివద్దనే. పద, నీవు తప్పక రావలసివుంటుంది.

ఒక్కపర్యాయంగా సత్యేంద్రుని ముఖం కాంతి విహీనమైంది. భయపడుతూ అన్నాడు—రాను, రాను. అమ్మయ్యో—

"పరవాలేదు పద."

"రాను, ఈరోజు కాదు—ఈరోజు రాలేను."

ఈవిధంగా చెప్పి వడికేపాదాలతో త్వరగా వెళ్లి పోయాడు. ఈదినం అతనికి ఈ అపరిచితప్రియురాలి యందు శ్రద్ధకలిగింది, ఆభారంతో అతని హృదయం పొంగిపోయింది. (సశేషము)

అనువాదకుడు:
ఎస్. వెంకటసుబ్బయ్య చౌదరి.

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టంబరు |
| డిసంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసంబరు |
| సెప్టంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 7 | 6 | అక్టోబరు |

# వింతలు—విశేషాలు

## పిల్లలు పుట్టే మంత్రాలు

జోహనస్‌బర్గులో అమాయికుడైన ఒక రైతు గుండెలుకొట్టుకుంటూ గవర్నమెంటు ఆసుపత్రికి పరుగెత్తుకొనిపోయి తనభార్యకు పిల్లలుపుట్టే మంత్రాలు పెట్టిరని గోలపెట్టెను. జరిగినదేమియని అడుగగా వెనుకటి శుక్రవారము రోజున తనభార్య ఒకకొడుకునికని మరుసటిదినమున పనిలోనికి వెళ్లెను. తిరిగి సోమవారంనాడు ఒక ఆడపిల్లను కనెను. తిరిగి గురువారంనాడు మరొకమగశిశువును కనెను. ఆశిశువు చనిపోయెనని చెప్పెను. డాక్టరు అతనిని ఓదార్చి అది మంత్రముకాదని, కొంతకొంత ఆలస్యముతో కవలపిల్లలు పుట్టినట్లె ముగ్గురు పిల్లలుపుట్టిరని చెప్పిపంపెను.

## బాకీ పరిష్కారము—222 సంవత్సరములలో

సింగపూరులో ఒక చీనావర్తకుడు దివాలాతీసెను. అతను బాకీదార్లకు మొత్తము 1000 పౌనులు ఇవ్వవలసియుండెను. అతనికిప్పుడు నెలకు 35 షిల్లింగు లాదాయము వచ్చుచుండెను. అందుచేత నెలకు $7\frac{1}{2}$ షిల్లింగులవంతున బాకీదార్లకు చెల్లించగలనని కోర్టులో చెప్పెనట. ఆప్రకారము 1000 పౌనులను తీర్చుటకు 222 సంవత్సరములు పట్టును. తుదకెట్లు పరిష్కారమగునో తెలియదు.

## మాట్లాడు స్టౌ

ఒన్టారియోలో ఒక వ్యవసాయదారుడు వంటచేసుకొనుట కొకస్టౌ కొనెను. అది వెలిగించినప్పుడు మాట్లాడుచుండెనట. అందరును చూచి ఆశ్చర్యపడుచుండిరి. ఇంటిలో తీగలేమియును లేకపోయినను రేడియోలో వినబడునట్లు అంతయు వినబడుచుండెను. వెనుక ఇట్లే ఒకపరిశోధకుడు నీటికుళాయిని త్రిప్పగనే సంగీతము వినబడెనట.

## భర్తకు చేతగాకపోతే

లండనులో భర్తలు ఇండ్లపన్నులిచ్చుకొనలేక పోయినప్పుడు భార్యలు కోర్టుకువెళ్లి చెప్పుకొనేవాడుక గలదట. జడ్జీలకు జాలిపుట్టునని చిన్నబిడ్డలను అడ్డాలలో వేసుకొని వెళ్లెదరు.

ఒకయిల్లాలు ఒకబిడ్డను పొత్తిళ్లలోనుంచి తీసుకొనివెళ్లగా జడ్జీపరకాయించిచూచి "ఏమమ్మా ఈదినము ప్రొద్దున ఈబిడ్డనే ఇంకొకఆమె తీసుకొనివచ్చినదే" అని అనెను. ఆమె పాపం వలవలఏడ్చి చేసినతప్పు ఒప్పుకొనెను. ఇట్లు చాలమంది చేయుచున్నారని ఆమె చెప్పెను.

## 5,00,000 కన్యలు తయారు

యుగొస్లోవియాలో ఒక యువకుడు వధువుకావలయునని ప్రకటించెను. వధువు 25 సంవత్సరములకు మించకూడదు. 5 అడుగుల 5 అంగుళముల పొడుగునకు తగ్గకూడదు. అందముగను, ఆరోగ్యముగను శాంతస్వభావముగలిగి యుండవలెను. బీదరాలైనను, ఎక్కువ చదువకపోయినను పైనుదహరించినట్లుండవలెను. ఆతడు ప్రకటించినప్రకారము సరిపోవువారు యుగస్లోవియాలో 5,00,000 మంది కన్యలు గలరట. ఆతడెవరిని పెండ్లాడునో ?




## రష్యాస్త్రీల అపూర్వసౌకర్యము

రష్యాలో గర్భిణీస్త్రీలకు ప్రసవవేదన లేకుండా సుఖముగనుండుటకు క్రొత్తసాధనము కనిపెట్టినారు. ఈవిధానము కనుగొన్నది మొదలు సోవియటురష్యాలోని స్త్రీలందరును నవీనశాస్త్రబద్ధమైన ఈ విధానఫలిత మనుభవించుటకు సమానహక్కులు గలవు. ఒక మాస్కోనగరమున 90 వేలమంది స్త్రీ లీ నూతనవిధానముతో పురుడుపోసుకొనిరి. వెన్నెముకచుట్టును ఎనాస్థటిక్ ఇంజక్షను లిచ్చుటవలన కాన్పుకు ముందు వచ్చు నొప్పులు రావు. తల్లికిగాని పిల్లకుగాని ఏవిధమైన ప్రమాదమును కలుగదు. ఈ నూతన విధానము బ్రిటనులోగూడ ఆచరణలోనుంచెదరని తెలియుచున్నది.

* * * *

## ధ్వని

నిరంతరము ధ్వని వినుటవలన జీవించు కాలపరిమితి తగ్గునని డాక్టరు ఛార్సుగారు చెప్పుచున్నారు. మిల్లులలోను, ముద్రాలయములలోను పనిచేయువారును, నిరంతరము బండ్లనుతోలువారును చాలభాగము గుండె జబ్బుతో బాధపడుదురు. ధ్వని ఎక్కువ అలసటను కలుగజేసి హుషారు తగ్గించును.

కాని ధ్వనివల్లనే అనేకరోగములు నివారణగుచున్నవి. ఇచ్చట ధ్వని ఇంపుగనుండవలెను. సంగీతము వినుటవల్ల ఆయువు వృద్ధియగును. అందువలననే చికిత్సాలయములలో రోగులకు గ్రామఫోనులవల్ల సంగీతమును వినిపించి కొన్నిరోగములు పోగొట్టెదరు. కొన్ని పక్షవాతరోగములు ధ్వనివలన కుదురునని డాక్టరు లెంకుగారు చెప్పుచున్నారు. చర్మవ్యాధులుకూడ కుదురునట.

ధ్వనిలో నధికమగుశక్తి గలదు. ఆ శక్తివలన కోడిగ్రుడ్డును ఉడికించిరని తెలియుచున్నది. 100,000 మంది కలకల ధ్వనులతోనిండిన హాలులో నీరునీరు మరుగుట కవసరమగు శక్తి గలిగెనట. పెద్దపెద్ద ధ్వనుల నిచ్చు రేడియోలవల్ల అన్నముకూడ వండుకొనవచ్చునట.

* * * *

## ఇండియాలో దిగంబరసిద్ధాంతము

"జర్మనీలోను యింగ్లాండులోను ఉండు నగ్నమతసంస్థలను బాగుగ పరిశీలించి మన దేశమునగూడ అట్టి సంస్థలుండుట ఆవసరమని గ్రహించి జర్మనీపద్ధతిని ఒకసంస్థను స్థాపింప సమకట్టితిమి" అని యం. యస్. అన్సారీగారు ప్రకటించిరి. బీహారులో హిందూస్థానీ నగ్నవిహారము అనుపేర నొకసంస్థ నూతనముగ నేర్పడినది. ఆసంస్థకు అన్సారీగారు కార్యదర్శి. చాలకాలమునుండి యిట్టిసంస్థ స్థాపింపవలెనని యుద్దేశించిరి. శారీరమానసికారోగ్యమును చేకూర్చుట కీవిధానమును ఇప్పుడు అనేక యూరోపియను దేశము లనుసరించుచున్నవి. సోనునదికి సమీపమున నొక పెద్దదీవిలో మిక్కిలి అనుకూలమైన ప్రదేశమందు వారీ కాలనీ నేర్పరచిరి. "అచట నదీతీరమున విశాలమగు నిసుకబయలు కలదు. ఆ నదిలోని నీరుగూడ మిక్కిలి ఆరోగ్యమైన"దని అన్సారీగారు తెలిపిరి.

## అందముగా నుండుటెట్లు?

అందము చర్మసంబంధమైనది కాదు. అది మనసునకు సంబంధించినది. "కష్టములను గమనించకుండ చిరునవ్వుతోనుండుట, ప్రతిప్రాణియెడల దయచూపించుట, ప్రతివారితోడను మర్యాదగా సంచరించుట, ఆదర్శప్రాయమైన మాతృత్వము ఇవే అందమునకు తావులు" అని రాజా రామసింగు నుడివెను. ఈకాలమున చిన్నవయసునందే స్త్రీపురుషులకు వృద్ధాప్యసూచనలు పొడగట్టుచున్నవి. అట్టివారు యోగాభ్యాసమువలన సౌఖ్యమయమైన జీవితమును గడపగలరని రామసింగు అభిప్రాయము. అతడు చాల అందమైనవాడు. ముఖము ఎప్పుడును కలకలలాడుచుండును. దీనంతకును యోగాభ్యాసమే కారణము. ఒకసారి ముప్పదేండ్ల స్త్రీ రామసింగువద్దకు వెళ్లి తనకు వృద్ధాప్యసూచనలు పొడసూపెనని చెప్పెనట. వెంటనే నాయెకు తన సలహానిచ్చెను. ఇప్పుడామె పదహారేండ్ల స్త్రీవలె యౌవనముతోనున్నదట. మరొకచిత్రమేమన డెబ్బదేండ్లస్త్రీ యోగాభ్యాసమువలన ముప్పదేండ్ల ప్రౌఢవలె సంచరించుచున్నదట.

* * * *

## నూలుపోగుపై స్వరాజ్య మాధారపడియున్నది

"నేను క్రొత్తవిషయము లేవియు చెప్పుటలేదు. నాది ప్రాతకథయే. క్రొత్తమాటలలోమాత్రము నేను దానిని చెప్పుచున్నాను. ఖద్దరునందు నావిశ్వాస మింకను అచంచలముగానున్నది. స్వరాజ్యము నూలుపోగుపై నింకను ఆధారపడియున్నదని యిప్పుడుగూడ నేను చెప్పుచున్నాను."

"తిరిగి మనము చెరసాలలకు వెళ్లవలసివచ్చునేమో! అట్లు వెళ్లవలసివచ్చుచో మన పాపపరిహారార్థమై వెళ్లవలసియుండును. మనమందరము దౌర్జన్యవిరహితులముగానున్నాము. మనమందరము ఖద్దరు ధరించుచున్నామా?"

"నేను చేయవలసినదని కోరిన చిన్నపనులు మీరు చేయకపోయినచో మీ పాపపరిహారార్థమై మీరు చెరసాలలకు వెళ్లవలసివచ్చును. ఒక్కొక్కరు ఒక్కొక్క రాయిపట్టుకొని భారతదేశముననున్న 70 వేల ఆంగ్లేయులను మీరు చంపవచ్చును. కాని మీ రిట్లుజేసినచో భగవంతుడు సంతోషించునా? నేను సత్యాగ్రహిని. చెరసాలల కేగుటకుపూర్వము నాకెంత ఉత్సాహముండునో యిప్పుడుగూడ నా కట్టి ఉత్సాహమే కలదు."

"మన యువకులు, మహిళామణులు చెరసాలల కేగెదరు. ముదుసలియైన మీరుకూడ చెరసాలకు వెళ్లవలెనా?" యని మీ రడుగుదురని నే నెరుంగుదును. మీరు సెగోన్‌గ్రామములో హాయిగానుండుడని మీ రనవచ్చును. కాని ఒక్కవిషయము చెప్పుదు. నే నెందుకు చెరసాలకు పోవలెను? ఏసమస్యపై యిప్పుడు చెరసాలకు పోవలసియున్నది? జవహర్లాల్‌గారు సంతోషపూర్వకముగా నురికంబము నెక్కును. ఆయనపక్షమున నే నీమాట చెప్పుచున్నాను. కాని యేసమస్య నాధారముచేసికొని ఆయన ఉరికంబము నెక్కవలెను? నేను కోరిన చిన్నపనులు మీరు చేసినచో శాసనసభలలోనికి మీరు పోనవసరములేదు. రాజప్రతినిధి యెదుటగాని బ్రిటిషుప్రజల యెదుటగాని మీరు ప్రాధేయపడ నవసరములేదు. ఈ రాట్నచక్రమును మనము మరవకుందుముగాక! నాసందేశము గ్రామములకు వ్యాపింపజేసినచో నేడు లిన్‌లిత్గో ప్రభువు కాంగ్రెసు యెదుటికివచ్చి, "నేను పొరపాటుచేసితిని. మీరు దౌర్జన్యవిప్లవవాదులని నే ననుకొంటిని.

మమ్ముల నీదేశములో నుండనిచ్చిన నుండెదము. లేనిచో వెళ్లిపోయెదము" అని మనవిచేసుకొనును. అప్పుడు మన మేమనెదము? "మేము చెప్పిన షరతులపై మీ రీదేశమున నుండవచ్చును. అప్పుడు మనము పాలుచక్కెరవలె కలసియుండెదము. మాకు ఎమిగ్రేషను ఆర్డినెన్సులు అవసరములేదు. మావద్ద నిదివరకే యున్న కమ్మనిపాలలో మీరు చక్కెర వేయవచ్చును" అని యనెదము. ఇదియే నా యాశయము. నా సందేశమును మీరు గ్రామములకు గొంపోయి పరిశ్రమల నభివృద్ధిచేయుచో నా యాశయము తప్పక నెరవేరును."

—మహాత్మాగాంధి.

## ప్రేమలేనివివాహము మృగకృత్యము

ఇంగ్లాండునందలి మతగురువులు తనవివాహవిషయమునుగురించి గావించిన విమర్శనలకు ప్రత్యుత్తరముగ విండ్సర్ ప్రభువుగారు (ఎనిమిదవఎడ్వర్డు) తనకు అతిధిగనున్న రాత్ చయిల్డు ప్రభ్వితో ఈక్రిందిఅభిప్రాయమును తెలిపిరని ఒక పత్రికాప్రత్యేకవిలేఖరి వ్రాయుచున్నాడు.

వర్తమానభావికాలముల వారెల్లరు, నేను రాజ్యమును వదలుకొనుటయందలి విశేషమును గుర్తెరిగి నన్ను ప్రశంసించెదరని నాకు విశ్వాసమున్నది. అత్యల్పకాలము రాజ్యపరిపాలనమొనర్చి వివాహవిషయమై యేర్పడిన భిన్నాభిప్రాయములకు రాజ్యమును వదలుకొనినందులకు భావికాలమువారు నన్ను గౌరవింపగలరు. ప్రేమలేనివివాహము నీతిబాహ్యమైనది. మానవప్రకృతికి విరుద్ధమైనది. వ్యక్తికేగాక, రాజవంశమునకుకూడ ఉపద్రవకరమైనది. వ్యక్తిత్వము, ఆత్మబలము గలిగిన మానవుడు దేనినైనను సహించునుగాని, ప్రేమలేని వివాహమును సహింపజాలడు. కేవలము వ్యవహారలాభముకొరకు వివాహముచేసికొనునట్టి నికృష్టమైన కార్యము మరొకటియుండదు. రాజకీయకారణముల ననుసరించి యిట్టి వివాహము జరిగినచో పశుశాలల యందు జరుగుచున్న పద్ధతులను అనుసరించుట యగును. మత గురువులు కొందరు నన్నుగురించి విమర్శనలను గావించుచున్నారని నాకు తెలియుచున్నది. యిట్టి విమర్శనలు విమర్శకులకే అపకీర్తిని, అగౌరవమును కలుగచేయును. అంతేకాక యిట్టి మతగురువుల ప్రవర్తనవల్ల మతసంస్థలకే అపఖ్యాతి వాటిల్లెను. ప్రేమ లేనప్పుడు వివాహసంబంధములను తెంచుకొనుట సహజమగుకార్యము. ప్రేమలేకున్నను నీతికిబద్ధులై సంసార మును గడుపు దంపతులు యెడబాయుటయె ఉచితము. సామాన్యప్రజలవలెనే హైతరగతులకు చేరినవారు కూడ అన్నివిషయములందును దాపరికము, కృత్రిమబుద్ధి లేక న్యాయమగుకార్యమును ధైర్యముతో గావించుట శ్రేష్ఠమగు పద్ధతి. బూటకము, డాంబికముకన్న యిదియే యెక్కువలాభకరము.

*          *          *          *

## యూరపుఖండమున జన్మించిన ప్రథమాంధ్రశిశువు వంగల శివరాముగారి శిశువుకాదు

"మీ గృహలక్ష్మియొక్క జనవరిసంచికలో "వింతలు-విశేషములు" యను వ్యాసములో ఐరోపాఖండ ములో జెనీవానగరమునందు వంగల శివరాముగారికి క్రిందటినెల 19-వ తేదీన ఆడశిశువు జన్మించినదనియు, ఈశిశువే ఐరోపాఖండమున జన్మించిన ప్రథమాంధ్రశిశువనియు ప్రకటించియున్నారు. ఇది వాస్తవముకాదు.

## పుష్పచయము

ప్రస్తుతము బందరుపురమున కృష్ణాజిల్లా మెడికల్ ఆఫీసరుగాయున్న లెఫ్టినెంటుకలనల్ కోతీ వెంకట రమణారావు ఐ.యం.యస్ గారు 1930వ సంవత్సరములో సంసారసమేతముగా యింగ్లాండునకు వెళ్లినప్పుడు వారికి 1930వ సంవత్సరం ఆగస్టు 17వ తేది కృష్ణాష్టమినాడు లండనునగరమున చారింగుక్రాసు ఆసుపత్రిలో ఆడశిశువు జన్మించినది. ఆసమార్తెకు శాంతాదేవియని నామకరణముచేసిరి. ఈశాంతాదేవియే ఇంగ్లాండుదేశపు పౌరసత్వపుహక్కును బడసిన ప్రథమాంధ్రశిశువయియున్నదేగాని వంగల శివరాముగారి శిశువుకాదు."

—మజుందారు రామారావు.

* * * *

భారతీయులకు తేయాకు క్రొత్తదిగాదు

"ఆస్పత్రుల్లోను, యిండ్లలోను, విందుల్లోను, యెక్కడబడితే అక్కడ అశేషజనముగూడ టీ త్రాగుతునే వుంటారు. దీన్నిబట్టి చూస్తే, టీ త్రాగడంవల్ల మనస్సుకు ఉత్సాహం తప్పక యేర్పడుతుందనీ కల్లు సారాయి మొదలయిన మద్యపానాదులవలె మత్తువుండదనీ స్పష్టముగా తెలుస్తున్నది."

అమెరికన్ డాక్టరు డేనియల్ ఆర్. హాడ్జిడన్ "బాగా తయారైన టీ త్రాగేటట్టయితే మంచి రుచిగా వుంటుంది. దానికయ్యే ఖర్చుగూడ తక్కువ. మితంగా త్రాగుతుంటే, ఒంటికి మంచిది. హితకరంగా వుండడమే కాకుండ ఆరోగ్యదాయకంకూడ. దేహానికి ఉత్తేజం కలిగిస్తుంది బడలిక, ఆయాసం, అలసట వగైరాలను తగ్గిస్తుంది. పెద్దవాళ్లు తరచుగా త్రాగేటట్టయితే వాళ్లజీర్ణకోశం బాగుపడుతుంది" అన్నాడు.

డాక్టర్ లూయీ లెమెరీ అనేదొరగారు టీ గురించి తెలిపిన అతని అభిప్రాయం ఇది.

"టీ మంచి హితకరంగా వుంటుంది. దానివల్ల కలిగేనష్టంకంటె లాభమే హెచ్చు. కొంతమంది రోజుకు పది పన్నెండు కప్పుల టీ సైతం మంచినీళ్ల ప్రాయంగా త్రాగుతుంటారు. వాళ్లకేమి జబ్బుగాని హానిగాని చేయడంలేదు. మెదడు, నరాలు సరిగా లేనప్పుడు టీ బాగా పనిచేస్తుంది. మనస్సుకు ఉత్సాహం కలుగజేస్తుంది. ఈ వేళ ఆవేళ అనక యెప్పుడు త్రాగినా, ఎంత వయస్సుగల వాళ్లకయినా ప్రతితత్వానికి టీ సరిపడుతుంది."

అనాదినుంచి గూడ హిందూవైద్య శాస్త్రానికి గొప్ప గౌరవంవుంది. "ఆయుర్వేద విజ్ఞానం" అనే గ్రంథంలో టీ గురించి వ్రాసిన విషయాలనుబట్టి హైందవుల తత్వానికి టీ శ్రేష్ఠమైందని తెలుస్తుంది.

"దాన్ని సంస్కృతంలో శ్లేష్మారి, గిరిభిత్, శ్యాంపర్ణి, అతంద్రి అని పిలుస్తారు. టీ త్రాగితే దగ్గును పోగొడుతుంది. చెమట బాగా పట్టిస్తుంది. గొంతులోని కఫ్లెను తెగకొడుతుంది. జ్వరాన్ని తగ్గిస్తుంది. ఆకలిని వృద్ధి చేస్తుంది. ఆయాసం, బడలిక, బలహీనత మొదలైన వాటిని తీసివేస్తుంది."

తే. అగ్రవర్తియై శ్రీరాముఁ డరుగుచుండె, నువిద తనుమధ్య మధ్యమం దుండెసీత,
మహిత కోదండదండ సంభరణహస్తుఁ డోలివెన్నంటె లక్ష్మణుఁ డొప్పుప్రేమ.

మానిని. సారముతో నవసారసకైరవ సౌరభవాసిత భాసితకా
సారములుం దటినీతటిసైకత సంచరదంచిత చక్రయుగీ
వారములున్ గిరిసుందరకందర పాతసుపూత ఝరీలహరీ
పూరములున్ సుమమంజులకుంజక పుంజితగుంజ దళీంద్రములున్.

కం. భీకరసూకర వృకఋక్ష దర్వీకర తాపరకరాగ విస్మృత హిమవ
చ్ఛీకర కరికేసరి నికరాకర గహ్వర వితాన మాదటఁగనుచున్.

శ్రీ మదాంధ్ర వాల్మీకిరామాయణము.

# ఆంధ్ర రమణీమణులు

ఇంకను ఎంతో అభివృద్ధిపొందవలసిన మాట నిజమే. ఆంధ్రదేశమభ్యున్నతిని జెంద వలసిదియు సత్యమే. అంత మాత్రమున ప్రకృతపు టభివృద్ధి గనపడకపోదు. గత కాలముతో, ప్రక్కరాష్ట్రములతో పోల్చి చూతము. కాలానుగుణ్యముగ ఆంధ్రులభి వృద్ధి - అన్ని శాఖలందును - గాంచుచునే యున్నారు. అభివృద్ధిని గాంక్షించి రాత్రిం బవల్లు కృషి చేయు స్త్రీ పురుషుల ప్రయత్నమే దీనికి కారణము. ఆవిధముగ దేశాభివృద్ధికి జాత్యభివృద్ధికి పాటుబడు పురుషులను గూర్చి మేమిపుడిట ప్రస్తావింప దలంచుకొన లేదు. స్త్రీలను గురించి మాత్రమే.

ప్రకృతమట్లు పాటుబడుచున్న రమణీమణులు పెక్కురు. వారిపద్ధతు లొకటిగాక పోవచ్చును. పథములు భేదింపవచ్చును. వారందు కుపయోగించు సామగ్రి వేరుగానుండ వచ్చును— సాంఘికాభివృద్ధికవి అత్యవసరములనుమాట మరువకూడదు— కాని గమ్యస్థానమొక్కటియే. ఇపుడు ఆంధ్రాభ్యుదయముగోరి నిరంతరము కృషిసల్పు వారిలో కలముచేబట్టి సంఘములోని కల్మషముల ఖండించి, సహృదయుల సానుభూతిని సంస్కారములపై బరపు రమణీమణులు గలరు. పాండిత్యమునుబడసి, విజ్ఞానమును విరివిగ గడించి విద్యావిహీనులకు సాదర పూర్వకముగ దాని నొసగు ప్రతిభాశాలు రున్నారు.సాంఘికోన్నతికి అడ్డపడు అలవాటులను అనాచారములను తుద ముట్టింప బట్టుబట్టి చట్టముల మూలముననైన సంఘమును సరిదిద్ద బూను సాహసికులుగలరు. అభివృద్ధిని గాంక్షించుచు ముందంజ వేయ వెఱచి

యున్నవారికి ధైర్యముగొలుప తామే నిష్ప్రయోజనమగు నిర్బంధముల ద్రెంపి యాదర్శప్రాయులైన వారునుగలరు. వివిధకష్టముల బడి విద్యాలయములస్థాపించి యావజ్జీవము వానిని నిర్వహించుచు విద్యావ్యాప్తిని గావించు విదుషీమణులు గలరు. అట్టి సంస్థల ప్రోత్సహించువారును గలరు. మాతృదేశదాస్య శృంఖలమును ద్రుంప ఆత్మత్యాగులై స్వాతంత్ర్యసమరమున కురికి అద్భుతమైన సహనము సాహసముజూపి ఆంధ్రమాత హృదయమున నగ్రస్థానము సంపాదించుకున్న స్త్రీ రత్నములు గలరు. రాజకీయములందు పాల్గొని పరిపాలన బాగుచేయ పాటుబడువారును గలరు. విద్యాగంధమిసుమంతయు లేకున్నను, మానవసేవయే మాధవసేవయనుట నెఱింగి బీదసాదల కెంతయోసాయమొనర్చుచు, సత్రముల గట్టించి బావులు త్రవ్వించి తీరని సాయ మొనర్చువారునుగలరు. ఇంకను నెన్నియో విధముల పాటుబడువారును లేకపోలేదు.

వీరందఱిని ఆంధ్రులందఱు నెఱుగకపో వచ్చును. ఆయా ప్రాంతములవారు మాత్రము అట్టి అభ్యుదయ కృషికుల నెఱిగియుండ వచ్చును. ఇదే విదేశములందైనచో, ఆ రమణీమణులగురించి దేశమంతయు నెఱింగి యుండును. అట్టివారిని తెలుసుకొనుటకు వారు కావలసినన్ని సదుపాయములు కలిగింతురు. అభ్యుదయ కాంక్షితులై యుండవలసినది విధిగాని దానినిగూర్చి యందఱు నెఱుగవలసిన పనియేమి అనుప్రశ్న జనింపకూడదు, జనించినను నిలువదు; వారికృషిని సేవనుగుర్తించిన ఇతరులు వారి నాదర్శముగా నుంచుకొందురు. అది వారివలె పాటుబడజేయ నుత్సహించును. అంతియ కాదు. సంఘమునకు దేశమునకు ఇంతటి మేలొనర్చిన వ్యక్తులును, వారికృషియు కాలగర్భమున క్రమముగా నణగిపోవలసినదేనా? వారిచరిత్రలు స్థిరముగానుండివారికృషి ఇతరులకు మార్గదర్శకమైయుండవలసిన యావశ్యకత లేదా? ఇట్టి రమణీమణుల చరిత్రలెన్నో కాలగర్భమున గలసిపోయినవి. ఉపేక్షించిన ఇపుడును అంతియే.

మేమిపుడు ఆంధ్రాభ్యుదయమున కేవిధముగనైనను పాటుబడుచున్న ఆంధ్రస్త్రీ రత్నముల చరిత్రలు వారి ఛాయాచిత్రములతోబాటు (Who is who in Andhra Desa) ప్రకటింప సంకల్పించితిమి. దానిలో చేరదగిన వారి యోగ్యతయొక్కటే సేవ— దేశసేవ, జాతిసేవ, సంఘసేవ. వారు పండితులుగానిండు, పామరులుగానిండు, ధనికులుగానిండు, దరిద్రులుగానిండు. వారికందు స్థానముండును.

కావున గృహలక్ష్మిపాఠకులు, గృహలక్ష్మల యభివృద్ధినిగోరు స్త్రీపురుషులెల్లరు అట్టివారి చరిత్రలను సేకరించి, క్లుప్తముగ, వారి ఛాయాచిత్రములతోబాటు పంప ప్రార్థించుచున్నాము. వారి చరిత్రలందు వారి కృషికి ప్రాధాన్యమియ్యవలెను. అతిశయోక్తి వాసనకూడ లేకుండవలెను. ఆంధ్రులందఱు మా యుద్యమునకు తోడ్పడి ఆంధ్రరత్నదీప్తిని ప్రజ్వలింపజేయుదురని ఆశించుచున్నాము.

# విచిత్రవ్యాఖ్య

"అట్లైన ప్రతిబాలుడును సన్యాసియగును. లేకున్న అబలయగును. అహింసాపద్ధతులతో పోరాడుటకుకూడ పౌరుషము, manliness, కావలసియున్నది. మనబాలురకు పౌరుషము చాల కొద్దిగనున్నది. ఉపాధ్యాయినులు వారిశిక్షకులో నైనచో నున్నదిపోవును."

శ్రీయుత వార్ధా గారు విద్యాశాఖమంత్రిగారికి కార్యదర్శి. వారు ఇటీవలనే దక్షిణదేశములో సంచారము ముగించిరి. వారొకచో Co-education నుగూర్చి, ఒకేపాఠశాలలో స్త్రీపురుషులను నియమించుటనుగూర్చి ఉపన్యసించిరి. వారిఅభిప్రాయముల సారాంశమిది.

మాధ్యమిక పాఠశాలలలోని బాలబాలికలకు ప్రత్యేకపాఠశాలలు ప్రత్యేక విద్యావిధానము అవసరము. వానియందు ఉపాధ్యాయినుల నియమింపవచ్చును. కాని ఒకటి. బాలురందఱు ఆడంగులుగా, effiminateగా, తయారు గావలసియున్న ఉపాధ్యాయినులను నియమింపనగును. బాలురు ధీరులు గావలసినచో ఉపాధ్యాయులనే నియమింపవలయును. 'నా కుమారుడు కాన్వెంటుస్కూలులో ఉపాధ్యాయినులచే శిక్షపొందినాడు. ధీరత్వమంతయు గోల్పోయినాడు. అందుచే నిపుడు వానిని ఉపాధ్యాయులక్రింద నుంచితిని.'

అపుడు ఆసభలో నొకరులేచి 'ప్రాథమికపాఠశాలలలో ఉపాధ్యాయినులే యుండవలెను. ఇది మహాత్ముని ఆశయము' అనిరి.

వార్ధాగారు దానికి ప్రత్యుత్తరమిచ్చిరి. "అట్లైన ప్రతిబాలుడును సన్యాసియగును. లేకున్న అబల- భీరువు - అగును. అహింసాపద్ధతులతో పోరాడుటకుకూడ పౌరుషము, manliness, కావలసియున్నది. మన బాలురకు అది కొద్దిగనున్నది. ఉపాధ్యాయినులు వారిశిక్షకులైన ఉన్నదిపోవును."

'అయితేలు' 'కానీలు' చాలా అపాయకరమైనవని అంటారు. వార్ధాగారి అభిప్రాయాలలో మొదటి పేరాలోని విషయముల నడక అందులోవచ్చు 'కాని' వఱకు సరిగానున్నది. తరువాత మనమే బండిని ఆపవలసివచ్చినది. కారణములు కావలసినన్ని.

నెపోలియనువంటి వీరాధివీరులున్నారు. శివాజివంటి రాజసింహులున్నారు. మహాత్ములవంటి లోకైకపూజ్యులున్నారు. వీరందఱు ఏకకంఠమున అన్నదిది. "బాల్యమున మాతృదేవత శిక్షణముచేతనే మే మీయున్నతికి రాగలిగితిమి." అంటే బాల్యమునందు మాతలు - మాతృస్వరూపులగు మానినులు- శిక్షనిచ్చుటవలనే వారు భావిజీవితములందు ప్రసిద్ధులయిరి. కాని ఇంతవఱకు వార్ధావలె వచించి రికార్డు స్థాపించినవారులేరు.

భావిపౌరులుగా నుండదగిన స్త్రీలు బాలురకు నేర్పదగిన విషయము లెఱుగుదురు. బాలురును అల్లరిగుణములనువీడి సదభ్యాసముల నేర్చుకొనెదరు. వినయవిధేయతలు

కలిగియుందురు, అంతమాత్రమున వారు ఆడంగులుకారు. అబలలుగారు. సన్యాసులు ముమ్మాటికిగారు. పౌరుషమనగా పెరిగిపెద్ద యయిన తరువాత నన్యాయమును, నసత్యమును ధైర్యసాహసములతో నెదుర్కొనుట యగును. ఇది బాల్యముననే వ్యక్తీకరింప బడుట కవకాశము లరుదు. ఉపాధ్యాయులుగాని ఉపాధ్యాయినులుగాని పౌరుషమును పోగొట్టుటకు తెచ్చిపెట్టుటకు అశక్తులైయున్నారు. కారణము స్పష్టము. వారిరువురు నిరుపయోగ విద్యావిధానములతో నుపాధ్యాయవర్గమును తండోపతండముగా తయారుచేయుచున్న బోధనాభ్యసన పాఠశాల కర్మాగారములందలి సామగ్రులే.

సరియే. ఆ విషయమటుండనిండు. మాతృశిక్షణలేని బాలుడు భావి జీవితములో పేరు ప్రఖ్యాతులు పొందజాలడని - పరిపూర్ణ పౌరుషయుక్తుడు కాడని - మహాత్ములు గుర్తించియున్నారు. మాతృమూర్తియగు స్త్రీ విద్యావిషయమున వెనుకబడి యుండుటచేతనే భారతజాతి బానిసత్వమున బడి ప్రగ్గుచున్నదని వాకొనుచున్నారు. పాశ్చాత్యప్రపంచము విద్యావ్యాప్తియందు విరివి గాంచినది. విజ్ఞానమున పరిణితి సంపాదించుకున్నది. ఈ విషయమునందు వారి యభిప్రాయమెట్టిది? చూడుడు. బాలబాలకుల స్వభావమును అతిసులభముగ గుర్తించువారు స్త్రీలు. వారికి అక్కరతో ఓపికతో నన్నిసంగతులు బోధించువారు స్త్రీలు. ప్రాథమిక పాఠశాలలందు ఉపాధ్యాయత్వమున వారికే మొదటి 'ఛాన్సు'. అందుకే పాశ్చాత్యులకు కాన్వెంటుస్కూళ్లు ఎక్కువ.

ఉపాధ్యాయినులచే క్రమశిక్షణ బొందిన పాశ్చాత్యులేమైరి? ఏమైననగుదురు గాక; సన్యాసులుగాలేదు. చవటలుగాలేదు. చచ్చుపెద్దమ్మలుగాలేదు. ధైర్యసాహసములకు, - పౌరుషమునకు పౌరుష మధికమై అనాగరికకార్యములకు- ఆదర్శప్రాయులుగా నున్నారుగదా ? దీనికి సమాధానమెయ్యది? ఇది పాశ్చాత్యులకే ప్రాచ్యులకు పనికి రాదందురా ?

నాటికి నేటికికూడ మనదేశమందు ఉపాధ్యాయినులరుదు. ఫలితమేమి ? - మాతృమూర్తి అవిద్యావతియైనందుననే భారతజాతి నిర్జీవమైనది. శారీరకముగా మనము చర్మములుగప్పిన అస్థిపంజరములము. మానసికముగా బానిసత్త్వము పూర్తిగా వంటబట్టినది. ధైర్యసాహసములమాట - పౌరుషముమాట - దైవమెఱుగును. ఉపాధ్యాయినులచే శిక్షణబొందిన పాశ్చాత్యులు అనాదిగా పౌరుషపరిపూర్ణులైన పురుషులచే బాల్యమున శిక్షణబొందిన ప్రాచ్యులను శతాబ్దములనుండియు పిడికిట నుంచుకొని నులిమివేయుచున్నారుగదా ? వార్కిగారి తత్త్వము దానికేమనును ?

ప్రభుత్వము మారినది. ప్రజలహక్కులు గుర్తింపబడినవి. ఆశయము లనుసరింపబడును. అని విద్యావిషయములో గంపెడాశతో నున్నారందఱు. మోమోటమువీడి చెప్పవలసినచో వార్కిగారి యాశయములు

అస్వాభావికములు. సత్యదూరములు. కాని మా నమ్మకమొకటి. ఈ యాశయములు కార్యదర్శిగారివి మాత్రమే. విద్యాశాఖ మంత్రిగారివి కావు కాగూడదు.

విద్యావతులైన సోదరీమణులు, శాసన సభ్యురాండ్రు ఇంతవఱకు దీని కి దెలుపని కారణమేమో వారిట్టివా మీాయదలంచిరా? తమ్ముగాదని యూ కుండదలంచిరా? ఈ సందేహములుదీర్ప వారు బాధ్యులు.

# పాకీపిల్ల

## శ్రీ "ఉభయభాషాప్రవీణ" జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

"ఉదయం సుమారు ఏడుగంటలవుతుంది. బజారునేవస్తోందో పాకీపిల్ల. పద్మాలు గేండ్లుంటాయి. చేతిలోచీపురుకట్ట. చంకనోచింపిరితట్ట. బాలభానుడు తనలేతకరాల్తో, ఆమెనులాలిస్తున్నాడు. భగవతి వసుంధర అడుగడుగుకు ఆమెచిన్నిపాదాల్ని ముద్దుపెట్టుకుంటున్నది. కవికుమారుని హృదయంకదిలింది."

తనసుఖమువీడి తోడిసోదరుల, సౌఖ్యమునకె జీవితసర్వస్వమును వ్యయించి,
ఏవమెరుగని నీ యమాయికపు, ప్రేమ లో తెరుగజాల దీస్వార్థలుబ్ధజగతి.
నీపవిత్రప్రకృతి స్వదేశోపకృతికి, త్రోవచూపించెలే మహాత్ములకుగూడ,
భరతజనయిత్రి ప్రేమంపుపసిడిముద్దు, తొలుదొలుత నీవె యందుకొందువుగదమ్మ!

చీపురునొక్కచేత నొకచేతను చింపిరిగంపబూని యీ
పాపవు గుప్పలూడ్చెదవు బాలిక! చీదరలేదె సుంత? నీ
యోపికచూచి మెచ్చితలయూచు జగత్పిత కన్నుగొల్కులన్
దేవకుదేవకున్ బయలుదేరె నవే నులివెచ్చబాష్పముల్.

ఆకల్పాంతము నీప్రశాంత దినచర్యల్ నిత్యనిర్నిద్ర వి
శ్వైకప్రేమ మహాప్రబంధముకు తూచా పోని వ్యాఖ్యానముల్
"పాకీదాని"గ నాడిపోసుకొను నీపాపిష్ఠలోకంబు నీ
బాకీ నీర్చుకొనంగలేదు – జగదంబా! జన్మజన్మాలకున్.

"పాకీపిల్ల"వటంచు నిన్ను నిరసింపన్ జూతురమ్మా! స్వయం
పాకస్వాములు కొంతమంది – అది యేపాపంబొ మూన్నాళ్లలో
నే కన్నుల్ తలకెక్కి వెన్కగన రీ నిర్భాగ్యదామోదరుల్,
పాకీదేగద మాకు మాజనని మాబాల్యంబులో సోదరీ!

మాతృస్థానము దక్కగొన్నయది యుష్మన్మూర్తిలోకాన – ఊ
హాతీతప్రణయాధిదేవతకు పుణ్యక్షేత్రమైపోయె నీ
చేతోవీథి – పరార్థచింత నుపదేశించున్ భవద్వృత్తి – ప్ర
ఖ్యాతంబైనది నీప్రవృత్తి – ఇవిగోనమ్మా! నమోవాకముల్.

# ముక్తి

స్వర్గతుల్యమగు ముక్తి అమూల్యమగు వస్తువు. ముక్తియొక్క యింద్రజాల మహిమ మానవహృదయమును అనాదినుండియు వశీకృత మొనర్చుకొనియేయున్నది. సాంసారికకలహములుగాని, సాంఘికకల్లోలములుగాని, జాతీయవిప్లవములుగాని యీ ముక్తిగమ్యమును చేర్చు సాధనమాత్రములే. కాని యీ ముక్తిభావము కవి కల్పనలలోనే కాంచదగునా లేక వాస్తవికప్రపంచమునకూడ లభ్యమగు వస్తువా?

శ్రీమతి
గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు

కారాగారము మానవజాతికి చిరపరిచితము. కారాగార పవిత్రమహిమను అనేక కవిశేఖరుల లేఖినులు వర్ణించియేయున్నవి. ఆదికవి వాల్మీకి సుధామధురమును, అమరచరిత్రమును అగు రామాయణ మహాకావ్యమునందు అశోకవన నిర్బంధిత, పతి విరహాతుర, సతీకుల శిరోమణీయనగు సీతాదేవియొక్క కరుణామూర్తిని చిత్రించియుండెను. పూజ్యతముడగు కృష్ణద్వైపాయనుడు నిర్వాసితపాండవుల వనవాసాజ్ఞాతవాసజీవితమును రసవాహినియగు తన కవితయందు సువర్ణాక్షరముల లిఖించియుండెను. ఇంతియేగాదు. లీలామానుష విగ్రహుడగు శ్రీకృష్ణభగవానుని జననము కారాగారమందే కల్పించి ఆ కవిమహర్షి తన పవిత్రమగు కవిత్వమును లోకపూజ్యమొనరించెను.

మానవప్రకృతియే సత్వరజస్తమోగుణము లనెడి శృంఖలములలో బద్ధమైయున్నది; మరియు సాంసారిక, సాంఘిక, జాతీయజీవనములను నాగపాశములచే ఆచ్ఛాదితమైయున్నది. సృష్ట్యాదినుండియు మానవుడు ఐహికాముష్మికములకు దూరుడై భగవన్నియమములకు ఘోరమగు విద్రోహ మొనర్చి యుద్ధఘోషణమును సల్పుచున్నాడు. ఈ బంధీకృతజీవనమొుక్క చిరతరార్తనాదమును అనేక భావనారూపములతో యుగయుగములనుండియు కవీశ్వరుల కావ్యజాలమందును, శిల్పశ్రేష్ఠుల చిత్రములయందును స్పష్టముగ అంకితమొనర్పబడియున్నది. మానవమాత్రుల శృంఖలాబద్ధహృదయములనుండి వెలువడు ఆర్తనాదమును తమతమ కవిత్వముల ద్వారమున గంభీరముగ వ్యక్తపరుపగల్గిన కవిశిల్పులే నిజమగు శూరులు. ఈ భయంకరమగు బందీజీవనము నుండి మానవాత్మ నిత్యము భయమందుచునేయుండును. కాని భగవన్నియతి ప్రకృతినియమములనుండి తప్పించుకొనుట మానవమాత్రులకు సాధ్యమా? క్షణభంగురములగు నీ మాయాజాలముల తగుల్కొను నిచ్ఛలేనప్పటికిని భగవన్నియమానుసారము ఆత్మార్పణ మొనర్పవలసియేయున్నది.

స్వర్గతుల్యమగు ముక్తి అమూల్యమగువస్తువు. ముక్తియొక్క యింద్రజాలమహిమ మానవహృదయమును నాదినుండియు వశీకృతమొనర్చుకొనియేయున్నది. సాంసారిక కలహములుగాని సాంఘిక కల్లోలములుగాని, జాతీయవిప్లవములుగాని యీ ముక్తిగమ్యమును చేర్చు సాధనమాత్రములే. కాని యీ ముక్తిభావము కవి కల్పనలలోనే కాంచదగునా లేక వాస్తవికక ప్రపం

చమునకూడ లభ్యమగు వస్తువా? ముక్తి యెక్కడ? ఈ ప్రశ్నకు ప్రత్యుత్తర మొసగజాలు సామర్థ్యము గలవారెవ్వరు? ఆధునిక విజ్ఞానప్రపుత్తమగు అమెరికాయా? లేక యూరప్ ఖండమా? నవనాగరిక ప్రపంచమున ప్రచలితమగు నూత్నభావముల ప్రభావమా? సామ్రాజ్యవాదమా? ముక్తి యెట్లు పొందబడును అను తహతహ నేడు ప్రతివ్యక్తి హృదయమును కలవరపరచుచున్నది. కాని యీ ప్రశ్నకు సమాధానము పురాణముకాలమందే తత్త్వవేత్తలగు మహాఋషులు చెప్పియుండిరి. కృష్ణభగవానుడే గీతయందు ముక్తిసాధనోపాయము నుపదేశించియున్నాడు.

ఈ శతాబ్దమందు లోకపూజ్యుడును, శాంతమూర్తియును అగు మహాత్మాగాంధి ముక్త్యుపాయమును తన ఆదర్శజీవితమందు చెప్పియున్నాడు. మహమ్మదు, క్రీస్తు మున్నగు మహాపురుషులును, బుద్ధుడు, టాలస్టాయివంటి తత్త్వవేత్తలును బోధించియున్న ముక్తిసాధనములనెల్ల మహాత్మాజీ నిత్యాచరణమున అవలంబించియున్నాడు. ఆత్మశక్తి, సత్యాగ్రహముల సహాయసంపదలచే కామక్రోధాది అరిషడ్వర్గమునుండి మనోవేగమును తప్పించుకొనుచు, భావిసుఖజీవితము నాశించి లోకకల్యాణార్థమై వర్తమానదుఃఖముల నాలింగనమొనర్చుకొని గాంధీమహాత్ముడు మానవులకు ముక్తికి దారిచూపెడి పవిత్రస్వర్గద్వారమును తెరచియున్నాడు. ధనకుబేరుడైననేమి, గంజి త్రాగి కాలము పుచ్చు పేదవాడైననేమి, సమస్తప్రాణులనుకూడ ఆ సింహద్వారమునుండి నడచుటకు సమానమైన హక్కు కల్గియున్నాడు. ముక్తిని వాంఛించు ప్రతివ్యక్తియు అహింసా వైరాగ్య శాంతిభావముల కాటపట్టగు పవిత్రపతాకమును ఈ సింహద్వారము చేరుటకు ధరింపవలసియున్నది. యంత్రవిజ్ఞానప్రతిష్ఠితములును, ధూమ్రకళంకితములును అగు యూరప్, అమెరికా సభ్యతలు భారతవర్షముయొక్క యీ పవిత్రతరుణమును సతృష్ణనయనములతో తిలకించుచున్నవి. సర్వజగత్తు నేడు దీనావస్థయందుండెడి భారతభూమి నల్పు అహింసాయుతమగు ముక్తిసమరమును రెప్పవాల్పక చూచుచున్నది. ఈ యుగసంధియీ సంగ్రామముయొక్క సామీప్య భవిష్యత్గర్భమున యిమిడియున్నది. ప్రపంచమునందు ఈ నూతన కాంతి, నూతన సభ్యత, నూతన ఆదర్శములు అను సజ్జనసంతానమును ప్రసరించుటకు విశ్వమోహినియగు భారతమాత అనుపమవేదన శాంతియుతమగు పర్యవసానము నందవలసియుండును.

బ్రహ్మాండమగు నీ విశ్వమందు ముక్తిబంధనములు, లీలామాత్రములు. జ్ఞాని, చింతాశీలుడు, సుముక్షువగు పురుషుడే యీలీలలకు పరిచితుడు. అట్టి పురుషుడు బంధనములందున్నను ముక్తినే అనుభవించుచుండును. ముక్తుడైయున్నను బంధనమునందున్నట్లే భావించుచుండును. హర్షశోకములు వానికి సమానములు. మాతృగర్భమునుండి శిశువు భూపతనమైన నాడే భయంకరప్రపంచక మను కారాగారమున బంధీకృతుడగుచున్నాడు. బంధనములుగా భావించిన అన్నియు బంధనములే. మాతృకరములందు శిశువు ప్రేమబద్ధుడగుటయును ఒక బంధనమే. కాని యీ వివిధబంధనములలో పరస్పర తారతమ్యము గలదు. సాధారణ మానవమాత్రుడు ముక్తిసంపాదనమునకై వివిధములగు విశ్వప్రయత్నము లొనర్చి తన సుకృతఫలితముగ నీప్సితార్థము పొందినను అట్టిముక్తి చిరస్థాయిగ నిలుచునది గాదు. సంసారబంధనమునుండి విముక్తుడగుట బహుదుర్లభము. నిజముగ మానవసంఘము ముక్తి నపేక్షించునెడల అనేక యుగములు సాధనచేసినగాని సిద్ధిపొందనేరదు. ఎట్టిసాధన యొనర్పవలెను? ఆత్మశుద్ధి, నిష్కామ కర్మలద్వారా అహంభావమును ఆత్మత్యాగ మను యజ్ఞకుండమున పూర్ణాహుతి చేయవలసియుండును. మనోదౌర్బల్యముతో కూడిన మానవుడు కారాగారబంధనములకు

భయకంపితుడగుచేని వాని భయము రజ్జుసర్ప భ్రాంతి వంటిది. కాని ధీమంతులగువారు కారాగారమను నాగపాశముల చిక్కియున్నను, ఆత్మయందు ముక్తి ననుభవించుచునేయున్నారు. వీలన ముక్తి యను విశాలగగనభాగము వారి చిత్తజగత్తుపై పరివ్యాప్తమై యున్నది. ముక్తి ధ్యాననీయమగు వస్తువు. హృదయాంతరాళమునుండియు వాంఛనీయము. ఏదినమున మానవదృష్టి సభ్యతాజగత్తున వెలిగించిన ప్రభాతరవి కిరణముల నాలోకించినదో నాటినుండియు మానవుడు ముక్తి సుందరీప్రేమకు బద్ధుడైయున్నాడు. విపత్తులును, కఠోరబాధలును సహించి, ధనమానప్రాణముల నర్పించి ముక్తికాంతను వలచుచుండెను. కాని నిజముగ నాతడు ముక్తికాంతప్రేమను చూరగొనగల్గెనా? లేదు. కాంచనమును పొందుటకు బదులు కాంచను పొందగల్గెను. కోటిప్రాణులయందొక్కడు సఫలప్రయత్నుడు కానోపడు. అట్టివానిని మహాపురుషునిగా నెంచవలసియుండును. దుర్లభమగు ముక్తియొక్క కల్పితాదర్శము నారాధించి సర్వపరిత్యాగియగుటకంటె ఆధ్యాత్మికదృష్టితో సాంసారికశృంఖలముల నుపేక్షించకయే ముక్తిసాధన చేయువాడు ధన్యతముడని నా తలంపు.

నేటి ప్రపంచమున ఏపురుషుడు భారతవర్షము యొక్క ముక్తిసాధనార్థము భారతీయులకందరకు కష్టసహనమున ఆదర్శప్రాయుడయ్యెనో యే పురుషుడు భారతదేశమునందలి ఆబాలవృద్ధమును మృత్యుంజయులను చేయు మహాదర్శమును లక్ష్యముగ నిడికొని తపస్సు నొనర్చుచున్నాడో ఆ గాంధీమహాత్ముడు ముక్తికాంత యను స్వరాజ్యమును హస్తగతమొనర్చుకొనియున్నాడు. కారణమేమన, స్వరాజ్యమను మనోజ్ఞాదర్శము, సుందరమగుకల్పన ఆతని చిత్తరాజ్యమున వ్యాపించియున్నది. ముక్తియొక్క రుచి రాష్ట్రనైతికజీవనమునందే బంధీకృతమైయుండలేదు. కేవలము లౌకికబంధనములనుండి కలుగు ముక్తి ఆధ్యాత్మికముక్తితో సమానము కాజాలదు. దక్షిణాఫ్రికా కారాగారమునందుండియుగూడ మహాత్మాజీ ముక్తియొక్క ఆస్వాదనమునుండి వంచితుడు కాలేదు. ఎంతమందియో యుగప్రవర్తకులు, మహాపురుషులు, కర్మవాదులు, ధర్మవీరులు, జ్ఞానవీరులు భయంకరమగు అస్వాధీనత ననుభవించుచున్నను, మృత్యువేదికయందు నిలిచియున్నను, అంధకారమగు కారాగృహమందుండియు, నిర్వాసితదండనకు లోబడియుసుగూడ ముక్తిసుఖమునుండి వంచితులు కాలేదు. అనేకములగు ఘోరవిపత్తులను బాధలను నెదుర్కొని, అంతరాత్మయందు ముక్తినిబొంది మహత్తరమగు సత్యాగ్రహధర్మమును జగత్తునకు చాటిరి.

# పశ్చాత్తాపము

## (వినోది)

ఆయనంతశాంతిమయ సౌధాంతరమును
విడిచిసుఖతృష్ణచే నీగభీరనిత్య
ఘూర్ణమాన మహోదధి గోరుకొంటి.

నిర్మలమనోజ్ఞ చంద్రికన్ నిందజేసి
వెలుగుకొఱకు తపించి యీవిలయకాల
తిగ్మకిరణాతపంబున తిరుగుచుంటి.

* * * * * *

లీలక్రీడింప మిత్రులు వేరటంచు
రాజసౌధమ్ము మించుకులాయపదము
వీడిచను దెంచినాడ నీవిపినమునకు.

వెదకుకొనకుండ తిండి లభించునెడి
వేడుక, స్వతంత్రమహిత జీవితమువిడిచి
ఈయయోమయపంజర మెన్నుకొంటి.

# 'సుందరి'

(సౌందరనందము)

'పద్మ'

శ్లో. అద్వైతమ్ సుఖదుఃఖయోరనుగతమ్ సర్వాస్వవస్థాసు యద్
విశ్రామోహృదయస్య యత్రజరసా యస్మిన్నహార్యోరసః
కాలేనావరణాత్యయాత్పరిణతే యత్ ప్రేమసారే స్థితమ్
భద్రమ్ తస్య సుమానుషస్య కథమ ప్యేకమ్హి తత్ ప్రాప్యతే.

—భవభూతి.

అర్థముకాని 'భావకవిత్వము' ఆంధ్ర వాఙ్మయలతకు వేరుపురువనుట సర్వథా నిక్కువము. ఈ కవితాశక్తి ఛందోభాష లన్నియు నొకతీఱు. విపరీతములును. భావనయందును కవితయందును నూత్నత్వము వెదజల్లుచు నర్థవంతముగా పదములనేర్చి కూర్చి తీర్చి దిద్ది యతిసులభమగు శైలిలో ప్రబంధముల నాంధ్రలోకమునకుఁ బ్రసాదించిన ఇటీవలి వారిలోఁ దిరుపతికవులు ముఖ్యులు. వీరిశిష్యు లెందఱెందఱో యెన్నో విధాల నాంధ్రభాషామతల్లిని గైసేతలొనర్చి పూజించియున్నారు. వీరిలో ప్రఖ్యాతులు శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతముగార్లు.

ఈ జంటకవులు పదునేడేండ్లకు మున్ను 'తొలకరి' యను భావగర్భితమైన చిన్ని పొత్తమును ఆంధ్రలోకమునకు సమర్పించి యెల్లర మన్ననలఁగన్నారు. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు దానికిఁ బీఠిక వ్రాయుటే తద్గ్రంథప్రాశస్త్యము చెప్పక చెప్పుచున్నది. ఈ పదునేడేండ్లకాలములో వారి భావనాశక్తి మిక్కిలి పరిపక్వావస్థదాల్చిన తరువాతనే 'ఆంధ్రావని మోదముఁబొరయునట్లు' శాశ్వతముగనిలుచు నమూల్యమగు నీ 'సౌందరనంద' గ్రంథరాజమును గురువులు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి కంకితముగాఁ బొనర్చియున్నారు. ఏతద్గ్రంథప్రకటనానంతరము గ్రంథకర్తలగు నీకవులుపొందిన యభినందనలు సహస్రాధికముగా నుండెననుట సర్వజనవిదితము.

'సౌందరనందము'లోని కథాసంగ్రహమిది. అనుకూలవతి భార్య సుందరితోఁ గ్రీడలు సలుపుచున్న నందుఁడు, భిక్షకయి యేతెంచిన బుద్ధదేవుని పిలుపు వినిపించుకొనకున్న నా బుద్ధభగవానుఁడు వెళ్లిపోఁగా, నది విని మిక్కిలి పరితపించి తిరుగా బుద్ధునిబిలిచికొని రానేగుట. బుద్ధుఁడు మరల నింటికివచ్చి భిక్షగొననొల్లమి సూచించుటయేగాక నందుని దనవెంట విహారమునకుఁ దెచ్చి దీక్షయొసఁగుట. ఎన్నాళ్లకును దిరిగిరాకున్న భర్త తుదకు సన్న్యాసమును స్వీకరించెనని యరసి యిందుకు మొదట బుద్ధునిదూషిఁ

చియుఁ దుట్టతుదకుఁ దాను బౌద్ధసన్న్యాసినిగాఁ జేరి యనాథరక్షణమునకుఁ బూనుకొనుట. బుద్ధునిమహత్త్వముచే నీయిర్వురును ధర్మసోదరీసోదరులుగ నొకహరిజనుల వాడలోఁగలసికొని బౌద్ధధర్మలతను బెంచి పోషించుటకు బద్ధకంకణులయి దేశికస్వామికి గళమ్ములెత్తి జయముపాడుట. ఇది యిందలి కథ. దీనను సుందరీవృత్తాంతము స్వాచిత్య-ముగా విమర్శింపఁబడినది.

నందునకు సుందరి యాదర్శధర్మపత్ని. వీరి 'పలుకుల్ సేఁతలు నెమ్మనములొక్కటై' యుంటచేఁ బ్రణయకలహము కలిగినను అదిచాలసే పుండెడిగాదు. ఇట్టివి 'వలపుల కల్పవల్లికి దోహదక్రియల'ఁట. కావుననే సుందరి చెల్వునకు నందుఁడు కైమోడ్పు చేయుచు

"రాగరంజిత మన్మనోరత్నమింత
యింతశకలమ్ము లొనరించి యింతి! నీడు
కంఠహారముగావింతు" ననియు,
"వెలఁది! యీరాగలతలు పుష్పించునట్టు
లీమనోరథములు ఫలియించునట్లు
దరులాలసిపారు నీమమతాస్రవంతిఁ
దేలిపోదము వెఱతలంపేల మనకు" ననియు,

ప్రేమశీధుపానరతులమై చరించుటకు నుద్యమింప గోరుచున్నాఁడు. వీరి ప్రణయము అతి పవిత్రమగుటచేతనే "భూతసంతాన నవీన సృష్టిపరిణామ"మని వా కొనఁదగియున్నది.

వీరిట్లు "కూరుములనాడుచుఁ బాడుచు" నుండ బుద్ధదేవుఁ డక్కడికి భిక్షుకయి యరుగుదెంచి "యస్తినాస్తియను పల్కొందుఁ విన రామి"చే తన దారింబడిపోయెను. దీనినొక యమూడిగపుఁగాంతవలన నందుఁడు పిదప విని పశ్చాత్తప్తుఁడయి యన్నను దిరిగి తోడ్తెచ్చుటకు నేఁగుదునన్నది విని సుందరి యీక్రింది విధమున పలుకుట యెంత స్వాభావికమో యుచితమో గమనింపుఁడు:

నామనోనాథ! నానిధానమ్మ! నాదు
కంఠహారమ్మ! నాకనుంగవవెలుంగ!
గురుచరణసేవ కావింపనరుగు నిన్ను
నెట్లువారింతుఁ, గాక నిన్నెట్లుపనుతు.

విరహ మేమాత్రమును సహింపనిది 'విశేషకమ్ము తడియాఱకమున్ జనుదేరగావలె'నని భర్తను బ్రార్థించినది. దానికతఁడియ్యకొని వెలఁదిపై రక్తివెన్నునుక కతని లాగుచున్నను బుద్ధగతమైన పెనుభక్తి ముందుకులాగఁగా నతఁడుగదలినాఁడు. బుద్ధదేవుఁడును నేదోవిధముగ నందుని విహారముచేర్చి వాసనాపరంపరలు మాయుటకును దివ్యవిజ్ఞానకళిక సిద్ధించుటకు నుపదేశము మొదలుపెట్టి నందునకు దీక్ష యీఁబంచినాఁడు. దానికివలయు యత్నములు సేయుచుండ బుద్ధశిష్యునకు నందుఁడు

"వరమడిగి నాశరీరము
తరుణీమణి పుచ్చుకొనియెఁ దనసొత్తుగ, నే
దురితముపాలైపోవను
పరధనమును నిచ్చువెంట వాడితినేనిన్."

అని జాలితో బల్కినాఁడుగాని తనకు దీక్ష తప్పినదిగాదు. ఇటనిట్లుండ నటసుందరి యెంతో విలపించుచున్నది. అప్పపాటంత

సేపు విరహామునే తాళని యీామె యిట్టి దీర్ఘవిరహామును సహించుటకెల్ల.

“ఈదారిఁజూచుఁ, బదపడి
నాదారింజూచుఁ, గలయ నంతటఁజూచున్
గాదను, నగునాయను, గా
నీ దండింపకయె విడుతునేయితని నను౯.”

కొంతసేపు తరువాతఁ దొయ్యలి సెజ్జపరుండి

“మనసులో మనసుగలిపి, మాటలోన
మాటయునుగల్పి, యొరిమయు మమతనెఱపు
జీవితేశ్వరుఁడిట్లు వంచించెనన్నఁ;
గలరె నాకంటె మందభాగ్యలుజగాన”

యని వెక్కుచు నేడ్వఁదొడంగె. తన ‘కనుఁదమ్ముల మోమునీడలఁజూచెడివానిఁ, గను సన్న మెలంగెడివానిఁ’ దెచ్చువారికి ‘మాడలు మాన్యములిచ్చి మెప్పింతును వేయునేల కనిపించెదఁ బ్రత్యుపకారభావము౯’ అని పలువిధముల వాపోవుచున్నది. ఇంతలో నందుని “జాడనరయఁ జనిన చేడివచ్చె”ను. అంతే—నాథునిగుఱించిన ప్రశ్నలఁ గురియించినది. “వచ్చుచున్నవాఁడె? తెలుపక౯ గదవే, ప్రియుడింతసేపు దానెచ్చటనున్న వాఁడె, నినునేమనె, నేటికిఁ దామసించెనే” యని పలుభంగుల నడిగిన దానికిఁ బ్రతిలేదు. అప్పుడే లేనిపోని పిచ్చిపిచ్చి తలఁపులు

“అశ్రుసిక్తములయిన నేత్రాంచలములె
చెప్పుచున్నవివాని దుశ్చేష్టితమును
అరుణ నోటవచింపుమేమనియె నతఁడు
రానుపొమ్మనెనో, కానరాఁడొ చెలియ !”

తన అపోహాలు నిజమాయని “నోటవచింపు మేమనియె నతఁడు” అని ప్రశ్న. నిజమేయగు నని “రానుపొమ్మనెనో”యని యొక సమాధానము — ఒకవేళ తనశంక యనాస్పదంబే యగునని యాశ. ఉహుఁ! ఆ చేడియకు భర్త ‘కానరాడో’ యేమో! ఈభావము లొకటివెంటనొకటి యంతరములేక క్షణక్షణము మనమున తఱుముకొని వెడలినవి. మానసికప్రవృత్తి నింతసుందరముగ, నిక్కువముగ, జిత్రించిన కవు లిటీవలి వారలలో నాఁకు గనఁబడలేదు. సరే — గురుఁదేవుఁడు తనవెంటఁబిలిచికొని యేఁగి యుండుననినిశ్చయించి భర్తనిట్లనుచున్నది.

“ఔరా! యభినయవిద్యా
పారంగత! వంచకాతివంచక! రసభా
వారంభప్రతికూల వి
చారా! సౌహార్ద ధర్మ సమయవిదూరా!”

దీనికిఁగారణము బుద్ధభగవానుఁడే యయి నను “గురు నేమనుటకు౯ నోరురాక, యల్లంతన మెత్తని కినుకతోడ గౌరవమెన సెడివాక్యముల నతని నిట్లనియెంచి”నది.

“పిట్టలుగా మృగములుగాఁ
బుట్టుండని శాపమిచ్చి పోఁగూడదొ, మే
మట్టి జంటంబాయక
చెట్టుల గుట్టలనుబట్టి జీవింతుముగా”

యని మిక్కిలి పదరుచున్నది.

“కాలముచెల్లి పశ్చిమము
ఖమ్మునఁ బ్రాయపుఁ బ్రొద్దొకింతలోఁ
బ్రాలఁగ నున్నపెద్దలు, భ
వత్ ప్రతిపాదిత ధర్మమార్గ చింతా
లాలసితాత్ములై, తెలిసి,
దారసుతాదుల నుజ్జగించిన౯

బోలు ; నిద్రాళులొప్పితివి,
మొగ్గను ద్రుంచుట పిందెఁగోయుటల్."

యని మనస్సులో వాదించుకొనుచున్నది - వినువారెవ్వరు ?

అక్కడ బౌద్ధవిహారములో నందుఁడును మొదట నెంతెంతో విలపించి విలపించి గురునితో వాదులాడి

"తేజఃప్రసన్నమై మనసు
తెల్వివహించెను, శోకమోహముల్
దూరములై భవాంధువునఁ
దూలినజీవుల నుద్ధరింపఁగాఁ
గోరిక పుట్టెఁ, దొంటివల
కూర్మికి దవ్వులనిల్చి వేఁడెదన్,
బూరుషులెల్ల నర్హులయి
పోటులుమాత్ర మనర్హులౌదురే."

యని వినయముగాఁ బ్రార్థించి గురునిచే నౌననిపించినాఁడు.

ఇట్లుండఁ గొన్నాళ్లకు సుందరియు "ధనకనకవస్తువాహన వనితా తనయాప్త బంధువర్గము నెల్లఁ గొనకొని త్యజించి గౌతమ మునివరుమార్గమ్ముఁ బట్టుపుణ్యులఁ దలఁచు" చు, బుద్ధ "శిష్యులలో నెల్లరకంటె ముందు హృదయేశ్వరునిఁ భావించికొని సెబాసని మెచ్చు"చుండెను. అంత నొకనాటిరేయి యెల్లవారును నిదురించిన తరువాత నందుని ప్రియవృత్తాంతమును రహశ్చింతనము ప్రోది రాచిల్కకు చెప్పనారంభించినది. ఈచిలుక వృత్తాంతము కొంత యస్వాభావికముగా నున్నది. కష్టసుఖముల నెదుటివారితోఁ జెప్పుకొనుటగలదు ; లేక మనముననే తలపోయుటకలదు ; కాని నడిరేయిని చిల్కయొద్దకరిగి తలపులు త్రవ్వుట స్వాభావిక మనిపించుకొనదేమో ?

"అతఁడు విహారకుద్యములఁ జిత్రించు భా
వములకుఁ బ్రాణార్పణమునొనర్పఁ
దగనఁజేసేను, నెచ్చెలీ ! తనకుఁగాని
భాగ్యమిది నాకుమాత్రము యోగ్యమఁటవె ?
అడవులకునేఁగి యిల్లు నాకడవిసేసె,
నయ్యడవి దేవళమ్ముఁ జేయునఁటె నేను ?"

అని యతిదీనముగా మంతనమాడుచున్నది. తరువాత నొకనాఁడు గురునిపంపునవచ్చిన నొకభిక్షుకుఁడు సుందరియింటికి నేఁగుదెంచి యామెకు దీక్షనొసంఁగెను. నాఁటినుండి "దినదినము నాదయామయి దీనజనులఁ బిలువనంపించి యిలువేలుపులకుఁబోలె భక్తి మైనర్చలొసఁగి, యాభరణరాజిఁ బంచి యిచ్చును బ్రీతిసంభావనముల" దినములుగడపుచుండ నొకనాఁటి సందెచీకటిని నొకబాలకుఁడు తనకొంగుఁబట్టిలాగుచు వెలివాడకుఁ దీసికొనియేఁగెను. అక్కడనే నందుఁడును ఆ బాలకునితల్లికి మరణాసన్నకు నుపచారముల చేయుచుండుటఁజూచి 'ప్రాణమా' అని సుందరి పలుకరింపసాఁగెను గాని 'ప్రా' మాత్ర పర్యవసన్నములగు నెలుఁగులుగళమ్ముఁ దగులఁ, దామెట్టకేలకు గచ్ఛామిబుద్ధం శరణమటంచు ననిరి. ఆ వెలివాడలో నాతల్లి మరణించుచు తన కూఁతు హస్తమ్మునందునకును, కొమరుని హస్తమ్ము సుందరికిని నొసఁగెను. అప్పుడట బుద్ధభగవానుఁడు ప్రత్యక్షమయి




రాధాకృష్ణులు



అక్షరా భ్యాసము

"తెక్కలించితి మున్ను నేనొక్కనందు
సుందరీ! ధర్మసోదరీ! చూడుమిదిగో
ధర్మసోదరు నొకనందు, ధర్మతనయు
నొక్కరుని బాలనందు నీకొసఁగుచుంటి."

అని యాదరమునఁ బల్కెను. ఇట్లే ధర్మ సోదరి సుందరిని, యనాథశిశు సుందరిని నందునికిఁజూపెను. ఇప్పుడు తమోదూరు లైన యీయిర్వురు యనాథలఁ గాచుటకు నవకాశముగల్పించిన బుద్ధభగవానుని "ఆనందవశత గళమ్మెత్తి జయముపాడిరి."

ఇట్లు సర్వాంగసుందరముగ నొక్కొక్క పాత్రను చిత్రించిన యీకవు లెంతేని వంద్యులు. ఇట్టి గ్రంథరత్నముల నింకనెన్నేని యాంధ్రలోకమునకు వీరు ప్రసాదింపఁగలరని యెల్లరు నాసపడుచుండుట వింతగాదు.

"హితము నహితమ్ము నుచితానుచితములాది
యైన సీమలుదాఁటి, ఫలానుమేయ
ములగు నార్యశుభారంభములకు స్వస్తి
యగుత, విశ్వమ్మునకు శ్రేయమగునుగాత."

---

# గు ణ వ తి

## శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు

(వెనుకటి తరువాయి)

గీ. చెంతగూర్చుని మూపుపై జేయివైచి
స్నేహసౌహార్ద్రభావంబు జెలగననియె
నేల నీలీల వగచెదు బేలవౌచు
ఆపదలు కాపురంబుండునా లతాంగి.

చ. నెలతరో కష్టకాలముల
నేఁగదధైర్యము నూనగావలెన్
దలగునె పూర్వకర్మములు
ధాత్రిని భుక్తముగాక, సౌఖ్యముల్
గలిగినరీతి గష్టములు
గల్గుట వింతయె నీవెఱుంగవే,
వలదిటు మృత్యువుందలప
వారిజలోచన యెట్టివేళలన్.

చ. తెలియనిదానివోలె నిటు
లేకువబాసెదు దుఃఖమగ్నవై
కలికి! జగత్ప్రభుండు రఘు
కాంతుడు రాముడు జానకీసతీ
తిలకము కష్టముల్పడరె,
ధీరతబాసిరె, పుణ్యమూర్తులై
కలతపడంగనేల మది
కాలము సడ్డగ ధాతనేర్చునే.

చ. తొలగును కష్టజాలములు
తొయ్యలిరాముని సేవజేసినన్;
సలలితబుద్ధితోడ కృషి
సల్పిన దీరుదరిద్రమెన్న; స

త్కళలిల నీవునేర్చికొన
గావలెనన్న ననేకముండె; నీ
కలవడజేతు నేనెఱిగి
నట్టిపనుల్మదిదాప కీయెడన్.

కం. చదువగ వ్రాయగ పాడగ
విదితంబుగ నర్థమెల్ల వివరింపంగా
కొదలేక యుండ నేర్పెద
ముదితరొ నీవింక దుఃఖమును వీడగదే.

గీ. చేతిపను లెన్నిగలవు నేర్పెదవయేని
నిబ్బరంబగు మనమున నిలిచెదేని
పూజనేయదె జగమెల్ల పూనినిన్ను
చాలు నీకేల నీలీల జాలిదూల.

గీ. శక్తివంచన లేకుండ సత్యముగను
చేతనైనంత సాయంబు జేతునేను
నీవు యత్నంబొనర్పుమా నిశ్చలమది
దేవుడున్నాడు కోర్కెలు దీర్చిబ్రోవ.

గీ. చింతచేనెట్టివారికి చేవజెడును
సాహసంబును ధైర్యంబు శాంతమూని
పరమపురుషుని పైవైచి భారమెల్ల
ధర్మమెడలక జేయగా దగునుపనులు.

గీ. పదిదినంబులు నీవునా పంక్తిగుడిచి
మదినెగుడుమాని ధృతినూని మసలుచుండు
మాడుబడుచవు మాయింటి కరయనీవు
అప్పటికి వేరుదైవంబె యాదరించు.

గీ. పల్లెటూరిది పదిమంది బాలికలకు
కుట్టుపనులను నేరిపి కొనుచువ్రాయ
చదువ పాడగ నుంత నేర్పెదవయేని
మించుకూరిమి నిను గారవించగలరు.

గీ. నీకిచట తావరముగల్గె నేనివెనుక
జనకునింగూడ బిలిపించి కొనెదుగాక
అవల దేవుడు నీకు దోడగునుగాక
యింతి నినుపతి బిలిపించి యేలుగాక.

గీ. అనిన నయ్యింతిపల్కుల కాత్మనలరి
కలికి నీవాక్యముల మది కలకదీరె
దిక్కులేనట్టి నాకీవు దిక్కువైతి
సుజన సంగతిమించెడు సుఖముగలదె.

## వ్యాసకర్తలకు

వ్యాసములు ప్రకటన కంగీకరింపబడుచో వ్యాసకర్తల కా సమాచారము వెంటనే తెలుపబడును. అంగీకరింపబడని వ్యాసములు ఆ మాసాంతమువఱకుమాత్రము భద్రపరుపబడి యుండును. వ్యాసములు కావలసిన ఆయావ్యాసకర్తలు తగు తపాలబిళ్లలనుపంపి వానిని తెప్పించుకొనగలరు.

సంపాదకుడు.

# రాటపు పరిశ్రమకు కావలసిన పరికరములు

శ్రీ ఆచంట లక్ష్మీనరసింహంగారు

ఆగస్టుసంచికయందు సోదరి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు "మనములోమాట"లను శీర్షిక క్రింద, గృహపరిశ్రమలనుగురించి చర్చించి, యందు రాటపుపరిశ్రమ యత్యంతోపయుక్తమైనదని, సోదరీమణులు చేబట్టదగునని సలహానిచ్చుచు, నీ పరిశ్రమ నవలంబించు వారికి పరికరములు లభించుట, మున్నగు సౌకర్యములు తక్కువగా నున్నవని సూచించియుండుటచే, యీ పరిశ్రమకు సంబంధించిన దిగువ వివరములు తెలుపుచున్నాను.

ప్రతి మానవునకును ముఖ్యమైన యక్కరలు అన్నము, బట్టయగుటచే, వ్యవసాయమునకు పిమ్మట, రాట్నమే ముఖ్యమైనదని ఎల్లరును అంగీకరించిన విషయమే. గృహపరిశ్రమలందు, చరఖా మహోజ్వలమగు సూర్యగ్రహమువంటిదనియు, మిగత పరిశ్రమలీ పరిశ్రమ నాశ్రయించు యుపగ్రహముల వంటివనియు మహాత్మాజీ స్థిరవిశ్వాసము. జాతి, మత విచక్షణతో, సంఖ్యలతో, నిమిత్తము లేకుండ, బాలబాలికలు, స్త్రీ పురుషులు, యీ పరిశ్రమ నవలంబించవచ్చును. బట్ట ప్రతివారికిని అగత్యమేయగుటచే, యీ పరిశ్రమయందు ఉత్పత్తి యెంతహెచ్చినను, సంతోషమేగాని, భారమను నదిలేదు. ఈ పరిశ్రమకు కావలసిన పెట్టుబడి, పరికరములు స్వల్పములని చెప్ప నక్కరయే లేదు. కావున నీ పరిశ్రమ ప్రతివారికిని అందుబాటులో నున్నది. ప్రస్తుతము స్వయంపోషకములుగా చేయవెంచు ప్రాథమిక పాఠశాలం దసంఖ్యాకులగు బాలబాలికల చేతను, కారాగారములందు ఖైదీల చేతను కూడ యీ పరిశ్రమ సాగించ మహాత్మాజీ యుద్దేశించుచున్నారన నీ పరిశ్రమ కోట్లకొలదిమందికి తావీయగలదనియు అత్యద్భుతమైన భవిష్యత్తు కలదనియు మనము గ్రహించ గలము,

1921 సం.రమునందు మహాత్మాజీ ఖాదీని గురించి ప్రబోధము సల్పినప్పుడు కాన్పించిన యుత్సాహము నేడు కానరాకుండుట వాస్తవమే. కాని యిది పట్టణములలోని సంగతిమాత్రమే పల్లెలలో మాత్రమీ పరిశ్రమ యత్యంత స్థిరమైన యభివృద్ధి గాంచుచున్నది. ఉత్సాహము పొంగిపొరలిన 1921 సం. రమునందు దేశ మొత్తమునందు లక్షరూపాయల ఖాదీయైనను నుత్పత్తికాలేదు. కాని నేడో సాలుకు 50 లక్షల రూపాయలకు తగ్గని విలువగలబట్ట తయారగుచున్నది. ఇటీవలి యంకెల ప్రకారము 2 లక్షలమంది సోదరీమణు లీ పరిశ్రమయందు నిమగ్నులై యున్నారు. విద్యావతులును, పరోపకారమానసులును నగు సోదరీమణులు పూని పట్టణములందు తరిగిన యుత్సాహమును పూరించవలసియున్నది. అందులకు ప్రస్తుతము తరుణమెంతయు ననుకూలమైనది.

ఈ పరిశ్రమాభివృద్ధికిగాను, మహాత్మాజీ యాధ్వర్యమున, నఖిలభారత చరఖాసంఘము 1925 సం. రములో స్థాపించబడి శాఖోపశాఖలుగా దేశమంతటను వివిధరాష్ట్రములలోను, ఉత్పత్తి విక్రయశాలలను స్థాపించి పనిచేయుచుండుట చాలమంది సోదరీమణులకు విదితమే. ఈ సంఘమువారును వీరి యనుబంధ సంస్థలును తమ యందుబాటులోనున్న సోదరీమణులు రాట్న పరిశ్రమను చేబట్టి తమ కుటుంబములకు వలయు నూలును వడుకుకొనునట్లును మిగిలినది వారికి విక్రయించి, లాభ మొందవలెననియు ప్రచారము చేయుచున్నారు. వడుకువారికి వీరు కలిగించు మరికొన్ని సౌకర్యములను కూడ దిగువ తెలుపుచున్నాను.

మహాత్మాజీ 2 సంవత్సరముల క్రిందట నీ పరిశ్రమయందు ప్రవేశబెట్టిన నూతన ప్రణాళికయు సోదరీ

మణులకు ప్రోత్సాహము కలిగించునదే. దీని ననుసరించి నూలువడుకురారు "తన్నువినా" గాకుండ తాము విధిగా ఖద్దరును ధరించవలెను (తాము వడికిన నూలు నేయించికొనిగాని ఖద్దరునుకొనిగాని ధరించవచ్చును.) తమబట్టకు వలయు నూలునుగాని రొఖమునుగాని ఒకే సారి యీయలేనివారు వాయిదాలుగా నూలుగాని రొఖముగానియిచ్చి ఖద్దరును తీసికొనవచ్చును. రెండవ ముఖ్యమార్పు ఇదివరకు అములులోనున్న రోజంతయు పనిచేసినను యిచ్చెడి 0-1-0 0-1-6 కూలి తరతరములనుండి వచ్చుచున్నదేయైనను, భుక్తికి చాలని యన్యాయపు కూలియగుటచే దానినిమార్చి రోజుకు 8 గంటల కృషికి 0-8-0 ఆదాయముండవలెనని మహాత్మాజీ సంకల్పించెను ఒకేసారి అములులోనున్న 0-1-0 0-1-6 కూలిని 0-8-0 కు పెంచినయెడల పరిశ్రమ తారుమారు కావచ్చునని సహచరులు ఒత్తిడి చేయుటచే వెంటనే 0-3-0 కనీసపు కూలితో ప్రారంభించవలెనని క్రమముగా దినమునకు 0-8-0 కూలి లభించునట్లు చేయవలెనని మహాత్మాజీ నిర్ణయించెను. ఈ నిర్ణయము ప్రకారము వివిధరాష్ట్రములందును వడుకుకూలి నూటికి 15 నుండి 150 పాళ్లవరకును పెంచబడినది. దీనివలన ఖాదీధరలు కొలదిగా పెరిగినవి. పెంచిన వడుకుకూలి పరిశ్రమకు భారముగాక ఖాదీని కొనువారికి కూడ లాభకరముగా నుండుటకు గాను నూలు సాఫీగానుండుటకును ఉత్పత్తి హెచ్చుటకును నూలు పురి హెచ్చుటకును స్త్రీలు స్వయముగా ఏకుకొనుపద్ధతియు పుక్కకదుళ్ల వాడుకయు ప్రవేశపెట్టబడినవి. ఏకుడు నేర్చుకొనుట నూతనముగా తోచవచ్చును. కాని చిన్నబద్దతో ఏకుటంత కష్టముకాదు. ప్రతిసోదరియు 5, 6 రోజులలో సులభముగా నేర్చుకొనవచ్చును. దీనివలన పరిశుభ్రమైన ఏకులు లభించి వడుకుట సుకరమగుట నూలు ఉత్పత్తి తద్వారా ఆదాయము పెరుగుటయేగాక ఏకుడుపనివల్ల వచ్చు నాదాయముకూడ కుటుంబమునకే మిగులగలదు. వారమునకు వలయు నేకుల నొక రోజు తయారుచేసికొనవచ్చును. ఈ పద్ధతిని చరఖా సంఘ ప్రచారకులు వుచితముగా నేర్పుదురు

ఇటీవల జరిగిన చరఖాసంఘ కౌన్సిలు సమావేశమునందు యీవత్సర మీపరిశ్రమ యభివృద్ధికి 8 లక్షలధికముగా పెట్టుబడినిచ్చి తద్వారా 25 వేలమందికి అధికముగా పనికల్పించ తీర్మానించితిరి. మరియు అభివృద్ధి సాధనములగు ఏకుడుబద్దలు ఉక్కు కదుళ్లను వడుకు వారికి తగ్గించి యిచ్చుటకును యింటింటికేగి గృహిణులకు ప్రచారకులు అభివృద్ధి మార్గములను బోధించుటకును రు 40,000 లు మంజూరు చేసియుండిరి. ఈ పద్ధతులన్నియు నీరాష్ట్రమునకూడ నములులో నుంచబడుచున్నవి. కొలదిమంది ప్రచారకులుకూడ పని సాగించుచున్నారు.

ప్రస్తుతమున్న రాటములలోకెల్ల శ్రేష్టమైనది ఎరవాడ చరఖా. దీనిమీద కొలది యనుభవముతో గంటకు 400 గ.ల చొ. దారము తీయవచ్చును. ప్రయాణములందుకూడ తేలికగా వెంటతీసికొని వెళ్లవచ్చును. వెల ఒక్కటి 3-4-0. (చరఖా సంఘములందు దొరకును). దారము పోయుటకు అనుకూడ యింజే అమర్చబడియుండును.

రాటమునకు బదులు తక్లీ యను నొక చిన్న పనిముట్టుకూడ ప్రస్తుతము వాడుకలోనున్నది. దీని వెల 0-1-3 మాత్రమే. దీనిని వాడుట కేలాటి యనుభవముగాని, కష్టముగాని, మరమ్మతులుగానీ లేవు. పసిబాలురనుండి వృద్ధులవరకు వాడవచ్చును. దీని మీద సైతము గంటకు 250 నుండి 400 గ. వరకును వడుకవచ్చును. మాటలాడుచున్నప్పుడును, సమావేశములందును, ప్రయాణములందుకూడ నిరాఘాటముగా వాడవచ్చును. క్లబ్బులలోను, పాఠశాలలోను, విశేష ప్రయాస వ్యయములేకుండ చరఖాప్రచారమునకుగాను వాడదగినది.

## ఈ పరిశ్రమ నవలంబించువారికి చరఖా సంఘము కలిగించు సౌకర్యములు

1 వడుకువారు తాము వడికిననూలుతో వస్త్రములను నేయించ గోరునెడల యీ సంఘముయొక్క భాండారములలోగాని, వుత్పత్తి సంస్థలలోగాని, అనుబంధ సంస్థలలోగాని తీసికొని నేతనేయించి యిత్తురు.

2. తమకు పోగా మిగులు నూలును, యీ సంఘ ఉత్పత్తి సంస్థలందును, అనుబంధ ఉత్పత్తి స్థానములందును న్యాయమైన ధరలకు కొనుగోలు చేయుదురు.

3. నూతనముగా నేర్చుకొనగోరువారికి రాటము, తక్లీ వడుకుట, స్వయముగా ఏకుకొనుట, యీ సంఘ ప్రచారకులు ఉచితముగా నేర్పుదురు.

4. ఈ పరిశ్రమకు అవసరములైన దిగువ పరికరములు ఈ సంఘముయొక్క వుత్పత్తిస్థానములు, భాండారములు, అనుబంధ సంస్థలనుండి సరియైన ధరలకు అందచేయుదురు.

1. ఎర్రవాడ చరఖాలు.
2. ఏకుడుబద్దలు, యితర పరికరములు.
3. ఆసులు.
4. ఉక్కుకదుళ్లు.
5. ఏకులు లేక దూది.

వీనిలో నేవైన తాత్కాలికముగా లేకున్నను, కోరినమీదట తప్పక త్వరలో సరఫరా చేయగలరు.

కావున సోదరీమణు లీ యవకాశములను గమనించి రాట్నలక్ష్మిని చేబూని, తమ గృహములకు కావలసిన వస్త్రములను తయారుచేసికొనియు, మరియు కుటుంబాదాయమును వృద్ధిపరచియు, మానవోత్తముడగు గాంధీమహర్షి సత్యసంకల్పమును నెరవేర్ప బద్ధకంకణులగుదురుగాక యని వేడుచున్నాను.

## నమస్కృతి

ఉ. గుమ్మడిపూవులన్ బొదవి గొల్లలుగొల్లలు పూవుబొత్తులన్
నెమ్మి నలంకరించి నిను నిద్దపుపీఠమునం దమర్చి గం
ధమ్మును గుంకుమల్ పసపు కమ్మని తెమ్మెర లీనుమేల్మి ధూ
పమ్ములు కమ్మతేనియలు భక్ష్యములాదిగ షోడశోపచా
రమ్ముల నిచ్చుచున్ జిగిరమ్ముల సమ్మది మోడ్పులుంచి యో
యమ్మ బంగరుగొమ్మ ముగురమ్మలయందున పెద్దయమ్మ లో
కమ్ములఖిలమ్ములన్ కరుణగాంచెడియమ్మ గిరీశు నర్ధదే
హమ్మున నెమ్మినిల్చి జగదావళి బ్రోవునగాంచి పెంచుచు
న్నమ్మ నతాళికిన్ సిరియు నాయువు సంతతభోగభాగ్య సౌ
ఖ్యమ్ములొసంగి బ్రోచెడి దయామతిగల్గిన మేటివమ్మ "గో
బ్బెమ్మ"యనంగ ముద్దులను పేర్మివహించిన చిన్నిపేరు గ
న్నమ్మ శుభమ్ములిమ్ము కరుణాయతదృష్టుల జూడుమమ్మ నో
యమ్మ వరములిమ్ము నతహార్షవిధాయిని లోకపావనీ.

చిలకపాటి సీతాంబ.

# స్త్రీలు — వేదాంతము

శ్రీ చోడవరపు సీతారామయ్యగారు

చూచుటకు మాత్రమిది కలియుగముగా గన్పించుటలేదు. ఏమూలగాంచినను భక్తి మందిరములు, భజనమందిరములు, వేదాంత మండలులు, భగవద్గీతోపన్యాసములే కన్పించుచున్నవి, విన్పించుచున్నవి.

ఈపైవాటి యన్నింటియందు ముక్కాలుమువ్వీసము పురుషులకంటె స్త్రీలే ఎక్కువ పాల్గొనుచున్నారను విషయము లోకవిదితము. ఈపనులనన్నియు జేయుట వట్టి బాహ్యాడంబరముగామాత్రమే యున్నది. జీసుక్రీస్తుకూడా "నీవు ధ్యానము జేయునప్పుడు ఒరుల చూడకుండజేయుము" అని చెప్పియున్నాడు.

ఏ పల్లెటూరిలో గాంచినను కొందరు స్త్రీలుచేరి ఏదోయొక పుస్తకమునుగైకొని ఇక దానిని పట్టిపల్లార్చడం, రోజంతయు వేదాంతచర్చలు. చదివి, చర్చించి, గ్రహించుటేగాని ఆచరించుటలేదు.

దగ్గర పట్టణములలో ఏదైనను సమారాధనలుగాని, సప్తాహములుగాని, వేదాంతోపన్యాసములుగాని జరుగుచున్నవని తెలిసినచో ఇండ్లు, వాకిండ్లు, పశువులు, అన్నిటినివదలి వాటిని వినుటకురావడం.

వేదాంతమునుగురించిన ప్రతి ఉపన్యాసములలో పాల్గొనుటకును ఎవరైనస్వాములవారు వచ్చినప్పుడు చూచుటకు వచ్చుటయందును, భజనలు గావించుటయందును స్త్రీలకు వేలము వెఱ్ఱి అమితము.

ఎక్కడ ఏవేదాంతోపన్యాసమువద్ద చూచినను స్త్రీసమూహామే యెక్కువగాన్పించును. ఇతరస్త్రీలకు చోటైననీయక ముందువచ్చినస్త్రీలు అతిశ్రద్ధగా వినునట్లు నటించెదరు. వారిలో నొకరైనను ఆఉపన్యాసమును వినువారేగాని ఆచరణలో పెట్టువారుండరు. ఆచరణలేనిచర్చలు ఫలపుష్పరహితములగు వృక్షములరీతి నిష్ప్రయోజనములు.

ఒక ఉపన్యాసమునకు వెళ్లితిమను సంబరమేగాని దానినుండి ఏమిగ్రహించితిమి, గ్రహించినదాని నాచరణలో పెట్టుటెరీతి అను విమర్శ వారికి జనింపదు. ఆవెఱ్ఱి వేదాంతమునెడ స్త్రీలకు పరలోకమునగలుగు ఫలితములమాట దైవమెఱుగును. కాని ఇహలోక విషయములందుమాత్రము ఒక విధమైన అశ్రద్ధజనించి వారివిధుల కాటంకముగ నుండుననుటమాత్రము నిజము.

స్త్రీలందరు ఈవిధముగా కాలమును వ్యయపుచ్చుటకంటె రాజకీయములలో బాల్గొని తమకువచ్చిన కొలదిచదువును తోడివిద్యావిహీనులగు స్త్రీలకునేర్పి నేటి ప్రపంచమున జరుగుచున్నవిషయముల గ్రహించి వారికిచెప్పి దేశస్వాతంత్ర్యసంపాదనకుగడంగిన నెంతబాగుండును! స్వామి

వివేకానందకూడా "మనము వేలకొలది సన్యాసులముండి, యిన్నినాళ్లనుండి వీరికేమి చేయుచుంటిమి? ఆకలిబాధ కోర్వలేక తల్లడిల్లువారి ప్రక్కజేరి వారిచెవులలో వేదాంతము, తత్త్వము నూరిపోయుచుంటిమా! ఏమిమూర్ఖత్వ"మని సిగ్గుపడినాడు. స్త్రీలు తాము తమభర్తతెచ్చిన ధనముతో మూడుపొద్దులా నిశ్చింతగాభుజించి వేదాంతచర్చల జరపిన చాలుననుకొనుచుండిరి గాబోలు. వారు వెంటనే ఈవిషయముల గ్రహించి తమచుట్టునుగల "దరిద్రనారాయణుల"గాంచి, జాలిచెంది వారికి తోడ్పడుదురు గాక!

కవిసార్వభౌమ రవీంద్రనాథుడుకూడా ఈక్రిందివిధముగా వ్రాసినారు.

"జపతపంబులు గానముల్ ♦ చాలుఁజాలు;
సన్నితలుపులు మూసియీ ♦ యాలయమున
జిమ్మచీకటి గొందిలోఁ ♦ జేరియిట్టు
లొంటినెవ్వని బూజించు ♦ చుంటివిపుడు?
తెఱచి కన్నులఁజూడుము ♦ దేవుఁడెదుటఁ
గానవచ్చునో లేదో నీ ♦ కన్నులకును
గట్టియౌ భూమిదున్నెడు ♦ కాఁపువాఁడు
కూలికై త్రోవఁ గంకరఁ ♦ గొట్టువాఁడు
కష్టపడుచోట నాతఁడు ♦ గలఁడు; చూడు!
దుమ్ముతనవస్త్రములమీఁదఁ ♦ గ్రమ్ముచుండ
నెండవానలలోవారి ♦ దండనుండు;
నతనికైవలె శుభ్రవస్త్రంబు ♦ నవలఁబెట్టి
దుమ్ములోనికి నీవును ♦ రమ్మురమ్ము.
మోక్షమా? చూడుమద్దియే ♦ మూలఁగలదొ
నాథుఁడునుగూడ సృష్టిబం ♦ ధమ్ముఁదాను
బూనియున్నాఁడు సంతోష ♦ పూర్వకముగ;
విడక మనలోనబద్ధుడై ♦ వెలసినాఁడు.
ధూపదీపాదులను బెట్టి ♦ దూరమందు
వెలుపలికిరమ్ము ధ్యానంబు ♦ వీడినీవు;
నలిగి నీవస్త్రములు మాయ ♦ నష్టమేమి?
చెమట నుదుటనుబట్టంగ ♦ శ్రమయొనర్చి
దర్శనముఁజేసి యాతని ♦ దండనిలుము.

[భక్తిప్రబోధినినుండి]

కనుక సోదరీమణులందఱు వెంటనే పవిత్రభారతమాత పిలుపునువిని, నిద్రనుండి మేల్కొని తోడి దరిద్ర సోదరసోదరీమణుల కొఱకు పాటుబడుట మంచిది.

---

## వచ్చే సంచికలో

శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి

"గృహలక్ష్మి"

అను వ్యాసమును ఎదురుచూడుడు.

---

# వరకట్న పరిణామము

శ్రీమతి పులిపాక బాలాత్రిపురసుందరమ్మగారు

"యేమండీ? ఎప్పుడూ మీ క్యాంపులేమో మీ పనేమిటి తప్ప ఇంటిగొడవలే పట్టదాయె. ఇంట్లో జరగాలిసిన పన్లు ఎల్లా జరుగుతాయి ?"

భాస్కర్రావు క్యాంపునుంచివచ్చి భోంచేసి నిద్ర రావాలనే నిమిత్తం గృహలక్ష్మి చేతబట్టుకుని చూస్తూ కండ్లు మూస్తున్నాడు. ఇంతలో భార్య పిలుపు విని విసుగుతో 'ఇస్సాబ్బ ఏమిటి నీ గొడవ?' అన్నాడు కండ్లు తెరచి.

"మీకు గొడవలాగేవుంటుంది. పెండ్లీడుకు వచ్చిన ఆడపిల్ల ఇంట్లోవుంటే తల్లికి ఎంతబాధో మీ కేం తెలుస్తుంది ? ఇదివరకు ఆపిల్లలకు ఇద్దరికీ పెండ్లంటే ఆ ముసిలాయనవున్నాడు గనుక దేశాలన్నీ తిరిగి తెచ్చాడు."

"ఎవరైనా మీ తాతగారైనా పొగడ్త. ఇక చాల్లే కట్టిపెట్టు. మీరిద్దరు కలసి ఘనమైన సంబంధాలు తెచ్చారు. శారదాబిల్లని హడావుడిచేసి అంత చిన్న పిల్లలకు పెండ్లిచేసి అధోగతిపాల్చేశారు. ఇందుమతికి రోజు లెన్నాళ్లు వెళతాయి. దాని గతేమిటి చెప్పు. పెండ్లిచేస్తానంటే మీవాళ్లు ఒప్పుకోరంటావు ? ఇంత కాలేజీలోఅన్నా చేర్పించి చదువుకున్నవరకు చదువు చెప్పిస్తా. పెద్దదాని సంబంధం చూశామా చదువు చాలించాడు. అతని తండ్రి పెద్దవాడైనాడు. అతని ఉద్యోగం విషయంలో ఎన్ని తిప్పలుపడుతున్నానో చూస్తున్నావు గదా? అడ్డమైనవాళ్ల కాళ్లు పట్టుకుంటున్నాగాని ఆలోచించుదామనేవాళ్లు, నెలో రెణ్ణెల్లో పోయింతరువాత కనపడు అనేవాళ్లేగాని పది రూపాయల ఉద్యోగం చూపించేవాడెవడు కనిపించ లేదు. ఇవన్నీ చూస్తూ నీకుమట్టుకు ఎల్లాతోస్తోంది ఇప్పుడే పెళ్లిచెయ్యాలని ?"

"వాళ్ల గీతకనా చేస్తారు? తిరిగితిరిగి మంచివనే తెచ్చారు. అప్పుడు మీమట్టుకు ఒప్పుకోలేదా? ఇప్పుడు ఖర్మం చాల్లేదు గనుక వాళ్లని నన్నుకూడా అంటున్నారు. ఏంచేస్తాం, ఎన్నినాళ్లు పడాలి విధివచ్చినప్పుడు. ఇక ఏకష్టము లేకుండా మీరే వెతికి తెచ్చుకోండి."

"ఒప్పుకోక ఏంచేస్తాను. శారదాబిల్లనే కత్తి నా గొంతుమీద పెట్టి ఏవో చూపిస్తే సరేనన్నాను. నేను ఇప్పుడు పెండ్లిచెయ్యను. నాకు వెతికేపనే లేదు. ఏదన్నా కష్టమొస్తే సాంఖ్య గీతని వేదాంతం నేనుచెప్పను."

"అయ్యో! అదేమిటి? అల్లాఅంటారు. పెండ్లి చేయకపోతే ఎల్లాగ? ఇప్పటికే ప్రతిగుడిదగ్గిరా మంచినీళ్ల నూతిదగ్గిరా అమ్మాయినిగురించి ఎల్లా చెప్పుకుంటున్నారో వినేదానికి నాకు తెలుస్తుంది."

ఏం చెప్పుకుంటున్నారు. అమ్మాయికి ఇంకా పెండ్లిచెయ్యలేదనేనా? గుడికిపోవడం పదిమంది వక చోట చేరడం ఊరికెబుద్ధులు చెప్పనేందుకే కాబోలు. ఆడవాళ్లు వకచోటచేరితే వూరుకోరు. అక్కడ దేవుడు సంగతేమి అక్కర్లేదు కాబోలు. పోనీ చెప్పకుంటే నీకేమీ? నా స్నేహితుడు మాధవరావున్నాడే వాడి కుమార్తె బి.ఏ. చదువుతున్నది. ఇంకా పెండ్లి కాలేదు. ఆమె నెవ్వరు చెప్పుకోటం లేదేం?"

"వారు బ్రహ్మసమాజమతం పుచ్చుకున్నారు గనుక వారెవ్వరు అనరు."

"అయితే నేను ఆ మతమే పుచ్చుకుంటా నిరాక్షేపణగా ఇందుమతికి పెండ్లి చెయ్యొచ్చు. దమయంతికి చదువు చెప్పించొచ్చు."

"అయ్యో ఖర్మమా? ఇప్పుడు ఈ సంసారంతో మనం మతం పుచ్చుకుంటే ఏమైపోతామో చూచు

క్కొండి. మీ నాయనగారు వైశ్వదేవంచేశారు. ఆయన ఇక మన గుమ్మం తొక్కరు. మీవాళ్లుమట్టుకు వస్తారా? ఎవ్వరురారు. మగపిల్లలు అధోగతిపాలౌతారు. ఇవ్వేం బుద్ధులు పెద్దవాళ్లౌతున్న కొద్దీని? ఏదో సంబంధంచూచి దానికి పెండ్లిచెయ్యక."

"ఆమతం తీసుకున్నవాళ్లంతా అధోగతిపాలైనారా? వాళ్లూ బాగానేవున్నారు మనకంటె ఎక్కువగా. సరే ఆలోచిస్తాను. ఇక నీవు వెళ్లు. కొంచం సేపు పడుకోవాలి" అని శాలువా కప్పుకొని పడుకున్నాడు భాస్కర్రావు.

భానుమతి కిందికొచ్చి చాపమీద పడుకొని ఆలోచిస్తున్నది. ఇద్దరుపిల్లల విషయములోను భర్తగారు అన్నమాటలు నిజమే. తలుచుకుంటే ఆమె గుండె నీరైపోతుంది. పెద్దల్లుడికి ఉద్యోగంలేకపోయినా వున్నది తింటూ కాలం గడుపుతారు. చిన్నదాని జీవితమే దుర్భరం. ఏమనుకుని ఏమి ప్రయోజనం. కాస్త సేపు కళ్లనీళ్లుకార్చి నిద్రపోయింది తానుకూడా.

మధ్యాహ్నం రెండు గంటలైంది. భాస్కర్రావు లేచి క్రిందికివచ్చి "ఏం భాను నిద్రా? కోపమా" అన్నాడు. గాఢనిద్రలోవున్న భానుమతి పలుకలేదు. తట్టిలేపాడు. కండ్లు నులుముకుంటూ లేచి "ఏం వెళ్లుతున్నారా? ఫ్లాస్కులో కాఫీ వుంది. పుచ్చుకొని వెళ్లండి. నిన్నటి మైసూరుపాక్ వున్నది. పలహారం చెయ్యరూ" అంటూ కాఫీ ఫలహారము తెచ్చి అందిచ్చింది భర్తకు. కుర్చీలో కూర్చుని ఫలహారం చేసి వెళ్లుతున్నానని కండువా తీసుకొని గుమ్మం దాటుతున్నాడు భాస్కర్రావు.

"ఇదుగో ఆఫీసుకు వెళుతున్నారు కాబోలు. మళ్లీ ఎక్కడికి క్యాంపుకు వెళుతారో. మాఘమాసం కూడ వెళ్లిపోతుంది. ఈనెల్లో తప్పకచేయాలి" అన్నది భానుమతి.

"సరే, బందరు సంబంధమే కొంచము బాగున్నది అన్నిట్లోకి; కాని ఆయన అతి లోభని చెపుతారు. అందుకే కొంచం ఆలోచిస్తున్నా."

"ఆయన లోభితనం మన కేం నష్టం. ఆయనకు ఇంకెవ్వరులేరు గదా. ఆ ముసిలాయన ఎన్నాళ్లు బ్రతుకుతాడు. పాడుచేస్తే కష్టంగాని ఆదుచేస్తే వాళ్లకే లాభంగదా? అదే ఆలోచిస్తే బాగుంటుందేమో. మీ ఇష్టం"

"సరే. వుత్తరం వ్రాస్తాను" అని ఆఫీసుకు వెళ్లాడు భాస్కర్రావు.

౨

వెంకట్రావుగారు చాలా లోభి. ఆయన పెనము పుచ్చుకున్నప్పటినుండే లుబ్ధత్వం మరీఅధికమైంది. నిద్రలేవడం కాల్యాలు తీర్చుకున్న వెంటనే దొడ్డిలో చెట్లు కాయలు పండ్లు లెక్కపెట్టడం అమ్మకమునకు పంపవలసిన కాయలు పండ్లు లెక్కవ్రాసి బజారుకు పంపడం, మార్కెట్టుకు తాను స్వయముగా వెళ్లి కొయ్యతోటకూర, పుచ్చువంకాయలు, చింతచిగురు తెచ్చి ఇవి రెండురోజులు రావాలి సుమా, ఇవి ఎనిమిదిపైసాలు పెట్టి తెచ్చా అని భార్యకు ఇవ్వడమూ, ఖజానా లెక్కించుకోవడం, తరువాత కచ్చేరి అరుగుమీద కూర్చుని వాయిదాలు వెళ్లిపోయ్యే నోట్లు వెతుకోవడము, ఈరోజు కోర్టువాయిదాలేమైన వున్నవేమోనని ఫైలులో చూచుకోడము ఇది వెంకట్రావుగారి దినచర్య.

ప్రొద్దుపొడుపు ఎండకు నులకమంచము అడ్డము పెట్టి దానిమీద జంబుఖానవేసి కంసాలి రామలింగం వేసిన రాగితీగె పకప్రక్కను, స్వయముగా పేనిన నులకతాడు పకప్రక్కకట్టిన కంటిఅద్దాలు వేసుకొని, కోడువిరిగిన దస్కుపెట్టెకు ఇటుకరాయి ఎత్తుపెట్టి, ఆ పెట్టెమీద కాగితాలుపెట్టి చూచుకుంటున్నాడు వెంకట్రావుగారు.

వేసవికాలమగుటచే ఏడుగంటలకే కుమారుడికి

భోజనముపెట్టి ఇంటిపనులన్నీ తీర్చుకుని నాల్గు ప్రాణాలు బిగపట్టుకుని వక్క ప్రాణంతో అడిగింది.

"ఏమండీ! నిన్న గుడివాడనుంచి వుత్తరం వచ్చిందంటిరే ఏమన్నారు జవాబు వ్రాశారా?"

తలఎత్తిచూచి కంటద్దాలు పైకి తీసుకుని దారముతో పాళీబిగించిన కందిపుల్ల చెవుకుపెట్టి చిటికెడు నస్యం అరచేతిలో వేసుగుని ముక్కుకు అందిస్తూ "ఏమిటి అంటున్నావు? నిన్నటి వుత్తరమా? ఎందుకంత తొందరపడుతావు పెళ్లో పెళ్లో అని? ఆడపిల్ల గనుకనా పెద్దదౌతుందని భయపడడానికి. నేనూ అదే ఆలోచిస్తున్నా. ఇప్పటికి వాడి చదువుకు నాలుగువేలయింది. అంతవరకున్నా ఇచ్చేవాళ్లువస్తేగదా పెండ్లిచేసేది?"

"అంత ఇచ్చేవాళ్లు రాకపోతే చెయ్యరా?"

"రాకపోతే ఎల్లా చేస్తాను? నీ అబ్బముల్లేమన్నా తెచ్చి ఆనాలుగువేల లోటూపూడుస్తావా?"

"నాఅబ్బ సంగతెందుకు? ఎప్పుడో చచ్చినవాడిని పెళ్లగించండం. మీ ఇష్టమైతే చెయ్యండి లేకపోతే వూరుకుండి నాకెందుకు? ఏమో వక్కపిల్లవాడుం గదా అచ్చటా ముచ్చటా జరుపుకుందామని తోటివాళ్లను చూచి ముచ్చటపడుతున్నాను."

"నేనూ ఆలోచిస్తూనేవున్నా నీకు వియ్యాలవారు ఏవిధంగా ముట్టచెప్పినా నాకు లాభమే. ఈ గుడివాడవారే మూడువేలిస్తామని వ్రాశారు. లాంఛనాల వగైరా వంకతో ఇంక వెయ్యిగుంజుదాం. ఇదే ఆలోచిస్తాను కానీ తొందరేం."

"మనకు లాంఛనాల కెవరున్నారు నేను వక్కతెనేగా."

"వోసీ వెఱ్ఱిదానా ఇంత తెలివితక్కువదానివేం? నీచెల్లెలిపిల్లలు ముగ్గురు అక్కపిల్లలు నలుగురు నీతో ఎనిమిదిమంది వేరువేరు సూటపదహారులు ఆమాంబాపతు ఇన్నింటితో సహా వెయ్యిరూపాయలు చులాగ్గ వస్తై."

"వాళ్లను కూర్చోబెట్టి మనం డబ్బు తీసుకుంటే బాగుంటుందా?"

"బాగుండకేం చేస్తుంది. వాళ్లకే తెలుస్తుందిలే. ఆవుపాయాలన్నీ నేచేస్తాగా. నీవు కూర్చోబెట్టు. వాళ్ళని కాదంటె బొట్టుపెట్టె వగైరా సామానిద్దాం."

"సరే అసలు కుదర్నియ్యండి."

"కుదర కేంచేస్తుంది! ఇది కాకపోతే ఇంకొకటి. ఈఏడు కాకపోతే ముందుకు."

"మళ్లీ అంతలోకొచ్చిందీ ముందుకు. ఆముందుకు అని మనమూ పెద్దవాండ్లమౌతున్నాం గదా కోడలు మనుమలు ముచ్చట తీరొద్దూ. బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా పనికిరాదంటారు పెద్దలు. ఇప్పుడు ఇరవైఏండ్లు వచ్చాయి. ఇంకా ఎప్పుడు చేస్తారు? వాడు ఈకాలపు పిల్లవాడు కాడు గనుక సరిపోయింది మీరు చేసే పనులకి."

"వోసి చాదస్తురాలా! మన మేం పెద్దవాళ్లమే? మానాయన నూటపదేండ్లు బ్రతికాడు. మాఅమ్మ నూటపదిహేనేండ్లు బ్రతికింది. ఇప్పుడు మనకు ఎన్నేండ్లు? నీకు అరవైన్ని నాకు డెభైయ్యేగా. అప్పుడేపే తొందర కోడండ్లకు మనమలకును కావలసినంత కాలముంది."

"లక్ష్మమ్మగారు! నడుముకు మంత్రం పెడతారా?" అన్నాడు మెహతాదు సుబ్బన్న వచ్చి.

పసిపిల్లను బుజానపడుకుబెట్టుకుని గరికిపోచ చేతబట్టుకుని, "లక్ష్మమ్మగారు ఇదేందో చూడండి. పొక్కులు పొక్కులుగావున్నాయి" అని ఆటుగాను కుని నుంచున్నది చాకలివెంకి.

"సుబ్బన్నా నీకు నడుమునొప్పెందుకు పట్టింది రా?" అన్నది లక్ష్మమ్మగారు మంత్రిస్తూ.

"నిన్న కరణంగారి వడ్లబస్తాలు మరకు ఎత్తామండి అప్పుడు పట్టింది. వారబ్బాయి పెళ్లంట. మీ అబ్బాయిగారి పెళ్లెప్పుడూ? అమ్మగారు!"

లక్ష్మమ్మగారు రెండడుగుల వెనక్కునడుస్తూ అరుగుమీదికి తలవిసిరింది వారి నడగమన్నట్లుగా.

"పంతులుగారు! అబ్బాయిగారి పెండ్లెప్పుడండి? ఇప్పుడు కొత్తమర వచ్చింది. చాలా మంచిదండి. వక్క వడ్లగింజకూడావుండదు. నేనక్కడేవుంటున్నా. తమరుకూడా పంపండి. నిలవ్వుంచకుండా ఆరోజే వేసి పంపుతాం."

"మాకు మరకు వేసే అన్ని అవసరము లేదురా. రెండు బస్తాలు దంపిస్తే కొల్ల."

"వా రెందుకండి అన్నిబస్తా లేయిస్తున్నారు?"

"వారి కెక్కువున్నాయి కాబోలు వేస్తున్నారు."

"బాబు. మాకందరికి పప్పన్నం కాబోలు. దబ్బున సెయ్యండి. ఈ ఏడు మా అబ్బాయికూడా పల్లకీకున్నాడు."

"ఈయన డబ్బంతాకూడా తగలేస్తారు గావాలె. పెళ్లికూడా గుప్పెడన్నం వెయ్యకుండా" అని లోలోన ఇద్దరు ఏమోఅనుకుంటూ వెళ్లారు సుబ్బన్నా వెంకీ.

లక్ష్మమ్మగారు లోభి కాకపోయినా భర్తముందర ఆమె త్యాగం పనికివచ్చింది కాదు. ఆయన చూడకుండా ఏదన్నా దానం ధర్మం చేస్తూ నేవుంటుంది. ఆడపిల్లలు లేకపోవడంచేత ఆవిషయమైన కష్టసుఖాలేమి తెలియవు. లక్ష్మమ్మగార్కి కొడుకు పెండ్లి కావడం తనకు లాంఛనాలు జరగడం చూచుకున్నది గాని ఇంతమందిని ప్రోగుచేసి వారి నెత్తినపెడితే వారి కెంతకష్టమో అనే ఆలోచన ఆమె మనస్సుకు తట్టలేదు. అక్కపిల్లలను చెల్లెలిపిల్లలను లాంఛనాలకు ఏర్పాటు చేసుకున్నది. లగ్నం ఎప్పుడు అని ఎదురు సూస్తున్నది.

3

అనుకున్నప్రకారం పెండ్లి అయిదురోజులు దివ్యంగాజరిగిందిగాని అలుక కట్నానికిమట్టుకు పేచీపెట్టి వెయ్యిన్నూటపదహారులు వప్పించారు వెంకట్రావుగారు భాస్కరరావుగారిచేత.

భాస్కరరావుగారిది కొంచం పెద్దకుటుంబం. ఇదివరకు ఎక్కువ ఆదాయంవస్తూండేది గాని ఇప్పుడు అన్నింటికి ధరలుతగ్గటంవల్ల ఆదాయం బొత్తుగా తగ్గినది. ఖర్చులు హెచ్చుతున్నవి. ఈ పరిస్థితులలో సంసారం బొత్తుగా చెడ్డది. ఇల్లా కొన్నిరోజులు గడిచినాయి.

ఒకరోజు భాస్కరరావు ఆఫీసునుంచివస్తూ వుత్తరంతీసుకువచ్చారు.

"భానూ! ఆనాడుఅన్నావు జ్ఞాపకమున్నదా ఆయన లోభితనం మనల్నేంచేస్తుందని ఈవుత్తరం చూడు. మనసంసారం స్థితిమారుస్తూకూడా అలుకరోజు వప్పించుకన్న వెయ్యిన్నూటపదహారు ఇప్పుడు ఇస్తేగాని అల్లుడు పునఃస్సంధానానికి రానంటున్నాడని వియ్యంకుడుగారు వ్రాశారు. దీనికికారణం లోభితనమేగదా. ఇప్పుడు ఇన్నిరూపాయ లెల్లా వస్తాయి? ఏమీతోచలేదు. సంబల్ దీవినుంచి మన రైతువస్తేను కొబ్బరితోట బేరం ఇవ్వమని చెప్పాను."

"అయ్యో! ఆ కొబ్బరితోట కాస్తా అమ్మేస్తే ఇక ఆ పల్లపుపొలంలో వచ్చేదేమిటి? మనం తినేదేమిటి? ఈ కట్నముల దురాచారం తొలగించేవారు లేరు గదా?"

"ఎవరు మానుతారు. ఎవరికి వారికే కావాలా యిక మానేవారెవరు."

"పోనీ, రేపు నీవు మానావా? నీ కొడుకులకు పుచ్చుకోకుండా?"

"నిరభ్యంతరంగా మానాను. మన పిల్లలను అమ్ముకోవడం నా కిష్టంలేదు. నరమాంసం అమ్మినట్లేగా?"

"ఇప్పుడిలాగే అంటావు. అప్పుడూ నీవూ గునుస్తావు. కొంచం తక్కువైతే మీరే చెడిచారంటావు నన్ను. నీవు మాను. ఇంకా కొందరు వెంటనే మానారు."

“ఇప్పు డెందుకు చూడండి. వక్క పైసా అయినా కట్నము లాంఛనాలు లేకుండా పెండ్లిచేసు కొచ్చి లోకానికి సంఘానికి ఆదర్శము చూపించు దాం.”

“సరే. ఇప్పుడు వారి కేం వ్రాయమంటావో చెప్పు?”

“నే నేం చెప్పను, పిల్లకు సారెపెట్టి పంపేప్పుడు ఇస్తామని. ఇప్పుడు దయచేసివస్తే శక్తికొలది వేడుక చేసి పంపుతామని వ్రాయండి.”

౮

పిల్లను వారింట్లో వుంచిబెట్టు చేయడంకంటే మనింటికి తీసుకువచ్చి దబ్బిస్తేగాని పిల్లను పంపనంటే డబ్బు తొందరగా వస్తుందనే వుద్దేశ్యముతో అక్కర తీర్చి కోడల్ని తీసుకువచ్చారు వెంకట్రావుగారు. సంక్రాంతిపండుగ వస్తున్నది ఆడపిల్లల పండుగ ఎల్లాగైన డబ్బిచ్చి పిల్లను తీసుకువెళ్లుతారు గదా అని పండుగకొరకు ఎదురుచూస్తున్నాడు. డబ్బు ఎక్కువ కూడిన కొలది మరియాదకూడా ఆలోచించటంలేదు. డబ్బే ఆయన మొదటి ప్రాణంగావున్నది.

పండుగ వచ్చేసరికి దమయంతికి నాలుగు నెలలు వచ్చినాయి. ముఖము తెల్లపడ్డది. బొత్తుగా చిక్కిపోయింది. అత్తగారి ఆదరణకంటె మామగారి నిరసన అనాదరణ ఎక్కువగావున్నది. ఏమైతే నేం చేస్తుంది. భర్త నిరుద్యోగి, మామగారు పెడితే తినాలి, లేకపోతే పడుకునాలి. అన్నింటికి వోర్చుకుని కాలం గడుపుతున్నది దమయంతి. సరి నెలలు కావడంచేత పండుగకు పుట్టింటికి పంపలేదు. తరువాత దమయంతి తండ్రి వచ్చి వియ్యంకుడిని అడిగి కుమార్తెను ప్రయాణముచేసి తీసుకువెళుతుండగా భర్తగారి పోరుపడలేక బండిదాకావచ్చి లక్ష్మమ్మ చెప్పింది “అన్నగారు! మీ బావగారి సంగతి మీకు తెలును గదా. సురక్షితముగా పిల్లను పంపేటప్పుడు మరిచిపోవద్దు” అని. వెంకట్రావుగారు రైలుదాకా వచ్చి పైకం విషయమై హెచ్చరించి పిల్లవాడి ఉద్యోగంనిమిత్తం ఈపైక మవుసరమని గట్టిగా చెప్పాడు. ఈకథంతా చూస్తూంటే దమయంతి భర్తయైన మోహనరావుకు ఇది వక నాటకంగావున్నది అని ఆలోచిస్తున్నాడు.

౯

దమయంతికి ఆడుశిశువు కలిగి ఆరునెలలైంది. ఇంతవరకు అత్తవారు తీసువెళ్లుతామని పంపమనిఐనా కబురులేదు. బారసాల చేసుకోమని కబురుపంపితే వెయ్యిన్నూటపదహార్లు వడ్డితోసహా ఇస్తే తన కొడుకును పంపుతానని వియ్యంకుడు కబురుచేశాడు. భాస్కరరావుగారి స్థితి బొత్తుగా చితికిపోవడంచేత వక్కమాటు ఇంతమొత్తం ఇవ్వలేక వూరుకున్నారు. తల్లి మెళ్లోనగలుకూడా పెండ్లికే ఖర్చైనవి గనుక ప్రస్తుతం వీరు ఇచ్చేది కనిపించలేదు. దమయంతిని వారు తీసుకువెళ్లేది కనిపించలేదు. అత్తవారింట వున్నది కొద్దిరోజులైనా భర్తప్రేమ ప్రతిక్షణము జ్ఞాపకము వస్తూనేవున్నది దమయంతికి.

తండ్రిగారు ఈవిధముగా తన్ను బజారువస్తువుగా మార్చడము, తాను తండ్రిచేతి కీలుబొమ్మవలె తండ్రిగారు ఏదిచేయమంటె అదిచేయడము, తనకు వుద్యోగము దొరక్కపోవడము, తన భార్యా బిడ్డాకూడా తండ్రి స్వార్జితపు ఆస్తిమీద ఆదారపడి ఉండటము, తండ్రి లుబ్ధతకు సహాయము, కట్నాల దురాచారము ఆలోచించుకుంటే తన జీవితము దుర్భరమని తోచింది. ఈ వెధవకట్నము గదా ఇంతకాలంనుంచీ అంత ప్రేమగల భార్యను ముద్దులుగారే బిడ్డను ఎడబాటు చేసింది. ఈ కట్నాల దురాచారమునకు నా జీవితాన్ని బలిఇచ్చి సంఘానికి ఆదర్శముచూపుతాను అనుకుని డబ్బుతోసహా భార్యను తీసుకువస్తానని తండ్రిగారికి చెప్పి బైలుదేరి గుడివాడ వచ్చాడు మోహనరావు.

అల్లుడిరాక చూచి అత్తగారు మామగారు అందరు పరమానందభరితులైనారు.

భానుమతి అల్లుడు రాకరాక వచ్చినందుకు పిండి వంటలతోసహా భోజనముపెట్టింది. అంతా ఎక్కడివాళ్లక్కడ పడుకున్నారు.

"దమయంతీ! నేను ఇన్నిరోజులనుంచీ రాకపోతే నీవు ఏమనుకున్నావు?"

"ఏమీ అనుకోలేదు. మా తండ్రిగారు డబ్బు ఇవ్వలేకపోబట్టికదా నా జీవితము ఈవిధముగా వున్నది అనుకున్నాను. ఇప్పుడు వారికి డబ్బుకు చాలా ఇబ్బందిగావున్నది. ఆడపిల్లలమూలమున వారి స్థితి ఈవిధమైంది. మేము పుట్టుకపోయినా బాగుండేది."

"ఐతే నిన్నెప్పుడు పంపుదామనుకున్నారు?"

"ఇక వక కొబ్బరితోట మూడెకరముల పల్లపు భూమి వున్నది. అది అమ్మిఇచ్చి పంపవలెనని ఆలోచిస్తున్నారు."

"అయ్యో పాపం. అది కాస్తాఅమ్మితే ఇక వారి జీవనం ఎల్లాగా? మీ తమ్ములు ఇంకా సంపాదించటం లేదు గదా?"

"సంపాదనేమిటి చదువులే పూర్తికాలేదు."

"ఇక వారు జీవనం ఎల్లాచేస్తారు?"

"నన్ను పంపినతరువాత వారి తిప్పలు వారివి. మా నాన్నగారికి పెనషను. అది చాలకపోతే? ఉపనయనమునాటి మాటవున్నది సుమతీ! అని పెద్దలన్నారు. ఇక నాలుగు కొంగులు ముడేవారజీవనం."

"అబ్బా ఎంత కష్టము?"

"ఆడపిల్లలను కన్నవారికి ఎంత కష్టమైనా తప్పదు."

"దమయంతీ! ఇక నాకు సెలవు."

"అదేమి? నన్ను తీసుకునివెళ్లరూ?"

"నేను ఇప్పుడు ఇంటికి వెళ్లుటలేదు."

"ఎక్కడికి వెళ్లుతున్నారు?"

"దేశాంతరము."

"నేను చెప్పిన మాటలనుబట్టి డబ్బులేకుండా నన్ను తీసుకువెళ్లవలసివచ్చినదని కాబోలు. ఇల్లా అబద్ధాలాడుతున్నారు? రేపు తప్పక డబ్బు వస్తుంది. డబ్బుతోసహా నన్ను తీసుకువెళ్లవచ్చు"

"రామ రామ! ఇక ఆ డబ్బుమాట నాముందర తలపెట్టవద్దు. ఆడబ్బుతో నాకు ఏవిధమైన సంబంధములేదు. నీదగ్గిర సెలవుతీసుకుని ఇక నాదారి నేను చూచుకోటానికి వచ్చాను."

"తమరు నాదగ్గర సెలవు తీసుకోటానికి వచ్చారని హాస్యపుమాట లెందుకూ? పసిదానను ముక్కుపచ్చలారని పదునైదు సంవత్సరముల బాలను నా దగ్గర మీరు శె వడుగుట ఎంతహేయము."

"నీ మాటలు పొరపాటు. అగ్నిసాక్షిగా పెండ్లాడి అదియునుగాక నాలుగువేల రూపాయలకు నీకు అమ్ముడుపోయిన నేను నీకు తెలియకుండా ఏ కార్యమును చేయుటకైనను మానవమాత్రుడనైన నాకు ఎట్లు స్వతంత్రత కలుగును?"

"మీ మాటలు నా కర్థంకావటంలేదు. మీరు చేయదలచిన కార్య మేమో నాకు విపులంగా చెప్పండి."

"నేను దేశాంతరము వెళ్లుతాను. నీవు ఇక్కడే వుండు."

"మీరు దేశాంతరము వెళ్లుటకు కారణమేమి?"

"మా నాయనగారే కారణము. మీవారికి భిక్షాపాత్ర చేతికిచ్చి ఇంకా రూపాయలు తెమ్మనుట నాకిష్టములేదు. తీసుకురానిదే మా నాయనగారు రానీయరు. ఈరోజులలో నాకు ఎక్కడా బానిసత్వము కూడా దొరికేటట్లు కనిపించలేదు. గనుక ఈపని నా బుద్ధికి బాగున్నది."

"సరే, నాకూ బాగానేవున్నది నేనుకూడ వస్తాను, మీరు వెళ్లేచోటికి."

"నీవు వచ్చునది కాదు అస్థలము. చిన్నదానవు,

ఆరునెలల పసికందును తీసుకునిరాలేవు. గనుక సుఖముగా మీవారి దగ్గరవుండు."

"మీరులేని సుఖము నాకు సుఖముకాదు. ఇన్ని దినములనుంచీ ఎప్పుడు మంచిరోజుల వచ్చునా ఎప్పుడు తీసుకుని వెళ్లుతారు అని మీలేఖల కన్నుల నద్దుకుంటూ నిముసములు గంటలు లెక్కించుకూ కాలము గడుపుతున్నాను గాని మీరు దేశాంతరులైన తరువాత నాకు ఈ ప్రపంచముతో పనిలేదు."

"చిన్నదాననని నీవే చెప్పావుగదా, ఏమో కఠినముగా మాట్లాడుతున్నావే?"

"మీరు చెప్పినదే కదా అగ్నిసాక్షిగా పెండ్లియాడినానని. అట్టి అర్ధాంగినివిడచి అర్ధశరీరము వెళ్ల తలచుకున్నారా?"

"దమయంతీ! అందుకే నీవద్ద ఆజ్ఞగొని వెళ్ల తలచాను."

"అనుజ్ఞలేనిచో ఏమి చేసెదరు?"

"బలవంతముగానైనా వెళ్లతలచాను."

"అట్టి బలవంతపు పని నేనుకూడా చేయవచ్చునన్న మాటేనా?"

"నీవు ఎంత బలవంతపెట్టినా నిన్ను తీసుకొని వెళ్లను. నీవు ఇక్కడనేవుండు" అన్నాడు మోహనరావు కోపంగా.

"మీ ఇష్టము వచ్చినప్పుడు పెండ్లియాడి ఇష్టము వచ్చినప్పుడు విసర్జించుటకు పుచ్చిపోయిన వంకాయ కాదు గోడవతల పారవేస్తే పోవటానికి. అగ్నిసాక్షిగా పెండ్లియాడిన ధర్మపత్ని మీరు వెంటతీసుకుని వెళ్లినాసరే, లేనిచో నాదారి నే చూచుకుంటా" అన్నది దమయంతి గంభీరంగా.

"నీవు ఈవిధముగా మాట్లాడుతూంటే నేను నిజము దాచలేను. నా జీవితము విరమించదలచాను."

"అయ్యో నాథా! నిజమా! మీ జీవితములేనిచో నాకు శరణ్యమేది. నా జీవితముకూడ మిమ్మనుసరిస్తుంది. మీరు నాకుకూడ సెలవియ్యండి" అన్నది దమయంది గద్గదకంఠముతో.

"హరి! హరీ! ఆశిశువు నీకొరకు అల్లాడదా? అట్టిపని నీ వెన్నడు చేయవద్దు. పతిమాట శిరసావహించుటయే పతివ్రతలక్షణము. నామాట విని నీవు సుఖముగా మీ పుట్టినింటవుండు. ఇదే నాకు సెలవు."

కండువా గట్టిగాపట్టుకుని "ఆవులుపోతూ లేగలకు మేతపెట్టునా? ఆ శిశువుతో మీకు లేని సంబంధము నాకుందా? భర్తృవిహీననై జీవించుటంటె కష్టమో సుఖమో మరణమో భర్తతోడి లోకమే పతివ్రతలక్షణము. మీరు దారి చూపకున్నారు. ఇవిగో నా కేశములు, ఇదుగో నా పమిటచెరుగు, ఇవే నాకు దారిచూపును" అని వేలవ్రాలింది దమయంతి.

"దమయంతీ లే. ఇచ్చట మన మే ఘోరకృత్యము చేసినా మీ నాన్నగారు కష్టాలపాలౌతారు, గనుక బైలుదేరుము. ఇంటిదగ్గర ఏదో ఆలోచిద్దాం."

ఈమాట విని దమయంతి అతిఉత్సాహముతో లేచి ప్రయాణమై తల్లికి తండ్రికి చెప్పబోయింది. డబ్బువిషయమై వారు అడిగితే ఇప్పుడు అవుసరము లేదట, ఎప్పుడోవున్నప్పుడు ఇవ్వవచ్చునట అని చెప్పి అమ్మాయి వెళ్లుతున్నానని బండి ఎక్కింది దమయంతి. రెండు కన్నీటిబొట్లుక్రింద రాలినై. శరవేగముతో వెళ్లింది గుఱ్ఱపుబండి రైలుస్టేషనుకు.

"డబ్బు ఇవ్వకుండా పంపాముగదా. ఏమి కష్టపెడతారో అత్తవారు" అని తల్లిదండ్రులు విచారపడ్డారు గాని ఏమనుకుని ఏమి ప్రయోజనం?

౬

పంచమీ సోమవారం రాత్రి పది గంటలకు వెంకట్రావుగారి వాకిట్లో బండి ఆగింది. డబ్బుతో సహా కోడలు వచ్చిందని మంచమ్మీదనుంచి త్రుళ్లిపాటుతో లేచి తలుపుతీశాడు వెంకట్రావుగారు,

కొడుకు కోడలు ఇంట్లో ప్రవేశించారు. లక్ష్మమ్మ గారి ఆనందానికి మేర లేకుండావుంది. మనుమరాల్ని ముద్దులాడింది. కోడల్ని దగ్గరకుతీసుకుని కుశల ప్రశ్న లడిగింది. మామగారికికూడా సంతోషముగానే వున్నది గాని డబ్బు కంటికి కనిపించినగాని మనస్సు కుదుటపడేటట్లు లేదు. ఏమైనగాని కొడుకు నడగా లనుకున్నాడు.

"ఒరే మోహను! ఇల్లారా వకమాటు."

"ఏమిటి నాన్నగారు?"

"చీకటికాలం ఏది ఆపైకం ఇల్లాఇయ్యి."

"నాన్నగారు ఇప్పుడేం తొందర? నీ కోడలు కూడా జాగ్రత్తమనిషే. తలక్రింద పెట్టుకు పడుకొంటుంది. రేపుప్రొద్దున్న తీసుకుందుగాని ఇప్పుడే అడిగితే దాని మనస్సు కష్టంగావుంటుందేమో?"

"సరే. వెళ్లిపడుకోండి" అని తన నులకమంచ మ్మీద పడుకున్నాడు వెంకట్రావుగారు.

మోహనరావు ఒక వుత్తరం వ్రాసి తలక్రింద పెట్టుకున్నాడు. "దమయంతీ! ఇదుగో నా జీవితము పూర్తిఅయింది. నీ యిష్టం. నా చేతిమీదుగా నేను ఇవ్వలేను" అని ఏదో గొంతులోపోసుకుని పడుకున్నాడు. దమయంతికూడా మిగిలింది త్రాగి సీసా నిండా పాలుపోసి పిల్లపక్కలో పెట్టి తాను వేరే మంచముమీద పడుకున్నది. తెల్లవారింది. ఇంకా లేవలేదు. ప్రయాణపు బడలికవల్ల లేవలేదనుకున్నది అత్తగారు. పసిబిడ్డ లేచి ఏడుస్తున్నది. గదిదగ్గరకు వచ్చి పిలిచింది. లేవలేదు. తలుపునెట్టి లోపలకి వెళ్లి తట్టిలేపింది. లేవలేదు. లక్ష్మమ్మగారికి కాళ్లు చేతులు వణుకుతున్నాయి. ఎల్లాగో ప్రయత్నము చేసి భర్తను పిలచి గొల్లుమన్నది. కొంపమునిగింది రండీ అన్నది. వెంకట్రావుగారు వచ్చి చూశారు. ఏముంది? అంతా నిశ్శబ్దం. లక్ష్మమ్మగారు నెత్తి మోదుకొంటూ ఏడుస్తున్నది. వూరుకోవే అని నోరు మూసి వెంకట్రావుగారు పరుపుపక్కలు వెతకడం మొదలుపెట్టారు. ఎక్కడా పైకం దొరకలేదు గాని మోహనుడిపక్క క్రింద ఒక వుత్తరంవున్నది. అది విప్పిచదివితే ఈవిధంగావున్నది.

"మహారాజశ్రీ గ్రామాధికారియైన మున్సిబుగార్కి.

ఆయ్యా! వివాహముల సంతలో పురుషపశువులను కొనుటకు స్త్రీరత్నములను కనిన తలిదండ్రులు స్థిర చరాస్తులను అమ్మకొని బిక్షాటనకు బైలుదేరుచున్న దుస్థితినిచూచి భరించలేక నాజీవితము విరమించుచున్నాను. నావంటి త్యాగస్వభావులు కొంతమంది బైలుదేరి సంఘమునకు ప్రపంచమునకు ఆదర్శము చూపినగాని కట్నములనే పేరుతో విక్రయించే వర విక్రయములు తగ్గి సంఘము బాగుపడదనే వుద్దేశ్యముతో నేను ఈపనికి పూనుకొంటిని. వరులను విక్రయించే మార్కెటులో మా నాయనగారుకూడా భాగస్థులే గనుక నేనుగూడ అమ్ముడుపోయిన పశువునే. అట్లు అమ్ముడుపోయి జీవించుట ఇష్టము లేకనూ ముందు వివాహములు చేసుకునే యువజనులకు దారిచూపుటకునూ నా జీవితము ఇట్లు చేయుచున్నాను. నేను లేనిదే జీవించుటకు ఇష్టములేక నా ధర్మపత్నిగూడా నన్ననుసరించినది. గనుక ఈవిషయములో మా తండ్రిగారి జోక్యము లేదు. ఇహలోకమున నాయందు తప్పులున్ననూ క్షమింతురుగాక యని కోరుచు ఇంతటితో నా జీవితమును విరమించుచున్నాను.

ఇట్లు

మోహనుడు."

# మనవి మాటలు

స్త్రీరత్నములు పెక్కురు శాసనసభ్యురాండ్రైనందులకు దేశమునందుగల స్త్రీలెల్లరు మిక్కిలి యుత్సాహవంతులై యున్నారు. ఇకముందు సంఘమునగల పెక్కు దురాచారములుతగ్గి స్త్రీల పురోభివృద్ధికి పెక్కుసదుపాయములు గలుగునని యాశించుచున్నారు. భారతమాత, తన ప్రజలకందరకును స్త్రీపురుషవ్యవస్థయు, జాతి మతభేదములును లేక సమానార్హతలు, గౌరవము, ప్రతిపత్తులు గలుగబోవుచున్నదని సంతసించుచున్నది. గరుడునివలె గాంధి తన్ను దాస్యశృంఖలా విముక్తురాలినిగా జేయునని యాశించుచున్న భరతమాతయొక్క యాశయములు శీఘ్రమున ఫలీకృతములగు గాక!

కె. ఎం.

అత్యధిక సంఖ్యాకులచే తమకు నిధులుగా నెన్నుకొనబడిన శాసనసభ్యురాండ్రు తమకు దోడ్పడిన తోడిసోదరీమణుల నభివృద్ధికిదెచ్చు మార్గములన్వేషింప వేగిరపడవలెను. ప్రప్రథమమున వారిదృష్టి నేడు భారతీయస్త్రీలలో ప్రబలియున్న విద్యావిహీనతవైపునకు మరల్చవలెను. ఒకప్పుడు ప్రపంచమునగల దేశములన్నిటిలో నెక్కువ యౌన్నత్యమునుగాంచిన మనదేశమునందు నేడు 100 కి ఇద్దరైనను విద్యావతులగు స్త్రీలు లేరని చెప్పుకొనుటకంటె సిగ్గువేరుండదు. దీనికి ముఖ్యకారణములు ప్రభుత్వ విధానమును, పురుషుల స్వార్థపరత్వమునై యుండును. స్త్రీలు శాసనసభ్యత్వము నొందినప్పటినుండియు తోడి సోదరీమణులు, స్త్రీల విద్యాభివృద్ధికై పాటుపడవలసినదిగా వారిని కోరుచునేయున్నారు. ఇప్పుడు వారు కార్యరంగమునకు దిగుచుండుటచే మరల నొకపర్యాయము వారల హెచ్చరించుచున్నారు. దేశసౌభాగ్యమునకు నిరుపయోగమగు నేటి విద్యావిధానమునందు సంస్కరణములుసలిపి స్త్రీల నైతిక, ఆర్థిక, సాంఘికారోగ్యాభివృద్ధికితగు విద్యావిధానములుజరుప పాటుబడ ప్రార్థితులు. స్త్రీలు ప్రత్యేకముగా నున్నత విద్య నభ్యసించుటకు తగిన సదుపాయములు గల విద్యాసంస్థలు దేశమునందరుదు. అధమపక్షము తాలూకాకొకటియైనను ప్రత్యేక స్త్రీ విద్యాలయముండితీరవలెను. అందు వృత్తి విద్యలు, గృహపరిశ్రమలు, గృహనిర్వహణత్వము, పాకశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము, లలితకళలు మున్నగు స్త్రీల కత్యంతావశ్యకములగు విద్యలనేర్పు నేర్పాటులు గావించవలెను. ముఖ్యముగా పల్లెలందుగల జనులగూర్చియే కడు శ్రద్ధవహించి వారల నభివృద్ధికి తేవలెను. జీతములు లేకపోయినను పాఠశాలలందు చదువుకొను బాలికల సంఖ్య చాలతక్కువ. బీద విద్యార్థినులకు కొంత






బాలయోగినిలోని

ప్రజ్వల

బాలికాగణము.

కాలమువరకు పుస్తకములు, దుస్తులు, భోజనాదులకు సరిపడునట్లు కొంత ద్రవ్య సహాయమునుగూడ జేసి ప్రోత్సహించిననే గాని స్త్రీవిద్య యభివృద్ధికాజాలదు. అందుకై ప్రత్యేకముగా కొంతిధనమును బడ్జెటు నందు శాంక్షను చేయించుకొని వినియోగించిననే గాని యీకొరత తీరదు అందుకు సభ్యరాంౘ్రులు తగుశ్రద్ధవహించుమనవి.

నేటి బాలబాలికలే రేపటి పౌరులను సంగతి జ్ఞప్తియందుంచుకొని వారల విద్య నభ్యసింప జేయుటకు వెనుదీయు నేటి మూఢులగు పెద్దలకే కొంతవరకు విద్యా బోధన సలుపవలెను. అప్పుడు వారు తమ బిడ్డలను తప్పక విద్యావంతులుగా జేయ ప్రయత్నింతురు. ఇందుకు ముఖ్యసాధనములు ప్రతియూరను గ్రంథాలయముల నెలకొల్పుటయే. ఈ గ్రంథాలయములు ప్రభుత్వ పోషణను నొందుచు గ్రామమందు గల స్త్రీలను ప్రోత్సహించి, రావించి, వారలకు గ్రంథపఠనమునందును, పత్రికాపఠనమునందును, విద్యయందును నభిరుచి గలిగించి ప్రస్తుత దేశపరిస్థితుల బోధించుచుండినచో వారల నావహించియున్న నజ్ఞానతిమిరము కొంతవరకు నశించగలదు. స్త్రీలకీ గ్రంథాలయోద్యమమమూల్యమని వేర చెప్పనక్కర లేదు.

అచ్చటచట మాతృశిశుసంరక్షణాలయముల (Child welfare centres) నేర్పాటు గావించి తెన్మాలమున కొంతవరకు శిశుపోషణ, గర్భిణీస్త్రీల యారోగ్యవిషయముల జాగ్రతకై ప్రభుత్వము కొంత పాటుబడు చున్నది. ఐనను పల్లెలసంఖ్యయే యెక్కువగాగల మనదేశమున నింతటితో సౌకర్య మందఱు స్త్రీలకును కలుగుననుకొనలేము. ప్రతిమాసమున కొకసారి ప్రతిమాతా శిశు సంరక్షణాలయమునందును లేడీ డాక్టరుచే చుట్టుప్రక్కలగల నేటివు మంత్రసానుల సభ గావింపబడి వారలకు కొంతవరకు శారీర శాస్త్రము, ఆరోగ్యశాస్త్రము, బోధించి ప్రసవసమయమున వారలననుసరించవలసిన విధుల బోధించినచో ప్రజలకు సహాయ మెక్కువగా లభించవచ్చును. అందుకు (Magic lantern lectures) కొంతవరకు సహాయపడవచ్చును. ఇట్టి యేర్పాటులవలన శిశుమరణ సంఖ్యయు, ప్రసవసమయమునందజాగ్రత్తచే గలుగు స్త్రీమరణ సంఖ్యయు చాలవరకు నరికట్టబడును. ఇందుకు ప్రభుత్వమువారు ఏర్పాటుచేయునట్లు శాసన సభ్యరాంౘ్రులు ప్రయత్నించ మనవి.

శారదాబిల్లు సరిగా నమలునందుండక పోవుటచే నతిబాల్య వివాహము లిప్పటికిని తగ్గలేదు. వానివలని చేటునకు మేర లేదు. బుద్ధికుశలులును, విద్యావంతులునగు సభ్యరాండ్రకు మేము చెప్పగలిగిన కొరతల కంటె నెక్కువగానే స్త్రీల యాశయముల తెలిసియుంటచే, తమ సోదరీమణుల పురోభివృద్ధికై సర్వవిధములవారు పాటుబడి, వారిమన్ననలకు పాత్రులగుదురుగాక ! భగవంతుడే శాసనసభ్యరాండ్ర సంఖ్య నింతకంటె వృద్ధిజేయుచు, వారిమూలమున యావద్భారత మహిళామండలికిని సౌకర్యములు జేకూర్చుగాక. వందేమాతరం !

# 'గృహలక్ష్మి'

శ్రీ ఎ. కృష్ణయ్యగారు

సర్వాంగసుందరముగనుండి మృదుమధుర వాక్కుల కాలవాలమై సరసవచో గాంభీర్యముచే నొప్పుచు తోడిమానినీమణులయందు తేజోవంతమై దేశాభ్యుదయమునకు నిరంతర సేవ యొనర్చుచు మాతృదేశ ముక్తిహేతువై విరాజిల్లు కాంతామణియే గృహలక్ష్మి యనబడును. పై గుణసంపదలచే 'గృహలక్ష్మి' పత్రికారత్నములయందు ప్రతిభావంతముగ నుండుట వాచకలోక మెఱింగినదే. ఇట్టి స్వర్ణాక్షరములచే విరాజిల్లు పత్రికా ప్రతికారాజమును పఠించుటవలననైన మన నారీమణులు గృహలక్ష్ములై విరాజిల్లెదరుగాక యని యాశయము.

విద్యావ్యాప్తిలేనిది ఇట్టి కార్య మెప్పటికిని నెరవేరజాలదు. ఏఇంట సూర్యుడు ప్రవేశింపడో ఆఇంట వైద్యుడు తప్పక ప్రవేశింపవలసియుండుననుట ఆంగ్లేయసూక్తి. ఆరోగ్యమునకు భాస్కరు డాధారమనుట హైందవ వైద్యసిద్ధాంతము. ఆరోగ్యమునకు సూర్యభగవాను డెట్లో సమస్త కల్యాణమునకును విద్య యట్టిదనుట సర్వజనవిదితము. విద్య విశ్వమునకు వెలుగు. అట్టి వెలుగులేనివారు కన్నులుండియు అంధులే. అన్ని సందేహములను విద్య మాన్పగలదు. కంటి కగపడనిదానినిగూడ జూపెట్టునది విద్య. నదులు సముద్రమునుగూర్చి ప్రయాణ మొనర్చునట్లు మానవుడు నిరంతరము జ్ఞానాబ్ధిననుసరించి చనుచుండవలయునని యొక మహాపురుషుని ప్రబోధము. విద్య అమృతత్వమును గలిగించును. విద్య కోరినవరములను ప్రసాదింపగలదు. అందువలన మనము మన సోదరీమణుల విజ్ఞానవ్యాప్తికై పనిచేయనంత కాలము జరుగుచుండు కొంతపనియు ఫలవంతము కానేరదు.

సహధర్మచారిణి యని పిలువబడు భార్య విద్యావిహీనయైయున్న ఆగృహమున కామె యెట్లు గృహలక్ష్మి కాగలదో విచారింప వీలులేదు. దీపకళికలేని గృహ మెట్లు క్షతిహేతువో జ్ఞానకళికలేని కాంత గూడ యట్టిదే. అజ్ఞానము సర్వానర్థములకు మూలము. మూర్ఖతవలన సౌఖ్యశూన్యత సంప్రాప్తమగుచున్నది. శాంతములేని సౌఖ్యములేదని త్యాగరాయలు.

నేటి బాలికలే రేపు కాంతామణులై దేశకల్యాణమునకు ఆధారములగుచున్నారు గాన మహిళా ప్రపంచమున విద్యావ్యాప్తికై చేయవలసిన పని యెంతేనికలదని విజ్ఞు లెఱుంగుదురు. బాలికలకుగూడ నిర్బంధవిద్యావిధానముండుట యత్యావశ్యకము. బాలికాపాఠశాలలలోని కన్యకామణులను జూచి యానందింపని మానవుడుండునా? విద్య నభ్యసించుటవలన శుభ్రత, దేహారోగ్యము, సుగుణసంపద, మైత్రి, దేశకల్యాణదాయకములగు తక్కుంగల గుణసంపదలు బాలికలు పొందగలుగుచుండుట మనము గాంచుచుండియు బాలికలను జ్ఞానవంతులుగ జేయ సమకట్టకుండుట శోచనీయము. ప్రపంచమునందలి వివిధదేశ నారీమణు లెట్లు విద్యావ్యాప్తివలన అభివృద్ధినొందుచున్నారో మన నారీమణులు స్వయముగ నెఱిగినగాని విద్యయందు వారికి పట్టుదల కలుగదు. అందుచే జ్ఞానకళిక నొక్కొక్క బాలిక పొంద వీలొసంగుట మన కర్తవ్యము. విద్యావ్యాప్తి లేనప్పుడు పత్రికాప్రచారముమాత్ర మేమి చేయగలదు? నడువచేతగానివానికి దివ్యశకట మొసగినట్లేయగును. మహిళాసమాజములు విరివిగ స్థాపింపబడవలయును. నిరంతరప్రబోధము

వారియందే కలుగవలయును. విద్య జన్మహక్కని వారు స్థాపించి ఫలిత మనుభవింపవలయును. దీనికి పురుషుని సానుభూతి యత్యవసరము. మహిళాభ్యుదయమునకై కంకణముగట్టుకొన్న 'గృహలక్ష్మి' ఇత్యాది పత్రికారాజములను ఒక్కొక్క బాలికా పాఠశాల, మహిళాసమాజము, గ్రంథాలయము ఆదరించుట ఆవశ్యకము. ఉన్న సహాయమును నిర్లక్ష్యపఱచి నారీమణుల విద్యావ్యాప్తికై పాటుపడక దేశకల్యాణమునకు స్త్రీలు వెన్నెముకవంటివారని మాత్రము యుపన్యాసపరంపరల నొసగుటవలన నేమి ప్రయోజనము? పసిపాపలపలుకు లెట్లు సర్వజనాదరణీయములో అట్లే మిగుల బాల్యావస్థలోనుండు ఈ మహిళాభ్యుదయ తత్వముగూడ సర్వజనాదరణీయమైనగాని మన దేశకల్యాణమునకు మార్గము మృగ్యము. విద్యావంతులలోగూడ బాలుర విద్యా విషయములో జూపు పట్టుదల బాలికలయం దగపడదు. బాలు దేనాడైనను వయోజనవిద్యాసంస్థ వలనగాని, గ్రంథాలయోద్యమమువలనగాని కొంత విద్యాగంధమును బొందవీలగునుగాని యుక్తవయసు రాకమునుపే మన బాలికలకు మనము కొంత జ్ఞానభిక్ష యొసగకున్నచో వారు నిరంతరము అజ్ఞానమునం దుండవలసినదే. అట్టి కాంతలు గృహలక్ష్ము లెన్నటికైన కాగలరా!

ప్రపంచచరిత్రలో వివిధదేశనారీమణు లెట్లు విద్యాప్రపంచమున నూత్నకళలచే విరాజిల్లుచున్నారో అట్లే మన మహిళామణులు విద్యాగంధముచే వెలసినప్పుడే గృహలక్ష్మి శబ్దము సార్థకము కాగలదు. నిరుత్సాహపడిన ప్రయోజనములేదు. ప్రయత్నము మానవునిది. ఫలమొసంగుట మాధవునిది యని గదా గీత ఘోషించుచున్నది గీతాతత్వమును ప్రపంచమునకే బోధించిన మన దేశము కర్తవ్యవిమూఢతను బొందిన ఫలమేమి? కర్తవ్యమును మానితిమా పతితులగుచున్నామని గదా గీత యుద్ఘోషించుచున్నది. అట్టి అమృతవాక్యములను స్మరణయం దిడుకొని నారీమణుల శ్రేయోభివృద్ధికై పాటుపడి దేశాభ్యుదయమునకు తోడ్పడెదముగాత!

## చింత

నవ్యవిజ్ఞానసముపార్జనమ్ము దుఃఖ
కారియగుగాని శాంతి నిక్కముగనున్న
సకలధనధాన్య సద్వస్తు సంచయంబు
గన నహంకారమునకు స్వాగతమొసంగు.
పరికైనను, కన్నులు గోరకించు
అంగసౌందర్యపటిమ ఉల్లాసకరమె
గాని, చెడుపోకడల కవకాశమొసగు
సూక్ష్మదృష్టికి శాంతి ఎచ్చోటలేదు.
సృష్టిసౌందర్యరమ నుపాసించుటనగ
నీశ్వరోపాసనంబని యెంచికొనుచు
ప్రకృతిసౌందర్యమును గాంచిభావముగ్ధ
డగుచుగన్నులు మోడ్చినయపుడె శాంతి.
జీవముగలట్టి సృష్టివైచిత్ర్యములకు
మురిసి పులకితగాత్రుడై మోడ్పుగనుల
ప్రకృతినిర్మాతయగు పరబ్రహ్మశక్తి
కబ్బురంపడనదియ తత్త్వార్థమగును.
నాకు మానసికారాధనమ్ముకంటె
యీయనంతప్రకృతిలోన నెచటనైన
శాంతిదంబైన పరమార్థసరణిలేదు
ప్రకృతిపరిశీలనయె తత్త్వపరిచయంబు.
మధురతరమైన నవ్యసుమమ్మురాలి
వికలముగనుండు శూన్యవల్లికయుపోలె
నలరుచుండెడి ప్రణయోపహతుల కెచటి
శాంతి; హృదయమ్ముగలిగి యున్నంతదాక.
సృష్టిసౌందర్యరమ నుపాసించుకొనుచు
మైమరచి పూర్ణప్రణయసమాధినుండు
హృదయ మవ్యయశాంతిసంపదలలోన
ఎట్టియానందము ననుభవించుకొనునో?

గంటి కృష్ణవేణమ్మ.

# సబితాదేవి



ఆదికళగానిమ్ము, లేక శాస్త్రముగానిమ్ము మన ఆంధ్రులు చేయువేయుక నిపుణరు. ఏ ఉపన్యాసము వినినా సరే, వెనుదీయరు. మంచిదే కాని "అంతయును తెలుసు"నను తలబిరుసుతనము మహాగ్రాహము మన లోతాగాధముగను గాఢముగను నాటుకొన్నది. అది నేరుపురుగని ఎఱుగము కాంబోలు! లేకున్న మన ప్రయత్నములేల వ్యర్థమగును? మనలోనే ఎందరు కళానిధులు లేరు! వారిమాట ననుసరించి నడచుచున్న మన పరిశ్రమ ఫలవంతము గాకపోవునా? వారి కళాకౌశలమును నోటికివచ్చినట్లు తిట్టుతయారైతిమి. ఆచార్యుని సుబోధనపాత్ర నిర్వహణమును అర్థముచేసికొనక "మానసంరక్షణము"నకు "మానభంగము" గావించితిమి.

తప్ప త్రాగి, గుల్లొల్లుచేసి, జుట్టుపీకుకొని, ఒడలెల్ల విఱచుకొని వికృతాట్టహాసమున ఓంఢ్రించలేదని కాంబోలు మాధవపెద్దిగారు శిశుపాలపాత్రను చెడఁగొట్టిరని ఘోషించితిమి. కళానిధుఁలలోనే కళనున్నయన్న మన కింక మంచిదినము లెక్కడిది ?

ఇప్పటికైనా నానరే మేలుకొంటిమా బాగుపడెదము. నేర్చుకోవలసినది సముద్రమంత కలదు. తలనని తలంపుగా పైకివచ్చిన... కుమారి "సునో, సునో"ను "చెలీ, చెలీ" అని కులికి కులికి అనుకరించినంత మాత్రమున నే "శాంత ఆప్టే" అనిపించుకొనగలదా ? ఏమో మీరే చెప్పవలెను. పనికిమాలిన రాగము గంటలకొలఁది తీసి మనల విసు గెత్తింపవచ్చును; చెమట కాల్వలుగట్ట, రంగస్థలముమీఁద దొమ్మరాట నెంతకష్టపడి యైన నాడవచ్చును; అనవసరముగా గొంతు చించుకొని ఎంత బిగ్గరగనైన అఱచి పసిపిల్లల భయపెట్టవచ్చును; ఉత్సవ విగ్రహములవలె సాలంకార సౌందర్య మెంతైన నుంపవచ్చును; కాని నటుఁడు (స్త్రీలింగము గతి మాత్రమో ?) కాఁదలఁచుట కల్ల.

హిందూస్థానీయులేమి, వంగీయులేమి, మహారాష్ట్రులేమి, కడకు కన్నడులేమి- మనకు కావలసినంత నేర్పఁగలరు. తెలియనిది తెలుసుకొనుట శ్రేయముగదా ! కనుక మనము విద్యార్థులమని ఒప్పుకొని "ఓనమా"లు దిద్దుకొందము. ఇందు తప్పేమున్నది ?

హిందీటాకీలలో "ఇది బాగుగలేదు" అని చెప్పుటెంతో కష్టము. అన్నియును ప్రశంసనీయములే. కొన్ని ఖండాంతరములఁ గూడ మాపులేని కీర్తి గాంచినవి. దీనికి కారణము లేకపోలేదు. మానవుఁడూహింపలేనివి - అసహజములునగు సన్నివేశములకు బొత్తిగా తావుండని సాంఘిక చిత్రములపైనే హిందూస్థానీయుల దృష్టి. వారికి కళ యన్న ప్రాణము. కడుపుకోసమై దానిని నాశము చేయరు డైరెక్టరులు సమర్థులు. ఉత్తమ నటీనటులనే ప్రోత్సహింతురు. పాత్రమునకు తగిన రూపము, రూపమునకు మెఱుఁగుపెట్టు ఉచ్చారణ, ఉచ్చారణకు జీవముపోయు భావప్రకటన, భావప్రకటనకు అనివార్యమైన సంగీతము—వీనిలో నేది లేకున్నను నటునిగాని నటినిగాని సినిమారంగము త్రొక్కనీయరు. కనుకనే వారి ఫిల్ములు జేజేలందుచున్నవి.

హిందీ సినిమాతారలలో గణింపదగిన వారు పెక్కురుగలరు. మొదటిరకపు వారిలో మొదటిదనదగినది సవితాదేవి. నేనుచూచిన నటీమణులలో—నే నెందఱినో చూడలేదు— దేవికారాణి మాత్రమే ఈమె కన్నిట (ఒక్క సౌందర్యమున తప్ప) సరియుద్ది.

సవితాదేవి సౌందర్యమున నొక ప్రత్యేకత కలదు. కన్నతల్లి మొగమ్మున కాయుపండు వెన్నెలకు ఈమె ముఖమున కఱవులేదు. ఈమెను చూచినప్పుడు అది ఏదో ఒకమాటకందని భక్తి మనలో కుదురును. మన ఎఱుక లేకయే చేతులెత్తి నమస్కరింతుము. ఆచూపులో — ఆ చిఱునవ్వులో ఇమిడి

యుండు భావమునకు పేజీలకొలఁది వ్యాఖ్య వ్రాయవచ్చును. ఈమె కమ్మని పలుకులో ప్రాణముకలదు. హిందీలో "అ, ఆ"లు కూడ తెలియని నేను ఈమె మాటలు, ఉచ్చారణ విన్నప్పుడు "ఇది తెలుఁగా ఏమి" అని నోరు తెఱచి ఆశ్చర్యపడితిని.

సహజముగ భావములను ప్రకటింపలేకున్న సంగీతమే శరణ్యము కనుకనే ఈమె సాధారణముగ పాడదు. భావమునకు తగిన రాగమున, సన్నివేశమునకు తగినపాట నెప్పుడో ఒక్కసారి పాడును. అది హృదయమునకు తాకును. శ్రోతలు కైపెక్కి తైతెక్కలాడవలసినదే! ఈమె గానమున ఇంకొక్క అపూర్వశక్తిగలదు. అచేతనములకు ప్రాణముపోయుట, చేతనములను శిలలుగా మార్చుట. ఇం కెందుకు? ఈమె అమృతవార్ధిలోని తరంగమాలికలు పూవులకు ప్రేమరసముగ్గు పోసినవి! పోయుచున్నవి!!

భావద్యోతకమైన అభినయము ఈమె పెట్టినభిక్ష. జీవన్‌లత చూడుడు.

ఒకయువతి జీవనుని తండ్రిని కాల్చి చంపును. నేరము తనపై మోపబడునని వెఱచి, "జీవనుఁడు తన తండ్రిని కాల్చిచంపెనని" పోలీసుకు కంప్లైంటిచ్చును. జీవనుఁడు, (మోతీలాల్) లత(సవితాదేవి) పీనుఁగుపైఁబడి మొత్తుకొనుచుందురు. పోలీసువారు వచ్చి జీవనునిచేతులకు సంకెలలు తగిలింతురు. అన్యాయముగా శృంఖలాబద్ధహస్తుడైన తన ప్రేమమూర్తిని లత చూచినది. ఇట్టి సమయమున ఆమె దుఃఖించుట ముమ్మాటికి తగదు. చీరచింపికొనుచు వెంట్రుకలు విరియఁబోసికొనుచు గయ్యాళివలె ఏడ్చి సవితాదేవి "తూ"యనిపించుకొనునా? పొరలుకొనివచ్చు శోకమును వెలిగ్రక్కుట నిష్ప్రయోజనమని తెలిసికొని జీవనుని రక్షించు నుపాయ మూహించును; ఏదియును తట్టదు అప్పుడు గద్గదస్వరముతో "స్వామీ, మేరిజీవన్ నిర్దోష్ హై"అని పోలీసువారి కాళ్లపైఁబడి బతిమాలుకొనును. ఆమె ముఖమును చూడుడు. అమాయకపు హృదయమున బద్ధలైన అగ్నిపర్వతముల దృశ్యముల నన్నిటిని అద్దమునందువలె చూపించు నాకన్నులు—"జీవనుఁడేమి గతి పట్టునో" అనుభీతితో కూడికొనిన ఆత్రమును ప్రకటించు నాముఖము చూచినప్పుడు, గుండె కలవాఁడు కంట నీరువెట్టవలసినదే! ఆతడఁబడుమాటలు మన మనస్సును ఎంత ఊపలేదు? "అయ్యో"అని మన మెన్నిమారులనలేదు? కనుకనే "భావద్యోతకమైన అభినయము సవితాదేవి పెట్టినభిక్ష"అంటిని. ఈ మహాశక్తి సామాన్యులందు శూన్యము.

పాశ్చాత్త్యులకుఁగూడ ఆదర్శప్రాయ కాఁగల భారతీయ నటీమణి ఈమె ఒక్కతే అని చెప్పటవేయగలను. ఒకప్పుడు ఈమె మనదేశమునకు గొప్పపేరు తేఁగలదు. ఉత్తమ నటీమణులకు ఉదాహరణము కాఁగలదు. మనస్సులందు వానకారు మెఱుపువలె తళుక్కున మెఱసిపోక, పరంజ్యోతివలె ఎప్పటికిని వెలుఁగుచుండఁగలదు" అని నా అంతఃకరణము ధ్వనించుచున్నది. మీ రేమందురో?

అ. సీతారాముఁడు.

# తోటపని

శ్రీ చిలకర్రి లక్ష్మణాచారి, బి.ఎ., బి.యస్‌సి.

మనదేశమునకు సౌభాగ్యమొనగూర్ప స్త్రీ పురుషులకు సమానబాధ్యత కలదనుటకు సందేహములేదు. స్త్రీలకు నిజమైన పట్టుదలయు స్వదేశోద్యమమునందాసక్తియుకలిగి దానిని ఆచరణలో పెట్టినెడల మనభారతదేశము నివసించుటకు స్వర్గతుల్యమగునని చెప్పనవసరములేదు. విదేశవ్యామోహము వీడి మనదేశములో పండిన సస్యములనే యారగించుచు మనదేశములోని పరిశ్రమలన్నిటిని త్రికరణశుద్ధిగా నాదరించునప్పుడు మనదేశము యితరదేశములకన్న సౌఖ్యదాయకమై మన్ననల నందగలదనుటలో నతిశయోక్తిలేదు. మనము టర్కీ, స్పెయిను మొదలగు విదేశములలో స్త్రీలు సైనికశిక్షనేర్చి దేశసంరక్షణార్థము పురుషులకు పైయుంజవేయుచు స్వదేశాభిమానమును గాపాడుకొనుచున్నట్లు వినుచున్నాము. ఇట్టిసమయములో భారతస్త్రీలు నడుముగట్టి పనిచేసినచో గృహసౌభాగ్యమునకు ప్రథమసోపానమగు ధనార్జనము చేయగలరనుటలో సందేహము లేదు. ధనమార్జించుటకు పురుషులకువలెనే స్త్రీలుకూడ కాయకష్టములకోర్చి పనిచేసి ధనమార్జించుట పురుషులపనియేయని యూరుకొనక గౌరవభంగమని తలపక స్త్రీలకు వర్తకము సేద్యము అని యభిమానపడక తీరికకాలమును వ్యర్థముచేయక సౌఖ్యదాయకముగను ధనము సంపాదించుకొనుటకు వీలుంగను చేసికొనవచ్చును. స్త్రీలు కేవలము వంటచేయుటకు పతిపూజచేయుటకు వ్రతములుచేయుటకే కాదు. వారి జీవితాభిప్రాయములు గొప్పవని తెలిసికొనవలెను. వారికికూడ పురుషులవలె స్వతంత్రజీవనము చేయుటకధికారము కలదు. భర్తలుసంపాదించుచుండగా స్త్రీలు యెందుకు పనిచేయవలెనాయని గర్వించుటతగదు.

నేను వ్రాయబోవునది మిగులనుపయోగమైనట్టియు అనుదినమును పనిని కల్పించునట్టిదియు, ధనమార్జించుటకు వీలైనట్టిదియు యెంతకష్టపడిన నంత లభించునట్టిదియు నగు తోటపని. తోటపనికదాయని నిరసనభావనముతో చూచుటతప్పు. పాడిపంటలకు పుట్టినిల్లయ్యును ప్రస్తుతము మనదేశము విదేశములకన్న ఆవిషయములోనే లోపవడుట మిక్కిలి శోచనీయము.

తోటపనికి మనదేశము అన్నివిధములుగా తగియున్నది. మనకు వలయునంత నీరు, భూమి తప్ప మరేవిధమైన ఖనిజసంపదయు లేదు. అందువలన శాస్త్రయుక్తమగు వ్యవసాయములో నొక శాఖయగు తోటపనినిచేసి స్త్రీలుకూడ ధనమును కూర్పదగును. ఇంచుమించు రెండువందల చతురపుగజముల యింటి పెరడుగల ప్రతివారును తోటపని చేయవచ్చును. పెరడు నలుచదరముగనుండి చుట్టును దొంగలు, పశువులు లోనికి చొరుటకు వీలులేకుండా గోడగాని, కంచెగాని, ముళ్లయినుపతీగెగాని యుండవలెను. నీరు అన్నివైపులకును పారుటకు వీలగుచోట నూయి, తేలికయగు యేతాము యుండుట మంచిది. తేలికయగు గట్టిపారయు, చిన్నగునపమును, కుర్పికయు అంట్లుకట్టుటకు క్రింద నుదహరింపబడిన పనిముట్లును కావలెను.

తోటభూమిని రెండు భాగములుగాచేసి పువ్వుముల మొక్కల మడిని నీటివసతికి దగ్గరగాను ఫలవృక్షములను కొంచెము దూరముగా నుండునట్లు చేయవలెను. వేరొకమూల గజమున్నరచతురమును, ఒకనిలుపు (సుమారు రెండు గజములు) లోతునుగల యెరువు గోయిని తీయవలెను. తోటమట్టిలో కొంచెము యినుకపాలు యెక్కువగానుండవలెను. వర్షము అధికముగా కురిసినపుడు నీరు నిలువయుండక యింకిపోవుటకు వీలుగానుండవలెను. అంతియేకాని తోటలోని మట్టి ఆవలకు కొట్టుకొనిపోగూడదు. అందు

వలన నేల గుల్లగానుండి లేతమొక్కల వేళ్లు త్వరగా లోనికి ప్రవేశించుటకును, సులభముగా త్రవ్వుటకు వీలుగానుండును.

మొదట మట్టిని పారతోగాని, గునపముతోగాని, ఆరేడంగుళముల లోతువరకును త్రవ్వి మట్టిబెడ్డలను పొడిగా చేయవలెను. అందువలన సున్నితమగు మొక్కలవేళ్లు లోనికి సులభముగా ప్రవేశించుటకును, మనము వేసెడి యెరువులోని సారము సులభముగా లోనికి ప్రవేశించుటకును వేళ్లకు కావలసినంత గాలి దొరకుటకును, భూమిలోనున్న నీరు పైకి ఆవిరిరూపముగా పోకుండుటకును, కలుపుమొక్కలను (weeds) నిర్మూలము చేయుటకును వీలగును.

తోటపనికి యెరువు మిక్కిలి అవసరము. మనము పెంటయని నిరసనభావముతో చూచుదానిలో అమూల్యమగు వృక్షాహారమున్నదని తెలిసికొనవలెను. మనము అనుదినమును పశువులపేడను పిడకలుగాచేసి కాల్చివేయుచున్నాము. దానివలన నష్టము యింతంతని చెప్ప నలవిగాదు. మొక్కలకు పనికివచ్చునట్టియు భూమిలో కొరతగునట్టిదియు భాస్వరము (phosphorus), పటాసు (potash), నత్రజని (nitrogen) యీ పెంటలోనున్నవి. భూమిని మెత్తగాను సారవంతముగానుచేయు కుళ్లుపదార్థము (humus) దీనిలోనున్నది. దీని విలువ తెలియక పిడకలుగాచేసి కాల్చివేయుట దరిద్రమునకు పడికట్టుటయేయని తెలుసుకొనవలెను. పశువులపేడను మూత్రమును మిక్కిలి జాగ్రత్తతో యెరువు గోతిలో వేయుచుండవలెను. ఆగోయిలో ఇండ్లు వూడ్చుకొనిన పెంటయు, పచ్చియాకులను వేసినయెడల అదికూడ మొక్కలకు ప్రయోజనమగు ఆహారపదార్థముగా మారును. పశువులమూత్రమును యెరువు గోతిలోనికి పోవునట్లుగా కాలువచేసికొనుట మంచిది. కలుపుమొక్కలను ఆ గోతిలోవైచి యెరువుగా మార్చుకొనవచ్చును. పశువులు లేనిచో పెంటనుకలుపు మొక్కలను, పచ్చియాకులను గుంటగోతిలోవైచి యెముకలపొడినిగాని (bone-meal) అమోనియా పిండిని (Sulphate of Amonia)గాని చేర్చి నీళ్లుచల్లి దానిని కుళ్లునట్లుగా చేసినయెడల అదికూడ పశువుల పెంటవలెనే పనిచేయును. అంతియేగాక పాత మన్ను పాతగోడలనుండి రాలెడు మన్ను, ఎండిన చెరువులలో నుపరిభాగమునుండు మట్టియు (Tank-silt) ఆ కుళ్లు (humus) ఎక్కువగానుండు మన్నును మిక్కిలి జాగ్రత్తతో గాని యెరువుగా నుపయోగించవచ్చును.

మనము సులభముగా సంపాదించుటకు వీలగునట్టియు బజారులో త్వరగా ఖర్చగునట్టియు యెక్కువగా ఫలసాయము నిచ్చునట్టియు, అందరికిని హితమగు నట్టియు పండ్లు పుష్పముల మొక్కలను వేసికొని తల్లిచెట్లుగా పరిగణింపవలెను. మనము ఫలసాయముతో తృప్తినొందక అంట్లుకట్టుట, అంట్లుతొక్కుట నేర్చుకొన్నయెడల వానివలన మంచిలాభ ముండవచ్చును. కనుక ఫలవృక్షముల నంట్లుకట్టుట, పూజెట్ల నంటుత్రొక్కుట స్త్రీలు ముఖ్యముగా నేర్చుకొనవలసిన విషయములు. ఆవృక్షములకు పురుగులు, చీడలు, బూజుతెగుళ్లు రాకుండానుండునట్లు చేసికొనుటకుకూడా తగిన యుపాయములను నేర్చుకొనవలెను.

మనము పెరటిలో వేసికొను ఫలవృక్షములు విస్తారముగా ఫలించుచు మంచిరుచిని కలిగియుండవలెను. వాటినుండి మనము ఫలసాయము నొందుటయేగాక, అంట్లుకూడ కట్టవలెను. కనుక అవి యన్నివిధముల శ్రేష్టమైనవిగా యుండవలెను. మనము స్వయముగా మంచిచెట్లదగ్గరకుపోయి పరీక్షించి అంట్లు కట్టించి తెచ్చుకొనవలెను. లేదా వ్యవసాయశాఖవారి నడిగి మంచి అంట్లు యెక్కడ లభించునో తెలిసికొని కొంచము యెక్కువ వ్యయమయినను ప్రశస్తమైనవి తెచ్చుకొనవలెను. మనము మంచి ఫలసాయ మనుభవించుటకు అంట్లు కట్టినయెడల త్వరలో ఖర్చగు

ననియు, అందరికి అనుదినము ఆవశ్యకముగునవియు అగు నిమ్మ బత్తాయి, నారింజ, దబ్బ, ద్రాక్ష, సపోటా మొదలగు మొక్కలలో మంచివి అయిదారు మొక్కలను, మొక్కకును మొక్కకును మధ్య ఇరువది మొదలు యిరువదిరెండు అడుగులుండునట్లు, నాటింపవలెను. నాల్గవయేటనుండి ఫలసాయమనుభవించుటకును, ఎనిమిదవయేటనుండి అంట్లుకట్టుటకును వీలగును.

అంట్లు త్రొక్కుట:—ఇది సాధారణముగా పువ్వుల మొక్కలను వ్యాపింపచేయుటకు సులభమైన మంచిపద్ధతి. మొక్కయొక్క కొమ్మలను భూమి సమీపమునకు తీసికొని రాబడుటకు వీలుగానుండు మొక్కలకు యీపద్ధతి మంచిది. అంట్లు త్రొక్కుట చిన్నకుండీలలో చేయుట మంచిది. కుండీలలో అంట్లు త్రొక్కినయెడల వేళ్లకు ప్రమాదమురాకుండా ఒకచోటనుండి మరియొకచోటునకు తీసికొనిపోవుటకును, వేళ్లకు ప్రమాదమురాకుండ నాటుటకును వీలగును. కొమ్మలు చాలపొడుగుగానున్నయెడల ఒక కొమ్మతోనే మూడు నాలుగు అంట్లు కట్టవచ్చును. మొక్క కొమ్మను క్రిందికి విరిగిపోకుండా బాగుగా వంచి భూమిలోనికిగాని, లేక సారవంతమయిన మట్టియున్న మట్టికుండీలోనికిగాని వంచవలెను. కొమ్మను కుండీలోనికి వంచి వంపు బాగుగా వచ్చువరకును, అనగా ఒకటి రెండు దినములు ఆ కొమ్మనువంచి ఆ వంపుపైన మట్టితోకప్పి దానిపై బరువైన రాతితో నొక్కియుంచవలెను. రెండు దినములైన తరువాత మెల్లగా ఆబరువును, మట్టిని తీసివేసినయెడల ఆ కొమ్మకు సరియైన వంపువచ్చును. వంపు బాగుగా తిరిగియున్న స్థలమునందు పదునైన చాకుతో ఆ కొమ్మలో క్రిందిభాగమున సుమారు సగము భాగము వరకును కోసి, అచ్చటినుండి ఇరువై పులకును సుమారు ఒక అంగుళమువరకును చీల్చవలెను. చీల్చిన భాగములు మరల మూసికొనిపోకుండా చిన్న గులకరాళ్లను రెండింటిని ఆ వేళ్లమధ్య నుంచవలెను. ఆ తెరచికొనియున్న స్థలమునందు కుండీలోని మట్టితోగాని, యిటికపొడుముతోగాని నింపి మరల దానిని జాగ్రత్తగా చీల్పబడిన భాగమువద్ద విరిగిపోకుండా సరిగా మొదటనున్నంత వంపుతోనే మరల భూమిలోనికిగాని, కుండీలోనికిగాని అమర్చి మట్టిచేపూడ్చిన ఒక బరువైనరాయిని ఆ వంపుపైని పెట్టియుంచవలెను. కొమ్మను ఎంతమాత్రమును కదలనీయకూడదు. తరచునీటిని జల్లుచు మట్టిని తడిగానుంచవలెను. నీటిని యెక్కువగాపోసి మట్టిని కదలనీయకూడదు. క్రమముగా ఆ పోసిన స్థలమునుండి వేళ్లు బయలుదేరి మట్టియొక్క ఉపరిభాగమునకు వచ్చును. అపుడు తల్లిచెట్టునుండి పదునైనకత్తితో తల్లిచెట్టువైపునకుండు కొమ్మను వంపునకు రెండు మూడంగుళముల దూరములో సగమువరకు కోయవలెను. సాధారణముగా వేళ్లు బయటకు కన్పించు మొక్కలలో ఆకులు వాడిపోవు. వేళ్లు కనుపించనియెడల ఆకులు వాడినయెడల మరికొన్ని రోజు లుంచవలయునని తెలియును. ఆకులు వాడిపోకుండా యుండినపుడు కొమ్మను పూర్తిగా కోయవచ్చును. ఆకులు వాడినయెడల కోయకూడదు.

ఈ అంట్లు త్రొక్కినపుడు ముఖ్యముగా అంటు త్రొక్కు కొమ్మ మిక్కిలి లేతగాగాని, మిక్కిలి ముదురుగాగాని యుండకూడదు. నడిమివయస్సు కలిగి త్వరితముగా చిగుళ్లను పెట్టుకొన్నకొమ్మను చిటికినవ్రేలంత కైవారము కలిగినచోట అంటుత్రొక్కుట మంచిది.

# గృహలక్ష్మీగౌరవము

శ్రీ కవిభూషణ - శతావధాని - విద్వాన్ - దోమా వేంకటస్వామిగుప్తగారు

మ॥ అహరారంభములందు లేచియు సమస్యన్ భర్తకుం జల్పి, లో
నహమున్ వీడిన నిర్మలత్వమున గేహశ్రీసమీహామతిన్
గృహసంశోధనఁ జేసి, శుద్ధ యయి, లక్ష్మిం బిల్చి నాఁదోఁచు త
ద్గృహలక్ష్మీమణికి న్నమస్కృతులు గావింతున్ సభక్తిన్ మదిన్.

మ॥ ఇహమందుం బరమందు సౌఖ్యమును హాయిం దా నొగిం గాంచ న
న్వహ మింటన్ గల పెద్దపిన్నలకు సర్వంబా సపర్యాదు లు
త్సహనోదంచితరీతి నేర్పడఁగ నత్యంతంబుగాఁ జేయు త
ద్గృహలక్ష్మీమణికి న్నమస్కృతులు గావింతున్ సభక్తిన్ మదిన్.

మ॥ సుహృదంచద్గతి వంటవార్పులను నెంతే శ్రద్ధమైఁ జల్పియున్
గృహముం జేరు నతిథ్యనీకమును నర్థిన్ భర్తనున్ దక్కు వా
రి హాసద్వ్యక్తిత భుక్తితృప్తులను సారెం జేయు పుణ్యాబ్ధియా
గృహలక్ష్మీమణికి న్నమస్కృతులు గావింతున్ సభక్తిన్ మదిన్.

మ॥ అహమా? లేదు; మనంబునన్ రుషయొ? యావంతేనియున్ గాన రా
దిహమందుం బరమందునుం బతిముదం బే కోరుచున్ భర్తదా
గృహ మింకన్ సకలోర్వి మేలు గన హృద్వీథిన్ గడుం గోరు త
ద్గృహలక్ష్మీమణికి న్నమస్కృతులు గావింతున్ సభక్తిన్ మదిన్.

మ॥ మొహరీ లిచ్చిన, నవ్వి గైకొనిన, రూపున్ గల్గినన్, లేకయు
న్న, హరిన్మానితకీర్తియైనను, యశోనైచ్యాఢ్యుఁ డైనన్ - బతిన్
న్నృహరిం జల్పియు జన్మజన్మముల నర్థిన్ గొల్వఁగాఁబూను త
ద్గృహలక్ష్మీమణికి న్నమస్కృతులఁ గావింతున్ సభక్తిన్ మదిన్.

మ॥ బహుజన్మార్జిత పుణ్యలబ్ధ విభుతాభ్రాజ న్నరేంద్రుల్ తపో
మహిమానూనులు మానిసత్తములు నేమాన్యాశయోదార న
న్వహమున్ లోఁ దలపోసి ధన్యు లగు వా - రాయీ శుభశ్రీలస
ద్గృహలక్ష్మీమణికి న్నమస్కృతులఁ గావింతున్ సభక్తిన్ మదిన్.

# మేఘసందేశము *

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

కవిత్వమునకు ముఖ్యముగ నక్కఱైనది భావనాశక్తి. కల్పనమనుడు, సృష్టియనుడు ఈ యద్భుతశక్తి నుండియే యుద్భవించును. దీని కతననే కవికానని తావులను కాంచును. సౌందర్యాన్వేషియై, అపూర్వ భావవిభూతిని పడసి, సాహితీచక్రవర్తియై యుగములకును, మహాయుగములకును దాని నీత దప్పనగును.

కవిమానసమున సుధాకలశమున్నది; కవిస్వాంతము సౌందర్యసందీప్తమైనది. ఇది దేనిపై వ్రాలినను, అది యందచందముల నిధానమై, యమృతజీవియై వెలయును. కావున కవితాసామ్రాజ్యమున దుల్లిపడు జడములును ప్రాణప్రదీప్తములై, బహుళమానసములను రంజించును. మాంత్రికుని చేతిబెత్త మెట్టిదో, పరుసవేది యెట్టిదో, Philosopher's Stone ఎట్టిదో, Alchemy ఎట్టిదో కవిభావనము నట్టిదే!

"Full many a glorious morning have I seen
Flatter the mountain-tops with sovereign eye,
Kissing with golden face the meadows green,
Gilding pale streams with heavenly alchemy."

అనికదా షేక్స్పియరు మహాకవి వచించినాడు. ఈతడనిన "Heavenly alchemy" ఈతని స్వాంతమునకు సంబంధించినది సుడీ! వెలవెలబారిన వెల్లువలను రంగారు బంగారు నీరముచే నింపునది కవిమానసమే! ఇది సోకిన కట్టెపుల్ల కుసుమవిలసితమగును. షేక్స్పియరు దుమ్మునుచేబూని, బంగారుపొడి జేసినాడు. బూడిదను చేబట్టి కాళిదాసు పుష్పొడి గావించినాడు. ప్రపంచసారస్వతమును నెమకితిమేని ఎన్నేని దృష్టాంతములు దృగ్గోచరమగును.

కడలిలోని నీరు ఎండవేడిమికి క్రాగి, యావిరియై, మేఘమగునని భౌతికశాస్త్రవేత్త తెలుపును. ఈ యావిరిగడ్డకు నాయువుపోసి, గంభీరభావబంధురము జేసి, సర్వాంగసుందరము గావించునది కవిహృదయము. కావుననే కదా షెల్లీ మహాకవి సృష్టించిన జలదము ("The nursling of the sky.")

"I pass through the pores of the ocean and shores;
I change, but *I cannot die.*"

అని వచించినది.

భావనాశక్తియందు భారతీయు డద్వితీయుడు. ఈ శక్తియందు ప్రపంచసారస్వతమున (చరిత్రయుగమున) నగ్రస్థానమున తేజరిల్లు నాతడు కాళిదాసు. షెల్లీ శక్తికంటె ఈతని శక్తి పెక్కుమడుంగు లధికమైనది. షెల్లీ సృష్టించిన ఘనుడు యాత్రికుడు కాడు. అద్భుతభావరాజి నాత్మహృది నిడికొని ప్రణయసందేశమును గైకొనిన యాత్రికుడు కాళిదాసు సృష్టించిన ఘనుడే! ఈ దూతపథమును భారతమహాకవి ప్రణయప్లావిత మొనరించి, పాఠకుల నాతెరువున నిలిపి వారి మేనులందు బులకలుం వేపినాడు. నిజానుభవములను విద్యుత్ప్రవాహమువలె బఠితలహృదయములం దుపొంగజేయుట కవిగుణములందు ఘనతరమైనది. కవిసంపర్క మెట్టిదో పరికించితిరా? కవిభావమహత్త్వ మెట్టిదో యోచించితిరా? పాఠకలోకము నిచ రసవార్ధియందు,—ఆనందార్ణవమున ముంచివేయునటుస కాళిదాసు "మేఘసందేశము" తారాకాణముకదా!

ఆసియాఖండమందలి యనేక రచయితలకు నిది మేలుబంతియైనది. లెక్కలేని యనుకరణములును, అనుసరణములును, అనువాదములును తలనూపినవి. చూడుడు: పవనదూత, కృష్ణపదాంకదూత, కోకిలసందేశ, భ్రమరదూత, చంద్రదూత, చాతకసందేశ, భ్రమరసందేశ, శుకసందేశ (త్రివేణి యను నొక దాక్షిణాత్యస్త్రీ రచించినది) పికదూత, భక్తిదూతి, పికసందేశ, భృంగసందేశ, మధురోక్తసందేశ, మనో

* ఆంధ్రీకృతము. కర్త శ్రీ మాడభూషి-మఠం-వేంకటాచార్యులుగారు, ప్లీడరు, తిరుపతి. వెల 8 అణాలు.

దూత, మయూరదూతిక, మనోదూతిక, మయూర సందేశ, మారుతసందేశ, మేఘప్రతిసందేశ (ఒక మైసూరువాని రచించినది) పవనదూత, సిద్ధదూత, వాతదూత, విప్రసందేశ, శుకదూత, శుకసందేశ (లక్ష్మీదాసను కేరళకవి రచించినది), సిద్ధదూత (అవధూతరామ విరచితము) శుభసందేశ, హంస దూత (రఘునాథదాస విరచితము), హృదయదూత (హరిహరభట్ట విరచితము) చక్రవాకదూత, కాకసందేశ, గరుడసందేశ మున్నగునవి. హిందువులును, జైనులును, సింహళవాసులును, టిబెట్టువాసులును గూడ నీ యనుకరణమున వ్రాసిరి. కొందఱి గ్రంథము లాకే పేరున బరగినవి.

ప్రతిభాప్రదీప్త గ్రంథములను పఠించియు, అనుకరించియు, అనుసరించియు, అనువదించియు రచయితలాత్మహృదయములందలి ప్రతిభాద్యుతిని గుర్తింతురు. పదపడి సహజశక్తిని, స్వతంత్రశక్తిని ప్రదర్శింప జాలుదురు.

ఆంధ్రకవులలో ముఖ్యులకు "కాళిదాసు కబ్బములు క్రొత్తలు కావు."

మహాకవుల రచనల ననువదించుతఱి మాటలబట్టి ప్రేలాడిన, లాభములేదు. మాటలో పదునాలుగు భావభువనము లుండవచ్చును. ఉపాసనమం దారితేఱిన వ్యక్తికే భావబ్రహ్మాండము మానసగోచర మగును. పుష్పమునుజూచి అందలి మరందహ్రదమున (మానససరోవరమున ముదమునమునుగు కలహంసవలె) మునిగి; మరియు, మనసొకటి; పూవుపై వ్రాలనొల్లని మానసమొకటి. ఆనందమున మునిగిమునిగి, సంపూర్ణముగ నాత్మానుభవమునంది యందినమానసమే యానందమును వ్యక్తీకరింపగలదు. భ్రమరఝుంకృతులేల మధురముగనుండును? నూనహృదయమున మునుగిత నీది, అందలి తేనెలనల్లన దన గుండెయందెలోనికి చాటించుటచేగదా? కవిభావమున మునుంగునంచ గాగలుగునాతడే సుందరదృశ్యమును ప్రదర్శింపగలడు. అక్కఁగములను రేకలందు ప్రవేశించి, యందలి భావ మరందమును తనివోవఁ గ్రోలజాలు తుమ్మెదకాఁగల వాఁడే మంజులాలాపనము గావింపగలఁడు. అనుభవ సామర్థ్యముగల హృదయములేనివాఁడిట్టి షట్పదము కాలేడు. ఇతడు ప్రావోపాసనపరుఁడనుట తప్పు. శబ్దజాల మందు సాముచేయువాఁడని, మాటలఁద్రిల్లునఁ దాటి తేలిన మహాశయుడనిచెప్పుట యొప్పు.

రెండవ తాజమహాలును సృష్టించుట కెవ్వనికైన శక్యమనినను, అది మహాశిల్పికే శక్యముగాని మొండి గోడలందు బ్రదుకీడ్చు వట్టి తాపీవానికిగాదు; భావమును గ్రహించుటయును, నాత్మానుభూతి నందుటయును (మరల సృష్టించుట కివి యనివార్యమైనవి కదా!) వానికి సాధ్యముగాని, వీనికిగాదు. తియ్యని పాయసమునట్లు భావమును బుజ్జిబుజ్జి, మనమున జీర్ణించుకొని, మనోభాగము గావించుకొని, స్వంతశక్తి జేసికొనినవాడే భావనుధాబిందువులను వ్యక్తీకరింప గలడు. తిక్కన యిట్లొనరించినాడు. జీర్ణించుకొన జాలనివాడు కంపుగొట్టువమనమున బొరగిలపడును.

అనువాదము కాదనిపించు అనువాదమే గణింప దగినది. మాతృకలోని భావస్వభావమును మనసునం బట్టించుకొను నాతడే యిట్టి యనువాదము గావింప జాలును. అనువాద మంతరంగమునకు సంబంధించినది కాని యవ్వలి యంగప్రత్యంగములకు గాదు; గుణమును గుర్తించినదిగాని, గోళ్లను గుర్తించినది కాదు. అంగప్రత్యంగముల ననుకరించినంతన నెవ్వడైన నాడుది కాజాలునా? చీర సింగారించుకొని, రవిక దొడిగిన వాడు స్త్రీ కాజాలునా? వేషమునకును, గుణమునకును అవినాభావసంబంధమున్నదని వాకొనువారెవరు? స్త్రీపాత్రను ధరించు సుశీలవుడు కొంత దనకైన స్త్రీస్వభావము నలవఱచుకొనవలెను. అంతే రంగికకల్పనాశక్తి గలిగినవానికే (True artist నకే), దీనిని చక్కగ వ్యక్తీకరింపగలవానికే ఇది సాధ్యము. ఈ కల్పనాశక్తియే సృష్టిశక్తియందును.

సృష్టికర్తగల దేవదేవుడే కదా జగన్మోహినియై ఈశ్వరు నంతవానిని మనసున బులబులలేపెను!

భావోపాసనకే, — నిక్కముగ శబ్దోపాసనకే ఆదర్శానుబంధము,—అనునాదమట్లు తోపని యను వాదము సాధ్యమని తెలుపుట నా యాశయము. శబ్దానువాదముతో పనిచెల్లినదని తలచువారి గ్రంథములను తెలిచి బాధపడుట యవివేకము.

మాతృకలోని భావములను హృదయంగమ మొనరించుకొని, పలుమారు మననము జేసికొనిన ప్రతిభాశాలి ఈ గ్రంథకర్తయనుట కెందు వలసినన్ని దృష్టాంతములున్నవి. మీగనులబోలు కొన్ని పదములను పరికించినను, లోనిభావవిభూతిదెస మనసు పోగలదు. ఈ నుడువులను పరికించినపుడు మనను నృత్యమొనరింపదా?

"నవ్యజపా సుమారుణిప సంధ్యాకాంతిమైనంది"

"కనకాబ్జంబులనీను మానసతటాకంబందు నీరాను చుక"

"సుంగురుల్విడిన మందారప్రసూనంబులుకా"

"వర వైఢూర్యసమాన నాళవికచ స్వర్ణాబ్జ సంఛన్నమై"

"తరుణీరత్నము స్వప్నమందయిన పొందంగోరుచుకా నన్ను నిద్దురఁగాంక్షించుచునుండు."

ఇట్టివచనములు గ్రంథమున జాలగలవు. గ్రంథకర్త యత్నము మిగుల ప్రశంసనీయమైనది.

# గంటలమ్మ

శ్రీ రాయసం వెంకటశివుడుగారు

సీతంపేటలో సేద్యమందు మిగుల నష్టపడి, కొంచెము పొలముసు అమ్మివైచి, 'చెడి పట్టణము చేరుమ'న్నట్లు తెలఁగా యల్లమంద తన భార్యతో గుంటూరుపురము ప్రవేశించెను. విడిచిపోవుట ఆఁడుగూఁతున కెపుడును గష్టమె. కాని, స్వగ్రామమునఁ దనకు కానుపువెంట కానుపు పోవుటచేత, గుంటూరు పయనమునకు కోటమ్మయు సిద్ధమయ్యెను. ఆనగరమున నీరు నివసించునది తమ్మావారితోఁట. నెలకు మూఁడువానలు గురియుచుండు పూర్వకాలమం దెపుడో, అక్కడక్కడ తోఁటలువేసికొని, గుంటూరి వేసిమినుండి భాగ్యవంతులగు పౌరులు కొంత యుపశమనము గాంచుచుండిరఁట. కాని, యీ పిదపకాలమందు వెనుకటి నీటివనతు లంతరించుటచేత, ఇపుడాపురమున నిలిచియున్నవి చెట్లులేనితోఁటల పెద్ద పేళ్లు మాత్రమె!*

౧

శక్తి వంచనలేక పాటుపడు యువకుఁడగుటచేత, అచిరకాలములోనె యల్లమంద పనివాఁడను పేరందెను. మొదటిరోజులలో కూలినాలిచేసికొని యెటులో యూతఁడు గాలి జీవనము చేయుచుండెను గాని, ఇటీవల కొంతడబ్బు చేరుటచేత, యల్లమంద

* నిజమయిన వృత్తాంతము.

మోఁతబండి యొకటికొని, రెయిలు బజారులమధ్య వర్తకపుసరకులు కొనిపోవుచు, మంచిలాభమునందుచున్నాఁడు. కొరిశేపాటి బండ్లజట్టు తరువాత తమ్మావారితోఁట జట్టే గుంటూరులో నెల్ల వాసికెక్కినది. మెలికలు తిరిగిన దండలు, నల్లని బుగ్గమీసములును చిహ్నములుగాఁగల మన యెల్లమందయే ఆ జట్టునకు మేస్త్రి!

౨

కుటుంబపోషణమునకు మగఁడిన్ని పాట్లు పడుచుండుటఁ జూచి యూరకుండనొల్లక, కోటమ్మ తానొక పొగాకు ఫ్యాక్టరీలోఁ గూలికిఁగుదిరి, రోజుకు పావులా సంపాదించుచున్నది. చెప్ప మఱచిపోయితిమి. ఇటీవల వారికుటుంబము వృద్ధినొందినది. తన కడుపున మగబిడ్డపుట్టి దక్కినయెడల మస్తాను పేరు పెట్టుదునని కోటమ్మ యొక మస్తానుఉరుసు సమయమున మ్రొక్కుకొనెను. ఆ ప్రత్యక్ష దేవత ప్రసాదమువలన నంత నామెకుఁ గుమారుఁడుగలిగి పెరుఁగుచున్నాఁడు. పిమ్మట రెండేండ్లకొక యాఁడుపిల్ల కలిగెను. ఆయేఁటి వేసంగిని మశూచకములచేఁ జెలరేగెను. తమ్మావారితోఁట దాపున నిటీవల పాటకపుజనుల గుడియొకటి వెలసినది. అది వేలకొలఁది రూప్యములు వెచ్చించి తీర్చి కట్టిన దేవాలయముకాదు. మంత్రోచ్చారణతో ప్రాణప్రతిష్ఠనందిన స్వామిగాదచట నుండునది. పండ్లుగడచిన వేపచెట్టు మొదట రాతిబండ నొకటి నిలిపి ప్రజలు పసుపుకుంకుమలు పూయఁగా అది గంటలమ్మగా వెలసినది. ఆపదమ్రొక్కులు గైకొనిన యాదేవి యనుగ్రహమువలన కోటమ్మ కూఁతురంత మశూచకమునుండి తేలి, గంటలమ్మ యను పేరుదాల్చెను.

౩

యెల్లమంద గుణము మంచిది. సహవాస దోషమున నెప్పుడైన వాఁడు సారాయి దుకాణము చూచివచ్చినను, సామాన్య కార్మికులవలె రాబడిలో చాలభాగము త్రాగుడునకు వెచ్చించువాఁడు కాఁడు. పొదుపరియగు కోటమ్మ, మగఁడు తన చేతికిచ్చిన డబ్బులోఁ దాను సంపాదించిన సొమ్మును జేర్చి పెంచుచుండుటచేత, ఆ దంపతులు శీఘ్రకాలములోనె స్థితిమంతులను పేరునొంది, తమ యిద్దఱు పిల్లలతోను సుఖజీవనముఁ జేయుచున్నారు.

౪

మాయదైవము వీని మీఁదను, గుంటూరు సీమవాసులయెడలను అలుకఁ బూనెనో యనునట్లు, ఈయేఁడు వేసవికాలము ముగియకముందె విషూచి జాడ్యము చటుక్కున ప్రారంభమై, కార్చిచ్చువలె వేవేగముగఁ బురమంతటను వ్యాపించెను! వ్యాధి తగులనీయదని వైద్యుఁడు చేతికెక్కించు సూదిమందు వెతలపాలు చేయుననియు, రోగము సోఁకినతోడనె ఆస్పత్రికిఁ జేర్పఁబడు దురదృష్టవంతుని పాట్లు దేవునికె యెఱుక యనియు, పామరజనులలో నపోహలు బయలుదేరెను! కావున తమ్మావారితోఁటలోని యేఁబదిపాకల వారికిని వారియిష్ట

దేవత గంటలమ్మయె యింకగతి! చూచు చుండఁగనె వ్యాధి పట్టణము నలముకొనుట చేత, ధైర్యముపీడి, ప్రజ లచటినుండి పలాయనమయిరి.

౫

'దూలమునచ్చి తలఁబాఁకినట్లు' ఈచిన్న కుటుంబములో నంతట నీసూచియమ్మవారు ప్రవేశమయ్యెను! గృహిణికి వ్యాధి సోఁకెను. కోటమ్మ చనిపోవుటయె లడవుగా, అప్పు సొప్పులకై యాగిక, బ్రదికియుండిన బలుసాకు తినవచ్చుననియు, ఇచ్చకునిల్లుబు డిక్కైన చాలుననియును దలపోసి, యల్లమందవారిని వెంటఁగైకొని, గుంటూరు విడిచిపెట్టెను. వారొక సెలయేటి దరికివచ్చునరికి,మస్తాను నకు రోగముతగిలి, వాని యసువులఁగొని గొనిపోయెను. గాఢాబముసంబంధించిన తన కుమారుని కళేబరమా యిసుకతిప్పలోఁ బూడ్చివైచి, యల్లమంద స్వగ్రామము చేరెను. శని వాని నచటను వెంటాడించెను. యల్లమంద తమవాఁడని మోమోటములేక, మీఁదు మిక్కిలి వీనితో రోగాంకురములు తమ యూరదిగుట స్పష్టమనియెంచి, గ్రామస్థులు వాని నచటినుండి తరిమివైచిరి. దిక్కు లేనివానికి దైవమేదిక్కు! ఊరివెలుపల నున్న గుడియొద్ద కంత యల్లమంద తన చిన్నకూఁతురితోఁ జేరెను. ఇంతలో వానికిని రోగమారంభమై, ఒకజాములో యల్లమందయుఁ జనిపోయెను.

౬

అన్నను తలిదండ్రులనుబాసి యేకాకియై గుడిచెంత బ్రొఁకులాడుచున్న యా మూఁడేండ్లశిశువు గంటలమ్మయొద్ద కెవరును జేరకున్నారు! పూజారులు కరుణించి, అన్న మొకింతకలిపి దూరమునుండియే యా పిల్లకుఁ బెట్టుచువచ్చిరి. దీనికిని వ్యాధి సోఁకుననియె వారిభయము కాని, యట్లు జరుగలేదు. ఆబాలిక ముందు సంగతిని గుఱించి యా గ్రామవాసులంత నాలోచనలు సాగించిరి. దాని పర్యవసానము, ఆయూర సంతానములేని యొక భాగ్యవంతులయింట గంటలమ్మ యిపుడు పెరుఁగుచున్నది. తలిదండ్రుల పెంపున కాబాలిక యింక నోఁచుకొనకున్నను, దయార్ద్రహృదయులయిన యా గృహ యజమానుల నిర్హేతుకప్రేమయె దిక్కులేని యాపసిపాప కిపుడు శరణము!

# మన భారత భూమి



శ్రీ యార్లగడ్డ శ్రీ కృష్ణచౌదరిగారు

పూజ్యమైన భారతభూమి, అవతార పురుషులగు రామ, కృష్ణులకు జన్మస్థానము. వీరవరులగు కర్ణార్జునులకు జన్మభూమి. సీతా, అరుంధతీ, సావిత్రి మొదలగు పతివ్రతాతిలకములకు మాతృస్థానము. భక్తాగ్రేసరులగు రామదాసు, తుకారాం, తులసీదాసులకు మాతృభూమి. రత్నగర్భ, ఖనిజ సంపత్తులకు అగ్రస్థానము. అన్ని పంటలకు ఆటపట్టు. వీరవిజ్ఞానవాహినుల ప్రవహింపజేసి, సుకీర్తి గడించిన పుణ్యభూమియగు భారతవర్షము యొక్క నేటిస్థితి యిది.

భారతవర్ష

వైశాల్యము 18,08,679 చ. మైళ్లు.

దీనిలో బ్రిటిషువారి

పాలనక్రిందనున్నది 10,96,171 చ. మైళ్లు.

స్వదేశీసంస్థానముల

పాలనలోనున్నది 7,12,508 చ. మైళ్లు.

| | |
|---|---|
| భారతవర్ష జనసంఖ్య | 35,28,37,098 |
| యిందులో బ్రిటీషుఇండియాలో నివసించువారు | 27,15,26,253 |
| స్వదేశీ సంస్థానములలో నివసించువారు | 8,13,10,845 |

భారతదేశ మంతటిలో

| | |
|---|---|
| నున్న గొప్పపట్టణములు | 10 |
| జిల్లాలు | 261 |

| రాజధానులు | జిల్లాలు | జనసంఖ్య |
|---|---|---|
| మదరాసు | 27 | 5,28,99,875 |
| బొంబాయి | 29 | 2,25,24,000 |
| బెంగాలు | 28 | 5,61,99,897 |
| సంయుక్తరాష్ట్రములు | 52 | 5,72,36,793 |
| బీహార్—ఒరిస్సా | 21 | 4,18,31,588 |
| పంజాబు | 29 | 1,66,19,993 |
| మధ్యపరగణాలు బీరార్ | 22 | 1,35,10,007 |
| ఆసాము | 12 | 84,04,096 |
| సీమాప్రాంతము | 5 | 23,00,004 |
| | 225 | 27,15,26,253 |

భారతవర్ష జనాభాలో

| | |
|---|---|
| చదువురానివారు | 32,16,28,003 |
| దీనిలో పురుషులు | 15,62,43,305 |
| స్త్రీలు | 16,53,84,698 |



లలితకళోపాసన



శ్రీ వేంకటేశ్వర స్వామివారి పుష్కరిణి. వెనుక భాగమున శ్రీవారి ఆలయము గలదు.

Photo by Messrs G. K. Vale & Co.

| | |
|---|---|
| చదువుకొన్నవారు స్త్రీ, పురుషులు | 3,12,09,095 |

బ్రిటిషు ఇండియాలో 100-కి వృత్తి

| | |
|---|---|
| వ్యవసాయవృత్తిలో | 60 |
| వర్తకములో | 6 |
| పరిశ్రమలలో | 10 |
| కమీషన్ వ్యాపారములో | 2 |
| కుంటిగ్రుడ్డివారును సోమరులై భిక్షాటనము చేయువారును | 2 |
| ఇక శ్రీమంతులుగను, జమీందారులుగను, భూస్వాములుగను, ఉద్యోగస్థులుగను | 20 |
| | 100 |

పశు సంతతి

| | |
|---|---|
| గోగణము | 11,96,65,900 |
| మహిష సంతతి | 2,83,35,000 |
| గొఱ్ఱెలు | 2,20,82,000 |
| మేకలు | 2,43,33,000 |
| గుఱ్ఱములు | 16,84,000 |
| గాడిదెలు | 13,96,000 |
| వంటెలు | 4,10,000 |
| కంచరగాడిదలు | 76,000 |

రైల్వేలైనులాక్రమింప ఆక్రమించబడిన భూమి

| | |
|---|---|
| మొత్తం విస్తీర్ణము | 39,5,73 చ. మైళ్లు |
| ఇందుకు ఖర్చు కాబడిన ధనము | రు. 754 కోట్లు |

ప్రతివత్సరము గూడ్సుబండ్లమీద వచ్చు ఆదాయము రు. 80 లక్షలకు మించుచున్నది.

సైన్యము — పోలీసు

| | |
|---|---|
| సైనిక సంఖ్య | 4,40,601 |
| పోలీసు సంఖ్య | 5,18,000 |

ప్రతివత్సరము ఖర్చు

| | |
|---|---|
| సైన్యమునకు | రు. 61,00,00,000 |
| పోలీసుకు | రు. 9,50,00,000 |

బ్రిటిషు ఇండియా

| | |
|---|---|
| చెల్లించు రివిన్యూ | రు. 15,10,00,000 |
| గ్రామములు | 7,00,000 |
| లక్ష జనసంఖ్యకు మించిన నగరములు | 34 |

పంటకాల్వలు

| | |
|---|---|
| ఇందుకు ఆక్రమింపబడిన భూమివిస్తీర్ణము | 36,583 చ. మైళ్లు |
| మెట్టమాగాణీ పైరులచే ఫలసాయమిచ్చుచున్న భూమి ఎకరములు | 22,39,00,000 |

ఉద్యోగస్థుల వార్షికవేతనములు

| | |
|---|---|
| వైస్రాయిగారికి | రు. 2,56,000 |
| గవర్నరుజనరల్ కౌన్సిల్ మెంబరు ఒక్కొక్కరికి | 86,000 |
| సేనానాయకునకు | 1,00,000 |
| మద్రాసు, బెంగాల్, బొంబాయి, యూ. పి. యొక్కొక్క గవర్నరుకు | 1,28,000 |

| | |
|---|---|
| పంజాబు, బీహార్ ఒరిస్సా | |
| యొక్కొక్క గవర్నరుకు | 1,00,000 |
| మధ్యప్రాంత గవర్నరుకు | 72,000 |
| ఆసాము గవర్నరుకు | 66,000 |

విద్యాలయములు

| | |
|---|---|
| పురుషులకొరకు | 1,37,437 |
| స్త్రీలకొరకు | 26,335 |
| హైస్కూళ్లు | 2040 |
| ఆర్టుకాలేజీలు | 152 |
| మెడికల్ కాలేజీలు | 9 |
| లాకాలేజీలు | 14 |
| వ్యవసాయకళాశాలలు | 6 |
| ఇంజనీరింగు కాలేజీలు | 5 |
| పశుచికిత్సా కాలేజీలు | 3 |
| ట్రయినింగు కాలేజీలు | 20 |
| హైస్కూళ్లలో ఆర్టుకాలేజీలో చదువు విద్యార్థుల సంఖ్య | 13,40,843 |

జననమరణములు

| | | |
|---|---|---|
| ప్రతి 1000కి | జననము | 320 |
| ,, | మరణము | 306 |

ప్రపంచము మొత్తముగా ప్రత్తిపంట

| | |
|---|---|
| ప్రత్తిపండుభూమి, ఎకరములు | 2.39,01,000 |
| పండింపబడిన ప్రత్తిబేళ్లు | 54,78,000 |

తల 1కి రు. 0-1-0లు ఆదాయ ముండియుండవచ్చుననుకొను నీ దేశములో సైన్యాధి, గవర్నరులకు లక్షలకొలది వార్షికవేతనములు ముట్టుచున్నవి. తల 1కి రూపాలకొలది ఆదాయమునువచ్చు పశ్చిమ దేశములలో వేలకొలది ముట్టుచున్నవి. లక్షలకొలది ప్రత్తిబేళ్లు పండించు నీదేశమునకు ఇతర దేశములనుండి 60 కోట్ల రూపాయిల వస్త్రాదిగుమతిలో దేశదౌర్భాగ్యమును సూచించుచున్నది.

# గమనిక

గతమాసమునందు ప్రకటించిన పజిలుకు సరియగు సమాధానములు:—

(1) స్వరాజ్యము, (2) సహనము, (3) యత్నము, (4) స్పెయిను, (5) గాంధి, (6) తిక్కన.

సరియగు సమాధాన మొక్కటియు రాలేదు. ఒక్క తప్పుతోగూడిన సమాధానములు పంపిన క్రింది నలుగురకు మూడుమాసములు గృహలక్ష్మి సంచికలు ఉచితముగా పంపబడును.

శ్రీమతి దామోజీపురపు వెంకటజానకమ్మగారు
c/o డి. నరసింహారావుగారు
తాడేపల్లిగూడెము. ప. గో.

శ్రీమతి బుర్రా కామమ్మగారు,
c/o బుర్రా శంకరశాస్త్రిగారు,
చికాకోల్.

శ్రీమతి అడపా సుగుణమణిగారు,
c/o సత్యనారాయణరావుగారు
పి. డబ్ల్యూ. డి. ఆఫీసు, కోరపుట్, ఒరిస్సా.

శ్రీమతి దాసు రాజమ్మగారు,
బేగూరు, కొడవలూరుపోస్టు,
కోవ్వూరుతాలూకా.

# మానవప్రకృతి

## ఏకాంక నాటిక

శ్రీమతి సి. వి. రమణమ్మగారు

[రావుగారి యిల్లు; అందులో ఒక హాలు. హాలు మధ్య గుండ్రటిబల్ల. బల్లమీద ఆకుపచ్చటి మఖమల్ గుడ్డ. దానిమీద గాజాపూలతొట్టి. అందులో వివిధరంగుల కాగితపుపూలు. బల్లచుట్టూ పేము కుర్చీలు అందంగా అమర్చిఉన్నాయి. గుమ్మానికెదురుగానున్న గోడకు తగిలించిన రాజా రామమోహనరాయలు పెద్దసైజు ఫోటో, దాని కుడి ఎడమలలోనున్న కేశవచంద్రసేన్, నాయకుడు వీరేశలింగం పంతులు ఫోటోలు ఆహాలుకు ఒక సంతసౌందర్యాన్ని ఆపాదిస్తూఉన్నాయి.

సాయంత్రం; నాలుగైంది. తీక్ష్ణతతగ్గిన సూర్యకిరణాలు కిటికీలలోంచి పేముకుర్చీలమీదపడి ధగధగ మెరిసిపోతున్నాయి. రావుగారు విలాసంగా ఒక కుర్చీలో కూర్చొని, ఆలోచనాపూర్వకంగా సిగరెట్టు కాలుస్తున్నాడు. ఆయన లాల్చీ, బెంగాలీ కట్టుకట్టిన ఆయన ధోవతీ, కాళ్లకువేసిన బర్మా చెప్పులు చూచి రెండువందల రూపాయలు నెలకు సంపాదిస్తోన్న ఉన్నతోద్యోగి అని ఎవరూ అనుకోలేరు. వయస్సుకూడ అంత ఎక్కువఉండదు, సుమారు నలభైఅయిదు ఉంటాయి. అందమైన విగ్రహం.]

రావు—(కొంతసేపాలోచించి) మణీ!

రావు—(జవాబు రాలేదు. మళ్లీ యింకోమారు అంతకంటె బిగ్గరగా) మణీ!

మణి—వస్తున్నానండీ.

ఒక నిమిషమైంది; మణి ప్రవేశిస్తుంది.

మణికి పదిహేడు పద్దెనిమి దేళ్లుంటాయి; నాజూకైన శరీరం. ఆమె కట్టిన సన్నటిజరీ అంచుల ఖద్దరు చీర ఆమెకోరకే తయారైనట్లుగా అనిపిస్తోంది. ఆమె గుండ్రపు మొహానికి ఆమె పొడుగులోలకులు క్రొత్తసోయగాన్ని సమకూర్చినై.

మణి—(నవ్వుతూ) ఏమండీ నాన్నగారు, పిల్చారు.

రావు—ఏమిటమ్మా నానీ రాలేదింకాను? నాలుగుకూడ అయినట్లుంది.

మణి—వస్తారు. అసలు వస్తుతః ఆయన చాలా Punctualగా ఉండే మనిషండీ. మన యీ దౌర్భాగ్య దామోదరుల మోస్తరు ఒకప్పుడు వస్తామని, యిష్టం వచ్చినప్పుడు రావడం అతని జీవితంలోలేని అలవాటు. పైగా నాతో నాలుగుంటావుకు వస్తామని చెప్పేరు

రావు—అలా ఉన్నతాదర్శాలు పెట్టుకొని, కట్టుబాట్ల సహాయంతో జీవితంలో కావలసిన నడవడిని అలవడచేసుకోడం చాలా ఉత్కృష్టమైన విషయం. అతను కాలేజీలోకూడ యిల్లాగే ఉంటాడా?

మణి—కాలేజీ ఏమిటి, యిల్లేమిటి అతనికి? అతని సంగతి మీకింకా తెలియదనుకుంటాను. అబ్బో! బ్రహ్మాండమైన తెలివిగలవాడు! ఎంత బాగా మాట్లాడుతాడని! అతనికి Burke of the College అనిపేరు ఆటల్లో? ఎన్నికప్పులు గెల్చాడు! అతనంటే కాలేజీ అంతా ప్రాణం విడుస్తారండీ.

రావు—కళ తాండవిస్తూఉండే అతని మొహమే చెప్పుతుంది అతని విషయం అంతా. అయనను వినా సూం అయిందా?

మణి—ఊహూ. టీ అయిందేమో చూచివస్తానండి. (లోపలికి వెడుతుంది.)

[ఆలోచిస్తూ సిగరెట్టుపొగ సంతోషంగా తొందర తొందరగా పైకి వదిలివేస్తున్నారు రావుగారు. అంతలోకే నానీవస్తాడు. ఇరవై రెండు యిరవైమూడు ఏళ్లుంటాయి. మంచి అందమైన మొహం కాకపోయినప్పటికి విశాలమైన ఆ నుదురు, తేజోనిలయాలైన ఆకళ్లూ, అందవిహీనుడు కాడు అని అనిపిస్తోన్నాయి. అతను వేసిన తెల్లడ్రిల్లు పేంటు, ట్వీడుకోటు, చేతిలో టెన్నిసురాకెట్టు కాలేజీలో అంత పేరు ప్రఖ్యాతులుగల నానీ యితనే అని చెప్పక చెప్పుతున్నాయి]

నానీ—హల్లో, గుడ్ యీవెనింగ్ రావుగారు!

రావు—హల్లో! రావోయి రా! నీకోసరం చాలా సేపటినుంచి ఎదురుచూస్తున్నాం. ఇప్పుడే మణి లోపలికి వెళ్లినట్టుంది.

నానీ—ఫరవాలేదు. రానివ్వండి. ఎల్లాఅయినా పెద్దింటిపిల్ల అని అనిపిస్తోంది మణి. ఆవిడ చేష్టలలో గాని, భావాలలో గాని, ఆడవాళ్లలో యీమాత్రం పరువున్నవాళ్లు చాలా అరుదుగా కనిపిస్తారు.

రావు—ఏదో మీబోటివారి దయ.

అంతలోకే టీపాయి చేతిలోపెట్టుకొని వయ్యారంగా వస్తుంది మణి.

మణి—(నానీ కేసిచూస్తూ, చిరునవ్వు నవ్వుతూ) హల్లో! (టీకప్పు అందిస్తుంది.)

నానీ—ప్రథమంలో పెద్దవారైన మీ నాన్నగారికి!

మణి—(నవ్వుతూ) పెద్దవారైనా, పరబ్రహ్మస్వరూపులు కారుగా నా నాన్నగారు. ఈయన 'అహం బ్రహ్మాస్మి' అనే శంకరమతావలంబకుడండి.

రావు—అల్లాగా! (మళ్ళీ టీ తీసుకుంటూ ఉంటారు.)

నానీ—రావుగారూ, తెలియక అడుగుతున్నాను, క్షమించండి. మీ బ్రాహ్మమతంలో పరబ్రహ్మను నీవు ఆదిమధ్యాంతరహితుడవు, ప్రేమమయుడవు, మాపాలిటి కల్పతరువు అని అంటూ నేను నీచుణ్ణి, పాపాత్ముణ్ణి, అల్పుణ్ణి అని అంటారు. ఏమి సమంజసమండి? భర్తృహరి నాలుగు పొగడ్తలు పొగడితే బహూకరించి సంతోషించే నీచజమీందారులాగు భగవంతుడుకూడ వరాలు ప్రసాదిస్తాడా?

రావు—నానీ, నీవు భగవంతుని విషయంలో ఇలామాట్లాడడం బావుండలేదు.

మణి—నానీ, నే నడుగుతాను చెప్పండి. విశ్వగర్భుడైన పరమాత్మలోనే యీప్రపంచం అంతా ఉందని యీప్రపంచంలో పరమాత్ముడు లేడని మీకు తెలుసు కదూ! ఈ చిన్నదైన ప్రపంచం అసంపూర్ణం. దీనిద్వారా పరిపూర్ణత్వాన్ని గ్రహించడానికి ప్రేమబంధాన్ని అర్పించేనుకొని, ప్రేమమయుడైన పరమాత్ముడి స్వయంపరిపూర్ణాన్ని సమీపానికి తెచ్చుకోవాలి కదూ? దీనినే ప్రార్థన అంటారు మేము.

రావు—అల్లాగా!......అవును.

మణి—మీ రెంత శంకరమతావలంబకులైనా, ఏ నిర్గుణత్వాన్ని ఉపాసిస్తారు కదూ. దానివల్ల లాభం ఏమిటి? సగుణోపాసన సంగతి మరచిపోదాం.

నానీ—ఆత్మాభివృద్ధి, ఆత్మ పరమాత్మ భేదాన్ని భేదించడం.

మణి—ఆత్మ పరమాత్మలకు భేదములేనప్పుడు ఎందుకువచ్చిన కుష్కప్రయాస యీ జ్ఞానసముపార్జన, యీ భేదనాప్రయత్నం.

రావుగారు నవ్వారు. ఒకనిమిషం ఉండి మణి అందుకొంది.

మణి—అయినా ఎందుకు నిర్గుణుడైన పరబ్రహ్మ ఎవరుచూచి ఆనందించడానికి ఉన్నాడు అని అనుకొని మన నాశనాన్ని మనం గురిచేసుకోవడం, కులకల్మషాలు పెంచుకోవడం, అమర్యాద ప్రవర్తనలకు దిగడం; చాలా హేయంగాఉంది. నిజమేమిటంటే భగవంతుని విషయంలో యుద్ధం చేయవలసిన పని లేదు; మన ధర్మం, మన విధి, మనం నెరవేర్చి స్తే సరి.

నానీ—మానవప్రకృతికి విరుద్ధమైన విషయం నీవు చెప్పేది. (మిగిలిన టీఅంతా పూర్తిచేశాడు; చెమటలు పట్టుతూఉంటే చేతిరుమాలుతో తుడుచుకుంటూ) ఈ నిరీశ్వరవాదమే మన దేశనాశనానికి దోహదమిస్తోంది అని నా అభిప్రాయమండి.

మణి—(కొంచెం తీక్ష్ణంగా) నానీ, ఈశ్వరుడు లేడని కాదు నేను చెప్పేది. ఈశ్వరుడు అనే తలంపుతో తలలు పగులగొట్టుకోవడం భావ్యంకాదు అని చెప్పతున్నాను. అయినా, ఒకదారిని పోవడం, మానవప్రకృతికి నీవన్నట్టుగా విరుద్ధం. కాని ఒక్కటి తెలుసుకో, ప్రళయానికి వేరు వేరు దార్లుగాని, ప్రపంచానికి ఒక్కటేదారి; మిగిలినవన్నీ ప్రయత్నాలే.

రావు—అవన్నీ మనకెందుకమ్మా యిప్పుడు (అంతలోనే నానీ టైముచూస్తాడు, అయిదయింది.)

నానీ—సరే, నాకు టెన్నీసుకు టైము అయింది. మణీ, క్షమించు మరోమారు ఎప్పుడైనా మాట్లాడుదాం. శలవండి రావుగారు, దయఉంచండి.

రావు—మంచిది.

నానీ—రైటో (వెళ్లిపోతాడు.)

మణి—ఇతని భావాలు ప్రకృతికూడా వింతగానే ఉంటాయి. అనుభవమూ లోతూలేని విజ్ఞానము!

౨

[రావుగారి యింటినంటియున్న పూలతోటలో, రాతి అరుగుమీద విలాసంగా కూర్చొని ఫిడేలు వాయించుకొంటుంది మణి.

ప్రణయగీతిక వెలుగెత్తి పాడిపాడి
యెంతో మూగవోయిన నాహృదయపక్షిణి
ఇపుడు నీకరస్పర్శకై యెదురుచూచు
చున్నదో దేవ! కరుణతో నన్నుఁ బ్రోవ
ప్రేమమయుడవుగాద? ఓ విశ్వగర్భ.

పాట ఆపి గుమ్మముకైపు చూచింది; పాకుడై పోతున్న చెట్లనీడల్ని, రాబోయే చీకటినయూ చూచి ఒక్కసారి తలపోసి దీర్ఘనిశ్వాసము విడిచింది. మరలపాట

ప్రణయగీతిక వెలుగెత్తి పాడిపాడి

.............

అంతలోనే నానీ ప్రత్యక్షమవుతాడు]

నానీ—ఏమిటి? ప్రేమ, ప్రేమ! ప్రేమసూత్రాన్ని అర్థంచేసికొన్నట్టు హృదయాన్ని కరిగించేటట్టు ఎంత హాయిగా శ్రావ్యంగా పాడుతున్నావు. నీవొక్కతె ఒక్కస్త్రీఉంటే చాలదూ యీ నిద్రపోతున్న ప్రపంచాన్ని మేల్కొల్పడానికి?

మణి—దయచేసి ఆలాకూర్చోండి. (అక్కడున్న యింకొక రాతిఅరుగు చూపుతుంది.)

నానీ—ఫరవాలేదు. (అక్కడున్న గడ్డిమెత్త మీద ఆసనశుద్ధిగా కూర్చుంటాడు) మణీ, మన యిరువుర్ని యింత గట్టిగా బంధించగలిగిన యీ ప్రేమసూత్రము మనల్ని ఎక్కడకు తీసుకొని వెడుతుందో?

(మణి ఖంగారుగా, వింతగా అర్థంలేని చూపులు చూస్తుంది.)

నానీ—నా హృదయాన్ని చీల్చి చూడగలిగితే చూడు. ప్రతిక్షణం ఎవరినామాన్ని జపిస్తూ ఉంటుందో? చీకటిమయమైన నా హృదయానికి నీ ప్రేమే వెలుగును కాంతిని ప్రసాదించగల జ్యోతి.

(మణి కళ్లు మూసుకొంటుంది; నానీ యింకా దగ్గరగా జరుగుతాడు.)

నానీ—(మణి శరీరాన్ని ఆపాదమస్తకం పరీక్షిస్తూ) మణీ, నీవే నన్ను నిజంగా ప్రేమిస్తూఉంటే, మన వివాహానికి ఏమీ అభ్యంతరంలేకుండా వేగిర పడు. నేను...(మణి కళ్లవెంట అశ్రుబిందువులు ఏకధారగా కారిపోతున్నాయి; మూగపోయిన గళాన్ని సరిచేసుకొంటోంది.)

నానీ—మణీ, మన ప్రథమసందర్శనంలోనే మన వివాహాన్ని చూడగలిగేను. దాన్ని నీవు అభ్యంతర పెట్టబోకు.

(దుఃఖవివశమైయున్న మణిని ఓదార్చడానికి ఇంకా దగ్గరగా జరుగుతాడు...... పెద్దపులిని చూచి భయపడి దూరంగాపరుగెత్తే లేడిపిల్లలాగు ఒక గంతు వేస్తుంది మణి; ఫిడేలుక్రిందపడి అపశ్రుతి గాళద్ధిస్తుంది.)

మణి—(ఎఱ్ఱనైన కళ్లతో కోపాన్ని సూచిస్తూ) నానీ, యింత క్రూరంగా మాట్లాడుతావని నా జన్మలో అనుకోలేదు. నేను నిన్ను నా సోదరుడి లాగు ప్రేమించాను. దానికి ఫలితమా యిది! (ఆవేశంతో) నీబోటి నీచులు, స్త్రీ స్వాతంత్ర్యంకోసరం గద్దెలెక్కి ఉపన్యాసాలిస్తూ, ఒక్క స్త్రీతో ఒంటరిగా కాలం గడపలేని నీచులు, ఎంతమంది ఉన్నారో యీ భారతభూమిలో! ప్రేమ! (వెర్రిగా నవ్వుతుంది) ప్రేమంటే అర్థంతెలీకుండానే ప్రథమసందర్శనంలోనే వివాహాన్ని చూడగలిగేవు కాదూ? వివాహాన్ని కాదు నీవు చూడగలిగింది. నీ నాశనాన్ని, నీ ప్రేమనాశనాన్ని, పరస్త్రీనాశనాన్ని.

(నానీ తలగిర్రున తిరిగిపోతుంది. శవంలా నిశ్చేష్టుడై చూస్తూఉంటాడు.) ఇదేకాదు. అహం బ్రహ్మాస్మి అనే పరబ్రహ్మస్వరూపం?... నానీ, నీకు హృదయంలేదు, మేధస్సు ఉంది. దాన్నిచూచి భ్రమపడిపోయింది లోకం. అనుభవమూ లోతూ లేని నీ విజ్ఞానము బూడిదనుపోసిన పన్నీరని గ్రహించలేకపోయింది. (నానీ యింకా దగ్గిరగా వస్తున్నాడు.) నానీ నీవుయిక నామొహము చూడొద్దు! కాని తెలుసుకో, వివాహమనేది ఆత్మోపలబ్ధికేగాని, బహిరింద్రియాలు సృష్టిచేసేకామప్రవృత్తి నివృత్తికొరకేకాదని.

నానీ—(జాలువారే కన్నీళ్లు తుడుచుకుంటూ) మణీ! క్షమించు.

మణి—నా మొహం చూడొద్దు వెళ్లు, నీవు క్రూరుడవు.

(నానీ బయల్దేరడానికి లేస్తాడు. ఎదురుగా రావుగారు ప్రత్యక్షమవుతారు. నానీ మాట్లాడకుండా వెళ్లిపోతాడు.)

రావు—(కోపంగా) మణీ, నీ ప్రవర్తన ఏమీ బావుండలేదు, నేనూ చూస్తూనేఉన్నాను. నీకు చదువు చెప్పించి స్వాతంత్ర్యము యిచ్చినందుకు బాగా కీర్తిప్రతిష్ఠలు తెస్తున్నావ్!

మణి—(అతికోపంగా) నాన్నగారూ, నాకు తెలుసు మీరు నాకు చదువు చెప్పించింది, నాకు స్వాతంత్ర్యం ఇచ్చింది, నాకొరకుగాని, మీ విశ్వాసముకొరకుగాని కాదని. మీరు, బ్రహ్మసమాజ సిద్ధాంతాలు తెలిసుని మీరు, మరిలేకపోతే బ్రహ్మసమాజానికి పెద్దలవుతారు. మీ ఉద్యోగంకోసరం, మీ మర్యాదకోసరం, నన్ను ఒక వస్తువుగా ఉపయోగింపచూచారు. కాని తెలుసుకోండి, మీరు ఉపయోగించిన యీవస్తువులో ఒక హృదయముందని అభివృద్ధి కాదగ్గ ఆత్మ ఒకటుందని.

రావు—బ్రహ్మసమాజం, స్త్రీ స్వాతంత్ర్యం తెస్తున్న కీళ్లే యిది!

మణి—(ప్రశాంతంగా) బాగా ఆలోచించండి. అదికాదు. మానవుని స్వార్థము, కట్టుబాటులేని విషమప్రకృతివల్ల కలిగే అనర్థాలు యివి!

3

[రావుగారి యింటిలో హాలు. అన్నీ పూర్వము మోస్తరే ఉన్నాయి. రావుగారు ఒక పేముకుర్చీలో

కూర్చొని ఏదో ఆలోచిస్తూ ఉంటారు. మణి ప్రక్క కుర్చీలో కూర్చొని ఉంటుంది. ఉప్పొంగిపున్న సముద్రాన్ని చూస్తూ నిశ్చలంగా, నిర్మలంగావున్న ఆకాశంలావుంది కళవాడిన ఆమె మొహము.]

రావు—మణీ! ప్రపంచంలో యీ నూతనసంస్కరణలనేవన్నీ వట్టి బూటకాలు. వాటిని మనం ఉపయోగించుకొని అభివృద్ధికిరావడానికి దారిచూపుకోవాలిగాని, వాటికోరకు మనం పాటుపడితే అవి మనల్ని సర్వనాశనం చెయ్యందే వదిలిపెట్టవు. (మణి పొంగిపొరలివచ్చే దుఃఖాన్ని అతికష్టంమీద ఆపుకొంటుంది.) ఇదో నీకు చెప్పేను చూడు. మన యింటికి వస్తారని ఎక్సయిజు యిన్‌స్పెక్టరుగారు (Excise Inspector) ఆయన కింకా వివాహము కాలేదు, నాయుళ్ల కుఱ్ఱాడు, పైకి రాదగ్గవాడు, నిన్ను చూడడానికే యివ్వేళ రావడం. (మణి మాట్లాడదు, శాంతత మొహాన్ని తాండవిస్తూఉంటుంది.) అతన్ని వివాహంచేసుకొంటే బ్రహ్మరథం పట్టారు బ్రహ్మసమాజపు పెద్దలంతా, సంఘసంస్కరణ అని పూజిస్తారు.

(అన్యవిచారంలేకుండా ప్రశాంతంగా వింటూఉంటుంది మణి. అంతలోకే యిన్‌స్పెక్టరు శ్యాంవస్తాడు. ఒహమోస్తరుగా ఉంటాడు, పలుచటిశరీరం.)

శ్యాం—హల్లో, రావుగారూ, గుడ్‌మార్నింగ్!

రావు—హల్లో, రండి. మీకోసరమే చూస్తున్నాం. ఇలా కూర్చోండి. (ఒక కుర్చీ చూపుతాడు)

(మణి చలనంలేకుండా ఒకయోగినిలా కూర్చుంటుంది.)

రావు—మణీ, కాఫీ తీసుకొనిరా, అమ్మా. (మణి లోపలికి వెళుతుంది.)

శ్యాం—మీ అమ్మాయికి సిగ్గు బిడియం చాలా ఉన్నట్టున్నాయండి. అవి మన స్త్రీలకు ఆభరణాలు నుమండీ! లేకపోతే, మగవాళ్లతోపాటు వీధిలో గంతులువెయ్యాలని కాఫీగ్లాసులు పట్టుకొచ్చి గదిలో

(మణి కాఫీ తీసుకొస్తుంది. కేవలం మాటచెప్పి కుర్చీలో ఆసీనురాలవుతుంది.)

రావు—దయచేసి కాఫీ తీసుకోండి. (వారిద్దరూ తీసికొంటూఉంటారు, శ్యాం మణివంక పరీక్షదృష్టితో చూస్తూఉంటాడు, మణి తల వంచుకొంటుంది).

శ్యాం—రావుగారూ, చూశారూ, ఆడవాళ్లిప్పుడు స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం అంటూ మగవాళ్లంటే నిర్లక్ష్యంగా చూస్తూ, సిగ్గులేకుండా తిరుగుతూ అసహ్యమైన ప్రవర్తనకు దిగుతూఉన్నారు. అయినా, సిగ్గులేని ఆడవాళ్ళు, సిగ్గున్న మగవాడిని నమ్మడానికి వీలు లేదు లెండి.

మణి—(చేతిరుమాలుతో దొండపండులా కందిపోతున్న మొహాన్ని తుడుచుకుంటూ) ఇన్‌స్పెక్టరుగారూ, క్షమించండి. సిగ్గువిడిచి మీబోటి మగవారితో మాట్లాడవలసివచ్చినందుకు నేనూ చాలా చింతిస్తున్నాను.

(శ్యాం నిర్ఘాంతపోతాడు, రావుగారు కోపంగా చూస్తారు; మళ్లీ మణి...) మీకు స్త్రీఅంటే ఉన్న నీచోద్దేశ్యాన్ని పటాపంచలు చెయ్యాలనే సంకల్పంతోనే నే నీ నాలుగుముక్కలు చెప్పాలసివచ్చింది. మీ ఉద్దేశ్యంలో స్త్రీ అంటే దాసి, బానిస, వంటకత్తె...ఆమె బుద్ధి ప్రళయాంతకము. కాని, యికనైనా తెలుసుకోండి, మీరు పురుషుని సౌఖ్యార్థము సృజింపబడిన విలాసవస్తువుగ...దాస్యపరికరముగ... పరిగణిస్తూఉన్న ఆవస్తువులో ఒక జీవంఉందని... అభివృద్ధికాదగ్గ ఆత్మ ఒకటుందని...యిది కారణంగానే అది భవిష్యజ్జాతినిర్మాత్రి, ఉత్తేజకారిణి... దేవి అవుతూఉందని.

(త్రాగుతూఉన్న కాఫీకప్పు అనాలోచితంగానే క్రిందపెట్టారు రావుగారు.) అవును లెండి. (తల పంకిస్తూ) స్త్రీ నడవడిగాని, ప్రవర్తనగాని, భావాలు

గాని, జీవితోద్దేశ్యముగాని తెలిసికోకుండా వివాహమాడడానికి వచ్చిన మీ మేధస్సును ఏమని కొనియాడాలి? సంఘసంస్కరణమాటే గిట్టని మా నాన్నగారు, యీ వింతవివాహానికి ఒప్పుకోవడం ఎంత క్రూరంగా ఉంది. అసహ్యాపు ప్రవర్తనలకుదిగింది. సిగ్గుతో తలలు వంచవలసింది స్త్రీలా పురుషులా యిప్పుడుచెప్పండి.

రావు—(కోపంగా) డేమిట్, ఏమిటీ రొద.

(అంతలోకే నానీ వస్తాడు.)

నానీ—హల్లో, గుడ్‌మార్నింగ్ సిస్టర్.

మణీ—నానీ, స్త్రీవిద్యను ప్రోత్సహిస్తూ స్త్రీకి స్వాతంత్ర్యము యివ్వని పురుషుల్ని ఏమని అనాలి?

(ఇన్‌స్పెక్టరు శ్యాం ఖంగారుగా లేస్తాడు.)

రావు—నాన్‌సెన్సు! ఏమిటీ గోల.

నానీ—పతితమైన భారతస్త్రీ తన స్వాతంత్ర్యం కోసరం పడే తీవ్రమనోవేదన. దాన్నే మీరు గోల అంటారేమొ మీ భాషలో, నాకు తెలియదు.

మణి—నానీ, యిది పెద్ద విచారించవలసిన విషయం కాదు. మానవప్రకృతే అలా మారిపోయింది. (ఒకనిమిషం ఆగి దీర్ఘనిశ్వాసం విడుస్తుంది.) అదీగాక నా అభిప్రాయమేమంటే, పురుషుడు యీ స్వార్థాన్ని చంపుకోనేవరకు దేశానికి మోక్షం రాదేమోనని!

(ఇన్‌స్పెక్టరుగారు తొందర తొందరగా వెళ్లిపోతారు. రావుగారు ఫూలిష్ (Foolish) అంటూ చరచర వంటయింటివైపు నడుస్తారు.)

నానీ—సోదరీ. నీ స్వాతంత్ర్యవిజయానికి చాలా సంతోషం.

(మణి కుర్చీలో కూర్చొంటుంది ఆలోచిస్తూ.)

మణి—(నెమ్మదిగా) ఈప్రపంచంలో జరిగే అనర్థాలన్నిటికీ కారణం, ప్రపంచంలో విచక్షణాజ్ఞానం చచ్చిపోవడమే ననుకుంటూ.

నానీ—(ఆలోచిస్తూ తనలోతాను) అంధకారమయమైన యీ భారతీయసంఘాన్ని పునఃకాంతిమంతము చెయ్యడానికి యిలాటి మణులు ఎన్ని కావాలో యింకా.

—:o:—

# పాకకళ

## గుమ్మిడికాయ వూరగాయ

ఒక గుమ్మడికాయను తెచ్చి దానిని పరిశుభ్రముగ కడిగి తరువాత దానిని సన్నసన్నముక్కలుగ తరగవలయును. పావుశేరు ఆవాలను ఎండబెట్టి మెత్తని పొడుముగాదంచి, శనగగింజంత యింగువయు, ఒకపావుశేరుప్పు పావుశేరుకు కొంచెముతక్కువగ కారము కలపవలయును. అన్నియుకలసిన ఆ పొడుమునందు రెండుమూడుగరిటెల పప్పునూనెనుకలిపి ఒకటిస్పూన్ పసుపుగూడ దానియందు కలుపవలయును. గుమ్మడికాయముక్కలను పొడుముతోకలిపి ఒకజాడీలో నుంచవలయును. అది ఒకటిరెండు గంటలు సేపటికి మామిడికాయవూరగాయవలె వూరి బహురుచిగాయుండును. యిది చెడిపోకుండ రెండుమూడుమాసములు పరిశుభ్రముగనిలువయుండును.

మల్లాది వెంకటరమణమ్మ.

# 'కృషితో నాస్తిదుర్భిక్షం' *

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఈ బాపట్లతాలూకా మహిళాసభను అవ్యవధిగా, అస్తవ్యస్తంగా తలపెట్టినవిధం తలుచుకొని నేటి యీమహిళాసభను తలుచుకుంటే అతి ఆశ్చర్యకరంగానూ ఆనందకరంగానూ ఉత్సాహకరంగానూగూడా వున్నది. నాలుగురోజులక్రిందటి వఱకూ మహిళాసభ జరిపేఉద్దేశం మాలో కేవల బీజమాత్రంగా వుండెను. నేడు ఒక మహావృక్షంలాగా కన్పిస్తున్నది. ఐంద్రజాలికుడు నాటినగింజ అప్పటికప్పుడే మొలకెత్తి ఆకులువేసి పెద్దదై పుష్పించి ఫలించినట్లుగా తాలూకా మహిళాసభ యేర్పాటైంది. 'కృషితో నాస్తిదుర్భిక్షం'. యత్నానికి సాధ్యంకాని పనిలేదు. సంఘీభావానికి ఫలించని కార్యంలేదు. కనుకనే మీయెల్లరితోడ్పాటుతో అత్యల్పకాలంలో మహిళాసభను యేర్పాటుచేయగలిగాము. ఇందువల్ల మాకు నవశక్తికలిగింది. యీవిధంగానే యికముందుగూడా తోడ్పడుతూవుంటే స్త్రీజనాభివృద్ధియే కర్తవ్యంగాపెట్టుకున్న మేము యథాశక్తి మాసేవాధర్మ నిర్వహించగలుగుతాము. యజమాని ఒక ఆవును కొనుక్కుంటే అతనివల్ల దానికి మంచి గడ్డిగింజలు వగైరాలు దొరుకుతాయి. దానివల్ల అతనికి మాధుర్యమైనపాలు దొరుకుతాయి. అట్లాగే ఒకసంఘానికి విరాళాలిస్తే అది బ్రతుకుతుంది. అది తనధర్మం తాను నిర్వహిస్తే సంఘానికి ఉపకారం కలుగుతుంది. సంఘ వికాసంగాని ప్రేమవికాసంగాని జీవవికాసంగాని యిచ్చిపుచ్చుకోవడంమీదనే వున్నది. ఇక ప్రస్తుతానికి వస్తాను. ఈతాలూకా మహిళాసభ యావద్భారత దేశమునా వ్యాపించివున్న మహిళోద్యమమనే జీవనదినుండి త్రవ్వి ప్రవహింపజేసిన ఒక చిన్న పిల్లకాలువ. దీనికంటే కొంచెము పెద్దది జిల్లాసభ; దానికంటె యింకా కొంచెం పెద్దది రాష్ట్రీయసభ; ఆరాష్ట్రీయసభకంటె పెద్దది అఖిలభారత మహిళాసభ; దానికంటెపెద్దది ప్రపంచమహిళాసభ. ఈ విధంగా ఒక గ్రామస్త్రీలతోను తాలూకాస్త్రీలతోను మొదలుకొని సమస్తదేశస్త్రీలతోను సంబంధం గలిగించడంచేత యీమహిళాసభ ఆకృతిచేత చిన్నదైనా ఉద్దేశంచేత పెద్దదనే చెప్పవలసివస్తుంది.

మొన్న మొన్నటివరకు ప్రపంచంలోని ప్రతిదేశమందునూ స్త్రీలస్థితి ఒకేవిధమైన పారతంత్ర్యావస్థలోనేవున్నది. కాని సజీవమైన ఒక జాతిని యెల్లకాలం ఒకేవిధంగా అడగత్రొక్కి వుంచడానికి సాధ్యమా? ప్రపంచంలోని సమస్తదేశస్త్రీలలోను యిప్పుడు అద్భుతమైన ప్రబోధంకలిగింది. స్త్రీలను బురఖాలతో బంధించే తుర్కీనిచూడండి. దుర్భరమైన సాంఘిక నియమాలచే కట్టివేసే చీనానుచూడండి. అవ్యక్తమైన ఆచారాలతో నిర్బంధించే జపానునుచూడండి. ప్రతిదేశంలోను అఖండప్రబోధంగలిగింది మహిళాలోకంలో. తుర్కీలో స్త్రీలకువున్న ఘోషా ఉఫ్న యెగిరిపోయింది. చీనాస్త్రీల నల్లమందుమాంద్యం నిముషంలో మబ్బువిచ్చినట్లు విచ్చిపోయింది. జపాను స్త్రీల నిర్బంధాచారాలు మంచుకరిగినట్లు కరిగిపోయినాయి. ఇక ఐరోపా అమెరికాఖండాల్లో ఆడవాళ్ల అభివృద్ధి యెట్లావున్నది చెప్పవలసినపనేలేదు. వాళ్లు మగవాళ్లకు పైచెయ్యే అయిపోయినారు. ఈవిధంగా సమస్తదేశస్త్రీలు అభ్యుదయతేజస్సులో శోభిల్లుతూ వుంటే ఆకాంతి కొంచెమైనా మనహిందూదేశస్త్రీల మీద సోకకుండా యెట్లావుంటుంది. వాళ్లుమాత్రం

* ద్వితీయ బాపట్లతాలూకా మహిళాసభా ప్రారంభోపన్యాసము.

ప్రపంచానికి సంబంధించిన వాళ్లు కాదా? కనుకనే హిందూ స్త్రీలమీద కూడా ఆ తేజోకిరణాలు పడ్డాయి. అయితే యెల్లప్పుడు చీకట్లో ఉండటానికి అలవాటు పడిన ప్రాణిని వెలుగులోకి తీసుకొస్తే ఆ వెలుగు చూడలేక గిలగిలకొట్టుకొని కళ్లుమూసుకుంటుంది. అట్లాగే అనేక వత్సరాలుగా అవిద్యాంధ తమస్సులో నిమగ్నులైన మన భారత స్త్రీలు స్త్రీలలో కలుగుచున్న నూతన పరిణామంచూచి భయపడి భ్రాంతిజెంది మాకొద్దు, మాకొద్దు, మేమెన్నడూ యెఱుగమని కండ్లు మూసుకుంటున్నారు. ఏమనిపైనా వెలుగు నేనుచూడలేనని కండ్లుమూసుకుంటే ఆ వెలుతురు తాను చూడకుండా ఉండటమే సంభవిస్తుంది గాని ఆ వెలుతురు తనమీద పడకుండా యేమిచేయకలుగుతుంది? అట్లాగే స్త్రీ సంఘంలో కలుగుచున్న క్రొత్తమార్పులతో మాకు జోక్యంలేదని మనమెంతముడుచుకొని ఒత్తిగిలినా ఆమార్పుల ప్రభావంమాత్రం మనలను అంటకుండా చేసుకోలేము. ఇప్పుడు శారదాచట్టం వచ్చిందంటే వోటింగుహక్కు వచ్చిందంటే, వారసత్వాధికారం వచ్చిందంటే అది కావాలన్నవాళ్లకు వచ్చి వద్దన్న వాళ్లకు రాకపోలేదు. అలాగే యిక స్త్రీలకు రాబోయ్యే యేఅధికారంగాని యేహక్కుగాని కేవలం సభలుచేసి తీర్మానాలు చేసినవాళ్లకే రాదు. అందఱికీ వస్తుంది. యీసభను జరిపే ఉద్దేశంగూడా స్త్రీలందఱికీ లాభం చేకూర్చవలెననే అభిప్రాయంతోగాని యే కొలదిమందో ప్రయోజనంకోరిగాదు కనుక నేను మనవిచేసే దేమంటే స్త్రీసంఘంలో మార్పుకలగడం తప్పని సరిగా సంభవించింది కాబట్టి, అది వద్దన్నవారి నైనా స్పృశించకుండా వదలదు గాబట్టి, దాన్ని మనం చూడకపోయినా అది చూడకుండా ఉండదు కాబట్టి, మనకెందుకనేమాటను వదలిపెట్టి అన్నివిషయాలు చక్కగా బరికించి పరిశీలించి తెలుసుకోడం మంచిదని.

ప్రస్తుతం ఈమహిళాసభల్లో చర్చింపబడే విషయాలు రెండు. ఒకటి విద్యావిషయం రెండోది సాంఘికం.

ఏదేశంలోనైనా స్త్రీలుగాని పురుషులుగాని అజ్ఞానులుగాను మూఢులుగాను మారిపోవడానికి ముఖ్యహేతువు అవిద్య. ఈవిద్య అనేకవాటం విద్య యనే గొడ్డలిపెట్టులతో యెప్పుడు బ్రద్దలు చేయబడుతుందో అప్పుడే వారిలో అంతర్గర్భితమైన వివిధ వివేకశక్తులు బయల్పడి వారివికాసానికి తోడ్పడుతవి. గట్టుతెగగొట్టినతర్వాత ప్రవాహాన్ని నిలపడం యెట్లా సాధ్యంగాదో విద్యచెప్పినతరువాత యెవరి వివేకశక్తులుగాని నిరోధించడానికి సాధ్యంగాదు. కాబట్టి జాతియొక్క అభ్యుదయానికి కావలసిన ప్రధాన సాధనం విద్య.

బస్తీలలో చదువుకున్న ఆడవాళ్లను నలుగురినీచూచి స్త్రీలవిద్యాభివృద్ధిని గణించగూడదు. 1931 సంవత్సరం జనాభాలెక్కలను బట్టిచూస్తే నూటికి తొంభై యెన్మిదిమంది చదువుకోనివారే. పూర్వం స్త్రీలు తమ విషయాలు తాము పరిశీలించుకోలేని రోజుల్లో తామే బాధ్యతవహించి నాకు అట్టు నీకు ముక్క అన్నట్టు నూరుపాళ్లలాభం తాముచూచుకొని ఒకపాలులాభం మనకు వచ్చేటట్టు విచారిస్తూవుండేవారు. ఇప్పుడు స్త్రీలకు కొంచెం విద్యాపరిజ్ఞానం యేర్పడినందున ఆవొకపాలు విచారణగూడా వారు మానివేశారు. కాబట్టి యిప్పుడు స్త్రీలు తమ క్షేమలాభాలను తామే పరిశీలించుకోవాలె. స్త్రీలంటే ఈభారతదేశపు జనాభాలో సగానికి మిగిలియున్న బాహుళ్యమైన సంఘమన్నమాట. ఈసంఘమేగనుక నిజంగా సరియైన అభివృద్ధిమార్గంబట్టి పైకివచ్చిందా అంటే భారతదేశం మళ్లీ ఒక్కవెలుగు వెలుగుతుంది. శూరులను, వీరులను, కవులను గాయకులను, పండితులను, మహర్షులను, మహాత్ములను సృష్టింపజేస్తుంది. సందేహంలేదు. కాని అటువంటి మహద్దశ రావడానికి యిటువంటి మహిళా సంఘాలు యెన్నాళ్లో పాటుపడాలె.

ఇంకా నా అన్న అభిమానమే పుట్టలేదు మనకు. వేదాంతభాషలో 'నా' అంటే ఎంతనిషేధమో దేశ

## 'కృషితో నాస్తిదుర్భిక్షం'

విషయంలో అంతసత్కారం. నామతము, నాసంఘము నాభాష, నాహక్కులు, నాదేశము అనేఅభిమానం పుడితేనేగాని యేజాతికైనా అభ్యుదయదశపట్టదు. మనసంఘం విద్యాహీనతచేత నశించిపోతూవుంటే సాంఘికనిర్బంధాలచేత సన్నగిలిపోతూవుంటే, ఆచార పీడనాలచేత అడుగంటిపోతూవుంటే ద్రవ్యలేబరంచేత తట్టుముట్టాడుతూవుంటే యివన్నీ మనమంచికే వచ్చిన వని అనుకుంటున్నాము మనం ఇంకసడలితే పరువు పోతుందనుకుంటున్నాము. ఏజాతైనా వివేకాలుకలిగి తనబాగు తానుచూచుకుంటే బాగుపడుతుందిగాని చెడి పోదు. పరువు యెక్కువ చేసుకుంటుందిగాని తక్కువ చేసుకోదు. దేశసౌభాగ్యానికి దేశీయవస్తువులను ఉప యోగించవలెనని యెందరో మొరబెట్టుతున్నారు, యేమిలాభం? వారిమొర వారిదే. యిప్పటికీ చీనా సిల్కులు, జపానురిబ్బన్లు, జర్మనీపౌడర్లు, యింగ్లండు సోపులు, అమెరికన్ పిన్నులు, ఆస్ట్రేలియా సెంట్లు, పరాసు స్నోలు ఉంటేనేగాని మన అలంకారాలు పూర్తికావడంలేదు. ప్రపంచంలో యేఅనాగరిక స్త్రీ గూడా యీవిధంగా తనదేశంలో తయారుగాని వస్త్రములనుధరించడానికి యిష్టపడదు. ఎందుకనాగా వున్న అన్యదేశవస్తువులు అందంగా మనలో తక్కువగా చేతితోగూడా ముట్టరు. స్వాభిమానం మనలో కలిగినప్పుడే నాదేశము యిది నాసొమ్మనేభావం గాదు, కాని యిది మనకు తెలియదు. ఎవరైనా చెప్పినా ఎవరో చూస్తారులేస్తూ, ఎప్పుడో జరిగి పోతుందిలేస్తూ ఎక్కడచేసింది లేదేమిమునిగిందిలేస్తూ ఏహక్కులూ లేకపోతే పోనీలేస్తూ, ఏవస్తువులు లేక పోతే మానెలేస్తూ అంటారు. అన్నిటికీ యిదే నిర్లక్ష్యమే. ఇది చదువురాని అజ్ఞానమనుకుందామా చదువెక్కువైన వేదాంతవిజ్ఞానమనుకుందామా? విప రీతవిజ్ఞానమనుకుందామా! ఇట్లావున్నది మనస్త్రీలస్థితి. యిటువంటి స్త్రీలకు స్వస్వరూపజ్ఞానం కలుగజేయ డానికి యేర్పడ్డవే యీమహిళాసభలు. కనుక యీసభ లలోచేరి మనకు సంబంధించినవిషయాలన్నీ సంపూ ర్ణంగా చర్చించుకుందాము. మీఅమూల్యకాలం కొంత నాముచ్చట్లతో వ్యర్థపుచ్చినందుకు క్షమిస్తూ, ఈమహి ళాసభలో చర్చించబోయే విషయాలను సమగ్రంగా పరిశీలించి కర్తవ్యం నిర్వహిస్తారని నమ్ముతున్నాను.

**తల్లులకు హెచ్చరిక :—**

> మీ కుమారులును కుమార్తెలును నవీనాభిప్రాయము లతో ముందుకు జనుచున్నారు. మీరు వారలతో నే కీభవించుటకు బదులు వారినిఆప ప్రయత్నించినయెడల వారు మీ చేతులలోనుండి దాటిపోయెదరు.”

మంటుజాసా నవాజ్ - పంజాబ్.

# తిరుపతి

ఘనగోపురములు ప్రాకారమండపములు తేరులు సత్పుణ్యతీర్థములును
కమలాప్తకిరణసంకలితంబులై ప్రకాశించుచుండెడు హేమశిఖరములును
పావనపరివారదేవాలయంబులు మహిమనొప్పు విరక్తమఠవరములు
రంగత్తరంగమాతంగతురంగముల్ గొమరారు బహుసాధుగోగణములు
ముద్దుగాఁబల్కు శుకపికములును నీల
కంఠములును మరాళసంఘములు మఱియు
ఫలవనంబులు తుళసికాదళసుమములు
క్రిక్కిఱిసియుండు వేంకటగిరిని నెపుడు.

అప్పురియందు దివ్యతరహాటక కుంభవిరాజమానమై
యొప్పువిమానమధ్యమున నుత్తమపూరుషుఁడై మహాత్ముఁడై
యొప్పులకుప్పయై ధరమహోన్నతుఁడై వెలుఁగొందుచుండు మా
యప్పఁడు వేంకటేశ్వరుఁ డహర్నిశముం గమలాసమేతుఁడై.

—తరిగొండ వేంకమాంబ.

కలియుగవైకుంఠంబను పేరంబరగు శైలరాజంబుల భువనైకనాయకుండైన శ్రీ వేంకటేశ్వరునకు నివాసంబయి హిందువు లందఱిచేతను మిక్కిలి పవిత్రముగ భావింపబడి తనరారుచున్నవి. తిరుపతినుండి ప్రారంభించు ముఖ్యనగంబయిన సప్తమునకు 'వేంకటాచలంబ'నియు తక్కుంగల షట్ శైలంబులకు వృషభాద్రి, గరుడాద్రి, సింహాద్రి, అంజనాద్రి, శేషాద్రి, నారాయణాద్రి యని వరుసక్రమంబున జేరవచ్చును. ఒకప్పు డీ కొండలు మేరుశిఖరములలో నొకటిగానుండి, ఆదిశేష వాయుదేవుల యుద్ధమూలమున జారి భూమిపై రాలెనని స్థలపురాణము వాకొనుచున్నది.

ఈ వేంకటేశ్వరు నాలయంబునకు నలువైపులను అనగా తిరుపతి, చంద్రగిరి, నాగపట్లు, బాలపల్లె మార్గములుండెనట గాని తుది పేర్కొనబడిన రెండు మార్గములును నేడు వాడుకలో లేవు. ఉన్న రెండు మార్గముల పొడవును విద్యుద్దీపముల గలిగి రాత్రులందు యాత్రికులకు మిక్కిలి యనువుగనున్నవి. చంద్రగిరి మార్గమున మంగాపురమునందు యాత్రస్థుల సౌకర్యమునకై దేవస్థానమువారు ఒక సత్రమును నిర్మించి యున్నారు; కాని యీవైపుకొండను నేగువారు వేయి కొక్కరైన నుండరేమో!

తిరుపతిమార్గమున ప్రథమనగాగ్రంబున 'గాలిగోపుర'మున్నది. దీనిచెంత నిలబడి సర్వదిగ్దర్శక ప్రకృతిచిత్రంబును సువర్ణముఖరీ నదిపాయ పల్లపుప్రదేశంబును జూచిన నెంతయో మదికింపు గొల్పును.

తిరుమల 1 క్షేత్రంబు శ్రీ ఆదివరాహస్వామివారిదనియు, వారి యనుజ్ఞబడసియే శ్రీ వేంకటేశ్వరులవారిచ్చట వెలసిరనియు నొక పౌరాణిక గాథ వాడుకలోనున్నది. ఈస్థలమున కిప్పటికిని వరాహ

---

1 శ్రీ వేంకటేశ్వరు డుండుదానికి తిరుమల యనియు రైలుస్టేషను దగ్గఱనున్న పట్టణమునకు తిరుపతియనియు నక్కడివారు వాడెదరు.



శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆలయ సింహద్వారము.

Photo by Messrs. G. K. Vale & Co.



శ్రీమతి

మంతెన అన్నపూర్ణమ్మగారు

గుంటూరుజిల్లా కాంగ్రెసు ప్రముఖులగు మంతెన వేంకటరాజుగారి ధర్మపత్ని. ఘోషావదలి కాంగ్రెసు ఆజ్ఞల ప్రకారము దేశసేవ చేయుచున్న విదుషీమణి. 1937 మార్చి 17వ తేదీ పోటీలేకుండా ఒంగోలు జిల్లాబోర్డున కెన్నుకొనబడిరి. జిల్లాబోర్డునుండి గుంటూరుజిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలుకుకూడా ఎన్నుకొనబడిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సభ్యురాలు. గుంటూరు జిల్లాలో క్షత్రియులలో అన్నివిధముల ప్రజాసేవచేయుటకు పతితో ముందు కురికిన ప్రథమ వీరపత్ని.





'మేలానామ్ తతోజాహై'



క్షేత్రమనియు పేరు. నేటికిని దైనికపూజాదులు ప్రథమమున శ్రీ ఆదివరాహస్వామివారికి జరిగిన వెనుకనే శ్రీ వేంకటేశ్వరునకు జరుగుచున్నవి. శ్రీ వేంకటేశ్వరాలయము ప్రక్కనున్న పుష్కరిణికి వాయువ్యమూలగట్టున శ్రీ వరాహస్వామి వారి దేవాలయమున్నది.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యమందిరము ఉన్నతమైన ప్రాకారంబులతోను, విశాలమైన వీథులతోను, బంగారుకలశములుగల గోపురంబులతోను 'ఆనందనిలయ' మను స్వర్ణమయంబైన విమానముతోను మిక్కిలి తనరారుచున్నది. ఈవిమానమున కమర్చబడి యుండు బంగారుపూత రేకులు మొట్టమొదట పదుమూడవ శతాబ్దమున ప్రథమజటావర్మ సుందర పాండ్యరాజుచేతను, పిమ్మట క్రీ॥ శ॥ 1359లో సేనాపతి సాళు మంగి దేవమహారాజుచేతను, పిమ్మట క్రీ॥ శ॥ 1425లో మల్లనామాత్యశేఖరునిచేతను, క్రీ॥శ॥ 1518లో శ్రీకృష్ణదేవరాయలచేతను జీర్ణోద్ధారణ గావింపబడెను.1 క్రీ॥ శ॥ 1570లో కాంచీపురవాసులైన కోటికన్యకాదానము తాతాచార్యులవారు ఆనంద విమానమును పునర్నిర్మాణము గావించి, విజయనగర సామ్రాజ్యాధీశుడైన శ్రీరంగరాయలవారిచే బంగారు పూతను నూతనముగా పూయించిరి. విమానోపరిభాగమున నుండు స్వర్ణకలశమును క్రీ॥ శ॥ 1909లో హాథీరామజీ మఠాధికారి బావాజీ శ్రీ రామలకణ్ దాసు గారిచే పునఃప్రతిష్ఠ గావింపబడెను.

శ్రీ స్వామివారి దేవాలయంబు ప్రవేశించినంతనే ప్రథమద్వారంబున నొకప్రక్క భార్యాద్వయసమేతుడయిన శ్రీకృష్ణదేవరాయల లోహబింబమున్నది. ఈ మువ్వురును శ్రీ వేంకటాచలమునకు వేంచేసినట్లును శ్రీ వేంకటాచలపతికి కొన్ని దానములు చేసినట్లును కొన్ని శాసనము లిటగలవు. ఈ ప్రథమ ద్వారంబునకు మరొకవైపు చంద్రగిరినుండి విజయనగర సామ్రాజ్యమును పాలించిన శ్రీ వేంకటపతి రాయల లోహవిగ్రహము గలదు.

తరువాత ధ్వజస్తంభమును దాటినచో రెండవ ప్రాకారములోనికి వచ్చి 'బంగారువాకిలి' ప్రవేశించవలెను. ఇటనున్న మహాద్వారమునకు 'బంగారు వాకిలి' యని పేరు. దీని కిరుప్రక్కల నత్తిమాలకాయులగు జయవిజయుల ద్వారపాలక ప్రతిమలున్నవి. బంగారువాకిలి లోపలిభాగమును రెండు గడపలు దాటినతోడనే మహాపవిత్రంబయిన 'కులశేఖరపడి' అను గడపయు దానికావల ప్రధానగర్భమందిరము నున్నవి. పూర్వాచార ప్రకారము కొందరు కైంకర్యపరులు మాత్రము ప్రధానగర్భాలయంబున కులశేఖర పడి దాటవచ్చును గాని యన్యులు గారాదు.

ప్రధాన గర్భగృహంబున భక్తజన హృదయాకర్షణప్రభావంబును దివ్యతేజశ్శీలముగల శిల్పనాచాతుర్యంబు ప్రదర్శించు ప్రముఖంబైన 'మూల విరాట్టు' శిలావిగ్రహం బలరారుచున్నది. నిత్యాచారకర్మనియమము ననుసరించి లోహప్రతిబింబము లనేకములున్నవి. ఉత్సవాదులందును ఆస్థానములందు నధిష్ఠానదైవంబైన శ్రీ భూనీళాసమేతుండైన మలయప్ప (శ్రీ వేంకటేశ్వరస్వామి) స్వామివారి తామ్రవిగ్రహంబులను, నిత్యాభిషేకమూర్తియగు శ్రీ భోగశ్రీనివాసమూర్తి బింబము నున్నవి. ఈ భోగ శ్రీనివాసమూర్తి విగ్రహంబును సహస్రకలశాభిషేక కాలంబున గర్భగృహమునుండి వెలుపలికి తెచ్చుట లేదు. సంవత్సరమున కొకపర్యాయము కార్తిక ద్వాదశిదినంబున సూర్యోదయంబునకు పూర్వమే శ్రీ భూనీళాసమేతంబుగ ఉగ్రశ్రీనివాసమూర్తికి ఉత్సవము జరుగును. ప్రతిదినంబును జమాఖర్చు లెక్కల వినుటకు దర్బారునందు శ్రీ కొలువుశ్రీనివాస మూర్తి విగ్రహంబును సింహాసనాసీనుల జేయుదురు. శ్రీరామ శ్రీకృష్ణవిగ్రహంబులుకూడా గర్భగృహ

1 Ref. T. Devasthanam's Epigraphical Report.

8

మున నారాధింపబడుచున్నవి. ఈ దేవళ్లకు సైతము వారి జన్మనక్షత్రములనాడు ఉత్సవములు జరుగును.

ఇచట పూజావిధానము వైఖానసాగమంబు ననుసరించి జరుపబడును. విశ్వరూపము, తోమాలసేవ, కొలువు, అర్చన, ఏకాంతసేవ (రాత్రివేళ) ఇవి ముఖ్య దర్శనసమయములు. ఏతన్మధ్యకాలంబున షడ్రసోపేతంబైన వివిధప్రసాదపణ్యారంబులు నివేదించబడుచున్నవి. ప్రతిగురువారము రాత్రి పూలంగిసేవయు, ప్రతిశుక్రవారము మధ్యాహ్నము 'మంగళాభిషేకము' లేక 'తిరుమంజనము'ను ముఖ్య దర్శనీయసమయంబులు.

అప్పుడప్పుడు జరుగు సాధారణ పక్షోత్సవ మాసోత్సవ నక్షత్రోత్సవాదులుగాక, సంవత్సరాదియాస్థాన, ఆనివరఆస్థాన, నిత్య, అధ్యయన, ప్లవోత్సవాదులు విశేషంబులు. ధనుర్మాస ప్రభాతసేవా సందర్శనంబు మిక్కిలి పవిత్రంబు. ఈ ధనుర్మాసమున శ్రీవారికి తులసికి బదులు బిల్వముతో అర్చన జరుగును. ఈ బిల్వార్చన యున్నప్పటికిని శైవాశ్వార్లు ఎవరుగాని శ్రీ వేంకటేశ్వరులను శివపదముగా స్తుతించినట్లు కానబడదు. భాద్రపదశుద్ధములో చిత్తా నక్షత్రమున సాల్‌హాల్ బ్రహ్మోత్సవము ఆరంభమై శ్రవణనక్షత్రమున 'తీర్థవారి' జరగును. ఏసంవత్సరమునైన అధికమాసము గలుగునెడల మొదటి బ్రహ్మోత్సవము యథావిధిగ జరుపబడి, రెండవ బ్రహ్మోత్సవంబగు 'శారదా నవరాత్రి' యుత్సవంబు ధ్వజారోహణ రథోత్సవంబులు వినా, వైభవంబుతో జరుగును. అంకురార్పణమునుండి ధ్వజారోహణంబువఱకు దశరాత్రంబులు బ్రహ్మోత్సవంబు జరుగుచున్నవి. ఈ యుత్సవంబుజూడ వేనవేలుగా భక్తజనంబులు ఆసేతుహిమాచలపర్యంతము వ్యాపించియుండు భరతఖండ నానాభాగములనుండి వచ్చెదరు. ఏడవదినము రాత్రి జరుగు గరుడోత్సవమును, ఎనిమిదవదినము జరుగు రథోత్సవమును ముఖ్యములైన యుత్సవములు.

ఇవేగాక భక్తుల ప్రార్థనానుగుణ్యముగ దేవస్థానము నిర్ణయించిన రుసుము చెల్లించినయెడల విశేషోత్సవంబులు జరుపబడుచున్నవి. వీనిలో సహస్ర రజితకలశంబులలో నింపబడిన శుద్ధోదకంబు శ్రీవారి కభిషేకము చేయు సహస్రకలశాభిషేక సేవయు, తిరుప్పావడసేవయు ముఖ్యములు. సాధారణము గరుడోత్సవములు తఱచు జరుగుచుండును. భక్తుల ప్రార్థనల ననుసరించి వారివలన ఏకసాల్ వర్తన కట్టుకొనిగాని, వారు దేవస్థానములో గట్టు మూలధనమునకు రాగల వడ్డీనుండిగాని నిత్యహారతి, అర్చనలు సలుపబడుచున్నవి.

(సశేషము)

జీవితవ్యాపారములన్నిటిలో స్త్రీపురుషులు సమానభాగ స్వాములుగా నుండవలెననియే నాతలంపు. మనహక్కులకని పురుషులతో పోరాడకూడదు. మనమభివృద్ధి పొందవలయును. మనము బాధ్యతవహింప సంసిద్ధులుగనున్న ఏ పురుషుడును దాని నడ్డగింపజాలడు. మన మాస్థితియందున్నామని నిరూపింపవలయును. దానికి మార్గమిది. పల్లెటూరివారి జీవితము దుర్భరము. దానిని మనమభివృద్ధిచేయవలయును. మన సంతానమునకు తగినవిద్య గరుపవలెను. ఒకముక్కలో-కార్యరంగమున జోరబడవలెను. దేశస్వాతంత్ర్యమును మాత్రమెగాదు మానవస్వాతంత్ర్యమును సంపాదింపవలెను.

శ్రీమతి
విజయలక్ష్మి పండిట్

# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహావిద్యాపీఠము

## పండితపూజ

శ్రీయుత కవితిలక కందనపల్లి కనకాంబా ప్రణీతము

బ్రహ్మశ్రీ వేదాంతాచార్య దేశికసార్వభౌములగు పెందుకూరి నరసింహశాస్త్రిగారికిని, బ్రహ్మశ్రీ తర్కమహోదధిపారంగతసుధీవర శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారికిని 15-11-37 తేదీన పైవిద్యాపీఠమున శ్రీయుత రావుబహదూర్ మున్త్రిప్రగడ నరసింహం పంతులుగారి యాజమాన్యమున జరిగిన సభయందు సమర్పింపబడినవి.

శ్లో. పెందుకూర్యార్య స్వయాంభోధౌ కలాపూర్ణోదభూత్సుధీః
నృసింహోఽమృతసారేణ తోషయన్ విబుధాన్ముదా.

శ్లో. అద్వైతాబ్ధేః పరంపారం ప్రాప్యాన్యాం స్తారయన్ సదా
ఆంధ్రదేశేఽధునాభాతి నారసింహ సుధీవరః.

ఉ. నీనరసింహనామ మది నిక్కముఁజేయఁగఁగాదె పీఠికా
స్థానమలంకరింతు బుధచంద్రుల ఛాత్రులఁగ్రహింతు స
న్మానముఁగాంతు వార్యజన మండలమందలి బ్రహ్మవిద్యకున్
స్థానమవై ధరించెదవు శంకరతత్త్వ విశారదత్వమున్.

శా. నీకంటెన్ ఘనుడెవ్వడార్తులకు సందేహానలం బార్ప న
స్తోకాద్వైత సుధాసువృష్టి విబుధస్తోమాంబుధిన్ సోముడై
పీకన్ బ్రోతువు నిస్పృహుండవయి యుర్విన్ దేవతాతత్త్వమున్
సాకల్యంబొనరింతు నీకిదెనమస్కారంబు ధీరోత్తమా.

కం॥ కొండవలె బండితులకిల, నండగనిల్చితివివో మహాప్రళయమునన్
బండలు బ్రద్దలుచేసి య, ఖండబ్రహ్మంబు నెదుటగనబఱుతు బళీ.

శ్లో॥ శ్రీపదాశ్రి పదాంభోజ మకరందరసాత్మకాః
శ్రీపాదకుల సంభూతాః త్రిలిఙ్గేషు ప్రతిష్ఠితాః.

శ్లో॥ భ్రాతాగురుర్యస్యచ రామశాస్త్రీ సద్దేశికస్తార్కికచక్రవర్తీ
సోయం నృసింహోవిబుధేంద్ర చంద్రస్త్రిలిఙ్గదేశే వితనోతి జ్యోత్స్నాం.

మ॥ నరసింహుండొక దగ్రపీఠమున విన్నాణంబుగానొప్పగా
నరసింహాఖ్య బుధేంద్రులిద్దరిట సమ్మానంబునుంగాంచి యె
ల్లరకున్ స్వాంతములందుగూర్తురు మహాహ్లాదంబు త్రైలిఙ్గ్యదే
శరమానాథులు మంత్రతర్కవిధి శాస్త్రక్షోణిభృత్కోటులై.

# మన కర్తవ్యము

శ్రీమతి వెలగపూడి సరస్వతమ్మగారు

## సమాజములు

ప్రతిగ్రామమునకును, పల్లెకునుపోయి స్త్రీల ఔన్నత్యమునకు కావలసినవిషయములను జనసామాన్యమున కుబోధించి సమాజముల నెలకొల్పి దేశమునందు ప్రచారము గావింపవలెను. మహానదులెట్లు పాయలుపాయలుగా పుట్టి ప్రవాహమునగలసి సముద్రమున గలియుచున్నదో అట్లే సమాజములును ఒకదానికొకటి శాఖలుగానేర్పడి అఖిలభారతమహిళా సభకు చేరియుండవలెను. తాలూకాలోని సమాజముల వారందరును మహిళాసభలకు ప్రతినిధులుగావచ్చి వారికిగల లోటుపాటులను చర్చించుకొని తీర్మానములుగావించి ఆతీర్మానములను మండలసభల కంపుచుండుటవలనను, అట్లే అఖిలభారతసభ కందచేయుచుండుటవలనను, స్త్రీలకు కావలసినహక్కులను, విద్యావిషయిక సౌకర్యములను బడయుట కవకాశమేర్పడగలదు. ఇప్పుడు ప్రపంచమును కలవరపరచుచున్న సంగ్రామములవిషయమును, కాంగ్రెస్‌వారి నూతనపరిపాలనా విషయములను, గాంధిమహాత్ముని విద్యావిధానములను, ఇదియది యననేల ప్రపంచమున జరుగుచున్న దినదినమార్పులను, ఆందోళనలనుగూర్చి కొంతవరకైనను గ్రహించుకొనుట స్త్రీలకర్తవ్యము. ప్రతిసమాజములందును స్త్రీలు అట్టివిషయములలో పాల్గొని చర్చించి తీర్మానముల గావింపవలెనన్న ఉన్నతవిద్యయే ముఖ్యాధారము. కాన సమాజములు విద్యాసాధనకు తగినవసతులు గల్పింపవలెను.*

## విద్యావిధానము

ఇటీవల వార్ధాలో గాంధిమహాత్ముని అధ్యక్షతక్రింద జరిగిన విద్యావిధాన సంస్కరణసభలో పాఠశాలలు స్వయంభరితములుగా నుండవలెననియును, ప్రతిదినము పనిచేయు 5 గంటలలో 1 గంటకాలము శాస్త్రాభ్యసనమునకును, 4 గంటలకాలము చేతిపనులకును వినియోగపరచవలెననియును, పొందుపరిచియున్నారు. ఈయంత్రయుగమున బాలబాలికలచేత చేయబడిన వస్తువులనమ్మి ఆధనముతో పాఠశాలల నిర్వహించుట బహుదుర్లభము. ఆసందర్భమున సౌదామినీ మెహతాగారు చదువుసంధ్యలకంటె విద్యార్థులకు పుష్టికరమైన ఆహారమునిచ్చుట ముఖ్యమనియును, అందుకొరకై దొరతనమువారు యెక్కువ ధనమును వ్యయపర్చవలయుననియును, వ్రాసియున్నారు. చేతిపనులు చేయుటకైనను, శాస్త్రాభ్యసనమునకైనను, ఆరోగ్యమావశ్యకముగదా! ఇప్పటి కాలపరిస్థితులనుపట్టి పాఠశాలలు స్వయంభరితములుగా నడుపుట బహుకష్టమనియును, దొరతనమువారి వలనగాని, సంఘములవలనగాని నిర్వహింపబడవలయుననియును ప్రొఫెసర్ కె. టి. షాగారు వచించియున్నారు.

ఆపాఠశాలలు పనిచేయుకాలములో మూడువంతులు శాస్త్రాభ్యసనమునకును, ఒకవంతు చేతిపనులకును, వినియోగించినయెడల జీవకళలు నశింపకుండుటకును, శాస్త్రజ్ఞానము పెంపొందుటకును, నిరుద్యోగ సమస్య తొలగింపబడుటకును అవకాశమేర్పడగలదు. పైవిద్యాపద్ధతి అమలులోనికితెచ్చుట బహుకష్టతరమని ఆంధ్రవిశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్ గారైన సి. ఆర్. రెడ్డిగారును గౌరవనీయులగు సుబ్బరాయన్ మంత్రిగారును వచించుచున్నారు. మనదేశపు శీతోష్ణ

* బాపట్లతాలూకా మహిళాసభాధ్యక్షురాలుగారి యుపన్యాసము.

స్థితులననుసరించి పాఠశాలలు ఉదయము 12 గంటల వరకుమాత్రమే పనిచేయవలయునని కొందరు నాయకులు పత్రికలలో ప్రచురించుచున్నారు. విద్యావిధానములపై దినదినము చర్చలు జరుగుచున్నవిగాని ఇంకను ఒక నిశ్చయమైనమార్గ మేర్పడలేదు. ఏదియెట్లున్నను వార్ధాసభలో తీర్మానింపబడిన 7 సంవత్సరముల నిర్బంధ విద్యావిధానమైనను అమలులోనికి వచ్చినగాని జనసామాన్యమందు విద్యావ్యాప్తి గాంచనేరదు. ప్రతిగ్రామమునందును పల్లెయందును విద్యాప్రచారములు సల్పవలెను. స్త్రీలకు కావలసినధర్మముల నరయుటకును గృహకృత్యముల నెరవేర్చుకొనుటకును కొంతవరకు విజ్ఞానమావశ్యకము. విద్యాభ్యసనమునకు ఆటంకములుగానున్న బాల్యవివాహములు కొంతవరకు తగ్గినవిగాని పూర్తిగా నశించలేదు. సామాన్యముగా వివాహము చేయవలసినవయస్సును 16 సంవత్సరములకు నిర్ణయించుకొనవచ్చును. అంతవరకు పాఠశాలలోచదివించి సామాన్యజ్ఞానమును సంపాదింపచేయుటకు తగినవసతులను ఏర్పాటుచేయవలయును. ప్రాథమికవిద్య పూర్తియగువరకును బాలురకును బాలికలకును ఒకేపాఠశాలయందు శిక్షణమొసగు అవకాశ మేర్పడినయెడల పాఠశాలలకగువ్యయము కొంతవరకు తగ్గించుకొనవచ్చును. సాధారణముగా ప్రాథమికవిద్య పూర్తియగునప్పటికి బాలికలకు 14 వత్సరములవయస్సుకు మించదు. ప్రాథమికపాఠశాలయందు స్త్రీలే యుపాధ్యాయినిలుగానుండి విద్యాశిక్షణమొసగినయెడల పిల్లలను దయదాక్షిణ్యములతో చూచుటకు నెక్కువ అవకాశముండును. తరువాత మాధ్యమికవిద్యాశిక్షణ మొసగుకాలమందు పాఠశాలలు ప్రత్యేకముగా నుండవలెను. అట్లు కానియెడల కొన్నిసమయములందు బాల బాలికలయొక్క నడతలకేమైన భంగముకలిగిన కలుగవచ్చును. ఉన్నతవిద్యనభ్యసించ తగినకాలము వచ్చునప్పటికి వారిబుద్ధికి నొకవిధమైన స్థిరత్వమేర్పడును. కాన పురుషులతో గలసి విద్య నభ్యసించవచ్చునని యింటవల కొందరు ప్రముఖులు పత్రికలలో ప్రకటించుచున్నారు. ఆవిధానముగూడ కొంతవరకు సమంజసముగానే యున్నది.

## శిశురక్షణాలయములు—వాని ఆవశ్యకత

పట్టణములందు రక్షణాలయములు చాలవరకు సేవచేయుచున్నవి. రక్షణాలయము ప్రతి గ్రామముయొక్క జనసంఖ్యననుసరించి యొకటిరెండు మంత్రసానుల నియమించి వారిద్వారా పేదజనులయొక్కయును, ముఖ్యముగా అనాథలైన వనితలయొక్కయును ఆరోగ్యముల కాపాడుట, ఆరోగ్యనియమములు జరిపించుట, ఆరోగ్యసూత్రముల సామాన్యజనులకు బోధింపజేయుట, కాలవశమున దుర్వ్యాపారములకు లోనైన స్త్రీలను సన్మార్గప్రవృత్తికి తీసుకొనివచ్చుటకు తగిన సహాయమొనర్చుట మొదలైన సేవచేయుంచుట స్త్రీసంఘములయొక్క ముఖ్యధర్మమైయున్నది.

## స్త్రీలు—రాజకీయవ్యవహారములు

ప్రతి స్త్రీకిని పురుషులతోబాటు రాజకీయవ్యవహారములు తెలిసియుండవలయును. మనము దేశస్వాతంత్ర్యమునకును, హక్కులకొరకును పాటుబడవలసియున్నది. స్త్రీలును పురుషులనుకలసి పనిచేయనిదే దేశదాస్యము తొలగదు. గృహకృత్యముల బాధ్యత మనయందుండుటచేత వాటిని చక్కబెట్టుకొని, మిగిలిన కాలమందు రాజకీయములలో పాల్గొనుచుండవలెను.

## వి వా హ ము లు

బాలికలకు 16 సంవత్సరముల వయస్సు వచ్చిన తరువాత వివాహప్రయత్నము చేయవలయును. అప్పటికిగాని వారికి విద్యయందు స్వాతంత్ర్య మేర్పడనేరదు. తరువాత వారికుండు అవకాశములనుబట్టి

ఉన్నతవిద్య నభ్యసింపవచ్చును. లేకపోయినను వారికి ప్రపంచధర్మములను పరిశీలించి నడుచుకొనుటకు తగిన జ్ఞాన మేర్పడును. సామాన్యముగా వివాహములు చేయవలసివచ్చినప్పుడు వరశుల్కములను భరించలేక సంసారములు కూలిపోవుట సంభవించుచున్నది. అట్టి ప్రమాదములు జరుగకుండ వరశుల్కములు తొలగించుటకు ప్రయత్నములు సలుపవలెను. ఈ ఉద్యమము స్త్రీలు పట్టుపట్టినగాని నెరవేరదు. శుభకార్యము లందు నెక్కువసొమ్ము కర్చుపెట్టుటకంటె దేశసేవ కొరకు వినియోగించుట ఉత్తమము.

## ప్రత్యేక ఆంధ్రరాష్ట్రావశ్యకత

ప్రథమాంధ్రమహాజనసభను మన గ్రామమందు 1913వ సంవత్సరమున జరిపిన నాయకులందరును ప్రత్యేకాంధ్రరాష్ట్రము కావలెనని తీర్మానించిరి. నేటివరకును రాష్ట్రవిభజన కాలేదు. భాషలనుబట్టి రాష్ట్రవిభజన చేయుమని కోరిరి. గత 25 వత్సరముల నుండి సభలు, తీర్మానములు జరుగుచున్నవేగాని భాషాప్రయుక్తరాష్ట్రము లభించలేదు. మనకంటె తరువాత ఆందోళన మొనర్చి సింధులు, ఓఢ్రులు ప్రత్యేకరాష్ట్రముల సంపాదింపగలిగిరి. భాషాప్రయుక్తరాష్ట్రప్రాప్తిగల్గనిదే దేశదారిద్ర్యము తొలగదు. ఇదివరకు ప్రభుత్వమువారుగూడ దేశమును చిన్న చిన్న రాష్ట్రములుగా విభాగించినగాని పరిపాలన బాగుగ జరగదని తెలిపియున్నారు. కాంగ్రెసు వారుగూడ భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతమును ఆదర్శముగా నిడుకొని రాష్ట్రవిభజనచేయుచున్న కాలములో మన కాంగ్రెసుమంత్రులు మాత్రము ఆసిద్ధాంతమున కేలకో విముఖత్వమును చూపుచున్నారు. భాషాప్రయుక్త రాష్ట్రవిభజన కాంగ్రెసు వారి ముఖ్యోద్దేశమైనను, ప్రధానమంత్రిగారు దానియందు విముఖత్వము చూపియుండుట కడుశోచనీయము. ప్రత్యేకరాష్ట్ర మేర్పడినయెడల అందలి మహానదుల నీటి నరికట్టి వ్యవసాయమున కుపయోగించి, పంటలను వృద్ధిచేసి, నిరుద్యోగసమస్యను తొలగించుకొని దేశదారిద్ర్యమును బాపుకొనవచ్చును. ప్రత్యేకరాష్ట్రము లేకపోవుటచేత మన రాష్ట్రపు ఆదాయములో చాలావరకు తమిళదేశపు ఖర్చుల క్రిందపోవుటచేత తోడి సోదరులైన రాయలసీమవారిని రక్షించుకొనుటకు తగిన యవకాశములేక బాధపడుచున్నాము.

## హరిజనులు

హరిజనుల నుద్ధరించవలెనని మాటలు చెప్పుటమాత్రమే జరుగుచున్నది. వారిని మనదరికైనను చేరనీయకున్నాము. అస్పృశ్యతను నివారించుకొని వారి నాదరించవలెను. మతవైషమ్యముల నంతరింపచేయవలెను.

గృహపరిశ్రమలను, లలితకళలను వృద్ధినొందించుటకు స్త్రీలు తగుప్రయత్నములు సల్పవలెను.



శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవిగారు

# గృహలక్ష్మీ కంకణ మహోత్సవాహ్వానము

శ్రీమతి 'కవితిలక' పులవర్తి కమలావతీదేవిగారు సుప్రసిద్ధ ఆంధ్రరచయిత్రులలో నొక్కరని పాఠకులెల్లరు నెఱిఁగియేయున్నారు. వీరు కుముద్వతి, విజయభాస్కరవిజయము, రాధికాచంద్రావళులు, భారతవీర కథామంజరి, విక్టోరియాక్రాసు, కమలాబాయి, క్రీస్తుచరిత్ర, అబిసీనియావిధ్వంసము, మీర్‌జుంలా, గ్రంథముల రచించుటేగాక ప్రసిద్ధాంధ్రపత్రికలందెల్ల పద్య గద్య వ్యాసముల నెన్నో రచియించియున్నారు. రచయిత్రులను, విదుషీమణులను గౌరవింప గంకణముగట్టిన 'గృహలక్ష్మీకంకణము' ఈరచయిత్రి నీవర్షము గౌరవింప నిశ్చయించినది. నెల్లూరుపురమున ప్రొగ్రెసివ్ యూనియన్‌వారి మొల్లజయింత్యుత్సవ సందర్భమున డిసెంబరునెల 18-వ తేది శనివారము కంకణబహూకరణము జరుగును. ఆసమయమున జరుగుసభకు ఉభయభాషాప్రవీణ శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు (రాజమండ్రి ఆర్యవైశ్య యువతీ సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు) అధ్యక్షత వహింతురు. కంకణ బహూకరణము పాఠకులపక్షమున జరుగుచున్నది గాన ఎల్లరా సమయమునకు విచ్చేయ ప్రార్థితులు.

ఇట్లు,

కె. ఎన్. కేసరి

'గృహలక్ష్మి' సంపాదకుడు




## సినిమా తారల బలుపు

చూడండి ! గోహరు, సులోచన లేపాటి వయస్సువారు ? పట్టుమని పాతికముప్పైయేళ్లయినా సరిగా లేనిదే వారిని పూర్వకాలపువాళ్లక్రింద ప్రేక్షకలోకం జమకట్టివేయడానికి ఈ మాయదారి బలుపేగదా కారణం !... ఉమాశశి భావిదశనుగూర్చి ఎంతెంతో ఆశపడ్డాము. గోహరుచార్జి యీమె పుచ్చుకొంటుం దనిపించింది కాని నాలుగైదేండ్లక్రిందటి ఉమను చూచినవారికి ఇప్పుడీమెనుచూడబోతే తప్పకుండా జాలికలిగి తీరుతుంది. సవితాదేవి పరిస్థితిగూడా దాదాపు అంతే... సినిమా ప్రేక్షకలోకంయొక్క హృదయాలను ఇటీవల ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలనేర్చిన శాంతా ఆప్టేకుగూడా కొలదికాలంలో ఈ పతనమే సంభవిస్తుం దేమోనని భయంకలుగుతోంది. 'అమృతమంథన్'లో అమాయికపుహొయలతోగూడిన ఆమె యభినయమూ, 'అమరజ్యోతి'లో వరవల్లుత్రొక్కి గ్రామఫోనులద్వారా దేశమంతటా వెల్లివిరిసిన ఆమె 'సునోసునో' సంగీతము ఆమెను ఎల్లరకూ అత్యంతప్రేమాస్పదనుగా నొనర్చివైచినవి. ఆ ప్రేమపీఠాన్నుండి ఆమెను తొలగించడానికి నిజంగా ఎవరికీ ఇష్టముండదు. కాని, 17 ఏండ్ల చిరుతప్రాయానవున్న యీబాలిక అప్పుడే స్థౌల్య లక్షణాలను కనబరుస్తోంది. ఈ ఉపద్రవం తప్పేదిఏలాగా ? మన తెలుగుతారలగతి దాదాపు అంతే అనవలసివచ్చునా ? (కృష్ణాపత్రిక.)

* * * *

## బాలికలవిక్రయము బరువుననుసరించి

ఐరోపాఖండమున యుగోస్లావియా అను దేశమున జిప్సీతెగవారు నివసించుచున్న కొన్నిగ్రామాలలో యువతులను తూచి విక్రయించుచున్నారు. పిల్లలకు పెళ్లియీడు రాగానే అమ్మకము జరుగును. ఒకపౌను అనగా 40 తులముల బరువుకు మూడు పెన్సులవంతున ఆబాలిక బరువునుబట్టి ఖరీదు యియ్యబడును. బాలిక అందము గానున్నచో ఒక హండ్రడుపేటు తూకముగల బాలికకు ఒకపౌను 8 షిల్లింగుల 2 పెన్సులు ఖరీదు వచ్చును. పాట నృత్యము కూడ వచ్చినచో ధర యింకను అధికమగును. చొగోజివో అనుగ్రామమునకు ఒక జిప్సీతెగవాడె రాజాగానున్నాడు. బాలికలను తూచుటలో మోసముజరిగినందున దానిని విచారించుట కితడు ప్రత్యేకముగా నొకత్రాసు పెట్టుకొనియున్నాడు. యుగోస్లావియాలో దక్షిణభాగమునందంతటను బాలికలను అమ్ముచునేయుందురు.. కాని బాలికలనుతూచి అమ్మెడుపద్ధతి జిప్సీలునివసించు గ్రామములో మాత్రమే యున్నది.

* * * *

## గౌరవముమీాద దృష్టి

పారిసులో మెయిటర్. ఇ. లెగ్రాండ్ పేరుపొందిన గొప్పబారిస్టరు. ఏదోకేసులో అతనికి కోర్టునందు అగౌరవముజరిగినది. ఈసంవత్సరారంభములో, లెగ్రాండ్ అగౌరవమును భరింపలేక తనప్రాక్టీసుకు రాజీనామా యిచ్చివేసినాడు. మరల యెన్నకోర్టులు ప్రారంభమైనవి. ప్రాక్టీసు విరమించుకున్న లెగ్రాండ్ ప్రతిదినము



# విష బుడ్డీ గాదు

విలువైన సౌఖ్యము సామరస్యములను చవ్చు దెబ్బలాటలతో చెడగొట్టుకో రాదు. నిజముగా జీవితప్రమాణ మిట్టి స్వల్పములకు చాలాతక్కువ.

కానీ, భార్య పట్టుపట్టి ఒక చౌక రకము వాసనతైలమును వాడి భర్తకు మనోవ్యాకులత కలిగించినట్లయితే అది ఉపేక్షతో ఊరకోదగిన విషయము కాదు.

'జయ్' 'హేరాయిల్' ఇంటిలో శాంతి సామరస్యముల గూర్చుటయేగాక, నీ సౌందర్య మెక్కుడుచేసి నీ అందచంద ములను పోషించును.

**jai** 'హేరాయిల్' మేలు రకము. లలిత పరిమళ వంతము. 'బ్రిలియంటైన్' అత్యంత సువాసనా సమన్వితము. అందమైన బుడ్డీలు, కార్కులు.




ది తాతా ఆయిల్ మిల్సు కంపెని లిమిటెడ్,
తాతాపురము, బొంబాయి.

టామ్కో సేల్సు డిపార్టుమెంటు,
19-A, వాణియర్ వీధి,
మదరాసు.

కోర్టులోనికివచ్చుట అందరికి విచిత్రముకలిగించినది. అతడు ఊరకవచ్చుటలేదు. కట్టలుకట్టలు కాగితాలతో కూడ వచ్చుచున్నాడు. కారణమేమిటని అందరు విచారింప మొదలుపెట్టిరి. రహస్యము బైలుబడినది. లెగ్రాండ్ తనఉద్యోగమునకు స్వస్తిచెప్పినాడు. తరువాత మెయిటర్ రోస్బాక్స్ అను ప్రసిద్ధ న్యాయవాదిని—బారిష్టరు—వద్ద ప్రధానగుమాస్తా, సెక్రెటరీగా కుదిరియుండెను. ఆ మెయిటర్ రోస్బాక్స్ ఆయన సతీమణియే !

*   *   *   *

పుక్కిటి పురాణముగాదు.

నౌఖాళీనగర సమీపమునగల హాజీర్‌పురమున శ్రీ రేవతికాంత శర్మగారిసతీమణి తన నాలుగుమాసముల బిడ్డ నిదురించుసమయములో కాపలావలె ఒక నాగుపాము పడగపట్టుకొనియుండుట అనేకపర్యాయములు చూచి మిక్కిలి భయపడుచుండెను. ఇది సాధారణముగా బిడ్డ యొంటరిగానున్నప్పుడు జరుగుచుండెడిది. ఏమైన అపాయముజరిగి బిడ్డ మరణించునను భయముచే ఒకనాడాయింటివారు ఆ నాగుపామును చంపించిరి. తరువాత తల్లి ఆయూరువిడచి పదిమైళ్లదూరమున భర్తయున్న నందనపురమునకేగెను. కాని యిక్కడకూడను పూర్వమువలె ఒకనాగుపాము ఆబిడ్డ యేకాంతముగానున్న సమయములందు పడగపట్టుచుండ కన్పడెను. ఒక విశేషమేమన, బిడ్డయొద్ద నెవరున్నను ఆసమయమున పాము కనబడెడిదిగాదు. ఆపామునకు నెట్టియపాయము కలుగకుండుటకు నింటివారు మిగుల జాగ్రత్తపడుచున్నారు.

*   *   *   *

పెరటిచెట్టు మందుకు పనికిరాదా ?

తేయాకులో నుత్తమరకములెన్నో భారతదేశమున బండింపబడుచున్నవి; అవి ప్రపంచములో వివిధ దేశముల కెగుమతిచేయబడుచున్నవి; కాని యితరదేశములతో బోల్చిచూచినచో భారతదేశము తేనీటిలాభమును గుర్తించుటకు యిటీవలనే ప్రారంభించిన దనవలయును.

ఆరోగ్యకరములగు పరిసరములందు వసించుచు సకాలములో తగినవేతనముల దెచ్చుకొనుచు ఋణబాధ ఎంతమాత్రములేక సంతృప్తులైయుండు 10 లక్షల కార్మికులు, ఫలవంతమగు 10 లక్షల ఎకరముల భూములందు వసించుచుండుట భారతీయ కర్షకావళిపొందిన లాభమున కొక చక్కని ప్రమాణము.

*   *   *   *

ప్రత్యేకత ప్రతివారినీ ఆకర్షించును.

అపర విష్ణుమూర్తులయిన ఆజానుబాహులు నేటికిని లేకపోలేదు. ప్రపంచమునకెల్ల చాల ఎత్తయినవాడు నేడు మహమ్మద్ ఘూజీ. ఇతడు ఈజిప్టుదేశస్థుడు, తొమ్మిదిఅడుగుల ఎనిమిదంగుళముల యెత్తు.

తాపీ వృత్తిలోనుండగా ఒకసారి గోడమీదనుండి కాలుజారిపడడము సంభవించినది. అప్పటినుండియు పెరిగిపోవుచునేయున్నాడు. అలెగ్జాండ్రియా గవర్నమెంటుఆసుపత్రిలో ఘూజీకి ప్రత్యేకముగా ఈజిప్టురాజు ఫరూక్ ఒకపడక తయారుచేయించియిచ్చెను.

*   *   *   *

## గ్రుడ్డుపెట్టలేదుకాని పిల్లనుచేసినాడు!

మాంటూవానగరమునం దొకబాలునికి తరచుగా కడుపునొప్పి వచ్చుచుండెడిది. కావలసిన చికిత్స లన్నియు చేసినను అదితగ్గలేదు. డాక్టర్లు పరీక్షింపజేసి బాలునికి వాంతికి ఔషధమిచ్చిరి. కప్పుడు ప్రారంభమైనది. ఇతరపదార్థములతోగూడ నొకకప్ప బైటికివచ్చి గంతులువేయ ప్రారంభించినది. వేసవి కాలములో కప్పగ్రుడ్లుగలనీటిని బాలుడు త్రాగియుండెనట. దానిఫలిత మిది.

*　　*　　*　　*

## మంగలివల్ల ప్రజాశాంతికి భంగము.

చిదపచిదపలుగా నెత్తిమీద అక్కడక్కడ జుట్టుఉంచి క్షౌరముచేసి చాలా అసహ్యముగా కనబడు నట్లు చేసినందుకు మధ్యరాష్ట్రిలకుజెందిన యుఖ్రాఅను గ్రామములో ఒకమంగలికి శిక్షవిధించినారు. ప్రజా శాంతికి భంగముకలుగజేసినందుకు నేరము తీసుకరావలసివచ్చెనని ఫిర్యాది మేజస్ట్రేటుకు తెలుపుకొన్నారు.

*　　*　　*　　*

## ప్రభుత్వ ప్రథమకర్తవ్యము: జపాన్ఆదర్శము.

సంవత్సరమునకు రెండుసార్లు జపాన్పోలీసువారు దేశీయులగృహములప్రవేశించి మూలమట్టుగాపరికించి యింటివారికి శుభ్రత ధృవపత్రము నొసగుదురు. ఈసమయమున నే జపాన్దేశీయులకు పుస్తకములద్వారాగా, ఉత్తరములద్వారాగా ప్రభుత్వమెట్లు తోడ్పడవచ్చునోయను దానిపై యింటింట సలహాలుపొందుదురు.

*　　*　　*　　*

## చంపడానికి చీనా వింతఆచారము.

చక్కిలిగింత పెట్టిచంపడము చీనావాళ్లకు అలవాటు. "నవ్వుపట్టలేక చచ్చిపోయినా" డను సామెత చీనాదేశములోనే మొదటపుట్టినది. శత్రువులకు అరికాళ్లలో చక్కిలిగిలిపెట్టి కడుపుబ్బునట్లు నవ్వించెదరు. ఆ నవ్వుపట్టలేక శత్రువులు చచ్చిపోవుదురు. ఈవిధముగా వీరు పగదీర్చుకొందురు.

*　　*　　*　　*

## అమెరికా గవర్నరుపదవికి భారతీయుడు.

అమెరికా సంయుక్తరాష్ట్రములోని న్యూజెర్సీరాష్ట్రముయొక్క గవర్నరుపదవికి జరుగనున్న ప్రాథమిక యెన్నికలకు శ్రీ దిన్షా పెస్టోన్జీ ఘడియాలి అనునొక పార్సి ఇంజనీయరువారు అభ్యర్థిగానిలుచుచున్నారు.

*　　*　　*　　*

## ఒకకాన్పునకు ఆఱుగురుబిడ్డలు.

కోహాల్నగరములో నొకస్త్రీ ఆఱుగురు మగబిడ్డలనుగనెను. అందఱుశిశువులును కుశలులైయున్నారు.

# గ్రంథపరిచయము

## ఆంధ్రవాచస్పత్యము.

శ్రీయుత కొట్ర శ్యామలకామశాస్త్రిగారిచే వెలువరింపబడుచున్న ఆంధ్రవాచస్పత్యము 14,15,16వ భాగముల నందుకొంటిమి. 14 వ భాగమున 'జాలె' మొదలు, 'తీర్పు'వఱకును, 15వ భాగమున 'తీర్ణము' మొదలు 'దుబరకా' వఱకును, 16 వ భాగమున 'దుబారా' మొదలు 'నిప్పటి' వఱకుగల పదములు గలవు. ప్రతిభాగము వెల రు. 1. ప్రతులకు గ్రంథకర్తపేర కరప, కాకినాడతాలూకా. అని వ్రాయనగును.

## శ్రీరామ శతకం.

ఇది 'శ్రీరామప్రభునిచే దురంతచింతలనుండి విముక్తులగాగోరు భక్తులు, గీర్వాణభాషలో పారాయణముచేయుట కనుకూలముగా' 108 శ్లోకములలో సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచే - కాకినాడ - రచింపబడినది. వెల 0-1-0.

## గానశాస్త్ర ప్రశ్నోత్తరావళి.

కర్త: అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు, గాంధీనగరు, బెజవాడ. 160 పుటలు. గ్లేజు వెల రు 1.

ఇందు 1930 మొదలు 1936 వఱకు గవర్నమెంటు టెక్నికల్ సంగీతపరీక్షా పత్రములందలి ప్రత్యుత్తరములు గలవు. సంగీత విద్యార్థులకిది యెక్కుడుగ నుపయోగపడును. సంగీతప్రపంచమున ప్రసిద్ధులగువారలయు, వాయిద్యములయొక్కయు చిత్రపటములు కూడ గలవు.

## భిక్షావతి.

కృతికర్త శ్రీ వజ్ఝల కాళిదాసుగారు మహారాణిపేట, విశాఖపట్టణము. మట్టా గురుమూర్తిగారిచే సంపాదితము. వెల తపాలకర్చుతోచేరి అర్ధరూపాయి.

అధునికాంధ్రకవిత్వమున వెలువడిన ఉత్తమఖండకావ్యములు రెండువిధములని చెప్పనగును. కవితామాధుర్యమును చవిజూపి ఉన్నతభావవీచికలనూపి తన్మయత చేకూర్చునవి; లోకమందలి యన్యాయములనే పతితలముందు నాట్యమాడించి, వారిహృదయాంతరాళమునదాగియున్న దయాదాక్షిణ్యాదిగుణముల విజృంభింపజేసి రక్తము నుడికించి కార్యరంగమున కురికింప జేయునవి. ఈకావ్యము రెండవరకమునకు చెందినదని చెప్పవచ్చును.

కవి సంఘమునందలి యన్యాయములను, తినుటకు తిండి, నిల్చుటకు నీడ, ధరింప బట్ట లేక దారిద్ర్యదవానలమునజిక్కి వాడివత్తలై, మాడి మంటకలయు దీనులపరిస్థితులను చక్కగ జిత్రించుకొన్నాడు. కాని అది లోన ఇమిడినదిగాదు. అది పొంగిపొరలి కవిత్వరూపమున బైలువెడలినది. అందుచే 'జీవితమెల్ల భగ్నమయి చీకటిపాలయిపోయినట్టి భిక్షావతియైనయీ యబల' యుదంతము హృదయముగలవారి కన్నీటి బిందువులరాల్చి, అట్టిదీనులకు చేయూతయొసగ నుత్సహించుచున్నది.

ఇందలి కవిత్వము జాను తెనుగుపదజాలముతో నుద్రేకపూరితముగ నున్నది. దేవుడు, దేవాలయములు, సంఘపరిస్థితులు దీనియందు కృతికర్తకు అధునికాభి

ప్రాయములుండుట శ్లాఘనీయము. మానవసేవయే మాధవసేవ యనునదే వీరియుద్దేశము.

## స్వప్నానుసూయ.

కృతికర్త శ్రీ ఆకుండి రామమూర్తిగారు. క్రౌన్ సైజు 68 పుటలు.

శ్రీకృష్ణభారత కృతికర్తలగు శ్రీకవిసార్వభౌము లకు కనకాభిషేకాదిదానముల దావించిన చుండూరి నారాయణరావుగారి ప్రథమభార్య, అనసూయ యను నామెకు స్మారకచిహ్నముగా చెప్పబడిన ప్రబోధక గ్రంథము. పై నారాయణరావుగారిచే "నాదు ప్రియధర్మపత్ని తన్నామధేయ మిచట శాశ్వతముగ నిల్వ నెద్దియేని" కృతిరచింప కవిగారు ప్రార్థింప బడిరి. కృతి రచింపఁబూని వీరు నిరుపహతిస్థలంబున విశ్రమించి నిమీలితలోచనులై యున్నతరి నిద్దురబట్టినది. స్వప్నమునందు అత్రిమహామునిపత్ని, నారాయణ రావుగారిపత్నికి పతివ్రతాది ధర్మములనుగూర్చి చెప్పుట ఈ గ్రంథమున కథావస్తువు. కవితపోకడ పూర్వకవుల దలపించుచు మధురముగనున్నది. గ్రంథ కర్తగారి ఆయుర్వేదప్రజ్ఞయు కవితయు, చెళ్లపిళ్ల వారియు, పానుగంటివారియు ప్రశంసలబొందుటలో నతిశయ మేమియులేదు.

వలయువారు క్రింది చిరునామాకు రెండణాల తపాలబిళ్లలనుబంపిన పుస్తకమును ఉచితముగ బడయ గలరు. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, పల్లెపాలెం, యానాంపోస్టు, తూర్పుగోదావరిజిల్లా.

## నిత్యప్రార్థన.

స్నేహలతాకవితాసంఘమున 52 వ పుష్పము; తిరుపచ్చూరు జమీందారుపతిగారైన శ్రీమతి ఇనుగంటి సరస్వతీదేవిగారిచే రచింపబడినది.

రచయిత్రి శ్రీ రాజా ఇనుగంటి వేంకటకృష్ణా రావు బహదర్ వారి ధర్మపత్ని. వేంకటకృష్ణారావు గారు 1935 వ సంవత్సరము ఆగస్టునెలలో స్వంత ముగ విమానము నడపుకొనుచు విధివశమున నెల్లూరు సమీపమున విమానముభగ్నమై దివంగతులైరి. భర్తృ వియోగ దుఃఖప్రవాహ మీ కవితాప్రవంతిరూపము దాల్చినది. ఈ చిన్నిపుస్తకమునగల 'పతిప్రార్థన', 'దైవప్రార్థన', 'తత్వము' 76 పద్యములందును వియోగతప్తహృదయము పైకుబుకుచున్నది. దీనికి మున్నుడి రచించిన శ్రీ చిలకమర్తివారు వీరికవిత్వము 'రసవంతమై, ప్రశంసనీయమై, నారీమణులకు నాదర ణీయమై, పఠనీయమై' యున్నదని వ్రాసిరి. ఇది సత్యమే. వీరి కవితారచనకు రెండుదాహరణములు:

> మెలఁగితిఁ బ్రాణమొక్కటిగ
> మేనులు రెండుగఁ గానుపించిన
> న్గలిసితి నాత్మలోపలను
> గాంతుని బూవును దావిరీతి నేఁ
> గలిసి సుఖాప్తి వర్తిలితిఁ
> గష్టమెఱుంగక యిప్డు దైవమా
> కలఁగఁగఁ జేసితే పరుల
> కష్టములోర్వని నాకుఁ గష్టముల్.

> బంధుగణమున్న ధనమున్న భాగ్యమున్నఁ
> దనయులున్నను సఖులున్నఁ దల్లిదండ్రు
> లున్న సతికేమి ఫలియించు నొక్కప్రాణ
> పతియె లేకుండు దుర్గతిపట్టెనేని.

## సిద్ధి గణపతినీతులు.

కర్త అల్లక వీరభద్రకవి, లక్ష్మీవారపుపేట రాజ మండ్రి. క్రౌనుసైజు. 128 పుటలు. వెల 0-6-0.

ఇందు 567 కందములు 'సిద్ధగణపతీ' అను మకుట ముతో గలవు. ఇవి 'యప్పుడెప్పుడెవ్వియో' కొన్ని కొన్ని ప్రస్తావనల యప్పటికి రచియింపంబడిన వానిలో గొన్నిమాత్రము. పెద్దలయొద్దం జదువుచుండ దద్దయుఁజా ముద్దుగులుకు సుద్దులనుద్ధరించు నిప్పద్ది

యంబు లెవ్వారికృతంబు లిప్పాం త్తంబెంచు సందర్భం బొందునోయని కుతూహలాయత్తచిత్తంబున నన్నుం బృచ్ఛసేయ దుదముట్టని కారణంబున' కవి యొకటిగా చేర్చి ముద్రించెను.

నీతినియమములు సంఘాభివృద్ధికి. ప్రపంచానుభవము, లౌకికపరిజ్ఞానము, విశాలహృదయముగల వారినీతులే ఉపయోగించును. కాని—భారతీయులందఱు వేదాంతులగుట —ప్రతివాడును తన కించిదనుభవమునుబట్టి నీతులు నియమములు నిర్ణయించి ప్రపంచముపై రుద్దుట పరిపాటియైపోయినది. అందులో నూతనముగా కవితసల్లు కవికుమారుల కిట్టినీతులు తప్పనిసరియైనవి కవిత్వమునకు బూనుకొని కలమంది పద్యమునకు కావలసిన సంగతులకై యాలోచించి ఆసమయమునకువచ్చిన-తాను మంచిదనితలంచిన-నీతి నందిరికించి గ్రంథము తయారుచేయుట జరుగుచున్నది. ఇందలి నీతు లట్టివే. 'ఇతరకవికృతుల మృదుపద తతి ముచ్చిలి తన రచనలందగ నతుకుకొనన్ జతపడు నెంగిలికవియన క్షితిమెత్తురె' అని కవితనుగూర్చి ఎన్నియోనీతులు కవిగారు వ్రాసుకొన్నారుగాని దాని నెంతమాత్ర మనుసరించినటుల గన్పట్టదు. నీతు లితరులకుగాని తనకుగాదన్నదికూడ ఒక నీతివాక్యమేగదా! కవిగారినీతులగూర్చి కవిగారినీతితోనే ముగింపనగును.

క. 'పూర్వము చెప్పిరి నీతుల
పేర్వడ్డ మహాకవు ల్ప్రవీణతతోఁపన్
దర్వాతనేను భవదా
శీర్వాదమున న్నొడివితి సిద్ధిగణపతీ.'

ఆంధ్రజ్యోతి.

శ్రీరంభాపురి గ్రంథమాల తొలిపుష్పము. క్రౌను 26 పుటలు. కర్త కొడాలి వేంకటరాజారావుగారు. పెదకళ్లేపల్లి, కృష్ణాజిల్లా. వెల పావలా.

ఇందలి పద్యములు కొన్ని గృహలక్ష్మిలో నిదివఱకే ప్రకటింపబడినవి.

పద్యములు హృద్యములు. వీరావేశములో ఉత్సాహముతో ముందుకు చొచ్చుకొని పోవుచున్నవి. మచ్చునకు,

'పోతే పోయెను వాని ప్రాణ మొకటే
పో, శత్రుజీవంబులా
కోతల్ పడ్డవి వేనవేలతనిచే
ఘోరాహవక్షోణిలో
ఖ్యాతే చాలును నాకు తృప్తి' యను వీ
రావేశ సద్వాక్యముల్
ఏతంత్రో వచియించి ధైర్యమున మ్రో
యింపించె భేరీతతుల్.

సైరంధ్రి.

కర్త ఎండమూరి సత్యనారాయణరావుగారు బి.ఎ. సహాయసంపాదకుడు 'జనవాణి', 2 16 మౌంట్ రోడ్, మదరాసు. క్రౌనుసైజు 126 పుటలు. వెల అ. 10. టెక్స్టుబుక్ కమిటీవారిచే అంగీకరింపబడినది.

అజ్ఞాతవాసమునాటి ద్రౌపతీవృత్తము వచన రూపమున వ్రాయబడినది. కథనవల రూపముదాల్చినది. గ్రంథకర్త తిక్కన రచననుసరించియే గ్రంథమునంతయు రచించినాడు. అందుచే ఇందు ద్రౌపది తిక్కన ద్రౌపతివలెనే హృద్యముగ తయారైనది. శైలి సరళముగ నున్నది.

---

## జ్వర బాధితుల కెచ్చరిక

జలుబుచేయుట, ఊపిరి తిరుగకుండుండుట, దేహోష్ణముయొక్క హెచ్చు తగ్గులు వీనికి విషము కారణము (జ్వరముచే నేర్పడు) ఈవిషము, ఎముకలను కండరములను బలహీనపఱచుచు, నీకు అశక్తత, అలసట కలిగించుచున్నది. సాధారణ భోజనము నీకు వమనమగునట్లుండును కాని యీ నరములను, కండరములను పునర్నిర్మాణముచేసికొనవలసిన బాధ్యత నీకు గలదు. హార్లిక్సు, నీ దుర్బలమైన కడుపునకు కష్టము లేక, నీకు పుష్టియొనగూర్చునని డాక్టర్లు చెప్పుచున్నారు. మీదు మిక్కిలి అది నూటికినూఱుపాలు పుష్టికరపదార్థము; అలసిన నీ దేహమునకు నూతన బలము, వీర్యముల నతిశీఘ్రముగా నిచ్చును.

నీస్టోరునుండి హార్లిక్సు నేడే తెప్పింపుము.

పల్లెటూరి ప్రజలు నిరక్షరకుక్షులు. పై పై 'వన్నెల్పుచరింప' వారెఱుగరు. విద్యావంతులకు వారినిచూచిన హేళన ఏవగింపు. ఇది సాధారణ పరిస్థితులలో బాధాకరముగాదు. కాని విద్యావంతులు విద్యాహీనులకు సానుభూతిచూపి సాయము చేయవలసియున్న సమయములందుమాత్రము బాధించును. పల్లెటూరిజనులు—ముఖ్యముగ స్త్రీలు-వైద్యాలయములందు పొందుఆదరణ దీనికొక యుదాహరణము.

పల్లెటూళ్లకు తగిన వైద్యసాహాయ్యము లేదు. ఏపదిపల్లెలకో ఎచ్చటనో ఒకవైద్యాలయముండును. అందు లేడీడాక్టరు లేకపోవచ్చును. పరిశుభ్రతనుగురించి ప్రాకులాడని పల్లెటూరిస్త్రీలను ఆత్మసోదరివలెచూచి తగినసాహాయ్యము చేయునట్టి సాదరబుద్ధి డాక్టరులకు కావలసియుండును. ఘోషా ప్రబలముగనుండు ప్రదేశములలో స్త్రీలకు గలుగు వైద్యసాహాయ్య మతిస్వల్పము-స్త్రీవైద్యు లున్నదప్ప. ఈకష్టములగుర్తించి సింధురాష్ట్రప్రభుత్వము గ్రామములందుగల వైద్యశాలలం దెక్కువగా స్త్రీవైద్యుల నియమించుచున్నది. వీరికిగల స్త్రీసహజమగు నోపిక సానుభూతి పల్లెటూరిస్త్రీల కెక్కుడు సహాయపడును. దీనిని ఇతర రాష్ట్రములవారును అనుసరించుట బాగు. వైద్యవిద్యనుపొంది పనిచేయ సంసిద్ధులగు స్త్రీలు పెక్కుమందిగలరు. వారిసేవను ప్రభుత్వమువా రుపయోగించు టుత్తమము.

* * *

**శ్రీ మహారాణి సేతుపార్వతీబాయిగారికి గౌరవబిరుదము.**

డిశంబరునెల రెండవతేది జరుగనున్న స్నాతకసమావేశములో ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు తిరువాంకూరు మహారాణీగారైన శ్రీమతి సేతుపార్వతీబాయిగారికి డాక్టరు బిరుదమును ప్రసాదించి గౌరవింప దలంచియున్నారు. సంస్థానమును సర్వతోముఖముగ నభివృద్ధికి దీసికొనిరా సర్వధా పాటుబడు స్త్రీరత్నము పార్వతీబాయిగారు. సంస్కారములన్న ముందంజవైచు సంస్థానాధీశురాలుకూడ నామెయే. అట్టి మహిళామణికి డాక్టరని గౌరవబిరుదమునియ్య ముందంజవైచినది ఆంధ్రవిశ్వకళాపరిషత్తు. ప్రజాసేవనుగుర్తించి విశ్వకళాపరిషత్తులు ప్రజాసేవకుల గౌరవింపదగు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తును, తనసేవకుతగిన గౌరవమును పొందుచున్న సేతు పార్వతీబాయిగారిని అభినందించుచున్నాము.

ఈసమయముననే కళాప్రపూర్ణ బిరుదమును గ్రహింపనున్న శ్రీయుత దేశోద్ధారక కాశీనాథ నాగేశ్వరరావుగారినికూడ వారికి గలుగనున్న గౌరవమునకు సంతసించుచు నభినందించుచున్నాము.

EDITED BY DR K. N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొన వలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1-వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2. | 3 | 4 | 5 | | | | డిసెంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసెంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టెంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టెంబరు |
| డిసెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసెంబరు |
| సెప్టెంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | అక్టోబరు |

ఈశ్వర సం॥ర కార్తిక మార్గశిరములు

1937_వ సం॥ డిసెంబరునెల

1 చతు॥ బు రా1-27 విశారా12-7 వతె4-23 మొ6-8కు భో7-24

2 అమా॥ ● గు రా3-28 అనూరా2-34 వర్జంలేదు భో7-20

3 శు॥ పా శు తె5-38 జ్యేతె5-11 వఉ8-47 మొ10-33 భో7-6

4 వి॥ శ పూర్తి మూల పూర్తివప2-4 మొ3-50కు వతె6-4 మొ భో7-12

5 వి॥ ఆ ఉ7-47 మూఉ7-46 శేవఉ7-50 కువసా6-21 మొ8-7కు భో7-8

6 త॥ సో ఉ9-45 పూషాఉ10-42 వరా7-54 మొ9-38కు భో7-4

7 చ॥ మం ఉ11-24 ఉషాప11-55 వసా4-36 మొ6-19కు

8 పం॥ బు ప12-37 శ్రప2-1 వరా7-13 మొ8-54 భో6-56

9 ష॥ గు ప1-20ధనిప3-14వరా10-37 మొ12-36భో6-5 స్కందషష్ఠి సుబ్రహ్మణ్యషష్ఠి

10 స॥ శు ప1-33శతప3-58వరా10-23 మొ12-0కు భో6-48 అష్టమీతిథి

11 అ॥ శ ప1-14పూభాసా4-13వరా1-39 మొ3-14కుభో6_44

12 న॥ ఆ ప12-26ఉభాసా3-58వతె3-36 మొ5-10కునవమితిథిభో6-40

13 ద॥ సో ప11-13 రేసా3-19 వర్జంలేదు భో6-36

14 ఏ॥ మం ప9-37అశ్వసా2-19వఉ10-29 మొ12-1కువరా11-22 మొ12-53కుభో6-32

15 ద్వా॥ బు ఉ7-44త్రయోదశితె5-26భప1-2వరా12-15 మొ1-45కుధనుభో8-33హనుమద్వ్రతం

16 చతు॥ గు తె3-20 * కృ ప 11-32వరా3-30 మొ5-0కుభో8-29

17 పూ॥ ○ శు రా12-5 రోఉ9-56వప3-8 మొ4-37కుభో8-26 దత్తాత్రేయోత్పత్తి

18 బ॥ పా శ రా10-35మృఉ8-14వసా4-4 మొ5-34కుభో8-22

19 వి॥ ఆ రా8-20ఆర్ద్రఉ6-36పునతె5-1వసా5-48 మొ7-18కుభో8-18

20 త॥ సో సా6-14పుష్యతె3-45వప12-38 మొ2-8కుభో8-14

21 చ॥ మం సా4-26ఆశ్రేరా2-40వసా3-56 మొ5-28కుభో8-10

22 పం॥ బు ప2-54మరా1-55వప2-17 మొ3-50కుభో8-6పంచమితిథి

23 ష॥ గు ప1-46పుబ్బరా1-40వఉ9-50 మొ11-25కు భో8-3 తిథిద్వయం

24 స॥ శు ప1-5ఉత్తరరా1-47వఉ8-54 మొ10-30కు భో7-0 అష్టమితిథి

25 అ॥ శ ప12-54హసా2-28వఉ10-26 మొ12-5భో7-57

26 న॥ ఆ ప1-12చిత్రతె4-34వఉ10-50 మొ12-30కు భో7-54 దశమితిథి

27 ద॥ సో ప2-2స్వాతె5-26వఉ9-33 మొ11-16కు భో7-50శుక్రాస్తమయ శూన్యతిధి

28 ఏ॥ మం ప3-20విశాపూర్తివఉ11-18 మొ1-2కుభో7-46

29 ద్వా॥ బు సా5-4విశాఉ7-21వప11-44 మొ1-30కు భో7-42

30 త్ర॥ గు రా7-5అనూఉ9-44వసా3-56 మొ5-42కు భో7-38

31 చతు॥ శు రా9-16జ్యేప12-18వరా9-8 మొ10-54కు వృశ్చికభో7-34

# దేవీ ప్రసాదములు

మీచే తయారుచేయబడు స్త్రీల వరప్రసాదములైన "లోధ్ర", "గర్భరక్షక" ప్రభావములను పొగడుటకు. ఆదిశేషునకైనను తరముకాదని నొక్కి వక్కాణించుటకు సందియములేదు.

నాకు వివాహమై 10 సంవత్సరములవఱకు సంతానములేదను నిందను భరింపలేక "అపుత్రస్యగతిర్నాస్తి" అని చీకాకుపడియుండి కట్టకడపట "శ్రీమహాలక్ష్మిదేవి" వ్రుపవాసినై 40 దినములు అన్న ఆహారములులేక యేకచింతతో పూజచేయుచుండ, ఆ దేవియొక్క అనుగ్రహమువలన, ఒక మహనీయుడు నన్ను లోధ్రను సేవింపుమని ఉపదేశించెను. ఆక్షణమునందే తమ అమోఘమైన లోధ్రను తెప్పించి సేవించితిని. ఒక బుడ్డికే యామాత నాకు పుత్రసంతానమును కలుగచేసినది. మీయొక్క గర్భరక్షకయొక్క ప్రభావమువలన, నవమాసములుగడిపి ఒక చక్కని మగశిశువునుగాంచి, సంతోషసాగరంబున మునింగియున్నదానను. కొలదిదినములలోనే నాశిశువుయొక్క ఛాయాపటమును పంపుటకు, కుతూహలపడుచున్నదానను. నాకు తెలిసిన సంతానహీనుల కందఱిని, లోధ్రను, పిదప గర్భరక్షకను సేవించి పుత్రపుత్రికారత్నములను పొందుడని ప్రోత్సాహపఱచుచు, ఆ లక్ష్మీమహాదేవియే తమ అమోఘమైన లోధ్రను, గర్భరక్షకను ప్రపంచమంతటను వ్యాపింపచేసి "అపుత్రస్యగతిర్నాస్తి" అను లోకోక్తికి నిలువనీడలేనట్లుచేయ ప్రార్థించుచున్నదానను.

కొత్తపేట,
కాళహస్తి.
15-11-37

ఇట్లు
టి. అమ్మణి,
మిస్ట్రెస్సు.

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR




## లోధ్ర

ఋతుదోషాది జనిత రోగములకు వజ్రాయుధము.

ఈ ఔషధరాజము సుప్రసిద్ధవనౌషధులచే తయారు చేయబడినది. గడచిన ముప్పదిఅయిదు సంవత్సరములనుండి హిందూదేశమునందే గాక పర దేశములయందు గూడవాడబడి ప్రసిద్ధిగాంచినదివ్యౌషధము.

ఈలోధ్రను వాడినవారు యిది వనితలకు వరప్రసాదమనిన్ని, రసాయనములకురాణియనిన్ని, స్త్రీలపాలిటి కల్పవృక్షమనిన్ని, కొంగుబంగారమనిన్ని మరియు ననేకవిధములుగ స్తోత్రమును చేయుచుండుట యెల్లరకు దెలిసిన విషయమైయున్నది.

గర్భాశయదోషజనితవ్యాధులగు ముట్టుకట్టు, క్రమముతప్పి ఋతువగుట, ఋతుస్రావము జాస్తి తక్కువ లగుట, స్రావము అనేకరంగులతో వెడలుట, సూతికగడ్డ, గర్భాశయమున విషవ్రణములుకలుగుట, మంట, వాపు మొదలగువాటిని పోగొట్టును. చిరకాలముగ బహిష్టు నిలిచినవారికి క్రమముగ బహిష్టగునటుల చేయుటలో అసమావశక్తి కలిగినది. సంతానములేక తపించుచుండు నారీమణులకు పుత్రపుత్రికా భిక్షను పెట్టి వారిని సంతోషసాగరమున ముంచుచున్నది.

చీకటింటిని ప్రకాశింపజేయు ఈ దివ్యజ్యోతిమహిమను యెల్లరు గుర్తెరుంగుదురు గాక!

12 ఔ. రు 3.    6 ఔ. రు 1—10 అణాలు.

లోధ్ర యెల్లెడలను దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

# మాలతి




ఇది బాదంపప్పుపాలనుండి తయారుచేయబడిన యొక తెల్లని సువాసనగల నవనీతమువంటిది. దీనిని స్త్రీపురుషులు తలదువ్వుకొనుటకు ముందుకొద్దిగ రాచుకొని దువ్వుకొనిన, వెంట్రుకలు రేగక పట్టుకుచ్చువలె మిసమిసలాడుచుండును. మెదడు చల్లపడి సుఖముగ నిద్ర వచ్చును. ఇందు ముఖ్యముగ మాలతీపుష్పముల అత్తరు చేరియున్నది. ఈయత్తరు సొగసునకు సొంపునకు సుఖమైన సువాసనకు పేరు గాంచినది.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

# విషయసూచిక

మ॥-సిరియున్నాదని విఱ్ఱవీగదు జగచ్ఛ్రేయోభిలాషా నిరం।
తరయై యొక్కట నాత్మనాథుఁడె జగన్నాథుం డటం చెంచి సు।
స్థిరభక్తిన్ బరిచర్యసేయు గృహలక్ష్మిన్ భక్తురాలిన్ సుధా।
చరితం జూడుము సోదరీ సకలమున్ సౌభాగ్యవంతంబగున్॥

—పనుమర్తి కృష్ణమూర్తి

వి వ్య సా ష ము సౌక్యవరి మనసుఃబం రా॰ల, [illegible]




# దీపావళి

సౌవర్ణకంకణ ఝణఝణనినదంబు శింజినీరవముతోఁ జెలిమిసేయ ।
తాటంక మణిగణ ధగధగ దీప్తులు గండమండలరుచి గప్పికొనఁగ ।
ధవళేతరాపాంగ ధళధళ రోచులు బాణజాల ప్రభాపటలి నడఁప ।
శరపాత ఘుమఘుమ శబ్దంబు, పరిపంథిసైనిక కలకల స్వనము లుడుప ।
వీరశృంగార భయ రౌద్రవిస్మయములు ।
గలసి భామినియయ్యెనో కాక యనఁగ
నిషువుదొడుగుట దివుచుట యేయుటెల్ల ।
నెరుఁగరాకుండ ననిసేసె నిందువదన॥

—'భాగవతం'

శక్త్యనుసారము నవరాత్ర దీక్షసలిపి పేరటాండ్రసేసలు తలఁదాల్చి త్రికరణశుద్ధలై యున్న సాధ్వీమతల్లుల కికముందు రానున్నది దీపావళి యని జ్ఞాపకముచేయుట కొప్పియున్నదియే పై పద్యము. లోకకంటకుఁడైన నరకదైత్యుని సేనలఁ జెల్లాచెదరుసేసి భగవంతుని మెప్పొందిన యా భామామణి దివ్యరూపము నొక్కపరి మనసులం జిత్రించుకొని చూచెదరుగాక "రాకేందుబింబమై రవిబింబమై యొప్పు నీరజాతేక్షణ నెమ్మొగంబు......హర్షదాయియై మహారోషదాయియై......హరికి నరికిఁజూడ నందంద శృంగార వీరరసము లోలి విస్తరించు" చున్నది! ఆహా! ముల్లోకములును ముగ్ధములై "బొమ్మ పెండ్లిండ్లకుఁ బోనొల్లనను బాల, రణరంగమున కెట్లు రాఁదలఁచె...

బలుకుమనినఁ బెక్కు పలుకని ముగుద యేగతి నౌనర్చె సింహగర్జనము" లని చిత్రాకృతిం బొందియున్నవి !!

ఔను: వీరమాతలగు భారతనారీరత్నముల తెరఁగట్టిదే! సమయము వచ్చినపుడగ్ని లోఁబడిమైన నాపదబాపుట; లేనప్పుడు నిజ గృహమందు లక్ష్మిస్థానమున నుండుట. అంతే కాని అనవసరముగ వీధినిబడి యార్భాటము సేయుట యెంతమాత్రముఁగాదు! ఈమర్యాద యనుశ్రుతముగా వచ్చుచునేయున్నది; కాని యప్పుడప్పుడు మాత్రము పరిస్థితులు తద్భిన్నములై యేర్పడుటయుఁ దన్మూలమున ధూర్తవ్యాఖ్యాన ప్రభవములు చెల రేగుటయు బుద్ధిమంతులగు వారికి గోచరించుచునే యున్నవి. అయిన నంతమాత్రమున భయపడ నవసరములేదు. ఏలయన నది శాశ్వతముకాదు: శాశ్వతమైన దల్ల మొదటి ధర్మమే. ఏయుగమునందుగాని యధర్మము వల్లఁ గొంత ప్రజాపీడ గలుగుటయు నది యేదో యొక యపూర్వశక్తి మూలమున నశింపఁబడి మరల యథాప్రకారముగఁ బ్రజా సౌఖ్యము విస్తరించుటయు సర్వత్ర వేద్యములు. దీనికి నిదర్శనములఁ జూపుటకు మనమేదో యొక పూర్వయుగమునకుఁ బోనక్కరయేలేదు. ఈయుగమునందే చూపవచ్చును. ఒక్కమహాత్ముని పిలుపు వినఁ బడఁగనే, యెంతమంది యిల్లాండ్రు నిలువఁబడినపాట్లనే వచ్చి సత్యాగ్రహ సమరరంగమున నురకలేదు ! అపుడు "భారతస్త్రీ లింతంతవాళ్ళా !!?" అని పరు లాశ్చర్యచకితులు కాలేదా ! "మగవారిఁగనినఁదా మరుఁగుఁజేరేమునింతి,పగవారిగెల్వ నే పగిదిఁ జూచె ?" నని యీ నారీమణులఁగూర్చి భవిష్యద్వ్యాసుఁడు వ్రాయవలయునుగదా!! కోటానకోట్ల భారతీయులలోఁ బెద్ద పెద్ద యింగ్లీషు చదువులు చదివిన యే కొలదిమందికి మాత్రమే తెలిసియుండిన కాంగ్రెస్ మహాసస్థకు ఖండఖండాంతర విఖ్యాతికలుగుట మనసోదరీమణుల మూలముననేకదా!! ఈపె జమీన్‌దారిణి, యీమె కర్షకుని యాలియనుభేదముండెనా అప్పుడు!!

ఐతే అప్పటి కాంగ్రెసు కార్యక్రమము వేరు ఇప్పటి కార్యక్రమము వేరు. దీనిం బట్టి "కాంగ్రెస్సుమగంటింది !—గాంధీ అడుగంటినాడు" అను ప్రవాదముఁ బుట్టించి స్వార్థపరు లానందించుచున్నారు. కాని యది నిరర్థకము. ప్రజాశక్తి యెన్నడును మాతృస్థానబలవిశిష్టమైయుండును. ఏ మహాశక్తుల త్యాగములవలన నాడు కాంగ్రెస్ విజృంభించినదో ఆ మహాశక్తుల ప్రచారములవల్లనే నేడు గూడ విజయభేరిని మ్రోగింపఁగలదు. స్త్రీయని నిరసింపఁబడక నాడు హరిచేఁ బ్రోత్సహింపఁబడిన సత్యామానినివంటి వారే నేటి మన సోదరీమణులును— పురాణజ్ఞానియగు మహాత్ముని చేఁ బ్రోత్సహింపఁబడుచున్నారు. "ప్రజాహితోద్యమములయందు స్త్రీలు చేయుచున్న కార్యములను గురుతింపుము. దేశము యొక్క రాజకీయోద్యమములయందు స్త్రీ లెక్కువ శ్రద్ధ వహించుచున్నారు. వేల

లాభమో నష్టమో తెలియును. బంగారమునకు హెచ్చు ఖరీదు వచ్చెనని అమ్మకొనుట ప్రస్తుతము అమ్మకొనినవారికి లాభముగ నుండును. కాని వారి దేశమునకు, వారి మాతృభూమికి మహాపరాధము చేయుచున్నారని నమ్మవలెను. నారీమణులు వారి నగలను జాగ్రత్తగ నుంచుకొని యింకను వృద్ధి యగుటకు చూచెదరని మేము భావించుచున్నాము. బంగారము పోవుచున్నకొలది మాయబంగారపు (Artificial gold) నగలు ఫేషన్ అగుచున్నవి. వీటిని త్రోసివేసి నిజము బంగారమునే పొందుడు!

మహాలక్ష్మిని కాగితములకై మీయిండ్లనుండి తరిమి వేయకుడు!

—కె. సచ్చిదానందరావు

## "యువతులకు నడవడి యందము"

"బిడ్డలారా, మన యువతులు తమలో దాము కాని యితరులలో గాని మెలగుచు వ్యవహరించు నపుడు గాని తమ నడవడియు వైఖరియు బహు నాజూకుగానుండునట్లు చూచుకోవలెనని నే జెప్ప నవసరములేదు. మనోహరమగు వైఖరిలేకుండుట హేయము. అందును స్త్రీలలో నాలోప మేమాత్రము క్షంతవ్యముకాదు. ఏకాంతమందుగాని నలుగురిలో నున్నపుడుకాని మనోభావముల వ్యక్తపరచు నపుడుకాని యువతులు మితిమీరరాదు. కొంత మంది పడుచులు బ్రహ్మకాయలవలె వటవట వదరుచు నేదో సందడి చేయుచుందురు. అట్టివారిని "మంచి చాకచక్యము గలవా" రనుకొందురు కాని యది తప్పు. ప్రశాంతస్వభావలగు సువిదలు మితభాషిణులై యితరులయెడ సత్యాతిసరళవర్తనము గలిగి యుందురు.........నలువురితో గలసియున్నపుడు గచ్చపొదవలె గలగలలాడుచుంట యొక పెద్దతప్పు! కొందరు తమమాటయేగాని యెదుటివారిమాట యొక్కనీయరు; తమసౌఖ్యమే కాని యెదుటివారేమైనను సరే; మరియు నడుగక లొడగక యితరులున్నచోట ప్రవేశించి వారి పెట్టెలు పేడలు తడిమి "యిదెందుకూ?" 'అదెంత ఖరీదు?' ఇది నీకెందుకూ—నా కిచ్చీ" అని చికాకుపెట్టి బాధింతురు; ఇవియన్నియు దుర్గుణములే. ఇంతేకాదు. చేయకూడని ప్రసంగములను కేయుచు లేనిపోని యూహలకు బోవుచు నితరులగూర్చి నీచములైన వదంతులను బుట్టించుచు వినోదించుట అన్నిటికంటె మహాతప్పు. ఇట్టి యలవాటు నెన్ని క్రమమైనబడి నిర్మూలము జేసికొంట ప్రథమ కర్తవ్యము.

సర్వకాల సర్వావస్థలయందును శుచిగా శుభ్రముగానుండుటగూర్చి యేమరియుండరాదు. "దీనికి వన్నె చిన్నె లేమీ తెలియవు. ఇది వట్టి జేల" యని యనిపించుకొనుటకు కొంతమంది 'యెన్నెమ్మ'ల వలె గన్పింతురు. చక్కగా దల దువ్వుకొని బొట్టు పెట్టుకుని యేవో యీశ్వరు డిచ్చియున్నంతవరకొక పరిశుభ్రమైన వస్త్రమును ధరించియుండుట చూచుట కెంతో ముచ్చటగనుండును. అది యెదుటివారి నేమో యుద్ధరించుటకు గాకున్నను దానియందొక మరియాదా సాంప్రదాయ మిమిడియున్నది. యేభ్రాసి రూపముతో బెద్దల యెదుటబడుట వారి యెడల నిర్లక్ష్యభావ మున్నట్లనిపించును. కాబట్టి యట్టిదాని కవకాశమీయరాదు.

(రవీంద్రుని ఉపదేశము)

## ప్రేమ

ఈశ్వరవిలాస విలసత్ప్రపంచము ప్రేమాత్మకము. ప్రేమోపాసనమే జననమరణములకు హేతువు. పాపపుణ్యముల కాలవాలము. కష్టసుఖములకు కారణభూతము. ప్రేమ యనిర్వచనీయమహిమా సమన్వితము. తదజడస్వరూపము. తజ్జడీకృతు లాశ్రితులు మానవుడు మాయాక్రాంతుడు. ప్రేమ మాయాజనితము. ప్రేమనికుంజ మితరప్రవేశమునకు భీషణపిశాచి. ప్రేమకాంత కష్టతపస్వులకైన స్వాధీనముకాని ప్రతిభావిశేషవతి. వశీకృత భూనాయకి తిరస్కృతక్షమాపాల. అధఃకృత స్వవిజ్ఞానశాలి. దిగంతవిస్తృతప్రతాప. ప్రేమ జనకము. శృంగారాదులు జన్యములు. ప్రేమ క్రోధాభిమాననివాసి. అనంతభేదవిరాజి, లౌకికము జన్మహేతువు, అలౌకికము; ముక్తినిదానము. ముక్తి మానవునకు గమ్యస్థానము. వివిధపథవిరాజి ముక్తి. తదేకపథము అలౌకికప్రేమోపాసనము. అలౌకికప్రేమోపాసన

యధిక కష్టసాధ్యము. సామాన్యుల కతీతము. పరిణత కార్మికుల కగ్రహస్తస్థ ద్రాక్షారసము. నిర్గుణ స్వరూప నిరంతర ధ్యానాసక్తియే" యలౌకిక ప్రేమోపాసనము. కర్మమార్గావలంబి మండన మిశ్రుడు. యోగపథరమి పతంజలి. భక్తిపథభాజి ప్రహ్లాదుడు. సర్వపథగమ్య మైక్యమే. తద్ద్వారము భేదయుక్తము. భక్తి తన్మార్గముల కగ్రేసరి. "నిర్గుణస్వరూపచింత. తత్త్వమసీత్యఖండబోధ" సగుణోపాసనాఫలితములు. ఫలితాంశీకృత తదైక్య చింతనమే అలౌకికప్రేమోపాసనము. ఆంజనేయు డలౌకిక ప్రేమోపాసకుడు. రామకథాచింతనామృత పానమత్తుడు. తద్వ్యక్తము ముక్తి. లౌకికప్రేమో పాసన మానవునకు సహజము. అయత్నప్రాప్యము. విశ్వామిత్రుని ప్రేమోపాసన లౌక్యము. వాసిష్ఠైర్ష్యా కృతము. వశిష్ఠు డలౌకికప్రేమోపాసకుడు. గోపికాదులు లౌకికప్రేమోపాసినులు. శబర్యాదు లలౌకికప్రేమోపాసినులు. వసిష్ఠవైరి, కష్టపరంపరా సరిత్ప్రవాహపతితుడు. వసిష్ఠుడు ముక్తికాంతాంకతల నిహితశిరస్కుడు. లౌకికప్రేమోపాసన ముక్తి కాంత కనిష్ఠము. కీర్తికాంతాకోపకారణము. అలౌకికప్రేమ. ఆదరణీయము. ప్రధానమచలత్వ బుద్ధి మంతము. "దైవాస్తిక్యబుద్ధి తదాంధనాశక్తి తదైక్యమే ముక్త్యనుమతి" తన్మార్గములు. ప్రేమ అగోచరస్వరూపి. "స్థిరము తాదాత్మ్యము" ప్రేమ చిహ్నములు. అనుభవైకవేద్య మలౌకిక ప్రేమ కాంతాహృదయగతార్థము. అప్రతిపాద్యము. జీవన్ముక్త్యర్థవాదులు సాంఖ్యులు. బుద్ధ్యర్థవాదులు బౌద్ధులు. ఏకత్వార్థవాదు లద్వైతులు. ద్విత్వార్థ వాదులు ద్వైతులు. చిదచిద్విశిష్టార్థవాదులు విశిష్టాద్వైతులు. ప్రత్యక్షార్థవాదులు చార్వాకులు. మర్త్యజన్మ ఫలము. జన్మరాహిత్యము. తదలౌకిక ప్రేమోపాసనాసాధ్యము కేవలార్థవాదన మూఢత్వము. పూర్వోక్త బౌద్ధాదులు వంద్యులు. పూజ్యులు. మానవుడు జన్మరాహిత్యకాంక్షి. లౌకిక ప్రేమపాశము విచ్ఛేద్యము. అలౌకికప్రేమ మానవోపాస్యము.

—శలాక అన్నపూర్ణాదేవి

## భగవంతుని మానవాకృతి

"భక్తి" అనే పదమును "ప్రేమ" అని అర్థమున్నదని నాఅభిప్రాయము. కాని కొందరు పామరులు నిజముగా వారికి లేశమయినా భక్తిలేకపోయినా తాముచేసెడి ఆరాధనయే తమభక్తిని వెల్లడిచేస్తున్నదని తలుస్తారు. సాధారణముగ మానవులు తమకు ఆపదలొచ్చినపుడే భగవంతుని ప్రార్థిస్తారు. కాని ఆభక్తికేవలము భయమువలన వచ్చెడిభక్తిగాని వేఱొండుగాదని నాయభిప్రాయము. కొందరు సాధారణముగ తమ వుదార స్వభావమును వెల్లడయేలాగున పదిమంది చూస్తూవుండగా దానధర్మాలు చేసెదరు. అది మంచిదికాదు. యిదియుగాక యిపుడు సాధారణమానవులకు మోసగించే మరియొక మానవ జాతి లేచింది. వీరలకు సాయంత్రమవగానే ఏతిరుపతి వెంకటేశ్వర్లో, సింహాచలస్వామియో పూనేస్తాడు. యింక దేముడు పూనెయ్యడమే తరువాయి చుట్టు ప్రక్కలవాళ్ళందరూ గుమిగూడేస్తారు.

యింక జనమువస్తున్నకొలదీ ఈదేముడికి వుగ్రము లావవుతూంది. ధూపదీపములకులోటు లేదు కొబ్బరి కాయలు, అరటిపళ్లు, డబ్బులు, ఆ మానవరూపధారియైన దేముడు పాదాలక్రింద దొర్లుచూనుంటవి చివరకు దేవుడు ఒక బేడహారతి కర్పూరంతోగాని వదలడు. ఆమనిషి ఎక్కడో నేర్చుకున్న నాలుగు బంగాళీ కీర్తనలు, ఓనాలుగు ఓఢ్రపు కీర్తనలు పాడడం ప్రారంభించగానే వచ్చినవాళ్లందరూ "ఆహా! దేముడి కీర్తనలు" అని పెన్సిలు కాగితము, తీసికొని వ్రాయడము మొదలుపెటతారు.

యింకొక ముఖ్యవిషయము. సాధారణముగా దేముడు ఆడవాళ్లకే పూనుతాడు. ఆహా కాలచక్ర మెంతటివిధముగ మారిపోయినది. మహాజ్ఞానులు తల క్రిందుగ వేలకొలది సంవత్సరములు తపసుచేసినా ప్రత్యక్షముగాని దేముడు, తెల్లవారితే నూరబద్ధాలు చెప్పి పదిమంది పీకలు కోసేవాళ్లకు ఎంత సులభముగ లభించుచున్నాడు. యీవిధముగా భగవంతుడు దేవాలయము విడిచి మానవరూపధారియై దేశద్రిమ్మరిలాగ సంచారం చేయడంచేత కొందరికివున్న కొద్దిపాటి భక్తి పూడిపోతూవుంది!

—పం॥ కామేశ్వరమ్మ

# వార్తలు—విశేషములు

మాతృదేశ సేవాపరాయణలై పేరుగాంచిన శ్రీమతులు పాటిబండ్ల అన్నపూర్ణమ్మగారు సత్యవోలు సుబ్బమాంబగారు, అడుసుమల్లి సుబ్బమ్మగారు ఇటీవలనే దివంగతులైనారని సోదరీమణు లెరిగియే యుందురు. ఐనను మా విషాదము దెలియ జేయుట కర్తవ్యమని యెంచి యిందు మరల దెలుపుచున్నాము. వారిలో అన్నపూర్ణమ్మగారు వీరమాత యని కూడ బేరొందినది. ఇట్టి యిల్లాండ్రు చని పోవుట దేశమునకును జాతికిని గొప్ప నష్టకరమగుచున్నది. పరమాత్ముడీ వనితలయాత్మలకు శాశ్వతానందపదవి నిచ్చుగాక! ఓం శాన్తిః.

## కీ॥ శే॥ నరాలశెట్టి దేవేంద్రుడుగారు

ఆది మాంధ్రశిరోమణియు, స్త్రీవిద్యకు ఆద్యప్రాయుడై మా జిల్లాలో ఎన్నడు ఎరుగని బాలికా వసతిగృహము ఏలూరులో స్థాపించి మా సంఘమును చుక్కానివలె నడుపుచు, సుమారు 1 సం॥రం నుండి వ్యాధితోనుండియు, సంఘసేవయందే నిమగ్నుడై యుండి మృత్యువు వాతబడెననువార్త ఉదయము 8 గంటలకు వినబడగానే స్త్రీసంఘమువారు నిలువున నీరై గ్రామమంతయు కన్నీరు పెట్టనివారు లేరు. సంఘమన నేమో యెరుగని ఈ ఆంధ్రదేశములో శ్రీ దేవేంద్రుడుగారు జాతీయరంగమున కాలిడిరి. నిండు కుండ తొణకదు అనునట్లు దేశనాయకులతోను, ప్రభుత్వోద్యోగులతోను, మైత్రిసల్పి, నిమ్నసంఘములకు కావలసిన హక్కులను, స్వాతంత్ర్యమును గోరుచుండిన వీరపురుషుడు. ఈ మహనీయుడు అంతమొందగానే మా సంఘములకు తీరని ఆశాభంగము కలిగినది. శ్రీ దేవేంద్రుడుగారి ఆత్మకు శాంతికలుగు గాక యని భగవంతుని ప్రార్థించుచు, అపారదుఃఖము ననుభవించుచున్న వారి కుటుంబమునకు మామల్లసరం స్త్రీసంఘము దర్పున సానుభూతి నందజేయుచున్నాము. జా॥ సూ॥ కాంతమ్మ.

## ఈశ్వరవిలాసమిదే!!

చాంబల్ నదిలో నొకపడవ యిరువదిమంది ప్రయాణికులతో బోవుచుండెను. నట్టేట నొక గుడిసె-యెక్కడనో యెగువనుండి ప్రవాహవశమునం గొట్టుకొని వచ్చుచున్నది-ఆనావతో దారసపడినది. వెంటనే యాగుడిసె కప్పుపైనుండి యొక నాగుపాము ఆ నావలోనికి దూకినది. ప్రయాణికు లదిచూచి భయోత్పాత వివశులై నావ కొకతట్టున జేరుకొనిరి. ఆ బరువుచే నావ బుడుంగుమనెను. పదునేడు నిండు ప్రాణములు ఏటికి బలియైనవి. ముగ్గురుమాత్రము ఈదుకొని యొడ్డెటులో యొడ్డునబడిరి. దైవవిలాస మవాఙ్మానసగోచరము కదా!!

## ధనాశాపిశాచము

మయూరభంజి సంస్థానములోనివాడగు భీమానాయకో అనువాడొక యేడేండ్లబాలకుని చంపినందుకు మరణదండన విధింపబడెను. వాడు, తన యింటి పెరటిలో నొకచోట ధనము పూడ్చిపెట్టబడి యున్నదనియు ఆనిధి ధనదేవతచే రక్షింపబడుచున్నదనియు అందుచేత నా ధనదేవతా ప్రీతికై యా చోటున రక్తాభిషేక మొనర్చి యా ధనమును గ్రహింప నెంచితిననియూ వాఙ్మూలమిచ్చెను.

## పిచ్చిప్రేమ

సెర్వియాలో సౌందర్యరాణి యని పేరొందిన యొకయువతిని బెండ్లియాడుట కొకయువకుడు స్థిర పరచుకొనెనట; కాని యా యువతి జబ్బుపడి వివాహదినమునకు ముందటినాడు గతించెనట. "ఆ శవమునే నేను పెండ్లియాడుదు" నని ఆ పడుచువాడు పట్టుబట్టి యెవ రెన్ని చెప్పినను వినక యట్లేచేసి శవమును దరువాత బెట్టెలో బెట్టెను; కాని యా శవమున కంతలో బ్రాణములు వచ్చెను. లయోనెల్ క్రాడల్ అను నా వరుడును మిల్లీసోవియాడా గోవిజా అను నా వధువును హాయిగా నున్నారు.

శ్రీయుత గోనెల నరసింగరావు, బి. ఏ., గారు, ఇటీవల జరిగిన 'ఫ్లెక్సుషూ కాంపెటిషన్'కు, (Flex Shoe competition, 1934), ఇంగ్లీషు పద్యములు వ్రాసి బహుమతి నొందినారు. విద్యార్థులలో, బహుమతినొందినవారిలో నగ్రగణ్యులు.

# విశ్వవిలాసము

**వచ్చే ప్రపంచకమునకు వారసు లెవరు ?**

నల్లవాళ్ల దేశాలలో తెల్లవారి ఆధిక్యతాధికార సామ్రాజ్యము లెన్నాళ్ళుదక్కుతాయీ అన్నది ప్రశ్న. వారియెడల ఆశ్చర్య, భయ, గౌరవములు పోగానే ఈ అధికారములు కూడా పటాపంచ లవుతాయనుటకు సందేహములేదు. అతి పరిచయమువల్లన ఆశ్చర్యం తగ్గుతుంది. ఇప్పు డేపల్లెటూరి అడవిజాతుల వారికో తప్ప తక్కిన వారందరికీ వీరుకూడా తమతో సమానమైన జంతువులే కాని వీరిలో విశేష మేమీ లేదని స్పష్టమైనది. వీరుకూడా తెల్లవారి దుస్తులు ముస్తాబులు చేసుకోవడంతో వా రెవరో వీ రెవరో తెలియనట్లు కూడా అంతా మమేకమయింది. ఆశ్చర్యం పోగానే భయంకూడా తగ్గుతుంది. భయం పోగానే గౌరవముకూడా క్షీణిస్తుంది. ఇవి పోతే, మిగిలే బాహుబల బుద్ధిబలాలలో ఎవరు పెద్దవారైతే వారిదే పై చెయ్యి అవుతుంది. పైగా విదేశాలలో వీ రల్ప సంఖ్యాకులు కనుక వీరికే పరాజయము పలాయనము తటస్థిస్తాయి. ఇట్టి పరిస్థితు లప్పుడే యేర్పడుతున్నాయి.

ఇదివర కల్లా నల్లవాళ్ళను రక్షించడం కోసం తెల్లవాళ్ళను ఉపయోగించేవారు. ఇప్పుడు తెల్లవాళ్ళను రక్షించుకోవడం కోసము నల్లవాళ్ళ సహాయం కావలసి వస్తోంది. అల్గయిర్సులో యూదులకు అరబ్బులకు పోట్లాటలువస్తే సెనిగాలులోవున్న ఫ్రెంచి అధికారులు తాము అణచీ లేక తమ కేమి ఉపద్రవంవస్తుందో అని సెనిగాలులో యున్న నీగ్రోలను సైన్యముగా తయారుచేసి ఆ పోరాటము లణిచినారు. దీనివల్ల నీగ్రోలకు తాము అరబ్బులు యూదులకంటె మాత్రమే కాక ఫ్రెంచివారికంటె కూడా గొప్పవారమనే భావము కలుగుతున్నది. ఈలాగు చేసినందుకు లండనులో ప్రకటించఁబడే సండేఎక్స్ప్రెసు పత్రిక ఫ్రెంచివారిని చాలామట్టుగ ఆక్షేపించింది. ఈవాళ ఫ్రెంచివారిమీద కలిగిన దురభిప్రాయమే రేపు ఇంగ్లీషువారు మొదలగు ఇతర తెల్లవారిమీద కూడా కలుగుతుందని వీరి అనుమానము. గత ఐరోపాయుద్ధములో తెల్లవాళ్లూ తెల్లవాళ్లూ పోరాడుకొంటూ ఇండియనులు మొదలగు నల్లవారిని తెచ్చి రైనునదీప్రాంతమున నిలబెట్టి వారిచాటున తామొకరినుండి ఒకరు కాపాడుకొనుటవల్లనే తెల్లవాళ్ళ బలము బడాయిఅంతా పచ్చవాళ్ళకు నల్లవాళ్ళకు తెలుసుకొచ్చి వారివారి దేశాలలో తెల్లవాళ్ళతో సమానత్వంకొరకో వారినుండి స్వాతంత్ర్యంకొరకో ఆందోళనలు ప్రారంభించారు. యుద్ధానంతరం కూడా ఫ్రాన్సు తన నీగ్రోసైన్యాలనే తరిపీదు చేసుకొంటున్నది. వచ్చేయుద్ధంలో జర్మనీనుండి తనను వారే రక్షించవలెనని ఆశ పెట్టుకొం

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. బి. మనోహరరావుగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు. (పెద్దచావిడిదగ్గర)
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.
జెమ్ షెడ్ పూర్: వి. కొండల్రావుగారు, అకౌంట్సు ఆఫీసు. న్యూస్ ఏజంట్.]
గుంటూరు: వెల్ కం అండు కంపెని. చికాకోలు: టి. శ్రీనివాసరావుగారు,
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. సూకరాజుగారు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రీ, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
సికందరాబాద్: శ్రీరామా బుక్ డిపో. బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
నరసాపురం: వై. సుందరరామయ్యగారు.
నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు.
భీమవరం: వంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూస్ ఏజంట్ 244, ఫేర్ వీధి.
మచిలీపట్టం. ఆచంట లక్ష్మినరసింహంగారు, రాజుపేట.
కర్నూలు: టి. బాలనాగయ్య శెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
కడప: ఎమ్. నరసింహంగారు, న్యూసుఏజంటు.
కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్ సాహేబ్.
పొన్నూరు: జి. సూర్యనారాయణగారు.
విజయనగరం: ది. పాపులర్ ట్రేడింగ్ కంపెని, కస్బా.
పర్లాకిమిడి: బండారు నరసింహమూర్తిగారు, న్యూస్ ఏజంట్.
రేపల్లి: పి. సి. కన్నభిరామ్ శెట్టిగారు, న్యూస్ ఏజంట్.
మదనపల్లి: ఎన్. రాధాక్రిష్ణయ్య శెట్టిగారు, న్యూస్ ఏజంట్.
ఖరగ్ పూర్: ఎన్. ఆంజనేయులుగారు, ట్రాఫిక్ సెటల్ మెంట్.
చీరాల: ఎ.ఎస్. ఆర్. ఆంజనేయులుగారు.
ఏలూరు: ది. నేషనల్ న్యూస్ మార్ట్.
రాజోలు: దినేషనల్ ఏజన్సి, ప్రొప్రయిటరు చింతా సూర్యనారాయణగారు.
నెల్లూరు: కె. శ్రీరాములు, న్యూస్ ఏజంట్.
ప్రొద్దుటూరు: వి. వెంకటసుబ్బయ్యగారు, న్యూస్ ఏజంట్.
హనుమకొండ: ఖమ్మమ్మెట్: టి. యల్. ప్రసాదుగారు ది. యూనివర్సల్ న్యూస్ బ్యూరో
హిగిన్ బాతమ్స్ స్టాలులవద్ద దొరకును.

**ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దర—**




## శాస్త్రి హోటలు అనగానేమి?

ఆరోగ్యభాగ్యమునిచ్చు ఆహారములకు

అల్పాహారములకు పుట్టినిల్లు.

వీర్యబలమునిచ్చు మధురపదార్థములు, చలిదేశ
మునకు అనుకూలమైన శయ్యాగృహములు,
దంపతులకు తగిన యేర్పాటులు.

## శాస్త్రి హోటలు

89 చిక్ పేట — బెంగుళూరు సిటీ.

# విషయసూచిక



త్రివర్ణచిత్రములు:

దీనురాలి దినకృత్యం. చిత్రకారుడు: పి. ఎల్. కృష్ణమూర్తిగారు.

పల్లెటూరి భాగ్యము



దీనురాలి దినకృత్యం

చిత్రకారుడు : పి.ఎల్. కృష్ణమూర్తిగారు

భాగ్యమడుగవు
భవనమడుగవు
భర్తతోడుత ప్రాకులాడవు
బంధువుల తోడ్పాటుగోరవు
బాధ్యతంటావు.

భారమోచవు
బాధ్య తెఱుగుదు
చేయికాలూ ఆడువఱకును
చీకు చింతాలేని బ్రదుకును
బతుకుతుంటావు.

బిడ్డ చంకన
పెట్టి మూపున
చీదరించే చిన్నికన్నుని
చెయ్యిపట్టుక తోడుకొంచూ
తిరుగుతుంటావు.

చేతినేర్పుతో
సృష్టినిచ్చి
మెలచినట్టి మెఱుగుబూసల
మించునోపిక తోడుగాగా
అమ్ముతుంటావు.

భోగభాగ్యము
భూరిసౌఖ్యము
భర్తప్రేమా బంధుప్రాపూ
పడయగలిగీ చింతనొందే
స్త్రీల చూస్తావు.

నీదు సహనము
నీదు త్యాగము
నీదు నేర్పూ నీదు బాధ్యత
స్త్రీత్వ స్ఫూర్తి కృషి యువారికి
చూపకున్నావా!

చే. రా.



# ఉపేక్ష

ఆమె యొకదొడ్డ యిల్లాలు. ఆమె పేరు నేను వ్రాయఁబూనుకొనలేదు. ఆ పేరుతో నవసరమును లేదు. కావలసినది కథ. గమనింపవలసినవి విషయములు.

ఆమెకు సంతానమారుమంది. భర్తనూట యేబది రూపాయలవేతనము దెచ్చుకొను నొక ప్రభుత్వోద్యోగి.

భర్త పదునైదు సంవత్సరములనుండియు నుద్యోగమున నున్నాడు. ఆమె అంతకు మూడుసంవత్సరములకుముందే సంసారమున బ్రవేశించినది. వారి యాదాయముపై నాధారపడియుండువారు నానాటికి అధికమగుచుండు వారి సంతానము మాత్రమే. వారి యాదాయముపై నిరంతరము కన్నువైచియుండువారును లేకపోలేదు. ఆదాయములో అధికభాగము బంధుదేవతల కర్పించిన సాక్ష్యములును ఉన్నవి. చెప్పవచ్చిన దేమిటంటే భర్తకు ఆదాయములో కానీయైన నిలువబెట్టుటకు తెలియదు; భార్యకు పైసాయైనను కర్చుచేయుట తెలియదు: ఇష్టమును ఉండదు. భర్తవ్యయము భార్యపట్టుదల క్రమక్రమాభివృద్ధిచెంది పిల్లల అభివృద్ధిమీదవిఱుచుకొని పడినవి.

భార్యాభర్తలిరువురు అతి సంస్కరణవాదులు. సనాతనత్వమును మరపించు మూఢ విశ్వాసముకూడ నధికము. వారు సంస్కరణముల బోధింపరు. సమయము వచ్చినపుడు వెనుదీయరు. అయితే ప్రపంచము ననుసరించి ప్రయాణమనువాడుభర్త; ప్రపంచముతో పనియేమి? మనదారి మనదను

నది భార్య. ఈ యుద్దేశముల మధ్యపడి నలిగిపోవువారు పిల్లలు.

వారి ప్రకృత నివాసము చెన్నపురి. భర్తకు 'బదిలీ' అయినది. పరపట్టణములం దున్నాడు. పిల్లలందరితో నామె ఇచటనే యున్నది. భర్త చెన్నపురికి తిరిగి వచ్చు లోపల నొకయిల్లు స్వంతముగ కట్టించుకొన నిశ్చయించినది. అద్దెయిల్లు వీడినది. పట్టణమునకు చివరనొక ప్రదేశమున కొంతభూమి కొన్నది. ప్రకృతమట నొక కుటీరము నిర్మింప జేసి నివాసమచటికి మార్చినది. అది ఊరికి దూరము మాత్రమె కాదు; సౌకర్యములకు చాలదూరము. పరిసరములు పల్లెపట్టును బోలియుండును. ఆయింటి కద్దెలేకపోయిన దను సంతోషము ఎంతోకాలము నిలువ లేదు. ఆయింట ప్రవేశించినది మొదలు ఎవరికిగాని ఆరోగ్యము పూర్తిగా లేకుండ పోయినది. అది ఆ పరిసరములలోనే లేదు.

ఆ దంపతులకు దీనులమెడ, దిక్కులేని వారిమీద, దురదృష్టవంతులపై అభిమానము, ఆదరణ సానుభూతియు నెక్కువ. ఇదియే నన్ను కొన్ని సంవత్సరముల క్రింద నాకర్షించినది. అప్పటినుండియు వారికి నాకును పరిచయము.

ఇది మున్నుడి.

అసలు కథయిది. వీలులేక పోవుటచే రెండుమాసములుగా వారి యింటికి నేను వెళ్లలేదు. పదునైదవతేది ఆఫీసుకు వెళ్లుచు 'వారికీవేళ ఉత్తరమైనా వ్రాసిన బాగుండును' అనుకొనుచునే వెళ్లితిని. ఆతరువాత ఒకగంటకే తయారైనాడు ఆమెగారి పెద్ద బ్బాయి. ఉత్తరమొక్కటి తీసుకొని వచ్చినాడు. అందులో "ముప్పూరి చిన్నబిడ్డలకు అమ్మవారుపోసినది. వారిని హాస్పిటలుకు బలవంతముగా తీసికొనిపోయెదమని కార్పొరే షనువారు భయపెట్టుచున్నారు. మీరొక్కమారు తక్షణము రావలయును" అని యున్నది.

ముప్పూరిబిడ్డల కొకేమారు అమ్మవారు పోయుట! తక్షణము బయలుదేరి వెళ్లితిని. వారియిల్లు చేరులోపలనే మదరాసుఎండ శరీరమును పప్పువలె నుడికించినది. వారి యింటికివెళ్లి ముప్పూరి బిడ్డలస్థితిచూడ హృదయము తగులబడినది.

గాలివెలితురులే కాదు, ఇతరులిండ్ల ప్రవేశింపరాదను నీతినియమములులేని చిన్న చిన్న జంతువులుకూడ నిరాటంకముగ ప్రవేశింప వీలుగల కుటీరమది. లోన మూడు కుక్కి మంచములు. ఒక్కొక్కదానిమీద నొక్కొక్కబిడ్డ పండుకొనియున్నది. సంవత్సరము వయసుగల చిన్నిబిడ్డ శరీరమంతయు పచ్చిబఠానిగింజలు సందులేకుండ అతికించినరీతి, పుండ్లతో పెద్దమ్మ మాహాత్మ్యమునబడి తలమున్కలు వేయుచున్నాడు. రెండవవాడు — మూడు సంవత్సరములు— బోండావలె, గాలినింపిన రబ్బరుగొట్టమురీతి నున్నాడు. శరీరమంతయు నొకటే పుండు. అవయవములన్నియు భయంకరరూపము దాల్చినవి. కనులు, ముక్కు, చెవులు

పూ ర్తి గ మూసికొనిపోయినవి. నోరు మాత్రము పూర్తిగ మూతపడలేదు. రెండు పెదవులమధ్య మాత్రము కొంచెము సందున్నది. ముక్కు మూసికొనిపోవుటచేత నోరు ఆ 'చార్జి' తీసుకొన్నందున ఆసందు మిగిలినవి. అదియు పెద్దదిగాకపోవుటచే ఈగలు గుంపులు గుంపులుగా లోపలికి వెళ్లి వచ్చుటకు సాధ్యపడుటలేదు. మూడవ అమ్మాయికి ఆరు సంవత్సరముల వయసు. అమ్మవారు పోయుట అపుడే ప్రారంభమైనది. ఆ అమ్మాయి సాధ్యమైనన్ని పాత గుడ్డలను కప్పుకొని, జపాను సైన్యమువలె, నిష్కరుణతో నిరంతరము నిరపరాధులను యమయాతనపెట్టు ఈగలతో పోరాడుచున్నది. అపుడే బిడ్డలకిచ్చుటకు ఆమె హార్లిక్సు కలుపుచున్నది. తక్కిన ముగ్గురు పిల్లలు ఇంట నాడుకొనుచున్నారు. తమ సోదరులకు కలిగిన ఆపదనుగూర్చిన ఆలోచన వారి చిఱుతహృదయములందు ప్రవేశించినటుల గన్పడలేదు. తమ స్థితిని గమనించువారు లేనందున వారందరు సాధ్యమైనంతవరకు అసహ్యముగ గన్పడుచున్నారు.

ఆ పిల్లలస్థితిని చూచి నా హృదయము దహించుకొనిపోయినదంటేని. పరమపవిత్రమై, ప్రపంచమునకంతయు పూజనీయమైన ఆ మాతృశబ్దమునందు ఎంతసహనము, ఎంతఓర్పు, ఎంతప్రేమ ఉన్నదో నాకు తెలియదు. పదిదినములు ఆముగ్గురి బిడ్డలతో రాత్రింబవళ్లు బాధపడుచున్న ఆ మాతృహృదయము ఎటుల సహించినదో నా కచ్చెరువు గొల్పినది. ఏమి నిమిషములకాలము ఆ పిల్లల దారుణ బాధను నేను చూచుటయే నాకు దుర్భరముగనుండినది.

ఇంతకు ఆ ముగ్గురుబిడ్డలు ఆవిధముగా దుర్భరమైన బాధకు పాల్పడుటకు కారణమెయ్యది? చేయు ప్రతిపనియు బిడ్డల అభివృద్ధికేయని చెప్పుచు,వారి యారోగ్యమును పోషణనుగూర్చి తగుశ్రద్ధవహింపక నుపేక్షించు తల్లిదండ్రులకు జన్మించినదే, వారి దోషమా? లేక మరేమి? నాకు కోపము వచ్చినది.

'ఈబిడ్డల నెందు కీవిధముగా జేసితిరి? ఇంత ఉపేక్షచేయు టెందుకు?' ఇట్టి 'ఎందుకు' లెన్నో శరపరంపరగా నా నోటి నుండి వెలువడినవి. ప్రత్యుత్తరముగా నామె యేడువ మొదలుపెట్టినది.

తండ్రి యూరలేడు. తల్లి భావికాలపు ఏర్పాట్లకై దినమంతయు పరిశ్రమ చేయుచుండును. విరామకాలమునందు తన కనారోగ్యముగనుండుటచే నెమ్మదిగ పండుకొనును. పెద్దకుఱ్ఱనికి పండ్రెండవయేడు. చిన్నబిడ్డ వయసు సంవత్సరము. తక్కిన బిడ్డ లీమధ్య వయస్కులు. వీరిలో పెద్దవారు ఎవరికివారే ఆహారవస్త్రముల చూచుకొని చదువు సాములందు శ్రద్ధవహించు బాధ్యత వారిపై బలవంతముగ నుంచబడినది. అన్నవస్త్రములకువలె దాని యావశ్యకత వారి కింకను గనుపట్టలేక పోవుటచే వా రారోగ్యముగనుండుటకై

మెప్పునను ప్రాకులాడరు. అయితే గుడ్డ లున్నను లేకున్నను గడ్డిలో మట్టిలో మాత్రము సందు దొరికినపుడంతయు ప్రాకు లాడుటమాత్రము మరువరు. ఇట్టి పరిస్థితు లలో వారి యింటి కొక బంధువును ఆమె కొమారుడును వచ్చిరి. ఆ బంధువుకు మొదట అమ్మవారుపోసి నిమ్మళించినది. తరువాత బంధువురాలి బిడ్డకుపోసినది. వీరంద ఱును కుటీరమున నేఉండుట! ఆమె బిడ్డలలో నొకరికిగాని, తుదకు ఆమెకుగాని టీకాలు వేసియుండలేదు. ఆరగంట 'పార్టునోటీసు' కు తయారయి టీకాలువేయు కార్పొరే షనువారి యుద్యోగులున్నారు. చికిత్స చేయు వైద్యశాలలు మితిమీరినన్ని గలవు. అయినను టీకాలు వేయించుకోవలసిన అవ శ్యకతగాని, వచ్చినవారికి చికిత్స చేయించ వలసిన అక్కరగాని, ఆమె హృదయములో జనియింపలేదు. జనించినను ఆమె ఉపేక్ష అట్టికోరికను మ్రింగివేసినది. తుదకు పసి బిడ్డలను వేరుగానుంచుటకైన నామె ప్రయ త్నింపలేదు. వారి పరిశుభ్రతనైన గమ నింపలేదు. అచిరకాలముననే తన చిన్నబిడ్డ లకు ముప్వురకొకేమారు అమ్మవారుపోసి నది. బంధువురాలిబిడ్డ మరణించినది. ఆబిడ్డను స్మశానవాటికకు తీసికొనివెళ్లినపుడే కార్పొ రేషనువారు సమాచారమును దెలిసి కొనుట!

ఉన్నత బ్రాహ్మణవంశము. మంచిచెడు గుల నతిసులభముగా గ్రహింపదగిన బుద్ధి, విద్య; కావలసినదానికంటె యెక్కువగా గడించుచున్న భర్త; అనాథలనేని అత్యంత శ్రద్ధతో గమనించు వైద్యాలయములు; వెచ్చించినచో రాజభోగములనేని చూర గొనదగు ప్రదేశము—ఇట్టిచోట తన ముద్దు బిడ్డలను తనయారోగ్యమును రక్షింపబూను కొనని ఆమె నుపేక్ష నేమనవలయును! తనకు ఓపికలేకున్న పోయె. బిడ్డలకమ్మవారుపోసిన తరువాతకూడ భర్తకుగాని, ఇతరబంధువు లకుగాని తెలుపలేదు. ఊరనున్న నాకును తెలుపలేదు. హాస్పిటలుకుపంపి చికిత్స చేయింపలేదు. ఇంటిచికిత్స అంతకంటెను లేదు. 'పోవునులే' అని యూరకున్నదట!

ఇట్టి ప్రదేశములలో ఇన్ని సౌకర్యముల మధ్యనుండియు నుపేక్షించి భరింపరాని బాధలకు దిక్కులేని దారుణమరణములకు గురియగువారుకూడ నున్నారా?

'అంబులెన్సుకారు తెచ్చెదను. ముప్వురు బిడ్డలను హాస్పిటలుకు తీసికొనిరండు. ఆలస్య మింతయైనను కూడదు' అంటిని. అంత వారియింట పనిచేయుమనిషి తనవైదుష్య మును వెలుగబెట్టుచు 'అంటూముట్టూ తగిలి ఇలా అయింది. అది తగలకపోతే ఏమీ ఫరవాలేదు. ఆస్పత్రికెందుకండీ' అన్నది. ఆమెమాటలకు నవ్వుచున్నట్టు బల్లి ఎక్కడ నుండియో అపుడే పలికినది. పనిమనిషి వాదమునకది బలమిచ్చినది. తన సంస్క రణబుద్ధి, విద్య, అనుభవము ఎందేగెనో గాని ఆమె పనిమినిషిమాటల కాదరణ చూపుచు 'నిజమేనండి. హాస్పిటలుకు ఎందుకండీ! కార్పొరేషనువారు తొందర

చేయకుండా మాత్రము చూడండి' అనుటకు ప్రారంభించినది. సంతానమునకై తన ప్రాణమునైన తృణప్రాయముగ నర్పించునది తల్లిహృదయము. ఆతల్లిహృదయమును గూడ అవసరములో ముందంజవేయనీయనిది మూఢవిశ్వాసము.

నేను వినలేదు. అంబులెన్సుకారులో ముగ్గురిపిల్లలను హాస్పిటలులో చేర్పించితిని. తక్కిన ముగ్గురుబిడ్డలకు టీకాలు వేయించుటకేర్పాటుచేసితిని. పిల్లలఆరోగ్యమునుగూర్చి భర్తకును బంధువులకును తెలిపితిని.

ఒకదినము గడచినది. మరుదినముదయము హాస్పిటలునుండి మనిషి మాయింటికి తయారు. ముగ్గురిలో నొకబిడ్డ గతించినది. అది యతడు దెచ్చినవార్త. వెంటనే హాస్పిటలుకు వెళ్లితిని.

తల్లి తనసంతానము నెడచేసిన ఉపేక్ష ఎంతచేసినది. నిద్రాహారములులేక దైన్యమాకారము దాల్చినరీతి తల్లి కుమారుని పడకవద్ద నిల్చున్నది. 'గట్టిగా ఏడువకూడదు. ఇతరపిల్లలు భయపడెద'రని దాది దబాయించుచున్నది. బాధచే ఇరువురు బిడ్డలు అవ్యక్తముగ మూల్గుచున్నారు. ఆస్థితిలో ఆతల్లిని, ఆబిడ్డలబాధనుచూచిన వారిహృదయములు కంపింపక మానవు. ముగ్గురిబిడ్డల కొక్కమారుగ ఆదారుణవ్యాధి వచ్చుట. అందులో నొకరు మృత్యువువాతపడుట, దుఃఖమును దిగమ్రింగుచు తక్కిన యిరువురి నహోరాత్రములు నిస్సహాయస్థితిలో గనిపెట్టియుండుట, దాన తన యారోగ్యముకూడ చెడుట—ఇవన్నియు దేనిమూలమున ? ఉపేక్ష ! ఉపేక్ష!! ఉరి తెచ్చిపెట్టు నుపేక్ష !!!

చదువుల రామచంద్రయ్య.



# శ్రీ శివశంకర శాస్త్రిగారి కొక చిన్నిమనవి

లక్ష్మీకాంతం

ఫిబ్రవరి 4, 5, తేదీలలో అఖిలాంధ్రకథకుల సమావేశం హైదరాబాదులో జరిగింది. దానికి శ్రీ శివశంకర శాస్త్రిగారు అధ్వర్యం వహించారు.

ఆసమావేశంలో శాస్త్రిగారు ఉపన్యసిస్తూ "కథాసాహిత్యాన్ని అభివృద్ధిపరచడంలో స్త్రీలు ముఖ్యభాగాన్ని స్వీకరించినారు. వీరు వ్రాసిన కథలు చక్కగా వున్నాయి. కథలుచెప్పడంలో స్త్రీలకు శక్తి అపారమైనది. కాని వారికి స్వతంత్ర రచనలో అనేక చిక్కులున్నాయి. వారి రచనల్ని అధికంగా ప్రచురించే 'గృహలక్ష్మి' పాతివ్రత్యాన్ని స్థిరపరచే కథలనేగాని ప్రకటించదు. అందులో ప్రకటింపబడే కథలన్నీ సీత, సావిత్రి, దమయంతిని దృష్టిలో నుంచుకొనే వ్రాయవలసి వుంటుంది" అన్నారు.

ఈ అభిప్రాయం నాకు కొంతవింత కలిగించింది. దీని కాధారమేమైనా వుంటుందా అని ఆలోచించాను. 'గృహలక్ష్మి' స్త్రీల సర్వతోముఖాభివృద్ధికై పాటుబడేది అయినా సంస్కారాలతోటి సంఘం బాగుపడాలంటుంది, కాని కేవలం సనాతనంగానే వుండవలెననే ఆశించదు. ఆరంభంనుంచి సీతా, సావిత్రీ, దమయంతీ, ఆదర్శంగా వ్రాసిన స్త్రీల కథలు 'గృహలక్ష్మిలో' ఎన్నో లేవు. ఇవిరెండే శాస్త్రిగారి వుద్దేశానికి ఆధారం అయివుంటాయా?

అయితే ఇది సర్వసాధారణంగా ఏకించిత్తు ఆధారాన్నో కనిపెట్టి జెనరల్ రిమార్కు పాసుచేసే వారి విషయములో నిజమైతే కావచ్చును. శ్రీ శివశంకర శాస్త్రిగారి యెడ అది నిజమవుతుందా? వారంతమాత్రానికే అటువంటి అభిప్రాయమును వ్యక్తపరుస్తారా! స్త్రీ లెక్కువగా అసహ్యహించుకునే పచ్చిబూతులతోడి కథలనుతప్ప ఇతర పత్రికలు ప్రకటించే సభ్యతాకథలన్నీ—అన్ని రకాలవి—'గృహలక్ష్మి'లో చాలాకాలం నుంచీ ప్రకటింపబడుతూవున్నవే. వాటిని శాస్త్రిగారు చూచేవుండరా? ఇపుడుకూడ చూడడము లేదా? ఇట్టి ప్రశ్నలు నామనోవీధిలో మెరసి పోతున్నాయి. అయినా, వానికిసమాధానంగా 'ఔను' అన అనడానికి నాకు సాహసంచాలదు. లేదంటే వారి అభిప్రాయాలతో ఏకీభవించడానికి అసాధ్యం.

ఇంతకు నావుద్దేశం ఇది. 'గృహలక్ష్మి'లో ప్రకటింపబడే కథలను విడువకుండా చదివే వారిలో నే నొకరిని. వీటిలో స్త్రీలు చేసే స్వతంత్రరచనకు ఆటంకం కలిగించడంగానీ, పాతివ్రత్యాన్ని స్థిరపరచే కథలనేగాని ప్రకటింపక పోవడముకానీ, 'గృహలక్ష్మి'కి వ్రాయవలసినవారంతా కథారచనలోని ఆశయాలన్నింటిని కేంద్రీకరణంచేసి సీతా, సావిత్రీ, దమయంతీ, వీరిని దృష్టిలో వుంచుకొనే వ్రాయవలసిన అవసరంగానీ, ఎంతమాత్రమూ వున్నట్లుగా నాదృష్టికికనబడ్డంలేదు. శివశంకర శాస్త్రిగారు అవిషయాల్ని గుర్తిస్తే చాలా సంతసిస్తాను.

# పాత పాటలు

శ్రీమతి అడపా సుగుణమణిగారు

దేవేంద్రసత్యార్థిగారు హిందూదేశమంతా సంచారముచేసి వివిధభాషలలోనున్న పాత పాటలను సేకరించి ప్రకటించేరు; గురుదేవ్ రవీంద్రనాథ్ ఠాకూరుగారు హృదయమంగమున్నవని శ్లాఘించేరు. అందుకొన్నిపాటల కనువాదము.

అల్లఊరివారు పిల్లనడిగేరు
పిల్లవానికి రూపురేఖలున్నాయి
ఏటేటపండేటి భూములున్నాయి
ఊరిపాలిమేరలో తోటలున్నాయి
చుట్టుకొల్లారంపు మిద్దెలున్నాయి
కుఱ్ఱవానికి మంచి సేద్యమున్నాది
పిల్లదానికితగిన ఈడుజోడేను
కన్నెనిస్తామని కబురంపుదాము.

రాజులిప్పటివారు రత్నాలచెల్లి
పూర్వక్షత్రియులింటపుట్టిపెరిగేరు
ఉనికితాతలనాటి ఊరిలోపలనె
ధ్యానింతురలనాటి దైవగణములనె
గాని వారలకున్న కరుణలేదాయె
పరికింప అలనాటి పౌరుషములేదు.

చెట్టా! చెట్టా! పువ్వులు
ఎందుకుచిట్టీ! పువ్వులు
ఆడుకొంటాను పువ్వులు
అట్లయితే లేవూపువ్వులు
తమ్ముడికిస్తాను పువ్వులు
అమ్ముడుపోయేయి పువ్వులు
అత్తింటికెడతాను పువ్వులు
అయితే యివిగో పువ్వులు.

నిదురపోకే కోయిలా!
    ఇక నిదురపోకె కోయిలా!
పాటపాడేకోయిలా!
    ఇకపాటపాడే కోయిలా!
నిదురపోయే కాలమేగెను
    నిదురపోకే కోయిలా!
పాటవిని కలకాలమయ్యెను
    పాటపాడే కోయిలా!
ఒకపాటపాడే కోయిలా!

చలిబాపుసూరన్న చలిమాపుతండ్రి
చందనపుచెక్కిదిగో చలిమాపుతండ్రి
బొమ్మపందిరివేసి బువ్వపెడతాము
సన్నబియ్యమువండి చారుచేస్తాము
లెంకాయపచ్చడి వంకాయకూర
పాయసము బొబ్బట్లు పండ్లువేస్తాము
చలిబాపుసూరన్న చలిమాపుతండ్రి
చందనపుచెక్కిదిగో చలిమాపుతండ్రి.

# గుణవతి

గీ॥ అట్లుకుమతులదుర్భాలాప లాత్మదలచి, యోచనాంబుధిమగ్నుడై యూరకుండె
నారగింపంగబిలుచు నిల్లాలిమాట, కేమిబదులాడకున్న నిదేటివింత.
గీ॥ అనుచుబలుమారుసతిబిల్వ నపుడులేచి, యెట్టులెట్టులోబోసేసి నెన్నడిట్టి
చందమెఱుగనివిమలాంబ శంకనొంది, చిత్తమునయోచనావళు లొత్తిగొనగ.
క॥ ఎట్లో గృహకృత్యముల ముగియింపజేసి, శీతకరముఖి నిజనాథు చెంతజేరి
పదముల్లల్లనొత్తుచు బలికెక్రొత్త, భంగిదోచెడు నాతోడ బలుకరాదె.
గీ॥ చిన్నబోయినమిముజూడ జిత్తమగిలె, యేనెఱుగరానిమర్మంబు లేమిగలవొ
మానధనయని పగబల్కు మానవతిని, ప్రాణనాథుడు దరికి జేరంగదిగిచ్చి.
గీ॥ చిన్నబోకుండుచేనిను జెప్పవాడ, వింతసంగతులెన్నియో విన్నవాడ
నగుట యోచనలను మున్కలాడువాడ, జెప్పకనుదప్పదికనీకు జెప్పవాడ.
క॥ చారుమతివిషయమునసీ, యూరకు జనులకు నహోహ లొదవెడునిన్నన్
సారెకుదూఱుటవింటిని, యారటపాటొదవె జాల నన్నియు జెప్పన్.

చ॥ తెలియునునాకుచారుమతి దివ్యగుణప్రతిభావిశేషముల్
లలనరో నీవుసాధుగుణ లక్షణలక్ష్యమవౌ టెఱుంగుదున్
తలపగనాదుచిత్తము విదారితమయ్యెడు గుత్సితాత్మకుల్
వలికెడుపల్కులన్వినిన బాపముశాంతిని జెందుగావుతన్.

చ. పరమపవిత్రశీలయు సుభాషిణి జారుమతిం దలంప ము
ష్కరు లను మాటలందలప స్వాంతముఝల్లను సాధ్వి దీన నే
కరణిసహించు నామె విన గల్గునె కష్టము మంచివారికే
తరుణిరో చూడదిక్కుగలదా మఱి యీపరుగూరనామెకున్.

గీ॥ ఆమె జనకునికడకామె నంపదగును, ఒంటరిగనిట్లుమనయింట నుండదగునె
యనినపతిపల్కులకు మనంబగల ధైర్య, వతియగుట నిబ్బరముకొంత వడికినూని.

మ॥ పరుమేల్గాంచి సహింపలేనికుమతు ల్వల్కంగ నేలెక్కయే
ధరనెవ్వారలకైన దిక్కగుగదే, దైవంబె జర్చింప నే
సరణింగానిగుణాఢ్యకీమెకుదయన్ సాయంబొనర్పందగుం
గరుణాశీలురుమీరలౌట బలుకంగానేర్చితిన్నేనిటన్.

గీ॥ సుగుణవతియు ననాథ విశుద్ధచరిత, యీమెకిటసాయ మొనరించుటయగణ్య
పుణ్యకార్యములకు సరిబోలుగాదె, యింకకొన్నాళ్లుసైరించు డీరుకరుణ.
గీ॥ విమల యిటులబలుక విమలాత్ముడన్యకాం, తాసహోదరుండు ధన్యుడతడు
ధర్మమతిని కలత దలగిచెలంగెను, సాధుమతికినితవు సాధ్విపలుకు.

గుడిపూడి ఇందుమతీదేవి.

# స్నేహలతాదేవి

శ్రీ అ. సీతారాముడుగారు

(ఏకాంకిక)

## మొదటి రంగము

[గంగాతీరమున పూరిల్లు: గౌరీదేవి ప్రవేశము]

గౌరీదేవి:—అమ్మా స్నేహలతా! (బయట ఆట లాడుకొనుచున్న స్నేహలతాదేవి తల్లి పిలుపు విని) ఇదిగో వచ్చుచున్నాను తల్లీ! (వచ్చి అమ్మకు నమస్కరించును.)

గౌరీదేవి:—ఇంతసేపు ఎక్కడ పోయియుంటివే బాచిట్టితల్లీ?

స్నేహలత:—ప్రియంవద నేను బయటనే ఆట్లాడుచుంటిమే! నీవు చూడలేదా? నీ పిలుపు విని ఒక్క పరుగున వచ్చినాను. ఏమి సెలవు?

గౌరీ:—అదిగో మీ తండ్రిగారు సాయంసంధ్యకు పూర్చున్నారు. మడిగట్టుకొని గంగోదకము తెమ్మా. చీకటిపడును.

స్నేహ:—చిత్తము తల్లీ. (నమస్కరించును).

గౌరీ:—ప్రియంవదనుకూడ పిలుచుకొని పొమ్మా. దాని అమ్మతో నేను చెప్పెదనులే. ఒకరికిద్దరు తోడైన మంచిదికదా!

స్నేహ:—ఆఁ ఔను. ప్రియంవద "మా అమ్మ గంగకుపోయి నీరు తెమ్మన్నది. నాకు తోడువస్తావు కదేమే" అన్నది. ఇద్దరము పోయివచ్చెదము. సెలవిమ్మా, మాతా.

గౌరీ:— (బిడ్డనొసట ముద్దుపెట్టుకొనుచు) ఇంక పొమ్మా, నా బంగారుతల్లీ. (స్నేహలతాదేవి బిందె చంకపెట్టుకొని పోవును.)

## రెండవ రంగము

[ప్రశాంతమైన గంగాతీరము: బిందెల క్రిందపెట్టి స్నేహలతా ప్రియంవదలు కూర్చుందురు.]

ప్రియంవద:—లతా! చూడవే. ఆ కడిమిపూ లెట్లు కాసినాయో! నేను పోయి కోసికొని వచ్చెదను. గంగకు పూజ చేయుదమా? (స్నేహలత ఊరకుండును. ఏదో దీర్ఘముగ ఆలోచించుచుండును.)

ప్రియ:—ఏమే పలుకవు? సరే నీ ఇష్టము. నేను మాత్రము పోయి పూలుకోసికొని వచ్చెదను. నీకు ఒక్కపూవైన ఇయ్యనులే!

స్నేహ:—(నవ్వుచు) నీ వొక్కదానివే పూజ చేయుము. మంచిమొగుడు వచ్చులే. (ప్రియంవద సిగ్గుతో తలవంచుకొని వెళ్లును.)

స్నేహ:—(ప్రవాహము నుద్దేశించి) తన్ను మనసారవలచిన ధర్మపత్నివైపు కన్నెత్తిచూడని ప్రణయశూన్యుహాతఁబడినట్టి ఒక్క యభాగ్యసతిని జ్ఞప్తి కెలయింతు వేల గంగామతల్లీ? భావిసూచక మేమొ ఎవ్వనికి తెలును. అభయమిమ్ము మనశ్శాంతినందగలను.

ప్రియ:—(దోసిలినిండ కడిమిపూలు: అస్తమించుచున్న సూర్యుని చూచి) లతా! అక్కడ చూడవే. సూర్యుడు సన్యాసివలె అగపడుచున్నాడు. ఏమి గతిపట్టెనే; పాపము. (ప్రేమలత భావనాసమాధిలో నుండును).

ప్రియ:—ఓహో! ఏదో మహాదీర్ఘముగా ఆలోచించుచున్నట్లున్న దే! ఏమిటే అది?

స్నేహ:—ఏమియునులేదు కాని, ఇంకను పూజ మొదలుపెట్టకుండ ఉన్నావెందుకే?

ప్రియ:—ముందు కాలుసేతులు కడుగుకొందాము రా! ఆవల పూజకు కూర్చోవచ్చును.

స్నేహ:—నేను అప్పుడే కడుగుకొన్నానే. నీవు పో. నేను ఇక్కడనే ఉండెదను.

ప్రియ:—అయితే ఈపూలు ఎత్తిపెట్టు (స్నేహలత ఒడిలోపోయుచు) పోయవచ్చెదను. (పోవును).

* * *

ప్రియంవద (కాలుసేతులు కడుగుకొని గంగనుద్దేశించి)

అమృతమయమైన నీ ప్రవాహమ్మునందు
స్నానమొనరించి సైకతశయ్యపైన
ఆడుకొన్నట్టి తపసికన్యకలు నాఁడు
దివ్యసుమనోజ్ఞ విమలగీతికలు పాడి
శిలలనిద్దురనుండి మేల్కొలుపలేదె
ఇప్పుడేమైరి వారలు! చెప్పవమ్మ.

నాలత ఒంటిగాఉన్నది. భయపడునేమో! త్వరగా పోవలయును. (నిష్క్రమించును).

స్నేహ:—ఎందుకే ఇంత ఆలస్యము?

ప్రియ:—ఎందుకో ఒకందుకు కానీ, ఇంక పూజకు కూర్చుందామా?

స్నేహ:—నీ పూలన్ని గాలికిపోయినవి. మట్టిలో కలిసిన పూలు పూజ కనర్హములుగదా? మరేమి చేయుట?

ప్రియ:—అయ్యో! అంతగా కష్టపడి కోసికొని వచ్చిన పూలను గాలి కెట్లు విడిచితివే? (గౌరీదేవి ప్రవేశము.)

గౌరీ:—ఏమి చేయుచున్నావు తల్లీ? నీ విల్లు విడిచి ఎంతసేపాయెను.

స్నేహ:—ప్రియంవద పూజకై తడవుచేసినదమ్మా. లేకున్న ఇంటికి ఎప్పుడో వచ్చియుందుము. క్షమింపుము.

గౌరీ:—ఇప్పటికైన తీరిక అయినదికదా? ప్రియంవదా! మీతల్లి నీకోసము ఎంత ఆత్రపడుచుండునో! అమ్మా, రాపోదము. (రెండు బిందెలు చూచి) ఇంత పెద్దబిందెలు పసిపిల్లలు మీ రెట్లు మోయగలరే? మీ అంతట మీరు ఇంటికిపదండి. నేను నీరు తీసికొని వచ్చెదను. (చంక నొకబిందె, నెత్తిన ఒకబిందె పెట్టుకొని నీటికై ప్రవాహము సమీపించును. స్నేహలతా ప్రియంవదలు ఇంటిత్రోవ పట్టెదరు.)

* * *

స్నేహ:—ప్రియా! మనకు ఈ దివ్యనదీపునర్దర్శన మెన్నడే?

ప్రియ:—ఎన్నడో అపెదవేలనే, రేపు నీ పెండ్లిలో వసంతములాడుట ఈతీరముననే కదేమే?

(స్నేహలత 'పెండ్లి'మాట విని తలవంచుకొనును).

ప్రియ:—ఏమిసిగ్గే! ఇంక మొగునిముందట మేము అగపడెదమా? అప్పుడు నన్నుకూడ ఒకకంట చూడవే.

స్నేహ:—ఈమాటల కేమికాని, తొందరగ నడు. అదిగో అమ్మ వచ్చుచున్నది. మన అధిక ప్రసంగము విన్నదా నవ్వుకొనుచు

## మూడవ రంగము

[హరశర్మ, గౌరీదేవి ప్రవేశము]

హర:—దేవీ! తిరిగి తిరిగి కాళ్లు కాయలు కాసినవి. కాని ఫలములేనట్లున్నది.

గౌరీ:—స్వామీ! దైవమంత నిర్దయవహించునా?

హర:—ఏమో ఎట్లు చెప్పగలము! ఎక్కడ వెదకినను వేయిరూపాయలకు తక్కువ వరశుల్కమడుగువాడు లేనేలేడు. మనమా నిరుపేదలము, వేలు లక్షలు ఎక్కడ తెచ్చిపెట్టగలము? పెండ్లిగాకున్న సంఘ మేమనును? పవిత్రమైన వంశమునకు కళంకము కలుగుచు. ఇంక బ్రదికి ఏమిప్రయోజనము? ఏది తోపకున్నది.

గౌరీ:—స్వామీ! ఇదిగో నాసొమ్ములు. వీని నమ్ముడు. పైకము చాలకున్న మనకు రెండెకరముల భూమి యున్నదికదా! దానినికూడ నమ్ముడు. ఎట్లైనను మనము స్నేహలతను ఒక అయ్యకు అప్పగింపక తప్పదుకదా? అవల మన కేమి కావలసినది? వాడవాడలఁ దిరిగిన పట్టెడన్నము దొరకదా? మన బిడ్డ సుఖముగనున్న అదే పదివేలు. మనము బిచ్చమెత్తియైన పొట్ట పోసికొనవచ్చును.

స్నేహలత (తలుపుచాటునుండి యంతయు వినుచుండును. తనలో) అబ్బా! ఎంతపాపిని! తల్లిదండ్రుల కడకు మృత్యువునైతిని కదా? ఇంక నా జీవితమెందుకు? కాల్పనా? కడుపారకన్న తల్లిదండ్రులకు హృదయములందు కుంపటి రగులపెట్టిన పుత్రికకు

ఏమి శిక్ష విధింతువో స్వామీ?......నాగుండె పగులును. ఇంక వీరి సంభాషణము వినలేను. (నిష్క్రమించును.)

## నాలుగవ రంగము

[అర్ధరాత్రి. స్నేహలతకు నిదురపట్టుటలేదు. పెరటిలోనున్న బృందావనముకడకు పోవును. దగ్గరనే ఒక తైలవస్త్రము. తులసియొద్ద దీపము వెలుగుచుండును.]

స్నేహలత (తులసి కంజలి ఘటించి) జననీ! అనాథను; ఎట్లు చూచుకొందువో!! (తైలవస్త్రము దాల్చి నిప్పంటించుకొనును.)

* * *

[తెల్లవారును. గౌరీదేవి హరశర్మ నిద్రలోనుందురు. ఎప్పటియట్లు ప్రియంవద వారి ఇంటికి వచ్చును.]

ప్రియ:—లతా! లతా! ఎక్కడ ఉన్నావే? శుక్రవారమునాడుకూడ మొద్దునిద్దరేనా?......... ఏమిది, స్నేహలత మాట వినబడదు. ఎక్కడ ఉన్నదో? (ఇల్లంతయు వెదకును; తుదకు పెరటిలోనికి పోవును.)

ప్రియ:—లతా! ఎక్కడివీ అస్థులు? ఏమిటీ బూడిద? అబ్బా! ఎంత భయంకరదృశ్యము! నా స్నేహలత కేమియు అపాయములేదు కదా? పట్టిది; ఇది అమంగళపు తలంపు......అదిగో! ఆ కాగితము ఏమిటో!! (బృందావనముకడ పడియున్న కాగితము తీసికొనును.)

ప్రియ:—(కాగితముపైని అక్షరముల చూచి) ఇవి నా స్నేహలత అక్షరములవలెనున్నవే! ఏదో ఉత్తరము కాబోలు! నే నన్నదానికి ప్రాణము. కనుక దీనిని చదివినప్పటికి నన్నేమనదు. (కాగితము మడతతీసి చదువును.)

"పూజ్యుడగు జనకుని పాదపద్మములకు సాష్టాంగములు. తండ్రీ! ఒక్క నాకొఱకు నీ విట్లుచేయవలెనా? తగదు. నీవు, అమ్మ తిండిలేక, తల దాచుకొనుటకు కొంపలేక, పడరానిపాట్లు పడుచుండ నాకుమాత్రము సౌఖ్యముండునని భ్రమించితివా? ఇన్నాళ్లు నన్ను అల్లారుముద్దుగ పెంచితిరి. విద్య నేర్పితిరి. అప్పుడప్పుడు నాకై మీ సౌఖ్యమును గూడచంపుకొనుచుంటిరి. అన్నిటికిని కృతజ్ఞను. కాని ఎంతోకాలము మిమ్ములను చూచి సంతోషపడగలనని ఉవ్విళ్లూరితిని. దేవునికి దయ తప్పినది. తండ్రీ! మొన్న ఎండప్రొద్దున ఊరూరు తిరిగి వృథాప్రయాసమునక ఇల్లు చేరితివి. అప్పటి నీ దైన్యపుముఖము. అబ్బా! నన్ను మాటిమాటికి కలత పెట్టుచున్నది. బ్రదుకుపై రోతపుట్టించినది. ఇట్లు మీవంశమును నాశనము చేయుటకు నీ కూతురు రాక్షసి యనుకొంటివా? ఎంత వెఱ్ఱివాడవయ్యా!......అంతటి నీచకార్యమునకు ఒప్పుకొని మన వంశమునకు కళంకము తెచ్చితివి. సకల వేద వేదాంగ వేత్తవు. అన్నిటను సమర్థుడవు. నీవంటివాడు చేయవలసిన పని ఇదేనా? ఇట్లంటినని నీకూతురిపై కోపింపకు. ఉన్న దున్నట్లంటిని. తప్పైన క్షమింపుము. తండ్రీ! ఇంక సెలవు. అదిగో దేవతాంగనలు స్వాగతగీతి పాడుచున్నారు. అమ్మా! నా కడసారి సాష్టాంగములు. తండ్రీ! నాకడసారి సాష్టాంగములు; నా ప్రియంవదకు కడసారి ముద్దులు. నా చావుమాట విని, పాపము ప్రియంవద ఎంత విలపించునో!...... తండ్రీ! నా తుదికోర్కె తీర్పుము. మీ కన్నీటకడిగి నాయస్థులు గంగలో కలుపుడు. అప్పుడు నా ఆత్మ శాంతించును.

ఇట్లు
నీ అభాగ్యదుహిత
స్నేహలత.

లతా!......లతా! ఇంకెక్కడి లత? పూయకముందే తెగిపోతివా నా స్నేహలతా!......అక్కా! ......అక్కా! (మూర్ఛిల్లును). *

* ఇది కథగాదు. శ్రవణపాతమైన ఒక యుదంతము.

# లేఖ

శ్రీమతి సి. వి. రమణమ్మగారు

కమలకు:—

ఎన్నిరోజులనుంచో నీకు ఉత్తరం వ్రాయాలని; కాని పనితొందరవల్ల పడడంలేదు. ఇవ్వేళ సావకాశంగా కూర్చొని వ్రాద్దామనుకున్నాను.

నీవు మాఇంటి ప్రక్కనున్న సుబ్బును ఎరుగుదువుకదూ; ఆసన్నటి పొడుగాటి అమ్మాయి? చిన్నతనంలో నిన్నూ నన్నూ చూచి "మీరు కేమమ్మా బాగా చదువుకుంటారు" అని అంటూ తన దౌర్భాగ్యానికి తానే చింతిస్తూ మనవైపు విచారంగా చూచేది. ఈనాడు తలచుకుంటే కమలంలా నవకోమలమైన స్త్రీ హృదయాన్ని భేదించగల ఆనాటి చూపులైనా జ్ఞాపకం రాక మానవు నీకు.

అలాటి అమాయకురాలు అతి కష్టం మీద సంసారసాగరాన్ని ఈదుతూ భాధపడుతూ ఉంటే చూడడానికి నాగుండె తరుక్కుపోతుంది. ఆవిడకు అందులో ఇద్దరు ముగ్గురు పిల్లలు. ఆ అల్పవయస్సులో వాళ్ల కందరకూ చాకిరీచేస్తూ విసుగుకుంటూ ఉన్నప్పుడు ఆవిడ జీవితంలో కాంతి, వెలుగు మాయమైపోయి సర్వము అంధకారమయమైనట్టు భావిస్తుంది. నిరాశ ఆవిడ ముఖాన ప్రళయ తాండవముచేస్తూ ఉంటుంది.

పాపం ఆపిల్లలు గాలికి పెరుగుతున్నారు. అందులో పెద్దకుఱ్ఱవాడికి ఆరు ఏడు ఏళ్లుంటాయి. ఆవయస్సులో విషయ సంగ్రహణం కోసరం బాలహృదయం ఎంత కుతూహలపడుతుందో ఎంత పరితపిస్తుందో నీవు ఊహించుకోగలవు అని అనుకుంటాను. అతను అలా తల్లిని విసిగిస్తుంటే అబ్బ ఎన్ని దెబ్బలు కొడుతుంది. ఎంతో ఆనందంగా నిర్విచారంగా ఆటలాడుకొనేవాడు అతను. ఇప్పుడు చూస్తే అతని కళ్లల్లోవిరక్తి జీవితంమీద లెక్కలేనితనమూ కన్పిస్తూనే ఉంటాయి. ప్రొద్దున్న వెళ్లి కాయకష్టంచేసి రాత్రి పిల్లలందరూ పడుకున్నతరువాతగాని రాడు వాళ్లనాయన. ఇలాటి సమయంలో ఆపిల్లలు ఏంచేస్తారు? ఏడుపు మరచిపోయేవరకు ఏడుస్తారు. కొంతసేపటికి మళ్లీ రంగంలోకి దూకుతారు. అన్నీ మళ్లీ మామూలే.

ఆకుఱ్ఱవాడిపేరు రాము. ఒకరోజున నేను చూస్తూనే ఉన్నాను. వాళ్లింటి అరుగుమీద చేతిలో ఒక బెత్తం పట్టుకొని కూర్చుని ఉన్నాడు. ఆ ప్రాంత్యాలంతా శుభ్రం చేసికొన్నట్టున్నాడు. ఎక్కడికో బయలుదేరుతూ "ఎవరూ కూర్చోకూడదిక్కడ. కూర్చుంటేనా........." అని కళ్లెఱ్ఱచేస్తూ బెత్తం తనస్థలంలో ఉంచాడు. కొంతసేపటికి ప్రక్కింటి సీత వచ్చి పంతానికి అక్కడే కూర్చుంది. "సీతా, నా స్థలమది. బెత్తం పెట్టుకున్నానమ్మాయ్" అంటూ వచ్చాడు రాము. ఆ అమ్మాయి లేవలేదు; పైగా ఆ బెత్తాన్ని క్రింద పారవేసింది. అత

నీక సహించలేక "లేస్తావా, లేవవా?" అంటూ ఉగ్రుడైపోయాడు. "సరేలే, నే లేవేలే"నని మూతిబిగించుకొని కూర్చుంది సీతి. రెండు చేతులుపట్టుకొని ఒక బంతిని గిరవాటువేసినట్టు గిరవాటువేసేశాడు ఆ అమ్మాయిని. ఆ అమ్మాయి పెద్దగా ఏడుస్తుంటే ఆ అమ్మాయి అన్నయ్యట, ఏడు ఏళ్లుంటాయి, రాముమీద కలబడసాగేడు. పాపం, "నే నూరకే కొట్టలేదోయి, నా స్థలం తీసికొంది" అంటూ శాంతంగా చెప్పేడు రాము. అతను మీదమీదకు వచ్చి కొట్టసాగేడు. ఆ దెబ్బలాటలో ఆ కుఱ్ఱవాడితొడ కొరికివేశాడట. "అమ్మో, అమ్మో" అంటూ బిగ్గరగా ఏడుస్తూ పరుగులెత్తసాగేడు ఆ కుఱ్ఱాడు. ఆ కుఱ్ఱవాడితల్లి వీధికెక్కి రామును అతని తల్లిదండ్రులను తన ఇష్టమువచ్చినట్టు తిట్టసాగింది. రాము తల్లి సుబ్బు భరించలేక ఆనాడు రామును కొట్టిన దెబ్బలు తలచుకుంటే ఏనాటికైనా అనవసరంగా దెబ్బలు తింటూ ఏకధారగా కన్నీళ్లు కారుస్తూ నిలబడే రాము, విద్యావిహీనురాలైన అతని తల్లి నా కళ్లముందు ప్రత్యక్షమవుతారు.

ఇదంతా నీ కెందుకు వ్రాస్తున్నానంటే మన యీ హిందూసంఘంలో భారతస్త్రీ పిల్లల్ని సరిగా పెంచడంచేతకాక ఏవిధంగా తన మాతృత్వాన్ని సతీత్వాన్ని నాశనం చేసుకుంటుందో నీకు తెలియచేయాలని.

ఇంకొకరోజున ఏమైందో తెలుసా? మా ఇంటిప్రక్క పెద్దనూతిమీద రాము నిలబడ్డాడు; ఇటు అటూ చూస్తున్నాడు. నాకేమిటో రాము నూతిలో దూకడానికి సంకోచిస్తూ ఉన్నాడా అని అపరిమితమైన భయంవేసింది. వెంటనే వెనుకగుండా వెళ్లి అతని కుడిచేయి పట్టుకున్నాను. నేనే కొంచెం ఆలస్యంగా వెళ్లినట్లయితే ఇంకొక క్షణంలో రాము నూతిలో ఉండేవాడు. "నన్నెందుకు పట్టుకున్నారు?" అని ఏడవడం మొదలుపెట్టేడు. అతనిని చూస్తే ఎంతో జాలివేసింది. బాలుడు అలా పసితనంలో జీవితంలో మాధుర్యంలేనట్టు ఆత్మహత్య చేసికోవాలని ప్రయత్నిస్తుంటే కళ్లారచూచి ఎంత కఠినమనస్కురాలైనా కన్నీళ్లు కార్చకుండా ఉంటుందా? మొహం చేతులూ కడిగి "రామూ, అలాదూకితే చచ్చిపోరూ?" అన్నాను. అతని కళ్లవెంట అశ్రువులు ఏకధారగా కారిపోతున్నాయి. నేనేమీచేయలేక అలా అతన్ని కౌగలించుకొని "నీకు తెలియదు రామూ, నాప్రాణం నీవు......అలాదూకితే..." ఏడ్చాను. ఈ అనుభవాలన్నీ తలపుకు తెచ్చుకుంటే పొంగి పొరలివస్తుంది మరల దుఃఖము నాకు. "నూతిలోనన్నాపడి చావు వెధవా, పీడన్నా వదులుతుంది" అని వాళ్లమ్మ ఎన్నో దెబ్బలు కొట్టిందట. వాళ్ల నాన్నగారితో చెప్పితే ఇంకా కొట్టేరట. ఇదంతా ఎందుకంటే ఎవరో కుఱ్ఱవాడు తన్ను కొడ్తే తను తిరిగి కొట్టినందుకు. ఈ సంగతంతా చెప్పి ఎంతో ఏడ్చాడు. పాపం. "నేనున్నానుకదూ నీకు. వాళ్లంతా నిన్నలాగే

చూస్తారు. నీవు నాదగ్గిరకురా రోజూ" అని బుజ్జగించి పంపేను. అప్పటినుంచి నా మాట తీయ డతను. వాళ్లమ్మా వాళ్లు "ఎవరినీ కొట్టవేరా రామూ?" అంటే, "అమ్మా, పిన్నికి కష్టంగా ఉంటుంది" అంటాడట. అలా మారిపోయాడతను.

ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే రాముతప్పు శారీరకంకాదని అది మానసికమని గ్రహించగల శక్తి ఆ అజ్ఞానులైన తల్లిదండ్రులకు లేదని వ్రాయడానికి. ప్రేమకోసరం, ఆదరణకోసరం ఎంత తహతహలాడిందో ఆ చిన్నిమనస్సు వాళ్లకు తెలియదు. శరీరాన్ని శిక్షించి మనస్సును ఆత్మను బాగుచేద్దా మనుకుంటారు. వీర్లు చివరకు మనస్సును క్షీణింపచేసి నాశనం చేసేస్తారు. ప్రేమకై ఆర్చి ఆర్చి తల్లులయొక్క ఆదరణ లేక వెఱ్ఱిగా తిరిగి వాళ్లలో ఎంతమందిని మనం ఎరుగం? ఏప్రేమకోసరం ఆపిల్లలు పరితపిస్తారో ఆప్రేమను మనము ప్రసాదించగలిగితే వాళ్లు ఎంతో ఉపయోగానికి వస్తారని వీళ్లకు తెలియకపోవడం చాలా హేయం.

ఇప్పుడు నాకు ఆశ్చర్యం వేస్తుంది, రాముమార్పునుగురించి ఆలోచిస్తే. పాపం, తండ్రి పగలంతా కష్టపడి, చెమటలు ఓడ్చి పిల్లలు పడుకున్న తర్వాత గాని ఇంటికి చేరడు; వాళ్లను అతను ఆదరించడానికి సావకాశమేలేదు. విసుగులో మునిగి తేలే ఆతల్లి పిల్లల్ని కొట్టడంతప్ప ఇంకోటి ఎరుగదు. ఇంకేమవుతుంది. ఆ పిల్లల బ్రదుకు ఏసుఖమెరుగక ఎండిపోక? ఇదే వాళ్ల విరక్తికి లెక్కలేనితనానికి కారణం. ఇది గ్రహించలేకపోయింది సుబ్బు. సుబ్బు ఏమిటి? ఇలా ఎంతమంది చేయడంలేదని నీ ఉద్దేశ్యము?

ఇప్పటికైనా, ఈ నా అనుభవాలన్నీ తలపుకు తెచ్చుకొని కొంతమంది కాకపోతే కొంతమంది అయినా భారతస్త్రీలు బాగుపడవలెనని నాకోరిక. ఈ ఉద్దేశ్యముతోనే నేను నీకు యీ ఉత్తరం వ్రాయుచుం.

ఈవిషయం నీ వెరుగున్నవాళ్ల కందరకూ తెలియచేయి. సంఘంలో అన్యాయాలని మనకు తెలియక ఎంతమంది జీవితాలని నాశనం చేస్తున్నామో నీవు ఊహించుకోగలవా? ఆవిషయాలన్నీ ఇంకో ఉత్తరంలో.

నిన్ను సదాప్రేమించే
"మణి."

# దినచర్య

*
* *

శ్రీ కె. వి. రావుగారు ఎం. ఏ.

ఇంటి దగ్గరందరూ కులాసాగాయున్నారా? కాళ్లు కడుగుకోండి" అంటూ మా అత్తగారు తలుపు చాటు నుండి అప్పుడేవచ్చి కుర్చీలో కూచోబోతూ ఉన్న నన్నుయోగ క్షేమాలు అడుగుట మొదలు పెట్టినారు. అప్పుడే సాయంత్రం ఆరున్నర అవుతుంది; 5 గంటలకు రావలసినరైలు ఒకగంట ఆలస్యం. పెండ్లి అయినప్పటి నుంచీ నేను తలచువస్తున్నా. ఎదురగా నిలబడి మాట్లాడడానికి ఆవిడకూసిగ్గే నాకూసిగ్గే—ఆవిడ మొగం ఏలా ఉంటుందో యిప్పటికి నాకు తెలియదు. తలయెత్తిమాట్లాడలేనుగా నేను. మా అత్తవారు నన్ను పిలుచుటగాని, ఫలానా అప్పుడు వస్తున్నానని నేను ముందు వ్రాయుటగాని మాకు అలవాటులేదు. అందుచేత ఆదినం వస్తానని ఆవిడకు తెలియదు. "ఎసరు కాగింది వస్తాను"అని 'జానకీ' అని పిలచి ఆవిడ లోపలకు వెళ్లినారు.

ఇంతలో మా మరదలువచ్చి "జానకక్కయ్య లోపలుంది రా"అని చేయిపట్టుకొని గదిలోపలికి తీసుకొని వెళ్లింది. అంతఃపురప్రవేశం అయిన 5 నిముషాలలో మాజానీ—మా ఆవిడ ముద్దుపేరులెండి—వేడి వేడి ఓవల్‌టిన్‌తో ప్రవేశించింది. మరి పది నిముషాలకు మా పెద్ద మరదలువచ్చి"బావా నీళ్లుకాగినాయట స్నానం చెయ్యవచ్చును"అంది. స్నానానంతరం మా చిన్నబావమరిదివచ్చి "బావా, బావా, మరేం, నాన్నగారు వచ్చేటప్పటికి ఆలస్యం అవుతుందిట. అమ్మ మనల్ని భోజనం చేయమంటోంది"అన్నాడు భోజనానంతరం కాస్సేపు దగ్గరచేరిన మా బావమరదులకు మరదలకూ కథ చెప్తుంటే, సరిగా ఆకథ అయ్యేసరికి వాళ్లకు లోపలనుంచి కబురు సావిట్లో చదువుకోమని—మా అత్తగారికి తెలుసు, కొంత కాలానికి కలుసుకొన్న భార్యాభర్తలు ఏకాంతం అభిలషిస్తారని.

మా అత్తగారినిచూస్తే నాకు భక్తి, గౌరవం, ఆశ్చర్యం. ఆవిడపనిలోచాకచక్యం, ఇంటిలోపొదుపు, ఇతరుల మనస్సులలో విషయాలు త్రుటిలో గ్రహించుట ఆవిడవినయం ఇవన్నీ నాకాశ్చర్యం కలిగిస్తాయి. వచ్చేనో లేదో అంతలో ఫలహారం అంతలో స్నానం, భోజనం, ఆవిడంత చురుకుగా పనిచేసేవాళ్లను చూడలేదు. అల్లుళ్ల విషయంలో అత్తలందరూ యీలాగే ఉంటారంటారేమో. ఆసంగతటుంచి మా అత్తగారు అన్ని విషయాలలోనూ అజే నేర్పూ, ఓర్పూ, తెలివీ, చాకచక్యం చూపిస్తారు.

ప్రొద్దున్నే 5 గంటలకు దాసీ వస్తుంది. అప్పుడే ఆవిడాలేచి యింటిపని దగ్గరఉండి చేయిస్తూ తనపని తను చూచుకుంటూ దైనిక జీవితం మొదలుపెడ్తుంది. మా అత్తవారు అంత శ్రీమంతులు కారుకాని ఏదో లోటులేకుండగా బాగానేఉంది. మామగారికి గవర్నమెంటులో ఒకచిన్న ఉద్యోగం కనుక ఆవిడకూడా ఏదో సాధారణ గృహిణివలె కొద్దో గొప్పోపనులు చేయవలెగదా! ఇంతలో ఆఖరు అబ్బాయి,అమ్మాయి-యిద్దరూ ఒకేమంచంమీద పడక-తగవు ప్రారంభించినారు. స్థలం కోసం అది కొంచెం ఎక్కువఅయి గుద్దులాటలలోకి దిగింది. ఆవిడ ఎప్పుడు విందో తక్షణం గబగబావచ్చి "అల్లరి చెయ్యకమ్మా, నాన్నగారు లేస్తారు. నువ్వుండమ్మా మంచివానవుకదూ, నువ్వు నామంచంమీద పడుకో."అని వాళ్లను సముదాయించి వాళ్లు పారవైచిన తలగడాలు మరలచేర్చి ఆలా వెళ్లిందో లేదో యింతలో చంటిపిల్ల ఏడుపు ప్రారంభించింది. పాపం ఆవిడ మళ్లావచ్చి పాలిచ్చి సముదాయిస్తూనే "జానీ కాఫీపొడుము వెయ్యమ్మా, నీళ్లు యీపాటికి కాగి ఉంటాయి"అంది. ఈ ఆడవాళ్ళకు అద్భుతమైన తెలివి తేటలు యిచ్చేడు భగవంతుడు. వాళ్లు వంటచేస్తూ పిల్లాడిమీద కూడా ధ్యానం; పిల్లాడ్ని ఒకమూల సముదాయిస్తూంటే కాఫీ

సంగతి జ్ఞాపకం; మరి పదినిముషాలలో నాకూ మామ గారికి (Bed-coffee) తయారు.

"లేవరా రామూ, 7 గంటలు అయిపోయింది అందరూ స్కూలుకు వెళ్తున్నారు. వేళయింది" అంటూ పెద్దబ్బాయిని లేపి—మా పెద్దబావమరది ఘస్తుఘారం చదువుచున్నాడు ప్రొద్దున్నే నిద్దరలేవడంలో అతనికి అంతగా నమ్మకంలేదు—ఆ అఖరుప్రక్క ఎత్తే యింతలో "చూడవే అమ్మా నేను పేడపట్టి పళ్లుతోము కుంటున్నానుట చిన్నక్కయ్య అంటూంది" అంటూ బుల్లి బావమరది సగంకడిగిన ముఖం చేతిలో కచ్చికా తయ్యారు మా మఱదలకు కచ్చిక పనికిరాదు—అది పేడనుంచి చేస్తారుట—నంజన్ గూడ్ పొడరుపట్టి మొగం కడుగుకుంది "లేదమ్మా అది యిటిక పొడుము ఉపయోగిస్తోంది. కచ్చికేమంచిది" అని సముదాయిస్తే ఇద్దరూ నాది మంచిది నా మంచిదంటూ మరల మొగము కడుగుట ప్రారంభించినారు. "నాది పేడలో నుంచి చేసారు. భూదేవి మంచిది మనకు వళ్లుయిస్తుంది" అంది. మరదలు "పేడ ఆవులోంచివస్తుంది. ఆవు మంచిది 'ఆవు పాలనిచ్చును' అని పాఠం వప్పగించినాడు బావ మరది. "కాదు పుడక మంచిది మామాష్టరుగారు చెప్పి నారు" అంటూ కళ్లు నులుపుకుంటూ పుడక నములుతూ అప్పుడే లేచిన రామూ ప్రవేశించినాడు "అయ్యో మాష్టారంటే జ్ఞాపకం వచ్చింది లెఖలు చెయ్యా" లంటూ మరదలు పారిపోయింది తుర్రున లోపలకి.

"నీళ్లకు ఎవరు ముందువస్తారో వాళ్లు నాబంగారు తండ్రులు" అంటూ యింతలో అత్తగారిమాట; నేనంటే నేనని పట్టాళ్లిద్దరూ సిద్ధం. వాళ్లిద్దరకూ నీళ్లుపోసి "జానకీ చెల్లాయేదే" అన్నారు. మా మఱదలు యింకా లెఖలు చేస్తూనేఉంది "రావే 7 గంటలు అవ్వస్తోంది" అని అమ్మఅంటే "అబ్బా లెఖలు చెయ్యాలి బాబూ నేను 10 గంటలకు స్నానంచేస్తానే" అంటూ విసుక్కుం టోంది చిన్నమఱదలు. అంతలో అన్నాలహోడావిడి; మగపిల్లలిద్దరూ కూర్చున్నారు. మఱదలు వెళ్లలేదు.

"పోనీ అన్నమన్నా తినవే మాయదారి లెఖలు" అంటే చివరకు చిత్తుపుస్తకం పెన్సల్ తాను తయార యింది మఱదలు. నెమ్మదిగా తింటూఉన్నారు.

"అమ్మా పెరుగు" అన్నాడు పెద్దవాడు.

"అమ్మా నాలుగుఏళ్లు ఎంతే" అని అడుగుతోంది చిన్నమరదలు అన్నంతింటోనే లెఖలు చేస్తోంది.

"వస్తున్నా, 28" అంటూ యిద్దరకూ సమాధానం చెప్తు ఉట్టిమీద పెరుగుగిన్నె తీస్తున్నారు ఆవిడ.

"7½ అయింది త్వరగా పొయ్యవే దానికి లెఖలు తరువాత చెప్తువు గాని."

"మరే నిన్ను 7 గంటలకు లేవమన్నారు గాబోలు."

"దాన్ని రాత్రి చెయ్యవద్దాన్నారు గాబోలు."

"మరి రాత్రి బావ రాలేదేమిటి?" అని మరదలు వంక చెప్పింది.

ఇంతలో "అమ్మా పాలు తియ్యండి." అంటూ వకరూ "అంట్లు తియ్యండి" అంటూ వకరు "వంకా యలు వచ్చేయి కావాలా" అంటూ మామగారికి అన్నాలుపెడ్తూ అందరకూ సమాధానం చెప్తూనే ఉన్నారు ఆవిడగారు గృహలక్ష్ములు అష్టావధానం చెయ్యాలిగదా యీవిషయాల్లో.

అమ్మాయీ పెద్దవాడూ తిన్నారు గాని చిన్న వాడు యింకా ఆవకాయకలుపుతున్నాడు. "అదేమి టిరా త్వరగా తిను మరి" అంది అమ్మ "త్వరగా తిన కూడదు బాగా నమిలితినమన్నారు మా మాష్టరుగారు" అని అతని జవాబు. పని తొందరలో అతనికి నమ్మకం లేదు. అన్నిపనులూ సావకాశంగా చేస్తాడు. "అమ్మ మేం వెడ్తున్నాం టైంఅయింది తమ్ముడికోసం ఉండం" అని ఒక్కపరుగులో వెళ్లినారు స్కూలుకు పిల్ల లిద్దరునూ. "ఉండరా నేనయినా తినిపిస్తాను" అని కూర్చొని తినుపిస్తూంటే గిన్నెచప్పుడు "అమ్మాయీ జానకీ, పాలగిన్ని తియ్యమ్మ పాడుపిల్లి వస్తోంది... ఉప్మా నీళ్లు మరిగినాయేమోచూడు" అంటూ అన్నం

తినిపించి పిల్లవాడికి మంచిబట్టలు తొడుగుతూ "రామం ఆవర్తతోనే స్కూలుకు వెళ్లినాడు గాబోలు చెప్మా" అనుకుంటూ దానీ దాన్నిచ్చి పిల్లాడిని స్కూలుకు పంపించింది ఆయిల్లాలు. ఇది ఆవిడ టైం టేబిల్లో ఫస్టుపీరేడు.

కొంత హడావిడి తగ్గింది; ఇంతవరకూ చంటిపిల్ల లేవలేదు. ఒకసారి వెళ్లిచూచి ఉప్మా కాఫీ మామ గారికిచ్చి నాకు పంపించి తను జడవేసుకొని జావకికి వేసి స్నానానికి వెళ్లేసరికి ఎనిమిదన్నర అయింది. ఒక గంటలో వంట కావాలి. మామగారు కచేరికి వెళ్లాలి. గబగబా చేస్తోంది "అది ఎంతకూ ఉడకదమ్మా యీ పాడు దుంపలు; పాపం! ఎప్పుడూ ఆయనకు హడావిడి భోజనమే. ప్రొద్దున్న సావకాశం ఎప్పుడూ పెట్టనే లేదమ్మా" అని తనలో తనను నిందించుకుంటూనే పప్పు, కూరా, పచ్చడి, పులుసుచేసి మామగారికి భోజనంపెట్టి, దగ్గరకూర్చొని అన్నం చల్లారేవరకూ విసరి భోజనం అవగానే తమలపాకులు చుట్టియిచ్చి పెట్టెలో చాకింటిబట్టలు యిచ్చి ఆయనను గుమ్మం వరకూ సాగనంపి మరల వంటయింటిలో ప్రవేశించే టప్పటికి పదిగంటలు అయింది ఇది రెండవ పీరేడు.

నేనప్పుడు ఉదయం భోజనం మామగారితో చెయ్యలేదు "ఈ హడావిడ భోజనం అతనికికూడా ఎందుకే? కాస్సేపుండి సావకాశంగా యిద్దరూ తిందురుగాని" అని కూతురుతో చెప్పుతుంది ఆవిడ. పైగా నేను సావకాశంగా లేచి స్నానంచేసి ఫలహారం చేసేసరికి మామగారి భోజనవేళ అవుతుంది—అత్తవారిల్లు గదా నాకు.

మరల నాకోసంగా ప్రత్యేకం ఒక వేపుడుకూర చేసి పీటలు వేసేసరికి మరల పదిన్నర అవుటబట్టి పిల్లలు తయ్యారు. మరల యిల్లు కలకలలాడుతోంది. "అమ్మోయ్ ఇవ్వాళ లెఖలు చెయ్యలేదని ఒక తాయి లారుని మాష్టారు తిట్టేరేవ్" అన్నాడు చిన్నాడు. "ఆలస్యంగా వచ్చినందుకు మనకు మాత్రం తగలలేదు లావుంది" అని రెట్టించింది అమ్మాయి. దానిచేత స్నానంచేయించి మాకందరకూ అన్నాలు పెట్టేసరికి పదకొండు దాటింది. "బావదగ్గర నేను కూర్చోవాలి" అని వాళ్లలోవాళ్లకు తగవు. ఒక ప్రక్కని పూటకు ఒకరు కూర్చోడానికి సమాధానం చేసింది ఆవిడ.

"రెండో ప్రక్కో" అంది పురదలు.

"అక్కయ్య."

"అయితే అమ్మా, అక్కయ్యకు బావ ఏమి అవుతాడే" అని చిన్నవాడి సందేహం!

"అదేమిటోయ్ అన్నీ ఆలా గగబెట్టుతున్నావు. సహించడంలేదా ఏమిటి? నాకు వంట చేతగాదమ్మా" అంటూ వద్దంటూఉన్నా అన్ని ఎక్కువ వడ్డిస్తూ ఉంటారు.

భోజనాలు అవగానే—పదకుండున్నర దాటింది. ఆవిడకూడా భోజనంచేసేసరికి పాపం పన్నెండు అవ వచ్చింది. అప్పుడప్పుడు ఒకసారివెళ్లి చూస్తూఉన్నా పాపం, చంటిపిల్లని కాస్తసముదాయించటానికి తీరుబడి లేదావిడకు. అప్పుడు వెళ్లి పిల్లదగ్గర పరుండేసరికి "అమ్మా చూడవే నాపలక పుల్ల అక్కయ్య ఎక్కడో పారేసింది" "లేకపోతే నాపుస్తకం ఎందుకు ముట్టుకోవాలి వద్దంటోంటే" అని చిన్నచిన్న తగవులు తీర్చే సరికి ఒంటిగంటన్నర అయింది. పిల్లలకు తలలుదువ్వి రామానికి క్రొత్తషర్టుతొడగి వాళ్లను బడికి పంపించి "అయ్యో బండ్రోతువచ్చే వేళఅయింది" అంటూ దబ్బున కాఫీపెట్టి టిఫిన్ చేసి వచ్చినబండ్రోతుచేత మామగారికి ఫలహారం పంపేసరికి రెండుగంటలు అయ్యింది. మరల హడావిడి తగ్గింది. ఇది ఆవిడ దినచర్యలో మూడవభాగం.

కాస్సేపు విశ్రాంతి. చంటిపిల్లను ప్రక్కలో వేసు గొని కొంచెంసేపు నిద్రపోయిందో లేదో యింతలో "అమ్మగారూ ఉత్తరం" అంటూ తపాలబండ్రోతు పాపం నిద్రాభంగంచేసేడు. "అయ్యో అప్పుడే మూడు అయింది గాబోలు ఎంతసేపు నిద్రపోయానో జానకీ మీ ఆయనకు ఫలహారం యియ్యవే" అంటూ

లేచింది. ఎప్పుడు చేసేదో లేక బజారునుంచి తెప్పించారో, నాకు మాత్రం మంచి ఫలహారం దొరికింది. "మీ ఆయన వింటారు ఫిడేల్ మీద రెండుపాటలు పాడవే" అని జానకికి సలహానిచ్చి ఆవిడ మరల దినచర్య ప్రారంభించింది.

పిల్లల చొక్కాలకు బొత్తములుకుట్టుట చంటిపిల్లకు ఊలుస్టాకింగులో భర్తకు జేబు రుమాలుమీద రంగులతలు కుట్టుట మొదలగు పనులతో కూర్చుంటే నాలుగు గంటలు అయింది "పిల్లలువచ్చే వేళయింది ఏమయిననా పెట్టమంటారు" అంటూ హడావిడిగా కొబ్బరికాయలుకొట్టి బాగుగా కోరుచేసి పంచదార చల్లి మూడు వెండిపళ్లెములలో సిద్ధంగా ఉంచేసరికి బడినుండి పిల్లలువచ్చి ఫలహారంచేసి, పెద్దవాడు బంతి ఆటకు వెళ్లేడు. చిన్నవాళ్లిద్దరూ కేరమ్స్ ఆడుతున్నారు. యింట్లో చంటిపిల్ల ఏడుస్తోంది. నేను షికారు వెళ్లేను. ఐదుగంటలకు ఆవిడ మడిగట్టుకొనుటకు సిద్ధముగా యున్నారు. ఇది నాలుగవభాగం.

ఆరున్నర గంటలకు మరల నేను యింటికి వచ్చేసరికి మామగారు పేపరు చదువుతున్నారు. పిల్లలెవ్వరూ కనుపించలేదు. మా ఆవిడమాత్రం మందహాసం చేస్తూవచ్చింది. "పిల్లలేరి" అని అడిగినాను. "భోజనం చేస్తున్నారు." "అప్పుడేనా" "అవును సాయంత్రం మా అమ్మ వాళ్లందరకూ కలిపితినిపిస్తుంది."

"నాక్కూడా కలిపి తినుపించగూడదు నువ్వు?"

"పాపం! మీరు బొత్తిగా చిన్నపిల్లలు. ఎత్తుకొని తినిపించాలిగూడాను" అంటూ మాజానీ నాస్నానానికి సబ్బు తువ్వాలు పట్టుకొని వెళ్లింది.

రాత్రి భోజనానికి నేనూ, మామగారు జానీ మాత్రమే. నేను లేకపోతే జానీకికూడా ముందర పెట్టేసి భార్యా భర్తలు కూర్చుంటారుట. భోజనం దగ్గర మామగారితో మాట్లాడే విషయాలు నాకంతగా కనుపించలేదు. అందరి భోజనాలు అయ్యేసరికి ఎనిమిది గంటలు అయినది. ఇంతలో పిల్లలు చదువు చాలించి మంచాలకోసం తగవులాడుకుంటున్నారు.

"నేను తమ్ముడిదగ్గర పడుకోనే. రాత్రి కుమ్ముతాడే" అంటోంది మా మరదలు.

"నా తలగడా ఏదే అమ్మా" అని రామం చికాకుపడుతున్నాడు. వీళ్లందరినీ సముదాయించి ప్రక్కలు వేసి ఆఖరివాడికి కథ చెప్పి నిద్దురపంచేసరికి దరిదాపు ఎనిమిదన్నర దాటింది. ఇల్లంతా సర్దుకొనేసరికి తొమ్మిదిగంటలు. ఇవి ఆఖరు పీరీడు.

"ఏమండీ స్వరూప్‌రాణీ పోయిందట నిజమేనా" అని భర్తకు మరల తమలపాకులు అందిస్తూ అడిగింది మా అత్తగారు.

"అవును."

"పోనీ లెండి. అదృష్టవంతురాలు. అటువంటి కొడుకుని గంది."

"ఏమో నీ కొడుకూ అంతవాడవుతాడేమో" అన్నారు మామగారు నవ్వుతూ.

"అంత అదృష్టంగూడానా?" ఏమో తన కొడుకు అంతవాడు అవతాడేమో. మాతృమూర్తికి తన సంతానవిషయంలో ఎంత ఆశలు గలుగునో ఎవ్వరు చెప్పగలరు—ఏమో? కాని యింతలో కళ్లనీళ్లు పెట్టింది ఆవిడ.

"చిట్టినాయన బ్రతికిఉంటే అంతవాడు అవునేమో?" అని విచారించింది.

అత్తగారికి ఒక కుమారుడు పోయినాడు. మరల ఎంతమంది పుట్టినా ఆ మాతృగర్భమునకు ఆ వేదన పోలేదు. ఆ లోటు తీరలేదు. ఇంతలో ఏమిటో జ్ఞాపకంవచ్చింది. "అన్నట్టు అతనికి పాలు యివ్వలేదు. జానకీ యీ ఫ్లాస్కుపాలు తీసుకొని మీగదిలో ఉంచుకో" అంది. ఆవేదనలోకూడా అల్లుడి సంగతి మరపురాదు! చెప్పేనుగదూ ఆడవారు అష్టావధానం చేస్తారని. ఆంగ్లేయులకు యింత ఆదరణచేసే అత్తగార్లుండరు. అందుకే హైందవయువకులకు అత్తగార్లంటే విందు, ఆంగ్లేయులకు చికాకు.

నేను చూచినంతవరకు మా అత్తగారి దినచర్య సమాప్తము. మా ఆవిడ నెమ్మదిగావచ్చి మా గది తలుపు వేసేసింది.

# శ్రీ రామ శతక ము

శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మగారు

క. ఏతీరుగనైనను ధర, ణీతలమునఁ బ్రాణులన్ గనికరమునఁ గనన్
భూతమయుండవు గావున, సీతాధిప! నీవు సంతసింతువు రామా!

క. ధర్మము భువినినశించి య, ధర్మము చెలరేగునపుడు దైత్యులఁ దునుమన్
ధర్మస్థాపన మొనరుప, ధర్మమయా! నీవు తనువుఁదాల్తువు రామా!

క. పరసతులఁ గోరువారలుఁ, బరధనమున కాసనొందు వారలు నకటా!
పరయశమునకు సహింపని, నరులీధరఁ బ్రబలుటన్ గనంగదె! రామా!

క. ఎల్లపుడు స్వార్థపరులై, యెల్లరయెడ దోషగుణములే కనుఁగొనుచున్
ఉల్లమున దయ నెఱుఁగని, కల్లరులకు నీవు దవ్వుగద రఘురామా!

క. అప్పనుచు నొరులధనమును, గుప్పలుకుప్పలుగఁ దెచ్చి క్రూరాత్ములిలన్
గొప్పలకై వెచ్చింతురు, తప్పక హరింతురిది యధర్మము రామా!

క. ఇట్టి నెఱదాతలనుభువిఁ, బట్టపగలు దారిఁదోచు పాపులకంటెన్
గట్టఁడు లనఁజెల్లును గద! కట్టా! యిదియెంత ఘోరకార్యము! రామా!

క. ధరణి నధర్మము ప్రబలెను, గరుణ యొకింతయును జనులకడ లేదనఘా!
నరుల సుశీలురఁ జేయవె!, శరధి సుతానయనకుముద శశధర! రామా!

క. అతివను, జ్ఞానవిహీనను, సతతము నీమహిమ లెన్నఁజాలను, శరణా
గతరక్షక బిరుదాంకా!, గతినీవేయంటి నన్నుఁ గావవె! రామా!

క. వినయమున వేఁడుదానను, వినవే! నామొఱను వేగఁ బ్రేమదలిర్పన్
గనుఁగొనవే! శ్రమలను; శ్రిత, జనకల్పక! యీప్సితము నొసంగవె! రామా!

క. లేదా! నీమనమున దయ; రాదా! నాయెడల దోషరాశినిగానన్;
కాదా? నీవఘహారివి, వాదేటికి? తెల్పు! దీనవత్సల! రామా!

క. చరణములవ్రాలఁ గాకా, సురునిం జేపట్టలేదె? సూనృతరత! నే
దురితాత్మురాలనైనను, శరణంటిని కావుమయ్య! జనకా! రామా!

క. ఉల్లము రంజిల్లఁగ నీ, చల్లనిచూపులను నన్ను సరగునఁగను ము
త్ఫుల్లాబ్జ పత్రలోచన! యెల్లపుడు స్మరింతుభక్తి నినకులరామా!

క. శ్రీలొప్పన్ గలశాబ్ధిని, వాలాయము భోగిరాజ పర్యంకమునన్
శ్రీ లక్ష్మీసహితుఁడవై, పాలింపవె! మమ్ముఁగరుణ భవహార! రామా!

క. బలిమినిఁ బ్రాఁజదువులఁగొని, జలనిధి సోమకుఁడు సొరఁగ సరగున వానిం
బొలియించి, నిగమముల నా, జలజాతాసనునకొసఁగు జలచర ! రామా !

క. సుర లసురులబ్ధిఁ దరచుచుఁ, బరిపరివిధములను నిన్నుఁ బ్రార్థింపఁగ మం
దరశైలముఁ బృష్ఠంబున, ధరియించిన కూర్మరూపధారివి రామా !

క. ఉరుబల హేమాక్షుఁడుతా, ధరణిని బాధింప, నుగ్రదంష్ట్రి తనువునన్
బరిమార్చి, యద్దురాత్మునిఁ, గరుణవిరాజిల్ల మహిని గాచిన రామా !

క ధర హేమకశిపుఁడాత్మను, గరుణన్ విడనాడి, సూనుఁ గడుబాధింపన్
నరహరివై ఖరనఖముల, నరిజీల్చి కుమారునేలు నఘహర ! రామా !

క. వామనుఁడై బలిదైత్యుని, భూమిని మూఁడడుగులడిగి, భువనత్రయమున్
శ్రీమహిమ లొప్పఁగొలిచిన, భూమీసుర ! నినుభజింతు మోక్షద ! రామా !

క. జననాథులు దుష్టాత్ములు, ధనలోభులుగాఁగ జామదగ్న్యుఁడవై నీ
వనినృపతులఁ దునుమాడవె ? ఘనవిక్రమ ! పరశురామ ! కార్ముకరామా !

క. ఖలుఁడగు రావణదైత్యుఁడు, పలువిధముల లోకములను బాధింపఁగ, స
ల్లలితపరాక్రమమున నీ, విలఁగూల్పవె ? సీతమిష మహీధవరామా !

క. గోపీమనోహరుఁడవై, గోపాధిపు నింటఁబెఱిగి, కుటిలదనుజులన్
క్ష్మాపాలురఁగూల్చిన యదు, భూపాన్వయ వార్ధిసోమ ! బుధనుత ! రామా !

క. వైరాగ్యగరిమ రాజ్యము, దారను నందనునివిడిచి, ధర్మరతుఁడవై
ధారుణి నహింసఁజాటిన, చారుయశస్సాంద్ర ! బుద్ధజనకా ! రామా !

క. ఖలచరితులు నిర్దయులును, మలినాత్ములునై చరించు మనుజులనెల్లన్
విలయింప భూతలంబునఁ, గలిఁగల్క్యాకృతివహించు ఘనుఁడవు రామా !

క. దురమునవోడి కరీంద్రుఁడు, పరమార్తుండగుచు నిన్నుఁ బ్రార్థింపఁగ భీ
కరచక్రముచే నక్రము, శిరమును శీఘ్రముగఁద్రుంచు శ్రీశా ! రామా !

క. సాకేతనాథ ! మును నీ, వేకరమునఁగరికి నభయమిచ్చితివో యా
శ్రీకరమును నాశిరమునఁ, బ్రాకటముగ నిలుపఁగదవె ! భవహర ! రామా !

క. వక్రాత్ముండైముని భూ, చక్రాధిపునంబరీషు, శ్రమనొందింపన్
జక్రముచేఁబ్రోచిన నీ, విక్రమము నుతింతుఁ బెక్కువిధముల రామా !

క. ఎంతటియోగులకైనను, శాంతమె శోభాకరంబు సౌఖ్యప్రదమున్
శాంతవిహీనమనస్కులు, స్వాంతంబుల నిన్నెఱుంగఁజాలరు రామా !

క. శాంతాత్ము లమలభక్తిని, స్వాంతంబుల నినుభజింప సంతృప్తుఁడవై
శాంతస్వరూప ! వారల, సంతాపముఁదీర్తువీవు సదయుఁడ ! రామా !



కీ. శే. జయంతి సుభద్రాదేవిగారు,
ఎం.బి.బి.ఎస్., డి.జి.ఏ.

విద్యార్థిగానున్న ప్రతి తరగతియందును ప్రత్యేక గౌరవమును బొందుచు, వైద్యపట్టము 1933 నందు పెక్కు పతకములతో పొందిరి. చిప్పర్ ఫీల్డు మెడలు పొందిన ప్రథమ ఆంధ్రయువతీ మణి. కర్నూలు హెడ్ క్వార్టర్సు హాస్పిటలులో నియమింపబడి కొంతకాలము పనిచేసి రాజమహేంద్రవరములో ప్రాక్టీసు పెట్టియుండిరి. 27-2-38 హృద్రోగముచే నాకస్మికముగ మరణించిరి.



భారతమాత వివిధమతప్రతినిధులు
విశాఖపట్టణము క్వీన్ మేరీ విద్యాశాల సిల్వర్ జూబిలీ సందర్భమున విద్యార్థులచే ప్రదర్శింపబడెను.



శ్రీమతి కొసనా సూర్యకాంతంగారు
(భీమవరం, వయసు 13 సం.లు)
శ్రీ రవీంద్ర సారస్వతసమాజమువారి 'చెల్లాయమ్మ' సారస్వత పోటీపరీక్షలో పశ్చిమ గోదావరిజిల్లా ద్వితీయ బహుమతిని (రు. 15) పొందిరి.

# ధర్మసూక్ష్మము

శ్రీమతి కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు

ధర్మ మెఱుఁగంగవచ్చు శాస్త్రంబుఁజదివి,
వాద మొనరింపవచ్చుఁ దత్త్వమ్ముగనక
తద్జ్ఞులంగొల్చి వారిడెందం బెఱింగి,
ధర్మసూక్ష్మ్మముగనుగొను ధన్యుఁ డెవఁడొ.

మహారాజసభ. పండితులు కవులు సంగీత శాస్త్ర విశారదులు రసికాగ్రేసరులు కిటకిటలాడుచు నీ శరన్నవరాత్ర మహోత్సవావసరమున రాజశేఖరాస్థానము నలంకరించియుండిరి.

కృతిలోఁ దన్మయతఁ జూపించువారు కొందఱు, రాగాలాపమునఁ బారవశ్యముఁ గొల్పెడువారు కొందఱు, పల్లవిపాడుటచే రసికుల యుల్లములఁబల్లవింపఁ జేసినవారు కొందఱు తానకౌశలమున మానసము నాకర్షించువారు కొందఱు నొక్కొక్కరొక్కొక్క యెడఁ దమచాతుర్యమును జూపిరి. సభ్యులెల్లరు తలలు పంకించువారు,పిలక లెగరవేయువారు,గాయకునితోఁ బాటు తాము నూగువారు, ముక్తాయితోఁ బాటు సిగముడివీడి మోమెల్లగ్రమ్మ గాభీక.రాకారుఁడైన మద్దెలవాని దెబ్బ కదిరిపడువారు, బలేయనువారు, మేలనువారు, చప్పరించువారు, హాయిహాయియనువారు, కన్నులు మూసికొనుచుఁ గదలక ప్రతిమల ననుకరించువారునై పలువురు పలువిధముల గానామృతపాన పారవశ్యముఁ జూపుచుండిరి. గాన వినోదము ముగియగానే, యాస్థానము నకు దైవికముగానే తెంచి సబహుమానముగా స్వాగత మొసంగఁబడిన యొక తేజోమూర్తిపై మహారాజు దృష్టి ప్రసరించెను. అంత నాస్థానసంగీతవిద్వాంసుడు లేచి నిలుచుండి చేతులు జోడించుకొని యిట్లు చెప్పందొడంగెను. "మహాప్రభూ! వీరు పరమభక్తులు. త్యాగబ్రహ్మగురుపరంలోనివారు. సంగీతవిద్యపట్ల సార్థకనామధేయులగు శ్రీ దక్షిణామూర్తి స్వరూపులనుటకు సందియములేదు.

అన్నదానముచేసి విద్యార్థులను బోషించి వారికి విద్యాదానము చేయుచున్నారు. దాతలు. అప్రతి గృహీతలు. నిస్పృహులు. రాజాస్థానములకేని పోయెడువారుకారు. ఏలినవారి గుణగ్రహణపారీణతను విని సంతసించి మన యాహ్వానమును మన్నించి యిటకే తెంచినారు."

ఆమాటలువిని రాజుగారు లేచివచ్చి యాదక్షిణామూర్తి గురుచరణములకు నమస్కరించి వారికి కుసుమమాలికలు, ఫలములు, సాలువలు స్వయముగ సమర్పించి

పూజించి యిట్లనిరి. "విద్వన్మణులారా? మీ సమక్షమున మనఃపూర్వకముగ మేము కొంత మా మనశ్శాంతికై ప్రకటింపవలసి యున్నది. పురుషాకృతిని ధరించిన కర్ణాట గానకళయో యన్నట్లున్న యీ దక్షిణా మూర్తి గురుమూర్తిని, వారీదేశమున స్థాపించిన గురుకులముయొక్క ప్రాముఖ్యమును నిటీవల విన్నాము. ఇన్నినాళ్లు మాకు ప్రాచీన విద్యలలోని నాణెమెఱుఁగ నవకాశము గలుగలేదు. క్రిందటి సంవత్సరము మేము కలినాయకుండగు వేంకటేశుని దర్శింప బోయి యచట కతిపయ శిష్యగణపరివృతుండగు నొక్క మహాతపస్వింబొడగాంచి వారిందర్శించితిమి. వారిట్లు శిష్యులకు బోధించుచుండిరి.

'బుద్ధిమంతులారా! శ్రద్ధాళువులై యాలకింపుఁడు. ఆర్యవిజ్ఞాన బీజములు రక్షితవ్యములు. కాల మనుకూలింపకున్న నేమి? కొందఱైన ధీరులై భారతీయుల వ్యక్తిత్వమును నిలువఁబెట్టవలయును. లేకున్న నీకర్మభూమియు నితర మ్లేచ్ఛభూములతోఁ దుల్యమగును.

ఈశ్వరేచ్ఛానుసారముగ నీపుణ్యభూమి గూడ నధర్మబహుళమగుచుండినను బుద్ధిమంతు లార్యవిజ్ఞాన బీజముల రక్షించుచుండుటయు భగవత్సంకల్పమే. అదియే మాముఖమున మీకు వినఁబడుచున్నదని భావింపుఁడు.'

ఈరీతి బోధించు గురుస్వామికి నేను సాష్టాంగముగ నమస్కరించితిని. వారు నన్ను దీవించి శిష్యులతో నెందేని జనిరి. నాటి నుండియు నార్యవిజ్ఞానమందు బద్ధాదరుండనై మాయాస్థానంబున శేషించియున్న ప్రాచీన విద్వాంసులరావించి, వారిసాయంబున నీ పరిషత్తుఁగావించి మీవంటి మహనీయుల కాహ్వానము పంపఁగలిగితిమి. మాయాహ్వానముల మన్నించి మీరరుదెంచుట మాకమందానందము కలిగించినది.

ఈ తొమ్మిదిదినములనుండి శాస్త్రార్థములు, సాహిత్యగోష్ఠులు, వేదాంతచర్చలు చతుష్షష్టికళాప్రదర్శనములు, మాతండ్రిగారి కాలమున జరిగినట్లే జరుప ప్రయతించితిమి. నూతన ప్రయత్నమాటచే నీ విజ్ఞానప్రదర్శనములోని విశేషములు మేము సమగ్రముగా గ్రహింపలేకున్నను మాకీ విద్యలన్నియుఁ బరమానందము గల్గించినవని మాత్రము చెప్పక తప్పదు. అంతియకాక యిన్నిదినములు పరధర్మావలంబనమున నిట్టి యవకాశము కలుగకపోయెగదా యని మాకుచింత గూడ కలిగినది. మా సంతోషము మాటకేమి! మీకంటె గూడ నీసభ్యులు, పౌరులు, రాజపురుషులు,నుద్యోగులెల్ల రిందలి సారస్యమును జక్కగా గ్రహించినట్లు కానఁబడుచున్నది. ఉత్సాహముతో నెల్లవారు చేయు శిరఃకంపాదికమువలన సభ్యుల కింతగుణగ్రహణశక్తి కలదాయని మాకచ్చెరువు కలుగుచున్నది. వేదవేదాంగములు, చతుష్షష్టికళలు మాపెద్దలనాడెట్లో మానాడు నట్లే మా సంస్థానమున వృద్ధిపొందునట్లు చేయ సంకల్పించిన, మాకు మీరెల్లరు

తోడ్పడుడు. దైవికముగా నీ నడుమకలిగిన యుపేక్షలోని లోపమునుగూడఁదీసి విద్యలకుఁ బరిపూర్ణతను గూర్చుఁడు.

విద్వన్మణులారా! నేఁడీ సభకలంకార భూతులగు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రిలగారు మనకు దిక్ప్రదర్శనముగాఁ గర్తవ్యము నిరూపించెదరు. కావున సావధానులై యాలకింపుఁడు" అని మహారాజుగారు మేఘగంభీర స్వరముతోఁబలికి విరమించిరి. అంతట దక్షిణామూర్తిశాస్త్రిగారు సభామధ్యమున నిలువంబడి యిట్లుపన్యసించిరి.

"మహారాజా నేఁడుకదా సుదినము ఆర్య విజ్ఞానమును బోషించుటకుఁ గంకణము గట్టుకొన్న ధీరుని నేఁ గన్నులారఁ జూడఁగల్గితిని. గుణగ్రహణపారీణులగుటచేఁ ప్రభువులు మావంటివారియందున్న గురుప్రకారమును గుర్తెఱింగి సభాముఖమున నిట్లుగ్గడించిరి. పామరలోకము విద్యాగంధవిహీనమౌటచే మమ్ముబోంట్ల సరకుచేయకున్నది. అట్లగుటచే విద్వాంసులు, వనములందును బల్లెలయందును కుసుమగుచ్ఛములవోలె జీర్ణభావంబుగాంచుచున్నారు. ఈశ్వరానుగ్రహమువలననే యద్వైతవాసన మానవుల కేర్పడునన్నట్లుగా నీశ్వరానుగ్రహముగలవారికే యార్యవిజ్ఞానమందభిమానము తత్పోషణము దానశక్తియుఁ గలుగునని తోఁచుచున్నది. లోకులు కాకులవంటివారు. యజమానుల యభిప్రాయము ననుసరించి పొగడుచుఁ దెగడుచుందురు. ఇట్టి చంచలస్వభావముగల లోకుల యామోదము వారి గుణగ్రహణమును సూచింపదు.

ఆధునికుల యాటపాటలకు వినోదములకు మోజుపడి వివిధసీమల వారి బిలిపించి నిరుడు తమరొక్క లక్షరూప్యముల వెచ్చించినపుడు వీరందఱు మిమ్ము మెచ్చుకొనలేదా? ప్రాచీన పండితులను నిలిపి వార్షికములుమాని, ఊటీకొండలలో నేలినవారు కందుకక్రీడాపరవశులై యున్ననాఁడీ సభ్యులు మిమ్ము మెచ్చలేదా?

నడగొండలఁబోలె నగరమున సంచరించు భద్రగజంబులనెల్ల నమ్మి వికారముగ మొఱుగుచు కుక్కలవలె నెల్లెడల సంచరించు మోటారుకారులెన్నని కొన్ననాఁడు ఈ సభ్యులు మిమ్ముల మెచ్చుకొనలేదా?

పండ్రెండు సంవత్సరములు చల్లకడవఁ గౌగిలించుకొని యకారసాధనఁజేసిన మహాసంగీత విద్వాంసులకు దేవిడీమన్నాచేసి గ్రామఫోనుతో రాజసభనించిననాఁడు వీరు మిమ్ము మెచ్చుకుండిరా? వేయేల? వడ్రంగులు, కమ్మరులు, వెండిపైడిపనివాండ్రందఱకు దగ్గించి ప్రతివస్తువును బైక్రవాసి తెప్పించిననాఁడు, మనవారది నాగరికతయని మిమ్ముం బొగడలేదా?

తాతముత్తాతలనాటి తాటియాకు గ్రంథముల నన్నింటిని నశిగిన వారికెల్ల యే జర్మనీవారికో, అడయారువారికో, దానముచేసి పీడవదలించుకొని యన్యభాషా గ్రంథరాజములతో బీరువాల నింపిననాఁడు వీరు మిమ్ముఁగొని యాడలేదా?

మీ మూలపురుషులనాటినుండి వచ్చు చున్న యమూల్యములగు నవరత్నముల యాభరణములు, బొంబాయికి పారిసు పట్టణమునకుఁబంపియమ్మించి దివాణమునిండ గాజు పింగాణిసామానులు నింపిననాఁడు మిమ్ము వారింపక పైపెచ్చు నిరాడంబర జీవనమును గొనియాడిన వారీసభ్యులుకారా? ఏకరాశిగా నన్ని యుదాహరణములు చెప్పితిని. ఇంతకు మాపుణ్యవశమున, నా మహాతపస్వి యనుగ్రహంబున నేలినవారి కార్య విజ్ఞానముపై దృష్టి ప్రసరించిన కారణమున జన్మమునకెల్ల శివరాత్రియని నాకీనాఁడిచ్చట పండిత సమక్షమున మనసులోనిమాట నిర్భయముగాఁ బ్రకటించు నవకాశము గలిగినది.

అదియట్లుండఁ బ్రకృత మేలినవారి ప్రశ్న యేమనగా నింతగాఁ దలలాడించి మెచ్చుకొను సభ్యులందఱకు సంగీతశాస్త్రమున మేలరసి యానందించునంతటి రసికతకలదా యని కదా! అందలి యథార్థమును రేపు నిరూపింతుము. ఆవిషయము తమతో నేకాంతముగా మనవిచేయుదును. రేపటి దినము సాయంకాలము యథాప్రకారము సభ కానిండు. మహాప్రభూ! తత్త్వజ్ఞులఁ జెంతఁజేర్చి వారిఁ బ్రోత్సహించి, కల్ల నిజము లేర్పఱచి ధర్మమును బోషించు మహారాజు తమరయ్యేదరేని మావంటి సాధువుల కదియ పరమానందము." ఈ రీతిగా దక్షిణామూర్తి శాస్త్రిగా రుపన్యసించినపిదప నాటిసభ ముగిసెను. మరునాటి యుదయము మొదలు సాయంకాలము వఱకు నూరంతయు నట్టుడికిన ట్లుడికిపోవు చున్నది. దర్బారులో సంగీతమునకు విధిగా నందఱు వెళ్లితీరవలయునఁట. మహాగాయకులు పాడుదురఁట. సభలో నెల్లయెడల నిచ్చుకత్తులవారు నిలువఁబడుదురట. తల యాడించినవారికి, మేలు భేషు అనినవారికి, దత్క్షణమే సభయందే శిరస్సులు నరికెద రట.

పౌరులంద ఱరచేతఁ బ్రాణములు పెట్టుకొని సాయంకాలము రాజభవనమునకు సంగీతసభకు విచ్చేసి క్రిక్కిరిసి కూరుచుండిరి. విచ్చలవిడిగా ఖడ్గధారులు సభలో బరాబరులు చేయుచుండిరి.

అంత దండనాయకుఁ డుచ్చైస్స్వరము నిట్లు ఘోషించెను. "సభ్యులారా! ఈ గానసభ జరుగునంతసేపు మీరందఱు కుదురుగాఁ గూర్చుండవలయును. తలలాడింపరాదు. బలే, మేలు, బాగు, వహ్వా యని యఱువరాదు. ఈ యాజ్ఞను మీరిన వారి శిరస్సులు ఖండింపఁబడును. బంతులవెంట సిద్ధముగనున్న నీ ఖడ్గధారలఁ దిలకింపుఁడు. భద్రము."

దండనాయకుఁ డాడినమాటలు విని సభయంతయు చిత్తరువువోలె నిశ్చేష్టముగ, నిశ్శబ్దముగ గానము వినుచున్నది, పరమ భక్త్యుద్రేకముతో "క్షీరసాగరశయన" యను కృతిలో "తారకనామా" యని తారస్వరమునఁబలికి సంబోధనఁ జేయు

గాయకుని భావోత్కృష్టతమెచ్చి చెంత నున్న విద్వన్మణు లిద్దరు తలలెగురవైచి "బలే" యని కేకవేసిరి.

విచ్చుకత్తులవారు వారిపై యురికిరి. సభలో కోలాహలము పుట్టెను. పాట నిలిచిపోయెను. ఏమైనది యెవ్వరెఱుఁగరు. "అయ్యో, రసికాగ్రేసరు లన్యాయముగ హతులైరి కదా" యని ప్రతివారు విల పింపఁజొచ్చిరి.

అత్తఱి కొంతవడికి తెరమఱుగుననుండి దక్షిణామూర్తి బుధుం డాతలలాడించిన విద్వన్మణుల చెరియొకవైపు నుంచుకొని సభలోఁ బ్రవేశించి రాజసన్నిధానమున నిలువంబడి యిట్లు ఘోషించెను. "మహా రాజా! ఈ మహానుభావు లిద్దఱు కేవల తత్త్వప్రవీణులు. కావున వీరికి నిజముగ మెప్పఁగలచోట కత్తులు కానబడలేదు. తక్కినవారెల్లరు కత్తులవలని భయముతోఁ గంతములు బిగపట్టుకొని బొమ్మలవలెఁ గూర్చుండిరి. సర్వకాలములందు సహజ ముగఁ దత్త్వకథనము చేయఁజాలు మహ నీయు లిట్టివారు.

యజమాని యభిప్రాయమునుబట్టి యాచకులు మాయికులు, లోకులు.

తత్త్వనిర్ణయముచేసి యథాయోగ్యముగ విద్వాంసులను విద్యలను పూజించి పోషించు నీ మహారాజు దీర్ఘాయుష్మంతుఁడయ్యెడు గావు"తమని దీవించి దక్షిణామూర్తి బుధుండు విరమించెను.

సభయంతయుఁ బరమానందభరితమై నది. అందఱకుఁ జందనతాంబూల వస్త్ర దానాదికముతో సభ ముగిసెను.

"ధర్మసూక్ష్మంబు తేల్చును ధన్యుఁ డొకఁడు."



# వ్యాసకర్తలకు

వ్యాసములు ప్రకటన కంగీకరింపబడుచో వ్యాసకర్తల కా సమాచారము వెంటనే తెలుపబడును. అంగీకరింపబడని వ్యాసములు ఆ మాసాంతమువఱకుమాత్రము భద్రపరుపబడి యుండును. వ్యాసములు కావలసిన ఆ యావ్యాసకర్తలు తగు తపాలబిళ్లలనుపంపి వానిని తెప్పించుకొనగలరు.

సంపాదకుడు.

# ఉత్తరాలు

●

శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారు

సామాన్యంగా రాత్రిపూట రైల్లో ప్రయాణం చేసేటప్పుడు ఏకొద్దిమందోతప్ప చాలామంది జనం నిద్రపోతూనే ఉంటారు. నాకెందుకోకాని ఆ మర్నాడురాత్రికికూడా నిద్రపట్టదు.

ఆవ్వేళసాయంకాలం ఐదుగంటలకు రైల్లోనుంచి "ఎబల్" సంస్థానంలో దిగాను. ఆసంస్థానం ఇప్పటికీ మాస్నేహితులైన "మార్టెస్టు డి అర్థస్" కుటుంబానికే చెందిఉన్నది. ఈసెలవలు మూడువారాలూ అక్కడే గడుపుదామని తిన్నగా వాళ్లదేవిడీకే వెళ్లాను. అది ఒక మనోహరమైన దివ్యభవనం. దాన్ని క్రిందటిశతాబ్దంలో వాళ్ల ఏతాతగారి కాలంలోనో నిర్మించారు. కనుకనే ఇంతకాలానికిగూడా ఆప్రాచీనశిల్పంయొక్క గాంభీర్యం, అభేద్యతా, జీవకళా కొంచెంగూడా తగ్గలేదు. ఇంతేగాక ఆభవనం ఒక చిన్నగుట్టమీద నిర్మించడం, ఆగుట్ట చుట్టూ ఒకదట్టమైనవనమూ, దానికిందుగా జలజలలాడుతూ ఓనదీ, ఆనది అవతలవైపు చాలాదూరం వరకూ వ్యాపించిన సస్యక్షేత్రాలూ, వాటిగట్లమీద మంచుతోతడిసిన పచ్చిగడ్డిమేస్తూ నిండుప్రేమతో వెంబడించేదూడల్తో మందంగా అడుగులువేసే పశువులూ,—ఇక ప్రకృతికాంత తననవలావణ్యశోభనంతా అక్కడ వొలకబోసిందంటే ఆశ్చర్యం ఏముంది. ఈసౌందర్యాన్నిచూచి ఆనందించడానికి నేను ప్రతి వసంతరుతువులోనూ ఇక్కడికివచ్చి మహోత్సాహంతో రోజులు వెళ్లబుచ్చుకొని వెళ్తుంటాను.

భోజనాలుకాగానే స్నేహితుడితో ఇట్లా అన్నాను. "మంచిది నాకు ఈసంవత్సరం ఏగది ఏర్పాటుచేశావు?"

"ఆన్ట్రోజు గది."

ఓగంటసేపు బాతాఖానీ కొట్టినవాత పడుకోడానికి ఆగదిలో ప్రవేశించాను. గదిలోప్రవేశించగానే ఆన్ట్రోజు, తైలవర్ణం చిత్రంఒకటి పెద్ద సైజులో ఎదురూగా వేలాడుతూ కనిపించింది. ఆమె ముఖం ఆదుమ్ముపట్టిన అద్దంలోనుంచి నాలో ఎక్కువభావాలేమీ కలిగించలేదుకాని, ఆనొక్కునొక్కులజుట్టూ, విశాలమైననుదురూ, సునిశితమైన కళ్లూ, అకళంకశీలవతులైన ప్రాచీన సాధ్వీశిరోమణులను జ్ఞాపకానికితెచ్చాయి. మా మిత్రుడికుటుంబంలో ఆమెపేరుకు చాలా గౌరవస్థానముంది.

ఇప్పటికి నేను చాలా అలిసిపోయినాను కాని ఇంకా నిద్ర రావడములేదు. కొంచెంసేపు పక్కమీదపొర్లి ఇక లాభంలేదని ఉత్తరాలయినా వ్రాసుకుందామని అక్కడే కిటికీపక్కగా గోడలో అమర్చి ఉన్న 'డెస్కు'ను తెరిచాను. కలమూ కాగితమూ ఏమయినా దొరుకుతాయేమోనని. కాని ఆలోపల పూర్తిగా పాడయిపోయిన ఒక్క ఈకకలంమాత్రం పడేశివుంది. నేను నిరాశతో సొరుగుమూసి వేస్తూవుండగా లోపలవైపుమూలగా ఏదో ఒకపదార్థం మెరుస్తూ కనిపించి నన్ను కాస్తకలవరపెట్టింది. వెంటనే మళ్ళీ ముందుకులాగి ఆపచ్చనిపదార్థాన్ని నారెండువేళ్ల గోళ్లతోనూ గట్టిగాపట్టుకొని నేర్పుగా పైకిలాగాను. అది ఒక బంగారు సూదివంటితాళం చెవ్వి. ఆకస్మికంగా నాతల్లో అనేకఊహాశకటాలు పరిగెత్తాయి. ఏదో ఒకరహస్యాగారం ఈకొత్త పనిముట్టువల్ల బయలుపడవచ్చు ననే ఒకఉత్సాహంతో ఆ'డెస్కు'నంతా పరిశీలించిచూచాను. చివరకు మొదట సొరుగు కొంచెంఎదురుగా ఒక చిన్నరంధ్రం గనిపించింది. క్షణం ఆలస్యంచెయ్యకుండా ఈసూదిని అందులోగుచ్చాను. ఆశ్చర్యం! వెంటనే ఒక చిన్నసొరుగు నావైపుకు తెరుచుకుంది.

అందులో ఉన్నసామానంతా రెండు, పసుపు పచ్చ, గులాబీ, రంగుల ఉత్తరాలకట్టలు; విలువైన, మృదువైన పట్టుగుడ్డముక్కలో చుట్టబడిఉన్నాయి.

అవ్విచదివి నేను కొంచెం విభ్రాంతుణ్ణయిపోయి నాను. వాటిలోనుంచి ఒకటి రెండుఉత్తరాలు చూపిస్తాఉన్నాను.

"నా.........'

నీవుకోరినవిధంగా నీవు వ్రాసినఉత్తరాలన్నీ పంపిస్తున్నాను. కాని నీకోర్కెను అంగీకరించడానికి నేను చాలా బాధపడుతున్నాను. నీవు దేనికొరకు ఇంతగా భయపడుతున్నావో నేను ఊహించుకో లేకుండాఉన్నాను. వాటిని నేను పోగొట్టుకుంటా నేమోనని భయపడుతున్నావా? జాగ్రత్తగా నా పెట్టిలోదాచి తాళంవేశాను. పోనీ ఎవరైనా దొంగి లిస్తారేమోనని భయపడుతున్నావా? పిచ్చిదానా! నాప్రణయకోశాన్ని నేను కాపాడుకోలేనా !!

నాకు బాధేకాదు ఆశ్చర్యంకూడా వేస్తూఉన్నది. ఒకవేళ నీహృదయాంతరాళంలో పశ్చాత్తాపం ప్రవే శించలేదుగదా. ఇంతకాలం నన్ను ప్రేమిస్తున్నం దుకూ లేకపోతే, నీచేతులోఉన్న కలంమీదఉన్న విశ్వాసంగూడ నామీద నీకు లేనిరోజుల్లో నీభావాల్ని ఒక తెల్లకాగితంమీద ప్రవేశపెట్టినందుకు ఇప్పుడు సిగ్గుపడుతున్నావా? చూడూ, ఎప్పుడైతే మనం ప్రేమించేదానికి ఒప్పుకున్నామో అప్పుడు, ఆప్రేమని మాటలలోనూ, వ్రాతలతోనూగూడా ఒప్పుకో వలిశివస్తుంది. ఎందుకంటావా, ఆలోచించుకో, మనం అనుకున్నమాటలు, మధురమైనసంగీతంలాగా హృదయంలో చొచ్చుకుపోయి, మలయానిలంలాగా మృదువుగా శరీరానికితాకి, సూర్యకిరణాల్లాగా వంటికి వేడిపుట్టించి చివరకు ఆవిరిలాగా మాయం అయిపోతాయి. ఇక అక్కడమిగిలేది ఒక్క స్మృతి మాత్రమే! కావలెనంటే, వాటిని దర్శించడానికిగానీ స్పృశించడానికిగాని, చివరకు చుంబించడానికిగాని వీల్లేదు. ఏమైనాసరే భరింపరాని హృదయవేదనతో ఉత్తరాలు పంపివేస్తున్నాను.

నాకు తెలుసు. నిస్సందేహంగా నీవు, ఒకానొక కాలంలో ఒకమనుష్యమాత్రుణ్ణి ప్రేమించి ఆభావా లను శాశ్వతంగా వెల్లడిపరచినందుకు ఇప్పుడు నీకోమలహృదయంలో పశ్చాత్తాపమూ, భీరుత్వమూ కలిగి, వాటిని ఎలాగైనాసంపాదించి, ధ్వంసంచేసి, పిడికెడుబూడిద చేసివేద్దాం. అనుకుంటున్నావు... సరే...మంచిది.

నీసంతృప్త ప్రశాంత జీవనాన్ని ఆశిస్తూ ఇవిగో నీలేఖలన్నిటినీ, పంపివేస్తున్నాను.

నీ.........

* * *

"మిత్రమా!

నాకు చాలా విచారంకలిగింది. ఎందుకంటే నీవు నన్ను సరిగా అర్థంచేసుకోలేకపోయినావు. చివరకు ఊహించుకోనన్నా లేక పోయినావు.

నేను నిన్ను ప్రేమించినందుకు ఎన్నడూ విచారించ లేదు. ఇకముందుగూడా విచారించను. నా జీవితాం తంవరకూగూడ ఇదేమోస్తరుగా నీకు ఉత్తరాలు వ్రాస్తూనేఉంటాను. కాని నాప్రార్థన ఏమంటే ఆ ఉత్తరాల్ని నీవు చదివినవెంటనే నాకు తిరిగీ పంపించి వెయ్యాలి.

నేను ఎందుకు ఆఉత్తరాలు పంపమని అడిగానో నీకు చెప్పివేస్తాను. కాని నీకు పెద్దహృదయాఘాతం అవుతుందని విచారిస్తున్నాను.

నీవన్నట్లు భావవీధి పరిభ్రమణంలో కాదుగాని ప్రత్యక్షంగా నేను భయపడుతూ ఉన్నాను. ఎందుకోఅంటావా, బహుశా అందులో ఏమైనా పొరపాటువస్తే, నాలోపాలు ఇతరులకు తెలియడం కాని అందువల్ల మరొకరికి నష్టంరావడంగాని నా కిష్టంలేదు.

ఈ చెప్పబోయేమాటలు కొంచెందీర్ఘంగా ఆలో చించుకో. నీవూ...నేనూ....ఇద్దరం....మరణించి పోవచ్చు. క్షమించాలి. నీవు నీగుర్రంమీదినుండి పడి పోవచ్చు. ఇంకా స్వారిచేస్తూనే ఉన్నావు కాదూ? లేకపోతే ఏదైనా ఆకస్మికవ్యాధి సోకో, గుండె జబ్బువల్లనో ప్రమాదంవల్లనో తలవనితలంపుగా

చనిపోవచ్చు. తెలుసుకదూ మృత్యువు ఒక్కటేకాని దానిమార్గాలుమాత్రం అసంఖ్యాకం, అనూహ్యం కూడాను. అప్పుడు నీచెల్లెలో బావో, వదినో మన ప్రేమలేఖల్ని చూడడం తటస్థించవచ్చు. అప్పుడు వాళ్లు నన్నుప్రేమించి క్షమించి ఇతరుల్తో ఈరహస్యాన్ని, ఇటువంటి రహస్యాన్ని చెప్పడం మానివేస్తారా! నేను నమ్మను. నేనిప్పుడేదో మహాభయంకరవిషయాన్నిగూర్చి చెపుతున్నట్లూ, మీబంధువులను అనుమానిస్తున్నట్లూ నీకు తోచవచ్చు. కాని మనం అందరం ఇవ్వాళో, రేపో—ముందో, వెనుకో—తప్పకుండా మన్నులో కలిశిపొయ్యేవాళ్లమే. కనుక తదనంతరం ఏభయంకర సంఘటనలూ జరగకుండా ముఖ్యంగా ఇలాటివిషయాలల్లో ముందే ఎక్కువ శ్రద్ధతీసుకోడం అవసరం.

ఇక నావిషయం—ఈఉత్తరాల్ని నేను నా వ్రాతబల్లలో ఒక రహస్యపుసొరుగులో దాచిఉంచుతాను. ఈసారి నీవువచ్చినప్పుడు, మన రెండుఉత్తరాలకట్టలూ, తమ మృదువైన పట్టుపల్కల్లో శాశ్వతంగా, పక్కపక్కసమాధాల్లో ఉండిపోయిన ప్రేయసీప్రియుల్లాగా ఎలా ఉంచబడ్డాయో చూపిస్తాను.

ఐతే నీవు "ముందుగా నీవుమరణిస్తే నీభర్త మన ఉత్తరాలను చూడడా?" అని ప్రశ్నించవచ్చును. ఊహూ, నాకావిషయంలో ఏమీ భయంలేదు. మొట్టమొతట అతను నారహస్యపు సొరుగును కనుక్కోనేలేడు. ఒకవేళ నామరణానంతరం కనుక్కొన్నా నేను లెక్కచెయ్యను. నీమటుకు నీవెప్పుడయినా, మరణించినవాళ్ల ప్రేమలేఖల్నిగురించి విన్నావా, లేదు. కారణం ఇది మనమరణానంతరం నాభర్త మన ప్రేమలేఖల్నిచూచినా ఏంచేస్తాడు, కాల్చిబూడిదచేస్తాడు. పురుషహృదయం ఎలాటిదో కొంచెం ఆలోచించావా? అతను బతికివున్న స్త్రీమీదఅయితే తప్పకుండా పగసాధిస్తాడు. ఆస్త్రీని అగౌరవపరచాడనే ఊహతో తన ప్రతిద్వంద్వితో పోట్లాడుతాడు. అంతేగాదు. ఆస్త్రీ కళ్లముందు అతనిని నాశనంచేయించడానికి ప్రయత్నంచేస్తాడు కూడాను. ఎందుకంటే,...పోనీలే ఎందుకో నాకూ బాగా కారణంతెలీదు. అదే ఆమె మరణానంతరం అయితే ఎంతసాక్ష్యం దొరికినాసరే దాన్ని ఇతరుల కంటబడకుండా నాశనం చేసి తృప్తిపడుతాడు. ఓహో! నాస్నేహితుల్లో ఇలాటి ఆధారాలమీద పిచ్చిగా, కుళ్లుగా, స్వార్థంతో కీచులాడుకున్నవాళ్లనీ అదే మరణానంతరంఅయితే నిశ్శబ్దంగా వాటిని నాశనంచేసినవాళ్లనీ బోలెడుమంది పురుషుల్ని చూచాను.

మరొక్కవిషయం. నేను వీటిని నాశనంచేస్తానేమో అనికూడ నీవు అనుకుంటున్నావు. ఎప్పుడూ కూడ అలాటి అభిప్రాయాలకు నీహృదయంలో చోటివ్వవద్దు. నేనేకాదు, ఈవిశాలప్రపంచంలో మరే స్త్రీకూడ తాము ప్రేమింపబడుతున్నామని వ్రాయబడ్డఉత్తరాల్ని ఏమాత్రం చెక్కుచెదరనివ్వదు. మాస్త్రీలోకానికి జీవనసర్వస్వమూ, జీవితోద్దేశమూ, నిరీక్షణమూ, సుఖస్వప్నమూకూడ ఇలాటి ప్రణయచిహ్నాలే. ఈచిన్నచిన్న కాగిదంముక్కలు ప్రణయారాధనకేర్పడ్డ ఆలయాలు. అందులో ప్రణయాధిదేవతలం మేమే మమ్మల్ని ఆరాధించేప్రియులు వ్రాసిన ఈప్రణయలేఖలు మాసౌందర్యానికీ, రీవికీ, చాకచక్యానికీ, అకర్షణకీ సంబంధించిన యోగ్యతాపత్రాలు. అవి మాప్రణయకోశాలు. ఇలాటి ఆనందగర్వాలకి కారణభూతాలయిన ఈలేఖల్ని ఏస్త్రీ ప్రాణప్రదంగా కాపాడుకోదు? కనుక ఈఉత్తరాల్ని, నీదగ్గిరుంటే మనఇద్దరికీ క్షేమంకాదు కనుక, నావ్రాతబల్లలో భద్రంగాదాస్తున్నాను. నీవు ఈవిషయంలో నిశ్చింతగా ఉండు...సెలవు...ముద్దులు...

నీ

రోజు."

అప్రయత్నంగా నాకళ్లు 'ఆన్ట్ రోజు" చిత్రం మీదికి ప్రసరించాయి. ఈసారి తడిసినకంబళిలాగా గంభీరంగా ముడుతలుబడ్డఆముఖంలో పైకి ప్రస్ఫుటం అవుతున్న పాతివ్రత్య సదాచారాలవెనుక సూక్ష్మంగా స్వార్థ్యం, కపటం, ద్వంద్వత్వం ఛాయగా గోచరమయినాయి.

## స్వస్తిక్ కుంతల ద్రవ్యములు

క్రమముగా స్వస్తిక కుంతల ద్రవ్యము లుపయోగించిన మనోహరమగు నిడుపైన వెంట్రుకల బొందగలవు. అవి భారతదేశ మంతయు ప్రసిద్ధి జెందినవి. వానిలో మట్టి మట్టితైలములు చేరలేదని గ్యారంటీ నివ్వ బడినది.



### కుంతలాభివృద్ధికి






వెంట్రుకలు విరివిగా పెరుగుటకును, బట్టతల కాకుండుటకును, చుండు మొదలగువానిని పోగొట్టి శిరమునకు చల్లదనము గల్గించుట కును చాల నుపయోగకరము. చక్కని పువ్వులసెంటు గలుపబడినది.

### ప్రశస్తమైన స్వస్తిక వెంట్రుకల తైలము

శ్రేష్టమైన టెంకాయ, తిలతైలముచే తయారుచేయబడినది. హాని కరమగు మట్టితైలము లిందు చేర్చబడలేదు. రెండు విధములుగా దొరకును. (కొలదిగా సెంటుచేర్చినది. ఎక్కువగా జేర్చినది.) స్వస్తిక ప్రశస్తతైలము క్రింది 5 వివిధ సువాసనలతో దొరకును:—
రోజా, మల్లె, శ్రీగంధము, కస్తూరి, స్వీట్ పీ.



### సువాసనగల ఆముదము

వెంట్రుకలకు మిగుల బలవర్ధకము. వెంట్రుకలను రాలకుండ తెల్ల బడకుండ జేయును. చర్మమును శుభ్రపరచి చల్లదనము గల్గించును. మంచివాసన చేర్చబడినది. ఉత్తమమైనది.




### షికకెయ్ సబ్బు

వెంట్రుకల యభివృద్ధికి, శిరస్నానమునకు, చుండు పోగొట్టి మెఱుగుగల్గించుటకు సాటిలేనిది. శిరమునకుచల్లదనముగల్గించును.



## దిస్వస్తిక్ ఆయిల్‌మిల్స్ లిమిటెడ్

వడాలా :: బొంబాయి

డిస్ట్రిబ్యూటర్లు: ది స్వస్తిక్ ఏజన్సీ, మద్రాసు — బెజవాడ స్టేషనరీ అండు ఫాన్సీమార్టు, బెజవాడ. చిత్తూరి రంగయ్య అండు కంపెని, కాకినాడ — గ్రంధిస్వామి అండు సన్సు, విజయనగరం సిటీ.

డిస్ట్రిబ్యూటర్సు ప్రతిజిల్లాయందు గలరు.

# ఉష్ణదేశాల్లో కురులకు - - - చేయవలసిన కృషి



సహజంగా వెంట్రుకల్లో వుండే తైలాన్ని సూర్యుడు ఎండిస్తూవుండేటప్పుడూ, ధూళి వాని సున్ని తత్వాన్ని నశింపచేస్తూ వుండేటప్పుడూ నీ మాడును గురించీ, వెండ్రకలనుగూర్చీ ప్రత్యేకశ్రద్ధ పుచ్చుకోవాలి.

1. ఉప్పూ, ధూళీ పోగొట్టి తైలాన్ని ఎప్పటి వలె కలిగించడానికి ప్రతివారము

**టామ్కో టెంకాయనూనె**

అభ్యంగనానికి ఉపయోగించవలె. మొదట దీనికి వేన్నీళ్లు, శుభ్రపరచిన తరువాత చన్నీళ్లు వాడుకోవాలి.

ఈ అభ్యంగనతైలంలో కురులను పరిశుభ్రంగా కడిగే సీకాయి, వెంట్రుకల్లో మాడులో సహజంగావుండవలసిన తైలాన్ని కలిగించే టెంకాయనూనె వున్నవి.

వెంట్రుకలనూ, మాడును ప్రతిదినము మూడు నిముషాలు సేపు

**టామ్కో సువాసన టెంకాయనూనెతో**

రుద్దితే వెంట్రుకలు సిల్కువలె అవుతవి. కురుల అభివృద్ధికి రక్తప్రసారం కలుగుతుంది.

పైవి రెండూ క్రొత్తగాతీసి బాగుచేసి సుగంధయుక్తంగా చేసిన టెంకాయనూనెనుండి తయారైనవి. ఈపద్ధతి పురాతనమైనా, టామ్కో పరిశ్రమాలయాల్లో దీనికి పరిపూర్ణమైన శాస్త్రోక్తవిధానం కల్పింపబడింది.






## ది టాటా ఆయిల్ మిల్స్ కో లిమిటెడ్

తాతాపురం & బొంబాయి.

టామ్కో సేల్స్ డిపో,

19A, వాణియర్ వీధి, మద్రాసు.

# వివాహములు—మార్పులు

శ్రీమతి హంసకోట కామాక్షమ్మగారు

సంఘమునందు మిక్కిలి పావనమనదగునది వివాహము. మన కుటుంబములయందు ఒక పిల్లవాడుగాని పిల్లగాని వివాహముకాదగిన వయస్సు పొందినదే యింటియందు పెద్దలు పిల్లల శ్రేయస్సును కోరి వివాహమునకు తగుయేర్పాట్లుచేయు నాచారము కలదు. ఇట్టివివాహములు జరిగినపిదప నూతన వధూవరు లన్యోన్యవృద్ధిపొందుటకుగాను సంతోషదాయకములగు నాచారముల నెన్నిటినో పెద్ద లేర్పాటు చేసియున్నారు. వధూవరుల అన్యోన్యత వృద్ధి నొందుటకు పిల్లయింటికి పిల్లవానినిగాని పిల్లవాని యింటికి పిల్లనుగాని పండుగపర్వములయందు పిలిపించి కొద్దిరోజు లుంచుకొని తగురీతి గౌరవించి పంపునది మనలో ఆచారముగానున్నది. ఇప్పుడన్ననో చదువుకొను కాలమునందు వ్యవధిలేదన్న కారణమువలన పిల్లవాడుగాని పిల్లగాని యొకరినొకరు కలసికొని వారివారి గుణములను గ్రహించుటకు వీలుగాక యిందుమూలమున నెన్నియో అనర్థములు కలుగుచున్నవి. నూతన వధూవరులు వారికి చెందగల నూతన ఆశ్రమధర్మముల నేరీతిగా తెలియు టనునది మన యిప్పటి సమస్య.

పూర్వాచారము లిప్పుడు మనకు కనుపించు క్షీణదశయందుండుటకు కారణము మన సంఘము నాక్రమించియుండు దౌర్బల్యము. ప్రపంచమునందన్ని జాతులయందును వివాహసందర్భములయందుపయోగింపబడు పవిత్రవాక్యములయొక్క సారాంశ మొక్కటే. అట్టివాక్యములు పండిత పామరరంజకములగు దేశభాషలలోనున్నవి. కాన వివాహముకాగల దంపతులు వాటియర్థమును గ్రహింపగలిగి గృహస్థాశ్రమమునందు వారిరువురకునుగల బాధ్యతను తెలిసికొనగలిగియున్నారు. మన దేశమునందటులుగాక వివాహసమయమున మంత్రములు సంస్కృతభాషయందున్నవి. అందుచే దంపతులు వాటి యర్థములను గ్రహింపలేక వారివారి బాధ్యతలను తెలిసికొనలేకయున్నారు.

ఇప్పుడు మనదేశము నావరించియుండు దరిద్రపు దశయందు నెల్లరును సంస్కృతజ్ఞానము నలవరచుకొనుట మంచిదని చెప్పినయెడల అట్టి యుపదేశవాక్యములను వినువారు బొత్తిగా లేరు. అయితే దేశసౌభాగ్యమునుకోరు ప్రతిహిందూనాయకుడును వివాహము కాగలవారలకు సంస్కృతభాషాజ్ఞానము లేనందున సంఘమునకు కలుగుచున్న యిబ్బందులను తొలగించుటకు వివాహసంబంధమయిన ప్రతిఘట్టమునకును ప్రాముఖ్యమును దెలుపుచు అందుపయోగించు పవిత్రవాక్యముల అర్థమును తెలుపునట్టి గ్రంథము దేశభాషలయందు ప్రచురించి ఉన్నతవిద్యను గఱపు పాఠశాలలయందు బాలబాలికలకు పఠనీయగ్రంథముగా నుపయోగించుటకు తీవ్రమయినకృషి సలుపుట మంచిది.

ప్రస్తుతము ప్రతియువకుని దృష్టియు రెంటియందు లగ్నమయియుండును. మొదటిది చక్కగా కట్నములతోటి కాగల పెండ్లి; రెండవది జీవనాధారమగు నౌకరీ. విద్యావంతులు విశేషముగానున్నందున చదువుకొన్న యే పదిమందికో ఉద్యోగములు, తక్కిన తొంభైమందికి నిరుద్యోగము. అయితే తొలుత పేర్కొనిన లాభమును పొందుటకు ఏ ఆటంకము లేనందున కట్నములతో కాగల పెండ్లిని దృష్టియందుంచుకొని యువకులు విద్యను సాగించుచున్నారు. ఎరువు తెచ్చుకొన్న నాగరికతగల యువకుని పెండ్లి చేసికొన్న యువతిగతి వివాహానంతరమున ఏవిధమున పరిణమించుచున్నది? యువకుని కుద్యోగము దొరకు

## గృహలక్ష్మి

వేరకను భార్యయొక్క తల్లిదండ్రులమీద నాధారపడి యుండవలసినదే. ఒకవేళ యువకునికి నౌకరీ చిక్కినను సంపాదించు కొద్దిజీతము వాని శృంగారమునకును కాఫీక్లబ్బులకును, సినీమాలకును, ఇతర బాజాఖర్చులకును చాలదుగాన అప్పుడప్పుడు అత్తమామలు అల్లుని కుటుంబపుఖర్చులకు సహాయముచేయక తప్పదు. ఇట్లు జరుగకయున్న అల్లుడు పిల్లతో కాపురముచేయుట లేదు. ఎందుకన యువకుడు గృహస్థాశ్రమ బాధ్యతలు తెలియక లాభమునుద్దేశించియే వివాహము చేసికొనుచున్నాడు. యువకుడు కాలమంతయును పాఠములను వల్లించుటతో పరీక్షలు ప్యాసుచేయుటతో గడపియున్నందున గృహస్థాశ్రమమునందు తల్లిదండ్రులను, అన్నదమ్ములను, అక్కచెల్లెండ్రను అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యను ఏవిధమున నాదరింపవలయునో తెలియును.

పైవిషయములను యోచించుకొలదిని మన నీచ్యా విధానమునందు కలుగనున్న మార్పులతోపాటు చట్టసభలద్వారా వివాహవిషయములందును కట్టుదిట్టము లేర్పడవలసియున్నది. దీనికి సంబంధించిన విషయములను మహిళాసమాజములవారు చర్చించి హిందూ వివాహవిషయమున శాస్త్రవిరుద్ధములేని యేలాటి కట్టుబాట్లు కలుగవలయునో నిర్ణయించి నూతనదంపతులు గృహస్థాశ్రమమునందు అన్యోన్యముగా కాలము గడపుటకై వివాహసమయము నీ యిరువురను అంగీకరింపదగిన నిబంధనల నేర్పాటుచేసి, అట్టి నిబంధనలను అతిక్రమించుటవలన నిరువురకును కలుగగల యిబ్బందులను తెలుపగల స్మృతి నొక్కదానిని నేర్పాటుచేయగలందులకు శాసనసభ్యులకు త్వరలో తెలుపుకొందురని ఆంధ్రదేశములయందలి మహిళా సమాజములవారిని ప్రార్థించుచున్నాను.

---

## మాతృ చింతామణి

గీ॥ మాతృశబ్దంబునందెట్టి మహిమగలదొ
మదినిదలపోసి చూడుడీ మగువలార
మహితసద్గుణఖనియైన మానవతియె
మహిళలకునెల్ల దలమానికంబుసూవె.

అన్నపానాదులనంటక త్యాగియై
బిడ్డలబోషించు ప్రేమమాత
యెట్టియిక్కట్టులు చుట్టుముట్టిననైన
గాసి నొందగనీని కన్నతల్లి

సీ॥ కడుపారగాంచిన కందులశ్రేయంబె
కాంక్షించుకరుణా ప్రపూతమాత
ఏతటినిసువునకేమి వచ్చునోయని
భీతిల్లుకరుణా సమేతమాత

గీ॥ తగుతనమనోరథంబును తనయశంబు
తనదు సర్వస్వమనియెంచి తాల్మితోడ
నురుతరానంద వార్థిలో నోలలాడు
మహిత మంగళమూర్తియే మాతృమూర్తి!

శా॥ ఏవోవచ్చియురాని పల్కులకు దానెంతే ముదంబంది త
ద్భావంబొరసి ముద్దుపట్టుల లసత్కాంక్షల్ వడిన్ దీర్చవే
నీ వవ్యాజకృపారసంబు లొలుకన్ జేయు, తుష్టాత్మతన్
భావంబందుదలంతుమెప్డు నినునమ్మా మాతృచింతామణీ!

పుత్సల. రాజరాజేశ్వరమ్మ.



# గోరక్షణ



“ఆచారః పరమోధర్మః శ్రుత్యుక్తస్స్మార్త ఏవచ
తస్మాదస్మిన్ సదాయుక్తో నిత్యంస్యాదాత్మవాన్ ద్విజః.”

[శ్రౌతస్మార్తములయిన యాచారములే ముఖ్యధర్మములు గనుక జనులమేలు గోరు విప్రుడు ఈ యాచారములందు నెల్లప్పుడు ప్రయత్నపరుడై యుండవలెను.]

భారతవర్షములోని యార్యులేగాక యీ జాతికి చేరిన ఇండోఇరేనియనులు లోనగు విదేశీయులును పశువు—పాడి—వీనియెడ అత్యంత గౌరవము కల్గియుండిరి. ‘హిందూదేశములో గోవుకుగల ప్రాముఖ్యము ఇతరత్ర ఎక్కడను కానము’అని డాక్టరు మెక్‌డొనల్ పండితుడు పేర్కొనుచున్నాడు.

ఆర్యులకు గోవులన ప్రాణసమానము, జీవాధారభూతమగు గోవు పవిత్రమనియు అదివినా ప్రపంచమస్తమించుననియు హిందువుల యభిప్రాయము. నేటికిని గోవు ప్రత్యక్షదేవతగను కొన్నియెడల బ్రాహ్మణునికన్న నెక్కుడుగను భావింపబడును. బుద్ధభగవానుడు బ్రాహ్మణికయజ్ఞయాగాదులకు స్వస్తి చెప్పినాడు. జీవకారుణ్యమే జీవగఱ్ఱగా బౌద్ధభిక్షుకులు తిరుగుచుండిరి. పశువైద్యశాలలు స్థాపించిరి. అశోక, హర్షవర్ధనుల రాజగృహంబులందు పశుబలి నిషేధింపబడుట జగద్విదితము. మృగముల—అందు గోవుల—జీవనము పవిత్రతమమని యీ యుగమున గుర్తింపబడిన ధర్మము. ఇదియే ఆర్యధర్మమయి నేటికిని అనుసరింపబడుచున్నది. ఎన్నడుగాని గోరక్షణయెడ నెవరుగాని యుపేక్షాభావము చూపియుండలేదనుట క్రింది నిదర్శనలు చాలును.

మార్కోపోలో అను సుప్రసిద్ధుడు బాటసారి (క్రీ॥ శ॥ 13 శతాబ్దమువాడు): “ఈ రాజ్యమున గోవన్న ప్రత్యేకగౌరవము చూపెదరు. ఏకారణముచేగాని పశుమాంసము నెవరును భుజింపరాదు...”

కర్ణాటకరాష్ట్రమున సంచారము సల్పిన బుచానన్‌గారు: “ఇక్కడ గోవును ప్రత్యక్షదైవముగ కొనియాడుచున్నారు. కొన్ని గ్రామములలో ఒండు రెండావులకు కొన్ని పుణ్యదినములందు పూజసలుపుదురు...”

మార్కోపోలో మరొక్కచోట “యుద్ధరంగముజొచ్చునపుడు ఒకయెద్దు పెంట్రుకను తీసి తన గుఱ్ఱముమెడకు ప్రతిసైనికుడును కట్టుకొనును. ఇట్లుచేసిన నెట్టి యాపదకు నతడు లోనుకాడట...”

అబ్బే డుబాయి(18 శతాబ్దము)హిందూదేశమున సంచరించుచు నిట్లు పేర్కొన్నాడు. “గోమాంసమును తినుట పరమనిషేధము.

తన్నామోచ్చారణయే కడుహేయముగ కడుహీనముగ హిందువులు భావింతురు.'

పై వాక్యములవల్ల హిందువులకు గోవు నెడ నెట్టి యున్నతభావములుగలవో సులభముగా నూహింపవచ్చును. గోహత్య ఉపపాతకమని మనువనినాడు. వసిష్ఠుడును గోవునకు మహోన్నతస్థాన మొసగినాడు.

చారిత్రికముగా గోసంరక్షణయొక్క వివిధదశల పరికింపవచ్చును. ఎట్టిమృగమును గాని చంపకూడదని అశోకుడు నిషేధించి నట్లీవఱకే గుర్తించియున్నాము. అశోకుని యనేక శిలాశాసనము లిందుకు ప్రబల నిదర్శనములు. తన రాజ్యములో సైతమిట్టి హత్య కొడిగట్టినవారు హెచ్చుదండనకు పాత్రులయ్యెదరని శాసించినాడు. ఇతని మరణానంతరము సుమారెనిమిదివందలేండ్ల దాక బౌద్ధధర్మమే దేశమును పాలించెడిది. ఇది కేవలము అహింసాపద్ధతులపై నిర్మింపబడిన ధర్మము. మరల హర్షవర్ధనుడు సింహాసనమధిష్ఠించిన పిదప అతని ప్రభుత్వమే అశోకునివలె బౌద్ధధర్మమైన గోరక్షణకు కంకణము కట్టుకొన్నది.యువాన్‌చువాంగు ప్రకారమితని రాజ్యములో పశురక్తము స్రవించ గూడదు; దానికి మరణదండనయే తగు శిక్షయట. హర్షవర్ధనుడు బౌద్ధమతావలంబి.

హర్షవర్ధనుని యనంతరము దేశమున అశాంతిప్రబలినది. అరాచకమెచ్చెను.ఒకరిపై మరొకరు యుద్ధముచేయుచు ఓడుచు గెలుచుచున్నను గోరక్షణయెడ మాత్రము హిందువులు పట్టుసడలించలేదు. కాశ్మీరరాజగు గోపాదిత్యుడు (6 శతాబ్దము) తన రాజ్యములో పశువిశసనము-యజ్ఞమునందుదప్ప- గావింపరాదని శాసించినట్లు రాజతరంగిణిలో కల్హణుడు పేర్కొనుచున్నాడు. 12 శతాబ్దమువాడగు గుజరాత్ ప్రభువు కుమారపాలుడు జైనమతమునకే యవలంబియయ్యెను. ఒకపేను చంపినదానికి ఒకధనికుడు తనయాస్తి సర్వస్వము ధారపోసికొనెనట కుమారపాలుని రాజ్యమున. ఈ ప్రభువు నకు అశోకు ననుకరించుటయందాస్తమెండు.

మహమ్మదీయులలో సైతము విశాల హృదయచక్రవర్తులు లేకపోలేదు. మొగలాయి చక్రవర్తులందు ప్రథముడగు బాబరు గోవులెడ పక్షపాతిగా తోచును. ఎన్నో విందుల నతడు సూక్ష్మాతిసూక్ష్మముగా వర్ణించెను గాని యెచ్చటగూడ పశుమాంస స్మరణమే లేదు. ఇంక కొంతసేపటికి మరణింపనున్న బాబరు తన కుమారుడు హుమయూనుకు హితవొసంగుచు పశుహత్య మాన్పింపగోరినాడు. హుమయూన్‌కాలమున గమనింపదగినదేదియు లేదు. అక్బరు పట్టమునకు వచ్చెను. ఇతడు గోరక్షణ విషయమున అశోకునంతటి ప్రతిభ పట్టుదల గలవాడు.

అక్బరు ఏ ఒక్క మతమునందును ప్రత్యేకముగా పక్షపాతము వహించలేదు. అన్నిటిని సమానదృష్టితో చూచు విశాలహృదయుడు. ఇతడు మాంసమన్న మిగుల

రోయువాడు. జైనులవలె జీవకారుణ్యాభిలాషి యితడని నొక్కి వక్కాణించవచ్చును. కొన్ని దినములందు తన సామ్రాజ్యములోని ప్రజలు మాంసమునే ముట్టుకోరాదని శాసించినాడు. గోవన్న ఇతనికి ప్రాణముతో సమానమని యితని లెక్కకు మిక్కుటంబులగు శాసనములు చెప్పక చెప్పుచున్నవి.

అక్బరు శాసించిన పద్ధతులనే యితని తరువాతి చక్రవర్తులు నడపిరి. జహంగీరు, అవురంగజేబుకూడ గోరక్షణయందు మిక్కిలి శ్రద్ధచూపిరి. అక్బరు పుట్టిన దినమున జంతువుల చంపరాదని జహంగీరు శాసించినట్లు శత్రుంజయశాసనము తెలుపుచున్నది. తాను చేయవలసిన యుద్ధసమయములందు పెక్కుజంతువులు మరణించిన దానికి ఔరంగజేబు మిక్కిలి వగచినాడట. మహమ్మద్ షాహా షాఆలం లోనగు తర్వాతి మొగలాయిప్రభువులు సైతము పశురక్షణ ప్రాముఖ్యమును గమనించిరని ఇస్లామి గోరక్షణవారి యభిప్రాయము.

గోరక్షణగూర్చి తిరుగా ఛత్రపతి శివాజీమహారాజు శ్రద్ధవహించుట చరిత్రాంశము. తనకు పంద్రెండేళ్లనాడు బిజాపుర సుల్తానువద్దకు వెళ్లియున్నప్పుడు శివాజీ యీ క్రిందివిధముగా వచించినాడు. "మనము హిందువులము, వారు యవనులు. వా రత్యధమజాతికి చెందినవారు. వారికి సలాముచేయుట పరమదోషము. గోహత్యలోనగు పాతకములకు వా రొడిగట్టుదురు. ఇది నాకు త్రికరణశుద్ధిగా మిక్కిలి యసహ్యము ....."

మొగలాయి, విజయనగర, మహారాష్ట్ర సామ్రాజ్యపతనానంతరము దేశమున గోవునెడగల భక్తి శ్రద్ధల దెలుపు నిదర్శనములు చాల గనబడవు. పదునెనిమిది, పందొమ్మిదవ శతాబ్దులలో దేశము యావత్తు యుద్ధముల మునిగియుండెను. బ్రిటిష్‌వారు వ్యాపారార్థమువచ్చి తిన్నగా దేశమును ఆక్రమించుకొనిరి. కావుననే యీయుగమున హిందూరాజులు గోసంరక్షణకై ప్రత్యేకతత్పరత చూపెట్టలేదు కాబోలు. అయినను హిందూప్రజ లెప్పటియట్లు తమభక్తి గోవునెడ చూపుచునే యుండిరనుట కల్లగాదు. పశుమాంసముతో తుపాకులమందు చేయుచున్నారనెడి హిందూ సిపాయీల నమ్మకమే సిపాయికలహమునకు కారణమను టందఱెఱిగినదే.

కాశ్మీరములో మహమ్మదీయుల సంఖ్య యెక్కువయ్యు, నేపాలు ఎక్కడనో హిమాలయమున కానుకొని వేరుగానుండిపోయియు, నీ రెండు రాజ్యములును ఇటీవల ధేనుసంరక్షణమున నెంతో ప్రాముఖ్యమును గన్నవి. పశుహింసకు ప్రబలశిక్షయున్నది. జోదుపురములో చాలానాళ్లుగా పశుహత్య నిషేధింపబడియున్నది. మీదుమిక్కిలి యీ సంస్థానమునుండి ఆవులు, గొఱ్ఱెలు, మేకలు వీనిని ఎగుమతి చేయకూడదు. సొండూరు (బళ్లారి) సంస్థానమున పశుహత్య నిషేధించబడినది. కొన్ని రాష్ట్రీయప్రభుత్వములు

(మధ్యరాష్ట్రము)కూడా ఇట్టి నిషేధాజ్ఞల అములుకు దెచ్చియున్నారు.

గోరక్షణకై కొన్ని సంవత్సరములుగా ఒక అఖిలభారతసంఘమేర్పడి కాంగ్రెసుతో కూడా సమావేశమయ్యెడిది. గాంధీమహాత్ముడు తత్సంఘపోషకుడు. జీవకారుణ్య సంఘములు యావద్భారతదేశమునందును ఏర్పడినవి. మద్రాసునందట్టిది (S. P. C. A.) 1877లో స్థాపింపబడినది. ఇది ఒక గోరక్షణకుమాత్రము సంబంధించక యెల్ల మృగములయెడను జూపు క్రూరత్వమును నశింపజేయు నుద్దేశముగలది. ఇందలి ఇన్‌స్పెక్టర్లకు పోలీసులవలె కొన్ని యధికారములు గలవు. యు. పి. రాష్ట్రములో నిట్టిదే ఇస్లామి గోరక్షణ అని పరగుచున్నది. కలకత్తాలో జస్టిస్ సర్ నలినిరంజన చటర్జీగారి ఆధిపత్యముక్రింద పశ్వభివృద్ధి సంఘము 1922లో స్థాపింపబడి నేటికిని వెలయుచున్నది. బొంబాయిలో 1923లో జీవకారుణ్య సంఘము నెలకొల్పి దానికి మణికలాల మెహతాగారు కార్యదర్శిగా పనిచేయుచున్నారు. బెంగళూరులో సర్ పుట్టణ చెట్టిగారి అగ్రాసనాధిపత్యమునను పహోచిమనలాలు కార్యదర్శిత్వమునను ఒక గోరక్షకమండలి పనిచేయుచున్నది. ఇంకను లెక్కలేని యిట్టి సంఘములు సర్వత్ర పరగుచు జీవకారుణ్యముకై యెంతో కృషి సలుపుచున్నవి.

నేడు హిందూదేశమున 'పింజరపోలు' సంస్థ నెలకొన్నది. బొంబాయిలో ఒక మార్వాడి లేక గుజరాతి గృహంబున కొన్ని పశువులకు పచ్చిగడ్డిపెట్టుట నేటికిని కన్నులపండువుగా చూడవచ్చును. అచ్చపు పాలు ఈ పింజరపోలులోనే దొరకును.

"ప్రయాగజైనులు స్థాపించిన మృగములకైన ఆస్పత్రి పశువునకు మనుష్యునకు గల సన్నిహిత సంబంధము గోచరింపజేయును. ఇట జంతువులన్నియు మిక్కిలి ఆరోగ్యము కల్గియున్నవి. వీధుల జూచువానికి నిచటి మృగములకు నిజముగా హస్తిమశకాంతరభేదమున్నది. జంతువులయెడ జైనులు సల్పిన సేవకు నిది ప్రత్యక్షనిదర్శనమనవచ్చును. అంత ఆనందదాయకముగ నున్నది" అని ఆ వైద్యశాలను దిలకించిన మోర్స్బిగారు పక్కాణించుచున్నారు. ఇట్టి పవిత్రాశయముల నింకను వెదజల్లుటకు అన్ని రాష్ట్రీయప్రభుత్వములును పూనుకొనుగాక!*

---

1 "Cow Protection in India" by Dr. Lanka Sundaram అను గ్రంథమున తుది యధ్యాయము ననుసరించి.

# కథ ఎట్లా ఉండాలె

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

'రాజేశ్వరీ! మీకథలు యేమి బాగున్నాయండీ అని అంటూనేఉన్నావు వాటిమీద దినదినమూ ప్రశంసాపూర్వకవిమర్శలు పత్రికలో వెలువడుతూనే ఉన్నవి.' అంటూ లోపలికి వచ్చాడు రాఘవరావు హౌసుహాలునుండి వస్తూనే.

రాజేశ్వరి అందుకు బదులేమీ చెప్పకుండా నవ్వి వూరుకుంది.

'మధురభారతీ' పత్రిక యిప్పుడే హౌసుహాల్లో చూచివచ్చాను. దానిలో నాకథాసంపుటిపై యెటువంటి విమర్శకవ్యాసం పడ్డదనుకున్నావు! నాకెఱుకలేని శిల్పమూ సౌందర్యమూ మధురిమా నాకథల్లో ఉన్నదని సోదాహరణంగా యెత్తిచూపాడా విమర్శకుడు' అన్నాడు రాఘవరావు మురుస్తూ.

'ఆవిమర్శకు డెవరు? మీ స్నేహితుడేగాదూ?' అన్నది రాజేశ్వరి కొంచెం పరిహాసంగా నవ్వుతూ.

'ఎబ్బే స్నేహితుడుగాడు.'

'పోని మీమిత్రమండలి సభ్యుడా?'

'ఏమో తెలియదు.'

'పేరు వ్రాయలేదా?'

'పూర్తిపేరు వ్రాయలేదు. సో. సూ. పొడిఅక్షరాలున్నవి.'

'మీస్నేహితుడు కాకుండా ఉండదు బాగా జ్ఞాపకం చేసుకోండి.'

'సరి సరి. యింకా అంత మతిమఱపురాలేదు, బహుళా అతడు నాస్నేహితుడుగాడు.'

'అదిగో బహుళా అంటున్నారే, ఏదో దూరపు స్నేహితుడై ఉన్నట్టున్నాడు.'

రాఘవరావు పక్కుననవ్వి 'బంధువుల్లో దూరపు వాళ్లనీ, దగ్గరవాళ్లనీ ఉండటం యెఱుగుదుం. స్నేహితుల్లో ఈమాట నీవల్లనే వింటున్నాను.'

'ఒకవేళ మీక్లాసుమేటేమో. ఆలోచించారూ?'

'ఎందుకింత తీవ్రశోధన? ఎవరైతేనేమి?'

'మీమీద ప్రశంసాత్మకవ్యాసం వ్రాసేవాళ్లు మీ స్నేహితులై ఉండవలెగదా అని.'

'విమర్శకు మిత్రులే కావలెనా? వస్తువు నాణెమైందయితే యెవరైనా బాగున్నదంటారు.'

'కానప్పుడు?'

'ఓ యిదా నీ అనుమానం? మా స్నేహితుల్లో రంధ్రాన్వేషణ పండితులేయెక్కువ. బాగా లేని దాన్ని బాగాఉన్నదని వాళ్లు యెన్నటికీ అనరు.'

'అది యితరుల నెఱసుల నెన్నడంలోనేమోగాని మీలో మీకుగాదు.'

'మాలో మేము విమర్శించుకోమా?'

'మీమిత్రమండలివారు మంచి కలిసికట్టుతనం గలవాళ్లు. ఒకరికొకరు ఆదుకుంటూ ఉండటం మీ సభ్యరీతి.'

'అంటే—'

'మీమండలివారిలోనే ఒకరు గ్రంథం వ్రాయడం, యింకొకరు పీఠికవ్రాయడం, మరొకరు దానిని పత్రికాముఖాన ప్రశంసించడం, దాని నెవరైనా కాదని పొరబాటుగా అంటే వేరొకరు వారిని గట్టిగా మందలించడం. ఆవిధంగా జయించుకొస్తున్నారు. మీరు యెంతెంతవారినీ మొత్తంమీద మీ కలిసికట్టుతనానికి ముచ్చటవుతున్నది.'

'అయితే మారచనలు బాగా ఉండకపోయినా మాప్రచారంవల్లనే వ్యాప్తికి తెస్తున్నామని నీఅభిప్రాయమా?'

'మీకు బాగానే ఉంటవిలెండి. మీలో మీకే బాగుండకపోతే యింత అట్టహాసం యెందుకుచేస్తారు?

ఇతరులబాగోగుల పరిశీలనతో మీకు నిమిత్తంలేదు. మీమిత్రమండలి ప్రచురించేపుస్తకాలు, పీఠికలు, అభిప్రాయాలు విమర్శనలు అన్నీ చూస్తూఉంటాము గదా. అపరిచితమైన పేర్లుదప్ప క్రొత్తవి కన్పడవు. ఇవ్వాళ మీమధురకథాసంపుటిపై వారుప్రశంసావాక్యాలు కురిపిస్తే రేపు వారికన్నిటి కెరటాలపై మీరూ, మొత్తంమీద ఒకరిరచనలకొకరు వందిమాగధులు కావడం మీ పద్ధతి.'

'మా నవీనరచయితల నీవింతనవ్వటాలు పట్టిస్తున్నావుగాని మేము కలంపట్టినతర్వాతనే వ్యవహారభాషకూ గేయకవితకూ, భావగీతాలకు, కథారచనకు చక్కనిబాట యేర్పడ్డది. నేడు కథకూ, గీతానికీ, చోటివ్వని దినపత్రికగాని, వారపత్రికగాని, పక్షపత్రికగాని, మాసపత్రికగాని, వార్షికపత్రికగాని, ఒక్కటైనా ఉన్నదేమో చూపగలవా? ఇది మానవ్యసాహితీపరుల పరిశ్రమాఫలితమని చెప్పకొని గర్వింపవలసినవిషయమే నంటావా? కాదంటావా?'

'ఈమాత్రానికి గర్వించవలసినవిషయం యేమీ లేదు. కథావాఙ్మయంగాని గేయవాఙ్మయంగాని ఆంధ్రభాషావధూటికి సరిక్రొత్త సొమ్ములుగావు. భట్టివిక్రమార్కుడికథలు, కాశీమజిలీకథలు, పంచతంత్రం కథలు, పన్నిద్దరురాజుల కథలు, అంటూ యెన్నెన్నోకథలు అనాదినుంచీ మనదేశంలో వాగ్రూపకంగానూ గ్రంథస్థంగానూగూడా వాడుకలో వున్నవి. ఇక మాజోలపాటలు, దంపుళ్లపాటలు మున్నగుపాటల్లో ఉన్నమాధుర్యం ఏభావకవితకూ తీసిపోదుగదా. మానవులకు కథాప్రియత్వం సహజసిద్ధం. మనచిన్నవాడు చూడండి కథంటే యెంత చెవికోసుకుంటాడో. కథచెప్తానంటేసరి అదేమిచిత్రమో ఎంతయేడ్పూ మానుతాడు. అభము శుభమెరుగని పసిబిడ్డగదా వాడికెందుకు కథంటే అంత ప్రేమ! పిల్లలేగాదు పెద్దవాళ్లకూ కథంటే ప్రాణమే. మొన్న మాసమాజభవనంలో బాలికాసమ్మేళనంజరిపి పిల్లలకు చెప్తూవుంటే పెద్దవాళ్లుగూడా చెవులు దోరగిలబెట్టి విన్నారు ఎంతోశ్రద్ధతో. అందుకనే కథాప్రియత్వం మానవులకు సహజసిద్ధమని అంటున్నాను. కనుక తెలుగువారికి ప్రీతి మేము కలుగచేశామని మీరు డెబ్బ చఱుచుకుంటే మేము ఒప్పకోము. అసలు బిడ్డలకువలెనే కథలకుకూడా మాతృత్వం మాది,' అన్నది రాజేశ్వరి సగర్వంగా.

ఆమాటలువిని రాఘవరావు పకాపకనవ్వి 'ఇప్పటికి గుట్టుబయటబడ్డది. ఎన్ని మెలికలు త్రిప్పైనా యేయొక్కగౌరవమూ మీసంఘానికి చెందించాలని చూస్తావు. పాపం! నీజాత్యభిమానం అసమానం' అన్నాడు.

'అయితే నేనుచెప్పింది అబద్ధమంటారా? నిజం ఆలోచించండి. మీశైశవంలో మీకు కథా ప్రీతి కల్గించినది మీతల్లిగారు. నాకు కల్గించింది మాఅమ్మ. నేనూ మీరూ యేమిటి లోకంలో ప్రతితల్లీ ప్రతిబిడ్డకూ కథాబోధవల్లనే ప్రపంచజ్ఞానం కలుగజేస్తున్నది. కనుక మీరేమన్నా నవ్వండి, సౌధానికి పునాది మాది. వృక్షానికి బీజావాపం మాది.'

'సరేసరే కానీ, నీవు యేదో తిప్పలుపడి మీస్త్రీసంఘానికి ఆధిక్యత కలిగించాలెనని ప్రాకులాడుతుంటే నేనెందుకు కాదనాలె. నీవేగాదులే. ఇప్పుడు మతాలవారేమి; కులాలవారేమి; వృత్తులవారేమి; అందఱూ యిదేపద్ధతి. ఏపాతపురాణాలో పెళ్లగించి ఏయొక్కగౌరవమూ తమసంఘానికి చెందించవలెనని పాట్లుపడుతున్నారు. అట్లాగే నీవూ.'

'సత్యమైనా అంగీకరించకుండా మనుష్యులను డీలాచేయడంలో మీకున్నంతనేర్పు యెవ్వరికీలేదు.'

'నాకథలు బాగున్నవని లోకమంతా పొగుడుతూ ఉంటే నీవు బాగున్నాయని ఒప్పకుంటున్నావా?'

'ఓహో అందుకు బదులాయిది? మీకథలు బాగున్నాయని అంగీకరించడానికి నాకేమీ అభ్యంతరంలేదు. మీరూ యేదో చాకచక్యంగా నే



గృహోన్ముఖం



శ్రీమతి జి. నరసమ్మగారు, నర్సాపురం,

వయస్సు 20 సం.

1928 సం. నాటకమున సుందర పాత్రకు రజిత పతకమును, 1932 సం. N. T. P. Union వారి పోటీపరీక్షలో రజితపతకమును, 1936 సం. స్త్రీల సంగీత పోటీలలో వెండిపతకమును, 1938 సం. శ్రీరవీంద్ర సారస్వతసమాజంవారి చెల్లాయమ్మ సారస్వత పోటీపరీక్షలో ప్రథమ బహుమతి రు. 25ను పొందిరి.

వ్రాస్తారు. కాని ఉత్తమశ్రేణికి చెందించడానికితగిన లక్షణాలు మీకథలకింకా తక్కువే అని నా అభిప్రాయం. ఉండవలసినలక్షణాలన్నీ లేనప్పుడు సర్వాంగసుందరంగా ఉందని ప్రశంసించడం నాచేత గాదుసుమండీ. అయినా మీకథలను నాచేత బాగా విమర్శింపజేసి లోపాలు తెలుసుకుంటే మీకు లాభం గాని బలవంతపెట్టి బాగున్నా యనిపించుకుంటే ఏమి ప్రయోజనము చెప్పండి?' అన్నది రాజేశ్వరి.

యింతలో వంటమనిషి సుబ్బమ్మ వంటయింట్లో నుంచివచ్చి మెల్లగా 'అమ్మగారూ!' అన్నది. 'అవునండోయి మఱచిపోయినా. మనం త్వరగా భోజనాలు కానివ్వాలె. యివ్వాళ సుబ్బమ్మ కనకతార చూడటానికి పోతానని పెందలాడేవచ్చి వంటచేసి మీకోసం కనిపెట్టుకొని కూర్చున్నది. మనం త్వరగా భోజనాలు చేస్తేనేగాని ఆమెపనిఅయి రెండోఆటకు అందుకోలేదు' అన్నది రాజేశ్వరి. 'ఏముందా కనకతారలో డబ్బిచ్చి యేడ్పుకొని తెచ్చుకోడమేగా. సరే సిద్ధం వడ్డించమను వస్తున్నా' అన్నాడు రాఘవరావు.

రాజేశ్వరి దొడ్లోకిపోయి పెనిమిటికి కాళ్లు కడుక్కునే నీళ్లుతెస్తూ 'సుబ్బమ్మా! నాకు గూడావడ్డించు నీకు పని త్వరగా తెములుతుంది' అన్నది. సుబ్బమ్మ యిద్దటికీ వడ్డించడానికి వెండి పళ్లాలు పెట్టింది. రాఘవరావు కాళ్లుకడుక్కొని ఉతికిఆరవేసిన చెంగాయిపంచె కట్టుకొని తువ్వాలు బుజానవేసుకొని భోజనాలయింట్లోకి వచ్చాడు. అతనివెంటనే రాజేశ్వరిగూడా వచ్చింది. 'పిల్లలు అన్నాలు తిన్నారా యేమి'టన్నాడు రాఘవరావు.

'అవును. వాళ్లకు వంటకాగానే పెట్టేశాను తిని నిద్రపోయినారన్నది' రాజేశ్వరి.

౨

భోజనాలు తొందరగా కావాలెనని అనుకుంటూ ఉండటంచేత భోజనాలవద్ద మాటలు పెట్టుకోకుండా త్వరగా తినిలేచారు రాఘవరావు రాజేశ్వరి. రాజేశ్వరి భోజనానంతరం కూరలు వగైరాలు సర్దుకుంటూ వుంటే రాఘవరావు వరండాలో పచారుచేస్తున్నాడు. సర్దుబాటుపూర్తై రాజేశ్వరి తములపాకుల పాండాను తీసుకొని సావిట్లోకి వచ్చేటప్పటికి రాఘవరావు గూడా పచారుముగింపుచేసి సావిట్లో పడకకుర్చీలో వచ్చి విశ్రమించాడు. ఇంతలో సుబ్బమ్మ అదరాబాదరా తానుగూడా అన్నంతిని వెండికంచాకడిగి తెచ్చి రాజేశ్వరికియెదురుగా బోర్లించిపెట్టి పాలకుండతెచ్చి నడవాలోపెట్టి యిల్లుకడిగి తలుపులు వేసివచ్చి, 'అమ్మగారూ నేను వెళ్లుతున్నాను. పాలు వేడిగావుంటే నడవాలోపెట్టాను కొంచెంతాళి తోడు వేసుకోండి' అన్నది. 'సరే, వెళ్లు. ఇదిగో పావలా తీసుకపోయి టిక్కట్టు కొనుక్కో. వేళైంది త్వరగా వెళ్లు' అని రాజేశ్వరి సుబ్బమ్మను పంపించింది.

సుబ్బమ్మ వెళ్లగానే రాఘవరావు రాజేశ్వరివంక చూచి 'రాజేశ్వరీ! యిందాక నాకథల్లో లోపాలేమిటో వెల్లడిస్తానంటివే, ఏదీ కొంచెం వెల్లడించూ' అన్నాడు.

'ఏదో తమాషాకంటె ఆమాటే పట్టుకున్నారేమిటి?'

'తమాషా యేమిటీ నేను వొప్పుకోను. విమర్శింపజేసి లోపాలు తెలుసుకోడం ప్రయోజనమని నీవు చెప్పుతున్నప్పుడు ఆప్రయోజనం అర్ధాంగలక్ష్మివైన నీవే కలుగజేస్తానంటున్నప్పుడు ఆ అవకాశం నేనెందుకు పోగొట్టుకోవాలె?'

'నేను మీ కథలమాటే చెప్పలేదు సుమండీ. మొత్తం యిప్పటి కథలమాటన్నాను.'

'ఓ మఱీమంచిది. నామీద ఆరోపణలేకుండా వినడమంటే మరీమంచిదేగా. కానీ, త్వరగా నాకు మళ్లీ నిద్రవస్తుంది.'

'నిద్రవస్తే పోండి. ఈచర్చల కేమి యివ్వాళ కాకపోతే రేపు.'

'అట్లాగాదు. శుభస్య శీఘ్రమన్నాడు. ఈ సంగతి యిప్పుడే తేల్చుకోవాలె. లేకపోతే నిద్ర వచ్చినా తేలిపోతుంది. హాయిగాపట్టదు.'

'ఏదైనా ఒకకథ వ్రాశామూఅంటే అది సర్వ విధాకర్షణకలదిగా ఉండాలె.'

'అనగా కొంచెం వివరంగా సెలవివ్వాలె.'

'అబ్బా! మీతో మాటమాట్లాడితే యిదేతంటా. మాటమాటకు వెక్కిరిస్తుంటారు.'

'కోపపడకు. ఆటలోదెబ్బ అరటిపండు.'

'మనోహరమైన ఒక గులాబిపువ్వుయొక్క ఆకృతి, రంగు, మృదుత్వము, పరిమళము, మకరందము మనల నెట్లా ఆకర్షిస్తూ ఉంటాయో అల్లాగే కథాకుసుమంగూడా కల్పన అనే ఆకృతీ, వర్ణన అనే రంగూ, శైలి అనే మృదుత్వము, రసమనే పరిమళము, నీతి అనే మకరందము గలిగి ఆకర్షవంతమైనదిగా ఉండాలె. ఇందులో యేదిలోపించినా కథాకుసుమం రాణించదు. ఇప్పుడు వ్రాయబడే కథల్లో ఒకటుంటే ఒకటుండదు. చూస్తున్నారో లేదో!'

'నీవు పొరబాటుపడుతున్నావు. ఇప్పుడు వ్రాయబడే కథలన్నీ నీవు చెప్పిన లక్షణాలన్నీ కలిగే ఉంటున్నవి. విను. కల్పనలో మా నవీనులు అసదృశులుగదా.'

'అసభ్యకల్పనలో ఫస్టు.'

'ప్రకృతే మా విహారమందిరం గనుక, మేము ప్రకృతి ఉపాసకులమే గనుక సహజవర్ణనావైదగ్ధ్యంలో మా కెవరూ సాటిరారు.'

'సహజమని ఉచితానుచితా లెఱుగకుండా అన్నీ వర్ణిస్తే అసభ్యమనిపించుకుంటుంది. యిప్పటి కథలు వెగటు పుట్టించడానికి ముఖ్యకారణము యిటువంటి వర్ణనలుండటమే. వర్ణన సహజమైనా ఉచితాన్ని మీరగూడదు.'

'మార్దవం మన తెలుగుభాషలోనే సహజంగా చెఱకుముక్కలో తీపిలాగావున్నది గనుక దానికి ప్రత్యేకంగా ప్రాకులాడవలసిన పనేలేదు.'

'సహజంగా ఉంటేనేమి ఉపయోగించేవారి నేర్పునుబట్టే మృదువు మృదువుగా కనపడుతుంది. మృదువైన మన తెలుగులోనే కఠోరశబ్దజాలంతో గూడిన గ్రంథా లెన్నిలేవు. వసుచరిత్ర పాండిత్య విశేషంచేత గొప్ప గ్రంథమైనప్పటికీ మృదుత్వం లేకపోబట్టే గదా మనుచరిత్రంత లాలిత్యంగలది కాదనుపించుకొంటున్నది.'

'రసమంటావా? ప్రతికథలోనూ యెక్కీ తక్కీ ఇది రసయుగం ఇప్పటి కవులందఱు రసజగద్విహారులు. కనుక రసవిషయమై నీవు చెప్పిన ఆక్షేపణ చెల్లనేచెల్లదు.'

'రస మెప్పడూ పూవిలో తావివలె వాక్యంలో మిళితమైయుండాలె. అందులో హాస్యరసం విషయంలో యిది యెంత గర్భితంగాఉంటె అంత మనోహరంగా ఉంటుంది. నవ్వించడానికే అని వ్రాసే అకటావికటపు వ్రాతలు చక్కలిగిలిపెట్టి నవ్వించినట్లు మొరటుగాఉంటాయి. హాస్యానికి ప్రత్యేక రూపు యివ్వడం పామరజనరంజకమేగా పండిత హృదయాహ్లాదకరం గాదు. ఏరసమైనా ప్రయత్నపూర్వకంగా పైకిచిందిస్తే అసహ్యంవేస్తుంది. ఒక కథలోనే గాదు. ఉపన్యాసంలోనైనా హాస్యం అధికంగా కనిపిస్తే వికృతంగా ఉంటుంది. కూరలో ఉప్పువేయకపోవడం యెంత అరుచికరమో, అధికంగావేయడమూ అంత అరుచికరమే. కనుక కథకూ ఉపన్యాసానికీ అన్నిటికీ రసమవసరమే. కాని దేనికీ మితత్వమే సొగసు కూరుస్తుంది. ఆమధ్య టౌనుహాల్లో యెవరో పండిత కవిగారు ఉపన్యాసమిస్తారని పిలుచుకుపోయినారు జ్ఞాపకమున్నదా? మాట మాటకు నవ్వించాడాయన. వుపన్యాసం విన్నంతసేపూ ఆయికిలించడం బాగానేఉన్నది. తీరా యింటికి వచ్చేటప్పటికి యింత ఉపన్యాసంలోనూ నిలవజేసుకోడానికి యేమి కన్పడలేదేమా అని ప్రాణం ఉస్సురు మనిపించింది.'

'అదే నీ తెలివితక్కువ. నిలవేమి చేసుకోవాలె. ఆయన గొప్ప విద్వత్కవి. మంచి చమత్కారి. కమ్మనిపద్యాలు చదివాడు. వినోదకరమైన విషయాలు చెప్పాడు. అందఱు ఉల్లాసంగా విన్నారు. ఆనందించారు. యింకా యింటికేమి తెచ్చుకోవాలె.'

# కథ ఎట్లా ఉండాలె

'కాదండి. ఒక మహాపండితుడు చేసిన ఉపన్యాసం విని నవ్వే శేదిగానైనా ఉండవలసింది? జ్ఞానమధువును కొంచెమో గొప్పో సేకరించుకోవలసిందిగా ఉండవద్దా? గులాబిపువ్వు సౌందర్యము, సౌరభమూ, సౌకుమార్యము ఒక్క నాటితో నశించిపోతుంది. దానినుండి మధుపముగూర్చిన తేనె యెంతకాలముంటుందో యెన్నిటికి వినియోగిస్తుందో చూచారా? అట్లాగే ప్రతిరచనలోనూ ప్రతిప్రసంగంలోను నైతికమైన లేక వైజ్ఞానికమైన ఒక సత్యవస్తువుకూడా ఉండాలె. అట్లాఉంటేనే రచయితయొక్క శ్రమ సార్థకమౌతుంది. ఆవిధంగా కాకుండా యిప్పటి మీ నవీనరచయితల్లాగా తాత్కాలికోల్లాసమే కథయొక్క ఉద్దేశ్యమైతే అందు ప్రణయవ్యవహారాలే కథకు ముఖ్యవస్తువైతే అంతకంటె మంచివి మీరు వ్రాయలేకపోతే అవేతప్ప పాఠకులకు రుచించకపోతే కథలు, కథకులు, కథాపాఠకులుగూడా భ్రష్టమార్గంపట్టినారనే చెప్పవచ్చును' అంటూ రాజేశ్వరి ఏదో జ్ఞాపకం వచ్చినట్లై చివాలునలేచి లోపలికి వెళ్లింది.

రాఘవరావు తింటూతింటూ ఉండగా అయిపోయిన రుచిరపదార్థంకొఱకు యెదురు చూస్తూవున్నవాడిలాగా కుతూహలంతో రాజేశ్వరి రాకకెదురుచూస్తూవున్నాడు.

రాజేశ్వరి పాలల్లో తోడువేసి ఉట్టిమీదపెట్టి మూతపెట్టి 'మాట్లాడుతూ కూర్చుంటే పాలు చప్పగా చల్లారిపోయినాయి సుమా' అంటూ సావిట్లోకి వచ్చింది.

'అవును. ఏపనైనా పదునుమీద ఉండగానే చెయ్యాలె. ఇప్పటి నీ విమర్శకవాదంగూడా అంతే చప్పగా చల్లారితే నిస్సారమే అయిపోతుంది. వేడిమీద ఉండగానే కానివ్వమన్నాడు' రాఘవరావు.

"కథలలో ఉత్తమ మధ్యమాధమాలున్నాయి. శైలీ మాధుర్యము, వర్ణనాచాతుర్యము, కల్పనా సౌందర్యము, రసౌచిత్యము, నైతికాదర్శముగలవే ఉత్తమశ్రేణికి చెందిన కథలు. ఇటువంటి కథలు వాఙ్మయంలో స్థిరమైన స్థానం సంపాదించుకుంటాయి. ప్రజాదరం పొందుతాయి. ఏటికి పాతగిలిపోవడమంటూ ఉండదు. రవీంద్రుని కథలు యిటువంటి శ్రేణికి చెందినవే. అతడు యేనీతినీ, యే ధర్మాన్నీ వెల్లడిగా యేకరువుపెట్టడు. అయినా ప్రతికథా ఏదో ఒక ఉత్తమాదర్శాన్ని వ్యక్తీకరిస్తూనే ఉంటుంది. ఒకకథలో ఒక అధర్మాన్ని అతడు నిరూపించాడూ అంటే ఆ అధర్మము తనజీవితంలో యెప్పుడూ చేయడానికి సాహసింపజాలనంత గాఢంగా పాఠకుడి హృదయంలో నాటుతాడు అతడు. అన్నిగుణాలుగలిగి నైతికాదర్శం లుప్తమైనవే మధ్యమతరగతి కథలు. ఈ నడిమిరకం కథలుగూడా జవము జీవముగల భాషలోనే వ్రాయబడుతవి. వర్ణనగూడా సహజంగానే ఉంటుంది. పాత్రపోషణాది కల్పనావిధానంగూడా బాగానే ఉంటుంది. రసపోషణకూ లోపం ఉండదు. కాని నైతికమైన ఒక ఉత్తమాదర్శం లేనందువల్ల ప్రజాహృదయంలో స్థిరమైన ఉనికి సంపాదించుకోలేవు. పాఠకులకు తాత్కాలికానందం కలిగించడంలో ఈ కథలపని పూర్తిఅవుతుంది. ఒకమాటు చదవడంతోనే పాఠకులు తృప్తిపొందుతారు. ఏనేస్తూ లేక యేదో చిత్రంవచ్చినట్లు వెకిలిగా యే యువతీదర్శన, వల్ల కల్గిన భావోద్రేకంవల్లనో వ్రాయబడేవే అధమతరగతి కథలు. ఇప్పుడు తెలుగుపత్రికల్లో ప్రకటింపబడే కథలు చాలావఱకు ఈ కడపటితరగతికి చెందినవిగానే ఉంటున్నాయి. ఇటువంటి కథలు వ్యాప్తిపొందడంవల్ల ప్రజలకుగాని భాషకుగాని యేలాటి ప్రయోజనమూలేదు. ఇటువంటి కథలయొక్క బ్రతుకు ఆ వొక్క సంచికతో ముగిసిపోతుంది. విద్యార్థులశ్రేయం కోరే ఉపాధ్యాయుడు ఇటువంటి కథలు తన విద్యార్థి చదువడానికి అంగీకరింపడు. బిడ్డలక్షేమం గోరే తలిదండ్రులు యివి తమపిల్లలు చదువడానికి ఒప్పుకోరు. ఇక నైతికశిక్షణ మత్యావసరమగు బాలవితంతువులు మున్నగువారు వీనిని చదవ

దం వారి అయోగ్యతకు చిహ్నంగా ఊహింపబడటం చేత వానిని స్పృశించడానికే భయపడిపోతారు. ఇంతేయెందుకు, సామాన్యంగా పెద్దమనుష్యు లనబడే వా రెవరుగాని యిట్టి కథలుగల పుస్తకాన్ని చేత పట్టుకొని బయటికిరావడానికి సంకోచిస్తారంటే నమ్మండి.

రానురాను ప్రజలకత్యంతప్రీతిపాత్రమైన కథా వాఙ్మయమిట్టి హీనమార్గంపట్టి భయోత్పాతం కలిగించేదిగా అయిపోవడం శ్రేయస్కరమనే అంటారా? నామటుకు నాకు అన్ని తరగతులవారు ధారాళంగా చదివిన ప్రతివారూ నైతికంగా యేకొంచెమో ప్రయోజనం పొందడానికి అర్హమైనవే మంచికథలని తాత్పర్యం అన్నది రాజేశ్వరి.

రాఘవరావు రాజేశ్వరి చెప్పిన మాటలన్నీ శాంతంగావిని 'రాజేశ్వరీ నీవు కథలనుగూర్చి చేసిన పరిశీలనకు చాలా సంతోషం కాని నీతి లౌభ్యంలోపడి కథ యెటువంటివస్తువో తెలుసుకోలేక పోయినందుకు విచారమవుతున్నది. కథ 'వినరా వేమ, గదరా సుమతీ' వంటి నీతి శతకంగాదు. నీతి నిబద్ధమైనకథలూ వుండవచ్చును. కాని ప్రతికథనూ నీతిచట్రంలోనే బిగించవలెననడం తెలివి తక్కువైనపని స్వేచ్ఛగా, ఉల్లాసంగా, బుద్ధివైశద్యం కొద్దీ, వికసింపవలసిన కథా కుసుమం యిందువల్ల సంకుచితమై సౌందర్య భ్రష్టమైపోతుంది. అసలు కథారచన ఒకకళా విశేషం. దాని ప్రయోజనం ఆనందం. దానిని నైతిక శిక్షణాది ప్రయోజనాలకు వినియోగించుకోవాలెనని యత్నించడం అరసికులపని' అన్నాడు రాఘవరావు.

''మీ యువకవుల అభిప్రాయాలన్నీ అచ్చువదీసినట్లు ఒకటిగానే ఉంటాయి కాబోలు ! అమధ్య నెవరోగూడా పత్రికలో యిట్లాగే వ్రాయంగా చూచాను. కళంటే నాకూయిష్టమే. వట్టి బంగారపు ముద్దకంటె ఆబంగారంతో చేయబడిన ఆభరణం యెక్కువ అందమైనదిగా విలువకలదిగా ఉంటుందని నాకు తెలియకపోలేదు. అసలు కళంటే యథేచ్ఛగా వ్రాయడంకాదు. నేను చెప్పిన లక్షణాలన్నీ కలిగి ఉండడమే. కథ వట్టిపొడిమాటలుగా కాక మంచి బుద్ధి వైశద్యంతో మనోహరవర్ణనాచాతుర్యంతో పాత్రపోషణాసంవిధానంతో తయారుకావడం బాగానే ఉంటుంది. కాని కళనేపేరుతో సంభాషణగాగాని వర్ణనగాగాని అవినీతిని చొప్పించడం యుక్తంగాదు. బంగారాన్ని యెంతనగిషీవస్తువుగానైనా తయారుచేయవచ్చునుగాని అందులో రాగిగాని యిత్తడిగాని కలిపి దాని విశుద్ధత చెఱపడం యుక్తం కాదు గదా' అన్నది రాజేశ్వరి.

'సరి సరి. ఇంతనీతి మడిగట్టుకొని కథలు వ్రాస్తే వాటి అందం చెప్పనక్కర్లేదు. చదువకుండానే ప్రజలు సంతోషిస్తారు.'

'మరేమీ భయంలేదు. ఆవిధంగా నీతిబద్ధమైన కథలు వ్రాసినప్పుడే కథలవిలువ యెక్కువౌతుంది. ప్రజల ఆదరం విస్తరిస్తుంది. తెలుగువారేగాక యితరులు గూడా వానిని తమతమ భాషలోకి తర్జుమా చేసుకొని మఱీ చదువుతారు. టాలుస్టాయి కథలు ప్రేమచందు కథలు చూడండి మన తెలుగులోకి ఎట్లా అనువాదింపబడుతున్నాయో. వానికా గౌరవం ఎందువల్ల వచ్చింది? మీరేమైనా చెప్పండి అది కథగానీ కావ్యంగానీ గేయంగానీ గీతంగానీ చిత్రంగానీ శిల్పగానీ మానవకల్యాణమునకు ఉపయోగించగల యుత్కృష్టత దానియందంతర్గర్భితమైయుంటేనే దానికి——'

ఇంతలో ఉయ్యాలత్రాళ్లు చల్లంగా కదలడం మొదలుపెట్టినాయి. నూరుమాటలాడుతున్నా దాని యందు దృష్టియేమరకుండావున్న రాజేశ్వరి ఆసవ్వడి కని పెట్టడంతోటే 'పిల్ల లేచినట్లుంది'అని చివాలునలేచి పిల్లకు పాలుపట్టేపనిలో నిమగ్నురాలైంది.

రాఘవరావుగూడా గడియారంవంక, తలత్రిప్పి చూచి 'అబ్బో పదిన్నరైందే' అంటూ వెన్నువిరుస్తూ లేచి వెళ్లి గదిలో మంచంమీద మేను వాల్చాడు.

# చర్మంలో నశించిన విటమినులను

# పాండ్సు క్రీము పునరుద్ధరిస్తుంది

## ఉష్ణదేశాల్లోవుండే స్త్రీలు వారి చర్మాలనుగురించి ఎందుకు ప్రత్యేక శ్రద్ధ వహించాలి?



ఇటీవల కొంతమంది జీవశాస్త్రవేత్తలు కొన్ని పరిశోధనలు చేశారు. చర్మం గరకుగా, కళావిహీనంగా వుండడం ఎందుకో దానివల్ల తెలిసింది. 'చర్మవిటమిను' అనునది చర్మాన్ని పునరుద్ధరించే దానికి తోడ్పడుతుందనే విషయం కొన్ని యేళ్ల నుంచీ డాక్టర్లకు తెలుసు. అదే లేకపోతే మీ చర్మం గరుకై కళావిహీనమై, ముసలిపడిపోతుంది—ఎందుకంటే వీచేగాలి మాడ్చేఎండా నిరంతరమూ ఈ చర్మవిటమినును మీ చర్మాల్లోనుండీ, ఎండింపచేస్తూవుంటాయి.

పాండ్సు, పాండ్సుక్రీముకు చర్మవిటమిను చేర్చి ఎన్నో పరీక్షలు చేశారు. కొన్ని వారాల్లోనే ఎండిపోయి గరుకుగావున్న చర్మం మృదువుగా నునుపుగా అయింది. ఉపయోగించిన స్త్రీలంతా దీన్ని ఎంతో మెచ్చుకున్నారు!

ఇపుడు ఈ నూతన పాండ్సుక్రీములు అంతటా దొరుకుతున్నయి—అవే బాటల్సుతో, అవే ముద్రల్తో, అవే ధరలకు. చర్మవిటమిను కలిగించే వీటిని కొనండి. అవి ముందటికంటె మీ చర్మాలని నూతనంగా మనోహరంగా చేస్తాయి.

### పాండ్సు కోల్డు క్రీము



క్రింది చర్మంలోని తైలగ్రంథులను పునరుద్ధరిస్తుంది. ముడుతలను పోగొట్టుతుంది. చర్మరంధ్రాల పరిశుభ్రతకు ఉపయోగించండి. దాల్లో ఇపుడు చర్మ జీవధాతువులున్నవి.

### పాండ్సు వానిషింగ్ క్రీము



గరకును పోగొట్టి, చర్మోపరిభాగాన్ని మృదువుగా నునుపుగా చేస్తుంది. దీనికేగాకుండా పౌడరు వేసుకోవడానికి ముందుకూడా వుపయోగించండి. దాల్లో ఇపుడు 'చర్మజీవధాతువు' లున్నవి.

క్రొత్తక్రీములకు ఈ కూపను పంపండి

ఉచితము: దీనిని నేడేపంపి పాండ్సు రెండు క్రీముల ట్యూబులను పాండ్సు ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ షేడు) నేచురల్....... రోజ్ క్రీమ్......బ్రునెట్......

డాడ్జి అండ్ సెయ్‌మర్ లిమిటెడ్,
3, విక్టెట్ రోడ్డు, బొంబాయి.

పేరు..........................................

చిరునామా.......................... No. G L. 24

# కాశ్మీర మజిలీలు

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

●

బుడంకాయిబోండాల ద్వంద్వయుద్ధము

●

వెన్నెలవాక, పిదప కెంపురేక, తదుపరి బంగారుగీత తూరుపున తళ్కొత్తినవి. ముగు రమ్మలవలె నవి కైలాస, సత్య, స్వర్గలోకము లను మనుష్య హృదయమున నిలుపును. గుండెయం దీలోకములు వెలయుచుండ, నుడువులకందని ఆధ్యాత్మికశక్తులు అంత రంగమున విరాజిల్లుచుండ కొండొకవడి కారురూపములతో చీకటులు విజృంభించిన నేమి, దుర్విధి కనులెఱ్ఱజేసిననేమి, నల్ల మబ్బులు పిడుగులను గ్రక్కిననేమి, మనుష్య జీవితమునుజూచి "ధిక్!" అన జెల్లునా? కలుషభూయిష్ఠమైనదని అరిష్ట గర్భితమైన దని వేడిమాటలు వెడలించుట పాడియా? మహోత్కృష్టమైన ఉద్దేశమునకు ఆటపందిరి యైన దానిపై నుల్కావృష్టిపోలు దుర్వి మర్శను వెలారింపవచ్చునా? కంటకముల మఱుగున పూవు విడియువడువున, నింగి కాటుకలో సౌదామిని తళ్కొత్తులీల జీవిత సౌందర్యము ఇరుల మఱుగునుండి వెడలుట నిక్కమే! ఉత్కృష్టసృష్టికి దుస్సహ యాతనము కన్నతల్లియగుటయు యథా ర్థమే! కాని, దృష్టి నిలువవలసిన దీ సృష్టి మీదనే కదా!

మెల్లగ నెల్లరము దాదాజీ యింటికి తరలిపోతిమి. కాల్యకృత్యములు నెఱపుకొని కొండొకవడి నిష్ఠాగోష్ఠిలో కాలము కడపి తిమి. పదపడి మరల నమృతసరో హృదయ మున బ్రవేశించితిమి. పవలంతయునగరమున జరించితిమి. సిక్కులవిద్యాసంస్థలం దెక్కువ సేపుంటిమి.

ఇక నందుండి తరలిపోవ నిశ్చయించితిని. జనవరి (1930) మాసాంతమున త్రివేణీ క్షేత్రమున జరుగబోవు కుంభమేళమహోత్స వమునకు పల్వురు పయనమయ్యెదమనిచెప్పి, తమ జట్టులో కలియుమని దాదాజీ నన్ను కోరి యుండెను కదా! సంతోషపూర్వక ముగ నేనందుకంగీకరించితినిగదా! "ఈ లోపుగ రాజస్థానమునుండి 'మయ్యా' (అమ్మ)ను తోడ్కొనిరండు. లాహోరులో కలియుచోటును, సమయమును జాబుద్వారా తెలుపుడు" అని దాదాజీ పలికినాడు.

అమృతసరమునుండి కాలుకదపితిని. ఈ వఱలోవలె నిపుడు తిరుగుపయనమును రైలుమార్గమున నలుప నిశ్చయించితిని. కాని బుడంకాయిగాడు నాతో నేమియు బలుకక తిన్నగా బస్సులు నిలుచుచోటునకు దారిదీసినాడు. స్టేషనుకుపోదుము గాకని పలికి, వానిని మరలింపుమని సింగును పిచికి

గాని వెళ్ళ బంపితిని. సింగు పిలుపునకుగాని, అరుగునకుగాని అందక చరచరనడచి బుడం కాయిగాడు నిముసములో నూరి వెలుపలి కరిగి బస్సులు నిలుచుతావున చతికిలపడి నాడు. సాయంకాల మూఁడుగంటలయ్యెను. రైలు వేళకుఁగొలఁది నిముసముల వ్యవధి మాత్రమున్నది. స్టేషనునకు పరుగునపోయి నను ప్రయోజనములేదు. కావున పొట్టిపిచికి ఉద్దేశము ననుసరించియే మరల బస్సులోనే లాహోరుపోవ సంకల్పించితిని.

సింగు దాదాజీ ప్రభృతులు సాగనంప నెంచి కాబోలు నావెంటవచ్చిరి. బజారు గుండా మూఁడుటాంగా లెక్కిపోతిమి. విశేష ముగ గడ్డములే కన్నులబడినవి. సిక్కులును మహమ్మదీయులును అమృతసరమున నధిక సంఖ్యాకులై యుండిరి. హిందువుల సంఖ్య మిక్కిలి తక్కువ. సిక్కుముసల్మానులలో అమృతసరములోవారును, లాహోరులో వీరును అధికముగానున్నారు. విపణివీధి జన సంకులమైయుండెను. కొంతసేపటికి బస్ స్టేండ్‌ను సమీపించితిమి.

పొట్టి పిచికిగాడు చాలబిజీగానున్నాడు. ఒకవింత మానిసితో నేమో మిగుల తీవ్ర ముగ ప్రసంగించుచు, నవ్వుచు, చప్పట్లు కొట్టుచు గాంధోలిగానివలె నెగురుచున్నాడు. స్టేషను జేరదలచిన వారము వీని మూలమున నిచ్చటికివచ్చి పడితిమి. వెంటబడినవాని కందక నిచటజేరి నిర్భయముగ నిశ్శంకగ నిండుమోదముతో నిచట నాటలాడు చున్నాడు. నాకు కోపమును నవ్వును కూడ వచ్చినవి. దాదాజీ సింగు ప్రభృతులు బుడంకాయిని చూచినతోడనే మహోల్లాస మున నవ్వుచు, సఱచుచు టాంగానుండి దిగిరి. బుడంకాయి క్రీగంటనైన ప్రక్కకు చూడలేదు. చిందులు త్రొక్కుచుసేమో పాడుచున్నాడు. సమ్ముఖమందలి వింతమాని సి లయ కనుకూలముగ హావభావములు ప్రదర్శించుచు నవ్వుచు, నడుమనడుమ పిచికి గాని పాటతో తన కంఠమును సహకరించు చున్నాడు.

మాదృక్కు లొక్క మాఱుగ నీపింత మానిసి యాకారపై వ్రాలినవి. మనిషి సంపూర్ణముగ నున్నగానున్నాడు. పూర్ణాను స్వారమే కూర్చుండె ననుకొంటిని. వాని శిరమున నొక్క వెండ్రుకైన కానరాలేదు. రక్తము చిమురునంతదనుక శరీరము చెక్కబడినది. కనుబొమ్మలుకూడ అంత ర్ధానమైనట్లే తోచెను! వాని యొడలున నున్నది మాంసముకాక ఏదోపిండియై యుండుననుకొంటిని. తలమొదలు కాళ్ల వఱకు ఒకేరీతిగనున్నాడు. ఇంత గుండ్ర ముగానున్న మానిసినీవఱలో నెందును జూడ నైతిని. పెద్దబోండాకు ముక్కు చెవులుంచి భగవంతుడమృతసరమున జార విడిచినాడు కాబోలు! ఓయి బోండాగాడి ముందల నిలిచితిమి. వానినోట నొక్కపల్లైనలేదు. ఏమో! ముఖమున చిరునవ్వు తళుక్కొత్తు చున్నది. 'బాబూసాబ్! అబ్ కహా రహీనే వాలే?' అని నన్ను సంబోధించి ఆతడుప్రశ్నించి లేవబోయినాడు. లేచుట సామాన్యమైన

పని కాలేదు. వంగి రెండుచేతులను నేలపై మోపి, హస్తపాదముల సంయుక్తబలము వలన శరీరభారమును మెల్లగ లేవందీసినాడు. వాని యుదరగోళము భూగోళమునకు అన్నగారివలెనున్నది. వరాహావతారమెత్తి ఒకప్పుడు శ్రీమహావిష్ణువు భూమిని ముట్టెపై నిలిపినాడు. ఈతడు పొట్టపై నిలిపినాడు. భేదమింతయే! విష్ణ్వవతారము యొక్క మోడరన్ ఎడిషన్ (Modern Edition) సాక్షాత్కరించినదని సంతసించితిని. మఱొక విడ్డూరము. వాని నోటికిని, కంటిజంటకును, కడుపునకును అవినాభావ సంబంధమున్నది. నవ్వుచు నోరు తెఱచి నంతన ఆల్చిప్పలవంటి కన్నులు రెండును మూతలుపడుచుండెను. కొలిమి సమీపమందలి తోలుతిత్తివలె పొట్ట ఒకపరి యుబ్బుచు, నింకొకతూరి క్రుంగుచు, అపూర్వమైన దృశ్యమును ప్రదర్శించుచుండెను. ఈమూడు ముఖ్యావయవములకు నెట్టి చుట్టరికము కుదిరెనో లేచి నిలిచినపిదప రెండుమూడు నిమిషములవఱకు (ముందుతూకమెక్కువగానుండుటచే బేలెన్స్ కుదరక) బోండాగాడు తొట్రుపడినాడు. ముందు యోచన దెలిసినవాడు కావున "బాబారే!" అని దాదాజీ రెండడుగులు వెనుకకువేసి నాదాపున నిలిచినాడు. బోండాగాని కంఠస్వరము, వాని కాయమునకు సరిపడినది కాదు. వానిది మిగుల సన్ననైన కీచుగొంతుక! ఆతని కంఠమున నేదియో గువ్వ, ఎట్లో ఇరుకుకొని పోయినది కాబోలు! "పిట్టకొంచెము, కూతఘన"మని వినుచుందుము. నేడు "ఒళ్లుఘనము కూతకొంచ"మైనది. కొండగుహనుండి పిల్లనగ్రోవిపాట వెడలునట్లు పెద్దబిలమువలెనున్న వాని నోటినుండి క్షీణస్వరము వెల్వడినది! నిద్దురపోవుచు, ఈశ్వరుడే వానికిని సృష్టించి యుండును. కన్నులనుబాగుగ నీ సృష్టిచిత్రమున కప్పగించి, రోచనానుగ్రహనై అట్లే నిలువంబడిపోతిని. "ఏక్కడివాడా?" అని బోండాగాడు హిందీలో నన్నడిగిన ప్రశ్నకు జవాబుచెప్పుట మఱచి అవాక్కై అట్లే యుంటిని. దాదాజీ చెంతనేయున్నాడు. నావలె వృద్ధు డాశ్చర్యాన్వితుడు కాలేదు. అమృతసరములో నితడు బోండాగానిని తఱచుగ చూచుచునేయుండును కాబోలు!

"వీరు దక్షిణదేశస్థులు; గోదావరీతీరవాసులు. వీరికిని నాకును కలకత్తాలో స్నేహము కలిగినది. జగన్నాథఘట్టమున ప్రతిదినము ప్రాతఃకాలమున కలియుచుండువారము. బాబూజీ అంగ్రేజీ బాగా చదువుకొన్నారు" అని దాదాజీ బోండాగాడి నుద్దేశించి పలికినాడు. "ఏమీ! గోదావరితీరము నుండి వచ్చిరా? ఆహా! అదెట్టిదది! గంగాజీ కంటె దొడ్డది" అని మహోద్వేగముతో పలుకుచు, నన్ను గోదావరియొక్క ప్రతినిధిగా నెంచి కాబోలు, మాటిమాటికి బోండా నాకు నమస్కరింప దొడగినాడు.

ఆధునికవిద్యాగంధ మెఱుగనివారి యందే ఇట్టి భక్తియుండుట నా యాత్రలందు పెక్కుమారులు విలోకించితిని. ఈ భక్తినిగుఱించి ఎంతేని విమర్శింపవచ్చును. ప్రశ్నపరంపరలచే దీనిని తునియలుచేసి,

భక్తిదూరులైనవారికంటె బోండావంటి వారలే అధికులని వచింతును. అజాండమున వెన్నెల నిండుకొనినట్లు, ఉద్యానమున పరిమళము సంపూర్ణముగ వ్యాపించినట్లు బోండా గుండెనిండ భక్తి నిండుకొనినది. భయమునకు, అవిశ్వాసమునకు, శంకకు, ఆతురతపాటునకు, ఆర్తికి అందు చోటు లేదు. ఇవి యమకింకరులవంటివి కదా! గుండె నివి యమలోకము జేసివైచెనుకదా! 'గోదావరి' యనినంతన గోదావరీలహరి వలెనే బొండాహృదయ ముప్పొంగినది.

"పదేండ్లకుమున్ను రామేశ్వరము పోతిమి. పోవునపుడు గోదావరీ దర్శన భాగ్యము నాకు లభించినది. మూడు దినములందు స్నానముచేసితిని. మేము విడిసిన యూరు పేరు మఱచితినిగాని నది అచ్చో మిగుల విశాలమైనది. గంగకంటె మిగుల పెద్దది. దొడ్డది యనికూడ వచింతును" అని బోండాగాడు పలికినాడు. వీనిమాటలు చెవిబడినంతన, పోట్లగిత్తవలె తలయూపుచు చరచర ముందులకువచ్చి, ఒక్క దుముకున బుడంకాయగాడు బోండాగాడి పొట్టపై లంఘించినాడు. ఉదరగోళము కదలినంతన, అంగప్రత్యంగములన్నియు నట్టిటులాడెను! బోండా దొర్లుపడుచున్నాడు. దాదాజీ సింగులు వానిని నిలుపదలచుకొనలేదు. వాని సమీపమునకే పోయిరికారు. తొట్రుపడుచున్నవాని మేను తమకు తగులుచో నేలపై తాము పెద్దకాలము దొరలిపోవలసి వచ్చునని ఝంకిరి. బూరెపై ఈగవ్రాలినట్లే బోండాపై పిచికిగాడు వ్రాలినాడు. "ఏమి! గోదావరి దొడ్డదియందువా? గంగయే గొప్పది. తప్పు చెప్పితినని యొప్పుకొనుము" అని బుడంకాయి బోండాపొట్టను చిత్తము వచ్చినట్లు బరికివేయసాగినాడు. "ఏహెహె! హేహేహే!" అనుచు పిచికి యొడలిని మీదినుండి బోండా పిసుకుచున్నాడు. బోండా బుడంకాయల ద్వంద్వయుద్ధమును చూచుచు సింగుసూరజ్ లట్లే నిలువంబడిరి. వారి కది గొప్ప చోద్యముగా తోచెను. గజముదూరమున నిలిచి "ఛోడ్ రే! ఛోడ్ రే!" (విడువరా! విడువరా!) అని నవ్వుచు చప్పట్లుకొట్టుచు దాదాజీ వెన్క వెన్కకు తరలుచున్నాడు. నేను కలుగజేసికొనినగాని కయ్యము కడతేఱదని గ్రహించితిని. బుడంకాయిబుఱ్ఱపై రెండే రెండు మొట్టికాయలు ప్రతిష్ఠించి వానిని వెన్కకు లాగినాను; కాని బోండా వానిని వదలినాడు కాడు. తనయొళ్లు హూనముచేసిన వానిపై నెట్లైన అక్కసు దీర్చుకొనవలెననియే ఆతడు సంకల్పించినాడు. చాపచుట్టవలె నిరువురు కలిసి దాదాజీపై బడినారు. అడలువానిమీదనే కదా ఆపదలు వ్రాలును! ఎంతో కష్టముతో వారిని ఒండొరులనుండి తొలగించితిని. "ఈరీతిగ ప్రవర్తించితివేని నాతో యాత్రసలుపకుము. నీయూరు నీవు పొమ్ము" అని పొట్టిపిచికితో గట్టిగా చెప్పితిని. చివాట్లు తగులగనే పోరుమాని వాడు నాచెంత నిలిచినాడు. మిగుల తీవ్రముగ కడువడిగ వగర్చుచున్న బోండాను (వానితో సమముగ తూలుచు) నెంతో కష్టమున కూర్చుండబెట్టితిని.




# బక్కపలుచనై, పెరుగుచున్న బిడ్డలు బలిష్ఠదేహు లగుదురు

స్కాట్స్ ఎమల్షన్ వారికి పరిపూర్ణారోగ్యము నొసగును

నీ కొమరుడు లేక కూతురు బక్కపలుచనగా నుండి బలుపునకు వచ్చుటకై సహాయము కావలసియుండిన యెడల స్కాట్స్ ఎమల్షన్ వాడుము. బలిష్ఠదేహము; ఆరోగ్యము చేకూర్చుటలో దానిని బోలినది లేదు.

స్కాట్స్ ఎమల్షన్ రసాయనపదార్థములవలన తయారగు నౌషధముకాదు. ఇది వట్టి ప్రకృతిసిద్ధ బలదాయక వస్తువు. కావుననే వైద్యులు 60 ఏండ్లకు పైగా దీనిని శిఫారసు చేయుచున్నారు.

నీ బిడ్డలకు నేడే స్కాట్ ఎమల్షన్ ఇమ్ము. అనతికాలములోనే దానివల్ల గల్గు అభివృద్ధికి నీ వాశ్చర్యపడగలవు.




# స్కాట్స్ ఎమల్షన్

# SCOTT'S Emulsion

శుద్ధమైన కాడ్ లివరాయిలునుండి.

స్కాట్సు ఎమల్షను మండీవర్తకులు :

ఇంపీరియల్ కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్,

కలకత్తా, బొంబాయి, మద్రాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా, అహమ్మదాబాదు, కొచ్చిను, క్యాలికట్, విశాఖపట్టణము, కరాచి, అమృతసరము.

# కత్తిరింపు ఫలితము నభివృద్ధిచేయును

శ్రీ చిలకమర్తి లక్ష్మణాచార్యులుగారు

(తోటపని)

ఈపని అనుభవమువలన ఎట్టి వృక్షములకు ఏ విధముగాచేసిన లాభించునో తెలిసికొనవలెను. కత్తిరింపుపని అన్ని వృక్షములకును ఒకేమాదిరిగాను, ఒకే సమయముననను ఉండదు. కొన్నిటికి కొంతభాగము, కొన్నిటికి వేళ్లను కత్తిరింపవలసియుండును. ఈపనిని కాపుముగిసి చెట్లు విశ్రాంత మనుభవించునపుడును, చెట్టు బాగుగా విస్తరించు సమయమునందును, భూమిలో నీరు, ఆహారము సమృద్ధిగానుండు నపుడును యీపనిచేయవలెను. కొన్నిటికి ప్రతిసంవత్సరమును, మరికొన్నిటికి రెండుసంవత్సరముల కొకసారియు కత్తిరింపు పనిచేయవలసియుండును. ఈకత్తిరింపు పని సరిగా చేసినయెడల వృక్షములు ఫలసాయము నెక్కువగా నిచ్చుటయేగాక చెట్లను విస్తరింపజేసి ఆకులను, కర్రనుకూడ వృద్ధిచేయవచ్చును. కొన్నిజాతుల మామిడి, నారింజ కొబ్బరి మొదలగు ఫలవృక్షముల యందు వేళ్లను కత్తిరించుటవలనను, ద్రాక్ష, మల్బరీ మొదలగు వృక్షములలో తీగలను, కొమ్మలను కత్తిరించుటవలనను ఎక్కువగాలాభము సమకూరినది. వేళ్లను కత్తిరించుటగాని, కత్తిరించినవెనుక వెంటను పోసి, నీరుపెట్టుట కాని చెట్టుయొక్క మొదలులో ఎన్నడును చేయకూడదు. సాధారణముగా కొమ్మల ఆవరణ ఎంతవరకుండునో అంతచుట్టును రెండడుగులు వెడల్పుకలిగి మూడడుగులు లోతుకలిగిన వలయాకారముగా గోయితీసి ఆగోయిని రెండుమూడువారముల వరకు ఎండ వెలుతురులు తగులునట్లుగాచేసి తరువాత ఎముకలపొడిచేర్చిన పశువులపెంటను చెట్టుయొక్క విస్తీర్ణతనుబట్టి సుమారు అరబండిమట్టిని ఆ గోతులలోపోసి మరలకప్పి వెంటనే నీరు పెట్టవలెను.

సాధారణముగా కత్తిరింపుపని వర్షాకాలమునందు చేయవలసియుండును. కత్తిరింపుపనిచేయుటకు ఒక తెగ రంపము, కొమ్మలుకోయు కత్తెర కొమ్మలు కోయు కత్తికావలెను. కొమ్మలు కత్తిరించునపుడు పాత కొమ్మలనే కత్తిరించి క్రొత్తకొమ్మలను ఏపుగా పెరుగునట్లు చేయవలెను. క్రొత్తకొమ్మలు విస్తారముగా బయలుదేరి పుష్పములను, ఫలములను హెచ్చించి ఫలసాయమును హెచ్చించుటయే కత్తిరింపుయొక్క ముఖ్యోద్దేశము. అంతేగాక, తెగులుపట్టిన కొమ్మలను త్రుంచివేయుటకును, చెట్లుయొక్క కొమ్మలను నలువైపులకును విస్తరించునట్లుగాచేసి ఎండవెలుతురులను బాగుగా తగునట్లుచేసి చిగుళ్లను హెచ్చించి బాగుగా ఫలింపజేయుటకును కొన్నిటిలో పొదుగైన కాండమే కావలసిన వృక్షములందు, ప్రక్కకొమ్మలను నిర్మూలము చేయుటకును, కొన్నిటిలో ఆకులే ముఖ్యముగా పెరగవలసిన సమయములందును యీపనిని తప్పక చేయవలసియుండును. పూచెట్లను పొదుగుగా యెదగనిచ్చినయెడల పుష్పములు కొద్దిగా పూయుటయేగాక మనకు అందనంత ఎత్తులో పూయునపుడు ఈ కత్తిరింపుపనివలన పూవులను సమృద్ధిగాను, మన కందుబాటులోను పుష్పించునట్లు చేయవచ్చును.

వృక్షములను పొదుగుగా పెరుగనిచ్చినయెడల చిగుళ్లు తక్కువై ఫలితమును కొద్దిగానిచ్చును. కొమ్మలు ప్రక్కకు విస్తరించుటవలన సూర్యకాంతి అన్ని ఆకులను బాగుగాతగిలి చెట్టునకు బలమునిచ్చుటయేగాక ఫలములను హెచ్చుగను, పెద్దవిగనుకూడ చేయును. అంతియేగాక పూచెట్లు మొదలగు వాటికి మంచి ఇంపైన ఆకారములనిచ్చుటకును, జీడలు, తెగుళ్లు

రాకుండ ఔషధములు జల్లుటకు వీలుగా చేసికొనుటకును నీడనిచ్చు చెట్లు చాలదూరము విస్తరింపచేయుటకును ఈ కత్తిరింపువలన సమకూర్పవచ్చును.

కొన్ని చెట్లలో కొమ్మను కత్తిరించుటకంటె వేళ్లను కత్తిరించుటవలన మంచి లాభముండును. ఈపనిని సాధారణముగా పండ్లచెట్లకు అవసరము. మామిడి, కొబ్బరి, నారింజ మొదలగుకొన్ని ఫలవృక్షములు కొన్ని సంవత్సరములవరకును ఫలమునీయవు. ఇచ్చినను బహుకొద్దిగా నిచ్చును. ఎందుచేతననగా వేళ్లు సంపాదించిన ఆహారము వేళ్లకే సరిపోవును. లేక వేళ్లు చాలాదూరముపోయి తోట భూమిలోనిసారమును గ్రహింపలేక, సారములేని ప్రదేశమునందుండి వాటి పనిని చేయలేకపోవును. అపుడు ప్రక్కవేళ్లను కత్తిరించివేసినయెడల అచట పిల్లవేళ్లు బయలుదేరి దగ్గరలోనున్న ఆహారమును సులభముగా సంపాదించి చెట్టు పైభాగమునకు కావలసినంత ఆహారమునుపంపి పుష్పములను, ఫలమును విరివిగా నిచ్చునట్లుచేయును.

చెట్టునకు రొట్ట పెరుగనిచ్చినచో పుష్పములను, ఫలములను హెచ్చుగానీయదు. కొన్ని ప్రక్కవేళ్లను, కొన్ని పాతకొమ్మలను కత్తిరించినయెడల చెట్టు నీరసించి ఎక్కువగాపుష్పించి ఫలములనిచ్చును. చెట్టు నీరసించినయెడల ఫలసాయము తగ్గునని యెన్నడును అనుకొనరాదు. వేళ్లు కత్తిరించునపుడు మిక్కిలి జాగరూకతతో చేయవలెను. మొదట కొమ్మలను కత్తిరించినను ఫలసాయము వృద్ధినొందనియెడల వేళ్లను కత్తిరించవలసియుండును. అదియైనను అయిదారు సంవత్సరముల కొకసారి చేయవలసియుండును. పొడుగుగా చాలదూరము వ్యాపించిన వేళ్లను కత్తిరించనియెడల చెట్టువద్ద ఎంత ఎరువువేసినను లాభము లేదు. కొమ్మలనుగాని, వేళ్లనుగాని కత్తిరించునపుడు కోత శుభ్రముగా ఒకే యేటుగా, ఏటవాలుగా నుండవలెను. లేనియెడల కత్తిరింపబడిన భాగమునుండి బూజుతెగుళ్లు ప్రవేశింపవచ్చును. పెద్ద కొమ్మలను కొట్టివేయునపుడు బహుజాగ్రత్తగా చెట్టున కపాయములేకుండా చేయవలెను. అది యెట్లనగా మనము కొట్టివేయు కొమ్మయు కాండమును కలియుచోటునకు ఒకఅడుగు క్రిందనుండి కొమ్మవైపునకు రంపముతో కర్రభాగములోనికి బాగుగాకోసి పిమ్మట ఆకోతకు ఒకఅడుగు కొమ్మవైపునకు పైనుండి కోసినయెడల కొమ్మ విరుగునపుడు చెట్టున కపాయములేకుండ విరిగిపోవును. ఆనరకబడిన ప్రదేశమునందు తారుతోగాని బోర్డో జిగురుతోగాని బాగుగా పూసినయెడల చెట్టునకు ఆపగుళ్లగుండా తెగుళ్లు రానేరవు.

వృక్షములో కొన్ని పాతకొమ్మలను కత్తిరించి క్రొత్త చిగుళ్లను పెట్టునట్లు చేసినయెడల వృక్షము ఫలములను విరివిగా నిచ్చునన్న సంగతి చాలమందికి తెలియదు. జామిచెట్లకు కొన్ని ప్రత్యేకభాగములందు మాత్రమే పువ్వులుపూసి, కాయలుకాయును. క్రొత్తగా పెట్టిన రెమ్మకు రెండు, మూడు, నాల్గుజతల ఆకుల కణుపుల యొద్దనుండియే బయలుదేరును గాని మరియితర స్థలములనుండి బయలుదేరవు. ఒకతోటలో రెండు జామిచెట్లు నాలుగయిదేండ్లవరకును ఫలింపలేదు. ఒకదానికి చెట్టుచుట్టును గోయితీసి వేళ్లు కత్తిరింపబడినవి. రెండవదానికి కొన్ని కొమ్మలను మాత్రము బాగుగా కత్తిరించిరి. ఈపని గ్రహింపదగిన ఫలితముల నిచ్చినది. వేళ్లు కత్తిరింపబడిన చెట్టు ఆకులురాలి క్రొత్తపలవలు పెట్టక ఫలములేమియు నీయలేదు. కాని కొమ్మలు కత్తిరించబనచెట్టు వారము రోజులలో చిగుళ్లనుపెట్టి ఏపుగా బయలుదేరి ఆరు నెలలలో ఫలములను సమృద్ధిగానిచ్చినది.

# గణపతి ప్రార్థన

శ్రీ గాలి పెంచల నరసింహారావుగారు

అనుభవముతో కర్ణాటక హిందూస్థాని మరాఠీ గానసంప్రదాయము లన్నియు వానివాని స్వరతాళములను మన కర్ణాటకరాగములకు వానికి గల స్వరభేదములను విద్యార్థులకు బోధపరుపగల యుద్గ్రంథము ప్రచురింపనెంచితిని. ఆంధ్రలోకము దాని నెట్లు నాదరించునో కనుగొందమని మాదిరికై కొన్ని కీర్తనములను గానకళ పేర ప్రకటించుచున్నాను. ఓం అని గణపతికీర్తనప్రార్థనతోను సరస్వతీరాగమున సరస్వతీ కీర్తనతోను కార్యక్రమ మారంభించితిని.

కాఫిరాగము - ఆదితాళము

22వ మేళకర్త ఖరహరప్రియరాగమున జన్యము

ప్రేలికి నాలుగు అక్షరములచొప్పున ఘాతనుండి రెండు అక్షరములుతోసి పాడుకొనవలయును

పల్లవి. గజముఖరూపా ! వినుతప్రతాపా !
భుజగభూషణసుతా ! త్రిభువనసన్నుతా ! గజ॥

అనుపల్లవి. ఆద్యంతముల కాధారంబగు
వేద్యుడవని మనసారనుతింతును. గజ॥

చరణము. అమరులకెల్లను అధినాయకులై
ప్రమథగణములతో కొలువైయుండెడు
పార్వతీశ్వరుల అంకతలముపై
బరగుచుభక్తుల నిరతముబ్రోచెడు. గజ॥

| | | | |
|---|---|---|---|
| పల్లవి. | ,,. పపామపా. పమగరిమాపా | ,, మనీదనీ | పమపా మగరిస |
| | గజముఖ రుఉఉఉపాఅ | ,, వినూతప్ర | తఅఆ. పఅఅఅ |
| | రిమ. నిదానిపా. పమగరిమాపా | ,, పసానిసా | దనిపా మగరిస |
| | అఅ. గజముఖ రుఉఉఉపాఅ | ,, వినూతప్ర | తఅఆ పఅఅఅ |
| | రిమ. నిదానిపా పామామగరీ మాపా | ,, పగారిపా | నిదనిప. పమగరి |
| | అఅ. గజముఖ రూఊఉఉఉఊపాఅ | ,, వినూతప్ర | తఅఅఅ పఅఅఅ |
| | మప. పనీనినీ. సానీసనిసా | ,, నిదానిపా | పమగరి సరిరిగ |
| | అఅ. భుజగభూషణా సుఉతా | ,, త్రిభువన | సఅఅఅ న్నుఉతఅ |
| | మప. పనీనినీసాసా సానీపనిసరి | గరినిదానిపా | మగరిస రిమపని |
| | అఅ. భుజగభూషణ సూఊతఅఅఅ | అఅ. త్రిభువన | సఅఅఅ న్నుఉతఅ |
| | సరి. నిదానిపా పామామగరీమాపా | పదమపగరిసరి | మపనీదపా, |
| | అఅ. గజముఖ రూఊఉఉఉఊపాఅ | అఅఅఅఅఅఅఅ | అఅఅఅఅ, |

అనుపల్లవి. ,,. నినిమాపా నీనీసనిసా | ,, పగారిగా | సారీసనిసా
,,. అఅఆద్యాంతముఉలా | ,, కఆధఆ | రం. బఅగూ
,,. నిదనిప మపనీనీసనిసా | ,, పరీరిరీ | రిమగరిసనిసా
,,. అఅఆఆ ద్యంంతముఉలా | ,, కఆధఆ | రంంం బఅగూ
,,. నిదనిప మపనీనీసనిసా | ,, సమాగమా | రిమగరిసనిసా
,,. అఆఅఆ ద్యంంతముఉలా | కఅధఅ | రంంం బఅగూ
,,. గా,రిసని దానీపామా | పానీనిరిసానిదనిప | పమగరి సరిరిమ
,,. వైద్యాదత్రి వనిమన | సాఅఅఆఅరంనుఉ | తింంం గుఉనుఉ
మప. గా,రిసని దానీపామా | రిమపని సరిగరి | సనిదని పమగరి
ఉఉ. వైద్యాదఅ వనిమన | సఅఅఅ రఅనుఉ | తింంం గుఉనుఉ
మప. నిదానిపా. పాపామగరీమాపా | పదమప. రిమపని | , దపా-,,,,
ఉఉ. గజముఖ రూఉూఉఉఉూపాఆ | అఆఆఆఅఅఆఅఅ | , ఆఅ,-,,,,

చరణము. ,,. పపాపపా. పా,,పాపా | ,, మగామమా | మగపమ గారీ
,,. అమారులాకే ,,ల్లను | ,, అధీనఅ | యఅకుఉ లై ఈ
,,. పపాపపా. పా,,పనిపప నినిపా | ,, మగామమా | రిమపని దపమగ
,,. అమారులాకే ,,ల్లఅఅఅనుఉఊ | ,, అధీనఅ | యఅకుఉ లై ఇఇఇ
రిమ. నిదామపా. మగరీసనిసా | ,, సమాగమా | రీగా రిసరీ
ఇఇ. ప్రమథగణఅములఅతో | ,, కొలుంవైఈ | యుంయెడూ
,,. నినిమప పానీనీసనిసా | ,, పగారిగా | సారీసనిసా
,,. పఅఅర్వతీ ఈశ్వారుఉలా | ,, అంకత | లమునైషఈ
,,. నిదనిపమప. నీనీసనిసా | ,, రిరీరిరీ | రిమగరి సనిసా
,,. పఅఅర్వతీఈ శ్వరుఉలా | ,, అంకత | లఅముఉ నైఇఈ
,,. నిదనిపమప నీనీసనిసా | ,, సమాగమా | రిమగరి సనిసా
,,. పఅఅర్వఅతీ ఈశ్వారుఉలా | ,, అంకత | లఅనుఉ నైఇఈ
,,. పగారిసా నిదనీపామా | పానీనిరిసా నిదనిప | మగరిసపరిరిమ
,,. పరగుచు భఅఆక్తులా | నీఈరఅఆతఅముఉ | బ్రోఒఒఒచెవిడుఉ
మప. పగారిసా నిదనీపామా | రిమపని సరిగరి | సనిదని. పమగరి
ఉఉ. పరగుచు భఅఆక్తులా | నిఇరఅ తఅముఉ | బ్రోఒఒఒచెవిడుఉ

మప. చిట్టిస్వరము
ఉఉ

,,. నీనీపమగరి. సరిమపని. మ | పనిసా సాగరి | సరిసని దనిపమ
గరి. మామాపనిమప. నీనీసరి | నిసనిసా సాదని | పాపామగరిస
రిమ||

# గృహలక్ష్మి

●

రోహిణి పిక్చర్సువారి సాంఘికచిత్రం

❋ ❋
❋

డాక్టరు కృష్ణరావు ఆతని గృహలక్ష్మి రాధా రాధాకృష్ణుల్లాగ ఆదర్శ దాంపత్య జీవం చేస్తూవున్నారు. రాధ సోదరుడు గోపీనాథుడు హరిజనసేవాసమితికి కార్యదర్శి. సమితి సహాయార్థం భరతనాట్య ప్రదర్శనం యేర్పాటుచేసి కృష్ణరావు నాహ్వానిస్తాడు.

సర్తకి మాధురి తల్లి, కృష్ణరావు పురోహితుడు వీరి సహాయముతో కృష్ణరావును తనవలలో వేసికొంటుంది. అతన్ని అన్ని విధాలా పతితుణ్ణి చేస్తుంది. డాక్టరు త్రాగుడు మరిగి ధనం పాడుచేస్తాడు. అప్పులు మితిమీరుతవి.

మద్యపానం మానివేయమని గోపీనాథుడు బావకు హితవుచెప్పితే కృష్ణరావతనిని హింసిస్తాడు. ఆకస్మికంగా తన సంసార స్వర్గంలో కలిగిన విప్లవాన్ని సరిదిద్దాలని రాధ ప్రయత్నిస్తుంది. భర్తకు హితవు గరవుతుంది. ఫలితంగా భర్త ఆగ్రహానికి గురిఅవుతుంది. తండ్రి నారాయణరావు కుమారుని త్రాగుబోతుతనాన్ని భరింపలేక యిల్లు వెడలగొట్టి కుమారుని యవస్థను చూళ్లేక, తన మనుమరాలిపేరుతో వున్న ఆస్తినంతా వ్రాసి, తన గుమస్తా విశ్వాసరావును అటార్నీగా నియమించి మరణిస్తాడు.

కృష్ణరావును పిలుచుకొనిరావడానికి విశ్వాసరావు మాధురియింటికి వెళ్లుతాడు. అపుడే తన బాకీ కృష్ణరావునుండి వసూలు జేసికొనడానికి మార్వాడీకూడా వస్తాడు. వాన్నిచంపితే అప్పుడు ఆఆస్తి రాబట్టవచ్చునని మార్వాడి విశ్వాసరావునుచంపి హంతకుడు కృష్ణరావని పోలీసువశముచేస్తాడు. మాధురికూడా ఆకుట్రలో చేరినందున కృష్ణరావుకు పశ్చాత్తాపం కలుగుతుంది. ఆస్తి మార్వాడిపరముకాగా రాధ సోదరుని ఆశ్రమంచేరుతుంది. భర్తస్థితి, తనకష్టాలు ఆమెకు ఉన్మాదం కలిగిస్తాయి.

కృష్ణరావు పతనానికి కారకురాలైన మాధురి ఆమెతల్లి, పురోహితుడు, మార్వాడి కృష్ణరావు ఆస్తిపంపకంలో తగవులాడుకుంటారు. మార్వాడీకోసరం మాధురి కోర్టుకువెళ్లుతూవుంటే కారు ప్రాసిక్యూటరుకారుతో ఢీకొని ఆమెకు గాయాలు తగులుతవి. ఆమె కోర్టులో హంతకుని బయటపెట్టి చనిపోతుంది. కృష్ణరావుకు విడుదలౌతుంది. భార్యతోకూడా బావమరది ఆశ్రమంలో

సుఖంగా వుండిపోతాము. క్లుప్తంగా చెప్పితే ఇది-రోహిణీపిక్చర్సువారి సాంఘికచిత్రం-గృహిలక్ష్మిలోని కథావస్తువు.

గృహలక్ష్మి తెలుగు సాంఘిక చిత్రాల్లో మొదటిది. 'ప్రకటనలవల్లనే ఇంత ఆకర్షనీయంగావుండే యథార్థంగాచూస్తే ఇంకే లావుంటుందో యీ గృహలక్ష్మి'అనే ఆసక్తి ఆంధ్రదేశమంతా జనింపజేసింది యీ చిత్రం. తుదకు Indian punctuality మీద బైలుదేరింది.

ఈ చిత్రం హరిజనోద్యమానికి, మద్యపాన బహిష్కారణోద్యమానికి బాగా వుత్సాహమిస్తుంది. ప్రజసముదాయంలోని రాజకీయవిజ్ఞానం సెంటిమెంట్సుతో నిండి వుండేటందువల్ల కాంగ్రెసు ఉద్యమానికి యీచిత్రం తోడ్పడుతుంది. పైగా కుటుంబంలో సతీత్వంలో సహనమే సంసారసౌఖ్యానికి మూలకందమని నిరూపిస్తుంది.

నిర్వాహకులు ఉత్తమసాంఘికచిత్రాన్ని తీయడానికెంతో కృషిచేసినట్టు కనపడుతుంది. వారాంధ్రులకు నూతనంగా ఒక తారను (కాంచనమాల) చేకూర్చారు. జనసామాన్యాన్ని ఆకర్షించడానికి యెక్కువగా పాటుబడ్డారు.

'గృహలక్ష్మి'ని చిత్రించడానికి యీచిత్రం నీతిఅవినీతుల ప్రాబల్యాన్ని Contrastగా ప్రదర్శించింది. ఆ అవినీతి ప్రదర్శనం శ్రుతిమించిపోయినది. అసభ్యమైనది. అసహ్యాం కూడా అయినది. అభిమానగౌరవాలున్న యేస్త్రీయైనా యీచిత్రాన్ని చూచి అందులో స్త్రీత్వానికి చేకూర్చబడ్డ అగౌరవాన్ని చూచి నొచ్చుకొనకుండా వుండదు.

కథా సంవిధానం సాంఘికమైనా దైనిక సాంఘిక జీవితాన్ని ప్రతిబింబింపచేయడము లోపించినట్టు కన్పిస్తుంది. ఎక్కడచూచినా కృత్రిమత్వము కనబడుతూవచ్చినది. డాక్టరు భార్య భారతీయ సంప్రదాయానుసారంగా గృహలక్ష్మి అయినా ఆమె నివాసములో భారతీయ వాతావరణం మచ్చుకైనా కనపడదు. భరతనాట్యం మధ్యలో రాధ రసభావాలులేని - రాచిప్పలావుంటుంది. బ్రాహ్మణగున్నలు ఎక్కడపడితే అక్కడంతా ప్రత్యక్షమై హాస్యాకిబిసలు అసహ్యాన్ని కలిగిస్తారు. త్రాగుడలవడేపటికు డాక్టరు అవ్యక్తమైన బాధపడే పేషంటులాగ వ్యవహరిస్తాడు. మాధురి తనలో స్త్రీహృదయం మాయమైనట్టు అస్వాభావికంగా 'అతి'గా వర్తిస్తుంది. మార్వాడీ అచ్చం తురకాడిలా వుంటాడు. ఎంతమాత్రమూ అవసరములేని ఖోజా మాధురియింట్లో ప్రాముఖ్యత సంపాదిస్తాడు. గోపీనాథుడు ఏమున్కా మాట్లాడినా—అది వ్యవహారికభాషయినా — గ్రాంథికఫక్కీలో ఉపన్యాసధోరణి అందుకుంటాడు. చచ్చేటట్టు దెబ్బలుతిన్న మాధురికి హాస్పిటలుకు వెళ్లి ప్రాణసంరక్షణ జేసుకోవడం గాకుండా కోర్టులో సాక్ష్యమిచ్చి మరి చావవలసినగతి పట్టినది. దెబ్బలుతగిలి చస్తుంటే హాస్పిటలుకు గాకుండా కోర్టుకులాగి సాక్ష్యమిప్పించడం ఏచట్టం జోరో తెలియకుండావున్నది.

ఆ స్త్రీ మార్వాడీపరం కావడంలో ఏచట్టాన్ని అనువర్తింపజేశారో?

సంభాషణ, శైలి,—చాకచక్యంతో ప్రయత్నింపబడినా—సంకరమైన భాషలో నడిచాయి. ముఖ్యంగా Delivery చాలా చెడినది. బ్యాక్‌గ్రౌండు సంగీతం బాగానే వుంది. ఫోటోగ్రాఫికూడా బాగానే తీయడానికి ప్రయత్నించినట్టు కనపడుతున్నది. శబ్దగ్రహణం బాగున్నది.

కన్నాంబ యీ చిత్రంలో కనపరచిన విశేషాలేమీలేవు. కాంచనమాల అభివృద్ధి పొందుతుందనడాని కవకాశాలున్నాయి. కుమారి రోహిణి గానం అభినయమూ బాగున్నాయి. ఆచారి తాగుబోతుగా బాగా నటించాడు. ఏమైనా మాకూ మాభాషలో సాంఘికచిత్రం తయారైంది అని యితరులకు జెప్పుకోతగ్గ గొప్పతనమేమీ ఇందులోలేదు.

ల. కా.

——:o:——

# అనుమాన పిశాచము

శ్రీ సత్యదుర్గేశ్వర కవులు

(శతావధానులు)

చ॥ సరిసరి యెంతమాట ననఁజాలిరి! చాలును లెండు నేర్చుకొం
టిరి! మరియాద మంటను వడింబడ నెమ్మనమెల్లఁ జీల్చివై
చిరి! మరియెన్నఁడేని తమ చెప్పినమాటకు వేఱురీతి సం
చరణ మొనర్చి నానె? ధృతి చాలక దూఱెద రేల? యీవిధిన్.

ఉ॥ మానములేని యాతుఁడిసుమీ యని లోకులు శాకులొంచు మీ
చానను లోక మందున బ్రచార మొనర్తురటంచు నెంచి మం
చానసె ప్రమగ్గుచున్న, జడి చప్పుడు లేకిటు మాటలాడుటల్
మానరు మీరు మీకు ననుమాన పిశాచము పట్టె నక్కటా!

చ॥ కలవు పిశాచముల్ పలురకంబులు దేశము నందు గాని ద
వ్వులకు బ్రయోగ మంత్రమున బోయెడి నయ్యవి; యీపిశాచమం
దులకు 'ససేమిరా' కదల దోగ్రహచారమ నీబలంబిటుల్
చెలగుచునుండ నెచ్చట వసించెడి నక్కట! సత్యవాక్యముల్.

# హిందూసంఘంలో విడాకులు

శ్రీ డాక్టరు ఎ. ఎస్. ఆల్టేకర్ గారు

(కాశీవిశ్వవిద్యాలయ ప్రాచీనభారతచారిత్రక విజ్ఞానశాఖాధ్యక్షులు)

విడాకులసమస్య విద్యావంతులైన స్త్రీపురుషుల హృదయాల్లో ఆందోళన ప్రారంభించినది. విడాకులు మంచివంటూ తీర్మానాలు పెక్కు సమావేశాల్లో ప్రవేశపెట్టబడుతున్నాయి. అవి కొన్ని సమయాల్లో నెగ్గుతున్నాయి, మరికొన్ని చోటుల్లో వీగిపోతున్నాయి. విడాకులను ప్రవేశపెట్టడము హిందూసభ్యత కెదురుచుక్క. ఇది సాధారణముగా ప్రతి హిందువుని నమ్మకము. అందులో సనాతనశాఖలవారి కది హిందూమతభ్రష్టసూచకము. సంస్కరణాల్లో ముందంజ వేసేవారంతా దాని ఆవశ్యకతను గుర్తించారు. అయినా దాన్ని ప్రవేశపెట్టడమువల్ల ఏలాంటి చెడుగు కలగదా అని వారు సంకోచిస్తున్నారు. అందుచేత విడాకుల చరిత్ర ఒకమారు సింహావలోకనము చేయుట మంచిది. అపుడుగాని మనదృష్టి కది స్పష్టము గాదు.

ధర్మశాస్త్రవాఙ్మయము మొత్తానికి ప్రథమకళత్రం జీవించివుండగానే రెండో పెళ్లాన్ని చేసుకోవడానికి పురుషునికి అధికారము యిచ్చినది. అయితే భర్తచేత పరిపూర్ణంగా త్యజింపబడినా భార్య భర్తనుండి వేరయ్యేటందుకు సమ్మతించలేదు. ఇందులో ఎంతమాత్రమూ సందేహము లేదు. ఆరంభములో క్రైస్తవమతమువలె హిందూమతముకూడా వివాహసూత్రము విచ్ఛేదముకాదనే ఉద్దేశించినది. మనువు ఇంకొక అడుగు ముందుకు వేసి,

న నిష్క్రియ విసర్గాభ్యాం భర్తుర్భార్యా విముచ్యతే,
ఏవం ధర్మం విజానీమః ప్రాక్ ప్రజాపతినిర్మితమ్.
—అ. 9. శ్లో. 46.

(విక్రయధనము కైకొన్నను, దానమొసగినను భర్తనుండి భార్య విడుదలనొందనేరదు అని బ్రహ్మ నియమించిన నిత్యమైన ధర్మము మే మెఱిగియున్నాము.) అన్నాడు.

## ప్రారంభధర్మస్మృతినిర్మాతలు విడాకులు అంగీకరించారు

క్రీ. పూ. 400నుండి క్రీ. శ. 200వరకుగల ధర్మశాస్త్రవాఙ్మయ ప్రారంభదృష్టి వేరు. ఈ కాలపు ధర్మశాస్త్రనిర్మాతలు కొన్ని ప్రత్యేకపరిస్థితుల్లో విడాకు లుండవచ్చునని అంగీకరించారు. మొదట వేదయుగంలో విడాకులంటే ద్వేషభావం వున్నట్టు ఎక్కడా కనపడదు. అథర్వణవేదంలో ఒకచోట (9, 5 27-8) పునర్వివాహము చేసుకున్న ఒక స్త్రీని గురించి చెప్పబడినది. అంతేగాకుండా ఆమె ద్వితీయ భర్తతో కలసి స్వర్గానవుండటానికని చేయవలసిన కొంత కర్మకాండకూడా చెప్పబడివున్నది. ద్వితీయ వివాహము అయివుంటే మొదట విడాకులు వుండివుండాలి. కొన్ని పరిస్థితుల్లో బ్రాహ్మణస్త్రీలకు కూడా విడాకులు పునర్వివాహము వుండవచ్చునని ధర్మశాస్త్రకర్తలంతా సమ్మతించారు. వారి దృష్టి ఏలాంటిదో క్రింద వివరింపబడిన వాశిష్ఠముచూస్తే తెలుస్తుంది :—

"యాత్రకు పోయినవాని భార్య ఐదు సంవత్సరాలు కాచివుండవలెను. ఐదు సంవత్సరాలైనతర్వాత ఆమె భర్తతో సంసారానికి వెళ్లవలెను. ఒకవేళ ఆర్థిక, మత అనుకూలాల చేత తాను ప్రయాణంచేయడానికి యిష్టము లేకుంటే, తాను తన భర్త చనిపోయినతరువాత ఏలావుండేదో, ఆలాగే నడుచుకొనవలెను. ఆమె ఆతరువాత ఇంకొక సగోత్రుని, సపిండుని వివాహమాడవలెను."



ఆంధ్రమహిళా గానసభ, రాజమహేంద్రవరము పంచమవార్షికోత్సవము.
అధ్యక్షులగు శ్రీమతి సీతంసెట్టి సుందరమ్మగారు పుష్పమాలాలంకృతులైయున్నారు.



శ్రీమతి మంత్రిప్రగడ వరలక్ష్మమ్మగారు

(తణుకు, వయస్సు 20 సం.లు)

శ్రీ తటవర్తి వెంకటరత్నంగారి స్మారక చిహ్నంగా శ్రీ రవీంద్ర సారస్వతసమాజ భగవద్గీత పోటీపరీక్షలో ప్రథమ బహుమతిని (రు. 25) పొందిరి.

కౌటిల్యుని అర్థశాస్త్రం పైసూత్రాలను అంగీకరిస్తున్నది. అయితే వివిధరకాలకు తగినట్లు కొన్ని మార్పులు చేస్తున్నది. భర్త వెడలినది దూరప్రయాణం గాకపోయినా అతన్నిగురించి సంవత్సరంవఱకు ఏమీ తెలియరాకపోతే భార్యకు పునర్వివాహం చేసికొనడానికి స్వాతంత్ర్యంవుంది. భర్త చేసింది దూరప్రయాణము అయివుంటే కాచుకొనివుండవలసిన కాలం ఎక్కువ చేయబడుతుంది. కొన్నిటి విషయాల్లో ఇలా కావచ్చు. అయితే ఆతరువాత తన భర్తను కలుసుకోవడానికై చేయవలసిన ప్రయాణానికి అయి ష్టతచూపే భార్య విషయమై వాశిష్ఠం ఆలోచించినది. అటువంటి పరిస్థితుల్లో జరిగే ద్వితీయవివాహములో భర్త్రబతికివున్నా విడాకులు పుచ్చుకున్నట్లే తలపడుతుంది.

## ప్రత్యేకవిషయాలు

పరాశరస్మృతి విడాకులుండవలెనని స్పష్టంగా సిద్ధాంతీకరిస్తూవున్నది. భర్తకు మగతనం లేకపోతే, లేక అతడు సన్యాసి అయితే భార్య పునర్వివాహము చేసుకోవచ్చునంటుంది స్మృతి. ఈ పునర్వివాహము ప్రథమవివాహసూత్రాన్ని భేదింపవచ్చునని తలంచడానికి స్పష్టంగా వీలుకలుగచేస్తూవున్నది.

ఒకటిగా సంసారాన్ని జరుపుకోలేని దురదృష్టవంతులుగావుండే దంపతులు విడాకులు పొందటానికి వివరంగా కౌటిల్యుని అర్థశాస్త్రం నియమాలు ఏర్పరచివున్నది. ఈ నియమాలు అసుర, గాంధర్వాలకే గాని, బ్రహ్మ, దైవ వివాహాలకు వర్తింపవు. మొదటి రెండురకాలు వివాహాలుకూడ ఆకాలంలో బ్రాహ్మణులలో వాడుకలోవుండేవి. అంచేత కొంతవఱకు వాళ్లలోకూడా విడాకులు వ్యాప్తిలో వుండివుండాలి.

అర్థశాస్త్రంలోని విడాకులనుగూర్చిన నియమాలు చాలా వింతగావుంటాయి. కౌటిల్యుడీవిషయములో చాలా ముందుకువెళ్లాడు. భార్యాభర్తలిద్దరిమధ్యా ఈర్ష్యపెరిగి ఒకరినొకరు అసహ్యహించుకుంటే విడాకు లివ్వడము మంచిదన్నాడతడు. అయితే అందులో ఒకరుమాత్రమే అసహ్యహించుకుంటే విడాకులుండవు. వీరిలో మొదట భర్త కంప్లెయింటుచేస్తే తాను వివాహసమయములో కట్నరూపంగా పుచ్చుకున్నదంతా భార్యకు ఇచ్చుకోవాలి. భార్య కంప్లెయింటు చేస్తే తాను తన భర్తనుండి వివాహానికిముందు పుచ్చుకున్నదంతా వెనకకు ఇచ్చుకోవాలి. కాని పిల్లలనేమిచేయాలో కౌటిల్యుడు మౌనంవహించాడు.

## గ్రంథస్థముచేయబడ్డ (విడాకుల) దృష్టాంతాలు

ఈ విడాకులనియమాలు ఎంతవఱకు ఉపయోగింపబడేవో చెప్పడము చాలాకష్టం. సంఘములోని అంత్యవర్ణాల్లో ఈవాడుక సాధారణమైవుండాలి. ఎందుకంటె వాళ్లల్లో అది ఈనాడుకూడా వాడుకలోవున్నది. బ్రాహ్మణాల వాఙ్మయంలో విడాకులవిషయాలు ఎక్కడా కనపడవు. బౌద్ధవాఙ్మయంలో ఏవో కొద్దిగా కనపడతవి. ధమ్మపదవ్యాఖ్యలో ఒక చక్కని కథవుంది. 'కని' అనే ఆమెవుండేది. ఆమె వివాహానంతరం తండ్రి యింట్లోనే కొంతకాలం వుండవలసివచ్చినది. భర్త ఆమెను తనవద్దకు పిలిచాడు. కాని ఆమె ఏకారణంచేతనో వెళ్లలేకపోయినది. భర్తకు కోపంవచ్చి ద్వితీయవివాహము చేసుకున్నాడు. వ్యవహారముచెడింపని కొంతకాలానికి 'కని' తెలుసుకొన్నది. ఆమె కోపము పట్టలేకపోయినది. భర్తవద్దకు వెళ్లడాని నిరాకరించినది. బుద్ధుని యానతి పైన ఆమెను ఒకరాజు దత్తుతీసుకున్నాడు. ఆతరువాత ఆరాజా తనసభలో నొక కులీనునకు ఇచ్చి పెళ్లి చేశాడు. (ధమ్మపదము II 82, వ్యాఖ్యకూడా).

తేరిగాథ వ్యాఖ్య (72) విడాకులకు సంబంధించిన ఇంకొక విచిత్ర ఉదంతము చెపుతూవున్నది. కోసలలో 'ఇసిదాసి' అనే ఆమెవుండేది. ఆమె అయోధ్యలో ఒకవర్తకుని వివాహము చేసికొన్నది. ఆదాంపత్యం సౌఖ్యదూరమైనది; భర్త భార్యను విసర్జించినాడు. అక్కరలేదన్న భార్యను స్వీకరించుమని ఆమె

తండ్రి అల్లుని బ్రతిలాడి కాలము వృథాచేయలేదు. ఆమెకు ద్వితీయవివాహము చేసి భర్తయింటికి పంపించాడు. ఈ వివాహముకూడా ఫలప్రదమైనది కాదు. అచిర కాలములోనే భర్త ఆమెను విసర్జించినాడు. అంతటామె తండ్రి మూడవమారు కుమార్తెను సుఖపెట్ట నుద్దేశించాడు కాని అదికూడా నిష్ప్రయోజనమైనది. మూడవభర్త ఆమెను పక్షంరోజుల్లోనే విడిచిపెట్టినాడు. ఆమె తుదకు సన్యాసిని అయినది.

'మజ్జిమనికాయ' విడాకులనుగూర్చిన మూడవ ఉదంతాన్ని తెలుపుతూవుంది. శ్రావస్తిలో ఒక ఆమెకు వివాహమైనది. ఆమెకు భర్తతోడి సంసారం దుర్భరమైనది. అందుచేత పుట్టినింటికి వచ్చివేసినది. ఆమెను సౌఖ్యవిహీనగావుంచుటకు తండ్రికి యిష్టము లేదు. అందుచేత మొదటి వివాహసూత్రాన్ని ఛేదించి రెండోపెళ్లి చేయాలని తలపెట్టాడు. కాని ఆమె కది నచ్చలేదు. తుదకేమయిందో మనకు తెలియదు.

## అంగీకరింపబడినా అసహ్యించుకోబడేది

బ్రాహ్మణిక బౌద్ధవాఙ్మయాల్లో ఉదహరింపబడిన విషయాలు విడాకులకు సంబంధించినవి కొద్దిగానే వున్నాయి—నిస్సందేహం. మొత్తానికి విడాకులు న్యాయసమ్మతమని అంగీకరింపబడినా సంఘంలో అది నైచ్యంగానే చూడబడుతూవచ్చినది. 'కన్హానిసాయన జాతకము'లో సౌఖ్యదూరమైన ఒకవివాహము సంగతి వున్నది. భార్య భర్తతో సంసారము చేయలేకపోయినది. కాని ఆమెకు విడాకులు పుచ్చుకోవాలని లేదు. అందుచేత ఆమె భర్తకు చెప్పింది అతనిమీద తన కేలాటి ప్రేమలేదని. అయినా ఆమె ద్వితీయ వివాహము చేసికొనలేదు. ఎందుకంటే ఆలాటివాడుక-పెళ్లయిన స్త్రీ మరలా పెళ్లిచేసుకోవడం—ఆమె వంశంలో లేదు. దీన్నిబట్టి తేలిందేమిటంటే ధర్మశాస్త్ర నిర్మాతలు విడాకులహక్కును అంగీకరించారు కాని అది యెక్కువగా ఉపయోగించుకున్నట్టు కనపడదు.

క్రీ. శ. ౫వ శతాబ్దమునుండి స్మృతికర్తలు విడాకులంటే ప్రతిఘటిస్తూవచ్చినట్టు స్పష్టపడుతున్నది. అవి వారి కట్టిపద్ధతి కంగీకరించిన వారి సమ్మతిని రద్దు చేయాలంటూ వారంతా యేకగ్రీవంగా పట్టుపట్టారు. మనువు యీవిషయములో తాను అన్యాయంగా చెప్పడానికికూడా అనుమతీయలేదు. భర్త భార్యను విసర్జించినా, అమ్మినా వివాహబంధం విచ్ఛేదము కాదన్నాడతడు.

ఆకాలంలో ప్రబల హృదయవికారము చలాయిస్తున్న వైరాగ్యము, సనాతనత్వమూ మనువుకూ, అతన్ని అనుసరించిన తరువాతి వారికీ ఆదృష్టి కలిగించాయి. భార్యాభర్తలను విసర్జించడానికి, ద్వితీయ వివాహము చేసికొనడానికి అంగీకరిస్తే దుర్నీతికి దోహదము చేసినట్లవుతున్నది; విషయవాసనకు ప్రాధాన్యం వహిస్తున్నది అనుకుంది ఆనాటిసంఘం. అందుచేత విడాకుల కది స్వస్తి చెప్పినది.

అది న్యాయంగా వుండాలంటే వారు పురుషులను కూడా, భార్యను విసర్జించి వేరే స్త్రీని వివాహం చేసికోకూడదని ఆటంకపరచి వుంచవలసినది. వివాహము సూత్రం పవిత్రమైనదీ, విచ్ఛేదం కానిది అయితే భార్య బ్రతికవుండేటంతవరకు భర్తగాని, భర్త బ్రతికివుండేటంతవరకు భార్యగాని ద్వితీయవివాహము చేసికొనకూడదని ఆటంకపెట్టవలసివుండేది. అటువంటిదేమీ చేసినట్లు కనపడదు. ధర్మశాస్త్రాలు వ్రాసినవాడు పురుషుడు, అందుచేతనే నియమనిబంధనలు తనకు వర్తించకుండా తన కసౌకర్యం కలగకుండా అతడు చక్కని శ్రద్ధ తీసుకున్నాడు.

ఇక్కడింకొక విషయము చెప్పడము అప్రస్తుతం కాదు. ప్రారంభములో క్రైస్తవమతముకూడా వివాహము విచ్ఛేదములేదని విడాకులను నిషేధించినది. ఇప్పటికీ యూరపునందు రోమనుక్యాథలిక్ దేశాల్లో విడాకులు లేవనే చెప్పవచ్చు. ఇంగ్లండులోకూడా 19వ శతాబ్దం మధ్యవరకూ ఏవ్యక్తిఅయినా విడాకులు పొందాలంటే పార్లమెంటుచట్టము చేయవలసి

వచ్చేది. అందుచేత అది ధనమూ పలుకుబడీవుండే యేకొద్దిమందికో లభ్యపడేది. 1715నుండి 1855వఱకు ఇంగ్లండులో 180 మంది మాత్రం పార్లమెంటును ప్రోత్సహించి ప్రత్యేకచట్టాలని పుట్టించుకొని విడాకులను పొందినారు.

5వ శతాబ్దమునుండే విడాకులు భారతదేశములో వాడుక లేకుండాపోయినవి. ఇది హిందూసంఘములోని అగ్రజాతులకు మాత్రమే వర్తిస్తుంది. కాని అంత్యజాతుల్లో ఆవాడుక అలాగే వుంటూవచ్చినది. 17వ శతాబ్దములో వ్రాయబడిన 'శూద్రకమలాకరము' శూద్రుల కది వుండవచ్చునన్నది. 19వ శతాబ్ద మధ్యలో గుజరాతులోని పెక్కుజాతుల్లో పంచాయతీదార్లు తమవర్ణాలవారికి విడాకుల కనుమతి యిచ్చేవారు. ప్రారంభములో బొంబాయి హైకోర్టు యీ హక్కును అంగీకరించినది. కాని ఆతరువాత హిందూచట్ట వుద్దేశ్యానికి వ్యతిరేకంగావున్నదని పనికిరాదన్నారు. అయితే యిప్పటికిని హిందూసంఘంలోని అంత్యవర్ణాలలో విడాకులను పొందుట అట్టే కష్టమైనది గాదు.

హిందూసంఘములోని అగ్రజాతుల్లోకూడా విడాకులను ప్రవేశపెట్టడము మంచిదేనాఅనే అభిప్రాయము ఏకగ్రీవంగా అంగీకరించడము కష్టము. విద్యాధికుల్లో ఒక మతంవారున్నారు. ఏవ్యక్తికీ ఏకష్టము కలుగకుండా వుండునట్టి సంఘవిధానము మనకెప్పటికీ వుండదు. విడాకులసూత్రాన్ని సంఘములో ప్రవేశపెడితే అది తొలగించేకష్టాలకంటే తెచ్చిపెట్టేబాధలే ఎక్కువగావుంటవి అని వీరిమతము. ఇంకోమతము వారుకూడా వున్నారు. ప్రకృతము వున్నటువంటి హిందూవివాహాధికార చట్టము చాలా అన్యాయమైనది, అత్యవసరమైన కొన్ని ప్రత్యేకవిషయాల్లో మాత్రము విడాకు లంగీకరించడ మొకటే ఇప్పటి సంఘము చేయతగిన గత్యంతరము: అన్నది వారి మతము.

ప్రకృతపు హిందూవివాహాధికార నిర్ణయము స్త్రీల యెడఅన్యాయము చేస్తూవున్నదనడములో ఎట్టి సందేహమూ లేదు. మొదట భార్యను లెక్కచేయకుండా ఆమెను విసర్జించి, పురుషుడు ద్వితీయ వివాహము చేసుకోవచ్చును. అంతేగాకుండా తనతోవుండటానికి భార్య అంగీకరించడములేదనే మిషచేత విసర్జించబడిన భార్యను పోషించవలసివుండు న్యాయసమ్మతమైన బాధ్యతనుకూడా పురుషుడు తప్పించుకొంటున్నాడు. అదివఱకు తనమీదవున్న ప్రేమనంతా కొత్తగావచ్చిన భార్యమీదకు మరలుస్తాడు భర్త. జీతం భత్యంలేకున్నా ఆమె ప్రార్థనపైననే వుంచుకోబడ్డ సేవకురాలినిగా చూస్తుంది సవతి. అటువంటిభర్తవద్ద ఆత్మగౌరవము గల ఏస్త్రీయైనా వుండటానికి యిష్టపడుతుందా? ఈవిధంగా తమ భర్తలచేత విసర్జించబడిన యువతుల సంఖ్య చిన్నదికాదు. పోనీ విసర్జించడానికి కారణము భార్యచేసిన యేతప్పునుకాదు; భర్తయొక్క తుచ్ఛతో, చాదస్తమో, విషయలోలత్వమో అయివుంటుంది. ఈ దురదృష్టవంతులగు పరిత్యక్తలు మరల వివాహము చేసికొనలేరు. ఎందుకంటె చట్టముగాని, మతముగాని హృదయములేని తమభర్తలతోటి వివాహబంధము విచ్ఛేదమయిందని అంగీకరించవు. వారుమరల వివాహమాడి సుఖించాలంటే మతాంతరమేగతి. హిందూమతములో నేవుండాలంటే విధవలవలె వుండవలసినదే. దానికివారు యిష్టపడుటలేదు.

ఈ పరిస్థితులు సమస్యాపరిష్కారానికి చాలా దూరంలోవున్నాయి. ఇవి హిందూమతములోవున్న వున్నతోద్దేశాలకు వ్యతిరేకము. పరిస్థితులను బాగుచేయడానికి వున్నమార్గాలు రెండు. అందులో మొదటిది వుత్తమమైనది. బహుభార్యాత్వము (లేక బహుభర్తృకత్వము) చట్టవిరుద్ధంగా చేసివేయడము. పూర్వము బహుభార్యాత్వాన్ని స్మృతికర్తలెందు కంగీకరించారని పురుషసంతతి లేనిసమయాల్లో అని గమనించాలి. నవీనకాలంలో 'అపుత్రస్యగతిర్నాస్తి' అనేదాల్లో నమ్మకము వున్నవాళ్లు చాలాకొద్దిమంది. ఆ నమ్మకమున్నవాళ్లు దత్తత ఉపయోగించుకోవచ్చును. హిందూసంఘములో కొన్ని అగ్రజాతులు— గుజరాతునందు నగర బ్రాహ్మణులవలె— బహు

భార్యత్వాన్ని నిషేధించారన్నది మరువకూడదు. వారిదారి త్రొక్కుట మనకిపుడు అత్యవసరము. బహుభార్యత్వము చట్టవిరుద్ధంగా చేయడమూ అవశ్యము. ఇలా చేస్తే పరిత్యక్తలైనయువతులు—ద్వితీయ వివాహాలు చేసికొని కొత్తభర్తలతో జీవితాలు గడుపుతూవుండే భర్తలు—ఎక్కడగాని లేకుండా మాయమౌతారు.

పరిత్యజించే విషయము లో—

ఒకవేళ ఇలా చేయడం సాధ్యంగాకపోతే పరిత్యక్తల విషయములో విడాకులకు అంగీకారంయివ్వాలి. హిందూసంఘములోని ఐకమత్యాన్ని, నైతిక పవిత్రతను అభివృద్ధి చేయాలంటే పరిత్యక్తలైన స్త్రీలకు—వారు కోరితే నే—విడాకులు పొందేహక్కు యివ్వడం మంచిది. అలా అని భర్తల మాటమీదనే విడాకులు పొందేటట్లు చేయకూడదు. ఎందుకంటే నానావిధంగా తమ కక్కరలేదనుకొన్న భార్యలను పోషించవలసివుండే చట్టసమ్మతమైన బాధ్యతను తప్పించుకోవడానికి చూస్తారు. స్త్రీలకు తమ్ముతాము పోషించుకోవడానికిగాని, విడాకులు పొందినతరువాత వివాహమాడడానికి గాని కష్టమే.

క్రూరత్వము, ఉన్మాదము, చిరకాల కారాగారవాసము, విడువని వ్యభిచారము,— వీటి విషయంలో కూడా విడాకుల వ్యాప్తి కలిగింపవలసిందేనా? ఈ ప్రశ్నకు వుత్తరంచెప్పడం కష్టమే. ప్రకృతము హిందూసంఘమున్న సంస్థితిలో పై కారణాలు మీదగాని, అటువంటి వానిమీదనేగని ఆధారపడి విడాకులు పొందడానికి అధికారం కలిగిస్తే చాలామంది స్త్రీల యభివృద్ధికది ఆటంకముగా వుంటుందని నిస్సందేహంగా చెప్పవచ్చును. వితుంతువులు కూడా తృప్తికరముగా ద్వితీయవివాహము చేసుకొనడానికి సాధ్యముగాకుండా వున్నది. అందుచేత విడాకులు పొందిన స్త్రీలలో నూటికి ఐదుమందయినా మరీ తృప్తికరంగావుండే వివాహము చేసుకోగలరనే నమ్మకమే మనకులేదు. తక్కిన 95 మంది వివాహము చేసికోవడానికి అశక్తులైవుంటారు. విడాకులే వస్తే వారు తమభర్తలవలన పొందవలసిన మనువర్తి హక్కు కూడా పోతుంది.

ఏకపత్నీవ్రతాదర్శము.

కాబట్టి, క్రూరత్వానికి, వ్యభిచారానికి చిరకాల కారాగారావాసానికి విడాకులు అవశ్యకం అనడము హిందూస్త్రీల శ్రేయస్సుకు భంగము. విడాకులు విరివిగా వ్యాపించి పరిస్థితులు గలిగించితే నైతికాధిక్యము తగ్గిపోవడము చాలా వివాహాలు సౌఖ్యదూరాలు కావడము జరిగింది. ఇది పాశ్చాత్యదేశాల అనుభవము. పతితసుగ్యోవస్తువుకు క్రమక్రమంగా వుకవడి గొనుక్కవయ్యేటట్లు, పాశ్చాత్యదేశాల్లో విడాకులు పుచ్చుకోవడము నానాటికి అధికమౌతూవున్నది. ఇంగ్లండు రష్యాలందు ఇటీవల చేయబడ్డ చట్టాలను చూస్తే ఇదివరకు విడాకుల విషయంలో యివ్వబడిన స్వాతంత్ర్యాన్ని అరికట్టవలెననే వుద్దేశం స్పష్టమౌతూ వున్నది.

సంఘశ్రేయానికి వివాహసూత్రము శాశ్వతమైనదీ, విచ్ఛేదంకానిదీ అని నిశ్చయం కావలసినదే. ఇందుకు సందేహం లేదు. ఇది సాధ్యము కావాలంటే వివాహాదర్శము అత్యున్నతముగా వుండితీరాలి; భార్యాభర్తలిద్దరు ఆత్మనిగ్రహము, పరస్పర బాధ్యతభావము కలిగి వుండాలె. వారిద్దరూ కూడా తెలిసికొనవలె: మానవప్రకృతిలో స్వభావభేదాలుండక తప్పవు; అవి దైనికజీవితములో గాని తప్పవు. ద్వితీయ వివాహముచేత ఆభేదాలను తప్పించుకోవడానికి సాధ్యముగాదు. జీవితములోని కష్టాల నెదుర్కోవడానికి భార్యాభర్తలిరువురు గొప్ప త్యాగాలు చేయ సిద్ధపడి వుండాలె. ఒకరిస్వభావం ఒకరుబాగా అర్థంచేసుకుని ఒద్దికతో నడుచుకోవాలి. అలా అయితే నీ కుటుంబ జీవితములో సంతోష సౌఖ్యాలుండడానికి వీలవుతుంది.

కాబట్టి విడాకులహక్కు భార్యను పలుమారు పరిత్యజిస్తూ రావడంగానీ, దీర్ఘకాలం పరిత్యజించడంగాని జరిగినపుడు మాత్రమే వుండవలెను. అదికూడా భార్య కోరికపైననే ప్రేరేపణపైననే అంగీకరింపబడవలెను.

—హిందూ.

# ఆంధ్రయువతి – నిరాడంబరజీవనము

## శ్రీమతి మర్ల రోజాబాయిగారు

నేడు 'తెలుగుతెగులు' అను ప్రయోగ మామెయెడల వర్తించుచున్నది. నవనాగరికాప్రవాహములో గొట్టుకొని పోవుచు మునుగుచు తేలుచు చేయూతదొరకక గమ్యస్థానము చేరలేకున్నది. తనలోతాను క్రమశిక్షాపద్ధతి నలవరచుకొనవలెను. నాగరిక మనుదాని కంతులేదు. Luxuries దిన దినమునకు హెచ్చుచున్నవి. ఈదినమున 50 రూప్యముల బనారసుచీర గట్టినచో రేపు 100 రూప్యముల విలువగల జరీచీరను కట్టి తోడివారిలో మెప్పునుపొంద నుత్సాహపడుచుండును. ఎవ రేపనిచేసి నను దాని ననుకరింప సమకట్టును.

మనదేశము చాల బీదస్థితిలోనున్నది. ఇట్టి ఫ్యాషనులు పెట్టుకొని ఎవ్విధమైన నియమములేక నిర్లక్ష్యముగానుండి తన కర్తవ్యమును తెలియలేక గాఢాంధకారముననున్నది. ఇట్టి నిరర్థకజీవనమువలన తనకును ఇతరులకు సౌఖ్యమును తేజాలదు. హిందూదేశ స్వాతంత్ర్యము మనకోటి యువతీమణులపైనే యాధారపడియున్నది. దేశసేవాపరాయణత్వము హృదయకుహరములో బీజముల గల్పించుకొని మొలకలెత్తవలయును. అమూల్యాభరణములను విలువగల దుస్తులను తిలకింప నుత్సవమందు నేత్రములను నేడు దేశదుఃస్థితివైపు ద్రిప్ప వలయును. రుచిగల పానీయములను పదార్థములను ద్రావ తిన నుద్దేశించు పెదవులను సాటి సోదరీమణులకు బుద్ధులు గరపుచు దేశసేవాపరాయణుల జేయగలుగు వాగ్ధాటి కొరకై వినియోగింపవలెను. దినకృత్యములందు మనిగిన కరములను నేడు దేశసేవ చేయుటకు దోసి లొగ్గవలెను. భౌతిక మానసికశరీరమంతయు మాతృదేవిపాల్చేసి తరింపవలెను.

నేటి ఆంధ్రసోదరి నాగరికత యను దురూహ్యమును బెట్టుకొని తన జీవితకర్తవ్యమును నిర్ణయించుకొనలేకున్నది. తన కన్నులను తెరచిచూచిన మాతృదేవి నొసట బంగరు అక్కరములతో లిఖింపబడిన నిరాడంబర మను పదమును చూడుడు. ఎట్టి యాడంబరములులేని జీవితమే జీవితము. మనము ప్రస్తుతము నిరాడంబర జీవనము గడపుచున్న వ్యక్తుల ననేకుల జూచుచున్నాము. వారినుండి మన మా పాఠమును గ్రహించి హృత్ఫలకములో చిత్రించుకొనవలెను. ప్రతిదినమును నిరాడంబర జీవనమునుగూర్చియు, ఖద్దరువస్త్రధారణమునుగూర్చియు ఉపన్యాసము లిచ్చుచు, వినుచు వాని నన్నిటి నచ్చటనే విడచి యథాప్రకారముగా Civilisation, vanity, recklessness అను శత్రువుల బారి పడుచున్నది. క్రిందటి కొక బాలుని భూమి యాకారమునుగూర్చి యడుగగా 'The

earth is round at school and flat at home' అని జవాబిచ్చెనట. ఆంధ్రయువతియుగూడ నట్లే యనుచున్నది.

దేశీయ, రాష్ట్రీయ, గ్రామ, గృహసుస్థితులకు ఖద్దరు వస్త్రధారణ ప్రధానసాధనము. మనము సాలునకు భోజనాదికృత్యముల కెంత వెచ్చముచేయుచున్నామో, వస్త్రములకై యంతకన్న మిక్కుటముగా వ్యయము చేయుచున్నాము. ఈ ధనమంతయు విదేశఫేక్టరీలపాలగుచున్నది. మనవారినోట మన్నుకొట్టి, పైదేశములవారి నోట బెల్లము కొట్టుచున్నాము. ఖద్దరును ధరించిన దానికై వినియోగింపబడిన ధనము మన దేశములో ననేక గృహములకు జీవనము గల్పించినవారమగుచున్నాము. కృత్యముల నెరవేర్చుకొనుచు తీరికయున్నప్పుడెల్ల నూలువడకుచు బట్టలు నేయించుచు తనకును తన కుటుంబమునకును సంవత్సరమునకు సరిపోవు బట్టలు తయారుచేయగల్గినచో బీదరికమేల యనుభవింపవలెను? పైదేశముల పైనేల నాధారపడియుండవలెను? మనకండ్లతో మనమే యెన్ని కుటుంబములు కూలుచున్నవో చూచుచున్నాము.

'అన్నగతప్రాణి' యనుమాట నేడు 'కాఫీగతప్రాణి' యగుచున్నది. 'కాఫీత్రాగు కొంప'యు 'కల్లుత్రాగు కొంప'యు నెన్నటికిని సరిపోల్చజాలవు. 'ఆధునికాంధ్రవనిత'కును 'నవీనాంధ్రవనిత'కును ఆరోగ్యములో నెంతభేదమున్నదో చూతుము. పానీయములవలన దేహము చెడును. అనేక రోగములపాలగును. సౌఖ్యము లేకపోవును. ధనము మందులకై వ్యయమగును. అనారోగ్యవంతులు తమకుగాని యితరులకుగాని సౌఖ్యమొసగుటెట్లు కల్పింపగలరు?

---

# వర్ణవ్యవస్థ

శ్రీమతి దేవినేని మాణిక్యాంబ.గారు

వర్ణముల నంతమొందించవలెనన్న మన కందరకు విశ్వసోదరప్రేమ పెంపొందవలెను. ప్రేమ ఐకమత్యమునకు మొదటి హేతువని తలంపవలయును. ఈ భారతదేశ మొకప్పుడు సర్వసౌఖ్యములకు నెలవై నేడు యస్వాతంత్ర్యమను పిశాచమును పైకెక్కించుకొన్నది. కొందరన్నమో రామచంద్రాయని యలరారువారు. మఱికొందరు నానావిధములైన బాధలకు బాధ్యులై యున్నారు. లక్షాధికారులు కొంతమంది భిక్షాధికారులు మఱికొందరు. సౌవర్ణ సౌధములయం దానందించువారు కొందరు, చావడీ చావడిపంచలజేరి పొడుదుడుకులు బొందువారు మఱికొందరు పంచభక్ష్య పరమాన్నముల సేవించి సౌఖ్యమొందువారు కొందరు, పనికిరాని పాచినన్నమును భుజించి నీరసించు

# వర్ణవ్యవస్థ

వారు మఱికొందరు పలువిధములగు బాధలకు బాధ్యులగుచున్నారు. కాని, యీకష్టపరంపరలకు కారణమేమోయని స్మరించక పోవుచున్నారు. వివిధములైన వర్ణములను కల్పించుకొని, కల్లోలమునెందుచు సంతోషించుచున్నారే, ఇదియేమన యవివేక ప్రభావము. కొంతమంది "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" "అదానదోషేణ భవేద్దరిద్రః, దారిద్ర్యదోషేన కరోతి పాపమ్, పాపాదవశ్యం నరకంప్రయాతి, పునర్దరిద్రీ పునరేవపాపీ" యనిచెప్పుచున్నారు. కాని నిజముగా ఆ హేతువే యని చెప్పుటకు సందేహాస్పదము, ఎందువలన మనదేశమునకంటె నితర దేశములవారందరు సమానమైనస్థితియందున్నట్లు తోచుచున్నది. అది వారి విజ్ఞాన విశేషమే. వారిధైర్యసాహసముల సమ్మేళనమే, వారియుక్తి ప్రయుక్తలచే వెలరారు స్వతంత్రశక్తియే, దానికి ప్రధానకారణము గాన అది వ్యక్తిగతమైన దోషముగాని, కర్మయని చెప్పుటకు సందేహమే. అట్లే మనదేశమునందును చేయుట కవకాశము లనేకములున్నవి. ఇట్లన్నచో కొందరు పుట్టుదరిద్రులగుటకు కారణమేమని ప్రశ్నించెదరు. ఇప్పుడు భాగ్యవంతుడైన వాడు మూడువంతులు పిత్రార్జితము వల్లనే గాని స్వతంత్ర కృషివల్లగాదు. అట్లే వాని తండ్రి కొన్ని లోపములచేపాపము బీదవాడైనచో, వాని సంతాన మట్లేయగుటకు సందేహములేదు. ఎందువల్లనన మనదేశమందతి మహత్తరమైన ధన ధాన్యములచే భాసిల్లువారు వారివారి నడవడి ననుసరించి, తినుటకు తిండిలేక క్షుధాకలిత పీడితులై, చింతాకులస్వాంతులై, స్వయంకృషి వదలి, అన్యవృత్తుల నవలంబించి, అల్లరులపాలైన వారనేకులు గలరు. ప్రత్యక్షమందు కష్టమొందు కుక్షులయందు లక్ష్యముంచి వారిని పోషించినవారు మనవలె తయారగుట కవకాశమున్నది. మనతో తుల్యముగ నెప్పుడు తయారగుదురో యప్పుడే తుచ్ఛవృత్తులను తృణీకరించెదరు. అప్పుడే నీచకర్మల నిరసించెదరు, గాన ప్రతివ్యక్తిని మన స్థితికి రప్పించవలయునను భావతరంగములెప్పుడుదయించునో, అప్పుడే వర్ణములను చూర్ణముజేయు శక్తులు బయలుదేరును. అప్పుడే విశ్వసోదరప్రేమ వల్లిక దోహదమధికమై విరివిగావ్యాపించును. జాతిభేదము గుణగతమైనదిగాని వ్యక్తిగతమైనది గాదు గాన చేయవలసిన చికిత్స యాత్మకై యుండగా శక్తియుక్తులు నశించిన యీ వ్యక్తిని కావలించుకొన్న భుక్తియా! ముక్తియా!

భుక్తికి ముక్తికి యుక్తముగాని మన నిష్ప్రయోజనము నిరర్థకము, గాన మానవుడు ఈ పరిపూర్ణమైన హృదయ కమలమును వికసింపజేయుచు తన విజ్ఞాన రసవిశేషముచేనిండి నిబిడీకృతమైన యామనోభాండమును పొంగిపొరలనివ్వక నాత్మశ్లాఘలను సంపాదించుకొని యొరులనాక్షేపించుట తన కాక్షేపణ యనితలంచి తనకన్నతక్కువ వారిని మక్కువతో దగ్గరకు జేర్చుకొన్నచో, అపుడే విశ్వసోదరప్రేమలతా వితానము ప్రాకుట కారంభించును.

# శిశు గీత

మూడు నెలలకుముందు బిడ్డలకు కన్నీళ్లు రావు

*　　　*　　　*

పాలు బిడ్డలకు నిద్రలో అరుగుతవి

*　　　*　　　*

బిడ్డలు నిద్రలో ఎదుగుతారు

*　　　*　　　*

తల్లి పల్లొకటి

*　　　*　　　*

వయసు పళ్లనుబట్టి నిర్ణయించవచ్చు.

*　　　*　　　*

బిడ్డలకు సాయంకాలపుయెండ మంచిది

*　　　*　　　*

ఆటలు ఎక్కువైతే బిడ్డలకు ఆకలి ఎక్కువౌతుంది

*　　　*　　　*

పెప్పర్ మెంటు బిళ్లలు పిల్లల జీర్ణకోశాల్ని చెడగొడుతవి

*　　　*　　　*

శైత్యానికి ముక్కుడము (STRAIN) గురుతు

*　　　*　　　*

బాలపాపచిన్నెలకు చర్మరోగాలు కారణం

*　　　*　　　*

బిడ్డలకు రెండేళ్లువస్తే ఎండురోగము రాదు

*　　　*　　　*

నాసికారోగాలున్న బిడ్డలకు ఛాతీ సరిగా పెరగదు

*　　　*　　　*

పిల్లికళ్లవాళ్లకు ఆయువు తక్కువ.

*　　　*　　　*

పొట్టివాళ్లు ఎక్కువకాలం బ్రతుకుతారు

ఎస్. శేషగిరిరావు.

పిల్లలు క్షణం వూరుకోరు. ఏమాత్రం ఏమరక వాళ్లను
ఎప్పుడూ కనిపెట్టివుండడం ముఖ్యం. లేకుంటే ప్రమాదాలే.



ఈ క్రింది వివరాలుచూస్తే

"పూనమల్లి హైరోడులో నొక బంగళాయం దొక తోటవాని బిడ్డయగు ధనలక్ష్మి రెండేండ్లబాలిక నీటితొట్టిలోపడి చనిపోయెను. ఈతొట్టిలో రెండు అడుగులఎత్తు నీళ్లుండెను. బాలిక ఆడుకొనుటకు వెళ్లి దానిలో ఆకస్మికముగ పడిపోయెను. తల్లితండ్రులు వచ్చి బిడ్డను బయటతీసిరి. కాని అది తరువాత చనిపోయెను."

—ఆంధ్రపత్రిక.

"నిన్నసాయంకాలము చింతాద్రిపేట వానియర్ వీధిలో ఖాదర్ అనేపిల్లవాడు వంటిమీద ఉడుకు గంజి పోసుకున్నాడు. శరీరము కొంతకాలినది. జనరల్ ఆసుపత్రిలో చికిత్సపొందుచున్నాడు"

—జనవాణి.

ఇలాటివి దినానికి ఎన్నో—వీటిలో మనకు తెలిసేవికొన్నే

“శ్రీమతి చాగంటి సునందనమ్మగారి” జన్మదినోత్సవ సందర్భమున, జరుపబడిన
“శ్రీమతులు లక్ష్మీశారద” లొసంగిన,

# ఆశీర్వచన పద్యరత్న మాల

క. శ్రీశివదంపతు లిలగల, నీశివ దంపతులనుగని - నిచ్చలుఁ బ్రోవన్
ధీశుభముల జేకూర్పను, నీశు సదా ప్రస్తుతింతు - నెంతయు ప్రీతిన్.

ఉ॥ తోచితి, పండితానికర - తోయధియందునస, కోనిదుందు, “కో
లాచలశ్రీనివాస”కుల - లక్ష్మి యిగా, బుధవర్యు నన, “సిం
హాచల మంత్రి”కోడలుగ - నార్యుడు “సాంబశివాఖ్యు”పత్నివై
పూచినతంగెడుంబలెను - పుత్రులతో దులదూగు చుమ్మరో?

శా. ఇంకన్ విద్యల నభ్యసించెదరు, మీ - గింకన్ సుమనంబంద, ని
శ్శంకన్ గౌరవనీయమౌ పదవుల - ప్రాంతంబుగానొందు, యి
ర్వంకన్ నీసుత పంచకంబిలను, స - ద్భాగ్యమ్ములన్ గాంచ, ని
త్యం, కల్యాణము, పచ్చతోరణముగా - త్వద్దేహ మొప్పారెడిన్.

గీ. మధురఫలముల వృక్షంపు-మహిమ దెలియు, సౌరభాఘ్రాణమున, పూల-సౌరు దెలియు
పుత్ర రత్నాలగన్న, నీ-పూజ దెలియు, ఇందిరాంశోద్భవమ్మ! “సు-నందనమ్మ”!

గీ. పసిడివిరులకు నెత్తావి-పొసగినట్లు, అందమునకీసు హృదయంపు-చెందమమరి
కలిమితేపాటు వినయంపు- గలిమిగల్గి, వరలుచున్నావు చాగంటి - వంశమందు.

సీ. సతతమ్ము, పతిభక్తి - నతిరక్తి నల్పుటన్ బరికింప నీకు, పా - ర్వతియెసాటి,
లలినిత్య సౌభాగ్య - ముల పెంపు కళసొంపు దిలకింప నీకు, శ్రీ - దేవిసాటి,
మృదుమంజులాలాప - పదగుంభన ప్రౌఢి భావింపనీకు, వా - గ్దేవిసాటి
ఓరిమిన్ గూరిమిన్ - గారుణ్య సంపదన్ దీపించు నీకు, భూ - దేవిసాటి

గీ. సత్యసౌజన్యములకు - నా శైబ్యసాటి, నిత్యమానందమున నీకు - నీవెసాటి
సాటియననేల, నిన్నిటన్ - మేటివగుచు ధరను ప్రభవించితమ్మ! యబ్బురముగాగ.

సీ. సుతుపంచకంబుతో - పతితోడబంధు మర్యాద లన్నిత్యంబు - యశముగనుమ
దీనజనావనో - ద్దీపితా దర్శవై సౌభాగ్యగరిమంబు - జాటుమమ్మ
దేశ సౌభాగ్యంబు - దేశానురాగంబు దేశ, స్వతంత్రంబు - దెల్పుమమ్మ
అధ్యాత్మికజ్ఞాన - మాధ్యాత్మవృత్తులన్ సతతమున్ గమనించు - వితముగనుమ

గీ. భరతమాతకు, నోముల - పంటవగుచు, కాంతలందరికోమేలు - బంతివగుచు
కడుపుచల్లగ వర్ధిల్లి - పుడమియందు ఇందుధరుడేల మనుము సు - నందనమ్మ.

# బనానా (అరటిపండ్లు)

శ్రీమతి ఎం. శాంతాదేవి గారు.

**బనానాలంటే** అందరికిన్ని యిష్టమే; ఎందుకంటే ఏ. బి. సి. ఇ. విటమిన్లు ఈపండ్లలో విశేషముగా ఉన్నవి. శాకపాకాదులకున్ను బనానాలు బాగుగా వాడుతారు.

పచ్చరటిపండ్లు తెచ్చి తోలుఒలిచి ముక్కలుగా తరిగి ఎండలో ఎండబెట్టవలెను. ఈ యెండుముక్కలను బాగా పిండికొట్టి ఉంచుతారు. మలబారు దేశస్థులకిదే చాలామట్టు కాహారము. ఈ అరటిపండ్ల పొడుమే చంటిపిల్లలకు హార్లిక్సువంటి వాటికి బదులుగా వాడుతారు. బాగా వీర్యదాయకమని చెప్పి, ఈ పొడరుతో చప్పాతీలుకూడాచేసి తింటారు.

ఇంతవరకు ఈ బనానాపండ్లు శాకపాకాదులకే పనికివచ్చు ననుకొన్నారు. అజీర్ణమువల్ల కలిగేభేదులు (డయేరియా) రక్తభేదులు–వీటివల్లభాధపడే చంటిపిల్లలు, చిన్నపిల్లలకు ఈ పొడర్‌ను నీటితో కలిపి యిస్తే 24 గంటలలోగా ఆగుతాయని ఇటీవల ఒక డాక్టరు ప్రకటించినారు. వైద్యములలో కూడా క్రమేణ తనస్థానాన్ని బనానా పొందుతూ ఉందంటే ఆశ్చర్య మేమీలేదు.

## బనానా స్వీట్

బాగాపండిన మూడు అరటిపండ్లను తోలుఒలిచి గుజ్జుగా రుబ్బుము. 15 ఏలకులపొడిచేయుము. ఒక చిన్నబల్లమీద అంతా నెయ్యిరాచి పెట్టియుంచుము.

ఒక ఇత్తడిపాత్రలో 4 టీకప్పుల చక్కెర, 1½ టీకప్పులనీళ్లుపోసి ఒక పొయ్యిమీద 20 నిమిషాలు మరగబెట్టుము. గుజ్జుగాచేసిన అరటిపండును, ¼ టీకప్పు నేతిని బాగా కలియబెట్టుము. ఈ మిక్చర్‌రు వదలకుండా గంటసేపు కలయబెట్టి తర్వాత ఆ యేలకులపొడి చేర్చుము. బాగాకలిపి సమముగా నెయ్యిరాసిన చిన్న బల్లమీద పఱచుము.

ఒకటి రెండంగుళాల తునుకలగా, వేడిగా ఉన్నప్పుడే చేయుము. బాగాచల్లారిన తర్వాత ఈ బిళ్లలను ఒక పలుచన కాగితములో గాలంటకుండా మడిచి పెట్టుము.

ఈ మిఠాయీలు చాలా రుచిగా ఉంటవి. అంత ఖర్చులేదు. తొందరచేసి పిల్లలకు తల్లి ఇదిచేసి యిస్తూవుండ వచ్చును.

## బనానా టాఫీ

పూర్తిగాపండిన మూడరటిపండ్లను తోలు ఒలిచి గుజ్జుగాచేసి ఒక ఇత్తడి పాత్రలోపోసి 2 టీకప్పులంత తెల్ల చక్కెర, ½ టీకప్పు నెయ్యి చేర్చి బాగాకలిపి పొయ్యిమీద 1 గంటసేపు అని చాకలెట్టువలె ఒక ముద్దగాఅయ్యేదాకా బ్రౌన్‌రంగువచ్చేదాక ఉంచుము. దీన్నిఒక ఇత్తడి ప్లేటుమీదపోసి చల్లారినతర్వాత చిన్న చదరములుగా కోయుము. ఇదిన్ని ఒక చక్కని మిఠాయి.

## బనానా డిలైట్

నాలుగు పెద్ద అరటిపండ్లను తోలుఒలిచి అంగుళము వెడల్పుగల ముక్కలుగా తరుగుము. ఒక టీకప్పంత నేతినిబాగా కాచుము. ఈ ముక్కలను అందులో కొన్నికొన్నిగావేసి బ్రౌణ్‌గా అయ్యేదాక రెండువైపులా ఉడికినతర్వాత తీసివేయుము. అన్ని యిల్లాగా వేచినపిమ్మట తెల్లచక్కెర వాటిమీద చల్లుము.

## బనానా జామ్

బాగాపండిన 3 సన్నని అరటిపండ్లను తోలుఒలిచి ముక్కలుగా తరుగుము. వీనికి ఒకపాత్రలో 4 టేబిల్ స్పూనుల మంచినెయి, 8 టేబిల్ స్పూనుల మంచి నీళ్లు, ఒక టీకప్పునిండుగా పొడిచేసిన బెల్లములో కూడావేసి నిప్పుమీద, ½ గంటసేపుంచి బాగా కలిపి నిప్పునుంచి తీసివేయుము. కొంతయేలకుల పొడికూడా వాసనకోసం చేర్చవచ్చును.



# పుష్పచయము

అనాగరిక ప్రాచీనాచారాలకు బలియగుచున్న దేవదాసీలు.

దేశస్వాతంత్ర్యంకంటే నాకు నాసాత్త్వికయోగమే ప్రియతమమైనది. అలాగే స్త్రీలకుకూడా ప్రాణంకంటే స్వాతంత్ర్యంకంటే గౌరవము ప్రియతమమైనది. భారతస్త్రీలు గౌరవరక్షణార్థం భర్తలతో సహగమనంచేసినారు. అట్టిపరిస్థితులలో అమాయికులైన కొందరుబాలికలు కృత్రిమమైన మతంపేరిట అవమాన దుఃఖపూరితమైన మరణదాయకమైన బలికి పాత్రులుకావడంచూస్తే ఆలోచించుకొంటే ప్రతిస్త్రీ పురుషుడు కంటనీరు పెట్టకమానరు.

దక్షిణాదిన తిరువన్నామలై, కంజీవరం, చిదంబర, తంజావూరు, మధుర మొదలగు పవిత్రమైన దేవాలయాలుగా పరిగణింపబడుచున్న వాటిల్లోకూడా ఈగజ్జపూజ అనేమారి యింకావున్నదని హిందూదేశంలో యితరప్రాంతాలవారికి తెలియదు. ఇదివరలోయుండే ప్రభుత్వము తలుచుకుంటే ఒక కలంపోటుతో యీ అమానుషమైనకార్యము ఎప్పుడో రూపుమాపి వేయవలసింది. బ్రిటిష్ప్రభుత్వము మన మతవిషయములో జోక్యం కలుగచేసుకోదు కాబట్టి వారు అంతగా చేయలేకపోయినారు. ప్రస్తుతము కాంగ్రెసు ప్రభుత్వము పవర్లోవుంది కాబట్టి మనము యీ అమూల్యతరుణం పోగొట్టుకోకూడదు. మద్రాసు ప్రధానమంత్రిగారు మధ్యపాననిషేధము, రైతు ఋణపరిష్కారచట్టము, రెండున్ను చాలా ముఖ్యమైనవి అమలు జరపించుచున్నారు. యిదివరలో యీవిషయమై సంఘసంస్కర్తలు పనిచేసి దానిని పూర్తిచేయించటము ప్రస్తుతపు మద్రాసు ఎసంబ్లీవారి విధియైయున్నది. దీనికి ప్రజామోదముకొరకు ప్రాతిపదిక ఇదివరలోనే యేర్పాటు చేయబడినది. తమ గర్భవాసులైనవారిని ఏలాగున ప్రేమించెదరో ఆలాగుననే నిర్భాగ్యబాలికలను ఉద్ధరించుటకు ప్రార్థించుచున్నాను. తద్వారా మన హిందూమతములోని మచ్చ రూపు మాసిపోవును.

—మహాత్మాగాంధి.

*　　　*　　　*　　　*

వ్యభిచారంవల్ల సంఘానికి, సంసారానికి, వ్యక్తులకు కలిగే అనంత కష్టాలు అందరికి తెలిసినవే అయినప్పటికి మన మూఢాచారాన్ని అడ్డగించుటలేదు. బహిరంగంగా జరుగుచున్న ఈ శాసన ధిక్కారాన్ని ప్రభుత్వం చూస్తూకూడా వూరుకుంటున్నదిగాని వ్యతిరేక ప్రయత్నం చేయుటలేదు. ఈ పరిస్థితులలో అఖిల భారత జాతీయమహాసభ యేమిచేస్తుంది. యేమిచేయవలసి యుంటుంది. వ్యభిచార నిరోధప్రయత్నం విజయవంతంగా నెరవేరాలంటే కాంగ్రెసు మహాసభ ఒక విచారణసంఘాన్ని ఏర్పరించి దీనిలో మంచిచెడ్డలను విచారించాలి. దేవాలయాలు ఈ దురాచారాన్ని అంగీకరించటమే గాక ప్రోత్సహిస్తున్నందు వలన ప్రజలు దీని ఫలితంగా కలిగే సాధకబాధకాలను గుర్తించలేని అజ్ఞాను లగుటచేతను శాసనరూపంగా ఈదురన్యాయాన్ని ఆపడానికి వీలులేక పోతున్నది.

సచ్ఛీలము పారిశుధ్యముగలస్త్రీకి అభిమానంకంటె విలువగల పదార్థం మరొకటిలేదు.

—డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డి.



శ్రీమతి ఆచంట శారదాదేవిగారు,

శ్రీయుత ఆచంట వెంకట్రామ శర్మ, బి.ఎ., బి.యల్.గారి సతీమణి. ఈమె బందరు లేడీ యాంప్థిల్ గవర్నమెంటు గరల్సు హైస్కూలు విద్యార్థిని. ఈమధ్య జరుపబడిన వక్తృత్వ, వ్యాసరచన, ఏకాభినయ పోటీలలో ప్రథమ బహుమానములను బడసినది. బ్యాట్‌మింటన్, వాలీబాల్, నెట్‌బాల్ వగైరా ఆటలపందెములలోకూడ పాల్గొని ప్రథమ బహుమతులను బడసినది.



కొచ్చిను రాజాంతఃపురము

## కావలసినది కార్యదీక్ష; పట్టుదల; త్యాగము.

మనకు రాజకీయ బానిసత్వముతోబాటు మానసిక బానిసత్వముగూడ ప్రసాదింపబడినది. ఉన్నతమైన విద్యలను మన బాలబాలికలు పొందుటకు అర్హత, అవకాశము లేకుండ జేయబడెను. ప్రపంచ చరిత్రలో నేసంఘములుగాని వ్యక్తులుగాని అపూర్వమైనకార్యములు చేసిరన్నచో వారివారికిగల విద్యయే కారణముగాని వేరొక్కటిగాదు. ఇంతయేల! సరస్వతీ ప్రసన్నమైన సంఘములే నేడు ప్రపంచమును పరిపాలించుచున్నవని మనము తెలుసుకొనవలయును. నేటి ప్రపంచపరిణామము సాంఘిక మత రాజకీయ విప్లవములు తెలుసుకొనవలెనన్న విద్య అవసరముగదా? భారతదేశమునందుగల అన్నిసంఘములు విద్యావిషయములందు శరవేగముతో ముందుకు నడచుచున్నవి. కాని విద్యాలోపముచే వైశ్యులుమాత్రము వెనకబడియున్నారు. ఇతరవర్ణములకు లక్ష్మి పూర్తిగా హస్తగతముగానికారణముచే విద్యాభివృద్ధికి అడ్డు తగులుచున్నది, కాని వైశ్యులు లక్ష్మీపుత్రులైనందువలన కాబోలు సరస్వతి దూరమగుచున్నది. ఇదియంతయు విచారకరము. దీనినుండి విముక్తులగుటకు ఒక్కటియేమార్గము. విద్యానిలయములను నేర్పరుపుడు. విద్యార్థి వసతిగృహముల నెలకొల్పుడు. ఇట్టి నిర్మాణకార్యక్రమమును పూనుకొనుడు. వైశ్యులు లక్ష్మీపుత్రులుగదా! ఇంకేమి కావలయును! కావలసినది కార్యదీక్ష, పట్టుదల, ఉదారస్వభావము, త్యాగము; ఇయ్యవి యిదివరకే మనలో నివురుకప్పిన నిప్పువలెనున్నవి. లెండు, లెండు! సప్తాహములు, నోములు, వ్రతములు, మతము పేరిట, దేవుని పేరిట, కొల్లగొట్టు పీఠాధిపతులకు భిక్షలు, గౌరవబిరుదములు మొదలగు దుర్వ్యయముల కట్టిపెట్టి, దానధర్మములనన్నిటిలోను ఉత్తమమైన విద్యాదానమునకే కానుకలనర్పించి వైశ్యవిద్యానిధుల నేర్పరుపుడు. పదిసంవత్సరములలోనే మన బాలబాలికలు సర్వతోముఖముగ జ్ఞానసంపన్నులు కాగలరని నా విశ్వాసము.

—పాదర్తి సుందరమ్మ—మహానంది వైశ్యమహాసభలో.

*    *    *    *

## కనబడని త్యాగాలు

కూడూ గుడ్డాలేని బీదవాళ్లు భార్య భర్తలిద్దరూ కూలికిపోవాలి. పొలంపని అలసిపోలనేటట్లుజేయాలి ప్రొద్దు పొడుస్తున్నాభయమే; ప్రొద్దు కుంకుతున్నాభయమే. పొలంపని పూర్తిజేసుకొని పొలాలగట్టుల మధ్య బడ్డారు గబాగబానడుస్తూ, కులాసాగా కబుర్లు జెప్పుకుంటూ. ప్రొద్దున యింటిదగ్గరవదలిన చంటిబిడ్డలు యెంతగా యేడ్చుచున్నారో యనుకొనుచూ మొగవాళ్లను వెనకవేసుకొని కొంతమందితల్లులు పరుగులమీద పరుగులెట్టుచూ యిల్లుజేర్తారు. ఆ యేడ్చుబిడ్డలను ఓదార్చేదానికి, అవకాశముండదు తమభర్తలు ఆసామి దగ్గర కూలిధాన్యం తేవాలి, అవి రాత్రివేళ దంచుకొని వంటజేయాలి. యిక తమమభర్తలతో సరససల్లాపాలెక్కడ? బిడ్డలతో ముద్దుముచ్చట్లెక్కడ? అనుదినం, యీమాదిరి తమ పేద జీవితంతో బలిచెడుగు ఆడి ఆడి విశ్రాంతిలేక చచ్చిపోవుచున్న స్త్రీలదా? పురుషులదా? త్యాగం.

సృష్టికి మూలాధారమైన స్త్రీజాతికి, యింతటిశక్తి సహనం, ఆత్మబలం, వీరత్వం దృఢత్వం, ఉండబట్టేవారి కనపడని త్యాగాలు, అన్నిజాతులను రక్షిస్తున్నవి. యింతకాలం యీజాతుల కాలప్రవాహమున కొట్టుకొనిపోక, బాధల సముద్రములందు మునిగిపోక, నిల్చియున్నవంటే ముఖ్యకారణం సాధారణ ప్రజలు, అందునూ వారి స్త్రీలు అనుదినం చేస్తూవున్న కనపడని త్యాగాలే; చూపెట్టుచున్న, ధైర్య సాహసాలే ముఖ్య కారణంగదా?

—భారతీదేవి రంగా.

# గృహలక్ష్మి

## రేడియో వార్తాపత్రికలు.

రేడియోవార్తాపత్రికలు సాధ్యమా అసాధ్యమా యనేప్రశ్న కిక తావుండదు. ఇన్నాళ్లు పరిశోధన చేసిచేసి యిట్టిది నూత్నముగా అమెరికా సంయుక్తరాష్ట్రములో నిటీవల నిర్మించినారు. దీనిఖరీదు 120 రూపాయలేనట.

ఈవస్తువు వాడుటలో కష్టమేలేదు. దుండగీండ్రకు శ్చేష్టలకు ఇది లోనుగాదు. ఇంతకు చేయవలసినది రాత్రి పండుకొనుసమయమున ఒకస్విచ్ వేయవలె. అంతే. తెల్లవారుసరికి, రాత్రి బ్రాడ్కాస్టుచేయబడ్డ వార్తలను బొమ్మలను విశదముగా వివరములతో ఈయంత్రము రికార్డుచేయగలదు.

ఇది ప్రస్తుతము సాక్రెమెంటో, ఫ్రెస్నోఅను ప్రదేశములందుమాత్రమే ఉపయోగమునసున్నది. జనసముదాయమునకు దీనియెడ ఆదరమెచ్చినచో అమెరికా సంయుక్తరాష్ట్రములలో ఇతరత్ర ప్రవేశపెట్టబడునట. ఇది 'టెలివిషన్' పద్ధతిపైనాధారపడి కనిపెట్టబడిన యంత్రమట. ఏతన్మాత్రముచే వార్తాపత్రికల ప్రాముఖ్యమేమీ నశించదు. రేడియో వార్తాపత్రికలరిపోర్టులు బుల్లెటినుగా కొద్దిమాత్రపు ముఖ్యవార్తలనే గలిగియుండును. కాబట్టి యిది దైనికపత్రికలకు సాహాయ్యకరముగా మాత్రముండునుగాని తత్ స్థానమెన్నటికి నాక్రమింపదు.

*　　　*　　　*　　　*

## కన్యాశుల్కం రు. 3051, కన్నెనుకన్న తండ్రికో ?

రూ. 3001ల చెక్కును బ్యాంకిలో మార్చుకొనివచ్చుటకు వెళ్లుచుండగా బొంబాయి సి. ఐ. డి వారొక 45 ఏండ్లవయస్సువానిని అరెస్టుచేసిరి. ఈ రూ. 3001 లు తనకూతురిని అమ్మినందుకు క్రయధనమట.

అరెస్టయినతడు తూర్పుఖాండేశమునుండి కూతురితోడ బొంబాయికివచ్చి కల్బదేవిగోడ్డులో నొక గుడిలోపల వాసముచేయుచుండి కూతురివిక్రయమునకు మధ్యస్థముజరుపుచు ఆఅమ్మాయియొక్క అమ్మకపువెల రూ. 3051 లుగా నిర్ణయించుకొన్నాడు.

ఈ అమ్మాయివయస్సు 13. ఈమెను కొనదలచినవాడొకడు ఆమెతండ్రియొక్క దురుద్దేశమును పోలీసువారికి చెప్పెను. పోలీసువారు అతనిచేతికి రొక్కముగా ఏబదిరూపాయలును 3001 రూపాయలకు చెక్కును ఇచ్చి ఆకన్యను కొనబంపిరి.

ఒక నిర్ణీతసమయమున మ్యూజియములో ఈకృత్రిమబేరగాడు ఆతండ్రిని కలసికొన్నాడు. అతడు ఆపైకమును చెక్కునుపుచ్చుకొని కూతురి నతనివశముచేసి ఒక విక్రయపత్రము వ్రాసియొసగెను.

ఆవలకే మ్యూజియములో వేచి జరుగుకార్యముల నిరీక్షించుచున్నపోలీసులు అతడు చెక్కుమార్చుటకు బ్యాంకుకు పయనమగుటచూచి అరెస్టుగావించిరి.

*　　　*　　　*　　　*

## ఇనుపకమ్ముల వెనుక యువతీమణులు.

కఠినాతికఠినంగావుంది జైళ్లలోమ్రగ్గుతున్న స్త్రీలస్థితి. మనదృష్టిని వెంటనే వారివైపుకు మరల్పవలసివుంది. బెంగాలులో ఏడుగురు అస్సాంలో ఒకరు ఆ యినుపకమ్ములవెనుక తమ ఆరోగ్యాన్ని కోల్పోయి దయనీయమైనస్థితిలో వున్నారు.

## పుష్పచయము

సునీతిచౌదరీ 14 సంవత్సరాల వయసులోనే యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్ష విధింపబడ్డది. ఆమె క్షయవ్యాధి పీడితరాలైవుంది. శ్రీమతి రాజలక్ష్మీదేవి, శ్రీమతి సువర్ణలతాదేవిగార్లను మామూలు ఖైదీలతో పాటు సి. క్లాసులో వుంచారు. కుమారి శాంతిఘోష్ 15 సంవత్సరాలప్రాయముననే ద్వీపాంతరవాసశిక్షను పొందింది. కుమారి వీణాదాస్ తొమ్మిదిసంవత్సరాలు శిక్ష విధింపబడ్డది. కుమారీ విజ్జలదేవికిగూడ క్షయవ్యాధి సోకినసూచనలు కనపడుతున్నాయి. ఒక బ్రిటిషుప్రభుత్వానికి వ్యతిరేకంగా అస్సాంలో బయలుదేరిన తిరుగుబాటులో పాల్గొన్న నేరానికి వీరయువతి గిడాల్లో యావజ్జీవశిక్షను అనుభవిస్తూవుంది ఈ వీరయువతులంతా వెంటనే విడుదల కావాలి. (రవీంద్రనాథ ఠాకూర్.)

*  *  *  *

### సినిమా యెరగనివాళ్లు సీమలోనూ వున్నారు !

బ్రిటన్‌లోవున్న ప్రజలలో సగంమంది, వారానికి ఒక్కసారైనా సినిమాకు వెళ్లుతారు. ముప్పాతికవంతు నెలకొక్కసారైనా వెళ్లుతారు.

స్త్రీపురుషులవిషయం లెక్కించితే ఉభయులసంఖ్య సగటున సమానంగానే కనబడుతుంది. కాని వయస్సు గమనిస్తేమట్టుకు 32 ఏండ్లలోపు యువతీయువకు లెక్కువగా వెళ్లుతున్నట్టు తెలుస్తుంది.

వినదగ్గ విశేషమేమిటంటే—సుమారు 6,000,000 మంది బ్రిటిష్‌దివులలో నేటివరకు సినిమాఅంటే యేమిటో యెరగనివాళ్లున్నారట.

*  *  *  *

### పదేళ్లలో తొమ్మిదికాన్పులకు బహుమతి.

చార్లెస్ ఫాన్సిపెల్లర్ అను కోటీశ్వరుడు ఒకవింత 'విల్లు' వ్రాసి మరణించినాడు. తన మరణానంతరము పదిసంవత్సరాలలోగా టొరెంటోలో హెచ్చుకాన్పులుగల స్త్రీరత్నములకు 150,000 పౌనులు బహుమతి యొసగవలసినట్లు ఆ'విల్లు'లోని విషయము.



# గ్రంథపరిచయము

## మురారి అనర్ఘరాఘవము
(సమాలోచనము)

గ్రంథకర్త: ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులవారు, M. A. ఆంధ్రగీర్వాణ భాషోపన్యాసకులు, పిఠాపురరాజ కళాశాల, కాకినాడ. (వెల తెలియదు)

శ్రీమాన్ వీరరాఘవాచార్యులవారు ఈవఱకే సంస్కృతాంధ్రములందు పెక్కుగ్రంథముల బ్రకటించి తమ యశశ్చంద్రికల దిగంతము వ్యాపింప జేసికొని యున్నారు. వారు నేడు వెలువరించిన మురారి అనర్ఘరాఘవ సమాలోచనము వారి యసమాన పాండితికి మఱియొక ప్రబలనిదర్శనము.

భట్టమురారి మహాకవినిగూర్చి చర్చించిన ప్రత్యంశమును అనేక హేతువులతో సాధింపబడినది. ఈమహాకవినిగూర్చి యితని తరువాతివారు ఎక్కడెక్కడ ఎట్టులు స్తుతించిరో, విమర్శించిరో వానినన్నిటిని ఆమూలాగ్రముగా గ్రోడీకరించి పఠితకు మనంబున కెక్కునట్లు ఆచార్యులవారు వ్రాసియున్నారు. ఇవిగాక ఆంగ్లవిమర్శకులు మురారి మహాకవిని విమర్శించిన పలుతావుల స్పృశించి వాని మంచిచెడ్డల పరామర్శించియున్నారు.

మురారి ఆంధ్రదేశమునకు జెందినవాడని శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి వాదమును శ్రీమాన్ ఆచార్యులవారు చక్కగా సమర్థించిరి. ఇదిగాక వైదేహీవివాహసమయమున భగ్నధనువు ధ్వని వివాహాదికాలమునందలి 'ఉలూలు' అను మంగళగానమును బోలినది అని మురారి మూడవయంకమున నేబదియైదవశ్లోకమున (శతానందునివాక్యమున) వాడినాడు. 'ఈ 'ఉలూలు' గానము దాక్షిణాత్యస్త్రీలలో మహాప్రసిద్ధవిషయము' అని మురారివ్యాఖ్యాత శ్రీరుచిమత్యుపాధ్యాయులు పేర్కొనియున్నారు. ఇదికూడ నొక యుపపత్తియే. కాలవిచారమును అత్యద్భుతముగా నిశ్చయముగా శ్రీమాన్ ఆచార్యులవారు తేల్చినారు.

శ్లో. "తత్త్వాద్యగుజ్జ్వలే"త్యాది శ్లోకమును శ్రీ ఆచార్యులుగారు విమర్శించి వాల్మీకిమురారుల విశేషణములు మార్చియుండిన అర్థవంతమగునని యభిప్రాయపడియున్నారు. కాని ఆశ్లోకమునకే యీక్రింది యర్థముచెప్పిన బాగుండెడిదేమో!

వాల్మీకికావ్యము పురాణము కనుక సుహృద్భావముచే విపులముగాను—కాబట్టి దుర్గ్రాహముగాను—ఉపదేశించును గాని ప్రవేశపర్యంతము సాధింపదు. మురారివాక్యము కాంతాసమ్మితమైనట్టి, కావ్యములోను దృశ్యకావ్యముగా సహృదయాహ్లాదకమై సంగ్రహముగా అన్నివిషయములను సుగమముగా బోధజేయును. కాబట్టి వాల్మీకికవిత కూపమునందలి జలముకావున వాల్మీకి కవితామృతమును నిపానమువంటి తన యనర్ఘరాఘవమునునించి సర్వజనసులభముగా దానొనరించినట్లు మురారి ఆశ్లోకమున జెప్పుకొన్నాడు. వాల్మీకిది పురాణము, తనది (దృశ్య)కావ్యము అని చెప్పుటయే కవ్యుద్దేశమైయుండును.

శ్లో. మురారిపదచిన్తాయామిత్యా శ్లోకమునకు (పు 22.)గల యర్థద్వయమును మహారసవంతముగా శ్రీఆచార్యులవారు చెప్పియున్నారు. శ్రీమద్వేదాంతదేశికుల సుభాషితనీవి భట్టమురారిపథమున రచింపబడ్డ కావ్యము. ఇట్లే వేంకటాధ్వరి లోనగువారు మురారి నెట్లనుకరించిరో ఆచార్యులు చక్కగా దెలిపియున్నారు.

మురారి వ్యాకరణసాహిత్య మీమాంసా మంత్ర శాస్త్రములందు ప్రవీణుడని ఆచార్యులవారు పేర్కొని యున్నారు. మూడవయంకము 12 శ్లోకము (యత్రే త్యాది) వలన మురారికి వేదాంతమున పరిచయము గోచరించును. అట్లే మూలగ్రంథపరిశీలనమున భట్ట మురారి న్యాయశాస్త్రములో సైతము గొప్పపండితు డని తేలగలదు.

ఆచార్యులవారు ఇంత చిన్నగ్రంథమున మహో త్తమవిషయములను ఆంధ్రలోకమునకు సమర్పించుట వారికి గీర్వాణభాషయెడల మక్కువను దెలుపు చున్నది. ఈచిన్నిపొత్తముకై పెక్కుమహాకవుల గ్రంథములను కూలంకషముగా పరిశోధనచేసినారు, పరామర్శించినారు.

శైలి సహృదయరంజకమై యెంతో ప్రీతి చేకూర్చు చున్నది. శ్రీమాన్ ఆచార్యులవారు ఇట్టిగ్రంథముల నెన్నో ప్రకటించి భాషాసేవ సేయగలరని మనవి.

[నరసింహాచార్య]

## శ్రీ భగవద్గీత.

గ్రంథకర్త:-రావుసాహెబు బచ్చు పాపయ్య శ్రేష్ఠిగారు, ద్వారకానాథ్ అండుకంపెనీ, నెం. 55 స్ట్రాటన్ ముత్యాలమొదలివీధి, మద్రాసు. వెల 6 అ

శ్రీమద్భగవద్గీత నీవఱకే పెక్కురు ఆంధ్రీకరించి యున్నారు. ఇదియు నొక తెలుగుసేత. గ్రంథములో నొకపుటలో సంస్కృతశ్లోకములును, వాని కెదురుగా వేరుపుటలో తెనుగు పద్యములు నున్నవి. పద్యము లన్నియు గీతములలో అతిసులభములైన తెలుగుపలుకు బళ్లతో వెలయుచున్నవి. అక్కడక్కడ క్లిష్ట (సంస్కృత) పదములకు అర్థములు సైతము గలవు. గీతయం దిచ్ఛగలవారికిది చాలా ఉపకరించగలదు, ఇందు కృష్ణాష్టోత్తరశతమ్, గీతామాహాత్మ్యము (తెలుగుసేతతో), శ్లోకముల యకారాదిసూచికయు గలవు. లోధ్ర ముద్రణాలయమున ముద్రింపబడి మంచి క్యాలికో బైండుతో నున్నది. వెల 6 అణాలే యగుటచే ఆంధ్రులెల్లరు దీనిని కొని పఠించి తరింతురు గాక.

## త్రిలోచన కవిరాజు.

రచయిత స్వర్గీయ రవీంద్రనాథమైత్రగారు, అను వాదకుడు శ్రీ చక్రపాణిగారు, ప్రకాశకులు యువ కార్యాలయం, తెనాలి. వెల ప్రతి ఆరుఅణాలు.

రవీంద్రుడు దేశసేవకూ, సంఘసంస్కరణానికీ జీవితమంతా గడపిన ప్రతిభాశాలి. ఆతని జీవితచరిత్రే ఎంతో ఆకర్షణీయంగావుంటుంది. ఆతని కథలుకూడా అలాగేవుంటవి. మానవునిలోవుండే వింత భావాల కన్నింటికీ కథల్లో రూపాలు ముగించి మధురమైన హాస్యంతో పాఠకులపెట్టే నేర్పు అతనికి అసమానం. అటువంటి కథకులుగాని, కథలుగానీ తెలుగులో అరుదుగా వున్నయి.

ఆంధ్రులకీ ప్రతిభావంతుని రచనల్ని తెనుగుచేసిన చక్రపాణిగారు ప్రశంసాపాత్రులు. ఈపుస్తకంలో 'త్రిలోచనకవిరాజు' 'ఆల్ స్టార్' 'ట్రాజెడీ' 'నారీ ద్వేషి', 'వెల్లువ', 'సంస్కార', 'ఆఖరుపేజీ' అనే ఆరుకథలున్నవి. అనువాదకులు మంచికథలనే ఏరు కొన్నారు. అయితే అనువాదభాషమాత్రం ఇంకను సంస్కరణాన్ని కోరుతుంది, భాషలో హిందీ ఫక్కీ తోసుకరావడం బాగుండలేదు. చ. రా.

## పశ్చాత్తాపము.

కర్త: హనుమంతరావుగారు' శ్రీ ప్రభాసీప్రెస్సు రాజమండ్రి.

ఇది 8 పేజీలేగల ఒక చిన్నగ్రంథము. బాల్య వివాహముయొక్క పర్యవసానము మృతియని యిందు చక్కగా చెప్పబడినది. "వివాహో విద్యనాశాయ, సర్వంనాశాయ శోభన" మ్మను సూత్రమును ఒక

కథగా హనుమంతరావుగారు వ్రాసినారు. వివాహముచే ప్రేమి చదువుకు స్వస్తిచెప్పుట, రజస్వలాఅయి స్నానమునాడే కార్యము, అనతికాలముననే శిశుజనము, ఆస్పత్రిలో తల్లిమరణము-ఇవి బాల్యవివాహముయొక్క అవ్యవహితఫలములు. నాడు తన స్నేహితుడు రామం ఇచ్చినసలహాలు పెడచెవిబెట్టినందుకు తనకిట్టి దుఃస్థితిః గ్లెనని ప్రేమి పశ్చాత్తాపపడుచున్నాడు. బాల్యవివాహమును నశింపజేయుటకు ఈపొత్తమెంతేని ప్రయోజనపడగలదు. [గ. ప.]

## రాఘవేశ్వర శతకము.

కర్త: బాలకవి సామవేదుల వేంకటశాస్త్రిగారు C/o వడ్డాది సీతారామాంజనేయులుగారు, ఖాసింకోట, వెల 0-2-0.

ఈశతకము బాలకవిగారి ప్రథమకవితయట. ఇది 'రాఘవేశ్వరా' యనుమకుటము గలది. ఈశతకమును సంస్కరించి వడ్డాది సీతారామాంజనేయులుగారు మెఱుగుపెట్టిరట. కవిత బాగున్నది. ఉత్తరోత్తరముగా మంచిరసవత్తర కావ్యమును రచించుటకు సామవేదుల వేంకటశాస్త్రి సమర్థుడు కాగలడనుటకు ఈశతకమున పెక్కు నిదర్శనలు కానవచ్చుచున్నవి.

## విప్లవగీతాలు.

విశ్వసాహిత్యమాల, ముంగండ, అంబాజీపేట పోస్టు తూర్పుగోదావరి జిల్లా.

" విజ్ఞానవ్యాప్తికై స్వాతంత్ర్యపోరాటానికై, నూతనసమాజ నిర్మాణానికై తగుచైతన్యాన్ని ప్రజాసామాన్యంలో వ్యాప్తిచేయడానికి "ఈ విశ్వసాహిత్యమాల కంకణము కట్టుకొన్నది. వీరు ప్రకటించిన గ్రంథములుకొన్ని అతివాదసిద్ధాంత వ్యాపకములని ప్రభుత్వమువారు నిషేధించిరి. విప్లవగీతాలను ఈచిన్నిపొత్తము నిద్రాణముననున్న జనసామాన్యమును లేపి వారి కష్టముల గుర్తెఱిగి స్వతంత్రసమరమునకు నడుముకట్టుకొని పోరాడ పురికొల్పుచున్నవి. ఈ గీతాలను వ్రాసినవారు సుప్రసిద్ధజాతీయవాదులు మద్దూరి అన్నపూర్ణయ్య, గరిమెళ్ల సత్యనారాయణ, తుమ్మల వెంకటరామయ్య మొదలగువారు. 'కూలిరాజ్యం' అను పి. లోకనాథకృత గీతము చాలబాగున్నది. కార్మికకర్షకులను ధనికులు సామ్రాజ్యవాదు లెట్లు దోచుచు వారిని అతిదరిద్రులజేసి ఘోరమైన దురవస్థకు దెచ్చుచున్నారో కండ్లకు కట్టినట్లు వర్ణించియున్నారు. ఈ గ్రంథములోని ప్రతిగీతమును పదుగురుకలసి కోరస్‌గా పాడుటకు ఎంతో అనుకూలముగనున్నది. కర్షక కార్మికులకు ఏతద్గ్రంథమువల్ల చాల ప్రబోధము కలుగగలదు.

## లలిత.

సచిత్రమాసపత్రిక. సంపాదకులు శ్రీముచ్చిమిల్లి గౌరాంగరావుగారు, కన్నూరుకోట ఖాసింకోట పోస్టు, విశాఖపట్టణమునుండి ప్రకటింపబడుచున్నది. విడిప్రతి 2 అణాలు. సాలుచందా రు. 1-4-0

ప్రకృతము ప్రచురింపబడుచున్న ప్రసిద్ధమాసపత్రికలన్నీ నొక్కొకవర్గమునకు చెందినవనియు నన్నిటికి సామరస్యమునుకలిగింప నొకయాంధ్రపత్రిక యవసరమగుటచే నీపత్రికను స్థాపించితిమనియు సంపాదకులు స్వవిషయమున నుడివిరి. హిందీ వ్యాప్తిచేయుటకూడ వీరి ముఖ్యోద్దేశము. మొదటిసంచికలో తులసీదాసు, అభిప్రాయప్రదాతలు, మహాతీర్థములోనగు వ్యాసములు ప్రశంసింపదగినవి. ఇందలి అనువాదములగు కథలే బాగున్నవి.




## స్త్రీ సర్జన్ - జనరల్

శ్రీమతి డాక్టర్ యం. సి. పోసెన్ లూకోస్ సతిగారిని తిరువాన్కూరు ప్రభుత్వమువారు సర్జన్ - జనరల్‌గా నియమించినందుకు భారత మహిళాలోకము సర్వథా కృతజ్ఞత చూపగలదు. ఈ పదవిని బడయుటకు ఈమెయే మొట్టమొదటి స్త్రీ.

ఇతర సంస్థానములకు దుస్సాధమైన పెక్కు విషయముల తిరువాన్కూరు ముందంజ వేయుచున్నది. హరిజనులకు దేవాలయ ప్రవేశమొసగినది తిరువాన్కూరే. స్త్రీని (అన్నాచాండీగారిని) న్యాయస్థానమునకు ప్రథమ పర్యాయము నియమించినది తిరువాన్కూరే. నేడు మరల అట్టి ఉన్నతోన్నతమైన సర్జన్ - జనరల్ పదవికి లూకూస్ సతిగారిని నియమించినది తిరువాన్కూరే.

దీని పాతమొక్కటే. పురుషులకు బలె స్త్రీలకును సమానావకాశము లొసగునెడల స్త్రీలు సైతమెట్టి మహోన్నత పదవినైన బొందుటకు సమర్థురాండ్రే - అయితే అవకాశము లేవీ?

మదరాసులో నుండునది కాంగ్రెసు మంత్రివర్గమైనను, అతి సమర్థురాండ్రైన స్త్రీలున్నను అట్టి బాధ్యతాయుతపదవి స్త్రీకి నొసగబడలేదు. మీదుమిక్కిలి స్పీకరుగారు యూరపునకు ప్రయాణమైన పిమ్మట ఆయనకుగల అధికారమంతయు డిప్టీస్పీకరగు శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారికి గాక మరెవ్వరికో యిచ్చుచున్నారని వదంతులున్నవి. ఇతరత్ర స్త్రీల నుద్ధరించి వారికి ఉన్నతపదవు లొసగుచుండ మద్రాసు ప్రభుత్వము వెనుకంజవేయుట స్త్రీలయెడ పరమ అధర్మమని నుడువుట కెంతయు విచారపడుచున్నాము.

## వ్యభిచారవృత్తి నిర్మూలన శాసనము

ఈవఱకే శాసనరూపమున నున్నదీనికి కొన్ని సవరణలు మద్రాసు ప్రభుత్వము వారు మొన్నగావించినారు. వ్యభిచారిణి ఆర్జించు ధనముతో బ్రదుకు ఎవరుగాని శిక్షార్హులగుదురు. పాతచట్టముయొక్క కొన్ని లోపములను గుర్తించి వాని సవరింప కొంతమట్టుకే సవరణచట్టము ప్రయత్నించినదిగాని ముఖ్యమైన మహాలోపమునెడ దృష్టి మరల్పలేకపోవుట శోచనీయము. దేవదాసీలయొక్క కొందఱు బంధువులు, వయస్సురాని బిడ్డలు--ఇట్టివారు వ్యభిచారిణి గడించు ధనముతో బ్రదుకవచ్చునట. ఈ లోపమును గుర్తించి కొందఱు శాసనసభ్యులు ఆసెక్షను తీసివేయవలెనని కోరిరిగాని మహామంత్రులు వినరైరి. దేవదాసీలకు బంధువులు బిడ్డలు కానివారెవ్వరు?

అందఱు కావలసినవారే. ఎవరిని శిక్షింప వలయునని యీశాసన ముద్దేశించెనో వారెల్లరు బంధువులు అను నెపమున శిక్ష తప్పించుకొన నవకాశముగలదు. ఈసెక్షన్ తీసివేయవలెనని అఖిలభారత మహిళాసంఘము తీర్మానించినది. ఇప్పటికైన లోపమును గ్రహించి ప్రధానిగారు దేవదాసీత్వమే నిర్మూలింతురని మనవి.

శ్రీమతి యశోధర దాసప్ప

కాంగ్రెసు శబ్దమే వినబడకుండజేయ కంకణముకట్టుకొన్న మైసూరు దివాన్ ఇస్మాయిల్ గారికి శ్రీమతి యశోధర దాసప్పగారు మంచి గుణపాఠము గఱపినారు. మొన్నటి బై యెలెక్షనులో పదునొక్క స్థానములకును కాంగ్రెసుచే నియమింపబడ్డ సభ్యులు గెలుపొందినారు. విశేషమేమన, సంస్థాన ముఖ్య పట్టణమైన మైసూరుపట్టణముననే కాంగ్రెసు అభ్యర్థిని యశోధరదాసప్పగారు ప్రత్యర్థి యగు రావుబహద్దరు మునివెంకటప్పగారిని మూడువేల ఓట్ల భేదముతో ఓడించినారు. మునివెంపటప్పగారికి వచ్చిన ఓట్లు 381. కాంగ్రెసు అభ్యర్థినితోడి పోటీఫలితము మునివెంకటప్పగారు తమ ధరావతును పోగొట్టుకొన్నారు. దేశసేవచే, త్యాగముచే కాంగ్రెసు ప్రతిష్ఠ నిలిపిన శ్రీమతి యశోధర దాసప్పగారికి మాహృదయ పూర్వక ధన్యవాదములు.

ఆంధ్రాయూనివర్సిటీ అవమానము

ఇటీవల జరిగిన ఆంధ్రాయూనివర్సిటీ సిండికేటు ఎన్నికలలో శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారికి జరిగిన అన్యాయము, అవమానములు నిజముగా దుస్సహములు. శ్రీమతి అమ్మన్నరాజాగారు మదరాసు శాసనసభనుండి ఆంధ్రాయూనివర్సిటీ సెనేటుకెన్నుకోబడ్డ సభ్యురాలు. ఈమె కాంగ్రెసు పక్షమునకు చేరినవారు. ఆ సెనేటు సభ్యులలో పెక్కండ్రు కాంగ్రెసువారున్నారు. సిండికేటు ఎన్నికకు నిలిచిన ముగ్గురు అభ్యర్థులలో ఈమెయొక్కతే కాంగ్రెసు సభ్యురాలు. అట్టిచో సెనేటులోని కాంగ్రెసు సభ్యులందఱొక్కుమ్మడి తమ ఓట్లను అమ్మన్నరాజాగారి కొసంగియుండవలసినది. ఇది జరుగలేదు. తుదకు గెలిచినది సెనేటుకు నామినేటు చేయబడిన కృష్ణయ్య చౌదరిగారు. అమ్మన్నరాజాగారికి 6 ఓట్లే వచ్చినవి. ఈఅవమానము నామె సహించలేక తన సెనేటు సభ్యత్వమునకు రాజీనామా నొసగినది. ఈవిధముననైన స్త్రీలోకమర్యాదను చాటిన శ్రీమతి అమ్మన్నరాజాగారికి మా అభినందనములు. అయిననిట నొక హెచ్చరిక: పురుషులు—అందును కాంగ్రెసు నాయకులు!—ఇట్లు పరాభవించి యెన్నాళ్లు నెగ్గగలరు? పశ్చాత్తాపపడి ఇక మీదనైన యిట్టి అకార్యముల జేయకుందురుగాక.

EDITED BY DR. K. N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# 1935–36 గృహలక్ష్మి స్త్రీరచనలు

1934_35లో 78 మంది స్త్రీలు 78 విషయములపై పద్యముల వ్రాసిరి. ఇవి 83 పుటల నాక్రమించినవి. 1936 ఫిబ్రవరితో అంతమగు సంవత్సరమున 27 మంది 31 విషయములపై పద్యరచనల జేసిరి. ఇవి 35 పుటలపైనున్నవి. వచనరచనల విషయమున 1934–35లో 157 మంది 161 విషయములపై వ్రాసిరి. ఈ వ్యాసములు 340 పుటలపై వ్యాపించియుండినవి. 1935-36 నందు 94 గ్గురు 90 విషయములగూర్చి 395 పుటలు రచియించియుండిరి. రచయితల సంఖ్యయందును విషయముల సంఖ్యయందును 1934_35 కంటె 1935_36 చాల వెనుకబడినను గుణభాగమున నైచ్యమగపడదు.

పద్యముల జెప్పినవారిలో ముగ్గురుతప్ప మిగిలినవారందరు ఒక్కొకమారే కనుపడుచున్నారు. శ్రీమతులు చిల్కపాటి సీతాంబగారు, లక్ష్మీసరస్వతులుగార్లు, పోతుల జయలక్ష్మమ్మగారు రెండు రెండు మాససంచికలకు వ్రాసియున్నారు. పద్యముల పోలికలు బెట్టుటగాని గుణదోషవిచారము చేయుటగాని భావ్యముగాదు. మొత్తముమీద పద్యములన్నియు సరసములుగను సహజములుగను సుగమములునున్నవి. మాదిరి కొకటిచాలును.

ఆజికితప్పి శత్రువులకాదల లొగ్గితిరేని మేమికన్
గాజులనూడ్చి కత్తులను కత్తళముల్గొని వైరిసేనలన్
తేజమడంచి యీభరతదేశము కున్నతిగూర్చి హైందవ
స్త్రీజనశౌర్యముల్దెలసి చేతులు మోడ్పగజేతు

మీతరిన్. (1935 మార్చి)

శ్రీమతి సీతాంబగారి "శరచ్చంద్రావళి" వీర్యవంతముగను సారవంతముగనున్నది. శ్రీమతి పోతుల జయలక్ష్మమ్మగారి "లెమ్మాయి—లెమ్మోయి" సజాతీయమై యుత్సాహకరముగనున్నది. శ్రీమతి జూలూరి తులశమ్మగారి "అపరోక్షానుభూతి" తద్గత వస్తువున కెనయగు పటిమయు ప్రౌఢిమయు గలిగియున్నది. ఈ ఖండకావ్యము నీయమ 1934 ఫిబ్రవరియందు ప్రారంభించి 1935 మార్చియందు సమాప్తము జేసినది. సాధారణముగ స్త్రీలు భక్తివిషయములు గూర్చి వ్రాయుచుందురు. ఈమె నిర్భరముతో గహనమగు శాంకరాద్వైతపథము నాశ్రయించిరి. ఉదాహరణము:

నిష్కళయు నేకమై యాత్మ నెగడు నెప్పుడు
నింద్రియాదుల దేహ మావృతముసొమ్ము
ఇట్టి దేహాత్మలకు నైక్యమెంతురకట
దీనిమించిన యజ్ఞాననమానెధాత్రి.

(మార్చి 1935)

శ్రీలక్ష్మీ సరస్వతయుగ్మ విరచితమగు "సీతాదేవి సందేశము" హృద్యముగనున్నది. వీరును పరాకాష్ఠాన్వేషణము బూని "ధన్యులెవ"రను విచారముజేసియున్నారు. వైదుష్య ప్రపంచమున "లక్ష్మీసరస్వతీ" సంయోగమెంతయు కోరదగియున్నది. వీరిద్దరికి పౌరాణికసంబంధముగాక సోదరీతత్వము వెలసియున్న పాఠకులును వీరితోజేరి పల్లవి పాడినట్లు వీరు వ్రాసిన "ధన్యులెవరు" అను విచారమున ఈ జంటనే జూపుదురు. శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారి "తెనుగులేఖిని" ఆంధ్రుల నుత్సాహకరముగనున్నది. ఈమెకు బహుశః ఆంగ్లమున పరిచయముకూడ కలదు కాబోలు. ఈ విషయభావన మామె యుపజ్ఞగనున్నందుకు సంతసింపవలెను. ఈమె సన్నయభట్టును సమాధాన్యజేసినది. సన్నయ, నియోగి యను నామాంకలదా. ఈమె లేఖిని విహారమును నొక్కపట్టు గాంచుడు:—

రసమయంబైన యా ప్రకృతిశోభనన్ను
తెనుగుపద్యాల చిత్రించినావు
[illegible]
సృష్టికి ప్రతిసృష్టి చేసినావు
భయదాహవక్షోణి [illegible]
గమునింబాగ జేయగల్గినావు
రంజిల్ల ప్రణయసామ్రాజ్యమున నెలకొల్పి
శృంగారసుధల నిర్మించినావు
భయదరసాంగ సందర్శ [illegible] చరిత్ర
వ్రాయుసమ్మదమున [illegible] గాలినావు
ప్రణయగీతి ప్రబంధము [illegible]
పుష్పబాణంబునై [illegible] నావు.

పూర్ణచంద్రమున, [illegible], స్వరాజ్యము, పిల్లవారాటము, తెలుగుయుగాది, నూత్నవత్సరస్వాగతము, అనసూయ, స్మరణానందము, పరదేశపత్రావలోకనము, గృహలక్ష్మి ప్రశంసా ప్రభాతము, శకుంతలా భర్తృవియోగము, గంగాయమున [illegible], దామోదరుడు, [illegible], ప్రబోధము, దీనస్వర్గ [illegible], ఆరాధ్యము, అతడు— ఇతడు, మంగళహారతి ఇత్యాది విషయములపై "మహోత్సాహముతో" నీ సంపుట

మున రమ్యములగు పద్యములు వ్రాయబడి యున్నవి. "తారతమ్యము" నెహ్రూ గాంధీల పోల్చుచున్నవి. అటులనె "అతడు ఇతడు." ఒకయామె చిత్రప్రశ్న పద్యము నిచ్చినది.

వచనవ్యాసప్రశంసయందు శ్రీమతులు వరలక్ష్మి శారదామణుల వివాదమతిగహనమై తనరారినది. వరలక్ష్మమ్మగారు హిందీ పక్షమును, శారదామణిదేవిగారు తెలుగునకే ప్రాశస్త్యము నుద్ఘోషించిరి. పర్యవసానమున నీ సోదరీమణు లొండొరుల భేదముల దెలిసికొనిరి, వివాదము సామరస్యమైనది. ఈ యుభయుల భాషాప్రావీణ్యము ఊహాపోహ ప్రౌఢిమ బహుశ్లాఘ్యములుగ నున్నవి. శారదామణిదేవిగారి వాగ్మిత్వము ఆంగ్లమున ఆరేటరి (Oratroy) యనిపించుకొనగలదు.

వచనరచయితలలో అనేక సంచికలకు వ్రాసినవా రనేకులున్నారు. శ్రీ వరలక్ష్మమ్మగారు మార్చి, జూన్, సెప్టెంబర్, నవంబర్, డిశంబర్ నెలలలో వ్రాసియున్నారు. శ్రీమతి దివాకర్ల శారదామణిదేవిగారు మార్చి, యేప్రెలు, మే, జూన్, జూలై, సెప్టంబర్, నవంబర్, డిసంబర్, జనవరి, ఫిబ్రవరి నెలలలో వ్రాసియున్నారు. శ్రీమతి పెద్దిశెట్టి రామంగారు జూన్, జూలై, ఆగస్టు, సెప్టంబర్, అక్టోబర్, నవంబర్ నెలలలోనున్నారు. శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు ఏప్రిల్, జూన్, జూలై, అక్టోబరులలో కనిపించుచున్నారు. రెండు నెలలకు వ్రాసినవా రనేకులున్నారు. వచనరచనల విషయముల జూడ శ్రీ వరలక్ష్మమ్మగారు, శ్రీశారదామణి దేవిగారు పలువిషయములపై నుపన్యసించియున్నారు. వీరిద్దరు సాంఘిక వైదుష్య రాజకీయోత్పాద్యనేకవిషయముల నవలీలగ చర్చింపగలిగియున్నారు. ఒక వ్యాసమున శ్రీ శారదామణిదేవిగారు నేషనల్ కాంగ్రెసు చరిత్రముతోను, ఐరోపీయ చరిత్రముతోను అత్యంతపరిచయము జూపియున్నారు. ఆంగ్లమునందును ఈమెకు గొప్ప ప్రవేశమున్నటుల తోచుచున్నది.

అనేకులు చిన్నచిన్నకథల వ్రాసియున్నారు. బాలవిజ్ఞానశాఖయందు ముచ్చటగ నుండు పిట్టకథలు కలవు. పాకకళలో అశ్రుత పూర్వములును విచిత్రములగు భోజన వస్తువులు చెప్పబడియున్నది. ఒక పుణ్యాంగన తాటిటీగల పచ్చడినిగూర్చి వ్రాసియున్నది. ఇంకొకయామె సీతాఫలం పచ్చడిని జెప్పియున్నది. ఈ యిద్దరికిపై చేయిగా నొకరిత మునగకాయలపచ్చడిని నేర్పినది. గోధుమలకాఫి నొకరు కనిపెట్టిరి.

శ్రీమతి కామరాజు మైత్రేయమ్మగారు జంతుశాస్త్ర పరిజ్ఞానమును జూపినారు. వీరు "సర్పములనాలుక"పై అయిదుపుటల వ్యాసమును రచించియున్నారు. ఇందు ముఖ్యాంశ మేమన పామునాలుక కొన రెండుగ చీలినట్లుండుం కేమికారణను దీని వలన నాలుక కేమిప్రయోజనమని చక్కగ విమర్శించియున్నారు. "స్త్రీల వ్యాయామ విహారస్థళముల"ను గూర్చి గురుజాడ రాజమ్మ (School Mistress, Chittoor) గారు

వివేచనగల వ్యాసము నిచ్చియున్నారు. శ్రీమతి కతారుకొండ హనుమాంబాయి గారు "చిత్రకళ"ను గూర్చి ప్రసగించి యున్నారు క. వరలక్ష్మమ్మగారి నిజనైపుణ్యము మెరయ పురుషులు వ్రాసిన ఖండ కావ్య విమర్శ జేసియున్నారు. "సరస్వతి" గారు "భావకవుల" నొక్కజాలిరి. ఇంకను విద్యావిషయమున చామర్తి భ్రమరాంబ గారు ఆంధ్రసారస్వతముపై వ్రాసియున్నారు. చరిత్రాంశములను చర్చించియున్నారు. మారెమండ సీతమ్మగారు 'గద్వాల రాణుల"నుగూర్చి చరిత్రాంశమును కొంత దెలిపియున్నారు. స్త్రీ స్వాతంత్ర్యమును గూర్చి యొకరు స్త్రీవిద్యనుగూర్చి కొందరు, నేటివిద్యాపాటమునుగూర్చి యొకరు, యువతి విద్యానిలయములగూర్చి యొకరు, నేటి విద్యాపాటవమును గూర్చి యొకరు, స్త్రీ యెట్లు విద్య నేర్వవలయునని యొకరు, స్త్రీ విద్యాప్రణాళికనుగూర్చి యొకరు-ఈవిధమున పలువురు విజ్ఞానమయి స్త్రీజనాభ్యుదయకములగు విషయముల నిపుణముగ చర్చించి యున్నారు. ఆచంట సత్యవతమ్మగారు "పుత్రపుత్రికాభేదము"లను వ్యాసము నాశ్రయించి హిందులామీదికి న్యాయమగు దాడి సాగించినారు. ఒక విదుషీమణి ఆంధ్ర రైతాంగ విద్యాలయముగూర్చి చక్కగ వ్రాసియున్నది. ఇత్యేవం విధములగు కేవల స్త్రీ జనోపయోగములెగాక లోకోపయోగములగు నానావిషయముల దేశస్త్రీజన ప్రశస్తములగు చర్చల గావించియున్నారు.

లోకగత సంవత్సరమునకంటె నీ సంవత్సరమున ఆయాసైన వ్యాసములు కొంతవడిసను గుణభాగమున నేమియు తక్కువపడలేదు. అతిశయించదనియు జెప్పనొప్పును. ఇంతకంతయు వారు తను స్వాంతవస్తువుగ నీ "గృహలక్ష్మి"ని యాదరించి "స్త్రీయోహి స్త్రీ షుద్యశ్వాంతె" యను ప్రాచేతసోక్తి ప్రకారము స్థైర్యముగ నిరుపమానంబులోని భావముల ప్రకాశింపజేయుట కెంతయు సంతసింపనగును. మొదట కనుపర్తి వరలక్ష్మమ్మగారు కొనూరు నెల్లూరిలో మొల్లపంపుగునాడు "మాకష్టములు మీకెట్లు తెలియగలవు" అని చురుకుగ జెప్పిరి. నిజమిది. వారి అనుభవముల దెలుపుకొనుటకే గృహలక్ష్మి లభించినది. అక్కచెల్లెండ్రను తమతమ కష్టసుఖముల తమలో తాము తలపోసికొనునట్లు నిర్భయముగను స్వతంత్రముగను నీ గృహలక్ష్మి ముంగిట కూర్చుండి ముచ్చటించుకొనుచున్నారు. గడచిన జూన్ సంచికయందు పరసా సీతారామమ్మగారు తల్లిదండ్రులు బిడ్డలు అను నొక వ్యాసమును సెప్టెంబరునందు శ్రీ చిత్రపు సుబ్బలక్ష్మమ్మగారు కొండంత ముచ్చటలను వ్రాసియున్నారు.

వ్యాసముల నన్నిటిని వ్రాసిన వారినందరిని పేర్వేర జెప్పబూనిన కడుదీర్ఘమగునని అందరిని జెప్పలేదు. కానిఒకటి యెక్కువ ఇంకొకటి తక్కువయనుభావ మేమాత్రమును లేదు.

# స్వాగతము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

స్వాగతము ధాతనామకవత్సరంబ! స్వాగతము నీకు మనసార స్వాగతంబు!
అరువదేండ్లకు మరల మాయాంధ్రభూమి, పాలనముసేయ పనిబూని వచ్చినావు
హర్షమయ్యెడుగాని నీయాగమనము, కలదొకభయము మామది గాఢముగను
చెప్పమొగమాటమైనను చెప్పివైతు, నిజముతెల్పినఁగద నీవు నిందబాపు

యత్నమునుసేయముందు ప్రయత్నపడెదు, అరువదేండ్లకు పూర్వ మీ వరుగుదెంచి
తెలుఁగువారికి తిప్పలుతెచ్చితంట, అన్నవస్త్రాలు కొఱయైన నాంధ్రప్రజలు
దేశదేశాలుచనిరంట తిరిపెమెత్త, నాఁటి నీ దుష్ప్రభుత్వంపుమాట దలఁచి
కలఁగివాపోవుచున్నారు తెలుఁగుజనులు, పాడిపంటల భాగ్యంబు పదటగల్పి

కడిదికఱువుకు జనులనుగావుజేసి, నీవుజూపిన వేఁడిమి నేఁటివఱకు
మఱువలేదయ్య మావారు మఱువలేదు, సుఖములెడజేసి కష్టాలు చుట్టబెట్టి
ప్రజలపాలించుప్రభువుల పాలనంబు, మఱచిపోదురెజనములు మహినినెందు
అయిననేమాయె నప్పటివయినమద్ది, నాఁటి యేల్బడి విధముల మాటయేల

ఎచటనుంటివొ యిన్నాళ్లు యెఱుఁగవేమొ మాసమాచారముల నిసుమంతయైన
సిరులకిరవగు బంగారుసీమ కేగె, ధరలుపడిపోయె పంటలుతగ్గిపోయె
వానలెడయయ్యె నీటికివల్లడయ్యె, పశ్చిమాంధ్రంబు కఱవుల పాలబడియె
ఐకమత్యంబు కొఱయయ్యె నన్నియెడల, వర్ణవైషమ్యమంతట పాదుకొనియె

తెలుఁగునేలను యుత్కళుల్ కలుపుకొనిరి, ఏమి చెప్పుదుమాస్థితి యింకనింక
తమిళకర్ణాటకులుగూడ తఱిమితఱిమి వచ్చుచుండిరి మానేలపుచ్చుకొనగ
నాఁటి పసలేదు తెలుఁగుల పోటునందు, తెనుఁగుమీఱిరియన్నిట తెనుఁగువారు
ఎలమినీవైన మాతప్పు లెఱుఁగజేసి, ఐకమత్యంబు పొసగించి యందఱకును

శుభములందెడి మార్గంబుచూపి మఱియు, కఱవుతొలగించి వర్షాలు కలుగజేసి
ఈతిబాధల పాల్గాక యెల్లప్రజలు, సౌఖ్యమున నోలలాడెడి చందమునను
నాంధ్రభూమినిపాలించి యఖిలజనులు, మంచియేఁడనికీర్తిని గాంచిచనుము.

# విద్యావతులు సంసారమున కనర్హులా? *

శ్రీమతి సత్యంగారు

హిందువులకు పెళ్ళిళ్ళఋతువు ఇంక దయ చేస్తుంది. స్వర్గమో నరకమో జూపించే యీతంతును వేలకొలది యువకులు మునిగించటానికి పూనుకొంటారు. అయితే వీరిలో చాల కొద్దిమంది—తెలివివున్నవారు మాత్రం—పెళ్ళినిగురించి తీవ్రంగా ఆలోచన చేస్తారంటే విన్నవాళ్ళకు విచిత్రంగా తోస్తుంది.

మన భారతదేశంలో పెళ్ళిళ్ళన్నీ నిర్ణీత కార్యాలే. అగ్రజాతులలో వధూవరు లిష్టపడడమనేదుందిగాని మన చుట్టూవుండే విచిత్రపరిస్థితులనుబట్టి దాన్ని, వరించడం అనడంకంటె "వద్దని జెప్పడంలేదు" అనడం మేలు. ఇనుపతీగల్లాగ చుట్టుకొని బంధించే వర్ణధర్మాలు, వానిలో విభాగాలు, పైగా సంఘనియమాలు స్త్రీ పురుషులు చెడిపోతారనే యుద్దేశ్యంతో వారిని భాగించి ఒకరితో యింకొకరికి సంబంధమే లేకుండా జేస్తూంటే యీ కాలములో మాత్రం వరించేదనేది నాటకముగాదా?

ఈ పరిస్థితుల్లో విద్యావంతురాలైన కన్య సంసారానికి పని కొస్తుందా అనే విషయం పెళ్ళాడే ప్రతివారికీ అక్కర గొలుపుతుంది. ఈకాలపు యువకులుగూడా తమ ఆర్థిక పరిస్థితులు సరిగ్గాలేకుంటే విద్యావతులను పెళ్ళాడేందుకు చాలా భయపడతారు. వారి విచిత్రమైన సిద్ధాంతాలకు వ్యతిరేక సాక్ష్యాలున్నా, విద్యావతులైన భార్య బాహ్యాడంబరానికే గాని నవీనజీవితములోని కష్టనిష్ఠురాలకు పనికిరాదని, ఆర్థికమాంద్యంగల యీ రోజుల్లో ఆమెను భరించేదే కష్టమని పట్టుపట్టి కూర్చుంటారు. పైగా "ఆమె ఇంటిపనేమీచేయదు; పట్టుబట్టలు, పౌడర్లు వగైరాలు నాకొంప ముంచుతాయి, తరువాత మేం బ్రదికేదెట్లు" అని గోలెడుతారు.

ఈ గోలకంతా సత్యమేమైనా ఉండటానికి సాక్ష్యాల్లేవు. సాధారణంగా కాలేజీ గరల్స్ అనేవారీ రకానికి జెందడంలో సందేహంలేదు గాని, యీనాటియువకు లనుకునే దానికంటె విద్యావతైన ప్రతి యువతికూడా యెక్కువ బాధ్యతల తెలిసుంటుంది. ఇది పట్టి సిద్ధాంతమే గాకుండా నిష్పక్షపాత బుద్ధితో గమనించే యే వ్యక్తికైనా పొడ కట్టకపోదు. జీవితంలో కష్టనష్టాలను పాల్గొనే విషయాల్లో, గృహకృత్యం నిర్వహించడంలో, చదువుగాని తన సోదరికంటే విద్యావతి చాల చక్కగా వర్తిస్తుందని తప్పక చెప్పాలిసొస్తుంది. "నిజమే! వారు వంటజేయలేరు. నే నింకొక వంట మనిషిని పెట్టాలి! ఇద్దరిని భరించడాని నాకు సాధ్యంగా" దంటారు యువకులు.

ఇది అపద్ధంకంటె నికృష్టం. ఇంతవరకు చదువుకొన్న యువతులు గొప్ప సంసారములలోనివాళ్లే అయినందుచేత వారికి వంట జేసే అవసరము లేకపోయింది; వారు

---

* పి. ఎక్. మోహిలిగారి వ్యాసమున కనువాదము.

దానికై తయారుగా లేదు; అంచేతనే చదువుకుంటే సంసారానికి పనికి రాదన్న పిచ్చినమ్మకాలు బైలుదేరాయి. అంతేకాకుండా నేటి విద్యావిధానంగూడా కొంచం తప్పుజేస్తూంది; ఒళ్లువంచి పనిచేయు టానికి తగుప్రోత్సాహం గల్గించడంలేదు. ఇపుడు సాధారణ కుటుంబీయులుకూడా తమ ఆడపిల్లల చదివిస్తున్నారు. కాబట్టి ఈ పరిస్థితుల్లో, మా సోదరీమణు లింకమీదట తమ పతులతోగూడా ఇబ్సెన్, షేక్సుపియరు మహాకవుల రచనల నానందించడమే గాకుండా, ఆఫీసునుంచి వారింటి కొచ్చేవేళకు చవులూరే భోజనంగూడ సిద్ధంచేసి యుంచుతారని నమ్ముతాను. ఇది జరుగుతూనే వుంది. ఇంకా చదువు వ్యాపించేకొద్దీ యిట్టి విషయాలు సర్వసాధారణమైపోతివి.

నేటి విద్యావతురాలైన యువతిలో మెచ్చదగిన దేమిటంటే జీవితములో నియథార్థవిషయాలను చక్కగా అవగాహం చేసికోవడమే. విజ్ఞానము, సంపద వీనిలో నేది గావలెనో కోరుకొమ్మంటే సాలొమన్ విజ్ఞానమే కోరుకొన్నాడట! అతడు కోరుకొన్నవిధమే మంచిదైతే, చదువుకున్న యువతిని పెళ్లాడితే ఉత్తమం. వారలకున్నా యనే అవగుణాలు వ్యూహాజనకములే గాని నిజంగావు. విద్యాహీనురాలైన యువతి క్రమక్రమంగా మగని మెడకు తిరుగలిరాయై వ్రేలాడుతుంది.

పూర్వకాలంలోలాగ వారిపైన హుకుం చెలాయిస్తూ చెప్పినట్లు విని నడుచుకోవాలనే రకం యువకులు చదివినవారిని పెళ్లాడితే సంతోషం సౌఖ్యం సున్నే. సమానంగా వారిని గౌరవిస్తూంటే సంసారం చల్లగా సాగిపోతుంది గాని, రాజ్యం చేయడాని కారంభిస్తే విద్యావంతురాలైన భార్య నిండుగానున్న కందిరీగల తుట్టని గ్రహించాలిసొస్తుంది. అగౌరవం గలిగిందా, ఆమె కందిరీగకన్నా నికృష్టం. అట్టి పరిస్థితుల్లో పెళ్లికంటె బ్రహ్మచారిత్వం సుఖంగా గనబడుతుంది ఆ యువకునికి.

అర్థికవిషయంగూడా గమనించాల్సిందే. పూర్వాచారపరాయణు డొకడన్నట్లు, చదువుకున్న పెళ్లాం భర్తమీదనే ఆధారపడి పిల్లల గనేచే పనిగా జూచుకొనకుండా, కొద్దిగా సంపాదిస్తే!

చదువుకున్నవారిని పెళ్లాడేది నికృష్టార్థంలో జూడమన్నా, అది యొకందుకు మంచిదే! తెలివైనవాడైతే ఆ పాచికలతోనే గెలువచ్చు. ఆ తెలివిలేకపోతే పెళ్లిచేసికోకుండా వుండడమే ఉత్తమం. తెలివిలేక పెళ్లాడితే యింట్లో యిద్దరు తెలివితక్కువ దద్దమ్మలు తయారై గృహంలోవుండే శాంతి సౌఖ్యాలు దూరమౌతవి. అటుగాకుండా చదువుకున్నావిడని పెళ్లాడితే తెలివితక్కువని పోగొట్టి భర్తనుగూడ విజ్ఞానుణ్ణిగా జేస్తుంది.

కాబట్టి నీ కాతడుణాం తటస్తిస్తే వరశుల్కం విరివిగా వస్తుందని శుద్ధ మొద్దు స్వరూపాన్ని పెళ్లాడకు. చదువుకున్నమ్మాయినే పెళ్లాడు. వరశుల్కాలు స్త్రీని ఉత్తమరాలుగా జేయలేవు. కాని స్త్రీలు మనుష్యుల్ని చేయగలరు; వించేయగలరు.

# వనితావతంసము

బులుసు వేంకటేశ్వరకవిగారు

జన్మించినది అంత్యకులమున దారిద్ర్య తాపసీనివాసగృహమున; అర్పింపఁబడినది ఆధారములేని నిరుపేదకు; జీవించినది యిరువదినాలుగువత్సరములు; అల్లివైచినది విమలకీర్తిప్రభారేఖలను; వినుతిఁగాంచినది అజ్ఞానాంధకార కుగ్రామాకాశవీధిని విద్యుత్తరంగమువలె వెలుగొంది; నిర్వహించినది స్వధర్మమును; చూపినది సర్వమానవ సౌభ్రాతృత్వము; చిలుకరించినది సర్వజీవులపైఁ బ్రేమరసము; కాంచినది జీవితపరమార్థ దృక్పథము; చేరినది సంక్రాంతిదినమున స్వర్గలోకమును; పేరుఁగాంచినది వనితావతంసమని. ఇది గంగమ్మ జీవిత సంగ్రహము.

వేకువనే మేల్కాంచుట, స్వగృహకృత్యముల నిర్వర్తించుట, ఇంతలో మెలఁకువఁ గన్న భర్తపాదంబులఁబడి హృదయపూర్వక భక్తింజూపుట, మేల్కాంచిన బిడ్డల నమృతతుల్య కుచక్షీరములఁ దృప్తినొందించుట, ఇంతలోఁ దెలతెలఁ దెల్లవార మెల్లమెల్లన భర్తకడ సెలవుగ్గైకొని బిడ్డల సంరక్షణార్థము అనుంగుపెద్దకూతుం గృహంబుననుండనునిచి యెడపిల్లంగొని గ్రామమున నుర్వీసురులయింటఁ జెంబులు సంట్లునుఁ దోమి వారుచెప్పిన పనులఁజేయుట, రెండు యామములగుసరికి బ్రాహ్మణస్త్రీలు భుజించిన పిదప నిడిన శేషాన్నంబుఁగొని సంతృప్తితో నిజగృహంబున కరుగుట, ఇంతలోఁ గూలిపనికేగిన భర్త తిరిగిరా నెదురేగి తీసికొనివచ్చి కాళ్లఁగడిగి సరసోక్తుల నమందానందముతో భుజింపఁజేయుట, ఒకవంకఁ బిల్లల కన్నమిడుట, ఇంకొకవంక పసిపిల్లనికిఁ బాలనిచ్చుట, భర్త విశ్రాంతిఁగొన్నమీదట దాభుజించుట, ఇంతలోఁ బొంతనున్న స్త్రీలోకమునుఁ గూర్చుండఁజేసి యుచితమర్యాదలఁజేయుట, ప్రతిదినము తమకుభోజన మిడుచున్న రాట్నమును ముందరనిడుకొని సన్నని నూలుఁదీయుచు స్త్రీలోకమును పుణ్యపతివ్రతామతల్లుల కథలచేఁ దృప్తి నొందించుచు వారి యభిమానంగొనుట, ఇంతలో మాధుకరమెత్తవచ్చిన మాదిగ మంగని సరసవచనములఁబిలిచి తాను కడుపారభుజింపకుండ మిగిల్చిన యన్నంబును వానికొసంగి వానిచేఁ దీవనలఁగొనుట, మరల గ్రామములోనికేగి బ్రాహ్మణులింటి పనులగావించి చీకటిపడుసరికి గృహంబునకేతెంచుట, భర్త తెచ్చిన బియ్యమునువండి భక్తితో మొదట భర్తకిడి పిదప పిల్లలకిడి తుదకు శేషించినదానిలో మూడువంతులు కుక్కకును, పిల్లికిని, మాదిగవానికి దిగవిడిచి యొకవంతుఁదిని గృహకృత్యములఁజేయుట, పిల్లలనెల్లర మెల్లగఁబరుండవెట్టి భర్తనిజపద పద్మంబుల నధికభక్తినొత్తి యాతని యా

నందవచనంబుల నూరడించి కునుకుపట్టిన పిదపఁ బక్కఁ జేరుట, భగవంతుని ననేక రీతులఁ బ్రార్థించుట, సుషుప్త్యవస్థం బ్రవేశించుట, ఇది యామె దినచర్య.

మండువేసవిని యెండలో గుండెలదుర నామె బ్రాహ్మణులయింటికేగు మార్గమునఁ గొనయూపిరితో నొకశునకము వడగొట్టి పడియుండెను. మానవసంచారము వీధుల యందెచటను లేదు. అట్టితరి కరుణారసంబుఁ జిలుకరించి యాశునకమునకు నీరోసి శైత్యోపచారములఁ జేసి నెమ్మదింపఁ జేసిన దొకనాఁడు గంగమ్మ. పిదప నామె పనికై బోవుచుండ నొకకాసులపేరామె కంటఁ బడెను. తత్క్షణ మా మాతృమూర్తి కన్నీరు నింపుచు దానినిఁ దీసి కనుపడిన వారికిఁ జూపుచు ప్రతిగృహమునకుఁ దిరుగుచు తుదకామె యొక గృహముం జేరెను. ఆ గృహస్థులును తమపేరుకై పలవించుచుండిరి. ఆ గృహయజమాని యకారణముగా ననేకమారులు గంగమ్మ నేడ్పించినాడు. అప్పుడే శంకయులేక గంగమ్మ అమితానందముతో వారికొసంగి నమస్కరించి పోవుచుండ వారు బహుమతినంప నది తనకు వలదని తిరిగి పంపివేసినది. ఇవి గంగమ్మజీవితములోని చిన్ని చెణుకులు.

ఇటుల గంగమ్మ యిరువదినాలుఁగువత్సరములు గడపినది. ఆరుగురు బిడ్డలఁగన్నది. జీవయాత్ర నతిచమత్కృతిఁగ జేసినది. సంక్రాంతినాఁటిరేయి యామెప్రాకారము ప్రక్కఁ జేరి పరున్నది. ఉదయమగుసరికి మృతజీవియైయున్నది. ఆయాసములేని మరణమెంత పుణ్యాత్ములకో సంభవింపదుగదా! అందును సంక్రాంతిదినమరణ మెంతటివారికోగదా! ఆమె నిర్వర్తింపవలసినపనుల నిర్వర్తించినది. ఊరందర హృదయములయందును విలువలేని స్థలములను సంపాదించికొన్నది. ఆహా! జీవికిఁగావలసిన దింకేమున్నది? ప్రతిదినమును గంగమ్మను స్మరించుకొనని వారూరనేలేరు. గంగమ్మజీవితము ధన్యము! ధన్యము! ధన్యము!

తనదు విధుక్తధర్మాల దనిపెనామె!
ఘనతర ప్రేమపూజలఁ గన్నదామె!
నానునిహృదబ్జ సింహాసనమున నామె!
ధన్యురాలగు వనితావతంసమామె!

"ఇంకా వెదుకుతున్నావా? పోయినడబ్బులు దొరకలేదా"

"దొరకాయి మా చిన్నతమ్మునికి"

"అయితే ఏమిటి వెదుకుతున్నావింకా"

"మాచిన్నతమ్ముని"

# ఇట్టి ఘోరము లెన్నాళ్లు?

పి. వి. రంగాచార్యులుగారు

సుభద్ర అయినింటి ఆడపడుచు. తను కాపరానికొచ్చిందిమొదలు భర్తచేతుల్లో దెబ్బలుతిననిరోజా అంటూలేదు. ఎంత శాంతురాలైతేనేమి? అతని దృష్టిలో ఆమెదేదో ఒకనేరం బయల్పడుతూనే వుండేది. దైవకృపవల్ల సంతానంకలిగినా, భర్తరోగగ్రస్థుడౌటచేతనో మరేకారణమో గాని ఆమెకొంచెం యించుమించు గొడ్రాలనే అనవలసివచ్చేది. నాడు అమావాస్య. రాత్రి గాఢాంధకారమయం. సుభద్ర వీధుల్లో పరుగులెత్తుతోంది. ఆకారం భయంకరంగా వుంది. తలవిరియబోసి సగంచిరిగిన బట్టపేలికలు వ్రేలాడుతూవుంటే ఆమెఒక భయంకర ఆసురశక్తిలా పొడకడుతూవుంది. వేడినిట్టూర్పులు గ్రీష్మఋతుభ్రమను కలుగఁజేస్తున్నాయి. ఇంత వికృతాకారంతోటి ఆ యిల్లాలు గజగజ వణికిపోతోంది. ఏ ఉప్పెటికేనా ఆటుపోటూ వుండవచ్చును గాని ఆమె కన్నీటిప్రవాహానికి పోటేగాని ఆటుఅనేది కనబడడంలేదు.

మానవరూపంతో వచ్చిన దండధరుడా అన్నట్టు ముప్పదియేండ్ల మోటుమానిసి యొకడామెను వెంటాడిస్తున్నాఁడు. చేతిలో బాయదుత్రాడు, చేతెడు కఱ్ఱ వున్నాయి. వెనక్కిముడిచికట్టినలుంగీ సగం వూడిపోతూవుంది. ఆత్రాగుపోతు పెనుగాలికి ఊగులాడేఒంటి తలతాడిలా ఊగుతూ ఉఱుకుతున్నాడు. అనరాని దుర్భాషలన్నీ వర్షంకురిపిస్తూ సుభద్ర జుట్టుపట్టుకుని ముందుకుగెంటి నేలమీదబరబరలాగేడు. 'బాబోయి!' అని పెద్దబొబ్బపెట్టి నిస్పృహురాలైంది ఆ అమాయికురాలు. నడిరేయి, వర్షాకాలం, మేఘాడంబరం ఎక్కువగావుంది. కొంచెం వర్షపుజల్లుకూడా పడింది. హోరున గాలిమాత్రం వీస్తోంది. ఆ మహాకల్లోలంలో సుభద్రకేకలు 'ఉప్పా — ఊరగాయా' అన్నట్టయాయి.

"దొంగ...! ......! ...నీరిగ...! ఇంతసేపే వూరెళ్లేవు?...ఎక్కడున్నావు? ... ఎవడితో మాట్లాడుతున్నావు? ... ఎంతసేపైంది నీవు ఇల్లువిడచి బయటికి వెళ్లి ... ఇప్పటిదాక ... చేస్తున్నావా?" అంటూ పెడేపెడే త్రాటితో కొట్టి చేతులమీద వేసికొని యింటి చావటిలోనికి తీసికొనిపోయాఁడు.

* * *

చదువు కొద్దిదైనా లౌకవ్యహారాలు బాగా చక్కపెట్టగల సమర్థుడు సోమనాథం. అంచేతే అతని యితరగుణలేశాల్ని పరిగణించకుండా అతణ్ణిచూస్తే ఒకవిధమైనగౌరవమే చూపిస్తూవుంటారు ఆ గ్రామస్థులు. అతఁడు స్వతంత్రజీవి. కొద్దోగొప్పో ఆస్తిపాస్తులు గలవాడున్నూ. కాని నేడు దుర్వ్యాపారత్వఫలితంగా ఇల్లు దొడ్డి తోట మాత్రం మిగిలున్నాయి. చింతచచ్చినా పులుసుచావలేదని టెక్కుమాత్రం చెక్కుచెదరలేదు. ఈ పరిస్థితిలో త్రాగుడు, పొగపీల్పు ఎడతెగని అభ్యాసలాయి. ఇవి పుట్టుతోపుట్టిన బుద్ధులుగాతోస్తూవుండడంచేత వీనికి అంతంపుల్లతో పూర్తి అవుతుందని లోకులు హేళనచేస్తూవుంటారు. పూర్వపు గౌరవంపూర్తిగా నశించింది. అసలైన రౌడీగా తయారయాడు సోమనాథం. 'దుష్టునికి దూరంగావుండాలనో ఏమో కాస్త మంచిగాబ్రతికతలుచుకున్నవారెవరూ అతనిపొరుగున నివసించడం మానేశారు. మంచినిషాలో సోమనాథం సుభద్రనిచావడిలోనికి తీసికొనిపోయిన తర్వాత మిన్నుముట్టేరోదన ధ్వనీ, గుభీ, గుభీమనే గ్రుద్దులచప్పుడూ, పొరుగింటి శివశంకరరావుని నిద్రలోంచి అమాంతంగా త్రుళ్లిపడేట్టులేపేయి. చటాలునలేచి కిటికీతలుపులుతీసి ముందింటి చావడిలోకి చూశేడు. చీకటిచేత మనుష్యులు కనబడడంలేదు గాని మాటలుమాత్రం కొంచెం అస్పష్టంగా వినబడుతున్నాయి.

"ఎవడికోసం ఎదురుచూస్తున్నావు? పొంచుని చూశేవే? చంపేస్తాను. 'నిజంచెప్పు.' (గ్రుద్దుల చప్పుడు వినబడును.)

"వానవస్తోందని దొడ్లోవున్న మంచాలన్నీ లోపల పడేస్తూవున్నానంటే మీరు నమ్మరేరి? నేనేంచేసేది. ..." అని ఏడుస్తోంది.

"ఆ సి!...నువ్వా శివశంకరంయింటివైపు దొడ్డి గోడదగ్గరనిలబడి పొంచుంటలేదూ? నేను సందులో వున్నానని..."

"రా...మ...రామ! ఎందు కీ కార్పణ్యాలు? అసలు సంగతి వేరు. మీ రా వెంకితో మాట్లాడుతూంటే కర్మంజాలక నే నావొడ్డిసందు ముగనించివచ్చానని... లోపల...ఉక్రోశం...నన్నిల్లా చంపేస్తున్నారు. ...నేనేం...కాదనీ—వద్దని...నోరెత్తి ఒక్కమాటేనా అన్నానా? నా కాపురం...యిలా...కాలిపోతుందని ...వళ్లిచస్తూ...యీ నాలుగేళ్లనుంచీ మీ రావృత్తి లో తిరుగుతున్నా ఒక్కనాడేనా...మీరీలా..." అని అడిగేనా?...అదేవో కల్లిబొల్లిమాటలు...చెపితే సరి...మానవరూపందాల్చిన పశుబలంఅంతా నామీదే ప్రయోగిస్తారు." అని బోరునగొంతెత్తి ఏడవడం ప్రారంభించింది.

"ఆలా అరుస్తావేం?" అంటూ లాటీచార్జి చేశాడు మళ్లీ సోమనాథం. అన్నదమ్ముల్లావుండే అధునాతన స్వాతంత్ర్యాన్ని పురస్కరించుకుని శివ శంకరం తలుపుతీసి ముందింటిసావడిలోకి అడుగుపెట్టి, "బాబూ! సోమన్నా! తొందరపడకురా! నాయనా! చచ్చిపోతుందిరా! నిష్కారణం స్త్రీహత్య! నిదానించరా?" ఆంటూ అడ్డుకోపోయాడు. సుభద్రకొంచెం తెప్పిరిలి ప్రాణం పిడికిటపట్టి దూరంగా పారిపోయింది. "అడ్డుతగిలితే నీప్రాణంకూడాదక్క" దని గర్జించి శివశంకరాన్ని దూరంగాగెంటి సుభద్ర మీదికిపోబోయి త్రుళ్లి గోడమీదపడ్డాడు. "హాఁ ...దైవమా దురతిక్రమము. వ్యవహారం ఎదురుతిరిగితే సరి...ఈ పొగరుపోతుతనం సహా తెలిసివస్తుంది" అంటూ శివశంకరం వెనక్కిమళ్లి తనగదిలోకి పోయాడు.

* * *

శివశంకరం అడ్డుతగలడం అతనికోపాగ్నికి నూతన ఇంధనమయింది. అనుమానం బలీయంఅయింది. ఖూనీ చేదామన్నంత హడావిడిచేస్తూ చావడిఅంతా తచ్చాడేడు. ఏదీ సుభద్ర? నాలుగుగోడలమధ్య ఎక్కడా కనబడలేదు. ఇల్లంతా గాలించేడు, ఎక్కడా జాడ లేదు. కోపం వెఱ్ఱిరూపంగామారింది. వెఱ్ఱి భయం లోకిదిగింది.

* * *

గుండె రాయిచేసుకుంది సుభద్ర. బ్రతుకుమీద ఆశచాలించుకుంది. బ్రతికుండి బావుకునేదేమో అనే విరమత ఆమెహృదయంలో తాండవించింది. పంచభూతాత్మక శరీరంలోంచి యీ అయిదుగాలుల్నీ ఏలాగ బయటికితోలడం? అని ఆలోచించింది. తన పూర్వజీవితాన్నొక్కమాటు స్మరించుకుంది. తను భర్తను తృప్తిపరచాలనే చేసినకృషికి ఫలితంగా నిజ శరీరం రోగపీడితమగుటే శేషించిదని విచారించింది. తుచ్ఛవిషయేచ్ఛలకులోనై హీనమతులగు అమాయిక స్త్రీజనముల బాధించి నొప్పించు భర్తవర్తనను చెవులారావింటూ, కన్నారాచూస్తూ, లోకాపవాదుకూ, సంఘనియమాలకూ, దైవనిర్మాణమునకూ, భీతిల్లి సగముచచ్చి కాపురంచేసే యీకష్టజీవికి పొందగలిగిన ఫలితం నిరంతరప్రహారణశిక్షకదా అనే నిస్పృహ కలిగింది. విశాలమైన పెరటితోటలంతా కలయవెతికింది సుభద్ర. ఆమె ఆక్రందన ధ్వనులనాలించే మానవులేలేరు. ధైర్యంచెప్పే మహిళామణులజాడ కొందటే కనబడలేదు. సంస్కారవేత్తల సారధ్యంకుంటువోయింది. సకలాంతర్యామి చెవులుకూడా ఆసమయంలో గడియలు పడివున్నాయి. ప్రకృతిసిద్ధమునై సకలసాక్షిభూతమునైన గాలి, నీరు, చెట్టు, పుట్ట



శ్రీమతి సయాల్ కోట రాణిగారు
ఐక్యమాగాణములందు బిజనోర్ డిస్ట్రిక్టు
బోర్డు ప్రెసిడెంటుగా నెన్నుకొనబడిన
ప్రథమ స్త్రీ



శ్రీమతి నజ్ మున్నీసా బేగంగారు
ఉస్మానియాయూనివర్శిటిపరీక్షలందు ప్రథమురాలుగా నెగ్గుటచే బంగారుపతకమును
బడసినది.



లంకాదహనము — రాధాఫిల్మ్ కంపెనీ

దాసరి కోటిరత్నం — సీత

కూడా తమమీద మానవుని అధికారంగా నిరంకుశంగా చలాయింప యేరోజులువచ్చేయికదా అనే భయం చేత కాబోలు, అవి ఆ నిర్భాగ్యురాలికి సహాయం చెయ్యడం మానేశాయి. ఆమె కన్నీటిప్రవాహం మొదలంట ఆరిపోయింది. అగ్నిపర్వతం పగిలినట్లు క్రోధానలజ్వాలలు ఆమె నేత్రాల్లో ధగధగా వెలిగేయి. మడమలంటే శిరోజాల్ని మెలిపెట్టి కంఠాన్ని చుట్టింది........

“ఆగు...ఆగు” అంటూ సోమనాథం సుభద్ర చెయ్యి పట్టుకున్నాడు. కంఠబంధనాన్ని సడలించేడు. “నువ్వు చావడమే కాకుండా నన్నుకూడా రాజకీయ బంధనాల్లో తగల్చి కుటుంబనాశనం చేస్తావా?” అన్నాడు. “నా జీవితాన్ని కుదముట్టించి మీస్వేచ్ఛా విహారాన్ని నిరాటంకపరుస్తా”నంది సుభద్ర.

సోమనాథం నిర్ఘాంతబోయాడు. అంతగండుమనిషి నిలువునానీరైపోయాడు. గజగజవణికేడు. ఆ మహిషాసురమర్దనిని ఎదురుగా చూడలేకపోయాడు. ఇంత సాహసంచేసే సుభద్రని తానే కుదముట్టింతామా అనే ఆక్రోశంలోపల ఉడికిపోతోంది. కానీ సామ్యంగా లోపలికి తీసుకునివెళితే తరువాత ఆలోచించవచ్చు ననుకున్నాడు. ‘రా! లోపలికిరా!’ అని లోనికి తీసికొనిపోయాడు.

పాపం! సుభద్రనమ్మింది భర్త సాత్వికమార్గాని కొచ్చేడనుకుంది. తనసాహసం కొంతపనిచూపిందని సంతోషించింది. లోపల అడుగుపెట్టిందో లేదో రణభేరీ మళ్లీమ్రోగింది. ‘అనుచిత సాహసానికి తగిన శిక్ష’ అంటూ మర్దించేడు సోమనాథం.

* * *

ఇంకా ఒకజాముురాత్రి బాకీవుంది. మబ్బుతెరలన్నీ క్రమంగా విడిపోయాయి. విశ్వమయుడు తన అనంత కోటి నేత్రాలతో ప్రశాంతనిశాంతాన్ని నిరీక్షిస్తున్నాడు. గగనమండలంలో చుక్కలు విస్పష్టంగా ప్రకాశిస్తున్నాయి. సోమనాథంచేసిన అవినీతికార్యాన్ని వెక్కిరుస్తున్నాయి యీలకోళ్లు. ఈమానుష వాతావరణలో నరపశువులచేతుల్లో జరిగే అవినీతి కార్యాలికి విచారిస్తూ ప్రవాహరూపాన్ని ధరించిన శోకమూర్తినిమాదిరిగా మెల్లగా ప్రవహిస్తోంది ఊరికి కొంచెందూరంలోవున్న ఏరు. సంసారసాగరయాత్ర చేసే ఒకదంపతీ నావయొక్క చుక్కాని విషయవాసనాతిమింగిలఘాతమై అధఃపతనమయే ప్రమాదావస్థ యందిచ్చిన వార్నింగుబెల్ (Warniug bell) అన్నట్లు కోడికూతలు వినిపించేయి. ‘అత్యుచ్ఛ్రియః పతన హేతు’ వన్నమాట సార్థకంచేస్తూ చుక్కలు రాలుతున్నాయి. అట్టితరుణంలో సుభద్ర ఆతీరాన్ని నీటికి చేరువగా నిలబడివుంది. “పాదద్వంద్వము నేలమోపి, పవనుంబంధించి — నిక్షేదబ్రహ్మపదావలంబనగతిఁ క్రీడించు యోగీంద్రుమర్యాదఁ” నిలిచింది సుభద్ర. ఆమె స్నిగ్ధముగ్ధవదన గహ్వరాన్నుంచి అప్రయత్నంగా మేఘగంభీరఘోషణలు ప్రతిధ్వనించాయి.

“మంచిచెడ్డల నేర్పింపగలిగి, సంపూర్ణజ్ఞానసంపదకు అధికారులైన ద్విపాదమృగసోదరులారా! మనవి! కాదు, — కాదు, — మొఱ్ఱ! మనోవిజ్ఞానాన్ని వినియోగించుకోలేని పశువులలోకూడ నియమము, నీతి, నిగ్రహము, దాంపత్యబంధనము సక్రమంగా నిర్వహింపబడతాయి. అమూల్యమైనబుద్ధి బలసంపన్నులై యుండీ ఆత్మపదార్థజ్ఞానాన్ని సహజధర్మాన్ని, నిజకర్తవ్యాన్ని తృణీకరించే నరసోదరులారా మనవి! స్త్రీలు తమ భోగవిలాసాల కుపకరించే ఆటబొమ్మలని వినియోగించే పురుషసోదరులారా! వినండి. మేము అబలలనీ ధైర్యం మిమ్మల్ని అంబరసంచారం చేయిస్తోంది. భార్యా హృదయరక్త పానాతురులైన నరదుశ్శాసనకులపాంసులారా! జాగ్రత!! ఈకాలంలోకూడా పాండునందను లుదయించకపోలేదు. భీమగర్జనలు ప్రతిజ్ఞలుచేయకనూ మానడంలేదు! కొంచెం విజ్ఞానంతెచ్చుకొని సోదరీమణుల నాదరించండి! ఇదే నాకోరిక.

"బుద్ధిబలముననూ, శుద్ధవర్తనముననూ, త్యాగధర్మముననూ నిజకర్తవ్యపాలనముననూ, ఆరితేరి, ఆత్మస్వాతంత్ర్యరక్షకములగు భారతమహిళాసమాజములూ! ఒక మాట! కాదు, కాదు, హెచ్చరిక!!

నవనాళ్లూ సల్లిపోయేట్టుగా నవమాసాలూ మోసి, పాలుత్రాగి అమ్మశ్రద్ధే సంతానానికి తల్లులనిపించుకోకండి! ద్రౌపదీమానరక్షకుఁడొసగిన వివేకచంద్రికల్ని అడవులలో ప్రసరింపచేయకండి! మీ సత్యాగ్రహంఅనే అసిధారావ్రతాన్ని అవలంభించండి. మీ జీవితాలూ, చక్కదనాలు, విజ్ఞానదీపికలు బూడిదలోపోసిన ఆహుతిగాచేయక మానవాతావరణంలో సమత్వసిద్ధాంతాన్ని గెలుపొందండి. ఇహభోగలోలుపత్వాన్ని యీనరమృగాలదగ్గిరనుంచి పారదోలండి.

"మానసిక, సామాజిక, రాజనైతిక, దార్శనిక ఆధ్యాత్మిక సంస్కార సంకల్ప శిఖామణులారా! చిన్ని సవాలు!!...కాదు...కాదు ఆందోళనావిజ్ఞప్తి!! సంస్కారధర్మ సంస్థాపకులారా! తాటాకుల చప్పుళ్లతో కుందేళ్లను బెదరింప చూడకండి. ఏకర్తవ్యమును నెరవేర్ప బద్ధకంకణులైనారో దాన్ని నిర్మాణవిధానంగా కార్యరూపాన్ని పొందజేయండి. పట్టణాల్లోకంటే పల్లెల్లో మీ కార్యక్రమాన్ని బలపర్చి అమలుపర్చండి. అనాగరికతకు తావులైన పల్లెలనుద్ధరించండి! అనాథలమగు మాబోంట్లదుర్భర కష్టజాలాన్ని రూపుమాపి యీజార పిశాచులవాత పడు అమాయికజీవుల నుద్ధరించండి!!

"సర్గస్థితిలయకారుడవై, సకలచరాచరభూతాత్మకుడవై, సర్వసముడవై, దుష్టశిక్షణ, శిష్టరక్షణ కంకణధారివై సృష్టికారకసాధన భూతములగు స్త్రీపుంస సహధర్మాచరణచండశాసకుడవై, మహిళామానస కల్పకమవగు సర్వశక్తుడా! సానురోధప్రార్థన!! కాదు కాదు అబలాక్రందన పరిపీడితమానసిక సంబోధన!!!

మానవులు అస్వతంత్రులు. మహిళలు అబలలు! సంస్కారులు అనధికారులు!! నీవో! సర్వస్వతంత్రుడవు, సర్వశక్తివంతుడవు, సర్వాధికారివి. నోరులేని జీవులకు తృప్తి, పట్టుదల, పౌరుషము, జాత్యభిమానము స్వతంత్రజీవితాన్ని బోధించావు. అవి వాటిని నిర్వహించి ఉచ్చస్థానాన్ని పొందలేకపోయినవి. పురుషులు అన్న పేరేగాని పౌరుషరహితులు. మానవులా అంటే అభిమానదీనులు. ప్రభూ! గంభీరపారావారంలో రత్నాలులేకపోలేదు. వానివిలువా తగ్గలేదు. ఆ సాగరగర్భస్థాలయే నత్తలూ సంచరిస్తున్నాయి. వీని సంఖ్య పాపంలా పెరిగిపోతోంది మహానుభావా! లాగై, వీటిని బడబలోకిలాగై! తండ్రీ! ఆ రత్నాల్ని గట్టుకినెట్టు. ఈ ప్రకృతిరంగస్థల నటకావతంసుల శిరోమణులలో జోడించు వాటిని. సకలచరాచరభూత దృష్టుల్ని వారిపైకి త్రిప్పు.

ఈ కాలంలోకూడా మహాకాళి, సత్యభామ ఝాన్సీరాణులబోలు పౌరుషమానినులున్నారని; అనసూయ, చంద్రమతి, దమయంతి, సరోజినీ, చాందీబేగమ్ వీరబాలల తిరస్కరించు సాధ్వీరత్నాలు వెలుగుతున్నారని, లోకానికి వెల్లడిచెయ్యి.

"సోమనాథా! నీకిదేజోహారు! నేటితో నీకీ అభాగినీ నిరోధం సమాప్తి చెందుతోంది. నీ వేడిరక్త ప్రవాహాన్ని ప్రవహింపచెయ్యి! స్వామీ! అనాథనాథా! దేవీ! గంగామాయీ! తావియ్యితల్లీ. నాడు సీతాదేవికి తావిచ్చి భూసతికుమార్తెను తనలో కలుపుకుందని వింటాను. తల్లీ! నాకంతదృష్టమా! తల్లీ భాగీరథీ! ఇదే నన్ను నీలో లీనంచేసుకో. ఒక్క అభాగిని తనభర్త అవినీతివర్తన మార్గానికి కంటకమైనిలిచి, నేడిదే నీ యొడిలో స్థానమాకోరుతోంది. ఈ కళంకగంధాన్ని ఆలోకపాతాళ పర్యంతం కొట్టుకుపోతల్లీ!!!"

తూర్పున భళ్లున తెల్లవారింది. నదిలో తెల్లని చీర కట్టిన శవంకొట్టుకుపోయింది. సుభద్రకాత్మశాంతి కలుగుగాకయని కమలబాంధవుడు తన సహస్రకరములూచాపి ప్రార్థనచేయసాగెడు తూర్పుకొండమీద.

## మానవజీవిత నిబంధనము*

# ఉ వి ద

విద్వాన్ పాలపర్తి సూర్యనారాయణగారు

చ॥ అమలవివేకబోధనల నాలనఁ జేయుము ; సూనృతంపుబో
ధముల మదిన్ దృఢంబుగను దాల్పు ; మహైన భవన్మనోవిలా
సము లొడఁగూర్చునందమును ; జానరో ! పన్నిరుపువ్వువంటి యం
దము పరువంబుదప్పినను దక్కొనునట్టుల సొంపునింపులన్.

చ॥ అయిన, వయోవసంతసమయంబున నీదగుభావిజీవితో
దయమున నెప్పుపూరుషులు దప్పక గాంతురొ మోహదృష్టులం
బ్రియమునఁ దెల్పునో ప్రకృతిహీనుల కట్టిదృగర్థమష్టు, దు
ర్ణయమునకీడ్చు మాటల మనంబున నిల్పకుమమ్మ మానినీ !

చ॥ అనఘమతీ వివేకవతివౌ హితురాలవుగా నినున్సృజిం
చెనువిధియంచు జ్ఞప్తినిడఁ జెల్లును ; బూరుషుకామతృప్తికై
మనుటకుఁగాదు ; తత్కుటిలమార్గమువీడుము ; జీవితప్రయో
జనము సుహృన్మతిన్ వలయు సాయముసేయుట సంకటంబులం
దున ; ముదమందఁ జేయుట మనోవ్యథనొందినవేళ ; డస్సివ
చ్చినను బ్రియోపచారముల సేదనుదీర్చుట ; భర్తమానసం
బును నటులైనలోఁగొనెదు ; పుట్టినయింటికి మెట్టినింటికిన్
ఘనతనుగూర్చి శాశ్వతసుఖమ్ముల నందెదవమ్మ నమ్ముమా !

సీ॥ ఆదర్శకంబైన యతివభావములందు చెలఁగఁ బవిత్రత ; చెక్కులందు
మక్కువవెలుగఁ ; బెంపెక్కెడుఁ బరువంపు మురిపంబు గులుకంగఁ దిరుగుచుండు
నామెహస్తంబు లభ్యర్థించుఁ బనులను; బనిలేక సలుపదు పర్యటనము
భుక్తిమితము, వస్త్రములు శుభ్రతమములు శాంతంబునడఁకువ కాంతనగలు

గీ॥ ఆమెనాలుక సంగీతమాడునాట్య ;
మామెపెదవులఁ దేనెదీపారుచుండు
నామెమాటల నౌచిత్యమలరుచుండు
నామెసంభాషణముల శైత్యంబుమెండు.

---

* ఈ గ్రంథము రెండువేలసంవత్సరములకుఁ బూర్వము రచింపఁబడినది. టిబెట్టుదేశమునందలి లామా యధికారమునసుండినది. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే నీతినిధియనుపేర గద్యముగఁ బ్రకటింపఁబడినది. దాని పద్యాత్మకంబుగ నే వ్రాసితిని.

# గృహలక్ష్మి

గీ॥ పరమవినయంబు నాజ్ఞానువర్తనంబు, నామె తనజీవితంబున నభ్యసించు
నట్టివిద్యలు ; శాంతిసౌఖ్యంబులామె, పడయుబహుమాన ; మా విధినశచుకొనుము.

గీ॥ నమ్ముమా శీలవతి యన్నదమ్ములకును, ముందునడచువివేకంబు మందముగను ;
గాచియుండు సౌశీల్యంబు కలికిపజ్జ, గౌరవాదరములు దాను గాంచుఫలము.

గీ॥ ఆమెకనులఁ బెద్దటికంబు ప్రేమయమరు, విడియుఁ గనుఁబొమ్మలందు వివేక ; మాపె
యెదుట దుష్ప్రవర్తకులు నోరెత్తఁజాల, రామె సౌశీల్యమునవారి కగునుభయము.

క॥ తనయెశ నకారణపునింద, నకారణమైనస్తుతినిఁ దనపొరుగునెడం
గనఁబఱుప నరకుగొనకుండును, సౌశీల్యవతిసతి కడున్సహనమునన్.

క॥ సదనము సౌమ్యతకాయమహృదయము ; సందేహామంద దితరులచెడు ; గే
సదనమున నామెమను నా సదనంబుననెపుడు శాంతిసౌఖ్యములుండున్.

చ॥ ఇలఁదెలవాఱలేచి గృహకృత్యము లన్మదిఁజింతఁజేసి యా
జ్ఞలనిడి వారివారికగు కార్యములంబచరింపఁ ; దా గుతూ
హలమునఁ జక్కఁజేసికొను నారకుటుంబము జ్ఞానధీబలం
బులఁగనిపెట్టుచుం ; బొడుపుపొందిక కన్పడునింట ; నామె కౌ
శలమున భర్తపొందునతిసంపదఁ ; దద్గుణగౌరవంబు ని
చ్చలువినఁగల్గు సంతసమెసంగ, నతండగుఁగాదెధన్యుఁ ; డ
క్కలికిని దల్లినాఁబిలువఁగల్గిన బిడ్డలుధన్యు ; లామెప
ల్కులు గుణవంతులన్ సలిపెడుం, గనుసన్నఁజరింత్రువారలున్.

సీ॥ పనివారలాజ్ఞలఁ బఱుగువారుదురు చేసన్నఁగార్యములెల్ల సలుపఁబడును
ఆమెచూపెడుప్రేమ యమరుచుతెక్కల వారిపాదములకు ; భాగ్యమందు
నుబ్బితబ్బిబ్బులై యుండ, దాపదలందు విహ్వలచిత్తయై వివశకాదు
శాంతంబుతోవాని సహియించు ; సద్బోధనములచే భర్తృకష్టములువాపు

గీ॥ శాంతునిగసల్పుఁ బ్రేమోపచారములను
నతఁడు తనహృదయంబు నాయమమనంబు
నందునిడి యూరటంగాంచు, నామెభర్త
ధన్యుఁ ; డాయమబిడ్డలు ధన్యతములు.

# మాతృ, శిశు సంరక్షణము— జర్మనీ, రష్యా దేశములలోని పద్ధతులు

బి. వెంకటసుబ్బయ్యగారు బి. ఏ., ఎల్. టి.

దేశాభ్యుదయమునకు మూలకందము దేశజన సంపత్తి. జనసంపత్తియన జనబాహుళ్యము కాదు. ఏలయన ప్రజలవిలువ వారి సంఖ్యాధిక్యముమీద గాక వారి శారీరక, మానసిక, నైతిక శక్తులపై నాధారపడును. ఆయురారోగ్య భాగ్యాభివృద్ధిగల్గి విద్యాధికులై యున్నవా రల్పసంఖ్యాకులుండుటయు కొఱత కాదు; విద్యావిహీనులును వ్యాధిగ్రస్తులునైన జనులధికముగనున్నను ప్రయోజనముండదు. అర్థోత్పత్తికి ప్రజల బుద్ధి బాహుబలంబులే కారణములు, కాని సతతము లేమినిగుందు నరులు మానసిక, నైతికవికాసమును బొందుట దుర్ఘటము. కావున ప్రజల సుఖజీవనమునకు వలయు వసతులు గల్పించు టవసరము, లేనిచో దేశమెన్నటికిని యభివృద్ధిలోనికి రాజాలదు.

ఈ క్రిందిపట్టిక భారత, భారతేతరదేశముల ఆర్థిక విద్యావిషయిక ఆరోగ్యపరిస్థితులలోని తారతమ్యమును ప్రకటించుచున్నది.

| దేశము | ప్రజల సరాసరి * ఆదాయము (రోజునకు) | విద్యావంతుల సంఖ్య (నూటికి) |
|---|---|---|
| అమెరికా | రూ. 3-0-0 | 95.4 |
| ఇంగ్లాండు | ,, 2-1-8 | 93.5 |
| జర్మనీ | ,, 1-3-8 | 100 |
| రష్యా | ,, 0-6-5† | 67§ |
| ఇండియా | ,, 0-1-7 | 7 5 |

దీనివలన మన భరతఖండ మెట్లు సర్వవిధములుగను అధోగతిపాలై యున్నదో వ్యక్తమగుచున్నది.

జనసంపత్తి కాధారభూతులగువారు తల్లులు, శిశువులు; నేటి శిశువులు రేపటి పౌరులు. ఇట్టి పౌరులను గనుభారము తల్లులది. మఱియు భావిసంతానముల యాయురారోగ్యములు తల్లుల జవసత్వములపైనను, వారి యానందసంతుష్టులపైనను యాధారపడి యుండుటచే, స్త్రీజనంబుల యారోగ్యమును గాపాడుట ప్రజల ప్రత్యేకవిధియైయున్నది. కావుననే పాశ్చాత్యులు తమ స్త్రీల యారోగ్యాభివృద్ధి విషయమై కడుంగడు శ్రద్ధ వహించియున్నారు. దానికై వా రవలంబించుచున్న పద్ధతులెవ్వియో కొంత విచారింతము.

ప్రజోపయోగకరములగు కార్యము లెవ్వి సూచించినను, ధనాభావముచే వాని గొనసాగింప వీలుపడదని నుడువుట మన ప్రభుత్వమువారికి పరిపాటియై యున్నది. కాని స్వతంత్రదేశములలోని ప్రభుత్వముల తీరు వేరు. భీకరసంగ్రామఫలితమునుండి యింకను కోలుకొననో లేదో జర్మను ప్రభుత్వము 1922వ సంవత్సరమున మాతృ శిశు సంరక్షణనిమిత్తమై సామ్రాజ్యమున కంతటికిని యన్వయించు శాసన మమలున బెట్టెను. కొంచెము యించుమించుగ నిదేసమయమున, అనగా నవప్రజాప్రభుత్వ మింకను శైశవమున నున్న

* మఱొక అంచెనా ననుసరించి అన్నిదేశములలోను సరాసరి ఆదాయము నూటికి 5 మొదలు 50వరకు హెచ్చుగనున్నది. అప్పుడు మన ఆదాయము 0-2-9 అగును.

* 1925వ సంవత్సరమున.

§ 1930 ,,

పుడే రష్యాదేశమునను యిట్టి శాసన మమలునకు దెచ్చిరి. కాని కార్యాసక్తులగుటకు మన కేమో తరుణము రాకున్నది.

## మాతృ సంరక్షణాలయములు

## (Mother welfare centres)

జర్మనీదేశమున గ్రామగ్రామమునను మాతృ సంరక్షణాలయములు స్థాపింపబడినవి. వానియందు వారములో కొన్ని నియమికదినములలో నొక వైద్యుడును, దాదియు హాజరుండి గర్భవతులగు స్త్రీలనందరిని పరీక్షించి, పరీక్షలో తేలినయంశముల నొక కార్డున వ్రాసి యుంచెదరు. ముమ్ముందు వారి యారోగ్యస్థితియం దగపడు మార్పులను గమనించుట కీ రికార్డులు సహాయపడును. సాధారణముగ గర్భము ధరించిన 2, 3, 8వ నెలలో స్త్రీలు పరీక్షింపబడుచున్నారు. వీనియందు చికిత్స జరుపకపోయినను రోగు లెచట చికిత్స నొందవలయునో సూచింపబడును. దాదులొక్కొకతఱి వారిని గృహములందు దర్శించుటయు కలదు. మఱియు ప్రసవించినవెనుక వారి యుపయోగమునకై కొన్ని ఉడుపులు, సబ్బు, బిడ్డలగానులు మొదలగువాని నొక బుట్టలోపెట్టి దాని నుచితముగ నిత్తురు. వీనినే తిరుగుడుబుట్ట లందురు (Wandering Baskets). ఈ సంరక్షణాలయములందు తఱుచుగ ఉపన్యాసములు, ప్రదర్శనలమూలమున ఆరోగ్యాభివృద్ధికొఱకై గర్భవతు లవలంబించవలసిన ముఖ్యవిధులు, వారు తమ గృహముల నుంచుకొనవలసిన రీతి, తదితర విషయములను బోధింతురు.

రష్యాదేశమునందు గర్భిణీస్త్రీల కుచితవైద్యసహాయ మొనర్చి వారిని గాపాడుట ఆరోగ్యశాఖవారి విధి. మఱియు వారి యక్కరలను గనిపెట్టు నిమిత్తమై మాతృశిశుశాఖ యను (Department of Motherhood and Infancy) ప్రత్యేక ప్రభుత్వశాఖ యొకటిగలదు. కమ్యూనిస్టు కక్షిలోని స్త్రీలశాఖ నారీమణుల యభ్యుదయమునకై సకలరీతుల పాటుపడుచున్నది. అది వనితల విద్యాభివృద్ధికిని, వారి హక్కుల సంరక్షణమునకును పత్రికలమూలమున తీవ్రమగు ప్రచారము జరుపుచున్నది. మాస్కో నగరమునందు మాతృత్వభవన మనబరగు (Palace of Motherhood) గొప్పభవన మొండుకలదు. అందు రోగకారణములు, తన్నివారణోపాయముల విషయమై పరిశోధనలు గావించి వాని ఫలితములను ప్రకటించుటేకాక వైద్యులు, మంత్రసానులు, దాదులను తరిఫీదు చేయుదురు. మఱియు నది యొక్క గొప్ప ప్రదర్శనశాలయై యొప్పుచున్నది. మాతృశిశు సంరక్షణమునకు సంబంధించిన సకల విషయములు నచట ప్రదర్శింపబడియున్నవి.

రోగులకు చికిత్సచేయుటకు వలయు వైద్యాలయములు లేనిచో సంరక్షణాలయములలో నొసగబడు పట్టిసలహాలు నిష్ప్రయోజనములు. కావున జర్మనీయందు ఆస్పత్రులలో చాలినన్ని పడక లుంచబడియున్నవి. దీని మన దేశపుపరిస్థితులతో బోల్చి చూతము.

| దేశము | జనసంఖ్య (లక్షలలో) | పడకలసంఖ్య * | వేయిమంది కెన్ని పడకలు * |
|---|---|---|---|
| ఇంగ్లాండు, వేల్సు | 339.5 | 3,70,671 | 1 |
| జర్మనీ | 623 | 9,244 | 0.6 |
| మద్రాసురాజధాని | 467 | 11,411 | 0.14 |

ఈ సందర్భమున మనము గమనించవలసిన విషయము మఱొకటికలదు — రోగులయొక్క వైద్యులు మెలగురీతి. పరాధీనమగు భరతఖండంబున ప్రభుత్వోద్యోగులు ప్రజలను దమ బానిసలుగ భావించి, వారిని తృణీకరించుట సర్వసామాన్యమగు దృశ్యము. అనాథులకును, దీనులకును వైద్యాలయములవలని ప్రయోజనమునుటల్ప

* From Main General F. H. G. Hutchin Sons (Surgeon General to Madras) evidence before the Royal Commission on Agriculture.

సత్యదూరము కాదు. అయితే స్వతంత్రదేశములలోని ప్రభుత్వోద్యోగులీ తీరుగ బ్రవర్తింప సాహసించరు. జర్మనీలోని వైద్యులు అహంభావమును వీడి తాము ప్రజలదాసులమని తలచి, రోగులయెడ శ్రద్ధాభక్తులతోను, సానుభూతితోను వర్తించెదరు.

## ఫ్యాక్టరీ శాసనములు

యంత్రశాలలయందు పనిచేయు స్త్రీల ఆరోగ్యమును సంరక్షించుటకై ప్రత్యేకశాసనములు కావింపబడినవి. గనులు మొదలగు నపాయకరములగు స్థలములగాని, పరిశ్రమలందుగాని స్త్రీలను నియమించరాదు. మఱియు దినములో ఎనిమిదిగంటలకన్న నెక్కుడు కాలమును (ప్రస్తుతము రష్యాయందేడుగంటలే) రాత్రులందును, విరామదినములలోను వారిని నియమించుట నిషేధింపబడినది. అంతియకాక గర్భిణీస్త్రీలకు ప్రసవమునకు పూర్వమారు వారములును, తదనంతర మారువారములును పూర్తివేతనములతో సెలవొసంగెదరు. (రష్యాలో కొన్ని సందర్భములందు నాల్గునెలలు సెలవిత్తురు.) పిదప పనిలో బ్రవేశించినను శిశువునకు స్తన్యమిచ్చుకొఱకై వారికి దినమునకు రెండుతడవులు, ఒక్కొక్కటి అరగంటచొప్పున విరామమియ్యవలయుననియు, ప్రసవకారణముచే రోగము సంప్రాప్తించినదని తేలినచో, స్వస్థతజెందువరకు పూర్తివేతనముతో సెలవియ్యవలయుననియు శాసించినారు. పదునాల్గువత్సరముల వయస్సునకు లోబడిన వారినేరినిగాని యంత్రశాలలతో నియమింపరాదను నిషేధమును కార్మికులందరును నిర్బంధజీవిత భీమాచేయించుకొనవలయునను నియమమును సర్వత్రకలవు. ప్రీమియములలో (Premiums) సగము పనివాండ్రును తక్కినది మిల్లుయజమానులును చెల్లింతురు.

పుణ్యభూమియగు మన భరతఖండంబునం దిట్టి నిర్బంధములట్టె కానరావు. 12 సంవత్సరములవయస్సు దాటినవారందరను పనులనుజేయ సమర్థులే; హిందు దేశపుచల్లనివాతావరణమున మనకార్మికులు దినములో 11 గంటలకాలము శ్రమింపవచ్చును; స్త్రీల సంరక్షణమునకై ప్రత్యేకశాసనము లేదు. అఖిలభారత భూమికి వర్తించు ప్రసూతి సహాయశాసనమొకటి (Maternity Benefits Bill) పదేండ్ల వెనుక శ్రీయుత జోషీగారు భారతశాసనసభలో ప్రవేశపెట్టగా, ప్రజాశ్రేయోభిలాషులగు సభ్యులు దాని నిరాకరించిరి. పిదప 1929వ సంవత్సరమున బొంబాయి, మధ్యమాగాణముల రాష్ట్రీయప్రభుత్వములు కొన్ని శాసనము లమలునబెట్టెను. వీనిననుసరించి గర్భవతులగు కార్మికులకు పురిటికి ముందు వెనుకలు మొత్తము రెండునెలల కాలము జీతముతోడ సెలవిచ్చెదరు. ఇన్నినాళ్లకు మన మద్రాసు రాష్ట్రమునందును గత వత్సరము యేప్రెల్ మాసమునుండి మిల్లులలో పనిచేయు గర్భవతులకు ప్రసవమునకు మునుపు మూడు వారములును, తదనంతరము నాల్గువారములును సెలవును, మఱియు దినమునకు అర్ధరూపాయవంతున ధన సాహాయ్యమును జేయవలసినదని శాసింపబడినది. కాని మనకన్న వేయిమడుంగులు దీనావస్థయందుండిన జర్మని, రష్యాలు చాలపూర్వమే వీనికన్న మేలైన శాసనములను గావించిరి. వాని ఫలితముగ ప్రసవకారణముచే సంభవించు మరణముల సంఖ్య తగ్గినది.

ప్రసవించిన వేయిమంది స్త్రీలలో మరణించువారిసంఖ్య

| | |
|---|---|
| మద్రాసు | 17. 5. |
| ఇంగ్లాండు | 4. 0. |

## ఆరోగ్యశాలలు, విశ్రాంతిశాలలు

మఱియు సంపూర్ణారోగ్యములేమిచే ప్రత్యేక పథ్యమును శుశ్రూషయు బొందవలసియుండినను, పనినుండి పూర్తిగవిరమించుకొన వీలులేని స్త్రీకార్మికుల ఉపయోగమునకై రష్యాదేశమునందు నైట్ సానిటోరియా (Night Sanitoria) యనబడు ఆరోగ్యశాలలు స్థాపింపబడినవి. వారు కర్మాగారములనుండి మరలి

వచ్చిన వెనుక రాత్రికాలము నిచటగడపెదరు. వనితలు తమతీరికసమయము నుల్లాసముగను, యుపయోగకరముగను బుచ్చుట కనువగు విశ్రాంతిశాల లనేకములు (Rest Houses) కలవు. మనదేశమునం దిటువంటి సంస్థలు మచ్చునకైనలేవు; వంటగృహమే మనస్త్రీల పాలిటి స్వర్గము. నీతి ఆరోగ్యములకు భంగమువాటిల్లకుండ, పదిమందిస్త్రీలుకూడి తమ తీరికకాలమును సంతోషముతో గడపుట కుపయుక్తములగు సంస్థల యావశ్యకతనుగూర్చి ప్రత్యేకముగ నుడువవలసిన దనవసరము.

## శిశుసంరక్షణము

దేశాభివృద్ధికి మాతలెట్టుల కారణభూతులో శిశువులును యట్లే కారకులు; కావున వారిరక్షణమును మనకర్తవ్యమేయని వేరుగ జెప్పవలయునా?

శతాబ్దకాలములో నొకసారి భీకరు భూకంపము వంటి ఘోరభీభత్సము సంప్రాప్తించి జననష్టముగల్గించినపుడు ప్రజలెల్ల దల్లడిల్లి అట్టుడికినట్టుడికిపోయిరి; కాని కనుకండ్లయెదుటనే యింతకన్న ఘోరకరమగు ప్రాణనష్టము ప్రతిమాసమును జరుగుచుండుట మన మెఱుంగకున్నాము. భరతఖండంబున దినమొక్కటికి ఆరువేలమంది శిశువులు మరణించుచున్నారని నీవెన్నడైన దలచితివా? అనగా మూడునెలలకొకతూరి మదరాసువంటి మహానగరమొకటి భూతలమునుండి తుడిచివేయబడుచున్నదని యర్థము. ఇట్టి దుస్థితిని మాన్పుటకై జరుగుచున్న ప్రయత్నమేమి? రానున్నది రాక మానదు; మృత్యువుకోటనుండి తప్పించుకొనుట కెవరితరమను శుష్కవేదాంతములతో గుటకలు మ్రింగుచే కదా! పాశ్చాత్యులీ మూఢసిద్ధాంతములకు హస్తోదకంబిచ్చి మృత్యువునోటనుండి శిశువులను గాపాడుటకై పలువిధములుగ యత్నించుచున్నారు. వారొనర్చుచున్న కార్యమేమి?

## శిశుసంరక్షణాలయములు

మాతృసంరక్షణాలయములనే సర్వసాధారణముగ శిశుసంరక్షణాలయములుగ వాడుచున్నారు. వీనియందును రోగులను బరీక్షించి హితవొసంగుదురేకాని చికిత్స చేయరు. పరీక్షాఫలితమును వ్రాసియుంచి, శిశువులు పెరిగి పాఠశాలల ప్రవేశించుసమయమున, యా రికార్డులను పాఠశాలాధికారుల కప్పగింతురు. బిడ్డల యారోగ్యస్థితిలోని మార్పులను జాగ్రత్తగ కనిపెట్టి, తగుచికిత్స చేయించుట పాఠశాలాధికారుల విధియగును. కర్మాగారమునకు వెడలుస్త్రీలు తమశిశువులను పోషణాలయములందు (Nurseries) విడచి వెళ్లవచ్చును. కాని అందరి శిశువులకును యిచ్చో ప్రవేశములేదు; తల్లిదండ్రులు బిడ్డలను బోషింపలేనంతటి పేదలైయున్నను, స్వగృహములు వాసయోగ్యములు కానపుడును మాత్రమే శిశువులకు శరణ్యమిత్తురు. ఈసంరక్షణాలయములసంఖ్య క్రమక్రమముగ బెరుగుచున్నది. 1925 వ సంవత్సరమున జర్మనీయందు 4491 సంస్థలుండెను. రష్యాయందును, క్రెచెస్ (creches) అనబడు శిశుసంరక్షణాలయము లనేకములుగలవు. వీనిపోషణమునకై 1925 వ సం॥న సామాన్యకర్షకజనము పదిలక్షలరూప్యములు (6½ Lakhs Roubles) విరాళముగ నొసగిరనిన, వాని ప్రజారంజకత్వము విశదమగును.

## శిశు చికిత్సాలయములు

బిడ్డలు జననీజనకుల మధ్య బెరుగుటే శ్రేయస్కరమని యెంచి వారిని స్వగృహములందే పెంచుటకు వలయు సౌకర్యము లేర్పాటు చేయబడును. అయినను తల్లి దండ్రులు అంటురోగములచే బాధపడుచున్నయెడ వారి సంతానమును చికిత్సాలయములందో లేక మాతృశిశుగృహములలోనో చేర్చుకొనెదరు. రోగగ్రస్తులగు బిడ్డలు సంపూర్ణముగ నారోగ్యవంతులగువరకు వారి కన్నపానాదులొసగి కాపాడుదురు. వీరి పోషణఖర్చులు కేంద్ర, స్థానిక ప్రభుత్వ

ములు భరించును. ఈ ఏర్పాటులమూలమున శిశుమరణముల సంఖ్య క్రమముగ సన్నగిల్లినది.

శిశుమరణముల సంఖ్య (సజీవులై జన్మించిన నూరు మందిలో).

| సంవత్సరము | జర్మనీ | ఇండియా | ఇంగ్లాండు |
|---|---|---|---|
| 1901 | 20.7 | | |
| 1921 | 13 | 19.4 | 7.5 |
| 1929 | 8.9 | 18.7 | 6 |

హిందూదేశమునం దేవో కొన్ని గొప్ప నగరములలో దప్ప తదితర ప్రదేశములం దిట్టి సంరక్షణాలయములు కానరావు. ఉన్నవి గ్రామసీమలలో నివసించు జనసామాన్యమున కందుబాటున లేవు. రెడ్ క్రాస్ సంఘమువారును, పూనాలోని సేవాసదనమువారును అనేక శిశుసంరక్షణాలయముల నచ్చటచ్చట స్థాపించినారు; కాని ఐదులక్షలు గ్రామములున్న భరతఖండంబున కొన్నివందల సంరక్షణాలయము లొనర్పగల మేలు అత్యల్పము.

## శిశువిద్య

జన్మించిన శిశువులలో పాతికభాగమునకన్న నెక్కుడుమంది ఐదేండ్లలోపుననే మరణించునెడ వారు సజీవులై పుట్టినమాత్రమున ప్రయోజనమేమి? మఱియు మరణాపాయమునుండి తప్పించుకొన్న వారును జీవచ్ఛవములై, యెల్లప్పుడు 'అన్నమో రామచంద్రా'యని విలపించుచు, జీవితానందమన నెట్టిదో కలనైన నెఱుంగక, పశుతుల్యులై కాలము గడపుచో, వారు సంఘమునకుగాని, దేశమునకుగాని యొనర్పగల యుపకారమేమి? కావున శిశువుల నకాలమరణమునుండి కాపాడుటేకాక, సంఘమున కుపయుక్తులగునటుల వారికి విద్యాబుద్ధులు గఱపి, శిక్షణమునొసగుట ప్రభుత్వమువారి విధ్యుక్తధర్మమని నాగరక ప్రపంచ మంగీకరించినది. జర్మనీ, రష్యాలలో, షోడశవర్షప్రాయులగువరకు బాలబాలికల కందరకును విద్య నేర్పుట ప్రభుత్వముల భారము. విద్యయొక్క లక్ష్యము వ్యక్తుల సర్వతోముఖమగు వికాసమునకు దోడ్పడి తన్మూలమున వారి వ్యక్తిత్వమును ప్రకటించుటేకాక, వారిని సంఘసేవాపరాయణులుగను, దేశాభిమానులుగను యొనర్చుటయని నిర్వచింపబడినది. ప్రజ లారోగ్యవంతులును, ధైర్యసాహసాదిసద్గుణ సంశోభితులును, స్వాతంత్ర్యేచ్ఛగలవారునై యుండు టవసరమని వారు గ్రహించినారు.

## ఫ్రోబెల్ సంఘములు

శైశవమును దాటి బాల్యావస్థలోనికి వచ్చినవారిని సంరక్షించి, శిక్షణ మొసగుటకై జర్మనీదేశమున ఫ్రోబెల్ సంఘము (Frobel Associations) లనేకములు గలవు. 1840 వ సంవత్సరమున ఫ్రోబెల్ మహాశయుడు స్వయంకృషిమూలమున బాలురను తరిఫీదుచేయు నుద్దేశ్యముతో నొకసంస్థను స్థాపించి దానికి "కింద్రగార్టన"ని (Kindergarden) పేరు బెట్టెను. కింద్రగార్టనన బాలురవనమని యర్థము. (Children's Garden). ఆతని యనంతర మాతని యుద్దేశ్యములను గొనసాగించుటకై స్థాపింపబడినవే వై సంఘములు. ఈ సంస్థల నభివృద్ధిజేసి, వీనియందు పనిచేయుటకై ఉపాధ్యాయినులను తరిఫీదుచేయుట వీనిపని. ప్రాథమిక పాఠశాలలలోని కింద్రగార్టనుల యందు బాలురకు భోజనసదుపాయములను గల్పించి, వారిని ప్రాతఃకాలమునుండి సాయంసమయమువరకు నచటనే యుంచుకొనెదరు. బాలుర వ్యక్తిత్వమును బోషించి పెంపుజేయుటే వీని ముఖ్యోద్దేశ్యము.

మఱియు బాలురు తమ ఆరోగ్యము నభివృద్ధికి దెచ్చుకొనుటకును, తీరికసమయము నుల్లాసముగ గడపుటకును నుపకరించునట్టి సంస్థ లనేకములున్నవి. విశ్రామశాలలు (Recreation homes) వనగృహము లనబరగునవి (Garden houses) సుందరవనమధ్యముననో, నదీతీరముననో లేక పర్వతప్రాంతముననో

నిర్మింపబడును. బాలురు ప్రకృతిసౌందర్యమును సమక్షముగాంచి, తనివిదీర యాయానందమును గ్రోలుటకవకాశమిచ్చు నిమిత్తమై వారి నీస్థలములకు వేసవి సెలవులలో గొనిపోవుదురు. కాని దీర్ఘవాసముచే వారికి జీవితసమస్యల విషయమై దురభిప్రాయములు వొడమునను భయమువలన వారి నచట స్వల్పకాలము మాత్ర ముండనిత్తురు.

ప్రజలను సంఘసేవాపరాయణులుగ నొనర్చుటే విద్యయొక్క పరమార్థమని రష్యనులును గ్రహించి విద్యాభివృద్ధికొఱకై వా రనేకప్రయత్నము లొనర్చుచున్నారు. లెనిన్ మహాశయుని సతి కృప్స్కాయా (Krupskaya) భర్తృవియోగానంతరము ప్రజల నీవిధముగ నుద్బోధించెనట. "సఖురాలా! మీరు నాకొక మహోపకారము జేయవలయు. తాము లెనిన్‌గారికి బాహ్యాడంబరములతో గూడిన గౌరవము గన్పరపరాదు; ఏలయన వారి జీవితమునందు వారి కిట్టివి సరిపడకుండెను. కాని తమ కతనియెడ నిజమగు గౌరవాభిమానములు గలవేని, దేశము కటికదారిద్ర్యమున మున్గియున్న సంగతిని జ్ఞప్తికిదెచ్చుకొని, మన చిన్నిబాలురకొఱకై విశ్రాంతిశాలలను, శిశుచికిత్సాలయములను, పాఠశాలలు, గ్రంథాలయములు మొదలగు సార్వజనిక సంస్థలను నెలకొల్పుడు."

పాఠశాలలకు బోవ వయస్సుచాలని మూడు నాల్గేండ్ల బాలబాలికలకొఱకై ప్రీస్కూల్స్ (Pre-schools) అను సంస్థలున్నవి; వీనిలో శిశువుల ఆరోగ్యము నిద్రాహారవిషయమై ప్రత్యేక శ్రద్ధవహింతురు. మఱియు ఆటపాటలు, సంగీతము, నాటకముల మూలమున వారికి విద్య గఱపుదురు. మనదేశపు పరిస్థితులను వీనితో మీరే పోల్చి చూచుకొనుడు.

## శుభాశంసనము

గబ్బిట మృత్యుంజయశాస్త్రిగారు

సీ॥ ప్రాచీనభారత రమణీమణులశౌర్య వైదుష్యములనెల్ల వఱలఁజేసె
గృహనిర్వహణధర్మ బృందంబులనుదెల్పి గృహిణీత్వసంసిద్ధి కీలుగొల్పె
సుదతులకునువిద్య సుంతేనివలదను పిడివాదములనెల్లఁ బిప్పి జేసె
మహిళోద్ధరణకృత్య మహితదీక్షనుబూని ఘనతరఖ్యాతి నార్జమునముచేసె

తే॥ అతులసాంఘికసంస్కార గతులఁదెల్పె
నిట్టియనవద్యగుణపుంజ హృద్యమైన
'యాంధ్రగృహలక్ష్మి' సకలగేహములయందు
శ్రీమహాలక్ష్మితల్లియై చెలగుఁగాత!॥

క॥ తెలుఁగులశౌర్యౌదార్యము,
తెలుఁగుల నాగరికతయును దెంపున్ బెంపున్
తెలుఁగుల వ్యక్తిత్వంబును,
దెలుపుచు విలసిల్లుగాత చిరమగుగతితోన్॥

# సన్యాసి

రావు వెంకటరంగ నాయకులుగారు

శ్యామా! నువ్వు నిజం చెపుతున్నావా? నేను నిన్ను మరచిపోగలనా? ఈ ఆశాలతని ముక్కలుముక్కలుగా తెంపేయనా? తండ్రిగారి కోపం...సంఘనియమానికి భయం.... ఆఖరుకలయిక......పరిణామం? హృదయం ముక్కలు ముక్కలుగా చేసేసుకోనా?

చంద్రా! నేనెప్పుడైనా నీతో అసత్యం చెప్పేనా? నేను చెప్పిందంతా నిజం. నువ్వు కలగనడంలేదు. నువ్వు పిచ్చివాడివికావు. నా సాహసానికి క్షమించు. సంధ్యాకాలం సమీపిస్తోంది. నాకిప్పుడు అంతిమ ఆజ్ఞ ఇయ్యి. ఇది మన అంతిమ సెలవు ఏమో! చంద్రా! ఏడుస్తున్నా వెందుకు చెప్పు?

శ్యామా! ఇప్పుడాజ్ఞ యెట్లు? నేను నీకు ఆజ్ఞ ఎలాయివ్వను! వెళ్లమని చెప్పలేను. ప్రేమముల్లు గుచ్చుకుంది--ఉండమనికూడా చెప్పలేను. నీతండ్రిఆజ్ఞ. సంఘనియమం...

మంచిది చంద్రా! నమస్తే. సాధ్యమైనంతవరకూ నన్నుమరచిపోవడానికి ప్రయత్నించు. తెలిసికో ఒకస్వప్నం, ఒకపిచ్చితనం.

## 2

అయ్యో! నిష్ఠురహృదయమా! నీకు కొంచెంకూడా దయరాలేదేమి! చిన్ననాటి సహచరుణ్ణి విడిచిపెట్టడానికి కొంచెంకూడా దుఃఖంకలుగలేదు. సంఘనియమాలికి భయపడి నిత్యం నీరు పోస్తున్న ఒకలతని పెరికి పారవేశేసేవే!

శ్యామా! నీకు దయలేదా! సంఘం అని ఒక వంకపెట్టుకుని నేను బీదవాణ్ణనీ, దీనుణ్ణనితలచి నిరాకరిస్తున్నావా?

చంద్రా! క్షమించు. నీ అమాయికముఖం నేనెప్పుడూ మరచిపోను. పిచ్చితనంగా నీతో కఠోరంగా మాట్లాడాను. నువ్వు నన్ను కఠోరమైనదానిననితలచి మరచిపొమ్మని కోరుతున్నాను. నువ్వు నావల్ల కష్టపడవలదని కోరుతున్నాను. నేను నిన్నువిడిచిపెట్టి పోతున్నానని మనస్సు కష్టపెట్టుకోకు.

## 3

చంద్రుని నివాసస్థలం ఒక చిన్నపట్టణం. బీదవాడు విద్యాపతి. తలిదండ్రులికి ఒకడే కొడుకు. అందరూ అతణ్ణిప్రేమించుచుండిరి. శ్యామా,చంద్రులు చిన్ననాటిస్నేహితులు. ఒకతరగతిలోనే చదువుకొనిరి. ఇద్దరికి అపూర్వమైన ప్రేమకలదు.

చాలసంవత్సరాలు గడిచాయి. చంద్రుని జాడలేదు. సమయంతో ప్రపంచంకూడా పరివర్తనశీలమైనది. చంద్రుడెక్కడున్నాడో, ఎక్కడికి వెళ్లిపోయాడో ఎవనికీ తెలియదు.

ఎందుకు వెళ్లిపోయాడో ఒక్క శ్యామకే తెలుసును.

శ్యామ ఇంటిలో ఉదాసీనంగావుంటూ వుండేది. ప్రపంచమంతా ఆమెకి శూన్యంగా కనిపించింది. నాహృదయం ఇంత కఠోరమై పోయిందేమని అనుకుండేది. చంద్రుడు వెళ్లి పోవడానికి కారణం నేనేనని చింతించేది. అతడు యెక్కడకు పోయాడో ఏంచేస్తున్నాడో తెలియదు. నేను సంఘనియమాల్ని తిరస్కరించి బయటికివచ్చేస్తే ఏమవుతుంది? ఏమీఅవదు. రెండురోజులు ఆందోళనగా వుంటుంది. తరువాత ప్రపంచకార్యక్రమం యథారీతి జరుగుతూనేవుంటుంది. చంద్రా! రా. ఒకమారు దర్శన మిచ్చిపో.

## ౮

శ్యామతండ్రి చనిపోయాడు. ఇప్పుడు శ్యామా, ఆమె భర్తావచ్చి శ్యామతల్లి దగ్గరవుంటూ వుండిరి. శ్యామకూడా తన తలిదండ్రులికి ఒక్కతే సంతానం. శ్యామ తల్లికికూడా చంద్రుడంటే చాలాయిష్టం. అప్పుడప్పుడు చంద్రుని మాటలుచెప్పి రెండు మూడు అశ్రుకణాలు రాలుస్తూవుండేది. తల్లికి చంద్రుడు వెళ్లిపోవడంగురించి ఏమీ తెలియదు. శ్యామచంద్రుని శిథిలగృహమున ఒక చంద్రకుటీరం స్థాపించింది. కొద్దిసమయంలో ఆకుటీరపు గొప్పదనం నాలుగు వైపులా వ్యాపించింది. అది సమీపంలో ఒక్కటే. ఈభవనం సార్వజనికకార్యాల్లో వినియోగింపబడుతూవుంది. ఒకపుస్తకాలయంకూడా స్థాపించి రెట్టింపుశోభ తెచ్చింది.

## ౯

చంద్రగ్రహనం అనాడు. శనివారం అందరూ త్రివేణీస్నానం చేయడానికి సరదా పడుతున్నారు. పట్టుదలగల సనాతనుల సంగతి చెప్పనక్కరలేదు. చాలామంది స్నానం చేశేసేరు, కొంతమంది చేస్తున్నారు. కొంతమంది స్నానంచేసి ఇవతలికి వచ్చేస్తున్నారు. ఈసమయాన ఒకనావలో ఇద్దరు నవదంపతులు చిన్నపిల్లాడితో వచ్చిచేరారు. వారు ధనవంతులుగా కనబడుతున్నారు. ఒకనౌకరు ఇంతకుముందునుంచీ ఒడ్డున నిలబడియున్నాడు. పిల్లాడ్నితీసుకుని అందరూ తీర్థంచూస్తూ ముందుకుసాగారు.

నవయువతి అప్పుడప్పుడూ ఆగుతూ వుండేది. బీదవాళ్లకి డబ్బులుఇస్తూ పోతూ వుండేది. ఆమె సాధువుల్ని ఈర్ష్యతో చూస్తూ నోటిలో గొణుక్కుంటూపోతూంది. దూరంగా వీరికారువుంది. (మోటారు) నవయువకుడు కొందరి పరిచితవ్యక్తుల్తో మాట్లాడుచుండెను. చిన్న పిల్లాడు "అమ్మా, అమ్మా" అని గోలపెట్టడం మొదలెట్టాడు. కాని ఆ యువతి ఏదోధ్యానంలో నిమగ్నురాలై వుంది.

దగ్గరనే కొందరువ్యక్తులు ఒకసన్యాసిని చుట్టుకుని నిలబడివుండిరి. అతడు ఎవడో ఆదర్శపురుషుడని అతని కాంతివల్ల తెలుస్తోంది. అతడు పిచ్చివాడిలాగ కనబడుతున్నాడు.

యువతికూడా అతణ్ణిచూచింది. చూడగనే హృదయంకంపించడం మొదలెట్టింది.

ముఖం ఎఱ్ఱనయిుంది. ఆమెహృదయం సం భాలించుకోలేకపోయింది. కన్నీరురాల్చింది. దగ్గరికిచేరింది. మంత్రముగ్ధురాలై నిలబడి పోయింది. సన్యాసిమాటలు ఆమెకి ఇష్టంగా ఉన్నాయి. ఎదుటవచ్చి నమస్కరించింది.

సాధువు యువతినిచూచి ఆశ్చర్యపడ్డాడు. "శ్యామా! నువ్విక్కడెక్కడ?" అన్నమాటలు నోటివెంట వెలువడ్డాయి.

యువతి ఆశ్చర్యంలో మునిగిపోయింది. ఆమెకి స్వప్నంలోకూడా ఆశలేదు అతను కనిపిస్తాడని.

ఎవరు? చంద్రా! నీయీదశ? నువ్వీ వేషంవేసుకున్నావా? ఆ అన్నివిపత్తులికి నేనే కారకురాల్ని.

కాదు, శ్యామా! ఏకాంతజీవనం అతి సుఖకరమనిన్నీ నా కిందులోనే ఆనంద మున్నదనిన్నీ నేను నీతో చెపుతుండేవాణ్ని కానా? ఈ సమయాన నవయువకుడు కూడా వచ్చిచేరాడు. శ్యామ, సన్యాసికి అతణ్ణి (నవయువకుడగు తనభర్తని) ఎరుక పరిచింది. హృదయావేశాన్ని ఆపి శ్యామ, చంద్రుణ్ణి ఇంటికిరమ్మని పట్టుబట్టింది.

"రేపు" అని సజలనేత్రాల్తో జవాబిచ్చాను.

## ౬

రెండవరోజున శ్యామ ఉల్లాసంగా చంద్రుణ్ణి తీసుకురావడానికి వచ్చింది. కాని చంద్రుడు అక్కడలేడు. తూర్పువైపు అలా వెళ్లాడని ప్రజలవల్ల తెలిసింది. శ్యామ ఆదారిచూస్తూవుంది. కాని అతడు రాలేదు. అక్కడే ఒకచిన్నకాగితం పడివుంది. అది కాగితంకాదు.

ఉత్తరం. ఆమెతీసింది. అందులో ఇలా వుంది —

శ్యామా!

ప్రపంచంస్వార్థంగలది. ప్రపంచంసుఖదుఃఖాలకి నిలయం. సేవాసుశ్రూషలు స్వర్గీయ వస్తువులు. నేను నిన్ను కలుసుకోలేకపోయి నందులకు విచారం. కష్టానికి క్షమించు.

నీఒక పరిచితవ్యక్తి. —హిందీనుండి

---

వినోదార్థమై యొక స్కాటుదేశీయుడు తన భార్యతోగూడ సముద్రతీరమునకు వెళ్లెను. అచట ఆతని భార్య సముద్రమున పెద్దఅలవచ్చి కొట్టుకొనిపోయెను. అంత నాతడు యింటికివెళ్లి భార్య శవము దొరికినట్లు వార్త వచ్చునని గనిపెట్టుకొనియుండెను. పది హేనురోజుల కాతనికి క్రిందివిధముగ తంతివచ్చెను. "శవము దొరికినది. శరీరమంతయు చేపలు గరచుకొని యున్నవి." వెంటనే ఆతడు తిరిగి యిట్లు తంతినంపెను. "చేపలు యేరుకొని తిరిగి శవమును సముద్రములో విడువుడు."

# స్వయంకృతాపరాధమా!

(వెనుకటి సంచిక తరువాయి)

[చిత్తరంజన్ గనులలో నధికారి. ఉత్తముఁడు. ఉత్తమాశయములు గలవాఁడు. ఒకప్పుడు గనిలో ప్రేలుడుసమయమున పైకివచ్చుటకు త్రోవగానక బాధపడుచుండగా, నతని సహోద్యోగియగు బెనర్జి చిత్తరంజన్ ప్రాణములఁ గాపాడెను. కృతజ్ఞతాపూర్వకముగా 'జీవితమే నీయధీన' మని చిత్తరంజన్ బెనర్జి సాయమును ప్రశంసెను. కాని యతఁడు మునుపటివలెనే విచిత్రమానవుఁడుగా ప్రవర్తించుచుండి, చిత్తరంజన్ లేనపుఁ డతని వశముననున్న గనుల యధికారి పైకము నపహరించెను. ఇనుపపెట్టె తెరచుమార్గమును చిత్తరంజన్ జోబులోనుండి వ్రాసియుంచుకొనెను. ఆరాత్రి అతఁడు నిద్రించుచున్నపుడు అపహరించిన ధనమును దాచెను. మరుదినము అధికారి యగు బోసు వారిరువురిని అనుమానముచే నిర్బంధించెను. బెనర్జీ ఇనుపపెట్టెను దెరచుటకు వ్రాసియుంచుకొన్న బిల్లు దొరకగా చిత్తరంజన్ తన నిర్దోషత్వమును దెలుపుట కాలోచించుచుండ, బెనర్జీ దానిని గనిపెట్టి, తా నతని ప్రాణముల గాపాడినదానికి చిత్తరంజన్ జీవితమునుండి యొక సంవత్సరకాల మివ్వవలయునని గోరెను. తరువాత కథ జదువుఁడు.]

అతఁ డంత నిట్లు జెప్పదొడఁగెను. "నీవద్దనున్నది వైద్యుఁడు పరీక్షచేసి నాకు మూడవమా రిచ్చినబిల్లు. ఒకపరీక్షచే నేను తృప్తిపొందలేదు. ఏలన నే జీవించు టింకొక సంవత్సరముపైన కొన్నిమాసములు మాత్రమే. దీని నబద్ధమని నిరూపింప నే నెన్నియో మారులు వైద్యులచే పరీక్ష జేయించుకొంటిని. నిరుపయోగమయ్యెను. కావలసిన నిదర్శనములు నీకు జూపింతును."

అతఁడు తన మేజాను తీయ ప్రయత్నించెను; నే వారించితిని. "నే నది నిజమని నమ్మెదను. కాని బెనర్జి! నీవు నన్ను నమ్మించుటకై నే నిటనుండగా దూరముగనున్న గుట్టలకువెళ్లి మరుగైతివిగదా! అది యట్లుండనిమ్ము. దీనికి ధనాపహరణమునకు సంబంధమేమి" అంటిని.

"ఇదే సంబంధము. నే నింకమీద చాల కాలము పాటుబడజాలను;జీవితాంతమువఱకు యిచట పాటుబడవలయునను యిచ్ఛగూడలేదు. నే మృతినొందుటకు మునుపు జీవించుటెట్టిదో యెఱుఁగవలెను. నే నంతమువఱకు మంచి స్థితియందే యుందునుగాన నా జీవితకాలమంతయు నొక్క సంవత్సరమునందే యిమిడ్చి, నే నింతవఱకు జూడదలంచిన చోటుల నెల్ల దిలకించి చేయదలంచినవెల్ల ముగింపగోరితిని.

"ఇది నా కెంతముఖ్యమో గడచిన నా జీవితమును వినినగాని తెలియదు. నీవు మీ తండ్రిని గురించియు, కర్చుచేసిన పైకమునుగుఱించియు, అనుభవించిన యితర వస్తువులనుగురించియుఁ జెప్పుకొందువు గదా! నే నన్ననో దిక్కులేనివాఁడనై అనాథశిశుశరణాలయమువద్ద పేలికలలో విడువబడితినట. అదియును

ఇప్పటి శరణాలయమువంటిది గాదు. నాకు కడుపు నిండ కూడు గాని కట్ట బట్టగాని చాలినంతలేక, నన్ను గమనించువారులేక నన్నెపుడు ఏడ్పించు మానుషాకృతి దాల్చిన మృగములమధ్య బెరిగితిని. ప్రకృతము నాకు గల్గిన యీవ్యాధికి కారణ మానాటి నిరాదరణయే నని వైద్యులు జెప్పుచున్నారు.”

ఇచట నాతఁడు కొంచమాగి యేదియో ఆలోచించురీతి యూరకుండి, తిరిగి తనకుతానే మాట్లాడు లీల నిట్లు ప్రారంభించెను.

“నేను పండ్రెండు సంవత్సరములవాఁడనైయుండి నపు డొక రైతింటికి పంపబడితిని. ఆతని యింట నా తిండితీర్థములకై పాటుబడవలసియుండెను. అతని పేరు మాధవపాలుఁడు. నా పరిస్థితులు గనుగొని యాతఁడు నన్ను పిండి సారము దీయదలంచి నాకు పనులు జెప్పుచుండెను. నే నెంతపనిజేసినను నాకై యాతఁడు వెచ్చించుదాని కది సరిపోదని దలఁచుచుండెను. ఆతని భార్య దుర్బలురాలు. అతని కుమార్తెయగు యమున తమ పొలమునందేమియు పనిచేయ నశక్తురాలై యుండుటచే కుటుంబమునకు తీరని నష్టముగా నెంచబడుచుండెను. కాని ఆమె బాలికలు చేయజాలని పనులు కొన్నిసమయములలో జేయుట గలదు. మైళ్లకొలది దూరముననున్న పాఠశాల కామె పోవుచుండెడిది.

“నేను పదియారు సంవత్సరముల ప్రాయమున నున్నపుడు మాధవపాలుఁడు గతించెను. మాధవపాలుఁడు గతించునప్పటికి ధనమేమియు మిగుల దయ్యెను. అందుచే ఆమన భార్య తనపొలమును ఇంటిని అమ్మి, కూతురకు విద్య నేర్పించుటకై మిడ్నపూరునందు నివాస మేర్పరుచుకొనెను.

“వారిని వీడుట నా కతికష్టముగ దోచెను. మాధవపాలునిసతి నను మిగుల యాదరించెడిది. యమునే నే ప్రపంచమున ప్రేమించిన జీవి. అప్పటి కామెకు పదుమూడేళ్ల వయస్సు. ఆ రూపము, ఆ విశాలమైన కనులు, ఆ మృదుత్వము ఎవరికైన నాకర్షించుచుండెను. పోవునపుడామెతల్లి నా కేబదిరూపాయలిచ్చి, కనులనీరు నింపి, ‘నాయనా, నీ కెపుడైన అవసరమువచ్చిన వ్రాయుము. తగిన సాయముజేయుదు’నని జెప్పెను. తదనంతరము నేను సమీపమందలి పట్టణము జేరుకొంటిని.”

ఇచట గద్గదకంఠుఁడై బెనర్జీ కుర్చీలోకూలఁబడెను. తిరిగి అతికష్టముతో యిట్లు ప్రారంభించెను. “కొన్ని సంవత్సరము లేదోపనిచేసి పొట్టకూటికి సంపాదించుకొంటిని. నా కిరువదియవ వత్సరమున నాజీవితమింతియే ననుకొంటిని. నా చదువు శరణాలయము విడిచినతోడనే ముగిసియుండెను. యమునమాత్ర మపుడపుడు తన విద్యనుగురించియు, తా నింకను చదువబోవు కళాశాలవిద్యనుగూర్చియు పలుమారు వ్రాయుచుండెడిది. వ్యాకరణయుక్తముగా నాల్గుముక్కలు వ్రాయుటకు నాకు చేతగాకుండుటచే నే నా ఉత్తరములకు జబాబివ్వ సిగ్గుపడుచుంటిని. కాని వ్రాయక యుండజాలనైతిని.

“ఈరీతి అజ్ఞానాంధకారమునఁబడి యీ నికృష్టజీవితమును గడుప నిచ్ఛగించనైతిని. ప్రత్యేకముగనైన విద్య నేర్చుకొనదలంచితిని. నే నంతవఱకేమియు ననుభవింపలేదు. కాని విద్యావంతులై పెద్దమొత్తముల సంపాదించి సుఖపడుచుండు గౌరవనీయుల సంఘములోనికి జేరుటకై ప్రయత్నింపగోరు నాశ నన్ను విడువదయ్యెను. నా బాల్యకాలమున ధనవంతులపిల్ల లనుభవించునవి గల్గకపోయినను, నా కుమారునికైన యొకప్పు డవి గల్గజేసినచో ధన్యుఁడ నగుదునని యెంచితిని. నా కుమారుఁ డపుడెట్లుండునో యాలోచింపసాగితిని. వానికి గావలసిన వస్తువుల గొనియిచ్చుట, సంతోషపెట్టుట, అతఁడు నా కుమారుఁడని మురియుట—ఇంతకంటె నాకు గావలసిన దేమి. ఏమి? ఇవన్నియు విని నన్ను పిచ్చివానిగా దలంచుచున్నావా?” అని నావంక దిరిగి ప్రశ్నించెను.

# స్వయంకృతాపరాధమా!

అప్రయత్నముగ నా నోటినుండి "లేదు. అది సిచ్చితలంపని నే ననుకొనుటలేదు. చెప్పుము" అని వెలువడెను.

"మంచిది. దీని తరువాత చదువనారంభించితిని. చదువుకొరకై నా కర్చులను తగ్గింపవలసి వచ్చినందున చవుకగదికి నివాసముమార్చి, దినభోజన కర్చు గూడ తగ్గించితిని. ఇప్పటికి నాకు కొంచమాశ చేకూరెను. పండుకొను కటికనేలగాని, తిను అరగడుపు భోజనముగాని, దినమంతయు పనిజేసినందున అలయు శరీరస్థితిగాని నాకు దోచలేదు. నేను భావికాలపు తలంపులలో జీవించుచుంటిని. నాకు రానున్న మంచి స్థితిని దలంచుకొనుటే కష్టముగనుండెను. యమునకు వ్రాసితిని. దాని కామె సంతోషముగ బదులు వ్రాసెను.

"ఈ మధ్యకాలములో నొకమారుమాత్రమే యమునను జూడగల్గితిని. అపుడామె కలకత్తాయందుపాధ్యాయనిగాబోవుచు నన్ను మార్గమధ్యమున జూచివెళ్లెను. అపుడామె ఆకారమందును నడవడికయందును ముందుకంటె మనోహరముగనుండెను. నా కృషియంతయు నెప్పటికైనను యమునను వివాహమాడవలయుననెడి యాశపైననే!

"తరువాత నొకసంవత్సరమునకు నా చదువు ముగించి యచట నీ యుద్యోగమున జేరితిని. చేరి యమునకు నా విషయమును వ్రాసి, నాస్థితి కొంత బాగుపడువఱకు వేచియుండి వివాహమాడగలవా యని వ్రాసితిని. ఆమెయిచ్చిన ప్రత్యుత్తరమే నా జీవితములను నిల్పినది. నేఁ డదిగూడ నాకు దక్క లేదు."

"ఏమి! ఆమె యిపుడు నిరాకరించినదా?" అని నే నాతురతతోఁ బ్రశ్నించితిని.

విచారముతో నాతఁడు "నాజీవితమున కింకను ఆశగలదేమోయని యున్నదంతయు వెచ్చించితిని. బాల్యమునందు నా పోషణమునందు గల్గిన లోపమును, చదువుతోపాటు సంపాదనకై బడిన పరిశ్రమయు నన్నింతకు దెచ్చెనని వైద్యులు ఘంటాపదముగ జెప్పుచున్నారు. ఇది నా దురదృష్టముగదా" యని నవ్వఁదొడగెను.

"నేను తప్పక కొంతకాలమునకు మృతినొందెదనని తెలిసికొంటిని. నే ననుభవింపదలంచిన నెల్లను మిగిలిన కాలములో ననుభవింపదలంచుట నీకిపు డుచితముగా దోచుచున్నదా? నీ వింకను పెక్కుసంవత్సరములు క్షేమముగా జీవింపనున్నాడవు. ఆ జీవితమంతయు నా యధీనమని యనియుంటివిగదా! ఆ జీవితమునం దొక్కసంవత్సరము నాకు దయయుంచి యివ్వఁజాలవా?" అని ప్రార్థనాసూచకముగ జూచెను.

చకితుఁడనై లేచి నిలువబడితిని. ఇంతవఱ కాతని కథయందు లీనమై మాకు రానైయున్న యపాయమును గుర్తెఱుఁగనైతిని.

"బెనర్జీ! నీకు సాయము జేయుదు"నని సానుభూతితో నిండిన హృదయముతో నిట్లంటిని. "నా దగ్గర ఎక్కువగ ధనమున్న యిచ్చియుందునుగాని వేయిరూపాయలుకూడ లేవు. నీ వొకసంవత్సరమని యనుచుండుటవలన నీకు బదులుగా నన్ను శిక్ష ననుభవింపమని నీతలంపైయుండు ననుకొనెదను. శిక్ష ఎన్నిసంవత్సరములు వేయుదురో దెలియదుగదా! అది తలంప వీలులేనిది. నా కది సాధ్యముగాదు."

"ఒకక్షణముండు"మని వారించుచు నాతఁడు తన వ్యూహము వివరించెను. ఆతఁడు ఇనుపపెట్టె దెరచు మార్గము వ్రాసికొన్న సమాచారము నేను దాచినచో నాకు శిక్షగాక తప్పదు. నే నావిధముగ నా నిర్దోషత్వమును నిరూపింప మిక్కుటముగ ప్రయత్నింపనిచో నాకు శిక్షగావచ్చును. శిక్షవేయుట ముగిసిన తరువాత తన దోషమును తా నొప్పుకొనుచు బెనర్జీ అధికారులకు వ్రాయును. బెనర్జీ స్వర్గస్థుఁడైన తరు

వాత అది వెల్లడియగును. మృత్యుశయ్యపైనుండి నేరస్థులు తమదోషము లొప్పుకొన్న నిర్దోషుల కెందరికో ముక్తిగలిగినది. నా కా కాలము దుర్భరమైయుండును గాని, ఒక సంవత్సరములో నంతయు ముగియును.

ఇది యాతని వ్యూహము. అది యట్టుగాక, అతఁడేమివచ్చినను దాచిన ధనమును బైటబెట్టనని వచించెను. ప్రాణమన్న నాతని కొక లెక్కగాదు. ఈ యనారోగ్యస్థితిలో దానిని త్వరగాముగింప పట్టుపట్టుటలో సందేహములేదు.

నిరాశతో నావైపు జూచుచు బెనర్జీ "నా కెపుడును అదృష్టముపట్టలేదు. అది యిపు డస్తగతమైనది. నీ కెపుడును అదృష్టపురోజులే. గనిలో ప్రేలుడుగల్గిననాఁడుగూడ నీ కదృష్టముపట్టినది. నేనిపు డింకొక గనిలోనున్నాను. ప్రేలుడుపదార్థము నా క్రిందనున్నది. దానికి నిప్పుగూడ ముట్టింపబడినది. అది యీరాత్రికి ప్రేలుటో ప్రేలకుండుటో నీపై నాధారపడియున్నది" అని ముగించెను.

నిశ్శబ్దముగా నాతనివంక జూచితిని. నిజమే! ఆతఁడు ధనమును దాచినచోటు దెలుపకనే ప్రాణముల వీడగలఁడు. అతని కా నిశ్చయమున్నదనుటలో సందియములేదు. నే నంగీకరించినను ఆతని దోషమునకు నేను బాధ్యుఁడగానోపను. 'నా' యనువారెవరును లేనందున ఆతఁ డడిగినదానికి నే నొప్పుకొన్నను, దానివలన నెవరికిని కష్టము గలుగదు.

ఒకటిగ పట్టుకొనియున్న యాతని బలహీనపు చేతులపై నాదృష్టి బరుగిడెను. ఆ చేతులేగదా నాకును మృత్యువునకును మధ్య నుప్పనిక్షణముల కాల మున్నపుడు నిచ్చెననందించి నన్నపాయమునుండి గాపాడినవి! ఆసమయములో నాతఁడు నాజీవితములో నొకసంవత్సరకాలము గోరియుండినచో—

"బెనర్జీ! నే నంగీకరించితిని. నీ కోర్కెప్రకార మాచరింతును" అంటిని.

కంఠమును సవరించుకొనుచు నాతఁడు తనముఖమును చేతులతో గప్పుకొనెను.

తేరుకున్న తరువాత బెనర్జీ తన అపరాధమునంతయు నొప్పుకొనుచు నొక ఉత్తరమువ్రాసి దానికి ఇనుపపెట్టె దెరచుమార్గమును వ్రాసియుంచుకొన్న బిల్లును జేర్చి నాకిచ్చెను. నేను దాని నతికించి, సీలు వేసి, దానిపై బెనర్జీ వ్రాసినట్లు "నా యనంతరము శా. చిత్తరంజనునకు" అని వ్రాసితిని.

దీనిని భద్రముగా దాచుట చాల దుర్ఘటము. పోలీసువారు మమ్మిరువురను శోధింతురు. అది యమున హస్తములందుండువేని మంచిదని యామె నామమును సూచించితిని. మొదట బెనర్జీ యంగీకరింపఁడయ్యె గాని, తుద కొప్పుకొని, కలకత్తాయందున్న యమున కొక యుత్తరము వ్రాసెను. దానిలో నాతఁడు నాకు బాకీపడినాడనియు, సీలుజేసిన కవరునందుండునది బాకీపత్రమనియు, అతనివద్దనుండి రెండు మాసములకాల మెపు డుత్తరములు రాకుండునో, అపు డాకవరును నా చిరునామాకు వెంటనే పంపవలయుననియు వ్రాసెను.

కాని దీనిని పోస్టుచేయుట దుర్ఘటమనిపించెను. అపుడే తపాలు కొనిపోవువాఁడు దూరమున వచ్చుచుండుట కిటికిమూలగున జూచి అతఁడు ద్వారకు ముందు వచ్చుసరికి మావద్దనున్న ఉత్తరము కవరు కొంతపైకము తలుపుక్రిందనుండి బైటికిజరుపగా నాతఁడు దానిని సంతోషముతోఁ దీసికొని వెళ్లెను.

మే మనుకొన్నరీతి నన్ను నిర్బంధమునందుంచిరి. ఇంకపైనవచ్చు నాకథ జెప్పుటకు చాలకష్టము. నే బెనర్జీ యపరాధఫలిత మనుభవించుట కంగీకరించితిని గాని, ఆ హస్తకంకణములు, ఆ చీకటికోణములు, ఆ యమభటులు, ఆ యవమానము ఊహించియుండలేదు. నాశిక్ష కొంతకాలమే యైనందున భయములేదు. నాలో నేదియో దీనిని ప్రతిఘటించుచుండెను.

# స్వయంకృతాపరాధమా!

నే లొంగలేదు. కారణమేమి? ప్రేలుడు మధ్య నుండి తనప్రాణములను లెక్కింపక నను గాపాడ ప్రయత్నించుటకు బెనర్జీకెట్టి ధైర్యస్థైర్యము లుండి యుండవలయును! నే నతనిని ఒకసంవత్సరము శిక్ష నుండి గాపాడుటకు నా కట్టి ధైర్యస్థైర్యము లక్కర లేదా? నే నతనికంటె తక్కువ రకమని యనిపించుకొందునా?

న్యాయస్థానమునందు నా యభియోగముపై విచారణ జరిగెను. నే నదివఱకు కలలోగూడ తలంపని విషయములన్నియు నా ప్రవర్తన మంచిదిగాదని నిరూపించుటకు చేకూర్పబడెను. నా ప్రవర్తనవిషయమై యితరుల సదభిప్రాయముల దెచ్చియుందును గాని నా వాగ్దానము ననుసరించి నే నేమియు వాదింప దలంచుకొనలేదు.

నే నెట్టి పొరపాటుగావించితినో యేడు సంవత్సరముల శిక్ష తలపై నిడుకొని కారాగృహము ప్రవేశించినపుడే తెలిసికొంటిని. కాని నిగ్రహమువహించి యుంటిని. ఎంతకఠినముగా గన్పించినను, నేననుభవించు కష్టము ఋణముదీర్చుకొని కృతజ్ఞతజూపుటకే యని ఎంచినపుడు నాలో నొకవిధమగు సంతోషము ధైర్యము పొడచూపెను. ఈ ధైర్యము కడపటివఱకు నను వీడలేదుగాని, సంతోషముమాత్రము చచ్చిపోయెను. కఠినమగు కారాగారనివాసము—అచటి నిర్బంధనలు, సహవాసము అనాదరణ,—అనుభవించిన సంతోష మెన్నఁడో మాయముగాకుండునా? అంతియగాక నాల్గుగోడలమధ్య బంధింపబడుట తలవని తలంపుగా నీశిక్ష యనుభవించుట, మనిషిని మార్చివేయగలవు. నే నావిషయమై యెక్కువబాధపడలేదు. శిక్షణ నా కనుభవైకవేద్యమే కాని యిట్టిదిగాదు.

ఒక్కొక్కమాసము గడచుచుండ విమోచనము దగ్గరించెనని యెంచుచుంటిని. కాలము జరుగు కొలది నూతనజీవితమున కలవాటుపడి పూర్వసంగతులను గూర్చి విశేషముగా చింతింపమానితిని.

రెండవ సంవత్సర మారంభమయ్యెను. విమోచనము సమీపించినదని యెంచితిని. ఏ నిమిషమైనను నాకు విమోచనము గలుగవచ్చును. ఆతురత భరింపరానిదయ్యెను. మరునెల, లేక రానున్న వారమున, లేక రేపె, మరునిమిషమె నా విముక్తి అను విషయము తప్ప వేరొకటి నే నాలోచించుటలేదు. ఈ ఆలోచనలతో రాత్రులంతయు జాగరమే. మరల నాలుగుమాసములు గడచెను. నా విమోచన మిపుడు తప్పక గల్గవలయును. ఐదవమాసము ఘోరయాతనతోఁ గడచెను. ఆరవమాసముగూడ గతించెను. రెండవ సంవత్సరము ముగియవచ్చెను. ఇపుడు నాకు విమోచనము గల్గునను నాశాజ్యోతి క్రమక్రమముగా క్షీణించి గాఢాంధకారము ప్రబలఁజొచ్చెను. నా విముక్తికై గావించుకొనిన యేర్పాటునందే పొరపాటు గల్గినది.

ఈతలంపు నా మనోవీథిని ప్రత్యక్షమైన రాత్రి నాకు నరకయాతన ప్రారంభమయ్యెను. అంతవరకు నే ననుభవించుచున్నది శిక్ష గదని యెంచితిని. ఇపుడది నిజమగు శిక్షయైనది—శరీరమంతయు చెమటపోసినది. అనంగీకారసూచకముగా గట్టిగా నరవవలయునని యనిపించెడిది—దుర్భరము. నాది పిచ్చితనము. నేను నిర్దోషిని. నన్ను బంధించు నినుపయూచల చేతులతో నూడబెరికి స్వాతంత్ర్యమునకు న్యాయమునకు దారిజేసికొందును! రాత్రియంతయు నీ వేదనతో మేల్కొనియుంటిని. ఎంతటి తెలివిహీనుఁడనై యంధుఁడనై వర్తించితిని! నా బుద్ధిమాంద్యమునకు నాకే కోపము వచ్చెను. కాని నా విమోచనమునకు గావలసిన యేర్పాట్లన్నియు జేసికొనియేయుంటినే. ఉత్తరము గూడ పోస్టుచేసితినిగదా? ఈవిషయమున పొరపాటెందులకు గలుగును?

బెనర్జీ జీవించియుండగూడదా! ఈతలంపు మనోవీధిని మెరసెను! ఇంకెన్ని సాధ్యములుగావు? అతఁడు తా నపహరించిన ధనమును తన జీవితమును కాపాడునేదేని యొకచికిత్సకై వెచ్చించియుండగూడదా? తరువాతనేమి? యమునకు ప్రతిమాసము ఉత్తరములు వ్రాయుచుండును. అంతయు నిట్లయియుండును. వేరుగా జరిగియుండదు. కోపముచే నా శరీరమంతయు నుడికిపోయెను. బెనర్జీని చూర్ణము గావింప నా హస్తము లాతురతపడుచుండెను. నేనాతని వృత్తాంతమంతయు బైటపెట్టి సాహసించితినిగాని, వానితోజేరి యపరాధము జేసినారందురేమోనని విరమించితిని. నేనుత్తమకులసంభూతుఁడను; ఉత్తమాదర్శములగలవానిని. ఆతఁడన్ననో హీనకులజుఁడు. హీనాశయములు గలవాడు. అట్టివాని జీవనమును పొడిగించి యాతని దుర్మార్గములకు ప్రోత్సాహము గల్గించితిగదాయని మరల రక్తము వేఁడెక్కెను.

దినములు క్రమక్రమముగా గడచుచుండెను. నా తలంపులన్నియు బెనర్జీపై కేంద్రీకరింపబడియుండెను. ఆతఁడొకవేళ జీవించియున్నను నేను నిర్దోషినని యెఱింగియు, నన్నింతబాధ ననుభవింపజేసి జీవింప హక్కు గల్గియుండెనా? అప్పటి కిది రెండవ దొంగతనముగాదా? అదియును బలవంతముగ నా సుఖజీవితము నపహరించెనుగదా!

చావలేదుగాన జీవించుచుంటిని. నేవిద్యావంతుఁడనైనందున ఐదవ సంవత్సరము నాకు కారాగార కార్యాలయమం దొక యుద్యోగిగాచేసిరి. నాకు కొంచము శాంతి యేర్పడెను. ఐననేమి? బైటి ప్రపంచము నా దృష్టినుండి మరిగిపోయినది. బెనర్జీపైన యాగ్రహముమాత్రము దినదినాభివృద్ధి గాంచుచుండెను. నా సత్ప్రవర్తనచే నాకు త్వరగా విముక్తి గలుగునని దెలియును. వెంటనే బెనర్జీచేతను వడ్డితో గూడ తీర్పవలయును. కాని నా కతఁడగపడునా? కాకేమి? ఎచటదాగినను పట్టుకొనకమానను. ముందు బ్యాంకిలోనున్న వేయిరూపాయలును, నూతనముగా నేర్చుకొన్న చేతిపనులును నాకు సాయపడును. తరువాత! ఆతని మెడ నా చేతులమధ్య నలిగిపోవలసినదే!!

ఏడవ సంవత్సరారంభమున నాకు విడుదల యయ్యెను. వెంటనే యమున ఉపాధ్యాయినిగానున్న కలకత్తాకు ప్రయాణమైతిని. ప్రపంచము, ప్రకృతి, మానవులు నాకు చిత్రముగ దోచెను. సంవత్సరములుగా యంత్రమువలె యాజ్ఞలప్రకారము వర్తించుచుండిన నేను సజీవమగు ప్రపంచములో స్వాతంత్ర్యముతో సంచరించుటను ప్రారంభించినపు డెట్లుండునో వర్ణింపఁజాలను.

యమున ఆచోటు విడిచి సంవత్సరములు గావచ్చిన ట్లచటి వ్రాతలు జూపుచుండెను. అచటి పాఠశాలాధికారిని విచారింప నాతడు యమున 1927వ సంవత్సరమున బెనర్జీ యను యువకుని వివాహమాడి ఆచోటును వీడెనని వచించెను.

నా మనోభావముల నతికష్టముతో దాచితిని. నరకయాతన ననుభవించి యతనికి ధనము దక్కునట్లు జేయగా వారిరువు రిట్లు సౌఖ్యమనుభవించుచు, దన్నా నరకకూపమునందే వీడిరా! ఎంత నీచులు! నే నెంత తెలివిహీనుఁడను!!

ఆ పాఠశాలాధికారి తదుపరి యమున సమాచారము తమ కేమియు తెలియలేదనియు, ఆమె వివాహానంతరము పాట్నాకు తన భర్త ఆరోగ్యమునకై వెళ్లునట్లు జెప్పినరీతి జ్ఞాపకమున్నదనియు, అచట కామె యుద్యోగమునకొఱ కొకరికి సిఫారసుగూడ జేసియుండెననియుఁ జెప్పెను.

కోపముతో శరీరమంతయు వణకుచుండ వెంటనే పాట్నాకు బైలుదేరితిని. ఆదినమే పాట్నా జేరుకొని యొక హోటలునందు బసచేసితిని. సామానుగూడ విప్పకనే యమునను వెదుక బైలుదేరితిని. ఏలన

# స్వయంకృతాపరాధమా!

అచట జేరినతరువాత యేమిజరుగునో నే నెఱుఁగుదును. నా సామానుతోఁగూడ నన్ను పోలీసువారు నా స్వస్థానమునకు బంపుదురు. కావున మూటవిప్పిన మరల గట్టుకొనవలయును గదా!

టెలిఫోనుపుస్తకమం దతనిపేరు గలదేమోయని వెదకితిని. ఆశ్చర్యము! నా కది దొరికెను. 45, బాగ్ బజారు! ఒక కుఱ్ఱవాని సాయమున ఆ యిల్లును గన్గొంటిని. అది నా బసకు చాలసమీపముననే యుండెను.

నే నాయింటిని సమీపింప వేయు ప్రతియడుగుతోఁగూడ ఉద్రేక మధికముగాఁజొచ్చెను. ఇంటిని జేరితిని. అది యంత పెద్ద యిల్లుగాదు. ద్వారము జేరి తలుపుతట్టితిని. నాకు రక్త ముడుకుచుండెను. లోపల పదముల చప్పుడు. ద్వారము తెరచుకొనెను. సుమా రారు సంవత్సరముల బాలుఁడు నన్ను తదేకదీక్షతోఁ జూచుచు వాకిట నిలువఁబడెను.

"బెనర్జీఉన్నాడా?"అని ఆతురతతో యడిగితిని.

"అవునండి" అని సిగ్గుతో నతఁడు ముఖమువంచి జవాబిచ్చెను.

పైకుబుకుచున్న కోపావేశము నతికష్టముతో నణచుకొని "నే నతనితో మాట్లాడవలె" నంటిని.

ఆశ్చర్యమును ప్రకటించు దృష్టులతో నావంక జూచుచు, "ఎందుకండీ! నేనే బెనర్జీని" అని యాతడు నింతగా బలికెను.

నే నెంత నిగ్రహము జూపదలంచినను, "ఏమీ! నీవా బెనర్జీవి" అను మాటలు నోటినుండి వెలువడెను.

"బెనర్జీ! వారెవరు" అనుచు నొకస్త్రీ తలుపు పూర్తిగా దెరిచి వాకిట నిలువబడెను. ఆకనులు—ఆముఖము—నాకు ఆమె యమునయని చెప్పక జెప్పుచుండెను.

అంత టామె "బెనర్జీతో మాటలాడ దలంచిన లోపలకురారూ"అని ప్రార్థనపూర్వకముగ నడిగెను.

మంత్రముగ్ధుడనై లోపలి కరిగితిని. లోపల గృహమందలి యేర్పాటులన్నియుఁ జక్కగనుండెను. నే నాసీనుఁడనై, "అమ్మా, నే మాట్లాడదలంచుకొన్నవాడు మీ భర్తయైయుండునని తలంచుచున్నా"నని నస్పష్టముగ నంటిని.

ఆమె ముఖము వివర్ణమయ్యెను. తన దృష్టి నచటనున్న తన కుమరునిపై నిల్పి, "అమరనాథబెనర్జీ (తన కుమారుఁడు) నాలుగుమాసముల శిశువైయున్నపుడే నా భర్త గతించెను" అని విచారముగ ప్రత్యుత్తరమిచ్చెను. కొంతవఱ కెవరేమియు మాట్లాడలేదు. నేనుమాత్ర మగాధమునబడిన ట్లూహించితిని.

"నా పేరు చిత్రరంజన్. ఇదివఱ కెపుడైన విన్నారా? మీభర్త నా కేదైనపత్ర మిచ్చిపోయినాడా" అని తిరుగ ప్రశ్నించితిని.

"ఔ"నని జెప్పి నాకు దానిని తీసికొనివచ్చుటకు వెళ్లెను. కొన్నినిముషములలో దానిని దెచ్చి, "నా భర్త మా వివాహమునకు కొన్ని వారములకు ముందు నాకీ కవరుపంపి, అందున్నది మీకు వ్రాసియిచ్చిన బాకీపత్రమనియు, తన యనంతరము దానిని మీకు పంపవలయుననియు వ్రాసెను. ఆతఁడు స్వర్గస్థుఁడగుటకు పదిదినములకు ముందు నాతో మీరు ముందుచోటు వీడి యెక్కడికో వెళ్లినారనియు, వచ్చువఱకు యీపత్రము నావద్దనే యుంచుకొని మీ కివ్వవలసినదనియు జెప్పి యీ యుత్తరముకూడ యిచ్చెను. మీ రీ యుత్తరము జదివి మీ కది తృప్తికరముగనున్నదేమో యెఱుఁగగోరెదను. ఏలన నే నిపుడు పెద్దఋణభారమును వహింపజాలను. అట్లు జేసిన నా పుత్రునిజీవిత మధోగతిజెందును" అని ఆ యుత్తరమును కవరును నాకిచ్చెను.

నా కొక వెఱ్ఱినవ్వు వచ్చెనుగాని, దాని నాపుకొని నాబసకు తిరిగివచ్చితిని. అచట సీలుజేయబడిన కవరు జింపిచూడ బెనర్జీ తన యపరాధము నొప్పుకొనుచు వ్రాసిన ఉత్తరము మునుపున్నట్లేయుండెను. తరువాత నాతని యుత్తరము దీసితిని.

అందలి సంగతు లివి. విడువడినవెంటనే యాతఁడు యమునకు జెప్పి ప్రపంచయాత్ర జేయదలంచుకొని యామెయొద్ద సెలవుగైకొన వెళ్లెను. ఆతనిస్థితి నామె విలోకించి, యతని యవసానకాలమున తానతని సేవజేయ నంగీకరించుటకును, నతని నామె

జ్ఞాపకముంచుకొనుట కొకమార్గమును గల్గించుకొనుటకును ప్రార్థించెను. దానివలన నామెకు కలుగు కష్టము లాతఁ డెఱిఁగియు తన జీవితములో ప్రతిక్షణము వాంఛించినదగుటచే నామెను వివాహమాడెను. కాని పుత్రోదయమగునని తెలిసిన పిదప నాతని స్థితి మారిపోయెను. అతఁ డడిగినపుడు నే నెందుల కా సంవత్సరకాలమివ్వ నిరాకరింపనైతినని యాతఁడు చింతించెను. క్రమక్రమముగ నాతని కవసానదశ దగ్గరించుచుండెను. తన యపరాధఫలితము తనకుమరునిపై బడునుగదా!

యమునవద్దగల ఒప్పుదల ఉత్తరమును చింపివేయ దలచెను గాని యమున నీచస్వభావములకు లొంగునది గాదు. అది యప్పుపత్రమనికదా యామెకు జెప్పబడినది. ఇపు డప్పుదీర్చినట్లు సాక్ష్యముజూపని దామె దానిని చింపనివ్వదు. సత్యము జెప్పుటకు బెనర్జికి ధైర్యముచాలదు.

పుత్రుఁ డుదయించెను. అతనికి శిక్ష పూర్తి యయ్యెను. ఏ పుత్రునికై ప్రపంచములో సర్వసౌఖ్యములు గలిగింప యువ్విళ్లూరుచుండెనో ఆతని కిపుడిచ్చుట కేమియు లేకపోగా, పైగా తండ్రి జేసిన యపరాధకళంకము మాత్రము మిగిలినది. కర్తవ్యమేమి?

తన వాగ్దానము తప్పుట విశ్వాసఘాతకమనియు ఘోరపాపమనియు నతనికి దెలియును. కావున పుత్రుని కీప్రపంచమున గావలసినంత ధనమైన నిచ్చి వాగ్దానము నెరవేర్తమని తిరిగి రాగిగనుల కాతఁడు ప్రయాణమయ్యెను. ఏలన తాను దొంగలించిన ధనములో కొంతమాత్రము దీసికొని మిగిలినదంతయు నచటనే దాచివెళ్లియుండెను. ఇపుడు తన శరీరపరిస్థితియైనను జూడ కచటికివెళ్లి దాచిన ధనముకై వెదుకగా నది యెవరో కనిపెట్టి దొంగలించియుండిరి! ఇక ఆతనిస్థితి వర్ణనాతీతము. అపు డతఁడు తన వాగ్దానము చెల్లింప బూనుకొన్నచో పుత్రునిగతి దుర్భరమగును. తనతోగూడ తన సంసారము కూలిపోవును. కావున నాకష్టము, నాశిక్ష, నాయాతనకంటె యతని శిశువును గాపాడుటే ముఖ్యమని యాతఁడు దలంచెను.

ఏడు సంవత్సరముల తరువాత నతని భార్యాపుత్రుని జూచినపు డేమి జేయుదునో యతఁడు దలంపలేదు. కాని యాతని తుదిప్రార్థన యిది, నే నత్యంత దయాపరుఁడనై యాతనికి సాయముజేయ, నాతనికి బదులుగా శిక్ష ననుభవింపపూనుకొన్న అంగీకారమే బాలుని జీవితమున కాధారము. అట్టివానిని తండ్రి జేసిన తప్పులకై హానిజేయక మన్నింపవలయును.

ఉత్తరము నాచేతులనుండి క్రిందబడిపోయెను. నే నట్లే యచ టెంతసేపు గూర్చొనియుంటినో తెలియదు. నే నేడు సంవత్సరములక్రింద గావించిన తీర్మాన మింతకు దెచ్చినది. నేను బెనర్జికి నాజీవితమున నొక సంవత్సరకాల మిచ్చుట కంగీకరించినపుడే అతఁడు జేయువాని కన్నిటికి బాధ్యత వహించినవాని నైతిని. దానికి తరువాత నే నెంత పశ్చాత్తాపమైనను బొందవచ్చును. బెనర్జీ నీచుఁడైన గావచ్చును. తాను బైటనున్నకాలము నా సాయములేక తా నేపనినైన గావించియుండగలఁడా! నిజమే, అతనివలన నే కలలో గూడ తలంపని కష్టములఁబడితిని. నాజీవితము ధ్వంసము జేసికొంటిని. కాని యిదంతయు స్వయంకృతాపరాధమే గదా!

ప్రశాంతుఁడనై లేచితిని. నే నింక యాతని యపరాధమును బైటపెట్టజాలను. దానికి సందేహము లేదు. నా తెలివితక్కువవలన గలిగిన పాపము నారేండ్ల చిరుతనిపై బడుచుండ జూడజాలను. నే గావించిన దాని కాతఁడు బాధ్యుడుగాడు గాని, ఆతఁ డీ ప్రపంచములోనికి వచ్చుటకు నేనుగూడ కొంచము బాధ్యత వహించియుంటిని. నే నతని కొకవిచిత్రమైన తండ్రి నైతిని. కావున నాచేతనైనంతవఱ కాతని సుఖపెట్టవలసినది నాబాధ్యత.

ఆతని కా సమాచారము తెలియకయుండవచ్చును. నా కది తెలిసినందున జైలునం దనుభవించినదాని నంతగ గణింపలేదు. ఈతనికిజేయు సహాయ మింకను గొప్పదగు త్యాగమును గోరుచున్నది. ఇది గౌరవనీయమైన త్యాగముగదా!

ఇపుడు నే నొక బీదవానిని. స్వయంకృషిచే పొట్టపోసికొనుచు కాలము గడుపుచున్నాడ. ఇపుడు జీవితము నాది; స్వాతంత్ర్యము నాది; యోగ్యత నాది; ఇవియేగదా ఉత్తమమానవుని ఆస్తిపాస్తులు.

(ఒక ఆంగ్లకథ ననుసరించి చ.రా.)

# అచ్చులపాటివారి యిళ్లల్లో పునస్సంధాన కార్యాలు

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

వ్యాకరణద్వీపాగ్రహారములో బ్రాహ్మణులకు ముఖ్యముగా అచ్చులపాటివారికి ఆ సంవత్సరమొక క్లిష్టసమయముగా పరిణమించినదనగానే మనమందఱము వారికి సానుభూతి చూపించకుండ నుండజాలము. అచ్చుల పాటివారి ఆడపిల్లలు పెండ్లిండ్లయినతరువాత రజస్వలలై పునస్సంధాన కార్యాలు మిగిలిపోయినందున వారి పరిస్థితులు ఆగ్రామములో చాల పిడ్డూరముగా లోకులు చెప్పుకొనునంతటివఱకు వచ్చివేసినవి. కాబట్టి ఆకన్యలకు కార్యము లెంత త్వరగా నిశ్చయపరచిన నంతశ్రేయస్కరమనుమాట వారి తల్లిదండ్రులు గమనించి పొరుగూరి కాపురస్థులైన అక్షయ సిద్ధాంతి గారికి కబురంపినారు. కబురందినదో లేదో కాని ఆమరునాడే అక్షయసిద్ధాంతిగారు వ్యాకరణాగ్రహారములో ప్రత్యక్షమైనారు. అందుచేత ఆయనకు నా గంతుక బ్రాహ్మణుడను పేరొకటి వాడుక పైరైపోయినది.

ఆయన ముహూర్తాలు పెట్టుటకు ఆలోచనచేయ నారంభించెను. ఆయన మాత్రమేగాక ఆగ్రామస్థులలోని మఱికొందఱు సిద్ధాంతులు కూడా వారితో సంప్రదించిరి. వారికిని అక్షయ సిద్ధాంతికిని మధ్య కొన్ని సంజ్ఞలు నడిచినవి. సంజ్ఞాప్రకరణము పూర్తియైన వెంటనే పునస్సంధాన (సంధి) ప్రకరణమునకు ప్రవేశించిరి.

ఆసంవత్సరము కార్యము కావలసిన బాలికల పేర్లు పాఠకులు తెలిసికొన గుతూహులురై యుందురని నేను వేరుగా వ్రాయనక్కరలేదు. కావున వయస్సును బట్టి వారిపేర్లు వరుసగా నిచ్చుచున్నాను మొదటి కన్యపేరు అత్తిమ్మ, రెండవదాని పేరు ఇత్తిమ్మ, మూడవ దానిపేరు ఉత్తిమ్మ. వారి భర్తల నామములను కూడచెప్పి అసలుకథ నడిపించుతాను. ఆగర్భాధానపు ముగ్వురి పెండ్లికొడుకులపేళ్లు వరుసగా అచ్చయ్య, స్వరయ్య మాష్టరు ప్రాణం. ఆ కన్యకలకు వారొనర్చు పునస్సంధాన ముహూర్తాలు ఒక్కనాడే ఆరంభమైనవని చెప్పినచో మీకందఱకూ నాశ్చర్యముగా దోపవచ్చును. కాని యీ వ్యాసారంభములో నేను సూచించిన క్లిష్టసమయ మిదియేయని మీరు తెలిసికొనగలరు. అయితే పునస్సంధాన కార్యాలు మాత్ర మొకటే లగ్నమందు జరుగును కాని వారి కథలు మీకు చెప్పవలెననగా ఒకటి తరువాత మరొకటి చెప్పవలసినదే కదా! కావున నేటి యీ వ్యాసములో అత్తిమ్మ గారి గర్భాధానపు ముచ్చట్లు ఆయూరి

అమ్మలక్కలు చెప్పుకొన్నవిధముగా మీకు బహిరంగపరచుట అసభ్యముగా నుండునేమో యన్నశంక నాకు గలుగకపోలేదు కాని యీకథ చదువ నిష్టపడిన ప్రతి స్త్రీ వ్యక్తియు తమయొక్క గాని పరాయిగాని మగవాళ్లెవరును లేకుండ చదివి ఆనందించి ఆడుపిల్లల యాత్మగౌరవమునకు భంగము కాని విధముగా బ్రవర్తిల్లెదరను దృఢ విశ్వాసముతో స్త్రీ ప్రపంచమునకు తెలియ జేయుచున్నాను.

## మొదటి రాత్రి

అత్తమ్మ గర్భాధానము నాటిపగలు దంపతులు పీటలమీద కూర్చుండి పురోహితులు నడిపించిన మంత్రతంత్రముల ననుసరించినందున నాటి శుభకార్యములోని పూర్వభాగమున క్రమముగా గడచిపోయినది. రాత్రిభోజనానంతరము శోభనాలగది చక్కగా అలంకరింపబడి గర్భాధానపు పెండ్లికుమార్తెను పెండ్లికొడుకును సుఖ శయ్యాసనమున జేర్చునప్పటికి సుమారు పదునొకండు గంటలైనది. అప్పటికిప్పుడే పేరంటాండ్రందఱు వచ్చివేసినారు. వారితో నిండి యాశోభనాలగది కిటకిటలాడిపోవుచు ఒకవింతశోభ కలిగించుచు ముత్తైదువులకు కన్నులపండువుగ నుండెను.

అత్తమ్మకు సిగ్గు తలమునకలైనందున తలవంచుచునే యుండెను. అచ్చయ్యగడుసు వాడుగను తమలపాకులకిల్లీలు మార్చుకొను సమయమునందు తమలపాకులబోలు మరేవియో కొన్నియాకులు తెచ్చి అత్తమ్మకియ్యగా పేరంటాండ్రబలవంతము పైన సత్యము నిత్యమనుకొని అత్తమ్మవానిని గ్రహించినది. అట్లాబలవంతము పెట్టిన అమ్మలక్కలు ఎవ్వరనుకొన్నారు? వెంకమ్మ (వెంక + అమ్మ), రామక్క (రామ + అక్క), ముమ్మడయ్య (ముమ్మడ + అయ్య) అనువారలే. వీరే నిత్యమంగళి పాడుచుండగా ఆమ్రేడితమ్మయను సాలెపడుచుకూడ మంగళహారతి పట్టుకొని వారి రాగములో తనరాగము కలిపినది. అంతట ముత్తైదువ లందఱు తమతమ గృహములకు వెళ్లిరి.

## రెండవ రాత్రి

రెండవనాడు రాత్రిగడుసు పెండ్లికొడుకు అచ్చయ్య చేసిన వేళాకోళాలను అత్తమ్మ వైపువారు పట్టుబట్టి కొన్ని నిషేధాలు గనుపరచినారు. అవియేమనగా పెండ్లికొడుకు పెండ్లికుమార్తెను వేళాకోళము చేయునప్పుడు పూర్వపు నాటిరాత్రిరీతిగా సంస్కృతములో (తత్సమంగా) మాట్లాడకూడదనుట యొకటి, స్త్రీ వాచకము గౌరవమైనది గనుక అదియు కూడదనుట రెండవది; సంబోధనయనగా పేరుపెట్టి పిలుచుట తమ యింటి సాంప్రదాయమునకును హిందువుల సాంప్రదాయమునకును విరుద్ధమాట చేనదియు కూడదనుట మూడవది; అవధారణగా (అదేధోరణిగా) మాట్లాడుట కాలెత్తి త్రివేసి నడచినట్లుండును గావున అదియు గూడదనుట నాల్గవది. ఈ విషయ

ములో మీకును మాకును జరుగు వివాద ములలో సంధికుదురదని అత్తమ్మగారి వైపు ఆడవాండ్రందరు పట్టుపట్టి అచ్చయ్య ఆడుబంధువులకు ఖచితముగా చెప్పివైచి నారు. అంతట అచ్చయ్యవైపు ఆడ చుట్టాలు "అట్లా అస్పష్టముగా చెబితే మాకు తెలియదు. నిదర్శనపూర్వకంగా చెబితేనే మేము వింటాము లేకపోతే మా అబ్బాయిని తీసుకొని మేము వెళ్లిపోతా" మని అన్నారు. అదివిని అత్తమ్మ బంధువులు ఇచ్చిన యీ క్రింది ఉదాహరణములతో కొంత కాలక్షేపము జరిగినది.

(1) "మొదటిరాత్రి మనమంతా ఇక్కడ ఉన్నవారమే కాబట్టి తత్సమంగా మాట్లాడ కూడదన్నది మీకును మాకును స్పష్టమే కదా ?

(2) "రెండవదంతగా గౌరవముగా (కష్టంగా) ఉండదు కాబట్టి మేము చెప్పుట గాని మీరు వినుటగాని అంత మంచిదిగాదు. పెండ్లికొడుకు, అత్త ఇదిగో అంటే అత్త యిదిగో ఆనుమని నిర్బంధముచేస్తే అత్త గారు నిషేధించుట యేమి యాశ్చర్యము?

(3) "అత్తమ్మా! ఇదిగో నీకు ఢిల్లీనుండి కిల్లీలు తెప్పించాను అని అనడానికి అత్త మ్మిదిగో నీకు ఢిల్లీకిల్లీలని అనగూడదు." (అట్లంటే పెండ్లికొడుకు అత్తమ్మా! యిదిగో నీకు అని సాగింపవచ్చునా అని అడిగేడు) కూడనిదానికి నాల్గవ ఉదాహరణం వినండి. పెండ్లికొడుకు అత్తమ్మనుచూచి పురాణాల లోని ఆడవాళ్లవలె నాకు పుత్రసంతాన మిమ్మని నీవ—అడుగకూడదని భార్యతో చెప్పకూడదంటే అచ్చయ్య నీవయడుగ కూడదని యనెదను లేండియని అత్తగారి వైపు నిషేధానికి తలదాల్చినాడు. కాబట్టి యిది మాకు నిష్టమే."

ఇట్లేవియో వియ్యపురాండ్రకు నడిచిన సంజ్ఞ అర్థముగాక అప్పటికింకా నిలిచి యున్న బంధువులు ఆశాభంగముతో నుండి పోవలసి వచ్చినది. సంజ్ఞాప్రకరణమైన తరు వాత సంధిప్రకరణముండుట సహజమేకదా!

మూడవనాటిరాత్రి వికల్పముగా ఒక వంతు నడచినది. అదెట్లైనను నందఱు గ్రహింపగలిగియే యుందురు.

మూడురాత్రులు నిద్రలైన తరువాత కొంత అన్యవిధముగా గూడ జరిగినదని చెప్పినచో బహుళముగా జరిగినదని మీ రందఱు గ్రహించియేయుందురు. కావున అత్తమ్మ పునస్సంధానకథా కథనము నేటికి ముగించివేయుచున్నాను.

---

# కీ॥ శే॥ గొట్టుముక్కుల మంగాయమ్మగారు

జె. మోహనరావుగారు

ఈ సుగుణవతి శ్రీమంతులైన గొట్టుముక్కుల నాగయ్యగారి కడసారి ముద్దుబిడ్డ. స్థానికసంస్థలలో సభ్యులైన శ్రీ వెంకన్నగారి ప్రియసోదరి. హరిజన కవియైన శ్రీ పోలుకొండ భద్రయ్యగారి శిష్యురాలు. త్యాగధనులైన శ్రీ తాడిమేటి కుటుంబశాస్త్రిగారి యభిమాన హరిజనసోదరి. సేవాధురంధరులైన శ్రీ ఉన్నవలక్ష్మీదంపతుల నికేతనపు దత్తపుత్రిక.

వయస్సును మించిన ప్రతిభ, కాలమును మించిన భావములు, శక్తికిమించిన సాహసము, పెద్దలను గౌరవముతో వంచగలనేర్పు మంగాయమ్మకుగల సుగుణములు. శ్రీమంతుల యింట కడగొట్టుబిడ్డయగుటచే ఆమె కడుగారాబముగ పెరిగినది. దగ్గర సంబంధము చెడిపోవునెడి ప్రేమచే తల్లిదండ్రు లామెను బలవంతముగ నొకనికి వివాహముచేయ యత్నించుటతో ప్రారంభమైనది యామె విషాదాంతజీవితనాటకముయొక్క ప్రథమాంకము. ఆవివాహసమస్య విడగొట్టుటకై యామెచేసిన ఉపవాసములు, వ్రతములు వర్ణనాతీతములు. ఆ క్లిష్టపరిస్థితులనుండి బయటపడుసరి కామెకు తలప్రాణము తోకకువచ్చినది.

ఇంతలోనే శ్రీ శారదానికేతనములో విద్యార్థినిగ చేరుటకు ప్రయత్నించినది. కడగొట్టు ముద్దుబిడ్డకై ప్రేమసాగరమున నోలలాడు తల్లిదండ్రు లందుల కియ్యకొనరైరి. వెంటనే మంగాయమ్మ రెండవ యగ్నిపరీక్షకు గురియైనది. ఆ దినములం దామెజేసిన యుపవాసములు, సల్పిన ఘోరతపస్సు చూపరులను దిగ్భ్రమజెందించినవి. ఈ రెండవ యగ్నిపరీక్షయే నేటి యామె భూగర్భప్రవేశమునకు మూలకారణమైనది. రజస్వలయైన యాసమయములోనే ఆమె జేసిన ఘోరమైన యుపవాసములు వికసింపనున్న ఆమె అవయవములను ముకుళింపజేసినవి. దానితోనే ప్రారంభమైన యీ భయంకరవ్యాధి నెవరును గమనింపలేదు.

తుదకు శ్రీ శారదానికేతనమునందు చేరి శ్రీ దేశోద్ధారకుని సహాయమున చదువుకొన ప్రారంభించినది. ఉన్నవలక్ష్మీదంపతుల కనుసన్నలమెలగి వారి ప్రేమను సంపాదించినది. ప్రతి వత్సరము పరీక్షల యందు గెలుపొంది బహుమతులను సంపాదింపసాగినది. దీనినంతయు జూచి మాలపల్లి గ్రంథమునందు సృష్టించిన "జ్యోతి" నేడు తన యాశ్రమమునందు చేరినదిగదాయని శ్రీలక్ష్మీనారాయణగారు, ఆమెను నికేతనమునందు చేర్పించుటకై పలుశ్రమలుపడిన శ్రీ కుటుంబశాస్త్రిగారు, ఆదిలో అమెకు విద్యనేర్పి మార్గముజూపిన శ్రీ భద్రయ్యగారు మొదట విద్యకు పోవలదని పట్టుబట్టిన తల్లిదండ్రులు ఇంకొక సంవత్సరములో విద్వాన్ బిరుదునంది యువతిసంఘము నలంకరింపనున్నదని అంద రెదురుచూడసాగిరి. భళీ! యని హరిజనసంఘము చంకలు కొట్టుకొనసాగినది.

ఇట్లందరు ఒకదారికి వచ్చుసరికి ఆమె వేరుదారి పట్టినది. నా డంకురించిన వ్యాధి విషమించినది. ఆమె యారోగ్యము పూర్తిగ చెడిపోయి పిచ్చిలోనికి దిగినది. చికిత్స లాభము లేకపోయినది. తిరిగి స్వగ్రామముచేయుటకై ప్రయాణము చేయుచుండగ, దారిలో, పరాయిదేశములో కటకటా!! గోదావరి రైలు స్టేషనులో ప్రాణములను బాసినది.

కాటికి కాళ్లు జాచుకొనియుండు సమయములో ఇంతకుముందే నలుగురు పుత్రికలను గోల్పోయిన ఆమె తల్లిదండ్రు లిపు డీ యైదవమరణమువల్ల నెంత దుఃఖించుచున్నారో! ఎవరు వర్ణించగలరు?

శ్రీ ఉన్నవలక్ష్మీనారాయణ పంతులుగారు ఆదర్శప్రాయముగ 'మాలపల్లి'లో తాను సృష్టించుకొనిన 'జ్యోతి' ఆనాడు కృష్ణవేణీ తరంగములపాలైనది. ఆ జ్యోతిని మించిన యీ హరిజన 'జ్యోతి' నేడు గౌతమీగోదావరి పులినతలములపాలైనది.

ఇపుడు వారి మన స్సెట్లుండునో!!!

సోదరి మంగాయమ్మ ఆత్మకు శాంతి కలుగుగాక!

# * పంజాబు యువతుల సంసార పద్ధతులు

శ్రీమతి అల్లాడ రామఅహల్యాదేవిగారు

నేటికాలమున ఆదేశము ఈదేశ మను విచక్షతలేకుండా అన్ని దేశములు నాగరికతా పిశాచమునకు అధీనములయినవనుట నిర్వివాదాంశము. బియ్యేలు ఎమ్మేలు ప్యాసయి స్త్రీలు పురుషులు పూర్వాచారముల బుగ్గిచేసి నవీనపథముల సంచరించుచున్నారు. అట్టి నవనాగరిక యువతులను గుఱించిగాక, పూర్వాచారములు పాటించుచున్న పంజాబు యువతులగూర్చి ఒక్కింత వ్రాయబోవుచున్నాను.

సంసారమునకు వినాయకునిపూజ వివాహము. వీరిలో పెండ్లికి ముందర కొన్నివారములనుండి చుట్టుప్రక్కల స్త్రీలెల్లరు, కాబోయే పెండ్లికుమార్తె యింటికి రాత్రులందు పోవుచు, అత్యంతహర్షమున పాటలు పాడుచుందురు. పెండ్లి యనుమాట యెంత పురాతనమైనదో ఈ పాటలుకూడ అంత పురాతనమైనవని కొందరి అభిప్రాయము. ఈపాటలు దంపతుల భావిజీవితములపై తమ ప్రభావము చూపించునని వారి నమ్మకము. ఇంతేకాక వివాహసందర్భమున ద్వివిధములగు పాటలు పాడబడును. ఇవి 'సుహాగ్', 'ఘోరియన్' పదములు. 'సుహాగ్' పదములు పెండ్లికుమార్తె యింటిలోను, 'ఘోరియన్' పదములు పెండ్లికుమారుని యింటిలోను పాడబడును. ఇచ్చట ఒక 'సుహాగ్' పదము భావము వ్రాయుచున్నాను.

ఎచ్చట
అత్తగా రుత్తమురాలో, మామగారు గౌరవనీయుడో అట్టిచోట ఓతండ్రీ! నన్ను కట్టిపెట్టిన నీకు శుభ్రయశము చేకూరును!

ఎచ్చట
అత్తగారు పెక్కుబిడ్డల మాతయో, వారి వివాహాది శుభకార్యములు తరుచుగా నా చేతిమీదుగా జరుగునో, అట్టిచోట, ఓతండ్రీ! నన్ను కట్టిపెట్టినచో నేను నిరంతరము ఆనందసాగరమున తేలి యాడుచుందును!

ఎచ్చట
పెక్కు పాడిపశువు లెల్లప్పుడూ పాలిచ్చునో, పాలు పితుకుట, వెన్నతీయుట నాకు నిత్యకృత్యమో, అట్టిచోట, ఓతండ్రీ! నన్ను కట్టిపెట్టిన నీతనయ అదృష్టవంతురాలగును!

ఎచ్చట
అగసాలివాడు నా కొలువుసేయ సిద్ధముగానుండునో, దినదినమూ వింత వింతల ఆభరణముల ధరించుచుందునో, అట్టిచోట, ఓతండ్రీ! నన్ను కట్టిపెట్టుట నీ పవిత్రవిధి!!

---

* దేవేంద్ర సత్యర్థి మహాశయుని ఆంగ్లవ్యాసము ననుసరించి.

పిమ్మట పెండ్లికుమార్తెను పల్లకిలో కూర్చుండబెట్టి పెండ్లి జరుగుచున్న యింటికి పంపింతురు. ఈ సందర్భమున 'డోలీ–డీ–గిట్' పదములు పాటబడును. డోలీ అనగా పల్లకీ. ఇచ్చట వధువు మిక్కిలి విచారించును. పదిపదారు వత్సరములనుండి సుఖముగా వసించుచున్న పితృగృహమును, చెలికత్తెలను, ఉద్యానవనములను వీడి నూతన ప్రదేశముల ప్రవేశించుటకు కొలదిగా మనసు కుందుచుండును. 'స్త్రీలు పిచ్చుకలవంటివా' రను అభిప్రాయ మిచ్చట సరిపోవును. ఎన్నడూ కనివిని యెఱుగని క్రొత్తప్రదేశములోని నూతనకులాయమునకు వధువను పిచ్చుక బయల్వెడలుచున్నది. అనంతరము కూతు నత్తవారింటికి పంపించువిధి తండ్రిదై యున్నది. ఇచ్చట వధువు తద్దయు వాపోవుచుండును. ఈ సందర్భమున తండ్రి సమాధానపఱచుచు, కొలదిగ క్రూరముగ వర్తించును. అనగా వాపోవుట కవకాశమీయక పంపివేయజూచును (ప్రేమలేక కాదు, విధిలేక). పిల్ల అత్తవారింట ఉన్నంతవఱకు (క్రొత్తలో) అక్కడకు కావలసిన వస్తుసామగ్రి పంపుట తండ్రి విధియైయున్నది.

మనలో గృహస్థులు సంక్రాంతి పండుగకు తమ ఆడుపిల్లల నత్తవారింటినుండి తీసికొనివత్తురు. అచ్చట శ్రావణమాసములో, 'తైటాజ్' పండుగులకు తీసికొని వత్తురు. అత్తింటినుండి పుట్టింటికి ఆడుపిల్లలందరు ప్రసన్నముఖములతో వచ్చు రోజులవి. తమతమ పూర్వనెచ్చెలులను కలసికొని క్షేమముల వినుచు, తెల్పుచు, అత్యంతానందముతో ఊయెలల నూగుచు, సంతోషముగా కాలమును బుత్తురు. ఈసమయమున 'గిధా' నాట్యమును సల్పుచు, నిజమృదుమధుర గొంతులతో పాటలు పాడుచుందురు. తలిదండ్రులచే నింకను ఆహ్వానింపబడకపోవుటచే 'వర్షాకాలము దాటిపోవుచున్నది కదా' యని ఆడుపిల్ల లత్తవారింట విచారించుటయే ఈ పాటలందలి భావము. మనలో వసంతకాల మెంతగా కొనియాడబడునో వారిలో వర్షాకాల మంతగా కొనియాడబడును. ఆ ఋతువందలి మేచకాభ్రములను కనుగొనినంతనే మయూరములపగిది అచ్చటి ముగుదలు హర్షపులకాంకురితలయి ఆటపాటలతో విహరించుచుందురు.

ఎవరింటనైనను పుత్రోద్భవమైనచో చుట్టుప్రక్కల స్త్రీలెల్లరు కొన్నిరోజులవఱకూ నిత్యమూ విచ్చేసి పాటలు పాడుచుందురు. వీటినే 'హోలారు' పదములందురు. 'హోలా'రనగా చంటిపిల్లవాని కర్థము. పిల్లవాడు కృష్ణదేవుడుగా భావింపబడి గౌరవింపబడును. ఈయదనున పాడు పాటలో గర్భవేదన పూర్తిగా వర్ణింపబడును. 'ఎందుకు గర్భము దాల్చితినా' యని ఒకానొకతరుణి వాపోవుచున్నట్లు చిత్రితమైయుండును.

మొత్తముమీద వారి జీవితమంతయు సంతోషపూరితము. ఏదియో నెపము కల్పించుకొని వారు ప్రతిసందర్భమునను పాటలు పాడుకొనుచు ఆనందమున నోలలాడుదురు.

# రాధాకృష్ణ

శ్రీమతి రాజేశ్వరిగారు

రాధ ఇల్లు. నాలుగిళ్లభవంతి పెద్దపెరడు. పెరట్లోని చిన్నపువ్వులవనం వొకవైపు గచ్చునుయ్యి. నాలుగుప్రక్కల ఆర్చికట్టిన చుఖవపందిరి. ఒకప్రక్క గోవులసాల. సాలనిండా ఆవులూ పెయ్యలు కలసి మెలసీవుంటాయి. రాధ ఆవుపాలు తీస్తున్నాది. అప్పడే కృష్ణుడు వీధితలుపు దడదడకొట్టి పిలుస్తున్నాడు.

రాధా! రాధా!

.............

ఓ అత్తా! అత్తా!

.............

యేవమ్మా అత్తా!

యెవరుమీరు పేరులేదూ.

నేను కృష్ణుణ్ని. తలుపుతియ్యి.

తీస్తానుండు.

వేగం తియ్యత్తా.

అలాగు పిలుస్తే నే తియ్యను.

మరేలాగత్తా.

.............

అత్తా అని పిలవనా?

.............

ఓ రాధా!

యేం ఇంతసేపూ అలాగు పిలవలేవూ?

మరచిపోతానత్తా.

మళ్లా అలాగే?

లేదత్తా.

నాతో మాట్లాడకు.

కోపంవచ్చిందా రాధా?

................

నేను మంచివాణ్ని కానూ రాధా.

................

నా జట్టువుండవూ రాధా.

................

పోనీ నేను వెళిపోతాను రాధా.

వద్దు కృష్ణా. నాకు కోపములేదు. వెళిపోకు.

మరి ఇంతసేపూ యెందుకు మాటాల్లే.

వుట్టినే. నువ్వు నన్ను రాధా యని యెందుకు పిలవ్వు. అత్తాయని పిలుస్తే నేను పలకను. అత్తేమిటి కొత్త చక్కగా రాధాయని మంచి పేరుండేను. నన్ను రాధా అనే రోజు పిలువు.

రాధా! అమ్మ నన్ను ఇక్కడికి రావద్దంది రాధా.

యేమీ యెందుకు రావద్దంది?

వూళ్లోవాళ్లంతా రోజూ నిన్నూ నన్నూ వెక్కిరిస్తున్నారట. అమ్మనిచూసి నవ్వుతున్నారట. అంచేత రావద్దంది రాధా.

నీవు రాకపోతే నాకీ ప్రపంచం ఎందుకు కృష్ణా. నీవులేని బ్రతుకు నిష్ఫలమేకాదా. నీవు యే దినమునుండీ ఇక్కడకు రావో చెప్పు. కృష్ణా! ఆ దినమే నా భారమైన జీవనము సుఖముగా చేసు చేసుకొంటాను. నా శరీరము వేరుగావుండుటచే అమ్మ నిన్ను రావద్దని ఆజ్ఞపెట్టింది. నీలో లీనమయిన నన్ను వేరుచేయువారు యెవరు కృష్ణా. నిన్ను ఇచ్చటకు రావద్దని చెప్పుటకు మీ అమ్మకు నేను యేమి అపకారముచేసినాను? ప్రపంచమును మనము మెప్పింపగలమా? అమ్మ రావద్దన్నదని నీవు రావా యేమి. కృష్ణా మాట్లాడవు. నిన్ను చూడని కన్నులు ప్రపంచమును యెట్లు చూడగలవు?

లేదు రాధా. ఆమె అటుల చెబుతుందని చెబుతున్నాను కాని నేను రానన లేదు. నిన్ను చూడక నేను ఒక్కనిమిషమైననూ గడుపలేనని నాకు తెలియదా రాధా. నాపై నేల లేనిపోని నిష్టూరాలు. రాధా ఆకలేస్తోంది రాధా. చూడు, కడుపు యెలాగు యేడుస్తోందో. నీకు జాలిలేదూ నా

మీద. పోనీ రాధా. అయితేను నేను వెళ్లిపోతాను. నాకు ఇక్కడేకాని ఇంటిదగ్గిర పాలు సాయించవు రాధా. ఇయ్యవూ. అంద రిండ్లలోను నేను పాలు దొంగతనంగా తాగుతానని అమ్మతో చెప్పేరు రాధా. ఇందాకాను కామాక్షీవాళ్లునూ. వాళ్లు వెళ్లిపోగానే అమ్మ నన్ను కొట్టింది రాధా. నీతోనామీద యెవరు యేమి నేరాలు చెప్పినా నీవు నన్ను యేమీ అనవు రాధా.

అబ్బా, ఇంతసేపూ ఆలోచించి యెంత కొంటె ప్రశ్న వేసేవో, నిజంచెప్పితే నా కేమిటిస్తావో చెప్పు.

యేమిటిస్తాను రాధా. ఒక్క ముద్దుయిస్తాను రాధా.

అబ్బా, రెండు ముద్దులు ఇస్తే చెప్పతాను. ఇస్తావా కృష్ణా.

మెల్లిగా పెట్టుకుంటానంటే ఇస్తాను రాధా.

అమ్మకు నిన్ను తన అదుపుఆజ్ఞలలో వుంచుకుందామని కోర్కె. నాకేమొ నిన్ను పూజిద్దామని. నీ కోర్కెలు యెటువంటివయినా నెరవేరుద్దామనీ. నీవు లేని జన్మ నిరర్థకమనీ నేను తలుస్తాను. నీవు పరమేశ్వరుడవని నాభావన. కలలోనైనా నే సేవచేయుటకే నా హృదయము పరుగులు పెట్టుచుండును. నీవే నా తల్లివి. తండ్రివి. భర్తవు. దేవుడవు. కృష్ణా! మీ అమ్మ చాల అదృష్టవంతురాలు. యెల్లప్పుడు ఆమె కండ్లయెదుటనే నీ వుందువు. రోజునకు రెండు మూడుసార్లు నాకు ముఖము చూపించుటకు యెంతో మురిపించుచుందువు. కృష్ణా! యెంత నిర్భాగ్యపు బ్రతుకు నాది.

రాధా ఆకలేస్తోంది రాధా. పాలు ఇయ్యవూ. మళ్లా అమ్మకూడా వస్తుంది రాధా. అమ్మవస్తే లేవని చెప్పు. ఇంటిదగ్గిర పాలు అమ్మ తాగమంటుంది రాధా. ఇంటిదగ్గిర పాలు నాకు సాయించవు రాధా.

పద పెరట్లోకి పాలుతీసి వలకబోస్తాను.

యేం,రాధా నా కియ్యవూ. వొలకబోస్తావు. నా కియ్యవూ పాలు. రాధా చెప్పవూ?

యెక్కడా నీ చిన్న బొజ్జలో వలకపోస్తాను పద.

............

అబ్బ కదపకు రాధా. పాలు ఒలికిపోతాయి రాధా.

............

అబ్బ! వేడిగా వూపిరి సలుపనియ్యవు రాధా.

............

అమ్మ ముద్దు పెట్టుకుంటే చల్లగావుంటుంది. నువ్వు పెట్టుకుంటే వేడిగావుంటుం దేమీ రాధా.

అన్నా యెప్పుడూ ఇలాంటి ప్రశ్నలే నువ్వు వేస్తావు.

రాధా.

..........

ఓ......రాధా.

రాధమ్మా.

.........

కృష్ణాదాంగో.

.........

వోయి. వాస్తున్నా. వుండండి.

రాధా! కృష్ణుడు వచ్చేడా.

ప్రొద్దుటినుండీ రాలేదోదినా.

వాడితో సాలలేకుండా వున్నానమ్మా.

చిన్నపిల్లడు మనమే అలాగు అంటే యెలాగు చెప్పండీ.

యేమయినా రాధా, నీకు కృష్ణుడంటె చాల ప్రేమ. వాణ్ని యెప్పుడూ వెనకేసుకొనే మాట్లాడుతావు. ఇక్కడికీగాని వస్తే ఇంటికిపంపు.

ఆలాగే లెండి.

.........

బాగా చెప్పేవత్తా.

............

రాధా దాగుడుమూతా లాడుకుందాం.

కృష్ణా, నా దేముడు యెవరూ?

నేనే రాధా!

# భారతవనిత

మద్దూరి అన్నపూర్ణయ్యగారు

ఫలముగోరక సేవించు పరమబుద్ధి
శ్రేష్ఠతమమని కృష్ణుడు చెప్పెగీత
హింసభావప్రవాహంబు నింకజేసి
ప్రేమజ్యోతిని బుద్ధుడు వెలుగజేసె
ఒక్కచెంపనుగొట్ట వేరొక్కచెంప
నివ్వవలెనంచు దెల్పెను యేసుక్రీస్తు
శస్త్రమేల సత్యాగ్రహ అస్త్రముండ
విశ్వకళ్యాణమొనగూడు ప్రేమవలన
ధర్మమిదియని మోహనదాసుదెల్పె
సకలమతములబోధల సారమిదియె
కాని లోకవర్తనమున గానరావు
స్వప్నసౌధములియ్యవి చాలుచాలు
అమలుజరుపంగ నెప్పుడు నలవికాని
బోధలెందుకు జనులకు పుడమియందు
విపులగంభీర సిద్ధాంత వితతిజూచి
రమ్యపదముల సౌందర్యరాశిగాంచి
మోహమొందుచునున్నారు మూర్ఖులంచు
తలచుచుండంగ భారతతరుణినాకు
స్ఫురణకొచ్చెను హృద్వీధి మెరపుమెరయ
పందయైనను కేవల పశువుయైన
వలుపుతనమీద నిల్పిన నిలుపకున్న
తిట్లుదెబ్బలు నిత్యము తినుచునున్న
వారకాంతలగూడుచు భర్తతన్ను
ముప్పుతిప్పలబెట్టుచు మోదుచున్న
కాంతుకుశలమెగోరును కాంతసతము
సాటియెవ్వరు భారతిసతికి భువిని?
గర్భమందున నున్నట్టి యర్భకుండు
భద్రమొందుట కెన్నియో బాధలంది
వెలుగుచూచినదాదిగ వెలదియెపుడు
బిడ్డసేవయె సల్పును ప్రీతితోడ
పాటపాడిన నదిబిడ్డయాటకొరకె
పాటుపడెనేని పసికూన బాగుకొరకె
నోమునోచిన తనపాప సేమమునకె
వ్రతముబూనిన తనయుని ప్రతిభకొరకె
ఏమియాచించిచేయును లేమయిట్లు
ప్రేమయే దివ్యఫలమిది ప్రేమకంచు
నెమ్మనంబున జింతించు నీలవేణి
స్వార్థమెరుగని ప్రేమను చాటగోరి
బ్రహ్మసృష్టించె భారతవనిత నిలను
కానిచో గీతపుక్కిటి గాథయంచు
బుద్ధదేవుని బాధ లబద్ధమంచు
క్రీస్తునుడువులు వ్యర్థపు కీసులంచు
గాంధియోగీంద్రు వచనముల్ కల్లలంచు
బ్రువ్వదిట్టరె! జనములు పృథ్వియందు?
కాంతుడాజికిబోవంగ కాంతయేగె
పురుషుడడవికి వెడలంగ పొలతిపోయె
తండ్రితగదన్న యోధుని తరుణిగోరె
సత్య, సీత, సంయుక్తలు స్వచ్ఛకీర్తి
సర్వకాలములందున సకలజనులు
గానమొనరించి చూపరె! గౌరవంబు
పాతకథలేల భారతమాతగొల్వ
భర్తవెన్నంటి జైలుకు భార్యచనియె
ఆర్యనారీమణికి ప్రేమ మారుపేరు (?)
అట్టిపతిశుద్ధ జీవినిబట్టికొంటి

దాస్యకూపమునందున ద్రోసినీవు
చిందులం ద్రొక్కుచున్నావు చేటుమీర
పురుషనామము నీకేల భరతపుత్ర!
మూడువేళలయందును ముసుగునేసి
రాణివాసములందున రవ్వగొట్టి
బాధలంబెట్టిననుగూడ భవ్యమైన
దేశస్వాతంత్ర్యరణమున దివ్యసేవ
చేసిరక్షించె తుర్కీని చెలియకాదె!
ఘోరబానిసయైయున్న గృహిణికాదె
విప్లవంబును రేగించి పెల్లగించె
జారు సామ్రాజ్యవృక్షముల్ జనులకొరకు
కార్మికులయొక్క రాజ్యంబు కాంతయొక్క
త్యాగఫలమని తేలెను ధరణియందు
సాత్త్వ్యమునుగోర రష్యాను సంతసమున
చూచిపొందుము శాంతియు సుఖమునీవు
సర్వసమతను స్థాపింపశపథమూని

స్వేచ్ఛనెలకొల్ప విప్లవచిచ్చురేపి
ప్రాఁసుజగమున మిక్కిలి ప్రణుతికెక్కె
సున్నయచ్చోట సత్వముల్ సుదతికిపు
ఓటుహక్కైన లేదిప్పుడువిదకచట
స్వార్థమను పేరు నరునకు సార్థకంబు
స్వేచ్ఛకిరవగు నింగ్లాండు సీమయందు
స్త్రీలహక్కులుమొప్పనే స్థిరముదాల్చె
చెలులచెరబట్టి రచ్చట సిగ్గులేక
మగువకొరడాల చవిచూపె మంత్రికచట
బుద్ధివచ్చెను అప్పుడు పురుషులకును
సత్వగుణశీల భారతసాధ్వీగాన
కరకుతనమును జూపదు కానినీవు
న్యాయబుద్ధిని జేకొని నారికిలను
సర్వసమతను జేకూర్చి శాంతినొసగు
ఆర్యనామము నీకప్డు సార్థకంబు.

## "వేఁడుక"

ఏలేశ్వరపు వేంకటకృష్ణమూర్తిగారు

అమ్మ! యీనాఁడుసంవత్సరాదిగాన
హాయిగాస్నానమున్ జేసి యతిముదమున
నూత్నజాకట్టు, పరికిణీ, నూత్నటవలు
నేనుధరియించి నాఁదగునెచ్చెలులతో
కూడిసంతసమొందఁగా కోర్కెదీర
కొత్తచక్కెర, మామిడి కొత్తచింత
పండు, మొదలగు సరుకులుబాగుమీర
వేసిచక్కనిపచ్చడి వేఁడుకలర
చేసితిందును తోడి నెచ్చెలులఁగూడి
యనుచుదల్లితోఁజెప్పి నాయనుఁగుబిడ్డ
వేఁగదలస్నానమున్ జేసి వేడుకలర
క్రొత్తదుస్తులధరియించి గోటుమీర
జెల్లులబిలువంగ నేతెంచెఁజేతతాను

వెండికుంకుమ భరణితోవేఁడుకొప్ప
రమ్ముమాయింటికీవు పేరంటకంబు
యనుచుబొట్టెట్టి వారల నతిముదమున
బిలుచుకొనివారలంగూడి బలుముదమును
బొందుచును నింటికేతెంచి ముందుగాను
వారలకుఁదగిన మర్యాద వరుసవరుసఁ
జేసి కూర్చుండనియమించి శీఘ్రముగను
చక్కనైనట్టిపచ్చడి చాలఁజేసి
వారలకుఁజేతనైచివహ్వా యటంచు
పాటలనుఁబాడి తాంబూలపట్టినిచ్చి
సాగనంపెనుజెలులను సదయహృదయ
యెన్నసంవత్సరాదన్న యెంతోముదము
గాదె? పిల్లలకానంద గాథమునుఁగ॥

# బాల విజ్ఞానశాఖ

## దద్ధమ్మ

శ్రీమతి బుర్రా అన్నపూర్ణమ్మగారు

దద్ధమ్మఅంటే తల్లిదండ్రులు ప్రాణాలు విడుస్తారు. కాకిపిల్ల కాకికిముద్దన్నారుగా మరి. ఇప్పుడు పిల్లది వ్యక్తురాలైంది. సంబంధాలు చాలా వచ్చిపోతున్నాయి. చూపుకు గుజ్జులేనా బుర్రలో సరుకుతక్కువే అనుకొని ఒక్కరూ మగ్గేవాళ్లుకారు. ముసలివాళ్లుమాత్రం యెలాఅయినా ఎవ్వరిమెడకో చుట్టాలని ప్లానువేసేవాళ్లు. ఒకతూరి తల్లి అమ్మా "ఎవ్వరయినా పెళ్లిచూపులకు వస్తే మెత్తగా మాట్లాడవే అంది." ఆమాట మాత్రం గట్టిగా కొంగున ముడివేసుకు ఒక నిఖారుపైన సంబంధంవచ్చినప్పుడు "దూది, వెన్న, దున్నపోతుకన్ను"అని ఉపన్యాసం మొదలెట్టింది దద్ధమ్మ. అదివిని అదిరిపోయి వాళ్లు చల్లగా సర్దుకున్నారు. ఇంకొకమాటు తండ్రిదగ్గర పెట్టుకు "చిట్టితల్లీ అట్లాకాదు కొంచెంగట్టిగా మాట్లాడవద్దా" అన్నాడు. పిల్లది "అట్లాగేలెండి" అన్నది ఇంకొక సంబంధమువచ్చేసరికి దద్ధమ్మ తనసోది కదురు, వెదురు, కామాయినుదురు" అని మొదలెట్టింది. చూస్తూ చూస్తు ఎవ్వరు గోతిలో దిగుతారు గనుక సర్దుకున్నారు వాళ్లుకూడా. ఆనాటితో కొండమీది కోతిని తెద్దామనే వెంకన్న మంగమ్మ ఆశలడుగంటాయి. వెంటనే ఓగంతకుతగ్గ బొంతకిచ్చి కన్యచెర వదిలించుకున్నారు ఆదంపతులు.

పుల్లాయి దద్ధమ్మ యేదోవిధంగా బండి సాగిస్తున్నారు. ఓనాడుపుల్లాయి వూరికి వెళ్తూ "ఇదిగో నే వచ్చేతలికి చేనుకాడికి పోయి వరి కళ్లంచెయ్యాలి, పొద్దుగుంకే యాలకి నేనువత్తా"నన్నాడు.

కాని తాను తీసికొనిపోయిన తవిద రొట్టెతిని అక్కడే కుంభకర్ణునికి జాబు వ్రాసింది దద్ధమ్మ. సాయంకాలంవేళ పుల్లాయి చూడగానే వాడి కడుపులో మండింది. ఇంటిమొహంపట్టాడు. కొంత సేపటికి దద్ధమ్మలేచింది. వెంటనే చీకటి శ్రీ మహాలక్ష్మి ఆవరించింది దద్ధమ్మ తెప్పిరిల్లి తడువుకొంటూ యిల్లుచేరుకొని తలుపు తట్టింది. జవాబులా. ఇంతలోనే గాలిదుమారంకూడా తోడయింది. ఇల్లిల్లూ తిరిగింది కాని దద్ధమ్మ నాదరించేవారు కానరాలా! ఆనాటినుంచీ పుల్లాయి దద్ధమ్మల విషయం కథలు భారతాలు అయినాయి!

## అక్బర్ ఔదార్యము

శ్రీమతి డి. కమలావతికన్యగారు

అక్బరు చక్రవర్తి కేకారణముననో బీర్‌బల్‌పై యాగ్రహమొదవెను. ఆవులించిన ప్రేవులు లెక్కించ గల యాబీర్‌బల్ చక్రవర్తి చిత్తరీతిని మున్ముందుగనే గ్రహించి, కొన్నాళ్లు సభకురాకయుండి పిమ్మట యొక కుగ్రామమునకుబోయి తగినసమయమేతెంచు వఱకందే రహస్యముగా జీవింప సంకల్పించుకొనెను. కొద్దికాలమునకే క్షమాస్వరూపుడగు అక్బర్ కోపము శాంతించెను. భావగర్భితశృంగారవాగ్జాలము చేతను హాస్యప్రసంగముచేతను తన మానసాకాశమున విషాదమేఘములు బొడమకుండునటుల జేయుచుండిన వ్యక్తికొఱకు అక్బర్ పట్టుబట్టి వెదకింపసాగెను. ఎంతవెదకియు ఫలము గానరాకుండెను. చక్రవర్తి యేదో ప్రియవస్తువును పాఱవేసికొనినటుల విచార నిమగ్నుడయి యుండెను.

తుదకు తన యేలుబడిలోగల రాజ్యాధిపతులకెల్ల బీర్‌బల్ నిమిత్తము యాజ్ఞాపత్రములంపెను వెదకి దొరకినక్షణమున ఆలసించక తనసభకు బంపవలసినదని. లాభము లేకపోయెను. వానిజాడ యించుకంతైనను తెలిసినదిగాదు.

చతురోపాయములచే దప్ప బీర్‌బల్ బైటబడడని యూహించి చక్రవర్తి యొక యుక్తిబన్నెను. తన యధీనమందున్న రాజులకును సామంతరాజులకును లేఖలుబంపెను. వాని సారాంశమిటులుండెను. "మా సముద్రములకు జరుగనున్న వివాహమహోత్సవ వేడుకలలో పాల్గొనుటకు మీ సముద్రములను బంపవలసినది." రాజులు, ఉన్నతోద్యోగులు, సహోద్యోగు లెల్లరు యీవింత లేఖలంగాంచి దీనినెట్లు పరిపాలింపవచ్చునని యబ్బురపడసాగిరి. యేమిచేయవలెనో యెట్లు జవాబివ్వవలెనో తోచక తికమక పడసాగిరి.

తానున్న గ్రామోద్యోగుల యుబలాటమునెఱింగి ప్రచ్ఛన్నవేషధారియగు బీర్‌బల్ యా గ్రామాధికారి కడకుబోయి "యేలినవారు వినుటకిష్టపడిన యీ విపత్తునుండి మిమ్ములనెల్ల యుద్ధరింపగల మార్గమెఱింగించెద"ననెను. వానిపలుకులయం దంతవిశ్వాసము గలుగకున్నను, ఆమార్గమెఱింగింపుమని అచ్చట నున్నవారలతో తన్నుప్రార్థింప "యేమియులేదు. చక్రవర్తిగారికీప్రకారము బదులు వ్రాయవలెను. "మేము మా సముద్రములను బంపుచున్నాము. వానినెల్ల నుచితరీతిగా నెదుర్కొనుటకు మీనదులు బావులు సంసిద్ధముగా నుండవలెను."

ఈ సలహా వెంటనే యనుసరింపబడెను. అగ్బర్ చిఱునవ్వుతో యీవింతప్రత్యుత్తర మందుకొనెను. బీర్‌బల్ దీనికి మూలమని గ్రహించెను. తన్మూలముగా యాతడు దాగియున్న స్థలమునుదెలిసికొని, సభకు రావించిపూర్వప్రకారము గౌరవింప దొడగెను.

మఱొకసమయమున అక్బర్ చక్రవర్తి సభనలంకరించు గాయకులలో నొకడాతని కోపమునకు గుఱియయ్యెను. తనరాజ్యమును వెంటనే విడువవలసినదని చక్రవర్తి బహుకఠినముగా నాజ్ఞాపించెను. కొన్నాళ్లు జరిగినయనంతర మొకనాడు చక్రవర్తి అరణ్యమార్గమున యశ్వారూఢుడై వెళ్లుచుండ, తన్ను గాంచినంతనే యొక వృక్షము నారోహించుచుండిన నొక మనుజుడు గానబడెను. చెట్టునుసమీపించి పైకిజూడ భయముచే దానిశాఖలలోనికి జొచ్చుకొనిపోవుచున్న యానాటి శిక్షితుడైన గాయకుడు కంటబడెను.

"నీవింకను యిచ్చట యేలయున్నావు? నారాజ్యము విడువవలసినదని నిన్నాజ్ఞాపించియుండలేదా?" యని చక్రవర్తి యడిగెను.

"సార్వభౌమా! నేను ప్రపంచమంతయు జుట్టి వచ్చితిని. వెళ్లిన ప్రతిస్థలమందు, యీ రాజ్యమెవరి పరిపాలనమునకు లోబడి యున్నదని ప్రశ్నించుచూ వెళ్లగా 'అగ్బర్ చక్రవర్తి పాలనమున నున్న'దను జవాబే ప్రతిసారి యివ్వబడుచుండుటచే విసిగి యిక యీ భూమండలమున తలదాచుకొనుట యబద్ధమని తలచి యాకాశమండలమునకు బోవ నిశ్చయించితిని. నేటిదినము నాదీర్ఘప్రయాణముయొక్క మొదటిమజిలీ చేరితిననుట మీరే ప్రత్యక్షప్రమాణముగా జూచుచుంటిరి గదా!" యని యాదిట్టరి యాకొమ్మలందుండియే బదులిడెను.

చక్రవర్తి నవ్వి వానిని మన్నించెను.

ఆహా! నాటిచక్రవర్తుల హృదయము లెట్టిపదార్థములతో నిర్మితములయి యుండెడినో కదా!

('జ్ఞానరత్నములు' యను ఆంగ్లగ్రంథమునుండి)

# భక్తి

శ్రీమతి కోకా హనుమాయమ్మగారు

భక్తి అనగా ప్రతిమానవుని మనమున పుట్టుకతోనుండు భావోద్రేకము. దీనికి జాతి మత భేదములు వయోవస్థలు అనావశ్యము.

పసినిసుంగుసైతము జేజేకు (అనగా వారి బాలభాషలో భగవంతుఁడని యర్థము) దండముపెట్టుమనిన లేనవ్వుకళలీనుచుండ, అబ్బురపాటుతో తన చిఱుచేతులనొక్కపరి మోడ్చి నవ్వుకొనును. కారణము, తన చిఱుమానస వీధి నప్పుడప్పుడే మొలకలెత్తుచున్న భక్తిభావముయొక్క తొలిసూచన యదే; మఱియు నధమవర్ణ సంజాతులైనను తమకష్టసంజైక జీవనమునం దొక్కొక్కపరి స్వేదసంసిక్తదేహములతో, జీర్ణపుటములతో, దుర్గంధభూయిష్ట ప్రదేశములందే, కృపాసముద్రుఁడును, ఆర్తలోకరక్షాపరుఁడును, దీనజనమందారుఁడును, భక్తజన కల్పకమునైన శ్రీమన్నారాయణునిగుఱించి ధ్యాన సమాధిలో నిఱుక్షణములు తమ్ముదాము మఱచి యుందురు.

భక్తియను నీ భావము పుట్టుకతో గల్గినను అది కొందఱియెడల మొలకతో నశించును. మరికొందఱికి ప్రేళ్లు నాటియు పుష్పింపదు, పుష్పించియు ఫలమునకు రాదొడంగు సమయమున బ్రోడువారును. ఎవరికో పూర్వజన్మ సుకృతముగల ప్రాణికి తప్ప తదితర వ్యక్తులకు కొనవరకు చెక్కు చెదరక కుదిరి యుండుటకల్ల.

సంసారజలధిలో మునింగి దరిగానక కొట్టుకొనుచున్న ప్రాణికి భక్తి నిలచియుండుట దుర్ఘటము.

అది తనంతట రాదుగదా యొరులుయొద్ద నేర్చుకొందమన్నను శక్యము కాదు. ధనవంతులు దానిని ధర యిచ్చికొనెదమన్నను దొరుకదు కదా!

ఉ॥ అచ్చపుచీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుబుట్టుచున్ మరల చర్వితచర్వణులైన వారికిం
జెచ్చెఱబుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైన కానలకునేగిననైన హరిప్రబోధముల్

అని భాగవతమున చెప్పబడియున్నది. భక్తి వర్థిల్లుటకు సజ్జనసహవాసంబును సద్గ్రంథ పఠనంబును, గాన శ్రవణంబును మార్గదాయకములు. ఎట్టి మూర్ఖుఁడైనను, అరక్షణము సజ్జనగోష్ఠినుండెనేని, అమందానందంబుతో, పులకితదేహంబుతో హరికథనాలించి యాహా యనును. అట్టిది నిరంతర సహవాసంబున మెలంగెనేని హరిభక్తి నిస్సందేహము గల్గునని చెప్పనగును రెండవదిమఱియు నుత్కృష్టము కొలదికాలముననే సత్ఫలమొసంగును. మూడవదియునంతియే.

చాలామంది మూర్ఖులు భక్తియని పొరబడి తప్పుద్రోవఁద్రొక్కుచుందురు. అట్టివారిది మూర్ఖభక్తియని యనిపించుకొనును.

పైడాంబికములు వారివి యెక్కువ. అడుగడుగునకు స్నానములు తీర్థయాత్రలు జపతపములు శుచాశుచములు ప్రబలముగా నుండును. వారి ప్రౌఢతయు వృథాడంబరములతో, నిండియుండును. కాని నిర్మల మనముతో యేకోధ్యానముగా యొక అరక్షణమా శ్రీహరిని గూర్చి ధ్యానించి యెఱుంగరు. మీదు మిక్కిలి వారిచాదస్తమంతయు నిజమైన భక్తియేయని యుద్దేశించి, తమ కెవరైనా మందలింపవచ్చినచో కసరిగొట్టి వినిపించుకొనరు సరిగదా! మరియును విపరీత మునకు కడంగుదురు. భగవంతునికృపారసము పైఁజల్లుకొనుటకు నుపాయము నరయక యెచ్చటెచ్చటనోయున్న తీర్థస్నానములేల, దానవృథాప్రయాసంబును ధనవ్యయంబునుగాక మరియేమి వచ్చును. ధనికులకేగాని ఇతరులకసాధ్యమైన యీ యాత్రారాటముననే భగవంతుఁడు ప్రసన్నుఁడైనయెడల, పేదభక్తులగతి యేమికావలెను. వారి నిష్కళంకభక్తిపూరితాంతఃకరణము నిరాశాదగ్ధమై నశింపవలసినదేనా! నిండుమనంబుతో శ్రీహరిపాదసరోజములను నిజమానససరోవరమున పొడగాంచుచు సేవించు వారలే నిజమైన భక్తాగ్రేసరులుగాని, అందు కళక్తులై, యూరకపైడాంబికముల్ పచరించు వారిదొక భక్తియా? అట్టివారి హృదయ సారంగము హృద్గతముయిన హరిపాదసరోజ మకరంద మాస్వాదింపఁజాలక యిందునందు పరిభ్రమించి పాపపంకమున దగుల్కొను చున్నది. ధ్యానమే వరమైన గంగాస్నానమని యెంచి సుహృద్వరులు మెలగెదరు.

భక్తులలో నాలుగువిధములుగా గలరు. ఎట్లనగా గీతలో శ్రీకృష్ణుఁడు భక్తులభేదమును వివరింపుచు నిట్లనెను.

శ్లో॥ చతుర్విధాభజంతేమాంజనే సుకృతోర్జునా!
ఆర్తో, జిజ్ఞాసు, రర్థార్థీ జ్ఞానీచభరతర్షభ॥

తా॥ భరతశ్రేష్ఠుడైన ఓయర్జునా? ఆర్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని, అను నామభేదములచే నాలుగువిధములుగా నాభక్తులు నన్ను కొలుచుచున్నారు. అనిచెప్పెను.

ఆర్తుఁడు అనగా తనకేదైన యాపద వచ్చిన తద్విముక్తికై ఆపద్బాంధవునిగూర్చి మొఱలిడుచునది మొదలు భక్తుఁడైయుండు వాడు. అట్టి భక్తుఁడే గజేంద్రుఁడు.

(2)జిజ్ఞాసువుఅనగాభగవంతుఁడున్నాడా? లేడా? యను జిజ్ఞాసచే భగవత్తత్వమరయు దలంపుతో ధ్యాననిమగ్నుండువారు. అట్టివారెవరనగా మునీశ్వరులు.

(3) అర్థార్థి అనగా ఏదైనకోరికగలిగి యది సాధించు తలంపుతో నిత్యము హరిధ్యాన నిరతులులై యుండి సఫలమనోరథులైయ్యు తదనంతరము భక్తగణంబులో చేరుదురు. అట్టి భక్తుఁడే ధ్రువుఁడు.

(4) జ్ఞాని అనగా, నిర్వ్యాజభక్తిపూరితాంతఃకరణులును సంతత శ్రీహరిధ్యానలోలురునై ఇతరవ్యాసంగముతో నెట్టి జోలియులేక భగవంతుఁడును తానే తప్ప నన్యవ్యక్తితో సంబంధరహితుఁడై శ్రీహరిచరణామృతమే గ్రోలుచు శ్రీహరిధ్యానమే చిత్తవృత్తిగానెంచుచు బహిద్వృత్తితో



మిసర్సు. వి. పి. ఆదిశేషయ్యా,
వేలూరు, స్త్రీలక్లబ్బు కార్యదర్శిగా
నెన్నుకొనబడెను.



మిసర్సు ధర్మసిల లాల్ ఎం. ఎ.,
బి. ఏ. (ఆనర్సు, లండన్) బార్ అట్ లా,
పాట్నా. అఖిలభారత హైహాయిక్షత్రియ
మహాసమావేశమునకు అధ్యక్షురాలు.



గుంటూరు శ్రీ శారదానికేతనమందు వడ్లదంపుడుసంఘము



గుంటూరు శ్రీ శారదానికేతనమునందలి కుట్టుపనిశాఖ

నిమిత్తములేక, జ్ఞానానందులై మనుచుం దురు. అట్టివారే భక్తులలో నుత్కృష్టులనియు గీతలో భగవానుడైన కృష్ణుడు, అర్జునునికి ప్రబోధించుచున్నాడు చూడుడు.

శ్లో॥ తేషాంజ్ఞానీ నిత్యయుక్తా ఏకభక్తిర్విశిష్యతే
ప్రియోహిజ్ఞానినో నిత్యమహంసచమమప్రియః॥

కనుక, అట్టిభక్తుఁడే భగవంతునిలో నైక్యత బొందునని నిస్సందేహముగా భావింపనగును. అటువంటి భక్తాగ్రేసరు డెవరన్న ప్రహ్లాద కుమారుఁడు. ఇతఁడుపుట్టుకతో నే దైవభక్తి గలవాడై యెట్టికోర్కెయులేక భగవంతు నితో క్రీడాలోలుఁడై రాత్రింబగల్లు ధ్యాన సమాధిలోనుండి శ్రీవారికి ప్రియభక్తుఁడై పేరుగాంచెను.

తక్కినవారివలె నన్నీయాపదనుండి రక్షిం పుమనియు నాకీ పదవియిమ్మనియు, గోరుచు నతనిపీడింపక అతని నిర్వ్యాజకరుణాదృష్టియే తనజీవితపరమావధి యని తలంచుచుండెను. ఆహా! ఇతని నిష్కళంక భక్తిపూరితాంతః కరణము నెవరు వర్ణింపగలరు. తండ్రి హరి భక్తివిడువమని నిర్బంధపఱచినపుడు, జన కునకేవిధముగాజెప్పెనో చూడుడు.

సీ॥ మందారమకరందమాధుర్యమునదేలు మధుపంబు
వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలదేలు రాయంచసనునె
తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కుకోయిల
సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురిత చకోరకంబరుగునే
సాంద్రనీహారములకు
అంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబుజేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల.

ఆహా! యాతని నిశ్చంచల హృదయ మెవ రభివర్ణింపగలరు. తుమ్మెద, రాయంచ, కోయిల, చకోరము, దమ ప్రేమైకస్థానముల వదలి యన్యప్రాంతములుకు జననట్టుగా, తన చిత్తము, అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపానమున దగుల్కొనియుంటచే నితరత్రాజననేరదని ప్రత్యుత్తరమిచ్చెను. ఈ యొక్కనుడియే చాలును యాతని చిత్త వృత్తి మెఱుంగుటకు. ఇట్టి సంపూర్ణభక్తి గలవారు పురాణకాలముననే యరుదుగా గలరనినచో, ఇప్పు డీకాలమున నెచ్చటనో గాని కాన్పింపరు.

భక్తి లక్షణములు నవవిధములుగా నున్నవి. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము. వీనిలో నాత్మనివేదనము కడుంగడు నుత్తమమైనది. భక్తాగ్రేసరుఁ డైన ప్రహ్లాదుఁడు యాత్మనివేదనముననే హరికి హర్షప్రదాయియయ్యెను.

సామాన్యజనులు (అర్చన) విగ్రహారా ధన చేయుచుందురు. భక్తి అలవరుచుకొను టకు సులభమార్గ మీ యర్చనయే యని చెప్పఁదగును. పలువిధములగు కలతలచే కలగుండుపడియున్న మానసమునకు నిశ్చ లత చేకూఱి భగవంతునిలో నైక్యతబొందుట సామాన్య మానవులకు చాలకష్టము. అం

దుచే దేవుని ప్రతిమ ముందిడుకొని యర్చించుచు లోకేశ్వరుని సన్నిధి నున్నటులగా తలంచుచు కొలది నిముసము లైనను నిలుకడగా ధ్యానించు శక్తి సంపాదించి యనుదిన మావిధి ననుష్ఠించినచో, కొలది కాలమునకు నిజమైన భక్తి కుదురునని మన పెద్దలు నిశ్చయించిరి. దాని సరియైన భావము గ్రహించి మనీషావంతులు మరుపక యట్లాచరించెదరు.

కొంతమంది యవివేకులు దైవపూజ యెంత జేసిన నంత పుణ్యమని తలంతురు. తెల్లవారినది మొదలు కల్లలాడుచునుండుటయు, ఆ గడియకు మడిగట్టుకొని శిరస్నానములతో శరీరశుద్ధి చేసికొని దేవుని ముందఱ సాగిలపడి తాము తృప్తి వహింతురు. అయ్యో! వీరి చిత్తశుద్ధిలేని శివపూజయంతయు, భాండశుద్ధిలేని పాకమువలె వృథా యగుచున్నదని గ్రహింపరు. సద్గ్రంథశ్రవణము అనగా భగవద్విషయములను ప్రబోధించునవి. భగవద్గీత, భాగవతము మొదలగు గ్రంథములను వినుట లేక చదువుట యిది యుత్తమమార్గము. ధీనిధులు దీని మార్గ మవలంబించెదరు. మొదటిమార్గము మూర్ఖులకు, చదువురానివారికిని, స్త్రీలకును సహాయమొనరించును. కనుక అది అంతగా మేలైనది కాదు. ఈ రెండవది యుత్తములైన వారాచరించి యనుదిన మీప్రకారము యొక గంటయైనను సత్కాలక్షేపము జేయుచుచో నిస్సందేహముగా భక్తి పట్టువడి మోక్షమార్గ మధిగమించెదరు.

కనుక ఇప్పటి విద్యావతులగు సోదరీమతల్లులు అనుదిన మొకగంటయైనను గృహమున తీరుబడిచేసికొని భగవద్గీత, భాగవతము పఠించుచు నందలి సారాంశముల నవగాహన మొనర్చుకొనుచునుందురని నేను వాంఛించుచున్నదానను. మఱియు నింకను యోపికగల సోదరీమణులు తమతమ ఇరుగు పొరుగువారి యిల్లాండ్రను పిలపించి వృథా కాలక్షేపము జేయక, పై జెప్పినవిధమున సత్కాలక్షేపము జేయుచో, తామును తరించి, వారినిగూడ తరింపజేయుదురని తలంచుచున్నాను.

నిందితునియం దేమియు దోషములేదని అతని వకీలు వాదించుచున్నాడు. అందరి కావిధమున నమ్మకముచూడ గల్గినది. ముగింపగోరి ఆ వకీలు, "జ్యూరీమహాశయులారా! నిందితుడు గడియారమును దొంగలింపలేదు. పోలీసు లాతనివెంటనే బాగుగా వెదికియున్నారు. అతని జోబులందు దది యగపడలేదు. తుదకు బూట్సులందు బెట్టుకొనియుండునన్న గడియారము పెద్దది. అతడు దానిని మరెక్కడ దాచియుండును?"

ఎచ్చట దాచియుంచలేదను అభిప్రాయము వారికి గలుగుటకై వాదన నిలుపగా, నిందితుడు లిన్నగా, "లేదండి, దానిని నేను టోపీక్రింద పెట్టుకొంటి" నని అతని ప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చెను.

# శిశుపోషణ

శ్రీమతి అడపా సుగుణమణిగారు

గృహస్థాశ్రమమున స్త్రీపురుషులకు సమాన బాధ్యత గలిగియున్నను శిశుపోషణముమాత్రము మాతృదేవిపై విశేషముగ నాధారపడియున్నదని ఘంటాపదముగఁ జెప్పవచ్చును. బుద్ధుఁడు జీవకారుణ్యమును ప్రబోధించి లోకపూజ్యుఁడగుట, శివాజి పరాక్రమము వెదఁజల్లి వీరాదివీరుఁడగుట, త్యాగరాజు రామనామామృతమును జూరఁగొని భక్తాగ్రగణ్యుఁడగుట, ముసోలిని సామాన్యకార్మిక కుటుంబమునఁబుట్టి సామ్రాజ్యాధిపత్యమునుఁగొను దృఢసంకల్పుఁడగుటకు మాతృదేవి శిశువు గర్భమునఁబడుట మొదలు జననమువరకును తలంచుతలపులు, బిడ్డకుసలుపు సపర్యలు, చేయుశిక్షణ, యొనర్చు యుపదేశములే కారణములు. అట్టియెడ స్త్రీలకు విద్య, విశేష లోకానుభవము వలయునని వేఱె చెప్పవలయునా?

నేఁడు భారతదేశమున అన్యదేశీయ నాగరికతా వ్యామోహము విశేషముగ ప్రబలుటచేఁ గొందరు పుత్రవతులు తమ కడుపునఁబుట్టిన నిసుగులకు సహితము స్తన్యమొసంగక పాలిచ్చుదాదులను నియమించుచున్నారు. మరికొందరు 'హార్లిక్స్' 'మెల్లిన్స్'లపై నాధారపడుచున్నారు. ఈరెండును బిడ్డకును తల్లికిని గూడ యనర్థదాయకములు. ఎట్లన పాలిచ్చుటకు నియమింపఁబడు దాదులు స్వేచ్ఛమై తినితిరుగుదురు గాని మనపిల్లలకొరకై సత్యనియమంబులఁ గొనరు గదా? అదియునుఁగాక వారి మంచిచెడ్డలు యారోగ్య విషయములు మనకు రూఢముగఁ దెలియుట దుర్లభము. ఇఁక 'హార్లిక్స్' 'మెల్లిన్స్' మున్నగు పాలవిరుగులవలన యర్భకులకు హానియెగాని మేలు లేదు. నవీనశాస్త్రజ్ఞులు 'పాలు మఱగించుట పాడుచేయుటయె' యని విశేషానుభవమునఁ దెలిపియున్నారు. అట్టియెడ పాలవిఱుఁగులవిషయమై ప్రత్యేకించి వ్రాయనక్కరలేదు.

శిశువులకు స్తన్యమొసంగనిచో మాతృస్వాస్థ్యమునకుగూడ హానికరమని తెలుపుట కొందరికి వింత గొలుపవచ్చును. కాని యిందలి నిగూఢరహస్యమేమనిన పురటాండ్రకు గర్భకోశము మున్నగు యవయవములు వ్యాప్తిజెంది తమ నియతిపరిమితికన్న ననేకరెట్లు పెద్దవై శిశోత్పత్తి కనుకూలముగనుండును. శిశువు భూపతనమైనను యవయవములు స్వస్థతఁ జెందుటకు కొంతకాలము పట్టును. బుడుతలకు స్తన్యమొసంగు స్త్రీలకీ యవయవములకూడిక శీఘ్రముగ సంభవించుచున్నది.

చంటిబిడ్డలకు స్తన్యపానీయమే యమృతము గనుక పుత్రవతి ద్రవరూపములైన యాహారములఁగైకొని, పాలునన్నమున కభ్యాసపడి తనకు పాలుండునట్లు చూచుకొనవలయును. తానేదేనివ్యాధిచే బాధింపఁబడునపుడును మఱల గర్భచిహ్నములు గాన్పించునపుడును చంటిపాలు విషతుల్యము లగును గాన యట్టి సమయముల నాత్మజులకు పాలొసంగరాదు. మరియు తల్లి వెలికలబరుండి పిల్లలను మీద పరుండబెట్టుకొని పాలు గుడిపింపరాదు. అందువలన శిశువునకు యూపిరాడకుండుటయు మాతృస్వాస్థ్యమునకు హానియు సంభవించును.

తల్లికి స్తన్యవృద్ధి లేకున్నచో నావుపాలో మేఁకపాలో వాడుటయె శ్రేయస్కరము. పాపలకు పట్టుపాలోప్పియునపుడు పాత్రశుద్ధి ముఖ్యముగ గమనించవలయును. పాలను క్రిమినిర్మూలనమునకై కొంచెము కాచి (60° ఉష్ణమును పొందువరకు కాచిన తప్పు లేదు.) చల్లారినపిమ్మట బిడ్డలకు పట్టునపుడు మీఁగడ లేకుండ చూచుకొనవలయును. లేకున్న మీఁగడ శిశు ప్రేవులంజొచ్చి యరుగక పాచనాలు కలుగజేసి మిక్కిలి యాందోళన కలిగించును. శిశువు యేడ్చినపుడెల్ల పాలుపట్టుట, ఒకసారి యూపిరాడనట్లు పాలు

పోయుట, మున్నగు దురభ్యాసములకు కొందరు లోనైయున్నారు. శిశువు యాకలివలన నేడ్చుచున్నది లేనిది బాగుక గుర్తెరింగి ప్రమాణమునుతగ్గించి పలుమారు పాలొసఁగుటయె శ్రేయోదాయకము.

పసికందులపాలిటికి యాముదమే సుధారసము. అట్టియాముదమునువీడి యన్యవిరేచన సాధనముల కెంత మాత్రమును గడంగరాదు. శిరస్సును కాపాడి మెదడును బలపరచుగుణము ఆముదమునకు, తైలములకు గలదు గాన వాటిని శిశుశీర్షముపై నిలుపుట మంగళావహము. కాటుక కన్నులెదిగించి నేత్రరోగములు గలుగకుండ కాపాడు శక్తిగలది గాన దానివాడుక నెంతమాత్రము నేమరకూడదు. బిడ్డలకు వెన్నుముదిరినవరకు గోర్వెచ్చనినీటితో ప్రతిదినమును స్నానమాచరించుట శుభావహము.

పిల్లలు స్వతంత్రముగ లేచి కూర్చొనుటకు ప్రాయమువచ్చి, శక్తిగలుగకమున్నె వారలను బలవంతముగ నట్టిపనుల కభ్యాసపరచుటవలన గూని యస్థిభంగము దొడ్డికాళ్లు మున్నగునవి సంప్రాప్తించును. బాలురకు వ్రేళ్లుగుడుచుట మంటిచోలవగొంట సులభముగ నభ్యాసపడును. అట్టివి వ్యాధికారణములుగాన స్వల్పములుగ దలంపక క్రమశిక్షపై వాటిని మాన్పింపవలయును. కొందరు తల్లులు వినోదార్థమై తమబిడ్డలను బలవంతముగ గిలిగింతలుబెట్టి నవ్వింతురు, పైకెగురవైచి పట్టుచుందురు. అభిమానముకొలది తాము తినుచున్న యెంగిలిపదార్థముల బిడ్డలనోటనుంతురు. ఇవియన్నియు బిడ్డల స్వాస్థ్యములకు హానికరములు కాన నిరసింపవలయును. తనయు లల్లరిసేయువేళల కొందరుతల్లులు "బూచి"యనియు "దయ్యో"మనియు జడిపించుట కద్దు. అట్లుచేయుటవలన బిడ్డలు పెద్దవారైనను పిరికితనము వీడకుందురు.

తల్లిబిడ్డప్రక్కనే పరుండవలయునా? లేక వేరొకశయ్యపై నుండవలయునా? యనునది మరియొక మీమాంస. ఇరువు రొకశయ్యపై నుండుట యనారోగ్యకరమని కొందరు వాదించుచున్నారు. కాని మాతృశిశువు లొకచోటనే పరుండుటవలన నొక వింతశక్తి తల్లియొడలినుండి శిశువునకు సంక్రమించి శిశువునారోగ్యముగఁ బెంచుచున్నది. ఇది స్త్రీలస్వభావరహస్యముగాన పుత్రవతులందరును గుర్తెరుంగుదురుగాక.



# బలము కాడ్డులివరాయిలులో వుంది

# స్కాట్సు ఎమల్షనులో

# అంతకు 3 రెట్లెక్కువ వుంది



దేహానికి బలము రావలెనంటే, అందులోనూ జబ్బుబడి లేచినతరువాత బలవృద్ధి శీఘ్రంగా కావాలంటే కాడ్డులివరాయిలుకంటె మంచి మందు లేదనే డాక్టర్లు చెపుతారు. దానినిండా ఎ. డి. వైటమినులుండి దేహానికి పెంపు పుష్టికూడా యిస్తవి.

కాని శుద్ధ కాడ్డులివరాయిలును త్రాగి అరగించుకోవడం చాలా మందికి కష్టం. స్కాటుచేసిన యీ ఎమల్షనువల్ల అది చాలావరకు మారి అందరికీ సులభముగా జీర్ణమవుతున్నది. దీనివల్ల దానిగుణములా చెడవు. జీర్ణశక్తియూ హెచ్చును. పైగా లైము, సోడాకూడా చేర్చుటవలన దానికంటె మూడురెట్లెక్కువ గుణముకూడా కలుగుతుంది.

## బలిష్ఠమగు రోగనివారిణి

దౌర్బల్యంపోయి బలంగా ఆరోగ్యంగా ఉన్నప్పుడైనాసరే. జన్మంలో ఏజబ్బూలేకుండా బాగుండాలంటే యీ ఎమల్షనే తగినది. రక్తము వృద్ధిఆవుతుంది. నరములు బలపడుతవి. ఎంతకష్టపడినా, ఎటువంటి శీతాతపములైనా శరీరాని కొక్కరవ్వ ఆయాసం కలగనీయదు. డాక్టర్లు అరవైయేళ్లాయను దీనిని సిఫార్సు జేస్తున్నారు.

స్కాట్సు ఎమల్షను సాదా కాడులివరు ఆయిలు కంటె 3 రెట్లధిక గుణమిచ్చును. ఎముకలను మాంసమును కండలనుతీర్చి పెంచును. నరములకు పుష్టినిచ్చును. రక్తవృద్ధి కలుగజేయును. రోగములు రాకుండా కాచుకుంటకు తగిన శక్తి నిచ్చును.



# SCOTT'S Emulsion

శుద్ధమైన కాడ్డులివరాయిలునుండి

మండీవర్తకులు :

ఇంపీరియలు కెమికలు ఇండస్ట్రీస్ (ఇండియా) లిమిటెడు, కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూన్, కొలంబో, కాన్పూరు, పాట్నా, అహమ్మదాబాదు, కొచ్చిన్, కాలికట్టు, విశాఖపట్టణం, కరాచి, అమృతసరను.

# మహారాజ్ఞి స్వర్ణమయి

ఆచంట లక్ష్మీనరశింహంగారు

ఔదార్యమునకును, ప్రజాసేవకును, దానధర్మములకును సాటిలేని మేటియని పేర్గాంచి, బెంగాలీయులకు పరమపూజ్యయైన నారీమణి మహారాజ్ఞి స్వర్ణమయి. విధియను కూలించుచో కుటీరములందు జన్మించినవారు సైతమెట్టి యున్నతపదవుల నధిష్ఠించి, జనులు మరువరాని యుత్తమకార్యముల నొనర్పవీలగునో యీమె జీవితమువలన నెరుంగవచ్చును.

ఈమె బర్ద్వాను జిల్లాయందలి భట్టకులమను గ్రామమున, రామతనుమండలుడను పేదగృహస్థునకు తనయయై జన్మించెను. (1828 సం॥రం) ఈమె జన్మకాలమున మహారాజులబిడ్డల జననకాలమునందు జరుగు వేడుకలు వైభవములేమియు జరుగలేదు. సరిగదా, మీదుమిక్కిలి రామతనుడు ఆడుబిడ్డ జన్మించెనని, యామెవివాహమునకై తనకున్న స్వల్పయాస్తిని గోల్పోవవలసి వచ్చునని వగచెను. తన యనుగుతనయ యచిరకాలమున వంగనారీమణులకెల్ల మకుటాయమానయగు మహారాజ్ఞి కాగలదని యతడూహించియైన యుండడు. దైవకృపవలన నీబాల యరిష్టములన్నిటినిగడచి శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్ధమానయగుచుండెను. తల్లిదండ్రులు బాలికకు శారదాసుందరియని నామకరణమొనరించిరి.

ఈమె బాల్యమునుండియు మిగుల నుదారస్వభావ; రూపసి; మిగుల కుశాగ్రబుద్ధి. కాశింబజారు రాజ్యాధిపతియగు రాజాకృష్ణనాథరాయబహదూరునకు, బందుగులు కన్యనన్వేషించి, యాయన జన్మమండలమున జన్మించి రూపగుణసౌశీల్యాదులచే నొప్పుచున్న శారదాసుందరి యన్నిట నర్హయని నిశ్చయించిరి. వెంటనే యామెకు స్వర్ణమయియను నామాంతరమిడి రాజాబహదూరునకు పాణిగ్రహణమొనర్చిరి. ఈవిధముగా నఘటనాఘటన సమర్థుడగు పరాత్పరుని లీలవలన, గర్భదరిద్రులగు వారియింటబుట్టి, కుటీరమున సర్వసామాన్యబాలికగా పెరిగిన శారదాసుందరి యకస్మాత్తుగా, వంగదేశమునకెల్ల శ్రీమంతమైన కాశింబజారు రాజ్యాధిపతి మహిషియయ్యెను.

ఈ యాకస్మిక పరివర్తనమువలన నామె మహాదృష్టశాలియైనను, ఉబ్బితబ్బిబ్బై, స్వభావము తారుమారుచేసికొనలేదు. స్వభావజన్యమైన శాంతమును, నిరాడంబరతను వీడలేదు. భర్తయగు కృష్ణనాథుడీమెను శాంతిదూతయని ప్రియముతో గారవించుచుండెను. కాని ఆయన యీమె సాహచర్యమును చిరకాలముగాంచు భాగ్యము నోచుకొనలేదు. రాజాకృష్ణనాథుడు గుణవంతుడును, ఉదారుడునయ్యు, దుబారాఖర్చులజేయుచు, నమిత దుర్వ్యసనలోలుడై, అపారముగానున్న తన ధనరాసులన్నిటిని అచిరకాలముననే వెచ్చించెను. తుదకొక క్రిమినల్ కేసునందు చిక్కుకొని, అవమానమును భరించలేక, 1844 సంవత్సరమున నాత్మహత్య గావించుకొనెను.

లోకజ్ఞానము సరిగానెరుగని పదునారేండ్ల యల్పప్రాయమున రాణీస్వర్ణమయి భాగ్యరేఖయంతరించి దుస్సహమైన వైధవ్యవ్యథ పాలయ్యెను. అప్పటికీమెకు యిరువురుకుమార్తెలు కలిగిరి. అందొకబిడ్డ తండ్రికంటె ముందుగానే మరణించెను. పుత్రికాభర్తృవియోగములచే క్రుంగిపోయిన యీసాధ్వి దుఃఖపాత్ర పూర్తియగుటకోయన మరి కొలదికాలములోనే ఈస్టిండియాకంపెనీవారు మరణాత్పూర్వము రాజాసాహేబు తమకొక వీలునామా వ్రాసియిచ్చెనని చెప్పి దాని ననుసరించి కాశింబజారు ఎస్టేటును జప్తుచేసి స్వాధీన మొనర్చుకొనిరి.

ఇక్కాలమున నామె మానసస్థితి యెట్లుండునో వ్రాయబూనుట సాహసము. కాని యీదుఃఖభారమున ధీరస్వాంతయగు నీయిల్లాలు క్రుంగిపోలేదు; తుఫాను సమయమున నడిసంద్రమున నోడనునడపు కర్ణధారుని వలె నీమె ప్రశాంతము నావంతయు వీడలేదు. దైవముపై భారమువైచి, నిండువిశ్వాసముతో నీమెపోయిన ఎస్టేటును సంపాదించుటకు కృషిసలుపజొచ్చెను. అందులకు ధనమగత్యమగుటచే నీమె పెక్కురు జమీందారులను శ్రీమంతులను సహాయమునకై యర్థించెను. ఎవ్వరును ముందునకు వచ్చువారు లేకపోయిరి. కొందరు దురాశాపరులు ఆస్తి తిరిగి లభించినపిమ్మట, తమకు అత్యధికభాగమీయ నంగీకరించిన తోడ్పడెద మని కబురంపిరి. నిస్సహాయురాలగు రాణి కేమిచేయుటకును పాలుపోలేదు.

కాని సజ్జనులను భగవాను డుపేక్షింపడుగదా? హారనాథలాహోరీయను నొక సజ్జనుడు భర్తృహీనయు నిస్సహాయయునగు రాణిస్థితిగాంచి జాలినొంది తాను శ్రీమంతుడు గాకున్నను, తనకుమార్తెయాస్తిని తాకట్టుపెట్టి వచ్చినసొమ్మును యీమెకు హృదయపూర్వకముగా నప్పిచ్చెను. ఈసత్పురుషుడు తానీకార్యమొనర్చినందుల కేవిధమగు బహూకరణముగాని దళారిగాని కోరలేదు. దారితెన్నుగానక సంకటపడుచున్న స్వర్ణమయికి యీమహానుభావుడు దైవమువలె నడ్డుపడి యమూల్యసహాయమొనర్చి, యామెనుద్ధరించి దేవి భవిష్యత్ సత్కార్యములకు మూలమగుటచే, నీయన పవిత్రనామ మజరామరణమై మహారాణి సత్యౌదార్యములు కీర్తింపబడునంతకాలమును స్మరింపబడుచుండును.

ద్రవ్యసహాయము కలుగగానే రాణి యుత్తమమైన న్యాయవాదవర్గము నేర్పరచి తనదావాను సుప్రీంకోర్టునందు సాగించెను. 1,2 వత్సరముల విచారణయనంతరము మరణమునకు ముందు రాజాకృష్ణనాథుడు చిత్తస్వాస్థ్యమును గోల్పోయెననియు,నందుచే నాయన వీలునామా చెల్లదగదనియు, చేసినన్యాయవాదులవాదనను కోర్టువారంగీకరించి ఎస్టేటును రాణీ స్వర్ణమయికి స్వాధీనమొనర్చున ట్లుత్తరువొసంగిరి. దీనితో నీయుకష్టము లంతమొందెను.

కాని ఎస్టేటు స్వాధీనముకాగానే సుఖముగా కూర్చుండి పరిపాలించ వీలుకాలేదు. కంపెనీకి కొంతకాలము స్వాధీనమైయుండుట, దావాలో నుండుట వలన సంస్థానవ్యవహారములన్నియు నల్లకల్లోలముగా నుండెను. అసలు కంపెనీవారిచే నీయబడిన ఎస్టేటు మిగులవిశాలమై పెక్కుచోట్ల నదులచేతను, పర్వతములచేతను, వేర్పడి ప్రయాణము మిగుల వ్యయప్రయాసమూలమై పరిపాలనము నెరపుటదుర్ఘటముగానుండెను. ఒకచోటనుండి మరొకచోటికి వార్త చేరుట కెంతో కాలము పట్టుచుండెను. వీనికితోడు పరిపాలకురాలు స్త్రీయను నీర్ష్యాభావమున బందుగులెవ్వరును తోడ్పడ సాహసింపకపోవుటయు, మరింత కష్టములకు కారణమయ్యెను. మరియు అతివ్యయప్రయాసమూలమైన సుప్రీంకోర్టుదావా నెగ్గుటకుగాను అప్పుడప్పుడు చేయబడిన ఋణములతో సంస్థానము మూల్గుచుండెను ఈవ్యవహారములన్నిటిని నేర్పుతో చక్కబెట్టుటకు అతి సమర్థుడగు దివాను కావలసియుండెను. రాణి దీర్ఘముగా యోచించి ఎస్టేటునందు సామాన్యోద్యోగిగానున్న రాజీవలోచనబాబును అర్హుడని నిశ్చయించి దివానుగా నియమించెను.

ఈయనపదవికి తగినవాడని త్వరలోనే ఋజువయ్యెను. తాబూనినకార్య మత్యంతకష్టసహితమైనదైనను, రాణివలెనే యీయన వుత్సాహపరుడును, క్షమాన్వితుడును, దీర్ఘదర్శియు, విశేషించి రైతుజనమునందు సానుభూతియు కలవాడగుటచే నీయన పరిపాలనము ప్రజానురంజకమై రాణి మన్ననలగాంచి, యచిరకాలముననే ఎస్టేటు నెదుర్కొనిన యవాంతరములన్నియుగడచి భయంకరములైన యప్పులుదీరి, ఎల్లెడల నభివృద్ధి కాన్పింపసాగెను. దైవానుగ్రహ



బొంబాయి ఇటీయాన్ వార్షికోత్సవ పందెములందుపాల్గొనుచున్న బాలికలు. వివిధములైన ఫలములను గడ్డిలో చుట్టుచుండుటిందు గాననగును.



బొంబాయి ఒటిమూస్ వార్షికోత్సవ పందెములు. ధాన్యముమధ్యనున్న నాణ్యముల
నోటితో ఎత్తుకొను పందెము.

మున మరొకసారి కాశింబజారు రాజ్యము తొల్లిటి పేరు ప్రఖ్యాతులతో ఖ్యాతినొందసాగెను. అప్పటి నుండియు స్వర్ణమయీరాజ్ఞి దివానుప్రోద్బలమున ప్రజోపయోగకార్యముల నారంభించి ప్రజానురాగమును చూరగొనజొచ్చెను.

మహదైశ్వర్యము తనకు కైవశమైయున్నను, యీయమ విరాగిణియై స్వార్థభోగములకొరకు పైసయైనను వెచ్చించి యెరుగదు. సంస్థానఆదాయమునందలి కొంతభాగము పరిపాలన నిర్వహణమునకుగాను ప్రత్యేకించి మిగతద్రవ్యమును యథేచ్ఛగా ప్రజాకార్యములకు వినియోగించుచుండెను. ఈమహారాణి బహిరంగముగను, గుప్తముగను చేసినదానము లసంఖ్యాకములగుటచే వాటినన్నిటిని యింత చిన్నవ్యాసమున పేర్కొనబూనుట సాహసకార్యము. కావున ముఖ్యమైనవానిని మాత్రమే తెలుపుచున్నాను.

ఉత్తరబంగాళమున 1874 సంవత్సరమున తీవ్ర క్షామము సంభవించినప్పుడీ యుదారహృదయ బాధితుల సహాయార్థము లక్షయిరవై అయిదువేలు విరాళమొసంగెను. 1876,1877 సంవత్సరములందు కలకత్తా మూర్షిదాబాదు చెన్నరాష్ట్రములందు సంభవించిన కాటక నివారణమునకుకూడ నీయమ యధికముగానే తోడ్పడెను. క్షామసహాయార్థము మొత్తమీమె 4, 5 లక్షలకుపైగా వెచ్చించెను.

స్వర్ణమయీదేవి మానవసేవకును, క్షామపీడితుల సహాయార్థమును యొనరించినకృషిని ప్రభుత్వమువారు మిగుల శ్లాఘించి యీమెకు మహారాణిబిరుదమును, యీమె వారసునకు మహారాజ బిరుదమును ప్రసాదించిరి. విక్టోరియా మహారాజ్ఞి యీమెను తనసామంత మండలియందు జేర్చుకొంటిననివి ప్రకటించెను. 1878 సంవత్సరమున డివిజనల్ కమీషనరు కాశింబజారునందు దర్బారుజరిపి అందు రాణీస్వర్ణమయీదేవి భూతదయను పెక్కువిధముల సంస్తుతించి యీమెకు శ్రీ క్రవర్తిని ప్రసాదించిన బిరుదములనొసగెను.

1877 సంవత్సరము నాటికి మహారాణియొనర్చిన దానములు 11 లక్షలకుమించినను, ఆమె దానదీక్ష సడలలేదు. అటుపిమ్మటకూడ సమయమువచ్చినప్పుడెల్ల నామె లక్షలువెచ్చించుచునేయుండెను. కలకత్తా వైద్యవిద్యార్థి వసతిగృహ నిర్మాణమునకు లక్ష రూపాయలును, కాంబెల్ వైద్యవిద్యార్థి వసతిగృహమును పెంచుటకు పదివేలును, మహారాణి విరాళమొసంగెను. అదిగాక, యీమె స్వసంస్థానమున మంచి నీటిబావులు తటాకములు, సంస్కృతపాఠశాలలు, వైద్యశాలలు విరివిగాస్థాపించి వానియభివృద్ధికొరకు పెక్కులక్షలు వ్యయపరచెను.

మరియు అన్నపూర్ణ పూజాదినమను నుత్సవము సంవత్సరమునకు 3 సారులుజరిపి యాదినములందు వేలకొలది సాధువులు, సన్యాసులు, ఫకీరులు మున్నగువారికి భూరి యన్నదానను గావించుచుండెను. చలికాలమున బ్రాహ్మణులకు వస్త్రదానము గావించుచుండెను. మరియు నామె తమ వంశమూలపురుషులగు కృష్ణకాంతబాబు, లోకనాధబాబు, హరినాధబాబుల యొక్కయు, భర్తగారగు కృష్ణనాధబాబుయొక్కయు మృతవార్షిక దినములందు బ్రాహ్మణులకును, పండితులకును విస్తారము సంభావనలనొసంగి గారవించుచుండెను. ఇకనీయమ లెక్కలేనన్ని గుప్తదానముల నొనరించియుండెను. ఉన్నతవంశులై, భర్తృహీనలైన యువిదలు దారిద్ర్యమును మొగమోటమువలన నోరుదెరచి తెలుపలేకున్నను కరుణాధురీణయగు మహారాణి వారి యంతరంగములగల కోర్కెలరసి, మాసమాసమును వారికి గౌరవభృతి యొసగుచుండెను.

ఇక విద్యార్థులయెడ యీసాధ్వీమతల్లి ప్రత్యేక ప్రేమను చూపెడిది. రాష్ట్రమంతటినుండియువచ్చిచుట్టు చేరెడి పేదవిద్యార్థిగణమునెడ నీమె యనుకంపవహించి, వారికి వసతినికల్పించి, భుక్తినొసంగి తన స్వంత ఖర్చుతో విద్యాప్రదానము గావించుచుండెను. రాజభవనమున నొక యుచితసవతి భోజనగృహము నిర్వహింప

బడుచుండెను. ఆకాలమున నీయమ సాహాయ్యము నేదో విధమున పొందని పేదవిద్యార్థులు రాష్ట్రమున లేరనుట యతిశయోక్తిగాదు. విద్యార్థులసౌకర్యము కొరకీమె సాలునకు లక్షరూపాయలు వెచ్చించుచుండెను.

ఈమె దాతృత్వము నీవిధముగా రాష్ట్రవాసు లందరును చవిజూచి కృతజ్ఞులైనను, యామె ప్రత్యేకాదరణకు పాత్రులైన బరంపురం (బెంగాలు) పౌరులు యామెనెన్నడును విస్మరింపజాలరు. ఆపట్టణమునందలి మొదటితరగతి కళాశాలను, ద్రవ్యాభావము వలన తగ్గించవలెనని బెంగాలుప్రభుత్వమువారు నిశ్చయించిరి. ఇందులకు ప్రతికూలముగా ప్రజలొనరించిన విన్నపములకు వారు చెవియొగ్గలేదు. కళాశాల పోనుండెను. ఆసమయమున విద్యార్థులపాలిటి కల్పవృక్షమగు మహారాణి యపారౌదార్యముతో ముందునకు వచ్చి కళాశాలానిర్వహణము తానువహింతునని వాగ్దత్తమొనర్చి నిర్వహణమునకు కొరవపడుచున్న సాలునకు 20 వేలును తనకోశమునుండి యొసగు నేర్పాటుగావించెను.

ఆపురవాసులు శాశ్వతముగా మరువరాని మరొక యుపకృతిని మహారాణి గావించెను. పట్టణమునకు సరియైన మంచినీటి సరఫరా లేకపోవుటచే, యనారోగ్యనిలయమై, గ్రహణి విరేచనములు మలేరియా, కలరా మున్నగువ్యాధులు నెలవుకొని, సాలునకు పందలకొలదిజనులు మృత్యుదేవతకు బలియగుచుండిరి. ఈదారాశయభరితయగు మహారాణి పట్టణము నీశాప నిర్ముక్తమొనర్చుటకుగాను, నీటికొళాయిలు నిర్మింప బద్ధకంకణయయ్యెను. (1894) ఆకార్యముకడ ముట్టువరకును భగవాను డీమెకు యాయుర్దాయ మొసంగలేదు. కాని యీమె యనంతరము అధికారమువహించిన ప్రస్తుతమహారాజుగారు ఆకార్యమును పూని, సాగించి 3 లక్షలవ్యయముతో మంచినీటి కొళాయిల నేర్పాటుచేసిరి. మహారాణి యమోఘ దానమువలన నేటి బరంపురపట్టణము ఆరోగ్యసౌఖ్యముల కాపట్టయినది.

మానవులయందు అపారమగుప్రేమయు, దాతృత్వమును మేళవించి మహారాణియందు మూర్తీభవించినవి. తనకున్న యవకాశములనన్నిటి నీమె యెట్లు మానవాభ్యుదయమునకు వినియోగించినదియు, దేశీయ చరిత్రకారులు స్వర్ణాక్షరములతో లిఖింపగలరు.

ఈపరదేవత పరమపితనుండి వచ్చిన యాహ్వానము నందుకొని, కడపటినిముసమువరకును, దేశీయుల యభ్యుదయమునకు కృషిసల్పుచు, 1897 సంవత్సరం ఆగస్టు 24 తేదిని యిహలోకయాత్రను చాలించెను. దీర్ఘవత్సరములు జీవించి మతభేదమెరుగక సమదృష్టితో ప్రజాక్షేమమునకు నిరంతరమును పాటుపడిన మహారాణి మరణమునకు తమ మాతనుగోలుపోయిన వారిమాడ్కి హిందూ మహమ్మదీయ లేకవిధముగా శోకించిరి.

మనదేశీయులకు పూజ్య రుద్రమదేవి నామము వలెను, మహారాష్ట్రులకు మహారాణీ యహల్యాదేవి నామమువలెను, నీయమ పవిత్రనామము బంగాళీయులకు అత్యంతపవిత్రమైనది. ధన్యజీవియైన యీ మహారాణిజీవితము, సత్కార్యపిపాసయు, నవకాశములును గల పెక్కురు సోదరసోదరీమణుల నుత్తమకార్య నిర్వహణమునకు ప్రేరేచుగాక !

# ప్రణయత్యాగం

శ్రీమతి దంతుర్తి లక్ష్మీనరసమ్మగారు

అది జూన్ నెల. సాధారణంగా ఒక్కొక్క నెల ఒక్కొక్క విషయానికి ప్రాముఖ్యాన్ని చెందిఉంటుంది. జ్యేష్ఠమాసంలో ఆవకాయలు మామిడిపళ్లు అలికిరి; శ్రావణమాసంలో ముత్తైదువులయొక్కయు, కొత్తకోడళ్ల యొక్కయు సందడి; కార్తీకమాసంలో వితంతువులస్నానాల అలికిరి; పుష్యంలో దశమగ్రహాలైన కొత్తల్లుళ్ల సందడి; మాఘంలో పునఃసంధానాల అడావుడి. వీటిఅన్నిటికన్నా ఆందోళనచేసేది స్కూలు ఫైనలు వారిపరీక్షలు తెలిసేమాసం.

శీతారామయ్యగారు తన మేనల్లుడు ప్రసాదంపరీక్ష ఏమైందోఅని ఆతుర్తపడ్తున్నారు. ఇంట్లో అతనిభార్య లక్ష్మీదేవి ఓవేపు పిల్లఅగుపద్మకు పెళ్లీడుమించుతూందని ప్రాణంకొరికేస్తూంది. అతనుప్రసాదం పరీక్షాఫలితమునుచూచి ఏదో నిశ్చయించేద్దాంఅని అనుకొంటున్నాడు.

జూను పదిహేనో తేదీ, ఆరోజు పోస్టుబంట్రోతు బీటుమీదవస్తాడు శీతారామయ్య తపాలబంట్రోతువాడికోసం ఊరికో మైలుదూరం ముందుపోయి ఎదుర్కొన్నాడు. ఉత్తరంకూడా అందుకొన్నాడు. అందుకొన్నాడు. దాన్నిచదవడంతోనే పొంగిపోయాడు. పోస్టుబంట్రోతుకు భోజనం శాంక్షన్ చేసాడు. లక్ష్మీదేవి ఆనందానికి మేరేలేదు. ఇంట్లోమాటలన్నీ జాగ్రత్తగా వింటూంది పద్మ. (చాలా తెలివైనపిల్లలెండి) ఆమెకు ప్రసాదంబావ పరీక్షప్యాసు అయాడన్నసంగతి వినడంతోనే ఆనందబాష్పాలు జలజలరాలాయి. (ఎంతైన మేనత్త మేనమామ బిడ్డలుగదండి. వారి కుదయించు ప్రేమ సహజమైనది.) ఒంటరిగా గదిలోకిపోయి తనఆనందాన్ని పైకివెలిపీసింది ఒక్కసారిగా.

* *

'పద్మాప్రసాదం' ఎంతకర్ణానందగాఉంది ఆ జంటపేర. వారినిచూచిన లేనివారికి ప్రేమఉదయించును. ఆహా! ఎంతఅన్యోన్యంగాఉంటున్నారు. వారిరువురునూ నిరుపమానదంపతులే! లక్ష్మీశీతారామయ్యలకు ఇక కావలిసినదేమున్నది?

ప్రసాదం ఎఫ్. ఎల్. పరీక్షఅయిపోగానే వేసంగిలో ఇంటికొచ్చాడు. ఇంటిదగ్గర తనప్రేమఫలమగు 'సీతారామ్' బోసినోరుతో, బూలిబుగ్గలతో, చిరునగవులతో ఎదురుగా గుమ్మందగ్గరున్నాడు. రావడంతోనే చూచాడుచిట్టి 'శీతారామం'ను. పిల్లాడిని తప్పించుకుపోదామనుకొన్నాడు. కాని ఒకేసారిగా ఒంట్లోనెత్తురు పూర్ణిమనాడు అలలుచందాన్ని పొంగింది. తనకు తెలియకుండానే శరీరంవంగింది, చేతులు చాపబడ్డాయి. అమాంతగా పిల్లడు చంకెక్కాడు. 'శీతారాం'ను ఎన్నిసార్లు ముద్దుపెట్టుకొన్నాడో అతనికే తెలియదు. గట్టిగా

అదుముకొన్నాడు పిల్లడ్ని తనగుండెలకు. అట్లా తన్ను తానుమరచాడు కొంతవరకూ. అప్పుడాతనికి కలిగినసౌఖ్యం, అతనుపొందిన ఆనందం చెప్పడాని కలవిగాదు.

*   *   *

సాయంత్రం ఏటివైపు షైరుబయల్దేరాడు. నాగావళీపాయ కృష్ణత్రాచులా ప్రవహిస్తూంది. సన్నంగాపాటవెలువడ్తూంది ప్రసాదంహృదయంలోంచి. ఒంటరిగా కూర్చున్నాడోచోట. సూర్యుడు సాయంకాల సమయాన్ని తనకిరణాలను వెదజల్లుచూ నాగావళీతీరదృశ్యాన్ని అతిమనోరంగానూ, అతిరమ్యంగానూ చేసాడు. ఆ దృశ్యాలవెంటబడ్డాది ప్రసాదంయొక్కహృదయం. అతని బుర్రలో మితిలేనన్ని ఆలోచనలు పరుగెత్తున్నాయి.

అకస్మాత్తుగా ఆతనిమనోవీధిలో పరుగెత్తింది 'విమలా' రూపం — ఆ విశాలమైన ముఖంతో, ఆ వేడికన్నులతో, ఆ పలుచని ఎర్రనిపెదిమలతో, ఆ భుజాలుదాకా వేలాడేచెవులతూరీగలతో, ఆ పార్శికచ్చతో ఆ సుకుమారనడకతోనున్నూ, ఆతని హృదయం చలించింది. ఆమెకునూ తనకునూ మదరాసు సముద్రపుటొడ్డున జరిగినసంగతులు జ్ఞాపకానికొస్తున్నాయి. — ఆమె విద్యాధిక, తాను విద్యాధికుడు, ఇరువురు ఒకర్నిమించినవారొకరు. నిష్కల్మషమైన ప్రేమ ఒకరిదొకరికి. ప్రపంచంలో కావల్సిన దిక ఏమిటున్నాయి? ధనమా? కావలసినంత పుష్కలంగా ఉంది. ప్రేమా? అదియుకూడా నిరుపమానమైంది ఒకరిపై నింకొకరికి. రెండునూ అమిరియున్నాయే! నేనెందుకింక వెరువాలి ఆమెను స్వీకరించడానికి?

తన 'సీతారాం' మళ్లీ గోచరించాడు. అతనికి ఆశాసౌధం విమలతోకూడా కూలిపోయింది ఒక్కమారుగాను. తనస్థితిని తల్చుకొన్నాడు. తనవయస్సు 22 ఏండ్లా? ఇంకా చదువువైనా పూర్తిగాలేదే! ఎంత సిగ్గు! ఎంతచిన్నదనం! నావిమల విన్నాదంటే ఏమనుకొంటుంది? ఎంతనవ్వుతుందో గదా? నేను చదువుకొన్నప్పటికిని విద్యాహీనమైన పశువువలె ప్రవర్తించేనే! మరీ జన్మలో నాకు ప్రణయసౌఖ్యంలేదా? ఈ జన్మ ఇంకనేను వృథాగా గడపవలసినదేనా? ప్రపంచంలో బ్రదకడం ఎందుకు? ఆనందం బొందడానికా? సౌఖ్యపడడానికా? లేక కుళ్లుతూకుముల్తూ దుఃఖపడడానికా?

'బాబయ్యా, ఏయాలొచ్చారండీ' అనే సాలికాపు వెంకడిపిలుపు ఆ తలపున్ని చెదిరీంది. 'చీకటిపడ్తూంది' అంటూ లేచాడు ఇంటికి.

*   *

'వెళ్లి పదిహేనురోజులైందే! ఉత్తరమైనా రాలేదే! ఏంచెప్మా! ఎంతతెలివిమాలినదానను నేను! వారు ఉత్తరం వ్రాసినగదా నాకువచ్చుట. ఉత్తరంవ్రాయకపోవడానికి ఏంకారణమైయుంటుంది? తీరుబాటులేకా? తీరుబాటులేకపోవుటకు చేయవలసిన పనులేమున్నవి? లేక నామీద కోపంచేతా? కోపానికి నేనేం అపరాధంచేసాను?

పోస్సీ. నేనే ఏదైనాఅపరాథంచేస్తే క్షమించ మని వ్రాస్తా' అంటూ లేచింది పద్మ పెరటి గచ్చు అరుగుమీదనుంచి పిల్లడ్ని చంక వేసు కొంటున్నా ఓనాడుసాయంత్రం.

రోజుకురోజూ ఆమె ముఖంలో కళ లంతరిస్తున్నాయి. ఆమె కానందం గూర్చే ఫలం ఒక్కటేఉందితనదగ్గర.అదే'శ్రీతారాం' జీవప్రతిమ. ప్రసాదాన్ని తల్చుకొనేసరికి కళ్లు కాలుచలుకట్టి గుండె దడదడ హెచ్చింది, నెత్తురుచల్లబడ్డది, ఒళ్లల్లాపులక రించింది. ఏపనిచేసినాపరాకే అంతాకలలో జరుగుతూన్నట్టేయుండేది. తాను ఉత్తరం వ్రాసి పదిరోజులైంది జబాబులేదు. ఆందో ళనం ఎక్కువైంది. ఏంచేయడానికి తోచ లేదు. యింటఎవరు పెద్ద మొగదిక్కులేదు. అంచేత పుట్టింటికి ప్రయాణంకట్టింది మేనత్త తోటి అక్కడనుంచీ తనతండ్రిని మదరాసు పంపడానికి.

పేపర్లు ప్రకటించాయి 'విమలాప్రసాదుల' వివాహం. మదరాసు వారందరూ ఆ అంత శ్శాఖా వివాహానికి ఆనందిస్తూ దంపతుల్ని అభినందించేరు. ప్రసాదం బస ఇప్పుడు 'రామకృష్ణారావునాయుడు గారింట్లోనే'. అతను ఓ వృద్ధబారిష్టరు, ధనవంతుడు సంఘ సంస్కారి. శాఖాహారనియమం కలవాడు. ఆతనిఒక్క కుమార్తెఅగు విమలను ఆమె ఇష్టంపైని ప్రసాదాని కర్పించాడు. అతని ఆనందానికి మేరేలేదు, తాను తన విమలకు స్వేచ్ఛావివాహం చేసేనన్న గర్వంచేత.

విమల సజంగా అవతరించిన ప్రేమమూర్తి యే. ఆమె నిజంగా ప్రసాదాన్ని మనసారా ప్రేమించింది. తన హృదయస్థ ప్రేమమూర్తిని ప్రసాదం పాదార్పితం చేసింది. తనహృద యంలో ఆతని హృదయం దాచుకోడానికి తానిచ్చింది. ప్రసాదంకూడా అట్లే ఆమెను చూసేవాడు. కాని ఎప్పుడూ అతను కలత పొందిన మనస్సుతో ఉండేవాడు. తనహృద యస్థ వ్యాకులాన్ని ఓపెక్కాది రమారమీ దాచాడు. కమలతో ఎప్పుడూలేని సంతోషం తెచ్చుకొని భాషించేవాడు.

'పవిత్రప్రేమకంటె మించిన పరీక్షకర్త వేరొకట్టుందా ?' ఆవిమలాప్రణయం ఇతని స్థితిని గ్రహించింది. కాని దానికి కారణం మాత్రం అగోచరంగావుంది.

లాకాలేజీ మూసారు వేసవికై. సాయం త్రం ఐదయింది. ఇంట్లో ప్రసాదంజాడేలేదు. 'టీ' త్రాగడానికైనా రాలేదు. విమల ఆతు రతతో అతనిగదిలోకిపోయిచూసింది. పెట్టె బిచాణా సర్దడంలో నిమగ్నుడయి యు న్నాడు ప్రసాదం. ఆశ్చర్యంతో ఆమె 'ఇదంతా ఏమిటి' అంది. ప్రసాదం ఆమె వైపుతిరిగి విమలా, ఈరాత్రి మావూరు వెళ్తున్నాను. మళ్లీ పదిరోజుల్లో వస్తాను.

'ఏమంత అర్జంటుప్రయాణం' అంది, 'నన్ను కూడా తీసుకెళ్తున్నారే.'

'అందుకే ఈనాప్రయాణంముందుగాను.' సామానుసర్దడంలో ఆమెకూడా సాయం చేసింది.

'శేషా మాసీతారామయ్య మామయ్య వస్తాడు మదరాసు నాకోసం. రానీ, నే నుంటేగదా నాపూర్వంలాడ్జిలోనన్ను చూడ డానికి. ఇపుడు వెళ్లడంతోనే అన్నీ తెగు తెంపూచేస్తా. మూడోవంతు ఆదాయం దానికి పంపించేస్తా. అని వినీవినబడనట్టు అనుకుంటున్నాడు ప్రసాదం. రైల్లో ఇంటరు క్లాసుబండిలో.ఎంతలేసి ఉత్తరాలు వ్రాసింది. పద్మ? చదివితే రాళ్లుకూడా కరిగిపోతా యే! నేనంత కర్కశహృదయుడనయాను! ఎన్నిసార్లుచదివినా తనివితీరదే! అను కొంటూ పెట్టెతలుపుతీసి తన రహస్యఉత్త రాలసంచీకోసం వెదికాడు. కాని లాభం లేకపోయింది. బెంచీనిండా బట్టలూ పుస్త కాలు పరిచేశాడు. వెదికినవే వెదికాడు. తీసినవే తీసాడు. లాభంలేకపోయింది. ఓపెద్ద నిట్టూర్పుతో అన్నీ పెట్లోపడేశాడు. అన్నా ఎంత పనైపోయింది.? టేబిల్ మీదా మర్చి పోయాను దాన్ని? విమలచూస్తే కొంప మునుగుతుందే? ఊఁ, కానీ! మాశ్యామా నివని దబాయిస్తా! అనుకొంటూ నిద్ర పోయాడట్లా.

తనఆస్థికి తనే యజమాని. రాగానే ఆస్తిని వంతులు వేయించేసాను. ఓవంతు భార్యపేర వ్రాయించి రిజిష్టరుచేయించి ఆదస్తావేజులు మరి పద్మ తనవద్దకు రానవు సరం లేదనిన్నీ, తాను మనోవివాహంచేసు కొన్నానని వ్రాసిన ఓఉత్తరం పెళ్లాం పేర పంపేశాడు. ఇల్లంతా నవీనపద్ధతి ననుస రించి అలంకరింపజేసాడు. వీధిలోనూ పెర ట్లోను పూలచెట్లూ మొదలైనవి పాతిం చాడు. మునపటికన్నా వేయిరెట్లానందంగా ఉన్నాదతనికి ఇప్పుడా ఇంట్లో ఉండడానికి. ఎప్పుడు మదరాసునుంచి ఉత్తరంవస్తుంది, ఎప్పుడు విమలను తీసుకురావడానికి వెళదాం అని స్వాతివానకు ముత్యపుచిప్పల్లాగు చూస్తున్నాడు ప్రసాదం విమలఉత్తరానికి.

ఆత్మహత్య!

బారిష్టరు రామకృష్ణారావునాయుడు గారికుమార్తె విమల (వయస్సు 19 సం॥) ఈరాత్రి ఎనిమిదిగంటలకు విషముత్రావి ఆత్మహత్య గావించుకొనెను. ఆమె ఈక్రింది ఉత్తరమును తనభర్త కందచేయమని వ్రాసి ఉంచెను.

ఆర్యా!

నమస్కారములు—

నేనువ్రాసే ఈక్రింది కొలదిపంక్తులను సావధానచిత్తులై చదివి నా తుదికోరికప్రకా రం మీరాచరించి నాఆత్మను శాంతిపరుప ప్రార్థిస్తున్నాను. నేనిట్టి సాహసకృత్యానికి గడంగితినని మీరు నాపై అలుగవలదని ప్రార్థన. మీరింకనూ పవిత్రమైనప్రేమ అన నెట్టిదో ఎరగనికారణంచే ఇట్లు చేయవలసి వచ్చెను.

అహా! పద్మాదేవీ' సుశీలా! నీకు నా హృదయపూర్వకవందనములు. 'సీతారాం' నీవెంత మనోహరంగా ఉన్నావోయ్. ఆ దంపతులరూపం నీయందా విధాత ఎట్లు చిత్రించినాడు! అట్టివారిని నాకొరకా

మీరు త్యజించారు? ఎంత దారుణకృత్యం చేసారు! తమరు ప్రణయసౌఖ్యము పొందిన వారని తెలసిన నేను మిమ్ములను చేపట్టనన్న భయముచేతనా ఇట్లాచరించారు? ఆహా, నేనుకూడా ఆమట్టిబొమ్మనేకదా! నాకొరకు మీ ఆనందదాయకమగు సంసారమును మట్టిపాలుచేసారా? అట్టి పతివ్రతామతల్లిని వేరుంచిరా? అట్టి ముద్దుపాపని చూడకుంటిరా? ఆమె ప్రణయతాపము-ఆమె ప్రణయ జ్వాల మనలను దహింపకుండుననుకొంటిరా?

'శీతారాం'—ఆముద్దుబాలుని ఛాయా చిత్రమైన మీహృదయాన్ని కరగింపలేదా. మాతాబాలు లెంతకృశించిరో గదా! దీని కంతటికిని మీకృత్రిమ ప్రేమయేగదా,— కాదుకాదు క్షమింపుడు, నాఈ అనిత్య వయోరూపమేకదా మూలకారణము.

మీసంసారవృక్షమును ఈ 'విమల' అనే వేరుపురుగేకదా నాశనంచేస్తూంది! అందు చేదీనికి ప్రతిక్రియ ఆవేరుపురుగును ధ్వంసము చేసి ఆవృక్షమును ఫలభరితముగా చేయుటయేగదా! అందుచే నేటితో ఈ విమల ఈ బాహ్యప్రపంచాన్ని విడుస్తూంది. ఎందుకొరకు?—పద్మాప్రసాదుల ప్రణయ లతాభివృద్ధికొరకు!

తమరు నాఈ తుదికోర్కెను పాలింప ప్రార్థితులు. ఏమన నాయందు (అస్వాభావిక) ప్రేమచే మీరు విరాగులుగాక నా సోదరియగు పద్మాదేవియందు మునుపటి ప్రేమతో వర్తిల్లుచూ నాఆత్మకు శాంతి కల్గింప ప్రార్థించుచున్నాను. దీనికి ప్రతిఫలముగా నేను సదా నాసోదరియందు ప్రతిబింబించుచున్నాను.

నాచిట్టి 'శీతారాం'కు ముద్దులతోనూ పవిత్రులగు మీ పద్మాప్రసాదులకు నాతుది వందనములతోను ముగించుచున్నాను.

మీపదదాసి,

విమల.

ఈ ఉత్తరం శ్యామంచదివి వినిపించాడు ప్రసాదానికి 'ఆంధ్రపత్రిక'లోంచి. ప్రసాదం వెర్రెత్తినవాడిలా బెదరినచూపుల్తో చూస్తున్నాడు. తనంతటతాను మళ్లీ చదివాడు. ఈసారి ఆడదానికన్నా వేయిరెట్లధికంగా ఏడుస్తున్నాడు. అట్లాగే తెలివితప్పేడు.

ఓగంటదాకా తెలివిరాలేదు. తెలివి వచ్చాక ఓదార్చాడు 'శ్యామం' ప్రసాదాన్ని. వారిరువురు కనులుమూసికొని 'విమల'ను ధ్యానించారు ఓ రెండునిముషాలు. ప్రసాదం కళ్లలోంచి బయలుదేరాయి అశ్రుకాలువలు. ఆమె త్యాగానికాశ్చర్యపోయాడు. పశ్చాత్తాపంవచ్చింది వెంటనే అతనికి.

* *

'పద్మాప్రసాదం'లు మునపట్లా చిలుకాగోరింకల్లాగున్నారు. ప్రసాదం విశాఖపట్నంలో బోర్డుకట్టాడు. ఇప్పుడు వాళ్ల ప్రేమలతకు 'విమలా' పుష్పం పూసింది.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రిగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, [లిమిటెడ్.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. నూకరాజుగారు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: పంతుల సత్యనారాయణగారు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు
కాకినాడ: నున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్‌బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజీశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
మచిలీపట్టణం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్ పేట.
కర్నూలు: టి. బాలనాగయ్యశెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకోనుడు.

# నీ కర్తవ్యము

శ్రీమతి జటావల్లభుల వెంకటరత్నమ్మగారు

పూతమనోవికాసమును ♦ పూర్వగుణాను గుణార్యధర్మముల్
చేతలజూపి, భర్తృపద ♦ సేవననన్యయశఃప్రకాశివై
యేతటినైన ప్రాచ్యమత ♦ మేగని, యన్యకులాంగనాళి ని
ర్ణేతవుగామెలంగు, మిదె ♦ నీవిధి, భారతజాతిరత్నమా!

పుట్టుక భారతావనిని ♦ బుద్ధిశ్రుతిస్మృతిమూలబీజ, మె
ప్పట్టున సాటిలేని గుణ ♦ వంతులు పూర్వులు, భర్తృపాదముల్
పట్టు పతివ్రతామణుల ♦ వంశముగల్గిన పూతమైన నీ
యట్టి కులాంగనల్ జగము ♦ నందిఁకనుండరు; నమ్మ! మమ్మరో?

గౌరవరీతి, పూజ్యత, య ♦ ఖండసుఖాస్పద కార్యనిర్ణయం
బారయ వేదశాస్త్రముల ♦ యందును నీకు ప్రధానపీఠమే!
భారముగాస్వతంత్రమను ♦ భావము వేఱొకటందనేలనో
తీరికనింటఁగూర్చొన న ♦ దేయొక స్వేచ్ఛయటంచునెంచవో?

కాలములోనమార్పులును ♦ గల్గుటమంచిదె విద్యలన్, గలా
లీలలనందవచ్చు, విప ♦ రీతపుబుద్ధి, ననన్యలభ్యస
చ్ఛీల పతివ్రతాచరణ ♦ చేటనిచెప్ప జనంబులెల్ల నీ
మూలమునన్ సుబుద్ధిగను ♦ బోధలజేయుచునుండు మెప్పుడున్

పోయెను దేశభాగ్యమెటొ, ♦ పోయినవాత్మవిశేషశక్తులున్
పోయె ననర్ఘ్యవిద్యలును, ♦ పోయియుబోవక, నన్యదేశముల్
మీఁదొమెడ గౌరవించెడు న ♦ మేయపతివ్రతమన్నశక్తి యే
మాయని మార్గమేదో కను ♦ మా! గృహలక్ష్మిమరో! యిద్దెముఖ్యమా.

# పుష్పచయము

## కవలలగన్న పురుషుఁడు

మనము సర్వసాధారణముగా పురాణములందు వినుచున్న పెక్కు విచిత్ర విషయములను ప్రకృతివిరుద్ధములని త్రోసివేయుచుండుట క్రొత్తగాదు. కర్ణునిజననము, మాంధాతపుట్టుక మొదలగు వృత్తాంతము లీవింతలందు జేరినవే. శాస్త్రకారు లీ విషయములనుగూర్చి పరిశోధించుచునేయున్నారు.

పురుషులు గర్భము ధరించు విషయమునుగూర్చి "Medical Critic and Guide" (New York)నందు రోముదేశమందలి కర్రే ఇటాలికాలోని వృత్తాంతమొకటి వ్రాయబడినది. అందిట్లు గలదు :

"కొన్నివారములకు ముందు బెల్‌గ్రేడు నగరమునగల జెనరల్ హాస్పిటలుకు జివోట జోబూవిక్ అను 22 సంవత్సరముల కర్షకయువకుడు వచ్చి కడుపునొప్పియని జెప్పెను. పరీక్షచేయగా కడుపునం దేదో ప్రబలముగ పెరిగియున్నట్లు గనపడెను. దానిని పరీక్షించుటకు శస్త్రచికిత్స ఆవశ్యకమయ్యెను. ప్రపంచ ఖ్యాతిగడించిన డాక్టరు హారిక్ ఆ యువకునికడుపు ఆపరేషన్‌చేసి అందుండిన 10 అం. 5 అం. పొడవుండిన రెండు పిండములను బైటికిదీసిరి.

పెద్దపిండమునకు చక్కగా అభివృద్ధిజెంది తల పండ్లతోగూడిన నోరు, మెడ, గొంతు గలవు. ఒకచేతికి ఆరువ్రేళ్లుండి యెడమచేయివ్రేళ్లకు నిడుపైన గోళ్లుండెను! చిన్నపిండము ఆకారవిహీనముగనుండెను. కాని దానికి లాతికంటెను కఠినమైన రెండు పెద్దకనులుండెను. ఈ యసాధారణవిషయము స్వల్పకాలములో బెల్‌గ్రేడంతయు వ్యాపించి జనులు తండోపతండములుగ రాసాగిరి. పోలీసువారు జనప్రవాహ మాపవలసివచ్చెను.

ఈ ప్రకృతివైచిత్రమున కేమియుజెప్పజాలక డాక్టర్లు కనులు తేలవైచుచున్నారు.

## స్త్రీయైన పురుషుడు!

క్రిందటిమాసపు గృహలక్ష్మియందు పురుషుడైన స్త్రీనిగురించి జదివి పాఠకు లచ్చెరువొందియుందురు. పురుషుఁడయ్యు స్త్రీగా నెంచబడిన యీ క్రిందివిషయముగూడ పాఠకులకు వినోదముగనుండును.

కెవిలియర్ డి. ఎన్ ఫ్రాన్సునందు 1728 సంవత్సరమున జన్మించెను. అతఁడు గొప్ప రాజకీయవేత్తయై 34 సం. ప్రాయమున ఫ్రెంచిరాయబారితోగూడి యింగ్లండు కరిగెను. అచట పెక్కుమంది మిత్రులను గూర్చికొని అప్పులపాలయ్యెను. కాని అతని సరళస్వభావము హాస్యప్రియత్వము పెక్కుమంది మిత్రులను గూర్చుచునేయుండెను. అప్పులబాధ అధికమయ్యెను. అపుడే తనకు గానివాడొకడు డి. ఎన్ పురుషుఁడేగాడనియు సుందరమగు స్త్రీయనియు వొకవదంతి పుట్టించెను.

అతనికి కోపమువచ్చెను. తన్నట్లనువారితో ద్వంద్వయుద్ధమును దిగెను. కోర్టులందు వ్యాజ్యములు దెచ్చెను. తనతో నెవరును ద్వంద్వయుద్ధమునకు రాకైరి; పైపెచ్చుగ కోర్టు అతఁడు స్త్రీ అనియే తీర్మానించెను !!

## పుష్ప చయము

స్పష్టముగ తాను పురుషుడయ్యు చట్టము తనను స్త్రీని జేసి పైచినదాని కాత దతీనులభముగా, వ్యతిరేకసాక్ష్యము జూపియుండవచ్చును గాని, స్త్రీగా నూతనజీవనము సుఖముగా గడుపవచ్చుననుకొని కోర్టులో తాను స్త్రీనేయని ఒప్పుకొనెను. తరువాత స్త్రీవలె దుస్తుల ధరించి తిరుగుచు, పదునెనిమిదవ శతాబ్దమున సౌందర్యవంతురాండ్రగు స్త్రీలలో నొకతెగా పేరొందెను!

### దొంగలుకూడా యెన్నోరకాలు

ఇటీవల బాల్కన్సులో నొకడు దొంగతనమువలన 80 సిల్కుషర్ట్లు, 100 జతలు సిల్కుమేజోళ్లు, 15 క్రొత్తసూట్లు సేకరించాడట! ప్రపంచమునకంతయు చక్కనివస్త్రముల నెప్పుడు ధరించు తస్కరమహాశయుడితడే గాబోలు. ఇంకొకడు జర్మనిలో చర్చిగంటకాడ దొంగలించాడట. తెల్లవారి యధాప్రకారము చర్చిగంట వినిపించనందున ఆ గ్రామవాసులందరు చాలకాలము నిద్రపోయిరట!

విద్యాసక్తి మిక్కుటముగాగల యొక దొంగబహద్దరు బెంగాలునందు చోటాకాలియా యందు పుస్తకభాండాగారమందలి పుస్తకములు, వాని నుంచుకొను అలమారులు మొదలగు కావలసిన సామానులన్నియు దొంగలించెనట!

కొన్ని నెలలకు ముందు లండనునగరమున వెంబుల్డన్ పార్కునందు 40 పక్షుల నొకడు దొంగలింపగా అమెరికాయందు సాల్టులేక్ నగరమందలి జంతుప్రదర్శనశాలలోని రెండు సింహముల నింకొకడు దొంగలించెను. వీరు ప్రకృతియం దిష్టముండు చోరాగ్రేసరులు గాబోలు.

ప్రాన్సునందు బర్గోయిన్ నం దొక చర్చిలోనున్న కొయ్యవిగ్రహ మొకడు దొంగలించెనట! అమెరికాయం దింకొకడు లేక్‌పోర్టునందు నివాసములేని యొకయింటిని ఇటుకలు, కొయ్యలనుగూడ విడువక యింటి నంతయు దొంగలించెను. కాని ఆ యింటియందున్న నేళమాళిగనుమాత్రము విడిచిపోయెను!

మాసిడోనియాదేశ మీ చోరులవిషయమున గర్వింపదగిన దొకటిగలదు. ఆదేశమునగల ఘోర్ట్రోఫిట్జి అను రైల్వేస్టేషను అధికారులు తెరుచుటకు పూనుకొన్న నాటిరాత్రి దొంగలింపబడినది! కోళ్ల గూడెవరికైన గావలసియుండెనేమొ?

### పాట పదునారు ఆత్మహత్యలకు కారణమైనది!

హంగేరిదేశమందు పదునారుమంది ప్రియులు (కాముకీకాముకులు) ఆత్మహత్య జేసికొన్నారు. వారి ఆత్మహత్యలకు ముఖ్యమైన కారణ మెక్కపాటయని దేలినది. దాని నిపుడు ప్రభుత్వమువారు నిషేధించిరి.

లాస్‌జ్లో జోవల్ ఒకస్త్రీని గాఢముగ ప్రేమించినాడు. కాని ఆశాభంగము గల్గినది. భగ్నహృదయుడైనాడు. ఆబాధచే పెక్కుమారు లాత్మహత్యాప్రయత్నమునకు దిగినాడు. తుదకు తన బాధనంతయు వెళ్లగక్కుచు నొక్కపాట రచించి కొంచము శాంతించినాడు. ఆపాటను విన్నవారందరు తమ బాధను తలంచుకొని ఆత్మహత్యలకు ప్రారంభము జేసిరి.

బుడాపెస్టునం దొకహోటలునం దొకయువకుడు తన ప్రియురాలితో వివాదమాడి పైపాటను బాడుచుండ విని యేకాంతజీవితము దుర్భరమని ఆత్మహత్య జేసికొనెను. అత డా సమాచారము నొక ఉత్తరములో వ్రాసియుంచెను. ఈవిధముగనే పాటవిని తమబాధలు ద్విగుణీకృతముకాగ పదునారుమంది ఆత్మహత్యల

అందుచే ప్రస్తుతము కొంతకాలమువఱకు ప్రభుత్వమువారిచేటగాని ఈపాట పాడకుండునట్లు గావించియున్నారు. ఈపాట నాంగ్లమున గ్లూమియస్ట్ సండె (Gloomiest Sunday) అందురు.

—United Press.

## చేతివ్రాత శీలమును దెలుపును !

వ్రాతనుబట్టి మనుష్యుల స్వభావములను గుణములను గనిపెట్టు పద్ధతి వింతగనుండును. దీనినిగూర్చి చక్కగ చేర్చుకొనవలయునన్న చేవ్రాలుతో ముందారంభింపవలయును. ఏవ్యక్తి చేవ్రాలైన కుడివైపున పైకి బోయియున్న అత్యాశ, అన్నియు మన మేలుకొరకే అను స్వభావముగల్గియుండును. క్రమక్రమముగా వ్రాత క్రిందకు వ్రాలుచున్న నిరాశాపూరితుడై ప్రపంచమే చెడ్డదని తలంచుచుండును. చేవ్రాలు క్రింద చక్కని గీతలున్న కల్పనాశక్తి. క్రింద ఒకేగీత నేరుగనున్న స్థిరచిత్తుడై నమ్మదగిన వ్యక్తియైయుండును. చేవ్రాలు క్రింద వంకరగీతయుండిన పరిహాసప్రియుడు.

అక్షరములు ఎడమప్రక్కకు వ్రాలియున్న ఉదాసీనము; సరళస్వభావుడు గాడు. కుడిప్రక్కకు వ్రాలియున్న ప్రేమపూరితహృదయుడు. నేరుగనున్న నిశ్చితస్వభావము; మనోబలమెక్కువ.

అక్షరములపరిమాణముగూడ శీలమును దెలుపును. చిన్నగవ్రాయువారు ఏకాగ్రత, వివరములందని ప్రీతిగల్గియుందురు. పెద్దక్షరములు వ్రాయువారికి విశాలహృదయముండును. సాధారణపువ్రాత మధ్య తరగతికి జెందును. అక్షరముల మధ్యచోటు దూరముగనున్న ఔదార్యము; అక్షరములు చాలదగ్గరగ నున్న పిసినిగొట్టుతనము. సాధారణముగనున్న డబ్బువిషయమున శ్రద్ధగలిగియుండును.

కాపీ వ్రాసినదానివలె వ్రాత సుందరముగనుండునేని వ్యక్తిత్వముగాని, శక్తిగానియుండదు. మందముగ (లావుగ)నుండు వ్రాత సులభముగా లోబడని శీలమును దెలుపును. ఒత్తివ్రాయుటయందు హెచ్చు తగ్గులు లేకున్న సామర్థ్యము గల్గియుండును.

మొదటియక్షరములు (Capitals) అలంకరింపకుండ వ్రాయబడెనేని, పరిజ్ఞానము, మంచివానియందభిరుచి దెలుపును. అచ్చునందువలె వ్రాయబడిన కళారాధన తెలుపును.

(జి. హెచ్. మోహిలి)

## సంసారం సౌఖ్యంతో చల్లగా సాగిపోవాలంటే !

భార్యాభర్తలకుమధ్య చీటికిమాటికి చీదరింపులుగలిగి సంసారము లెన్నియో సంతోషము జూడక నుండుటకు కారణములు కాలిఫోర్నియాయం దిరువురు డాక్టరులు కనుగొన్నారు. ఆకారణ మిది :

"నీవు వివాహానంతరము సౌఖ్యపడదలంచుచో అత్త ఉత్తమురాలుగానుండునట్లు గమనించుము. సంతోషసౌఖ్యములతో తులదూగుచున్న 99 దంపతులను తీసికొనగా నందులో నూటికి 83 మంది భార్యల తలిదండ్రులు తమ జీవితములను సంతోషముగా గడపినవారైయుండిరి. భర్తలయొక్క తలిదండ్రులలో నూటికి 88 మంది సంతోషసౌఖ్యము లనుభవించినవారే ! వీరిలో నూటికి 87 మంది తమ వంశములందు సంతోషవంతముగు వివాహములాడినవారే ! వయస్సునకు సౌఖ్యమునకు సంబంధము గన్పింపలేదు.

"పుత్రులవలన సుఖము గన్పడలేదు. పుత్రులున్నందున విడాకులు గలుగకయుండవచ్చునేమో గాని, తలిదండ్రుల సంతోషసౌఖ్యములకు పుత్రులకు ఈ పరిశోధనయం దేమియు సంబంధము గన్పడలేదు. కాని పుత్రులు కావలయునా వలదాయను విషయము భార్యాభర్తల మధ్య చాల ముఖ్యమైనది."

(బి. క్రానికల్)

# గ్రంథపరిచయము

**నీతిగీతికలు** — 16 పేజీలు. వెల 0-2-0 స్నేహలతా కవితాసంఘమున 49 వ పుష్పముగా వెలువడినది. రచయిత గ్రంధము వెంకటనరసింహాచార్యులుగారు. ఇందు నీతిబోధకములై సులభగ్రాహ్యములైన నలుపదిగీతములుగలవు.

**లక్ష్మీస్తోత్ర నక్షత్రమాల** — 4 పేజీలు. వెల 0-2-0 స్నేహలతా కవితాసంఘమున 39 పుష్పముగా వెలువడినది. వఠిపె వేంకటరావుగారు రచించిరి. ఇందు హృద్యములైన 27 కందములుగలవు.

**మాడపాటి హనుమంతరావుగారి జీవితము** — 20 పేజీలు. వెల్దుర్తి మాణిక్యరావుగారు రచించిరి. శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారు నైజామురాజ్యమున పేరెన్నికగన్న యాంధ్రులు. వీరి దేశభక్తి, ప్రజోపకార్యములందు నిరంతరపరిశ్రమ, ఆంధ్రభాషను నైజామురాజ్యమందుగల యాంధ్రజాతీయతాయాభివృద్ధికిని పాటుబడుటయందలి యక్కరయు శ్లాఘనీయము. ఈచరిత్ర వ్రాయుటయందు గ్రంథకర్తగారి యుద్దేశ్యము "తమనాయకుల తొ మెలుగుట గొప్పసాధనమను తత్త్వమునుజూచి, వీరపూజయే పురోవృద్ధికి సాధనమని" యెంచుటైయున్నది, గాని యిట్టివారల చరిత్ర యింతక్లుప్తముగ వ్రాసినచో పై యుద్దేశ్యము నెరవేరజాలదు. ఇంకను వివరములతో వారిజీవితము ప్రకటించియున్న బాగుండెడిది. ఈ పుస్తకము వలయువారు గ్రంథకర్తగారికి గోలకొండ పత్రికఆఫీసునకు తపాలకర్చులకు బిళ్లలపంపిన బడయగలరు.

**శ్రీ భర్గశతకము** — ఆధునికకవులలో పెక్కుగ్రంథములను రచించి కవిసార్వభౌమ బిరుదమును బడసిన కూచిమంచి తిమ్మయకవి ప్రణీతము. వారి వంశీయులగు కూచిమంచి శ్రీరామమూర్తిగారిచే ప్రకటింపబడినది. ఇందు మనోహరమగు 101 పద్యములు 'భర్గా! పార్వతీవల్లభా' అను మకుటముతో నున్నవి. తిమ్మకవిగారి కవిత్వ మాంధ్రలోకమునకు నూతనముగాదు కావున యీశతకమునుగూర్చి వేరుగావ్రాయ నవసరములేదు. ఈపుస్తకము, కూచిమంచి శ్రీరామమూర్తి, అముద్రితాంధ్రగీర్వాణగ్రంథమాల, గెద్దనాపల్లి, పెద్దాపురం తాలూకావారికి వ్రాసిన దొరకును.

**హిందూదేశము ఫెడరలు ప్రభుత్వము** — 28 పుటలు. వెల 1 అణా. గ్రంథకర్త కె. వి. పున్నయ్యగారు ఎం. ఎ, (ఆనర్సు) రావు శర్మకంపెని, అనకాపల్లి, ప్రకటించిరి. ఫెడరలు విధానమునుగూర్చి యిందు క్లుప్తముగగలదు.

**నైవేద్యము** — గ్రంథకర్త బులుసు రామలింగస్వామిగారు. ఇది యాంధ్రభారతికి స్వామిగారి కవితాప్రసాద 'నైవేద్యము.' ఇందు 116 పద్యములున్నవి. కవిత ధారాళమై చదువరుల మనసు రంజింపజేయుచున్నది.

**సౌభద్రుని ప్రణయయాత్ర** ఇది రసతరంగిణియందు 6 వదిగా వెలువడినది. గ్రంథకర్తనాయని సుబ్బారావుగారు. 136 పుటలు. వెల తెలియదు. పవిత్ర ప్రణయము పరమాత్మనిసృష్టిలో పరమోత్కృష్టమైనది. అందలి పవిత్రతను, ఆనందమును యీకవి కనులకు గట్టినట్లు వర్ణించియున్నారు. ఇందలి పద్యములు హృద్యములైయున్నవి.

**శ్రీ కుచేలోపాఖ్యానము** ఇది మూడాశ్వాసముల పద్యకావ్యము. గ్రంథకర్త్రి శ్రీమతి దేచిరాజులక్ష్మీనరసమ్మగారు, దేచిరాజు రామారావుగారు, పాతగుంటూరు, ప్రకటించిరి. వెల 0-3-0. ఈమె యిదివఱకే రామచరిత్రము, శ్రీరామశతకమును రచించి వన్నెకెక్కిన విదుషీమణి. ఈ పద్యవకావ్యము మనోహరమై బమ్మెరపోతన భాగవతకథాసరణిని తలపింపజేయుచున్నది. కవనము ధారాశుద్ధిగలిగి సరళముగనున్నది.

# పత్రికాపరిచయము

## భారతీయవైశ్య పత్రిక

శ్రీయుత అన్నవరపు సుబ్బరావు గుప్తగారి సంపాదకత్వమున బెజవాడలో ప్రతి గురువారము ప్రకటింపబడుచున్నది. ఇది పేరు సూచించెడిరీతి వైశ్యులకు సంబంధించిన విషయములను చర్చించునదయ్యు, ప్రపంచవార్తలకును వాఙ్మయ సినిమా విషయములకుగూడ చోటిచ్చుచున్నది. తగిన యాదరమును బడయునని తలంచెదము. వార్షికపుచందా 3-4-0. క్రౌన్ సైజు ఫోలియో 12 పుటలు.

## కాలక్షేపము

నరసాపురమందు శ్రీయుత కొప్పర్తి సీతారామయ్యగారి సంపాదకత్వమున "సచిత్ర సర్వవిషయ నెలసరి" యై, "ఆంధ్రవిజ్ఞాన సర్వస్వసంపాదక" యై, వెలువడుచున్నది. క్రౌను 1/4 సైజు. వెల యైదుకానులు. పత్రికను "ఒక స్టాండర్డుపోలసిలో నడిపింపవలయు"నని వీరి యాశయము. ఇందు వివిధవిషయములకు సంబంధించిన వ్యాసములుగలవు. ఈ 'కాలక్షేపం' ఆంధ్రులు కాలక్షేపాని కుపయోగపడుగాక.

## పుష్పాంజలి మాసపత్రిక

రాజమండ్రియందు శ్రీయుత బొమ్మలూరి సుందరరామయ్యగారి సంపాదకత్వమున వెలువడుచున్నది. డెమ్మీ 1/8 సైజు. చందాలు వివిధతరగతులు గలవు. సాధారణచందాదార్లు 1 నుండి 4 రు. వరకు యివ్వవచ్చును. ఈ "పుష్పాంజలియందు సేకరించెడి ధర్మపుష్పములన్నియును సాధారణముగా విద్యారణ్యమునందలి ఋగాది వేద మహావృక్షములనుండియును వాని ననుసరించుచు వానినీడనే పెరిగి పెద్దవైన స్మృతిలతలనుండియు నుత్పన్నములైనవిగా నుండునేమో కాని యార్షమతమున కేమాత్రమును భిన్నములైనవి గావు." "పూర్వరుచులపై వేడ్కపాడమిన" అది, ఈపత్రికప్రకారము, రోగలక్షణము గాని మరేమియు గాదు. ప్రపంచము నాగరకతాభివృద్ధితో ముందున కరుగుచుండ మనము 'వేదవిద్యారణ్యములకు' వెనుకకు వెళ్లిన యెంత మేలుగలుగునో యీపత్రిక జూపగలుగునేమో ? ఈసంచికయందు చాతుర్వర్ణ్యములు, పంచమహాయజ్ఞములు, వేదపఠనావశ్య

# ప త్రి కా ప రి చ య ము

కత, యాజ్ఞవల్క్యచరిత్రము మొదలగువ్యాసములు గలవు. ఆంధ్రులీపత్రిక నుచితరీతి ఆదరింతురని తలంచుచున్నాము.

## శా ర ద

శ్రీమతి పాటూరు బాలసరస్వతమ్మగారి సంపాదకత్వమున నెల్లూరునందు ప్రతిపౌర్ణమియందును ప్రకటింపబడుచున్నది. ఆంధ్రదేశమున స్త్రీసంపాదకత్వమున ప్రకటింపబడు పత్రికలలో నియ్యది రెండవదిగా వచ్చును. అందుచే నాంధ్రులకిది మగుల యాదరణీయము. ఇందు ఆర్థిక, సాంఘికసారస్వతవిషయములు చర్చింపబడును. ప్రథమసంచికయందుగల పద్యగద్యవ్యాసములు చక్కగనున్నవి. సంవత్సరపుచందా రు. 3-0-0. విడిప్రతి 0-4-0.

## బాలసరస్వతి

శ్రీయుత మాజేటి రామచంద్రరావుగారి సంపాదకత్వమున మాజేరు, చల్లపల్లిపోస్టునుండి, దివి తాలూకా గ్రంథాలయముతరఫున ప్రకటింపబడు సచిత్రమాసపత్రిక. సంవత్సరపు చందా రు I-8-0. మార్చిమాసపు సంచిక నందుకొనుట కానందించుచున్నారము. గ్రంథాలయములే అరుదుగనున్న ఆంధ్రదేశమందు తత్సంబంధమగు పత్రికలవిషయమై యడుగ నక్కరయేలేదు. ఈపత్రిక యీవిషయమునతగు కృషిజేసియాంధ్రుల యాదరణబడయునని కోరుచున్నాము. ఈసంచికయందు గ్రంథాలయములకు సంబంధించినవేగాక వివిధవిషయముల గూర్చి వ్రాసిన పద్యగద్యవ్యాసములు గలవు.

## ము ర ళి

శ్రీ ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము, కాకినాడనుండి వేంకటపార్వతీశ్వరుల సంపాదకత్వమున వెలువడుచున్న సచిత్రమాసపత్రిక. సంవత్సరపు చందా రు I-2-0 విడిప్రతి 0-1-6. ఆంధ్రసారస్వత ప్రపంచమున వేంకటపార్వతీశ్వరులను, వారిరచనలను రెఱుంగనివారుండరు. కావున వారి సంపాదకత్వమున వెలువడు నీపత్రిక మంచిప్రచురణగాంచునని నమ్ముచున్నాము. మేమానందముతో నందుకొన్న మురళి మొదటిసంచికయందు రసవంతములైన పెక్కురచనలుగలవు. "భిన్నగుణములు, భిన్నభావములు, భిన్నమతములు, భిన్నవృత్తులునుగల భిన్నప్రకృతుల యేకీభావమును ప్రతిపాదించుటకే యాంధ్రలోక కళ్యాణకాంక్షిణి"యైన "మురళి గానామృతమునందు కవితామాధుర్యమును, కవితామృతమందు గానమాధుర్యమును ప్రదర్శించుచు" వృద్ధియగుగాక.




## నూతన సంవత్సరము

అనంతకాలవాహినియందు మరల నొక కెరటము లేచినది. యువవెళ్లినది; ధాత ప్రారంభమైనది. నూతనవత్సర ప్రారంభమున ప్రజలకెల్ల సంతోషసౌఖ్యములు గలుగుగాకయని గోరుట సహజము గావున ధాతసంవత్సరము ప్రపంచశాంతిని నెలకొల్పి సౌభాగ్యము నభివృద్ధిబొందించి యెల్లరకు ఆనందోత్సాహములు గల్గించుగాకయని గృహలక్ష్మి వాంఛించుచున్నది.

అరువది సంవత్సరములనాఁడు ధాత జేసిన యవకతవకలను దలంచి కొందరీ నూతనవత్సర మెట్లుండునోయని భయపడుటలో నాశ్చర్యమేమియులేదు. అప్పటి ఘోరపరిస్థితులు దలంచుకొన్నచో నేరికైన శరీరము కంపింపకమానదు. నేటి ధాత తన పూర్వపు నడవడి నెంతమాత్రము మార్చునోయని యందరెదురు చూచుచునేయున్నారు. ఇప్పటికే గంజాము మండలము కఱవుపాలైనది. ఆంధ్రదేశము చీలికలై యితరులపాలగుచున్నది. నలువైపులనుండి యాంధ్రుల హక్కులపై యితరుల దాడిదీయ సాహసించుచునేయున్నారు. అంతఃకల్లోలములు లేవుగాని ఐకమత్యము హుళిక్కి. ఆనందోత్సాహములు సున్న. మనుజుల మాడ్చుటయందు పేరుబొందిన ధాత యిట్టి పరిస్థితులలో నాంధ్రదేశము నేమిచేయునో యని కొందరనుకొన్న విచిత్రమేమి?

ఇఁక ప్రపంచపరిస్థితులను గమనించిన మరింత ఘోరముగనున్నవి. ప్రపంచములో శాంతికి చోటులేదు. ప్రాగ్దేశములలో యుద్ధమేఘము లావరించుచునే యున్నది. నాగరికత నేర్పుమిషతో నన్యాయముగ నిటలీ అబిసీనియాపైబడి అబలలను, నిరాయుధలను, శిశువులను మారణయంత్రములతో చిత్రవధలు జేయుచున్నది. ప్రపంచశాంతిని నెలకొల్పుటకని, సమితి సభ్యులగు దేశీయుల కితరులచే నన్యాయము జరుగుచున్నపుడు వారిని రక్షించి, యన్యాయము జేయువారిని శిక్షించుటకని వేనవేలు ఆదర్శములతో నెలకొల్పబడిన అంతర్జాతీయసమితి ఇటలీ జేసినది చేయుచున్నదిగూడ నన్యాయమని యెఱింగియు, కనులార గాంచుచుండియు, నేమియు జేయక యూరక నీళ్లునములుచు, ఆంక్షలని అవియని యివియని యారుమాసములుగా కాలహరణము చేయుచున్నది. ఇంతలో పిడుగులు వర్షించినరీతి హిట్లరు మహాశయుడు రైనునదీప్రాంతపు సరిహద్దులందు సైన్యములను జేర్చుట కారంభించి ఢంకా మ్రోగించెను. దీనితో యూరపు

ఖండమంతయు గగ్గోలుపుట్టినది. అతిత్వరితముగా యూరపురాజ్యములు విమానములపై నెగిరి యవసరమగు సభల గావించి హిట్లరు గావించినది తప్పని యేకగ్రీవముగ తీర్మానించిరి. ప్రపంచమునయున్న ప్రబల రాజ్యము లన్నిటిలో ఆయుధబలమున నద్వితీయ మనిపించుకొన్న ఫ్రాంసు రష్యా దేశములు జర్మని తలయెత్తినపు డణగద్రొక్కవలయున నెడి యుద్దేశ్యముతో సంధి గావించుకొనినమీదట తన సరిహద్దులు రక్షించుకొనుటకై జర్మని ప్రయత్నించుచే అంతర్జాతీయదృష్టిలో తప్పగుచో (జర్మనీకి సమితి సభ్యత్వములేదు) సమితి సభ్యులై, నిరాయుధయై, శాంతికొరకు వేవిధముల ప్రయత్నించిన అబిసీనియాపై నన్యాయముగ,దుర్మార్గముగ సమితినిధిక్కరించి, దండెత్తిన యిటలి దోషముజేయలేదా! ఆరుమాసములనుండి యీ యన్యాయమును దీర్పజాలని సమితి, జర్మనియెడల నీక్షణమే ప్రతిక్రియలకై ప్రాకులాడు టెందులకు? నిష్కారుణముగా జరుగుచున్న నిరాయుధులవధ నిలుపకుండు టెందులకు? ఇటలీ జేసిన మంచియేమి? జర్మని జేసిన చెడుగేమి? ఇవన్నియు నిష్పక్షపాతబుద్ధితో పరికింతుమేని అంతర్జాతీయసమితి నామమాత్రావశిష్టమనియు, పశుబలమే ధర్మమనియు, స్వార్థపరత్వమే దాని జీవనమున కాధారమనియు దెలియకపోదు. ఇట్టి పరిస్థితులలో ప్రారంభించిన ధాత ప్రజలకు స్వధర్మముల చక్కగ హెచ్చరించి, ప్రపంచశాంతిని చేకూర్చి, తనకు ముందు గల్గియున్న నడిని పోగొట్టుకొని పోవుటకు దైవము తగిన బలమును ప్రసాదించుగాకయని గోరుచున్నాము.

స్త్రీసంస్థ కుదారబహుమతి

హైదరాబాదు (దక్కన్)నందు, సుల్తానుబజారునందున్న బాలికల ఉన్నత పాఠశాల విద్యాభిమానులగు పెక్కు ఉదారపురుషులచే నెలకొల్పబడి క్రమక్రమాభివృద్ధిజెందుచున్నది. ఈ ఉదారపురుషులలో నొక్కరగు స్వర్గీయ కేశవరావుగారి జ్ఞాపకార్థమై వారి పుత్రుడగు శ్రీ వినాయకరావు, విద్యాలంకార్, ఎల్. ఎల్.బి. (లండను) బారిస్టరుగారు, 25 వేలు రూప్యముల విలువగల భూమిని దానమిచ్చిరి. పై పాఠశాలకమిటీ అధ్యక్షుండగు శ్రీ రాజాబహదరు వెంకటరామారెడ్డి ఓ. బి. ఇ.గారు విద్యాలంకారుగారిచ్చిన భూదానము నంగీకరించుచు ఆ చోట యిరువదివేల రూపాయలు కర్చుపెట్టి కావలసిన భవననిర్మాణము జేయుదునని వాగ్దత్తమొసంగిరి. ఇయ్యది శ్లాఘనీయము; ఆనందదాయకముగూడ. శక్తిగలవారందరు యథోచితముగ నిట్టిసంస్థలకు సాయపడి విద్యాభివృద్ధికి తోడ్పడుటకు పైయుదారు లాదర్శప్రాయులుగ నుందురనుటకు సందియములేదు. వీరివలెనే మన యాంధ్రదేశమున—భారతదేశమునం దంతయు—బాలికల విద్యావిషయము చాల గమనింపదగినదనియు, ప్రతివారి సహకా

రము గోరుచున్నదనియు నందరు గుర్తించినచో వీరి యాశయములు ఫలించుటయే గాక విద్యాభివృద్ధికి కారణము గాగలదు.

**శ్రీమతి కమలానెహ్రూగారి నిర్యాణము**

శ్రీమతి కమలానెహ్రూగారి నిర్యాణము జవహరలాల్ గారికిని, నెహ్రూకుటుంబమునకును, భారతదేశమునకును తీరని నష్టము గల్గించెననుటలో సందియములేదు. శ్రీమతిగారి మరణమునకు చింతించుచు, వారి కుటుంబమునకును, నెహ్రూగారికిని హృదయపూర్వకమగు సానుభూతి నందజేయుచున్నాము.

కమలానెహ్రూగారి నెఱుంగని భారతీయులు చాలమందియుండరు. వారి మరణమునకు చింతించుచు, వారి కుటుంబమునకు సానుభూతిని దెలుపుచు, కాశ్మీరము మొదలుకొని కన్యాకుమారియగ్రము వఱకుగల భారతీయులు ప్రతిపట్టణమందును పల్లెలందును సభల జరిపిరి. అంతియగాక ఖండఖండాంతరములనుండువారు సైతము వారి మృతికి వగచుచు నెహ్రూగారికి పంపు సానుభూతి ఉత్తరములప్రవాహ మింకను నాగుటలేదు. ఇట్టి ప్రపంచసానుభూతిని ప్రేమను బడయజాలిన యీ భారత నారీమణియందుగల ప్రభావ మెట్టిది?

కమలానెహ్రూ యెక్కువ విద్యావతి గాదు; పాఠశాలందు పాఠము లభ్యసింపలేదు; కళాశాలలందు కళల నేర్చుకొనలేదు. జీవితమే యామెకు విశ్వవిద్యాలయము. తండోపతండములుగ తన జీవితమందుగల్గిన కష్టములే యామెకు గురువులై పాఠములు నేర్పినవి. ఆమె జీవితము యితరుల కెన్నియో విషయములు నేర్పుచున్నది. టాకూరుగారు వచించిన రీతి "మన మామె జీవితమునుండి ఉత్తమ జాతి ధైర్యమును నేర్చుకొనవలయును."

ఎనలేని సంపదతోగూడిన యింటికోడలయ్యు భర్తగారితోపాటు మహోన్నత త్యాగమును గావించి, నిరంతరము పతి ననుసరించి, భారతమాత దాస్యశృంఖముల సడలింపబోయి ప్రాణమునే ధారబోసినది. భర్తకు నిరంతరము బాసటయై యతని యాదర్శములందు పాల్గొని యాతనికి యుత్సాహము గల్గించినది. అట్టి వీరనారీమణి ప్రకృతప్రపంచమున అద్వితీయముగా స్వదేశీయుల ప్రేమాభిమానములు పూర్తిగ చూరగొనుటలో నాశ్చర్యమేమి?

నెహ్రూగారు, ప్రేమస్వరూపిణియై, నిరంతరముఉత్తేజన మిచ్చు దేవతాస్వరూపమైన తన యర్ధాంగిని, బహిప్రాణమును పోగొట్టుకొన్నారు; భారతమాత తన ప్రియపుత్రిని, తన దాస్యవిముక్తికై ప్రాణముల ధారవోసిన పరమపావనిని నష్టపడినది; భారతీయులు, త్యాగమూర్తియై, అత్యంతధీరయు, ధైర్యశాలియునై మార్గదర్శకురాలగు తమ సోదరిని బాసిరి. అందుచే నందరు సానుభూతి వెల్లడింతురు. నష్టమునకై చింతింతురు. అంతమాత్రముననే కృతజ్ఞత వెల్లడిగాదు, పూర్తియుగాదు. కమల ఆత్మగూడ శాంతింపదు కాని

యామె నాదర్శముగా గాని యామె త్రోవనువీడక యామెదలపెట్టినకార్యమును హృదయపూర్వకముగా ముగింప ప్రతి సోదరీ సోదరులును ప్రయత్నించు వో కమల ఆత్మకు శాంతి తప్పక గలుగును. వట్టి యుపన్యాసములతో రిత్తతీర్మానములతో కాలహరణము జేయుటకంటె ముందంజ వేసి వారివారి శక్త్యానుసారము భరత మాత నుద్ధరించుట మేలు. అదియే కమల ఆశయము.

వంగదేశపు యువతుల పరిస్థితులు

వంగదేశమున నిటీవల సాంఘికముగా చాల మార్పు గల్గినది. ఆచారవ్యవహార ములందు, విద్యావిధానమునందు, వేష భాషలందు గల్గిన యీ మార్పు మంచికి గాక విపరీతముగనున్నది. బాలురతో సమానమగు విద్య, ఆదరణబడసి బాలికలు విద్యాభివృద్ధిబొందుటయు, బాలురకంటె విద్యయం దభిమానము చురుకుదనము గల్గియుండుటయు ముదావహమగు విషయ ములేయయ్యు, వారి నడవడిక వేషభాషలు విపరీతములై పోవుచున్నవి. వేషభాష లనగా కేవలము విదేశీయుల ననుకరించుటయందే నేర్పరితనము జూపుచు మాతృదేశాభి మానముగాని, తదనుకూలమగు వేష భాషలుగాని మృగ్యమై జూపట్టు యనుకర ణము చాల యేవగింపు గల్గించుచున్నదని పత్రికలు వాకొనుచున్నవి. నవీనపద్ధతులపై పట్టభద్రురాండ్రైన నిన్నటి తల్లియే నేటి కులేషను జదివెడి నేటి తనయకు ఏవిషయ మందును జబాబు చెప్పజాలకుండుటయే గాక, వారితో మెలగుటే కష్టమని యెంచుచున్న యీ నూతన విద్యావతులు సంఘమునం దెంత సహృదయముతో వర్తించుచున్నారో తెలియకపోదు. తుచ తప్పక పూర్వాచారముల ప్రకారము వర్తించుచు, ముగ్గుచు, కాలదేశపాత్రముల ననుసరించి మార్పు బొందకయుండుట గర్హనీయము గాని, తనదంతయు నీచమని పెరవారిదంతయు యుత్కృష్టమైనదని యనుకరణముపైననే జీవించుట మరింత గర్హితమైనది. వివాహవయసు వచ్చిన పది వేలు కన్యలు వివాహమాడ నిష్టపడక ఉద్యోగములకై ప్రాకులాడుచున్నారు. కాని పురుషులంటే నిరుద్యోగసమస్య మిక్కుటముగనున్న రోజులలో వీరి కుద్యో గములు దొరుకుట సులభము గాదు.

ఉన్నతవిద్య లభ్యసించుటయు, పురు షులు వెరగంద అన్నివిషయము లందు వారికి దీసిపోరని జూపింప ప్రయత్నిం చుటయు నుత్తమమైనదేగాని, మాతృ భాషను, మన దేశాచారములను, సంఘము నందలి యుత్తమాశయములను తృణీకరించి యనుకరణ ప్రవాహమునబడి గమ్యస్థానము లేక కొట్టుకొనిపోవుచుండిన యుపయోగ ముండునా యను ప్రశ్న యుదయింపక పోదు. ఇతరులనుజూచి తమ పొరపాటుల (ఉన్నచో) సంస్కరించుకొని స్వదేశాభి వృద్ధి సూచకముగ వర్తించిన మంచిది.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గర్భరక్షక

## సుఖప్రసవద్రావకము

స్త్రీలు గర్భము ధరించిన పిమ్మట వారల శరీర ఆరోగ్యము మిక్కిలి చక్కగ నుండవలయును. గర్భము ధరించినపిమ్మట మంచి శరీరారోగ్యము కలిగియుండిన తల్లులకు పుత్రపుత్రికా రత్నంబులు బుట్టి దీర్ఘాయుష్మంతులై యుండెదరు.

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి.

ఈ "గర్భరక్షక" యను దివ్యౌషధమును గర్భము ధరించినది మొదలు ప్రసవించువరకు స్త్రీలు సేవించిన పైకనుపరచిన జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించు వరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు. ప్రసవించిన పిమ్మట సామాన్యముగ కలుగు సూతికా రోగములనుగూడ రానీయక నాటంకపరచును.

ఈ దివ్యౌషధముయొక్క మరియొక అద్భుతమైన మహాత్యమేమన తల్లిదండ్రులు యెంత కురూపులైనను నల్లనివారైనను యీఔషధమును సేవించిన స్త్రీలకు బంగారువంటి శరీరకాంతి కలిగిన సుందరులగు పుత్రపుత్రికా రత్నంబులు బుట్టి సుఖముగ నుండగలరు.

సుందరులైన ముద్దుబిడ్డలను గనవలయునను వాంఛ గలిగిన ప్రతి అబలారత్నము యీ "గర్భరక్షక" యను ఔషధరాజమును పరీక్షించవలయును.

ప్రపంచమున నిట్టి ఔషధముకూడ యుండునాయని కొందరికి ఆశ్చర్యము కలుగవచ్చును. అనుభవము మీద నీ సంశయము మానగలదు.

బుడ్డి 1-కి రు. 2 0 0

# మాదీఫలరసాయనం

## గర్భిణుల వాంతులకు

ఇది ముదిరిన మాదీఫలములరసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. ప్రతివారికి కలుగు సామాన్యమైన తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరు పొందినది. ఇది తేనెవలెనుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔ. బుడ్డి 1-కి 12 అణాలు.

# సౌభాగ్యశొంఠి

## బాలింతలేహము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఔషధమును బాలింతలకు యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈకారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక యల్లమ్మ పుల్లమ్మ జెప్పిన వస్తువులనో లేక అంగడివాడు యిచ్చు వస్తువులనో తెచ్చి మందును తయారు చేయుదురు. ఈ కారమును వుసిరిగకాయంత పరిమాణము మొదలు నిమ్మకాయంతవరకు బాలింతలకు ప్రతిదినము 40 దినములవరకు యిచ్చెదరు. ఈకారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ప్రసవించిన స్త్రీల శరీరము చాల సున్నితమని తెలుసుకొనజాలక యిట్టి మొరటువైద్యమునుచేసి వారిని పలుకష్టములకు పాత్రులుగ చేయుచున్నారు.

ఈ సౌభాగ్యశొంఠిని బాలింతలకు వాడిన ఆరోగ్యము చెడక తల్లియుబిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును. సామాన్యముగ బాలింతలకు వచ్చు బాలింతరోగములు రానేరవు.

వెల బుడ్డి 1-కి రు 1.

# విషయసూచిక



త్రివర్ణచిత్రము

కాకాసురుడు

చిత్రకారుడు: సి. ఎన్. వెంకట్రావు.



# ఆదర్శభారతనారీమణి

“హే భారతీయా! నీ నారీజాతి ఆదర్శము సీతా, సావిత్రి, దమయంతు లనుమాట మరువకుము. నీ యుపాస్యదైవతము సర్వత్యాగియును, ఉమానాథుఁడును అగు శంకరుఁడను విషయమును విస్మరింపకుము. నీవివాహము, ధనము, నీజీవితము, ఇంద్రియసుఖముల కొఱకుఁగాదు. స్వార్థసుఖముల కొఱకుఁగాదు. నీవు నీజన్మముహూర్తముననే మాతకై బలిగా సమర్పింపబడితివి. నీ సంఘము విరాడ్రూపినియగు మహామాయ యొక్క ఛాయమాత్రమే!’

వివేకానంద.

ఆదర్శములేని జీవితము చుక్కానిలేని నావవంటిది; గమ్యస్థానము నెఱుగని పథికుని గమనమువంటిది. సాగరమున దేలియాడుచు గాలివీచినటులెల్ల బోవుచు సాగరతరంగములచే కబళింపబడువఱకు నదేస్థితియందున్న నెంతయుపయోగమో, సంసారసాగరముననుండి ఆహారనిద్రాదుల తృప్తిబొందుచు జీవితకాలము నంతయు నేయాదర్శమునులేక జీవించుటయు నంతియ.

ఆదియందే భారతజాతి యిందలి ప్రాముఖ్యమును గమనించి జీవితమునందలి హెచ్చుతగ్గులుగల యన్ని యంతస్థులవారికి, స్త్రీపురుషులకు, నాదర్శముల నిరూపించిరి. ఈయాశయములతో రచింపబడినవే రామాయణభారతాది గ్రంథములు. వీనియందలి యాదర్శములు సర్వకాలసర్వావస్థల స్త్రీపురుషుల కాదరణీయములు.

భారతస్త్రీకి స్వార్థత్యాగము సేవ యనునవి యాదర్శములు. ఈ యాదర్శములు సీతపాత్రయందు నిండి నిబిడీకృతమైయున్నవి.

సీతచారిత్ర మెందువచ్చినను ఏదేనియాదర్శ మచట ప్రస్ఫుటము గాకపోదు. ఇట్టిదే రామాయణమునందలి కాకాసురవృత్తాంతము. ప్రక్కనుగల త్రివర్ణచిత్రమీ వృత్తాంతమును గూర్చియే చిత్రింపబడినది. దీన సీతయొక్క క్షమాభావమును, సతీపతుల ధర్మమును చక్కగ వివరింపబడినది.

ఇది జరిగినది సీతారాము లరణ్యవాసము చేయుచున్నపుడు. ఆదర్శములతోఁగూడుకొనినదయ్యు నిది చెంతనుండిన లక్ష్మణునికేనియు దెలిసినదికాదు. అవసరము వచ్చినపుడానవాలుగా సీతాదేవి రామునికి వచింపుమని హనుమంతునితోఁ జెప్పినది.

సామ్రాజ్యములు ధనరాసులు సకల సౌఖ్యములు దూరములైననేమి? ప్రాణప్రదముగా ప్రేమించిన సతీపతులిద్దఱొక్కచోటనే యున్నారు. అందుచే వారి కరణ్యమైనను నందనవనవిహారణమువలెనే గన్పట్టినది. అది చిత్రకూటాచల పూర్వోత్తర పార్శ్వము. అందు సిద్ధాశ్రమమను తాపసాశ్రమము. సమీపమునఁ బారుమందాకిని. సతీపతులిద్దఱు నదియందు జలక్రీడలాడి యలసినారు. మొదట సీతాదేవి యాతని యంకశయ్యఁ బరుండి నిద్రించి లేచినది. తరువాత నిజనాథుఁడు తనయశయ్యబరుండి నిద్రింప తానును కునికిపాట్లు పడుచుండినది. అపుడటఁ గాచియున్న కాకి యరుదెంచినది. అంతటనామె 'మేలుఁకొని రామునినిద్రకు నంతరాయమున్ జేయక మెల్లన తలపైకెత్తి' లేచినది. అంత వాయసము 'నిర్భరరీతిని నేగుదెంచి నాపైనిఁ జెలంగుకోపమున భవ్యకుచాంతర సీమఁజీఱె'నది. అంతటితోఁబోక, యదలించినను నిలువక 'ఊనినపూన్కిమై నెగరి యుద్ధతి బల్మిఁజీరజొచ్చె'నది. అద్దానను రక్తబిందువుల తద్దయుఁ జిమ్మగ' నవ్వి సోఁకుటచే శ్రీరాముఁడు తడసెను. అంతట నామె పలుమారు కాకబాధితయయి 'మించగా నిద్రనుగాంచు నాసుందర తమరూపు శ్రీమంతు విమతహరుని మేలుకొల్పి'నది.

శ్రీరాముడును నానందముతో మేల్కానినాడు. కాకి తన సతీమణికొనర్చిన యపరాధమునుగాంచి మండిపడినాడు. ఆకోపమున తన నాసనస్థమగు దర్భ నొకదానిని దానిపై విసరినాఁడు. అది యంత బ్రహ్మాస్త్రమై తాఁకినది. ఇఁక దానికి దిక్కు దెలిసినదికాదు. ఒకటేపరుగు. 'తను నెవ్వరైన గావదగుధన్యులు గల్గుదురే' యంటంచు, భీతిని గొని యెల్లలోకముల తీవ్రగతిం దిరిగె'ను. కాని సాధ్వీలలామలకు నిష్కారణముగ నపకారమొనర్చిన తులువలరక్షింప నెవరు పూనుకొందురు? కాకి తిరిగి శ్రీరాముని శరణుజొచ్చినది. దయానిధి గావున నీకపై నట్టి యపరాధములగావింపక యొక కంటిని తనయస్త్రమునకు బలిగానిచ్చి దానిని రక్షించినాడు. తననాథుని దాంపత్య ధర్మమునకు, దయాస్వభావమునకు సీత సంతసించినది; తన దేవితాల్మికి రాముఁ డెంతయు నలరి నామె నక్కున జేర్చినాఁడు.

# సహకారమా? విధ్వంసమా?

డాక్టరు కొమఱ్ఱాజు అచ్చమాంబగారు

● యువకులు జాతికి ప్రాణమువంటివారు. ఒకరిజీవితములో యౌవనమెంత ముఖ్యమో ఒకజాతికిని అట్లే యువకులు ముఖ్యము. ప్రతిజాతియొక్క మోక్షము తజ్జాతి యువకులచేతనున్నది. మంత్రిపదవిలో కూర్చుండి కార్యభారమున నిమగ్నులయి కార్యక్రమాది విషయనిర్ణయమునకు మీనమేషములు లెక్కించుచుండు వృద్ధులెందఱో ఉన్నారు. ఎందుకు? మాటలందుగాక క్రియారూపమున వర్తనల చెప్పి చూపువారు త్యాగరూపులగు యువకులే. చలించక, యుద్ధాగ్ని నుఱుకువారు యువకులు. అనుభవజ్ఞులగు రాజకీయవేత్తలు తామొకనాడు యువకులుగానుండిరని మఱచి అప్పుడప్పుడు "ఈ యువకుల కేమి తెలియును? ఉత్సాహావేశములతో కూడినయొకవిపరీత సిద్ధాంతమునుబట్టుకొని దానికయి ప్రాకులాడుదురు. అంతే" అని తప్పుడు వ్యాఖ్యానములు చేయుచుండుదురు. యువకుల ప్రత్యేకత తెలిసి దానినివిస్మరించుచుందురు. రాజకీయముగను ఆర్థికముగను మాతృదేశము నుద్ధరించు బాధ్యత కేవలము యువకుల భుజాస్కంధములపైనే యున్నది.

*

అధికారము మద్యసమానము. ఇట్టి యధికార మొకరి యధీనమైనయెడల తల తిరుగకుండుటకు నిజము ఇనుము నరము లుండవలయును.

*

● నూతన ఇండియాచట్టము హిందూదేశమును నిరంతరము బానిసస్థితిలో నుంచుటకే సృష్టింపబడిన రాక్షసమగు రాజ్యాంగప్రసాదము. ఎన్నియో అసంబద్ధములతో నిండియున్న యీరాజ్యాంగచట్టము మనయాదర్శమగు స్వాతంత్ర్యము వైపు శతాంశమైనను జరిగినదని యెవరైన హృదయపూర్వకముగ వచింపగలరా? అంతియుగాదు; మన కిదివఱకున్న కొన్ని హక్కులనుకూడ కాజేసి యీచట్టము మనలను వెనుకకు గొనిపోవుచున్నదని నాదృఢాభిప్రాయము; యుక్తాయుక్తవివేకజ్ఞానముగల యే భారతీయుడైనను దీనిని కాదనజాలడు. రాజ్యాంగనిర్మాణచరిత్రయందిదియపూర్వము.

● మన మంత్రులలో నొకరు తమ ఆవేశములో—అధికారము పుచ్చుకొన్న రెండువారములకే సుమండీ!—గవర్నరుగారిని మార్గదర్శి, వేదాంతి, చెలికాడు అని సంబోధించినారు. ఈ సంబుద్ధి పరమార్థమేమో నాకు గోచరమవుటలేదు. ఒకానొక ఉద్యోగమునకు తన అధికారరీత్యా ఐ. యం. యస్.కు జెందని యొక భారతీయుని నియమించుటలో గవర్నరుగారు తన కడ్డు తగులలేదన్నమాత్రాన ఈ మంత్రిగారి కిట్టి

అనకతవక వాక్యములాడుట భావ్యమేయగునా? ముకుందలాలు సర్కార్ సోదరుని నిటీవల విడుదలచేసినప్పుడు కొన్ని షరత్తుల విధించిరిగదా! రాజకీయనిర్బంధితుల విడుదల, అధికారము చేబట్టిన మరునాడే జరుగవలసినట్టి ఒక అల్పవిషయము. ఇట్టిది నేటికిని అందరికిని తృప్తికరముగా పూర్తికాలేదు. విడుదలసందర్భమునను, పత్రికల ముద్రణాలయముల ధరావతు వాపసుచేయు సందర్భమునను, మంత్రులు కోరుచుండు విపరీత, అనవసర షరత్తులు చూచినయెడల అధికారవాత మెట్లు వీచుచున్నదో తెలియగలదు. అతిజాగరూకతతో వర్తించు ప్రఖ్యాతిపాత్రులయిన ప్రధానమంత్రిగారు సైతము జీతములు, సౌకర్యాది విషయములందు యూరోపియనుల పొంత పోరాదనియు ఏలన అట్టివానికి వారలవాటుపడినారు కావున—అనియు నుపన్యసించుచున్నారు. అక్షరశః ఇది మనకు మ్రింగరాని అతిమాత్ర. ఇది యొక విపరీత నీతిసారము. దీనియెడ మనమెట్లు సానుభూతి చూపగలము?

● జాతీయపతాకము, జాతీయగీతము, రాజకీయ నిర్బంధితులు, వీరిమొదలగల నిషేధముల తొలగించుటతోడనే మన్ను మిన్ను తెలియకున్నారు మనవారు. ఇవి చూడచూడ అత్యంత స్వల్పవిషయములు, ప్రాణరహితములును. ఆయువుపట్టులగు ముఖ్యతమ విషయములందు వీరేమి చేయగలిగినారో చూడుడు: జమీాందారిపద్ధతి నిర్మూలించుట, మరణపుపన్నులు (Death Duties) విధించుట మొదలగు విషయములందు నిజముగా వీరు కార్యవాదులగుచో గవర్నరుతోడను యూరోపియన్లతోడను డీకొనవలసివచ్చునుగదా? అండమాన్ ఖైదీల విషయమున నెవ్వరుగాని ఆఁ ఊఁ అని లేశమైన అనగల్గిరా? పట్టుదలతో నీ కార్యము నిర్వహింపదలచినయెడల గవర్నర్లకుగాని రాజప్రతినిధికిగాని తమకుండు ప్రత్యేకబాధ్యతాధికారమును అమలులో బెట్టవలసియుండును; కాని మన కాంగ్రెసు మంత్రుల కా ధైర్యముకలదా? ప్రత్యేక బాధ్యతాప్రయోగమనగా శాసనసభలు గాలికిపోవును. అయిన కాంగ్రెసువారు మంత్రిపదవుల నేల స్వీకరించిరి? ఎచ్చటగాని నిరోధములేకుండ ప్రతివిషయమునందును ప్రభుత్వముతో సహకారమొనర్చుటకా? లేక కొన్ని యున్నతాశయముల కండగానున్నది కాంగ్రెసుసంస్థ యొక్కటే అని ప్రపంచమునకు చాటి యెట్లయినగానీ, తదాశయప్రాప్తి కెంత త్యాగముసేయుటకయిన నది సిద్ధముగానున్నదని చెప్పి నిరూపించుటకా? అండమాన్‌లోని నిర్బంధితులను తిరుగా వారివారి రాష్ట్రమునకు పంపివేయుటకు కేంద్రప్రభుత్వము ఇష్టపడకున్నచో ఆయా రాష్ట్రమువారు తమకు జెందిన నిర్బంధితులశిక్షను పూర్తిగా రద్దుగావించి యేల విడుదలచేయరాదు? దీనికి కాంగ్రెసు మంత్రుల సమాధానమేమి? కొత్తపట్నము రాజకీయ వేసవిపాఠశాలపైనిగల నిషేధమును ఇంకా తొలగించకుండుటకు మద్రాసు కాంగ్రెసు మంత్రివర్గము మనకెట్టి సమాధానమీాయగలదు?

# *** రాలిన మొగ్గ ***

మమత పెంచిన మొగ్గ మాడిపోయింది
అది యేమొ నాకంట నశ్రువులు రావు.
నా గుండె విచ్చింది
నా గొంతు ప్రిదిలింది
నా మనసు చెదరింది
నా శిరసు పగిలింది
మమత పెంచిన మొగ్గ మాడిపోయింది
అది యేమొ నాకంట నశ్రువులు రావు.

*   *   *

బగబగని మంటలూ
బుగిలాయి గుండెల్లో
బుగబుగమని పొగలు
ఎగిసాయి గొంతుల్లో
గమ్ముగమ్మని ఆవి
క్రమ్మింది కన్నుల్లో
మమతఁజూచిన మొగ్గ మాడిపోయింది
అదియేలకో ఉరల దాయ శ్రుకణము.

*   *   *

ఆ ప్రేమ గురుతుకై
వాపోవబోయాను
గొంతులో ఆతడీ
అంతరించిందేమొ
కనులలో ఆనీరు
ఇంకిపోయిందేమొ
కూర్మి పెంచిన మొగ్గ కమిలిపోయింది
అది యేలకో రావు అశ్రుబిందువులు.

గుండెల్లో ఆ మొగ్గ
తాండవమ్మాడేను
బొందిపై ఆ మొగ్గ
చిందులు త్రొక్కేను
కండ్లల్లో ఆ మొగ్గ
కట్టినట్లుండూను
కూర్మి పెంచిన మొగ్గ కూలిపోయింది
అది యేలకో రావు అశ్రుబిందువులు.

*   *   *

తొలిసంజ చూచాను
మలిసంజ చూచాను
మఱుసంజలో కట్టె
మఱల చూచేసరికి

పెరిమ పెంచిన మొగ్గ పేలిపోయింది
అది యేలకో కంట అశ్రువులు రావు.

*   *   *

తలఁచినంతటిలోనె
తలపులో జారింది
నిద్రాణమైయున్న
నా మనసు మేల్కొంది
కన్విచ్చి చూచాను
కనిపించనే లేదు.
పెరిమ పెంచిన మొగ్గ పెటిలిపోయింది
అది యేమొ నాకంట అశ్రువులు రావు.

మొగ్గవిచ్చినవెన్క
పూవుపూచినవెన్క
శిరసుపై బెట్టుక
మురిసిపోదామంటి
మొగ్గవిచ్చకమున్న
పూవుపూచకమున్న
వలపునిలిపినమొగ్గ వాడిపోయింది
అదియేలొకోరావు అశ్రుబిందువులు.

* * *

ఆమొగ్గలోఅంత
అందమున్నాదంచు
కనులజూచినగాని
కనుగొనగాలేరు
అనుభవించినగాని
ఆకళింతకురాదు
వలపునిలిపినమొగ్గ వాడిపోయింది
అదియేలకోరావు అశ్రుబిందువులు.

* * *

ఆలేతనవ్వుల్లో
పూలసోనలుకురిసె
ఆకులుకు నడకల్లో
అందచందము లొలికె
ఆతొక్కుపలుకుల్లో
అణిముత్తెము లురలె
ఆచిన్ని చూపుల్లో
అమృతమ్ములు చిందె
మనసునిలిపినమొగ్గ మాడిపోయింది
అదియేలకోరావు అశ్రుబిందువులు.

ఎదురువచ్చినతోనె
మదినిండిపొయ్యేది
కాంచినంతటిలోనె
కరువెల్లతీరేది
తాకినంతటిలోనె
తనువుపులకించేది
ఆగాలిసోకినా
హాయిహాయనిపించె
మనసునిలిపినమొగ్గ మగ్గిపోయింది
అదియేలకోరావు అశ్రుబిందువులు.

* * *

మొలక వెన్నెలచూచి
మొగ్గయని పొంగాను
పట్టి బయలేచూచి
నిట్టూర్చి క్రుంగాను
మొగ్గమాడినదని
మొదలెచూడనెలేదు
రహినిబెంచినమొగ్గ రాలిపోయింది
అదియేలకోరావు అశ్రుబిందువులు.

* * *

పూబొదరిండ్లలో
దోబూచులాడేది
తరపివెన్నెలలోన
తళతళా మెరిసేది
వీచుతెమ్మెరలోన
వీణలామ్రోగేది
బాళినించినమొగ్గ పాలిపోయింది
అదిఏలకోరావు అశ్రుబిందువులు.

'కృష్ణకుమారి'

# బందీ

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు

కారాగారము విచిత్రమగు పక్షిపంజరము. శతాధికలగు నారీజనము భిన్నభిన్నరీతులుగ శిక్షింపబడి బంధీకృత మొనర్పబడిన క్షేత్రమిది. అనేక స్థలములనుండి, అనేక కుటుంబములనుండి వచ్చియున్న బందినులందఱు నేకకుటుంబముగ మెలగుచు, వార్డరుల కఠోరవాక్యములును, అత్యాచారములును సహించుచు కాలము గడపుచుందురు. కారాగారము బంధితులకు విశ్వజగత్తు.

నిత్యము తమకు నిర్దిష్టమైనకాలమున పాఠశాలా భవనమున కేగుటయే బందినులకు పరమోత్సవము. శిశువులను చంకనిడుకొని సమవయస్కులగు స్త్రీలతో నేకకంఠమున సులలితారాగములతో రంగురంగుల త్రాళ్లను చేతనిడుకొని కేంద్రస్థానమునకు ప్రదక్షిణముగ తిరుగుచు, నుపాధ్యాయిను లొసంగు పాఠముల నేర్చికొనుచు అశిక్షిత నిరక్షరలగు బందినులు శిక్షమార్గములలో అభివృద్ధిగాంచుచుండుట సంతోషదాయకము.

అపరిచితమాతయొక్క శిశువును నింకొక బందిని ముద్దిడుకొనబోవుట, బందినులెల్లరును పరస్పర భావముల నేకీభవింపచేసికొని ఒకచోట శయనించుట, ఒకచోట ఆహారముకొనుట, ఒకచోట కాలముగడుపుచుండుట చూడ ఆ యానందమే నాకొక ముక్తివలె కాన్పట్టుచుండును. కారాగారమందున్న విడిగదులన్నియు చూడ బందిజనములను జగమంతయు ఖండఖండములుగ భాగింపబడున ట్లగపడును. వాయువే ఆహారముగగొని కొండగుహలలో తపస్సుచేయు మహాఋషుల ముక్తికన్న అనేక బంధనములలోనుండి ముక్తిబొందినవాడే ధన్యుడని తోచును.

కాని మరియొకరీతిగ ఆలోచించిన శాంతిదేవియగు నిశాదేవి నిశ్శబ్దత భంగపరచు కారావాసినుల బిడ్డల రోదన ధ్వనుల వినునపుడును, దుర్బలశిశువును చంకనిడుకొని అసహాయయగు నొకమాత నావద్దకు వచ్చి, "తల్లీ! రొట్టె" యని అరచునప్పుడు నే నా చిన్నశిశువునకుగూడ నాహారమీయ నసమర్థనైనప్పుడును హృదయవిదారకమగు ఆవేదనచిత్రమును కలవరపరచి నరకభ్రాంతి కల్గించుచుండును. కాయకష్టము లొనర్చు తల్లులను అల్పదోషములకే భయంకరశిక్షలకు పాల్పడచేయుచు వారి నిస్సహాయులగు శిశువులను యమభటులవలె భయపెట్టి దండించు నీలవస్త్రధారిణులగు స్త్రీవార్డరుల అత్యాచారముల గాంచినపుడు ఆ బందిను లనుభవించునది కఠినవరకము గాదు; కేవలము కఠోరనరకమే యని చెప్పిన నతిశయోక్తి కానేరదు. విచారహృదయలై యున్న నా పతితబందినుల నోటినుండి వారివారి వంచితజీవితములయొక్కయు, వంచితమాతృత్వములయొక్కయు, వంచిత పత్నీత్వముయొక్కయు దుఃఖగాథలను విన్నప్పుడు ఒడలు జలదరించుచుండును. సమష్టికుటుంబములలోని కలహజాలమునకు ఫలితముగ అత్తమామలయొక్కయు ఆడుబిడ్డలయొక్కయు భర్తలయొక్కయు అత్యాచారములను సహింపనేరక ప్రతిహింసనొనర్చిన దోషములకు ప్రతిఫలముగ ఘోరదండనలకు గురియైన యీ స్త్రీల కరుణార్ద్రమైన కథలను వినునప్పుడు నా హృదయమందు వజ్రాఘాత మొనర్చినట్లుండును. అనుభవరహితలును, అజ్ఞానలును అగు బందినులద్వారా వేకువజామునవే గంజి అంబలులతో గూడిన బ్రహ్మాండమంతటి పాత్రల మోయించుకొనిపోవుట చూచినప్పుడు కన్నులనుండి బాష్పవారి వెలువడుచుండును.

కారాగారప్రాంగణమందు భ్రమణమొనర్చునపుడు మృత్యుదండన విధింపబడిన నిర్భాగ్యప్రాణులను ఉరిశిక్ష యొనర్చుటకు నిర్దేశమగు ఆ యినుపయంత్రముతో కట్టబడిన ప్రదేశముగాంచినపుడును శిక్షితుల మృతకళేబరముల నావలకు కొనిపోవు "ట్రాలీ" బండి దృష్టిగోచరమగునపుడును మృతఖండితుల అద్భుతచరిత్రలు వినబడినపుడును నా సమస్తాంగములును స్తంభీభూతములగుచుండెడివి. ఎంతయో పాపమొనర్చిన ఫలము 10 నిమిషముల లోపుగ నీ నరకక్రియమూలమున సమాప్తి నొందుచున్నది.

భారతవర్షముయొక్క రాజనీతి నారీశిశువులవధ్యులని స్పష్టపరచుచున్నది. పుణ్యశాలులగు హిందూమహీపతు లనేకులు స్త్రీల ధన మాన ప్రాణములను రక్షించు కార్యమున వారి సర్వస్వ మర్పించినటుల పురాణములనుండి మన కనేక సాక్ష్యములు లభ్యము కాగలవు. అంతియేకాక రాజపుత్రస్థాన చరిత్రములన్నియును ఇందుకు ప్రత్యక్ష ప్రమాణములు. ధర్మమునకును నీతికిని ఆదిజననియగు భారతవర్షముయొక్క యీ మహాదర్శము నేడేమూల దాగియున్నది? పుణ్యమూర్తులగు రాజర్షిగణముల ధర్మరాజ్యస్థాపన మడుగంటెనా? కాలచక్రముయొక్క అద్భుతపరివర్తనము తలంచినతోడనే హృదయము శోకాన్వితమై క్రుంగిపోవును. రాజ్యశాసన మనుపేరిట నిట్టి పైశాచికకృత్యములను ఈ దేవభూమి, కర్మభూమి, పుణ్యదాయినియగు భారతావనియందు నొనర్చుటకు వెనుదీయని యీ రాజ్యమును "గుండా రాజ్యము" అని చెప్పకతప్పదు.

ఒక మనుష్యుని ఇంకొకమనుష్యుడు కారణాంతరములచే వధించినపుడు ఆఘాతుకునికి ఉరిశిక్ష విధించిన వానికి ఆత్మసంశోధన యెట్లు కాగలదో నా క్షుద్రబుద్ధికి దురూహ్యముగనున్నది. ఏలన ఆఘాతుకుని మృత్యుశిక్షకు పాలుచేసినపుడు వాని జీవాత్మ కొలదినిమిషములలో సమస్త పాపములనుండి విముక్తి బొందుచున్నది. చేసిన దోషమునకు పశ్చాత్తాపము ననుభవించుటకు తగుఅవసరమే వానికి లేదు. మృత్యుదండన మనుపేర నరహత్యల నొనర్చు నీ శాసన మేల నెలకొల్పబడెనో తెలియకున్నది. మానవప్రకృతికి అస్వాభావికమగు నేరమొనర్చిన వ్యక్తికి అస్వాభావికమగు దండనయే విధించుటవలన గలుగు ప్రయోజనమేమి? ఒకవేళ రాజ్యదండనద్వారా మృతుడగు హంతకు పునర్జన్మ కలుగకుండునట్లు యేదేని నియమమున్నయెడల యిట్టి మృత్యుశాసనమునకు అర్థమున్నదని యూహించిన నూహించవచ్చు. కాని యీఅస్వాభావికమగు శిక్షలమూలమున ప్రపంచమందు అధర్మము, అవినీతు లెక్కువగుచున్న వేగాని తగ్గుట కెట్టి సూచనలును కన్పించుటలేదు.

మనుష్యుడు అతిదుర్బలుడు. నడచుచు నడచుచు పల్టీలుకొట్టుచుండును. పురాణములు కాని నీతిశాస్త్రములు కాని వానిమార్గము నడ్డజాలవు. తప్పుమార్గము ననుసరించుచున్న మానవునికి ఏకమాత్రశిక్ష కారాగారమేయనిగాని మృత్యుదండనమనిగాని చెప్పుట ప్రకృతివిరుద్ధముగా దోచును. సామ దాన భేద దండోపాయములు నాలుగును అనాదినుండియు భారతవర్షమున రాజనీతిగా నవలంబింపబడుచున్నవి. కాని భేద దండోపాయములయందే ఆంగ్లరాజనీతి ప్రసిద్ధిగడించియున్నది.

ఆంగ్లేయజాతి క్రైస్తవమతావలంబకులు. క్రీస్తు క్షమా దయాగుణములకు మూర్తి. జగత్తున పాపనివారణోద్దేశ్యముతో హింస, ఈర్ష్య మున్నగు పాపములను పారద్రోలుటకై కంటకకిరీటమును ధరించి, తన రక్తధారలను స్రవింపజేసెను. సామ్రాజ్య మదగర్వితులగు ఆంగ్లజాతి నేడు న్యాయ మనుపేరిట నొనర్చుచున్న దండనలలో వారి మతప్రవక్తయొక్క ఆదర్శములలో కోటికొకపాలైనను వారి ఆచరణలోలేవు.

# కుపితయగు దాక్షాయణి

శ్రీమతి చిలకపాటి సీతాంబగారు

హరుని లోకైకగురుని దేవాదిదేవు, నిందసల్పితి వదిజాలు నిన్నుగూల్పు.
కన్నకూతురి నవమతిగాంచియుంక, నేమి గొనిపోవనెంచితి వేగునవుడు.

అరయఁగలేవె మూఢమతి ఆత్మజ యాత్మసమానయంచునీ
సిరియును బల్మియున్ మనము చేట్పరుపన్ బితృవత్సలత్వమున్
మరచి యవజ్ఞజేతువె కుమారిని పల్వురుచూడనిట్టి యీ
దురిత మవాచ్యమై యశము ద్రుంపదె పీడక చుట్టిముట్టుచున్.

అమరులు మిత్రులు సిరి, నాకమరు ప్రజాపతినటంచు నాత్మదలచితో
కొమరిత యవమానాగ్ని యె, కమలింపదె నీమదంబు కడుమస్తరమై.

తిరిపెమెత్తుక మెసవుచు దీనఁగతి, మెలగువారమటని మమ్ము చులకనాడి,
తక్కుఁగలవారి ప్రీతిచే దన్పునీదు, పక్షపాతంబువలని దుష్ఫలముగనవె.

ఆడుబిడ్డసంతుష్ట యైనట్టిగృహము, నిత్యకళ్యాణయుతమగు నిజ మిదివిను,
కటకటంబడి కన్నీరుగార్చె నేని, అంతకంతకు క్షీణించి యంతమొందు.

చుట్టములకన్న సతికన్న సుతులకన్న, ఆప్తవర్గంబుకన్న రాజ్యంబుకన్న,
సహజపితృభక్తి జనకున కిహపరముల, నాడుబిడ్డయె గూర్చును నతిప్రియంబు.

---

## గృహలక్ష్మి పజులు నెం. 5

గత మాసము ప్రకటించిన పజులుకు మూలము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గో | తా | ము | ■ | క | ర |
| గు | ■ | స | వ | ర | ణ |
| ■ | సీ | ల | లు | ■ | ము |
| నె | ■ | ము | ■ | మ | ■ |
| ర | డి | ■ | తా | న | ము |
| వు | రు | ము | ■ | ము | ■ |

దీనికి సరియగు సమాధాన మొక్కటియు రాలేదు. అంతియగాక ఒకటి, రెండు, మూడు తప్పులుగల సమాధానములు కూడ రాకపోవుటచే నాలుగు తప్పులుగల సమాధానమును బంపిన

శ్రీమతి వారణాసి వరలక్ష్మిగారు,
అడ్మిరాల్టిహౌస్, మైలాపూరు, మదరాసు

వారికి ఒక సంవత్సరము గృహలక్ష్మి సంచిక ఉచితముగా పంపబడును.

గృహలక్ష్మి పజులు నెం. 6కు రాబోవు సంచికను చూడుడు.

# చైనా-జపాన్

ప్రపంచమున చైనాకంటె పెద్దదేశము లే క్కొద్దిగనో గలవు; కాని యింతటి జన సంఖ్యతో, నింతటి సహజ సంపదతో, నింతటి సారవంతమైన ప్రదేశములతో నుండు దేశ మింకొకటి గానరాదు. ఐననేమి? ఇంతటి దురదృష్ట దేశమును వేరొకటి లేదు. అంత శ్శాంతి లేదు; ఐకమత్యమునున్న; ప్రభుత్వమునందు స్థిరత్వము వాలుశక్కి; పరిపాలకులందు శక్తి నాస్తి; పైగా నిరంతరము విదేశముల యొత్తిడి; జపాను, ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా దేశములచే దండయాత్రలు, ఓటములు. పాపము ప్రకృతికూడ దయజూపదు. వరదలు ప్రతి వత్సరము వేలకొలది జనులను తన పొట్టబెట్టుకొని లక్షలకొలది మైళ్ల విస్తీర్ణభూములను నిస్సారముగ చేయు చుండును. ఇట్టి కారణములచేత అసలే చచ్చుచున్న చైనాపై జపానుభూతము కబళింప నేడు పైబడినది. ఏ మహాత్ముడో యిట్టిభూతముల నదల్ప తోడ్పడిన గాని చైనా నిలువదు.

ముసోలినీ మహాశయునిచే మారణయంత్రములమూలమున ప్రవహింపజేయబడిన పాశ్చాత్యనాగరికత ధాటి కోర్వజాలక అబిసీనియనులా బాలగోపాలము గావించిన యాక్రందన మణగలేదు. ఇంతలోపలనే, ప్రజానము దాయమును బాగుపడజేయు సామ్యవాదమును తుద ముట్టించి నిరంకుశత్వమును నెలకొల్ప ఫ్రాంకో ప్రముఖుడు స్పెయినుదేశమును విధ్వంసముగావింప మొదలిడిన మరఫిరంగుల ధ్వని మిన్నుముట్టెను. ఇది కొంచెమేనియు తగ్గుసూచనలైన గాన్పింపకము స్నీ సహజసంపదయు శక్తిహీనతయు కారణములుగానెంచి జపాను చైనాపై కత్తి కట్టినది. లక్షలకొలది జనులతో నిండియున్న షాంగే, పెకింగ్, నాంకింగ్, వంటి నగరములపై బాంబులవర్షము గురిపించి నిరాయుధులైయేపాపమెఱుగని పురుషుల, స్త్రీల, శిశువుల నిష్కారుణముగ, నతిదారుణముగ జంపుచున్నారు. పాపఫలముపండిన జపాను ఏమి గానున్నదో గాని ప్రకృతము చైనాయందది గావించుచున్న బీభత్సము వర్ణనాతీతమై హృదయ నిదారకముగ నున్నది.

చైనా భాషయందు ఆదేశమునకు 'పదునెనిమిది రాష్ట్రములసముదాయ'మనియు, 'మధ్యదేశ'మనియు, 'మనుమరాష్ట్ర'మనియు పేరులుగలవు. *

చైనా 15,32,815 చదరపుమైళ్ల విస్తీర్ణము గలది. తన యధికారమునను మంగోలియా టిబెట్ వంటి రాష్ట్రములతో గలసి యది 42,78,352 చదరపు మైళ్లగుచున్నది. మొత్తము జనసంఖ్య 46 కోట్లు. వీరిలో 43 కోట్లు చైనాయందే గలరు.

చైనాకు సముద్రతీరము 2,500 మైళ్లు పొడవు. దీనియందు పెక్కు విఖ్యాత రేవుపట్టణములు గలవు. ప్రపంచమునందలి గొప్ప నదులు గలవు. ఇవి దేశమునకుజీవనాధారమగుటయగాక నావికా ప్రయాణమున కుపయోగపడుచున్నవి.

* 'షి - పా - షెంగ్', 'చుంగ్ కోవ్', 'హ్వాకోవ్'.



మై లింగ్ సూంగ్
చీనాజాతీయ ప్రభుత్వ ప్రథమాధ్యక్షుని మరదలు. ప్రస్తుత చీనాజాతీయ ప్రభుత్వాధ్యక్షుడు చియాంగ్ - కే.షక్ సతీమణియైన ఈమె అన్యదేశాలలోని విద్యలనభ్యసించి, సభ్యతగమనించి చీనా దేశములోని స్త్రీల నన్నివిధముల నభివృద్ధినొందింప బద్ధకంకణయై పాటుపడుచున్నది. ఇపుడు ప్రాణములుండగా చైనా జపానుకు లోబడకూడదని చైనీయుల పురికొల్పుచు భర్తకు బాసటగా పనిచేయుచున్నది.

ఈదేశమున అసంఖ్యాకోపయోగములకు బనికివచ్చు 60 విధములగు వెదురు పెరుగుచున్నది. పొగాకు నల్లమందు పంటలు కూడ నానాటి కమితాభివృద్ధి జెందుచున్నవి.

ప్రపంచమున నుత్తమవస్త్రముల తయారుచేయుట కన్నివిధమున ననుకూలవాతావరణము గల్గియుండెడు ప్రదేశములు మూడు; ఇంగ్లాండునందలి మాంచెస్టరు, చైనాయందలి యాంగుసెటియాంగ్ నదీప్రాంతము, జపాను అంతర్భాగములు. వీనిలో జపాను, ఇంగ్లండునకు లేని సౌకర్యము - దానికి తగిన ప్రత్తి పండించు ననుకూలము - చైనాకుమాత్రమే గలదు. దీనికితోడు చైనాయందు ఖనిజసంపద ఎంతేనిగలదు. నేడు యుద్ధములకు ముఖ్యముగ కావలసిన వస్తువులు మూడు; ఇనుము, బొగ్గు, పెట్రోలు. చైనాయందు బొగ్గుదొరకని రాష్ట్రమేలేదు. ఉత్తరమునందు ఇది మరింత యెక్కువగ దొరుకును. ఒక్క షాంటాంగు బొగ్గుగనులు సరిగా పనిచేయించినచో దినమునకు వేయిటన్నులవంతున ముప్పది సంవత్సరములవఱకు బొగ్గునిచ్చునట. చైనాయందలి ఇనుపగనులు ప్రపంచములో నతిపురాతనములైనవి. పెట్రోలియము పెక్కుప్రదేశములందు దొరుకుచున్నది. వేలకొలది సంవత్సరములుగా బంగారము పండుచున్న భూములు లక్షలకొలది యెకరములుగలవు.

చైనాయందు ముఖ్యమగు పరిశ్రమములు రెండు; వ్యవసాయము; పట్టు. గోధుమలు, వడ్లు, బార్లీ, జొన్నలు, బఠానీ, చిక్కుడు, సోయా, నీలి మొదలగునవికూడ అమితముగా పండింపబడుచున్నవి. పలురకములైన ఫలవృక్షములు ఉత్తరచీనాయందు గలవు. ఇంత సహజ సంపదగలది యయ్యు నితర కష్టములచే చైనా నేటివఱకు వీని నుపయోగించుకొని బాగుపడుటకు నేర్చుకొనలేదు. వీనినంతటిని విదేశీయులు కొల్లగొనిపోవుచుండ గని యిటీవలనే పరిశ్రమాభివృద్ధి గావించి బాగుపడజొచ్చినది.

చైనీయులందఱు బౌద్ధమతావలంబకులే. కాని ప్రారంభమందలి బౌద్ధమతమున కిది చాలదూరము పోయినది. చైనాయందు ఒకకోటి మహమ్మదీయులును, క్రైస్తవులు సుమారు 26 లక్షలును, కన్‌ఫ్యూషియనులు 35 లక్షలును గలరు.

చైనా పురాతన నాగరికతదేశములలో నొకటి. పాశ్చాత్యనాగరికతాప్రాబల్యము దానిని చెనకలేకున్నది. ఈ చైనా నాగరికత పాశ్చాత్యు లాక్రమించుకొనియున్న పెద్దపట్టణములందు స్పష్టముగా గన్పడదు. గ్రామములందే దానిని జూడనగును. భారతదేశమునందువలెనే గ్రామమే చైనా జాతీయజీవనమునకుపునాది. ఇదియు పురాతనసంప్రదాయపద్ధతుల ననుసరించియుండును. మొన్న మొన్ననే విద్య వ్యాపింపఁదొడగినది. చైనీయులకు తమ పురాతన విద్యలందు అమితాశక్తి. వారు తమ శాస్త్రముల జీవితకాలమునందంతటను చదువుటయగాక ఎనభై తొంభై సంవత్సర ప్రాంతములందును కూడ అతి కష్టమగు పరీక్షలందు పాల్గొనుచుండుట వారియోపికకు, పరిశ్రమకు పట్టుదలకు నిదర్శనములు. కొంతకాలము క్రింద అన్‌హ్వేరాష్ట్రమునందిట్టి పరీక్షలందు పాల్గొన్న వారిలో ముప్పదియైదుమంది 80 సం|| పైబడినవారును 19 మంది 90 సం|| పైబడినవారును గలరట. తనయుడు, తండ్రి, తాతయుగలసి యొకటే పరీక్షకు కూర్చొనుట సాధారణమే. వయోభేదముండియు, బుద్ధి తీక్ష్ణతలో భేదముండదు. దీర్ఘ జీవితముల సకలవిధములైన కష్టనష్టముల నోర్చుకొనుటకు చైనీయులు మిగుల ప్రసిద్ధి బొందినవారు.

చైనా పురాతన నాగరికతదేశమని ముందే వ్రాయబడినది. ఇది పెక్కుప్రఖ్యాత చక్రవర్తులచే పరిపాలింపబడుచువచ్చినది. ఈ చక్రవర్తులవంశము 1902 సంవత్సరమున నంతరించగా నప్పటినుండి ప్రజాప్రభుత్వమైనది. ప్రపంచదృష్టిలో చైనాకు ప్రాముఖ్యమును గలిగించినవాడు సన్‌యెట్‌సేను. అతని యనుచరుడై యంతటివాడు నేటి చైనాయధ్యక్షుడగు చియాంగ్ - కే - షేక్. ఇతని నింతటి ప్రసిద్ధికెచ్చుటకు నిరంతరము పాటుబడుశక్తి యాతనిభార్య.

## చైనా — ఇతర దేశములు

సహజశక్తి సంపదలు గలదయ్యు పాశ్చాత్య ప్రాబల్యమునకు లొంగి, నింతవఱకు వారిభూమిగాక మిగిలిన దొక్కచైనాయే. అందుకూడ పాశ్చాత్యులు క్రమక్రమముగా నయమున భయమున ప్రవేశించి, దాని సహజసంపదను దోచుకొన పీఠము వేసియున్నవి. చైనీయులు దీనినిగుర్తించి తమజాతీయతను, జాతీయసంపదను నిలువబెట్టుకొన గోరుటచేతను, మాకు లేక ఇతరులు చైనా దేశమును కబళింతురేమోయని ఆదేశమును కబళించునుద్దేముతో గాచియున్న దేశములు భయపడుటచేతను, చైనా భయంకరసంగ్రామములకు నిలయముగానున్నది.

వాణిజ్యమూలమున లాభముపొందవలయున నెడి యభిలాషతోడనే ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా దేశములు చైనాయందక్కరను జూపెట్టుచు దాని నితరదేశము లాక్రమింపకూడదను పట్టుదలతోనున్నవి. కాని రష్యా జపాను లటులకాదు. వాణిజ్యలాభముచేనేమి, సామ్రాజ్యలాభముచేనేమి చైనా నేవిధముగనైన కబళింప నువ్విళ్లూరుచున్నవి. ఈగుణము జపానుకమితము. ఊరుపేరులు లేకున్న జపాను పాశ్చాత్య పద్ధతుల నవలంబించి ముందుకువచ్చిన నాటినుండి చైనామీద కన్నువేసినది.

జపానుకు సామ్రాజ్యములేదు. జనసంఖ్య అధికము సామ్రాజ్యభిలాష అంతకంటెను హెచ్చు. సహజసంపదగల చైనాను కబళించిన తనతృష్ణ కొంతవఱకుదీరును; ప్రపంచమున బలీయ సామ్రాజ్యమును నిర్మించుకొనవచ్చును. ఇది మనసులోనుంచుకొనియే ఇప్పటికి సుమారు 40 సంవత్సరములనుండి జపాను కారణములు లేకున్నను యుద్ధమునకు గడంగుచువచ్చి, తుదకు కొరియాతో ప్రారంభించి చైనాయందలి



శ్రీమతి ఇందిరా నెహ్రూ ఉన్నతవిద్యకై ఇంగ్లాండు వెళ్లుచున్న సమయమున
తండ్రిని వీడ్కొనుట.



చైనాఅధ్యక్షుడగు చాంగే - కె - షేక్‌గారి సతి.



చిల్లరదేవత యూరేగింపునం దొక దృశ్యము. ఇట్టి దేవతలే యుద్ధమున బలగము లనిపించుకొందురు.

మంచూరియానంతయు స్వవశముచేసికొన్నది. అంతటితో దానికితృప్తిలేదు. లేనికారణ మేదోయొకటి పురస్కరించుకొని జూలై 7 వ తేది చైనాతో యుద్ధము ప్రారంభించినది.

ఇది రష్యా కెంతమాత్రమునిగిట్టదు. రష్యా జపానుల కెప్పుడును శునకమార్జాలస్నేహమే. జపాను చైనాను వశపరచుకొన్నచో, తన కత్యవసరముగా గావలసిన సముద్రతీరము పోవుటయగాక, జపాను ప్రక్కలోని బల్లెమైయుండునని రష్యాయెఱుగును. అందుకే ఆరంభమునుండియు చైనాయందు జపానును నిరోధించుచు వచ్చుచున్నది. ఒకమారు జపాన్ ఓడిపోయినదికూడ. కాని నాటిరష్యా పరిస్థితులు వేరు; నేటి స్థితిగతులు వేరు. రష్యా కారణముకొరకు వేచియున్నది గాని సమయముదొరికినచో జపానును నుగ్గునూచుగాజేయ శక్తిసామర్థ్యములు సేకరించి తగినయేర్పాట్లతో సిద్ధముగనున్నది.

## ప్రపంచయుద్ధము

ప్రపంచమునంతటిని బహిరంగముగా ధిక్కరించి మంచూరియా నాక్రమించిననాడే ప్రపంచయుద్ధమునకు జపాను కారణమైయుండవలసినది. అది దైవవశమున దప్పినది. కాని నేడట్లుగాదు. జపాను దురంతముల చైనా దుర్బలయగుట నోర్వవచ్చునుగాని రష్యా సహించదు. ఇపుడే లోలోపల కావలసినంత సాహాయ్యము రష్యా చైనాకు చేయుచున్నదని వినుచున్నాము. ఏదోకారణముగా చైనాతో చేరగలదు. అంతియగాక చైనాపై యుద్ధముచేయుటలో జపాను తెలివిలేని దద్దమ్మవలె ప్రవర్తించుచున్నదనుట నిజము. అంతర్జాతీయుల నివాసములగు షాంగేవంటి నగరములందు భేదమేమియులేక జపాను విదేశీయుల కెనలేని నష్టము గల్గించుచున్నది. కోట్లకొలది రూపాయలు చైనాయందు వెచ్చించి వాణిజ్యలాభములబొందుచుండెడి అమెరికా ఇంగ్లండుదేశములు అంత గొప్ప నష్టములకు ఓర్చుకొని సులభముగా చైనాదేశమును జపానుకు బలిగ నియ్యవు. రష్యా, ఇంగ్లండు ఫ్రాంసులకు పరస్పరసానుభూతియు, జపానుపెడ వైషమ్యమును గలవగుటచే నివి చైనాకు తోడ్పడును. జపాను విజృంభణము సహింపని అమెరికాకూడ వారితో 'భాయీ! భాయీ' అనవచ్చును. జపానుపెడ సానుభూతిగల దేశములు లేకపోలేదు. జర్మని జపానులు సామ్యవాదమును తుదముట్టించు నాశయముతో నిదివఱకే సంధి జేసికొనియున్నవి; రష్యాయన్న తమకుగిట్టదు కావున హిట్లరు ముసోలినీలు భంగిభాయీలు. ఇద్దరికిని ఫాసిజము తలకెక్కి చిందులుత్రొక్కుచున్నారు. కావున నీ రెండుదేశములు జపానుకు తోడ్పడవచ్చును. అగుచో శతాబ్దములనుండియు పరిణామమును బొందుచువచ్చిన నేటి ప్రపంచము కొలదికాలములోనే పీనుగపెంటలతో నిండి రుద్రభూమియగుట కాటంకమేమున్నది? ప్రపంచపరిస్థితులను చక్కగా నవగాహము చేసికొన్న ప్రసిద్ధరాజకీయవేత్తలు కొన్నివారములలో ప్రపంచయుద్ధము వచ్చుటకు కారణములు గలవని భయపడుచున్నారు.

ప్రపంచయుద్ధమువలన గలిగిన నష్టముల దిలకించి యట్టి సంగ్రామములు గలుగకుండజేయుటకై స్థాపింపబడిన జాతిసమితి చైతన్యములేక శవాకృతినున్నది. జపానే దీనిని మొదట ధిక్కరించి మంచూరియాను కాజేసినది. తరువాత ముసులోని సమితినేభయపెట్టి ఆబిసీనియాను కబళించెను. సమితిమాటయైనదలపెట్టక స్పెయినునంతయు శ్మశానముగా వించుచున్నాడు ఫ్రాంకో. ఇపుడు చైనాకూడ జపాను దురంతముల మొరపెట్టుకొన్నది సమితితో. సమితిచేయగల సాహాయ్యమెయ్యదో సమితిని నమ్ముకొన్నవారే గతిపట్టుదురో నూతనముగ జెప్పవలసిదేమియులేదు.

# "అది

శ్రీమతి విద్వత్కవితిలక



చ. అది గృహలక్ష్మి యెవ్వతె గృ
హాంగణభూమిని రంగవల్లు లిం
పొదవు, ద్విజోత్తమాంఘ్రి జల
జోదకముల్ ప్రవహించు, లేగలున్
మొదవులునిల్చు, ధాన్యములు
ప్రోవగు, వేడుకముద్దుబిడ్డలా
డుదురు, శుభంబులున్ జరిగె
డున్, గడుసంతసమంద బంధుగుల్.

చ. అది గృహలక్ష్మి యెవ్వతె గృ
హాంగణభూమిఁ బురాణసత్కథల్
చదువఁబడున్ హరిప్రణుతి
సల్పఁబడున్, ఫలపుష్పపల్లవా
స్పదమగు వృక్షరాజి పెను
పంబడు, సాఁకబడుం గురజ్గముల్
ముదితలచే ననారతము
ముద్దుగ హారతిపాఁడగాఁబడున్.

చ. అది గృహలక్ష్మి యెవ్వతె గృ
హాంగణసీమను గీరశారికా
వదనవినిర్గళన్నిగమ
వాక్కులు గీతలు శ్రోతృపాళికిన్
వదలుచుశంక, శాంతినిడు,
వాకిటనిల్చినఁగుడ్యచిత్రముల్
ముదమగుఁజూడ, లేదనుట
బొత్తుగలే దెటువంటివేళలన్.

చ. అది గృహలక్ష్మి యెవ్వతె గృ
హంబున భాండములున్ బదార్థముల్
సదమలరీతినుండు సక
లంబును లెక్కగనుండుఁజూచినన్



హృదయముపొంగుచుండు నెది
యేనియుఁదత్త్వము దాల్చియుంట సం
పదలు సమస్తముండు హరి
భావనయుండును గన్నదానిపై.

చ. అది గృహలక్ష్మి యెవ్వతె గృ
హంబునఁబంధుగలుండు, వేడ్కన
ల్పుదురు గృహోచితక్రియలు
మోదముతోడ, స్వయంబుగానె చే
యుదు రుపచారముల్ గురుల
కోర్వఁగలేరు పరాపవాదముల్,
చదువుచు విన్చునుంద్రు బుధ
సమ్మతపూర్వ నవీనకావ్యముల్.

# “గృహలక్ష్మి”

కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు

చ. అది గృహలక్ష్మి యెవ్వతె గృ
హంబున నూత్నవధూవరుల్ వటుల్
ముదమున మ్రొక్కుచుందురు
పూజ్యుల, నెమ్మదినున్నదానితో
నొదవెడు, జక్రవర్తిమది
నుండనితృప్తి, నిజాధినాథు న
భ్యుదయముఁగోరి, యేమఱక
భూషణముల్ ధరియింతు రింతులున్

చ. అది గృహలక్ష్మి యెవ్వతె హృ
దంతరమందు నిజాధినాథుఁడే
య్యెది యనునద్దిగాని మఱి
యేదియునుండదు, వానికిన్ వ్రతం
బెది తనకేని సద్వ్రతమ
దేయగు, రూపులు రెండుతోఁచినన్
మదియొకఁడట్లపోయెడు స
మంచితభావము నిండియుండెడున్.



చ. అది గృహలక్ష్మి యెవ్వతె హృ
దంతరమందున నార్యధర్మముల్
చదువులు, సంప్రదాయములు,
సచ్చరితంబులు సాధుగోష్ఠులున్
ముదమునుగూర్చు నాత్మజులు
మోదముతో నవి నేర్చునట్లు దో
హదమునుసల్పు నన్యమగు
నట్టి వాకించుక పట్టకుండఁగన్.

చ. అది గృహలక్ష్మి యెవ్వతె హృ
దంతరమందు మగండెఱుంగరా
నిది యొకయింతకల్గదత
నిన్దనియింపఁగఁజేయుఁబూను నె
య్యెదియు, సుమంబుసౌరభము,
నిందుని వెన్నెలయట్టు, లైక్యసం
పదబొందలున్, విభుంగలిసి,
మాన్యులుమెచ్చ ననన్యభక్తికిన్.

చ. అది గృహలక్ష్మి యెవ్వతె గృ
హాంతరమందున వస్తుజాతమె
య్యెది యెట నుండ నౌనచట
సేకనుపట్టును, సంజలందు వ్రే
ల్చెదరు హుతాశునందు, ముర
ళీనినదంబులు వీణపాటలున్
హృదయమునించు, మించులలు
లింతలు నంతలు సంచరింతురో.



# గృహలక్ష్మి



చ. అది గృహలక్ష్మి యెవ్వతె గృ
హాంగణసీమ సమస్తవిద్యలున్
జదువుదు రాస్థతో వటులు
సద్గురుసన్నిధి, నర్థికోటికిన్
ముదమగుఁ, దైర్థికాళిపద
ముల్ గనవిశ్రమ, మెట్టివారికే
నుదకము నన్నముం దొరకు
నో, యడుగంగనె యర్ధరాత్రియేన్.

చ. అది గృహలక్ష్మి యెవ్వతె హృదంతరమందున దానుశక్తి యా
చు దయితుఁడీశుఁడంచుఁ దలచున్ దనసంతతి వక్త్రితుండ వ
ద్వదనులటుల్ దలంచు సుదృఢంబుగఁ దారకమంత్రమూర్తిపై
వదలనిభక్తియున్ విబుధవర్గముపై నెనరుండుదండిగన్.

చ. అదిగృహలక్ష్మి దేన నెలకంతను స్వాంతము సంతసంబునన్
బొదవఁగబాలు, వింతలు ప్రబోధములున్ కథలెన్నొ చిత్రముల్
చదువఁగ ముద్రితంబయి ప్రచారమగున్ సకలాంధ్రదేశమం
దెది దమయింటలేమి యదియెంతయొలోపమటందు రందఱున్.

చ. అదిగృహలక్ష్మి దేని హృదయంబున భారతభూమికెల్ల శం
పదమగు సద్యమంటుల ప్రవక్తల సూక్తులు వెల్గు ధర్మమున్
వదలకఁ దాల్చు ధీరుల ప్రవర్తనముల్ గనుగౌరవంబుఁ బ్రాఁ
జదువులు నూత్నవిద్యలు ప్రశస్తముగా వివరింపఁగాబడున్.

చ. అదిగృహలక్ష్మి కేసరిగృహంబున వెల్వడు సర్వగేహినీ
హృదయము లుల్లసిల్లగ సమీరితధోరణి వ్యాసరాజముల్
పదములు పద్యముల్ సరసభంగులనుం గవయిత్రులున్ గవుల్
చదువరులున్ లిఖించినవి చల్లుచు నెల్లెడ వేయిమోములన్.



చ. అది గృహలక్ష్మి యెవ్వతె హృ
దంతరమందలి దైవభక్తి నా
గఁదరము కాదు బంధుకుఁ
గాంతున కేని, సుశీల, సఖ్య, మీ
ర దరినిజేరినట్టుల స్థి
రంబగు దీక్షను జేరుఁబారమున్
వదలనికూర్మితోడఁ దన
వారల కెల్లను దారకంబగున్.

# స్త్రీలు — గ్రంథాలయములు

శ్రీమతి క్రొవ్విడి మాణిక్యాంబగారు

హిందూ ప్రజాసామాన్యమునం దజ్ఞాన తిమిర మావహించియున్నది. అందు స్త్రీల స్థితి అతిదైన్యము. వారలకు దినమంతయు వంట యిల్లేశరణ్యమై, గృహకృత్యములే యాశయములై యున్నవి. అందులకే స్త్రీలను భగవంతుడేర్పాటు చేసెనని వారియూహ. ప్రపంచపరిణామమున దేశపరిస్థితులు, రాజకీయ విధానములు, ఆచారవ్యవహారములు ప్రతిదిన మెట్టిమార్పుల జెందుచున్నవో వారికి తెలియదు. తెలిసికొన నభిలాష లేదు. అట్టి స్త్రీలకు పత్రికాపఠనమునందును గ్రంథపఠనమునందు నభిరుచి కలుగజేసినచో వారల నావరించియున్న యజ్ఞానతిమిరము కొంతవరకు తగ్గును.

స్త్రీలు పత్రికాపఠన మొనరించుట తప్పనియు, స్త్రీల పురోభివృద్ధికై పాటుబడుచున్న గృహలక్ష్మి మొదలగు చక్కని పత్రికలు సైతము స్త్రీల నైతికమును పాడుచేసి దుర్బోధల గావించునవేయనియు నమ్ము మూఢస్త్రీలు పెక్కురు మనపల్లెలయందున్నారని చెప్పుటకు మిగుల సిగ్గగుచున్నది. వారి యూహాలో నట్టిపత్రికలు జదువుట తప్పు. వానికి వ్యాసములు వ్రాయుటంతకంటె తప్పు. ఏ వినోదినివంటి కాలహరణ పత్రికయందో నెవరో వ్రాసిన యే మొరటు కథనో జదివి దానివలె నన్నిపత్రికలుకూడ జనుల పాడుచేయుటకే పుట్టినవని తలంచెదరు. అట్టి యభిప్రాయమునుండి వారిని మరల్పజూచుట బహుకష్టతరము.

"భార్య: మీరు చదువునదేది?

భర్త: గృహలక్ష్మి పత్రిక.

భార్య: దానిని చదువవద్దనియు, అట్టి వానికి వ్యాసములు వ్రాయవద్దనియు నేనెన్ని విధముల మొరపెట్టుకొనినను మీరు వినరు. ఎందుకు నన్నింత బాధించెదరు?

భర్త: గృహలక్ష్మి మాస్త్రీల పురోభివృద్ధికై పాటుబడు చక్కని పత్రికారాజము. అది చదువుటవలని దోషమేమి? అందలి చక్కనియంశముల జదివి వినిపించెద. నీవు కూడ వినుము. 'పతివ్రత లోకకళ్యాణమున కెట్లు తోడ్పడును?' మొదలగు చక్కని విషయము లందు వ్రాయబడును.

భార్య: నాకువద్దు. అందేమివ్రాసినను నేను వినను. ఇదివరనుండియు నీపత్రికలే మాస్త్రీల నుద్ధరించునవి గాబోలు. ఈ పత్రికలు జదువుచుండుటబట్టియే మీలో కొంతమార్పు కనబడుచున్నది. స్త్రీకి స్వాతంత్ర్యము కావలెననియు, స్త్రీవిద్య నభ్యసించవలెననెడి యూహలు కలుగుచున్నవి. అట్టి స్త్రీలు పెక్కురు పాడగుట చూచుచుండుటలేదా?"

పత్రికాపఠనమువలనను, విద్యవలనను స్త్రీలు పాడగుచున్నారను మూఢస్త్రీలు వేలకువేలు మన పల్లెలందుగలరు. ఆహా! తలిదండ్రులు చిన్నతనమున వారలకు విద్య నభ్యసింపించక పోవుటయేగదా విద్యవిలువ వారలకు తెలియకుండుటకు కారణము. విద్యావ్యాప్తికి పాఠశాలలేగాక గ్రంథాలయములుగూడ చక్కని సాధనములు. ఇంటింట నొక పత్రిక కొనబడి చదువబడిననాడు, పత్రికాపఠనము వ్యాప్తమొందిననాడు, కొన్ని సంఘదురాచారములును, విద్యావిహీనత వలని లోపములును చాలవరకు చక్కబడ గలవు. పాశ్చాత్యదేశములందు కూలివాడు సైతము సాయంకాలము తానింటికేగునపు డొక పెన్నినైనను వెచ్చించి వార్తాపత్రికను కొనక మానడు. దానిని చదువక మానడు. అందువలననే ఆదేశములందు వేలకువేలు పత్రికలు పోషింపబడుచున్నవి. చదువుకొనుటకు పత్రిక నొకసారియిమ్మని మరియొకరిని యాచించునంతటి హేయము మరియొక టుండదు. మనహిందూదేశములో పత్రికా పఠన మొనరించువారు 100 కి ఒకరిద్దరు గూడ నున్నట్లుదోచదు. చదువుకొనిన వారిలోగూడ పత్రికను చదువవలెను, ప్రపంచ పరిస్థితుల దెలిసికొనవలెనను కుతూహలము లేదు. అట్టి కుతూహలమేయున్నచో మన దేశమున మరెన్నిపత్రికలు వెలువడియుండెడివో? ఇప్పుడున్న కొలదిపత్రికలకే ప్రోత్సాహమును జూపువారులేరు. ప్రతి పాఠశాలయందును వార్తాపత్రికలను దెప్పించి వానిని బాలబాలికలచే జదివించి పత్రికా పఠన మలవరచవలెను. స్కూలులైబ్రరీలలో చక్కని గ్రంథములుండి అవి బాలురచే విరివిగా చదివించబడవలెను. రెండు మూడు పుస్తకముల మాత్రమే క్షుణ్ణముగా (Intensive) చదువుటకంటె పెక్కుపుస్తకములను చదువుట (Extensive reading) వలన విద్యార్థుల యూహాపరంపరలును, భాషాజ్ఞానమును వృద్ధిపొందును. వార్తాపత్రికలు మనకొనరించుమేలును వేర చెప్ప నక్కరలేదు. దేశపరిస్థితులు, కాలమాన స్థితి, వర్తకసరళి, సంఘసంస్కరణాది సంగతుల పెక్కింటిని తెలియజేయుటయేగాక గృహలక్ష్మి మొదలగు కొన్నిపత్రికలు మానవాభ్యుదయమునకును దేశసేవకును మిక్కిలి తోడ్పడుచున్నవి. ప్రతియూరను స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయములుండి ఆ యూరి స్త్రీలు ప్రతిదినమచటజేరి గ్రంథములను పత్రికలను జదుపు నలవాటుచేసికొనవలెను. గ్రంథాలయములందలి పుస్తకములిండ్లకుగూడ పంపి స్త్రీలు వానిని విరివిగా చదువు నవకాశము గల్పించవలెను. స్త్రీల శీలమును, ధైర్యసాహసములను విజ్ఞానమును పెంపొందించు గ్రంథములు మాత్రమే యందుండవలెను. గ్రంథపఠన విషయమున నొక యనుభవజ్ఞుడొసగిన విషయము జూడుడు. "సద్గ్రంథపఠన మేకాంతమునం దానందమిచ్చును. సంభాషణమునకు భూషణమువలె శోభనిచ్చును. బుద్ధికి సత్యనిర్ణయ సామర్థ్యమిచ్చును. వ్యవహారములు చక్కగా

చురుకుగా నెఱవేర్చుకొనుశక్తి నిచ్చును.” గ్రంథాలయములం దనుదినమును స్త్రీ లోకచో గుమిగూడుటవలన వారలలో నొకరియెడ నొకరికి సోదరీభావమును, సర్వ మానవ సమానత్వమును, జాతిమతభేద వివక్షతపోయి ఐకమత్యమును నలవడి తోడి మానవులయెడ నెట్లు ప్రవర్తించవలెనో తెలియును. సంఘలోపములు తెలిసికొని వానిని నివారించ ప్రయత్నించవచ్చును.

ఆ.వె. “పలువురొక్కచోట బఠనమందిరమని
చేరి దేశదేశ చిత్రములను
జదివి, చర్చచేసి సారంబుగొనునట్టి
సభయనంగ స్వర్గ సమముగాదె!

ప్రతిగ్రామమునందును ఊరికి సమీపమున ప్రజాసామాన్యమున కంతకు వీలగుచోట కొంతస్థలము నేర్పరచుకొని, ప్రతి సాయంతనమునందును ఆయూరి స్త్రీలందరచట గుమిగూడి, వార్తాపత్రికలను, గ్రంథములను జదివి ముచ్చటించుకొను నేర్పాటు చేసికొనినచో వారలు తమ భావముల నొకరికొకరు వెల్లడించుకొని, దినమంతయు తమ యిండ్లయందు పని భారముచే గలిగిన నలసటదీర్చుకొని, ఆకొలది సేపైనను గృహ సంబంధమైన చింతలమరచి, స్వేచ్ఛావిహార ములసల్పి, ప్రాణమునకు సౌఖ్యము చేకూర్చుకొని ఆనందను బడయవచ్చును. తన్మూలమున నిర్మలవాయువు బీల్చుకొని శరీరారోగ్యము జేకూరును. ప్రజలలో నొకరిపై నొకరికిగల యసూయతగ్గి, ప్రేమ, వాత్సల్యము పెంపొందును. అట్టి ప్రదేశములను (Village common వంటివి) గ్రంథాలయములను, పత్రికాపఠనానుకూలములను ప్రతియూరను ప్రభుత్వమేర్పాటుచేసినచో ప్రజలలోగల అజ్ఞానము, మూఢత్వము నశింపజేసి భారతమహిళాభ్యుదయమునకును తన్మూలమున దేశౌన్నత్యమునకును తోడ్పడినవారలగుదురు. శాసనసభలం బ్రవేశించిన సోదరీమణులు తప్పక యిట్టి యేర్పాటులు జరిపించ తమ తోడిసభ్యుల ప్రోత్సహించి ప్రభుత్వముచే కార్యక్రమము జరిపించి దేశాభ్యుదయమునకు తోడ్పడ ప్రార్థితులు.



శ్రోత:— నే నీగడ్డిని తినలేను. ఏడీమీయజమానున్ని పిలూ.

ఖంత్రోతు:— కార్యంలేదండి. ఆయనా తినలేరు.

యన్. విశాలాక్షి.

# పెండ్లి సంబంధం

ఆగస్టులో నేను డార్కు రూములోకివెళ్లి ప్రాక్టికల్ చేసుకుంటూంటే మా నరసింహామూర్తివచ్చి "ఏమోయి కృష్ణా, సిద్ధంగావుండు" అన్నాడు. "ఏమిటోయి" అని వెనక్కు తిరిగిచూస్తే అతను వెళ్లిపోయినాడు. ఒకటిరెండునిముషాల్లో ఒకపంతులు గదిలో ప్రవేశించినాడు. సుమారు 40 సంవత్సరాలుంటాయి. తెల్లపడుతూంది జుత్తు. ఒక ఖద్దరుపంచ, శిల్కుషర్టు. సేలంఅంచు వుత్తరియ్యం. నే నొక్కడినే వున్నాను గదిలో. నాదగ్గరకువచ్చి "మీరేనాఅండి కృష్ణమూర్తిగారు" అన్నాడు. "ఔ"నన్నాను.

"ఎబ్బే ఏమీలేదు. మాది కాకినాడదగ్గర రామచంద్రపురం. మీనాన్నగారిని యెరుగుదును. కాలేజి చూడటానికివచ్చాను. పనిలోపని మిమ్మల్నిచూచిపోదా"మనుకున్నాను.

"సరేలేండి. మీ పేరేమిటో చెపితే మానాన్నగారికి మీరువచ్చి చూచివెళ్లినట్లు వ్రాస్తా" నన్నాను.

"నాపేరు రామకృష్ణశాస్త్రి. మా యింటిపేరు యెడవల్లివారు. మీనాన్నగారిని నేనుచూచి పదియేండ్లవుతుంది. వారికి జ్ఞాపకంవుందో లేదో గాని నాకు మాత్రం చాలాబాగా జ్ఞాపకంవుంది. అసలుసంగతి యేమిటంటే మాబావమరది 1926 పారిపోయాడు చెప్పకుండా. అప్పుడు మావూళ్లో ఒక వకీలుగారిచేత మీనాన్నగారికి వ్రాయించాను బందరువచ్చినట్టువిన్నానని కనుక్కోమని. వారుచూచి అతన్నిపంపించారు. పైగా వాడిడబ్బెపోతే రైలుఖర్చుకి వారు మూడురూపాయలుగూడా యిచ్చారుట. తర్వాత ఆయేడే మద్రాసుకాంగ్రెసుకు మీనాన్నగారు వాళ్లు బయల్దేరారు. నేను మావూరినుంచి వుత్తరంవ్రాసిన వకీలుగారు కొంతమందిగూడా ఆపెట్టెప్రక్కపెట్టెలోనే ప్రయాణంచెయ్యడం తటస్థించినది. వారు ఇంటరుక్లాసులోనున్నారు. మేము 'గాంధీ క్లాసు' లో నున్నాము. గూడూరులో కాఫీతాగుతూంటే మీనాన్నగారికి మా వకీలుగారు ఇంట్రడ్యూస్ చేసినారు. మా బావమరది సంగతి మరీ మరీ అడిగినారు. మీనాన్నగారు చాలవుదారహృదయులు. తర్వాత మళ్లీ చూడలేదు. వారిని చూడవలెననివుంది. మీరు హాస్టలులో వున్నారా వూళ్లోవున్నారా" అని పురాణం ఆపాడు.

"నేను వూళ్లో ఒక రూములో వున్నాను. హాస్టల్లో చేరలేదు." ఈయన యింకా నన్ను వదలలేదు. మా నరసింహామూర్తి వచ్చి "ఒంటిగంట దాటింది. టిఫిన్ చేసొద్దాంరావోయి మీరుగూడరాండిసర్" అన్నాడు. ముగ్గురు అక్కడ టిఫిన్ తిని కాఫీతాగి కాలేజికి వచ్చాం. ఆయన వెళ్లిపోయేవాడు వెళ్లిపోకుండా అన్నాడుగదా "నేను అయిదుగంటలకు మళ్లీ యిక్కడకు వస్తాను. మీ రూముకు వస్తాను. అంతాకలిసి వెళ్దాంలేండి" అని. నరసింహామూర్తినిగూడ పిలిచి వెళ్లిపోయాడు.

నేను నరసింహామూర్తితో "ఏమోయ్ ఈపంతులును నీకేంతెల్సు" అన్నాను. "లైబ్రరీలో నేను పేపరుచూస్తుంటే, ఏమండీ మీక్లాసులో ఏవరైనా తెలగాణ్యు లున్నారా" అన్నాడు యీయనవచ్చి.

మావారు మొన్న క్రిస్టమస్ (1936) సెలవులలో యింటికివచ్చినప్పుడు మాటల్లో "ఏమే మధూ! నాకు పెండ్లిసంబంధం వచ్చినది. తెలుసునా" అన్నారు. నేను గాభరాపడి" ఏమిటండోయి! నే నేమిటికావడం." అన్నాను. వారు దానితో నవ్వి "ఎబ్బే ఇంకా చేసుగోడం లేదు. అసలు సంగతి చెప్పుతా విను" అన్నారు.

కొద్దిగా తమాషా చేయవచ్చునని నీపేరు చెప్పాను. మీ తండ్రిపేరు గూడా అడిగివెళ్లాడు. దానిమీద ఊహ – ఊకదంపు, సాయంత్రంఆయనతో నీరూముకు వస్తానోయి. లైటుహౌసు సినీమాలో ఇన్విసి బుల్ మాన్ వుంది ”అన్నాడు. “సరే లేవోయి”అన్నాను.

౨

ఆరోజు నాకు రిజల్టురాలేదు. నాలుగుముప్పా వుకే దిగాడు రామకృష్ణశాస్త్రిగారు శనిగ్రహంలాగు, నరసింహమూర్తిగూడ ప్రాక్టికల్ కట్టిపెట్టి బయల్దే రాము బండీచేసుకుని ముగ్గురం. నరసింహమూర్తి హాస్టల్లోవాడైనా వచ్చేశాడు వూళ్లోకి. మొహాలు కడుక్కుని బయల్దేరాము కాఫీదేవాలయానికి.

ఏదోఇంత కడుపులోవేసుకొని బీచికి దారితీశాం. వాళ్లవూళ్లో ఆయన కరణంగావున్నారనీ, ప్రస్తుతం ఒకనెలరోజులు సెలవుతో రామచంద్రపురంలో వున్నారనీ తెలిసింది. వాళ్లవూళ్లో దశరావుత్సవాలు చేస్తారనీ చాలబాగుంటుందనీ, పైగా భోగంమేళం రాజమండ్రీనుంచి తెప్పిస్తారనీచెప్పారు. మేమిద్దరు సెలవులలో వెళ్లేటప్పుడు అక్కడదిగి వెళ్లవలసిందనీ, ఒకరోజుమాత్రమన్నా వుండవలసిందనీ ఒక సజెషన్ పారేశాడు. ఎల్లుండి దశరాఅనగా తనకు యిక్కడ పనుందనీ తనేవచ్చి మమ్మల్లను తీసుకువెళ్తామనీ చెప్పాడు. ‘సరేలెండి’ అన్నాడు మా నరసింహమూర్తి మాటవరసకు. గంట ఆరుంబాతికఅయింది. ముగ్గురంకలిసి బీచిమీదనున్న లైటుహౌసు సినీమాకు వెళ్లాం. ఇంటికిరాగానే ముగ్గురం నా లాడ్జిలోనే భోంచేశాం. ఆయన వాళ్లసత్రాని కెళ్లిపోయినాడు నేనూ మావాడు మిగిలాం.

“ఏమోయి కృష్ణా యీాయనవొక పెద్దబ్బాలా వున్నాడు. అంతా అరవగోడులావుంది. ఏమిటి అయితే మైకిల్మసులో మనం రామచంద్రపురం వెళ్లు దామా?”

“ఏమిటో లేవోయి. ఆయనవస్తేగా. తర్వాత మాట. మర్యాదకు అనుంటాడు. నాకు అయితే రామచంద్రపురం సామార్లకోట దగ్గరేకాబట్టి వెళ్లే దారిలో దిగవచ్చును. నువ్వుఎట్లావస్తావు. విజయ నగరంనుంచి మీ ఆవిడ వారానికిరెండుసార్లు వైర్లెను మెస్సేజెను పంపుతూంటే. ఇంతకు మనం అక్కడకు వెళ్లితే డి.పి.ఏనా లేక ఏమిటిసంగతి.”

“ఈడబ్బాగాడి సంగతేమిటో కనుక్కోవా లోయి. నేనూవస్తాను. కోసనీమచూచి ఆరేళ్లయింది.”

“సరేలే మళ్లీ ఆయనవచ్చినాక చూచుకోవచ్చు. నాకు నిద్రవస్తూంది. లైటాఫ్‌చెయ్యి పడుకుందాం.”

“జాగ్రత్తోయ్ ఇన్‌విజిబుల్‌మాన్ వస్తాడేమో?”

3

శుక్రవారంనుంచి దశరాసెలవులు. బుధవారం సాయంత్రం, టెన్నిసుఆడుతున్నాను. నరసింహమూర్తి టెన్నిసుఆడి దగ్గరకు వచ్చాడు. సినీమాకు వెళ్లుదామని యిద్దరం ప్లానువేశాం. సెట్టుఅయింది. ఇద్దరం సైకిల్సుయెక్కాం. ఇంతలో వెనుకనుంచి పిలుపువచ్చింది., చప్పట్లతో. ఇంకా ఎవరైనా స్టూడెంట్సు సినీమాకువస్తారేమోనని వెనక్కి తిరిగాము. బండీ, బండీలో రామకృష్ణశాస్త్రిగారు. సరేఅని సైకిల్సుదిగాం. “ఏమిటి ఐదున్నరకి యెట్లా వచ్చారు” అంటే మెయిలు లేటయిందనీ అందులో వచ్చాననీ చెప్పాడు. రాత్రి సినీమాకు భోజనానికి మాకాయనగెస్టు. ప్రొద్దున్నేనిద్దర నాలుగన్నరకే లేచాం. సూటుకేసు – బెడ్డింగుహోల్డరు నేను ప్యాకు చేసుకున్నాను. నరసింహమూర్తిమాత్రము నాతోనే వచ్చాడువూరికే. ఆరున్నరకు స్టేషనుకువచ్చాం.

మాశాస్త్రిగారు టెలిగ్రాము యిచ్చివచ్చారు ఎక్కడికో వెళ్లి. బహుశః మేంవస్తున్నామని యేమన్నాయిచ్చారేమో! ఇంత టిఫిన్‌తిని రైల్లో బైలు,

దేరాము. ఎంతయినా రైల్లో చాలకులాసాగా గడచింది. సామర్లకోటలో టిఫిన్ తిన్నాం. రామచంద్రపురం వెళ్లేటప్పటికి పాతికతక్కువ పన్నెండుఅయింది. ఆయనకొడుకున్నూ (16 ఏళ్లుంటాయి పిలక, కళ్ళజోడు, చెప్పులు, పైజామా,) ఆయన బావమరదిన్నీ స్టేషనుకువచ్చారు. ఇతనే ఇక్ష్వాకులనాడు తప్పిపోయిన బావమఱది. వాళ్లను మాకుఆయన ఇంట్రడ్యూస్ చేశాడు. మే మెవరమో వాళ్లకు సరిగ్గా తెలీదనుకుంటా.

ఇంటికివెళ్లి కాళ్లుకడుక్కునేటప్పటికి పన్నెండు దాటింది. కడుపులో యెలికలు దూరినాయి. ఎంత సామర్లకోటలో అయ్యరుకు ఇచ్చేసినా, వెధవది, ఆకలిమాత్రం మళ్లీ తిరిగివచ్చేసింది. స్నానాలుచేసి భోజనంచేసేటప్పటికి ఒంటిగంటన్నరఅయింది. హాయిగాకొంతసేపు నిద్రపోయిలేచి ఇద్దరం మొహం కడుక్కున్నాము. ఇంతలో శాస్త్రిగారబ్బాయి వచ్చి "టిఫినుపుచ్చుకోరూ" అన్నాడు, అప్పుడు ఒక చింపెన్జీ జ్ఞాపకంవచ్చింది నాకు. కాఫీహోటలులో మూడురోజులనుంచి ఖర్చుగాని జిలేబి, ఇంట్లో చేసిన కారంపూస, తెల్లటిపానకం కాఫీవచ్చాయి. ఏదో పుచ్చుకున్నాం.

౪

శాస్త్రిగారి తల్లిటవచ్చింది. అరవయ్యేళ్లుంటాయి. నిలువుగానేవుంది. ఆవిడ లెక్చరు మొదలెట్టింది.

"ఏం నాయనా మీరు యింతత్వరగా అనుకోకుండా మాయింటికి వస్తారనుకోలేదు. ఏమిటో మావాడు వాడి వెఱ్ఱిధోరణిలో విశాఖపట్టణం వెళ్లడం వాడికి మీరు అక్కడ కనబడ్డం నిజంగా దైవఘటనయే నాయనా. మీరిద్దరూ ఒక చేచదువుతున్నారానాయనా!"

"ఔనండి" అన్నాడు మా నరసింహమూర్తి.

"ఏమే సుందరమ్మా మనశ్యామలను వీరికి కాస్త ఫిడీలు వినపించమనరాదుటే? కష్టపడీ రాకరాక వచ్చారు" అంది.

ఇంతలో చాకలివాడు ఫిడేలుతెచ్చి అక్కడ పెట్టాడు. తల్లీకూతురువచ్చారు. అవ్వగారు మళ్లీ అందుకుంది.

"నాయనా యీశ్యామల నా మనమరాలు. నేనో సుందరమ్మో యెత్తుకోడమేగాని యెప్పుడు కింద కాలుబెట్టలేదు."

"ఊరుకోవేమమ్మా నువ్వెప్పుడూయింతే" అంది అమ్మాయి.

"దీన్ని స్కూలులోవెయ్యలేదు. అక్కడ సరిగ్గా చెప్పతారో చెప్పరో అని ఇంట్లోనే ప్రైవేటు చెప్పిస్తున్నామునాయనా. ఇంగ్లీషువుండాలని మా అబ్బాయి పోరాట్టంవల్ల ఏదో ఒకఅబ్బాయి చెప్పతున్నాడు. ఏడోక్లాసుపుస్తకం. గడగడా చదివేస్తుందినాయనా. తెలుగులో మనకావ్యా లెన్నున్నాయో అన్నీ ఖంటాపాఠం. ఏదీ ఎంతలెక్కపెట్టినా రక్తాక్షిలోపుట్టిందేగా ఇది..."

ఇంతలో శాస్త్రిగారువచ్చారు. "ఏమిటో మీరు పిల్లని పాడనిస్తారా మీగోడేనా" అన్నారు. గొడవ తగ్గింది.

సరే అమ్మాయి సరిగమలు వాయించి తల్లివేపు చూసింది. "బ్రోచేవారెవరురా!" అని వాయించమంది తల్లి. బాగానేవుంది. అవ్వగారు "ననుపాలింపగ నడచివచ్చితివా" వాయించమన్నారు. అదీ అయిందనిపించింది. సరే తల్లీ కూతురు లోపలకు వెళ్లారు. అవ్వగారు కూడ కాస్సేపటిలో పీఠం ఎత్తారు.

పాట బాగానేవుంది. నామట్టుకు నాకు ఇదంతా ఒక అరవగోడులాగుంది.

## ఈశ్వర సం॥ర భాద్రపద ఆశ్వయుజములు

1 ద్వా॥ శు సా5-58 మరా2-27 వసా.-39 మొ4-13కు భో6-58
2 త్ర॥ శ సా5-5పుబ్బ రా2-25వప10-22 మొ12-2కు భో6-54
3 చతు॥ ఆ సా4-44 ఉత్తరరా2-58 వఉ9-48 మొ11-26కు భో6-50
4 అమా॥ ● సో సా5-53 వహస్త రా3-55 వప11-4 మొ -22కు భో6-46 మహాలయఅమా
5 శు॥ పా మం 4-35 చిత్రతె5-28వప12-27 మొ2-9 భో6-42 శరన్నవరాత్రప్రారంభము
6 వి॥ బు సా6-19 స్వాపూర్తి వప11-30 మొ1-14కు భో6-38 .
7 త॥ గు రా8-17స్వాఉ7-26వప1-34మొ3-19కుభో6-34
8 చ॥ శు రా 0-12 విశాఉ9-45 వప2-10 మొ3-56కు భో6-30
9 పం॥ శ రా12-16 అనూప12-16 వసా6-30 మొ8-16కు భో6-26
10 ష॥ ఆ రా2-24 జ్యేప2-54 వరా2-21 మొ4-7కు భో6-22
11 స॥ సో తె4-20 మూసా5-25 వసా3-25 మొ5-11కు వతె2-58 మొ5-43కు భో6-18
12 అ॥ మం తె6-1 పూషారా7-44 వతె4-24మొ6-8కు భో6-14 దుర్గాష్టమి
13 న॥ బు పూర్తి ఉషా రా9-42 వరా1-58 మొ3-40కు భో6-10 మహానవమి
14 ద॥ గు ఉ7-7 శ్రరా11-11 వతె.-22 మొ5-2కు భో6-6 విజయదశమి
15 ద॥ శు ఉ7-49 ధరా12-13 వర్జ్యంలేదు భో6-2
16 ఏ॥ శ ఉ8-4 శరా12-42 వఉ7-34 మొ9-12కుభో5-58
17 ద్వా॥ ఆ ఉ7-45 పూభారా12-44 వఉ7-6 మొ7-42కు తులా భో8-3
18 త్ర॥ సో ఉ7-0 చతు తె5-53 ఉభారా12-15 వఉ10-9 మొ11-43కు భో8-0
19 పూ॥ ○ మం తె4-27 రే11-27 వప11-51 మొ1-24కు భో7-56
20 బ పా॥ బు రా2-19 అశ్వరా10-16 వసా6-28 మొ7-59కు భో7-52
21 వి॥ గు రా1-29 భరా8-52 వఉ7-18 మొ8-48కు భో7-48
22 త॥ శు రా9-49కృ రా7-19 వఉ8-3 మొ9-33కు భో7-44 అట్లతద్ది
23 చ॥ శ రా7-25 రోసా5-38 వఉ10-12 మొ11-41కు వరా10-52 మొ12-20కు భో7-40
24 పం॥ ఆ సా4-58 మృసా3-55 వరా11-47 మొ1-17కు భో7-36
25 ష॥ సో ప2-43 ఆర్ద్ర ప2-23 వరా2-9 మొ3-39కు భో7-32 తిథిద్వయం
26 స॥ మం ప12-35 పునప12-58 వరా9-4 మొ10-35కు భో7-28 అష్టమీతిథి
27 అ॥ బు ఉ10-41 పుష్యప11-46 వరా1-25 మొ1-37కు భో7-24
28 న॥ గు ఉ9-4 ఆశ్రేఉ10-52 వరా1-18 మొ12-42కు భో7-20
29 ద॥ శు ఉ7-50 మఉ10-21 వసా6-20 మొ7-56కు భో7-16
30 ఏ॥ శ ఉ7-1 పుబ్బఉ10-16 వసా5-35 మొ7-13కు భో7-12
31 ద్వా॥ ఆ ఉ6-43 ఉత్తరఉ10-39 వరా7-22 మొ9-2కు భో7-8

1937 సం॥ అక్టోబరు నెల

వందేమాతరం

# చెన్నపురిమండల ఆంధ్ర కాంగ్రెసు సంఘము

పై సంఘముయొక్క ఆదరణక్రింద ధర్మ హిందీ చరఖా పాఠశాలయును పఠనమందిరమును ఆచారప్పన్ వీధిలో 29 నెంబరు గృహమునందు స్థాపింపబడినది.

ప్రజలందరు హిందీ, నూలువడుకుట నేర్చుకొనవచ్చును. ఉదయం 7 మొదలు 9 ఘంటలు వరకు, పగలు 3 మొదలు 5 ఘంటలువరకు పఠనమందిరమున తెనుగు, అరవము ఇంగ్లీషు పత్రికలు చదువవచ్చును. సాయంత్రం 6 మొదలు 9 ఘంటలవరకు, శ్రీమతి దుర్గా వెంకటరమణమ్మగారు కార్యనిర్వాహకులుగను, హిందీ, చరఖా ఉపాధ్యాయులుగను ఈ స్థానమందు పనిచేయుచున్నారు. ఈమె కార్యనిర్వాహణమునందు మిక్కిలి సమర్థురాలు.

శ్రీ పసుమర్తి చక్రవర్తి శ్రేష్ఠిగారు పైవిచారణ చేయుచుందురు. వీరు దేశభక్తులు, దేశాభిమానులు.

ఉదారులందరు వారివారి శక్త్యానుసారము ఈసంస్థకు ద్రవ్యసహాయము చేసి పోషింప ప్రార్థించుచున్నాము.

కె. శ్రీరాములు నాయుడుగారు, మేయర్: పోషకులు.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, అధ్యక్షులు.

గద్దె రంగయ్య నాయుడుగారు, కార్యదర్శి.




చర్మము
మెఖమల్
వలె
మృదువుగా
నుండుటకు
**వేప్**
(వేప)
**సబ్బు**
కేరళ సోప్
ఇన్‌స్టిట్యూట్
కాలికట్.

## కావలెను

ఏలూరు, కాకినాడ, బరహంపురము, అనకాపల్లి, గుడివాడ మొదలగు స్థలములందు 'గృహలక్ష్మి'కి ఏజంట్లు కావలెను. వివరములకు వ్రాయుడు.

# వీరస్మృతి

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

సీ. హృదయమైనను గోసియిచ్చునంతటి భూరివితరణవల్లి దిగ్వీధిప్రాక
సహజపరాక్రమోజ్జ్వల యశఃపుంజంబు సర్వసర్వంసహాస్థలి వెలుంగ
సతతసద్గుణగణాచారనిష్ఠాపరత్వంబు యోగులకు దత్త్వంబుగ అప
దనదుసర్వస్వమైనను త్యజించెడునంత ప్రభుభక్తినిష్ఠ ప్రాభవమొసంగ

గీ. కొన్నిదినముల నిలయేలికొన్ననీదు, రమ్యవితరణగుణ చరిత్రములనెల్ల
ప్రకృతిమాతయె స్వర్ణాక్షరములదిద్ది, గ్వతానముల వ్రాసికొనియె నిస్తంద్రప్రతిభ.

చ. అరుదగు ప్రేమపాత్రులగునట్టి నిజానుజులంద్యజించి, నా
కరయఁగ రాజభక్తియ మహావ్రతమంచు దలంచి దీక్షమై
నరపతిసేవకై దనమనంబును కాయమునుంద్యజించినా
డరరె యదెట్టిత్యాగమహిమాన్వితవ్యక్తియొ యాతడెన్నఁగన్.

గీ. త్యాగమే మూర్తిగైకొన్న దాయనంగ, నవిరళయశఃప్రదంబైన కవచకుండ
లములఁగొని యొకవిప్రసత్తమునికొఱకు, త్యాగమొనరించినాడు; అత్యాదరమున.

క. తనధనము పేదలకునై, తనయావనధనము తనదుతరుణికొఱకునై
తనప్రాణధనము ప్రభుకై, వినియోగమొనర్చె త్యాగివిధమదియగదా.

గీ. దేవ యనివచ్చి తనువేడదివిరెనేని, జెలగికండలనైనను జెండియిచ్చు
త్యాగి; యిట్టియాతనిమహత్త్వంబు భారత, తీయులకునెల్ల వన్నియదెచ్చునీవి.

గీ. పరమమంగళుడగు భానుప్రాపునొంది, విమలవిజ్ఞానమయుడవై వెలసికొనుచు,
నిత్యమంగళమూర్తివై నెగడునిన్ను, చచ్చితివటంచు దలతు నాపిచ్చితనము.

చ. అనినిటలాక్షుగెల్చిన మహాబలికైన నెదిర్చినిల్చి యా
జనపతికై బలంబు దనసర్వము జీవితముందృజించినా
వనఘ; భవత్సమానుల మహాత్ముల భారతదేశమాత పా
వనతరగర్భమందుగని యద్భుదకీర్తినిబొందు గాకికన్.

గీ. ఎంతకాలంబు నీతండ్రి యిలవెలుంగు నంతదాకను నీకీర్తియమలకాంతి
చంద్రికయనంగ వెలుగు దిశాతటముల, జెలగి త్యాగపుకిరణముల్ చిందుకొనుచు.

గీ. సత్యమునహారిశ్చంద్రుసాటియౌదు, ఈవియందునశిబి బలికీడువత్తు
శీలమున రామచంద్రునిబోలగలవు, రాజభక్తికి నీసాటిరాగనెవరు.



# భారతస్త్రీల పరమధర్మము


శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారు

[ సంయుక్తరాష్ట్రముల స్థానికసంస్థలయు ఆరోగ్యశాఖయొక్కయు మంత్రి. ]




స్త్రీసమస్యనుగూర్చి నాయభిప్రాయము లెట్టివి అని పత్రికావిలేఖకులు నితరులును పదేపదే నన్నడుగుచున్నారు. ఒక్కొక్కసారియు నిట్టిప్రార్థనలు స్త్రీలకర్తవ్య మేమి యని నాకు విస్మయము కల్గించుచున్నవి.

స్వరాజ్యమునకయి పోరాటము సలుపుచున్న మనయట్టి దేశములో అసలుండునదొకేప్రశ్న—కూడినంత శీఘ్రకాలములో స్వాతంత్ర్యమును సంపాదించుట అనునది. ఇతరప్రశ్నలకు తావులేదు.

కాని స్త్రీసమస్య యెట్లయినను బయలుదేరుచునేయున్నది. దానికి నేను పరిష్కారపూర్వక ప్రత్యుత్తరమొసగుట సమంజసమేయగును.

అసలు సమస్య ఇది. సంఘములో స్త్రీయొక్క సరియైన స్థానమెద్ది? సంఘమునకును దేశమునకును స్త్రీ యెట్లు తోడ్పడగలదు?

పరమావధివిషయమున అభిప్రాయభేదములు తప్పవు.

స్త్రీ బహిఃప్రపంచమెట్టిదియో యెరయ నేరక వంటయిల్లేమో, బిడ్డల కనిపెంచుటేమో తప్ప అన్యమెఱుగని స్థితినుండి అభివృద్ధిమార్గమున మన మెంతో దూరము ప్రయాణము సాగించితిమి; కాని నేడు స్త్రీ ఒక ప్రత్యేకవ్యవస్థకు మాత్రమే యరికట్టబడక వ్యావహారికముగనైనను కొంత స్వాతంత్ర్యమును సంపాదించుకొనియున్నది.

అయినను, ఆమెను పూర్వము బానిసస్థితిలోనుంచిన అనేక ప్రాచీననిషేధములు క్రొత్తవేషములతో తిరుగా నేటికి పొడసూపుచు నామె పురోవృద్ధికి నిరోధము కల్పించుట చూచుచునేయున్నాము.

నేటి విద్యావిధానము ప్రపంచవ్యవస్థలో స్త్రీని తన వ్యక్తిత్వము నెఱపుకొని ఒక స్థాన మాక్రమించుకొనునట్లు చేయక గృహమునకుగాని దేశమునకుగాని అక్కఱకురాని కేవల సంఘాలంకారముగా నగుటకు తోడ్పడుచున్నది. అంతే. (ఇది ఒక్క

భారతదేశమునకు మాత్రము సంబంధించిన వాక్యము).

*     *     *     *

ప్రస్తుతసంఘావస్థలో నాగరకతయింకను పురుషాయత్తమే. విషయవ్యవస్థలందు స్త్రీ యింకను తనకు దక్కవలసిన స్థాన మాక్రమించలేదు. నాగరకతకు పురుషు డెంత అవసరమో స్త్రీయు నంత ముఖ్యమే నేడు ఆమె పురుషుని స్వార్థపరత్వమును అంతమొందింప పోరిడుటే గాక నాగరకతావిషయమున సైతము గల పురుషుని ప్రాబల్యమునుధిక్కరించుటకు పూనుకొన్నది.

వంశమునునిలుపుటకు బిడ్డలకనుటతో స్త్రీకర్తవ్యము ముగియదు; కాని ఆపిల్ల నెట్లు పెంచిన వారు దైహికముగను మానసికముగను పూర్ణారోగ్యము కల్గియుందురో దాని నెఱుగవలయును.

సత్యమును గ్రహించి యెన్ని నష్టకష్టములపాలయినను దాని వీడకుండునట్లు పిల్లలకు గుణము నేర్పు బాధ్యత స్త్రీదే.

గృహనిర్మాణ మొక్కటే స్త్రీ బాధ్యతగా పూర్వముండెను. ముందంజవైచి ప్రభుత్వమును చక్కపఱచుట కెందుకు స్త్రీ పూనుకోరాదు?

ఈవఱకు స్త్రీలు పరమార్థచింతలే. ఇక మీాద 'ఇదమిత్థమ్' అను నిర్ణయసామర్థ్యము వారికి కలుగవలెను. ఇట్లు చక్కనివిషయములందు వా రారితేరినవారు గనుక వ్యవహారములుకూడా నడపుటకు తెలిసికోవలెను.

*     *     *     *

కావున నారీమణియొక్క ప్రతిభ లలితకళా సంబంధ విజ్ఞానార్జనమాత్రమేగాక రాజ్యాంగము నడపుటయందు సైతము వెల్లడి కావలయునని భవిష్యత్తు వచించు నేమో! ఇది స్త్రీసమస్యాపరిష్కారమునకు సరియగు సూచనయని ఇప్పుడే సిద్ధాంతము చేయలేము. కానీ ఒక మహోన్నతాశయము సిద్ధించుట కిది మార్గదర్శకము కాగలదు.

"గృహనిర్మాణమొక్కటే స్త్రీ బాధ్యతగా పూర్వముండెను. ఇపుడు ముందంజవైచి ప్రభుత్వమును చక్కపఱచుటకెందుకు స్త్రీ పూనుకోరాదు? నారీమణియొక్క ప్రతిభలలితకళాసంబంధవిజ్ఞానార్జన మాత్రమేగాక రాజ్యాంగము నడపుటయందు సైతము వెల్లడికావలయునని భవిష్యత్తు వచించునేమో? ప్రయత్నించిన ప్రపంచమును అందముగను నివాసయోగ్యముగను ధర్మబద్ధముగను స్త్రీ చేయగలదు."

గృహనిర్మాణమున ఆరితేరినచేయి స్త్రీగా నుండనిండు. ఇంటిని కళావంతముగను ఆనందముగను ఒనర్పనిండు; కాని ముఖ్యతర విషయములందును వారి యీ ప్రతిభ ప్రతిబింబించునట్లు చూడవలయును.

ప్రపంచమును సైతము అందముగను, సంతోషదాయకముగను, నివాసయోగ్యముగను, ధర్మబద్ధముగను వారిని చేయనిండు.

హిందూస్త్రీల గొప్పవిశేషము, ధైర్యముతో తనధర్మమును నెఱవేర్చుటలో నేగలదని ప్రపంచమునకు వారు చాటుదురుగాక.

స్త్రీయొక్క ధర్మవర్తనమే మనకు తుదకు విజయము చేకూర్చగలదు. (I.W.)

# "సమాధులపై సౌధమును నిర్మించవద్దు"

శ్రీమతి తాడి నాగమ్మగారు

హెడ్మాస్టరు—ఏమోయి! రమణారావు! నీప్రత్యర్థి రామారావుకే ఈసారి ఫస్టుమార్కులు వచ్చాయి నీవేమి చదవలేదా?

రమణరావు—ఎంతచదివినా ప్రశ్నపత్రికలు సంగ్రహించుట, అవివీలుకానప్పుడు పుస్తకములుచూచి వ్రాయుట నాచేతకాదులెండి.

హెడ్మా—మొన్నటి పరీక్షలలో ప్రశ్నపత్రికలు దొంగిలించడం, చూచివ్రాయడం కూడానా!

రమణరా—ఏమోలెండి నాకెందుకు? నిజముచెప్పితే నిష్ఠూరం. 'చాడీకోండి' అని బిరుదులివ్వడం.

హెడ్మా—నీవు తరగతికి పెద్దవై (Monitor) యుండి ఇట్టిసంగతులుచెప్పడానికి భయమెందుకు?

రమణరా—అయ్యా నాకెందుకులెండి? తీరామీరే ఆ విషయంతెచ్చారుకాబట్టి నాహృదయంలో దాగియున్న సత్యం బయటపడింది.

హెడ్మా—నిజముగా అట్లుచేసినట్లు ఋజువున్నదా?

రమణరా—ఏమో నాకెందుకు? మీతో యేదిచెప్పినా ఋజువులు, సాక్ష్యములు, ప్లీడర్లుకావాలి.

హెడ్మా—అట్లయితే రామారావును డిస్మిస్‌చేస్తా.

రమణరా—అయ్యోపాపం!! డిస్మిస్‌దాకాయెందుకు? ఏదోకొంచెం భయంచెప్పండి...అయ్యా యిటువంటివారివల్ల స్కూలుపేరుకూడా పాడగును.

హెడ్మా—No. Certainly he should be dismissed.

రమణరా—అంతకఠినశిక్ష యెందుకులెండి. మరి... పైగా యీస్కూలునుండి డిస్మిస్‌చేస్తే ఇంకొక స్కూలులోమాత్రముచేరి యిట్టిపనులుచేయడా?

హెడ్మా—ఇంక యేస్కూలులోనూ చేరనీకుండగ డిస్మిస్‌చేస్తాను. ఈవిషయం డైరక్టరుకు వెంటనే వ్రాస్తాను.

నిరపరాధియగు రామారావు డిస్మిస్‌చేయబడినాడు. తలదాల్చుకొనుటకైన తలములేని పేదయతడు. అనాథబాలుడగు నాతడు దిక్కుతెన్నులులేక తల్లడిల్ల సాగినాడు. రమణారావుమోపిన కృత్రిమ నేరము మూలమున అతనిజీవితము అధోగతిపాలైనది. ప్రపంచ నాటకరంగమునందతడు పైకిరాకుండగ రమణారావు జీవముతోనే పూడ్చివేసినాడు. రామారావులేనందు వల్ల తనకువచ్చెడి ఫస్టుమార్కులతోను, బహుమతుల తోను వృద్ధిపొందసాగినాడు.

*　　　*　　　*

ప్రిన్సిపాల్—రమణారావు! హాస్టలు గొడవలేమిటి?

రమణరావు—ఉన్నవిచెపితే స్టూడెంట్సు చాడీలు అంటారు. చెప్పకుంటే మనకే ముప్పువస్తుంది. నేనేబాధపడగలను చెప్పండి?

ప్రిన్సి—నాతోచెప్పడానికి నీకేమి అభ్యంతరంగలదు?

రమణ—లేదు...కాని—

ప్రిన్సి—ఏం? మోహన్‌రావు మరల దెబ్బలాటకు వచ్చాడా?

రమణ—ఒక్కదెబ్బలాట ఐతే అంత యిబ్బంది యేముంది?

ప్రిన్సి—మరింకేమిగలదు?

రమణ.—హాస్టలులోనేనా...అయినా నాకెందుకులెండి.

ప్రిన్సి—హాస్టలుపెద్దవైన నీవుగాక ఇంకెవరికి?

రమణ—ఉండలేక నిజముచెపితే—క్లాసులో అతనికీ నాకు పోటీయగుటచే—అసూయతో చెప్పావంటారు.

ప్రిన్సి—అసూయతోచెప్పావని తలచేవాళ్లు నిన్నేమి చేయగలరు? నాతో నిజంచెప్పు.



భారతదేశద్వారము, బొంబాయిరేవు

రమణ—అబ్బా!! నిజంచెప్పేవరకు మీరు చంపుకు తింటారు. పైగా తమవద్దనిజం దాచలేనుకూడాను.

ప్రిన్సి—పరవాలేదు, చెప్పు.

రమణ—మీరు గట్టిగానొక్కి అడుగుతున్నారు కాబట్టి చెబుతున్నా......రాత్రి హాస్టలుకుర్రాళ్ళంతా అన్నంతినడం మానివేసారు.

ప్రిన్సి—ఆఁ? ఎందుచేత?

రమణ—నేయి మంచిది కాదట. దుర్వాసనట - కూరలో యింకేమిటో లోటట–ఒకటా? బోలెడు.

ప్రిన్సి—ఇవన్నీ యెవరెవరన్నారు?

రమణ—ఇంకెవరు? అన్నిటిలోను అడుగుపెట్టే మోహన్ రావున్నాడుగా.

ప్రిన్సి—ఇంకాయేమిటి?

రమణ—తక్కిన వెందుకులెండి. అవికూడ మీకు తెలిస్తే అసలు మాకే చిక్కువస్తుంది.

ప్రిన్సి—నీకేమిచిక్కు?

రమణ—హాస్టలే యెత్తివేస్తారు.

ప్రిన్సి—అంతప్రబల కారణమేముంది?

రమణ—ఏదో పడుచువాళ్లం కాదా?

ప్రిన్సి—ఐతే?

రమణ—ప్రక్కనే ఆడపిల్లల హాస్టలుంది. ఇంకేమి కావాలి?

ప్రిన్సి—ఏమిజరిగింది?

రమణ—ఏమీ జరుగలేదులెండి...మరి...అయినా ...నా...కెందుకులెండి.

ప్రిన్సి—నీవేమీ దాచవద్దు. నాదగ్గరకూడా దాపరికమా?

రమణ—ప్రేమలేఖలూ...రాత్రులు విహారములూ... మొదలైనవి.

ప్రిన్సి—లెటర్సు దొరికినవా?

రమణ—కావలిసినన్ని. కాని అతని స్వదస్తూరిలో లేవు.

ప్రిన్సి—అతడెవరు?

రమణ—ఇంకెవరంత సమర్థులు?

ప్రిన్సి—మోహన్ రావేనా?

రమణ—ముమ్మాటికిని...నాకెందుకులెండి మీకంత సంశయమున్నపుడు?

ప్రిన్సి—వానిని డిస్మిస్ చేస్తా.

రమణ—అయ్యోపాపం!! డిస్మిస్‌దాకా యెందుకు? ఏదోకొంచెం భయంచెప్పండి...యిటువంటివారి వల్ల కాలేజీపేరుకూడా పాడగును.

ప్రిన్సి—No. Certainly he should be dismissed.

రమణ—అంతకఠినశిక్ష యెందుకులెండి......మరి... పైగా యీ కాలేజీనుండి డిస్మిస్ చేస్తే ఇంకొక కాలేజీలోమాత్రంచేరి యిట్టిపనులు చేయడా?

ప్రిన్సి—ఇంక యేకాలేజీలోను చేరకుండగ డిస్మిస్ చేస్తాను. ఈసంగతి వెంటనే యూనివర్సిటీకి వ్రాస్తాను.

నిర్దోషియగు మోహన్‌రావు యేకాలేజీలోను చేరకుండగ డిస్మిస్ చేయబడినాడు. అకస్మాత్తుగ జరిగిన యీఘోరసంఘట్టనమూలమున మోహన్‌రావు మతిపోయినది. పిచ్చివాడై దివారాత్రములు ప్రలాపింప సాగినాడు. వీధివీధుల మైలపేలికలతో సగము దిగంబరుడై యల్లాడుచుండు నాతనిజూచి కంటతడిబెట్టని వారుండరు. నిరపరాధియగు నాయువకుని జీవితము నకస్మాత్తుగ పాతాళమునకుపడద్రోసి మరియొకగోరీని నిర్మించినాడు రమణారావు. మోహన్‌రావులేనందు వల్ల రమణారావుకే ప్రథమబహుమతులు, విద్యార్థి వేతనములు రాసాగినవి. ద్విగుణోత్సాహముతో నాతడు అవిధముగవచ్చుపేరు ప్రతిష్ఠలకు పొంగి పోసాగినాడు.

* * *

రత్నమ్మ—హాలో! డియర్ రమణారావు. ఎప్పుడు వేంచేశారు మదరాసుకి?

రమణరావు—ఇప్పుడే.

రత్న—త్వరలోనే మాయింటికివచ్చారు. వందనాలు,


RESTAURANT

## "సమాధులపై సౌధమును నిర్మించవద్దు"

రమణ—రత్నం నాకుఅలంకారం కాబట్టిధరించుటకు వచ్చాను.

రత్నమ్మ—మీరు చూపించేదయకు నన్ను నేనేమరచి పోతున్నాను సంతోషపరవశమున.

రమణరా—అయితే అంత యిబ్బందిలేదుగాని మరి నన్నుమాత్రం మరచిపోవద్దు.

రత్నమ్మ—మిమ్ములను మరచిపోవుటకు నేనెంతటి దాన్ని, అందుకు మీరేసమర్థులు.

రమణరా—సమర్థతలేకనే నీకొరకై యింతదూరం పరుగెత్తికొనివచ్చాను.

రత్నమ్మ—కేవలం నాకొరకేవచ్చారా?

రమణరా—మరెందుకు?

రత్నమ్మ—నాబోటి నారీమణులిం కెంతమంది తమకు గలరో!

రమణరా—పరిచయమైన స్నేహితురాండ్రున్నారు. ఉంటేయేం?

రత్నమ్మ—వారినికూడా నావలెనేప్రేమించారేమో?

రమణరా—అబ్బా! మాటలతో చంపడమేగాని... ఎందుకువచ్చానో?...ఏమిటో...సంగతులు తెలిసి కొనవుగదా...ఉస్...అబ్బా.

రత్నమ్మ—ఆయాసంగా ఉన్నారేం?

రమణరా—నాలుగువందలమైళ్లు నిద్ర లేకుండగ ప్రయాణంచేసివస్తే ఆయాసంగదూ?

రత్నమ్మ—ఏం పనిమీదవచ్చారు?

రమణరా—పెద్దఉద్యోగంవచ్చిందిగాని లాభంలేదు.

రత్నమ్మ—ఏం?

రమణరా—డిపాజిట్టు 400 రూపాయలుకట్టాలి.

రత్నమ్మ—మరికట్టకూడదూ?

రమణరా—డబ్బేదీ?

రత్నమ్మ—ఇదిగో నాబంగారుగొలుసు, గాజులజత. అమ్మి డిపోజిట్టుకట్టండి.

రమణరా—ఇవి లేకపోతే నీయందం చిన్నబోతుంది. అందుకు నాప్రాణం ఓర్చదు.

రత్నమ్మ—ఆ ఉద్యోగంవస్తే యిటువంటి వెన్నో మీరే సంపాదిస్తారు.

రమణరా—ఉద్యోగం రాకపోతేనో?

రత్నమ్మ—అప్పుడు మీరే నాకలంకారం. త్వరగా పోయి వస్తువులమ్మి డిపోజిట్టుకట్టిరండి.

రమణరా—రత్నం! నీప్రేమకెన్ని యుగాలవరకైనా రుణపడియుంటాను.

రత్నమ్మ—అబ్బా! పొగడ్తలెందుకు పోయివద్దురూ.

* * *

రమణరా—హలో! డాక్టరమ్మగారు బాగున్నారా?

రాధమ్మ—అంత గొప్పపేరెందుకు 'మంత్రసాని' అని పిలవండి.

రమణరా—మీకు వారికి అట్టే తేడాలేదులెండి.

రాధమ్మ—మీరెప్పుడూ నన్ను పొగడుటేకదూ.

రమణరా—వంట్లో కులాసా ఉందాండి.

రాధమ్మ—మీదయవల్ల.

రమణరా—నా దయకేమిలెండి. భగవంతునిదయ ఉండాలిగాని.

రాధమ్మ—భగవంతునిదయ యెట్లాఉన్నా తమదయ ఉంటేచాలు.

రమణరా—ఏమండీ అట్లా దిగులుగా మాట్లాడుతున్నారు.

రాధ—పెండ్లిగాని నాబోటివనితలకు దిగులులేని విషయమేముంది?

రమణ—మీకేమి లోటుందని దిగులు?

రాధ—భర్తదొరకకపోవడం దిగులుగాదా?

రమణ—ఎన్నిచెప్పినా మీకు నమ్మకలేదు?

రాధ—నమ్మియే యీగతి తెచ్చుకొన్నాను.

రమణ—ఏగతి? ఏం అల్లామాట్లాడుతున్నారు.

రాధ—ఏమో! అన్నిటికిని మిమ్మునే నమ్మాను.

రమణ—బలే ఇంక భయమెందుకు?

రాధ—త్వరలోనే కార్యం అయితే మంచిది.

రమణ—అంతతొందరేం?

రాధ—నాకు తొందరలేదుగాని... పరిస్థితులు తెచ్చి పెట్టిన చిక్కుయిది.

రమణ—నీ చిక్కుకేమిగాని... నాది పెద్దచిక్కు.

రాధ—ఏమిటది ?

రమణ—ఉద్యోగంకొరకు 400 రూపాయలు డిపాజిట్టు కట్టాలి.

రాధ—డబ్బులేని చిక్కా?

రమణ—ఔను.

రాధ—నావద్దరున్నవి. తీసికొనిపోయి కట్టండి.

రమణ—రాధా! నీ క్షేమకెన్నియుగముల వరకైనా రుణపడియుంటాను.

రాధ—సొగసులకేమి గాని వివాహంత్వరగాజరగాలి.

రమణ—ఉద్యోగంవచ్చిన వెంటనే తప్పదు.

రాధ—నిజం చెప్పుతున్నాను. నెలతప్పింది.

రమణ—పరవాలేదు. భారంనాది.

ఉద్యోగం వచ్చినవెంటనే రమణారావు రాధా రత్నమ్మలను మరిచాడు. వారికి ద్రోహంచేశాడు. అమాయికలగు వారి ధనరాసులను ద్రోచుకొన్నాడు. కన్యాత్వము చూరగొన్నాడు. తుదకు వారి జీవితములను నాశముచేసాడు. ధనము పోయినందుకును పాతివ్రత్యము చెడగొట్టుకొన్నందుకును రత్నమ్మకు పిచ్చియెక్కినది. నెలలుతప్పిన రాధమ్మ లోకనిందకు జడిసి విషముతో ఆత్మహత్యగావించుకొంది. వారి జీవితములపై మరిరెండు గోరీలు నిర్మించి రమణారావు అభివృద్ధిపొందసాగాడు. నాలుగువందల రూపాయల లంచముతో మంచి ఉద్యోగం సంపాదించాడు.

*   *   *   *

ఉద్యోగి—రమణారావుగారూ! మీకూ వెంకటరావు గారికిని పోటీవచ్చింది. ఇద్దరిలోను ఈ ఆఫీసు మేనేజరుగా యెవరిని నియమించవలెనను విషయం గురించి పైనుండి నాకు వ్రాసారు.

రమణ—ఆఫీసు మేనేజరు పదవి అటుంచి మీపదవికే పోటీ వచ్చేటట్టు ఉంది.

ఉద్యోగి—నాపదవికెట్లు?

రమణ—అదే చిదంబర రహస్యం.

ఉద్యోగి—నాపదవికెవరు పోటీచేస్తున్నారు?

రమణ—మీరు ఆక్టింగ్ ఆఫీసరుగదా, పర్మనెంటుగా రావడానికి మరొకరున్నారు.

ఉద్యోగి—ఎవరు?

రమణ—వెంకటరావుగారే.

ఉద్యోగి—అతడెట్లు నాపదవికి రాగలడు?

రమణ—అతనికి మెడ్రాస్ సెక్రటేరియేట్‌లో బంధువులున్నారు.

ఉద్యోగి—ఉంటే మాత్రం?

రమణ—మొన్న వెంకటరావుగారు పదిరోజులు సెలవుపెట్టినారు మీరెరుగుదురా?

ఉద్యోగి—ఔను.

రమణ—అపుడు వారు మెడ్రాస్‌వెళ్లి వారిని నేరుగా మీపదవిలో వేయమన్నారట.

ఉద్యోగి—మరియేమైయింది?

రమణ—అపుడు వారి బంధువులే అది వీలుపడదు కాబట్టి మొదట ఆఫీసుమేనేజరైతే తరువాత సంగతి చూస్తామన్నారట.

ఉద్యోగి—తరువాత యేమిచేస్తారు?

రమణ—మేనేజరైన రెండవనెలలోనే మీపదవిలో వేయించే యేర్పాట్లు చేస్తారట.

ఉద్యోగి—నాకు యీచాన్సులో ఫర్మనెంటు కాకపోతే మరల పదిసంవత్సరములవరకు కాదు.

రమణ—కాబట్టి యిపుడే మేల్కొండి.

ఉద్యోగి—ఎట్లా?

రమణ—వెంకటరావుగారు మేనేజరు కాకుండా చేయడం.

ఉద్యోగి—యెలాగు?

రమణ—లంచం కేసుకల్పించి పైకి రిపోర్టుచేయాలి.

ఉద్యోగి—దయతో ఆయేర్పాట్లు నీవే చేయాలి.

రమణ—మీరు ఊ అంటేచాలు అంతా నేనే యేర్పాటు చేస్తాను.

## "సమాధులపై సౌధమును నిర్మించవద్దు"

ఉద్యోగి—ఏలా చేస్తావో ఒక వేళ అపీలుమీద విచారణకువస్తే అన్నీ దృఢపడాలి.

రమణ—అవన్నీ నేనే యేర్పాటుచేస్తా. మీరు మాత్రం అతడు మేనేజరు కాకుండా చూడాలి.

ఉద్యోగి—నా ప్రాణముండగా నేను చూడక పోతానా?

కృత్రిమలంచపు కేసు నిరూపింపబడుటవలన వెంకటరావును ఉద్యోగమునుండి కొంతకాలము బర్తరఫుచేశారు. జీవితములో అతనికి ప్రమోషను లేక పోవుటయే గాక—అతని స్థానమునుండి తగ్గించి సామాన్యగుమస్తాగా వేసారు. నిర్దోషియగు వెంకటరావు జీవితకాలమంతయు అందే పూడ్చి వేయబడినాడు. తాను మేనేజరై అభివృద్ధిపొంద సాగినాడు.

* * * *

ఒకడు—బాబూ! యీడిప్యూటి కలెక్టరుగారి పేరేమిటి?

గుమస్తా—రమణారావుగారు.

ఒకడు—వీరి బసయెక్కడ.

గుమస్తా—వంతెన దగ్గరున్న పెద్దమేడ.

ఒకడు—ఎన్నిగంటలకు వారు వెళతారు.

గుమస్తా—ఇన్నిగంటలని చెప్పలేను.

ఒకడు—చీకటిపడేవరకుండెదరా?

గుమస్తా—బహుశః ఉంటే ఉండవచ్చు.

ఒకడు—వెళ్ళేటప్పుడు నడిచివెళ్లెదరా?

గుమస్తా—చీకటిపడితే నడిచేవెళ్లుతారు. ఇవన్నీ నీకెందుకు?

ఒకడు—వారితో మొరబెట్టుకోవాలి.

గుమస్తా—ఏమని?

ఒకడు—నాకొడుకును, నాముద్దుబిడ్డను చంపినవాని కేసు కొట్టివేశారు.

గుమస్తా—కేసుకొట్టివేస్తే యింకేమిచేస్తారు?

ఒకడు—అది ఘోరం! పైగా లంచంతిన్నారట.

గుమస్తా—ఆవిషయం ఎత్తావంటే నిన్ను ఖైదులో వేస్తారు.

ఒకడు—చిత్తం. లంచం గాదుట. కేసుకొట్టివేసినందుకు వాళ్లొక మేడకట్టించి దొరగారికిస్తారట.

గుమస్తా—అయితే అందుకేమంటావు?

ఒకడు—నాకొడుకుసమాధిపై వారు సౌధము కట్టించుకొంటారా?

గుమస్తా—అందుకిప్పుడేమి చేస్తావు?

ఒకడు—వారితో మనవిచేస్తాను.

గుమస్తా—ఏమని.

ఒకడు—సమాధులపై సౌధము కట్టకూడదని.

గుమస్తా—నీయిష్టం—పోవోయి.

ఒకడు—చిత్తం.

* * * *

ఆ వేళ యేదో కేసులో తీర్పుచెప్పేసరికి చాలచీకటి పడింది. డిప్యూటికలెక్టరు రమణారావు తీర్పుచెప్పి యింటికి బయలుదేరినాడు. ఇంటికి కొంతదూరములో నుండగ 'డప్' అను శబ్దముతో ఒక దుడ్డుకఱ్ఱ అతని శిరస్సుపైబడినది. వెనుకనే వచ్చుచున్న ఇద్దరు బంట్రోతులు పరుగెత్తసాగారు. "సమాధులపై సౌధము నిర్మించవద్దు" అంటూ మరల యొక ప్రేటుపడినది. రమణారావు నేలకూలినాడు. పారిపోయిన బంట్రోతులు పోలీసులతో తిరిగివచ్చారు. తలచితికిన డిప్యూటి కలెక్టరు క్రిందపడియున్నాడు. ఆసుపత్రికి గొని పోవగ అచ్చట శస్త్రచికిత్స జరిగినది. స్పృహదప్పి యున్న రమణారావు "సమాధులపై సౌధములు నిర్మించవద్దు" అని పలవరించుచుండువాడు. అందుచే గాయము మానిపోవు సరికి అతనికి పిచ్చియెత్తినది. పిచ్చియందు సతతము "సమాధులపై సౌధమును నిర్మించవద్దు" అని పలవరించుచుండును. పిచ్చియెత్తుటచే ఉద్యోగము పోయినది. పిచ్చియెత్తిన రమణారావు ప్రేలాడు మైలపేలికలతో వీధివీధుల తిరుగుచు ఇప్పటికిని "సమాధులపై సౌధమును నిర్మించవద్దు" అని నవ్వుచు, ఏడ్చుచు, కిచకిచలాడుచు ఉచ్చరించుచుండును.

# అత్తింటి ప్రయాణము

చెలీ! గృహలక్ష్మీ!

విలువ బంగారునగల సంకెలలతోడ
నీ లతాంగముల నెటు బంధింపగలను?
కోమలశిరీష పద్మంపు కుసుమములను
అందమును గూర్చునీదు లతాంగములకు.

శ్రీమతి కొల్లూరి గౌరీదేవిగారు

"ఏమోయీ! నెలయైనకాదిటకు తానే తెంచి, గొంపోవ మీ
గ్రామంబప్పుడ యేమితొందరిపు డింకన్ గొన్నినాళ్లుండి నీ
వామీదన్ గొనిపోదుగాని, యికనేమనోక్కకు మీసారికిన్";
ప్రేమన్ బల్కిన యత్తగారిటులు కూర్మిన్ నవ్వి యల్లుండనున్.

"అటుకానిం డెపు డీరుసెప్పినను నేనాటంకమున్ జెప్ప, ని
ప్పటికామెంగద యార్నెలల్, నెలయెగా భావించినారీరు, ప
ల్కుటసాజంబటు మీరుతల్లులగుటన్; కోపింప కీసారి పం
పుటయేమీవిధి; మీరెఱుంగనివె మమ్మున్ మాగృహచ్ఛిద్రముల్."

"ఏమిది బావ! నీదుధనమేయయినట్టుల బల్కుచుంటి వీ
వామె, త్వదర్థమాట నిజ మంతనె సోదరి కాదె మాకు?"; "బా
వా! మఱియక్కఁదీతుకెలు పాపనుమాత్ర మిడన్ జుమా"; "సరే
నీమనసార పెంచుమిట నిత్యముపాలను నీవె యిచ్చుచున్."

"ఇందఱు నిన్నిరీతులవచింతురె కాని యొకండునైన మా
బందరువచ్చిచూచి యొకవారమునుంటిరె చెల్లెలున్ ముదం
బొందంగ, ప్రేమయున్న; నిటనున్నపుడుండిన ప్రేమయెల్ల మా
కుందరినుండనప్పు డెటకున్ జనునోగద బావగార్లకున్."

"ఏమో నీవెపుడన్ననిట్టులె వచింతెంతో పనుందంచు, ని
ప్డీమేచేయుపనేమి నీకచట? నీ కెల్లారునున్నారుగా;
యేమంచున్ వచియింతు నింతకును నీవేజూడు మాపైని నా
కేమీతోప"దటన్నమామ, వినయుం బేసార యల్లుండనున్.

"మీరల్ పెద్దలుగూడనన్నిబలుకఁ మేలౌనె? యోజింపు డీ
మారాడంగలవాడనా? యచటనఁ మాతల్లియుఁ దండ్రి యొం
తో రాగంబున తోడితెమ్మనిరి సంతోషాంతరంగంబులఁ;
నారాకఁ గను చంద్రు; రేపనువుడీ నామాటమన్నింపుడీ!"

మరునాఁడెల్లరు మూగవోయినటులఁ మారాడరెప్పట్టు, లా
యరవిందానన మోముదమ్మి ముకుళంబాయెఁ; ఫలాహారప
ళ్లెరముఁ ముందిడి బావకుఁ మఱది వేళాకోళముల్ సేయ, డా
దర మొప్పఁ బిలువంగ బావ, మరదల్ "దానం"చు గీల్కొట్టుగా!

పలుమరు నెల్లవారలును పాపను చేతుల నెత్తి ప్రేమతో
బలుకుచు ముద్దులఁ గురిసివచ్చెడి దుఃఖము సంతసంబులఁ
గలిపి ఘనీభవించుకొని కాన్కల నెన్నియొ బెట్టి ముస్తబుఁ
జలుపుచు దేలు చంద్రి ముఖచంద్రమరీచిచయామృతాంబుధిఁ.

బొటబొటకారు బాష్పజలపూర్ణ, సులోచన, నావధూమణీ
స్ఫుటనిటల ప్రభల్ దరుగ బూచపనుల్ సవరింప, తల్లిదా
నటజని "నీవొనర్పగలవా?" యని దాసయొనర్చు, నంతన
చ్చొటువిడి బాష్పముల్ విడచుచుఁ గనుచుండగ తల్లినొక్కెడఁ.

"బండియువచ్చె, వీధినిలువంబడె, జాగిక నేల? వేగనె
ఎక్కుండని" లోనికింజనుచు కూర్మిసహోదరిగాంచి, కోమలిఁ
నిండుకవోష్ణభాష్పచయ నీరజలోచన మారుమాట లే
కుండగబోయి బండికడకుఁ, నిలువంబడె ఖిన్నచిత్తుఁడై.

మేలిమివన్నెకన్న గడుమిన్నగ మన్ననగాంచు మేనిపై
వ్రాలిన తుమ్మెదల్బలెను వాల్గనులొప్పగ, బాలచంద్రునిఁ
కేళియొనర్చి సంతసిలి కేకలిడఁ గనిపాపలీలలఁ
కాలముఁబుచ్చుచెల్లెఁ జెలికాండ్రనుఁ జేరి శుభాంగియంతటఁ.

ఏదో చెప్పదలంచి, మూడవడమాటేరాక యత్నించియుఁ,
భూదేవిఁ గని బాష్పధారలచయంబుఁ వ్రాసి యద్దాని, పా
పఁ దానెత్తుకనేగుచుఁ చెలిసఖుల్ బాష్పాంజలుల్ సేయుచుం
డఁ దీనాననుడై, వసారగదిలోనఁ నిల్చె పిత్రాజ్ఞకై.

## గృహలక్ష్మి

"నాన్నా! వెళ్లెద" నన్న సుమాట హృదయాంతర్భాగమం దుండియుఁ
కన్నీరుక్కుత్తుకఁబట్టియుండ బలుకంగా లేక చేలాంచలిన్
ఖిన్నాబ్జానన మొత్తికొంచు నలిసెన్, నిత్యోత్సవానందసం
పన్నుండా పసిపాప లేనగవులన్ భాసిల్లగా జేయఁగన్.

సకలాంధ్రావని పండితాభినుతులన్ సంతోషితస్వాంతుఁడం
త కుమారిన్ గనుఁగొంచు గద్గదికనెబ్బెన్ "పుత్రపౌత్రాది స
త్సకలైశ్వర్యములొనఁగాక" యని యాత్మన్ దీవనల్ చేసి బా
ష్పకణాక్షింతల గొన్ని జల్లె నవి తత్ప్రాంతంబునేదూలఁగన్.

"తొలుత నె నీకొసంగితిని తోడుగ సద్గృహలక్ష్మి నెల్ల, నీ
యలఁగల కావ్యకీర్తికల నాదనొ జతకూర్చినాను, కో
మలకవితాలతాంగి సరిగుం జెలికత్తెనిచ్చినాను, నే
దెలిసినవాడఁగావున; సుదీవగుపొందకుమమ్మ పుత్రికా!"

"తనయల కెప్పుడైన తలిదండ్రులవీడి పతిగృహంబులన్
జని సుఖయించుటెల్ల విధిశాసనమే కద! నీ వెఱుంగు, పై
నను నొకమాట, వెన్క నొకనాడు శకుంతలఁ జెప్పనట్టిదా
నిని జపియించి తిరుగుము నిత్యము; జ్ఞప్తియొనర్తు సిప్పుడున్.

"శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే।
భర్తుర్విప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపం గమః।
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యేష్వనుత్సేకినీ।
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః॥"






వారు టీ త్రాగునప్పుడు వారిలో నొక శాంతియు, వారికి ప్రపంచ మంతయు యానందమయముగా తోచుచున్నది. మనోభారము తగ్గుటచే జీవించుటయే మంచిదై తోచును. తెలివిగల గృహపత్నులు వారి కిన్ని వారి కుటుంబములకున్ను సంతుష్టికొఱకై తమ యిండ్లలో దీనిని సహజమైన వాడుకగా పెట్టుకొని యున్నారు.

“టీ” జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూన్ “టీ” యొక్కొకరికిన్ని, మొత్తముగా నొకస్పూన్ యధికముగాను పాత్రములో వేసి, మరుగుచున్న నీటిని పోయవలెను. ౫ నిముషములు తాళి, కప్పులలో పోసి, పాలు, చక్కెర చేర్పవలెను.

## సంసారమునకు తగినపానము—ఇండియా ‘టీ’

IK 54

# దుర్భిక్షంలో నిర్బంధపండుగాచారాలా?

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

ధరణీచక్రముతోపాటు లోకం పోకడ పండుగాచారాలుకూడా మారాలి. అత్తకాలంకొన్నాళ్లు, కోడలికాలం కొన్నాళ్లు, కోడలి కాలం కొంత మరువకూడదు.

రామరాజ్యమువంటి స్వతంత్రపాలనాశక్తి పరహస్తగతమై వారిదు గంజిమెతుకులకే లోబడి బ్రతుకుతెరువులు చేతకానివారమై, కోరలుతీసిన పాములవలె పాటలతోను, మాటలతోను, పట్టిబుస్సలకొట్టుచు, ఇన్నాళ్లు కాలక్షేపం చేసితిమి. కావడికుండలు మారాయి. ఇంటియజమానికి ఇల్లు బాధ్యత తెలిసినట్లు మనవారు, మనకు దక్కినారు. స్వజనబాధ్యత గుర్తించి మంచిదారుల బిడ్డలను త్రిప్ప జూచుచున్నారు. త్రాగుడు జోగుడు, ప్రపంచారిష్టములలో నొకటని దిద్ద దలపెట్టినారు. మాతృబోధనలచే మది కుదురుపరచ చూచుచున్నారు. చేతిలోపని కలిగి చేతకానిపెద్దమ్మలవలె తరిఫీతులేక కూర్చున్న సోదరసోదరీలను, స్వశక్తిని తెలిసికొను ప్రబోధములు గల్గించుచున్నారు. నిర్బంధములు పడసినచోట్లనే, నివాళులందుకొనుచున్నారు. అమితాహార, ఆశాపాశ విషయేచ్ఛలకు వెచ్చించు ధన ప్రవాహమరికట్టి సవ్యమార్గముగా మితవ్యయములుగా సమానసుఖోత్పత్తిగా దేశీయులనడవడికలలో మార్పులుచేయుచున్నారు. చెప్పుటకంటె చేసిచూపించుచున్నారు. అత్తసొమ్ము, అల్లుడుధారపోసినట్లు హిందూదేశీయుల వెచ్చని నిట్టూర్పులతోగూడిన రక్తపుబొట్లులావిడచిన

పూర్వం విజయదశమీపండుగలకు స్వతంత్రరాష్ట్రములు గనుక విజయోత్సాహముగా కత్తులునూరి సేనను తరిఫీతుచేసి దేవిని పూజించి యుద్ధాలకు వెడితే, ఇప్పుడు మనకి కత్తి కఠారులకంటె, కదురుకవ్వములే ముఖ్యముగాన, వాటినే పూజించాలి.

నిర్బంధపుపన్నులన సమకూర్చిన ఆదాయములలో; పేదవారు. పుచ్చుకునే ఆరువేలజీతమును, వేయికి నూరుగా తీసికొను మనవారిచేతలే గొప్పఆదర్శము. ఇట్లా కోడలికాలమువలె, అనుభవనీయం. వైద్యమువలె, రోగి కష్టముమల్లినట్లు మనకాలం మారదలచింది. గాన, ఇంటినిబట్టి, సంసారములోకూడా మార్పులుజరగాలి.

భావిశుభోదయమునకును, నిరుద్యోగ సమస్యాపరిష్కారమునకును, పాడిపంట ముఖ్యము. పశువు వ్యవసాయాధారము, గోక్షీరమృతము, శరీరాధారము పంట, పొట్టకు బట్టకు ఆధారము. గాన, పండుగ, గోజుల్లో, వున్నా లేకపోయినాకూడా, కష్టపడో నిష్ఠూరముపడో, అప్పోసప్పోచేసి, అల్లుళ్ళమర్యాదలు, అలంకారకోరికలు, అమృతజిలేబీల పిండివంటలు, అమ్మవార్ల పూజలు, అమ్మలఆర్భాటములు, అబ్బాయిలగిలకలు, పంతుళ్ళబహుమతులు, దీపావళీసందర్భ బాణసంచాకాల్పులపై నిజంగా డబ్బుతగలవేసి కోవడము తీర్చలేక దివాలాలు సందర్భపడుచుండుట లోకవిదితమే.

ఇన్నిరీతులచూస్తూ, వింటూకూడ మనసంసారములలో కూడా సమయానుకూలంగా మార్పులుచేసికొనకపోతే ముక్తిలేదు. ఉన్నావిడయున్నట్లు చేసికొంటే, లేనావిడలేనట్లే చేసికోవాలిగాని వారి అల్లుడికి శేలం అంచుపట్టుబట్టలే పెడితే, లేని సంసారిణి

మాలుబట్టలేపెట్టి కుటుంబ నిర్వాహకంచేయాలి కాని, మగనినిపీడించి అలిగి, అప్పుచేయించితే అధఃపాతాళమేగాని మరిగతికలదా? తృప్తియే సర్వసౌఖ్యములకు మూలము గాన మనపండుగలలో పాత ఆచారములనే పట్టుకుని ప్రాకులాడక నూతనసిద్ధాంతముల రీతిగా మనము మార్పులు పొందుట విధాయకము. శ్రావణ శుక్రవారముకు తొమ్మిది పిండివంటలూ చేయక తప్ప దట! ఎట్లు? బీదబానిస దేశములో అన్నాతురులై అలోమను ఆరుకోట్ల జీవులనుభవించుచుండగా ఒక్క కుటుంబము స్వకీయోదరపోషణకై అన్నమేకాక పది పిండివంటలు!

కాను రెండుపదులకుమించినా తప్పదట! ఇష్ట మెచ్చినట్లు ధర పెరిగిందికాని, బంగారము పదకొండ ణాలయితే! ఇల్లలుకగానే పండుగగునా? ఎన్ని అమ రాలి?మాపొరుగింటి ఆవిడ పండుగవచ్చిందంటే ఇంట్లో పురిటికి సిద్ధముగా కూతురున్నాసరే, మరొకరికి ముస్తీగాయున్నా సరే, తనకి జబ్బుచేసినాసరే, ఉండ లేని ఆబాలవృద్ధులున్నా సరే, యథావిధిగా తలంటు స్నానంచేసి, కలశంపెట్టి, దశరాత్రులును, సహస్ర నామావళియుక్తముగా పలువిధపిండివంటల సహిత ముగా పూజాదికములు నిర్వర్తించితీరును. ఆ మూఢ విశ్వాసములో యజమాని యెంతయోనలిగినా చివరకు నూతనాంబర ధారణమువఱకు చేసితీరవలెనన్న నిర్బంధ విధానమామెదే నెగ్గితీరుతుంది.

బాల్యవివాహానర్థము లెన్నిరీతులనో బోధించి శారదాశాసనము నిలబెట్టి మహాత్కార్యము పూర్తిగా నెరవేర్చినారు. కాని, కొడుకు రెండుమూడువందలు జుల్మానాయిచ్చుకున్నా సరే రెండునెలలు కారాగార శిక్ష యనుభవించినాసరే మనుమరాలు పెద్దమనిషి కాకుండా కన్యాదానఫలం దక్కనిస్తావా? లేదా? యని పట్టుపట్టి, యుపవాసములుండి, గయ్యాళులై అల్లరి చేసి, తమపంతములు నెగ్గించుకున్న ముసలమ్మలు ఇటువంటివారే.

పండుగవచ్చిందంటే, పూటకు గతిలేకపోయినా నూతనవస్త్రాలు తెచ్చేదాకా అలిగి, సణిగి, మగనిచే అప్పుచేయించియో, అరువు తెప్పించియో పంతము నెగ్గించుకొనుచున్న భార్యామణులనేకులున్నారు.

ఇంతెందుకు? శ్రీరామనవమిని చందాలుగా వేలకు వేలు పోగుచేసి బాహ్యాడంబరమైదురోజులకు అధ మము, పందిళ్ల అలంకారముల కానితములక్రిందను, అట్టలక్రిందను ఖర్చుపెట్టువందలకొలది సొమ్ముతో వృత్తిపనులు నిర్వర్తించు యేసంస్థయో స్థాపించిన యెడల, ఎంతనిరుద్యోగసమస్యయో పరిష్కారమగు టయేగాక నిత్యావసరమగు స్వదేశవస్తువులెన్నియో, సంప్రాప్తమగును. ఆ ఐదురోజులు మనవారు ఆచార ముల పేరిట, సగుణారాధనాతత్పరులై ఖర్చుపెట్టు ధనప్రవాహముయొక్క విలువ తెలిసికొనినయెడల అట్టి దేవుళ్ల నిత్యకళ్యాణములకు, దొంగదాసుల భజన కాలక్షేపములకు, అల్లరిమూకల నేత్రోత్సవములకును, సంసారవృక్షములయొక్క వేరుపురుగులై, గృహిణుల అర్థాంగుల నపహరించు నేర్పరులై,సంసారిణుల కన్నీళ్ల కాలవాలములై మేడిపండుమైచాయాలంకార క్రిమి సంకుల మురికికూపముల మించు భోగదూపకాంతలగు వేశ్యానటనాకచేరిలకును, చేయు దుర్వ్యయములో పదవవంతు స్వంతబిడ్డల వివాహోపనయనములకు ఖర్చు చేయ వెనుదీయుదురుకదా? అదియు నధికవ్యయమే. ఇట్టి చందాగా ప్రోగుచేయబడిన ధనముతో; యే అనాథశరణాలయమో, ఏబీద విద్యార్థినిధియో, ఏ దేశీయవృత్తిసంస్థయో స్థాపించిన దేశమెంతటియున్న తిని బొందును? అయినా మనలోకులుకూడా దేవుడు కార్యమంటే భయభక్తులతో యిచ్చినట్లు, ఇతర సంస్థ లకు చందాలేయియ్యరు. అలాగే యజమానికూడా పండుగంటేనే ఎంతయినా ఖర్చుపెట్టును కాని పేపరు కొక్కకానియైనా యియ్యడు.

ఈలాగే ప్రతిపండుగలకి యింటింటా దుర్వ్య యమే. దేశములోయుండి వేలకొలది దేవాలయ

తీర్థోత్సవాలకి మొత్తముమీద ధనవ్యయమే. వీటిని సక్రమంగా ఖర్చుచేయించి దేశోద్ధరణచేయు మహానీయులెరీ ! ఇటీవల గవర్నరుగావచ్చిన రెడ్డిగారు మా గోపాలస్వామి గుడిపన్ను బకాయి సుమారుకొన్ని వేలు కొట్టించేశారు కాని పురారోగ్య సంఘస్థాపన కీసుమంత గ్రాంటైనాచేయలేదు. ఇదే "అయినవాళ్ల కాకులలోను, కాని వాళ్లను కంచాలలోను" అన్న సామెత.

ముక్కు మొగ మెరుగని కోమటికి మూడువందల ఖరీదువస్తువు అమ్ముటకై యిచ్చిన ఒకరు అంతరంగిక బంధువుకాని స్నేహితుడుకాని వందరూపాయిలడిగితే వస్తువుముదుట పెట్టుమంటారు. అలాగే రోజుకు బేడ సిగరెట్లకు ఖర్చుచేసే పురుషుడు స్వభార్యాబిడ్డల స్వంతఖర్చుకి వెనువీసి జమాఖర్చు అడుగుతాడు. ఈలా యున్నవి మన ప్రాతఆచారములు. వ్రాస్తే పెద్ద గ్రంథమవుతుంది. ఏపురగ్రామములు చూచినా స్త్రీల ఆరోగ్యవాహ్యాళుల కొక్కచోటైనా లేదు. ఈసంగతెవరికి కావాలి?

# కోయిలా!

కోయిలా! గున్నమామిడికొమ్మమీద
వ్రాలిచిగురాకులను గొంతువరకుమెక్కి
లేశము విచారమునుమదిలేక, స్వేచ్ఛ
విహారణము సేయుదువు వనవీధులందు
విభుడు, పెద్దలు నీవిట్లువీథులందు
తిరుగ కిమ్మన రెంతయదృష్టవతివో !
నాల్గుగోడలమధ్యను నవయు రాణి
వాసముండదుగాదె నివాసగృహమున
మఱియు నీకొక్క వ్యాసంగమయినలేదు
వంటచేయగవలె తినవలెనటన్న
నియమమేలేదు, శిశువులన్బెంచు బాధ
మున్నె లేదు, లేదుమఱొక్క బన్నమహహా
తీరుబడిలేమియెట్టిదో తెలియవీవు
చీకుచింతలు నీదరిజేర వెపుడు
కావుననె వసంతోదయకాలమునను
మావికొనకొమ్మపై రాచఠీవిమెఱయ
నధివసించి ప్రకృతికాంత కదిసియాడ
భావమానందసాగర భంగములను
తేలియాడగ గొంతెత్తియాలపింతు
విశ్వమోహన గీతికావిసర; మట్టి
మాకుగూడను పాడగా మనసుగలదు.



కాని నీవలెగా దేము బానిసలము
తలపులో పల్కులోను చేతలను మగని
మాటయే బాట, పరదాలుదాటి యవలి
ప్రకృతి కన్నారగాంచిన పాపమునను
పోవలేదెప్పు, డాహారపుష్టియైన
బహుజనములకు మాతృనసహో, మగలకె
కృషులులేవనుగోల, చాకిరికలోటు
మాకులేదు, పిల్లలబెంప నీయవలెను
కాకిమూకంత దాదులగణము లేదు
తీరుబడియన్న నెట్టిదో తెలియలేము
చీకుచింతలకాటాచిచిత్త; మింక
నెట్టుపాడగగలము నీయట్టుమేము
ఎపుడొనరదాగపాట యత్నింతుమేని
గొంతుమూగపోవును, భావతంత్రులు తెగి
హృదయవీణయు మ్రోగ, దింకేమిపాట?
పాటకును స్వస్తిచెప్పుటే భావ్యమగును.

ఎన్. అలివేణి.



శ్రీమతి భక్తిబాయి లక్ష్మీబాయి దేశాయిగారు

**51 వ కాంగ్రెసు సమావేశ ఆహ్వానసంఘ సహాయాధ్యక్షురాలు.**

# పుష్పము

శ్రీమతి కె. సుగుణమణిగారు

"ఏపువ్వుపూసినా ఏమొగ్గవిడచినా,
ఎందుకో యీహృదయమింత కిళవళపడును!"



ఈ భూమిపై మనము కన్నులు తెరచిననాటినుండి అనంతకోటి వర్ణాలతో కూడిన బాహ్యప్రకృతి ప్రత్యక్షమౌచున్నది. ఏవస్తువును తిలకించినను రంగురంగులతో మనస్సు రంజింపచేయుచున్నది. ఏవంక జూచినను పచ్చనిచెట్లు, చెట్లపర్ణాలనుండి తొంగిచూచు అనంత వర్ణాలు వెదజల్లు పుష్పగుచ్ఛాలు, గుచ్ఛాలనడుమ రంజిల్లు రమ్యమౌ పూమొగ్గలు, కన్నులం బొడుచుచుండును. హృదయారవిందముగూడ వానితో నైక్యమై వికసించుచున్న పుష్పాల అందముచందము వర్ణము చూచుచున్న నెవరి మనస్సు ఆనందాతిరేకమును బొందకుండును?

ఈ కారణాలవల్లనే కాబోలు పువ్వునకును మానవజాతికిని పురాతనమునుండి ప్రణయస్నేహము. ఇప్పటికి చూడుడు, ఏ పుణ్యకార్యము తలపెట్టినను ఏచిన్న సమావేశము జరిగినను పువ్వు ఏదో రూపముగా ప్రత్యక్షమైననేగాని కార్యక్రమము జరుగదు. మనముచేయునదొక పెండ్లికానిండు, జరుపునది ఒక వ్రతమనుడు; పువ్వుఉండి తీరవలెగదా! పూర్వపరిచితులకు మన ఆదరణ దెల్పవలసివచ్చినను, ఒకమిత్రునకు స్వాగతము పంపవలసివచ్చినను పూదండయుండ నుండవలసినదేగా! బంధువర్గములో నెవరికో పుట్టినదినమని దీవనలంపినను వానికిని పూలే తోడగుడ్డ! ఒకమృతజీవికి మన మన్ననల దెల్పవలసినప్పుడును పుష్పాలే కావలెను! పూజారి చేతిలో పూవులేనిదే గుడిలో పూజేలేదు! భక్తుడు భక్తితో నిష్టదైవమునుపూజించి అలంకరించునది పూలతోడనే! ఎప్పుడెప్పుడని యువ్విళ్లూరు ఆరాటము పెండ్లికొడుకు ఆతురత మాన్పుటకుగూడ పూబోడి చేతి పూలమాలిక ముందు సూత్రధారి కావలెగా!!

ఇవిగాక కుసుమమునకు స్వర్ణరజతములకు గూడ నీయబడని అపూర్వస్థానమీయబడినది; మిత్రునకే గాదు, పైయధికారికే గాదు మరి మహారాజుకైనను గాన్కగానైనను నీయవలసివచ్చినప్పుడు పుష్పమును బోలునది వేరొకటి గానరాదు. గృహప్రాంగణమున చక్కటి పూదోట పెంచుకొనినచో కొందరి కదియొక గర్వకారణము. పుష్పము త్వక్ చక్షుర్ఘ్రాణేంద్రియములద్వారా శరీరమునకేగాదు మనస్సుద్వారా ఆత్మకును ఆనందదాయకమగుచున్నది. వేయేల పాపిని పావనునిగూడ ఒకేమాదిరి నానందింపజేయగల సామర్థ్యముగలది పుష్పమొక్కటే!

తమంతటతామే అలంకారములైనను అలంకారార్థముగూడ పూలు పలువిధముల వినియోగింపబడుచున్నవి. ధనికుల యిండ్లలో ప్రొద్దుటనే నింపబడు మేజాలపై పూసజ్జలు మనకు నిత్యపరిచయవస్తువులే. ఏకారణముననో మానవునకు పూవులనిన అమితానురాగము—తనయింటి ద్వారబంధములపై పూలే చెక్కించుకొని ఆనందించును. బల్లపైనున్న చైనా పాత్రలపైనను పుష్పములనే చిత్రించికొని కుతూహలపడును. చీరలపైనేగాక వల్లెవాట్లపైగూడ అంచులను కుసుమధామములనే ముద్రించుకొని మురియుచుండును! పూలకొరకు తనకున్న అమితతృష్ణచే కాబోలు—రంగురంగుల కాగితములతో వర్ణవర్ణాలజిలుగ బెండ్లతో కృత్రిమపూలు నిర్మించుకొని యదార్థకుసుమములు తనకు చాలుటలేదని వెల్లడించుకొనును మానవుడు,

ఇంకను చిత్రము!—పొడిపొడిగా తయారగు కొన్ని రసాయనికములకు గూడ "పూలు" అని పేరిడికొని పూలనిన తనకున్న మమతను తెలియబరచును. [ఉదాహరణ:—గంధకంపూలు సౌవీరంపూలు గంధకపుష్పం అను పూలు; ఇవి యదార్థమునకు "పూలు" గాక పోయినను 'సేతిబీరకాయల' వలె నివియు పూలనియే వ్యవహరింపబడుచుండును!]

ఇంతచేసినను పుష్పములతో తనివిచెందక ఆసమయమునకే ఆనందమునుగూర్చు వాటి సౌరభముల బీల్చి తృప్తినందక వానిసారమును పిండి కావలసినప్పుడెల్ల లభించుటకని సీసాలలోని కెక్కించి "సెంటని" "సువాసననూనె" యని పేర్లిడి 'వెఱ్ఱికి వేయివిధము'లన్న చందమున ప్రవర్తించుచుండు మానవునిచూచి "పూల పిపాసి" యని యెవరనకుందురు!

ఇట్లు అందఱు పూలవెఱ్ఱితో కొట్టుకొనుచుండ తామమాత్ర మెందు కూరకొనవలెనని గాబోలు కవులుగూడ వానినే సమయమువొరకినప్పుడెల్ల వర్ణించి వర్ణించి తనవితీరక శాంతిపడక స్త్రీల చక్కదనమును సుకుమారత్వమునుగూడ కుసుమగుణాలకు ముడిపెట్టి పోల్చి పువ్వుబోడి అని తమ రసికత్వమును వెల్లబుచ్చుకొనుచున్నారు!! అందువలన నీ సందర్భములలో పుష్పమునుగురించి కొద్దిగా వ్రాయబూనిన నాప్రయత్నము అసందర్భముకానేరదని తలంచెదను.

## పుష్పమనఁగా నేమి?

శాస్త్రజ్ఞులను పుష్పమననేమియని యడిగినచో—వృక్షశాస్త్రజ్ఞుఁడు "అది స్త్రీపురుష అంగములు గలిగి ఆకర్షణపత్రములు మున్నగు వానిగా మార్పుజెందిన ఆకులసమూహము" అనును. అండ, అండాశయ, కింజల్క, ఆకర్షణ, రక్షకపత్రములు మున్నగునవన్నియు కలసినది పువ్వట! ప్రకృతిరీత్యా చెప్పవలసి వచ్చినయెడల "కోటివేషాలూ ఆకొంతకార్యం కోసరమే" అన్న ఆర్యోక్తిప్రకారము—'పూవు ఒకందుకు నిర్మింపబడిన వృక్షాంగం'—జాతిప్రవృద్ధికోసరం జరుగవలసిన ఆక్రియకోసరము.

## పూలరంగు

సృష్టిలోనిపూలు అనంతవర్ణాలలో వర్ణాలకలయికలతో విరాజిల్లుచుండును. ఈరంగులు వృక్షాంగములలో తయారగు పద్ధతులనుగూర్చి యెంతయో శాస్త్రపరిశోధన చేయబడినది.

కీటకముల నాకర్షించి వానిచే సంయోగసిద్ధిబడయుటకై దాల్చిన మిష—యీ రంగులు రమ్యాలును! కొన్ని గాలిచే తేబడిన పుప్పొడివల్లనే గర్భధారణ పొందును. మరికొన్ని నీరు, ఇంకను కొన్ని చిత్రచిత్రములైన విధముల నీప్సితార్థముల నందుచుండును. వీనిలో కీటకముల సహాయమునుగొను పూలరంగులు అత్యంత మనోరంజకములుగా నుండును. రాత్రివికసించుపూలు (మల్లి తామర మొదలగునవి) సాధారణముగ తెలుపువర్ణముగలిగియుండును సృష్టిలో సహజముగదొరకు పూలను పరీక్షించినయెడల వాని రంగుక్రిందిమాదిరి నుండునని శాస్త్రజ్ఞులు అంచనా తేల్చినారు:— "వేయికి 284 తెల్లపుష్పములు 226 పసుపుపచ్చన, 12 నారింజపండురంగు, 4 గోధుమవర్ణం 2 నలుపు" అని.

## కుసుమ పరిమళము

వర్ణములకన్న పుష్పముల పరిమళమే మనకు చాల మక్కువ. కుసుమసౌరభమునుబోలు అపూర్వవస్తువింకొకటి సృష్టిలోలేదనియే చెప్పనగును. ఆత్మకు ఆనందదాయకమది. పుష్పాకృతి వర్ణము కంటికి; కోమలతఒంటికి; ఆనందమునుగూర్చ — సౌరభము నాసికకును ఆత్మకును ముదమొనగూర్చుచు సృష్టికర్త చాతుర్యమును తలపించుచుండును.

వీటి రహస్యముల నెరిఁగికొనుటకై శాస్త్రజ్ఞులు చాల కష్టించి కృషి సల్పియుండిరి. పూర్తిగా తెలియుట దుస్తరమనియే చెప్పవలెను; కాని ఆధునిక

శాస్త్రవేత్తలు—ఆ ఆకారమునకు కారణము వంశ పారంపర్యా వచ్చు నిక్షిప్తజీన్సు అనియు, రంగుకు ఒక సేంద్రియ రసాయనికవస్తువే కారణమనియు, పరిమళమునకు మూలము ఏదో "చిన్న అల్ఫా–గామా–లాక్టా రసాయనితపదార్థమేతప్ప అంతకు మినహా మరియేమియు అద్భుతముకే"దని చెప్పుచుండ మనస్సు ఒక్కరీతి వైకల్యమును బొందకమానదు! ప్రకృతిశాస్త్రజ్ఞు లెంత ప్రవీణులైనను, శాస్త్రపరిశోధనల నెన్నిగావించినను, అద్భుతావహమగు సృష్టి వైచిత్ర్యములు శాస్త్రపుముక్కలతో జెప్పివేయబడగలవనుట అసంభవము. అపూర్వమై, అవర్ణనీయమై, అనంతమైన సృష్టికర్తలీల లెప్పటికిని, ఎంతటివారికిని దురావగాహము లయియేయుండునేమో! "మాయ సృష్టిని దెల్పంగ మనిషికగునె?" అని గదా ప్రాజ్ఞులనియుండిరి.

పూలరంగు, పరిమళము—రసాయనిక శాస్త్రరీత్యా చెప్పవలసివచ్చినయెడల వీటినిగూర్చి రసాయనిక శాస్త్రజ్ఞుల అభిప్రాయము కొద్దిగావ్రాయుట నిట సమంజసము. పూల వివిధవర్ణములకు కారణము జాన్‌తిన్, సయానిన్ మున్నగు కొన్ని సేంద్రియ పదార్థములేనట! వీటిని పూలనుండితీసి పరీక్షించుట చాల కష్టమైనపని. ఎంత శ్రద్ధతీసికొనినను ఈ ద్రవ్యములు కల్తిలేకుండ లభింపవు. అందుచే వాటి యదార్థత్వము లంత విశదముగా నింకను తెలియబడలేదు.

'గాలిలో త్వరగా హరించు గుణముగల కొన్ని నూనెలు పూలలోనుండుటవలన వాటికి తావి యబ్బుచున్నదని, పూలను బట్టిపట్టి వీటిని "సెంట్లు", "అత్తరు"గా వేరు చేయవచ్చునని రసాయనిక శాస్త్రజ్ఞులు కనుక్కొనియున్నారు. అంతియేకాదు; ఆ పరిమళములతో తుల్యమగు సెంటులను (పూలు అక్కరలేకుండగనే) చవుకగా దొరకు తమ రసాయనికములనుండియే తయారుచేయగలుగుచున్నారు. నిజమైన అత్తరులో వీటిని కల్తీగా కలుపుటచే రకరకాల కృత్రిమసెంట్లు వేనవేలు తయారయి అంగళ్లు నింపివేయుచున్నవి. అందుచే నీశాస్త్రజ్ఞుల పుణ్యమాయని మనకు నికార్సయిన అత్తర్లే కరువైపోయినవని చెప్పవచ్చును.

ఇందుకు కొంచెము ఉదాహరణముగా నీక్రింది పట్టీ పొందుపరచబడినది:—

| సువాసన | ఆవాసనిచ్చు రసాయనిక పదార్థము |
|---|---|
| మల్లిపూల వాసన | బెంజైల్ ఏసిటేట్ |
| గులాబి | బెంజైల్ కార్బినాల్ |
| నిమ్మగడ్డి వాసన | సిట్రాల్ |
| లావెండరు | జరేనియల్ ఏసిటేట్ |
| బనానాపండ్ల వాసన | ఏమైల్ ఏసిటేటు |
| అనాస | ఈథైల్ బ్యుటైరేట్ |
| లవంగవాసన | యూజినాల్ |
| కస్తూరి | ట్రైనైట్రో బ్యుటైల్ |

పూలపరిమళము శీతోష్ణస్థితినిబట్టికూడ నుండును. ఏలనన పూవులోని వాసనద్రవ్యములు ఆవిరి యెంత ఎక్కువగనైన అంత పరిమళము మనము గ్రహింతుము. చలిదేశములోను, నీలగిరి మున్నగు కొండలపైనను పూలకు వాసన చాలతక్కువగనుండుట కిదియే కారణము. అన్ని సౌభాగ్యములకు ఆకరమగు మన దేశమున పూలచెట్లు పెరుగుటకును వాటి సుగంధము చక్కగా విస్తరించుటకును తగినంత సూర్యరశ్మి, వేడిమియు చాల ననుకూలముగనుండుటగూడ మన భాగ్యమే అనుకొనవలెను.

## పుష్పములయొక్క ఇతరోపయోగములు

1. తేనె:—పుష్పములలోని మకరందమును మధుపములు గ్రోలుచుండుట మనమెల్లరు గాంచినదే. కీటకముల కడుపులో కొన్నిమార్పులను జెందినపిదప ఆ మధురరసము తేనెగా మారిపోవును. దీనిని తేనె

టీగలు వెళ్ళి గక్కి పట్టులో తన పిల్లలకై నిలువజేసికొన మనము దానిని దొంగిలి ఆరగింతుము.

2. పానీయములు:—పూల సౌరభమును నీళ్లతో గలిపి "రోజావాటరు', 'ఆరంజిష్ణవరువాటరు' అని అనేక పేర్లతో విందులలో వాడుట మన కెరుకయే. రోజువాటరు చేయుటకు 3 పాళ్లు ఆటోఆఫ్‌రోజును, 25 పాళ్లు సారాయము, 3800 పాళ్లు నీళ్లును కలిపిన తయారగును. ఇట్లే వివిధరకముల పానీయములు చేసికొనవచ్చును.

3. పూలనుండి తినుటకును, బట్టలకు పనికివచ్చు రంగులనుగూడ వేయబడుచున్నవి. 'కుంకుమపువ్వు' అనునది క్రోకస్ సెటైవస్ అనే మొక్క పూలనుండి తయారుచేయుదురు. బట్టలకు వేయు స్ప్రేఫన్ డై అను చక్కటి పసుపు పచ్చరంగు 'కుసుమ' అను మొక్క కుసుమ కింజల్కములనుండి తీయుదురు.

4. భుజించుటకు పనికివచ్చు పుష్పములు:—కొన్ని పుష్పములు భోజనయుక్తములన్న సంగతి మన మెరుగుదుము. అరటిపూలు, పుల్లగోంగూరపూవు రక్షక దళములు మన యిండ్లలో కూర్లకు, పచ్చళ్లకు ఉపయోగింతురన్న సంగతి సర్వజనవిదితమే. విప్పపువ్వులని భద్రాచలము వెళ్లినవారు తెచ్చు పుల్లగా తీయగానుండునవి ఒక చెట్టుపూలే. యూరపులో ప్రిమ్‌రోజులు, వయొలెట్లు, పాట్ మేరీగోల్డులు అను పుష్పములు సలాడ్సుగను నిలువచేసికొనియు తినుచుందురట. బర్మాదేశీయులు బూరుగ పూమొగ్గల రక్షక పత్రములను కూరగా తిందురని చెప్పుదురు. చైనావారు లిలియంతుంబర్గి అను వృక్షము పూలు చాల ఆతురతతో భుజింతురట. అవిసెపూలు సిలోనుదేశవాసులు పేచుకొనియు ఉడికించియు ఆరగింతురట. కాలీఫ్లవరు మనమెల్లరకు తెలిసిన భోజనయుక్తమగు పూవే గనుక వేరే చెప్పనక్కరలేదు.

5. పూలవల్ల కాలక్రమము తెలియనగునని ఒక వృక్ష శాస్త్రజ్ఞుడు తెలియపరచినాడు. ఎట్లనః— కొన్ని కొన్ని పుష్పములు దినప్రమాణమునుబట్టి ఆయా గంటలలోనే వికసించుచుండును. కొన్ని ఉషఃకాలమున విడచును, కొన్ని సూర్యోదయవేళ విచ్చును, మరికొన్ని 7, 8 గంటలకు వికసించును. ఇట్లే సాయంకాలమువరకును రాత్రియుకూడ ఆయా వేళల వికసించు పూలుగలవు. వీటిని ఇంటిముందు గడియారము డైలు మాదిరిని పాతించినచో వాటి వాటి పూలు వికసించుట, ముకిళించుటలనుబట్టి సరిగా టైము కట్టవచ్చునని సూచించినాడు! ఇదియు పరీక్షించదగిన ఒక వింతసంగతియే.

ఇక 'పూలుగాని పూలు'గూడ నేతిబీరకాయల చందమున కొన్నిగలవని ముందే తెలిపియుంటిని.

ఈ పై అన్నియంశములవలన మానవునకు పూవు పైగల మమత, మర్యాద, ఆదరణ, తృష్ణ కొంతవరకు తెలియరాగలదు. సహజమగు కోమలత, ఆకర్షణీయములగు వర్ణములు, అద్వితీయములగు ఆకారములు గలిగి, అపూర్వసౌరభములతో సర్వజనమనోరంజకములగు పుష్పములను, (వాటికి పలువిధముల నెనయగు పూబోండ్లనుగూడ) సర్వకాలములందును, సర్వదేశములకును ఆబాలగోపాలము పండిత పామరులకు ఆదిమహాకవులు మొదలు ఆధునిక భావకవుల వరకు ఒకేరీతి నెల్లరకు; ఆకర్షణీయములై ఆనందదాయకములైయుండుటలో ఆశ్చర్యమేమిగలదు!

అందువలననే కాబోలు ఒకరసికుడు—

"వనితలేకున్న సాగదే వ్రాతనీకు?
పూలువిడనాడి రచనలు చేయలేవె?"

అనుచు, పూలు, స్త్రీలు, కవులు వీరందరిమీదనుకూడ తనకున్న యుక్రోషమును దీర్చికొని—

"దేశకల్యాణమునుగూర్చి దొడ్డరచన,
యువకులకు ముందుగతిజూపు యుక్తివచన
భావ కోకవన్నె దెచ్చెడి భావపసను
తెలుపుచుండుము నిత్యము తెలుగుబిడ్డ!"

అని ప్రబోధించెను.

## స్వస్తిక్ కుంతల ద్రవ్యములు



క్రమముగా స్వస్తిక కుంతల ద్రవ్యము లుపయోగించిన మనోహరమగు నిడుపైన వెండ్రుకల బొందగలవు. అవి భారతదేశమంతయు ప్రసిద్ధి జెందినవి. వానిలో మట్టితైలములు చేరలేదని గ్యారంటీనివ్వబడినది.






### కుంతలాభివృద్ధికి

వెంట్రుకలు విరివిగా పెరుగుటకును, బట్టతల కాకుండుటకును, చుండు మొదలగువానిని పోగొట్టి శిరమునకు చల్లదనము గల్గించుటకును చాల సుపయోగకరము. చక్కని పువ్వుల సెంటు గలుపబడినది.

### ప్రశస్తమైన స్వస్తిక వెండ్రుకల తైలము



శ్రేష్ఠమైన టెంకాయ, తిలతైలములచే తయారుచేయబడినది. హానికరమగు మట్టితైలములిందు చేర్చబడలేదు. రెండువిధములుగా దొరుకును. (కొలదిగా సెంటుచేర్చినది. ఎక్కువగా జేర్చినది.) స్వస్తిక ప్రశస్తతైలము క్రింది 5 వివిధ సువాసనలతో దొరుకును:— రోజా, మల్లె, శ్రీగంధము, కస్తూరి, స్వీట్ పి.

### సువాసనగల ఆముదము

వెండ్రుకలకు మిగుల బలవర్ధకము. వెంట్రుకలను రాలకుండ తెల్లబడకుండచేయును. చర్మమును శుభ్రపరచి చల్లదనముగల్గించును. మంచిసువాసన చేర్చబడినది. ఉత్తమమైనది.




### షికకెయ్ సబ్బు

వెంట్రుకల యభివృద్ధికి, శిరస్నానమునకు, చుండు పోగొట్టి మెఱుగుగల్గించుటకు సాటిలేనిది. శిరమునకు చల్లదనముగల్గించును.



## ది స్వస్తిక్ ఆయిల్‌మిల్స్ లిమిటెడ్,

వడాలా — బొంబాయి

డిస్ట్రిబ్యూటర్లు: ది స్వస్తిక్ ఏజన్సీ, మద్రాసు — బెజవాడ స్టేషనరీ అండు ఫాన్సీమార్టు, బెజవాడ చిత్తూరి రంగయ్య అండు కంపెని కాకినాడ — గ్రంధిస్వామి అండు సన్సు, విజయనగరం సిటీ.

డిస్ట్రిబ్యూటర్సు ప్రతిజిల్లాయందును గలరు.

హిందూస్త్రీలను మొగలాయీలు వివాహమాడవచ్చును కానీ యవననారీమణులు హిందువులను వివాహమాడరాదను ప్రపితామహుడగు అక్బర్ చక్రవర్తియొక్క చండశాసనమే ఆమెను బంధించివైచెను.

ఈ ప్రణయమే ఆ మానినీరత్నపు మనోవేదనకు కారణము. గుప్తప్రణయమే ఆమెను దహించివేయుచుండెను.

దాన నామె ఎన్నియోవిధముల చింతించెడిది. తన్ను అమితముగలాలించు తనసోదరుడు, తనతండ్రి ఎట్లైనను తనముద్దుచెల్లింతురని ఒక్కొక్కమారు తలచెడిది. ఒక్కొకమారు తండ్రి కంత ధైర్యములేదు; సోదరుడగు దారా రాజ్యాధికారము వహించిన ప్రపితామహుని శాసనము నుల్లంఘించునను, దారా నాకై ఏమిచేయును? అని తలచెడిది: ఒక్కొకమారు ప్రపితామహుని శాసనమును ప్రతిఘటించుటకు సాహసము లేదేమో, ఈజీవితము అడవినిగాచిన వెన్నెలేమోయని పలవించెడిది. హిందూమహమ్మదీయుల ఐకమత్యమునకై కృషిసల్పిన అక్బర్ పాదుషా ఏలాకో ఈశాసనము కల్పించెను. పూజనీయులగు రసపుత్రరమణులు యవనుల వివాహమాడ, యవననారీమణులు రసపుత్రవీరుల వివాహమాడరాదను నియమమేల యని ఆత్మగతముగ అనేకమారులు వాదించుకొనుచుండెడిది. ఇహలోకమున నా యీప్సితము నెరవేరదు. పరలోకమున నీప్సితసిద్ధి బడయుదునేమో. అచట అడ్డువారెవరు, అచటకూడా అక్బర్ చక్రవర్తి శాసన మడ్డువచ్చునాయని పలవరించెడిది. తాను తన ప్రియునితో సుఖతరంగముల నోలలాడుచున్నట్లు కలవరించెడిది. ఒక్కొక్కమారు దుఃఖించెడిది. ఏడ్చిన హృదయభారము కొంతతగ్గునని తలచి వెక్కివెక్కి ఏడ్చెడిది. వలపు వమ్మాయెనని కన్నీరు కార్చెడిది.

అంతఃపురమున ఆమె కేదియు మనశ్శాంతి నిచ్చెడిదికాదు. బిడ్డలయాశల ప్రియమున దీర్చుటకు తల్లికన్న వేరు దైవమే లేదు. పాపము పాదుషాబేగమునకు తల్లి పసితనముననే కరవయ్యెను కదా. మనశ్శాంతికై యమునాతీరమున రమ్యహర్మ్యరూపముగ అవతరిల్లిన మాతృమూర్తి తాజమహాల్‌కు వెళ్లి మాతృసమాధికడ కూర్చుండి కన్నీరు రాల్చుచుండెడిది. సమాధిరూపముననున్నను మాతృమూర్తియే జహనారాబేగమునకు శాంతి నొసగెడిది.

వృద్ధుడగు తండ్రికి రాజ్యభారము కష్టముగ దోచెను. కాన ఆ జరాపీడితుడు తిసకుమాళ్ల తనప్రతినిధులుగ వంగ, గుజరాతు దక్షిణదేశములకు పంపి, ప్రియపుత్రుడును, జ్యేష్ఠుడును అగు దారాను ఆగ్రానగరమందే నిలుపుకొనెను.

దారా పాదుషా ప్రియతనూజుడే కాదు. పాదుషా బేగమునకుకూడా ప్రేమపాత్రుడే. రాకుమారుడు దారాకు జహనారా ముద్దుచెల్లెలు. పాదుషావలెనే కుమారుడుకూడ పాదుషాబేగముమాట జవదాటడు. ఆతడామెను అల్లారుముద్దుగ చూచుకొనుచుండెను.

పాదుషా దారాను నిలిపి, తమ్ము వివిధ రాష్ట్రముల కంపినది భాతృత్రయమునకు కంటగింపై యుండెను. దారా మోసము చేసి సింహాసన మాక్రమించుకొన ప్రయత్నించుచున్నాడేమో యని ఆ రాకొమరులకు సంశయమొదవెను. కాన ఎవరికివారే చక్రవర్తి కావలయునన్న వాంఛ ప్రబలి సోదరులొండొరులతో పోరనారంభించిరి.

ఆ భాతృకలహము జ హా నా రా కు హృదయశల్యమైపోయెను. రాజకుమారులు ఒకరితోనొకరు కలహించుట చక్రవర్తి తనూజ సహింపలేకపోయెను. ఆమె చేయునదేమున్నది. అబల. భాతృకలహమున తాను పాల్గొనలేదు. ఆమెకు సోదరులందరొక్కటే. క్రూరుడగు ఔరంగజేబు కృత్యముల ఆమె ఓర్వలేకపోయెను. అమాయకుడగు దారామీద ఆమె ప్రేమ వెల్లివిరియుచుండెను. కాన భాతృకలహమున రాకుమారి దారాపక్ష మవలంబించెను. ఆమె సోదరి రోషనారా ఔరంగజేబు పక్షపాతి.

జరాభారపీడితుడగు తండ్రికి ఈ తనయుల పోరాటము హృదయభారమునకు కూడా కారణమయ్యెను. చక్రవర్తి హృదయబాధ జహనారా ఎరిగెను. తన శేషజీవితము తండ్రి పరిచర్యకే వినియోగపరుప దలచెను. పాదుషాకు పరిచర్య పాజాదియే స్వయముగ చేయుచుండెను.

తాను ప్రణయముచే బీడితురాలైనట్లు ఆమె ఎవరికిని ఎరుకపరచలేదు. తండ్రి కూడా ఎరుగడు. పాదుషాబేగము ప్రియుడు దారాపక్షమున పాదుషాకొరకు పోరుచుండెను. పాదుషా గెలిచిన ప్రథమ తనూజుడగు దారాకు పట్టముగట్టి పాదుషా విశ్రాంతి నొందదలచుచుండెను. పాదుషా బేగమునకు మరల ఆశ మొలకలెత్తెను. దారా యుద్ధమున గెలిచిన సింహాసనస్థుడగును. దారా గెలిచిన తాను తన ప్రణయరాజ్యమును గెలిచి ప్రణయసింహాసనమున సుఖాసీనురాలు కావచ్చునని ఉవ్విళ్లూరెడిది. ఈకోరిక ఆమె హృదయమందు చిరకాలము వాసమొనర్పనేలేదు. ఆమె ఆశలన్నియు వ్రేళ్లతో పెళ్లగింపబడెను. ఏమందురా, పాదుషాబేగము ప్రియుడు పాదుషాకొరకు యుద్ధముచేయుచు రసపుత్రుల కుచితమగు వీరమరణమందెను.

ప్రియుని మరణవార్త పాదుషాబేగమునకు పెద్దగొడ్డలిపెట్టే. ఆమె పై ప్రాణములు పై కెగసిపోయెను. పాదుషాబేగమువలెనే ఆ రాజకులాలంకారముకూడా ఎన్నియోఆశలుంచుకొనియుండెను. దారారాజకుమారుడుయుద్ధమున గెలిచిన తానుచేసిన సహాయమునకు బహుమానము కోరుకుని అడుగుననియు, పాదుషాబేగమును కోరి పడయవచ్చునని తలచుచుండెను. ఈ బహూకృతికి దారా ఇయ్యకొనుననియు, వృద్ధుడగు పాదుషాకూడా అడ్డుతగులడనియు, ఆవిధముగ అక్బర్ శాసనమును ప్రతిఘటించవచ్చుననియు ఆ వీరుడు తలంచుచుండెను.

ఆ ప్రణయినీప్రణయుల తలపులన్నియు గగనహర్మ్యములైపోయెను.

ఇక పాదుషాబేగము జహనారా కేమున్నది? ఆమె జీవన్మృతురాలే. షాహజాదీ ఏ విషమో త్రాగి మరణించెడిదే. వృద్ధజనకునికొరకే యసువులు నిల్పుకొనుచు కాలముగడుపుచుండెను. తన ప్రియునితలచి గట్టిగ విలపించుటకుకూడా ఆ తరుణికి ధైర్యములేదు. అంతకుకూడ ఆయతివ పెట్టిపుట్టలేదు.

ఇదిమొదలు ఆ ఇంతి హృదయక్షోభ ఇనుమడించెను. యుద్ధమున దారా ఓడిపోయెను. దారా తన దారపుత్రులతో యుడవిపట్టెను. ఔరంగజేబ్ మిత్రుడొకడు దారాను చంపి యతని శిరమును ఔరంగజేబునకు కానుకగా బంపెను. ఔరంగజేబా భిన్నమస్తకమును ఆగ్రాపురవీథులలో నూరేగించెను. జహనారా ప్రియసోదరుని మరణవార్త వినినది. మరి ఇరువురు సోదరులుకూడా ఔరంగజేబుచే హత్య కావింపబడిరి. ఇవన్నియు ఆమెకు దుఃఖకరవిషయములే. ఆమె సహింపలేనివే. ప్రతియొకటియు షాజాదీ హృదయమును కలచునదే. పాదుషాబేగము హృదయము పాషాణముకావించుకొని ఆ ముసలిజనకునికొఱకే ఓర్చినది. ఔరంగజేబు చేతలకు లోలోపలనే దుఃఖించెడిది.

తండ్రిని చెరసాలలో బంధించి 'అలంఘీర్' నామమున సింహాసనస్థుడైనాడు ఔరంగజేబు. తండ్రిని బంధించినపుడు సోదరి జహనారాను తన అంతఃపురమున కాహ్వానించినాడు. కాని పాదుషాబేగము సోదరాహ్వానమును తిరస్కరించినది. తండ్రితోకూడ కారాగృహావాసమే కోరినది.

కారాగారమున ఏడు వత్సరములు గడపినది. పాప మాచెలువ చెరయందున్నపుడు పూర్ణయౌవన.

తండ్రి మరణానంతరము ఆమె జీవిత మెట్లు గడపినదో మన మెరుగము. ఖురాన్ పఠనమొనరించుచు, పుణ్యక్షేత్రములు సేవించినట్లును, ఆమరణాంతము తండ్రిని బంధించిన గదిలోనే వసించినట్లును, అలంఘీర్ పాదుషా అంతఃపురము ప్రవేశించినట్లును చరిత్రలో వివిధరీతుల తెలియుచున్నది.

నిజముగ పాదుషాబేగ మొనరించిన దేమో మన మెరుగము. కాని పౌరుషహీనురాలై ఔరంగజేబు నంతఃపురము మాత్రము ప్రవేశించియుండదని నా నమ్మకము. ఆమె ఆత్మహత్యకుకూడా వెనుదీయని సాహసికురాలు. ఆమె అన్నమునకై అలంఘీర్ పంచ చేరెడి మానినికాదు.

కాని జహనారా క్షమాస్వరూపిణి. పాపము, ఏ తండ్రి సోదరులకై తాను జీవించుచుండెనో, ఆ తండ్రి సోదరుల హింసించిన ఆ అలంఘీర్ పాదుషాను ఆమెయందున్న క్షమాగుణము, భ్రాతృప్రేమయే క్షమించినది.

అలంఘీర్ పాదుషాకు పాదుషాబేగము జహనారాయందు అభిమానగౌరవములు మెండు. 'ప్రేమమయి. అందరిచే కొని

యాడబడిన అతివ'యని అనేకమారు లాత డుగ్గడించియున్నాడు. పాదుషా మీవారు పై యుద్ధమునకు వెడలుచుండ మధ్యదారిలో జహానారాబేగము మరణించినట్లు తెలిసెను. వెంటనే ఆమె గౌరవార్థము మూడు రోజులు యుద్ధయాత్ర నాపుదలచేసెనన్న సోదరిమీద పాదుషాకున్న ప్రేమగౌరవములు తెలియనగును.

సోదరి జహానారా శీలవతి. ఆమె పరుల కంటపడెడిదికాదు. ఒకానొకసమయమున తనచెలియగు ఒకనర్తకికి దురదృష్టవశాత్తున నిప్పంటుకొనెను. ఆమెకు రాకొమరి సాయము చేయబోగా ఆ అలజడిలో తన వలువకు కూడా అగ్నిరగుల్కొనెను.అప్పుడువవరినైన సాయము పిలిచిన తండ్రి కెరిగింతురనియు, ఆయన ఏ ఘనవైద్యునో పిలిపించుననియు, పురుషు లెవరికంటనైనతాను పడవలసివచ్చుననియు ఎంచి, కష్టపడి స్వంతముగ నిప్పులార్పుకొనులోపల కొంత శరీరము దగ్ధమయి కొన్నినెలలు మంచ మెక్కవలసి వచ్చెను.

సోదరి జహానారా హిందువులను నేవగించెడిది కాదు. హిందువులన్న ఆమెకు భక్తి ప్రేమలు మెండు. హిందూస్త్రీల పతిభక్తి యామెకు ఆశ్చర్యానందములు గొలిపినవి. పతిభక్తికి సాటియైనది ప్రపంచమున వేరులేదని తలచెడి తరుణీమణి. అవకాశము లభించిన తానును పూజనీయులగు హిందూరమణులనే ఆదర్శముగ నుంచుకొనవలెనని ఉవ్విళ్లూరెడిది.

పాపము. కోరికలన్నియు భగ్నములు కాగా నిరాశాపూరితజీవితమే గడపినది.

'జహానారా' యన్న జగద్భూషణమని యర్థము. ఆమె అన్వర్థనామధేయ.

ఇంతయుండియు సుఖములేక నిరాశాప్రపంచమునందే జీవించిన సోదరి జహానారాను తలచి కంటతడి పెట్టనివారుండరు.

ఆమె మరణించునపుడు ఆమె తన తుది కోరిక నిట్లు కోరెను. 'నాసమాధి పచ్చని పచ్చికతోనే కప్పబడుగాక. నా సమాధికై నవరత్నములును, స్ఫటికశిలలును అనవసరములు. నవరత్నములకై ఎవరైన ఆశించి నానిద్రకు భంగము కలిగింతురేమో. పచ్చికయైన ఆ భయములేదు. పచ్చిక తీసినను మరలపెరుగును. నాకు శాంతియుకలుగును. నవరత్నసమాధికి నే ననర్హను.'

ఆమెసమాధి ఆమెకోరినట్లే నిరాడంబరముగనేయున్నది.

# గృహపరిశ్రమలు

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

గృహిణులు సాధారణముగ, మొత్తముగంటలలోను, ఏకొన్నిగంటలు మాత్రమే పనిగలిగియుందురు. కాబట్టి వీరు తీరిక సమయములందు కొన్ని లాభకరములగు పనులనుచేసి ధనమును గడించి సంసారమునకు ఆర్థిక లాభమును చేకూర్చవచ్చును. వీటియందు నిత్యము గృహిణులకు నుపయోగపడు వస్తువులైన ఎక్కువలాభకారిగనుండును. అవి ఏవన అప్పడములు వడియములు, పులుసు, చారు, పొడులు, అన్నముపొడి మొదలగు పాకశాస్త్ర సంబంధమగు వస్తువులైన త్వరలో ఖర్చగుటకు వీలగును.

## మినప అప్పడములు

ఇప్పుడు బజారులో ఒకరూపాయకు సుమారు నాలుగుపడులు రెండు ఆశాకుల మినపప్పు అమ్ముచున్నారు. ఒకపావలాకు, మినపప్పు, కొని శుభ్రము చేసి ఎండబెట్టి సాయంకాలము తిరగలిలో వేసి మెత్తగ పిండి విసరవలెను. ఈ విసరినపిండిని జల్లెడపట్టి మెత్తటిపిండి తీసికొనవలెను.

ప్రొద్దున ఒకకాని నల్లేరుతెచ్చి పిండికి సరిపడిన వుప్పవేసి ఈనల్లేరును దంచవలెను. ఈదంచిన నల్లేరు రసమును ఎండలో బెట్టవలెను. వంట భోజనములైన తర్వాత పిండితెచ్చి దానిలో కొంచెము జీలకర్ర వేసి ఈనల్లేరు రసమును వడబోసి గట్టిముద్ద అగునట్లు కలుపవలెను. (ఇష్టమున్నవారు కొంచెము ఇంగువ నీళ్లలో నానవేసి ఆనీళ్లుకూడ వేయవచ్చును) ఈ ముద్దగ కలిపిన పిండిని పచ్చడిరాతిమీద బాగుగ కలియునట్లు దంపవలెను. మినపపిండి జిగురు కనుక దంచునపుడు నెయ్యిగాని ఆముదముగాని రాచి దంపవలెను. ఈపిండి బాగుగ కలిసిన తర్వాత వుండలు చేయవలెను. నాలుగు అణాల పప్పునకు సుమారు మూడునాలుగు వందల వుండలగును.

మరుసటిరోజు మామూలు పనులు ముగిసినతర్వాత యీవుండలు అప్పడములు వత్తవలెను. ఈ అప్పడములు వత్తుటకు పైపిండికి కొంచెము బియ్యపుపిండిగాని మినపపిండిగాని అద్దుకొనవలెను. ఈపని అగునప్పటికి రెండురోజులగును. చేసిన అప్పడములు ఎప్పటికప్పుడు ఎండలోవేసి కట్టకట్టవలెను. ఈఅప్పడములు వాటి సైజునుపట్టి ఆరుఅణాలు మొదలు ఎనిమిది పది అణాలవఱకు వెల కట్టవచ్చును.

## పెసల అప్పడములు

పచ్చనిపెసలుతెచ్చి బాగుచేసి నూనెరాచి పప్పుచేయవలెను. ఈ పప్పును ఎండలోబెట్టి కొంచెము చల్లారిన తర్వాత రోటిలో పోసిదంచవలెను. దంచి పొట్టునూక చెరిగి పెద్ద పప్పుగా తీసికొనవలెను. పెసలపప్పుకు సమానముగ మినపప్పుకూడ వేసి రెండును కలిపి ఎండబెట్టి విసరి పిండిచేసి పైమాదిరి అప్పడములు చేయవచ్చును. వెలకూడ పైమాదిరికట్టవచ్చును.

## బియ్యపు అప్పడము

ఒకపడి తెల్లటిబియ్యము కడిగి నీడలో ఆరబోసి బాగుగ ఆరినపిదప పొయ్యిమీద బాణలివేసి కొంచెము కొంచెముగ వేసి బొరుగులు అగునట్లు మాడకుండ

వేయించవలెను. అట్లు వేయించిన బియ్యమును తిరగటి యందు విసరవలెను. ఆపిండిలో ఒకపడికి అయిదు పలముల సగ్గుబియ్యముపిండి: దబెట్టిపిండిచేసియీపిండిలో కలుపవలెను. ఈ పిండికి తగిన ఉప్పును నీళ్లలో వేసి పిండిలో నిమ్మకాయరసమును కొంచెముపిండి ఈ ఉప్పునీరునుపోసి కలుపవలెను. గట్టిగ ముద్దగనే కలుప వలెను. ఈముద్దను బాగుగ దంపి ఉండలు చేయవలెను. ఒకపడికి సుమారు మూడువందల అప్పడములు అగును. ఇవి వంద పదిఅణాలుమొదలు రూపాయివరకు వెల వేయవచ్చును.

## ఆవిరి అప్పడములు లేక తళిగఅప్పడములు

ఒకపడిబియ్యము, కొంచెముగ నాననిచ్చి బాగుగ పిండి దంచుకొనవలెను. ఆదంచినపిండిని, ఒకసన్నటి గుడ్డలో వస్త్రకాయముపట్టి ఆపిండిని నీడలో, ఆర బోసి, ఆరినమీదట, పిండికితగిన ఉప్పును పిండిలో వేసి, దోసెపిండిమాదిరి కలిపి పులియవలెను.

రెండవరోజు, ఒకగిన్నె పొయ్యిమీదపెట్టి, అడు గున నీరుపెట్టి ఇడ్డెన, కుడుము, వండినట్లు ఆవిరిపెట్ట వలెను. బాదముఆకులుకాని, పోదుగఆకులుకాని, తెచ్చి, వాటినూనెరాచి, ఒకచిన్న నేతిగరిటెతో గరిటెడు, చాలపల్చగ, ఈపులియబెట్టిన పిండినిరాచి, ఆవిరిబెట్టవలెను. ఆవిరిపెట్టి తీసి, ఒలిచి అప్పడములు ఎండవేయవలెను. ఈఅప్పడములు, సుమారు, పడికి అయిదువందల అప్పడములు అగును. ఇవికూడ, వంద, పదిఅణాలుమొదలు పండ్రెండుఅణాలు వెల వేయవచ్చును.

## మినపవడియములు

ఒకపడి బజారుమినపపప్పుకాని, మినుములు విసరినపిండి కాని, సుమారు 3 అణాల బూడిద గుమ్మడికాయను తెచ్చి ముందటిరోజు బాగుగ సన్నగ తరిగికాని, నూరికాని, ఒకగుడ్డలో మూటకట్టి, మూట పైని బరువును పెట్టవలెను. అట్లుచేసిన కాయలోని నీరుఅంతయు వడసిపోవును. తెల్లవారి, ఈమినపపప్పు, నానబోసి, మెత్తగ రుబ్బవలెను. ఒకపడికి సుమారు 5 పలముల పచ్చిమిరపకాయలు ఇంగువ,పిండికిసరిపడు ఉప్పువేసి రుబ్బి, ఈపిండిలో, గుమ్మడికోరుతో కూడ వేసి కలిపి, ఎండలో, చాపగాని, గుడ్డగాని పరచి వడియములు పెట్టవలెను. వడియములకు ఉప్పు కొంచెము తక్కువగనే వేయవలెను. ఎండినయెడల సరి పోవును. బాగుగ రెండురోజులు ఎండినతర్వాత వడియములు ఒలిచివేయవలెను. ఇవి ఒకపడికి, 3 పళ్లు వడియములగును. వీటికి 1 పడి, 8 అణాలు మొదలు వెల కట్టవచ్చును.

## సగ్గుబియ్యమువడియములు

ఒకవీశె సగ్గుబియ్యముతెచ్చి, దానికి తగిననీళ్లుపెట్టి ఉప్పువేసి సగ్గుబియ్యముపోసి ఉండకట్టి కుండ కలియ బెట్టుచు నుడికించవలెను. సుమారు 2½ పలము పచ్చి మిరపకాయలు నూరి, యీవుడికిన, సగ్గుబియ్యములో వేసి, కలిపి, వడియములు చాపమీద నూనెరాచి, ఎండలో పెట్టవలెను. ఇవి 1 వీశెకు సుమారు 4 వీశెల వడియములగును, ఈవడియములు వీశె 10 అణాలు అమ్మవచ్చును.

## పిండివడియములు

1 పడి బియ్యము నానబోసి, పిండికొట్టవలెను. ఈపిండి వస్త్రకాయముపట్టి, దోసెపిండివలె కలుప వలెను. పొయ్యిమీద తగుపాటి నీళ్లుపెట్టి నీరు తెర్లు నపుడు, చేరడు సగ్గుబియ్యము వేసి ఈకలిపినపిండిని ఉండకట్టనట్లు కలుపుచు, నీళ్లలోపోయవలెను. ఈపిండి బాగుగ మెత్తగ, హల్వామాదిరి అగును. (నీరు తెర్లు నపుడే, 2½ పలముల పచ్చిమిరపకాయలు పిండికి సరి పడు ఉప్పువేయవలెను.) ఈపిండిని చేతితోగాని, లేక, జంతికలు పీటతోగాని, వడియములవలె పెట్ట వలెను. ఎండలో బాగుగ ఎండినమీదట ఒలిచి తీసికొన వలెను. ఇవికూడ ఒకపడికి సుమారు 3,4, పళ్ల వడియ

ములు అగును. ఇవి 1 పడి పండ్రెండుఅణాలువరకు వెల వేయవచ్చును.

## పేలాలవడియములు

ఒకపడి బజారు పేలాలు తెచ్చి, వడ్లు లేక ఏరి ఒకగిన్నెలో నీళ్లుపోసి, పేలాలు వేసి, కడిగి పైకి తీసి, చాపమీద పోయవలెను. $2\frac{1}{2}$ పలముల పచ్చి మిరపకాయలు, ఉప్పునూరి, ఈ పేలాలతోకూడ (ఇష్టమున్నవారు తెల్లనువ్వులపప్పుగాని, గసగసాలు కాని, బూడిదగుమ్మడికోరును కాని) వేసి, పేలాలు ఎక్కువ నలుగకుండ కలిపి ఎండలో వడియములు పెట్టవలెను. ఇవికూడ ఒకపడికి పేలాలకు, 3, 4 పళ్లె ఒడియములగును.

## అన్నము పొడి

కందిపప్పు, పెసలపప్పు, సెనగపప్పు ఈ మూడు పప్పులును వేర్వేరుగ బాగుచేసి సమానముగ అనగా మూడు పప్పులు ఒకటే కొలతగ వేర్వేరున వేయించుకొనవలెను. పై పప్పులకు సరిపోవు ఎండుమిరపకాయలుకూడ వేయించుకొనవలెను. వేయించిన పప్పులు మూడును కలిపి తిరగటియందు పిండిగ విసరవలెను. వేగిన మిరపకాయలు, పిండికి తగిన యుప్పును వేసి మెత్తగదంచి ఈ పిండిలో కలుపవలెను. ఇష్టమైనవారు ఇంగువకూడ పొంగించి వేసుకొనవచ్చును. దీనినికూడ వెల చేయవచ్చును.

## పులుసు పొడి

ఐదు పలముల ఎండిన మిరపకాయలకు 10 పలముల ధనియాలును, సెనగపప్పును, మినపపప్పును గలిపి $\frac{1}{2}$ ఆళాకును, $1\frac{1}{2}$ గుప్పెడు మెంతులును కొద్దిగ మిరియాలును వేయవలెను.

సెనగపప్పును, మినపపప్పును వేర్వేరుగ వేయించుకొనవలెను. మెంతులు, మిరియాలుకూడ వేయించుకొనవలెను. పై నాలుగింటిని మెత్తగ తిరగటియందు విసరుకొనవలెను. పైచెప్పిన మిరపకాయలును, ధనియాలను కొంచెము నూనెకాని, ఆముదముకాని వేసి వేయించి, రోటియందువేసి దంచవలెను. దంచిన కారమును జల్లించి యీపిండిలో కలుపవలెను. ఇది యే పులుసుపొడి. (ఎక్కువ చేయవలయునన్న పై లెక్కనుపట్టి ఎక్కువ చేయవలయును).

## చారు పొడి

మూడు గుప్పెడులు కందిపప్పు, 10 పలముల ధనియాలు, రెండు గుప్పెళ్లు మిరియాలు, కొంచెము సెనగపప్పు, ఐదు పలముల మిరపకాయలు ఇవి అన్నియు కలిపి ఎండలో ఎండబెట్టవలయును. మిషను ఉన్న యూరులైన మిషనుకు పంపవచ్చును. లేని ఎడల బాగుగ మెత్తగ దంచవలెను.

## కూటు పొడి

5 పలముల మిరపకాయలకు రెండు చేరల ధనియాలు, ఒకచేర సెనగపప్పు, ఒకచేర మినపపప్పు, రెండు గుప్పెళ్లు మిరియాలు వేయవలెను. ఈ పప్పులను, మిరియాలను వేయించుకొని తిరగటియందు విసరుకొనవలెను. మిరపకాయలు, ధనియాలు కలిపి నూనెవేసి వేయించుకొనవలెను. వీటిని రోటిలో వేసి దంచి జల్లించి కారమును, ఈ పిండిలో కలుపవలెను.

## కూర పొడి

పైచేసినట్లే అన్నియు వేసి (మిరియములు మాత్రము తీసివేసి) పొడిచేసికలపవలెను.

పై పేర్కొన్న పాకశాస్త్ర సంబంధములగు వస్తువులు కాక పలువిధములగు తలనూనెలను, దంతచూర్ణమును చేయవచ్చును.

## మల్లెనూనె

మల్లెపువ్వులకాలమునందు మంచి మల్లెపువ్వులు తెచ్చుకొనవలెను. మంచిరకము నువ్వులు తెచ్చుకొనవలెను. ఒకపీటమీద నువ్వులు వేసి, ఈ నువ్వులపైన

మల్లెపువ్వులు పరచవలెను. ఈ పరిచిన పీటను ఎండ పెట్టవలెను. ఎండిన తర్వాతదానిపై మరల నువ్వులు, దానిపైన పువ్వులు వేసి ఎండపెట్టవలెను. ఇట్లే నాలుగైదు దొంతులుగ (layers) ఎండబెట్టవలెను. బాగుగ ఎండినతర్వాత గానుగకు పంపి నూనె ఆడించవలెను. కావలసినయెడల సెంటు వేసుకొనవచ్చును.

## జీడి నూనె

మంచిరకము నువ్వులనూనెతెచ్చి కుంపటిమీద బాణలిపెట్టి దానిలో నూనెపోసి కాగునప్పుడు జీడి గింజలు ఒకటి రెండుగ నలియగొట్టి నూనెలో వేయవలెను. వాసనకు కర్పూరములుకూడ వేయవచ్చును.

## నలుగు పిండి

పచ్చటిపెసలు తెచ్చి దానిలో కొంచెము బియ్యము వేసి మెత్తగ విసరవలెను. దీనిలోకూడ కర్పూరముల వేసిన మంచివాసన కలిగి, ఒంటికి శుద్ధకొనుటకు చాలబాగుండును. దీనిలో సెనగపప్పుకూడ కొంచెము వేయవచ్చును.

## దంతచూర్ణము

సీమబాదముతొక్కలు చేర్చిపెట్టి, వానిని పొయ్యిలోవేసి నల్లగ కాల్చవలెను. బాగుగ కాలిన దానితోకూడ కొంచెము ఉప్పువేసి బాగుగ దంచవలెను. ఉప్పుకాని పటికకాని వేయవచ్చును. వీనిని పొట్లములుకట్టి అమ్మవచ్చును.

నేను పైపేర్కొన్నవన్నియుకూడ విదేశీయములైన వస్తువులను ఉపయోగించక, స్వల్పపెట్టుబడితోను, అందఱకు అందుబాటులోను త్వరగా ఖర్చగునట్లుకూడనున్నవి. ఈ పైవ్యాపారమును పెక్కుమంది యిప్పటికిప్పుడేచేసి ధనమును చేయుచున్నారు. అయినను ఈ పరిశ్రమలు గృహిణులు ఇలువీడకయే స్వయంసహాయముతో చేసికొనుటకు అనువుగనుండునని నమ్ముచున్నాను.



# గుణవతి

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు

గీ. నెచ్చెలీ ఎన్నికష్టాలు వచ్చుచున్న, ముచ్చటుటమాని సతము సమ్మోదమూని
దేవుడేకలడని నమ్మి ధీరమతిని, సైచితిని నింకనేలాగు సైపగలనొ.

గీ. కడుపులో దాచికొనుతల్లి నడచెదివికి, తండ్రి నామూలమున దీనదశవహించె
వెచ్చబెట్టెను తనకున్న విత్తమెల్ల, నల్లుడిల నున్నతోద్యోగి యగునటంచు.

గీ. కన్నతండ్రికికడు గడగండ్లుగలిగె, నాదరింపంగ దిక్కులేదాయె నకట
మంచిలేదాయె మాయత్తమదికి, నెన్నిపనులుచేసిన పతితోడ పలుకనీదు.

క. పతి యాదరించుచుండిన, మతినంతటి దుఃఖవహ్ని మఱుగుదునే నా
వెతవెడలుటెన్నడో నా, గతియేమో కూడుగుడ్డ కఱవాయెగదే.

క. పరసతులయందు జూపెడు, గురుదయ రసికతయుకండ్ల కొలుకుల నాపై
బరపందగదే యత్తయు, కరుణంగనరాదె పాపకర్మంబగునే.

గీ. ఆదరించెడునదిగదా యత్తగారు, నేలుకొనదగువాడు ప్రాణేశ్వరుండు
ఇద్దఱింతటికఠినులై యేచుచుండ, నెట్లుసైరించుచుంటినో యిన్నినాళ్లు.

క. ఎన్నటికినైన నాథుడు, నన్నుం దయగనునటంచు నమ్మితి కష్టా
లెన్నెన్నో సైరించితి, నన్నియు వృథయయ్యె తిట్టె నడచెను వెడలన్.

క. తుదియాసకూడ వదలెను, ముదితనొకతె పెండ్లియాడి ముఱియుచునుండెన్
హృదయేశ్వరు డిదెవింటివె, వదినా నేనింక జేయవలయునదేమో.

క. సతినన్నిటు విడనాడగ, పతినేనేవిడచితినని పాపపులోకం
బతికఠినోక్తులు పలికిన, బ్రతికితి నపనిందలబడి వచ్చితి నిటకున్.

ఉ. ఆకలిసైప నీపరిభవాగ్ని సహింప నిరాపనిందలీ
లోకులు వైవనోపను విలోలమనంబునునిల్ప నింద్రియ
వ్యాకులమున్నడంప చెలియా యిటు లొంటరి నిల్చియుండగా
నాకికచేతగా దెటులనాయన చెంతకుబోదునే కటా.

క. అన్నకొమరుండు విసుగుచు, నన్నుంబిడ బ్రదుకుచుండు నయ్యైకడకునే
నున్నానని యెటులేగుదు, చిన్నతనముగాదె తండ్రి చింతిలకున్నే.

శా. నాకుంగూర్చినదానవౌటమదిలోనన్ యోచసంబొందువే
నాకై సేయుము ప్రాణముల్విడుచుటే న్యాయంబొ గాకున్న నీ
లోకుల్నవ్వగ హీనపుంబ్రదుకుపై లోలాత్మనైయుంటనే
గాకుంజెందుటకంచు నేడ్చె సతిదా కన్నీరుమున్నీరుగన్.

గీ. పైదలికినట్లు కుత్తుకబంటియాచు, పొరలి పొరలి యాగక పైకిపొంగివచ్చు
శోకవారాశి నరికట్టలేక యలసి, ప్రాణసఖిపైని వ్రాలె నిబ్బరముసడలి.

గీ. ఇట్లువ్రాలిన నెచ్చెలి నెదకుజేర్చి, కనులుచల్లనినీటితో గడిగి మదిని
కలకబాయగమాటాడె కరుణవెలయ, మిత్రులనుబోలుబంధు లీ ధాత్రిగలరె.

# అంబ అచ్యుతుల యుద్ధము

## తిరుచూరు ఉత్సవవిశేషము

"పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థ
మహిమ వినుటయు యఖిలకల్మషహరంబు."

—మనుచరిత్రము.

'పద్మ'

కొచ్చిన్ సంస్థానము చిన్నదయ్యు వర్ధమాన సంస్థానములలో ఉన్నతస్థాన మాక్రమించుచున్నది. కేరళదేశములో నొక భాగము కొచ్చిన్ సంస్థానము. ఇర్వది యొక్కమారు సమస్త క్షత్రియులను రూపుమాపి వారి కళేబరములనే నిర్జర లోకమందలి తన పితృవ్రాతముల దనుప సోపానములుగా జేసికొన్న పరశురాముడు తదనంతరము భూమికి కశ్యపునకు ధారవోసినట్లును, గ్రహించి, — కృతఘ్నుడు కాబోలు — కశ్యపుడు పరశురాముని నిలపైనుండరాదని శాసించినట్లును అంత పశ్చిమతీరమునకు వచ్చి సముద్రుని వెనుకకు తగ్గవలసినదని కోరి ఆప్రదేశమునే పరశురాముడు నివాసముగా నేర్పఱచికొన్నట్లును అదే కేరళమనియు నైతిహ్యము.

ఈ కొచ్చిన్ సంస్థానమునకు ముఖ్యపట్టణములు రెండు. ఎర్నాకుళము, తిరుచూరు. 'తిరుశివపేరూరు' (శ్రీ పరమేశ్వరుని పేరుగల యూరు) అను శబ్దము యొక్క అపభ్రంశమే తిరుచూరు. అనేక చారిత్రికవిషయములకు ప్రసిద్ధిగడించిన దివి. హైదరాలీ, టిప్పుసుల్తాను లిట యుద్ధములు సల్పియున్నారు.

కొచ్చిన్ సంస్థానభూషణ మనదగు తిరుచూరు పెక్కువిచిత్రములకు నిక్క. సాధారణముగా ఏప్రెల్, మే నెలలో వచ్చు 'దేవతాపౌరుష ప్రదర్శనము' ఎప్పటి వైభవముతో నిటీవల ముగిసెను. ఈ తిరుచూరు "పూరము" కొచ్చిన్ సంస్థానములో — మలబారు కంతటికన్నను సత్యమునకు తలవంపురాదు — మిక్కిలి కొండాడబడు పండుగ. తిరుచూరుపట్టణమున కీ యుత్సవమునకు అన్నిదిక్కులనుండి వచ్చు ప్రేక్షకుల యుత్సాహము, సంఖ్య దాని గొప్పతనమును చెప్పకచెప్పగలదు. డెబ్బది యైనువేలకుపైగా జనులు ఉత్సవమునకు పెక్కుదినములకు మున్నే తిరుచూరునకు వచ్చి విడియుదురు.

'పూరము' అనగా ఉత్సవమని యర్థము. ఇతరములగు చిన్నచిన్న యుత్సవములకు దీనికి పోలి కెందునులేదు. ఇందలి విపరీత

ము తే మనల ముగ్ధులను జేయుచున్న దనుట నిస్సంశయము.

తిరుచూరున కధిష్ఠాన దేవతలు ముగ్గురు. శక్తిదేవి, శ్రీకృష్ణపరమాత్మ, వీరిద్దఱికన్న ముఖ్యులు ప్రధానులునగు శ్రీ పరమేశ్వరుడు. ఈ మువ్వురయుత్సవములు ఏటేట నత్యంతవైభముతో జరుగుచున్నవి. ఈ యుత్సవమునకు జేయబడు నేర్పాట్లు, వ్యయమగు ధనము ఎవ్వనినైన విస్మయమున ముంపగలవు. ఆ తిరుచూరును ఉత్సవమునకు పూర్వదినము చూచినను, రానున్న దింత బ్రహ్మోత్సవమని తలచుట కవకాశ ముండదు. ఏలన ఉత్సవమునకై యేర్పాట్లు అతిరహస్యముగను, అతిశీఘ్రముగను చేయుదురు. దేవుని పెండ్లికి ప్రతియొక్కడును పెత్తనదారన్నప్పు డీ రహస్య మేలయ్యా అని ప్రశ్నింపవచ్చును; కాని ఇదే మన కంత విస్మయానందము గల్పించి మన దృష్టుల కేంద్రీకరింపజేయుచున్నది.

మొదటి యిర్వు రధిష్ఠాన దేవతల యుత్సవము ఏకకాలమున వచ్చును. కావున 'పోటీ' సహజము. ఇద్దఱు దేవతలును పందెములు చఱచి 'యెవరా ముందు' అని తహతహపడునట్లు తోపజేయుదురు. అతి స్వల్పవిషయమును సైతము చాలచక్కగా నిర్వహింపబడునట్లు కార్యక్రమ మేర్పాటు చేయబడు టొక విశేషము. వీరి 'పోటీ'లో గెలుపెవరిదో ప్రధానదేవత న్యాయమూర్తిగానుండి నిర్ణయించును. అక్కడ జరుగు పద్ధతి ఇది.

మలబారులో దొరకు ఉన్నతములును సుందరములునగు ఏనుగులను చెఱి పదునైదుటిని ఇరుపక్షములవారును గల్గియుందురు. సుమారు ఎనిమిదడుగులు పొడుగైన ఆతపత్త్రమును, జరిగలతో చుట్టు సొగసుగా నలంకరించినట్టిదానిని, అనుభవశాలియగు బ్రాహ్మణయువకుడు ఏనుగు మెడమీద కూర్చుండి ఉత్సవాంతముదాక దాల్చియుండును. ఆతపత్త్రము కేవల మలంకారమాత్రమే. ఈ యువకునితర్వాత వెండిపిడి చామరములు రెండుగల మఱొక యువకుడు వానిని తఱచు ఇటునటు వీచుచుండును. ఇతని వెనుక నెమ్మిపింఛములతో జేసిన ఆలవట్టమును బూనిన మూడవ వాడు గలడు. ఇట్లు అన్నియేన్గులపై నుందురు. వీరలకుతోడు శ్రుతిలయలతో ఆహా పుట్టించు నాగస్వరము, మృదంగము.

ఎత్తుకుదగినట్టులు ఇటులేడు, అటులేడు, మధ్య అన్నిటికన్న నెత్తైన నేనుగును నిలుపుదురు. ఆ నడుమగల యేనుగు నదృష్టము గదా యదృష్టము. సకల చరాచరజీవములకు ప్రభువగు ఆ దైవము దీనిమీదనే గదా యూరేగును! ఊరేగునంతకాలము ఆకసమును నిరసించి తలపైకెత్తి గంభీరముగా నది నడచుటలో వింతయేమి?

ప్రాతఃకాలమునకే ప్రధానియగు శ్రీ కృష్ణమూర్తి ఇర్వురు సేనాపతు లిరువైపుల కొలిచి వచ్చుచుండ యుద్ధభూమిలో నేర్పాట్లు సాంతముగానున్నవాయని పరిశీలించుటకై బయలుదేరి తన మకాము

క్రొత్తచోటికి మార్చుకొనును. దారి పొడుగునను జెండాలు గాలిగుమ్మటాలు కట్టబడి కంటికి కనువింపు గూర్చుచుండును. ముత్తైదువలు మోసాలనిల్చి యారతులు చక్రధరున కెత్తుదురు. శ్రీకృష్ణమూర్తి మకాము మాఱుటతోడనే శ్రీ వడక్కు_న్నాథాలయముననుండు చిల్లరదేవళ్ల యూరేగింపులాయా గుళ్లనుండి యారంభించి న్యాయమూర్తి దేవాలయము నెదుట ముగియును. ఈ పెద్దపూరము పండుగకు చిల్లర దేవళ్ల యుత్సవము బలగము లనిపించుకొనును.

ఇప్పటికే పోటీ యారంభమైనదని యూహింపవలెను. మిట్టమధ్యాహ్న మగుసరికి శ్రీకృష్ణమూర్తి వాద్యవిశేషములతో తన మకామునుండి సేనాపతులు కొలిచి వచ్చుచుండ విరోధిపక్షముతో డీకొన బయలుదేరును.

ముఖములందు రకరకపు ఉడుపులు చిత్రములు గల్గిన యేనుగులు, బహువర్ణాతపత్త్రములు, నెమ్మిపింఛముల యాలవట్టములు, ప్రకాశమానసూర్యుడు—ఇవన్నియు ప్రోగైన ఆసౌందర్యమును చెప్పుటకు వేనోళ్లు చాలవు.

ఈలోగా రహస్యవార్తాహరులద్వారా తెలిసికొని యేమో, శక్తిదేవి సమాన గాంభీర్యముతో బయలుదేరును. వీరికిని ఇరువైపుల నేడేడేన్గులు శ్రీకృష్ణునకున్న ఆతపత్త్రాదితంతు పూర్ణముగానుండును. శ్రీశక్తిదేవి బయలుదేరు నవసరమున తదాలయ పూర్వభాగశోభావిశేషములను చూచినవారే యానందింపగలరు. పైమాదిరినే ఇంచుకవేఱగు రంగులుగల పదునైదు ఏన్గులపై సూర్యుడు ప్రకాశించుచుండ సమానశక్తిసామర్థ్యములుగల సేనతో దేవిగారు బయలుదేరి యుద్ధారంభ చిహ్నముగా శంఖము పూరింతురు. ఈసరికి శ్రీకృష్ణమూర్తి సేనలు గట్టిగా సేకరించుకొని గుడిప్రాకార బహిరంగణమున విడిసియుండును. ఇప్పుడే వాద్యవిశేషములు చెలరేగును.

ఈసమయమున చుట్టుకొలత ఒకమైలుండొక వలయముమధ్య ఉన్నతముగా న్యాయమూర్తి శ్రీపరమేశ్వరుడు అధిష్ఠించియుండును. సాయంకాలముదాక శక్తికృష్ణులు తమతమ కదన చాకచక్యముల వెల్లడించుచుందురు గాని గెలుపెవరిదో నిర్ణయించలేని స్థితిలో యుద్ధముండును. "నాతో సరివత్తువా, డాగక పైకిరమ్మ" అని యంబ పరిహసించెను.

ఉత్సవమునకెల్ల యానందదాయకమగు పట్టిదియే. ఇనుకచల్లిన నేలపై రాలదు. ఇరుపక్షములును ఆతపత్త్రములతో క్రుమ్ముకొని శక్తిసామర్థ్యముల చాటుటకు సంపూర్ణ ప్రయత్నములు గావించును. గెలుపునిర్ణయము పరమేశ్వరాధీనమైనను అక్కడ గూడియున్న ప్రేక్షకులు దాని గూర్చి తర్కించుకొనుచుందురు.

ఇప్పటి కేదియు తేలలేదు గనుక, సరే, తమతమ విడుదులకు నిరుపక్షముల వారు నేగుదురు.



సాయంకాలమున జరుగు అంబ-అచ్యుతుల 'యుద్ధము'లో ఒక దృశ్యము. ఒకవైపు బలగమునకు జెందిన కరిబలము. 15 ఏనుగులు వానిపై ఆతపత్రములశోభ లోనగువాని నిట కాంచనగును.



శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీసుందరమ్మ గారు బి.ఏ.(ఆనర్సు).
వీరు బాలాంత్రపు సుందరరామయ్యా శేషమ్మ గార్ల పుత్రిక.
శ్రీయుత కాళ్లకూరి శేషయ్యగారి ధర్మపత్ని.
వీరిటీవలనే సంస్కృతమున బి ఏ ఆనర్సు
రెండవతరగతియం దు త్తీర్ణులైరి.



వీ ధి సి నీ మా

# అంబ అచ్యుతుల యుద్ధము

ప్రొద్దుటివలె రాత్రి మరల తమ యుత్సవముల సాగించి చిన్నదేవళ్లు వెడలుదురు. ఇప్పటికి నడిరాత్రియగును. తనకే యెక్కుడు బలమని నిరూపించుటకయి యెదుటివారిని వెదకుటయట్లు రాజవీధుల నిర్దుదైవములును ఊరేగి యథాస్థానమునకు వచ్చి చేరును. ఇక్కడనేమూడుగంటల సేపు యుద్ధము జరుగును. దీనిని వీక్షించుటకయి యుత్సవాగత ప్రేక్షకులు ఎత్తైనమేడలనెంతో యద్దెకుపుచ్చుకొందురు. ఈయదనున బాణ వేడుకల సొంపుపెంపులు వర్ణనాతీతమే. ఎదుటిపక్షమువారికి తెలియకుండ వీరు, వీరికి తెలియకుండ వారు తయారుచేసియుంచిన రకరకము మత్తాబులు, బాణాసంచాలు వగైరా—ప్రదర్శింతురు. ఆబొట్లు, ఆచైనా పెట్టెలు, 'టార్పిడోలు' — ఇవి, అవి, యని పేర్కొనుటకిట జాగాచాలదు. ఇట్టిప్రదర్శనమున తిరుచూరుప్రథమస్థాన మాక్రమించుచున్నదనుటలో అతిశయోక్తి లేదు. దీనివల్ల కూడా తిరుచూరు ప్రాముఖ్యము బడసినది.

మరుదిన ముషస్సు. చుట్టుపక్కముల నుండి వచ్చినవారు రాత్రి జరిగిన యుత్సవములపయి చర్చించుచు వారివారి గ్రామముల కేగునెడ వారికి తట్టినట్టు గెలుపు నిర్ణయించు 'ఓటు' చేయుదురు.

ఇంతలో చాలినది కాదు కాబోలు తిరుగా చెటి పదునైదు ఏన్గులతో ఇరుపక్షములును గుడి కెదుట శ్రీపరమేశ్వర సాన్నిధ్యమున నిలిచెదరు. మరల వాద్యగాండ్రు తమ కౌశలమును ప్రదర్శింతురు. ఆ తలత్రిప్పుటయు, జుట్టు ముడివేసికొనుట, ఆ స్వరము వేయుటయందలి కసరత్తులు ఆ ఉత్సాహము వాద్యగాండ్రను పరవశమున ముంచును. దాని నాలకించు జనసామాన్యము వీరిలో నెవరి దెక్కువయో నిర్ణయింతురు. ఇట్లు 5, 6 గంటల కాలము 'యుద్ధము' బాగుగా సాగించి సుమారు 12 గంటలకు పెక్కు తుపాకి కాల్పులతో పూరము ముగియును. "జన వాక్యంతు కర్తవ్య" మ్మన్న సామెతను శ్రీపరమేశ్వరుడు జనులు నిర్ణయించిన రీతిని గెలుపెవరిదో తేల్చును.

పట్టణమంతయు మున్నాటిలేని నిద్రను తెచ్చుకొనును. సాయంకాలము చూతువా! అయ్యో యేమి చెప్పను? ఒక యెడారి యనిపించును. ఆ ప్రజలకోలాహలము, ఆ యేన్గులు—ఇవన్ని యేవీ? రెండు మూడు రోజులకు ముందున్న 'శాంతి' తిరుగా కన్పట్టి ఉత్సవములు జరిగెనాయని ప్రశ్నించుట కవకాశమిచ్చు విభ్రమమునకు మనల వశము చేయును.

ఈ యుత్సవసందర్భ సమాగతుల సంఖ్య డెబ్బదియైదు వేలకు తగ్గదని ఆదినే సూచింపబడినది. ఇందఱకును ఆ యుత్సవము రెండు రోజులును చలిపందిరిపెట్టి అందు మజ్జిగ నొసగు శ్రీ కేసరికుటీరమువారి యౌదార్యమును ప్రశంసింప దగియున్నది. వీరికి నిరత మాయురారోగ్యైశ్వర్యము లొసగి. శ్రీవడక్కున్నాథస్వామివారి కిత్తోఽధికసేవయుటకు శ్రీ పరమేశ్వరు డనుగ్రహించుగాక.

# ఆర్తవఫలముల అయోమయము

శ్రీమతి అడపా సుగుణమణిగారు

"శుభదినంబున సప్తమశుద్ధి గలిగి
చెలగు వేళను గురుమాపుచీరతోడ
సరసరుచిరాన్నభోజనోత్తరమునందు
నీడెరుంగని చేడియ యీడుమీఱె."

పళని.

స్త్రీల ప్రాయమును మన శాస్త్రజ్ఞులు బాల, యౌవన, ప్రౌఢ, లోలయని చతుర్విధములగ విభజించియున్నారు. అందు జననాది పదునారువత్సరములగు బాలప్రాయముననే సమశీతోష్ణప్రదేశమున సర్వసాధారణముగ నారోగ్యవతులగు స్త్రీలు పుష్పవతులగుచున్నారు. అత్యల్పప్రాయమగు ఆరు, ఏడు వత్సరములవయసునను ఆలస్యముగ ఇరువది, ఇరువదైదు వర్షములప్రాయమునను కన్యలీడేరునట్లు నిదర్శనము లేకపోలేదు. కాని అట్టివానిని వ్రేళ్లపైలెక్కింపవచ్చు. ఈకాలవ్యత్యాసములకు దేశశీతోష్ణస్థితులు, భుజించుఆహారము, దేహపటుత్వము కారణములని కొందరిమతము; అతిమాత్రవ్యాధులు, పైశాచికలక్షణములు కారణములని మరికొందరితలంపు. కవయిత్రి ముద్దుపళని "కలికి కన్నెరికంబు వొలగ జెంచుల కెంతో యిచ్చితీసినమంచు లిచ్చునిచ్చ, నెప్పుడీడేరునో యీ ముద్దురాలని యుపవాసమొక వేళ నుండనీదు" అని యుద్ఘోషించినది. పరిశీలించుచో పూర్వకవిప్రణీతములగు గ్రంథములలో నింక నీయంశముల వ్యక్తీకరించు వర్ణనలెన్నియోగలవు. ఎప్పుడు సంభవించినను ప్రథమార్తవము భారతదేశమున స్త్రీజీవిత నాటకరంగమునకు నాందియై, మహోత్సవమున కాలవాలమై యలరారుచున్నది.

స్త్రీలకు పుష్పిణులగు నాటనుండి నలువదియెనిమిది లేక ఏబదివత్సరముల ప్రాయమువరకును గర్భము దాల్చినపుడు, రోగిగనున్నపుడును గాక యిరువది యెనిమిదినముల కొకపరి రజోదర్శనమై మూడు లేక ఆరుదినములవరకును గాన్పించుచుండును. దీని విషయమై పెక్కుఅభిప్రాయములుగలవు. వానిలో కొన్ని యీదిగువ నుదాహరింపబడినవి.

స్త్రీమర్మస్థానము సరియగువృద్ధిని బొందినపిదప దానియొక్కటి త్తియందు అండముబయలుదేరి పాలోబియన్ద్వారముగ గర్భాశయమును జేరుట కారంభించును. అందువలన నేర్పడిన కాలువద్వారా నూతనముగగలుగు అండములు ప్రతిమాసమును బయటికి వచ్చుచుండును. ఇదియె స్త్రీ లింటికి కాకపోవుటయని శరీరశాస్త్రకారణము.

ద్వాదశ రాశ్యాత్మకభచక్రమున జలతత్వకారకుడగు చంద్రుడు, అగ్నితత్వకారకుడగు కుజుడు గోచారరీత్యా సంచరింపుచు బాలికలను, వృద్ధురాండ్రనువిడచి మిగిలిన స్త్రీలకు రజోజన్మ మొనగూర్చుచున్నారు. జన్మలగ్నము లేక చంద్రలగ్నము (జన్మకాలచంద్రస్థితరాశి)లకు అనుపచయస్థానములలో (లగ్నాత్ ౧, ౨, ౪, ౫, ౭, ౮, ౯, ౧౨, ఇండ్లు) గోచారరీత్యా చంద్రుడున్నచో రజఉత్పత్తియగును. ఆచంద్రునకు కుజదృష్టికలిగినచో నా ఋతుకాలాంతరమున పురుషసంసర్గమున గర్భమేర్పడునని జ్యోతిశ్శాస్త్రరహస్యము.

త్వష్టృప్రజాపతిపుత్త్రుడగు విశ్వరూపుడు పురందరుని పురోహితుడుగానున్న కాలమున దురభిమాన

గ్రస్తుడై రహస్యముగ దానవులతో సంప్రదించి, వారలసహాయమున తా నింద్రపదవి నాక్రమించుకొనుటకును, ప్రతిఫలముగ వారలకు హవ్యభాగము లొసంగుటకును తీర్మానించుకొని, అశ్వమేధయాగ మొనర్చుటకు గడంగెను. విశ్వరూపునివలన నారాయణ కవచ విద్య నుపదేశింపబడి శచీనాథుడు దౌర్జన్యమునకు గడంగిన దానవుల రణరంగమున జక్కాడి, విజయోత్సాహముతో స్వగృహమునకుమగిడి, పురోహితుని కుతంత్రము నెఱింగి, రోషావేశంబున మన్నుమిన్ను గానక నాతని శిరస్త్రయంబును ఖండించెను. అందువలన పాకశాసనునకు బ్రహ్మహత్యాదోష మాచ్ఛాదించినదనియు, దుర్భరమగు నద్దానిని సమభాగములుగ జల, తరు, భూ, కామినులకు ప్రతిఫలముగ వరంబులనొసంగి పంచిపెట్టెననియు, ఆ బ్రహ్మహత్యాపాదితమే స్త్రీ లంటుగైకొనుటయని పౌరాణికగాథ.

స్త్రీలకుభగవంతుడే స్వాతంత్ర్యమిచ్చియున్నాడు. సృష్టిస్థితిలయకారణభూతులగు బ్రహ్మ, మహేశ్వర విష్ణులు, తమ అర్ధాంగులకు వాక్, శిర, ఉరములు వాసస్థలములుగ నిచ్చి యితరులకు మార్గదర్శకులైరి. యుక్తవయోనిర్ణయమున పురుషులకు ఇరువదియైదు సంవత్సరములని స్త్రీలకు పదునైదువర్షములని వ్యత్యాసముంచియున్నారు. పురుషులరీతి స్త్రీలు ఇరువదియైదుసంవత్సరముల కీ యుక్తవయస్కులగుదురు గాని యీలోపున నెట్లగుదురని స్వార్థపరులగు పురుషులు నోరెత్తకుంటకై భగవంతుడు స్త్రీలకు సమర్తాడునట్లు గల్పించెనని నేటి ఆధునికకవుల ప్రతిపాదన.

రజస్సు చక్కనియెరుపువర్ణమును, నలుపుగలసిన రక్తవర్ణమునుగలిగి, అంటుకొనినవిధముగనుండి ఆరులేక ఎనిమిదిఔన్సుల (Ounce) పరిమితిగలిగినచో నా స్త్రీ ఆరోగ్యకరముగనున్నదని తలంచవలయును. డాక్టరు ఆర్. డి. డ్రాల్. ఎం. డి. సుప్రసిద్ధశరీరశాస్త్రజ్ఞులు స్త్రీలకు రెండుఔన్సు (Ounce) ల రక్తముకన్నను హెచ్చుతగ్గులుగాస్రవించుట అనారోగ్యకరమని నుడివియున్నారు. మితిమీరిన పురుషసంసర్గమును, లాహిరివస్తువులవాడుకయు రక్తస్రావవ్యత్యాసములకు గారణములని శరీరశాస్త్రజ్ఞులచే నేకగ్రీవముగ నామోదింపబడినది. శరీరతత్త్వశాజ్ఞులు కొందరు రజస్సు ఊటఅనియు మరికొందరు రక్తసంబంధమైన రోగమనియు భేదాభిప్రాయముల నిచ్చియున్నారు. ప్రాచీనులు శరీరమును శుద్ధిచేయుట కేర్పరుబడిన మార్గమని తలంచిరి. మేటంహోవిన్ అను వైద్యనిపుణులు సాధారణరక్తమునకును దీనికిని భేదమేలేదని నిరూపించినారు.

భారతదేశమున కడకేగు స్త్రీలు ప్రథమదినమున చండాలస్త్రీతుల్యముగను, రెండవరోజున మహాపాతకాభిశప్తయైన నెలతతోసరిగను, మూడవదివసమున చాకలిపొలతితోసమముగను, నాల్గవవాసరమున శూద్రకామిని సమానురాలుగను తలంపబడుచున్నారు. వారలు పాదులు, తులసిచెట్లులను సమీపించిన నవి చచ్చిపోవుననియు, కాయకూరలు ముట్టుకొనినవి నిస్సారములగుననియు ప్రతీతిగలదు. పాశ్చాత్యులలో సహితమిట్టి నమ్మకములుగలవు. చెరగుమాసినస్త్రీ ఆపిల్ (Apple) చెట్టుక్రింద కూర్చుండి ఆచెట్టు కాయలు, పండ్లు రాలిపోవునని వారితలంపు. ప్రాచ్యులచే కడకేగు స్త్రీలకు నియమింపబడిన నిబంధనలీ దిగువ నుదాహరింపబడినవి.

౧ అభ్యంగనము, గంధపుష్పాదిధారణము, అంజనము, తాంబూలచర్వణముకూడవు.

౨ చీరల మార్చికట్టరాదు.

3 గోరు మొదలగువానిని గిల్లకూడదు.

౪ శిరోజములకు తైలసంస్కారణకూడదు.

౫ కలహములందు పాల్గొనరాదు.

౬ మితాహారమును భుజింపవలయును.

౭ పగలు నిద్రించకూడదు.

౮ అగ్నిస్పర్శము, దంతధావనము, సూర్యావలోకనము చేయకూడదు.

౯ నేలపైనే శయనింపవలయును.

౧౦ అంజలిచేనైనను తామ్రలోహ పాత్రముచేనైనను ఉదకమును పానముచేయకూడదు.

౧౧ మరియొక రజస్వలస్త్రీని స్పృశించకూడదు.

౧౨ తనముఖము తాను చూచుకొనరాదు.

౧౩ తనమాటను ఇతరులకు వినిపింపకూడదు.

౧౪ ఇతరులకు తాను నాలుగు కాడిమ్రానుల (బారల) దూరమున నుండవలయును.

౧౫ నాల్గవదినమున స్నానముచేయవలయును.

౧౬ దిగంబరియై స్నానముచేయకూడదు.

౧౭ స్నానముచేసిన పిమ్మట భర్త మొగమును చూడవలయును.

౧౮ స్నానాంతమున నోట వక్కగింజలను వేసుకొననిదే శిశువులను తాకకూడదు.

బహిష్ఠయైన స్త్రీ తిరుగ పందొమ్మిదిదినములలో రజోవతియయ్యెనేని అపవిత్రతలేక స్నానమాత్రముచే యొకదినమున శుచిర్భూతురాలగుననియు నిరువదిదినంబుల కనంతరమయ్యెనేని యథాప్రకారముగ నాచరింపవలెననియు విధింపబడియున్నది.

వైద్యశాస్త్రములో రజస్సువలన కొన్నిరోగములు నివృత్తియగునని వ్రాయబడియున్నది. అందు కొన్ని యీదిగువ పొందుపరుపబడినవి. తదితరములు కేవలము స్త్రీ సౌందర్యపోషణకు, పురుషుల స్వార్థమునకు ఉపయోగింపబడుటచే విడువబడినవి. బహిష్ఠయైన స్త్రీయొక్క బుతురక్తమును తేలుకుట్టినకాటుపై బెట్టిన దాని విషము విరిగిపోవును; శ్వేతకుష్ఠు మచ్చలపై పూసిన నవిమానును. ప్రథమ రజస్వల అయినస్త్రీయొక్క బుతురక్తమును కండ్లకు కాటుకవలె బెట్టిన తెల్ల కామెర్లజాడ్యము నివారణమగును. చెలగుమాసిన స్త్రీ,మూర్ఛరోగిని మూర్ఛయున్నప్పుడు ముట్టుకొనిన మూర్ఛ నివారణమగును.

పాశ్చాత్యనవనాగరకత భారతదేశమున వేయి కాళ్లతో 'ఢిఢిమ్మ'నినృత్య మొనర్చుచున్నను ఆంధ్రుల కింకను సాంప్రదాయిక విజ్ఞానముగ కొన్ని మూఢాచారములు, పిచ్చినమ్మకములు అలవడుచున్నవని యెఱుంగుట మిగుల శోచనీయమగు విషయము. అందు కన్య లీడేరిన తక్షణమున 'ఆర్తవఫలముల'నరయు పిచ్చినమ్మక మొకటి. ఇందువలన చెడుఫలములు వచ్చినపుడు చదువుకొనినవారు లేనిపోని కుశ్శంకలుగలిగి మనోవ్యాకులతతో కుందుటతోడను, చదువురానివారు అప్పికొండమున్నగు తీర్థయాత్రలతోడను వ్యయప్రయాసములకు లోనగుచున్నారు. ఈ అప్పికొండ తీర్థము దరి సంఘటనలు మేయోకన్య (Miss Mayo) విరచితము 'హిందూమాత' (Mother India) కు మరియొక ప్రకరణమును చేర్చుటకే యుపయోగపడును. కొలది కాలములో వేశ్యాకులము చారిత్రకవిషయమై నిఘంటుబోధ్యమగునని సంతసించుచున్న మహిళామండలి కిదియొక చిచ్చరపిడుగు. ఇట్టి అవినీతికరమును మరియొకరిచే వ్రేలెత్తి చూపించుకొనవీలగు సంఘటనలను రూపుమాయించుటకు వీని యుత్పత్తికి కారణమగు 'ఆర్తవఫలముల' పుట్టుపూర్వోత్తరముల నరయుట యావశ్యకము.

వేదముయొక్క షడంగములలో నొకటియగు జ్యోతిశ్శాస్త్రము సిద్ధాంత, జాతక, ముహూర్తములని మూడుభాగములుగ విభజింపబడియున్నది. అందు ద్వితీయ, తృతీయభాగములగు జాతక, ముహూర్తభాగములు సిద్ధాంతభాగమువలన నేర్పరుపబడిన పంచాంగముపై నాధారపడియున్నవి. సిద్ధాంతులు కొందరు 'కల్పలత' ననుసరించి, మరికొందరు 'అహోబలనాథీయము' నూతగొని, వేరొకకొందరు 'గ్రహలాఘవము' రీత్యా పంచాంగములను గుణించుచున్నారు. అందువలన పంచాంగములలో గ్రహగమనములు, గ్రహణములు, తిథి, వారనక్షత్ర, యోగ, కరణ, అమృత, త్యాజ, భుక్తిఘడియలు వ్యత్యస్థములుగ గాన్పించుచున్నవి. గ్రహగమనములలో నొక్కొక్కపరి రోజులు

తదితరములలో కొన్ని ఘడియలు హెచ్చుతగ్గులు తరచు గాన్పించుచుండును. ఇది అనివార్యము. అందు నొకటితప్పు ఇంకొకటి యొప్పయని తలంపబనిలేదు. అన్నియు శాస్త్రసమ్మతములగు గ్రంథముల ననుసరించి గుణింపబడిన పంచాంగములే.

ఈసందర్భమున ఆధునికసిద్ధాంతులలో కొందఱి విషయమునుగూడ స్థాలీపులాకన్యాయముగ చెప్ప నగత్యముగలిగినందుకు పాఠకలోకము మన్నింతురు గాక. ఆంధ్రబాలికలకు అక్షరాభ్యాసముతోబాటు రాజావలంబనమగు హూణవిద్య తప్పనిసరిగనున్నది. హూణవిద్య నభ్యసించినవారికి కులవృత్తియనిన చుక్కెదురు. ఎంతటి ఉన్నతవిద్యనభ్యసించినను నేటి నిరుద్యోగసమస్యలో నింటగూర్చుండుటయే గాని వేరొక గత్యంతరములేదుగదా? వితంతువువలె నింట గూర్చుండుటకైన వలనుపడక వీరినంటబట్టిన హూణ విద్యాసారము అనవసరపుభేషజముల కాళ్ళచేయించును. ఈభేషజములను నెరవేర్చుకొనుటకై ద్రవ్య సంపాదనకు ఉపాయములను వెదకివెదకి వేసారి 'ఉపనయనము నాటిమాట ఉన్నదిసుమతీ' అన్నట్లు చుట్టుతిరిగి పౌరోహిత్య మారంభింతురు. 'కరువనక దాసరులగుచో పదములెట్లలవడు' నన్నట్లు వీరలకు పంచాంగము చూచుటగూడ తెలియదు. తెనుగుభాష ముపేళ్ళకు వీరికి షష్టాష్టకము; తెనుగుఅంకెలకు వీరికి ద్విర్ద్వాదశము; తెనుగుసంవత్సరపుపేళ్ళన ఏలినాటిశని; పంచాంగములోనుండు ఘడియఘడియలను గంటలు, నిమిషములలోనికి మార్చుకొనుటయన నైధనతార. ఎట్లోపంచాంగమును చూచి తిథి, వార, నక్షత్రములు చెప్పగలుగటతోడనే "అశ్విని భరణీ కృత్తికాః పాదం మేషం" అని చెప్పవలెను నేర్చుకొని జ్యోతిర్విద్యావిశేషజ్ఞులు, లంకామధ్యాహ్నమధ్య రవిని తీయగడంగి సిద్ధాంతశిరోమణులగుచున్నారు. ఇట్టి సిద్ధాంతులచే గుణింపబడిన పంచాంగములు జాతక, ముహూర్తభాగములకు పెట్టినభిక్ష. పదిలముగలేని పునాదులపైనిర్మింపబడిన సౌధమువలె నిట్టిపంచాంగములపై నాధారపడిన జాతక, ముహూర్తభాగములు నిలకడలేక ఊగులాడుచున్నవి.

పంచాంగముల, సిద్ధాంతుల పరిస్థితులిట్లుంచి ఫలములను పరిశీలింతము. ఆర్తవఫలములను వత్సరాయన, ఋతు, మాస, తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములకును, ఆర్తవకోటీ రజస్వలాచక్రములకును సంబంధపడియున్నవి. ఆంధ్రదేశమున విశేషప్రచారమువడసి దైవజ్ఞులకు మార్గదర్శకములైన 'స్త్రీజాతకము' 'ఆర్తవచంద్రిక' 'నారదీయసంహిత' మున్నగు శాస్త్రముల లోని ఫలములు ఒకటి రేటికీడ్చిన నింకొకటి కోటికీడ్చుచున్నదని యీదిగువ నుదాహరింపబడిన శ్లోకభాగములవలన సోదరీమణులకు విదితము కాకపోదు. గ్రంథవిస్తరభీతిచే నొక్కనక్షత్ర ఫలములుమాత్రమిట పొందుపరుపబడినవి. తదితరములలోగూడ నిట్టివ్యత్యస్థములుగలవు.

అశ్విన్యాం విధవానారీ. (౧)
అశ్విన్యాం ప్రథమరజస్వలాకన్యాధన
సుపుత్రవ్రతభోగినీ భవతి. (౨)
శ్రీయుక్తా సుభగా పుత్రవతీ సౌఖ్యా
న్వితా స్థిరా, కలాదికా మానవతీ
చాశ్విన్యాం ప్రథమార్తవా. (౩)
పూర్వే భాగ్యవతియోషా. (౧)
పూర్వఫల్గుణీ నక్షత్రే ప్రథమరజస్వ
లాకన్యా పతిసుతహీనాభవతి. (౨)
పరకామరతా దీనాదుష్పుత్రా క్లేశ
భాగినీ మలినాకర్క-శాకృద్ధాభాగ్యర్క్షే
ప్రథమార్తవా. (౩)

మఖాయాం పుత్రవర్ధినీ. (౧)
మఖానక్షత్రే ప్రథమరజస్వలాకన్యా
శోకవతీ భవతి. (౨)
నిర్ద్వేష్యా రోగసంయుక్తా సర్వదా
గేయలోలుసా, పితృవేశ్మరతా మాన్యా
పితృభే ప్రథమార్తవా. (3)
పునర్వస్వోః సుఖం పత్యుః. (౧)
పునర్వసూ నక్షత్రే దుశ్చారిణీ ధన
నాశినీ భవతి. (౨)
పతిభక్తాపుత్రవతీ వరసంతానమోదినీ
కులాచారానురక్తాఢ్యాఽదితిభే ప్రథ
మార్తవా. (3)
విశాఖే విధవాభవేత్. (౧)
విశాఖనక్షత్రేన్యా సౌభాగ్యపుత్రవతీ
భవతి. (౨)
నీచకర్మరతా దుష్టాపానాసక్తా పర
ప్రియా, విపుత్రామలినా కృద్ధా
ద్విదైవే ప్రథమార్తవా. (3)
మూలేతు వ్యభిచారఃస్యా... (౧)
మూలనక్షత్రేన్యా సౌభాగ్యపుత్రవతీ
భవతి. (౨)
సంతానార్థగుణైర్నాలైశ్వర్యక్తాన్య
క్లేశమోచనీ,
స్వకర్మనిరతా నిత్యం మూలర్క్షే ప్రథ
మార్తవా. (3)
ప్రోష్ఠపాదే శ్రేష్ఠపుత్రా. (౧)
పూభానక్షత్రేన్యా పతిహీనాభవతి.(౨)

బంధకీ బంధువిద్వేష్యా నిత్యందుష్ట
రతాఖిలా, శిల్పకార్యేషు కుశలాది
జాంఘ్రిభే ప్రథమార్తవా. (3)

పై శ్లోకముల యర్థము సులభగ్రాహ్యము గాన తాత్పర్యము వ్రాయబడలేదు. మఖ, భరణి, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, ఆర్ద్ర, పునర్వసు, జ్యేష్ఠనక్షత్రములలో వ్యక్తురాండ్రగు కన్యలు వానివానికి చెప్పబడు పరిమితులలో భర్తృదర్శనమును, తాంబూలచర్వణాదులను విసర్జింపవలయుననియు, తదుపరి సక్రమముగ శాంతి జరుపవలయుననియు శాసించిరి. ఫలములన్నిటిలోను వైధవ్య యోగము పురుషులపాలిటికి ఫిరంగిగుండు. పురుషుని జాతకములో ద్వికళత్రయోగము స్పష్టముగా గాన్పించుచున్నను కన్యను వివాహమాడుటకు వెనుదీయడు. గాని కన్యజాతకమున వైధవ్యయోగము పనికిరాదట! ఏమి న్యాయము!!

కన్యకు జాతకమునుబట్టిగాని, ఆర్తవఫలమునుబట్టి గాని వైధవ్యయోగముండెనేని ఆ కన్యకయొక్క తండ్రి ఆ కన్యక చేతనే సావిత్రీవ్రతమునుగాని, పిప్పల వ్రతమునుగాని చేయించి ఆకన్యను విష్ణుప్రతిమ, అశ్వత్థఘటములకు రహస్యముగనిచ్చి వివాహమును చేసి చిరంజీవియైన వరునికిచ్చి వివాహము చేయవలయును. అట్లు రెండుమార్లు పెండ్లిచేసినందుననే దోషము లేకపోవునని బాలవైధవ్యయోగపరిహారముగ జెప్పబడినది. చిరంజీవియైన వరుడనగా పూర్ణ, అపరిమితాయుర్దాయయోగములు జాతకరీత్యాగలిగి అశ్విని, మఖ, మూల, ఇత్యాది దీర్ఘాయుర్దాయ నక్షత్రములలో జననమైయుండవలయును. ఈ ఆయుర్దాయ యోగములు విషూచి, కలరా, ప్లేగ్ (Plague) మున్నగు అంటువ్యాధులు వ్యాపించునపుడు భూకంపము, వఱదలు ఇత్యాది అవాంతరములు తటస్థించు

నపుడును వర్తింపవట. "లలాట లిఖితా రేఖాః పరిమార్జుం నశక్యతే" "ఋణానుబంధరూపేణ పశు పత్నీ సుతాలయాః" మున్నగు సుభాషితములను జ్ఞప్తి నిడుకొనినచో నీ మానవప్రయత్న మెంతవరకు సఫలీకృతమగునని సంశయము తోపకపోదు.

ఆంధ్రదేశమున షష్టిపూర్తి చేసుకొని మూడు లేక నాలుగు కళత్రములను పొట్టబెట్టుకొని కొడుకు, కొమరితల బిడ్డల లాలింపు ముక్కాలి ముదుసలి సహితము పెండ్లిపీటలపై కూర్చొనుటకు వెనుదీయడు. సతికదా కూర్చొనునపుడు 'అష్టవర్షాత్ భవేత్ కన్య' యేవధువు కానవలయును. ఇట్టి అసమానదాంపత్యమునకు దురదృష్టవశమున భార్య రజస్వలా నక్షత్రము పై శ్రేణికిచేరి వత్సరములపాటు వియోగము గలిగించినచో 'త్రోసిరాజు ఆటకట్టగు'నని ఈ నిబంధన కొక సవరణను గావించుకొని ముందరి కాళ్లకు బంధము వేసినారు.

శ్లో. రజస్వలానాం యదిపూర్వకాలే
సంభోగమస్మిన్ కురుతేంగనానాం
తదూర్ధ్వగండం యదితచ్ఛుభంచ
భర్తృశ్చిరాయుర్యది రుద్రవాక్యమ్.

అనగా రజస్వలకాని చిన్నదానికి భర్తృసంయోగము గలిగినచో తదనంతరమున రజస్వలా నక్షత్రమునకు దోషమున్నను వర్తించదని రుద్రవాక్యమట. అందువలన నిషేకముహూర్తములు బయలుదేరినవి.

క్రూరనక్షత్రమందు రజస్వలయైన స్త్రీకి మరల శుభ నక్షత్రమందు రజస్వలయైన పిమ్మట గర్భాధానము చేసిన దోషములేదనియు, క్రూరనక్షత్రమందు చంద్రుడు శుభనక్షత్రమందు సూర్యుడు ఉండగా రజస్వలయైన స్త్రీకి నక్షత్రదోషము లేదనియు గ్రంథములలోనున్నపుడు పైశ్లోకముయొక్క ఆవశ్యకత–కేవలము వృద్ధవరుల అనుకూలమునకుతప్ప–గాన్పింపదు. ప్రభుత్వచట్టము ననుసరించి శిక్షార్హమై, శారీరశాస్త్రరీత్యా హానికరమై, ధర్మశాస్త్రపద్ధతిని పాపభూయిష్ఠమై, అన్యదేశీయసోదరీమణులకు హాస్యాస్పదమై, నికృష్టమగు నీ రజస్వలాత్పూర్వభర్తృసంయోగ మెంతవర కామోదకరమో సోదరీమణు లెల్లరను యోచింతురుగాక.

శారదాచట్టమమలులోనున్నపుడు పైవిషయములకవకాశములేదని కొందరుసోదరీమణులు తలంచవచ్చును. శతకోటిదరిద్రములకనంతకోటి ఉపాయములుగదా? ప్రస్తుతపువివాహములు నూటికితొంబది రజస్వలాత్పూర్వముగనే యానాములో జరుగుచున్నవి; వ్రతము పేరుచెప్పియో, ఉపనయనమనియో రహస్యముగ నాంధ్రదేశమంతటను జరుగుచున్నవి. ఇందు స్త్రీలు చేయికలుగజేసుకొందురనుట నిర్వివాదాంశము. తమకొరకై యేర్పరపబడిన చట్టమును తామే యతిక్రమించిన ఈచట్టమమలులోనున్న ప్రయోజనమేమి? దాస్యశృంఖలాబద్ధమైన భారతస్త్రీజీవితము ధన్యతజెందు టెన్నటికో!



బొంబాయి విక్టోరియాగార్డన్సులో ఒక మనోహర దృశ్యము.



శ్రీమతి దుర్గా దేవల్కారుగారు,

(ఎడమనుండి రెండవవారు.) లండను విశ్వవిద్యాలయమున

గృహశాస్త్రములందు పట్టము బడయానేగిరి.

# కులము కులమందు వేటికి తెలుగుబిడ్డ !

గీ. గుణమె ముఖ్యము నరులకు-కులమదేల
అన్నయార్యోక్తిదలపక-అనవరతము
కులము కులమందు వేటికి- తెలుగుబిడ్డ!

2. నవ్యసాహిత్యవాసనల్-దివ్యభంగి
దిశలబర్వుచునున్న ఈ-దినములందు
అల్ల జాతివివక్షను-యుల్లమందు
విడువనేరక యింకను- వెఱ్ఱివగుచు
కులము కులమందు వేటికి- తెలుగుబిడ్డ!

3. సాటిదేశంబులందలి-జనులు మిగుల
జాతిభేదంబు విడనాడి-జగతియందు
ఐకమత్యంబుతోనుండ-అహరహంబు
జాతిభేదంబులనినీవు-జడతబుద్ధి
హెచ్చుతగ్గులు కల్పించి-ఇహమునందు
అంటురోగులమాదిరి-అంటకుండ
కులము కులమందు వేటికి- తెలుగుబిడ్డ!

4. కులమెగల్గుచో మనఋషి-కులముగనుము
వేదకర్తయు బ్రహ్మర్షి-విపులజ్ఞాని
యైనవ్యాసుఁడు శూద్రజుం-డగునుగాదె?
ధర్మమార్గానువర్తియై-ధరను కీర్తి
గనినధర్మవ్యాధు డరయ-గాను నవని
నతఁడు నీచకులోద్భవుం-డగునుగాదె!
కులముపూజ్యముభువిని-సద్గుణముముందు
వీనితత్వమ్మునరయక-వెఱ్ఱివగుచు
కులము కులమందు వేటికి- తెలుగుబిడ్డ!

5. తక్కువకులమునగలరు-తఱచిచూడ
నేటిదినములలోకూడ-నిపుణమతులు
ఉత్తమోత్తమపూరుషు-లొప్పిదముగ
గాంధిజీమహాత్మునివలె-ఖ్యాతిగాంచి
నట్టిభూసురుఁడెందైన-నవనిగలఁడె
అట్టి శ్రీమహాత్ము నుపదే-శామృతంబు
ఆలకింపుముశ్రద్ధతో-ననవరతము
జాతిభేదంబు విడనాడి-జనులుమిగుల
సఖ్యభావంబుతోనుండి-సంతతంబు
హెచ్చుతగ్గులు విడనాడి-హితముగల్గి
అందరున్ సమభావమున్-పొందువరకు
భారతావనిమరిముక్తి-బడయలేదు
అనుచు చెప్పుటసభలలో-నహరహంబు
వినుచు నింకనువదలక-వెఱ్ఱివగుచు
కులము కులమందు వేటికి- తెలుగుబిడ్డ!

6. శీలమేయానుతొడవులు-స్త్రీలకెపుడు
సత్యసంధతయును మరి-శాంతతయును
కరుణయును కలుగవలెను-పురుషులకును
సర్వజనులకును తొడుగు-సంతతంబు
భూతదయగల్గియుండుట-పుడమిగాన
గుణమెముఖ్యము నరులకు-కులమదేల
అన్నయార్యోక్తిదలపక-అనవరతము
కులము కులమందు వేటికి- తెలుగుబిడ్డ!

కోశా హనుమాయమ్మ.

# ఇవీ సమస్యలే

దేవి

విశాలదృష్టిని బరికించిన నిందలి సంగతులు సమస్యలు కావచ్చును; కాకపోవచ్చును; కాని ఆయాపరిస్థితులందుండు వారి కివి విషమసమస్యలనిమాత్ర మంగీకరింపక తప్పదు.

నేటి ప్రపంచమున నియంతలకే కాలమనుట పరిపాటియైనది 'అతి సర్వత్రవర్జయేత్' అనుటవలననో యేమో, భారతదేశమం 'దూరూర నింటనింట' నున్న వేలకొలది నియంతలు కాలపరిపాకము వలన కోరలుదీసిన పాములగుచున్నారు; వారు తమ యశక్తతను నిందించుకొనుచు బుసకొట్టుచున్నారు. ఐననేమి? ముక్కుపచ్చలారని బాలబాలికలకు ముడివైచి 'మీభావి జీవితముతో మాకెట్టి సంబంధముగాని లేకున్నను, మిమ్ముల భార్యాభర్తలుగ నొనరించుచున్నాము; మీరు పెరిగి పెద్దవారైనపుడు మీకిష్టమున్నను లేకున్నను మా యిప్పటిచేతలకు కట్టుబడియుండవలసినదే. దీనివలనగలుగు ఫలితములను అనుభవింపవలసినదే. ఇది మా యాజ్ఞ' యని బాల్యవివాహము లొనరించుచున్న వారందఱును, విజ్ఞాన వ్యాప్తిచేతను, విద్యాప్రాబల్యము వలనను నవీనాశయముల తోడను దారికివచ్చి వానికి స్వస్తి జెప్పవలసివచ్చినది. వీని కతీతులైన మహాత్ములను శారదాశాసనము కొరడా చేతబుచ్చుకొని 'కబడ్దార్' అని మందలించుచున్నది. దీనికికూడ భయపడనిధీరులగు పూర్వాచారపరాయణు లుందురేని వారిని కాలమే చక్కచేయగలదు. కావున బాల్యవివాహ మనునది నేడు మనమంతగా పరిగణింపదగిన ప్రబలసమస్య గాదు.

ప్రపంచమంతయు ప్రౌఢావివాహమేయుక్తమని నెత్తిన నోరుపెట్టుకొని ఘోషించుచుండ ప్రత్యేకముగా నదియే యుత్తమని చర్వితచర్వణముగ వ్రాయబూనుట

మనసంఘములో దురాచారము లున్నవని నందఱంగీకరింపవలసినదే కాని అవి యందఱికిని గనపడవు. వానికి గుఱియైన ప్రత్యేక వ్యక్తులకే వానిబాధలు స్పష్టమగును. బాల్యవివాహపిశాచములబారికి బాల్పడిన వారికిగాని వాని 'మజా' తెలియదు. పాపపుణ్యము తెలుగని పసికూసలపుడే వివాహము లొనర్చికొని దురదృష్టులైన వారికిగాని వితంతువుల బాధలు ప్రస్ఫుటముగావు. ఈ విధముగా ఆయా ఆచారములకులోనై తప్పని సరిగా తన్మూలమున తమకుగలుగు ఆ యాకష్టములు నూటికి నూరుపాళ్లు అనుభవించువారలయు వానినిగూర్చి తెలిపినవారలయు వ్రాతలు, (కష్టాలుకూడ)సత్యమునకు చాలదగ్గఱ.కష్టములచే గలిగిన బాధలచే నావేశపూరితులై సూచించిన పరిష్కారముల నందఱట్టె యంగీకరింపక పోవచ్చునుగాని వారికష్టములు మాత్రము వారింపదగినవనుట నిర్వివాదాంశము; తప్పనిసరి.

పాండిత్యముగాదు; ప్రజ్ఞావిశేషమునుగాదు కాని దాని కవినాభావసంబంధముగానుండెడి కొన్ని విషయములు తప్పక విచారింపదగినవి.

ప్రౌఢావివాహమన్నంతనే కన్యకువివాహ విషయమున తగిన స్వాతంత్ర్యముండితీరునని స్ఫురించును. కాని స్త్రీ స్వాతంత్ర్యమును నది మన దేశములో ఏ నలువురి విద్యావంతుల వద్దనో జనించి మాయ మగుచున్నది. ఒక వేళ బాల్యవివాహ ము లంతరించి ప్రౌఢా వి వా హ ము లు జరుగవచ్చును కాని కన్యపితరుల వాక్యాను సారము వివాహమాడ వలసినదేనా యను సం దియము జనించును. తనకు నచ్చినవో, తన క ది యభ్యంతరము లేనిచో, నటులనే గావ చ్చును. వివాహ మను నది యానాటి ముచ్చ టతో దీరునదికాదు.

> "న్యాయమైన హక్కులన్నిటికిని సరియగు పరిష్కారముండి తీరవలయుననుట నాయుద్దే శము. ఈ సమస్యాపరిష్కారమే సాంఘిక విద్వేషములనుగాని విభేదములనుగాని పెంపొందించు నట్టిదైనచో, భావి సాంఘిక పరిణామమున కది క్షమింపదగని నేరమగును. ఈ తరుణమున స్త్రీలకొక ప్రత్యేకప్రార్థన హృదీయపూర్వకముగా చేయుచున్నాను. స్త్రీలు సాంఘికవిద్వేషములందు పాల్గొన కుడు. పురుషులు కీవిషయమున బుద్ధులు లేకున్న మనకైననుండనిండు. ప్రకృతి కష్టముల గమనిం పక భావిమానవ సాంఘిక సౌభాగ్యమునెడ దృష్టియుంచుట స్త్రీలకర్తవ్యము. వారైక మత్యము మాటనెపుడునుమరువరాదు."
>
> ఆచంట రుక్మిణమ్మ

వివాహితులు జన్మాంతరమువఱకు కష్టసుఖ ములను సమభాగినులై యేకొరంతయులేక ప్రశాంతముగ కాలము గడుపవలసియున్నది. అట్టితరి నభీష్టవరణమునకన్న ననుకూల మార్గమేమున్నది? అటుగాక పితరుల యా జ్ఞానుసారముగ గంగిరెద్దువలె తలనాడించు చు నెవరికిచ్చి వివాహముచేసినను సరియే యని యున్నవారు ప్రతికూలురును అనను బద్ధులునగు వారితో — సౌఖ్యముమాట దైవమెఱుగును — కన్య కాపురమెట్లు చేయగలుగును? వివాహములందెట్లు ప్రౌ ఢావివాహము ముఖ్యమో వివాహవిషయ మున స్వయంవరణస్వాతంత్ర్యము ముఖ్యావ సరమగుట నిర్వివాదాంశము. ఇటులని తనయుల భావి సౌఖ్య మునందు దృష్టిగల అనుభవజ్ఞులగుమాతా పితల యుపదేశము లను మన్నింపక యుండ రాదు.

పాశ్చాత్య ప్రపంచ మునందు ప్రణయరా హిత్యమైన వివాహము లరుదు. కాని మనదేశ మున నింతవఱకు ప్రణ యమునకు వివాహ మాధారమని తలంచి యుండిరి. వివాహానంత రము భార్యాభర్తల యెడ నభివృద్ధియగు ప్రణయమునంఘము నకు వెఱుచుటచేతనో, నియమబద్ధమై యుండుటచేతనోయని చెప్పవలసినదే. ఇది యు నరుదు; ప్రతివారియందును గలుగు టసంభవము.

కాలానుసారము మన యాచార వ్యవ హారములుగూడ కొంతవఱకు మారి నేడు

యువతీయువకులు కలసిమెలసియుండుట కవకాశములు గలవు. దీనిచే వీరియందు పరిచయము గలుగుచున్నది. అట్టిపరిచయము కాలక్రమమున స్థిరమై నాంతరంగికమగును. ఈ యాంతరంగిక మైత్రియే స్నేహమనియు, ప్రేమయనియు జెప్పబడుచున్నది. కేవల మొకేజాతికి జెందినదైన స్నేహమనియు దద్భిన్నమైన ప్రేమ లేక ప్రణయమనియు జెప్పదగును. [ప్రేమ, ప్రణయము అభిన్నము నర్థమున నిట్లుపయోగించుచున్నాను.] కనుకనే ప్రేమోత్పత్తికి సంవీక్షణ, సంభాషణ, సాహచర్యము లనునవి యాలంబనములు. అయ్యది వీక్షణమువలన నుద్భిజ్జంబై సంభాషణమువలన నభివృద్ధి నంది సాహచర్యమువలన స్థిరమగుచున్నది. వీనికి విద్యారూపశీలము లుద్దీపితములు. అవకాశములుండుటచే ప్రేమ యువతీయువకులమధ్య నీవిధముగ ప్రబలుచున్నది. అంతియగాక యొకరినొకరు చక్కగ నర్థముచేసుకొని తమ జీవితమంతయు కలసి హాయిగగడపగలమను నభిప్రాయమును వారి హృదయములందు రేకొత్తును. ఈ ప్రేమకు ప్రతిఫలమేవివాహమయ్యేనేని వారిసుఖజీవితమున కది మొదటిమెట్టుగనుండగలదు.

ఇటులగుట అవివాహితులగుయెడ మాత్రమేగాదు. బాల్యవివాహమునకు బలియై వితంతువులైన వారికికూడ నిట్టి యవకాశము లుండవచ్చును. అట్టిచో వారెల్లరు అవశ్యముగా స్వయంవరణపద్ధతినే వివాహమాడవలయుననుట నాయుద్దేశము. కారణము లెల్లరికి విదితములే.

హేతువాదమునకు నిలువజాలక, మానుషత్వమును దగ్గఱజేరనీయకయుండు నే సనాతనాచారపరాయణ చక్రవర్తియో వితంతూద్వాహము శాస్త్రనిషేధమని యసంబద్ధప్రలాపములాడిన నాడు గాక. ముక్కుపచ్చలారని ముద్దియ యకాలమృత్యువువాతబడిన భర్తకొఱకై యావజ్జీవము దుఃఖములపాలు గావలసియుండునా? వారిభర్తతోపాటు వారియందలి మానవగుణములుకూడ మరణించినవా? తాను బాధ్యతవహింపనిదానికై తనజీవితము బలిచేయవలయునా? సంఘము వారలను వెరపించి వివాహమొనర్చుకొనుట కాటంక పెట్టినది. వారితలంపులను, వారి రహస్యాచరణములను నాపజాలెనా? జీవితపర్యంతము సుఖించుటే జన్మోద్దేశము. సంఘమునకు భీతిజెందక, యన్యాయముల నోడిగట్టక, ప్రకృతి సిద్ధమగు సుఖానుభవార్హతను,వ్యక్తిస్వాతంత్ర్యమును బురస్కరించుకొని స్త్రీలు స్వయంవృణీతప్రణయపాత్రులు గావలయును. ఇది వారికి సమస్యయే! కాని పరిష్కారముకూడ వారిచేతులందే యున్నది.

అధైర్య ముగ్గుపాలతో పెట్టబడి సంఘనియములకు కదలక కట్టువడి విద్యా, జ్ఞానములచెంత పోవని వితంతువులమాటయేమి? వారికి సాహస మెక్కడినుండి వచ్చును? నిజమే. అందువలననే వారు తీరనికష్టములకు లోనగుచున్నారు. ఆకష్టములకెల్ల కారకులయ్యు వానిని వారింప నెంతమాత్రమును శ్రద్ధవహింపనివారు మానవగణమునకు చెందరు.

# పెంచిన ప్రేమ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

జాతిమత, వయోభేదాలను, హెచ్చు తగ్గులను, గుణావగుణాలను, సాధక బాధకాలను గుర్తించకుండా అభివృద్ధి చెందే ప్రేమ ఆమెలోకూడా జనించింది. ప్రపంచదృష్టిలో అది న్యాయమూకాదు; ప్రేమించడానికి ఆమె కధికారమూ లేదు. కాని ఆ ప్రేమ హృదయాలు......................

*　　　*　　　*

రామలక్ష్మికి చాలా జబ్బుగావున్నది. బ్రతికే స్థితిలో లేదు. తమ అబ్బాయిగారిని చూడాలెనని మహాకలవరిస్తున్నది. ఒక్కమారు తమరు అబ్బాయిని అమ్మాయిలను తీసుకొని మావూరు దయచేయాలెనని రామలక్ష్మి చెల్లెలుకొడుకు వచ్చి చెప్పగానే రామారావు కాలేజీకి సెలవు వ్రాసిపంపి వేణుకుగూడా ఆపూట బడిమాన్పించి వేణును తీసుకొని రామలక్ష్మి వున్న గ్రామం వెళ్లాడు. రామలక్ష్మి వూరిగుడిసెలో నులకమక్కలో పడుకొనివున్నది. రామలక్ష్మిని చూదామని తండ్రికంటె ముందు వురుక్కుంటూ లోపలికిపోయిన వేణు రామలక్ష్మిని చూచి భయపడి తండ్రి వెనుకకువచ్చి నిలిచి తొంగిచూడటం మొదలుపెట్టాడు. “పెద్దాము చిన్నయ్యనూ పంతులుగారిని చూడాలంటివే అరుగోవచ్చారు చూడూ” అన్నాడు కోటయ్య. రామలక్ష్మికి వుబ్బువ్యాధి కావడంచేత శక్తితప్పినా తెలివితప్పలేదు. కోటయ్య చెప్పగానే చప్పున కళ్లు తెరిచింది. రామారావు వేణు యెదుట నిలబడివున్నారు. రామలక్ష్మి చూపులు పక్కపక్కల ప్రసరించాయి యెవరినో వెదకుతున్నట్టు. రామారావు గ్రహించి ‘పెద్దమ్మాయిని అత్తవారు యేడాదిలోపల తీసుకపోయినారు. చెల్లెలుగూడా పెద్దమ్మాయితో వెళ్లింది’ అన్నాడు. సరేనన్నటు రామలక్ష్మి తల త్రిప్పి వేణును దగ్గిరకురమ్మని సౌంజ్ఞ చేసింది. వాపుచేత వికృతంగావున్న రామలక్ష్మినిచూచి భయపడి వేణుతండ్రి వెనుకనుండి యివతలకు రాలేదు. ‘రామారావు భయంలేదు నాన్నా! మన రామలక్ష్మి నీమీద దానికి అమితప్రేమ. నేను దగ్గిరకు తీసుకపోతా రమ్మ’ని రామారావు వేణును రామలక్ష్మి వద్దకు తీసుకపోయినాడు. రామలక్ష్మి వేణును కళ్లారాచూచి కాగితంలో మడచి మడచి వుంచిన ఒక నవర్సుతీసి వేణుచేతిలో బెట్టి ‘చిన్నయ్యా....నా పేరుగా. ఉంగ....రం.....చేయిం....చి.....చేతికి పెట్టుకో......న...న్న....మఱచి.....’ రామలక్ష్మి మాట్లాడలేకపోయింది. అవసానదశలోగూడా రామలక్ష్మి వేణుపై జూపిన ప్రేమకు రామరావు ఆశ్చర్యపడిపోయినాడు. అప్రయత్నంగా వెలువడిన రెండు కన్నీటిబిందువులు కృతజ్ఞతాభరితమైన అతని అంతస్సును వెల్లడించినవి. ‘మహాయోగ్యురాలు. మహావిశ్వాసంగల మనిషి. రామలక్ష్మివంటి ఉత్తమురాలి సహాయంలేకపోతే ఆగోజుల్లో నాఅవస్థ యెట్లావుండెదో: మనిషికి కులం ప్రధానంగాదు. గుణమే ప్రధానం’ అన్నాడు రామారావు. ఒక్కటి రెండు నిమిషాలు గడిచాయి. రామలక్ష్మి పని అయిపోతున్నట్టు తోచింది. ‘రామలక్ష్మి వెళ్లివస్తాను’ అన్నాడు రామారావు. రామలక్ష్మి బలవంతంగా కండ్లు తెఱచింది. ఆమె చల్లనిచూపులు మొదట వేణుపైబడి రామారావు దెసకు మరలినాయి. ప్రాణపదంగా పెంచిన నీ వేణు జాగ్రత్త సుమా అని వొప్పగించినట్లున్నది రామారావు కాచూపు. రామలక్ష్మి మళ్లీ కండ్లు మూసింది. కనుకొలుకులు నిండిన కన్నీళ్లు బొట్లు బొట్లుగా చెక్కిళ్లపై జారినాయి. మనసులో వూహ చెప్పే శక్తిలేదు. రామారావు వేణును తీసుకొని బయటికివచ్చాడు. అంతే అయిపోతున్నదన్న సవ్వడి

గూడా వెంటనే వినవచ్చింది. గబగబ యిద్దఱు మనుష్యులు పట్టి బయటకు తీసుకొచ్చారు. ఆ దృశ్యం చూసి వేణు వలవల యేడ్చాడు. రామారావుకు గూడా కళ్లనీళ్లు వచ్చాయి. కళ్లనీళ్లు తుడ్చుకుంటూ వేణును పూరడిస్తు కొంచెం దూరంగా వచ్చి 'కోటయ్యా నేను వెళ్లిపోతున్నాను. ఇవ్వాళ కర్చునిమిత్తం ఈ పదిహేనురూపాయలు తీసుకో. డబ్బుకోసం నీవు వెనకముందాడ నక్కర్లేదు. రామలక్ష్మి దినవారాలు ఘనంగాచెయ్యి. అందుకైన కర్చంతా నేనే భరిస్తాను. అంతేగాదు. రామలక్ష్మి పేర మీగ్రామంలో ఒక మంచినీళ్లబావిగూడా వేయిస్తాను' అని రామారావు స్వస్థలానికి బయలుదేరాడు. రామారావు కాలేజీలో ప్రొఫెసర్. నెలకు నాల్గువందలు జీతం.

౧

ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క కుటుంబానికి కల్గే విపత్తు చూస్తే భగవంతుడికికూడా చూడలేనితనమున్నదా? అనిపిస్తుంది. లేకపోతే పాలు పోసుకుంటున్న కంకిలాగా నవనవలాడుతూ యెంతో చక్కగా కూడుకుంటున్న రామరావు కాపురం యింతలో యింత విపత్తుకు పాలుచేయడమేమిటి భగవంతుడు?

రామారావు యిరవైయారు సంవత్సరాల చిన్నవాడు. ఎం.ఏ. ప్యాసైనాడు. కాలేజీలో ప్రొఫెసరు. నూటయాభై రూపాయల జీతం. భార్య జానకికి యిరవైరెండేళ్లు వయస్సు. తెలివి, యోగ్యత, చక్కదనము అన్నీ ఆవిడ సొమ్ము, భార్యాభర్తలలో అత్యంతమైన అన్యోన్యత. చూడ ముచ్చటైన దాంపత్యం. తొలిచూలు మలిచూలు ఆడబిడ్డలు. మూడవకాన్పు వేణు పుట్టుకతో ఆమె జీవితం ముగిసింది. హాయిగా సుఖసాగరంలో శయనించుచున్న ఆ సంసారనౌక ఆ మహోపద్రవపర్వతానికి ఢీకొని ఫెటిల్లున పగిలిపోయింది.

నాలుగేండ్లబిడ్డ ప్రేమలత. రెండేండ్లపిల్ల హర్షలత. పదమూడురోజుల పసికూన వేణు. రామారావు పాతాళానికి క్రుంగిపోయినాడు. జానకిమీద అతనికి అపరిమితప్రేమ. వినోదమునకైనా మాటామాటా అనుకొని యెఱుగని ఉత్కృష్టదాంపత్యం వారిది. అటువంటి భార్యను కోల్పోవడం ఈ పసిబిడ్డలను పెంచవలసిన బాధ్యతమీదపడడం తనవంకగాని ఆమెవంకగాని యీ బిడ్డలపోషణభారం వహింపగలవారెవరూ లేకపోవడమూ రామారావుకు అన్నికష్టములు ఒక్కమాఱు చుట్టుకున్నవి.

వంటమనిషి, పనిమనిషి, బిడ్డలనెత్తుకొనేమనిషి బజారువెచ్చాలు వగైరాలకు చాకలి, మొదలైన నౌకర్లంతా యిదివఱకేవున్నారు. చూచినా చూడకున్నా ఆ తల్లిలేని బిడ్డలపోషణభారం ఆ నౌకర్లమీదనే పడ్డది. రామారావు క్లబ్బు మానుకున్నాడు. కాలేజీనుంచి వస్తే బిడ్డల సంరక్షణలోకం.

౨

రామలక్ష్మి జానకి రెండోబిడ్డను కడుపుతో వుండగా పెద్దపిల్లను యెత్తుకోడానికి వారింట్లో చేరింది. రాత్రీ పవలూ వారింట్లోనే ఉండటం అన్నంవస్త్రం సంరక్షణంతా వారిదే. రామలక్ష్మి వొళ్లు దాచుకోట మెఱుగదు. జానకికి రవ్వంత కష్టం తగలకుండా రాత్రిపూటగూడా పిల్లను బుజానవేసుకొని తిరిగేది. 'రామలక్ష్మీ! పాపం యెంతసేపు యెత్తుకు తిరుగుతావు. అమ్మాయిని నా కిట్లాయిచ్చేసి నీవు పడుకో' అంటే "యెందుకమ్మా వద్దు. ఓపలేని అమ్మవు అమ్మాయి నెత్తుకోలేవు. మీరే అమ్మాయిని సముదాయించుకుంటే నే నెందుకువుండి అనేది" దాని యోగ్యతకు రామారావు జానకీకూడా చాలా సంతోషించి మిక్కిలి ఆదరించేవారు. వారి ఆదరణకొద్దీ రామలక్ష్మి వారినధికంగా ప్రేమించేది. రామలక్ష్మిమీదవుండే ప్రేమాతిశయంచేత యెంత లేకలేకపోయినా జానకి రామలక్ష్మికి తానే స్వయంగా అన్నంపెట్టేది. కన్నతల్లిలాగా చూచేది. అటువంటి జానకమ్మతల్లి పోయిందంటే రామారావుకంటే

యెక్కువ దుఃఖాన కుమిలిపోయింది రామలక్ష్మి. ఆమె బిడ్డలనుచూస్తే దాని జాలిగుండె కరిగిపోయింది. అన్న మొక్కటితప్ప తక్కినవాళ్లకు కావలసినవన్నీ తానే చూచేది. అందులో వేణుగోపాలుడంటే దానికి అమితప్రేమ. చిన్నయ్యా చిన్నయ్యా అంటూ అతిలాలనచేసేది. ఆబిడ్డకు యియ్యామంటే దాని ప్రాణం వోర్చేదికాదు. మగబిడ్డంటే అపేక్షపడేది మా జానకమ్మతల్లి. మా బంగారునాయన పుట్టవచ్చే టప్పటికి చూచుకోనేందుకు లేకపోయింది మా అమ్మ అని కండ్లనీళ్లు బొటబొట కార్చేది. ఆబిడ్డలను తల్లి కంటెను మిక్కిలిగా చూచేది అందులో రోజుల బిడ్డైన వేణును కేవలం తానే పెంచడంచేత ఆ కుఱ్ఱ వాడిమీద ప్రేమ అత్యధికం. వేణుగూడా దానిని తల్లిలాగా ప్రేమించేవాడు. దాని వొడిలోమారి నవ్వుతూ కేరుతూ దోబూచులాడేవాడు. చప్పట్లు కొట్టి భజనలుచేసేవాడు. యెవరివద్దవున్నాసరే రామ లక్ష్మిని చూడంగానే దానిదగ్గరికి దూకేవాడు. అది యెత్తుకోకుండాపోతే పెద్దగా గ్రుక్కపట్టి యేడ్చే వాడు. అది తన కన్నతల్లిగాదనీ, తన బంధువు రాలు కూడా కాదనీ, ఆఖరికి తల కులస్థురాలుగూడా కాదనీ తనకూ దానికీ మధ్య యెన్నో అంతరువు లున్నాయనీ, కాబట్టి తాను దానిని ప్రేమించడం పరిమితమైనదిగా వుండవలెననీ ఆ శిశుహృదయాని కేమి తెలుసు? తల్లిలేని బిడ్డలకు దయచూచినవాళ్లే తల్లులు గదా. పసివాడు గనుక వేణు తెలుసుకోలేక పోయినాడు సరే; రామలక్ష్మైనా తెలుసుకొని వుండాలిసింది. కాని దానికీ తెలియలేదు. వారిరువురి మధ్యా మాతా శిశు సంబంధమైన ప్రేమపాశ మేదో తెలియబడకుండానే పెనవేసుకుపోయింది. వేణుకు కొంచెం వొళ్లు వెచ్చబడితే చాలు రామలక్ష్మి అన్నం నీళ్లు కొనేదికాదు. ఎన్నెన్నో వైద్యాలు చేసేది. దృష్టిమంత్రాలు పెట్టించేది. జడుపుమంత్రాలు పెట్టించేది. వాళ్ల తండ్రిని తొందరపెట్టి మందులు పోయించేది. దాని ఆరాటంచూచి "పాపం. రామ లక్ష్మి మహామంచిది. కళ్లుపోగొట్టిన దేవుడు మతి యిచ్చె నన్నట్టుగా తల్లిలేని ఆ పిల్లలకు దేవుడు రామలక్ష్మిని చూపించాడు" అని అందరూ అను కొనేవారు.

3

ఒక్కసంవత్సరం గడిచింది రామారావుకు ఆడది లేనికాపురం నిర్వహించడం దుర్భరమనిపించింది. పైగా స్నేహితులందరూ 'యిదేమిటోయి పెండ్లి చేసుకోకుండా భీష్మికరించావు. పోయినవాళ్లతో పోతారాయేమిటి? ఆడదిక్కులేని కాపురం మగ వాడివి నీవల్ల యేమవుతుంది, పెండ్లిచేసుకోమని పోరడం మొదలుపెట్టారు. మిత్రులప్రోత్సాహంవల్ల నైతేనేమి తనఅనుభవంవల్ల నైతేనేమి యేదోపిల్లను కట్టుకోకతప్పదు. అనిపించింది రామారావుకు. రామారావు వివాహమాడవలెననే అభిప్రాయం బైటికి పొక్కంగానే సంబంధాలు కొల్లగా రావడం మొదలుపెట్టాయి. తుదకు ఒక పెన్షను పుచ్చుకున్న తాసీల్దారుగారికోమార్తె సుభద్రను యివ్వడానికి నిశ్చయమైంది. బాలిక పద్నాలుగుసంవత్సరాలు నిండిన యుక్తవయస్కురాలు కావడంచేత ఆసంబంధమే బాగున్నదనుకున్నారు. యెక్కువ ఆడంబరంలేకుండా ఒక్కపూట వివాహంజరిగింది. పెండ్లికొమార్తెను మూడునిద్రలకు తీసుకొచ్చారు అంతే. మళ్ళీ పుట్టింటికి పంపించలేదు. ఆమె ఆమెతోబాటు యిద్దరు చెల్లెళ్లు ఒక్కతమ్ముడూ యిక్కడే వుండిపోయినారు. ఇంతేగాక తాసీల్దారుగారు ఆరుగురు కొమార్తెలూ నలుగురుకొమాళ్లూగల బహుకుటుంబీకు డవటంవల్ల వారివారి సంబంధీకులందరూ వచ్చిపోయే రావంధాళీ గూడా యెక్కువైంది. వెనుక తాసీల్దారుగారు వుద్యోగంచేస్తూ అరమర లేకుండా వస్తు రూపంగా ధనరూపంగా బాగా లంచాలు గుంజే రోజుల్లో అలవాటుపడ్డ సుష్టుభోజనాలో, కాఫీ

ఫలహారాలూ తాసీల్దారు గారిని వారియింటిలోవారినీ యిప్పటికీ వదలిపెట్టకుండా జన్మాంతరవాసనలాగా అంటిపట్టి యుండటంచేత వచ్చినవారందఱికీ రామారావుగూడా యివన్నీ సప్లైచేయడం తప్పని సరై పోయింది. ఒక్క కాఫీలక్రిందనే నెలకు ముప్ఫైనలభై రూపాయలు కర్చౌతున్నాయి. మితమూ ఉచితమూ నెఱిగి కర్చుచేయడానికి అలవాటుపడిన రామారావుకీ దూబరతిండివ్యవహారము యింపితంగా ఉండకపోయినా విధిగా నెత్తిమీదపడినందున కిక్కురుమనడానికి వీలుగాకుండా పోయింది.

౪

వేణుకు మూడోయేడు వచ్చింది. ఆటా, మాటా, నడక అన్నీ వచ్చినవి. అక్కలిద్దఱూ బడికిపోతుంటే నేనూ పోతానని ఒక్క చిన్నపలక కొనిపించుకొని పిచ్చిగీతలతో పలకనింపుతున్నాడు. అప్పుడప్పుడు అక్కలతో బడికిపోతానని పేచీపెట్టి రామలక్ష్మిని తీసుకొని బడికిపోయివస్తున్నాడు. రామలక్ష్మి యెప్పటివలెనే పిల్లలను వేయికళ్లకనిపెట్టి ఉపచరిస్తూవున్నది. పిల్లలుముగ్గురూ కొంచెంపెద్దవాళ్లు కావడంచేత వాళ్లవిషయమై దిగులుదీరినట్టున్నా రామారావుకు ద్వితీయవివాహంవల్ల యేర్పడ్డకుటుంబభారం అతనిని క్రుంగదీస్తున్నది. నెలకువచ్చే రెండువందల రూపాయలు ధూపానికాగడంలేదు. ఏకర్చు తగ్గిద్దామన్నా వీలుగానిదిగానే కనపడుతున్నది. పనిమనిషిని మానిపిద్దామంటే పాచిపనికి యిబ్బంది. వంటమనిషిని మానిపిద్దామంటే నలుగురువచ్చేపోయే కొంపలో చిన్నపిల్లైన సుభద్రవల్ల వంటపనిజరగదు. చాకలిని మానిపిద్దామంటే బజారునుంచి వస్తువులు తెచ్చేవారులేరు. తుదకు ఆలోచించగా వేణుకు మూడోయేడువచ్చింది గదా అక్కలతోబాటుతిని ఆడుకుంటూవుంటాడు వాడికిక ప్రత్యేకనౌకరవసరంలేదు గనుక రామలక్ష్మిని మానిపిస్తే యిబ్బంది లేదనుపించింది రామారావుకు. కాని పిల్లలను కన్నతల్లిలాగా చూస్తూవున్న రామలక్ష్మిని మానుకోమనిచెప్పడానికి నోరురాలేదు. చెప్పాలనుకుంటూనే కొన్నిరోజులు గడచిపోయినవి ఒకనాడు యిప్పుడు చెప్పివేద్దాము అని నిశ్చయించేసుకొని రామలక్ష్మి యెక్కడున్నదో అనిచూచాడు. వేణును వుయ్యాలలో పడుకోబెట్టి రామలక్ష్మి వూపుతున్నది. వేణు నోట్లో వ్రేలేసుకొని సుఖంగా నిద్రబోతున్నాడు. "అయ్యో! రామలక్ష్మి వెళ్లిపోతే వాడినట్లా సుఖనిద్రబుచ్చేవారెవరు?" అనిపించింది రామారావుకు. కనుల వెంట నీళ్లొచ్చాయి. చెప్పకుండా వూరుకున్నాడు. మఱోమాటు చూచాడు. వేణును చంకబెట్టుకొనే తలంటుతున్నది. నాకు తలంటవొద్దని వేణు మారాముబెట్టుతూ కాళ్లు చేతులూ కుమ్ముతుంటే అన్నిదెబ్బలుతింటూ చినయ్యా తలంటిపోసుకోకపోతే యెట్లానాయనా మాడుకుసెగ గాదూ, కళ్లకు జబ్బుచేయదూ అని బ్రతిమలాడుతున్నది. "ఛీ వెధవడబ్బుకోసం వేణుసుఖం యెక్కడ చెడగొట్టే"దని మాట్లాడకుండా వూరుకున్నాడు. మఱోకమాటు చెప్పవలెనని ప్రయత్నిస్తే వేణు వాకిట్లోకిబోయి కూర్చుండేయీడు వచ్చినప్పటికీ మలవిసర్జనకు దొడ్లోనే కూర్చోబెట్టి యెత్తిపారవేస్తున్నది. "అదేమిటే నీగారాబం నీవూనూ పిల్లవాడిని అట్లా వీధిలో కూర్చోబెట్టరాదుటే" అని వంటామెగాబోలు మందలిస్తూవుంటే "ఎత్తిపాఱవేసేదాన్ని నేనుంటే నీకెందుకమ్మా కోపంచేస్తావు. వీధిలోకూచోబెడ్తే యెవరైనా తొక్కినాచేసినా తిట్టుకోరమ్మా; తిడ్తే నాయనకు తప్పుగాదటమ్మా?" అని అంటున్నది. మలమూత్రాదులు సైతం అట్లా యేవగింపులేకుండా తీసివేస్తున్న రామలక్ష్మిని యెట్లాపొమ్మనని రామారావు చెప్పలేక వూరుకున్నాడు.

౫

రామారావు సాయంత్రం షికారువెళ్లి యింటికి వచ్చేటప్పటికి యిల్లంతా నిశ్శబ్దంగావున్నది. రామలక్ష్మివొక్కతే వాకిట్లోకూర్చుండి కునికిపాట్లు పడు

తున్నది. రామారావు లోపలికిపోతూ రామలక్ష్మిని చూచి మనవాళ్లంతా సినీమాకు పోతామన్నారు పోయినారా యేమిటన్నాడు. అవునండీ అందఱూ వెళ్లారు. వద్దన్నకొద్దీ చిన్నయ్యనుగూడా తీసుక పోయినారు అన్నది రామలక్ష్మి.

'తీసుకపోతే యేమిలే వాళ్లక్కయ్యలదగ్గిర కూర్చొని సినీమా చూస్తాడు.'

'అమ్మాయిగార్లను యెత్తుకోమని వేధిస్తే?'

'ఆఁ యేమీ పరవాలేదు. మూడోయేడుగూడా వచ్చింది. అక్కలవద్దనైనావుండే అలవాటులేకపోతే యెట్లాగన్నాడు–' వాకిట్లోకివచ్చి వాలుకుర్చీమీద కూర్చుంటూ రామారావు.

'నిద్రవచ్చి యేడుస్తారేమో.'

'ఏడిస్తే చాకలి తీసుకొస్తాడులే. అన్నాలు తిన్నారా?'

'తిన్నారండీ.'

'సరే ఫరవాలేదులే. నీవు వూరికె భయపడతా వెందుకు?'

'చిన్నయ్యను నేను మరిపిస్తా మీరు మాట్లాకుండా పోండమ్మా అంటే ఆఁ తమ్ముణ్ణిగూడా తీసుకపోతామని తీసుకుపోయినారు.'

'పోనీలే యెల్లకాలం నిన్నేకటిచి పట్టుకొని కూర్చుంటే యెట్లా నీ వెక్కడకన్నా పోయినా చేసినా యిబ్బందిగాదా?'

'నే నెక్కడికెళ్లతాను అయ్యగారూ చిన్నయ్యను విడిచి' అన్నది రామలక్ష్మి దృఢంగా.

'ఏమో పోక యేమిచేస్తావు? యెల్లకాలం మా యిల్లే నిత్యమా.'

'అయ్యగారట్లా సెలవిస్తున్నారేమి?'

'ఏమో రామలక్ష్మీ! యింట్లోకర్చు భరించడం చాలాకష్టంగావున్నది. మీ అమ్మగారున్నదినాల్లో నూటయాభై వచ్చేవి. ఎంతోహాయిగా గడిచేది కాపురం. ఇప్పుడు రెండువందలరూపాయలు వస్తున్నాయి యేనెలకానెల నెలాఖరయ్యేటప్పటికి గిజగిజగానే ఉన్నది.'

'అవునయ్యగారూ? అప్పటి కాపురమెక్కడ యిప్పుడెక్కడ? అప్పుడు అమ్మగారూ, మీరూ, చిన్నమ్మాయి లిద్దఱూయింతేగా చిన్నయ్య పుట్టవచ్చేటప్పటికి అమ్మకు నూరేళ్లూనిండిపోయె', అని రామలక్ష్మి కన్నీరునించింది. రామారావుగూడా కన్నులు తువ్వాలుతో తుడుచుకున్నాడు. 'అదేచెప్పడం ఆవో పుణ్యాపురోజులు అయిపోయినాయి. ఇప్పుడేదో కాడి మెడమీదవేసుకున్న తర్వాత యెంత భారమైనా యీడ్వకతప్పదు. కాని యేవిధంగానైనా ఖర్చు తగ్గించాలెననివున్నది. అందుకోసమే యేమీ పాలుబోకుండావున్నది.

'ఏమి తగ్గిస్తారయ్యగారూ. అన్నితప్పనివే.'

'చూడు నేణుకు మూడోయేడువచ్చింది రాత్రిళ్లు పాలుత్రాగడంకూడా మానేశాడు. పొద్దుటిపూట మా కాఫీలతోబాటు ఒక్కమాటు పాలుపట్టితేచాలు, మళ్లీ మధ్యాహ్నం కాఫీవేళకే త్రాగుతున్నాడు. ఏదో నాల్గు మెతుకులుతిని అక్కలతో ఆడుకుంటూవున్నాడు, యింకానీవు రాత్రింబవళ్లువుండి వాడిని పోషించాలిసినపని కన్పడటంలేదు అనుకుంటాను.'

ఆమాటవినేటప్పటికి రామలక్ష్మికి తలపై పిడుగు పడినట్లైంది. ఇటువంటి ఆపదవస్తుందని కలలోనైనా అనుకోలేదు. రామారావుగారు తన్ను తనకుటుంబములో వొకదానిగాభావించి యెల్లకాలం చిన్నయ్య సంరక్షణ తన్నువుంచుతారనే వూహలోనేఉన్నది యింతవఱకూ, రామలక్ష్మి. కాని యిప్పుడు రామారావుపల్కులు మునుముందు తనకే వుద్వాసంచెప్ప దలచుకొన్నవిగా వుండేటప్పటికి రామలక్ష్మి దుఃఖంతో పాతాళానికి క్రుంగిపోయింది. నోటమాటరాలేదు.

'రామలక్ష్మీ యేమంటావు?'

నీకు పాచిపనిచేసేందుకు శక్తివుండేటట్లైతే పనిమనిషినే మానిపిస్తాను నీవుండిపనిచెయ్యి. యెప్పటిలాగానే పిల్లలను కనిపెట్టుకొనివుండవచ్చు లేదా నీదారి నీవు చూచుకో. పనిమనిషిపనిచేస్తుంది. కాని యిద్దటినీ భరించలేను.”

రామలక్ష్మికి దుఃఖాతిశయంచేత కంఠం రుద్ధమైపోయినా యెట్లోపెగిల్చుకొని ‘అయ్యగారూ! మీకు తెలియని దేమున్నది? అబ్బాయిగారినీ యెట్లాపెంచానో తమకే తెలుసు.’

‘అవును నాకు తెలుసు. నీసహాయంలేకపోతే అప్పట్లో వేణును పెంచడానికేమి అమ్మాయిలను పెంచడానికేమి నేనెంతైనా అవస్థపడేవాడిని, కాని యేమి చేయను, ఇప్పటిస్థితిలో నిన్ను యిష్టంలేకుండానే మానిపించాలసొచ్చింది. అయినా అసలే పొమ్మనడం లేదుగా పనిమనిషిగావుండు.’

అయ్యా! నే నెప్పుడు పాచిపని చేసినదాన్నిగాను. అయినా ఈ పెద్దతనంలో ఈ లోతుభావుల్లో నీళ్లు చేదటం యివన్నీ నావల్లకావు. ఏదో మీరు కర్చంటున్నారు గనుక మునుపటాలె నెలకు మూడు రూపాయల జీతం యివ్వవద్దు. ఆమెవక్క కొనుక్కోడానికి ఒక్కరూపా యిప్పించండి చాలు. బిడ్డలను కనిపెట్టుకొనివుంటాను.’

‘పిల్లలు పెద్దవాళ్లైనారు. వాళ్ల కిక ప్రత్యేకమనిషి అనవసరమని చెప్పుతున్నాగా!’

‘నేను అబ్బాయిని తమరిబిడ్డగా పెంచలేదండి. నా బిడ్డలాగా అతిప్రేమగా పెంచుకున్నాను.’

‘ఎంత పిచ్చిదానవు రామలక్ష్మీ! ఎంత పెంచినా జీతపురాళ్లకు ఆశించి పెంచినదానవు నీకు నా బిడ్డమీద ప్రేమేమేమిటి? చేసినన్నాళ్లు విశ్వాసంగా చేశావు అంతేగాని అబ్బాయిమీద నాకు ప్రేమంటే యెవ్వరు నమ్మతారు.’

‘అయ్యగారూ చదువుకున్న మారాజులు తామట్లా సెలవిస్తే నే నేమిచెప్పేది. ఒక్కక్షణం చిన్నయ్యను చూడకపోతే నాప్రాణం కొట్టుకలాడిపోతుంది. అందుకనే యింతగా మనవిచేస్తున్నా.’

‘సరే. నీవు అబ్బాయిని వదిలిపెట్టలేవని అవసరం లేకపోయినా నేను నిన్నెట్లా భరించేది. యెల్లుండితో నీకు నెల పూర్తౌతుంది. ఆమర్నాటినుంచీ నీదోవ నీవు చూచుకో.’

రామలక్ష్మి యిక నేమీమాట్లాడలేదు. కన్నీళ్లు సంతతధారగా కారిపోతుంటే అక్కడనుంచీ తొలిగిపోయింది.

ఏదైనా మనస్సులో వొక సంకల్పం కల్గినతర్వాత దానిని పైకిరానీయకుండా యిముడ్చుకోటం మానవ ప్రకృతికి విరుద్ధం. పరిణామదశతో దానికి పనిలేదు. బైటికి రావలసిందే కనుకనే రామారావు తన మనస్సులోగల్గిన తలంపు రామలక్ష్మికి చెప్పేసి హృదయ భారం తీర్చుకున్నాడు.

౬

వేణును ప్రాణపదంగా చూస్తూ ఆ కుఱ్ఱవానిలో మాతా శిశు సంబంధమైన అవ్యయానందం అనుభవిస్తున్న రామలక్ష్మికీ హఠాత్సంభవం కల్లోలకారణమైంది. ఆరాత్రి అన్నం తినలేదు. నిద్రకూడా పోలేదు. ‘నాకు తగిన కూలిపా టేదోచేసుకోక నే నీ బిడ్డను పెంచేపనేల పెట్టుకొంటిని. పెట్టుకొంటినిపో, యేదో కూలిపెంపకముగానే పెంచక యింత మమకారం యెందుకు పెట్టుకొంటిని. అయ్యో! యెంత తెలివితక్కువ, యెంత మమకారంగా పెంచితే పిల్లలు పెరుగుతారు. ఇప్పు డీ పిల్లవాడిని విడిచిపొయ్యే దెట్లా? పోకపోతే అంతకచ్చితంగా పొమ్మని ఆయనగారన్నాక ఒక్కక్షణమైనా యిక్కడుండేట్లా? అయ్యో! ఎంత తప్పుపని చేశాను? అమ్మగారు పోగానే నాదోవను నేను తప్పుకుంటే నాకీ బాధ లేకపొయ్యేదిగా. నే నెట్లాగైనా పొదుగాని చిన్న

య్యాదే నాకు దిగులుపట్టుకున్నదే. నన్నువిడిచి ఒక్క క్షణమైనావుండడే, నేనుపోతే నాకోసం దిగులు పడతాడేమో. బెంగపడిన పిల్లలు కోలుకోటం కష్టమే. అయ్యో! తెలిసిన మాగాజుగదా. అయ్యగారెంతమాటన్నారు? నా బిడ్డమీద నీకు ప్రేమేటి. కూలిదానికనేశారే చిటుక్కున! కూలిదానిలాగానే పెంచానా నేను చిన్నయ్యను? ఆమాత్రం తెలుసుకోపోయినారే నాయనగారు? ఎంత చదువుకున్నవారైతేనేం, యెంత మంచివారైతేనేం. తమ సొత్తంటే అంత అధికారంవుంటుంది కాబోలు! అవును వారి ననవలసిన పనేమున్నది? పరాయిబిడ్డలమీద ప్రేమ పెట్టుకున్నది నాదేతప్పు. ఎప్పటికీ పండ్లకు అధికారి తోట ఖామందవుతాడుగాని తోటమాలి అవుతాడా? తప్పొకరిదీ శిక్షఒకరిదీ యెట్లావుంటుంది. నాకు హక్కులేని పని నేను చేసినప్పుడు హక్కుదారుడు వేసే దండనకు గురికావాలసిందే. అయ్యో! మాజానకమ్మ తల్లివుంటే నాకీగతిపట్టునా? ఈ అమ్మకేమీ తెలియదు. ఒకటే రుసరుస, కసకస, అసలు చిన్నయ్యపాడే గిట్టదీమెకు. అయ్యో అమ్మాయిలిద్దరికీ పూలజెడ వేయిస్తానన్నాను. నిన్న రుక్మిణమ్మగారిని అడిగిగూడా వచ్చాను. రేపో యెల్లుండో పూలుకొనుక్కొని అమ్మాయిలను నాదగ్గిరకు తీసుకరావేస్తానన్నది. జానకమ్మగారిమీదవుండే స్నేహాన ఆమెపిల్లలను మహా ఆదరిస్తుంది. ఇక పిల్లలను వెంటబెట్టుకొని ఆమెవద్దకు తీసుకపొయ్యేవారెవ్వరు? పూలజడలు వేయించేవారెవరు? ఈఅయ్యగారు నామీద ఆదాచేసుకోదలంచి బిడ్డలకు అన్యాయంచేస్తున్నది కానకుండావున్నారు. ఏంజేయను. నాతిండి నేనుతిని పిల్లలనుకనిపెట్టుకొని వుందామంటే నేనేమన్నా డబ్బుగలదాన్నా రెక్కలాడితేగాని డొక్కలాడని బ్రతుకాయె నాది' రాత్రంతా రామలక్ష్మి కీకన్నీళ్ళకలాపంతోనే భల్లున తెల్లవారింది.

వేణు రాత్రి సినిమాచూడడానికి వెళ్లి అక్కడే నిద్రబోయినందున ఆటంతా అయినతర్వాత చాకలి యెత్తుకొని తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టాడు. ప్రొద్దుబోయి పడుకున్నందున వేణు ఒక్కమారైనా రాత్రి లేవలేదు. తెల్లగాతెల్లవారి లేచాడు. లేచీ లేవగానే రామలక్ష్మి యెత్తుకొనిపోలేదని యేడ్పు మొఖంబెట్టుకొని మంచంమీద కూర్చున్నాడు. యింతలో రామలక్ష్మి! తమ్ముడు లేచాడు రమ్మని ప్రేమలత దొడ్లోకిపోయి రామలక్ష్మిని పిలుచుకొని వచ్చింది. రామలక్ష్మిని చూడగానే వేణు దుఃఖమంతా పోయి నవ్వుకుంటూలేచి రెండుచేతులూ రామలక్ష్మి కంఠానికి మెలివేసి మంచపుపట్టెమీద నిలబడ్డాడు. అంతప్రేమతో తన్ను కౌగలించుకున్న వేణునుచూస్తే రామలక్ష్మికి తాను ఆబాలకునివిడిచి వెళ్లిపోవలసిన విషయం జ్ఞప్తికివచ్చి పుట్టెడు దుఃఖం వచ్చింది. ఆప్యాయంగా వేణును గుండెలకుహత్తుకొని చెమ్మగిలినకన్నులు పమిటచెఱుగుతో తుడుచుకొన్నది. తరువాత వేణును దొడ్లోకితీసుకబోయి పండ్లువగైరాలు తోమి మొఖంకడిగించి లోపలికి తీసుకొచ్చింది. ఇంతలో రామారావుగూడ నిద్రలేచి మొఖం కడుక్కొని సావిట్లోకివస్తూ చేతులమురుగులూ మెడలో హారమూ మొలనుగజ్జెలూ మిలమిల మెరుస్తూవుండగా తళుకుకన్నుల కడ్డుపడిననీలాలకలు చేతితో వెనుకకు సర్దుకుంటూ బాలకృష్ణుడులాగా వస్తూవున్నకొడుకును చూచి రామారావుకు ముద్దువచ్చి రాత్రి సినీమాచూచి వచ్చావుటోయ్ నాన్నా! అని యెత్తుకొని ముద్దుపెట్టుకున్నాడు. సినీమాసంగతి రవ్వంత తండ్రి హెచ్చరించంగానే సంతోషం యెక్కువై కూతుళ్లిద్దరూ గూడా తండ్రినిచుట్టుకొని కృష్ణలీలలన్నీ తండ్రితో చెప్పడం మొదలుపెట్టారు. తనకా సంగతులన్నీ తెలిసినా తెలియకపోయినా వేణు అక్కలకంటే యెక్కువ అభినయంచేస్తూ తన జిలిబిలిపలుకులతో తండ్రిని రంజింపజేశాడు. ఈవినోదంలోపడి వేణు చాలసేపు రామలక్ష్మిని తలపెట్టనేలేదు. ఇట్లా ఆడుకొనే వేణుకు

రామలక్ష్మితో యిక అగత్యంలేదనిపించింది రామారావుకు.

౭

పనిమనిషివుండి వారియింట్లో పనిచేసేశక్తి తనకు లేనందువల్లనూ, గట్టిగా పొమ్మన్నతర్వాతపోకుండా వుండటం మర్యాదకానందుననూ, రాత్రి పొమ్మని చెప్పినతర్వాత మరల తనయింట్లో అట్టే పెట్టుకొనే సూచనలేమీ రామరావువద్ద కనుపించనందుననూ, తాను పోకతప్పదనేవిషయం బాగా దృఢపడి ప్రొద్దు యేటవాలినకొద్దీ పోవలసినసమయము దగ్గిర పడుతున్నదే అనే ఆందోళన రామలక్ష్మికి యెక్కువైంది. మనసులో యేదో అదురు భయము పుట్టి కాళ్లూ చేతులు పట్టుతప్పిపోతూ కదలలేక మెదలలేక యెక్కడపడితే అక్కడ కుప్పపడినట్టు కూర్చుంటూ పిల్లలకష్టము పంతులుగారు ఆలోచించి ఒకవేళవుండమంటారేమోనని అప్పుడప్పుడు వెఱ్ఱిఆశకు లోబడుతూ పిల్లలవంక దిగులుగొన్నట్టుగాచూస్తూ ప్రొద్దు పుచ్చుతున్నది.

అయిదుగంటలు కాగానే రామారావు కాలేజీనుంచి యింటికివచ్చాడు. వచ్చీరావడంతోటే రామలక్ష్మినిచూచి 'రామలక్ష్మీ! ఏమిఆలోచించావ'న్నాడు. 'ఆలోచనేమున్నది అయ్యగారు పిల్లనువదలలేకనే అల్లాడుతున్నా'నన్నది రామలక్ష్మి. అయితే పనిమనిషిలాగా వుండలేవా?' అన్నాడు రామారావు.

'అరవైయేళ్లు దాపడుతున్నాయి పంతులుగారూ. యీలోతుభావులో నీళ్లుదోడి నేనేమి పనిచేయ'గలనన్నది రామలక్ష్మి విచారిస్తూ. 'అయితే నీకీయవలసిన జీతం యిదుగో యిచ్చివేస్తున్నాను. ఏదో నీదారి నీవు చూచుకో, నీవు మంచిదానవు నమ్మకస్తురాలవు నిజమేకాని నేను భరించలేక యిట్లా చెప్పవలసివచ్చింది యేమీ అనుకోకు' అన్నాడు రామారావు. రామలక్ష్మి యేమీ బదులుమాటాడలేదు. కళ్లనిండా నీరుతెచ్చుకొని పూరకున్నది. రామరావు పిల్లలు ముగ్గుర్నీ తీసుకొని లోపలికిపోయినాడు. రామలక్ష్మి యికనేమీ మాట్లాడకుండా తన మూటాముల్లే తీసుకొని బయటికివచ్చి 'అయ్యగారూ, సెలవు'అన్నది గద్గదకంఠంతో. సరేవెళ్లు, అన్నాడు రామారావు లోపలనుంచీ బయటకు రాకుండానే. కడసారి బిడ్డలను కన్నారా చూద్దామని రామలక్ష్మి నలువైపుల పరికించిచూచింది. కాని పిల్లలను మరిపించడానికే రామారావు లోపలికివెళ్లి పిల్లలను దగ్గిరపెట్టుకొని కూర్చున్నందున పిల్లలెవరూ కనిపించలేదు. చిన్నయ్యా చిన్నయ్యా, అని యేదో అస్పష్టంగా గొణుక్కుంటూ కళ్ళనీళ్లుతుడ్చుకుంటూ తడబడేకాళ్ళతో రామలక్ష్మి వీధివెంట వెళ్లిపోయింది.

రామలక్ష్మి వెళ్లిపోయినతరువాత రామారావు చాకలినిపిలిచి వాడిచేతిలో ఒక అణా పడవేసి 'అబ్బాయిలనీ, అమ్మాయిలనూ బజారుకు తీసుకపోయి పిప్పరమెంట్లు కొనిపెట్టి ఒకమాటు షికారు తిప్పుక రారా'అని పిల్లనిచ్చి పంపించాడు. పిల్లలు బజారుకు వెళ్లినతర్వాత రామారావు తనకూ యేదో మనసులో ఆందోళనగానేయున్నందున ఒక్కమాటు క్లబ్బుకైనా పోయివద్దామని ఉత్తరీయం భుజానవేసుకొని క్లబ్బుకు వెళ్లాడు.

౮

చాకలితోగూడా సాయంత్రం చల్లగాలిలో కాసేపు అటూయిటూ తిర్గి మునిసిపల్‌పార్కులో పూలగుత్తులు కొనుకొని యింటికివస్తూనే వేణు 'అమ్మచ్చీ! అమ్మచ్చీ!' అంటూ కేకలుపెడ్తూ అటూయిటూ వెతుక్కోడం మొదలుపెట్టాడు. అమచ్చి వూరికిపోయిందన్నాడు చాకలి. ఆఁ అని కోపగించి వేణు పూలగుత్తితో చాకలినికొట్టి 'అమచ్చీ!'అని పెద్దగా పిలిచి యేడ్పుముఖం బెట్టాడు. 'నిజమేతమ్ముడూ, రామలక్ష్మి వూరికిపోయిందిట. ఇందాకా నాన్నగారు గూడా చెప్పా'రన్నారు అక్కలిద్దఱూ. వేణు యిక యేమీ సమాధానం చెప్పలేక 'అమచ్చీ!' అని యేడు

స్తూ అక్కడే అరుగుచివరనే కూలపడ్డాడు. అలవాటైన మనిషికోసం వేణు యేడుస్తుంటే ఆదరించి తీసుకపోయి ఆమాటా ఈమాటా చెప్పి మఱిపించేవాళ్లెవరు? వేణు యేడుస్తుంటే వోదార్చడానికి చేతగాని చిన్నపిల్లలైన అక్కలిద్దఱూ లోలోపల దుఃఖిస్తూ బిక్కముఖం వేసుకొని చెరివొకవైపునా కూర్చున్నారు. సుభద్ర లోపల సావిట్లోనుంచి ఒక్క మాటు వాళ్ల వంకచూచి తెలియకనో, కోపానో యేమైతేనేమి మాట్లాడకుండానే లోపలికిపోయింది. కుఱ్ఱవాడైనా చాకలికి ఆదృశ్యం కడుపును కోసేసింది. తల్లిలేని పిల్లలకు లోపలికిపొయ్యే చనువు యెట్లావుండదో కళ్లారాచూచి కళ్ళనిండా నీళ్లు పెట్టుకొని వేణును బ్రతిమలాడి ఒళ్లోకి తీసుకొని ఆడపిల్లలిద్దర్నీ వెన్నెనిమరి దగ్గరకు తీసుకొని నాన్నగారు వస్తారు యేడవబోకండమ్మా అని వోదారుస్తూ దగ్గిర కూర్చోబెట్టుకున్నాడు. తల్లిలేని బిడ్డలను లోకమంతా మాతృస్థానం వహించి ఆదరిస్తుంది. కాని ఆకొఱత తీఱదు.

౯

రామారావు క్లబ్బుకు వెళ్లాడేగాని మనసులో మనసులేదు. తల్లిలేకపోగా తల్లికి మాఱుగావున్న మనిషినిగూడా తొలిగించి వేణుకు తాను గావించిన అపకారం చేయిపెట్టి కలచినట్లు అతని మనసులో విపరీతమైన బాధ కలిగించింది. టెన్నిసు ఆడటానికిగాని, పేపరు చూడటానికిగాని స్నేహితులతో మాట్లాడటానికిగాని అతనికి బుద్ధి పుట్టలేదు. కుఱ్ఱవాడు యేమి యేడుస్తున్నాడో పుట్టినది మొదలు ఒక్కక్షణమైనా రామలక్ష్మిని యెడబాసి యెరగడు అని ఆందోళనపడుతూ బాగా ప్రొద్దుకూకకుండానే యింటికి వచ్చేశాడు. యింటికి రాంగానే వాకిట్లో అరుగుచివర బిక్కముఖాలు వేసుకొని చాకలిని చుట్టుకొని కూర్చున్న బిడ్డలు ముగ్గుర్నీ చూచేటప్పటికి రామారావు కడుపు చెఱువైపోయింది. దుఃఖభారంతో కుములుతూ యేమమ్మా యిట్లా కూర్చున్నారు అని బిడ్డలదగ్గిరికి పోయినాడు. ఆదరణకోసం తపించిపోతున్న ఆబిడ్డలు ముగ్గురు ఆ చల్లనిమాటతో ప్రాణాలు లేచి వచ్చినట్లై వికాసముఖంతో తండ్రిని చుట్టుకున్నారు. 'నాన్నా! నాన్నా! ఆమచ్చి పోయిందంతూవున్నారు చూడూ' అని వేణు తండ్రితో నేరం చెప్పాడు. 'పోతేపోయిందిలే నేనున్నానుగా' అని రామారావు కుమారుని అక్కున చేర్చుకొని ముద్దిడుకుంటూ ఆడపిల్లలిద్దర్నీ వెంటబెట్టుకొని లోపలికి వచ్చాడు.

తరువాత పిల్లలతో యేవో అమాటలూ యీమాటలూ చెప్పి కాసేపు ఆడించి తనతోబాటు భోజనం పెట్టించి తీసుకొచ్చి కొంచెం అటూఇటూ త్రిప్పి నిద్రవచ్చాక మంచాలమీద పడుకోబెట్టాడు. రామారావు బిడ్డలతో యిట్లా పాట్లుపడుతుంటే సుభద్ర తనకేమీ పూచీలేనట్టుగా వూరుకున్నది. రామరావు గూడా ఆమె కేమీ ఫరమాయించలేదు. తన పాట్లు తానే పడుతున్నాడు. రామలక్ష్మి వుండగా రామరావు ఒక్కనాడైనా వేణును దగ్గిర పడుకోబెట్టుకొని యెరగడు. ఎప్పుడైనా జ్వరం గిరం వచ్చి పిల్లవాడు నిద్రపోక అవస్థపడుతున్నా రామలక్ష్మి అవస్థపడేదిగాని అత నేమీ చేసేవాడుకాదు. పాలుపోయడం, మందుయివ్వడం అన్నీ రామలక్ష్మికి అతను మొదట్లో చూపించాడంతే. అప్పటినుంచీ రామలక్ష్మి అన్నీ చూచుకొనేది. కాని నేడు వేణు లేచి యేడుస్తాడేమోనన్న భయంచేత తన క్యాంపుకాట్ వేణు మంచప్రక్కను వేయించుకొని రామారావు పిల్లలవద్దనే పడుకున్నాడు. అనుకున్నట్టుగానే వేణు నిద్రలో ఆమచ్చీ! ఆమచ్చీ! అంటూ కలవరిస్తూ చాలామాట్లు లేచి యేడ్చాడు. లేచినప్పుడల్లా రామారావు చిచ్చుకొడ్తూ వస్తుందిలే వస్తుందిలే అంటూ నిద్రపుచ్చాడు. ఎట్లాగో రాత్రి గడిచిపోయింది.

రాత్రి సరిగా నిద్రలేకపోవడంచేత తలవేడెక్కి యేదో బాధగావుండి వుదయంలేస్తూనే రామారావు

గాలిలో కాసేపు తిరిగివద్దామని వూరివెలుపలికి షికారుగా వెళ్లాడు. తండ్రి వెళ్లిన కొంతసేపటికి వేణు లేచి ఆమచ్చీ! అని యేడ్వసాగించాడు. అక్కలిద్దరూ తమ్ముడి యేడ్పువిని దగ్గిరికిపోయి రామలక్ష్మి వూరికిపోయిందిగా యెట్లావస్తుంది? మేము తీసుకపోతాము రమ్మనిపిలిస్తే వేణు రాలేదు. కాళ్లు నిగడదన్ని అట్లాగే యేడుస్తూపడుకున్నాడు. బాగా 'గారాబం సాగించిపోయింది ముండ. యెందుకు వస్తాడు? వూరుకోండి కాసేపు యేడ్చి వాడేలేస్తా'డని సుభద్ర అక్కలిద్దర్నీ మందలించి వేణువంక చురచుర చూస్తూపోయింది. మారుతల్లి మాటవిని అక్కలిద్దరూ భయపడి ఆవిడవంక బెదరిబెదరి చూస్తూ నిలబడిపోయినారు. వేణుమాత్రం ఆమచ్చీ! ఆమచ్చీ! అంటూ యేడుస్తూనేవున్నాడు. ఇంతలో రామారావు వచ్చి వేణుని యెత్తుకొని యెందుకురా నాన్నా యేడుస్తున్నావు అన్నాడు బుజ్జగిస్తూ.

'ఆమచ్చికోసం.'

'రామలక్ష్మి వూరి కెళ్లిందిగా.'

'వూయికిపోతే యెప్పుడొత్తుంది?'

'ఎప్పుడో వస్తుంది. రాకపోతేమాత్రమేమీ నేనున్నాను. అక్కలున్నారు. చాకలివున్నాడు మాతో చక్కగా ఆడుకో' అని ముచ్చటలుచెపుతూ రామారావు వేణుని దొడ్లోకి తీసుకపోయి మొఖంకడిగి లోపలికి తీసుకొచ్చి పాలు త్రాగించాడు. యింతలో అక్కలిద్దరూగూడా మొఖాలు కడుక్కొచ్చి కాఫీ త్రాగేరు. ఇన్నాళ్లూ రామలక్ష్మి తమ్ముడి పని చేస్తుంటే అక్కలిద్దరూ తమదోవను తమరు ఆడుతూ బడికిపోతూ స్వేచ్ఛగావుండేవారు. ఇప్పుడు రామలక్ష్మి లేకపోవడంచేత తమ తమ్ముని ఆడించే బాధ్యత తమదేనని ఆ బాలికలకు తోచింది. ఆరోజున వాళ్లు ఒక్కక్షణమైనా వేణును యెడబాయకుండా యేవో బొమ్మలు గురుగులూబెట్టి తమ్ముణ్ణి ఆడిస్తూ ప్రొద్దుపుచ్చారు. వాళ్లింతగా ఆదరిస్తున్నా వేణుకు రామలక్ష్మి జ్ఞాపకంవచ్చి అప్పుడప్పుడు దానికోసం వెతుక్కుంటూనే ఉన్నాడు. ఆరోజు అన్నంగూడా సరిగా తినలేదు. రెండు మూడు విరేచనలుగూడా అయినాయి. సాయంత్రం అయ్యేటప్పటికి సగం తీసిపోయినట్లైనాడు.

౧౦

రామలక్ష్మి వెళ్లి మూడురోజులైంది. కాని వేణు రామలక్ష్మిని కొంచెమైనా మఱచిపోలేదు. ప్రేమభరితమైన రామలక్ష్మి లాలనకోసమూ, ఆమెవొడిలో సుఖనిద్రకోసమూ వేణు లేతహృదయము తపిస్తూనే వున్నది. 'అక్కా! ఆమచ్చి యెప్పుడొత్తుంది?' అని అడిగాడు వేణు హర్షలతను.

'ఏమో వస్తుందో; రాదో' అన్నది హర్షలత.

'రాదు. అచలేరాదూ' అన్నాడు యేడ్పుమొఖంబెట్టి వేణు. ఇంతలో ప్రేమలతవచ్చి వస్తుంది తమ్ముడూ, నాన్నగారు వుత్తరంవ్రాస్తే వస్తుంది అన్నది తమ్ముణ్ణి వోదారుస్తూ.

'నేను ఆత్తేరాదూ?'

'వస్తుంది. నీవు వ్రాసినా వస్తుంది.'

'అయితే నేనే దాత్తా వుండు' అని చిత్తుకాగితం మీద పూచికపుల్లతో రామలక్ష్మికి ఉత్తరం వ్రాయడం మొదలుపెట్టాడు వేణు. అక్కలిద్దరూ బలే వుత్తరమని నవ్వుకున్నారు. 'తమ్ముడూ రామలక్ష్మి వచ్చేటప్పుడు నా కేమి తెస్తుంది చెప్పుకో' అన్నది 'చిన్నక్క! బిచకత్తు' అన్నాడు. 'నాకో' అన్నది. పెద్దక్క. 'పిప్పెరమెంతు' అన్నాడు. చాకలికో అన్నారు మళ్లీ అక్కలు. 'ఏమీలేదు' అన్నాడు వేణు. యిట్లా రామలక్ష్మినిగూర్చిన కథలతోనూ అది రావడానికిచేసే ప్రయత్నాలతోను పొద్దుగడుస్తున్నది. ఇట్లాగే యింకా నాల్గురోజులు గడిస్తే వాళ్లే మఱచిపోతారు అనుకుంటున్నాడు రామారావు. కాని నాల్గోరోజు వుదయం నిద్రలేచేటప్ప

టికి వేణు యెట్లాగోవున్నాడు. ప్రొద్దున పాలుపట్టితే పాలూ త్రాగలేదు. మధ్యాహ్నం అన్నంపెడ్తే అన్నమూ తినలేదు. మందకొడిగావున్నాడు. సాయంత్రం రామారావు కాలేజీనుంచివచ్చి పిల్లవాడిని చూచేటప్పటికి పక్కలు వెచ్చబడివున్నాయి. జ్వరం తగిలిందే అనుకొని పక్కవేయించి పడుకోబెట్టాడు. రాత్రి పొద్దుపోయిన కొద్దీ జ్వరం మరీయెక్కువైంది. ఆజ్వరంలో యెన్నోమాట్లు కలవరించాడు. ఆ కలవరింతల్లో ఆమచ్చీ! ఆమచ్చీ! అన్నమాటతప్ప మరో పలుకులేదు. అస్థితిచూచి రామారావు మతిపోయినట్లై తెల్లవార్లూ పక్కమీదనే కూర్చున్నాడు.

౧౧

కేవలం తన పాలనపోషణలోవున్న పిల్లలను విడిచి అకస్మాత్తుగా వచ్చివేయడం రామలక్ష్మికి యెంతో దుఃఖమనిపించింది. ఒక్కొక్కనాడు రాత్రంతా వేణును వొడిలోనే బెట్టుకొని కూర్చుండే కునికిపాట్లు పడటానికి అలవాటుపడిన రామలక్ష్మికి ఆదినం యెవరి యింటి అరుగుమీదనో వొంటరిగా పడుకొని నిద్రబోతే నిద్రపట్టలేదు. "ఎన్నాళ్లు పెంచినా పరాయిబిడ్డలు పరాయిబిడ్డలే! కనంది బిడ్డలౌతారా? కట్టంది చీరలౌతాయా? నా కెందుకీ మమకారం! ఆ అయ్యగారు అంత మొగమోటంలేకుండా పొమ్మన్నాక వారి బిడ్డలమీద నా కెందుకీ ధ్యాస. ఛీ పూరుకొమ్మని మనస్సు యెంత సమాధానం పెట్టుకున్నా మనస్సు కుదటపడలేదు. అయ్యో! నాయన యీరాత్రి సుఖంగా నిద్రపోయినాడో లేదో. నోరులేని బిడ్డలువారి కేమితప్పు మనం ఆదరించినంతకద్దు. ఆయనగారికీ సంసారం పెద్దదైపోయింది. కర్చు భరించలేకపోయినారు. లేకపోతే పొమ్మనే అయనేనా ఆ మారాజు. ఇంతకూ తల్లిచస్తే తండ్రి పినతండ్రితో సమానం అంటారు. ఈ అమ్మకీ నెలతప్పింది. ఇక యీపిల్లల కర్మం యేమికానున్నదో! ఏమో పెద్దమ్మాయి పెళ్లైందాకా కనిపెట్టుకొనివుందామనుకున్నాను. అయ్యగారికి దయ కలిగిందికాదు. అన్ని కర్చులు బాగానేవున్నాయి. నాకర్చే ఆయన మోపలేకపోయినారు. నా కేమీ యెక్కడ అంట్లు తెప్పాలాలు తోమినా పొట్టగడుస్తుంది. కాని బిడ్డలనాడెం చూచుకోలేను గదా అయ్యగారు. చిన్నయ్యా! నీవు వ్రేలు కుడుచుకుంటూ వొళ్లోపడుకున్నట్టేవున్నది. నిన్నెట్లా మఱచిపోయేది బాబూ' అని యేమేమో గొణుక్కుంటూ కళ్లనీళ్లు కార్చుకుంటూ వేగించింది. తెల్లవారి మళ్లీ ఒకమాటువెళ్లి అబ్బాయిగారిని చూచి వద్దామా అనుకున్నది. కాని యెందుకొచ్చావని అయ్యగారు కోపపడతారేమో అనుకున్నది. పిల్లలను చూడకుండా యీవూళ్లోవుండలేనూ అనుకున్నది. ఈ గోలంతా యెందుకు. మా చెల్లెలిగారి వూరికెళ్లి నాలుగెళ్లింది. దాన్ని బిడ్డలనూ చూచివస్తాను. తరువాత సంగతి చూద్దామని మనస్సులో నిశ్చయంచేసుకొని తెల్లవాఝుజామునేలేచి వాళ్ల వూరు వెళ్లిపోయింది.

౧౨

మరునాడు తగ్గుతుందనుకున్నట్టుగా వేణు జ్వరం తగ్గలేదు. యెక్కువగానే వున్నది. రామారావు కాలేజీకి సెలవుపెట్టి వేణుదగ్గిర్నే వున్నాడు. డాక్టరును పిలిపించి మందులు యిప్పిస్తున్నాడు. తమ్ముడి అవస్థచూచి పెద్దపిల్లలిద్దఱూ దిగులుపడి అన్నంతినడం మానుకొని చిక్కి సగమైనారు. రామారావు ఆబిడ్డలను చూచి తన ప్రణయధనమైన జానకి దిగవిడిచిపోయిన ఈ కసిగందులను యెట్లా రక్షిస్తానా అని లోలోన పరితపిస్తూవున్నాడు.

రాత్రి తొమ్మిదిగంటలవేళ వేణు క్యారుమని ఒక కేకపెట్టి ఒళ్లంతా వణికించడం మొదలుపెట్టాడు. రామారావు ఆస్థితిచూచి అదలిపోయి చాకలిని లేవగొట్టి డాక్టరుగారిని పిలుచుకొని రమ్మని తరిమాడు. చాకలి పరుగు పరుగునబోయి డాక్టర్ను పిలుచు



శ్రీమతి డి. హేమలతగారు, బి.ఎ.

శ్రీ దామెర్ల గోపాలరావు, శాంతమ్మగార్ల పుత్రిక; కాశీ విశ్వవిద్యాలయమున గృహశాస్త్రములందు పట్టముబొందిరి. సంగీత పుపోటీ యందు ప్రథమ బహుమతినందిరి. అఖిల భారత దేశములందీ యోగ్యతలబడయుట కీమెయె ప్రథమురాలు.



మిస్. చంద్రావతి రాయల్ గారు, బి.ఎ.,ఎల్.టి.

మదనపల్లి ఎ.ఎ.ఎం. బాలికాపాఠశాల ప్రధానోపాధ్యాయిని. బెంచి కోర్టు ప్రసిడెంటుగా గవర్నమెంటు వారిచే నియమింపబడిరి. వీరికి స్త్రీ యుద్యమములందెక్కు డభిలాష.



శ్రీమతి ఎస్. సుబద్రమ్మగారు,

అఖిల భారత మహిళాసభకు డెలిగేటుగా నెన్నుకొనబడిరి.

కొచ్చాడు. డాక్టరుగారు వేణును పరీక్షించి చూచి, నాడి చక్కగావున్నది. 'హార్టు బాగావున్నది. పిల్లవాడికి అజీర్తిగాని, వాతంగాని యేదీ అధికంగా వున్నట్టు కన్పడదు. జ్వరమే జాస్తిగావున్నది. అందువల్లనే వొళ్లుగూడా వణికించివుంటాడు. ఈజ్వరమే యెంత ప్రయత్నించినా తగ్గకుండవున్నదండీ యెందువల్లనోనూ అన్నాడు. డాక్టరు 'అవునదేభయంగా వున్నదండీ. యివ్వాళ ప్రొద్దుటినుంచీ ఒక్కమారైనా కన్ను తెఱవలేదు. ఈ జ్వరతీవ్రతవల్ల నంటారా?'

'అవు నదే కారణంగాని వొక్కొక్కప్పుడు పిల్లలు భయపడినా దిగులుపడినా యిటువంటి పేలిపొయ్యే జ్వరం వస్తూవుంటుంది. దీనికి మన పెద్దవాళ్లేదో తీర్థమంటూ విభూతంటూ దేవుళ్లాడుతూవుంటారు గూడాను. అటువంటి భయంవగైరా సందర్భాలేమీ కలుగలేదుగదా.'

'ఎక్కడా భయపడ్డట్టులేదు గాని దిగులేమైనా పడ్డాడేమో.'

'ఎవరికోసమంటారు?'

'ఈ పిల్లవాడికి తల్లిలేదనే సంగతి తమకు తెలుసుగా. (ఈ మాటనేటప్పటికి రామారావు కనుల వెంట జొటజొట కన్నీళ్లొచ్చాయి.) ఈ పిల్లవాడు పుట్టిన పదమూడోరోజుననే ఈ దురవస్థ సంభవించింది. అప్పటినుంచీ ఒకమనిషి యీపిల్లవాడిని పెంచుతున్నది. అమనిషి చాల ప్రేమగా ఆదరణగా బిడ్డను చూచేది. అది వూరికి వెళ్లింది. వారంరోజులైంది.'

'ఓ! అదీ సమాచారం చెప్పరేం. పిల్లవాడు ఆ మనిషికొఱకు తప్పకుండా బెంగపెట్టుకొని వుంటాడు. అబ్బాయి వయస్సెంత?'

'రెండు వత్సరాలువెళ్లి మూడు మాసములైంది.'

'పాపం. చాలా పసివాడండీ! ఈ యీడులో యేబిడ్డైనా తల్లిని విడచివుంటాడా అండీ. పాపం ఆ పిల్లవానిపాలికి ఆమనిషే తల్లి. ఆమనిషి వెళ్లిన తర్వాత ఆవిడనుగూర్చి అడిగాడా?'

'అబ్బో యెన్నిమార్లని లెక్కలేదు. ఎప్పుడదే కలవరింత.'

'సరే. విషయం తెలిసిపోయిందండీ. ఆమనిషిని పిలిపిస్తేనేగాని అబ్బాయికి స్వస్థత కలగదు. పైకి చెప్పలేరుగాని పిల్లల మనసు బహుగొప్పవి. ఒక్కొక్కప్పుడు అపాయకరంగూడాను. ఇప్పుడు మిగిలిపోయిందేమీలేదు. వెంటనే మనిషిని పంపి ఆవిడను పిలిపించండి ఈలోపుగా మందుగూడా వాడుతుందాము' అని డాక్టరు వెళ్లిపోయినాడు.

రామలక్ష్మి యెక్కడికి వెళ్లిందో తెలియదు. ఎక్కడికని మనిషిని పంపుతాడు రామారావు. చేతులారా బిడ్డ కెంత అపాయము తెచ్చిపెట్టితిని అని దుఃఖించాడు. మర్లీ తెప్పిరిల్లి తెల్లవారుజాముననే చాకలిని పిలిచి 'రామలక్ష్మి చెల్లెలు చెల్లెలుకొడుకులు వున్న గ్రామం నీకు తెలుసునుగదా. చేబ్రోలుకు మైలుదూరంలో వుంటుంది. ఈవుదయం బైలుదేరే బస్సులో చేబ్రోలువెళ్లి అక్కడినుంచీ వాళ్ల గ్రామం వెళ్లి రామలక్ష్మిని వెంటనే పిలుచుకురా' అని పంపించాడు.

౧౩

రామలక్ష్మి తన చెల్లెలుగారి యింటికి వెళ్లింది. చాలారోజులకు వచ్చిన రామలక్ష్మిని వాళ్లంతా చాలా ఆదరించారు. 'పెద్దామా! నీ విక యెక్కడికీ పోవాక మాతోబాటు తిని మా బిడ్డలను కనిపెట్టుకొని వుండ'మన్నారు చెల్లెలుకొడుకులు. తనవాళ్లు చూపిన ఆదరణకు రామలక్ష్మి చాలాసంతోషించింది కాని మనస్సంతా చిన్నయ్యమీదనేవున్నది. 'నెన్నున నా చెయ్యిలేనిది నిద్రపొయ్యేవాడుకాడు చిన్నయ్య. ఎట్లా పండుకుంటున్నాడో యేమో. యిస్కూలుకు వెళ్లినాక అయనగారి కేమి తెలుస్తుంది పిల్లల మంచి

చెడ్డలు. ఆఅమ్మ ఒక్కమాటైనా పొరుగుపిల్లలను పిలిచినంతమాత్రపు ఆదరణగానైనా బిడ్డలను పలకరించదు. వంటామెగూడా కొత్తామె వచ్చింది. జానకమ్మగారు చచ్చిపోతూ 'రామలక్ష్మీ, పిల్లలు! పిల్లలు! అబ్బాయి!' అనిప్రాణంవిడిచింది. ఆ యింటా ఆయింటా బిచ్చమెత్తుకొని తినైనా బిడ్డలను కనిపెట్టుకొనివుండక యెందుకొస్తిని? వాళ్లకేదైనా వాపాటం వస్తే ఆతల్లిలేనిబిడ్డల వుసురు నాకు తగలదూ.' రామలక్ష్మికి యెప్పుడూ యిదే ఆందోళన. యిదే కళవరింత. మనస్థిమితం తప్పిపోయింది. జీతానికున్నదానవు. ఆపిల్లలమీద నీ కింత ఆపేక్ష యెందుకని చెల్లెలు వాళ్లు చీవాట్లుపెట్టారు. అయినా రామలక్ష్మికి మనస్సు కుదటపడలేదు. ఏదో పిచ్చిపిచ్చిగా కొట్టుకుంటూవుంటే పక్కవూళ్లో అమ్మవారి కొలుపులు జరుగుతున్నాయి. చూచివత్తామని యెవరినో సోబతు చేసి పంపించింది చెల్లెలు. రామలక్ష్మిని ఆ సంబరం చూడబోతే యెక్కడజూచినా పిల్లలు ఆడుకొనే వస్తువులే కనిపించాయి. ఈ వస్తువులుచూస్తే కొన్నదాకా నిలవనిచ్చేవాళ్లు గాదు పిల్లలు. ముఖ్యంగా చిన్నయ్య! యివన్నీ చూస్తే యెంత గోలచేశావాడో కొనమని! అనుకున్నది రామలక్ష్మికి. యింటినుంచి మూటగట్టుగపోయిన అన్నం వూరిబావివద్ద పెట్టుకొని తిని రాత్రిపొద్దు పోయిందాకా సంబరంచూచి యెవరి వాకిట్లోనో పడుకున్నది రామలక్ష్మి. కాస్త కూర్కుపట్టిందోలేదో వేణు చిక్కిపోయి బిక్కముఖం వేసుకొని దీనంగాచూస్తూ 'అమచ్చీ మాయింటికి ఆవూ. నేను పొయ్యేదీ. ఒక్కన్నే పొయ్యేదీ!' అంటూ వున్నట్టు కలవచ్చింది. 'ఆఁఆఁ యెక్కడికి పోతావు చిన్నయ్యా! అదేమి అట్లా చిక్కిపోయినావేమి నాయనయ్యా!' అని కలవరిస్తూ రామలక్ష్మి లేచింది. ఏముంది అంతా శూన్యం. మిగతా రాత్రి నిద్రలేదు. ఇక అక్కడవుండటానికి రామలక్ష్మికి బుద్ధి పుట్టలేదు. కన్నప్రేమకంటె పెంచినప్రేమ జాస్తి. 'యేమైనా సరే. పిల్లలను చూడనిది వుండలేను. ఏదో ఎట్లాగో నాబతుకు నేను బతుకుతూ పిల్లలను కనిపెట్టుకొనివుంటాను. అందువల్ల అయ్యగారికి కష్టయిబ్బందేమున్నది? యెందుకు వద్దంటారు. అనుకొని ఆడపిల్లలిద్దరికీ చెరి వొక లక్కపిడతా బొమ్మా, వేణుకొక తూతూ, బొంగరమూ గాలిగిలకా కొనుక్కొని, మూడు మామిడిపండ్లు కొనుక్కొని చిన్నయ్యను చూడటానికి ప్రయాణముకట్టింది.

౧౪

రామారావు యింట్లో అంతా భీభత్సం. వేణు జీవిస్తాడన్న ఆశ పూర్తిగా తొలిగిపోయింది. దైవికమైన జబ్బువల్ల గాక తన అకృత్యంవల్లనే యిటువంటి మహాపద తటస్థించడం రామారావుకు మహాకడుపుకోతగావున్నది. అయినా యేమి జేస్తాడు? రామలక్ష్మి యిప్పుడు కంటికి కనపడితే 'తల్లీ! నీవు నా కుటుంబంలో ఒకదానవు నా మహాపరాధం క్షమించు. నిన్నిక యెప్పుడూ పొమ్మనను. నాబిడ్డ నాకు దక్కితే చాలు'నని వేడుకోడానికి సిద్ధంగావున్నాడు కాని రామలక్ష్మికొరకు పంపిన చాకలి రామలక్ష్మి వూళ్లో లేదనీ యెక్కడో సంబరం చూడటానికి పోయిందటనీ తిరిగివచ్చాడు. యిక ఆతనికి గామలక్ష్మికి వచ్చే ఆశ యేమున్నది? మహాదుఃఖపడుతున్నాడు. కేవల స్వసుఖంకొరకు పెండ్లి చేసుకున్నాడు. పెండ్లి మూలకంగా కర్చు యెక్కువైతే పిల్లవాని దాయీని మాన్పించాడు. అది పిల్లవాని మృత్యుహేతువైంది. ఇంతకంటె హృదయవేదన యేమికావాలె. ముగ్గురు బిడ్డలతల్లి యెంత చిన్నదైనాకానీ మళ్లీ పునర్వివాహ యత్నం చేస్తుందీ. మఱి మొగవాడు గనుకనే ఈ సాహసకృత్యము! ఈ దుర్భరావమానము. రామారావు యేమిజేస్తాడు? వేణును యెట్లా బ్రతికించుకుంటాడు? మందుల కతీతమైనవ్యాధి! యింజెక్షనులకు లొంగని వ్యాధి! వైద్యులు నివారించలేని వ్యాధి!

కేవలం ఒక పేదముసలిదాని ముఖావలోకనం లేనందువల్ల యేర్పడిన వ్యాధి! 'ప్రేమ గుడ్డిది. అది గొప్పకొద్దులు చూడలేదు. అందచందాలు గమనించలేదు. వయసు తారతమ్యము తెలుసుకోలేదు. వర్ణ వ్యత్యాసం గ్రహించలేదు. ఆదరణకు ప్రతిఫలము ఆత్మార్పణమే! ఆ కిశోరచక్రవర్తి అందుకే సిద్ధమైయున్నాడు! పెద్దతనంచేతను బెంగచేతనూగూడ నీరసపడియున్న రామలక్ష్మికి దాదాపు రెండామడ నడిచి వాకిట్లో అడుగుపెట్టేటప్పటికల్లా 'ఎందుకండీ రామారావుగారు! మీ కింకా పిచ్చిఆశ. పిల్లవాడిని వాకిట్లోకి తీసుకరానియ్యండి' అంటున్నారెవరో. ఎవరిని నా చిన్నయ్యానే అని గుండెబాదుకుంటూ రామలక్ష్మి గావుకేకపెట్టి పిల్లవాడిదగ్గరపోయిపడ్డది. సుపరిచితమైన ఆ కంఠస్వరం చెవులపడటమే తడవుగా మూడుదినములుండి కనులు విప్పని మగతలోపడివున్న వేణు అల్లన కన్నులు తెఱిచాడు. ఆ చూపులలో ప్రాణోత్క్రమణావస్థ గాదు. తన ప్రాణపదవస్తువుకొఱకు ఆ బాలతపని చేయుచున్న కఠోరతపస్సు ద్యోతకమవుతున్నది.

---

# రాసక్రీడాష్టకము

మానినికిమానినికి మధ్య మాధవుండు
మాధవుల కిర్వురకు మధ్యమానినియును
గలిగితనచుట్టు నిలిచిన వలయమందు
మురళి మ్రోయించు దేవకీపుత్రుకొలుతు.

మేఘములటంచు జడిసి నెమిళ్లు కూయ
వాసకారనియంచలు భ్రమసితమ్మి
యిండ్లు వెలువడ మురలి మోయించివాని
భ్రమనుమాన్పెడు కంసమర్దను నుతింతు.

వీణకొకచోట ననుకూలవృత్తినాడు,
బాడునొకచోట, కింకిణీస్వనము చేయు
వీణకును దోడుగా, నొకవీణెతోడ
మురళివాయించు గోపాలమూర్తిదలతు.

కామితార్థప్రదాతను గాదలంచి
యప్సరస్సుందరులఁబోలు నతివలెల్ల
మోహపుంజూడ్కులను తనమోముగనఁగ
మురళి మ్రోయించు మోహనమూర్తి
గొలుతు.

మాళికుసుమంబులందున వ్రాలియున్న
భృంగములు సేయు ధ్వని కెద భీతినొంది
లేచి గోపకాంతలు గౌగిలింప వంశి
లీల మ్రోయించు ప్రౌఢగోపాలు దలతు.

మేల్మిబంగరు కెనవచ్చు మేనులలర
గోపబిబ్బోకవతు లాలు క్రేపులు దన
చుట్టునిలచియానందింప చోద్యమొదవ
గానమొనరించు వనమాలి గరముదలతు.

గోపికాగీతికల కనుకూలరీతి
భ్రూయుగము ద్రిప్పి కాంతలన్ బ్రోత్సహించి
లీలపిల్లనగ్రోవి దాలిచి కరాన
పాటలాలికించు వల్లవీపతి భజింతు.

భామముంగిట నందనవనములోని
పారిజాతమ్మునాటి గోపకులగూడి
అలరయామునసైకత స్థలుల వంశి
బాడియలరించు శ్రీకష్ణు బ్రస్తుతింతు.

వేదుల మీనాక్షీ దేవి.

# నూతనరాజ్యాంగవిధానము*

శ్రీమతి సుశీలగారు

మన ఆశయములకు అందినను అందకపోయినను నూతనరాజ్యాంగవిధానమును తృణీకరించుటకు వలను గాని యవస్థ యేర్పడినది. ఈవిధానమును గ్రహింపని భారతీయుడు లేడు; కాని రాజ్యాంగమున పాల్గొనక తప్పినదిగాదు. దీనిని అస్పృశ్యభావముతో జూచిన కాంగ్రెసు నేడు పదవులస్వీకరించి పాలనమును పూనుకొన్నది. మనజీవితములో నొకమార్పుకలిగి తీరినది. దీని కవకాశము కల్గించినను తన రాజ్యాంగవిధానమును గుఱించి పూర్తిగా లోతుపాతులు తెలిసికొనవలసిన విధి ప్రతిభారతీయునకును గలదు. ఆంధ్రలోకమునకు ఈవిధానము నందుబాటులో చేయుటకు రెండు పొత్తములు సమయమునకు వెలువడినవి.

ఇందు మొదటిపుస్తకము నూతనరాజ్యాంగవిధానమును సమగ్రముగ బ్రదర్శించు నాశయముతో రచింపబడినట్టులు తోచును; కాని యిది కొంచెమైనను నెరవేరినట్లు కన్పట్టదు. మొదటి ప్రకరణమున సింహావలోకన మనుపేరిట చరిత్రాత్మకముగా నేటివఱకు మన రాజకీయవిధానములు ప్రదర్శింపబడినవి. ఇది రాజ్యాంగవిధానమును క్రొత్తగా తెలిసికొనగోరువారికి చాలా ఉపయోగకారిగనుండును. ఒకదాని తరువాత నొకటి జరిగినదని పేర్కొనుటయే కాని తగునట్లు చర్చించకపోవుటచే దీని ప్రయోజనము చాలమట్టుకు అడుగంటినదేమో! ఉదా: "రెగ్యులేటింగు ఆక్టు 1773లో చేయబడినది. దానిలోని విషయము లివి" అన్నతరువాత "1784లో మరల సీమపార్లమెంటువారొక చట్టమును గావించియుండిరి" అని మాత్రమే చెప్పబడినది. రెగ్యులేటింగు ఆక్టువల్ల హిందూదేశములో తీసికొనిరాబడిన మార్పులు, దాని నాచరణలో బెట్టుటలో గల్గిన కష్టములు, పిట్ ఇండియా ఆక్టు (Pitt's India Act) చేయబడుటకు కల్గిన ఆవశ్యకము, దానివలన కలిగిన మార్పులు—ఇట్టివి చర్చింపబడలేదు. రాజ్యాంగవిషయములను క్రొత్తగా చదువువారికి ఈమార్పులేల కలుగవలసివచ్చినవో దుర్గ్రాహ్యముగానుండును. కావున ఒకచట్టమునకు మరియొకచట్టమునకుగల సంబంధము చర్చించిన బాగుండెడిది.

నూతన రాజ్యాంగవిధానము నాల్గు ప్రకరణములలో వివరింపబడినది. ఇందు మొట్టమొదటిది "సార్వభౌముడు". ఇది ఇండియాచట్టము మొదటి ప్రకరణమునకు సంబంధించినది. "నూతన రాజ్యాంగవిధానమునందు సార్వభౌముడు ప్రధానస్థాన మలంకరించియుండును" అని ప్రకరణము మొదలుపెట్టబడినది. చేసిన పనులన్నియు సార్వభౌముని పేరిట జరుగవలయుననునది ఒక రాజకీయమర్యాద. ఇంతే కాని "సార్వభౌముడు" అను అధ్యాయము చదివిన సార్వభౌమునకు అధికారము కలదేమో అను సంశయము పొడముట కవకాశములున్నవి. ఈప్రకరణములో మోర్గన్ నివేదిక ఇరికింపబడినది. దీనికిని నూతనరాజ్యాంగవిధానమునకును సంబంధ మేమియో తెలియదు. సంస్థానాధిపతులు స్వతంత్రులనియు వారు "All India Federation"లో చేరిన నష్టములకు పాలగుదురు కావున చేరగూడదనియు దీనియందలి వాదన. ఈవాదనను అంగీకరించి బ్రిటిష్ పార్లమెంటు రాజ్యాంగవిధానమున చేర్చియుండలేదు. అట్టిచో సార్వభౌమునిగురించియు, ఫెడరేషన్ స్థాపనను గుఱించియు రాజ్యాంగవిధానవిధులనుగూర్చియు చర్చించునపుడు మోర్గన్ నివేదికను స్మరించుట రామాయణమున పిడకలవేట యట్టిదే యగును. ఇదీప్రదేశమున జొన్పకపోయిన బాగుండిపోవును.

* 1. నూతనరాజ్యాంగవిధానము (రచయిత: తల్లాప్రగడ జగన్నాథరావుగారు B.A. దేవాలయవీథి, కాకినాడ. వెల 8 అణాలు). 2. నూతనఇండియారాజ్యాంగము (D. H. బూటానీగారి ఆంగ్లవ్యాసమునకు శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారి ఆంధ్రానువాదము; ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్రీ రైతుసంఘము, బెజవాడ. వెల 3 అణాలు). ఈ రెండు గ్రంథముల పురస్కరించుకొని వ్రాసిన విమర్శవ్యాసము.

మూడు నాలుగు అధ్యాయములలో రాష్ట్రీయ స్వపరిపాలనమును అఖిల భారత ఫెడరేషన్ (All India Federation)ను వివరింపబడినది. All India Fedaration అను అధ్యాయమున లోకములోగల ఇతర ఫెడరేషన్లకన్న భారతదేశపు ఫెడరేషన్ ఎటుల భిన్నమో సూచింపబడినది. "ఇట్టిది కనివిని యెఱుగనిది" కాని క్రొత్తపోకడ యైనంతమాత్రమున చెడుపోకడ కాదుగదా!

గ్రంథమున పర్యాయపదములు సరిగా వాడబడ లేదు. ఆంధ్రమున పుస్తకముల జదివి అర్థముచేసికొవలయునన్న పర్యాయపదములు సరియైనవి వాడుట అత్యావశ్యకము. "All India Federation" అను దానికి రాష్ట్రీయ స్వపరిపాలనమని వాడబడినది. ఫెడరేషన్ అనగా "సంయుక్తరాష్ట్రము" అని అనాదిగా వాడుచున్నారు. "రాష్ట్రీయసంఘము" అనునదియు అర్థములేనిమాట. అట్లే legislatureను 'శాసననిర్మాణవర్గము' అని తెలుగుసేత; కాని శాసనసభ లేక చట్టనిర్మాణసభ యన్నది పదుగురకు తెలిసిన మాట. "పబ్లిక్ సర్వీస్ కమీషన్ సభ్యులకు (Members of the Public Services Commission) గాని, వారి...కాపాడుటకు ప్రత్యేకబాధ్యత గలదని వ్రాయబడినది (పుట 78), గవర్నరుకుగల బాధ్యత Members of Public Services గూర్చిగాని Public Services Commission Members గూర్చి గాదు. Members of the Public Services అనగా ప్రభుద్యోగులనియు, సర్వీసెస్ కమీషన్ అనగా ప్రభుత్వోద్యోగుల నియమించుటకై యేర్పరచిన సంఘమనియు గ్రంథకర్తగారికి తెలియకయుండదు, కాని యిది అచ్చుపొరపాటనుటకు వీలులేకుండ ఇంగ్లీషులోను తెనుగులోనుకూడా వ్రాయబడినది(పుట 78) అదియే తిరుగా 116 పుటలో చెప్పబడినది.

భాష చాలాచోట్ల అసాధువుగను కటువుగను నున్నది. "సింధురాష్ట్రమునందలి గవర్నరుకుకూడా ......సంబంధము......" సింధురాష్ట్రి గవర్నరుకు మాత్రమే యీ ప్రత్యేకబాధ్యత. మరి 'గవర్నరుకు కూడా' అనుటలో నర్థమేమి?

నియోజకవర్గమునుగూర్చి చర్చించుచు, ఎక్కువ మంది యెన్నికలలో బాల్గొనుట కవకాశము కల్గినదని గుర్తించుచు "పూర్వము నూటికి ముగ్గురకంటె నెక్కువలేనివారు ఇప్పుడు పదునాలుగురవరకు పెరుగుట శోచనీయము" (పుట 96) అనిరి. ఎక్కువ మందికి వోటుచేయుట కధికారముకలుగుట "శోచనీయమా?" లేక "శోచనీయము" అనుమాట తప్పుగా పడినదా? క్లిష్టాన్వయములుసైత మీ గ్రంథమునగలవు. భారతసలహాదారులు పార్లమెంటులో మెంబర్లుగా నుండనక్కఱలేదు—అనుదానికి "వీరు సీమ పార్లమెంటులో పాల్గొని తమ సమ్మతిని తెల్పుటకు అర్హత కల్పింపబడియుండలేదు" (పుట 67) అనునది అనవసరమైన పొడుగింపు.

ఇట్టిచిన్నతప్పులను సవరించిన ఈపుస్తకముయొక్క వుపయోగము ఇనుమడించుననుటలో సందియము లేదు.

రెండవ గ్రంథమగు "నూతన ఇండియారాజ్యాంగము" ఆంగ్లవ్యాసమున కనువాదము. భాష నిర్దుష్టమై సరళముగానున్నది. మొదటివ్యాసమున అఖిల భారత సంయుక్తరాష్ట్రముయొక్కయు (All India Federation) రాష్ట్రీయ స్వపరిపాలనయొక్కయు తత్త్వమును, రెండవ వ్యాసమున నూతనరాజ్యాంగ విధానము వలన మనకు గలుగు ఆర్థికవ్యవస్థలును చక్కగా చర్చింపబడినది. "బ్రిటిష్ సామ్రాజ్య తత్త్వము భారతజాతీయోద్యమము నణగద్రొక్క లేక పోయినందున ఇప్పుడు దేశములోని ధనాఢ్యులను, భూస్వాములను, సంస్థానాధీశులను ఇతర స్వార్థపరుల వర్గములను బహిరంగముగ జేరతీసి దేశముపైని తనకుగల అధికారమును మరింత బిగియించజూచుచున్నది. (పుట 45) అనునది ప్రథమవ్యాసమున ముఖ్యాభిప్రాయము. రెండవ వ్యాసములలో "పరస్పరమర్యాదలను అసందర్భపు సిద్ధాంతమును మిషగాగొని, బ్రిటిష్‌వారు హిందూదేశపు సంపదను కొల్లగొట్టుటకుచేసిన ప్రయత్న మీ నూతనరాజ్యాంగవిధానము" అను సిద్ధాంతమును నిరూపించిరి. వెల స్వల్పము. అందరును చదివి విషయమును తెలిసికొనవలసిన పుస్తకము. సులభశైలిలో అనువదించిన శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారు ఆంధ్రపాఠకలోకమునకు వందనీయులు.



# సంపాదకీయములు

## దసరాసంచిక

మా ప్రకటనల ననుసరించి, మా మనవిని మన్నించి గృహలక్ష్మియం దత్యంతాదరముంచి మునుపటికంటె నెక్కువ శ్రద్ధతో ప్రత్యేకముగ పద్యగద్య వ్యాసములబంపి దసరాసంచిక కై సేతతో వెలువడ తోడ్పడిన సోదరీమణుల కెల్లరకు మా కృతజ్ఞతా పూర్వకవందనములు. స్థలాభావముచేతను, వ్యవధిలేనందునను వచ్చినవ్యాసముల నన్నింటిని సంచికయందు చేర్పజాలక పోయి నందు కా రచయిత్రులు మన్నింతురుగాక.

ఈ సంచికయందలి వ్యాసముల నొకపరి సింహావలోకనము చేసినవారి దృష్టికి స్త్రీలు ప్రతివిషయమును నెంతశ్రద్ధతో ప్రత్యేకముగా పరికించుచున్నారో తెలియకపోదు. ఇందు మూడుకథలు గలవు. అందు 'పెంచిన ప్రేమ' ప్రేమయందలి దివ్యత్వమును దానికి లోకముచేయు వ్యాఖ్యానమును మనసునకు హత్తునట్లు రచింపబడినది. తక్కినవి రెండును స్వార్థపరులు లోకము నెట్లు మోసగింప ప్రయత్నింతురో చూపుచున్నవి.

'జహనారా' చరిత్రాత్మకమయ్యు చక్కని రూపు దాల్చినది. ప్రపంచపరిస్థితులనుకూడ నితర సంగతులతోబాటు సింహావలోకనము చేయుట కుపకరించునని 'చైనా జపాన్' చేర్పబడినది.

గత సంచికలకంటె నిందు రాజకీయ వ్యాసము లెక్కుడుగా చేర్పబడినవని చదువరు లెఱుఁగగలరు. నూతన మంత్రివర్గముచేయనగు మహత్కార్యములను గూర్చియు, నుత్సాహపూరితులగు యువకలోక ప్రాముఖ్యమును గూర్చియు 'సహకారమా? విధ్వంసమా?' తీవ్రగతిని దెలుపుచున్నది. విమర్శయయ్యు 'నూతన రాజ్యాంగవిధానము' రాజకీయములందు స్త్రీలకు గల రుచిని వ్యక్తపరచుచున్నది. స్వానుభవపూరితమగుట 'బందీ'కి పావనత చేకూరినది. 'భారతస్త్రీల పరమధర్మము'ను సోదరీమణులు మిగుల శ్రద్ధతో పరికింపదగినది. కాలము మారినను పరిస్థితులు మారినను మన యాచారవ్యవహారములు మారకుండుట లోపమనియే 'దుర్భిక్షములో నిర్బంధపండుగాచారాలా?' యభిప్రాయము. 'ఇవీ సమస్యలే'యందు ఉద్రేకపూరిత హృదయ మిమిడియున్నదనుట నిక్కువము. ప్రతిస్త్రీయు నెఱుఁగదగిన విషయముల నెంతో ధైర్యముతో స్పష్టముగ 'ఆర్తవఫలముల అయోమయము' దెల్పినదని చదువరులు గుర్తింపఁగలరు.

స్త్రీలెల్లరు నిరంతరము వాడు 'పుష్పము' పెక్కువిషయములు నేర్పినది. నూతనత్వము మా పాఠకులకు రుచించుననియే గతసంచికలందలి పెక్కు శీర్షికలను మార్చితిమి. 'గృహపరిశ్రమలు' కొన్ని వివరములతో చేర్చబడినది.

ఇతర రచనలతోబాటు రచయిత్రులకు కవనమునందెట్టి మక్కువగలదో గమనింపఁదగినది. గృహాంగణమందును, గృహాంతరమందున, హృదంతరమందును గృహలక్ష్మి యేవిధముగనుండునో చూపినది 'అది గృహలక్ష్మి'. భావగీతమైన 'రాలినమొగ్గ' కరుణరసపూరితము. 'అత్తింటి ప్రయాణము' సర్వసాధారణమేయయ్యు నిందు నూతనశోభదాల్చినది. 'కోయిల' సామ్యము చక్కనిది. 'గుణవతి' పలుకులు తియ్యనివి. 'వీరస్మృతి' సాభిప్రాయము. తక్కినవికూడ చదువరులకు ఇంపు జనింపజేయగలవని నమ్మకము.

* * *

మహాత్ముని మాహాత్మ్యము

కాంగ్రెసు నియమముల ననుసరించి మహాత్ముడు నాలుగణాలైననిచ్చి కాంగ్రెసు సభ్యత్వముకూడ సంపాదించుకొనలేదు. కాని జాతీయసభాధ్యక్షులుకూడ మహాత్ముని సలహాలకై యువ్విళ్ళూరుచు, నాతడు చెప్పినదానిని శిరసావహించుచుందురు. ఈ యర్ధదిగంబరసన్యాసిలో నేమున్నదో తెలియదు కాని ఒక యపూర్వశక్తి మాత్రము మూర్తీభవించియున్నదనుట నిక్కవము. ఇటీవల అండమాను ఖైదీలొనరించిన నిర్ణయము దీనికొక నిదర్శనము.

తమ ఇబ్బందుల దీర్చినగాని యుపవాసవ్రతమును విడువమని ప్రతిజ్ఞజేసి వారు భీష్మికరించియున్నపుడు ఇండియా ప్రభుత్వమువారును, భారతదేశమంతయును వారియుపవాసమును మాన్పింప శతవిధముల ప్రయత్నించి సఫలత నొందఁజాలక తల్లడించుచున్న సమయమున పిలువనిపేరంట మనక మహాత్ముఁడు అండమాను ఖైదీలతో నుత్తరప్రత్యుత్తరము లెవరికిని తెలియకయే జరిపి వారి ప్రతిజ్ఞను సడలించి యుపవాసవ్రతమును మాన్పించెను! అంతియగాదు. నేడు అండమానులందున్న విప్లవోద్యమప్రవాసితులందఱు ఆ యుద్యమమును ప్రాణప్రదముగ నెంచి సంవత్సరముగా కృషిచేసి తత్ఫలితముగ దేశదూరులు గావింపబడిన వారు. అట్టివారికికూడ వారి యుద్యమమందు నమ్మకముపోగొట్టి అహింసాతత్వమున నమ్మకముపుట్టించి వారిచే నావిధముగ ప్రకటింపజేసిన మహాత్ముని ప్రతిభకచ్చెరువందని భారతీయులుండరు. దీన ప్రభుత్వమువారు చాల మంది అండమాను ఖైదీలను భారతదేశమునకు గొనిరా నుత్తరువుల నొసగిరి. వారు భారతదేశమున కరుదెంచిన తరువాత వారికి ముక్తికూడ కలుగవచ్చును. మహాత్ముని యాధిపత్యమున నంద అద్దానికి ప్రయత్నించు టొప్పు.

ఇట్టి మంగళకరుఁడైన మహాత్ముని జన్మదినము ఈనెల రెండవ తేది రానున్నది.

దేశీయనాయకులు ప్రకటించిన విధమున ప్రజలెల్ల రాయుత్సవములందుపాల్గొని మహాత్ముని యాశయముల నాచరణలోపెట్టుచు, మహాత్ముడింకను పెక్కువర్షములు జీవించి భారతదేశకళ్యాణమునకు తోడ్పడు రీతి ప్రార్థనలు సలుపవలయును.

*　　*　　*

దేవదాసీత్వము

"దేశములో మద్యపాననిషేధముతో సమానప్రాముఖ్యమును వహించు సమస్య దేవదాసీత్వమును నిర్మూలించుటయే" అని వెల్లడించిన శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారి యభిప్రాయముతో మహాత్మాగాంధీగా రేకీభవించుచున్నారు. ఈవిషయములో తాను తయారుచేసిన చిత్తుచట్టమును శాసనము చేయుటకు మద్రాసుమంత్రివర్గము తత్‌క్షణమే పూనుకొనవలయునని శ్రీమతి రెడ్డిగారి విజ్ఞాపనమునకు సంపూర్ణముగా చేయూత యొసగవలయునని మహాత్ముడు హెచ్చరించుచున్నాడు. ఆచారవ్యవహారములపేరను మతములపేరను నిట్టి దుష్టసంఘములు తలయెత్తుచున్నవి. అనాదిగా వచ్చు నీయాచారమును నిర్మూలించుట చాల తప్పుపని అని కొందఱు సనాతనులు తలతురేమో; కాని ఇట్టి పడుపువృత్తికి శాసనములో అంగీకారలేశముగాని ఉండరాదు. "శ్రీమతి రెడ్డిగారి చిత్తుచట్టమును నే నింకను పరిశీలించలేదుగాని దాని అంతస్తత్వ మంతచక్కగా, అంతశుద్ధముగా నాకు కనబడుచుండుటచేత, దక్షిణదేశములో నిట్టిశాసన మీనాటికే యేల లేకుండెనోయని నాకు విస్మయము కల్గించుచున్నది." అని గాంధీజీ ఈసంస్కరణము నెడ తహతహపడుచున్నాడు. అనేకవత్సరములుగ నీవిషయమై కఠినకృషిసలుపుచున్న ప్రస్తుత ప్రధాని శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచార్యులవారు ఆచిత్తుచట్టమునకు శాసనరూపమొసగుటకు వెనుదీయడనియు, నిట్టి అత్యాచార మనతికాలములోనే అంతరించుననియు మహాత్ముడు ఆశించుచున్నాడు. ఇందు సంస్కారులెల్లరు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారికి సర్వవిధముల తోడ్పడుదురుగాక యని గోరెదము.

*　　*　　*

దేశోద్ధారకుని సన్మానము

దేశోద్ధారకాభిదేయము సర్వవిధముల తనయెడ సార్థకమైయుండ ఎల్లపుడును నాంధ్రుల యున్నతికిని, ఆంధ్రదేశ సౌభాగ్యమునకును పాటుబడుచున్న, శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారిని తగిన రీతిని సన్మానింపవలయునని పత్రికలలో సూచనలును, సభలందు తీర్మానములును బైలుదేరుట ఆంధ్రులందఱికి ముదావహమైన విషయము. ఎంత యుత్కృష్టమైన గుణమున్నను, ఎంత ప్రతిభగలిగినను ఆంధ్రులు తమజాతిని తాము గౌరవించుకొనుట యెఱుగరన్న నది సత్యదూరము గాదు. ఈలోపమును దెలిసికొని యిటీవలనే దేశోద్ధారకుని సన్మానించి తమ యపయశస్సును దొలగింప నాంధ్రులు దలపెట్టిరి. ఆంధ్రులు

మేలుకొనిరని యెల్లరు సంతసించిరి; కాని ఆ సంతస మంతటితో నాగిపోయినది. ఎందుకు? ఆడిన మాటలను, వ్రాసిన వ్రాతలను, తీర్మానించిన తీర్మానములను ఇంకను నాచరణలోనికి తీసికొనివచ్చుటకు వారు తగినకృషి చేయుటలేదు. ఇవన్నియు కార్యరూపము దాల్చినగాని ఇదివఱకు కలిగిన సంతసమునమ్మకములు నిలువవు.

ఈ సన్మానమును పురస్కరించుకొని యొక్కవిషయమున నిట వ్రాయదలంచితిమి. ఇటీవల చిత్తూరునందు సమావేశమైన ఆంధ్రరాష్ట్రీయ సంఘమువారు బెజవాడయందు ఆంధ్రరత్నభవనముపై నొకహాలు దేశోద్ధారకుని పేర నిర్మించి, యందాతని చిత్రపటమును స్థాపింపవలయునని తీర్మానించిరి. బెజవాడ దేశోద్ధారక సంఘమువారు వారి విగ్రహమును నిర్మింప తీర్మానించిరి. మదరాసునందు పురప్రముఖులందఱు దేశోద్ధారకుని చిత్రపటమును ఆంధ్రవిశ్వవిద్యాలయమున ప్రతిష్ఠింప చేయవలయునని తీర్మానించియున్నారు.

ఇందు చిత్రపటమును చిత్రించుట కాంధ్రులగు చావలి నాగేశ్వరరావుగారికి (బొంబాయి) అప్పగించి మదరాసుపౌరులు ఆంధ్రాభిమానముజూపుట సంతసింపదగిన విషయమే. అటులనే విగ్రహనిర్మాణము నందును బెజవాడ సంఘమువారు చేయవలెననుటయే యిందలి ముఖ్యాంశము. ఇదివఱకు చేయింపబడిన యాంధ్రుల శిలావిగ్రహములు ఏమికారణముననో ఆంధ్రులచేగాక ఆంధ్రేతరులచే నిర్మింపబడి యాంధ్రాభిమానమును మూలకు ద్రోసినవి. ఈ విషయమునగూడ నంతియేయగునేమో యను సందియమే యీవ్రాత కాధారము. ఆంధ్రులందు శిల్పులు లేకపోలేదు. హిందూదేశమందు ప్రసిద్ధిజెందిన చిత్రకారుడును, శిల్పియునగు రాయిచౌదరిగారి ప్రియశిష్యుడై కళాప్రావీణ్యమున గురువునంతటివాడయ్యు నాంధ్రుల యాదరణ పొందజాలక పుదుచ్చేరియందు ఫ్రెంచివారలయు, తిరువాంకూరునందు మహారాజాగారి యొక్కయు నాదరణపొంది తన కళాప్రావీణ్యము చాటుచున్న శ్రీయుత దేవీప్రసాదు నారాయణరావుగారివంటి యాంధ్రులు గలరని మరువక పైసంఘమువారు విగ్రహనిర్మాణ విషయమున శ్రద్ధవహింతురుగాక.

*   *   *

దంపతుల కవివాహితుని సలహా

అనుభవములేనివారు కలవారి కా విషయమై సలహానిచ్చుట వింతగ దోపకమానదు. ఇచ్చినసలహా సత్యదూరముగాక నాచరణలోపెట్టుట కుపయోగముగనున్నచో నది మరింత విచిత్రముగ నుండకపోదు. నలువదియేండ్లకు పైబడియు వివాహ మాడకయున్న హిట్లరునియంత దాంపత్య ధర్మములనుగూర్చి సెప్టంబరు 11-వ తేది న్యూరెంబర్గునందు ఇరువదివేల స్త్రీల కుపన్యసించుట యీరీతిగ నేయున్నది. తమతమ బాధ్యతలగు ర్తింపక సమానత్వమునకై చేయు గోల నానాటి కధికమైపోవు

చున్న పాశ్చాత్యలోకమునకిది యెక్కువగా నుపకరింప గలదేమో?

హిట్లరుసలహాయందలి ముఖ్యవిషయములివి: స్త్రీపురుషులు ప్రకృతి తమకొసగిన ధర్మగుణస్వభావాదుల నెఱుగుట; సమాన హక్కులకు పోరాడుటకంటె సమానబాధ్యతలను గుర్తించుట; భార్యాభర్తలందఱు తప్పని సరిగా కలసియుండుట; స్త్రీపురుషులకు ప్రకృతి యొనర్చిన యేర్పాట్లు తృప్తికరముగ నున్నవి, స్త్రీపురుషు లొకరొకరికి లేకున్న నెవ్వరును సుఖపడజాలరను సంగతి గ్రహించుట; శరీరకష్టముతో గూడిన పనులన్నింటిని అన్ని దేశములందును పురుషులే చేయుదురు, వారికందువలన అనుభవముండును, వారు స్త్రీలను కాపాడ యోగ్యులు, అట్లయ్యు పురుషుల సౌఖ్యజీవనమునకు స్త్రీలే యాధారమని నమ్ముచుందురు, జర్మనియందీ నమ్మక మెక్కువగా గలదనుట; వివాహానంతరము భార్యాభర్తలు సహకారముతో, సామరస్యముతో సమష్టి లాభముకొఱకును, సంతానముకొఱకును పాటుబడుట.

అనుభవముమాట యటుండనిచ్చి, హిట్లరు చేయునదంతయు మారణహోమము నకే యను పక్షపాతబుద్ధినిచూడక పై సలహాలను గమనించినచో నయ్యవి పాశ్చాత్యవనితలకే గాక, వారిధోరణి ననుసరింప జూచు భారతస్త్రీలకుకూడ అనుసరణ యోగ్యములై యుండునని యనుకొన వచ్చును.

* * *

## బాల్యవివాహ నిరోధకచట్టము

'శారదాబిల్లుకు సహకారము' అను శీర్షికపై గతసంచికయందు బాల్యవివాహ నిరోధకచట్టము పుదుచ్చేరియందు ఫ్రెంచివారిచే ప్రవేశపెట్టబడుటను గూర్చి వ్రాయుచు 'సామంతరాజ్యములుకూడ నిట్టి నిర్బంధముల నమలునందుంచ ప్రయత్నింపకుండుట శోచనీయము' అని వ్రాసియుంటిమి. ఇపుడు తిరువాంకూరు శాసనసభయందు బాల్యవివాహములు కూడదనియు బాలికల కథమపక్షము వివాహకాలము పదునేడేండ్లుగా నుండవలెనియు ప్రవేశపెట్టబడిన బిల్లు సెలెక్టుకమిటీకి ఒప్పగింపబడియుండి వారిచే వివాహనిర్ణయ వయస్సు 16 సంవత్సరములుగా నిర్ణయింపబడి చట్టముగాచేయుటకు సలహా నియ్యబడినదని తెలియుచున్నది. సంస్కరణపద్ధతుల నన్నింటియందును ముందంజవేయుచున్న తిరువాంకూరు రాజ్య మీ విషయమునగూడ నిట్టి నిర్ణయమునకువచ్చి యితరరాజ్యముల కాదర్శకమగుటకు మిగుల సంతసించుచున్నారము. త్వరలో నీ ఉపసంఘముయొక్క సలహా చట్టరూపము దాల్చునని యాశించుచున్నాము.

* * *

## హిందీ—మాతృభాష

పాఠశాలలో 1,2,3 ఫారములలో విద్యార్థులకు నిర్బంధముగా హిందీ నేర్పవలెనని, అనతికాలములో ప్రభుత్వమువారు ఉత్తర్వు మంజూరు చేయనున్నారు. హిందీపఠనము మాతృభాషకెంతేని అపకార మొనగూర్చునను ఆందోళన అప్పుడే బయలుదేరినది.

ఇట్టి వివాదము ఆంధ్రరాష్ట్రమున ప్రస్తుతము విన్పించుటలేదు.

స్కూల్ ఫైనల్ దశదాక అన్నిపాఠము లును మాతృభాషలో జరుగుటకు ప్రభుత్వమువారు దృఢసంకల్పులయి యున్నారని మొన్న బడ్జెటు చర్చసమయమున విద్యాశాఖామంత్రిగారు స్పష్టపఱచి యున్నారు. అట్టితఱి హిందీ మాతృభాషకు అడ్డంకులు కల్పించునన్న వాదము గాలికి పోగలదు.

అయిన హిందీ యెందుకు? ఆయా రాష్ట్రము వేర్వేఱు, ఆ యా ఖండములు వేఱు అనుభావము లంతరించుచున్నవి. ప్రపంచమున ఒక దేశమునకును నింకొక దానికి నెట్టి అంతస్సంబంధములు గలవో యట్లే ఒక దేశములోనే ఒక రాష్ట్రమునకును మఱొక దానికిని అట్టి యవినాభావ సంబంధము గలదు. మన వ్యక్తిత్వముల నిలుపుకొన వచ్చునుగాని యితరరాష్ట్రములతోడి సంబంధముల మానుకొనవీలులేదు. ఇట్టి సంబంధము దినదినమధికమే యగుచున్నది. కావున రేపు ప్రజానాయకులు కానున్న నేటి బాలురు విద్యార్థిదశలో అంతర్రాష్ట్రీయ భాష నొకటి నేర్చుకొన్ననే దేశము పెంపొందగలదు. మన భరతఖండములో హిందీయొక్కటే అంతర్రాష్ట్రభాషగా నుండదగుననుట నిర్వివాదము. కాబట్టి హిందీపఠనము అత్యంతావశ్యకమని ఘంటాపథముగా వాకొనవచ్చును. ఈవిషయమున స్త్రీలపయి ప్రత్యేకబాధ్యత గలదు. బాల్యదశలో పెంచి పెద్దజేయుభారము తలిదండ్రులది. తండ్రి బహుముఖ వ్యాపకత్వముచేత ఇంటిలోనేయుండి తనపిల్లలకు విద్యగఱపు నవకాశములేని యతడు కావచ్చును. ఇట్టిచోట తల్లి శ్రద్ధబూని ఉత్తరోత్తరము పనికివచ్చు భాషను నేర్పి యిట్లు దేశోద్ధరణమునకు తోడ్పడుట యెంతయు బ్రశంసనీయము. ఈయుద్యమమునకు నెల్లరు—ముఖ్యముగా స్త్రీలు—సర్వవిధముల సహకార సానుభూతులజూపి తోడ్పడుదురుగాక.

* * *

భారత ఇన్సూర్యాన్సుకంపెని లిమిటెడ్

ఇది నలువది సంవత్సరములక్రింద ప్రారంభింపబడి, ప్రకృతము అఖిల భారత దేశమందలి పెక్కుప్రముఖుల యాధిపత్యమున మిగుల నభివృద్ధిజెందుచున్నది. కడచిన ఒక్కసంవత్సరమున ఈ కంపెని పొందిన యభివృద్ధి మిగుల నాశ్చర్యమును కలిగించుచున్నది. దీని నిర్వహనము భారతీయవ్యవహారదీక్షతకు, ప్రావీణ్యమునకు నిదర్శనమై ఇతోధికవృద్ధినొందునని యాశింతుము.

EDITED BY DR K. N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. బి. మనోహరరావుగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మిబాయిగారు, సుల్తాన్ బజారు. (పెద్దబావిడిదగ్గర)
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.
జెమ్‌షెడ్‌పూర్: వి. కొండల్రావుగారు, అకౌంట్సు ఆఫీసు.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. సూరరాజుగారు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
సికందరాబాద్: శ్రీరామా బుక్ డిపో. బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
తణుకు: నడుపల్లి సూర్యనారాయణగారు, న్యూస్ ఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహాంపేట.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
నరసాపురం: వై. సుందరరామయ్యగారు.
నిడదవోలు: కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్‌గారు.
భీమవరం: వంగల అచ్యుత రామయ్యగారు, మేనేజరు, అశ్విన్ కుమార్ ఫార్మసీ.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
మచిలీపట్నం. ఆచంట లక్ష్మినరసింహంగారు, రాజుపేట.
కర్నూలు: టి. బాలనాగయ్య శెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
కడప: ఎమ్. నరసింహంగారు, న్యూసుఏజంటు.
కాళహస్తి: యస్. అబ్దుల్ అజీజ్ సాహెబ్.
తుని: అల్లాడ బాపిరాజులింగంగారు.
పోనూరు: జి. సూర్యనారాయణగారు,
హనుమకొండ: వరంగల్లు: కంభంపాటి అచ్యుతానందంగారు.
జయనగరం: ది. పాపులర్ ట్రేడింగ్ కంపెని, కస్బా.
పర్లాకిమిడి: బండారు నరసింహమూర్తిగారు, న్యూస్ ఏజంట్.
రేపల్లి. పి. సి. కన్నభిరాన్ శెట్టిగారు, న్యూస్ ఏజంట్.
మదనపల్లి: ఎన్. రాధాక్రిష్ణయ్య శెట్టిగారు, న్యూస్ ఏజంట్.
నెల్లూరు: మెసర్సు నాథన్ అండ్ మూర్తి, న్యూస్ ఏజంట్స్.

హిగిన్‌బాతమ్స్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు

# నేను ఎల్లప్పుడు రోగములతో కృశిల్లుచుండేని...













## జ్వరము ఎపుడూ బలహీనులకే తగులుతుంది

ప్రతిఘటించే శక్తి ఎపుడు తగ్గుతుందో అపుడు మీరు అంటు రోగాలకు బలి ఔతారు. కాబట్టి ఆరోగ్యంగావుండి వరముల బలహీనత పోగొట్టుకొని శక్తిని చేకూర్చుకొనండి. దీనికి హార్లిక్సు కంటె ఏదీ మీకు సాయముచేయలేదు. అది నూటికి నూరుపాళ్లు శరీరానికి బలం కలిగిస్తుంది; పోయినశక్తిని చేకూర్చుతుంది. హార్లిక్సు రాత్రుల్లో పుచ్చుకుంటే తెల్లవారేసరికి మంచి శక్తి కలిగిస్తుంది.




# హార్లిక్సు బలము శక్తి నొసంగును.

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకురేట్లు ప్రత్యేకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికయెంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 20 0 0 అరపుటకు రు. 12 8 0 పావుపుటకు రు. 8 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. పావుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతోవ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగనుండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తులపేర ఎంతమాత్రము పంపకూడదు.

